గ్రహాకరుండవయిన నిన్నెఱుంగ నెవ్వరికి నశక్యంబు దేవతిర్యఙ్మనుష్యుల [illegible]
నెవ్వఁడును సమర్థుండు గాఁడు నీకుం బ్రియాప్రియులు లేరు జన్మకర్మశూన్యుండవై [illegible]
బులను మనుష్యులందు రామాదిరూపంబులను, ఋషులయందు వామనాదిరూపంబులను, జలచరంబులందు మత్స్యాది
రూపంబుల నవతరించుట లోకవిడంబనార్థంబు గాని జన్మకర్మసహితుండవగుటం గాదు॥ ఉ॥ కోపముతో [illegible] దధిభాండభ
ము భిన్నము సేయుచున్నచో । గోపిక త్రాటఁ గట్టిన నకుంచితసాంజనబాష్పతోయధా । రావరిపూర్ణవక్త్రముఁ గరంబు
లఁ ద్రాముచు వెచ్చనూర్చుచున్ । బాలుఁడవై నటించుట కృపాపర నామదిఁ జోద్యమయ్యెడిన్॥ క॥ మలయమునఁ జందనక్రి
య। వెలయఁగ ధర్మజుని కీర్తి వెలయించుటకై । యిలపై నభవుఁడు హరి యదు । కులమున నుదయించె నంచుఁ గొందఱనం
తా॥ క॥ వసుదేవదేవకులు దా। పసగతి గతభవమునందుఁ బ్రార్థించిన సం। తసమునఁ బుత్రత నొందితి। వసురుల వ్యాతికంచుఁ
గొందఱం డ్రు మహాత్మా॥ క॥ జలరాశిలోన మెలఁగెడు । కలముక్రియ ధర భూరిభారకలితయు నగు నీ। యిలఁ గావ నజుఁడు
గోరినఁ। గలిగితి వని కొందఱం డ్రు గుణవారీశా॥ గీ॥ మఱి యవిద్యాజ్ఞానకామకర్మములఁ దిఱుగు। వేదనాతురులకుఁ దన్నివృత్తిఁ
జేయ । శ్రవణచింతనవందనార్చనము లిచ్చు । కొఱకు నుదయించితం డ్రని కొంద ఱభవ॥ శా॥ నినుఁ జింతింపుచుఁ బాడు
చుం బొగడుచు న్నీదివ్యచారిత్రముల్ వినుచుం జూతురుగాక లోకు లితరాన్వేషంబులం జూతురే। ఘనసద్జన్మపరంపరాహ
రణదక్షుం బై మహాయోగివా। గ్వినుతం బైన భవత్పదాబ్జయుగము న్విశ్వేశ విశ్వంభరా॥ వ॥ దేవా నిరాశ్రయులమై భవ
దీయచరణారవిందంబు లాశ్రయించి నీవారలమైన మమ్ము విడిచి విచ్చేయ నేల నీ సకరుణావలోకనంబుల నిత్యంబును జూడ
వేని యాదవసహితులైన పాండవులు జీవునిం బాసిన యింద్రియంబుల చందంబునఁ గీర్తిసంపదలు లేక తుచ్ఛత్వంబు నొందు
దురు కల్యాణలక్షణలక్షితంబులైన నీయడుగుల చేత నంకితంబయిన మదీయధరణీమండలంబు నీవు వాసిన శోభితంబు గా
దు నీ కృపావీక్షణామృతంబున నిక్కడి జనపదంబులు కుసుమఫలభరితంబులైన యోషధితరులతాగుల్మనదనదీసమేతంబు
లై యుండు॥ ఉ॥ యాదవులందుఁ బాండుసుతులందు నధీశ్వర నాకు మోహవి। చ్ఛేదము సేయుమయ్య ఘనసింధువుఁ జేరె
డి గంగభంగి నీ। పాదసరోజచింతనము పై ననిశంబు మదీయబుద్ధి న। త్యాదరవృత్తితోఁ గదియునట్లుగఁ జేయఁగదయ్య యీ
శ్వరా॥ శా॥ శ్రీకృష్ణా యదుభూషణా నరసఖా శృంగారరత్నాకరా। లోకద్రోహినరేంద్రవంశదహనా లోకేశ్వరా దేవ
తా। నీకబ్రాహ్మణగోగణార్తిహరణా నిర్వాణసంధాయకా। నీకు న్మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ॥
వ॥ అని యిట్లు సకలసంభాషణంబుల నుతియించు కొంతిమాటలకు నియ్యకొని గోవిందుండు మాయానిరూఢమందహాసవిశే
షంబున మోహంబు నొందించి రథారూఢుండై కరినగరంబునకు వచ్చి కుంతీసుభద్రాదుల వీడ్కొని తనపురంబునకు విచ్చే
య గమకించిన ధర్మరాజు చేఁగించి కొంతకాలంబు నిలువుమని ప్రార్థితుండై నిలిచె నంత బంధువధశోకాతురుండయిన ధర్మజుం
డు నారాయణవ్యాసధౌమ్యాదుల చేతఁ దెలుపంబడియుఁ దెలియక మోహితుండై నిర్వేకంబున నిట్లనియె॥ మ॥ తనదే
హంబునకై యనేకమృగసంతానంబుఁ జంపించు మూ। ర్ఖునిభంగి న్గురుబాలకద్విజతనూజభ్రాతృసంఘంబుని। ట్లనిజంపించి
న పాపకర్మునకు రాజ్యాకాంక్షికిన్నాకు మో। హనలబ్ధావధి యైన ఘోరనరకవ్యాసంగముల్మాను నే॥ వ॥ మఱియుఁ బ్రజా
పరిపాలనపరుండయిన రాజు ధర్మయుద్ధంబున శత్రువుల వధియించినఁ బాపంబు లేదని శాస్త్రవచనంబు గలదైన నది విజ్ఞా
నంబు కొఱకు సమర్థంబు గాదు చతురంగంబుల నేకాక్షౌహిణీసంఖ్యాతంబులం జంపించితి హతబంధులైన సతులకేను జే
సిన ద్రోహంబుఁ దప్పించుకొన నేర్పు లేమి గృహాశ్రమధర్మంబులయిన తురంగమేధాదియాగంబుల చేతం బురుషుండు బ్ర
హ్మహత్యాదిపాపంబుల వలన విడివడి నిర్మలుండగునని నిగమంబులు నిగమించుఁ బంకంబునఁ బంకిలస్థలంబునకు మద్యంబున
మద్యభాండంబునకు శుద్ధి సంభవింపని చందంబున బుద్ధిపూర్వకజీవహింసనంబులయిన యాగంబుల చేతం బురుషులకుఁ
బాపబాహుళ్యంబు గాని పాపనిర్ముక్తి గాదని శంకించెద॥ క॥ అని యిట్లు ధర్మసూనుఁడు। మొనసిన నిరాహారభావమున దేవ

## ధర్మరాజు శ్రీకృష్ణసహితుండయి శరతల్పగతుండయిన భీష్మునికడ కేగుట.

నదీ। తనయుఁడు గూలిన చోటికిఁ। జనియెం బ్రజాద్రోహపాపచలితాత్ముండై॥ వ॥ అయ్యవసరంబునం దక్కిన పాండవులు
ఫల్గునసహితుండైన పద్మలోచనుండుఁ గాంచనసమంచితంబులయిన రథంబు లెక్కి ధర్మజుం గూడి చనిన నతండు గుహ్యక
సహితుండయిన కుబేరునిభంగి నొప్పె నిట్లు పాండవులు పరిజనులు గొలువఁ బద్మనాభసహితులై కురుక్షేత్రంబున కేగి ది
వంబుననుండి నేలం గూలిన దేవత తెఱంగున సంగ్రామపతితుండైన గంగానందనునకు నమస్కరించి రంత బృహదశ్వభర

గా। స్తోకవిశేషతీర్థములం దోఁగ్లితి కాముల నేఁగిరో॥ వ॥ అని యిట్లు నానావిధంబులైన పౌరసుందరీవచనంబు లాకర్ణించి కటాక్షించుచు నగరంబు వెడలి ధర్మజుం డనుపహారితుఁడై కొలిచిన దుర్వారచతురంగబలంబులతోడఁ జతురంగసమేతుఁడై తనతోడి వియోగంబున కోర్వక దూరంబు వెనుదగిలిన కౌరవుల మఱలించి కురుజాంగలపాంచాలశూరసేనయామునబ్రహ్మావర్తకురుక్షేత్రమత్స్యసారస్వతమరుధన్వసౌవీరాభీరవిషయంబు లతిక్రమించి తత్తద్దేశవాసు లిచ్చిన కానుకలు గొనుచు నానర్తమండలంబు సొచ్చి పరమబంధుండు పశ్చిమసింధునికటస్థుండైన సమయంబునఁ

## శ్రీకృష్ణుఁడు ద్వారకానగరంబు ప్రవేశించుట.

బరిశ్రాంతవాహుండై చనిచని॥ మ॥ జలజాతాక్షుఁడు శౌరి డగ్గఱె మహాసౌధాగ్రశృంగారకన్। గలహంసావృతహేమపద్మపరిఖాకాసారకన్ దోరణావళిసంఛాదితతారకన్ దరులతావర్గానువేలోదయోత్ఫలపుష్పాంకురకోరకన్ మణిమయప్రాకారకన్ ద్వారకన్॥ వ॥ ఇట్లు తన ప్రియపురంబు డగ్గఱి॥ మత్తకోకిల॥ ఆర్యసన్నుతసాహసుండు మురారి యొత్తె యుదాత్తము। ధన్యులై వినఁ బాంచజన్యము దారితాఖిలజంతుచై। తన్యమున్ భవనైకమాన్యము దారుణస్వనభీతరా। జన్యమున్ వైరిమూర్ఛితాఖిలశత్రుదానవసైన్యముల్॥ శా॥ శంఖారావము వీనులన్ని నిజనుల్ స్వర్ణాంబరద్రవ్యము। న్సంఖ్యాతీతముఁ గొంచు వచ్చిరి దిదృక్షాదర్పితోత్కంఠన। ప్రేంఖద్భక్తులు వంశకాహళమహాభేరీగజాశ్వావళీ। సింఖారావము లుల్లసిల్ల దనుజారిం జూడ నాసక్తులై॥ క॥ బంధులు పౌరులు దెచ్చిన। గంధేభహయాదు లైన కానుకలు దయా। సింధుఁడు గైకొనె నంబుజ। బంధుఁడు గొను దత్తదీపవస్తుల భంగిన్॥ వ॥ ఇట్లాత్మారాముండు పూర్ణకాముండు నయిన యప్పరమేశ్వరునికి నుపాయనంబు లిచ్చుచు నాగరులు వికసితముఖులయి గద్గదభాషణంబులతోడ నయ్యాకుండ నడపు నయ్యాకు నెయ్యంపుచూపుల నడ్డంబు లేని బిడ్డల చందంబున మ్రొక్కి యిట్లనిరి॥ శా॥ నీపాదాబ్జము బ్రహ్మపూజ్యము గదా నీసేవ సంసారసం। తాపధ్వంసిని యౌఁగదా సకలభద్రశ్రేణులం బ్రీతితో। నాపాదింతు గదా ప్రపన్నులకుఁ గాలాధీశ కాలంబు ని। ర్వ్యాపారంబు గదయ్య చాలరు నినున్ వర్ణింప బ్రహ్మాదులున్॥ క॥ ఉన్నారము సౌఖ్యంబున। విన్నారము నీప్రతాపవిక్రమకథలు। న్నన్నారము ధనికులమై। కన్నారము తావకాంఘ్రికమలములు హరీ॥ క॥ ఆరాటము మది నెఱుఁగము। పోరాటము లిండ్లకడలఁ బుట్టవు పురిలోఁ। జోరాటన మెఱుగము నీ। దూరాటన మోర్వ లేము తోయజనేత్రా॥ ఉ॥ తండ్రుల కెల్లఁ దండ్రియగు ధాతకుఁ దండ్రివి దేవ నీవు మా। తండ్రివి తల్లి వింబతివి దైవము వున్నఖి విస్తురుండవే। తండ్రులు నీక్రియం బ్రజల ధన్యులఁ జేసిరి వేల్పులైన నో। తండ్రి భవన్ముఖాంబుజము ధన్యతఁ గానరు మావిధంబునన్॥ క॥ చెచ్చెరఁ గరినగరికి నీ। విచ్చేసి ననిమిషమైన వెఱయేండ్లగు నీ। వెచ్చోటికి విచ్చేయక। మచ్చికతో నుండుమయ్య మా నగరమునన్॥ గీ॥ అంధకారవైరి యపరాద్రి కవ్వలఁ। జనిన నంధమయిన జగము భంగి। నిన్నుఁ గానకున్న నీరజలోచన। యంధతమసమతుల మగుదుమయ్య॥ వ॥ అని యిట్లు ప్రజ లాడెడి భక్తియుక్తమధురమంజులాలాపంబులు గర్ణకలాపంబులు గా నవధరించి సకరుణావలోకనంబులు వర్షించుచు హర్షించుచు దనరాక విని మహానురాగంబున సంరంభవేగంబుల మజ్జనభోజనశయనాదికృత్యంబు లొల్లక యుగ్రసేనాక్రూరవసుదేవబలభద్రప్రద్యుమ్నసాంబచారుదేష్ణగదప్రముఖయదుకుంజరులు కుంజరతురగరథారూఢులై దిక్కుంజరసన్నిభంబయిన యొక్క కుంజరంబు ముందట నిడుకొని సూతమాగధనటనర్తకవందిసందోహంబుల మంగళభాషణంబులును భూసురనికాయాశీర్వాదవేదఘోషంబులును వీణావేణుభేరీపటహశంఖకాహళధ్వానంబులును రథారూఢవిభూషణభూషితవారయువతిగానంబుల సమానంబులై చెలంగ నెదురుకొని యథోచితప్రణామనమస్కారపరిరంభకరస్పర్శనసంభాషణమందహాససందర్శనాది విధానంబుల బహుమానంబులు సేసి వారలుం దానును భుజగేంద్రపాలితంబయిన భోగవతీనగరంబు చందంబున స్వసమానబలమధుభోజదాశార్హకుకురాంధకవృష్ణివీరపాలితంబును సకలకాలసంపద్యమానాంకురపల్లవకోరకకుట్మలకుసుమఫలమంజరీపుంజభారవినమితలతాపాదపరాజివిరాజితోద్యానమహోపవనోపవనారామభాసితంబును వసాంతరాళరసాలసాలశాఖాంకురఖాదనతుండకషాయకంఠకలకంఠమిథునకోలాహలఫలరసాస్వాదపరిపూర్ణశారికాకీరకులకలకలకల్హారపుష్పమకరందపానపరవశభృంగభృంగీకదంబఝంకారసరోవరకనకకమలమృదులకాండఖండస్వీకారమత్తవరటాయత్తకకలహంసనివహక్రేంకారసహితంబును మహోన్నతసౌధజాలరంధ్రనిర్గతకర్పూరధూపధూమపటలసందర్శనసంజాతజలధరభ్రాంతివిభ్రాంతసముద్ధూతపింఛనర్తనప్రవర్తమానమత్తమయూరకేకారవమహితంబును నానారూపతోరణధ్వజవైజయంతికానికాయనిరుద్ధతారకాగ్రహ

[illegible]పుత్రుండయిన యిక్ష్వాకు వంశంబునం బ్రజారక్షణంబు శ్రీరామచంద్రుని భంగి బ్రహ్మణ్యుండు సత్యప్రతిజ్ఞుండును, శిబికైవడి శరణాగతరక్షకుండు, దుష్యంతపుత్రుండగు భరతుని పగిది జ్ఞాతివర్గ యశోవర్ధనుండు, కార్తవీర్యార్జునుని యట్లు ధనుర్ధరాగ్రేసరుండు, శిబిచక్రవర్తి తెఱంగున దానశీలుండు, ఘోరకాంతారంబు పావకుని తెఱంగున దుర్ధర్షుండును, సముద్రుని తెఱంగున దుస్తరుండును, మృగేంద్రంబు పై వడి విక్రమశాలియు, వసుమతియ పోలిక సహనశీలుండును, భానునిఁ బోలి ప్రతాపవంతుండును, వాసుదేవుని వడువున సర్వభూతహితుండును, దల్లిదండ్రుల వాడుకన సహిష్ణుండు నగు మఱియును॥ సీ॥ సమదర్శనంబున జలజాతభవుఁ డనఁ బరమప్రసన్నత భర్గుఁ డనఁగ। నెల్లగుణంబుల నిందిరావిభుఁ డన నధికధర్మమున యయాతి యనఁగ। ధైర్యసంపద బలిదైత్యవల్లభుఁ డన నచ్యుతభక్తిఁ బ్రహ్లాదుఁ డనఁగ। రాజితోదారత రంతిదేవుం డన నాశ్రితమహిమ మహాద్రి యనఁగ। యశము నార్జించుఁ బెద్దల నాదరించు నశ్వమేధంబు లొనరించు నాత్మసుతుల। ఘనులఁ బుట్టించు దండించుఁ ఖలులఁ బట్టి। మానధనుఁడు నీ మనుమఁడు మానవేంద్ర॥ భుజంగప్రయాతము॥ హరించుం గలిప్రేరితాఘంబు లెల్లన్। భరించున్ ధరన్ రామభద్రుండు వోలెం। జరించున్ సదా వేదశాస్త్రానువృత్తిన్। వరించున్ విశేషించి వైకుంఠభక్తిన్॥ వ॥ ఇట్లు పెక్కేండ్లు జీవించి భూసురకుమారకప్రేరితంబయిన తక్షకసర్పవిషానలంబున నందనకు మరణంబని యెఱింగి సంగవర్జితుండయి ముకుందపదారవింద భజనంబు సేయుచు శుకయోగీంద్రుని వలన నాత్మవిజ్ఞానసంపన్నుండై గంగాతటంబున శరీరంబు విడిచి నిర్గతభయశోకుండై నలోకంబుఁ బ్రవేశించు నని జాతకర్మఫలంబు సెప్పి లబ్ధకాములై భూసురులు చనిరంత॥ క॥ తన తల్లి కడుపులోపల। మునుఁ జూచిన విభుఁడు విశ్వమున నెల్లఁ గలం। డనుచుఁ బరీక్షింపఁగ జను। లనఘుఁ బరీక్షి న్నరేంద్రుఁ డండ్రు మునీంద్రా॥ గీ॥ కళల చేత రాజు గ్రమమునఁ బరిపూర్ణుఁ। డయిన భంగిఁ దాత లనుదినంబు। పోషణంబు సేయఁ బూర్ణుఁ డయ్యె నుధర్మ। పటల పాలకుండు బాలకుండు॥ వ॥ మఱియు ధర్మజుండు బంధుసంహారదోషంబు వాయుకొఱకు నశ్వమేధయాగంబు సేయం దలంచి ప్రజలవలనం గరదండంబుల నుపార్జితంబయిన విత్తంబు చాలక చిత్తంబున జింతించు నెడ నచ్యుతప్రేరితులై భీమార్జునాదులు దొల్లి మరుత్తుం డను రాజు మఖంబు సేసి పరిత్యజించిన యేపించిన సువర్ణపాత్రాదికంబైన విత్తము నుత్తరదిగ్భాగంబు వలన బలవంతులై తెచ్చిన నా రాజసత్తముండు సమాయత్త యజ్ఞోపకరణుండై సకలబంధుసమేతంబుగఁ గృష్ణుని నాహ్వానంబు చేసి పురుషోత్తము నుద్దేశించి మూఁడు జన్నంబులు గావించె తదనంతరంబ కృష్ణుండు బంధుప్రియంబుకొఱకుఁ గరిసగరంబునం గొన్ని నెలలుండి ధర్మపుత్రాముల చేనామంత్రణంబువడసి యాదవసమేతుండై ధనంజయుండుతోడరా నిజనగరంబునకుఁ జనియె నంతకమున్న విదురుండు తీర్థయాత్రకుఁ జని మైత్రేయముండ కర్మయోగవ్రతాది విషయంబులయిన ప్రశ్నలు గొన్నింటిం జేసి యతని వలన నాత్మవిజ్ఞానంబు దెలిసి కృతార్థుండై హస్తిపురంబునకు వచ్చిన॥ క॥ బంధుఁడు వచ్చె నటంచును। గాంధారీవిభుఁడు మొదలుగా నందఱు సం। బంధములు నెఱపి ప్రీతిన। గంధరగతిఁ జేసి రపుడు మన్నన లనఘా॥ వ॥ అంత ధర్మనందనుండు విదురునకు మజ్జనభోజనాదిసత్కారంబులు సేయించి సుఖాసీనుండై తనవారలందఱు వినుచుండ నిట్లనియె॥ సీ॥ పవర్తనంబున నింతగాలము మీరు సంచరించితి రయ్య జగతిలోన। నేతీర్థములు గంటి రెక్కడ నుంటిరి భావింప మీవంటి భాగవతులు। తీర్థసంఘంబుల దిక్కరింతురు గదా మీ యందు విష్ణుండు మెఱయుకతన। మీరే తీర్థంబులు మీకంటె మిక్కిలి తీర్థంబు లున్నవె తెలిసి చూడ। వేరె తీర్థంబులవని పైవెమక నేల। మిమ్ముఁ బోడగని భాషించుమే లెచాలు। వార్తలే మంద్రు లోకులు వసుధలోన। మీకు సర్వంబు నెఱిఁగెడు మేరగలదు॥ మత్తకోకిల॥ తండ్రి సచ్చిన మీఁద మా పెదతండ్రి బిడ్డలు దొల్లి పెం। కరాంధ్రు సర్వవిషాగ్ని బాధలఁ గాసి వెట్టఁగ మమ్ముని। ర్లాంద్రనంతముఁ బొందకుండఁగ లాలనంబున మీరు మా। తండ్రిభంగి సముద్ధరింతురు తద్విధంబు దలంతురే॥ క॥ పక్షులు దమ ఱెక్కలలోఁ। బక్షంబులు రాని పిల్ల పసువుల మమతన్। రక్షించిన క్రియ మీరలు। పక్షీకరణంబు సేయ బ్రదికితిమి గదే॥ క॥ మన్నారా ద్వారకలో। నున్నారా యదుకులంబు జోదరు కరుణన్। గన్నారా లోకులచే। విన్నారా మీరు వారి విధమెట్టిదియో॥ చ॥ అనవిని ధర్మరాజునకు నావిదురుండు సమస్తలోకవర్తనము గ్రమంబుతోడ విశదంబుగఁ జెప్పి యదుక్షయంబు సెప్పిన నతఁడు గ్రశోకమున బెగ్గిలుచుం డెడినంచు నేమింటను। న్యానమని చెప్పఁడయ్యె యమహీరుల నాశముభార్గవోత్తమా॥ గీ॥ మేలుఁ జెప్పె నేని మేలందురు లోకులు। చెట్టయం[illegible]కీడుఁ జెప్పువాని। నంత మీఁదఁ జూడ్రుఁడై నకతంబున। శిష్టమరణ మతఁడు సెప్పఁడయ్యె॥ వ॥ అది యెట్లనిన మాండవ్యమహాముని శాపంబున నందొల్లి యముండు శూద్రయోనియందు విదురుండై జన్మించి యున్న నాలువత్సరంబుల

**మారుండు** జాతకర్మవిదులైన పెద్దలు చెప్పినచందంబున భూసురోత్తమశిక్షావశంబున మహాభాగవతుండై ధరణీపాల నంబు సేయుచును నుత్తరునిపుత్త్రిక నిరావతియను మత్తకాశినిం బెండ్లియాడి జనమేజయప్రముఖులయిన నలువురుకొడుకులను త్పాదించి గంగాతటంబునఁ గృపాచార్యుండు గురువై యుండ యాగభాగంబులకు వచ్చిన దేవతల నీక్షించుచు భూరిదక్షిణంబులుగా మూఁడశ్వమేధంబు లాచరించి దిగ్విజయకాలంబున గోమిథునంబుఁ దన్నుచున్న శూద్రుండగు రాజచి

**పరీక్షిన్మహారాజు దిగ్విజయంబున భూధర్మదేవతల సంవాదం బాలించుట.**

హ్నముద్రితుండగు కలిం బట్టి నిగ్రహించె నని చెప్పిన శౌనకుండు పౌరాణికున కిట్లనియె॥ క॥ భూవరరూపపు శూద్రుఁడు గోవృందా నేలఁ దన్నఁ గోరి పరీక్షిద్భూవరుఁడు దిశలఁ గెలుచుచు నేవిధిఁ గలి నిగ్రహించె నెఱిఁగింపఁగదే॥ మ॥ అరవిందాక్షుపదారవిందమకరందాసక్తులైనట్టి సత్పురుషశ్రేష్ఠులప్రవృత్తము ల్వినక దుర్బుద్ధిన్విలంఘించి మున్నగవాగ్జాతకథనప్రపంచములు గర్ణప్రాప్తము ల్సేసి వాసరముల్ వ్యర్థతఁ ద్రోచుచుండ జనుఁ డుసరసారమోహంబునన్॥ సీ॥ మనుజుఁడు సత్యము గామమరణంబు నిజమని యెఱిఁగి మోక్షస్థితి నిచ్ఛయించు నల్పాయువులగు మాకు నట్టి ముకుందచరిత్రము లోలిఁ గర్ణరంధ్రములఁ బెట్టి! బంగారువంటి యీ రాత్రి కెడఁ గాలంబు వోనాడఁగా నేల పుణ్యచరిత! మాధవపదపద్మమకరందపానంబు సేయింపవే యేము సేయునట్టి సత్త్రయాగమునకు సమ్మునీంద్రులు చీఱ! వాఁడె యీఁడె యముఁడు వచ్చెఁ జూడు! చంపఁ డొకనినైనఁ జన్నమయ్యెడుదాఁక! వినుచుసుండుఁ దగిలి శిష్టుకథలు॥ క॥ మందమతులమందబుద్ధికి మందాయువునకు నిరర్థమార్గములను గోవిందచరణారవిందము రందము గొనఁ దెఱపి లేదు రాత్రింబవలున్॥ వ॥ అని శౌనకుండు పలికిన సూతుం డిట్లనియెఁ బరీక్షిన్నరేంద్రుండు నిజవాహినీసందోహసంరక్షితంబగు కురుజాంగలదేశంబునం గలిప్రవేశంబు నాకర్ణించి యుద్ధకుతూహలం బంగీకరించి యొక్కనాఁడు సముల్లాసంబున బాణాసనంబుఁ గైకొని నీలనీరదనిభతురంగనివహయోజితంబును ఫలితమనోరథంబునైన రథంబు నారోహణంబు చేసి మృగేంద్రధ్వజంబు వెలుంగ రథకరితురంగసుభటసంఘటితచక్రంబు నిర్వక్రంబునం గొలువ దిగ్విజయార్థంబు వెడలి పూర్వదక్షిణపశ్చిమోత్తరసముద్రలగ్నంబులైన యిలావృతరమ్యకహిరణ్మయహరివర్షకింపురుషభద్రాశ్వకేతుమాలభారతవర్షంబులును నుత్తరకురుదేశంబులును జయించి పుష్కలధనప్రదానపూర్వకయగుసపర్యల నభ్యర్చితుండై తత్తద్దేశమంగళపాఠకసంఘాతజేగీయమానపూర్వరాజవృత్తాంతంబు లాకర్ణించుచుఁ బాండవపతితపవ్యంబులఁ బాండవులకు భక్తవత్సలుండైన పుండరీకాక్షుం డాచరించిన సారథ్యసఖ్యసభాపతిత్వసాచివ్యరచనవీరాసనదూతభావాదికృత్యంబులు నశ్వత్థామాస్త్రతేజంబువలనఁ దనురక్షించుటయు యయాతిన పాండవులందలి స్నేహానుబంధంబును వారలకుఁ గలిగిన భగవద్భక్తివిశేషంబును విశ్వభగత్వంబును విని యాశ్చర్యంబు నొందుచు వందిబృందంబులకు మహాధనంబులు మహారాంబరాభరణసందోహంబులు నొసఁగుచుఁ బద్మనాభపాదపద్మభజనపరతంత్రపవిత్రమానసుండై యుండె నయ్యెడ వృషభరూపంబున నేకపాదంబున సంచరించు ధర్మదేవుండు దనసమీపంబున లేగ లేనికుఱ్ఱిచందంబున హతప్రభయై నేత్రంబుల సలిలంబులు గురియుచు గోరూపయై యున్న ధాత్రి కిట్లనియె॥ మ॥ నయనాంభఃకణజాలమేల విడువన్ వాతన్నీ మేను సామయమై యున్నది మోము వాడె నది సీసన్నించుచుట్టాలకున్! భయదుఃఖంబులు నేఁడు వొందవుగదా బంధించి శూద్రుల్ పవిత్రయహీనున్ నను బట్టిన స్తూరనియో తాపంబుని కేటికిన్॥ సీ॥ మఖముల లేమిని మఖ్యులకిటమీఁద మఖభాగములు లేక మానునని యొ! రమణులు రమణులరక్షింపరని యొ పుత్త్రులఁ దల్లిదండ్రులు ప్రోవరనియొ! భారతిగుజనులఁ బ్రాపించునని యొ సద్విప్రులన్నృపులు సేవింపరని యొ! కులిశహస్తుఁడు వానగురియింపకుండఁగఁ బ్రజలు దుఃఖంబులఁ బడుదురనియొ! హీనవంశజాతులే లెవరని యొ రాజ్యములు పాడిగలిగి జరుగవనియొ! మనుజులన్న పానమైథునశయనాసనాదికర్మసక్తులగుదురనియొ॥ మ॥ జననీ నీభర మెల్ల డంపుటకునై చక్రాయుధుండిన్నిహా యనముక్తేళిన రాకృతిన్మేలఁగిని త్వానందముం జేసి పోయిన నేఁ డింక ననాథనై తెగుజనుండెవ్వాఁడు శాసించునో! పెనుదుఃఖంబులఁ బొందఁగంటి నని యో భీతిల్లి చింతించుటల్॥ క॥ దెప్పరమగు కాలము చే నెప్పుడు దేవతలకెల్ల నిష్టంబగు నీ యొప్పెనము గృష్ణుఁ డరిగినఁ దప్పెఁగదా తల్లి నీవు దల్లడపడఁగన్॥ అనిన భూదేవి యిట్లనియె॥ క॥ ఈలోకంబునఁ బూర్వము నాలుగుపాదములనీవు నడతువు నేఁడా! శ్రీలలనేశుఁడు లేమిని! గాలము చే నీకు నొంటికాలయ్యెఁగదే॥ వ॥ మఱియు సత్యశౌచదయాక్షాంతిత్యాగసంతోషార్జవంబులును శమదమతపంబులును సామ్యంబును బరాపరాధసహనంబును లాభంబు గల మెడను దాసీనుండై యుండుటయును శాస్త్రవిచారంబును విజ్ఞానవిరక్తులు నైశ్వర్యశౌర్యప్రభాదక్షత్వంబులును స్మృతి

చారము సేసెఁగా దె నృపసత్తమ భక్తిలతానుబద్ధుఁడై॥ వ॥ నరేంద్రా యేము ప్రాణులకు దుఃఖహేతువులము గాము మావలన దుఃఖంబు నొందెడు పురుషుండు లేఁడు వాదివాక్యభేదంబుల యోగీశ్వరులు మోహితులై భేదంబుల నాచ్ఛాదించి తమకు నాత్మ సుఖదుఃఖంబుల నిచ్చు ప్రభువని చెప్పుదురు దైవజ్ఞులు గ్రహదేవతాదులకుఁ బ్రభుత్వంబు సంపాదింతురు మీమాంసకులు కర్మంబునకుఁ బ్రాభవంబుఁ బ్రకటింతురు లోకాయతికులు స్వభావంబునకుఁ బ్రభుత్వంబు పలుకుదురం దెవ్వరికిని సుఖదుఃఖప్రధానంబు సేయఁ బ్రభుత్వంబు లేదు పరులవలన దుఃఖంబు వచ్చిన నధర్మంబు పగులు చేసిరని విచారింపవలదు తర్కింపను నిర్దేశింపను రాని పరమేశ్వరునివలన సర్వము నగుచుండు ననిన ధర్మదేవునికి ధర్మనందనపౌత్రుఁ డిట్లనియె॥ గీ॥ ధర్మమూర్తి వయ్య ధర్మజ్ఞ వృషరూప। పరమధర్మ మీవు పలుకు త్రోవ। పాపకర్మ సేయు పాపంబు సూచింపఁ। బాపకర్ముఁ డేగు పథము వచ్చు॥ వ॥ మఱియు దేవమాయవలన భూతంబుల వాఙ్మనంబులకు వర్త్యఘాతుకవృత్తి సులభంబునం దెలియ రాదు నీవు ధర్మదేవతవు కృతయుగంబునం దపశ్శౌచదయాసత్యంబులను నాలుగు నీకుం బాదంబులని చెప్పుదురు త్రేతాయుగంబునఁ బూర్వోక్తపాదచతుష్కంబునం దొక్కపాదంబు క్షీణం బయ్యె ద్వాపరంబునం బాదద్వయంబు నశించెఁ గలియుగంబందు నివ్విధంబున నిప్పుడు నీకుఁ బాదత్రయంబు భగ్నంబయ్యె నవశిష్టంబగు భవదీయ చతుర్థపాదంబు నధర్మంబు గల్యంతంబున నిగ్రహింపఁ గమకించుచున్నది విను మదియును గాక॥ క॥ భరమున్ బాపి రమావిభుండు గురుణం బాదంబులం ద్రొక్కఁగా। స్థిరమై వేడుక నింతకాలము సుఖశ్రీ నొందియీ భూమి నీ। చ్చరణస్పర్శము లేమి శూద్రకులజుల్ పాలింతురంచు

## ⟹ పరీక్షిన్మహారాజు కలిపురుషుని నిగ్రహించి ధర్మపరిపాలన సేయుట. ⟸

న్నిరంతరశోకంబున నీరుఁగన్నుల నిడెన్ ధర్మజ్ఞ వీక్షించితే॥ వ॥ అని యిట్లు పలుకు ధర్మభూదేవతలఁ బుజ్జగించి మహారథుండయిన విజయపౌత్రుండు గ్రొక్కారు మెఱుంగు తెఱంగున ధిక్కరించి దిక్కుల వెక్కసంబయిన యడిదంబు వెడలించి యడిపించి పాపహేతువయిన కలిరూపు మాప నుద్యోగించిన వాఁడు రాజరూపంబు డిగి వాఁడిన మొగంబుతో భయవిహ్వలుండయి హస్తంబులు సాఁచి సత్పాదమూలవిన్యస్తమస్తకుండయి ప్రణామంబు సేసె॥ క॥ గంపించె దేహ మెల్లఁ। జంపకుమీ రాజతిలక శరణాగతుర। క్షింపుమని తనకు మ్రొక్కినఁ। జంపక కలిఁ జూచి నగుచు జనపతి వలికెన్॥ క॥ అర్జునకీర్తిసమేతుం। డర్జునపౌత్రుండు భయరసావృతజనులన్। నిర్జితులఁ జంపనొల్లఁడు। దుర్జనభావంబు విడిచి తొలఁగు దురాత్మా॥ వ॥ నీవు పాపబంధుండవు మదీయ బాహుపాలితంబయిన మహీమండలంబున నిలువవలదు రాజదేహంబులందు వర్తించు నిన్ను ననృతలోభచౌర్యదౌర్జన్యదురాచారమాయా కలహకపటకలుషాలక్ష్మ్యాది ధర్మేతరసమూహంబులాశ్రయించు సత్యధర్మంబులకు నివాసంబగు బ్రహ్మావర్తదేశంబున యజ్ఞవిస్తారనిపుణులయిన వారు యజ్ఞేశ్వరుండయిన హరిం గూర్చి యాగంబు సేయుచున్నవారు యజించువారలకు సుఖప్రదానంబు సేయుచు సకలభూతాంతర్యామియై భగవంతుండయిన హరి జంగమస్థావరంబులకు నంతరంగబహిరంగంబుల సంచరించు వాయువు చందంబున నాత్మరూపంబున మనోరథంబుల నిచ్చుం గావున నిందుండవలవదనుచు దండహస్తుండయి నజము నిక్కి వడి మండలాగ్రంబు సాఁచిన రాజునకుం గలి యిట్లనియె॥ క॥ జగతీశ్వర నీయడిదము। ధగధగితప్రభలతోడఁ దఱచుగ మెఱయన్। బెగడెం జిత్తము గుండెలు। వగిలెడి నిఁక నెం దుఁజొత్తు భావింపగదే॥ వ॥ నరేంద్రా నిను నారోపితశరశరాసనునిఁగ సర్వప్రదేశంబులందును విలోకించుచున్నవాఁడ నే నెక్కడనుండుదు నానతిమ్మనిన రాజన్యశేఖరుండు ప్రాణివధ స్త్రీ ద్యూత పానంబులనియెడు నాలుగు స్థానంబులనిచ్చి మఱియు నడిగిన సువర్ణమూలంబగు ననృతమద కామ హింసా వైరంబులనియెడు పంచప్రదేశంబుల నొసంగి యితరస్థలంబుల స్పృశియింపకుండ నియమించె నిట్లు కలి నిగ్రహంబు సేసి హీనంబులయిన తపశ్శౌచదయలనియెడి మూఁడు పాదంబులు వృషభమూర్తియయిన ధర్మదేవునికిచ్చి రత్నగర్భకు నిర్భరంబయిన సంతోషంబు సంపాదించె॥ క॥ గజనామధేయపురమున। గజరిపుపీఠమున ఘనుఁడు గలిమర్దనుఁడున్। గజవైరిపరాక్రముఁడై। గజిబిజి లేకుండఁ దాల్చెఁ గౌరవలక్ష్మిన్॥ వ॥ ఇట్లు కృష్ణుని యనుగ్రహంబున నశ్వత్థామబాణపావకంబువలన బ్రతికి పరీక్షిన్నరేంద్రుండు బ్రాహ్మణశాపప్రాప్తతక్షకభయంబువలనఁ బ్రాణంబులు వోవునని యెఱింగి సర్వసంగంబులు వర్జించి శుకునకు శిష్యుండై విజ్ఞానంబు గలిగి గంగాతరంగిణీతీరంబునం గళేబరంబు విడిచె వినుఁడు॥ క॥ హరివార్త లెఱుఁగువారికి। హరిపదములు దలఁచువారి కనవరతంబున్। హరికథలు వినెడువారికి। మరణాగతమోహసంభ్రమము లేదనఘా॥ క॥ శుభచరితుఁడు హరి యరిగినఁ। బ్రభవించి ధరిత్రి నెల్లఁ బ్రబ్బియుఁ గలి దా। నభిమన్యుసుతుని వేళను। బ్రభవింపక యడఁగియుండె భార్గవముఖ్యా॥ వ॥ ఇవ్విధంబునఁ జతుస్స

ముద్రముద్రితాఖిలమహీమండలప్రాజ్యసామ్రాజ్యంబుపూజ్యంబుగాఁజేయుచునాయభిమన్యుపుత్త్రుండు॥. ఉ॥ చే
సినఁగానిపాపములుచెందవుచేయఁదలంచినంతటన్। జేసెదనన్నమాత్రమునఁజెందుఁగదాకలివేళపుణ్యముల్। మోస
ములేదటంచునృపముఖ్యుఁడుగాచెఁగలిన్మరందముల్లాసముతోడఁగ్రోలివిరులందెగఁజూడనితేఁటికైవడిన్॥. వ॥ మఱి
యుంబ్రమత్తులైయధీరులగునరులయందువృకంబుచందంబుననొదిగిలియాచుకొనియుండిచేష్టించుఁగానిధీరులైనవా
రికింగలివలనిభయంబులేదనికలినంతంబునొందింపఁడయ్యెననినవిని ఋషులుసూతునకిట్లనిరి॥. సీ॥ పౌరాణికోత్తమ
బ్రతుకుముపెక్కేండ్లుదామరసాక్షునిధవళయశము। మరణశీలురమయినమాకెఱింగించితికల్పితంబగుక్రతుకర్మమం
దుఁ। బొగలచేఁబొగిలియబుద్ధవిశ్వాసులమముహరిపదపద్మమధురరసముఁ। ద్రావించితివినీవుధన్యులమైతిమిస్వర్గమేని
యునపవర్గమేని। భాగవతసంగలవభాగ్యఫలముకీడె। ప్రకృతిగుణహీనుఁడగుచక్రిభద్రగుణము। లీశకమలాసనాదులుసె
ఱుఁగలేరు। వినికివినఁజాలమునియెడివెఱ్ఱిగలఁడె॥. క॥ శ్రీపంబులుఖండితాసం। తాపంబులుగల్మషాంధతమసమహా।
దీపంబులుపాషండమ। రాపంబులువిష్ణువందనాలాపంబుల్॥. క॥ పావనములుదురితలతా। లావనములునిత్యమంగళప్ర
భవసం। జీవనములులక్ష్మీసం। భావనములువాసుదేవపదసేవనముల్॥. గీ॥ పరమభాగవతుఁడుపాండవపౌత్త్రుండు। శుకు
నిభాషణములశుద్ధబుద్ధి। యైవిరాజమానుఁడైముక్తియగువిష్ణు। పాదమూలమెట్టుపడసెననఘ॥. వ॥ మహోత్మ్యావిచిత్ర
యోగనిష్ఠాకలితంబు విష్ణుచరితలలితంబుపరమపుణ్యంబు సకలకల్యాణగుణగణ్యంబు భాగవతజనాపేక్షితంబునయిన
పారీక్షితంబగుభాగవతాఖ్యానంబువినుపింపుమనినసూతుండిట్లనియె॥. క॥ మిముబోఁటిపెద్దవారలు। గమలాక్షునిచరి
తమడుగఁగాఁజెప్పెడిభా। గ్యముఁగలిగెనేఁడుమాజ। న్మముసఫలంబయ్యెవృద్ధమాన్యులమగుటన్॥. క॥ కులహీనుఁడునా
రాయణ। విలసత్కథనములుదగిలివినుపించినఁద। త్కులహీనతఁబాసినుమహా। జ్వాలకులజత్వమునుబొందుసన్మునులా
రా॥. సీ॥ ఎవ్వనిగుణజాలమెన్నజిహ్వలులేకనళినగర్భాదులనంతుఁడండ్రుఁ। గోరెడువిబుధేంద్రకోటినొల్లకలక్ష్మిప్రా
ర్థించెనెవ్వనిపాదరజము। బ్రహ్మయొవ్వనిపాదపద్మంబుగడిగినజలముధన్యతఁజేసెజగమునెల్ల। భగవంతుఁడనియెడిభ
ద్రశబ్దమునకునెవ్వఁడర్థాకృతినేఁపుమిగిలె। నేమహాత్మునాశ్రయించిశరీరాదిసంగకోటినెల్లసంహరించి। ప్రాభవమున
మునులుపారమహంస్యంబు। నొందితిరిగిరాకయుందురెలమి॥. చ॥ క్రమమునమింటికై యెగయఁగాకవిహంగమమిం
టిదైనపా। రముగననేర్చునేహరిపరాక్రమమోపినయంతగాకస। ర్వమువివరింపనెవ్వఁడుప్రశస్తకుఁడర్యములార

## ※ పరీక్షిన్మహారాజు వేఁటాడి శమీకమహాముని పైమృతసర్పము నెత్తివైచుట. ※

నానుచి। త్తమునకునెంతఁగానఁబడెఁజెప్పకచెప్పెదమీకునంతయున్॥. క॥ వేదండపురాధీశుఁడు। గోదండముచేతఁబట్టి
కొనిగహనములో। వేదండాదులనెకనాఁ। డేదండలఁబోవనీకయెగిచెన్బలిమిన్॥. క॥ ఒగ్గములుద్రవ్వివడువునఁ। నొగ్గ
డుపెనుదెరలవలలనుగ్రమృగములున్। డగ్గరినఁజంపువేడుక। వెగ్గలమైచిత్తమందువేఁటాడింపన్॥. క॥ కోలములగవయ
వృకశార్దూలములఁదరక్షుఖడ్గరోహితహరిశుం। డాలములశరభచమర। వ్యాలములవధించెవిభుఁడువడినోలములన్॥.
క॥ మృగయులుమెచ్చనరేంద్రుఁడు। మృగరాజపరాక్రమమునమెఱసిహరించెన్। మృగధరమండలమునఁగల। మృగమొ
క్కటివిడకసర్వమృగములనెల్లన్॥. వ॥ ఇట్లువాటంబయినవేఁటతమకంబునమృగంబులవెంటందగిలిబుభుక్షాపిపాస
మిగులంబరిశ్రాంతుండయిధరణీకాంతుండుచల్లనినీటికొలంకులుగానకకలంగినచిత్తంబుతోఁజనిచనియొక్కతపోవ
నంబుగనియందు॥. సీ॥ మెలఁగుటఁజాలించిమీలితనేత్రుఁడై శాంతుఁడైకూర్చుండిజడతలేక। ప్రాణమనోబుద్ధిపంచేం
ద్రియంబులబహిరంగవీథులఁబారనీక। జాగరణాదికస్థానత్రయముదాఁటిపరమమైయుండెడిపదముఁదెలిసి। బ్రహ్మభూ
తత్వసంప్రాప్తివిశ్రాంతుఁడైయతిదీర్ఘజటలునన్నావరింప। నలఘురురుచర్మధారియైయలరుచున్న। తపసిఁబొడఁగనిశో
షితతాలుఁడగుచు। నెండితడిలేనికుత్తుకనెలుఁగుడింద। మందభాషలడగ్గరిమనుజవిభుఁడు॥. క॥ తోయములుదెమ్ముమాకే।
తోయమువేఁటాడువేళఁదొల్లిప్రేడమదీ। తోయముక్రియజలదాహము। తోయమువారలునులేరుమస్నేహమనఘా॥.
వ॥ అనిభూవరుండుశమీకమహామునిసమాధినిష్ఠుండునువిస్మృతబాహ్యాంతరింద్రియకృతసంచారుండునుహరిచింతా
పరుండునయియుండుటఁజింతింపక॥. ఉ॥ కన్నులుమూసిబ్రాహ్మణుఁడుగర్వముతోడుతనున్నవాఁడుచే। సన్నలనైన
రమ్మనఁడుచాలజలంబులుఁదెచ్చిపోయఁడే। మన్ననలైనఁజేయఁడుమసగ్రఫలంబులువెట్టఁడింతసం। పన్నతనొందెనేత
నతపశ్చరణాప్రతిమప్రభావముల్॥. గీ॥ వారిఁగోరుచున్నవారికిశీతల। వారినిడుటయొట్టివారికయిన। వారితంబుగానివ

లసినధర్మంబు। వారి యిడఁడు దాహవారి గాఁడు॥ చ॥ అని మనుజేశ్వరుండు మృగయాపరతాయతతోయదాహసంజనితరురంతరోషమున సంయమి కన్నుఁ దిరస్కరించి పూజనములు సేయఁ డంచు మృతసర్పము నొక్కటి వింటికొప్పునన్ ననివడిఁ దెచ్చి వైచె నటు బ్రహ్మమునీంద్రుని యంసవేదికన్॥ వ॥ ఇట్లు తండ్రి ప్రత్యాహృతబాహ్యేంద్రియుండగుచు మీలితలోచనుండగు నొప్పునో యట్లు గాక గతాగతులగు క్షత్రబంధులచే నేమియనిష్ప్రయాసమానసనిష్ఠుండగునో పునో యని వితర్కించుచు వ్యథారోషదర్పంబున మునిమూఁపున గతాసువయిన సర్పంబు నిడి నరేశ్వరుండు నిజపురంబునకుం జనియె నంత సమీపవర్తులైన మునికుమారులు చూచి శమీకనందనుండయిన శృంగికడకుం జని॥ క॥ నరగంధగజస్యందన। తురగంబుల నే

శ్రీ శమీకమహామునిపుత్రుండగు శృంగిమునిపరీక్షిత్తుని శపించుట. శ్రీ

లు రాజు దోయాతురుఁడై। పరగన్నీ జనకుని మెడ। నురగముఁ బెగిలించి పోయె నోహో సంద్రీ॥ వ॥ అని పలికిన సమానవయోరూపమునికుమారలీలాసంగియయిన శృంగి శృంగంబులతోడ మూర్తీకరియించినట్లు విజృంభించి రోషసంరంభంబున నిపరిపడి బల్యన్నంబుల భుజించి పుష్టంబులగు పరపుష్టంబులం బోలి బలిసియు ద్వారంబులం గాచికొనియుండు సారమేయంబుల పగిది దాసభూతులగు క్షత్రియాభాసులెల్ల బ్రాహ్మణోత్తములచే స్వరక్షకులుగ నిరూపితులయిరి యట్టివారలెట్లు తద్గృహంబుల భాండసహితంబుగ నన్నంబు భుజింపనర్హులగుదురు తత్తత్కృతంబులయిన ద్రోహంబులెల్లు నిజస్వామిం జెందునని మఱియు నిట్లనియె॥ ఉ॥ అడఁడు తన్నుఁ బ్రమావాసులఁ గాని శైగులం। గాపడఁడుక పమాలములు గూడు గఁదించు సమాధిచిత్తుఁడై। వీడఁడు లోనిచూడ్కులను విష్ణుసదర్కఁ బరిప్రపంచముం। జూడఁడు సద్గుణుండు ఫణిఁ జుట్టఁగ నేటికి రాచవానికిన్॥ ఉ॥ హోమహిరణ్యదానములఁ బుచ్చుకొనంగ ధనంబు లేమియుం। దేమ సవంచనంబులుగ దీవెనలిచ్చుచు వేసరింపఁగా। రాము వనంబులన్ గృహావిరాములమై నివసింపఁ జెల్ల రే। పాముసుపై వఁగాఁడగునె బ్రహ్మమునీంద్రభుజార్గళంబునన్॥ క॥ పుడమిఁ గలజనులు వొగడఁగఁ। గుపుఁడు గుట్టుమను గాక పువలయపతులై। యడవుల నిడుములఁ బడియెడి। బడుగుల మెడనిడగఁదగునె పన్నగశవమున్॥ క॥ భగవంతుఁడు గోవిందుఁడు। జగతిం బెడవాసి చనిన శాసింపంగాఁ। దగువరులు లేమి దుర్జను। లెగసి మహాసాధుజనుల నే చెదరకటా॥ క॥ బాలకులారా ధరిత్రీ। పాలకు శపియింతు ననుచు బలువడి నివిలో। బాలకుఁడగు మునికుంజర। బాలకుఁ డరిగెం ద్రిలోకపాలకులెరఁగన్॥ వ॥ ఇట్లు రోషించి కౌశికీనదికిం జని జలోపస్పర్శనంబు చేసి॥ ఉ॥ ఓడక వింటికొప్పున మృతోరగముం గొనివచ్చి మా గురుం। డాడక యున్న మజ్జనకు నంసతలంబునఁ బెట్టి మర్మదా। క్రీడఁ జరించు రాజు హరకేశవు లడ్డినఁ గానఁ జచ్చుఁ బో। నేడవనాఁడు తక్షకఫణీంద్రవిషానలహేతిసంహతిన్॥ వ॥ అని శమీకమహామునికుమారుండయిన శృంగి పరీక్షిన్నరేంద్రుని శపియించి నిజాశ్రమంబునకుం జనుదెంచి కంఠలగ్నకాకోదరుండయిన తండ్రిం జూచి॥ క॥ ఈ యెడ నీకిం తముననకు। నీయురగశవంబుఁ దెచ్చి యిటు సేర్చినయా। యయ్యనికనేమి సేయుదు। నెయ్యంబులు లేవు సుమ్మ నృపులకుఁ దండ్రీ॥ శా॥ ప్రారంభంబున వేఁటవచ్చి ధరణీపాలుండు మాతండ్రిపై। నేరం బేమియు లేదు సర్పశవము న్నేఁడు గ్రుడ్డై వైచినాఁ। డీరీతిన్ ఫణిక్రమ్ముఁ బ్రతుకు నోహింసించునో కో అలన్। రారే తాపసులార దీనిఁ దివరే రక్షింపరే మ్రొక్కెదన్॥ వ॥ అని సర్పంబు దిగుచు నేర్పు లేక యెలుంగెత్తి విలపించుచున్న కుమారకు రోదనధ్వని విని యాంగిరసుండయిన శమీకుండు సమాధిఁ జాలించి మెల్లన కన్నులు దెఱచి మూఁపున వ్రేలుచున్న మృతోరగంబు నీక్షించి పారవైచి కుమారకుం జూచి॥ క॥ ఏకీడు నాచరింపము। లోకులకున్ మనము సర్వలోకసములమున్। శోకింప నేల పుత్రక। కాకోదర మేల వచ్చెఁ గంఠంబునకున్॥ వ॥ అని యడిగినఁ దండ్రికిఁ గొడుకు రాజు వచ్చి సర్పంబు వైచుటయుం దాను శపించుటయు వినిపించినఁ దండ్రి గొడుకువలన సంతసింపక యిట్లనియె॥ క॥ బెట్టిదమగు శాపమునకు। దట్టపు ద్రోహంబు గాము ధరణీకాంతుం। గట్టా యేల శపించితి। పట్టీ తతుక విషాగ్నిపాలగు మనుచున్॥ గీ॥ తల్లి కడుపులో నదగ్ధుఁడై క్రమ్మఱఁ। గమలనాభు కరుణఁ గలిగినాఁడు। బలిమిఁ గలిగి ప్రజలఁ బాలించుచున్నాఁడుఁ। దిట్టవడుగ రాజుఁ దిట్టఁదగునె॥ ఉ॥ కాపరి లేని గోవితతికై వడిఁ గంటక చోరకోటిచే। నే పరి యున్నదీ భువనమీశుఁడు కృష్ణుఁడు లేమి నిట్టిచో। భూపరిపాలనంబు సమబుద్ధి నితండొనరింపఁ జెల్ల రే। యీపరిపాటి ద్రోహమునకిట్లు శపింపఁగ నేల బాలకా॥ సీ॥ పాపంబు నీచేతఁ బ్రాపించె మనకింక రాజు నశించిన రాజ్యమందు। బలవంతుఁడగు వాఁడు బలహీను పశుదారహయసువర్ణాదుల నపహరించు। జారచోరాదులు సంచరింతురు ప్రజ కన్యోన్యకలహంబు లతిశయిల్లు। వైదికంబై యున్న వర్ణాశ్రమాచారధర్మ మించుక లేకఁ దప్పిపోవు। నంతమీఁద లోకు లర్థకామంబుల। కగిలి సంచరింప ధరణి నెల్ల। వర్ణసంకరములు వచ్చు నమర్కట।

కుంబుత్తుప్రభుకృపక। లేమ్మా నీరూపముతో। రమ్మా నా కెదురు గంగ రమ్యతరంగా॥ వ॥ అని తనకు మీఁదనయ్యెడి జన్మాంతరంబులందైన సర్వజంతుసౌజన్యంబు సంధిల్లుంగాత యని గంగాతరంగిణీదక్షిణకూలంబున ఖూర్వాగ్రదర్భాసనంబున నుత్తరాభిముఖుండై యుపదేశించి జనమేజయు రప్పించి రాజ్యభారంబు సమర్పించి యత్నంబు సంసారబంధంబునకుఁ దప్పించి చిత్తంబు హరికి మెప్పించి పరమభాగవతుండైన పాండవపౌత్రుండు ప్రాయోపవిష్టుండై యున్న సమయంబున॥ క॥ ఒత్తిలి పొగడుచు సురలు వియత్తలమునను౦డి మెచ్చి యలరుల వాన। ల్మొత్తములై కురిసిరి నృప। సత్తముపై భూరిభేరిశబ్దంబులతో౯. ఆసమయంబున సభాసీనులైన సంయమీంద్రు లిట్లనిరి॥ మ॥ క్షితినాథోత్తమ నీచరిత్రము మహాచిత్రంబు మీ తాతలు। గ్రతపోధన్యులు విష్ణుపార్శ్వపదవిం గామించి రాజన్యశో।భితకోటీరమణిప్రభాన్వితమహాపీఠంబు వర్జింతురు।న్నతులై నీవున న్మహోన్నతుండవు గదా నారాయణధ్యాయివై॥ మ॥ వసుధాధీశ్వర నీవు మర్త్యతనువు న్వర్జించి నిశ్శోకమై। వ్యసనచ్ఛేదకమై రజోరహితమై వర్తించు లోకంబు స।ర్వసమత్వంబునఁ జేరు నంతకు భవద్వాక్యంబు లన్వించు నే। దెసకుం బోవక చూచుచుండెద మునీ దివ్యప్రభావంబుల౯॥ వ॥ అనియిట్లు పక్షపాతశూన్యంబులు మహనీయమాధుర్యగాంభీర్యసౌజన్యధుర్యంబులైన భాషణంబు లాడుచు మూఁడులోకంబులకు నవ్వలదైన సత్యలోకంబున మూర్తివంతంబులై నెగడుచున్న నిగమంబుల చందంబునం దేజరిల్లుచున్న ఋషులం జూచి భూవరుండు నారాయణకథాశ్రవణకుతూహలుండై నమస్కరించి యిట్లనియె॥ క॥ ఏడు దినంబుల ముక్తిం। గూడఁగ నేరీతి వచ్చు గురుసంసార।క్రీడనమే క్రియ నెడ దెగుఁ। జూడుఁడు మా తండ్రులార శ్రుతివచనముల౯॥ శా॥ ప్రాప్తానందులు బ్రహ్మబోధనకళాపారీణు లాత్మప్రభా।లుప్తాజ్ఞానులు మీర లార్యులు దయాళుత్వాభిరాముల్మనో।గుప్తంబుల్ సకలార్థజాలములు మీకుం గానవచ్చుం గదా। సప్తాహంబుల ముక్తికే గెడఁగ తెంజర్చించి భాషింపరే॥ వ॥ అనియుత్తరాసూనుం డాడిన వచనంబులకు మునులందఱు ప్రత్యుత్తరంబు విమర్శించు నెడ దైవయోగంబున॥

## శ్రీ శుకమహర్షి పరీక్షిన్మహారాజు నొద్దకేతెంచుట. శ్రీ

సీ॥ ప్రతినిమేషముఁ బరబ్రహ్మంబు నీక్షించి మదిఁ జొక్కి వెలుపల మఱచువాఁడు। కమలంబు మీఁది భృంగంబుకైవడి మోముపై నెఱసిన కేశపటలివాఁడు। గెఱ బ్రాసి మాయ నంగీకరించిన భంగి వసనంబుఁ గట్టక వచ్చువాఁడు। సంగిగాఁడని వెంటఁ జాటు భూతములు నా బాలురహాసశబ్దములవాఁడు। సుహితపదజానుజంఘోరుమధ్యహస్త। బాహువక్షోగళాననఫాలకర్ణ। నాసికాగండమస్తకనయనయుగళుఁ। డయిన యవధూతమూర్తి వాఁ డరుగుదెంచె॥ ఉ॥ ఊరని లోకులంగినిసి యొగ్గులు వల్కనివాఁడు గోరిక।ల్గోరనివాఁడు కూటువలఁ గూడనివాఁడు వృథాప్రపంచము౯। జేరనివాఁడు దైవగతిఁ జేరిబలాభము సూచితుష్టుఁడై। నేరనివారి చందమున నేర్పులు సూపనివాఁడు వెండియు౯॥ గీ॥ అమ్మహాత్మషోడశాబ్దవయోరూప। గమనగుణవిలాసకౌశలములు। ముక్తికాంత సూచి మోహితయగు నన। నితరకాంత లెల్ల నేమి సెప్ప॥ గీ॥ వెఱ్ఱితనము మాని విజ్ఞానమూర్తియై। బ్రహ్మభావమునను బర్యటింప। వెఱ్ఱియంచు శుకుని వెంట నేతెంతురు। వెలఁదులర్భకులును వెఱ్ఱులగుచు॥ వ॥ ఇట్లు వ్యాసనందనుం డయిన శుకుం డరుగుదెంచిన మునికులతిలకు లమ్మహానుభావుని ప్రభావంబు తెఱంగెఱుంగుదురు గావున నిజాసనంబులు డిగ్గి ప్రత్యుత్థానంబు సేసిరి పాండవపౌత్రుండు నా యోగిజనశిఖామణికి నతిథిసత్కారంబుఁ గావించి దండప్రణామంబు సేసి పూజించె మఱియు గ్రహనక్షత్రతారకామధ్యంబునం దేజరిల్లు రాకాసుధాకరుండునుం బోలె బ్రహ్మర్షి దేవర్షి రాజర్షి మధ్యంబునం గూర్చుండి విరాజమానుండైన శుకయోగీంద్రుం గనుంగొని॥ ఉ॥ ఫాలము నేల మోపి భయభక్తులతోడ నమస్కరించి భూ।పాలకులోత్తముండు కరపద్మములన్ముకుళించి నేఁడు నా।పాలిటి భాగ్య మెట్టిదియొ పావనమూర్తివి పుణ్యకీర్తివి। వేలకు నీవు వచ్చితివి వేకవిభూషణదివ్యభాషణా॥ మ॥ అవధూతోత్తమ మింటి నేఁడు నిను డాయంగంటి నీవంటివి। ప్రవరుం బేరొనునంతటన్ సితమౌఁ బాపంబు నా బోటికి౯। భవదాలోకనభాషణార్చనపదప్రక్షాళనస్పర్శనా।దివిధానంబుల ముక్తిచేఁ బడుట చింతింపంగ నాశ్చర్యమే॥ క॥ హరి చేతఁ దనుజేంద్రులు। ధర ద్రుగ్గెడు భంగి నీపదస్పర్శము చే। గురుపాతకజాతంబులు। పొరిఁ దూలుఁ గదయ్య యోగిభూషణ వింటే॥ మ॥ ఎలమి న్మేనమఱంది యైన సచివుండై యెమ్మెటి మా తాతల। న్బలిమిం గాచి సముద్రముద్రితధరం బట్టంబుఁ గట్టించె నా। య్యలఘుండీశుండు చక్రి రక్షకుఁడు నాకన్యుల్ విపద్రక్షకు।ల్గలరే వేఁడెద భక్తి నా గుణనిధి౯ గారుణ్యవారాంబుధి౯॥ సీ॥ అవ్యక్తమార్గుండ వైన నీదర్శనమాఱడివోవునే యభిమతార్థ।సిద్ధి గావించుట సిద్ధంబు నేఁ డెల్లి దేహంబు వర్జించు దేహధారి। కేమి చింతించిన నేమి జపించిన నేమి గావించిన నేమి వినిన। నేమి సేవించిన నెన్నఁడు సంసారపద్ధతిఁ బాసినఁ బడవిగలుగు।నుండు మనరాదుగు

ఘుఁడను యోగివిభుఁడు। వావిరిఁ బిదికిన తడవెంతయంత *కారు। గాని యొక్క జనసూఁడ పుణ్యకరుణతోడ। జెప్పవే తండ్రి ము క్తికిఁ జేరు తెరువు॥ వ॥ అని పరీక్షిన్నరేంద్రుండు బాదరాయణి నడిగెనని చెప్పి॥

క॥ రాజీవపత్రలోచన। రాజేంద్రకిరీటఘటితరత్నమరీచి। భ్రాజితపాదాంభోరుహ। భూజనమందార నిత్యపుణ్యవిచారా॥ మాలిని॥ అనుపమగుణహారా ‡హన్యమానారివీరా। జనవినుతవిహారా జానకీచిత్తచోరా। దనుజఘనసమీరా దానవశ్రీవిదారా। ఘనకలహకఠోరా §కంధిగర్వాపహారా.

గద్య. ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్త్ర సహజపాండిత్య పోతనామాత్యప్రణీతంబైన శ్రీమహాభాగవతంబను మహాపురాణంబునందు- నైమిశారణ్యవర్ణనంబు, శౌనకాదుల ప్రశ్నంబు, సూతుండు నారాయణకథాసూచనంబు సేయుటయు, వ్యాసచింతయు, నారదాగమనంబు, నారదుని పూర్వకల్పవృత్తాంతంబుఁ, బుత్త్రశోకాతురయైన ద్రుపదరాజనందన కర్జునుం డశ్వత్థామం దెచ్చి యొప్పగించి గర్వపరిహారంబు సేయించి విడిపించుటయు, భీష్మనిర్యాణంబు, ధర్మనందను రాజ్యాభిషేకంబు, గోవిందుని ద్వారకాగమనంబు, విరటకన్యకాగర్భపీడ్యమానుండైన యర్భకు నశ్వత్థామబాణానలంబువలనం బాపి విష్ణుండు రక్షించుటయుఁ, బరీక్షిజ్జన్మంబు, గాంధారీధృతరాష్ట్రవిదురనిర్గమంబు, నారదుండు ధర్మజునకుఁ గాలసూచనంబు సేయుటయుఁ, గృష్ణనిర్యాణంబు విని పాండవులు మహాపథంబునం జనుటయు, నభిమన్యుపుత్త్రుండు దిగ్విజయంబు సేయుచు శూద్రరాజలక్షణలక్షితుండగు కలిగర్వంబు సర్వంబు మాపి గోవృషాకారంబుల నున్న ధరణీధర్మదేవతల నుద్ధరించుటయు, శృంగిశాపభీతుండై యుత్తరానందనుండు గంగాతీరంబున బ్రాయోపవేశంబున నుండి శుకదర్శనంబు సేసి మోక్షోపాయం బడుగుటయు ననుకథలుగల ప్రథమస్కంధము. శ్రీకృష్ణార్పణమస్తు

## ద్వితీయస్కంధ ప్రారంభము.

శ్రీసుకీర్త్తిచకోరక। సోమ వివేకాభిరామ సురవినుతగుణ। స్తోమ నిరలంకృతాసుర। రామా సీమంత ¶సీమ రాఘవరామా॥ వ॥ మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండైన సూతుండిట్లనియె- నట్లు పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె॥ సీ॥ క్షితిపతీ ప్రశ్నంబు శ్రేష్ఠతమంబగు నాత్మవిదుల్ మెత్తు రఖిలశుభద। మాకర్ణనీయాదు ‖లయుతసంఖ్యలు గలవందు ముఖ్యంబిది యఖిలవరము। గృహములలోనెల్ల గృహమేధులగు నరులాత్మతత్త్వము లేశమైన నెఱుఁగ। రంగనారతులనిద్రాసక్తిజను రాత్రి వోవుఁ గుటుంబార్థబుద్ధి నహము। పశుకళత్రపుత్త్రబాంధవదేహాది। సంఘమెల్లఁ దనకు సత్యమనుచుఁ। గాపురములు సేసి కడపటఁ జత్తురు। కనియుఁ గానరంత్యకాలసరణి॥ క॥ కావున సర్వాత్ముండు మహావిభుఁడు విష్ణుఁడీశుఁ డాకర్ణింపన్। సేవింపన్ వర్ణింపన్। భావింపన్ వలయుఁ దభవభాజికి నధిపా॥ గీ॥ జనులకెల్ల శుభద సాంఖ్యయోగంబుల। వలన ధర్మనిష్ఠ వలన నైన। నంత్యకాలమందు హరిచింత సేయుట। పుట్టువునకు ఫలము భూపరేంద్ర॥ గీ॥ అనిశ నిర్గుణబ్రహ్మంబు నాశ్రయించి। విధినిషేధనివృత్తసద్వృత్తు లమలమతులు। సేయుచుందురు హరిగుణ చింతనములు। మానసంబునఁ దలఁచుచు మానవేంద్ర॥ సీ॥ ద్వైపాయనుఁడు నా దుతండ్రి ద్వాపరవేళ బ్రహ్మసమ్మతమైన భాగవతము। బఠనంబు సేయించె బ్రహ్మతత్పరుఁడనై యుత్తమశ్లోక లీలోత్సవమున। నాకృష్టచిత్తుండనై పఠించితి నీవు హరిపాదభక్తుండవగుటఁ జేసి। యెఱిఁగింతు వినుమయ్య యీ భాగవతమున విష్ణుసేవాబుద్ధి విస్తరిల్లు। మోక్షకామికిదగి మోక్షంబు సిద్ధించు। భవభయంబు లెల్లఁ బాసిపోవు। యోగిప్రాగమునకు నుత్తమవ్రతములు। వాసుదేవనామ సువర్ణనములు॥ తే॥ హరి నెఱుంగక నింటిలో బహుహాయనంబులు చత్తుఁడై। పొరలుచుండెడి వెఱ్ఱి ముక్తికిఁ బోవనేర్చునె వాఁడు †సంసరణముం బెడఁబాయఁ డెన్నఁడు సత్యమా హరినామసంస్మరణ మొక్క ముహూర్తమాత్రము చాలు ముక్తిదమౌ నృపా॥ సీ॥ మానవేశ్వర తొల్లి ఖట్వాంగుఁడను విభుం డిల నేడుదీవుల నేలుచుండ। శక్రాదిదివిజులు సంగ్రామమునను గ్రదానవులకు నోడి తన్ను వచ్చి। తమకుఁ దోడడిగిన ధరనుండి దివికేగి దానవవిభుల నందఱ వధింప। వరమిత్తు మనుచు దేవతలు భాషింపంగ జీవితకాలంబు సెప్పుఁ డిదియ। వరము నాకు నొండువర మొల్ల ననవుడు। నాయు వొక్క ముహూర్త మంత తడవు। గలదటంచుఁ బలుకఁ గగనయానమున న। మ్మానవేశ్వరుండు మహికి వచ్చి॥ క॥ గిరులం బోలెడి కరులను। హరులం దనప్రాణదయితలై మానినులన్। సుందరులను హితనరులను బుధ। వరులను వర్జించి గాఢవైరాగ్యమునన్॥ క॥ గోవిందనామకీర్తనఁ। గావించి భయంబుఁ బడసి ఖట్వాంగధరిత్రీవిభుఁడు సూరఁ గొనియెను। గైవల్యముఁ దొల్లి రెండుగడియలలోనన్॥ వ॥ వినుము నీకు నేఁడు దివసంబులకుం గాని జీవితాంతంబు గాదు; తావత్కాలంబునకుం బారలౌకికసాధనభూతంబగు కల్యాణంబు సంపాదింపం దగు నం

*కారు-కాలము. ‡హన్యమాన-చంపఁబడిన. §కంధి-సముద్రము. ¶సీమంత-పాపట. ‖అయుత-పదివేలు. †సంసరణము-సంసారము.

త్కాలంబు దగ్గరిన నరుండు భయంబునం బెగ్గడిలక దేహగేహపుత్రకళత్రాదిసంబంధపాశంబుల నిస్పృహాకరవాలంబునఁ దెగ్గోసి గేహంబు వెడలి పుణ్యతీర్థజలావగాహనంబొనర్చి యేకాంతశుచిప్రదేశంబున విధివత్ప్రకారంబున నకుశాజినచేలంబులతోడం గల్పితాసనుండై మానసంబున నిఖిలజగత్పవిత్రీకరణసమర్థంబగు నకారాదిత్రివర్ణకలితంబును బ్రహ్మబీజంబైన ప్రణవంబు సంస్మరించుచు వాయువుల జయించి విషయంబుల వెంటనంటి కెంటి పాఱెడి యింద్రియంబుల బుద్ధిసారథియైన మనోనాయకంబులైన పగ్గంబుల నిగ్రహంబు చేసి ముక్కందిగి విదట్టంబులైన కర్మఘట్టనంబులం బట్టి మెట్టి మనంబు శేముషీబలంబున నిరోధించి భగవదాకారంబుతోడం బంధించి నిర్విషయంబయిన మనంబు భగవత్పాదాబ్జవ్యయధ్యానంబు సేయుచు రజస్తమోగుణంబులచేత నాక్షిప్తంబు విమూఢంబునగు చిత్తంబు ధారణావశంబునఁ దద్గుణంబుల వలన నెయ్యెడి మలంబులం బోనడంచి నిర్మలచిత్తంబున నంబరంబైన విష్ణుపదంబునకుం జను ధారణానియమంబు గలుగు సుఖాత్మకంబగు విషయంబున నవలోకించు యోగికి భక్తిలక్షణంబైన యోగంబు వేగంబె సిద్ధించు నని యోగీంద్రునకు నరేంద్రుం డిట్లనియె. క॥ ధారణ యే క్రియ నిలుచును। ధారణ కేరూప మెద్ది ధారణ యనఁగా। ధారణ పురుషుని మోహము। లేరీతి హరించు నా

**శుకుండు పరీక్షిత్తునకు విరాట్స్వరూపంబు దెలుపుట.**

కు నెఱిఁగింపు నగర్గా!॥ అనిన విని రాజునకు నవధూతవిభుం డిట్లనియె॥ గీ॥ పవనము నియమించి పరిహృతసంగుఁడై। యింద్రియములవర్గ మెల్ల మాఁపి। హరివిశాలరూపమందుఁ జిత్తముఁ జేర్చి। నిలుపవలయు బుద్ధి నెఱపి బుధుఁడు॥ వ॥ వినుము భగవంతుండైన హరి విరాడ్విగ్రహంబున సంభూతభవిష్యద్వర్తమానంబైన విశ్వంబు విలోక్యమానంబగు. ధరణీసలిలతేజస్సమీరణగగనాహంకారమహత్తత్త్వంబులనియెడి సప్తావరణంబులచేత నావృతంబగు మహాండకోశంబైన శరీరంబునందు ధారణాశ్రయంబైన వైరాజపురుషుండు దేజరిల్లు నమ్మహాత్మునికిఁ; పాదమూలంబు పాతాళంబు, పార్ష్ణిభాగపాదాగ్రభాగంబులు రసాతలంబు, గుల్ఫంబులు మహాతలంబు, జంఘలు తలాతలంబు, జానుద్వయంబు సుతలంబు, ఊరువులు వితలాతలంబు, జఘనంబు మహీతలంబు, నాభివివరంబు నభస్థలంబు, వక్షంబు గ్రహతారకాముఖరజ్యోతిస్సమూహసమేతంబగు నక్షత్రలోకంబు, గ్రీవయు మహర్లోకంబు, ముఖంబు జనలోకంబు, లలాటంబు తపోలోకంబు, శీర్షంబు సత్యలోకంబు, బాహుదండంబు లింద్రాదులు, కర్ణంబులు దిశలు, శ్రవణేంద్రియంబు శబ్దంబు, నాసాపుటంబు లశ్వినీదేవతలు, ఘ్రాణేంద్రియంబు గంధంబు, వదనంబు వహ్ని, నేత్రంబు లంతరిక్షంబు, చక్షురింద్రియంబు సూర్యుండు, రేయింబవళ్లు ఱెప్పలు, భ్రూయుగ్మవిజృంభణంబు బ్రహ్మపదంబు, ధాతువులు జలంబు, జిహ్వేంద్రియంబు రసంబు, సంభాషణంబులు సకలవేదంబులు, దంష్ట్రలు దండధరుండు, దంతంబులు పుత్రాదిస్నేహకళలు, నగవులు జనోన్మాదకారిణియగు మాయ, కటాక్షంబులు మరంతసర్గంబులు, పెదవులు వ్రీడాలోభంబులు, స్తనంబులు ధర్మంబు, వెన్ను ధర్మమార్గంబు, మేఢ్రంబు ప్రజాపతియు, వృషణంబులు మిత్రావరుణులు, జఠరంబు సముద్రంబులు, శల్యసంఘంబులు గిరులు, నాడీనివహంబులు నదులు, తనూరుహంబులు తరువులు, నిశ్వాసంబులు వాయువులు, కాలంబు గమనంబు, కర్మంబులు నానావిధజంతుసన్నివహసంసృతిసంభూతంబైన మనము చంద్రుండు, చిత్తంబు మహత్తత్త్వంబు, అహంకారంబు రుద్రుండు, అశ్వాశ్వతర్యుష్ట్రగజంబులు నఖంబులు, కటిప్రదేశంబు పశుమృగాదులు, విచిత్రంబులైన శిల్పనైపుణంబులు పక్షంబులు, బుద్ధి మనువు, నివాసంబు పురుషుండు, షడ్జాదులయిన స్వరవిశేషంబులు గంధర్వవిద్యాధరసిద్ధచారణాప్సరస్సమూహంబులు, స్మృతి ప్రహ్లాదప్రముఖులు, వీర్యంబు దైత్యదానవానీకంబై యుండు; మఱియు నమ్మహావిభునకు ముఖంబు బ్రాహ్మణులు, భుజంబులు క్షత్రియులు, ఊరులు వైశ్యులు, చరణంబులు శూద్రులు, నామంబులు నానావిధంబులైన వసురుద్రాదిదేవతాభిధానంబులు, ద్రవ్యంబులు

---

విను మను వచనమందుఁ గొన్ని పదములకర్థము పాదమూలము-అఱకాలు, పార్ష్ణి-మడిమ, పాదాగ్రము-మీఁగాలు, గుల్ఫము-చీలమండ, జంఘలు-పిక్కలు, జానుద్వయము-రెండు మోకాళ్లు, ఊరువులు-తొడలు, జఘనము-పొత్తికడుపు, వక్షము-రొమ్ము, తారక-చుక్కలు, ముఖర-మొదలగు, గ్రీవ-కంఠము, శీర్షము-శిరస్సు, వదనము-ముఖము. భ్రూయుగ్మవిజృంభణము-రెండు కనుబొమల ప్రకాశము, ధాతువులు-అనఁగా త్వక్-చర్మము, మాంస-పొలసు, రుధిర-రక్తము, మేద-రొమ్మునందుండు క్రొవ్వు, మజ్జ-ఎముకలలోని క్రొవ్వు, అస్థి-ఎముకలు, స్నాయువు-నరములు। [illegible]. కటాక్షంబులు [illegible] సృష్టి క్రమములు, వ్రీడ-సిగ్గు, మేఢ్రము-శిశ్నము, జఠరము-కడుపు, శల్యసంఘము-ఎముకలగుంపు, నాడీనివహము-నరములగుంపు, తనూరుహంబులు-వెండ్రుకలు, [illegible]-తలవెండ్రుకలు, [illegible] ప్రదేశము, షడ్జాదులయిన స్వరవిశేషంబు — నిషాద ఋషభ గాంధార షడ్జ మధ్యమ ధైవత పంచమ అనిన స్వరములు. వీర్యము-[illegible].

ర్యసంభూతిసన్నిభుండునై నపరమేశ్వరునిమనోధారణావశంబుననిలిపికొని తదీయగుల్ఫచరణజానుజంఘాద్యవయ
వంబులు గ్రమంబున నొక్కటి నొక్కటిఁ బ్రతిక్షణంబును ధ్యానంబు సేయుచు నెంతకాలంబునకుం బరిపూర్ణనిశ్చలభక్తి
యోగంబు సిద్ధించు నంతకాలంబునుం దదీయచింతాతత్పరులై యుండుదురని మఱియు నిట్లనియె॥. సీ॥ ఆసన్నమరణార్థి
యైనయతీశుండు గాలదేశములను గాచికొనఁడు తనువు విసర్జించు తలఁపు జనించిన భద్రాసనస్థుఁడై ప్రాణపవను మనసు
చేత జయించి మానసవేగంబు బుద్ధిచే భంగించి బుద్ధిఁ దెచ్చి క్షేత్రజ్ఞుతోఁ గూర్చి క్షేత్రజ్ఞు నాత్మలోపలఁ జేర్చి యాత్మను
బ్రహ్మమునందుఁ గలిపి యొక్కటిగాఁ గావించి గారవమున శాంతితోడ నిరూఢుఁడై సకలకార్యనివహమెల్లను డిగనాడి నిత్యసు
ఖము వలయు ననిచూచు నటమీఁద వసుమతీశ॥. వ॥ వినుమప్పరమాత్మరూపమైన బ్రహ్మమునకుఁ దక్కఁ గాల దేవ సత్త్వ రజస్త
మోగుణాహంకార మహత్తత్త్వ ప్రధానంబులకు సామర్థ్యంబు లేదు. కావునం బరమాత్మవ్యతిరిక్తంబు లేదు దేహాదుల
యందాత్మత్వంబు విసర్జించి యన్యసౌహృదంబు మాని పూజ్యంబయిన హరిపదరబునుం బ్రతిక్షణంబు హృదయంబున నా
లింగనంబు సేసి వైష్ణవంబైన పరమపదంబు సర్వోత్తమంబని సత్పురుషులు దెలియుదు రివ్విధంబున విజ్ఞానదృగ్వీర్యజ్వల
నంబున నిర్దగ్ధవిషయవాసనుండై క్రమంబున నిరపేక్షత్వంబున॥. సీ॥ *అంఘ్రిమూలమున మూలాధారచక్రంబు పీడిం
చి ప్రాణంబు బిగియఁబట్టి నాభితలముఁ జేర్చి నయముతో మెల్లన హృత్సరోజము మీఁది కెగయఁబట్టి యటమీఁద నురిపి
మహత్త్వంచి క్రమ్మఱఁ దాలుమూలమునకుఁ దెలిమి నిలిపి మతిమతో భ్రూయుగమధ్యముఁ జేర్చి దృక్కర్ణ నాసాస్యమా
ర్గములు మూసి యిచ్ఛ లేని యోగి యొక్క ముహూర్తార్థమింద్రియానుషంగమింత లేక ప్రాణముల నవపంచి బ్రహ్మ
రంధ్రము చించి బ్రహ్మముఁ గలయుఁ బౌరవేంద్ర॥. వ॥ మఱియు దేహత్యాగకాలంబున నింద్రియంబులతోడి సంగంబు వి
డువనివాఁడు వానితోడన గుణసముదాయరూపంబగు బ్రహ్మాండంబునందు ఖేచరసిద్ధవిహారయోగ్యంబున నణిమాదిసకలై
శ్వర్యసమేతంబునైన పరమేష్ఠిపదంబుఁ జేరు విద్యాతపోయోగసమాధిభజనంబు సేయుచుఁ బవనాంతర్గత లింగశరీరులై
న యోగీశ్వరులకు బ్రహ్మాండబహిరంతరాళంబులు గతియని చెప్పను దేరికిం గర్మంబుల నట్టిగతిఁ బొంద శక్యంబు గాదు బ్ర
హ్మలోకంబునకు నాకాశపథంబునం బోవుచు సుషుమ్నానాడి వెంట నగ్నియను దేవతం జేసి జ్యోతిర్మయంబైన తేజంబున ని
ర్మలుండై యెందు నుందగులుపడక తారాగామండలంబు మీఁద సూర్యాది ధ్రువాంత పదంబులు గ్రమక్రమంబున నతిక్రమిం
చి హరిసంబంధంబైన శింశుమారచక్రంబు చేరి యొంటరి పోవుచుఁ బరమాణుభూతంబైన లింగశరీరంబుతోడ బ్రహ్మవిమ
లను నెలవైన మహర్లోకంబు చొచ్చి మహాకల్పకాలంబు క్రీడించుచుఁ గల్పాంతంబున ననంతముఖానలజ్వాలాదందహ్యమా
నంబగు లోకత్రయంబు నీక్షించుచుఁ దన్నిమిత్తసంజాతదాహతాపంబు సహింపంజాలక॥. సీ॥ ఇలమీఁద మనువులీరేడును
జను వేళ దివసమై యెచ్చోటఁ దిరుగుచుండు మహనీయసిద్ధవిమానసంఘము లెందు దినకరప్రభములై తేజరిల్లు శోకజ
రామృత్యుశోషణభయదుఃఖనివహంబు లెందు జనింపకుండు విష్ణుపదధ్యానవిజ్ఞానరహితులశోకంబు లెందుండి చూడవ
చ్చు పరమసిద్ధయోగిభాషణామృతమున శ్రవణపర్వమగుచు జరుగుచుండు నట్టి బ్రహ్మలోకమందు వసించును రాజవ
ర్యమ యలరాఁడు వాఁడు॥. వ॥ మఱియు నొక్కవిశేషంబు గలదు పుణ్యాతిరేకంబున బ్రహ్మలోకగతులైనవారు గల్పాంత
రంబునం బుణ్యతారతమ్యంబుల నధికారవిశేషంబు నొందువారలగుదురు బ్రహ్మాది దేవతా భజనంబునంజనువారు: బ్ర
హ్మజీవితకాలంబు దనుక బ్రహ్మలోకంబున వసియించి ముక్తులగుదురు; నారాయణచరణకమలభక్తిపరాయణత్వంబు
నం జనినవారు నిజేచ్ఛావశంబున నిరర్గళగమనులై బ్రహ్మాండంబు భేదించి మహోన్నత వైష్ణవపదారూఢులై తేజరిల్లు
దురీశ్వర ¶రాధిష్ఠితంబైన ప్రకృతియంశంబున మహత్తత్త్వమగు, మహత్తత్త్వంబున నహంకారంబగు, నహంకారంబున శ
బ్దతన్మాత్రంబగు, శబ్దతన్మాత్రంబున గగనమగు, గగనాంశంబున స్పర్శతన్మాత్రంబగు, స్పర్శతన్మాత్రంబున సమీరణంబగు,
సమీరణాంశంబున రూపతన్మాత్రంబగు, రూపతన్మాత్రంబువలనఁ దేజంబగుఁ, దేజోంశంబున రసతన్మాత్రంబగు, రసతన్మా
త్రంబువలన జలంబగు, జలాంశంబున గంధతన్మాత్రంబగు, గంధతన్మాత్రంబున పృథివియగు, వాని మేళమునం జతుర్దశభు
వనాత్మకంబై విరాడ్రూపంబగు నా రూపమునకుఁ గోటియోజనవిశాలంబైన యండకటాహంబు ప్రథమావరణంబైన పృ
థ్వియగు దీని †బంచాశత్కోటివిశాలంబని కొందఱు పలుకుదురు. యావరణంబుమీఁద సలిల తేజస్సమీరగగనాహంకారమ

* అంఘ్రిమూలమున - మడిమచేత, మూలాధారచక్రంబు - గుదస్థానము, పీడించి - నొక్కి, తాలుమూలము - కంఠము, భ్రూయుగమధ్య
ము - రెండు కనుబొమల నడుమ. § [illegible] ¶ అధిష్ఠితమైన - సంబంధముగల, [illegible] † పంచాశత్కోటి - ఏబది కోట్లు.

హత్తత్త్వంబులనియెడి నావరణంబులు క్రమంబున నొండొంటికి దశగుణోత్తరాధికంబులై యుండు నట్టి యేడింటిమీఁదఁ బ్రకృత్యావరణంబు మహావ్యాపకంబగు బ్రహ్మాండంబు భేదించి వైష్ణవపదారోహణంబు సేయువాఁడు నిర్భయుండై మెల్లన లింగదేహంబునఁ బృథివ్యాత్మకత్వంబు నొంది యట్టి పృథివ్యాత్మకత్వంబున ఘ్రాణంబున గంధంబును, జలాత్మకత్వంబున రసనేంద్రియంబున రసంబును, దేజోరూపకత్వంబున దర్శనంబున రూపంబును, సమీరణాత్మకత్వంబున దేహంబున స్పర్శనంబును, గగనాత్మకత్వంబున శ్రవణంబున శబ్దంబును నతిక్రమించి భూతసూక్ష్మేంద్రియలయస్థానంబయిన యహంకారావరణసంప్రాప్తుండై యందు మనోమయంబు దేవమయంబునైన సాత్త్వికాహంకారగమనంబున మహత్తత్త్వంబు సొచ్చి గుణత్రయంబును లయించినఁ బ్రధానంబు నొంది ప్రధానాత్మకత్వంబున దేహంబు నుపాధిపరంపరావస్థానంబునం బ్రకృతిం బాపి యానందమయుండై యానందంబునం బరమాత్మరూపంబైన వాసుదేవబ్రహ్మమందు గలయునని చెప్పి వెండియు నిట్లనియె॥ గీ॥ పరమభాగవతులు పాటించు పథమిది। యీపథమున యోగి యరిగెనేని। మగుడి రాఁడు వాఁడు మఱి సంశయము లేదు। కల్పశతములైనఁ గౌరవేంద్ర॥ వ॥ వినుము నీవడిగిన సద్యోముక్తియుఁ గ్రమముక్తియు ననియెడు నీ రెండు మార్గంబులు వేదంబులందు వివరింపంబడియె. వీనిం దొల్లి భగవంతుండైన వాసుదేవుండు బ్రహ్మచేత నారాధితుండై చెప్పె. సంసారప్రవిష్టుండైన వానికిఁ దపోయోగాదులైన మోక్షమార్గంబులు పెక్కులుగలవందు భక్తిమార్గంబు కంటె

### శుకమహర్షి పరీక్షిన్మహారాజునకు భక్తిమార్గంబె ముఖ్యంబని తెలుపుట.

సులభంబు లేదు॥ మ॥ వినుమంభోజభవుండు మున్ను మదిలో వేదంబు మున్మారు నె।మ్మనముం దుందలపోసి యంతయుఁ బరామర్శించి మోక్షంబుకు। క్కనమార్గంబున లేదటంచు హరిభక్తిం జింత చేసెం జనా। ర్దను నాత్మాకృతి నిర్వికారుఁడగుచుం దత్సన్మార్గనిర్ణేతయై॥ సీ॥ అఖిలభూతములందు నాత్మరూపంబున నీశుండు హరియుండు నెల్లప్రొద్దు। బుద్ధ్యాదిలక్షణంబులఁ గానఁబడును మహాసేవనీయుఁడు హర్నిశంబు। వందనీయుఁడు భక్తవాత్సల్యసంతతి నియతుఁడై సతతంబు నియతబుద్ధి। నాత్మరూపకుఁడగు హరికథామృతములు గర్ణపుటంబులఁ గాంక్షదీరఁ। గ్రోలుచుండెడు ధన్యులు కుటిలబహుళ। విషయమలినీకృతాంగముల్ వేగ విడిచి। విష్ణుదేవుని చరణారవిందయుగముఁ గడకుఁ జనుదురు సిద్ధంబు గౌరవేంద్ర॥ క॥ మానుషజన్మము నొందిన। మానవులకు లభ్యమాన మరణులకు మహా।జ్ఞానులకుఁ జేయవలయు వి।ధానము *నిగదింపఁబడియె ధరణీనాథా॥ వ॥ వినుము బ్రహ్మవర్చసకాముఁడైన వానికి వేదవిభుండగు చతుర్ముఖుండు, నింద్రియపాటవకామునికి నింద్రుండుఁ, బ్రజాకామునకు దక్షాది ప్రజాపతులు, భోజనకామునకు దితియు, స్వర్గకామునికి ¶నాదిత్యులు, రాజ్యకామునికి విశ్వేదేవతలు, దేశప్రజాస్వాధీనకామునికి సాధ్యులు, శ్రీకామునికి దుర్గయుఁ, దేజస్కామునకు నగ్నియు, ధనకామునకు వసువులు, వీర్యకామునకు వీర్యవంతులగు రుద్రులు, నాయుష్కామునకు నశ్వినీదేవతలుఁ, బుష్టికామునకు భూమియుఁ, బ్రతిష్ఠాకామునికి లోకమాతలైన గగనభూదేవతలు, సౌందర్యకామునకు గంధర్వులుఁ, గామినీకామునకు నప్సరయగు నూర్వశియు, సర్వాధిపత్యకామునకు బ్రహ్మయుఁ, గీర్తికామునకు యజ్ఞోపాధికుండగు విష్ణువు, విత్తసంచయకామునకుం బ్రచేతసుండు, విద్యాకామునకు నుమావల్లభుండు, దాంపత్యప్రీతికామునకు నుమాదేవియు, ధర్మార్థకామంబులకు నుత్తమశ్లోకుండగు విష్ణువు, సంతానకామునకుఁ బితృదేవతలు, రక్షాకామునకు యక్షులు, బలకామునకు మరుద్గణంబులు, రాజత్వకామునకు మనురూపదేవతలు, శత్రుమరణకామునకుఁ §కోపాలకుండైన రాక్షసుండు, భోగకామునకుం జంద్రుఁడును, భజనీయులగుదురు మఱియు॥ క॥ కామింపక యును సర్వముఁ। గామించియునైన ముక్తిఁ గామించితగన్। లోమించి పరమపురుషుని। నేమించి భజించుఁ దత్త్వనిపుణుం డధిపా॥ మ॥ అమరేంద్రాములఁ గొల్చు భంగిజనుఁ డాయజ్ఞాత్ము సేవింపఁగా। విమలజ్ఞానవిరక్తిముక్తులొదవున్ వేయేల భూనాథ। తత్కమలాధీశకథాసుధారసనదీకల్లోలమాలావళీ। భ్రమమెవ్వారికినైనఁ గర్ణయుగళీపర్వంబుగాకుండునే॥ వ॥ అని రాజునకు శుకుండు సెప్పెననవిని శౌనకుండు సూతునకిట్లనియె॥ క॥ వరతాత్పర్యముతోనిటు। భరతాన్వయవిభుఁడు శుకునిపలుకులు వినిస।త్వరతాయుతుఁడై శ్రేయ। స్కరతామతి నేమియడిగెఁ గణుతింపఁగదే॥ క॥ ఒప్పెడిహరికథలెయ్యవి। సెప్పెడినో యనుచు మాకుఁ జిత్తోత్కంఠం। గుప్పలుగొనుచున్నవి రుచు। లుప్పతిలన్ నీ మనోహరోక్తులు వినఁగన్॥ అనిన విని సూతుండిట్లనియె॥ క॥ తూలెడి ‡కూఁకటితోడను। బాలురతో నాడుచుండి బాల్యమునమహీ।పాలుఁడు హరిచరణార్చన। హేలాలసుఁడగుచునుండెనెంతయు నియతిన్॥ వ॥ అట్టిపరమభాగవతుండయిన పాండవేయున

*నిగదింపఁబడియెన్-చెప్పఁబడెను. ¶ఆదిత్యులు-దేవతలు. §కోపాలకుండైన-కోపమునుంగురులుగాఁగల. ‡కూఁకటి-పిల్లజుట్టు.

కు వాసుదేవపరాయణుఁ డయినశుకుం డిట్లనియె॥ సీ॥ వాసుదేవశ్లోకవార్తలాలించుచుఁ గాలమెప్పుడుఁ గడపుచుం
డు నతనియాయువుదక్క నన్యులయాయువు నుదయాస్తమయముల*నుఱక కరుగు। వంచించి కొనిపోవు వాఁడదియెట్లుఁ
గాక జీవింతుఁ బెక్కేండ్లు సిద్ధమనుచు। సంగనాపుత్రగేహారామవిత్తాదిసంసారహేతుకసంగసుఖముఁ। దగిలి వర్తింపఁ గా
లము తఱి నేతెంచి। దండధరకింకరులు వచ్చి తాడనములు। సేసికొనిపోవఁ బుణ్యంబు సేయనైతి। పాపరతి నైతి నని ¶విట్టువల
వరించు॥ అదిగావున॥ సీ॥ అలరుజొంపములతో నభ్రంకషంబులై బ్రతుక వే వనముల పాదపములు। § ఖాదనమేహనాకాం
క్షలఁ బశువులు జీవింప వే గ్రామసీమలందు। నియతమై యుచ్ఛ్వాసనిశ్వాసపవనముల్ ప్రాపింప వే ‖చర్మభస్త్రికలును। గ్రా
మసూకరశునకశ్రేణు లింటింటఁ దిరుగ వే మరోగ్యాదివృత్తి। నుష్ట్రఖరములు మోయ వే యురుభరములఁ। బుండరీకా
క్షు నెఱుఁగని పురుషపశువు। లడవులందు నివాసములందుఁ బ్రాణవిషయభరయుక్తితో నుంట విఫలమధిప॥ సీ॥ విష్ణుకీర్త
నములు విననికర్ణంబులు గొండలబిలములు గువలయేశ। చక్రిపద్యంబులు చదువనిజిహ్వలు కప్పలజిహ్వలు కౌరవేంద్ర। శ్రీ
మనోనాథు నీక్షింపనికన్నులు గేకిపింఛాక్షులు కీర్తిసమిత। కమలాక్షుపూజకుఁ గాని హస్తంబులు శవముహస్తంబులు స
త్యవచన। హరిపదతులసీదళామోదరతి లేనిముక్కు పందిముక్కు మునిచరిత్ర। గరుడగమనుభజనగతి లేనిపదములు। పా
దపములపాదపటలమనఘ॥ సీ॥ నారాయణునిదివ్యనామాక్షరములపైఁ గరుగని మనములు కఠినశిలలు। మురవైరికథలకు
ముదితాశ్రురోమాంచమిళితమై యుండని మేను మ్రొద్దు। చక్రికి మ్రొక్క నిజడునియాడలనున్న కనకకిరీటంబు కట్టె
మోపు। మాధవార్పితముగాఁ మననిమానవుసిరి వనదుర్గచంద్రికావైభవంబు। కైటభారిభజన గలిగియుండనివాఁడు। గా
లిలోననుండిక దలుశవము। కమలనాభుపదముఁ గననివాని బ్రతుకు। పశిరికాయలోని ప్రాణి బ్రదుకు॥ వ॥ అట్లు పలికిన వై
యాసివచంబుల నుత్తరేయుండు గంపలితహృదయుండై నిర్మలమతివిశేషంబున॥ గీ॥ సుతుల హితుల విడిచి చుట్టాల విడిచి
యిల్లాలి విడిచి బహుబలాళి విడిచి। రాజు హృదయ మిడియె రాజీవనయనుపైఁ। ధనము విడిచి జడ్డుతనము విడిచి॥ వ॥ ఇట్లు మృ
త్యుభయంబు నిరసించి ధర్మార్థకామంబులు సన్న్యసించి పురుషోత్తమునందుఁ జిత్తంబు పన్యసించి మనుకులంపు నరేంద్రుం
డిట్లనియె॥ క॥ సర్వాత్ముఁ వాసుదేవుని। సర్వజ్ఞుఁడవై నీవు సంస్తుతి సేయన్। సర్వభ్రాంతులు వదలెమ। హోర్వీసుర
వర్యమానసోత్సవమగుచున్॥ సీ॥ ఈశుండు హరివిష్ణుఁడే విశ్వ మంతయుఁ బుట్టించు రక్షించుఁ బొలియఁజూచు। బహుశక్తి
యుతుఁడగు భగవంతుఁ డవ్యయుఁ డాదినేశక్తుల నాశ్రయించి। బ్రహ్మశక్రాదిరూపముల వినోదించెఁ గ్రమమున నో
యేకకాలమున నొ। ప్రకృతిగుణంబులఁ బట్టి గ్రహించుట నేకత్వమున నుండు నీశ్వరుండు। భిన్నమూర్తి యగుచుఁ బెక్కు
విధంబుల నేలయుండు నతని కేమి వచ్చె। నుండకున్నఁ దాపసోత్తము తెలుపవే। వేడ్కతోడ నాకు వేదవేద్య॥ వ॥ అనిన నుత్త
రానందను వచనంబులకు నిరుత్తరుండుగాక సదుత్తరప్రదానసమర్థుండయి లోకోత్తరగుణోత్తముం డయిన తాప
సోత్తముం డుపదనమునంబున॥ మ॥ పరుఁడై యీశ్వరుఁడై మహామహిముఁడై †ప్రాదుర్భవస్థానసం। హరణక్రీడను
డై త్రిశక్తియుతుఁడై యంతర్గతజ్యోతియై। పరమేష్ఠిప్రముఖామరాధిపులకున్ బ్రాపింపరాకుండు న। స్తరమార్గంబు
నఁ దేజరిల్లు హరికిం దత్త్వార్థినై మ్రొక్కెదన్॥ వ॥ మఱియు సజ్జనదురితసంహరణుండు, దుర్జననివారణుండు, నఖిలసత్త్వ
రూపకుండును బరమహంసాశ్రమప్రవర్తమానమునిజనహృదయకమలకర్ణికామధ్యదీపకుండు సాత్వతశ్రేష్ఠుండు పరమభ
క్తియుక్తసులభుండు, భక్తిహీనజనదుర్లభుండు, నిరతిశయనిరుపమనిరవధికప్రకారుండు, నిజస్వరూపబ్రహ్మవిహారుండు
నైనయప్పరమేశ్వరునకు నమస్కరించెద॥ ఉ॥ ఏవిభువందనార్చనము లేవిభుచింతయు నామకీర్తనం। బేవిభులీలలద్భుత
ము లెవ్వని సంశ్రవణంబు సేయదో। షావలిఁ బాసి లోకము శుభాయతవృత్తిఁ జెలంగు నంత్రు నే। నావిభు నాశ్రయించెద న
ఘౌఘనివృత్తిదు భద్రకీర్తిమున్॥ ఉ॥ ఏపరమేశుపాదయుగ మెప్పుడుఁ గోరి భజించి నేర్పరు। ల్లోపలిబుద్ధి లోనుభయ
లోకములందుల సక్తిఁ బాసి తా। పము లేక బ్రహ్మగతిఁ బారుగతశ్రములై చరింతురే। నాపరమేశు మ్రొక్కెద నఘౌ
ఘనివృత్తిదు భద్రకీర్తిదున్॥ చ॥ తపములు చేసినైన మఱి దానము లెన్నియుఁ జేసినైన నే। జపములు చేసినైన ఫలసంచ
య మెవ్వనిఁ జేర్పకున్న హేయపదములై దురంతవిపదం బితరీతిగ నెప్పుడుండున। య్యపరిమితుం భజించెద నఘౌఘని
వృత్తిదు భద్రకీర్తిదున్॥ మ॥ యవనవ్యాళపుళిందహూణశకకంకాభీరచండాలసం। భవులుం దక్కినపాపవర్తనులు నే

* ఉఱక కరుగుఁ-సూర్యుఁడు. ¶ విట్టువలవరించు-మిగుల నేడ్చును. § ఖాదనమేహనాకాంక్షలన్-భోజనమైథునములయందాశగలవై.
‖ చర్మభస్త్రిక-తోలుతిత్తి. † ప్రాదుర్భవస్థానసంహరణక్రీడనుఁడై-పుట్టించుట, పెంచుట, త్రుంచుట లను లీలలుగలవాఁడై.

భద్రాత్ము సేవించి భాగవతశ్రేష్ఠులు డాసి శుద్ధతనులఁ గల్యాణులై యుందురా యవికారుం బ్రభువిష్ణు నాదుమవాదిలోన శాంతము నమ్మి క్రేఁడర్॥ మ॥ తపముల్ సేసిన నేమి నోమి నియతిన్ దానవ్రతప్రీతి నేమి । జపహోమంత్రంబుల నేమి శ్రుతిస్మృతుల నో సద్భక్తి నేమి యెట్లుల । బ్ధపదుండౌనని బ్రహ్మరుద్రముఖరుల్ భావింతు రెవ్వానిన । య్యపవర్గాధిపుఁ డాత్మమూర్తిసులభుండౌఁ గాక నా కెప్పుడున్॥ క॥ శ్రీపతియు యజ్ఞపతియుఁ బ్ర । జాపతియున్ బుద్ధిపతియు జగదధిపతియున్ । భూపతియు యాదవశ్రే । ణీపతియుం గతియునైన నిపుణు భజింతున్॥ మ॥ అణుఁడో కాక కడు న్మహావిభవుఁడో యచ్ఛిన్నుఁడో ఛిన్నుఁడో । గుణియో నిర్గుణియో యటంచు విభుధుల్ గుంఠీభవత్తత్త్వమా । ర్గణులై యే విభుపాదపద్మభజనోత్కర్షంబులన్ దత్త్వవి । క్షణముం జేసెద రట్టి విష్ణుం బరము న్సర్వాత్ము సేవించెదన్॥ మ॥ జగదుత్పాదనబుద్ధి బ్రహ్మకుమదిన్ సంధింపనూహించియే । భగవంతుండు సరస్వతిం బనుప నా పద్మాస్యదానవ్విభు । న్మగనింగా నియమించి సద్భువనసామ్రాజ్యస్థితిన్ సృష్టిపారగుం జేసె న్మను బ్రహ్మ నట్టి గుణి నారంభింతు సేవింపఁగన్॥ సీ॥ పూర్ణుఁడయ్యును మహా *భూతపంచకయోగమున మేనులను పురములు సృజించి । పురములలోనుండి పురుషభావంబున దీపించు నెవ్వఁడు నదినవృత్తిఁ । బంచభూతములను †బదునెకొండింద్రియములను బ్రకాశించి భూరిమహిమ । షోడశాత్మకుఁడన శోభిల్లి జీవత్వనిత్యవినోదంబు నెఱపుచుండ । నట్టి భగవంతుఁ డవ్యయుఁ డచ్యుతుండు । మానసోదితవాక్పుష్పమాలికలను । మంజునపరసమకరందమహిమపుష్టి । శిష్టహృద్భావవలీలలఁ జేయుఁ గాత॥ ఉ॥ మానధనుల్ మహాత్ములు సమాధినిరూఢులు యస్ముఖాంబుజ । జ్ఞానమరందపానమున జన్మభయంబులఁ బాసి ముక్తులై । ¶లూనతలొందరట్టి మునిలోకశిఖామణికి న్§విశంకటా । జ్ఞానతమోనభోమణికి సాధుజనాగ్రణికేను మ్రొక్కెదన్॥ వ॥ అని యిట్లు గురువందనంబు సేసి శుకయోగీంద్రుం డిట్లనియె॥ మ॥ అవిరోధంబున నీవు నన్నడుగు నీయర్థంబుమున్ బ్రహ్మమా । ధవు చేత న్విని నారదుం డడిగిన్ దథ్యంబుగాఁ జెప్పె మా । నవలోకేశ్వర నారదుండు వెనుక న్నా

## నారదుండు బ్రహ్మను బ్రపంచప్రకారముఁ దెలుపుమని యడుగుట.

కుం బ్రసాదించె సం । శ్రవణీయంబు మహాద్భుతంబు విను మా సందేహవిచ్ఛేదివై ॥ నారదుండు బ్రహ్మ కిట్లనియె॥ మ॥ చతురాస్యుండవు వేల్పుపెద్దవు జగత్సర్గానుసంధాయివీ । శ్రుతిసంఘాతము నీముఖాంబుజములన్ శోభిల్లు శబ్దార్థసం । యుతమై సర్వము నీకరామలకమై యుండుం గదా భారతీ । సతి యిల్లాలట నీకు నో జనక నా సందేహముం బాపవే॥ శా॥ ప్రారంభాదివివేక మెవ్వఁడొసఁగెం బ్రారంభసంపత్తికా । ధారం బెయ్యది యేమిహేతువు యదర్థం బే స్వరూపంబు సం । సారానుక్రమ ‖మూర్ణనాభిపగిదిన్ సాగించెదొక్కప్పుడుం । బారం బెన్నఁడు లేదు నీకు నువు దుష్పారంబు వాణీశ్వరా॥ శా॥ నాకుం జూడఁగ నీవు రాజవనుచున్నాఁడన్ యథార్థస్థితిన్ । నీకంటెన్ ఘనుఁ డొక్క రాజు గలఁడో నీ వింతపన్ రాజవో । నీ కేలాభము రాఁ గలంచి జగముల్ నిర్మించెదీ చేతనా । నీకం బెందు జనించు నుండు నడఁగున్ నిక్కంబు భాషింపుమా॥ మ॥ సదసత్సంగతినామరూపగుణదృశ్యంబైన విశ్వంబు నీ । హృదధీనంబు గదా ఘనుల్ సములు నీ కెవ్వారును న్లేరు నీ । పదమత్యున్నతమిట్టి నీ పులపమున్ బ్రావీణ్యయుక్తుండవై । మది నేయీశ్వరుఁ గోరి చేసితివి తన్మార్గంబు చూపింపవే॥ శా॥ అంభోజాసన నీకు నీశుఁడు గలండంటేని దత్ప్రత్యయం । దంభోజాతభవాండమే విభుని లీలాపాంగసంయుక్తిచే । సంభూతంబగు వర్తమానముగు సంభిన్నంబగున్ దద్విభున్ । సంభావింపఁగ వచ్చునే దలఁప నే చందంబు వాఁ డాకృతిన్॥ క॥ తోయజసంభవ నాకీ । +తోయము వివరింపఁ జాలఁ దోఁచిన నేనా । తోయము వారికి నన్యుల । తోయములం జెందకుండ ?ధ్రువ మెఱిఁగింతున్॥ వ॥ దేవా భూతభవిష్యద్వర్తమానంబులగు వ్యవహారంబులకు నీవే విభుండవు నీ వెఱుంగని యర్థం బించుకయు లేదు విశ్వప్రకారంబు వినుపింపుమనిన విని వికసితముఖుండై విరించి యిట్లనియె॥ క॥ రారా బుధులు విరక్తులు । గారా యీరీతి నడుగఁగా నేరరు వి । స్మేరావహ మభవన్మతి । వారా నాతోడి మర్మ మడిగితి వత్సా॥ శా॥ నానాస్థావరజంగమప్రకరముల్ నాయంత నిర్మింపవి । జ్ఞానం బేమియు లేక దొట్రుపడఁగా నాకున్న నుస్తానుసం । ధానారంభవిచక్షణత్వము మహాధారంబుగా నిచ్చెము । న్నే నా యీశ్వరు నాజ్ఞఁ గాక జగముల్ నిర్మింపశక్తుండనే॥ మ॥ అనఘా విశ్వము నెల్ల దీప్తముగఁ జేయన్నేన సద్ధండనే । యినచంద్రానలతారకాగ్రహగణం బేరీతి నారీతి నె । వ్వని దీప్తిం బ్రతిదీప్తమయ్యె భువనవ్రాతంబు దద్దీప్తిచే । ననుదీప్తం బగు నట్టి యీశ్వరున కేన్ శాంతమున్ మ్రొక్కెదన్॥ మ॥ వినుమే నీశ్వరుదృష్టిమార్గమున నావేశింత

---

* భూతపంచక ॥ భూమి, జలము, అగ్ని, వాయు, ఆకాశములు. † పదునొకొండింద్రియములు - బుద్ధి, జ్ఞానేంద్రియపంచకము, కర్మేంద్రియపంచకము. ¶ లూనతలు - ఖండనములు, § విశంకట - అధికము. ‖ ఊర్ణనాభి - సాలెపురుగు. + తోయము - వింత, స్నేహము. ? ధ్రువము - నిజము.

శంకించిసి । గ్గునసంకోచము నొందుమాయవలనం గుంఠీభవత్ప్రజ్ఞ చే । ననులోకేశ్వరుఁ డంచు మ్రొక్కు మతిహీన
న్రాతముం జూచి నే । ననిశంబున్న గిధిక్కరింతు హరిమాయాకృత్యమంచున్న తా॥. వ॥ మఱియు దేహంబునకు మహా
ద్రవ్యంబులైన మహాభూతంబులును, జన్మనిమిత్తంబులైన కర్మంబులును, గర్మక్షోభకంబైన కాలంబును, గాలపరిమా
ణహేతువైన స్వభావంబును, భోక్తయైన జీవుండును, వాసుదేవుండు గానెఱుంగుము వాసుదేవవ్యతిరిక్తంబు లేదు; సిద్ధం
బు, నారాయణనియమంబులు లోకంబులు, దేవతలు నారాయణశరీరసంభూతులు, వేదయాగ తపోయోగ విజ్ఞానంబు
లు, నారాయణపరంబులు, జ్ఞానసాధ్యంబగు ఫలంబు నారాయణాధీనంబు, గూటస్థుండు సర్వాత్మకుండు, *సర్వద్రష్టయై
నయీశ్వరునికటాక్షవిశేషంబున సృజియింపంబడి ప్రేరితుండనై సృజ్యంబైన ప్రపంచంబు సృజించుచుండుదు. నిర్గుణుం
డైనయీశ్వరునివలన రజస్సత్త్వతమోగుణంబులు ప్రభూతంబులై యుత్పత్తిస్థితిలయంబులకుఁ బాలుపడి కార్యకారణక
ర్తృత్వభావంబులందు ద్రవ్యంబులైన మహాభూతంబులు జ్ఞానమూర్తులయిన దేవతలు క్రియారూపంబులయిన యింద్రి
యంబులు నాశ్రమంబులుగా నిత్యముక్తుండయ్యును మాయాసమన్వితుండై నజీవుని బంధించి జీవులకు నావరణంబులయి
నయుపాధిభూతంబులయిన మూఁడులింగంబులు చేసి పరులకు లక్షితంబుగాక తనకు లక్షితంబైన తత్త్వంబుగలయీశ్వరుం
డివ్విధంబునం గ్రీడించుచుండు॥. క॥ ఆయీశుఁ డనంతుఁడు హరి। నాయకుఁడీ భువనములకు నాకున్నీకున్ నాయకుఁ బ్రాశి
§వ్రజమున। కేయెడలన్ లేమనీశ్వరేతరము సుతా॥. వ॥ వినుము మాయావిభుండై నయీశ్వరుండు దనమాయం జేసి దైవ
యోగంబునం బ్రాప్తంబులయిన కాలజీవాదృష్టస్వభావంబులు వివిధంబులు సేయ నిశ్చయించి గైకొని యీశ్వరాధిష్ఠి
తంబయిన మహత్తత్త్వంబువలన నగు కాలంబున గుణవ్యతికరంబును స్వభావంబునఁ బరిణామంబును జీవాదృష్టభూతంబ
యిన కర్మంబున జన్మంబునయ్యె రజస్సత్త్వంబులచేను పబృంహితంబై వికారంబునొందిన మహత్తత్త్వంబువలనం దమఃప్ర
ధానంబై దివ్యజ్ఞానక్రియాత్మకంబగు నహంకారంబు గలిగె నదియు రూపాంతరంబు నొందుచు ద్రవ్యశక్తియైన రాజసం
బు, క్రియాశక్తియైన తామసంబు, జ్ఞానశక్తియైన సాత్త్వికంబు, ననమూఁడువిధంబులయ్యె నందు భూతాదియైన తామసా
హంకారంబువలన నభంబు గలిగె, నభంబునకు సూక్ష్మరూపంబు, భూతదృశ్యంబునకుఁ బోధకంబైన శబ్దగుణంబు, నభంబు
వలన వాయువు గలిగె, వాయువునకుం బరాన్వయంబున శబ్దంబు స్పర్శంబునను రెండుగుణంబులు గలిగియుండు నవి దేహం
బునందుండుటం జేసి ప్రాణరూపంబై యింద్రియమనశ్శరీరపాటవంబైన యోజస్సహోబలంబులకు హేతువై వర్తించు
వాయువువలన రూపస్పర్శశబ్దంబులనియెడు గుణంబుల మూఁటితోడఁ దేజంబు గలిగెఁ. దేజంబువలన రసరూపస్పర్శశబ్దంబు
లనియెడు నాలుగుగుణంబులతోడ జలంబు గలిగె, జలంబువలన గంధరసరూపస్పర్శశబ్దంబులనియెడు గుణంబులయిదింటితో
డం బృథివి గలిగె, వైకారికంబైన సాత్త్వికాహంకారంబువలన చంద్రదైవతంబయిన మనంబు గలిగె. మఱియు దిక్కులు వా
యువు నర్కుండు ప్రచేతసుండు నశ్వినులు వహ్నియు నింద్రుఁడు నుపేంద్రుండు మిత్రుండు ప్రజాపతియు ననియెడి దశదేవ
తలు గలిగిరి. తైజసంబయిన రాజసాహంకారంబువలన దిగ్దైవతంబైన శ్రవణేంద్రియంబు, వాయుదైవతంబైన త్వగింద్రి
యంబు, సూర్యదైవతంబైన నయనేంద్రియంబు, ప్రచేతోదైవతంబైన రసనేంద్రియంబు, నశ్వినీదైవతంబైన ఘ్రాణేం
ద్రియంబు, వహ్నిదైవతంబైన వాగింద్రియంబు, నింద్రదైవతంబైన హస్తేంద్రియంబు, నుపేంద్రదైవతంబైన పాదేం
ద్రియంబు, మిత్రదైవతంబైన గంధేంద్రియంబు, ప్రజాపతిదైవతంబైన గుహ్యేంద్రియంబు ననియెడి దశేంద్రియంబులును
బోధజనకాంతఃకరణైకభాగంబయిన బుద్ధియుఁ, గ్రియాజనకాంతఃకరణంబయిన ప్రాణంబును గలిగె నిట్టి శ్రోత్రాదుల
గు నింద్రియంబులతోఁ గూడిన భూతేంద్రియమనోగుణంబులు వేఱ్వేఱుగ బ్రహ్మాండశరీరనిర్మాణంబునందసమర్థం
బులగునపుడు భగవచ్ఛక్తిప్రేరితంబులగుచు నేకీభవించి ¶సమష్టివ్యష్ట్యాత్మకత్వంబు నంగీకరించి చేతనాచేతనంబులం గ
ల్పించె నట్టియండంబు సహాయుతసహస్రాంతంబువనుక జలంబునందుండఁ గాలకర్మస్వభావంబులం దగులువడక సమస్త
మును జీవయుక్తముగఁ జేయు నీశ్వరుం డచేతనంబును సచేతనంబుగ నొనర్చె నంతఁ గాలకర్మస్వభావప్రేరకుండయిన పర
మేశ్వరుండు జీవరూపంబున మహావరణజలమధ్యస్థితంబయిన బ్రహ్మాండంబులోను సొచ్చి సవిస్తరంబు గావించి యట్టియం
డంబు భేదించి నిర్గమించె నెట్లంటేని॥. క॥ భువనాత్మకుఁ డాయీశుఁడు। భవనాకృతితోడనుండు బ్రహ్మాండంబు। న్వివరము
తోఁ బదునాలుగు। వివరంబులుగా నొనర్చె విశదంబులుగన్॥. మ॥ బహుపాదోరుభుజానన నేత్రణశిరఃఫాల శ్రవోయుక్తుఁ

*సర్వద్రష్ట-సర్వసాక్షి, §వ్రజము-సమూహము. ¶సమష్టివ్యష్ట్యాత్మకంబు-చేరియుండుటయు వేరువేఱుగనుండుటయు.

డై। విహరించుచున్న బహుదేహి దేహగతుండై విద్వాంసులూహించిత। ద్బహురూపావయవంబులకా భువనసంపత్తిన్విచారించుచురా। మహనీయామృతమూర్తియోగిజనహృన్మాన్యుండు మేధానిధీ॥ వ॥ వినుము చతుర్దశలోకంబులందు మీఁదియేడు లోకంబులు శ్రీమహావిష్ణువునకుం గటిప్రదేశంబుననుండి యూర్ధ్వదేహమనియును, గ్రిందియేడులోకంబులు జఘనంబుననుండి యధోదేహమనియును బలుకుదురు; ప్రపంచశరీరకుండగు భగవంతుని ముఖంబువలన బ్రహ్మకులంబు, బాహువులవలన క్షత్త్రియకులంబు, నూరువులవలన వైశ్యకులంబుఁ, బాదంబులవలన శూద్రకులంబును జనియించెనని చెప్పుదురు. భూలోకంబు గటిప్రదేశంబు, భువర్లోకంబు నాభి, సువర్లోకంబు హృదయంబు, మహర్లోకంబు వక్షంబు, జనలోకంబు గ్రీవయుఁ, దపోలోకంబు స్తనద్వయంబు, *సనాతనంబును బ్రహ్మనివాసంబును నైన సత్యలోకంబు శిరంబు, గటిప్రదేశంబతలంబు, దొడలు వితలంబు, జానువులు సుతలంబు, జంఘలు దలాతలంబు, గుల్ఫంబులు మహాతలంబు, పాదాగ్రంబులు రసాతలంబు, పాదతలంబు పాతాళంబును నిలోకమయుంగా భావింతురు. కొందఱు మఱియుం బాదతలంబువలన భూలోకంబును, నాభివలన భువర్లోకంబును, శిరంబువలన స్వర్లోకంబును గలిగెనని లోకకల్పనంబు నెన్నుదురు. పురుషోత్తము ముఖంబువలన సర్వజంతువాఙ్నాజాలంబుఁ దదధిష్ఠాతయగు వహ్నియును దయించెఁ, జర్మరక్తమాంసమేదశ్శల్యమజ్జాశుక్లంబులు సప్తధాతువులందురు. పక్షాంతరంబున రోమత్వఙ్మాంసాస్థిస్నాయుమజ్జాప్రాణంబులు సప్తధాతువులనియందురందు రోమంబులుష్ణిక్ఛందంబనియుఁ, ద్వక్కు ధాత్రీఛందంబనియు, మాంసంబు త్రిష్టుప్ఛందంబనియు, స్నాయువనుష్టుప్ఛందంబనియు, నస్థి జగతీఛందంబనియు, మజ్జపఙ్క్తిఛందంబనియుఁ, బ్రాణంబు బృహతీఛందంబనియు నాదేశింతురు. హవ్యకవ్యామృతాన్నంబులకు మధురాదిషడ్రసంబులకు రసనేంద్రియంబునకు రసాధీశ్వరుండైన వరుణునికి హరిశిరసనేంద్రియంబు జన్మస్థానంబు, సర్వప్రాణావళకు వాయువునకు విష్ణునాసికావివరంబు నివాసంబు, సమీపదూరవ్యాపి గంధంబులకు నోషధులకు నశ్వినీదేవతలకు దిశాంబరుని ఘ్రాణేంద్రియంబు నివాసంబు, దేవలోకసత్యలోకంబులకుఁ దేజంబునకు సూర్యునికి సకలచక్షువులకు లోలోచను చక్షురింద్రియంబు స్థానంబు, దిశలకు నాకాశంబునకు శ్రుతిభూతంబులైన యంశంబులకు శబ్దంబునకు సర్వేశ్వరుని కర్ణేంద్రియంబు జన్మస్థానంబు, వస్తుసారంబులకు వర్ణనీయసౌభాగ్యంబులకుఁ బరమపురుషుని గాత్రంబు భాజనంబు,* స్పర్శంబునకు వాయువునకు సకలస్నిగ్ధంబులకు దివ్యదేహుని దేహేంద్రియంబు గేహంబు, యూపప్రముఖయజ్ఞోపకరణసాధనంబులగు తరుగుల్మలతాదులకుఁ బురుషోత్తముని రోమంబులు మూలంబులు, శిలాలోహంబులు సర్వమయుని నఖంబులు, మేఘజాలంబులు హృషీకేశుని కేశంబులు మెఱుంగులు, విశ్వేశ్వరుని శ్మశ్రువులు, భూర్భువస్సువర్లోకరక్షకులైన లోకపాలకుల పరాక్రమంబులకు భూరాదిలోకంబుల క్షేమంబునకు శరణంబునకు నారాయణుని విక్రమంబులు నికేతనంబులు, సర్వకామంబులకును త్తమంబులైన వరంబులకుఁ దీర్థపాదుని పాదారవిందంబులాస్పదంబులు, జలంబులకు శుక్లంబునకుఁ బర్జన్యునకుఁ బ్రజాపతిసర్గంబునకు సర్వేశ్వరుని మేఢ్రంబు సంభవనిలయంబు, సంతానంబునకుఁ గామాదిపురుషార్థంబులకుఁ జిత్తసౌఖ్యరూపంబులగు నానందంబులకు శరీరసౌఖ్యంబునకు నచ్యుతుని యుపస్థేంద్రియంబు స్థానంబు, యమునికి మిత్రునికి మలవిసర్గంబునకు భగవంతుని పాయ్వింద్రియంబు భవనంబు, హింసకు నిరృతికి మృత్యువునకు నిరయంబునకు నిభరూపకు గుదంబు నివాసంబు, పరాభవంబునకు నధర్మంబునకు నవిద్యకు ననంతుని పృష్ఠభాగంబు సదనంబు, నదనదీనివహంబునకు నీశ్వరుని నాడీసందోహంబు జన్మమందిరంబు, పర్వతంబులకు నధోక్షజుని శల్యంబులు జనకస్థలంబులు, ప్రధానంబునకు నన్నరసంబునకు సముద్రంబులకు భూతలయంబునకు బ్రహ్మాండగర్భుని యుదరంబు నివేశంబు, మనోవ్యాపారరూపంబగు లింగశరీరంబునకు మహామహిముని హృదయంబు సర్గభూమి యగు మఱియును॥ గీ॥ నీలకంధరునకు నీకు నాకు సనత్కు। మారముఖ్యసుతసమాజమునకు। ధర్మసత్త్వబుద్ధితత్త్వములకు నీశ్వ। రాత్మవినుము పరమమైన నెలవు॥ సీ॥ వరసురాసురపితృనాగకుంజరమృగగంధర్వయక్షరాక్షసమహీజ। సిద్ధవిద్యాధరజీమూతచారణగ్రహతారకాప్సరోగణవిహంగ। భూతతటిద్వసుపుంజంబులును నీవు ముక్కంటియును మహామునులు నేను। సలిలనభస్స్థలచరములు మొదలైన వివిధజీవులతోడి విశ్వమెల్ల। విష్ణుమయము పుత్ర వేయేల బ్రహ్మాండ। మతనిజానలోన నడఁగియుండు। బుద్ధి నెఱుఁగరాదు భూతభవద్భవ్య। లోకమెల్ల విష్ణులోన నుండు॥ క॥ మండలములోన భాస్కరుఁ। డుండుచు జగములకు దీప్తి నొసఁగెడి క్రియ బ్ర। హ్మాండములోపల నచ్యుతుఁ। డుండుచు బహిరంతరముల నొగి వెలిఁగించున్॥ ఉ॥ శ్రీయట్టియనంతశక్తి జగదాత్ముని నాభిసరోజమున

*సనాతనంబును-శాశ్వతము. శిరసనేంద్రియంబు-నాలుక. శ్రీయట్టియనంతశక్తి-అనుపద్యము మొదలుకొని, వెలిగందలనారయ చెప్పినకవిత్వము.

డు నే॥ బుట్టియు దలంపఁగా మనసు పుట్టిన యజ్ఞపదార్థజాతముల్ వెట్టఁగ నారామికి విని ర్మలమైన తదీయరూపముల్ గట్టిగ బుద్ధిలో నిలిపి కంటిని పాయము నా మనంబునన్॥ సీ॥ పశుయజ్ఞవాటయూపస్తంభపాత్రసమృష్ట*శరావవసంతకాలములును। స్నేహౌషధీధిహుళులో హచాతుర్హోత్రమతనామధేయసన్మంత్రములును। సంకల్పబుగ్యజుస్సామనియుక్తవషట్కారమంత్రానుచరణములును। దక్షిణల్ దేవతాద్యనుగతతంత్రవ్రతోద్దేశధరణీసురోత్తమాదు। లర్పణంబులు బోధాయనాదికర్మ।సరణి మొదలగు యజ్ఞోపకరణసమితి। యంతయును నమ్మహాత్ముని యవయవములు। గాఁగఁ గల్పించె విధివత్ప్రకారమునను॥ క॥ యజ్ఞాంగి యజ్ఞఫలదుఁడు। యజ్ఞేశుఁడు యజ్ఞకర్తయగు భగవంతున్। యజ్ఞపురుషుఁగా మానస। యజ్ఞముఁగావించితిం దదర్పణబుద్ధిన్॥ క॥ అప్పుడు బ్రాహ్మణు లెల్లం। దప్పక ననుఁ జూచి సముచితక్రియలగు చో। నప్పరమేశునకభిమత। మొప్పఁగ నాశ్రిసత్తతంతువును గావింపన్॥ చ॥ మనువులు దేవదానవులు మానవనాథులు మర్త్యకోటి దా। రనయము వారి వారికిఁ బ్రియంబగు దేవతలన్ భజించుచున్। ఘనతరనిష్ఠ యజ్ఞములఁ గైకొని చేసిరి తత్ఫలంబులయ్యనుపమమూర్తి యజ్ఞమయుఁడై నరమావరునందుఁ జెందఁగన్॥ క॥ సువ్యక్తతంత్రరూపకుఁ। డవ్యక్తుఁ డనంతుఁ డభవుఁ డచ్యుతుఁ డీశుం। డవ్యయుఁ డగు హరి సురగణ। సేవ్యుఁడు క్రతుఫలదుఁ డగుటఁ జేసిరి మఖముల్॥ క॥ అగుణుం డగు పరమేశుఁడు। జగములఁ గల్పించుకొఱకుఁ జతురత మాయా।సగుణుండగుఁ గావున హరి। భగవంతుం డనఁగ బరగె భవ్యచరిత్రా॥ క॥ విశ్వాత్ముఁడు విశ్వేశుఁడు। విశ్వమయుం డఖిల§నేత విష్ణుఁ డజుఁ డీ। విశ్వములోఁ దానుండును। విశ్వము దనలోనఁ జాల వెలుఁగుచునుండున్॥ చ॥ అతని నియుక్తిఁ జెందిన చరాచరభూతసమేతసృష్టి నే। వితతముగా సృజింతుఁ బ్రభవిష్ణుఁడు విష్ణుఁడు ప్రోచుఁ బార్వతీ।పతి లయమొందఁ జేయు హరి పంకరుహోదరుఁ డాదిమూర్తియచ్యుతుఁడు త్రిశక్తియుక్తుఁ డగుచుండును నింతకుఁ దానమూలమై॥ క॥ విను వత్స నీవు నన్నడిగిన ప్రశ్నకు నుత్తరంబు గేవలపరమం। బును బ్రహ్మంబీ యఖిలం।బునకగు నాధారహేతుభూతము సుమ్మీ॥ క॥ హరి భగవంతుఁ డనంతుఁడు। గరుణాంబుధి సృష్టికార్యకారణహేతు।స్ఫురణుం డవ్విభుకంటెం। బరుఁ డన్యుఁడు లేఁడు తండ్రి పరికింపంగన్॥ సీ॥ ఇదియంతయును నిక్కమే బొంకనుతక్కంతవాటిల ద్ష్ణాధ్యానమహిమఁ జేసి। పరికింప నే నేమి పలికిన నదియెల్ల సత్యంబులగు బుధస్తుత్య వినుము। నీయుక్తమా మాకేంద్రియములు సుడియుఁ బొరయ వసత్యవిస్ఫురణమందు। నదిగాన మత్తను¶వామ్నాయతుల్యంబు నమరేంద్రవందనీయంబు నయ్యె। దవిలి యే దేవదేవుని భవమహాబ్ధి।†తారణంబును మంగళకారణంబు। నఖిలసంపత్కరంబునై యలరు పాద।వనజమున కేనొనర్చెద వందనములు॥ ఉ॥ ఆనలినాక్షు నందనుఁడ నయ్యుఁ బ్రజాపతి నయ్యు యోగవి।ద్యానిపుణుండ నయ్యును బదంపడి మజ్జననప్రకారమే। యేను నెఱుంగ నవ్విభుని యిద్ధమహత్త్వ మెఱుంగ నేర్తునే। కానఁబఱుం బరమేశపరికల్పితవిశ్వము గొంతకొంతయున్॥ మ॥ విను వేయేటికిఁ దాపసప్రవర యవ్విశ్వాత్ముఁ డీశుండు దాఁ। దనమాయామహిమాంతముం దెలియఁగాఁ దథ్యంబుగాఁ జాలఁ డన్నను నేనైన సుమీరలైన నసురలైన న న్వాసుదేవుండునై।ననునిక్కంబెఱుఁగంగఁ జాలుదుము మువిజ్ఞానక్రియాయుక్తులన్॥ వ॥ అమ్మహాత్ముండైన పుండరీకాక్షుండు సర్వజ్ఞుండంటేని॥ క॥ గగనము దనకడపలఁ దాఁ। దగ నెఱుఁగని కరణి విభుఁడు దా నెఱుఁగఁ డనన్। గగనప్రసవము లేదన। నగునే సర్వజ్ఞతకును హాని దలంపన్॥ చ॥ తలకొని యమ్మహాత్ముఁడు దాల్చిన యయ్యవతారకర్మముల్। వేలయఁగ నస్మదాదులము వేయువిధంబుల సన్నుతింతుము। య్యాలఘు ననంతు నిం జిదచిదాత్మకు నాద్యు ననీశు నీశ్వరున్। దెలియఁగ నేర్తుమే తలవిలి దివ్యచరిత్రున కేను మ్రొక్కెదన్॥ మ॥ పరమాత్ముండజుఁ డీజగంబుఁ బ్రతికల్పంబందుఁ గల్పించుచుం। బరిరక్షించుచుఁ ద్రుంచుచున్న యనఘున్ బ్రహ్మాత్ము నిత్యున్ జగ।ద్భరితుం గేవలు నద్వితీయుని విశుద్ధజ్ఞాను సర్వాత్ము నీ।శ్వరు నాద్యంతవిహీను నిర్గుణుని ?శశ్వన్మూర్తిఁ జింతించెదన్॥ చ॥ సరసగతిన్ మునీంద్రులు ప్రసన్నశరీరహృషీకమానస।స్ఫురణ గలప్పు డవ్విభుని భూరికళాకలితస్వరూపమా।దరమిడి చూతు రెప్పుడు కుతర్కహతమోహాతిచేతనజ్ఞతన్। బొరసిన యప్పు డవ్విభుని మూర్తిఁ గనుంగొనలేరు నారదా॥ వ॥ అని వెండియు నిట్లను నమ్మహాయుష్మహాతేజోనిధి మొదలియవతారంబు సహస్రశీర్షాదియుక్తంబయి ప్రకృతిప్రవర్తకంబగు నాదిపురుషరూపంబగు నందుఁ గాలస్వభావంబులను శక్తులుదయించె నందుఁ గార్యకారణరూపంబయిన ప్రకృతి జనించెఁ బ్రకృతివలన మహత్తత్త్వంబును దానివలన నహంకారత్రయంబును బుట్టె నందు రాజసాహంకారంబువలన నింద్రియంబులును సాత్త్వికాహంకారంబువలన నింద్రియగుణప్రధానంబులైన యధిదేవతలును, దామసాహంకారంబువలన భూతకారణంబులై

* శరావ-మూఁకుడు. సత్తతంతువు-యాగము. § నేత-ప్రభువు. ¶ ఆమ్నాయ-వేదము. † తారణంబు-దాటించునట్టి. ? శశ్వత్-ప్రకాశించుచున్న.

నశబ్దస్పర్శరూపరసగంధతన్మాత్రంబులు వొడమె, బంచతన్మాత్రంబులవలన గగనానిలవహ్నిసలిలధరాదికంబైన భూతపంచకంబు గలిగె, నందు జ్ఞానేంద్రియంబులయిన త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులును, గర్మేంద్రియంబులైన వాక్పాణిపాదపాయూపస్థలును మనంబును జనియించె, నన్నింటిసంఘాతంబున విశ్వరూపుండైన విరాట్పురుషుండు పుట్టిన నతనివలన స్వయంప్రకాశుండైన స్వరాట్టు సంభవించె నందుఁ జరాచరరూపంబుల స్థావరజంగమాత్మకంబయిన జగత్తు గలిగె నందు సత్వరజస్తమోగుణాత్మకులమయిన విష్ణుండును హిరణ్యగర్భుండనయిన యేనును రుద్రుండును గలిగితిమి యందు సృష్టిజననకారణుండయిన చతుర్ముఖుండు పుట్టె వానివలన దక్షాదులగు ప్రజాపతులు దొమ్మండ్రు గలిగిరి యందు భవన్ముఖులైన సనకసనందనాదియోగీంద్రులును, నాకలోకనివాసులును, ఖగలోకపాలకులగు గరుడాదులును, నృలోకపాలకులగు మనుమాంధాతృప్రభృతులును, దలలోకపాలకులగు ననంతవాసుకిప్రభృతులును, గంధర్వసిద్ధవిద్యాధరచారణసాధ్యరక్షోయక్షోరగనాగలోకపాలురును మఱియు ఋషులును బితృదేవతలును దైత్యదానవభూతప్రేతపిశాచకూష్మాండపశుమృగాదులునుద్భవించిరి. ఇట్టిజగత్ప్రథమోద్భవంబు మహత్తత్వసృష్టి యనంబడు ద్వితీయంబండసంస్థితంబనందగు తృతీయంబు సర్వభూతస్థంబన నొప్పు నందైశ్వర్యతేజోబలసంపన్నులైన పురుషులు సర్వాత్ముండైన నారాయణుని యంశసంభవులుగా నెఱుంగు మప్పుండరీకాక్షుని లీలావతారంబులనంతంబులు దత్కర్మంబులు లెక్కవెట్ట నెవ్వరికిని నలవి

## శ్రీమన్నారాయణుని లీలావతారంబుల యభివర్ణనము.

గాదైనను నాకుం దోఁచినంత నీ కెఱింగించెద వినుము॥ ఉ॥ అన్యకథాసులాపముల హర్నిశమున్ వినునట్టి సత్క్రియా। శూన్యములైన కర్ణముల సూరిజనస్తుతసర్వలోకస।మ్మాన్యములై తనర్చు హరిమంగళదివ్యకథామృతంబు సౌ।జన్యతఁ గ్రోలుమయ్య బుధసత్తమ యే వివరించి చెప్పెదన్॥ వ॥ అని పలికి నారదుం జూచి మఱియు నిట్లనియె॥ మ॥ కనకాక్షుండు భుజావిజృంభణమునన్ ధాత్రీచక్రముం జాపఁజు।ట్టినమాడ్కిన్ గొనిపోవ యజ్ఞమయదంష్ట్రిస్వాకృతిం దాల్చి యా।ద్దనుజాధీశ్వరుఁ దాఁకి యబ్ధినడుమన్ దంష్ట్రాగ్రహతిం ద్రుంపఁ బా।త్రనిగూలెన్ గులిశాహతింబడు మహోద్రింబోలి యత్యుగ్రతన్॥ వ॥ మఱియు సుయజ్ఞావతారంబు వినుమని యిట్లనియె॥ సీ॥ ప్రకటరుచిప్రజాపతికిని స్వాయంభువుని కూఁతు రాకూతియను లతాంగి।కర్థిఁ జన్మించి సుయజ్ఞుండు నా నొప్పనతఁడు దక్షిణ యను నవతియందు। సుయమనామామరస్తోమంబుఁ బుట్టించి యింద్రుఁడై వెలసియుపేంద్రలీల। నఖిలలోకంబుల యార్తి హరించిన నతని మాతామహుండైన మనువు। ఘనమనంబునఁ దచ్చరిత్రమున కలరి। పరమపుణ్యుండు హరియని పలికెఁ గాన। నంచితజ్ఞాననిధియైన సుయజ్ఞుఁ డెలమిఁ। దాపసోత్తమ హరియవతారమయ్యె॥ వ॥ అని చెప్పి సాంఖ్యయోగప్రవర్తకాచార్యవర్యుండగు కపిలుని యవతారంబు వినుమని యిట్లనియె॥ చ॥ ధృతమతి దేవహూతికిని దివ్యవిభుండగు కర్దమప్రజా।పతికిఁ బ్రమోద మొప్పన వభామలతోఁ గపిలాఖ్యఁ బుట్టియే।గతిహరిఁ బొందునట్టి సుభగంబగు సాంఖ్యము పన్యసించి దు।ష్కృతములు వాపి చూపె ముని సేవితమై తనరారు మోక్షమున్॥ వ॥ మఱియు దత్తాత్రేయావతారంబు వినుము॥ సీ॥ తాపసోత్తముఁ డత్రి తనయునిఁ గోరి రమేశు వేఁడిన హరి యేను నీకు। ననఘ దత్తుఁడనైతి నని పల్కుకతమున నతఁడు దత్తాత్రేయుఁడై జనించె। నమ్మహాత్ముని చరణాబ్జపరాగసందోహంబుచేఁ బూతదేహులగుచు। హైహయయదువంశులైహికాముష్మికఫలరూపమగు యోగబలము వడసి। సంచితజ్ఞానఫలసుభైశ్వర్యలక్ష్మీ। శౌర్యములఁ బొందితమకీర్తి చదల వెలుఁగ। నింపునం బనువాసికి నెక్కినట్టి। దివ్యతరమూర్తి విష్ణు నుతింపఁదరమె॥ వ॥ వెండియు సనకాద్యవతారంబు వినుము॥ సీ॥ అనఘాత్మ నేను గల్పాదిని విశ్వంబు సృజియింపఁదలఁచి యంచితతపంబు। నర్థిఁ జేయుచు సనయని పల్కుటయు నది కారణంబున సనాఖ్యలను గలస। నందనసనకసనత్కుమారసనత్సుజాతులు నల్వురు సంభవించి। మానసపుత్రులై మహి నుతికెక్కి రిపోయిన కల్పాంతమున వసించు। నట్టియాత్మీయతత్వంబు పుట్టఁజేసి। సంప్రదాయకభంగిని జగతి నెల్లఁ। గలుగఁజేసిరి యవ్విష్ణుకళలఁ దనరి। నలువురయ్యు నొక్కఁడైనయచరిత్ర॥ వ॥ మఱియు నరనారాయణావతారంబు వినుము॥ క॥ గణుతింపఁగ నరనారా।యణులన ధర్మునకును దయమందిరి దాక్షా।యణియైన మూర్తివలనం।బ్రణుతగుణోత్తములు పరమపావనమూర్తుల్॥ క॥ అనఘులు బదరీవనమున। వినుతతపోవృత్తి నుండ విభుధాధిపుఁడున్। మనమున నిజపదహానికి। ఘనముగఁ జింతించి దివిజకాంతామణులన్॥ క॥ రావించి తపోవిఘ్నముఁ। గావింపుం డనుచుఁ బలుకఁ గడు వేడుకతో। భావభవానీకినులన।గా వనితలు సనిరి బదరికావనమునకున్॥ అందు॥ మ॥ నరనారాయణులున్నచోటికి మరున్నారీసమూహంబు భా।స్వరలీలం జనితూపవిభ్రమకళాచాతుర్యమేపారఁగా। ఖరిమాస్తోత్తులనాటపాటలఁజ

రింపం జూచి నిశ్చింతతన్। భరితధ్యానతపఃప్రభావనిరతిం బాటించి నిష్కాములై॥ క॥ క్రోధము దపముల కెల్లను। బాధక
మగు టెఱింగి దివిజభామలపైనన్। మేధాత్మకు లొకయింతయుఁ। గ్రోధము దేరైరి సత్త్వగుణయుతులగుటన్॥ క॥ నారా
యణుఁ డప్పుడు తన। యూరువు వెసఁ జీల్పనందు నుదయించె నురుం। బారంగ నూర్వశీముఖ। నారీజనకోటి దివిజనారులు మె
చ్చన్॥ క॥ ఊరువులందు జనించిన। కారణమున నూర్వశియన ఘనతకు నెక్కెన్। వారలరూపవిలాసవి। హారములకు సోఁ
గి రంత నమరీజనముల్॥ వ॥ అంతం దాముని నారాయణుల తపోవిఘ్నంబుగా వింపంబూని చేయు విలాసంబులు మానసిక
సంకల్పమాత్రంబున సృష్టిస్థితిసంహారంబు లొనర్పంజాలు నమ్మహాత్ముల దెసం బనికిరాక కృతఘ్నునకుం జేయు నుపకృతి
యుంబోలె నిష్ఫలంబులైన సిగ్గునం గుందుచు నూర్వశిం దమకు ముఖ్యురాలిఁగాఁ గైకొని తమ వచ్చినజాడనే మరలి రంత॥
క॥ కాముని దహించెఁ గ్రోధమహాభీమసురుద్రుఁ డట్టి యతికోపమునన్। ధీమంతులు గెలిచి రనినం। గామును గెల్చుటకుఁ
జెప్పఁగా నేమిటికిన్॥ వ॥ అట్టి నరనారాయణావతారంబు జగత్పావనంబై విలసిల్లె వెండియు ధ్రువావతారంబు వివరిం
చెద వినుము॥ సీ॥ మానితచరితుఁ డుత్తానపాదుండను భూపరేణ్యునకు సత్పుత్రుఁ డనఁగ। నుదయించి మహిమఁ బెంపొం
ది బాల్యంబున జనకుని కడనుండి సవతితల్లి। యను నాడు వాక్యాస్త్రతతిఁ గుంది మహితతపంబుఁ గావించి కాయంబుతోడ। జ
ని మీఁద ధ్రువపదస్థాయియై యట మీఁద నర్థి వర్తించు భృగ్వాదిమునులు। చతురగతిఁ గ్రింద వర్తించు సప్తఋషులు। ప్రస్తు
తింపఁ దన్ను నుతించుచుండ ధ్రువుఁ డనా నొప్పు నవ్విష్ణుతుల్యుఁ డగుచు। నున్నవాఁ డిప్పుడును నున్నవాఁడు॥ [illegible]
యవతారంబు వినుము॥ ఉ॥ వేనుఁడు విప్రభాషణ*పవిచ్యుతభాగ్యవిహీనపౌరుషుం। డై నిరయంబునం బడిన నాత్మ
సూభవుఁడై పృథుం డనాఁ। బూని జనించి తజ్జనకుఁ బున్నరకంబును బాపె మేదినిన్। ధేనువు సేసి వస్తుపితతిం బితికెన్ హరి
సత్కళాంశుఁడై॥ వ॥ అని మఱియు వృషభావతారంబు నెఱింగింతు వినుము ఆగ్నీధ్రుం డను వానికి సుదేవి వలన నాభియను
వాఁ డుదయించె నతనికి మేరుదేవి యందు హరి వృషభావతారంబు నొంది జడస్వభావంబైన యోగంబు దాల్చి ప్రశాంతాం
తఃకరణుండును విముక్తసంగుండును నై †శ్రీపరమహంసాభిగమ్యంబైన పదంబు విదియ నిమహర్షులు పలుకుచుండుదురు. మ
ఱియు హయగ్రీవావతారంబు చెప్పెద వినుము॥ చ॥ అనఘచరిత్ర మన్మఖమునం దుదయించె హయాననాఖ్యతన్। కనకసు
వర్ణవర్ణుఁడును వేదమయుండఖిలాంతరాత్మకుం। డనుపమయజ్ఞపూరుషుఁడు నై భగవంతుఁడు సత్ప్రశస్త పా। వనమగు నా
సికాశ్వసనవర్గములం దుదయించె వేదముల్॥ మఱియు మత్స్యావతారంబు వినుము॥ సీ॥ ఘనుఁడు వైవస్వతమనువు నిలిచి
పడి ధర యురుదెంచునట్టియుగాంతసమయ। మందు విచిత్రమత్స్యావతారము దాల్చి యఖిలావనీమయంబగుచు జీవ
జీవులకు నాశ్రయభూతుఁడగుచు నేకార్ణవంబైన తోయముల నడుమ। నమ్ముఖ¶శ్లథవేదమార్గంబుల నుజ్జ్వలపదవులం
జేసి। దివ్యు లర్థింప నాకర్థిఁ దెచ్చియిచ్చి। మనువు నెక్కించి పెన్నావ వనధినడుమ। మునుఁగకుండఁగ నరసిన
మీనావతారమేరికి నుతియింపఁ దరమె వత్స॥ మఱియుఁ గూర్మావతారంబు వినుము॥ మ॥ అమృతోత్పాదనయత్నులై విబుధు
లై దైత్యానీకము మందరాగము కవ్వంబుగఁ జేసి యబ్ధిఁ దఱువంగాఁ గవ్వపుంగొండ పాతాళమునకుం గ్రుంగఁ హరి కూర్మరూపమున
నత్రిందాల్చెఁ దత్పర్వత। భ్రమణవ్యాజతపీఁపులీఁట శమియింపం జేయఁగా నారదా॥ వ॥ వెండియు నృసింహావతారంబు వి
నుము॥ మ॥ సురలోకంబుఁ గలంచి దేవసమితిన్ స్రుక్కించి యుద్వృత్తుఁడై ధరఁ దైవచ్ఛవి నిశాచరుం గని కనద్దంష్ట్రాగ్ని దా
ర్వవిస్ఫురితభ్రూకుటితో నృసింహాకృతి రక్షోరాజవక్షంబు భీకరనఖాస్త్రమ్ముల దారించెఁ ద్రుంచెన్ త్రిజగత్కల్యాణసంధాయి
యై॥ ఆదిమూలావతారంబు చెప్పెద వినుము॥ మ॥ కరినాథుం డుజలగ్రహగ్రహణదుఃఖాక్రాంతుఁడై వేయువత్సరము
లాయాసమునఁ దవేల్పులకు విశ్వవ్యాప్తి లేకుండుటన్। హరి నీ వే శరణంబు నాకనినఁ గుయ్యాలించి వేవేగ వాశ్వరిముం
క్రుంది దిక్కరిం గ్రుంగఁగాఁ జెనుహితోత్సాహంబున న్దాపసా॥ మఱియు వామనావతారంబు వినుము॥ సీ॥ యజ్ఞేశ్వరుఁ డగు
హరి విష్ణుఁ డదితిసంతానంబునకు నెల్లఁ దమ్ముఁ డయ్యెఁ। గుణములఁ బెద్దయై వామనమూర్తితో బలిచక్రవర్తిఁ జేరి।
తన్ను భూమి మూఁడుపాదమ్ములనడిగి పదత్రయంబున నుజగత్త్రయంబు। వంచించికొని యొసఁగె వాసవునకు రాజ్యము నింపనీ
శ్వరుఁడయ్యు మొఱఁగి। యర్థిరూపంబు గైకొని యడుగవలసె। ధార్మికులసొమ్ము విన యోచితమునఁ గాని। వెడఁగుతనమున
నూరక విగ్రహించి చలనమందింపరాదు నిశ్చయము పుత్ర॥ చ॥ బలి నిజమౌళి నవ్వటుని పాదసరోరుహభవ్యతీర్థముం। తల
లికధరించి తన్ను నుజగత్త్రయముం హరికిచ్చి కీర్తులన్। నిలిపె వసుంధరాస్థలిని సిగ్గఱ లోకవిభుత్వహానికిన్। దలఁకక సత్స

*పవిచ్యుత-జారిన. †శ్రీపరమహంసాభిగమ్యంబైన-శ్రేష్ఠులగు యోగులచేతఁ బొందఁదగిన. ¶శ్లథ-వెడలిన.

మాటలకుం జొరక భూరివదాన్యశీలుండై॥ వ॥ మఱియు నప్పరమేశ్వరుండు నారదునకు హంసావతారంబు నొంది య
తిశయభక్తియోగంబున సంతుష్టాంతరంగుండగుచు నాత్మతత్త్వప్రదీపకంబగు భాగవతమహాపురాణం బుపదేశించె
మన్వవతారంబునొంది స్వకీయతేజఃప్రభావంబున నప్రతిహతంబైన చక్రంబుధరియించి దుష్టవర్తనులైన రాజులదం
డించుచు శిష్టపరిపాలనంబు సేయుచు నాత్మీయకీర్తిచంద్రికలు సత్యలోకంబున వెలింగించె. మఱియు ధన్వంతరి యనన వ
తరించి తన నామస్మరణంబున భూజనంబులకు సకలరోగనివారణంబు సేయుచు నాయుర్వేదంబు గల్పించె. వెండియుఁ బరశు
రామావతారంబు వినుము॥ మ॥ ధరణీకంటకులైన హైహయనరేంద్రవ్రాతమున్ భూరివి। స్ఫురితోదారకుఠారధారఁ
గలనన్ ముయ్యేడుమాఱుల్ వారి౦। బోరిమర్దించి సమస్తభూతలము విప్రుల్ వేడఁగా నిచ్చెఁ దాఁ। జిరకీర్తిన్ జమదగ్నిరాముఁ
డనమించెన్ దాపసేంద్రోత్తమా॥ వ॥ మఱియు శ్రీరామావతారంబు సెప్పెద వినుము॥ సీ॥ తోయజహితవంశదుగ్ధ
పారావారరాకావిహారకైరవహితుండు। గమనీయకోసలక్ష్మాభృత్సుతాగర్భశుక్తిసంపుటలసన్మౌక్తికంబు। నిజపాద
సేవకవ్రజమఘౌఘనిబిడాంధకారవిస్ఫురితపంకరుహసఖుఁడు। దశరథేశ్వరకృతాధ్వరవాటికాప్రాంగణాకరదేవతా
నోకహంబు। చటులదానవగహనవైశ్వానరుండు। రావణాటోపశైలపురందరుండు। నగుచు లోకోపకారార్థమవత
రించె రాముఁడై చక్రి లోకాభిరాముఁడగుచు॥ క॥ చిత్రముగ భరతలక్ష్మణశత్రుఘ్నులకర్థి నగ్రజన్ముండగుచున్। ధా
త్రిన్ రాముఁడు వెలసెం బవిత్రుఁడు మఖపూతలతాలవిత్రుండగుచున్॥ అంత॥ సీ॥ కిసలయఖండేందుబిసకుందపద్మా
స్త్రంబదఫాలభుజరదపాణినేత్రఁ। గాహళకరభచక్రవియత్పులినశంఖజంఘోరుకుచమధ్యజఘనకంఠ। ముకురచందన
బింబశుకగజశ్రీకారగండగంధోష్ఠవాగ్గమనకర్ణఁ। జంపకేందుమస్వర్ణశంపాధనుర్నీలనాసికాస్యాంగదృగ్భ్రూశిరోజ। న
లినసుధావర్తకుంతలహాసనాభి। కలితజనకావనీపాలకన్యకాలలామఁ బరిణీతుఁడయ్యె లలాటనేత్ర। కార్ముకధ్వంసమునం
కువఘాఁగనతఁడు॥ అంత॥ క॥ రాము న్మేచకజలదశ్యామున్ సుగుణాభిరాము సద్వైభవసు। త్రామున్ దుష్టనిశాటవి। రా
ముం బొమ్మనియెం బిత్రి రఘుఁడడవులకున్॥ చ॥ అరుదుగ లక్ష్మణుండు జనకాత్మజయున్ దనతోడ నేగుదే। నరిగి రఘూత్త
ముండు ముదమారఁగఁ జొచ్చెఁ దరక్షుసింహసూ। కరకరిపుండరీకకపిఖడ్గకురంగవృకాహిభల్లకా। సరముఖసత్త్వవన్య
చయచండతరాటవి దండకాటవిన్॥ క॥ ఆవనమున వసియించిన। పావననయశాలి యిచ్చెన భయము లుజగ। త్పావనము
నిసంతతికిం గృ। పావననిధియైన రామభద్రుం డెలమిన్॥ క॥ ఖరకరకులజలనిధిహిమకరుఁడగు రఘురామవిభుఁడు గఱక
శితోడన్ ఖరునివధించెను ఘనభీకరశరములన ఖిలజనులు గరము రుదందన్॥ క॥ *హరిసుతుఁ బరిచరుఁ గాఁ గొని। హరిసు
తుఁ దునుమాడి పనిచె హరిపురమునకున్। హరివిభునకు హరిమధ్యను। హరిరాజ్యపదంబు నిచ్చె హరివిక్రముఁడై॥ వ॥ అం
త సీతానిమిత్తంబున న్త్రిలోకకంటకుండగు దశకంఠుం దునుమాడుటకు నైకపిసేనాసమేతుండై చని దుర్గమంబయిన సము
ద్రంబు దెరువుఁ జూపకున్న నలిగి॥ మ॥ వికటభ్రూకుటిఫాలభాగుఁడగుచున్ వీరుండు రోషారుణాం। బకుఁడై చూచిన
యంతమాత్రమున నప్పాథోధి సంతప్తతో। యకణగ్రాహతిమింగిలప్లవఝలీవ్యాళప్రవాళోర్మికా। వరకారండవచక్ర
ముఖ్యజలసత్త్వశ్రేణితో నింకినన్॥ వ॥ అయ్యవసరంబున సముద్రుండు గరుణాసముద్రుండగు శ్రీరామభద్రు నిశరణం
బు సొచ్చినం గరుణించి యప్పటియట్ల నిలిపి నలుని చే సేతువు బంధించి తన్మార్గంబున జని॥ మ॥ పురముల్ మూఁడును నొక్క
బాణమున నిర్మూలంబుగా వించు శం। కరుచందంబున నేర్చి రాఘవుఁడు లంకాపట్టణం బిద్ధగోపురశాలాంగణహర్మ్యరా
జభవనప్రోద్యత్ప్రతోళీకవాటరథాశ్వద్విపశస్త్రమందిరనిశాటశ్రేణితో వ్రేల్మిడిన్॥ క॥ రావణున ఖిలజగద్వి। ద్రా
వణుఁ బరిమార్చి నిలిపె పరఁగ విభుఁగా। రావణునను జన్ముని నై। రావణసితకీర్తి మెఱసి రాఘవుఁ డెలమిన్॥ సీ॥ *ధర్మసంర
క్షకత్వప్రభావుండయ్యు ధర్మవిధ్వంసకత్వమునఁ బొదలి। †ఖరదండనాదిముఖ్యతఁ బొందకుండియు ఖరదండనాదిముఖ్య
తను మెఱసి। ¶పుణ్యజనావనస్ఫూర్తిఁ బెంపొందియుఁ బుణ్యజనాంతకస్ఫురణఁ దనరి। సంతతాశ్రిత ?విభీషణుఁడుగా
కుండియు సంతతాశ్రితవిభీషణత నొప్పి। మించి తనకీర్తి చేత వాసించె దిశలు। దర మెనుతియింప రాము నెవ్వరికినైనఁ జా

*హరిసుతున్। సూర్యపుత్రుఁడగు సుగ్రీవుని-పరిచరుఁగాఁగొని। సహచరునిఁగాఁ జేకొని-హరిసుతున్। ఇంద్రపుత్రుఁడగు వాలిని-తునుమాడి చంపి-హరిపురమునకున్। యమపురమునకు-పనిచెన్। పంపెను-హరివిభునకున్। వానరరాజగు సుగ్రీవునకు- హరిమధ్యను। సింహమువంటి నడుము గలతారను-హరిరాజ్యపదంబు నిచ్చెన్। వానరరాజ్యమును నిచ్చెను-హరివిక్రముఁడై। విష్ణుస్వరూపుఁడగు శ్రీరాముఁడు పరాక్రమముగలవాఁడై.— *ధర్మ। న్యాయము-విల్లు.— †ఖర। తీక్ష్ణము-ఖరాసురుఁడు.— ¶పుణ్యజన। పుణ్యపురుషులు-రాక్షసులు.— ?విభీషణుఁడు। భయముగలవాఁడు-రావణునితమ్ముఁడు.

రుతరమూర్తి యవనీశచక్రవర్తి। ప్రకటగుణసాంద్రుఁ దశరథరామచంద్రుఁ॥ వ॥ అట్టి రామావతారంబు జగత్పావనంబు నస్మత్ప్రసాదకారణంబునై నుతికెక్కె నింకఁ గృష్ణావతారంబు వివరించెద వినుము॥ సీ॥ తాపసోత్తమ వినుదైత్యాంశములఁ బుట్టిన నరనాథులతులసేనాసమేతు। లగుచు ధర్మేతరులై ధాత్రిఁ బెక్కుబాధలనలయించుటఁ ధరణి వగలఁ। బొందుచు వాపోవ భూభారము డుపుటకై హరి పరుఁడు నారాయణుండు। చెచ్చెరఁ దనసితాసితకేశయుగమున బలరామకృష్ణరూపములఁ దనరి। యదుకులంబున లీలమై నుదయమయ్యె। భవ్యయశుఁడగు వసుదేవుభార్యలైన। రోహిణియు దేవకియు ననురూపవతుల। యందును మత్తదైత్యసంహారి యగుచు॥ వ॥ ఇట్లు పుండరీకాక్షుండగు నారాయణుండు సమస్తభూభారనివారణంబు సేయం దనమేని కేశద్వయంబ చాలు ననియాత్మప్రభావంబుఁ దెలుపుకొనుటకు నిజకళాసంభవులైన రామకృష్ణదేహవర్ణంబులు శ్వేతకృష్ణంబులని నిర్దేశించుకొనుటకు సితాసితకేశద్వయవ్యాజంబున రామకృష్ణాఖ్యల నవతరించె నంత భగవంతుండు సాక్షాద్విష్ణుండునైనఁ గృష్ణుండు జనమార్గవర్తి యయ్యు నతిమానుషకర్మంబుల నాచరించుటం జేసి కేవలపరమేశ్వరుండయ్యె నమ్మహాత్ముం డాచరించు కార్యంబులు లెక్కవెట్ట నెవ్వనికిన లవిగాదయినను నాకు గోచరించినంతయు నెఱింగించెద వినుము॥ క॥ నూతనగరళస్తనియగు। పూతనఁ బురిటింటిలోనఁ బొత్తులశిశువై। చేతనములఁ హరియించి ప। రేతనగరమునకు ననిచెఁ గృష్ణుఁడు పెలుచన్॥ క॥ వికటముగ నిజపదాహతిఁ। బ్రకటముగా మూఁడు నెలలబాలకుఁడై యా। శకటనిశాటుని నంతక। నికటస్థునిఁ జేసె భక్తనికరావనుఁడై॥ క॥ ముద్దులకొమరుని వ్రేతెల। రక్తులకై తల్లి రోలఁ ద్రాడునఁ గట్టం। బద్దులకు మిన్నుముట్టిన। మద్దులవడిఁ గూల్చెఁ జనసమాజము వొగడన్॥ మ॥ మదిఁ గృష్ణుండు యశోదబిడ్డఁడని నమ్మం జాలవో యోగీంద్ర త। ద్వదనాంభోజములోఁ జరాచరసమస్తప్రాణిజాతాటవీ। నదనద్యద్రిపయోధియుక్తమగు నానాలోకజాలంబు భా। స్వదనూనక్రియఁ జూపెఁ దల్లికి మహైశ్వర్యంబు వాటిల్లఁగన్॥ చ॥ వరయమునానదీహ్రదనివాసకుఁడై నిజవక్త్రనిర్గత। స్ఫురితవిషాంబుపానమున భూజనులన్ మృతిఁ బొందఁ జేయుభీ। కరగరళద్విజిహ్వుఁడగు కాళియపన్నగునాహ్రదంబుఁ జె। చ్చెర వెడలించి కాచె యఘసింహుఁడు గోపకగోగణంబులన్॥ మ॥ తనయా గోపకులాకరా। రినినిద్రం జెందఁగార్చి చ్చవ; ద్భినఁ గృష్ణా మము నగ్నిపీడితుల రక్షింపందగుం గావవే। యనినం గన్నులు మీరు మోడ్పుఁడిసె దావాగ్ని న్వెసనార్తునే। ననవారట్లను సర్పమిం గశిఖిఁ బద్మాక్షుండు లీలాగతిన్॥ క॥ మందునిగతి యమునాంబువు। లందునిశిం గ్రుంకి బద్ధుఁడై చిక్కినయా। నందుని వరుణునిబంధన। మందునివృత్తునిఁగఁ జేసె హరి సదయుండై॥ మ॥ హయసూనుండగు దానవుండు నిజమాయన్ గోపరాజిన్ గుహా। శ్రయయత్నాన నట్లొనరించి తత్పథము నీరంధ్రంబుగా వించినన్। రయ మొప్పన్ గుటిలాసురాధమునిఁ బోరన్ ద్రుంచి గోపావళిన్। దయతోఁ గాచిన కృష్ణు సన్మహిమ మే తర్మాత్ర మే తాపసా॥ క॥ దివిజేంద్రప్రీతిగ వ। ల్లవజను లేఁటేటఁ జేయు లాలితసవనో। త్సవము హరి మానిపిన గో। పవరులు గావింపకున్న బలరిపుఁ డలుకన్॥ గీ॥ మందగొందలమందనమందవృష్టిఁ। గ్రందుకొనుఁ డంచు నింద్రుండు మందలింపఁ। జండపవనసముద్ధాతచటులవిలయ। సమయసంవర్తకాఖిలజలధరములు॥ శా॥ సప్తస్కంధశిఖాకలాపరుచిమత్సౌదామనీవల్లికా। దీప్తోదగ్రముహుర్ముహుస్తనితధాత్రీభాగనీరంధ్రమై। సప్తాశ్వస్ఫురదిందుమండలనభస్సంఛాదితాశాంతమై। వ్యాప్తాభోదనిరర్గళస్ఫుటశిలావాఃపూరధారాళమై॥ వ॥ అట్లు గురియు వానజల్లు పెల్లున నిమ్మలు గొని సొమ్మలు వోయి సొమ్మసిలు గోపగోకులంబు వ్యాకులంబు నొంది కృష్ణ కృష్ణ రక్షింపుమని యార్తిం బొందికుయ్యిడ నయ్యఖండకరుణారససముద్రుండు భక్తజనసురద్రుముండును నగు పుండరీకాక్షుండు॥ శా॥ సప్తాబ్దంబులబాలుఁడై నిజభుజాస్తంభంబునన్ లీలతో। సప్తాహంబులు శైలరాజము లసచ్ఛత్త్రంబుగాఁ దాల్చి సం। గుప్తప్రాణులఁ జేసె మాధవుఁడు గోగోపాలకవ్రాతమున్। సప్తాంభోధిపరీతభూధరున కాశ్చర్యంబె చింతింపఁగన్॥ సీ॥ సాంద్రశరచ్చంద్రచంద్రికాధవళితవిమలబృందావనవీథియందు। రాసకేళీమహోల్లాసుఁడై యుత్ఫుల్లజలజాక్షుఁడొకనిశాసమయమునను। దనరారు మంద్రమధ్యమ తారకలనింపు దలుకొత్తరాగభేదములఁ జెలఁగి। ధైవతఋషభగాంధారనిషాదపంచమషడ్జమధ్యమస్వరములోలిఁ। గళలు జాతులు మూర్ఛనల్ గలుగ వేణు। నాళవివరాంగుళిన్యాసలాలనమున। మహితగతిఁ బాడె నవ్యక్తమధురముగను। బంకజాక్షుండు దామవులంకురింప॥ మ॥ హరి వేణూద్గతమంజులస్వననినాదాహూతలై గోపసుం। దరులే తేరఁ ధనాధిపానుచరగంధర్వుం డధ్గొంపోవఁ ద। త్తరుణుల్ గుయ్యిడ శంఖచూడుని భుజాదర్పంబు మాయించి లా। ఁ బరిరక్షించిన యట్టి కృష్ణుని నుతింపన్ శక్యమే యేరికిన్॥ చ॥ నరకమురప్రలంబయవనద్విపముష్టికమల్లకంసశం। బరశిశుపాలపంచజనపౌండ్రకపిప్పల

దంతవక్త్రశివా।వరఖరసాల్వవత్సబకనాగవిదూరకరుక్మికేశిద।ర్దురవృషధేనుకప్రముఖదుష్టనిశాటులఁద్రుంచెఁద్రేల్మి డిన్॥. మఱియును॥ మ॥బలభీమార్జునముఖ్యచాపధరరూపవ్యాజతంద్రుర్జరులన్।ఖలులన్ మత్తధరాతలేశ్వరులసంగ్రామైకపారీణదో।ర్బలకేళిందునుమాడిసర్వధరణీభారంబుమాయించిసా।ధులరక్షించినయట్టికృష్ణునిననంతుంగోర్తునెల్లప్పుడున్॥.వ॥అట్టిలోకోత్కృష్టుండైనకృష్ణునియవతారమాహాత్మ్యంబెఱింగించితి-యింక వ్యాసావతారంబువినుము॥ చ॥ ప్రతియుగమందుసంకుచితభావులునల్పతరాయులౌనస।ద్గతిపులునైనమర్త్యులకగమ్యములైస్వకృతంబులైసుశా।శ్వతములునైనవేదతరుశాఖలుదావిభజించినట్టిస।న్నుతుఁడుపరాశరప్రియతనూజుఁడనన్ హరివుట్టెనర్మిలిన్॥. మఱియుబుద్ధావతారంబువినుము॥. మ॥ అతిలోలాత్మలసూనృతోక్తులను వేదాచారసంశీలురు। ద్ధతపాషండమతౌపధర్మ్యులుజగత్సంహారులైనట్టియా।దితిసంజాతులధర్మవాసనలవర్తింపందద్దాచారసం। హతిమాయించిహరించెఁదానవులఁబుద్ధాకృతిన్॥. మఱియుంగల్క్యవతారంబువినుము॥. మ॥వనజాక్షుండస్తవశూన్యులైమఱివషట్స్వాహాస్వధావాక్యశో। భనహీనుల్గరినానృతోక్తిపరులైపాషండులునైననవి। ప్రనికాయంబునుశూద్రభూపులుగలిన్ భాసిల్లినంగల్కియైజననంబందియధర్మమెల్లనడఁచున్ స్థాపించుధర్మంబిలన్॥.వ॥ అనిమఱియుఁబితామహుండునారదునకిట్లనియె.మునీంద్రా పుండరీకాక్షుండంగీకరించులీలావతారకథావృత్తాంతంబు నేనీకు నెఱింగించునంతకుమున్నహరివగాహాదియవతారంబులంగీకరించితత్ప్రయోజనంబులుదీర్చె. మన్వంతరావతారంబునంగీకరించినవియునంగీకరింపంగలయవియునైయున్నవి.వర్తమానంబునధన్వంతరిపరశురామావతారంబులుదాల్చియున్నవాఁడు।భావికాలంబునశ్రీరామాద్యవతారంబులనంగీకరింపంగలవాఁడమ్మహాత్ముండుసృష్ట్యాదికార్యభేదంబులకొలకుమాయాగుణావతారంబు నొందుమబహుశక్తిధారకుండైనభగవంతుండుసర్గంబునంతపం బేను ఋషిగణంబులు నవప్రజాపతులునై యవతరించివిశ్వోత్పాదనంబుగావించువిష్ణుండుధర్మంబుయజ్ఞంబులుమనువులింద్రాదిదేవగణంబులుధాత్రీపతులునయి యవతరించిజగంబులరక్షించుచుండు;అధర్మంబురుద్రుండుమహోరగంబులురాక్షసానీకంబులునైవిలయంబునొందించునిత్తెఱంగునంబరమేశ్వరుండుసర్వాత్మకుండునైనహరివిశ్వోత్పత్తిస్థితిలయహేతుభూతుండైవిలసించుధరణీరేణువులనైనగణుతింపనలవియగుంగానియమ్మహాత్మునిలీలావతారాద్భుతకర్మంబులు లెక్కవెట్ట నెవ్వరికినశక్యంబై యుండునీకుసంక్షేపరూపంబులనుపన్యసించితిసవిస్తరంబుగా నెఱింగింపనాకుందరంబుగాదన్యులంజెప్ప నేలవినుము॥. చ॥అమరంద్రిపిక్రమస్ఫురణనందినయమ్మహితాత్మపాదవే।గమునహతంబులైనత్రిజగంబులకావలనొప్పుసత్యలో।కముచలియించినంగరుణగైకొనికాచిధరించుపాదప।ద్మముత్తుదీనున్నయత్రుతిహతంబగుశక్తిగణింపశక్యమే॥. మ॥హరిమాయాబలమేనెఱుంగనటశక్యంబేసనందాదిస। త్పురుషానీకినికైనబుద్ధినితరంబున్ మాని సేవాధిక । స్ఫురణం దచ్చరితానురాగసుణవిస్ఫూర్తిన్సహస్రాస్యసుం। దరతన్ బొల్పగు శేషుఁడున్నెఱుఁగఁడన్నన్ జెప్పఁ దేరొండొరుల్ ॥. చ ॥ ఇతరపుమానితస్నమది నెంతయునమ్మిభజించువారినా । శ్రితజన సేవితాంఘ్రిసరసీరుహుఁడైనసరోజనాభుఁడం । చితదయితోడనిష్కపటచిత్తమునంగరుణించునట్టివా । రతులఁదురంతమైతనరునవ్విభుమాయఁదరింతురెప్పుడున్॥. వ॥మఱియును సంసారమున్నులయిదివసంబులుగడపి యంతంబునశునకసృగాలభక్ష్యంబులయిన కాయంబు లందుఁ మమత్వంబు సేయక భగవదర్పణంబుసేసినపుణ్యాత్ములుకొందఱుగల రెఱింగింతువిను మేను నీబ్రహ్మత్వంబునంజెందురాజసంబువిడచియమ్మహాత్మునిపాదారవిందంబులభక్తినిష్ఠుండనైశరణాగతత్వంబునభజియించునప్పుడు దెలియుదు; రాజసగుణుండనైనఁదెలియఁజాల; శాస్త్రంబులుప్రపంచింపక కేవలభక్తిజ్ఞానయోగంబున సేవింతు;మఱియుసనకాదులగుమీరును, భగవంతుండైనరుద్రుండు,దైత్యపతియైనప్రహ్లాదుండు,స్వాయంభువమనువు,నతనిపత్నియగుశతరూపయు,దత్పుత్రులగుప్రియవ్రతోత్తానపాదులనువారలు,దత్పుత్రికలు,ప్రాచీనబర్హియు, ఋభువు, వేనజనకుండగునంగుండు, ధ్రువుండును,గడువంజాలుదురు వెండియు॥. సీ॥ గాధిగయానులిక్ష్వాకు దిలీపమాంధాతలు భీష్మయయాతిసగర । రఘుముచుకుందైళరంతి దేవోద్ధవసారస్వతోదంకభూరిషేణ । శ్రుతదేవమారుతిశతధన్వపిప్పలబలివిభీషణశిబిపార్థవిదురు। లంబరీషపరాశరాలర్కసౌభరిదేవలమిథిలేశ్వరేంద్రదత్త । లార్ష్టిషేణాదులైనమహాత్ములెలమిఁ।దవిలియద్దేవుభక్తిఁజిత్తములనిలిపి।తత్పరాయణభక్తిమద్దాంతమయిన।విష్ణుమాయఁదరింతురువిమలమతులు॥. మ॥అనఘాభీరులనెన్నఁనేమిటికిఁదిర్యగ్జంతుసంతానప।క్షినిశాటాటవికాఘజీవనివహస్త్రీశూద్రహూణాదులై।ననునారాయణభక్తియోగమ

సీతానందాత్ములై రేని వారనయంబున దరియింతు రవ్విభుని మాయా వైభవాంభోనిధిన్॥ కావున॥ క॥ శశ్వత్ప్రశాంతు
నభయుని విశ్వాత్ము బ్రబోధమాత్రు విభు నంశుద్ధున్ । శాశ్వతు సదసత్పూరుషు నీశ్వరుఁ జిత్తమున నిలుపు మెప్పుడు మునీం
ద్రా॥ వ॥ అట్లైన నప్పుణ్యాత్ముల ననవద్యశీలుర నవిద్యలజ్జావనతవదనయై పొందంజాలక వైముఖ్యంబున నం దవ్వుదవ్వులంద
లంగి పోవు మఱియు॥ చ॥ హరిఁ బరమాత్ము నచ్యుతు ననంతు నిజిత్తములోఁ దలంచి సుస్థిరతవిశోకసౌఖ్యములఁ జెందిన ధీనిధు
లన్యకృత్యముల్ । మరులునఁ జేయ నొల్లరు తలంచిన నట్టిదయౌ సురేంద్రుఁడుం । బరువడి నుయ్యిఁ ద్రవ్వెడు *నిపాన ‡ఖని
త్రము మానుకైవడిన్॥ ఉ॥ సర్వఫలప్రదాతయును సర్వశరణ్యుఁడు సర్వశక్తుఁడు । న్సర్వజగత్ప్రసిద్ధుఁడును సర్వగతుండ
గు చక్రపాణియి । సర్వశరీరులున్విగము సంగతిఁ జెంద విశీర్యమాణులై । పర్విన చోనభంబుగతిఁ బ్రహ్మము దాఁ జెడకుండు నె
ప్పుడున్॥ ఉ॥ కారణకార్యహేతువగు కంజదళాక్షునికంటె నన్యులె । వ్వారును లేరు తండ్రి భగవంతు ననంతుని విశ్వభావ
నో । దారుని సద్గుణావళులు దాత్తమతి న్గొనియాడకుండినన్ । జేరవు చిత్తముల్ ప్రకృతిఁ జెంద నిర్గుణమైన బ్రహ్మమున్॥
మ॥ నిగమార్థ§ప్రతిపాదకప్రకటమై నిర్వాణసంధాయిగా । భగవంతుండు రచింపభాగవతకల్పక్ష్మాజమై శాస్త్రరా । జి
గనిష్ఠంబగు నీపురాణకథ సంక్షేపంబుగాఁ జెప్పితిన్ । జగతిన్నీవు రచింపు దీని నతివిస్తారంబుగాఁ బుత్రకా॥ చ॥ పురుషభ
వంబు నొందుటయుఁ బూర్వపుజన్మములందు నంచుభూ । సురకులమందుఁ బుట్టుటలు చోద్యములిట్లగు టన్మనుష్యులు । స్థిరమ
గు కార్యదుర్దశల చేతన శింపక విష్ణుసేవనా । పరతఁ దనర్చి నిత్యమగు భవ్యపథంబును నొందుటొప్పదే॥ మ॥ ఉపవాసవ్రత
శౌచశీలమఖసంధ్యోపాసనాగ్నిక్రియా । జపదానాధ్యయనాదికర్మముల మోక్షప్రాప్తి సేకూరద । చ్చపుభక్తిన్ హ
రిఁ బుండరీకనయనున్ సర్వాతిశాయిన్ రమాధిపుఁ బాపఘ్నుఁ బరేశు నచ్యుతుని నర్థింగొల్వ లేకుండినన్॥ క॥ వనజాక్షు
మహిమ నిత్యము । వినుతించుచు నోరులు వొగడ వినుచున్మదిలో । నను మోదించుచు నుండెడు । జనములు నన్మాయవశతఁ జన
రు నరేంద్రా॥ క॥ అని వాణీశుఁడు నారద । మునివరునకుఁ జెప్పినట్టి ముఖ్యకథా సూ । చనమతిభక్తిఁ బరీక్షి । జ్జనపాలుని తోఁ శు

## శ్రీ పరీక్షిన్మహారాజు శుకయోగిని బ్రపంచోద్భవాది ప్రశ్నించుట. శ్రీ

కయోగిచంద్రుఁడు నుడివెన్॥ సీ॥ విను శుకయోగి కిమ్మను జేశుఁ డిట్లను మునినాథ దేవదర్శనము గలుగు । నారదమునికిఁ బం
కరుహభవుఁ డెఱిఁగించిన తెఱఁగు సత్కృపదలిర్ప । గణుతింప సత్త్వాదిగుణశూన్యుఁడగు హరి గుణలాక్షులోకమంగళము
లయిన కథలు నాకెఱిఁగింపఁ గైకొని నిస్సంగమైన నాహృదయాబ్జమందుఁ గృష్ణు । భవ్యచరితు నాద్యంతభావశూన్యు । జి
త్ర్యయాకారు ననఘు లక్ష్మీసమేతు । నిలిపి యస్థిరవిభవంబు నిఖిల †హేయ । భాజనంబైన యీ కళేబరము విడుతు॥ వ॥ అది
యునుంగాక యెవ్వఁడు శ్రద్ధాభక్తియుక్తుండై కృష్ణుగుణకీర్తనంబులు వినుచుం బలుకుచుండు నట్టివాని హృదయపద్మంబు
నందుఁ గర్ణరంధ్రమార్గంబునం బ్రవేశించి కృష్ణుండు విశ్రమించి సలిలగతంబైన కలుషంబును శరత్కాలంబు నివారించు
చందంబున నాత్మగతంబైన మాలిన్యంబున పకర్షించుఁ గావున॥ మ॥ భరితోదగ్రనిదాఘతప్తుఁ డగు నప్పాంథుండు రన్యావి
సం । చరణక్లేశసముద్భవంబగు పిపాసం జెందియాత్మీయమం । దిరముం జేరి గతశ్రముండగుచు నెందేనిన్జనన్ లేని భంగి ర
మాధీశుపదారవిందయుగసంగీభూతుఁడై మాసు నే॥ వ॥ అదియునుంగాక సకలభూత ¶సంసర్గశూన్యంబయిన యాత్మకు
భూతసంగమంబే ప్రకారంబు గలిగె నది నిర్నిమిత్తంబునం జేసియో, కర్మంబునం జేసియో, యాక్రమంబు నాకెఱింగింపు
ము॥ సీ॥ ఎవ్వని నాభియందెల్ల లోకాంగసంస్థానకారణపంకజంబు వొడమె । నందుదయించి సర్వావయవస్ఫూర్తిఁ దన
రాగు నట్టి పితామహుండు । గడఁగి యెవ్వని యనుగ్రహమున నిఖిలభూతముల సృజించె నుత్కంఠతోడ । నట్టి విధాతయే యను
వున సర్వేశురూపంబు గనుఁగొనె రుచిరభంగి । నా పరంజ్యోతిమైన పద్మాక్షునకును । నళినజునకుఁ బ్రతీకవిన్యాసభావగతు
లవలనను భేదంబు గలదె చెపుము । యతిదయాసాంద్ర యోగికులాబ్ధిచంద్ర॥ వ॥ మఱియు నుభూతేశ్వరుండయిన సర్వేశ్వ
రుండు సృష్టిస్థితిలయకారణంబైన తన మాయను విడిచి మాయానియామకుండై యే యే ప్రదేశంబుల శయనంబు సేసెనది
యునుంగాక పురుషావయవంబులచేఁ బూర్వకాలంబున లోకపాలసమేతంబులైన లోకంబులు గల్పితంబులయ్యె ననియు,
లోకంబులు పురుషావయవంబులనియుం జెప్పంబడియె-నదియునుంగాక మహాకల్పంబులు, నవాంతరకల్పంబులును, భూత
భవిష్యద్వర్తమానకాలంబులు, స్థూలదేహాభిమానులై జనియించిన దేవపితృమనుష్యాదులకుం గలుగు నాయుఃప్రమాణం
బు, సూక్ష్మతత్త్వాత్మకాలానువర్తనంబు, నేయేకర్మంబులం జేసి జీవులేయేలోకంబుల నొందుదురు. మఱియు నేయేకర్మంబు

*నిపాన । నీళ్లతొట్టి. — ‡ఖనిత్రము । త్రవ్వె సాధనము. — §ప్రతిపాదక । తెలుపునట్టిది. — †హేయ । నింద్యము. — ¶సంసర్గ । సంబంధము.

లంజేసి దేహాదికర్మశరీరంబులం బ్రాపింతు రట్టికర్మమార్గప్రకారంబు, *సత్త్వాదిగుణంబులపరిణామంబులగు దేవాదిరూపంబులం గోరుజీవులకు నేయేకర్మసముదాయం బెట్లు సేయందగు, నెవ్వనికి నర్పింపందగు నవి యెవ్వనిచేతఁ గ్రహింపంబడు భూపాతాళ ‡కకుబ్వ్యోమగ్రహనక్షత్రపర్వతంబులు, ¶సరిత్సముద్రద్వీపంబు లేప్రకారంబున సంభవించె, నాయాస్థానంబులం గలవారిసంభవంబు లేలాటివి, §బాహ్యాభ్యంతరంబులం గలుగు బ్రహ్మాండప్రమాణం బెంత, మహాత్ములచరిత్రంబు లెట్టివి, వర్ణాశ్రమవినిశ్చయంబులు, ననుగతంబులై యాశ్చర్యావహంబులగు హరియవతారచరిత్రంబులు, యుగంబులు, యుగప్రమాణంబులుఁ, బ్రతియుగమందును మనుష్యుల కేయేధర్మంబు †లాచరణీయంబులు, మనుష్యకర్తవ్యంబులగు సాధారణధర్మంబులు, విశేషధర్మంబులు, జాతివిశేషధర్మంబులు, రాజధర్మంబు, లాపత్కాలజీవనసాధనభూతంబులగు ధర్మంబులు మహదాదితత్త్వంబులసంఖ్యయు, సంఖ్యాలక్షణంబు, నాతత్త్వంబునకు హేతుభూతలక్షణంబు, భగవత్సమారాధనవిధంబు, నష్టాంగయోగక్రమంబు, యోగీశ్వరులయణిమాద్యైశ్వర్యప్రకారంబు, వారలయర్చిరాదిగతులు, లింగశరీరవిలయంబు, ఋగ్యజుస్సామవేదంబులు, నుపవేదంబులైన యాయుర్వేదాదులు, ధర్మశాస్త్రంబులు, నితిహాసపురాణంబులసంభవంబు, సర్వభూతంబులయవాంతరప్రళయంబు, స్థితిమహాప్రళయంబులు, నిష్టాపూర్తంబులను, యాగాదివైదికకర్మజాలంబును, వాపీకూపతటాకదేవాలయాదినిర్మాణంబులన్నదానం బారామప్రతిష్ఠ మొదలగు స్మార్తకర్మంబులుఁ గామ్యంబులైన యగ్నిహోత్రంబులయనుష్ఠానప్రకారంబు, జీవసృష్టియు, ధర్మార్థకామంబులనియెడు త్రివర్గాచరణప్రకారంబు, మలినోపాధికపాషండసంభవంబు, జీవాత్మబంధమోక్షప్రకారంబు, స్వరూపావస్థానవిధంబు, సర్వస్వతంత్రుండైన యీశ్వరుం డాత్మమాయం జేసి సర్వకర్మసాక్షియై క్రీడించుటయు, మఱియు మాయ నెడఁబాసి యుదాసీనగతి విభుండై క్రీడించు తెఱంగు, నివి యెల్లఁ గ్రమంబున నాపన్నుండనయిన నాకు నెఱింగింపుము. బ్రాహ్మణశాపంబునం జేసి శోకవ్యాకులితచిత్తుండనై యనశనవ్రతుండనైన నీవు వినుట యెట్లని సందేహింపవలవదు; త్వదీయముఖారవిందవినిస్రుతనారాయణకథామృతపానకుతూహలి నయిన నాకు నింద్రియంబులు వశంబులై యుండు నదిగావున నే నడిగిన ప్రశ్నంబులకు నుత్తరంబులు సవిస్తరంబుగా నానతిచ్చి కృతార్థునిం జేయం బరమేష్ఠితుల్యుండవగు నీవ పూర్వసంప్రదాయానురోధంబున నర్హుండవగుదు వని విష్ణురాతుండయిన పరీక్షిన్నరేంద్రుండు బ్రహ్మరాతుండయిన శుకయోగి నడిగిన నతండు బ్రహ్మనారదసంవాదంబు నేకసంప్రదాయానుగతంబుగ తాగలిక ప్రకారంబునై తొల్లి సర్వేశ్వరుండు బ్రహ్మకల్పంబున బ్రహ్మకుపదేశించిన భాగవతపురాణంబు వేదతుల్యంబు నీకెఱింగింతు వినుమని చెప్పె నని సూతుండు శౌనకాదిమహామునులకుం జెప్పినట్లు శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె. సీ॥ భూపాలకోత్తమ భూతహితుండు సుజ్ఞానస్వరూపకుండైనయట్టి। ప్రాణికి దేహసంబంధ మెట్లగు నన్న మహి మెప్పు నీశ్వరమాయి లేక। కలుగ మనిద్ర వోఁ గలలోనఁ దోఁచిన దేహబంధంబుల తెఱఁగు కరణి। హరియోగమాయామహత్త్వంబునం బాంచభౌతికదేహసంబంధుఁడగుచు। నట్టిమాయాగుణంబులనాత్మలోన। బాల్యకౌమారయౌవనభావములను। నరసురపర్వాదిమూర్తులఁ బొరసియేను। నాయదిదియను సంసారమాయఁదగిలి॥ వ॥ వర్తించుచు నిట్లున్న జీవునికి భగవద్భక్తియోగంబున ముక్తి సంభవించుటయెట్లనిన నెప్పుడేని జీవుండు ప్రకృతిపురుషాతీతంబగు బ్రహ్మస్వరూపంబునందు మహితధ్యాననిష్ఠుండగు నప్పుడు విగతమోహుండై యహంకారమమకారాత్మకంబయిన సంసరణంబుం దొఱంగి ముక్తుండై యుండు; మఱి జీవేశ్వరులకు దేహసంబంధంబులు గానంబడుచుండునట్టి దేహధారియైన భగవంతునందు భక్తిం జేసి జీవునకు ముక్తి యెత్తెఱంగున గలుగు నని యడిగితివి జీవుం డవిద్యామహిమం జేసి కర్మానుగతంబయిన మిథ్యారూపదేహసంబంధుండు భగవంతుండు నిజయోగమాయామహిమంబున స్వేచ్ఛాపరికల్పితచిద్ఘనలీలావిగ్రహుండుగాన భగవంతుండగు నీశ్వరుండు స్వభజనంబు ముక్తిసాధనంబని చతుర్ముఖునకుఁ దదీయనిష్కపటతపశ్చర్యావిశేషంబయిన నిజజ్ఞానానందఘనంబయిన స్వరూపంబు సూపుచు నానతిచ్చెనదిగావున జీవునికి భగవ

### శ్రీమన్నారాయణుండు బ్రహ్మతపంబునకు మెచ్చి వరంబు లిచ్చుట.

ద్భక్తి మోక్షప్రదాయకంబగు నిందులకొక యితిహాసంబు గల దెఱింగింతు నాకర్ణింపుము; దానభవదీయసంశయనివృత్తియయ్యెడు ననిశుకయోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె॥ సీ॥ హరిపాదభక్తిరహస్యోపదిష్టయనఖిలదేవతలకు

* సత్త్వాదిగుణంబుల॥ సత్త్వగుణ-రజోగుణ-తమోగుణములయొక్క పరిణామంబులగు వికారంబులైన.— ‡ కకుబ్వ్యోమ॥ కకుప్। దిక్కులు-వ్యోమ। ఆకాశము.— ¶ సరిత్। నది.— § బాహ్యాభ్యంతరంబులం। వెలుపలలోపల.— † ఆచరణీయంబులు। ఆచరింపఁదగినవి.

నధివిభుండు। నైనవిధాతకల్పాదియందునునిజాశ్రయపద్మమునకధిష్ఠానమరయ। నర్థించిజలములనన్వేషణముసేసినతి నంబుమొదలుగానంగలేక। విసివిబ్రహ్మయనుదన్ముసరుహాసీనుండై సృష్టినిర్మాణేచ్ఛంజిత్తమందుంజాలనూహించితత్త్వ విజ్ఞానమహిమ। నరణిమననమునందోఁపకజడనుపడుచు। లోకజాలంబుపుట్టింపలేక మోహి। తాత్ముండై చింతనొందున య్యవసరమున.వ॥జలమధ్యంబుననుండియక్షరసమామ్నాయంబునస్పర్శంబులందుషోడశాక్షరంబుమఱియునేకవింశా క్షరంబునైననీయక్షరద్వయంబువలననగుచుమహాముని జనధనంబయినతపయనుశబ్దంబు రెండుమాఱులుచ్చరింపంబడి వినంబడిననట్టిశబ్దంబువలికినపురుషునివీక్షింపంగోరినలుదిక్కులకుం జని వెదకియెందునుంగానక మఱలినిజస్థానంబయినప ద్మంబునందాసీనుండై యొక్కించుకచింతించి య[illegible]ంబుదన్నుఁదపంబుసేయుమనినియమించుటగాఁదలంచి-ప్రాణా యామపరాయణుండైజ్ఞానేంద్రియకర్మేంద్రియంబులంజయించియేకాగ్రస్వాంతుండై సకలలోకసంతాపహేతువగు తపంబు వేయిదివ్యవత్సరంబులుగావింప నీశ్వరుండుప్రసన్నుండై పొడసూపినకమలసంభవుండుదక్షిణంబరాజస తామసమిశ్రసత్వగుణాతీతంబు,శుద్ధసత్వగుణావాసంబు,నకాలవిక్రమంబు,సర్వలోకోన్నతంబు,సకలసురగణస్తుత్యం బు,లోభమోహభయవిరహితంబు,నపునరావృత్తిమార్గంబు,ననంతతేజోవిరాజితంబునైన వైకుంఠపురంబుంబొడగని యందు॥సీ॥సూర్యచంద్రానలస్ఫురణలంజొరనీకనిజదీధితిస్ఫూర్తినివ్వటిల్ల। దివ్యమణిప్రభాదీపితసౌధవిమానగోపుర హర్మ్యమంటపములం।బ్రసవగుచ్ఛస్వచ్ఛభరితకామితఫలసంతానపాదపసముదయములం।గాంచనదండసంగతమాగు శోద్ధూతతరళవిచిత్రకేతనచయములు। వికచకైరవపరదరవిందగతము। రందరసపానమోదితేందిందిరప్రభూతమంజు లనినదప్రబుద్ధరాజ। హంసశోభితవరకమలాకరములు॥. సీ॥ వలనొప్పఁగానదైవంకేశవాత్పరంబనిపల్కు-రాజకీరావళి యును।మహిమసర్వంవిష్ణుమయమనుజగత్తనిచదివెడుశారికాసముదయంబు। నేపారఁగాజితంతేపుండరీకాక్షయనిలీలం బాడుపికావళియును। లలిమీఱఁగామంగళమధుసూదనయనిపల్కు-కేకులనారతంబు।సవిలక్రౌంచషట్పదకేళ్యాతిశ బ్దకలితముగమ్రోయుమధుపనికాయములును।గలిగియక్షులైకదివ్యమంగళవిలాసమహిమంజెన్నొందువైకుంఠమందిరం బు॥. వ॥ మఱియుంబయోధరావళీవిభాసితనభంబుంబోలె వెలుంగుచున్నయద్దివ్యధామంబునందు॥. సీ॥ సలిలతేంది వరశ్యామాయమానోజ్జ్వలాంగులునవ్యపీతాంబరులును। ధవళారవిందసుందరపత్రనేత్రులుసుకుమారితనులుభాసుర వినూత్న।రత్నవిభూషణ* గ్రైవేయకంకణహారకేయూరమంజీరధరులు। నిత్యయౌవనులువినిర్మలచరితులురోచిష్ణులు సుహరిరూపధరులు। నగునునందుండునందునఁడునన్దుమలుండు। ప్రబలుఁడును మొదలగునిజపార్శ్వచరులు।మఱియువైదూ ర్యవిద్రుమామలమృణాళ। తుల్యగాత్రులుదనుభక్తితోభజింప॥. సీ॥ ఘనశితాఖిలకల్మషవ్రజామరనదీజనకకోమలప దాబ్జములవాని। నఖిలసంపత్కారణాపాంగలక్ష్మీవిలాసితవక్షస్థలంబువాని। బహ్మమిత్రామిత్రభాసురలోచనునళిన సుందరవదనంబువాని। భువననిర్మాణనైపుణభవ్యనిజజన్మకారణనాభిపంకజమువాని। నహిహితాహితశయనవాహ నమువాని। సేవితామరతాపసశ్రేణివాని।నఖిలలోకంబులకుగురుండయినవానిం।గాంచెంబరమేష్ఠిగన్నులకఱవుదీఱ॥. క॥ కమనీయరూపరేఖా।రమణీయతఁజాలనొప్పరమణీమణియ। కమలాలయదనకృముకర।కమలంబులవిభునిపాద కమలములొత్తఁ॥వెండియు॥. శా॥ శ్రీకాంతాతిలకంబురత్నరుచిరాజిప్రేంఖితస్వర్ణడో।లాకేళిస్థలసింపఁదక్కుచ భరాలంకృత్రస్రీగామోదలో। భాకీర్ణప్రచరన్మధువ్రతమనోజ్ఞాలోలనాదంబుల।స్తోకానుస్వరలీలనొప్పఁగసిజేశుస్వే చ్ఛతోఁబాడఁగాఁ॥. అట్టినిత్యవిభూతియందు॥. మ॥ సతతజ్ఞానరమాయశోబలమహైశ్వర్యాదియుక్తుఁజగత్పతియ జ్ఞేశునసనంతునచ్యుతుదళత్పంకేరుహాక్షుంశ్రియః। పతినాద్యంతవికారదూరుఁగరుణాపాథోనిధింసాత్వతాం।పతివర్ధి ష్ణుసహిష్ణువిష్ణుగుణవిభ్రాజిష్ణురోచిష్ణునిఁ॥. మ॥ దరహాసామృతపూరితాస్యునిజభక్తత్రాణపారాయణుం।దరుణాం భోరుహపత్రలోచనునిఁబీతాచ్ఛాదనుఁలోకసుం। దరుమంజీరకిరీటకుండలముఖోద్యద్భూషుయోగీశ్వరేశ్వరులక్ష్మీ యుతవక్షుంజిన్మయుదయాసాంద్రుఁజతుర్బాహునిఁ॥. వ॥ మఱియుశీననర్ఘరత్నమయసింహాసనాసీనుండు,సునం దనందకుముదాదిసేవితుండుం,బ్రకృతిపురుషమహదహంకారంబులును,జతుశ్శక్తులుం,గర్మేంద్రియజ్ఞానేంద్రియమనో మహాభూతంబులనుషోడశశక్తులుం,బంచతన్మాత్రంబులును బరివేష్టింపంగోట్యర్కప్రభాభాసితుండునై స్వేతరాల భ్యస్వాభావికసమస్తైశ్వర్యాతిశయుండునై స్వస్వరూపంబునంగ్రీడించుసర్వేశ్వరుండై నపరమపురుషుంబుండరీకా

* గ్రైవేయము।కంఠాభరణము-హార।ముత్యాలహారము-కేయూర।భుజకీర్తులు-మంజీర।అందెలు,—— ఘనఅనర్ఘ।వెలలేని.

యుఁ నారాయణుం జూచి సాంద్రానందకందళితహృదయారవిందుండు రోమాంచకంచుకితశరీరుండు నానందబాష్పధారా*సిక్తకపోలుండు నగుచు॥ క॥ వరపరమహంసగమ్యా। స్ఫురణాదనరారుపరమపురుషునిపదపం। కరుహములకు నజుఁడు చతు। శ్శిరములు సోఁకంగ నతులు సేసిన హరియున్॥ చ॥ ప్రియుఁడగు బొడ్డుదమ్మితొలుబిడ్డఁడు వేలుపుపెద్ద భూతసం। చయములఁ జేయుకర్తనిజశాసనపాత్రుఁడు ధాత మ్రొక్కినన్। దయ దళుకొత్తఁ బల్కె ¶ బ్రమదస్మితచారుముఖారవిందుఁడై। నయమునఁ బాణిపంకజమునన్ హరి యాతని దేహ మంటుచున్॥ ఇట్లనియె॥ గీ॥ కపటమునులకెంతకాలంబునకు నైన। సంతసింప నేను జలజగర్భ। విరతపస్సమాధిఁ జెందివిసర్గేచ్ఛ। మెలఁగు నిన్నుఁ బరిణమింతుఁ గాని॥ గీ॥ భ్రమసుఁ గాక నీకు నోపద్మగర్భ। వరము నిపుడిత్తు నెఱిఁగింపు వాంఛితంబు। దేవదేవుఁడ నగు నస్మదీయపావ। దర్శనంబవధి విపత్తిదశలకనఘ॥ చ॥ సరసిజగర్భ నీయెడఁ బ్రసన్నత నొందితి మదీయలోకమే। నిరవుగఁ జూపు టెల్లను నహేతుకభూరిదయాకటాక్షవి। స్ఫురణను గాని నీదగు తపోవిభవంబునఁ గాదు నీ తప। శ్చరణము నాదువాక్యములసంగతిఁ గాదె సరోజసంభవా॥ క॥ తపమనఁగ నాదు హృదయము। దపమున నద్రూపమునఘధర్మముఁ దపమా। దపమున నే జననస్థి। త్యుపసంహారణములొనర్చుచుండుదుమఁద నయా॥ క॥ కావున మద్భక్తికిఁ దప। మే విధమున మూలధనము నిది నీమదిరా। జీవభవ యెఱిఁగి తపమిటు। గావించుట విగతమోహకర్ముఁడవింకన్॥ క॥ అనియానతిచ్చి కమలజ। యెనయఁగ భవదీయమాన సేప్సిత మేమై। నను నిత్తు వేఁడుమా నినను। వనరుహసంభవుఁడు వికచవదనుండగుచున్॥ చ॥ హరివచనంబులాత్మకుఁ బ్రియంబొనరింపఁ బయోజగర్భుఁ డో। పరమపదేశ యోగిజనభావనయా నిఖిలోర్వియందు నీ। వరయ నియట్టి యర్థ మొకఁడైనను గల్గునె యైన నా మది। న్నెరసిన కోర్కెఁ దేప వినుపింతుఁ దయామతిఁ జిత్తగింపవే॥ వ॥ దేవా సర్వభూతాంతర్యామివై భగవంతుండవైన నీకు నమస్కరించి మదీయవాంఛితంబు విన్నవించెద నవధరింపుము అవ్యక్తరూపంబులై వెలుంగు భవదీయస్థూలసూక్ష్మరూపంబులు నానాశక్త్యుపబృంహితంబులయిన బ్రహ్మాదిరూపంబుల నీ యంత నీవే ధరియించి జగదుత్పత్తిస్థితిలయంబులం దంతుకీటంబునుం బోలెఁ గావించుచు నమోఘసంకల్పుండవై లీలావిభూతిం గ్రీడించుమహిమంబుఁ దెలియునట్టి పరిజ్ఞానంబుఁ గృప సేయుము భవదీయశాసనంబున జగన్నిర్మాణంబుఁ గావించునపుడు బ్రహ్మాభిమానంబునం జేసి యవశ్యంబును మహదహంకారంబులు నామదిం బొడముం గావునఁ దత్పరిహారార్థంబు వేఁడెద నన్నుం గృపాదృష్టి విలోకించి దయ సేయుము నివిన్నవించిన నాలించి పుండరీకాక్షుండ తనికిట్లనియె॥ క॥ వారిజభవ శాస్త్రార్థవి। చారజ్ఞానమును భక్తిసమధిక సాధ్యా। చారములను నీమూఁడును। దారతనీమనమునం దుధరియింపనగున్॥ సీ॥ పరికింప మత్స్వరూపస్వభావములును మహిమావతారకర్మములు దెలియు। తత్త్వవిజ్ఞానంబు పలకొనిమత్ప్రసాదమునఁ గల్గెడి నీకుఁ గమలగర్భ। సృష్టిపూర్వమునఁ జర్చింప నే నొకరుండ గలిగి యుండుదు మవీతకర్మనగుచు। సమధికస్థూలసూక్ష్మస్వరూపములుఁ దత్కారణప్రకృతియుఁ దగ మదంశ। మందు లీనమైన నద్వితీయుండనై। యుందు నాకు నన్య మొకటి లేదు। సృష్టికాలమందు సృష్టినాశంబున। జగము మత్స్వరూపము గును వత్స॥ క॥ అరయఁగఁ గల్పప్రళయాంత। తరమున నాద్యంతవిరహితక్రియతోడన్। బరిపూర్ణనిత్యమహిముం। బరమాత్ముఁడనై సరోజభవ యేనుందున్॥ వ॥ అదియునుం గాక నీవు నన్నడిగిన యీ జగన్నిర్మాణమాయాప్రకారం బెఱింగింతు లేని యర్థంబు శుక్తిరజతభ్రాంతినియేమిటిమహిమందోఁచి క్రమ్మఱందోఁచకమానునిదియె మదీయమాయావిశేషంబని యెఱుంగుము ఇదియునుం గాక లేనియర్థంబు దృశ్యంబగుటకుం గలయర్థంబు దర్శనగోచరంబు గాకుండుటకును ద్విచంద్రాదికంబును దమఃప్రభాసంబును దృష్టాంతంబులుగాఁ దెలియుమే ప్రకారంబున నేమి ‡మహాభూతంబులు §భౌతికంబులయిన ఘటపటాదులందుం బ్రవేశించియుండు నా ప్రకారంబున నేను నీ భూతభౌతికంబులయిన సర్వకార్యంబులందు సత్త్వాదిరూపంబులం బ్రవేశించియుండుదు భౌతికంబులు భూతంబులయందుఁ గారణావస్థం బొందుచందంబున భూతభౌతికంబులు గారణావస్థం బొందిన నాయందు నభివ్యక్తంబులై యుండవు సర్వదేశంబులయందును సర్వకాలంబులయందు నేదిబోధితంబై యుండునట్టిదయ పరబ్రహ్మస్వరూపంబు తత్త్వం బెఱుంగ నిశ్చయించిన మిముబోఁటివారలకు నీ చెప్పినదిమదీయతత్త్వాత్మకంబయిన యర్థంబని యెఱుంగుమరీయర్థంబుత్కృష్టంబయిన యది యేకాగ్రచిత్తుండవై యాకర్ణించి భవదీయచిత్తంబున ధరియించిన నీకు సర్గాదికర్మంబులందు మోహంబు చెందకుండెడిని భగవంతుండయిన పరమేశ్వరుండు చతుర్ముఖున కాజ్ఞాపించి నిజలోకంబు

*సిక్తకపోలుండు। తడుపఁబడిన చెక్కిళ్లు గలవాఁడు.—¶ప్రమదస్మితచారు॥ ప్రమద। సంతోషముతోఁ గూడిన-స్మిత। చిఱునవ్వుతోఁ గూడిన-చారు। సుందరమైన.—‡మహాభూతంబులు। భూమి-జలము-అగ్ని-వాయువు-ఆకాశము.— §భౌతికంబులైన। ఆభూతములవల్లఁ గలిగిన.

తో నంతర్ధానంబు నొందె నని చెప్పి శుకుండు వెండియు నిట్లనియె॥ సీ॥ అవనీశ బ్రహ్మయు ట్లంతర్హితుం డైనఁ బుండరీకాక్షుని
బుద్ధి నిలిపి। యానందమునుఁ బొంది యంజలి గావించి తత్పరిగ్రహమునఁ దనము బుద్ధి। నైకొని పూర్వప్రకారంబునను సమస్త
ప్రపంచం బెల్లఁ దగ సృజించి। మఱియొక నాఁడు ధర్మప్రవర్తకుఁ డౌచు నఖిలప్రజాపతి యైన కమలగర్భుఁ డాత్మహితార్థమై
కాక సకల। భువనహితబుద్ధి నున్నతస్ఫురణ మెఱసి। మానితంబైన యమనియమముల రెంటి। నాచరించెను సమ్మోదిదాత్ము
డగుచు॥ అయ్యవసరంబున॥ క॥ *అనలినాసననందను। లైన సనందాదిమునులక**గ్రేసరుఁడు। న్నానుఁగఁ బ్రియతనుజుండగు।
నా నారదుఁ డేఁగుదెంచె నబ్జజుకడకున్॥ క॥ చనుదెంచి తండ్రికిం బ్రియ। మొనరఁగ శుశ్రూషణంబు లొగిఁ జేసిన చోఁ। దన డె
సం ప్రసన్నుఁ డగుటయుఁ। గని భగవన్మాయఁ దెలియఁ గా నుత్సుకుఁడై॥ సీ॥ అవనీశ నీవు నన్నడిగిన పగిది నతఁడు దండ్రి నడుగఁ
బితామహుండు। భగవంతుఁ డాశ్రితపారిజాతము హరి కృపతోడఁ దన కెఱింగించినట్టి। లోకమంగళ చతుశ్శ్లోకరూపంబును
దశలక్షణంబులఁ దనరు భాగ।వతము నారదునకు న్నతిఁ జెప్పె నాతఁడు చారుసరస్వతీతీరమునను। హరిపదధ్యానపారీణుఁ
డాత్మవేది। ప్రకటతేజస్వి యగు ***బాదరాయణునకుఁ। గోరి యెఱింగించె నమ్మహోదారుఁ డెలమి। నాకు నెఱిఁగించె నెఱిఁ
గింతు నీకు నేను॥ వ॥ అదియునుం గాక యిపుడు విరాట్పురుషునివలన నీ జగంబు లేవడువునఁ బొడమె నని యడిగిది మొదలయిన
కొన్ని ప్రశ్నలు నన్నడిగితివి యేను నన్నింటికి నుత్తరంబగునట్లుగా నమ్మహాభాగవతం¶బు పన్యసించెద నాకర్ణింపు మమ్మహా
పురాణంబు చతుశ్శ్లోకరూపంబును, దశలక్షణంబుల సంకుచితమార్గంబుల నొప్పు; నందు దశలక్షణంబు లెయ్యవి యనిన స
ర్గంబు, విసర్గంబు, స్థానంబు, పోషణంబు, ఊతులు, మన్వంతరంబు, ఈశానుచరితంబు, నిరోధంబు, ముక్తియు, నాశ్రయంబు,
ననంబది తెఱంగులయ్యె. దశమవిశుద్ధ్యర్థంబునకుఁ దక్కిన తొమ్మిది లక్షణంబులు సెప్పంబడు నవి యెట్టి వనిన॥ గీ॥ మహదహం
కార §పంచతన్మాత్ర గగన। పవనశిఖితోయభూభూతపంచకేంద్రి।య ప్రపంచంబు భగవంతునందు గనుట। సర్గమందురు దీని
నిజనవరేణ్య॥ క॥ సరసిజగర్భుండు విరా।ట్పురుషునివలన న్జనించి భూరితర చరా। చరభూతసృష్టిఁ జేయుట। బరువడి ని విసర్గ
మంత్రు భరతకులేశా॥ శా॥ లోకద్రోహినరేంద్రా। నీకముఁ బరిమార్చి జగము నెఱి నిల్పిన యా। వైకుంఠనాథకృతవిజ।యా
కల్పము స్థానమయ్యె నవనీనాథా॥ క॥ హరి సర్వేశుఁ డనంతుఁడు। నిరుపమశుభమూర్తి చేయు నిజభక్తజనో। ద్ధరణము పో
షణమవనీ। వరయూథులనంగఁ గర్మవాసనలరయన్॥ గీ॥ జలజనాభదయాకటాక్షప్రసాద। లబ్ధి నఖిలైక లోకపాలకవి
భూతి। మహిమఁ బొందినవారి ధర్మములు విస్తరమునఁ బలుకుట మన్వంతరములు భూప॥ క॥ వనజోదరునవతారక। థన
ముఁ దదీయానువృత్తిఁ దచ్చారిత్రం। బును విస్తరించి పలుకం। జను నవి యీశానుకథలు సౌజన్యనిధీ॥ సీ॥ వసుమతీనాథ సర్వ
స్వామి యైన గోవిందుండు చిదచిదానందమూర్తి। సలలితస్వోపాధిశక్తిసమేతుఁడై తనరారు నాత్మీయధామమందు। ఫణి
రాజమృదులతల్పంబుపై సుఖలీల యోగనిద్రారతి నున్నవేళ। నఖిలజీవులు నిజవ్యాపారశూన్యులై యున్నతి తేజంబు
లుఱులుగొనఁగ। జంగమస్థావరాదిచేష్టాదులెల్ల। విదితమగునట్లు వలుకుట యది నిరోధ। మన నిది యవాంతర ప్రళయంబ
నంగఁ బరగు నీకముక్తిగతి వినుపార్థివేంద్ర॥ సీ॥ జీవుండు భగవత్కృపావశంబునఁ జేసి దేహధర్మంబులై ధృతిని నేక।
జన్మానుచరితదృశ్యములైన యజ్జరామరణంబు లాత్మధర్మంబు లయిన। ఘనపుణ్యపాపని కాయసర్గోచన స్థితి నొప్పి పూ
ర్వసంచితము లైన। యపహతపాప్మవత్త్వాదృష్టతద్గుణవంతుఁడై తగ భగవచ్ఛరీర।భూతుఁడై పారతంత్ర్యాత్మబుద్ధి నొ
ప్పి। దివ్యమాల్యానులేపనభవ్యగంధ। కలితమంగళదివ్యవిగ్రహవిశిష్టుఁ। డగుచు హరిరూపమొందుమోయనఘముక్తి॥ వ॥ మ
ఱియు నుత్పత్తిస్థితిలయంబు లెందు ననగుచుఁ బ్రకాశింపఁబడు నదియాశ్రయంబనంబడు నదియ పరమాత్మ బ్రహ్మశబ్దవా
చ్యంబు-నదియ ప్రత్యక్షానుభవంబున విదితంబు సేయుకొఱకు నాత్మ కాధ్యాత్మ్యాదివిభాగంబు సెప్పంబడియె నది యె
ట్లనిన నాత్మయాధ్యాత్మికాధిదైవికాధిభౌతికంబులఁ ద్రివిధంబయ్యె నందు నాధ్యాత్మికంబు చక్షురాదిగోళకాంతర్వర్తి
యై యెఱుంగఁబడు చక్షురాదికరణాభిమానియై ద్రష్టయైన జీవుండె యాధిదైవికుం డనఁ దగుఁ జక్షురాద్యధిష్ఠానాభిమాన
దేవతలైన సూర్యాదితేజోవిగ్రహుండు నగుచు నెవ్వనియందు నీయుభయవిభాగంబునుం గలుగు నతండె యాధిభౌతికుం
డు విరాడ్విగ్రహుండు నగుం గావున †ద్రష్టయు దృక్కు దృశ్యంబు ననందగు నీమూఁటియందు నొకటి లేకున్న నొకటి గాన
రాదీ త్రితయంబు నెవ్వఁ డెఱుంగు నతండు సర్వలోకాశ్రయుండై యుండు నతండె పరమాత్మ యనమ్మహాత్ముండు లీలా

* అనలినాసనభు। అబ్రహ్మయొక్క.— ** అగ్రేసరుఁడు। పెద్దవాఁడు.— *** బాదరాయణుఁడు। వ్యాసుఁడు.— ¶ ఉపన్యసించెదన్। చెప్పెదను.— § పంచతన్మాత్ర। శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములు.— † ద్రష్టయు। చూచేవాఁడు-దృక్కు। చూపు-దృశ్యం। చూడఁదగిన విషయము.

దేవుఁడు వృష్ణికులప్రదీపకా॥ శా॥ కందర్పాంశమునం దనూజుఁ బడయంగా మించి భూదేవతా। బృందంబుం భజియించి త
త్కరుణఁ దీపింపం బ్రభావంబు పెం। పొందం రుక్మిణి గన్న నందనుఁడు ప్రద్యుమ్నుండు భాస్వచ్ఛమా। సందోహంబులుద
న్నుఁగొల్వ నహితోత్సాహంబున న్మించునే॥ క॥ సరసిజలోచనకరుణా।పరిలబ్ధసమస్తధరణిపాలనమహిమం। బరమప్రీ
తిసుఖించునె। చిరవిభవోదారుఁ డుగ్రసేనుఁడు జగతిన్॥ చ॥ లలితపతివ్రతామణివిలాసవతీతిలకంబు పార్వతీ।లలనకుమా
రుఁగన్నగతిం లక్షణజాంబవతీలలామ ని।ర్మలగతిఁ గన్నపట్టి సుకుమారతనుండు విరోధిభంజనో। త్కలికసుఖించునే గుణక
దంబుఁడు సాంబుఁడు వృష్ణిపుంగవా॥ క॥ హరిపదసేవకుఁ డరిభీ।కరుఁ డర్జునువలన మిగులఁ గార్ముకవిద్యల్। డిరముగఁ గఱచి
న సాత్యకి।వరసుఖవిభవములనున్నవాఁడె ధరిత్రిన్॥ మ॥ జలజాతాంకుశచక్రచాపకులిశచ్ఛత్రాదిరేఖాంకితో। జ్జ్వల
గోవిందపదాబ్జలక్షితవిరాజన్మార్గధూళిచ్ఛటా। కలిదాంగుండు విధూతకల్మషుఁడు నిష్కామైకధన్యుండు స। త్కులజా
తుండన నొప్పునట్టిఘనుఁ డక్రూరుండు భద్రాత్ముఁడే॥ క॥ శ్రుతులును గ్రతుజాతములు। న్మతిఁ దాల్చినయట్టి వేదమాతగ
తిన్ శ్రీ।పతిఁ దనగర్భంబునను। క్షితిఁ జేసిన గరిత దేవకీసతి సుఖమే॥ వ॥ మఱియు మహాత్మ్యమహితోపాసకులగు వారలకో
ర్కులు నిండింపం జాలిన పరమేశ్వరుండు శబ్దశాస్త్రంబునకుం గారణంబని తన్ను నఖిలదేవతాజనంబులగ్గింపంగల మేటి
యగుటం జేసి మనోమయుండును సకలజీవ చతుర్విధాంతఃకరణంబులకుం జిత్తాహంకారబుద్ధిమనంబులకుం గ్రమంబున
వాసుదేవసంకర్షణప్రద్యుమ్నానిరుద్ధులధిదైవతంబులగు మఱట్టి చతుర్విధతత్త్వంబులకుం ‡తుర్యంబయిన తత్త్వంబగు నని
రుద్ధకుమారుండును సంతోషచిత్తుండగునే యని॥ మ॥ ఇతరారాధనబుద్ధి మాని కమలాధీశుం బయోజాసనా। ర్చితుఁ గృష్ణుం
నిజనాథుఁగా సతతముం సేవించు పుణ్యుల్ జగ।న్నుతులధ్యాత్మవిముల్ మహాభుజులు మాన్యుల్ ధర్మమార్గస్థుల్ సుము। న్నత
త్యాత్మజచారుదేష్ణగములానందాత్ములే యుద్ధవా॥ గీ॥ క్రోధమాత్సర్యధనుఁడు సుయోధనుండు। వోలుచు నెవ్వని సభఁ జూ
చి కలుషమొదవి। మనములోన నసూయానిమగ్నుఁ డయ్యె।నట్టి ధర్మజుఁ డున్నాఁడె యనఘచరిత॥ గీ॥ ఘనగదాభ్యాసవిశ్ర
సంగతుల మెఱసి। కురుకుమారుల భూరిసంగరములోన। హతులఁ గావించి వెలసిన యట్టి జెట్టి। వాయుతనయుండు గుశలియై
వఱలునయ్య॥ చ॥ హరికరుణాతరంగితకటాక్షనిరీక్షణలబ్ధశౌర్యవి। స్ఫురణ దనర్చి తన్ను *ననిబోయగతిం గిరిశుం డెదిర్చి
న।న్నరవసమొప్పఁగా గెలిచి పాశుపతాస్త్రముఁ గొన్న శత్రుభీ।కరుఁడు ధనంజయుండు సుభగస్థితి మోదము నొందుచుం
డునే॥ మ॥ తెరఁగొప్పం జననీవియోగమునఁ గుంతీస్తన్యపానంబు సో।దరసంరక్షయుఁ గల్గి దేవవిభువక్త్రస్థామృతంబుం
ఖగేశ్వరుఁ డర్థిం గయికొన్నమాడ్కి గురువంశశ్రేణి నిర్జించి త।ద్ధరణీరాజ్యముఁ గొన్న మాద్రికొడుకుల్ ధన్యాత్ములే యుద్ధ
వా॥ గీ॥ పాండుభూమీశ్వరుండు సంప్రాప్తమరణుఁ।డైన శిశువులఁ బ్రోచుటకై నిజేశు। గూడి చనకున్నయట్టి యాకుంతి
భోజ।తనయ జీవించునే నేఁడు మనుచరిత్ర॥ అని వెండియు॥ మ॥ అనుజాతుండగు పాండుభూమిభుఁడు §నిర్యాణంబునుం బొం
దనా।తని పుత్రుల్ దనుఁ జేరవచ్చినను మధ్యస్థంబుఁ బోఁదట్టి యో।గ్గొనరించెం ధృతరాష్ట్రభూమివిభుఁ డెట్లూహింపఁగా నె
గ్గుసేసిన వాఁడే యగుఁగాక మేలుగలదే చింతింపఁగా నుద్ధవా॥ క॥ అనుజుఁడని యనక తననిజ। తనయులనను వెడలనడువఁ
జానూరకయుం।డిన ధృతరాష్ట్రుఁడు నరకం।బునఁ బడు నాదైన దుఃఖమున ననఘాత్మా॥ వ॥ అదియునుం గాక పరమజ్ఞా
నుండవైన నీమనంబున దుఃఖంబు కర్తవ్యంబు గాదంటి వేని॥ క॥ నరలోకవిడంబనమున। హరిపరమపురుషుండు మానవాకృ
తోని।ద్ధరఁ బుట్టి యాత్మమాయా।స్ఫురణన్ మోహింపఁ జేయు భూజనకోటిన్॥ ఉ॥ కావున నమ్మహాత్ము నవికారవిదూరు నిసర్వ
మోహమా। యావిలమానసుండ నగు నప్పుడు సంసృతి దుఃఖినౌ మన। ద్దేవుని సత్కృపామహిమఁ దేరిన వేళ సుఖింతు నేన
కా। దా విధిశంకరప్రభృతు లవ్విభుమాయఁ దరింప నేర్తురే॥ వ॥ అయిన నమ్మహాత్ముని కరుణాతరంగితాపాంగ పరిలబ్ధవిజ్ఞా
నదీపాంకురనిరస్తసమస్తదోషాంధకారుండ నగుటఁ జేసి మదీయచిత్తంబు హరిపరాయత్తంబై తన్మార్గంబు సతతంబు నిరీక్షిం
పుచునుండు మఱియును॥ సీ॥ అట్టి సరోజాక్షుఁ డాత్మీయపదభక్తు లడవుల నిడుములఁ గుడుచుచుండ। ¶దౌత్యంబు సేయఁ గొం
దఱు విరోధులు హరిఁ బద్ధునిఁ జేయ సన్నద్ధులైన। బలహీనుమాడ్కి మార్పడఁగ లేఁ డసమర్థుఁ డని తలంచెద వేని యచ్యుతుండు।
పరులఁ జయింపనోపక కాదు మిథ్యాభిజాత్యధనంబుల జగతిఁ బెక్కు। బాధలఁ గలంచు మత్తభూపతుల నెల్ల। సైన్యయుక్తులుగా
ననిసంహరించు।కొఱకు సభలోన నప్పు డా కురుకుమారు।లాడు దుర్భాషణములకు నలుఁగఁ డయ్యె॥ మ॥ జననం బంచుట లేని
యీశ్వరుఁడు దా జన్మించు టెల్ల న్విరోధి†నిరాసార్థము వీతకర్ముఁ డగు నద్దేవుండు గర్మప్రవ। ర్తనుఁ డౌ టెల్లఁ జరాచరప్ర

‡తుర్యంబు।అతీతము—*అని।యుద్ధము— §నిర్యాణము।మరణము—¶దౌత్యము।దూతకృత్యము.— †నిరాసార్థము।సంహారనిమిత్తము.

కటభూతశ్రేణులన్నర్మవర్తనులం జేయఁ దలంచి శాకకలవే దైత్యారికిం గర్మముల్ ॥ క॥ హరి నరులకెల్లఁ బూజ్యుఁడు। హరి లీ
లామనుజుఁడును గుణాతీతుండై। పరఁగిన భవకర్మంబులఁ। బొరయం డట హరికిఁ గర్మములు లీలలగుటన్॥ క॥ మదిఁ దన శాసనమి
డి నిజ। పదములు సేవించు లోకపాలాదులు పెం। పొదవింప యదుకులంబున। నుదయించెను భువిని బలసహాయాదరుఁడగు
చున్॥ గీ॥ చలనమందక *భూరిసంసరణతరణ। మైన సత్కీర్తి దిక్కులనతిశయిల్లి। వరలసమమతిరైయె యున్నవాఁడె కృష్ణుఁ। డ
నుచు నుద్ధవుని విదురుఁ డడుగుటయును॥ ఇట్లడుగ నయ్యుద్ధవుండు॥ క॥ యదుకులనిధియగు కృష్ణుని। పదజలజవియోగతాపభ
రమున మాటల్। ప్రిదులక హృదయం బెఱియఁగఁ। బెదవులు దడుపుచును వగలఁ బెంపఱియుండెన్॥ క॥ అని చెప్పి బాదరాయ
ణి। మనుజేంద్ర నివలనఁ జూచి మఱి యిట్లనియెన్। విను మొకనాఁ డీయుద్ధవుఁ। డనయము నైదేండ్ల బాలుఁడై యున్న తఱిన్॥
వ॥ మున్ను కృష్ణునిఁ గూడియాడు బాలకులలో నొక్క బాలునిఁ గృష్ణునిఁ గా భావించి పరిచర్య సేయుచుండ గుణవతీ§మతల్లి
యగు తల్లి చనుదెంచి యాకొంటివి దియేల రావన్న యని పిలిచిన జననీవాక్యంబులు గైకొనక యఖండ తేజోనిధియైన పుండ
రీకాక్షు పాదారవింద సేవానురక్తిం జేసి యున్న యుద్ధవుండు నేఁడు కృష్ణవియోగతాపంబున హరివార్త విదురునకుఁ జె
ప్పంజాలక యుండుట యేమి విచిత్రంబని వెండియు నిట్లనియె నంత నుద్ధవుండు సరోజాక్షు పాదారవింద మకరంద సుధాజలని
ధి నిమగ్నమానసుండై సముత్కంఠం జింతించి యొక్క ముహూర్తమాత్రంబునకు బాష్పజలపూరితలోచనుండై గద్గద
కంఠుండగుచు॥ క॥ ఘనముగ నెమ్మనమున మిం। చిన కృష్ణవియోగజనితశిఖి దరికొనఁగాఁ। గనుఁగవఁ బెడ చేనొత్తుచుఁ। బెను
పొందిన ¶దురితశిఖరిభిదురున్ విదురున్॥ కనుంగొని యిట్లనియె॥ క॥ యముఁడను ఘనకాలభుజం। గము పుంగవ మొదిగిపట్టఁ
గా యదువంశో। త్తము చారిత్రము దత్కుశ। లము లేమని చెప్పుదును గలంగెడి మనమున్॥ సీ॥ మునిజన ముఖపద్మములు ముకు
ళింపంగ ఖలజన లోచనోత్పలము లలర। జారచోరుల కోర్కి సఫలత నొందంగ దానవదర్పాంధతమస మడర। వరయోగిజన
చక్రవాకంబు లడలంగఁ గలుషజనానురాగంబు పర్వ। భూరిదోషాగమస్ఫూర్తి వాటిల్లంగ నుచితధర్మక్రియలుడిగి యడఁ
గ। మానుషాకారరుచికోటిమండపరుచి। యనఘ యేమన నేర్తుఁ గృష్ణాభిధాన లోకబాంధవుఁ డుత్తమ‡శ్లోకమూర్తి। మించు
తేజంబుతోన స్తమించె నయ్య॥ మఱియు॥ క॥ †హల◊కులిశ జలజరేఖా। లలిత శ్రీకృష్ణపాదలక్షితమైని ర్మలగతి నొప్పెడు
ధరణీలలనామణి నేఁడ భాగ్యలక్షణ యయ్యెన్॥ క॥ యాదవుల వలని రాజ్య। శ్రీ దొరఁగెను ధర్మగతి నశించెను భువిపా। ర్వా
దలు దప్పెన ధర్మో। త్పాదనమున దైత్యభేది దప్పిన పిదపన్॥ వ॥ మఱియు లలిత నికషణ విరాజమాన మణిగణకిరణ సుషమావి
శేష విడంబిత విమలసలిలంబులందుఁ బ్రతిఫలిత సంపూర్ణచంద్రమండలరుచి నిరీక్షించి జలచరబుద్ధిం జేసి తజ్జలవిలోలమీ
నంబులనూన స్నేహంబు నందలంచు చందంబునఁ గృష్ణానుచరులయిన యదువృష్ణికుమారు లమ్మహనీయమూర్తిం దమకు
నగ్రేసరుండని కాని లీలామానుషవిగ్రహుండయిన పరమాత్ముండని యెఱుంగక హరిమాయాజనితంబగు నసద్భావనం
బునం జేసి భోజనశయనాసనానుగమనంబులం జేరి సహోదరాదిభావంబులం గూడి చరియింతు రద్దేవుని మాయాప
యోనిధి నిమగ్నులు గాకుండ నబ్జభవాదులకైన నందీరదు. సత్వగుణగరిష్ఠులు సత్పురుషశ్రేష్ఠులునగు పరమభాగవతులకుం
దక్క నందక్కిన వారలం జెప్ప నేల; యదియునుం గాక యభిజన విద్యాధనబలగర్వమదాంధీభూత చేతస్కులయిన శిశుపా
లాదిభూపాలకు లమ్మహాత్ముని పరతత్త్వంబని యెఱుంగక నిందించు దుర్భాషలు దలంచి మనస్తాపంబు నొందుచుండుదు మన
ని వెండియు॥ మ॥ అవితృప్తేక్షణధీసమాహిత తపోవ్యాసంగులై నట్టిభా। గవతశ్రేష్ఠుల కాత్మమూర్తి నిఖిలైకజ్యోతి మైఁ
జూపి శో। కవిశోకంబులు నిగ్రహించి కమలాకాంతుండు శాంతుండుమా। నవరూపంబగు దేహముర్వ దలియంతర్ధానుఁడ
య్యెం జుమీ॥ సీ॥ మానవైక వికారమానమై తనకును విస్మయజనకమై వెలయునట్టి। యాత్మీయ యోగమాయాశక్తిఁ జేపట్టి
చూపుచు నత్యంత సుభగుఁడగుచు। భూషణంబులకును భూషణంబై వివేకముల కెల్లను పరాకాష్ఠయగుచు। సకలకల్యాణసం
స్థానమై సత్యమై తేజరిల్లెడునట్టి దివ్యమూర్తి। దానతనమూర్తి నిజశక్తిఁ దగ ధరించి। యమతనూభవు రాజసూయాధ్వరం
బునందు నెవ్వని శుభమూర్తి నర్థితోడ। నిండువేడుకఁ జూచి వర్ణించుచుండు॥ క॥ ప్రకటముగఁ గమలభవసృ। ష్టికిఁ గార
ణమి మ్మహాత్ముఁ డేయనుచును సు। త్సుకులై తన్మూర్తి నిద। ప్పక జూచిరి గాదె తత్సభాజను లెల్లన్॥ వ॥ మఱియు శాంతోగ్రరూ
పధరుండయిన సర్వేశ్వరుండు శాంతరూపుండు గావునఁ బరకృతాపరాధ నిపీడ్యమానమానసుండయ్యు ●ననుకంపాయ

---

* భూరిసంసరణతరణమైన। అపారమగు సంసారమును దాఁటించునదియైన.— §మతల్లి। శ్రేష్ఠురాలు.— ¶దురితశిఖరిభిదురున్। పాపములను పర్వతములకు వజ్రమువంటివాఁడయిన.— ‡శ్లోక। కీర్తి.— †హల। నాగలి.— ◊కులిశ। వజ్రము.— ○అభిజన। సద్వంశము. ●అనుకంప। కరుణ.

ర్తచిత్తుండైవర్తించుపరావరుండును, బ్రకృతికార్యంబైనమహత్తత్త్వరూపుండును, జననవిరహితుండయ్యును దారువు
లవలననలంబుదోఁచుచందంబున జననంబు నొందుచుండు నట్టిసరోజనాభునిహాసరాస లీలానురాగవిలోకనప్రతిలబ్ధ
మానలైనగోపకామినులుదన్మార్గిదర్శనానుషక్తమనీషలంగలిగివర్తించిరదియునుంగాక॥చ॥దివిజులకోర్కిదీర్పవసుదే
వునియింటజనించికంసదానవుఁడువధించునన్భయమునంజనినందునియింటనుంటకున్ । యవనజరాసుతాదులకునాజినె
దుర్పడలేకసజ్జన। స్తవమధురాపురిన్ విడిచిడాగుటకున్మదిఁజింతనొందుదున్॥అదియునుంగాక॥సీ॥కడఁగిపెక్కుఁడుములఁ
సుడుచుచుఁజిత్తముల్గలఁగఁగబంధనాగారములను।*వసరినదేవకీవసుదేవులనుడాయఁజనుదెంచిభక్తివందన మొనర్చి।త
లిదండ్రులారయేఁగలుగంగమీరలుగంసుచేనలజడిఁగ్రాఁగుచుండఁ। గడఁగిశత్రునిఁజంపఁగాలేకచూచుచు నున్ననాత
ప్పఁబ్రసన్నులగుచుఁ।గావుఁడనియానతిచ్చిన దేవదేవుఁ।నన్భుతావహమధురవాక్యములఁదలఁచి। తలఁచినాచిత్తమునఁ
బెద్దగలఁగుచుండుఁ। ‡బృథులపాతకభూమిభృద్భిదురవిదుర॥ క॥ విమలమతిఁదలప నెవ్వని।బొమముడిమాత్రమునఁనిఖల
భూదేవీభారమువాయునట్టిహరిపద।కమలమరందంబుఁగ్రోలుఘనుఁడెవ్వాఁడో॥క॥సుందప్రజ్ఞుఁడనై గో।విందునిముర
వైత్యహరునివిష్ణునిబరమా।నందునినందతనూజుని।మందరధరుఁజిత్తమునందుమఱతునెయెంచున్॥చ॥అదియునుఁగాకమీ
రున్నృపులందఱుచూడఁగధర్మసూతిపెం।పొదవినరాజసూయసవనోత్సవమందునుజన్మనాదిగాఁ।బదపడియెగ్గొనన్ప శిశు
పాలుఁడుయోగిజనంబులిట్టిద।ట్టిదనియెఱుంగనోపనికడిందిపదంబుననొందెనేకదా॥ చ॥ కురునృపపాండునందను§ల
కుంఠితకేళిఁజమూపమేతులై। యరిదిరణోర్వి నెవ్వనిముఖాంబురుహామృతమాత్మలోచనో।త్కరములఁగ్రోలిపార్థవి
శిఖప్రకరక్షతపూతగాత్రులై।గురుతరమోక్షధామమునకుంజనిసౌఖ్యమునొందిరేకదా॥ సీ॥అట్టిసరోజాక్షుఁడాద్యం
తశూన్యుండుసుభగుండునై త్రిలోక్యసుందరుండు। గమనీయసాగరకన్యకాకుచకుంకుమాంకిత‖విపులబాహాంతరుండు।
**సకలదిక్పాలభాస్వత్కిరీటన్యస్తపద్మరాగారుణపాదపీఠుఁ।డజుఁడనంతుఁడుసమానాధికరహితుండు¶నిద్ధమూర్తిత్ర
యాధీశ్వరుండు।నైనహరియుగ్రసేనునియఖిలరాజ్య।రుచిరసింహాసనమునఁగూర్చుండబెట్టి।భృత్యభావంబునొందిసం
ప్రీతినతని।పనుపుసేయుటకెప్పుడునామనముగుందు॥వ॥అని వెండియునిట్లనియెననఘపరాత్పరుండుయోగీశ్వరేశ్వరుం
డునగుకృష్ణుండుభగవద్భక్తుండుపరమభాగవతోత్తముండునైనయుగ్రసేనునిసేవించుటయాశ్చర్యంబుగాదుతన్నుహ
రియింపవలంచికుచంబులవిషంబుధరించిస్తన్యపానంబుసేయించినదుష్ట†చేతనయైనపూతనకుంజన్నిచ్చి పెంచినయ
శోదాదేవికినైననంతరానినిజపదంబుగారుణ్యచిత్తుండై యొసంగెననిన నిజపదధ్యానపరాయణులగు వారలననుసరిం
చిసేవించుటచెప్ప నేలననినవుద్ధవునికివిదురుండిట్లనియె. భక్తవత్సలుండుఁగారుణ్యజలనిధియునై భాగవతజనులననుగ్ర
హించుపుండరీకాక్షుండునిజదాసలోకంబునకొసంగు పరమపదంబుగ్రకర్ములైనరాక్షసులకెట్లొసంగెన త్తెఱంగెఱిం
గింపుమనినవిదురునకునుద్ధవుండిట్లనియె॥మ॥దనుజానీకమనేకవారములుదోర్దర్పంబుసంధిల్లఁగా। వినతాసూనుభుజా
వరోహుఁడగునవ్విష్ణున్☉సునాభాస్త్రిఁదా।రనిలోమార్కొనిపోకుపోకుహరిదైత్యారాతియంచుందదా।ననముంజూచు
చుఁగూలిమోక్షపదమున్ బ్రాపింతురత్యున్నతిన్॥క॥ధీరజనోత్తమనవసిత।పారసనేత్రుఁడగుకృష్ణుజననంబునుడ।చ్చా
రిత్రమునెఱిఁగింతును।దారతనీవిపుడువినుముతద్విధమెల్లన్॥ చ॥ధరణిభరంబువాపుటకుఁదామరసాసనుప్రార్థనప్ర
మా।వరుఁడలకంస ?బంధననివాసమునన్ వసుదేవదేవకీ।వరులకునుద్భవించిబలవంతుఁడుగంసుఁడుహింససేయున। న్వై
రపునర్థరాత్రిసుతునింగనియవ్వసుదేవుఁడిమ్ములన్॥క॥నందునిమందకుఁజనిత।త్సుందరితల్పమునఁ బరులుసూడకయుం
డన్।నందనునినునిచియానక।దుందుభిమఱలంగనేగెఁదొల్లిఁటిపురికిన్॥క॥హరియేకాదశసంప। త్సరములునందవ్రజము
నఁదనుహరియనియెవ్వరునెఱుఁగకుండనాహల।ధరుతోఁదగనాడుచుండెఁదద్దయుఁబ్రీతిన్॥క॥♣గోపాలవరులకైనను
వాపోవఁగఁదనసనుంచితాకారమొగిన్।జూపనిశ్రీపతివేడుక।గోపాలురఁగూడికాచెగోవత్సములన్॥వ॥ అయ్యవసరం
బునఁగృష్ణుండులీలావినోదంబులతోడి గోపాలబాలురకుంజూపంపలుంది॥చ॥వరయమునానదీసలిలవర్ధితసారభయుక్త

---

* వసరిన। దుఃఖించుచున్న.— ‡ పృథులపాతకభూమిభృద్భిదుర। మహాపాతకములను పర్వతములకు వజ్రమైన— § అకుంఠితకేళిఁ జమూప
మేతులై। కొఱఁతగానియుద్ధవిలాసముచేత సేనాసహితులయి— ‖ విపులబాహాంతరుండు। విశాలవక్షస్థలముగలవాఁడు— ** సకల-పీఠుఁడు। ఇం
ద్రాద్యష్టదిక్పాలకుల ప్రకాశమానములగు కిరీటములయందుఁ జెక్కఁబడిన కెంపులచే నెఱ్ఱఁగఁ జేయఁబడిన పాదముల క్రిందనుండెడు పీఠముగల
వాఁడు— ¶ ఇద్ధ। ప్రకాశమానమయిన— † చేతనమైనపూతనకుం। బుద్ధిగలదిమైనపూతనయనురాక్షసస్త్రీకి— ☉ సునాభాస్త్రిన్। చక్రా
యుధుఁడయిన— ? బంధననివాసమునన్। చెరసాలయందు— ♣ గోపాలవరులకైనన్। వేదార్థవిచారణచేసిన బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠులకైనను.

పుష్పమే। మరమకరందపానపరితుష్టమధువ్రతరంగమాధవీ।కురువకకుందచందననికుంజములందు మయూరశారికా।పరభృతరాజకీరవ్యూహభామలభంగిఁ జెలంగి పల్కుచున్॥ ఉ॥ శ్రీరమణీమనోవిభుఁడు సింహకిశోరమువోలి లీలఁగా। మారదశర్వరమావిమలమందిరముల్ బురణించు గోతతిన్। వారక మేపుచుం బరళవంశరవస్ఫుటమాధురీసుధా। సారము చేత గోపజనసంఘములన్ ముదమందఁ జేయుచున్॥ మఱియు॥ మ॥ చిరకేళీరతి బాలకుల్ దృణములన్ సింహాదిరూపంబుల। న్గర మొప్పన్విరచించి వానిమరలన్ ఖండించు చందంబున। న్గరుణాతీతులు కామరూపులగు కంసప్రయుక్తకుహా।చరులం గృష్ణుఁడు సంగరస్థలములఁ జెండాడె లీలాగతిన్॥ చ॥ వరయమునానదీజలనివాసమహోరగవిస్ఫురత్తాస్యవి।స్ఫురితవిషానలప్రభల సోకునఁ గ్రాఁగిన గోపగోధనో।త్కరముల నెల్లఁ గాచి భుజగప్రవరున్ వెడలంగఁ ద్రోలి త । త్సరిదమలాంబుపానమున సంతసమందఁగఁ జేసె గోతతిన్॥ మ॥ దివిజాధీశుఁ గురించి వానకొఱకై దీపించ నందాదివ।ల్లవు లేఁటేఁట నమానసంపదల సుల్లాసంబునుం జేయును।త్సవముం గృష్ణుఁడు మాన్పి గోపగణముల్ సంప్రీతి నొందన్ శచీ।ధవు గర్వంబడఁగన్ దనవ్యయముగాఁ దాఁ జేసె గోయాగముల్॥ చ॥ హరిహయుఁ డంతరోషవివశావిలమానసుఁడై సరోరుహో।దరుమహిమం బెఱుంగక సమంబడగం గవలాహకాదిభీ।కరఘనపఙ్క్తిఁ బంపిన నఖండశిలామయభూరివర్షముల్। గురిసె సమానగర్జనల గోకులమాకులమందికుందఁగన్॥ ఉ॥ ఆ తఱిమంద గొందలమునందఁగ వల్లవులెల్లఁ గృష్ణ యీ।చేతను వెల్లనిట్టి జడిఁ జిందరవందరలైనానంబులు। న్నాతరులై రిదె నీవు గృపఁ గావు మహాత్మ యనాథనాథ ని।ర్ధూతకళంక భక్తపరితోషణ భూషణపాపశోషణా॥ మ॥ అనియిబ్భంగి విపన్నులై పలుకుమయ్యాలించి కృష్ణుండు స।జ్జనవర్తిష్ణుఁడు గోపగోనివహరక్షాదక్షుఁడై దేవతా। జనులగ్గింపఁగ రాంబుజాతమునఁ శచ్ఛత్రంబుగాఁ దాల్చె భో।రున గోవర్ధనశైలముల్ దటచరప్రవ్యామరీజాలమున్॥ వెండియు॥ సీ॥ శరదాగమారంభసంపూర్ణపూర్ణిమాసాంద్రచంద్రాతపోజ్జ్వలితమగుచు । వెలయుబృందాటవీవీథియందొక నాఁడు రాసకేళీమహోల్లాసుఁడగుచు। రుచిరసౌభాగ్యతారుణ్యమనోరమస్ఫూర్తిఁ జెన్నొందిన మూర్తిపసర।సలలితముఖచంద్రచంద్రికాతతి గోపనయనోత్పలముల కానందమొసఁగ। భవ్యచాతుర్యభంగిఁ ద్రిభంగియగుచు। నబ్జనాభుండు మనమ్మోహనమగు శయిల్లీలఁ బూరించు వరమురళీనినాద।ముగ్ధవీతతి విని మోహితాత్మలగుచు॥ చ॥ పతులు మరందులున్ సుతులు బావలు నత్తలు మామలు నన్నము।న్నతివలదన్న మానక మనంబులఁ గృష్ణపదాబ్జసేవనా।స్వితరతి గోపకామినులు వేచను దేరఁ యామవయోధిశో।భితగతి రాసకేళి సలిపెం దరుణీనవపుష్పచాపుఁడై ॥ ఉ ॥ రాముఁడుఁ దానుఁ గూడి మధురాపురికిం జనియందు వైభవో।ద్దామనృపాసనంబున నుదారతనున్న దురాత్ముఁ గంసు ❀దు।ష్టామరశత్రుఁ ద్రుంచి ముదమారఁగ దల్లినిఁ దండ్రి నంచిత।శ్రీమహితాత్ములై తనరఁ జేసె సరోరుహనాభుఁడున్నతిన్॥ మ॥ నలువొప్పంగ షడంగయుక్తమహితామ్నాయంబు చౌషష్టివి।ద్యలు సాందీపుని చే నెఱింగెఁ జెలువొందన్ విన్నమాత్రంబులో। పలనేలోకగురుండు దానతనకు న్వ్యాపింప నన్యుల్గురు।ల్గల రేలోకవిడంబనార్థమగు లీలల్గా వెయమ్మేటికిన్॥ ఉ॥ మించి ప్రభాసతీర్థమున మృత్యువశంబునఁ బొందిపోయియా। పంచజనోదరస్థుఁడగు బాలుని దేశికనందనుం బ్రభో।దంచితలీలఁ దెచ్చి గురుదక్షిణగా నతిభక్తియుక్తిన।ర్పించె గురుండు చిత్తమునఁ బెంపెసలార మురారి వెండియున్॥ సీ॥ ఘనుఁడు విదర్భేశుఁ డనఁ బొల్పు భీష్మకవరసుతామణి నవవారిజాక్షిఁ। బద్మాసమానరూపశ్రీవిభాసితఁ గమనీయభూషణఁ *గంబుకంఠిఁ। జతురస్వయంవరోత్సవసమాగతులైన యసాల్వమాగధముఖ్యజనవరేణ్యు।ల్కరసమావృతఁ బ్రకటసచ్చారిత్ర రుక్మిణి సమానశీ❀రుక్మకాంతి। నమరగుప్తామృతము విహంగాధివిభుఁడు। గొనినకైవడి మనుజేంద్రకోటిఁ ద్రోలి। కమలనాభుండు నిజభుజాగర్వమలరఁ। దెచ్చి వరియించె నతని నుతింపవశమె॥ చ॥ పరువడి పట్టిసప్తవృషభంబుల ముక్కులు గుట్టఁ దర్పల।స్ఫురణ సహింపఁ జాలక నృపుల్ దలపడ్డ జయించి నగ్నజి । ద్ధరణిపునందనన్వికచతామరసాక్షిఁ బ్రమోదిగా నెస్వయం।వరమున బెండ్లియాడె గుణవంతుఁ డనంతుఁ డనంతశక్తితోన్॥ మ॥ ప్రతివీరక్షయకారి ముస్నహరిసత్రాజిత్తనూజాహ్వయదీ।ప్సితముం దీర్పఁదలంచి నాకమునకుం జెంపారఁగా నేగి ❀జ్వ।లితశౌర్యోన్నతిఁ బారిజాతము నిలకున్ లీలాగతిం దెచ్చెను। ద్ధతి దేవేంద్రుఁ జయించి కృష్ణుఁ డన నేతన్మాత్రుఁడే చూడఁగన్॥ సీ॥ మానితాఖిలజగన్మయదేహమునఁ బొల్చు ధరణీదేవికిఁ బ్రియతనయుఁడైన। నరకదానవుని సునాభాఖ్యఁ జెన్నొందు ఘనచక్రధారావిఖండితోత్తమాంగునిఁ జేయ నయ్యవనీలలామంబు వేఁడినఁ దత్పుత్రు విపులరాజ్యా।పదమున నిల్పి లోపలి సుందరంబులఁ జిరము గనరకుండు చెఱలఁ బెట్టి। నట్టి కన్యలు నూఱుఁ బదాఱు వేలు। నార్తబంధువుఁడైన పద్మాక్షుఁ జూచి । హర్షబాష్పంబు

---

❀దుష్టామరశత్రున్।దుష్టరాక్షసుని— *కంబు।శంఖము— ❀రుక్మ।బంగారు— ❀జ్వలిత।తేజరిల్లుచున్న.

ధారాప్రవర్షమొదవఁ। బంచశరబాణనిర్భిన్నభావులగుచు॥ వ॥ లలితతదీయసుందరవిలాసవిమోహితలైన వారినిం। బాలసినకోర్కెఁ దీర్చుటకు నొక్కముహూర్తమున నవ్వరించి కన్యలలలితావరోధభవనంబులనందఱకన్నిరూపులై। కలసి సుఖస్థితిం దనివోఁ గాంతలభక్తిని తాంతచిత్తులన్॥ క॥ చతురతతోనందొక్కొక। యతివకును బదేసి సుతుల నాత్మసములను। న్నతభుజశక్తులఁ గాంచెను। పితతంబై కీర్తి దిశల వినుతికి నెక్కన్॥ సీ॥ మధురాపురముఁ జతుర్విధబలౌఘములతో నావరించిన కాలయవనసాల్వ। మగధభూపాలాదిసను జేంద్రలోకంబు సైన్యయుక్తముగాఁగ సంహరించి। దనబాహుశక్తిఁ జిత్తములనర్థించిన భీమపార్థులను స్ద్దానువిజయ। మొసఁగి తద్వైరులను క్కడంగఁగఁ ద్రుంచి బాణశంబరముర పల్వలాది। దనుజనాయకసేనా*వితానములను। హలధరాదిసమేతుఁడై హతులఁ జేసె। దంతవక్త్రాది దైత్యులు దన్ను నెనుఱ। భండనములోనఁ ద్రుంచె దోర్బలము మెఱసి॥ వ॥ వెండియుఁ గృష్ణుండు గౌరవపాండవభండనంబునకుం దోడ్పడి రాజన్యులన్యోన్యమాత్సర్యోత్సాహసమేతులై సైనికపాదఘట్టనంబుల ధరాచక్రంబు గంపింపన నన్యసామాన్యంబులైన శంఖభేరీప్రముఖతూర్యఘోషంబులు ¶నింగి ప్రింగఁ దురంగమరింఖాసముద్ధూతధూళిపటలపరిచ్ఛన్నభానుమండలంబును ంగాఁ జను దెంచి కురుక్షేత్రంబున మోహరించిన నుభయపక్షబలంబులందును మాడి నిఖిలరాజ్యవైభవమదోన్మత్తుండైన దుర్యోధనుండు నిఖిలరాజసమక్షమునఁ గర్ణశకునిదుశ్శాసనాదుల దుర్మంత్రంబున నిరంతరంబుఁ గుంతీనందనుల కెగ్గు చేసిన దోషంబునం జేసి సంగరంగంబున భీముగదాఘాతంబునం దొడలు విఱిగి పుడమిం బడి గతాయుశ్శ్రీవిభవుండై యుండం జూచి యపరితుష్టచిత్తుండయి యపరిమితబాహుబలోత్సాహులైన భీష్మద్రోణభీమార్జునులచేత నఖిలధరాధిపతుల నష్టాదశాక్షౌహిణీబలంబులతోడం జునిమింపించి మఱియు నసమానబలులైన యదువీరుల జయింప నెంతవారలకైన నందీరమమధుపానమదవిఘూర్ణితతామ్రవిలోచనులై వర్తించు యాదవుల కన్యోన్యవైరంబులు గల్పించి పోరించి యితరేతరకరాఘాతంబుల హతులై దనుఁ గలసినం గాని భూభారంబు వొఁగదని చిత్తంబున నందలంచి యంత ధర్మనందను చేత §నిస్సపత్నంబగు రాజ్యంబు ప్రాజ్యంబుగాఁ జేయించుచుండను గ్త్యులసంగర్తవ్యంబులైన ధర్మపథంబులు సూపుచు బంధుమిత్రుల నెల్లం బరితోషంబు నొందించుచుం †దత్పరోక్షంబున వారివంశంబుద్ధరింపం దలంచి యభిమన్యువలన నుత్తరయందు గర్భంబు నిలిపి గురుతనయప్రయుక్త మహితబ్రహ్మాస్త్రపాతంబునఁ దద్గర్భదళనంబుగాకుండ నర్భకుని రక్షించి నిజపదారవిందసేవారతుండైన ధర్మజుచేఁ గీర్తిప్రతాపంబులు నివ్వటిల్లం దురంగమేధంబులు మూఁడు సేయించి వెండియు॥ సీ॥ వలనొప్ప లౌకికవైదికమార్గముల్ నడుపుచు ద్వారకానగరమందు। నవిదితాత్మీయమాయాప్రభావమున నిస్సంగుఁడై యుండి సంసారి పగిదిఁ। జెందికామంబులచేత విమోహితుఁడై సుఖించుచు ముదితాత్ముఁ డగుచు। నంచితస్నిగ్ధస్మితావలోకములు సుధాపరిపూర్ణసల్లాపములను। శ్రీనికేతనమైన శరీరమునను। బాండునందనయదుకులప్రకరములను। లీలఁ గారుణ్యమొలయఁ బాలించుచుండె। నాగ్తరకౌచణుండు నారాయణుండు॥ సీ॥ సంపూర్ణపూర్ణిమాచంద్రచంద్రిక నొప్పు రమణీయశారదరాత్రులందు। సలలితకాంచనస్తంభసౌధోపరిచంద్రకాంతోపలస్థలములందు। మహితకరేణుకామధ్యదిగ్గజములగతిని సౌదామినీలతలనడిమి। నీలమేఘంబులలీల ముక్తాఫలలలితమధ్యస్థనీలము లభాతి। సతతయౌవనసుందరీయుతవిహారుఁ। డగుచు సతులెందఱందఱకన్నిరూప। ములను గ్రీడించెఁ బెక్కుద్దములు సెలంగి। నందనందనుఁ డభినవానందలీల॥ అంత నొక్కనాఁడు॥ చ॥ మునివరులేగు దేరయదుముఖ్యులు మూఁకలుగా డిముట్టఁబ। లిక్కనఁగనలొందివారు తమకించి శపించినఁ గొన్నిమాసము। లిను నెడదైవయోగమున జాతరఁ బోసము కట్టి వేడుక। లమనములఁ దొంగలింపగ రిమున్నిజయానము లెక్క యాదవుల్॥ ఉ॥ కోరి ప్రభాసతీర్థమునకుం జని తన్నదిఁ గ్రుంకి నిర్మలో। దారతనంబున దేవమునితర్పణముల్ పితృతర్పణంబుల। న్నారనిభక్తిఁ జేసిన నవత్సలతోఁ బొలుపారు గోవులన్। భూరిసదక్షిణాకముగ భూసురకోటికి నిచ్చి వెండియున్॥ క॥ అజినపటరత్నకంబళి। రజతసుహేరజతతిలధరాధరకన్యా। గజతురగరథములను స। ద్ద్విజకోటికి నిచ్చి పెంపు దీపింపంగన్॥ వ॥ ఇట్లు సఫలంబులైన భూదానంబు మొదలుగాఁగల దానంబులనానంబులుగా భగవదర్పణబుద్ధిం జేసి యనంతరంబ॥ గీ॥ ఎసఁగు మోదంబు సంధిల్ల నిష్టమైన। రసికమృదులాన్నమర్థిఁ బారణలు సేసి। మంజులాసవరసపానమత్తులగుచుఁ। గడఁగి యన్యోన్యహాస్యవాక్యములఁ గలఁగి॥ వ॥ ఇట్లు దమలోన మదిరాపానమదవిఘూర్ణితతామ్రలోచనులై మత్సరంబుల నొండొరులం బొడిచి సమస్తయాదవులు వేణుజాతానలంబునఁ దద్వనవంశపరంపరలు దహనంబు నొందు చందంబునఁ బొలిసిరి యంతయును గనుంగొని కృష్ణుండప్పుడు॥ క॥ చతురతతో నిజమాయా

*వితానము। సమూహము— ¶నింగి। ఆకాశము— §నిస్సపత్నంబు। శత్రురహితమైనది— †తత్పరోక్షంబునన్। ఆపాండవులకుపిమ్మట.

గతిఁజూచిలసద్వీలోలకల్లోలసమం।చితవిమలకమలసార।స్వతజలములవిహితవిధులుసలిపినవాఁడై॥ క॥ఒకవృక్షమూల
తలమున।నకలంకగుణాభిరాముఁడాసీనుండై।యకుటిలమతిబదరీవని।కిఁక నీవరుగు మని మొఱఁగియేగిన నేను॥ క॥క్రమ
మునవిజకులసంహా।రము సేయఁగఁడంగు టెఱిఁగిరమణీయశ్రీ।రమణుచరణాబ్జయుగవిర।హమునకుమదినోర్వ లేకయను
గమనుఁడనై॥క॥హరినరయుచుఁజనిచనియొక।తరుమూలతలంబునందుఁదనదేహరుచుల్।పరఁగఁగనున్నమహాత్మునిఁబ
గుని ప్రపన్నార్తిహరునిభక్తవిధేయు॥మఱియును॥సీ॥అస్మత్ప్రియస్వామినచ్యుతుఁబరుసత్త్వగుణగరిష్ఠునిరజోగుణవి
హీను। సురుచిరద్వారకాపురసమాశ్రయుననాశ్రయునీలనీరదశ్యామవర్ణు।దరదరవిందసుందరపత్రనేత్రులక్ష్మీయుతుఁ
బీతకౌశేయవాసు।విలసితవామాంకవిన్యస్తదక్షిణచరణారవిందుశశ్వత్ప్రకాశు।ఘనచతుర్బాహుసుందరాకారుధీరుఁ।
జెన్నుగలలేత్తరావిపై వెన్నుమోపి।యున్నవీరాసనాసీనునన్నుఁగన్న।తండ్రినానందపరిపూర్ణునిసుజహాయని॥ మత్తకోకి
ల॥కంటిఁగంటిభవాబ్ధిదాటఁగఁగంటినాశ్రితరక్షకు।న్గంటియోగిజనంబుడెందమునుఁగంటిఁజుట్టమునుఁగంటిము।కృంటికింగ
నరానిశ్రీయెక్కటిఁగంటిఁదామరకంటిఁజే।కొంటిముక్తినిధానముందలకొంటిసౌఖ్యములందగ॥వ॥అయ్యవసరంబునం
బరమభాగవతోత్తముండుమునిజనసత్తముండుద్వైపాయనసఖుండుఁబరమతపోధనుండునఘశూన్యుండునఖిలజనమా
న్యుండుబుధజనవిధేయుండునగుమైత్రేయుండుదీర్ఘాచరణంబు సేయుచుంజనిచని॥మ॥కనియెందాపసపుంగవుండఖిలలో
కఖ్యాతవర్ధిష్ణుశో।భనభాస్వత్పరిపూర్ణయావనకళాభ్రాజిష్ణుయోగీంద్రహృ।ద్వనజాతైకచరిష్ణుఁగౌస్తుభముఖోద్య
ద్భూషణాలంకరి।ష్ణునిలింపాహితజిష్ణువిష్ణుఁబ్రభవిష్ణుంగృష్ణురోచిష్ణుని॥క॥తదనంతరంబహరిఁదన।హృదయాబ్జమునం
దమముకుళితేక్షణములస।మ్మదమునఁజూచుచునానత।వదనుండైయుండెముదమువఱలఁగనేనఘా॥ వ॥అంతదగ్గరనేతెంచి
యున్నమైత్రేయుండువినుచునుండదరహాసచంద్రికాసుందరవదనారవిందుండునానందసుధానిష్యందకందళితహృదయుం
డుభక్తానురక్తదయాసక్తవిలోకనుండునగుపుండరీకాక్షుండునన్నునిరీక్షించియిట్లనియానతిచ్చెఁబూర్వభవంబునవసు
బ్రహ్మలు సేయుసత్రయాగంబునవసువై భవదీయహృదయంబునవితరపదార్థంబులుగోరక మదీయపాదారవింద సేవ
యపేక్షించితికావునందన్నిమిత్తంబున నేనునీహృదయంబునవసియించినసమస్తంబునుగనుఁగొందునాత్మారాముండనై
ననన్నునెవ్వరేనియుసదసద్వివేకులై యెఱుంగంజాలరు-వారలకునేనగోచరుండనైయుండు-మత్పరిగ్రహంబుగలనీకునీ
జన్మంబెకాని*పునర్భవంబునొందకుండుటకుభవదీయపూర్వజన్మకృతసుకృతవిశేషంబుకతననీయాశ్రమంబునమత్పదా
రవిందసందర్శనంబుగలిగెనదియునుంగాకపద్మకల్పంబునందునన్నాభిపద్మమధ్య§నిషణ్ణుండయినపద్మసంభవునకుజన్మ
మరణాది‡సంసృతినివర్తకంబు¶నవిరతానశ్వరసౌఖ్యప్రవర్తకంబునగుమన్మహాత్త్వంబుదెలియంజేసినదివ్యజ్ఞానంబునీ
కునెఱింగింతుననియమ్మహనీయతేజోనిధియానతిచ్చినసుధాసమానసరసాలాపంబులు ‖కర్ణకలాపంబులై మనస్తాపం
బులంబాపినరోమాంచకంచుకితశరీరుండ,నానందబాష్పధారాసిక్తకపోలుండఁ,బరితోషసాగరాంతర్నిమగ్నమానసుం
డనయి యంజలిపుటంబునిటలతటంబునఘటియించియిట్లంటి॥ క॥ పురుషోత్తమనీపదసర।సీరుహ†మననాభృతాభిషే
కస్ఫురణ। న్గరమొప్పిననాచిత్తమి।తరవస్తువులందువాంఛఁదగులునెయెందుఁ॥ చ॥జననములేనినీవుభవసంగతినొందుట
కేమిగారణం।బనియునుగాలసంహారుఁడవైజగముల్విలయించునీవుపా।యనిరిపుభీతికై సరిమదంచితదుర్గమునాశ్రయిం
చుటెట్లనియును దేవనామనమునందుఁదలంతుసరోజలోచనా॥అదియునుంగాక॥ క॥శ్రీరమణీశ్వరనీవా।త్మారాముఁడ
వయ్యులీలఁదరుణీకోటిం।గోరిరమించితివనియును।వారకయేఁదలఁతుభక్తవత్సలకృష్ణా॥ క॥పరతత్త్వజ్ఞులుగరుణా।కరనిను
సంసారరహితుఁగాఁదలపోయ।న్నరసెనినుఁగాంచుటెట్లను।గరమరుదేదలఁచిచూడఁగమలాధీశా॥ [వ]॥దేవానీవఖండిత
విజ్ఞానరూపాంతఃకరణుండవయ్యును ముగ్ధభావంబునంబ్రమత్తునిచందంబుననిర్మోహికై వడింబ్రవర్తించుచు నెందేని
యునొదిగియుండుటందలంచినాడెందంబుగుందుచుండు నరవిందలోచన, సురవందిత,ముకుంద,యిందిరాసుందరీరమణ,
సరస్వతీరమణునకుంగరుణించిన విజ్ఞానంబుధరించుశక్తినాకుంగలదేనికృప సేయుము- భవదీయశాసనంబుధరియించి
భూరిసంసారపారావారోత్తరణంబు సేయుదుమనవివిన్నవించిబహుభంగులంబ్రస్తుతించినభగవంతుండుఁబ్రసన్నపారి
జాతుండునైనకృష్ణుండుపరతత్త్వనిర్ణయంబునెఱింగించిన॥క॥సరసిజలోచనకరుణా।పరిలబ్ధజ్ఞానకలితభావుఁడనగుట।

---

§ ఎక్కటి।ఏకస్వరూపుడయితేజరిల్లువాని— *పునర్భవంబు।పునర్జన్మమును— §నిషణ్ణుండు।నివసించియున్నవాఁడు—‡సం
సృతి।సంసారము—।¶అవిరతానశ్వర।ఎప్పుడునశింపని— ‖కర్ణకలాపంబులై।కర్ణాభరణములై—†మనన।ధ్యానము—

బరతత్త్వవేదినై త।చ్చరణసరోజములకెఱఁగినస్మృతితోడన్॥ క॥ హరిపదజలరుహవిరహా।తురఘనముద్గాంతదుఃఖతోయధిఁగడువ। న్వైరవేదితిరుగవలసెను।సరసిజభవకల్పవిలయసమయముదాఁకన్॥ ఇట్లుదిరుగుచు॥ మ॥ నరనారాయణతాపసాశ్రయపదౌన్నత్యంబునంబొల్చుభా।సురమందారరసాలసాలవకుళాశోకాస్లపున్నాగకే।సరజంబీరకదంబనింబకుటజాశ్వత్థస్ఫురన్మల్లికా।కరవీరక్షితిజాధిరామబదరీకాంతారసేవారతిన్॥ క॥ చనుచున్నవాఁడననిప।ల్కినపలుకులకులికికళవళింపుచువిదురుం।డనుపమశోకార్ణవమున।మునిఁగియునిజయోగసత్త్వమునఁదరియించెన్॥ వ॥ ఇట్లువిదురుండుశోకపావకునిందనవివేకజలంబులనార్చియుద్ధవునకిట్లనియె॥ మ॥ అనఘాయుద్ధవనీకుఁగృష్ణుఁడసురేంద్రారాతిమన్నించిచెప్పినయధ్యాత్మరహస్యతత్త్వవిమలాభిజ్ఞానసారంబుభో। రననన్నుంగరుణించిచెప్పనఁగృతార్థత్వంబునుంబొందెద। న్నినుపుణ్యాత్ములుశిష్యసంఘములనుర్విం బ్రోవరేవెండియున్॥ క॥ భగవద్భక్తులుసుజనులు। దగవెఱిఁగిపరోపకారతాత్పర్యవివేకగరిష్ఠులైచరింతురు।జగతింబెంపొందవృష్ణిసత్తమయెందున్॥ క॥ అనవుడునుద్ధవుఁడవ్విమ।లునకిట్లనునసఘమునివరుఁడుసాత్యవ్విద్యాన్నునిభుండగుమైత్రేయుఁడు।పనమనమునమనుజగతివదలఁదలఁచితగన్॥ క॥ హరిమురభేదిఁబరాపరుఁ।గుణాకరుఁదలఁచునట్టిఘనుఁడమ్మునికుం।జరుకడకేఁగిననాతఁడు।గరమర్థిందెలుపుసాత్త్వికజ్ఞానంబున్॥ అనియుద్ధవుండువిదురుంగూడిచనిచని॥ ఉ॥ ముందటఁగాంచిరంతబుధముఖ్యులు *హల్లకఫుల్లపద్మనిష్యందమరందపానవిలసన్మదభృంగజలత్తరంగ‡మా। కందలవంగలుంగ§లతికాచయసంగసురాంగనాశ్రితా। నందితపుణ్యసంగయమునన్నవభంగశుభాంగ¶నర్మిలిన్॥ క॥ కనిడాయనేగిమోదం।బునఁదత్సరిదమలపులినభూములఁదగనా।దినశేషమునవసించిరి। వనజోదరపాదపద్మవశమానసులై॥ క॥ మరునాఁడుంలేపకడభా।సురపుణ్యుఁడుఘనుఁడుమాధునిషూదనచరణస్మరణక్రీడాకలితుఁడు।దరియించెన్నలుపదహానదమనన్యమునన్॥ వ॥ ఇట్లుద్ధవుండుయమునానదినుత్తరించిబదరికాశ్రమంబునకుంజనియెననినవినిరాజేంద్రుండుయోగీంద్రునకిట్లనియె॥ క॥ శౌరియునతిరథవరులుమహారథసమరథులుయదుబలాధిపులెల్ల।న్నోరిస్మృతిఁబొందనుద్ధవుఁ।డేరీతిన్బ్రదికెనాకునెఱిఁగింపుతగన్॥ సీ॥ నావుడురాజేంద్రునకుశుకయోగీంద్రుఁడిట్లనుముసుబరమేష్ఠిచేత।సంప్రార్థితుండైనజలరుహనాభుండువసుమతిపైయదువంశమందు। నుదయించితనుఁదానమాజిలోనఁజింతించితెలివొందియాత్మీయకులవినాశ।మొనరించితానుబంచోపనిషణ్ణయమగుదివ్యదేహంబునందుఁజెందఁ।దలఁచిపిజ్ఞానతత్త్వంబుధరణిమీఁదఁ।దాల్చిజనకోటికెఱిఁగింపఁదగినధీరుఁ। డుద్ధవుఁడుదక్కనితరులునోపరితఁడు।నిర్జితేంద్రియుఁడాత్మసన్నిభుఁడటంచు॥ క॥ క్షితిపైనిలిపినకతమున।నతనికిమృతిదొరకదయ్యెనవనీశ్వరమా।పతియభిమానముగలిగిన।యతిపుణ్యుఁడుచనియెబదరికాశ్రమమునకున్॥ అంత॥ క॥ ఉద్ధవుఁడరిగినపిదప।న్మిద్ధపరిజ్ఞానుసుజనహితుమైత్రేయు।న్వృద్ధజ

## విదురమైత్రేయసంవాదము.

నసేవ్యుఁదాపస।వృత్రుఁజూడఁగోరివిదురుఁడుగడఁకన్॥ వ॥ యమునానదిదాటి†కతిపయప్రయాణంబులఁదత్పుణ్యానములహరిక్షేత్రంబులనుదర్శించుచునతిత్వరితగమనంబున॥ క॥ చనిచనిముందటఁగనుఁగొనె ఘనపాపతమఃపతంగఁగరుణాపాంగ।న్ఘనమత్తుంగతరంగ।న్జనవరనుతబహుళపుణ్యసంగన్గంగన్॥ క॥ అందునరవిందసౌరభ।నందితపవమానధూతనటమూర్మిపరిస్పందితకందళశీకర।సందోహలసత్ప్రవాహజలమజ్జనుఁడై॥ సీ॥ ‖ఘనసారరుచివాలుకాసముదంచితసైకతవేదికాస్థలమునందు।యమనియమాదియోగాంగక్రియాసక్తుఁబూనిపద్మాసనాసీనుఁడగుచు।హరిపాదసరసీరుహన్యస్తచిత్తుఁడైబాహ్యేంద్రియవ్యాప్తిఁబాఱఁదోలి।సకలవిద్వజ్జనస్తవనీయసముచితాచారవ్రతోపవాసములఁగృశిం।యున్నపుణ్యాత్ముఁవిగతవ్యయోవికారు।వినుతసంచారుభువనపావనవిహారు।యోగిజనగేయు⁂సత్తతిభాగధేయు। నాశ్రితవిధేయుమైత్రేయునపుడుగాంచె॥ వ॥ ఇట్లుకనుంగొనియమ్మునీంద్రునిపాదంబులకుంబ్రణమిల్లిముకుళితహస్తుండైయిట్లనియె మునీంద్రాలోకంబునసకలజనంబులుమనంబులఘనంబులగుసౌఖ్యంబులందలంచితత్ఫలప్రాప్తిహేతువులైనకర్మంబులాచరించిదైవోపహతులైతత్కర్మంబులచేతనిష్ఫలారంభులగుమరుకర్మంబులుబంధకరంబులుదుఃఖహేతువులుంగానిసా

---

*హల్లక- భృంగన్ ॥హల్లక। ఎఱ్ఱకలువలవలనను-ఫుల్ల। పుష్పించిన-పద్మనిష్యంద। తామరలనుండిజాఱుచున్న- మరందపానవిలసత్ । మకరందపానముచేతశోభిల్లుచున్న-మదభృంగన్ । మత్తిల్లినతుమ్మెదలుగలదిన్ని-—‡మాకంద। మామిడిచెట్లు-— §లతికాచయ। తీఁగెలగుంపు— ¶అర్మిలిన్ । ప్రీతితో—†కతిపయ। కొన్ని-— ‖ఘనసార-సందున్ ॥ఘనసారరుచి। కర్పూరమువంటికాంతిగల-వాలుక। ఇసుకయందు-సముదంచిత। మిగులనొప్పుచున్న-సైకతవేదికాస్థలమునందున్ । ఇసుకచేతనేర్పరచినతిన్నెమీఁద. ⁂సత్తతిభాగధేయన్ । సజ్జనసమూహముపాలిటివాఁడైన

ఖ్యదాయకంబులై పాపనివృత్తిఁ జేయనోపవదియట్లుండె భూరిదుఃఖానుసాగరంబైన సంసారచక్రంబునం బరిభ్రమించు
చుం గామవిమోహితులై పూర్వకర్మానుగతంబులైన శరీరంబులు దాల్చుచుఁ జచ్చుచుం బుట్టుచు నెంతకాలంబునకుఁ
బాపనిర్ముక్తిఁ గానక మాతృయోనావనవనకు తారులై జనియించి వర్తించు మహాత్ములం బశుప్రాయుల రక్షించుకొఱకుం గా
దె నారాయణపరాయణులైన మీవంటి పుణ్యాత్ములు లోకంబునం జరియించుటయదియునుం గాక॥ సు॥ అవివేకానుగతస్వ
కార్యజలవేలాకీర్ణమై మిత్రబం।ధువధూపుత్ర *జలగ్రహోగ్రయుతమై మదుర్దాంతసంసారము। ర్ధ్యరపాథోధిఁ దరించు
వారె హరిసంబంధక్రియాలోలభా।గవతానుగ్రహనావ లేసియథముల్గారుణ్యసంధాయకా॥ క॥ మునినాథచంద్రననుఁ
గై।కొని కాచుతలంపు బుద్ధిఁ గొనకొనినఁ దగ।న్వినుము మదీప్సితమది నా।చనువునఁ గావింపు మయ్య సజ్జనతిలకా॥ వ॥ అని వెం
డియు విదురుండు మైత్రేయుం జూచి మునీంద్రా త్రిగుణాత్మకమాయానియంతయగు భగవంతుండు స్వతంత్రుండగుచు న
వతరించి యెయ్యేయవతారంబులందు నెయ్యేకర్మంబు లాచరించె నదియును స్త్రీయుండగు నీశుండు మొదలఁ బ్రపంచంబు
నే విధంబునం గల్పించె నే పగిది దీనిం బాలించె మఱియు నీ విశ్వంబు నాత్మీయహృదయాకాశగతం జేసి నివృత్తవృత్తియగుచు
యోగమాయయందు నెట్లు వసించె బ్రహ్మాండంబునందు నే లీలఁ బ్రవర్తించె నందు బ్రహ్మాదిరూపంబులం బొంది బహుప్ర
కారంబుల నెట్లు క్రీడించె భూసురగోసురామలక్ష్మణంబుకొఱకై మత్స్యాద్యవతారంబులు ధరియించి యెయ్యే ప్రయోజ
నంబులం దీర్చెం బయోరుహగర్భాండకటాహాంతర్గతంబులై లోకపాలసహితంబులైన లోకంబుల లోకాలోకపర్వతం
బుల బహిర్భాగంబుల నెయ్యే తత్త్వభేదంబుల నేతెఱంగున బుట్టించె నందుఁ బ్రతీతంబగు జీవకోటి యెవ్వని గొల్చి బ్రదుకు
జనులకుం గర్మ నామరూపభేదంబు లెట్లు నిర్దేశించె నింతయు సవిస్తరంబుగా వింపు ముత్తమశ్లోకమౌళి యుండనుండ యోగీ
శ్వరేశ్వరుండైన పుండరీకాక్షుని చరిత్రశ్రవణంబునం గాని జన్మమరణాదిసకలదుఃఖాకరంబులు దుష్కర్మప్రాప్తంబులు
నగు భవబంధంబులు దెగవని వెండియు నిట్లనియె॥ తరల॥ సతతము న్సరసీరుహోదరసత్కథామృతపూరముం। శ్రుతిపు
టాంజలి చేత నిమ్ముల జుఱ్ఱియుండని వోమభా।రతకథామిషమూని విష్ణుఁ బరాశరప్రియసూతి స।న్మతినుతించిన చోట సన్ముని
నాథ నామది నుబ్బుమర్ధ॥ క॥ ఇతరకథావర్ణనముల। నతిహేయతనొందెఁ జిత్తము నఘాత్మ రమా।పతిచరితామృతరతిసం।
స్మృతి వేదన లెల్లఁ బాయఁ జేయు మునీంద్రా॥ గీ॥ భూరివిజ్ఞానవిమలుగు నారదాదు।నిర్మలాత్ములకయిన వర్ణింపరాని।హరికథా
మృతపానంబునం దవిసిపి।యొల్ల ననువాఁ డెపో వెఱ్ఱిగొల్లఁడనఘ॥ సీ॥ అరవిందనాభునియపరావతారమై జననమందిన
పరాశరసుతుండు। మహినొప్పవర్ణాశ్రమాచారధర్మముల్ద్వవశింప లోకవిడంబనములు। నను గ్రామ్యకథలు పెక్కుగ్రంథిఁ గ
ల్పించుచు హరికథావర్ణనమందు లోన।నించుకించుక గాని యెప్పుడఁ జెప్పమి నంచితవిజ్ఞానమాత్మ నిలుప।కున్నఁ జింతిఁ చివుర
నారదోపదిష్టుఁడగుచు హరివర్ణనామృతమాత్మ గ్రోలి।విమలసుజ్ఞాననిధియన నెసఁగె గాక।ధన్యుఁడయ్యె నులోకైకమాన్యుఁ
డగుచు॥ కావున॥ క॥ సరసిరుహోదరుమంగళ।చరితామృతమాత్మఁ గ్రోలు జనుఁడితరకథా।గరళము గ్రోలునె హరి
సం।స్మరణము జీవులకు నఖిలసౌఖ్యదమనఘా॥ క॥ శ్రీవనితాధిపు నామక।థాపిముఖులకిహము పరము।సవ్వ్వపసపంబొప్పు
దురు నరకమునకు।న్వావిరి నే వారిఁ జూచి వగతు మునీంద్రా॥ క॥ పనరుఁడే నొక నిమిషం।బైన వృథా వాఁడగతినిహరిపదకమలా।
ధ్యానానందుఁడు గాఁడే।నా నరునకు నాయువల్పమగు మునినాథా॥ చ॥ మృమగతిఁ బుప్పతేనియ రమించుచుఁ బానము సే
యఁ బారు। షట్పదమును బోలి యార్తజనబాంధవు విశ్వభవస్థితివ్యయా। స్పదము హితావతారుఁ డగు పంకరుహోదరు
నిత్యమంగళ।ప్రదగుణకీర్తనామృతముఁ బాయక గ్రోలెదఁ జెప్ప వేదయర్ణ॥ క॥ అని విదురుఁడు మైత్రేయుం।డను మునినా
యకుని నడిగెనని వేదవ్యా।సుని తనయుండభిమన్యుని।తనయునకుం జెప్పె నఱియుఁ దగనిట్లనియెన్॥ వ॥ ఇట్లు విదురుండు మై
త్రేయు నడిగిన నతండతనిం గనియతిమృదుమధురవచనరచనుండై యిట్లనియె ననఘా కృష్ణకథాశ్రవణతత్పరుండవై నీవున
న్నడిగితివి గావున భద్రంబయ్యె నీవు భగవద్భక్తుండవు గావు న హరికథాసక్తుండవగుట సుఁజిత్రంబు గాదదియునుం గాక
మాండవ్యుని శాపంబున సాత్యవతేయువలన భ్రాతృక్షేత్రంబున శూద్రయోనిం బుట్టినట్టి ప్రజా।§సంయమనుండవగు య
ముండవు।పరమజ్ఞానసంపన్నుండవు నారాయణునకుం బ్రియుండవు గావునఁ గృష్ణుండు నిర్యాణకాలంబునం దనసన్నిధికిం
జనిన నన్నుం డాయం జీరి విజ్ఞానంబెల్ల నుపదేశించి నీకు నెఱింగింపుమని యానతిచ్చుటం జేసి యవశ్యంబు నీకు నెఱింగింతు
దత్తావధానుండవై వినుమని॥ క॥ వనజాక్షు యోగమాయా।జనితంబగు విశ్వజననసంస్థానవినా।శనముల తెఱఁగెఱిఁగింపు

---

* జలగ్రహోగ్రయుతమై। కాఱుమొసళ్లతోఁ గూడుకొన్నదై— §సంయమనుండవగు।పుణ్యపాపముల నెఱిఁగి లెస్స గశిక్షించుచున్నట్టి.

ము|నననఘావిష్ణునిమహత్త్వమభివర్ణింతుఁ॥ సీ॥సకలజీవులకెల్లఁబ్రకటదేహమునాత్మనాథుండుపరుఁడునానావిధైక|మ
త్యుపలక్షణమహితుండునగుభగవంతుండుసృష్టిపూర్వంబునందు|నాత్మీయమాయలయంబునొందినవిశ్వగర్భుఁడైతాన
యొక్కఁటివెలుంగు|పరమాత్ముఁడభవుండుద్రష్టయయ్యువస్త్వంతరపరిశూన్యుఁడగుటఁజేసి|ద్రష్టగాకుండుమాయాప్ర
ధానశక్తినతులదిదృక్షాశక్తిగలవాఁడునగుచుఁదన్ను|లేనివానిఁగఁజిత్తంబులోనఁదలఁచి|ద్రష్టయగుతనభువననిర్మాణవాంఛ॥
గీ॥బుద్ధిఁదోఁచిననమ్మహాపురుషవరుఁడు|గార్యకారణరూపమైఘనతకెక్కి-|భూరిమాయాభిధానవిస్ఫురితశక్తి|వినుతికె
క్కి-నయ్యట్టియవిశ్వయందు॥క॥పురుషాకృతినాత్మాంశ|స్ఫురణముగలశక్తినిలిపిపురుషోత్తముఁడీ|శ్వరుఁడభవుండజుఁడుని
జో|దరసంస్థితవిశ్వమువుడుదగఁబుట్టించెఁ॥ సీ॥ధృతిఁబూనికాలచోదితమునవ్యక్తంబుప్రకృతియుననుపేర్లఁబరఁగుమా
య|వలనమహత్తత్త్వమెలమిఁబుట్టించెమాయాంశకాలాదిగుణాత్మకంబు|నైనమహత్తత్త్వమచ్యుతదృగ్గోచరమగుచువిశ్వ
నిర్మాణవాంఛ|నంబుటఁజేసిరూపాంతరంబునఁబొందినట్టిమహత్తత్త్వమందునోలిఁ| గార్యకారణకర్త్రాత్మకత్వమైన|మ
హితభూతేంద్రియకర్మనోమయమునంగఁ| దగునహంకారతత్త్వముత్పన్నమయ్యెఁ|గోరిసత్త్వరజస్తమోగుణకమగుచు॥
వ॥ వెండియునూపాంతరంబులంబొందుచున్నసాత్త్వికాహంకారంబువలనమనంబువైకారికకార్యభూతంబులైనదేవతా
గణంబులునుసంభవించె-నింద్రియాధిష్ఠాతలైనవానివలన శబ్దంబుపూర్వంబునఁబ్రకాశంబగుటంజేసిజ్ఞానేంద్రియం
బులయినత్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులునుగర్మేంద్రియంబులయినవాక్పాణిపాదపాయూపస్థలునుదైజసాహం
కారంబుననుత్పన్నంబయ్యెఁ-దామసాహంకారంబువలనశబ్దస్పర్శరూపరసగంధంబులుదయించె-నందుశబ్దంబునిజగుణం
బయినశబ్దంబువలననాకాశంబుఁబుట్టించె-గగనంబుగాలమాయాంశయోగంబునంబుండరీకాక్షునిరీక్షణంబునస్పర్శత
న్మాత్రంబువలన వాయువుంగలిగించెఁ బవనుండునభోబలంబునరూపతన్మాత్రంబువలన లోకలోచనంబయిన తేజంబు
నుత్పాదించెఁ- దేజంబుగాలమాయాంశయోగంబునసుత్తమశ్లోకుని విలోకనంబునఁబవమానయుక్తంబగుచురసతన్మా
త్రంబువలననంబువులఁగలిగించె- సలిలంబు గాలమాయాంశయోగంబునం బరమేశ్వరానుగ్రహంబుగలిగి తేజోయు
క్తంబయిగంధగుణంబువలనఁబృథివిఁగలిగించె-నందుగగనంబునకుశబ్దంబు, వాయువునకుశబ్దస్పర్శంబులుఁ, దేజంబునకు
శబ్దస్పర్శరూపంబులు,సలిలంబునకుశబ్దస్పర్శరూపరసంబులుఁ,బృథివికిశబ్ద స్పర్శ రూప రస గంధంబులును, గుణంబులయి
యుండుఁ- గాలమాయాంశలింగంబులుగలిగిమహదాద్యభిమానంబులుఁబొందినదేవతలు విష్ణుకళాకలితులగుచునట్టిమ
హదాదితత్త్వంబులైక్యంబుచాలమిం బ్రపంచంబుంగల్పింప సమర్థంబులుగాకకృతాంజలులై యోగీశ్వరేశ్వరుఁడయిన
నారాయణునిట్లనిస్తుతియించె ॥ దండకము॥ శ్రీనాథనాథాజగన్నాథ*నమ్రైకరక్షా§విపక్షక్షమాభృత్సహస్రాక్షనీ
రేజపత్రేక్షణా దేవదేవా భవద్దాసవర్గానుతాపంబులం బాపఁగా నొప్పుదివ్యాతపత్రంబునాఁబొల్చుయుష్మత్పదాం
భోజమూలంబుపుణ్యాలవాలంబుగాఁబొందియోగీంద్రులుద్దామసంసారతాపంబులంబాయఁగామీఁటివర్తింతురోతం
ద్రియీశానసంస్థానవిజ్ఞానశయ్యావిశ్వమందెల్లజీవుల్ భవోదగ్రదుర్వార¶తాపత్రయాభీలదావాగ్నిచేఁగ్రాఁగిదుః
ఖాబ్ధిలోఁదోఁగియేకర్మముంధర్మముంబొందఁగా లేకసంసారచక్రంబునందుం బరిభ్రామ్యమాణాత్ములై యుండురవ్యా
థచేతస్కులంజెప్పఁగా నేననో దేవవిజ్ఞానదీపాంకురంబయిన మీపాదపంకేరుహచ్ఛాయఁ బ్రాపింతురిజ్ఞాతుసన్మానిస
ఘుంబులేకాంతికస్వాంతతంబేర్చిమద్దాన్తపాపౌఘనిర్ణాశకంబుప్రవాహోగ్రగంగానివాసంబనానొప్పమీపాదయు
గ్మంబుయుష్మన్ముఖాంభోజ‡నీడోద్గతంబైన వేదాండజశ్రేణిచేతం†గవేషించిసంప్రాప్తులై యుందురోనాథవైరాగ్య
శక్తిస్ఫుటజ్ఞానబోధాత్ములైనట్టిధీరోత్తముల్ నిత్యనైర్మల్యభవ్యాంతరంగంబులం దేవరంజ్యోతిపాదాబ్జపీఠంబుగీలించి
కైవల్యసంప్రాప్తులైరట్టినిర్వాణమూర్తిం బ్రశంసింతుమింద్రాదివంద్యాముకుందా సమస్తంబుగల్పింపఁబాలింపఁదూ
లింపఁగాఁబెక్కుదివ్యావతారంబులంబొందునీపాదపంకేరుహధ్యాన‖పారీణసుస్వాంతులై యొప్పుభక్తాళికిన్మోక్షసం
బైనమీపాదకంజాతముల్గొల్తుమీశౌరమాధీశ పుత్రాంగనామిత్రసంబంధబంధంబులం జెంది ✤సోహంబు మేలిక్రియా

* నమ్రైకరక్షా|శరణాగతులనుముఖ్యముగరక్షించువాఁడా— § విపక్షక్షమాభృత్సహస్రాక్షా|శత్రువులనుపర్వతములకునింద్రుఁడా—
¶ తాపత్రయ|ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికములు. అందు రోగములవలనగలిగెడుతాపము ఆధ్యాత్మికము. మృగసర్పవృశ్చికాదులవలన వచ్చుతాపము ఆధిభౌతికము. ఎండ, మంచు, అగ్ని, జల, వర్ష, అశని, వాయు, దేవాలయ, గోపుర, మంటప, ప్రాకారాదులవలనవచ్చునట్టితాపము ఆధిదైవికము.— ‡ నీడోద్గతంబు|గూఁటినుండివెడలిన— † గవేషించి|వెదకి— ‖ పారీణ|ఆసక్త— ✤ సోహంబు మేలి|నేను నాదియనెడు.

లోలురై దేహగేహంబులందోలి వర్తించుచుర్మానవశ్రేణులందంతరాత్ముండవై యుండియుఁ దూరమైతోఁచు మీపాదప
ద్మంబులర్చింతు మో దేవ బాహ్యేంద్రియవ్యాప్తినుద్వృత్తులై నట్టిమూఢాత్ములధ్యాత్మతత్త్వప్రభావాఢ్యులై మీపదా
బ్జాతవిన్యాసలక్ష్మీకళావాసముం గన్న యయ్యుత్తమశ్లోకులం గానఁగాఁజాల రప్పుణ్యులాదుష్టులం జూడఁగా నొల్లరం
భోధిరాట్కన్యకాకాంత వేదాంత‡‡శుద్ధాంతసిద్ధాంతమై యొప్పు మీసత్కథాపారచంచత్సుధాసారపూరంబులం గ్రోలి
సౌఖ్యోన్నతిన్ సోలి ధీయుక్తులై వ్రాలి తాపంబులందోలి మోదంబులం దేలి సంపన్నులై యున్న నిత్యప్రసన్నుల్ మహో
త్కంఠతం బేర్చి వైకుంఠధామంబునల్పక్రియాలోలురై కాంతురద్దివ్యవాసైకసంప్రాప్తికిం గోరుచున్నార మో దేవ వై
రాగ్యవిజ్ఞానబోధాత్మయోగక్రియారూఢినంతర్బహిర్వ్యాప్తిఁ జాలించి శుద్ధాంతరంగంబుగావించి హృత్పద్మవాసుం
డవై చిన్మయాకారమైయున్న నీయున్నతానంత తేజోవిలాసోల్లసన్మూర్తిఁ జిత్తంబులం జేర్చి యానందలోలాత్మకంబో
ల్చు యోగీశ్వరశ్రేణికిం దావకీనానుకంపానులబ్ధస్ఫుటజ్ఞానముం గల్గుటం జేసి యాయాసముం జెందరో దేవ తాచక్రవ
ర్తీ సదానందమూర్తీ జగద్గీతకీర్తీ లసద్భూతవర్తీ భవద్దాసులై నట్టిమమ్ముం జగత్కల్పనాసక్తచిత్తుండవై నీవు త్రైగుణ్యాపి
స్ఫూర్తిఁ బుట్టించినం బుట్టుటే కాక నీభవ్యలీలానుమేయంబుగా సృష్టినిర్మాణముం జేయనే మెంతవారమ్ము సచ్ఛక్తియుక్తి
న్నవత్పూజఁ గావింతుమట్లుండె నీసత్కళాజాతులమ్మైనమమ్మెన్నఁగా నేల నధ్యాత్మతత్త్వంబవన్నం బరంజ్యోతివన్నం
బ్రపంచంబవన్నన్నధిష్ఠాతవన్నన్సదాసాక్షివన్నన్గుణాతీతనీవేకదా పద్మపత్రాక్ష సత్త్వాది త్రైగుణ్యమూలంబునా నె
ప్పు మాయాగుణంబం దనుద్యన్మహాతత్త్వమైనట్టి నీవీర్యముం బెట్టుటం జేసి నీవింతకుం గారణంబౌదు వాయాయికాలంబుల
న్నీకు సాక్ష్యంబులే మెట్లు గావింతు మేరీతి నన్నంబు భక్షింతు మెబ్భంగి వర్తింతు మే నిల్కడన్నుందు మీజీవలోకంబె యాధా
రమైయుండి భోగంబులం బొందుచున్నన్న యికార్యసంధానులమ్మైన మాకుం జగత్కల్పనాశక్తికిం దేవ మీశక్తిఁ దో
డ్పాటుగావించి విజ్ఞానముం జూపి కారుణ్యసద్ధాయివై మమ్ము రక్షింపు లక్ష్మీమనః§§పల్వలక్రోడ యోగీంద్రచేతస్సరోహం
స దేవాదిదేవా నమస్తే నమస్తే నమః॥ సీ॥ అనినఁ బ్రసన్నుఁడై హరి మహదాదులకన్యోన్యమైత్రత్వమందకున్న|కతము
ననిఖిలజగత్కల్పనాశక్తివొడమకుండుటఁ దనబుద్ధి నెఱిఁగి| కైకొని కాలవేగమునను ద్రేకంబునొందిన ప్రకృతితోఁ బొం
దినిజబ|లము నిల్పి తానురుక్రముఁడన *సప్తవింశతితత్త్వములయందు సగుతనొక్క| పరిఁ బ్రవేశించి యాతత్త్వభవ్యగుణ
ము|నంచుఁ జ్యేష్ఠానురూపంబులలరఁ జెంది| యొకటినొకటినిఁ గలయకయుండి విశ్వ| రచన నెఱుఁగనియాతత్త్వనిచయము
నకు॥ వ॥ ఇట్లు విశ్వనిర్మాణనిపుణత్వంబు నెఱుఁగం జూపుచున్నింటికి నన్యోన్యతం గల్పించి తనయనుగ్రహంబునం బ్రేరి
తంబయి కానంబడి క్రియాసామర్థ్యంబునఁ జెన్నొందిన తత్త్వవితానంబు దేవప్రేరితంబయి స్వకీయంబులగు నంశంబుల
చేతం బుట్టించిన విరాడ్విగ్రహంబై తత్త్వవితతిదమయందుఁ జెందిన పుండరీకాక్షునికళాంశంబున నొకటికొకటికి నైక్యం
బు వాటిల్లి పరిణతంబై రూపాంతరంబును జెందె నేతత్త్వంబున నేని యుఁజరాచరలోకపుంజంబులు నిండియుండు నా హిర
ణ్మయంబయిన విరాడ్విగ్రహంబునొందిన పురుషుండు సర్వజీవసమేతుండై యుండె నంత॥ క॥ జలములలోపల నిమ్ముల| జల
రుహజాతాండమందు సాహస్రాబ్దం|బులు నిలిచెఁ గార్యరూపా|కలితంబగు నవ్విరాట్పుగర్భము వరుసన్॥ గీ॥ దైవకర్మా
త్మశక్తివితానములను|దగిలి తనచేతఁ దానేకదైవశక్తి|యగుచు వెలుఁగొందుచుం బ్రకాశాంతరమునఁ|దనువు వితతంబుఁ
గాని చైతన్య మొందె॥ గీ॥ రూపసంశక్తిఁ జేసి నిరూఢకర్మ|శక్తియనువృత్తిభేదసంసక్తి దశవి|ధములు గలిగిన ప్రాణరూపము
ననాత్మ|శక్తిబోధత్వమగుచున్న శక్తి గలిగి॥ క॥ త్రివిధంబగుచును నాధ్యా|త్మ్యాదిభేదంబునను బాపిమఱియధిభూతా|త్మ
విరాడ్రూపంబగు నిది| వివిధప్రాణులకు నాత్మవిధమై మఱియున్॥ క॥ జీవంబై పరమాత్మకుఁ|‖తావలమై యామహావతా
రంబగు నద్దేవుని గర్భంబున భూ|తావలితోడం బ్రపంచము ద్భిందోఁచెన్॥ వ॥ ఇట్లు దోఁచిన విరాట్పురుషుండాధ్యాత్మికాధి
దైవికాధిభౌతికంబులను భేదంబులచేఁ బూర్వోక్తక్రమంబున వెలుఁగొందుననుచు విదురునకు మైత్రేయుండెఱింగించె
నని చెప్పి వెండియు నిట్లనియె॥ చ॥ హరిపరమాత్ముఁ డీశుఁ డజుఁ డాఢ్యుఁ డనంతుఁ డనంతమూర్తి సా|గరతనయాహృదీశుఁడు
¶వికారవిదూరుఁడు నిత్యమంగళా|కరుఁడు కృపాపయోనిధి యకల్మషచిత్తుఁడు సర్వశక్తిఁ దా|మరసవిలోచనుండు బుధమా

---

‡‡ శుద్ధాంత|అంతఃపురము— §§ పల్వలక్రోడ|అల్పసరస్సునకు సూకరమయినవాఁడా— * సప్తవింశతితత్త్వములయందుఁ| పంచభూతములు, అహంకార, బుద్ధి, అవ్యక్తములు. జ్ఞానేంద్రియపంచకము, కర్మేంద్రియపంచకము, మనస్సు. పంచతన్మాత్రలు. గుణత్రయము వీనియందు.— ‖ తావలమై|స్థానమై— ¶ వికారవిదూరుఁడు|అస్తి, జాయతే, వర్ధతే, పరిణమతే, అపక్షీయతే, నశ్యతి, అను వికారములు లేనివాఁడు.

న్యచరిత్రపవిత్రుఁడిమ్ముల౯॥ వ॥ ఇత్తెఱంగున నీశుండగు నధోక్షజుండు మహదాదితత్త్వంబుల మనంబుల ఘనంబులగు తలంపు
లుఁదా నెఱింగి యట్టితత్త్వంబుల వివిధవృత్తిలాభమునకై స్వకీయచిచ్ఛక్తిచే నిట్టులొనర్తునని చింతించి నిజకళాకలితంబగు
విరాడ్విగ్రహంబునందు నగ్నిప్రముఖంబగు దేవతావళికెల్ల నివాసంబగుచుఁ గానంబడినవై రాజపురుషుని యాస్యాద్యవ
యవంబుల వినుపింతు †దత్తావధానుండవై వినుము॥ సీ॥ నరనుత యా దివ్యపురుషోత్తముని పృథగ్భావంబు నొంది ముఖంబువల
న| భువనపాలకుఁడైన పవమానసఖుఁ డంతరాత్ముఁ డీశ్వరు నంశమైనవాని| కనయంబును ననుకూలమగుచు నిజస్థానమునఁ బ్రవే
శించిన ముఖమునందుఁ| బరఁగు జీవుండు శబ్దమును చ్చరించుఁ బృథగ్భావమైన నేత్రములనినుఁడు| చక్షురింద్రియయుక్తుఁ
డై సరవిఁ జెందవ| రూపవిజ్ఞానమహిమ నిరూఢి నొందు| మఱియుఁ జర్మంబునను బవమానుఁ డీశ్వ|రాంశమై త్వగింద్రియమం
దుఁగూడ॥ వ॥ నిజనివాసంబు నాశ్రయించి జీవుండు స్పర్శేంద్రియగతుండై స్పర్శంబు నొందు శ్రోత్రంబుల దిక్కు లచ్యుతకళాం
శంబులై కూడ జీవుండు శ్రవణేంద్రియయుక్తుండై నిజస్థానంబునం బొంది శబ్దజ్ఞానగతుండగు మఱియుఁ దాలువు నిర్భిన్నం
బయిన లోకపాలుండగు వరుణుండందుఁ బ్రవేశించి రసనేంద్రియంబుచేఁ బ్రకాశించినం బ్రాణి రసంబులం గ్రహించెఁ- బర
మేశ్వరుని నాసికేంద్రియంబులు పృథగ్భావంబు నొంది యాశ్వినేయాధిష్ఠానంబై ఘ్రాణాంశంబు నొందిన జంతువు గంధ
గ్రహణసమర్థం బయ్యె- వెండియు భిన్నంబయిన చర్మంబున నోషధులును, బరమపురుషాంశంబులయిన కేశంబులం గూడ నిజ
నివాసంబు నొంది జీవుండు ‡కండూయమానుండగు భిన్నభూతంబైన మేఢ్రంబునం బ్రజాపతి నిజస్థానంబు నొంద రేతంబు
న జీవుండానందంబునుం బొందు భిన్నభావంబైన గుదంబున మిత్రుం డచ్యుతాంశంబును బొంది పాయువుం గూడ నిజాధిష్ఠా
నంబు నొందుచు జీవుండు విసర్గంబుఁ జెందు వేఱువేఱైన బాహువులం ద్రిదశాధీశ్వరుండయిన పురందరుండు క్రయవిక్ర
యాదిశక్తియుక్తుండగుచు నిజస్థానంబు నొంద జీవుండు వానిచే తజ్జీవికం బొందు మఱియుఁ బాదంబులు నిర్భిన్నంబులయిన
విష్ణుండు స్వావాసంబు గైకొని గతిశక్తిఁ బొందిన జీవుండు గమనాగమనార్హుం డయ్యె వెండియు భిన్నభావంబయిన హృద
యంబు మనంబుతోడం గలసి నిజాధిష్ఠానంబునం జంద్రుండు ప్రవేశించిన శరీరసంకల్పాదిరూపంబగు వికారంబునుం బొందు
భిన్నభావంబైన యహంకారంబున నహంకృతియుక్తుండై రుద్రుండు నిజస్థానంబుగా వసియింప నా యహంకృతిచే శరీర
కర్తవ్యంబులు నడుపు- బుద్ధి వాగీశ్వరావాసంబై హృదయంబుతోడం గలసి నిజాధిష్ఠానంబున బోధాంశంబుచే వెలింగిన శ
రీరి బోద్ధవ్యతం బొందు భిన్నంబైన చిత్తంబు బ్రహ్మావాసంబై చేతనాంశంబు నొందినఁ బ్రాణి విజ్ఞానంబునుం బొందు నావి
రాట్పురుషుని శీర్షంబున స్వర్గంబు, చరణంబుల వసుమతియు, నాభియందు గగనంబునుం గలిగె- సత్త్వాదిగుణపరిణామంబు
లన మరులైరి- ఊర్జితసత్త్వగుణంబున నద్దేవతలు త్రిదివంబునుం బొందిరి- రజోగుణంబున మనుజులు గవాదులును ధరణిం
బొందిరి- తామసంబున భూతాదులైన రుద్రపార్షదులు ద్యావాపృథివ్యంతరంబగు వియత్తలంబునుం బొందిరి- ముఖంబు
వలన నామ్నాయంబు లుత్పన్నంబు లయ్యె వెండియు॥ క॥ ధరణీదివిజులు శ్రుతులును| నరవర యమ్మేటి ముఖమునం బొడమ
ట భూ| సురుఁ డఖిలవర్ణములకు| గురుఁడు ముఖ్యుండు నయ్యె గుణరత్ననిధీ॥ క॥ ధర బ్రాహ్మణాదికము దు|ష్కరబాధం బొంద
కుండఁ గైకొని కావ| న్పురుషోత్తము బాహువుల| న్నరనాథకులంబు పుట్టెనయ తత్త్వనిధీ॥ క॥ గణుతింపఁగఁ గృషిగోర|క్షణ
వాణిజ్యాదికర్మకలితంబుగ నా| గుణనిధి యూరువులందుం| బ్రణుతింపఁగ వైశ్యజాతిప్రభవంబయ్యె౯॥ గీ॥ తివిరి సేవకధ
ర్ములై దేవదేవు| పదములను శూద్రసంతతు లుదయమయ్యె| వీరలందఱు దమతమవిహితకర్మ| ములరఁ జేయుచు జనకుండు
నాత్మగురుఁడు॥ క॥ అగు సర్వేశుఁ బరాత్పరు| జగదేకప్రభుని పాదజలజాతంబు| ల్దగిలి భజింతురు సతతము| నిగమోక్తి న్భ
క్తియోగనిపుణాత్మకులై॥ గీ॥ మహిమఁ దీపింపఁ గాలకర్మస్వభావ| శక్తిసంయుక్తుఁడగు పరేశ్వరుని భూరి| యోగమాయావి
జృంభణోద్యోగ మెవ్వఁ| డెఱిఁగి నుతియింపఁగా నోపు నిద్ధచరిత॥ ఉ॥ అన్యకథానులాపముల హర్నిశము న్బరియించి చాల
మా| లిన్యము నాత్మశోభన విలీనత నొందు మదీయజిహ్వ సా| జన్యముతోడఁ గ్రోలు హరి సద్గుణదివ్యకథామృతంబు స| న్మా
న్యచరిత్రమై నెగడు మద్గురువాక్యపదంబుఁ జెందఁగ౯॥ మ॥ హరినామాంకితసత్కథామృతరసవ్యాలోలుఁడై నట్టి సత్పు
రుషశ్రేష్ఠుఁడు సత్కథాలవణవాఃపూరంబుఁ దాఁ గ్రోలునే| వరమందారమరందపానకుతుకస్వాంత *ద్విరేఫంబు స|
త్వరమై పోవునె చేతి §వేములకుఁ దద్గంధానుమోదాత్మయై॥ క॥ హరిమహిమ ముదన్నాభీ| సరసిజసంజాతుఁడైన చతురా
ననుఁడు| న్వరికించి యెఱుఁగఁడనిన ని|తరమనుజుల జెప్ప నేల తత్త్వజ్ఞనిధీ॥ గీ॥ శ్రుతులు దమలోన వివరించి చూచి పుండరీక

---

†దత్తావధానుండవై| నిశ్చలచిత్తుఁడవై. ‡కండూయమానుండు| గోకుకొనుచున్నవాఁడు. *ద్విరేఫంబు| తుమ్మెద. §వేములకుఁ| వేపచెట్లకు.

లోచనును త్తమశ్లోకచరితు। నమరగణవంద్యమానపాదాబ్జయుగళు। వెదకి గనుఁగొనలేవం త్రు విమలమతులు॥ క॥ హరి
యుఁ దనమాయాగతిఁ। బరికించియుఁ గానఁడయ్యెఁ బరిమితి లేమి। న్మతిమాయావిసి మోహిని। చరితముఁ గనుఁగొందు రె
ట్లు చతురాస్యాముల్.క॥ ఆదివిజాధీశుఁడు మహా। దాములు దిక్పతులుఁ బంకజాసనుఁడున్నా। రీదయితుఁడు గనజాలని। శ్రీదేవు
నిపదయుగంబుఁ జింతింతు మదిన్॥ క॥ అని మైత్రేయుం డవ్విదు। రున కెఱిఁగించిన తెఱంగు రుచిరము గాన। గ్గునపాత్రు నకుఁ
బరాశర। మునివనునుం డెఱుఁగఁజెప్పె ముదము దలిర్పన్॥ వెండియు నిట్లనియె॥ క॥ భూమీశ్వర మైత్రేయమ। హాముని విదు
రునకు నిట్లు హరిగుణశుభలీ। లామాహాత్మ్యముఁ జెప్పిన। నా మైత్రేయునకు విదురుఁడనియె న్మఱియున్॥ క॥ అగుణునకు నిర్వి
కారికి। జగదవనోత్పవవినాశసత్కర్మములుం। దగు లీల లెట్లు లాతఁడు। సగుణుండై యుండు టెట్లు సౌజన్యనిధీ॥ సీ॥ అనియర్భ
కుని గతిననఘుని మైత్రేయమునిఁ జూచి విదురుఁ డిట్లనియె మఱల। బాలుఁడు గ్రీడావిలోలమానసమున దీపించు లీలానురూ
పుఁడగుచుఁ। గాని చోఁ గామానుగతుఁడై రమించును నర్భకుఁ డర్థి వస్త్వంతరమున। నర్భకాంతరమున నైనను బాల కేళీసం
గుఁడగుచు నోలి నిఁజరించు। హరియు నెపుడు నివృత్తుఁడత్యంత తృప్తుఁ। డగుట వర్తించు టెట్లు క్రీడాములందు। మఱియుఁ త్రి
గుణాత్మకంబైన మాయఁ గూడి। యఖిలజగములఁ గల్పించె ననుట యెట్లు॥ సీ॥ అమ్మాయ చేత నీయఖిలంబు సృజియించి పాలిం
చి పాలియించి పరమపురుషుఁ। డనఘాత్మ దేశకాలావస్థలందును నితరులయందు నసహీనమైన। జ్ఞానస్వభావంబుఁ బూనియా
ప్రకృతితో నెబ్బంగిఁ గలసెం దానేకమయ్యెఁ। గోరి సమస్తశరీరంబులందును జీవరూపమున వసించియున్న। జీవునకు మర్భగ
క్లేశసిద్ధి యెట్టికర్మమున సంభవించెను గడఁగి నాకు। చిత్తమున జ్ఞానము గ్గమస్థితిఁ గలంగి। యధికఖేదంబు నొందెడు ననఘచరి
త॥ వ॥ అదిగావున సూరిజనోత్తముండవైన నీవు మదీయమానసిక సంశయంబులఁ దొలంగింపనర్హుండవని విదురుండు మై
త్రేయ మహామునీంద్రు నడిగె నని బాదరాయణతనూభవుం డభిమన్యునందనునకిట్లనియె॥ క॥ సరసిరుహోదరు పదసంగళి।
చరితామృతపాన *కుతుకసంగంబున ని। ర్భరుఁడగు విదురునకు మునీ। శ్వరుఁడగు మైత్రేయుఁడనియె సజ్జనతిలకా॥ చ॥ విను
ము వితర్కవాదములు విష్ణు నిఫుల్లసరోజపత్త్రనే। త్రు నిఘనమాయ నెప్పుడు విరోధము సేయుఁబరేశు నిత్య సో। భనయుతు
బంధనాదికవిపద్దశలన్ గృపణత్వమెప్పుడే। ననయముఁ బొందలేవు విభుఁ డాద్యుఁ డనంతుఁడు నిత్యుఁ డౌటచేన్॥ మఱియును॥
చ॥ పురుషుఁడు నిద్రవోఁ గలలఁ బొందు సమస్తసుఖంబులాత్మసం। హరణశిరోవిఖండనములాదిగ జీవునికిం ¶ప్రబోధమం। దిరి
యఁగఁ దోఁచుచున్న గతి నాదిబరేశుఁడు బంధనామల। న్నొరయ కేత్వ మెట్లను చుబుద్ధిని సంశయము డెందనియున్॥ వ॥ అవ్వి
ధంబు తనికిం గలుగ నేరదదియెట్లంటేని॥ చ॥ లలితవిలోలనిర్మలజలప్రతిబింబితపూర్ణచంద్రము। దలమువిసంబు చాలనవిసం
బనహేతువు నొందియున్న యా। త్తలమునఁ గంపమొందని విధంబున సర్వశరీరధర్మము। ల్గని గిరమించునే తునకుఁ గల్గఁగ నేర
వు కర్మబంధముల్॥ వ॥ కావున జీవునకు ‡నవిద్యామహిమం జేసి కర్మబంధనాదికంబు సంప్రాప్తంబగుం గాని సర్వభూతాం
తర్యామియైన యీశ్వరునకుం బ్రాప్తంబుగా నేరదని॥ చ॥ నను నను నాత్మదేహజగుణంబులఁ బాపఁగ నోపునే జో। హరిచర
ణారవిందమహితస్ఫుటభక్తియు యింద్రియంబులీ। శ్వరవిషయంబులైన మదిసంచితనిశ్చలతత్త్వమైనచో। సరసిజనేత్రుకీ
ర్తనమె చాలు విపద్దశలం జయింపఁగన్॥ చ॥ హరిచరణారవింద యుగళార్చనసన్నుతిభక్తియోగముల్। నిరతము
గల్గువారు భవనీరజగర్భులకందరాని భా। సురపదముం దఁ జేరుదురు సూరిజనస్తవనీయ యట్టి స। త్పురుషులపూర్వజన్మఫ
లమున్ గణుతింపఁ దరంబె యేరికిన్॥ వ॥ అని చెప్పిన విదురుండు మైత్రేయుం గనుంగొని ముకుళితహస్తుండు వినమితమస్తకుం
డగుచుం దనమానసంబున శ్రీహరిం దలంచుచు వినయయుక్తవచనరచనుండై యిట్లనియె- మునీంద్రా భవదీయవాక్యంబులచే
త నామానసంబున నారాయణుండు లోకైకనాథుం డెట్లయ్యె నని యుశరీరధారియైన జీవునికిఁ గర్మబంధంబు లేరీతి సంభవించె
నని యును బొడమిన సంశయంబు నేఁడు నివృత్తం బయ్యె నెట్లనిన లోకంబున కీశ్వరుండు హరియని యు జీవుండు పరతంత్రుం
డనియును దలంపు మనారాయణభక్తి ప్రభావంబు ప్రాణిగోచరంబయిన యవిద్యకు నాశనకారణంబనం దనరుచుండు నా
రాయణుండు దనకు నాధారంబు లేక సమస్తంబునకుం దానయాధారభూతుండై విశ్వంబు పొదివియుండు దానుండు తెఱం
గెట్లు శరీరాభిమానంబును బొందియెవ్వఁడు మూఢతముండై సంసారప్రవర్తకుండగు నెవ్వండు భక్తిమార్గంబునఁ బరమా
త్ముండై నపుండరీకాక్షునిఁ జెందు- వీరలిద్దఱును సంశయక్లేశంబులు లేమిం జేసి సుఖానందపరిపూర్ణులయి యభివృద్ధిఁ నొందు
వారగుదు రెవ్వండు సుఖదుఃఖానుసంధానంబుచే లోకానుగతుండగుచుం బ్రమోద వేదనంబుల నొందున తండు దుఃఖా

*కుతుక। అధికసంతోషము— ¶ప్రబోధమందున్। జాగ్రదవస్థయందు— §ప్రతిబింబిత। ప్రతిఫలించిన— ‡అవిద్యా। మాయ.

త్రయుండగు నారాయణుభజనంబున సమస్తదుఃఖనివారణంబగు నని భవదీయచరణసేవానిమిత్తంబునఁ గంటిఁ బ్రపంచంబు ప్రతీతిమాత్రంబు గలిగియున్న నందుకుఁ గారణంబు లేకుండుటం జేసి తెలియని వాఁడనై వర్తింతు నని వేఁడియు॥ క॥ లలినామదిఁ దలఁపుము సువ్రతులు గోనియాడంగఁ దగిన తోయజనాభుం। డలవడ నల్పతపోనిరతులతలఁ బోతలకు మిగుల మగ్నభుండంచున్॥ సీ॥ ఇంద్రియంబులతోడ నెలమి నెప్పెడి మహదాదులనితరేతరానుషంగ। మునఁ జేసి వానియందొగి విరాడ్దేహంబు పుట్టించి యయ్యంతఁ జేపట్టి తాను। వసియించు నాతఁడు వరలసహస్రసంఖ్యాతంబులగు సమస్తకాంఘ్రిబాహు। కలితసత్పురుషునిఁ గా బ్రహ్మవాదులు పలుకుదు రావిరాట్ప్రభువునందు। భువనజాలంబులలఁ జడిఁ బొరయఁ జుండుఁ। బ్రాణదశకంబు సేంద్రియార్థములు నింద్రి। యాధిదైవతములు గూడ ననఘ త్రివిధ। మగుచు విప్రాదివర్ణములయ్యె నంచు॥ క॥ ఇలఁ బుత్రపౌత్రసంపద। గలిగిన వంశములతోడఁ గడుఁ జోద్యముగా। లలిఁ బ్రజ లేగతిఁ గలిగిరి। కలిగిన యాప్రజలచేఁ జగము లెట్లుండెన్॥ క॥ చతురతదీపించు ప్రజా। పతులకుఁ బతియనఁగ వెలయు పద్మాపతియే। గతిఁ బుట్టించెను స్రష్ట్రృ। ప్రతతులచే నవవిధప్రపంచము మఱియున్॥ గీ॥ వాని భేదంబులును మనువంశములును। మనుకులాధీశ్వరులును దన్మనుకులాను। చరితములు నే విభూతి నే జాడ నీని। నింతయును బుట్టఁ జేసె నాకెఱుఁగఁ బలుకు॥ క॥ సరవిం గ్రిందన్మీద। ధ్ధరణికిఁ గలలోకములను దత్త్వస్థితుల। న్వరుసం బరిణామంబులు। చిరకృప నెఱిఁగింపు నాకు సిద్ధచరిత్రా॥ క॥ సురతిర్యఙ్నరరాక్షస। గరుడోరగసిద్ధసాధ్యగంధర్వనభశ్చరముఖ[*]భవములు మునిపుం। జరగర్భ స్వేదజాండజముల దెలుంగన్॥ క॥ త్రిగుణప్రధానకంబులు। నగు నవతారములు పూర్ణమై వెలసిన యా। జగదుత్పత్తిస్థితిలయ। నిగమముల విధంబు వానినిలుకడ లుడగన్॥ క॥ చక్రాయుధసౌందర్యప। రాక్రమముఖగుణములును ధరామరముఖవ। ర్ణక్రమములు నాశ్రమధ। ర్మక్రియలును శీలవృత్తమత భావములున్॥ గీ॥ యోగవిస్తారమహిమలు యోగములును। జ్ఞానమార్గంబులును బరిజ్ఞానసాధ। నములునై యొప్పు సాంఖ్యయోగములు వికచ। జలజనయనకృతంబులౌ శాస్త్రములును॥ సీ॥ *పాషండధర్మంబు ప్రతిలోమకులవిభాగములు జీవులగుణకర్మములును। బలుకులగతులును గలిగెడిధర్మమోక్షములయందలి పరస్పరవిరోధ। ములు లేని సాధనములు భూమిపాలకనీతివార్తలు కండనీతిజాడము। సుబృహద్గ్యావంబులును విధానములును §పితృమేధములును పిత్ర్యవిసర్గ। గతులుఁ దారాగ్రహంబులుఁ గాలచక్ర। మునవసించిన నిలుకడలును వ్రతంబు। దానములుఁ దత్ఫలంబులుఁ దనరు ప్రబల। ధర్మములుఁ బ్రజలొనరించు కర్మములును॥ చ॥ వదలక భక్తజనావళికి వచ్చువిపద్దశ ధర్మములెవ్వరో। జడలని భాతుఁడేగతి నిసంతసమందెడు నెట్టి వారిఁ బెం। పొదవఁగఁ గానవచ్చునిలఁ పుల్ ప్రియశిష్యులు గొల్వ వారుస। మ్మదమునఁ గోరెడర్థములు మానుగ నెవ్విధి నెఱిఁగింతురిమ్ములన్॥ క॥ విలయాదిభేదములీనియ్యలఘు విభుర మేలు నెవ్వరం చితభక్తిన్। గొలుతురదెవ్వని తోను। ద్వఱికస్సుఖియించు జీవతత్త్వము మఱియున్॥ క॥ గోవిందునిరూపంబున। జీవబ్రహ్మలకునైక్యసిద్ధియు నెట్లౌ। భావనను పనిషదర్థం। బై వెలయు జ్ఞానమెట్టిదార్యస్తుత్యా॥ గీ॥ ఉచితమగు నట్టి శిష్యప్రయోజనములు। సజ్జనులచేత విజ్ఞానసాధనములు। నేమి పలుకంగఁ బడు వాని నెల్లనుఱియుఁ। బొలుచు వైరాగ్యమునఁ దగు పుంసభక్తి॥ గీ॥ ఇన్నియును దెలియ నానతియిచ్చి నన్ను। నర్థి రక్షింపు యజ్ఞదానాది పుణ్య। ఫలము వేదంబుచదివిన ఫలము నార్త। జనులఁ గాచిన ఫలముతో సమము గావు॥ క॥ అని విదురుఁ డుమైత్రేయుని। వినయంబునఁ దెలియ నడుగు విధమెల్లను వ్యాసునిసుతుఁడభిమన్యునినం। దనునకు నెఱిఁగించి మఱియుఁ దగనిట్లనియెన్॥ చ॥ ఇలఁ గలమానవావళికి నెల్లను దెంపక భజింపయోగ్యమై। వెలసిన పూరువంశము పవిత్రము సేయఁగఁ బుట్టిపద్మనా। కలితయశః ప్రసూనలతికా తతికిం బ్రతివాసరంబు పెం। పలరఁగ †ప్రోదివెట్టు మగడయ్య ముకుందకథామృతంబునన్॥ గీ॥ అల్పతరమైన సుఖముల నందుచున్న। జనులదుఃఖంబు మాన్పంగఁ జాలునట్టి। పుండరీకాక్షుగుణకథాప్రోక్తమైన। వితతనిగమార్థమగు భాగవతము నీకు॥ వ॥ ఎఱింగింతు వినుమనియిట్లనియె॥ సీ॥ అమ్మహాభాగవతామ్నాయ మొకనాఁడు గైకొని సప్తపాతాళలోకమందు। ¶నప్రతీకజ్ఞానినై వాసుదేవాఖ్యఁ బొలుచు సంకర్షణమూర్తి దివ్య। పురుషుఁడు సనుఁదానబుద్ధిలోఁ జూచుచు సలలిత ధ్యానముకుళిత నేత్రుఁ। డై సనందాఖ్యదయార్థంబుగను విచ్చి చూచిన వారు సంస్తుతులొనర్ప। నమరగఙ్గావగాహనులై యహీంద్ర। కన్య[‡]లార్ద్రజటాబద్ధకలితలగుచు। భర్తృవాంఛను బుద్ధిన ప్పరమపురుషుఁ। గదియ నే తెంచి తత్పాదకమలయుగము॥ క॥ సేవించి భక్తితో నా। నావిధపూజోపహారనతినుతులను నా। దేవుని హృదయము వడసిరి। యావేళ సనందనాదులమ్మహితాత్మున్॥ మ॥ ఘనసాహస్రకిరీట

[*] భవములు। ఉత్పత్తిక్రమములు—— *పాషండ। వేదబాహ్యులయొక్క—— §పితృమేధములు। పితృయజ్ఞములు—— †ప్రోదివెట్టు మగడయ్య। వృద్ధిఁ గలుగఁ జేయుచున్నాఁడు గదయ్యా—— ¶అప్రతీక। అసదృశమైన—— [**]అహీంద్రకన్యలు। నాగకాంతలు. [‡]ఆర్ద్ర। తడపఁ బడిన.

త్నవిలసత్కాంతప్రశుద్ధప్రభా। జనితోదగ్రరుచిప్రకాశితఫణాసాహస్రుఁడౌ దేవతా। వనరతౌచణురూపకృత్యము
లూగి స్వాంఛన్ప్రశంసించి వా।రనురాగస్ఖలితోక్తులొప్పనమురగ్ హర్షించి యా దేవుఁడుర్॥ గీ॥ భూరినిగమార్థసారవిచా
రము సుచుఁ।దనరు నీ భాగవతము సాదరతఁ బలికె।నలినభవసూతియైన సనత్కుమార। కునకు నెఱిఁగించె సాంఖ్యాయనునకు
నతఁడు॥ క॥ పరగ నతండంతఁ బరా।శరునకు నుపదేశమిచ్చె సన్మతి నతఁడు।న్సురగురునకొసఁగె నాతఁడు।గరమరుదుగ నా
కుఁ జెప్పెఁ గైకొని యేనుర్॥ క॥ నీకిప్పుడు వివరించెద।నాకర్ణింపుము సరోరుహాక్షుండగుసు।శ్లోకుని చరితామృతపరి।పాకుఁ
డవై ముదము గదురఁ జెలఁగుము విదురా॥ వ॥ ఇట్లు భవత్ప్రోక్తంబు ఋషిసంప్రదాయగతంబుఁ బురుషోత్తమస్తోత్రం
బుఁ బరమపవిత్రంబు భవలతాలవిత్రంబు నైన భాగవతకథాప్రపంచంబు,* శ్రద్ధాళుండవు భక్తుండవు నగు నీకు నుపన్యసిం
చెద వినుము॥ సీ॥ అనఘ యేకోదకమైయున్న వేళ §నంతర్నిరుద్ధానలదారువితతి। భాతిఁ జిచ్ఛక్తిసమేతుఁడై కపటనిద్రా
లోలుఁడగుచు ¶నిమీలితాక్షుఁడైన నారాయణుండంబుమధ్యమున భాసురసుధాఫేనపాండురశరీర। రుచులు సహస్రశి
రోరత్నరుచులతోఁ జెలిమి సేయఁగ నొప్పు శేషభోగ।తల్పమునఁ బవ్వళించియనల్పతత్త్వ।దృష్టిఁ జెన్నొందఁగా నద్వితీయుఁడ
గుచు।నభినుతుండయ్యుఁ గోర్కులయందుఁ బాసి।ప్రవిమలాకృతి నానందభరితుఁడగుచు॥ గీ॥ యోగమాయాపమానుఁడై
యుగసహస్ర।కాలపర్యంతమఖిలలోకములు మ్రింగి। పేర్చి మఱి కాలశక్త్యుపబృంహితమున।సమతసృష్టిక్రియాకలాప
ములఁ జగిలి॥ క॥ తన జఠరములోపల దాఁ।చిన లోకనికాయముల సృజించుటకును సా। ధనమగు సూక్ష్మార్థమునను।మునుఁ
గనుకాలానుగతరజోగుణమునంతన్॥ సీ॥ పుట్టించెఁ దత్క్షణంబునఁ బరమేశ్వరు నాభిదేశమునందు నళిననాళ।ముదయించెను
నయ్యబ్జయోరుహముకుళంబు గర్మబోధితమైన కాలమునందుఁ। దన తేజమునఁ బ్రవృద్ధంబైన జలము చే జలజాప్తు గతిఁ బ్రకా
శంబు నొందఁ। జేసి లోకాశ్రయస్థితిగతి నొప్పు నా।శ్రీవరు నాభిరాజీవమందు।నజకళౌకలితాంశంబు నిలిపె దాని। వలన నా
మ్నాయమయుఁడును వరగుణుండు।నాత్మయోనియునైన తోయజభవుండు।సరవి జతురాననుండు నా జననమొందె॥ గీ॥ అ
ట్టి డుదత్పద్మకర్ణికయందు నిలిచి। వికచలోచనుఁడై లోకవితతదిశలు। నంబరంబును నిజచతురాననములఁ।గలయఁ బరికిం
చి చూచుచుఁ గమలభవుఁడు॥ చ॥ అలఘుయుగాంతకాలపవనాహతసంచలదూర్మిజాలసం।కలితజలప్రభూతమగు నకంజ
ముదప్పనజాతకర్ణికా।తలమున నున్న తన్నుఁ విశదక్రియగన్గొని లోకతత్త్వమున్।న్నతిఁ దెలియంగ నోపక మనంబునఁ జాల విచా
రమొందుచున్॥ ఇట్లు వితర్కించె॥ ఉ॥ ఈ జలమందు నీకమలమేగతి నుద్భవమయ్యె నొంటినే।నీ జలజాతపీఠమున నేగతి నుంటి
నాఖ్యయెద్ది నా।కీజననంబు నొందుటకు నెయ్యది హేతువొ బుద్ధిఁ జూడ నే।యోజ నెఱుంగలేననిపయోరుహగర్భుఁడు వి
స్మితాత్ముఁడై॥ క॥ ఆవనజనాళమూలం।బావనములలోన నరసియుటకొఱకై।యావనజాతప్రభవుఁ।డావనరుహనాళ
వివరమందభిముఖుఁడై॥ మ॥ అతిగంభీరవిశాలవారినిధితోయాంతర్నిమగ్నాంగుఁడై చతురాస్యుండరుదివ్యవత్సరసహ
స్రంబబ్జమూలంబు సన్మతి నీక్షించియుఁ గానలేక భగవన్మాయామహత్త్వంబు వి।స్మృతిఁ గావింప భీతుఁడై మఱలఁ జేరెం
గన్సరోజాతమున్॥ గీ॥ అట్లు గ్రమ్మఱఁ జేరియయ్యబ్జపీఠ।మందు సష్టాంగయోగక్రియానురక్తిఁ।బవనుబంధించి మహిత
తపస్సమాధి।నుండి శతవర్షములు చనుచుండ నంత॥ గీ॥ అట్టి యోగజనితమయిన విజ్ఞానంబు।గలిగి యుండి దానఁ గమలనయ
ను। గానలేక హృదయకమలకర్ణికయందు। నున్నవానిఁ దన్నుఁ గన్నవానిఁ॥ మ॥ కనియెన్నిశ్చలభక్తియోగమహిమ
స్వంజాతగర్భుండు శో। భనచారిత్రు జగత్పవిత్రు విలసత్పద్మాకళత్రు న్సుధా। శనముఖ్యస్తుతిపాత్రు దానవచమూజై
త్రు న్దళత్పద్మనే। త్రు నవీనోజ్జ్వలనీలమేఘనిభగాత్రు న్సత్కిరాట్పత్రునిన్॥ మఱియు॥ చ॥ అలఘుఫణాతపత్రనిచయా
గ్రసమంచితనూత్నరత్ననిర్మలరుచి చేయు గాంతతమిరంబు నడంచియ కల్మషోల్లసజ్జలములఁ జేసియందు నవసారసనాళ
సితైకభోగము।గలిగిన శేషతల్పమున గైకొనియున్న మహాత్ము నెక్కనిన్॥ సీ॥ వరపీతకౌశేయపరిధానకాంతిసంధ్యాం
బుదరుచినిచయంబు గాఁగఁ। గమనీయనవహేమకలితకిరీటంబు రమణకాంచనశిఖరంబు గాఁగ। మానితమౌక్తికమాలి
కారుచిసానుపతితనిర్ఝరపరంపరలు గాఁగఁ। జెలువొందు నవతులసీదామకములు లాలిత తటజౌషధీలతలు గాఁగఁ। వరభు
జంబులు †నికటస్థవంశములుగఁ।బదములంగణపాదపప్రచయములుగ।లలితగతి నొప్పు మరకతాచలవిడంబి।తాత్మదేహం
బు గలుగు మహాత్ము హరిని॥ వ॥ మఱియు ‡నపరిచ్ఛిన్నంబు నిరుపమానంబు నిఖిలలోకసంగ్రహంబునతివిస్తార। వర్తులా

* శ్రద్ధాళుండవు। ఆసక్తిగలవాఁడవు.— § అంతర్నిరుద్ధానలదారువితతిభాతిన్। వృక్షసమూహములోపల నగ్ని యడఁగియున్నట్లు— ¶ నిమీలితాక్షుఁడైన। నేత్రములను ముకుళించినట్టి † నికటస్థవంశములుగన్। సమీపమందలి వెదుళ్లగుచుండఁగాను. ‡ అపరిచ్ఛిన్నంబు। విభాగింపఁగూడనిది.

యోరూపంబునై వివిధవిచిత్ర దివ్యమణివిభూషణంబుల నాత్మీయనిర్మలద్యుతిచేతం బ్రకాశంబు నొందంజేయుదివ్యదేహం
బునను వివిధంబులగు కామంబుల నభిలషించి విశుద్ధంబయిన వేదోక్తమార్గంబున భజియించుపురుషశ్రేష్ఠులకుం గామధేను
వనందగినపాదపద్మయుగంబు నళికఫలకవితతరుచినిచయంబులకు నోటువడి కృపాపాత్రుండై చంద్రుండు బహురూ
పంబులం బదసరోజంబుల నాశ్రయించెననం నొప్పుపదనఖంబులుం గమలాభూకాంతలకు *నుపధానరూపంబులనం దగి కదళీ
కాండస్తంభంబుల§డంబు విడంబించు నూరుయుగళంబుం గనకమణిమయ మేఖలాకలాపాభిరామంబుగ దంబకింజల్కశోభి
తపీతాంబరాలంకృతంబై విలసిల్లు కటిమండలంబు శృంగారవాహినీజలావర్తంబు నాఁబోలుపొందు నాభీవివరంబు ¶జఠ
రస్థనిఖిలబ్రహ్మాండశ్రీ ‡ముహుర్ముహురుద్భవవక్రశ్రీభూతంబనందగు మధ్యభాగంబు మహితముక్తాఫలమాలికావిరచితరంగవ
ల్లీవిరాజితంబును వనతులసీదామకిసలయాకల్పంబుం గుసుమమాలికాలంకృతంబు ఘనసారకస్తూరికాచందనవిలిప్తంబు గౌ
స్తుభరత్నప్రదీప్తంబు శ్రీవత్సలక్షణలక్షితంబై యిందిరకుం గేళీమందిరంబనం బొల్చు వక్షస్స్థలంబును సుఖకేళీసమారంభ
†పరిరంభణాంభోధిరాట్కన్యకాకరాంభోజకీలితకనకమణికంకణనికషంబులం బోలుపారు రేఖాత్రయవిరాజమాన
‖కంబుకంధరంబును సుహితానర్ఘ్యదివ్యమణిప్రభావిభాసితకేయూరకంకణముద్రికాలంకృతంబులైన బాహువులును సక
లలోకార్తినివారకదరహాసచంద్రికాధవళితంబులై కర్ణకుండలమండితమణిమరీచులు నర్తనంబులు సలుపం దనరినిద్దంబు
లగు చెక్కుటద్దంబులుం బరిపక్వబింబఫలప్రవాళపల్లవారుణాధరంబు నఖిలభువనపరిపాలనంబునకు నేనచాలుదునని
వాదించునయనయుగళంబునకు సీమాస్తంభంబుం జంపకప్రసూనరుచివిభాసంబునగు నాసాదండంబుం గమలకుముదం
బులకుం బెంపుసంపాదించుచుం గరుణామృతతరంగితాపాంగంబులై కర్ణాంతవిశ్రాంతంబులై చెలువొందు నేత్రంబులు
సలలితశ్రీకారంబునకు నక్షరత్వంబు సార్థకంబయ్యెననం జనుకర్ణంబులు నిక్షుచాపు చాపద్వయరూపంబులం జూపట్టు
భ్రూయుగళంబును బగపటొప్పమీఱ శశాంకశంకాస్పదఫాలఫలకంబు నీలగిరీంద్రశృంగసంగతబాలమార్తాండమండలవిడం
బితపద్మరాగమణిఖచితకాంచనకిరీటంబు చేఁబొలుపారి సూర్యేందుపవనానలప్రకాశంబులకు నవకాశంబు చూపక త్రి
లోకవ్యాపకసముగ్రంబులగు తేజోవిశేషంబులుం గలిగి సంగరరంగంబుల దానవానీకంబుల హరింపం జాలు సుదర్శనాదిది
వ్యసాధనంబుల చేమరాసదంబగు దివ్యరూపంబునుం గలిగి మఱియు॥ ఉ॥ హారకలాపపుష్పనిచయంబులఁ జంచదనర్ఘ్యర
త్నకేయూరకిరాంగుళీయక మహోజ్జ్వలబాహుసహస్రశాఖిలో।ప్పారఁగఁ జూడనొప్పి భువనాత్మకలీలల దృష్టమూ
లపై। స్ఫారితభోగివేష్టితవిభాసితచందనభూరుహాకృతిన్॥ మ॥ విలసత్కుండలిరాజసఖ్యమున నుర్వీభృత్సమాఖ్యన్సము।
జ్జ్వలితోదారశిరోవిభూషణసహస్రస్వర్ణకూటంబులన్।సలిలావాసతఁ జారుకౌస్తుభవిరాజద్రత్నగర్భంబునన్। నళినా
క్షుండు గనుంగొనంగఁ దగె మైనాకావనీభృద్గతిన్॥ క॥ వితతార్థజ్ఞానిజన।స్తుతిమకరందప్రహృష్టశ్రుతిజాతమధు।వ్రత
గణపరివృతశోభా। గతకీర్తిప్రసవమాలికుఁ గలవానిన్॥ కనుంగొని చతురాననుండు॥ సీ॥ అనఘు సర్వేశ్వరు నాద్యంత
శూన్యునిధన్యుని జగదేకమాన్యచరితుఁ। దన్నాభిసరసికోద్భవసరోజంబున నప్పలననిలునినంబరమును।మానితభువనని
ర్మాణదృష్టిసిం బొడగనేఁగాని యితరముఁ గానలేక। యాత్మీయకర్మబీజాంకురంబును రజోగుణయుక్తుఁడగుచు నకుంఠిత
ప్రజాభిసర్గాభిముఖతనవ్యక్తమార్గుఁ। డయిన హరియందుఁ దన హృదయంబుఁ జేర్చి। యమ్మహాత్మునిఁ బరమునననంతున
భవు నజు నమేయుని వేగ నిట్లని నుతించె॥ సీ॥ నలినాక్షు మాయాగుణవ్యతికరమునఁ జేసి గార్యంబైన సృష్టిరూప। మునఁ బ్ర
కాశించు నీ ఘనరూపవిభవంబు రూపింప దేహధారులకు ⁂దుర్వి। భావ్యంబు దలపోయ భగవంతుఁడవునయిన పద్మాక్ష నీస్వ
రూపంబుకంటె। నన్యమొక్కటి సత్యమై బోధకంబైన యది లేదు కాన నీయతులదివ్య। మైనరూపంబు నాకుఁ బ్రత్యక్షమ
య్యె।నదియుఁ గాక వివేకోదయమునఁ జేసి।వరద నీరూపమజ్ఞానగురుతమోని। వారకంబయ్యె నాకు శశ్వత్ప్రదీప॥ క॥ ఘన
సత్పురుషానుగ్రహ। మునకై యమితావతారమూలంబగుచుం। దనరెడి నీరూపము శో।భనమగు భవదీయనాభిపద్మము వ
లనన్॥ క॥ జననంబందిన నాచే। ననయము మొదల నెగృహీతమయ్యె జగత్పా।వన నీమనుస్స్వరూపము। ఘనరుచిరంబై స్వ
యంప్రకాశకమగుటన్॥ వ॥ మఱియు జ్ఞానానందపరిపూర్ణమాత్రంబున నావృతప్రకాశంబు భేదరహితంబుఁ బ్రపం
చజనకంబుఁ బ్రపంచవిలక్షణంబు భూతేంద్రియాత్మకంబు నేకంబునైనరూపంబు నొందియు నెందునుం బొడఁగాననట్టిని

---

*ఉపధాన।దిండు— §డంబు విడంబించు।కాంతిని ప్రకటనజేయుచున్న— ¶జఠరస్థ।గర్భమందున్నట్టి— ‡ముహుర్ముహురుద్భవ।మాటిమాటికిపుట్టించుటవలన— †పరిరంభణ।ఆలింగనము— ‖కంబుకంధరము।మూఁడు రేఖలుగలకంఠము— ⁂దుర్విభావ్యంబు।భావింపనశక్యమైన.

నాశ్రయించెదనదియునుంగాక జగన్మంగళస్వరూపధరుండవై నీయుపాసకులమైన మా మంగళంబులకొఱకు నిరంతర
ధ్యానంబుచేత నీదివ్యరూపంబునం గానంబడితివి యిట్టి నీవు ‡నిరయభాక్కులై నిరీశ్వరవాదంబునం జేసి కుతర్కంబులు
ప్రసంగించు భాగ్యరహితులచేత నాదృతుండవు గావు మఱియుం గొందఱు గృతార్థులైన మహాత్ములు భవదీయశ్రీచరణా
రవిందగంధంబు వేదమారుతానీతంబగుటం జేసి తమతమ కర్ణకుహరంబులచేతం గ్రహింతురు వారల హృదయకమలం
బులందు భక్తిపారతంత్ర్యంబున గృహీత పాదారవిందంబులుగలిగి ప్రకాశింతువదియునుంగాక ప్రాణులకు ద్రవ్యా
గార సుహృన్నిమిత్తంబయిన భయంబు దన్నాశ నిమిత్తంబయిన శోకంబు ద్రవ్యాది స్పృహయుం దన్నిమిత్తంబ
యిన పరిభవంబు మఱియు నంతం దృష్ణయు నది ప్రయాసంబున లబ్ధంబయిన నార్తిమూలంబగు దదీయంబయిన
పృథాగ్రహంబు నీశ్రీపాదారవిందంబులందు వైముఖ్యం బెంతకాలంబుగలుగు నంతకాలంబును బ్రాప్తంబగుంగా
ని మానదాత్మనాయకుండవగు నిన్ను నాశ్రయించిన భయనివృత్తి హేతువగు మోక్షంబుగలుగు మఱియుం గొం
దఱు సకలపాపనివర్తకంబయిన త్వదీయ నామస్మరణకీర్తనంబులందు విముఖులయి కామ్యకర్మప్రావీణ్యంబునం జేసి
నష్టమతులై యింద్రియపరతంత్రులై యమంగళంబులైన కార్యంబులు సేయుచుందురు దానం జేసి వాతాదిత్రిధాతు
మూలంబైన క్షుత్తృడాదులచేత శీతోష్ణవర్ష వాతాదిదుఃఖంబులచేత నతిదీర్ఘంబైన కామాగ్నిచేత నవిచ్ఛిన్నంబగు క్రో
ధంబుచేతం దప్యమానులగుచుందురు వారలం గనిన నాచిత్తంబు గలంకంబొందు జీవుండు భవదీయమాయాపరిభ్రామ్యమా
ణుండై యాత్మ వేఱని యెప్పుడు దెలియనంతకాలంబు నిరర్థకంబై దుస్తరంబైన సంసారసాగరంబు దరియింపం జాలకుం
డు సన్మునీంద్రులైనను భవదీయ నామస్మరణంబులు మఱచి యితరవిషయాసక్తులై రేసి వారలు దివసంబులందు వ్యర్థ
ప్రయత్నులై సంచరించుచు రాత్రి నిద్రాసక్తులై స్వప్నగోచరంబైన బహువిధసంపదలకు నానందించుచు శరీర ¶ప
రిణామాదిపీడలకు దుఃఖింపుచు ప్రతిహతంబులైన యుద్యోగంబుల భూలోకంబున సంసారులై వర్తింతురు నిష్కామబుద్ధులై ని
న్ను భజియించు సత్పురుషుల కర్ణమార్గంబులం బ్రవేశించి భవదీయ భక్తియోగపరిశోధితంబైన హృత్సరోజ కర్ణికాపీఠం
బున వసియింతువదియునుంగాక ॥మ॥ వరయోగీంద్రులు యోగమార్గముల భావంబందు నే నీ మనోహరరూపంబులం ది
వ్యగుణగణధ్యానంబుఁ గావింతురు । స్వరుచశ్రేష్ఠపరిగ్రహంబునకునై బొల్పారెడు ధ్యానగో । చరమూర్తిం ధరియింతు గా
దె పరమోత్సాహుండవై మాధవా ॥ గీ॥ అరయ నిష్కామధర్ములై నట్టి భక్త । లందు నీవు ప్రసన్నుండవై నరీతి । స్వాదయము
బద్ధకాములై యున్న దేవ । గణములందుఁ బ్రసన్నత గలుగ దీవు ॥ చ॥ అరయ సమస్త జీవహృదయంబులయందు వసించి యొప్పి
నై । పరగియునంతరాత్మ సఖభావసుధర్ముఁడవున్న రాపరే । శ్వరుఁడవునై తనర్చుచును సజ్జనదుర్లభమైనయట్టి సుస్థిరమగు స
ర్వభూతదయచేఁ బొడఁగానఁగవచ్చు త్వమచ్యుతా ॥మ॥ క్రతుదానోగ్రతపస్సమాధిజపసత్కర్మాగ్నిహోత్రాఖిల । వ్ర
తచర్యాదుల నాదరింపవఖిలవ్యాపారపారాయణ । స్థితి నొప్పారెడి సాదపద్మయుగళీ సేవాభిపూజాసమ । ర్పితధర్మంబ
గువాని భంగినసురారీ దేవ చూడామణీ ॥గీ॥ తవిలి శశ్వత్స్వరూపమై తన్మహోరు । మహిమచేత §నపాస్త సమస్త భేద । మో
హుఁడవఖిలవిజ్ఞానమునకు నాశ్ర । యుండవగు నీకు మ్రొక్కెద నోరమేశ ॥ క॥ జననస్థితివిలయంబుల । కి నయంబున
హేతుభూతమగుమాయాలీ । లనుఁ జెందిన నటన సలిపెడు । ననఘాత్మక నీకొనర్తు నభివందనముల్ ॥ సీ॥ అనఘాత్మ హంభవ
దవతారగుణకర్మఘనవిడంబన హేతుకంబులయిన । రమణీయమగు దాశరథివాసుదేవకుమారాది దివ్యనామంబులెల్ల । వెం
యంగ మనుజులు వివశాత్ములై యవసానకాలంబున సంస్మరించి । జన్మజన్మాంతర సంచితదురితంబుఁ బాసి కైవల్యసం
ప్రాప్తులగుదు । రట్టిదివ్యావతారంబులవతరించు । నజుఁడవగు నీకు మ్రొక్కెద ననఘచరిత । చిరశుభాకారనిత్యలక్ష్మీవిహార
భక్తమందారమత్సరభవవిదూర ॥ తరల॥ జననవృద్ధివినాశహేతుకసంగతింగల యేను నీవును హరుండు ద్రిశాఖలై ఘన
పుష్కరీచిముఖాసురు । ల్వానరనంచుప శాఖలై చెలువొందుమనింత కుమూలనై । యనయము న్భువనద్రుమాకృతివై ననీకిదె
మ్రొక్కెదన్ ॥మ॥ పురుషాధీశ భవత్పదాబ్జయుగళీపూజాదికర్మక్రియా । పరతం జెందనిమూఢచిత్తుని బలుం బ్రాయుస్స
నుష్యాధము । న్జరయన్నంతమునొందఁ జేయునతిదక్షుం బైన కాలంబుదు । స్తరుకాలాత్ముఁడవైన నీకు ముదిసంతోషంబున
న్మ్రొక్కెదన్ ॥సీ॥ సర్వేశ కల్పాంత**సంస్థానమగు జలసంజాతమందేను సంభవించి । భవదీయ సుస్వరూపముఁ జూడ నర్థిం
చి బహువత్సరములు తపంబు సేసి । క్రతుకర్మములు పెక్కు గావించియును నినుఁ బొడఁగానఁగాలేక బుద్ధిభీతిఁ । బొందిన నా

‡నిరయభాక్కులై = నరకము ననుభవించువారై. —¶పరిణామము = వికారము. —§అపాస్త = నాశనము గావింపఁబడిన —** సంస్థాన = ఉన్న.

కనిప్పుడుసనిర్హేతుకకరుణ చేనఖిలలోకైకవంద్య।మానసతతప్రసన్నకోమలముఖాబ్జ। కలితభవదీయదివ్యమంగళవిలా
స।మూర్తిఁదర్శింపఁగలిగెభక్తార్తిహరణ।కరణతుభ్యంనమోవిశ్వభరణదేవ ॥ సీ ॥ అమరతిర్యఙ్మనుష్యాదిచేతనయో
నులందునాత్మేచ్ఛఁజేఁజెందినట్టి। కమనీయశుభమూర్తిగలవాఁడవై ధర్మసేతువనంగఁబ్రఖ్యాతినొంది।విషయసుఖంబు
లవిడిచిసంతతనిజానందానుభవసమున్నతిఁదనర్తు। వదిగానఁబురుషోత్తమాఖ్యఁజెన్నొందుమువట్టినిన్నెప్పుడునభినుతిం
తు।నర్థిభవదీయపాదంబులాశ్రయింతు।మహితభక్తినినీకునమస్కరింతు। భక్తజనపోషపరితోషపరమపురుష।ప్రవిమ
లాకారసంసారభయవిదూర॥ సీ॥ *తలకొనిపంచభూతప్రవర్తకమైనభూరిమాయాగుణస్ఫురణఁజిక్కి। వడకలోకం
బులుభవదీయజఠరంబులోనిల్పిఘనసమాలోలచటుల। సర్వంకషోర్మిభీషణవార్ధినడుమనుఫణిరాజభోగతల్పంబునం
దు।యోగనిద్రారతినుండంగనొకకొంతకాలంబుచనఁగమేల్కనినవేళ।నలఘుభవదీయనాభితోయజమువలనఁ।గడఁగి
యుల్లోకములసో‡పకరణములుగఁ।బుట్టఁజేసితివతులవిభూతిమెఱసి। పుండరీకాక్షసంతతభువనరక్ష॥ క॥ నిగమస్తుతల
క్ష్మీపతి।జగదంతర్యామివగుచుసర్గములెల్ల।న్దగుభవదైశ్వర్యంబున।నగణితసౌఖ్యానుభవమునందింతుగదే॥ సీ ॥ జలజా
క్షమెట్టివిజ్ఞానబలంబునఁగల్పింతువఖిలలోకంబు §లోలి। నతజనప్రియుఁడవునాకట్టిసుజ్ఞాన ¶మర్థిమైఁగృపసేయుమ
య్యవరద।సృష్టినిర్మాణేచ్ఛఁజెందినాచిత్తంబుదత్కర్మకౌశలత్వమునఁదగిలి। యనుగర్మవైషమ్యమునుబొందకతమున
మరితంబుఁబొరయకతొలఁగునట్టి। †వెరవునాకెట్లుగలుగునవ్విధముదలఁచి। కర్మవర్తుననుభవత్కరుణమెరసి।తగఁ
గృతార్థునిఁజేయుము నిగమవినుత।సత్కృపామూర్తియో దేవచక్రవర్తి॥ చ॥ భవమదరప్రభూతమగుపద్మమునందున
సంభవియున్ననే।నవిరళ ‖తావకీనకలితాంశమునఁదనరారువిశ్వము।న్దవిలిరచింపుచున్బహువిధంబులఁబల్కెడివేదజా
లము। ల్నివతరమైఫలింపఁగృపసేయుముభక్తఫలప్రదాయకా॥ చ॥ అనియనుకంపదోఁపవినయంబునఁజాగిలిమ్రొక్కి
చారులో।చనసరసీరుహుండగుచుసర్వజగత్పరికల్పనారతిం।దనరిననన్నుఁబ్రోచుటకుఁదానిటుసన్నిధియైనయీశ్వరుఁ।
డనయమునామదుఃఖముదయామతిఁబాపెడునంచునమ్రుఁడై॥ క॥ వనరుహసంజాతుఁడునెమ్మనమునహర్షించెననుచు
మైత్రేయమహా।మునిఘనుఁడగువిదురునకు।న్వినయంబుననెఱుఁగఁజెప్పవెండియుఁబలికెన్॥ మ॥వనజాతప్రభవుండు
గేవలతపోవ్యాసంగుఁడైపద్మలో।చనుగోవిందుననంతునాద్యుఁడనవాక్ఛక్తిన్నుతింపన్సుధా।శనవంద్యుండుప్రసన్నుఁడై
నిఖిలవిశ్వస్థాపనాలోకనం।బునఁజూచెన్విలయప్రభూతబహువార్పూరంబులన్ ‖‖వ్రేల్మిడిన్॥ గీ॥అట్లుపొడగనియా
ర్తుఁడైనట్టిపద్మ।భవునివాంఛితమాత్మఁదీర్పంగఁదలఁచి। యతనిమోహనివారకమైనయట్టి। యమృతరసతుల్యమధురవా
క్యములననియె॥ చ॥ తలకొనినీయొనర్చుపనిదప్పనుదింతలపోయుదుఃఖము।దలఁగుమునామలీలఁబ్రధానగుణంబగుసృ
ష్టికల్పనం। బలవడఁజేయుబుద్ధిహృదయంబునఁజొన్పితపస్సమాధిని। స్థలనతిభక్తిలన్నన్ఁబ్రసన్నునిఁజేయుముచెందుఁ
గోరికల్॥ క॥ నీవునరించుతపోవి।ద్యావిభవవిలోకనీయమగునీసృష్టి।న్గావింపుములోకంబుల।లోవెలిగెడినన్నుఁగందు
లోకస్తుత్యా॥ క॥నాలోనిజీవకోటులు।వాలాయమునీకుఁగానవచ్చునిపుడునీ।వాలోకింపుముదానవి।లోలహుతాశను
నికరణిలోకస్తుత్యా॥ సీ ॥నలువొప్పనఖిలజీవులయందుఁగలనన్నుఁదెలిసిసేవింపుమునలినగర్భ। భవదీయదోషముల్బా
యుభూతేంద్రియవ్యతిరిక్తమైశుద్ధమైనహృదయుఁ।డైనజీవునివిమలాంతరాత్ముఁడనైననను నేకముగఁజూచునరుఁడు
మోక్షపదమార్గవర్తినై భాసిల్లుబ్రహ్మాండమందులవివిధకర్మానురూప।పక్షులఁజేసిపెక్కురూపములనొందు।జీవతతిర
చియించునీచిత్తమెపుడు।మత్పదాంబుజయుగళంబుమఱిగియున్న।కతనరాజసగుణమునఁగలుగదఘము॥ క ॥ వినుమదీ
యుఁగాకప్రాణుల। కనయమునెఱుఁగంగరానియనఘుఁడతేజో। ధనుఁడపరేశుఁడనీచే। తనుగానంబడితినిదెపితామ
హాకంటే॥ వ॥మఱియుభూతేంద్రియగుణాత్మండనియుజగన్మయుండనియునన్నునీచిత్తంబునందుఁదలంపుము తామరస
నాళవివరపథంబువెంటంజనిజలంబులలోనంజూడంగోరునట్టిమదీయస్వరూపంబు॥ క॥నీకిప్పుడుఁగానంబడె।♣నాకులకు
ననురగపతిపినాకులకైనన్।వాక్రువ్వందలపోయన్।రాకుండుమదీయరూపరమణీయంబుల్॥ క॥ కావునమచ్చారిత్రక।
థావిలసితమైనసుమహితస్తవముజగ।త్పావనమువిగతసంశయ। భావుఁడవై బుద్ధినిలుపుపంకజజన్మా॥ క ॥ సగుణుఁడ
నైలీలార్థము।జగములఁగల్పింపఁదలఁచుచతురునినన్ను।న్సగుణునిఁగానుతియించితి।తగసంతసమయ్యెనాకుఁదామరసభ

---

*తలకొని।అత్యంతము— ‡ఉపకరణములు।పనిముట్లు— §ఓలి।వరుస— ¶అర్థిమైన్।ప్రీతితోడ— †వెరవు।ఉపాయము—
‖తావకీనకలితాంశమునన్।నీసంబంధమైనయొప్పెడునంశముచేత— ‖‖వ్రేల్మిడిన్।శీఘ్రముగాను— ♣నాకులకున్।దేవతలకు.

వా॥ క॥ ఈ *మంజుస్తవరాజము। నీమనమునఁ జింతఁ దక్క నిలుపుము భక్తిన్। ధీమహిత నీమనంబునఁ। గామించిన కోర్కు లె
ల్లఁ గలుగుం జుమ్మీ॥ క॥ అనుదినము ద్రిజగత్పా। వనమగు నీ మంగళస్తవంబుఁ బఠింపన్। వినిన సుజనులకు నేఁ బొడఁ। గనఁబడు
దు ‡నవాప్తసకలకాముఁ డనగుచున్॥ గీ॥ వనతటాకోపవనయజ్ఞవివాహ దేవ। భవననిర్మాణభూమ్యాదివివిధదాన। జపతపో
వ్రతయోగయజ్ఞములఫలము। ¶మామక స్తవఫలముసమంబు గావు॥ క॥ జీవావలిఁ గల్పించుచు। జీవావలిలోనఁ దగవసించు
చుఁ బ్రియవ। స్త్వావలిలోపల బ్రియవ। స్త్వావలి నైయుండు నన్ను ననిశముఁ బ్రీతిన్॥ క॥ తలఁపుము మత్ప్రీతికై। కలిగించితిని
న్ను భువనకారణనాలో। పలనడఁగియేక మైనిశ్చలగతి వసియించియున్న జగముల నెల్లన్॥ గీ॥ తగనహంకారమూ
లతత్త్వంబునొంది। నీవు పుట్టింపు మనుచు రాజీవభవుఁడు। వినఁగ నానతియిచ్చి యవ్విష్ణుఁ డభవుఁ। డంతనంతర్హితుం డయ్యె
ననఘచరిత॥ క॥ అని చెప్పిన మైత్రేయునిఁ। గనుఁగొని విదురుండు వలికెఁ గడు ముద మొప్పన్। జననుతనలినదళాక్షుఁడు।
సనినం బ్రహ్మజుఁడు దేహసంబంధమునన్॥ క॥ మానససంబంధంబును। బూనినయీసర్గ మెట్లు పుట్టించెదయాం। భోనిధి వైనా
కింతయు। మానుగ నెఱిఁగింపు మయ్య మహితవిచారా॥ వ॥ అనవుడు నమ్మునివరేణ్యుండు విదురున కిట్లనియెఁ బుండరీకాక్షు
వరదానప్రభావంబునం బంకజాసనుండు శతదివ్యవత్సరంబులు భగవత్పరంబుగాఁ దపంబుఁ గావించి తత్కాలవాయువు
చేఁ గంపితంబగు నిజనివాసంబయిన పద్మంబును జలంబుఁ గనుంగొని యాత్మీయ తపశ్శక్తి చేత నభివృద్ధిం బొందిన విద్యాబలం
బున వాయువుతోడఁ దోయంబు సమస్తంబును గ్రోలియంత గగనవ్యాపియగు జలజంబును గనుంగొని॥ ఉ॥ వారిజసం
భవుండు బుధవంద్యుఁడు చిత్తమునం దలంచె దై। త్యారిఁ బయోవిహారి §సముదంచితహారి ‖జనతాఖిలామృతా। హారిర
మాసతీహృదయహారి నుద్ధారివికారభూరిసం। సారిభవప్రహారి విలసన్నుతసూరి నఘారి నయ్యెడన్॥ గీ॥ అట్లు దలఁచి స
రోజజుఁ డంబుజమును। గగనతలమునఁ జూచియా కమలకోశ। లీనమై యున్నలోకవితానములను। నెయ్యఁ బొడగని హరి
చేనియుక్తుఁ డైన॥ గీ॥ వానిఁ గాఁదనుఁ దలఁచి యవ్వనరుహంబు। లోపలికిఁ బోయి మున్నందులోన నున్న। ముజ్జగంబులఁ జూ
చి యిమ్మ[illegible]ల సృజించె। మఱి చతుర్దశభువనములు మహిమఁ జేసె॥ క॥ మఱియు సుధాశనతిర్య। జ్నరవివిధస్థావరాదినానాసృష్టి।
స్ఫురణ నజుం డొనరించెం। బరువడి నిష్కామధర్మఫలరూపమునన్॥ వ॥ ఇట్లు భువనంబులఁ బద్మజుండు గల్పించెనని మైత్రే
యుండు విదురున కెఱింగించిన॥ క॥ విదురుఁడు దురితావనిభృ। ద్భిదురుఁడు మునివరునిఁ జూచి ప్రియము మనమున। న్గదురఁగ
నిట్లని పలికెన్। తిమిరాంతంబయిన విష్ణుదేవుని మహిమన్॥ గీ॥ అమరభువనంబులతని కాలాఖ్యతయును। గణుతి సేయఁ దదీయ
లక్షణములర్థి। నాకు నెఱిఁగింపుమయ్య వివేకచరిత। యనిన మైత్రేయుఁ డవ్విదురునకు ననియె॥ సీ॥ ✱ఆద్యంతశూన్యంబున
ద్వయంబై తగుతత్త్వ †మింతకు నుపాదాన మగుట। గుణవిషయములు గైకొని కాలమును మహదాదిభూతములు దన్నాశ్ర
యింపఁ। గాలానురూపంబుఁ గైకొని యీశుండు దనలీలకై దనుఁ దా సృజించెఁ। గరమొప్ప నఖిలలోకములందుఁ దానుం
డుఁ దనలోన నఖిలంబు దనరుచుండుఁ। గాన విశ్వమ్మునకుఁ గార్యకారణములు। దాన యమ్మహాపురుషుని తనువువలనఁ। బాసి
విశ్వంబు వెలిమై ప్రభాసమొందె। మానితాచార యీవర్తమానసృష్టి॥ క॥ తెరఁగొప్పన నఖిలవిశ్వము। పురుషోత్తము దేహ
మందుఁ బుట్టుం బెరుగున్। విరతిం బొందుచునుండుం। గరమర్థిన్ భూతభావికాలములందున్॥ వ॥ అట్టి సర్గంబు నవవిధంబం
దుఁ బ్రాకృతవైకృతంబులుగాల ద్రవ్యగుణంబులను త్రివిధంబులగు భేదంబులచేఁ బ్రతిసంక్రమంబులగుచునుండు నందు
మహత్తత్త్వంబు ప్రథమసర్గం బది నారాయణ సంకాశంబును గుణవైషమ్యంబు నొందు ద్రవ్యజ్ఞానక్రియాత్మకంబయిన
యహంకారతత్త్వంబు ద్వితీయసర్గంబు శబ్దస్పర్శరూపరసగంధంబులను పంచతన్మాత్ర ద్రవ్యశక్తియుక్తంబయిన పృథివ్యా
దిభూతసర్గంబు మూఁడవదియయి యుండు జ్ఞానేంద్రియంబులయిన త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులు గర్మేంద్రి
యంబులైన వాక్పాణిపాదపాయూపస్థలను దశవిధేంద్రియజననంబు చతుర్థసర్గంబు సాత్త్వికాహంకారజనితంబైన మ
నోమయయను మనోగణసర్గంబెయ్యైదవసర్గంబై యొప్పు జీవలోకంబులకు నబుద్ధికృతంబులైన ‡యావరణవిక్షేపంబు
లం జేయు దామససర్గంబాఱవదై యుండు నియ్యాఱును ఈశ్వరునకు లీలార్థంబులైన ప్రాకృతసర్గంబులయ్యె నింక వైకృతస

---

*మంజు। మనోహరమైన — ‡ఆవాప్త। పొందింపఁబడిన — ¶మామక। నాయొక్క — §సముదంచితహారిక। అతిసుందరములగు ముక్తికాది హారములుగలవాని — ‖జనతాఖిలామృతాహారిక। పాపాత్కాంతుఁడై సకలజనులచే మోక్షమును అనుభవింపఁజేయువాని — ✱ఆద్యంతశూన్యంబు। జననమరణములు లేనట్టి — †ఇంతకు నుపాదానమగుటన్। ఘటశరావాదులకు మృత్తికవలెనకలప్రపంచమునకును ముఖ్యకారణమగుటవలన. ‡ ఆవరణవిక్షేప। ఆవరణశక్తి। అనఁగా మఱపు — లేక నిద్ర — విక్షేప। జాగ్రత్స్వప్నములయందు భేదబుద్ధినిగలుగఁజేయునవి.

ర్గంబు నేఁడవది మొదలుగాఁ గలుగునది విని పింతు వినుము పుష్పోత్పత్తిరహితంబులై ఫలించెడు నశ్వత్థో*దుంబర పనస §న్యగ్రోధాదులైన ‡వనస్పతులును బుష్పితంబులై ¶ఫలపాకాంతంబులయిన వ్రీహియవముద్గాద్యోషధులు వారోహణానపేక్షంబులైన మాలతీమల్లికాదిలతలుఁ ద్వక్సారంబులైన వేణ్వాదులుఁ గఠినీభూతమూలంబులుఁ శిఖావిస్తృతంబులున్నగు లతావిశేషరూపంబులైన ||వీరుధంబులుఁ బుష్పవంతంబులై ఫలప్రాప్తంబులగు చూతాశోకాది ద్రుమంబులును వ్యక్తచైతన్యంబులు నూర్ధ్వస్రోతంబులు నంతస్పర్శంబులై తమఃప్రాయంబులైన స్థావరంబులగు నీయాఱు నేఁడవసర్గంబయ్యె నెనిమిదవసర్గం బిరువదియెనిమిది భేదంబులు గలిగి స్వస్తానాదిజ్ఞానశూన్యంబులై యాహారాదిజ్ఞానమాత్రనిష్ఠంబులై ఘ్రాణంబువలన నెఱుంగం దగిన దాని నెఱుంగుచు హృదయంబున దీర్ఘానుసంధానరహితంబులై వర్తించు ద్విశఫంబులుం గల వృషభ మహిషాజ కృష్ణ సూకరోష్ట్ర గవయ రురు మేషముఖరనవకంబు నేకశఫంబులుం గల ఖరాశ్వాశ్వతర గౌర శరభ చమర్యాది షట్కంబుఁ బంచనఖంబులుం గల శునక సృగాల వృక వ్యాఘ్ర మార్జార శశ శల్యక సింహ కపి గజ కూర్మ గోధముఖ భూచర ద్వాదశంబు మకరాదిజలచరంబులుఁ గంక గృధ్ర బక శ్యేన భాస భల్లూక బర్హి హంస సారస చక్రవాక కాకోలూకాది ఖేచరంబులు మొదలగునది తిర్యక్సర్గంబయ్యె నర్వాక్స్రోతంబై యేకవిధంబగు మానుషసర్గంబు రజోగుణప్రేరితంబై కర్మకరణదక్షంబై దుఃఖంబందును సుఖంబు గోరునది తొమ్మిదవసర్గంబనందగునని చెప్పి యీ త్రివిధసర్గంబులు వైకృతంబులనంబడు దేవసర్గంబు వినుమదియు నెనిమిది తెఱంగులం గలిగియుండు నందు విబుధ పితృ సురాదులు మూఁడు గంధర్వాప్సరస్సులొకటియు యక్షరక్షస్సులేకంబు భూతప్రేతపిశాచంబులొకటియు సిద్ధచారణవిద్యాధరులేకంబుఁ గిన్నరకింపురుషులొకటియునుంగా దేవసర్గంబయ్యె నిట్టి బ్రహ్మనిర్మితంబులైన దశవిధసర్గంబులు నెఱింగించితి మఱియు నిందొక్క విశేషంబెఱింగించెదఁ గౌమారసర్గంబనునది దేవసర్గాంతర్భూతంబయ్యును బ్రాకృతవైకృతోభయాత్మకంబై దేవత్వమనుష్యత్వపూజ్యంబైన సనత్కుమారాది సర్గంబనంబడె నమోఘసంకల్పుండైన పుండరీకాక్షుండు దనుఁ దాన విశ్వభేదంబునం గల్పించెనని మైత్రేయుండు విదురునకుం జెప్పి కాలలక్షణం బెఱింగించువాఁడై యిట్లనియె

||సీ|| భువిఁ దనకార్యాంశమునకు నంతము నన్యవస్తుయోగంబు నేవలన లేక | ఘటపటాదిక జగత్కార్యంబునందనిజసముదాయకారణత్వమునఁ బరగి | జాలసూర్యమరీచిసంగతగగనస్థమగు త్రసరేణు షడంశమరయఁ | బరమాణువయ్యెఁ దత్పరమాణువందఱ్క గతియెంత దడవు దత్కాలమగును | సూక్ష్మకాలంబునదివిను సూర్యమండ | లంబు ద్వాదశరాశ్యాత్మకంబనంగఁ | గలుగు జగమునొక యేఁడు గడచనినఁ | గాలమెంతగునది మహత్కాలమనఘ

|| వ|| అందుఁ బరమాణుద్వయంబొక్క యణువగు నణుత్రితయంబొక్క త్రసరేణువగు నవి మూఁడుగూడ నొక్క త్రుటియగు నా త్రుటిశతంబొక్క వేధయనంబరగు నట్టి వేధలు మూఁడుగూడ నొక్క లవయనం దగు నవి మూఁడైన నొక్క నిమేషంబనం జను నిమేషత్రయంబొక్క క్షణంబగుఁ దత్క్షణపంచకంబొక్క కాష్ఠయనందగు నవి పదియైన నొక్క లఘువన నొప్పు నట్టి లఘుపంచదశకంబొక్క నాడియనం బరఁగు నట్టి నాడికాద్వయంబొక్క ముహూర్తంబయ్యె నట్టి నాడికలాఱైన నేడైన మనుష్యులకు నొక్క ప్రహరంబగునది యయామంబనం జను దివసపరిమాణవిజ్ఞేయంబగు నాడికోన్మానలక్షణం బెఱింగింతు షట్పలతామ్రంబునం బాత్రంబు రచియించి చతుర్మాషసువర్ణంబునం జతురంగుళాయామశలాకంబుఁ గల్పించి దానం దత్పాత్రమూలంబున ఛిద్రంబుఁ గల్పించి తచ్ఛిద్రంబునం బ్రస్థమాత్రతోయంబు పరిపూర్ణంబు నొందునంతకాలం బొక్క నాడిక యగు యామంబులు నాలుగు సన నొక్క పగలగు రాత్రియు నిప్పగిదిఁ జరుగు నట్టి యహర్నిశంబులు గూడ మర్త్యులకొక్క దినంబగు నవి పదునేనైన నొక్క పక్షంబగు శుక్లకృష్ణనామంబులం బరగిన యప్పక్షంబులు రెండుగూడ నొక్క మాసంబగునది పితృదేవతలకు నొక్క దివసంబగు నట్టి మాసంబులు రెండైన నొక్క ఋతువగు షణ్మాసంబులరిగిన నొక్క యయనంబగు దక్షిణోత్తరనామంబులం బరగిన యట్టి యయనంబులు రెండుఁ గూడి ద్వాదశమాసంబులైన నొక్క సంవత్సరంబగు నట్టి సంవత్సరశతంబు నరులకుం బరమాయువై యుండుఁ గాలాత్ముండు నీశ్వరుండునైన సూర్యుండు గ్రహనక్షత్రతారా

---

*ఉదుంబర|అత్తిచెట్టు — §న్యగ్రోధ|మఱ్ఱిచెట్టు — ‡వనస్పతులు|పుష్పములు లేక ఫలములతోఁ గూడిన వృక్షములు — ¶ఫలపాకాంతంబులు|ఫలించఁగానే చెడిపోవునవి — ||వీరుధంబులు|పొదలును — †శఫ|గిట్ట — కృష్ణ|నల్లయిఱ్ఱి — గవయ|కురుబోతు — రురు|నల్లచారలదుప్పి — అశ్వతర|కంచరగాడిదె — శల్యక|ఏదుపంది — గోధ|ఉడుము — కంక|రాబులుగు — శ్యేన|డేగ — సారస|బెగ్గురుపక్షి — కాకోలు|మాలకాకులు.

చక్రస్థుండై పరమాణ్వాదిసంవత్సరాత్మకంబైన కాలంబునం జేసి ద్వాదశరాశ్యాత్మకంబైన జగంబున సౌరబార్హస్పత్యసావనచాంద్రనాక్షత్రమానభేదంబులం గాననంబడుచున్నవాఁడై సంవత్సరపరివత్సరేడావత్సరానువత్సరవత్సరనామంబుల సృజ్యమైన బీజాంకురముల శక్తిం గాలరూపంబైన నవ్వశక్తిచేత నభిముఖంబుగాఁ జేయుచుం బురుషులకు నాయురాదివ్యయంబులం జేసి విషయాసక్తి నివర్తింపం జేయుచుం గోరికెలుగలవారికి యజ్ఞముఖంబులం జేసి గుణమయంబులైన స్వర్గాదిఫలంబుల విస్తరింపం జేయుచు గగనంబునం బరువువెట్టు వత్సరపంచకప్రవర్తకుండగు మార్తాండునకుం బూజ గావింపుమని మైత్రేయుండు వలికిన విదురుండిట్లనియె॥ క॥ నరపితృసురపరమాయుఃపరిమాణము లెఱుంగ నాకుం బలికితి విమునీశ్వర తెలియంగింపుఁ ద్రిలోకోపరిలోకవిలోకనైకపరులగు వారిన్॥ ఉ॥ పూనిన యోగసిద్ధిం గొందిన నేత్రయుగంబునన్ బహిఃజ్ఞానము గల్గి యుండి భువనంబులఁ జూచుచుండువారికి, న్నామ గల్గు కాలగతి మాకెఱిఁగింపు మునీంద్ర నావుడు నా నయశాలి యవ్విదురు సాదరుఁడై తగఁ జూచి యిట్లనున్॥ సీ॥ జననుతకృతయుగసంఖ్య నాలుగు వేలు దివ్యవర్షములు వదీయసంధ్య యెనుబది నూతేండ్లు విను త్రేతవత్సర త్రిసహస్రములగు దదీయసంధ్య యాఱునూఱేఁడులు నగు ద్వాపరము రెండు వేలు వత్సరముల వెలయు సంధ్య యోలి నన్నూఱేండ్లు నెగిఁ గలియుగము సహస్రవర్షములు సంధ్యాంశమరయ రెండు నూఱేఁడులును నిల్పియుండు జువ్వె యనఘ సంధ్యాంశమధ్యంబులందు ధర్మ మతిశయించును సంధ్యాంశలందు ధర్మ మల్పమై కానంబడుచుండు ననఘచరిత॥ వ॥ మఱియు ధర్మదేవత కృతయుగంబున నాలుగు పాదంబులఁ ద్రేతయందు మూఁడు పాదంబులు ద్వాపరంబునం బాదద్వయంబుఁ గలియుగంబున నేకపాదంబుఁ గలిగి సంచరించు నట్లగుటం జేసి॥ క॥ పాదవిభేదంబున మర్యాదలు నొగిఁ జెడు నధర్మమాకొలఁది నెయ్యుత్పాదిల్లి వృద్ధిఁ బొందు *ధరాదివిజులు పాపబుద్ధిరతులగుచు రిలన్॥ సీ॥ భూర్భువస్స్వర్లోకమునకంటెఁ బొడవునఁ గడునొప్పు సత్యలోకంబునందు నుండు బ్రహ్మకుఁ జతుర్యుగసహస్రము లేగ దివ మొక్కటగు రాత్రి దీయునిట్ల చనధాత నిద్రవో జగములు మడఁగు మేల్కని చూడ మఱల లోకములు పుట్టుఁ దద్దినమునఁ జతుర్దశమనువులగుదు రొక్కొక మనువునకొనర దివ్యయుగములోలి నిడెబ్బది యొక్కమాఱు సన్నిన మనుకాలమయ్యె నమ్మనుకులంబు సురలు మునులును సప్తర్షులరయ భగవదంశమునఁ బుట్టి పాలింతు రఖిలజగము॥ క॥ హరి పితృసుపర్వతిర్యఙ్నరరూపములం జనించి నయమున మన్వంతరముల నిజసత్త్వంబునఁ బరిపాలించును జగంబుఁ బౌరుషమొప్పన్॥ క॥ క్రమమునఁ ద్రైవర్గికసర్గము జెప్పంబడె సరోజగర్భుఁడు దివసాంతమునఁ దమఃపిహితపరాక్రముఁడై శయనించు నిద్రఁ గైకొని యంతన్॥ సీ॥ ఆరాత్రి భువనత్రయము దమఃపిహితమై భానుచంద్రులతో విలీనమైన సర్వాత్ముఁడగు హరిశక్తిరూపంబయి కడఁగి వెలుంగు సంకర్షణాగ్ని భువనత్రయంబును దవిలి దహింప నయ్యనలకీలలఁ బొడమిన ¶మహోష్మ లలమినఁ గనలి మహర్లోకవాసులు జనలోకమునకును జనుదురపుడు §విలయసమయసముత్కటవిపులచండవాతధూతోర్మిజాలదుర్వారవార్ధి ‡భువనముల ముంచ నమ్మాఁడు ‖భువనములను నత్తమోరాశి మీఁదఁ బద్మావిభుండు॥ ఉ॥ చారుపటీరహారఘనసారతుషారమరాళచంద్రికాపూరమృణాళహారపరిపూర్ణసుధాకరకాశమల్లికాసారనిభాంగశోభితభుజంగమతల్పమునందు యోగనిద్రారతిఁ జెందియుండు జఠరస్థితభూర్భువరాదిలోకుఁడై॥ క॥ జనలోకవాసులర్థిని వినుతింపఁగ నతులదివ్యవిభవప్రభచేఁ దనరుచు మీలితనిజలోచనుఁడై వసియించు నతఁడు సముచితలీలన్॥ ఇవ్విధంబున॥ సీ॥ కైకొని బహువిధకాలగత్యవలక్షితములై యహోరాత్రతతులు జరుగ శతవత్సరంబులు జనులకుఁ బరమాయువై నరీతి విబంకజాసనునకుఁ బరమాయువగు శతాబ్దంబులందు సగమరిగిన నదియుఁ బరార్ధమంద్రు గానఁ బూర్వార్ధంబు గడచుటఁ జేసి ద్వితీయపరార్ధంబు దీని పేరు గడఁగి పూర్వాపరార్ధాది కాలమందు బ్రహ్మకల్పాఖ్య నెంతయుఁ బరగు నందు బ్రహ్మ యుదయించుటం జేసి బ్రహ్మకల్పమనియు శబ్దాత్మక బ్రహ్మమనఁగ నెగడె॥ క॥ విను మెన్నఁడు పంకజనాభుని నాభీసరసియందు భువనాశ్రయమై తనరిన పద్మము వొడమును ననఘా యది పద్మకల్పమన విలసిల్లున్॥ వ॥ పూర్వపరార్ధాదినిం గలిగిన పద్మకల్పంబుఁ జెప్పితి నింక ద్వితీయపరార్ధంబు మొదల నెన్నఁడేని హరి సూకరాకారంబు దాల్చె నది వరాహకల్పంబనం దగు నట్టి వరాహకల్పం బిపుడు వర్తమానంబగుచున్నది వెండియు॥ సీ॥ దీపింపఁగాలస్వరూపుఁ

* ధరాదివిజులు। బ్రాహ్మణులు.— ¶ మహోష్మలు। అధికోష్ణములు— § విలయ-వార్ధి॥ విలయసమయ। ప్రళయకాలమందు-సముత్కట। మిగులవిజృంభించిన-విపుల। విస్తారమైన- చండ। కడువడిఁ గలిగిన-వాత. గాలిచేత-ధూత। ప్రేరేపింపఁబడిన-ఎగరఁగొట్టఁబడిన-ఊర్మిజాల। అలలపిండుగలదై-దుర్వార। అడ్డగింపఁగూడని-వార్ధి। సముద్రము— ‡ భువనములన్। జలములచేత— ‖ భువనములన్। లోకములను.

రముండు। నాభింబులహుండు గర్ణములం బులస్త్యుండు ద్వక్కునఁ బృగువు హస్తమునఁ గ్రతువు। నాస్యంబువలన నయ్యంగిర
సుండు ప్రాణమున వసిష్ఠుండు మనమున మరీచి। గన్నులనత్రియుం గాంబుత్రదశకంబు గలిగిరి వెండియు నలినగర్భు। దక్షిణస్త
నమువలన ధర్మమొసపె। వెన్నువలన నుపయమయ్యె విశ్వభయద। మైన మృత్యువధర్మంబునందఁ గలిగె। నాత్మఁ గాముండు
జననమునందె మఱియు॥ సీ॥ భ్రూయుగళంబునఁ గ్రోధంబు నధరమునందు లోభంబు నాస్యమున వాణి। యును మేఢ్రమునం
దంబయోధులపానంబు నందు మనఘాశ్రయుండైన నిర్ఋతి। లాలితచ్ఛాయవలన దేవహూతివిభుండు గర్దముండును బుట్టిరం
త। నబ్జజుండాత్మ దేహమున జనించిన భారతిం జూచి విభ్రాంతిం బొరసి। పంచశరబాణనిర్భిన్నభావుఁడగుచుం। గూఁతురను
పాపమునకు సంకోచపడక। కవయం గోరిన జనకుని గని మరీచి। మొదలుగాఁ గల యమ్మునిముఖ్యులలిగి॥ ఇట్లనిరి॥ ఉ॥ చాలు
*బురే సరోజభవ సత్పథవృత్తిం దొఱంగి కూఁతుని। †ట్లాలరివై రమింప హృదయంబునఁ గోరుట ధర్మరీతియే। ‡జేలరివై తిసీత
గవు పెద్దతనంబును మంటిపాలుగా। శీలము వోవఁ దట్టి యిటుఁ జేసిన వారలు మున్నుఁ గల్గిరే॥ ఉ॥ నీవు మహానుభావుఁడవ
నింద్యచరిత్రుఁడ విట్టి చోటరా। జీవభవుండు దా విధినిషేధములాత్మ నెఱుంగఁ డయ్యెనీ। భావభవప్రసూనశరబాధితుఁడై
తనకూఁతుఁ బొందెఁ బో। వావిఁ దలంప లేకనుచు వారక లోకులు పృథ్విఁ దిట్టరే॥ క॥ పాపము వలఁపక నిమిషము। లోఁపలఁ జెడుం
సౌఖ్యమునకు లోనైతివి యిం। తే పోధారుణిఁ గామాంధోపిన పశ్యతి యనంగఁ దొల్లి యువినమే॥ వ॥ అని యిబ్భంగి మునీం
ద్రులాడిన కఠోరాలాపములు వీనుల। న్విని లజ్జావనతాననుండగుచు నా నీరేజగర్భుండు సయ్యన దేహంబు విసర్జనీయముగఁ
జేయఁగా దిక్కులేతెంచి తత్తనువుఁ గైకొనఁ బుట్టె దిక్కలితమై తామిస్రనీహారముల్॥ అంత॥ చ॥ ఉసుంగక పంకజాతభ
వుఁడొండొక దేహముఁ దాల్చి ధైర్యముం। న్విడువక సృష్టిఁ బూర్వమున నేసృజియించిన నైపుణంబు దాఁ। బొడమిన నాత్మ
లోనఁ దలపోయుచునుండఁ జతుర్ముఖంబుల। న్వెడలె ననూనరూపముల వేదములంచితధర్మయుక్తతన్॥ గీ॥ మఱియు మఖ
ములు హితకర్మములుఁ దంత్ర। ములును నడవళ్లు నాశ్రమములుఁ దదీయ। ముఖచతుష్కమునందునఁ బొడమెననిన। విని
మునీంద్రునిఁ జూచి యవ్విదురుఁ డనియె॥ క॥ తోయజసంభవుఁ డప్పుడు। నేయేముఖమండలమున నేయే సృష్టిన్। ధీయుతుఁడై
సృజియించెను। బాయక యత్తెఱఁగు దెలియఁ బలుకుము నాకున్॥ వ॥ అని యిట్లు విదురుండడిగిన మైత్రేయుండతనితో నిట్లని
యె ఋగ్యజుస్సామాథర్వంబులను వేదంబులు, హోతృకర్మంబులైన యప్రగీతమంత్రస్తోత్రంబులగు శస్త్రంబులు
నధ్వర్యుకర్మంబైన యిజ్యయు సంగీతస్తోత్రంబగు స్తుతియు, గాతృప్రయోజ్యంబైన ఋక్సముదాయరూపంబగు స్తోమం
బుఁ, బ్రాయశ్చిత్తంబగు బ్రహ్మకర్మంబు §నాయుర్వేద ధనుర్వేద గాంధర్వ వేదంబులను నుపవేదంబులు, విశ్వకర్మశా
స్త్రంబగు స్థాపత్యంబును, బ్రాగాదిముఖంబుల నుత్పన్నంబులయ్యెఁ బంచమవేదంబగు నితిహాసపురాణంబులు, సర్వము
ఖంబులం గలిగె మఱియు గర్మతంత్రంబులైన షోడశ్యుక్థ్యులు చయనాగ్నిష్టోమంబులు, నాప్తోర్యామాతిరాత్రంబులు, వా
జపేయగోసవంబులు, ధర్మపాదంబులైన విద్యాదానతపస్సత్యంబులు, బ్రహ్మచర్యగృహస్థవానప్రస్థయత్యాశ్రమంబు
లు, వీనికి నొక్కొక్కటికిం జతుర్విధంబులై వృత్తులుం గలిగియుండు, నందు సావిత్రంబు, బ్రహ్మచర్యంబు, నుపనయనం
బాదిగా దివసత్రయంబు గాయత్రిజపించుటయు ప్రాజాపత్యంబు, వేదవ్రతచతుష్టయంబు, వ్రతులు సంవత్సరపర్యం
తంబుగా నాచరించుటయు, బ్రాహ్మంబు వేదగ్రహణాంతంబు నాచరింపందగు, నైష్ఠికంబునను బ్రహ్మచారివృత్తిచతుష్ట
యంబు నిషిద్ధకృష్యాదివృత్తియగు వార్తయు, యజనాదికర్మోపయుక్తంబైన యాచ్ఞాదిరూపంబగు సంచయంబు, పరులయా
చింపకుండు నయాచితంబను శాలీనంబు క్షేత్రపతితకణిశకణసంగ్రహణరూపంబగు శిలోంఛనంబు, ననుగృహస్థవృత్తు
లు నాలుగు, నకృష్టపచ్యాహారులగు వైఖానసులు, నూతనఫలంబులబ్ధంబైనఁ బూర్వసంచితపదార్థత్యాగంబుగల వాలఖి
ల్యులుఁ, బ్రాతఃకాలంబున నేదిక్కు విలోకింతురద్దిక్కునకుం జని, యచ్చట లభించు పదార్థంబులం భుజించి, జీవించు నౌదుం
బరులుఁ, దమంత ఫలించి తరుపతితంబులగు ఫలంబులఁ దినుచుండు ఫేనపులు, నను చతుర్విధవృత్తులుం గల వానప్రస్థులు, స్వా
శ్రమవిహితకర్మంబులం బ్రధానుండగు కుటీచకుండు, గర్మంబు పసర్జనంబు చేసి జ్ఞానప్రధానుండగు బహూదకుండుఁ, గేవ
లజ్ఞానాభ్యాసనిష్ఠుండగు హంసుండు, బ్రాప్తంబైన పరబ్రహ్మతత్త్వంబు గల నిష్క్రియుండు నను సన్న్యాసిచతుర్విధవృ
త్తులు, మోక్షఫలప్రదంబై, ¶యాత్మానాత్మవివేకవిద్యారూపంబగు నాన్వీక్షకియు, స్వర్గాదిఫలప్రదంబై కర్మవిద్యారూ

*బురే। ఆహా — †ఆలరివై। మేరమీఱినవాఁడవయి — ‡జేలరివి। మూర్ఖుఁడవు — §ఆయుర్వేద। వైద్యశాస్త్రము, ధనుర్వేద-అధర్వణము, గాంధర్వవేదము, భరతశాస్త్రము — ¶ఆత్మానాత్మ। ఆత్మయనఁగా శరీరత్రయవిలక్షణమై-అవస్థాత్రయసాక్షియై-పంచకోశవ్యతిరిక్తమై-స

పనుగు త్రయియు, జీవనఫలప్రధానంబై కృష్యాదిరూపంబగు వార్తయు, నర్థసంపాదనైకప్రయోజనంబగు, దండనీతియు మోక్షధర్మకామార్థంబులైన న్యాయవిద్యాచతుష్టయంబులు, భూర్భువస్సువయను వ్యాహృతులును, బూర్వాదిముఖములనుదయించె-మఱియునతనిహృదయాకాశంబువలనం బ్రణవంబు, రోమంబులవలననుష్ణిక్ఛందంబుఁ, ద్వగింద్రియంబువలనగాయత్రిచ్ఛందంబు, మాంసంబువలనం ద్రిష్టుప్ఛందంబు, స్నాయువులవలననుష్టుప్ఛందంబు, నస్థివలనజగతీచ్ఛందంబు, మజ్జవలనపఙ్క్తిచ్ఛందంబుఁ, బ్రాణంబువలనబృహతీచ్ఛందంబుఁ, గకారాదిపంచవర్గాత్మకంబులైనస్పర్శలవలనజీవుండు, నకారాదిస్వరాత్మకంబైనదేహంబు, నూష్మలను శషసహాదివర్ణచతుష్టయరూపంబులగునింద్రియంబులు, నంతస్థలగు యరలవలనువర్ణంబులుషడ్జాదిసప్తస్వరరూపంబు, నాత్మబలంబునైనశబ్దబ్రహ్మంబును, జతుర్ముఖునిలీలావిశేషంబుననుత్పన్నంబయ్యె-వ్యక్తావ్యక్తంబులై ఖరీప్రణవాత్మకంబైనశబ్దబ్రహ్మంబువలనం బరమాత్మయవ్యక్తాత్మకుండగుటం జేసిపరిపూర్ణుండు-వ్యక్తాత్మకుండగుటం జేసి యింద్రాదిశక్త్యుపబృంహితుండై కానంబడుఁబడంపడియుఁ జుండుభూరి*వీర్యవంతులైనఋషిగణంబులసంతతియవిస్తృతంబనితలంచిపూర్వతనుపరిగ్రహంబు చాలించి యనిషిద్ధకామాసక్తంబైనదేహాంతరపరిగ్రహంబుచేసినిత్యంబు ప్రజాసృష్టియందు §వ్యాసక్తుండై నం బ్రజలభివృద్ధినొందక యుండుట కేమి కారణంబగుననియచ్చెరువొందితత్ప్రవృద్ధియగువిధంబాలోచించుచుదైవంబిచ్చట విఘాతుకంబుగానఁదనపౌరుషంబావశ్యకంబని దానినెమరుచూచుచుయథోచితకృత్య కిరణపరుండగుచుండు చతుర్ముఖుని దేహంబు ద్వివిధంబైనట్టిరూపద్వయవిభాగంబుస్వరాట్టగు స్వాయంభువమనువునుఁ దన్మహిషియగు శతరూపయనుకన్యకయుఁగా మిథునంబై జనియించెనమ్మిథునంబువలనం బ్రియవ్రతోత్తానపాదులను పుత్రద్వయంబునాకూతి దేవహూతి ప్రసూతులను కన్యకాత్రయంబునుంగలిగెరందు నాకూతిని రుచికునకు, దేవహూతిం గర్దమునకుఁ, బ్రసూతిం దక్షునకునిచ్చెవీరలవలనఁగలుగు ప్రజాసంతతులచేత జగంబులుపరిపూర్ణంబులయ్యెనని నవుడు॥

### స్వాయంభువమనువు ప్రజావృద్ధిచేయుట.

క॥ అని మైత్రేయుఁడు వలికిన। వినిమనమున హర్షమొదవ విదురుఁడు మునినా।థునిఁ జూచినొడివెఁ గ్రమ్మఱ।వనజోదరపాదభక్తివశమానసుఁడై॥ క॥ఘనుఁడు స్వాయంభువునకుఁ బ్రియ।తనయుఁడు స్వాయంభువుండుదైతేయవిభే।దనసేవాచతురుండును।జనవినుతుం డాదిరాజసత్తముఁడౌటన్॥ క॥ఆతనిచరితం†బవ్యా।హతసుఖదమునిఖిలమంగళావహము సమం।చితము న్నావునబుధసే।వితనాకెఱుఁగంగఁబలుకువిశ్వస్తుత్యా॥ క॥అదియునుగాక ముకుందుని।పదకమలమరందపానపరవశులై పెంపొందవినవారి చరిత్రము।సదమలమతివినినభవము సఫలముగాదే॥ చ॥అనివిదురుండువల్కనదయాన్వితుఁడై మునినాథచంద్రుఁడిట్లను శ్రుతిశాస్త్రపారకలితాత్ముఁడై ననయుండుఁబద్మలోచనచరణారవిందయుగసంగముగల్గిన సజ్జనుండునొందినఫలమొందు భాగవతదివ్యకథాశ్రవణానురక్తిచేన్॥ క॥అని చెప్పిమునికులాగ్రణి।దనుజారికథాసుధా**ప్లుతస్వాంతుండై।తనువునఁబులకాంకురములు।☆మొనయఁగ నానందబాష్పములుజడిగురియన్॥ సీ॥వినిపింపఁదొడఁగెన్నాఘనుఁడు స్వాయంభువుఁడంగనాయుక్తుఁడై యబ్జగర్భునకు మ్రొక్కి-≪వినయవినమితోత్తమాంగుఁడై హస్తముల్మోగిచియిట్లనియెఁ బ్రీతి।జీవసంహతికిరాజీవసంభవనీవజనకరక్షణవినాశములకరయ।హేతుభూతుఁడవుమాకెద్దియాచరణీయమైనకర్మముదానినానతిమ్ము।హర్షదములైనకృత్యములాత్మజుండు।జనకునకుఁ జేసెపరిచర్యసలుపఁగీర్తినందినులికెక్కవర్తించునంచునిందుఁగాన నెఱిఁగింపుఁడట్టిసత్కర్మమనఘ॥ క॥అనిపలికినస్వాయంభువ। మనువృనుభాషలకునలరి మనమునఁగమలా।సనుఁడనురాగముప్పొరిఁగొనఁ బ్రియతముఁడైనసుతునకునిట్లనియెన్॥ చ॥ మనుకొనితండ్రియాజ్ఞఁదలమోఁచినిజోచితకృత్యమేమిపం।చినఁదనశక్తిచేతనెడసేయకచేయుటపుండరీకలోచనపదసేవసేయుటప్రజాపరిపాలనశాలియౌటయు।జ్ఞనసుతుఁడైసుతుండుపరిచర్యలొనర్చుటసువ్వేపుత్రకా॥ కావున॥ మ॥వివరింపన్ హరియజ్ఞమూర్తిఁబరమున్విష్ణున్హృషీకేశుఁగే।శవుఁబద్మాక్షుఁగురించిజన్నములుశశ్వద్భక్తిఁగావింపుమా।ధవుఁడాత్మన్బరితోషమొందునతఁడుద్యత్ప్రీతిఁగైకొన్నలోకవితానంబులుతుష్టినొందునసఘా కావింపుమాయజ్ఞముల్ ॥ చ॥అనుటెలభ

---

చ్చిదానందస్వరూపమైన-కాలత్రయాబాధ్యమైయుండునస్తువు. అనాత్మయనఁగా-వ్యష్టిసమష్టిరూపములైన స్థూలసూక్ష్మకారణశరీరములేను.
*వీర్య।ప్రభావము— §వ్యాసక్తుండన్।ఆసక్తిగలవాఁడను— †అవ్యాహతసుఖదంబు। నిత్యనిరుపాధికనిరతిశయానందమునుగలుగజేయునట్టిది. **అప్లుత।తడపఁబడిన. ☆మొనయఁగన్।పుట్టగాను. ≫వినయవినమితోత్తమాంగుఁడై।అడఁకువగలిగివంపఁబడినశిరస్సుగలవాఁడై.

స్త్రీఁగేశవసమర్పణబుద్ధిఁ గ్రతుక్రియల్పొన|ర్పక విపరీతులై యముకరాసులు దంచి ఫలంబు నందఁగా| నక చెడు రీతి నూర
కథనవ్యయమాటయె కాని మోక్షదా|యక మనుగుచున్న తత్ఫలమునందరు విష్ణుపరాఙ్ముఖక్రియల్ ॥ ఉ॥ కావున యజ్ఞము
ల్లారివికారవిమారుఁ గురించి చేయునీ| భావము సూనృతవ్రతశుభస్థితిఁ జెందెడు నీకుమారులు| నీ నిపుణు నీ ధరాభరము నె
మ్మిన వహింపుము సజ్జనావలిం| బ్రోవుము ధర్మమార్గమునఁ బుత్రక దోషలతాలవిత్రకా॥ క॥ అనవుడు నతనికి నతఁడి|ట్లనియె

## శ్రీయజ్ఞవరహావతారవర్ణనము.

న్భవదీయమైన యానతియెట్లు|ట్లొనరించెద నాకును నా| తనయులకు వసించియుండఁదగు నెలవెంచుఁడు॥ గీ॥ అరయ లేమ విధా
తయీ యఖిలజంతు|జాతముల కెల్ల నాధారభూతమైన| ధరణి యిప్పుడు ఘనజలాంతర్నిమగ్న| మైన కతమునఁ జోటులేదర
యఁదండ్రి॥ క॥ కావున భూమ్యుద్ధరణము| గావించు నుపాయమిపుడు మకైకొని నాకుఁ| దేవా నీ వెఱిఁగింపుము| నావుడు పద్మ
జుఁడు వదనమునం బునఁదలఁచెఁ॥ మ॥ జలమధ్యంబున లీనమొందిన ధరాచక్రంబు నే నేర్పున|న్నిలుపన్వచ్చును బూర్వమందు
జగముల్నిర్మించునాఁడాది ❋ కైన|ప్పులఁబుట్టించి వినమీఁదనివ్వసుమతిన్సృష్టించితిం బుత్రయం|బులలోఁగ్రుంకిరసాతలాంత
రమునుం బొందెన్ధరాపృథ్వియుఁ॥ సీ॥ అఖిలజగత్కల్పనాటోపమునకుఁ బొల్పడిన నా చేత నెబ్భంగి నిపుడు| దగిలి విశ్వంభ
రోద్ధరణంబుఁ గావింపనగునని సర్వభూతాంతరాత్ముఁ| బురుషోత్తముని నవపుండరీకాక్షు లక్ష్మీపతిఁ దనమనస్థితునిఁ జేసి|
తలపోయుచున్నఁ బద్మజు నాసికావివరమ్మున యజ్ఞవరాహమూర్తి| యఙ్గుష్ఠమాత్రదేహంబుతోడ|జననమందివియ
త్తలస్థాయియగుచు|క్షణములోపల భూరి జగత్ప్రమాణ| మయ్యె నచ్చటి జనములకద్భుతముగ॥ సీ॥ అంతఁ బ్రజాసర్గ సంయు
నియుక్తులైనట్టి మరీచ్యాదులైన మునులు| సనకుమారకులు నస్మనుసహితంబుగ యజ్ఞవరాహంబు నర్థిఁ జూచి| యిట్టియా
శ్చర్యమెచ్చోటఁ దేనిఁ గలదె నాసారంధ్రనిర్గత* స్తబ్ధరోమ|లోకంబు మనము విలోకింపనంగుష్ఠమాత్రమై యంతఁ గ్షణమాత్ర
లోన| మహీమ దీపింపదంతి ప్రమాణము నుమ| హోన్నతంబై నఋగండశైలోపమంబు| సమ్యోనునుమవిలక్షించె నబ్జభ
వుఁడు| హర్షమిగురొత్తనిట్లనియెపుడు మదిఁదలఁచె॥ క॥ నామనమునఁ గలసుఖిపి| రామముఁ గావించుకొఱకుఁ బసరాజీవాక్షుం|
డీ మేరయజ్ఞపోత్రి| శ్రీమూర్తి వహించెనిది విచిత్రము దలఁపఁ॥ వ॥ అని వితర్కించుచున్న యంబున సూకరాకారుండయిన
భగవంతుండు॥ గీ॥ ప్రళయజీమూతసంఘాతభయదభూరి|గర్జనాటోపలోపకృత్ఘనగభీర|రావమడరింపఁ పసపుడు రాజీవభ
వుఁడు| మునులు నానందమును బొందిరనఘచరిత॥ వ॥ అంత మాయాసూకరవరాహ ఘుర్ఘురారావంబు బ్రహ్మాండకోటరప
రిస్ఫోటనంబుఁ గావింపవిని జనస్తపస్సత్యలోకనివాసులైన మునులు ఋగ్యజుస్సామమంత్రంబుల వినుతించిరి యజ్ఞవరా
హరూపధరుండైన సర్వేశ్వరుండు సత్పురుషపాలనదయాపరుండు గావున దిగ్గజేంద్రలీలాపహేలుండై॥ సీ॥ కఠినసటా
చ్ఛటోత్కటజాతవాతనిర్ధూత‡ జీమూతసంఘాతమగుచు| తుహినిభసునిశిత ఖురపుటాహతచలత్పృథ్వీరాజదిగ్గజప్రచ
యమగుచు| చండదంష్ట్రోగ్రవైశ్వానరార్చిః ప్రవర్ధజత హేమాద్రివిస్రంభమగుచు| ఘోరగంభీరఘుర్ఘురభూరినిస్వన
పంకిలాఖిలవార్ధిసంకులముగఁ|బొరలుఁ§ గెరలు నటించునంబరమునెఱల|నొప్పునుప్పరమెగయును గొప్పరించు¶ ముట్టెబి
గియించు మును సముసమూరుకొనుచు| †నడరు సంరక్షితత్రోణియజ్ఞఘోణి॥ మఱియు నయ్యజ్ఞవరాహంబు॥ సీ॥ తెపరిచతుర్ద
శభువనంబులను దొంతులౌటుఁగఁ గొమ్ములఁ జిమ్మునొక్కమాటు| పుత్తడి కొండ మూఫు ఏమను నొఱగంటనురుముఁగారా
పాడు నొక్కమాటు| ఖురములసప్తసాగరములరొంపిగా నుక్కింపి మట్టాడునొక్కమాటు| అఖిలవాలవాతాహతి చేమి
స్నన్ అసిబ్రద్దలు సేయునొక్కమాటు| గసులకొనలను విస్ఫులింగములు సెదర| నురుభయంకరగతిఁ దోఁచు నొక్కమాటు
పరమయోగీంద్రజనసేవ్యభవ్యవిభవ| యోగ్యమై కానఁగానగునొక్కమాటు॥ వ॥ ఇట్లు హరివిహరింపుచుఁ బ్రాతర్మధ్యం
దినతృతీయసవనరూపుండైన యజ్ఞవరాహమూర్తియగు సర్వేశ్వరుండు మహాప్రళయంబునందు యోగనిద్రావశుండై
యుండునవసరంబునను దకస్థంబైన భూమి రసాతలగతంబైన దాని నుద్ధరించుటకు సముద్రోదరంబు దఱియం జొచ్చు వేగం
బు సైరింపం జాలక సముద్రుండూర్మ్ములను భుజంబులెత్తి పిశీర్ణహృదయుండై యార్తుని పగిది యజ్ఞవరాహ నన్ను రక్షింపు
రక్షింపుమనియాక్రోశింప నిశితకరాళఖురతీక్ష్ణంబులైన ఖురాగ్రంబుల జలంబుల విచ్ఛిన్నంబులఁ గావించి యపారంబై
న రసాతలంబు బ్రవేశించి భూమింబొడఁ గనునవసరంబున॥ క॥ శరనిధిలోన మహోగ్రా| సురకంటకుఁడెమరుగాంచెను

---

❋ అప్పు| జలము—— * స్తబ్ధరోమ| వరాహము—— ※ గండశైలోపమంబు| గండశైలముతోఁ దుల్యమైనది-గండశైలమనఁగా భూకంపరులచేతఁ పర్వతమునుంచి జారిన దొడ్డరాయి ‡ జీమూత| మేఘము § కెరలుఁ| కోపగించును—— ¶ ముట్టె| పందిముఖము—— † అడరుఁ| విజృంభించును.

ఖమయగాత్రిఁ । ఖురవిదళితకులగోత్రిఁ । ధరణికళత్రిఁ * గవేషధాత్రిఁ బోత్రిఁ ॥ వ ॥ ఇట్లు పొడఁగని దైత్యుండు రోషభీష
ణాకారుండై ॥ మ ॥ గదసారించి యసహ్యవిక్రమసముగ్రస్ఫూర్తిచే వ్రేయుచో । నది దప్పించి వరాహమూర్తి నిజదంష్ట్రా
గ్రాహతిన్ ద్రుంచెఁ బెం । పొదవన్ గ్రొవ్వున దాతిరేకబలశౌర్యోదారవిస్తారసం । పదఁ బంచాస్యము సామజేంద్రుఁ జలమొ
ప్పం ద్రుంచు చందంబునన్ ॥ మ ॥ దితిజాధీశుని నీగతిం దునిమి యుద్వృత్తిన్ దదీయాంగశో । ణితపంకాంకితగండభాగుఁడగు
చున్ విష్ణుండు దా నొప్పె విస్తృతసంధ్యాంబుదధాతుచిత్రితసముద్దీప్తక్షమాభృద్గతిన్ । క్షితిదంష్ట్రాగ్రమునన్ ధరించి జల
రాశిం బాసి యేతేరఁగన్ ॥ గీ ॥ బాలశీతాంశురేఖావిభాసమాన । ధవళదంష్ట్రాగ్రమున నున్న ధరణి యొప్పె । హరికి నిత్యాన

## శ్రీయజ్ఞవరాహమూర్తిని బ్రహ్మాదులు స్తుతియించుట.

పాయినినైన లక్ష్మి । నెఱయఁ బూసిన కస్తూరి నికరమనఁగ ॥ వ ॥ అట్టి యజ్ఞపోత్రిమూర్తిం జూచి కమలాసనప్రముఖు లిట్లని
స్తుతియించిరి ॥ సీ ॥ దేవ జితం జితం తే పరమేశ్వర జితయజ్ఞభావన శ్రుతిశరీర । కారణసూకరాకారుండవగు నీకు నతిభక్తి
మ్రొక్కెదమయ్య వరద । భవదీయరోమకూపములందు లీనంబులయ్యుండు నంబుధులట్టి యధ్వ । రాత్మకమైతనరారు నీ రూ
పంబుఁ గానంగ రాదు దుష్కర్మపరుల । కట్టి నీకుఁ బ్రణామంబు లాచరింతు । మఖిలజగదేకకీర్తి దయానువర్తి । భవ్యచారిత్ర
పంకజపత్రనేత్ర । విరళశుభాకార యిందిరాచిత్తచోర ॥ అని వెండియు నిట్లు స్తుతియించిరి ॥ సీ ॥ త్వక్కునన జల వేదంబులు
రోమంబులందును బర్హిస్సులందు । నాజ్యంబుఁ బాదంబులందుఁ జాతుర్హోత్రకలితంబులగు యజ్ఞకర్మములును । స్రు
క్కుతుండంబున స్రువము నాసమున నిడయుఁ బోత్రియు కరకోటరమునందు । శ్రవణాస్యబిలములఁ జమస ప్రాశిత్రముల్ గ
ళమున నిష్టిత్రికంబు జిహ్వఁ । దగఁ బ్రవర్గ్యము నగ్నిహోత్రములు నీదు । చర్వణంబును సభ్యోపసభ్యులుత్తమాంగమసు
వులు చయనములగుఁ గిటీశ ॥ వ ॥ వెండియు మహాత్మ భగవదావిర్భావంబు దీక్షణీయేష్టియగు నీ దంష్ట్రలు ప్రాయణీ
యంబను దీక్షానంతరేష్టియు దయనీయంబను సమాప్తేష్టియు యుష్మద్రేతంబు సోమంబును త్వదీయావస్థానంబు ప్రాత
స్సవనాదులు నీ మాంసాదిసప్తధాతువులగ్నిష్టోమోక్థ్యషోడశీవాజపేయాతిరాత్రాప్తోర్యామంబులను సంస్థాభేదం
బులు ద్వాదశాహాదిరూపంబులయి బహుయాగసంఘాతరూపంబులగు సర్వసత్త్రంబులు భవదీయశరీరసంధులు సోమా
సోమంబులగు యజ్ఞక్రతువులు నీ[illegible]మఱియు యజనబంధనంబులచే నొప్పుచుండు వదియునుం గాక ॥ క ॥ హవరూపివి హవనే
తవు హవభోక్తవు నిఖిలహవఫలాధారుఁడవున్ । హవరక్షకుండవగు నీ కవితతముగ నుతులొనర్తుమయ్య ముకుందా ॥ గీ ॥ స
త్త్వగుణమున సత్త్వసంభవించు । భక్తియును ముఁజిత్తంబు భవ్యమగును । హృదయపద్మంబునందోలి నెఱుఁగఁబడిన । య
ట్టి నీకు నమస్కారమయ్య వరద ॥ మ ॥ అరవిందోదర తావకీనసితదంష్ట్రాగ్రావలగ్నక్షమా । ధరనద్యబ్ధినదాటవీయుతసమిద్ధ
ద్మోత్పలంబొప్పె భా । సురకాసారజలావగాహమునఁ దవచ్ఛుండాలరాడ్దంతశే । ఖరసంసక్తవిశాలపంకజము రేఖం బొల్పుదీ
పింపఁగన్ ॥ మఱియు ॥ మ ॥ చతురామ్నాయవపుర్విశేషధర చంచత్పూకరాకారని । సితదంష్ట్రాగ్రవిలగ్నమైన ధరరాజిల్లె
న్నగలాద్రీంద్ర రాజతశృంగోపరిలగ్నమేఘము గతిం జాలంద గెన్నుజ్జ్వాం । చితహృత్పల్వలలోలఘూరమణ లక్ష్మీనాథ దేవో
త్తమా ॥ సీ ॥ వసుధికి స్థావరజంగమాత్మకమైన వసుమతీచక్రమువక్రలీల । నుద్ధరించితి కరుణోపేతచిత్తుండవగుచు నస్మన్మా
తయయ్యె ధరణి । మాతయాటెల్లని మృదిఁదలంచెర వేనిఁ జక్కింపనమాకు విశ్వమున కీవు । జనకుఁడవగుట యుష్మత్పత్ని భూదేవి
యగుట మాకును దల్లియయ్యె నిపుడు । ధరకు నీతోడఁ గూడ వందన మొనర్తు । మరణియందును యాజ్ఞికుఁ డగ్ని నిలుపు । కరణి మీ
తేజమీ ధరాకాంతయందు । నిలుప ధరణి పవిత్రమై నెగడుఁగాన ॥ చ ॥ తలఁపరసాతలాంతరగతక్షితిఁ గ్రమ్మఱ నిల్పినట్టి నీక
లితనమెన్న విస్మయము గాదు సమస్తజగత్త్రిలోకినై । గలుగఁగఁ జేయుటద్భుతము గాక మహాన్నతిని వ్రేనప్పె పెం । పల
రిన కార్యముల్ మనుపనన్యులకుం దరమే రమేశ్వరా ॥ ఉ ॥ సకలజగన్నియామకవిచక్షణలీలఁ దనర్చునట్టి నం । దక ధరతావక
స్ఫురదుదారతమంత్ర సమర్థుఁడైన యాజ్ఞికుఁ డరణిన్ హుతాశనుని నిల్పిన కైవడి మన్నివాస మా । టకుఁ దలపోసి యీ క్షి
తి దృఢంబుగ నిల్పితి వయ్య యీశ్వరా ॥ చ ॥ సలలితవేదశాస్త్రమయసౌకరమూర్తిఁ దనర్చు చుర్విరసా । తలమున నుండి వెల్వ
డును దారత మేను విదిర్పఁ దత్సటో । చ్చలితములైన బిందువుల సాధుతపోజనసత్యలోకవా । సులమగు మేము దోఁగి పరిశుద్ధి
వహించితిమయ్య మాధవా ॥ ఉ ॥ విశ్వభవస్థితిప్రళయవేళలయందు వికారసత్త్వము । న్విశ్వము నీవ యీ నిఖిలవిశ్వములోలి
సృజింతు విందిరా । ధీశ్వర యీశ కేశవ త్రయీమయ దివ్యశరీర దేవ నీ । శాశ్వతలీల లిట్టివని సన్నుతిసేయఁగ మాకు శక్యమే ॥

* గవేషధాత్రిఁ - భూమిని వెదుకుచున్నవాని. — క్షేత్రయీమయ - వేదస్వరూపమయిన.

సీ॥ పంకజోదరదేవపాదకర్మండడపు భవదీయకర్మాబ్ధిపారమరయ। నెఱిఁగెదనని మదినిశ్చయించిన వాఁడు పగిలించఁగాఁ మతి ధృష్టుఁగాక। విజ్ఞానియే చూడ విశ్వంబు నీ యోగమాయాపరోనిధి మగ్నమాటఁ। దెలిసియుఁ దమబుద్ధిఁ దెలియని మూఢుల నేమనవఖిలలోకేశ్వరేశ। దాసజనకోటికతిసౌఖ్యదాయకములు। వితతకరుణాసుధాతరంగితములైన। నీకటాక్షేక్షణములచే నెఱయ మమ్ము। బాధిసుఖులను జేయ వేసుభగచరిత॥ క॥ అని బ్రహ్మాదులగు సన్మునివర్యులు భక్తియోగమున వినమితులై మనమున మోదముముప్పిరి। గొనఁ బొగడిరి ఖురవిదళితగోత్రి కిటి పోత్రి కిటి॥ ఉ॥ అంతటలీలవోలె జగదాత్ముఁడు యజ్ఞవరాహమూర్తి మహా ధ్వాంతగభీరభీమణమహార్ణవతోయము మూహమున్ ఖురా। క్రాంతము జేసి క్రమ్మఱ ధరాతలమంబులమీఁద నిల్పి విశ్రాంతిఁ వహింపఁ జేసి గుణశాలి తిరోహితుఁ డయ్యె నయ్యెడన్॥ ఉ॥ మంగళమైన యీ కథ సమంచితభక్తిఁ బఠింపవిన్నవారిం గరుణార్ద్రదృష్టిఁ గని శ్రీహరి చాలఁ బ్రసన్నుఁ డౌను సత్। సంగతుఁడైన విష్ణుఁడు ప్రసన్నుఁడుదానగు నేని వారికిన్ మంగళము ల్లభించు నను మానము లేదది గాక వెండియున్॥ చ॥ హరి నిజదాసకోటికిఁ దదాశ్రయులై రమియించు సన్నట్టి సత్పురుషులకిష్ట వస్తుపరిపూర్ణము నోరథసిద్ధిగల్గును। స్థిరమగుచున్న ముక్తియును సిద్ధముగాఁ జెలువారు నన్న న। స్థిరతరతుచ్ఛసౌఖ్యములు సేకురుటల్లఁ జెప్ప నేటికిన్॥ ఉ॥ కానసరోజలోచనుజగత్స్తవనీయకథాసుధారసం। బాని నయట్టి జిహ్వాయసదన్యకథాలవణోదకంబులు। స్నానము సేయఁజూచు నెసు పర్వమహీజమరందపానలా। ళానుభవంబునొందు షషుఢుపంబును బోవు నె వేఁపచెట్లకున్॥ క॥ అని మైత్రేయమునీంద్రుండనఘుఁడు విదురునకుఁ జెప్పినట్టి తెఱంగు। స్సునపౌత్రునకు వ్యాసునితనయుఁడు వినిపించి మఱియుఁ దగనిట్లనియెన్॥ క॥ అని చెప్పిన విని మైత్రేయుని గని విదురుండు వల్కె నుత్తమముగు నా। దనుజకులాంతకుచరితము। వినితనియదు నామనంబు విమలచరిత్రా॥ చ॥ సవనవరాహమూర్తి కథ సర్వము నీదయ వింటి వెండియు। న్వివరముగా వినంబలుక వేడుణసాంద్ర మునీంద్రచంద్రమా। ధవగుణకీర్తనామృతవితానము గర్ణపుటాంజలి న్వేసన్। జవిఁగొన కేల మానుజనసంతతి కిన్నవతాపవేదనల్॥ కావున॥ సీ॥ శ్రీహరి యజ్ఞవరాహరూపముఁ దాల్చి మించిహిరణ్యాక్షుఁ ద్రుంచె నను చు। నప్పుడు మునినాథ సెప్పితి నాతోడ నవ్వరాహంబు దంష్ట్రాగ్రమునను। ధరణి నెబ్బంగి నిధరియించె హరికి హిరణ్యాక్షుతోడ వైరమున కేమి। కారణమసురనేగతి సంహరించె దానింతయు నెఱిఁగింపు మిద్ధచరిత। యనిన మైత్రేయముని విదురునకు ననియె। హరికథాకర్ణనమున నెంపారు నీకు। జన్[illegible]ద్ధియగుటకు సందియంబు। వలదు హరిమహిమ *విధికి వశమె తెలియ॥ క॥ అనఘాత్మనను న్నీవడిగిన యీకథ ధ్రువుఁడు విష్ణుకీర్తనపరతన్। దనరిన నారదమునడుగన। తనికతఁ డెఱిఁగింప హరికథాశ్రవణమునన్॥ గీ॥ దండధరుఁ §జెల్చ దాకాలఁ దన్ని ధ్రువుఁడు। నందునందును వాసికె

—§ మైత్రేయమహాముని విదురునకు హిరణ్యాక్షహిరణ్యకశిపుల జననం బెఱింగించుట. §—

నెక్కెనట్టి। విష్ణుసంకీర్తనం బరవిందభవుఁడు। దివిజులకుఁ జెప్పె నదినీకుఁ దేటపరతు॥ ఆకర్ణింపుము॥ సీ॥ బలిసిదతు ప్రజాపతి తనూభవ దితి సంతానవాంఛఁ దాఁ జింతతోడ। నొకనాఁడు పుష్పసాయకశరనిర్భిన్నభావయై విరహతాపమున వచ్చి। పతిసమాగమ వాంఛ ప్రభవింప నిజనాథు సన్నిధి నిలిచియస్ఖలితనియతి। నగ్నిజిహ్వుం డనుయజ్ఞభోక్తుండగు హరి §జిష్ణుఁ దనచిత్తమందు నిలిపి। తగ బయస్సున నగ్నిహోత్రంబుఁ జేసి। కమలహితుఁడస్తశైలసంగతుఁడు గాఁగ। హోమశాలాంగణమునఁ గూర్చున్న విభుని। గశ్యపుని గాంచి విమలవాక్యములననియె॥ చ॥ గజవిభుఁ డుద్ధతిన్ననటికంబములన్ దళించు లీలఁ జిత్తజుఁడు ప్రసూనసాయకపితానము చేత మదీయచిత్తమున్। గలఁగఁ జేసి పెన్వగలఁ గాఱియఁ బెట్టఁగ నాథనీపదాంబుజములఁ గానవచ్చితిఁ బ్రభుత్వ మెలర్పఁగ నన్నుఁ గావవే॥ వ॥ అదియునుం గాక నాతోడి సవతులెల్లను భవత్కృపావిశేషంబున గర్భాధానంబులు వడసి నిర్భరానందంబున నుండం జూచి శోకవ్యాకులితచిత్తనై యున్న నన్ను రక్షించుట పరమధర్మంబు నీవు విద్వాంసుండవు నీ వెఱుంగని యర్థంబు గలదె నీవంటి మహానుభావులైన సత్పురుషులార్తులైనవారికోర్కులు వ్యర్థంబులుగాకుండం దీర్చుట ధర్మంబని వెండియు నిట్లనియె॥ క॥ పతిసన్మానము వడసిన। సతులకు నభిమతపదార్థసంసిద్ధియు నూర్జితయశముఁ గలిగి లోకస్తుతమై చెలువారుచుండుఁ జువ్వె మహాత్మా॥ క॥ తన ధర్మపత్నివలనను। మునుకొని తాఁ బుత్రరూపమున నుదయించున్। వ్వను దీపము చే దీపించిన దీపము రెండుగా వెలిఁగి యొకడయ్యున్॥ క॥ కావున నీయర్థమయాత్మా వై పుత్రయను వేదతతులందోలి। న్వారిరిఁబలుకఁగ వినవే। ధీవర నను గావు మధికదీనం గరుణన్॥ చ॥ వరకరుణా మతిం దుహితృవత్సలతం దనరారునట్టి మద్గురుఁ డొకనాఁడు మమ్ముఁ దన కూఁతుల నందఱఁ బిల్చి మీ మనో। హరు నెఱిఁగింపుఁ డిత్తుఁ గడు

§ జెల్చదాకాలన్। వేగముగా ఎడమకాలితోతన్నెను. § విష్ణు, విశ్వం వేవేష్టి వ్యాప్నోతి ఇతి విష్ణుః ప్రపంచమును వ్యాపించియుండువాఁడు. విష్ల్ వ్యాప్తౌ.

లానన లారయటన్న నందులోఁ। బురుషవరేణ్య యేముపదముం బ్రవరము ల్మిలినిన్వరింపవే॥ క॥ దితియాగతిఁ గామవిమో।
హితమతి బహువచనముల హృదీశునిఁ బలుకన్। ధృతిఁ గృపణఁ బతివ్రత నిజ। సతిఁ గని కశ్యపుఁడు వలికె నల్లాపమునన్॥ వ॥ నీ
వు చెప్పినయట్ల పురుషులకు నంగనలవలన ధర్మార్థకామంబులు సిద్ధించుఁ గర్ణధారుండు నావచేతం బయోధిఁ గడచు చందం
బున గృహమేధి సర్వాశ్రమవాసుల నరపి రక్షించుచు నిజాశ్రమంబున వ్యసనార్ణవంబుఁ దరియింపం జేయు భార్య పురుషు
నం దమ నర్ధంబు, భార్యయందు సకలగృహకార్యభారంబును జేర్చి పురుషుండు నిశ్చింతుండై సుఖియించుచుండు మఱియు ని
తరాశ్రమదుర్జయంబులైన యింద్రియశత్రువర్గంబుల భార్యాసహితుండైన గృహస్థుండు దుర్గాధిపతియైన రాజు శత్రు
సంఘంబుల జయించు చందంబున లీలామాత్రంబున జయించు నిట్టి కళత్రంబునకుం బ్రత్యుపకారంబు సేయ సకలగుణాభి
రాములగు సత్పురుషులును నూఱేండ్లకును జన్మాంతరంబులకునైన సమర్థులుగారనిన మముబోఁటి వారలు సేయనోపుదు
రే తొయ్యలి నీమనంబునం గల దుఃఖంబుఁ దక్కుమని యిట్లనియె॥ గీ॥ తరళలోచన నీవు సంతానవాంఛఁ। జేసి వచ్చితి వౌఁ గులశీలవ
ర్తనములుగల భార్య మనమున నమరు కోర్కిఁ। దవిలి తీర్చుట పతికిఁ గర్తవ్య మరయ॥ మ॥ తరుణీ యొక్కముహూర్తముండు
మిది సంధ్యాకాలమిక్కాలమం। దురయన్ భూతగణావృతుండగుచుఁ గామారాతి లీలన్వృషే। శ్వరయానంబున సంచరించు
టన భావ్యంబయ్యె నీయుగ్రవే। ళ రమింపం గనిషిద్ధకర్మమగు నేలా ధర్మమున్వీడఁగన్॥ మ॥ అరవిందాననవీఁడె నీమఱఁది లీ
లాటోపరుద్రక్షపా। చరజంఝానిలధూతపాంసుపటలచ్ఛన్నుండు ధూమ్రైకదు। ర్భరవిద్యోతితకీర్ణభీమజటాబద్ధుండు
భస్మావళిప్తరుచిస్ఫారసువర్ణవర్ణుఁ డగుచున్ భాసిల్లు నత్యుగ్రుఁడై॥ క॥ అనలసుధాకరరవిలోచనముల వికసింపఁ జేసిన
మధికరోషంబునఁ జూచుచున్నవాఁడదె। వనితా బంధుత్వ మరయ వలవదెసుమ్మీ॥ క॥ అతనికిఁ దలపోయ హితా। హితులును
సమ్మాన్యులును విహీనులును నతిగ। ర్హితులును లేరీశుఁడు సమ। మతియను నిఖిలైకభూతమయుఁడై యుంటన్॥ క॥ కావున మ
ద్భావితభవ। ద్దేవరుఁడని తరుణి నీమదిం జూడకుమా। దేవాదిదేవుఁ త్రిజగ। త్పావను నిఖిలైక *నేత భగవంతు హరున్॥ వ॥ ప
ముసు సత్పురుషులైన విజ్ఞానవంతులును భుక్తభోగంబై దూరతో న్యస్తమైన పుష్పమాలికయునుం బోలె నమ్మహాత్మునిచ
రణారవిందవందనాభిలాషినైన యవిద్య ననుసరించి వర్తింతుమది యునుంగాక॥ సీ॥ ఎవ్వనికరుణ బ్రహ్మేంద్రాదిదిక్పా
లవరు లాత్మపదవైభవములఁ దనరి। రెవ్వని యాజ్ఞ వహించి వర్తించును విశ్వరూపిణి యానవిద్య యెపుడు। నెవ్వని మహిమం
బులిట్టివట్టివి యని తర్కింప లేవు వేదంబులైన। నెవ్వని సేవింతు రెల్లవారును సమానాధికరహితుఁడై యలరు నెవ్వఁ। డట్టి
దేవుని త్రిపురసంహారకరుని। నస్థిమాలాధరుండు భిక్షాశనుండు। భూతిలిప్తాంగుఁడు ప్రేతభూమి। వాసుఁడని హాస్య
మొనరించువారు మఱియు॥ క॥ ధరశునకభోగ్యమును నిహ। పరదూరము నైన తనువుఁ §పాథేయముగా। నెఱి నమ్మి వస్త్ర
మాల్యాభరణంబుల నలంకరించు పామరజనులన్॥ క॥ ఘననిర్భాగ్యులుగా మదిఁ। గనుమని యారీతిఁ బ్రియకుఁ గశ్యపుఁడె
ఱిఁగింపఁ। విన దితి గ్రమ్మఱఁ బలికెను। మనసిజసాయకవిభిన్నమానసయగుచున్॥ క॥ మునుకొని లజ్జావనతవ। దనయై ప్రాణే
శుకొంగుఁ దాలిమి మాలం। బెనఁగొని యెవార కామిని। యనువున వినిషిద్ధకర్మమునందభిముఖయై॥ వ॥ ఇట్లు చేసిన భార్యాని
ర్బంధంబునకుం దొలంగ నేరక యీశ్వరనమస్కారంబొనరించి యేకాంతంబున నిజకాంతాసంగమంబుఁ దీర్చి సంగమానం
తరంబున *వార్చి స్నాతుండయి ప్రాణాయామంబును విరజంబు §సనాతనంబునైన బ్రహ్మగాయత్రి జపియించె నంత॥
క॥ దితియును నిషిద్ధకర్మ। స్థితికై మదిలోన సిగ్గు దిట్టాడఁగ నా। నతవదనయగుచు నాపశు। పతివలని భయంబుఁ దక్కి పరమప్రీ
తిన్॥ క॥ అర్భకులు లేనిదగుటను। గర్భము నిజనాథువలనఁ గమలానన ¶కా। విర్భూతమైనఁ గర్భ §ని। ర్భరపరితోషమాత్మ నె
లకొనియుండెన్॥ వ॥ అంతఁ గశ్యపుండు దక్కాలసముచితసంధ్యావందనంబులు దీర్చి॥ క॥ ఆచెలికి గర్భచిహ్నము। దోఁచిన ని
రితోషమాత్మఁ దొడరఁగ †నామా। రీచుండు నిజతలోదరిఁ। జూచి యకర్మమున కాత్మ ప్రుక్కుచుఁ బలికెన్॥ మ॥ సతి నీ వేగతి
నిందకోడక మనోజాతేక్షుకోదండని। ర్గతనారాచపరంపరాహతవిశీర్ణస్వాంతవై పాపసం। గతిలజ్జాభయధర్మముల్వి
డిచి దుష్కాలంబునం దేరమిం। చితి బల్మిన్వెలయాలికైవడి నిదుశ్శీలక్రియాలోలతన్॥ అట్లు రమించుటం జేసి॥ క॥ సతి విను
భూతగణప్రేరితులై రుద్రానుచరుల రీణబలసమన్వితులుగ్రకర్ములతిశౌ। ర్యతములు భద్రానుభద్రులను నామములన్॥
క॥ పరగిన దర్పోద్ధతులిద్దరు కొడుకులు నీకుఁ బుట్టి ధరణికి ?ప్రేఁగై। నిరతము బుధజనపీడా। పరులై వర్తింతు రాత్మబలగర్వమునన్

---

• నేత।పతి— §పాథేయముగా।జీవాధారభూతముగా— *వార్చి।ఆచమనము చేసి— §సనాతనంబు।శాశ్వతమయినది— ¶ఆవిర్భూతమైనన్।పుట్టఁగా— §నిర్భరపరితోషము।అధికానందము— †మారీచుండు।మరీచిబ్రహ్మపుత్రుఁడైన కశ్యపుఁడు— ?ప్రేఁగు।భారము.

నర్క॥ గీ॥ అట్టిసుకర్ములకును మహాత్ములలిగి। విశ్వవిముఁడై నహరికి నివిన్నవింప। నతఁడు గోపించి*హరికులిశాయుధమున।
గిరులనతికినగతి వారిధరణిఁగూల్చు॥ క॥ అని కశ్యపుఁడెఱిఁగించిన। వినిదితిభయమందిచాలవిహ్వలమతియై। తనహృదయే
శుముఖాబ్జముఁ। గనుఁగొని యిట్లనియె విగతకౌతుకయగుచున్॥ చ॥ ధరసుజనాపరాధులగు తాపసచిత్తులకెందు నాయువు।
న్సిరియునశించిపోవు స్మృతిసేకుకుశత్రులచేత నింతయా। నరయఁగనిక్కవంబు భవదాత్మజులార్యులకెగ్గుఁజేయభూ। సు
రుల త్రుళగ్నిపాల్పడక శోభనమాహరి చేతి పంచతన్॥ చ॥ జనవుడు గశ్యపుండు గమలాననకిట్లను నింతనీవు చేసినవిపరీత
కర్మమునఁ జేకురెనిట్టియవస్థ దీనికి। న్మనమునఁ దాపమొందకుము మాధవుపాదసరోజయుగ్మ చిం। తనమును జేసియున్నను
ముదంబునఁ గొల్చుటఁ జేసియుందగన్॥ గీ॥ రమణినీసుతులందు హిరణ్యకశిపు। వలననుదయించు వారిలోపల ముకుంద। పదస
రోజాతవిన్యస్తభావుఁడైన। తనయుఁడుదయింపఁగలఁడత్ ధార్మికుండు॥ మఱియును॥ క॥ ఘనపుణ్యుఁడు నన్వయపావనుఁ
డగునప్పుణ్యతమునివరకీర్తిలత। భ్వనజభవాండోదర మెల్లనునిండఁగఁ బర్వు బుధలలాముండగుటన్॥ గీ॥ వామలోచనవి
శుముమర్వర్ణహేమ। మగ్నిపుటమునఁ బరిశుద్ధమైవెలుంగు। నట్లు దుష్టాత్మసంభవుఁడయ్యు వంశ। పావనుండగు హరిపాదభ
క్తుఁడౌట॥ అట్టి నీపౌత్రుండు॥ గీ॥ అంచితాష్టాంగయోగక్రియాకలాపు। లైన యోగీశ్వరులు నస్మహాసుభావు। నతులశీల
స్వభావవిజ్ఞానసరణిఁ। దామఁజరియింపనాత్మలఁదలఁతురెపుడు॥ ఉ॥ ఆమహితాత్మకుండు సుగుణాంబుధి భాగవతోత్త
ముండు పుల। శ్రీమహిళాదినాథుఁ మలసీదళదాముఁబరేశు నాత్మహృ। త్తామరసంబునందుఁ బ్రసదంబున నిల్పితదన్యవస్తు
వుం। దామదిలో హసించు హరిదాస్యవిహారపవిత్రితాత్ముఁడై॥ సీ॥ మహితదేహాద్యభిమానంబుదిగనాడి విరతరాలంపటశీ
లుఁడగుచుఁ। బరసమృద్ధికి నాత్మఁబరితోషమందుచుఁ బరదుఃఖమునకుఁ దాపమును బొందు। నీపిశ్వమంతయు నేపిభుమయ
మనియెవ్వనికరుణచేనెఱుంగనయ్యె నట్టి యీశ్వరునిఁ దానాత్మసాక్షిగమోదనుదరంగఁ జూచునన్యస్థిమిట్ల నిదాఘో
గ్రసమయంబునందు నిఖిలజంతుసంతాపమడఁగించుచంద్రుమాడ్కి। నఖిలజగముల దుఃఖంబులపనయించు। రూఢిమీఱ
నజాతవిరోధియగుచు॥ వ॥ మఱియు హరిధ్యాననిష్ఠాగరిష్ఠుండగునమ్మహాభాగవతాగ్రగణ్యుండు॥ క॥ విమలాంత
రంగబహిరం। గములను స్వేచ్ఛానురూపకలితుండగు నా। కమలాధీశ్వరుఁగుండల। రమణీయముఖంబుఁ జూచుఁ బ్రసాదం
బెసఁగన్॥ గీ॥ మఱియు నీవిశ్వమాహరిమాయముగాఁగ। మనములోపలఁదలఁచు నమ్మనుజభుంభ। మనుమహాత్ములలోన నీ
మనుమఁడఖిలు। డనఁగనుతికెక్కనునుచుఁ గశ్యపుఁడువలుక॥ క॥ విసితనతనయులు నధముల। నుచేహతులగుదురనుచుఁద
నమనుమఁడుసజ్జనుతభాగవతుండగు। నని సనమునఁ జాలదుఃఖహర్షములొదవన్॥ వ॥ ఉండనంత నాదితియుఁ గశ్యపువీ
ర్యసంభృతంబైనగర్భంబు మర్భర తేజోభిరామంబునన్య తేజోభిరామంబు దినదిన ప్రవర్ధమానంబునై నిష్పటిల్లనిజోదర
స్థితులైనకుమారులమరవనులైవర్తింపంగలరని చింతింపుచు గర్భంబు శతవర్షంబులు ధరియించియున్న తదనంతరంబ
ఉ॥ ఆదితిగర్భమందు దివిరాకృతితోనొకతేజమన్యతే। జోదమలీలవెల్వడివసుంధరయున్గగనంబునిండినం। ఛాదితపద్మ
బాంధవనిశాకరదీప్తులుగల్గినూదికా। భేదమశేషరూపసంతమసభీషణమైనభయాకులాత్ములై॥ చ॥ అసురగణంబు లె
ల్లఁగమలాసనుపాలికినేగితత్పదా। బ్జములకు మ్రొక్కి యంజలులు ఫాలములంగదియంగఁ జేర్చి దిగ్ధామలభయంబుసం
భ్రమము దార్కొనసిట్లనిపిన్నవించిరో। యమరపులాగ్రగణ్య ¶దురితార్ణవతారణ సృష్టికారణా॥ ఉ॥ నీవు చరాచరప్రచ
యనేతవు §ధాతవు సర్వలోకపా। లావలిమౌళిభూషణుఁడవంచితమూర్తివి దేవదేవ। నీవరయీయజాండమున నీవు
నెఱుంగనియర్థమున్నదే। భావమునందలంపు ముపిపన్నులమమ్ము భవత్ప్రసన్నులన్॥ వ॥ దేవా కార్యరూపంబగు చేతనాచే
తనాత్మకప్రపంచంబునకుఁ గారణుండవైన నీచేత సమస్తభువనంబులు సృజియింపంబడె*- నీవు సర్వభూతాత్మభావవిదుం
డవు లోకనాథశిఖామణిభూషుండవు విజ్ఞానవీర్యుండవు నవిద్యం జేసియిట్టి ప్రత్యరూపంబు నొందితి గృహీతరజోగుణుండ
వు నీయందుఁ బ్రపంచంబు లీనంబై యుండుసుపక్వయోగంబు నొందినస్థానములై ధ్యానంబున నిన్నరయుచు నిర్జితశ్వాసేం
ద్రియాత్ములై భవత్ప్రసాదంబు వడసినవారలకుం బరాభవంబు లేకుండెడి యెవ్వని వాక్యపాశబద్ధులై పశువులచందంబు
న నిఖిలజీవులు వర్తింతురట్టి నీకు నమస్కరించెద- మహాయారాత్రపిభాగాభావంబున లుప్తకర్మంబులగు లోకంబులకు సే
మంబుఁగావింపుము శరణాగతులమైన మమ్ము నతిశయకరుణారసపరిపూర్ణంబులగు కటాక్షంబుల నీక్షించి రక్షింపుము కశ్య
పవీర్యంబు దితిగర్భంబుననుండి సకలదిగ్వలయంబు నాక్రమించి దారువందు వహ్నిచందంబున లీనంబై ప్రవృద్ధంబగుచున్న

• హరి॥ఇంద్రుఁడు— ¶ దురితార్ణవతారణ। జననమరణాదిరూపపాపసముద్రమును దాటించువాఁడా— § ధాతా। ఫలప్రదుఁడవు.

చనివిన్నవించినబృందారకసందోహంబులకు నానందంబు గందళింపన రవిందనందనుం డిట్లనియె॥ క॥ గీర్వాణులార యుష్మ
త్పూర్వజులాత్మీయసుతులు పుణ్యులు విచర న్నిర్వాణులు సనకాదులు। సర్వంకష శేముషీవిచక్షణు లెందున్॥ క॥ వారలు
నిస్పృహులగుచును। వారణభువనంబులెల్ల వడిఁ గ్రుమ్మరుచున్। ధీరులు లోకనాథు భక్తిన్। శ్రీరమణీశ్వరపదాబ్జసేవానిర

✽ సనకసనందనాదులు వైకుంఠమునకరుగుట. ✽

తిన్॥ చ॥ చనిచని కాంచి రంత బుధసత్తములంచిత *నిత్యదివ్యశో। భనవిభవాభిరామముఁ బ్రపన్నజనస్తవనీయనామము।
జ్జననవిరామమార్యజనసన్నుతిభూమము భక్తలోకపా। లనగుణధామముం బురలలామముఁ జారువికుంఠధామమున్॥
ఉ॥ ఆమహనీయపట్టణమునందు వసించెడువారలాత్మని। ష్ఠానుఫలంబె సత్ఫలముగాఁ దలపోసి ముముక్షుధర్ములై। శ్రీమ
హిళాధిపాంఘ్రిసరసీరుహపూజలొనర్చుచున్మహో। ద్దామతదీయరూపములఁ దాల్చి సుఖించుచునుందు రెప్పుడున్॥
చ॥ విగతరజస్తమోగుణుఁడు విశ్రుతచారుయశుండు శుద్ధస। త్త్వగుణుఁ డజుం డనాది ✽భగవంతుఁ ¶డనంతుఁ డనంతశక్తి
యున్। నిగమచయాంతవేద్యుఁడు వినిశ్చలనిర్మలధర్మమూర్తియై। యగు హరి పేరఁ బెంపెసఁగుచున్న సరోపవనమ్ము లిమ్ము
లన్॥ వ॥ మఱియుం గైవల్యంబు మూర్తిభవించిన తెఱంగునం బొలుపారుచు నై శ్రేయస నామంబున నభిరామంబై సతతం
బు సకలర్తుధర్మంబులు గలిగి యర్థిజనంబుల మనంబుల ఘనంబులుగ నీరికలెత్తిన కోరికలు సారికలు గొనసాగించుచుం గా
మదోహనసహితంబులుం బుష్పఫలభరితంబులు నైన సర్వ ✽✽సంతానవనసంతానంబులు సమందితవసంతసమయసౌభాగ్య
సంపదభిశోభితవాసంతికాకుసుమవిసరపరిమళమిళితగళితమకరందలలితామోదముదితహృదయులై యఖండతేజోనిధి
యగు పుండరీకాక్షు చరిత్రంబులు గ్గడింపలేక ఖండితజ్ఞానులైన మునిరతిశయవిషయసుఖానుభవకారణంబగుట నిందిరా
సుందరీరమణుచరణసేవావిరమణకారియగు ననితలం బిత్తగంధప్రాపకగంధవహుని దిరస్కరించి నారాయణభజనపా
రాయణులై చరియించుసుందరీయుక్తులైన ✽✽✽వైమానికులై మానికమానసోత్సేకంబుగం బారావతహంససారసశుక
పికచాతకతిత్తిరిమయూర †రథాంగముఖ్యవిహంగమరంగ కోలాహలవిరామంబుగా నుపవిందనయనకథాగానంబు ల
మానంబులుగా మొరయు మదవదిందిందిరసందోహకలితపుష్పవల్లీమతల్లికలు ననంతితచరిత్రంబైన నిర్వంతనిలయనిక
రంబునం దేజరిల్లు విలసితతులసీదామంబుం గనుంగొని యీతులసీమాల్యంబు హరిగళవిలగ్నంబై యుండు సౌభాగ్యంబున
డయుట కేమితపంబు గావించెనో యని బహూకరించుచందంబున నొప్పు చందనమందారకుందారవిందపున్నాగనాగ§కు
రువకోత్పలపారిజాతాది ప్రసూనమంజరులు మంజరీపుంజరంజితనికుంజంబులు యందు మసృణంగపీనకుచభారాకంపితమ
ధ్యంబులుం గటితటకనకమేఖలాకలాపనినదోపలాలితనీలమణిశోభితస్ఫటికనితంబభరాలసయానహసితకలహంసవా
యూరగమనంబులు నసమశరకుసుమశరవిలసితంబు నవహసించునయనకమలంబులును గలిగిన సుందరీసందోహంబు
లందగిలి కందర్పకేళివిహారంబుల నానందంబు నొందక ముకుందచరణారవిందసేవాపరిలబ్ధమురకతనై మార్యహేమమయ
విమానారూఢులై హరిదాసులు విహరించుపుణ్యప్రదేశంబులు నిందిరాసుందరి త్రైలోక్యసౌందర్యఖనియైన సహస
మూర్తిధరియించి రమణీయరణితమణినూపురచరణారవిందయై నిజహృదయేశ్వరుం డైన సర్వేశ్వరుని మందిరంబులో
నం జాంచల్యదోషరాహిత్యంబున వర్తింపంగ రకమల భ్రమణీకృతలీలాంబుజాతయై తననీడ గాంచనస్ఫటికమయమధ్య
ప్రదేశంబులం బ్రతిఫలింప శ్రీనికేతనుని ✽✽✽✽నికేతనసమ్మార్జనకైంకర్యంబు పరమధర్మంబని తెలుపుచందంబునం జూపట్టు
చు నిజవనంబునందు నుసౌరభాఢ్యరామంబులను తులసీదళనామంబుల నాత్మనాయకుని చరణారవిందంబుల నర్చింపుచు నె
సటినృగమనమదపుటసలు నమసలుకొని తుంపెసలాడు పనులు బలితతిలప్రయాన దిరాభానాసంపసను మోము తానాగ
విమలసలిలంబులం బ్రతిబింబింప నిజమనోనాయకు చేతం జుంబితంబగుటం గాఁ దలంచి లజ్జావనతవదన యైయుండం జేయు
ప్రవాళలతికామూలంబులైన ✽✽✽✽✽కూలంబులుం గలనడబావులుం గలిగి పుణ్యంబునకు శరణ్యంబు ధర్మంబులకు నిర్మలస్థానంబు
సుకృతమూలంబునకు నాలవాలంబునై పొలుపొందుచుండు॥ చ॥ హరివిముఖాత్ములన్యవిషయాదృతచిత్తులుఁ బాపవర్తులు।
న్నిరయనిపాతహేతువున నింద్యచరిత్రములైన మనుష్యథా। నిరతిఁ జరించువారలును నేరరు పొందఁగ నిందిరామనో।హార

*నిత్య। కాలత్రయమందు నశింపని—దివ్య। అప్రాకృతమైన— ✽భగవంతుఁడు। షడ్గుణైశ్వర్యసంపన్నుఁడు— ¶అనంతుఁడు। దేశకాలవస్తు
పరిచ్ఛేద్యశూన్యుఁడు— ✽✽సంతా-బులు॥ సంతానమను కల్పవృక్షసహితములగు ఉద్యానవనసమూహములు— ✽✽✽వైమానికులు। విమానము
లనెక్కి తిరుగువారు— †రథాంగ। చక్రవాకపక్షి— §కురువక। ఎఱ్ఱపువ్వులు గలగోరింట. ✽✽✽✽నికేతన। గృహము— ✽✽✽✽✽కూలంబు। దరి-ఒడ్డు.

చరణారవిందభజనాత్మకులుం డెడు గొందఱు నారయన్ ॥ వెండియు ॥ చ॥ హరిం బరమేశుం గేశవు ననంతు భజింపఁగ ధర్మతత్త్వ
ధీ। పరిణతి సాధనంబగు స్వభావముఁ దాల్చిన యట్టి మర్త్యులా। సరసిజనేత్రు మాయను ‡ భృశంబుగ మోహితులై తదంఘ్రి
పం। కరుహములర్థిమైఁ గొలువఁగానమిఁ బొందరు తత్పదంబునున్ ॥ చ॥ మఱియు సరోరుహోదరుని మంగళదివ్యకథాను
లాపని। ర్భరపరితోష బాష్పకణబంధుర చారుకపోలగద్గద। స్వరపులకీకృతాంగులగు వారలు నిస్పృహచిత్తులత్యహం। కరణ
విదూరులుం బరుసుకర్ములునుం డెడు పుణ్యభూములన్ ॥ అందు ॥ మ॥ వరవైకుంఠము ¶ సారసాకరము దివ్యస్వర్ణశాలాంక
గో। పురహర్మ్యావృతమైన తద్భవన ❀ మంభోజంబు దన్మందిరాం। తరవిభ్రాజితభోగికర్ణికదమద్యద్భోగపర్యంకమం। దిర
తోడన్వసియించు మాధవుఁడు దానేపారు భృంగాకృతిన్ ॥ అంత ॥ మ॥ హరి చేఁ బాలితమైన కాంచనవిమానారూఢమైనట్టి
స। త్పురుషానీకము చేఁ దనర్చి విభవాపూర్ణ ప్రభావోన్నతి। న్నరమొప్పారు తదీయధామము జగత్కల్యాణమూర్తుల్ మునీ। శ్వ
రులర్థిన్నిజయోగశక్తిం బరితోషస్వాంతులై చెచ్చెరన్ ॥ డాయంజని ॥ చ॥ మరకతరత్నతోరణసమంచితకుడ్యకవాటగే
హాళి। విరచితపట్టికక్ష్యలరవిన్దదళాక్షు విలోకనోత్సవా। దరమతి నన్యముం గనక దాఁటి యనంతరకక్ష్యయందు ముని। ద్వరను త
దీయపాలుర ననూదరసమాన వయోవిశేషులన్ ॥ సీ॥ కాంచననవరత్నకటకాంగుళీయక హారకేయూరమంజీరధరులఁ। గమ
నీయసౌరభాగత మత్తమధుకర కలితసద్వనమాలికా విరాజి। తోరస్థలులఁ గదాధరుల ఘనచతుర్బాహుల నున్నతోత్సా
హమతుల। నారూఢరోషానలారుణితాక్షుల భ్రూలతా కౌటిల్య ఫాలతలుల। వేత్రదండాభిరాముల వెలయు నమ్ము। కుంద
శుద్ధాంతమందిరాళిందభూమి। నున్న యిద్దర సనకాదియోగివరులు। చూచుచును వృద్ధులయ్యు నా సుభగమతులు ॥ క॥ ధీరతఁ
బంచాబ్దములపు। మారకులై కానఁబడుచు మనమున శంక। న్నారక చతురాత్ములని। వారితగమనముల డాయవచ్చిన నెడ
లన్ ॥ క॥ శ్రీలలనేశ్వరదర్శన। లాలసులై యేగు బుధ ※ లలాములనతిచ। శ్శీలతఁ ద్వచనప్రతి। కూలమతిన్ద్వాస్థకులు గుటి
లాత్మకులై ॥ క॥ వారించిన వారలు ※ బృం। దారకులీక్షించుచుండ దారుణపటురో। షారుణితాంబకులై రొద। వారించుచు వా
రునచటి వారును వినఁగన్ ॥ ఇట్లనిరి ॥ చ॥ పరమున ననంతు భక్తపరిపాలు సుహృత్తము నిష్టు నీశ్వరే। శ్వరు భజియింపఁగోరియ
నివారణ నిందరు డేరనిచ్చు లు। న్నరితము దాత్ములై కొలువఁ బాయక తద్భజ ※ నాంతరాయత। త్పరమతి మాకు నిప్పుడరిపద్ధమ
రాత్ముల నేఁడు గంటిరే ॥ వ॥ అని మఱియు సనకసనందనాదులిట్లనిరి మీమనంబుల స్వామిహితార్థంబై నిష్కపటవర్తనుల
మైన మా బోఁటులఁ గుహకవృత్తిం గలయితరజనంబులు భగవత్సదనంబుఁ బ్రవేశింతురో యను శంకం జేసి కొందఱుం బ్రవే
శింపఁ జేయుటయుఁ గొందఱ వారించుటయు ※ దౌవారికస్వభావంబని వారింపందలంచితిరేనిఁ బ్రశాంతదివ్యమంగళవి
గ్రహుండు, గతవిగ్రహుండు, భగవంతుండు, విశ్వగర్భుండునైన యీశ్వరుండు † ప్రాప్యంబుఁ బ్రాపకంబుఁ బ్రాప్తియు
నను భేదశూన్యుండు గావున మహాకాశంబునందు ఘటపటాద్యాకాశంబులు వేఱు లేక యేకంబయి తోఁచు చందంబున వి
ద్వాంసులగు వారమ్మహాత్ముని సకలాత్మభేదరహితునిం గాఁ బొడఁగందురదియునుం గాక లోకమందు రాజులు సాపరాధు
లైన కింకరజనంబుల నాజ్ఞాపించు చందంబున నీశ్వరుండు దండించునో యను భయంబునం జేసి వారించితిమని తలంచితిరే
ని భూసురవేషధారులమైన మాకు వైకుంఠనాయకుండైన సర్వేశ్వరునకు భేదంబు లేకుండుటం జేసి శంక సేయం బనిలేది
ట్లగుట నెఱింగియుం దబుద్ధులై మమ్ము వారించిన యనుచితకర్ములగు మీరలు మదీయశాపహతులగుచు రాగన భూలోకంబునం
గామక్రోధలోభంబులను శత్రువులు బాధింపం బుట్టుండని పలికిన ॥ క॥ వారలు వినితమనముల। భూరిస్ఫుటచండ ※ కాండ
పూగంబులచే। వారింపరాని భూసుర। దారుణవాక్యములకులికి తల్లడపడుచున్ ॥ క॥ పరితాపంబును బొందుచు। సరసిజలో
చనునిభటులు సనకాదిమునీ। శ్వరుల పదాంబుజములకు। న్దరమర్థిన్ మ్రొక్కి నిటలఘటితాంజలులై ॥ ఇట్లనిరి ॥ మ॥ వరయో
గీశ్వరులార మమ్ము నుదినెవ్వస్మీరలిట్లన్నని। ష్ఠురవాక్యంబులకింక మా మనములన్ శోకింపఁగా రాదు స। త్పురుషశ్రేణిఁ బ
రాభవించిన వృథాభూతాత్ములమ్ము మా। దురితంబింతకుఁ దెచ్చె మీఁదశుభముల్ దూకొందు మేమారయన్ ॥ అదియెట్లం
టిరేని ॥ ఉ॥ మీ కరుణావలోకనసమేతులఁ గామముఁ జేయఁజిత్తము। * ల్దూకొనెనేని మా చనువుఁ గ్రోయక నీఁదగుఁ గామ
లోభముల్। గైకొని పుట్టుచోట నవకంజదళాక్షుని నామవిస్మృతిన్। బైకొనకుండఁ జేయుట శుభంబగు మీఁది మదీయజన్మ

‡ భృశంబుగన్। అత్యంతముగాను —— ¶ సారసాకరము। కొలను —— ❀ అంభోజము। పద్మము —— ※ లలాములన్। శ్రేష్ఠులను —— ※ బృందారకులు। దేవతలు —— ※ అంతరాయము। విఘ్నము —— ※ దౌవారిక। ద్వారపాలకుఁడు —— † ప్రాప్యంబు। పొందఁదగినది - ప్రాపకంబు। పొందెడివాఁడు. ప్రాప్తి। పొందుట —— ※ కాండపూగంబులచేన్। బాణసమూహములచేత —— * దూకొనెనేని। ప్రవేశించినట్టులాయెనేని.

ముల్ ॥ ఆసమయంబున ॥ మ ॥ హరిసర్వేశుఁడనంతుఁడాకలకలంబాలించి *పద్మాలయా । నరసాలాపవినోదసౌఖ్యరచన
ల్బాలించి శుద్ధాంతమం । దిరమాణిక్యపుగేహళుల్గడచియేతెంచెం బ్రపన్నార్తిసం । హరుఁడై నిత్యవిభూతిశోభనకరుండై
మానితాకారుఁడై ॥ మఱియును ॥ చ ॥ శరనిధికన్యకామణియుసంభ్రమమొప్పఁగఁదోడరాఁ మనో । హరనిజలీలమైపరమ
హంసమునీంద్రగవేషపాదపం । కరుహములన్వినూత్నమణికాంచననూపురమంజుఘోషము । ల్వొరుసఁ జెలంగ నార్యజన
వంద్యుఁడు యోగిజనైకసేవ్యుఁడై ॥ చ ॥ కరమణిహేమకంకణనికాయఝణంకృతులుల్లసిల్లన । చ్చరలిడుహంసపక్షసిత
చామరగంధవహోచ్చలత్సుధా । కరరుచిరాతపత్రసుభగప్రవిలంబితహారవల్లరీ । సరసగళస్తుషారకణజాలవిరాజిత
మంగళాంగుఁడై ॥ మఱియు ॥ సీ ॥ నిఖిలమునీంద్రవర్ణితసస్మితప్రసన్నాననాంబుజముచేనలరువాఁడు । విస్మృతస్నేహార్ద్ర
వీక్షణనిజభక్తజనగుహాశయుఁడనఁదనరువాఁడు । మానితశ్యామాయమానవక్షముననంచితవైజయంతిరాజిల్లువాఁడు ।
నతజనావనకృపావ్యాప్తతరంగితములై భాసిల్లులోచనాబ్జములవాఁడు । నఖిలయోగీంద్రజనసేవ్యుఁడైనవాఁడు । సాధు
జనములరక్షింపఁజాలువాఁడు । భువనచూడావిభూషనైభూరిమహిమ । మించి వైకుంఠపురముభూషించువాఁడు ॥ సీ ॥ కటి
విరాజితపీతకౌశేయశాటితోఁ బెనఁగొను కాంచీగుణద్యుతినటింప । నాలంబికంఠహారావళిప్రభలతోఁ గౌస్తుభరోచులు గ్రంద
కొనఁగ । నిజకాంతిజితతటిత్స్ఫూర్తికర్ణకుండలరుచులుగండద్యుతులఁ బ్రోదిసేయ । మహనీయనవరత్నమయకిరీటప్రభానిచ
యంబుదిక్కులు నిండఁబర్వ । వైనతేయాంసవిన్యస్తవామహస్త । కలితకేయూరవలయకంకణములొప్ప । నన్యకరతలభ్ర
మణీకృతానుమోదసుందరాకారలీలారవిందమమర ॥ వ ॥ మఱియుఁ జరణారవిందమంజుకింజల్కపుంజప్రభారంజితతు
లసీమరందబంధురగంధానుబంధసుగంధిగంధవహాస్వాదకలితసేవాతత్పరులై చనుదెంచుయోగీంద్రులమానసానంద
కారియు బహిఃకరణాంతఃకరణపరితోష§ప్రకీర్ణరోమాంచరుచిదాయకంబుఁ బ్రభాపూర్తియుక్తంబగుమూర్తితోడనిజ
సౌందర్యవరకళాపనిర్జిత శ్రీరమణీసౌందర్యభాసమానుండగుచుఁ బాదచారియైయఖిలవిశ్వగురుండైన సర్వేశ్వరుండు
వేంచేసెనప్పుడు ॥ చ ॥ స్థిరశుభలీలనల్లరుగుదెంచినయవ్విభువిద్రుమారుణా । ధరనవపల్లవస్ఫురదమందచితకుందరుచిస్మితై
కసుం । దరవదనారవిందముముదంబునఁ దప్పకచూచియమ్మునీ । శ్వరులునిజాత్మలందనివిసాలక వెండియుఁజూచి రిమ్ములన్ ॥
చ ॥ సునిశితభక్తిఁ దన్ముఖముఁ జూచినచూడ్కులఁద్రిప్పలేకయుం । గనుఁగొని *రెట్టకేలకునకల్మషభక్తవిధూతఖేదము । ల్మ
నిజనచిత్తమోదములు ముక్తినివాసకవాటభేదము । ల్వినుతవినూత్ననూపురితవేదములన్మహనీయపాదముల్ ॥ చ ॥ కనిన
ఖపద్మరాగమణికాంతివిభాసితపాదపద్మము । ల్మనములయందుఁ గీల్కొలిపి లబ్ధమనోరథయుక్తులై పునః । పునరభివందనం
బులు విభూతిదలిర్చనొనర్చి యోగమా । ర్గనిరతచిత్తులు న్వెదకి కానఁగలేనిమహానుభావునిన్ ॥ క ॥ మానసమునఁ నిలిపిరి త ।
ధ్యానాస్పదుఁడైనవానిఁ దత్త్వజ్ఞులకున్ । గాననగువాని భక్తజ । నానందకరైకమూర్తినలరినవానిన్ ॥ వ ॥ మఱియుం

## సనకసనందనాదులు నారాయణదేవునినుతించుట.

జతురింద్రియగ్రాహ్యంబగు దివ్యమంగళ విగ్రహంబు ధరియించియున్న పురుషోత్తముని దాత్తతేజోనిధిం జూచి
సనకాదులిట్లనిస్తుతియించిరి ॥ చ ॥ వనజదళాక్షభక్తజనవత్సల దేవభవత్సుతుండుమా । జ్జనకుఁడునయినపంకరుహజా
తుఁడు మాకురహస్యమొప్పఁ జెప్పినభవదీయమంగళగభీరపరిగ్రహవిగ్రహంబు మే । మనయముఁ జూడఁగంటిమిఁ గృతా
ర్థులమైతిమంటిమీశ్వరా ॥ సీ ॥ దేవదుర్జనులకుభావింపహృదయసంగతుఁడవైయుండియుఁ గానఁబడవు । కడఁగి మీదివ్య
మంగళవిగ్రహంబునఁ జేసిసమంచితాశ్రితులనెల్లఁ । జేకొనిసంప్రీతచిత్తులఁగాఁ జేయుదతిశయకారుణ్యమతిఁ దనర్చి । క
మలాక్షసర్వలోకైకనాయక భవదనుసరణాభిలాషానులాప । విదితదృఢభక్తియోగప్రవీణులగుచు । నర్థిమైవీతరాగు
లైనట్టియోగిజనమనఃపంకజాతనిషణ్ణమూర్తి । వనియెఱుంగుదురయ్యనిన్నాత్మవిదులు ॥ క ॥ యుక్తిం దలఁపభవద్వ్యతిరిక్త
ములైనట్టియితరదృఢకర్మంబుల్ముక్తిదములయినమీపద । భక్తులుదత్కర్మములనుపాటింపరిలన్ ॥ ఉ ॥ కావునఁ గీర్తనీయగ
తకల్మషమంగళతీర్థకీర్తిసు । శ్రీవిభవప్రశస్తసుచరిత్రుఁడవై నభవత్పదాబ్జసే । వావిమలాంతరంగబుధవర్గమనర్గళభంగి
నన్యము । న్భావమునందలంచునెక్కపాఁగుణభూషణపాపశోషణా ॥ చ ॥ పరమతపోవిధూతభవపాపులమై చరియించుమా
కునేఁడు రయభవత్పదాశ్రితులనగ్గిశపించినభూరిదుష్కృత । స్ఫురణనసత్పదైకపరిభూతులమైనిజధర్మహానిగా । నిరయ
మునొందఁగావలసి నేరమువెట్టకమమ్ముఁగావవే ॥ చ ॥ కరమనురక్తిషట్పదము ¶ గన్రసుగంధమరందవాంఛచేఁ । దరుచుగ

---

*పద్మాలయా । లక్ష్మి — §ప్రకీర్ణ । వృద్ధిబొందించుచున్న — *ఎట్టకేలకున్ । కొంతతడవునకు — ¶క్రమ । మనోహరమయిన —

శీతకంటకవృతస్ఫుటనవ్యతరప్రసూనమ।జరులను డాయుపోల్కి నిభృశంబగు విఘ్నములం జయించుమీ। చరణసరోజ ముల్గొల్వుచు సమ్మతి వచ్చితిమయ్య కేశవా॥ చ॥ అలరు భవత్పదాంబుజయుగార్పితమై పొలుపొందునట్టి యా। తులసి పవిత్రమై నగతిం దోయజనాభ భవత్కథాసుధా। కలితములైన వాక్కులనకల్మషయుక్తి నివిన్నగర్వము। ల్విలసితలీలమై భువిం బవిత్రములై విలసిల్లు మాధవా॥ చ॥ మహితయశోవిలాసగుణమండన సర్వశరణ్య యిందిరయ। స్పృహయులకుంగానరాక *యతసికుసుమద్యుతి నొప్పుచున్న మీ। సహజశరీర మిప్పుడు భృశంబుగం జూచితి మీదయన్ కృపం గలిం। దహహ కృతార్థతం బొరసె నచ్యుత మ్రొక్కెద మాదరింపవే॥ క॥ అనిసనకాదులు దప్పక। వనజములకు మ్రొక్కి భక్తివశమానసులై। వినిపించిన *గోవిందుండు। మునివరులం జూచి పలికె ముదితాత్ముండై॥ వ॥ ఈయిరువురు జయవిజయాభిధానంబులు గల మదీయద్వారపాలకులు మీరు మిమ్ము గైకొనక మదీయాజ్ఞాతిక్రమణులయి చేసిన యపరాధంబునకుం దగిన దండంబుం గావించితిరి యది నాకు నభిమతంబయ్యె నదియునుం గాక భృత్యవర్గంబు చేయు నపరాధంబు స్వామిది యగుటం గాన మాననీయుండ నయిన నన్ను మన్నించి ప్రసన్నులగుమరుగాక యని వేండియు॥ చ॥ తనువునం బుట్టినట్టి బెడిదంబగు కష్టమహా *గదంబు చే। వనరి తదీయ చర్మము వివర్ణత నొందినరీతి భృత్యు లొప్పనిపనిం జేసిన స్వాములు బస్వరచారుయశంబు పేరుపెంపును జెడిపోయి దుర్యశముం బొందుచునుంమరు *విష్టపంబులన్॥ చ॥ అలవడ మీకు నావలన నబ్బిన తీర్థసుకీర్తనీయ సత్సలిల నిర్మలామృతవిలాసయశోవిభవాభిరామమై। వెలయు వికుంఠనామమ పవిత్రమునర్చ్య పచాథమాదిలో। కుల చెవి సోకం దత్క్షణమ కోరి *పునీతులం జేయు వారలన్.
గీ॥ అట్టి నేను దలంపమీయట్టి సాధు। జనులకపకారమర్థిం జేసిన మదీయ। బాహుసమూహమైన ద్రుంచెదను త్వాసనేల। నన్న నితరులమీద మ్రోలనెన్న నేల॥ క॥ ధరణీసురోత్తమసేవా। పరిలబ్ధంబైనయట్టి పాతకనాశ। కర నిఖిలభువనపూత। స్ఫురితాంఘ్రిసరోజతోయములు గలనన్నున్॥ క॥ అలఘుమతి విరక్తుని గాం। పలంపక నిజశుభకటాక్షధారాకలితో। జ్జ్వలన వవైభవశ్రీలలనారత్నంబు రక్షస్థలంబును జెందెన్॥ చ॥ క్రతువులు సేయుచో శిఖిముఖంబున వేలుచునట్టి సద్ఘృతాప్లుతంబులగు హవిష్యణమ్ము దముం బొందదు నిస్పృహధర్మమార్గసం। గతుండగు భూసురోత్తము ముఖంబున వేడ్కభుజించు సయ్యెడి। తృప్తిని బళంబున న్మనము దృప్తివహింపని సరిలేనిచ్చలున్॥ సీ॥ సతతంబున ప్రతిహత యోగమాయా విభూతిచే। శ్రీఖ్యాతిం బొందు నేను। నేను పీంసురులసమిద్ధ నిర్మలపాదనలినరజోవితానములు భక్తి। హాటకనవరత్నకోటీరమునం దాల్చునట్టి నాచరణాంబుజాంబువులను దవిలి ధరించి సద్యఃపునీతాత్ములై రర్థిం *చంద్రావతంసాదిదేవ। చయము లెవ్వాండు బ్రాహ్మణజనులు పనుపున పకృతుల్ సేసి రేని మారలు గడతండు వి। ప్రలసు నన్నుంగాంగ భావించు నతండు। ధర్మపద్ధతి నాప్రియతముండు వాండు॥ ఉ॥ గోవితతిధరాదివిజకోటి నిసన్నుసుదీనవర్గము। న్వావిరిభేదబుద్ధిం గనువారలఘోరగణంబు బొందసందు *నాశీవిషరోషదుష్పురిణం జెంది *కృతాంతభటుల్మహోగ్రగృధ్రావళిం బోలి *చంచువుల నంగములుద్ధతి నొంచి రెప్పయెన్॥ చ॥ ధరణిసురోత్తముల్బహువిధంబులం దమ్ముం బరాభవించినన్। దరహసితాస్యులై యమృదుమంబున నిచ్చలు పూజ సేయుచున్। సరసవచోవిలాసములసన్నుతి సేయుచుం దండ్రి నాత్మజుం। గరుణ నురక్తిం బిల్చుగతిం గైకొని పిల్చిన వారు నాసముల్॥ క॥ ఇందుండయ్యు నఘచరిత్రులకనయముం బ్రియతముండనగుచు నమ్మునివరులున్మను నన్ను భృగుపుత్రున్నన। గనలక పరితోషవృత్తిం గైకొంటిం గదే॥ సీ॥ పొలుచు నా మానసాంభోజాతభావంబు దెలియంగలేక యుద్వృత్తులగుచు। గడంగి మాయానతిం గడచి నద్దోషఫలము మీరలకు సంప్రాప్తమయ్యె। మునులార నా చిత్తమునను సన్నరీతియునట్టి సభూమి పైంబుట్టి మీర। లచిరకాలమునన నా *యంతికంబు నకొలిన రుదెంచునట్లుగా ననుమతింప। వలయుననియమ్ముకుందుండు పలుకుటయును। విని యంబున సనకాదిమునివరేణ్యులమ్మహాత్ముని మృదులభాషామృతంబుం। దవిలి గ్రోలియు రోష *సందష్టులగుచు॥ సీ॥ మునివరుల్దమ చిత్తములం దృప్తిం బొందక పంకజాతాక్షుండు పలికినట్టి। పరిమితగంభీరబహుళార్థమురవగాహములను విస్ఫురదమృతతుల్య। మాధుర్యసుగుణసమన్వితమ్ములు వినిగ్గతశబ్దదోషనికాయయుతము। లైన వాక్యములకు నాత్మలం బరితోషమందియుల్లసిరి నెయ్యములమనల। కొడయండిప్పుడు నందించి యోతలంప। నర్థి నిందించి యోమతక్రూలైక పండు। మునకు సంకోచమంది యోయనుచు సంశయాత్ములగుచు విలోకించి యంతలోన॥ క॥ నలినాక్షుండు దమదెసం గృప। గలిగిన భావంబుం దెలిసి కా

*అతసీకుసుమ। నల్లగిసెపుష్పము — *గోవిందుండు॥ గో అనంగా భూమి - దానినుద్ధరించినవాండు — *గదంబు। వ్యాధి — *విష్టపము। లోకము — *పునీతులన్। ధన్యులను — *చంద్రావతంసాది। చంద్రుండు శిరోభూషణముగాంగలశివుండు మొదలయిన — *ఆశీవిష। సర్పము — *కృతాంత। యముండు — *చంచువు। పక్షిముక్కు — *అంతికము। సమీపము — *సందష్టులు। పండ్లు గొరుకుచున్నవారు.

తుకమొులయిన్పులకీకృతాంగులై యుత్కలికఁ హర్షించినిటలఘటితాంజలులై ॥ క॥ భరితనిజయోగమాయా।స్ఫురణం
దనరారునతివిభూతియుబలము।న్బరమోత్కర్షముగలయీ।శ్వరునకునిట్లనిరిమునులుసద్వినయమునన్॥ గీ॥ పొలుపుదీ
పింపనిత్యవిభూతినాయ।కుఁడవుభగవంతుఁడవుననఘుఁడవునీవు।సత్కృతంబిప్పునీకభిమతమటంటె। వీశభవదీయచారి
త్రమెఱుఁగఁదరమె॥ ఉ॥ దేవగణాలికెల్లఁబరదేవతలైతనరారునట్టివి।ప్రావలికాత్మనాయకుఁడవై పెనుపొందిననీకునీ
ధరా।దేవతలెల్లనెన్నఁనధిదేవతలై రటయెట్టిచోద్యమో। దేవసమస్తపావనసుధీజనతావనవిశ్వభావనా॥ చ॥ కమలదళా
క్షనీవలనఁగల్గినధర్మముదావకావతా।రములనురక్షితంబగుఁజిరంబగునీశ్వరనిర్వికారత। త్వమునఁదనర్చునిన్నరయఁద
త్ఫలరూపముతత్ప్రథానగో।వ్యమునవిపల్కుచుందురుకృపామయలోచనపాపమోచనా॥ చ॥ మహిఁదలపోయనెవ్వని
సమగ్రపరిగ్రహమున్నఖింపని।స్పృహమతులై మునీశ్వరులుమృత్యుభయంబునఁ*దాటురట్టిస।న్మహితవివేకశాలిగుణ
మండననీకిలనన్యసత్పరి।గ్రహమదియెట్టిచోద్యముజగత్పరిపాలననిత్యఖేలనా॥ సీ॥ సతతంబుసద్ద్విజనశిరోలంకారపదరే
ణువులుగలపద్మను నెడ।జలజకింజల్క†శీనిష్యందమరందలోభాగతభ్రమరనాయకునిపగిది।ధన్యజనార్పితోదంచితతుల
సికాదామంబుననునిజధామమునుగుచు। భాసిల్లుభవదీయపాదారవిందముల్విలసితభక్తిసేవింపుచుండి। కమలనయనకృ
పావలోకనములాలయ।సద్దిఁబొడఁజూపుభాగవతానురక్తిఁ। జేసిభవదీయమహిమంబుచిత్రమరయ। చిరశుభాకార
యుంచిరాదిమూర్తిచోర॥ మ॥ చిరభాగ్యోదయదేవదేవలలితశ్రీవత్సలక్ష్మాంగయీ।వరవిప్రానుపదైకపుణ్యరజమేవర్ణింపనీ
మేనికాభరణంబటంచిసర్వలోకులకుపవిత్రశ్రేణిమాహాత్మ్యమీ।వరయంజెప్పటనైధరించితిగదాయెన్నన్బునీలాకృతీ॥
సీ॥ ధర్మమూర్తివిజగత్కర్తవునసునీవుప్రోవంగఁజనువారిఁబ్రోవవేని।నపిరళవేదోక్తమార్గమసన్మార్గముగుఁ
గానసత్వగుణవి।శిష్టుఁడవగుచునీజీవసంఘముసేమమరసిరక్షించునీదైనశక్తి।చేతనుధర్మవిఘాతులఖండించునీకునంవి
తమైననిగమధర్మ।మార్గనాశకరంబులుమదికినింపు। గావువిప్రులయందుసత్కరుణమెఱసి। ఘనతఁబలికినవినయవాక్య
ములునీకు।యుక్తమగుచుండుసతతంబుభక్తవరద॥ వ॥ అట్లయినంబరులయెడవినయంబులువలికినబ్రాహ్మణవహ్నియగున
నితలంచితివేని॥ గీ॥ విశ్వమునకెల్లఁగర్తవువిశ్వనిధివి।విశ్వసంరక్షకుండవై వెలయునీకుఁ। గడఁగిబ్రాహ్మణవహ్నియొక్కఁడిది
పలఁప।వినయములునీకుపేలలై వెలయుఁగాన॥ గీ॥ మునులమగుమమ్మునతిమోదముననునీవు।సత్కరించుటలెల్లసజ్జనపరి
గ్రాహ్యమైయుండుగాదేవమహాత్మ్యమొకటి। విన్నవించెదమీజయవిజయులకును। గీ॥ అరిగిమేముశపించితిమంతకంటె।
బెడిదమగునాజ్ఞసేయనభీష్టమేని।జేయుమదిగాకసమధికశ్రీదనర్పఁ।జేసిరక్షించెదేనిరక్షింపువిభుఁడ॥ వ॥ అట్లయినమా
కుంబ్రియంబగుంగావుననపరాధులునతినిర్మలాంతఃకరణులునైనవీరలకుననృతంబులువలికితిమేనినూమైనంజిత్తంబుకో
లఁదినాజ్ఞాపింపుమనికరకమలంబులుమొగిచికృతాంజలులై యున్నమునులంగరుణార్ద్రదృష్టింగనుంగొని॥ క॥ అనఘుఁడు
భగవంతుండిట్లనియెమ్మునులారవీరలలరన్ముపికి।న్జనియచటనసురయోని।న్జనియింతురులోభమోహసంగతులగుచున్।
క॥ దేవజనావళి§ఉపహతిఁ।గావింపుచునిఖిలభువనకంటకవృత్తిన్।జీవించుచునాయెడసం।భావితమైనానుబంధభావులు
నగుచున్॥ క॥ ఆహవముఖముననునతి।సాహసముననెదిరిపోరిచక్రనిశితధా।రాహతిఁదెగివచ్చెదరు।త్సాహమెలర్పఁ
గనామసన్నిధికంతన్॥ అదియునుంగాక॥ క॥ ననువైరంబుననైనను।మనమునఁదలఁచుటయునాసమక్షమునసదా।ననమీ
క్షింపుచునిల్లుట।ననఘాత్ములై వసింతురస్మజ్జగతిన్॥ క॥ వినుమిలమీఁదనికెన్నఁటి।కినిబుట్టవులేమవీరికినిమీరలువ।ల్కిన
యట్లనాచుచిత్తము।ననుదలఁతుంగానమీమనంబులనింకన్॥ ఉ॥ దీనికిఁజింతఁదక్కుఁడుసుధీజనపుంగవులన్నఁబ్రీతులై।
యానలినాసనాత్మజులనంతునిభావముఁదామెఱింగిపెం।పూనినవేడ్కఁదేలితెలివొందినచిత్తములన్నుతించిరం।భోనిధి
శాయినార్తజనపోషణభూషణుఁబాపశోషణున్॥ ఉ॥ ఆసనకాదులప్పుడులకాంకురముల్ననలొత్తబాష్పధా।రాసుభగా
త్ములై మునిశరణ్యవరేణ్యునగణ్యుదేవతా।గ్రేసరుదివ్యమంగళశరీరముఁజూచుతదీయధామమున్।వ్వాసురలీలఁజూచినన
పద్మదళాక్షునకున్వినమ్రులై॥ క॥ తమపలికినభాషణములు।గమలోదరుభాషణములుగాఁదలఁచుచునె।య్యమునన్వైష్ణ
వలక్ష్మిన్।బ్రమదంబునఁబ్రస్తుతించిపరమేశ్వరుచేన్॥ క॥ ¶ఆమంత్రితులై తగనిజ।ధామములకుఁజనిరివారుసదయకల
క్ష్మీ।కాముఁడుజయవిజయులనభి।రామంబుగఁజూచిపలికెరయమొప్పారన్॥ క॥ మీరసురయోనియందని।వారితులై జననస
మందవలసెనునేమ।శ్వారబలాఢ్యుఁడనయ్యును।వారింపఁగనోపవిప్రవచనములెందున్॥ క॥ అదిగానదనుజయోనిం।బ

* పాటురు।తొలఁగుదురు— †శీనిష్యంద।స్రవించుచున్న— §ఉపహతి।పీడను-బాధను— ¶ఆమంత్రితులై।పిలువఁగొనినవారలై.

దపడి జవియించి మద్విపక్షులరై మీ మది నెపుడున్ వెన్నె తలఁపుచు వదలక నా చేతఁ జచ్చి వచ్చెదరిటకున్॥ ఉ॥ పొందనియా
నతిచ్చి హరి ఫుల్లసరోరుహపత్రనేత్రుఁ డాఖండలముఖ్యదిగ్వరనికాయకిరీటలసన్మణిప్రభామండితపాదపీఠుఁడు రమా
రమణీమణితోడ నేగుదెంచె నిండినవేడ్కనే గనిజనిర్మలపుణ్యనివాసభూమికిన్॥ అంత॥ క॥ నిజతేజోహానిగ జయవిజయులు ధ
రఁ గూలిరపుడు విహ్వలురగుచున్ త్రిజగములు సురవిమానవ్రజముల హాహారవంబు గ్రందుకొనఁ జెలఁగెన్॥ క॥ వారలు నా
దితిగ*ర్భాగారంబున నున్నవారు గడఁగి తదీయోదారఘన తేజమిపుడ‡ని వారణమీ తేజమెల్ల §వమ్ముగఁ జేసెన్॥
ఉ॥ ఇంతకు మూలమా హరి రమేశ్వరుఁ డర్థి నొనర్చు కార్యములివ్వింతలె సర్వభూతభవవృద్ధివినాశనహేతుభూతుఁ డా
ద్యంతవికారశూన్యుఁడు దయానిధి మీ యెడ మేలు సేయునీ చింతఁ దొరంగి వేఁ జనుఁడు చేకురు మీకు మనోరథార్థముల్॥
క॥ అని వనజాసనుఁ డాడిన వినిత ద్వృత్తాంత మెఱిఁగి విబుధులు నాకంబున కేగిరి దితి నిజనాథుని మాటలు దలఁచి యపరితో

**జయవిజయులు దితిగర్భంబున హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగాఁ బుట్టుట.**

షముతోడన్॥ గీ॥ తనసుతులు సురల హరింతురనుచు నాత్మఁ దలఁచుచుండంగ నంతవత్సరశతంబు సనఁగ నటమీఁదఁ గనియెఁ
గశ్యపుని దేవి యఖిలలోకైకకంటకులైన సుతుల॥ అయ్యవసరంబున॥ గీ॥ ధరణి గంపించెఁ గులపర్వతములు వడఁకె జడనిధిగ
లంగెఁ దారకావళులు డుల్లె గగనము గలెను మ్రొగ్గె దిక్కరులు దిశలు మిడుగురులడరెఁ బిడుగులు పుడమిఁ బడియె॥ సీ॥ ఘోరా
మ్నానలంబుల ధూమంబులడరెను బ్రతికూలవాయువుల్ ప్రబలి వీఁచెఁ దరువులెల్లడ¶ విటతాటంబులై కూలె గ్రహతారకా
వళికాంతి మాసె బెరసి మొగుళ్లు నెత్తురువాన గురిసెను మెఱుఁగులు దెసల మిర్మిట్లు గొలిపె॥ **స్వర్భానుఁ డొగినపర్వమున
భానునిఁ బట్టెఁ గైకొని విస్మయీకట్లు పర్వె మొనసి కుక్కలు మొఱిఁగెను మోర లెత్తి పగలు నక్కలు వాపోయె ఖగములార్త
రవములిచ్చెను దేవతాప్రతిమ లారగెఁ గన్నులను నశ్రుకణములు గ్రందుకొనఁగ॥ క॥ మొదవులెన్నెత్తురుఁ జీమును బిదికె
నార్ద్రభరవంబు భీషణమయ్యె నమదముడిగెఁ గరులకటములఁ బొడమెఁ దురంగముల వాలముల నిప్పులొగిన్॥ క॥ గుహలు రొద
లిచ్చెఁ బాపగ్రహమిత్రతఁ జెంది వక్రగతులను సౌమ్యగ్రహములు వర్తించెను మహస్సహ తేజోదితితనూజసంభవవేళన్॥
మ॥ భయదప్రక్రియ నట్లు దోఁచిన మహోత్పాతంబు లీక్షించి సంక్షయకాలంబని కాని సాధుహననోగ్రక్రూర దేవాహి
తోదయసంక్షోభముగా నెఱుంగక సమస్తప్రాణిజాతంబు లుద్భయనుం దెన్ సనకాదియోగిజనముల్ దక్కన్ బుధేంద్రోత్త
మా॥ వ॥ అట్లావిర్భవించిన యనంతరంబ॥ మ॥ కులశైలాభశరీరముల్ నరరక్షోనాథులత్యుగ్రదోర్బలమొప్పన్ బదఘట్టనన్ ధ
రచలింపన్ రత్నకేయూరకుండలకాంచీకటకాంగుళీయకకిరీటస్వర్ణమంజీరనిర్మలకాంతుల్ దురఁగింప నాత్మరుచిచే మం
దీకృతార్కాంశులై॥ వ॥ ఉన్న సమయంబునం గశ్యపుండు నిజతనూభవులఁ జూడం దలంచి దితిమందిరంబునకుం జనుదెంచి సు
తులం గనుంగొని వారలకు నామకరణంబు సేయం దలంచి॥ చ॥ దితిజఠరంబునందుఁ దనతేజము మున్నిడినట్టి పుత్రున వ్యుత
చరితున్ హిరణ్యకశిపుం డను పేరఁ బ్రసూతివేళ నా దితిమును గన్నపట్టి రవితేజునిఁ గాంచనలోచనుండు నా హితమతిఁ బే
రువెట్టి చనియెన్ నిజనిర్మలపుణ్యభూమికిన్॥ వ॥ అయ్యవసరంబున నతులతేజోవిరాజితుండైన హిరణ్యకశిపుండు హిరణ్యగ
ర్భవరదానగర్వంబున నుర్వార†పరిపంథిగర్వనిర్వాపణాఖర్వభుజావిజృంభణంబున నఖిలలోకపాలాదుల జయించి స్వ
వశంబొనర్చి సంతుష్టాంతరంగుండై యెందునుం దనకు మృత్యుభయంబు లేక నిర్భయుండై సుఖంబున నుండెఁ దత్సోదరుం
డైన హిరణ్యాక్షుండు ప్రతిదినంబుఁ జండవేదండశుండాదండమండితభుజాదండంబున గదాదండంబు ధరియించి తన్నునె
దిరి‡‡ కదనంబు సేయంజాలిన యరివీరుని గానక భూలోకంబెల్లఁ గ్రుమ్మరి దివంబునకు దాడివెట్టి యందు సమరవిముఖులై
న బర్హిర్ముఖులం గనుంగొని వనజాసనవరప్రదానంబుఁ జింతించి హితులు సెలంగ నహితులు గలంగ మహిత వైజయంతికా
దామం బభిరామంబై వెలుంగఁ జరణంబుల మణినూపురంబులు మొఱయ నిజదేహద్యుతి దిక్కులం బిక్కటిల్లం జనుదెంచు
వానిం గని భీతచిత్తులై దేవతాగణంబులు గరుడునిం గని పరచు నురగంబులుం బోలె నిజనివాసంబు‡‡‡ లర్కకాంచననివాసం
బులుగ నొనర్చి యెక్కడి కేనియుం జనిన॥ ఉ॥ శౌర్యము వోవఁ దట్టి నిజసాధనముల్ దిగనాడి విక్రమౌదార్యపరాక్రమక్రమ
ము దప్పఁగ భీతిలి పారి రక్కటా క్రౌర్యముఁ దక్కి నాకులనిగైకొని యార్చి సుమేరుపర్వత స్థైర్యుఁడు వార్ధిఁ జొచ్చె నతిదర్పి

* అగారము|ఇల్లు — ‡ అనివారణన్|నివారణ లేనిదగుటవలన — § వమ్ముగన్|వ్యర్థముగాను — ¶ విటతాటంబులై|తారుమారై — ** స్వర్భానుఁడు|రాహువు — † పరిపంథి-బునన్॥ శత్రువులగర్వము నడఁగించుటయందు కొఱఁతపడని బాహుబలపరాక్రమముచేత — ‡‡ కదనము|యుద్ధము — ‡‡‡ దాడివెట్టి|యుద్ధమునకు బయలుదేరి — ‡‡‡‡ అర్కకాంచన॥ అర్క|జిల్లేడు చెట్లకు, కాంచన|ఉమ్మెత్త చెట్లకు.

తభూరిభుజావిజృంభితుఁడై॥ ఇట్లు చొచ్చిన॥ క॥ వరుణుని బలములు దనుజే।శ్వరు తేజముఁ జేరి చూడఁజాలక శౌర్య।స్ఫురణము చెడి యెందేనియుఁ।బరచెం దజ్జలధిమధ్యభాగమునందున్॥ క॥ అమరారి విపులనిశ్వా।సములం బ్రభవించినట్టి జలనిధి కల్లో।లములను విపులగదాదం।డమునం బోనడఁచె నతిదృఢంబుగు శక్తిన్॥ చ॥ మఱియును నమ్మహాజలధిమధ్యమునన్ సురవైరి పెక్కువ।త్సరములు గ్రీడసల్పి రిపుసైన్యవిదారణశౌర్యఖేలనా। పరతఁ జరించి యవ్వరుణపాలితమైన లసద్విభావరీ। పురమున కేగి యందుఁ బరిపూర్ణతనున్న పయోధినాథునిన్॥ మఱియును॥ సీ॥ యాదోగణాధీశుఁడగుచుఁ బాతాళభువనపరిపాలుఁడై తనరుచున్న। వరుణునిఁ గనుఁగొని పరిహసితోక్తులనిట్లను విశ్వవంద్య నన్నుఁ గలుగు।సకలలోకైకపాలకులలోనతిబలాఢ్యుడని నిజగమును తింపఁదగిన।శూరుండవిపుడు నీ పౌరుషమొప్పంగఁ గదనరంగమున నన్నెదిరి చూడు। నీభుజావిక్రమంబును బ్రాభవంబు।నడఁతు నని పలుక్క-టయుపిన్యబ్ధివిభుఁడు।పగర జయమును వృద్ధియు బలము నాత్మ।బలము దలపోసి దనుజుతో బవరమునకు॥ క॥ సమయము గాదని తన చి।త్తమునం గలరోషవహ్నిఁ దాలిమి యను తోయములం దగ నార్పుచును ప।శమితోక్తులఁ బలికె దనుజసత్తముతోడన్॥ చ॥ మనమున శాంతిఁ బూని నియమంబున సంగరముజ్జగించితి।నన యమునున్న వాఁడ నీవు డాహవకేళిఁ జరింప రామనీ। ఘనభుజవిక్రమస్ఫురితగాఢవిజృంభణ ముజ్జయింపఁ జా।లిన ప్రతివీరు లెవ్వరును లేరు ముకుందుఁడు దక్క నెక్కడన్॥ చ॥ గొనకొని యమ్మహాత్ముఁడు వికుంఠపురంబున నున్నవాఁడు దా।నని మొనఁ జెక్కుమారు *లఖియాతులనోలి జయించి శక్తి పెం।పున నడిగన్న వీరుఁడని భూజనకోటి నుతించు శంధు వేచను।మతఁడిచ్చు నీకు నని సర్వము దీఱెడు నంతమీఁదటన్॥ ఉ॥ నిందకు నోర్చి యాజి మొననిల్వఁగ నోపక పీఁగిపారు నీ। పందలవెంటఁ బడ్డవఁగ పంతమె పెద్ద శరణ్యుఁడైన గో। విందుఁడు దీర్చు నీ పనివివేకవిహీన చనంగి నోపుదే। నందులకేగు మాతఁడమరారులఁ బోర జయించు నిచ్చలున్॥ అదియునుం గాక॥ క॥ పురుషాకృతిఁ బ్రతియుగమునఁ।బురుషోత్తముఁడవతరించి భూరిభుజావి।స్ఫురణస్ఫుటనిశాటుల హరియించుచునుండు మునిగణార్చితపదుఁడై॥ ఉ॥ కావున నా విభుం దొడరి కయ్యము దయ్య మెఱుంగఁ జేసిర। య్యా వరనీభుజాబలము సొంపరి మేదినిఁ గూలి §సారమే। యావళికాశ్రయంబగుదు వచ్చటికిప్పుడు నేగు దేనినీ। చేవయు లావు నేర్పడును జెప్పఁగ నేటికి మీఁది కార్యముల్॥ చ॥ అని వరుణుండు వల్కిన మరాగ్రహమెత్తి హిరణ్యలోచనుం।డనయము మానసంబున భయరిబొకయించుక లేక సంగరా। వని నెదిరింతు నేఁడ సురవర్ధను దుష్టవిమర్దనుం జనా।ర్దనునను చున్వికుంఠనగరస్ఫుటసంచితమార్గవర్తియై॥ క॥ చనునవసరమున నారద।మునివరుఁడెదురేగుదెంచి ముదముదలిర్పన్ దనుజేంద్ర యెందుఁ బోయెదు।వని యడిగిన నారదునకు నతఁడిట్లనియెన్॥ చ॥ సరసిరుహోదరుం దొడరి సంగరమే నొనరించి యిందిరా।వరునిననంతు ద్రుంచి సురవైరికులంబులకెల్ల మోదవి।స్ఫురణ ఘటింపఁ జేయుటకుఁ బూని వికుంఠపధాను వర్తినై। యరిగెద నన్న నమ్మునికులాగ్రణి దానవనేతకిట్లనున్॥ చ॥ గురుభుజుఁ డమ్మహాత్ముఁడు వికుంఠపురంబున నేఁడు లేఁడు భూ। భరము వహింపనాదికిటిభావముఁ దాల్చి రసాతలంబునం।దిరవుగనున్నవాఁడ చటికేఁగఁగ నోపుదువేని యేగుమం। దరయఁగఁ గల్గు నీకు నసురాంతకుతోడి రణంబవశ్యమున్॥

§ హిరణ్యాక్షుఁడు యజ్ఞవరాహంబగు హరినెదిరించి యుద్ధము చేయుట §

చ॥ అనవుడు దానవేంద్రుఁడు హుతాశనుకైవడి నుండి పద్మలో। చను నెదిరించు వేడుకలు సందడిఁ గొల్పన నల్పతేజుఁడై। ఘనగదఁ గేలఁ బూని త్రిజగద్భయదాకృతిఁ దాల్చి వ్రేల్మిడి।న్ఘనమెరసాతలంబునకుఁ జండభుజాబలదర్ప మేర్పడన్॥ చని జలమధ్యంబున॥ క॥ దివిజారి యెదుర గనె।నవిరళదంష్ట్రాభిరాము నవరలలామున్। ❀గువలయభరణోద్దాము।న్నవనమయ స్తబ్ధరోము జలదశ్యామున్॥ అయ్యవసరంబున సూకరాకారుండైన హరియు॥ క॥ వనజనిభ సన్నిభములగు।తనలోచనయుగళదీప్తిఁ దనరఁ దదాలో।కనముల దనుజాధీశుని।తనుకాంతిహరింపఁ జేసె దక్షణమాత్రన్॥ వ॥ మఱియు నయ్యాదివరాహంబు వార్యశౌర్యంబున మారు లేని విహారంబునం జరియించుచున్నట్టియెడ॥ సీ॥ తుద మొదల్లకుం జెక్కు మునిసి పారఁగ మోరఁ గులశైలములఁ జిమ్ముఁ గొంతతడవు।బ్రహ్మాండభాండంబు వగిలి చిల్లులువోవఁ గొమ్ములఁ దాడించుఁ గొంతదడవు। జలధు లేడును బంకసంకులంబై యుంక ¶ఖురములఁ ద్రొక్కాడుఁ గొంతతడవు । ‡ఉడురాజు సూరుండును నొక్కమాలకుఁ బోవఁ గురుచవాలముఁ ద్రిప్పుఁ గొంతతడవు। ‡గుణియుఁ గుప్పించు లంఘించుఁ గొప్పరించు। నెగయు ధరఁ ద్రవ్వుఁ బొరియఁ గానేపు తేఁగి।దానవేంద్రుని గుండె లుదల్ల డిల్లఁ।బంది మెల్లన రణపరిపంథియగుచు॥ మఱియు॥ క॥ కనుఁగవ నిప్పులు రాలఁగ।సుని

*లఖియాతులకా।శత్రువులను —— §సారమేయావళికిన్।కుక్కల గుంపులకు —— ❀కువలయ।భూమండలము —— ¶ఖురములం ద్రొక్కాడున్। గొరిజలతో త్రొక్కును —— ‡ఉడురాజ।సూరుండు-చంద్రసూర్యులు —— ‡గుణియున్।గొబ్బున

పేర్మిన్॥అంత॥ సీ॥కాలానలజ్వలజ్జ్వాలావిలోలకరాళమై పెంపొందుశూలమంది।సురవైరియజ్ఞసూకరరూపధరుఁడై
నవనజనాభునిమీఁద వైవనదియు।సద్ద్విజోత్తముమీఁదఁ జపలతఁ గావించునభిచారకర్మంబునట్లు బెండు।పడిపరతేఁగనిపన్నో
దరుఁడు దానిఁ జక్రధారాహతిఁ జండవిక్రమముననడుమనవడిఁ ద్రుంచెనమరభర్త।మహితదంభోళిచే గరుత్మంతుపక్ష।
మతిరయంబునఁ ద్రుంచినగతిఁ జెలంగి।సురలు మోదింప నసురులు సొంపుడింప॥వ॥అయ్యవసరంబున నయ్యసురదనశూలం
బు చక్రంబు చేత నిహతంబగుటం గని॥ క॥దితిజుఁడు రోషోద్ధతుఁడై।యతినిష్ఠురముష్టిఁ బొడిచె హరి నాలోకో।న్నతుఁడొప్పె
గుసుమమాలా।హతిదిగ్గజరాజుఁ బోలి యతిదర్పితుఁడై॥ మ॥హరిమీఁదన్ దితిసంభవుండు ఘనమాయాకోట్లు పుట్టించినన్।
ధరణీచక్రము భూరిపాంసుపటలధ్వాంతంబునం గప్పెభీ। కరపాషాణపురీషమూత్రఘనదుర్గంధాస్థిరక్తావళుల్।గురిసె
న్మేఘములభ్రవీథి నిశాహాట్టోభక్రియాలోలమై॥ మఱియు॥ చ॥తవిలి విముక్తకేశపరిధానములుగ్రకరాళదంతతా।లు
వులు నరక్తలోచనములుం గలభూతపిశాచఢాకినీ।నివహములంతరిక్షమున నిల్చి నిజాయుధపాణులై మహా। రవముగయ
తు దైత్యచతురంగబలంబులఁ గూడి తోఁచినన్॥అంత॥క॥త్రిసవనపాదుండగు నా।బిసరుహనేత్రుండు లోకభీకరమగు నా
యసురాధిపుమాయావిని।రసనకరంబైన శస్త్రరాజముఁ బనిచెన్॥ క॥ ఆచక్రభానుదీప్తిధ।రాచక్రము నంపసిండిరయము
ననమ్మా।యాచక్రమునడఁగించెను।నీచక్రముఁడైన యామినీచరు నేమన్॥అంతనిక్కడ॥క॥దితితనవిభువాక్యంబుల।గతి
దప్పనయనుచుఁ దలఁపఁగాఁ జన్నులశో।ణితధారలొలికెరక్షః।పతియగుకనకాక్షుపతనభావము దోఁపన్॥ వ॥అయ్యవస
రంబున నసురవిభుండు దాను జేసినమాయాశతంబులు కృతఘ్నునకుం గావించినయుపకారంబులుం బోలె హరిమీఁదఁ బని
సేయక విఫలంబులైనం బొలివోవని బంటుతనంబునం బుండరీకాక్షుఁ జేరం జనుదెంచి బాహుయుగళంబు సాఁచి యాఁచి
పొడిచి రక్షోవైరివక్షంబుఁ బీడించిన నయ్యధోక్షజుండు తప్పించుకొనితలంగినఁ జెలంగి దైత్యుండు నిష్ఠురంబగు ముష్టిం బొడి
చిననసురాంతకుండు *మిసిమింతలు లేక రోషభీషణాకారంబున వాసవుండు వృత్రాసురుం దెగటార్చుచందంబున వజ్రప
ప్రసన్నిభంబగు నిజచేతంగఱుకటసుర**కటతటంబుఁ జటులగతి వ్రేసిన నాహిరణ్యాక్షుండు దిర్దిరం దిరిగి మీలితాక్షుండై
సోలి యొట్టకేలకు నేలయనిలుపంబడెనంత॥క॥దిటచెడిలోఁబడె దైత్యుఁడు †సటికిన్ ‡దంష్ట్రాప్రభిన్నశత్రుమహోరః।స్థటి
కిన్ ఖరఖురపుటికి।న్గటితటహతకమలజాండఘటికి న్గిటికిన్॥ ఇట్లు లోఁబడిన॥మ॥దివిషింద్రాదులు సంతసింప హరి మొత్తెం గ
ర్ణమూలంబునన్। బవిసంకాశకఠోరహస్తమున శుంభల్లీలమై దానదా।నవలోకేశుఁడు రక్తనేత్రుఁడగుచున్ దైన్యంబు
వాటిల్లగా।భువిమీఁదం బడిసోలె మారుతహతోన్మూలావనీజాకృతిన్॥ క॥ బుడబుడనెత్తురుఁ గ్రక్కుచు। వెడరూపముఁ
దాల్చి గ్రుడ్లు వెలికుఱికనిలం।బడిపండ్లు గీటుకొనుచు।న్విడిచెన్ బ్రాణంబు దైత్యవీరుండంతన్॥ గీ॥పడినదనుజేశ్వరునిఁ జూ
చి పద్మసంభ।వాదిదివిజులు వెఱఁగందిరాత్మలందు।నితఁడు వొందుట యెట్లకో యీయవస్థ।నసితలంచుచు మఱియునిట్లనిరి వె
సను॥మ॥పరయోగీంద్రులు యోగమార్గముల నెవ్వానిన్మనోవీథిను।స్థిరతల్లింగశరీరభంగమునకై చింతింతు రాపంకజో।
దరుపాణ్యాహతిఁ దన్ముఖాంబురుహమున్దర్శింపుచున్జచ్చె దు।ర్భరితోత్తంసుని దైత్యవల్లభుని సౌభాగ్యంబు దానెట్టిదో॥చ॥స
మమతివీరు దైత్యకులశాసను పారిషదుల్మునీంద్రశా।పమునసికృష్టజన్మమునఁ బైకొనిపుట్టియు నేఁడు విష్ణుచే। సమయుటఁ
జేసి మీఁదనగు జన్మములన్జలజాక్షునిత్యవా।సమున వసింతు రెన్నటికిఁ జావును బుట్టువు లేదు వీరికిన్. క॥అనివెఱఁగునొంది త్రి
సవన।తనువొందినయట్టి వికచతామరసాక్షున్।మునియోగిజన త్రిదశా।వనదక్షున్ §దనుజకరటివరహర్యక్షున్॥ కనుంగొ
ని॥చ॥వనజదళాక్షు యీజగతి వారలమర్త్యమునీవెఱంగియా।సునఁ బగఁ బట్టి నీ దివిజసూదనుఁ జంపితి గాన నింపె శో।భనముగు
నంచుహస్తములు ఫాలములం గదియించి యందఱు।న్వినమితులై నుతించిరి వివేకవిశాలురుఁ బుణ్యశీలురున్॥అంత॥ చ॥సవన
వరాహమూర్తి సురశత్రువుఁ ద్రుంచినమీఁద భారతీ।ధవముఖదేవతాముని కదంబము దన్ను నుతించునట్టిసం।స్తవమునకా
త్మలోనఁ బ్రమదంబును బొందిసమగ్రమంగళో।త్సవము దలిర్పనందఱఁ బ్రసాదవిలోకన మొప్పఁ జూచుచున్॥చ॥అరిగెవి
కుంఠధామమునకమ్మహితోత్సవసూచకంబుగా। మొరసెను పర్వదుందుభులమోఘములై ధరణీతలంబున।న్గురిసెఁ బ్ర
సూనవృష్టి శిఖికుండములెల్లెడఁ దేజరిల్లె భా।స్కరశశిమండలంబులు నిజద్యుతితో వెలుఁగొందెనత్తఱిన్॥ క॥అనియీపుణ్యా

---

*మిసిమింతలు।సుక్కుటలు—**కటతటంబున్।కణతను—†సటికిన్।జడలుగలదానికి— ‡దంష్ట్రాప్రభిన్నశత్రుమహోరస్థటికిన్॥కోరపండ్లచే తబద్దలుచేయఁబడినశత్రువులవిశాలములైనవక్షస్థలములుగలదానికి, ఖరఖురపుటికిన్।వాడిగలగొరిజలుగలదానికి, కటితట-ఘటికిన్॥పిరుదులచే తబ్రవక్కలుచేయఁబడిన బ్రహ్మండభాండముగలదానికి, కిటికిన్।ఆదివరాహమూర్తికి—§కరటివరహర్యక్షున్।ఏనుఁగునకుమహాసింహమైన.

చరిత్రము। వనరుహసంభవుఁడు*త్రిదివవాసులకుం జె। ప్పినయది మైత్రేయుఁడు విదు। రున కెఱింగించినవిధంబు రూఢము గాఁగ॥ క॥ శుకయోగిపరీక్షి త్తున। కకుటిలమతి నెలుఁగఁ జెప్పెననిసూతుఁడు శౌ। నకముఖ్యులైనమునివరు। లకుఁ దెలియఁ గఁ జెప్పెమఱియులాలన మెప్పన్॥ వ॥ ఇవ్విధంబున మైత్రేయుండు సెప్పినవినివిదురుండు సంతసిల్లెనని॥ క॥ అనఘంబగు నీచరితము। వినినఁ బఠించినలభించు విశ్రుతకీర్తు। ల్వనజోదరుపదభక్తియు। మనుకొని యిహపరసుసౌఖ్యములు జనములకున్. వ॥ అని చెప్పి వెండియు సూతుండు మహర్షుల కిట్లనియె నంబరీషున్న రేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని మునీంద్రా హిరణ్యాక్షువధానంతరంబున వసుంధర సమస్థితిం బొందినవిధంబు స్వాయంభువమనువు దిర్యగ్జాతిజంతుసృష్టినిమిత్తంబులైన మార్గంబు లెన్ని సృజించె, మహాభాగవతోత్తముండయిన విదురుండు గృష్ణున కపకారంబు దలంచినపాపవర్తనులగు ధృతరాష్ట్రపుత్త్రులం బాసి జనకుండగు కృష్ణద్వైపాయనునకు సముండగుచు మనోవాక్కాయకర్మంబులు గృష్ణునందఁ జేర్చి భాగవతజనోపాసకుండయి పుణ్యతీర్థసేవాసమాలబ్ధయశోవిగతకల్మషుండగుచు మైత్రేయమహామునినేమి ప్రశ్నలడిగె

## ——॥ చతుర్ముఖుండొనర్చు యక్షాదిదేవతాగణసృష్టిఁ దెలియఁ జేయుట. ॥——

నవియెల్లం దెలియనానతిమ్మనిన రాజేంద్రునకు శుకయోగీంద్రుండిట్లనియె॥ సీ॥ విమలాత్ముఁడైనయవ్విదురుండు మైత్రేయమునివరుఁ జూచి యిట్లనియెఁ బ్రీతిఁ। జతురాత్మ సకలప్రజాపతియైనట్టి జలజగర్భుఁడు ప్రజాసర్గమందు। మునుఁ బ్రజాపతులను బుట్టించి వెండియుఁ జిత్తమందేమి సృజింపఁ దలఁచె। మునుసృజింపఁ బడ్డయట్టిమునులు సమ్మరీచ్యాదులబ్జజు నాదేశమాత్మనిలిపి యర్థినెట్లు సృజించిరి యఖిలజగము। మెఱసి మఱి వారు భార్యాసమేతులగుచు। నేమి సృజియించి రది గాక కాములను। బాసి యేమి సృజించిరో భద్రయశులు॥ క॥ అందరుఁ దమలో నైక్యముఁ జెందినచో నేమిదగ సృజించిరి కరుణా। కందళితహృదయ యిన్నియుఁ బొందుగ నెఱిఁగింపుమయ్య బుధనుత నాకున్॥ సీ॥ అనిన మునీంద్రుఁ డిట్లనియె జీవాదృష్టపరుఁడు మాయాయుక్తపురుషపరుఁడు। గాలాత్మకుఁడు ననుకారణంబున నిర్వికారుఁడైనట్టి జగన్నివాసుఁ। డాదిజాతక్షోభుఁడయ్యును స్మేటివలనను గుణత్రయంబును జనించె। నాగుణత్రయమునం దయ్యె మహత్తత్త్వ మది రజోగుణహేతువైన దాని। యందహంకారమొగిఁ ద్రిగుణాత్మకమునఁ। బొడమె మఱి దానివలనఁ బ్రభూతమయ్యెఁ। బంచతన్మాత్రలందు సంభవము నొందె। భూతపంచకమాసృష్టిహేతువగుచు॥ వ॥ అవి మఱియును దమలోనఁ బ్రత్యేకంబుగ భువననిర్మాణకర్మంబునకు సమర్థంబులు గాకయున్నయన్నింటి సంఘాతంబునఁ బాంచభౌతికంబైన హిరణ్మయాండంబు సృజియించెనదియును జలాంతర్వర్తియై వృద్ధిఁ బొందుచుండె నందు॥ సీ॥ నారాయణాఖ్యనున్నతి నొప్పు బ్రహ్మంబు। సాహస్రదివ్యవర్షంబులోలి। వసియించియుండె నా వాసుదేవుని నాభియందు సహస్రసూర్యప్రదీప్తిఁ। గనరుచు సకలజీవనికాయయుతమగు పంకజాతంబు సంభవము నొందెఁ। బరగ నందులో భగవదధిష్ఠితుఁడగు స్వరాట్టగు చతురాననుండుఁ। జనన మొందెను దత్స్వాత్మసంభవుండు। నామరూపగుణాదిసంజ్ఞాసమేతుఁ। డగుచు నిర్మాణమొనరించె నఖిలజగము। వనజజుండు నిజచ్ఛాయవలన మఱియు॥ సీ॥ తామిస్రమును నంధతామిస్రమును దమంబును మోహమును మహామోహనంబు। ననుపంచమోహరూపాత్మకమైనయవిద్యఁ బుట్టించి యవ్వేళఁ దనను। నదిపమోహమయదేహము నిధాతరోసి తత్తనువు విసర్జించె ధాతృముక్త। మూర్తియు తృట్సముద్భవంబగు రాత్రి యయమయ్యె నప్పుడు మఱి తలంప। నందులో యక్షరక్షస్సులను జనింప। వారి కప్పుడు క్షుత్తృషల్వారలఁ గొంచు। నాచతుర్ముఖు భక్షింతమని రికొంద। ఱతని రక్షింపుఁడని తగ నాడిరంత॥ వ॥ ఇట్లు పలుకుచు ధాతసన్నిధికి నతని భక్షించు వారలయిన విని నతండు భయవిహ్వలుండై యేను మీజనకుండ మీరలు మత్పుత్త్రులరు నన్ను హింసింపకుండనుచు¶మామాజక్షతరక్షతయను శబ్దంబులు వలుకం దన్నిమిత్తంబున వారలకుం గ్రమంబున యక్షరక్షో నామంబులు ప్రకటంబులయ్యె వెండియుం బ్రభావిభాసితంబైన యొక్కకాయంబు ధరించి సత్వగుణగరిష్ఠులుఁ బ్రభావంతులునగు ‡సువర్వాణులముఖ్యంబగు నట్లు సృజియించి తత్ప్రభామయగాత్ర విసర్జనంబు చేసెనదియ యహోరూపంబై దేవతావళికి నాశ్రయంబయ్యె మఱియు §జఘనంబువలన ‖నతిలోలుపులైనయసురలం బుట్టింప వారలతి కాముకులగుటం జేసి యయ్యజునిం జేరి **మిథునకర్మంబ

---

* త్రిదివవాసులు। దేవతలు—— †వాసుదేవః। వసనివాసఇత్యస్మాద్ధాతోః-వసత్యస్మిన్ సర్వం వసత్యసౌ సర్వత్రేతివాసుః-దీవ్యతేప్రకాశతఇతిదేవః-సచాసౌసచేతివాసుదేవః-అనఁగాఁ జతుర్దశభువనములెవనియందున్నవో, వాటియందెవఁడు వసించి ప్రకాశించుచున్నాఁడో, వాఁడు వాసుదేవుఁడని యర్థము.—— ¶మామాజక్షతరక్షత। వలదు వలదు విడువుఁడు రక్షింపుఁడు—— ‡సువర్వాణులు। దేవతలను—— §జఘనము। పాత్తికడుపు.—— ‖అతిలోలుపులు। అత్యాశగలవారు—— **మిథునకర్మంబు। మైథునము.

పేక్షించి నవిరించి నగుచు నిగ్గజ్జులయిన యసురులు దన వెంటనంటి విడువకుండ బరచి ప్రపన్నార్తిహరుండు భక్తజనానురూపసం
దర్శనుండు నైన *నారాయణుం జేరి తత్పాదంబులకుం బ్రణమిల్లి యిట్లనియె॥ క॥ రక్షింపుము రక్షింపుము [illegible]క్షింపక వినుత ని
ఖిలబృందారకవిశ్వేశ శంకరవినుత ముకుంద నీయాజ్ఞ నేను దలనిడి వరుసన్॥ గీ॥ ఈ ప్రజాసృష్టి కల్పనంబే నొనర్ప నంతఁ
బాపాత్ములయిన యీ యసురులిపుడు నను రమింపఁగడాయ వచ్చినఁ గలంగి యిటు వచ్చితిని నను గావుమిద్ధచరిత॥ వ॥ అదియు
నుం గాక లోకంబు వారలకుం గ్లేశంబు లొనరింప క్లేశంబునం బొందిన వారల క్లేశంబు లపనయింపను నీవ కాక యని స్తుతి
యించినఁ బద్మజు కార్పణ్యంబెఱింగి నవధరించి వివిక్తాధ్యాత్మదర్శనుండగుచు నిట్లనియెఁ గివుల సంభవ భవద్ఘోరతనుత్యాగం
బు సేయుము నియాన నవ్విననతండునట్ల చేసిన నదియును॥ సీ॥ ‡నవ్యకాంచనరణన్మణినూపురారావవిలసితపాదారవింద
యుగళ కాంచీకలాపసంకలితదుకూలవస్త్రస్ఫారపులిననితంబబింబ రాజితాన్యోన్యకర్కశపీనకరికుంభసన్నిభకుచభార
కంపితవలగ్న మదిరారసాస్వాదమదవిఘూర్ణితచారుసితనవవికచరాజీవనయన యపరపక్షాష్టమీశశాంకాభనిటల మధు
పవదలికులరుచిరోపమానచికుర లలితచంపకకుసుమవిలాసనాస హాసలీలావలోకన యబ్జపాణి. క॥ అనఁదగి సంధ్యారూ
పంబున లలనారత్నమపుడు పుట్టిన దానిన్ నసురులుఁ గోని దానవు‖ఉపగూహ హాస మొగిఁ గాంపించి పలికిరంబెఱుగని లోకన్॥ క॥ ఈ
సౌకుమార్యమారయ నీసౌందర్యక్రమంబు నీధైర్యంబౌరా సౌభాగ్యవిశేషము నే సతులకుఁ గలదె చూడ నిది చిత్రము సుమ్మీ॥
చ॥ అని వెఱగందియద్దనుజుల దెలు నిల్లనిరీక్షలోదరిఁ గని మానసమింత నిప్పుడతి కాముకవృత్తిఁ జరింపుచుండఁగా నవనయమొదవని
చిత్తమున నక్కుఱవ లేమికి నేమి హేతువో యని బహుభంగులం బలికి రా ప్రమదావాక్యతత్పరులై సన్మతితోన్॥ క॥ ఓ కదళీస్తంభో
రువ యేకులమే జాడ దాన వెవ్వరి సుతవి శ్లోకాంతంబున నిచ్చట నే కారణమునఁ జరించె దెఱిఁగింపఁగదే॥ క॥ భవదీయచా
రురూపద్రవిణలసత్పణ్యభూమిఁ దగు మోహమునన్ దవిలిన మమ్ముల నిమ్ముఁ గవయఁ బుష్పాస్త్రబాధ ఘనమయ్యెఁగదే.
వ॥ మఱియుఁ దదీయసౌష్ఠవ్యంబు గడింపనలవిగాక చింతింపుచు॥ సీ॥ గురుకుచభారసంకుచితావలగ్నంబు పదరాయు నాకాశ
తలముగాఁగ లలితపల్లవపాణితలమునఁ జెన్నొందు చెండు †పతత్పతంగుండుగాఁగ సలలితనీలపేశలపృథు§ధమ్మిల్లబంధం
బు ఘనతమఃపటలి గాఁగ భ్రమిసులతరకాంత భావవిలోకనజాలంబు దారకానమితిగాఁగ గడఁగి మై ప్రభాతి సాంధ్యరాగం
బుగాఁగ నంగనాకృతి నొప్పు సంధ్యావధూటి గదిసి వారముల మోహంబు గదలుకొనఁగ నసురలందఱుఁ గూడి యిట్లనిరి మ
ఱియు॥ క॥ వెలయఁగ బ్రహ్మంబేకస్థలమున నేయొప్పుఁ గానిత్వస్థకాత్పద్మంబిలబహుయుగములనేకస్థలములఁ డనరారె నిపుడు
తరుణాబ్జముఖీ॥ క॥ అని దనుజులు దమమానమున నను రాగములుప్పతిల్ల నంద లనానసంభ్యను బట్టిరనిరి వనజాసనుఁడప్పుడు
హృదయమునం దసంతసనుండై॥ క॥ సరసిజభవుఁ డయ్యెడఁ దనుఁ గరమా ప్రాణించినపుడు గంధర్వులు నప్సరసలుఁ బుట్టిరి
ధాతయుఁ బరువడి నాత్మీయతనువుఁ బాసిన నదియున్॥ వ॥ ‡‡చంద్రికారూపంబైన తద్గాత్రంబు విశ్వావసుపురోగముల
గు గంధర్వాప్సరోగణంబులు కై కొనిరి వెండియుం గమలగర్భుండు తంద్రోన్నాన్యజృంభికానిద్రారూపంబైన శరీరంబుఁ దా
ల్చి పిశాచగుహ్యకసిద్ధభూతగణంబులం బుట్టించిన వారలు దిగంబరులు ముక్తకేశులునయి నంజూచి ధాతలోచనంబుల ము
కుళించి తద్గాత్రంబు విసర్జనంబు గావించిన నది వారలు గై కొనిరి వెండియు నజుండు తన్ను నన్నవంతునింగాఁ గై కొని చిం

---

* నారాయణ॥ నారమనఁగా విజ్ఞానము-అది ఆశ్రయముగాఁ గలవాఁడు నారాయణుఁడు.—‡ నవ్య-యుగళ॥ నవ్య॥ నూతనములైన-కాంచన॥ బంగారుమయములైన-రణత్॥ మ్రోయుచున్న-మణినూపుర॥ రత్నఖచితములైన అందెలయొక్క- ఆరావ॥ విలసిత॥ ధ్వనులచే నొప్పుచున్న-పాదారవిందయుగళ॥ పద్మములవంటి రెండు పాదములు గలది. కాంచీ-బింబ॥ కాంచీకలాప॥ కాంచి అను ఆభరణముతో—కాంచి అనఁగా-ఒంటినరపుమొలనూలు-సంకలిత॥ కూడుకొనిన- దుకూలవస్త్ర॥ తెల్లపట్టుపుట్టముచేత-స్ఫార॥ ప్రకాశించుచున్న- పులిన॥ ఇసుకదిబ్బలవంటి-నితంబబింబ॥ గుండ్రని పిరుఁదులు గలది. రాజితా-వలగ్న॥ రాజిత॥ ప్రకాశించుచున్న- అన్యోన్యకర్కశ॥ ఒకటి నొకటి నొరయుచున్న-పీన॥ బలిసిన-కరికుంభ॥ ఏనుఁగు కుంభమువలె-పృథు॥ గొప్పలైన-కుచభారకంపిత॥ స్తనముల బరువుచేత-అసియాడుచున్న వలగ్న॥ నడుముగలది-మదిరా- నయన॥ మదిరారసాస్వాద॥ కల్లుద్రాగుటవలనఁ గలిగిన-మదవిఘూర్ణిత॥ మదముచేతఁ ద్రిప్పఁబడుచున్న-చారు॥ సుందరములైన- సిత॥ తెల్లనైన-నవవికచ॥ నూతనముగాఁ బుష్పించిన-రాజీవనయన॥ తామరలవంటి కన్నులుగలది. అప-నిటల॥ కృష్ణపక్షమందలి, అష్టమినాఁటి చంద్రునివంటి నొసలుగలది. మధుప-చికుర॥ మదపుటుతుమ్మెదలగుంపువలె తేజరిల్లుచున్న వెండ్రుకలుగలది లలిత-నాస॥ మనోహరముగు కనకసంపెగపుష్పమువంటి ముక్కుగలది. హాస-కన॥ విలాసములైన చూపులుగలది-అబ్జపాణి॥ కమలములవంటి హస్తములు గలది.—‖ ఉపగూహనము॥ ఆలింగనము—— ‖‖ రూపద్రవిణలసత్పణ్యభూమికి॥ చక్కదనమను ధనముచేత నొప్పుచున్న వెలనేలయందు అనఁగా మర్మస్థానమందు—— †పతత్పతంగుండుగాఁగ॥ జారుచున్నండెడుసూర్యుఁడగుచుండఁగాను—— § ధమ్మిల్ల॥ కొప్పు—‡‡ చంద్రిక॥ వెన్నెల.

తించియదృశ్యదేహుండగుచుం బితృసాధ్యగణంబులం బుట్టించిన వారలు దమ్ముం బుట్టించిన యదృశ్యశరీరంబునకుం గార్యం
బగు దేవభావంబుం గైకొనినం దత్కారణంబునం బితృసాధ్యగణంబుల నుద్దేశించి శ్రాద్ధంబుల ✿హవ్యకవ్యంబు లాచరింతు
రనుమఱియును॥ సీ॥ సజ్జనస్తుతవినుత చతురతం బంకజాసనుండు దిరోధానశక్తివలన। నరసిద్ధవిబుధకిన్నరులను బుట్టించి తపిలి
వారికిం దిరోధాననామ। ధేయమైనట్టి యా దేహంబు నిచ్చెను వెండియు భారతీవిభుండు దనకుం। బ్రతిబింబమగు శరీరమునం
గిన్నరులం గింపురుషులం బుట్టింపం బూని వారు। ధాతృప్రతిబింబదేహముల్ దాల్చి వరుస। నిద్దఱిద్దఱుగవం గూడి యింపులొదవ। బ్ర
హ్మపరమైన గీతముల్ పాడుచుండి। రంతం బంకజసంభవుం డాత్మలోన॥ క॥ తనసృష్టి వృద్ధి లేమికిం। గనలుచు శయనించి చింతం
గరచరణాదుల్ గానకొని కదలింపం గరాలి నరోమములుగ్ర✤కుండలిప్రజమయ్యెన్॥ క॥ వనజజుండు దనన్ గృతకృత్యునిం
గా భావించియాత్మం దుష్టి వహింప। న్మనమున నిఖిలజగత్పావనులగు మనులం ద్రిలోకపరుల సృజించెన్. సీ॥ పుట్టించి వారికిం
బురుషరూపంబైన తనదేహ మిచ్చినం దగిలి వారు। గనుంగొని మున్ను పుట్టించిన వారలా వనజసంభవున కిట్లనిరి దేవ। యఖిలజ
గత్స్రష్టవైన నీచేతం గావింపంగంబడిన యీ యావితతసుకృత। మాశ్చర్యకరము యజ్ఞాదిక్రియాకాండ మీమనుసర్గమం *దీడ్యము
య్యెం। గహవిర్భాగములు మాకుం దవిలి జిహ్వ।లందు నాస్వాదనములు సేయంగం గలిగె। ననుచు మానసముల హర్షంబు లతిశయి
ల్ల వినుతిం జేసిరి భారతీవిభుని మఱియు॥ వ॥ వరతపోవిద్యాయోగసమాధియుక్తంబగుచున్న ఋషివేషధరుండు ✤హృషీకాత్మం
డునై ఋషిగణంబులం బుట్టించి సమాధియోగైశ్వర్యతపోవిద్యావిరక్తియుక్తంబగు నాత్మీయశరీరాంశంబు వారికిం గ్ర
మంబున నొక్కొక్కనికి నిచ్చె నని మైత్రేయుండు సెప్పిన విని విదురుండు పరమానందంబును బొంది గోవిందచరణారవిందం

## కర్దమప్రజాపతి భగవదనుజ్ఞ వడసి దేవహూతి యను కన్యకం బెండ్లి యాడుట.

బులు డెందంబునం దలంచి వెండియు మైత్రేయునిం జూచి యిట్లనియె॥ సీ॥ వరగుణ స్వాయంభువమనువంశం బిలం బరమసన్ను
తము దప్పదు దలంప। గొనకొని తద్వంశమున మిథునక్రియం జేసి ప్రజావృద్ధిం జెప్పితీవు। నదిగాక స్వాయంభువమనువునకు నె
గిం బూని ప్రియవ్రతోత్తానపాదులను సునందనులు గలరంటివి వారు సప్తద్వీపవతియైన ధాత్రి నెల్ల। ధర్మమార్గంబు లేమియుం
దప్పకుండ। ననఘులై యెట్లు పాలించిరయ్య వారి। చరిత మెల్లను సత్కృపానిరతబుద్ధి। నెఱుంగ వినుపింపు నాకు మునీంద్రచం
ద్ర॥ వ॥ అదియునుంగాక తన్మనుపుత్రియు యోగలక్షణసమేతయునగు దేవహూతి యను కన్యకారత్నంబును స్వాయంభు
వుండు గర్దమునకు నేవిధంబునం బెండ్లి చేసెనా దేవహూతియం దమ్మహాయోగియయిన కర్దముండు ప్రజల నేలాగునం బు
ట్టించెనదియునుంగాక కర్దముండు గుచియను కన్యను దక్షప్రజాపతికి నిచ్చెనని చెప్పితివి యా రుచియం దమ్మహాత్ముండు సృ
ష్టియేలాగునం బుట్టించెనవియన్నియుం దెలియనానతీవలయుననియడిగిన విదురునకు మైత్రేయుండిట్లనియె॥ క॥ వినుమన
ఘుక్కృతయుగంబున। మునినాథుండయిన కర్దముండు ప్రజలస్సృజిం। పను వనజసంభవుని చే। తనియుక్తుండగుచు సుదిమున దశ
సంధిల్లెన్॥ గీ॥ ధీరగుణుండు సరస్వతీతీరమందుం। దవిలి పది వేలు దివ్యవత్సరములోలిం। దపము సేయుచు నొక నాండు జపసమా
ధి నుండి యేకాగ్రచిత్తుండై నిండు వేడ్క॥ క॥ వరమం బ్రసన్నమనోరథ। వరదానసుశీలు నమరవంద్యు రమేశుం। దురితహ
రు సుదర్శనకరుం బూజించిన నతండు గరుణాకరుండై॥ వ॥ అంతనంతరిక్షంబునం బ్రత్యక్షంబైన॥ సీ॥ తరణిసుధాకరకర
ణోదబాంచితసరసీరుహోత్పలప్రస్రగ్విలాసుం। గంకణనూపురగ్రైవేయముద్రికాహారకుండలకిరీటాభిరాముం। గమ
నీయసాగరకన్యకాకౌస్తుభమణిభూషణోద్భాసమానవక్షు। సలలితదరహాసచంద్రికాధవళితచారుదర్పణవిరాజత్క
పోలు। శంఖచక్రగదాపద్మచారుహస్తు। నళికులాలకరుచి భాస్వదళికఫలకుం। బీతకౌశేయవాసుం గృపాతరంగి। తస్మితేక్ష
ణుం బంకజోదరుని హరిని॥ వ॥ మఱియు శబ్దబ్రహ్మశరీరవంతుండును, సదాత్మకుండును, జ్ఞానైకవేద్యుండును, వైనతేయాంసవిన్య
స్తచరణారవిందుండునయిన, గోవిందునింగనుంగొని సంజాతహర్ష ¶లహరీపరవశుండు లబ్ధమనోరథుండునగుచు సా
ష్టాంగదండప్రణామంబు లాచరించి తదనంతరంబ॥ క॥ ముకుళితకరకమలుండై। యకుటిలసద్భక్తిం బరవశాత్ముండగుచు। న
న్నికచాంభోరుహలోచను। నకు నిట్లనియెం దదాననముం గనుంగొనుచున్॥ సీ॥ అజ్ఞాతసకలభూతాంతరాత్ముండవనందనగు
చుం డెడి నీదు దర్శనంబుం దలకొని సుకృతసత్ఫలభరితంబులైనట్టి యనేకజన్మానుసరణిం। బ్రకట యోగక్రియాభ్యాస

---

✿హవ్యకవ్యంబులు॥ హవ్య। దేవతలకొఱకు నియమించిన అన్నము - కవ్యము। పితృదేవతలకు నియమించిన యన్నము.— ✤కుండలిప్రజము। సర్పసమూహము— *ఈడ్యము। నుతింపందగినది.— ✤హృషీకాత్ముండు। చతుర్దశేంద్రియస్వరూపుఁడు— ¶లహరీ। ప్రవాహము.

రూఢులైనట్టి యోగీశ్వరులాత్మఁ గోరి। యెంతురు యోగీశ్వరేశ్వర యే భవత్పాదారవిందములు వరగ నిప్పుడు। గంటి భవవా
ర్ధిఁ గడువఁ గంటిమంటిఁ। గడఁగి నాలోచనంబుల కలిమి నేఁడు। దవిలి సఫలత నొందె మాధవ ముకుంద। చిరదయాకార ని
త్యలక్ష్మీవిహార॥ వ॥ అదియునుంగాక దేవా భవదీయమాయావిమోహితులై హతమేధస్కులై సంసారపారావారోత్తార
కంబులయిన భవదీయపాదారవిందంబులు తుచ్ఛవృత్తికాములయి సేవించి నిరయగతులైన వారికిం దత్కామయోగ్యంబు
లగు మనోరథంబుల నిత్తువట్టి సకాములయిన వారి నిందించు నేను గృహమేధధేనువున శేషమూలయుం ద్రివర్గకారణయు స
మానశీలయునయిన భార్యం బరిణయంబు సేయ నపేక్షించి కల్పతరుమూలసదృశంబులయిన భవదీయపాదారవిందంబు
లు సేవించితినయిన నొక్కవిశేషంబు గలదు విన్నవించెద నవధరింపుము- బ్రహ్మాత్మకుండయిన నీదు వచస్తంతునిబద్ధులయి
లోకులు కామహతులయిరి యేనును వారల ననుసరించిన వాఁడనయి కాలాత్మకుండవైన నీకు నభిమతంబగునట్లు గాఁ
గర్మమయంబైన భవదాజ్ఞాచక్రంబు ననుసరించుటగాని మదీయకామంబుకొఱకుఁగాదు భవదీయమాయావినిర్మితంబుఁ
గాలాత్మక భూరివేగసమాయుక్తంబు అక్షరంబునయిన బ్రహ్మంబునందు భ్రమణశీలంబు అధిమాససమేత త్రయో
దశమాస అరంబు షష్ట్యుత్తరశతత్రయాహోరాత్రమయ పర్వంబు ఋతుషట్కసమాకలిత నేమియుం జాతు
ర్మాస్యత్రయవిరాజిత నాభియు నపరిమితక్షణలవాది పరికల్పితపత్రశోభితంబుఁ గాలాత్మక భూరివేగసమాయుక్తంబున
యిన కాలచక్రంబు సకలజీవనికాయాయుర్గ్రసనతత్పరంబగుం గాని కామాభిభూతజనానుగత పశుప్రాయులగు లోకుల
విడిచి భవపరితాపనివారణకారణంబయిన భవదీయ తరుణాతపత్రచ్ఛాయాసమాశ్రయులై తావకీనగుణకథన సుధా
స్వాదనరుచిరలహరీనిరసిత సకలదేహధర్ములయిన భవద్భక్తజనాయుర్హరణసమర్థంబు గాకుండునని॥ సు॥ అనఘా
యొక్కఁడవయ్యు నాత్మకృతమాయాజాతసత్త్వాదిశక్తిని గాయస్థితి నిజగజ్జననవృద్ధిక్షోభహేతు ప్రభా। వనిరూఢింబగు
ఊర్ణనాభిగతి విశ్వసృష్టి సర్వేశ నీ। ఘనలీలామహిమార్ణవంబుఁ గడవంగావచ్చునే యెరికిన్॥ వ॥ దేవా శబ్దాదివిషయ
సుఖకరంబగు రూపంబు విస్తరింపంజేయు టెల్ల నస్మదనుగ్రహార్థంబుగాని నీకొఱకుంగాదు ఆత్మీయమాయాపరివర్తితలో
కతంత్రంబుగలిగి మదీయమనోరథసుధాప్రవర్షివయిన నీకు నమస్కరించెద॥ మ॥ అని యిబ్భంగి నుతించిన న్వనసరోజా
క్షుండు మోదంబునన్। వినతానందనకంధరోపరిచరద్విభ్రాజమానాంగుఁడుం। డనురాగస్మితచంద్రికాకలితశోభాలోక
నుండై మునీం। ద్రునిఁ గారుణ్యము మెలర్పఁ జూచి పలికెన్ రోచిష్ణుఁడై ప్రేల్మిడిన్॥ క॥ మునివరయే కోరిక నీ। మనమునఁ గా
వించినను సమంచితభక్తిన్। నెనరునఁ బూజించితి నీ। కనయము నాకోర్కె సఫలమయ్యెడుఁ జుమ్మీ॥ వ॥ అని యానతిచ్చి ప్రజా
పతిపుత్రుండగు సామ్రాట్టువునయిన స్వాయంభువమనువు బ్రహ్మావర్తదేశంబునందు సప్తార్ణవమేఖలామండితమహీ
మండలంబుఁ బరిపాలించుచున్నవాఁడు అమ్మహాత్ముండు పరదివసంబున నిందులకు శతరూపయను భార్యాసమేతుండై భర్తృ
కామయగు కూఁతుం దోడ్కొని భవదీయసన్నిధికిం జనుదెంచి నీకు ననురూపవయశ్శీలసంకల్పగుణాకరయైన తన పుత్రిం బ
రిణయంబు గావించు భవదీయమనోరథంబు సిద్ధించు నను చిత్తంబు ననుస్మరింపుచుండు మమ్మనుకన్యను వరించి భవద్వీ
ర్యంబువలన నతిసౌందర్యవతులయిన కన్యలందొమ్మండ్రఁగను నాకన్యకానవకంబునందు మునీంద్రులు పుత్రోత్పాదనం
బులు సేయంగలరు నీవు మదీయశాసనంబు ధరియించి మదర్పితాశేషకర్ముండవగుచు నైకాంతికస్వాంతంబున భూతాభ
యదానదయాచరితజ్ఞానివై నాయందు జగంబులు గలవని యు నీయందు నేగలనని యెఱింగి సేవింపుము చరమకాలంబున
ననుం బొందఁగలవు భవదీయవీర్యంబువలన నేను నీభార్యాగర్భంబుఁ బ్రవేశించి మత్కళాంశంబున సంభవించి నీకుం దత్త్వ
సంహితనుపన్యసింతునని జనార్దనుండు గర్దమున కెఱింగించి యతండు గనుంగొనుచుండ నంతర్హితుండై॥ చ॥ అతులసరస్వతీ
సరిదుదంచిత వాలరసాలసాలశో। భితతటతుంగరంగమగు బిందుసరంబు వినిర్గమించి యం। చితగరుడావరోహణము చేసె
దదీయగరుత్పరిభ్రాంతరుక్పరితతి విలక్షణక్రమ విరాజితనాదము వించు మోదియై॥ చ॥ అరిగె వికుంఠధామమునకంత సకా
మనుడయిన కర్దముండు రయవిమోహితమైన మనమునందను ముందట వచ్చు కోరిక। ల్విరిఁ గొనుచుండఁ దత్క్షణము బిందుసరం
బున కేగియుండి రా। వరుఁడలపోయుచుండె జనవంద్యుఁడు భక్తిని శాంతచిత్తుఁడై॥ వ॥ అంత స్వాయంభువుండు గనకరథా

అక్షరంబు।నశింపనిది-క్షరమనఁగా నశించునది—— భ్రమణశీలంబు।తిరుగుచుండుటయే స్వభావముగాఁగలది—— అధిమాస।అధికమాసము... అరము।అంచు... పర్వము।కణుపు... నేమి।చక్రపంచు... ఊర్ణనాభి।సాలెపురుగు... సామ్రాట్టువు।రాజసూయయాగము చేసినవాఁడును, హిమవత్సేతుమధ్యమందుగల సహస్రయోజనపరిమితమయిన సకలభూమండలమునకు రాజైనవాఁడును, సకలరాజులను తనయాజ్ఞ చేతవశవరుచుకొనినవాఁడును సమ్రాట్టువనంబడును. అట్టి సమ్రాట్టుధర్మముగలవాఁడు-సామ్రాట్టువు... చరమకాలము।అంత్యకాలము.

రూఢుండగుచు నిజభార్యాసమేతుండై భక్తవాంఛాపరయయిన పుత్రికం దోడ్కొనుచు నిజతనూజకుం దగినవరు *నన్వేషింపుచు భువనంబులు గలయం గ్రుమ్మరియెడుమనుం గానక వచ్చి వచ్చి. ఉ॥ ముందటం గాంచె నంత †బుధముఖ్యుఁడు విష్ణుఁడు గర్దము న్మహా। నంద మెలర్పఁ జూచి నయనంబుల రాలిన బాష్పముల్ధర। న్బిందువులై వెసం దొరఁగి పేర్చి సరస్వతిఁ జుట్టి పారుట। న్బిందుసరోవరం బనెడి పేరఁ దనర్చిన పుణ్యతీర్థముల్॥ ఉ॥ అందుఁ ‡దమాలసాలవకుళార్జుననింబకదంబపాటలీ। చందననారికేళఘనసారశిరీషలవంగలుంగమా। కందకుచందనక్రముకకాంచనబిల్వకపిత్థమల్లికా। కుందమధూకమంజుళనికుంజములన్దనరారి వెండియున్॥ క॥ పరిపక్వఫలభరానత। తరుశాఖానికరనివసితస్ఫుటవిహగో। త్కరబహుకోలాహలరవ। భరితదిగంతములు గలిగి భవ్యంబగుచున్॥ క॥ అతినిశితచంచుదళన। క్షతనిర్గతపక్వఫలరసాస్వాదనమో। దితరాజశుకవచోర్థ। శ్రుతిఘోషము వెలుఁగ శ్రవణసుఖదంబగుచున్॥ క॥ లలిత ◐సహకారపల్లవ। కలితాస్వాదనకషాయకంఠవిరాజ। త్?కలకంఠపంచమస్వర। కలనాదము లుల్లసిల్లఁగ మనోరమ్యములై॥ క॥ అతులతమాలమహీజ। ప్రతతీక్షణజాతజలదపరిశంకాంగీ। కృతతాండవఖేలనవిలసితపింఛవిభాసిబాల ※శిఖిసేవ్యంబై॥ క॥ కారండవజలకుక్కుట। సారసబకచక్రవాకషట్పదహంసాం। భోరుహ ✤కైరవనవక। §హ్లారవిరాజితసరోరుహాకరయుతమై॥ క॥ కరి ✦పుండరీకవృకకా। సరశశభల్లూకహరిణచమరీహరిసూ। కరఖడ్గగవయవలిముఖ। శరభప్రముఖోగ్రవన్యసత్త్వాశ్రయమై॥ వ॥ ఒప్పు నప్పరమతాపసోత్తముని యాశ్రమంబుఁ గనుంగొని మితపరిజనంబులతోడం జొచ్చి యందు॥ సీ॥ అంచితబ్రహ్మచర్యవ్రతయోగ్యమై విలసిల్లు ఘనతపోవృత్తిచేత। దేహంబు రుచిరసందీప్తమై చెలువొందఁగ మఱఁ గృశీభూతాత్మకాయుఁడగుచు। నళినోదరాలాపనవసుధాపూరంబు శ్రోత్రాంజలులఁ ద్రావి చొక్కియున్న। కితనఁ గృశీభూతకాయుండు గాక జటావల్కలాజినశ్రీ వెలుంగఁ। గమలపత్రవిశాలనేత్రములు దన ఘననలినసంస్కారసంచితాసక్త్యనూత్న। రత్నమును బోలియున్న కర్దమునిఁ జూచి భక్తి నమ్మను వెరగందఁ దత్పాదములకు॥ వ॥ ఇట్లు వందనంబు గావించినఁ గర్దముండు దనగృహంబునకు విందై చనుదెంచిన యమ్మనువు నాదరించి యర్ఘ్యపాద్యాదివిధులం బరితుష్టుం గావించి పూర్వోక్తంబయిన భగవదాదేశంబు సంస్మరించి స్వాయంభువున కిట్లనియె॥ సీ॥ వరగుణాకర భగవద్ప్రవృత్తియు తెంపదై నదీ ¤త్వదీయపర్యటన మెల్ల। శిష్టపరిగ్రహ దుష్టనిగ్రహములకొఱకుఁ గదా పుణ్యపురుష మఱియు। ❖వనజహితాహితవహ్ని ⁂సమీరవైవస్వత ✧వార్ధిపవాసవాత్మ। కుఁడవు హరిస్వరూపుఁడవైన నీకును మానితభక్తి నమస్కరింతు। నఘుఁడ వెప్పుడే నేమి యఖిలలోక। జైత్రమగు హేమమణిమయస్యందనంబు। నెక్కి కోదండపాణివై యుద్ధసైన్య। సవవిఘుట్టనఁ జేఁ భూమిభాగము గల॥ మ॥ తరణింబోలి చరింపకున్నఁ ఘననిద్రం బొందియుండేని భూ। వరపద్మోదరకల్పితంబు లగు నీవర్ణాశ్రమోదాత్తవి। స్తరపాథోనిధి హేతుభూతమగు పామాచారక్రియల్దప్పి సం। కరమై చోరభయంబునన్నిఖిలలోకంబుల్నశించుం జుమీ॥ వ॥ అని పలికి భవదాగమనంబునకు నిమిత్తంబెయ్యది యనవుడు సమాహితసకలనిత్యకర్మానుష్ఠానుండై సమునీంద్రునకు స్వాయంభువుం డిట్లనియె॥ క॥ సరసిజగర్భుఁడు దన చే। విరచితమైనట్టి వేదవితతుల నెల్లన్ధర వెలయించుటకై బుధ। వరనుత మిముఁ దనముఖంబువలన సృజించెన్॥ క॥ మఱి తత్స్వరూపరక్షా ♣పాట। చ్చరపీడం బొందకుండ సకలక్షోణిం। బరిపాలించుటకై నను। నరవిందభవుండు భుజములందు సృజించెన్॥ క॥ మఱియట్టి జలజభవునకుఁ। గరమంతఃకరణగాత్రకములై వరుసం। బరఁగిన బ్రహ్మక్షత్రము। లరయ రమాధీశ్వరునకు ♠నవనీయంబుల్॥ వ॥ కావున హరిస్వరూపుండవై మద్జనమద్దర్శనుండవైన నినుం గనుట మదీయభాగ్యంబున సిద్ధించె భవత్పాదకంజకింజల్కపుంజరంజితంబై మదీయమస్తకంబు దావకవచనసుధాపూరితంబులైన శ్రవణంబులు మంగళాకరత్వంబును సాఫల్యంబునుం బొందె నేను గృతార్థుండనైతిని హితస్నేహజనకుఃఖ ♦పరిక్లిన్నాంతఃకరణుండనై సకలదేశభ్రమణఖిన్నుండనై నా విన్నపం బవధరింపుమని యిట్లనియె॥ మ॥ పరయోగీశ్వర దేవహూతియను నీవామాక్షి మత్పుత్రికా। వరలావణ్యగుణాఢ్యులన్నియు నెవ్వాని న్మదిం గోరదా। తురమై నారదు పంపున న్నిను వరింతు న్వేగ నంచెంచెనీ। తరుణీభిక్షుఁ బరిగ్రహింపుము శుభోదాత్తక్రియాలోలతన్॥

---

*అన్వేషించుచు। వెదకుచు... †బుధముఖ్యుఁడు। దేవతాశ్రేష్ఠుఁడయిన... ‡తమాల। చీఁకటిచెట్లు, సాల। ఏపెచె, వకుళ। పొగడచె, అర్జున। మద్దిచె, నింబ। వేఁపచె, పాటలి। కలిగొట్టుచె, ఘనసార। కర్పూరపుఁటిచె, శిరీష। దిరిసెనపుచె, మాకంద। మామిడిచె, కుచందన। ఎఱ్ఱచందనపుచె, క్రముక। పోఁకచె, కాంచన। సంపెఁగచెట్లు... ◐సహకార। తియ్యమామిడిచెట్లు... ?కలకంఠ। కోకిల... ※శిఖి। నెమలి... ✤కైరవ। తెల్లగలువ... §కల్హార। కెంచెమెరుపు-అధికపరిమళముగలిగినకలువ... ✦పుండరీక। పులి, వృక। తోడేలు, కాసర। అడవిదున్న, వలిముఖ। కోఁతి.... ¤త్వదీయపర్యటనము। మీసంచారము... ❖వనజహితాహిత। కమలమునకు మిత్రశత్రువులైన సూర్యచంద్రులు... ⁂సమీర। వాయువు... వైవస్వత। యముఁడు... ✧వార్ధిప। వరుణుఁడు... ♣పాటచ్చర। దొంగ... ♠అవనీయంబులు। రక్షణీయములు... ♦పరిక్లిన్న। తడుపఁబడిన.

క॥ అమరిన గృహమేధికక|ర్మములకు ననురూపగుణవిరాజితశీల|క్రమమునఁ దనరిన తరుణిం|బ్రమదమున వరింపు మయ్య భవ్యచరిత్రా॥ క॥ అనఘవిరక్తుల కైనం|దనయంతల భించు సౌఖ్యతతి వర్ణింప|న్జనదట కాముకులకున|బ్బినమానుదురే లభించు ప్రియసౌఖ్యంబుల్॥ క॥ వినుము ఫలారంభుఁడు గృప|ణుని నడిగినఁ దనయశంబు నుండన మానం|బును జెడుఁ గావునఁ దగనీ|వెనయవివాహేచ్ఛఁ దగులు వెఱిఁ గేనిటకున్॥ క॥ చనుదెంచితి నస్మత్ప్రా|ర్థనఁ గైకొని మత్తనూజఁ దగ వరియింపుం|డన మునిస్వాయంభువునిం|గనుఁగొని మఱలం గఁబలికెఁ గడు మోదమునన్॥ సీ॥ అనఘునిచేతన నన్యదత్తముగఁ బ్రతిష్ఠితంబైన యాతీఁగెబోఁడి|కమనీయరూపరేఖావిలాసంబుల మానితలక్ష్మీసమానయగుచు|నొక నాఁటిరాత్రియందు రాజచంద్రికాధవళితనిజసౌధతలమునందు|మహితహిరణ్మయమంజీరశోభితచరణయైన నిజసఖీసహితయగుచుఁ|గందుకక్రీడఁ జరియింపగగనమందు। వరవిమానస్థుఁడగుచు విశ్వావసుండు। నాఁగఁ దనరిన గంధర్వనాయకుండు।తరుణిఁ జూచి మోహితుఁడై ధరణిఁ బడియె॥ గీ॥ పుండరీకాక్షు నెఱుఁగని పురుషపశువు|లీ తలోదరిఁ బొందఁగా నేమి చెప్ప|నట్టి కోమలి భాగ్యోదయమునఁ దాన|వచ్చి కామింపనొల్లని వాఁడు గలఁడె॥ క॥ ఈ కన్యారత్నమునకు|నాకును గుణరూపవర్తనంబుల యెడ నా|లోకింప సమము కావునఁ|గైకొని వరియింతు విగతకల్మషవృత్తిన్॥ క॥ విమలాత్మ దీని కొక సమ|యము గల దెఱిఁగింతు వినుము గుణాకర యగు నీ|రమణికి *నపత్యపర్యం|తము వర్తింపుము గృహస్థధర్మక్రియలన్॥ గీ॥ అంత మీఁద విష్ణు నాజ్ఞ ⁑యౌదలఁ దాల్చి|శమదమాదియోగసరణిఁ బొంది|సన్న్యసించు వాఁడ జలజనేత్రుని వాక్య|కారణమునఁ జేసి ధీరచరిత॥ క॥ శ్రీవిభుని వలన నీలో|కావళి యుదయించుఁ బెరుగు నడఁగును వినురా|జీవప్రభవునకతఁడే|భూవరనిర్మాణహేతుభూతుం డరయన్॥ వ॥ అదిగావున యమ్మహాత్ముని యాజ్ఞోల్లంఘనంబు సేయరాదని కర్దముండు వలికిన విని స్వాయంభువుండు నిజభార్యయైన శతరూపదలంపును బుత్రియైన దేవహూతిచిత్తంబు నెఱింగినవాఁడై ముని⁂సమయంబునకియ్యకొని ప్రహృష్టహృదయుండగుచు సమంచితగుణగణాఢ్యుండయిన కర్దమునకు దేవహూతిని విధ్యుక్తప్రకారంబున వివాహంబు సేయించి తదనంతరంబ శతరూపయును బారిబర్హసంజ్ఞికంబులైన వివాహోచితదివ్యాంబరాభరణంబులు దేవహూతికర్దములకొసంగె నివ్విధంబున నిజకులాచారసరణిం బరిణయంబుఁ గావించి విగతచింతాభరుండై స్వాయంభువుండు మహితవియోగవ్యాకులితస్వాంతుండై కూతుం గౌఁగిలించికొని ●చుబుకంబుఁ బుడుకుచుఁ జెక్కిలి ముద్దుగొని శిరంబు మూర్కొని ప్రేమాతిరేకంబున బాష్పధారాసిక్తమస్తకం జేసి తల్లీ పోయివచ్చెదనని చెప్పి కర్దమునిచేత నామంత్రితుండై నిజభార్యాసమేతంబుగ రథంబెక్కి సపరివారుండై॥ చ॥ తరళతరంగవీచిసముదంచితబిందుసరస్వతీనదీ|సరదరవిందతుందిలలసత్తరుతీరనివాససన్మునీ|శ్వరనికరాశ్రమాకలితసంపదలం గనుఁగొంచు వేడ్కముప్పిరిగొన నేగె నాత్మ⁕పుటభేదనవిస్ఫుటమార్గవర్తియై॥ ఇట్లు చనిచని బ్రహ్మావర్తదేశంబునందు॥ సీ॥ ఎందేని దొల్లి లక్ష్మీశుండు యజ్ఞసూకరమూర్తిఁ గైకొని సరభసమున|నొడలు జాడించినఁ బుడమిపై రాలినరోమజాలంబులు రుచిరహరిత|వర్ణమై పొలుపారు వరకుశకాశమయంబును యజ్ఞక్రియాకలాప। యోగ్యంబులై చాలనొప్పారి బర్హిస్సు సంభవించిన దాన సకలఋషులు|క్రతువులొనరించి తద్విఘ్నకారులైన|యసురులను ద్రుంచిరట్లు స్వాయంభువుండు|విష్ణుపరముగ మఖము గావించి చిర|మేధఁ జెలువొందవచ్చి యాత్మీయపురము॥ క॥ డాయం జనఁ బురజనములు|పాయనములు దెచ్చి యిచ్చి బహుగతుల నుతు|ల్సేయఁగ మంగళతూర్యము|లాయతగతి మ్రోయఁ జొచ్చె నతఁడు పురమున్॥ వ॥ ఇట్లు ప్రవేశించి తాపత్రయాపశాంతంబగు భగవద్భక్తివృద్ధిం బొందింపుచుం బుత్రమిత్రకళత్రసుహృద్బాంధవయుతుండై పరమానందంబున॥ మ॥ అతిభక్తిం బ్రతివాసరంబును హరివ్యాసంగుఁడై మాధవాం|కితగంధర్వవిపంచికాకలితసంగీతప్రబంధానుమోదితుఁడై యిష్టవిభూతులందు ననురక్తిం బొందకే ప్రొద్దున|చ్యుతసేవైకపరాయణుండగుచు నస్తోకప్రభావోన్నతిన్॥ మ॥ హరిపాదాంబురుహద్వయార్పితతులస్వామోదముం గొంచు ద|చ్చరితంబుల్దలపోయుచుం బొగడుచున్|జర్చింపుచున్వించుఁ ద|త్పరిచర్యావ్యతిరిక్తసంసరణసత్కార్యార్థకామంబుల|న్బరిభూతంబులు సేసి మోక్షపథసంప్రాప్తిక్రియారంభుఁడై॥ క॥ నిగమార్థగోచరుం డనఁ|దగు హరిచరితప్రసంగతత్పరచిత్తుం|డగు నతనికి స్వాంతరగము|లగు యామము లొగిన యాతయామములయ్యెన్॥ సీ॥ వెండియు నమ్మేటి విష్ణుమంగళకథాకర్ణనధ్యానానుగాననుతులు। సలుపుచు స్వస్వప్నజాగ్రత్సుషుప్తులఁ దలగించియా పుణ్యతముఁడు దాను। జక్రి దాసుఁడుగాన శారీరమానస దివ్యమానుషభౌతికవ్యథలను|దగులక సన్మునీంద్రశ్రేణికిం దగఁ దనరు వర్ణాశ్రమధర్మగతులు। దప్పకుండంగఁ జెప్పుచుఁ దగిలి సర్వ|భూతహితవృత్తిన

* అపత్యసంతానము... ⁑ఔదలన్ శిరముమీఁద— ⁂సమయ ప్రతిజ్ఞ —●చుబుకంబున్ గడ్డము— ⁕పుటభేదన పట్టణము.

తులవిఖ్యాతలీల । *నేకసప్తతియుగములస్తోకచరితుఁ । డగుచు వర్తించె సమ్మోదమతిశయిల్ల ॥ క॥ అనియిమ్మనుచరితము వి
దు । రునకు మైత్రేయమునివరుఁ డుదయతోడ । న్వినిపించి కర్దమునికథఁ । దనరఁగ నెఱిఁగింతు ననిముదంబునఁ బలికెన్ ॥

## —కర్దమప్రజాపతి యోగభావంబు చే విమానంబు గల్పించి భార్యతోఁ గూడి విహరించుట.—

వ॥ ఇట్లు స్వాయంభువుండు దేవహూతిని గర్దమునికి వివాహంబు సేసి మరలిచనిన తదనంతరంబ దేవహూతియుఁ బతిభక్తి గలిగి భవునికి భవాని పరిచర్య సేయు తెఱంగున పతియాతనకు నేడుగడయుంగా, నెఱింగి యమ్మునీంద్రుని విత్తవృత్తికొలఁది దినదినంబునను భక్తి తాత్పర్య స్నేహంబులు రెట్టింపం బ్రియశుశ్రూషణంబులు గావింపుచు ననూనతేజోవిరాజితయగుచుఁ గామక్రోధదంభలోభాదిగుణవిరహితయై శరీరశుద్ధి వహించి చతురసౌహార్దస్నేహంబులు గలిగి పతియ దైవంబుగా భావించి స్మితమధురవచనరచనయై పతిభక్తియే మఱక వర్తింప దైవయోగంబునుం దప్పింప సమర్థుండయిన కర్దముండు నిజసేవాయాసకృశీభూతదేహయై యున్న దేవహూతిం గరుణాతరంగితాపాంగుండై కనుంగొని మంజుభాషణంబుల నిట్లనియె ॥ ఉ॥ మానితధర్మమార్గమహిమానుస్ఫుటభావితపస్సమాధివి । ద్యానిభృతాత్మయోగసముపార్జితవిష్ణుకటాక్షలబ్ధశో । భానఘదివ్యభోగబహుభద్రవితానము లస్మదీయసే । వానిరతిన్లభించు ననివారణ నిత్తును దివ్యదృష్టియున్ ॥ గీ॥ నెలఁత తద్దివ్యదృష్టి నన్నియును నీకుఁ । గానవచ్చు విలోకింపు కమలపత్త్ర । నయన బొమముడిమాత్రన నాశమందు । నితరసంగతుచ్ఛభోగంబు లేమి చెప్ప ॥ సీ॥ అనుపమరాజ్యదర్పాంధచేతస్కులై పాపవర్తనులయిన పార్థివులకు । ధృతిఁ బొందరాని యీ దివ్యభోగంబులు నీమపాతివ్రత్యనిష్ఠఁ జేసి । సంప్రాప్తములునయ్యె సమతభోగింపుము కార్యంబు సిద్ధించుఁ గాక నీకు । ననుటయు నతివయు ననుపమయోగమాయావిచక్షణశాలియైన కర్ద । ముని గనుంగొని ‡విగతాధియును గటాక్షు । కలితలజ్జానతాస్యపంకజయు నగుచు । వినయప్రణయములం జేసి విహ్వలంబు । లయిన పలుకులఁ బతికి నిట్లనియెఁ బ్రీతి ॥ వ॥ అనఘాయమోఘయోగమాయావిభుండవు సమర్థుండవు నయిన నీయందు మదీయమనుపమదివ్యభోగంబులు గలుగుట నిక్కంబ యెఱుంగుదు భవత్సంగతి నన్నియు నాకుం గలుగు నయినను దేవా నీ వానతిచ్చిన సంతానపర్యంతంబైన శరీరసంగమసమయంబు చిత్తంబునం దలంచి భవదంగసంగమంబుఁ గృప సేసి మన్నింపుము భవదీయసంయోగవాంఛాపరతంత్రకృశీభూతంబయిన యీ దేహంబు విధంబున మజ్జనభోజనపానసుఖంబులం బరితుష్టిం బొందునట్లు మన్మనోరథంబు దీర్ప రతిరహస్యప్రకాశకంబగు కామశాస్త్రప్రకారంబు పరిశీలించి యయ్యంగుళంబున నుచితంబులైన వివిధాంబరాభరణమాల్యానులేపనమందిరారామప్రముఖనిఖిలవస్తువిస్తారంబుఁ గావించి నన్నుం గరుణింపుమనిన నమ్మహాత్ముండు నిజయోగమాయాబలంబున నందక్షణంబ ॥ సీ॥ దివ్యమణిస్తంభదీప్తిఁ జెన్నొందుచు మరకతస్థలములు మహిమఁ దనర । వరవజ్ర§కుడ్యకవాటశోభితములై విద్రుమదేహళీవీధులమరఁ । గొమరొప్పనవ♠శాతకుంభకుంభములపై హరినీలశకలవిస్ఫురణ మెఱయఁ । దగఁ బద్మరాగంబు†మొగడలఁ జెన్నొందు వైడూర్య♣వలభులు వన్నెఁ జూపఁ । దరళతరధూతకేతుపతాకలోలయు । మంజుశింజన్మధుపకలిత సురుచిరాలంబమానప్రసూనరాజి । మాలికల నొప్పు వివిధగృహాళిఁ దనరి ॥ క॥ మఱియును దుకూల‖చీనాంబర◊కౌశేయాదివివిధపటపరివృతమును । బిరసుభగాకారంబై । కర మొప్పు విచిత్రపట్టికాలంకృతమై ॥ మ॥ లలితోద్యానవనాంతసంచరణలీలాలోలహంసాళికో । కిలపారావతచక్రవాకశుకకేకీందిందిరానీకము । త్కలికం గృత్రిమపత్త్రులన్నిజవిహంగశ్రేణియంచుం గుతూ । హలియై పల్కుచు నాడుచుం బ్రతిశాఖారోహణవ్యాప్తులన్ ॥ క॥ ఘనసౌధాంతరశయ్యా । సనకేళిగేహ♦కృతకజగతీధరశో । భనవం ప్రకాంతనానా । వనఫలభరితావనీజవంతము లొసమన్ ॥ క॥ సకలర్తుశోభితంబును । సకలశుభావహము సకలసంపత్కరమున్ । సకలోపభోగయోగ్యము । సకలేప్సితకామదంబు సదలంకృతమున్ ॥ వ॥ అగుచు నొప్పు దివ్యవిమానంబుఁ గల్పించి తదీయసుషమావిశేషవిచిత్రంబులు నిర్మించిన తాన తెలియంజాలనియమ్మహాకర్మంబయిన విమానంబు దేవహూతికిం జూపినం జూచి యమ్ముద్దియ సంతసింపకుండుట నెఱింగి సర్వభూతాంతరాశయాభిజ్ఞుండు సంతుష్టాంతరంగుండు నయిన కర్దముండిట్లనియె ॥ గీ॥ అతివ భగవత్సృతంబయి యఖిలమంగ । ళాళి కాకరమగు నీజలాశయమునఁ దవిలి గ్రుంకిన జంతువితానములకుఁ । గామ్యఫలసిద్ధి సేకురుఁ గాన నీవు ॥ క॥ ఇజ్జలములన తిభక్తిని । మజ్జన మొనరించి యీవిమానము వేడ్కన్ । లజ్జా

*ఏకసప్తతి। డెబ్బదియొకటి— ‡విగతాధి। పోయిన మనోవ్యాధిగలది— §కుడ్యకవాట। గోడలుతలుపులు— ♠శాతకుంభకుంభముల పైన్। బంగరుకుండలగూఁడ— †మొగడలన్। మొగ్గలతోడ— ♣వలభులు। కొణిగెలు— ‖చీనాంబర। చీనాదేశపువస్త్రములు— ◊కౌశేయ। పురుగులచేతనైన, బుజ్జలనూలుచేత నేయఁబడినపట్టుచీరలు… ♦కృతకజగతీధర। కృత్రిమపర్వతములు.

పతియొక్కవేయని బుజ్జగమొనరంగఁ గర్దముఁడు వల్కుటయున్ ॥ వ ॥ వినియాకువలయాక్షి పతిసేవాయాసమలినాంబ
రయు వేణీభూతశిరోజయు ధూళిధూసరితాతికృశీభూతాంగయు శబలస్తనయునై భర్తృనియోగంబున సరస్వతీసలిలసం
భూతజలచరాశ్రయంబగు బిందుసరోవరంబుఁ బ్రవేశించి తజ్జలంబులఁ గ్రుంకులిడు సమయంబునఁ దద్వాఃపూరమధ్యంబు
నరుచిరసూ*క్ష్మాంశుకధారులుఁ గిశోరవయఃపరిపాకశోభితులు నుత్పలగంధులునగు కన్యాసహస్రంబులు దేవహూతిం
గనుంగొని యిట్లనిరి ॥ క ॥ తరుణీ నీదుని యోగా । చరణులమిదె మేము నీకు సదమలభక్తిన్ । బరిచర్య సేయ నేర్తుము । కరుణాకలి
తేక్షణములఁ గనుఁగొనుము మమ్మున్ ॥ సీ ॥ అనిపల్కి దాసియయ్యతివకు నభ్యంజనోద్వర్తనములు పెంపానరఁ జేసి । మలయజక
ర్పూరమహితవాసితహేమకలశోదకంబుల జలకమార్చి । ధవళవస్త్రంబులఁ గడియొత్తి సర్వాంగధూపంబులొసఁగిక
స్తూరి నలఁది । మంజుశింజన్మణిమంజీరకింకిణీకలరావకలితమేఖలలు రత్నఖచితతాటంకముద్రికాకంకణాది । సముచితాన
ర్ఘ్యహేమభూషణములొసఁగి । భవ్యమాల్యానులేపనాంబరములిచ్చి । షడ్రసోపేతవివిధాన్నసమితిఁ దనిపి ॥ వ ॥ మఱియుం
గనకపాత్రరచితంబులయిన కర్పూరనీరాజనంబులిచ్చి రుచిరాసనంబునఁ గూర్చుండఁ బెట్టి దర్పణంబు చేతికిచ్చిన నం దత్ప్రతి
ఫలితనిజదేహంబుఁ గనుంగొని కర్దముని మనంబునందలంచిన నతండుఁ గన్యాసహస్రంబును దత్క్షణంబున దనసన్నిధినుండు
టం జూచి నిజభర్తృయోగమాయాప్రభావంబునకద్భుతంబునొందె నంతఁ గర్దముండుఁ గృతస్నాతయైన దేవహూతిం గనుం
గొని వివాహంబునకు ముందట నేచందంబునం దనరుచుండు నాచందంబునం జెన్నొందుచుండుటకు నానందభరితుండై భా
ర్యాసహితంబుగఁ దత్కన్యాసహస్రంబు గొలువ నిజవిమానారూఢుండై తారాగణపరివృతుండై రోహిణీయుక్తుండ
గు సుధాకరుంబోలి యొప్పుచుండె దదనంతరంబ ॥ చ ॥ చిరశుభమూర్తి యమ్ముని యశేషదిగీశవిహారయోగ్యమున్ । సురుచిర
మందగంధవహశోభితమున్నికటప్రధాతుని । ర్ఝరసరిదంబుశీతలతుషారము నైతనరారు మేరుకం । దరమున కేగి దేవవని
తాయుతుఁడైన కుబేరు చాడ్పునన్ ॥ మఱియు ॥ మ ॥ అమరోద్యానవనప్రదేశములు నవ్యారామభూముల్దరీ । కుముదాంభో
జవిభాసిమానససరఃకూలంబులున్మంజుకుం । జములున్ జైత్రరథంబు విస్ఫురితవిస్రంభంబునం జూచె నె । య్యమునన్గర్దమ
యోగి కామగవిమానారూఢుఁడై చెచ్చెరన్ ॥ వ ॥ ఇవ్విధంబున సమస్తభూభాగంబును వాయువేగంబునం గలయం గ్రుమ్మ
రి నిఖిలవైమానికలోకంబున నతిశయించి లోకంబులం జరియించె మోక్షదాయకుండుఁ దీర్థపాదుండునగు పుండరీకాక్షుఁ
సన్నుతించి సేవించు పుణ్యాత్ములకుం బొందరాని పదార్థంబులు గలవె యిట్లు కర్దముండు దేవహూతికి నిఖిలధరాచక్రంబుం
తయుం జూపి మఱల నిజనివాసంబునకుం జనుదెంచి కామకేళీవినోదాత్మయైయున్న భార్యనుపలక్షించి రతిప్రసంగవ్యాసం
గంబుఁగైకొని బహువిధంబులయిన యిష్టోపభోగంబుల బహువత్సరంబు లొక్క ముహూర్తంబుగా జరుపుచు నన్యోన్య
సరసావలోకనంబుల సముచితాలింగనసంభాషణంబులం గాలనిరూపణంబు సేయ నేరక శతవత్సరంబులు గడపి తదనంత
రంబ ॥ క ॥ మునివరుఁ డొక నాఁడిమ్ములఁ । దననిజదేహంబు నవవిధంబుగఁ గావిం । చి నయంబునఁ దద్వీర్యముఁ । దనసతిగర్భము
నన నవవిధంబుగ నిలిపెన్ ॥ క ॥ అదికారణంబుగాఁ బెం । పొదవిన మునివలన దేవహూతి తనయల । న్ముదమునఁ గనెఁ దొమ్మండ్రం ।
న్ముదితయు మదిసంతసించె మునివరుఁ డంతన్ ॥ గీ ॥ సన్న్యసింపంగఁ గోరిన సతి యెఱింగి । యాత్మఁ బొడమిన సంతాపమగ్గలిం
పఁ । జింతవాటిల్లఁ జెక్కిటఁ జెయ్యిఁ జేర్చి । పదములను నేల వ్రాయుచుఁ బలికెఁ బతికి ॥ సీ ॥ అనఘ సంతానపర్యంతంబు ననుఁ
గూడి వర్తింతు ననుచుఁ బూర్వమునఁ బలికి । కూఁతుల నిచ్చితి కొమరార నిప్పుడీ తరుణులు పతులను దమకుఁ దార । యరసి వర్తిం
తురో యనిభీతి నొందెదఁ గావున నీపుత్రికలకుఁ దగిన । వరుల సంపాదించి పరిణయంబులు సేసి తత్వసంహిత నాకుఁ దపిలి తె
లుపు । సుతుని గృపఁ జేసి ననుఁ గావు సుజనవినుత । యర్థిసంసారదుఃఖంబునపనయింప । నర్హుఁడవు నీవ కామమోహమున నింత
కాలమూరకపోయె నే గతియు లేక ॥ చ ॥ ¶ఉపరతివృత్తి నైహికసుఖోపగతానుభవంబులందు ము । న్నపలతఁ గామభోగరతిస
ఙ్గముఁ గోరి మహాత్మ నిన్ను నా । చ్చపు దలపొప్పఁ గాదెలియఁ జాలక యే వరియించుటన్న వ । త్యపఫలియించె ముక్తి నినుఁ గేవల
భక్తి భజింపఁగల్గదే ॥ అదియునుం గాక ॥ చ ॥ సమమతినొప్పు సత్పురుషసఖ్యము సద్గతికారణంబు నీ । చమతి విలోలు దుష్పురుష
సఖ్యము దుర్గతిహేతువంచుఁ జి । త్తమునఁ దలంచి §యోగిజనతానుతమిమ్ము భజింతుఁ బ్రాణిసం । గమమునఁ బుణ్యపాప
ములు గైకొని పొందవె యొట్టివారలన్ ॥ క ॥ అని యిట్లు వేదనాభర । మున మునుఁగుచుఁ బలుకఁ గర్దముఁడు మనుపుత్రిన్ । గ్గనుఁగొ
ని సరసిజనయను వచనములు మదిసంస్మరించి సతికిట్లనియెన్ ॥ క ॥ మనుసుత నీమదిదుఃఖం । బును బొందకుము చిరకాలమునభ

*అంశుక । వస్త్రము. — ¶ఉపరతి । నిస్పృహ — §యోగిజనతా । యోగిజనసమూహముచేత.

గవంతుం|డనఘుండత్రుఁడుజనా|ర్దనుఁడుభవద్గర్భమందుఁదగవసియించున్॥క॥వరనియమవ్రతనిష్ఠా|చరణనియుక్తాంతరంగసమధికవై సం|భరితతపోధనదాన|స్ఫురితశ్రద్ధానుభక్తిపూర్వముగాఁగన్॥ మ॥ మఱినారాయణపాదపద్మములుసమ్యగ్భక్తిఁబూజింపుత|త్పురుషశ్రేష్ఠుఁడుమానసంబునభవత్పూజానుసంప్రీతుఁడై|కరమర్థిందరుణీశిరోమణిభవ

## దేవహూతిగర్భంబునవిష్ణుండుకపిలాచార్యుండుగానుదయించుట.

ద్గర్భస్థుఁడైయుండితాఁ|గరుణంజేయుభవన్మనోజనితశంకా|గ్రంథివిచ్ఛేదమున్॥చ॥అనవుడుదేవహూతిహృదయంబునసంతసమందియమ్మునీం|ద్రునివచనక్రమంబునఁబన్నగవంశుననంతుఁబద్మలో|చనుహరివిష్ణునర్చనముసల్పుచునుండఁగఁగొన్నియబ్దముల్|చనునెడదానవాంతకుఁడుసమ్మతిఁ*గార్దమమైనతేజమున్॥క॥ధరియించియమ్మునీంద్రుని|తరుణీగర్భంబువలనదనుజారిశమీ|తలుకోటరమునవైశ్వా|నరుఁడుదయించినవిధంబునన్జనియించెన్॥ సీ॥అయ్యవసరముననాకాశమునదేవతూర్యఘోషంబంతఁదుములమయ్యె|నందితదేవతాబృందంబులంతంతఁగురిసిరిమందారకుసుమవృష్టి|గంధర్వకిన్నరగానంబులీతెంచెనప్సరోగణములయాటలొప్పె|వాపిరిదిక్కులఁగావిరివిరిసెనుదవిలివార్ధులగలఁకలునుమానె|సాధుజనములమనములుసంతసిల్లె| హోమవహ్నులుప్రభలఁజెన్నొందివెలిఁగెఁ| గుసుమఫలభరములనొప్పెఁగుజములెల్ల|సర్వసస్యాళిచెన్నొందెజగతిలోన॥ వ॥ఇట్టిమహోత్సవంబునదేవహూతికిందత్త్వబోధంబుఁగావించుకొఱకుఁదదీయగర్భంబుననుదయించినపరబ్రహ్మస్వరూపుండైననారాయణునిదర్శించుకొఱకుమరీచిప్రముఖమునిగణసమేతుండైచతుర్ముఖుండుచనుదెంచియమ్మహాత్మునిదర్శించికర్దమదేవహూతులంగనుంగొనియిట్లనియె॥క॥నుతచరితులారమీరలుకృతకృత్యులువిష్ణుప్రాఁగేవలభక్తి|న్మతినిష్కపటులరై చే|సితిరితదర్చనఫలంబుచేకురెమీకున్॥ క॥శ్రితభయహరణుఁడుమునిజన|నుతచరితుఁడుపరుఁడుమీమనోరథసిద్ధి|న్వితతంబుగఁగావించుటఁ| చతురతమీజన్మమింకసఫలతఁబొందెన్॥క॥పినుఁడుసకాములునైహరి|ననుపమభక్తిన్భజించునదెముక్తికిఁజా|లునుమీపుణ్యంబేమని|కొనియాడఁగవచ్చునీతికోవిమలాంరా॥వ॥అనివెండియుంగర్దమునింగనుంగొనియిట్లనుభవదీయతనూభవలంబ్రకటశీలవ్రతాచారసంపన్నలయినమునివరేణ్యులకుంబెండ్లిసేయుముతైనవారివలనంబ్రజాసృష్టిబహువిధంబులవృద్ధింబొందుననిచెప్పిమఱియునిట్లనియె॥ చ॥ అనఘభవత్సుతుండుసముదంచితతేజుఁడునైనయిమ్మహా|త్మునిఁబరమేశునీశునజితున్నలినాక్షునమేయునచ్యుతున్|ఘనునవికారునక్షగునఘారిననంతునిఁగాఁదలంపుస|ద్ఘనియుసమస్తచేతననికాయహృదీప్సితదాయిగావుతన్॥సీ॥మానితజ్ఞానవిజ్ఞానయోగంబులుననుపాయంబులునెనరఁజేసి|యోలిమైకర్మజీవులనుద్ధరించుటకొఱకునమ్మహాత్ముఁడుసముగ్ర| §హాటకరుచిజటాజూటుండునుత్ఫుల్లపంకజనేత్రుండుపద్మవక్త్ర| హలకులిశాంకుశలలితరేఖాంకితచరణతలుండునుసత్త్వగుణుఁడు|నగుచునిప్పుడుసరసీరుహాక్షినీదు|గర్భమందుదయించెనుఘనుఁడునీకుఁ|దత్త్వబోధంబుఁగావించుఁబావకీన|హృదయసంగతసంశయమెల్లఁబాపు॥మఱియును॥క॥నుతికెక్కిసిద్ధగణసే|వితుఁడైఘనసాంఖ్యయోగవిలసితతత్త్వ|స్థితినిరతుఁడగుచుఁగపిలా|ఖ్యతఁదనరిచరించునీజగత్త్రియమెల్లన్॥ క॥అనిపలికియమ్మరీంచి|గని*యుద్వాహార్థమునిదికమలజుఁడంత|న్దననందనులగునారద|సనకాదులఁగూడియాత్మసదమునకరిగెన్॥వ॥అంతనాకర్దముండుకమలసంభవచోదితుండగుచుయథోచితంబుగానాత్మీయదుహితలవివాహంబుసేయందలంచిమరీచికింగళయనుకన్యక,నత్రికిననసూయ,నంగిరసునకుశ్రద్ధను,బులస్త్యునకుహవిర్భువు,బులహునకుంగతిని,గ్రతువునకుఁగ్రియను,భృగువునకుఖ్యాతిని,వసిష్ఠునకునరుంధతిని,నథర్వునకుశాంతినింగానిజకులాచారసరణింబరిణయంబుగావించినవారునుగృతదారపరిగ్రహులుగర్దమకృతసంభావనాసంభావితులగుచునతనిచేతననుజ్ఞాతులైజాయాసహితులగుచునిజాశ్రమభూములకుంజనిరియనంతరంబుకర్దముండుదేవోత్తముండగువిష్ణుండుదనమందిరంబుననవతరించివసించియుంటందనచిత్తంబుననెఱింగివివిక్తస్థలంబునకుంజనియచ్చటఁగపిలునికివందనంబాచరించియిట్లనియె॥సీ॥చతురాత్మవినుమాత్మకృతములైనట్టియమంగళభూతకర్మంబులనెడి|దావాగ్నిశిఖలచేదందహ్యమానులై నట్టిజీవులుమదముట్టలేక|పాయకసంసారబద్ధులైయుందురుబహుళకాలంబిట్లువరలుచుండ|సకలదేవతలుప్రసన్నులునగుదురు బహుజన్మపరిచితప్రాప్తయోగ|విరసమాధితపోనిష్ఠచేవివిక్త|దేశములయోగిజనములుధృతులనేము|హానుభావువిలోకింతురట్టిదివ్య|పురుషరత్నంబనాయింటఁబుట్టితీశ॥వ॥మఱియుసంసారచక్రపరిభ్రామ్యమాణులమగుచుగ్రామ్యులమయినమావర్తనంబులుగణింపకమదీయగృ

*కార్దమ-మున్॥కర్దమబ్రహ్మవీర్యము. §హాటకరుచిజటాజూటుండు|బంగారుచాయగలజడలుగలవాఁడు. *ఉద్వాహార్థము|పెండ్లినిమిత్తము.

హంబునం బూర్వంబునం బ్రతిశ్రుతంబులయిన భవదీయవాక్యంబులు దప్పకుండ ననుగ్రహింపను దయించితని వెండియు
నిట్లనియె॥క॥తలపోయఁగ నప్రాకృత।బలయుక్తచతుర్భుజాదిభవదవతార।ంబులు నీకు రూపములునై। పొలుపొందంగా
దె పరమపురుష మహాత్మా॥అదియునుం గాక।క॥అనయము భవదీయాశ్రిత। జనసంరక్షణము కొఱకు సమ్మతితోఁ దా।ల్చిన
మానవరూపంబులు।ననురూపములగును గాదె హరి నీ కెపుడున్॥క॥సుమహితతత్త్వజ్ఞానా।ర్థము విద్వజ్జనగణంబు దవిలిన సు
స్థా। రములోలిఁ జేయు పదపీ।ఠము గల నినుఁ బొగడ వశమె మెఱవణింపంగన్॥సీ॥సమధికషడ్గుణైశ్వర్యకారణుఁడవు పరమేశ్వ
రుండవు ప్రకృతిపురుష।మహదహంకారతన్మాత్రతత్క్షోభకహేతుకాలాత్మవిఖ్యాతధృతివి।జగదాత్మకుండవు విచ్ఛాశక్తి నా
త్మీయజఠరనిక్షిప్తవిశ్వప్రపంచ।మును గల సర్వజ్ఞమూర్తి విస్వచ్ఛందశక్తియుక్తుండవు సర్వసాక్షి।వగుచుఁ గపిలాఖ్యఁ ద
నరారునట్టి నీకు।ననఘ మ్రొక్కెదఁ బుత్త్రుండవగుచు నీవు। నాకుఁ బుట్టినకతన గుణత్రయంబు। వలనఁ బాసితి నిఁక భక్తవర
ద నేను॥గీ॥మానితవ్రతయోగసమాధినియతిఁ। జెంది భవదీయపాదారవిందయుగము। డెందమునఁ జేర్చి శోకంబులందుఁ
దొలఁగి। సంచరించెద నంచితస్థలములందు॥క॥అని యిట్లు విన్నవించిన।మునిపుంగవుఁడైన కర్దముని వచనంబుల్।విని భగవం
తుండగున।య్యనఘుఁడు గపిలుండు పలికె నర్మిలి దోఁపన్॥సీ॥ నా చేతఁ బూర్వంబునం బ్రతిశ్రుతమైన వచనముల్ దప్పక వర
మునీంద్ర।నీయింటఁ బుట్టితి నిర్హేతుకస్థితిభూరి దయాగుణంబున నవాప్త। సకలకాముఁడ నేను సన్మునివేషంబు ధరియించు
టెల్ల నాకొఱకుఁ గాదు।వినుమహాత్మకులయిన మునులకుఁ బరమాత్మగురుసద్వివేకంబు నరసిచూపు।తత్త్వబోధంబు కొఱకు
ను దాల్పఁబడిన।యంచితవ్యక్తమార్గమైనట్టి దేహ।మని తలంపుము మత్పదధ్యానభక్తి।క్షేపరాయణమహిమంబు దేజరిల్ల॥
క॥ సమధికనిస్సంగీకృతయో।గమున సన్న్యస్తసకలకర్ముఁడవై మో।హముఁ బాసి భక్తిచే మో।క్షమునకు భజియింపు నను
వికారరహితుఁడై॥ క॥ ననుఁ బరమేశుఁ బరంజ్యో।తిని ననఘు ననంతు దేవదేవు సకలభూ।తనికాయగుహాశయు నా।ద్యుని న
జు నాద్యంతశూన్యు దురితవిదూరున్॥ క॥తిరముగ భవదీయాంతః।కరణసరోజాతకర్ణికాతలమునను। స్థిరుఁ జేసి యింద్రి
యంబుల।నిరసించి మనోంబకమున నెఱిఁగను మనఘా॥అట్లని.క॥తనరిన మోక్షము నొందెద।వని పలికినఁ గర్దముండు సమ్ముని
కులచం।ద్రునివలనఁ గొని వందనములు।ఘనముగ నతిభక్తిఁ జేసి కౌతుకమలరన్.క॥మునిగణసేవితమగు వన।మునకుం జనియం
దుమానమున నిస్సంగుం।డును వహ్నిరహితుఁడని కే।తనుఁడై యాత్మైకశరణతత్పరుఁడగుచున్॥వ॥పరబ్రహ్మంబుఁ జిత్తం
బున నిల్పి యహంకారంబు విడిచి నమత్వంబు నిరసించి దయాగుణంబునం జేసి సకలభూతంబులందు సమత్వంబు భజియిం
చి శాంతశేముషీగరిష్ఠుండగుచు*నిస్తరంగంబగు వార్ధిచందంబున ధీరుండై నిఖిలప్రపంచంబును వాసుదేవమయంబుగాఁ
దలంచుచు భక్తియోగంబున భాగవతగతిం బొందెనని చెప్పి వెండియు మైత్రేయుండు విదురునిం గనుంగొని కర్దముండు వనం
బునకుం జనిన యనంతరంబ మాతృవత్సలుండయిన కపిలుండు బిందుసరంబున వసియించి యుండ దేవహూతి తత్త్వమార్గాగ్ర

## దేవహూతి తనపుత్త్రుండైన కపిలాచార్యునివలనఁ దత్త్వజ్ఞానంబు వడయుట.

దర్శనుండయిన సుతునిం గనుంగొని బ్రహ్మవచనంబులు దలంపుచు నిట్లనియె॥ క॥ అసదింద్రియఘర్షణమున।వసుమతి నిర్వి
ణ్ణ నగుచు వనరెడి నాకీ।యసదృశమోహతమోవిని।రసనంబనఘాత్మ యే వెరవున ఘటించున్॥క॥పటుఘననీరంధ్రతమః।ప
టలపరీవృతజగత్ప్రపంచమునకు నె।క్కటిలోచనమై మహితో।త్కటరుచి వెలుఁగుదువు భానుకైవడి ననఘా॥ ఉ॥భూరిమ
దీయమోహతమముం బెడఁబాప సమర్థులన్యులెవ్వారలు నీవ కాక ‡నిరవద్య నిరంజన నిర్వికారసం।సారలతాలవిత్ర బుధ
సత్తమ సర్వశరణ్య ధర్మవి।స్తారక సర్వలోకశుభదాయక నిత్యవిభూతినాయకా॥ చ॥నిను శరణంబుఁ జొచ్చెద ననింద్యతపోని
ధి నన్నుఁ గావవే।యని తను దేవహూతి వినయంబున సన్నుతి చేసి వేఁడఁగా।ననుపమసత్కృపాకలితుఁడై కపిలుండనురాగ
మొప్పస।జ్జననిచయాపవర్గఫలసాధనతం దగు తల్లివాక్యముల్॥క॥విని మందస్మితలలితా।ననకమలుండగుచు నెమ్మనమునఁ
బ్రమోదం।బనయంబు ¶గడలుకొన నిజ।జననికి నిట్లనియెఁ బరమశాంతుండగుచున్॥క॥విను జీవుని చిత్తము దా।ఘనభవబం
ధాపవర్గకారణమనియే। వినఁ ద్రిగుణాసక్తంబయి।నను సంసృతిబంధకారణంబగు మఱియున్॥ గీ॥అదియు నారాయణాస
క్తమయ్యెనేని। మోక్షకారణమగు నని మునికులాబ్ధి।చంద్రుఁడన నొప్పు కపిలుండు జననితోడ। నర్థి వినఁ జెప్పి మఱియు నిట్లని
యెఁ బ్రీతి॥వ॥మఱియుఁ జిత్తంబహంకారమమకారరూపాభిమానజాతంబులగు కామలోభాదికలుషవ్రాతంబులచేత నె

* నిస్తరంగంబగు వార్ధిచందంబునన్।అలలులేని సముద్రమువలె — ‡నిరవద్య।నిర్దోషమైన, నిరంజన।తమోరహితమైన, నిర్వికార।గర్భమందుండుట-పుట్టుట-పెరుగుట-ముదియుట-చిక్కిపోవుట, చచ్చుట అను వికారములు లేనివాఁడా. ¶గడలుకొనన్।అవరింపఁగా.

తిప్పెఁ *దగులంబుమానినన్ననఘుని ‡విశ్వతోముఖుననన్యగతిన్భజియించెనేని వానినిఘనమృత్యురూప ఀభవనీరధి నేఁదరియింపఁజేయుదుర్॥ సీ॥ రూఢిఁ §ప్రధానపూరుషనాయకుండనుభగవంతుఁడనుజగత్ప్రభుఁడనైన। నాకంటె నన్యులఁ గైకొనితగిలినయాత్మలుభవభయంబందుమరది। గావుననాయాజ్ఞఁ గడువంగనోడుటఁజేసివాయువువీఁచు శిఖి వెలుంగు। నినుఁడుఁదపించుఁ దానింద్రుండువర్షించుభయమునందిమృత్యువుపరువువెట్టుఁ। గానవిజ్ఞానవైరాగ్యకలితమైన। భక్తియోగంబునంజేసిపరమపదము। కొ॥ అకునయోగివరులుమచ్చరణభజను। లగుచుఁజరియింపుదురునిర్భయాత్ములగుచు॥ క॥ గురుభక్తిఁ జిత్తముమత్పరమైవిలసిల్లునంతపర్యంతమునత్పురుషులకిహలోకంబునఁ। జిరతరమోక్షోదయంబు సేకురుచుండుర్॥ క॥ అనియిట్లుసన్మునీంద్రుఁడు। జననికిహరిభక్తియోగసంగతి నెల్లన్వినిపించుచువెండియునిట్లనియెన్సత్ప్రమోదచిత్తుండగుచుఁగడంకన్॥ వ॥ అవ్వాయివ్విధంబునభక్తియోగప్రకారంబు సెప్పితనింకఁదత్వలక్షణంబు వేఱువేఱ నెఱింగింతు నేతత్వగుణంబులనెఱింగినరులుప్రకృతిగుణంబులవలనవిముక్తులగుదురు- హృదయ ¶గ్రంథివిచ్ఛేదకంబు నాత్మదర్శనరూపంబునగుజ్ఞానంబాత్మనిశ్రేయసకారణంబుగావునదాని నెఱింగింతు నంమనాత్మస్వరూపంబెట్టిదనిన ‖నాదియుఁ, బురుషుండుసత్వాదిగుణశూన్యుండుఁ, బ్రకృతిగుణవిలక్షణుండుఁ, బ్రత్యక్స్వరూపుండు, స్వయంప్రకాశుండు, మఱియు నెవ్వనితోడనీవిశ్వంబుసమన్వితంబగు-నతండుగుణత్రయాత్మకంబునవ్యక్తంబుభగవత్సంబంధియగుప్రకృతియందుయదృచ్ఛచేలీలావశంబునం బ్రవేశించిననాప్రకృతిగుణత్రయమయంబైనరూపంబయినప్రజాసర్గంబుఁజేయంగనుంగొనియప్పుడుమోహితుండైవిజ్ఞాన§తిరోధానంబునంజేసిగుణత్రయాత్మకంబయిన ప్రకృత్యధ్యాసంబునననన్యోన్యమేళనంబగుటయునంతంబ్రకృతిగుణంబుఁదనయందునారోపించికొని ✠క్రియమాణంబులగుకార్యంబులవలనం గర్తృత్వంబుగలిగిసంసారబద్ధుండై ✿పారతంత్ర్యంబుగలిగియుండుఁ గర్తృత్వశూన్యుండగునీశ్వరుండు సాక్షియగుటంజేసియాత్మకుంగార్యకారణకర్తృత్వంబులుప్రకృత్యధీనంబులనియు సుఖదుఃఖభోక్తృత్వంబులుప్రకృతివిలక్షణుండయినపురుషునిదనియు నెఱుంగుమరనిచెప్పినవిని దేవహూతికపిలునకిట్లనియెఁ బురుషోత్తమా ప్రకృతిపురుషులుసదసదాత్మకప్రపంచంబునకుఁ గారణభూతులుగావునవానిలక్షణంబు సదసద్వివేకపూర్వకంబుగా నానతిమ్మనినభగవంతుండిట్లనియె॥

క॥ క్రమమునఁ ద్రిగుణమునవ్యక్తమునిత్యముసదసదాత్మకముమఱియుఁ బ్రధా। నమునన నాఁ బ్రకృతివిశేషములదియు విశిష్టమనిరిసద్విదులెలమిన్॥ వ॥ అందుం బ్రకృతి, చతుర్వింశతితత్వాత్మకంబై యుండు, నదియెట్లనినం, బంచమహాభూతంబులుం బంచతన్మాత్రలుజ్ఞానకర్మాత్మకంబులయినత్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులు, వాక్పాణిపాదపాయూపస్థలు, ననుదశేంద్రియంబులు, మనోబుద్ధిచిత్తాహంకారంబులనునంతఃకరణచతుష్టయంబు, ననుచతుర్వింశతితత్వాత్మకంబయిన, సగుణబ్రహ్మసంస్థానంబు సెప్పితి. నిటమీఁదఁగాలంబనుపంచవింశతితత్వంబు సెప్పెదనదిగొందఱుపురుషశబ్దవాచ్యుండయినయీశ్వరునిపౌరుషంబుగాలశబ్దంబునఁ జెప్పంబడునందురందునహంకారమోహితుండై, ప్రకృతినొందుజీవుండుభయంబుఁ జెందుఁ, బ్రకృతిగుణసామ్యంబునంజేసివర్తించి నిర్విశేషుండగుభగవంతునిచేష్టావిశేషంబు దేనివలననుత్పన్నంబగునదియకాలంబని చెప్పంబడునదియుజీవరాశ్యంతర్గతంబగుటంజేసి, పురుషుండనియు, వానిబహిర్భాగవ్యాప్తింజేసికాలంబనియుఁ, జెప్పంబడు, నాత్మమాయంజేసితత్వాంతర్గతుండైనజీవునివలనక్షుభితంబై, జగత్కారణంబగుప్రకృతియందుఁబరమపురుషుండుదనవీర్యంబు వెట్టిన, నాప్రకృతిహిరణ్మయంబైనమహత్తత్వంబుపుట్టించె, నంతసకలప్రపంచబీజభూతుండు, లయవిక్షేపశూన్యుండునగునీశ్వరుండుసూక్ష్మరూపంబున, నాత్మగతంబయిన, మహదాదిప్రపంచంబులవెలింగింపుచుస్వతేజోవిపత్తింజేసి, యాత్మప్రస్వాపనంబు సేయునట్టితమంబును గ్రసించెనని చెప్పి వెండియునిట్లనియె.

క॥ దివ్యమగువాసుదేవా। దివ్యూహచతుష్టయంబు ద్రిజగములందు। సేవ్యంబని చెప్పంబడు। భవ్యగుణాదాని నెఱుఁగఁ బలికెదనీకున్॥ సీ॥ సత్వప్రధానమైస్వచ్ఛమైశాంతమై ✲యూర్మిషట్కంబులనోసరించి। సురుచిర †షాడ్గుణ్యపరిపూర్ణమైనిత్యమైభక్తజనసేవ్యమైతనర్చి। వలనొప్పుచుండునవ్వాసుదేవవ్యూహమంతమహత్తత్వమందునోలి। రూఢిఁ గ్రియాశక్తి

---

*తగులము। మోహము— ‡విశ్వతోముఖుని। అంతటనిండియున్నవాని— ఀభవనీరధి। పాపసముద్రము— §ప్రధాన। మాయ— ¶గ్రంథి। ముడి— ‖అనాది। జననములేనిది॥ పురుషుండు। పురిశరీరే శేతఇతిపురుషః- పురమనఁగా శరీరము- అందుండువాఁడు గావున- పురుషుఁడు— §తిరోధాన। అంతర్ధానము— ✠క్రియమాణంబులు। చేయఁదగినవి— ✿పారతంత్ర్యంబు। అస్వాతంత్ర్యము— ✲ఊర్మిషట్కంబులనోసరించి। అశన, పిపాస, శోక, మోహ, జరా, మరణములనంటనిదై— †షాడ్గుణ్య। సర్వజ్ఞత్వ, సర్వేశ్వరత్వ, సర్వాంతర్యామిత్వ, సర్వస్రష్టృత్వ, సర్వపాలకత్వ, సర్వసంహారకత్వములను ఆరుగుణములచేత.

రూపంబుగల్గునహంకారముత్పన్నమయ్యె నదియు। సరవి వైకారికంబు దైజసము దామసంబు నా మూఁడు తెఱంగులజరు
గునంత। దనరు వైకారికాంశములు మానసేంద్రియములకును గగనముఖభూతములకు రయ॥ వ॥ ఉత్పత్తిస్థానంబై యుండు మఱి
యు॥ సీ॥ అట్టియహంకారమందధిష్ఠించి సాహస్రఫణామండలాభిరాముఁ డై తనరారు ననంతుఁడు సంకర్షణుండనఁదగుపు
రుషుండు ఘనుఁడు। మహితభూతేంద్రియమానసమయుఁడు నై కర్తృత్వకరణత్వకార్యములును। బ్రకటశాంతత్వఘోర
త్వమూఢత్వాదిలక్షణలక్షితోల్లాసియగుచు నుండు నమ్మేటి రెండవ వ్యూహ మనఁగ। ఘనవికారంబుఁ బొందు వైకారికంబు
వలన వినుము మనస్తత్త్వమెలమిఁ బుట్టె। మఱియు వైకారికంబును మాతవినుము॥ వ॥ అదియెట్టులం టేని, సామాన్యచింతయు
విశేషచింతయు, ననంధగుసంకల్పవికల్పంబులం జేసి కామసంభవము నంబడు నెద్దియనిరుద్ధాఖ్యంబైన వ్యూహంబునదియ
*హృషీకంబులకు నధీశ్వరంబై సకలయోగీంద్రసేవ్యంబగుచు శరదిందీవరశ్యామంబై యుండు, వెండియుం దైజసంబువ
లన బుద్ధితత్త్వంబు వుట్టె దానిలక్షణంబులు ద్రవ్యప్రకాశంబైన జ్ఞానంబు నింద్రియానుగ్రహంబు సంశయంబు మిథ్యా
జ్ఞానంబు, నిద్రయు, నిశ్చయంబు, స్మృతియు, ననం దగియుండు- తైజసాహంకారంబువలన, జ్ఞానేంద్రియకర్మేంద్రియంబు
లుఁ, గ్రియాజ్ఞానసాధనంబులుఁ గలిగియుండుఁ- బ్రాణంబునకుం గ్రియాశక్తియు, బుద్ధికి జ్ఞానశక్తియు, నగుటం జేసి, యిం
ద్రియంబులకు దైజసత్వంబు గలిగియుండు, భగవచ్ఛక్తిప్రేరితంబైన దామసాహంకారంబువలన శబ్దతన్మాత్రంబు వుట్టె
దానివలన నాకాశంబు, నాకాశంబువలన శ్రోత్రేంద్రియంబు వుట్టె శ్రోత్రంబు శబ్దగ్రాహియయ్యె శబ్దంబర్థంబునకు నా
శ్రయంబై శ్రోతకు జ్ఞానజనకంబయ్యె, మఱియు నభస్తన్మాత్రంబు సూక్ష్మాకాశంబ యాయయాకాశంబు భూతంబులకు
బాహ్యాభ్యంతరంబులన వకాశంబిచ్చుటయు, నాత్మప్రాణేంద్రియాదులకు నాశ్రయంబగుటయు, ననులక్షణంబులు గలిగి
యుండుఁ, గాలగతిచే వికారంబు నొందు శబ్దతన్మాత్రలక్షణంబగు నభంబువలన స్పర్శంబు, స్పర్శంబువలన వాయువు, వా
యువుచే స్పర్శగ్రాహియైన త్వగింద్రియంబు వుట్టె, మృదుత్వంబు, కఠినత్వంబు, శైత్యంబు, నుష్ణత్వంబు, ననునవి స్పర్శంబు
నకు స్పర్శత్వంబని చెప్పంబడు, మఱియు వాయువునకుఁ §చాలనంబు, పరస్పరవిభాగకరణంబు, సమ్మేళనంబు, ద్రవ్యశబ్దనే
తృత్వంబు, నంము గంధవంతంబగు ద్రవ్యంబును, ఘ్రాణేంద్రియంబు నొందించుట ద్రవ్యనేతృత్వంబు, దూరస్థంబగు శబ్దంబు
ను, శ్రోత్రేంద్రియగ్రాహ్యము గునట్లొనరించుట, శబ్దనేతృత్వంబు, సర్వేంద్రియాత్మకత్వంబు ననునవి లక్షణంబులై యుం
డు, దైవప్రేరితంబై స్పర్శతన్మాత్రసుణకంబగు వాయువువలన రూపంబు, దానివలనఁ దేజంబు వుట్టె, రూపంబు నే
త్రేంద్రియగ్రాహకంబయ్యె, ద్రవ్యాకారసమత్వంబు ద్రవ్యంబునకు నుపసర్జనంబగుటయు, ద్రవ్యపరిణామప్రతీతి
యు నివి రూపవృత్తులనంబడుఁ దైజసంబునకు సాధారణంబులగు ధర్మంబులు, ద్యోతనంబన ప్రకాశంబు, పచనంబన దండు
లాదులపాకంబు, పిపాసానిమిత్తంబైన పానంబు, క్షున్నిమిత్తకంబైన ‡ఓదనంబు, హిమమర్దనంబగు శోషణంబు, న
నువృత్తులై యుండు రూపతన్మాత్రంబువలన దైవచోదితంబై వికారంబు నొందు తేజస్సువలన రసతన్మాత్రంబు వుట్టె రసత
న్మాత్రంబువలన జలంబు వుట్టె, జిహ్వ యనురసనేంద్రియంబు రసగ్రాహకంబయ్యె, నా రసంబు ‖కషాయతిక్తకట్వామ్లమ
ధురాది భేదంబులననేకవిధంబయ్యె, వెండియు సాంసర్గికద్రవ్యవికారంబునం జేసి, రసంబేకంబయ్యు నార్ద్రింబగుటయు,
ముద్దగట్టుటయు, తృప్తిదాతృత్వంబు, జీవనంబు, దప్పిశనివర్తనంబు, మృదూకరణంబు, తాపనివారణంబు, కూపగతంబయి
న జలంబు దివియ మఱియు నుద్గమించుటయు, నను నివి జలవృత్తులనంబడు, రసతన్మాత్రంబువలన దైవచోదితంబై వికారంబు
నుం బొందినజలంబువలన గంధతన్మాత్రంబు వుట్టె, దానివలనం బృథ్వియుఁ గలిగె ఘ్రాణంబు గంధగ్రాహకంబయ్యె నంము
నేకంబగు గంధంబు వ్యంజనాదిగతంబయి, ♣హింగ్వాదినిమిత్తంబయిన మిశ్రగంధంబను ¶కరంభంబు †గృంజనాదిగ
తంబయిన ?పూతిగంధంబు ‖ఘనసారాదినిమిత్తంబైన సుగంధంబు, ♠శతపత్త్రాదిగతంబగు శాంతగంధంబు, ♥లశునా
దిగతంబైన యుగ్రగంధంబు #పర్యుషితచిత్రాన్నాదిగతంబయిన యామ్లగంధంబు, ద్రవ్యావయవవైషమ్యంబునం జేసి
యనేకవిధంబై యుండు, నదియునుం గాక, ప్రతిమాదిరూపంబులం జేసి సాకారతాపాదనంబగు భావనంబు, జలాదివిలక్షణ
ద్రయాంతరనిరపేక్షంబయిన స్థితియు, జలాద్యాధారతయను, ధారణంబు, నాకాశాద్యవచ్ఛేదకత్వంబు, సకలప్రాణి

*హృషీకము। శ్రోత్రాదీంద్రియములు—§చాలనము। చలనము—‡ఓదనము। అన్నము—‖కషాయ। వగరు, తిక్త। చేఁదు, కటు। కారము, అమ్ల। పులుసు, మధుర। తీపు—♣హింగు। ఇంగువు—¶కరంభము। పెరుగుతోఁ దడిపిన అటుకులు మొదలైనవి—†గృంజనము। వెల్లుల్లి—?పూతిగంధము। దుర్గంధము—‖ఘనసార। పచ్చకర్పూరము—♠శతపత్త్ర। కమలము—♥లశున। ఎఱ్ఱవుల్లి— #పర్యుషిత। చలిది.

పుంస్త్వాభివ్యక్తీకరణంబు, ననునివిపృథ్వీవృత్తులనంబడుననిచెప్పి: వెండియు నిట్లనియె- నభోసాధారణగుణశబ్దవిశేషగ్రాహకంబు శ్రోత్రంబు, వాయ్వసాధారణగుణవిశేషగ్రాహకంబు స్పర్శనంబు, తేజోసాధారణగుణవిశేషగ్రాహకంబు చక్షురింద్రియంబు, నంభోసాధారణగుణవిశేషగ్రాహకంబు రసనేంద్రియంబు, భూమ్యసాధారణగుణవిశేషగ్రాహకంబు ఘ్రాణేంద్రియంబు నాకాశాదిగుణంబులగుచు, శబ్దాదికార్యంబులగు వాయ్వాదులందుఁ గారణాన్వయంబున నన్నిటికిం బృథ్వీసంబంధంబు గలుగుటం జేసి, భూమియందు శబ్దస్పర్శరూపరసగంధంబులు గలుగుట* మహదాదిపృథివ్యంతంబులగు నీయేడుతత్త్వంబులు, పరస్పరామిళితంబులై, భోగాయతనంబగు పురుషు నింగల్పింపన సమర్థంబులై యున్నం జూచి, కాలాదృష్టసత్త్వాదులం గూడి జగత్కారణుండు; త్రైగుణ్యవిశిష్టుండు, నశేషనియామకుండు, నిరంజనాకారుండు, నగు సర్వేశ్వరుం డందుఁ బ్రవేశింపనంత నన్యోన్యక్షుభితంబులై, మిళితంబులై నమహదాదులవలన నధిష్ఠాతృచేతనరహితంబగు నొకయండంబు పుట్టె నంత॥ సీ॥ గురుశక్తియా విరాట్పురుషుండు ప్రభవించె నట్టి విశేషాండమూర్తిఁ బొదివె। నంబ్వాదులావరణంబు నొక్కొక్కటి దశగుణితంబయి తవిలి యావ। రణములై యుండు నుగ్రమున లోకంబులకు ¶ మేలుకట్లు పోలికఁ దనర్చుఁ। బంకజోదరు నిరూపము విలసించు నులోలత జలములోఁ దేలుచున్న। హేమమయమైన యండంబులో మహాను। భావుఁ డభవుండు హరి దేవదేవుఁ డఖిల। జేత నారాయణుఁడు ప్రవేశించియపుడు। ‡ విష్ణుపదభేదనంబుగా వించియందు॥ సీ॥ కరమొప్పఁగా విరాట్పురుషుండు వెలుఁగొందు నా విరాట్పురుషుని యాననంబు। వలనను వాణియు వాణితో వహ్నియు నాసంబు వలనఁ బ్రాణములఁ గూడి। ఘ్రాణేంద్రియంబయ్యె ఘ్రాణంబు వలనను వాయువులును బ్రాణవాయువులును। నంచునక్షులు చక్షువందును సూర్యుండు నందభిధ్యానంబు సిద్ధిఁ జేయఁ। గర్ణములు జాతమయ్యెఁ దత్కర్ణసమితి। వలన శ్రోత్రేంద్రియంబు దిక్కులును గలిగెఁ। ద్వక్కు చేర్మశ్రు రోమవితానకములు। నోషధీవ్రాతమును భవమందె మఱియు॥ గీ॥ దానివలనను మేఢ్రంబు గానఁబడియెఁ। బరగ § రేతంబువలన నాపంబు పుట్టె। గుదమువలనన పానంబును దయమయ్యె। దానివలనను మృత్యువుదగఁ జనించె॥ క॥ కరములవలనను బలమును। నిరవుగ నా రెంటివలన నింద్రుఁడు పాదాం। బురుహంబులవలన గతియు। నరుదుగ నా రెంటివలన హరియునుఁ గలిగెన్॥ క॥ ఘననాడీపుంజము వల। ననురక్తము దానివలన నదులును జఠరం। బున నాకలియును దప్పియు। ననయము నా రెంటివలన నబ్ధులు పుట్టెన్॥ క॥ వినుహృదయము వలనను మన। మును మనమున నమహీనకిరుఁడు బుద్ధియుఁ జిత్తం। బున బ్రహ్మయు క్షేత్రజ్ఞుం। డును గలిగిరి యవ్విరాజుఁడున్ బురుషతన్॥ వ॥ మఱియు విరాట్పురుషునం దుదయించిన ‖ వ్యష్టిరూపంబులగు నాకాశాదిభూతంబులు। శబ్దంబు మొదలగు భూతతన్మాత్రంబులు, వాగాదీంద్రియజాతంబు, తదధిదేవతలును, తమంతన ‡ సమష్టిరూపుండగు క్షేత్రజ్ఞుం బ్రవృత్తిప్రవర్తకుం జేయన సమర్థంబులయ్యె నట్లు నిన దేవాధిష్ఠితంబులగు నింద్రియంబులు దాము వేర్వేఱ నయ్యీశ్వరుం బ్రవృత్త్యున్ముఖుం జేయ నోపకఁ గ్రమంబునం దత్తదధిష్ఠానములనొందెనందు నగ్ని వాగింద్రియంబుతోడ ముఖంబు నొంది ప్రవర్తించిన విరాట్కార్యంబగు వ్యష్టిశరీరజాతంబు నుత్పన్నంబయ్యె, నంత నాసయు ఘ్రాణేంద్రియంబుతోడ వాయువుం గూడిన నట్టిదియయ్యె నాదిత్యుండు చక్షురింద్రియంబుతోడ నేత్రంబుల నొందిన వృథాభూతంబయ్యె దిగ్దేవతాకంబగు కర్ణంబులు శ్రోత్రేంద్రియంబుతోఁ గూడిన విరాట్కార్యప్రేరణాయోగ్యంబయ్యె నోషధులు రోమంబులం ద్వగింద్రియంబు జెంద విఫలంబయ్యె నబ్దైవంబగు మేఢ్రంబు రేతంబు నొందినఁ దత్కార్యకరణాదక్షంబయ్యెఁ బవంపడిగుదంబు మృత్యువుతోఁ గనపానేంద్రియంబు జేరిననతి హైన్యంబు నొందె విష్ణుదేవతాకంబులగు చరణంబులు గతితోఁ గూడిన ననీశ్వరంబయ్యెఁ బాణీంద్రియంబు లింద్రదైవంబులగుచు బలంబు నొందిన శక్తిహీనంబులయ్యె మఱియు నాడులు సనదీకంబులై లోహితంబు నొందిన నిరర్థకంబులయ్యె నుదరంబు ♣ సింధువులతోడం జేరి క్షుత్పిపాసలం బొందిన వ్యర్థంబయ్యె హృదయంబు మనంబుతోడం జంద్రు నొందిన మారకయత్నుం డె బుద్ధి బ్రహ్మాధిదైవతంబై హృదయంబు నొందిన నిష్ఫలంబయ్యెఁ జిత్తం బభిమానంబుతో రుద్రుని జెందిన విరాట్కార్యజాతంబు సమ్యాఘాతంబయ్యె నంతం ‖‖ చైత్యుండగు క్షేత్రజ్ఞుండు హృదయాధిష్ఠానంబు నొంది చిత్తంబుతోడం బ్రవేశించిన విరాట్పురుషుండు సలిలకార్యభూతబ్ర

* మహ-ఏడుతత్త్వంబులు। మహత్తు। అహంకారము, పంచభూతములు— ¶ మేలుకట్లు। చందువా। చాందిని— ‡ విష్ణుపదము। ఆకాశము.... § రేతంబు। ఇంద్రియము, ఆపంబు। జలము... ‖ వ్యష్టి। ఏకము... ‡ సమష్టి। సమస్తము. ♣ సింధువు। సముద్రము... ‖‖ చైత్యుండగు క్షేత్రజ్ఞుండు-చిత్తవృత్తిసహితుఁడైన జీవుఁడు-పృథివ్యాదిపంచభూతములు-అహంకారము, బుద్ధి, మాయ, జ్ఞానేంద్రియపంచకము, కర్మేంద్రియపంచకము, వీనికధిష్ఠానమైన మనస్సు, శబ్దాదిపంచవిషయములు, కోరిక, ద్వేషము, సుఖదుఃఖములు, దేహేంద్రియాదివృత్తులు, ఈసముదాయమునకు క్షేత్రమని పేరు. దీని నెఱిఁగినవాఁడు క్షేత్రజ్ఞుఁడు. లేక-క్షేత్రమనఁగా శరీరము-దాని నెఱిఁగెడువాఁడని చెప్పవచ్చును.

ప్రవాహఁగలలఁబొందుననర్థకముల్ప్రబోధమున్।దరయఁగమిథ్యలై పురుషునందుఘటింపనికై వడిఁగన్నరే।ఈశ్వరునకునాత్మ నాథునకుసర్వశరీరికిఁగర్మసాక్షికి।న్బరువడిఁబొంద వెన్నటికిఁబ్రాకృతదోషములంగ నామునీ ॥అని వెండియు నిట్లనియె॥ సీ॥అధ్యాత్మతత్పరుండగువాఁడు పెక్కు జన్మంబులఁబెక్కు కాలంబు లందు।బ్రహ్మపదప్రాప్తిపర్యంతమునుబుట్టుసర్వార్థవైరాగ్యశాలియగుచుఁ।బూనినాభక్తులచేనుపదేశింపఁబడిన*విజ్ఞానసంపత్తిచేతఁ।బరగఁబ్రబుద్ధుఁడై బహువారములుభూరిమత్ప్రసాదప్రాప్తిమతిఁదనర్చు।నిజపరిజ్ఞానవిచ్ఛిన్ననిఖిలసంశ।యుండునిర్ముక్త †లింగ దేహుండునగుచు।ననఘయోగీంద్రహృద్గేయమగుమదీయ। దివ్యధామంబునొందుసందీప్తుఁడగుచు॥ వ॥మఱియు ననిమాద్యష్టైశ్వర్యంబులు మోక్షంబునకంతరాయంబులుగావున వానియందువిగతసంగుండు మదీయచరణసరోజస్థితలలితాంతరంగుండునగు వాఁడుమృత్యుదేవతనపహసించి మోక్షంబు నొందు ననిచెప్పి వెండియుయోగలక్షణప్రకారంబువినిపింతువినుమని భగవంతుండయినకపిలుండు నృపాత్మజకిట్లనియె॥క॥ ధీనిధు లయ్యును యోగవిధానంబునఁ జేసి మనముదగవిమలంబై। మానితమగుసత్పదము౯।బూనుమరాయోగధర్మముల నెఱిఁగింతు౯॥ వ॥అదియెట్లనిన శక్తికొలఁదిస్వధర్మాచరణంబు శాస్త్రనాగతంబులవినిషిద్ధధర్మకర్మంబులుమానుటయు దైవికంబై వచ్చినయర్థంబువలన సంతోషించుటయు మహాభాగవతశ్రీపాదారవిందార్చనంబు గ్రామ్యధర్మనివృత్తియు మోక్షధర్మంబులయందు రతియుమితంబై శుద్ధంబైనయాహారసేవయు విజనంబై నిర్బాధకంబయినస్థానంబుననుండుటయు హింసారాహిత్యంబు సత్యంబు నస్తేయంబు దనకెంతయర్థంబు ప్రయోగించునంతయర్థంబ స్వీకరించుటయు బ్రహ్మచర్యంబుఁదపశ్శౌచంబులుస్వాధ్యాయపఠనంబుఁబరమపురుషుండయిన సర్వేశ్వరునియర్చనంబు మౌనంబు నాసనజయంబునుం జేసి స్థైర్యంబుఁ బ్రాణవాయుస్వవశీకరణంబు నింద్రియనిగ్రహరూపంబైన ప్రత్యాహారంబు మనంబు చే నింద్రియంబులవిషయంబులవలన మరలించి హృదయమందు నిలుపుటయు దేహగతంబయినమూలాధారాదిస్థానంబులలోనొక్కస్థానంబునందు హృదయగతంబయినమనస్సుతోడంగూడఁ బ్రాణధారణంబు వైకుంఠుండయిన సర్వేశ్వరుండు ప్రవర్తించినదివ్యలీలాచరిత్రధ్యానంబు మానసైకాగ్రకరణంబుఁ బరమాత్మయగుపద్మనాభునిసమానాకారతయునిదియునుంగాక శక్తిసవ్రతదానాదులం జేసి మనోముక్తుండైన యసన్మార్గంబును బరిహరించి జితప్రాణుండై మెల్లన యోజించి శుచియైన దేశంబునం బ్రతిష్ఠించి విజితాసనుండై యభ్యస్తకుశాజినచేలోత్తరాసనంబునయిన యాసనంబు చేసి ఋజుకాయుండై ప్రాణమార్గంబును గుంభకరేచకపూరకంబులం గోశశోధనంబు చేసి కుంభకపూరకంబులచేతం బ్రతికూలంబుగావించి చంచలంబయిన చిత్తంబు సుస్థిరంబుగావించి తీవ్రంబయిన యనుంబునం బ్రతప్తంబై విగతసమస్తదోషంబగు ‡చామీకరంబుకరణి విరజంబు చేసి జితమారుతుండగు యోగికిం గ్రమ్మఱం బ్రాణాయామంబులను పావకుని చేత వాతపైత్యశ్లేష్మంబులను దోషంబులభస్మీకరణంబులు చేసి ధారణంబు చేఁ గిల్బిషంబులను బ్రత్యాహారంబు చేత సంసర్గంబులను రాగంబుల దహనంబుఁ జేసిన ధ్యానాదిగుణంబులను నివారించి విష్వానాసాగ్రావలోకనంబు చేయుచు ॥ సీ ॥ దరదరవిందసుందరపత్రసుదిరాక్షుసలలితశ్రీవత్సకలితవక్షు। నీలనీరదనీలనీలోత్పలశ్యాముని లిసులాకులమాలికాభిరాము। కౌస్తుభకలితనుత్తాహారయుతకంఠు యోగిమానసపంకజోపకంఠు । సతతప్రసన్నసస్మితవదనాంభోజు దినకరకోటిసందీప్తతేజు। సలలితానర్ఘ్యరత్నకుండలకిరీటు। హారకంకణకటకకేయూరముద్రి।కాతులాకోటిభూషాభక్తప్రపోషుఁ। గింకిణీయుతమేఖలాకీర్ణజఘను ॥ మఱియు ॥ సీ॥ కంజాతకింజల్కపుంజరంజితపీతకౌశేయ వాసుజగన్నివాసు। శత్రుభీకరచక్రశంఖగదాపద్మవిహితచతుర్బాహువిగతమోహు । నుతభక్తలోకమనోనేత్రవర్ధిష్ణులాలితసద్గుణాలంకరిష్ణు । వరకుమారకవయః పరిపాకుసుశ్లోకుసుందరాకారుయశోవిహాసు।సకలలోకనమస్కృతచరణకమలు।భక్తలోకపరిగ్రహప్రకటశీలు।||దర్శనీయమనోరథదాయిఁగీర్తనీయతీర్థయశోమహనీయమూర్తి॥వెండియు॥క॥అనుపమగుణసంపూర్ణుని। ననఘునిసుస్థితునిగతునినాసీను¶శయానునిభక్తహృద్గుహా

*విజ్ఞాన।అనుభవజన్యజ్ఞానము— †లింగదేహము।శ్లో॥పంచప్రాణమనోబుద్ధిదశేంద్రియసమన్వితం।అపంచీకృతభూతోత్థంసూక్ష్మాంగం భోగసాధనం॥అనఁగా-ఊపిరియను పేరుగలయొక ప్రాణమే- ప్రాణమని, అపానమని, వ్యానమని, ఉదానమని, సమానమని, చెప్పఁబడిన అయిదింటితోడను, సంశయాత్మకమైనమనసుతోడను, నిశ్చయాత్మకమైనబుద్ధితోడను, త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణవాక్పాణిపాదపాయూపస్థలను పదియింద్రియములతోడనుకూడుకొని-ఐదేశిగాఁబంచఁబడనిసూక్ష్మభూతములవలనఁబుట్టి, సుఖదుఃఖానుభవములకుఁగారణమయినదే లింగశరీరము. దానికే సూక్ష్మశరీరమని పేరు. — ‡చామీకరము।బంగారు— §దరదరవింద॥దరత్।కొంచెము వికసించిన, అరవింద।తామరపూల యొక్క— ||దర్శనీయమనోరథదాయి।సేవించెడివారలయొక్క-కోరికలనిచ్చువాఁడా— ¶శయానుని।పరుండియున్నవాని.

శయు। న్మునిసర్వేశ్వరు ననంతు నుత్తమచరితున్॥ వ॥ విమలంబై పరిశుద్ధమైతగు మనోవిజ్ఞానతత్త్వప్రబోధమతి న్నిల్పి తదీయమూర్తివిభవధ్యానంబు గావించి చిత్తము సర్వాంగవిమర్శనక్రియలకు*న్దార్కొల్పి ప్రత్యంగము న్మహాధ్యానము సేయఁగావలయుఁ బోశుద్ధాంతరంగంబునన్॥ అది యెట్టి దనిన॥ సీ॥ హలకులిశాంకుశ జలజధ్వజచ్ఛత్ర లాలితలక్షణలక్షితములు। సలలితనఖచంద్రచంద్రికానిర్ధూతభక్తమానసతమఃపటలములును। సురుచిరాంగుష్ఠశశినిష్ఠ్యూతగంగాతీర్థమండితహరజటామండలములు। నందితధ్యానపారాయణజనభూరికలుషపర్వతదీప్తకులిశములును। దాసలోకమనోరథదాయకములు। చారుయోగిమనఃపద్మషట్పదంబు। లనఁగఁ దనరిన హరిచరణాబ్జములను। నిరుపమధ్యానమున మదినిలుపవలయు॥ చ॥ కమలజుమాతయైన సురనికాయసమంచితసేవ్యమానయై। కమలదళాభనేత్రములుగల్గి హృదీశ్వరభక్తి నొప్పునకమలనిజాంకపీఠమునఁ గైకొని యొత్తు పరేశుజానుయు। గ్మము హృదయారవిందమున మక్కువఁ జేర్చి భజింపఁగాఁదగున్॥ ఉ॥ చారుపిశంగవల్లభుభుజంబులమీఁద విరాజమాన సు। శ్రీరుచి నుల్లసిల్లి యతసీకుసుమద్యుతిఁ జాల నొప్పపం। కేరుహనాభు మాసపు బలకిల్బిషభక్తిభజించి మానసాం। భోరుహమందు నిల్పఁదగుఁ బో మునికోటికి నంగనామణీ॥ క॥ పరిలంబితస్ఫుమపీతాం। బరకాంచీగుణకనాదభరితంబగున। ప్పరమోత్తమునితంబముఁ। దరుణీ భజియింపవలయుఁ దద్దయు శ్రీతిన్॥ క॥ విను భువనాధారత్వం। బునఁ దగి విధిజననహేతుభూతంబగున। వ్వనజాతము చేఁగడుమిం। చిన హరి నాభీసరస్సు జింతింపఁదగున్॥ గీ॥ దివ్యమరకతరత్నసందీప్తలలిత। కుచములను ముక్తికావళిరుచుల నరి। యిందిరాదేవి సదనమై యొసకమెసఁగు। వక్షమాత్మ లంకలపోయవలయుఁ జుమ్ము॥ మ॥ నిరతంబు న్భజియించు సజ్జనమనోనేత్రాభిరామైకసుస్థిరదివ్యప్రభఁ గల్గు కౌస్తుభరుచి విస్పష్టంబునై యొప్పు నా। పరయోగీశ్వరవంద్యమానుఁడగు సర్వస్వామి లక్ష్మీశు *శ్రీకం। ధరమాత్మన్గదియించి తన్గుణగణధ్యానంబు సేయం దగున్॥ క॥ ఘనమందరగిరిపరివ। ర్తననికషోజ్జ్వలితకనకరత్నాంగదము। ల్దనరన దిగ్లోకపాలకులను గలిగిన బాహుశాఖలను దలఁపఁదగున్॥ వ॥ మఱియు ననతజనాసహ్యంబులైన సహస్రారంబులు గలుగు సుదర్శనంబును సరసిజోదరకరసరోరుహంబందు రాజహంసరుచిరంబైన పాంచజన్యంబును రాతిభటశోణితకర్దమలిప్తాంగంబై భగవత్ప్రీతికారిణియగు*కౌమోదకియు నరవిందనందనాదిబృందారకబృందామందానందకంబగు నందకంబును మర్త్యాదస్పృహణీయరోపంబగు చాపంబును బంధురసుగంధగంధానుబంధమందగంధవహోహూయమానపుష్పంధయఝుంకారనినదవిరాజితవైజయంతీవనమాలికయును జీవతత్త్వంబైన*కౌస్తుభమణియును బ్రత్యేకంబ ధ్యానంబు సేయం దగు వెండియు భక్తసంరక్షణార్థంబంగీకరించు దివ్యమంగళవిగ్రహంబునకనురూపంబైన యాననంబును మకరకుండలమణినిచయమండితసుసరోపమాననిర్మలగండమండలంబును సనాతశ్రీనివాసంబులైన లోచనపంకజంబులను లాలితభ్రూలతాజుష్టంబు మధుకరసమానరుచిచికురవిరాజితంబునైన ముఖకమలంబును రమణీయహీరమణిఖచితంబై మధ్యందినవిద్యోతమానఖద్యోతమండలఛవిఘటాప్రకటంబగు ముకుటంబును ధ్యానంబు గావింపవలయు మఱియు శరణాగతులకభయప్రదంబులగుచు నెగడు పాణిపంకేరుహంబులు మానంబునఁ దలఁపవలయు॥ క॥ గురుఘోరరూపకములై। బరగెడు తాపత్రయోపశమనార్థము శ్రీహరిచేత నిసృష్టములగు। కరుణాలోకములఁ దలఁపఁగాఁదగు బుద్ధిన్॥ క॥ ఘనరుచిగలమందస్మిత। మునకనుగుణమగు ప్రసాదమునుఁ జిత్తములో। నునిచి ధ్యానము సేయం। జను యోగిజనాళికెపుడు సౌజన్యనిధీ॥ గీ॥ ప్రణతశిరులైనట్టి భూజనముల। శోక బాష్పాంబుజలధిసంశోషకంబు। నత్యుదారతమము హరిహాస మెపుడు। దలఁపఁగవలయు నాత్మలోఁ దవిలి వినుము॥ సీ॥ మునులకు మకరకేతనునకు మోహనంబైన స్వకీయమాయావిలాస। మునరచితంబైన భ్రూమండలంబును మునిమనఃసుహరసంనర్ధమానుఁడగు నీశ్వరుని మందహాసంబున నపల్లవాధరకాంతిచేనరుణమైన। మొల్లమొగ్గలకాంతి నుల్లసంబాడెడు దంతపఙ్క్తియు మదిఁ దలఁపవలయు। వెలయ నీరీతి నన్నియు వేఱు వేఱ। నంచితధ్యాననిర్మలస్థానములుగ। మునుమ లోఁగనుమని చెప్పి మఱియుఁ బలికె। దేవహూతికిఁ గపిలుండు దేటపడఁగ॥ సీ॥ ఈప్రకారమున సర్వేశ్వరునందు బ్రతిలబ్ధభావసంపన్నుఁడగుచుఁ జిరతరసద్భక్తిచే బ్రవృద్ధంబయిన యతిమోదమునఁ బులకితశరీరుఁ డగుచు మహోత్కంఠ నానందబాష్పముల్జడిగొనఁ బరితోషజలధిఁ గ్రుంకి। భగవత్స్వరూపమై భవగుణగ్రాహకమగుచు మత్సంబంధమనుకరించి। సుమహితధ్యానమునఁ బరం

* తార్కొల్పి। పొందించి — శశినిష్ఠ్యూత। బయలు దేరిన — * కంధరము। కంఠము — * కౌమోదకి। కుం భూమిం మోదయతీతి హర్షయతీతి కుమోదకో విష్ణుః-తస్యేయం కౌమోదకీ-అనఁగా భూమిని సంతోషింపఁ జేయు విష్ణుసంబంధమయినది-అనఁగా-గద. — * కౌస్తుభ। కుంస్తుభ్నాతి వ్యాప్నోతీతి కుస్తుభస్సముద్రః-తత్ర భవతీతి కౌస్తుభః-అని వ్యుత్పత్తి-సముద్రమునందుద్భవించినదని యర్థము.

జ్యోతియందు। మనమున్ జాలని యోజించి మహిమఁ దనరు। మోక్షపదమాత్మలోన నపేక్ష సేయు। ననఘవర్తనుఁడయిన మహాత్ముఁ డెపుడు॥ వ॥ అది గావున ముక్తి నపేక్షించు మహాత్ముండగు వాని చిత్తంబు విముక్తంబయిన భగవద్వ్యతిరిక్తాశ్రయంబు గానిగి విషయాంతరశూన్యంబై విరక్తిం బొందుటం జేసి పురుషుండు శరీరభావంబుల ననన్యభావంబగు *నిర్వాణపదంబు సూక్ష్మంబగు తేజంబునకంటె నధికంబగు తేజంబుతోడి సమానాకారంబున గు చందంబున నిశ్చయించు వెండియు॥ సీ॥ పురుషుండు చరమమై భువియయ్యవిషయనివృత్తమై తగనివర్తించు చిత్త। వృత్త్యాదులును గల్గి వెలయంగ నాత్మీయమగు మహిమను నిష్ఠుఁడై లభించు। సుఖదుఃఖములనునస్సనదలంపక యహంకారధర్మంబులు గాఁదలంచి। యనయంబు సాక్షాత్కృతాత్మతత్త్వముగల్గు నతఁడు జీవన్ముక్తుఁ డండ్రు నీను। బ్రతఁడు నే చందమున నుండు ననిన వినుము। తనశరీరంబు నిలుచుటయును జరించుట। యును గూర్చుండుటయు నని కేమియు నెఱుంగఁ। కర్థి వర్తించు మదిను తల్లి యతఁడు మఱియు॥ వ॥ మదిరాపానంబునం జేసి మత్తుండగు వాఁడు తనకుఁ †బరిధానంబగు నంబరంబు మఱచి వర్తించు చందంబునఁ దనశరీరంబు దైవాధీనంబున ‡నశ్వరంబని తలంచి యాత్మతత్త్వనిష్ఠుండై యుపేక్షించు నదియునుం గాక సమాధియోగంబునం జేసి సాక్షాత్కృతాత్మతత్త్వంబుగలవాఁడై స్వాప్నికశరీరంబు చందంబున యావత్కర్మఫలానుభవపర్యంతంబు పుత్త్రదారసమేతంబగు ప్రపంచంబున ననుభవించి యట మీఁదఁ బుత్త్రదారాదిసంబంధంబు వలనం బాసి వర్తించు॥ సీ॥ సుతదారమిత్త్రానుజులకంటె మర్త్యుండు భిన్నుఁడై వర్తించుచున్న రీతి। ¶విస్ఫులిఙ్గోల్ముకవిపులధూమముల చే హవ్యవాహనుఁడు వేఱయిన రీతి। వలనొప్ప దేహంబు వలన నీజీవాత్మ పరికింప భిన్నరూపమున నుండుఁ। దవిలి భూతేంద్రియాంతఃకరణంబుల భాసిల్లుచున్న యా ప్రకృతిరూప। బ్రహ్మమున కాత్మ దా బృహద్భావమగుచు। §ద్రష్టయగు బ్రహ్మసంజ్ఞ చేఁ దనరుచుండు। నఖిలభూతప్రపంచంబులందుఁ దన్నుఁ। దవిలి తనయందు నఖిలభూతములఁ గనుచు॥ వెండియు॥ సీ॥ వరుస ననన్యభావంబులఁ జేసి భూతావళియందుఁ దదాత్మకత్వమునఁ జూచు నాత్మీయఘనతరోపాదానములయందుఁ దవిలి యిమ్ముల వెలుంగు। నిట్టి దివ్యజ్యోతి యేకమయ్యును బహుభావంబులను దోఁచుఁ బ్రకృతిగతుండు। నగుచున్న యాత్మయుఁ బొగడొందు దేవతిర్యఙ్మనుష్యస్థావరాదివివిధ। యోనులను భిన్నభావంబు నొందుటయును। జాలఁ గల్గు నిజగుణవైషమ్యమునను। భిన్నుఁడై వెల్గుఁ గావునఁ బేర్చి యదియు। దేహసంబంధి యగుచు వర్తింపుచుండు॥ క॥ భావింపసదసదాత్మక। మై వెలయుచు మఱి విభావ్యమగుచు స్వకీయం। బై వర్తింపుచుఁ బ్రకృతిని।

## శ్రీ కపిలుండు దేవహూతికి భక్తియోగమును దెలియఁ జేయుట.

భావమునఁ దిరస్కరించు భవ్యస్ఫూర్తిన్॥ వ॥ ఈ యాత్మ నిజస్వరూపంబునం జేసి వర్తించు నని కపిలుండు దెలియంగించిన విని దేవహూతి వెండియు నిట్లనియె మహాత్మా మహదాదిభూతంబులకుం బ్రకృతిపురుషులకుం గలిగిన పరస్పరలక్షణంబులను దదీయస్వరూపంబుల నెఱింగించితివి యింక నే ప్రకారంబున సాంఖ్యంబునందు నిరూపింపంబడు నట్టి ప్రకారంబును భక్తియోగమాహాత్మ్యంబును బురుషుండు భక్తియోగంబునం జేసి సర్వలోకవిరక్తుండగు నట్టి యోగంబును బ్రాణిలోకంబునకు సంసారం బనేకవిధంబులై యుండుఁ గావునఁ బరాపరుండవై కాలస్వరూపివైన నీ స్వరూపంబు నే నీ వలన నిర్భయంబునం జేసి జనులు పుణ్యకర్మంబులు సేయుదురు మిథ్యాభూతంబైన దేహంబునందు నాత్మాభిమానంబు సేయుచు మూఢుండై కర్మంబులందు నాసక్తంబైన బుద్ధిం జేసి విభ్రాంతుండగుచు సంసారస్వరూపంబగు మహాంధకారంబునం దుఁ జిరకాలప్రసుప్తుండైన జనుని బ్రబోధించుకొఱకు యోగభాస్కరుండవయి యావిర్భవించిన పుణ్యాత్ముండవు గావున నాకు నిన్నియుం దెలియ సవిస్తరంబుగా నానతిమ్మనిన దేవహూతికిఁ గపిలుం డిట్లనియె॥ క॥ నలినాయతాక్షి వినుజనములఫలసంకల్పభేదమునఁ జేసి మదీ। యగు భక్తియోగమహిమం। బలవడఁ గనేకవిధములఁ దగు నవియున్॥ వ॥ వివరించెదఁ దామసరాజససాత్త్వికాదిభేదంబులం ద్రివిధంబై యుండు నందు దామసప్రకారం బెట్టి దనిన॥ గీ॥ సతతహింసాతిదంభమాత్సర్యరోష। తమములనుఁ జేయుచును భేదదర్శియగుచుఁ। బరగ నాయందుఁ గావించు భక్తి వలనఁ। దామసం బనఁదగు వాఁడు దామసుండు॥ క॥ ఘనవిషయప్రావీణ్యములను మహదైశ్వర్యయశములను బూజాద్యర్థా। నిననునర్చి భజించుట। చను రాజసయోగ మనఁగ సౌజన్యనిధీ॥ చ॥ అనుపమపాపకర్మపరిహారకుఁడై భజనీయుఁడైన శోభనచరితుండితండనుచు భావమునందలపోసి భక్తిచే। ననితరయోగ్యతన్ భగవదర్పణబుద్ధి నొనర్చి కర్మముల్ జనహితకారివై నెగడు సాత్త్వికయోగ మనంగఁ జొప్పడున్॥ చ॥ మనుసుత మద్గుణశ్రవణమాత్రలభిం

*నిర్వాణపదం। మోక్షస్థానము — †పరిధానము। కట్టుపుట్టము — ‡నశ్వరము। నశించునది — ¶విస్ఫులింగ। మిడుఁగురులచేత-ఉల్ముక। కొఱవిచేత-విపులధూమములచేన్। మిక్కుటములైన పొగలచేత-హవ్యవాహనుఁడు। అగ్నిహోత్రుఁడు. — §ద్రష్ట। సాక్షి.

చినయట్టిభక్తిచే। ననఘుఁడసర్వశోభనగుణాశ్రయుఁడన్పరమేశ్వరుండనై।తనరిననన్నుఁజెందినయుదాత్తమనోగతు
లవ్యయంబులై।*వననిధిగామియైనసురవాహినిఁబోలిఫలించునిమ్ములన్.క॥హేయగుణరహితుఁడనఁగల।నాయందలిభ
క్తిలక్షణముఁదెలిపితిన। న్వాయకనిర్హేతుకముగఁ। జేయునుదీయవ్రతైకచిరతరభక్తిన్॥ వ॥నిష్కామములయినమదీయ
భక్తులకునట్టిభక్తియోగంబు ✠సాలోక్యసార్ష్టిసామీప్యసారూప్యసాయుజ్యంబులకుసాధనంబుగావున మహాత్ములగు
వారుదమమనోరథఫలదాయకంబులయినను మదీయసేవావిరహితంబులయిన యితరకర్మంబులనాచరింపనొల్లరుదీని
నాత్యంతికభక్తియోగంబని చెప్పుదురుసత్త్వరజస్తమోగుణవిహీనుఁడయిన జనుండుమత్స్వరూపంబుఁబొందునని చెప్పి
మఱియునిట్లనియె॥సీ॥నిత్యనైమిత్తికనిజధర్మమునగురుశ్రద్ధాగరిష్ఠతఁజతురపాంచరాత్రోక్తహరిసమారాధనక్రియ
లనునిష్కామనంబుననెఱిమదీయ।విగ్రహదర్శనవినుతిపూజావందనధ్యానసంశ్రవణములఁగర్మ। సంగిగాకుండుటసజ్జ
నప్రకరాభిమానంబునొందుటహీనులందుఁ।జాలననుకంపసేయుటసములయందు।మైత్రినెరపుటయమనియమక్రియా
దు।లైనయోగంబుచేతనాధ్యాత్మికాధి।భౌతికాదులఁదెలియుటపలుకుటయును॥మఱియును॥క॥హరిగుణమంగళకీర్తనప
రుఁడైతగ§నార్జవమున భగవత్పరుల।న్గరమనురక్తిభజించుట।నిరహంకారముననుంటనిశ్చలుఁడగుటన్॥క॥ఇవి మొదలు
గాఁగఁగలుగుభ। గవమద్దేశస్వధర్మకలితుండైపీ। నివలనఁబరిశుద్ధగతిం। దవిలినమదిగలుగుపుణ్యతముఁడెయ్యెడలన్॥
గీ॥సురుతరానేకకల్యాణగుణవిశిష్టుఁ।డనఁగనొప్పిననన్నుఁబొందనండఁగొనక।పవనవశమునఁబుష్పపరిమళంబు।ఘ్రాణ
ముననావరించినక్రరణిమెఱసి॥ చ॥అనిశముసర్వభూతహృదయాంబుజవర్తియనందనర్చునీ। శునమునవజ్ఞఁజేసిమనుజుం
డొగిమత్ప్రతిమార్చనావిడం।బనమునమూఢుఁడైయుచితభక్తినినన్నుభజింపఁడేనియ।మ్మనుజుఁడుభస్మకుండమునమాన
కవ్రేల్చినయట్టివాఁడగున్॥ సీ॥అజ్ఞాత్మనిఖిలభూతాంతరాత్ముఁడనైన నాయందుభూతగణంబునందు। నతిభేదదృష్టిమా
యావులైసతతంబుపాయకవైరానుబంధనిరతులగువారిమనములఁదగులనుశాంతియెన్నటికైననేను నాకుటిలజనులు।
మానకయెపుడుసామాన్యాధికద్రవ్యసమితిచేనుపచార్చనమొనర్ప। నర్థినాచిత్తమునమదంబందదుమందు।ననుచు నెఱిఁ
గించి మఱియునిట్లనియెఁగరుణఁ।గలితసద్గుణజటిలుఁడక్షమ పిలుఁడెలమిఁ।దల్లితోడగుణవతీమతల్లితోడ॥ సీ॥తరళాక్షివిను
మచేతనదేహములకంటెఁజేతనదేహముల్శ్రేష్ఠనందుఁ।ప్రాణవంతంబులైస్పర్శనజ్ఞానంబుగలుగుచైతన్యవృక్షములకం
టె।ఘన‡రసజ్ఞానసంకలితచేతనలుత్తములురసజ్ఞానంబుగలుగువాని।కంటె¶గంధజ్ఞానకలితభృంగంబులుగడుశ్రేష్ఠము
లువానికంటె†శబ్ద।వేదులగుచుండుశ్రేష్ఠమై వెలయుశబ్ద।వేదికంటెనుసద్రూపవేదులైన।వాయసాదులుశ్రేయములవ్వాని
కంటె।వరుస‖బహుపాదులుత్తములవ్వానికంటె॥క॥తలపఁజతుష్పదములధికులు।బలకొనిమఱివానికంటెఁబాదద్వయముం।
గలమనుజులలఘుతములి।మ్ములవారలయందువర్ణములునాల్గరయన్॥అందు॥సీ॥తలఁపబ్రాహ్మణులునుత్తములువారలకం
టెవేదవేత్తలువేదవిదులకంటె।విలసితవేదార్థవిదులువారలకంటెనమధికశాస్త్రసంశయములమాన్పు।◊మీమాంసకులు
మఱిమీమాంసకులకంటెనిజధర్మవిజ్ఞాననిపుణులరయ।వారికంటెనుసంగవర్జితచిత్తులుదగవారికంటెసద్ధర్మపరులు।ధా
ర్మికులకంటెనుత్తమోత్తములువినుము।మత్సమర్పితసకలధర్మస్వభావ।మహిమములుగల్గి యితరధర్మములు విడిచి।సమ
తవర్తించునప్పుణ్యతముఁడుఘనుఁడు॥అట్టివాని॥క॥కనిసకలభూతగణములు। మనమునవానందజలధిమగ్నములగుచున్।
ఘనబహుమానపురస్సర।మునయమువాటిల్లవినుతులర్థింజేయున్॥వ॥అంతనీశ్వరుండుజీవస్వరూపానుప్రవిష్టుండైయుం
డునట్టిభగవంతుం జూచిభక్తియోగంబుననైనయోగంబుననైనంబురుషుండు పరమాత్మఁబొందుఁబ్రకృతిపురుషాత్మ
కంబునుదవ్యతిరిక్తంబునయినదైవంబునైకర్మవిచేష్టితంబగుచునుండునదియభగవద్రూపంబిట్టిభగవద్రూపంబురూప
భేదాస్పదంబగుచునద్భుతప్రభావంబుగలకాలంబనియుఁజెప్పంబడునట్టికాలంబు⁂మహదాదితత్త్వంబులకుఁదత్త్వాభి
మానులగు జీవులకునుభయావహంబులగుటం జేసిసకలభూతంబులకునాశ్రయంబగుచు నంతర్గతంబై భూతంబులచేత

*వన-బోలి॥ వననిధిగామియైన।సముద్రమునుగూర్చి పోవుచున్న-సురవాహినిఁబోలి।గంగానదివలెను—— ✠సాలోక్యాదులు।పదవులు.
§ఆర్జవము।తిన్నదనము. ‡రసజ్ఞానసంకలితచేతనలు।రసజ్ఞానముగలమత్స్యాదులు——¶గంధజ్ఞాన।గంధజ్ఞానముగలతేనెటీగలుమొదలగునవి.
†శబ్దవేదులు।శబ్దవేదులయినతుమ్మెదలుమొదలైనవి——‖బహుపాదులు।అనేకపాదములుగలిగినసర్పములు——◊మీమాంసకులు।వేదాంతశా
స్త్రవిదులు నెఱిఁగినవారు——⁂మహదాది।బ్రహ్మణోరవ్యక్తః-అవ్యక్తాన్మహతః-మహతోహంకారః-అహంకారాత్పంచతన్మాత్రాణి- పంచత
న్మాత్రేభ్యోపంచమహాభూతాని-పంచమహాభూతేభ్యోఖిలంజగత్-అవ్యక్తమనఁగా-నానాజగన్నిర్మాణసామర్థ్యబుద్ధిరూపముచేతభాసమానమ
గుబ్రహ్మశక్తియైనప్రకృతియే - ఆప్రకృతివలనత్రిగుణగర్భమయినమహత్తత్త్వముజనించెను. శేషంబూహ్యంబు.

భూతంబుల గ్రసింపుచు యజ్ఞఫలప్రదాత గావున వశీకృత భూతుండై ప్రభుత్వంబు భజియించి విష్ణుండు ప్రకాశింపుచుం
డు నతనికి మిత్రుండు శత్రుండు బంధుండును లేఁడట్టి విష్ణుండు సకల జనంబులయందావేశించి యప్రమత్తుండై ప్రమత్తుల
యిన జనంబులకు సంహారకుండై యుండు నతని వలని భయంబున నంజేసి వాయువు వీఁచు సూర్యుండు దపియించు నింద్రుండు వ
ర్షించు నక్షత్రగణంబు వెలుంగుఁ జంద్రుండు ప్రకాశించుఁ దత్కాలంబుల వృక్షలతాదులోషధులతోడం గూడి పుష్పఫలభ
రితంబులగు సరిత్తులు ప్రవహించు సముద్రంబులు మేరలు దప్పక యుండు నగ్ని ప్రజ్వలించు భూమి గిరులతోఁ గూడఁ బరువునం
గ్రుంగ వెఱచు నాకాశంబు సకల జనంబులకు నవకాశంబిచ్చు మహత్తత్త్వంబు జగత్తునకు నంకురస్వరూపంబు గావున *సప్తా
వరణావృతంబగు లోకంబను స్వదేహంబు విస్తరింపంజేయు గుణాభిమానులగు బ్రహ్మేశులు సర్వేశ్వరుని చేత జగత్సర్గంబం
దు నియోగింపంబడి ప్రతి దినంబు నయ్యాయి సర్గంబు చేయ నప్రమత్తులై యుండుదురు పిత్రాదులు పుత్రోత్పత్తిఁ జేయుదు
రు కాలుండు మృత్యుసహాయుండై మారకుండై యుండుఁ జరాచరాత్మకంబగు సకల ప్రపంచంబు భగవదధీనంబయ్యుండు॥
క॥ మఱియిట్టి నిఖిలలోకేశ్వరుని పరాక్రమముఁ దెలియ సామర్థ్యంబెవ్వరికిని గలుగదు మేఘము ‡శిగరువలి విక్రమముఁ దెలి
యఁగాలేనిగతిన్॥ క॥ మగువా వినుసుఖహేతుక మగు నర్థము దొరకి మికిమహాదుఃఖమునం దగులుదురిది యెంతయు నా భ
గవంతుని యాజ్ఞఁ జేసి ప్రాణులు మఱియున్॥ సీ॥ ప్రాణియసత్యంబులయిన గృహక్షేత్ర పశుధన సుత వధూ బాంధవాది విపి
ధ వస్తువులను ధ్రువముగా మదినమ్మి వరలు దుర్మతియగు వాఁడు జంతుసంఘాతమగు దేహసంబంధమున నిల్చి యర్థి నెయ్యే
యోనులం దుఁ జొరఁగ ననుగమించును వానియందు విరక్తుండు గాకయుండు ననరకస్థుఁడైన దేహియాత్మీయ దేహంబుది
విరివడలేక తనకది పరమసౌఖ్యాకరంబు గాఁగ వర్తించు నదియునుగాక యతఁడు దేవమాయా విమోహితభావుఁడగు
చు॥ క॥ ఘనముగఁ బుత్ర వధూ పశు ధన గృహ రక్షణమునం దదత్తత్క్రియల నమ్మనమునఁ దలపోయుచు దిన దినముల్ దంద
హ్యమాన దేహుండగుచున్॥ క॥ అతిమూఢహృదయుఁడగుచును రితకర్మారంభమునఁ జరింపుచు ధరణిం గృతగోప్య భాష
ణములను సుతలాలన భాషణములఁ జొక్కుచు మఱియున్॥ క॥ వినుమింద్రియపరవశుఁడై మును కొని తత్కూటధర్మము
లుగల దుఃఖంబనయము సుఖరూపంబుగ మనమునఁ దలపోసి తదభిమానుండగుచున్॥ క॥ సతతము దమతమ సంపాదితమ
గు నర్థముల చేత వృత్తిఁ బరులకుఁ గుత్సితమతి హింసలు సేయుచు నతిమూఢమనస్కుఁడగుచు నాత్మజనముల్॥ గీ॥ ప్రాణి రక్షిం
పుచును వారి భుక్తశేష మనుభవింపుచు ననంత జీవనము దోప కడఁగి మఱి మఱియపరార్థ కాముఁడగుచు ¶సత్త్వమెడలి కు
టుంబపోషణమునందు॥ సీ॥ బలిమి చాలక మందభాగ్యుఁడై కుమతియై ప్రాణియవ్వడు క్రియాహీనుఁడగుచుఁ దపిలి వృథా ప్ర
యత్నంబులు సేయుచు మూఢుఁడై కార్పణ్యమునఁ జరించు నట్టి ‖యకించనుఁడగు వానిఁ జూచి తద్దారసుతాదులాత్మలను
వీఁడు గడు నశక్తుఁడు ప్రోవఁగాఁ జాలఁడితఁడని †యెగ్గింతురర్థిఁ §కృషీవలుండు బడుగు ముసలెద్దు రోసిన పగిదినంత నతఁ
డు నే వెంటలను సుఖంబందలేక తాను వోషించు జనులు దందనరి ప్రోవ బ్రతుకుముదిమియు మికిలి బాధపఱుప॥ క॥ ⁂వెడరూ
పుఁ దాల్చి బాంధవులు డలఁగ నిర్యాణమునకు నభిముఖుఁడై యిల్వెడలఁగఁజాలక శునకము వడువునఁ గుడుచుచును మేను వ
డవడవడఁ కన్॥ సీ॥ అతిరోగపీడితుండై మందమగు జఠరాగ్ని చే మిగుల నల్పాశియగుచు మెఱసి వాయువు చేత మీఁదికి నెగసిన
కన్నులు కఫమునఁ గప్పఁబడిన ◊నాళంబులును గంఠనాళంబున ఘురఘురమను శబ్దంబు దోరుఁగ బంధు జనుల మధ్యంబున
శయనించు బహువిధములఁ దన్ను బిలువఁగఁ బలుకలేక చటులతర కాలపాశవశంగతాత్ముఁ డగుచుఁ బిడ్డలఁ బెండ్లామునర
సి ప్రోచు చింతవికలములయిన హృషీకములును గలిగి విజ్ఞానము బాసి కష్టుఁడగుచు॥ వ॥ అంతమరణావస్థం బొందు సమ
యంబున నతిభయంకరాకారులు ⁑సరభసేక్షణులు నగు యమదూతలిద్దరు దన ముందఱ నిలిచినం జూచి ❀త్రస్తహృదయుం
డై ※శకృన్మూత్రంబులు విడుచుచు యమపాశంబుల చే గళంబున బద్ధుండై శరీరంబువలన నిర్గమించి యాతనా శరీరంబున వ
లంబించి బలాత్కారంబున దీర్ఘంబయి దుర్గమంబగు మార్గంబును బొంది రాజభటుల చే నీయమానుండగుచు దండనంబున
కభిముఖుండై చను నపరాధి చందంబునఁ జనుచుండి॥ చ॥ అనయము మూర్ఛనొందుచు శునకావలి చేతను భక్ష్యమాణుఁడై యన
నుపమ కాలకింకర భయంకర తర్జనగర్జనంబుల । న్మనమున గలంగ దేహము సమస్తముఁ గంపమునొందఁగాఁ బుఱా తనభవ

* సప్తావరణంబులు భూ, సలిల, తేజో, వాయు, గగన, అహంకార, మహత్తత్త్వములు — ‡శికరువలి వాయువు — ¶సత్త్వమెడలి బలము క్షీణిం
చి — ‖అకించనుఁడు బీదతనముగలవాఁడు — †ఎగ్గింతురు దూషింతురు — §కృషీవలుఁడు పైరుపెట్టువాఁడు — ⁂వెడరూపు వికారరూ
పము — ◊నాళము నరము — ⁑సరభసేక్షణులు కోపదృష్టులుగలవారు — ❀త్రస్త భయము — ※శకృత్ మలము.

పాపకర్మసముదాయముఁ జిత్తములోఁ దలంపుచున్॥ సీ॥ అనుపమ క్షుత్తృష్ణలం తవ్యథలఁ జేయ ఝంఝానిలజ్వలజ్వలన చండభాను ప్రదీప్తితప్తంబైన *వాలుకామార్గానుగత తప్యమానగాత్రుఁడై వీఁపుఁ గశలచే నడవంగ వికలాంగుఁడగుచు మార్గమునందున నచటనచటఁ జాల మూర్ఛిల్లి యాశ్రయశూన్యమగు నీళ్ల మునుగుచు లేచుచు మొనసి పాపరూపమగు తమములచే నిరూఢుఁడగుచు వెలయఁ దొంబదితొమ్మిది వేల యోజనముల దూరంబుగల యమనగరమునకుఁ బూని యమభటుల్గొంపోవఁ బోవునంత॥ వ॥ ఇట్లు మహాపాపాత్ముండైన వాఁడు ముహూర్తత్రయకాలంబునను సామాన్యదోషి యగు వాఁడు ద్విముహూర్తంబుల నేగి §యాతనం బొందునందు॥ క॥ పట్టుదురు కొఱవులను వడిఁ బెట్టుదు రసిపత్రికలను బెనుమంటలయం దొట్టుదురు రొడ్డలనలియ న్నట్టుదు రప్పాపచిత్తు నత్యంబెలుచన్॥ ఉ॥ ముంతురు తప్తతోయముల మొత్తుదు రుగ్రగదాసిధారలన్ ద్రెంతురు పొట్టప్రేవులు వధింతురు మీఁద నిభేంద్రపఙ్క్తితో ద్రొప్పింతురు ఘోరభంగిఁ గరపింతురు పాముల చేత బిట్టు ద్రొబ్బింతురు మీఁదఁ గుండ్లఁ దిసిపింతురు దేహముఁ గోసి కండలున్॥ వ॥ మఱియుఁ గుటుంబపోషణంబునకుఁ ‡కుటుంభరుండగుచు నధర్మపరుండై భూతద్రోహంబున నతిపాపుండై నిరయంబునుం బొంది నిజధనంబులు గోలుపడి మొఱవెట్టు నాపన్నుని చందంబునఁ బరస్పరసంబంధంబునఁ గల్పింపంబడిన తమిస్రాంధతామిస్ర రౌరవాదులగు నరకంబులం బడి తీవ్రంబులైన బహు §యాతనలననుభవించి క్షీణపాపుండై పునర్నరత్వంబునుం బొందునని చెప్పి వెండియు నిట్లని

## కపిలుండు దేవహూతికిఁ బిండోత్పత్తిక్రమంబుఁ దెలుపుట.

యె॥ సీ॥ దైవకోదితమతిపూర్వకర్మానుగుణమున శశ్వత్ప్రకాశకుండీశ్వరుండు ¶ఘటకుండు గావునఁ గ్రమ్మఱ జీవుండు దేహసంబంధంబుఁ దివిరి తాల్పఁ దొరకొని పురుష రేతోబిందుసంబంధియై వధూగర్భంబునందుఁ జొచ్చి దైవకోని యొకరాత్రిఁ కలిలంబు పంచరాత్రముల బుద్బుదము నుదశమదివసమందుఁ గర్కంధువై యుండు నంత మీఁదఁ బేశమగు నంత మీఁదటఁ బేర్చి యండమ్మగు నొక్క నెలమస్తకము నుమాస యమళమైన సుగర చరణములుఁ బొడము॥ వ॥ మఱియు మాసత్రయంబున నఖరోమాస్థిచర్మంబులు లింగచ్ఛిద్రంబులును గలిగి, నాలవమాసంబున సప్తధాతువులు, పంచమమాసంబున క్షుత్తృష్ణలు, షష్ఠమాసంబున మావిచేతం బొదువంబడి తల్లికుక్షి నిదక్షిణభాగంబునందిరుగు - మాతృభుక్తాన్నపానంబుల వలనఁ దృప్తిం బొందుచు సప్తధాతువులును గలిగి జంతుసంకీర్ణంబగు విణ్మూత్రగర్తంబందుఁ దిరుగుచుఁ గ్రిమిభక్షితశరీరుండయి మూర్ఛలం బొందుచుఁ దల్లి భక్షించిన కటుతిక్తోష్ణలవణక్షారామ్లాద్యుల్బణంబులయిన రసంబుల చేతఁ బరితప్తాంగుండగుచు జరాయువునఁ గప్పంబడి బహిఃప్రదేశంబునందు నాంత్రంబుల చేత బద్ధుండయి కుక్షియందు శిరంబు మోపికొని †భుగ్నంబయిన పృష్ఠగ్రీవోదరుండయి స్వాంగచలనంబునందు నసమర్థుండగుచుఁ బంజరంబునందుండు శకుంతంబు చందంబున నుండి దైవకృతంబయిన జ్ఞానంబునం బూర్వజన్మదుష్కృతంబులం దలంచుచు దీర్ఘోచ్ఛ్వాసంబు సేయుచు నే సుఖలేశంబునుం బొందక వర్తించు - నంత నేడవ నెలయందు లబ్ధజ్ఞానుండయి చేష్టలు గలిగి విట్క్రిమిసోదరుండయి యొక్క దిక్కున నుండక సంచరించుచు ప్రసూతిమారుతంబుల చేత నతివేపితుండగుచు యాచమానుండు దేహాత్మదర్శియుఁ బునర్గర్భవాసంబునకు భీతుండగుచు బంధనభూతంబగు సప్తధాతువుల చే బద్ధుండయి కృతాంజలిపుటుండు దీనవదనుండునయి జీవుండు దా నెవ్వని చే నుదరంబున వసియింప నియమింపంబడె నట్టి సర్వేశ్వరుని నిట్లని స్తుతియించు ॥ క ॥ అనయమును భువనరక్షణమునకై స్వేచ్ఛానురూపమునఁ బుట్టెడివి ష్ణునిభయవిరహితమగు పద వనజయుగం బర్థిఁ గొల్తు వారనిభక్తిన్॥ వ॥ అదియునుం గాక పంచభూతవిరహితుండయ్యుం బంచభూతవిరచితంబయిన శరీరంబునందుఁ గప్పంబడి యింద్రియగుణార్థ చిదాభాసజ్ఞానుండనయిన నేను॥ సీ॥ ఎవ్వఁడు నిఖిలభూతేంద్రియమయ యగు మాయావలంబన మహితకర్మబద్ధుఁడై వర్తించు పగిది దందహ్యమానంబగు జీవచింతనమునందు నవికారమై శుద్ధమై యఖండజ్ఞానమున నుండు వానికి ముఖ్యచరితునకు నకుంఠితశౌర్యునకుఁ బరంజ్యోతికి సర్వజ్ఞునకుఁ గృపాశాంతమతికిఁ గడఁగియుఁ బ్రకృతిపురుషుల కంటెఁ బరముఁడయిన వానికి మ్రొక్కెద నస్మదీయ దుర్భరోదగ్రభీకరగర్భనరకవేదనలఁ జూచి శాంతిఁ గావించుకొఱకు॥ సీ॥ అనవుడు సుతునకు జనని యిట్లనుఁ దగ మహితాత్మ యెవ్వని మహిమచేత ఘనమోహమై గుణకర్మనిమిత్త సాంసారికమా

---

* వాలుక = ఇసుక — ‡ కుటుంభరుఁడు = తనకడుపు నిండించుకొను వాఁడు — § యాతన = తీవ్రమయిన వేదన — ¶ ఘటకుండు = ఒనగూర్చువాఁడు — కలిలంబు = రక్తశ్వేతములు కలిసియుండుట — బుద్బుదము = నీటిబుగ్గ — కర్కంధువై = రేఁగుపండంతయై — పేశ = మాంసపుముద్ద. యమళము = జంట — లింగచ్ఛిద్రంబులు = శరీరమందలి నవద్వారములు — జరాయువు = మావి. † భుగ్నంబు = వంగియున్నది. శకుంతము = పక్షి.

ర్గసంచారములను। ధృతిచెడియలసియేదిక్కునెఱుంగక హరిపదధ్యానంబు నాత్మ మఱచి। యుండువారలకు నేయుక్తియున
న్మహాపురుషునను గ్రహబుద్ధి లేక। తద్గుణధ్యానతన్మూర్తివర్ణనములు। గోచరించుటయెట్లు నాకును బ్రబోధ। కలితముగఁ
బల్కుమనవ్వుచుఁ గపిలుఁడనియె। నంబతోడనుసుగుణకదంబతోడ॥ వ॥ అట్టి యీశ్వరుండు గాలత్రయంబునందును జంగమ
స్థావరాంతర్యామియగుటం జేసి జీవకర్మమార్గంబులం బ్రవర్తించువారు దాపత్రయనివారణంబుకొఱకు భజియింతుర
ని చెప్పి మఱియు నిట్లనియె॥ క॥ జనయిత్రిగర్భమందును। ఘనక్రిమివిణ్మూత్రరక్తగర్తములోన। న్మునుఁగుచు జఠరాగ్నిని దిన
దినమును *సంతప్యమానదేహుండగుచున్॥ గీ॥ దీనవదనుఁడగుచు దేహియీదేహంబు। వలననిర్గమింపఁదలఁచుచనిన। నెలల
నెన్నికొనుచు నెలకొనిగర్భంబు। వలన వెడలఁద్రోయువారుగలరె॥ వ॥ అనితలంపుచు దీనరక్షకుండైన పుండరీకాక్షుండు
దన్ను గర్భనరకంబువలన విముక్తునిఁ జేయనమ్మహాత్మునికిఁ బ్రత్యుపకారంబు సేయలేమికి నంజలిమాత్రంబు సేయందగున
ట్టిజీవుండనైన నేను ‖శమదమాదియుక్తంబయిన శరీరంబునందు విజ్ఞానదీపాంకురంబునం బురాణపురుషు నిరీక్షింతునని
మఱియు నిట్లనియె॥ సీ॥ నెలకొనిబహుదుఃఖములకు నాలయమైన యీగర్భనరకము నేను వెడలఁ। జాలబహిఃప్రదే
శమునకువచ్చిన ననుపమ దేవమాయావిమోహి। తాత్ముండనై ఘోరతమమగు సంసారచక్రమందును బరిభ్రమణశీలి।
నైయుండవలయుఁ దానదిగాక గర్భంబునందుండు శోకంబునపనయించి। యాత్మకనయంబు సారథియయినయట్టి। రుచిరవి
జ్ఞానమునఁ దమోరూపమయిన। భూరిసంసారసాగరోత్తారణంబు। చేసి యీయాత్మ నరసి రక్షించుకొందు॥ మఱియును॥
చ॥ పరగుచునున్న దుర్వ్యసనభాజనమై ఘనదుఃఖమూలమై। యరయఁగఁ బెక్కుతూంట్లుగలదై క్రిమిసంభవమైనయట్టి
మ। స్తరబహుగర్భవాసములసంగతి మాన్పుటకై భజించెద। న్సరసిజనాభ భూరిభవసాగరతారకపాదపద్మముల్॥ క॥ అని
కృతనిశ్చయుఁడైయే। చినవిమలజ్ఞానియగుచు జీవుఁడు గర్భం। బున వెడల నొల్లకుండన్। జనియెన్నవమాసములును జననీ
యంతన్॥ వ॥ దశమమాసంబున వానినధోముఖుంగావించిన నుచ్ఛ్వాసనిశ్వాసంబులు లేక ఘనదుఃఖభాజనుండు విగత
జ్ఞానుండు రక్తదిగ్ధాంగుండై §విష్ఠాస్థక్రిమింబోలి నేలంబడి యేడ్చుచుండు జ్ఞానహీనుండై జడుంబోలియుండి యంతనింగిత
భావానభిజ్ఞులగు పరులవలన వృద్ధింబొందుచు నభిమతార్థంబులం జెప్ప నేరక యనేకకీటసంకులంబైన పర్యంకంబునందు శ
యానుండై యవయవంబులు కండూయమానంబులైన గోఁకనేరక యాసనోత్థానగమనంబుల నశక్తుండయి తనశరీర
చర్మంబు మశకమత్కుణమక్షికాదులు పొడువఁ గ్రిములచే వ్యథంబడు క్రిమికుంబోలి దోధూయమానుండయి రోదనంబు
సేయుచు విగతజ్ఞానుండై యుండుచు †శైశవంబునందత్తత్క్రియానుభవంబుఁ గావించి పౌగండవయస్సునఁ దదనురూ
పంబులగు నధ్యయనాదిదుఃఖంబుల ననుభవించి తదనంతరంబ యౌవనంబు ప్రాప్తంబయిన నభిమతార్థఫలప్రాప్తికి సాహస
పూర్వంబులగు వృథాగ్రహంబులు సేయుచుఁ బంచమహాభూతారబ్ధంబగు దేహంబందుఁ బెక్కుమారు లహంకారమమ
కారంబులం జేయుచుఁ దదర్థంబులయిన కర్మంబు లాచరింపుచు సంసారబద్ధుండగుచు దుష్పురుషసంగమంబున శిశ్నోదరప
రాయణుండయి వర్తింపుచు నజ్ఞానంబునం జేసి ‡వర్ధిష్యమాణరోషుండగుచుఁ దత్ఫలంబులగు దుఃఖంబుల ననుభవింపుచుఁ గా
ముకుండయి నిజనాశంబునకు హేతువులగు కర్మంబులం బ్రవర్తింపుచుండు మఱియును॥ సీ॥ జనయిత్రిసత్యంబు శౌచంబుఁ ద
యయును ధృతియు మౌనంబు బుద్ధియును సిగ్గు క్షమయును యశమును శమదమ ¤భగములు మొదలుగాఁగల గుణంబులు నశిం
చు జనులకసత్సంగమునననియెఱిఁగించి వెండియు నిట్లను వినుము మూఢ। హృదయులు శాంతివిహీనులు దేహాత్మబుద్ధులునంగ
నామోహపాశ। బద్ధకేళీమృగంబులపగిదిఁ దగిలి। పరవశస్వాంతముల ?శోచ్యభావులయిన। వారిసంగతి విడువంగవలయు
నందు। నంగనాసంగము దోషమంద్రు గాన॥ వ॥ దీనికొక్కయితిహాసంబుగలదు తొల్లి యొక్కనాఁడు ప్రజాపతి దనకూఁ
తురయిన భారతి మృగీరూపధారిణియైయుండంజూచి తదీయరూపరేఖావిలాసంబులకు ¶నోటుపడి వివశీకృతాంతరంగుం
డు విగత‖త్రపుండునయి తాను మృగరూపంబు నొంది తదనుధావనంబు హేయంబని తలంపక ప్రవర్తించెం గావున నంగ
నాసంగమంబు వలవదస్మదీయనాభీకమలసంజాతచతుర్ముఖనిర్మితమరీచ్యాద్యుద్భూత. కశ్యపాదికల్పితదేవమనుష్యాదు
లందు మాయాబలంబునం గామినీజనమధ్యంబున విఖండితమనస్కుండు గాకుండుటకుఁ బుండరీకాక్షుండయిన నారాయ

*సంతప్యమాన। తపింపఁజేయఁబడిన. ‖శమదమ॥ శమ। అంతరింద్రియనిగ్రహము-దమ బహిరింద్రియనిగ్రహము—§విష్ఠాస్థక్రిమింబోలి। మల
మునందుండు పురుగువలె—†శైశవంబున। బాల్యమందు.—‡వర్ధిష్యమాణ। వృద్ధిఁబొందుచున్న— ¤భగము। మహాత్వము-సంపద— ?శో
చ్య। పరితపించుచున్న—¶ఓటుపడి। ఆశ్చర్యపడి-విశాకుపడి—‖త్రపుండు। సిగ్గుగలవాఁడు.

ణఁబులిపికిందక్క నన్యులకు నెవ్వరికినిదీరదని వెండియునిట్లనియె॥గీ॥ రూఢి నామాయ కామినీరూపమునను। బురుషులకు నె
ల్ల మోహంబుఁ బొందఁజేయుఁ। గానఁ బురుషులు సతులసంగంబుమాని। యోగవృత్తిఁ జరింపుచునుండవలయు॥ క॥ ధీరతతో
మత్పదసరసీరుహసేవానురక్తిఁ జెందినవార। ల్నారీసంగము నిరయ। ద్వారముగా మనములందుఁ దలఁపుదు రెంతుర్॥
క॥ హరిమాయాపరచితమై। తరుణీరూపంబుఁ దాల్చి ధరఁ బర్వినబం।ధురతృణపరివృతకూపము। కరణిన దియు మృత్యురూప
కంబగు మఱియున్॥ చ॥ ధనపశుపుత్త్రమిత్త్రవనితాగృహకారణభూతమయినయా। తనువుననున్న జీవుఁడుపదంపడియట్టి
శరీరమెత్తి తా। ననుగతమయిన కర్మఫలమందక పోవఁగ రాదు మిన్నువా। కినభువి దూరి నద్రిశిలకేగిన నెచ్చటనైన డాఁగి
నన్॥ వ॥ అట్టిపురుషరూపంబు నొందిన జీవుండు నిరంతర స్త్రీసంగంబు చేసి విత్తాపత్యగృహాదిప్రదంబగు స్త్రీత్వంబు నొందు
నీక్రమంబున నంగనారూపుండగు జీవుండును మన్మాయచేఁ బురుషరూపంబు నొంది ధనాదిప్రదుండగు భర్తను నాత్మబంధ
కారణంబగు మృత్యువునుగ నెఱుంగవలయు మఱియు జీవోపాధిభూతంబగు లింగదేహంబు చేసి స్వావాసభూతలోకంబున
నుండి లోకాంతరంబు నొందుచుం బ్రారబ్ధకర్మఫలంబుల ననుభవింపుచు మఱల కర్మములం దాసక్తుండగుచు *మృగయుం
డు గాననంబున ననుకూల సుఖప్రదుండయిన మృగంబునకు మృత్యువగుచందంబున జీవుండు భూతేంద్రియమనోమ
యంబయిన దేహంబు గలిగియుండునట్టి దేహనిరోధంబె మరణంబు నావిర్భావంబె జన్మంబును గాన సకలవస్తువిషయజ్ఞా
నంబు గలుగుటకు జీవునకు సాధనంబు చక్షురింద్రియంబగు †ద్రష్టృదర్శనీయ యోగ్యతాప్రకారంబున జీవునకు జన్మమ
రణంబులు లేవు గావున భయకార్పణ్యంబులు విడిచి సంభ్రమంబుమాని జీవప్రకారంబు జ్ఞానంబునం దెలిసి ధీరుండై ముక్త
సంగుండగుచు యోగవైరాగ్యయుక్తంబయిన సమ్యగ్జ్ఞానంబున మాయావిరచితంబయిన లోకంబున దేహాదులం దాసక్తి
మానివర్తింపవలయునని చెప్పి వెండియు నిట్లనియె॥ సీ॥ గృహమందు వర్తించు గృహమేధులగువారు మహితధర్మార్థకామ
ములకొఱకు ననుసంప్రీతులగుచుఁ దత్సాధనానుష్ఠాననిరతులై ‡వేదనిర్ణీతభూరి। భగవత్సుధర్మసద్భక్తిపరాఙ్ముఖులై దేవగ
ణములననుదినంబు। భజియింపుచును భక్తిఁ బైతృకకర్మముల్ సేయుచు నెప్పుడుఁ శిష్టచరితులగుచుఁ దగ దేవపితృసుప్రజా
ఘ్యులయిన। కామ్యచిత్తులు §ధూమాదిగతులఁ జంద్ర।లోకములఁ జెందిపుణ్యంబు లోపమయిన। మరలి పత్తురు భువికి జన్మం
బునొంద॥ అదియునుం గాక॥ గీ॥ ప్రవిమలానంతభోగితల్పంబునందు। యోగనిద్రాళువై హరియున్నవేళ। నఖిలలోకంబు
లును విలయంబు నొందు। నట్టిసర్వేశ్వరునిఁ గూర్చియనఘమతులు॥ మ॥ పరికింపన్నిజభక్తియుక్తి గరిమం బాటిల్లు పంకేరు
హపాదంబవిన్యస్తసమస్తధర్మములశాంతస్వాంతులై సంగముం। బరివర్జించి విశుద్ధచిత్తులగుచున్ పంకేజపత్త్రేక్షణా।నఘ
ధర్మైకనివృత్తులై సతతముం దైత్యారిఁ జింతింపుచున్॥ సీ॥ మఱియు నహంకారమమకారశూన్యులై యర్థి వర్తింపుచు ¶న
ర్చిరాది। మార్గగతుండును మహనీయచరితుండు విశ్వతోముఖుఁడును విమలయశుఁడు। జగదుద్భవస్థానసంహారకారణుం
డవ్యయుఁ డజుఁడు పరాపరుండు। పురుషోత్తముఁడు నవపుండరీకాక్షుండునైన సర్వేశ్వరునందుఁ బొంది। మానితాపునరా
వృత్తిమార్గమయిన। ప్రవిమలానంత తేజోవిరాజమాన। దివ్యపదమును సుఖియించుధీరమతులు। మఱలి రారెన్నటికి నిజజన్మ
ములఁ బొంద॥ వ॥ మఱియుఁ బరమేశ్వరదృష్టి చే హిరణ్యగర్భు నుపాసించువారు సత్యలోకంబున ద్విపరార్థావసానంబగు
ప్రళయంబు దనుకఁ బరుండగు చతురాననుం బరమాత్మరూపంబున ధ్యానంబు సేయుచునుండి పృథివ్యప్తేజోవాయ్వాకా
శమానసేంద్రియశబ్దాదిభూతాదులతోడంగూడ లోకంబును బ్రకృతియందు లీనంబు సేయ సర్వేశ్వరుండు సకలహర్త
యగు సమయంబున గతాభిమానంబులుం గలిగి బ్రహ్మలోకవాసులగు నాత్మలు బ్రహ్మతోడం గూడి పరమానందరూపుండు
సర్వోత్కృష్టుండు నగు పురాణపురుషుం బొందుదురు గావున నీవు సర్వభూతహృదయపద్మనివాసుండు ‖శ్రుతానుభావుం

* మృగయుఁడు। వేఁటకాఁడు— † ద్రష్టృదర్శనీయ। చూచువాఁడు చూడఁదగినది అనే— ‡ వేదనిర్ణీత। వేదమందు నిర్ణయింపఁబడిన—
§ ధూమాదిగతులన్॥ శ్లో॥ ఇడాచ వామనిశ్వాస సోమమండలగోచరా। పితృయానమితి జ్ఞేయా వామమాశ్రిత్య తిష్ఠతి॥ తా. ఇడానాడియనివా
మనిశ్వాసము చంద్రమండలగోచరమైయుండును- వామనాసాపుటము చేతఁ జంద్రమండలమును బొందును- వామభాగమునాశ్రయించియుం
డును- మూలాధారాదిగా బ్రహ్మరంధ్రపర్యంతమైయుండును- ఆనాడి పితృయానమనిన్ని పునరావృత్తికి అనుకూలమనిన్ని- ధూమమార్గమనిన్ని
యెఱుఁగఁదగినది- ఇది మొదలయిన మార్గములచేత.— ¶ అర్చిరాది॥ శ్లో॥ దక్షేపింగళానాడీవహ్నిమండలగోచరా। దేవయానమితి జ్ఞేయం పుణ్య
కర్మానుసారిణీ॥ తా. దేహదక్షిణభాగమందగ్నిమండలగోచరమై పుణ్యకర్మానుసారిణియైయుండునది పింగళానాడియనిపించుకొనును- అదే దే
వయానమని పునరావృత్తిరహితమని తెలియఁదగినది- అది మొదలయిన.— ‖ శ్రుతానుభావుండు। ప్రసిద్ధమయిన ప్రభావము గలవాఁడు.

డునిష్కళంకుండునిరంజనుండునిర్ద్వంద్వుండగుపురుషునిభావంబుచేశరణంబునొందుమనిచెప్పిమఱియునిట్లనియె॥మ॥స
కలస్థావరజంగమప్రతతికిన్జర్చింపఁదానాద్యుఁడై।యకలంకశ్రుతిగర్భుఁడుంబరుఁడుసర్వాద్యుండునీశుండునే।వకయో
గీంద్రకుమారసిద్ధముని దేవశ్రేణియోగప్రవ।ర్తకమైతన్నుభజింపఁజూపు సగుణబ్రహ్మంబులీలాగతిఁ॥ సీ॥అట్టిసర్వే
శ్వరుఁడయ్యాయికాలంబులందునుదక్షుణవ్యతికరమున। జనియింపుచుండునీచాడ్పున ఋషి దేవగణములుదమతమకర్మని
ర్మి।తైశ్వర్యపారమేష్ఠ్యములొందుపురుషత్వమొందియయ్యధికారములువహించి।వర్తించిక్రమ్మఱవత్తురుమఱికొంద
ఱారాధకర్మానుసారమైన।మనములనుజాలఁగలిగిధర్మములయందు।శ్రద్ధతోఁగూడశీయప్రతిషిద్ధమైన।నిత్యనైమిత్తికా
చారనిపుణులగుచు।దగిరజోగుణకలితచిత్తములుగలిగి॥వ॥సకాములైయింద్రియజయంబు లేక పితృగణంబులనెల్లప్పుడు
పూజింపుచుగృహంబులయందువర్తించిహరిపరాఙ్ముఖులగువారుత్రైవర్గికపురుషులనిసెప్పంబడుదురు॥చ॥వినుతగుణో
త్తరుండునురువిక్రముఁడైనహరిన్భజించిత।న్మననలసత్కథామృతముమానుగ।గ్రోలుటమానిదుష్కథ। ల్వినిమదమం
దుచుండురువివేకవిహీనతనూరపందియా।త్మనుమధురాజ్యభక్ష్యములుమాని పురీషముమెక్కు చాడ్పున॥చ॥ అలవడ
ధూమమార్గగతులైపితృలోకముఁబొందిపుణ్యముం।బొలిసినవారుదొంటితమపుత్రులకుందగదామువుట్టివి।హ్వలమతిగ
ర్భగోళపతనాదిపరేతధరాక్రియాంతమై।వెలసినకర్మమింతనుభవింతురుగావుననీవుభామినీ॥క॥వినుసర్వభావములఁబ
ర।మునినసఘునినంతునీశుఁబురుషోత్తముస।న్మనమునభజియింపుముమద।మునఁబునరావృత్తిలేనిముక్తిలభించున్॥వ॥అ
నిచెప్పిమఱియునిట్లనియెభగవంతుండగువాసుదేవునియందుంబ్రయుక్తంబగుభక్తియోగంబుబ్రహ్మసాక్షాత్కారసాధ
నంబులగువైరాగ్యజ్ఞానంబులంజేయునట్టిభగవద్భక్తియుక్తంబయినచిత్తంబింద్రియవృత్తులచేసమంబులగునర్థంబులం
దువైషమ్యంబుఁబ్రియాప్రియంబులును లేక నిస్సంగంబుసమదర్శనంబుహేయోపాదేయవిరహితంబునైయారూఢం
బైనయాత్మపదంబునాత్మచేఁజూచుచుండుజ్ఞానపురుషుండుపరబ్రహ్మంబుపరమాత్ముండునీశ్వరుండుపరమపురుషుండునే
కరూపంబుగలిగియుండియుదృశ్యద్రష్టృకరణంబులచేతంబృథగ్భావంబునుఁబొందుచుండునిదియయోగికిసమగ్రంబగు
యోగంబునంజేసిప్రాప్యంబగుఫలంబుగావునవిషయవిముఖంబులగునింద్రియంబులచేతజ్ఞానరూపంబుహేయగుణరహి
తంబునగుబ్రహ్మంబుమనోవిభ్రాంతింజేసిశబ్దాదిధర్మంబగునర్థరూపంబునందోఁచు నదియెట్లులర్థాకారంబునందోఁచు
ననియడిగితివేనియహంకారంబుగుణరూపంబునంజేసిత్రివిధంబుభూతరూపంబునంబంచవిధంబునింద్రియరూపంబుననే
కాదశవిధంబునైయుండుజీవరూపుండగు విరాట్పురుషుండుజీవవిగ్రహంబైనయండంబగుజగంబునందోఁచుచుండుదీని
శ్రద్ధాయుక్తంబయినభక్తిచేతయోగాభ్యాసంబునంజేసిసమాహితమనస్కుండై నిస్సంగంబునవిరక్తుండయినవాఁడు
సొడగనుచుండునదియంతయుబుధజనపూజనీయచరిత్రవుగావున నీకుంజెప్పితిసర్వయోగసంప్రాప్యుండునిర్గుణుండు
నుభగవంతుండని చెప్పినజ్ఞానయోగంబునుమదీయభక్తియోగంబునను రెండు లేవొక్కటియయింద్రియంబులుభిన్న
రూపంబులుగావున నేకరూపంబయినయర్థంబనేకవిధంబులగునట్లేకంబగుబ్రహ్మంబనేకవిధంబులుగఁదోఁచుమఱియు॥
సీ॥అంబనారాయణుండఖిలశాస్త్రములనుసమధికానుష్ఠితసవనతీర్థ। దర్శనజపతపోధ్యయనయోగక్రియాదానకర్మం
బులఁగానఁబడక।యేదినమనముబాహ్యేంద్రియంబులగెల్చిసకలకర్మత్యాగసరణినొప్పి।తలకొనియాత్మతత్త్వజ్ఞానము
నమించియుఁడుగకవైరాగ్యయుక్తిదనరి।మహితఫలసంగరహితధర్మమునఁదనరు।నట్టిపురుషుండుదలపోయనఖిలహేయ।
గుణములనుబాసికల్యాణగుణవిశిష్టుఁ।డయినహరినొందుఁబరమాత్మునసఘుఁడగుచు॥ వ॥అదిగావుననీకుంజతుర్విధభక్తి
యోగప్రకారంబు దేటపడనెఱింగించితినదియునుంగాక కాలరూపయగుమదీయగతిజంతువులయందునుత్పత్తివినాశరూ
పంబులనుండునవిద్యాకర్మనిర్మితంబులయినజీవునిగతులనేకప్రకారంబులైయుండునదియు జీవాత్మవానియందుంబ్రవ
ర్తించియాత్మగతియెట్టిదనియెఱుంగకయుండునని చెప్పిమఱియునిట్లనియెనిట్టియతిరహస్యంబగుసాంఖ్యయోగప్రకారం
బుఖలునకునవినీతునకుజడునకుదురాచారునకుడాంబికునకునింద్రియలోలునకుఁబుత్రదారాగారాద్యత్యంతాసక్తచి
త్తునకుభగవద్భక్తిహీనునకువిష్ణుదాసులయందుద్వేషంపడువానికినుపదేశింపవలవదుశ్రద్ధాసంపన్నుండుభక్తుండువినీ
తుండునసూయారహితుండుసర్వభూతమిత్రుండుశుశ్రూషాభిరతుండుబాహ్యార్థజాతవిరక్తుండుశాంతచిత్తుండునిర్మత్స
రుండుశుద్ధాత్ముండుమద్భక్తులయందుప్రేమగలవాఁడునన్యకాంతావిముఖుండు నిష్కాముండునగునధికారికినుపదేశింప

శ్రీఅప్రతిషిద్ధమయిన।నిషేధముకానిదైనట్టి— ‡పరేతధరా।శ్మశానము— †తనరి।ఒప్పి— ‖విశిష్టుఁడు।శ్రేష్ఠుఁడు.

నర్హంబగునీయుపాఖ్యానంబెపురుషుండేనిఁబతివ్రతయగునుత్తమాంగనయేని శ్రద్ధాభక్తులుగలిగి మదర్పితచిత్తంబునవినుఁబఠించు నట్టిపుణ్యాత్ములుమదీయదివ్యస్వరూపంబుఁబ్రాపింతురనిచెప్పెనని మైత్రేయుండువిదురునకు వెండియునిట్లనియెనీప్రకారంబునఁగర్దమదయితయైనదేవహూతికపిలునివచనంబులువినినిర్ముక్తమోహపటలయగుచు *సాష్టాంగదండప్రణామంబులాచరించితత్త్వవిషయాంకిత సాంఖ్యజ్ఞానప్రవర్తకంబగు స్తోత్రంబుసేయనుపక్రమించి దేవహూతికపిలునకిట్లనియె॥సీ॥అనయంబుపినుమింద్రియార్థమనోమయంబును భూతచయమయంబునుసమస్త। భూరిజగద్బీజభూతంబునుగుణప్రవాహకారణమునువలను మెఱయు। నారాయణాభిఖ్యననఁగలభవదీయదివ్యమంగళమూర్తి దేజరిల్లు। చారుభవద్గర్భసంజాతుఁడగునట్టి కమలగర్భుండుసాక్షాత్కరింప। లేకమనమునఁగనియెననేకశక్తి।వర్గములుగల్గిసుగుణప్రవాహరూపమునందివిశ్వంబుదాల్చిసహస్రశక్తి।కలితుఁడై సర్వకార్యముల్గలుగఁజేయు॥అంత॥గీ॥ప్రళయకాలంబునం❀దంఘ్రిపాయిగవట।శిశువవై యొంటిఁగుక్షినిక్షిప్తనిఖిల।భువననిలయుండవై మహాంభోధినడుమ। జారువటపత్త్రమధ్యసంస్థాయివగుచు॥గీ॥లీలనాత్మీయపాదాంగుళీవినిర్గ।తామృతముగ్రోలినట్టిమహాత్మనీవు।గడఁగినాపూర్వభాగ్యంబుకతననిపుడు।పూనినాగర్భమున నేఁడుపుట్టితయ్య॥అట్టిపరమాత్ముఁడవయినసీవు॥సీ॥పరుసవిగ్రహపారవశ్యంబుననుఁజేసిరఘురామకృష్ణవరాహనార। సింహాదిమూర్తులందితలీలధరియించి దుష్టనిగ్రహముసుశిష్టపాల।నముసుఁగావింపుచునయమునసద్ధర్మనిరతచిత్తులకువర్ణింపఁదగిన।చతురాత్మతత్త్వవిజ్ఞానప్రదుండవై వర్తింతువనఘభవన్మహత్త్వ।మజునకయినను వాక్రువ్వనలవిగాదు।నిగమజాతంబులయినవర్ణింపవెఱుఁగ। నెఱిఁగిసంస్తుతిసేయనేనెంతదాన।వినుతగుణశీలమాటలు వేయునేల॥అదియునుంగాక॥క॥ధీమహితభవన్మంగళ।నామస్మరణానుకీర్తనముగలహీనుల్। శ్రీమంతులగుదురగ్ని। ష్టోమాదిక్రతుదాళికంటెశుద్ధులుదలఁపన్॥ అదియునుంగాక॥క॥ నీనామస్తుతిశ్వపచుం। డైననుజిహ్వాగ్రమందుననుసంధింప। వానికిసరిభూసురుఁడు।న్నా నేరఁడుచిత్రమదిజగంబులనరయన్।ఉ॥ఈవిధమాత్మలందెలిసియెప్పుడుసజ్జనసంఘముల్జగత్పావనమయిననీగుణకథామృతమాత్మలఁగ్రోలిసర్వతీ।ర్థావళిఁగ్రుంకినట్టిఫలమందుదురంచుసమస్తవేదము। ల్పావిరిఁబల్కుఁగావునను వారలుధన్యులుమాన్యులుత్తముల్॥వ॥అదిగావునఁబరబ్రహ్మంబవుపరమపురుషుండవుప్రత్యఙ్మనోవిభావ్యుండవుసమస్తజనపాపనివారకస్వయంప్రకాశుండవువేదగర్భుండవుశ్రీమహావిష్ణుండవునగునీకువందనంబులాచరించెదనని స్తుతియించినఁబరమపురుషుండుమాతృవత్సలుండునగుకపిలుండుఁగరుణారససాంద్రహృదయకమలుండై జననికిట్లనియె॥గీ॥తవిలిసుఖరూపమును మోక్షదాయకంబు। నైనయీయోగమార్గమేనంబనీకు। నెఱుఁగవివరించిచెప్పితినిది దృఢంబు।గాఁగభక్తిననుష్ఠింపుకమలనయన॥క॥జీవన్ముక్తిలభించుం।గావున నేమరకతలఁపుఁగైకొనివీని।న్నావిరినొల్లని వారికిఁ।దావలముగుమృత్యుభయముదప్పదుసుఖముల్॥క॥అనియిట్లుదేవహూతికి।మనమలరఁగఁగపిలుఁడాత్మమార్గంబెల్లన్వినుపించిచనియెననివిదు।రునకున్ మైత్రేయమునివరుండెఱిఁగించెన్॥వ॥అట్లుకపిలుండేగినపిదపదేవహూతియుం బుత్త్రుండుచెప్పినయోగమార్గంబునవిజ్ఞానంబుగలిగియుండియుంబెనిమిటియైనకర్దమునిందనయుండైనకపిలునింబాసిన ష్టవత్సయగుగోవుచందంబునఁదల్లడిల్లుచుఁగపిలమహామునిందలంపుచుంగర్దమతత్త్వసామర్థ్యంబులైనయట్టి॥ఉ॥మానితసౌరభప్రసవమంజులపక్వఫలప్రవాళభా।రానతచూతపోతవిటపాగ్రనికేతనరాజకీరస।మ్మాన్యతరానులాపపరిమండితకర్దమతాపసాశ్రమో।ద్యానవనప్రదేశకమలాకరతీరనికుంజపుంజముల్॥ వెండియు॥సీ॥అందితస్ఫటికమయస్తంభదీప్తిచేఁగొమరారుమరకతకుడ్యములను।సజ్జాతివజ్రాలసజ్జాలకరుచులభాసిల్లునీలసోపానములను।దీపించుచంద్రకాంతోపలవేదులవిభ్రమనుగేహాళీవిలసితముల।హాటకరత్నకవాటశోభితములనలరినసౌధశాలాంగణముల।వరపయఃఫేనపటలపాండురకరీంద్ర।దంతనిర్మిత¶ఖట్వాళిధవళపట్ట।రచితశయ్యాళులను ‡చతురంతయాన। కనకపీఠాదివస్తుసంఘములనెల్ల॥వ॥మఱియువికచకమలకువలయసౌగంధికబంధురసుగంధానుబంధిగంధవహాశోభితంబునరవిందనిష్యందకందళితమరందరసపానమదవదిందిరసందోహఝుంకారసంకులంబునై చెలువారుబావులుంగలిగిపురందరసుందరీనందితంబైనకర్దమాశ్రమంబుఁబరిత్యజించికుటిలంబులైనకుంతలంబులుజటిలంబులుగాధరించిసరస్వతీబిందుసరోవరంబులం§త్రి

* సాష్టాంగదండప్రణామలక్షణము॥శ్లో॥ఉరసాశిరసాదృష్ట్యామనసావచసాతథా।పద్భ్యాంకరాభ్యాంకర్ణాభ్యాంప్రణామోష్టాంగముచ్యతే॥ ❀అంఘ్రిపాయి।కాలివ్రేలినిచప్పరించుచున్నవాఁడు—శ్లో॥కరారవిందేనపదారవిందంముఖారవిందేవినివేశయంతం।వటస్యపత్రస్యపుటే శయానంబాలంముకుందంమనసాస్మరామి॥ఇట్లనిగోపాలకృష్ణసంహితయందు. ✿దవ్వు।దూరము. ¶ఖట్వ।మంచము. ‡చతురంతయాన।పాలకి.— § త్రిషవణస్నానంబు।త్రికాలములయందుఁజేయుస్నానము.

షవణస్నానంబుగావింపుచును గ్రతపోభారంబునం గృశీభూతశరీరయై నిజకుమారుండు ప్రసన్నవదనుండు గపిలరూపనామధేయుండునగు నారాయణుని సమస్తవ్యస్తచింతలచే ధ్యానంబు సేయుచుఁ బ్రవాహరూపంబైన భక్తియోగంబున నధికవైరాగ్యంబున యుక్తానుష్ఠానజాతంబై బ్రహ్మాత్మావబోధకంబునగు జ్ఞానంబున విశుద్ధమనంబునుం గలిగి॥ సీ॥ అనయంబు నాత్మనాయకుఁడును విశ్వతోముఖుఁ డనంతుఁడు పరముఁడు నజుండు। చతురుండు నిజపరిజ్ఞానదీపాంకురమహిమ నిరస్తసమస్తభూరి। మాయాంధకారుఁ డమేయుఁ డీశ్వరుఁడగు నా పరబ్రహ్మంబునందు విరత। బద్ధతత్త్వజ్ఞానపరత చే నిర్ముక్తజీవభావమున విశిష్టయోగ। భవ్యసంప్రాప్తనిర్మలబ్రహ్మభావ। ములను గలిగి సమాధిచే నెలమిఁ దనరు। నపునరావృత్తమగు త్రిగుణప్రధాన। తత్త్వముల నొప్పి సంతతోదారనియతి॥ గీ॥ కలలఁ దోఁచిన వస్తుసంఘముల మేలు। కనిక నుంగొనఁగా లేనిమనుజుపోలికఁ। బొలఁతి దనయాత్మ మరచియు మ్మలసధూమ। మైన పావకు గతినుండె నంతలోన॥ క॥ గురుయోగశక్తిచే నంబరతలమున కెగసి సత్కృపామయుఁడగు నా। పరవాసుదేవు చరణాం। బురుహాయుగన్యస్తచిత్తముగలదియగుచున్॥ వ॥ ఇట్లు కపిలోక్తమార్గంబున దేవహూతి శ్రీహరియందుఁ గలసెన య్యంగనారత్నంబు మోక్షంబునకుం జనిన క్షేత్రంబు సిద్ధిపదంబను పేరం బఱిగి ప్రసిద్ధివహించె నంతనక్కడఁ గపిలుండు నల్లిచే తననుజ్ఞాతుండై సిద్ధచారణగంధర్వాప్సరోమునినివహసంస్తూయమానుండగుచు సముద్రుని చేత దత్తార్ఘ్యపూజానికేతనంబులువడసి సాంఖ్యాచార్యాభిష్టుతంబగుయోగంబున వలంబించి లోకత్రయశాంతికొఱకు సమాహితుండై స్వపితృాశ్రమంబు విడిచి యుదగ్భాగంబునకుం జనియె నని మైత్రేయమహాముని విదురునకిట్లనియెఁ దండ్రీ యీ యుపాఖ్యానంబు నాకు గోచరించిన రీతి నీకుం జెప్పితి నిది కపిలదేవహూతిసంవాదంబత్యంతపావనంబు గపిలప్రణీతంబునైన యోగంబు దీనిం బరమభక్తియుక్తుండై యెవ్వఁడు పఠించు నెవ్వఁడు వినునట్టిపుణ్యాత్ముండు విగతపాపుండై గరుడధ్వజుండైన పుండరీకాక్షుని శ్రీచరణారవిందంబులం బొందు నని మైత్రేయుండు విదురునకెఱింగించె నని శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకుం జెప్పె నని సూతుండు శౌనకాదిమహామునులకు నీకథావృత్తాంతంబు జెప్పిన విని ప్రహృష్టహృదయులయి మునికులోత్తమా భవద్వాక్పూరంబగు భగవత్కథామృతంబు గ్రోలుచుండ మా మనంబులు దనివి నొందెనిక దరువాతి వృత్తాంతంబులు మాకు విశదంబులుగ వినుపింప నీవ యర్హుండవని యడుగుటయు॥

చ॥ జనకసుతామనోవిమలసారసకోమలచంచరీక చం। దనశరదిందుకుందహరతారమరాళపటీరచంద్రికా। వినుతయశోవిశాలరఘువీర దరస్మితపద్మపత్రలోచన నిటలాంబకప్రకటచాపవిఖండనవంశమండనా॥ తరల॥ పరమపావనవిశ్వభావనబాంధవప్రకరావనా। శరధిశోషణసత్యభాషణసత్కృపామయభూషణా। దురితతారణసృష్టికారణదుష్టలోకవిచారణా। ధరణిపాలనధర్మశీలనదైత్యమర్దనఖేలనా॥ మాలిని॥ దివిజగణశరణ్యాదీపితానంతపుణ్యా। ప్రవిమలగుణజాలా భక్తలోకానుపాలా। భవతిమిరవినాశాభానుకోటిప్రకాశా। కువలయహితకారీ ఘోరదైత్యప్రహారీ॥

గద్య. ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్యప్రణీతంబైన శ్రీమహాభాగవతంబను మహాపురాణంబునందు విదురనీతియు, విదురునితీర్థాగమనంబు, నుద్ధవసందర్శనంబుఁ, గౌరవయాదవక్షయాదినిర్యాణంబు, గంగాద్వారంబున విదురుండు మైత్రేయునిం గనుటయు, విదురమైత్రేయసంవాదంబు, జగదుత్పత్తిలక్షణంబు, మహదాదులసంభవప్రకారంబు, మహదాదులు నారాయణు నభినందించుటయు, విరాడ్విగ్రహప్రకారంబు, శ్రీమహాభాగవతభక్తకారణంబగు పద్మసంభవుజన్మప్రకారంబు, బ్రహ్మతపంబుఁ, బరమేష్ఠికిం బుండరీకాక్షుండు ప్రత్యక్షంబగుటయు, బ్రహ్మకృతంబైన విష్ణుస్తోత్రంబుఁ, గమలసంభవుని మానససర్గంబుఁ, బరమాణువుల పుట్టువు, భూర్భువస్స్వరాదిలోకవిస్తారంబుఁ, గాలదివసమాసవత్సరాదినిర్ణయంబు, నాయుఃపరిమాణంబుఁ, జతుర్యుగపరిమాణంబుఁ, బద్మసంభవుసృష్టిభేదంబు, సనకాదులజన్మంబు, స్వాయంభువమనుజన్మంబు, శ్రీహరివరాహావతారంబు, భూభరణంబు, సూకరాకారుండైన హరిని విధాత స్తుతియించుటయు, దితికశ్యపసంవాదంబుఁ, గశ్యపుండు రుద్రునిం బ్రశంసించుటయుఁ, గశ్యపువలన దితి గర్భంబు ధరియించుటయుఁ, దత్ప్రభావంబునకు వెఱచి దేవతలు బ్రహ్మసన్నిధికిం జని దితిగర్భంబు విన్నవించుటయు, సనకాదులు వైకుంఠంబునకరుగుటయు, నందు జయవిజయుల నలిగి శపించుటయు, శ్రీహరిదర్శనంబు, బ్రాహ్మణప్రశంసయు, సనకాదులు హరిని నుతించుటయు, హిరణ్యకశిపుహిరణ్యాక్షుల జన్మప్రకారంబు, హిరణ్యాక్షుని దిగ్విజయంబు, నవనవరాహహిరణ్యాక్షుల యుద్ధంబు, బ్రహ్మస్తవంబు, హిరణ్యాక్షువధయు, నమరగణంబులు శ్రీహరి నభినందించుటయు, హరివరాహావతారవిసర్జనంబు సేయుటయు, దేవతిర్యఙ్మనుష్యాదులసంభవంబుఁ, గర్దమమహాముని తపంబునకు సంతసించి శ్రీహరి ప్రత్యక్షంబగుటయుఁ, గర్దముండు స్వాయంభువమనుపుత్రియైన దేవహూతిం బరిణయంబగుటయు, దేవహూతి పరిచర్యలకు సంతసిల్లి కర్దముండు నిజయోగకల్పితంబగు విమానంబునందు నిలిచి సహస్రదాసీపరివృతయైన దేవహూతిం గూడి బారతాదివర్షంబులు గలయఁ గ్రుమ్మరుటయు, దేవహూతికి కర్దమునివలనఁ గన్యకానవకంబును గపిలునిం గనుటయుఁ, దత్కన్యకావివాహంబుఁ, గర్దమతపోయాత్రయుఁ, గపిలదేవహూతిసంవాదంబు, శబ్దాదిపంచతన్మాత్రల జన్మప్రకారంబు, బ్రహ్మాండోత్పత్తియు, విరాట్పురుషకర్మేంద్రియపరమాత్మప్రకారంబుఁ, బ్రకృతిపురుషవివేకంబు, నారాయణుని సర్వాంగస్తోత్రంబు, సాంఖ్యయోగంబు, భక్తియోగంబు, జీవునకైన గర్భసంభవప్రకారంబుఁ, జంద్రసూర్యమార్గంబుఁ, బితృమార్గంబు, దేవహూతినిర్యాణంబుఁ, గపిలమహాముని తపంబునకుం జనుటయు, నను కథలుగల తృతీయస్కంధము. శ్రీగోపాలకృష్ణార్పణమస్తు.

# శ్రీమదాంధ్రభాగవతము — చతుర్థస్కంధప్రారంభము.

శ్రీవిలసితధరణీతన। యావదనసరోజవాసరాధిపనుతరా। జీవదళనయననిఖిలధ। రావరనుతసుగుణధామరాఘవరామా॥

వ॥ అమ్మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండైన సూతుండిట్లనియె నట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె॥ సీ॥ జననాథ విదురునకును మునిమైత్రేయముని నాథచంద్రుం డిట్లనియె మఱియు। స్వాయంభువునకర్థి శతరూపవలనను గూఁతులు ముగ్వు రాకూతి దేవ। హూతి ప్రసూతులు నెనరఁ బ్రియవ్రతోత్తానపాదులను తనయయుగము। జనియింపఁగా నంత సంభవంబైన యాకూతిని సుమహిత భ్రాతృమతిని। దనకు సంతానవిస్తరార్థంబుగాఁ గఁ బుత్రికాధర్మ మొందియాపువ్వుబోఁడిఁ। బ్రకటమూర్తి రుచిప్రజాపతికి నిచ్చె। మనువు ముదమొంది శతరూప యనుమతింప॥ వ॥ అట్లు వివాహంబైన రుచిప్రజాపతి బ్రహ్మవర్చస్వియుఁ బరిపూర్ణగుణుండును గావున జితైకాగ్రతం జేసి యాకూతియందు శ్రీవిష్ణుండు యజ్ఞరూపధరుండగు పురుషుండును జగదీశ్వరియగు నాదిలక్ష్మియు మహాత్మునకు నిత్యానపాయిని గావున దదంశంబున దక్షిణయను కన్యకారత్నంబును గను మిథునంబు సంభవించె నందు స్వాయంభువుండు సంతుష్టాంతరంగుండచుఁ బుత్రికాపుత్రుండు వితతతేజుండునగు శ్రీవిష్ణుమూర్తిరూపుండగు యజ్ఞునిం దనగృహంబునకుఁ దెచ్చియుసి చెనుదియు దక్షిణయను కన్యకాలలామంబును దనయొద్దన నిలిపె నంత సకలమంత్రాధిదేవతయగు శ్రీయజ్ఞుండు దనుఁ బతిగఁ గోరెడు దక్షిణయను కన్యకం బరిణయంబయ్యె వారు నామిథునంబు గావున నిషిద్ధంబుగాకుండెనని చెప్పి మైత్రేయుండు వెండియు నిట్లనియె॥ క॥ ధీమహితయంతవారల। యామాఖ్యలఁ గలుగు దేవతావళి గడుఁ గర్ణా। వేశను*నభినందించుచు। నామిథునమువలనఁ బుట్టె నతిబలయుతమై॥ వ॥ వారు తోషుండు, ప్రతోషుండు, సంతోషుండు, భద్రుండు, శాంతియు, నిడస్పతియు, నిధ్మ్ముండు, కవియు, విభుండు, వహ్నియు, సుదేవుండు, రోచనుండు, ననం బన్నిద్దఱు సంభవించి; వారలు స్వాయంభువాంతరంబునం దుషితులను దేవగణంబులై వెలసిరి మఱియు మరీచిప్రముఖులైన మునీశ్వరులును యజ్ఞుండను దేవేంద్రుండును మహాతేజస్సంపన్నులయిన ప్రియవ్రతోత్తానపాదులును గలిగి పుత్రపౌత్ర*నప్తృవంశంబులచే వ్యాప్తంబై యామన్వంతరంబు పాలితంబగుచు వర్తించె మనువు ద్వితీయపుత్త్రియైన దేవహూతిం గర్దమునకిచ్చె తద్వంశవిస్తారంబు గావించెదనని మున్న యెఱింగించితి వెండియు నమ్మనువు మూఁడవదైన ప్రసూతియను కన్యకను బ్రహ్మపుత్రుండగు దక్షప్రజాపతికిచ్చె నా దక్షునకుం బ్రసూతివలనను దయించిన ప్రజాపరంపరలచేత ముల్లోకంబులు విస్తృతంబులయ్యె మఱియుఁ గర్దమపుత్రికాసముదయంబు బ్రహ్మర్షిభార్యలగుటం జేసి వారివలనం గలిగిన సంతానపరంపరల వివరించెద

## శ్రీ కర్దమప్రజాపతిసంతతిని దెలుపుట. శ్రీ

సీ॥ ఘనుఁడౌ మరీచికిఁ గర్దమాత్మజయగు కళయను కన్యకవలనఁ గశ్యపుండను గొడుకును బూర్ణిమయను నాఁడుబిడ్డయుఁ బుట్టిరి పేర్మి వారివలనఁ బుట్టిన ప్రజావళి పరంపరలచే భువనంబులెల్ల నాపూర్ణమగుచు। జరిగెను బూర్ణిమ జన్మాంతరంబున హరిపదప్రక్షాళితాంబువులను। గంగయను పేరఁ బుట్టినకన్య దేవకుల్యయను దానినొక్కతెఁ గూఁతు నఖిలవిష్టపవ్యాపకుండగు విరజుఁడనెడి। తనయు నొక్కనిఁ గాంచె మోదంబుతోడ॥ క॥ అనఘుం డత్రిమహాముని। యనసూయాదేవివలన హర్యజపురసూదనులకళాంశంబులనం। దనులను ముగ్వురను గాంచె దనర్చియుఁ బ్రీతిన్. క॥ అనవుడు విదురుఁడు మైత్రేయునిఁ గనుఁగొని పలికె మునిజనోత్తమ జగతిం। జననస్థితిలయకారణులన వెలసిన యప్పద్మగర్భహరిహరులెలమిన్॥ క॥ ఏమినిమిత్తంబత్రిమహా। మునిమందిరమునం దనసూయకును। ద్దామగుణులుదయమయిరన। నా మైత్రేయుండు పలికె నవ్విదురునితోన్॥ సీ॥ సుచరిత్ర వినువిధిచోదితుండై యత్రి తపమాచరింపఁగాం తానసమేతుఁడయి ఋక్షనామకులాద్రితటంబున ఘనఘుమాఘుమారావసంకులవిలోల। కల్లోలజాలసంకలితనిర్వింధ్యానదీజలపరిపుష్టరాజిత ప్ర। సూనగుచ్ఛస్వచ్ఛమానితాశోకపలాశకాంతారస్థలమున కెలమి। నరిగి యచ్చట నిర్ద్వంద్వుఁడగుచుఁ బ్రాణ। నియమనమున నేకాంఘ్రిఁ జేసి విగాలి। దివుటఁ గ్రోలి కృశీభూతదేహుఁడగుచుఁ। దపముఁ గావించె దివ్యవత్సరశతంబు॥ వ॥ ఇట్లతిఘోరంబైన తపంబు సేయుచుఁ దనచిత్తంబున. క॥ ఏవిభుఁడు జగదధీశ్వరుఁ। డావిభుశరణంబుఁ జొత్తు నతఁడాత్మసమం। బయి వెలసినసంతతి నిడ। యావరమతి నిచ్చుఁ గాక యని తలఁచునెడన్॥ చ॥ మునుకొని యత్తపోధనుని శిమూర్ధజమైన తపఃకృశానుచే। తను త్రిజగంబులుం గఱఁగి తప్తములైననుజూ

---

*అభినందించుచు। మిగుల నంతసిల్లుచు. నప్తృ। మనుమనిపుత్రుఁడు — శిమూర్ధజమైన। శిరస్సునందుఁ బుట్టినట్టి. కృశానుచేతన్। అగ్నిచేత.

చిపంకజా। సన*మురశాసన త్రిపురశాసనులచ్చటికేగిరప్పరో। జనసురసిద్ధసాధ్యమునిసన్నుతభూరియశోభిరాములై॥ వ॥ అట్లుమునీంద్రునాశ్రమంబుడాయంజనునవసరంబున॥ చ॥ అనఘతపోభిరాముఁడగు నత్రిమునీంద్రుఁడు గాంచెఁ దత్తకాంచనఘనచంద్రికారుచిరచారుశరీరుల హంసనాగసూదనవృషభేంద్రవాహులను దారకమండలుచక్రశూలసాధనులవిరించివిష్ణుపురదాహుల వాక్కమలాంబికేశులన్॥ వ॥ మఱియుఁ గృపావలోకనమందహాససుందరవదనారవిందంబులుగల మహాత్ములఁ దర్శించి యమందానందకందళితహృదయారవిందుండై సాష్టాంగదండప్రణామంబు లాచరించి నిటలతటఘటితకరపుటుండై దుర్నిరీక్ష్యంబైన తత్తేజోవిశేషంబుఁ దేరిచూడంజాలక ముకుళితనేత్రుండై తత్పదాయత్తచిత్తుండగుచు సర్వలోక**ప్రశస్యంబులైన మృదుమధురగంభీరభాషణంబుల నిట్లని స్తుతియించె॥ సీ॥ ప్రతికల్పమందు సర్వప్రపంచోద్భవస్థితివినాశంబులఁ జేయునట్టి। మహితమాయాగుణమయదేహములఁ బొల్చు నజవాసుదేవ***శివాభిధాన। ములుగల్గు మీపాదజలజాతములకేను నతిభక్తివందనం బాచరింతు। నఖిలచేతనమానసాగస్యమును నొప్పుమూర్తులు గల్గు మీ మువ్వురందుఁ బరగ నా చేతఁ బిలువంగఁబడినధీరుఁ। డెవ్వఁ డేనొక్కరుని బిల్వ నిపుడు మీరు। మువ్వురేతెంచుటకు నాదుబుద్ధి విస్మయంబు గదిరెడిఁ జెప్పరే యనఘులార॥ వ॥ అదియునుంగాక సంతానార్థంబు నానావిధపూజలు గావించి నాచిత్తంబున ధరియించిన మహాత్ముండొక్కరుండ యనిన నమ్మువ్వురు విబుధశ్రేష్ఠులు ప్రశస్యమానతపోవిభవంబుగల యతనిం గనుంగొని సుధామాధుర్యసమంబులయిన వాక్యంబుల నిట్లనిరి॥ క॥ విను మేము మువ్వురయ్యును। ననుపమమతిఁ దలఁప నేకమై యుందుము నీ। మనమందు నేమి గోరితి। వనయము నాకోర్కి సఫలమయ్యెడుఁ జుమ్మీ॥ క॥ మా మువ్వురయంశంబుల। ధీమతులగు సుతులు వుట్టి త్రిభువనములలో। నీమంగళగుణకీర్తి। శ్రీమహితము సేయఁగలరు సిద్ధము సుమ్మీ॥ క॥ అని మునిచంద్రుఁడు దనమాన। మునఁగామించిన వరంబు బుధవరులు మునం। బున నొసఁగి యతని సతియు। జనములఁ బరితృప్తులగుచుఁ జనిరి యథేచ్ఛన్॥ ఉ॥ ఆ సుచరిత్రదంపతులు వంచితలీలఁ గనుంగొనంగ నా। బ్జాసనునంశమందు నమృతాంశుఁడు విష్ణుకళన్ సుయోగవి। ద్యాసుభగుండు దత్తుఁడు పురాంతకుభూరికళాంశమందు దు। ర్వాసుఁడునై జనించిరనవద్యపవిత్రచరిత్రులిమ్ములన్॥ క॥ అంగిరసుఁడనెడుమునికిఁ గు। లాంగనయగు శ్రద్ధయందు ననుచితసౌంద। ర్యాంగులు గూఁతులు నలువురు। మంగళవతులుదయమైరి మాన్యచరిత్రా॥ క॥ వారు సినీవాలియును గు। హూరాకానుమతులనఁగ నొప్పిరి మఱియుం। గోరసుతయుగముగలిగెను। స్వారోచిషమనువువేళ శస్తఖ్యాతిన్॥ వ॥ వారలెవ్వరనిన భగవంతుండగు నుచథ్యుండు బ్రహ్మనిష్ఠుండగు బృహస్పతియు ననం బ్రసిద్ధి వహించిరి పులస్త్యుండు హవిర్భుక్కను నిజభార్యయందు నగస్త్యునిం బుట్టించె నాయగస్త్యుండు జన్మాంతరంబున జఠరాగ్నిరూపంబై ప్రవర్తించె వెండియు నా పులస్త్యుండు విశ్రవసునిం గలిగించె నా విశ్రవసునకు నిలబిలయను భార్యవలనం గుబేరుండు కైకసియను దానివలన రావణకుంభకర్ణవిభీషణులు వుట్టిరి పులహునకు గతియను భార్యయందుఁ గర్మశ్రేష్ఠుండు వరీయాంసుండు సహిష్ణుండు ననుమువ్వురు కొడుకులు జనియించిరి మఱియుఁ గ్రతువునకుఁ గ్రియయను భార్యయందు బ్రహ్మతేజంబున జ్వలింపుచున్న షష్టిసహస్రసంఖ్యలుగల వాలఖిల్యులను మహర్షులు గలిగిరి వసిష్ఠుండూర్జియను భార్యయందుఁ జిత్రకేతుండు సురోచియు విరజుండు మిత్రుండు నుల్బణుండు వసుభృద్ధ్యానుండు ద్యుమంతుండు ననుసప్తఋషులను భార్యాంతరంబున శక్తిప్రముఖపుత్రులనుం బుట్టించె నధర్వుండను వానికిఁ జిత్తియను భార్యయందు ధృతవ్రతుండు నశ్వశిరస్కుండయిన దధ్యంచుండును బుట్టె మహాత్ముండగు భృగువు ఖ్యాతియను పత్నియందు ధాతయు విధాతయు నను పుత్రద్వయంబును భగవత్పరాయణయగు శ్రీయను కన్యకం బుట్టించె నా ధాతృవిధాతృలు మేరువను వాని సుతులయిన యాయతినియతులను భార్యలవలన మృకండు ప్రాణులను కొడుకులం బుట్టించిరందు మృకండునకు మార్కండేయుండును బ్రాణునకు వేదశిరుండను మునియుం బుట్టిరి భార్గవునకు నుశనయను కన్యయందుఁ గవియనువాఁడు పుట్టె నిట్లు కర్దమదుహితలయిన కన్యకానవకంబువలనం గలిగిన సంతానపరంపరలచేత సమస్తలోకంబులు పరిపూర్ణంబులయ్యె నిట్టి సద్యఃపాపహరంబు శ్రేష్ఠతమంబునయిన కర్దమదౌహిత్రసంతానప్రకారంబు శ్రద్ధాగరిష్ఠచిత్తుండవగు నీకుం జెప్పితి నింక దక్షప్రజాపతివంశం బెఱింగింతు వినుము॥

---

*మురశాసన। విష్ణు. త్రిపురశాసన। శివుఁడు—— **ప్రశస్యంబు। ప్రసిద్ధము—— ***శివ। శామ్యతిపరమానందరూపత్వాన్నిర్వికారో భవతీతి శివః-బ్రహ్మానందస్వరూపుఁడును, నిర్వికారుఁడును, శమించియుండువాఁడును గావున శివుఁడు-లేక-శేరతే సజ్జనమనాంస్యస్మిన్నితి-ఇతనియందు సజ్జనమనస్సులుండుఁ గావున శివుఁడు-లేక-శేతే సజ్జనమనస్స్వితి శివః - సాధువుల మనస్సునందు శయనించియుండువాఁడు-లేక- శివం కల్యాణం తద్యోగాద్వా-శివమనఁగా శుభము-దానితోఁ గూడినవాఁడు-లేక-శివప్రదత్వాద్వా-శుభములనిచ్చువాఁడు.

## దక్షప్రజాపతిసంతతిని దెలియఁజేయుట

క॥ వనజజునివలనభవమం। దినయాదక్షప్రజాపతికి మనునిజనం। దనయగు ప్రసూతిసతియం। దనఘాపదియాఱ్వురుదయ మందిరికన్యల్ ॥ వ॥ ఇట్లావిర్భవించినకన్యకలందు శ్రద్ధయు, మైత్రియు, దయయు, శాంతియుఁ, దుష్టియుఁ, బుష్టియుఁ, గ్రియయు, నున్నతియు, బుద్ధియు, మేధయుఁ, దితిక్షయు, హ్రీయు, మూర్తియు, నను నామంబులుగల పదమువ్వురను ధర్మరాజున కిచ్చె నొక్క కన్యక నగ్నిదేవునకు నొక్క తెం బిత్రులకు నొక్క తె జన్మమరణాదినివర్తకుండగు నభవునకుం బెండ్లిసేసె నంత నా ధర్మపత్నులయందు శ్రద్ధవలన శ్రుతంబు, మైత్రివలన బ్రసాదంబు, దయవలన నభయంబు, శాంతివలన సుఖంబుఁ, దుష్టివలన ముదంబుఁ, బుష్టివలన స్మయంబుఁ, గ్రియవలన యోగంబు, నున్నతివలన దర్పంబు, బుద్ధివలన నర్థంబు, మేధవలన స్మృతియుఁ, దితిక్షవలన క్షేమంబు, హ్రీవలన బ్రశయంబు, మూర్తివలన సకలకల్యాణగుణోత్పత్తిస్థానభూతులగు *నరనారాయణులను ఋషులిద్దరు సంభవించిరి వారలజన్మకాలంబున॥ సీ॥ గంధవాహుఁడు మందగతి ననుకూలుఁడై వీఁచె నయ్యెను దిశల్విశదములుగ। నఖిలలోకంబులు నానందమునుఁ బొం[illegible]దుములమై దేవదుందుభులు మ్రోసెఁ। గర మొప్పజలధులు గలఁకలడంగెను మించినగతిఁ బ్రవహించె నదులు। గంధర్వకిన్నరగానము ల్వీతెంచె నప్సరోజనుల నృత్యంబు లొనరె। సురలు గురియించి రందంద విరులవాన। మునిజనంబులు సంతోషములఁ జెలంగి। వినుతులొనరించి రవ్వేళ విశ్వమెల్లఁ। బరమమంగళమై యొప్పె భవ్యచరిత॥ వ॥ ఆసమయంబున బ్రహ్మాదిదేవతలమ్మహాత్ములకడకుం జనుదెంచి యిట్లని స్తుతియించిరి॥ సీ॥ గగనస్థలిం దోఁచు గంధర్వనగరాదిరూపభేదములట్లు రూఢి మెరసి। యేయాత్మయందు దేవ యే పారమాయచే నీవిశ్వమిటు రచియింపఁబడియె నట్టియాత్మప్రకాశార్థమై యిట్టి రూపము ధర్మగృహమునఁ బుట్టినట్టి। పరమపురుష నీకుఁ బ్రణమిల్లెదము నది గాక యీసృష్టి మస్మద్ర్యవస్థి జరుగక నెయుండు కొఱకునై సత్త్వగుణము। చేసృజించినవాఁడ విట్లు శ్రీనివాస। మైనసరసీరుహప్రభ నపహసించు। మీకృపాలోకనంబుల మిందిగనుఁడు॥ క॥ అనియిట్లు దేవగణములు। వినుతింపఁ గృపాకటాక్షవీక్షణములచేఁ। గని వారు గంధమాదనమున కేగిరి తండ్రి ముదము మొప్పిరి గొనఁగన్॥ క॥ ధరణీభరము డుపుటకా నరనారాయణులు భువిజననమానయమునఁ। దరియర్జునకృష్ణాఖ్యులఁ। గురుయదువంశముల సత్త్వగుణయశులగుచున్॥ వ॥ నాఁటియు నగ్నిదేవునకు దక్షపుత్రియైన స్వాహాదేవియను భార్యయందు హుతభోజనులగు పావకుండుఁ బవమానుండు శుచియనను మువ్వురు కొడుకులు గలిగిరి వారివలనం ❀బంచచత్వారింశత్సంఖ్యలుం గలయగ్నులుత్పన్నంబులయ్యె నిట్లు పితృపితామహయుక్తంబుగా ✽నేకోనపంచాశత్సంఖ్యలుగలయగ్నులు బ్రహ్మవాదులచే యజ్ఞకర్మంబులం దగ్నిదేవతాకంబులైన యిష్టులు దత్తాన్నానంబులచేతఁ జేయంబడుచుండు నాయగ్నులెవ్వరనిన నగ్నిష్వాత్తులు బర్హిషదులు సౌమ్యులు పితృలు నాజ్యపులు సాగ్నులు నిరగ్నులు నన నేడు తెఱంగులై యుండురు దాక్షాయణియగు స్వధయను ధర్మపత్నియందు వారలవలన వయునయు ధారిణియు ననుకన్యకలుదయించి §జ్ఞానవిజ్ఞానపారగలగుచు బ్రహ్మనిష్ఠలయి పరగిరి వెండియు॥ సీ॥ దక్షప్రజాపతితన

## ఈశ్వరునకును దక్షప్రజాపతికిని విరోధము సంభవించినకథ.

యయభవుని భార్య యన్నఁగాఁ దనుసతియనుల తాంగి। సతతంబు పతిభక్తి సల్పుచుండియుఁ దనూజాతలాభమునం బడఁజాలదయ్యె। భర్గుని దెసఁ జాలఁ బ్రతికూలుఁడైనట్టి తన తండ్రి మీఁద రోషమునఁ జేసి। †వలనేదితాముగ్ధవలె నిజయోగమార్గంబున నాత్మదేహంబు విడిచె నని మునీంద్రుఁడు వినుపింప నమ్మహాత్ముఁ డయిన విదురుండు మనమున నద్భుతంబు గదురఁ దత్కథ వినవేడ్కఁ గడలుకొనఁగ। మునివరేణ్యునిఁ జూచి యిట్లనియె మఱియు॥ సీ॥ చతురాత్మ మహితవత్సలుఁడై సదయుండు దనకూఁతు సతిని నాదరముఁ జేసి। యనయంబు నఖిలచరాచరగురుఁడు నిర్వైరుండు శాంతవిగ్రహుఁడు ఘనుఁడు। జగముల కెల్లను జర్చింపఁ దేవుండు నంచితాత్మారాముఁ డలఘుమూర్తి। శీలవంతులలోన శ్రేష్ఠుండునగునట్టి భవునందు విద్వేషపడుట కేమి। కారణము సతిదా నేమికారణమున। విడువరానట్టి ప్రాణము ల్విడిచె మఱియు। ?శ్వశురజామాతృవిద్వేష◎సరణి నాకు। దెలియ నానతియిమ్ము సుధీవిధేయ॥ క॥ అనియడిగిన యవ్విదురునిఁ। గనుఁగొని మైత్రేయుఁ డనియెఁ గౌతుక మొప్పన్। విను మనఘ తొల్లి బ్రహ్మలు। జనసుతముగఁ జేయునట్టి ‡సత్రముఁ జూడన్॥ చ॥ సరసిజగర్భయోగిజనశర్వసుపర్వమునీంద్ర

---

* నర। ఋష్యతే క్షీయ్యతే ఇతి-రః-రిష్ క్షయే ధాతుః-అనఁగా నశింపఁబడునదియే దోదానికి-రః-అని పేరు-సనభవతీతి నరః-అవినాశ్యాత్మా-నాశములేనివస్తువు నరుఁడు — ❀పంచచత్వారింశత్। నలుబదియైదు — ✽ఏకోనపంచాశత్। నలుబదితొమ్మిది — §జ్ఞానవిజ్ఞానపారగలగుచు శాస్త్రజన్యజ్ఞానమును, అనుభవజన్యజ్ఞానమును, సంపూర్ణముగ గలవారై — †వలనేదితాముగ్ధవలె। యుక్తిదోఁపనిదై తానుమూఢురాలివలె — ?శ్వశురజామాతృ। మామమొక్క, అల్లునియొక్క — ◎సరణి। మార్గము — ‡సత్రము। యాగము.

హవ్యభుక్ప్రదను ఋషిప్రజాపతులు భక్తిమెయిం జనుదెంచియుండన । త్తరణిసమాన తేజుఁడగు దక్షుఁడు వచ్చినఁ దత్సద
స్యులాదరమున లేచిరప్పుడు పితామహభర్గులు దక్క నందఱున్ ॥ క ॥ చనుదెంచిన యాదక్షుఁడు వనజజునకు మ్రొక్కి భక్తి
వశులై సభ్యు ల్దనకిచ్చిన పూజలు గై । కొనియగ్ర్యాసనమునందుఁ గూర్చుండితగన్ ॥ గీ ॥ తన్నుఁ బొడగని సభ్యులందఱును లేవ ।
నాసనము దిగనట్టి పురారివలనఁ । గన్నుఁగవలను విస్ఫులింగములు చెదరఁ । జూచి యిట్లను రోషవిస్ఫురణ మెఱయ ॥ గీ ॥ వినుఁడు
మీరలు రోదమాని విబుధమునిహు । తాశనాదిసురోత్తములార మోహ । మత్సరోక్తులుగావు నామాటలనుచు । వారికిం
దఱికాపుర వైరిఁ జూపి ॥ సీ ॥ పరికింప నితఁడు దిక్పాలయశోహానికరుఁడీక్రియాశూన్యపరుని చేతఁ । గర మొప్పు సజ్జనాచరిత
మార్గము దూషితం బయ్యె నెన్నఁగ తత్రపుండు । మహితసావిత్రీసమానను సాధ్వి నస్మత్తనూజను మృగశాబనేత్ర । సకల
భూమీసురజనసమక్షమున *మర్కటలోచనుఁడు గరగ్రహణమర్థిఁ । జేసి తాశిష్యభావంబుఁ జెందుటాత్మ । దలఁచి ప్ర
త్యుద్గమాభివందనము లెలమి । నడుపకుండిన మానె వినతుఁడు గాక । నోరి మాటకుఁ దన కేమి గోరువోయె ॥ సీ ॥ అనయంబు
లుప్తక్రియాకలాపుఁడు మానహీనుఁడు మర్యాద లేనివాఁడు । మత్తప్రచారుఁడున్మత్తప్రియుఁడు దిగంబరుఁడు భూతప్రే
తపరివృతుండు । దామసప్రమథభూతములకు నాథుండు భూతిలిప్తుఁడస్థిభూషణుండు । నష్టశౌచుండు నున్మదనాంగుఁడును
దుష్టహృదయుండునుగ్రపరేతభూని । కేతనుఁడు వితతశ్మశ్రుకేశుఁడశుచి । యయిన యితనికి శివనాముఁడను ప్రవాద । మె
టులఁ గలిగెన శివుఁడగునితని నెఱిఁగి । యెఱిఁగి వేదంబు శూద్రునకిచ్చినటుల ॥ వ ॥ ఇతనికి నస్మత్తనయను విధిప్రేరితుండనై
యిచ్చితి ॥ క ॥ అని యిట్టులు ప్రతికూలవచనములు దక్షుండు పలికి శపియింతునుశ । ర్వుని నని జలములుగొని కర । మునసలిలి దిట్లని
యెరోషమున ననఘాత్మా ॥ క ॥ ఇతఁడింద్రోపేంద్రపరీవృతుఁడై మఖసమయమున హవిర్భాగము దేవతలం గూడఁగ మహి
తని యతిఁ బొందక యుండుఁ గాక యని శపియించెన్ ॥ వ ॥ ఇట్లు దక్షుండు పల్కిన గర్హితవాక్యంబులు విని నిందితంబులుగను
డినయథార్థంబున వాస్తవంబులగుచు భగవంతుండగు రుద్రునందు ననిందితంబులై స్తుతిరూపంబుల నొప్పఁ దదనంతరంబ
రుద్రునకు శాపంబిచ్చి దక్షుండు సదస్యముఖ్యులచేన కృత్యంబని నిషేధింపఁబడి ప్రవృద్ధంబయిన క్రోధంబుతో దనిజనివా
సమ్మునకుం జనియెనంత గిరిశానుచరాగ్రేసరుండగు నందికేశ్వరుండు దక్షుండు నిట్లు శపియించిన శాపంబు నత్యం
బల్కిన యనర్హవాక్యంబులును విని కోపారుణితలోచనుండై యిట్లను నీదక్షుండు మర్త్యశరీరంబు శ్రేష్ఠంబుగాఁ దలంచి
యప్రతిద్రోహియయిన భగవంతునందు భేదదర్శియై యపరాధంబుఁ గావించె నట్టి మూఢాత్ముండు తత్త్వవిముఖుండగు
మఱియుం గూటధర్మంబులయిన నివాసంబుల గ్రామ్యసుఖాకాంక్షులం జేసిన స్తంభుఁడై యర్థవాదంబులయిన వేదంబుల చేత న
ష్టమనీషం గలిగి కర్మతంత్రంబు విస్తృతంబు సేయుచు దేహాదికంబులు పాదేయంబులుగాఁ దలఁచుచు బుద్ధిచేత నాత్మతత్త్వం
బు మఱచి వర్తించి పశుప్రాయుండై స్త్రీకాముండునగు నిదియునుం గాక దక్షుండచిరకాలంబున మేషముఖుండగునని మ
ఱియు ॥ మ ॥ అనయంబుం దనమానసంబున నవిద్యన్ముఖ్యతత్త్వంబుగాఁ । గని గౌరీశుఁ దిరస్కరించిన యసత్కర్మాత్మసేవ
క్షుఁడా మనువర్తించినవారు సంసరణకర్మారంభులై నిచ్చలు । జననంబందుచుఁ జచ్చుచున్ మఱల నొండం బుట్టుచున్ వర్తి
లున్ ॥ వ ॥ అదియునుం గాక యీహరద్వేషులయిన ద్విజులర్థవాదబహుళంబులైన వేదవాక్యంబులవలన మధుగంధసమం
బైన చిత్తక్షోభంబు చేత విమోహితమనస్కులై కర్మాసక్తులగుచు మఱియును భక్ష్యాభక్ష్యవిచారశూన్యులై దేహాది
పోషణంబుకొఱకు ధరియింపఁబడు విద్యాతపోవ్రతంబులుగలవారలై ధనదేహేంద్రియంబులయందుఁ బ్రీతిం బొందియా
చకులై విహరింతురని నందికేశ్వరుండు బ్రాహ్మణజనంబుల శపియించిన వచనంబులు విని భృగుమహాముని వారల శపియిం
పంబూని యిట్లనియె ॥ గీ ॥ వసుధ నెవ్వారు ధూర్జటివ్రతులు వారు । వారికనుకూలులగుదు రెవ్వారు వార । లట్టి సచ్ఛాస్త్రప
రిపంథులైనవారు । నవనిపాషండులయ్యెదరని శపించె ॥ సీ ॥ సకలవర్ణాశ్రమాచారహేతువు లోకములకు మంగళమార్గము
ను సనాతనము పూర్వఋషిసమ్మతము జనార్దనమూలమును నిత్యమును శుద్ధమును శివంబు । నార్యపథానుగంబగు వేదము
ను విప్రగణము నిందించిన కారణమున । నేశివదీక్షయందేని మధ్యమపూజ్యుఁడై భూతపతి దైవమగుచునుండు । నందు మీర
లు భస్మజటాస్థిధార । ణములఁ దగి మూఢబుద్ధులు నష్టశౌచు । లై నశింతురు పాషండులగుచు ననుచు । శాపమొనరించె నాద్వి
జసత్తముండు ॥ వ ॥ ఇట్లన్యోన్యంబును శాపంబులం బొందియు భగవదనుగ్రహంబు గలవారలగుటం జేసి నాశంబు నొంద
రైరంత విమనస్కుండగుచు ననుచరసమేతుండై భవుండు సనియెనంత ॥ సీ ॥ అనఘాత్మ యేయజ్ఞమునందు సర్వశ్రేష్ఠుఁడగు
హరి సంపూజ్యుఁడై వెలుంగు । నట్టి యజ్ఞంబు సమ్యగ్విధానమున సహస్రవత్సరములు నజుఁ డొనర్చెఁ । గర మొప్పన మరగం

*మర్కటలోచనుఁడు । శివుఁడు.

గాయమునాసంగమంబునఁగలుగు ప్రయాగయందు। నవభృథస్నానంబులతిభక్తిఁగావించి గతకల్మషాత్ములై ఘనతకెక్కి। తగనిజాశ్రమభూములఁదలఁచి వార। లందఱును వేడ్కతోఁజనిరనుచు విదురు। నకును మైత్రేయుఁడనుమునినాయ

§ దక్షప్రజాపతి యజ్ఞముఁజేయునపుడు దాక్షాయణి యచ్చటికిఁబోవుట. §

కుండు। నెఱుఁగ వినిపించి వెండియునిట్లనియె॥ వ॥ అంత శ్వశురుండగు దక్షునకు జామాతయైన భర్గునకును న్యోన్యవిరోధంబులు పెరుగుచుండ నతి చిరంబగు కాలంబరిగెనంత దక్షుండు రుద్రవిహీనంబగు యాగంబు లేనిదియైనను శర్వుతోడి పూర్వవిరోధంబునను బరమేష్ఠికృతంబైన సకల ప్రజాపతి విభుత్వగర్వంబునం జేసి బ్రహ్మనిష్ఠులగు నీశ్వరాదులధిక్కరించియరుద్రంబుగా వాజపేయసవనంబు గావించి తదనంతరంబ బృహస్పతిసవన నామకంబైన మఖంబు సేయనుపక్రమించిన నచ్చటికిం గ్రమంబున॥ చ॥ కరమనురక్తి నమ్మఖముగన్గొను వేడుక *తొంగలింపఁగాఁ। బరమముని ప్రజాపతి §సుపర్వమహర్షి వరుల్ సభార్యులై। పరువడివచ్చియందఱుశుభస్థితిదీవనలిచ్చి దక్షుచేఁ। బొరిఁబొరి నచ్చటన్ విహితపూజలనొందిరి సమ్మదంబునన్॥ గీ॥ దక్షతనయ సతీదేవి దవిలి యాత్మ। సదనమునను౦డి జనకుని సవనమహిమ। గగనచరులు నుతింప నాకలకలంబు। వినికుతూహల మొప్పఁగ ‡విష్ణుఁజూడ॥ వ॥ అయ్యవసరంబునఁ దదుత్సవదర్శనకుతూహలులై సర్వదిక్కులవారును జను సమయంబున॥ సీ॥ తనరారు నవరత్న ◊తాటంకరోచులు చెక్కుటద్దములతోఁ జెలిమి సేయ। మహనీయ తపనీయమయపదకమ్యతులంసభాగంబుల నావరింప। నంచిత చీనిచీనాంబర ప్రభలతో ¥మేఖలకాంతులు ¶మేలమాడఁ। జంచల †సారంగచారుపిలోచన ప్రభలు నద్దిక్కులఁ ✿ప్రబ్బికొనఁగ। మించు వేడుక భర్తృసమేతము గను। మానితములైన దివ్యవిమానయానలగుచు నాకాశపథమున నరుగుచున్న। ఖచరగంధర్వకిన్నరాంగనలఁ జూచి॥ క॥ సతి దనపతి యగునా పశు। పతిఁ జూచి సముత్సుకమున భాషించెఁ బ్రజా। పతి మీమామ మఖము సు। వ్రతమతి నొనరింపుచున్నవాఁడని వింటే॥ క॥ కావున నయ్యజ్ఞమునకు। నీవిబుధగణంబులర్థి నేగెదరదిగో। దేవ మనమిప్పుడచటికిఁ। బోవలయును వేడ్క నాకుఁ బుట్టెడు నభవా॥ క॥ ఆయజ్ఞముఁ గనుఁగొనఁగా। నాయనుజలు భక్తిఁ బ్రాణనాథులతోడ। న్బాయక వత్తురు మానము। నోపిన నేవారి నచటఁ బొడగనఁ గల్గున్॥ క॥ జనకుని మఖమునకర్థిం। జనినీతోఁ ✿పారిబర్హసంజ్ఞికములచేఁ। దనరిన భూషణములఁ గై। కొన వేడ్క జనించె నీశ కుజనవినాశా॥ క॥ నాతోడి స్నేహము గల। మాతను సత్సోదరీ సమాజము ఋషిసం। ఘాతకృత మఖసమంచిత। ✿కేతువుఁగన వేడ్క గగనకేశ జనించెన్॥ వ॥ అదియునుంగాక దేవా మహాశ్చర్యకరంబై గుణత్రయాత్మకంబగు ప్రపంచంబు భవదీయ మాయావినిర్మితంబగుటం జేసి నీకునాశ్చర్యకరంబు గాదయినను భవదీయతత్త్వంబెఱుంగఁజాలక కామినీస్వభావంబుగలిగి కృపణురాల నయిన మదీయ జన్మభూమిఁ గనుంగొననిచ్ఛయించితినని వెండియు నిట్లనియె॥ చ॥ ముదమునఁ దమ్మఖోద్భవ విభూతిఁ గనుంగొన నన్యకామినుల్ ✿పదువులు గట్టి భూషణవిభాసితలై నిజనాథయుక్తలై। మదకలహంస పాండురసమంచిత దివ్యవిమానయానలై। యదె చనుచున్నవారు గను మభ్రపథంబున నీలకంధరా॥ క॥ అనఘా విను లోకంబుల। జనకుని గేహమునఁ గలుగు సకలసుఖంబు। ల్దనయలు చనిసంప్రీతి। న్గనుఁగొన కేరీతి నిల్వఁ గాయము లభవా॥ క॥ అనయముఁ బిలువక యుండ। న్జననను చితమంటివేని జనక గురుసుహృ। జ్జననాయకగేహములకుఁ। జనుచుందురు పిలువకున్న సజ్జనులభవా॥ వ॥ అని మఱియు నిట్లనియె దేవా నాయందుఁ బ్రసన్నుండవై మదీయమనోరథంబుఁ దీర్ప నర్హుండవు సమధికజ్ఞానంబు గల నీచేత నేను భవదీయదేహంబునందర్ధంబున ధరియింపంబడితినట్టి నన్ను ననుగ్రహింపవలయునని ప్రార్థించిన మందస్మితవదనారవిందుండగుచు జగత్స్రష్టలసమక్షంబున దక్షుండు దన్నాడిన ✿మర్మభేదంబులయిన శిహూహాక వాక్యసాయకంబులం దలంచుచు నిట్లనియె॥ సీ॥ కల్యాణి నీమాట గడు నొప్పు బంధువుల్ పిలువకుండిననుసంప్రీతిఁ జనుద। రంటివి యది లెస్సయైనను దేహాభిమానమదమున నమర్షమునను। గడఁగి యాకోపితఘనకోపదృష్టులు గారేని బోఁదగుఁగాని వినుము। వినుతవిద్యాతపోవిత్తవయోరూపకులములు సుజనులకును గుణంబు। లివియ కుజనుల యెడ దోషహేతుకంబు। లై వివేకంబు చెఱుపు మహాత్ములైన। వారి మాహాత్మ్యమాత్మగర్వమునఁ జేసి। జడులు వొడగానఁ జాలరు జలజ

---

*తొంగలింపఁగా। ప్రకాశింపఁగా — §సుపర్వ। దేవతలు — ‡విష్ణు। ఆకాశము — ◊తాటంకరోచులు। కర్ణాభరణకాంతులు — ¥మేఖల। ఒడ్డాణము — ¶మేలమాడెన్। కోడిగమాడుచుండఁగాను — †సారంగ। లేడి — ✿ప్రబ్బికొనఁగన్। కమ్ముకొనుచుండఁగాను. — ✿పారిబర్హ। పరిబర్హ। అనఁగా రాజయోగ్యములగు ఛత్రచామరాదివస్తువులు. — ✿కేతువు। అగ్ని-శ్లో॥ కేతుర్గ్రహ ధ్వజే చిహ్నే కిరణోత్పాతవహ్నిషు। ఇతి నానార్థరత్నమాలాయాం — ✿పదువులు। గుంపులు. … ✿మర్మ। ఆయము-గుట్టు — శిహూహాక। వంచన.

నేత్ర॥ క॥ వినుమట్లుకుజనులగుదు। ర్జనులగృహంబులకు బంధుసరణి నిబోవ। న్జనదు వినీతులకది కడు। నను వితమైయుం
డునింతియదియెట్లనినన్॥ గీ॥ కుటిలబుద్ధులైనకుజనులయిండ్లకు। నార్యులేగవారనాదరమున। బొమలుముడివడంగ
భూరిరోషాతురులై। చూతురదియుఁగాక సువతివినుము॥ చ॥ సమదరిపుప్రయుక్తపటుసాయకజర్ఝరితాంగుఁడయ్యు
దుః। ఖమునుదొరంగి నిద్రఁగనుఁగానికృశింపఁడుమానవుండునో। యుమాపినుమిష్టబాంధవదురుక్తులుమర్మములంటనాఁ
టఁజి। త్తముననహర్నిశంబుపరితాపమునొందికృశించునెప్పుడున్॥ క॥ వినుముత్కృష్టుండగుద। క్షునికిఁదనూభవల
లోనఁగూరిమిసుతవై। నను నాసంబంధంబున। జనకునిచేఁబూజవడయఁజాలవుతరుణీ॥ వ॥ అదియెట్లనిన నీచేతభవత్సం
బంధంబునం జేసి పూజఁబడయమికినతనికినీకువిరోధంబునకుహేతువెట్టిదనియంటివేని॥ మ॥ నిరహంకారమహాత్మసమృ
ద్ధిసుజనానింద్యోల్లసత్కీర్తియుం। ధరఁగామించియశక్తులై మనములన్దండహ్యమానేంద్రియా। తురులై కొండఱుమ
చ్చరింతురుమహాత్ముండీశ్వరుండైనయా। హరితోబద్ధవిరోధముల్దొడరుదైత్యశ్రేణిచందంబునన్॥ వ॥ అదియునుంగా
కనీవతనికింబ్రత్యుత్థానాభివందనంబులుఁగావింపకుండుటంజేసియతండుదిరస్కృతుండయ్యెనంటివేనిలోకంబులజను
లన్యోన్యంబును బ్రత్యుత్థానాభివందనంబులుగావింతురదియప్రాజ్ఞులయినవారుసర్వభూతాంతర్యామియయినపరమ
పురుషుండు నిత్యపరిపూర్ణుండుగావునఁగాయికవ్యాపారంబయుక్తంబనితదుద్దేశంబుగామనంబునందు నమస్కారాది
కంబులుగావింతురు కాని దేహాభిమానంబులుగలుగుపురుషులందుఁగావింపరుగాన నేనును వసుదేవశబ్దవాచ్యుండు శుద్ధస
త్వమయుండునంతఃకరణంబునందు నావరణ విరహితుండునయి ప్రకాశించు వాసుదేవునకు నాహృదయంబున నమస్క
రింపుచుండుదు నిట్లనపరాధియయిననన్నుఁ బూర్వంబున బ్రహ్మలుసేయు సత్రంబునందు దురుక్తులంజేసిపరాభవించి
నమద్వేషియయినదక్షుండు భవజ్జనకుండయిననతఁడును దదనువర్తనులయినవారలును జూడఁదగరుగావున మద్వచనా
తిక్రమంబుంజేసియరిగితివేనియచట నీకుఁబరాభవంబు సంప్రాప్తంబగు లోకంబున బంధుజనంబులవలనఁబూజవడయ
కతిరస్కారంబునొందుటచచ్చుటయకాదె యనిపలికి మఱియు నభవుండు పొమ్మనియనుజ్ఞనిచ్చిననచ్చటనవమానంబునం
జేసియశుభంబగుననియు నిచ్చటఁబొమ్మనక నివారించినమనోవేదనయగుననియు మనంబునందలపోయుచుమూరకుండె
నంత॥ సీ॥ సతిసుహృద్దర్శనేచ్ఛాప్రతికూలదుఃఖస్వాంతయగుచునంగములువడఁక।నందందఁదొరిగెడునశ్రుపూరంబులు
గండభాగంబులఁగడలుకొనఁగ।నున్నతస్తనమండలోపరిహారముల్వ్రేడినిట్టూర్పులవెచ్చఁగంద।నతిశోకరోషాకులాత్యం
తదోధూయమానమైహృదయంబుమలగుచుండ। మఱియుఁగుపితాత్మయై స్వసమానరహితు। నాత్మదేహంబుసగమిచ్చి
నట్టిధవుని।విడిచిమూఢాత్మయగుచునవ్వేలఁదిసనియె।జనకుఁజూచెడువేడుకసందడింప॥సీ॥మానినిచనుచుండమణిమన్మ
దాదిసహస్రసంఖ్యాతరుద్రానుచరులు। యక్షులునిర్భయులై వృషభేంద్రునిమున్నిడికొనుచునమ్మదితదాల్చు। కందు
కాంబుజశారికాతాళవృంతదర్పణధవళాతపత్రప్రసూన। మాలికాసౌవర్ణమణివిభూషణఘనసారకస్తూరికాచందనా
ది। వస్తువులుగొంచునేగిశర్వాణిఁగదిసి। శంఖదుందుభివేణునిస్వనములొప్ప। మానితంబయినవృషభేంద్రయానఁజేసి।
యజ్ఞభూమార్గులైయర్థినరిగియరిగి॥ముందట॥చ॥మనమున మోదమందుచును మాతరుణీమణిగాంచెఁజారువ్యా।త్కనక
కుశాజినాయసనికాయవినిర్మితపాత్రసీమమై। యనుపమవేదఘోషసుమహత్పశుబంధనకర్మభూమమున్। మునివిబు
ధాభిరామముసముజ్జ్వలహోమముయాగధామమున్॥వ॥ ఇట్లుగనుంగొనియజ్ఞశాలంబ్రవేశించిన॥క॥చనుదెంచి
నయమ్మగువను।జననియుసోదరులుదక్కసభఁగలజనులెల్లసుదక్షువలనిభయమున।ననయమునపుడాదరింపరైరిమహా
త్మా॥క॥మఱిదల్లియుఁబినతల్లులు। పరిరంభణమాచరింపఁబరితోషాశ్రు। ల్దొరుగఁగడగ్గుత్తికతో।సరసిజముఖిసేమమర
యసతిదానంతన్॥క॥ జనకుండవమానించుట।యునుసోదరలర్థిఁదనకునుచితక్రియఁజే।సినపూజలనందకశో।భనమరసి
నమారుమాటఁబలుకకయుండెన్॥ వ॥ ఇట్లుదండ్రిచేనాదరింపఁబడనిదై విభుండైనయీశ్వరునందునాహ్వానక్రియా
శూన్యత్వరూపంబైనతిరస్కారంబునరుద్రభాగంబైనయజ్ఞంబుఁగనుంగొనినిజరోషానలంబునలోకంబులుభస్మంబుసే
యంబూనినతెఱంగుననుద్రేకించిరుద్రవిద్వేషియుఁగ్రతుకర్మాభ్యాసగర్విష్ఠుండునగుదక్షునివధియింతుమనుచులేచి
నభూతగణంబులనివారించిరోషావ్యక్తభాషణంబులనిట్లనియెలోకంబునశరీరధారులైనజీవులకుఁబ్రియాత్మకుండైన
యీశ్వరునకుఁబ్రియాప్రియులు నధికులును లేరట్టిసకల*కారణుండునిర్మత్సరుండునైనరుద్రునందునీవుదక్క నెవ్వం

* కారణుండు।కరోతీతి కారణః-చేయువాఁడని అర్థము-అనఁగా-ప్రపంచోత్పత్తిస్థితినాశములఁ జేయువాఁడనుట.

డు ప్రతికూలంబాచరించు నదియునుంగాక మిముబోటివారలు పరులవలని గుణంబులందవగుణంబుల నాపాదింతురు మఱియుం గొందఱు మధ్యస్థులైనవారలు పరులగుణంబులయందు దోషంబుల నాపాదింపరు కొందఱు సాధువర్తనంబుగల వారలు పరులదోషంబులనైన గుణంబులుగా ననుగ్రహింతురు మఱియుం గొందఱుత్తమోత్తములు పరులయందు దోషంబుల నాపాదింపక తుచ్ఛగుణంబులు గలిగిననుసద్గుణంబులుగాఁ గైకొందు రట్టి మహాత్ములయందు నీవు పాపబుద్ధిం గల్పించితివని వెండియు నిట్లను మహాత్ములగు వారల పాదధూళిచే నిరస్తప్రభావులై జడస్వభావంబు గల దేహంబు నాత్మయని పల్కు కుజనులగు వారు మహాత్ముల నిందించుట గార్యంబు గాదదియు వారికనుచితంబగునని వెండియు నిట్లనియె॥ సీ॥ అనయంబు శివయను నక్షరద్వయమర్థి వాక్కునం బలుక భావమునం దలప। సర్వజీవుల పాపసంఘముల్చెడు నట్టి మహితాత్ము నందు నమంగళుండ। వగు నీవు విద్వేషివగుట కాశ్చర్యంబు నందెద విను మునీవదియుఁ గాక। చర్చింప నెవ్వని చరణపద్మంబుల నరసి బ్రహ్మానందమను మరంద। మతులభక్తినిద మహృదయంబుల నెడి। తుమ్మెదల చేతఁ గ్రోలి సంతుష్టచిత్తు। లగు మరత్యంత విజ్ఞానులట్టి దేవు। నం ద్రోహంబు సేసితే మందు నిన్ను॥ క॥ మఱి గడఁ నమ్మహితాత్ముని। యతిముదిఁ జరణాబ్జయుగము నఖిలజగంబు। ల్నెఱిఁ గోరిన కోరికలం। దిమిడి వర్షించు నతనిఁ దగునే దెగడన్॥ చ॥ పరగఁ జితాస్థిభస్మనృకపాలజటాధరుఁ డున్నరేతభూ। చరుఁడు పిశాచయుక్తుఁడని ✠శర్వు నమంగళుఁ గాఁ దలంపరె। వ్వరు నొకఁ డీవు దక్క మఱి వాక్పతిముఖ్యులు నమ్మహాత్ము స। చ్చరణసరోజరేణువులు సమ్మతిఁ దాల్తురు మస్తకంబులన్॥ చ॥ నెలకొని ధర్మపాలన విసర్మలు ¶భర్గుఁ దిరస్కరించున। కల్మషుని జిహ్వఁ గోయఁదగుఁ గాక టు సేయఁగ నోపఁడేని దాఁ। బొలియుట యొప్పు రెంటికిఁ బ్రభుత్వము చాలమిఁ గర్ణరంధ్రము। ల్బలువుగ మూసికొంచుఁ జనఁ బాడియటం డ్రురుధర్మవర్తనుల్॥ అదిగావున॥ మ॥ జనుఁ డజ్ఞానమునన్నుజించిన జుగుప్సంబయిన యన్నంబు స। య్యన వెళ్ళించి పవిత్రుఁడయిన గతి మత్స్వాత్ముండనై యీశ్వరున్। ఘను నిందించిన నీతనూభవ యనంగా నొర్వ నీ హేయభా। జనమయినట్టి శరీరము న్విడిచి భాస్వచ్ఛుద్ధివాటిల్లెదన్॥ వ॥ అదియునుంగాక దేవతలకాకాశగమనంబు, మనుష్యులకు భూతలగమనంబును, స్వాభావికంబులైనట్లు ప్రవృత్తినివృత్తిలక్షణకర్మంబులు రాగవైరాగ్యాధికారంబులుగా వేదంబులు విధించుటం జేసి రాగయుక్తులయి కర్మతంత్రులయిన సంసారులకు వైరాగ్యయుక్తులయి §యాత్మారాము లయిన యోగిజనులకు విధినిషేధరూపంబులయిన వైదిక కర్మంబులు గలుగుటయు లేకుండుటయు నైజంబులగుటం జేసి స్వధర్మనిష్ఠుండగు వాని నిందింపం జనదు యుభయకర్మశూన్యుండు బ్రహ్మభూతుండునయిన సదాశివుని క్రియాశూన్యుండని నిందించుట పాపంబగుటం దండ్రీ సంకల్పమాత్రప్రభవంబులగుటం జేసి మహాయోగిజనసేవ్యంబులైనయస్మదీయంబులగు ✠నణిమాద్యష్టైశ్వర్యంబులు నీకు సంభవింపవు భవదీయంబగు నైశ్వర్యంబులు ‖ధూమమార్గప్రవృత్తులై యాగాన్నభోక్తలయిన వారిచేత యజ్ఞశాలయందె చాల నుతియింపం బడియుండుఁ గాన నీ మనంబున నేనధిక సంపన్నుఁడ ననియుఁ ?జితాభస్మాస్థిధారణుండైన రుద్రుండు దరిద్రుండనియును గర్వింపం జనదని వెండియు నిట్లనియె॥ ఉ॥ నీలగళాపరాధియగు నీకుఁ దనూభవనౌట చాలదా। చాలుఁ గుమర్త్య నీమతను జాతన నమ్మ దిసిగ్గువుట్టెడి। జ్జాలధరన్మహాత్ములకుఁ జయ్యన నెగ్గొనరించు జన్మము। న్నాలుపనేతలంప జనకా కుటిలాత్మక యెన్నిచూడఁగన్॥ చ॥ వరవృషకేతనుండు భగవంతుఁడునయిన **హరుండు నన్ను నా। దరపరిహాసవాక్యముల దక్షతనూభవ యంచుఁ బిల్వ నేఁ। బురపురబొక్కుచున్మదముఁ బొందక నర్మవచఃస్మితంబుల। న్దొరుగుదు మీ తనూజననదుఃఖముకంటెను జచ్చుటొప్పగున్॥ వ॥ అనియిట్లు యజ్ఞసభామధ్యంబునం బ్రతికూలుండగు దక్షునుద్దేశించి పలికి కామక్రోధాదిశత్రువిఘాతినియగు సతీదేవి *యుదఙ్ముఖియయి జలంబుల నాచమనంబు చేసి శుచిర్మౌనంబు ధరియించి జితాసనయై భూమియందాసీనయగుచు యోగమార్గంబునం జేసి శరీరత్యాగంబు సేయందలంచి॥ సీ॥ వరుసఁ బ్రాణాపానవాయునిరోధంబు గావించి వాని నేకమున నాభితలమునఁ గూర్చి యంతట నుదానము దాఁకి నెగయించి బుద్ధితో హృదయపద్మమున నిల్పి వాని మెల్లనఁ గంఠమార్గమునను మరి భ్రూమధ్యమున వసింపఁ। జేసి శివాంఘ్రి రాజీవచింతనముచే నాథునిఁ దక్క నన్యంబుఁ జూడ। క మ్మహాత్ముని ‖యంక

✠ శర్వ। ప్రళయే భూతాని శృణాతీతి శర్వః - ప్రళయకాలమందు భూతములను హింసించువాఁడని యర్థము - శౄహింసాయాం - అని ధాతువు. ¶ భర్గ। భజ్యంతే కామకాలాదయో౽నేనేతి భర్గః - ఈతనిచేత కామకాలాదులు కాలపాకమును బొందింపఁబడిరి గావున భర్గుఁ డని యర్థము. § ఆత్మారామః। ప్రత్యగాత్మస్వరూపుఁడైన తనయందె క్రీడించువాఁడు — ✠ అణిమాది। అణిమ మొదలైన - శ్లో॥ అణిమా మహిమా చైవ గరిమా లఘిమా తథా। ప్రాప్తిః ప్రాకామ్య మీశత్వం వశిత్వం చాష్టభూతయః॥ — ‖ ధూమమార్గప్రవృత్తులై। జననమరణసహితులై — ? చిత। సాద-చితి. — ** హరుండు। ప్రళయకాలమందు సర్వమును హరించువాఁడు - శివుఁడు. ... *ఉదఙ్ముఖియై। ఉత్తరపుముఖము గనున్నదయి — ‖ అంక। తొడ.

పీఠంబునందు। నాదరంబుననుండు దేహంబు దక్షు। వలనిరోషంబునను విడువంగఁ దలఁచి। తాల్చెఁదనువున ననిలాగ్నిధార
ణములు॥ వ॥ ఇట్లు ధరియించి గతకల్మషంబైన దేహంబు గల సతీదేవి నిజయోగసమాధిజనితంబైన వహ్నిచేఁ దగ్ధం
బయ్యె నంత॥ క॥ అది గనుఁగొని హాహారవ। ము దివంగనిల్ల నిరిమానవులు త్రిదశులు నీ। మదిరాక్షి యకట దేహము। వదలెం గా
దా దక్షుతోడి వైరము కతనన్॥ మఱియును॥ సీ॥ సకలచరాచర జనకుఁడు ఘనుఁడట్టి యీ దక్షుం డిపుడు తనకూర్మి తనయ మాన। వతి
పూజనీయ యీ సతి దన చేన వమానంబు నొంది పమత్తుమంచుఁ। గాయంబుఁ దొరఁగంగఁ గనుఁగొనుచున్న వాఁడిట్టి మరా
త్ముఁ డెందేనిఁ గలఁడె। యనుచుఁ జిత్తంబుల నాశ్చర్యములఁ బొందిరది యునుఁ గాక నిట్లు నిరియిట్టి దుష్టచిత్తుండు * బ్రహ్మబం
ధుండునయిన యీతఁడన యంబుఁ దాన పఖ్యాతిఁ బొందు। నిందఁబడి మీఁదమ గ్గతిఁ జెందుఁ గాక। యనుచు జనములు వలుకున
య్యవసరమున॥ క॥ దేహము విడిచిన సతిఁ గని। బాహాబల మొప్పరుద్రపార్షదులును దక్షు। ద్రోహిం ద్రుంచుటకై యు। త్సా
హంబున లేచి రసిగదాపాణులునై॥ క॥ ఆరవము వుడీక్షించి మహారోషముతోడ భృగుమహాముని క్రతుసంహారక మారక
ముగు నభిచారిక హోమంబొనర్చె ¶ సరభస మొప్పన్॥ వ॥ ఇట్లు దక్షిణాగ్నియందు వ్రేల్చిన నందుఁ దపంబొనర్చి సోమ
లోకంబుననుండు సహస్రసంఖ్యలు గల ఋభు నామధేయులైన దేవతలుదయించి బ్రహ్మతేజంబునం జేసి దివ్యవిమానులై
యుల్ముకంబులు సాధనంబులుగా ధరియించి రుద్రపార్షదులైన ప్రమథగుహ్యక గణంబులఁ బారం దోలిన వారును పరాజి
తులై రితదనంతరంబ నారదువలన నభవుండు దండ్రి చేన సత్కృతురాలగుటం జేసి భవానిపంచత్వంబునొందుటయుం
ప్రమథగణంబులు ఋభు నామక దేవతలచేఁ బరాజితులగుటయు విని॥ శా॥ ఆద్యంతు గ్రుఁడు నీలకంఠుఁడిభదైత్యారాతిద

## శ్రీమహేశ్వరుండు వీరభద్రుని చేత దక్షుయజ్ఞంబు ధ్వంసంబు చేయించుట.

ష్టోష్ఠుఁడై। మాద్యద్భూరిమృగేంద్రఘోషమున భీమ ప్రక్రియన్నవ్వుచు। న్విద్యుద్వహ్నిశిఖాసముచ్చయరుచిన్వెల్గొం
దుచుం జజ్జట। న్సద్యఃక్రోధముతోడఁ బుచ్చివయిచెన్ ధాత్రీచక్రమధ్యంబునన్॥ వ॥ ఇట్లు పెటికి వైచిన రుద్రునిజటయందు॥
సీ॥ ‡ అభ్రంలిహోదభ్ర విభ్రమాభ్రభ్రమకృన్నీలదీర్ఘశరీర మమరఁ। బ్రజ్వలజ్జ్వలన దీప్తజ్వాలికాజాల జాజ్వల్యమా
నకేశములు మెఱయఁ। జండదిగ్వేదండ శుండాభ దోర్దండ సాహస్రధృత హేతిసంఘ మొప్ప। వీక్షణత్రయ లోకవీక్షణద్యు
తిలోకవీక్షణతతి దుర్నిరీక్షమగుచుఁ। గ్రకచ కఠిన కరాళదంష్ట్రిలు వెలుంగ। ఘనకపాలాస్థివనమాలికలును దనర। నఖిల
లోకభయంకరుఁడగుచు వీరభద్రుఁడుదయించె మారటరుద్రుఁడగుచు॥ గీ॥ వీరభద్రుండు విహతవిద్వేషి భద్రుఁ డగు
చుఁ దన వేయు చేతులు మొగిచి వినయ। మెసఁగ నే నేమి సేయుదు నెఱుఁగ నాకు। నానతిమ్మనన తనికయ్యభవుఁడనియె॥ చ॥ గు
రుభుజశౌర్య భూరిరణకోవిదమద్భటకోటికెల్లనీ। వరయ ‡ వరూథినీవరుఁడవై చని యజ్ఞముగూడ దక్షుని। న్సురువడిఁ
ద్రుంపు మీవ చట బ్రాహ్మణతేజము జేయమంటి వే। నరిది మదంశసంభవుఁడవై తగు నీకు నసాధ్యమెయ్యెడన్॥ వ॥ అని కుపిత
చిత్తుండై యాజ్ఞాపించిన నట్లకాక యని॥ చ॥ అనఘుఁడు రుద్రుఁ జేరి ముదమారఁ బ్రదక్షిణమాచరించి పీడ్కొని యనివార్య
వేగమునఁ గుంభినిగ్రక్కదలం ఝుళం ఝుళ। ధ్వని మణినూపురంబులు పదంబుల మ్రోయఁగ భీషణప్రభా। ట్టనరఁ గృతాంత
కాంతకశితస్ఫుటశూలముఁ బూని చెచ్చెరన్॥ చ॥ సరభసవృత్తి నట్లరుగు సైన్యపదాహతపాదధూళి ధూ। సరితకుబేరదిక్త
టము సభ్యులు దక్షుఁడు చూచి యొట్టిభీ। కరతమమంచనందమము గాఁ దురజఃపటలంబటంచున। చ్చెరియము నొంది రాత్మలవి
చక్షణతారహితాత్ములై కడున్॥ సీ॥ ఈ ధూళిపుట్టుట కెయ్యది హేతువో విలయసమీరము వ్రేలయదిపుడు। ప్రాచీనబర్హి

---

* బ్రహ్మబంధు। బ్రాహ్మణకర్మహీనుఁడయి బ్రాహ్మణునికిఁ బంధుమాత్రమైనవాఁడు— ¶ సరభసము। అతివేగము— ‡ అభ్రం-మమరన్॥ అభ్రం। ఆకాశమును-లిహ। ఒఱయుచున్న-అదభ్ర। అమితమైన-విభ్రమ। విలాసముచేత-అభ్ర। మేఘమోయనెడు-భ్రమకృత్। సందేహమును గలుగఁ జేయుచున్న-నీల। నల్లనైన-దీర్ఘ। ఉన్నతమయిన-శరీరము మరన్। దేహము ఒప్పఁగాను-ప్రజ్వల-మెఱయన్॥ ప్రజ్వలజ్జ్వలన। మిగులమండుచున్న అగ్నియొక్క-దీప్తజ్వాలికాజాల। ప్రకాశమానములగు మంటల మొత్తములవలె-జాజ్వల్యమాన। మిక్కిలి తేజరిల్లుచున్న-కేశములు మెఱయన్। వెంట్రుకలు ప్రకాశింపఁగాను-చండ-మొప్పన్। చండదిగ్వేదండ। అతికోపవంతములగు దిగ్గజములయొక్క-శుండాభదోర్దండ। తొండములవలె ప్రకాశించుచున్న బాహుదండములయొక్క-సాహస్రధృత। వేయింటిచేత ధరింపఁబడిన-హేతిసంఘ మొప్పన్। ఆయుధసముదాయము ప్రకాశింపఁగాను-వీక్షణ-మగుచున్॥ వీక్షణత్రయ। మూఁడు కన్నులచేత। లోకవీక్షణద్యుతి। ప్రపంచమును చూచెడు నేత్రకాంతి। లోకవీక్షణతతి। జనులయొక్క నేత్రసమూహమునకు-దుర్నిరీక్షమగుచున్। చూడనశక్యమైనదగుచుండఁగాను- క్రకచ-గన్॥ క్రకచకఠిన। రంపములకంటెఁ గఠినముగల- కరాళదంష్ట్రిలు వెలుంగన్। భయంకరములగు కోరలు మెరయుచుండఁగా- ఘన-తనరన్॥ ఘన। గొప్పలగు-కపాల। పుఱ్ఱెలను-అస్థి। ఎముకలను-వనమాలికలును। పుష్పహారములును- తనరన్। ఒప్పఁగా-మారటరుద్రుఁడు। రెండవశివుఁడు-అగుచున్। వినవాఁడై-అఖిల-ఉదయించెన్॥ సకలప్రపంచమునకు భయంకరమైనవాఁడై వీరభద్రుఁడు పుట్టెను. ‡ వరూథినీవరుఁడు। సేనానాయకుఁడు.

ధరాపతిమహితోగ్రశాసనుండిపుడు రాజ్యంబు సేయఁ। జోరసంఘములకోరారాదుమఱిగోగణాళిరాకకుసమయంబు
గాదు। కావుననిప్పుడుగల్పావసానంబుగాఁబోలుఁగాకటుగాకయున్న। నిట్టియౌత్పాతికరజమెందేనిఁగలదె। యనుచుమ
నములభయమందిరచటిజనులు। సురలుదక్షుఁడునంతఁ బ్రసూతిముఖ్యులయినభూసురకాంతలిట్లు నిరిమఱియు॥ క॥ తన
కూఁతులుసూడఁగనిజ। తనయనుసతినపరాధఁదగ వేదిక్లిష్టోనరించినయాదక్షుని। ఘనపాపవిపాకమిదియుఁగాదగున
నుచున్॥ వ॥ అనివెండియునిట్లనిరి కుపితాత్ముండై నదక్షుండుదనకూఁతుతోవిరోధంబుచాలక జగత్సంహారకారణుండయి
నరుద్రుఁ గ్రోధింపఁ జేసిననమ్మహాత్ముండెంతటివాఁడంటేఁ ప్రళయకాలంబున॥ సీ॥ సుమహితనిశితత్రిశూలాగ్ర*సం
ప్రోతనిఖిలదిక్కరిరాజనివహుఁడగుచుఁ। జటులోగ్రనిష్ఠురస్తనితగంభీరాట్టహాసనిర్భిన్నాఖిలాశుఁడగుచు। భూరికరా
ళవిస్ఫారదంష్ట్రాహతిఁ బతితతారాగణప్రచయుఁడగుచు। వివిధ †హేతివ్రాతవిపులప్రభాపుంజమండితచండదోర్దండుఁ
డగుచు। వికటరోషభయంకరభ్రుకుటిమూర్తి। రీక్ష్యమస్సహతేజోమహిమదనర్చి। ఘనవికీర్ణజటాబంధకలితుఁడగుచు। నఖి
లసంహారకారణుఁడు నటించు॥ గీ॥ అట్టిదేవునిఁ ద్రిపురసంహారకరునిఁ। జంద్రశేఖరుసద్గుణసాంద్రునభవు। మనమురో
షింపఁజేసినమంగళములఁ। బొందవచ్చునెపక్ష్మగర్భునకునయిన॥ వ॥ అనియివ్విధంబునభయవిహ్వలలోచనులై పలుకుచు
న్నసమయంబున మహాత్ముండయినవీరభద్రునకు భయావహంబులై సహస్రసంఖ్యాతంబులైనమహోత్పాతంబులుభూ
నభోంతరంబులఁగానంబడుచుండె। నాసమయంబున రుద్రానుచరులునానావిధాయుధంబులు ధరియించి కపిలపీతవర్ణం
బులుగలిగివామనాకారులు మకరోదరాననులై యజ్ఞశాలాప్రదేశంబునంబరువులు వెట్టుచుఁ గదియం జనుదెంచి దక్షా
ధ్వరవాటంబులవిటతాటంబు సేయుచుం గొందఱు ప్రాగ్వంశంబును గొందఱు పత్నీశాలయుఁ గొందఱు సదస్యశాలయునం
దుఁ గొందఱాగ్నీధ్రశాలయుఁ గొందఱు యజమానశాలయుఁ గొందఱు ❦మహానసగృహంబును విధ్వంసనంబులుగావిం
చిరి మఱియుఁ గొందఱు యజ్ఞపాత్రంబుల నగ్నులం జెరిచిరి వెండియుఁ గొందఱు హోమాగ్నులార్చిరి పదంపడి గొందఱు
హోమానకుండంబులయందు మూత్రంబులు విడిచిరి గొందఱుత్తరవేదికామేఖలలు ద్రెంచిరి గొందఱు మునులబాధించిరి
గొందఱు పత్నీజనుల వెఱపించిరి మఱికొందఱు దేవతానిరోధంబుఁ గావించిరి యంత మణిమంతుండు భృగువును, వీరభ
ద్రుండు దక్షునిఁ జండీశుండు పూషునిభగుని నందీశ్వరుండును, బట్టిరి యివ్విధంబున సదస్య దేవ ఋత్విజ్నికాయంబుల శిలలఱు
వ్వియు, జానువులఁ బొడిచియు, నఱచేతులనడఁచియు గుల్ఫంబులఁ బొడిచియు, వివిధబాధలం బరచిన, వారు ‖కాందిశీకులై
యెక్కడెక్కడేనియుం జనిరి మఱియును॥ క॥ మునుదక్షుఁడు భవుఁ బలుకఁగఁ। గనుఁగీటినభగునిఁ బట్టి కన్నులు పెకలించె ను
నందీశ్వరుఁడచ్చటి జనములు హాహారవంబు సందడిగొలుపన్॥ గీ॥ కుపితుఁడై నాఁడు ¶భవునిదక్షుఁడు శపింపఁ। బరిహసిం
చినపూషునిపండ్లుడుల్లఁ। గొట్టె బలభద్రుఁడాకళింగుని §రదంబు। లెలమిడులిచినపగిది జండీశ్వరుండు॥ క॥ తగ వేదిదక్షుఁ
డాసభ। ‡నగచాపుఁ దిరస్కరించునాఁడు శ్మశ్రు। ల్నగుచుం జూపుటనాభృగు। పగకై శ్మశ్రువులు వీరభద్రుఁడు వెఱికె
న్॥ సీ॥ అతులదర్పోద్ధతుండై వీరభద్రుండు గైకొని దక్షునవక్షుంబుఁ ద్రొక్కి। ఘనసితధారాసిఁ గొని మేననడచియుమం
త్రసమన్వితమహితశస్త్రజాలావినిర్భిన్నచర్మంబుగలదక్షుఁ జంపగాలేక విస్మయము నొంది। తద్వధోపాయంబుఁదన
చిత్తమునఁ జూచి కంఠనిష్పీడనగతిఁ నలంచి। మస్తకముదున్మియంచితామర్షణమున। దక్షిణానలమున వ్రేల్చెదనుచ
రులు। హర్షమునుఁ బొందనచటిబ్రాహ్మణజనంబు। లాత్మలనుజాలదుఃఖంబులందుచుండ॥ వ॥ ఇట్లు వీరభద్రుండు దక్షుని
యాగంబు విధ్వంసనంబు గావించి నిజనివాసంబైన కైలాసంబునకుం జనియె నయ్యవసరంబున॥ చ॥ హరభటకోటిచేతనిశి

### ❦ దేవతలు వీరభద్రాదులచేఁ బరాజితులయి బ్రహ్మతో విన్నవించుట. ❦

తాసిగదాకరవాలశూలముద్గరముసలాదిసాధనవిదారితజర్ఝరితాఖిలాంగులై। సురలుభయాకులాత్ములగుచున్సరసీ
రుహజాతుఁ జేరి తచ్చరణసరోరుహంబులకు సమ్మతిఁ జాగిలి మ్రొక్కినమ్రులై॥ క॥ తమ ఘూర్జటి సైనికులగు। ప్రమథులు
దయమాని పెలుచ బాధించుటస। ర్వముఁ జెప్పిరియని మైత్రే। యమునీంద్రుఁడు విదురుతోడ ననియెన్మఱియున్॥ గీ॥ ఇంత
యునుమున్ను మనమున నెఱిఁగియున్న। కతనవిశ్వాత్మకుండునుగమలలోచ। నుండునన నొప్పు నారాయణుండు నజుఁడు।

*సంప్రోత। లెస్సగాఁ గ్రుచ్చఁబడిన... †హేతి। ఆయుధము-రవేరర్చిశ్చశస్త్రించవహ్నిజ్వాలాచ హేతయః। ఇత్యమరః— ❦మహానసగృహము-వంటయిల్లు... ‖కాందిశీకులై। భయమువలనఁ బరుగులెత్తుచున్నవారై... ¶భవుని। సర్వమస్మాద్భవతీతి భవః-సర్వమీయనవలనఁ గలుగుచున్నది గావున భవుఁడు-అనఁగా శివుని... §రదంబు। దంతము... ‡నగచాపున్। మేరుపర్వతమే విల్లుగాఁగల శివుని... ?అమర్షణము। కోపము.

చూడరారైరియపుడుదక్షునిమఖంబు॥వ॥అనిచెప్పిసురలిట్లువిన్నవించినచతుర్ముఖుండువారలకిట్లనియె॥క॥ఘనతేజోనిధిపురుషుండనయంబుగృతాపరాధుఁడయిననుదామెల్లనఁబ్రతికారముఁగావిం । చినజనులకులోకమందుసేమముగలదే ॥ వ ॥ అనిమఱియునిట్లనియె॥క॥క్రతుభాగార్హుండగు *పశుపతినీశ్వరునభవుశర్వుభర్గునిదూఱి।కృతయజ్ఞభాగుఁజేసిన।యతిదోషులుదుష్టమతులునగుమీరింకఁ॥సీ॥పూనియేదేవునిబొమముడిమాత్రనలోకపాలకులునులోకములును।నాశమొందుదురట్టియీశుండుఘనదురుక్త్యస్త్రనికాయవిద్ధాంతరంగుఁ। డును బ్రియావిరహితుండుగనయినవాఁడమ్మహాత్మునిఁద్రిపురసంహారకరుని।మఖపునస్సంధానమతినపేక్షించుమీరలుచేరిశుద్ధాంతరంగులగుచు । భక్తినిష్ఠలఁదత్పాదపద్మయుగళి। ఘనపరిగ్రహపూర్వంబుగాఁగనతని।శరణమొందుండతండుప్రసన్నుఁడయినఁ ।దివిరిమీకోర్కిసిద్ధించుదివిజులార॥వ॥అనిమఱియునిట్లనియెనద్దేవునిడాయంజనవెఱతుమనితలంపకుండతనిఁ జేరనుపాయం బెఱింగింపుమంటిరేని నేనునింద్రుండుమునులుమీరలు మఱియుదేహధారులెవ్వరేని నమ్మహాత్ము నిరూపంబునతని బలపరాక్రమంబులకొలఁదినెఱుంగంజాలమతండుస్వతంత్రుండుగావునఁదదుపాయంబెఱింగింపనెవ్వఁడు సమర్థుండగునైననిపుడు భక్తపరాధీనుండుశరణాగతరక్షకుండగునీశునిఁ జేరంబోవుదమనిపలికి పద్మసంభవుండుదేవపితృగణప్రజాపతులంగూడికైలాసాభిముఖుండయిచనిచని॥ఉ॥భాసురలీలఁగాంచిరిసుపర్వులుభక్తజనైకమానసో । ల్లాసముఁగిన్నరీజనవిలాసమునిత్యవిభూతిమంగళా।వాసముసిద్ధగుహ్యకనివాసమురాజతభూవికాసికై। లాసముఁగాంచనిర్జితకులక్షితిభృత్సుమహద్విలాసముఁ॥సీ॥ధాతువిచిత్రితోదాత్తరత్నప్రభాసంగతోజ్జ్వలతుంగశృంగములును। గిన్నరగంధర్వకింపురుషాప్సరోజననికరాకీర్ణసానువులును।మానితనిఖిలవైమానికమిథునసద్విహరణైకశుభప్రదేశములును। గమనీయనవమల్లికాసుమనోవల్లికామతల్లీలసత్కందరములు।నమరసిద్ధాంగనాశోభితాశ్రమములు । విబుధజనయోగ్యసంపన్నివేశములును।గలిగిబహువిధపుణ్యభోగములనొప్పు।వినుతసుకృతములకుదండవెండికొండ॥ వ॥ అదిమఱియునుమందారపారిజాతసరళతమాలసాలతాలతక్కోలకోవిదారశిరీషార్జునచూతకదంబనీపనాగపున్నాగచంపకపాటలాశోకవకుళకుందకురువకకనకామ్రశతపత్రకింశుకైలాలవంగమాలతీమధూకమల్లికాపనసమాధవీకుటజోదుంబరాశ్వత్థప్లక్షవటహింగుళభూర్జపూగరాజపూగజంబూఖర్జూరామ్రాతకప్రియాళునాళికేరేంగుదవేణుకీచకముఖరతరుశోభితంబుఁగలకంఠకాలకంఠకలవింకరాజకీరమత్తమధుకరనానావిహంగకోలాహలనినదబధిరీభూతరోదోంతరాళంబు సింహతరక్షుశల్యగవయశరభశాఖామృగవరాహవ్యాఘ్రశశ¶కుర్కురరురుమహిషవృకసారంగప్రముఖవన్యసత్త్వసమాశ్రయవిరాజితంబుఁగదళీషండమండితకమలకల్హారకైరవకలితపులినతలలలిత కమలాకరవిహరమాణ కలహంసకారండవసారసచక్రవాకబకజలకుక్కుటాదిజలవిహంగకులకూజితసంకులంబుసలిలకేళీవిహరమాణసతీరమణీరమణీయకుచమండలవిలిప్తమృగమదమిళితహరిచందనగంధసుగంధితజలపూరితగంగాతరంగిణీసమావృతంబునయినకైలాసపర్వతంబువొడగనియరవిందసంభవపురందరాదిదేవగణంబులత్యద్భుతానందంబులంబొందిముందటఁ‡దారహీర హేమమయవిమానసంకులంబుఁబుణ్యజనమానినీశోభితంబునయినయలకాపురంబుఁగడచి తత్పురబాహ్యప్రదేశంబునం దీర్ఘపాదుండైనపుండరీకాక్షుపాదారవిందరజఃపావనంబురతికేళీవ్యాసంగపరిశ్రమనివారకసలిలకేళీవిలోలదేవకామినీ పీనవక్షోజవిలిప్తకుంకుమపంకసంగతపిశంగవర్ణవారిపూరవిలసితనందాలకనందాభిధానంబులుగలనదీ ద్వితయంబుదాఁటితత్పురోభాగంబునవనగజసంఘృష్టమలయజపరిమిళితపవనాస్వాదన ముహుర్ముహురున్మదితమానసపుణ్య జనకామినీకదంబంబువైదూర్యసోపానసమంచితకనకోత్పలవాపీవిభాసితంబుఁగింపురుష వ్యాప్తంబునగుసౌగంధిక వనసమీపంబునం

§ బ్రహ్మాదులుదక్షిణామూర్తిరూపుండగునీశ్వరునిస్తుతించుట. §

మ॥సీ॥ఉజ్జ్వలంబైశతయోజనంబులపొడవును †బంచసప్తతియోజనముల।పరపునుగల్గియేపట్టునఁదఱుగనినీడశోభిల్లునిర్ణీతమగుచుఁ।బర్ణశాఖాసమాకీర్ణమైమాణిక్యములఁబోలఁగలఫలములుదనర్చి। కమనీయసిద్ధయోగక్రియామయమయి యనఘముముక్షుజనాశ్రయంబు। భూరిసంసారతాపనివారకంబు। నగుచుఁదరురాజమనఁగఁ బెంపగ్గలించి।భక్తజనులకునిచ్చలుప్రమదమెసఁగ।వలయుసంపదలందు‖నావటమువటము॥అవ్వృక్షమూలతలంబున॥సీ॥ఇద్ధసనందాదిసిద్ధసంసేవి

* పశుపతి।పశూనాంపతిః పశుపతిః-పశవః క్షేత్రజ్ఞాః-తేషాంపతిఃత్రాతాసంసారబంధనాత్ - పశువులనఁగాజీవులు-వారినిసంసారబంధమువలనరక్షించువాఁడుగావునపశుపతియని. †పంచసప్తతి।డెబ్బదియైదు, ‡తార।ముత్యము. ¶కుర్కుర।కుక్క... ‖వటమువటము।మఱ్ఱిచెట్టు.

తు శాంతవిగ్రహుని వాత్సల్యమునను|గమనీయలోకమంగళదాయకుని శివు విశ్వబంధుని జగద్వినుతయశుని| గుహ్యకసా
ధ్యయక్షరక్షోనాథకుబేరసేవితుని దుర్వారబలుని|నుచితవిద్యాతపోయోగయుక్తుని బాలచంద్రభూషణుని మునీంద్రను
తుని|దాపసాభీష్టకరు భస్మదండలింగ|ఘనజటాజినధరు నిభక్తప్రసన్ను|వితతసంధ్యాభ్రరుచివిడంబితవిమాత్ను| రక్త
వర్ణు సనాతను బ్రహ్మమయుని॥మఱియును॥సీ॥అంచితవామపాదాంభోరుహము దక్షిణోరుతలంబునను నిచితగను| సవ్య
జానువుమీఁద భవ్యబాహువు సాఁచి వలపలిముంజేత సలలి *తాక్ష| మాలిక ధరియించి మహనీయతర్కముద్రాయుక్తుఁడ
గుచుఁజిత్తంబులోన|నవ్యయంబయిన బ్రహ్మానందకలితసమాధినిష్ఠుఁడు వీతమత్సరుండు| యోగపట్టాభిరాముఁడై యుచి
తవృత్తి|రోషసంగతిఁ బాసి కూర్చున్న †జముని| యనువునను దర్భరచిత ¶బ్రుస్యాసనమున| నున్న మునిముఖ్యు నంచిత
యోగనిరతు॥క॥అలఘుని నభవుని యోగీం|ద్రులు వినుచుండంగ నారదునితోఁ బ్రియభా|షలు జరుపుచున్న రుద్రుని| సల
లితపన్నగవిభూషు సజ్జనపోషున్॥క॥కనిలోకపాలురును ముని|జనులును సద్భక్తి నతని చరణంబులకున్| వినతులయిరి యపు
డబ్జా|సనుఁ గని యయ్యభవుఁ డధికసంభ్రమ మొప్పన్॥క॥అనఘమహాత్ముండగు వా|మనుఁ డా కశ్యపునకును నొగి నమస్కా
రము చే|సిన గతి నజునకు నభవం|దన మొగిఁ గావించె హరుఁడు దద్దయుఁ బ్రీతిన్॥గీ॥అంత రుద్రాను వర్తులై యట్టి సిద్ధ|గణమహ
ర్షి జనంబులు గనిపయోజ|గర్భునకు మ్రొక్కి రంత నాకముల భవుఁడు| శర్వుఁ గనిపల్కె మందహాసంబుతోడ॥గీ॥జగములకు
నెల్ల యోనిబీజంబులైన|శక్తిశివకారణుండవై జగతి నిర్వి|కార బ్రహ్మంబవగు నిన్నుఁ గడఁగి విశ్వ| నాథుఁగా నెఱిఁగెద
నామనమున నభవ॥గీ॥సమత నదిగాన దావకాంశంబులైన|శక్తిశివరూపములఁ గ్రీడ సలుపుదూర్ణ| నాభిగతి విశ్వజననవి
నాశవృద్ధి| హేతుభూతుండవగుచుందువీశరుద్ర॥సీ॥ అనఘ లోకంబులయందు వర్ణాశ్రమ సేతువులనఁగ బ్రఖ్యాతినొం
ది|బలిసి మహాజనపరిగృహీతంబులై యఖిలధర్మార్థదాయకములయిన| వేదంబులను మఱి వృద్ధి నొందించుటకొఱకునై నీవ
దక్షునినిమిత్త|మాత్రునిఁ జేసి యమ్మఖముఁ గావించితివటుగాన శుభమూర్తివై ననీవు| గడగి జనముల మంగళకర్ములయి
న| వారి ముక్తినమంగళాచారులయిన| వారి నరకంబు నొందింతు భూరిమహిమ|భక్తజనపోష రాజితఫణివిభూష॥ వ॥ అ
ట్లగుటం దత్కర్మంబులొకానొకనికి విపర్యాసంబు నొందుటకుఁ గారణంబెయ్యదియో భవదీయరోషంబు హేతువనిత
లంచితి నేనిద్ద్వదీయపాదారవిందనిహితచిత్తులై సమస్తభూతంబులయందు నిన్నుం గనుంగొనుచు భూతంబుల నాత్మయం
దు వేఱుగాఁ జూడక వర్తించు మహాత్ములయందు నజ్ఞులైనవారియందుం బోలె రోషంబు దరుచుపొరయదట్టి నీకుఁ గ్రోధంబు
గలదే యని॥సీ॥మఱి భేదబుద్ధిఁ గర్మప్రవర్తనములమదయుతులై దుష్టహృదయులగుచుఁ| బరవిభవాసహ్యభవమనోవ్యా
ధులఁ దగిలి మర్మాత్మభేదకములైన|బహుదురుక్తుల చేతఁ బరులఁ బీడించుచునుండు మూఢులను దైవోపహతులఁ| గాఁదల
పోసి యకర్కపటచిత్తులకు నీవంటి సత్పురుషుఁడేవలననైన|హింసఁ గావింపకుండు సమిద్ధచరిత| నీలలోహిత మహితగుణా
లవాల|లోకపాలనకలితగంగా ❀కలాప|హరజగన్నుత చారిత్ర యదియుఁగాక॥సీ॥అమరసమస్తదేశములందు నఖిలకా
లములందుఁ దలఁప దుర్లంఘ్యమహిముఁ|డగు పద్మనాభుమాయా మోహితాత్ములై భేదదర్శనులైనవారి| వలనను ద్రో
హంబు గలిగిననంతయు నదిదైవకృతమని యన్యదుఃఖ|ములకోర్వలేక సత్పురుషుండు దయసేయుఁ గాని హింసింపఁడుగా
ననీవు|నచ్యుతునిమాయ మోహమునందకుంట|జేసి సర్వజ్ఞుఁడవు మాయచేత మోహి|తాత్ములై కర్మవర్తనులయిన వారి|
వలన ద్రోహంబు గలిగిన వలయుఁ బ్రోవ ॥ వ ॥ అదిగావున యజ్ఞభాగార్హుండవైన నీకు సవనభాగంబు సమర్పింప
నికతన నీచేత విధ్వస్తంబయి పరిసమాప్తినొందని దక్షాధ్వరంబు మఱలనుద్ధరించి దక్షుని పునర్జీవితుం జేయుము - భ
గుని నేత్రంబులు, భృగుమునిశ్మశ్రువులుఁ, బూషుని దంతంబులుఁ గృపసేయుము- భగ్నాంగులయిన దేవ ఋత్విజ్ని
కాయంబులకు నారోగ్యంబుఁ గావింపు మీ మఖావశిష్టంబు యజ్ఞపరిపూర్తి హేతుభూతంబయిన భవదీయభాగంబ

శివుఁడు బ్రహ్మాదులచేఁ బ్రార్థితుండై దక్షాదుల ననుగ్రహించుట.

గుఁగాక ॥ చ ॥ అని చతురాననుండు వినయంబున వేఁడిన నిందుమౌళి స| య్యనఁ బరితృప్తిఁ బొంది దరహాసము నన్న
పదోంగలింపని| ట్లను హరిమాయచేత ననయంబును బామరులైనవారు చే| సినయపరాధదోషములు చిత్తములో
గణియింప నెన్నఁడున్ ॥ అల్లయుండి ॥ క ॥ బలియుల దండించుటము| ర్బలజన రక్షణము ధర్మపద్ధతియగుటన్| గ

* అక్షమాలిక|జపమాల... †జముని యమవునన్|యమునివలెను... ¶బ్రుస్యాసనమునన్|వ్రతస్థులైనవారు కూర్చుండుటకు దర్భ మొదలైనవాని చేతరచింపఁబడిన ఆసనము బ్రుసియనంబడును. అట్టి పీఠముమీఁద... ❀కలాప|భూషణము.

లుషాత్ములయపరాధము । కొలఁదిని దండింపుచుండుఁగొనకొనియేనుఁ ॥ వ॥ అనిదగ్ధశీర్షుండయినదక్షుండజముఖుండ
గుభగుండుబర్హిస్సంబంధభాగంబులుగలిగి మిత్రనామధేయచక్షుస్సునం బొడఁగాంచుఁ బూషుండు పిష్టభుక్కగుచు
యజమానదంతంబులచేభక్షించు దేవతలుయజ్ఞావశిష్టంబు నాకొసంగుటంజేసి సర్వావయవపరిపూర్ణులై వర్తింతురుఖం
డితాంగులైనఋత్విగాదిజనంబులశ్వినీదేవతలబాహువులచేతను *పూషునిహస్తంబులచేతనులబ్ధబాహుహస్తులైజీ
వింతురుభృగువు†బస్తశ్మశ్రువులుగలిగివర్తించుననిశివుండానతిచ్చినసమస్తభూతంబులుసంతుష్టాంతరంగంబులైతండ్రి
లెస్సయ్యెననిసాధువాదంబులనభినందించిరియంతనాశంభునియామంత్రణంబు వడసి‡శునాసీరప్రముఖులగుదేవతలు
ఋషులతోడంగూడిరానజుండునురుద్రునింబురస్కరించికొనిదక్షాధ్వరవాటంబునకుంజనెనంత॥క॥ శర్వునియోగక్ర
మమున।సర్వావయవములుగలిగిసమ్మనిఋత్విగ్గీర్వాణముఖ్యులొప్పిరి।పూర్వతను శ్రీలనార్యభూషణయంతన్॥క॥వి
నుదక్షుసవనబస్తము। ఖునిఁజేసిననిద్రమేలుకొనిలేచినపో।లిక్కనిసలిచెదక్షుఁడభవుఁడు।గనుఁగొనుచుండంగనాత్మఁగొ
తుకమొప్పన్॥ వ॥ ఇట్లులేచినిలిచిముందఱనున్నశివునింగనుంగొనినమాత్రనశరత్కాలంబుననకల్మషంబైనసరస్సునుం
బోలిపూర్వరుద్రవిద్వేషజనితంబులైనకల్మషంబులంబాసినిర్మలుండై యభవునినుతియింపందొడఁగి స్మృతిఁబొందినసతీ
తనయందలంచియనురాగోత్కంఠంబులబాష్పపూరితలోచనుండు గద్గదకంఠుండునైపలుకంజాలకయెట్టకేలకుదుఃఖం
బులసంస్తంభించికొనిప్రేమాతిరేకవిహ్వలుండగుచు సర్వేశ్వరుండగుహరునకిట్లనియె॥క॥ వినునీకపరాధుఁడనగు।నను
దండించుటదిదండనముగామమదిన్ననురక్షించుటగానున।మునఁదలఁతును దేవయభవపురహరరుద్రా॥సీ॥ అనఘాత్మత
గనీవునజ్జనాభుండునుబరికింపబ్రాహ్మణాభాసులయిన। వారలయెడలనెవ్వలననుపేక్షింపరటుస్వధృతవ్రతచర్యులైనవా
రి। యెడనీకుపేక్షయెక్కడిదిసర్గాదినినామ్నాయసంప్రదాయప్రవర్తనము నెఱింగించుటకిమరవిద్యాతపోవ్రతపరా
యణులైనబ్రాహ్మణులను।వరుసఁబుట్టించితివికానవారినెపుడుఁ।గేలదండంబుఁబూనిగోపాలుకుండు।బలసిగోవులరక్షిం
చుపగిదినీవు। నరసిరక్షింపుచుందుగదయ్యరుద్ర॥సీ॥తలపోయనవిదితతత్త్వవిజ్ఞానుండనైననాచేతసభాంతరమున‖నతిదు
రుక్త్యంబకక్షతుఁడయ్యునస్మత్కృతాపరాధముహృదయంబునందు।దలఁపకత్ర్యక్షునిందాదోషముననధోగతిఁబొందు
చున్నదుష్కర్మునన్నుఁ। గరుణఁగాచిననీమహనసద్గుణంబులనెఱిఁగిసంస్తుతిసేయ నెంతవాఁడ।నుతచరిత్రభవత్ప్రాను
గ్రహానురూపకార్యంబుచేతనిరూఢమైన। తుష్టినీచిత్తమందునెందుదువుగాక । యుగ్రసంహారకరుణాసముద్రరుద్ర॥
వ॥ అనియిట్లురుద్రక్షమాపణంబుఁగావించిపద్మసంభవునిచేతననుజ్ఞాతుండైదక్షుం డుపాధ్యాయర్త్విగ్గణసమేతుండ
గుచుఁగ్రతుకర్మంబునిర్వర్తించుసమయంబునబ్రాహ్మణజనంబులుయజ్ఞంబులు నిర్విఘ్నంబులైసాఁగుటకుఁబ్రమథా
దివీరసంసర్గకృతదోషనివృత్త్యర్థంబుగావిష్ణుదేవసహితంబుఁ ద్రికపాలపురోడాశద్రవ్యకంబైనకర్మంబుఁగావింప
నధ్వర్యుకృత్యప్రవిష్టుండగుభృగువుతోడంగూడినిర్మలాంతఃకరణుండగుచు దక్షుండు ద్రవ్యత్యాగంబుఁగావింపఁబ్రస

❀ దక్షాధ్వరంబునకువచ్చిననారాయణునిదక్షాదులుస్తుతియించుట. ❀

న్నుండైసర్వేశ్వరుండు॥సీ॥ మానితశ్యామాయమానశరీరదీధితులునద్దిక్కులదీటుకొనఁగ।గాంచనమేఖలాకాంతుల
తోడఁగౌశేయచేలమ్మెత్తుల్చెలిమిసేయ।లక్ష్మీసమాయుక్తలలితవక్షంబునవైజయంతీప్రభల్వన్నెఁజూప। హాటకరత్న
కిరీటకోటిప్రభల్బాలార్కరుచులతోమేలమాడ।లలితనీలాభ్రసుచిఁగుంతలములుదనరఁ।బ్రవిమలాత్మీయదేహజప్రభ
సరోజ।భవభవామరముఖ్యులప్రభలుమాప। నఖిలలోకైకగురుఁడునారాయణుండు॥చ॥ సలలితశంఖచక్రజలజాతగ
దాశరచాపఖడ్గనిర్మలరుచులన్సువర్ణరుచిమన్మణికంకణముద్రికాప్రభా।వలులనుదేజరిల్లుభుజవర్గమునర్గళకాంతియుక్త
మై। విలసిత¶కర్ణికారపృథివీరుహమున్స్ఫురణించుబిట్టుగన్॥క॥ సరసోదారసమంచిత। దరహాసవిలోకనములఁదగలోక
ములన్సరితోషమునొందింపుచుఁ।బరమోత్సవమొప్పవిశ్వబంధుండగుచున్॥ చ॥మెఱయనురాజహంసరుచిమద్ధవళీ
కృతతాలవృంతచా।మరములువీవఁగాదివిజమానినులచ్ఛసుధామరీచివి।స్ఫురణసితాతపత్త్రరుచిపుంజముదిక్కులఁబిక్క
టిల్లఁగాఁ।గరివరదుండువచ్చెసుభగస్తుతిపర్ణసుపర్ణయానుఁడై॥చ॥ఘనరుచినట్లువచ్చినవికారవిదూరుముకుందుఁజూచి

---

*పూషుఁడు।సూర్యుఁడు… †బస్తశ్మశ్రువులు।మేఁకవెండ్రుకలతోనేర్పరచినమీసములు… ‡శునాశీర।దేవేంద్రుఁడు… ‖అతిదురుక్త్యంబకక్షతుఁడయ్యున్।మిగులకటినవుమాటలనెడునమ్ములచేతగాయముగాఁజేయఁబడినమనసుగలవాఁడనైనను… ¶కర్ణికారపృథివీరుహమున్।కొండగోఁగుచెట్టును,బిట్టుగన్।మిక్కిలి, పురణించున్।తిరస్కరించును.

భో। యనన రవింద సనందన పురందర చంద్రకళాధరాద్యులా। శనముఖులగ్ని లేచి యతిసంభ్రమ మొప్పన మోనమోదయా
వననిధయేయటంచు ననివారణ మొక్కిరి భక్తియుక్తులై॥ వ॥ అట్లు కృతప్రణాములైన యనంతరంబ॥ ఉ॥ ఆనలినాయతా
క్షుని యనంతపరాక్రము సుదుర్నిరీక్ష్యు తేజోహతస్వదీప్తులగుచున్నతి సేయనశక్తులై భయ।*గ్లాని వహించి బాష్పము
లు గ్రమ్మ గద్గదకంఠులై తనుల్।¶మ్రానుపడంగ నప్పుభుని సన్ననఁ గైకొని యెట్టకేలకున్॥ వ॥ నిటలతటఘటితకరపుటు
లై యమ్మహాత్ముని యపారమహిమంబెఱింగి నుతియింపశక్తులు గాక యుండియుఁ గృతానుగ్రహపరిగ్రహుండగుటం జేసి
తమతమమతులకుఁ గోచరించిన కొలందిని నుతియింపం దొడంగిరి యందు గృహీతంబులగు పూజాద్యుపచారంబులు గలిగి బ్ర
హ్మేమలకు జనకుండు సునందననందాది పరమభాగవతజన సేవితుండు యజ్ఞేశ్వరుండునగు భగవంతుని శరణ్యునిఁగాఁ దలంచి
దక్షుండిట్లనియె దేవా నీవు స్వస్వరూపమునందున్న యప్పు※డుపరతంబులుగాని రాగాద్యఖిలబుద్ధ్యవస్థలచే విముక్తుండవు
నద్వితీయుండవు భయరహితుండవునై మాయం బరిహరించి మఱియు నా మాయ ననుసరించుచు లీలామానుషరూపంబుల
నంగీకరించి స్వతంత్రుండవయ్యును మాయాపరతంత్రుండవై రాగాదియుక్తుం బోలె రామకృష్ణాద్యవతారంబులఁగా
నంబడుచుందువు గావున నీలోకంబులకు నీవయీశ్వరుండవని యును తరులైన బ్రహ్మరుద్రాదులు భవన్మాయావిభూతుల
గుటం జేసి లోకంబులకు నీశ్వరులు గారనియును భేదదృష్టిగల నన్ను రక్షింపుమీ విశ్వకారణులైన ఫాలలోచనుండు బ్రహ్మ
యు దిక్పాలురును సకలచరాచరజంతువులును నీవ భవద్వ్యతిరిక్తంబు జగంబున లేదని విన్నవించిన తదనంతరంబ ఋత్విక్స
దస్యులిట్లనిరి॥ సీ॥ ‡వామదేవుని శాపవశమునం జేసి కర్మానువర్తనులమేమైన కతన। బలసి వేదప్రతిపాద్యధర్మోపలక్ష్య
మైన యట్టి మఖంబునందు। దీపింప నింద్రాది దేవతాకలితరూపవ్యాజమును బొంది పరగు నిన్ను। యజ్ఞస్వరూపుండవనియును
గేవలనిర్గుణుండవు నిత్యనిర్మలుండవు। నవయనవ్యయమూర్తివైన నీదు। లలితతత్త్వస్వరూపంబుఁ దెలియజాల। మయ్య
మాధవ గోవింద హరి ముకుంద। చిన్మయాకార నిత్యలక్ష్మీవిహార॥ సదస్యులిట్లనిరి॥ సీ॥ శోకదావాగ్నిశిఖాకులితంబు ప్ర
ఘనదుర్గమార్గంబు। దండధర క్రూర♣కుండలిశ్లిష్టంబు పాపకర్మవ్యాఘ్రపరివృతంబు। గురుసుఖదుఃఖకాకోలపూరిత
గర్తము గుచున నాశ్రయమైన యట్టి। సంసారమార్గసంచారులై మృగతృష్ణికలఁ బోలు విషయసంఘము నహమ్మ। మేతి సో
తుక దేహనికేతనములు। ననుమహాభారవహులైన యట్టి మూఢ। జనములే నాఁట మీ పదాబ్జములు గానఁ। జాలువారలు భక్తి
ప్రసన్న దేవ॥ రుద్రుండిట్లనియె॥ చ॥ వరద హరీ మహాయోగిజనవర్గసుపూజిత నీపదాబ్జము। న్నిరతము నంతరంగమున నిల్పి భవత్ప
దనుగ్రహాధిక। స్ఫురణఁ దనర్చు నన్ను నతిమూఢులవిద్యలు మిన్నకుంగికా। వరణుఁడటంచుఁ బల్కినఁ భవన్మతి నేఁ గణియిం
పనచ్యుతా॥ భృగుండిట్లనియె॥ మ॥ అరవిందోదర తావకీనఘనమాయామోహితస్వాంతులై। పరమంబైన భవన్మహా
మహిమము న్నాటించి కానంగనో। పరు బ్రహ్మాదిశరీరులజ్ఞులయి రూపద్యాత్మభక్తార్తిసం। హరణాలోకన నన్నుఁ గావఁదగు ని
త్యానందసంధాయివై॥ బ్రహ్మయిట్లనియె॥ సీ॥ తవిలి పదార్థభేదగ్రాహకములయిన చక్షురింద్రియములఁ సరవిఁ జూడఁ। గ
లుగు నీరూపంబు గడఁగి మాయామయంబగుననస్వ్యతిరిక్తమగుచు మఱియు। జ్ఞానార్థకారణసత్త్వాదిగుణముల కాశ్రయ
భూతమై యలరుచున్న। నిరుపమాకారంబు నీస్వలక్షణమై యుండ ననుచు నేనాత్మఁ దలఁతు। నిర్వికార నిరంజన నిష్కళంక ని
రతిశయ నిష్క్రియారంభ నిర్మలాత్మ। విశ్వసంబోధ్య నిరవద్య వేదవేద్య। ప్రవిమలానంద సంసారభయవిదూర॥ ఇంద్రుం
డిట్లనియె॥ మ॥ దితిసంతానవినాశసాధన సముద్దీప్తాష్టబాహాసమ। న్వితమై యోగిమనోనురాగపదమై వెల్గొందు నీ దేహ
మా। యతమైనట్టి ప్రపంచముం బలెను మిథ్యాభూతముంగా మిశ్రా। స్వతముంగా మదిలోఁ దలంతు హరి దేవాదైవచూడా
మణీ॥ పత్నులిట్లనిరి॥ చ॥ కడఁగి భవత్పదార్చనకుఁగా నిటు దక్షుని చేరఁజింపఁగా। బడి శితికంఠరోషమున భస్మము నొందిపరే
తభూమియై। చెడికడు శాంత మేధమునఁ జెన్నఱియున్న మఖంబుఁ జూడుమే। ధ్వజజలజాభనేత్రములఁ బావనమై విలసిల్లు న
చ్యుతా॥ ఋషులిట్లనిరి॥ మ॥ అనఘా మాధవ నీవు మావలె నెకర్మారంభివై యుండియున్। వినుతత్కర్మఫలంబుఁ బొందవి
తరులిశ్వంబున న్భూతికై। యనయంబున్ భజియించు నిందిర గరంబర్థిన్ని నుం జేరఁగా। కొనవేమందుము నీ చరిత్రము నకుం
గోవిందపద్మోదరా॥ సిద్ధులిట్లనిరి॥ చ॥ హరి భవదుఃఖభీషణదవానలదగ్ధ§తృషార్తమన్మనో। ద్విరదము శోభితంబును బవి
త్రమునైన భవత్కథాసుధా। సరిదవగాహనంబునను సంస్మృతితాపముఁ బాసి క్రమ్మఱన్। దిరుగుమ బ్రహ్మముం గనిన

* గ్లాని। బాధ... ¶ మ్రానుపడంగన్। నిశ్చేష్టములగుచుండఁగా... ※ఉపరతంబులుగాని। అన్యోన్యాసక్తములుగాని... ‡వామదేవుని। ఈశ్వరునియొక్క... ♣కుండలిశ్లిష్టం। సర్పముచేతఁ జుట్టఁబడియున్నదియు... §తృష, తృష్ణ। ఆశ.

*నధోక్షజు నాశ్రయింపుము నీవెండియు నిట్లనియె. సీ॥ పరికింప నీవిశ్వపరిపాలనమునకై నర్థిఁ గుణవ్యక్తుఁడైనయట్టి। నారాయణుని పాదనళినముల్ సేవించి వితతగ బ్రహ్మ బ్రహ్మపదంబు నొందె। ఘనుఁడు మీ తాత యామనువు సర్వాంతరయామిత్వమగు నేకమైన దృష్టిఁ। జేసి యాగంబులఁ జేసి తా భౌమసుఖములను దివ్యసుఖముల మోక్ష। సుఖములను బొందె నట్టి యచ్యుతునిఁ బరుని। వితత యోగీంద్రనికరసంవేద్యమాన। చరణసరసిజయుగళు శశ్వత్ప్రకాశు। భక్తవత్సలు విశ్వసంపాద్యహారిని॥ మఱియును॥

—— శ్రీ ధ్రువుండు నారదోపదేశంబు వడసి తపంబుఁ జేయుట. ——

క॥ కరమున గృహీతలీలాం। బురుహాయు నరవిందగర్భముఖగీర్వాణు। ల్వరికింపంగల లక్ష్మీ। తరుణీమణి చేత వెదకఁదగు పరమేశుఁ॥ వ॥ నిజధర్మపరిశోభితంబైన యేకాగ్రచిత్తంబున నిలిపి సేవింపు మమ్మహాత్మునికంటె నీ దుఃఖంబు పనయించువాఁడన్యుండొక్కరుండు గలఁడే యని పలికిన పరమార్థప్రాప్తిహేతుకంబులైన తల్లి వాక్యంబులు విని తన్నుఁ దాన నియమించికొని పురంబు వెడలిచను నవసరంబున నారదుండు దద్వృత్తాంతం బెఱింగి యచ్చటికిం జనుదెంచి యతని *చికీర్షితంబుఁ దెలిసి పాపనాశకరంబైన తన కరతలంబున ధ్రువుని శిరంబంటి మానభంగంబునకు సహింపని క్షత్రియుల ప్రభావం బద్భుతంబు గదా బాలకుండై యుండియుఁ బినతల్లి యాడిన దురుక్తులు చిత్తంబునం బెట్టి చనుచున్నవాఁడని మనంబున నాశ్చర్యంబు నొంది యో బాలక సకలసంపత్సమృద్ధంబగు మందిరంబు దెగడి యొంటి నెందు నేగెదవు స్వజనకృతంబగు నవమానంబు చేసినుసంతప్తుంగాఁ దలంచెదవనిన ధ్రువుం డిట్లనియె *సపత్నీమాతృవాగిషుక్షతంబగు మానంబు భగవద్ధ్యానయోగరసాయనంబున మాపుకొందుననుధ్రువునికి నారదుం డిట్లనియె॥ క॥ వినుపుత్రక బాలుఁడవై। యనయంబును గ్రీడలందు నాసక్తమనం। బునఁ దిరిగెడు నీకీకాలం। బున నీకవమానమానములు లేవెందుఁ॥ గీ॥ కాఁగ మనమునఁ దద్వివేకంబు నీకుఁ। గలిగెనేని యసంతోషకలితులయిన। పురుషులాత్మీయకర్మవిస్ఫురణఁ జేసి। వితతసుఖదుఃఖముల ననుభవింతురెపుడు॥ వ॥ కావున వివేకంబు గలపురుషుండు దనకుం బ్రాప్తంబులగు సుఖదుఃఖంబులు దైవవశంబులు గాఁ దలంచి తావన్మాత్రంబున సంతుష్టుండగు నీవును దల్లి చెప్పిన యోగమార్గప్రకారంబున సర్వేశ్వరానుగ్రహంబుఁ బొందెదనంటివేని॥ సీ॥ అనఘాత్మ యోగీంద్రులనయంబు ధరఁ బెక్కు జన్మంబులందు నిస్సంగమైన। మతిని బ్రయోగసమాధినిష్ఠలఁ జేసియైనను దెలియలేరతని మార్గ। మదిగాన నతఁడు *దురారాధ్యుఁడగు నీవు నెఱుఁగుము నిష్ఫలోద్యోగమిపుడు। గాక నిశ్శ్రేయసకాముఁడవగు దేనిఁ దండ్రి వర్తించు తత్కాలమంచుఁ। బూని సుఖదుఃఖముల రెంటిలోన నేది। దైవవశమునఁ జేకురుఁ దానఁ జేసి। డెందమునఁ జాలసంతుష్టి నొందుచుండు। విమలవిజ్ఞాని యనఘుఁడై వెలయు నెపుడు॥ వ॥ మఱియుఁ గుణాఢ్యుండగు వానిఁ జూచి సంతోషింపుచు నాభాసుఁడగు వానిం జూచి కరుణింపుచు సమానుని యెడ మైత్రి సలుపుచు వర్తింపుచున్నవాఁడు తాపత్రయాదికంబులం దొఱంగునని నారదుండు పలికిన విని ధ్రువుం డిట్లనియె నయ్యుపశమంబు సుఖదుఃఖహతాత్ములగు పురుషులకు దుర్గమంబని కృపాయత్తుండవైన నీచేత వినంబడె నట్లయిన నంబరభయంకరంబగు క్షాత్త్రధర్మంబు నొందిన యవినీతుండ యేను సురుచి దురుక్తిబాణవినిర్భిన్నహృదయుండ నగుట మదీయచిత్తంబున శాంతి సెలువదు గావునం ద్రిభువనోత్కృష్టంబును నన్యాధిష్ఠితంబును నగు పదంబుఁ బొందనిచ్ఛయించిన నాకు సాధుమార్గంబు నెఱింగింపుము నీవు భగవంతుండగు నజుని యూరువు వలన జనియించి వీణావాదనకుశలుండవై జగద్ధితార్థంబు సూర్యునిం బోలి వర్తింతువనిన విని॥ క॥ నారదుఁ డిట్లను ననఘకు। మారక విను నిన్ను మోక్షమార్గంబునకుఁ। బ్రేరేచిన వాఁ డిప్పుడు। నీరజనోత్తముఁడు వాసుదేవుండగుటన్॥ వ॥ నీవు నమ్మహాత్ముని నజస్రధ్యానప్రవణచిత్తుండవై భజింపుము॥ క॥ పురుషుఁడు దవిలి చతుర్విధ। పురుషార్థశ్రేయమాత్మఁ బొందెదననినన్। ధరఁ దత్ప్రాప్తికి హేతువు। హరిపదయుగళంబు దక్క నన్యము గలదే॥ కావున॥ క॥ పరయమునాతటమున నగు। హరిసాన్నిధ్యంబు శుచియును తపుణ్యమునై। పరగిన మధువనమునకును। సరసగుణా చనుము మేలు సమకురు నచటన్॥ క॥ ఆయమునాతటినీశుభ। తోయములన్ గ్రుంకి నిష్ఠతో నచ్యుతనా। రాయణున కనునమస్కృతు। లాయతమతిఁ జేసి సేయుము యమనియమములన్॥ వ॥ మఱియుఁ బాలుండవగుటం జేసి వేదాధ్యయనాద్యుచితకర్మానర్హుండవయ్యును ఉచితంబులగు కుశాజినంబులం జేసి నస్వస్తికప్రముఖాసనంబులం గల్పించికొని త్రివృత్ప్రాణాయామప్రత్యాహారంబుల చేతం బ్రాణేంద్రియమనోమలం

---

*అధోక్షజున్। విష్ణువును - అధఃకృతానిఅక్షాణీంద్రియాణియస్మికర్మణితద్యథాతథాజాతః - అనఁగా - ఇంద్రియములను అధఃకరించి జనించినవాఁడని యర్థము - స్వయంభూతుండని భావము. ...*చికీర్షితంబున్। చేయఁదలఁచిన కార్యమును... *సపత్నీమాతృవాగిషుక్షతంబగు। సపత్నీమాతృ। సవతితల్లియొక్క, వాగిషు। మాటలను బాణములచేత, క్షతంబగు। గాయముగాఁ జేయఁబడిన. *దురారాధ్యుఁడు। పూజింపనశక్యమైనవాఁడు

నారదుండు వల్కిన। విని మనమున విశ్వసించి విభుఁడును బ్రియనం।దనుఁ జింతింపుచు నాదర।మునఁ జూడం డయ్యె రాజ్యమును
బూజ్యముగన్॥ అంతనక్కడ ధ్రువుండు॥క॥ చని యముందటఁ గనుఁగొనె మధు।వనమును ముని దేవ యోగి వర్ణితగుణ పా।వన
మును చుర్ఘర జలదప। వనమును నిఖిలైక పుణ్యవర భవనంబున్॥వ॥ అట్లు గని డాయం జని యమునానదిం గృతస్నానుండై
నియతుండును సమాహితచిత్తుండునై సర్వేశ్వరుని ధ్యానంబు సేయుచుం ద్రిరాత్ర త్రిరాత్రంబులకొక్క మారు గృతకపిత్థ
బదరీఫల పారణుండగుచు దేహస్థితి ననుసరించి యొక్క మాసంబు హరిం బూజించి యంతనుండి యాఱేసి దినంబులకొకప
రికృత జీర్ణతృణ పర్ణాహారుండగుచు రెండవ మాసంబున విష్ణు సమారాధనంబుఁ జేసి యంతనుండి నవరాత్రంబుల కొ
కమారుదకభక్షణంబు సేయుచు మూఁడవ మాసంబున మాధవు నర్చించి యంతనుండి ద్వాదశ దినంబులకొకమారు వాయు
భక్షణుండగుచు జితశ్వాసుండై నాలవ మాసంబునం బుండరీకాక్షుని భజియించి యంతనుం డిపంచమ మాసంబున నలయక నిరు
చ్ఛ్వాసుండై యేకపదంబున నిలిచి పరమాత్మం జింతింపుచు నచేతనంబైన స్థాణువుం బోలెనై దవ మాసంబునుం జరపెనం
త॥సీ॥సకలభూతేంద్రియాశ్రయ మహద్ధృదయంబునందు విషయములఁ జెందనీక।మహదాదితత్త్వ సమాజమ్ములకును నా
ధారభూతము బ్రధానపూరు।షేశ్వరుఁడైనట్టి శాశ్వత బ్రహ్మంబుఁ దనసితహృదయపద్మమున నిలిపి। హరిరూపమున
కంటె నన్యంబు నెఱుఁగక చిత్తము విభునందుఁ జేర్చియున్న।కతన ముల్లోకములు చాలఁ గంపమొందె। వెండియును బేర్చియ
య్యర్భకుండు ధరణి।నొక్క పాదంబుఁ జేర్చి నిల్చున్న వేళఁ।బేర్చి యబ్బాలునంగుష్ఠపీడఁ జేసి॥గీ॥వసుమతీతలమర్ధము వంగఁ
జొచ్చె।భూరిమదమగ్న వారణవారణేంద్ర।మెడఁగుడి నొరఁగినపుడడుగడుగునను। జలన మొందుచు నడగెడు *కలము
వోలె॥చ॥అతఁడు ననన్యదృష్టి నిజ రాచర దేహశరీరధారణా।స్థితిగల యీశునందుఁ దన జీవితము న్ఘటియింపఁ జేసి యే।కతఁ
గనఁ దన్నిరోధమునఁ గైకొని కంపమునొందె నీశ్వరుం।డతఁడు చలింప నిజ్జగములన్నియుఁ జంచలమొందెనత్తఱిన్॥క॥ఆలోక
భయంకరముగ।నాలోక మహద్విపద్దశాలోకనులై।యాలోకపాలురందఱు।నాలోకశరణ్యుఁ గాన నతిగిరిభీతిన్॥వ॥అట్లు
ఱిగి నారాయణు నుద్దేశించి కృతప్రణాములై కరంబులు ముకుళించికొని యిట్లనిరి॥చ॥హరి పరమాత్మ **కేశవ చరాచరభూ
తశరీరధారివై।పరగు మహీవునిట్టులను బ్రాణనిరోధమెఱుంగ మెందుమున్।దిరముగ దేవదేవ జగదీశ్వర సర్వశరణ్య నీపదాం।
బురుహములోలిమై శరణుఁ బొందెద మార్తి హరించి కావుమీ॥ వ॥అని దేవతలు విన్నవించిన నీశ్వరుండు వారలకిట్లనియె ను
త్తానపాదుండను వాని తనయుండు విశ్వరూపుండనైన నాయందుఁ దనచిత్తంబైక్యంబుఁ జేసి తపంబుఁ గావింపుచుండ దానం
జేసి భవదీయ ప్రాణనిరోధం బయ్యె నట్టి ‡దురత్యయంబైన తపంబు నివర్తింపం జేసెద వెఱవక మీమీ నివాసంబులకుం జనుం

॥శ్రీసాక్షాత్కరించిన భగవంతుని ధ్రువుండు స్తుతించుట.॥

డని యానతిచ్చిన నా దేవతలు నిర్భయాత్ములై యీశ్వరునకుం బ్రణామంబు లాచరించి ‡‡త్రివిష్టపంబునకుఁ జనిరి తదనంత
రంబ॥సీ॥హరి యీశ్వరుండు విహంగకులేశ్వరయానుఁడై నిజభృత్యుఁడైన ధ్రువునిఁ। గనుఁగొను వేడుక జనియింప నామ
ధువనమునకప్పుడు సనీ ధ్రువుండు।పరువడి యోగవిపాకతీవ్రంబైన బుద్ధిచే నిజహృదంబురుహముకుళ। మందుఁ దటిత్ప్రభా
యతమూర్తి యటఁ దిరోధానంబునను బొందితత్క్షణంబ।తనపురోభాగమునను నిల్చినను బూర్వ।సమధికజ్ఞాననయనగోచర
సమగ్ర।మూర్తిఁ గనుఁగొని సంభ్రమమునను సమ్మ।దాశ్రువులు రాలఁ బులకీకృతాంగుఁడగుచు॥గీ॥నయనములు విభుమూ
ర్తిఁ బానంబు సేయ।మగిది దనముఖమునను జుంబనము సేయ।లీలఁ దగ భుజములను నాలింగనంబు। సేయుగతి దండవన్నమ
స్కృతులొనర్చె॥వ॥ఇట్లు దండప్రణామంబు లాచరించి కృతాంజలియై స్తోత్రంబు సేయ నిశ్చయించి స్తుతిక్రియాకరణస
మర్థుండు గాక యున్న ధ్రువునకు సమస్తభూతంబులకు నంతర్యామియైన యీశ్వరుండు ధ్రువుని తలం బెఱింగి వేదమయం
బైన తన శంఖంబు చేతన బ్బాలుని కపోలతలంబంటిన జీవేశ్వర నిర్ణయజ్ఞుండును భక్తిభావనిష్ఠుండును నగు ధ్రువుండు నఖిలలో
కవిఖ్యాతకీర్తిగల యీశ్వరుని భగవత్ప్రతిపాదితంబులగుచు వేదాత్మకంబులైన తన వాక్కులనిట్లని స్తుతించె దేవా నిఖిలశ
క్తిధరుండవు నంతఃప్రవిష్టుండవై నీవులీనంబులైన మదీయ వాక్యంబులం బ్రాణేంద్రియంబులం గరచరణశ్రవణత్వగా
దులను జిచ్ఛక్తిచే గృపం జేసి జీవింపం జేసిన భగవంతుఁడవు పరమపురుషుండవైన నీకు నమస్కరింతు నీవొక్కరుండవయ్యు

*కలము।ఓడ... †ఆలోక।చూచుటకు-సర్వప్రపంచము యొక్క, ఆలోకనులై।చూచినవారై... **కేశవ। శ్లో॥క ఇతి బ్రహ్మణో నామ ఈ
శో౽హం సర్వదేహినాం।ఆవాంతవాంగే సంభూతౌ తస్మాత్కేశవనామవానితి-హరివంశే. క-అనఁగా బ్రహ్మ, ఈశ అనఁగా శివుఁడు, ఈయి
రువురు నీయనయందు జనించిరి గావున కేశవుఁడు. లేక-కశ్చ అశ్చ ఈశశ్చ కేశాః-తేసన్త్యస్మిన్నితి కేశవః-అనఁగా-బ్రహ్మ, విష్ణు, రుద్రులు, ఈ
యనయందు గలుగుటవలన కేశవుఁడు.... ‡దురత్యయము।ఓర్వఁగూడని...‡‡త్రివిష్టపము।స్వర్గము.

మహదాద్యంబైనయీయశేషవిశ్వంబుమాయాఖ్యంబైనయాత్మీయశక్తిచేతఁగల్పించి యందుఁబ్రవేశించియింద్రియంబులందువసింపుచుఁదత్తద్దేవతారూపంబులచేనానాప్రకారంబులదారువులందున్నవహ్నిచందంబునఁబ్రకాశింతువదియునుంగాక॥చ॥వరమతినార్తబాంధవభవద్ఘనబోధసమేతుఁడై భవ। చ్చరణముఁబొందినట్టివిధిసర్గముమత్తజనుండు బోధమునొందయఁగఁజూచురీతిగనునట్టిముముక్షుశరణ్యమైననీ। చరణములంగృతజ్ఞుఁడగుసజ్జనుఁడెట్లుదలంపకుండెడున్॥సీ॥మహితాత్మమతిజన్మమరణప్రణాశనహేతుభూతుండవునిర్ధకల్ప।తరువవునగునిన్నుఁదగనెవ్వరేనేమి పూనినీమహాయావిమోహితాత్ము।లగుచుధర్మార్థకామంబులకొఱకుఁదామర్చింపుచుందురిగుణాభమైన। దేహోపభోగ్యమైయుపించుసుఖములనెనయంగమదినిచ్ఛయింతురట్టి। విషయసంబంధజన్యమైవెలయుసుఖము। వారికినిరయమందునువరలుదేవ।భూరిసంసారతాపనివారగుణక।ధామృతాపూర్ణ యీశమాధవముకుంద॥వ॥అరవిందోదరతావకీనచరణధ్యానానురాగోల్లస।చ్చరితాకర్ణనజాతభూరిసుఖముల్సానందకబ్రహ్మము।దరయన్లేదటదండభృద్ధతవిమానాకీర్ణులై కూలునా। సురలోకస్థులఁజెప్ప నేలసుజనస్తోమైక చింతామణీ॥చ॥హరిభజనీయమార్గనియతాత్మకులైభవదీయమూర్తిపై। వరలినభక్తియుక్తులగువారలసంగతిఁగల్గఁజేయుమ।త్పురుషసంగతిన్ వ్యసనదుర్భవసాగరముప్రయత్నతన్।సరసభవత్కథామృతరసంబునమత్తుఁడనై తరించెదన్॥చ॥నిరతముఁదావకీనభజనీయపదాబ్జసుగంధలబ్ధినె।వ్వరిమదివొందఁగాఁగలుగువారలుదప్పిప్రియమర్త్యదేహము।న్నరముఁదదీయదారసుతకామసుహృద్గృహబంధువర్గము । న్మరతురువిశ్వతోముఖరమాహృదయేశముకుందమాధవా॥సీ॥పరమాత్మమర్త్యసుపర్వతిర్యఙ్నృగదిజసరీసృపవ్విజగణాది। సంవ్యాప్తమునుసదసద్విశేషంబునుగైకొనిమహదాదికారణంబు।నైనవిరాడ్విగ్రహంబునేనెఱుఁగుదుఁగానితక్కినసు మంగళమునైన। సంతతసుమహితైశ్వర్యరూపంబునుభూరిశబ్దాదివ్యాపారశూన్య।మయినబ్రహ్మస్వరూపమేనాత్మ నెఱుఁగఁ। బ్రవిమలాకారసంసారభయవిదూర।పరమమునిగేయసంతతభాగధేయ।నళిననేత్రరమాలలనాకళత్ర॥సీ॥ సర్వేశకల్పాంతసమయంబునందునీయఖిలప్రపంచంబునాహరించి । యనయంబుశేషసహాయుండవై శేషపర్యంకతలమునఁబవ్వళించి। యోగనిద్రారతినుండినాభీసింధుజస్వర్ణలోకకంజాతగర్భ।మందుఁజతుర్ముఖునమరఁబుట్టించుచురుచినొప్పు బ్రహ్మస్వరూపివైన।నీకుమ్రొక్కెదనత్యంతనియమమొప్ప।దివ్యచారిత్రపంకజపత్రనేత్ర।చిరశుభాకారనిత్యలక్ష్మీవిహార। యవ్యయానందగోవిందహరిముకుంద॥వ॥అనియిట్లు యోగనిద్రాపరవశుండవయ్యును జీవులకంటెనత్యంతవిలక్షణుండవైయుండుమువదియెట్లనినబుద్ధ్యవస్థాభేదంబునఖండితంబయినస్వశక్తిం జేసిచూచులోకపాలననిమిత్తంబుయజ్ఞాధిష్ఠాతవుగావుననీవునిత్యముక్తుండవుఁబరిశుద్ధుండవుసర్వజ్ఞుండవునాత్మవుఁగూటస్థుండవునాదిపురుషుండవుభగవంతుండవుగుణత్రయాధీశ్వరుండవునైవర్తింతువుభాగ్యహీనుండైనజీవునియందునీగుణంబులుగలుగవేసర్వేశ్వరునందేనేమివిరుద్ధగతులై వివిధశక్తియుక్తంబులైనయవిద్యాదులానుపూర్వ్యంబునంజేసిప్రలీనంబులగుచుండునట్టి విశ్వకారణంబునేకంబుననంతంబునాద్యంబునానందమాత్రంబునవికారంబునగుబ్రహ్మంబునకునమస్కరించెదమఱియుదేవా నీవుసర్వవిధఫలంబనిచింతించునిష్ఠాములైనవారికి రాజ్యాదికామితంబులలోనఁబరమార్థంబైనఫలంబు సర్వార్థరూపుండవైనభవదీయపాదపద్మంబులిట్లునిశ్చితంబులైననుసకాములైనదీనులనుగోవువత్సంబును స్తన్యపానంబుసేయించుచువృకాదిభయంబువలనరక్షించుచందంబునంగామప్రముండవై సంసారభయంబువలనంబాపుమువనియిట్లుసత్యసంకల్పుండు సుజ్ఞానియునైనధ్రువునిచేతవినుతింపంబడిభృత్యానురక్తుండైనభగవంతుండుసంతుష్టాంతరంగుండై యిట్లనియె॥క॥ధీరవ్రతరాజన్యకు।మారకనీహృదయమందుమసలినకార్యం। బారూఢిగానెఱుంగుదు । నారయనదివొందరానిదన్నేనిత్తున్॥వ॥అదియెట్టిదనిననెందేని*మేధియందుఁబరిభ్రామ్యమాణగోచక్రంబునుంబోలిగ్రహనక్షత్రతారాగణజ్యోతిశ్చక్రంబునక్షత్రరూపంబులైన§ధర్మాగ్నికశ్యపశక్రులుసప్తర్షులునుదారాసమేతులై ప్రదక్షిణంబుదిరుగుచుండుమరట్టిమరాపంబుననన్యాధిష్ఠితంబులోకత్రయప్రళయకాలంబునందునశ్వరంబుగాకప్రకాశమానంబునైనధ్రువక్షితియనుపదంబుముందటనిరువదియాఱువేలేండ్లసనఁబ్రాపించుచువుతత్పదప్రాప్తిపర్యంతంబుభవదీయజనకుండువనవాసగతుండైనందద్రాజ్యంబుపూజ్యంబుగాధర్మమార్గంబునజితేంద్రియుండవై చేయుచువుభవదనుజుండగునుత్తముండుమృగయార్థంబువనంబునకుంజని మృతుండగుఁదదన్వేషణార్థంబు దదాహితచిత్తయై తన్మాతయు వనంబునకుంజనియందుఁ†దావ

*మేధి।పశువులఁద్రొక్కినడుమపాతియుండుస్తంభము...§ధర్మ।యముఁడు...♣దురాపంబు।పొందనశక్యమైనది...†దావదహనము।కాఱుచిచ్చు

తహాననిమగ్నయగు వెండియు॥ సీ॥ అనఘాత్మ మఱినీవు యజ్ఞరూపుండనఁదగునను సంపూర్ణదక్షిణంబు। లగుమఖంబుల
చేత నర్చించి సత్యంబులగు నిహసౌఖ్యంబు లనుభవించి। యంత్యకాలమున నన్నాత్మఁదలంపుచు మఱిసర్వ లోకనమ
స్కృతమును। మహిఁబునరావృత్తి రహితంబును సప్తర్షి మండలోన్నతమగు * మామకీన। పదముఁదగఁబొందఁగలవని
పరమపురుషుఁ। డతనియభిలషితార్థంబులర్థినిచ్చి। యతఁడుగనుఁగొను చుండంగ నాత్మపురికి। గరుడగమనుఁడు వేం
చేసెఁగౌతుకమున॥ గీ॥ అంతధ్రువుఁడును బంకేరుహాక్షుపాద। కమలసేవోపసాదితఘన మనోర। థములఁ దనరి
యుఁ దనమదిత్తంబులోనఁ। దుష్టిఁబొందక చనియె విశిష్టచరిత॥ అప్లు॥ క॥ అని మైత్రేయుఁడు ధ్రువుఁడ। ట్లనయము
హరిచేఁగృతార్థుఁడైనవిధంబె। ల్లనువినిపించిన విదురుఁడు। విని మునివరుఁజూచి పలికె వినయంబెసఁగన్॥ క॥ మునినా
యక విను కాముక। జన § దుష్ప్రాప్యంబు విష్ణుచరణాంబురుహా। ర్చనహితజనసంప్రాప్యము। ననఁగల పంకేరుహాక్షు
నవ్యయపదముల్॥ వ॥ పెక్కుజన్మంబులం గాని పొందరాని పదంబు దానొక్కజన్మంబున నేపొందియుండె నమనంబునందు
ప్రాప్తమనోరథుండనని పురుషార్థవేదియైన ధ్రువుండెట్లు దలంచెననిన మైత్రేయుండిట్లనియె॥ గీ॥ అనఘ పినతల్లి దన్నుఁ బలిక్కి
నమరుక్తి। బాణవిద్ధాత్ముఁడగుచుఁ దద్భాషణములు। చిత్తమునఁదల్చుచుండుటఁజేసి ముక్తిఁ। గోరమికి నాత్మలో వగఁగుందు
చుండె॥ అంత నాధ్రువుండు॥ చ॥ అనఘ జితేంద్రియుల్ మహితాత్ములునైన సనందనాదులిం। పనయ మనేకజన్మసము
పార్జితయోగసమాధిఁ జేసియె। వ్వని చరణారవిందములు వారక భక్తి నెఱుంగుచుందురా। ఘనుఁ బరమేశు నీశు నవికారు
నమేయు నజేయు నాత్మ్యనిన్॥ వ॥ పనుషణ్మాసంబులు భజియించి తత్పాదపద్మచ్ఛాయం బ్రాపించియు భేదదర్శనుండనైతి
నక్కటా యిట్టి భాగ్యహీనుండనై నయేనుభవనాశనుండైనయతనిం బొడగని నశ్వరంబులైన కామ్యంబులడిగితి నిట్టి నారా
త్మ్య మెందునుంగల దేతమపదంబులకంటె నున్నతపదంబు నొందుదునో యని సహింపంజాలని యీ దేవతల చేత మదీయమ
తిగలుషితంబయ్యెం గాక నాఁడు ✿ నారదుండాడిన మాట తథ్యంబయ్యె నతని వాక్యంబులంగీకరింపకయే నసత్తముండనై
స్వప్నావస్థలం బొందినవాఁడునై వికంబైన మాయం జెంది భిన్నదర్శనుండనగుచు దంభంబున నేసద్విరోధియుండనైనను భ్రాత
యనుశత్రువుచేఁ బ్రాప్తంబయిన దుఃఖంబు నొంది జగదాత్మకుండును ప్రసాదసుముఖుండును భవనాశకుండునైనయీశ్వరు నారా
ధించి తత్ప్రసాదంబు వడసియు నాయుర్విహీనుండై నరోగికిం బ్రయోగించు నౌషధము బోలె నిరర్థకంబులైన నశ్వరంబు
లైనయీ కామితంబులు గోరితినని వెండియు॥ మ॥ ధనహీనుండు నృపాలుఁజేరి మిగులన్ ధాటిన్ఫలీకారమి। ట్లనియర్థించి
నరీతి ముక్తిఫలదుండైనట్టి పంకేజలో। చనుఁడే చాలఁ బ్రసన్నుఁడైన నతనిన్సాంసారికంబర్థిఁగో। రిన నావంటి విమూఢ
మానసులు ధాత్రిన్గల్గిరే యెవ్వరున్॥ సీ॥ అని యిట్లు చింతించెననుచు మైత్రేయముని విదురునకనినిట్లనియెఁ దండ్రికనమునీ

✿ ధ్రువుఁడు మరలి తనపురంబునకు వచ్చుట. ✿

యహరిపాదకమలరజోభిసంస్కృతశరీరులును ⚘ యాదృచ్ఛికమున। సంప్రాప్తమగు దానసంతుష్టచిత్తులై వరలుచును
డుమీవంటివారు। దగ భగవత్పాదదాస్యంబు దక్కంగ నితరపదార్థంబు లెడదలంతు। మఱియును గోరనొల్లరు మను చరి
త్రాతవిలి యిట్లు హరిప్రసాదంబు నొంది। మగలివచ్చుచునున్న కుమారువార్తఁ। జారుచే విని యుత్తానచరణుఁడపుడు॥
మనమున నిట్లనిదలంచె॥ క॥ చచ్చినవారలు గ్రమ్మఱ। వచ్చుటయే గాక యిట్టి వార్తలుగలవే। నిచ్చలు నమంగళుఁడనగుఁద
చ్చుటమఱి నాకు శుభము లేల ఘటించున్॥ క॥ అని † విశ్వసింపకుండియు। మనమందును నారదుఁడు కుమారుఁడు వేగం। బు
నరాగలఁడనుచును బలికిన పలుకులు దలఁచినమ్మి కృతకృత్యుండై॥ క॥ తనసుతుని రాకఁ జెప్పిన। ఘనునకు ధనములును మౌక్తి
కపుహారములు నమ్మనమ్ములరనిచ్చి తనయునిఁ। గనుఁగొను సంతోషమాత్మఁ గడలుకొనంగన్॥ సీ॥ వలనుమీఱఁగ ❀ సైంధవంబు
లఁ బూన్చిన కనకరథంబునుత్కంఠ నెక్కి। బ్రాహ్మణకులవృద్ధబంధుజనామాత్యపరివృతుండగుచు విస్ఫురణ మెఱసి। బ్రహ్మ
నిర్ఘోషతూర్యస్వనశంఖకాహళ వేణురవములందందఁ జెలఁగఁ। శిబికంబు లెక్కి భూషితలై సునీతిసురుచులుత్తముండును నా
రూఢినడువఁ। గరిమఁదీపింపనతిశీఘ్రగమనమొప్ప। నాత్మనగరంబు వెలువడి యరుగుచుండి। బలసి నగరోపవనసమీపంబు
నందు। వచ్చు ధ్రువుఁ గని మేదినీశ్వరుఁడునంత॥ చ॥ అరదము డిగ్గి ప్రేమమగ్గలుకాఁడ ససంభ్రముఁడై రమాను నో। హరుచర

* మామకీన। నాయొక్క... § దుష్ప్రాప్యంబు। పొందశక్యముగానిది... ✿ నారదుఁడు। నరస్యేదంనారం- నరసంబంధమైనదినారము- అజ్ఞానము- నారందదాతీతి నారదః- ఆయజ్ఞానమును పోఁగొట్టువాఁడు గావున నారదుఁడు... ⚘ యాదృచ్ఛికమునన్। ప్రయత్నింపకనే... † విశ్వసింపక। నమ్మక... ❀ సైంధవ। గుఱ్ఱము.

[illegible]ారవిందయుగళాభ్యర్చననిర్దళితాఖిలాఘునిన్। శ్వరకరుణావలోకనసుజాతసమగ్రమనోరథున్ [illegible]। ష్కరమునార క్రీడా
సిపుత్రకల్పనలాక్తఁ బ్రమోదితాత్ముఁడై॥ గీ॥ బిగియఁ గౌఁగిటఁ జేర్చి నెమ్మొగము నివిరి। శిరము [illegible] చుబుకఁ గంబుచే
తఁ బుణికి యవ్యయానందబాష్పధారాభిషిక్తుఁ। జేసి యాశీర్వదింప నాచిరయశుండు॥ క॥ జనకుని [illegible]మునకు నవ
యముఁ గైకొని ప్రమోదియై తత్పదములఁ। దనఫాలతలము సోఁకఁగ। వినతులు గావించి భక్తివిహ్వలుఁడగుచున్॥ గీ॥ [illegible]
సజ్జనాగ్రణియైన ధ్రువుఁడు। దల్లులకు భక్తివినతులు దగ నొనర్చి। సురుచికిని మ్రొక్క నర్భకుఁ జూచి యెత్తి। నను [illegible]
యాలింగనంబుఁ జేసి॥ సీ॥ కరమొప్ప నానందగద్గదస్వరమున జీవింపుమనుచు నాశీర్వదించె। భగవంతుఁ డెవ్వనిపై మైత్రి[illegible]
[illegible]ంచు సత్కృపానిరతిఁ బ్రసన్నుఁ డగుచు। నతనికిఁ దమయంత ననుకూలమై యుండు సర్వభూతంబులును సమతఁ బేర్చి। మహిం
దలపోయ నిమ్నప్రదేశములకు ననయంబు చేరు తోయముల పగిదిఁ। గాన ఘనున నమ్మహాత్ముఁ గారవించె। సురుచి పూర్వంబు
దలఁపక సుజనచరిత। విష్ణుభక్తులు ధరను బవిత్రులగుట। వారికలుగరు ధరణి నెవ్వారు మఱియు॥ వ॥ కావున నుత్తముండు
ను ధ్రువుండును ప్రేమవిహ్వలురగుచు నన్యోన్యాలింగితులై పులకాంకురాలంకృతశరీరులై యానందబాష్పంబుల నొప్పి
రంత సునీతియుఁ దన ప్రాణంబులకంటెం బ్రియుండైన సుతు నుపగూహనంబు చేసి తదవయవస్పర్శనంబు చేత నానందంబు
నొంది విగతశోకయయ్యె నప్పుడు సంతోషబాష్పధారాసిక్తంబులై చనుబాలు గురిసె నంత॥ సీ॥ ఉన్నతసంతోషము ప్పొ
దల్లఁగఁ బౌరజనములా ధ్రువుతల్లి నెనయఁ జూచి। తొడరిన భవదీయదుఃఖనాశకుఁడై యీ తనూజుండు నెందేనిఁ బెద్ద।
కాలంబు క్రిందటఁ గడగి నష్టంబైన వాఁ డిప్పు నీభాగ్యవశముఁ జేసి। ప్రతిలబ్ధుఁడయ్యె నీతండు భూమండలమెల్ల నురక్షించు ని
గ్ధమహిమ। గమలలోచనుఁ జింతించు ఘనులు లోక। దుర్జయంబైన యట్టి మృత్యువును గెల్తు। రట్టి ప్రణతార్తిహరుఁడైన య
బ్జనాభుఁ। దర్శిని చేతఁ బూజితుఁడగుట నిజము॥ వ॥ అని ప్రశంసించిరట్లు పౌరజనంబుల చేతను పలాల్యమానుండగుచు నుత్తా
నపాదుండుత్తమసమేతంబుగా ధ్రువుని గజారూఢునిం జేసి ప్రహృష్టాంతరంగుండై పురాభిముఖుండై చనుదెంచి॥ సీ॥ *స్వ
ర్ణపరిచ్ఛదస్వచ్ఛకుడ్యద్వారలాలితగోపుర§అట్టాలకములు। ఫలపుష్పమంజరీకలితరంభాస్తంభపూగపోతాదివిభూషి
తంబు। ఘనసారకస్తూరికాగంధజలబంధురాసిక్తవిపణిమార్గాంచితంబు। మానితనవరత్నమయరంగవల్లీవిరాజితప్రతి
గృహప్రాంగణంబు। శుభనదీజలకుంభసంశోభితంబు। దండులస్వర్ణలాజాక్షతప్రసూన। ఫలభరవ్రాతకలితవిభ్రాజితం
బు। నగుచు సర్వతోలంకృతమైన పురము॥ వ॥ ప్రవేశించి రాజమార్గంబునఁ జనుదెంచునప్పుడు॥ మ॥ హరిమధ్యల్ పురకామిను
ల్ సతులు సౌధాగ్రంబులందుండి భా। స్వరసిద్ధార్థఫలాక్షతప్రసవదూర్వావ్రాతదధ్యంబువుల్। గరవల్లీమణిహేమకంకణఝు
ణత్కారంబు శోభిల్లఁ జల్లిరి యాభాగవతోత్తమోత్తమునిపై లీలానుమేయంబుగన్॥ వ॥ ఇట్లు వాత్సల్యంబునం జల్లుచు స
త్యవాక్యంబులం దీవించుచు సువర్ణపాత్రరచితమణిదీపనీరాజనంబుల నివాళింపం బౌర‡జానపదమిత్రామాత్యబంధుజన
పరివృతుండై చనుదెంచి॥ సీ॥ కాంచనమయమరకతకుడ్యమణి‡జాలసంచయరాజతసౌధములను। వరసుధాఫేనపాండు
రరుక్మపరికర‖దాంతపరిచ్ఛదతల్పములను। సురతరుశోభితశుకపికమిథునాళిగానవిభాసితోద్యానములను। సుమహితవై
దూర్యసోపానవిమలశోభితజలపూర్ణ¶వాపీచయములు। వికచకల్హారదరదరవిందకైర। వప్రదీపితబకచక్రవాకరాజ।
హంససారసకారండవాదిజలవి। హంగనినదాభిరామపద్మాకరములు॥ మఱియును॥ గీ॥ చారుబహువిధవస్తువిస్తరత నొప్పి।
యంగనాయుక్తమగుచుఁ బెంపగ్గలింప। నర్థిఁ దనరారు జనకు గృహంబుఁ జొచ్చి। నెలమిఁ ద్రిదివంబు సొచ్చు దేవేంద్రు పగిది॥
వ॥ ఇట్లు ప్రవేశించి రాజర్షియైన యుత్తానపాదుండు సుతుని యాశ్చర్యకరంబైన ప్రభావంబు వినియుం జూచియు మనంబున
విస్మయంబు నొంది ప్రజానురక్తుండయ్యును బ్రజాసమ్మతుండును నవయౌవనపరిపూర్ణుండును నైన ధ్రువుని రాజ్యాభిషిక్తుం జే
సి వృద్ధవయస్కుండైన తన్ను దాన యెఱింగి యాత్మగతిఁ బొందనిచ్ఛయించి విరక్తుండై వనంబునకుం జనియె నంత నా ధ్రువుం
డు శింశుమారప్రజాపతికూఁతురైన భ్రమియను దాని వివాహంబై దానివలన కల్పవత్సరులను నిద్దరు కొడుకులం బడసి వెండి
యు వాయుపుత్రియైన యిలయను భార్యయందు నుత్కలనామకుండైన కొడుకును నతిమనోహరమైన కన్యారత్నంబునుం గనియె
నంతఁ దదాశ్రితమైన యుత్తముండు వివాహంబు లేకుండి మృగయార్థంబు వనంబునకరిగి హిమవంతంబున యక్షుని చేత
హతుండయ్యె నతని తల్లియుఁ దద్దుఃఖంబున వనంబునకేగి యందు గహనదహనంబున మృతిఁ బొందె ధ్రువుండు భ్రాతృమరణం

---

* స్వర్ణపరిచ్ఛదములు బంగారు పూఁతగలవి... § అట్టాలకములు కోటపాకెతిమీఁది యిల్లు... ‡ జానపదులు దేశములనుండి వచ్చినవారు... ‡ జాలములు [illegible]... ‖ దాంతపరిచ్ఛదములు ఏనుఁగుకొమ్ములఁ జేర్చిరచిన పందిళ్లుగలవి... ¶ వాపీ నడబావి,

బవిష్ణి కోపామర్ష వ్యాకులిత చిత్తుండై జైత్రంబగు రథంబెక్కి యుత్తరాభిముఖుండై చని హిమవద్ద్రోణియందు భూతగణ సేవి

## ధ్రువుండు కుబేరానుచరులైన గుహ్యకులతో యుద్ధంబు సేయుట.

తంబగు యక్షసంకులంబునైన యలకాపురంబు పొడగని॥ మ॥ ఘనశౌర్యోన్నతితోడ సర్వకకుబాకాశంబులందుం బ్రతి ధ్వ
నులొప్పన్ నిజశంఖము మహోద్యల్లీలఁ బూరింపఁ దన్నినదంబున్ విని యక్షకాంతలు భయాన్వితాత్మలై రుగ్రసాధ్వస
లై యక్షభటుల్ పురిన్వెడలి రుత్సాహంబు సంధిల్లఁగన్॥ వ॥ ఇట్లు వెడలి యా ధ్రువునిం దాకిన॥ చ॥ కరము మహారథుండు భుజగ
ర్వపరాక్రమశాలి యున్నను గ్ధరుఁడును శూరుఁడా ధ్రువుఁడు దన్ను నెదిర్చిన యక్షకోటిఁ జెచ్చెరఁ బదమూఁడు వేలనొక్కటి
తీక్ష్ణశైకొనకొక్క పెట్టఁ బెట్టెన్ కరము గమూఁడు మూఁడు శితకాండములం దగ గ్రువ్వ నేసినన్॥ ఉ॥ వారు లలాటముల్ వ్రీలి వా
రక సోలియు దెలియమ్మహాదారుపరాక్రమప్రకటధైర్యముఁ దక్కరలాఘవంబుఁ బల్మారును మెత్తు రుచ్చుమ్ముపిత మాన
సులై పదతాడితప్రదుష్టోరగకోటిఁ బోలి చటులోగ్రభయంకర రోషమూర్తులై॥ ఉ॥ ఆరథికోత్తముం దొడరి యందఱు నొ
క్కట బెట్టు ముట్టి పెం పారఁగ బాణషట్కము దదంగములన్ బగులంగ నేసి వి స్ఫారగదాశరచ్ఛురికపట్టసతోమరశూలఖ
డ్గముల్ ప్సారథియుక్తుఁడై నరథిసత్తము పైఁ గురియించి రేపునన్॥ వ॥ అట్లు గురియించిన నతండు॥ క॥ పెంపఱియుండెను ధారా
సంపాతచ్ఛన్నమైన శైలము భంగిన్ గుంపులుగొని యాకసమునఁ గంపింపుచు నపుడు సిద్ధగణములు వరుసన్॥ క॥ హాహా
కారము లెసఁగగ నోహో యీరీతి ధ్రువపయోరుహహితుఁడు త్సాహము చెడి యిటు దైత్యప యోహార్ణవమందు నేఁ
డు మునిఁగెనె యకటా॥ అవిచింతించు సమయంబున॥ క॥ తామాతనిఁ గెలిచితిమని యామనుజాశనులు వలుక నటనీ
హార సోమము సమయించు మహా ధాముండగు సూర్యుఁ బోలి తద్దయుఁ దోఁచెన్॥ అట్లు దోఁచిన॥ మ॥ అరిదుఃఖావ
హమైన కార్ముకము గార్యస్ఫూర్తితోఁ దాల్చి భీకరబాణావళిఁ బింజపింజగర వంగా నేసి ఝంఝానిలుం డురు మేఘా
వళిఁ బారఁ దోలు గతి నత్యుగ్రాహవక్రూరబంధుర శస్త్రావళి రూపుమాపె విలసద్దోర్లీల సంధిల్లఁగన్॥ చ॥ మఱియు పుడమ్మ
హాత్ముఁడసమాన బలుండు మహోగ్రబాణము లగ్లకటిఁ దాఁక నేసి భుజగర్వమెలర్ప విరోధి మర్మము ల్పఱియలు సే
సి యంగములు భంగము నొందఁగఁ జేసి వ్రేల్మిడిన్ ద్రిగిఁ బొనిపర్వతంబుల నొగిం దెగఁగొట్టెడు నింద్రుకైవడిన్॥ అయ్యా
వసరంబున॥ చ॥ అలఘుచరిత్రుఁ డమ్మునికులాగ్రణి చేవికలాంగులైన వారలసకిరీటకుండలవిరాజితమస్తకకోటిచే సము
జ్జ్వలమణికంకణాంగదలసద్భుజవర్గముచేత సంగరస్థలమతిరమ్యమై దనరెసంచితవీరమనోహరాకృతిన్॥ అంతహతశే
షులు॥ క॥ వరబలుఁడగు మనుమనుమని శరసంఛిన్నాంగులగుచు సమరవిముఖులై హరిరాజముగని పరచెడు కరిబృందముఁ
బోలి చనిరి కళవళపడుచున్॥ క॥ అప్పుడు రాక్షసమాయలు గప్పిన ధ్రువుఁడసురవరుల కార్యం బెఱుఁగన్ జొప్పడక వారి బొడఁ
గనఁ దెప్పరమగు టయును సారథిం గనియంతన్॥ క॥ తలఁపోయఁగ భువి మాయావులకృత్యం బెఱుఁగ నెవ్వరోపుదురనుచు
న్పలుకుచు దత్పురిఁ జొరఁగాఁ దలఁపుచు నదిగాన రాకఁ దద్దయు మానెన్॥ వ॥ అట్లు పురంబునకరుగుట మాని చిత్రరథుండై
న యాధ్రువుండు సప్రయత్నుండయ్యు నుబరప్రతియోగ శంకితుండై యుండె నయ్యెడ మహాజలధి ఘోషంబు ననుకరించు శ
బ్దంబు వినంబడె నంత సకలదిక్తటంబుల వాయుజనితంబైన రజఃపటలంబు చేఁ దత్క్షణంబున నాకాశంబున విస్ఫురత తటిత్ప్రభా
కలితగర్జారవయుక్తమేఘంబుల మొగంబులగుచు భయంకరాకారంబులై తోఁచె నంత॥ మ॥ అనయంబున్ ధ్రువుమీఁద దై
త్యకృతమాయాజాలము ల్గ్లెచిభోరనమస్తిష్క పురీషమూత్రపలదుర్గంధాస్థిమేదశ్శరాసననిస్త్రింశశరాళితోమరగ
దాచక్రత్రిశూలాదిసాంధనభూభృన్నభుజగాతళింగురిసెనుద్దండక్రియాలోలతన్॥ వ॥ మఱియు మత్తగజసింహవ్యా
ఘ్ర సమూహంబులు నార్మిభయంకరంబయి సర్వతఃప్లవనంబయిన సముద్రంబును గానంబడియె వెండియుం గల్పాంతం
బునందుం బోలె భీషణంబయిన మహాప్రోదంబును దోఁచె నివ్విధంబున నానావిధంబుల నేకంబులును విరళభయంకరంబు
లు నైన యసురమాయలు క్రూరప్రవర్తనులగు యక్షులచేత సృజ్యమానంబులై యడరె నా సమయంబున॥ క॥ అనయము మా
యావ్యసురుల ఘనమాయ నెఱింగి మునినికాయము వరుసన్ మనుమనుమని మనుమనుమని మనమునఁ దలఁపుచును దత్స

---

మహారథుండు॥ శ్లో॥ ఏకాదశసహస్రాణి యోధయేద్యస్తు ధన్వినామ్। శస్త్రశాస్త్రప్రవీణస్తు మహారథ ఇతి స్మృతః॥ అమితాన్ యోధయేద్యస్తు సంప్రోక్తోతిరథస్తు సః। సమస్త్వేకేన యోద్ధా తస్యోనోర్థరథో మతః॥ ఇతి. తా. పదునొకొండు వేలవిలుకాండ్రతో యుద్ధము జేయు సామర్థ్యము గలశస్త్రశాస్త్రప్రవీణుఁడైనవాఁడు మహారథుఁడనంబడును - అపరిమిత రథికులతో యుద్ధము జేయువాఁడు - అతిరథుఁడనంబడును - ఒకరథికునితో యుద్ధము చేయువాఁడు సమరథుండనంబడును - ఆసమరథునికంటె తక్కువైనవాఁడు అర్ధరథుండనంబడును … గిరిగొని చుట్టుకొని.

మత్తమమునకుఁ॥ చను దెంచియిట్లనిరి॥ సీ॥ అనఘాత్మలోకు లెవ్వనిదివ్యనామంబుసమతనాకర్ణించిసంస్మరించి। దుస్తరంబైనమృత్యువునైనసుఖవృత్తిఁదరియింతురట్టియీశ్వరుఁడుపరుఁడు। భగవంతుఁడును శార్ఙ్గపాణియుభక్తజనార్తిహరుండగునట్టివిభుఁడు। భవదీయవిమతులఁబరిమార్చుఁగాక నివలికినమునులసంభాషణములు। వినికృతాచమనుఁడౌరమాధిభునిపాద। కమలముఁదలంచిరిపుభయంకరముఖాగ్ర। కలితనారాయణాస్త్రంబుఁగార్ముకమునఁ। బూనఁదగవఁదటయుసంధానమునను॥ గీ॥ కడఁగిగుహ్యకమాయాంధకారమపుడు। వెరవుచెడిదవ్వుదవ్వులవిరిసిపోయె। విమలమైనవివేకోదయమునఁజేసి। సమయురాగాదికంబులసరణినంత॥ మ॥ వరనారాయణదైవతాస్త్రజనిదుర్వారప్రభాహేమ*పుంఖ। రుచిస్ఫారమరాళరాజసితపక్షక్రూరధారాపత। చ్ఛరసాహస్రములోలిభీషణవిపక్షశ్రేణిపైప్రాలెఫీ। కరరావంబునఁగానఁజొచ్చుశిఖిసంఘాతంబుచందంబునన్॥ అక్లేసిన. చ॥ ఖరనిశితోగ్రసాయకనికాయపరంపరవృష్టిచేఁబొరిం। బొరివికలాంగులై యడరిపుణ్యజనుల్ పృథుహేతిపాణులై। గరుడునిఁజూచిభూరిభుజగప్రకరంబులెదిర్చిపేర్చిచె। చ్చెరనడతెంచుచందమునఁజిత్రరథున్బలుపూనితాఁకినన్॥ ఉ॥ వారలఁజండతీవ్రశరవర్గముచేతనికృత్తపాదజం। ఘోరుశిరోధరాంబకశిఖోదరకర్ణులఁజేసియోగిపం। కేరుహమిత్రమండలసకృద్భిదనెట్టిపదంబుఁజెందునా। భూరిపదంబునం బెలుచఁ

## స్వాయంభువుండుధ్రువునిసంగరంబుడుగుమనియుపదేశించుట.

బొందఁగఁబంపెభుజావిజృంభియై॥ వ॥ ఇవ్విధంబుననాచిత్రరథుండగుధ్రువునిచేతనిహన్యమానులునిరపరాధులునైనగుహ్యకులంజూచియతనిపితామహుండయినస్వాయంభువుండు ఋషి.గణపరివృతుండైచను దెంచిధ్రువునింజూచియిట్లనియెవత్సానిరపరాధులయినపుణ్యజనులనెట్టిరోషంబునవధియించితివట్టినిర్హేతువైనరోషంబువిరమింపుము భ్రాతృవత్సలభ్రాతృవధాభితప్తుండవై కావించునీయత్నంబుడుగుమని॥ క॥ అనఘామనుకులమునకిది। యనుచితకర్మంబయొకనికైపెక్కండ్రి। ట్లనిమొనఁగ్రుంగిరియిదిలే। కనయంబునువలవదుడుగుమయ్యకుమారా॥ వ॥ అదియునుంగాక దేహాభిమానంబునం బశుప్రాయులైహింసఁగావించుట *హృషీకేశానువర్తనులయినసాధువులకుం దగదునీవుసర్వభూతంబులనాత్మభావంబునఁదలఁచిసర్వభూతావాసుండుదురారాధ్యుండునైనవిష్ణునిపదంబులఁబూజించి తత్పరమపదంబునుబొందితివియట్టిభగవంతునిహృదయంబున *ననుధ్యాతుండవుభాగవతులచిత్తంబులకుసమ్మతుండవుమఱియు సాధువర్తనుండవననెప్పనీవీపాపకర్మంబెట్లుసేయ*సమకట్టితివేపురుషుండైన నేమిమహాత్ములయందుఁ* తితిక్షయు సములయందుమైత్రియుహీనులయందుఁగృపయునితరములగుసమస్తజంతువులయందు సమత్వంబును గలిగివర్తించువానియందుసర్వాత్మకుండైనభగవంతుండుప్రసన్నుండగు నతండుప్రసన్నుండైనవాఁడుప్రకృతిగుణంబులంబాసి లింగశరీరభంగంబుఁగావించిబ్రహ్మానందంబునుంబొందునదియునుంగాక కార్యకారణసంఘాతరూపంబైనసర్గంబీశ్వరునందున*యస్కాంతసన్నిధానంబుగలిగినలోహంబుచందంబునవర్తించునందుసర్వేశ్వరుండు నిమిత్తమాత్రంబుగాఁబరిభ్రమించునట్టియీశ్వరునిమాయాగుణవ్యతికరంబున నారబ్ధంబులైనపంచభూతంబులచేత యోషిత్పురుష*వ్యవాయంబువలనయోషిత్పురుషాదిరూపసంభూతియగు నివ్విధంబునసర్గంబుఁ దత్సంస్థానంబుఁదల్లయంబునగుచునుండు నిట్లుదుర్విభావ్యంబయినకాలశక్తింజేసిగుణక్షోభంబునవిభజ్యమానవీర్యుండునంతుండునాదియునై జనంబులచేత జనంబులఁబుట్టింపుచుండుటంజేసిగదాయాదికరుండుమృత్యుహేతువులగుజనంబులలయంబు నొందించుటంజేసి యంతకరుండునైయనాదియగుటంజేసియవ్యయుండునైనభగవంతుండుజగత్కారణుండగుఁగావుననీసృష్టిపాలనవిలయంబులకుంగర్తగానివానివడువునదానిఁజేయుచుండునిట్లుమృత్యురూపుండుపరుండుసమవర్తియునైనయీశ్వరునికి స్వపక్ష పరపక్షంబులు లేవుకర్మాధీనంబులైనభూతసంఘంబులురజంబులుమహావాయువుననుసరించుచాడ్పుననస్వతంత్రంబులగుచు నతనిననువర్తించునీశ్వరుండుజంతుచయాయు*రుపచయాపచయకరణంబులందస్పృష్టుండునగుజీవుండుగర్మబద్ధుండగుటంజేసికర్మంబవానికినాయురుపచయాపచయంబులంజేయుచుండుమఱియుసర్వజగత్కర్మసాక్షియగు సర్వేశ్వరుని॥ క॥ కొందఱుస్వభావమందురు। కొందఱుకర్మంబటండ్రు కొందఱుగాలం। బందురుకొందఱుదైవం। బందురుకొందఱును

---

*పుంఖ। వింటినారిమీఁదమోపుబాణపుపింజ... *హృషీకేశ। హృషీకాణామింద్రియాణామీశః-ఇంద్రియములకునీశుఁడనిఅర్థము.... *అనుధ్యాతుండవు। ధ్యానముచేయుచున్నవాఁడవు... *సమకట్టితివి। ప్రయత్నముచేసితివి... *తితిక్ష। ఓర్పు. *అయస్కాంత। సూదిగుండురాయి. *వ్యవాయము। సంగమము... *ఉపచయాపచయ। వృద్ధిక్షయములు.

రామమంత్రప్రమహాత్మా॥ వ॥ ఇట్టులవ్యక్తరూపుండునప్రమేయుండు నానాశక్త్యుదయహేతుండునై సకలగుణ
ఘుండు సేయుకార్యంబుల బ్రహ్మరుద్రాదులెఱుంగరట యతనితత్త్వంబులెవ్వరు నెఱుంగనోపరు గావునం బుత్రా యిట్లు
సృష్టిస్థితివినాశంబులకు దైవంబు కారణంబై యుండుఁగాన నిర్ధనదానవరులు భవదీయభ్రాతృహంతలగుదురే భూతాత్మకుం
డు భూతేశుండు భూతభావనుండునగు నీశ్వరుండు పరాపరుండునగు నీశుండు మాయాయుక్తుండై స్వశక్తిచే సృష్టిస్థితిలయం
బులం జేయునై ననహంకారంబునం జేసి గుణకర్మంబులచే నప్పృథ్వ్యండగుచు వర్తించు నదియునుంగాక యీప్రజాపతులు
విశ్వసృజ్నామంబుల నియంత్రితులై ముకుదాళ్లు వెట్టిన పశువులం బోలి యెవ్వని యాజ్ఞాధీనకృత్యులై వర్తింతురట్టి మృత్యుజన
మృత్యువు సుజనామృతస్వరూపుండు సర్వాత్మకుండు జగత్పరాయణుండునైన యీశ్వరుని సర్వప్రకారంబుల శరణంబుఁ
బొందుము అదియునుంగాక॥ సీ॥ అనఘాత్మ నీవు పంచాబ్దవయస్కుండవై పినతల్లి నిన్నాడినట్టి మాటల నిర్భిన్నమర్మండవగుచు
మజనయిత్రి దిగనాడి కానకేగి తపమాచరించి యచ్యుతునీశ్వరుని భక్తిఁ బూజించి మహితవిభూతి మెఱసి రమణఁ ద్రిలోకో
త్తరంబైన పదమును బొందితివది గాన భూరిభేదరూపమైన ప్రపంచంబు రూఢి నేమహాత్మునందుఁ బ్రతీతమై యలరునట్టి
యగుణుఁడై యద్వితీయుండునక్షరుండు నైన యీశ్వరుఁ బరమాత్మునను దినంబు॥ సీ॥ వెదకొని శుద్ధంబుగత మత్సరాదికంబ
మలంబున గు హృదయంబునందు సొలయక న్వేషింపుచును బ్రత్యగాత్ముండు భగవంతుఁడును బరబ్రహ్మమయుఁడు నానం
దమాత్రుండు నవ్యయుండు పపన్న సకలశక్తియుతుండు సగుణుఁడజుఁడు నైన సర్వేశ్వరునం దుత్తమంబైన సద్భక్తిఁ జేయు
చు నమతనొప్పి రూఢిసోహమ్మమయని ప్రరూఢమగుచు ఘనతరోన విద్యామహాగ్రంథి నీవు ద్రెంచివైచితి కావున ధీవరే
ణ్యా సర్వశుభహానియైన రోషంబువలదు॥ క॥ విను రోషహృదయుఁ గనుఁగొని యనయము లోకము నశించు నతిభయయుత
మై ఘను రోగమౌషధంబుల యనువున నది గాన రోషమడఁపుమహాత్మా॥ గీ॥ అనఘ నీ మసహోదరహంతలనుచు బెనచి
యీ పుణ్యజనులఁ జంపితి కడంగి పరగ నిది మెసదాశివభ్రాతయైన యర్థవిభునకు నపరాధమయ్యెఁ గాన॥ క॥ ధృతి నుతులచే
తని విపుడతనిఁ బ్రసన్నునిఁగఁ జేయుమని మనువుదయామతిఁ జెప్పి ధ్రువుని చేసత్కృతుఁడై నయమొప్పఁ జనిరి మొఋషి
యుక్తుండై॥ అంత॥ గీ॥ యక్షచారణసిద్ధవిద్యాధరాది జనగణస్తూయమానుఁడై ధనదుఁడంతఁ బుణ్యజనవైశసనివృత్తభూ
రిరోషరహితుఁడై నట్టి ధ్రువునిఁ జేరంగవచ్చి॥ అప్పుడు॥ సీ॥ చనుదెంచి వెసఁ గృతాంజలియైన ధ్రువునిఁ జూచి తిపుటనిట్లనియె
తు త్రియకుమార। తగ భవదీయ పితామహాదేశంబునను దుస్త్యజంబైన ఘనవిరోధ। ముడిగితివట్లు గావునఁ దానఁ జేసి నీ
యందుఁ బ్రసన్నుండనైతి భూరి జననలయంబులకనయంబు గాలంబె కర్తయై వర్తించుఁ గాన యుష్మదనుజుఁ జంపిన వార
లీయక్షవరులు గాదు తలపోయ నీ యక్షగణము నిట్లు నెఱివధిరచినవాఁడవు నీవుఁ గావు వినుతగుణశీల మాటలు వేయు నేల॥
వ॥ అదియునుంగాక యేబుద్ధిం జేసి కర్మసంబంధదుఃఖాదికంబులు దేహాత్మానుసంధానంబునం జేసి సంభవించునట్టి
యహంత్వమ్మనపార్థజ్ఞానంబు స్వప్నమందుం బోలెఁ బురుషునకుం దోఁచు నది గావున సర్వభూతాత్మ విగ్రహుండున
ధోక్షజుండు భవచ్ఛేదకుండు భజనీయపాదారవిందుండు ననంతామేయశక్తియుక్తుండు గుణమయియగు నాత్మమాయ
చే విరహితుండునైన యీశ్వరుని సేవింపుము- నీకు భద్రంబయ్యెడు భవదీయ మనోగతంబైన వరంబుఁ గోరుము నీవంబు
జనాభపాదారవింద సేవనంబుఁ దిరంబుగఁ జేయుమవని యెఱుంగుమనని రాజరాజు చేత నట్లు మహామతియు భాగవతోత్త
ముండునైన ధ్రువుండు ప్రేరేపింపంబడి యేహరిస్మరణంబుచేతఁ దనప్రయత్నంబు నదురత్యయంబైన యజ్ఞానంబుం దరి
యింతురట్టి హరిస్మరణం బచలితంబగునట్లొసంగుమని యడిగిన నట్ల కాక యని యంగీకరించి యంతకుబేరుండు సంప్రీతచిత్తుం
డై ధ్రువునికి శ్రీహరిస్మరణం బిట్లియనుగ్రహించి యంతర్ధానంబు నొందె నంత ధ్రువుండు యక్షకిన్నరకింపురుషగణసంస్తూ
యమానవైభవుండగుచు నాత్మీయపురంబునకు మరలి చనుదెంచి॥ సీ॥ గణుతింప భూరిదక్షిణలచేఁ గడునొప్పు యజ్ఞములసే
యనయజ్ఞవిభుఁడు ద్రవ్యక్రియాదేవతాఫలరూపసత్కర్మఫలప్రదాతగుచు నొప్పు పురుషోత్తముని నర్థిఁ బూజించి మ
ఱియు సర్వోపాధివర్జితుఁడు త్తముండు సర్వాత్మకుండగు జలజాక్షునందుఁ దీవ్రంబై ప్రవాహరూపంబునైన భక్తివలు
పుచు నఖిలప్రపంచమందు నలరఁ దనయందునున్న మహాత్ము హరినిఁ జిదానందమయుని లక్ష్మీశుఁ బరము విశ్వేశ్వరు
బొడగనె నిద్ధచరిత॥ వ॥ ఇట్లు సుశీలసంపన్నుండు బ్రహ్మణ్యుండు ధర్మసేతురక్షకుండు దీనవత్సలుండునయి పాలించు ధ్రువుం
నిం బ్రజలు దండ్రియని తలంపని యుండిరి యారాజు వేలంబు భోగంబుల చేతం బుణ్యక్షయంబును భోగంబులైన యాగాదుల చేత
నశుభక్షయంబును జేయుచు బహుకాలంబు దనుకఁ ద్రివర్గసాధనంబుగా రాజ్యంబు చేసి కొడుకునకుం బట్టంబుఁ గట్టి యుచా

తేంద్రియుండై యవిద్యారచితస్వప్నగంధర్వనగరోపమంబై నదేహాదికంబగు విశ్వంబు భగవన్మాయారచితంబనియా త్మం దలంపుచు వెండియు॥ చ॥ ననునిభుఁడంతభృత్యజనమంత్రిపురోహితబంధుమిత్రనం। దనపశువిత్తరత్నవనితాగృహ రమ్యవిహారశైలవా।రినిధిపరీతభూతలహరిద్విపముఖ్యపదార్థజాలము।ల్మనమతిచేననిత్యములుగాఁదలపోసివిరక్తచిత్తుఁ డై॥ సీ॥ పురము వెల్వడిచనిపుణ్యభూబదరికాఘనవిశాలానదీకలితమంగ।శాంబుపూరంబులననురక్తిమైఁగ్రుంకికమనీ యపరిశుద్ధకరణుఁడగుచుఁ। బద్మాసనస్థుఁడై పవనునిబంధించి నెలకొనిముకుళితనేత్రుఁడగుచు। హరిరూపవైభవధ్యానం బుసేయుచుభగవంతునచ్యుతుఁబద్మనేత్రు।నంమనసతతంబునిశ్చలమైనయట్టి।భక్తిఁబ్రవహింపఁజేయుచుఁబరమమోద। బాష్పధారాభిషిక్తుండుభవ్యయశుఁడు। పులకితాంగుండునగుచునివ్వెఱఁదనర్చి॥ వ॥ మఱియువిగతక్లేశుండుముక్తలిం గుండునయిధ్రువుండుదన్నుఁదామఱచియుండుసమయంబునదశదిక్కులనుద్యద్రాకానిశానాయకుంబోలి వెలిఁగింపు చునాకాశంబుననుండియొక్కవిమానంబుచనుదేరనందు దేవశ్రేష్ఠులుచతుర్భుజులురక్తాంబుజేక్షణులు శ్యామవర్ణులుగ దాధరులుసువాసస్సులుఁ గిరీటహారాంగదకుండలధరులుఁ గౌమారవయస్కులు నుత్తమశ్లోకకింకరులునయినవారలని ద్ధరింగనిసంభ్రమంబునలేచి మధుసూదననామంబులుసంస్మరింపుచు వారలభగవత్కింకరులుగాఁదలంచిదండప్రణా మంబులాచరించి *కృష్ణపాదారవిందవిన్యస్తచిత్తుండుఁగృతాంజలియువినమితకంధరుండునైనధ్రువునింగనుంగొని పు ష్కరనాభభక్తులైనసునందనందనులుప్రీతియుక్తులై మందస్మితులగుచునిట్లనిరి॥ ఉ॥ ఓనృపనీకుభద్రమగునొప్పగుచున్న మదీయవాక్యము।ల్వీనులయందుఁజొన్పుమువివేకముతోనయిదేండ్లనాఁడుమే।ధానిధివైయొనర్చినయుదాత్తతపోవ్రత నిష్ఠచేతఁదే।జోనయశాలినైనమధుసూదనుఁదృప్తివహింపఁజేసితౌ. గీ॥ అట్టిశార్ఙ్గపాణియఖిలజగత్కర్త। దేవదేవుఁడతు లదివ్యమూర్తి।మమ్ముఁబనుపమేముమాధవపదమున।కర్థినిన్నుఁగొనుచునరుగుటకును॥ వ॥ వచ్చితిమియేపదంబు నేమిసూరి జనంబులుసర్వోత్తమంబనిపొందుదురు దేనిఁజంద్రదివాకరగ్రహనక్షత్రతారాగణంబులు ప్రదక్షిణంబుగాదిరుగుచుం డుమఱియునీమపితృలచేతనన్యులచేతననధిష్ఠితంబుజగద్వంద్యంబునభక్తజనాతిమృగ్యంబునైనవిష్ణుపదంబుఁబొంద నువురమ్మిదివిమానశ్రేష్ఠంబుత్తమశ్లోకజనమౌళిమణియైనశ్రీహరిపుత్తెంచెదీనినెక్కనర్హుండవనిననురుక్రమప్రియుం డైనధ్రువుండుదమ్మధురవాక్యంబులువినికృతాభిషిక్తుండై యచ్చటిమునులకుం బ్రణమిల్లితదాశీర్వాదంబుఁగైకొనివి మానంబునకుం బ్రదక్షిణార్చనంబులుగావించి పార్షదులైనసునందనందనులకువందనంబాచరించి భగవద్రూపవిన్యస్త చక్షురంతఃకరణాదికుండగుచు యావిమానాధిరోహణంబుగావించుటకుహిరణ్మయరూపంబుధరియించెనప్పుడు॥ క॥ సు రమంచుభిపణవానక।మురజాదులుమొఱసెవిరులముసరుగురిసెఁగి।న్నరగంధర్వులపాటలు।భరితములై చెలఁగెనపుడు భవ్యచరిత్రా॥ వ॥ అట్టిసమయంబున ధ్రువుండుమర్గమంబగుత్రివిష్టపంబునకునేగువాఁడగుచు దీనయగుజననిందెగడియె ట్లుపోవుదునని చింతించు వానింబార్శ్వములవలోకించియగ్రభాగంబునవిమానారూఢయైయేగుచున్న జననింజూపినసంతు ష్టాంతరంగుండగుచు॥ క॥ జననిసునీతినిమునుఁగనుఁ।గొనియమలవిమానమెక్కి గొనకొనివిబుధు।ల్దనమీఁదఁబుష్పవర్షము। లనయముగురియింపధ్రువుఁడుహర్షముతోడన్॥ క॥ చనిచని వెసగ్రహమండల। మునుత్రైలోక్యంబుసప్తమునిమండ లముఁ।ఘనుఁడుత్తరించియవ్వలఁ।దనరెడుహరిపదమునొందెఁదద్దయుఁబ్రీతిన్॥ వ॥ అదిమఱియునిజకాంతిచేతంద్రిలో కంబులంబ్రకాశింపంజేయు, నిర్దయాగమ్యంబు, శాంతులు, సమదర్శనులు, శుద్ధులు, సర్వభూతానురంజనులు, నచ్యుతభ క్తబాంధవులు,నైన భద్రాచారులకుసుగమ్యంబై గంభీరవేగంబుననిమిషంబునగుజ్యోతిశ్చక్రంబుసమాహితంబై గోగ ణంబుమేధియందుఁబోలెనెందుఁబరిభ్రమించుచుండునట్టియచ్యుతపదంబునుంబొంది విష్ణుపరాయణుండైనధ్రువుండు త్రిలోకచూడామణియైయొప్పుచుండెనప్పుడుభగవంతుండైన నారదుండుధ్రువునిమహిమంగనుంగొనిప్రచేతస్సత్త్రం బునందువీణవాయించుచు॥ సీ॥ పతియొదైవంబుగాభావంబులోఁదలఁచుసునీతినందనుతపఃప్ర।భావముక్రియధర్మభ వ్యనిష్ఠలఁబొందఁజాలరుబ్రహ్మర్షిజనములనిన। క్షత్రియకులులెన్నఁగానేల నెవ్వాఁడుపంచసంవత్సరప్రాయమునను। సురుచిమరుక్త్యగ్రశరభిన్నహృదయుఁడై మద్వాక్యహితబోధమతిఁదనర్చి।వనమునకునేగిహరిభక్తివశతనొంది।యజి తుఁడగుహరితనవశుడై చరింపఁ।జేసివెసఁదత్పదంబునుజెందెనిట్టి।హరిపదంబునుబొందనెవ్వరికిఁదరము॥ క॥ అనిపాడెన

---

* కృష్ణ।సర్వంకరోతీతికృష్ణః- అన్నిటినిజేయువాఁడు-డుకృఞ్ కరణే-దైత్యాన్ కర్షతీతివా-కృషవిలేఖనే-రాక్షసులసంహరించువాఁడు-కృష్ణవర్ణత్వాద్వా-కృష్ణవర్ణుఁడుగావునకృష్ణుఁడు-అనఁగానీలవర్ణుఁడు.

నుచు విదురున కనఘుఁడు మైత్రేయుఁ డనియె నంచితభక్తి। న్వినుతోద్దామయశస్కుం। డనఁగల యాధ్రువుని చరితమాద్య
స్తుత్యా॥ సీ॥ మహిత సత్పురుష సమ్మతము ధన్యంబు స్వర్గప్రదంబు యశస్కరంబు। నాయుష్కరంబుఁ బుణ్యప్రదాయ
కము సుమంగళకర *మఘమర్షణంబు। సౌమనస్యముఁ బ్రశంసాయోగ్యము ను బాపహరము ను ధ్రువపదయాపకంబు। నై
యొప్పనీ యుపాఖ్యానంబుఁ దగ నీకు నెఱిఁగించితి నిదీని నెవ్వఁ డేని। తివుటఁ శ్రద్ధాగరిష్ఠుఁడై తీర్థపాద। చరణసరసీరుహద్వ
యాశ్రయుఁడు నైన। భవ్యచరితుఁ దినాంతప్రభాతవేళ। లను †సినీవాలిపూర్ణిమలందు మఱియు॥ గీ॥ ద్వాదశిని బద్మబాం
ధవవాసరమున। శ్రవణనక్షత్రమున దినక్షయమునందుఁ। బరగ సంక్రమణ వ్యతీపాతలందు। సభల భక్తి వినునట్టి సజ్జనుల
కు॥ వ॥ క్లేశనాశంబు మహాప్రకాశంబు నైన భగవద్భక్తియు శీలాదిగుణంబులును గలుగు మఱియుఁ దేజః కామునకుఁ దేజం
బు నిష్కామునకుఁ దత్త్వజ్ఞానంబును గలుగు వినిపించు వారికి దేవతానుగ్రహంబు గలుగు నిట్టి యుపాఖ్యానంబు నీ కెఱింగిం
చితి నని మైత్రేయుండు విదురునకుఁ జెప్పిన క్రమంబున శుకయోగి పరీక్షిత్తున కెఱింగించిన తెఱంగున సూతుండు శౌనకా
దులకు వినిపించి వెండియు నిట్లనియె నట్లు చెప్పిన మైత్రేయునిం గని విదురుం డిట్లనియె॥ సీ॥ అనఘాత్మ నారదముని పవిత్ర ధ్రువచ
రిత్రము ప్రచేతసుల సత్రంబునందు। నర్థి మైఁ గీర్తించె నంటి ప్రచేతసుల నెవ్వ రెవ్వని తనయు లెట్టి। వంశజుల్సత్ర మెవ్వాలను
గాఁ జేసిరి యాగంబునను నిజాచారశీలురగు ప్రచేతసులచే యజియింపఁగాఁబడె యజ్ఞపూరుషుఁ డెట్టులచ్యుతాంఘ్రి।
భక్తియుక్తుఁడు విదితసద్భాగవతుఁడు। దివిరి హరిపాదసేవావిధిప్రయుక్త। దేవదర్శనుఁ డగునట్టి దివ్యయోగి। నారదుం డెట్టు
గొనియాడె శౌరికథలు॥ క॥ నాకిపు డెఱిఁగింపుము సు। శ్లోకుని చరితామృతంబు శ్రోత్రాంజలులం। బైకొని జుర్రియుఁ దనివిం।
గైకొనకున్న దిమనంబు గరుణోపేతా॥ క॥ అని యడిగిన విదురునిఁ గనుఁ। గొని మైత్రేయుండు వలికెఁ గొనకొని ధ్రువుఁడు।
న్వనమునకుఁ జనిన నాతని। తనయుండగు నుత్కలుండు దళితాఘుండై॥ సీ॥ చతురుఁ డాజన్మప్రశాంతుండు నిస్సంగుఁడును
సమదర్శనుండు నఘనుండు। నై యాత్మయందు లోకావళి లోకంబులందు నాత్మయుఁ జూచు ననఘమైన। యనుపమ యోగ
క్రియాపావకాదగ్ధకర్మమలాశయకలనఁ బేర్చి। జడుసికైవడిఁ జేయు చందంబునను మూఢుపగిదిను న్మత్తుని భంగిఁ జెవిటి।
వడువునను గానఁబడుచు సర్వజ్ఞుఁడై ప్ర। శాంతకీలహుతాశను సరణిఁ జొచ్చి। సతత శాంతంబు నంచితజ్ఞానమయము। నైన
బ్రహ్మస్వరూపంబు నాత్మఁ దలఁచి॥ క॥ తనకంటె నితర మొకటెఱుఁ। గని కతమున సార్వభౌమగ శ్రీఁ బొంద। న్మనమునఁ గో
రకయుండుటఁ। గని కులవృద్ధులును మంత్రిగణములు నంతన్॥ వ॥ అతని నున్మత్తునింగాఁ దెలిసి తదనుజుండయిన వత్సరునికిఁ
బట్టంబు గట్టిరి యా వత్సరునికి సర్వర్ధి యను భార్యయందుఁ బుష్పార్ణుండుఁ జంద్రకేతుండు నిషుండు నూర్జుండు వసువుజ
యుండు నన నార్వురు తనయులు గలిగిరి యందుఁ బుష్పార్ణుండను వానికిఁ బ్రభయు దోషయు నన నిద్దరు భార్యలైరి యందుఁ బ్ర
భయను దానికిం బ్రాతర్మధ్యందినసాయంబులను సుతత్రయంబును దోషయను దానికిం బ్రదోష నిశీథ వ్యుష్టులను వారు
ముగ్గురును బుట్టిరందు వ్యుష్టుండను వానికిఁ బుష్కరిణియను పత్నియందు సర్వతేజసుండను సుతుండు పుట్టె వానికి నాకూతి
యను §మహిషివలనఁ జక్షుస్సంజ్ఞుండైన మనువు జనించె వానికి నడ్వలయను భార్యయందుఁ బురువుఁ గుత్సుఁడుఁ ద్రితుండు,
ద్యుమ్నుండు, సత్యవంతుండు, ఋతుండు, వ్రతుండు, నగ్నిష్టోముండు, నతిరాత్రుండు, ప్రద్యుమ్నుండు, శిబియు, నుల్ము
కుండు, నను పన్నిద్దరు తనయులు గలిగిరి యందు నుల్మునకుఁ బుష్కరిణియను దానివలన నంగుండు సుమనసుండు ఖ్యాతియుఁ
గ్రతువు నంగిరసుండు గయుండు నను నార్వురు కొడుకులు పుట్టిరి యందు నంగునికి సునీథయను ధర్మపత్నివలన వేనుండను పు
త్త్రుం డుదయించిన॥ మ॥ క్షితినాథోత్తముఁ డాత్మనందను నిమశ్శీలంబు వీక్షించి దుఃఖితుఁడై యొంటిగఁ దత్పురి న్వెడలి యే
గె న్వేగ నెందేనిఁ దద్గతి వీక్షించి మునీశ్వరులు గుపితులై దంభోళిసంకాశవా। క్యతతి న్శాపవశంపవాఁ డపుడు వీఁకం గూలె న
మ్మేదినిన్॥ సీ॥ గైకొని యపుడు లోకంబ రాజకమైనఁ బ్రజలు దస్కరపీడఁ దల్లడిల్లఁ। గనుఁగొని దుఃఖించి మునులు గతాసుఁ
డై పడిన వేనుని వలపలిభుజంబు। నర్థి మథింప నారాయణాంశంబున నాదిరాజన నొప్పు నట్టి పృథుఁడు। జనియించె నవుడు విని
విదురుఁడు మునిఁ గనుఁగొని పలికె నో యనఘచరిత। సాధువృత్తుసు శీలనిధియును సజ్జనుండు। నలఘు బ్రహ్మణ్యుఁడును మహాత్ముం
డు నంగ। ధరణివిభునకు దుష్టసంతాన మెట్లు। గలిగె నయ్యంగపతి యేమి కారణమున॥ వ॥ విమనస్కుండగుచుఁ బురంబు విడిచె ధ

*అఘమర్షణంబు। పాపనాశకరమైనది... †సినీవాలి। చంద్రకళతోఁ జేరిన అమావాస్య పేరు. అ॥ విష్ణుః - తేనసహవర్తత ఇతి సాలక్ష్మీః - సాల స్వామితి - సినీచంద్రకళా సాచంద్రకళాబాలా అస్యామితి సినీవాలీ - అ, అనఁగా విష్ణువు - అతనితోఁ గూడినది గాన - సా అనఁగా లక్ష్మి - ఆలక్ష్మి గల దిగనుక - సిని అనఁగా జంద్రకళ, ఆచంద్రకళ దీవియందు లేఁతదై యుండుమ గావున సినీవాలి... §మహిషి। పట్టపుదేవి.

ర్మకోవిదులైనమునులు నండవ్రతధరుండు రాజునగు వేనునియందు నేపాపంబు నిరూపించి బ్రహ్మదండంబొనర్చిరి యది యునుంగాక లోకంబుల రాజులు లోకపాలతేజోధరులు ప్రజాపాలనాసక్తులు గావునఁ గల్మషంబు గలిగినం బ్రజలచేతన వజ్ఞానర్హులై యుండరు గావున నా వేనుని చేష్టితంబులు శ్రద్ధాగరిష్ఠుండు భక్తుండునైన నాకుం బరాపర విదగ్రేసరుండవ యిననీ వెఱింగింపనర్హుండవనిన మైత్రేయుం డతనికిట్లనియె॥ ..............................

## అంగపుత్త్రుండగు వేనునిచరిత్రము.

సీ॥ అనఘాత్మ రాజర్షియైనట్టి యయ్యంగ మేదినీవిభుఁ డశ్వమేధమఖము। గావింప ఋత్విజ్ఞికాయంబు చేత నాహూతమయ్యును సురవ్రాతమందు। నాత్మహవిర్భాగమందరాకుండిన నప్పుడు ఋత్విక్కులద్భుతంబు। నందుచు యజమానుఁడైనయయ్యంగమహీపరుఁ జూచి రాజేంద్ర యిట్లు। త్రిదశులిదె పిల్వఁబడియు సంప్రీతి నాత్మ। భాగములఁ బొందరారైరి భవ్యచరిత। యేమి హేతువొ యిది నాకు నెఱుఁగఁ జెప్పు। కడఁగి హోమంబు దుష్టంబుగాదు మఱియు॥ వ॥ శ్రద్ధాయుక్తులైన యీ బ్రహ్మవాదులచేత సంప్రయుక్తంబులైన యీ ఛందస్సులు వీర్యవంతంబులై యున్నయవియిందు దేవతాపరాధం బణుమాత్రంబైన నెఱుంగమిట్టిచోటం గర్మసాక్షులైన దేవతలు స్వకీయభాగంబులం గికరింపకుండుటకుఁ గతంబెయ్యదియో యనిన నయ్యంగుండుఁ దుఃఖితస్వాంతుండై తన్నిమిత్తంబు సదస్యులనడుగం దలంచి వారలయనుమతిం బడసి మౌనంబు మాని యిట్లనియె॥ గీ॥ అనఘచరితులార యాహూతులయ్యును। పర్వగణములాత్మభాగములను। స్వీకరింపరేను జేసినయపరాధ। మెట్టిదనిన వారలిట్టులనిరి॥ క॥ నరనాథ యిదియు నిప్పుడు। పొరసిన దుష్కృతముగాదు పూర్వభవమున। న్వరగినదురితంబిదియా। నరమున నెఱిఁగింతుమింత ధన్యచరిత్రా॥ క॥ నీకింతవాఁడవయ్యును। భూవర సంతానలాభమును బొందమినా। దేవతలు యాగభాగము। లీవేళ భుజింపరైరి యిందునసీవుర్॥ గీ॥ పుత్త్రకామేష్టిఁ గావించి పుత్త్రుఁ బడయు। మట్లొనర్చిన దేవతలాత్మభాగ। మర్థి నంగీకరింతురయ్యజ్ఞపురుషు। హరి భజించిన సకలకార్యములు గలుగు॥ వ॥ అనిన నాతండు సంతానార్థంబు *శిపివిష్టదేవతాకంబైన పురోడాశంబుచే హోమంబు గావించిన నందదీయ హోమానకుండంబునందు హేమమాల్యాంబరుండైన పురుషుండు హిరణ్మయపాత్రంబున సిద్ధపాయసంబు గొనుచును దయించిన నప్పుడు విప్రానుమతంబున నా రాజు దత్పాయసంబు నంజలిచే గ్రహించి సంతోషయుక్తుండగుచు భార్యకొసంగెనంత॥ చ॥ కమలదళాక్షి పాయసము గౌతుకమొప్ప భుజించి భవ్యసం। గమమునఁ జేసి తత్క్షణమ గర్భముఁ దాల్చి కుమారుఁ గాంచె నాకొమరుఁడు నంత మాతృజనకుండగు మృత్యువుఁ బోలి తానధర్మమునఁ జరింపు చుండె గుణమండన వేనుఁడనంగ నిచ్చలున్॥ చ॥ ఎనయఁగ బాల్యమందె వనయాడు కుమారులఁ గ్రీడవోలె నెమ్మనమున భీతిలేక కృపమాని పశుప్రకరంబు నొంచుపో। లికనినరికట్టిచంపు నును గిల్బిషలుబ్ధకవృత్తి మైశరా। సనశరముల్ధరించి మృగజాతిన సాధుగతిన్వధింపుచున్॥ వ॥ ఇట్లు పాపప్రవర్తనుండై చరియించు కొడుకుం జూచి యంగుండు వివిధశాసనంబుల దండించియు నతనిదుశ్చేష్టితంబులు మానుపంజాలక దుఃఖితాత్ముండై మనంబున॥ క॥ అనయంబు నిట్టిపుత్త్రుని। గని పరితాపమునుఁ బొందకం టెను ధరలో। ననపత్యుండగుట యొప్పును। వనజాక్షుభజించునట్టి వాఁడగు వాఁడున్॥ అని వెండియు నిట్లనియె. సీ॥ జనులకు దుష్పుత్త్రకుని చేతనపకీర్తియును నధర్మమును సర్వజనవిరోధ। మును మనోవ్యథయును మునుకొని ప్రాపించు నట్టి కుపుత్త్రు మోహంబు విడువఁ। జాలక బహుమానసంగతిఁ గను నెవ్వఁడతని గేహంబు దుఃఖాలయంబు। నగునని మఱియు నిట్లను మనుజుండు శోకస్థానమగు పుత్త్రుకతనఁ జేసి। యనుపమక్లేశభాజనంబైన గృహము। విడుచుఁ గావున నిట్టి వివేకహీనుఁ। డగు కుపుత్త్రు సుపుత్త్రుఁ గా నాత్మఁదలఁతు। ననుచు నా రాజు బహుదుఃఖితాత్ముఁడగుచు॥ క॥ తగు మహదైశ్వర్యోదయ। మగు గృహమునుఁ బ్రజలనిద్రనందిన భార్యన్। దిగవిడిచి యొక్కఁడె నియుః జగతీశుఁడు సనె నిశీథసమయమునందున్॥ వ॥ అంతఁ దద్వృత్తాంతంబంతయు సుహృద్బాంధవ పురోహితామాత్యప్రభృతులైన ప్రజలెఱింగి దుఃఖింపుచున్న తదనంతరంబ॥ సీ॥ సమధిక బ్రహ్మనిష్ఠాగరిష్ఠులు భృగ్వాదిమౌనీంద్రబృందము పుడమి §లోకావనైకావలోకనోత్సుకమాటజనులు స్వరక్షకజనవిభుండు। లేమిఁ బశుప్రాయులై మెలంగుటఁ గనియం

........................................................................

* శిపివిష్ట। విష్ణువు, శివుఁడు-శిపాచర్మణి విష్టం దోషవ్యాప్తిరస్యేతి-శిపిషుపశుషు విష్టో వ్యాప్త ఇతిచ శిపివిష్టః-చర్మమందు దోషవ్యాప్తిగలవాఁడు గనుకను, పశువులయందు వ్యాపించినవాఁడు గనుకను, శిపివిష్టుఁడు. శ్లో॥ శిపివిష్టాస్తు దుశ్చర్మ ఖల్వాట హరిశంకరా। ఇతి నానార్థసంగ్రహః॥ టీ॥ మహేశ్వరాయథా-పశవశ్శిపిరితి దర్శనాత్-శిపిశబ్దేన పశవ ఉచ్యంతే-తైర్విష్టో వ్యాప్తస్సేవితః-తత్పతిరితి యావత్-తదుక్తం స్కాందే॥ శ్లో॥ ఆత్మానః పశవః ప్రోక్తాస్సర్వేసంసారవర్తినః। తేషాం పతిత్వాద్విశ్వేశో భవః పశుపతిస్స్మృత ఇతి-విష్ణోర్యథా-శిపయో రశ్మయః తైర్విష్టో వ్యాప్త ఇతి శిపివిష్టః ఇతి శ్రీ విష్ణుసహస్రనామభాష్యవ్యాఖ్యాతమ్, ...§లోకావనైకావలోకనోత్సుకము। ప్రపంచరక్షణమందు ముఖ్యమైన నంతోషదృష్టి.

త వేనుని మాతయగు సునీథ యను సతి నఖిలప్రజావళికి ప్రియుండైన యవ్వేనుఁ బట్టాభిషిక్తుఁ జేసె నంతట మహితోగ్రశా
సనుఁడగు వేనుఁ బట్టంబు గట్టుట విని సమస్త తస్కరులు సర్పభీతిచేఁ దలఁగు మూషకముల కైవడిఁ గడఁగి గిరిగహనములకు॥
అంత నతండు॥ చ॥ పరువడి నష్టలోకపరిపాలక ముఖ్యవిభూతియుక్తుఁడై పరగి నృపాసనంబున విభాసితుఁడై తన స్వభావసిద్ధ
మై *వరలు మహావలేపమున వారక సంతతమాననీయస త్పురుషుల నెల్ల నెంతయుఁ బరిభూతులఁ జేయుచు నుండె నిచ్చలున్॥
చ॥ మఱియు నతండు భూగగనమార్గములం దొకవేళ నొక్కఁడే యరదము నెక్కి క్రుమ్మరు †నిరంకుశవృత్తిఁ జరించు ‡మత్త
సింధురవిభుపోల్కి సత్పురుషదూషితవర్తని నొప్పుచు న్నిరంతరసుజనాపరాధకృతితత్పరమానసుఁడై క్రమంబునన్॥ క॥
దివ్యులు వెఱఁగందఁగఁ బృథ్వీవ్యోమములఁ గల భేరి వ్రేయించె §నయష్టవ్యం దాతవ్యం హోతవ్యం విప్రా యనుచు నుదా
త్తధ్వనులన్॥ క॥ అని యిట్టులు భేరీరవమునఁ జేసి సమస్తధర్మములు వారింప న్మునులు వినీతుండగు వేనుని దుశ్చరితంబు జనమ
నోభయదమగుటన్॥ గీ॥ కని కృపాయత్తులగుచు నిట్లనిరి యిట్టి రాజచోరభయంబు లీభూజనులను బలసి యిరువంకలను బాధప
రపఁ జొచ్చె దారువందుల వహ్నిచందమునఁ జెలుచ॥ చ॥ అరయన రాజకం బగు మహాభయముం దొలఁగించువారమై కర
ము తదర్హు గర్హితుని క్ష్మాపతిఁ జేసినయట్టి దోషము న్బరువడిఁ జెందె దుగ్ధరసపానమునం బరివృద్ధి నొందు నయ్యురగము నైజ
పోషకుని నొందినరీతి ననర్థహేతువై॥ అదియునుం గాక॥ క॥ మునుకొని సునీథగర్భంబున జనియించి స్వభావమున దుర్జనుఁడై
యెనయఁ బ్రజాపాలనమునకును బాల్పడి ప్రజలమునికిఁ గొనఁ జొచ్చెఁ గదే॥ వ॥ అదిగాన నీ వేనుండు పూర్వంబున జ్ఞానసం
పన్నుల మైన మనచేత రాజుగాఁ జేయఁబడియె నిట్టివానిని మనముం దరముగూడి ప్రార్థితము లోకరక్షణార్థంబుగావునఁ ద
ద్దోషంబు మన లస్పృశింపమి ‖సమీచీనోక్తులం జేసి వీనిననునయింప వానిఁ గ్రహింపకుండె నేని మున్ను లోకధిక్కారాగ్నిసం
దగ్ధుండగు వీనిని మన తేజోమహాగ్నిచేత భస్మీభూతుం జేయుద మని యాలోచించి ※గూఢమన్యులగుచు వేనునిం గదియం జని
యతని కిట్లనిరి॥ క॥ నరపాలక నీ కాయువు సిరియును బలమును యశంబు చేకురు వృద్ధిన్ బొరయుము గాక నుచు మునో హారము
గ నాశీర్వదించి యతివినయమునన్॥ వ॥ ఇట్లనిరి నరేంద్రా యే మొక్కటి విన్నపించెద మవధరింపుము పురుషులకు వాఙ్మనః
కాయవృత్తులవలన నాచరించు ధర్మంబు సమస్తలోకంబుల విశోకంబులం జేయున సంగులైన వారికి మోక్షంబు నిచ్చు నట్టి ధ
ర్మంబు ప్రజలకు క్షేమకారణంబు గావున నీయందుఁ జెడకుండుఁగాక యని పలికి మఱియు ధర్మంబు నాశంబు నొందిన నైశ్వ
ర్యంబుచే రాజు విడువంబడు నని చెప్పి వెండియు నిట్లనిరి మత్త చిత్తులగు నమాత్యులవలనం దస్కరులవలనను బ్రజలు నాశంబు
నొందకుండ రక్షింపుచు యథాన్యాయంబుగ వారలచేఁ గరంబు గొనుచు నుండు మహీపతి యిహపరసౌఖ్యంబుల నందు నది
యునుం గాక యెవ్వని రాష్ట్రంబున నేనిఁ బురంబున నేని యజ్ఞేశ్వరుండైన పురుషోత్తముండు నిజవర్ణాశ్రమోచితంబైన ధర్మం
బుగలవారిచేత యజనంబు చేయంబడు నట్టి నిజశాసనవర్తియగు రాజువలన సర్వభూతభావనుండు మహాభాగుండు భగవం
తుండు నగు సర్వేశ్వరుండు సంతుష్టుండగు నట్టి సకలజగదీశ్వరుండైన సర్వేశ్వరుండు సంతోషించిన రాష్ట్రాధిపతికి సర్వసౌ
ఖ్యంబులు ప్రాపించు లోకపాలకులగు వారు సర్వేశ్వరునికొఱకు బలిప్రదానంబులు సేయుదురు సమస్తలోకదేవతాయ
జ్ఞాదిసంగ్రహుండు వేదమయుండు ద్రవ్యమయుండుఁ దపోమయుండు నగు నారాయణుని విచిత్రంబులైన యజ్ఞంబులచేత
యజనంబు చేసిన నీకు నభయంబగు మోక్షంబును గలుగుఁ గావున నీ రాజ్యంబున మఖంబులు సేయుమని యాజ్ఞాపింపుము నీ
దేశంబునఁ జేయంబడిన యజ్ఞంబులచేత హరికళాయుక్తంబులగు దేవగణంబులు ¶స్విష్టంబులై తుష్టంబులగుచు భవదీ
య వాంఛితార్థంబు లిచ్చుం గావున దేవతాతిరస్కారంబు నీకు యుక్తంబుగాదు వేదచోదితంబులగు ధర్మంబులం దాసక్తుం
డవు గమ్మనిన వేనుం డిట్లనియె॥ క॥ మునులార మీరలిప్పుడు నను నీగతిఁ బడుచు తనమున్వంబలికితిరై నను మీరల ధర్మముఁ దగ న
నయము ధర్మం బటంచు ననియెద రైనన్॥ అదియునుం గాక॥ చ॥ ఎనయఁగ జారకామినిని జేకొని మ్రుచ్చిలి జారపూరుషున్ దనప
తిఁ గాఁ దలంచు గతిఁ దద్దయు మూఢమనస్కులై తన క్కనన నరపాలరూపము ధరించిన యీశ్వరు నన్నెఱుంగక న్యుని భజి
యింప మీరిహపరోన్నతసౌఖ్యములం దరెన్నఁడున్॥ వ॥ అని మఱియు నిట్లనియె యజ్ఞపురుషుం డన నెవ్వఁ డెవ్వని యందు మీ

*వరలు మహావలేపమున వృద్ధిఁ బొందుచున్న అతిగర్వము చేత... †నిరంకుశవృత్తిన్ అడ్డములేని ప్రవర్తనము చేత... ‡మత్తసింధురము మదపుటేనుఁగు... §అయష్టవ్యం దాతవ్యం హోతవ్యం విప్రా యనుచున్॥ విప్రా బ్రాహ్మణులార-ఇచ్చట జాత్యేకవచనము-అయష్టవ్యం-యజ్ఞములు చేయఁగూడదు, అదాతవ్యం దానములు చేయఁగూడదు, అహోతవ్యం అవుపాసన వైశ్వదేవాదినిత్యహోమములు చేయఁగూడదు. ‖సమీచీనోక్తులం జేసి మంచిమాటలవలన... ※గూఢమన్యులగుచు లోనడఁగిన కోపము గలవారగుచు... ¶స్విష్టంబులై తుష్టంబులగుచు తమ యభిమతములయిన హవిర్భాగములను పొందిసంతోషించినవై.

కుభక్తిస్నేహంబులుదయించె [illegible] స్నేహవిదూరంబులై యోషిద్గణంబులు జారులయందు [illegible]భక్తినుండుటఁ బలి కెవ్వరడియెదను ధాక॥ క॥ హరిహరహిరణ్యగర్భ। స్వరధీశ్వరవహ్నిశమనజలధిపతిమరు। న్నరవాహన[illegible]। సురముఖ్యులు నృపశరీరసూచకులగుటన్॥ క॥ పరికింపననుభజింపుఁడు। ధరణీశుఁడు సర్వదేవతామయుఁడగుట। [illegible]డున్ గాకం బెనుబురుషుఁడు మఱియెవ్వఁడగ్రపూజార్హుఁడిలన్॥ వ॥ అదిగాన మీరు నాయందు బలివిధానంబులు [illegible] నిపాపకర్ముండును సత్ప్రవర్తకుండును నష్టమంగళుండును విపరీతజ్ఞానుండు నగు వేనుండు పండితమానియగుచుం బలికిన ముసలివచనంబులు నిరాకరించి యూరకుండిన మునులు భగ్నమనోరథులై తమలో నిట్లనిరి యీదారుణకర్ముండైన పాపుండు హతుండుగాక జీవించెనేని వీనిచేత నీజగంబులు భస్మంబులు గాఁగలవది నిశ్చయంబు దుర్వృత్తుండగు వీఁడు మహారాజసింహాసనంబునకర్హుండు గాఁడు ఇతండు మున్న నే సర్వేశ్వరు ననుగ్రహంబున నిట్టివిభూతి యుక్తుండయ్యె నట్టి యజ్ఞపతియైన శ్రీవిష్ణుని నిందింపుచున్నవాఁడు గావున నిర్లజ్జుండైన హరిదూషకుని *హననంబు సేయవలయునని మునులు వ్యోగించి యాత్మప్రకాశితంబైన క్రోధంబునం జేసి హుంకారమాత్రంబున నాయీశ్వరనిందాహతుండగు వేనునిం బొలియఁ జేసిరంత॥ క॥ అరయసునీథయు శోకాతురయై తనసుతుఁడు సనువుఁ దొరిగిన దదనంతరము నను యోగశక్తిన్బరువడి నిజతనయుతనువుఁ బరిపాలించెన్॥ అంతనొక్కనాఁడు॥ సీ॥ మునివరేణ్యులు భక్తిదనరసరస్వతీసలిలంబులను గృతస్నానులగుచు। మునుకొనితత్తీరమున నగ్నిహోత్రములు వ్రేల్చి సిల్లని యతిఁగావించి యచటఁ। బవిలి సత్పురుషకథావినోదంబులు సలుపుచునుండంగ సకలలోక। భయదంబులగు మహోత్పాతముల్ దోఁచిన మసలి లోకంబుల మంగళములు। పొరయకుండెడుఁగాక నిబుద్ధిలోన। దలఁపుచుండఁగఁ బెలుచనుదగ్రమైన। సర్వదిశలను *పాంసువర్షంబు గురిసెఁ। దస్కరులు సర్వజనుల విత్తములు గొనిరి॥ వ॥ ఇట్టి లోకోపద్రవం బెఱింగి జననాథుం *డుపరతుండగుటం జేసి *జనపదంబుల రాజకంబులై యన్యోన్యహింసల నొందుచుం దస్కరబాధితంబులగుచునుండుట నెఱింగి యుఁదన్నివారణంబునకు సమర్థులయ్యును జోరాదిబాధలం గనుఁగొనుచు మునులు వారింపకయుండిరి సమదర్శనుండు శాంతుండు ఘననశీలుండునగు బ్రాహ్మణుండు దీనుల నుపేక్షించిన నతనితపంబు భిన్నభాండగతంబైన క్షీరంబుచందంబున నశియించుం గావున నంగవంశాధీశవంశోద్భవులు హరిపదాశ్రయులగుటనమోఘసత్వనిష్ఠులగుటం జేసి వీరలవంశంబు విచ్ఛిత్తినొందింపనన ర్హంబుగాన స్థాపనీయంబని నిశ్చయించి మృతుండైన వేనుని కళేబరంబు డగ్గరవచ్చి తమూరువు మధనంబు గావింపనందు॥ సీ॥ ఘనకాకకృష్ణసంకాశవర్ణుండును హ్రస్వావయవుఁడును మహాహనుండు। హ్రస్వబాహుండును హ్రస్వపాదుండును నిమ్ననాసాగ్రుండు నెఱియరక్త। నయనుండు దామ్రవర్ణశ్మశ్రుకేశుండు నతిదీనవదనుండునై యట్టి। యొక్క *నిషాదకుండుదయించి యేమి సేయుదుమనిపలుకుచునున్నఁ జూచి। వరమునులు *నిషీదయనుచుఁ బలుకుటయును। దానవాఁడు నిషాదాభిధానుఁడయ్యె। నతనివంశ్యులు గిరికాననంబుల వేను కల్మషముఁ దెల్పుచుండిరి కడఁక మఱియు॥ క॥ కనివారనపత్యుండగు। మనుజేంద్రుని బాహులంత మధియించిననఁ। దనఘంబగు నొకమిథునము। జనియించెను సకలజనులు సమ్మదమందన్॥ వ॥ అందు లోకరక్షణార్థంబుగా నారాయణాంశంబున నొకపురుషుండును హరికిని త్యానపాయినియయిన లక్ష్మీకళాకలితయై గుణంబులకు భూషణంబులకు నలంకారప్రదాత్రియైనగు కామినియు జనియించె నందుఁ బృథుయశుండగుట నతండు పృథుచక్రవర్తియను పేరం బ్రసిద్ధుండయ్యె నంగన యర్చియను నామంబున నందనరుచు నతని వరియించె నాసమయంబున॥ సీ॥ అందంద గురియించి రమరులు మునినాథవితతి మోదంబందవిరులవానఁ। బరమానురక్తి శుంభల్లీలఁ జూపట్టె సురపతివీటనచ్చరలయాట। గర్ణరసాయనక్రమమున వీతెంచె బఠహైన తేఁటకిన్నరులపాట। యనిమిషకరహతంబై చాలఁ జెలఁగెను బ్రభవోత్సవకరదుందుభిరవంబు। మునినుతి చెలంగె శిఖిగుండముల వెలింగె। నంతనచటికి సరసీరుహాసనుండు। గరుడగంధర్వకిన్నరగణముతోడ। నర్థిఁ జనుదెంచె సమ్మోదమతిశయిల్ల॥ అంత॥ కవిరాజవిరాజితము॥ అరయఁగ వైన్యుని దక్షిణహస్తమునం దురమార మణీసుమనో। హరలలితాయుధచిహ్నము పాదములందు సమగ్రహలాంకుశఖా। స్వరకులిశధ్వజచాపసరోరుహశంఖవిరాజితరేఖలు వి। స్ఫురగతి నెప్పఁ ఖితామహముఖ్యులు చూచి సవిస్మయులై మఱియున్॥ వ॥ ఇతండు నారాయణాంశసంభూతుండితని యంగన రమాంశసంభూతయుం గానోపు నని తలంచి రయ్యవసరంబున బ్రహ్మవాదులగు బ్రాహ్మణోత్తములతనికి విధ్యుక్తప్రకారం

---

*హననము। సంహారము... *పాంసు। ధూళి... *ఉపరతుండగుటం జేసి। మరణమొందినవాఁడగుటవలన... *జనపదంబులు। దేశములు... *నిషాదుండు। నిషీదతి పాపమస్మిన్నితి నిషాదః–షద్ల్ విశరణగత్యవసాదనేషు–వీనియందు పాపముండునని అర్థము. *నిషీద। తొలఁగుము.

బునరాజ్యాభిషేకంబుఁగావించుసమయంబున॥క॥సరిదంభోనిధిఖగమృగ।ధరణీ*సురవర్త్మపర్వతప్రముఖములై।వరగిన
భూతశ్రేణులు। నరవరునకుఁదగనుపాయనములిచ్చెనొగిన్॥ గీ॥ సమధికఖ్యాతినాపృథుచక్రవర్తి। దేవియగునర్చితోఁ
గూడదివ్యవస్త్ర। గంధమాల్యప్రభూషణకలితుఁడగుచుఁ।బావకునిఁబోలిసత్ప్రభాభాసియయ్యె॥సీ॥ ‡రాజరాజాపృథు
రాజుకుహేమమయంబైనవీరవరాసనంబు। జలపతిజలకణస్రావకంబగుపూర్ణచంద్రసన్నిభసితచ్ఛత్రముమఱిఁ। బవ
మానుఁడమలశోభనమగువాలకేశౌసమంచితసితచామరములు।ధర్ముండునిర్మలోద్యత్కీర్తిమయమగుమహనీయనవపు
ష్పమాలికయును। ‖జంభవైరికిరీటంబు¶శమనుఁడఖిల।జననియామకదండంబుజలజభవుఁడు। నిగమమయకవచమును
వాణీలలామ। యచ్ఛమగునవ్యహారంబులిచ్చెమఱియు॥సీ॥ §దామోదరుండుసుదర్శనచక్రంబునవ్యాహతైశ్వర్యము
బ్జపాణి।చంద్రార్ధధరుఁడునుజంద్రమండలదశకమనీయకోశసంకలితఖడ్గ।ముంబికశతచంద్రమను ˈఫలకముఁజంద్రుఁడ
మృతమయశ్వేతహయచయంబుఁ। ద్వష్టరూపాత్రయోదాత్తరథంబునుభానుండుఘృణిమయబాణములును। శిఖియు
గోజవిషాణసంచితమహాజ।గవమనందగుచాపంబునవనిదేవి। యోగమయమైనపాదుకాయుగముగగన। చరులుగీతాదు
లిచ్చిరిసంతసమున॥వ॥ వెండియుంబ్రతిదినంబునాకాశంబుపుష్పంబులఁగురియించెమహర్షులుసత్యంబులైనయాశీర్వచ
నంబులసముద్రుండుశంఖంబునదంబులు పర్వతంబులునదులునురథమార్గంబులొసంగెఁదదనంతరంబసూత †మాగధ
వందిజనంబులుదన్నునుతియించినంబ్రతాపశాలియగునవ్వైన్యుండుమందస్మితసుందరవదనారవిందుండై చతురవచన
రచనుండగుచుమేఘగంభీరభాషణంబులనిట్లనియె॥సీ॥ వందిమాగధసూతవరులార నాయందుఁ గమనీయగుణములుగలి
గెనేని। నర్థంబునుతిఁజేయనవి లేవునాయందునదిగానమీనుతివ్యర్థమయ్యె।నిటమీఁదగుణములనేపారియుండిననపుడు
నుతించెదరగుటమీరు।సభ్యనియుక్తులై చతురతనుత్తమశ్లోకునిగుణములస్తోకభూప్ర। సిద్ధములుగాననన్నుతిసేయుఁడజు
ని। నతనిబహువిధభావంబులనునుతింప।నలవిగాక నెయుండుచురదియుఁగాక। చతురమతులారమాగధజనములార॥వ॥
మఱియుమహాత్ములగుణంబులుదనయందుసంభావితంబులుసేయసామర్థ్యంబుగలిగిననందుమహాత్ములగుణంబులుప్రసి
ద్ధంబులుగావునందత్సమంబుగానెట్లునుతింపవచ్చునెవ్వండేనినొకండుశాస్త్రాభ్యాసంబునందనకువిద్యాతపోయోగగు
ణంబులుగలుగునని పలికినవానింజూచిసభ్యులుపరిహసింతురదికుమతియగువాఁడేఱుంగండదియునుంగాక॥క॥ అతిపరిశు
ద్ధులులజ్జా।న్వితులునుదారులధికనిర్మలులాత్మ।స్తుతిపరనిందలదోషము।లతిహేయములనితలంతురాత్మలనెపుడున్॥
క॥వందిజనంబులులోకము।లందునవిదితవరకర్ములగుభూపతుల।న్నందించుటశక్యంబై ।నందగనునుతింపశిశుజనంబులపగి
దిన్॥క॥అనిసూతవందిమాగధ।జనులానరనాయకునివచనములువినియు।న్మునిచోదితులైక్రమ్మఱ।ననురాగములుప్పతిల్ల
నమ్మనుజేశున్॥అమ్మతోపమానంబులయినమధురవాక్యంబులనిట్లనిరి॥క॥ వేనాంగసంభవుండవు।శ్రీనాథకళాంశజుఁడ
వుచిరతరగుణస।న్మానార్హుండవతర్కిత।మైనభవన్మహిమఁబొగడనలవియెమాకున్॥క॥అని వెండియునిట్లనిరై ।ననునొక
మార్గంబుగలదునందింపభవ।ద్ఘనచరితామృతపానం।బునఁజేసియుమునులవచనములఁజేసితగన్॥వ॥శ్లాఘ్యంబులైనభ
వదీయచరిత్రంబులస్తుతియించెదమనియిట్లనిరి॥సీ॥ఈవైన్యుఁడఖిలలోకావళిధర్మానువర్తనములనెప్డువరలఁజేసి।ఘనధ
ర్మమార్గవర్తనులలోధుర్యుఁడైధర్మసేతువుఁబ్రీతిఁదగిలిప్రోచు।ధరనుశాత్రవులనుదండించునష్టదిక్పాలకమూర్తిసంక
లితుఁడగుచు। నయ్యాయికాలంబులందుదండాదండములఁబ్రజారంజనములఁదనర్చు।సవనసద్వృష్టికరణాదిసక్తుఁడౌట।
నుభయలోకంబులకుఁబ్రీతినొదవఁజేయు। న్యాయమార్గంబుననుభూజనాళిధనముఁ। బుచ్చుకొనునిచ్చుసూర్యునిఁబోలి
యితఁడు॥మఱియు॥సీ॥సర్వభూతములకుసముఁడునుబర్యతిక్రమమునలోకాపరాధములమహాక్షాంతిసంయుక్తుఁడైస
హింపుచునార్తులగువారియెడఁగృపాయత్తుఁడగుచు।నరరూపుఁదాల్చినహరిమూర్తిగావుననింద్రుండువర్షించియెల్లప్ర
జలరక్షించుగతిదానరక్షించునమృతాంశుసన్నిభవదనాబ్జసస్మితాను।రాగమిళితావలోకనరాజిఁజేసి।సకలజనులకుసం
ప్రీతిసంభవింపఁ।జేయుసంతతమునుగూఢచిత్తుఁడగుచు।శత్రువరులకసాధ్యుఁడైసంచరించు॥వ॥అనివెండియుంబ్రవేశనిర్గ
మశూన్యమార్గనిరూఢకార్యుండునపరిమితమహత్త్వాదిగుణగణైకధాముండు సముద్రునిభంగిగంభీరచిత్తుండుపగుప్తవి

---

*సురవర్త్మ।ఆకాశము… ‡రాజరాజు।కుబేరుఁడు… ‖జంభవైరి।ఇంద్రుఁడు… ¶శమనుఁడు।యముఁడు… §దామోదరుఁడు।ఉదరేదా
మయస్యేతిదామోదరః-ఉదరమందుదులసీమాలగలవాఁడు-లేక- దామ్నాఉదరేమాత్రాబద్ధః- బాల్యమందుయశోదచేతనుదరమందుగట్టఁబడి
నపటువుగలవాఁడు- ˈఫలకము-డాలు- †మాగధ।వంశావళినిజెప్పువారు-వంది।రాజులపరాక్రమమునుతించువారు.

త్తుండువరుణునింబోలిసంవృతాత్ముండుశాత్రవాసహ్యప్రతాపయుక్తుండుదురాసదుండుసమీపవర్తియయ్యునుదూరస్థ నిభంగివర్తింపుచు వేనారణిజనితహుతాశనుండుహుతాశనుచందంబుననన్యదుస్స్పర్శనుండుచారులవలనసకలప్రాణిబాహ్యాభ్యంతరకర్మంబులఁ దెలియుచు దేహధారులకునాత్మభూతుండై సూత్రాత్మకుండైనవాయువుభంగివర్తించుచు నాత్మస్తుతినిందలవలనను దాసీనుండగుచుధర్మపథంబునవర్తించుచునాత్మీయసుతసుహృజ్జనులవలనందప్పుగలిగిననుదండించు నాత్మశత్రుపుత్త్రులైననదండ్యులదండింపఁడుతనయాజ్ఞాచక్రంబప్రతిహతంబగుచుమానసాచలపర్యంతంబువర్తింప సూర్యుండునిజకిరణంబులచేతనెంతపర్యంతంబుభూమింబ్రకాశింపంజేయునంతపర్యంతంబు నిజగుణంబులచేతలోకంబులరంజిల్లంజేయునదియునుంగాకప్రకృతిరంజకంబులైనగుణంబులచేతదృఢవ్రతుండుసత్యసంధుండుబ్రహ్మణ్యుండు సర్వభూతశరణ్యుండువృద్ధసేవకుండుమానప్రదుండుదీనవత్సలుండుపరవనితామాతృభావనుండుతనపత్నినర్ధశరీరంబు గాఁదలంచువాఁడునగుచుంబ్రజలయెడఁదండ్రివలెఁబ్రీతిసేయుచురక్షింపుచునుండుమఱియు॥ సీ॥ తలపోయఁబ్రహ్మవిద్యానిష్ఠజనములకనయంబుఁగింకరుండైనవాఁడు।నఖిలశరీరగుణాప్తసుహృజ్జనతానందకరుఁడననలరువాఁడు।సంసారఘనకర్మసంగహీనులయందుసంగసంప్రీతుఁడైజరుగువాఁడు।దుర్మార్గమనుజసందోహంబునకునుగ్రదండధరుండనఁదనరువాఁడు।ప్రకృతిపురుషకావేశుఁడైపరగునట్టి। భగవదవతారయుక్తుఁడై నెగడువాఁడు। నగుచువర్తించుసమ్మోదమతిశయిల్లఁ।జారుతరమూర్తియారాజచక్రవర్తి॥ వ॥ మఱియుంద్ర్యధీశుండుగూటస్థుండుపరమాత్మయుబ్రహ్మకళారూపుండునగువాఁడునైయుదయించెంగావున నితనియందునవిద్యారచితంబైప్రతీతంబగుభేదంబు నిరర్థకంబగునని పెద్దలగువారలుచూతురనిమఱియునిట్లనియె॥ సీ॥ ఉదయాద్రిపర్యంతముర్వీతలంబేకవీరుఁడై రక్షించి వెలయునీతఁ।డొకనాఁడువిజయయాత్రోత్సవంబేపారసన్నద్ధుఁడై మణిస్యందనంబు। నెక్కి చాపముఁబూనిదిక్కులసూర్యునిపగిదినిశత్రుభూపాలతమము। విరియింతుననిచాల వెలుఁగొందుచునుధరాచక్రప్రదక్షిణశాలియగుచు। దిరుగునెడసర్వ దిక్పాల వరసమేత।పార్థివోత్తమునికరముపాయనంబు।లిచ్చితనుఁజక్రపాణికినెనయునాడి।ధరణివిభుఁడనినుతియించిదలఁతురనుచు॥ క॥ ఈనృపతిధరాచక్రము। ధేనువుఁగాఁజేసిపితుకుధృతినఖిలపదా।ర్థానీకమువిబుధులుస।న్మానింపఁగఁబ్రజకుజీవనప్రదుఁడగుచుఁ॥ చ॥ అమరవరేణ్యుఁబోలియనయంబునితండును *గోత్రభేదన।త్వమునఁజెలంగుఁదానజగవ*ప్రదరాసనశింజినీనినా। దమునవిరోధిభూపతులుదల్లడమందనసహ్యసింహవి। క్రమమునసంచరించుననికౌతుక మొప్పఁగఁబల్కవెండియుఁ॥ ఇట్లనిరి॥ చ॥ సకలజగన్నుతుండితఁడుచారుయశోనిధియశ్వమేధముల్।ప్రకటముగాశతంబుదగఁబావనమైనసరస్వతీతటి। నికటధరిత్రిఁజేయుతఱినేర్పుననంతిమయాగమందు §గొం।జకముఖసాధనాశ్వమును జంభవిరోధిహరించునర్థితిఁ॥ సీ॥ ఒకనాఁడునిజమందిరోపవనమునకుఁజనియందుసద్గుణశాలియైన।ఘనునిసనత్కుమారునిఁగాంచియమ్మునివరుబ్రహ్మతనయునివరుసభక్తిఁ। బూజించివిజ్ఞానమునుబొందుదేనిచేబ్రహ్మవేత్తలుమునిప్రవరులవని।భావితముక్తిసంపన్నులైవర్తింతురిమ్మహారాజుమహీతలంబు।నందువిశ్రుతవిక్రముఁడగుచుమిగులఁ।దనకథావళిభూప్రజాతతినుతింప।నక్కడక్కడవినుచుశౌర్యమునసఖిల।దిక్పులనుగెల్చివర్తించుధీరయశుఁడు॥ వ॥ ఇట్లువిపాటితవిరోధిమనశ్శల్యుండు సురాసుర జేగీయమాననిజవైభవుండునైధరాచక్రంబునకితండు రాజయ్యెడిననియివ్విధంబునస్తోత్రంబుసేసినవందిమాగధసూతజనంబులంబృథుచక్రవర్తిపూజించి మఱియుంబ్రాహ్మణభృత్యామాత్యపురోహిత పౌరజానపదతైలికతాంబూలికనియోజ్యప్రముఖాశేషజనంబులందత్తముచితక్రియలంబూజించెననిమైత్రేయుండుచెప్పినవినివిదురుండిట్ల

## శ్రీ పృథుచక్రవర్తిగోరూపధారిణియగు భూమివలననోషధులఁబిదుకుట. శ్రీ

నియె॥ సీ॥ ఏమినిమిత్తమైభూమిగోరూపిణియయ్యెదానికివత్సమయ్యెనెద్ది। గొనకొని‡దోహనమునకునర్హంబైనపాత్రమెయ్యదిదలఁపంగ ‡దోగ్ధ।యైనయాపృథువేపదార్థముల్పితికెనుబరికింపనవనిస్వభావమునను। విషమమైయుండియువెలయంగనేరీతిసమగతిఁజెందెనుజంభవైరి।క్రతుహయంబునుఁగొనిపోవఁగార్యమెద్ది। ధీరనిధియైనబ్రహ్మకుమారువలనఁ।గలితవిజ్ఞానియగుచునేగతినిఁబొందె।ననఘచారిత్రమైత్రేయయదియుఁగాక॥ వ॥ మఱియుఁబరబ్రహ్మంబుభగవంతుం

---

*గోత్రభేదనత్వమునఁ।ఇంద్రునిపరమందు-పర్వతములవ్రక్కలుచేయుటయందనియర్థము, భూమినిసమరచుటయందనిపృథుచక్రవర్తిపరమైనయర్థము...*ప్రదరాసనశింజినీనినాదమునఁ॥ ప్రదరాసన।వింటియందలి-శింజినీ।అల్లెత్రాటియొక్క-నినాదమునఁ।ధ్వనిచేత... §కొంజక।భయపడక...‡దోహనమునకుఁ।పితుకుటకు...‡దోగ్ధ।పాలుపిదికెడువాఁడు.

పుణ్యశ్రవణకీర్తనుండును సర్వనియామకుండును నగు కృష్ణుని యవతారాంతరాశ్రయంబులైన దివ్యకథలను భాగవతుండైన పుండరీకాక్షుండు పృథ్వవతారంబు ధరియించి గోరూపిణియగు పృథివిం బితికిన యాదిమ కృపలగు పుణ్యకథల నన్నియు నీకున గోవిందునకు దాసుండనైన నాకు నెఱింగింపుమనిన వాసుదేవకథాసంప్రీతచేతస్కుండగు విదురుం బ్రశంసించి మైత్రేయుం డిట్లనియె నట్లు బ్రాహ్మణజనంబులచేత రాజ్యంబునం దభిషిక్తుండగుచు సకలప్రజాపాలనవిధియుక్తుండైన పృథుఁడు రాజ్యంబు సేయుచుండ నంతఁ దత్సమయంబున ధరిత్రియం దన్నరహితలగుచుం బ్రజలు క్షుత్పిపాసాక్షీణదేహులై వైన్యునిం జేరవచ్చి యిట్లనిరి॥

క॥ అరయఁగ నేము బుభుక్షాపరిపీడితుల మయ్యు పైకొని తరుకోటరజనితవహ్నిచేతను దరికొను వృక్షంబువోలి ధరణీనాథా॥ క॥ శరణాశరణ్యుఁడవగు నినుఁ శరణము వేఁడెదము మాకు సత్కృపఁ బ్రసన్నం బర సత్కృపఁ జేసి ప్రోవుము నరనాయక యనుచుం బ్రజలు నతులై పలుకఁగ॥ క॥ విని దానికి సమపాయము జననాయకుఁ డాత్మఁ దలఁచి సక్రోధుండై ధనువున బాణముఁ దొడిగెను ఘనరౌద్రుండై స*త్రిపురఘ్నస్మరుపగిదిన్॥ ఇట్లు దొడిగిన॥ క॥ మహీపతి నప్పుడు గనుఁగొని మహి గోరూపమునఁ గంప్యమానయు నగుచు ‡క్షీణగుహామండగుల బుద్ధికుఁ గని గహనంబునఁ బారు హరిణికైవడిఁ బాఱెన్॥ వ॥ ఇట్లు ధరణి పాఱిన నతండు గుపితారుణేక్షణుండై వెంటం దగిలిన నద్దిక్కులను విదిక్కులను భూభాగనభోభాగంబుల నెక్కడఁ జనిన నక్కడికి వెనుదగిలి యుద్యతాయుధుండై చనుచుండిన వైన్యునిం గని మృత్యుగ్రస్తలగు ప్రజల చందంబున నన్యశరణ్యయై యతిభయంబునం బరితప్యమానహృదయ యగుచు నిట్లనియె వైన్యా ధర్మజ్ఞుండ వాపన్నవత్సలుండవు మహాత్ముండవు సకలప్రాణిపరిపాలనావస్థితుండవు నైన నీవు దీనయుం బాపరహితయుం గామినియు నగు నను వధియింపం బూని యేల వెనుదగులుచున్నవాఁడవు ధర్మతత్త్వం బెఱుంగు వారు సతీజనంబులు కృతాపరాధలైనం దీనవత్సలతం జేసి వధియింపరని పలికి మఱియు నాధరణి పృథుచక్రవర్తికి నిట్లనియె॥ క॥ జననాథచంద్ర యీ భూజనకోటికి †యానపాత్రసదృశస్థితితో ఘనదృఢశరీరయగు నే ననయము నాధారభూతయగుచుఁ జరింతున్॥ గీ॥ ఇట్టి నన్నుఁ గృపామతి యెడలనిట్లు విపాటనముఁ జేసి ద్రుంచెదు ప్రజలు నీట మునుఁగకుండంగ నేరీతి ననఘచరిత యరసి రక్షింతువనన నతండ వనికనియె॥ వ॥ ధరిత్రీ నీ మదీయాజ్ఞోల్లంఘనంబు సేయుచున్నదానవదియుం గాక నీవు యజ్ఞంబులందు హవిర్భాగంబుల ననుభవింపుచు ధాన్యాదికంబుల విస్తరింపం జేయక గోరూపంబు ధరియించి యనయంబుఁ దృణభక్షణంబు సేయుచుఁ బాలుం బితుకక నీయందు వయిడంచికొంటివి నీయందున్న యోషధీబీజంబులు బ్రహ్మచేతం బూర్వంబున నందె కల్పింపంబడినయవి వానిని నీ దేహమందు యడంచికొని యిప్పుడీయక మూఢహృదయవు మందమతివియునై యపరాధంబుఁ జేసిన దుష్టురాలవగు నిను నా బాణంబులచే జర్ఝరీభూతశరీరం జేసి వధియించి నీ మేని మాంసంబునం జేసి క్షుద్బాధితులు దీనులు నగు నీ ప్రజల యార్తి నివారించెద నీవు కామిని యనంటివి స్త్రీపురుషనపుంసకులలో నెవ్వండేని భూతదయ లేక స్వమాత్రపోషకుండగుచు నిరనుక్రోశంబున భూతద్రోహియై వర్తించు వాని రాజులు వధించిన నవ్వధంబు గాదు గాన దానఁ బాపంబు వోరయము నీవు కామినివైనను దుర్మదయు స్తబ్ధయు నగుచు మాయాగోరూపంబునం బారిపోవుచున్న నిన్నుఁ దిలలంత ఖండంబులు చేసి నా యోగమహిమం బ్రాణికోటిని ధరించెద నని పలికి రోషభీషణాకారంబు ధరియించి దండధరుని వడువున వర్తించు పృథునిం జూచి వడంకుచు మేదిని ప్రాంజలియై యిట్లని నుతియింపం దొడంగె॥ క॥ ఈ పాథపరమపురుషుఁడవై నిజమాయాగుణంబులం దివ్యకతన నానావిధదేహములం బూనుమను సగుణుండవగుచు బుధనుతచరితా॥ అట్టి నీవు॥ క॥ నను సకలజీవతతికిని మును నీవాధారభూతముగ నిర్మింపన్ నీవు నాయందుఁ §జతుర్విధఘనభూతవిసర్గం బర్థిం గైకొనవలసె॥ అట్లయ్యుండన్॥ క॥ నను నుద్యదాయుధుఁడవై మనుజేంద్ర వధింపఁ బూనితి మస లేమని కంబెనితరు నెవ్వని వినుఁడే ఘనముగ శరణంబుఁ జొత్తుఁ గరుణాభరణా॥ అదియునుం గాక॥ సీ॥ అనఘ స్వకీయంబునై యతర్కితమునై మహిమ నొప్పిన భవన్మాయచేత సకలచరాచరసర్గంబు నిర్మించి ధర్మార్థపరుఁడవై తనరు దీశ నీ విక్రమము నవనీరజలోచన సకలలోకులకు దుర్జ్ఞయము దలఁప దగు నట్టి నీవు స్వతంత్రుఁడ వగుటను బ్రహ్మఁ బుట్టించి యా బ్రహ్మచేత సకలజగములఁ జేయింతువు నేమతెఱఁగొ యేకమయ్యు మహాత్మ యనేకవిధము లగుచు వెలుఁగొందుచుందు వీ యఖిలమందమఱ జారుతరమూర్తి యో పృథుచక్రవర్తి॥ వ॥ మఱియు మహాభూతేంద్రియకారకచేతనాహంకారంబులను శక్తులం జేసి యీ జగంబులకు నుత్పత్తిస్థితిలయంబులం గావింపుచు నయ్యుత్కటనిరుద్ధశక్తులుం గల పురుషునకు నమస్కరించెద నట్టి

* త్రిపురఘ్నస్మరుపగిదిన్ । త్రిపురహరుడైన శివునివలె... ‡ క్షీణగుహామండగు । వంచకుఁడైన - లుబ్ధకుం గని । బోయవానిఁ జూచి... † యానపాత్ర । ఓడ... § చతుర్విధ । దేవతిర్యఙ్మనుష్యస్థావరములని నాలుగువిధములయిన - విసర్గము - సృష్టి.

పరమపురుషుండవై ననీవు నిజనిర్మితంబు భూతేంద్రియాంతఃకరణాత్మకంబునయిన యీవిశ్వంబు సంస్థాపింపం బూని॥ సీ॥ ఆదివరాహంబవగుచు రసాతలగతనైన నన్ను నకుటికతోడ । నుద్ధరించితివట్టి యుదకాగ్రభాగంబునం దర్థిను న్ననేన నెడినావ । యందున్న నిఖిలప్రజావళి రక్షింపఁగోరి యీపృథురూపధారివైతి । వట్టిభూభరణుండవై ననీవిపుడు పయోనిమిత్తంబుగా నుగ్రచరుఁడ । వగుచు నన్ను వధించెదననుచు బుద్ధిఁ । దలఁపుచున్నాఁడవిది విచిత్రంబుగాదె । విశ్వసంపాద్య నిరవద్య వేదవేద్య । భవ్యగుణసాంద్ర వైన్యభూపాలచంద్ర॥ వ॥ కావున నీశ్వరగుణసర్గరూపంబయిన మాయచే మోహితాంతఃకరణులమైన మావంటివారల చేత హరిభక్తుల చేష్టితం బెఱుంగఁ బడదన్న హరిచేష్టితం బెట్లెఱుంగంబడునట్టి జితేంద్రియయశస్కరులైన వారలకు నమస్కరింతు ననుచు నివ్విధంబునం గోపప్రస్ఫురితాధరుండైన పృథుని నభినుతించి ధైర్యంబవలంబించి వెండియు నిట్లనియె॥ క॥ విమలాత్మ నాకు నభయము । సమకూరెడునట్లుగాఁగ సన్మతి నీక్రోధమును పశమించి కరుణింపుము నా విన్నపము వినుము పురుషనిధానా॥ క॥ ధరపైరులు గందకుండఁగ । సరసగతిన్బ్రావు తేనెఁజపిఁగొను నిందిందిరవిభుకైవడి బుధుఁడగు । పురుషుఁడు సారాంశమాత్మఁ బూని గ్రహించున్॥ సీ॥ వినుమయ్య తత్త్వదర్శనులైనయట్టి సన్మునులచే నైహికాముష్మికంబు । లైన ఫలప్రాప్తికర్థిఁ గృష్యాద్యగ్నిహోత్రాద్యుపాయంబు లుర్వి మీఁద । దృష్టంబులును సుచరితములును నగుచుం దానెనయంగఁ దదుపాయ మెవ్వఁడాచ । రించునువాఁడు ప్రాపించుఁ దత్ఫలమును । విద్వాంసుఁడైనను వెలయ దీని । నాదరింపక తనయంత నాచరించె । నేని నాయాసమే యగుఁగాని తత్ఫ । లమును బొందఁడు బహుళకాలమునకైన । వినుతగుణశీల మాటలు వేయు నేల॥ అని మఱియు మహి యిట్లనియె॥ చ॥ జలరుహగర్భుచేత మును జాలసృజింపఁగఁబడ్డ యోషధుల్ల లుపమతిన్ ధృతవ్రతులు గాని యసజ్జనభుజ్యమానలై । మెలఁగుటఁ జూచి యేను నృపమీరలు మాన్పమిఁ జోరబాధల । న్బలుమఱుఁ బొంది తానపరిపాలితనై కృశియించి వెండియున్॥ క॥ అనుపమ మఖకర్మక్రియ । లనయము లేమింట నేన నావృత నగుచు । జ్జననాయక యీలోకము । ఘనచోరీభూతమగుటఁ గనుఁగొని యంతన్॥ క॥ సవనాదిసిద్ధికొఱకై । తవిలి తదీయౌషధీవితతులను ధరణీ । ధవ యేనపుడు గ్రసించితి । నవియును నాయందు జీర్ణమయ్యెఁ గడంకన్॥ క॥ వినువానినొకయుపాయం । బునఁ గ్రమ్మఱఁబడయవచ్చు భూవరచంద్రా । వినుమది యెఱిఁగించెద నీ । కును వత్సలు రాలనగుట ననఘచరిత్రా॥ క॥ అనయము నాకొకవత్సము । ననురూపక్షీరదోహనమ్ము ననురూపకదో । గ్ధను గల్పింపుము దగనై । నను నీభూతములకవని నాయక దానన్॥ క॥ పరగ నభీప్సితములు బల । కరములు నగు నన్నదుగ్ధకలితములు శుభా । సురకామంబులఁ బితికెద । నరనాయకచంద్ర వినుము నావచనంబుల్॥ చ॥ మనుజవరేణ్య యేను విషమస్థలినై యిపుడున్నదానఁగా । వున జలదాగమోదితపయోనివహంబు దదాగమంబుపో । యినను దదంబువుల్పుడమి సింకక యింతట నిల్చునట్లుగా । మనునిభ నన్ను నిప్పుడు సమస్థలినై పెనుపొందఁ జేయవే॥ క॥ అని యివ్విధమున నాభూ । వనితామణి వలుకు మధురవచనంబులు దా । వినియనురాగము దనమన । మునఁ గడలుకొనంగ రాజముఖ్యుండంతన్॥ చ॥ మనువును దూడఁ జేసి గరిమన్నిజపాణితలంబు బీలదో । హనముగఁ జేసి యందు సకలౌషధులన్బితికెన్ గ్రమంబున । న్దనరఁగ నివ్విధంబునను దత్పృథువత్సలమైన భూమియం । దనయము వారువారును బ్రియంబుగఁ గోర్కులఁ బొందిరన్నిటన్॥ సీ॥ బలసి బుధులు బృహస్పతి వత్సకంబుగా నర్థించి తమయింద్రియంబులందు । నంచితచ్ఛందోమయక్షీరమును దేవతలు సురరాజవత్సకము గాఁగఁ । గనకపాత్రమునందుఁ దనరు నోజోబలవీర్యామృతంబునై వెలయుఁ బయము । దైత్యదానవులు దైత్యశ్రేష్ఠుఁడగు గుణవంతుఁ బ్రహ్లాదు వత్సంబుఁ జేసి । సత్సురాసవపయ *మాయసచషకమున । నప్సరోజనగంధర్వులలరి యపుడు । దనరు విశ్వావసును వత్సమునుగఁ జేసి । పద్మమయనిర్మితంబైన పాత్రమందు॥ వ॥ మాధుర్యసౌందర్యసహిత గాంధర్వక్షీరంబును బిత్రుదేవతలు సూర్యవత్సకంబుగా నామపాత్రమందుఁ గవ్యంబను దుగ్ధంబును సిద్ధులు గపిలవత్సకంబుగా నాకాశపాత్రమందు సంకల్ప నామరూపాణిమాదిసిద్ధియను క్షీరంబును విద్యాధరాదులు దద్వత్సకంబుగఁ దత్పాత్రకంబునుం గా ఖేచరత్వాదివ్యాపారరూపక్షీరంబును గింపురుషాదులు మయవత్సకంబును నాత్మపాత్రంబును గా సంకల్పమాత్రప్రభవంబు నంతర్ధానాద్భుతాత్మసంబంధియు నగు మాయయను క్షీరంబును యక్షరక్షోభూతపిశాచంబులు భూతేశవత్సకంబు గపాలపాత్రకంబును గా రుధిరాసవంబను క్షీరంబు నహిదందశూకసర్పనాగంబులు దక్షకవత్సకంబుగా బిలపాత్రంబున విషరూపక్షీరంబును బశువులును గోవృషవత్సకంబు నరణ్యపాత్రంబునుం గాఁ దృణంబను క్షీరంబును గ్రవ్యాదమృగంబులు మృగేంద్రవత్సకంబు నాత్మకళేబరపాత్రకంబును

* ఆయసచషకమునన్ । ఇనుపపాత్రయందు— క్షీరదోహనమ్మున్ । పాలుపితుకుటకుఁ దగిన పాత్రను, దోగ్ధన్ । పాలుపితుకువాని.

గాఁ *క్రవ్యంబును దుగ్ధంబును విహంగంబులు సుపర్ణవత్సకంబు నిజకాయపాత్రంబును గాఁ గీటకఫలాదికంబును దుగ్ధంబు
ను వనస్పతులు వటవత్సకంబుగా భిన్నరోహరూపపయంబును గిరులు హిమవద్వత్సకంబును నిజసానుపాత్రకంబును గా నా
నాధాతువులను దుగ్ధంబులుఁగా నివ్విధంబున సమస్తచరాచరవర్గంబు స్వముఖ్యవత్సకంబును స్వస్వపాత్రకంబును గా భి
న్నరూపంబులయిన క్షీరంబులం బితికిరని చెప్పి మఱియును॥ క॥ క్రమమున నిటు పృథ్వాదులు। దమతమ కామితములనఁ గఁద
గు భిన్నక్షీ। రము దోహనవత్సక భే।దమునం దగఁ బితికి రంత ధరణీధవుఁడున్॥ గీ॥ సముచితానందమును బొంది సర్వకామ।
దుఘ యనందగు భూమిని ❋దుహితఁగాఁగఁ। గోరి గైకొని నిజధనుఃకోటిచేత। భూరిగిరికూటములఁ జూర్ణములుగఁ జేసి॥
గీ॥ చండదోర్దండలీల భూమండలంబు। సమతలంబుగఁ జేసె శశ్వత్ప్రసిద్ధి। నొందియవ్విభుఁ డీలోకమందు నెల్ల। ప్రజకుఁ దం
డ్రియు జీవనప్రదుఁడు నగుచు॥ గీ॥ అక్కడక్కడఁ బూర్వంబునందు లేని। గ్రామ పట్టణ దుర్గ §ఖర్వట ❋❋పుళింద। ‡ఖేట శబరాలయ
వ్రజవాట ఘోష। వివిధనిలయములఁ దగఁగా వింపెనంత॥ క॥ వారు సుభయపరిహీనులై। భోరనఁ దత్తన్నివాసములయందు
సుఖ।శ్రీరుచి నొప్పుచునుండిరి। వారక యాపృథునిఁ బొగడ వశమె ధరిత్రిన్॥ సీ॥ అని చెప్పి మునినాథుఁడైన మైత్రేయుఁడ
వ్విదురునకిట్లను వేడ్కతోడ। ననఘాత్మ రాజర్షియైన వైన్యుండశ్వమేధశతంబు సన్మేధతోడఁ। గావింతునని దీక్షఁ గైకొ
ని తనిష్టఁ దివిరి బ్రహ్మావర్తదేశమందు। నలరు మనుక్షేత్రమందు సరస్వతీనదివిహాంతఁ దాను హెూన్నతి నొనర్ప। సవనక
ర్మక్రియకు నతిశయవిశేషఫలము గలిగెడినని బుద్ధిఁ దలఁచియచట। యమసఁ గావించునతిశయాధ్వరమహోత్స। వమున

పృథుచక్రవర్తి యశ్వమేధంబు సేయు నెడ నింద్రుండశ్వము నపహరించుట.

హింపక యుండె నయ్యసురవిభుఁడు॥ సీ॥ అట్టియధ్వరకర్మమందు సాక్షాద్భగవంతుఁడు హరి రమేశ్వరుండు లోక। గురుఁడు
సుసర్వాత్మకుండును విభుఁడును నీరజభవభవాన్వితుఁడు లోక। పాలకనిఖిలసుపర్వానుగుండును యజ్ఞాంగుఁడఖిలాధ్వ
రాధివిభుఁడు। గంధర్వమునిసిద్ధగణసాధ్యవిద్యాధరాప్సరోదైత్యసుహృత్యాళి దాన। వాదిజేగీయమానుఁడు నలఘుయశుం
డు। ప్రకటనందసునందాదిపార్షదుండు। గపిలనారదవరసనకప్రముఖ్యానుహితయోగీంద్రసంస్తూయమానుఁడజుఁడు॥
వ॥ మఱియుం బరమభాగవతసేవితుండు నారాయణాంశప్రభవుండునైన పృథుచక్రవర్తికి భూమి హవిరాది❖దోగ్ధ్రియు
య్యు సర్వకామదుఘయై సమస్తపదార్థంబులం బితుకుచుండె మఱియుఁ బెరుపులు ఘనతరాకారంబులు గలిగి మకరంద
స్రావులగుచు నిక్షుద్రాక్షాదిరసంబులు దధిక్షీరాజ్యతక్రపానకాదికంబులు వర్షింపన వియెల్ల నదులు వహించె సముద్రం
బులు హీరాదిరత్నవిశేషంబుల నీనుచుండెఁ బర్వతంబులు భక్ష్యభోజ్యలేహ్యచోష్యంబులను చతుర్విధాన్నంబులఁ గురి
యుచుండె లోకపాలసమేతులైన సకలజనంబు ¶లుపాయనంబులు దెచ్చియిచ్చుచుండిరిట్టిపరిపూర్ణవిభవాభిరాముండై
యధోక్షజసేవాపరాయణుండగు పృథుచక్రవర్తి †యేకోనశతాశ్వమేధంబులు సన్మేధంబునం గావించినాఁ డవయా
గంబునందు యజ్ఞపతియైన పుండరీకాక్షుని యజింపుచుండం దదీయపరమోత్సవంబు సహింపంజాలక॥ క॥ అమరేంద్రుఁడు
ఘనరోషోద్రమ్ముఁడై పాషండవేషకలితతిరోభా। వమునం దశ్వముఖపశువుఁ। గ్రమమేది హరించి చనియె గగనంబునకున్॥ అ
ట్లు చనునప్పుడు॥ క॥ అనఘుండగు నత్రిమహా।మునిచోదితుఁడగుచుఁ బృథునిపుత్త్రుఁడు బాణా।సన ❋తూణీరధరుండై। యని
మిషపతివెనుకఁ జనియె నతిదర్పమునన్॥ అట్లు చని చని ముందట॥ సీ॥ యజ్ఞసాధనపశుహరణుఁ సువధియించు ధర్మంబునందు నధ
ర్మము నేడి। బుద్ధిఁ బుట్టఁగఁ జేయ భూరిమాయావేషధారియై యసుగు ?సుత్రాముఁ గదిసి। విలునిలుమని యార్చి నిజ♦గుణధ్వ
నిఁ జేసి ఘనజటాభస్మాస్థికలితమయిన। మూర్తిఁ గనుంగొని మూర్తిభవించిన ధర్మంబుగా బుద్ధిఁ దలఁచియమర। నాయకుని
మీఁద సాయకమేయఁ జాల। కున్నఁ గనుఁగొని యత్రి విద్వన్నుతుండు। వైన్యజునకనె వాసవు వలనుఁ జూపి। మనములోపలరో
షంబు మల్లడింప॥ క॥ విను మితఁడు యజ్ఞహంతయ। ననిమిషనికరాధిపుండు నగునింద్రుఁడు గా।వున నితని జయింపుము నీ। వని
ను సమ్మారుచ్చరింపన వ్వైన్యజుఁడున్॥ మ॥ వినువీధిన్ ఘను దేవవల్లభుని పైఁ బేరుండు గ్రోధాంతరం। గని రూక్షిన్మృగరాట్కిశోర
ము మహాగంధద్విపేంద్రంబు మీఁ। దను లంఘించువిధంబునం బడిన నాతండశ్వచౌర్యైకసా।ధనరూపంబు దదశ్వమున్ విడి
చియంతర్ధానముం బొందినన్॥ క॥ వీరుఁడు పృథుభూపాలకు।మారుఁడు నిజయజ్ఞపశువు మఱలం గొనిదు।ర్వారబలుఁడగుచు

*క్రవ్యంబు।మాంసము — ❋దుహిత।కూఁతురు — §ఖర్వట।నన్నూరూళ్లకు సుబా — ❋❋పుళింద।చెంచువాండ్రపల్లెలు — ‡ఖేట।కాపువాండ్రపాలెములు, శబరాలయ।బోయపల్లెలు, వ్రజవాట।పశువులకొట్టములు, ఘోష।గొల్లపల్లెలు — ❖దోగ్ధ్రి।పితుకుచున్నయావు — ¶ఉపాయనములు।కానుకలు — †ఏకోనశత।తొంబదితొమ్మిది — ❋తూణీర।అమ్ములపొది — ?సుత్రామ।ఇంద్రుడు — ♦గుణ।అల్లెత్రాడు.

కీర్తికిఁ బుణ్యమూర్తికిన్॥ అంత నచ్చటి జనంబు లిట్లనిరి॥ గీ॥ అనఘ నీచేత నాదృతులై రిసర్వ। జనులు మఱి దానమానోపచారము

### యాగంబున నారాయణుండు ప్రసన్నుండై పృథుచక్రవర్తి ననుగ్రహించుట.

లను। బిత్ర దేవర్షి మానవవితతి పూజ। నొంది సంచిత మోదంబు నొందె నయ్య॥ వ॥ అని పలుకు సమయంబున యజ్ఞభోక్తయు యజ్ఞవిభుండు భగవంతుండు నైన సర్వేశ్వరుం డింద్రసమేతుండై యచ్చటికిం జనుదెంచి యా పృథున కిట్లనియె॥ క॥ జరవర భవదీయంబై। జననుతమగు నశ్వమేధశతమునకిపుడీ। యనిమిషపతి భంగము చే।సిన కతన నతఁ క్షమాపణంబు సేసెడిఁ గంటే॥ వ॥ కావున నితని క్షమింపుము సత్పురుషులగు వారు దేహాభిమానులు గాకుండుటం జేసి భూతంబులయెడ ద్రోహంబాచరింప రట్లగుటం జేసి నీవంటి మహాత్ములు దేవమాయామోహితులై పరోపతాపంబులు సేసిరేని దీర్ఘతరంబైన వృద్ధజనసేవ వ్యర్థంబుగా దెయదియునుం గాక యీ శరీరం బవిద్యాకామకర్మంబుల చేత నారబ్ధంబని తెలిసిన పరమజ్ఞాని యీ దేహంబునందు *ననుషక్తుండు గాకుండుట సహజంబన దేహోత్పాదితంబులైన గృహదారాదులయందు మమత్వంబు లేకుంటం జెప్ప నేల నిట్టి దేహంబునందున్న యాత్మ *యేకంబు శుద్ధస్వరూపంబు స్వయంజ్యోతియు నిర్గుణంబు గుణాశ్రయంబు వ్యాప్యవ్యాపకంబున సంవృతంబు సాక్షిభూతంబు నిరాత్మయునగు దీని దేహంబునకంటె వేఱుగా నెవ్వండు దెలియువాఁడు మత్పరుండగుటం జేసి దేహధారియైయుండియుఁ దద్గుణంబులం బొరయక వర్తించు మఱియు నెవ్వండేని స్వధర్మాచారపరుండు నిష్కాముండు శ్రద్ధాయుక్తుండునైన న న్నెల్లప్పుడు భజియించు నట్టివాని మనంబు గ్రమంబునఁ బ్రసన్నంబగు నట్లు ప్రసన్నమనస్కుండు ద్రిగుణాతీతుండు సమ్యగ్దర్శనుండునైన యతండు మదీయ సమవస్థానరూప శాంతి నొందు నదియ కైవల్యపదంబనంబడుఁ గూటస్థంబైన యీ యాత్మ యుదాసీనభూతంబైన దీని ద్రవ్యజ్ఞానక్రియామనంబులకు నీశ్వరుంగా నెవ్వండు దెలియువాఁడు భవంబు నొందకుండు నీ సంసార ద్రవ్యక్రియాకారక చేత నాత్మకంబగుటం జేసి ప్రభిన్న దేహోపాధికంబుగావునఁ బ్రాప్తంబులైన యీ యాపత్సంపదలయందు మత్పరులైన మహాత్ములు వికారంబు నొందరు గావున నీవు సుఖదుఃఖంబులయందు సమచిత్తుండవు సమానోత్తమమధ్యమాధముండవు జితేంద్రియాశయుండవునై వినిష్పాదితాఖిలామాత్యాదిసంయుతుండవై యఖిల లోకరక్షణంబు సేయుమని వెండియు నిట్లనియె॥ సీ॥ పార్థివోత్తములకుఁ బ్రజల రక్షించుట పరమధర్మంబగు నరవరేణ్య। ధరణీశులకుఁ బ్రజాపరిపాలనంబునఁ బూని లోకులు సేయు పుణ్యమందు। షష్ఠాంశ మర్థి నిసంప్రాప్తమగు నట్లు ప్రజలఁ బ్రోవని రాజు ప్రజల చేత। నపహృత సత్పుణ్యుఁడై వారు గావించు ఘనపాపఫలముఁ దా ననుభవించుఁ। గాన నీవును విప్రవరానుమతము। సాంప్రదాయక విధము నై జరుగు ధర్మ। మహిమ జేఁబట్టి యర్థకామములయందు। సమత నమ్మాఁటియందు నాసక్తి లేక॥ ఇవ్విధంబున॥ క॥ జనులకు ననురక్తుఁడవై। జననాయక నీవు ధరణి సమచిత్తుఁడవై। యనయముఁ బరిపాలించిన। సనకాదులఁ గాంతువాత్మసదనమునందున్॥ సీ॥ భూవర యోగతపోముఖంబుల చేతఁ గైకొని సులభుండఁ గానిమేను। సమచిత్తులైన సజ్జనుల చిత్తంబుల వర్తింపుచుండెడివాఁడ నగుటఁ। జేసి తావక శమశీలవినుతసరకీర్తనముల వశీకృతుఁడనైన। నే నీకు నొక వరంబిచ్చెద వేఁడుము నావుడువిని మేదినీవరుండు। లోకగురుఁడైన యప్పుండరీకనయనుఁ। డానతిచ్చిన మృదులలితామృతోప। మానవాక్యములాత్మీయమస్తకమునఁ। దాల్చి సమ్మోదితాత్ముఁడై ధరణివిభుఁడు॥ క॥ తనపాదములకు భక్తి। న్వినతుండై యాత్మకర్మవితతికి లజ్జం। దనరుచున్న సురేంద్రునిఁ। గనుఁగొని సప్రేమ మొదవఁ గౌఁగిటఁ జేర్చెన్॥ వ॥ ఇట్లు గౌఁగిటం జేర్చి గతద్వేషుండై యున్న యనంతరంబ॥ మ॥ భగవంతుండును విశ్వరూపకుఁడునై భాసిల్లు నవ్విష్ణుఁడా। జగతీనాథకృతార్చనానతుల చేసంప్రీత చేతస్కుఁడై। న్నిగృహీతాంఘ్రిసరోరుహద్వయుడునై నిల్చెన్ బ్రియాణాభిము। ఖ్యగరిష్ఠాత్ముఁడయ్యె నా పృథుని పైఁ గారుణ్య మేపారఁగన్॥ వ॥ ఇట్లు తనని మీఁదియనుగ్రహంబునం జేసి విలంబితుండగు నయ్యాదిరాజన్యుండైన పృథుచక్రవర్తియమ్ముకుందసందర్శనానందబాష్పజలబిందు సందోహకందళితనయనారవిందుండై యవ్విభుమూర్తిం గనుంగొనిగనుంగొన లేక గద్గదకంఠుండై పలుక లేక యుండియు నెట్టకేలకుఁ దన హృదయంబునన ద్దేవునినుపగూహనంబుఁ గావించి తన్మూర్తి ధరియించి కన్నులం దొలంగు నానందబాష్పంబులు తుడిచికొని విలోకనంబు సేయుచు నతృప్తదృగ్గోచరుండు గరుడస్కంధవిన్యస్తహస్తుండు వసుధాతలస్థితపాదకమలుండు నైయొప్పు నద్దివ్యపురుషున కిట్లనియె॥ క॥ వరదాయీశ్వర నిను స। త్పురుషుఁడు దేహాభిమానభోగములకునీ। వర మెట్లు గోరు నిహసుఖ। వ

---

* అనుషక్తుండు। అభిలాషగలవాఁడు— *ఏకంబు। సజాతీయవిజాతీయస్వగతభేదశూన్యమయినది, శుద్ధ। జరామరణక్షుత్పిపాసాది మాలిన్యశూన్యమయినట్టి, నిర్గుణంబు। రాజసతామససాత్త్వికగుణములు లేనిది.

రములు నారదులకైన నవశరము వె చెప్పుమా॥ చ॥ ఘనమగు దేవ యీవరమె కామము మహాత్మక వాఙ్వినిర్గతంబునై తావకీనచర
ణాంబుజచారుమరందరూపమై। తనరిన కీర్తియు న్విని ముదంబును బొందఁగ లేని మోక్షమై।నను మదిఁ గోరనొల్లన ఘనాశర
మేశ సరోజలోచనా॥ క॥ అదిగానఁ బద్మలోచన। సదమల భవదీయ ఘనయశము వినుటకునై। పది వేలు చెవులు గృపవి।మ్మిది
యే నాయభిమతంబు లెసఁగు ముకుందా॥ చ॥ అనఘ మహాత్మ వాగ్గళితమైన భవత్పదపంకజాత సం।జనిత సుధాకణానిలవశం
బున విస్మృతతత్త్వమార్గ వర్తనలగు దుష్టయోగులకుఁ గ్రమ్మఱ దత్త్వముఁ జూపఁ జాలుఁ గా।వున నిది దక్క నన్యవర మొల్లఁ బ
య్యోరుహపత్త్రలోచనా॥ సీ॥ వినుతమంగళ యశోవిభవ సర్వేశ్వర యిందిర గుణసంగ్రహేచ్ఛఁ జేసి।యే నీ మశివతరంబైన
సత్కీర్తి నినర్థిమైవరియించె నట్టి కీర్తి। కలిత సత్పురుష సంగమము గల్గుచునుండ దృతి నెవ్వఁడేని యాదృచ్ఛికమునఁ। జేసి యొ
క్కమాటు చెవులార విన్నవాఁడనయంబు ను గుణజ్ఞుఁ డయ్యె నేని। విరతి నేరీతిఁ బొందమను ధరణిఁ బశువుఁ। దక్కఁ దక్కి నతద
జ్ఞుండు దనుజభేది। గాన నుత్సుకమతినైన యే నులక్ష్మి।కరణి నిన్ను భజింతునో పరమపురుష॥ వ॥ ఇట్లు భవదీయ సేవాతత్పరుల
మైన యిందిరయు నేనును నేకపదార్థాభిలాషం జేసి స్పర్ధమానులగుచున్న మాయిద్దఱికి నిబ్బర్యాయ సేవం జేసి కలహంబు లేకుం
డ నిమ్మెట్లుఁ గాక భవదీయ చరణసరోరుహ సేవాసక్తమనోవిస్తారులమగుటం జేసి నేను నేనను మున్ను భజియింతు నను తలంపు
లం గలహంబు గానిమ్ము దేవా యని వెండియు ని ట్లనియె॥ సీ॥ జగదీశ దేవ యుష్మత్పదకైంకర్యపరతఁ బెనర్చు సాగరతనూజ। కృ
త్యంబు నందు నకిల్బిషబుద్ధి నేఁ బ్రీతిఁ గోరుట జగన్నాథ మైన। యా రమాసతితోడి వైర్యము వశ్యంబు గల్గునైనను దయాకార నీ
వు। దీనవత్సలుఁడవు గాన స్వల్పంబైన నధికంబు సేయు మట్లు గాన। భవ్యచరిత నిజస్వరూపంబునందు। నభిరతుఁడవైన నీవు
నన్నాదరించు। పగిది నిందిర నాదరింపవు మహాత్మ। భక్తజన లోకమందార భవవిదూర॥ వ॥ ఇట్లగుటం జేసి సత్పురుషులయిన
వారలు నిరస్తమాయాగుణ సముదయంబు గల నిన్ను భజియింతురు వారలు భవత్పాదానుస్మరణరూపంబయిన ప్రయోజ
నంబు దక్క నితరప్రయోజనంబుల నెఱుంగరు దేవా సేవకజనంబులను వరంబులు వేఁడుమని జగద్విమోహనంబయిన వా
క్యంబులం బలుకుదువట్టి భవదీయ వాక్యతంత్రీనిబద్ధులు లోకులు గాకుండిరేని ఫలకాములై కర్మంబుల నేట్టులాచరింతురీ
శ భవదీయ మాయా విమోహితులైన జనులు లేదు కారణంబు నీకింతె నితరంబులఁ గోరుచుండరిట్లగుటం జేసి తండ్రి దనంతన
బాలహితంబాచరించు నట్లు మాకు నీవ హితాచరణంబాచరింపనర్హుండవని పలికిన యాది రాజర్షియైన పృథుచక్రవర్తియ
ద్దివ్యంతంబులైన వచనంబులు విని విశ్వద్రష్టయగు నారాయణుండు సంతుష్టాంతరంగుండై యిట్లనియె నో మహారాజ దైవప్రే
రితుండవైనా యెడ నిట్టి బుద్ధి గలుగుటం జేసి యచంచలమగు భక్తివోడముదాని చే మస్తరంబగు మదీయ మాయం దరింతువు నీ
వు నా చే* నాదిష్టంబగు కృత్యంబ ప్రమత్తుండవగుచు నాచరించిన సకలశుభంబులం బొందుదువు మదీయ భక్తజనంబులు స్వ
ర్గాపవర్గనరకంబులం దుల్యంబులుగా నవలోకింతురు గావున నీ§యధ్యవసాయంబు నట్టి వయస్థిత మదీయా‡దేశంబు
నమస్త్యజంబగు రోషంబు నుద్యజించి నా యెడ భక్తి సలిపితివి గాన నిదియె నాకుఁ బరమహర్షణంబగునని యభినందించి యను
గ్రహించి తగ మోక్షముఖుండయ్యె నయ్యవసరంబున॥ సీ॥ నరసిద్ధచారణ సురముని గంధర్వకిన్నర పితృ సాధ్యపన్నగములు।
నఖిలజనంబులు హరిపార్శ్వవర్తులు నానందమగ్నాంగులగుచు వేడ్క। యజ్ఞేశ చింతనుండైన యా పృథువు చే సత్కారము
లం బొందిన సమ్మదమున। జనిరి నిజాధివాసములకు భగవంతుఁడైన నారాయణుండును ¶అచ్యుతుండు। దగనుపాధ్యాయ సహితుఁ
డై తనరు పృథుని। విమలమతితోడఁ జూచుచు నసురవైరులు। దన్ను జయ విజయ కలిత శబ్దములఁ బొగడఁ। జనియె నప్పుడు వైకుంఠస
దనమునకు॥ వ॥ అంతఁ బృథుచక్రవర్తియు నింద్రియ గోచరుండయ్యును దర్శితాత్ముండు దేవదేవుండును నైన వాసుదేవునకు
నమస్కరించి నిజపురంబునకుం జనుదెంచు సమయంబున మౌక్తిక కుసుమమాలికా మకరాల స్వర్ణతోరణాలంకృతంబులగు నిత
సుగంధధూపవిరాజితంబు రత్నమయ రంగవల్లికా విరాజితంబు ఫలపుష్పలాజాక్షత దీపమాలికా స్తంభ ప్రాగసోతాఖిరా
మ ప్రతిగృహ ప్రాంగణంబు మృగమదఘనసార చందనాగరు వారి పూరసంసిక్త ‖రథ్యావళీ విభాసితంబు దరు పల్లవాభి
శోభితంబునైన పురంబుఁ బ్రవేశించి మండిత రత్నకుండల మణిమరీచులు గండఫలకంబులం దాండవంబులుసలుపం బుర కా
మినులు గనకపాత్ర విరచితంబులైన యశేషమంగళ నీరాజనంబుల నివాళింప శంఖ దుందుభి ప్రముఖ తూర్య ఘోషంబులు
బుత్విజ్నికాయాశీర్వచనంబులును జెలంగ వందిమాగధజన సంస్తూయమానుండగుచు విగతగర్వుండై యంతఃపురం

* ఆదిష్టంబగు కృత్యంబు। ఆజ్ఞాపింపఁబడిన కార్యమును — § అధ్యవసాయంబు। ప్రయత్నమును — ‡ మదీయాదేశంబు నట్టి। నా యాజ్ఞచేత — ¶ అచ్యుతుండు। నవ్యవతిత్య మ్యుతః—నాశనము లేనివాఁడు—ఆనఁగా విష్ణువు — ‖ రథ్యావళి—పెద్దవీధులచేత.

బుఁ బ్రవేశించియనంతరంబ॥సీ॥సమధికమతిఁ బౌరజనజానపదులచేఁదనరారువివిధపూజనలనొంది।రాజుసంతుష్టాంతరం గుండుప్రియవరప్రదుండునై వారలబహువిధములఁ। బూజించెనివ్విధంబున మహత్తరములైనట్టికర్మంబులనాచరింపు। చున్నిరవద్యచేష్టుండై మహాత్ముఁడన నొప్పు నాపృథుమనుజవిభుఁడు। మించిభూమండలమ్ముఁ బాలించివిశద।యశమునసర్వధరాచక్రమునందునిలిపి। చారుశుభమూర్తిరాజన్యచక్రవర్తి।పరమమోదముతోఁ బరంపరము నొందె॥క॥అని మైత్రేయమహాముని।యనఘుఁడు విదురునకుఁ జెప్పిననిశుకుఁడభిమ।న్యునిసుతునకుఁ జెప్పినతెఱఁ।గనిసూతుడు సెప్పెశౌనకాదులతోడఁ॥

**పృథుచక్రవర్తిసభాసదులకు సద్ధర్మములనుపదేశింపుచు బ్రాహ్మణప్రశంస చేయుట.**

వ॥ అట్లెఱింగించియు వెండియునిట్లనియెనివ్విధంబున నశేషగుణవిజృంభితంబు నిర్దోషంబు సత్పురుషసత్కృతంబునైన పృథుచక్రవర్తియశంబును బ్రకటంబుగాఁ జేయంజాలు మైత్రేయునిం జూచి మహాభాగవతుండయిన విదురుండిట్లనియె॥ సీ॥ మునినాథవినుపృథుజనపాలచంద్రుండు సొబగొప్ప మేదినీసురులచేత। రాజ్యాభిషేకసంపూజ్యుఁడై దేవతాగణముచేలబ్ధార్హగుణుఁడునగుచు। వైష్ణవతేజంబువలనొప్పధరియించియర్థి నెయ్యేకర్మమాచరించె । నదినాకు నెఱిఁగింపు మనఘాత్మభూమియేరూఢిగవాక్కృతిరూఢయౌవని।విక్రమోద్భిష్టమైయొప్పి వెలయుచుండు।కర్మమునిప్డు రాజన్యగణము బ్రతుకు।నట్టిపృథుకీర్తిధరలోననతివివేకి।దవిలియెవ్వఁడువినకుండు ధన్యచరిత॥క॥నావుడు వినిమైత్రేయుం। డావిదురునిఁ జూచి పలికె నతివినయమునం।బావనచరితుఁడు పృథుఁడు ధ।రావరనుతుఁడలఘుయశుఁడు ప్రముదంబలరన్॥ సీ॥*రంగముత్తుంగతరంగగంగాయమునామధ్యమందునున్నతివసించి। కైకొని ప్రారబ్ధకర్మక్షయార్థంబునఖిలపుణ్యంబులననుభవింపు। చునుసర్వదేశంబులనుదనయాజ్ఞయప్రతిహతసత్ప్రతాపమునఁ జెలఁగ।బూనిసర్వద్వీపములకుఁ దానొక్కండ వైష్ణవభూసురావళికిఁ దక్క।ధరణిఁ దక్కిన ప్రజకెల్ల దండధరునిఁ। బోలివర్తింపుచును గొంతకాలమరుగఁ। దవిలియొకనాఁడు దీర్ఘసత్రంబుసేయ।నర్థిఁ గైకొని దీక్షితుండయ్యెనందు॥గీ॥రాజఋషిదేవఋషిపితృబ్రహ్మఋషులు।జనవరునిచేతవిహితపూజనలనొంది।సమధికైశ్వర్యగతినున్నసమయమునను।జిరశుభాకారుఁడా రాజశేఖరుండు॥సీ॥ ఉన్నతోన్నతుఁడు సముత్తుంగభుజుఁడుసన్మహనీయతరశోభమానముఖుఁడు । చారుసంఫుల్లకంజారుణేక్షణుఁడుసునాసపుటుండుమందస్మితుండు।వక్రసూక్ష్మస్నిగ్ధవరనీలకేశుండుగమనీయరుచికంబుకంధరుండు । సుభగవిశాలవక్షుండునుత్రివళిశోభితమధ్యభాగుండుపృథునితంబ।మండలుండు నావర్తసమాననాభి।వివరుఁడును గాంచనస్తంభవిలసదూరు। రాజితుఁడు మఱియరుణచరణుఁడునుద్ధృత।నవదుకూలోత్తరీయుఁడున్నతయశుండు॥వ॥మఱియునియమనిమిత్తంబునం బరిత్యక్తభూషణుండగుటంజేసి వ్యక్తాశేషగాత్రశ్రీకుండు కృష్ణాజినధరుండు శ్రీమంతుండు కుశహస్తుండు కృతోచితుండు శిశిరస్నిగ్ధతారాక్షుండునైనపృథుచక్రవర్తిసభామధ్యంబున తారాగణమధ్యభాసితుండగుసుధాకరునింబోలి వెలుంగుచు లేచినిలుచుండి సదస్యసంతోషదాయకంబులుఁ జిత్రపదవిరాజితంబులుఁ బ్రసన్నంబులుఁ బరిశుద్ధంబులుగంభీరార్థంబులునవ్యాకులంబులునైనభాషణంబులనిట్లనియె॥క॥వినుఁడీసభికులు ధర్మము। ననయము నెఱుఁగంగఁ గోరునట్టిజనుఁడు దాఁ। దనతలఁపునఁ గలయర్థముఁ।జను నెఱిఁగింపంగధీరసత్పురుషులకున్॥ సీ॥వినుఁడీలోక¶వితానంబులెల్లను శాసించిభూప్రజాసంతతులను।దత్తద్విహితవృత్తిదానంబులను జేసిరక్షింపవివిధమర్యాదఁ దప్పి।పోకుండనిలుపుటకై కమలజుచేనియోగింపఁబడితినిట్లొనరియుండ।నట్టిప్రజాపాలనాద్యనుష్ఠానవశంబునఁ బ్రాక్కర్మసాక్షియీశుఁ। డెట్టివానికిసంతుష్టి నెసఁగుచుండు నట్టివానికి నేలోకమంద్రుబుధులు। ‡కామదుఘములునైనలోకములునాకు। సరవిఁగలుగుననుష్ఠానపరుఁడనగుట॥వ॥ఇట్లుప్రజలనుధర్మంబులయందు ననుశాసింపకయర్థకాముండై వారివలన నప్పనంబులుగొనె నేనివారలపాపంబుదనకుఁ బ్రాపింపం దేజోహీనుఁడై భూవిభుండుచెడుంగావునభూపతిహితార్థంబునకు స్వార్థంబునకుననసూయారహితలై ప్రజలువాసుదేవార్పణబుద్ధింజేసిధర్మంబాచరింపవలయునిదియనన్ను ననుగ్రహించుటయదియునుంగాకపితృదేవర్షితుల్యులగుమీరలను మోదించికర్తయుననుశాసకుండుననుజ్ఞాతయునైననాకుఁబరలోకంబున నేఫలంబుగలుగునట్టిఫలంబునకుసదృశంబైనకర్మంబాచరింపవలయునట్లైనసంతోషంబునొందుదుననిన వారలా రాజేంద్రునకిట్లనిరి॥ క॥ జననాయక ప్రజలిరవొం।దినధర్మములెల్ల వాసుదేవార్పణబు। ద్ధినిఁ జేయవలయునంటివి। యనయమున వ్యాసుదేవుఁడనఁగలఁ డేమహీశ॥ సీ॥అనిన వారికినిజనాథుఁడనుసద్వ్రతములారవినుఁడయ్యతవిలిమీరు।యజ్ఞాధిపతియైనయఖిలేశ్వరుఁడు గొన్నిమతములఁ

*రంగదుత్తుంగతరంగ।మనోహరములైపొడవులైనఅలలుగల—¶వితానము।గుంపు—‡కామదుఘములు।అభీష్టములనిచ్చునట్టివి.

గలఁడుధీమంతులార। యట్లైనమీరలునందుకువిప్రతిపత్తిగల్గుటను బ్రపన్నమరయఁ।గాదంటిరేనియాఘనునిచేరదితమై
కాంతిమాత్రైనజగంబుగానఁ।బడుచునున్నదియిట్టిప్రపంచరచిత।కర్మవై చిత్ర్యమమ్మేటిగలుగకున్న।నదిదదీయోక్తులునుబ్ర
పన్నములుగావు।కానన వ్యాసుదేవుండుగలఁడుమఱియు॥ వ॥అదియునుంగాక యీజగద్వైచిత్ర్యంబుగర్తమైనయీశ్వ
రుండు లేకున్నంగర్మవశంబునం జేసి*యుపపన్నంబగునంటిరేని॥సీ॥పూనిప్రియవ్రతోత్తానపాదధ్రువమనులకస్మత్పితా
మహుఁడనంగఁ।దగునంగ మేదినీధవునకుమఱియనువినుతికెక్కినపృథివీపతులకుఁ।బద్మసంభవభవప్రహ్లాదబలిచక్రవర్తి
ప్రముఖభాగవతులకర్థి।వర్గసుస్వర్గాపవర్గంబులకుననుగతకారణుండనఘనతకెక్కి। హీనులగుమృత్యుదౌహిత్రుఁడైన
వేన। ముఖమరాత్ములధర్మవిమోహితులను। దక్కఁదక్కినవారికి దాఁబ్రసన్న। వరముఁడై యిచ్చునభిమతావళుల
నతఁడు॥ వ ॥ ఇట్టివిద్వదనుభవంబున భువనహితుండగు వాసుదేవుండు లేడనుట యుపపన్నంబుగాదదియునుంగాక॥
ఉ॥ భూరితపోభిరామమునిపూజనమెవ్వనిపాదపద్మసే। వారతివృద్ధిఁబొందియనివారణఁబూర్వభవానుసారసం। సా
రసుసంతాపమువ్యశంబుగఁబాపఁగనోపుఁదత్పదాం। భోరుహజాతదేవనదిఁబోలి యశేషమనోఘహారియై॥
మఱియు॥మ॥ అనుపమభక్తినెవ్వనిపదాంబుజమూలముమందిరంబుగా।ననయముఁబొందువాఁడునిహతాఖిలభూరిమ
నోమలుండుస। ద్వినుతవిరక్తిబోధధృతివీర్యవిశేషసమన్వితుండుదా। ననఁదగిభూరిసంసృతిమహోత్తరదుఃఖమునందఁ
డెన్నఁడున్॥క॥ నారాయణుండుజగదా। ధారుండగునీశ్వరుండువలఁపనతనికిఁ।లేరెందుసములునధికులు।ధీరోత్తముఁ
డతఁడునద్వితీయుండగుటన్॥ అదియునుంగాక॥ఉ॥కర్మవశంబునంజగముగల్గును హెచ్చునడంగునన్నచోఁ।గర్మముఁబు
ద్ధిఁజూడజడకార్యముగాని ప్రపంచకల్పనా। కర్మమునందుగర్తయనఁగావిలసిల్లఁగఁజాలదీజగ।త్కర్మకకార్యకారణము
గావుననీశుఁడువిష్ణుఁడారయన్॥వ॥ కావునమీరలవ్యాసుదేవునినధికారానుసారంబుననిశ్చితార్థఫలసిద్ధిగలవారలైన
నోవాక్కాయకర్మంబులనిష్కపటవృత్తిందగిలి §వినుతినతిపరిచర్యాపూర్వకంబుగాఁగామమఘంబులయిన యతని
పాదపంకజంబులుభజియింపుండదియునుంగాక॥సీ॥రూఢినీశ్వరుఁడుస్వరూపంబునం జేసిపూనివిశుద్ధవిజ్ఞానఘనుఁడు।న
గుణుండునైనదానరయనికర్మమార్గమునందువ్రీహ్యాదిద్రవ్యములను। శుక్లాదిగుణమువిస్ఫురదవఘాతాదినత్క్రియలు
నుమంత్రసంచయంబు। సంకల్పమునుయాగసాధ్యమైనట్టియఖండోపకారంబుఘనపదార్థ।శక్తియుంజ్యోతిష్టోమాదిసం
జ్ఞికమ్ము। ననునానేకవిశేషగుణతనుమెఱియు। నట్టియధ్వరరూపమైయఖిలజగము। నందుననిశంబుప్రఖ్యాతినెందుచుం
డు॥ వ॥అదియునుంగాకదారుస్థితంబైనయనలంబుతద్దారుగుణంబులయిన¶జైహ్మ్యవక్రత్వాదికంబులననుసరించుచుం
డంబుననవ్యక్తంబుతత్క్షోభకంబయినకాలంబువాసనయునదృష్టంబునను కారణంబులచేతంబుట్టినశరీరంబునందువిష
యాకారంబయినబుద్ధినొందితద్విష‡యాభివ్యంగ్యంబయినయానందస్వరూపుండగుచుక్రియాఫలంబునఁబ్రసిద్ధియు
నొందుననిచెప్పివెండియునిట్లనుమదీయజనంబు లీమేదినీతలంబున దృఢవ్రతులై యజ్ఞభుగీశ్వరుండుగురుండునైనసర్వే
శ్వరునిహరినినిరంతరంబునుస్వధర్మయోగంబునంబూజింపుచున్నవారలునన్నాశ్చర్యకరంబుగానను గ్రహించువార
నిహరిభక్తిరతులయినమహాత్ములనుతియించి వెండియునిట్లనియె॥మ॥ పరసంపద్విభవప్రతాపమహదైశ్వర్యంబులంబొ
ల్చునీ। ధరణీనాథులతేజమంచితతపో†దాంతిక్షమావిద్యలం।గరమొప్పారుధరాసుపర్వహరిభక్తశ్రేణులందెప్పుడుఁ।
ధరలోనంబ్రభవింపకుండుననియద్ధాత్రీవిభుండిట్లనున్॥చ॥ అరయఁగనేధరామరపదాంబుజరేణువులర్థిఁదాల్చియప్పు
రమపురాణపూరుషుఁడుబ్రాహ్మణదేవుఁడునైనయట్టియీ। శ్వరుఁడుసదానపాయియగుసాగరకన్యనుసర్వలోకవి।
స్ఫురితపవిత్రకీర్తియునుబొందివిభూతిఁదనర్చెఁగావునన్॥సీ॥ పవసుధామరసేవనుజేసియశేషగుణాన్వితస్థితిఁదనర్చు।
సర్వేశ్వరుఁడుమఱిసంతుష్టుఁడగునట్టిధరణిదివిజులుదద్ధర్మపరులు।నలఘువినీతులునై యవశ్యంబునుసేవింపుఁడేధరాదే
వనిత్య। సేవచేఁబురుషుఁడుచిరతరజ్ఞానవిద్యాభ్యాసిగాకున్ననైననతఁడు। వేగముననంతరంగంబువిశదమగుటఁ। జేసి
కైవల్యపదమునుఁజెందునట్లుఁ। గానలోకులుభూదేవతానికరముఁ।దగిలిభజియింపవలయునుదాత్తమతిని॥మఱియును॥
సీ॥విజ్ఞానఘనుఁడనవెలయునీశ్వరుఁడుడత్త్వజ్ఞానులైనట్టివారిచేత। దీపింపనింద్రాదిదేవతాదేశంబుననుభూమిసురము
ఖంబునహుతంబు। లగుహవిస్సులఁదృప్తినందినగతినచేతనమైనయాహుతాశనముఖంబు। వలనువేల్చినహవిస్సులచేతఁ

---

*ఉపపన్నంబు।కలుగుచున్నది,యుక్తము— § వినుతినతి॥వినుతి।స్తోత్రము-నతి-నమస్కారము— ¶ జైహ్మ్య।పొడుగు— ‡ అభివ్యం
గ్యంబు।తెలుసుకొనఁదగినట్టిది— † దాంతి।ఇంద్రియనిగ్రహము.

ద్యుతిమంతుఁడు గాకుండుఁ గావున లోకమందు । నగ్నిముఖమునకంటెఁ ధరామరేంద్ర। ముఖము పరిశుద్ధమత్యంతముఖ్యమనఁ గఁ జనరు నది గావున భూసురార్చనము సకల । జనులు గావింపఁదగు నార్యజనవరులార॥ అదియునుం గాక॥ సీ॥ ఏ వేదమం దేనిని విశ్వమెల్లను దర్పణప్రతిబింబితమగు వస్తునివహంబుకైవడిఁ దివిరి ప్రకాశించు నది విరజమును నజియవ్యయంబు। న గుచు సనాతనంబగు వేదమర్థరా దేవతాజనములు దివముఁ దగిలి। సహితశ్రద్ధాతపోమంగళమౌనసంయమసమాధులఁ బో లుపారుచుండి యర్థి సదసద్విచారులై యధికరింతు । రట్టివారలపదరజంబుఁ దితాల్చు। నలఘులసు సర్వపాపక్షయంబు నఖిల। సద్గుణావాప్తికరము సుజనులార॥ వ॥ కావున నట్టి విప్రపాదసరోజరేణువు లేను నుగిరీటంబున ధరియింతు నట్లు బ్రాహ్మణభజనంబునం జేసి యవాప్తసకలగుణుండును శీలధనుండును గృతజ్ఞుండును శ్రద్ధాయుక్తుండునై న మహాత్ముం డఖిలసంప దలుఁ బ్రాపించుఁ గావున గోబ్రాహ్మణకులంబు ననుచరసమేతుండయిన *జనార్దనుండు నాయెడం బ్రసన్నులయ్యెదరు గాక యని పలుకుచున్న పృథుచక్రవర్తిం గనుంగొని పితృదేవద్విజసత్పురుషులు సంతుష్టాంతరంగులై సాధువాదంబుల నభినందించి యిట్లనిరి॥ క॥ మనుజేంద్ర నీకతంబున। ననుపమఘనబ్రహ్మదండహతుఁ డత్యఘవ। ర్తనుఁ డునగు నట్టి వేనుం। డనయమున నరకంబువలన నర్థిం దరించెన్॥ వ॥ కావునం బుత్రేణ లోకాన్ జయతి యను వేదవచనంబు నిశ్చయంబదియునుం గాక॥ చ॥ పురుషవరేణ్య హేమకశిపుం డురమాలల నేశనిందచే। నరకమునందఁ గోరియుఁ గుణజ్ఞుఁడు భాగవతుండునైన యా। వరతనయప్రభావమున వాసికి నెక్కి విధూతపాపుఁడై । నిరయముఁ బొందఁడయ్యె ననినిర్మలకీర్తిఁ దనర్చెఁ గావునన్॥ క॥ అనిపలికి వీరవర్యుం। డనఁదగు పృథు శాశ్వతంబులగు హాయనము। ల్దనరఁగ జీవింతువుగా। కని తగ నాశీర్వదించి యభిమా। నమొప్పన్ ॥ వ ॥ వెండియు నిట్లనిరి దేవా యే నీకు సకలలోకభర్తయగు నారాయణునందు నిట్టిభక్తి వొడముటం జేసియు బ్రహ్మణ్యదేవుండును త్తమశ్లోకుండునై న సర్వేశ్వరుని సత్కథాజాలంబు వ్యక్తంబు సేయుచున్న నీవు మాకు నాథుండవగుటం జేసియు నేము ముకుందదాసులమైతిమి యీ భవదీయప్రజాశాసనంబు ప్రజానురాగంబును గారుణ్యమూర్తులైన మహాత్ములకు స్వభావంబులు గావున నాశ్చర్యంబు గాదు దైవసంజ్ఞితంబులయిన కర్మంబుల చేత పినష్టజ్ఞానులమై పరిభ్రమించు మాకు తమఃపారంబుఁ గంటిమి యే సర్వేశ్వరుండు బ్రాహ్మణజాతి నధిష్ఠించి క్షత్రియులను క్షత్రియజాతి నధిష్ఠించి బ్రాహ్మణుల నీయుభయంబు నధిష్ఠించి విశ్వంబును భరియించు నట్టి వివృద్ధసత్త్వుండు సర్వరూపుండు నా మహాపురుషుండునైన పృథునకు నీశ్వరబుద్ధిం జేసి యేము నమస్కరింతుమను సమయంబున॥ క॥ వినువీధినుండి మెల్లనఁ। జనుదెంచిరి బాలసూర్య

## పృథుచక్రవర్తి యొద్దకు సనకాదులరుగుదెంచుట

సంకాశతనుల్ । జనవినుతసిద్ధవర్యులు। సనకాదులు శేముషీవిచక్షణు లంతన్॥ ఇట్లు చనుదెంచిన॥ క॥ అనఘాత్ము లతిథిగూపంబున రా గృహమేధి ప్రాణములు నుద్గతిచేఁ। దనరినఁ బ్రత్యుద్గతివం। దనముల మఱలం బ్రతిష్ఠితములగు ననుచున్॥ క॥ వినఁబడు వచనన్యాయం। బునను ద్గతములగు ప్రాణములఁ గ్రమ్మఱఁ బొం। దను గోరువాఁడునుంబలె। ననుచర ఋత్విక్స। భ్యుఁడై పృథుఁ డంతన్॥ గీ॥ ఇంద్రియేశుఁడు గంధాదికేష్టగుణముఁ। గూర్చి యుద్గమనక్రియఁ గోరి చేయు। పగిదిఁ బృథుచక్రవర్తి సంభ్రమముతోడ। మహితభక్తిని బ్రత్యుద్గమంబు సేసె॥ క॥ ఘనగౌరవమున నమ్ముని। జనచిత్తవశీకృతుండు సభ్యు। తుఁ బ్రియుఁడు వినయానతకంధరుఁడై । జనవరుఁ డాపరమయోగిచంద్రుల నెలమిన్॥ సీ ॥ పూని యప్పాసనాసీనులఁ గావించి కరమర్థి విధివత్ప్రకారమునను। బూజించి తత్పదాంభోరుహక్షాళనసలిలంబు లాత్మమస్తమునఁ దాల్చి। హాటకకలితసింహాసనాసీనులై విహితాగ్నులను బోలి వెలుఁగుచున్న। శర్వాగ్రజన్ముల సనకాదులను జూచి యతులశ్రద్ధాసంయమాన్వితుండు। పరమసంప్రీతమతియునై పలికె రాజు। గోరి యోమంగళాయనులార పూర్వ। భవమునం దెద్ది మంగళప్రదసుకర్మ। మేను జేసితిమి మిముఁ జూడ నిపుడు గలిగె॥ అని వెండియు॥ క॥ భువి నెవ్వనియెడ శ్రీవిప్రులు। భవుఁడును విష్ణుండును దదీయభక్తులు ప్రసన్నవదనులగుదురు వానికి। భువిని దివిని సాధ్యకర్మములు లేవనఘా॥ వ॥ అని మఱియు ననఘాత్ములారా లోకంబులఁ జూడ్కింపుచుం బర్యటనంబు సేయు మిమ్ము సర్వదర్శనుండయిన యాత్మ నుంగనుంగొనం జాలని సర్వదృశ్యంబు చందంబు

* జనార్దనుండను॥ సముద్రమధ్యవర్తినో జననామ్నో సురాన్ అర్దితవాన్ ఇతి జనార్దనః- సముద్రమధ్యమందుండెడి జనులనెడి రాక్షసులఁ బీడించినవాఁడు. లేక-ప్రళయకాలే జనాన్ సర్వానపి అర్దయతీతి వా జనార్దనః-ప్రళయకాలమం దెల్ల జనులను పీడించువాఁడు గావున జనార్దనుఁడని యర్థము—శ్లో॥ పుత్రేణ లోకాన్ జయతి. పుత్రుని చేత లోకములను జయించుచున్నాఁడని యర్థము-పున్నామ్నో నరకాత్త్రాయత ఇతి పుత్రః- శ్లో॥ పున్నామ్నో నరకాద్యస్మాత్పితరం త్రాయతే స్వయం-తస్మాత్పుత్ర ఇతి ప్రోక్తస్స్వయమేవ స్వయంభువ ఇతి దత్తరత్నాకరే... శ్రీ విప్రులు। ధి శేషేణ పాపశ్యాః- ఆత్మానం పరం చ పాతీతి విప్రః- పా రక్షణే అని ధాతువు-తన్ను నుపరుని విశేషముగాఁ బాపములవలనఁ గాపాడువాఁ డనియర్థము.

నశీలోకంబు గనుంగొనంజాలకుండు మనట్టి మహాత్ములరయిన మీ దర్శనంబు చేసితే ననుధన్యుఁడనై [illegible]॥ అ
రయఁ ధరిత్రి నెవ్వని గృహంబు మహాకీర్తిని జనోపభోగ్యవిస్ఫురితతృణాంబుభృత్యగృహభూములనా [illegible]
పతి సేవకులైన జగతింగడు ధన్యుఁడటం ద్రుంగానను। స్థిరమతి మీకు వచ్చుటయు శ్రేయఃశుభంబుల నేను బొందెదఁ [illegible]
గాక॥ చ॥ వరమతులార యెవ్వని నివాసము దీర్ఘపథాంతరంగులై। పరగిన యట్టి భాగవతపాదజలంబులు సోఁకఁ [illegible]
రుషుఁడు భూరిసంపదలఁ బొంపిరిపోయిననైన వానిమం। దిర *మురగప్రకీర్ణ జగతీజముఁ బోలు నటం ద్రుకోవిదుల్॥ అని
లికి వెండియు నిట్లనియె॥ సీ॥ పరమపావనులార బాల్యంబునందుండి మానిత శ్రద్ధాసమన్వితులును। గుణనిధుల్ ధైర్యయుక్త
లు ముముక్షువులునై యధికవ్రతంబుల నాచరింతు। రట్టి పుణ్యులు భవదాగమనంబు స్వాగతమయ్యె పత్న్యపాకలితులా
ర। యనివారితవ్యసనార్ణవంబయినట్టి భూరిదుర్లంఘ్యసంసారమందు। మతివిహీనస్వకీయకర్మములఁ జేసి। యడరి మగ్నుఁ
లమై యింద్రియార్థములనె। తివిరి పురుషార్థములుఁ గాఁగఁ దెలియుమాకుఁ। గుశలమున్న దెలోకైకకుశలులార॥ వ॥ మీరలు
నాత్మారాములగుటం జేసి మీయందుఁ గుశలాకుశలరూపంబులైన మతివృత్తులు సంభవింపవు కావునం గుశలప్రశ్నంబు పరి
పన్నంబు గాదు కాన నేనుఁ గృతవిశ్వాసుండనై సంతప్తులైన వారలకు సుహృత్తులైన మిమ్ము నాకు నీ సంసారంబునందు నేమిట
వేగం బేక్షేమంబు గలుగునని యడిగెద నాత్మవంతులకు నాత్మయు నాత్మభావనుండునైన యీశ్వరుండు భక్తానుగ్రహంబు
కొఱకు నీలోకంబుల మీవంటి సిద్ధరూపంబున వర్తింపుచుండు నని పలికిన యతని గంభీరార్థగౌరవంబులు శుభకరంబులు న్యా
యసహితంబులు మితాక్షరంబులు శ్రోత్రప్రియంబులునైన వచనంబులు విని సంప్రీతచేతస్కుండై సనత్కుమారుండిట్లనియె॥
మ॥ ధరణీశోత్తమ సర్వభూతహితచేతస్కుండవై ధర్మసుస్థిర భాగ్యోదయశాలివై యెసఁగు నీచే సాధులోకోత్తరో। త్తర
సంప్రశ్నము సేయఁగాఁ బడె మహాత్మా సాధులోకైకసచ్చరితంబుం దలపోయ నిట్టిదిక దాచర్చింప లోకత్రయిన్॥ గీ॥ ధర
ణి సజ్జనసంగంబు దలఁపనుభయ। సమ్మతంబగు వారలు సలుపునట్టి। సరససంభాషసంప్రశ్నసరణి నిఖిల। జనములకు సుఖకర
మగు జనవరేణ్య॥ వ॥ అని యభినందించి మోక్షసాధనోపదేశకాముండైన పృథుచక్రవర్తికి వెండియు నిట్లనియె॥ సీ॥ ధరణీశ మ
ధునిషూదనుఁడైన యట్టి నారాయణు లలితపాదారవింద। వరగుణధ్యానధీపరిణతత్వంబున సకలాత్మనులవిమోచనమునై
న। రతియును నిత్యవైరాగ్యంబు మొదలనే లోకోత్తరుఁడవైన నీకుఁ గలవు। సమ్యగ్విచారశాస్త్రములు జనులకు క్షేమంబునకు
సునిశ్చితంబులైన। యాత్మవ్యతిరిక్తవస్తువులందు మీఁత। రాగతఁ దలంప నిర్గుణబ్రహ్మమయిన। యాత్మయందు మలరతియును నంగ
నివియును। హేతువులు బుద్ధిఁ జింతింప సిద్ధచరిత॥ వ॥ కావున శ్రద్ధయు భగవద్ధర్మచర్యయుఁ దద్విశేషజిజ్ఞాసయు నాధ్యాత్మి
కయోగనిష్ఠయు యోగీశ్వరోపాస్తియుఁ బుణ్యశ్రవణుండైన నారాయణకథాలాపంబున ధేంద్రియారాములైన వార
లతోడి సంగతులయందు విరక్తియు వారలకభిమతంబులైన యర్థకామంబులందున నాకాంక్షయు సర్వేశ్వరుని గుణకీర్త
నామృతపానంబు దక్క నితరపదార్థవైరాగ్యంబు నొందియాత్మారామతం గలిగి విజనస్థలంబులందు లరుచిగలుగుటయు న
హింసయు పశమాదిప్రధానవృత్తియు నాత్మహితానుసంధానంబు భగవత్కథానుస్మరణంబున కామ్యంబులైన యమని
యమంబులు నితరభక్తిమార్గాగర్హణంబు యోగక్షేమార్థక్రియారాహిత్యంబు శీతోష్ణాదిద్వంద్వసహిష్ణుతయు భాగ
వతకర్ణాలంకారభూతంబులగు భగవద్గుణాభిధానంబులను వీనిచేత విజృంభమాణంబయిన భక్తియోగంబునం జేసి యనా
త్మయందు మనసంగంబు గార్యకారణరూపంబగు నిర్గుణబ్రహ్మంబునందు రతియు నెప్పుడు గలుగు నప్పుడు సదాచార్యానుగ్రహ
వంతుండైన పురుషుండు బ్రహ్మనిష్ఠులతోడఁ జెలిమి సేయుచు ¶ నీషణత్రయంబు వర్జించి ప్రకృతిం జేరక వైరాగ్యవేగంబు
నం జేసి॥ సీ॥ అనఘ సాక్షాత్కారమగు భక్తియోగాగ్నిఁ గడఁగి జీవాధారకమును బంచ। భూతాత్మకంబునై పొలుచు హృ
ద్గ్రంథిని బూనిస్వకారణభూతమయిన। యరణి దహించు హుతాశనుకైవడి నిర్దహించిననిట్లు నెఱసి దగ్ధ। చిత్తుఁడై ముక్తని
శ్శేషాత్మగుణుఁడు సద్ధర్ముఁడునైన యతండు మిగుల। నర్థిబాహ్యంబులయిన ఘటాదికములు। నాంతరములయిన సౌఖ్యదుః
ఖాదికములు। ననువిభేదములాత్మభేదకములగుట। నయ్యుపాధి వినాశంబునం దవగలఁడు॥ అది యెట్లనిన॥ చ॥ పురుషుఁడు ని
ద్రఁబోఁ గలలఁ బొందిన యాత్మను బైకహేతువై। పరగిన రాజభృత్యజనభావగుణంబులు సంప్రబోధమందరయఁగ మిథ్య
యైనగతి నాంతరబాహ్యగుణప్రభేదము। ల్పరువడి గానకుండు జనపాలనశీల నిత్యఖేలనా॥ వ॥ మఱియును ద్రష్టయైన యా

* ఉరగప్రకీర్ణ జగతీజము - సర్పములచేతఁ జుట్టఁబడిన చెట్టును — ¶ జిజ్ఞాస - జ్ఞాపకము, ఆవక్తి — ¶ ఈషణత్రయంబు - దారేషణ, ధనేషణ, పుత్రేషణములు, ఈషణ - ఆశ

ద్రష్టయు దృశ్యంబునైన యింద్రియార్థంబునను వీనికినహంకారంబు సంబంధహేతువగుటం జేసియదియంతఃకరణంబునం గలుగుచుండు జాగ్రత్స్వప్నంబులయందునీ భేదంబుగనుంగొనుచుండునట్టియంతఃకరణంబు లేనిదియగు సుషుప్తికాలం బునం బురుషుండు జలదర్పణాదినిమిత్తాభావంబగునప్పుడు బింబప్రతిబింబభేదంబుగనుంగొననిచందంబున ద్రష్టృదృశ్య భేదంబు గనుంగొనకుండుంగావున నంతఃకరణంబు విలయంబు నొందిన బాహ్యాంతరభేదంబుగనకుండుట నిశ్చయంబని వెండియు నిట్లనియె॥ సీ॥ భువివిషయాకృష్టభూతంబులయినయింద్రియముల చేతనుదివిరిమనము। దగవిషయాసక్తిందగిలియాంతర మైనమహితవిచారసామర్థ్యమెల్ల।శరకుశస్తంబకజాలంబు హ్రదతోయములు గ్రోలుగతిం గ్రమంబునహరించు। నీరీతి నంతర్విచారసామర్థ్యంబునపహృతంబయినపూర్వాపరాను। మేయసంధానురూపసంస్మృతినశించు। నదినశించినవిజ్ఞా నమంతందొలంగు।నట్టివిజ్ఞాననాశంబునార్యజనులు।స్వాత్మకదిసక*లాపహ్నవంబటండ్రు॥ వ॥ అదియునుంగాక యాత్మ నస్తుకామాయసర్వం ప్రియంభవతియను వేదవచనంబునం జేసివిషయంబులకుం బ్రియతమత్వంబై యాత్మోపాధికంబు నొందియాత్మాపహ్నవంబునం బాటిల్లుస్వార్థనాశంబెద్దిగలుగు దానికంటె లోకంబునన్నధికంబైనస్వార్థనాశంబు లేదది యెట్లనిన సర్వార్థనాశంబునకు స్థైర్యంబునొందించునట్టియర్థకామాభిధ్యానంబునందర్థహేతుకంబయినస్వార్థనాశంబునం బరోక్షాపరోక్షరూపజ్ఞానంబునం జేసినశించుంగావున నాత్మాపహ్నవంబునకంటెనధికతరంబైన సర్వార్థనాశంబు లేద ని వెండియునిట్లనియె॥ సీ॥ అనఘయీసంసారమతిశయంబునందగియింపంగమదినిశ్చయించువాఁడు। గైకొనిధర్మార్థకా మమోక్షములకునతివిఘాతుకమెద్దియట్టిదాని।వలనుసంగము సేయవలవదుధర్మాదులందుం ద్రివర్గంబునంతకోగ్ర।భయ కారియగుటనుబరమమోక్షంబెముఖ్యార్థమైవిలసిల్లునండ్రు బుధులు।భువిగుణవ్యతికరమునంబుట్టినట్టి। యబ్జజాతామల కునస్మదామలకును।గాలవిధ్వంసితాఖిలక్రమముగల్గుం।గలుగ దెన్నఁడు సేమంబుగానవినుము॥ వ॥ కావున మోక్షంబె ప రమపురుషార్థంబని చెప్పి వెండియునిట్లనియెన రేంద్రా దేహేంద్రియప్రాణేంద్రియబుద్ధ్యహంకారపరివృతంబులయిన యీస్థావరజంగమంబులహృదయంబులందు వ్యాపకుండు ప్రత్యక్షభూతుండు ప్రత్యగ్రూపుండు భగవంతుండు నైనయీ శ్వరుండంతర్యామిరూపంబునం బ్రకాశింపుచుండునది నారాయణునిసద్రూపంబుగాఁదెలియుమని వెండియునిట్లనియె॥

ఉ॥ భూవరయేమహాపురుషభూషణునందుమలనీసమస్తవి। శ్వావళిలీలమైసదసదాత్మకభావమునొందిభూరిమా।యావి భవంబులందగిసమగ్రవివేకవిరోధిస్రగ్ఘనా।శీవిషబుద్ధిదోఁపుచువిశేషగతిన్వెలుగొందు నెప్పుడుంగా॥ చ॥ సుమహితనిత్య ముక్తపరిశుద్ధవిబుద్ధసుతత్త్వుఁడై యురు।క్రముఁడఖిలభూతసత్త్వవికృతికర్మకళంకుఁడు నైనయట్టియు। త్తమచరితుంగృపాక రునుదాత్తగుణోన్నతునీశ్వరేశుఁజి। త్తమునందలంపుమయ్యజనతాపరిరక్షణదక్షశిక్షణా॥ సీ॥ వసుమతీనాథయెవ్వనిపా దపద్మపలాశవిలాసపల్లలితభక్తి।సంస్మరణంబు చేసజ్జనప్రకరంబుఘనకర్మసంచయగ్రథితమగున। హంకారమనుహృ దయగ్రంధిం జేరరువివరింపనిట్లునిర్విషయమతులు।మహినిరుద్ధేంద్రియమార్గులునైనట్టి యతులకుం జేరంగనలవిగాని। యట్టిపరమేశుంగేశవునాదిపురుషు।వాసుదేవునిభువనపావనచరిత్రు।నర్థిశరణంబుగాందత్పదాంబుజములు।భక్తిసేవిం పుగుణసాంద్రపార్థివేంద్ర॥ మ॥ అరిషడ్వర్గమహోర్మినక్రనికరవ్యాకీర్ణసంసారసా।గరమబ్జోదరకీర్తనాదుష్కరుండుప సాంగత్యంబునంబాసితా। మరుదారంగనఘాపహప్రకటయోగాదిక్రియాయుక్తిచేఁ। దరియింపన్మదిఁగోరువారలకు దుర్దాంతంబగుం గావునన్॥ మ॥ ధరణీశోత్తమనీవు కేవలసముద్యద్భక్తిధీయుక్తిమై।వరగోవిందపదారవిందయుగభాస్వ న్నావసంధించుము। స్తరభూరివ్యసనాకరోల్లసితదుర్దాంతోగ్రగంభీరసం। సరణాంభోధిదరింపుమయ్య పరమోత్సా హంబుదీపింపఁగన్॥ క॥ అనియీగతిఁబంకరుహా।సనసుతుఁడుసనత్కుమారసన్మునినాథుం।డనుయోగివల్లభునిచే।తనుదె లియఁగఁబడినబ్రహ్మతత్త్వుండగుచున్॥ క॥ జనపతిమునిఁబొగడిముదం। బుననిట్లనుబూర్వజన్మమున నేదీనా। వనుఁడైన యీశ్వరునిచే।తనునికరమనుగ్రహింపఁదగితిమునీంద్రా॥ క॥ వినుఁడట్టియనుగ్రహసా।ధనమునకై మీరలిపుడుదగనిచ్చ టికిం।జనుదెంచితిరిదయాళులు।ననఘులుభాగవతవరులునగునుత్తములున్॥ సీ॥ నిరతంబునాయందునిష్పాదితములగు దే హసమేతమదీయరాజ్య। సర్వసంపదలునుసద్విజదత్తముల్గావునం బ్రాణకాంతావిభూతి।మందిరసుతరాజ్యమహిబలకో శపరిచ్ఛదంబులనెల్లధృతిఁదలంప। రాజునుభృత్యుండురాజకీయములగుతాంబూలముఖపదార్థములఁ జేసి। సమతసంత ర్పణోపచారములునడపు।గతినివారలకవిని వేదితములయ్యెఁ।గానమీకుపచారమేగతినొనర్తు।నతులగుణసాంద్రులారమ హాత్ములార॥ వ॥ అదియెట్లు బ్రాహ్మణాధీనమంటి రేని సేనాపత్యరాజ్యదండనేతృత్వసర్వలోకాధిపత్యంబులు వేదశాస్త్ర

*అపహ్నవంబు।ఆత్మద్రోహము.

వేదివైన బ్రాహ్మణునకుం గాని యితరులకు యోగ్యంబులుగావు కావున బ్రాహ్మణులకు భోజనవసనదానంబులు స్వకీయంబులై యుండుఁ క్షత్రియాదులకు బ్రాహ్మణానుగ్రహంబున నన్నమాత్రంబు దక్కం దక్కిన వస్తుస్వాతంత్ర్యంబు లేదుగావున మీకుం గురుదక్షిణ నేమి సమర్పించువాఁడ నదియునుం గాక స్వాతంత్ర్యంబు గలిగిన నిట్టి యధ్యాత్మవిచారులు వేదాంతవేదులునై న భగవద్భక్తి నుపదేశించెడు మీవంటి పుణ్యాత్ములకుం బరిహాసాస్పదుండు దక్కం దక్కిన వాఁ డెవ్వండు నంజలిమాత్రంబు దక్కం దక్కిన ప్రత్యుపకారంబు సేయం దలంచునది గావున దయాళులై న మీ రలు స్వకృతోపకారంబున నంజేసి సంతుష్టాంతరంగులగుదురు గాక యని పలుకుచున్న యాదిరాజై న పృథుచక్రవర్తి చేతం బూజితులై యాత్మయోగనిష్ఠులై న సనకాదులు తన నిస్వభావంబుఁ బ్రశంసింపుచు సమస్తజనంబులు సూచుచుండ నాకాశగమనంబున నంజనిరి యయ్యవసరంబు

## శ్రీ పృథుచక్రవర్తి జ్ఞానవైరాగ్యవంతుండగుచు ముక్తి నొందుట. శ్రీ

సీ॥ గీ॥ వినుమహాత్ముఁ డాతఁ డెన్న నెప్పువైన్యుఁడే। కాగ్రచిత్తుఁడగుచు నాత్మనిష్ఠుఁ। డై నయట్టి తనువనవాప్తకాముని గాఁగ। బుద్ధిలోనఁ దలఁచె భూవరుండు॥ అంత॥ సీ॥ కర్మంబులను యథాకాలదేశోచితబలవిత్తములుగాఁ గఁబరగుధర్మ। ముగను బ్రహ్మార్పణబుద్ధినిఁ జేసి కర్మసక్తుఁ డగుచు సమాహితుండు। ప్రకృతికంటెను దన్నుఁ బరమైన యాత్మను గర్మసంచయసాక్షిఁ గాఁగ బుద్ధి। నర్థి దలంపుచు నాచరింపుచు నట్లు మెఱసి సామ్రాజ్యలక్ష్మీసమేత। మందిరోద్యానవనభూములందు రాజ్య। గరిమ వర్తింపఁగా నహంకారరహితుఁ। డగుచుఁ దనచిత్తమున నింద్రియార్థములను। దగుల కనయుండె నాతఁడు ధరణిపగిది॥ వ॥ ఇట్లధ్యాత్మయోగనిష్ఠుండై కర్మంబుల నాచరింపుచు నర్చియను భార్యయందు విజయాశ్వుండు ధూమ్రకేశుండు హర్యక్షుండు ద్రవిణుండు వృకుండు నను నాత్మసములై న పుత్త్రుల నేవురం గనియె నంత॥ క॥ జనవినుతభూమివలనను। ధనములను గ్రాదఁ గొనుచు దాననిమిత్తం। బునఁ గ్రమ్మఱఁ దానిచ్చుచు। దిననాయకుఁ బోలి వసుమతీవిభుఁ డొప్పెన్॥ వ॥ అతండు మఱియు నగ్నిచందంబున దేజో*దుర్ధర్షుండును మహేంద్రునిపగిది దుర్జయుండు ధరణికరణి సతతక్షమాయుక్తుండు స్వర్గంబు పగిది నభీష్టదుండు §పర్జన్యునిభాతిఁ గామితప్రవర్షణుండు సముద్రునిరీతి గాంభీర్యయుక్తుండు మేరువు పోలిక సత్త్వవంతుండు ధర్మరాజు కై వడి ననుశాసకుండు మహేంద్రునివిధంబున నైశ్వర్యవంతుండు కుబేరునిమాడ్కి ధనవంతుండు వరుణునిసరణి గుప్తార్థుండు సర్వాత్మకుండగు వాయువుచొప్పున బలౌజస్తేజోయుక్తుండు రుద్రునిపగిది నసహ్యతేజుండు ‡కందర్పునియనువున సౌందర్యవంతుండు మృగరాజునోజ నధికశౌర్యోపేతుండు మనువురూపున వాత్సల్యయుక్తుండు నజుని చందంబున బ్రభుత్వసమేతుండు బృహస్పతిగరిమ బ్రహ్మవాదియు సర్వేశ్వరునిజాడ జితేంద్రియుండు ¶విష్వక్సేనానువర్తనులై న గోగురువిప్రజనంబులందు భక్తియు లజ్జావినయశీలంబులందుం బరోపకారంబునందును నిరుపముండై యివ్విధంబున సర్వలోకపాలకపృథగ్విధగుణంబుల నన్నింటి నిం దా నొక్కరుండ ధరియించి॥ క॥ అనఘాత్మకలోకత్రయ। మున సజ్జనకర్ణరంధ్రముల వినఁబడునా। వినుతయశోమహనీయుఁడు। జనవినుతుండగును రామచంద్రుని మాడ్కిన్॥ చ॥ సరసవచోర్థసత్పురుషసంఘసమంచితగీయమానసు। స్థిరవరకీర్తిపూరము సుధీజనకర్ణములందు నించి తా। నిరుపమసౌమ్యభాషణమనీషలతోడఁ బ్రజానురక్తుఁడై। ధరణిని రాజనామమునఁ దానగు రెండవచంద్రుఁడో యనన్॥ వ॥ మఱియు నమ్మహాత్ముండు విజ్ఞానియు వర్థితాశేషస్వానుసర్గుండు ప్రజాపాలకుండు స్థావరజంగమవృత్తిదాయకుండు సత్పురుషధర్మవర్తనుండు నిష్పాదితేశ్వరాదేశకుండునై న పృథుండొక్కనాఁడు దనవార్ధకంబు వీక్షించి నిజరాజ్యమాత్మజులయందు నిలిపి ప్రజలు చింతాతురచిత్తులగుచుండ నిజభార్యాసమేతుండై యప్రతిహతనియమంబు వైఖానససమ్మతంబునై న యుగ్రతపంబునందుఁ బూర్వంబున దిగ్విజయప్రవృత్తుండగు చందంబునం బ్రవృత్తుండై తపోవనంబునకుం జనియందు॥ మత్తకోకిల॥ కందమూలఫలాశియై బహుకాలముగ్రతపఃపరి। స్పందుఁడై యటుమీఁదటం దృణపర్ణభక్షణుఁ జేసియా। చంద మేది జలాశియై నృపసత్తముండ దిమాని తా। మందగంధవహాశియయ్యెఁ గ్రమంబునం దృఢచిత్తుఁడై॥ ఇట్లు వర్తింపుచు॥ సీ॥ మెండుగా మిటమిటమండు వేసవియందుఁ దప్తపంచాగ్నిమధ్యమున నిలిచి। మానక జడిఁ గొన్న వానకాలంబునఁ జైఁ గోఁక వేయక బైట నిలిచి। జనులు హాహా యనుచలివేళఁ గుత్తుకబంటితోయములలోపల వసించి। శిశిరంబు చాలనద్దిశలఁ బర్వెడు వేళ వెలయ భూశయనుఁడై విశ్రమించి। మహితనియతిఁ దితిక్షాసమన్వితుండు। నియతపరిభాషణుఁడు జితానిలుఁడు దాంతుఁ। డిద్ధమతి నీశ్వరారాధ నేచ్ఛఁ

* దుర్ధర్షుండు। భరింపనశక్యమైనవాఁడు— § పర్జన్యుఁడు। మేఘుఁడు— ‡ కందర్పునియనువునన్। మన్మథునివలె— ¶ విష్వక్సేనః। విష్వక్సమంతతః వ్యాప్తా సేనా యస్య సః - అంతట వ్యాపించిన సేనగలవాఁడు. అనఁగా విష్ణువు.

దహనుండు। నూర్ధ్వరేతస్కుఁడయ్యెఁ గ్రమోచితమున॥ వ॥ అతిఘోరంబయినతపంబాచరించెనివ్విధంబునం గ్రమానుసి
ద్ధంబయినతపంబునం బ్రాణాయామంబులచే విధ్వస్తాశేషకర్మములాశయుండు జితారిషడ్వర్గుండు ఛిన్నబంధనుండు పురు
షశ్రేష్ఠుండునైన పృథుచక్రవర్తి భగవంతుండయిన సనత్కుమారుం డెఱింగించిన యోగమార్గంబున సర్వేశ్వరభజనం
బుగావించె నిట్లు భగవద్ధర్మపరుండు సాధువర్తనుండు శ్రద్ధాసమన్వితుండునైన పృథునకు నారాయణునందు భక్తియన
న్యవిషయంబై ప్రవృద్ధంబయ్యె నివ్విధంబున॥ క॥ నరలోకోత్తర భగవ। త్పరిచర్యారాధనము దపశ్శుద్ధాంతః। కరణుఁడున
గు నా పృథునకు। సరసిరుహోదరుకథానుసంస్మరణమునన్॥ క॥ పరిపూర్ణంబగు భక్తిని। గరమనిశము సంశయాత్మకం
బై చాలఁ బ్వరలీన హృదయగ్రంథిని। నిరసించు విరక్తియుత మనీషజనించెన్॥ వ॥ దానం జేసి యతండు సంఛిన్నదేహాత్మజ్ఞా
నుండు నధిగతాత్మస్వరూపుండునై గదాగ్రజుండయిన శ్రీకృష్ణునికథాసక్తినొంది సహస్తయోగసిద్ధులందు నిస్పృహుం
డగుటను హృదయగ్రంథివిచ్ఛేదకంబయిన జ్ఞానయోగంబును విడిచి యాత్మయందు నాత్మయోగంబుఁ గావించి బ్రహ్మ
భూతుండై నిజకళేబరంబు విడువ నిశ్చయించి॥ సీ॥ కోరి మడిమెల చే గుదపీడనము చేసి పూని యుక్తాసనాసీనుఁడగుచుఁ। దన
రు *మూలాధారమున నుండి వాయువు నొయ్యన నెగయించి యొనర నాభి। కలితంబు గావించి క్రమమున హృద్వక్షకంఠ
సిరఃకోష్ఠకములఁ జేర్చి। కైకొని మూర్ధభాగమునకు నెగయించి ప్రాణముల్విడిచి యాపనుఁబవను। నందు నాకాశమాకాశ
మందుఁ దేజ। మందుఁ దేజంబు నుదకంబునందు నుదక। మర్థిఁ గాయంబు మేదినియందుఁ గలపెఁ। బూని వానియధోచితస్థా
నములుగ॥ వ॥ మఱియు భూమి నుదకంబునందు నుదకంబును దేజమందుఁ దేజంబును వాయువున వాయువు నాకాశంబునం
దు నాకాశంబును మనంబున మనంబు నింద్రియంబుల నింద్రియతన్మాత్రలు భూతాదియైన యహంకారంబునం దహంకా
రంబు మహత్తత్త్వంబునం దనుగూర్చి యట్టి సర్వకార్యహేతుభూతంబయిన మహత్తత్త్వంబును జీవోపాధిభూతంబయిన
ప్రకృతియందుఁ గల్పిజీవభూతుండయిన పృథుండు జ్ఞానవైరాగ్యంబులచేత బ్రహ్మనిష్ఠుండై నూయోపాధిం బాసి ము
క్తుండయ్యె నని చెప్పి వెండియు నిట్లనియె॥ సీ॥ అంత నా పృథునిభార్యామణియగు నర్చి పుడమిపైఁ దనయడుగిడినఁ గందు। సుకు
మారపాదాబ్జ సుందరీరత్నంబు నతులపతివ్రతయగుటఁ జేసి। యాత్మేశకృతసువ్రతాచరణంబును సుమహితశుశ్రూషణ
మును జేసి। యాశ్లేయమగు దేహయాత్రయు నను వీని చేత మిక్కిలిఁ గృశీభూతదేహ। యయ్యుఁ బ్రియనాథకృతకరుణావ
లోక। కరతలస్పర్శనాది సత్కారములనె। యబలసుఖవృత్తిఁ జెందియయ్యడవులందుఁ। గృశతనుఁడుదోఁపపుండఁజరించున
పుడు॥ క॥ తనమనమున నేమఃఖం। బనయంబు నెఱుంగనట్టియర్చి నిజాధీ। శుని ప్రాణరహితదేహముఁ। గనుఁగొని విలపించి
విగతకౌతుకయగుచున్॥ సీ॥ మానితమందరసానుప్రదేశంబునందుఁ జితారోపమర్థిఁ జేసి। లలితమహానదీసలిలసుస్నాత
యై కలితమహోదారకర్మఁడైన। నాథునకుదకదానక్రియల్గావించి యతిభక్తి సురలకు నతులొనర్చి। వహ్నికి మువ్మా
ఱు వలగొని పతిపాదకమలయుగంబుఁ జిత్తమున నిలిపి। సంస్మరింపుచు శిఖిప్రవేశంబు సేసె। వీరవరుఁడైన పృథుపృథ్వీతలే
శు। నందు ననుగమనము సేయునట్టి సాధ్వి। నర్చిఁ గనుఁగొని దేవాంగనాసహస్ర। మాత్మనాథులఁ గూడి నెయ్యంబుతోడ॥
క॥ పరమోత్కంఠమున న్మం। దరగిరిసానుప్రదేశతలమున వరుసం। గురియించిరి నవసురభిత। పరమందారప్రసూనవర్షము
లంతన్॥ క॥ కరమపు డచ్చరలాడిరి। మొరయించిరి శంఖతూర్యములు దివిజులు పా। డిరి కిన్నరజనులు పర। స్వరనుతులొనరిం
చి రా సుపర్వాంగనలున్॥ మఱియు నిట్లనిరి॥ సీ॥ చర్చింప నిట్టి యాశ్చర్యమెందేని యుఁ గనుఁగొంటిరే యర్చి యను లతాంగి।
ధన్యాత్మురాలు గదా తన విభుఁ గూడి యిందిరారమణి యజ్ఞేశుఁ గూర్చి। వెనుచను కైవడిననుగమనముఁ జేసి నియ్యమనిజ

*మూలాధారాదిచక్రములుండుస్థానములు. శ్లో॥ మూలాధారం గుదస్థానం స్వాధిష్ఠానం తు మేహనం। నాభిస్తు మణిపూరాఖ్యం హృద
యాబ్జమనాహతం॥ తాలుమూలం విశుద్ధాఖ్యమాజ్ఞాఖ్యం నిటలాంబుజం। సహస్రారం బ్రహ్మరంధ్రమిత్యాగమవిదో విదుః॥ ఈ చక్రములవర్ణ
అక్షరనిర్ణయములు. శ్లో॥ ఆధారస్తు చతుర్దళో రుణరుచిర్వాసాంతవర్ణాశ్రయస్స్వాధిష్ఠానమనేకవైద్యుతనిభం బాలాంతషట్పత్రకం। రత్నాభం
మణిపూరకం దశదళం డాద్యం ఫకారాంతకం పత్రైర్ద్వాదశభిస్త్వనాహతపురీ హైమీ కఠాంతాన్వితా॥ దృష్ట్వారం స్వరషోడశైః పరిహితం
జ్యోతిర్విశుద్ధాంబుజం హంక్షేత్యక్షరపద్మపత్రయుగళం రక్తోజ్జ్వలాజ్ఞాపురీ। తస్మాదూర్ధ్వమధోముఖం వికసితం పద్మం సహస్రచ్ఛదం నిత్యానం
దమయీ సదాశివపురీ శక్త్యా సమాశ్లేషితా॥. చక్రాధిదేవతా జపహోమతర్పణనిరూపణము. మూలాధారచక్రంబున వినాయకునకు ఆఱునూ
ఱును, స్వాధిష్ఠానచక్రమునందు బ్రహ్మకు ఆఱువేలును, మణిపూరకచక్రమందు శ్రీమహావిష్ణువునకు ఆఱువేలును, అనాహతచక్రమునందు రుద్రున
కాఱువేలును, విశుద్ధచక్రమునందు జీవాత్మునకు సహస్రమును, ఆజ్ఞాచక్రమందు పరమాత్మునకు సహస్రమును, సహస్రారచక్రమందు శ్రీగురుస్వామి
కి సహస్రమును, ఈ ప్రకారము ప్రతిదినము నిరువదియొక్క వేల ఆఱునూఱు మాఱులు హంసగాయత్రీమంత్రము అర్పణము గుచుండును.

హృదయేశుఁడయిన।ఘన వైన్యునూర్ధ్వలోకంబును బొందించు నేఁడింతవట్టును నిశ్చితంబు।పరమయోగీంద్రులకు మఱి భావ్యమైన।దృఢసుకర్మమువలన నతిక్రమించి।వైన్యభూమీశు వెనుచని వరుస నూర్ధ్వ।గామినియు నగుచు నీయింతి ఘనత నొందె॥ వ॥ కావునం బతివ్రతలకు నసాధ్యం బెందునుం గలదే యని మఱియు॥ క॥ పరికింపఁగ నేమనుజుఁడు।హరిపదమును బొందఁ జేయు నట్టి వివేక।స్ఫురణము దనరుచు వానికిఁ।బరువడి నిలఁ బొందరాని పదముం గలదే॥ గీ॥ అట్టి యపవర్గసాధనమయిన మనుజ।భావ మొంది యువిషయసంబద్ధుఁడగుచు।వసుధ నెవ్వఁడు వర్తించు వాఁడు ధరణి।ననయ మునిజాత్మవంచకుఁడనఁగఁ బరగు॥ క॥ అని వారలు వన్నర్థిని।వినుతింపఁగ నర్చియాత్మవిభు వెనువెంటం।జని యచ్యుతలోకంబున।ననుపమవిభవమును బొందె నని విదురునకున్॥ క॥ మునివరుఁడగు మైత్రేయుఁడు।వినయంబున నెఱుఁగఁ జెప్పి వెండియుఁ దగ ని।ట్లను నమ్మహానుభావుం।డనఘుఁడు భగవత్తముండు నగు పృథుఁడనఘా॥ క॥ పనికిప్పుడు సెప్పితి మానుగ నీపుణ్యకథను మహితశ్రద్ధాధీనుండై విస్ఫురదవధానుండై యెవ్వఁడేనిఁ దనరిన భక్తిన్॥ క॥ వినినఁ బఠించిన వ్రాసిన।వినిపించిన వాఁడు పృథుఁడు విమలగతిం బొం।దిన క్రియ హరిపద మొందెడు।ననయము నిర్ధూతపాపుఁడగుచు మహాత్మా॥ సీ॥ బ్రాహ్మణుం డంచితభక్తిఁ బఠించిన బ్రహ్మవర్చస్సు సంప్రాప్తమగును।క్షత్రియుం డర్థిమైఁ జదివిన విన్న నుజగతీవిభుత్వంబు సంభవించు।వైశ్యుండు వినిధనవంతుఁడై యొప్పును శూద్రుండు వినిన సుశ్లోకుఁడగును।మఱియును భక్తిమ్మహాఖ్యానముఁ బఠించిన విత్తహీనుండును విత్తపతియు।నప్రసిద్ధుఁడు ప్రఖ్యాతయశుఁడు ప్రజలు।లేని యధముఁడు వితతసంతానయుతుఁడు।మూర్ఖుఁ డిత్తుండు విజ్ఞానబోధమతియు।నగుచు నుతికెక్కు మఱి మహాత్మ మఱియు॥ వ॥ ఈ లోకంబునం బురుషులకు స్వస్త్యయనంబును మంగళనివారణంబు ధనప్రదంబు యశస్కరంబు నాయుష్కరంబు స్వర్గదాయకంబుఁ గలిమలాపహంబు నైన యీ పుణ్యచరిత్రంబు చతుర్విధపురుషార్థకాములైన వారికిఁ జతుర్విధపురుషార్థకారణం బగుం గావున విజయాభిలాషియగు రాజు సంగ్రామాభిముఖుండై యీ చరిత్రంబు ననుసంధించి పరోధి నెదిర్చిన నన్నిరోధ పృథునకుం బోలెఁ గప్పంబు లిచ్చు ముక్తాన్యసంగుండు భగవద్భక్తుండు నైన వాఁడు పుణ్యంబు నైష్యమాహాత్మ్యసూచకంబు నైన యీ చరిత్రంబు వినుచుం బఠియింపుచుం గృతనిత్యుఁడై యొదినదినంబును నాదరంబునం బ్రకటంబు సేయు వాఁడు భవసింధు*పోతసమానుండయిన సర్వేశ్వరునియందు నచలుండై సభక్తిగలిగి పృథుచక్రవర్తి వొందిన విష్ణుపదంబుఁ బొందు నని యిప్పుణ్యచరిత్రంబు మైత్రేయుండు విదురునకెఱింగించి వెండియు నిట్లనియె॥ క॥ పృథునకు నర్చికిఁ బుట్టిన।పృథుకీర్తిధనుండు ఘనుఁడు పృథుశుల్యుండై।పృథుశౌర్యమై ర్యధురుఁడు।పృథివి న్విజితాశ్వుఁడొప్పెఁ బృథివీపతియై॥ క॥ విను సంతర్ధానగతిం।దనరి •శునాసీరువలనఁ దగ విజితాశ్వుం।డను మఱియంతర్ధానుఁ।డను పేరఁ బ్రసిద్ధుఁడయ్యె నతిచతురుండై॥ సీ॥ స్థిరమతి రాజ్యాభిషిక్తుఁడై యమ్మేటి సమమతి నయ్యనుజన్ములైన।హర్యశ్వునకు సమాదరమునఁ బ్రాక్పవక్షిణదిశఁ దగ ధూమ్రకేశునకును।బరగఁ గవృకునకుఁ బశ్చిమభాగంబు ద్రవిణునకిద్దినుత్తరపుదిశను।నొసఁగి యొప్పునలువురకును బంచి యిచ్చి స్వకాంతయైన నట్టి శిఖండి వలన।మనుజయోని నిజనియుంపుఁడను చుమున్ను।బలికిన ట్టి వసిష్ఠుశాపమునం జేసి।పూని త్రేతాగ్నులతనికిఁ బుత్రులగుచు।జనన మొందిరి సజ్జనస్తవ్యచరిత॥ వ॥ వారలు పావకుండు పవమానుండు శుచియును నామంబులను నుపయోనింబుట్టియు నాత్మప్రభావంబునం గ్రమ్మఱ నగ్నులై చనిరి తదనంతరంబ॥ క॥ అతఁడు నభస్వతి యను నిమొడి।ద్వితీయపత్నివలన నుహవిర్ధానుఁడు నా।సుతుఁగని విజితాశ్వుండా।నతవిమతుఁడు రాజ్యవర్తనమునఁ దలఁపోయన్॥ క॥ విమలాత్మక రాదానము।దమశుల్కాదికముగ రము దారుణమని దై।ర్యమునం దీర్ఘసుఖవ్యా।జమునం దద్వర్తనంబు సమ్మతి విడిచెన్॥ ఇట్లు విడిచి॥ క॥ అతఁడాత్మదర్శనుండై।చతురతఁ బరమాత్ముహంసు సర్వేశ్వరుఁడ। త్క్రతువునయజించి విమలా।స్ఖలితయోగసమాధియుక్తిఁ బొందెను మహాత్మా॥ వ॥ అంత విజితాశ్వుండు పరలోకగతుండైన హవిర్ధానుండు హవిర్ధాని యను భార్యవలన బర్హిష్మదుండు గయుండు శుక్లుండు గృష్ణుండు సత్యుండు జితవ్రతుండు నను పుత్రులనార్వురం గాంచె నందు బర్హిష్మంతుండు॥ సీ॥ సంతత‡సవనదీక్షాశాలియగుచు ధరాతలంబెల్లను గ్రతువులకును।విలసిల్లు యజ్ఞశాలలు వేలు వేలుఁగల్పించి యజ్ఞములు గావించుచుండఁ।జిరకీర్తి యతఁడు ప్రాచీనాగ్రకుశలచే క్షితితలంబెల్ల నాస్తృతము సేయ।వసుధయెల్లను యజ్ఞవాటమై విలసిల్ల సత్క్రియా§కాండనిష్ణాతుఁడగుచు।సుభగయోగసమాధినిష్ఠుఁడు ప్రజాపతియగు ననితన్ను జనము నుతింప వెలయు।నట్టి ఘనుఁడు హవిర్ధాని యఖిలజగతిఁ।బరఁగఁ గుశలను బ్రాచీనబర్హి యయ్యె॥ మఱియు నతండు॥ చ॥ ¶అలవడ నేసతీమణి సమంచితలీల వివాహవేళను।‖త్కలికఁ బ్రదక్షిణంబు లిడఁగాఁ గని హవ్యవహుండు దొ

*పోత।ఓడ. •శునాసీరు।ఇంద్రుఁడు. ‡సవన।యాగము. §కాండము।గుంపు. ¶అలవడన్।ఒప్పునట్లు. ‖ఉత్కలిక।తహతహపడుట.

ల్లియు। నమ్ముల శుకిఁ జూచి మోహమునుఁ బొందినరీతి వి మోహితయయ్యె నా। లలితవినూత్నభూషణయలంకృతచారుశుభాంగి వెండియున్॥ చ॥ సురుచిరభంగి నా సతికిశోరవయఃపరిపాకమైరణ। ద్వరమణిహేమనూపురరవంబు చెలంగ వివాహవేశ్రఁ దా। గరమున వోఢయై పరగఁ గాంచి విస్మితులైరి దేవకి। న్నరవరసిద్ధసాధ్యముని నాగనభశ్చరముఖ్యులందఱున్॥ వ॥ అట్టి సౌందర్యఖనియు సముద్రపుత్రియునైన శతధృతి యను కన్యం బ్రహ్మోపదేశంబునం బాణిగ్రహంబు సేసె నా శతధృతివలనం బ్రాచీనబర్హికిఁ బదుగురు కొడుకులు జనియించిరి వారలు తుల్యనామవ్రతులగుచు ధర్మపారగులునైన ప్రచేతసులు ప్రజాసర్గంబునందుఁ దండ్రిచే నాజ్ఞాపితులగుచుఁ దపంబు గావింప వనంబునకుం జను సమయంబున నందన్మార్గంబునఁ బ్రసన్నుండగుచు దృశ్యమానుండయిన శ్రీరుద్రునిచేత నేదియుపదేశింపంబడెఁ దాని జపధ్యానపూజానియమంబుల సేవింపుచుఁ దపస్పతియైన నారాయణుం బది వేలసంవత్సరంబులు పూజించిరని చెప్పిన విని విదురుండు మైత్రేయున కిట్లనియె॥ సీ॥ తాపసోత్త

శ్రీరుద్రుండు ప్రచేతసులకు యోగాదేశమను స్తోత్రమును దెలియఁ జేయుట.

మ ప్రచేతసులకు నా వనమార్గంబునందు నా భర్గుతోడ। సంగమెట్లయ్యెఁ బ్రసన్నుఁడై హరుఁ డెద్ది తివుట వారలకుపదేశమిచ్చె। జీవప్రజమున కా శివుతోడి సంగంబు గడు దుర్లభం బీజగంబునందుఁ। జర్చింపనమ్మేటి సన్మునీంద్రులకును సంచితధ్యానగోచరుఁడు గాని। పుడమిఁ బ్రత్యక్షమునఁ గానఁబడఁడు మఱియు। నంచితాత్మసదారాముఁ డఖిలలోకరక్షకుఁడు పరముఁడు విరూపాక్షుఁ డాత్మశక్తితోఁ గూడి జగతిపై సంచరించు॥ క॥ కావున భగవంతుండును। దేవాధీశుండునైన దేవుని సంగంబే వెరవున ఘటియించెనొ। యావిధమంతయును దెలియ నానతియీవే॥ క॥ అనవుడు విదురునకమ్ముని। జననాయకుఁ డనియె నట్టి సాధుమనీషం। దనరు ప్రచేతసులును నిజ। జనకునిసద్భాషణములు సన్మతితోడన్॥ క॥ శిరమున వహించి ప్రాగ్దిశ। కరిగెడి సమయమున నేమఱ నంబుధికంటెం। బరపగు నొకసరసి మనో। హరనిర్మలసలిలపూర్ణమైయది మఱియున్॥ సీ॥ రక్తోత్పలేందీవరప్రఫుల్లాంభోజకమనీయకల్హారకలితమగుచుఁ। గంజాతకింజల్కపుంజవిక్షేపకమందగంధానిలానందమగుచు। రమణీయహంససారసచక్రవాకకారండవనినదాభిరామమగుచు। వరమత్తమధుపసుస్వరమోదపల్లవాంకురితలతాతరుభరితమగుచు। సిద్ధచారణగంధర్వసేవ్యమగుచుఁ। బుణ్యముల కాలయంబయి పొలుపు మిగిలి। లలితమై చూడనొప్పఁగ రమ్యమగుచు। దివ్యశుచిలఘుమధురాంబుభవ్యమగుచు॥ గీ॥ సజ్జనునిహృదయముఁ బోలి స్వచ్ఛమగుచు। హరిపదాకృతి దివిజవిహారమగుచు। ఘనుని సిరిభంగి నర్థ్యజీవనమునగుచు। మానవతివృత్తిగతిని నిమ్నంబునగుచు॥ గీ॥ శశికరంబులఁ బోలి విశదములగుచు। హరికథలఁ బోలి కల్మషహరములగుచు। వహ్నులను బోలి భువనపావనములగుచుఁ। బొగడఁదగు నీరముల చేఁ బ్రపూర్ణమగుచు॥ వ॥ ఒప్పునట్టి సరోవరంబుఁ బొడగని యందు నొక్క దివ్యపురుషునిం గనిరి యతండును॥ మ॥ సమదశ్రీకమృదంగవేణుముఖభాస్వన్నాదమై దివ్యమార్గమనోరంజకమై తనర్చు విలసద్గాంధర్వగానంబు నే। య్యము సంధిల్లఁగ వించుఁ దన్మహిమకత్యాశ్చర్యము నొందివే। గమునం దత్కమలాకరంబు వెడలెన్ గౌతూహలోల్లాసియై॥ ఇట్లు వెడలి వచ్చిన॥ మ॥ కనిరా తాపసపుంగవుల్ దివిజలోకశ్రేష్ఠునిం దప్తకాం। చనవర్ణున్ సనకాదియోగిజనభాస్వద్గీయమానున్ త్రిలో। చను భక్తానుగుణానుగున్ సుమహైశ్వర్యున్ బ్రసాదాభిశో। భనవక్త్రున్ మహితాఘకర్తృజనసంపద్భద్రునిన్ రుద్రునిన్॥ క॥ కని వారలు దమమానముల। నను రాగమున నచ్యుతంబున నయము వొడమ। న్వినయముదోఁపఁగఁ దత్పద। వనజములకు మ్రొక్కి భక్తివశగతులగుచున్॥ వ॥ భగవంతుండును నఖిలధర్మజ్ఞుండును గృపాళుండును దర్శనంబున నఖిలపాపహరుండును భక్తవత్సలుండునైన హరుండు ప్రీతుండగుచుం బ్రసన్నాంతఃకరణులు ధర్మజ్ఞులు శీలసంపన్నులు సంప్రీతులునైన వారల కిట్లనియె॥ సీ॥ వినుఁడు నృపాలనందనులార మీమదిఁ గలతలం పెల్లను గానవచ్చె। మీకు భద్రంబగు మీయెడ నేననుగ్రహబుద్ధి చేసి నిటు గానఁబడితిఁ। గైకొని యెపుడు సూక్ష్మము త్రిగుణాత్మకమునగు నా ప్రకృతికంటెను ధరణినిఁ। బరగు జీవునికంటెఁ బరుఁడైన వాసుదేవునిచరణాబ్జముల్ దనరు భక్తి। నర్థి నెవ్వరు భజియింతు రట్టివారు। నాకుఁ బ్రియతముల్ వారికి నయచరిత్రు। లార యేనుఁ బ్రియుండనై భూరిమహిమ। వెలయుచుండుదు మనదిగాక వినుఁడు మీరు॥ వ॥ స్వధర్మనిరతుండైన పురుషుండ నేకజన్మాంతరసుకృతవిశేషంబులం జతుర్ముఖత్వంబు నొంది తదనంతరంబునం బుణ్యాతిరేకంబున నన్నుం బొంది యధికారాంతంబున నేను దేవతాగణంబులు నవ్యాకృతంబైన యే హరిపదంబును బొందుదుమట్టి పదంబు భాగవతుండు దనంతనె పొందుం గావున మీరు భాగవతత్వంబు నొందుటం జేసి నాకుం బ్రియులైయుండుదురు భాగవతజనంబులకు నాకంటె నధిక ప్రియుండు లేఁడు గాన వివిక్తంబు జప్యంబు పవిత్రంబు మంగళంబును శ్రేయస్కరంబునైన నా వచనంబు నాకర్ణింపుఁడు సర్గాదిని బ్రహ్మ నిజనందనుల కెఱింగించిన శ్రీహరిస్తోత్రంబు మీకు నెఱింగింతు వినుండది యెట్టిదనిన॥ క॥ వనజాసనుఁ డాత్మజులగు। సనకాదులఁ జూచి పలికె సమ్మతితోడ। న్వినుఁడు గుణా

రమలారా। వనజోదరుమంగళస్తవంబెఱింగింతురు॥ వ॥ అనివారలతో నిట్లనియె నోయీశాయాత్మ వేదులైనవారలకు భవదీయోత్కర్షంబు స్వానందలాభకరంబు గావున నట్టి స్వానందలాభంబు మాకుం గలుగవలయు నీవు పరిపూర్ణానందస్వరూపుండవిట్టి సర్వాత్మకుండ వైన నీకు నమస్కరింతు నని వెండియు నిట్లనియె॥ సీ॥ పంకజనాభాయ *సంకర్షణాయ శాంతాయ విశ్వప్రబోధాయ భూతసూక్ష్మేంద్రియాత్మనే సూక్ష్మాయ వాసుదేవాయ పూర్ణాయ పుణ్యాయ నిర్వి। కారాయ కర్మవిస్తారకాయ త్రయీపాలాయ త్రైలోక్యపాలకాయ। ‡సోమరూపాయ తేజోబలాఢ్యాయ స్వయంజ్యోతిషే దురంతాయ కర్మ। సాధనాయ పురాపురుషాయ యజ్ఞ। రేతసే జీవతృప్తాయ పృథ్వీరూప। కాయ లోకాయ నభసేంతకాయ విశ్వ। యోనయే విష్ణవే జిష్ణవే నమోస్తు॥ సీ॥ స్వర్గాపవర్గసుద్వారాయ సర్వరసాత్మనే పరమహంసాయ ధర్మ। పాలాయ సద్ధితఫలరూపకాయ కృష్ణాయ ధర్మాత్మనే సర్వశక్తి। యుక్తాయ ఘనసాంఖ్యయోగీశ్వరాయ హిరణ్యవీర్యాయ రుద్రాయ శిష్ట। నాథాయ మష్టవినాశాయ శూన్యప్రవృత్తాయ కర్మణే మృత్యవే వి। రాట్చరీరాయ నిఖిలధరాయ వాగ్వి। భూతయే నివృత్తాయ సత్పుణ్యాఘహారి। వర్చసే ఖిలధర్మదేవాయ చాత్మ। నే నిరుద్ధాయ నిభృతాత్మనే నమోస్తు॥ గీ॥ సర్వసత్వాయ దేవాయ సన్నియాను। కాయ బహిరంతరాత్మనే కారణాత్మ। నే సమస్తార్థలింగాయ నిర్గుణాయ। ¶వేధసే జితాత్మక సాధవే నమోస్తు॥ వ॥ అనియుఁ §బ్రద్యుమ్నుండవు నంతరాత్మవు సమస్తాశేష కారణుండవు చాతుర్హోత్రరూపుండవు ననంతకుండవు సర్వజ్ఞుండవు జ్ఞానక్రియారూపుండవు నంతఃకరణవాసివి నైన నీకు నమస్కరింతు ననిన॥ క॥ అనఘా దేవ భవత్పద। వనరుహసందర్శనేచ్ఛవరలి నమాకుఁ। విను వైష్ణవసత్కృతమై। యొనయు భవద్దర్శనంబు నీ వేమహాత్మా॥ అదియెట్టిదనిన॥ క॥ అనఘ సకలేంద్రియగుణాం। జనము సుభక్తప్రియంబు జలదశ్యామం। బును సౌందర్యసమగ్రము। ననుపమమును నిఖిలమంగళావహమగుచుఁ॥ మఱియును॥ సీ॥ అళికులోపమలసదలకశోభితమునునమృతాంశు రేఖానిభాననమును। సమకర్ణదివ్యభూషాప్రభాకలితంబు సుందరభ్రూనాసను రుచిరంబు। సలలితకుందకుట్మలసన్నిభ†ద్విజపూరితస్నిగ్ధకపోలయుగము। పద్మపలాశశోభనలోచనంబును మందస్మితాపాంగసుందరమును। సస్మితాలోకసతతప్రసన్నముఖము। కంబుసుందరరుచిరమంగళగళంబు। హారమణికుండలప్రభాపూరకలిత। చారుమృగరాజసన్నిభస్కంధయుతము॥ వ॥ వెండియు శంఖచక్రగదాపద్మకలితాయతబాహుచతుష్టయంబు వై జయంతీవనమాలికా కౌస్తుభమణిశ్రీవిరాజితంబు నిత్యానపాయినియైన యిందిరాసుందరీరత్నపరిస్పందంబునం దనరి తిరస్కృతనికషోపలవక్షస్థలంబును శ్వాసనిశ్వాసంబులఁ జంచలంబులయిన వళిత్రయరుచిరప్రకాశమాన దళోదరంబుపూర్వవినిర్గతనిఖిలవిశ్వంబును బ్రవిష్టంబు సేయురీతి నొందు సలిలావర్తసన్నిభగంభీరనాభివివరంబు పంకజకింజల్కవిభాసితదుకూలనిబద్ధకనకమేఖలాకలాపశోభితశ్యామపృథునితంబబింబంబు నీలకదళీస్తంభరుచిరోరుయుగళంబు సమచారుజంఘంబు నిమ్నజానుయుగళంబు పద్మపత్రభాసురపాదద్వయంబు మదీయాంతరంగతమోనివారకనిర్మలచంద్రశకలసన్నిభనఖంబుఁ గిరీటకుండలగ్రైవేయహారకేయూరవలయముద్రికామణినూపురాదివివిధభూషణభూషితంబు నిరస్తసమస్తనతజనసాధ్వసంబు భక్తజనమనోహరంబు సర్వమంగళాకరంబునైన భగవద్దివ్యరూపంబుఁ దామసజనసన్మార్గప్రదర్శకుండవైన నీవు మాకుం జూపి మమ్ముఁ గృతార్థులఁ జేయుమని వెండియు నిట్లనియె॥ సీ॥ ఆత్మకుఁ బరిశుద్ధి నర్థించువారికి ※ధ్యేయవస్తువు భవద్దివ్యమూర్తి। యంచితస్వర్గరాజ్యాభిషిక్తున కైన సమధికస్పృహణీయతముఁడవీవు। సద్భక్తియుతభక్తజనసులభుండవు దుష్టాత్ములకుఁ గడు దుర్లభుండ। వాత్మదర్శనులకు నరయఁ గమ్యుండవు నైయర్థి విలసిల్లు ననఘచరిత। యిట్టి నిఖిలసురారాధ్య యీశ దేవ। నెఱయ సుజనులకైన వర్ణింప రాము। వరల నెవ్వఁడు పూజించు వాఁడు విడువఁ। జాలు నే పద్మదళనేత్ర సచ్చరిత్ర॥ చ॥ ఎనసిన భక్తియోగమున నే భవదీయపదాబ్జమొందఁగా। ననయముఁ గోరువాఁడు చటులాగ్రహభీషణవీర్యశౌర్యత। గ్గనముల చేననూనగతి సర్వజగంబులు సంహరించున। య్యనుపముఁడైన కాలు నిభయంబునుఁ బొందఁడు సుమ్ము కావునన్॥ గీ॥ ఇట్టి మీ పాదమూలంబు లెవ్వఁడేనిఁ। బొందిధన్యాత్ముఁడౌనట్టిపుణ్యుఁడొండు। మనములో పలఁగోరునే మఱచియైన। నవ్యయానందగోవిందహరిముకుంద॥ క॥ హరి మీ భక్తజనులతో। నిరుపమగతిఁ జేయు సఖ్యనిమిషార్ధముతో। సరిగాదు మోక్షమనినన। చిరశుభమగుమర్త్యసుఖముఁ జెప్పఁగ నేలా॥ క॥ దురితవినా

---

*సంకర్షణః। శత్రూన్ ప్రళయే జనాన్వా సంకర్షతి సంహరతీతి - శత్రువులను బ్రళయమందు సర్వజనులను సంహరించువాఁడని యర్థము — ‡సోమ। ఉమయా సహవర్తత ఇతి సోమః - అనఁగా నీశ్వరుఁడు — ¶వేధ। విదధతి సృజతీతి వేధాః - సృజించువాఁడు - అనఁగా బ్రహ్మ - విధ విధానే అని ధాతువు — §ప్రద్యుమ్నుండవు। ప్రకృష్టమైన బలముగలవాఁడవు — †ద్విజ। దంతములు. — ※ధ్యేయ। ధ్యానము చేయఁదగిన.

శతపదపం।కరుహభవత్కీర్తితీర్థకణచయబాహ్యాం।తరసేకధూతకల్మష।పురుషులుధరమీఁదఁదీర్ఘభూతులుగారే॥ వ॥ అట్టిభూతదయాసమేతులు రాగాదివిరహితచిత్తులు *నార్జవాదిగుణయుక్తులునయినభాగవతజనులసంగంబుమాకుసంగలుగంజేయుమిదియమమ్మనుగ్రహించుటయనివేఁడియునిట్లనియె॥చ॥ సరసిజనాభసత్పురుషసంగసమంచితభక్తియోగవి।స్ఫురణననుగ్రహింపఁబడిశుద్ధమునొందినవానిచిత్తము।స్థిరబహిరంగముంగనదుచెందదుభూరితమస్స్వరూపసం। సరణగుహాజిరంబుగనజాలుభవన్మహనీయతత్త్వముల్॥ అదియెట్టిదనిన॥ సీ॥ అరయంగనేమిటియందునీవిశ్వంబువిదితమైయుండునీశ్వమందు।నేదిప్రకాశించునెప్పుడునిట్టిస్వయంజ్యోతినిత్యంబునవ్యయంబు।నాకాశమునుఁబోలియవిరళవ్యాపకమగునాత్మతత్త్వంబునధికమహిమఁ । దనరుపరబ్రహ్మమగునిపల్కయిట్లనియెనవిక్రియుండైనవాఁడు। నెవ్వఁడాతఁడుదనయందునెపుడునాత్మ।కార్యకరణసమర్థంబుగానిభేద। బుద్ధిజనకంబునాఁదగుభూరిమాయఁ। జేసివిశ్వంబుసత్యంబుగాసృజించె॥గీ॥మఱలమఱలఁబెక్కుమారులీవిశ్వంబు।జననవృద్ధివిలయసంగతులనందఁ।జేయుచుండునట్టియీశ్వరుఁడవై।తనరునిన్నునాత్మతత్త్వముగను॥వ॥ తెలియుదుమనివేఁడియునిట్లనియెయోగపరాయణులగువారుశ్రద్ధాసమన్వితులైక్రియాకలాపంబులనంతఃకరణోపలక్షితంబయినభవదీయరూపంబుయజింతురువారువేదాగమతత్త్వజ్ఞానులునీవొక్కండవునాదియునద్వితీయుండవుమాయాశక్తియుక్తుండవునైవిలసిల్లుచుండుదువట్టిమాయాశక్తిచేత॥సీ॥చతురాత్మసత్త్వరజస్తమోగుణములువరుసజనించెనువానివలన। మహదహంకారతన్మాత్రనభోమరుదనలజలావనిమునిసుపర్వ। భూతగణాత్మకస్ఫురణనీవిశ్వంబుభిన్నరూపముననుత్పన్నమయ్యె। దేవయోగతిభవదీయమాయనుజేసిరూఢిఁజతుర్విధరూపమైన। పురమునాత్మాంశమునఁజెందుపురుషుఁడింద్రి। యములచేవిషయసుఖములనుభవించు। మహినిమధుమక్షికాకృతమధువుఁబోలి। యతనిఁబురవర్తియగుజీవుఁడండ్రుసుధియు॥వ॥ ఇట్టిజగత్స్రష్టుండవైననీవు॥క॥ భూతగణంబులచేతనె।భూతగణంబులనుమేఘపుంజంబులని।ర్ధూతముగఁజేయుననిలునిభాతినిఁజరియింపఁజేసిపౌరుషమొప్పన్॥గీ॥ రూఢిఁదత్తత్క్రియాలబ్ధరూపుఁడవును। సుమహితస్ఫురదమితతేజుఁడవుచండ। వేగుఁడవునయిఘనభుజావిపులమహిమ। విశ్వసంహారమూర్తిఁగావింతువీశ॥అదియెట్లనిన॥క॥ఇతికర్తవ్యవిచారక। మతిఁజేఁదగనెప్పుడుంబ్రమత్తంబుసుసం।చితవిషయలాలసమునా।ర్జితలోభమునైనయట్టిసృష్టిగడంకన్॥గీ॥ అప్రమత్తుండవగుచుఁబద్మాక్షనీవు। మ్రింగుదువుచాలనాఁకటమ్రొగ్గుచుండి। నాలుకలుచాఁచుభూరిపన్నగమువాఁతఁ। బడినయెలుకనుభక్షించుపగిదిననఘ॥చ॥అనిశమునస్మదీయగురుఁడైనసరోరుహసంభవుండును। న్మనువులునాత్మసంశయముమానిభజించుభవత్పదాబ్జముల్। మనముననిల్పియుస్మదవమానమహావ్యథఁజెందుచున్నట్టిస। జ్జనుఁడుపరిత్యజించునెభుజంగమతల్పకభక్తకల్పకా॥క॥ కావుననాకునుసూరిజ। నావళికినిసర్వసంశయంబులువాపం। గావనుబ్రోవనుదగుగతి। నీవనివినుతించినట్టియీస్తవమెలమిన్॥వ॥ రుద్రుండుప్రచేతసులకెఱింగించి వెండియునిట్లనియెఁబ్రచేతసులారా యిట్టియోగాదేశనామకంబైనయాస్తోత్రంబుబహువారావృత్తిచేఁబఠించి మనంబునధరియించిసమాహితచిత్తులైమీరందఱునాదరంబున విశ్వాసయుక్తులుస్వధర్మాచారవంతులుభగవదర్పితాశయులునైజపియించుచుసర్వభూతావస్థితుండునాత్మారాముండునైన సర్వేశ్వరునినుతింపుచుధ్యానంబుసేయుచుఁబూజింపుఁడుతొల్లియీస్తోత్రంబుభగవంతుండైనపద్మసంభవుండు *సిసృక్షువగుచునాత్మజులమైనమాకునుసృజియింపనిచ్ఛగించుభృగ్వాదులకునెఱింగించె నేమునాభృగ్వాదులును బ్రజాసర్గంబునందుఁబ్రహ్మచోదితులమైయీస్తోత్రంబునంజేసివిధ్వస్తసమస్తతమోగుణులమైవివిధప్రజాసర్గంబుగావించితిమిగావుననీస్తోత్రంబునెల్లప్పుడునేకాగ్రచిత్తుండువాసుదేవపరాయణుండునైయెవ్వఁడుజపియించువాఁడు వేగంబెశ్రేయస్సునుబొందితదీయజ్ఞాన*ప్లవంబునవ్యసనార్ణవరూపంబైనసంసారంబునుసుఖతరంబునందరియించునిట్టిమదుపదిష్టితంబైనశ్రీహరిస్తవంబునెవ్వండుచదువుచుదురారాధ్యుండైనశ్రీహరిఁబూజించువాఁడుమదుక్తస్తోత్రగానసంతుష్టుండుశ్రేయస్సులకునేకాశ్రయభూతుండునగుశ్రీమన్నారాయణునివలనసమస్తాభీష్టంబులంబొందునెవ్వఁడుప్రభాతంబునలేచిప్రాంజలియుశ్రద్ధాసమన్వితుండునైయీమంగళస్తవరాజంబునువినినవినిపించినవాఁడుకర్మబంధవిముక్తుండగుననిమఱియునిట్లనియె॥ క॥నరదేవతనయులారా।పురుషాధీశుండుపరమపురుషుఁడునగునీ।శ్వరునుస్తోత్రముమీకా।దరమునఁదెలిపితి. నిమీరువర్ధయుభక్తిన్॥క॥ఏకాగ్రచిత్తులునసు।శ్లోకులునైజపముసేయుచునుఘనతపముం। గైకొనిచేసినమీకును।జేకు

• ఆర్జవము। త్రికరణములుసన్మార్గప్రవర్తకములగుట — * సిసృక్షువగుచు।సృష్టింపనిచ్ఛగలవాఁడయి — * ప్లవ।ఓడ.

రుమహితేప్సితార్థసిద్ధిగడంకన్॥ క॥ అని యాగతి నుపదేశం। బొనరించి సదాశివుండు నెగి వారలచే। తను బూజితుఁడై వా రలు। గనినంతర్ధానుఁడయ్యెఁ గౌతుక మొప్పన్॥ అంత. గీ॥ తివుట వారలు రుద్రోపదిష్టమైన। యచ్యుతస్తవము జపించు *చయుతసంఖ్య। వత్సరములు గ్రతపము దుర్వార వారి। మధ్యమునఁ జేయుచున్న సమయమునందు॥ వ॥ అంతం గర్మాసక్తచిత్తుండై

——⇒ శ్రీ నారదుండు ప్రాచీనబర్హికి జ్ఞానమార్గమును దెలియఁజేయుట. శ్రీ ⇐——

యున్న ప్రాచీనబర్హి కడకు నధ్యాత్మవేదియుం గృపాళువునైన నారదుండు చను దెంచి యా రాజునకు జ్ఞానబోధంబు సేయు కొఱకు నతని కిట్లనియె రాజా యీ కర్మంబున నం జేసి యెట్టి శ్రేయస్సు నభిలషించుచున్నవాఁడ వరిష్టనిరసనాభీష్టప్రాప్తికరంబునైన శ్రేయం బీ కర్మంబువలన లభింపదనిన ప్రాచీనబర్హి నారదున కిట్లనియె॥ సీ॥ అనఘ మునీంద్ర మహాభాగ నే నుగ్ర కర్మపహతజ్ఞానినగుచు మోక్షు। మెఱుఁగంగలేనైతి నిట్టి నాకిప్పుడు గడువిమలంబును గర్మబంధ। నాశకంబైన విజ్ఞానోప దేశంబు గావింపు మతిదయాకారశ కూట। ధర్మంబులను గేహతత్సులందుఁ జెందిజాయాతనూజాతధనాదికములు। భూరిపు రుషార్థములు గాఁగ బుద్ధిఁదలఁచు। మతివిహీనుండు సంసారమార్గములను। బగఁబరిభ్రామ్యమాణుఁడై యెుగిని మోక్ష। ప దము నొందంగఁజాలఁడు భవ్యచరిత॥ క॥ అనవుడు నతనికి నతఁడను। ననఘా యీ యధ్వరంబులందు నుగ్రపమా। లిననీచే విశ సింపం। జనికూలిన పశుల వేలసంఖ్యలఁగనుమా॥ వ॥ కావునం బశువ్రాతంబులు †త్వదీయవైశసంబును స్మరింపుచున్నవి యగుచు లోహాయంత్రమయశృంగంబులచేత నెన్నఁడు నీవు పరలోకంబు నొందెదవప్పుడు నిను హింసింతుమని భవదీయమృతిక నెమరుచూచుచున్న విట్టి సంకటంబు నొందంగల నీకు నిస్తారకంబయిన యొక్క §యితిహాసంబు గలదెఱింగింతునని యిట్ల

——⇒ శ్రీ పురంజనోపాఖ్యానము. శ్రీ ⇐——

నియె॥ సీ॥ భూమీశ వినుమయ్య పూర్వకాలమునఁ బురంజనుఁడను నొకరాజు గలఁడు। నతనికి విజ్ఞాతుఁడను పేరఁదగిలి విజ్ఞాత చేష్టితుఁడగు సఖుఁడు గలఁడు। ఆ పురంజనుఁడు పురాన్వేషియై ధరాచక్రంబు గలయంగ సంచరించి। తనకనురూపమై పెను పొందు పురమెందు వీక్షింపఁజాలక విమనుఁడగుచు। నే పురములుర్విఁ బొడగనే నా పురములు। గామములఁగోరు తనకు నర్హా మములను। బొందుటకు వానినియనర్హములు గఁదనమా। నమునఁదలఁచి యొకానొక నాఁడతండు॥ వ॥ చనుచున్న సమయంబు న హిమవత్పర్వతదక్షిణసానువులందు॥ సీ॥ వర నవద్వారకవాటగవాక్షతోరణదేహళీగోపురముల నొప్పి। ప్రాకారయంత్ర వప్ర ప్రతోళీపరిఘాట్టాలకోపవనాళిఁ దనరి। సౌవర్ణ రౌప్యాయసమయశృంగంబుల రమణీయవివిధగేహములమించి। రథ్యాసభాచత్వరధ్వజ క్రీడాయతనసుచైత్యాపణతతిఁ దనర్చి। మరకతస్ఫటికవైదూర్యమణివినూత్న। హర్మ్యకాయుతశోభిత హర్మ్యములు గలిగి। విద్రుమద్రుమవేదుల వెలయు నొక్క। పురముఁ గనె భోగవతికెనఁ బోలుదాని॥ వ॥ ఇట్లు గనుంగొని యనంతరంబ ముందట నంబరబాహ్యోపవనంబున దివ్యద్రుమలతాకు●జపుంజంబులు సమదసదవ్విహంగమత్తమధుకర కులకోలాహలసంకులజలాశయశోభితంబు హిమనిర్ఝరబిందుసందోహపరిస్పందకందళితమందమలయమారుతచ్ఛలిత ప్రవాళవిటపనళినీతటంబు పాంథజనమనంబులకు నాహ్వానబుద్ధిజనకకలహంసరాజకీరకోకిలాలాపవిరాజమానంబు మునివ్రతనానావిధవనమృగవ్రాతబాధారహితంబునైన పుర బాహ్యోద్యానవనంబునందు యాదృచ్ఛికంబున నేకైకశతనాయకులైనయనుచరదశకంబు పంచమస్తకసర్ప ‡ప్రతీహారుండు దోడరాఁ జనుదెంచుచున్న భర్త్రన్వేషిణి యుం గామరూపిణియు ¶నవోఢయునైన యొకట్టి॥ సీ॥ ఘనసమవిన్యస్తకర్ణకుండలరుచుల్గండభాగంబుల నిండి పర్వఁ। దమ్మి రేకుల సిరిఁ ‖దటమటింపఁగఁజాలు మెఱుఁగు కన్నులు దలఁదిరిగి రాఁగ। జఘనసంకలితపిశంగ ‡నీవి ద్యుతిఁగనక కాంచీరుచిఁగ రముఁ బెనుపఁ। జరణసరోజభాసుర చల‡నూపురఝణఝణధ్వని నర్మసరణిఁ జూప। లలితయౌవనలక్ష్మీవిలాసభాసురోదయ ‖వ్యంజితప్రభా యుక్తపీన। సమనిరంతర కుచ ‖కుట్మలముల వ్రీడఁ। జెందిపయ్యెదఁగప్పు బాలేందుముఖిని॥ వ॥ మఱి

●అయుత। పదివేలు. ‖కూట। కపటము. †త్వదీయవైశసంబును। నీవు చంపుటను. §ఇతిహాసంబు। పూర్వకథ. నవద్వార। కన్నుముక్కు మొదలైనవి, కవాట। తలుపు, దేహళీ। కడపలు. యంత్ర। జలయంత్రాదులు. వప్ర। పుట్టకోట. ప్రతోళి। రచ్చవీధులు-అనఁగాఁ బెద్దవీధులు. పరిఘ। అగడ్త. అట్టాలక। ఉపరిగృహములు. రథ్యా। రథములు నడిచే వీధులు, సభ। కచ్చేరీకూటములు. అంగణ। ముంగిళ్లు. ధ్వజ। టెక్కెము. క్రీడాయతన। విహారగృహములు. సుచైత్య। సుందరములగు యజ్ఞశాలలు. ఆపణ। అంగళ్లు. హర్మ్య। ధనికగృహములు. విద్రుమద్రుమవేదుల్। పగడపుమానులచేఁ గట్టబడిన తిన్నెలచేతను. ‡ప్రతీహార। ద్వారపాలకుఁడు. ¶నవోఢ। వివాహము కానిదియు. ‖తటమటించుట। పరిహసించుట-వ్యర్థము చేయుట. ‡నీవి। పోకముడి. ‡నూపుర। కాలి అందె. ‡నర్మసరణి। రతాశయమును బోధించెడు మాటలచందమును. ‖వ్యంజిత। సూచనచేయుచున్న. ‖కుట్మల। మొగ్గ.

యును బాలయు*సుదతియు గజగామినియు నైన యొక్క ప్రమదోత్తమం గాంచి॥ క॥ అరుదుగ ప్రియ మగ్గలమై మరువిల్లం
బోలు కనుబొమలు గల తరుణి। న్సరసాపాంగ విలోకన। శరపరివిద్ధాంగుఁడగుచు జనవిభుఁ డనియెన్॥ క॥ ఎవ్వరిదాన వు జనకుం।
డెవ్వఁడు పేరేమి భృత్యులీపతి యొకరిం। డెవ్వరు సతు లెవ్వరు మఱి। యివ్వనమున నుండఁ గార్య మెద్ది మృగాక్షీ॥ క॥ భవదీ
య పురస్సరుఁడగు। పవనాశనుఁ డెవ్వఁ డతికృపామతి నాకు। న్వివరింపు మనుచు వేఁడియు। ధవళేక్షణఁ జూచి ధరణీధవుఁ డిట్ల
నియెన్॥ సీ॥ తరళాక్షి పతియగు ధర్ము నన్వేషింపఁ జరియించు హ్రీ యను సతివొ కాక। సుప్రియు నన్వేషించు రుద్రాణివో కాక
బ్రహ్మను వెదకు భారతివొ కాక। నారాయణుని భక్తిఁ గోరి యన్వేషించు నిందిరవో కాక యెవ్వరీవు। త్వత్పాదకామున త్వ
మునను సంప్రాప్త సకల కాముండగు సరసు నెట్టి। వాని వెదికెదు తరుణీ భవత్కరాగ్ర। పద్మకోశంబు నేఁ డెంపఁ బతితమయ్యె।
నాకు నెఱిఁగింపఁదగు మవివేక చరిత। యని నృపాలుఁడు మఱియు నిట్లనియె సతికి॥ క॥ కరమొప్పఁగ నీ విటు భామా। చరవగుటన్
హ్రీవి శివవు శారదవును సా। గర కన్యవు గాకుండుట। తరుణీ పాదగంటనె పదంపడి పలికెన్॥ సీ॥ మొనసి యుగ్రకర్ముఁడనై
న నా చేతను పురుషపాలిత మైన యీపురంబు। సరసిజోదరుని భుజాపాలితోదాత్తలలితవై కుంతము లంకరించు। నిందిరా
సుందరి చందంబునను నీ వలంకరింపఁ గడంగు పంకజాక్షి। యది గాక లావకీనాపాంగ రుచి మోహితాంతరంగుండనై నట్టి న
న్ను। మహితసవ్రీడ భావ సన్మందహాస। చారువిభ్రమ భ్రూలతా ప్రేరితుఁడుఁగ। దనరు భగవంతుఁడగు నట్టి మనసిజుండు।
పడఁతి యుమగక పీడింపఁ దొడఁగె నిపుడు॥ కావున॥ చ॥ తరుణి సుతారలోచనయుతంబును మంజు సుధాసమాన భా।సుర మృ
దువాక్యయుక్తమును శోభితకోమలలంబమానసుం।దర చికురాభిరామమును దారము నైన భవన్ముఖాబ్జము। న్సరుచిర లీల
నెత్తి నను జూడుము సిగ్గును జెంద నేటికిన్॥ వ॥ అని యివ్విధంబున నధీరుండై పలుకు పురంజనుం జూచి యా ప్రమదోత్తమ వీ
ర మోహితమై సస్మితాననయగుచు నానందంబు నొంది యిట్లనియె॥ క॥ పురుషవర నాకు నీకును। గురువును నామమును గు
లముఁ గోత్రము నెఱుఁగనీ। పురమున నుండుమ గాని। పురమును నిర్మించినట్టి పురుషు నెఱుంగన్॥ క॥ వీరలు నా సఖులీలలు। నా రత్న
ములార్య వినుత నా చెలులీవ్య। ద్ధోరగ మేనిద్రింపఁగ। ధీరత మేల్కాంచి పురము త్వలిఁ బాలించున్॥ వెండియు నిట్లనియె॥
సీ॥ మనుజనాయక నీవు సద్భాగ్యవశమున నిటకు నేతెంచితి విపుడు నీకు। మంగళంబగు నీవు మహితేంద్రియ గ్రామ భోగ్యం
బులగు కామపుంజములను। నర్థి సంపాదింతు వనఘాత్మ యీ నవద్వార ప్రయుక్తమై తనరు పురము। నీవు గైకొని యేలు నీకిం
తెనిందుకు నధిపుఁ డన్యుండు లేఁ డనఘ యింపు। మడుపనీతము లైన కామముల ననుభ। వింపుచును సహశతసమను స్థింపు మెల
మిఁ। గోరి నీకంటెఁ బ్రియులు నెవ్వారు నాకు। నరసి చూడంగ మనుజేంద్ర యది యుఁ గాక॥ వ॥ మఱియు నవిజ్ఞాన విహీనుండును
నకోవిదుండును నిహపర చింతాశూన్యుండుఁ బశుప్రాయుండు నత్వదన్యుండు నైన వానినే నెట్లు వరియింతు గృహస్థాశ్రమం
బు ధర్మార్థ కామ మోక్ష ప్రజానందంబులు యశంబు యతివేద్యంబులు గాని రజస్తమోవిహీన పుణ్యలోకంబులును గలుగు
పితృదేవర్షి మర్త్యభూతగణంబులకుం దనకు నీలోకంబున గృహస్థాశ్రమంబు సర్వక్షేమార్హంబయిన యాశ్రమంబండ్రు
కావున †వదాన్యుండవు వీరవిఖ్యాతుండవు ప్రియదర్శనుండవు స్వయంప్రాప్తుండవు నయి భోగ భోగి సదృశ భుజాదండం
బుల చే నొప్పు భవాదృశుండగలి మాదృశ యగు కన్య వరియింపకుండునే యని వెండియు॥ క॥ కరుణారసపరిపూర్ణ। స్ఫురితస్మి
తరుచి విలోకపుంజము చేతన్। గరమర్థిదీనజన భయ। హరణుఁడవై సంచరింతు వఖిలజగములన్॥ క॥ అనియాగతిఁ బలికిన
యా। వనజాక్షిఁ బురంజనుండు వరియించి ముదం। బున నన్యోన్యప్రీతిన్। దనరుచుఁ దత్పురము సౌఖ్యధన్యుండగుచున్॥
చ॥ శత‡సమ కాలమప్పురి నజస్రము భూరి సమస్త సౌఖ్యసం। గతులఁ దనర్చి వందిజన గాయక సద్వినుతోపగాన మో। దితమ
తి నెప్పి సుందర సతీజన సేవితుఁడై నృపాలకో। చితలలితస్థలంబుల వసింపుచు గ్రీడలు సల్పుచుండఁగన్॥ క॥ నరనాథుఁడు
లోకభయం। కరగతి వర్తించు గ్రీష్మకాలము దోఁపం। దరళ§లహరీ మనోహర। వర హ్రాదిని సలిలమందు వసియించెఁ దగన్॥
వ॥ ఇట్లు వసించి కతిపయ దినంబు లరుగు సమయంబున॥ సీ॥ అవనీశ్వరోత్తమ యప్పురంబున నాల్గు వంకలనున్న గవనులు విను
ము। తూర్పు దిక్కందు నైదును దక్షిణోత్తరంబుల రెండు పశ్చిమంబునను రెండు। గాఁగను తొమ్మిది గవనులును పరిదిక్కన నే
డు గ్రిందిదిక్కునను రెండు। నై యుండు మఱి వానియందుఁ బృథగ్విధ విషయగత్యర్థమై వెలయు నీశ్వ। రుండొకఁ డరయంగ
గలఁడు రూఢిఁ దత్పురంబుఁ బాలించునట్టి పురంజనుండు। నా పుర ద్వార నవకంబునందు లోన। నర్థిఁ బ్రాగ్ద్వార పంచకమం
దు వరుస॥ వ॥ ఖద్యోతయు నావిర్ముఖియు నను నామంబులు గల ద్వారయుగంబున ద్యుమత్సఖుండై విభ్రాజితాఖ్య జనపదంబు

*సుదతి।మంచిదంతములుగలది. †వదాన్యుండవు।దాతవు।లేక-వాచాలకుఁడవు. ‡సమ।సంవత్సరము. §లహరీ।ప్రవాహము।హ్రాదిని-నది.

సుభోంబు వెండియు నళినియు నాళినియు ననుపేళ్లుగల వాకిళ్లు రెంటియందు నవధూతసఖుండై సౌరభరూపంబులయిన విష
యంబులం బొందుచుఁ బిదప ముఖ్యనామకంబయిన ప్రధానద్వారంబున రసజ్ఞవిపణాన్వితుండై యాపణబహూద
నంబులను విషయంబులనొందుఁ బిత్రుహూనామకంబయిన దక్షిణద్వారంబున శ్రుతధరాన్వితుండై దక్షిణపాంచాలంబ
ను రాష్ట్రంబు నొందు దేవహూనామకంబయిన యుత్తరపువాకిట శ్రుతధరాన్వితుండై యుత్తర పాంచాలంబను రాష్ట్రం
బు నొందు వెండియుం బశ్చిమవాకిళ్లు రెంటియందు నాసురీనామకంబైన వాకిట దుర్మదసమేతుండై గ్రామక నామకంబైన
సవిషయంబును నిర్ఋతినామకంబైన వాకిటియందు లుబ్ధకయుక్తుండై వైశసంబను విషయంబు నొందుచుండు వెండియుం బు
రంజనుండప్పురంబునం బౌరజనంబులందు నిర్వాక్పేశస్కరులను నిద్దరంధులుగలరు వారల చేతగమనకరణంబులను క్రియ
లనొందుచు నంధకుండగునప్పుడు విషూచీనసమన్వితుండై జాయాత్మజోద్భవంబయిన మోహప్రసాదహర్షంబుల
నొందుచుండు నిట్టి స్వప్నంబునం గర్మాసక్తుండగు నాత్మయుండునై బుద్ధియను మహిషిచేత వంచితుండయ్యె నక్కామినియు॥
సీ॥ పానంబు సేసినఁ దానుఁ బానముఁ జేయుఁ గుడిచినఁ దానును గుడుచు మఱియు। భక్షింపఁ దాను భక్షించు నడిచిన నడుచు
ను నవ్విన నవ్వు నేడ్వ। నేడుచుఁ బాడినఁ బాడు విన్నను వినుఁ జూచినఁ జూచుఁ గూర్చున్నఁ గూర్చుండు। దుఃఖింపదీనుఁడై దుఃఖించు ని
లిచిన నిలుచుఁ దిరుగఁ దిరుగు నిద్రింపఁగ నిద్రపోవు। ముట్టినను ముట్టు మూర్కొన్న మూర్కొనును। బలుకఁ బలుకును బవళింపఁ బవ్వళించు
హర్షమునను బొందు నాత్మ హర్షమొందు। మోహమును బొందఁ దానును మోహమొందు॥ వ॥ ఇవ్విధంబున సతతంబు మహిషీవి
ప్రలబ్ధుండై యవితస్వభావుండై పారవశ్యంబునం జేసి యజ్ఞుండునితరేచ్ఛావిరహితుండునై క్రీడామృగంబు చాడ్పు
ననుకరింపుచు నట్టి యప్పురంబున నాపురంజనుండొకానొకదినంబున ధనుర్ధరుండై॥ సీ॥ పంచా
శ్వయుక్తంబు పంచబంధనము ద్విధ్వజయము ను *యుగద్వయంబు। నాళు వేగంబు నేకాక్షంబు కూబరద్వయము ను త్రి
తయపతాకయుతము। నేకరశ్మియుతంబు నేకసారథికంబును వృత్తవరూథంబు స్వర్ణభూష। మను బంచవిక్రమముసు నీడెమొ
క్కటి ప్రకటమవ ప్రహరణము నై నరథము కాంచనరచితవర్మ మాధరించి। బిలసదక్షయతూణీరకలితుఁడగుచుఁ। గడఁకదీ
పింప నెక్కి యేకాదశ ప్రసంఖ్య సేనాసమేతుఁడై సరభసమున॥ వ॥ ఇవ్విధంబునం బురంబు వెడలి పంచప్రస్థంబను వనంబు
నకుం జనియందు మహిషీవిరహిత నివిడిచి శీఘ్రమృగయాసక్తుండై దృప్తుండగుచు ధనుర్బాణంబులు ధరియించి సంచరించు
చు నాసురవృత్తిం దగిలి ఘోరాత్మకం మనదయుండునై నిశాతసాయకంబులచేత నమృగవ్రాతంబులం బరిమార్చె రాజు
లకు మృగయావినోదంబు విహితానుస్థానంబగుచుండ నాసురవృత్తి యెట్లయ్యెనని యంటివేని నిది రాగప్రాప్తంబగుటను వి
హితంబు గాదు నిను ము శ్రాద్ధకాలం దె ప్రఖ్యాత శ్రాద్ధదివసంబులయందె రాజైనవాఁడె మేధ్యంబులయిన పశువుల నెవ
సంబునం దియథోపయుక్తంబుగా నెవధింపఁజనునను నియమమాత్రంబుగలదు గావున నజ్ఞానివిమై నవిద్వాంసుండాచరిం
పఁడుగాక యాచరించినం గర్మానుస్థానజనితంబైన జ్ఞానంబునం జేసియందుం బౌరయండట్లు గాక నియమోల్లంఘనంబు
నం గర్మాచరణుండగు వాఁడభిమానంబు నొందికర్మబద్ధుండై గుణప్రవాహపతితుండు నష్టప్రజ్ఞుండునై యధోగతింగూలు
నిట్లగుటం జేసి సాధుజనులకు సర్వప్రకారంబుల నాసురవృత్తి మానందగునని వెండియు నిట్లనియెనంతం బురంజనుండప్పనం
బున॥ క॥ వరచిత్రపక్షయుతనిశిత। శరములచే శశవరాహచమరీరురుకా। సరగవయశల్యహరిణీ। కరిహరివృకపుండరీకకపిఖడ్గ
ములన్॥ వధియించి మఱియు॥ సీ॥ పరుసమేధ్యామేధ్యవనమృగంబుల *ఘృణజనముస్పృహఁ గ్రీడ సంహరించి। శ్రమయుక్తుండై
వేఁటఁ జాలించి మఱలి మందిరమునకేగి నేతెంచియందు। సముచితస్నానభోజనకృత్యములు దీర్చి యాపరిశ్రాంతిశయాసుం
డగుచుఁ। బరిమళమిళితధూపవ్రాతవాసితసర్వాంగుఁడగుచు స్రక్చందనాది। వివిధభూషణచేలముల్ వెలయఁదాల్చి। తృప్తుఁ
డును హృష్టుఁడు మగర్వదృప్తుఁడయియ। నన్యజాకృష్టచిత్తుండునై రతిప్ర। సంగకౌతుకమాత్మను దొంగలింప॥ వ॥ అంత స్వకీ
యప్రాణవల్లభయగు మహిషియందు మనంబు నునిచి నా *వరారోహయు గృహమేధియునైన గృహిణిం గానక విమన
స్కుండై నిజాంతఃపురకామినులం గనుంగొని యిట్లనియె॥ క॥ *రామాజనసంఘములా। రామానవతిలలామ రామామణి
సా। రామలకృపచే మెలఁగుచు। రామానుగకుశలమాపరామర్శింపన్॥ ఉ॥ సారవివేకలారగృహసంపదలీయెడఁ బూర్వరీ

---

యుగ। కాడి, అక్షు। ఇరుసు, కూబర। నొగ, రశ్మి। పగ్గము, వరూథము। రథమును సంరక్షించెడి వ్యాఘ్రచర్మాదికము, ప్రహరణము। ఆయుధ
ము, వర్మము। కవచము—*మృగయ। వేఁట, దృప్తుఁడు। గర్వించినవాఁడు, నిశాతసాయకమ్ములు। కఱుకుటమ్ములు—*ఘృణ। కరుణ, ధృష్టుఁ
డు, । నిశ్శంకితుఁడు—*వరారోహ। శ్రేష్ఠమయిన పిరుదులుగలది—*రామ। స్త్రీ.

తిచే। నారయఁగారుదింపవు గృహస్థునకుఁ గృహమందు మాతగా। వీరమణానుకూలరమణీమణియైనతనరారుభార్యగా।
నీకుచినొందకున్నఁగన నేర్చునె తద్గృహమేధిసౌఖ్యముల్ ॥ అదియునుంగాక॥క॥ పొగడొందుజననిగానీ।తగవునవర్తించు
నట్టివనితయకానీ। తగనుండనిగృహమునను। టగుఁజక్రవిహీనరథమునంచుంటరయఁ॥కావున॥చ॥ తలఁకొనినాపుఁ
దానుసుపథంబునఁబ్రజ్ఞజనింపఁజేసిసం। చలదురుమర్భరవ్యసనసాగరమగ్నుఁడనైననన్నుని। శ్చలమతినుద్ధరించియని
శంబునుమట్టిప్రియయైనభార్యయే।వలనుజరింపుచున్నదనివారణనాకెఱిఁగింపరేదయఁ॥క॥ అనవుడువినియక్కాంతలు।
జనపతికిట్లనిరిరాజసత్తమయిదిగో। తనకొంగైననుబరపుగ। నొనరింపక నేలఁబొరలుచున్నదివగలఁ॥గీ॥ఏమికతమునను
న్నదోయెఱుఁగమేము। నీవుచూచుచుమటన్నాభూవరుండు। నేలఁబడిపొరలెడుభార్యఁబోలఁజూచి। మనములోదుఃఖతా
పంబుమల్లడింప॥అంత॥గీ॥ జలజనేత్రప్రణయసంజాతరోషభా। వంబునైనయట్టివక్రదృష్టి। జనవిభుండుచూచియనున
యకోవిదుఁ। డగుచునప్పయోరుహాక్షిఁజేరి॥క॥పొలఁతుకఁదన *యుత్సంగం।బులనిడితత్పాదయుగళమునునంటుచుమం।
జులమృదుభాషణములనా। లలనామణిఁజూచిపలికెలాలనమొప్పన్॥చ॥ రమణిరొభృత్యులందునపరాధముగల్గిననాయ
కుల్ స్వపక్షముఁదలపోసియుగ్రతరశాసనముందెగిచేయరట్లుగా। కమనములోనికిన్ఁదమకంబుననాజ్ఞనొనర్చిరేని
నికఱముగననుగ్రహించుటయకాకతలంపఁగనాజ్ఞసేయుటే॥క॥కమలాననబాంధవకృ।త్యముఁదలఁపకరోషచిత్తుఁడగు
కుటిలాత్ముఁ। సామర్థ్యండునునీతి।క్రమరహితుఁడునైనబాలుఁగానెన్నఁదగుఁ॥ అని వెండియునిట్లనియెసుదతీహృదయే
శ్వరివైననీవు॥మ॥సరసోదారసుధారసోపమవచశ్చాతుర్యసౌభాగ్యమై। హరినీలోపమకోమలాలకయుతంబైవిభ్రమ
భ్రూలతా। పరిజుష్టస్మితసద్విలోకనమునై భాసిల్లుయుష్మన్ముఖాం। బురుహంబున్నపదీయదాసునకుఁబూబోణీకృపఁజూ
పవే॥క॥ వినువీరపత్నినీయెడ। ననయంబునుబ్రాహ్మణులునుహరిభక్తులుద। క్క నితరులెగ్గొనరించిన।వనితాశిక్షింతునెం
తవారలనైనఁ॥క॥ ఈముల్లోకములందును। నామననమునరోషమొదవినన్నయరహితుం। డైమదిలోఁబరితోషము। తో
మెలఁగెడువానిఁగానఁదోయజనేత్రా॥సీ॥ ఇందీవరేక్షణయే నెందుభవదీయతిలకవిరహితముమలినయుతము।హర్ష శూ
న్యంబుమనోప్రకాశకమునైయత్యమర్షయుతంబునైనముఖము। గళితాశ్రుబిందుసంకలితసంచితశోభమానపీనస్తన
మండలమును।రమణీయతాంబూలరాగవిహీనమైనట్టిసుపక్వబింబాధరంబు।గాఁగనిట్లుంటకిపుడేమిగతమునాకు।నర్థినె
ఱిఁగింపవేమృగయాభిసక్తినబలనీకెఱిఁగింపకయరిగినట్టి।తప్పుసైరించికావంగఁదగుదునేను॥క॥ వనితాజనపరవశుఁడై।
మనసిజశరబాధ్యమానమానసుఁడగువా। నినిఁదగఁగర్తవ్యార్థము।లనుభజియింపకతొలంగులలనలుగలరే॥ వ॥అనుచుం
దదీయవిభ్రమవశంగతుండైపలికినవిని॥క॥ కంజాతపత్రనేత్రపు।రంజనుదెసరోషముడిగిరమణీయశ్రీ।మంజులమృదుహా
స్తులమనము। రంజింపుచుఁబలికెసదనురాగమెలర్పన్॥అంత॥సీ॥ అమ్మహాదేవినెయ్యంబునమంగళస్నాతయైమృదులవ
స్త్రములుగట్టి। స్రక్చందనాదిభూషణములుధరియించికమనీయమోహనాకారయగుచుఁ। బతికడనిలిచిననతఁడుసంతు
ష్టాంతరంగుఁడైయభ్యంతరముననుండి। యన్యోన్యపరసగాఢాలింగనంబులుగావించిగోప్యవాక్యములచేత।నతఁడుప్ర
మదాపరిగ్రహవ్యసనముననుగడఁకనపకృష్టఘనవివేకమునుగలిగి। పగలురేయనుప్రొద్దులేర్పఱుపలేక। యొనసియా
యుర్వ్యయంబుదానెఱుఁగడయ్యె॥వ॥మఱియునతండున్నథమదుండుమహామనుండునగ్రాశయ్యాశయానుండు మహి
షీభుజోపధానుండునైయజ్ఞానాభిభూతుండగుటంజేసిస్వరూపభూతపరమపురుషార్థంబునెఱుఁగకనిజమహిషినేపరమ
పురుషార్థంబుగాఁదలంపుచురమింపుచుంగామకశ్మలచిత్తుఁడయినయతనికినవయౌవనంబైనకాలంబుతృణార్థంబునుం
బోలిగతంబయ్యెనంత॥క॥విశదయశోజలనిధియా। శశిముఖియగుభార్యవలనసమ్మతినేకా। దశశతపుత్రులరణక। ర్కశ
దేహులఁగాంచికౌతుకంబునమఱియుఁ॥క॥ గురుశీలౌదార్యగుణో। త్తరులనుసల్లలితగుణకదంబలఁబ్రియల। న్వరకుల
పావనలదశో। త్తరశతమహితలనుగాంచెఁదత్సతివలనన్॥వ॥ ఇట్లుపుత్రపుత్రికాజనంబులంగనియంత॥క॥ వినుమాతని
యాయువులో। ననరిగెనర్థంబునంతనరపతికులవ। ర్థనులగుసుతులకుఁబరిణయ। మొనరించెన్సదృశలయినయువిదలతో
డన్॥క॥ నరనాథుఁడాడుబిడ్డల।వరరూపవయోవిలాసవైభవములచేఁ।బరగినస్వతనయలసదృశ।వరులకుసంప్రీతితోవి
వాహముఁజేసెన్॥వ॥ అట్లువివాహంబుగావించియున్నసమయంబున॥క॥ వినుతత్సుతులొక్కొక్కని।కనయముఁబాం
చాలదేశమందులఁబౌరం।జనకులవర్ధనులగుచున్।జనియించిరినూఱ్ఱువురేసిశౌర్యబలాఢ్యుల్॥గీ॥ అనఘుయిట్టిశిక్షహారు

* ఉత్సంగ।తొడముందటిభాగము — శిరిక్షహరి।పిండప్రదాత.

లు గేహాళ్ళ శానుజీవయుతులునైనయట్టి। నందనాదులం జెందిన మమతని। బద్ధుఁడయ్యె నంతఁ బార్థివుండు॥చ॥ రతిమగు
నిష్ఠతో నతఁడు దీక్షితుఁడై పశుమారకంబులున్। సరవిభయంకరంబులగు సన్మఖముల్ దగఁజెక్కు చేసి యా। దరమున నీవునుం
బలెను వస్తదమానఫలాప్తికాముఁడై। సురపితృభూతసంఘమునసూయఁదనర్చి భజించె భూవరా॥వ॥ ఇట్లాత్మహితంబు
లైనకర్మంబులయందనవహితుండును గుటుంబాసక్తమానసుండునై యున్నయతనికి విరోధియై ప్రియాంగనలకు కాముకజ
నంబులకునప్రియంబగు కాలంబు సంభవించినం జండవేగవిఖ్యాతుండగు గంధర్వాధీశుండు *షష్ట్యుత్తరశతత్రయసంఖ్యా
తులైన గంధర్వులునందఱు గంధర్వీజనంబులు సితాసితవర్ణంబులు గలిగి మిథునీభూతులగుచు ననుగమింపం జను దెంచి సర్వ
పరిభ్రమణంబుచేత నెసర్వకామంబుల నిర్మితంబగు నాపురంబు నిరోధించిన నప్పుడా చండవేగానుచరులైన గంధర్వులా
పురంజనుపురంబు వ్యాకులంబు నొందించుచు నపహరింపనుపక్రమించు సమయంబున నంబురంజనపురాధ్యక్షుండైన ప్రజా
గరుండను వాఁడు †వింశత్యుత్తరసప్తశతంబులయిన గంధర్వగంధర్వీజనంబుల నివారించి బలవంతుండై సంవత్సరశతంబు
యుద్ధంబు గావించి యొక్కరుండయ్యును పెక్కండ్రతో నిట్లు పోరి క్షీణుండైన పురంజనుండు దాననిలిచి తత్పురంబున నల్ప
సుఖంబుల ననుభవించుచుఁ బాంచాలదేశంబులందుల నిజపార్షదులచేత నానీతంబులైన పదార్థంబుల నొందుచుం గామినీజ
నసమేతుండై భయపర్యాలోచనంబు సేయనేరక రాష్ట్రపురబాంధవసమేతుండై యార్తినొంది చింతాక్రాంతుండై యుం
డెనంత॥క॥ అనయంబు గాలపుత్త్రిక। యను నొకకామిని వరేచ్ఛ నఖిలజగంబుం। దనయంతఁ గలయఁ దిరుగుచుఁ। జనిచని
యొకనాఁడు రాజసత్తమ వింటే॥సీ॥ అనఘాత్మ రాజర్షియైన యయాతికుమారకుండైనట్టి పూరుచేత। వరియింపఁగాఁబడి
వలనొప్ప నతనికి వరమిచ్చి దౌర్భాగ్యవశత నొంది। ప్రఖ్యాతిగను దుర్భగయను పేరను బరగున కాంత నే పురుషవరుఁడు।
వరియింపఁడయ్యె నాతరుణియు నొక్కనాఁడుగర మొప్ప బ్రహ్మలోకమునను౦డి। వసుధకేతెంచి వినుబృహద్వ్రతుఁడనైన। న
న్ను వరియింపఁగోరిన నను నగాము। శరవిమోహితయై వేడఁగరము నేను। సమ్మతింపక యున్నరోషమున నలిగి॥వ॥ ఇట్లు మును
నీంద్రా మదీయాశావిముఖుండవైన నీకు నేకత్రావస్థానంబు లేక యుండుం గాక యని శపించి విహతసంకల్పయై మహపదే
శంబున నంజనియవనేశ్వరుండు భయనామకుండునైన వానిం గదిసి యిట్లనియె.క॥ అవనీపతి భయనామక। యవనకులాధీశ్వ
రుండవగు నినుఁ బతిఁగాఁ। దవిలి వరింపఁగ వచ్చితి। సవినయమున గవిను ముభూతసంకల్పమునన్॥వ॥ కలుగు మత్కామితంబు
వృథగామిలోకంబున వేదంబులందు దేయగ్రాహ్యరూపంబైన వస్తువు యాచ్యమానంబగుచుండ నెవ్వండొసంగఁడెవ్వం
డిం మదీయమానంబగుచుండంగొరం డట్టివీరలిద్దరును జడస్వభావులని సత్పురుషులు శోకంబు నొందుదురు కావున నిన్ను భ
జియించుచున్న నన్నుం గరుణార్ద్రచిత్తుండవై భజియింపుమిట్టి యార్తానుకంపయుఁ బురుషధర్మంబని పలికిన యకాలపు
త్త్రికవచనంబులు విని యవనేశ్వరుండు దేవగుహ్యచికీర్షువగుదానిం గనుంగొని దరస్మితవదనుండగుచు నిట్లనియె॥క॥ విను
తరుణి యాచ్యమానం। బనఁదగు నీలోకమందు మంగళవునుస। జ్జనములకసమ్మతవునగు। నిను నభినందింప సంత్రు నెటి నెవ్వా
ర్లు॥వ॥ కావున నేను జ్ఞానదృష్టింజేసి నీకుం బతిని నిరూపణంబు సేసెదనదియెట్లనిన మదీయసేనాసహాయంబువడసి ప్రజా
నాశంబొనరించునట్టి నీవవ్యక్తగతివై కర్మనిర్మితంబైన లోకంబు ననుభవింపుమీ ప్రజ్వారుండను వాఁడు నాకు సహోదర
గుండు నీవును మదీయభగినివియై యిద్దఱిం గూడి యీ లోకంబునందు నవ్యక్తుండ భీమసైనికుండనై యేను వర్తింతునని నా
భయనామకుండైన యవనేశ్వరునిదిష్టకారులైన సైనికులు ప్రజ్వారకాలకన్యాయుక్తులై భూమండలంబెల్ల దిరుగుచు నొ
క్కనాఁడతివేగంబున భౌమభోగాఢ్యంబు జరత్పన్నగపాలితంబునైన పురంజనుపురంబు నావరించియున్నం తత్స్వాభిభూ
తుండైన పురుషునకు నిస్సారత్వంబు గలిగించునట్టి కాలకన్యక బలాత్కారంబున నాపురంజనుపురంబు ననుభవించె నట్లు కా
లకన్యకోపభుజ్యమానంబైన పురంబు సర్వద్వారంబులందును సర్వతోధిక్యంబుగా నయ్యవనులు ప్రవేశించి తత్పురంబు స
మస్తంబును బీడింప నిట్లు పురంబు ప్రపీడ్యమానంబగుచుండ నభిమానయైన పురంజనుండు॥సీ॥ అనఘ యాతఁడు మమతాకు
లచిత్తుఁడై బహువిధభూరితాపములఁ బొంది। ఘనకుటుంబియుఁ గాలకన్యోపగూఢుండు నష్టసంపదుఁడు వినష్టమతియు।
విషయాత్మకుండును వినిహతైశ్వర్యుండు గృపణుండు చాలనకించనుండు। నగు పురంజనుఁడు శోకావిలభావుఁడై గంధర్వ
యవనసంఘముల చేత। నోజచెడి వికలము నొందు నిజపురమును। దవిలి ప్రతికూలురై యనాదరణయుతులు। నైన పుత్త్ర
లఁ బౌత్త్రులననుచరులను। సచివపౌరోహితుల నిజసతినిఁ జూచి॥వ॥ మఱియుం గాలకన్యాగ్రస్తుండైన తన్ను నరిదూషితం
బులైన పాంచాలబలంబులనుం జూచి యపారచింతనొంది తత్ప్రతీకారంబు సేయనేరకుంగక కాలకన్యాపహృతవీర్యంబుల

*షష్ట్యుత్తరశతత్రయము మున్నూటఱువది— †వింశత్యుత్తరసప్తశతంబు ఏడునూటయిరువది.

యునంగామంబుల నభిలషించుచు దీనుండు విగతాత్మగతికుండు స్నేహంబునం జేసి పుత్రదారోపలాలన పరుండునై కాలకన్యోపమర్దితంబు గంధర్వయవనాక్రాంతంబునైన పురంబు విడువ నిచ్ఛలేకయు విడువ నుపక్రమించె నప్పుడు॥ క॥ అనఘా భయనామాగ్రజుఁడనఁగల ప్రజ్వారుఁడు వేగ నరుదెంచి పురంబును సకలంబును భయనా। మునికిం బ్రీతిగ దహించెమును కొని యంతఁ॥ వ॥ అట్లు దహ్యమానంబగుచుండఁ బౌరభృత్యవర్గాదిసమన్వితుండు గౌటుంబికుండు పుత్రాదిసమన్వితుండు యవనోపరుద్ధాలయుండు కాలకన్యాగ్రస్తుండునైన పురంజనుండప్పురంబునం బ్రజ్వారసంస్పృష్టుండై యనుతాపంబు నొంది తత్పురపాలనంబునం దసమర్థుండు గాక *పురుకృచ్ఛ్రోరువేపథుండై యుండ నశక్తుండయ్యె॥ క॥ దవశిఖియుతతరుకోటరనివసితపన్నగము పగిది నిజపురి వెడలం దివురుచు నతఁడు శిథిలదవ। యవుఁడును గంధర్వగణవిహతశౌర్యుండుఁ॥ సీ॥ అయిచాల ఘురఘురమను శబ్దముడరంగ మనమునఁ జింతానిమగ్నుఁడగుచుఁ। గొడుకులఁ గోడండ్రఁ గూఁతుల నల్లుండ్ర మనుమల నాప్తుల ననుచరాళి। ననయంబు నల్పమాత్రావశిష్టంబైన గృహకోశనివహపరిచ్ఛదములఁ। మమతయు నహంకారమమకారములఁ జేసి మతిహీనుఁడగుచు నెమ్మనములోనఁ। గడఁకఁ దలఁచుచు విప్రయోగమునఁ దాను। గటకటా యిట్లు పరలోకగతుఁడనైన। నిట్టి భార్య యనాథయై యీకుమార। వరుల నేరీతిఁ బ్రోచునో యవని ననుచు॥ మఱియు నిట్లని తలంచు॥ సీ॥ పడఁతి యేమును భుజింపక భుజింపదు నేను నిద్రవోవక మఱి నిద్రవోదు। నేను నీళ్లాడక నీళ్లాడ దెల్లను పదరి యేఁ గోపింప భయమునొందు। భర్జించుటకు మాఱుఁ బలుకక గవాయోడు బుద్ధిహీనుఁడనైన బుద్ధిఁ జెప్పు। లలిమీర యిట్టి కళత్రంబుతో నేను గడఁగి దేహాంతరగతుఁడనైన। ననయమును దాను బుత్రిణియగుటఁ జేసి। యాత్మశోచినియగుచు గృహస్థధర్మ। మాచరించుచునుండునో యనుగమనము। సేయునో యని మనమునఁ జింతనొంది॥ క॥ తనపుత్రులు దనతనయలు। ననయముఁ దాఁ జనిన యెడ నిరాశ్రయులగుచుఁ। వననిధిమధ్యంబున నవి। సిన కలముం బోలి యెట్లు జీవించెదరో॥ క॥ అని యివ్విధమునఁ గృపణుని। యనువున ఘనదుఃఖవిహ్వలానర్హుండై। యనుదుఃఖించు పురంజను। ననయముఁ గొనిపోవ నిశ్చితాత్ముండగుచుఁ॥ క॥ చనుదెంచె నుభయనాముండను వాఁడప్పుడు పురంజనాఖ్యుఁడు పెలుచ। న్వినుతాత్మ పశువు భంగిని। మనమున గలఁగ యవనీయమానుండగుచుఁ॥ వ॥ అనుచరవర్గంబు భృశాతురులు దుఃఖితులునై దుఃఖించుచు వెనుచనుచుండను పరుద్ధంబగు భుజంగమం బప్పురంబు నెపుడు వాసె నప్పుడా పురంబు విశీర్ణంబై ప్రకృతిం బొందె బలవంతుండైన యవనుని చేత బలాత్కారంబున వికృష్యమాణుండైన పురంజనుండు దుఃఖపిహితుండై పూర్వసుహృత్తగు సఖు నీశ్వరు నెఱుంగకుండె నంతం బరలోకగతుండైన పురంజనుం గదిసి పూర్వంబున నదయుండైన యతని చేత హింసింపంబడిన యజ్ఞపశువులు గ్రోధోద్రేకంబునఁ గుఠారంబుల నతని నఱికె నివ్విధంబునం బ్రమదాసంగదోషదూషితుండు నపారతమోనిమగ్నుండు నష్టజ్ఞానుండునై పురంజనుండ నేకకాలంబు పరలోకంబున నార్తి ననుభవించి తద్భార్యయైన ప్రమదోత్తమం జిత్తంబున నశ్రాంతంబును దలంచుచుండం దదీయసంస్మరణంబునం జేసి తరవాతి జన్మంబున విదర్భరాజగృహంబునం బ్రమదోత్తమయై జన్మించె నంత॥ సీ॥ నరవరవీర్యపణాప్తయైనట్టి వైదర్భి నిమలయకేతనుఁడనంగ। బరపురంజయుఁడైన పాండ్యభూమీశుండు దారుణసంగరస్థలమునందు। శక్తి ననేకరాజన్యుల నిర్జించి పరిణయంబయ్యె నా గురుభుజుండు। నావిదర్భాత్మజయం దసితేక్షణయైన కూఁతును ద్రవిడాధినాథులైన కొడుకుల నేడ్వురనర్థిఁ గనియె। వారలకు నెల్ల నొక్కొక్క వరుస నర్బు। దార్బుదసుతులు సంజాతులైరి యతని। సుత ధృతవ్రత నాయగస్త్యుఁడు వరించె॥ క॥ అతఁడా కన్యక వలనను। జతురుండై యిధ్మవాహజనకుఁడగు దృఢ। చ్యుతుఁడగు మునీంద్రుఁ గనియెను। నుతినంత విరక్తుఁడగుచు మలయధ్వజుఁడుఁ॥ గీ॥ క్ష్మాతలంబెల్ల నిజతనూజాతులకును। బంచి యిచ్చి సరోజాక్షు పాదపంక। జార్చనాయత్తుఁడగుచుఁ గులాద్రికరుగ। నంత మదిరాక్షి సతియగు నావిదర్భి॥ గీ॥ కనకగృహములు నఖిలభోగములు విడిచి। చంద్రు వెనుచను చంద్రిక చందమునను। భక్తి దలుకొత్తఁ బాండ్యభూపాలుఁడైన। మలయకేతను వెనుకొని మగువ సనియె॥ వ॥ అట్లు ధర్మపత్ని వెంట రాఁ జనియందుఁ జంద్రవసాతామ్రపర్ణీనవోదకలను నమలపుణ్యజలంబుల స్నాతుండై ప్రక్షాళితబాహ్యాభ్యంతరమలుండు గందమూలఫలబీజపుష్పపర్ణతృణతోయాహారుండునై కాయకర్శనంబైన తపం బాచరించుచు శీతోష్ణవర్షవాతంబులు క్షుత్పిపాసలు ప్రియాప్రియంబులు సుఖదుఃఖంబులునను ద్వంద్వంబుల సమదర్శనుండై జయించి తపోవిద్యాయమనియమంబులం జేసి పక్వకషాయుండై బ్రహ్మయందు నిజాత్మను సంధించి విజితేంద్రియప్రాణచిత్తుండై స్థాణువుం బోలి దివ్యవర్షశతంబు తపంబు సేసి భగవంతుండైన వాసుదేవునందుఁ బ్రీతి వహించుచు నన్యం బెఱుంగక వర్తించుచుఁ దన్ను స్వప్నమందు మమేదంశిరశ్ఛిన్నమితి యను ప్రతీతియం

*పురుకృచ్ఛ్రోరువేపథుండై॥ పురు। అధికమైన-ఇచట వవయోరభేదః-అని యెఱుఁగఁదగినది. కృచ్ఛ్ర। కష్టము-వేపథుండై। వణఁకుగలవాఁడై.

మంబో లె వ్యతిరిక్తునిఁ గవ్యాపకునిఁగ నంతఃకరణవృత్తిసాక్షిఁగా నెఱింగి ॥ సీ ॥ సాక్షాత్కృతుండును సర్వేశ్వరుం
డును భగవంతుఁడు నుగ్రపాపరుఁడు నైన । హరియను లోకైకగురునిచే నుక్తమై సర్వతోముఖముతోఁ స్వప్రకాశ । మ
గునట్టి రహిత స్వచ్ఛజ్ఞానదీపప్రభాతతిచేఁ బరబ్రహ్మమందుఁ । దన్నును దనయందుఁ దగఁ బరబ్రహ్మంబు నెనయఁగ
న్గాను చుదగ్ధేంధనాగ్ని । భంగి నేషణములఁ బెడఁబాసి భూరి । వ్యసనసాగర సంసృతివలనఁ జాల । *నుపరతుండయ్యె నా
నుహితోన్నతుండు । నవనినాయక విను మప్పుడతని భార్య ॥ క ॥ పతిదైవతశీలసమం । చితవేణీభూతచికురచీరాంబరసు ।
వ్రతచర్యాక్షామాంగి వి । గతదోషవిదర్భరాజకన్యక యచటన్ ॥ గీ ॥ కమలలోచన నిఖిలభోగములఁ దొరఁగి । మలయ
కేతనుఁ బరమధర్మజ్ఞుఁ జేరి । నిరుపమైకపతివ్రతానియమ మొప్ప । సాధ్వి యాభర్తఁ బరిచర్య సలుపుచుండె ॥ క ॥ విమల
మతిని జేశుసమీ । పమునందతిధూమరహితపవమానసఖా । గ్రమున వెలుగొందు కీలవి । ధమునఁ బ్రకాశించుచుండెఁ దద్దయు
వేడ్కన్ ॥ క ॥ సతి దన ప్రాణేశ్వరుఁడుప । రతుఁడగుట మనంబులోన రయకను బూర్వ । స్థితి నుపచార క్రియలం । చితమతిఁ
గావింపఁదలఁచి విరతరభక్తిన్ ॥ క ॥ అనుపమసుస్థిరనియమా । సనుఁడగు నిజనాథుఁడాయఁ జనిపూర్వగతిన్ । వినమిత
యై సతి యప్పుడు । వనజములర్చించు నపుడు వరుపాదములన్ ॥ క ॥ విను శ్రీమూష్మత లేకున్నను । గనియూధభ్రష్టహరిణి కైవడిస
తి నెమ్మనమునఁ బెగడుచు దీనత । ననయంబును బంధురహితయై శోకించెన్ ॥ చ ॥ అనయము నిట్లు శోకవిపులాశ్రుపయఃకణసి
క్తమానిత । స్తనయుగయై వియోగపరితాపమునన్ హృదయంబు గందశో । భనలలితాధరోష్ఠనవపద్మము శోషిల సుస్వరం
బుగా । వనజదళాక్షి యేడ్చెనని వారణఁ ద్వీపినాంతరంబునన్ ॥ ఉ ॥ హా నరనాథ హా సుమహితాత్మక హా గుణశాలి యింక
నంభోనిధిమేఖలాకలితభూమి యధార్మికరాజచోరపీడానిరలింగ్యశింపనకటా తగునయ్య యుపేక్ష సేయశో । భానయ
శాలి నీవు పరిపాలన సేయుము లెమ్ము భూవరా ॥ చ ॥ అని విలపించుచున్న సరసిజాక్షి నిజేశుపదారవిందముల్ । దననిటలంబు
సోఁకఁ బరితాపమునం బడి బిట్టు చాలరో । దన మొనరించుచుండగ నిదారువులన్ జితిఁ బేర్చి యందులోఁ । బెనుపగు తత్కళేబర
ముఁ బెట్టి శిఖిం దరికొల్పి యివ్వులన్ ॥ క ॥ తాననుగమనము సేయం । బూనిన చోనంతలోనఁ బూర్వసఖుఁడు వి । జ్ఞానస్వరూపుఁ
డనలుఁడు । నైనధరాదివిజుఁ డొక్కఁడబలం గనియెన్ ॥ క ॥ చనుదెంచి యత్తలోదరి । సునయోక్తులననునయించుచుండగ న
నియెన్ । వనితా నీ వెవ్వతె వెవ్వని దానవితం డెవండు వగ చెద వేలన్ ॥ క ॥ అని యడుగుచు వెండియు ని । ట్లనియెను నే సృష్టిపూ
ర్వమందును నీవే । వ్వనితోడి సఖ్యసౌఖ్యం । బనవరతంబనుభవించి తట్టి సఖుండన్ ॥ క ॥ నన్నెఱుఁగుదే నిమనమున । నన్నె
ఱుఁగకయున్న నైన నలినదళాక్షీ । నన్నుఁ బురాతనసఖునిఁగ । నెన్నం గలదాన వైన నెఱుఁగవె చెపుమా ॥ వ ॥ కావున నీవు
నేనునుం బూర్వంబునందు మానసనివాసుల మైన హంసల మైయుండి గృహంబుఁ బాసి సహస్రవత్సరంబులు సఖుల మై వ
ర్తించుచునంత నీవు నన్నుం బాసి భౌమభోగరతుండవై పదంబు నిచ్ఛయించుచు మహీమండలంబు గలయం గ్రుమ్మఱుచు నప్పుడొ
క్క కామినీనిర్మితంబు పంచారామంబు నవద్వారసమేతంబు నేకపాలకంబు త్రికోష్ఠంబు షట్కులంబు పంచవిపణంబు పం
చప్రకృతియు స్త్రీనాయకంబు నైన యొక్క పురంబు వొడగంటి వదియెట్టి దనినం బంచారామంబులనం బంచేంద్రియా
ర్థంబులు నవద్వారంబులన నాసికాదిద్వారంబులు లేకపాలకంబనం బ్రాణపాలనంబు త్రికోష్ఠంబులనం దేజో భిన్నంబులు
షట్కులంబులన నింద్రియసంగ్రహంబు విపణంబులనం గర్మేంద్రియంబులు పంచప్రకృతియన భూతంబులు ప్రకృతియను కామి
నియన బుద్ధి యిట్టి పురంబునం బ్రవిష్టుండైన పురుషుండంగనాపరతంత్రుండై యజ్ఞుండగు నీవు నప్పురంబునం గామినీసంస్పృ
ష్టుండవై రమియించుచుఁ దత్సంగమంబున నష్టస్మృతివై పురంజనవై దర్భిజనసంభావితసుఖాభాసంబులగు దుఃఖంబులచేని
ట్టిపాపిష్ఠంబైన దశం బొందితివి గావున ॥ సీ ॥ నీవు వైదర్భివి గావు వీరుఁడితండు వివరింపఁగాఁ గాఁడు విభుఁడు నీకు । నొగి మున్ను
బురమున నుపరుద్ధుఁ జేసిన యా పురంజనపతివరయఁ గావు । మఱియు నీవన్యసీమంతినియని యనుజర్చింపఁగా బూర్వజన్మ
మందుఁ । బురుషుండవని యనుబుద్ధిఁ దలంచుట యరయంగ నీయుభయమున సత్య । మింతయును మామకీనమై యొసఁగుమా
యఁ జేసి కల్పితమయ్యెఁ జర్చింపమనము । పూర్వమున హంసలమనియుఁ బూని యెఱుఁగ । బలికితిఁ దెలియ మనలరూపంబుఁ
జూడు ॥ వ ॥ ఏ నీవు గానియన్యుండవు గావు నీ వే నేఁ గాని యన్యుండం గాని ట్లెఱుంగుము విద్వాంసులు మనయిద్దరియందు
నంతరంబు నీక్షింపరు పురుషుండు దన్నొక్కని నెయ్యాదర్శచక్షువులందు భిన్నరూపులుగాఁ దలంచు చందంబున మనయిద్దరి
కిని భేదంబు గలిగినయట్లు దోఁచు నని యివ్విధంబున నతండతనిచేత నీవు పూర్వంబున మదీయ సఖుండవై న హంసవని తెలుపం
బడి స్వస్థుండై తద్వియోగనష్టంబైన జ్ఞానంబు గ్రమ్మఱం బొందెనని చెప్పి నారదుండు ప్రాచీనబర్హిం జూచి యీ యాధ్యాత్మ

*ఉపరతుండయ్యెన్ । శాంతినొందినవాఁడాయెను-మరణమొందెనని భావము—శ్రీమూష్మత । వేడిమి, యూథభ్రష్ట । తనజాతిగుంపునుండి తొలఁగిన.

ను। గైకొని తామసకర్మంబుననుదవశోకమోహావృతంబగు లోకములను। బొందుచుం బుంస్త్రీనపుంసకమూర్తులదేవ తిర్యఙ్మర్త్యభావములను। గలుగఁగ గర్మానుగుణములుగాఁగ జగతిఁ। బుట్టిచచ్చుచుఁ గ్రమ్మఱఁ బుట్టునట్లు। దివిరి కామాశయుండయిన దేహియప్పు। డున్నతోన్నతపదవుల నొందుచుండు॥ అనిమఱియు నిట్లనియె॥ మ॥ ఎనయం గాఁ క్షుత్పరిపీడఁ గుందిశునకం బింటింటికిం బోవఁ బూ। నినఁ దద్దైవికమైన దండహతిగానీ కాకచౌర్యాన్నమై। నను గానీ తగఁ బొందుచందమున నవెన్నఁ డైవయోగంబు పెం।పున నీజీవుఁడు దా ప్రియాప్రియములం బొందున్ద్రిలోకంబులన్॥ చ॥ గొనకొని యెట్టిదుఃఖములకుం బ్రతికారము మానవేంద్రక।ల్గినవినుతతత్ప్రతిక్రియ నకించనవృత్తి జనుండు మస్తకం।బుననిడు మోఁపు మూఁపునను బూనినఁ దద్భరదుఃఖమాత్మఁ బా।యనిగతి జీవుఁ డుం ద్రివిధమైనతగు దుఃఖముఁ బాయఁ డెన్నఁడున్॥ క॥ ఘనదుఃఖహేతుకర్మం।బున కత్ప్రతికారకర్మమును వినియుతమాయా।జననములగుటను బుధు ఘటా।ననుఁ గలలో వోవు చినట్టికలచందమునన్॥ వ॥ సవాసనోచ్ఛేదకంబుగాదని వెండియు నిట్లనియె॥ సీ॥ నరనాథ వినుము స్వప్నంబుచందంబున నజ్ఞానవిలసితంబగుటఁ జేసి। తపిరిమిథ్యాభూతదేహాదికమునకు నరయ నివర్తనాయాసమేటి। కనియంటి వేనియు నర్థంబు లేకున్న నర్థిసోపాధికంబైన మనము। వాంఛతో స్వప్నము వర్తింపఁ బురుషునిం బూని జాగ్రద్బోధ చేను పాధి। చెడక స్వాప్నికసంసృతి విడువనట్లు। తత్త్వవిజ్ఞానమున నవిద్యానివృత్తి। ద్వారదేహాదికనివృత్తి గలుగకున్నఁ। దివుట సంసృతి దానివర్తింపకుండు॥ చ॥ ఘనపురుషార్థభూతమునఁ గాఁదగు నాత్మకు నేనిమిత్తమై। యొనరిననర్థహేతువననూల్పానుసంసృతి సంభవించిన।ట్లనయము దన్నిమిత్తపరిహారక మర్థి జగద్గురుండనా। దనరిన వాసుదేవపదతామరసస్ఫుటభక్తియారయన్॥ క॥ ఘనసినతత్కృతభక్తి నమి। దీనగతిం దెలియఁగ నఘు విరవైరాగ్య।జ్ఞానజనకమగు భక్తిని। ధ్యానము గోవిందవరకథాశ్రయమగుటన్॥ వ॥ కావున నదిసన్మ-థాకర్ణనగాననిరతుండు విశ్వాససంయుక్తుండునై సవానికి సంభవించు మఱియును॥ క॥ ధరసాధులు విమలాంతః। కరణులు భగవద్గుణానుకథనశ్రవణ।స్ఫురితస్వాంతులు ననఘులు। పరధివణులునైన భాగవతజనసభలన్॥ క॥ సరసోదారమహాత్మము।ఖరితములగు మధువిరోధికమనీయగుణో।త్కరసుధి చరితామృత।పరిపూరిత వాహినులు ననుబరమప్రీతిన్॥ క॥ మనములరఁగ శ్రోత్రాంజలులను బానము సేయు పుణ్యులకు తృష్ణా।ఘనభయశోకవిమోహము।లనయంబును సోఁకకుం।డునవనీనాథా॥ వ॥ కావున నిట్టిభాగవతసహవాసంబు లేక తనంతన భగవద్భాగవత గుణాభివర్ణనకథాను చింతనామయంబు ప్రవర్తించిన నానస్యాది దోషంబులం బొందియీ జీవలోకంబు సహజక్షుధాదికంబు ననుపద్రుతంబై సర్వేశ్వరకథామృతవాహినియందు రతిం జేయదిది నిశ్చయంబని మఱియు నిట్లనియె॥ సీ॥ పద్మసంభవుఁడును భవుఁడును మనువులు నమితదక్షాదిప్రజాపతులును। నైష్ఠికులైన సనకముఖ్యమునులును బులస్త్యుండు భృగుపులహుండు గ్రతువు। నత్రి మరీచియు సంగిరసుండు నరుంధతీవిభుఁడును మొదలైన బహువుణ్యు లేగడపలఁగాఁగల బ్రహ్మవాదులు నందఱు వాక్సమితికి। నెనయి నీశ్వరులై యుండియును సదగ్ర।హతపోయోగవిద్యాసమాధివరవి।చారులై యుండియును సర్వసాక్షియైన। యీశ్వరుని వెదకియుఁ గాన సిద్ధచరిత।మది యెట్లంటేని॥ శా॥ ఘనవిస్తారమపారమవ్యయమనంగా నొప్పువేదంబు దా। మునుప ర్తించు మంత్రయుక్తి వివిధంబైనట్టి దేవాఖ్యశో।భనసామర్థ్యము చేత నింద్రముఖరూపం బిట్లదైవంబుగాఁ। గని వేర్వేరం భజియించువారలు గనంగా నేర్తురే యీశ్వరున్॥ క॥ తనుమాత్మ భావించుండవ। నెనసిన భగవంతుఁ డెప్పు డెవ్వనిఁ గరుణిం। చనరుచు ననుగ్రహించును। మనుజేశ్వర యపుడు వాఁడు మహితాత్మకుఁడై॥ క॥ ధీరత నీలోకవ్యవ।హారంబును వైదికంబు ననఁదగుకర్మా।చారములందు వినిష్ఠిత।మైరూఢిఁ దనర్చు బుద్ధి నధిష్ఠించున్॥ సీ॥ కావున రాజేంద్ర నీవును బరమార్థరూపంబులగుచుఁ బ్రరోచమానములును గర్ణప్రియంబులు నగుచున్నస్పష్టవస్తువులును నగువగలు కర్మ।ములయందుఁ బరమార్థబుద్ధి గావింపకు మతిఘనస్వాంతులైనట్టి వారు।పరగు జనార్దనప్రతిపాదకంబైన శ్రుతిఁ గర్మపరమని చూపుచుండు। వారు వేజ్ఞులనఁదగువారుగారు। రూఢిమఱి వారు నిత్యస్వరూపభూత।మైనయీయాత్మతత్త్వంబునను వేద।కలితతాత్పర్యమున యాత్మఁ దెలియలేరు॥ వ॥ కావునం బ్రాగగ్రంబులైన దర్భలచేత సకలక్షితిమండలాస్తరణంబుగావించి యహంకారయుక్తుండవు నవినీతుండవునై పెక్కు పశువులఁ జంపనే కానీ కర్మస్వరూపంబును విద్యాస్వరూపంబు నెఱుంగవు కర్మవిద్యాస్వరూపంబులెట్టివనిన సర్వేశ్వరపరితోషకం బేదియది యకర్మంబు సర్వేశ్వరునియందు నేమిటమతి సంభవించునదియ విద్య యతండే దేహులకు నాత్మయు నీశ్వరుండును నగుచుండుఁ గావున నంబురుషులకు శుభకరంబైన యాశ్రయంబు దత్పాదమూలంబయితండు ప్రియతముండు సేవ్యమానుండు నగుచుండ నణుమాత్రంబైన దుఃఖంబు లేదట్టి యీభగవత్స్వరూపం బెవ్వం డెఱుంగువాఁడు విద్వాంసుండు గురుండు హరియునని చెప్పి వెండియు నిట్లనియె॥ క॥ అవనీశ యీవిధంబున భవదీయప్ర

శ్నమిట్లుపరిహృతమయ్యెఁ।దవిలియిఁకనొక్క గోప్యము।వివరించెదఁజి త్తగింపువిమలచరిత్రా॥సీ॥ లలిసుమనోవాటికల
యందునల్పప్రసూనమరందగంధానుమోద।సంచారితమధ్యగీసహితముఁదన్నివేశితచిత్తమునుమధువ్రతనినాద। మే
మరశ్రవణానుమోదితమును బురోభాగచరన్నిజప్రాణహారి। దీపితవృకగణాధిష్ఠితమునులుబ్ధకక్రూరఘనసాయకప్ర
భిన్న।పృష్ఠభాగము నైమనంబుననుమృత్యు।భీతివాటింప నెండుదప్పింప వెరవు।గానకడవిఁజరించుమృగంబుపగిది।భూమవ
రోత్తమవినుమయ్యపురుషుఁడెపుడు॥వ॥ అంగనానివాసంబులయందుఁ దూగ్రతమంబగుకామ్యకర్మపరిపాక జనితంబైన
జిహ్వోపస్థాదికామజనితసుఖలేశంబునన్వేషించుచుఁగామినీయుక్తుండుదన్నివేశితమానసుండునతివమోహరవ
నితాజనాలాపశ్రవణతత్పరచిత్తుండుప్రత్యక్షంబుననాయుష్హరణకారణాహోరాత్రాదికాలవిశేషగణనాపరుండు
గాకపరోక్షంబునంగృతాంతశరనిర్భిన్నగాత్రుండునగుచునీజీవుండువిహరించుచుండుంగావున నీవునీజీవునిమృగచేష్టి
తునిగవిచారించిశ్రోత్రామలంబన్నశబ్దాదులంబోలెబాహ్యవృత్తులగుశ్రౌతస్మార్తాదిరూపంబగుకర్మంబునుహృదయం
బునందునియమించుచునసజ్జనయాథవార్తాసహితంబైనగృహాశ్రమంబువిడువుముసకలజీవాశ్రయుండైనయీశ్వరు
సిభజియింపుమిట్లుసర్వతోవిరక్తుండవుగమ్మనినారదుండువలికినంబ్రాచీనబర్హియిట్లనియె॥క॥ మునివరభగవంతుండవు।
నెనుపమవిజ్ఞాననిధివిననఁదగునీచేఁతనువివరింపంగాఁదగి।యెనసినయీయాత్మతత్త్వమిటునాచేతన్॥ వ॥ శ్రుతంబువిచా
రితంబునయ్యెఁగర్మనిష్ఠులగునుపాధ్యాయులైనవారలీయాత్మతత్త్వంబునెఱుంగ రెఱింగిరేని నుపదేశింపరు కావునఁద
త్కృతంబైనమహాసంశయంబునీచేతనివృత్తంబయ్యెననివెండియునిట్లనియె॥ సీ॥ అనఘాత్మయెమ్మిటియందునీయింద్రి
యవృత్తులుదగఁబ్రవర్తింపఁజుండుటను జేసిఋషులైనఘనముగమోహింతురట్టియర్థమునందునాత్మసంశ । యముగ
ల్గుచున్నదియదియెట్టిదనిననుబురుషుఁడేయే దేహముననుజేసి । కర్మములేసితతాకయంబునీలోకమందునేఁపిడిచితాన
న్యదేహమ।మర్థితోఘటియించిలోకాంతరమును। బొందితత్కర్మఫలమునుబొందుననుచుఁ। బ్రకటముగవేదవేత్తలుపలు
కుచుందు।రన్ననదియెట్లువిననుపపన్నముగును॥వ ॥ అదియునుంగాకయాచరితంబైనకర్మంబుదక్షణంబుననవినష్టంబగు
టంజేసిదేహాంతరంబున లోకాంతరగామియైనఫలంబెట్లనుభవించుననిన బర్హిష్మంతునకునారదుండిట్లనియెనరేంద్రా
స్వప్నావస్థయందులింగశరీరాధిష్ఠాతయైనజీవుండుజాగ్రద్దేహాభి మానంబువిడిచితాదృశంబకాని యతాదృశంబకాని
యైనశరీరాంతరంబునొందిమనంబునందుసంస్కారరూపంబుననాహితంబైకర్మంబుననుభవించుచుండుంబునంబురుషుం
డేలింగశరీరంబునంజేసికర్మంబునాచరించునాలింగశరీరంబుననేలోకాంతరంబునదేహావిభేదంబునొందకతత్ఫలంబను
భవించునదియునుంగాకదానప్రతిగ్రహాదులయందుస్థూలదేహంబునకుంగర్తృత్వంబుగలదంటివేని నహంకారమమ
కారయుక్తుండైనపురుషుండుమనంబునంజేసియేయేదేహంబుపరిగ్రహించునాయాదేహంబునసిద్ధంబైన కర్మంబాజీ
వుండనుభవించునట్లుగాకున్నఁగర్మంబుపునర్భవకారణంబగుటయుపపన్నంబుగాకుండుఁగావునమనఃప్రధానంబైనలిం
గశరీరంబునకెకర్తృత్వంబుపపన్నంబగుననివెండియునిట్లనియె॥ క॥ క్షితినుభయేంద్రియకర్మ। స్థితులనుభవమందఁబడి
నచిత్తముపగిదిన్।ధృతిఁజిత్తవృత్తులనులక్షితమగుఁదత్పూర్వదేహకృతకర్మంబుల్ ॥వ॥అదియెట్లనిననీదేహంబునంజేసి
యేరూపంబునేప్రకారంబునెప్పుడునెచ్చటననుగునదియయనుభూతంబునదృష్టంబునశ్రుతంబు నైయుండునట్టిదియొకా
నొకకాలంబునవాసనాశ్రయుండయినపురుషునకుఁదదనుభవాదియుక్తంబగుపూర్వదేహంబుననునుభూతంబుదృష్టం
బుశ్రుతంబుననివిశ్వసింపుమీమనంబుననను భూతార్థంబుగోచరింపఁజాలదీమనంబె పురుషులకుశుభాశుభ నిమిత్తంబు
లైనపూర్వాపరదేహంబులంబ్రకాశింపంజేయుచుండునీమనంబునందునదృష్టంబునశ్రుతంబునైనయర్థంబుస్వప్నాది
కమందుఁదోఁచునంటివేనినదిదేశకాలక్రియాశ్రయంబనితలంపందగుసమస్తవిషయంబులుగ్రమానురోధంబునమనం
బునంజేసిభోగ్యంబులగుననిమఱియు॥చ॥సుమహితశుద్ధసత్త్వగుణశోభితమన్సరసీరుహోదరో। త్తమగుణచింతనాప
రముధన్యమునైనమనంబునందుభూ।రమణసుధాంశునందునుపరాగమునద్దివిఁదోఁచురాహువుచం। దమునను గోచరంబ
గునుదారతనీయఖిలప్రపంచముల్॥వ॥అనివెండియునిట్లనియె లింగదేహమునకుఁ గర్తృత్వభోక్తృత్వంబులుస్థూలదే
హద్వారకంబులగుటంజేసిస్థూలదేహవినాశనంబుగలుగంజీవునకుఁగర్తృత్వభోక్తృత్వంబులు లేకుండుటంజేసిముక్తి
గలుగునంటివేనినీస్థూలదేహసంబంధంబుజీవునియందుబుద్ధిమనోమోహార్థగుణవ్యూహరూపాదిలింగశరీరభంగపర్యం
తంబుగలుగుచుండునుసుషుప్తిమూర్ఛాదులయందునిష్టపియోగాదిదుఃఖమందునహంకారంబు గలిగియుండునదియుం
ద్రియోపహతింజేసియమావాస్యయందుజంద్రునింబోలితరుణపురుషునకుగర్భబాల్యావస్థలయందునింద్రియపాటవ

ల్యంబు లేకుండుటం జేసియు కాదశేంద్రియస్ఫురణసమర్థంబైనయహంకారంబు గర్భాదులకుఁ బ్రకాశింపనిచందంబున నందోపకుండుంగావున స్థూలదేహవిచ్ఛేదకంబు లేకుండుటం జేసి వస్తుభూతార్థంబు లేకున్న యీసంసారంబు విషయంబులయందాసక్తుండగుజీవునకు స్వాప్నికానర్థాగమనంబుచందంబున నివర్తింపదు తీరున నఁబంచతన్మాత్రాత్మకంబును ద్రిగుణాత్మకంబును షోడశవికారాత్మకంబును విస్తృతంబైన లింగశరీరంబు నధిష్ఠించి చేతనాయుక్తుండైన జీవుండని చెప్పంబడు మఱియు॥ సీ॥ తివిరి యప్పురుషుండు దేహంబునను జేసి యనయంబుఁ బెక్కు దేహాంతరముల। నంగీకరించుచు నది విసర్జించుచుసుఖదుఃఖభయమోహశోకములను। బురుషుండు దద్దేహమున నెపొందుచునుండు నదియెట్లు లన్నను నగ్రభాగ। తృణము నూఁది మఱి పూర్వతృణపరిత్యాగంబుగావించు తృణజలూకయును బోలి। జీవుఁడవని గొంతజీవించి మ్రియమాణుఁ డగుచునుండ దేహమర్థిఁ జెందు। కాని పూర్వమైన కాయంబు విడువడు। గాన మనమె జన్మకారణంబు॥ తరల॥ నరవరోత్తమ యట్లుగాన మనంబె జీవులకెల్ల సంసరణకారణమట్టి కర్మవశంబునన్ సకలేంద్రియా। చరణుఁ డౌట నవిద్య గల్గును సంతతంబు నవిద్యచేఁ। బడగుట న్నహుదేహకర్మనిబంధముల్గలుగుం జుమీ॥ చ॥ వినుమ దిగాన భూవర యవిద్య లయించుటకై రమాపతిన్। ఘనజననస్థితిప్రళయకారణభూతునిఁ బద్మపత్రలో। చనుఁ బరమేశు నీశ్వరుని సర్వజగంబు దదాత్మకంబుగాఁ। గనుఁగొనుచుం దదీయపదకంజములన్ భజియింపు మెప్పుడున్॥ క॥ అని యాగతిభగవంతుం। డనఘుఁడు భాగవతముఖ్యుఁ డగు నారదుఁడా। ఘనునకుఁ జీవేశ్వరగతి। ఘనకృప నెఱిఁగించి సిద్ధగతిఁ జనినయెడన్॥ సీ॥ రాజర్షియైనట్టి ప్రాచీనబర్హి స్సుదగఁ బ్రజాపాలనార్థంబు సుతుల। ధరకు నియోగించి తాఁ దపంబునకునై కపిలాశ్రమంబునకరిగి వేగ। నచ్చటనియతనేకాగ్రచిత్తుండును ముక్తసంగుండును భూరిధైర్య। యుక్తుండునగుచును భక్తియోగంబునన నఘ గోవిందపదారవింద। చింతనామృతపానవిశేషచిత్తుఁ డగుచు విధిరుద్రముఖ్యులకందరాని। యవ్యయానందమయపదమందె నప్పు। డనుచు మైత్రేయముని విదురునకుఁ జెప్పి॥ వ॥ వెండియు నిట్లనియె నిట్లు ముకుందయశంబునం జేసి భువనపావనంబు మనశ్శుద్ధికరంబు సర్వోత్కృష్టఫలప్రదాయకంబు దేవర్షివర్యముఖవినిస్సృతంబును నైన యీయాధ్యాత్మపారోక్ష్యంబు నెవ్వండు పఠియించు నెవ్వండు వినునట్టివాఁడు లింగశరీరవిధానంబుగావించి ముక్తసమస్తబంధుండై విదేహకైవల్యంబు నొంది సంసారంబునందుఁ బరిభ్రమింపం బడండని

## శ్రీ ప్రచేతసుల తపంబునకు భగవంతుండు మెచ్చి వరంబు లిచ్చుట.

మైత్రేయునకు విదురుండిట్లనియె॥ క॥ మునినాథ ప్రచేతస్కులు। ఘనముగ రుద్రోపదిష్టకమలోదరకీ। ర్తనమున నేగతిఁ బొందిరి। వనజాక్షుఁడు సంతసింప వారనఘాత్మా॥ గీ॥ కడగి మఱి వారు యాదృచ్ఛికమునఁ జేసి। హరికి నిత్యప్రియుండగు హరునిఁ గాంచి। యతనివలన ననుగ్రహ మంది మోక్షు। మందిరని చెప్పి తదనిశ్చయంబు మఱియు॥ క॥ హరిదర్శన పూర్వంబిహ। పరలోకములం దనా నృపాలతనయులం। దిరి యేఫలములనం దట। నిరతి నెఱింగింపు మనమునీంద్రుఁడు వలికెన్॥ క॥ వినుజనకాదేశమును దలఁ। దాల్చి నృపాత్మజులు సముద్రోదరమం। దనుపమజపయజ్ఞంబున। ఘనతరదపంబు నియమమున నొంచుచునుండన్॥ క॥ పదివేలేఁడులు నిష్ఠను। వదలక తపమాచరింప వారలకర్థి। న్సదయాంతరంగుఁ డభయ। ప్రదుఁడు సనాతనుఁడునై నపద్మోదరుఁడున్॥ క॥ అనుపమ శాంతములగు నిజ। తనురశ్ములచే నృపాలతనయతపోవే। దనలు శమింపఁగఁ జేయుచు। ననయముఁ బ్రత్యక్షమయ్యె నచ్యుతుఁ డంతన్॥ సీ॥ ఘనమేరుశృంగసంగతమైన మేఘంబు నెఱిగరుడస్కంధనివసితుండు। గమనీయనిజదేహకాంతివిస్ఫాటితాఖిలాఖిలాశాంతరాళతముఁడు। సుమహితాష్టాయుధసుమనోమునీశ్వరసేవకపరిజనసేవితుండు। మండితకాంచనకుండలరుచిరోపలాలితవదనకపోలతలుఁడు। చారునవరత్నదివ్యకోటీరధరుఁడు। కౌస్తుభప్రవిలంబమంగళగళుండు। లలితపీతాంబరప్రభాలంకృతుండు। హారకేయూరవలయమంజీరయుతుఁడు॥ క॥ లలితాయతాష్టభుజమం। డలమధ్యస్ఫురితరుచివిడంబితలక్ష్మీ। లలనాకాంతిస్పర్ధా। కలితలసద్వైజయంతికాశోభితుఁడున్॥ క॥ సురగరుడయక్షకిన్నర। నిరుపమగేయమాననిఖిలదిశాసం। భరితయశోమహనీయ। స్ఫురణుఁడునగు నప్పురాణపురుషుం డెలమిన్॥ క॥ కరుణావలోకనంబుల। నిరవొందన్నృపాలసుతుల నీక్షించి రమా। వరుడంబుదగంభీర। స్వరభాషలఁ బలికెఁ బ్రియము దూకొనుచుండన్॥ గీ॥ తాపసోత్తములగు ప్రచేతస్కులార। వినుఁడు మీరలు సౌహార్దమున నభిన్న। ధర్ములగుట భవత్సౌహృదమున కేను। జాలఁ బరితోషమందితి సమత నేఁడు॥ క॥ అనయమును మీమనోరథ। మొనరింతు నెఱుంగఁ బలుకుఁడుత్తములగు మి। మ్మనుదినమేనరుఁడు సుఖశ। యనుఁడై సుదిలోఁ దలఁచునా నరుఁడెపుడున్॥ క॥ భ్రాతృజనసౌహృదంబును। భూతదయాగుణము విమలబుద్ధియు సుజన। ప్రీతియుఁ గల్గి సుఖించును। వీతసమస్తాఘుఁ డగుచు విశ్వములోనన్॥ వ॥ మఱియు రుద్రగీతంబైన మదీయస్తవంబెవ్వరనుదినంబును స్తోత్రంబు సేయుదురు వారలకభిమతవరంబులు శోభనకరంబగు ప్రజ్ఞయు నిత్తు మీరలు ముదన్వితు

లైజనకాదేశంబంగీకరించుటం జేసి మీకీర్తి లోకంబుల విస్తరించు మీకున నూనబ్రహ్మగుణుండు నాత్మసంతతిం జేసి లోక
త్రయపరిపూర్ణగుణాకరుండు నైనపుత్త్రుండు సంభవింపంగలండు కండుమహాముని తపోవిఘ్నార్థంబుగా నింద్రు విచే
తఁ బ్రేరితయగు ప్రమ్లోచయను నప్సరసగర్భంబు దాల్చి యమ్మునీంద్రు నివీక్షించి దివంబునకుం జను సమయంబునం బ్రసూ
తయైన తత్పుత్త్రి నివృక్షంబులందుఁ బెట్టి చనిన॥ సీ॥ ఆశిశువపుడు పేరాఁకలిచేఁ గుంది వాత్రుచ్చి బిట్టుగ వగచుచుండ। నాలించి
యగమురాజైన సోముఁడు వచ్చి వలనొప్పనవసుధావర్షియైన। యాత్మీయతర్జని నర్థిఁ బానమ్ము సేయింపంగఁ బెరిగి యయ్యిం
దువదన। కన్యవరారోహ గడకమారిష యను చెలువఁ బుణ్యుండు ప్రాచీనబర్హి। రాజుచేతఁ బ్రజావిసర్గంబునందుఁ। బూ
నివేడ్కఁ దదాదిష్టులైన మీర। లందఱును నెయ్యమున వివాహంబుగండ। నియు సరోరుహనయనుఁ డిట్లనియె మఱియు॥ వ॥ అ
నఘాత్ములారా యభిన్నధర్మశీలురైన మీకునందఱకు నీసుమధ్యమయైన కన్య యభిన్నధర్మశీలయు భవదర్పితాశయయు నై
నభార్యయగు మీరలప్రతిహతతేజస్కులై దివ్యవర్షసహస్రంబులు భౌమదివ్యభోగంబులు మదనుగ్రహులై యనుభవిం
చెదరంత నాయందమలభక్తిం జేసి నిర్మలాంతఃకరణులై యీభోగంబులు నిరయప్రాయంబులుగాఁ దలంచి మదీయస్థానం
బు నొందెదరని వెండియు నిట్లనియె॥ చ॥ అరయ గృహస్థులయ్యు మదర్పితకర్ములు నస్మదీయసుందరచరితామృతశ్రవణత
త్పరమానసయాతయాములు। స్సరసగుణాఢ్యులై తనరు సాధులకీ గృహముల్దలంపమ। ప్పరభవబంధహేతువులు గావు మ
హాత్ములార యెన్నఁడున్॥ అదియెట్లంటిరేని॥ చ॥ అనుపమ బ్రహ్మవాదులగు నంచితయోగిజనానుగేయమా। ననిజకథాసు
ముత్సుకుఁడనందగు నేను మదీయులందనూ। తనముగనుండుఁ గావునను దారత వారికి నీ గృహావళుల్। ఘనభవబంధహేతు
వులు గావిదియంతయు నిక్కమూరయన్॥ క॥ సరసుఁడనగు నన్నుఁ బొందిన। పురుషులు ఘనశోకమోహమోదంబులఁ బొంద
రు గావున నెనయఁగను త్రిపురుషాధీశ్వరుఁడ బ్రహ్మభూతుఁడ నగుటన్॥ వ॥ అని యిట్లు పలుకుచున్న పురుషార్థభాజనుండ
గు జనార్దనుని దర్శించి తద్దర్శనవిధ్వస్తరజస్తమోగుణులైన ప్రచేతసులు॥ చ॥ కరసరసీరుహంబులెసకంబెసఁగన్ ముకుళించి
గద్గద। స్వరములఁ జేసి యిట్లనిరి సర్వశరణ్యు నగణ్యు నిందిరా। వరు నజితుం గుణాఢ్యు ననవద్యచరిత్రుఁ బవిత్రు నచ్యుతుం।
బరుఁ బరమేశు నీశు భవబంధవిమోచనుఁ బద్మలోచనున్॥ సీ॥ కేశవ సంతతక్లేశనాశనుఁడవు గుణమయ నమ్మనోవాగగోచరుఁడ
వు। సిద్ధమనోరథహేతుభూతోదారగుణనాముఁడవు సత్త్వగుణుఁడ వఖిల। విశ్వసృష్టిస్థితివిలయార్థధృతనిత్యవిపులమా
యాగుణవిగ్రహుఁడవు। మహితాఖిలేంద్రియమార్గనిరధిగతమార్గుఁడ వతిశాంతమానసుఁడవు। తపితసంసారహారిమేధ
స్కుఁడవును దేవదేవుఁడవును వాసుదేవుఁడవును। సర్వభూతనివాసివి సర్వసాక్షి। వైన నీకు నమస్కారమయ్య కృష్ణ॥ మఱి
యును॥ ఉ॥ తోయరుహోదరాయ భవదుఃఖహరాయ నమోనమః పరే। శాయ సరోజకేసరపిశంగనిర్మలదివ్యభర్మవ।
స్త్రాయ పయోజసన్నిభపదాయ సరోరుహమాలికాయ కృ। ష్ణాయ పరాపరాయ సుగుణాయ సురారిహరాయ వేధసే॥ అ
నివినుతించి॥ చ॥ కమలదళాక్ష దుఃఖలయకారణమైన తగుతావకీనరూ। పము ననివార్యదర్శనవిపద్దశ దుఃఖము నొందు మా
కును। సుమహితసత్కృపాగరిమఁ జూపుట కింతెనను గ్రహంబులో। కముఁ దలంప నొండొకటి గల్గునె భక్తిఫలప్రదాయ
కా॥ ఉ॥ భూరివివేకితావహవిభూతిసమేతమహాత్మదీనర। క్షారతనొప్పు నీవు చిరకాలము నన్నుఖివృత్తిఁ జిరుమా। వారలటం
చు బుద్ధిననవద్యదలంచిన యల్పమాత్రస। త్కారమె చాలు నట్లగుటగాకిటు సన్నిధివైతివీశ్వరా॥ చ॥ అరయఁగ యోగ్రభూ
తహృదయంబులయందుమలనంతరాత్మవై। తిరముగనుండు నీవు భవదీయపదాంబురుహార్చనా। పరమతులైన మా
కును శుభప్రదభూరిమనోరథంబు లీ। వరుము గనీవె భక్తహృదయప్రముదప్రదముక్తిదాయకా॥ సీ॥ అయిన నుపినసరోజా
యతలోచన వరమోక్షమార్గప్రవర్తకుఁడవు పురుషార్థభూతవిస్తరుఁడవు నగు నీవు నగిలి ప్రసన్నుఁడవగుట మాకు। నర్థిమ
నోభీష్టమైనవరంబయ్యో నైనను నాథపరాపరుండ। వైనని న్నొకవరంబర్థింతుము నిను భువిం దావకీనవిభూతు లెన్న। నంత
మెఱుఁగంగరామి ననంతుఁడనుచుఁ బలుకుచురు నిన్ను సవిగానఁ బరమపురుష। యేవరంబని కోరుదు మేము దప్పిఁ గొన్న బాల
కుఁడర్థి నీ రెన్ని గోలు॥ అదియునుంగాక॥ ఉ॥ స్వామి భవత్పదాంబురుహమూలనివాసులమైన మేము మే। ధానిధి నీవిలోక
నముఁదకఁ గనన్య మెఱుంగనేర్తుమే। మానితపారిజాతకుసుమస్ఫుటనవ్యమరందలుబ్ధశో। భానయశాలియైన మధుపంబు
భజించునె యన్యపుష్పముల్॥ చ॥ హరి భవదీయమాయననయంబును జెందిన నేము నిచ్చలున్। గరమసురక్తినే దితుదగా
భవకర్మలమై ధరిత్రిపైఁ। దిరుగుదుమంతదాఁక భవదీయజనంబులతోడిసంగతిన్। స్థిరమతిజన్మజన్మములకున్ సమకూరఁగఁ జే
యుమాధవా॥ మ॥ కమలాధీశ్వర తావకీనవరభక్తవ్రాతసంసర్గలే। శముతోడన్ సరిగాఁ దలంప మెలమిన్ స్వర్గాపవర్గా
దిసౌఖ్యములన్ని మానుషంబులగు నీ కామంబులం జెప్పనే। లమునీంద్రస్తుతపాదపద్మ సుజనాలాపానుమోదాత్మ

కా॥ వ॥ మఱియు భగవద్భక్తసంగంబులయందుఁ దృష్ణాప్రశమనంబులైన వృష్టకథలు చెప్పఁబడుటఁ జేసి భూతంబులయం
దు వైరంబును ద్వేగంబును లేకుండు ననిన॥ చ॥ వనములముక్తసంగులగు వారనుతింపఁ దనర్తునీవు గా। పునఁ నిలఁ బుణ్యతీర్థ
ములనొప్పఁ బునీతము సేయఁ బూనియ। గ్గునిబవచారులై ధరఁజరించు భవత్పదభక్తసంగమం। బనుపమభూరి సంసృతిభయ
స్థునిబుద్ధి రుచింపకుండునే॥ కావున॥ చ॥ వనరుహపత్రలోచన భవత్సఖుఁడైన సుధాంశుమౌళితోఁ। జనిమిషమాత్రసంగతిఁగ
డింది వ్రణంబును దుశ్చికిత్స్యమా। ననుభవకష్టరోగమున కర్మిలి వైద్యుఁడవైన నిన్ను నే। మనయము జూడఁగంటి మిక్కృతార్థ
లమైతిగ మంటిమీశ్వరా॥ వ॥ దేవా మదీయస్వాధ్యాయాధ్యయనంబులు గురుప్రసాదంబు విప్రవృద్ధానువర్తనంబు నార్య
జననమస్కరణంబు సర్వభూతానసూయయు నన్నవిరహితంబుగా నేకకాలంబు దకంబులయందు సుతప్తంబయిన తపం
బు సేయుటయు నివియన్నియును బురాణపురుషుండవైన భవదీయపరితోషంబుకొఱకునగుం గాక యని విన్నవించెద మని
వెండియు నిట్లనిరి॥ మ॥ మనుపద్మాసనధూర్జటిప్రముఖధీమంతు ల్తపోజ్ఞానస। త్వనిరూఢిం దగువారు నీమహిమము న్వర్ణిం
పఁ బారంబెఱుం। గనివారయ్యును నోపినంత వినుతుల్గావింతు రట్లౌటనే। మునునిన్నర్థి నుతింతు మీశవరదా బుద్ధ్యాదిమూ
లంబుగన్॥ వ॥ అని మఱియు సముండవు నాదిపురుషుండవు శుద్ధుండవు పరుండవు వాసుదేవుండవు సత్త్వమూర్తివి భగవంతుం
డవు నైన నీకు నమస్కరించెద మనియిట్లు ప్రచేతస్సుల చేత నుతింపంబడి శరణ్యవత్సలుండగు హరి సంతుష్టాంతరంగుండై వార
లుగోరిన యట్ల వరంబు లిచ్చిన॥ తరల॥ అనయమాన్యపనందనుల్ముదమార సన్నుతిఁ జేయఁగా। మనములోఁ బరితోషమంది
రమాహృదీశుఁడు భక్తపా। లనకరుండు దదీయదర్శనలాలసాత్మకులాత్మలం। దనివిసాలక చూడ నాత్మపదంబుఁ జేరె రయం
బునన్॥ వ॥ తదనంతరంబ ప్రచేతస్కులు భగవదాజ్ఞ శిరంబులధరియించి సముద్రసలిలనిర్గతులయి॥ క॥ భూరిసమున్నతినా
క। ద్వారనిరోధంబుగాఁగఁ దగఁ బెరిగిన యా। భూరుహసంఛన్నాఖిల। ధారుణిఁ వీక్షించి రాజతనయులు వరుసన్॥ చ॥ ఘనకు
పితాత్ములై పిలయకాలభయంకర హవ్యవాహులో। చనుగతినుగ్రులై ధరణిచక్రము నిర్వసుధారుహంబుగా। ననయముఁ
జేయఁ బూని నిజనాథిపసూనుల మోములందుఁ దా। ననలసమీరముల్జననముందికుజంబులఁ గాల్పఁ జొచ్చినన్॥ క॥ నలినభ
వుఁడావహీజ। ప్రళయముఁ గని వచ్చి ధరణిపాలతనూజా। తులమధురోక్తుల ననుపశాం। తులఁ గావించుచు ననయము మూ
కొనఁబలికెన్॥ వ॥ అట్లుపలికి వారల నుపశమితక్రోధులం జేసిన యనంతరంబ॥ సీ॥ అవశిష్టధరణీరుహంబులు భయమందితివి
రిచతుర్ముఖాదేశమునను। మారిషయను సతీమణిఁ దమకూఁతురి నా ప్రచేతస్కులకర్థి నిచ్చి। రానరపాలకసూనులుదయను
కరయంగ మునునీశ్వరాపరాధ। మునఁ బ్రాప్తమైనట్టి జనపాలజన్మంబునకుఁ గారణంబైన నలినినయన। నాదరంబునఁ గను
లజునాజ్ఞఁ జేసి। కడఁక దీపింప విధివత్ప్రకారమునను। వరుసనందఱుఁ గూడి వివాహమైరి। గడవవచ్చునె దైవసంకల్పమెందు॥
క॥ కలదేమెంచఁ బదుగురుస్త్రీ। పులకిల నొక భార్యయందుఁ బొసఁగు నెపినఁగా। నలినోదరుఘనమాయా। కలితామ్నాత
ములకునతులుగావింపఁదగున్॥ వ॥ అంతం జాక్షుష మన్వంతరంబునదైవచోదితుండై యిష్టప్రజాసర్గంబు గావించుచుఁ
బ్రసిద్ధుండైనదక్షుండు పూర్వదేహంబు గాలవిద్రుతంబగుచుండఁ బ్రచేతస్కులకునమ్మారిషయను భార్యయందు సం
భవించి నిజకాంతిం జేసి సమస్తతేజోధనుల తేజంబును బిహితంబుగాఁ జేయుచుఁ గర్మదాక్ష్యంబున దక్షుండను నా
మంబు వహించి బ్రహ్మచేతం బ్రజాసర్గరక్షయందు నియోగింపంబడి మరీచ్యాదులం దత్తద్వ్యాపారంబులందు నియోగించి
యుండెనంత॥ సీ॥ ఒనరఁ బ్రచేతస్కులుత్పన్నవిజ్ఞానులగుచు వేగంబ నారాయణోక్తిఁ। దలఁచుచు నాత్మనందనుకడ నిజభా
ర్యనిడి వనవాసులై కడఁగి మున్ను। జాబలియను మునీశ్వరుఁడు సిద్ధుండైన భూమిఁ బశ్చిమవార్ధితీరమునను। సర్వభూతాత్మ
విజ్ఞానంబుగలయాత్మఘనవిమర్శకృతసంకల్పులైరి। యంతనచటికి సమ్మోనమతిశయిల్ల। నరసురాసురయక్షకిన్నరవరే
ణ్య। మానితోన్నతసంపూజ్యమానుఁడైన। నారదుండు వివేకవిశారదుండు॥ వ॥ చనుదెంచిన నిర్జితప్రాణమనోవాగ్దృ
ష్టులు జితాసనులు శాంతులు సమానవిగ్రహులు నిర్మలంబైన పరబ్రహ్మంబునందు వియోజితంబైన యంతఃకరణులునై
న రాజనందనులకడ నిలిచిన॥ క॥ చనుదెంచిన నారదమునిఁ। గనుఁగొని నృపసుతులు లేచి కౌతుకమొప్ప। న్వినమితులై సము
చితపూ। జనములఁ బరితుష్టుఁ జేసి సద్వినయమునన్॥ చ॥ అనఘమునీంద్రచంద్రభవదాగమనంబు సమస్తలోకశో। భన
మగు నస్మదీయమగు భాగ్యవశంబున నేఁడు విశ్వపా। వననినుఁ జూడఁగంటి మునివార్యభవద్భ్రమణంబు లోకలో। చను
గతిఁ బోలి ప్రాణులకు సర్వభయాపహరంబు గావునన్॥ అని మఱియు నిట్లనిరి॥ సీ॥ అనఘాత్మ భగవంతులైన కేశవవామదే
వుల చేసు పదిష్టమైన। యాత్మతత్త్వంబు గృహస్థులమగు మాకు సనయంబు విస్మృతంబైనయట్టి। యీశతత్త్వార్థప్రకాశకం
బును భూరిఘోరసంసారాబ్ధితారకంబు। నైకరము ప్పారునాత్మతత్త్వము నేఁడు చిరదయామతిఁ బ్రకాశింపఁ జేయు। మని

ప్రాచేతసుల కెల్లఁ బల్కెనఁ జెలంగి। భగవదాయత్తచిత్తుండు భవ్యగుణుఁడు। సకలలోకవిహారుండు నైనయట్టి। నారదుఁడు ప్రాచీనబర్హి రాకుమారులకును॥ సీ॥ చర్చింపనరులకీజన్మకర్మాయుర్మనోవచనంబుల దేవదేవుఁ। డఖిలవిశ్వాత్మకుండైన గోవిందుండు విలసిల్లు భక్తి సేవింపఁబడిన। నవియపో జన్మకర్మాయుర్మనోవచనములను ధరణి నెన్నంగఁ దగును। వనరుహనాభ సేవారహితములైన జన్మోపనయనదీక్షాకృతంబు। లైన జన్మంబులేల దీర్ఘాయువేల। వేదచోదితయగు కర్మవితతియేల। జపతపశ్శ్రుతవాగ్విలాసంబులేల। మహితనానావధానసామర్థ్యమేల॥ వ॥ మఱియు హరివిరహితంబైన యింద్రియపాటవంబు నిపుణమైన బుద్ధియుఁ బ్రాణాయామాదియోగంబు దేహాదివ్యతిరిక్తాత్మజ్ఞానంబు సన్న్యాసాధ్యయనంబులు దక్కిన వ్రతవైరాగ్యాదిశ్రేయస్సాధనంబులు నేల సర్వేశ్వరుండు సమస్తశ్రేయస్స్వరూపుండు సమస్తశ్రేయోవధిభూతుండు సర్వభూతావాసుండు సర్వభూతాత్మప్రముండు సర్వభూతప్రియుండు సర్వవ్యాపకుండును గావున॥ మ॥ కమలాధీశ్వరుఁ బూజ సేయుట సమగ్రప్రీతిఁ బ్రాణోపహారము సర్వేంద్రియతృప్తిహేతువును సర్వద్రుమాజమూలాభిషేకము శాఖాభుజపుష్టిదంబునగు రేఖ సర్వదేవార్హణక్రమమై యొప్పు ధరావరేణ్యసుతులారా బుద్ధినూహించి చిరన్॥ అదియునుం గాక॥ క॥ పెనుపగు వర్షాకాలంబున దిననాయకుని వలనఁ బొడమిన సలిలంబన యముఁ గ్రమ్మఱ గ్రీష్మంబున సూర్యుని యందు మడింగు పోలికె మఱియున్॥ క॥ ధరణిఁ జరాచరభూతము లరయఁగ జనియించి యందె యడఁగినపగిదిన్। హరిచేఁ బుట్టిన విశ్వము హరియందె లయంబు నొందు నదియట్లన్నన్॥ వ॥ అరుదౌ నభ్రతమఃప్రభల్ మునుప నభంబందొప్పఁగాఁ దోఁచియున్మిఱలం జూడఁగ నందె లేనిగతి బ్రహ్మంబందు నీశక్తులున్। బరికింపన్ ద్రిగుణప్రవాహమున నుత్పన్నంబులై క్రమ్మఱన్। విరతిం బొందుచునుండుఁ గావున హరిన్ విష్ణున్ భజింపందగున్॥ వ॥ మఱియును సమస్తదేహులకు నాత్మయు నిమిత్తభూతుండు నద్వితీయుండు శశ్వత్ప్రకాశుండు ప్రధానపురుషుండు స్వతేజోవిధ్వస్తగుణప్రవాహుండు మానసబుద్ధిసుఖేచ్ఛాద్వేషాదివికల్పరహితుండు నగుణుండు దేహాత్మభ్రమనివృత్త్యుపలభ్యుండు నాదిమధ్యాంతరహితుండు నిత్యానందస్వరూపుండు సర్వజ్ఞుండు పరమేశ్వరుండు నైన నారాయణు నభేదబుద్ధిం జేసి భజింపుం డతండు సర్వభూతదయాళువులునెంతమాత్రంబు సంభవించు నంతమాత్రంబున సంతుష్టచిత్తులు సర్వేంద్రియోపశాంతులు నగు పురుషులయెడ సంతుష్టుండగునని వెండియు నిట్లనియె॥ చ॥ చతురత నట్టి యీశ్వరుఁడు సజ్జనలోకనిరస్తసర్వకా। మితవిమలాంతరంగమున మిశ్రితభావనఁ జేసి సన్నిధా। పితుఁడగుచున్ దయాకరగభీరగుణంబులఁ జాల నెప్పియా। శ్రితజనపారతంత్ర్యమును జేకొని పాయకయుండు నిచ్చలున్॥ క॥ శ్రుతధనకులకర్మసమున్నతమదములఁ జేసి సజ్జనప్రతతికి సంతతమెగ్గొనరించుచు నుగ్రమతులర్థిం జేయు పూజ మతిఁ గొనఁ డెందున్॥ అదియెట్లనిన॥ సీ॥ వలనొప్పఁ దనుననువర్తించు నిందిరాకామినీమణిఁ దదాకాంక్షులగుచు। ధృతి ననువర్తించు దేవేంద్రముఖ్యుల నైన నెవ్వఁడు చూడఁ డాత్మనట్టి। నిత్యస్వతంత్రుని నిజభక్తవరదుని దీనవత్సలు గుణాధీశు నజునిఁ। బురుషోత్తము నిజగద్భరితు సర్వేశ్వరు నారాయణునిఁ జిదానందమయుని। సజితు నచ్యుతుఁ బుండరీకాయతాక్షుఁ। దవిలి సేవింపకుండు నే ధరఁ గృతజ్ఞుఁ। డైన పురుషుండు సమ్మోదితాత్ముఁ డగుచుఁ। జారుమతులార రాజకుమారులార॥ వ॥ అని మఱియు నిట్లనియె భవదీయవంశధుర్యుండు చిత్రరథుండు నగు ధ్రువుండు సపత్నీమాతృవాగ్బాణభిన్నహృదయుండై పంచవర్షార్భకుండగుచుఁ దపోవనంబునకరుగునప్పుడు మార్గంబున నాచేనుపదిష్టంబైన క్రమంబున భగవంతుండగు పుండరీకాక్షు నారాధించి యితరులచే నొందరాని సర్వోత్తమంబగు పదంబు నొందెఁ గాన మీరును రుద్రోపదేశక్రమంబున సర్వభూతాంతర్యామియగు నీశ్వరు భవచ్ఛేదంబునకై భజియింపుఁడు॥ క॥ అని యివ్విధమున నారదముని రాజకుమారులకును ముదము దలిర్పన్। సనజోదరు సచ్చరితము। వినిపించి సరోజభవుని వీటికిఁ జనియెన్॥ వ॥ ఇట్లు నారదుండు చనినయనంతరంబ॥ చ॥ నరవరనందనుల్ గడఁక నారదవక్త్రవినిర్గతంబు సుందరము సుమంగళావహము ధన్యము లోకమలాపహంబునై। పరగిన విష్ణుసద్యశము భక్తి నుతించి ముకుందచింతనా। నిరుపమభక్తిఁ జెందిహరి నిత్యపదంబునఁ బొందిరున్నతిన్॥ వ॥ అని మైత్రేయుండు విదురున కిట్లనియె మహాత్మా నీవు నన్నడిగిన ప్రచేతోనారద సంవాదరూపంబైన హరికీర్తనంబును సుపుత్రుండైన యుత్తానపాదుని వంశప్రకారంబును జెప్పితినని వెండియు నిట్లనియె నారదువలనం బ్రియవ్రతుండాత్మవిజ్ఞానంబు నొంది మహీమండలంబుఁ బరిపాలించి యనంతరంబునఁ బుత్రులకు రాజ్యంబుఁ బంచియిచ్చి పరలోకగతుండయ్యె ననిన॥ క॥ విని విదురుండా మునివరు। ఘనచరణములాత్మమస్తకంబున మొదుపూ। నను చరణాంభోరుహముల। మనమున దదగఁ దాల్చి పలికె మైత్రేయునితోన్॥ క॥ మునినాథచంద్ర కరుణా। వననిధి నీచేత భక్తవత్సలుఁడగు నా। వనజాక్షు తత్త్వ మెఱిఁగితి। నని తత్పదములకు వినతుఁడై వినయమునన్॥ క॥ ఆముని చే నామంత్రితుఁ। డై మనమున బంధుదర్శనాకాంక్షితుఁడై। ధీ

సావేశితమనః ప్రధానుండగుస। త్పురుషుఁ డొకవేళ విఘ్నము। బొరసినఁ దనపూర్వమార్గ మునువిడువఁ డిలన్॥ క॥ ధరణీ
వల్లభ వినుమా। నరవరుఁడు ప్రియవ్రతుండు నారదముని స। చ్చరణోపసేవఁ జెందుచు। నరుదుగ నధ్యాత్మసత్త్రయాగం
బందున్॥ సీ॥ దీక్షితుండై ధరిత్రీపాలనము దండ్రి పనిచిన సుజ్ఞానభంగమనుచు। నంగీకరింపమి నంతయుఁ దెలిసి పద్మాసనుం
డతనికి నతులరాజ్య। మందుల మిక్కిలియాసక్తిఁ బుట్టింతు ననుచును దన చిత్తమందుఁ దలఁచి। తారకాద్యనుసృత తారాధిపు
నిమాడ్కి శ్రుతులతోఁ గూడి యచ్యుతవిభూతి। హంసవాహనుఁ డగుచు నింద్రాదు లెల్లఁ। గదిసి సేవింప బ్రహ్మలోకమున
నుండి। సన్మునీంద్రులు దన్నుఁ బ్రశంస సేయ। నల్లనల్లన యుడువీథి నరుగుదెంచె॥ వ॥ మఱియు నయ్యైమార్గములయందు సి
ద్ధసాధ్యగంధర్వచారణగరుడకింపురుషులు స్తోత్రంబులు సేయుచుండ గంధమాదనద్రోణులం బ్రకాశంబు నొందించుచుం
జనుదెంచిన పద్మాసనునకు నారదుండు స్వాయంభువప్రియవ్రతులతోఁ గూడి ముకుళితహస్తుండై యెదురుచనుదెంచి సం
స్తుతులతోడం బూజించిన విరించి సంతసించి ప్రియవ్రతునిం జూచి నవ్వుచు నిట్లనియె॥ క॥ హరి నా ముఖమున నీకును। గర మె
ఱిఁగింపంగఁ బనిచెఁ గావున నిదెను। స్థిరమతి వినుమంతయు శ్రీ। హరివాక్యము గా నెఱింగి యవనీనాథా॥ గీ॥ కోరి వేడ్క నేను
నారదుండును నీవు। నందఱ మిదె యీశ్వరాజ్ఞఁ బూని। యుడుగ కెపుడు సేయుచున్నవారము గాన। నతని యాజ్ఞఁ దప్పన
లవిగాదు॥ వ॥ మఱియు శ్రీహరియాజ్ఞన్ జీవుండు దపోవిద్యలను యోగవీర్యజ్ఞానార్థధర్మంబులను దనచేత నొరులచేతఁ ద
ప్పింపసమర్థుండు గాఁ డుత్పత్తినాశంబులకు శోకమోహభయసుఖదుఃఖంబులకు నీశ్వరాధీనుండ కాని జీవుండు స్వతం
త్రుండు గాఁడు శ్రీహరివాగ్రూపంబులైన శ్రుతులం గుణత్రయంబను రజ్జువున బంధింపంబడిన యస్మదాదులము ముకు
ద్రాటిచేఁ బశువు మనుష్యులవశంబైన చందంబున నీశ్వరాజ్ఞం బ్రవర్తించుచుందుము నరుండు సుఖదుఃఖానుభవంబులకు నీ
శ్వరాధీనుండు నేత్రంబులుగలవానిచేతఁ దివియంబడిన యంధుండునుబోలె నీశ్వరుండిచ్చిన సుఖదుఃఖంబు లనుభవించు
చున్నవారము స్వప్నంబునం గన్నపదార్థంబు మేల్కాంచి మిథ్యఁ గాఁ దలంచిన కరణి మోక్షార్థియైన సుజ్ఞానవంతుండు ప్రా
ప్తసుఖదుఃఖంబుల ననుభవించుచు దేహారబ్ధకర్మంబులం బాయనొల్లఁడు వనవాసియైనను జితేంద్రియుండు గాకుండె నేనిఁ
గామాదిసహితుండగుటం జేసి సంసారబంధంబులు గలుగు గృహస్థాశ్రమంబందు జితేంద్రియుండై యాత్మజ్ఞానంబు గలపు
రుషునకు మోక్షంబు సిద్ధించు శత్రువుల గెలువ నిచ్ఛయించిన పురుషుండు దుర్గంబాశ్రయించి శత్రువుల గెలిచిన మాడ్కి మో
క్షార్థియగు నీవు గృహాశ్రయుండవగుచు శ్రీహరిచరణారవిందంబులను దుర్గంబాశ్రయించి యరిషడ్వర్గంబులం జయించి
ముక్తసంగుండవై యీశ్వరకల్పితంబులగు భోగంబుల ననుభవించి ముక్తిం జెందుమనినఁ బ్రియవ్రతుండు త్రిభువనగురుం
డైన బ్రహ్మవాక్యంబున నవనతమస్తకుండై బహుమానపూర్వకంబున నంగీకరించె నంత॥ గీ॥ సరసిజాసనుండు స్వాయం
భువుని చేత। నధికమైన పూజలందినార। దుండు నా ప్రియవ్రతుండును జూడంగ। జనియెఁ దనదుపూర్వసదనమునకు॥ గీ॥ స
త్యసంధుఁడైన స్వాయంభువుండను। మనువు బ్రహ్మ చేత మన్ననఁ దగ। నందియంత నారదానుమతంబునఁ। దనదుసుతుని
రాజ్యమునను నిలిపి॥ వ॥ ఇట్లు స్వాయంభువమనువు భూపరిపాలనంబునకుం బ్రియవ్రతునిఁ బట్టంబు గట్టి విషమంబులగు విష
యంబుల ననువిషసముద్రాశవలన విముక్తుండై వనంబునకుం జనియె నంత॥ మ॥ ధరణీవల్లభుఁ డా ప్రియవ్రతుఁడు మోదం
బందుచున్ లీల నీ। శ్వరవాక్యంబునఁ గర్మతంత్రపరుఁడై సంగంబులం బాపు శ్రీ। హరిపాదాంబుజచింతనం దగిలి నిత్యానంద
మున్ బొందిమ। త్సరరాగాదులఁ బారఁ దోలి ప్రజలం బాలించె నత్యున్నతిన్॥ వ॥ ఇట్లు ప్రియవ్రతుండు రాజ్యంబు సేయుచు
విశ్వకర్మప్రజాపతిపుత్త్రిక యగు బర్హిష్మతి యను దానిం బత్నిగాఁ బడసి యాసతివలన శీలవృత్తగుణరూపవీర్యౌదార్యంబు
లందనకు సమానులైన యాగ్నీధ్రఇధ్మజిహ్వయజ్ఞబాహు మహావీర హిరణ్యరేత ఘృతపృష్ఠ సవన మేధాతిథి వీతిహో
త్రకవి యను నామంబులుగల పుత్త్రదశకంబు నూర్జస్వతి యను నొక్క కన్యకను గాంచె నందుఁ గవి మహావీర సవనులు మువ్వు
రుఁ బాలకులయ్యు నూర్ధ్వరేతస్కులై బ్రహ్మవిద్యానిష్ణాతులై యుపశమశీలురగుచుం బారమహంస్యయోగంబాశ్రయిం
చి సర్వజీవనికాయావాసుండు భవభీతజనశరణ్యుండు సర్వాంతర్యామియు భగవంతుండును నగు వాసుదేవుని చరణారవిం
దావిరతస్మరణావిగళితపరమభక్తియోగానుభావంబున విశోధితాంతఃకరణులగుచు నీశ్వరుతాదాత్మ్యంబుఁ బొందిరం
త॥ సీ॥ వసుధేశ యా ప్రియవ్రతుఁ డొండు కాంతయందధికుల మన్వంతరాధిపతుల। మఱియు నుత్తముఁడు దామసుఁడు రై
వతుఁడను సుతులను బుట్టించె సుమహితులను। మున్ను జన్మించిన పుత్త్రులలో మువ్వుర వ్యయపదవికి నరిగి రంత। నపుడు ప్రియ
వ్రతుఁడఖిలశాత్రవకోటిఁ దన బాహుబలము చేతను జయించి। యతఁడు బర్హిష్మతీకాంతయందుఁ బ్రీతి। గలిగి యావనలీలా
విలాసహాస। హేలనాదులఁ జిత్తంబు గీలుపఱిచి। గతవివేకుండువోలె భోగములఁ బొందె॥ వ॥ ఇట్లు ప్రియవ్రతుండేకాద

శార్బుదపరివత్సరంబులు రాజ్యంబు సేసి యొక్కనాఁడు మేరునగప్రదక్షిణంబు సేయు సూర్యునకు నపరభాగంబునం బ్ర
వర్తించు నంధకారంబు నిర్వర్తింపం బూని భగవదుపాసనాజనితాతిపురుషప్రభావుండై సవితృరథసదృశ వేగంబు గలిగి
తేజోమయంబైన రథంబు నారోహణంబు సేసి రాత్రులనెల్ల దివంబులోనర్తునని సప్తవారంబులు ద్వితీయతపనుండువో
లె నరదంబు వరపుటయు నారథనేమిమార్గంబులు సప్తసముద్రంబులు నామధ్యభూసంధులు సప్తద్వీపంబులునయ్యె నందు॥
సీ॥ సరసజంబూప్లక్షశాల్మలిద్వీపకుశక్రౌంచశాకపుష్కరములనఁగ। నలరు నాద్వీపంబులందు జంబూద్వీపమొనరంగల
క్షయోజనములయ్యె। నటయుత్తరోత్తరాయతసంఖ్యఁ దాద్విగుణితములై యొండొంటికతిశయిల్లు। క్షారేక్షురససురా
జ్యక్షీరదధ్యుదకంబులగలుగు సాగరము లేడు। ద్వీపపరిమాణములు గల్గి విస్తరిల్లు। సంధిసంధులఁ బరిఘలచందమునను। క్ర
మముఁ దప్పక యొండొంటిఁ గలయకుండు। సకలజీవులకెల్ల నాశ్చర్యము గను॥ వ॥ అట్టిద్వీపంబులం దుఁ బరిపాలనంబునకుం
బ్రియవ్రతుండాత్మభవులు నాత్మసమానశీలురునైన యాగ్నీధ్రేధ్మజిహ్వయజ్ఞబాహుహిరణ్యరేతోఘృతపృష్ఠమేధా
తిథివీతిహోత్రులనెక్కొక్కనినెక్కొక్కద్వీపంబునకుం బట్టంబుగట్టి యూర్జస్వతి యను కన్యకను భార్గవునకిచ్చిన భార్గవున
కు నూర్జస్వతియందు దేవయాని యను కన్యారత్నంబు జనించె నట్లు బలపరాక్రమవంతుండైన ప్రియవ్రతుండు విరక్తుం
డై యొక్కనాఁడు నిజగురువగు నారదునిచరణానుసేవానుపతితరాజ్యాదిప్రపంచసంసర్గంబుఁ దలంచి దుఃఖించి యిట్లని
యె॥ సీ॥ అకటయేనింద్రియములచేఁ గట్టంగఁబడియుండియందులఁ బాయలేక। యజ్ఞానవిరచితంబగు విషయములను నంధ
కూపంబులనడఁగియుండి। తరుణులకేవినోదమ్మగంబునై యుండియది యెల్ల నేనెల్లననుచు లోసి। హరికృపచేనప్పుడం
దినయాత్మవిద్యను గల్గి తన వెంటనరుగుదెంచు। కొడుకులకు నెల్ల రాజ్యముఁ గుదురుపఱచి। తనదుపత్నులఁ దిగనాడి ధనముఁ వి
డిచి। హరివిహారంబు చిత్తంబునందు నిలిపి। పరగ నల్లన నారదపదవి కరిగె॥ వ॥ ఇట్లు తన రథమార్గంబులు సప్తద్వీపసాగరంబు
లుగాఁ జేసి సూర్యునకుఁ బ్రతిసూర్యుండై సరిద్గిరివనాదులచేత భూతనిర్వృతికొఱకుఁ బ్రతిద్వీపంబులందు నవధులఁ గల్పిం
చి ద్వీపవర్షనిర్ణయంబులఁ బుట్టించి పాతాళభూస్వర్గాదిజాతంబులగు సుఖంబులు నరకసమానంబులుగాఁ దలంచి విరక్తిం
బొంది నిరంతరభగవద్ధ్యానవిమలీకృతాశయుండగుచు హరిభక్తప్రియుండైన ప్రియవ్రతుని చరిత్రంబు లీశ్వరునకుం ద
క్కనన్యులకెఱుంగఁ దరంబుగాద తని మహిమలు నేఁడును గొనియాడుదు రని మఱియు శుకుం డిట్లనియె॥ క॥ హరిసేవనా
ప్రియవ్రతుఁ। డరయఁగఁ గైవల్యపదవినందుటయరుదే। ధరఁ జండాలుండైనను। హరినామస్మరణఁ జెందు నవ్యయపద
ముఁ॥ అని పలికి శుకుండు మఱియు నిట్లనియె॥ మ॥ జనకుం డిట్లు విరక్తుఁడై నను పదాజ్ఞం జేసి యాగ్నీధ్రుఁడే। పుననధర్మప్రతి
పాలనుండగుచు జంబూద్వీపమేలెం దగం। దన సత్పుత్రుల మాడ్కి నెల్ల ప్రజలం దాత్పర్యచిత్తంబునన్। ఘనతం బ్రోచె న
నేక కాలములు ప్రఖ్యాతంబుగా భూవరా॥ వ॥ ఇట్లాగ్నీధ్రుండు రాజ్యంబు సేయుచు నొక్కనాఁడు పుత్రకాముండై మంద
రాద్రిసమీపంబున నఖిలోపచారంబుల నేకాగ్రచిత్తుండై యర్చించిన నంగమలసంభవుండు సంతసిల్లి తన సమ్ముఖంబున సం
గీతంబు సేయు పూర్వచిత్తి యను నప్సరాంగనం బంపుటయు నాయప్సరాంగన చనుదెంచి రమణీయవివిధనిబిడవిటపివిటపస
మాశ్లిష్టసమీపసువర్ణలతికారూఢస్థలవిహంగమమిథునోచ్చార్యమాణషడ్జాదిస్వరంబులచే బోధ్యమానసలిలకుక్కుట
కారండవబకకలహంసాదివిచిత్రకూజితసంకులంబులైన నిర్మలోదకకమలాకరంబులు గల తదాశ్రమోపవనంబునం
దు విహరించుచు విలాసవిభ్రమగతివిశేషంబులఁ జలనంబు నొందు స్వర్ణచరణాభరణస్వనంబు విన్న రదేవకుమారుండాలించి
యోగసమాధిం జేసి ముకుళితనేత్రుండై యుండి యల్లనఁ గనువిచ్చి చూచి తన సమీపంబునన్మధుకరాంగన యుంబోలెఁ బు
ష్పాఘ్రాణంబు సేయుచు దేవమానవులకు మనోనయనాహ్లాదంబుఁ బుట్టించుచున్న గతివిహారవినయావలోకనసుస్వరావ
యవంబుల మన్మథశరపరంపరలనొందించుచు ముఖకమలవిగళితామృతసమానహాసభాషణామోదమదాంధంబులైన
మధుకరమిథునంబుల వంచించి శీఘ్రగమనంబునం జలించు కుచకచమేఖలలు గల దేవాంగనం గొని చిత్తచలనంబు నొంది మ
న్మథపరవశుండై జడుని చందంబున నిట్లనియె॥ క॥ సతినీ వెవ్వతె వీపర్వతమున కేమేని గోరి వచ్చిన వనదేవతవో శారదవో ర
తి। పతిపంచిన మాయవో తపస్సారమవో॥ ఉ॥ అంగజుఁ డెక్కుడించిన శరాసనముల్ ధరియించియంతనా। యంగజు వేఁటమా
నవమృగావళిఁ జూచుచున్న దానవో। రంగగు నీ నిజాకృతి తెఱంగెఱుఁగం గని జంబుఁ బల్కుమా। యంగన నిన్నుఁ గన్గొనిన
యంతనసంగతి వెట్టపంగుదురు॥ క॥ పొలుపొందుచున్న విలాసంబుల నంగజు బాణములను బోలెడినీ చం। చలసత్కటాక్షవీక్ష
ణములనెవ్వనిని నితిచిత్తమును గలఁచెదవే॥ చ॥ చెదరఁగ వేదముల్ చదువు శిష్యులపైఁ దగఁ బుష్పవృష్టి సమ్మదమున నంతలో
గురియు మాడిని మన్మథ సామగానము ల్పదివేడు శిష్యులో యనఁగ షట్పదపఙ్క్తులు చేరి మ్రోయఁగాఁ బదఁపడి మీఁద శా

లుకచభారమునం దులఁ జారు క్రొవ్విరుల్ ॥క॥ అందియల వెలయు రత్నము। లందంబుగ లలితపదములను సుభగము లై। యం దంబు మ్రోయుచును నా। డెందంబునఁ దగిలి పందడించుచు నున్నన్ ॥క॥ పాయక కదంబపుష్ప। చ్ఛాయ యుగల వస్త్రకాంతి చ శ్లేషంగంటే। యా యెడ నితంబరోచులు। గాయుచు నెడ తెగక తఱిమి కప్పెడుఁ దన్వీ ॥క॥ నిరతము వీతను మధ్యము। గరమరుదు గ నరసి చూడఁగా నంబడదీ। కరికుంభంబులఁ బోలెడి। గురుకుచముల నెట్లు నిలుపుకొంటి లతాంగీ ॥క॥ పొంకములగు కుచముల పైఁ। గుంకుమపంకంబుఁ బూసికొని వాసనలం। గొంకక వెదచల్లెదు నీ। బింకంబగు చన్నుదోయి పెంపో సొంపో ॥శా॥ ఏలోకం బుననుండి వచ్చితివి నీ విచ్చోటికి న్మున్నునే। నేలోకంబునఁ జెప్పఁగా నెఱుఁగ నో నీసుందరాకారమా। నీలాలిత్యము నీవినోద ములు నీ కెట్లొప్పునే కామినీ। భూలోకంబున కెట్లు వచ్చితివి నా పుణ్యంబ గణ్యంబుగన్ ॥క॥ హాసావలోకనంబుల। భాసిల్లెడు నీముఖంబు పలుమఱు నిపుడే। యాసలు పుట్టింపఁగ నే। నాసఁగొనెద నిన్నుఁ జూవియంబుజనేత్రీ॥ గీ॥ కందము లేని యించుక శి ఖించినె మ్మోము। గాంతియుక్తమగుచుఁ గానుపించె। గాన విష్ణుకళయు గాఁబోలు నని నామ। నంబునందుఁ దోఁచు నళిననే త్రి॥ మ॥ పటుతాటంకి రథాంగయుగ్మమునకుం బల్మారు భీఁ గిల్లుచు న్నటనం బందెసుగండు మీనములతో నాసన్న నీలాలకో। త్కటభృంగావళితో ద్విజావళి లసత్కాంతిన్విడంబించు మా। రటకాసారముఁ బోలి నెమ్మొగము దారం జెల్లు నత్యున్నతిన్॥ చ॥ కరువలిఁ బాయు వస్త్రమును గట్టనెఱుంగవు చూడ్కి దిక్కులం। బరచుచుఁ జంచరీకముల భాతిఁ జెలంగెడు కంధరంబు నం। బొరలెడు ముక్తకేశభరముం దుఱుమంగఁ దలంప విప్పుడిట్లరుగ రత్నకందుకవిహారము సల్పెదు సంభ్రమంబునన్॥ వ॥ మఱియు నిట్లు మతపోధనులగువారల తపంబుల నీరూపంబున నపహ్నవించిన దానవు నీ చక్కదనం బేమి తపంబున సంపా దించితివి నాతోడం గూడి తపంబు సేయుము సంసారంబు వృద్ధిఁ బొందం జేయు ముపద్మాసనుండు నాకుం బ్రత్యక్షుం బై నిన్ను నిచ్చినవాఁడు గావున నిన్ను విడువం జాల ననుసీ సఖీజనంబులు మా వాక్యంబులకు ననుకూలించు మదురు గాక నీవు చనుచోటికి న నుం దోడ్కొని చనుమని స్త్రీలకు ననుకూలంబుగాఁ బలుక నేర్చిన యాగ్నీధ్రుండు పెక్కు భంగుల బలికిన నా పూర్వచిత్తియు నతని యనునయ వాక్యంబులకు సమ్మతించి వీరశ్రేష్ఠుండగు నారాజవర్యుని బుద్ధిరూపశీలౌదార్యవిద్యావయశ్శ్రీల చేఁ బరాధీ నచిత్తయగుచు జంబూద్వీపాధిపతి యగు నా రాజశ్రేష్ఠునితోడం గూడి శతసహస్ర సంవత్సరంబులు భూస్వర్గభోగంబుల ననుభవించె నంత నాగ్నీధ్రుం డా పూర్వచిత్తివలన నాభి,కింపురుష,హరివర్ష, ఇలావృత, రమ్యక హిరణ్మయి,కురు,భద్రా శ్వ కేతుమాలసంజ్ఞలుగల కుమారులఁ బ్రతివత్సరంబు నొక్కొక్కనిగ దొమ్మండ్రం గాంచె నంత నా పూర్వచిత్తి యా య ర్భకుల గృహంబున విడిచి యాగ్నీధ్రుం బాసి బ్రహ్మలోకంబునకుం జనిన నా యాగ్నీధ్రపుత్రులు మాతృసామర్థ్యం బునం జేసి స్వభావంబున నశరీరబలయుక్తులగుచుఁ దండ్రి చేత నను జ్ఞాతులయి తమ నామంబులఁ బ్రసిద్ధంబులయిన జం బూద్వీపాదివర్షంబులఁ బాలించుచుండి రంత నాగ్నీధ్రుండు నా పూర్వచిత్తివలనం గామోపభోగంబులం దృప్తిం బొం దక పూర్వచిత్తిం దలంచుచు వేదోక్తంబులగు కర్మంబులం జేసి తత్సలోకంబగు బ్రహ్మలోకంబునకుం జనియె నిట్లు తండ్రి పర లోకంబునకుం జనిన నాభి ప్రముఖులగు నాగ్నీధ్రకుమారులు దొమ్మండ్రును మేరుదేవియుఁ, బ్రతిరూపయు, నుగ్రదంష్ట్రి యు,లతయు,రమ్యయు,శ్యామయు,నారియు,భద్రయు,దేవియు,నను నామంబులుగల మేరుపుత్రికలగు,తొమ్మండ్రు కన్య

### శ్రీ భగవంతుండగు నారాయణుండు ఋషభావతార మెత్తుట. శ్రీ

కల,వివాహంబై రంత॥ గీ॥ నరవరేణ్యుఁ డైన నాభి సంతానార్థ। మంగనయును దాను యజ్ఞపురుషుఁ। డైన వాసుదేవు నతు లభక్తి శ్రద్ధ। లెసఁ జెలంగి పూజలొలరఁ జేసె॥ వ॥ మఱియుం బ్రవర్గ్యసంజ్ఞికంబులగు కర్మంబులు శ్రద్ధా విశుద్ధ ద్రవ్య దేశ కాల మంత్ర ఋత్విగ్దక్షిణావిధానయోగంబులం బరమేశ్వరుని మెప్పించిన నెవ్వనికిం బ్రసన్నుండు గాని పుండరీకాక్షుం డు భక్తవత్సలుండై సురుచిరావయవంబులు గలిగి యజనశీలంబయిన యా నాభిహృదయంబునందుఁ బాయని రూపంబు గలిగి మనోనయనానందకరావయవంబులు గల తన స్వరూపంబుఁ జూపందలంచి॥ సీ॥ అంతనా విష్ఫుత కాంత చతుర్భుజంబులును బీతాంబరంబును వెలుంగ। శ్రీవత్సకౌస్తుభ శ్రీరమా చిహ్నంబు లురమందు రమ్యమై యిరవుపడఁగ। శంఖ చక్ర గదాంబుజా త ఖడ్గాది దివ్యాయుధంబులు చేతులందు మెఱయ। నతులిత నవరత్న హాటక కాంతి తనూత్న ఘన కిరీట ద్యుతుల్ల డలుకొనఁగఁ। గ ర్ణకుండల కటిసూత్ర కనక రత్న। హార కేయూర వరనూపురాదిభూష। ణముల భూషితుఁడైన శ్రీనాయకుండు। దంపతుల కప్పుడెదురఁ బ్రత్యక్షమయ్యె॥ గీ॥ ఇట్లు ప్రత్యక్షమగు పరమేశ్వరునకుఁ। బెన్నిధానంబుఁ గనుఁగొన్న పేదమాడ్కి। హర్ష మున ఋత్విగాదికులవనతాస్యులగుచు భక్తి నుతిఁ జేసి రిట్లను చునపుడు॥క॥ పరిపూర్ణుఁడవై యుండియు। మ్రుటువక మాపూ జ లెల్ల మన్నింతువు నీ। చరణారవింద సేవయుఁ। దరఁ బెద్దలు విని చినటులఁ దగఁ జేసెదమా॥ క॥ ఏమిపుడు సేయు సంస్తుతి। నీ

మహిమ నెఱింగి కాదు నిరతము పెద్దల । చే మదియుపదేశింపఁబడిరో । యా మతమునఁ బ్రస్తుతింతుము మయ్యా మహాత్మా॥ వ॥ మఱియు నీవు సంసారాసక్తమతిఁ గలిగినవారికి వశుండవుగా వీశ్వరుండవు ప్రకృతిపురుషవ్యతిరిక్తుండవు పరమపురుషుండవు నైన నిన్నుఁ బొందని ప్రపంచాంతర్గతంబు లైన నానారూపంబులు గల యస్మదాదుల చేత నిరూపింపనశక్యంబగు సర్వజీవులం జెందిన దురితసంఘంబుల నిరసించు స్వభావంబు గల నీ యుత్తమగుణంబులయందు నేకదేశంబు గాని సర్వగుణనిరూపణంబుఁ జేయ శక్యంబుగా నేరదు నీ భక్తులు మిక్కిలి భక్తిం జేసి స్తుతియించు గద్గదాక్షరములను సలిలశుద్ధపల్లవతులసీదళదూర్వాంకురములను సంపాదించిన పూజను సంతసిల్లెడి నీకు బహువిధద్రవ్యసంపాదనంబు గలిగి విభవయుక్తంబు లైన యశ్వమేధాదులు నుపస్కరింబులుగా నేరవు స్వభావంబున సర్వకాలంబునందును సాక్షాత్కరించి యతిశయంబై వర్తించుచు నశేషపురుషార్థస్వరూపము పరమానందరూపము నైన వాఁడవగుటం జేసి యజ్ఞాదులయందు నీకుఁ దృప్తి లేక యున్న నస్మదాదులకోరికలకుఁ బరికించుకితంబున యజ్ఞాదుల నొనరింతుము నిమాఱియు నిట్లనిరి॥ క॥ ✻బాలిశులము గుచు మిక్కిలి। మేలెఱుఁగని మమ్ము నీదు మించిన దయచేఁ। బాలించి యిత్తు వెప్పుడు। చాలఁగ నిహపరములందు సకలసుఖంబుల్॥ గీ॥ ఇపుడు మేము నీకు నిష్టంబులగు పూజ। లాచరింపకున్న నైన నధిక। మయిన నీ కృపాకటాక్షవీక్షణములఁ। జక్కఁ జూచితఁ బ్రసన్నుఁడగుచు॥ క॥ వరమీయఁ దలఁచి మమ్ముం। గరుణించితి కాక నిన్నుఁ గనుఁగొనుటకు నై। యరసి నుతింపఁగ మాకుం। దరమగునే వరద నీరదశ్యామాంగా॥ వ॥ మఱియు నిస్సంగు లై నిశితజ్ఞానంబునం జేసి దోషరహితు లై భవత్స్వభావులు నాత్మారాములు నగు మునులకు స్తుతియింపఁ దగిన గుణంబులు గలవాఁడవగుచుండియుఁ బ్రసన్నుండవు స్ఖలనక్షుతపతనజృంభణాది దురవస్థలందు వివశులమగు మాకు జ్వరమరణాది దుర్దశలందును గల్మషనాశకరంబు లైన భవద్దివ్యనామంబులు మా వచనగోచరంబులగుంగాక మఱియు నీ రాజర్షి నీతోడ సమానుండై న కుమారునిం గోరి కామంబుల స్వర్గాపవర్గంబుల నీ నోపిన నిన్నుం బూజించి ధనకాముండై నవాఁడు ధనవంతుని జేరి తుషమాత్రం బడిగిన చందంబున మోక్షనాథుండవై న నీవలన సంతానంబు గోరుచున్నవాఁడు జయింపరాని నీ మాయచేత నెవ్వండు మోహంబు నొంది విషయాసక్తుండు గాకయుండు నర్థకాములము మందాంధులము నగు మేము నిన్ను నావాహనంబుఁ జేసిన యపరాధంబు సర్వాత్మకుండవగుటం జేసి సామ్యంబు చేయుదుగాక యని ప్రణమిల్లిన సర్వేశ్వరుండు వర్షాధిపతియగు నాభిచే ఋత్విక్కులచేతను వందితుండై దయాకలితుండగుచు నిట్లనియె॥ క॥ మునులార వేదవాక్యము। లను బ్రస్తుతిఁ జేసి సర్వలక్షణములనా। కెనయగు పుత్రుని నిమ్మని। పనిఁ బలికితిరి ప్రసిద్ధిమిగుల వేడుకతోడన్॥ క॥ నాకాదిలోకములలో। నాకున్ సరివచ్చునట్టి నందను నిట్లా। లోకింప లేరుగావున। నాకున్ సరి నేన కావున మున నెఱుఁగుఁడీ॥ వ॥ అదియునుం గాక భూసురోత్తములు నా ముఖం బగుటం జేసి విప్రవాక్యంబు తప్పింపరాదు నాభిపత్నియగు మేరుదేవియందు నేన పుత్రుండనై జనియించెదనని పలికి పరమేశ్వరుండా గ్నిప్రపత్నియగు మేరుదేవి చూచుచుండ నా యజ్ఞంబునం దంతర్ధానంబునొందె నాభి మిగులఁ దినయంబు జేసి దిగంబరులు తపస్వులు జ్ఞానులు నూర్ధ్వరేతస్కులును నగు నైష్ఠికులకు యోగధర్మంబుల నెఱింగింపఁ దలంచి పుండరీకాక్షుండు నాభిపత్నియగు మేరుదేవి గర్భాగారంబునం బ్రవేశించె నంత॥ గీ॥ మేరుదేవియందు మేరుధీరుండగు। హరి సమస్తలక్షణాన్వితుండు। శమదమాదిగుణవిశాలుండుదయించె। సకలజనుల కెల్ల సంతసముగ॥ గీ॥ ధవళకాంతియుక్తిఁ దనరు దేహంబును। సహితబలపరాక్రమంబు వీర్య। మును దలంచి చూచి జనకుండు పేరిడె। సుతుని ఋషభుఁ డనుచు సొంపుతోడ॥ క॥ ధరణీసురులును మంత్రులు। పరివారము హితులు ప్రజలు బాంధవులును। స్థిరమతి నా బాలకునిం। గరమనురాగమున రాజుగాఁ జూచిరిలన్॥ క॥ ❀పురుహూతుఁడు తన మహిమలు। సరగున విని చిత్తమునకు సహ్యము గామిం। బరికించి ఋషభుఁడేలెడి। ధరణిన్ వావృష్టి మిగుల వట్టము సేసెన్॥ గీ॥ అది యెఱింగి ఋషభుఁ డంతట యోగమా। యాబలంబుకతన నఖిలరాజ్య। మందుఁ గురియఁజేసె నత్యంతసంపూర్ణ। వృష్టి దినదినంబు వృద్ధిఁ బొంద॥ వ॥ ఇట్లు ఋషభుండు ✻✻పురందరుండు సేయు దౌష్ట్యంబునకు నవ్వి యజనాభంబను తన మండలంబు సుభిక్షంబుగాఁ జేసి నాభి యుండన కోరిన చందంబున పుత్రుండు జనియించి వృద్ధిఁ బొందుటకు సంతసిల్లి తనచేత నంగీకరింపంబడు నరలోకధర్మంబు గల పుండరీకాక్షుని మాయావిలసితంబును జేసి బాలకనాతంత్రియని మోహంబున నుపలాలించుచుం బ్రజానురాగంబున సర్వసమ్మతుండై న పుత్రుని సమయసేతురక్షణంబు

✻ బాలిశులము। అవివేకులము. ✻✻తుష। ఊక. ❀పురుహూతుఁడు। పురు ప్రభూతం హూతం యజ్ఞే ష్వాహ్వానం యస్య పురుహూతః-యజ్ఞములయందుఁ బ్రచురమైన పిలుపుగలవాఁడు. లేక-పురునామాసురుని హతవానితి వా-పురువనెడి రాక్షసునిఁ జంపినవాఁడు-అనఁగా నింద్రుఁడు. ✻✻పురందరుఁడు। పురాణి అరీణాం దారయతీతి పురందరః-శత్రుపురములఁ బ్రక్కలించినవాఁడు- దౄ-విదారణే అని ధాతువు, అనఁగా నింద్రుఁడు.

నకుం బూజ్యంబైన రాజ్యంబునం దభిషిక్తుం జేసి భూసురులకుం బ్రధానవర్గంబునకు నప్పగించి మేరుదేవిం గూడి నరనారాయ ణాస్థానంబైన బదరికాశ్రమంబునకుం జని యచ్చట మహాయోగసమాధిచే నరనారాయణాఖ్యుండు పురుషోత్తముండున గు వాసుదేవు నారాధించి క్షీణదేహుండై యానాభి హరితాదాత్మ్యంబు నొందె నంత॥ చ॥ సరసత నేనృపాలకుని జన్మము నందును భూసురోత్తము। ల్సరసిజనాభు నిందఁ బ్రసన్నతఁ బెట్టిన నంత మెచ్చి యీ। శ్వరుఁడు దనంత గర్భమున వచ్చి తనూ భవుఁడై జనించె నా। నరపతి నాభికి న్సరియనందగు నే నరనాథ యన్యులన్॥ సీ॥ భూవరుఁ డగు ఋషభుఁడు దన రాజ్యంబుఁ గర్మభూమిగ నాత్మఁ గాంచి జనుల। కందఱకును బ్రియంబగునట్లు కర్మతంత్రంబెల్లఁ దెలుపంగఁ దలఁచి కర్మ। ములు సేయు టకు గురువుల యొద్ద వేదంబు చదివి వారల యనుజ్ఞను వహించి। *శతమన్యుఁ డిచ్చిన సతి జయంతీకన్యఁ బరిణయంబై యట్టి పడఁతి వలన। భరతుఁ డాదిగ సుతుల నూర్వురను గాంచె। నట్టి భరతుని పేర ధరాతలంబు పురవరాశ్రమ గిరి తరు పూర్ణమై మ గుచు। నమరి భారతవర్షనామమున నమించె॥ వ॥ ఆమహాభారతవర్షంబునందు తమతమ పేరం బరగు భూములకుం, గుశావ ర్త, ఇలావర్త, బ్రహ్మావర్త, ఆర్యావర్త, మలయకేతు, భద్రసేన, ఇంద్రస్పృక్, విదర్భ, కీకటులను, దొమ్మండ్రు ♣శీకుమారు లను నవతి పుత్రులకుం బ్రధానులనుగాఁ జేసె నంతఁ గవి, హరి, అంతరిక్ష, ప్రబుద్ధ, పిప్పలాయన, ఆవిర్హోత్ర, ద్రమీళ, చమస, కరభాజనులను వారు, తొమ్మండ్రును భాగవతధర్మప్రకాశకులై రి భగవన్మహిమోపబృంహితంబులగు వారల చరిత్రంబు లు ముందర నెఱింగించెదఁ దక్కిన యెనుబది యిద్దరు కుమారులు పిత్రాదేశకరులు ♣నతివినీతులు మహాశ్రోత్రియులు యజ్ఞశీలు రు గర్మనిష్ఠులునైన బ్రాహ్మణోత్తములైరి ఋషభుండు స్వతంత్రుండై సంసారధర్మంబులం బొరయక కేవలానందా నుభవుండై నయీశ్వరుండై యుండియుఁ బ్రాకృతుండువోలెఁ గాలానుగతంబులగు ధర్మంబుల నాచరించుచు ధర్మప్రవ ర్తకులకు సముండు నుపశాంతుండు మైత్రుండు గారుణికుండు నై ధర్మార్థయశః ప్రజానందామృతావరోధంబుచే గృహ స్థాశ్రమంబులం బ్రజల నియమించుచుఁ గొంతగాలంబు నీతిమార్గంబు దప్పక ప్రజాపాలనంబు సేయుచు వేదరహస్యంబు లగు సకలధర్మంబులు స్వవిదితంబులయిన ను బ్రాహ్మణోపదేశపూర్వకంబున ద్రవ్యదేశకాలవయశ్శ్రద్ధర్త్విగ్వివిధోద్దే శోపచితంబులుగ నొక్కొక్క క్రతువును శతవారంబును యథావిధిగఁ జేసి సుఖంబుండె నంత॥ క॥ జనవర ఋషభుని రాజ్యం।

### ఋషభుండు పుత్రులకు నీతి యుపదేశించుట.

బున నైహికఫలముఁ గోరు పురుషుని నొకనిం। గనుఁగొన నెఱుంగ మెన్నఁడు। నిన తేజుం డతని మహిమ లేమని చెప్పన్॥ సీ॥ ఆ ఋషభుండు రాజ్యంబు సేయుచు నుండి యంతట నొక్క నాఁ డాత్మ యందుఁ। దలపోసి భూలోకఫలము నపేక్షింపక మో హంబు దిగనాడి పుత్రులకును। దనరాజ్యమెల్ల నప్పనఁ జేసి వెనువెంటఁ గొడుకులు మంత్రులు గొలిచి రాఁగ। నల్లన యరిగి బ్రహ్మావర్తదేశంబులం దమలనపుడు మహాత్ములైన। యట్టి మునిజన సమ్ముఖంబందుఁ జేరి। తనదు పుత్రుల నందఱ డాయఁ బి లిచి। పరమపుణ్యుండు ఋషభుండు భక్తితోడ। హర్షమందుచు నప్పు డి ట్లనుచుఁ బలికె॥ గీ॥ తనయులార వినుఁడు ధరలోనఁ బుట్టిన। పురుషులకును శునకములకు లేని। కష్టములను దెచ్చు గానఁ గామంబుల। వలను బుద్ధి సేయవలదు మీరు॥ చ॥ నరులకు సే తపంబున ననంతసుఖంబులఁ బొందనౌను శ్రీ। కరమతి నాతపంబుఁ దగఁ గైకొని చేసిన బ్రహ్మసౌఖ్యముం। దిరముగఁ గల్గు వృ ద్ధులను దీనులఁ బ్రోవుఁడు మత్ప్రవర్తన। న్జరుగుచునుండు కాముకుల సంగతిఁ బోకుఁడు మీఁద మేలగున్॥ వ॥ మఱియు నంగనాస క్తులగు కాముకుల సంగంబు నిరయరూపంబైన సంసారంబగు మహత్సంగంబు మోక్షద్వారంబగు నట్టి మహాత్ము లెవ్వరనిన శత్రుమిత్రవివేకంబు లేక సమచిత్తులు శాంతులు క్రోధరహితులు సకలభూతదయాపరులు సాధువులు నగువారలు మహా త్ములనందగు మఱియట్టి మహాత్ములు నాయందలి స్నేహంబె ప్రయోజనంబు గల్గి యుండుటం జేసి విషయవార్తాప్రవృత్తులగు కుజనులందుఁ దమ దేహగృహమిత్రదారాత్మజాదులందుఁ బ్రీతి లేక యుండుదురు విషయాసక్తుండైన వాఁడు వ్యర్థకర్మం బులం జేయు నట్టి మహాకృతకర్మంబులం జేయువాఁ డెప్పుడును బాపకర్ముండగుచుం గ్లేశదంబగు దేహంబు నొందుచుండుం గావున నం బాపమూలంబులైన కామంబులు గోరకుఁడీ జ్ఞానం బెంతగాలంబు లేకయుండు నంత కాలం బాత్మతత్త్వంబెఱుం గం డాత్మతత్త్వం బెఱుంగకుండుటం జేసి దేహికి దుఃఖం బధికంబై యుండు లింగదేహం బెంతతడవుండు నంతతడవు మనంబు గర్మవశంబై జ్ఞానవంతంబు గాక యవిద్యం బాయకుండు శరీరంబు గర్మమూలంబగుటవలనఁ గర్మంబులు సేయఁ జనదు వా సుదేవుండగు నాయందుఁ బ్రీతి యెంతతడవు లేక యుండు నంతతడవు దేహధర్మంబులు బాధించు విద్వాంసుండైనను దే

---

*శతమన్యుఁడు। శతం మన్యవో యస్య సః శతమన్యుః-నూఱు యాగములు గలవాఁడు-ఇంద్రుఁడు. ♣శీకుమారులు। కు-అనఁగాఁ బాపము దానిని-మారులు। నశింపఁజేయువారు గాన కుమారులు-అనఁగాఁ బుత్రులు. ♣నతి। తో ంబడి. ♣నతివినీతులు। మిగుల నడఁకువ గలవారు.

గలుగు నారదమహాంస్యధర్మంబుపదేశింపంగలవాఁడగుచుఁ బుత్రశతంబునందగ్రజుండు పరమభాగవతుండు భగవజ్జనపరాయణుండునగు భరతుని ధరణీపాలనంబునకుఁ బట్టంబుగట్టి తాను గృహమందె దేహమాత్రావలంబనంబుఁ జేసి దిగంబరుండై యున్మత్తాకారుండగుచుం ✻ప్రకీర్ణకేశుండై యగ్నులనాత్మారోపణంబుఁ జేసి బ్రహ్మావర్తదేశంబును బాసి జడాంధ‡బధిర†మూకపిశాచోన్మాదులంబోలె నవధూతవేషంబునొంది జనులకు మాఱుపలుకక మౌనవ్రతంబునం బురగ్రామాకరజనపదారామశిబిరవ్రజఘోషసార్థగిరివనాశ్రమాదులయందు వెంటం జనుదెంచు మర్జనతర్జనతాడనావమాన◊మేహననిష్ఠీవనపాషాణశకృద్రజఃప్రక్షేపణపూతివాతమరుత్తులం •పరిభూతుండైనను గడనం బెట్టక వనమదేహంబున మక్షికాదికృతోపద్రవంబును బోలెం గైకొనక దేహాభిమానంబునం జిత్తచలనంబు నొందక యేకాకియై చరియించుచుండ నతిసుకుమారంబులగు కరచరణోరస్స్థలంబులు విపులంబులగు బా†హ్వంసకంఠవదనాద్యవయవవిన్యాసంబులుం గలిగి ప్రకృతిసుందరంబగుచున్నతస్నిగ్ధదరహాసరుచిరముఖారవిందంబై నవనళినదళంబులం బోలి శిశిర‖కనీనికలం జెలువొందియరుణాయతంబులగు నయనంబులచే నొప్పియనన్యానాధికంబులగు కపోలకర్ణకంఠనాసాదండంబులచేఁ దేజరిల్లుచు విగూఢస్మితవదనవిభ్రమంబులం బ్రకాశించు తనదివ్యమంగళవిగ్రహంబుచేఁ బురసుందరుల మనంబులనతిమోహంబు గలుగఁ జేయుచు॥ గీ॥ ధూళిచేత మిగుల◆ధూసరితంబునై। జడలుగట్టి కపిశంగవర్ణ। మునగు కేశపాశమును వెలిఁగించుచు। నితరులెవరుఁ దన్నెఱుఁగకుండ.॥ క॥ అవధూతవేషమున ని। ట్లవనిన్మలినంబులైన యవయవములతోఁ। దవిలి చరించుచునుండును। భువిభూతాక్రాంతుఁడైన పురుషుని మాడ్కిన్॥ గీ॥ జనులకిట్లు యోగసంచారమెల్ల వి। రుద్ధమనుచు నాత్మబుద్ధిఁ జూచి। ¶యజగరంబుమాడ్కి నవనిపై నుండె భీ। భత్సకర్మమునకుఁ బాలువడుచు॥ వ॥ ఇట్లు భీభత్సరూపంబున వసుంధరం బడియుండి యన్నంబు భుజియించుచు నీరు ద్రావుచు మూత్రపురీషంబులు విడుచుచు నవి శరీరంబునం దంటం బొరలుచుండు మఱియుం దత్పురీషసౌగంధ్యయుక్తంబగు వాయువు దశదిశల దశయోజనపర్యంతంబు పరిమళింపఁ జేయుచుండ గోమృగకాకచర్యలం జరియించుచు భగవదంశంబైన ఋషభుండు మహానందంబు ననుభవించుచుఁ దనయందు సర్వభూతాంతర్యామియగు వాసుదేవుని బ్రత్యక్షంబుగాఁగనుంగొనుచు సిద్ధిం బొందిన వైహాయసమనోజవపరకాయప్రవేశాంతర్ధానదూరగ్రహణశ్రవణాది యోగసిద్ధులు దనంతవచ్చినం గైకొనకయుండెనని పలికిన శుకయోగీంద్రునకుం బరీక్షిన్నరేంద్రుండిట్లనియె॥ క॥ మునివర యోగజ్ఞానం। బునఁ జెరుపంబడ్డకర్మములుగల పెద్ద। ల్గనియుండెడి యైశ్వర్యం। బును ఋషభుండేఁటికి యేల పొందకయుండెన్॥ అనిన శుకుండిట్లనియె॥ మ॥ ధరణీవల్లభ నీదు వాక్యములు తథ్యంబింతయుం దప్పదె। ట్లరయన్ వన్యమృగంబు పట్టువడి తానా వేళ నా లుబ్ధకు। న్దరవంచించినమాడ్కి నింద్రియములం దండించి చిత్తంబు ని। ర్భర కామాదుల కాసయిచ్చుఁ గద సంరంభంబుతోఁ గ్రమ్మఱన్॥ క॥ చిరకాలతపమునైనను। హరియింపఁగనోపుఁ జిత్తమని పెద్దలున। మ్మరు జారులకును జారిణి। కరణి నియడరించు మననసు కామాదులకున్॥ క॥ కామక్రోధాదులు దా। భూమీశ్వర కర్మబంధములు మఱియును జే। తోమూలములగుటను దా। నీమహిలో మనము నమ్మరెప్పుడు పెద్దల్॥ సీ॥ అదిగాన నెన్నఁడు నైశ్వర్యములను జేపట్టఁ జూడఁడు లోకభవ్యులైన। వారలచేనభివందనంబులువొంది వెలయంగ నవధూతవేషభాష। ణంబుల నెఱిఁగికొనఁగరాని భగవత్స్వరూపంబు గలిగి యారూపమంచుఁ। బరమయోగధ్యానపరులకు నెల్లదేహత్యాగసమయంబునంతలోనఁ। జూపుచుండియు దేహంబుఁ బాపనిచ్ఛయించె నచ్చట దివ్యయోగీంద్రుఁడాద్యుఁ। డతులదివ్యప్రకాశకుఁ డమరవరుఁడు। పరమపురుషుండు ఋషభుండు పార్థివేంద్ర॥ వ॥ అంత విముక్తలింగుండు భగవంతుండునగు ఋషభుండు మానంబున దేహాభిమానంబు విసర్జించి §కులాలచక్రంబు కులాలునిచే భ్రమియింపఁబడి విస్సృష్టంబైనను భ్రమియించుగతిం బ్రాచీనసంస్కారవిశేషంబగు నభిమానాభాసంబున దేహచలనాదికంబుల నొప్పియుండియు యోగమాయావాసనచే యుక్తుండయ్యె మఱియు నా ఋషభుం డొక్క దినంబునం గొంకవంకపటకంబులను దక్షిణకర్ణాటకదేశంబులకు యదృచ్ఛచేఁ జని కుటకాచలోపవనంబున నిజాస్యకృత శిలాకబళుండగుచునున్మత్తుని చందంబున వికీర్ణకేశుండు దిగంబరుండునై సంచరింప వాయువేగవిధూతవేణుసంఘర్షణసంజాతంబగు నుగ్రదావానలంబు తద్వనంబు దహింపనందు దగ్ధుండయ్యెనంత నతని కృత్యంబులు తద్దేశవాసులగు జనంబులు సెప్ప నర్హన్నామకుండగు తద్రాష్ట్రాధిపతి విని నిజధర్మంబులం బరిత్యజించి స్వదేశస్థులతోడం గూడి దానాయాచారంబులనంగీకరించి

---

✻ప్రకీర్ణ|విరిసియున్న. ‡బధిర|చెవిటివాఁడు. †మూక|మూఁగ, అవధూత|దిగంబరుఁడు, మేహన|శిశ్నము, అనఁగా లాక్షణికముచేత మూత్రమర్దనము. నిష్ఠీవన|ఉమియుట. •పరిభూతుండై|అవమానింపఁబడినవాఁడై, గడన|లెక్క-లత్యము. †అంస|భుజశిరస్సు. ‖కనీనిక|నల్లగ్రుడ్లు. ◆ధూసరితంబు|కొంచెము తెల్లబారినది, పిశంగ|పచ్చనైన. ¶అజగర|కొండచిలువ. §కులాల|కుమ్మరవాఁడు.

యధర్మబహుళంబగు కలియుగంబున *భవితవ్యతచేవిమోహితుండై మనుజులనసమంజసంబగు పాషండమతాభినివేశు లంజేసెమఱియును గలియుగంబునం దమనుజాధములు దేవమాయా మోహితులై శాస్త్రోక్తశౌచాచారంబులువిడిచినిజేచ్ఛంజేసి దేవతా †హేళనంబులు సేయుచున స్నానానాచమనాశౌచ‡కేశోల్లుంఛనాదికాపవిత్రవ్రతంబులం జేయుచునధర్మబహుళంబగు కలియుగంబునం జెరుపంబడ్డబుద్ధిధర్మంబులుగలిగి వేదబ్రాహ్మణయజ్ఞపురుషులదూషించుచు లోకంబులందమతమమతంబులకుండా మెసంతసించుచున వేదమూలంబగు స్వేచ్ఛంజేసి ప్రవర్తించి యంధపరంపరచేవిశ్వాసంబుంజేసి తముంతననంధతమంబునం బడుచునుండు మఱి ఋషభునియవతారంబు రజోవ్యాప్తులగు పురుషులకు మోక్షమార్గంబునుపదేశించుటకునయ్యె నదియునుంగాక సప్తసముద్రపరివృతంబులగు నీభూద్వీపవర్షంబులందలి జనంబులు దివ్యావతార ప్రతిపాదకంబులతిశుద్ధంబులునగు నెవ్వనికృత్యంబులంగీర్తింతురు మఱియు నెవ్వనివంశంబున నతికీర్తిమంతుండగు ప్రియవ్రతుండు గలిగె నెం దమజగదాద్యుండగు పురాణపురుషుం డవతారంబునొంది కర్మహేతుకంబుగాని మోక్షధర్మంబులం దెలిపె నెండియు నెవ్వండు యోగమాయాసిద్ధులనసమ్యుతంబులగుటం జేసి నిరసించె నట్టి ఋషభునితోడందత్సిద్ధికృత ప్రయత్నులగు నితరయోగీశ్వరులు మనోరథంబుననైన నెట్లుసరియగుదురిట్లు సకలవేదలోకదేవబ్రాహ్మణులకు గోవులకుం బరమగురుండు భగవంతుండునగు ఋషభుచరిత్రంబు వినినవారలదుశ్చరితంబులు దొలంగు మంగళంబులు సిద్ధించు మిక్కిలిశ్రద్ధతో నెవ్వండు వినుచు వినిపించు వానికి హరిభక్తిదృఢంబగు నట్టి హరిభక్తితాత్పర్యంబునం బెద్దలు భాగవతులగుటం జేసి సంప్రాప్తసర్వపురుషార్థులగుచు వివిధ§వృజినహేతుకంబగు సంసారతాపంబును బాసి యవిరతంబు దద్భక్తియోగామృతస్నానంబుం జేసి పరమపురుషార్థం బైన మోక్షంబును జెందుదురనిసప్తద్వీపంబులవారు నేఁడునుం గొనియాడుచుండుదురు॥గీ॥ యాదవులకుమీకు నత్యంతకులగురు। వైనకృష్ణుఁడెచటనైన గలఁడు। కొలుచువారికెల్ల సులభుఁడై మోక్షంబు। నిచ్చుఁ జింతసేయ నేల మీకు॥ సీ॥ నిత్యానుభూతమానిజరూపలాభనివృత్తమై తగు మహాతృష్ణగలిగి। యతులితవిపులమాయారచితంబైనలాభంబు నసుఁదను లంబు లేని। మతిగల్గి లోకులనతివేడ్కఁ గరుణించి యభయదానంబిచ్చియుండ నకిల। నవ్యయంబై దివ్యమైన మహానందమై యత్యంతసేవ్యమై యతులమైన। తనదు లోకంబు చూపంగఁదగినయట్టి। మోక్షమార్గంబు నెఱిఁగించి ముక్తదేహుఁ। డగుచుఁ దా వాత్స్యమొందెఁ బ్రత్యక్షవిష్ణు। వైనఋషభుండు జనులకునద్భుతముగ॥ వ॥ భ

### ——⇒ భరతోపాఖ్యానముఁ దెలుపుట. ⇐——

రతుండంత ధరాతలంబుఁ గడఁకం బాలించుచుఁ దా ధారుణీ। శ్వరచంద్రుండగు విశ్వరూపునకు మున్ సంజాతమైయుండిని। ర్భరకాంతిన్ విలసిల్లు పంచజని పేరం గల్గు కాంతామణిం। గరమర్థిన్ దరఁ బెండ్లియాడె శుభలగ్నంబందు భూవల్లభా॥ వ॥ ఇట్లు వివాహితుండై యా పంచజనివలన నహంకారంబునం బంచతన్మాత్రలు జనియించిన తెఱంగున సుమతి రాష్ట్రభృత్సుదర్శనావరణ ధూమ్రకేతువులను నేవురుపుత్రులం బుట్టించె నటమున్న నజనాభంబను పేరం బరగు వర్షంబు భరతుండు పాలించుకతంబున భారతవర్షంబునాఁ బరగె నంత॥ క॥ భరతుఁడు నిజపితృలేలిన। కరణిని గర్మముల నెల్లఁ గైకొని ప్రజలన్। హరికృపనొందుచు నేలెను। ధరణీసురవరులు వొగడ ధరణీనాథా॥ సీ॥ భగవంతుఁడగు జగద్భర్తను నల్పంబులు నధికంబులైన పెక్కధ్వరములు। దర్శపూర్ణిమలచేఁ దగు నుజాతుర్మాస్యములన గ్నిహోత్రమువలనఁ గడఁకఁ। బశుసోమములచేతఁ బలుమారుఁ బూజించి వేదోక్తమైన యావినులకర్మ। ములఁగల్గు ధర్మంబుఁ బురుషోత్తమార్పణంబుగఁ జేయుచును మఖంబుల మమంత్ర। ములను బలికెడు నా దైవములను శ్రీశు। నవయవంబులుగాఁ గ భూధవుఁడు ప్రేమ। ననుదినంబును బాయక ఘనతఁ దలఁచి। యఖిలరాజ్యానుసంధానుఁడగుచునుండె॥ క॥ ఈరీతిఁ గర్మసిద్ధుల। నారయ నత్యంతశుద్ధమగు చిత్తముతో। నారాచపట్టి భరతుఁడు। ధారుణిఁ బాలించె నధికధర్మాన్వితుఁడై॥ వ॥ మఱియు నా భరతుండు శ్రీవత్సకౌస్తుభవనమాలాలంకృతుండు సుదర్శనాద్యాయుధోపలక్షితుండు, నిజభక్తజనహృదయారవిందవాసుండుఁ, బరమపురుషుండును నైన వాసుదేవునియందు నధికభక్తిననుదినంబును సేయుచు నేఁబదిలక్షుల వేలేండ్లు రాజ్యంబుఁ జేసి ¶పితృపితామహాద్యాయాతంబగు నాధనంబును యథార్హంబుగఁ బుత్రులకుఁ బంచియిచ్చి బహువిధసంపదలుగల గృహంబును బాసి పులహాశ్రమంబున కరిగె నంత॥ సీ॥ ప యాశ్రమంబున నిందిరాధీశ్వరుఁ డచ్చటి వారల నాదరించి। ప్రత్యక్షమున నుండుఁ బాయక యెప్పుడు నట్టి రమ్యంబైన యాశ్రమమున। నిలిచి సాలగ్రామములు గల గండకీనది యొండు నెంతయుఁ గదిసియుండు। నచ్చోట నేకాకియగుచును భరతుండు

---

*భవితవ్యతచేత। కాగలకాలప్రమాదములచే, అసమంజనంబగు। యోగ్యము గాని, †హేళనము। నిందన-తిరస్కారము, ‡కేశోల్లుంఛన। వెంట్రుకలుకత్తిరించుట. §వృజిన। పాపము, అవిరతంబు। విరామము లేని. ¶పితృపితామహాద్యాయాతంబగు। పితృపితామహక్రమము గావచ్చిన.

బహువిధనవపుష్పపల్లవముల।నతులతులసీదళంబులనంబువులను। గందమూలాదిఫలములఁగంజములను।ఘనతనర్పించిని చ్చలుదనివిలేక। సేవసేయుచునుండెనాశ్రీశుహరిని॥వ॥దానం జేసివిగతవిషయాభిలాషుండై శమదమాదిగుణంబులుగ లిగియథేచ్ఛంజేసియెడతెగకపరమపురుషునిపరిచర్యాభక్తిభరంబునశిథిలీకృతహృదయగ్రంథిగలిగిసంతోషాతిశయం బునంబులకితాంగుండునానందబాష్పనిరుద్ధావలోకనయనుండునగుచు నిజస్వామియైనహరిచరణారవిందానుధ్యానపరి చితభక్తియోగంబునంబరమానందగంభీరహృదయంబనునమృతహ్రదంబుననిమగ్నుండగుచుఁదానపుడుపూజించుపూ జనెఱుంగకనిట్లుభగవద్వ్రతంబుధరియించి యేణాజినవాసస్త్రిషవణస్నానంబుల నార్ద్రకుటిల§కపిశవర్ణజటాకలా పంబులుగలిగిమార్తాండాంతర్గతుండయినపరమేశ్వరునిహిరణ్మయపురుషునింగాఁదలంచుచునిట్లనియె॥సీ॥కర్మఫలంబు లఁగడఁకనిచ్చుచుమనోవ్యాపారమనునట్టి యఖిలలోక। ములఁజేసియాలోకములకునంతర్యామియగుచుఁ బ్రవేశించి యంతమీఁద। నానందరూపమైనట్టిబ్రహ్మముఁగోరుచున్నజీవునిఁదనలోనియోగ। శక్తిచేఁదగనసిశంబుఁబాలనసేయు చుండియంతటను✻మార్తండమధ్య।వర్తియగుచునిట్లువరలుచుజగముల। యందునుండిప్రకృతిఁబొరయక†ంత।నతులదివ్య మూర్తియైనయానందరూ।పమునుశరణమొందెభరతవిభుఁడు॥వ॥అంత నాభరతుండొక్కనాఁడామహానదింగృతాభిషే కుండయిముహూర్తత్రయంబంతర్జలంబులందుఁబ్రణవోచ్చారణంబుసేయుచుండుసమయంబుననిర్ఝరగర్భిణియగుహ రిణిజలార్థియైయొంటిజలాశయసమీపంబునకువచ్చిజలపానంబుసేయునెడనాసమీపంబునమృగపతిగర్జించిలోకభయం కరంబుగనాదంబుసేయహరిణిస్వభావంబునభీతయగుటంజేసిబెగ్గడిలిహరిపిలోకనవ్యాకులచిత్తయైదగ్గననదరి గగనం బునకునెగిరియగతతృషయగుచునదినుల్లంఘించునెడనధికభయంబునంజేసియాగర్భంబుయోనిద్వారంబున *గళితం బయిజలంబులంబడియెనాహరిణియుల్లంఘనాదిభయంబునంజేసిచిత్తంబుననుండుగిరిదరింబడి శరీరంబుఁబాసెనంత నాహరిణపోతంబుజలంబులందేలుచున్నభరతుండుఁగనువిచ్చిచూచికరుణార్ద్రచిత్తుండయి మృతజననియగు ‡హరిణపో తంబునుదనయాశ్రమంబునకుంగొంపోయిమిక్కిలిప్రీతింజేసియుపలాలనంబుసేయుచుంబోషణపాలనప్రీణనలాలనా నుధ్యానంబులభరతునకునాత్మనియమంబులైనయష్టాంగయోగంబులునుబరమపురుషపూజాపరిచర్యాదులునొక్కొ క్కటిగఁగ్రమక్రమంబునంగొన్నిదినంబులకుసమస్తంబులుత్సన్నంబులయ్యెనంత॥ క॥ఘనతపముచలనమొందుట।యు నుభరతుండెఱుఁగకాత్మయోగంబునుఁజా।ల్యోసంబాసెహరిణపోతముఁ। దనమదిలోనిల్పిప్రేమఁదప్పకపలికెన్॥ఉ॥అక్క టతల్లిఁబాసిహరిణార్భకమా త్రులులేమిఁజేసియే।దిక్కును లేకయున్ననిటఁదెచ్చితినాయెడనీస్వగార్భకం।బెక్కుడుప్రే మంజేసిజరియించుచునున్నదినాదుసన్నిధి।న్మిక్కుటంజేసిదీనిగడుమన్ననలందుగఁబ్రోతునెంతయున్॥క॥శరణమునివచ్చు జంతువుఁ।గరుణంగనువిచ్చిచూచికాచినఁబుణ్యం।బరయఁగనఘకంబనిము। న్నరమెఱిఁగించెనుమునీంద్రగణములుప్రేమన్॥ వ॥ అనియిట్లుహరిణపోతంబుందనయాశ్రమంబునన్యాసక్తింజేసియాసనశయనాటనస్నానసమిత్కుశకుసుమఫలప లాశమూలోదకాహరణదేవపూజాజపాదులయెడందనయొద్దనయునిచికొనుచు♣వృకసాలావృకాదిక్రూరమృగంబుల వలనిభయంబునవనంబులవెనువెంటందిరుగుచునధిక⁂ప్రణయభరపరీతహృదయుండగుచునతిస్నేహంబునంజేసికొంత సేపు†స్కంధంబులవహించుచుఁజీకొంతదడవురంబుననుత్సంగంబుననుంచికొనిలాలించుచుసంతసంబునొందుచుఁజియు నా భరతుండునిత్యనైమిత్తికాదిక్రియాకలాపంబునిర్వర్తించునెడనంతనంతలేచిహరిణ¶కుణకంబుఁజూచుచుఁగించిత్స్వ స్థహృదయుండైదాని🙞నాశీఃపరంపరలనభినందించుచుంజుంబనాదులంప్రీతిఁజేయుచు నతిమోహంబునఁబెంచుచుండు నెడ॥గీ॥కరిమనిరీతిమెల్లనఁ❧గెగలువైడవి। చెలఁగియాడంగభరతుండు చిత్తమందు। సంతసిల్లుచునుండెనాశ్రమముఁ బాసి।హరిణడింభకమంతలోనుఱికిచనిన॥వ॥భరతుండంతఁదన్మృగశాబకంబుగానంబడకుండుటయుమిక్కిలివ్యాకులి తచిత్తుండగుచునష్టధనుండువోలెనతిదీనుండైకరుణతోడంగూడితద్విరహవిహ్వలమతియైదానినతలంచుచునతిశోకంబు తోమనంబునమఱఁగించియిట్లనియె॥ గీ॥ హరిణపోతంబనీకువనాంతమందు।గ్రాగమృగబాధలేకుండఁగోరుచుండఁ। దలఁ గిపోయిటెయనుచుఁజిత్తమునందు। రాజుబుషభుండుభరతుఁడారాటమందె॥గీ॥తల్లిచచ్చినహరిణపోతంబువచ్చి। పుణ్య హీనుండనగునన్నుఁబొందిపాసె। నేమిసేయుదునేనింకనెట్లుగందుఁ। జేరియేరీతిఁగాంచిరక్షించువాఁడ॥ క ॥ ✿కట్టా

§ కపిశ।మర్కటవర్ణము. ✻మార్తండ।సూర్యుఁడు. • గళితంబై।జారినదై. ‡హరిణపోతంబు।లేడిపిల్ల. ♣వృక।తోడేలు, సాలావృకాది। కోఁతి-నక్క-కుక్క-మొదలగు. ⁂ప్రణయభరపరీతహృదయుండు।అతిప్రీతిసహితముగుహృదయముగలవాఁడు. †స్కంధము।భుజశిరస్సు. ¶కుణకము।శిశువు 🙞ఆశీఃపరంపర।ఆశీర్వచనపఙ్క్తి. ❧కెరలువాడిచి।పులకాంకితమై. ✾శాబకము।శిశువు. ✿కట్టా।అయ్యో.

[illegible]

యీయాశ్రమమునఁ బుట్టిన తృణచయము మేసి పెరిగిన హరిణం బిట్టట్టు దిరుగుచుండఁగఁ బట్టి మృగేంద్రుండు గొట్టి బాధించెనొకో॥ వ॥ ఇట్లు భరతుండు హరిణపుత్త్రకంబుఁ గోరుచు నెప్పుడు వచ్చి నన్ను సంతోషపఱచు నానాప్రకారంబులైన తనగతులచేత నెప్పుడానంద మొందించు ధ్యానసమాధి నున్నప్పుడు నన్నుం గొమ్ములం ద్రోయుచు నుండు నట్టి విమోదంబు లెప్పుడు గనుంగొందు దేవపూజాద్రవ్యంబులు ద్రొక్కి మూర్కొనిన నంగోపించి చూచిన నం గుమారుండువోలె దూరంబునకుం జని నిలిచిన నప్పు డలనే చిలిచిన వెనుక నిలిచియుండు నట్టి మెలంకువ స్వభావంబు గలుగుట యెట్టు లీభూదేవి యెంత తపంబుఁ జేసినదియో హరిణపాదస్పర్శంబులం బవిత్రంబైన భూమి స్వర్గాపవర్గకాములైన మునులకు యజ్ఞార్హంబగు నట్టి హరిణపోతంబు నెట్లు గనుంగొందు నదియునుం గాక భగవంతుండగు చంద్రుండు మృగపతిభయంబున మృతజననియు స్వాశ్రమపరిభ్రష్టంబునైన మృగశాబకంబును గొనిపోయి పెంచుచున్నవాఁడో మున్ను పుత్త్రవియోగతాపంబును జంద్రకిరణంబులం బాపుమని పుత్త్రహరిణపోతంబు దనశరీరస్పర్శం జేసి చంద్రకిరణంబులకన్న నధికంబగు చుంబుత్రవియోగతాపంబు నిర్వర్తింపం జేసెనను చుం చెస్కంభంగుల హరిణనిమిత్తంబులైన మనోరథంబులచేతం బూర్వకర్మవశంబున యోగభ్రష్టుండగు భరతుండు భగవదారాధనంబువలన *విభ్రంశితుండగుచు నితరజాతిం బుట్టిన హరిణపోతంబు మీఁది మోహంబగ్గలంబగుచుండ నుండెనని పలికి శుకయోగీంద్రుండు మఱియు నిట్లనియె॥ సీ॥ జననాథ మున్ను మోక్షవిరోధ మని పాయఁగరాని పుత్త్రాదికంబు లెల్లఁ బాసి తపస్వియై భరతుండు హరిణశాబకపోషణంబునఁ బాలనమున నటలాలనప్రీణనానుషంగంబుల మూషకబిలమునకు రోహమునను సర్పంబు సొచ్చినచందంబునను యోగవిఘ్నంబు మిక్కిలి విస్తరిల్లఁగా నెంతవానికైనను గాలంబు గడువరాని చొప్పు గాక పోదు పరమమునులకైనఁ బాయదు కర్మంబు నరులనంగ నెంత నరవరేణ్య॥ వ॥ ఇట్లు భరతుండు మృగవియోగతాపంబు నొందుచుండ నెడ నా మృగశాబకంబు చనుదెంచిన సంతసిల్లుచుండె నంత నొక్కనాఁడు॥ మ॥ భరతుం డిట్లు ననంత్యకాలము వెసం బ్రాపింపఁగా నప్పుడా హరిణంబుం గడుభక్తిం బుత్త్రు గతిన త్యాసక్తి వీక్షింపనా హరిణంబుం దనయాత్మలో నిలిపి దేహంబంతటం బాసి తా హరిణీగర్భమున జనించె హరిణంబై యొప్పెం బూర్వస్మృతిన్॥ వ॥ ఇట్లు భరతుండు హరిణీగర్భంబునం బుట్టియు భగవదారాధనసామర్థ్యంబునం బూర్వమృగకారణంబుఁ దెలిసికొని తాపంబు నొందుచు నిట్లనియె॥ ఉ॥ రాజులు ప్రస్తుతింపసురరాజసమానుఁడనై తనూజుల న్రాజులఁ జేసి తాపసులు రాజఋషీంద్రుఁడటంచుఁ బల్కఁగాఁ దేజము నొందియా హరిణదేహమునందు మలంభ్రమఁ జేసినా †ఓజ చెడంగ నేఁ జెడితి యోగజనంబులలోన పేదనై॥ వ॥ ఇట్లు శ్రీహరిశ్రవణ మనన సంకీర్తనారాధనానుస్మరణాభియోగంబులం జేసి యశూన్యసకలయామంబగు కాలంబు గలనాకు హరిణపోతస్మరణంబు కతంబున యోగవిఘ్నంబు ప్రాప్తంబయ్యె మోహమూఢుండనైతినని ‡నిగూఢనిర్వేదుండగుచుఁ దల్లిం బాసి శ్రమ్యమనుపశమశీల మునిగణసేవితంబై భగవత్క్షేత్రంబైన సాలగ్రామనిబిడతమ గ్రామసమీపపులస్త్యపులహాశ్రమంబునకుం గాలాంజనపర్వతంబువలనఁ జనుదెంచియు మృగదేహత్యాగావసానంబు గోరుచు సంగంబు విడిచి యేకాకియగుచు శుష్కపర్ణతృణ§వీరుదాహారుండై మృగత్వనిమిత్తంబగు నానదీతీర్థంబునందు నవసానంబు గోరుచుఁ దత్తీర్థోదకక్లిన్నంబగుచుండు శరీరంబు విడిచెనని శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రు

## ——శ్రీ భరతుండు హరిణజన్మంబు విడిచి, ఆంగిరసుండను బ్రాహ్మణునకుఁ బుట్టుట. శ్రీ——

నకు వినిపించి మఱియు నిట్లనియె॥ సీ॥ హరిణదేహముఁ బాసి యంత నాంగిరసాహ్వయుండు శుద్ధుఁడు విప్రముఖుఁడు శమదమాదిక తపస్స్వాధ్యాయనిరతుండు గుణగరిష్ఠుఁడు నీతికోవిదుండునైన బ్రాహ్మణునకు నాత్మజుండై పుట్టి సంగంబువలన నుజకీతుఁడగుచుఁ గర్మబంధంబుల ఖండింపఁ జాలు నీశ్వరు నినచ్యుతు నజు శ్రవణమననములసు హరిచరణధ్యానములను విఘ్నభయమునను జేసి నమందఁ బాయనీక సలిపి సంస్తుతి సేయుచు నిలిచియుండె భరితయశుండైన భరతుండు పార్థివేంద్ర॥ వ॥ ఇట్లాంగిరసుండు ప్రథమభార్యయందుఁ బుత్త్రనవకంబుఁ గని ద్వితీయభార్యయందు స్త్రీపుంసముల నిద్దఱను గలుగఁ జేసె నందుఁ బుంసుండు పరమభాగవతుండు రాజర్షిప్రవరుండు నుత్సృష్టమృగశరీరుండు చరమశరీరంబునం బ్రాప్తవిప్రశరీరుండును నగు భరతుండయ్యె నతం డా జన్మంబున నన్యజనసంగంబు జన్మపరంపరలకుం గారణంబని యత్యంతభయంబు నొంది కర్మబంధవిధ్వంసన శ్రవణస్మరణాదుల శ్రీహరియనుగ్రహంబునం బూర్వజన్మపరంపరల సంస్మరించుచు మదనస్వరూపంబు నున్మత్త జడాంధబధిరరూపంబున లోకులకుం జూపుచుండె నంత॥ మ॥ జనకుం డంగిరసుండు నాత్మజుని వాత్సల్యం

* విభ్రంశితుండు జారినవాఁడు. †ఓజ తేజస్సు-బలము. బేల మూఢుఁడు. ‡నిగూఢనిర్వేదుఁడు ఇతరులకెఱుఁగరాకుండ వ్యసనపడుచున్నవాఁడు. §వీరుదాహారుండై లతాసమూహమాహారము గలవాఁడయి.

ముగావునం బ్రమాణమూలంబయిన లోకవ్యవహారంబు సత్పథంబున సమ్మతంబై యుండుటం జేసి మీరలాడు వాక్యంబులు నాకు సమ్మతంబుగా నేరవని సింధుదేశాధీశ్వరుండు వినిపించిన నావిప్రుండు లోకవ్యవహారంబునకు నిత్యత్వంబౌపాధికంబగుంగాని నిత్యంబుగా నేరదని దృష్టాంతనిదర్శనంబున నిట్లనియె॥ సీ॥ పావకశిఖలచే భాండంబు దాఁ దప్తమగు దప్తఘటము చే నంబు నున్న। జలము దపించు నా జలముచేఁ దండులంబులు దప్తమొంది యప్పుడు విశిష్ట। మైన యన్నంబగు నా చందమునను దా దేహేంద్రియంబులఁ దెలివితోడ। నాశ్రయించుక యున్న యట్టి జీవునకు దేహంబునఁ బ్రాణేంద్రియాదికమున। జరుగుచుండు నిట్లు సంసారఘటవృత్తి। మండునైన రాజు మష్టమైన। కర్మములకుఁ బాసి కంజాక్షుపదసేవఁ। జేసె నేని భవముఁ జెందకుండు॥ గీ॥ అనుచు ధారుణీసురాత్మజుఁ డీరీతిఁ। బల్కుటయును రాజు పరిణమించి। వినయవాక్యములను వినుతించి క్రమ్మఱఁ। బల్కెఁ దైన సింధుభూవరుండు॥ వ॥ మహాత్మా యేను రాజనని యొడియభిమానమదాంధుండనై మహాత్ములం దిరస్కరించిన నన్నుం గరుణింపుము నీ వార్తబంధుండవు నీకృపాదృష్టిం జేసి మహాత్ముల నవమానంబుఁ జేసిన దురితంబువలన విముక్తుండ నయ్యెద విశ్వసుహృత్తవైన నీకుం గోపంబు గలుగ నేరదు సమర్థులయిన మాబోటివారలును మహాజనావమానంబున శీఘ్రంబె నశింతురు గాన నీవు దయాళుండవై నన్ను మన్నింపుమనిన నావిప్రుండిట్లనియె॥ క॥ కడు వేడ్క నీవు విద్వాంసుడవై యుండియును మిగులఁ జోద్యము విద్వాంసుండు నోలెను బలికెదవి। ప్పుడు మేలనవచ్చుఁ గొంత పురుషులలోనఁ॥ గీ॥ పరగఁ బెద్దలీ ప్రపంచమంతయుఁ దథ్య। మనరు నీవు తథ్యమనుచుఁ బలికి। తట్లుగాన నిన్ను నధికుండవనవచ్చు। రామనాకుఁ జూడ రాజచంద్ర॥ సీ॥ యజ్ఞాదికములందు నామ్నాయములయందుఁ దనుచు గాఁ దత్త్వవాదంబు లేదు। స్వప్నంబునందుల సౌఖ్యమాకారంబునందు లక్షత్వమైయంత లేని। యట్టి చందమున వేదాంతవాక్యంబులు దత్త్వంబు నెఱిఁగించి తలఁగుఁ గాని। నిత్యంబులై యుండ నేరవు పురుషు నిది చిత్తంబు గుణములఁ జెందియెంత। కాలముండును మఱి యంత కాలమందు। నరయవిజ్ఞానకర్మేంద్రియముల చే। మఱిగి ధర్మంబు మఱియధర్మంబు నట్లు। దగిలి పుట్టించుచుండు నత్యంతమహిమ॥ వ॥ మఱియు ధర్మాధర్మవాసనాయుక్తంబు విషయానురక్తంబునైన చిత్తంబు గుణప్రవాహంబుల చే వికారంబు నొంది దేవతిర్యఙ్మనుష్యరూపంబులైన దేహంబులం బుట్టించుచుఁ గాలప్రాప్తంబులైన సుఖదుఃఖితమభయఫలంబుల ననుభవించుచు ననవరతంబు జీవునికిం బ్రత్యక్షంబగుచు స్థూలసూక్ష్మరూపంబులనుండు స్వాంతంబు గుణరహితంబైన ముక్తికారణంబగు ఘృతవర్తులుగల దీపంబు సధూమశిఖలం బుట్టించు ఘృతవర్తులు నాశంబు నొందిన స్వరూపంబుఁ బొందిన తెఱంగున మనంబు గుణకర్మానుబంధంబైన జన్మములం బుట్టించు గుణకర్మంబులం బాసె నేనియుం బరతత్త్వంబు నొందు జ్ఞానేంద్రియంబులేను విషయంబులమీఁద దోఁచు బుద్ధులేను నభిమానంబును నేకాదశవృత్తులంగూడిన మనంబు జీవునికి ననంఖ్యంబులైన జన్మంబులం బొందించు మనోవృత్తుల నతిక్రమించిన జీవుండు పరంజ్యోతిస్సైన నారాయణస్వరూపంబుగా నెఱుంగుము- స్థావరజంగమంబులైన జీవులకుం బవనుండు ప్రాణంబై యున్న చందంబున నీశ్వరుండు సర్వభూతాంతర్యామియగుచు జీవాత్మస్వరూపంబునం నుండు జీవాత్ముండు జ్ఞానోదయంబునం జేసి మాయ నెంత కాలంబునం గెలువకుండు నంత కాలంబు ముక్తసంగుండు గాఁ డరిషడ్వర్గంబును జయించి పరతత్త్వంబు నెఱింగిన నీశ్వరుండగుఁ జిత్తంబెంత కాలంబు విషయాసక్తంబగు నంతతడవు సంసారచక్రంబునందు సంచరించుం గావున మహావీరుండైన మనంబను శత్రువైన మనంబున ప్రమత్తుండయి యుచ్చాహారంబు జరుగనీక పరమగురుండైన శ్రీహరిచరణోపాసనాస్త్రంబున జిత్తంబు గెలిచినం బరతత్త్వంబు నొందు నని విప్రుండు వలికిన నతని మహిమకు వెఱఁగంది బ్రాహ్మణునకు నమస్కారంబు సేయుచు భూవరుండిట్లనియె॥ ఉ॥ కారణవిగ్రహంబును గాయమును నీయవధూతవేషమున్ బ్రాగ్విధరామరత్వమును బూర్వసమాగమమాహాత్మ్యభావముం। జారువిహారమత్యతులశాంతిగుణంబును గూఢవర్తనం। బారయఁ గల్గు నీకు వనయింబును మ్రొక్కెదఁ బెక్కుభంగులన్॥ మ॥ జ్వరితార్తుండగు రోగికౌషధమతీష్టంబై రచంబునన్। దరలో నాతపతప్తదేహికిఁ శీతంబైన తోయంబును। గరిమం గ్రోలి నరీతి నేంతయు మహాంకారాహతుండనై। పరగుదాన్నకు నీవచోమృతము దప్పమ్మందు వేఁడుచున్నదే॥ గీ॥ విప్రవర్య నేను వేడ్కతో నా సంశయంబు లెల్ల నిన్ను నడిగి తెలియుఁ। గలఁచి యున్న వాఁడఁ గప్పక యెఱింగింపు। ముచితవృత్తిఁ గర్వయోగి మెల్ల॥ అనియడిగిన యారాజునకా విప్రుండిట్లనియె॥ గీ॥ కానవచ్చిన ఫలములు గర్మమూల। ములగుటను జేసి సంసారములను జిత్త। మెపుడు వర్తించుచుండు గానెఱుఁగ లేవు। తత్త్వయోగంబు మిగులనిత్యంబటంచు॥ వ॥ మఱియు నీ వసుంధర నున్న చరణంబులకు నెక్కుడు జంఘలు నామీఁద జానువులా పాదవుననూరువులందు మలకును పరిప్రదేశంబున మధ్యంబట మీఁద నురమందుకు నెక్కువ కంఠంబు బుమీఁద స్కంధంబందులదాను వాదారువున శిబికయందు రాజనని యొడయభిమానంబు గలిగి నీవున్న

క్షీకాబాధనత్యంతదుఃఖితుండయినమాడ్కి నిసంసారకాముండై పరదారద్రవ్యాభిలాషియగుచు భూపాలకులచేతనయినను గృహపతిచేతనయినను దాడితుండయి నరకంబునం బడుచుండు యావనంబున సంపాదించినద్రవ్యంబులు పరులచేతం గోనాడినవిధంబున శీతవాతాద్యనేకప్రయాసలబ్ధంబైనధనంబులువోనాడి సంసారి యతిచింతాక్రాంతుండై యుండు మఱియును వనంబున లుబ్ధకులు సంసృష్టంబయినయల్పామిషంబునకు నన్యోన్యవైమనస్యంబునం గలహించిన విధంబున సంసృష్టవ్యవహారిరై నల్పద్రవ్యంబులకుం బోరాడుచుండునని భూపాలునకు విప్రుండు సంసారాటవి తెఱంగెఱింగించి వెండియునిట్లనియె॥ గీ॥ అల్పధనుఁడు విశ్రమస్థానములఁ దృప్తిఁ। బొందకోరులధనముఁ బొందఁ గోరి। యరిగి వారివలన నవమానములఁ బొంది। యధికమయినదుఃఖమనుభవించు॥ గీ॥ అంతఁ గొందఱల్లనన్యోన్యవిత్తాదివినిమయమునఁ గడుఁ బ్రవృద్ధమయిన। వైరములను బొంది పోరాట మొందుచు। రాత్మచింత లేక యనుదినంబు॥ సీ॥ సంసారమార్గసంచారుడై యధికప్రయాసంబునను గూర్చునర్థములను। విహరింపుచును గొందఱిహలోకఫలములఁ గోరి మోక్షంబును గోరకంతఁ। జెడిపోవుచుందు రెప్పుడు గానియందుకుఁ గడపటియోగంబుఁ గానలేరు। మానవంతులునసమానశౌర్యులునగువారు మిక్కిలియైనవైరబుద్ధి। నాహవంబునఁ బడియుమరంతె కాని। మోక్షమార్గంబుఁ గానరు మూఢవృత్తి। ననుచు సంసారగహనవిహారమెల్లఁ। దెలిపి క్రమ్మఱ ననియె ధాత్రీసురుండు॥ వ॥ మఱియుం గాలచక్రనియంత్రితుండై చక్రాయుధునిం గొల్వక కాకగృధ్రబకసమానులైన పాషండసఖ్యంబునం జేసి వారలచేత వంచితుండై బ్రాహ్మణకులంబునం జేసి శ్రౌతస్మార్తకర్మానుష్ఠానపరుండై విషయసుఖంబులం దుదగులంబడి కాలంబు తుదనెఱుంగక వృక్షంబులుం బోలె నైహికార్థంబులయందుఁ దృష్ణ గలిగి మైథుననిమిత్తంబు సుతదారాదులయందు స్నేహంబు సేయుచుఁ బథికుండు మాతంగంబులయందు భయంబున దీర్ఘనిమ్నకూపంబునం బడినతెఱంగున సంసారమృత్యుగజభయంబున గిరికంధరప్రాయంబయినయజ్ఞానతమంబునం బడుం గావున మాయచేత సంసారమార్గంబైనరాజభావంబు విడిచి సర్వభూతమైత్రి గలిగి జితేంద్రియుండవై జ్ఞానాసిచే మార్గంబు కడపలఁ గనుమని పలికిన భూపాలుండిట్లనియె॥ క॥ అక్కట మానుషజన్మం। బెక్కువ నైమియుండు నెపుడభేదమతిం బెం। పెక్కిన యోగిసమాగమమక్కజము గలిగెనేని యఖిలాత్ములకున్॥ క॥ ధరణీసురవరనిశ్రీ। చరణాంబుజయుగళరేణుసంస్పర్శమునా। దురితంబులఁ డఁచెనింతట। హరిభక్తియునంతకంతనధికంబయ్యెన్॥ వ॥ మఱియు విప్రవరులయందు యోగీశ్వరులవధూతవేషంబునం జరియింపుచుందురు గావున విప్రులు పిన్న పెద్దలనక నందఱికి నమస్కారంబని స్తుతియించిన నా యోగీశ్వరుండును సింధుపతికి గరుణాన్వితుండగుచుఁ దత్త్వజ్ఞానంబుపదేశించి యా రాజుచేత వందితచరణుండై పూర్ణార్ణవంబునుం బోలె సంపూర్ణకరుణారసపూరపూరితస్వాంతుండై వసుంధరం జరియింపుచుండె సింధుభూపతియును సుజనసమాగమంబున లబ్ధతత్త్వజ్ఞానుండై దేహాత్మభ్రమంబా సెననిపలికి శుకయోగీంద్రునకుఁ బరీక్షిన్నరేంద్రుండిట్లనియె॥ చ॥ అరయఁగ మౌక్తికంబు వినతాత్మజుఁ గూడఁగ లేనిరీతియో। భరతునిసచ్చరిత్రము ప్రస్తుతిసేయఁగనీవసుంధరన్నరపతులెల్ల నోపరు మనంబున నైననునింక నిట్టియో। భరతునిపుణ్యవర్తనముఁ బ్రస్తుతి సేయఁగ నాకుశక్యమే॥ వ॥ నరేంద్రా భరతుండు సుతదారరాజ్యాదులను బూర్వకాలంబునం దవిడిచి భగవత్పరుండగుచు యజ్ఞరూపంబును ధర్మస్వరూపంబును సాంఖ్యయోగంబును బ్రకృతిపురుషస్వరూపంబునైన నారాయణునకు నమస్కారంబు నుమ్మృగరూపంబునుం బాసెనట్టి భరతుని చరిత్రం బెవ్వరు సెప్పిన నెవ్వరు వినిన నట్టివారలఁ బుండరీకాక్షుండు రక్షించు నాయురభివృద్ధియగు ధనధాన్యసమృద్ధియునగు స్వర్గోపభోగంబులం బొందుదురని॥

మ॥ నరదేవాసురయక్షరాక్షసమునీంద్రస్తుత్యదివ్యాంబరా। ధరణాలంకృతభక్తవత్సలకృపాపారీణవైకుంఠమం। దిరబృందావనభాసురప్రియధరిత్రీనాథగోవిందశ్రీ। కరపుణ్యాకరవాసుదేవత్రిజగత్కల్యాణగోపాలకా॥ క॥ పరమపదవాసదుష్కృత। హరకరుణాకరమహాత్మహతదితిసుతభా। సురగోపికామనోహర। సరసిజదళనేత్ర భక్తజనసుతగాత్రా॥ మాలిని॥ సరసహృదయవాసా చారులక్ష్మీవిలాసా। ధరితశుభచరిత్రా భాస్కరాబ్జారినేత్రా। నిరుపమఘనగాత్రా నిర్మలజ్ఞానపాత్రా। గురుతరభవదూరా గోపికాచిత్తచోరా॥..........

గద్య. ఇది సకలసుకవిజనానందకరబొప్పనామాత్యపుత్ర గంగనార్యప్రణీతంబైన శ్రీమహాభాగవతపురాణంబునందు ప్రియవ్రతునిసుజ్ఞానదీక్షయు, బ్రహ్మదర్శనంబు, నాగ్నీధ్రాదులజన్మంబు, నుత్తమతామసరైవతులజన్మంబును, ప్రియవ్రతుండు వనంబునకుఁ జనుటయు నాగ్నీధ్రుండప్సరసం బరిగ్రహించుటయు, వర్షాధిపతులజన్మంబు నాగ్నీధ్రుండు వనంబునకుం జనుటయు నాభిప్రముఖులరాజ్యంబును నాభియజ్ఞంబును ఋషభునిజన్మంబును, ఋషభునిరాజ్యాభిషేకంబును, భరతునిజన్మంబును, ఋషభుండు తపంబునకుఁ జనుచు సుతులకు జ్ఞానంబుపదేశించుటయు, భరతునిపట్టాభిషేకంబును, భరతుండు వనంబునకుఁ జనుటయు, భరతుండు హరిణపోతంబునందుఁ బ్రీతిఁ జేసి హరిణగర్భంబున జనియించుటయు, మఱల విప్రసుతుండై జనియించుటయు, విప్రుండు చండికాగృహంబునఁ బ్రతికివచ్చుటయు, సింధుపతివిప్రసంవాదంబును నను కథలుగల పంచమస్కంధమునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీగోపాలకృష్ణపరబ్రహ్మణే నమః.



## శ్రీమదాంధ్ర భాగవతము — పంచమస్కంధము.

### ద్వితీయాశ్వాసము.

శ్రీకాంతాహృదయప్రియ। లోకాలోకప్రచారలోకేశ్వరసు। శ్లోకభవభయనివారక। గోకులమందారనందగోపకుమారా॥

వ॥ సకలపురాణార్థజ్ఞానవిఖ్యాతుండగు సూతుండిట్లనియె॥ క॥ మునులార*బాదరాయణి।యనఘాత్మకుఁడై నయుత్తరా త్మజునకుస। ద్వినయోక్తిభరతుచరితము। వినిపించుచుమఱియునిట్లువినిపించెఁదగన్॥ గీ॥ పార్థివేంద్రయిట్లుభరతాత్మజుండైన।సుమతిధర్మవర్తనమునదిరుగ।నదియెబేరింగిదుష్టులయినపాషండులు। దమమతంబుమిగులఁదలఁచిపొగడి॥ క॥ ధరణీవల్లభనిన్నును।నిరతంబునుబుద్ధదేవునింగొలిచినయా। తెఱఁగునఁగొలిచెదమనిభా।సురమతిబోధించిరపుడుసుమతిం బ్రీతిన్॥ వ॥ ఇట్లుపాషండబోధితుండైనసుమతికిధ్రువసేనయందుదేవతాజిత్తనుపుత్త్రుండుజనించెవానికిదేవద్యుమ్నుం డనుసత్పుత్త్రుండాసురియందుజనియించె నమ్మహాత్మునకుధేనుమతియందుఁబరమేష్ఠిజనియించెనతనికిసువర్చలయందుఁ బ్రతీహుండనువాఁడుసుతుండయ్యె నప్పరమపురుషుండు సకలజనులకుబ్రహ్మోపదేశంబుఁజేసి తాను శుద్ధాత్ముం డై హరిస్మరణ సేయుచుయజ్ఞకరణనిపుణులగుప్రతిహర్తప్రస్తోతఉద్గాతయనుసత్పుత్త్రులఁగాంచెనాప్రతిహర్తకుస్తు తియందువ్యోమభూమయనుపుత్త్రద్వయంబుత్పన్నంబయ్యెనందుభూమునకుఋషికుల్యయందునుద్గీథుండనుసుతుండుజ నించెనతనికిదేవకుల్యయందుఁబ్రస్తోతగలిగెనాప్రస్తోతకువరరుత్సయందువిభుండనుతనయుండుద్భవించెనతనికిరతియం దుఁబృథుషేణుండుదయించెనతనికినాకూతియందునక్తుండుగలిగెనానక్తునకురాజర్షిశ్రేష్ఠుండగుగయుఁడనుమహాకీర్తి సంపన్నుండుదయించె॥ గీ॥ అట్టిగయునివలననఖిలజీవులఁబ్రోవఁ।దలఁచిసాత్త్వికప్రధానమయిన।యట్టిమేనుదాల్చియాత్మ తత్త్వజ్ఞానుఁ।డగుచునుండెహరినిజాంశమునను॥ వ॥ ఇట్టిమహనీయసుగుణాకరుండగుగయునిగాథానువర్ణనంబుపురాచి ములగుమహాత్ములచేనితెలుంగుననుతింపఁబడుచున్నదిసావధానమనస్కుండవైయాలకింపుమనియిట్లనియె॥ సీ॥ ధర్మమా ర్గంబునధారుణిజనులనుప్రేమతోఁబోషణ ప్రేషణోప।లాలనశాసనలక్షణాదులచేతఁబోషింపుచునుయజ్ఞములనుయ జ్ఞ।పురుషునీశ్వరుఁజిత్తమునఁనిల్పిసేవించిస్వాంతమందున్నయీశ్వరునిఁగాంచి। యఖిలజీవతతికినానందమొసఁగుచుని రభిమానంబునధరణినేలె।సత్యమందుమిగులసక్తివయందును।ధర్మమందుయజ్ఞకర్మమందు।గయుఁడువసుధలోనఁగంజా క్షుఁడేకాని।మానవుండుగాఁడుమానవేంద్ర॥ వ॥ అట్టిమహాపురుషగుణగణపరిపూర్ణుండగుగయునికి దక్షకన్యకలగుశ్ర ద్ధామైత్రిదయాదులుదమయంతవచ్చికోరికలొసఁగనతనిప్రజలకువసుంధరకామధేనువైపితుకవేదంబులుసకలకామం బులనిచ్చుచుండసంగరంబునభంగంబునొందినరాజు లప్పనంబులొసంగ విప్రులుధర్మంబౌఅవపాలుపంచియుడనిరంతర సోమపానంబునుశ్రద్ధాదిశుద్ధభక్తియోగంబునుంగలిగియొనర్చుయజ్ఞంబుల నింద్రాదిదేవతలుతృప్తులయియజ్ఞఫలం బులనొసంగబ్రహ్మాదితృణగుల్మలతాంతంబుగాసకలలోకంబులవారినితృప్తింబొందింపుచుశ్రీహరితృప్తింబొందఁజే యుచుగయుండుపెక్కుకాలంబురాజ్యంబునేలెనట్టిగయునికిజయంతియందుఁజైత్రరథస్వాత్యవరోధనులనుమువ్వురు కొడుకులుపుట్టిరియాచిత్రరథునికినూర్ణయందుసామ్రాట్టువానికినుత్కళయందుమరీచియామరీచికిబిందుమతియందు బిందుమంతుండనువాఁడునాబిందుమంతునకుసరఘయందుమధువునామధువునకుసుమనస్సనుదానియందు వీరవ్రతుండా వీరవ్రతునకుభోజయందుమన్యుప్రమన్యువులనిరువురందుమన్యువునకుసత్యయందుభువనుండునతనికిదోషయందుఁద్వ ష్టయునాద్వష్టకువిరోచనయందువిరజుండనువాఁడునుజనించెనంత॥ క॥ ఆవిరజునకుదయించిరి।భూవినుతవిషూచియందుఁ బుత్త్రశతంబు।న్నావలనొకకన్యకయు।న్నావేళసమస్తజనులుహర్షంబందన్॥ క॥ ఘనుఁడుప్రియవ్రతువంశం।బునకుందు దర్థైనవిరజభూవిభువంశం।బునుదానలంకరించెను।వినుశిమింద్రావరజుఁడైనవిష్ణునిమాడ్కిన్॥ క॥ అనిపలికినశుకయోగిం। గనుగొనియభిమన్యుసుతుఁడుగడుమోదముతో।వనజదళాక్షునిమహిమలు।వినిసంతసమందియనియెవేడుకమఱియున్॥ వ॥ మునీంద్రాసూర్యరశ్మియందాఁకంబ్రవర్తిల్లునక్షత్రయుక్తంబయినచంద్రకిరణంబులెంతమేరఁదిరుగునంతదూరం బుప్రియవ్రతునిరథనేమిఘట్టనలచేతసప్తద్వీపంబులునుసప్తసముద్రంబులునయ్యెనని పలికితి వాద్వీపసముద్రంబులప రిమాణంబులుసవిస్తరంబులుగానెఱింగింపుము గుణమయంబునుస్థూలరూపంబునునైనశ్రీహరిశరీరంబగునీలోకంబు నందునిలిపినచిత్తంబగుణంబునుసూక్ష్మంబునాత్మజ్యోతియుబ్రహ్మంబునైనవాసుదేవునియందునిల్పుంగావునద్వీపవ ర్షాదివిస్తారంబువినుపింపుమనినశుకయోగీంద్రుండిట్లనియె॥ క॥ ధరణీవల్లభవినుమశ్రీహరిమాయాగుణవిభూతులనుజలనిధు

—కథాంశములు. భరతచరితము. శ్రీ పేషణాద్యాదులనుపనులకుపంపుట. శ్రీ ఇంద్రావరజుండైనయింద్రునకుతమ్ముఁడైన.

ర్శ్వనగాగ్రంబునందుఁ బంచవ్యామపరీణాహబంధురంబులగునైదు మధుధారాప్రవాహంబులు పంచముఖంబుల వెడ
లి సుపార్శ్వనగశృంగంబులం బడియిళావృతవర్షంబు పశ్చిమభాగంబుఁ దడుపుచుం బ్రవహించు నా తేనియ ననుభవించు
వారల ముఖమారుతసుగంధంబు శతయోజనపర్యంతంబు పరివాసించు॥ సీ॥ కుముదపర్వతశిఖాగ్రమున నుత్పన్నమై కనుప
ట్టు వటతరుస్కంధముల వలన నుదయించు పట్టిపయోదధిఘృతమధుగుడవిశిష్టాన్నంబు లధికమయిన। యంబరశయ్యాసనాభర
ణాదివస్తువులు గోరి కెలువిర్చుచును గుముద।పర్వతాగ్రంబునఁ బడియిళావృతవర్షము నిజనులకు నెల్ల భోగ్యములను। వదల
కొనఁగు వారి*వళిపలితంబులు। దొలఁగు మస్తగంధములును బాయు। మరణభయము మునిమిపోరయ దెన్నఁడును సీ।తోష్ణ
బాధఁ జెందకుందురధిప॥ గీ॥ దేవదానవులును దివ్యమునీంద్రగం।ధర్వులాదిగాఁగఁ దగిలి యాత్ర। యించియుందు రాగిరీంద్ర
మూలమునందు। హర్షమున దిఘనవిహారలీల॥ వ॥ నరేంద్రా మేరునగేంద్రంబునకుఁ బూర్వభాగంబున జఠరదేవకూటంబు
లు పశ్చిమంబున నం బవనపారియాత్రలును పర్వతంబులు నాలుగు దక్షిణోత్తరంబులొండొంటికి నష్టాదశసహస్రయోజ
నంబుల నిడుపును, బూర్వపశ్చిమంబులు ద్విసహస్రయోజనంబుల వెడల్పును, దక్షిణంబునఁ గైలాసకరవీరంబులు, నుత్తరం
బునఁ ద్రిశృంగమకరంబులను నామంబులు గల దక్షిణోత్తరంబుల పర్వతంబులు నాలుగును బూర్వపశ్చిమంబుల నష్టాదశసహ
స్రయోజనంబుల నిడుపును, దక్షిణోత్తరంబుల ద్విసహస్రయోజనంబుల వెడల్పు గుచు నగ్నిపురుషునకుం బ్రదక్షిణంబగుచు
న్న ✿పరిస్తరణలచందంబున మేరువునకుం బ్రదక్షిణంబుగా నష్టనగంబులు నిలిచియుండు మేరుశిఖరంబున దశసహస్రయో
జనంబుల నిడుపునంతియ విస్తారంబునగుచు సువర్ణమయంబైన బ్రహ్మపురంబు దేజరిల్లుచుండు నా పట్టణంబునకు నష్టదిక్కు-
లయందును లోకపాలుర పురంబులుండు॥ క॥ పరమేష్ఠిపట్టణంబున।హరి మును త్రివిక్రమణములందన్సర్వే।శ్వర చరణాగ్ర
నఖాహతిఁ।బరువడినూర్ధ్వాండమంతఁ బగిలె నరేంద్రా॥ వ॥ ఇట్లు చరణనఖస్పర్శంజేసి భేదింపఁబడ్డయూర్ధ్వకటాహవివరం
బువలన నంతఃప్రవేశంబు సేయుచున్న బాహ్యజలధార శ్రీహరిపాదస్పర్శం జేయుచుం జనుదెంచి సకలలోకజనంబుల దురి
తంబులు వాపుచు భగవత్పాదియను పేరం దేజరిల్లుచు దీర్ఘకాలంబు స్వర్గంబున విహరించుచు విష్ణుపదంబున నుత్తానపాదపు
త్రుండును బరమభాగవతుండును నయిన ధ్రువుండు తనకులదేవతయైన శ్రీహరిపాదోదకంబుఁ బ్రతిదినంబును భక్తియోగం
బున నిమీలితనేత్రుండై యానందబాష్పంబుల రోమాంచితగాత్రుండై యత్యాదరంబున నేఁడును శిరంబున ధరియించుచు
నున్నవాఁడతనికి నధోభాగంబున నుండు మండలాధిపతులైన సప్తర్షులును హరిపాదోదకప్రభావంబు నెఱింగి తాము వొం
దు తపస్సిద్ధియాకాశగంగాజలంబుల స్నాతులగుటయే యని సర్వభూతాంతర్యామియగు నీశ్వరుని యందు భక్తిసలిపి యిత
రపదార్థాపేక్ష సేయక మోక్షార్థిముక్తిమార్గంబు బహుమానంబు సేయు తెఱంగున బహుమానయుక్తంబుగాఁ దమ జ
టాజూటంబులయందు నేఁడును ధరించుచుందురు॥ సీ॥ అంతనసంఖ్యంబులైన దివ్యవిమానసంకులంబులను విశాలమైన।
దేవమార్గంబున దిగివచ్చి చంద్రమండలముఁ దోఁచుచు మేరునగశిఖాగ్ర।మునను నా బ్రహ్మదేవుని పట్టణమునకు వచ్చి యం
దుల చతుర్ద్వారములను।వరుసతో దీర్ఘప్రవాహంబులగుచును బ్రవహించియమల ప్రభావములను।నరుగు లవణసాగరాం
తంబులుగ నాల్గు। మోఘులందు నాల్గు నామములను। తన్నుఁ గన్నవారి తనవారిఁ దోఁగిన। వారికెల్ల నమృతవారియగుచు॥
వ॥ ఇట్లు సీతయను పేరవినుతి నొందిన యమ్మహానదీప్రవాహంబు బ్రహ్మసదనపూర్వద్వారంబున వెడలి కేసరావలయం
బుఁ దడుపుచు గంధమాదనాద్రికింజని భద్రాశ్వవర్షంబుం బావనంబు సేయుచుఁ బూర్వలవణసాగరంబునం బ్రవేశించుఁ
జక్షువను పేరఁ దేజరిల్లెడు దీర్ఘప్రవాహంబు పశ్చిమద్వారంబున వెడలి మాల్యవత్పర్వతంబునం బడి కేతుమాలవర్షంబుఁ
బవిత్రంబు సేయుచుఁ బశ్చిమలవణార్ణవంబునం గలయు భద్రయను పేర వెలుఁగొందిన యమ్మహాప్రవాహంబుత్తరద్వారం
బున వెడలి కుముదనీలశ్వేతాఖ్యపర్వతశిఖరంబులం గ్రమంబునఁ బ్రవహించుచు శృంగనగంబునం జని మానసోత్తరంబు
లగు కురుభూములఁ బవిత్రంబు సేయుచు నుత్తరలవణసాగరంబుఁ జేరు-నలకనంద యను ప్రఖ్యాతిఁ గాంచిన నమ్మహానదీప్ర
వాహంబు బ్రహ్మసదనదక్షిణద్వారంబున వెడలి యత్యంతదుర్గమంబులైన భూధరంబులఁ గడచి హేమకూటహిమకూ
టనగంబులనుత్తరించి యతివేగంబునఁ గర్మక్షేత్రంబగు భారతవర్షంబుఁ బావనంబు సేయుచు దక్షిణ లవణాంబుధిం గల
యు నంత॥ సీ॥ జగతిలో మేరువాదిగఁ బర్వతంబులకుఁ బుత్రికలైనట్టి పుణ్యతీర్థ। ములు వేలసంఖ్యలు గలవు జంబూద్వీపమం
దు భారతవర్షమరయఁ గర్మ। భూమి యెక్కి నవవర్షములు దివంబుననుండి భువికి వచ్చిన వారు పుణ్యశేష। ములు భుజింపుచు
నుండ్రు భూస్వర్గమనఁదగు నా నవవర్షమునను నుండునట్టి నార। లయుతసంఖ్యావత్సరాయువులయుతమా। తంగబలులు దేవతా

* వళితపలితంబులు॥ వళిత।శరీరము ముడతలుపడుట, పలిత।తల నెఱయుట. ✿పరిస్తరణంబులు।అగ్నిచుట్టునుండు దర్భలు.

సమానులగులవజ్రదేహులధిక ప్రమోదితులప్రమత్తులారోగ్యులనఘులధిప॥ వ॥మఱియుసురతసుఖానందంబున మోహంబునైనంగైకొనకసత్కృతప్రసూతులగుచునవరతంబును త్రేతాయుగకాలంబుగలిగి ప్రవర్తింతురీయష్టవర్షంబులయందు దేవతాగణంబులుతమభృత్యవర్గంబులత్యుపచారంబులు సేయుచుండ నెల్ల ఋతువులయందుంగిసలయకుసుమఫల భరితంబులయినలతామలశోభితంబులగువనంబులుగలవర్షనిధిగిరి ద్రోణులయందుఁ గమలామోదితంబులగురాజహంస కలహంసలుగలసరోవరంబులయందును జలకుక్కుటకారండవసారసవినోదంబులుగలిగి మత్తాళి ఝంకృతిమనోహరంబులైనానావిధంబులయిన కొలంకులయందు దేవాంగనలకామోద్రేకజంబులయినవిలాసహాసలీలావిలోకనంబులందివియంబడినమనోవృష్టిగలదేవగణంబులువిచిత్రవినోదంబులుగలిగియిచ్ఛావిహారంబులుసలుపుచుండుదురు॥ క॥ఈ నవవర్షంబులయం। దానారాయణుఁడువచ్చియనవరతములో। కానుగ్రహమునకై సు। జ్ఞానంబీదలఁచిలీలఁజరియించుఁ దగన్॥ సీ॥ వసుధనిళావృతవర్షాధిపతియైనపురహరుండావర్షమునవనంబు। నందునుండుటకునాయంబికాశాపవశంబు ననావనస్థలమునందు। నెవ్వరువచ్చిననింతులై యుందురావనమందుపార్వతియనుదినంబు।నంగనాజనసహస్రార్బుదంబులతోడనసమలోచనుగొల్చునతులభక్తి।*నట్టిశివునిగోరియాయిళావృతవర్ష। మునఁజరించుజనులుమోదమునను।గదిసితత్ప్రకాశకములైనమంత్రతం। త్రములఁబూజఁజేసితలఁతు రెపుడు ॥ క॥ భద్రాశ్వవర్షమందుల।భద్రశ్రవుఁడనెడి పేరఁబరగుచుదపనీ। యాద్రిసమధైర్యుఁడగుచుస।ముద్రాంతంబైనజగతిఁబొలుపుగనేలున్॥క॥అనరవరునకుఁబ్రియతముఁ।డైనహయగ్రీవమూర్తిననవరతంబున్। ధ్యానస్తోత్రజపాను।స్థానములఁబూజఁజేసిసజ్జనులంతన్॥గీ॥తత్ప్రకాశకృత్ప్రధానమంత్రార్థసం। సిద్ధిఁజేసిముక్తిఁజెందిరప్పు।డట్టివర్షమందునాహయగ్రీవుని।దలఁచికొలిచిమిగులధన్యులగుచు॥సీ॥హరివర్షపతియైననరహరిననిశంబునందున్నజనులుమహాత్ములయిన । దైత్యదానవకులోత్తములుప్రహ్లాదాదిపెద్దలుగూడిసంప్రీతితోడ।సుస్నాతులయిభక్తిఁజూచుచునుందురువ్యాఘ్రమూలాంబరములుదాల్చి। తత్ప్రకాశకమంత్రతంత్రజపస్తోత్రపాఠకధ్యానతపఃప్రధాన। మయినసత్పూజలనుజేసియచలబుద్ధి। శ్రీనృసింహునిఁజేరిపూజించియతనికరుణనొందుచునతులప్రకాశులగుచు। భుక్తిముక్తులఁగైకొంద్రు భూపవర్య॥వ॥మఱియు కేతుమాలవర్షంబునందుభగవంతుండుశ్రీదేవికిసంతోషంబునొసఁగుటకుఁగామదేవరూపంబుననుండు నమ్మహాపురుషునియస్త్రతేజః ప్రకాశంబునఁ బ్రజాపతిదుహితలగురాత్ర్యధిదేవతలగర్భంబులుసంవత్సరాంతంబుననిర్జీవంబులైస్రవించునా కామదేవుండునుదనగతివిలాసలీలావలోకనసుందరభ్రూమండలసుభగవదనారవిందకాంతులంజేసి శ్రీరమాదేవినిరమింపంజేయుభగవన్మాయారూపిణియగుశ్రీదేవియుఁబ్రజాపతిపుత్రికలునుబుత్రులునైనరాత్రింబగళ్లుంగూడి కామదేవస్తోత్రపాఠకపూజాధ్యానాదులంబూజించుచుండునంత॥ క॥విమలమతిఁజిత్తగింపుము।రమణీయంబైనవిమలరమ్యకమనువ।ర్షమునకునధిదైవతదా।నమరంగామత్స్యరూపమగుహరిదలఁపన్॥గీ॥అట్టివర్షమునకునధిపతియగుచున్న।మనువుపుత్రపౌత్రమంత్రివరులఁగూడిమత్స్యమైనకుంభినీధరుచిత్త।మతులభక్తియుక్తిహత్తుకొలుపు॥గీ ॥ తత్ప్రకాశకృత్ప్రధానమంత్రస్తోత్ర।ములను ధర్మకర్మములనుమహాను। ములనుజనులుసేసిపుణ్యులైభుక్తి। ముక్తులనుబొందుచుందురెలమితోడ॥ క ॥ వినుముహిరణ్మయవర్షం।బునకుంగూర్మావతారమనుదాల్చినయా।వనజోదరుఁడధిదేవత।యనఘుఁడుపితృపతిమహాత్ముఁడర్యముఁడునృపా॥క॥ఆవర్షమందునర్యముఁ। డావర్షజనంబుగూడిహరిఁజిత్తములో।భావింపసంస్తవంబులు।గావించుచుగాంతురతనికైవల్యంబున్॥క॥అరయఁగసీతాలక్ష్మణ । పరివృతుఁడైవచ్చి రామభద్రుఁడుగడిమిం। బరగనధిదేవతగుకిం।పురుషమహావర్షమునకుభూపవరేణ్యా॥ గీ ॥ అట్టిరామభద్రు నంజనీసుతుఁడుకిం।పురుషగణముఁగూడిపూజఁజేసి। తత్ప్రకాశకప్రధానమంత్రస్తోత్ర।పఠనములనుదగనుపాస్తిఁజేయు॥ సీ॥భారతవర్షాధిపతియైనబదరికాశ్రమమునన్నున్ననారాయణుండు।భూనాథయామహాత్మునినారదాదులుభారతవర్షంబుప్రజలు ప్రేమఁ।బాయకచేరియుపాస్తిఁజేయుచుసాంఖ్యయోగంబునుపదేశముచితవృత్తి। నందియందఱునుగృతార్థులై యట్టినారాయణదేవునారాధనంబు। చేసియాత్మఁజాలఁ జింతించితత్ప్రకా । శకములయినమంత్రసంస్తవములఁ। బూజఁజేసిముక్తిఁబొందుచునుందురు। రచలమైనభక్తిననుదినంబు॥క॥భారతవర్షమునందుల।సారాంశములైనపుణ్యశైలంబులుగం।భీరప్రవాహములుగల।వారయనెఱిఁగింతువాని నవనీనాథా॥వ॥మలయపర్వతమును,మంగళప్రస్థమును, మైనాకంబును, త్రికూటంబును,ఋషభపర్వతంబును, కూటక

* ఈఘట్టము మొదలుకొని ఆయావర్షములయందువర్షాధిదేవతలనారాధించెడువారలుపఠించుమంత్రంబుల నాంధ్రమునందు వదలియున్నదిగాన వానినిసంస్కృతభాగవతమునందుఁజూచి తెలిసుకొనవలయును.

మును,గోల్లమును,సహ్యపర్వతంబును,వేదగిరియును,ఋశ్యమూకపర్వతంబును,శ్రీశైలంబును,వేంకటాద్రియును,మహేంద్రంబును,వారిధరంబును,వింధ్యపర్వతంబును,శుక్తిమత్పర్వతంబును,ఋక్షగిరియును,పారియాత్రంబును,ద్రోణపర్వతంబును,చిత్రకూటంబును,గోవర్ధనాద్రియును,రైవతకంబును,కకుంభంబును, నీలగిరియును,గోకాముఖంబు,నింద్రకీలంబును,రామగిరియు నాదిగాఁగల పుణ్యపర్వతంబుల నేకంబులుగలవాపర్వతపుత్రికలైన చంద్రవటయుఁ దామ్రపర్ణియు నవటోదయుఁ గృతమాలయు వైహాసియుఁ గావేరియు వేణియుఁ బయస్వినియుఁ బయోదయు శర్కరావర్తయుఁ దుంగభద్రయుఁ గృష్ణయు వేణియు భీమరథియు గోదావరియు నిర్వింధ్యయుఁ బయోష్ణియుఁ దాపియు రేవానదియు శిలానదియు సురసయుఁ జర్మణ్వతియు వేదస్మృతియు ఋషికుల్యయుఁ ద్రిసామయుఁ గౌశికియు మందాకినియు యమునయు సరస్వతియు దృషద్వతియు గోమతియు సరయువును భోగవతియు సుషమయు శతద్రువును జంద్రభాగయు వితస్తయు నసిక్నియు విశ్వయు నను నీమహానదులును సింధువు శోణయను నదంబులు నిట్టి మహాప్రవాహంబు లీభారతవర్షంబునం గలవందు స్నాతులయిన మానవులు ముక్తిం జెందుదురు మఱియు నీభారతవర్షంబున జన్మించిన పురుషులు శుక్లలోహితకృష్ణవర్ణరూపంబులగు త్రివిధకర్మంబులం జేసి క్రమంబుగ దేవమనుష్యనరకగతులను ద్రివిధగతులం బొందుదురు వినుము రాగద్వేషాదిశూన్యుండును వాఙ్మానసగోచరుండును నాధారుండును నగు శ్రీవాసుదేవమూర్తి యందుఁ జిత్తంబు నిలుకడఁ జేసి భక్తియోగంబున నారాధించెడు మహాత్ముల విద్యాగ్రంథిదహనంబుగా వించుటం జేసి పరమ భాగవతోత్తములు పొందెడు నుత్తమగతినిం జెందుదురు గావున భారతవర్షంబు మిగుల నుత్తమమని మహాపురుషు లిట్లు స్తుతించుచుండుదురు॥ ఉ॥ భారతవర్ష జంతువుల భాగ్యము లేమని చెప్పవచ్చు నీ। భారతవర్షమందు హరి పల్మఱుఁ బుట్టుచు జీవకోటికిన్। ధీరతతో డఁదత్త్వముపదేశము సేయుచుఁ జెల్మిసేయుచు। న్నారయ బాంధవాకృతిఁ గృతార్థులఁ జేయుచునుండు నెంతయున్॥ క॥ తనజన్మకర్మములనుం। గొనియాడెడివారికెల్లఁ గోరినవంతన్। దనియఁగ నొసఁగుచు మోక్షం। బనయముఁ గృపఁ జేయుఁ గృష్ణుఁ డవనీనాథా॥ వ॥ ఇట్లు భారతవర్షంబునం గల జనంబులకు నెద్దియు నసాధ్యంబు లేమి నారాయణస్మరణ సకలదురితంబుల నడంచుఁ దన్నామస్మరణరహితంబులయిన యజ్ఞతపోదానాదులు దురితంబుల నడంపలేవు బ్రహ్మకల్పాంతంబుఁ బ్రతికెడి యితరస్థానంబునంబునర్జన్మభయంబున భీతిల్లుచునుండుటకన్న భారతవర్షంబునందు క్షణమాత్రంబు మనంబున సర్వసంగపరిత్యాగంబుఁ జేసిన పురుషశ్రేష్ఠునకు శ్రీమన్నారాయణపదప్రాప్తియతిసులభంబున సంభవించుఁ గావున నట్టి యుత్తమమగు నీభారతవర్షంబె కోరుచుండుదురు- మఱియు నెక్కడ వైకుంఠుని కథావాసన లేకుండు నేదేశంబున సత్పురుషులైన పరమభాగవతులు లేకుండుదు రేభూమిని యజ్ఞేశ్వరుని మహోత్సవంబులు లేకయుండు నది సురేంద్రలోకంబైననుండందగదు జ్ఞానానుష్ఠానద్రవ్యకలాపంబు చేత మనుష్యజాతిం బొందితపంబున ముక్తిం బొందకుండెనేని మృగంబుల మాడ్కి నతండు దనకుందానె బంధనంబు నొందు భారతవర్షంబునందుఁ బ్రజలచేత శ్రద్ధాయుక్తంబుగా ననుష్ఠింపంబడిన యజ్ఞంబులయందు వేల్వంబడు హవిస్సులను బెక్కునామంబులం బుండరీకాక్షుండంది తనమీఁది భక్తి యధికంబుగాఁ జేయు నట్టి భారతవర్షంబునందలి ప్రజలమీఁదం గరుణించి సర్వేశ్వరుం డిహపరసౌఖ్యంబుల నొసంగుచుండు జంబూద్వీపంబున సగరాత్మజు లశ్వమేధాశ్వంబు నన్వేషింపంబూని భూఖననంబు సేయుటం జేసి స్వర్ణప్రస్థ,చంద్రశుక్ల,ఆవర్తన,రమణక, మందేహారుణ,పాంచజన్య,సింహళ,లంక యను, నెనిమిది యుపద్వీపంబులు గలిగె॥ సీ॥ లక్ష యోజనముల లవణాబ్ధి పరివృతమగుచు జంబూద్వీపమతిశయిల్లు।విను రెండులక్షలు విస్తృతముగను ప్లక్షద్వీపమిక్షురసాబ్ధి చేత। నావృతమయి యుండు నారూఢముగ నందు వృక్షంబు *ప్లక్షంబు విదితముగను। దనరు నాద్వీపంబు తరునామ మహిమ చే మిగులఁ బ్లక్షంబన మించి రహిని। యందు సంచరించు నట్టి వారలకగ్ని। దేవుఁడమరునాదిదేవతయుగ। నందులోన నా ప్రియవ్రతసుతుఁడగు। నిధ్మజిహ్వుఁడను మహీవరుండు॥ వ॥ నరేంద్రా యీ యిధ్మజిహ్వుండా ప్లక్షద్వీపంబు నేడువర్షంబులుగ విభజించి యందు నావర్షనామధారులుగా నుండు తనపుత్రులగు శివ,యశస్య,సుభద్ర,శాంత,క్షేమ,అభయ, అమృతులనియెడు నేడుగుర నేడువర్షంబులకధిపతులం గావించి యిధ్మజిహ్వుండు దపంబునకుం జనియె- నావర్షంబులయందు మణికూట-వజ్రకూట-ఇంద్రసేన-జ్యోతిష్మద్-ధూమ్రవర్ణ,హిరణ్యగ్రీవ, మేఘమాలలను నామంబులుగల సప్తకులపర్వతంబులు- నరుణయు, నృమణియు,నాంగిరసయు,సావిత్రియు,సుప్రభాతయు,ఋతంభరయు,సత్యంభరయు,నన సప్తమహానదులు నానదులయందు స్నాతులగుచు గతపాపులై నహంసపతంగోర్ధ్వాయనసత్యాంగులను నామంబులుగల చాతుర్వర్ణ్యులు గలిగియుండుదురందు పురుషులు సహస్రవత్సరజీవులును దేవతాసములును దృష్టిమాత్రంబునం †క్లమస్వేదాదిరహితంబగు నపత్యోత్పాదనంబు గలవా

*ప్లక్షము।జువ్విచెట్టు. †క్లమస్వేదాది।చెమట మొదలగునవి.

రలగుచు వేదత్రయాత్మకుండును స్వర్గద్వారభూతుండైన భగవత్స్వరూపియగు సూర్యుని వేదత్రయమ్మున సేవించుచు
రుప్లక్షద్వీపంబాదిగా మీఁదటి ద్వీపపంచకంబందలి పురుషులకు నాయురింద్రియపటుత్వంబులును దేజోబలంబులును దోడ
నైజనియించుచుండు. క॥ ప్లక్షద్వీపము ద్విగుణిత। లక్షేక్షురసాబ్ధి సుట్టి రా విలసిల్లు। న్నిక్షురసోదద్విగుణం। బక్షయముగ శా
ల్మలీమహాద్వీపమిలను॥ వ॥ అందు *శాల్మలివృక్షంబు ప్లక్షాయామంబై తేజరిల్లు నా వృక్షరాజంబున కధోభాగంబునఁ
†పత్త్రిరాజుగా నుండు గరుత్మంతుం డునికడగా వసించు నా శాల్మలీవృక్షంబు పేర నా ద్వీపంబు శాల్మలీద్వీపంబన విలసి
ల్లు నా ద్వీపపతియైన ప్రియవ్రతాత్మజుండగు యజ్ఞబాహు వుతన పుత్త్రులగు సురోచన, సౌమనస్య, రమణక, దేవబర్హ, పారి
బర్హ, ఆప్యాయనులనియెడు వారి పేర నా వర్షంబుల నేర్పరచి యా వర్షంబులయందు నేడ్వురఁ గుమారులనభిషిక్తులం జేసె నా
వర్షములయందు స్వరస, శతశృంగ, వామదేవ, కుముద, ముకుంద, పుష్పవర్ష, శతశ్రుతులను పర్వతసప్తకంబు, ననుమతియు, సి
నీవాలియు, సరస్వతియు, కుహు, అజని, నంద, రాకయు, ననుసప్తమహానదులును, శ్రుతధర విద్యాధర వసుంధర ఇష్మధర సం
జ్ఞులగు నా వర్షపురుషులు భగవత్స్వరూపుండును వేదమయుండును నాత్మస్వరూపియునగు సోముని వేదమంత్రంబులచే నా
రాధించుచుండు నా ద్వీపంబు లక్ష‡చతుష్టయపరిమిత యోజనవిస్తృతమయిన సురాసముద్రముచే నావృతమై తేజరిల్లు నంత॥
సీ॥ భూనాథ యా సురాంభోధికిఁ జుట్టుగా నుండు కుశద్వీపమొప్పు మీఁద। §ఘోరమై తాద్విచతుర్లక్ష యోజనంబుల నువి
స్తారమై పాలుపుమిగులు। నందుఁ గుశస్తంభమనిశంబు దేవతాకల్పితంబైనట్టి కాంతిచేత। దిక్కులు వెలుఁగించు ద్వీపంబు నదుఁ
దన పేరను సత్కీర్తి పెంపు సేయు। నట్టి దీవికి యధిపతియగు ప్రియవ్ర। తాత్మజుండు హిరణ్యరేతస్సనంగ। దనరు భూపతి వన
సుత నామములను। వర్షములు సేసె నత్యంతహర్షమునను॥ వ॥ ఇట్లు హిరణ్యరేతస్సు వసుదాన, దృఢరుచి, నాభి, గుప్త, సత్య
వ్రత, విప్ర, వామదేవులను నామంబులుగల పుత్త్రుల నామంబుల సప్తవర్షంబులం గావించి యా కుమారుల నందు నిలిపి తా
ను దపంబునకుం జనియె నా వర్షంబునందు బభ్రు, చతుశ్శృంగ, కపిల, చిత్రకూట, దేవానీక, ఊర్ధ్వరోమ, ద్రవిణులను నామం
బులుగల సప్తగిరులును, రసకుల్యయు, మధుకుల్యయు, శ్రుతవిందయు, మిత్రవిందయు, దేవగర్భయు, ఘృతచ్యుతయు, మం
త్రమాలయు, ననుసప్తమహానదులు, నా నదీజలంబులఁ గృతమజ్జనులగుచు భగవంతుండగు యజ్ఞపురుషుని, కుశల, కోవిద, అ
భియుక్తులను, కులములుగల వర్షపురుషులారాధించుచుందురు॥ సీ॥ ఆకుశద్వీపంబు నరికట్టుకొని యుండు నెనిమిదిలక్షల ఘన
ఘృతాబ్ధి। యా ఘృతసాగరంబవ్వల షోడశలక్ష యోజనముల లలితమగుచు। నుండుఁ గ్రౌంచద్వీప మొప్పు నాశయందు మధ్య
ప్రదేశంబున నట్టి దీవి। పేరుగాఁ దన పేర బెద్దగాఁ జేసిన క్రౌంచాద్రి గలదా నగంబు మున్ను। షణ్ముఖుండు దివ్యశరమున ఘ
ననితం। బంబు దూయ నేయఁ బాలవెల్లి। గరిమఁ దడుపుచుండు వరుణుండు రక్షింప। నందు మిగుల భయము నొందకుండె॥ వ॥ న
రేంద్రా యా క్రౌంచద్వీపపతియగు ఘృతపృష్ఠుండు దనకుమారుల పేరంగల యామోద, మధువహ, మేఘపృష్ఠ, సుధామ, ఋ
షిజ్య, లోహితార్ణ, వనస్పతులను వర్షంబుల నభిషిక్తులం జేసి పరమకల్యాణగుణయుక్తుండైన శ్రీహరిచరణారవిందంబు
ల సేవించుచుండ వనంబునకుం జనియె నా వర్షంబులయందు, శుక్ల, వర్ధమాన, భోజన, ఉపబర్హణ, ఆనంద, నందన, సర్వతోభ
ద్రములను సప్తసీమాపర్వతంబులు, నభయ, అమృతౌఘయు, నార్యకయుఁ, దీర్ఘవతియుఁ, దృప్తిరూపయుఁ, బవిత్రవతియు,
శుక్లయు, ననుసప్తనదులయందును బవిత్రోదకంబుల ననుభవించుచు, గురు, ఋషభ, ద్రవిణక, దేవక, సంజ్ఞలుగలిగి వరుణ
దేవుని నుదకాంజలులం బూజించుచున్న చాతుర్వర్ణంబులుగలిగియుండు॥ సీ॥ జగతీశ వినుము క్రౌంచద్వీపముసుఁ జుట్టియుం
డు షోడశలక్ష యోజనముల। విస్తారమై పాలవెల్లి యందునను శాకద్వీపమహితుల ప్రకాశ మొందు। నండిమై ముప్పది రెండు ల
క్షల యోజనముల విస్తారమైయమరియుండు। నందు ననశాకవృక్షమామోదమా ద్వీపమును సుగంధంబునం బెనఁగఁ జేసి। యం
తగన పేర దీవి ప్రఖ్యాతమమరఁ। జేసి యందున మిగులఁ బ్రసిద్ధికెక్కె। నందు మేధాతిథియుఁ గర్తయగుచునుండె। తవిలి వేడు
కతనమున నందనులఁ జూచి॥ వ॥ మఱియు నా ప్రియవ్రతపుత్త్రుండయిన మేధాతిథి తనపుత్త్రుల పేరంగల పురోజవ, మనోజవ,
వేపమాన, ధూమ్రానీక, చిత్రరథ, బహురూప, విశ్వవారులను, సంజ్ఞలుగల సప్తవర్షంబులయందు, వారలకుఁ బట్టంబుగట్టి
శ్రీహరిపాదసేవ సేయుచుఁ దపోవనంబునకుం జనియె నా శాకద్వీపంబునందు, నీశాన, ఉరుశృంగ, బలభద్ర, శతకేసర, స
హస్రస్రోతో, దేవపాల, మహానసములను, సీమాగిరులు, ననఘ, ఆయుర్ద, ఉభయస్పృష్టి, అపరాజిత, పంచనది, సహస్రస్నృతి,
నిజధృతియు, ననుసప్తనదులు, నా నదీజలంబులుపయోగింపనచ్చటి వారలు ప్రాణాయామంబుఁ జేసి విధ్వస్తరజస్తమో
గుణంబులుగల్గి పరమసమాధిని వాయురూపంబైన భగవంతుని సేవించు, ఋతవ్రత, సత్యవ్రత, దానవ్రత, సువ్రత, నా

*శాల్మలి।బూరగచెట్టు. †పత్త్రి।పక్షి. ‡చతుష్టయ।నాలుగు. విస్తృతము।విశాలము। §ఘోరమై।ఘనమయి.

సంయమనియను యమనగరంబును బశ్చిమంబున నిమ్లోచనియను వరుణపట్టణంబును నుత్తరంబున విభావరియను *సోముని పుటభేదనంబును దేజరిల్లుచుండు నాపట్టణంబులయందును నుదయమధ్యాహ్నాస్తమయనిశీథంబులని యెడు కాలభేదంబులను **భూతప్రవృత్తినివృత్తినిమిత్తంబు వచ్చటి జనులకుం బుట్టించుచుండు సూర్యుం డెప్పుడింద్రనగరంబుననుండి గమనించు నవియాదిగాం బదియేను గడియలను రెండుకోట్లు ముప్పదియేడు లక్షల యెబ్బదియైదు వేల యోజనంబులు నడుచు నివ్విధంబున నింద్రయమవరుణపురంబుల నింద్రజంద్రాదిగ్రహనక్షత్రంబులం గూడి సంచరించుచుం బండ్రెండంచులు, నాఱుకమ్ములు ను, మూఁడుతొలులుం గలిగి, సంవత్సరాత్మకంబై, యేకచక్రంబైన, సూర్యునిరథంబు, ముహూర్తమాత్రంబున ***నష్టశతాధికచతుస్త్రింశల్లక్ష యోజనంబులు సంచరించు॥ సీ॥ ఇనురథంబుననున్న యిఱుసు సొ[illegible]టియ మేరుశిఖరంబు నంటను జేరియుండు। నొకరథచక్రము మానసోత్తరపర్వతంబందు లందిరిగెడు నారథంబు నిఱుసునను న్న రెండిఱుసులు [illegible] బవన పాశంబుల బద్ధములగుచు। ధ్రువమండలంబునం దుల నంటియుండఁగా సంచరించుచునుండు సంతతంబు। నట్టియరథంబు ముప్పదియాఱులక్షలం దునంటిన కాడియు నన్ని యోజనములకు స్తారమై [illegible] బడగులు మవెలుఁగొందు రమణతోడ॥ వ॥ ఆరథంబునకు గాయత్ర్యాది ఛందంబులు నాగాసప్తఛందంబులు నశ్వంబులై సంచరించు భాస్కరునకు నగ్రభాగంబున ****నరుణుండు నియుక్తుండై రథికంబుగ నడుపుచుండు. *****నంగుష్ఠపర్వమాత్రశరీరంబులు గలయఱువది వేలవాలఖిల్యాఖ్యులగు ఋషివరులు సూర్యుని ముందట సౌరసూక్తంబుల స్తుతియింపుచుండు. నితరులగు మునులును గంధర్వకిన్నరకింపురుషనాగాప్సరఃపతంగాదులు నెలనెలవరుసక్రమంబున సేవింపం దొమ్మిదికోట్లు నేబదియొకలక్ష యోజనంబుల పరిమాణంబుగల భూమండలంబునం దొకక్షణంబున సూర్యుండు రెండువేల యేబది యోజనంబులు సంచరించుచు నొక యహోరాత్రంబునం దియాభూమండలంబంతయు సంచరించు ననిన శుకయోగీంద్రునకుం బరీక్షిన్నరేంద్రుండిట్లనియె॥ క॥ ఆయినవర మేరుధ్రువులకు నొనరం బ్రదక్షిణము దిరుగుచుండెడి యా సూర్యుండు రాశికి నెదుఱై యెట్టిచందమునఁ దేటంబడ వినియెఱిఁగింపుత గ॥ క॥ అనిపలికిన భూవరునిం గనుంగొని శుకయోగి మిగుల గరుణాన్వితుఁడై। మనమున శ్రీహరిఁ దలఁచుచు। వినుమని క్రమ్మఱఁ గనిట్లు వినిపించెదగ॥ వ॥ నరేంద్రా యతివేగంబునం దిరుగుచుండు కులాలచక్రంబునందుఁ జక్రభ్రమణమునకు వేఱైన గతి నొంది బంతి సాగి తిరిగెడు పిపీలికాముల చందంబున నక్షత్రరాసులతోఁ గూడిన కాలచక్రంబు ధ్రువమేరువులం బ్రదక్షిణంబు దిరుగునప్పుడా కాలచక్రంబు నెదురసంచరించు సూర్యాదిగ్రహంబులకు నక్షత్రాంతరంబులయందును రాశ్యంతరంబులయందును నికి గలుగుటం జేసి సూర్యాదిగ్రహంబులకుం జక్రగతిస్వగతుల వలన గతిద్వయంబు గలుగుచుండు మఱియు నా సూర్యుండాదినారాయణమూర్తియగుచు లోకంబుల యోగక్షేమంబులకు వేదత్రయాత్మకంబును గర్మసిద్ధినిమిత్తంబును దేవర్షిగణంబుల చేత వేదాంతార్థంబుల ననవరతంబు వితర్క్యమాణంబును నగుచున్న తనస్వరూపంబును ద్వాదశవిధంబులుగ విభజించి వసంతాదిఋతువుల నాయా కాలవిశేషంబులయందుఁ గలుగఁ జేయుచుండు నట్టి పరమపురుషుని మహిమ నీలోకంబున మహాత్ములగు పురుషులు వారివారి వర్ణాశ్రమాచారక్రమంబున వేదోక్తప్రకారంబుగా భక్త్యతిశయంబున నారాధించు క్షేమంబునొందుచుందు రట్టియాదినారాయణమూర్తి జ్యోతిశ్చక్రాంతర్వర్తియై స్వకీయ తేజఃపుంజదీపితాఖిలజ్యోతిర్గణంబులు గలవాఁడై ద్వాదశరాసులయందు నొక సంవత్సరంబున సంచరించుచుండు నట్టి యాదిపురుషుని గమనవిశేషకాలంబును లోకులయన ఋతుమాసపక్షతిథ్యాదుల చే వ్యవహరించుచుందురు. మఱియు నప్పరమపురుషుండా రాసులయందు షష్ఠాంశ సంచారంబు నొందిన సమయంబును ఋతువని వ్యవహరింపుదురు. రాసులయందు నర్ధాంశ సంచారమ్మున రాశిపర్యభోగంబొందిన తఱి యయనమని చెప్పుదురు. సమగ్రంబుగా రాసులయందు సంచారమొందినయెడల నట్టి కాలంబును సంవత్సరంబని నిర్ణయింపుదు రిట్టి సమగ్రరాశిసంచారంబునందు శీఘ్రగతి మందగతి సమగతులని యెడు త్రివిధగతివిశేషంబుల వలన వేఱుపడెడు నావత్సరంబును, సంవత్సరంబు, పరివత్సరం, బిడావత్సరంబనువత్సరం, బిద్వత్సరంబని, పంచవిధంబులఁ జెప్పుదురు, చంద్రుండు నీ తెఱంగున నా సూర్యమండలంబు మీఁద లక్ష యోజనంబుల నుండి సంవత్సరపక్షరాశినక్షత్రభుక్తులు గ్రహించుచు నగ్రచారియై శీఘ్రగతిం జరించు నంతవృద్ధిక్షయరూపంబునఁ బితృగణంబులకుం బూర్వపక్షాపరపక్షంబుల చేత నహోరాత్రంబులం గలుగఁ జేయుచు సకలజీవప్రాణంబై యొక్క నక్షత్రంబు త్రింశ

---

*సోముని పుటభేదనంబు = సోముని పట్టణము. **భూతప్రవృత్తినివృత్తినిమిత్తంబు = భూతము = ప్రాణులు యొక్క, ప్రవృత్తి = పనులయందుఁ బ్రవేశించుటకు, నివృత్తి = విడుచుటకు, నిమిత్తంబు = కారణము. ***అష్టశతాధికచతుస్త్రింశల్లక్షయోజనంబులు = ముప్పదినాలుగులక్షలయెనమన్నూరామడలు. ****అరుణుండు = అనూరుఁడు. *****అంగుష్ఠపర్వము = వ్రేలికణుపు.

ష్పహూర్తంబులనుభవించుచుషోడశకళలుగలిగిమనోమయాన్నమయామృతమయదేహుండై దేవపితృమనుష్యభూ
పశుపక్షిసరీసృపవీరుత్ప్రభృతులకుఁ బ్రాణాప్యాయనశీలుండగుటం జేసిసర్వసముండనంబడు॥ క॥ చందురునకుమీఁదై
మూ।నంతంబునలక్షయోజనంబులఁదారల్ ।గ్రందుకొని మేరుశైలం।బందిప్రదక్షిణముఁదిరుగు*నభిజిద్భముతోఁ॥ సీ॥ అ
మీఁదఁదారలకన్నిటికిసుపరిదై రెండులక్షలశుక్రుఁడుండిభాస్క।రునికిముందఱఁబిఱుదనుసావ్యవ్యృదుశీఘ్రసంచారము
నుభాస్కరునిమాడ్కిఁ।జరియించుచుండునుజనులకననుకూలుఁడై వృష్టినొసఁగుచునంతనంతఁ।జతురత శ్రీవృష్టివిష్కం
కగ్రహశాంతినొనరించువారలకొసఁగుశుభము। లుండునామీఁదసౌమ్యుండు రెండులక్ష। లనుజరించుచురవిమండలం
బఁబాసి।కండ్లఁబడినజనులకుదౌగడాంబ।రాదిభయములఁబుట్టించునతులమహిమ॥ సీ॥ ధరణీశ నూఁజుఁడంతటిమీఁద
రెండులక్షలనుండిమూఁడుపక్షములనొక్క। రాసిదాఁటుచునుండుఁగ్రమమునద్వాదశరాసులుభుజియించురాజసము
।వక్రించినయెనవక్రుఁడైనసుదరుచుగాఁబీడలునగులకొసఁగు।నంగారకునిమించికావలరెండులక్షలయోజనంబులఘు
తమించి।యొక్కరాశినుండునొక్కొక్కవత్సరం। బనుభవించుచుండునమరగురుఁడు । వక్రుఁడైనసుధావరుల
నును। శుభమునొసఁగునెప్డునభినవముగ॥ క॥ సురగురునకుమీఁదై భా।స్కరసుతుఁడిరులక్షలనుజగములకుఁబీడల్ ।జరు
పుచుఁద్రింశన్మాసము।లరుదుగనొక్కొక్కరాశియందునివసించున్॥ క॥ ప్రాకటముగరవిసుతునకు। నేకాదశలక్షలనుమ
హాసురు।లకుసీ। లోకులకుమేలుగోరుచుఁ। జోకుగమునిసప్తకంబుసొంపువహించున్॥ క॥ మునిసప్తకమునకెక్కువఁ।వన
పచు నామీఁదఁద్రయోదశలక్షలఁబెం। పునశింశుమారచక్రం। బనఁగానన్నిటికినుపరియగుచుండునృపా॥ సీ॥ ఆశింశు
మారాఖ్యమగుచక్రమునభాగవతుఁడైనధ్రువుఁడింద్రవరుణకశ్య। పప్రజాపతియమప్రముఖులతోఁగూడిబహుమాన
ముగవిష్ణుపదముఁజేరి।పడకనిచ్చలుప్రదక్షిణముగాఁదిరుగుచుచెలఁగియుండునుగల్పజీవియగుచు । ననఘుఁడుత్తానపా
దాత్మజుఁడాఢ్యుఁడైనయాధ్రువునిమహాత్మ్యమెల్లఁ। దెలిసివర్ణింపబ్రహ్మకునలవిగాదు। నేనెఱింగినయంతయునీకు
మున్న। తెలియఁబలికితిఁగ్రమ్మఱఁదలఁచికొనుము। జితరిపువ్రాతశ్రీపరీక్షిన్నరేంద్ర॥ వ॥ మఱియునాధ్రువుండునిమి
షమాత్రంబెడలేకసంచరించుజ్యోతిర్గ్రహనక్షత్రంబులకునీశ్వరునిచేత ధాన్యాక్రమణంబునఁబశువులకైయేర్పఱచిన
మేఢిస్తంభంబుతెఱంగున మేటిగాఁగల్పింపంబడిప్రకాశించుచుండుగగనంబునందుమేఘంబులును శ్యేనాదిపక్షులును
వాయువశంబునంగర్మసారథులై చరించుతెఱంగునజ్యోతిర్గణంబులును బ్రకృతిపురుషయోగగృహీతాశులై కర్మనిమి
త్తగతిగలిగివసుంధరంబడకుండు॥ క॥ పొందుగజ్యోతిర్గణముల।నందముగాశింశుమారమండలనుండం। గొందఱుదర్శిం
పఁజెప్పుచు।నుందురునిలిపింతాపినుమమోఘచరిత్రా॥ క॥ తలక్రిందైవర్తులమై। సలలితమగుశింశుమారచక్రమునందున్।
నెఱిఁదానిపుచ్ఛాగ్రంబున।నిలిచిధ్రువుండుండునెప్డునిర్మలచరిత్రా॥ వ॥ మఱియునాశింశుమారచక్రపుచ్ఛంబునఁబ్రజా
పతియునాగ్నీంద్రధర్ములునుబుచ్ఛమూలంబునధాతవిధాతలును గటిప్రదేశంబున ఋషిసప్తకంబును దక్షిణావర్తకుండ
లీభూతభూతశరీరంబునకునుత్తరాయణనక్షత్రంబులును దక్షిణపార్శ్వంబునదక్షిణాయననక్షత్రంబులును బృష్ఠమార్గంబు
న దేవమార్గంబును నాకాశగంగయును త్తరభాగంబునఁ బునర్వసుపుష్యంబులును దక్షిణాయనంబు నార్ద్రాశ్లేషలును దక్షి
ణవామపాదంబుల నభిజిదుత్తరాషాఢలును దక్షిణవామనాసారంధ్రంబుల శ్రవణపూర్వాషాఢలును దక్షిణవామలోచ
నంబులధనిష్ఠామూలలును దక్షిణవామకర్ణంబుల మఖాదినక్షత్రంబులును వామపార్శ్వంబున దక్షిణాయనంబును దక్షిణ
పార్శ్వంబున మృగశీర్షాదినక్షత్రత్రయంబును నుత్తరాయణంబును వామదక్షిణస్కంధంబుల శతభిషజ్యేష్ఠలును త్తరహ
నువునన గస్త్యుండును నధరహనువున యముండును ముఖంబున నంగారకుండును గుహ్యంబున శనైశ్చరుండును మేఢ్రంబున
బృహస్పతియును వక్షంబున నాదిత్యుండును నాభిని శుక్రుండును జిత్తంబున జంద్రుండు స్తనంబున నశ్వినులును బ్రాణాపానం
బులబుధుండును సర్వాంగంబులను కేతుగ్రహంబులును రోమంబునఁ దారలునుండునది సర్వదేవతామయంబై నపుండ
రీకాక్షునిదివ్యదేహంబుధ్రువునింగానెఱుంగుము॥ సీ॥ ఇట్టిదివ్యశరీరమెవ్వఁడుప్రతిదినంబందుసంధ్యాకాలమతులభక్తి।
మనమందునిలిపిమౌనాఱికమిక్కిలిప్రయత్నంబునవియతుఁడై తత్త్వబుద్ధి।మానవ్రతంబునఁబూనివీక్షించుచునీసంస్తవంబు
దానెంతఁబ్రేమ।జెటియించిక డంబ్రశస్తముగనుమునీంద్రసేవ్యమునుజ్యోతిస్స్వరూపమునవెలుఁగు।విపులశింశుమారవిగ్ర
హంబునకువం।దనమువందనంబులనుచునిలిచి।సన్నుతించెనేనిసకలార్థసిద్ధులఁ।బొందుమీఁదముక్తిఁజెందునధిప॥ క॥ ఇన
మండలంబునకుఁగ్రిం।దనుదశసాహస్రయోజనంబులస్వర్భా।నునిమండలంబుగ్రహమై।ఘునతన్నపసవ్యమార్గగతినుం

*అభిజిద్భముతోఁ ।అభిజిన్నక్షత్రముతోడను శ్రీవృష్టివిష్కంభక।విఘ్నప్రతిబంధకములైన.

మున్నృపా॥ క ॥ అసురాధముఁడగు రాహువు రవిశశిహానం భవునివరమువలన నొప్పుకనెంత । స్వనయమునను నిత్యంబున । నస
మానంబైన గ్రహవిహారముఁ బొందెన్॥ సీ ॥ జననాథ రాహువు జన్మకర్మంబులు దివిఁబింతుముందఱను ద్దరించి । యయుత
యోజనవిస్తృత ఘోర్యమండలము ద్వాదశసహస్రవిశాలచంద్రమండల । బయుఁబర్వకాలంబులను గ్రహపుదశసహస్రః
శాలమైమీఁద రాహుంగప్ప । నదిచూచియుపరాగమనుచును బలుకుదు రెల్ల వారును స్వధర్మేచ్ఛులగుచు । గంగలోన నిశ
శాంకసూర్యమండలములఁ । గరుణఁబ్రోవఁదలఁచి హరి సుదర్శనంబువచ్చు నను భయంబున నైచాలు । గడియలకును రాహువడి
నొడఁ బొలఁగు ॥ క ॥ నరవర యా రాహువునకు । సరసత నా క్రిందసిద్ధచారణవిద్యా । ధరులయుత యోజనంబులఁ । దిరముగ వసి
యుంచిలీలఁ దిరుగుచు రచట ॥ క ॥ పరికింప సిద్ధవిద్యా । ధరులకుఁ బది వేలు క్రిందఁ దరలక యక్షుల్ । కఱియును భూత ప్రేతల
జరియింతురు రాక్షసులు పిశాచులుగూలువర్ ॥ గీ ॥ వారి క్రిందఁ దగిలి వాయువశంబున । మలయుచుండు మేఘమండలంబు । వే
ఘమండలంబు మీఁదగుచుండు భూ । మండలంబు క్రిందనుండు నధిప ॥ వ ॥ అట్టి భూమండలంబు క్రింద యోజనాయుతాంత
రంబుననండకటాహాయామంబు గలిగి క్రమంబున నొండొంటికిం గ్రిందగుచు, నతల, వితల, సుతల, రసాతల, తలాతల, మ
హాతల, పాతాళ లోకంబులుండు, నట్టి బిలస్వర్గంబులయందు నుపరిస్వర్గంబునకధికంబైన కామభోగంబులనైశ్వర్యానం
దంబులను సుసమృద్ధ వనోద్యానక్రీడావిహారస్థానంబులననుభవించుచు దైత్యదానవ కాద్రవేయాది దేవయోనుల
నిత్యప్రముదితానురక్తులగుచుఁ గళత్రాపత్యసుహృద్బంధు దాసీదాసపరిజనులతోఁ జేరుకొని మణిగణఖచితంబులగు న
రమణీయగృహంబులయందు నీశ్వరుని వలనం జేటులేని కాయంబులు గలిగి వివిధమాయావిశేషవినిర్మిత నూతన కేళీసదన
విహరణమంటపవిచిత్రోద్యానాదులయందుఁ గేళీవినోదంబులసలుపుచుఁ జరియింతురంత ॥ సీ ॥ అట్టి పాతాళంబులందు న
మయకల్పితములగు పుటభేదనములయందు । బహురత్ననిర్మిత ప్రాకారభవనగోపురసభాచైత్యచత్వరవిశేష । ము
యందు నాసురాదుల మిథునముల చే శుకపిక శారికానికరసంకు । లములశోభిల్లు కృత్రిమభూములనుగల గృహముల చేన
లంకృతములగుచుఁ । గుసుమఫలసుగంధి కిసలయస్తబకసం । తతుల చేతనవనతంబులయిన । వృక్షరాజంబులందుల వెలయ
చుండు । శారికాకీరపికములు సంతతంబు ॥ వ ॥ మఱియు నానావిధ జలవిహంగమమిథునంబులు గలిగి నిర్మలజలపూరితంబ
లై మత్స్యకులసంచార క్షుభితంబులయిన కుముదకువలయకల్హారలోహితశతపత్రాదికంబులఁ దేజరిల్లెడు సరోవరంబ
లుగల యుద్యానవనంబులయందుఁ గృతనికేతమలై స్వర్గభూములనతిశయించిన వివిధవిహారంబులు గలిగియు హోరా
త్రాదికాలవిభాగభయంబు లేక మహాహిప్రవరుండైన శేషుని శిరోమణిదీధితుల చేనంధకారోపద్రవంబు లేక యెల్లప్పుడ
దివసాయమానంబుగా నుండు నా లోకంబునందు నఖిలజనులు దివ్యౌషధిరసరసాయనంబుల ననవరతంబు నన్నపాన
బులుగా సేవించుటం జేసి యచ్చటి వారలకు నాధివ్యాధులును వళితపలితంబులును జరారోగంబులును శరీరవైవర్ణ్యంబుల
ను స్వేదదౌర్గంధ్యంబులును గలుగక పరమకల్యాణమూర్తులగుచు హరిచక్రభయంబు దక్క నన్యంబగు మృత్యుభయంబ
నొందకనుందురదియునుంగాక ॥ గీ ॥ అట్టి పాతాళ లోకంబునందు విష్ణు । చక్ర మెప్పుడేని యుఁ బ్రవేశంబునొందు । నప్పుడెల్ల
ను దైత్యకులాంగనలకు । గర్భసంపదలందందఁ గఱఁగుచుండు ॥ చ ॥ అతలములందు నమ్మయునియాత్మజుఁడైన బలాసురుఁ
డుషణ్ణవతిం జరియించు షణ్ణవతి మాయలఁ గూడి వినోదమందుచున్ । గుతలములందు నేఁడు నొకకొందఱు నచ్చటి మా
యఁ జెందిసం । తతముఁ జరించుచుండుదురు దప్పని మోహనిబద్ధచిత్తులై ॥ వ ॥ అట్టి బలుని యావలింతలను స్వైరిణులు కామి
నులు పుంశ్చలులను స్త్రీగణంబులు జనియించి రా కామినీ జనంబులు పాతాళంబుఁ బ్రవేశించిన పురుషునికి హాటకరససంబ
యొనుపిద్ధరసఘుటికనిచ్చి రససిద్ధునింగావించి యతనియందు స్వవిలాసావలోకాను రాగస్మితసల్లాపోపగూహనాదుల
చ్ఛావిహారంబు సలుపుచుండ నా పురుషుండు మదాంధుండై తా నే సిద్ధుండననియును, నాగాయుతబలుండననియును, వ
లంది నా వాఖిధబలి క్రీడలఁ బరమానందంబు నొందుచుండు ॥ సీ ॥ హాటకేశ్వరుఁడైన యంబికాధీశుండు వితలంబునందుల వే
ష్టనిలిచి । తన మహాపార్షదభూతతతులతో బ్రహ్మ సర్గోపబృంహణమునకొఱకుఁ జోటఁ । బార్వతీసంభోగపరుఁడగుచుండఁగా
వారలవీర్యంబు వలనఁ బుట్టి । నట్టిను హాటకియను నదియనిలాగ్నులు భక్షించియంతనుమియ । నదియు హాటకమను పే

---

ఉపరాగము । చంద్రసూర్యగ్రహణము. కాద్రవేయ । పడగలు, తోఁకలు గలిగి—మనుష్యరూపము—దేవ జాతివిశేషముగల నాగుప
ము. లేక-శ్రద్ధావసంతానము. పుటభేదనము । పట్టణము. కిసలయ స్తబక । చిగురుగుత్తి. జలవిహంగమ । నీళ్లయందుసంచరించుపక్షులు హం
సలగునవి. క్షుభితంబులై న । కలఁత పెట్టఁబడిన. కుముద । సామాన్యమైన కలువ, కువలయ । లావుగకలువ తెల్లగలువ, కల్హార । మిగులపరి
మళముగలకలువ, లోహితశతపత్ర । ఎఱ్ఱతామర, దివసాయమానంబుగా । పగటివలెనే. షణ్ణవతి । తొంబదియాఱు. స్వైరిణులు । యథేచ్ఛ
గమనముగలవారు. కామినులు । అధిక కామముగలవారు. పుంశ్చలులు । జారలు. నాగాయుతబలుండ । పది వేలగజముల బలముగలవాఁడను

నతిశయిల్లి। వన్నెమీఱుచు శుద్ధసువర్ణమయ్యె। నాసువర్ణ●బు నాలోకమందు నున్న। జనుల కెల్లను వినుతభూషణములయ్యె॥ సీ॥ ఆక్రిందసుతలంబునందు మహాపుణ్యుఁడగు విరోచనపుత్రుఁడైనయట్టి। బలిచక్రవర్తియా పాకశాసనునకు ముదమొసఁగఁగఁగోరి యదితిగర్భ। మున వామనాకృతిఁబుట్టి యంతటఁద్రివిక్రమరూపమునను లోకత్రయంబు। నాక్రమించి వినదాన వారాతి చేతను ముందఱ నయిరావడినయింద్రత్వ మిచ్చు। గలుగు వాఁడు పుణ్యకర్మసంధానుండు। హరిపదాంబుజార్చనాభిలాషుఁడగుచు శ్రీరమేశు నారాధనము సేయు। చుండు నెప్పుడును నతిమహోత్సవమున॥ వ॥ నరేంద్రా సకలభూతాంతర్యామియును దీర్ఘభూతుండునైన వాసుదేవుని యందుఁ జిత్తంబు గలిగి యిచ్చిన భూదానంబున కుసాక్షాత్కరించిన మోక్షంబు ఫలంబగుం గాని పాతాళస్వర్గ రాజ్యంబులు ఫలంబులుగా నేరవైన నెవ్వరికిని మోక్షంబు సాక్షాత్కృతంబుగాకుండుటం జేసి లోకప్రదర్శనార్థంబు పాతాళస్వర్గ రాజ్యంబులనిచ్చె। ఊతపతన ప్రస్ఖలనాపలందును వివశుండైనను నామస్మరణంబు సేయు పురుషుండు కర్మబంధంబులవలన విముక్తుండగుచు సుజ్ఞానంబు నంబొందునట్టి వాసుదేవుం డాత్మజ్ఞాన*ప్రమోషణము సేయు మాయామయంబులైన భోగైశ్వర్యంబుల నెల్ల నెట్లొసంగును నవలవము భగవంతుండు యాచనఁ జేసి సకలసంపదలఁ జేకొని శరీరమాత్రావశిష్టునిం జేసి వారుణపాశంబులం గట్టివిడిచిన నప్పుడు బలీంద్రుండిట్లనియె॥ సీ॥ పరమేశ్వరునకు నెప్పటపదార్థములందుఁ దృష్ణ లేకుండుట దెలిసినాఁడ। నింద్రాదులెల్లను పేంద్రునిఁ బ్రార్థించి యడిగిరి గాని శ్రీహరికిఁ గోరికలు లేవు మిక్కిలిగంభీరమగు మహాకాలస్వభావంబు గలుగుచుండు। నరయంగ మన్వంతరాధిపత్యము నులోకత్రయంబును నెంతగానఁ దలఁప। మత్పితామహుండు మానవంతుండు ప్రహ్లాదవిభుని జూ విహార్షమంది। మెద్దిమైన గోరుమిచ్చెదననుటకు। నంతలో నయిశ్వర్యాజ్ఞఁ దెలిసి॥ వ॥ ఇట్లు గృతార్థుండై శపిత్ర్యంబైన రాజ్యంబు నొల్లక పరమేశ్వరదాస్యంబు కోరెనా ప్రహ్లాదచరిత్రకథనావసరమున నీతండ్రి కిని నీకును విశేషముగా నేపురుషు●డు భగవదనుగ్రహంబుఁ బొందనోపునని పుండరీకాక్షుం డానతిచ్చిన వాక్యంబులు వక్ష్యమాణ గ్రంథంబున విస్తరించెద నా బలిచక్రవర్తి గృహద్వారంబున నఖిలలోకగురుండైన శ్రీమన్నారాయణుండు గదాపాణియును నిజజనానుకంపితుండును శంఖచక్రాద్యాయుధధరుండును నగుచు నిప్పుడును దేజరిల్లుచుండునట్టి బలి ద్వారంబున లోకంబులు గెలువ నిచ్ఛయించె దశగ్రీవుండుల్లంఘిత శాసనుండై ప్రవేశంబుగావింపనాయామివపురుషుండు దనపాదాంగుష్ఠంబున యోజనాయుతాయుతంబులం బాఱంజిమ్మెనంత॥ క॥ ఆసుతలమునకుఁ గ్రిందై। భాసిల్లుఁదలాతలంబు ప్రభువందుమయుం। డాసురపు⁑నిర్మాతయు। వాసిగఁ బొగడొందియేలు వసుధాధీశా॥ చ॥ పురహరుఁ డీశ్వరుఁడు భూతహితార్థముగాఁ బురత్రయంబు। బరుమఁ గసీఱుఁ జేసె శరణాగతు నా మయుఁగాచి యెంతయుం। గరుణఁ దలాతలంబునకుఁ గర్తగ నిల్పె మనున్న వాఁడు శ్రీధరుని సుదర్శనంబునకుఁ దప్పి విముక్తభయుండుగాఁ దగన్॥ క॥ తలఁపఁగ నాక్రిందను మహా। తలమునఁ గద్రువ ఘనాటిత నయులు సర్పం। బులు గలవు పెక్కుశిరములు। నలరంగాఁ గ్రోధవశగణావళియనఁగన్॥ వ॥ మఱియును, కుహక, తక్షక, కాళియ, సుషేణాది ప్రధానులైన వారలతులశరీరంబులు గలిగి యాదిపురుషుని వాహనంబైన †పతగరాజభయంబున ననవరతంబును ద్విజితులగుచు స్వకళత్రాపత్యసుహృద్బాంధవసమేతులై యుండుదురు ఆక్రిందరసాతలంబునందైత్యులు దానవులు నగు నివాతకవచ కాలకేయులును హిరణ్యపుర నివాసులగు దేవతాశత్రువులు మహాసాహసులును దేజోధికులు నగుచు సకలలోకాధీశ్వరుండైన శ్రీహరి తేజంబునం బ్రతిహతులై వల్మీకంబునం దణఁగియున్న సర్పంబుల చందంబున నింద్రదూతయగు సరమచేఁ జెప్పఁబడెడు మంత్రాత్మక వాక్యంబులకు భయంబు నొందుచుండుదురు॥ క॥ ఇందుకులోత్తమ వినుమా। క్రిందటి పాతాళమునను గ్రీడించుచు నా। నందమునొందుచు నుండును। సందడిఁబడి నాగకులము చతురతతోడన్॥ వ॥ ఇట్లు వాసుకి ప్రముఖులైన, శంఖ, కులిక, మహాశంఖ, శ్వేత, ధనంజయ, ధృతరాష్ట్ర, శంఖచూడ, కంబళాశ్వతర, దేవదత్తాదులైన, మహానాగంబులై మనేకపదియును నూఱు వేయు శిరంబులు గలిగి ఫణామణికాంతులం జేసి పాతాళతమిరంబును బాపుచుండుదురు॥ సీ॥ పాతాళలోకంబు పాదమున శేషుండు వెలయంగ ముప్పది వేలయోజ। నంబుల వెడలుపుననుదోఁకఁ జుట్టుగాఁ జుట్టుకయుండు విష్ణునిమహాగ్ర। మైనదాను శరీరమైనయనంతాఖ్య సంకర్షణుండు సంతతంబు। నట్టి యనంత నామాభిపూజ్యుని మస్తకమున సిద్ధార్థంబు కరణి ధరణి। యంత నా విభుండు నఖిలలోకంబుల। సంహరింపఁగోరి చండకోప। వశత సృజనఁ జేయువరుసనే కాదశ। రుద్రమూర్తుల నెసఁ రౌద్రమతుల॥ గీ॥ అట్టి రుద్రమూర్తులుతుల త్రినేత్రులు। నఖిలశూలహస్తులగుచు నుండు। రందునున్న ఫణిపకులాధిపులు శేషుని। పాదపంకజములభక్తిఁ జేరి॥ గీ॥ నమ్రులగుచు ననుదినంబును మాళిర। త్నములచేతఁ గమ్ము ఋగంబు నొంది। కోరికలు కవిర్చనీరాజనంబుల। నిచ్చ

● ప్రమోషణంబు సేయు। అపహరించునట్టివైన. శపిత్ర్యంబు। తండ్రి సంబంధమైనది ⁑నిర్మాత। సృజించినవాఁడు. †పతగరాజు- గరుత్మంతుఁడు. ఉద్వేజితులగుచున్। కలత పెట్టబడినవారై.

చుంమరెప్పుడుమచ్చికలను॥వ॥మఱియునాసంకర్షణమూర్తిం జేరినాగకన్నియలుకోరికలుగలవారలగుచునొప్పెడిశరీర
విలాసంబులం జేసియగురుచందనకుంకుమపంకంబులను లేపనంబులు సేయుచుసంకర్షణమూర్తిదర్శనస్పర్శనాదులనుద్బో
ధితమకరధ్వజావేశితచిత్తంబులుగలిగి చిఱునవ్వులొలయనధికాభిలాషం జేసి *స్మితావలోకనంబుల సవ్రీడితలై యవ
లోకించుచుండ ననంతగుణంబులుగలయనంతదేవుండుపసంహరింపంబడినక్రోధంబుగలిగి లోకంబులకు క్షేమంబుఁగోరు
చుసురాసురసిద్ధగంధర్వవిద్యాధరమునిగణంబులనవరతంబుధ్యానంబుసేయ సంతతసంతోషాతిశయంబున⁂మ్రాఁ
గన్నువెట్టుచుసలలితగీతవాద్యంబులనానందంబునొందుచుఁదనపరిజనంబులనతిస్నేహంబుననవలోకించుచునవతులసీ
గంధ❖పుష్పరసామోదితమధుకరవ్రాతమధురగీతంబులు గలవైజయంతీవనమాలధరియించుచు నీలాంబరధరుండును
హలధరుండునగుచు నితండు మహేంద్రుండో హరుండో యనుచుజనంబులు వలుకుచుండఁగాంచనాంబరధరుండై ము
ముక్షువులుధ్యానంబులు సేయ❊నధ్యాత్మవిద్యాయుక్తంబైనయానందహృదయగ్రంథినిభేదించు నట్టిశేషుని✤స్వా
యంభువుండగునారదుండుతుంబురుప్రభృతులగుఋషిశ్రేష్ఠులతోఁ జేరుకొనికమలాసనుని సభాస్థానంబునందు నిట్లు
స్తుతించుననంత॥ సీ॥ఓలిమైయెవ్వనిలీలావినోదముల్జన్మసంరక్షణక్షయములకును। హేతువులగుచుండు నెవ్వని చూపులజని
యించెసత్త్వరజస్తమంబు। లెవ్వనిరూపంబు లేకమైబహువిధంబులనుజగత్తులఁ బ్రోచుచుండు। నెవ్వని నామంబులెఱుఁ
గకతలఁచినయంతనదురితంబులడఁగుచుండు।నట్టిసంకర్షణాఖ్యుండునవ్యయుండు।నైన శేషునివినుతిసేయంగఁదరమె।త
లఁపనెప్పుడు వాఙ్మనంబులకునింక।మూఁడులోకంబులందు భూతతతికి॥ గీ॥ మఱియుఁబెక్కుగతులమాబోఁటివారలఁ।
బ్రోవఁదలఁచిశేషమూర్తిసాత్త్వి।కస్వభావమొందెఁగడఁకతోనట్టిశే।షునకుమ్రొక్కుచుందుననుదినంబు॥వ॥మఱియు
నాశేషునినెవ్వండేనియునాకస్మికంబుగనైననునార్తుండగుచునైననుస్మరించినమాత్రముననఖిలపాపంబులుంబొలిసిస
కలశ్రేయస్సులంబొందు నట్టిశేషుని నేమముముక్షువులాశ్రయించిధ్యానంబొనర్చి భవబంధనిర్ముక్తులగుదురతనిఫణంబుల
యందుభూగోళంబణుమాత్రంబగుచునుండు నతనిమహిమలుగణుతింప సహస్రజిహ్వలుగలపురుషుండైననోపండనిప
లుకుచుండుదురాయనంతుండు పాతాళంబుననుండి సకలలోకహితార్థంబుభూమినిధరించునని లోకతిర్యఙ్మనుష్యగతులను
లోకస్థితియును శుకయోగీంద్రుండు వినిపించి యింకనేమి వినుపింతు నెఱింగింపుమనినం బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీం
ద్రునకిట్లనియె॥క॥ మునివరలోకచరిత్రం।బనుపమముమహావిచిత్రమగునట్లుగనా।కును వినిపించితివంతయుఁ।బనుపడినా
చిత్తమందుఁబాయకనిలిచెన్ ॥ అనినశుకయోగీంద్రుండిట్లనియె॥గీ॥జంతుజాలములకు శ్రద్ధలు త్రిగుణాత్మ।కములుగాన
వానికర్మగతుల। తారతమ్యములునుదగిలియున్నియువివి।ధంబులగుచుసంతతంబునుండు॥వ॥నరేంద్రా ప్రతిషిద్ధలక్షణంబ
గునధర్మంబాచరించునరుని శ్రద్ధవిపరీతముగాఁ బ్రవర్తిల్లునట్టివానికిఁగలిగెడుకర్మఫలంబును విపరీతంబుగా నెయుండుఁ
గావుననానాద్యవిద్యాకామప్రవర్తనలవలనఁ బెక్కుతెఱంగులఁగలిగెడు కర్మగతులసంగ్రహంబుగనెఱింగించెదననినశు
కునితోఁబరీక్షిన్నరేంద్రుండిట్లనియె॥ గీ॥మునివరేణ్యానరకములుముజ్జగంబుల।యందో యంతరాళమందో వెలియొ।యది
యుఁగాకదేశమందుండుభూవిశే।షములోఁ దెలియఁబలుకుసంతసమున॥వ॥అనినశుకయోగీంద్రుండిట్లనియె॥క॥ఎడతెగ

### శుకయోగి పరీక్షిత్తునకునుపదేశరూపముగా నరకలోకవర్ణనమును దెలుపుట.

కముజ్జగంబులఁగడపలనై §యామ్యదిశనుగదలకనిలుచు। న్నడుఘోరములుగనరకము। లడరంగానంతరాళమందులనధి
పా॥వ॥మఱియును దక్షిణంబుననగ్నిష్వాత్తాది పితృగణంబులుతమగోత్రజులకు మేలుగలుగుటకొఱకు సత్యంబులగునాశీ
ర్వాదంబులనొసంగుచుండుదు రచ్చటపితృపతియగుశమనుండుతనలోకంబుకుంజనుదెంచు జంతువులకర్మంబులకుంద
గినఫలంబులనిచ్చి శిక్షించుచునుండు,నందుఁదమిస్రంబు,నంధతామిస్రంబును, రౌరవంబును, మహారౌరవంబును,కుంభీ
పాకంబును,గాలసూత్రంబు,నసిపత్రవనంబును,సూకరముఖంబు,నంధకూపంబును,క్రిమిభోజనంబును,సందంశమును,
తప్తోర్మియును,వజ్రకంటకశాల్మలియు,వైతరణియుఁ,బూయోదయుఁ,బ్రాణరోధయు,విశసనంబును,లాలాభక్షమును,సా
రమేయాదనంబు,నావీచిరయంబును, రేతఃపానంబు,ననునేకవింశతిమహానరకంబులును,మఱియును, క్షారకర్దమంబు
ను,రక్షోగణభోజనంబును, శూలప్రోతంబును, దందశూకంబును,నవటనిరోధంబును,పర్యాయవర్తనంబును, సూచీము

---

* స్మితావలోకనంబులసవ్రీడితలై॥ స్మిత-వికసించిన-అవలోకనంబులన్-చూపులచేత- సవ్రీడితలై-సిగ్గుతోఁగూడినవారై. ⁂మ్రాఁగన్నువెట్టుచు-నగవుమూయఁబడినకన్నులుగలవారై. ❖పుష్పరసామోదితమధుకరవ్రాత-మకరందపానముచేతసంతసిల్లుచున్నతుమ్మెదలగుంపుయొక్క. ❊అధ్యాత్మవిద్యాయుక్తంబైన-బ్రహ్మజ్ఞానముతోఁగూడిన. ✤స్వాయంభువుండగు-బ్రహ్మపుత్రుండైన. §యామ్యదిశ-దక్షిణపుదిక్కు.

ఖంబు, ననుసప్తపధనరకంబులతోడి, యష్టావింశతినరకంబులుగలవని కొందఱు నొడువుచుందురు॥ క॥ పరపుత్రకళత్రంబులఁ। బరికింపఁగనపహరించుపాపాత్ముఁడుము। ష్కరపాశబద్ధుఁడై యమ। పురుషులచేనధికబాధఁ బొందుచునుండున్॥ వ॥ మఱియునివ్విధంబున బాధితుండగుచుఁ, దామిస్రనరకంబునంబడి, యనశనాద్రిపాతనదండతాడనతర్జనాదిబాధలం జెంది కడుభయంబున మూర్ఛలం బొందుచుండు॥ క॥ పరకాంత నెవ్వఁడేనియుఁ। బురుషుండుండంగ మొఱఁగిపొందిన యమకిం। కరులతనిఁ బట్టివడిద। త్తరమునఁబడవైతు రంధతామిస్రమునన్॥ వ॥ నరేంద్రా యెవ్వఁడేనియుఁ గుటుంబపోషణార్థంబు పరులకు ద్రోహంబు సేయు నా నరుండు రౌరవనరకంబునం బడు నెవ్వం డిహలోకంబునందు స్వేచ్ఛావిహారంబున సంచరించుచుఁ బరోపద్రవపరాఙ్ముఖంబులై యుండు పశుపక్షిమృగాదుల బాధించు నాయామృగంబులు *రురురూపంబులఁ దాల్చి యట్టి పాపిజనుల నానావిధ †యాతనల బాధించుటం జేసి రౌరవమహారౌరవనరకంబులనబడు నెవ్వఁడేనియు దేహపోషణార్థంబు మూషకాదుల బిలనిరోధంబుఁ జేసి వధించు నా నిష్కరుణుండైన పురుషునిం గుంభీపాకనరకంబులయందుఁ గల ‡తప్తతైలంబులం బెట్టు బాధలం బొందింతురు॥ సీ॥ తల్లిదండ్రులకును ధరణీసురులకును నహితంబుఁ జేసిన యట్టివాఁడు। కాలసూత్రంబనుకడుఁదీవ్రనరకంబునందున నందండ §యయుతయోజ। నాయతపాత్రములందుల సూర్యుండు మీఁదఁ గ్రిందను వహ్ని మిగుల మండ। నత్యంతక్షుత్పిపాసాదుల చేతను బాధితుండగుచుండుఁ బాయ కెపుడుఁ। బరువు వెట్టుచున్నఁ బడియున్న నిలిచినఁ। గదలకున్నఁ జాలనొదిగియున్న। బాధఁ బొందుచుండు పశురోమముల లెక్క। వరుస ¶నపరిమేయవత్సరములు॥ వ॥ మఱియు వేదమార్గంబు విడిచి పాషండమార్గంబులాచరించు పురుషుని ‖నసిపత్రవనంబునందు యమకింకరులు తరట్లనడచుచుఁ బరిహసించుచుండ నోలు నెడ నా యసిపత్రంబులిరుగెలంకుల శరీరంబుఁ దెంచుచుండ నడుగడుగున మొఱఁబెట్టుచుండ బాధించుచుండుదురు॥ క॥ దండింపఁదగని వారల। దండించిన విప్రవరుల తనువులు ముట్టం। దండించిన దుర్మతులం। దండింతురు కాలసూత్రనరకములందున్॥ గీ॥ మఱియు నట్టిదుష్టమానవుఁ గింకరు। ల్వెఱచి చెఱుకు కోలవిఱచినట్లు। బాధఁ బెట్టుచుండఁ బడి మూర్ఛఁ జెందుచుఁ। బొరలు వెట్టుచుండు భూపవర్య॥ వ॥ నరేంద్రా యెవ్వఁడేనియు నీశ్వరకల్పితవృత్తిగల జంతువుల హింసించు నట్టివాని నంధకూపంబను నరకంబునం బడవైచిన నంతనతండు దొల్లి తాను చేసిన భూతద్రోహంబున నచ్చటవివిధక్రూరపక్షిమృగపశుసర్పమశకమత్కుణమక్షికాదులచేత హింసం బొందుచు మహాంధకారంబునందు నిద్రానుభవసుఖలేశంబును లేక కుశరీరంబునందుల జీవుండును బోలె మృతప్రాయుండై యుండు నంత॥ క॥ తనకలిమి నెవ్వఁడేనియుఁ। దనబాంధవవరులఁ గూడితగఁ గుడువక తా। నును వాయసంబు భక్షిం। చిన మాడ్కి నొదిన్న వాని శీఘ్రమె యచటన్॥ క॥ క్రిమిభోజనమని యెడి నర। కమునం బడి క్రిమి లెకూడు గాఁ గుడుచుచుఁ దాఁ। గ్రిమియగుచు లక్షపరిమా। ణముగల క్రిమికుండమం దునాటుక యుండున్॥ వ॥ మఱియు నీభూలోకంబున నెవ్వఁడేనియు **నవిపన్నుండై చౌర్యవృత్తిచే బ్రాహ్మణాదుల హిరణ్యరత్నాది ద్రవ్యంబులనపహరించు నట్టిపురుషుని నగ్నివర్ణంబులగు ††నయఃపిండంబుల నగ్నితప్తంబులగు శూలంబుల నతని శరీరంబునందిడియుచుండుదురు మఱియును ‡‡మదనాతురులగుచు స్త్రీపురుషులగమ్యాగమనంబులు చేసి రేనినట్టివారి నియమలోకంబున నతితీక్ష్ణ §§కశాతాడితులం జేసి యగ్నిమయంబులయిన యుక్కుప్రతిమల నాలింగనంబు సేయింతురు॥ గీ॥ సర్వజంతుజాలసంగమ మొందెడు। వానిఁ బట్టికట్టి వజ్రదంష్ట్రి। కములుగలుగు నట్టి ఘనతర శాల్మలీ। తరువులందుఁ జేర్చి దంతు రెపుడు॥ గీ॥ పార్థివేంద్ర నరుఁడు పాషండదర్శనుఁ। డగుచు ధర్మమార్గ మడఁచెనేని। వాఁడు నరకమందు వైతరణీ నది। నుడుగ కెపుడుఁ బొరలి పడుచునుండు॥ వ॥ మఱియు నట్టి వైతరణీనదియందు ¶¶జలగ్రాహంబులు దిగిచి భక్షింప బ్రాణంబులు నిర్గమింపఁ దమ పాపంబులు చ్చరించుచు విణ్మూత్రపూయశోణితకేశనఖాస్థిమేదోమాంసవసావాసినియగు నందుఁ దప్తుండగుచునుండు, విప్రుండు శూద్రకామినులం బొంది శౌచాచారంబులం బాసి గతలజ్జుండై పశువుం బోలి చరియించెనేని నతండు నరకంబునుం బొందియందుఁ బూయవిణ్మూత్ర ‖‖లాలాశ్లేష్మపూర్ణార్ణవంబందు ద్రొబ్బంబడి నతిభీభత్సితంబు

---

*రురురూపంబులన్। సర్పాదులకన్న నతిక్రూరమైన విషజంతువుల రూపములను. †యాతన। అతివేదన ‡తప్తతైలంబులన్। కళకళఁ గాఁగుచుండెడి నూనెలయందు. §అయుత। పదివేలు. ‖ఆయత। విశాలమయిన, క్షుత్పిపాసాదులచేతన్। ఆఁకలిదప్పి బడలికలు మొదలగువానిచేత. ¶అపరిమేయ। లెక్కఁబెట్టఁగూడని. **అసిపత్రవనంబునందున్। ఖడ్గప్రాయములగు ఆకులుగలచెట్లతోఁ గూడిన అడవియందు. ††తరట్లన్। కొరడాలతో। జాటీలతో. క్రిమి। పురుగు. ‡‡అవిపన్నుండై। ఏయాపదలేనివాఁడయి. §§అయఃపిండంబులన్। ఇనుపగుండ్లను. ఇడియుచుందురు। బాధింతురు. ¶¶మదనాతురులగుచున్। మన్మథునిచేత పీడింపఁబడినవారై, అగమ్యాగమనంబులు చేసిరేనిన్। పొందఁగూడనివారితోడ పొందిరేని, కశాతాడితులన్। కొరడాలతోఁ గొట్టఁబడినవారినిగాను. ‖‖జలగ్రాహంబులు। నీటిమొసళ్లు, దిగిచి। ఈడ్చి, విట్। మలము-పూయ। చీము-మేద। ఎముకలలోని క్రొవ్వు-వస। అన్నిమాంసములలో మేలయిన క్రొవ్వు. వీనికి, వాసినియగునందున్। స్థానభూతమైన వైతరణీనదియందు, తప్తుండు। పరితపించువాఁడు. ***లాలా। నోటిచొంగ, శ్లేష్మ। కఫము, అర్ణవము। సముద్రము. ద్రొబ్బుట। త్రోయుట. అతిభీభత్సితంబులగు। మిగులనింద్యములైన.

లగు నా ద్రవ్యంబుల భుజియించుచుండు॥ క॥ శునకములఁ బెంచి యెవ్వం, డనయంబును వేటసలిపి యాత్మార్థముగా, వనమృగముల హింసించెను, మనుజాధము నస్త్రములను మర్దింతురొగిన్॥ గీ॥ ద్రవ్యలోభమునను దంభార్థమై పశు, వులను జంపి జన్నములను జేయు, వానిఁ బట్టి యముని వారలు గోయుచు, నుందు రెపుడు మిగుల సందడిలుచు॥ వ॥ కామమోహితుండై యెవ్వండేని యుదనభార్యచేత రేతఃపానంబు సేయించు నా పాపాత్ముని రేతః* ప్రవాహంబునం ద్రోచి యా రేతంబు నె పానంబు సేయింపుదురు రాజపుత్రులైనను చోరులైనను ధనికుల గ్రామంబుపైఁ బడి యందు గృహదాహంబు సేయు వారలను విషామలవలన నన్యులఁ జంపెడు వారలను వజ్రదంష్ట్రలుగల **వింశత్యుత్తర సప్తశత శునకంబులెడ తెగ కఱిగి విభక్షించుచుండు॥ సీ॥ లంచంబుఁ గొని సాక్షి వంచించి యనృతంబుఁ బలికెడు పాపాత్ముఁ బట్టి కట్టి, యంతమహావీచి యను నరకమునను శతయోజనోన్నత శైలశిఖరమునఁ దలక్రిందుగా నునిచి యధోముఖంబుగఁ బడ ద్రొబ్బిన బొబ్బలిడుచుఁ, గల్లోలములు లేని కమలాకరము వోలెఁ ***జటులమైయున్న పాషాణమందుఁ బడిన యంతన దేహంబు పగిలి పెక్కు, శునకలైపాసి యదికూడికొనుచు నుండు, నుండి యాకులమును నొందుచుండుఁగాని, చావు లేకుండు నా దుష్టజంతువునకు॥ గీ॥ సోముయాజి భార్యఁ గామించిఁ బొందిన, వానిఁ గపటమద్యపానసోము, పానమును దినంబుఁ బానంబు సేయువి, ప్రక్షత్రియులను బట్టి సంభ్రమమున॥ గీ॥ ఆ లోహమ్ముఁ ద్రొక్కి మోము ****లెమ్మ వట్టగ మోది, యనలముఖమునందు నగ్నివర్ణ, ముగను గాఁచిన క్షత్రియునసింఁడఁ గానుక్కి, నీరు వోతు రేఁచి నిష్ఠురమున॥ వ॥ మఱియు నీచవర్గుండు నిష్ఠసలుపుచుఁ దపోదానవిద్యాచారంబులఁ బెద్దలకవమానంబు సేయువాఁడు క్షారకర్దమంబను నరకంబునందు నధోముఖుండగుచు బాధలం బొందు స్త్రీపురుషులెవ్వరేని యుశరీరరక్షణార్థంబు పశువుల మానవుల బలియిచ్చిరేని వారల నిరయంబునందు యమకింకరులు ¶సురియలందు నిమిత్తరక్తంబు పానంబు సేయించుచుం బొరాడుచుండుదురు గ్రామారణ్యంబులయందు జంతువుల శూలప్రోతలం గావించి హింసించుచు హర్షించుచున్న వారలను నరకంబునందు శూలప్రోతలం జేసిన క్షుత్పిపాసాపరులగుచుండఁ గంకగృధ్రాదులు తీక్ష్ణ తుండాగ్రంబునఁ దిగి విభక్షించుచుండు మఱియు భూత స్వభావంబున జంతుపీడనంబుఁ గావించెడు పాపాత్ముల దందశూకంబను నరకంబునందు నైదు నేడుముఖంబుల సర్పంబులు గఱచుచుండు॥ గీ॥ ఎనయ దొడ్డిలోన సందులలోనైనను, బశుపతంగహరిణపక్షి నెల్లఁ బట్టి హింస సేయు పాపాత్ము విషవహ్ని, ధూమశిఖల ద్రొబ్బుదురు నృపాల॥ క॥ తనయింటికి వచ్చిన మనుజుని నతిథిం గ్రోధదృష్టిఁ జూచిన వానిం, గనుఁగవల వజ్రదంష్ట్రలఁ, దనరిన యా కంకగృధ్రతతి భక్షించున్॥ మ॥ ధనవంతుండగు మానవుండు గడఁక న్ధర్మోపకారంబులన్, ఘనతం జేయక యుండెనేని యముల్ లోకంబు సూచీముఖంబను నా దుర్గతిఁ బట్టి త్రోచి యిది గాఁ పైయున్న భూతంబుటం, చును బాశంబులఁ బట్టి కట్టి వడితో నొప్పింతు రత్యుగ్రులై॥ గీ॥ నరవరేణ్య యిట్టి నరకముల్ యమలోక, మందుఁ గలవు మఱి సహస్రసంఖ్య, లందు శమనమాతల నిశంబు బాధింతు, రవని నధర్మయుతులయిన నరుల॥ గీ॥ ధర్మవంతు లెల్లఁ దప్పక స్వర్గంబు, నందు భోగసమితిఁ బొందుచుండు, రెలమిఁ బుణ్యపాపముల శేషములవల్లఁ, బుట్టుచుందు రవనిఁ బుణ్యచరిత॥ వ॥ నరేంద్రా మోక్షమార్గంబు మున్నె వినిపించితి నిప్పుడు నీకెఱింగించిన వెల్లను బ్రహ్మాండకోశంబునం గలవని పురాణంబులు వలుకుచుండు నట్టి బ్రహ్మాండంబు శ్రీమన్నారాయణు నిస్థూలశరీరంబగుటం జేసి బ్రహ్మాండం బెవ్వరు వర్ణింతు రెవ్వరు వింతురు వారలకు సకలశ్రేయస్సులు గలుగు నీశ్వరస్థూలశరీరంబుఁ దెలిసిన వారికి శ్రద్ధాభక్తులం జేసి స్థూలదేహంబు నెఱుంగవచ్చు భూద్వీపవర్ష పరిదద్రి నభస్సముద్ర పాతాళదిఙ్నరక తారాగణలోక సంస్థితంబయిన శ్రీహరి సకలజీవనికాయంబై యద్భుతంబైన స్థూలశరీరంబు వినిపించితినని॥

చ॥ జలజభవాదిదేవమునిసన్నుతతీర్థపదాంబుజాత నిర్మలనవరత్ననూపుర విరాజితకౌస్తుభభూషణాంగ యుజ్జ్వలతులసీమరందమదవాసనవాసితదివ్యదేహ శ్రీనిలయశరీర కృష్ణ ధరణీధరధాను శశాంకలోచనా॥ క॥ శ్రీ తరుణీహృదయస్థిత, పాతకహర సర్వలోకపావన భువనా, తీతగుణాశ్రయ యతివి, ఖ్యాత సురార్చితపదాబ్జ కంసవిదారీ॥ మత్తకోకిల॥ దండితారిసమూహ భక్తనిధాన దానవిహారమా, ర్తాండమండల మధ్యసంస్థితతత్త్వరూప గవాసికో, దండశంఖసుదర్శనాంక సుధాకరార్కసునేత్ర భూ, మండలోద్ధరణా ర్తపోషణ మత్తదైత్యనివారణా॥

గద్య॥ ఇది శ్రీ సకలసుకవిజనానందకర బొప్పనామాత్యపుత్ర గంగనార్యప్రణీతంబైన శ్రీమద్భాగవతపురాణంబునందు భరతాత్మజుండైన సుమతికి రాజ్యాభిషేకంబును, పాషండదర్శనంబును, సుమతిపుత్రజన్మవిస్తారంబును, గయుని చరిత్రంబును, గయునిసంస్తుతియు, భూద్వీపవర్షసరిదద్రి నభస్సముద్రపాతాళదిఙ్నరకతారకాగణసంస్థితియు, ననుకథలుగల పంచమస్కంధంబునందు ద్వితీయాశ్వాసము.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

---

*ప్రవాహము, మడుగు. **వింశత్యుత్తర సప్తశత శునకంబులు, ఏడునూట యిరువదికుక్కలు. ***జటులము, ఉన్న, సుందరమగుచున్న. ****లెమ్మ వట్టగ, ముద్దుపారునట్లు, ఏఁచి, విజృంభించి. ¶సురియలన్, కత్తులచేత, తుండాగ్రంబులన్, నోటికొనలతో, అనఁగా ముక్కుచివరలతో.

## శ్రీమదాంధ్రభాగవతము.— షష్ఠస్కంధప్రారంభము

* శ్రీవత్సాంకితకౌస్తుభస్ఫురితలక్ష్మీచారువక్షస్స్థలు। శ్రీవిభ్రాజితునీలవర్ణుశుభరాజీవాక్షుఁగంజాతభూ। దేవేంద్రాదిసమస్తదేవముకుటోద్దీప్తోరురత్నప్రభా। వ్యావిద్ధాంఘ్రిసరోజునచ్యుతుఁగృపావాసుం బ్రశంసించెదన్॥ ఉ॥ నిండుమనంబునం దలంతుఁ ※కమనీయభుజంగమరాజమండలీ। మండనుఁ జంద్రఖండపరిమండితమస్తకు నుదారమల్లికా। పాండురవర్ణుఁ జండతరభండను హేమగిరీంద్రచారుకో। దండు మహేశు గంధగజదానవభంజను భక్తరంజనున్॥ ఉ॥ హంసతురంగము న్※పరమహంసము నంచితదేవతాకులో। త్తంసము నాగమాంతవిదితధ్రువపుణ్యరమావతంసముం। గంసజిఘాంసునంశమును గర్బురసూత్రసమావృతాంసమున్। హింసనడంచు బ్రహ్మను మనసేనశుభంబులకై భజించెదన్॥ ఉ॥ ※మోదకహస్తునిన్ సుపమూషకవాహు నేకదంతులం। బోదరు నంబికాతనయు నూర్జితపుణ్యుఁ గణేశు దేవతాహ్లాదకరిష్ఠు దంతిముఖు నంచితభక్తఫలప్రదాయకున్। మోదముతోడ హస్తములు మోడ్చి భజించెద నిష్టసిద్ధికిన్॥ ఉ॥ కల్లరనంబు గాకసోడఁ గట్టినపూర్వపురీతి నేఁడు నా। యుల్లమునందు నుండుము సమున్నతతేజముతోడ భక్తిరం। జిల్లినచూపు గూడ విధిఁ జెందిన ※ప్రౌఢబుధాళినీడ మా। తల్లి దయామతల్లి ప్రణతద్రుమకల్పకవల్లి భారతీ॥ క॥ విలసత్కంకణరవరవ। కలితంబగు నభయవరదకరముల చెరయం। జెలరేఁగి భక్తుల మనల। కలుముల దయసేయు జలధికన్యకఁ దలఁతున్॥ క॥ కాళికి బహుసన్నుతలో। కాళికిఁ ※కమనీయవలయకరకీలితకం। కాళికిఁ దాపసమానస। కేళికి వందనముఁ జేసి కీర్తింతు మదిన్॥ అని యిష్టదేవతాప్రార్థనంబుఁ జేసి॥ చ॥ పరమసమాధిధుర్యుఁ బటుపావనకర్మవిధేయు దేవతా। వరనరవంద్యు సద్విమలవాక్యు జనార్దనకీర్తనక్రియా। భరణసమర్థు వేదచయసారసుభవ్యుఁ ద్రికాలవేదిభా। సురమతిఁ గొల్చుటొప్పు బుధశోభితుఁ బుణ్యుఁ బరాశరాత్మజున్॥ క॥ వ్యాసుని భగవత్పదసం। వాసుని నాగమపురాణవగవిష్ణుకథా। వాసుని నిర్మలకవితా। భ్యాసుని పదపద్మయుగము భావింతు మదిన్॥ సీ॥ వరకవిత్వోద్రేకి వాల్మీకిఁ గొనియాడి భాగవతార్థవైభవముఁ బలుకు। శుకమంజులాలాపు శుకయోగిఁ బ్రార్థించి బాణమయూరుల ¶ప్రతిభ నొడివి। భాససౌమిల్లికభారవిమాఘుల ఘనసుధామధురవాక్యములఁ దలఁచి। కాళిదాసుఁ గవీంద్రకల్పవృక్షముఁ గొల్చి నన్నపాచార్యవర్ణనలఁ బొగడి। వెలయ దిక్కనసోమయాజుల భజించి। యెఱ్ఱనామాత్యు భాస్కరు నిచ్చ నునిచి। సుకవి సోముని నాచనసోము నెఱిఁగి। కవిమనోనాథు శ్రీనాథు ఘనత మెచ్చి॥ ఉ॥ ఎమ్మెలు సెప్పనేల జగ మెన్నఁ

---

*శ్రీవత్సాంకిత-జితున్॥ శ్రీవత్స। శ్రీవత్సమను పుట్టుమచ్చచేత, అంకిత। చిహ్నితమైన, కౌస్తుభస్ఫురిత। కౌస్తుభమను మణిచేఁ బ్రకాశిల్లుచున్నట్టి, లక్ష్మీచారు॥ లక్ష్మీ। లక్ష్మీదేవిచేత-చారు। మనోజ్ఞమైన-వక్షస్స్థల। శ్రీ। ఉరస్స్థలశోభచేత-విభ్రాజితున్। తేజరిల్లుచున్నట్టి-నీలవర్ణున్। నీలవర్ణుని- శుభరాజీవాక్షున్। మంగళకరములగు తామరరేకులవంటి నేత్రములు గలిగినట్టి కంజాత-సరోజున్॥ కంజాతభూ। బ్రహ్మయును-దేవేంద్రాది। పురందరుఁడాదిగాఁ గల-సమస్తదేవ। సర్వగీర్వాణులయొక్క-మకుట। కిరీటములయందు-ఉద్దీప్త। మిక్కిలి వెలుఁగుచున్న-ఉరు। శ్రేష్ఠములైన-రత్నప్రభా। మణికాంతులతోడ-వ్యావిద్ధ। కూడుకొనిన-అంఘ్రిసరోజున్। పాదపద్మములు గలిగినట్టి-కృపావాసున్। కరుణానివాసుఁడైన-అచ్యుతున్। విష్ణుదేవుని, ప్రశంసించెదన్। స్తుతించుచున్నాను.— ※కమనీయభుజంగమరాజమండలీమండనున్॥ కమనీయ। మనోహరములైన-భుజంగమరాజ। సర్పశ్రేష్ఠములయొక్క-మండలీ। సమూహమే-మండనున్। ఆభరణములుగాఁ గలిగినట్టి-అనఁగా- అనంతతక్షకశేషవాసుక్యాది సర్పశ్రేష్ఠములే భూషణములుగాఁ గలవాఁడని భావము. చంద్రఖండపరిమండితమస్తకున్॥ చంద్రఖండ। అర్ధచంద్రునిచేత-పరిమండిత। లెస్సగ నలంకరింపఁబడిన- మస్తకున్। శిరస్సు గలిగినట్టి-ఉదారమల్లికాపాండురవర్ణున్। శ్రేష్ఠములైన మల్లెపూవులవలె తెల్లనైన శరీరచ్ఛాయ గలిగినట్టి- చండతరభండనున్। అతిభయంకరములగు యుద్ధములు గలిగినట్టి- హేమగిరీంద్రచారుకోదండున్। పర్వతరాజమగు మేరువే విల్లుగాఁ గలిగినట్టి- గంధగజదానవభంజనున్॥ గంధ। గర్వించిన-గజదానవ। గజాసురుని- భంజనున్। సంహరించినట్టి-భక్తరంజనున్। భక్తజనాహ్లాదకరుఁడైనట్టి-మహేశున్। శివుని-నిండుమదిన్। పరిపూర్ణమగు ఉల్లమునందు-తలంతున్। స్మరించుచున్నాఁడను.— ※పరమహంసమున్॥ పరమ। ఉత్తమమైన-హంసమున్। ఉచ్ఛ్వాసనిశ్వాసరూపమైన ప్రాణస్వరూపమైనట్టి- ఉత్తంసము। శిరోభూషణము - ఆగమాంతవిదితధ్రువపుణ్యరమావతంసమున్॥ ఆగమాంత। వేదాంతములయందు-విదిత। ప్రసిద్ధమైన- ధ్రువ। స్థిరమైన-పుణ్యరమ। మోక్షలక్ష్మికి, అవతంసమున్। ఉత్తంసమైనట్టి, కంసజిఘాంసునంశమున్। కంసుఁడను రక్కసుని జంపిన కృష్ణుని యంశాసంభూతుఁడైన-కర్బురసూత్రసమావృతాంసమున్। కనకమయములగు యజ్ఞోపవీతములచేఁ జుట్టఁబడిన భుజశిఖరములు గల-అహీన। తక్కువగాని- బ్రహ్మమున్। బ్రహ్మదేవుని.— ※మోదకము। కుడుము, సమద। గర్వముతోఁ గూడిన, లంబోదరున్। పెద్దబొజ్జగల, ఊర్జిత। విస్తారమైన, దంతి। ఏనుఁగు, మోదము। ఆనందము— ※విధి। బ్రహ్మ. ప్రౌఢ। గట్టివయసు గలది. బుధాళినీడ। పండితులనెడు తుమ్మెదలకు గూడువంటిది, అనఁగా నాశ్రయభూతమైనది. దయామతల్లి। శ్రేష్ఠమైన కరుణ గలది, ప్రణతద్రుమకల్పకవల్లి॥ ప్రణత। సేవించువారనెడు-ద్రుమ। వృక్షములకు-కల్పకవల్లి। కల్పవృక్షముతీఁగెవంటిది, అనఁగా దన్ను గొలుచువారినెడఁ బాయక రక్షించి వారలకోర్కులు నెరవేర్చునట్టిదని భావము.— ※కమనీయవలయకరకీలితకంకాళికి॥ కమనీయ। రమణీయములైన-వలయ। కడియములుగాఁ జేయఁబడిన-కరకీలిత। హస్తములయందు తొడుగఁబడిన-కంకాళికి। మనిషి యెముకలు గలదానికి-అనఁగా నెముకల కడియములు ధరించినదని భావము. ¶ప్రతిభ। బుద్ధివిశేషము.

లసూర్యుం। డరుదుగఁ బెనుమంచుపింఛమడఁచినభంగిన్॥ క॥ దంతిపురనాథవినుమొక। *మంతనమెఱిఁగింతు శపదమం
బులు శీనంహోవంతు శుభవంతుఁ జేయవు। కంతునిగురుభక్తిముక్తిగలిగించుఁగడిన్॥ సీ॥ హరికినర్థముఁ బ్రాణమర్పితం
బుగనుండువానికైవల్య మెవ్వనికిలేదు। వనజలోచనుభక్తవరుల సేవించినవానికైవల్య మెవ్వనికిలేదు। వైకుంఠనిర్మల
వ్రతపరుండైనట్టివాని కైవల్య మెవ్వనికిలేదు। సరసిజోదరుకథాశ్రవణలోలుండైనవానికైవల్య మెవ్వనికిలేదు। వేద
తపముల బ్రహ్మచర్యాదినియతి। శమదమాదులసత్యశౌచములదాన। ధర్మముఖములసుస్థిరస్థానమైన। వైష్ణవజ్ఞానజనిత
నిర్వాణపదము॥ గీ॥ అరయనెన్నఁడుఁ జేటులేనట్టిముక్తి। వర్త్మ మీలోకమందు నెవ్వనికిఁ గలదు। సాధులును బుణ్యశీలురుస
జ్జనులును హరిపరాయణతత్పరులగుటఁగాక॥ క॥ అనుమగ నరహరిభక్తిం। బొరయనియాపురుషసుకృతపుంజంబులు వే।
మఱుఁ బుణ్యుఁ జేయనేరవు। నరవర మధుఘటముఁ బెన్కొనదులుం బోలెన్॥ చ॥ సతతముఁ గృష్ణపాదజలజంబులయందుమ
నంబునిల్పును। వ్రతులుఁ దదీయశుద్ధగుణరాగులుఁ గాలునియుగ్రపాశసం। హతులధరించుతత్సుభటవర్గములం గలలోనఁ
గానరే। గతులను మష్టకర్మములుగైకొని వారలఁ జెందనేర్చునే॥ వ॥ కావున నీయర్థంబునకుం బురాతనంబగు నొక్కయి

## అజామీళోపాఖ్యానము.

తిహాసంబుగలదది విష్ణుదూతయమదూతసంవాదంబనంబడుదాని నెఱింగింతు నాకర్ణింపుము॥ సీ॥ నరనాథ వినుము కన్యా
కుబ్జపురమునఁ గలఁడు బ్రాహ్మణుఁ డజామిళుఁడనఁగ। బాతకుండతుల నిర్భాగ్యుండవజ్ఞుండునష్టసదాచారికష్టరతుఁడు।
జూదంబులందు మద్యాదంబులందును జౌర్యంబునందు మచ్చరముగలిగి। §తొత్తాత్మపత్నిగా సుత్తుఁడై వరియించి కొడుకు
లఁబదుగురఁబడసి చాల। మోహజలధిలో నమునిఁగి ముచ్చటఁదీఱ। బాలలాలనావిలీలఁదగిలి। పెద్దగాలమతఁడు పెంపార
సుఖియించి। ఫలితమెల్ల వదలి పలితుఁడయ్యె॥ సీ॥ నిర్మలంబనఁజాలనెఱయుచిత్తంబు ననల్లని వెండ్రుకలెల్లనయ్యెఁ। దగు
మోహపాశబంధంబు జాఱినమాడ్కిఁ ¶బొదలిన యంగంబు వదలఁ బ్రాలె। నింద్రియంబులకోర్కెలిక నెల్లనసుభంగిను
డుగకతలచాలవడఁకఁ జొచ్చెఁ। దమకంబు ప్రాయంబుఁ దగిలిపోయినమాడ్కి లోచనంబులు చూడ్కి నీచమయ్యె। వగరు
పుట్టినంతఁ బెకలెదంతంబులు। నుక్కిసయును దగ్గు పిక్కటిల్లె। శిరసు నెవ్వఁదొడఁగెఁ జెదరె మనంబంతఁ। గడిదియైన ము
ప్పకాలమునను॥ గీ॥ ఎనయనతనికెనుబదెనిమిదివర్షంబు। లంతనరుగుటయును భ్రాంతుఁడగుచుఁ। గోరిపిన్నకొడుకు నారా
యణాఖ్యుండు। బాలుఁడగుటమిగుల భక్తిఁ జేసి॥ క॥ తనసతియుఁ దానుఁ గూరిమి। మనమునఁ బెనఁగొనఁగనక్కుమారుని నని
శం। బును ముద్దుసేయుచుండెను। జనవర వాత్సల్యమాత్మసందడిగొనఁగన్॥ క॥ బాలునిఁ గలభాషణుజన। పాలుని నిజజనక
బంధుపరిణామకళా। శీలుని లోలతఁ గనుఁగొని। యాలరిబ్రాహ్మణుఁడు నందితాత్ముండగుచున్॥ క॥ అత్యంతపానభోజ
నకృత్యంబులఁ బొత్తుగలిగి క్రీడలఁ దత్సాం। గత్యంబు వదలకాగత। మృత్యువుఁ గననేరఁడయ్యె మిక్కిలిజడుఁడై॥ గీ॥ తెలి
యకీరీతి నతఁడు వర్తించుచుండ। భయదమగు మృత్యుకాలంబు ప్రాప్తమయిన। భూరివాత్సల్యవృత్తి నప్పుత్త్రుఁ దలఁచి। యా
ర్తిఁ బ్రలపించె నారాయణాయటంచు॥ అప్పుడు॥ క॥ కింకరులధర్మరాజవ। శంకరులమరంతమరితసహధికజననా। శంకరు
లసకలలోకభ। యంకరులంగనియె నింద్రియాకులుఁడగుచున్॥ క॥ ఘాతుకుల దండదండిత। పాతకులనుగ్రకర్మభ
రవిమర్కుణా। జాతకులఁ బ్రేతనాయక। దూతకసంతతుల నతఁడు దూరమునందున్॥ మ॥ కనియెన్ బ్రాహ్మణుఁ డంత్యకాల
మున వీక్షారోమనిష్ఠ్యూతలన్। ఘనపీనోన్నవికారవక్త్రబిలసక్రవ్యైకుడుంబోపేతులన్। జనసంత్రాసకరోధ్యతాయతసుపా
శశ్రేణికాహస్తులన్। హననవ్యాప్తివిభీతులస్మఖర¶ సాత్మానేతలన్ దూతలన్॥ వ॥ ఇట్లతివిశ్రుతతుండగండభాగవి
భాగవిషమవివృత్తనేత్రులును అతిపుష్టనిష్ఠురతనుయష్టిసంవేష్టితమహోర్ధ్వరోములును అభ్యస్తసమస్తజీవాపహరణకర
ణప్రశస్తహస్తవిన్యస్తపాశధారులునగు యమభటులముగ్వురంగనుంగొని యజామిళుండు వికలేంద్రియుండును వికంపి
తప్రాణుండును వికృతలోచనుండును విహ్వలాత్మకుండునై॥ క॥ దూరమున నాడుచుం బాలుఁడు। ఘోరనఁదన చిత్తసీమఁ బొడఁ
గట్టిననో। నారాయణనారాయణ। నారాయణయనుచు నాత్మనందను నొడివెన్॥ చ॥ మరణపువేళ న[illegible]దనుజమర్దనుసంస్మ
రణంబు సేయఁడు। త్వరిసరవర్తులాత్మపరిపాలకు నామము నాలకించి విని। స్ఫురగతి నేగుదెంచి పాడఁ జూపియదల్చి రికాలుదా
సులన్। ఘనతరభాషులన్ వికటకల్పితవేషుల దీర్ఘరోషులన్॥ క॥ దాసీభర్తన జామిళ। భూసురుఁ దత్తనువువలన భోరు

---

*మంతనము|రహస్యము. †అంహోవంతుఁడు|పాపముగలవాని. ‡కంతునిగురుభక్తి|మన్మథునకుతండ్రియైనవిష్ణుభక్తి. నంహతి|సమూహము,
§తొత్తాత్మపత్నిగాన్|దాసినిభార్యనుగా, ¶పొదలిన|వృద్ధిఁబొందిన-బలిసిన, తమకంబు|వలపు-మోహము, ఉక్కిస|మూల్గుట, ముప్పకాలము
నన్|ముసలితనమునందు. ఆలరి|స్వేచ్ఛాప్రవర్తనములుగల. ప్రలపించెన్|వాపోయెను. ¶ఆత్మానేతలన్|జీవులఁగొనిపోవుచున్నవారైన,

ర్కంబు సేయు।స్మృతిపదవాక్యసంగతిగాక తత్స్మృతిపదవాక్యసంగతిపరగఁ జేయు।నాటకాలంకారనైపుణంబుడిగి తన్నా
టకాలంకారపాటిదిరుగు।బరగఁ జిరకాలమీరీతిఁ బాపనియతి।రమణదాసీకుటుంబభారము వహించి।యదిగుటుంబినిగాఁ
గఁ బాపాత్ముఁడగుచు।నశుచియును దుష్టవర్తనుఁడగుటఁ జేసి॥ క॥ అటుగానఁ బాపకర్మునిఁ । గుటిలుని సుజనార్తిదూర్తుఁ
గ్రూరుని నేమా।రటమునఁ గొనియేగెదము।తటదండమువలన నితఁడు ధన్యతనొందున్॥ వ॥ ఇట్లు పలుకుచున్న యమదూత
లవారించిన యకోపితులయిన భగవద్దూతలిట్లనిరి॥ క॥ అవురా ధర్మవివేక।ప్రవరుల సభగానఁ బడియెఁ బాపము పుణ్యో।ద్భ
వులనవంధ్యులదరిడన।వివరంబొనరింపఁబడియె విధి నెఱుంగమి చేన్॥ చ॥ సములును సాధులున్ విహితశాసనులున్ సదయా
ళురున్ శుభో।త్తమగుణులైనయట్టి కలితంత్రులు బిడ్డలకెగ్గు సేయుచోఁ। గ్రమమున వారలెవ్వరికిఁ గైకొని కుయ్యిడఁ జా
లువారు సం।భ్రమమున మీఁద నంబులఁ దరంబుగఁ జర్చయొనర్చి చూడుఁడా॥ గీ॥ ఎఱుక గలుగు వారలేది యొనర్చిన।నదియ
చేయుచుందురితరమయినవారు।నలరి సత్యమిట్టిదని రేని లోకంబు।తత్ప్రవర్తనమునఁ దగిలియుండు॥ గీ॥ నెమ్మిఁ దొడలమీఁద నిద్రిం
చు చెలికాని।నమ్మఁ దగినవాఁడు నయము విడిచి।ద్రోహబుద్ధిఁ జంపఁ దొడరు నేయెంతైనఁ।బ్రీతిలేక ధర్మదూతలార॥ గీ॥ చి
త్తమెల్ల నిచ్చి చెలితనంబున నచ్చి। నచ్చికలయ మెచ్చి నమ్ము వానిఁ। గరుణగలుగు వాఁడు కడు సౌమ్యుఁడగు వాఁడు। చింత
సేయు కెట్లు చెఱుప నేర్చు॥ అదియునుం గాక।ఉ॥ ఈతఁడు కోటిసంఖ్యలకు నెక్కుడు పుట్టువులందుఁ బుట్టి యా।యాతములై
న పాపనివహంబుల నన్నిటిఁ బారఁదోలి ప్ర। ఖ్యాతముగాఁ బ్రమాదమరణకాలమునన్ హరిపుణ్యనామసం। భూతసుధామ
యామృతవిభూతికి రాశికరసంగ్రహంబునన్॥ సీ॥ బ్రహ్మహత్యానేక పాపాటవులకగ్నికీలలు హరినామకీర్తనములు। గు
రుతల్పకల్మషక్రూరసర్పములకుఁ గేకులు హరినామకీర్తనములు।తపనీయచౌర్యసంతమసంబునకు సూర్యకిరణముల్ హరి
నామకీర్తనములు।మధుపానకల్బిషమదనాగసమితికిఁ గేసరుల్ హరినామకీర్తనములు। మహితయోగోగ్రనిత్యసమాధి
విధుల।సురుబ్రహ్మాదిసురులకును నందరాని।భూరినిర్వాణసామ్రాజ్యభోగభాగ్య।ఫలనంబులు హరినామకీర్తనములు॥ సీ॥
ముక్తికాంతైకాంతమోహనకృత్యముల్ కేలిమై హరినామకీర్తనములు।సత్యలోకానందసౌభాగ్యయుక్తముల్ కేలిమై
హరినామకీర్తనములు।మహితనిర్వాణసామ్రాజ్యాభిషిక్తముల్ కేలిమై హరినామకీర్తనములు।బహుకాలజనితతపఃఫ
లసారముల్ కేలిమై హరినామకీర్తనములు।పుణ్యమూలంబులపాయపోషకంబు।లభిమతార్థంబులజ్ఞానహరణకరము।
లాగమాంతోపలబ్ధంబులమృతసేవ।లార్తశుభములు హరినామకీర్తనములు॥ క॥ కామంబుఁ బుణ్యమార్గ।స్థేమంబును నీం
ద్రసాంద్ర చేతోసరసీ।ధామంబు జన్మనిర్మల।నామంబుఁ దలంచు వాఁడు నాథుఁడు గాఁడే॥ క॥ డెందంబు పుత్రువలనఁ।
జెందిన దనితలఁపు పలుమ శ్రీపతిపేరే।చందమునైనఁ బలికిన।నందకధరుఁ డండ కెలఁడు నాథుండగుచున్॥ గీ॥ బిడ్డపేరుఁ బెట్టి
పిలుచుట విశ్రామ।కేలినైన నిగుడఁ గేనినైనఁ।బద్యగద్యగీతభావార్థములనైనఁ।గమలనయనుఁ దలఁప కలుషహరము॥
ఉ॥ కూలినచోటఁ గొట్టుపడియుందినచోటను హోజ్వరామలం।ప్రేలినచోట సర్పముఖపీడల నందినచోట నార్తుడై।తూలినచో
టపిష్ణు భవమూగునిఁ జేరగ్రని రేని మీఁదన।కాలుని యాతనాపితతిఁ గానరు పూనరు దుఃఖభావముల్॥ సీ॥ అతిపాపముల
కుఁ బ్రయత్నపూర్వకమునఁ దను పాపములకు మితంబుగాఁగ।సన్మునివరులచే సంపాద్యమైయుండు నిర్మలంబగు పాప✻ని
ష్కృతములు। క్రమరూపమున ననుపశమనంబులగుఁ గాని తత్క్షయచయములఁ దుపలేవు। సర్వకర్మంబుల సంహారమొన
రించి చిత్తంబునకుఁ దత్వసిద్ధి నెపుడు।నొసఁగునట్టి పుణ్యయోగమానససరో।వాసు సేవ †హేమవాసు సేవ। వేదవేద్యు సే
వ వేదాంతవిభు సేవఁ।బరమపురుష పాదపద్మసేవ॥ క॥ హరి నెఱుఁగనియా బాలుఁడు । హరిభక్తులతోడఁ గూడి హరియను
వాఁడు।న్నరిమై దోషములడఁచును।‡గరువలితో నగ్ని తృణముఁ గాల్చినభంగిన్॥ ఉ॥ ఆరయ వీర్యవంతమగు నౌషధమెట్లు
యదృచ్ఛఁ గొన్నఁ దచ్చారుగుణంబు రోగములఁ జయ్యనఁ బాపిన మాడ్కిఁ బుణ్యవిస్ఫారుని నంబుజోదరునిఁ బామరుఁ డజ్ఞు
ఁడవజ్ఞఁ బల్కినన్నారకఁ దత్ప్రభావము ధ్రువంబుగ నాత్మగుణంబుఁ జూపదే॥ క॥ ధృతిఁ దప్పిన తజ్జనిఁ బురా।కృతమునఁ గా
కెట్లు దోఁచుఁ గేశవుఁడు మది।న్మృతి లేని జగముఁ దాల్చిన।యతఁడొక్కని మిముల లోన నడఁగెడువాఁడే॥ మ॥ నిరతంబై నిరవ
ద్యమై నిఖిలచిన్నిర్మాణమై నిత్యమై।నిరహంకారగుణాఢ్యమై నియమమై నిర్దోషమైనట్టి శ్రీ।హరినామస్మరణామృతంబితఁ
డు ప్రత్యక్షంబు సేవించెఁ దా।మరణాంతంబున నిట్టి సజ్జనుని ధర్మంబేల వ్యర్థంబగున్॥ వ॥ అని యిట్లు భగవద్దూతలు భాగవత
ధర్మంబు నిర్ణయించి బ్రాహ్మణుని నతిఘోరంబైన మృత్యుపాశబంధనజనితభీతి చేవిముక్తునింగావించి రంత నాయమదూ
తలా భగవద్దూతల సంభాషణప్రభావంబులఁ దమమానంబుల శాంతి నొంది భగవత్తత్త్వజిజ్ఞాసితులయి చేయునది లేక *నిరా

✻నిష్కృతములు। ప్రాయశ్చిత్తములు. †హేమవాసు। బంగరుపట్టుపుట్టము గలవిష్ణువు యొక్క. ‡కరువలితోన్।వాయువుతో. *నిరాకృతు

కృతులై యమలోకంబునకుం జని పితృపతికి సర్వంబును నెఱింగించి రంత॥ క॥ అతఁడును బాశచ్యుతుఁడై। గతభయుఁడై ప్ర
కృతి నొంది కడు నుత్సవసం। గతిఁ జూచి మ్రొక్కి మదిలో। నతులితముద మొదవ విష్ణుదాసుల కనియెన్॥ గీ॥ నిలిచి కేలు మొగి
చి పలుక నుద్యోగించి। చెలఁగుచున్న లోని తలఁపుఁ దెలిసి। చక్రధరుని మూర్తి సహచరు లరిగిరి। దృశ్యులగుచు దేవదేవుకడకు।
క॥ వేదత్రయసంపాద్యము। మోదంబగు నాశ్రయంబు మును భగవద్ధ। ర్మాదేశంబగు తద్భట। వాదంబున జామిళుండు విమ
లక వినుచున్॥ క॥ శ్రీమన్నారాయణపద। తామరసధ్యానసలిల ‖ధౌతమహాఘ। స్తోముఁడై సద్భక్తికి। ధాముండగుచుం
డెఁ దెలిసి తత్క్షణమాత్రన్॥ క॥ *పరవశమున నరికట్టిన। దురితంబులఁ దలఁచి తలఁచి దుర్దాపమునన్। హరి నీశు నాశ్రయిం
చుచు బరితాపము నొంది పలికె బ్రాహ్మణుఁ డాత్మన్॥ సీ॥ వృషలియందనురాగవృద్ధి బిడ్డలఁ గని కులముఁ గోల్పోవరిఁ గాలఁ ద్రో
చి రచ్చలకెక్కి పెక్కురజ్జు సేతల సరివారిలోపలఁ దలవంపుఁ జేసి। కట్టిడిమునుకనై కర్మబంధంబుల పుట్టనై నింపల ప్రోవనగు
చుఁ బరుషుల రోఁతలఁ బలిభోగించినకడిదియా జన్మంబు గాలిపోయెఁ। జదువు చట్టువడియె శాస్త్రంబు మన్నయ్యె। బుద్ధి
పురువు మేసెఁ బుణ్యాను డఁగె। నీతి మట్టువడియె నిర్మలజ్ఞానంబు। మొదలి చెడి గెబోధమూఁజెనోయి॥ క॥ చిక్కని చక్కని చ
న్నులు మక్కువ యిల్లాలి విడిచి మాయలుగలయా। వెక్కసపు మద్యపానపుఁ। బొక్కపసదగిలి మర్కటుండనై చెడితిన్॥ ఉ॥ అ
క్కట ఘోరదుష్కృతమహానలకీలలు వస్సముట్టి పే। ర్మిక్కడఁగింపకిట్లు ధృతిసుండఁగ నిచ్చె నెటూరు మదాత్మునిన్। గ్ర
క్కున దల్లిదండ్రులనకల్మషచిత్తులఁ బెద్దలన్ మహాత్ముల। దిక్కును లేనివారిఁ బెనుపేదలఁ బెట్టుచుఁ బారఁద్రోలితిన్॥ క॥ అకృత
జ్ఞుఁడనై విడిచితిఁ। బ్రకృతిం గల బంధువులను బాల్యము వనను। స్వకృతిఁ దనకుండఁ బెంచిన। సుకృతుల మజ్జనకజననుల శుభనకగు
లన్॥ అప్పుడు. గీ॥ పెక్కుపాతకములఁ బృశదారుణంబైన। దొడ్డ నరకమంపఁ బడ్డ నన్ను। నాపదలఁ బాపి యరికట్టి రక్షించి। కి
ట్టి ధర్మపురుషు లెందువారో॥ శా॥ దోషంబై కలవో లెవీక్షణమునం జూడంగఁ బ్రత్యక్షమై। దేహంబయ్యెను నన్ను నీడ్చి నమ
హావీరుల్ భృశోదగ్రులా। యుద్యోగంబుల వారు పాశధరులీయుత్సాహముల్మానిసం। పాద్యానేకపికారరూపపటలప్ర
ఖ్యాతులెవ్వారలో॥ ఉ॥ దారుణపాశబంధనవిధానములన్నరకార్ణవంబులోఁ। గూరిన నన్ను నేఁడు సెడకుండ నొనర్చిన పు
ణ్యమూర్తులం। భోరుమహానేత్రులుజ్జ్వలనభోమణితేజులు లోచనోత్సవుల్। బ్బారుదయాసమంచితవిచారులు నల్వురు నెం
దు కేగిరో॥ మ॥ ననురక్షించిన పుణ్యవంతులు ‡లసన్నాళీకపత్రాక్షులం। జనసంకాశులు శంఖచక్రధరులాజానూరుబా
హుల్ స్మితాననులాలంబితకర్ణవేష్టనసువర్ణచ్ఛాయదివ్యాంబరు। ల్ఘనకారుణ్యరసైకపూర్ణులు సమగ్రస్ఫూర్తి నెవ్వార
లో॥ వ॥ పాతకుఁడనగు నాకు నివ్విబుధోత్తమదర్శనంబు పురాకృతంబుదియ పుణ్యావశేషంబున గాక పొందశక్యంబు గాదు
తత్సందర్శనంబాత్మకు నతిసుప్రసన్నంబై యొప్పునట్లు గాకుండె నేనిఁ గలుషవర్తనంబుల వృషలీభర్తనై యుండి మృత్యుఁ
బొందుచున్న నాదు జిహ్వకు శ్రీమన్నారాయణ నామగ్రహణంబు సంభవింప నేరదు మఱియును॥ గీ॥ పాతకుఁడను జడుం
డ బ్రహ్మఘాతకుఁడను। మానలోభమోహమత్సరుండ। నాకు నెట్లు దొరుకు నారాయణుని దివ్య। నామవినుల కీర్తనంబు మ
దికి॥ సీ॥ దారుణమోహాంధకారపూరితుఁడను హరివిస్మయస్మరణార్హమతినె। పంచమహాతీవ్రపాతకోపేతుఁడ హరివిస్మ
యస్మరణార్హమతినె। కౌటిల్యకితవప్రకారపారీణుండ హరివిస్మయస్మరణార్హమతినె। యఖిలమహైకఘోరార్ణవమ
గ్నుండ హరివిస్మయస్మరణార్హమతినె। నిందలకు నెల్ల నెలవైన నిర్గుణుండ। సంపభాగ్యుండనే నేడు మధువిదారి। దివ్యగుణ
నామకీర్తన తెఱఁగఁ జెడఁ। బూర్వసుకృతంబు లేట్లు పొందఁగలుగు। ననుచు తరిక్కించి॥ మ॥ †యతచిత్తేంద్రియమారుతుండ
నగుచున్ యత్నంబొనర్తున్ హరిం। ప్రతిసంపత్తికిఁ బుణ్యవృత్తికిఁ జిదావాసోన్ముఖాసక్తికిన్। యుతనిర్వాణపదానురక్తికి
సుఖోద్యోగక్రియాశక్తికిన్। వ్రతలబ్ధోత్తమమూర్తికిన్ సకలధాత్రీమర్త్యసద్భక్తికిన్॥ క॥ విడిచితి భవబంధంబుల। నడిచితి
మాయావిమోహమైన తమంబు। ‡విడిచితి నరిషడ్వర్గంబులఁ। గడచితి నా జన్మదుఃఖకర్మార్ణవమున్॥ క॥ §యోషిద్రూ
పంబున నను। నేషణముఖగహ్వరమున నెగమ్రింగిక మ। ద్వేషమునఁ గోఁతఁ జేసిన। దోషదయగు నాత్మమాయఁ దొలఁగఁగంగం
టిన్॥ వ॥ అనియిట్లు నైష్ఠికవజ్ఞానదీపం¶బాత్మస్నేహంబున ప్రోదిన బ్రాహ్మణుండు॥ మ॥ భగవద్ధర్మపరాయణోత్తముల
సంభాషైకమంత్రంబుల। న్మిగులన్ జ్ఞానముపుట్ట మోహభవసమ్మిశ్రాత్మబంధంబుల। న్దెగఖండించి సబంధుమిత్రసుతప

లై। తిరస్కరింపఁబడినవారై. ‖ధౌతమహాఘస్తోముఁడై। పోఁగొట్టఁబడిన ఘనపాపసమూహము గలవాఁడై. *పరవశమునన్। అతిసమర్థత చేత.
‡లసన్నాళీకపత్రాక్షులు। ప్రకాశమానములగు తామరరేకులవంటి నేత్రములుగలవారు. అంజనసంకాశులు। కాటుక కాంతివంటి శరీరకాంతి
గలవారు. స్మితాననులు। చిఱునవ్వుతోఁ గూడిన ముఖములు గలవారు. ఆలంబితకర్ణవేష్టనులు। మిగుల వ్రేలాడుచున్న కుండలములు గలవారు. †య
తచిత్తేంద్రియమారుతుండనగుచున్। నిశ్చలములుగఁ జేయఁబడిన మానసేంద్రియప్రాణములు గలవాఁడనై. ‡విడిచితిన్। గెలిచితిని. అరిషడ్వర్గము
లన్। కామక్రోధాదులను. §యోషిద్రూపంబునన్। స్త్రీరూపము చేత. ¶ఆత్మస్నేహంబునన్। అంతఃకరణమనెడు తైలము చేత.

త్నమోహవిభ్రాంతుఁడై। జగతీనాథుర మేశుఁ గృష్ణునిదమైశ్వర్యంబులం గోరుచున్॥ క॥ హరిభక్తులతో మాఁటలు। ధరనెన్నఁడుఁ జెడనిపుణ్యధనములమూఁట। ల్వరముక్తికాంత తేటలు। నరిషడ్వర్గంబు చొరనియరుగులకోటల్॥ సీ॥ అనుచునాబ్రాహ్మణుండతితత్త్వవేదియై భవబంధముల నెల్లఁ బారఁదోలి। మొనసి గంగాద్వారమున కేఁగి యచ్చటఁ * బ్రబ్బిన దేవతాభవనమందు। నాసీనుఁడై యోగమాశ్రయించి వెలుంగు దేహేంద్రియాదుల తెరువు వలనఁ। దనుఁ బాపుకొని పరతత్త్వంబుతోఁ గూర్చి మానుగా ✠ నాత్మసమాధిచేత। గుణగణంబుఁ బాసి కొమరొప్పె నభగవ। దనుభవాత్మయందు నాత్మఁ గలిపి। రమణఁ దన్ను మొదలరక్షించినట్టియా। పురుషవరులఁ గాంచి పొసఁగ మ్రొక్కె॥ వ॥ అట్లజామిళుండు యోగమార్గంబున దేహంబు విడిచి పుణ్యశరీరుండై యగ్రభాగంబునం బ్రాగుపలబ్ధులైన యమ్మహాపురుషకింకరులం గాంచి సముంచితరోమాంచితచలచ్ఛటాపింజరితస్వేదబిందుసందోహమిషనిష్యందమహానందవల్లికాకల్లికాంకురసంకులపరిశోభితతనుండును, హర్షనికర్షమాణమానసోద్యోగయోగప్రభావోత్సాహవిస్మయమందస్మితముఖారవిందకందళితుండును, నిఖిలజగజ్జేగీయమానాఖండశుభప్రదశుభాకారసందర్శనసమాసాదితకుతూహలమానసుండై ప్రణామంబులాచరించుచు భాగీరథీతీరంబునఁ గళేబరంబు విడిచి తత్క్షణంబున హరిపార్శ్వవర్తనులైన దాసవరుల స్వరూపంబుఁ దాల్చి యావిష్ణుసేవకులతోఁ గూడి దివ్యమణిగణఖచితంబగు సువర్ణమయంబైనయసమానవిమానంబెక్కి నిఖిలానందభోగభాగ్యానుభవాకుంఠితంబయినవైకుంఠంబున శ్రీమన్నారాయణపాదారవిందసేవాచరణపరిణామస్థితికిం జనియె నిట్లు ❋ విప్లావితసర్వధర్ముండైన దాసీపతి గర్హితకర్మంబులచేతఁ బతితుండును హతవ్రతుండునై నరకంబునం గూలుచుండి భగవన్నామగ్రహణంబున సద్యోముక్తుండయ్యెఁ గావున॥ క॥ కర్మంబులెల్ల బాయను। మర్మము దలఁపంగ లేదు మధురిపు పేరే। పేర్మిని నొడువుటకంటెను। మర్మదమునఁ జిత్తమెన్నిత్రోవల నున్నన్॥ ఉ॥ పాండవవంశపాలన నృపాలక యీయితిహాసమెవ్వఁడే। నొండొకభక్తిలేక వినఁ నొప్పమెయిం బఠియించు నాతఁడున్। దండతముక్తికామినికిఁ దానక మైదను జారిలోకముం। దుండుమహావిభూతియమదూతల చూడ్కికగోచరాకృతిన్॥ గీ॥ అరయపుత్రోపచారితమైన విష్ణు। నామము వసానకాలంబున నుభజించి। శౌరి నిలయంబుఁ జేరెనజామిళుండు। నిట్లు సద్భక్తిఁ దలఁచిన నేమిసెప్ప॥ క॥ కోరిన వారల కెల్లను। జేరువకై వల్యపదము సిరివరుని మదిం। గోరని వారలకెల్లను। దూరము మోక్షాప్తి యన్ని త్రోవలనైనన్॥ వ॥ అనినం బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె మునీంద్రా! యాజ్ఞాభ్రష్టుండై యమధర్మరాజు శ్రీవిష్ణునిర్దేశకులచేత విహతులైనభటులచేత వర్ణింపంబడిన నారాయణుని నామప్రభావంబాకర్ణించి వారలకేమనియె మఱియు నెన్నఁడేనియు యముదండంబు విఫలంబై పోయిన తెఱంగుగలదే నిపి నవలయు నీసందేహంబుఁ బాప మహాత్మా నీవుదక్కఁ దక్కిన వారలు సమర్థులు గారని తలంచుచున్న వాఁడఁ జిత్తంబును బ్రసాదాయత్తంబుగా భవదీయవచనసుధాధారలఁ బ్రసాదింపవలయు ననిన శుకుండిట్లనియె॥ క॥ శ్రీకృష్ణభటులచేతని। రాకృతులై యామ్యభటులు యమునకు నాత్మ। స్వీకృతవిప్రకథాక్రమ। మేక్రియ ముందెలిపిరయ్య నెఱిఁగింపుతగన్॥ గీ॥ చేరి త్రివిధకర్మలఁ జేయు జీవతతికిఁ। గర్మఫలములఁ దెలిపెడు కారణులుగ। నగుచు శిక్షించువారలీయవనిమీఁద। దేవయండుగలరయ్య తెలియవలయు॥ క॥ దక్షిణదిశాధినాయక। శిక్షించఁగఁ జేయువారు క్షితిపెక్కండ్రే। నిక్షయ మున్నక్షయమును। సాక్షాత్తుగ రెండు నెందు సంపన్నముగన్॥ గీ॥ దట్టమైనట్టి కర్మబంధముల నెల్ల। నాజ్ఞఁ బెట్టెడు వారు పెక్కైనచోట। యకటశాస్త్రార్థముపచారమయ్యెఁ గాదె। శూరులైనట్టి మండలేశులకుఁ బోలె॥ ఉ॥ కావున నీవయొక్కఁడవ కర్తవు మూఁడు జగంబులందుసం। భావితభూతకోటిఁ బరిపాకవశంబున శిక్ష సేయఁగా। నీవరశాసనంబఖిల నిర్ణయమై తనరారుచుండ నేఁడీవల గ్రమ్మరింపమఱి యెవ్వఁడు శక్తుఁడు ధర్మపాలనా॥ క॥ చండకరతనయ యొరులకు। దండధరత్వంబుగలదె తగ జగమునను। ద్దండధరవృత్తి నొత్తిలి। దండింతువు నిన్ను దండధరుఁడని పొగడన్॥ సీ॥ ఇట్టి నీదండంబు నీమూఁడు జగములఁ దెగువమై నేఁడు వర్తించుచుండు। మనుజలోకంబున మహదద్భుతాకారసిద్ధులమిగులఁ బ్రసిద్ధులైన। వారు నల్వురు వేగవచ్చి నిర్దేశంబు భంగించి మమ్ము నంతఁ బారఁదోలి। మీశాసనంబున మేమీడ్చికొనివచ్చు క్రూరచిత్తుని పుచ్చికొనియదల్చి। పాశబంధంబు ! ఈసునఁ బట్టి తెంచి। బలిమి మిగులంగ మమ్మునఁ బారఁదోలి। యిచ్చఁ జనినారు వారు దామెచటివార। లాదరమ్మున మాకు నేఁడానతిమ్ము॥ వ॥ అనిరని మఱియు శుకుండిట్లనియె నట్లు సూతలు పరితాపసమేతులై పలికిన దండధరుండు పుండరీకాక్షుని చరణకమలంబులు స్వమానసంబున సన్నిహితంబులుగఁ జేసి వందనం బాచరించి పరమభక్తిపరుండై వారలకిట్లనియె॥ సీ॥ కలఁ

* ప్రబ్బిన। ప్రాప్తమైన-లేక-శ్రేష్ఠమైన. ✠ ఆత్మసమాధిచేతన్। బ్రహ్మసమాధిచేత-సమాధియనఁగా-శ్లో॥ మనఃప్రచారశూన్యం పరమాత్మని లీనం భవతి-మనస్సంచారములేనిదియై పరమాత్మయందు లీనమగుచున్నది-అదియ సమాధి. ❋ విప్లావిత। ఎగరఁగొట్టబడిన. ! ఈసునన్। కోపముతో.

డు మదన్యుం డఘనుఁ డొకఁ డతనుండు వెలికిఁ గానఁగ రాక విశ్వ మెల్ల| నతిలీన మైన మహోచ్ఛ్రిత సమగ్ర స్ఫూర్తి నుండుఁ గో
కం మునూలున్న భంగి| దా మెనఁ బశువులు వగిలియుండెడు మాడ్కి నామసంకీర్తన స్థిమనమతుల| విహరించు నెవ్వఁడు విలసిత
మత్స్యాజ లెవ్వని పదములని వ్వటిల్లుఁ| గనుట మనుట చనుట గల్గు నెవ్వని లీల| లంతులోక మెవ్వ నంచుఁ బొందు| నెన్నఁ బడుచు
పుడమి నెవ్వని నామము| ల్గర్మబంధనములఁ బేర్మి నడఁచు॥ తరల॥ వినుఁడు నేను మహేంద్రుఁ *డప్పతి వీతిహోత్రుఁ డురా
షుసుం| డనిలుఁ డర్కుఁడు చంద్రుఁడుం గమలాసనుండు మరుద్గణం| బును మహేశుఁడు రుద్రవర్గము భూరిసంయమి సిద్ధు
లు| న్మౌనపిక న్గొనఁ జాల రెవ్వని మూర్తి విశ్రుతకీర్తి నై॥ క॥ సత్త్వ తరింగుణపాశవ| శత్వంబునఁ బొందఁ బీరుజఁ జాతులు సత్తై| క
త్వంబు గానవో పరు| సత్వ ప్రాధాన్యలి తరింజనులకు సరియే॥ చ॥ అభవు నమేయు నవ్యయు ననంతు ననారతుఁ బూన్ మేనిలో
నుభయము నై వెలుంగు పురుషోత్తముఁ గానను దిత్తకత్వమా| స్వభవ గరిష్ఠు నై దెనకీఁ డిప్రాణులు సర్వ వస్తువు| ల్యుభగ
లిఁ జూడనేర్చి తనుఁ జూడఁగ నేర నికంటి పోలికన్॥ చ॥ పరమ మునిభక్త లోకపరిపాలు నశీలు నిమష్టలోక స| హాసుఁ బన్నగపుం
గవ విహారు నకూరిమి మూతలామనో| హరులు సురేంద్ర వందితులు నా హరి రూప గుణస్వభావులై| తిరుగు చునుంద రెల్లెడ
లఁ దిక్కులఁ దేజము పిక్కటిల్లఁగన్॥ ఉ॥ లెక్కకు నెక్కువై కసటు లేని మహోచ్ఛ్రిత తేజమెల్లడం| బిక్కటిలం జనింతురతి
భీమ బలాఢ్యులు విష్ణుభూతము| ల్చక్కని ధర్మశాంతులతి సాహసవంతులు దేవపూజితు| న్నిక్కటి పీజగంబునను గేశవ సేవ
కరతు నార్థమై॥ క॥ వావలనను మీవలనను| దేవాసురగణము వలనఁ ద్రిజగంబులలో| నేవగలఁ బొందకుండఁగఁ| గావంగల
వారు పుడమిఁ గల వైష్ణవులున్॥ క॥ భగవత్ప్రతిపాదిత ధర్మ| బగపడ దెవ్వారిమఁ కిననిమిషగరుడో| రగసిద్ధ సాధ్యసరసుర|
ఖగ తాపస యక్ష దివిజ ఖచరుల కైనన్॥ క॥ ఎన్నఁడుఁ దెలియఁగ నేరరు| పన్నగపతి శాయి తత్త్వభావము¶ మేనం| గన్నుల వే
ల్పును డాపల| సన్నుతిగల వేల్పు మురుచదువుల వేల్పున్॥ సీ॥ వరమహోచ్ఛ్రిత మైన వైష్ణవజ్ఞానంబుఁ దిరముగా నెవ్వారు తె
లియఁగలరు| దేవాదిదేవుండు త్రిపుర సంహారుఁ డొండెఁ గమలసంభవుఁ డొండెఁ గార్తికేయ| కపిల నారదములొండెఁ గా
త్మజుండొండె మనువొండె బలియొండె జనకుఁ డొండెఁ| బ్రహ్లాదుఁ డొండె నేర్పాటు గా శుకుఁ డొండె భాసురతరమతి వ్యా
సుఁ డొండెఁ| గాక యన్యులతర మెయా లోకమంద| నీసుబోధంబు సద్బోధమీ పదార్థ| మీ సదానంద చిన్మయ మీ యగన్య|
మీ విశుద్ధంబు గుహ్యంబు నీ శుభంబు॥ క॥ ఈ పన్నిద్దరుఁ దక్కఁగ| నోపరు తక్కొరులు దెలియ నుపనిషదుచిత| శ్రీహరి నామమ
హోచ్ఛ్రిత| దీపిత భాగవతధర్మ దివ్యక్రమమున్॥ గీ॥ పదిజపియింపనమృతమై యొసఁగుచుండు| నేది సద్ధర్మపథమని యెయ్యెడఁ
దగిన| దదియె సద్భక్తియోగంబు సావహించు| మూర్తివంతంబుతో హరికీర్తనంబు॥ గీ॥ కంటిరే మీరు సుతులార కమలనే
త్రు| భవ్యమగు నామకీర్తన ఫలము నేఁడు| తవిలి మృత్యువు పాశబంధములవలన| జాణతనమున వీడె నజామిళుండు|| ఉ॥ పట్టి
కి జాలిఁ బొందనరు లేక్రియఁ గృష్ణుని కీర్తనంబు పా| పాటవులద్దహింపఁగల పాటుపసందియ మేలయిప్పుడీ| తూటరి దోస
కారి పెనుదోసియ జామిళుఁ డంత మొంమచుం| బాటిగ విష్ణునామమును బల్కుచుఁ గేవలముక్తిఁ గేగఁడే॥ క॥ ఇంతే యనుపద్య
మనిమది| నెంతయుఁ దెలియంగ లేరు హీనాత్ములు ను| ద్దాంతతర ఘటిత మాయా| క్రాంతాత్యంత ప్రకాశ గౌరవజమునై॥
మంగళ మహా శ్రీవృత్తము॥ ఈ విధము నన్ని బుధు లేకతము దిత్తముల నేకతము లేక హరినీశు| న్భావమున నచ్చిత గుభాగవత
యోగపరిపక్వమున నెంచు మరువారిన్| దేవలమునందనగతిన్ జనదమాను గురి డిప్పక ఘమల్లలఁగ మీఁదన్| శ్రీవరుని చ
క్రము విశేషగతిఁ గాఁచు సురసేవితులు ముక్తిఁ గడు పెద్దల్॥ ఉ॥ ఎవ్వరు సిద్ధసాధ్య ఖచరేశల సత్పరిగీత గాథలం| దెవ్వారు
ముక్తి భోగతల హేమమనోహర చంద్రశాలలం| దెవ్వరు శంఖచక్రగురు హేతిగదారు చిరోగ్ర పాణులా| మవ్వపు రూప
వంతుల సమానులు వో ధరలోని వైష్ణవుల్॥ సీ॥ శ్రుత్యంత విశ్రాంత మత్యనుక్రమణీయ భగవత్ప్రసంగతుల్ భాగవతులు|
సకల సమ్మత యోగిజన సదానందైకపరమ భాగ్యోదయుల్ భాగవతులు| కృష్ణపదధ్యాన కేవలామృతపాన పరిణామయుతు
లు శ్రీభాగవతులు| బహుపాతకానీక పరిభవ ప్రక్రియా పగు సాగ్ర్యమూర్తులు భాగవతులు| భావతత్త్వార్థ వేదులు భాగవ
తులు| బ్రహ్మవాదానువాదులు భాగవతులు| సిరులు దనరంగ నెన్నఁడుఁ జేటులేని| పదవి నొప్పారు వారు మా భాగవతులు॥
క॥ అది గాన విష్ణుభక్తులఁ| గదియఁగ జనవలదు మీరు కరివరదుల సత్పదపద్మ వినతి విముఖులఁ| బదినంటఁగఁ గట్టి తెండు ధూ
ర్తులు వారల్॥ సీ॥ ఏకసక్తము నకైనను నిందిరారమణుని బలుకంగ లేని మర్త్యాధికులను| గలలోన నైన శ్రీకాంతుని సత్పా
దకమలముల్ సూడని కర్మరతుల| నవ్వుచు నైనఁ గృష్ణప్రశంసకుఁ [illegible]దాల వేయని దుష్ట ధార్మికరతుల| యాత్రోత్సవంబు

*అప్పతి| వరుణుఁడు. వీతిహోత్రుఁడు| అగ్ని. మరుద్గణంబును| దేవసమూహంబును. రుద్రవర్గము| ఏకాదశరుద్రులు. ¶ మేనం గన్నుల వేల్పును| శం
కరుఁడును. డాపల సన్నుతిగల వేల్పు| అర్ధనారీశ్వరుఁ డగుటవలన నేకభాగము శివునకు, అపరభాగము పార్వతీదేవికి గావున సక్కఁ డశివుఁ డని-అర్థం,
మురుచదువుల వేల్పున్| బ్రహ్మదేవుని.

లనైన నీశునిగుడి శ్రోత్ర ముఁగ్రొక్కఁగలేనిదుష్టులను|బరమభాగవతులపాదధూళిసమస్తతీర్థసారమనుచుఁ దెలియలేని
వారివారివారివారిఁ జేరినవారిఁ|దోలుతఁగట్టి తెండు దూతలార॥గీ॥ఎల్లపాపములకు నిల్లయినయింటిలోఁ|బద్ధతృష్ణులగు
చుబుద్ధిఁ దగిలి|పరమహంసకులముగుటిఁ దప్పివర్తించు|ధూర్తజనులఁ దెండు దూతలార॥ గీ॥ అరయఁదనదు జిహ్వ హరిపే
రు నుడువదు|చిత్తమతనిపాదచింతఁ జనదు|తలఁపఁ దనకు మ్రొక్కి తంగేటిజున్నేకో|సకలవిష్ణుభక్తులకును బోలె॥గీ॥ పద్మ
నయనమీఁది భక్తి రోగఁ జెల్లఁ|ముక్తియోగమనుచు మొదలెఱుంగు|వారివారివారివారిఁ జేరినవారి| ద్రోవఁ బోవవల
దు దూతలార॥వ॥అని పలికెనని చెప్పి మఱియు శుకుండిట్లనియె, శ్రీకృష్ణనామకీర్తనంబు జగన్మంగళంబనియును, జగన్మోహ
నంబనియును, జగజ్జేగీయమానంబనియును, నిఖిలపాపైకనిష్కృతియనియును, నిఖిలదుఃఖనివారణంబనియును, నిఖిలదారి
ద్ర్యనిర్మూలకంబనియును, నిఖిలమాయాగుణవిచ్ఛేదకంబనియు సుద్ధామంబులగు, హరివీర్యంబుల నాకర్ణించు, వారలచిత్తం
బులతినిర్మలంబులగుభంగిం దక్కిన వ్రతాచరణంబులం గావనియును, శ్రీకృష్ణపదపద్మంబులు హృత్పద్మంబులఁ దలఁచువా
రలన్యపాపకర్మంబులకు నవిద్యావ్యసనంబులం బొరయనేరరనియును, నిజస్వామిదైన యమధర్మరాజు చేతఁ గీర్తింపంబ
డినభగవన్మాహాత్మ్యంబు నాకర్ణించి విస్మితులై కాలకింకరులు నాఁటనుండియు వైష్ణవజనంబులం దేరి చూడవెరతురు నరేం
ద్రా పరమగుహ్యంబగు నీయితిహాసంబును బూర్వకాలంబున సకలవిజ్ఞానగోచరుండైన కుంభసంభవుండు సకలదుఃఖవిల
యంబును, సకలపుణ్యనిలయంబైన మలయంబున పురాణపురుషుండైన పురుషోత్తము నారాధనంబు సేయుచుండి నాకె
ఱింగించెనని చెప్పిన విని విస్మయానందహృదయుండై పరీక్షిజ్జనపాలుండిట్లనియె॥క॥స్వాయంభువమనువేళల| నోయయ్య
సురాసురాండజోరగనరవ|ర్గాయతసర్గముఁ దెలిపితి|వాయకనదివిస్తరించి పలుకఁగదవే॥క॥ఉత్తరకోడకిట్లడిగిన| యు
త్తరమున కమ్మునీంద్రుఁ డుత్తమచేతో|వృత్తిముదమందిపలికెను| దత్తరపాటుడిగి వినుఁడు దాపసులారా ॥ సీ ॥ పూర్వ
ప్రచేతసపుత్రులు పదుగురు ప్రాచీనబర్హిషప్రాఖ్యగలుగు | వారుమహాంభోధి వలన వెల్వడి వచ్చి తరువృక్షవృతమై
నధరణిఁ జూచి | మేదినీజములపైమిక్కిలి కోపించి మదిలోన దీపితమన్యులగుచు | వక్త్రంబులను మహావాయుసంయు
తమయిన యనలంబుఁ గల్పించియవనిజములఁ | జెల్లువడఁగాల్పఁ దొడఁగినఁ దల్లడిల్లి | వారికోపంబు వారించు వాఁడ
పోలెఁ | బలికెఁ జంద్రుండు రోమమహాభాగులార | దీనమగు వృక్షముల మీఁదఁ దెగుటఁదగునె ॥ గీ ॥ మొదల వర్ధి
ష్ణులగు మిమ్ము సదయహృదయు | లగు ప్రజాపతులనుచు సర్వాత్ముఁడనియె|నట్టిమీరు ప్రజాసృష్టికైనవార| లీవనస్పతీత
తులదహింపఁదగునె ॥ సీ ॥ ఆదికాలంబున నా ప్రజాపతిపతియైన లోకేశ్వరుండచ్యుతుండు | పద్మనేత్రుండు వనస్పతు
లనోషధిముఖ్యజాతంబుల సమునూర్జంబుఁ గోరి | కల్పించెనందుముఖ్యంబైన యన్నంబు యచరంబులైనట్టి యుపద
ములఁ | బాదచారణులకుఁ బాల్పట్టియిరుగాళ్లు చేతులుగలిగినజీవతతికి | హస్తములు లేని యాచతుష్పాదులెల్ల | న
న్నముగఁ బూనికావించెనదియుఁగాక | నామహాభాగుఁ డచ్యుతుఁ డాదరమున | మీకు ననఘాఖ్య విఖ్యాతి జోకపరచె॥
క॥నిజముగ దేవాధీశ్వరుఁ| డజుఁడు ప్రజాసర్గమునకు ననఘులమిమ్మున్|సృజియించెనట్టివారికిఁ | గుజదహనము సేయనె
ట్లుకోరికి వోడమెన్॥చ॥సతతమహాత్మసత్త్వగుణసత్పురుషత్రుణిఁ బొందితయ్యుమి | పితరులునుం బితామహులు పెద్ద
లు నెన్నఁడుఁ బొందనట్టిమ|ప్రకృతమతైన కోపమునఁ గిల్బిషభావము మానరయ్య సం|భృతకరుణావలోకమున భీతత
రుప్రకరంబుఁ బ్రోచుచున్|ఉ॥ తప్పక నర్భకావళికిఁ దల్లియుఁ దండ్రియు నేత్రపక్ష్మకిన్ | ఱెప్పలు నాతికిం బతిన రేంద్రుం
డు లోకుల కెల్లనర్థికిన్ | నెన్న గృహస్థుమూఢులకును త్తముఁ తెన్నఁగ పీరుబంధువు | ల్మున్ననఁగావ లేనికడమూర్ఖులు నుమ్మి
సమస్తబంధువుల్ ॥సీ॥అఖిలభూతముల దేహాంతస్థమగునాత్మయాతుఁడచ్యుతుఁడనియెఱుఁగవలయు| నెఱిఁగి సర్వంబై
నయిందిరారమణుని లోఁజూపునవి గాఁజూడవలయుఁ|జూచిన చిత్ర పశుద్ధాత్ములగు మిమ్ము నెఱిసిన వేడ్కతో నిచ్చ మెచ్చు
మెచ్చిన సర్వాత్ముమీ కెఱింగిన చోటఁ గోపగుణంబులఁ బాపవలయుఁ|బాపిదగ్ధశేషపాదపజాలంబు|దియ్యమెసఁగఁ బ్రతు
కనీయవలయు|ననఘులార మీరలస్మదీయ ప్రార్థనంబుసరగఁ జేకొనంగవలయు ॥ క ॥ ఇదె వృక్షసముద్భవయగు| మ
దిరేక్షణనాఁ బ్రగసఁగుమారికనిత్తు|న్వదలక పత్నిగఁ జేకొని|ముదమందుఁడు పాదపముల మోసము వాయన్॥వ॥అని యిట్లా
మంత్రణంబు సేసి మారిషయనుకన్యకను వారలకిచ్చి చంద్రుండు చనియె నప్పుడు ॥ క ॥ వారలు పర్యాయంబున | నీర
జముఖి నిర్వరించి నెఱి నియింపన్|ధీరుఁడు ప్రాచేతసుఁడై | వారకఁ దక్షుండు పుట్టె వనజజసముఁడై॥ క ॥ ఎవ్వనిసం
తానంబులు నిర్వటిలెన్వసుధ నెల్ల నెఱినాదక్షుం | డివ్వలనజగములన్నిటఁ|బ్రవ్వజలము నిలిపినట్లు ప్రజఁ బుట్టించెన్॥
ఉ॥వారని వేడ్కతో సుహితవత్సలతయుం దుదక్షుఁ డాత్మచేఁ|గోరిసృజించెఁ గొన్నిటి నకుంఠితవీర్యముచేతఁ గొన్నిటిన్|

ఘోరునఖేచరంబులనుభూచరముఖ్యవనేచరంబుల।న్నీరచరవ్రజంబురజనీచరజాలదివాచరంబులన్.క॥నరసురగరుడోరగకి। న్నరదానవయక్షపక్షినగవృక్షములం। దరమిడిసృష్టియొనర్చెను। దిరముగదక్షప్రజాపతిస్ఫుటకీర్తిన్॥క॥ బహువిధములబహుముఖముల। బహురూపములైనప్రజలబహులోకముల। న్బహుళముగఁజేసిమదిలో।బహుమానమునొందఁడయ్యెఁబ్రఖ్యాతముగన్॥గీ॥ ఆప్రజాసర్గబృంహితంబయినజగము। దక్షుఁడీక్షించిమదిలోనఁదాపమొంది।మఱియుజననంబునొందించుమతమురోసి।పరమపురుషునినాశ్రయింపంగఁదలఁచె॥వ॥ ఇట్లుదక్షప్రజాపతిప్రజాసర్గంబుచాలకచింతించిమంతనంబునలక్ష్మీకాంతునిసంతుష్టుంజేయువాఁడై॥ క॥ మోదంబైపరిమూషిత। ఖేదంబైశాబరీద్ధకిలికించితదృ।శ్ఛేదంబైబహుసౌఖ్యా।పాదంబైయొప్పువింధ్యపాదంబునకున్॥ వ॥ఇట్లువింధ్యపాదంబునకరిగియందఘమర్షణంబనుతీర్థంబుసర్వదురితహరంబయియొప్పుదానిననుసవనంబుసేవించియతిఘోరంబయినతపంబుసేయుచుహరింబ్రసన్నుం

## దక్షుఁడుస్తుతియించినహంసగుహ్యంబను స్తవరాజము.

జేసిహంసగుహ్యంబను స్తవరాజంబుననిట్లనిస్తుతియించె॥గీ॥పరమునికివందనముసేతుఁబరిఢవించి। మునునవితథానుభూతికిమ్రొక్కికొందు। మెఱయగుణములఁదేలునిమిత్తమాత్ర।బంధుఁడైనట్టివానికిఁబ్రణుతిసేతు॥గీ॥తవిలిగుణముచేతఁదత్త్వబుద్ధులచేత।నిగిడికానరానినెలవువాని। మొదలఁదానకలిగిముక్తిమానావధి।రూపమైనవానిప్రాపుఁగొందు॥ గీ॥ఎల్లతనువులందునిలవొందితనతోడఁ।బొందుసేసినట్టిపొందుకాని। పొందువొందలేఁడుపురుషుండుగుణముడా।గుణిఁబోలునట్టిగుణిభజింతు॥ ఉ॥పూనిమనంబులుఁదనువుభూతములున్మఱియింద్రియంబులున్। బ్రాణములున్వివేకగతిఁబాయకనన్యముదంబునెమ్మియిం।గానఁగనేరవాగుణనికాయములంబరికించునట్టిస। ర్వానుగతున్సమస్తహితునాదిమపూరుషునాశ్రయించెదన్॥వ॥మఱియుననేకవిధనామరూపనిరూప్యంబగుమనంబునకుదృష్టస్మృతులనాశంబువలనఁగలిగెడు నుపరామంబగుసమాధియందుఁగేవలజ్ఞానస్వరూపంబునఁదోఁచునిర్మలప్రతీతిస్థానుండైనహంసస్వరూపికినమస్కరింతు దారువందునతిగూఢంబైనవీతిహోత్రునిబుద్ధిచేతంబ్రకాశంబునొందించుభంగిబుద్ధిమంతులుహృదంతరంబునసన్నివేశుండయినపరమపురుషునినాత్మశక్తిత్రయంబులచేతందేజరిల్లంజేయుమరట్టిదేవుండుసకలమాయావిచ్ఛేదకంబయిననిర్వాణసుఖానుభవంబులంగూడియుచ్చరింపంగొలందిగానిశక్తిగలవిశ్వరూపినాకుంబ్రసన్నుండగుంగాకవాగ్బుద్ధీంద్రియమానసంబులచేతంజెప్పనిట్టిదనిరూపింపనలవిగాక యెవ్వనిగుణరూపంబులువర్తించునెవ్వండునిర్గుణుండుసర్వంబునెవ్వనివలననుత్పన్నంబగునెవ్వనివలనస్థితింబొందునెవ్వనివలనలయంబగుఁబరాపరంబులకుంబరమంబై యనన్యంబైప్రాక్ప్రసిద్ధంబైసర్వవ్యాపకంబైయాదికారణంబైయున్న తత్త్వంబునాశ్రయింతునెవ్వనిప్రభావంబుమాటలాడెడువారలకువాదంబుసేయువారలకువివాదస్థలంబులగుచునప్పటప్పటికిమోహంబునొందించుచుండునట్టియనంతగుణంబుగలమహాత్మునకుంబ్రణామంబుసేయుచునస్తినాస్తియనువస్తుద్వయనిష్ఠలంగలిగియొక్కటనగలిగియుండివిరుద్ధధర్మంబులుగనుండునుపాసనాశాస్త్రసాంఖ్యశాస్త్రంబులకుసమంబైవీక్షింపఁదగిన పరమంబునాకుననుకూలంబగుంగాకనెవ్వఁడుజగదనుగ్రహంబుకొఱకుజన్మకర్మంబులచేతనామరూపంబులెఱుంగంబడుచుండునట్టి నామరూపంబులుగలిగితేజరిల్లుననంతుండయినభగవంతుండుప్రసన్నుండగుంగాక యెవ్వండుజనులపురాకృతజ్ఞానపథంబులచేతనంతర్గతుండైమేదినింగలుగుగంధాదిగుణంబులనాశ్రయించిన వాయువుభంగిమెలంగుచుండునాపరమేశ్వరుండుమదీయమనోరథంబుసఫలంబుసేయుంగాకయనుచుభక్తిపరవశుండైయుక్తివిశేషంబునస్తుతియించుచున్న దక్షునికిభక్తవత్సలుండైనశ్రీవత్సలాంఛనుండుప్రాదుర్భావంబునొందిప్రత్యక్షంబయ్యెనంత॥సీ॥ భగ్నాచలేంద్రప్రపాతద్వయంబునఁగలిగిననీలంపుగనులనంగ। మొనసితార్క్ష్యునియిరుమూఁపుపైఁబడ్డట్లుపదముల కాంతులుపరిఢవింపఁ। జండదిజ్మండలశుండాలకరములకైవడినెనిమిదికరములమరఁ। జక్రకోదండాసిశంఖనందకపాశచర్మగదాములసరవిఁబూని। నల్లమేనుమెఱయనగుమొగంబలరంగఁ। జల్లచూపువిబుధసమితిఁబ్రోవఁ। బసిఁడికాశఁబూనిబహుభూషణకిరీట। కుండలములకాంతిమెండుకొనఁగ॥ సీ॥ కుండలమణిదీప్తిగండస్థలంబులఁబూర్ణేందురాగంబుఁబొందుపరప। దివ్యకిరీటప్రదీప్తులంబరరమాసతికిఁగౌసుంభవస్త్రంబుగాఁగ।వక్షస్థలంబుపైవనమాలమాలికల్ శ్రీవత్సకౌస్తుభశ్రీలమెఱయ। నీలాద్రిఁబెనఁగొనినిలిచినవిద్యుల్లతలభాతికనకాంగదంబుమెరయ। నఖిలలోకమోహనాకారయుక్తుఁడై। నారదాదిమునులుసేరిపాడఁ।గదిసిమునులుఁబొగడగంధర్వకిన్నర।సిద్ధగానరవముసెవులనలర॥ క॥సర్వేశుఁడుసర్వాత్ముఁడు।సర్వగతుండచ్యుతుండుసర్వమయుండై। సర్వంబుచేరికొలువఁగ।సర్వగుఁడైదక్షునకుఁబ్రసన్నుండయ్యెన్॥వ॥ఇట్లుప్రసన్నుండయినస

శ్వేశ్వగుని సర్వాంకషంబయి, మహదాశ్చర్యధుర్యంబయి తేజరిల్లు దివ్యరూపంబుఁ గాంచి, భయంబును, హర్షంబును, విస్మయంబును, జిత్తంబున ముప్పిరిగొని, చొప్పుఁదప్పింపం దెప్పిరిక ప్పరపాటునం బుడమిపై, నిడుసాగిలంబడి దండప్రణామంబు లాచరించి కరకమలంబులు మొగిడ్చి సెలయేరులతోఁ గొట్టువడియట్టట్టుపట్టు చాలక నిట్టనోడి చిమున్నీరుఁ డన్ని నిలిచిన పెన్నీరునుంబోలె సర్వాంగంబులుం దోఁగ లించి చిత్తంబు నాత్మాయత్తంబు సేసి పిక్కటిల్లిన సంతోషంబు చేత భగవంతుం బలుకను, నత్యంతమంగళ సందోహపాదకంబులైన తన్నామంబులుగ్గడింపనతినిర్మలంబులైన తదీయకర్మంబులు దడువను, విబుధహర్షకరంబులైన, తత్పౌరుషంబులు పొగడను, నాత్మీయమనోరథంబు వాక్రువ్వ నోపక, ప్రజాకాముండై యూరకున్న, ప్రజాపతిం జూచి సర్వజీవనయాపరుండును, సర్వసత్త్వహృదంతరస్థుండును, సర్వజ్ఞుండునుం గావున, నతని భావంబు దెలిసి, జగన్నాథుం, డార్తిపోషణంబులైన భాషణంబుల నిట్లనియె॥ క॥ మెచ్చితి ప్రాచేతస తప।మిచ్చ ఫలసిద్ధియయ్యె నిట్లతిభక్తిన్। హెచ్చగు మద్వరవిభవము।నచ్చుపడం బొంద నెవ్వఁడర్హుఁడు జగతిన్॥ గీ॥ తపము చాలు సంకల్పగ భూతతతికి విభూతులొనరుగాక పొందుపడఁగ।నిదియ సుమ్ము నాకు నిచ్చలోఁ గలకోర్కి।హా సంగనీమువలనఁ బొందుపడియె॥ వ॥ వినుము బ్రహ్మయు, భర్గుండును, బ్రజాపతులు, నింద్రులును, వీరలు నిఖిలభూతంబులకు భూతిహేతువులయిన, మద్విభూతివిభవంబులు, మఱియు నాకు, యమనియమాది సహిత సంధ్యావందనాదిరూపంబగు తపంబు హృదయంబు, సాంగజపధ్యానరూపంబగు విద్య శరీరంబు, ధ్యానాదివిషయపుంవ్యాపారంబుగా నుండు, భావనాదిశబ్దవాచ్యంబగు క్రియ యాకృతియుఁ, గ్రతుజాతంబు లంగంబులు, ధర్మంబాత్మ, దేవతలు ప్రాణంబులు, నిగమంబు మత్స్వరూపంబు, జగదుత్పత్తికి నాదియందు నే నొక్కఁడన తేజరిల్లుచుంటి, బహిరంతరంబుల వేఱొక్కటి లేదు, సుషుప్త్యవస్థయందు సర్వంబు లీనం బగుటం జేసి, సంజ్ఞామాత్రుండు నవ్యక్తుండునుగా నుండు జీవునిభంగి నొక్కఁడన యుండుదు, ననంతుండనై, యనంతగుణంబులు గల మాయాగుణంబువలన, గుణవిగ్రహంబగు బ్రహ్మాండంబును, నయోనిజుండు స్వయంభువుండగు బ్రహ్మయును బుట్టిరి, మదీయవీర్యోపబృంహితుండయి, మహాదేవుండగు నా బ్రహ్మ యసమర్థునిం బోలె నకృతార్థంమన్యమానమానసుండయి, సృష్టింపనుద్యమించు తఱి, తపం బాచరింపుమని నాచేత బోధితుండయి, యఘోరంబైన తపం బాచరించి, తొలుత సృష్టికర్తృత్వంబు వహించి నమ్ము సృజియించె, నంతపంచజనుండగు ప్రజాపతితనూజయగు, యసిక్నియను పేరంటవినుతి నొందియున్న యుక్కన్యకను నీకిచ్చితి, దీనిం బత్నిగాఁ గైకొని, మిథునవ్యవాయధర్మంబు గలవాఁడవై, మిథునవ్యవాయధర్మంబు గలయీ నాతియందుఁ, బ్రజాసర్గంబు, నతివిపులంబుగఁ గావింపం గలవాఁడవు మఱియు నీకు, బిదపనీ క్రమంబున నిఖిలప్రజలును, మన్మాయామోహితులయి, మిథునవ్యవాయధర్మంబునఁ బ్రజావృద్ధి నొందించి, మదారాధనపరులై యుండఁగలరని పల్కి విశ్వభావనుండైన హరి, స్వప్నోపలబ్ధార్థంబునుం బోలె, నంతర్ధానంబు నొందె నప్పుడు, దక్షుండు విష్ణుమాయోపబృంహితుండై, పాంచజనియగు నసిక్నియందు, హర్యశ్వసంజ్ఞల విసుతిఁ జెందియున్న యయుతసంఖ్యాపరిగణితులైన పుత్రులం గాంచె, నప్పుడా ధర్మశీలురైన, దాక్షాయణులు, పితృనిర్దేశంబునం, బ్రజాసర్గంబుకొఱకుఁ, దపంబు సేయువారై పశ్చిమదిశకుం జని, యచ్చట సింధుసముద్రసంగమంబున, సమస్తదేవమునిసిద్ధగణసేవితంబై దర్శనమాత్రంబున, నిర్ధూతకల్మషులను, నిర్మలచిత్తులం జేయుచున్న, నారాయణసరస్సనం బరగు, తీర్థరాజంబున, నవగాహనంబుఁ జేసి, నిర్మలాంతరంగులై, పరమహంసధర్మంబునందు, నుత్పన్నమతులై ప్రజాసర్గంబుకొఱకుఁ దండ్రియనుమతంబున, నుగ్రతపంబు సేయుచుండ వారికడకు నారదుండు వచ్చి యిట్లనియె॥ సీ॥ మీరతిమూఢులు మీఁదటి గతిగాన రెన్నంగఁ బసిబిడ్డలన్న లాగు।పుడమిఁ దాని నంతనికడఁ బరికింపక ప్రజలఁ బుట్టింప నే ప్రతిభ గలదు।అట్టైన నొక్కమహాత్ముఁడు పురుషుండు బహురూపములు గల భామ యొకతె। పుంశ్చలిగర్తయుఁ బురణింపను భయప్రవాహంబుగలనది వరలఁగ నిల।నంచయొకటి యిరువదైదింటి మహిమలఁ గలిగియుండు తెరువు గాన రాక। వజ్రనిబిడమగుచు వరుసవనంతన। తిరుగుఁ గాష్ఠబిలము దేటపడఁగ॥ క॥ విను ఁడండులనను రూపము। నను వొందగ నెఱుఁగకాత్మ నాత్మగురూక్తిం। గొనసాగించెద మనుమి। మ్మన నేమియు లేమమూఢులని తెలిసితగన్॥ వ॥ అని నారదుండు బోధించిన హర్యశ్వులు సహజబుద్ధిచేత నారదవాక్యంబులఁ దమలో నిట్లని వితర్కించిరి॥ గీ॥ సారవిక్షేత్రజ్ఞుఁడననతి సూక్ష్మమంది। యరయ నజ్ఞానబంధనం బగుచు లింగ। దేహమున నెద్దిగలదది దెలియకున్నఁ। గలదె మోక్షంబు దుష్కర్మగతుల చేత॥ గీ॥ కలఁడు జగదేకసన్నుతకారణుండు। స్వామి భగవంతుఁ డభవుండు స్వాశ్రయుండు। పరముఁ డాతనిఁ జూడక బ్రహ్మకైనఁ। గలుగునే ముక్తిపదము దుష్కర్మగతుల॥ గీ॥ పురుషుఁ డెట్లయేనిఁ బూని బిలస్వర్గ। గతుఁడు వో లెవర్తకంబు నూను। నట్టి బ్రహ్మ మెఱుఁగునయ్యు కుస్వర్గోఫగ। కర్మగతు

లనేమి కానఁబడును॥ శా॥ తన్నిష్ఠాగతి లేనివానికి నసత్కర్మప్రచారంబుచే। మున్నే మయ్యెడి నాత్మబుద్ధిగుణసమ్మోహం బునందోఁచుచు। న్వన్నెల్వెట్టుక వింత బాగులతఁ జిన్వర్తించు దౌర్గుణ్యసం। పన్న స్త్రీయనుబోలె నెల్లగతులం బ్రఖ్యాతిమై యుండఁగన్॥ సీ॥ అనువొంద సృష్టి నవ్యయముగఁ జేయుచుఁ బ్రచురప్రవాహసంపతితమైన। నెఱయఁగూలంబను నిర్గమ స్థానంబునందు వేగముగల క్రుంకుమాయ। కడలి యహంకారగతివశంబునఁ జాలవివశుఁడై బోధకు విపరీతమైన। వానికినీరీ తివలవంతకర్మప్రచారంబులను మీఁదఁ జక్కనైన। జన్మమరణముఖ్యజాడ్యంబుతోఁ బాసి। యఖిలసౌఖ్యపదవి నరసి క్రమ। మార్గమైన యట్టి మహనీయధామంబు। చిత్తమార నెట్లు చేరఁగలఁడు॥గీ॥ దానిసంసర్గగుణములు దప్పినడుచుఁ। గుచ్ఛితపు భార్యఁ జేకొన్నకుమతివోలెఁ। దివిరి సుఖదుఃఖములఁ గూడి తిఱుగుజీవ। రూపమెఱుగని వారికి బ్రాపుగలదె॥మత్తకోకిల॥ పంచవింశతితత్వరాశికపారదర్పణమయ్యుఁ దాఁ। గొంచమై పురుషుండు తత్వముఁ గోరిపట్టఁగ నేరకే। మంచుఁ దలఁచుచు నుండి హేయకుమార్గకర్మము సేయఁగా। మంచిలోకము వానికేటికి మానుగా సహకూరెడిన్॥క॥బంధాను మోక్షుణక్రము। సంధానైశ్వర్యధుర్యశాస్త్రప్రమగ్ర। గ్రంథంబు మాను చిద్రూ। పాంథునకు సుకర్మగతులనగు నే శుభముల్॥మత్తకోకిల॥ చూడనీజగమంతయు న్వెసఁ జుట్టిపట్టుక లీలనే। జోడులేక రయంబునం గుడిచుట్టినట్టి స్వతంత్రముం। గూడియుండిన కాలచక్రముఁ గోరిచూడని వారికే। జాడఁ గల్గును కర్మసంగతిఁ జారు మోక్షపదంబిలన్॥గీ॥ జన్మహేతువైన జనకనిర్దేశంబు। తనకుఁ జేయరానిదనుచుఁ దెలిసి। గుణమయప్రవృత్తి ఘోరాధ్వనిశ్వాస। నిరతుఁడగుచుఁ జేయ నేరఁడతఁడు॥వ॥అనితమలో వితర్కించి యాకుమారులప్పుడు॥ సీ॥ వినవయ్య భూపాలమునివరేణ్యుని మాటలను వొందఁదలపోసి వినయమలర। వలగొని యతనికి వందనం బొనరించి తిరిగి యెన్నఁడు రాని తెరువు వట్టి। చయ్యన నేగిరి సహజసత్వబ్రహ్మమయమైన పంకజనయనుపాద। పద్మమరందంబు పానంబు సేయుచు మత్తిల్లి నిలిచిన మానసాళి। పరిణమింప విష్ణుఁ బాడుచుఁ దత్కీర్తి। సరణి మ్రోయు మహతి సంఘటించి। నారదుండు గుణవిశారదుండెందేనిఁ। జనియె జగము దన్ను సన్నుతింప॥క॥అప్పుడు దక్షుఁడు తనయులు। దప్పి మహాపథము గనుటఁ దగ నారదుఁడే। చెప్పినఁ గప్పిన శోకము। ముప్పిరిగొని చిత్తవృత్తి మూటిం బోవన్॥చ॥అడలుచునున్న వచ్చి కమలాసనుఁ డూరడిలంగఁ బల్కె ముం। న్బడసిన లీలఁ బుత్రుల నపారగుణాఢ్యులఁ గాంచుమన్న నా। పడఁతుకయందుఁ గృష్ణురను బల్వురఁ దాశబళాశ్వసంజ్ఞులం। బెడఁగగువారిఁ బుణ్యములఁ బేర్చిన వారిసహస్రసంఖ్యలన్॥ క॥పుట్టించిన జనకుని మదిఁ। బుట్టిన తలఁపెఱిఁగి వారు పూనికెఁ బ్రజలం। బుట్టించువ్రతముఁ గైకొని। గట్టిగఁ దపమాచరింపఁ గాఁ జనిరి వెసన్॥వ॥ఇట్లు శబళాశ్వులు ప్రజాసర్గంబుకొఱకుఁ దండ్రిపంపున దపంబు సేయువారై యేతీర్థంబు తీర్థరాజంబై సకలతీర్థఫలంబుల నాలోకనమాత్రంబున ననుగ్రహించు సకలపాపంబుల నిగ్రహించు నే తీర్థప్రభావంబున నగ్రజన్ములు ఫలసిద్ధిం బొందిరట్టి నారాయణసరస్సను పుణ్యతీర్థంబునకుం జని తదుపస్పర్శమాత్రంబున నిర్ధూతమలామలాత్ములై॥ శా॥ బ్రహ్మేంద్రాదులు నందనేరని పరబ్రహ్మంబుఁ జింతించుచున్। బ్రహ్మానందముఁ బొంది జిహ్వకలపై బ్రహ్మణ్యమంత్రంబున। ద్బ్రహ్మలోకనవాంఛతో నిలుపుచున్ బ్రహ్మంబితండంచు మున్। బ్రహ్మజ్ఞానగురున్ హరిం దపమునం బాటించిర బ్బాలకుల్॥సీ॥ఏకపాదాంగుష్ఠమిల మీఁద సవరించి। నిశ్చలకాయులై నిక్కి నిలిచి। కరములు గీలించి సరవిమీఁదికి నెత్తి గురుతుగాఁ బెనుబయల్ గుట్టిపట్టి। నిడివిగా క్రూరమై నిగిడిన చూడ్కులఁ గడుతీవ్రభానునిఁ బొదివిపట్టి। వడిఁ గొంతకాలంబు వాయువు భక్షించి యంతనుండియు నిరాహారులగుచు। సకలలోకములకు సంహారకరమును। బేర్చి దేవతలకు భీతికరము। గాఁగ ఘోరతపముఁ గావింపఁ దొడగిరి। మహితచిత్తులు కుమారవరులు॥వ॥ ఇట్లతిభయంకరంబయిన తపంబు సేయుచు

## నారదుండు శబళాశ్వులకు నివృత్తిమార్గంబు నుపదేశించుట.

నెడతెగక భగవన్మంత్రంబుల నొడువుచుఁ బ్రజాసర్గకాములై యున్న యచ్చిన్నబాలుర కడకు నారదుండు సనుదెంచి పూర్వవిధంబున బలుకుచు నిట్లనియె భ్రాతృవత్సలులై యున్న మీరలు వేదాంతసారంబుఁ బలుకుచున్న నా వచనంబు లాదరించి తోఁబుట్టువులు సనినమార్గంబునఁ జనుం డెవ్వరేనియుఁ దనయగ్రజులు గన్న మార్గంబునం దానునుం దప్పక వర్తించునట్టి వాని విశేషధర్మం బెఱింగినవాఁడండ్రు సతతంబును బుణ్యబంధుండై దేవతలం గూడి సుఖంబుండుఁ డని పల్కి నారదుండు సనియె వారలు సర్వకర్మంబులయందు నిర్మోహితులై పరమపదంబునకు నాస్పదంబులయిన దేవర్షి వాక్యంబుల నాశ్రయించిరి॥ ఉ॥అప్పుడు లజ్జతోడ శబళాశ్వులు పూర్వజులేగినట్టియా। చొప్పున నెన్నఁడుం దిరిగి చూడని త్రోవ విశేషపద్ధతిం। దప్పకఁ బోయిరయ్య గుణధాములు నేఁడును మళ్ళరేమి నేఁ। జెప్పెదఁ గాకరాక కడఁ జేరిన రాత్రులఁ బోలి భూవరా॥ క॥దక్షుని కాకాలంబున। లక్షితమై యుండెఁ బెక్కులాగుల నుత్పా। తక్షోభంబుల వారికి। రూక్షవ్యథనొంది యాపురుష నాశమునన్॥క॥నా

రదకృతమని యెఱింగి మహారోషముతోడ నేఁగి యాతనిఁ గని దుఃఖారూఢచిత్తుండై మది నూరడిలం దెరువు లేక నుగ్రుండగుచున్॥ గీ॥ మోము జేవురింప ముడివడఁ బొమదోయి। చూపు వెంట మంట నుడిగొనంగఁ। బెదవు లదరఁ బండ్లు పెటపెటఁ గొఱుకుచు। దక్షుఁ డాగ్రహించి తపసిఁ బలికె॥ చ॥ నెఱయఁగ సాధురూపమున నీవతిబాలుర నాత్మజాలికిం। గఱకున భిక్షుమార్గమగు కందువ సెప్పితి వేలధూర్తవై। మఱుఁగక యుండవచ్చునె కుమారకులీదురితంబు నేఁడు నీ। న్నెఱలఁగ ద్రోతు నాదుసమ

—— దక్షుండు నారదుని శపియించి ప్రజాసర్గం బొనరించుట. ——

ద్రోగ్రమహోగ్రహశాపవహ్నులన్॥ వ॥ అదియెట్లంటేని దేవర్షిపితౄణంబులు దీర్పక కర్మవిచారంబు సేయని బాలుర మనంబులకు నైహికేచ్ఛలయందు నైరాశ్యముఁ గలుగం జేసి నివృత్తిమార్గం బుపదేశించి వారలకు నుభయలోకంబులయందుఁ జెందఁగల శ్రేయోహాని నొనర్చితి వట్టి పాతకంబున భాగవతోత్తములలో లజ్జాహీనుండవై యశోహానిం బొంది చరింపుము వుగాక నిరపరాధులై వైరంబు లేని నా పుత్రులపట్ల ద్రోహకృత్యం బొనర్చిన నిన్నుఁ దప్పఁ దక్కిన భాగవతోత్తములు సకలభూతానుగ్రహపరవశులు గావున నిరంతరంబును లోకసంచారివైన నీకు నేలోకంబునను నిక్కపట్టు లేకుండుఁ గాక యని నిర్దయుండై శాపం బిచ్చె నంత నారదుండు తతోక్తిక వాక్యంబులకు లుగక యట్ల కానిమ్మని సమ్మతించి చనియె నిట్టి శాంతభావంబు నెవ్వనివలనం గలుగు నతండు సర్వాతీతుండై సర్వేశ్వరుండనంబడు మఱియు దక్షుండు తన మనోరథంబు విఫలంబగుటం జేసి యతిదుఃఖితమనస్కుండై సొగులుచున్నఁ బితామహుండు చనుదెంచి మఱియుఁ బ్రజాసర్గోపాయం బుపదేశించిన నా ప్రజాపతి ప్రియభామయైన యసిక్నియందుఁ బితృవత్సలలైన పుత్రికల నరువదింటినిం బుట్టించి వారిలో ధర్మునకుం బదుమువ్వురను, గశ్యపునకుం బదుమువ్వురను, జంద్రునకు నిరువదేడ్వురను, భూతునకు నాంగిరసునకుఁ గృశాశ్వునకు నిద్దఱేసి చొప్పున నార్వురను దార్క్ష్యుఁడను నామాంతరంబుఁ దాల్చిన కశ్యపునకు మఱి కడమ నలుగుర నీక్రమంబున నిచ్చె వారి నామంబు లాకర్ణింపుము॥ గీ॥ ఎట్టి పుణ్యవతులొ నీ చేడియలు సెప్ప। సవతు లేని యట్టి సవతులయ్యుఁ। గడుపు పడసి రెట్టి కడుపునఁ బుట్టిరో। కడిది త్రిజగమెల్ల కడుపు గాఁగ. వ॥ వార లెవ్వరనిన, భానువు, లంబయుఁ, గకుప్పు, జామియు, విశ్వయు, సాధ్యయు, మరుత్వతియు, వసువును, ముహూర్తయు, సంకల్పయు, నననంబనుగు యధర్మునకుఁ బత్నులై కొడుకులం బడసిరి, వారెవ్వరంటేని, భానువునకు వేదఋషభుండు పుట్టె, నతనికి నింద్రసేనుండు దయించె లంబకు విద్యోతుండు గలిగె నతనికి స్తనయిత్నుండువులను వారు పుట్టిరి, కకుప్పను దేవికి సంకటుండు పుట్టె, సంకటునకుం గీకటుండు పుట్టెఁ, గీకటునకు దుర్గాభిమానులయిన దేవతలు జన్మించిరి, జామి దేవికి మర్గభూముఖ కథిష్ఠాన దేవతలు జనియించిరి, వానికి స్వర్గుండును, నందియు జన్మించిరి, విశ్వయను దానికి విశ్వేదేవతలు జన్మించిరి, వారలపుత్రకుల నంబరగిరి. సాధ్యయను దానికి సాధ్యగణంబులు పుట్టె, వానికి నర్థసిద్ధి యనువాఁడు పుట్టె, మరుత్వతియను దానికి మరుత్వంతుఁడు జయంతుండను వారలుదయించిరి, యందు జయంతుండు, వాసుదేవాంశజుండైన యుపేంద్రుఁడనంబడి వినుతి నొందె, ముహూర్తయను దానికి సకలభూతంబులకు నాయాకాలంబులఁ గలిగెడు, నాయా ఫలాఫలంబుల నిచ్చు మౌహూర్తికులనియెడు దేవగణంబులు పుట్టిరి, సంకల్పయను దానికి, సంకల్పజుండయిన కాముండు జనించె, వసువను దానికి, ద్రోణుండును, ప్రాణుండును, ధ్రువుండును, నర్కుండు, నగ్నియును, దోషుండును, వస్తువును, విభావసుండు, నను నెనమండ్రు వసువులుదయంబు నొందిరందు, ద్రోణునకు నభిమతియను భార్యయందు, హర్షశోకభయాదులు పుట్టిరి, ప్రాణునకు భార్యయైన యూర్జస్వతియందు సహుండు, నాయువును, బురోజవుఁడను వారు గలిగిరి, ధ్రువుని భార్యయగు ధరణియందు వివిధులగు పురులను వారు జనించిరి యర్కునికి భార్యయగు వాసనయందుఁ దర్షాదులుదయించిరి, యగ్నికి భార్యయైన వసుధారయందు ద్రవిణకాదులు పుట్టిరి మఱియుఁ గృత్తికకు స్కందుండు గలిగె నా స్కందునకు విశాఖాదులుదయించిరి దోషునకు శర్వరియను భార్యయందు హరికళయగు శింశుమారుండుదయించె వస్తువునకు నాంగిరసయందు విశ్వకర్మయను శిల్పాచార్యుండుదయంబందె నా విశ్వకర్మునకు నాకృతియను సతియందుఁ, జాక్షుషుండను మనువు జనించె, నా మనువువలన విశ్వేలు సాధ్యులను వారలు పుట్టిరి, విభావసునకు నుషయను భార్యయందు, వ్యుష్టియు, రోచిస్సు, నాతపుండును జనించిరి, యందు నాతపునికిఁ, బంచయాముండను దివసాభిమాన దేవత జనించె, శంకరాంశజుండయిన భూతునకు సురభియను భార్యయందుఁ గోట్లసంఖ్యలైన రుద్రగణంబులుదయించిరి, రైవతుం, డజుండు, భవుండు, భీముండు, వాముం, డుగ్రుండు, వృషాకపియు, నజైకపాత్తు, నహిర్బుధ్న్యుండును, బహురూపుండును, మహాత్ముండు, నను వారల నతిభయంకరులగు రుద్రపారిషదులయిన ప్రేతలును, వినాయకులును, బుట్టి రంగిరస్సను ప్రజాపతికి, స్వధయను భార్యయందుఁ, బితృగణంబులు పుట్టి, సతియను భార్యకు, నథర్వణ వేదాభిమాన దేవతలు పుట్టి

కృశాశ్వునకు నర్చిస్సను భార్యయందు, ధూమ్రకేశుండను పుత్త్రుం డుదయించె, వేదశిరస్సునకు ధిషణ యను భార్యయం
దు, దేవలుండును, వయునుండును, వసువునుం బుట్టిరి, తార్క్ష్యునకు వినత, కద్రువు, పతంగి, యామిని యను నలువురు భార్యలం
దుఁ, బతంగికిఁ బక్షులు పుట్టె, యామినికి శలభంబులు పుట్టె, వినతకు సాక్షాత్కరించిన యజ్ఞాధిపతికి వాహనంబైన గరుడుం
డును, సూర్యునకు సారథియైన యనూరుండును జనియించిరి, కద్రువునకుఁ బెక్కుతెఱంగుల భుజంగమంబులు పుట్టెఁ, జం
ద్రునకుఁ గృత్తికాదినక్షత్రంబులు భార్యలు, వారలయందుఁ జంద్రుండు, రోహిణియందు మాత్రము, మోహితుండగుటం
జేసి, దక్షశాపంబున, క్షయరోగగ్రస్తుండై, సంతానంబు వడయ నేరఁడయ్యెఁ, దంతదక్షప్రసాదంబున క్షయపీడితంబులగు
కళలను బలంబొందెను మఱియును॥ సీ॥ కామితప్రదుఁడైన కశ్యపుఁ గౌఁగిటఁ బుచ్చుటదీర్ఘరేయుద్ధరాంత్రు। అఖిలలోకముల
కనవ్వలై జగమెల్లఁ బూజింపనుండు రేపూవుబోఁడ్లు। బనియులై పుత్రులు పౌత్రులు ప్రజ్ఞాంబు లేలంగఁ జాలు రేయిందు
ముఖులు। ముంగొంగు పసిడియై మూల్లు పుణ్యంబు కొట్టి గెడకట్టి యింతరాంద్రు। వావిగలఁ గంపకడుపుల సేరుపరులు। నరిదివి
ష్ఠలఁ బడసిన బిరుసు సతుల। నామముల నన్వయంబులు నీమానంబు। పూనఁ జెప్పెద వినవయ్య నాగవేంద్ర॥ తరల॥ అదితియు దితి
కాష్ఠయు దనువయ్యరిష్టయు నాత్రయు। నన్నరయఁ గ్రోధవశాఖ్యయు సురసాఖ్యయు సురభిస్మృ। ల్మొదలుగాఁ దిమియు
ఁ గశ్యపప్రియముఖ్యయోషలు మౌనిచిత్తముదిత లెన్నఁగఁ గన్న సంతతి మిజ్జగంబులఁ బూవరా॥ సీ॥ చాలంగఁ దిమికిని జలచరంబు
లు పుట్టెను టికి రాత్రులు సరమకును బ్రజలు। సురభికిని మహిషాదిసుకభులు జనియించెఁ దామ్రకు శ్యేనగృధ్రములు గలిగె। ము
నికి నప్సరసలమూఁకలు జనియించె క్షగనెభూరిసహములను గ్రోధ। వశకున్ దృపిళ్లైను ర్వారిసర్పంబులు సరియాతుధానులు
సురసకు రయ। సుప్ర్వోల్లి రిగంధర్వులోకమెగిన। రిష్టకుదితంబు నొందిరి త్రిదశముఖులు। దదియు నెను బంద్రులయినట్టి దై
తేబలులు। వారినామాన్వయంబులఁ గోరి వినుము॥ వ॥ ద్విమూర్ధుండు, శంబరుండు, నరిష్టుండు, హయగ్రీవుండు, విభావసుం
డు, నయోముఖుండు, శంకుశిరస్సు, స్వర్భానుండుఁ, గపిలుండు, నరుణియుఁ, బులోముండు, వృషపర్వుండు, నేకచక్రుండు, ను
లోమసుండు, ధూమ్రకేతుండు, విరూపాక్షుండు, విప్రచిత్తియు, దుర్జయుండు, నను వారలు వీరలలో నస్వర్భానునకును ప్ర
భ యను కన్యక పుట్టె, దానిని నముచి వివాహంబయ్యె. వృషపర్వునకు శర్మిష్ఠ యను కూఁతురు పుట్టె, దానిని నహుషపుత్త్రుండై
న యయాతి పెండ్లియయ్యె. వైశ్వానరునకు, నుపదానవి, హయశిర, పులోమ, కాలక యను, నలువురు పుత్రికలుదయించిరం
దు నుపదానవి, హిరణ్యాక్షునకు బత్నియయ్యె, హయశిరయును, క్రతువు వివాహంబయ్యెఁ, బులోమకాలకలను నిరుపుర
ను, గశ్యపప్రజాపతి చతుర్ముఖుని వాక్యంబునం గయికొనియె, నాయిరువురకును, సమరకోవిదులయిన దానవులు, పౌలోమ
కాలకేయులనం బుట్టిరి, మఱియు నా యిరువురకును, నఱువది వేలరాక్షసులు జన్మించిరి, వారు యజ్ఞకర్మంబులకు విఘాతకులై వ
ర్తించువారినింద్రునకుం బ్రియంబుగా నీ పితామహుండగు నర్జునుండు వధించె మఱియు విప్రచిత్తి సింహిక యను దానియం
దు. రాహు ప్రముఖంబుగాఁ గల కేతుశతంబును బడసె, వారలు గ్రహత్వంబుఁ గైకొనిరి, మఱియుం బురాణపురుషుండై
న శ్రీమన్నారాయణుండు, తనయంశంబున నే సరమభాగ్యవతియయిన, యదితిగర్భంబున నుదయించె, నాయదితి వంశం
బును వివిదితంబుగా వినుపించెద. సావధానుండవు వినుము-వివస్వంతుండు, నర్యముండును, బూషయుఁ, ద్వష్టయు, సవిత
యు, భగుండును, ధాతయు, విధాతయు, వరుణుండును, మిత్రుండును, శక్రుండు, నురుక్రముండును, నను మను వులు జ
న్మించిరందు, వివస్వంతునకు, శ్రాద్ధదేవుండను, మనువు సంజ్ఞాదేవియందు నుదయించె, మఱియు యముండు, యమియు న
ను, నిరువురు మిథునంబుగా నుదయంబు నొందిరి. మఱియు నా సంజ్ఞాదేవి, బడబా స్వరూపంబు నొంది. యశ్వినీదేవతలం గనె
-ఛాయాదేవియందు, శనైశ్చరుండును. సావర్ణియు మనువును, దపతియను, కన్యకయుం బుట్టిరి, యాతపతిని సంవరుండుడు
వరియించె. నర్యమునకు. మాతృక యను పత్నియందుఁ జర్షణులుదయించిరి వారివలనంబున మనుష్యజాతియగు లోకంబున
స్థిరంబుగా నుండునట్లు బ్రహ్మదేవుని చేఁగల్పింపంబడె, బూషుండు భగ్నదంతుండై పిష్టంబులు వివృతంబులుగా నగిన, నతం
డు క్రోధించి దంతంబులూడఁ బడిన, నాఁటనుండియు, భగ్నదంతుండయి, యనపత్యుండయి, పిష్టాపులం భక్షించుచుండెఁ
ద్వష్టకు దైత్యానుజయైన, రచనయను కన్యకకు, నధిక బలాఢ్యుండగు విశ్వరూపుండు పుట్టెనంత నా దేవతలు బృహస్పతిం
గోపింప, నేఁతఁ డుంతలంగిపోయినం, దనకు నా విశ్వరూపుని నాచార్యునింగా వరియించిరని చెప్పిన విని, శుకయోగీంద్రునకుం
బరీక్షిన్నరేంద్రుండిట్లనియె॥ సీ॥ అరయంగ యోగీంద్ర యమ్మతంబయ్యెడు సురలపై నేటికి సురగురుండు। కోపించె నీతండు
సుభావమున దేవతల కేమి యాపదఁ దలఁగఁ జేసె। నెఱిఁగింపు మనవుడు సంద్రుండు త్రిభువనైశ్వర్యమదంబున సత్పథం
బు। గానక వసురుద్రగణములు నాదిత్యమరుదశ్వినీముఖ్యమండలములు। సిద్ధచారణగంధర్వజిహ్మగాది। సురలుమునులును

రంభాదిసుందరాంగులు। ఆడఁ బాడంగ వినుతి సేయంగఁ గొలువ। నొక్క భద్రాసనంబున నుక్కుమీఱి ॥సీ॥ నిండుపున్నమ నాఁడు గండరించిన చంద్రునందు శ్రీలతో మారుమూలయు। భద్రవిద్యోతాతపత్రంబు గ్రాలంగ మిన్నేటి తరగల మేలుకొలుపు। గలిగిన వ్యాంగనాకరతల చాతుర్య చామీకర శ్రేణిజాడ పటుప। జింతామణిస్ఫుట కాంచన తత్నానేక ఘటిత సింహాసనాగ్రంబునందు। నూరుపీఠంబులో నరియుండనుండి। వరుస దిక్పాలకాది దేవతలు గొలువ। సాటి జెప్పంగరాని రాజసముతో డనింద్రుఁ డొప్పారె వైభవసాంద్రుఁడగుచు॥ అయ్యవసరంబున॥ క॥ గురుశరధర్మక్రియ నయ। గురుఁడు గురుఁడు మంత్రవినయగురుఁడు వదశ్రీ। గురుఁడు స్సస్తానరగణ। గురుఁడు గురుండరుగుదెంచెఁ గొల్వున కున్నపా॥ చ॥ అమితతపః ప్రభావగరుఁ డాత్మనిగీష్పతిఁ జూచి రాజ్యమున్ దనుమదరేఖనింద్రుఁడు వృథాతనగద్దియ లేవకుండెనే। య్యామున నెమర్కొనం జనకయాసనమీయక గౌరవోపచా। రములఁ బ్రసన్నుఁ జేయక తిరంబుగ దివ్యసభాంతరంబునన్॥ క॥ అప్పుడు సురపతిగన్నల। గప్పిన సురరాజ్యమదవికారంబునకుం। జప్పుడు సేయక గృహమున। కప్పుణ్యుఁడు దిరిగిపోయె వగ్గించున్నంపై॥ చ॥ ఎఱుగమిఁ జేసినట్టి గురుహేళనమంతనెఱింగి యింద్రుఁడు। చ్చెరువడి భీతినొందియని చింతితుఁడై తలపోసి పల్కెన। ప్పరవపవిత్ర లోకనుతభవ్య చరిత్రుపిశేషపాదపం। కరుణామునుఁ బూజ సేయక యకర్మముఁ జేసితి నప్రబుద్ధినై॥ క॥ త్రిభువ[illegible] భవనాదంబున। సభలోనాఁ గురువునకుఁ బ్రసన్నునకు లసన్। త్ప్రభువునకు నెగ్గుఁ జేసితి। శుభములు వోఁగంగ నేనసురభావమునన్॥ గీ॥ పారమేష్ఠ్యమయినపదవి నొందిన భూపు। లెట్టివారికైన లేవవలదు। విబుధులిట్లు సెప్పువిధ మెన్నవారలు। ధర్మవేత్తలను చూఁదలపఁబడరు॥ గీ॥ కుపథవర్తులగుచుఁ గుత్సితదర్పులో। నిపుణులయిన వారు నిడిచి జెలిసి। తొలఁగలేక వారధోగతిఁ బడుదురు। తప్పలేక రాతి తెప్పభంగి॥ ఉ॥ కావున లోకవందితుని గార్యవిచారుని యింటికేగి తా। త్పావనపాదపద్మములపైనుకుటంబు ఘటిల్ల మ్రొక్కి సత్సేవ మొనర్చి చిత్తము వసించి ప్రసన్నునిఁ జేతునంచు న। ద్దేవవిభుండు వోయెనతి తీవ్రగతిన్ గురుధామసీమకున్॥ వ॥ ఈ రీతిఁ దనయింటికే తెంచు దేవతాపతి రాక యా బృహస్పతి యెఱింగి। యధ్యాత్మమాయచే నడఁగియదృశ్యుఁడై పోయెనప్పుడు దేవపుంగవుండు। సకలంబుఁ బరికించి జాడఁ గానక గురుఁ జింతించి తలపోసి చిన్నవోయె। బోయినవిధమెల్ల దాయలు గాకుసవీరులు వేగులవారివలనఁ। దెలిసి మిక్కిలి తమలో నఁ దెలివి నొంది। యందఱును గూడి భార్గవునాశ్రయించి। తత్కృపాదృష్టిఁ దమశక్తి దిట్టమైన। దేవతలమీఁది దాడికిఁ దెరువు వెట్టి॥ క॥ ధూర్తులు సమస్త కిల్బి

## దేవాసురయుద్ధము.

ష। మూర్తులు వరధర్మకర్మ మోదితమార్గా। వర్తులు కుర్గ్ణయనిర్మితకీర్తులు దానవులు పరిగిరి ర్వాణులపై॥ స్రగ్ధర॥ దండింగోదండకాండోద్ధతరథహయవేదండషండంబుతోడన్। దండెత్తె మెండుగా నద్దనుజనికరము ద్దేవతాకోటిమీఁదం। జండప్రస్ఫోటదభేరీ వ్యచ్ఛ్రితజయజయకవముల్ఫుండరీకో భాగాను। ద్దండప్రఖ్యాగలీలన్ బలపడి సురద్రిష్పురై వారితోడన్॥ చ॥ వాదమున దేవదానవులు వచ్చరముల్ల డుఁబిడ్డలింపన। పదలను గోరిపోరునెడ భార్గవమంత్రక లాపిశేషులై। యొదురులు ప్రాలియస్త్రముల నేయన హాసురులే విరమేసిపెన్। గుదులుగఁ గ్రుళ్ళ దేవతలు కొల్లలుకోర్వకపాఱిరయ్యెడన్॥ గీ॥ దనుజవీరులే యుదాగుణదివ్యాస్త్ర। దళిత దేహులగుచుఁ దలలు పీడ। నోడి పాఱిరవ్వ తోపేతబలులైన। త్రిదశవరులు బిట్టుఁ దిట్టినట్లు॥ క॥ ఒక మొగము గాక దివిజులు। లికనాకఁ గొని వైరులెల్ల డీకొనఁ దమ్ముం। బకవకలై కనకినలై। లుకలుకఁ బరువెత్తిరో డిలోఁ గొనుచున్॥ చ॥ దనుజుల గర్వరేఖయును దానవవీరుల యంపజోఁకయు। న్మనుజపిశేషభోజనుల వచ్చటికంబు నిశాటకోటియే। చినబలశౌర్యముం దనుకు సిగ్గును హానినహో భయంబునిగ్గొనక మిఁ జేయును మ్మలికఁ గొల్లలకోవకపాఱి రార్తులై॥ క॥ అసురులు విస్పృష్టదానవ। సనురులు శరభిన్న దేహసంతాపగుణ। భ్రమరులు దైత్యకిరాతక। పసురులు కమలజునికడకుఁ జనిరి భయార్తిన్॥ ఉ॥ ధాతను దేవతావిభవదాతనుఁ బుణ్యజనానురాగసం। ధాతను సర్వలోకహితతాతను వైదికధర్మమార్గనిర్ణేతను నుల్లసద్విభవనీతను సర్వజగజ్జయాంగజ। భ్రాతనుఁ బుణ్యయోగిజనభావవిధాతను మ్రొక్కిరయ్యెడన్॥ క॥ ఆఖండలుండు మొదలుగ। లేఖానీకములు బ్రహ్మ లేనగవునని। త్యాఖండలసత్కృపారస। శేఖర వాక్యముల వారి సేనలు దేర్చె॥ వ॥ ఇట్లు బ్రహ్మదేవుండు దేవేంద్ర ప్రముఖులయిన దేవతలకనుకంపాతివిభవంబున నభయంబొసంగి యిట్లనియె॥ ఉ॥ నెట్టనఁ బాపకర్మమున నేరమిఁ జేసితిరేని చెప్పవిగా। పుట్టిన నాఁటనుండియును బుద్ధులు సెప్పి జగంబులేలఁగాఁ। బట్టముఁ గట్టి పెంచిన కృపానిధి బ్రహ్మకళావిధిజ్ఞుఁ జేఁ। బట్టక గుట్టు జాతిసిరి పట్టునఁ దొట్టిన పాట్లఁ గ్రొవ్వినన్॥ వ॥ బ్రహ్మిష్ఠుండైన బ్రాహ్మణుని నాచార్యుంగాఁ గొనక గురుద్రోహంబుఁ జేసితిరి తద్దోషంబిపుడు మీకుఁ జేఁ జేత శత్రుకృతంబై యనుభవింపం జేసెనతిబలవంతులయిన మిమ్ము నతిక్షీణులయిన రాక్షసులు జయించుట తమయాచార్యుండైన శుక్రా

రాధించితన్మంత్రప్రభావంబునఁబునర్లబ్ధవీర్యులై యిప్పుడు మదీయంబయిననిలయంబు నాక్రమింపఁగలవారునై మదోద్రేకంబున నెమ్మియు లేక వర్తిల్లుచున్న రక్షోనాయకులకుం ద్రిదివంబుఁ గొనుట తృణప్రాయంబ భేద్యమంత్రబలంబుగల భార్గవునకు వారు శిష్యులగుటం జేసి విప్రగోవిందగవేశ్వరానుగ్రహంబుగలవారలకుఁ దక్క నదక్కిన రాజులకరిష్టంబగుం గావున మీరిప్పుడు త్వష్టయను మనుపుత్రుండగు విశ్వరూపుండను ముని నిశ్చలతపోమహత్వ సత్త్వస్వభావుండతని నారాధించిన మీకు నభీష్టార్థంబులు నతండు సంఘటిల్లఁ జేయు నిట్టిమర్దశల తండడంచునని చెప్పిన దిక్పాల కాదులు డెందంబులు డిందుపడి కమలగర్భుని వీడ్కొని విశ్వరూపుకడకుం జని యిట్లనిరి॥ గీ॥ అన్న మేలగు నీకు నిన్నడుగఁ గోరి। వచ్చినారము భవదీయవనమునకును। దండ్రులకు నేఁడు సమయోచితంబులయిన। కోర్కెలొడఁగూడఁ జేసి చేకొనుము యశము॥ క॥ సుతులకుఁ బితృశుశ్రూషణ। మతిపుణ్యము సేయుచుండు నాత్మజులు గుణో। న్నతి బ్రహ్మచారులైనను। మతితో గురుసేవకన్న మఱియుం గలదే॥ అదియునుం గాక॥ సీ॥ అరయ నాచార్యుండు పరతత్త్వరూపంబు దండ్రి తలంపంగ ధాతరూపు। రూపింప భ్రాత మరుత్పతిరూపంబు దెలియంగ తల్లి భూదేవిరూపు। భగిని దయారూపు భావంబు ధర్మస్వరూపంబు దానర్థి రూపు మొదల। నభ్యాగతు[illegible]మన్న యగ్నిదేవుని రూపు సర్వభూతములు గేశవుని రూపు। గానఁ దండ్రి వేగఁ గడు నార్తులగు పితృ। జనులమైన మమ్ముఁ జల్లఁ జూచి। పరభయంబు వాపి నిరుపమంబగు తపో। మహిమచేత మెఱసి మనుపుమయ్య॥ వ॥ ఇప్పుడు బ్రహ్మనిష్ఠుండవైననిన్నాచార్యునిఁగా వరించి భవదీయ తేజోవిశేషంబుచేత వైరివీరులం బరిమార్చెదమాత్మీయార్థంబయిన యుష్మత్పాదాభివందనంబు నిందితంబుగాదని వేదవాక్యంబు గలదు గావున నీకు నమస్కరించుచున్న దేవతలం గైకొని పౌరోహిత్యంబు సేయుమనినం బ్రహసితవదనుండై యమ్మునీశ్వరుండిట్లనియె॥ గీ॥ బ్రహ్మవర్చస్సునో మొడి ప్రార్థనంబు। ధర్మగుణగర్హితంబని తానెఱింగి। సౌరదిననుబోటి తపసియౌ సురలచేతఁ। బ్రకటమధురోక్తి నేటికిఁ బలుకఁబడియె॥ విశేషించి॥ క॥ గురుధనముఁ గూర్చనేటికి। గురుశిక్షుం దగిలి మంత్రకోవిదులై స। ద్గురుధర్మ నిరతులేనియు। గురువులకును శిష్యవరులె కూర్చినధనముల్॥ సీ॥ అరయ నకించనులైనట్టి వారికిఁ దగు శిలోంఛనవృత్తి ధనము సుమ్ము। దానిచే నిర్వర్తితప్రియ సాధుసత్క్రియగలవారలై ప్రీతినొందెద। దరుగాన సద్గర్హితాచారమైన యాచార్యత్వమిపుడు మీ శాసనమునఁ। గైకొంటి గురువులకామంబు ప్రాణార్థవంచనములు లేక వడినొనర్తు। నను చు విశ్వరూపుఁడని మొడి ముని ప్రతి। జ్ఞోక్తిఁ బలికె వారి నూరడిం[illegible]మహితమైన తత్సమాధి చే గురుభావ। మమరఁ జేసెఁ దేవసమితికపుడు॥ క॥ భార్గవవిద్యాగుప్త। స్వర్గశ్రీ ద్విగుణదనుజసమధిక సంప। ద్వర్గము లపవిష్ణుమాయా। నర్గళగతిఁ దెచ్చియింద్రునకు నిచ్చె నృపా॥ క॥ ఏవిద్యచేత రక్షితుఁ। డై వజ్రధరంబులోన నసురులఁ ద్రుంచెఁ। భావింపనట్టి విద్య। శ్రీహరిమాయామతంబుఁ జెచ్చెరఁ జెప్పెఁ॥ ఉ॥ నావుడు పాండవాన్వయుఁడు నమ్మిన భక్తిజగన్నివాసురా। జీవదళాక్షుఁ గృష్ణుఁ దనచిత్తమునన్ భజియించి పల్కె నో। దేవగణార్చితాంఘ్రియుగ దివ్యమునీశ్వర విశ్వరూపుఁడు। ప్పావనమైన విద్య సురపాలునకే క్రియ నిచ్చెఁ జెప్పవే॥ ఉ॥ ఎందును రక్షితుండగుచు నింద్రుఁడు లీలయవోలె వైరి సే। నం దునుమాడి దేవతలు నమ్మి సుఖింపఁగ నిష్టసంపదం। జెందిసమస్తలోకములఁ జేకొనియేలెము నీంద్రదాని నే। విందు సుఖంబుఁ గందునిఁక వీనులు సంతసమందఁ బల్కవే॥ క॥ వరనారాయణకవచము। నరిభీకర వజ్ర

## ॥ శ్రీమన్నారాయణకవచప్రారంభము. ॥

కవచమాశ్రితసంప। త్పరిణామకర్మసువచము। పురుహూతున కెట్లు మౌని బోధించెఁ దగఁ॥ అనినం బరీక్షిజ్జనపాలునకు మునినాథుండిట్లనియె॥ సీ॥ వినవయ్య నరనాథ మునినాథుఁ డింద్రునకను వొందనారాయణాఖ్యమైన। కవచంబు విజయసంకల్పంబు నప్రమేయస్వరూపంబు మహాఫలంబు। మంత్రగోప్యము హరిమాయావిశేషంబు సాంగంబుతోడ నెఱుంగఁ జేసె। దాని నే వినుపింతుఁ బూనిత దేకాగ్రచిత్తంబుతోడుతఁ జిత్తగింపు। మొనర ధౌతాంఘ్రిపాణియై యుత్తరంబు। ముఖముగాను త్తమాసనమున వసించి। కృతనిజాంగకరన్యాస మతిశయిల్ల। మహితనారాయణాఖ్యవర్మము నెనర్చె॥ వ॥ ఇట్లు నారాయణకవచంబు ఘటియించి పాదంబులను జానువుల నూరువుల నుదరంబున హృదయంబున నురంబున ముఖం

### శ్రీనారాయణకవచప్రారంభః.

రాజా॥ యేన గుప్తస్సహస్రాక్షస్సవాహాన్ రిపుసైనికాన్। క్రీడన్నివ వినిర్జిత్య త్రిలోక్యా బుభుజే శ్రియమ్॥ భగవంస్తన్మమాచక్ష్వ వర్మ నారాయణాత్మకం। యథాతతాయినశ్శత్రూన్ యేన గుప్తోజయన్మృధే॥ శ్రీశుకః॥ వృతః పురోహితస్త్వాష్ట్రో మహేంద్రాయానుపృచ్ఛతే। నారాయణాఖ్యం వర్మాహ తదిహైకమనాశ్శృణు॥ విశ్వరూపః॥ ధౌతాంఘ్రిపాణిరాచమ్య సపవిత్ర ఉదఙ్ముఖః। కృతస్వాంగకరన్యాసో మంత్రాభ్యాం వాగ్యతశ్శుచిః॥ నారాయణమయం వర్మ సన్నహ్యేద్భయ ఆగతే। దైవభూతాత్మకర్మభ్యో నారాయణమయః పుమాన్॥ పాదయోర్జానునోరూర్వోరుద

బున శిరంబున నిట్లు షడంగంబులం బ్రణవపూర్వకంబై నయష్టాక్షరమంత్రరాజంబు న్యాసంబుఁ జేసి ద్వాదశాక్షరవిద్యచేతఁ గరన్యాసంబుఁ జేసి మంత్రమూర్తినై ప్రణవాదియకారాంతమగు మహామంత్రంబుచేత నంగుళ్యంగుష్ఠపర్వసంధులయందుపన్యసించి మఱియు హృదయంబున నోంకారంబు వికారంబు మూర్ధ్నియందు షకారంబు భ్రూమధ్యంబునందు ణకారంబు శిఖయందు వేకారంబు నేత్రంబులయందు నకారంబు సర్వసంధులయందు మఱియు నస్త్రము నుద్దేశించి మకారంబు నున్యసించి నేని మంత్రమూర్తియగు మఱియు నస్త్రాంతియ ఫట్, అను మంత్రంబున దిగ్బంధనంబుఁ జేసి పరమేశ్వరునిఁ దన భావంబున నిల్పి విద్యామూర్తియుఁ దపోమూర్తియు నగు షట్ఛక్తిసంయుతంబయిన నారాయణకవచాఖ్యమైన నీమంత్రరాజంబు నిట్లు నిపఠించె॥ చ॥ గరుడుని మూఁపుపైఁ బదయుగంబు ఘటిల్లఁగ శంఖచక్రవ। ర్మరుచిరశార్ఙ్గఖడ్గశరరాజితపాశగదాదిసాధనో। త్కరనికరంబులాత్మకరకంజములన్ ధరియించు భూతిసం। భరితమహాష్టబాహుఁడు కృపామతితో ననుఁ గాచుఁగావుతన్॥ గీ॥ ప్రకటమకరవరుణపాశంబులందుల। జలములందు నెందుఁ బొలయకుండఁ। గాచుఁగాక నన్ను ఘనుఁడొకండైనట్టి। మత్స్యమూర్తి విద్యమానకీర్తి॥ క॥ వటుఁడు సమాశ్రితమాయా। నటుఁడు బలిప్రబలశోభనప్రతిఘటనోద్భటుఁడు త్రివిక్రమదేవుఁడు। చటులస్థలమందు నన్ను సంరక్షించున్॥ చ॥ అడవుల సంకటస్థలుల నాజిముఖంబుల నగ్నికీలలం। దెడరుల నెల్ల నాకు నుతికెక్కఁగఁ దిక్కగుఁగాక శ్రీనృసిం। హుఁడు కనకాక్షురాక్షసవధోగ్రుఁడు విస్ఫురితాట్టహాసవ। క్త్రుఁడు ఘనదంష్ట్రపావకవిధూతదిగంతరుఁ డప్రమేయుఁడై॥ చ॥ అరయఁగ నెల్లలోకములు నంకిలి నొందమహా

---

రేఫ హృద్యథోరసి। ముఖే శిరస్యానుపూర్వ్యాద్యోంకారాదీని విన్యసేత్॥ ఓం-నమో నారాయణాయేతి విపర్యయమథాపి వా। కరన్యాసం తతః కుర్యాద్ద్వాదశాక్షరవిద్యయా। ప్రణవాదియకారాంతమంగుళ్యంగుష్ఠపర్వసు॥ న్యసేద్ధృదయ ఓంకారం వికారమను మూర్ధని। షకారం తు భ్రువోర్మధ్యే ణకారం శిఖయా న్యసేత్॥ వేకారం నేత్రయోర్యుంజ్యాన్నకారం సర్వసంధిషు। మకారమస్త్రముద్దిశ్య మంత్రమూర్తిర్భవేద్బుధః। సవిసర్గం ఫడంతం తు సర్వదిక్షు వినిర్దిశేత్॥ ఓం విష్ణవే నమః॥ ఇత్యాత్మానం పరం ధ్యాయేద్ధ్యేయం షట్ఛక్తిభిర్యుతం। విద్యాతేజస్తపోమూర్తిమిమం మంత్రముదాహరేత్॥ ఓం-హరిర్విదధ్యాన్మమ సర్వరక్షాం- న్యస్తాంఘ్రిపద్మః పతగేంద్రపృష్ఠే। దరారిచర్మాసిగదేషుచాప-పాశాన్దధానోష్టగుణోష్టబాహుః॥ జలేషు మాం రక్షతు మత్స్యమూర్తి-ర్యాదోగణేభ్యో వరుణస్య పాశాత్। స్థలేషు మాయావటువామనోవ్యా- త్త్రివిక్రమః ఖేవతు విశ్వరూపః॥ దుర్గేష్వటవ్యాజిముఖాదిషు ప్రభుః- పాయాన్నృసింహోసురయూథపారిః। విముంచతో యస్య మహాట్టహాసం- దిశో వినేదుర్న్యపతంశ్చ గర్భాః॥ రక్షత్వసౌ మాధ్వని యజ్ఞకల్ప- స్వదంష్ట్రయోన్నీతధరో వరాహః। రామోద్రికూటేష్వథ విప్రవాసే- సలక్ష్మణోవ్యాద్భరతాగ్రజోస్మాన్॥ మాముగ్రధర్మాదఖిలాత్ప్రమాదాన్నారాయణః పాతు నరశ్చ హాసాత్। దత్తస్త్వయోగాదథ యోగనాథః- పాయాద్గుణేశః కపిలః కర్మ[illegible]ధాత్॥ సనత్కుమారోవతు కామదేవా- ద్ధయాననో మాం పథి దేవహేళనాత్। దేవర్షివర్యః పురుషార్చనాంతరా- త్కూర్మో హరిర్మాం నిరయాదశేషాత్॥ ధన్వంతరిర్భగవాన్పాత్వపథ్యాద్ద్వంద్వాద్భయాదృషభో నిర్జితాత్మా। యజ్ఞశ్చ లోకాదవతాజ్జనాంతా- ద్బలో గణాత్క్రోధవశాదహీంద్రః॥ ద్వైపాయనో భగవానప్రబోధా- ద్బుద్ధశ్చ పాషండగణాత్ప్రమాదాత్। కల్కిః కలేః కాలమలాత్ప్రపాతు ధర్మావనాయోరుకృతావతారః॥ మాం కేశవో గదయా ప్రాతరవ్యాద్గోవింద ఆసంగవమాత్తవేణుః। నారాయణః ప్రాహ్ణ ఉదాత్తశక్తిర్మధ్యందినే విష్ణురరీంద్రపాణిః॥ దేవోపరాహ్ణే మధుహోగ్రధన్వా- సాయం త్రిధామావతు మాధవో మాం। దోషే హృషీకేశ ఉతార్ధరాత్రే- నిశీథ ఏకోవతు పద్మనాభః॥ శ్రీవత్సధామాపరరాత్ర ఈశః- ప్రత్యూష ఈశోసిధరో జనార్దనః। దామోదరోవ్యాదనుసంధ్యం ప్రభాతే విశ్వేశ్వరో భగవాన్ కాలమూర్తిః॥ చక్రం యుగాంతానలతిగ్మనేమి- భ్రమత్సమంతాద్భగవత్ప్రయుక్తం। దందగ్ధి దందగ్ధ్యరిసైన్యమాశు- కక్షం యథా వాతసఖో హుతాశః॥ గదేశనిస్పర్శనవిస్ఫులింగే- నిష్పిండి నిష్పిండ్యజితప్రియాసి। కూష్మాండవైనాయకయక్షరక్షో- భూతగ్రహాంశ్చూర్ణయ చూర్ణయారీన్॥ త్వం యాతుధానప్రమథప్రేతమాతృపిశాచవిప్రగ్రహఘోరదృష్టీన్। దరేంద్ర విద్రావయ కృష్ణపూరితో- భీమస్వనారేర్హృదయాని కంపయ॥ త్వం తిగ్మధారాసివరారిసైన్యమీశప్రయుక్తో మమ ఛింధి ఛింధి। చక్షూంషి చర్మన్ శతచంద్ర ఛాదయ ద్విషామఘోనాం హర పాపచక్షుషామ్॥ యన్నో భయం గ్రహేభ్యోభూత్కేతుభ్యో నృభ్య ఏవ చ। సరీసృపేభ్యో దంష్ట్రిభ్యో భూతేభ్యోంహోభ్య ఏవ చ॥ సర్వాణ్యేతాని భగవన్నామరూపాస్త్రకీర్తనాత్। ప్రయాంతు సంక్షయం సద్యో యే నః శ్రేయః ప్రతీపకాః॥ గరుడో భగవాన్ స్తోత్రస్తోభశ్ఛందోమయః ప్రభుః। రక్షత్వశేషకృచ్ఛ్రేభ్యో విష్వక్సేనః స్వనామభిః॥ సర్వాపద్భ్యో హరేర్నామరూపయానాయుధానినః। బుద్ధీంద్రియమనః ప్రాణాన్ పాంతు పార్షదభూషణాః॥ యథా హి భగవానేవ వస్తుతః సదసచ్చ యత్। సత్యేనానేన నః సర్వే యాంతు నాశముపద్రవాః॥ యథైకాత్మ్యానుభావానాం వికల్పరహితః స్వయం। భూషణాయుధలింగాఖ్యా ధత్తే శక్తీః స్వమాయయా॥ తేనైవ సత్యమానేన సర్వజ్ఞో భగవాన్ హరిః। పాతు సర్వైః స్వరూపైర్నః సదా సర్వత్ర సర్వగః॥ విదిక్షు దిక్షూర్ధ్వమధః సమంతాదంతర్బహిర్భగవాన్నారసింహః। ప్రహాపయఁల్లోకభయం స్వనేన స్వతేజసా గ్రస్తసమస్తతేజాః॥ శ్రీవిశ్వరూపః॥ మఘవన్నిదమాఖ్యాతం వర్మ నారాయణాత్మకం। విజేష్యస్యంజసా యేన దంశితోసురయూథపాన్॥ ఏతద్ధారయమాణస్తు యం యం పశ్యతి చక్షుషా। పదా వా సంస్పృశేత్సద్యః సాధ్వసాత్స విముచ్యతే॥ న కుతశ్చిద్భయం తస్య విద్యాం ధారయతో భవేత్। రాజదస్యుగ్రహాదిభ్యో వ్యాధ్యాదిభ్యశ్చ కర్హిచిత్॥ ఇమాం విద్యాం పురా కశ్చిత్కౌశికో ధారయన్ ద్విజః। యోగధారణయా స్వాంగం జహౌ స మరుధన్వని॥ తస్యోపరి విమానేన గంధర్వపతిరేకదా। యయౌ చిత్రరథః స్త్రీభిర్వృతో యత్ర ద్విజక్షయః॥ గగనాన్న్యపతత్సద్యః సవిమానో హ్యవాక్ఛిరాః। స వాలఖిల్యవచనాదస్థీన్యాదాయ విస్మితః॥ ప్రాస్య ప్రాచీసరస్వత్యాం స్నాత్వా ధామ స్వమన్వగాత్। య ఇదం శృణుయాత్కాలే యో ధారయతి చాదృతః। తం నమస్యంతి భూతాని ముచ్యతే సర్వతో భయాత్॥ శ్రీశుకః॥ ఏతాం విద్యామధిగతో విశ్వరూపాచ్ఛతక్రతుః। త్రైలోక్యలక్ష్మీం బుభుజే వినిర్జిత్య మృధేసురాన్॥..........

... నారాయణవర్మోపదేశో నామాష్టమోధ్యాయః.

ర్ణవంబులలో నొంటిగినిమగ్నమైనధరనుద్ధతిఁగొమ్మున నెత్తినట్టియా । కిరిపతియగ్నికల్పుఁడురుఖేలుఁడు నాశ్రిత మేదినీమనో । హరుఁడు కృపావిధేయుఁడుపథాధ్వములన్ననుఁగాచుఁగావుతన్ ॥ క ॥ రాముఁడు రాజకులైకవి । రాముఁడు భృగుసత్కులాభిరాముఁడు సుగుణస్తోముఁడు నను రక్షించును । శ్రీమహితోన్నతుఁడు నద్రిశిఖరములందున్ ॥ సీ ॥ తాటకీమర్దించి చితపసిజన్నముఁగాఁచి హరువిల్లువిఱిచి ధైర్యమున మెఱసి । ప్రబలులైనట్టి విరాధకబంధోగ్రఖరదూషణాది రాక్షసులను నిమి । వానరవిభునేలి వాలిఁగూలఁగనేసి జలరాశిగర్వంబుఁ జక్కఁజేసి । సేతువుబంధించి చేరి రావణకుంభకర్ణాదివీరులం గడిమిఁద్రుంచి । యవ్విభీషణులంకకునధిపుఁజేసి । భూమిసుతఁగూడి సాకేతపురమునందు । రాజ్యసుఖములు గైకొన్నరామవిభుఁడు । వరుసననుఁబ్రోచుచుండుఁబ్రవాసగతుల ॥ వ ॥ మఱియు నఖిలప్రమాదంబులైనయభిచారకర్మంబులవలన నారాయణుండును గర్వంబువలన నరుండును యోగభ్రంశంబువలన యోగనాథుండయిన దత్తాత్రేయుండును కర్మబంధంబువలన గణేశుండైన కపిలుండును గామదేవునివలన సనత్కుమారుండును మార్గంబుల దేవహేళనంబుఁ జేయుటవలన శ్రీహయగ్రీవమూర్తియును దేవతానమస్కారతిరస్కార దేవపూజాచ్ఛిద్రంబులవలన నారదుండును నశేషనిరయంబులవలనఁ గూర్మంబును నపథ్యంబువలన భగవంతుండైన ధన్వంతరియును జనాపవాదంబువలన యజ్ఞదేవుండును జననమగణామలం గలుగఁజేయుకర్మంబులవలన బలభద్రుండును గాలంబువలన యముండును సర్పగణంబులవలన శేషుండును ప్రబోధంబువలన ద్వైపాయనుండును పాషండసమూహంబువలన బుద్ధదేవుండును శనైశ్చరునివలనఁ గల్కియును ధర్మరక్షణపరుండయిన మహావతారుండును నన్నురక్షించుఁగాత ప్రాహ్ణమధ్యాహ్నపరాహ్ణసాయంకాలంబులను ప్రదోషార్ధరాత్రాపరరాత్రప్రత్యూషానుసంధ్యలను గదాద్యాయుధంబులుధరియించి కేశవనారాయణగోవిందవిష్ణుమధుసంహరత్రివిక్రమవామనహృషీకేశపద్మనాభ శ్రీవత్సధామసర్వేశ్వరయోగేశజనార్దనవిశ్వేశ్వరకాలమూర్తియను నామరూపంబులుగలదేవుండు నన్నురక్షించుఁ బ్రళయకాలానలతీక్ష్ణసంభ్రమభ్రమణనిర్వక్రవిక్రమాక్రమావక్రీకృతదనుజచక్రంబైన సుదర్శననామచక్రంబ మహావాయుప్రేరితంబై హుతాశనుండు నీరసతృణాటవులభస్మీభూతంబు సేయు భంగి భగవత్ప్రయుక్తంబై మద్వైరిసైన్యంబులదగ్ధంబుగావింపుము జగత్సంహారకాలఘటితచటులమహోత్పాత గర్జారవపర్జన్యవిశాభివర్జితఘనఘనాంతరనిష్ఠ్యూతనిష్ఠురకోటిశతకోటిసంస్పర్శస్ఫురద్విస్ఫులింగనిర్గమానర్గళభుగభుగాయమానమూర్తివిస్ఫూర్తినారాయణకరకమలవర్తిగదాయుధోత్తమమదీయవైరితండోపతండంబుల భండనంబులం జండగతిం బిండిగాఁగూశ్మాండవైనాయకరక్షోభూతగ్రహంబులంజూర్ణంబులుగాఁగొండొకవినోదంబు సలుపుము పరేంద్రుండవైన పాంచజన్యంబ సర్వలోకజిష్ణుండయిన శ్రీకృష్ణునిముఖపుణ్యైకసదనపవననిష్ఠ్యూతనిశ్వాసాధరవేణుపరిపూరితంబవై యున్మత్తభూతప్రేతపిశాచవిప్రగ్రహాదిక్రూరదుర్గ్రహంబులవిద్రావణంబుగా నస్మత్పరవీరమండలంబుల గుండియలతోడదీయమానినీమర్భరగర్భంబులు గర్భస్థార్భకవివర్జితంబులుగా నవియ బ్రహ్మాండభాండభీకరంబయిన భూరినాదంబున మోహమతితీవ్రధారాదళితనిశాటకోటికఠోరకంఠకరాళరక్తధారాధౌతమలీమసవిసరంబవైన నందకమహాసిశేఖరంబ జగదీశప్రేరితంబవయి మద్విద్విషవిషమవ్యూహంబులమెండు ఖండములుగఖండించి చెండాడుము నిష్కళంకనిరాతంకసాంద్రచంద్రాకారమండలపరిమండితసర్వాంగలక్షణవిచక్షణ ధర్మనిర్మితంబవైన చర్మంబ మర్మదమద్వైరిలోకంబులకు సమాపులక్ష్మిబిడ నీరంధ్రనిష్ఠురగమనకసబలపటుఘటనంబులం గుటిలపఱుపుము నిఖిలపాపగ్రహంబులవలనన కలనరమృగసర్పక్రోడభూతాదులవలనన గుభయంబులు వొందకుండ భగవన్నామరూపయానదివ్యాస్త్రంబులు రక్షించుఁగాక బృహద్రథంతరాదిసామంబులచేత స్తోత్రంబు సేయంబడుచున్న ఖగేంద్రుండు రక్షణదక్షుండయి నన్నురక్షించుఁగాక శ్రీహరినామరూపవాహనదివ్యాయుధపారిషదోత్తమప్రముఖంబులస్మదీయబుద్ధీంద్రియమనఃప్రాణంబుల సంరక్షించు భగవంతుండైన శేషుండు సర్వోపద్రవంబుల నాశంబు సేయు జగదైక్యభావంబైన ధ్యానంబుగలవానికి వికల్పరహితుండై భూషణాయుధలింగాఖ్యలగు శక్తులం దన మాయచేత ధరియించి తేజరిల్లుచుండు లక్ష్మీకాంతుండు వికల్పవిగ్రహంబులవలన నన్నురక్షించుఁగాక లోకభయంకరాట్టహాసభాసురవదనగహ్వరుండగుచు సమస్త తేజోహరణధురీణ తేజఃపుంజసంజాతదివ్యనృసింహావతారుండగు నప్పరమేశ్వరుండు సర్వదిగ్భాగంబులవలన నను రక్షించుచుండుఁగాక యని నారాయణాత్మకకవచప్రభావం బితిహాసరూపంబున నింద్రుండు దెలిసికొని ధ్యానంబుఁ జేసి తద్విద్యాధారణమహిమవలన నరాతులనిర్జించెం గావున నెవ్వరేని నిర్మలాత్ములగువారలేతద్విద్యాధారణులై యనుదినంబును బఠియించిన నతిఘోరరణంబులనత్యుత్కటసంకటంబులను సర్వగ్రహనిగ్రహకర్మమారణకర్మాదిదుష్కర్మజన్య క్లేశంబులను వదిలియ

వ్యాకులమనస్కులై విజయంబు నొందుదురు మఱియును సర్వరోగంబులకు నగమ్యశరీరులై సుఖంబు నొందుదు రదియునుం గాక॥ సీ॥ అతిభక్తిఁ గౌశికుం డను బ్రాహ్మణుండు దొల్లి యీ విద్య ధరియించి యెలమి మించి। మరుభూమియందు నిర్మలచిత్తుండై యోగధారణంబున బిట్టు తనువు విడిచె। దాని పై నొకఁడు గంధర్వవరేణ్యుండు చిత్రరథాఖ్యుఁడ జేయుఁడొంటిఁ। జదలం జనంగఁ దచ్ఛాయ వదస్థి పైఁ గదిసిన నాతఁడు గళవళించి। యువిదపిండుతోడ నవవిమానముతోడఁ। దనదు విద్యతోడ ధరణిఁ ద్రెళ్లి తిరిగి లేవలేక తికమకగుడువంగ। వాలఖిల్యమౌని వానిఁ జూచి॥ క॥ నారాయణకవచసమా। ధారణపుణ్యాస్థి దీని డగ్గఱనీకుం। గూరెడి నెపిష్ణుభక్తుల। వారక చేరంగ నెట్టివారికిఁ దరమే॥ ఇంద్రవజ్రం॥ సంధించి నీయంగకసంధులెల్లన్। స్సంధించినన్మంత్రబలంబు పేర్మిన్। అందంబు మాన్పింపఁ దదన్య మేది। సింధుప్రవాహూన్నతిచేతఁ దీర్పున్॥ వ॥ కావున నీ పుణ్యాశల్యంబులు భక్తియుక్తుండవై కైకొనిపోయి ప్రాఙ్ముఖంబునఁ బ్రవహించెడు సరస్వతీజలంబుల నిక్షేపణంబుఁ జేసి కృతస్నానుండవై యాచమనంబు చేసిన నీ సర్వాంగబంధనంబులుడుగు ననిన నతండట్ల చేసి తన విమానంబెక్కి నిజస్థానంబునకరిగెం గావున॥ క॥ అనుదినము దీని నెవ్వరు వినిరేనిఁ బఠించిరేని విస్మయ మొదవ। న్ఘనభూతజాలమెల్లను। మునుకొని వారలను గాంచి మ్రొక్కుచునుండున్॥ గీ॥ విశ్వరూపువలన నైశ్వర్యకరమైన। యిట్టి విద్యఁ దాల్చి యింద్రుఁడపుడు। మూఁడులోకములకు ముఖ్యమై యట్టి శ్రీ। ననుభవించి మించె నధికమహిమ॥ సీ॥ భూపాల యా విశ్వరూపునకు రుదైన తలలు మూఁడనువొందదగిలి యుండు। సౌరదిసురాపానసోమపానంబులు నన్నాదమునఁగను నమరవరులతోఁ గూడి భుజియించి యూకొని వారితో యజ్ఞభాగంబు ప్రత్యక్షమొంది। కైకొనుచుండి మహాగ్రుఁడై యా యజ్ఞభాగంబు రాక్షసప్రవరులకును। దల్లిమీఁదఁ గలుగు తాత్పర్యవశమున। దివిజవరుల మొఱఁగి తెచ్చి యిచ్చు। నది యెఱింగి యింద్రుఁ డతిభీతచిత్తుఁడై। తనకుఁ గానియతని తలలు ద్రుంచె॥ క॥ భాసురుఁ డనక మహాత్మా। గ్రేసరుఁ డనక మరపి భూఁడు ప్రియకర్మగతి। న్వేసరుఁ డనక మహేంద్రుఁడు భూసురు తలలవుడురోషమునఁ దెగనడచెన్॥ వ॥ ఇట్లయ్యింద్రుండు క్రోధంబు సహింపంజాలక విశ్వరూపు తలలు ఖడ్గంబునం దెగనడిచిన సోమపానంబు సేయు శిరంబు కపింజలంబయ్యె సురాపానంబు సేయు శిరంబు కలవింకంబయ్యె నన్నంబు భక్షించు శిరంబు తిత్తిరియయ్యె నిట్లు త్రివిధపక్షిస్వరూపంబు దాల్చి బ్రహ్మహత్యయే తెంచి యింద్రునిఁ జుట్టుకొని తమ్ముఁ బరిగ్రహింపుమని నిర్బంధింపనపుడింద్రుండతిభీతచిత్తుండయి త్రిలోకనాయకుండయి సందానిం దప్పించుకొనంజాలక యంజలి యొగ్గి యమ్మహాదోషంబుఁ గైకొని యొందద్దోషంబొక్క సంవత్సరంబనుభవించి యంతం బాపుకొనువాఁడై భూజలవృక్షస్త్రీలం బ్రార్థించి దుష్కరితంబు చతుర్విధంబులం బంచ్చికొమ్మనిన భూమి తనయందుఁ జేయంబడిన ఖాతంబు తనంతన పూడునట్టి వరంబును, జలంబులు సర్వంబు తనయందుఁ బ్రక్షాళితంబయి నంబావనంబగునను వరంబును, వృక్షంబులు భేదింపంబడి పునః ప్రరోహంబు గలుగునను వరంబును, స్త్రీలెల్ల పురుషసంగమమునకుఁ గామసుఖంబు గలుగునను వరంబును గోరిన నతండట్లకాక యని యొసంగిన నతని మహాపాతకంబు ధరణి నెఱియ, యూషరక్షేత్రంబుల విధంబున నుదకంబు, బుద్బుదఫేనరూపంబునను, మహీరుహంబులు, నిర్యాసభావంబున, నింతులు రజస్స్వలవికారంబున, నిట్లు చతుర్భాగంబులం బంచికొనిరంత॥ మ॥ హతపుత్రుండగు విశ్వరూపజనకుండా త్వష్ట దుఃఖాయతో। ద్ధతరోషానలదహ్యమానుఁడగుచుం దానింద్రుపై మారణ। క్రతుహోమంబు నొనర్పనందుఁ బొడమెం గల్పాంతకాకారవి। శ్రుతకీలానలనిష్ఠురేక్షణ గుణక్షుభ్యత్త్రిలోకోగ్రుఁడై॥ సీ॥ యుగము గ్రుంగెడునాఁడు జగములు వోలియించునంతకు మూర్తి పైనింతయగుచుఁ। బరపును నివుడును బ్రతిదినంబును నొక్కశరపాతమంగంబు విరివిఁ గొనుచుఁ। గడుదగ్ధశైలసంకాశదేహమునందుఁ గరము సంధ్యారాగకాంతి మెఱయ। మును గాఁక రాగి చేఁగను మించు మంచులకఱకు మీసలు కచాగ్రములు మెఱయఁ। జండమధ్యాహ్నమార్తాండమండలోగ్ర। చటులనిష్ఠురలోచనాంచలవిఘాత। దశదిశాభాగుఁ డుజ్జ్వలతరకరాళ। భిదురసునిశితదంష్ట్రికుపవనగుహుఁడు॥ ఉ॥ నింగికి నేలకుం బొడవునిట్టలమై శిఖలందుఁ బర్వను। త్తుంగతరాగ్నిజాలములఁ దొట్రిలుచున్న త్రిహపక్ష్ర జారని। స్సంగకరాళశాతఘనసద్ఘృణిమండలచండశూలము। ప్పొంగుచుఁ గేలఁ బూనఁగొని భూమి చలింపఁగ సోలియాడుచున్॥ సీ॥ పదఁపడి విరివిగా వదనంబుఁ దెరచుచు నాకాశమంతయు నప్పళించుఁ। గడునాల్క నిగుడించి గ్రహతారకంబుల నయమెల్లఁ దిగజార నాకికొనుచు। నలవోకయును బోలె నట్టహాసమునకు మెఱసి లోకములెల్లఁ ద్రిమ్మంగఁ జూచుఁ। దనరు దిగ్దంతిదంతములు చెక్కలు వారను గ్రుడంష్ట్రిలు త్రిప్పను మిక్కిలి। త్వష్టబలితంపు తపమున సృష్టి నొంది। యఖిలలోకంబులెల్లఁ దానాక్రమించి। వృత్రనామాఖ్యదేవతాశత్రుఁ డగుచు। దారుణాకారుఁ డఖిలదుర్దముఁడు మెఱసె॥ మత్తకోకిల॥ అట్టి వృత్రునిమీఁద దేవతలల్కతోఁ జెనుమూఁకలై। చుట్టుముట్టి మహాస్త్రవిద్యలు సూపి మేపున నేయనా। గొట్టి పీఁడువారలేసిన క్రూరశస్త్రములన్నియుం।

జుట్టిపట్టుక త్రుంగిశూరత జోక నార్చెమహోగ్రుఁడై ॥ క॥ భక్షితదివ్యాస్త్రుండగు। రక్షోనాయకుని నమరరాజప్రముఖుల్ వీక్షింప వెఱచి పఱచిరి। రక్షకుఁ జింతించికొనుచు రయమొప్పారన్ ॥ వ॥ ఇట్లు సర్వసాధనంబులతోడ సాధుజనంబుల, వృత్రాసురుండు త్రుంగిన, నచ్చెరువడి, చేయునది నేరక, తత్తేజోవిశేషవిభవంబునకు, భయంబునొంది, కందిన డెందంబునం గుందుచుఁ బురందరప్రముఖులార్తరక్షకుండగు, పుండరీకాక్షునకుం, గుయ్యిడువారలై ॥ లయగ్రాహి॥ పేఁడుకడుపుగ్దముఁడు వాఁడిమనకై దువులు వాడి చెడఁగా మెసవియాడుఁగనకున్నాఁ। డేడబ్రతుకెంకెఁ జెనకీడు వోడ మెన్మనకుఁ దోడుపడనెక్కరుఁడు లేఁడు హరిదక్క। స్వేదమము శ్రీనరుని గాడు దముసన్నుటులఁ బాడుదము గీతములఁ జాడపడునంతే, న్వాడిచెడ త్రోవదయతోడ నెటిగించు ఘనుఁ డోడక సురాలయము పాడువడదింకన్ ॥ క॥ అనితలపోయుచుఁ దమలో। నునుకుచుఁ దికమకలు గొనుచు మురరిపుకడకు। న్గునుకుచుఁ దినుకుచు నేగిరి। ఘనరాక్షసుఁ గన్నఁ గన్నుఁగవ బెగ్గిలఁగన్ ॥ వ॥ ఇట్లు భయార్తులై యమర్త్యవ్రాతంబు, చనిచని ముందట, నభంగభంగరంగదుత్తుంగ, డిండీరమండలసముద్దండాడంబర, విడంబితనారాయణనిరంతరకీర్తిలతాకుసుమ, గుచ్ఛ స్వచ్ఛంబు, ననవరతగోవిందచరణారవింద సేవాసమాకుల, కలకలఘటితమహాపుణ్యఫలాయమాన, సముద్దీపితావర్తవర్తితదక్షిణావర్తరుచిరశంఖమండలమండితంబును, నతినిష్ఠురకఠినపాఠీనపృథురోమరాజసంకుల, తిమితిమింగిలకర్కట, కమఠకచ్ఛప, మకరనక్రవక్రగ్రహగ్రహణ। ఘుమఘుమారావదారుణగమన, విషమితవిషమతరంగసుట్టనఘట్టితసముత్తుంగశీకరనికర, నీరంధ్రతారకిత, తారాపథంబును, నుహిమాచ్ఛ్రియశిలోచ్చయశిఖరాగ్రప్రవహిత, దుగ్ధనిర్ఝరసమ్మార్జిత, పురాణపురుషవిశుద్ధ, శుద్ధాంతవిహరణధురీణ, నవసుధాధౌతధావళ్యధగద్ధగాయమాన, రమ్యహర్మ్యనిర్మాణకర్మంబు, నతిపవిత్రగుణవిచిత్రనిజకళత్ర, ప్రేమానందసందర్శిత, ముకుందపదప్రవదంతరంగకరుణారసపరిమిళితభావబంధురవిద్రుమవల్లీమతల్లికాంకురశోభితంబును, బ్రసిద్ధసిద్ధరసాంబువాహసంగమసముత్థితగంభీరఘోషపరిదూషితసకలరోదోంతరాళంబును, సముద్రమేఖలాఖిలప్రదేశవిలసితనవీనదుకూలాయమానంబును, హరిహరప్రముఖదేవతానిచయపరిలబ్ధామృతమహదైశ్వర్యదానధౌరేయమహానిధానంబును, వైకుంఠపురపారవగకామ్యఫలఫలితమందారపారిజాతసంతానకల్పవృక్షహరిచందనఘనవనానుకూలకూలంబునై యొప్పుచుఁగు బేరుభాండాగారంబునుం బోలెం బద్మమహాపద్మశంఖమకరకచ్ఛపముకుందకుందనీలవరసమగ్రంబై విష్ణుకరకమలంబునుం బోలె సుదర్శనావర్తప్రగల్భంబై కైలాసమహీధరంబునుం బోలె నమృతకళాస్థానశేఖరపదార్పణంబై యింద్రవైభవంబునుం బోలె కల్పవృక్షకామధేనుచింతామణిజనితంబై సుగ్రీవసైన్యంబునుం బోలె నపరిమితనిబిడహరిసంచారంబై నారాయణోదరంబునుం బోలె నిఖిలభువనభారభరణసమర్థంబై శంకరుజటాజూటంబునుం బోలె గంగాతరంగిణీసమాశ్రయంబై బ్రహ్మలోకంబునుం బోలెఁ బరమహంసకులసేవ్యంబై పాతాళలోకంబునుం బోలె ననంతభోగిభోగయోగ్యంబై నందనవనంబునుం బోలె నైరావతమాధవీరంభాదిసంజననకారణంబై సౌదామినీనికరంబునుం బోలె నభ్రంకషంబై విష్ణునామకీర్తనంబునుం బోలె నిర్మలస్వభావంబై క్రతుశతగతుండునుం బోలె హవిపదభాజనంబై యొప్పుచున్న దుగ్ధవారాశిడాసి శ్వేతద్వీపంబున వసియించియందు సకలదిక్పాలకాది దేవతలు దేవదేవు నాశ్రయించి యిట్లనిస్తుతియించిరంత॥

సీ॥ పంచమహాభూతపరినిర్మితంబైన ముజ్జగంబులకెల్ల నొజ్జయైన। బ్రహ్మయు నేమును బరగనంజలుంగాడియెవ్వనికైవ్రాజలిత్తు మెపుడు। నట్టి సర్వేశ్వరుండాగమవినుతుండు సర్వాత్మకుండు మాకు శరణమగును। అహప్రాజ్ఞ తామసహంకారమారుసమునిశాంతుని గృపాస్పదుని గురుని। మానియన్యుని సేవింపఁ బూనువట్టి। కపటశీలుని యతిపాపకర్మబుద్ధి। శునకవాలంబు వట్టుక ఘనతరాబ్ధిఁ। దరియఁజూచుటగాదె తాఁ దామసమున॥ వ॥ ఉదకమయంబున న్నుసుధనోడగఁ జేసి తనర్చుకొమ్మున్ఠ। న్వదలక నంటఁగట్టి మనువల్లభుఁగాచిన మత్స్యమూర్తిసం। పదమున మమ్ముఁబ్రోచు ననుమానను మానఁగ వృత్రుచేతియా। పదదొలఁగించి నేఁడు నరపాలురపాలిటి భాగ్యదేవతై॥ మత్తకోకిల॥ సంతు సేయుచు వాతఘాతకరాళభంగురభంగము। ద్దాంతసంతతసాగరోదకతల్పమొందివసించుబ్ర। హ్మాంతవానిని బొడ్డుదమ్మిని నాదికాఁడిన నేర్పరిం। తంతవాఁడనరాని యొంటరి యాదరించుమమున్ గృపన్ ॥ గీ॥ దేవతలమైన మే మిట్టిదేవదేవు। సర్వలోకశరణ్యుని శరణుఁ జొచ్చి। బలితమైనట్టి పీనియాపదలఁ బాసి। మీఁద శుభములఁ జేకొను వారమిపుడు॥ వ॥ ఇట్లు స్తుతియించుచున్న దేవతల సుభక్తవత్సలుండైన వైకుంఠుండు ప్రసన్నుండయ్యె నప్పుడు॥ సీ॥ తగు శంఖచక్రగదాధరుండగువాని। శ్రీవత్సకౌస్తుభచిహ్నవానిఁ। గమనీయమాణిక్యఘనకిరీటము వానిదివ్యవిభూషణదీప్తివాని। మండితకేయూరకుండలంబులవాని సిరియురస్థలమునఁ జెలఁగువాని। దనుఁ బోలు సేవకతండంబు గలవానిజలుగై నపచ్చనిపలువవానిఁ। దెల్లదమ్మిపిరులఁ దెగడు కన్నులవాని। నవసుధాం

లయినవార లేలోకంబుల నెవ్వరికి నజేయులు గావున మీకు భద్రంబయ్యెడు నని భూతభావనుండయిన భగవంతుం డదృ
శ్యుండయ్యె నప్పుడు దేవతలు దధీచిమునికడకుం జనిన నత్తఱి యింద్రుం డిట్లనియె॥ గీ॥ దేహి సుఖము గోరు దేహంబు ఘటి
యించి। దేహి విడువలేడు దేహ మెపుడు। దేహి యస్మదీయ దేహంబుకొఱకునై। దేహ మీఁగదయ్య దేవతలకు॥ ఉ॥ ఎక్కడ నె
ల్లలోకముల నెవ్వరు గోరరు నీకొఱకై నేఁడు మా। తెక్కలిపాటుకై తివిరి దేహము వేఁడఁగ వచ్చినారమే మెక్కడఁ దీవ్రకర్మగ
తిమెక్కుడ దైవకృతంబు గాక నీ। త్రొక్కుడు దానమీవరుసఁ దోయక వేఁడుము రేఁజగంబులన్॥ క॥ నీచగతియెల్లభంగుల। యా
చకునసి తెలిసితగ నిదకుగుమ వేనిన్। యాచకవర్గము లోపల। నీచకులనఁబడరె యెంత నేర్పరులైనన్॥ క॥ అడుగంగ రానివ
స్తువు। లడుగరు బలిమాలి యెట్టి యిద్దులు నిను నే। నడిగితిమి దేహ మెల్లను। గడునడిగెడు వాని కేడఁగ గుణమహాత్మా॥ ఉ॥ నావు
డు నా దధీచియు మనంబున సంతసమంది నవ్వి సం। భావిత వాక్యపద్ధతులఁ బల్కుచు నిట్ల నెఁ బేర్మితోడ నో। దేవతలార ప్రాణుల
కుఁ దెక్కలి విస్మృత్యుభయంబు పూను టే। భావములందు లంపరు కృపామతి నెన్నఁడు మీ మనంబులన్॥ గీ॥ ఎలమిఁ బ్రతుకనిచ్చ
యుండిన వారికి। దేహ మెల్లభంగిఁ దీపు గాదె। యచ్యుతుండు వచ్చి యర్థించె నేనియుఁ। గన్న నిచ్చు నెట్టి దాతగలఁడె॥ అదియు
నుంగాక॥ సీ॥ అర్థంబు వేడెడు నర్థులు గలరు గాకంగంబు వేఁడెడి నర్థి గలఁడె। తగఁ గోరికల నిచ్చు దానశీలురు గల్గుదురు దేహ
మీ నేర్చు దాత గలఁడె। యీ నేర్చువాఁడు దన్నిచ్చినరోయక చంపెడు నట్టి యాచకుఁడు గలఁడె। చంపియుఁ బోవక శల్యంబు
లన్నియు నేఱి పంచుకపోవు వారు గలరె। రక్షణ లోకమెల్ల రక్షించు వారికి। హింస సేయు బుద్ధి మెట్టు వొడమె। భ్రాంతిరైన
యట్టి ప్రాణంబు పైఁ దీపి। తనువుఁ బోలి నెవరిఁ దలఁపవలదె॥ అనిన యింద్రుం డిట్లనియె। గీ॥ సర్వభూతదయాపర స్వాంతులకు
ను। బుణ్యవర్తనులగు మిమ్ముఁ బోటి వారికి। కమిత సత్కీర్తి కాములకు లఘుమతులకియ్యరాని పదార్థంబు లెవ్వి గలవు॥ గీ॥ అడుగరా
ని సొమ్ము లడుగరాదని మాన। డడుగు వాని మాటలడుగ నేల। భ్రాంతి నడుగుచోటఁ బ్రాణంబు లేనియు। నిచ్చువాఁడు దాపడిచ్చుఁ
గాని॥ వ॥ అని పరసంకటంబు దలంపక నిలింపులు కార్యపరతన్ వినయవాక్యపరంపరలఁ బ్రార్థించిన నతండు దరహసితవదనుం
డై యఖిలలోకధర్మం బెఱింగియు నొక్కింతగాలంబు మీ వాక్యంబు విచ్చిదిని సహింపందగుదుగు మీయట్టి వారలకుం బ్రియం
బగు నేని నెప్పుడైన విడువందగిన శరీరంబు విడుచుట యేమి దుర్లభంబు యధ్రువంబైన యీ దేహంబు చేతం గీర్తిసుకృతంబు
ల నెవ్వండార్జింపకుండు నతండు పాషాణాదులకంటె నతికఠినుం. మీయట్టి పుణ్యశ్లోకులచేత నాకాంక్షింపంబడిన శరీరంబ
ప్రమేయధర్మార్జితంబే దేహంబు చేతనైన ననుసకలభూతంబులు శోకానుభవంబున శోకించు హర్షానుభవంబున హర్షించు
నట్టి మహాకష్టదైన్యాకరంబైన శరీరంబు కాకి శునక సృగాలాదుల పాలుగాకుండ మేలయ్యె నని నిశ్చితాత్ముండయి దధీచి దిగ
త్వావలోకనంబు చేత నిరసితబంధనుండై బుద్ధీంద్రియమానసంబులతోఁ గూడిన క్షేత్రజ్ఞుని పరబ్రహ్మస్వరూపంబైన భగ
వంతునందు నేకీభూతంబుఁ జేసి యోగజ్ఞానంబున శరీరంబు విడిచె నప్పుడింద్రుండతని శల్యంబుల విశ్వకర్మనిర్మితంబైన నిశి
తశతధారాసమావృతంబై వెలుంగు వజ్రాయుధంబుఁ గైకొని భగవత్తేజోపబృంహితుండయి యైరావతారూఢుండై సక
లదేవోత్తమ గరుడ గంధర్వ ఖచర కిన్నర కింపురుష సిద్ధ విద్యాధర పరిసేవితుండై సకలమునిజనంబులు వినుతింప త్రిలోకహ
ర్షకారియై భగవదనుగ్రహసంప్రాప్తమహోత్సాహవికసితవదనారవిందుండయి వృత్రాసురు పైనడిచె నప్పుడు॥ ఉ॥ వృ
త్రుఁడు మానవాన్వయపవిత్రుఁడు లోకజిఘాంసకక్రియా। సూత్రుఁడు నిగ్రహాగ్రహణసుస్థిర వాక్యవివేకమానచారి
త్రుఁడు దేవతోరగదరీకృతవస్త్రిఃపురోషదూషితామిత్రుఁడు శత్రురాకఁ గని మిక్కిలియైనయుగాంతకాకృతిన్॥ క॥ మెం
దుగల దనుజనాయక। మండలములు గొల్వ నడిచె మహిమోద్ధతి వే। దండములనడుమఁ జనునడ గొండయనుం బోలెని బిడౌజో
పోద్ధతుఁడై॥ క॥ కాలగళుఁడ దరికదువడిఁ। గాలుని పైఁ గవయు మార్కి ఖరతరరవసం। చాలిత పూర్వదిగంతరుఁ। డై లీలమహేం
ద్రు మీఁద నతఁ డరిగెన్ నృపా॥ వ॥ ఇట్లు రుద్రగణంబులు మరుద్గణంబులు నాదిత్యగణంబులశ్వినీదేవతలు పితృదేవతలు విశ్వేదే
వులు వహ్నియు ఋభువులు వరుణవాయు కుబేరేశానాదులు సిద్ధ సాధ్య కిన్నర కింపురుష గరుడ గంధర్వ ఖేచర ప్రముఖం
బులగు నింద్రసైన్యంబులతోడ నముచియు శంబరుండ నర్వుండును ద్విమూర్ధుండును వృషభుండును హయగ్రీవుండును
శంకుశిరుండును విప్రచిత్తియు నయోముఖుండును బులోముండును వృషపర్వుండును హేతియుఁ బ్రహేతియు నుత్కటుం
డును ధూమ్రకేశుండును విరూపాక్షుండును గపిలుండును విభావసుండును నిల్వలుండును బల్వలుండును దందశూకుండును
వృషధ్వజుండును గాలనాభుండును మహానాభుండును భూతసంతాపనుండును వృకుండును సుమాలియు మాలియు మున్న
గు దైతేయ దానవ యక్ష రాక్షసాద్యసంఖ్యలగు వృత్రాసురబలంబులుఁ దలపడి సమరంబుఁ జేసిరప్పుడు॥ చ॥ అసురులకున్న
రావళికి నయ్యె మహారణమప్పుడొండొరు। ల్ముసలగదాసికుంతశరముద్గరతోమరభిండివాలపట్టిసపటుశూలచక్రములడం

ధియిఁబాసిసమరధర్మముమానితలంగఁబాడియే। మల్లుఁడుదుర్గమప్రధనమత్తునివృత్రునిపోటులుంగరే॥ క॥ చావుధ్రువమైన
ప్రాణికిఁ।జావులురెండరసికొనుఁడుసమరమునందు।న్భావింపయోగమందును।జావంగాలేనిచెడుగుచావుంజావే॥ వ॥ అ
నివాసుదేవతేజోవిశేషవిశేషితులై దవానలకీలలంబోలె వెలుంగుచు వెఱచి వెన్నిచ్చి పాఱెడు నసురుల వెనుకొని తఱుము
సురవీరులంజూచి హుంకరించి స్వర్గానుభవంబు ననిచ్చలేకుండెనే నిను మదవలోకనస్పర్శనమాత్రంబు ముందర నిలుతురు గా
కయని యేచి కల్పాంతానల్పఘనఘనాటోపంబునుంబోలెఁ గఠోరకంఠరవహుంకారతర్జనంబులం గద్దిల్లుచుఁ బ్రళయకాలప
వనపరిభావితమహాశిఖిశిఖావళులం దృణీకరించు కుటిలావలోకనంబుల నాలోకించుచుం గాలపరిపక్వలీలాలోలుండయిన
శూలిపోలికె నాభీలమూర్తియై సకలజీవభారభరణమత్సరభగ్నబ్రహ్మాండభాండమహాధ్వానంబు భంగి నాస్ఫోటించిన॥
ఉ॥ మూడుజగంబులన్నియును మ్రుంకిరి సూర్యసుధాంశులద్రులూ।టాడె నభస్థలంబగిలె నంబుధులింకెను దిగ్గజాళి పట్టూ
డె వడిద్దిశల్వగిలె నుర్వర గ్రుంగె నజాండభాండమ।ల్లాడె విధాత బెగ్గడిలె నార్చుచు వృత్రుఁడు బొబ్బవెట్టినన్॥ లయగ్రా
హి॥ కూలిరి వియచ్చరులు సోలిరి దిశాధిపులు వ్రాలిరమరవ్రజము దూలిరురగేంద్రుల్। వ్రేలిరి మరుద్గణము జాలిఁగొనిర
శ్వినులు కాలుడిగి రుద్రులవలీలఁ బడిరార్తిన్। వ్రేలిరి దినేశ్వరులు కీలెడలినట్లు సురజాలములు పెన్నిమర పాలగుచు ధారా।
భీలగతితోడఁ దమకేలిధనువుల్విడిచి నేలఁబడి మూర్ఛలను దేలిరి మహాత్మా॥ వ॥ ఇట్లు కఠోరకంఠనాదంబొనర్చిన నశనిపా
తంబునం గూలు ప్రాణిచయంబు భంగి నంగంబులెఱుంగక రణరంగంబునంబడి బెట్టుమూర్ఛిల్లిన దివిజరాజసైన్యంబుల
వృత్రాసురుండు సంగరరంగమధ్యముండై మహీవలయంబు పదాహతంబులగ జగజవడంక నిశిత శూలంబు కేలనంకించుచు
మదించిన భద్రమాతంగంబు కమలవనంబు సొచ్చి మట్టిమల్లాడు విధంబున నిమీలితాక్షుండగుచుఁ బదతలంబుల రూపంబు
లుమాయం జమురుచు వెక్కసంబునఁ గ్రీడించువానిం గని వజ్రి వజ్రశతోపమనిష్ఠురగదాదండం బాభీలభంగిఁ బ్రళయకా
లమార్తాండచండపరివేషప్రేరితంబుగాఁ ద్రిప్పివైచిన॥ మ॥ అదిమింటం బెనుమంటలంటఁ బరపై యాభీలవేగంబునం। గది
యన్వచ్చినలీలతోడఁ గరసంగ్రాహంబు గావించి బె।ట్టిదమై చేరి సురారి దానిఁ గొని కారిన్యోరుపాతంబునం। జదియన్మో
దెగజేంద్రమస్తకము నుత్సాహైకసాహాయ్యుఁడై॥ గీ॥ అగ్గజంబు కులిశహతిఁ గూలుకులమహీ। ధ్రంబువోలె రక్తధారలు
రుల।మస్తకంబు వగిలి మదమఱి జిరజిరఁ।దిరిగి పిఱుఁగు సూపి తెరలిపఱచె॥ ఉత్సాహవృత్తము॥ గజము దెరలి దానికొఱలి గర్జ
లిడుచుఁ బాఱఁగా। బలిమి నింద్రుఁ డంకుశమునఁ బట్టి బిట్టు నిల్పుచు।న్నిజసుధారసైకపాననిర్ణయార్ద్రకరమునన్। బుఱ
జువుమీఱ నిమిరె నపుడు రూఢి మెరసి క్రమ్మఱన్॥ వ॥ ఇవ్విధంబున నైరావతంబును సేద దేర్చుచు నెదుర నిలుచున్న భిదుర
పాణిం గని తోఁబుట్టువుఁ జంపిన తెంపుఁ దలంచి మోహశోకంబున విపర్యాసంబుగా నవ్వుచు నాహవకామ్యార్థియై వృత్రుం
డిట్లనియె॥ శా॥ నాకుంబెద్దయు నీకు సద్గురువు దీనవ్రాతరక్షున్మహా। లోకుం జంపితివిట్లు పాపమతివై లోభంబుతో నియ్యో
డన్। లోకుల్నవ్వఁగ మచ్చుజాబలిమికిన్లోనైతి వీశూలమం। దాకంపింపఁగ నిన్ను గ్రుచ్చి ఋణముక్తాత్ముండనై పేర్చె
దన్॥ క॥ ఎట్టితులువైన గానీ। నెట్టనఁ దన బ్రదుకుకొఱకు నీవలె గురువుం। జుట్టమును బుణ్యబ్రాహ్మణుఁ। బట్టి వధింపంగఁగలఁ
డె పశువుంబోలెన్॥ చ॥ దయయును సత్యమున్విడిచి ధర్మము మాని యశంబు మాసి శ్రీ। జయములఁ బారఁదోలి పురుషత్వము
గానక లోకనిందితా।హ్వయుఁడగువాని చావునకు నార్యులు గుందుదు రేసృగాలము। ల్ప్రియమున నంటు నేశవముఁ ద్రేల
కచేరు నేకంకగృధ్రముల్॥ క॥ నిక్కమగు పాపములచేఁ। జిక్కితివి నిశాతశూలశిఖరాగ్రమున। న్మక్కించి నీదుమాంసము।
నక్కలుఁ గుక్కలును జేరి నమలఁగఁ జేతున్॥ ఉ॥ డీకొని నీకు నేఁడిచట దిక్కని వచ్చినవారు గల్గిరే। యేకమతిం బిశాచములకె
ల్లను దృప్తిగ మన్నిశాతశూ।లైకమహాగ్నికీలల ననేకవిధంబుల సోమయాజినై। మేకలఁ జేసి వ్రేల్చెద నమేయ మదోద్ధతి
వ్రాలి నియ్యెడన్॥ క॥ కాకననుఁ గులిశధారల। దీకొని నిర్జింపఁగలిగితేని యుభూతో। ద్రేకంబుఁ జేసి శూరులు। ప్రాకటపదప
ద్మధూళిభాగంబగుదున్॥ సీ॥ సందేహమేటికి జంభారి వేవేగ భిదురంబు వ్రేయుమాభీలభంగి। నతిలోభి నడిగినయర్థరాశి
యుఁబోలెఁ గడవలేని దివృథగాదు సుమ్ము। మురమర్దనుని తేజమున నాదధీచి వీర్యాతిశయంబున నధికమయిన। యది గాన హ
రిచే నియంత్రితోన్నతుఁడవై గెలువుము శత్రులగీటడంచి। యెందుఁగలఁడు విష్ణుఁ డందు జయశ్రీలు। పొందుఁదానవచ్చి
పొందుచుండుఁ। గాన భక్తవరమఁ గమలాక్షు సర్వేశు।పదములందు మనముఁ బదిలపఱుతు॥ వ॥ ఇట్లు వజ్రధారలం దెంపంబ
డినవిషయభోగంబులు గలవాఁడనై శరీరంబు విడిచి భగవద్ధామంబుఁ బొందెద నారాయణుని దాసుండనైన నాకు స్వర్గమ
ర్త్యపాతాళంబులం గలసంపద్భోగంబులు నిచ్ఛయింపంబడవు త్రైవర్గికాయాసరహితంబైన మహదైశ్వర్యంబు ప్రసా
దించుటం గావున నేననుపమేయంబైన భగవత్ప్రసాదంబన్యులకగోచరంబ ద్దేవుని పాదైకమూలంబుగా నుండు దాసుల

షుదాసానుదాసుండనైయున్నవాఁడననియప్పరమేశునుద్దేశించి॥ చ॥ అరయఁగభక్తపాలనములైనభవద్గుణజాలమాత్మ
సంస్మరణముసేయవారు నినుసన్నుతిసేయశరీరమెల్లఁగిం। కరపరివృత్తిసేయఘదిఁగాంతుయొనర్చెదఁగానియొల్ల
నే।నరవిభుత్వవోన్నతస్థలమునబ్జజుపట్టణమింద్రభోగముల్॥ ఉ॥ ఆఁకలిగొన్నక్రేపులురయంబుననీకెలురానిపక్షులుల్ద్రి
కొనితల్లికిన్మఱిపిదేశగతుండగుభర్తకంగజ।వ్యాకులచిత్తయైనజవరాలునుదత్తరమందుభంగినో। శ్రీకరపంకజాక్షని
నుఁజేరఁగనామదిగోరెడుంగదే॥ క॥ నాకునుసఖ్యముపుణ్య।శ్లోకులతోఁగానితత్త్వశూన్యులుసంసా।రైకవిమోహులతో
డం।గాకుండనొనర్పుమయ్యకంజదళాక్షా॥ మహాస్రగ్ధర॥ హరిపైసర్వాత్ముపైనన్యగణితగుణుపైనంతరంగంబుపర్వ।న్స
రిమేనుప్పొంగఁజావుంజయమునుసరిగాసంతసంబందుచున్స్మే।కరుఁడైకాలాగ్నివోలెన్నలుచుఁగవిసెన్ఖర్వగర్వోన్న
తిస్ఫు।ర్ఫురలీలన్క్ష్మాభిగంపింపఁగదిశలద్రుల్భండనోద్దండవృత్తిన్॥ క॥ దొరకొనిప్రళయోదకమున।హరిపైఁగైటభుఁడు
గవియుహంకారమున।న్సురనాథునిఁదవృత్రా।సురుఁడుమదోద్వృత్తినడిచెశూలాయుధుఁడై॥ శా॥ కల్పాంతాగ్నియుఁ
బోలెనుల్కలెగయంగాఁద్రిప్పుచుద్దీననో।రల్వాపాళ్లిటివంచుశూలమురయంబారంగఁబైవైచినం। బోల్పంగోటిరవి
ప్రకాశతదవింబోవంగవీక్షించియా।వేల్పుల్పొంగగవజ్రధారమనిమెన్విన్నాణమొప్పారఁగన్॥ గీ॥ శూలమప్పుడతఁ
డుప్రకట్కఖండించి।పూనితోనకదిసిభుజముఁద్రుంచె।నసురగనలియేకహస్తుఁడైపరిఘుంబు।గొనిమహేంద్రుఁగిట్టిహ
నువులడఁచె॥ వ॥ ఇట్లుప్రళయకాలభీషణపరివేషపోషంబుగారోషంబునంబరిఘుంబుఁద్రిప్పికుప్పించి గజకుంభస్థలంబుభ
గ్నంబుసేసియింద్రుహనుప్రదేశంబులునిష్ఠురాహతినొప్పించిన॥ క॥ గజముమదముడిగితిరుగుచు। గుజగుజనైఘీంకవెట్టఁ
గులిశమునేల।న్బలిమిచెడవిడిచెనింద్రుఁడు।గజబిజితోఁబెగడెనసురకడిమిజగంబుల్॥ క॥ గరుడుఁడువ్రేదివిననాగము।క
రణిన్వృత్రాసురేంద్రుకడిమికిలోనై।తిరుగుడువడ్డహరింగని।పురపురనాహాయటంచుఁబొగిలెజగంబుల్॥ అప్పుడు॥
గీ॥ గజముపాటుఁజూచికడుదీనగతిఁజూచి।పరికరంబుజారిపడుటఁజూచి।యుద్ధధర్మకెలఁగియున్నశత్రునిఁజూచి।సిగ్గుతో
డవజ్రిశిరమువంచె॥ వ॥ ఇట్లుయుద్ధంబునశత్రుసన్నిధింగరంబుజారిపడినవజ్రంబుఁబుచ్చికొనకనిర్వీణుండైయున్నపా
కశాసనుంజూచివృత్రుండిట్లనియె॥ క॥ దురమునఁగైదువువదలిన।శరణన్ననువైరిజనులఁజంపరువైరిన్। వెరగొందనేలకు
లిశము।కరమరుమగఁబుచ్చికొనుముకాచితినింద్రా॥ సీ॥ వజ్రంబుఁగైకొనివైరినిర్జింపుమిట్లడలంగవేళగాదమరనాథ।
యసురదేవాధీనులైనమూర్తులకెల్లనీశులక్ష్మీశునస్వేశుఁబాసి। కడతేఱజయములుగల్గునెయొండైనఁదలపోసిచూడు
మాతత్త్వవృష్టి।నీలోకపాలురునెవ్వనివశగతివలఁబడ్డపక్షులవర్తనమునఁ।జిక్కిచేష్టలుచేయుచుఁజింతసేతు। రట్టినమ్మృ
త్యుబలంబులనాత్మజయము।తమదిగాఁగోరియజ్ఞానతంత్రులగుచుఁ।గమలలోచనులీలావికారములను॥ గీ॥ మెఱయయం
త్రమయంబైనమృగముభంగి।దారునిర్మితమైనట్టితరణిపోలిక।శక్రయెఱుఁగుమిలభూతజాలమెల్ల।దళితపంకేరుహాక్షు
తంత్రంబుగాఁగ॥ వ॥ మఱియుభూతంబులచేతనింద్రియంబులచేతవశుండైనపురుషుండుప్రకృతిచేతవేఱుసేయంబడిన
యాత్మంబరమేశ్వరానుగ్రహంబువాసి సుఖియించుచుండునవిద్వాంసుండైనవాఁడనవరతంబుతన్నుస్వతంత్రుఁ
గాఁదలంచుచుండు భూతంబులవలన భూతంబులుపుట్టుచుండు నాభూతంబులు భూతంబులవలన భక్షించుచుండుఁబు
రుషునకాయువుశ్రీయును కీర్తియునైశ్వర్యంబుమొదలయినవియనుభవింప నెంతగాలంబుప్రాప్తం బంతగాలంబుని
వసించుఁబ్రాప్తంబుదీఱినఁ బురుషుండుజాలింబొందిన నదియుండక పోవుచుండుఁగావున గుణంబున వగుణంబుఁగీ
ర్త్యపకీర్తులును,జయాపజయంబులును,సుఖదుఃఖంబులును,జావుబ్రతుకులును, సమంబులయికలుగుచుండునజ్ఞానియైన
వానికిసత్త్వరజస్తమోగుణంబులుగలిగియుండునట్టివానికిగుణమయంబులైన యింద్రియాదులేయాత్మయని తోఁచు
చుండుంగావునవాఁడాగుణంబులచేతబద్ధుండగు నాగుణంబులకుసాక్షిమాత్రంబయినశరీరంబువేఱని యెవ్వఁడెఱుంగ
నోపువాఁడాగుణంబులచేతబద్ధుండుగాఁడుగావునగుణంబులుగుణియును భోక్తయును భోగంబును జయంబునపజ
యంబునుహర్తయునుహన్యంబునుత్పత్తిస్థితిలయకర్తయైనసర్వోత్కృష్టుండైనయప్పరమేశ్వరుండేకాని యన్యంబులే
దిప్పుడొక్కహస్తంబునాయుధంబుపోయిననేను భవత్ప్రాణాపహరణంబునకు సమర్థుండనగుచున్ననన్నుంజూడుమ
నిమఱియునిట్లనియె॥ గీ॥ వాహనంబులుసారెలువాడిశరము।లూర్జితాక్షములసువులునొడ్డణములు। గాఁగఁబోరెడినీ
ద్యూతకర్మమందు।నెవఁగజయమునునపజయమెవ్వఁడెఱుఁగు॥ చ॥ అనవుడువృత్రుమాటలకునద్భుతమంది సురేంద్రుఁ
డెంతయుం।దనమదిఁగుత్సితంబుడిగిదైవముగానతనిన్భజించికై।కొనియెఁగరంబునన్దిగువఁ గూలినవజ్రము నప్పుడాత్మ
లోఁ।దనరెజగంబులన్నియుముదంబునుబొందిరిఖేచరావళుల్॥ క॥ రాహుగ్రహవక్త్రిమహా।గేహాంతము వాసివచ్చి

డై నయిద్ధురాత్మునిహింసించినహత్యయేమి సేయంగలదని యొడంబరవిననిం ద్రుండు వల్లెయనియివ్విధంబున మారుతునిం
బరిమార్చి బ్రహ్మహత్యంబొందియత్తాపంబు భరియింపనోపక మర్దశం బొందెనప్పుడు॥సీ॥ పాపంబుచండాలరూపంబుగ
లదానిముదిమిచేనొడలెల్లఁగడలుదాని।క్షయకుష్ఠరోగసంచయయుక్తంబగుదానినురురక్తపూరంబుదొరుగుదాని। నెఱసి
నవెండ్రుకల్బెరసినతలదాననటపోకుపోకుండుమనెడుదానిఁ। గమరుకంపునంబే ఫులదరఁజేసెడుదానిఁదానెందుఁబా
టినఁదరుముదాని। నాగుణంబులెల్లభోగింపకేరీబి।నరుగనెంతవాఁడవనెడుదాని।బిట్టుఁతిరిగిచూచిభీతిల్లిసిగ్గుతో। దేవనా
యకుండు డెరలిపఱచె॥వ॥ఇట్లతివికృతంబుతో బ్రహ్మహత్యవెనుకగులనిం ద్రుండు నభోభాగభూభాగదిగ్భాగంబులెల్లం
దిరిగిచారందెరువులేకదీర్ఘనిఘ్నతాటోపనిశ్వాసదూషితుండై యీశాన్యభాగంబునకుం బఱవియద్దెసనమేయపుణ్యాగ
ణ్యంబైనమానససరస్సునం బ్రవేశించియందునొక్కకమలనాళంబుసొచ్చి యందుఁదంతువుంగలసిరూపంబులేకనలబ్ధభో
గుండై బ్రహ్మహత్యాపిమోచనంబుఁజింతించుకొనుచు సహస్రవర్షంబులుండె నాచండాలియదిపరమేశ్వరదిగ్భాగంబ
గుటం జేసియందుం జొరరాకకాచియుండెనంతగాలంబుఁ ద్రిదివంబున నహుషుండు విద్యాబల తపోబలయోగబలంబు
లం బాలించుచుండె సంపదైశ్వర్యమదాంధుండై యింద్రపత్నింగోరియింద్రుండువచ్చునందాఁక నాకుం బత్నివిగమ్మనిన
నాశచీదేవిబృహస్పతిప్రేరితయై బ్రహ్మర్షివాహ్యశిబికంబు నెక్కివచ్చిననన్నుభోగింపుమనినవతండట్లచేసి కుంభసంభవ
శాపహతుండై యజగరయోనియందుఁబుట్టెనంతనింద్రుండు బ్రహ్మర్షిగణోపహతుండై త్రిదివంబునకువచ్చెనంతగాలం
బు నారాయణచరణారవిందధ్యానపరుండై యుండుటం జేసి దిశాధినాయకుండైనశంకరుచేతరక్షింపంబడ్డవాఁడై యుం
డుటం జేసితద్దోషబలంబుడఱిగిసహస్రాక్షునిం బీడింపలేదయ్యెనప్పుడింద్రుండుని జైశ్వర్యంబునుంబొంది బ్రహ్మర్షిపరివృ
తుండై మహాపురుషారాధనంబుఁజేసిహయమేధాధ్వరంబునకుందీక్షఁగైకొని బ్రహ్మర్షులచేతఁజేయింపంబడుచున్నవాఁ
డయిసర్వదేవతామయుండైన నారాయణుంబరితృప్తుంజేసినంచుపిరియించు మార్తాండునిచందంబునఁద్వాష్ట్రవధ
రూపపాపంబునాశంబునొందించిసకలదివిజయక్షగంధర్వసిద్ధమునిజనసంస్తూయమానుండై త్రిభువనైశ్వర్యభోగభా
గ్యంబులం గైకొనియెనప్పుడు॥చ॥ సతతమరీచిముఖ్యమునిసంఘముచేతయథోచితంబుగాఁ।గ్రతుఘనవాజిమేధమునఁ
గేశవునీశుఁబురాణపూరుషుఁ। హితుజగదీశుయజ్ఞపతినిష్టఫలప్రదునంతరంగసం। గతుభజియించిదివ్రిగతకల్మషుఁ
డై నెగడెన్మహీశ్వరా॥సీ॥ మఱియుఁబుట్టింపంగమనసువెట్టినయట్టి క్రూరకర్మాంభోధికుంభజుండు। అంగారములుసే
యనాహుతిగననోపుబహుపాపకాననపావకుండు। కండకడిగమ్రింగగల్గునుద్రేకపంకగల్మషగరళగంగాధరుండు।
ఘనగుహాంతరములకాలూననియ్యనికలుషమస్తరతమోగ్రహావిభుండు। సకలముక్తిలోకసామ్రాజ్యసమధిక। సహజ
భోగభాగ్యసంగ్రహైక। కారణాప్రమేయకంజాక్షుసర్వేశ। కేశవాదినామకీర్తనంబు॥సీ॥ అఖిలమహైకసంహారా
దికారణంబఖిలాఘసంచయాన్లోకరము। విమలభక్త్యుద్రేకవిభవసందర్శనంబనుపమభక్తవర్ణనరతంబు। విబుధహృ
ష్టానేకవిజయసంయుక్తంబుగ్రస్తామరేంద్రమోక్షక్రమంబు। బ్రహ్మహత్యానేక పాపనిస్తరణంబుకమనీయసజ్జన
కాంక్షితంబు।నైనయీయితిహాసంబునధికభక్తి। వినినఁజదివినవ్రాసిననను దినంబు। నాయురారోగ్యభాగ్యభోగాభివృ
ద్ధికర్మనాశముసుగతియుఁగలుగునవఘ॥సీ॥ నావుడుయోగీంద్ర నాకు నంబీవృత్రు విపరంబుఁ జెప్పితివిన్న నొకటిలుగ జను
మ్మతంబునఁగళవళంబందెడుఁగోరిరజస్తమోగుణములందు। వర్తించునీపాపవర్తికి నేరీతి నారాయణపదభక్తి సంభవించె।
సత్త్వస్వభావులై సమబుద్ధులైతపోనియమప్రయత్నులైసిద్ధచేత। నిర్మలాత్మకులైనట్టి నిర్మలురులు। కనుగొనలేరుపుణ్యాము
నులమునంబుజాక్షు। భూరికైవల్యసంప్రాప్తిమూలమైన।భక్తిపీనికిఁబోలె నేర్పాటుగాదు॥సీ॥ ఉర్విపైఁగల రేణువులకం
న్నదట్టమైకడునొప్పజీవసంఘములుగలవు। ఆజీవములలోననరయుధర్మాయతములివసించినవారినుసుజనాలి।యీనాను
ష్యులలోనఁగామంబులెడవాసి మోక్షార్థులగువారు మొదలనరిది। మోక్షమార్గంబాత్మమూలంబుగానుండు వారిలో
ముక్తులు లేరుతరుచు। ముక్తులయినట్టివారిలోయుక్తిగలఁప। జాలమగ్లభుఁడమితప్రశాంతిపరుండు। పరమసుజ్ఞానని
తుండుభద్రగుణుఁడు। రమణశ్రీవాసుదేవపరాయణుండు॥గీ॥ సకలలోకాపకారిదుస్సంగతుండు। వృత్రుఁడేక్రియ
సుజ్ఞాననిరతుఁడయ్యె।సమరమునఁబౌరుషంబుచేనమరపభుని। నెట్లుమెప్పించెదీనినాకెఱుఁగఁజెపుమ॥వ॥ అనిపరీక్షిన్న

## ⟶ చిత్రకేతూపాఖ్యానకథాప్రారంభము. ⟵

రేంద్రుండుశుకయోగీంద్రునడిగెననిసూతుండుశౌనకాదిమునులకుం జెప్పెమఱియునిట్లనియెనట్లుగజపురవల్లభుండుసం
ప్రశ్నంబుసేసినబాదరాయణిహరిస్మరణశ్రద్ధాపరుండై యిట్లనియెందొల్లికృష్ణద్వైపాయన నారదదేవలమహర్షులు

లక్షతి[illegible]గతిచేతఁ బుట్టుటచచ్చుట పొసఁగుచుండుఁ గాన భూతములకుఁ గలుగు భూతంబులు మహదేవోత్పన్నమాయఁ జే-
సి। దీనికిఁ దల నేలన్యతిరూఢలఁగా నేల బుద్ధిఁ దలఁపవలదె భూతసృష్టి। వ॥ మఱియు నీవు నేమును దక్కిన వారలును వర్త-
మానకాలంబు గలిగి జన్మంబు నొంది మృత్యువువలన వినాశంబు నొందంగలవారై యిపుడు లేక పోవుదుము కావున పుట్టువులకు
నాశంబు లేదు ఈశ్వరుండు తన మాయచేత భూతజాలంబులవలన భూతంబులం బుట్టించు వాని నా భూతంబుల చేతన రక్షించు
వాని నా భూతంబుల చేతన నపహరించు స్వతంత్రుండు తాను తనసృష్టిచేత బాలుండునుం బోలెన పేక్ష లేక యుండు దేహియైన
న పితృదేహంబు చేత దేహియైన పుత్రదేహంబు వలనం గలుగుచుండు నా ప్రకారంబున బీజంబువలన బీజంబులు పుట్టుచుండు
దేహికి నివి శాశ్వతంబై జరుగుచుండుఁ బూర్వకాలంబున సామాన్యవిశేషంబులు సన్మాత్రంబైన వస్తువులం దే విధంబున గ-
ల్పింపంబడియె నా ప్రకారంబున దేహంబునకు జీవునకు నన్యోన్యవిభాగంబు పూర్వకాలంబున నజ్ఞానకల్పితంబయ్యె జన్మఫ-
లంబులను జూచుచున్నవారికి సహాన క్రియల నగ్ని పెక్కురూపంబులం గానంబడు భంగి నొక్కండైన జీవుండు పెక్కుభం-
గుల వెలుంగుచుండు నిదియునుంగాక యాత్మజ్ఞానంబు చాలక దేహి దేహసంయోగంబు స్వప్నంబునందు భయావహంబైన
ప్రయోజనంబు వడుపు నుండి మేల్కాంచి యాస్వప్నార్థంబైన ప్రయోజనంబు తనది గాదని యెఱుంగు భంగి జీవుండే తాన-
ని జ్ఞానగోచరుండై వార లెఱుంగుదురు గాన నజ్ఞానంబును నోమాత్రంబని తెలిసి మోహాననంబు వాసి భగవంతుండైన
వాసుదేవుని యందుఁ జిత్తంబు వెట్టి శమ్మోక్షముండవగుమని బోధింపఁ జిత్రకేతుండు లేచి వారలకిట్లనియె॥ సీ॥ యతి వేష-
ములు పూని యతిగూఢగతి నిందు నేతెంచినట్టి మీ రెవ్వరయ్య। కడఁగి నావంటి గ్రామ్యబుద్ధుల నెల్ల బోధింపవచ్చిన పుణ్యమ-
తులొ। రమణఁ గుమారనారదఋభులో దేవలాసితులైన ధీరవరులొ। వ్యాసవసిష్ఠదుర్వాసమార్కండేయగౌత-
మశుకరామ కపిలమునులొ। యాజ్ఞవల్క్యుండఁ రణియు నారుణియును। జ్యవనరోమశయాసురిచత్వదేవ। దత్తమైత్రే-
యవరభరద్వాజ బోధ్య। పంచశిఖులో పరాశర ప్రభృతిమునులొ॥ క॥ వీరలలో నెవ్వ గురుడ। చారణగంధర్వసిద్ధసంఘంబు-
లలో। వారలో యీ సుజ్ఞానము। కారణమై యెవ్వ రెంచుఁ గలదు తలంపన్॥ క॥ పొందుగ గ్రామ్యపశుత్వముఁ బొందిన మా
శోకతమముఁ ద్రుంగిన నాకు। న్మంచి దివ్యజ్ఞానము నెందించిన వారో మిమ్ముఁ జెప్పఁగ తెలియన్॥ వ॥ అనిన నాంగిరసుం డి-
ట్లనియెఁ బుత్రకాంక్షివై నీకుం బుత్రుం బ్రసాదించిన యాంగిరసుండ నితండు బ్రహ్మపుత్రుండయిన నారదభగవంతుండు
దుస్తరంబయిన పుత్రశోకంబున నున్నవాఁడవైన నిన్ను ననుగ్రహించి పరమజ్ఞానంబు పదేశింపవచ్చితిమి మిమ్ము దుఃఖంబెఱింగి పు-
త్రునిచ్చితి మే నిపుత్రవంతులయినవారి తాపంబు నీ చేతన నుభవింపంబడు నీ ప్రకారంబున లోకంబున సతులును గృహంబు-
లును సంపదలును శబ్దాదులయిన విషయంబులును రాజ్యవైభవంబును జంచలంబులు నటియు రాజ్యంబును భూమియును బ-
లంబును ధనంబును భృత్యామాత్యసుహృజ్జనంబులును మొదలయిన విశోకమోహభయపీడలం జేయుచుండుం గాని సుఖం-
బులనీనేరవు గంధర్వనగరంబునుం బోలె స్వప్నలబ్ధమనోరథంబునుం బోలె నర్థంబుఁ బాసి కానంబడుచు మనోభవంబు-
లయిన యర్థంబులం గూడి స్వార్థంబులయి కానంబడ నేరవు కర్మంబుల చేత ధ్యానంబులు సేయుచుండు మనంబులు నానాక-
ర్మంబులగుచునుండు నీ దేహి దేహంబు ద్రవ్యజ్ఞానక్రియాత్మకంబయి దేహికి వివిధక్లేశసంతాపంబులం జేయుచుండుం గా-
వున నిర్మలంబయిన మనంబు చేత నాత్మగతి వెదకి ధ్రువంబయిన పదంబు నొందుమనిన యెడ నప్పుడు నారదుండిట్లనియె నుపనిషద్గో-
ప్యంబగు నే నిచ్చు మంత్రంబెవ్వఁడేని సప్తరాత్రంబులు పఠియించు నతండు సంకర్షణుండైన భగవంతునిం జూచు నెవ్వని పా-
దమూలంబు సర్వాశ్రయంబై యుండు నట్టి శ్రీమన్నారాయణుని పాదంబులు సేవించి యీ మోహంబు వదలి యతిశీఘ్రం-
బున నుత్తమపదంబు సొరుము ఇప్పు డీకుమారునకు నీకుం బ్రయోజనంబు గలదేని జూతమని నారదుండా పుత్రుని కళేబరం-
బుఁ జూచి యో జీవుండ నీకు శుభంబయ్యెడు నిందుఁ బ్రవేశించి మీ తల్లిదండ్రుల బంధుజనులం జూచి వీరల దుఃఖంబులాఱ్చి
యీ కళేబరంబునందుఁ బ్రవేశించి యాయుశ్శేషంబున ననుభవించి పిత్రార్జితంబయిన రాజ్యాసనంబునఁ గూర్చుండుమనిన
నబ్బాలుండిట్లనియె॥ గీ॥ కర్మవశమున నెందును సుఖంబు లేక। దేవతిర్యఙ్మనుష్య యోనులఁ దిరుగు నాకు। వెలయు నే జన్మమునకు నా
వీరు దల్లి। దండ్రులయినారు చెప్ప వేతాపసార్య॥ గీ॥ బాంధవజ్ఞాతిసుతులును బగతులాత్మ। వరులుదాసీనమధ్యస్థవర్గములు-
ను। సరవిఁ గను చుండు రొక్కొక్క జన్మమునను। నెఱయఁ బ్రాణికి నొకవావి నిజము గలదె॥ గీ॥ రత్నములు హేమములను నరా-
గలీల। నమ్మకంబులనీవలనావలయిన। భంగి నరులందు జీవుండు ప్రాప్తుఁడగుచు। నేలమీఁద దిరుగుచునుండుఁ దా నెందుఁ జేరఁడు॥
సీ॥ ఒక్కఁడై నిత్యుఁడై యొక్కెడఁ గడలేక పొరఁదిజన్మాదుల శూన్యుఁడగుచు। సర్వంబునందుండి సర్వంబు దనయందు నుం-
డంగ సర్వాశ్రయుండవంగ। సూక్ష్మమై స్థూలమై సూక్ష్మాధికములకు సామ్యమై స్వప్రకాశమున వెలిఁగి। యఖిలంబుఁ జూ-

విద్యాధరులభర్తకనీవయ్యెననంతుఁ। డోవిమలబుద్ధినీదగు। ధీవిభవంబునకు మెచ్చితిం బ్రియమారఁ॥గీ॥ అరయ నారదుం
డు నాంగిరసుండును। దత్త్వమొసఁగి నారు దానికతన। నన్నుఁజూడఁగల్గెనాభక్తి సుదిఁగలిగె। నా పథంబు నీకు నమ్మఁగలిగె॥
సీ॥ ప్రాణినారూపంబు భూతజాలంబులు భూతపావనుఁడనఁ బొందుపడఁగ। బ్రహ్మంబు మఱియు శబ్దబ్రహ్మమును శాశ్వతం
బైన తనువులుదగిలె నాకు। నఖిలలోకంబులు ననుగతంబై యుండు లోకంబు నాయందు జొక్కఁజెందుఁ। నుభయంబు నా
యందు నభిగతంబయ్యుండు నదిలీనమయ్యె నయ్యుభయమందు। వెలయ నిద్రించువాఁ డాత్మ విశ్వమెల్లఁ। జూచి మేల్కాం
చి తానొక్కచోటువాని। గావివేకించు మాడ్కి నీ జీవదేశ। మాయ దిగనాడి పరమధర్మంబుఁ దెలియ॥గీ॥ నిద్రఁ బోవు వేళ ని
రతుఁడై దేహిదా। నెట్టిగుణము చేతనింద్రియముల। గడచినట్టి సుఖముఁ గనునట్టి బ్రహ్మంబు। కడిమి మెఱయ నన్నుఁ గా నె
ఱుంగు॥గీ॥ స్వప్నమందు నెల్లు సంచారమొనరించు। మేలుకాంచి దృష్టమెల్ల నెఱుఁగు। నుభయమెఱుఁగునట్టి యుత్తమజ్ఞా
నంబు। తత్త్వమట్టిదైన తలఁపు నేను॥సీ॥ అరయంగ నెవ్వనికలవిగానట్టి యీ సలలితమానుషజాతిఁ బుట్టి। యాత్మతత్త్వజ్ఞాన
హతుఁడైనవానికి గలుగునే యందు సుఖంబొకింత। వెలయఁ బ్రవృత్తి నివృత్తి మార్గంబుల సుఖదుఃఖచయముల సొరిదిఁ దెలిసి
పని చెడి సంకల్పఫలమూలమునఁ బారుకడు సుఖదుఃఖమోక్షములకొఱకు। దంపతీక్రియామతంబు వర్తింతురు। దాన మోక్ష
మేలఁ దక్కియుండు। నఖిలదుఃఖహేతువైనయా కర్మంబు। నెఱిఁగి నన్నుఁ దలఁప రిచ్ఛలోన॥వ॥ మఱియు విజ్ఞానాభిమాను
లయిన మనుష్యులకు నతిసూక్ష్మంబయినయాత్మగతి నిష్ఠానత్రయలక్షణంబును జతుర్థాంశంబు నెఱింగి యైహికాముష్మిక
విషయంబుల చేతను వివేకబలంబు చేతను నియుక్తుండయి నజ్ఞాన విజ్ఞాన సంతృప్తుండయిన పురుషుండు నాకు భక్తుండగు నీవి
ధంబులు గలవారలు యోగనైపుణబుద్ధి గలవారలునై స్వార్థంబయిన యాత్మ చేతం బరమాత్మను దెలియుచుందురు నీవు
నీ క్రమంబున మద్భక్తి శ్రద్ధాపరుండవై విజ్ఞానసంపన్నంబయిన వాక్యముల చేత నన్ను స్తోత్రంబుఁ జేసి ముక్తుండవైతివని
యాశేషభగవంతుండు విద్యాధరపతియైన చిత్రకేతుం బలికి యతనికి దృశ్యుండై పోయె నేదిక్కన సర్వాత్మకుండయిన య
నంతుం డంతర్ధానంబు నొందె నా దిక్కునకు విద్యాధరభర్త నమస్కరించి గగనచరుండై చని లక్షలసంఖ్యలయిన దివ్యవర్షం
బుల వ్యాహితబలేంద్రియుండై పరమయోగీంద్రపురుషులును, దివ్యమునీంద్ర సిద్ధచారణగంధర్వులును వినుతిసేయం గు
లద్రోణాదిశైలంబులను, రమ్యప్రదేశంబులను, సంకల్పసిద్ధప్రదేశంబులను, వినోదించుచు శ్రీనారాయణదత్తంబగు దివ్య
విమానంబునందుఁ జరియించుచునుండె॥శా॥ ఆడించుం హరిదివ్యనాటకగుణవ్యాపారనృత్యంబులం। బాడించుం జలజాత
నేత్రబిరుదప్రఖ్యాతగీతంబులం। గూడించుం సతతంబు జిహ్వల తుది న్గోవిందనామావళుల్। క్రీడం గిన్నరయక్షకామినుల
చేఁ గృష్ణార్పితస్వాంతుఁడై॥సీ॥ వాసించునాత్మఁ బో వైష్ణవజ్ఞానంబు నాశించు భాగవతార్చనంబు। భూషించు నాప్రొద్దుఁ
బుండరీకాక్షుని భాషించు హరికథాప్రౌఢి మెరసి। ఘోషించు హరినామగుణనికాయంబులు పోషించుఁ బరతత్త్వబోధ మె
ఱసి। సేవించు శ్రీకృష్ణసేవకనికరంబు సుఖమునఁ జేయు నీశునకు బలులు। పాడుఁ బాడించు వైకుంఠభర్తనటన। రూపవర్తన

## విద్యాధరాధిపతియగు చిత్రకేతుండీశ్వరధిక్కారంబువలన శాపంబు నొందుట.

గుణనామదీపితోరు। గీతజాతప్రబంధసంగీతవిధులఁ। గేశవప్రీతిగాఁ జిత్రకేతుఁ డెపుడు॥మ॥ హరిఁ గీర్తించుచు నల్లనల్ల మ
దిలో నబ్జాక్షు సేవించుచుం। బరమానందము నొందుచు న్జగములం బ్రఖ్యాతి వర్తించుచు। న్సురరాజోపమమూర్తి యక్షగణ
ముల్ సొంపార విద్యాధరా। ప్సరసల్గొల్వఁగఁ బాడఁగా సితగిరిప్రాంతంబున న్నేగుచున్॥శా॥ ఆవిద్యాధరభర్త గాంచె హర
నీహారావృతాహాసమున్। శ్రీవిభ్రాజితమున్ నిరస్తగిరిజాసేవాగతాయాసము। న్దేవానీకవికాసమున్ ప్రభమహాదేవాం
ఘ్రిసంవాసము। న్భావిఖ్యాతవిలాసమున్ద్రిభువనీపూతంబుఁ గైలాసమున్॥క॥ ఆరజతభూధరంబున। నీరేజభవామరా
దినికరము గొల్వ। న్పేరోలగమున నుండిన। గౌరీయుతుఁడైన హరునిఁ గనియొన రేంద్రా॥సీ॥ తననిజరూపమింతంతని తెలియ
క వాదంబు సేసెడు వేదరవము। కరుణావలోకనాకాంక్షితులయియున్న బ్రహ్మాదిసనకసప్రణుతరవము। సారశివానం
దసల్లాపములనొప్పు ప్రమథగణాళియార్భటరవంబు। డమరుమృదంగాదిథమథమధ్వనితోడఁ బటుభృంగినాట్యవిస్ఫారర
వము। మానుగాఁ జామరలు వీచుమాతృకాది। కామినీజనమహితకంకణరవంబు। మెండుఁ జెలఁగంగఁ గన్నులపండువయ్యెఁ।
గొండరాచూలిపెనిమిటినిండుకొల్వు॥వ॥ ఇట్లు బ్రహ్మాదిసురనికరసేవితుండై యూరుపీఠంబున నున్న భవానిఁ గౌఁగిటం జే
ర్చికొని యొడ్డోలగంబున నున్న పరమేశ్వరుం జూచి చిత్రకేతుండు పకపక నగియద్దేవి వినుచుండ నిట్లనియె॥సీ॥ కొమరొప్పఁ
గా లోకగురుఁడును గడలేని ధర్మస్వరూపంబు దానయగుచు। జడలుధరించియు సరిలేని తపమునఁ బొడవైన యీయోగిపుం
గవులును। బ్రహ్మవాదులుఁ గొల్వ భాసిల్లు కొల్వులో మిథునరూపంబున మెలఁతతోడఁ। బ్రాకృతుండును బోలె బద్ధానురా

గుఁడై లాలితుండయ్యె నిర్లజ్జతోడ। నకట ప్రకృతిపురుషుఁడయినఁదా నేకాంత। మందుసతులతోడ నలరుఁగాని। యిట్లు ధర్మ
సభలనింతులతోఁగూడఁ। బరిఢవింపవలదు భ్రాంతి నొంది॥ క॥ అనవినిసర్వేశ్వరుఁడా। తని నేమియుననక నవ్వెఁ దత్సభవా
రుం। గనుఁగొని యూరక యుండిరి। మనుజేశ్వర యీశు ధైర్యమహిమ యెట్టిదియో॥ వ॥ ఇట్లు తనపూర్వకర్మవిశేషంబున నిం
ద్రియజయుండనని పుట్టిన యహంకారంబున జగద్గురువుం బెక్కు ప్రల్లదంబులాడుచున్న చిత్రకేతుం జూచి భవాని యిట్ల
నియె॥ క॥ మముఁబోటి లజ్జలుడిగిన। కుమతులకుం గర్తయగుచుఁ గోపింపంగా। నమితాజ్ఞానిపుణుండగు। శమనుండా నేఁడు
వీఁడు జగముల కెల్లన్॥ క॥ భృగునారదకపిలాదులు। నిగమాంతజ్ఞులును యోగనిర్ణయనిపుణుల్। త్రిగుణాతీతు మహేశ్వ
రు। నగరెన్నఁడు వారు ధర్మనయ మెఱుఁగరొకో॥ సీ॥ ఎవ్వని పదపద్మ మింద్రాదివిబుధులు చూడాగ్రపఙ్క్తులనీడఁ జూచు। నె
వ్వని తత్త్వంబు నెనయంగ బ్రహ్మాదియోగిమానసపఙ్క్తి నోలలాడు। నెవ్వని రూపంబు నేర్పాటుగానక వేదంబులందండ
వాదమడఁచు। నెవ్వని కారుణ్య మీలోకముల నెల్లఁ దనిపి యంతయు ధన్యతములఁ జేయు। నట్టి సర్వేశుఁ బాపసంహారు ధీరు। శా
శ్వతైశ్వర్యు నాత్మసంసారు నీశు। నెగ్గుఁ బలికెన పాపాత్ము డెల్ల భంగి। దండనార్హుండు గాకెట్లు తలఁగఁగలఁడు॥ గీ॥ నిఖిల
లోకాశ్రయంబు సన్నిహితసుఖము। సకలభద్రైక సేవ్యంబు సాధుసేవ్య। మయిన కంజాక్షు పాదపద్మార్చనంబు। ననుస
రింపంగ ఖలుఁడు వీఁడర్హుఁడగునె॥ వ॥ కావున నోరి మదాత్మక యీ పాపంబునం బాపస్వరూపంబయిన రాక్షసయోనిం బు
ట్టుమని శపియించి యింతనుండి మహాత్ములకు నవజ్ఞ సేయకుండుమని పల్కెఁ జిత్రకేతుండు విమానంబు డిగ్గి వచ్చి యద్దే
వికి దండప్రమాణంబు లాచరించి కరకమలంబులు దోయిలించి యిట్లనియె నో జగన్మాత భవచ్ఛాపవాక్యంబు నట్లకైకొం
టిఁ బ్రాచీనకర్మంబులం బ్రాప్తంబైన సంసారచక్రంబుచేత నజ్ఞానమోహితులై తిరుగుచున్న జంతువులకు సుఖదుఃఖం
బులు నైజంబులై ప్రవర్తిల్లుచుండు నట్టి యాత్మసుఖదుఃఖంబులకు నెవ్వరు కర్తలీగుణంబుల నిమిత్తమై శాపానుగ్రహం
బులును స్వర్గనరకంబులును సుఖదుఃఖంబులును సమంబులు భగవంతుండొక్కండు దన మాయచేత జగంబులు సృజియించు
చుండు వారి వారికి బద్ధానురాగంబులు గలుగఁజేయుచుఁ దాను వానికి లోనుగాక నిస్పృహుఁడై యుండు నీవిధంబున బుట్టుచు
న్న నరునకుం బత్నీ బంధు శత్రు మిత్రోదాసీనంబు లెక్కడివి వారి వారి కర్మవశంబునం బరమేశ్వరుండు సర్వసముండై
యుండు నప్పరమేశ్వరునకు సుఖదుఃఖంబుల చేత రాగంబు లేదు రాగానుబంధంబున రోషంబు లేదతని మాయాగుణవిస
ర్గంబు జంతువులకు సుఖదుఃఖంబులను బంధమోక్షంబులఁ గల్పించుచుండుఁ గావున నీకు నమస్కరించుచున్న నన్ను ననుగ్ర
హింపుము శాపభయశంకితుండం గాను జగన్మాతవైన నిన్నుఁ బలికిన దోషంబునకు శంకించుచున్నవాఁడనని దండప్రణా
మంబు లాచరించి పార్వతీపరమేశ్వరుల బ్రసన్నులం జేసి తన విమానం బెక్కి చనియె నప్పుడు పరమేశ్వరుండు బ్రహ్మాది
దేవర్షి దైత్య దానవ ప్రమథగణంబులు వినుచుండఁ బార్వతి కిట్లనియె నీకు నిప్పుడు దృష్టంబయ్యెఁ గదా నారాయణదాసదా
సానుచరుల నిస్పృహభావంబు హరితుల్యార్థదర్శనులయి నిస్పృహులైన భాగవతులకు స్వర్గాపవర్గ నరక భేద భావంబులు
లేవు ప్రాణులకు దేహసంయోగంబు వలన నారాయణలీలం జేసి యుండి ద్వంద్వాది సుఖదుఃఖంబు లాత్మయందు నజ్ఞానం
బున భేదంబు సేయంబడియె నిట్టి విపర్యయంబు భగవంతుండైన వాసుదేవుని భక్తిగలవారిం జెందవు మఱియును॥ ఉ॥ నేనుఁ
గుమార నారదులు నీరజగర్భుఁడు దేవసంఘము। ల్మానితయోగివర్యమునిమండలమిట్లగు వారమందరు। న్దానవవిద్విషాంశ
జనితంబులమయ్యుఁ దదీయతత్త్వముం। గానఁగ నేరమీశు ఘనగర్వమునం దలపోసి చూచుచున్॥ క॥ ఆతనికి నప్రియుఁ డప్ర
యుఁ। డేతెఱఁగున లేఁడు నఖిలమెల్లను దానై। భూతముల కాత్మయగుటయు। భూతప్రియుఁ డొక్కఁ డాదిపురుషుఁడు దన్వీ॥
గీ॥ అరయఁ జిత్రకేతుఁ డతిశాంతుఁ డతిలోక। సముఁడు విష్ణుభక్తిసంగతుండు। నితని నేమి చెప్ప నీశుండనగు నేను। సువిదయ
చ్యుతప్రియుండసుమ్మి॥ క॥ కావున భగవద్భక్తుల। భావమునకు విస్మయంబు పనిలేదు మహా। ధీవిభవ శాంతచిత్తులు। పావనప
రతత్త్వనిపుణ భవ్యులు వారల్॥ వ॥ అనిన విని యద్రినందన విస్మయంబు మాని శాంతచిత్తయయ్యె నట్లు పరమభాగవతుండ
యిన చిత్రకేతుం డద్దేవికిం బ్రతిశాపం బియ్య సమర్థుండయ్యును మఱల శపింపక నతిశాంతరూపంబున శాపంబు శిరంబున ధరి
యించె నిట్లు సాధులక్షణంబులు నారాయణపరాయణులయిన వారలకుం గాక నొరులకుం గలుగ నేర్చునే యిపుడు శాపహ
తుండయిన చిత్రకేతుండు త్వష్ట సేయు యజ్ఞంబున దక్షిణాగ్నియందు దానవయోనిం బుట్టి వృత్రాసురుండన విఖ్యాతుండ
యి భగవద్జ్ఞానపరిణతుండయ్యెఁ గావున॥ సీ॥ నరనాథ యీ వృత్రునకు రాక్షసాకృతి గలిగిన యీ పూర్వకారణంబు। చిర
పుణ్యుఁడైనట్టి చిత్రకేతు మహానుభావంబు భక్తితోఁ బరగ విన్నఁ। జదివిన వారికి సకలదుష్కర్మముల్ ఖిలంబులై కడఁ జెడ
రిపోవు। సకలవైభవములు సమకూరుఁ దనయంతఁ దొల్లాడు కోర్కులతోడఁ గూడి। నిర్మలాత్ములగుచు నిత్యసత్యజ్ఞాన। నిర

తులగుచువిగతదురితులగుచు। బంధుమిత్రపుత్రపౌత్రాదులనుగూడి। యనుభవించుచుండురధికఫలము॥ సీ॥ వినవయ్యనర

॥ సవితృవంశాదిప్రవచనకథాప్రారంభము. ॥

నాథవిశదంబుగాఁద్వష్టృవంశంబు సెప్పితివాని వెనుక। సవితయుఁబృశ్నియుసావిత్రివ్యాహృతియను భార్యలందునింపారువేదత్రయి నగ్నిహోత్రంబులనరయంగఁబశుసోమపంచయజ్ఞంబులఁబరగఁగనియె। భగుఁడుసిద్ధికయనుభార్యకుమహిమానుభవునివిభవునిఁదాఁబడసెమువురఁ। దనయనొకతెఁగాంచెఁదదనంతరమునవా। దరళనేత్రసద్వ్రతైకధామ। పుణ్యశీలసుగుణపూరితచారిత్ర। యఖిలలోకపూజ్యయాశిషాఖ్య॥ వ॥ మఱియుధాతకుఁగలకుహూసినీవాలిరాకానుమతులనియెడునలువురుభార్యలలోఁగుహూదేవిసాయమనుసుతునిఁగాంచెసినీవాలిదర్శాఖ్యునిఁబడసెరాకప్రాతరాఖ్యునిఁగాంచెననుమతిపూర్ణిమాఖ్యునిఁగనెవిధాతక్రియయనుభార్యయందునగ్నిపురీష్యాదులంగనియెవరుణునకుఁజర్షణియనుభార్యయందుఁబూర్వకాలంబునబ్రహ్మపుత్రుండైనభృగువునువల్మీకంబునంజనియించినవాల్మీకియునుదయించిరి మిత్రావరుణులకునూర్వశియందురేతోగ్గమంబైననదియుఁగుంభంబునంబ్రవేశింపఁజేయనందునగస్త్యుండును వసిష్ఠుండునుజనియించిరిప్రత్యేకంబమిత్రునకురేవతియందునుత్సర్గసంభవులైనయరిష్టయుఃబిప్పలుండునను వారలు జనియించిరి శక్రునకుపౌలోమియందుజయంతఋషభవిదుషులనముగ్గురుపుట్టిరివామనుండైనయురుక్రము దేవునకుఁ గీర్తియనుభార్యయందుబృహచ్ఛ్లోకుండుపుట్టెనాబృహచ్ఛ్లోకునకుసౌభగాదులుపుట్టిరి మఱియుమహానుభావుండైనకశ్యపప్రజాపతికినదితియందుశ్రీనారాయణుండవతరించినప్రకారంబువెనుకవివరించెదదితిసుతులైనదైతేయులవంశంబుసెప్పెదనేదైతేయవంశమునందైనను బ్రహ్లాదబలులుపరమభాగవతులైదైత్యదానవవందితులై వెలసిరిదితికిహిరణ్యకశిపుహిరణ్యాక్షులనఁబ్రసిద్ధినొందిరియందుహిరణ్యకశిపునకుజంభాసురతనయయైనదత్తకుఁబ్రహ్లాదయనుహ్లాదసంహ్లాదహ్లాదులనునలుగురుకొడుకులునుసింహికయనుకన్యకయుజన్మించిరియాసింహికకురాహువుజనియించెనారాహువుశిరంబమృతపానంబుసేయహరిదనచక్రంబునంద్రుంచెసంహ్లాదునకుగతియనుభార్యయందుఁబంచజనుండుపుట్టెహ్లాదునకుధమనియనుభార్యయందువాతాపియిల్వలులుపుట్టిరివారలనగస్త్యుండుభక్షించెననుహ్లాదునకుసూర్మియనుభార్యయందుబాష్కలమహిషులుగలిగిరిప్రహ్లాదునకుదేవియనుభార్యయందువిరోచనుండుపుట్టెనతనికిబలిజన్మించె నాబలికినశనయనుభార్యయందుబాణుండుజ్యేష్ఠుండుగానూర్వురుకొడుకులుపుట్టిరియాబలిప్రభావంబువెనుకవివరించెదబాణాసురుండుపరమేశ్వరునారాధించిప్రమథగణంబులకుముఖ్యుండయ్యెమఱియునాదితిసంతానంబువలననేకోనపంచదశకంబులుదయించెవారలందఱుననపత్యులైయింద్రుతోఁగూడిదేవత్వంబునొందిరనినవినిపరీక్షిన్నరేంద్రుండుశుకయోగీంద్రునకిట్లనియె॥ గీ॥ ఏమికారణముననింద్రునకీమరు।చ్చయములాప్తులగుచుశాంతినొంది।రరయఁదత్సమానులగుచువర్తించిరి। దీనివినఁగవలయుఁదెలుపవయ్య॥ అ॥ ననుశుకుండిట్లనియె॥ సీ॥ నరనాథవినుతననందనులందఱునసురేంద్రుచేహతులగుచునుండఁ గోపశోకంబులఁగ్రుస్సుచుఁదనలోననుండుచుదితిచాలసుఖుఁగఁదొడఁగె। భ్రాతృహంతకుఁడలిపాతకునింద్రునింజంపకనాకేలసొంపుగలుగు। వీనిభస్మముసేయువానిగానొకసుతుఁబడసెదననిచాలభర్తఁగోరి। ప్రియముసేయఁదొడఁగెఁజెప్పభావంబుల। భాషణములనధికపోషణముల। భక్తియుక్తిచేతఁబరిచర్యగతిచేత। నుతులచేతనతురలతులచేత॥ చ॥ కలికికటాక్షవీక్షణవికారములఁ హృదయానురాగసం। కలితవిశేషవాఙ్మధురగర్జనలన్లలితాననేందుమం। డలపరిశోభితామృతవిడంబితసస్మితసుప్రసన్నతా। ఫలరుచిరప్రధానములభామినిభర్తమనంబులోఁగొనెన్॥ గీ॥ అఖిలమెఱిఁగినకశ్యపునంతవాని। హీనవృత్తులకెక్కరతులసంగతులచేత। నవశుఁగావించెస్త్రీమిడినబ్జవదన। పతులభ్రమియింపనేరనిసతులుగలరె॥ క॥ పతులఁ బెలుగకనిలిచెను। భూతంబులఁజూచియాత్మపురుషులననము। ఖ్యాతిఁగొలుపంగయువతీ। వ్రాతంబుసృజించెఁబుత్తులువారలకరుదే॥ వ॥ ఇట్లునిజసతిచేతనుపలాలితుండైకశ్యపప్రజాపతియాసతికింబరమప్రీతుండైయిట్లనియెనోతన్వి నీకుఁబ్రసన్నుండనైతివరంబుగోరుమిచ్చెదనాథుండుప్రసన్నుండయినస్త్రీలకుంగోరికసంభవించుటఁయేమిగొరంతసతికింబతియెదైవంబుసర్వభూతంబులమానసంబులకువాసుదేవుండెభర్తనానురూపకల్పితులయినసకలదేవతామూర్తులచేతంబురుషులచేతనుభర్తృరూపధరుండయినభగవంతుండుసేవింపంబడుచుండుస్త్రీలచేతఁబతిరూపంబునభజియింపంబడుచుఁగావునపతివ్రతలయినసుందరులుశ్రేయస్కామలైయేకచిత్తంబుననాత్మేశ్వరుండయినయప్పరమేశ్వరునిభర్తృభావంబునసేవించుచుండుదురేనునునీదుభావంబునవరముండనైతిముశ్శీలులైనవనితలకుంబొందరానివరంబునీకిచ్చెదవేడుమనిననాకశ్యపునకుదితియిట్లనియె॥ గీ॥ వరముగోరనాకువరముండవేనియు। నింద్రుఁద్రుంచునట్టినిర్ధబలుని। నమితతేజుఁడన

యునమరత్వసంప్రాప్తి నెందఁ జెడని వానినిమ్ము నాథ॥ అనవుడు॥ క॥ ఉట్టిపడునట్టి వరమీ కట్టిడి నన్నేట్టు వేఁడెఁ గటకట యనుచు న్నిట్టిపడి యతని మదిలోఁ బుట్టిన తల్లడముతోడఁ బొక్కుచునుండెన్ ॥ చ॥ ప్రకృతిని గర్మపాశముల బద్ధుఁడనైతిఁ గదయ్య నేఁడు నీ వికటసతీస్వభావమగు వేమరుఁ గొల్చిన మాయ నింద్రియాధికమతినైన వాఁడు దన పెంపునఁ జిత్తము వెచ్చఁబెట్టి పాతకములఁ గూలకున్నె నను దైవము నవ్వదె లోలితాత్మునిన్ ॥ సీ॥ కందశరత్క రతోడఁ గలహించుఁ బలుకులుఁ బద్మవిలాసమేర్పఱుపు నోము మహిమాంశుకళలతోఁ జులుఁ దూఁగు చెయ్వులుఁ జెమటఁ గ్రొన్నెత్తురు సేయు మేను నిలువెల్లఁ గరగించు నింపుల నేర్పులుఁ బువ్వుల కరుదైన ప్రోదిసేతఁ దమకంబు పుట్టించు తరితీఁపు తలఁపులు నెనసిన మదిలోని యిచ్చ గింత గలిగి కరవనున్న కాలాహిపోలికెఁ జెలఁగుచున్న సతుల చిత్తవృత్తిఁ దెలియవశమె యెంత ధృతిగలవారికి నాకె కాదు నిఖిలలోకములకు॥ గీ॥ కోరి సతులకెల్లఁ గూర్చెదరెవ్వరు పతులనైన సతుల హితులనైన బలిమిఁ జేసియైనఁ బరహస్తమున నైన హింస సేతు రాత్మహితముకొఱకు॥ వ॥ అని చింతించి దీనికి నేమని ప్రతివాక్యంబిచ్చువాఁడ మద్వచనంబెందున మోఘంబు త్రిలోకపరిపాలనశీలుండయిన నభిమరపాణి వధార్హుండె యైనను దీనికి నైనది యొకటి గల్పి చెదనని దితిం జూచి యో తనుమధ్య నీకు నట్లు దేవబాంధవుండయిన యింద్రహంతయగు పుత్త్రుండు గలిగెడు నొక్క సంవత్సరంబు వ్రతంబునఁ జరియింపుము దీని ప్రకారంబు విను మెల్ల జీవులవలన హింసాభావంబు లేక నతిథ్వని వాక్యంబులు డిగి కోపంబు మాని యనృతంబు వలుకక నఖరోమచ్ఛేదనంబు సేయక నస్థికపాలాదియమంగళంబుల నంటక నదీనదతటాకాముల నవగాహస్నానంబు కాక ఘటోదకకూపోదకంబుల స్నానంబు సేయక దుర్జనసంభాషణంబులు వర్జించి కట్టినకోకయును ముడిచిన పువ్వులను గ్రమ్మర ధరియింపక భోజనంబులయందు నుచ్ఛిష్టాన్నంబును జండికానివేదితాన్నంబును గేశశునకమార్జారకంక్రిమిపిపీలికాది విదూషితాన్నంబును నామిషాన్నంబును వృషలాహితాన్నంబు నీ పంచవిధ నిషిద్ధాన్నంబులు వర్జించి దోయిట నీళ్లు ద్రావక నుచ్ఛిష్టగాక సంధ్యాకాలంబుల ముక్తకేశిగాక మితభాషిణియై యలంకారవిహీన గాక వెలుపలం దిరుగక పాదప్రక్షాళనంబు చేసుకొని కాని శయనింపక నార్ద్రపాదియై పవ్వళింపక పశ్చిమశిరస్సయ్యును నగ్నయయ్యును సంధ్యాకాలంబుల నిద్రింపక నిత్యంబును ధౌతవస్త్రంబులు గట్టి శుచియై సర్వమంగళసంయుక్తయై ప్రాతఃకాలంబున లక్ష్మీనారాయణుల నారాధించి యావాహనార్ఘ్యపాద్యోపస్పర్శనస్నానవాసోపవీతభూషణ పుష్పధూపదీపోపహారాద్యుపచారంబుల నర్పించి హవిశ్శేషంబుగా ద్వాదశాహుతుల వేల్చి దండప్రణామంబు లాచరించి భగవన్మంత్రంబును దశవారంబులను సంధించి స్తోత్రంబుఁ జేసి గంధపుష్పాక్షతల ముత్తైదువులం బూజించి పతిని సేవించి పుత్త్రుం గుక్షిగతుంగా భావించి యివ్విధంబున మార్గశిరశుద్ధప్రతిపదారంభంబుగా నొక్క సంవత్సరంబు సలిపి యాద్వాదశమాసాంత్యదివసంబున విధ్యుక్తంబుగా నుద్యాపనంబు సేయవలయు నీ పుంసవనంబను నీ యెడి వ్రతంబు ద్వాదశమాసపర్యంతంబు చేయుటకు సల్పిన నీవు గోరిన కుమారుండు గలిగెడు ననిన దితియా వ్రతంబుతోడ నె గర్భంబు ధరియించి వ్రతంబు సలుపుచునుండ నింద్రుండు మాతృభిప్రాయంబెఱింగి యాయమ్మ నహరహంబును రహస్యంబున సేవించుచు వ్రతంబునకుం దగిన పుష్పఫలసమిత్కుశపత్త్రాంకురంబులు మొదలయిన వస్తువితతిం ద్రికాలంబునం దెచ్చి యిచ్చుచుఁ బుండరీకంబు హరిణికిం బొంచియున్న భంగి నాయమ్మ వ్రతభంగంబునకై కాచి శుశ్రూషఁ జేయుచు నాయమ్మ ధరియించిన తేజోవిశేషంబునకు బెగ్గలించుచుఁ గృశించుచునుండె నంత నొక్కనాఁడు॥ సీ॥ వామాక్షి యనుదినవ్రతధారణోన్నతపరిచర్యాదిఖులచేఁ బడలియలసి । యొంటిసంధ్యావేళ నుచ్ఛిష్టయై పదప్రక్షాళనామలఁ బాసి మఱచి తనకర్మమోహంబు తవిలి నిద్రింపంగ నింద్రుండు చయ్యన నెదుర్కొంచి । యోగమాయాబలోద్యుక్తుఁడై యాయింతి యుదరంబుఁ జొచ్చి బడి యుగ్రుఁడగుచుఁ దివిరి దేదీప్యమానమై దేజరిల్లు నర్భకుని వజ్రధారల నడఁచె నేఁడు ముక్కలుగ వాఁడు మునిసియుఁ దునుకదునుకఁ జెడక నొక్కొక్క బాలుఁడై చెలఁగుచున్న॥ క॥ వారేడ్వ రగుచుఁ గుయ్యిడ నోరేడ్వకుమనుచు నింద్రుం చెనొక్కొక్క నినా శూరుండేక్కరిదునుకలు గారయమున వారు సెడక ఖండితులయ్యున్ ॥ క॥ ఖండములన్నియు నందఱుఁ జండాంశుసమప్రకాశశాశ్వతులగుచు న్మెండుకొని నిల్చియని రా । ఖండలునకుఁ గరుణ పుట్టుగతి మఱుదోఁపన్ ॥ వ॥ అందఱు ముకుళితకరకమలులై నీకుం దోడఁబుట్టువులము మమ్ము హింసింపం బని లేదు నీకుం బారిషదులమై మరుద్గణములమై నిన్ను సేవించెదము మమ్ము రక్షింపుమనిన నారాయణప్రసాదంబునం జెడని మరుద్గణంబుల పలుకులకుఁ గృపాళుండై యింద్రుండు వారల సహోదరులుగాఁ గైకొని మఱి హింసింపక మానె నశ్వత్థామాస్త్రాగ్నివలన నారాయణరక్షితుండవయిన నీవునుం బోలెఁ గులిశధారల శకలంబులయిన కుమారులన్ని రూపంబులై సంవత్సరంబునకు నొక్కింతకడమగా హరిం బూజించిన వారుగావున నింద్రుతోడం గూడఁ బంచాశద్దేవతలయిన మరుద్గణంబులు ది

తిగర్భంబు వెలువడి రంగ దితి మేల్కాంచి యనలప్రకాశులై యింద్రుతోడం గూడి వెలుంగుచున్న కుమారులం జూచి సంతోషించి యక్క నింద్రుం జూచి నీకు మృత్యురూపం బయిన పుత్రుం గోరి దుస్తరంబయిన వ్రతంబు సలిపితి సంకల్పించిన పుత్రుం డొక్కరుండీ సప్తసంఖ్యగల కుమారులగుట కేమి కతంబు నీ వెఱింగిన భంగి నతథ్యంబుఁ బలుకు మనిన నింద్రుం డిట్లనియె నో తల్లీ భగవద్వ్రతంబుఁ జింతించి సమయ విచ్ఛేదనంబున గర్భంబుఁ జొచ్చి పాపచిత్తుండనై వజ్రధారల గర్భంబు విదళనంబుఁ జేసిన నా శకలంబులు సెడక మహాశ్చర్యంబుగా నిన్నివిధంబున నంగుమారకులయిరి మహాపురుషపూజాసంసిద్ధికార్యానుషంగి గాకుండు నే భగవదారాధనంబు గోరికలం బాపి యెవ్వరు గావింతురు వారిహపరంబుల స్వార్థకుశలులగుదు రమ్మహాపురుష వ్రతసముత్పన్న తేజంబున డంప నెవ్వం డోపుం గావున మన్మకంబున బాలిశస్వరూపుండనై దోషంబుఁ జేసిన నా కార్జన్యకర్మంబు సహింపం దల్లికన్న నెవ్వరు సమర్థులు పాపాత్ముండ ననుగు నన్నుం గావుము నేను వీరలతోడి వాడ నని నిష్కపటంబుగాఁ బ్రార్థించిన నద్దేవియప్పు డా కాకయని శాంతచిత్తయయ్యె నింద్రుండును వారలం గూడి త్రిదివంబునకుం బోయి సోమపానహవిర్భాగంబులు వారలకుం బంచిపెట్టి కూడి సుఖంబుండె నని చెప్పి పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండు వెండియు నిట్లనియె॥ క॥ హరివరమఁడయిన వ్రతమునఁ। హరివంశజులగుచు నెగడు నమరులజన్మ।స్ఫురణంబుఁ బఠియించిన నర। యఁగ నురుదీర్ఘపాపహర మగుట యరుదే॥ వ॥ అని విష్ణుకథాశ్రవణకుతూహలాయమానమానసులైన శౌనకాదిమహామునులకు సూతుండు సెప్పెనని శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకుం జెప్పెననుటయు॥ ... ... ... *

క॥ రాజీవరాజపూజ్యా। శ్రీజితగోపీకటాక్షభువనాంతరవీ। భ్రాజితమూర్తిమదోద్ధత। రాజకులోత్సాహరామరాజాఖ్యనిధీ॥

తరల॥ మురవిదారణ ముఖ్యకారణ మూలతత్త్వవిచారణా। దురితతారణ దుఃఖవారణ దుర్మదాసురమారణా।
కిల్బిహరణ కీర్తిపూరణ కీర్తనీయమహారణా। ధరణిధారణ ధర్మతారణ తాపసస్తుతివారణా॥

తోటకము॥ కరుణాకర శ్రీకరకంబుకరా। శరణాగతసంగతజాడ్యహరా। పరిరక్షితశిక్షితభక్తహరా। కరిరాజశుభప్రదకాంతిధరా॥

గద్య. ఇది, శ్రీసకలసుకవిజనమిత్ర శ్రీవత్సగోత్రపవిత్ర కసువయామాత్యపుత్ర బుధజనప్రసంగానుషంగ సింగయనామధేయప్రణీతంబైన శ్రీమహాభాగవతపురాణంబునందు నజామిళోపాఖ్యానంబును, బ్రచేతసులుఁ జంద్రుండా మంత్రణంబు సేయుటయు, దక్షోత్పత్తియుఁ, బ్రజాసర్గంబును, దక్షుండు శ్రీహరిం గూర్చి తపంబు సేయుటయు, నతనికి నప్పరమేశ్వరుండు ప్రత్యక్షంబగుటయు, హర్యశ్వశబళాశ్వులజన్మంబును, వారల నారదుండు బోధించుటయు, నారదువచనప్రకారంబున వారు మోక్షంబు నొందుటయుఁ, దద్వృత్తాంతంబు నారదువలన విని దక్షుండు దుఃఖాక్రాంతుండగుటయుఁ, దదనంతరంబ బ్రహ్మపదంబున దక్షుండు శబళాశ్వసంజ్ఞలగు సహస్రసంఖ్యాతంబుగల పుత్రులం గాంచుటయును, సృష్టినిర్మాణేచ్ఛానిమిత్తంబున దక్షుపంపున వారలగ్రజన్ములకీర్తిం బొందిన తీర్థరాజంబైన నారాయణసరస్సునకుం జనుటయు, వారికి నారదభగవంతుండు బ్రహ్మజ్ఞానంబు నుపదేశించుటయును, వారు పూర్వజులేగిన ప్రకారంబున మోక్షంబు నొందుటయును, దద్వృత్తాంతంబు దక్షుండు దివ్యజ్ఞానంబున నెఱింగి నారదోపదిష్టంబని తెలిసి నారదు శపియించుటయును, నారదుండు దక్షుశాపంబు ప్రతిగ్రహించుటయును, దక్షునకు మఱల బ్రహ్మవరంబున సృష్టివిస్తారంబుకొఱకుఁ గూఁతు లఱువదియుం జన్మించుటయు, నందుఁ గశ్యపునకు నిచ్చిన పదముగ్గురివలన సకలలోకంబులు నిండుటయును, దేవాసురనరతిర్యఙ్మృగఖగాదిజన్మంబులును, దేవేంద్రుతిరస్కారంబున బృహస్పతి యదృశ్యత్వమాయ చేతం గానరాకుండుటయును, దద్వృత్తాంతంబు రాక్షసులు విని సక్రోధచిత్తులై వచ్చుటయును, దేవాసురయుద్ధంబును, నాచార్యతిరస్కారంబున దివిజరాజపలాయనంబును, బలాయమానులై దేవతలు బ్రహ్మసన్నిధికిం జనుటయును, బ్రహ్మవాక్యంబునఁ ద్వష్టృకుమారుండైన విశ్వరూపు నాచార్యునింగా దేవతలు వరించుటయును, విశ్వరూపుప్రసాదంబున నింద్రుండు నారాయణవర్మంబను కవచంబు ధరియించి రాక్షసుల జయించుటయును, బరోక్షంబున రాక్షసులకు విశ్వరూపు వర్ణనంబును, వృత్రాసురజన్మంబును, సురలకు నారాయణుండు ప్రసన్నుండగుటయును, విశ్వరూపువధానంతరంబున నింద్రునకు బ్రహ్మహత్యసంప్రాప్తంబైన నింద్రుండు స్త్రీభూజలద్రుమంబులయందుఁ బంచిపెట్టుటయును, విశ్వరూపుండు హతుండగుటకుఁ ద్వష్ట యింద్రవధార్థంబు మారణహోమంబు సేయ వృత్రాసురుండు జనించుటయును, వృత్రాసురయుద్ధంబున పరాజితులై యింద్రసహితులైన దేవతలు శ్వేతద్వీపంబునకుం జనుటయు, నంత శ్రీహరి ప్రసన్నుండై దధీచివలన నధిరంబు గైకొనుటయు, నింద్రుండు వజ్రాయుధంబున వృత్రుని సంహరించుటయు, నింద్రుండు బ్రహ్మహత్యాపీడితుండై మానససరస్సుఁ బ్రవేశించుటయును, నహుషుండు శతాశ్వమేధంబులం జేసి యింద్రాధిపత్యంబు వడయుటయును, నహుషుండగస్త్యశాపంబున సురరాజ్యచ్యుతుండై యజగరయోనిం బుట్టుటయు, నింద్రాగమనంబును, నశ్వమేధంబును, నింద్రుండు త్రిలోకాధిపత్యంబు వడయుటయును, జిత్రకేతూపాఖ్యానంబును, మరుద్గణంబుల జన్మప్రకారంబునను కథలుగల షష్ఠస్కంధము.

శ్రీకృష్ణార్పణమస్తు.

---

నప్రశస్తుల వెదకి ఖండింపుఁడు విష్ణుఁ డనఁగ నన్యుఁ డొకఁడు లేఁడు యజ్ఞంబు వేదంబు నతఁడె భూదేవక్రియాదిమూలము నతఁడె దేవర్షిపితృప్రాదిలోకములకు ధర్మములకు మహాధార మతఁడె యే స్థలంబున గోభూసురేంద్ర వేద వర్ణధర్మాశ్రమంబులు వఱలుచుండు నా స్థలంబుల కెల్ల మీ రరిగి చెఱిచి దగ్ధములు సేసి రండు మీ దర్ప మొప్ప॥ వ॥ అని యిట్లు నిర్దేశించిన నదిపజవాగ్దనుని ర్దేశంబులు శిరంబున ధరించి రక్కసులు పెక్కండ్రు భూతలంబునకుం జని॥ సీ॥ గ్రామపుర క్షేత్ర ఖర్వట ఖేట ఘోషారామ నగరాశ్రమాదికములు గాలిచి కొలఁకులు గలఁచి ప్రాకార గోపుర సేతువులు ద్రవ్వి పుణ్యభూజ చయములు ఖండించి సౌధ ప్రపా గేహ పర్ణశాలాదులు పాడుఁ జేసి సాధు గో బ్రాహ్మణ సంఘంబులకు హింసఁ గావించి వేదమార్గములు చెఱిచి కుతల మెల్ల నిట్లు కోలాహలంబుగా దైత్యు లాచరింపఁ దల్లడిల్లి నష్టమూర్తు లగుచు నాకలోకము మాని యడవులందుఁ జొచ్చి రమరవరులు॥ వ॥ అంత హిరణ్యకశిపుండు దుఃఖితుండై మృతుండయిన సోదరునకు నుదకప్రదానాదికార్యంబు లాచరించి యతని బిడ్డలగు, శకుని, శంబర, కాలనాభ, మదోత్కచ, ప్రముఖుల నూరడించి వారల తల్లితోఁ గూడ హిరణ్యాక్షుని భార్యల నంవఱరావించి తమతల్లి యైన దితి నవలోకించి యిట్లనియె॥ శా॥ నీరాగారనివిష్టపాంథుల క్రియన్నెక్కంబు సంసారసం, చారుల్వత్తురు కూడి విత్తురు సదా సంగంబు లేదొక్కచో। శూరుల్వోయెడి త్రోవంబోయెను భవత్సూనుండు తల్లీ మహా। శూరుం డాతఁడు దద్వియోగమునకున్ శోకింపనేటికిన్॥ సీ॥ సర్వజ్ఞుఁ డీశుండు సర్వాత్ముఁ డవ్యయుం డమలుండు సత్యుఁ డనంతుఁ డాఢ్యుఁ డాత్మరూపంబున నశ్రాంతము నుదనమాయా ప్రవర్తన మహిమ వలన గుణములఁ గల్పించి గుణసంగమంబున లింగశరీరంబు లీలఁ దాల్చి కంపితజలములోఁ గదలెడి క్రియఁ దోఁచు పాదపంబుల భంగి భ్రామ్యమాణ చక్షువు సధరిత్రి చలితనగాకారంగ బడిన భంగి వికలభావరహితుఁ డాత్మమయుఁడు కంపితాంతరంగంబునఁ గదలినట్లఁ దోఁచుఁ గదలఁ డతఁడు॥

## శ్రీ బాలవేషము దాల్చిన యముండు దెలిపెడు సుయజ్ఞోపాఖ్యానము. శ్రీ

వ॥ అవ్వా యివ్విధంబున లక్షణవంతుండు గాని యీశ్వరుండు లక్షితుండై కర్మసంస్మరణంబున యోగవియోగంబుల నొందించు సంభవవినాశ శోక వివేకావివేక చింతాస్మరణంబులు వివిధంబు లీయర్థంబునకుఁ బెద్దలు ప్రేతబంధు యమ సంవాదంబను నితిహాసంబు నుదాహరింతురు వినుండు చెప్పెద-నుశీనరదేశంబునందు సుయజ్ఞుండను రాజు గలం డతండు శత్రువులచేత యుద్ధంబున నిహతుండయి యున్న యెడ॥ సీ॥ చినిఁగిన బహురత్న చిత్రవర్మముతోడ రాలిన భూషణరాజితోడ భీకర బాణ నిర్భిన్న వక్షముతోడఁ దొరఁగుచుండెడు శోణితంబుతోడఁ గీర్ణమై జాఱిన కేశబంధముతోడ రయరోషదంష్ట్రాధరంబుతోడ నిమిషహీనంబైన నేత్రయుగ్మముతోడ భూరజోయుతముఖాంబుజముతోడఁ దునిసిపడిన దీర్ఘ దోర్దండములతోడ జీవగహితుఁడగు నుశీనరేంద్రుఁ జుట్టి బంధుజనులు సౌరదినుండఁగ భయభ్రాంతలగుచు నతని కాంత లెల్ల॥ శా॥ ప్రస్తాకంపితకేశబంధములతో సంఛిన్నహారాళితో । హస్తాబ్జంబులు సాఁచి మోఁదికొనుచున్ హా నాథ యంచున్భృశ । ప్రస్తావోక్తులతోడ నేడ్చి రివగన్ బ్రాణేశుపాదంబుపై। నస్తోక స్తనకుంకుమారుణవికీర్ణాస్రంబు వర్షించుచున్॥ మ॥ అనఘా నిన్ను నుశీనరప్రజలకర్థానందసంధాయిగా। మును నిర్మించిన బ్రహ్మ నిర్దయతను న్మాలించె నేఁడీరికిన్। దనయశ్రేణికి మా కుదిక్కు గలదే ధాత్రీశ నీబోటికిన్। జను నే పాసి చనంగ భృత్యజనులన్ సన్మిత్రులం బుత్రులన్॥ మ॥ జనలోకేశ్వర నిన్నుఁ బాసిన నిమేషంబుల్మహాబ్దంబులై। చను లోకాంతరగామివై యలుకచందంబున నిన్నువోయిన నెబ్భంగిఁ జరింతు మొల్లము గదా యీ లోకవృత్తంబు నేఁ। డనలజ్వాలలఁ జొచ్చి వచ్చెద మనీయంఘ్రిద్వయిం జూడఁగన్॥ వ॥ అనియిట్లు రాజభార్యలు రాజశవంబు డగ్గఱి విలపింపం బ్రొద్దు గ్రుంకెడి సమయంబున వారల విలాపంబుల విని బాలకుండై యముండు సనుదెంచి ప్రేతబంధులం జూచి యిట్లనియె॥ ఉ॥ ముచ్చిక వీరికెల్ల బహుమాత్రము చోద్యము దేహి పుట్టుచున్జచ్చుచునుండఁ జూచెదరు చావక మానెడు వారి భంగినీ। చచ్చినవారి కేడ్చెదరు చావునకొల్లక డాఁగవచ్చునే। యెచ్చటఁ బుట్టె నచ్చటికి నేఁగుట నైజము ప్రాణికోటికిన్॥ క॥ జననీజనకులఁ బాసియు ఘనవృకములబాధపడకఁ గడుఁ బిన్నలమై। వనిలో నెవ్వఁడు గర్భంబున మముఁ బోషించె వాఁడె పోషకుఁ డడవిన్॥ క॥ ఎవ్వఁడు సృజించుఁ బ్రాణుల నెవ్వఁడు రక్షించుఁ ద్రుంచు నెవ్వఁడనంతుం డెవ్వఁడు విభుఁ డెవ్వఁడు వాఁ డివ్విధమున నానుచు బెనుచు హేలారతుఁడై॥ గీ॥ ధనము వీథిఁ బడిన దైవవశంబున నుండుఁ బోవు మూలనున్ననైన। యడవి రక్ష లేని యబలుండు వర్ధిల్లు రక్షితుండు మందిరమునఁ జచ్చు॥ క॥ కలుగును మఱి లేకుండును గలభూతము లెల్లఁ గాలకర్మవశములై। నిలువఁడు ప్రకృతిం దద్గుణకలితుఁడు గాఁ డాత్మమయుఁ డగమ్యుఁడు దలఁపన్॥ సీ॥ పాంచభౌతికమైన భవనంబు దేహంబు పురుషుండు దీనిలోఁ బూర్వకర్మవశమున నొకవేళ వర్తించు దీపించుఁ దఱిదప్పిన నొకవేళ దలఁగిపోవుఁ జెడెనేని దేహంబు చెడుఁ గాని పురుషుండు చెడఁ డాతనికి నింత చేటు లేదు। పురుషునికిని దేహపుంజంబునకు వేఱుగాని యేకత్వంబు

గానరాదు దారువుల వెలుంగు దహనుని కైవడిఁ గాయములఁ జరించు గాలి భంగి నాశ్రితమైన నభము చాడ్పున వేఱు దెలియవలయు దేహి దేహములకు॥ అని మఱియు నిట్లనియె॥ సీ॥ భూపాలకుఁడు నిద్రవోయెడి వాఁ డేమి విలపింప నేటికి వెఱ్ఱులార యెవ్వఁడు భాషించు నెవ్వఁ డాకర్ణించు నట్టివాఁ డెన్నఁడో యరిగినాఁడు ప్రాణభూతుం డయిన పవనుఁ డాకర్ణింప భాషింప నేరఁడు ప్రాణిదేహములకు వేఱై తాను ముఖ్యుఁడై యింద్రియవంతుఁడై జీవుండు వలను మెఱయుఁ బ్రాభవమున భూతపంచకేంద్రియ మనోలింగదేహములను లీలఁ గూడి విడుచు నన్యుఁ డొక్కఁడు విభుఁడు దీనికి మీరు పొగల నేల వగల బొరల నేల॥ క॥ ఎందాఁక నాత్మ దేహము నొందెడు నందాఁక కర్మయోగములఁ టపైఁ జెందవు మాయా*యోగస్యందితులై §చిత్తఁ జాలిఁబడ నేమిటికిన్॥ మ॥ చెలులుం దండ్రులుఁ దల్లులాత్మజులు సంసేవ్యుల్ సతుల్ వారు నిర్మలగేహంబు లటంచుఁ గూర్తురు మహామాయాగుణభ్రాంతులై కలలోఁ దోఁచిన యర్థముల్ నిజము లేకర్మానుబంధంబులం గలుగున్ సంగము లేక మానుఁ బిదప న్గర్మాంతకాలంబునన్॥ వ॥ మఱియు మాయాగుణప్రపంచంబు నెఱింగెడి తత్త్వజ్ఞులు నిత్యానిత్యంబులఁ గూర్చి సుఖదుఃఖంబులం జెంద రజ్ఞులు గొందఱు యోగవియోగంబులను సుఖదుఃఖంబుల నొందుదురు తొల్లి యొక్క మహాగహనంబున విహంగంబులకు నంతకభూతుండైన యొకఁడు గలఁ డతండు ప్రభాతంబున నొక్కనాఁడు లేచి వాటంబైన వేఁటతమకంబున॥ క॥ వలలురులు జిగురుగండెలుఁ జలిదియుఁ జిక్కంబు ధనువు శరములుఁ గొనుచుం బులుఁగులఁ బట్టెడు వేడుక నలుకుడు వెడలంగఁ గదలి యడవికి నడిచెన్॥ ఇట్లడవికిం జని తత్ప్రదేశంబునందు॥ క॥ కట్టలుకఁ దడుక చాటునఁ బిట్టలను ఱెఁగోలఁ దిగిచి విఱుచున ఱెక్కల్ బట్టి విఱిచి చిక్కములోఁ బెట్టుచు విహరించె లోకభీకరలీలన్॥ వ॥ మఱియు నానావిధంబుల శకుంతంబుల నంతంబు నొందించుచు సకలపక్షిసంహారసంరబ్ధకరుండై న లుబ్ధకుండు దన ముందటఁ గాలచోదితంబై సంచరించుచున్న కుళింగపక్షిమిథునంబుం గనుంగొని యందుఁ గుళింగినిఁ జిందిగిచి యొక్క చిక్కంబులో వైచిన జూచి దుఃఖించి కుళింగపక్షి యిట్లనియె॥ చ॥ అడవుల మేఁత మేసి మన మన్యుల కెన్నఁడు నెగ్గుఁ జేయ కెక్కడ విహరింప నేఁ డకటకట్టడి బ్రహ్మ కిరాతుచేతులోఁ బడుమని వ్రాసె నే నమటఁ బావపుదైవము కంటికింత నెక్కుడు బరువయ్యె నే బ్రతుకు కోమలి యేమన నేర్తుఁ జెల్లరే॥ క॥ ఒకమాటు మనల నందఱఁ బ్రకటించి కిరాతు వలలఁ బడఁ జేయక ని న్నొక్కటి న్వలఁబడఁ జేసిన వికటీకృతదశమైన విధి నే మందున్॥ ఉ॥ ఱెక్కలు రావు పిల్లలకు ఱేపటినుండియు మేఁత గానమిన్ బొక్కుచుఁ గూటిలో నెగసిపోవఁగ నేరవు మున్నుఁ దల్లి యే దిక్కననుండి వచ్చునని త్రిప్పని చూపుల నిక్కి నిక్కి న ల్దిక్కులు చూచుచున్న వతిదీనత నెట్లు భరింతు నక్కటా॥ అని యివ్విధంబున॥ క॥ కుంఠితనాదముతోడను గంఠము శోషింప వగచు ఖగమును హననోత్కంఠుండై న కిరాతుఁడు కుంఠితగతి నేసె నొక్క కోలం గూలన్॥ క॥ కాలము వచ్చిన శబరుని కోలన్ ధరఁ గూలె ఖగము ఘోషముతోడన్ గాలము డాసిన నేలం గూలకపోవశమె యెట్టి గుణవంతులకున్॥ ఉ॥ కావున మీరు చచ్చుతఱిఁ గానరు చచ్చి ధరిత్రిఁ బడ్డ ధాత్రీవిభు దేహముం గదిసి దీనత నేడువ నేల పొందు చింతావతులార వత్సరశతంబునకైన నిజేశుచక్కికిం బోవుట దుర్లభంబు మృతిఁ బొందినవారలు సేరవత్తురే॥ వ॥ అని యిట్లు కపటబాలకుండై క్రీడించుచున్న యముని యుపలాలనాలాపంబులు విని సుయజ్ఞుని బంధువులెల్ల వెఱఁగుపడి సర్వప్రపంచంబు నిత్యంబు గాదని తలంచి శోకంబు మాని సుయజ్ఞునికి సాంపరాయికకృత్యంబులు సేసి చని రంత నంతకుం డంతర్హితుండయ్యె నని చెప్పి హిరణ్యకశిపుండు దన తల్లి నిఁ దమ్ముని భార్యలం జూచి యిట్లనియె॥ క॥ పరులెవ్వరు దా మెవ్వరు పరికింపఁగ నేకమగుట భావింపరు తత్పరమజ్ఞానము లేమిని బరులును మేమను చుందోఁచుఁ బ్రాణులకెల్లన్॥ వ॥ అని తెలియం బలికిన హిరణ్యకశిపుని వచనంబులు విని దితి కోడండ్రునుం దానును శోకంబు మాని తత్త్వవిలోకనంబు గలిగి లోకాంతరగతుండైన కొడుకునకు వగవక చనియె నని చెప్పి నారదుండు ధర్మనందనున కిట్లనియె॥ క॥ అజరామరభావంబును ద్రిజగద్రాజ్యంబున ప్రతిద్వంద్వము దోర్విజితాఖిలశాత్రవమును గజరిపుబలమును హిరణ్యకశిపుఁడు గోరెన్॥ వ॥ ఇట్లు గోరి మందరాచల¶ద్రోణికిం జని యందుఁ గాలి పెనువ్రేల నేల నిలువంబడి యూర్ధ్వబాహుండయి మిన్నుఁ జూచుచు వాడిమయూఖంబులతోడి ప్రళయకాలభానుండునుంబోలె దీర్ఘజటారుణప్రభాజాలంబులతోడ నెవ్వరికిం జేరి చూడరాక పరమదారుణంబైన తపంబు సేయుచుండె నిర్జరులు నిజస్థానంబున నుండి రంత॥ మ॥ అదరెం గుంభిని సాద్రినాయకలఁ గె నేఁ డంభోనిధుల్ తారకల్ డ్రైదరెన్ గ్రహసంఘముల్ దిశలు విచ్ఛిన్నాంతలై మండెఁ బెల్లదరెన్ గుండెలు జంతుసంహతికి నుగ్రాచారదైత్యేంద్రమూర్ధన్నదిశోద్ధూతసధూమహేతిపటలోదంచత్తపోవహ్నిచేన్॥ వ॥ ఇట్లు త్రైలోక్యసంతాపకరంబైన దైత్యరాజతపోదహనవిజృంభణంబు సైరింపక నిలింపులు నాకంబు విడిచి బ్రహ్మలోకంబునకుం జని లోకేశ్వరుండైన బ్ర

*యోగస్యందితులై సంబంధము చేత నిలుకడఁ దప్పినవారై. — §చిత్తవ్యర్థమైన — ¶ద్రోణి తొన్ప—ఓడ.

హ్మాదులీనతులయి యిట్లని విన్నవించిరి॥ క॥ దితికొడుకు తపము వేఁడిమి। నతితప్తుల మైతి మింక నలజడిఁ జనముఁరా। వతినుండ వెఱతు మెయ్యది। గతి మాకును దేవదేవ కారుణ్యనిధీ॥ మ॥ శంకాలేశము లేదు దేవ త్రిజగత్సంహారము న్దైవతా। సంకోచంబును వేదశాస్త్రప్రపదవీసంక్షేపముం జాలనే। వంకకుం జేతునటంచు మస్సహతపోవ్యావృత్తిచిత్తంబులో। సంకల్పించె నిశాచరుండు ప్రతిసంస్కారంబుఁ జింతింపవే॥ శా॥ నీ వేరీతిఁ దపోబలంబున జగన్నిర్మాణముం జేసి యీ। దేవాధీశులకంటె నెక్కుడు సిరిం దీపించితి బ్బంగిఁ దా। నీ విశ్వంబు తపస్సమాధిమహిమన్ హింసించి వేఁ లొక్కఁడై। శ్వావిర్భావకరత్వశక్తిమదిలో నర్థించినాఁ డీశ్వరా॥ వ॥ అదియునుం గాక కాలాత్మలగు జీవాత్మలకు నిత్యత్వంబు గలుగుటం జేసి తపోయోగసమాధిబలంబునం దనకు నిత్యత్వంబు సంపాదింతునని తలంచినాఁ డని మాకుఁ దెలియు నిట్లనియె॥ మ॥ భవదీయంబగు నున్నతోన్నతమహాబ్రహ్మైకపీఠంబునం। స్తవనీయంబగు భూతియున్ విభవమున్ సౌఖ్యంబు సంతోషము। న్భువనశ్రేణికి నిచ్చి దైత్యునిఁ దపస్స్ఫూర్తిన్ నివా

## బ్రహ్మదేవుండు హిరణ్యకశిపునకు వరమిచ్చుట.

రించి రమ్మో। భువనాధీశ్వర కావవే భువనముల్ పూర్ణప్రసాదంబునన్॥ వ॥ అని దేవతలు విన్నవించిన స్వయంభూతుండును భగవంతుండు నైన నలుమొగంబుల వేల్పు భృగుదక్షాదులతోడ మందరపర్వతంబునకు వచ్చి యందు నియమయుక్తుండును బిపీలికావృతమేదోమాంసచర్మరక్తుండును వల్మీకతృణవేణుపటలపరిచ్ఛన్నుండును మహాతపఃప్రభావసంపన్నుండును నై నీరంధ్రనిబిడనీరదనికరనివిష్టనీరజబంధుండునుం బోలె నివసించియున్న నిర్జరారాతిం జూచి వెఱఁగుపడి నగుచు నిట్లనియె॥ మత్తకోకిల॥ ఓసురారికులేంద్ర నీక్రియ నుగ్రమైన తపంబు మున్। జేసి చూపినవారు లేరికఁ జేయువారును లేరు నే। నీ సమాధికి మెచ్చితిన్ నను నీయభీష్టములిత్తు వా। యాస మేటికి లెమ్ము వేగ మహాత్మ కోరుము కోరికెల్॥ శా॥ దంశవ్రాతములున్ పిపీలికలు మేదస్రక్త్వ్యరక్తంబులు। న్సంశీర్ణంబులు సేసిపట్టి తిన నంగాశల్యావశిష్టుండవై। వంశచ్ఛన్నతృణావళీయుతమహావల్మీకమం దింద్రియ। భ్రంశం బింతయు లేక నీవు నిలువం బ్రాణంబు లెట్లుండెనో॥ ఉ॥ ఉత్సుకతన్ జలాన్నముల నొల్లక నీక్రియ నూఱు దివ్యసం। వత్సరముల్ శరీరమున వాయువు లున్నిలుపంగ వచ్చునే। యుస్సవమయ్యె మాకు మును గ్రతపంబున గెల్చితీవు నే। వత్సలతన్నినుం గదియవచ్చితిఁ గోరికె లెల్ల నిచ్చెదన్॥ వ॥ అని పలికి వనముషీ కాపిపీలికాభక్షితంబైన రక్షోవిభుని దేహంబుమీఁద గమండలుజలంబులు ప్రోక్షించిన నక్షానవేంద్రుండు గమలాసన కరకమలకమనీయకనకమయ దివ్యామోఘకమండలునిర్గతనిర్మలనీరధారాబిందుసందోహసంసిక్తసకలాంగుండై తపంబు చాలించి సాంద్రకీచకసంఘాతసంఛాదితవామలూరుమధ్యంబు వెలువడి మహాప్రభావబలసౌందర్యతారుణ్యసహితుండును వజ్రసంకాశదేహుండును దప్తసువర్ణవర్ణుండును నీరసేంధననికరనిర్గతవహ్నియుంబోలె వెలుంగుచుఁ జనుదెంచి॥ మ॥ దివిజానీకవిరోధి మ్రొక్కెఁ గనివాగ్దేవీమనోనేతకున్। స్వవిశేషోత్సవసంవిధాతకు నమత్సంత్రాతకున్ స్రష్టకున్। వివహాభీష్టవరప్రదాతకు జగన్నిర్మాతకున్ ధాతకున్। వివిధప్రాణిలలాటలేఖనమహావిద్యానుసంధాతకున్॥ వ॥ ఇట్లు దైత్యేశ్వరుండు దివిసున్న హంసవాహనునకు ధరణీతలంబున దండప్రణామంబు లాచరించి సంతోషబాష్పసలిలసంవర్ధితపులకాంకురుండై యంజలిఁ జేసి కంజగర్భుని మీఁద దృష్టి యిడి గద్గదస్వరంబున నిట్లని స్తుతియించె॥ సీ॥ కల్పాంతమున నంధకారసంభృతమైన జగము నెవ్వఁడు దనసంప్రకాశమున వెలిఁగించుచు మూఁడు భంగుల రజస్సత్వతమోగుణసహితుఁ డగుచుఁ। గల్పించు రక్షించుఁ గడపటఁ బ్రహరించు నెవ్వఁ డాద్యుఁడు సర్వహేతువగుచు। శోభితుండై స్వయంజ్యోతియై యొక్కట విలసిల్లు నెవ్వఁడు విభుత మెఱసి। సమయమయిన మానసప్రాణబుద్ధీంద్రి। యములతోడ నెవ్వఁడలఘుమహిము। నడరు నట్టి సచ్చిదానందమయునకు। మహితభక్తి నే నమస్కరింతు॥ వ॥ దేవా నీవు ముఖ్యప్రాణంబగుటం జేసి ప్రజాపతివి మనోబుద్ధిచిత్తేంద్రియంబులకు నధీశ్వరుండవు మహాభూతగణంబులకు నాధారభూతుండవు త్రయీతనువునం గ్రతువులు విస్తరింతువు సకలవిద్యలు నీతనువు సర్వార్థసాధకులకు సాధనీయుండవు నీవ యాత్మనిష్ఠాగరిష్ఠులకు ధ్యేయంబగు నాత్మ కాలమయుండవై జనులకు వాయుర్నాశంబుఁ జేయుదువు జ్ఞానవిజ్ఞానమూర్తివి బాహ్యాభ్యంతరరహితుండవు అంతరాత్మవు మూఁడుమూర్తులకు మూలంబగు పరమాత్మవు జీవలోకంబునకు జీవాత్మవు నీవ సర్వంబును నీవ నీవుగానిది లేశంబు లేదు వ్యక్తుండవుగాక పరమాత్మవై పురాణపురుషుండవై యనంతుండవైన నీవు ప్రాణేంద్రియమనోబుద్ధిగుణంబుల నంగీకరించి పరమేష్ఠిపదవిశేషంబున నిలిచి స్థూలశరీరంబునం జేసి యింతయుం బ్రపంచింతువు భగవంతుండవైన నీకు మ్రొక్కెదనని మఱియు నిట్లనియె॥ క॥ కోరిన వారలకోర్కులు। నేరుపుతో నిచ్చువాను నీక్రియ నన్యుల్। నేరరు కరుణాకర నేఁ। గోరెద నీ విచ్చెదేని గోరికె లభవా॥ శా॥ గాలింగుంభిని నగ్నినంబువుల నాకాశస్థలిన్ దిక్కుల। న్రేలన్ఘస్రములందు మగ్రప్రబలభూరిగ్రాహరక్షోమృగ। వ్యా

ళాదిత్యనరాదిజంతుకలహవ్యాప్తిన్సుస్త్రాస్త్రశస్త్రాళిన్మృత్యువులేనిజీవనములోకాధీశయిప్పింపవే॥ వ॥ మఱియుర
ణంబులందుఁదనకెదురులేనిశౌర్యంబునులోకపాలురనతిక్రమించుమహిమయునుభువనత్రయజయంబును హిరణ్యకశి
పుండుగోరిననతనితపంబునకుసంతోషించిదుర్లభంబులయినవరంబులన్నియునిచ్చికరుణించివిరించియిట్లనియె॥ శా॥ అ
న్నా! కశ్యపపుత్ర! దుర్లభములీయర్థంబులెవ్వారికిన్మున్నెవ్వారలుగోరరీవరములన్నోమించితినీవీయెడన్ నన్నున్గోరిన
వెల్లనిచ్చితిఁబ్రవీణత్వంబుతోబుద్ధిసంపన్నత్వంబుననుండుమీసుమతివై భద్రైకశీలుండవై॥ వ॥ అనియిట్లు మోఘంబు
లయినవరంబులిచ్చిదితినందనుచేతంబూజితుండయియరవిందసంభవుండుబృందారకసందోహవంద్యమానుండగుచునిజ
మందిరంబునకుంజనియె నివ్విధంబున నిలింపారాతివర పరంపరలు సంపాదించుకొని ॥ క ॥ సోదరుజంపినపగకై।
యాదరమించుకయులేకయసురేంద్రుఁడుకంజోదరుపైవైరముగ్మాదరతుండగుచుంజేసెనుమనుజాధీశా॥ సీ ॥ ఒక
నాఁడుగంధర్వయూథంబుపరిమార్చుదివిజులనొకనాఁడుదెరలఁదోలు। భుజగులనొకనాఁడుభోగంబులకుఁబాపుగ్రహ
ములనొకనాఁడుగట్టివైచు।నొకనాఁడుయతులనుగ్రతదండించునొకనాఁడువిహగులనొడిసిపట్టు। నొకనాఁడుసిద్ధుల
నోడించిబంధించుమనుజులనొకనాఁడుమదనుడంచు । గడిమినొకనాఁడుకిన్నరఖచరసాధ్య । చారణప్రేతభూతపి
శాచవన్య । సత్వవిద్యాధరాముల సంహరించు । దితితనూజుండుదుస్సహతేజుఁడగుచు॥ క ॥ అట్టళ్లతోడఁగోటలఁ।
గట్టలుకంగూలఁద్రోఁచిక్రవ్యాదులతోఁ।జుట్టువిడిసిదిక్పాలుర। పట్టణములుగొనియెనతఁడుబలముననధిపా॥ క॥ కృశలై
సంప్రాపితమద్దశలైసర్వంకషోగ్రదైతేయాజ్ఞా।వశలైనిశలునుదివములు।దిశలెల్లనుగట్టువడియెదీనతననఘా॥ వ॥ మ
ఱియు నద్దానవేంద్రుండువిద్రుమసోపానంబులును, మరకతమణిమయప్రదేశంబులును, వైడూర్యరత్నస్తంభసము
దయంబులును,చంద్రికాసన్నిభస్ఫటికసంఘటితకుడ్యంబులును,పద్మరాగపీఠకనకకవాటగేహాళీవిటంకవాతాయనంబు
లును,విలంబమానముక్తాఫలదామవితానశోభితధవళపర్యంకంబులును, వివిధవిచిత్రవిమానంబులును,నిరంతరసురభికు
సుమఫలభరితపాదపసమూహోద్యానంబులును,హేమారవిందసౌగంధికబంధురసరోవరంబులును, రమణీయరత్నప్రా
సాదవిశేషంబులును,మనోహరపరిమళశీతలమందమారుతంబులును మృదుమధురనినదకీరకోకిలకులకోలాహలంబులును
గలిగివిశ్వకర్మనిర్మితంబైత్రైలోక్యరాజ్యలక్ష్మీశోభితంబైనమహేంద్రభవనంబుఁజొచ్చి॥ మ॥ దితిపుత్రుండుజగత్త్రయై
కవిభుఁడై దేవేంద్రసింహాసనో।ద్ధతుఁడై యుండహరాచ్యుతాంబుజభవుల్దప్పంగభీతిన్సమా।గతులై తక్కినయక్షకిన్నర
మరుద్గంధర్వసిద్ధామలా।నతులై కానుకలిచ్చికొల్తురతనిన్నానాప్రకారంబులన్॥ శా॥ ఏదిక్పాలురఁజూచినేఁడలుగునో
యేదేవుబంధించునో। యేదిగ్భాగముమీఁదదాడిచనునోయేప్రాణులంజంపునో। యీదైత్యేశ్వరుడంచునొండొరులు
దారింద్రామలాస్థానభూ। వేదిన్మెల్లననిక్కిచూతురుభయావిర్భూతరోమాంచులై ॥ సీ॥ కోలాహలముమానికొలువుండుఁడీ
సురలారతలఁగిదీవింపుఁడుతపసులార।ఫణలెత్తకుండుఁడునిక్కిపన్నగేంద్రములార ప్రణతులై సనుఁడుదిక్పాలురార।గానం
బుసేయుఁడుగంధర్వవరులారసందడిఁబడకుఁడీసాధ్యులార। యాడుఁడునృత్యంబులప్సరోజనులారచేరికమ్రొక్కుఁడు
సిద్ధులార।శుద్ధకర్పూరవాసితసురభిమధుర।భవ్యనూతన*మైరేయపానజనిత।సుఖవిలీనతనసురారిసొక్కినాఁడు।శాం
తిలేదంద్రునిచ్చలుచారులధిప॥ శా॥ లీలోద్యానలతానివాసములలోలీలావతీయుక్తుఁడై।హాలాపానవివర్ధమానమదలో
లావృత్తతామ్రాక్షుఁడై। కేళింతేలఁగనేనుఁదుంబురుఁడుసంగీతప్రసంగంబుల। న్వాలాయంబుఁగరంగఁజేయుమము
దేవద్వేషిసుర్వీశ్వరా॥ క॥ యాగములుబుధులుధరణీ।భాగములంజేయుచుండఁబరతెంచిహవి।ర్భాగములఁదానకైకొ
నుఁ।జాగింపఁడుదైత్యుఁడమరసంఘంబునకున్॥ సీ॥ సకలమహాద్వీపసహితవిశ్వంభరాస్థలినిదున్నకపండుసస్యచయము
కామధేనువులకరణినర్థులుగోరుకోర్కులుగగనంబుగురియుచుండు।వననిధులేడునువాహినీసందోహములునువీచుల
రత్నములువహించు।నుర్వీరుహంబులునొక్కకాలంబుననఖిలర్తుగుణములనతిశయిల్లు। నంబుసంపూరితద్రోణులగుచు
నొప్పఁబర్వతంబులుసర్వదిక్పాలవివిధ।గుణములెల్లనుదానెకైకొనుచుదైత్య। విభుఁడుత్రైలోక్యరాజ్యసంవృద్ధినొం
ది॥ వ॥ ఇట్లుసకలదిక్కులునిర్జించిలోకైకనాయకుండైతనయిచ్చాప్రకారంబుననింద్రియసుఖంబులనుభవించుచుం దని
యకశాస్త్రమార్గంబునతిక్రమించి విరించివరజనితదుర్వారగర్వాతిరేకంబున సుపర్వారాతియైశ్వర్యవంతుండై పెద్ద
కాలంబురాజ్యంబుసేయునెడ॥ ఉ॥ ఎన్నఁడుమాకుదిక్కుగలదెన్నఁడుదైత్యునిబాధమానుమే। మెన్నఁడువృద్ధిఁబొందఁ
గలమెవ్వఁడురక్షకుఁడంచుదేవతా।కిన్నరసిద్ధసాధ్యమునిఖేచరనాయకులాశ్రయించిరా।పన్నగతల్పుభూరిభవబంధవి

• మైరేయపానజనిత॥ మైరేయ।ఆరెపువ్వు-బెల్లము-కదంగునీళ్లచేతఁజేసినకల్లుయొక్క, పానజనిత।త్రాగుటవలనఁబుట్టిన.

హోమములు బ్రహ్మలోకమునకున్॥వ॥ఇట్లు దానవేంద్రుని యుగ్రదండంబులకు వెఱచి యనన్యశరణ్యులై రహస్యంబున నందఱుం గూడికొని యిట్లనిరి॥ ఉ॥ఎక్కడనున్నవాఁడు జగదీశ్వరుఁ డాత్మమయుండు మాధవుం డెక్కడికేఁగి శాంతులు మునీశులు ధీరులు సారు క్రమ్మఱం దిక్కులు నెల్ల నెక్కడఁ దమదిం జోరదిక్కగునట్టి దిక్కుకై మ్రొక్కెద మేము హస్తయుగముల్మసలించి మదీయు రక్షకున్॥వ॥అని మఱియు నాహారనిద్రలు మాని చిత్తంబులు వరాయత్తంబులుగా నీక సమాహితబుద్ధులై భగవంతుండు మహాపురుషుండును, మహాత్ముండును, విశుద్ధజ్ఞానానందమయుండును నైన హృషీకేశునకు నమస్కరించుచున్న యెడ మేఘరవసమానగంభీరనినదంబున దిశలు మ్రోయించుచు సాధులకు నభయంబు గావించుచు, దృశ్యమానుండు గాక పరమేశ్వరుండైన హరి యిట్లనియె॥మ॥భయముం జెందకుఁ డయ్య నిర్జరవరుల్ భద్రంబు మీకయ్యెడు న్జయము న్లాభము భూతసంతతికి మత్సందర్శనప్రాప్తిని వ్యయమై చేరు నెఱుంగు మద్గతిసుత వ్యాపారభాషావిపర్యయముం గాలము గూడఁ జంపెదఁ జనుం డందాఁక మీ రోర్వలెన్॥ గీ॥ శుద్ధసాధులందు సురలందు శ్రుతులందు గోవులందు విప్రకోటియందు ధర్మపదవియందు మదగిలినాయందు వాఁ డెన్నఁడలుగు నాఁడె హింసఁ జెందు॥ క॥ కన్నకొడుకు శమదమసంపన్నుఁ డసురవైరుఁ డనక ప్రహ్లాదముని వాని నెన్నఁడు రోషంబున నాపన్నత నొందించువాఁడె పట్టి వధింతున్॥ శా॥ వేధోదత్తవరప్రసాదగరిమన్ వీఁడింతవాఁడై మిముం బాధం జేయుచు నున్నవాఁడని మదిన్ భావింతు భావించి నేన్ సాధింపం దఱి కాదు కావునఁ గడుం జైరించి తిష్ఠీఁదట న్సాధింతున్ సురలార నేఁడు సనుఁడా శంకింపమీ కేటికిన్॥ వ॥ అని యిట్లు దనుజమర్దనుండు నిర్దేశించిన నిలింపులు గుంపులుగొని మ్రొక్కి రక్కసుండు మ్రగ్గుట నిక్కంబని తమతమదిక్కులం జనిరి- హిరణ్యకశిపునకు విచిత్రచరిత్రులు నలు

## ప్రహ్లాదచరిత్ర ప్రారంభము.

పురుపుత్త్రు లుద్భవించిరందు॥సీ॥తనయందు నిఖిలభూతములందు నొకభంగి సమహితత్వంబున జరుగువాఁడు। పెద్దలఁ బొడఁగన్న భృత్యుని కైవడిఁ జేరి నమస్కృతుల్ సేయువాఁడు।కన్నుదోయికి నన్యకాంతలడ్డంబైన మాతృభావముఁ జేసి మఱలువాఁడు।తల్లిదండ్రులభంగి ధర్మవత్సలతను దీనులఁ గావఁ జింతించువాఁడు।సఖులయెడ సోదరస్థితి జరుపువాఁడు। దైవతములంచు గురువులఁ దలఁచువాఁడు। లీలలందును బొంకులు లేనివాఁడు। లలితమర్యాదుఁడైన ప్రహ్లాదుఁ డధిప॥ మఱియును॥ సీ॥ ఆకారజన్మవిద్యార్థవరిష్ఠుఁడై గర్వసంస్తంభసంగతుఁడు గాఁడు।వివిధమహానేకవిషయసంపన్నుఁడై పంచేంద్రియములచేఁ బట్టువడఁడు।భవ్యవయోబలప్రాభవోపేతుఁడై కామరోషాదులఁ గ్రందుకొనఁడు।కామినీప్రముఖభోగములెన్నిగలిగిన వ్యసనసంసక్తి నాపంకఁ బోఁడు।విశ్వమందు గన్న విన్న యర్థములందు।వస్తుదృష్టిఁ జేసి వాంఛనిడఁడు। ధరణినాథదైత్యతనయుండు హరిపరతంత్రుఁడై హతాన్యతంత్రుఁ డగుచు॥గీ॥సద్గుణంబులెల్ల సంఘంబులై వచ్చి।యసురరాజతనయునందు నిలిచి।పాసి చనవు విష్ణుఁ బాయని విధమున।నెపుడుఁ దగిలి యుండు నిర్మలాత్మ॥మ॥పగవారైన సురేంద్రులున్ సభలలోఁ బ్రహ్లాదసంకాశులున్ సుగుణోపేతుల నెందు మే మెఱుఁగనంచున్ వృత్తబంధంబులం।బొగడం జొత్తురు సత్కవీంద్రుల క్రియన్ నాథ మీబోటిస।ద్భగవద్భక్తులు దైత్యరాజతనయుం బాటించి కీర్తింపరే॥క॥గుణనిధియగు ప్రహ్లాదుని।గుణములనేకములు గలవు గురుకాలమున।న్గణుతింపన శక్యంబులు।ఫణిపతికి బృహస్పతికిని భాషాపతికిన్॥ వ॥ఇట్లు సద్గుణగరిష్ఠుండైన ప్రహ్లాదుండు భగవంతుండైన వాసుదేవుని యందు సహజసంవర్ధమాననిరంతరధ్యానరతుండై ॥ సీ ॥ శ్రీవల్లభుఁ డుడన్నుఁ జేరినయట్లైనఁ జెలికాండ్ర నెవ్వరిఁ జేరమఱచు। నసురారిదన మ్రోల నాడినయట్లైన నసురబాలురతోడ నాడమఱచు। శుభభక్తవత్సలుఁడు సంభాషించినట్లైనఁ బరభాషలకు మారు పలుక వెఱచు। సురవంద్యు దనలోనఁ జూచినయట్లైనఁ జొక్కి సమస్తంబుఁ జూడమఱచు।హరిపదాంభోజయుగచింతనామృతమున।నంతరంగంబు నిండిన యట్లైన నతఁడు। నిత్యపరిపూర్ణుఁడగుచు నన్నియును మఱచి।జడత లేక యయుండు నుజడునిభంగి॥శా॥పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్ హాసలీ।లా నిద్రాదులు సేయుచుం దిరుగుచున్ లక్షించుచున్ సంతత। శ్రీనారాయణపాదపద్మయుగళీచింతామృతాస్వాదసం।ధానుండై మఱచున్ సురారిసుతుఁ డేతద్విశ్వమున్ భావరా.సీ॥వైకుంఠచింతావివర్జితచేష్టుఁడై యొక్కఁడు నేడుచు నొక్కచోట।నశ్రాంతహరిభావనారూఢచిత్తుఁడై యుద్ధతుఁడై పాడు నొక్కచోట। విష్ణుఁ డింతియకాని వేఱొండు లేదని యొత్తి వినగుచుండు నొక్కచోట। నలినాక్షుఁడను నిధానముఁ గంటి నేనని యుబ్బి గంతులు వైచు నొక్కచోటఁ।బలుకు నొక్కచోటఁ బరమేశుఁ గేశవుఁ।బ్రణయహర్షజనితబాష్పసలిల। మిళితపులకుఁడై నిమీలితనేత్రుఁడై। యొక్కచోట నగుచు నూరకుండు॥వ॥ఇట్లు పూర్వజన్మపరమభాగవతసంసర్గసమాగతంబైన ముకుందచరణారవిందసేవాతిరేకంబున నఖర్వనిర్వాణభావంబు విస్తరించుచున్నప్పటప్పటికి దుర్జనసంసర్గనిమిత్తంబున దనచిత్తంబన్యాయత్తంబుగానీక నిజాయత్తంబు సే

శైలతనర్థకల్పనముఁ జెప్పెడి గ్రాహ్యము గామశాస్త్రము। శ్లే తెటఁగించెద న్వినిన మీకు నిరంతరభక్తి మయ్యెడిన్ ॥వ॥ వివిమం
బుసకలజన్మంబులందును ధర్మార్థాచరణ కారణంబయిన మానుషజన్మంబు దుర్లభం బందు బురుషత్వంబు దుర్గమంబది
యు శతవర్ష పరిమితంబయిన జీవితకాలంబు ననియతంబై యుండు నందు సగమంధకారబంధురంబయి రాత్రిరూపంబున ని
ద్రాదివ్యవహారంబుల నిరర్థకంబయి చను నంత నిలిచిన పంచాశద్వత్సరంబులందును బాల్యయౌవనకౌమార కైశోరవయోవిశే
షంబుల వింశతిహాయనంబులు గడచుఁ గడమ నుప్పదియబ్దంబులు నింద్రియంబుల చేతఁ బట్టువడి దురవగాహంబులైన కా
మక్రోధలోభమోహమదమత్సరంబులను పాశంబులఁ గట్టువడి విడివడ సమర్థుండు గాక ప్రాణంబులకంటె మధురాయ
మానయైన తృష్ణకులోనై భృత్యతస్కరవణిక్కర్మంబులఁ బ్రాణహానియైన నంగీకరించి పరార్థంబుల నర్థించుచు రహస్య
సంభోగచాతుర్యసౌందర్యవిశేషంబుల ధైర్యవల్లీకాలవిత్రంబులయిన కళత్రంబులను మహనీయమంజులమధురాలాపం
బులు గలిగి వశులయిన శిశువులను శీలవయోరూపధన్యలగు కన్యలను వినయవివేకవిద్యాలంకారులయిన కుమారులను గామి
తఫలప్రదాతలను భ్రాతలను మమత్వప్రేమ మైన్య జనకులయిన జననీజనకులను సకలసౌజన్యసింధువులయిన బంధువులను
ధనకనకవస్తువాహనసుందరంబులైన మందిరంబులను సుకరంబులైన పశుభృత్యనికరంబులను వంశపరంపరాయత్తంబు
లయిన విత్తంబులను వర్జింపలేక సంసారంబు నిర్జింపను పాయంబుఁ గానక తంతువర్గంబున నిర్గమద్వారశూన్యంబయిన
మందిరంబుఁ జేరి చిక్కువడి వెడలెడి పాటవంబు చాలక తగులువడు కీటకంబు చందంబున గృహస్థుండు స్వయంకృతకర్మబ
ద్ధుండయి శిశ్నోదరాదిసుఖంబులఁ బ్రసక్తుండై నిజకుటుంబపోషణపారవశ్యంబున విరక్తిమార్గంబుఁ దెలియ నేరక స్వకీ
యపరకీయభిన్నభావంబున నంధకారంబునం బ్రవేశించుఁ గావునఁ గౌమారసమయంబున మనీషాగరిష్ఠుండై పరమభాగ
వతధర్మంబు నష్ఠింపవలయు దుఃఖంబులు వాంఛితంబులు గాక చేకుఱు భంగి సుఖంబులు గాలానుసారంబులై లబ్ధంబుల
గుం గావున వృథాప్రయాసంబున నాయుర్వ్యయంబు సేయందగదు హరిభజనంబున మోక్షంబు సిద్ధించు విష్ణుండు సర్వ
భూతంబులకు నాత్మేశ్వరుండు ప్రియుండు మిత్రుండగు దేహికి దేహావసానపర్యంతంబు నారాయణచరణారవిందసే
వనంబు కర్తవ్యంబు ॥సీ॥ కంటిరే మనవారు ఘనులు గృహస్థులై విఫలులై రై కొన్న వెఱ్ఱితనము। భద్రార్థులై యుండి పాయ
రు సంసారపద్ధతి నూరక పట్టువడిరి। కలయోనులందెల్ల గర్భాద్యవస్థలఁ బురుషుండు దేహియై పుట్టుచుండుఁ। దన్నెఱుంగక
కర్మతంత్రుఁడై కడపట ముట్టఁడు భవశతములకు నైన। దీనశుభము లేదు దివ్యకీర్తియు లేదు। జగతిఁ బుట్టి పుట్టి చచ్చి చచ్చి। పో
రల నేలమనకుఁ బుట్టని చావని త్రోవ వెదకికొనుట దొడ్డబుద్ధి ॥శా॥ హాలాపానవిజృంభమాణమదగర్వాతీతదేహోల్లస।
ద్బాలాలోకనశృంఖలానిచయసంబద్ధాత్ముఁడై లేశము। న్వేలానిస్సరణంబుఁ గానక మహాఫిద్వాంసుఁడుం గామినీ। హే
లాకృష్టకురంగశాబకమగుఁ క్షీణస్థితిన్వింటిరే ॥గీ॥ విషయసక్తులయిన విబుధాహితులతోడి। మునికి వలదు ముక్తిమార్గ
వాంఛ। నాదిదేవు విష్ణు నాశ్రయింపుఁడు ముక్తసంగజనులఁ గూడి శైశవమున ॥వ॥ కావున విషయంబులఁ జిక్కువడి నరకగ
సులకు హరిభజనంబు శక్యంబు గాదు రమ్యమయ్యును బహుతరప్రయాసగమ్యము నితలంచితి రేనిఁ జెప్పెద సర్వభూతాత్మ
కుండై సర్వదిక్కాలసిద్ధుండయి బ్రహ్మ కడపలఁ గాఁగల చరాచరస్థూలసూక్ష్మజీవసంఘంబులందును నభోవాయుకుం
భినీసలిలతేజంబులని యెడు మహాభూతంబులందును భూతవికారంబులయిన ఘటపటాదులందును, గుణసామ్యంబైన ప్ర
ధానమందును, గుణవ్యతిరిక్తంబైన మహత్తత్త్వాదియందును, రజస్సత్త్వతమోగుణంబులయందును, భగవంతుం డవ్యయుం
డీశ్వరుండు పరమాత్మ పరబ్రహ్మ మని యెడు వాచకశబ్దంబులం గేవలానుభవానందస్వరూపకుండు, నవికల్పితుండు, నిర్దే
శ్యుండు, ననిర్దేశ్యుండునై వపరమేశ్వరుండు త్రిగుణాత్మకంబైన తన దివ్యమాయ చేత నంతర్హితైశ్వర్యుండై వ్యాప్యవ్యాపక
రూపంబులం జేసి దృశ్యుండును, ద్రష్టయు, భోగ్యుండును, భోక్తయునై నిర్దేశింపందగి వికల్పితుండై యుండుఁ దత్కారణంబున
నాసురభావంబు విడిచి సర్వభూతంబులందును దయాసుహృద్భావంబులు గర్తవ్యంబులు దయ గలిగిన నధోక్షజుండు సంత
సించు ననంతుండాద్యుండు హరి సంతసించిన నలభ్యంబెయ్యదియు లేదు జనార్దనచరణసరసీరుహయుగళస్మరణసుధారస
పానపరవశులమైతిమేని మనకు దైవవశంబున నకాంక్షితంబులై సిద్ధించు ధర్మార్థకామంబులు కాంక్షితంబులై సిద్ధించు మో
క్షంబననేల త్రివర్గంబును, నాత్మవిద్యయుం దర్కదండనీతి జీవికాదులన్నియుఁ ద్రైగుణ్యవిషయంబులైన వేదంబులవలనం
బ్రతిపాద్యంబులు నిస్త్రైగుణ్యలక్షణంబు నంబరమపురుషుండైన హరికి నాత్మసమర్పణంబు సేయుట మేలు పరమాత్మ జ్ఞా
నోదయ మనం జేసి స్వపరభ్రాంతిఁ జేయక పురుషుండు యోగావధూతత్వంబున నాత్మవికల్పభేదంబు నాఁగి లోకంబు స్వ
విశేషంబు భంగిఁ దథ్యంబనక మిథ్యయని తలంచు ననిమాటియుఁ బ్రహ్లాదుండిట్లని యె ॥మ॥ నరుఁడుం దానును నైన త్రిలోకనాథుఁ బోలఁ

గురుఁడో నారాయణుం డింతయు । న్వరుస న్నారదసంయమీశ్వరుఁ డనఘా వ్యాఖ్యానముం జేసె మున్ । హరిభక్తాంఘ్రిపరాగ శుద్ధతనులే కాంతుల్మహాకించను । ల్పరతత్త్వజ్ఞులుగాని నేరరు మహాభావింప నీజ్ఞానమున్ ॥వ॥ తొల్లి నేను దివ్యదృష్టిగల నారద మహామునివలన నవిశేషంబై న యీజ్ఞానంబును, బరమ భాగవతధర్మంబును వింటి నని వెఱఁగుపడి దైత్యబాలకులు దనుజ రాజకుమారున కిట్లనిరి ॥ఉ॥ నుంటిమి కూడి భార్గవసుమారకు నొద్దన నేకశాస్త్రము । ల్వింటిమి లేఁడు సద్గురుఁడు వేఱొకఁ డె న్నఁడు రాజశాలము । లొక్కంటికి నై న రాము సారఁగా వెలికిం జన రాముని వీని । యొంటక వృత్తి నెవ్వఁడు ప్రసన్నుఁడు నెప్పెగు నాధ్య సెప్పవమా ॥ క ॥ సేవింతుము ని న్నెప్పుడు । భావింతుము రాజవను చు బహుమానంబు । ల్గావింతుము తెలియుము నీ । కీవింత మతి ప్రకాశ మే క్రియఁ గలిగెన్ ॥వ॥ అని యిట్లు దైత్యనందనులు దన్నడిగినఁ బరమ భాగవతకులాలంకారుం డై న ప్రహ్లాదుం డునగి తనకుఁ బూర్వంబున నమవినంబడిన నారదు మాటలు దలంచి యిట్లనియె. శా॥ అక్షీణో గ్రతపంబు మందరగము న్పై సద్ధింది మా తండ్రి శు । ద్ధక్షాంతిం జనియుండఁ జీమగమి చేత న్బాగి చందంబున । న్భక్షింపం బడెఁ బూర్వ పాపముల చేఁ బాపాత్ముకుం డంచుము । న్రక్షస్సంఘము మీఁద నిర్జరులు సంరంభించి యుద్ధార్థులై ॥ శా॥ ప్రస్థానోచిత భేరి భాంకృతులతోఁ బాకారి యుం దారు శౌ । ర్యస్థైర్యంబున నేగు దెంచినఁ బదీయాటోప విభ్రాంతులై । స్వస్థేమ ల్దిగనాడి పుత్రధనయోపామిత్ర సంపన్న శా । ప్రస్థానంబులు డించి పాఱి రసురుల్ప్రాణావనోద్యుక్తులై ॥ మ॥ త్తకోకిల॥ ప్రల్లదంబున వేల్పులుద్ధతిఁ బాఱి రాజనివాసము । న్గొల్లవెట్టి సమస్త విత్తముఁ గ్రూరతం గొనిపోవఁగా । నిల్లుఁ జొచ్చి విశంకుఁడై యమరేశ్వరుండు దలంచి మా । తల్లిఁ దాఁ జెఱఁ బట్టె సిగ్గున దత్తయై విలపింపఁగాన్ ॥వ॥ ఇట్లు సురేంద్రుండు మాతల్లిం జెఱఁ గొనిపోవుచుండ నమ్మార్గమునఁ గురరియను పులుఁగు క్రియ మొఱలిడినఁ దెరువునఁ దైవయోగంబున నారదుండు వొడగని యిట్లనియె ॥ ఉ॥ స్వర్భువనాధినాథ సురసత్తమ వే ల్పులలోన మిక్కిలి । న్నిర్భర పుణ్యమూర్తివి సునీతివి మానినిఁ బట్ట నేల యీ । గర్భిణి నాతురన్ విడువు కల్మషమానసు రాలుగాదు నీ । మత్సరరోషము న్నిలుపు మగ్గుఁడ వై ననిలింప వైరిపై ॥ అనిన వేల్పుతపసికి వేయిగన్నులరవరయిట్లనియె ॥ఉ॥ అంతనిదానమైన దివిజాధిపు వీర్యము దీని కుక్షిన । త్యంత సమృద్ధి నొందెడి మహాత్మక కావునఁ దత్ప్రసూతిప । ర్యంతము బద్ధఁ జేసి జనితార్భకు వజ్రపు ధారఁ ద్రుంచి నిశ్చింతుఁడనై తుదిన్విడుతు సిద్ధము దానవ రాజవల్లభన్ ॥ వ॥ అని పలికిన వేల్పుఱేనికిఁ దపసి యిట్లనియె ॥ శా ॥ నిర్భీతుం డుప్రశస్త భాగవతుఁ డున్నిద్రైక విజ్ఞానుఁ డంత రావిర్భూత దాచ్యుత పాదభక్తి మహిమావిష్టుండు దైత్యాంగనా । గర్భస్థుండగు బాలకుండు బహు సంగ్రామాద్య్యపాయంబులన్ । మర్త్యావంబునఁ బొందిచావఁడు భవద్దోర్దర్ప విక్రాంతుఁడై ॥ వ॥ అని దేవముని నిర్దేశించిన నతని వచనంబులు మన్నించి తాను హరిభక్తుండుగావున దేవేంద్రుండు భక్తి భావంబున మాయవ్వను విడిచి వలగొని సురలోకంబునకుం జనియె- మానీంద్రుండును జననియందుఁ బుత్రికాభావంబుఁ జేసి యూరడించి నిజాశ్రమంబునకుం గొనిపోయి నీవు పతివ్రతవు నీ యుదరంబునం బరమ భాగవతుండై న ప్రాణియున్న వాఁడు తపోమాహాత్మ్యంబునం గృతార్థుండై నీ పెనిమిటి రాఁగలండందాఁక నీవిక్కడ నుండుమని సమ్మతించి॥ శా॥ యోషారత్నము నాథ దేవతపిశాలోద్యోగమాతల్లిని । ర్దోషస్వాంతము నాథురాక నుజలో వాంఛించి నిర్దోషయై । యూహద్భీతియు లేక గర్భపరిరక్షేచ్ఛన్విహారించి శుశ్రూషల్ సేయుచునుండె నారదునకు న్సువ్యక్తశీలంబునన్ ॥ వ॥ ఇట్లు తనకుఁ బరిచర్యఁ జేయుచున్న దైత్యరాజకుటుంబినికి నాశ్రితరక్షావిశారదుం డై న నారదుండు నిజసామర్థ్యంబున నభయం బిచ్చి గర్భస్థుండై న నన్నును ద్దేశించి ధర్మతత్త్వంబును, నిర్మలజ్ఞానంబు నుపదేశించిన నమ్మునిదయ తద్దయుం బెద్దకాలంబు నాఁటి విసికిఁ గావున నాఁడు దియగుటం జేసి పరిపాటిఁ దప్పి సూటి లేక మఱచె నారదుండు నాయెడఁ గృపగల నిమిత్తంబున ॥ క॥ వెల్లిగొని నాఁట నుండియు । నుల్లసితంబై న దైవయోగంబున శో । భిల్లెడు ముని మతమంతయు । నుల్లంబున మాఱుపుట్టదొకనాఁడై నన్ ॥గీ॥ పినుఁడు నాముపలుకు విశ్వసించితి రేని । సతులకై న బాలజనులకై న । దెలియవచ్చు మేలు దేహాద్యలంకార । వశన సిపుణమైన తపసిమతము ॥వ॥ అని నారదోక్త ప్రకారంబున బాలురకుఁ బ్రహ్లాదుండిట్లనియె నీశ్వరమూర్తియైన కాలంబునం జేసి వృక్షంబు గలుగుచుండ ఫలంబునకు జన్మసంస్థానవర్ధ నాపక్షీణత్వపరిపాక నాశంబులు ప్రాప్తంబులయిన తెఱంగున దేహంబునకుం గాని షడ్భావవికారంబు లాత్మకు లే వాత్మ నిత్యుండు, క్షయరహితుండు, శుద్ధుండు, క్షేత్రజ్ఞుండు, గగనాదులకు నాశ్రయుండు, క్రియాశూన్యుండు, స్వప్రకాశుండు, సృష్టిహేతువు, వ్యాపకుండు, నిస్సంగుండు, బరిపూర్ణుం, డొక్కఁ డని పదిసమర్థంబులగు నాత్మలక్షణంబులు పండ్రెండు నెఱుంగుచు దేహాదులందు మోహజనకంబులగు నహంకార మమకారంబులు విడిచి వసించిగను లుగల నెలవున విభ్రాజమానకనక లేశంబుల పాషాణావములందుఁ బుటంబు వెట్టి వహ్నియోగంబునఁ గఱఁగ నూది హేమకారకుండు పాటవంబున హాటకంబుఁ బడయు భంగి నాత్మకృత కార్యకారణంబుల నెఱింగెడి నేర్పరి దే

హంబునందాత్మసిద్ధికొఱకు నైనయుపాయంబులం జేసి బ్రహ్మభావంబునం బడయు మూలప్రకృతియు మహదహంకారం బులుఁ బంచతన్మాత్రంబులు నివియెనిమిదియుం బ్రకృతులనియును, రజస్సత్త్వతమంబులు మూఁడున్ బ్రకృతిగుణంబులనియు ను, గర్మేంద్రియంబులైన వాక్పాణిపాదపాయూపస్థలును, జ్ఞానేంద్రియంబులైన శ్రవణనయనరసనాత్వగ్ఘ్రాణంబులు ను, మనంబును మహీసలిలతేజోవాయుగగనంబులు నివి పదాఱును వికారంబులనియును, గపిలాదిపూర్వాచార్యులచేతం జె ప్పంబడియె సాక్షిత్వంబున వీనినిరువదియేడింటిని నాత్మఁ గూడియుండుఁ బెక్కింటికూటువ దేహమదియు జంగమస్థావరరూ పంబుల రెండువిధంబులయ్యె మూలప్రకృతి మొదలైన వర్గంబునకు వేఱైన మణిగణంబులఁ జొచ్చియున్న సూత్రంబుచందం బున నాత్మయున్నింటియందును జొచ్చి దీపించు నాత్మకు జన్మస్థితిలయంబులు గలవంచు మిథ్యాతత్పరులు గాక వివేకశుద్ధ మైన మనంబున విచారించి దేహంబునందాత్మ వెదుకవలయు నాత్మను నవస్థలుగలయట్లుండు గాని యవస్థలు లేవు జాగరణ స్వప్నసుషుప్తులను వృత్తులెవ్వనిచేత నెఱుంగంబడు నతండాత్మ యం ప్రకుసుమధర్మంబులయిన గంధంబులచేత గంధా శ్రయుండైన వాయువు నెఱింగెడు భంగిఁ ద్రిగుణాత్మకంబులై కర్మజన్యంబులైన బుద్ధిభేదంబుల నాత్మ నెఱుంగందగు నని చెప్పి॥సీ॥ సంసారమిది బుద్ధిసాధ్యము గుణకర్మగణబద్ధమజ్ఞానకారణంబు। కలవంటిదింతియ కాని నిక్కము గాదు సర్వార్థ ములు మనస్సంభవములు। స్వప్నజాగరములు సమములు గుణశూన్యుఁ డగు పరమునికి గుణాశ్రయమున। భవవినాశంబులు పాటిల్లినట్లుండు పట్టిచూచిన లేవు పాలురార।తే॥ డంగి త్రిగుణాత్మకములయిన కర్మములకు। జనకమై వచ్చు నజ్ఞానసముదయ మును। ఘనతరజ్ఞానవహ్నిచేఁ గాల్చి పుచ్చి। కర్మవిరహితులై హరిఁ గనుట మేలు॥వ॥ అదిగావున గురుశుశ్రూషయు సర్వలా భసమర్పణంబును సాధుజనసంగంబు నీశ్వరప్రతిమాసమారాధనంబును హరితత్పరత్వంబును వాసుదేవునియందలి ప్రే మయు నారాయణగుణకర్మకథానామకీర్తనంబును వైకుంఠచరణకమలధ్యానంబును విశ్వంభరమూర్తివిలోకనపూజ నంబులు మొదలైన విజ్ఞానవైరాగ్యలాభసాధనంబులయిన భాగవతధర్మంబుల పయి రతిగలిగి సర్వభూతంబులయందును నీ శ్వరుండు భగవంతుండాత్మ గలండని సన్మానంబు సేయుచుఁ గామక్రోధలోభమోహమదమత్సరంబులం గెలిచి యింద్రి యవర్గంబును బంధించి భక్తి సేయుచుండ నీశ్వరుండైన విష్ణుదేవునియందు రతి సిద్ధించు॥సీ॥ దనుజారిలీలావతారంబులం దలిశౌర్యకర్మంబులు పద్గణములు। వినిభక్తుఁడగువాఁడు వేడ్కతోఁ బులకించుఁ గన్నుల హర్షాశ్రుకణము లొలుక। గద్గద స్వరముతోఁ గమలాక్ష వైకుంఠ వరద నారాయణ వాసుదేవ। యనుచు నెత్తిలి పాడు నాడు నాక్రోశించు నగుఁ జింతనము సేయు నతిమొనర్చు। నాటులు కొనియుండుఁ దనలోన మాటలాడు। వేల్పు సోఁకిన పురుషుని వృత్తిఁ దిరుగు। బంధములు వాసి యజ్ఞానపటలిఁ గాల్చి। విష్ణుఁ బ్రాపించుఁ దుదిభక్తి వివశుఁడగుచు॥వ॥ కావున రాగాదియుక్తమనస్కుండైన శరీరికి సంసార చక్రనివర్తకంబైన హరిచింతనంబు బ్రహ్మమందలి నిర్వాణసుఖంబని బుధులు దెలియుదురు హరిభజనంబు దుర్గమంబు గాదు హరి సకలప్రాణిహృదయంబులయందు నంతర్యామియై యాకాశంబు భంగి నుండు విషయార్జనంబుల నయ్యెడిది లేమ నిమి షభంగుర ప్రాణులైన మర్త్యుల కుమమతాస్పదంబులు చంచలంబులయిన పుత్రమిత్రకళత్రపశుభృత్యబలబంధురాజ్య కోశమణిమందిరమంత్రిమాతంగమహీప్రముఖవిభవంబులు నిరర్థకంబులు యాగప్రముఖపుణ్యలబ్ధంబులైన స్వర్గాదిలో కభోగంబులు పుణ్యానుభవక్షీణంబులు గాని నిత్యంబులు గావు నరుండు విద్వాంసుండనని యభిమానించి కర్మంబు లాచరించి యమోఘంబులయిన విపరీతఫలంబుల నొందు గర్మంబులు గోరక చేయవలయుఁ గోరి చేసిన దుఃఖంబులు ప్రాపించుఁ బురు షుండు దేహంబుకొఱకు భోగంబుల నపేక్షించు దేహంబు నిత్యంబు గాదు తోడరాదు మృతంబయిన దేహము నుసునకాదు లుభక్షించు దేహి కర్మంబు లాచరించి కర్మబద్ధుండయి క్రమ్మఱం గర్మానుకూలంబైన దేహంబుఁ దాల్చు నజ్ఞానంబునం జేసి పురుషుండు గర్మదేహంబుల విస్తరించు నజ్ఞానతంత్రంబులు ధర్మార్థకామంబులు జ్ఞానలభ్యంబు మోక్షంబు మోక్షప్రదా తయగు హరి సకలభూతంబులకు నాత్మేశ్వరుండుఁ బ్రియుండుఁ దనచేతనైన మహాభూతంబులతోడ జీవసంజ్ఞితుండయి యుండు నిసాక్షము లై హృదయగతుండయిన హరిని నిజభక్తిని భజింపవలయు॥క॥ దానవదైత్యభుజంగమ। మానవగంధర్వ సురసమాజములోఁ లక్ష్మీనాథుచరణకమల। ధ్యానంబున నెవ్వఁడైన ధన్యత నొందుఁ॥క॥ దిక్కఁడు వ్రతములఁ గ్రతువులఁ జిక్కఁడు దానముల శౌచశీలతపములం। జిక్కఁడు వృత్తిని భక్తిని। జిక్కిన క్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ॥క॥ చాలదు భూ దేవత్వము। చాలదు దేవత్వమధికశాంతత్వంబుం। జాలదు హరి మెప్పింపవి। రాలోగ్యములార భక్తి చాలిన భంగిన్॥గీ॥ ద నుజభుజగయక్ష దైత్యమృగాభీర। సుందరీవిహంగశూద్రశబరు। లయినఁ బాపజీవులైన ముక్తికిఁ బోదు। రఖిలజగము విష్ణుఁ డనుచుఁ దలఁచి॥క॥ గురువులు మనకును లోఁబడు। తెరువులు సెప్పెదరు విష్ణుదివ్యపదవికిం। దెరువులు సెప్పరు చీఁకటిఁ। బరువు

లు వెట్టంగ నేల బాలకులారా॥ క॥ తెం డెల్ల పుస్తకంబుల। నిండా చార్యునకు నుఱల నేకతమునకున్। రండు విశేషముఁ జెప్పె
దఁ। బొండొల్లని వారు కర్మపుంజము పాలై॥ క॥ ఆడుదము మనము హరిరతిఁ। బాడుదమే ప్రొద్దు విష్ణుభద్రయశంబుల్। వీడుద
ముం దనుజసంగతిఁ। గూడుదము ముకుందభక్తకోటిన్ సూటిన్॥ క॥ విత్తము సంసృతిపటలము। వృత్తము కామాదివైరివర్గంబు
లనేఁ। డిత్తము చిత్తము హరికినిఁ। జొత్తము నిర్వాణపదము శుభమగు మనకున్॥ వ॥ అని యిట్లు రహస్యంబునఁ బ్రహ్లాదుండు
నయ్యా వేళల రాక్షసకుమారులకు నపవర్గమార్గం బెఱింగించిన వారును గురుశిక్షితంబైన చదువులు సాలించి నారాయణభ
క్తిఁ జిత్తంబులం గీలించియుండుటం జూచి వారల యేకాంతభావంబుఁ దెలిసి వెఱచి వచ్చి శుక్రాచార్యనందనుండు శక్రవై
రికిట్లనియె॥ శా॥ రక్షోబాలుర నెల్ల నీకొడుకు చేరంజీరి లోలోన నా। శిక్షామార్గము లెల్లఁ గల్లలని యాక్షేపించి తానందఱన్।
మోక్షాయత్తులఁ జేసి నాఁడు మనకున్ మోసంబు వాటిల్లె నీ। దక్షత్వంబున నొక్కఁ జేయవలయున్ దైతేయవంశాగ్రణీ॥ క॥ ఉల్ల
సితవిష్ణుకథనము। లెల్లప్పుడు మాకుఁ జెప్పఁ డీగురుఁ డనిన। న్నుల్లంఘించి కుమారకు। లొల్లరు చదువంగ దానవోత్తమ విం
టే॥ క॥ ఉడుగఁడు మధురిపుకథనము। విడువఁడు జడుపగిదిఁ దిరుగు వికసనమున నే। నొడివిన నొడువులు నొడువఁడు। దుడుక
నిఁ జదివింప మాకు దుర్లభ మధిపా॥ క॥ చొక్కపు రక్కసకులమునఁ। బెక్కురు జన్మించి రింతఁ బీతాంబరుసే। విన్నిక్కపు మది
వఁ గొలిచెడు। నెక్కడి సుతుఁ గంటి రాక్షసేశ్వర వెట్టిన్॥ వ॥ అని యిట్లు గురుసుతుండు సెప్పిన కొడుకువలని విరోధవ్యవహా
రంబులు కర్ణరంధ్రంబులం దుష్టఖడ్గప్రహారంబులయి సోఁకిన బిట్టుమిట్టిపడి పాదతాడితంబైన భుజంగంబు భంగిఁ బవనప్రే
రితంబైన దవానలంబు చందంబున దండతాడితంబైన కంఠీరవంబు కైవడి భీషణరోషరసావేశజాజ్వల్యమాన చిత్తుండును,
బుత్త్రసంహారోద్యోగయుక్తుండును గంపమానగాత్రుండును నరుణీకృతనేత్రుండునై కొడుకును రప్పించి సన్మానకృత్యం
బులు దప్పించి నిర్దయుండయి యశనిసంకాశభాషణంబుల నదల్చుచు॥ శా॥ సూనున్ శాంతగుణప్రధాను నతిసంశుద్ధాంచిత
జ్ఞానున్। జ్ఞానరణ్యకృశానునంజలిపుటీసంభ్రాజమానున్ సదా। శ్రీనారాయణపాదపద్మయుగళీచింతామృతాస్వాదనా।
ధీనున్ ధిక్కరణంబుఁ జేసి పలికెన్ దైవాహితుం డుగ్రతన్॥ సీ॥ అస్మదీయంబగు నాదేశమునఁ గాని మిక్కిలి రవి మింట మెఱయ వె
ఱచు। నన్నికాలములందు ననుకూలుఁడై కాని విద్వేషమున గాలి వీవ వెఱచు। మత్ప్రతాపానలమందీకృతార్చియై విచ్చలవి
డి నగ్ని వెలుఁగ వెఱచు। నతితీక్ష్ణమైన నా యాజ్ఞ నుల్లంఘించి శమనుండు ప్రాణులఁ జంప వెఱచు। నింద్రుఁ డాదలనా మ్రోల
నెత్త వెఱచు। నమరకిన్నరగంధర్వ యక్షవిహగ। నాగవిద్యాధరావళి నాకు వెఱచు। నేల వెఱవవు పలువ నీ కేది
దిక్కు॥ శా॥ ప్రజ్ఞావంతులు లోకపాలకులు శుంభద్వేషులయ్యున్ మదీ। యాజ్ఞాభంగము సేయ నోడుదురు రోషాపాంగదృ
ష్టిన్ వే। కజ్ఞానచ్యుతమై జగత్త్రితయముం గంపింప నీ వెట్టిచో। నాజ్ఞోల్లంఘన మెట్లు చేసితివి పాపా హంకారగతస్మృతీ॥ శా॥ కం
తక్షోభము గాఁగ నెత్తిలి మహాగాధంబుగా డింభవై। కుంతుం జెప్పెదు దుర్గ్రయుండనుచు వైకుంఠుండు వీరవ్రతో। త్కం
ఠాబంధురుఁ డేని నేనమరులం ఖండింపఁ దండింపఁ గాఁ। గుంఠీభూతుఁడు గాక రావలదె మద్ఘోరాహవక్షోణికిన్॥ శా॥ ఆచా
ర్యోక్తము మాని బాలురకు మోక్షాసక్తిఁ బుట్టించి నీ। వాచాలత్వముఁ జూపి విష్ణు నహితున్ వర్ణించి మద్దైత్యవం। శాచారం
బులు నీఱుఁ జేసితివి మూఢాత్ముం గులద్రోహిని। న్నీచున్ జంపుట మేలు చంపి కులమున్ నిర్దోషముం జేసెదన్॥ క॥ దిక్కులు గె
లిచితి నన్నియు। దిక్కెవ్వఁడు రోరి నీకు దేవేంద్రాదుల్। దిక్కుల రాజులు వేతోక। దిక్కెఱుఁగక కొలుతురితఁడె దిక్కని న
న్నున్॥ క॥ బలవంతుఁడ నే జగముల। బలములతో జనక వీరభావమున మహా। బలులఁ జయించితి నెవ్వని। బలమున నాడెదవు వా
కుఁ బ్రతివీరుఁడవై॥ అనినఁ దండ్రికి మెల్లన వినయంబుతోఁ గొడుకిట్లనియె॥ క॥ బలయుతులకు దుర్బలులకు। బలమెవ్వఁడు నీ
కు నాకు బ్రహ్మాదులకున్। బలమెవ్వఁడు ప్రాణులకును। బలమెవ్వం డట్టి విభుఁడు బలము సురేంద్రా॥ క॥ దిక్కులు కాలము
తో నే। దిక్కును లేకుండుఁ గలుఁగు దిక్కుల మొదలై। దిక్కు గల లేని వారికి। దిక్కెయ్యది యది యనాథదిక్కు మహాత్మా॥
సీ॥ కాలరూపంబులఁ గలవిశేషంబుల నలఘుగుణత్రయుండైన విభుఁడు। సత్త్వాఖిలేంద్రియ సహజప్రభావుఁడై వినో
దంబున నఖిలజగముఁ గల్పించు రక్షించు ఖండించు నవ్యయుఁ డన్నిరూపములందు నతఁడు గలఁడు। చిత్తంబు సమముగాఁ జే
యుము మార్గంబుఁ దప్పి వర్తించు చిత్తంబు కంటె। వైరులెవ్వరు చిత్తంబు వైరి గాక। చిత్తమును నీకు వశముగాఁ జేయుమ
య్య। మద్దయు తామసభావంబుఁ మానుమయ్య। యయ్య నీ మ్రోల మేలాడరయ్య జనులు॥ ఉ॥ లోకములన్నియున్ గడియలో
న జయించిన వాఁడ వింద్రియా। నీకము చిత్తముల్ గెలువ నేరవు నిమ్ము నిబద్ధుఁ జేయు నీ। భీకరశత్రులాఱ్వురఁ బ్రభిన్నులఁ జే
సినఁ బ్రాణికోటిలో। నీకు విరోధి లేఁడొకఁడు నేర్పునఁ జూడుము దానవేశ్వరా॥ క॥ పాలింపుము శేముషిని। న్మాలింపుము క
ర్మబంధముల సమదృష్టిన్। జాలింపుము సంసారముఁ। గీలింపుము హృదయమందుఁ గేశవభక్తిన్॥ వ॥ అనినఁ బలుకు భాగవత

శేఖరునకు దోషాచరశేఖరుం డిట్లనియె॥ క॥ చంపినఁ జచ్చెదననుమను। గంపింపక యొంటిపడుచ కతినోక్తులనన్। గుంపించి నేఁ జావునకుం। దెంపరివై పలుకువాని తెఱఁగునఁ గుమతీ॥ శా॥ నాతో డంబ్రతిభాషలాడెదు జగన్నాథుండు నాకంటె నీ భూతశ్రేణికి రాజు లేఁ డొకఁడు సంప్రాప్తప్రభావుండవై ధాత్రీశం జంపినయున్న నే వెదకితిన్ సర్వాలయంబుల నా గారామంబుల। దేవతద్విశ్వములోన లేఁడు మఱి వాఁ డెందుండు రా దుర్మతీ॥ క॥ ఎక్కడఁ గలఁడే క్రియ నే। చక్కటి వర్తించు నెట్టిజాడను వచ్చుం। గక్కఁడు నిన్ను విష్ణుని। బెక్కులు ప్రేలెదవు వానిభృత్యుని పగిదిన్॥ వ॥ అనిన హరికింకరుండు శంకింపక హర్షపులకాంకురసంకలితవిగ్రహుండై యాగ్రహంబు లేక హృదయంబున హరిం దలంచి నమస్కరించి బాలవర్తనంబున నర్తనంబు సేయుచు నిట్లనియె॥ మ॥ కలఁ డంభోధిఁ గలండు గాలిఁ గలఁ డాకాశంబునం గుంభినిం। గలఁ డగ్నిన్ దిశలం బగళ్ల నిశలన్ ఖద్యోతచంద్రాదులం। గలఁ డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులం దంతటం। గలఁ డీశుండు గలండు తండ్రి వెదకంగా నేల నీ నా యెడన్॥ క॥ ఇందుఁ గలఁ డందు లేఁ డని। సందేహము వలదు చక్రి సర్వోపగతుం। డెం దెందు వెదకి చూచిన। నందందే గలఁడు దానవాగ్రణి వింటే॥ ఇవ్విధంబున॥ మ॥ హరి సర్వాకృతులం గలం డనుచుఁ బ్రహ్లాదుండు భాషింప స। త్వరుఁడై యెందును లేఁడు లేఁ డని సుతున్ దైత్యుండు దర్జింప శ్రీ। నరసింహాకృతి నుండె నచ్యుతుఁడు నానాజంగమస్థావరో।త్కరగర్భంబుల నన్ని దేశముల నుద్దండప్రభావంబునన్॥ వ॥ అయ్యవసరంబున నద్దానవేంద్రుండు॥ క॥ డింభక సర్వస్థలముల। నంభోరుహనేత్రుఁ డుండు ననుచు మిగుల సం।రంభంబునఁ బలికెదవీ। స్తంభంబునఁ జూపఁగలవె చక్రిన్ గిక్రిన్॥ క॥ స్తంభమునఁ జూపవేని యు।గుంభిని నీ శిరముఁ ద్రుంచి కూల్పఁ గరి రౌ।రంభమున వచ్చి హరి నీ। స్తంభంబున నడ్డపడఁగ శక్తుండగునే॥ వ॥ అనిన భక్తవత్సలుని భటుం డిట్లనియె॥ శా॥ అంభోజాసనుఁ డాదిగాఁ దృణపర్యంతంబు విశ్వాత్ముఁడై। సంభావంబున నుండు ప్రోడ విపులస్తంభంబునం దుండఁడే। స్తంభాంతర్గతుఁ డయ్యు నుండుటకు నే సందేహముల్ లేమ నిర్దంభత్వంబున నేఁడు గానఁబడుం బ్రత్యక్షుస్వరూపంబునన్॥ వ॥ అనిన విని కరాళించి గ్రద్దన లేచి గద్దియ డిగ్గ నుఱికి యొఱఁ బెఱికి ఖడ్గంబు కేలనమ ఝళిపించుచు మహాభాగవతశిఖామణి యైన ప్రహ్లాదుని ధిక్కరించుచు॥ మ॥ వినరా డింభక మూఢచిత్త గరిమన్ విష్ణుండు సర్వమ్మునం విశ్వాత్మకుం। డని భాషించెదవైన నిందుఁ గలఁడే యంచున్ మహోద్రేకియై। దనుజేంద్రుం డఱచేత వ్రేసెను మహాదభ్రప్రభాశుంభమున్ సర్వస్పృగ్ఘృణదంభమున్ హరిజనుస్సంరంభమున్ స్తంభమున్॥

## శ్రీహరి నరసింహరూపం బెత్తుట.

వ॥ ఇట్లు దానవేంద్రుండు పరిగృహ్యమాణవైరానుబంధుండును, వైరానుబంధజాజ్వల్యమానకోపానలుండును, కోపానలజాజ్వల్యమానవిజ్ఞానవినయుండును, వినయగాంభీర్యధైర్యజేగీయమాన హృదయుండును, హృదయచాంచల్యమాన తామసుండును, తామసగుణచంక్రమ్యమాణ స్థైర్యుండునునై విస్రంభంబున హుంకరించి బాలునిధిక్కరించి హరిం జూపుమని కనత్కనకమణిమయకంకణక్రేంకారశబ్దపూర్వకంబుగా దిగ్దంతిదంత భేదనపాటవప్రశస్తంబగు హస్తంబున సభామంటపస్తంభంబు వ్రేసిన వ్రేటుతోడన దశదిశలమిణుంగురులు చెదరఁ జిటిలి పెటిలిపడి బంభజ్యమానంబగు నమ్మహాస్తంభంబునం బ్రళయవేళాసంభూతసప్తస్కంధబంధురసమీరసంఘటితరజోఘుష్యమాణమహాబలాహకవర్గనిర్గతనిబిడనిష్ఠురదుస్సహనిర్ఘాతసంఘనిర్ఘోష నిఃకాశంబులు నై చటచ్చటస్ఫుటస్ఫుటధ్వనిప్రముఖభయంకరారావపుంజంబులు జాజన్యమానంబులయి యొగసి యాకాశకుహరాంతరాళంబు నిరవకాశంబుఁ జేసె నిండిన బిట్టులు బాలకవిధూయమానహృదయంబులై పరవశంబులైన పితామహ మహేంద్రవరుణవాయుశిఖిప్రముఖచరాచరజంతుజాలంబులతోడ బ్రహ్మాండకటాహంబు పగిలి పరిస్ఫోటితంబుగాఁ బ్రఫుల్లపద్మయుగళసంకాశభాస్వరచక్రచాపహలకులిశజలచరరేఖాంకితచారుచరణతలుండును, చరణచంక్రమణఘనవినమితవిశ్వవిశ్వంభరాభారధౌరేయదిక్కుంభికుంభీనసకుంభినీధరకూర్మకుల శేఖరుండును, దుగ్ధజలజాతశుండాలశుండాదండమండితప్రకాండప్రచండమహోరుస్తంభయుగళుండును, ఘణఘణాయమాన మణికింకిణీగణముఖరితమేఖలావలయవలయితపీతాంబరశోభితకటిప్రదేశుండును, నిర్జరనిమ్నగావర్తవర్తులకమలాకరగంభీరనాభివివరుండును, ముష్టిపరిమేయవినుతతనుతరస్నిగ్ధమధ్యుండును, కులాచలసానుభాగసదృశకర్కశవిశాలవక్షుండును, దుర్జనదనుజభటధైర్యలతికాలవిత్రాయమానరక్షోరాజవక్షోభాగవిశంకటక్షేత్రవిలేఖనచుంచులాంగలాయమానప్రతాపజ్వలనజ్వాలాయమానశరణాగతనయనచకోరచంద్రరేఖాయమానవజ్రాయుధప్రతిమాన భాసమాన నిశాతనఖరతరముఖనఖరుండును, శంఖచక్రగదాఖడ్గకుంతతోమరప్రముఖనానాయుధమహితమహోత్తుంగమహీధరశృంగసన్నిభాక్షీరసాగరవేలాయమానమాలికావిరాజమాననిరర్గళానేకశతభుజార్గళుండును, మంజుమంజీరమణిపుంజరంజితమంజుల

హారకేయూరకంకణకిరీటమకరకుండలాదిభూషణభూషితుండును, త్రివళీయుతశిఖరిశిఖరాభపరిణద్ధబంధురకంధరుండును, ప్రకంపనకంపితపారిజాతపాదపపల్లవప్రతీకాశకోపావేశసంచలితాధరుండును, శరత్కాలమేఘజాలమధ్యధగద్ధగాయమానతటిల్లతాసమాన దేదీప్యమానదంష్ట్రాంకురుండును, కల్పాంతకాలసకలభువనగ్రసనవ్యసనవిజృంభమాణసప్తజిహ్వజిహ్వాతులితతరళతరాయమానవిభ్రాజమానజిహ్వుండును, మేరుమందరమహాగుహాంతరాళవిస్తారవిపులవక్త్రనాసికావివరుండును, నాసికావివరనిస్సరన్నిబిడనిశ్వాసనికరసంఘట్టనసంక్షోభితసంతప్యమానసప్తసాగరుండును, పూర్వపర్వతవిద్యోతమానఖద్యోతమండలసదృక్షసమంచితలోచనుండును, లోచనాంచలసముత్క్షిప్యమాణవిలోలకీలాభీలవిస్ఫులింగవితానరోరుధ్యమానతారకాగ్రహమండలుండును, శక్రచాపసురుచిరోదగ్రమహాభ్రూలతాబంధబంధురభయంకరవదనుండును, ఘనతరగండశైలతుల్యకమనీయగండభాగుండును, సంధ్యారాగరక్తధారాధరమాలికాప్రతిమమహాభ్రంకషతంతన్యమానపటుతరసటాచ్ఛటుండును, సటాజాలసంచాలన సంజాతవాతడోలాయమానవైమానికవిమానుండును, నిష్కంపితశంఖవర్ణమహోర్ధ్వకర్ణుండును, మంథదండాయమానమందరవసుంధరాధరపరిభ్రమణవేగసముత్పద్యమానవియన్మండలమండితసుధారాశికల్లోలశీకరాకార భాసురకేసరుండును, పర్వాఖర్వశిశిరకిరణమయూఖగౌరతనూరుహుండును, నిజగర్జననినాదనిర్దళితకుముదసుప్రతీకవామనైరావణసార్వభౌమప్రముఖదిగిభరాజకర్ణకోటరుండును, ధవళధరాధరదీర్ఘదురవలోకనీయదేహుండును, దేహప్రభాపటలనిర్గమ్యమానపరిపంథియాతుధాననికురంబగర్వాంధకారుండును, ప్రహ్లాదహిరణ్యకశిపురంజనభంజననిమిత్తాంతరంగబహిరంగజేగీయమానకరుణావీరరససంయుతుండును, మహాప్రభావుండు నైన శ్రీనృసింహదేవుం డావిర్భవించినం గనుంగొని॥ క॥ నరమూర్తి గాదు కేవల।హరిమూర్తియుఁ గాదు మానవాకారము కే।సరియాకారము నున్నది।హరిమాయారచితమగు యథార్థము సూడన్॥ ఉ॥ తెంపున బాలుఁ డాడిన సుధీరత సర్వగతత్వముం బ్రతి।ష్ఠింపఁ దలంచి యిందు నరసింహశరీరముఁ దాల్చి చక్రి శో।భింపఁగ

## శ్రీనృసింహదేవుండు హిరణ్యకశిపుని వధించుట.

వచ్చినాఁడు హరి చే మృతి యంచుఁ దలంతు నైన నా।సొంపును బెంపు నందఱును జూడఁ జరింతు హరింతు శత్రువున్॥ వ॥ అని మొత్తంబడని చిత్తంబున గద నెత్తికొని తత్తరంబున నార్చుచు నతిశోభితకంఠీరవంబు డగ్గఱు గంధసింధురంబు చందంబున నక్తంచరకుంజరుండు నరసింహదేవుని కెదురునడచి, తదీయదివ్యతేజోజాలసన్నికర్షంబునం జేసి దవానలంబు డగ్గఱిన ఖద్యోతంబునుం బోలెం గర్తవ్యాకర్తవ్యంబులు దెలియక నిర్గతప్రభుం డయ్యె నప్పుడు॥ మ॥ ప్రకటంబై ప్రళయావసానమున మున్ బ్రహ్మాండభాండావరో।ధకమై యున్న తమిస్రమున్ జగమును త్పాదించుచోఁ ద్రావి నా।డొక తేజోనిధి యైన విష్ణు నెడ నుద్దీపించు నే।వస్తువై విఫలంబై చెడుఁ గాక తామసుల ప్రావీణ్యంబు రాజోత్తమా॥ వ॥ అంత నద్దానవేంద్రుండు మహోగ్రదండంబగు గదాదండంబు గిరగిరం ద్రిప్పి నరసింహదేవుని వ్రేసిన నతండు దర్పంబున సర్పంబు నొడిసిపట్టు సర్పపరిపంథి చెన్నున దితిపట్టిం బట్టికొనిన మిట్టిపడి కట్టెం బిట్టు కిట్టలుకనయ్యసురపరివృఢుండు దృఢబలంబున నిట్టట్టు మిడిసి పట్టుఁ దప్పించుకొని విడివడి దిట్టతప్పక కుప్పించి యుప్పరంబున కెగసి విహంగకులరాజచరణనిర్గళితభుజంగంబు తెఱంగున నందలంగి సుటికి తన భుజాటోపంబు వనరకంఠీరవుండు కుంఠితుం డయ్యెడి నని దలంచి కలంగక చెలంగుచుఁ దన్ను నిబిడనీరదనికరంబులమాటున నిలింపులు గుంపులుగొని డాఁగి మూఁగి క్రమ్మఱ నాత్మీయజీవనశంకాకలంకితులై సంతసంబునఁ జింతనంబు సేయుచు నిరీక్షింప నదీనసురదక్షతావిశేషంబు వరియించి ఖడ్గవర్మంబులు ధరించి భూనభోభాగంబుల వివిధవిచిత్రలంఘనలాఘవంబులఁ బరిభ్రమణభేదంబులం గరాళవదనుండై యంతరాళంబునఁ దిరుగు సాళ్వపు డేగ వడువున సంచరించిన సహింపక॥ సీ॥ పంచాననోద్ధూతపావకజ్వాలలు భూనభోంతర మెల్లఁ బూరితముగ। దంష్ట్రాంకురాభీలధగధగాయితదీప్తి నసురేంద్రు నేత్రము లంధములుగఁ। గంటకసన్నిభోత్కరకేసరాహతి నభ్రసంఘము భిన్నమై చలింపఁ। బ్రళయాభ్రచంచలాప్రతిమభాస్వరములై ఖరనఖరోచులు గ్రమ్ముదేఱ। సటలు ఝళిపించి గర్జించి సంభ్రమించి। దృష్టి సారించి బొమలు బంధించి కెరలి। జిహ్వ యాడించి లంఘించి చేత నొడిసి। పట్టె నరసింహుఁ డా దితిపట్టి నధిప॥ క॥ సరకుఁ గొనక లీలాగతి। నురగేంద్రుఁడు మూషకంబు నొడిసిన భంగిన్। నరకేసరి దను నొడిసిన।సురవిమతుఁడు ప్రాణభీతి నుడివడియె నృపా॥ క॥ సురరాజవైరి లోఁబడెఁ।బరిభావితసాధుభక్త*పటలాంహునకున్।నరసింహునకును దంచ।త్ఖరతరజిహ్వునకును గ్ర[illegible]రంహునకున్॥ అంత॥ మ॥ విహగేంద్రుం డహి వ్రచ్చు కైవడి మహోత్సాహస్ఫూర్తి నృసింహుండు సా।గ్రహుఁడై యూరువులందుఁ జేర్చి నఖసంఘాతంబు

*పటలాంహునకున్ = సమూహముయొక్క పాపములు గలవానికిని — ఘోరరంహునకున్ = వేగముగలవానికిని.

లక్ ప్రచ్ఛన్నము।స్సహజదంభోళికఠోరదేహునచలోత్సాహున్ సముద్యద్బాహుని౯। గ్రహుతాశాంతకభీకరున్ నకరుక్ దైత్యా న్వయశ్రీకరుక్॥ శా॥ చించుర్౯ హృత్కమలంబు శోణితము వర్షించుర్౯ ధరామండలి౯। ద్రెంచుం గర్కశ నాడికావలులు భే దించున్ మహావక్షముం। ద్రుంచున్ మాంసము సూక్ష్మఖండములుగా దుష్టాసురస్వచ్ఛిద। ద్రెంచుం బ్రేవులు కంఠమాలికలుగల్పిం చున్నఖోద్భాసియై॥ సీ॥ వక్షఃకవాటంబు వ్రక్కలు సేయుచో ఘనకుఠారంబుల కరణి నొప్పు। గంభీరహృదయపంకజము భే దించుచోఁ గుద్దాలముల భంగిఁ గొమరు మిగులు। *ధమనీవితానంబు దవిలి ఖండించుచోఁ బటులవిత్రంబుల పగిది మెఱయు। జ ఠరవిశాలాంత్రజాలంబుఁ ద్రెంచుచోఁ ‡క్రకచసంఘంబుల గరిమఁ జూపు। నంకగతుఁడైన దైత్యుని నాగ్రహమున। శస్త్ర చయముల నెంపఁ సంహరించి। యమరు నరసింహు నఖరంబులతివిచిత్ర। సమరముఖరంబులై యుండె జనవరేణ్య॥ క॥ స్ఫురిత విబుధజనముఖములు। పరివిదళితదనుజనివహపతిరనుముఖములు। ల్గురువిజితశిఖిశిఖములు। నరహరికరనఖములమరు నతజన సఖముల్॥ వ॥ ఇట్లు కేవలపురుషరూపంబును మృగరూపంబునుం గాని నరసింహరూపంబున రేయునుం బవలునుం గాని సం ధ్యాసమయంబున నంతరంగంబును బహిరంగంబునుం గాని సభాద్వారంబున గగనంబును భూమియుం గాని యూరుమ ధ్యంబునఁ బ్రాణసహితంబును బ్రాణరహితంబునుం గాని నఖంబులం ద్రైలోక్యజనహృదయభల్లుండైన దైత్యమల్లుని వధిం చి మహాదహనకీలాభీలదర్శనుండును, కరాళవదనుండును, లేలిహానభీషణజిహ్వుండును, శోణితపంకాంకితకేసరుండునై ప్రేవులు మాలికలుగ ధరించి కుంభికుంభవిదళనంబుఁ జేసి చను దెంచు పంచాననంబునుం బోలె దనుజకుంజర హృదయకమల విదళనంబుఁ జేసి తదీయరక్తసిక్తంబులయిన నఖంబులు సంధ్యారాగరక్తచంద్రరేఖల చెలువు వహింప సహింపక లేచి తన కట్టెదుర నాయుధంబులెత్తికొని తత్తరంబున రణంబునకు నురువడించు రక్కసులం బెక్కుసహస్రంబులం జక్రాదిసర్వ క్రిసాధనంబుల నొక్కనిఁ జిక్కకుండఁ జక్కడిచెనిపి విధంబున॥ శా॥ రక్షోవీరుల నెల్లఁ ద్రుంచి రణసంరంభంబు చాలించి దృష్టిక్షేపంబు భయంకరంబుగ సభాసింహాసనారూఢుఁడై। యక్షీణాగ్రహుఁడై నృసింహుఁడు కరాళాస్యంబుతో నొ ప్పెద। నీక్షింపంబరికింప నోడిరనురుల్ విభ్రాంతులై డాఁగఁగ౯॥ క॥ సురచారణవిద్యాధర। గరుడోరగయక్షసిద్ధగణముల లో నొక్కరుఁడైన డాయ వెఱచును। నరహరినయ్యవసరమున నరలోకేశా॥ క॥ §తర్షంబుల నరసింహునిఁ। హర్షంబులఁ జూ చి సిద్ధరాంగనలు మహోత్కర్షంబులఁ గుసుమంబుల। వర్షంబులు గురిసిరుత్సవంబుల నధిపా॥ వ॥ మఱియు నయ్యవసరంబు న మింటన నేక దేవతావిమానంబులును, గంధర్వగానంబులు, నప్సరోగణనర్తనసంవిధానంబులును, దివ్యకాహళభేరీపట హమురజాదిధ్వానంబులును, బ్రకాశమానంబులయ్యె సనందకుముదాదులైన హరిపార్శ్వచరులును, మహేశ్వరవిరిం చిమహేంద్రపురస్సరులగు త్రిదశకిన్నరకింపురుషపన్నగసిద్ధసాధ్యగరుడగంధర్వచారణవిద్యాధరామరులును, బ్రజాపతు

⁂ బ్రహ్మాది దేవతలు శ్రీనృసింహమూర్తిని వేర్వేఱుగా స్తుతించుట. ⁂

లును నరకంఠీరవదర్శనోత్కంఠితులయి చను దెంచి॥ క॥ కరకమలయుగళకీలిత। శిరులై డగ్గఱి కభక్తిఁ జేసిరి బహుసం। సరణా ద్భితరికి నఖరికి। నరభోజనహస్తిహరికి నరకేసరికి౯॥ వ॥ ఆసమయంబున దేవతలందఱు వేఱు వేఱ వినుతించిరందుఁ గమలా సనుండిట్లనియె॥ మ॥ ఘనలీలాగుణచాతురిస్ భువనముల్ గల్పించి రక్షించి భే। దనముం జేయు ననంతశక్తికి ననంతజ్యోతికిం జి త్రవీర్యునకు నిత్యపవిత్రకర్మునికి నేనుత్కంఠతో నవ్యయా। త్మునికిన్ వందనమాచరించెదఁ గృపాముఖ్యప్రసాదార్థినై॥ రుద్రుండిట్లనియె॥ చ॥ అనఘ వరేణ్య మీఁదటసహస్రయుగాంతము నాఁడు గాని కో। పమునకు వేళ గాదసురబాధకుఁడైన తమస్వినీచరు। న్సమరమునన్ వధించితి విచాలుఁ దదాత్మజుఁడైన వీఁడు స। ద్విమలుఁడు నీకు భక్తుఁడు పవిత్రుఁడు గావుము భ క్తవత్సలా॥ ఇంద్రుండిట్లనియె॥ సీ॥ ప్రాణిసంఘముల హృత్పద్మమధ్యంబుల నివసించి భాసిల్లు నీవ యెఱుఁగు। దింత కాలము దానవేశ్వరుచే బాధపడి చిక్కియున్న యాపన్నజనుల। రక్షించితివి మమ్ము రాక్షసేశ్వరుఁ జంపి క్రతుహవ్యములు మాకుఁ గలిగె మఱల। నంటిమి నీ సేవ మఱిగినవారలు కైవల్యవిభవంబు కాంక్ష సేయ। రితరసుఖము లెల్ల నిచ్చయింపఁగ నేల। నస్థి రంబులివియనంతభక్తిఁ। గొలువనిమ్ము నిన్ను ఘోరదైత్యానీక। చిత్తభయదరంహ శ్రీనృసింహ॥ ఋషులిట్లనిరి॥ మ॥ భవ దీయావరలీలలోకములనుత్పాదించి రక్షింపనేఁ। డవి దైత్యేశుని చేత భేదితములై హ్రస్వంబులై యుండ నీ। యవినీతున్ న రసింహరూపమున సంహారంబు నొందించి వే। దవిధిం గ్రమ్మఱనుద్ధరించితి గదా ధర్మానుసంధాయివై॥ పితృదేవతలిట్లనిరి॥ శా॥ చండక్రోధముతోడ దైత్యుఁడు మదీశ్రాద్ధంబులన్ మత్సుతు। ల్పిండంబుల్ సతిలోదకంబులు గనర్పింపంగమాకీకయు। ద్దండత్వంబునఁ దాన కైకొను మహోదగ్రుండు వీఁడిక్కడన్। ఖండింపంబడె నీనఖంబులను తుల్యా వింతుమా త్మేశ్వరా॥

* ధమనీవితానంబు। నాడీసమూహమును — ‡ క్రకచ। రంపము — § తర్షంబుల। అధికాభిలాషులతో.

సిద్ధులిట్లనిరి॥క॥ఉద్ధతుండై యణిమాదిక।సిద్ధులు గైకొనిన దైత్యుఁ జీరితివి మహా।యోద్ధవు నీకృప మాకును। సిద్ధులు మఱలంగఁ గలిగె శ్రీనరసింహా॥విద్యాధరులిట్లనిరి॥క॥దానవునిఁ జంపి యంత।ర్ధానాదిక విద్య లెల్ల దయతో మా కలం।గా నిచ్చితివి విచిత్రము।నీ నిరుపమవైభవంబు నిజము నృసింహా॥భుజంగులిట్లనిరి॥క॥రత్నములను సుతాకాంతా। రత్నంబులఁ బుచ్చికొన్న రక్కసునురముం।యత్నమునఁ బ్రచ్చి వైచితి।పత్నులు రత్నములుఁ గలిగెఁ బ్రకటితమీశా॥మనువులిట్లనిరి॥క॥దుర్ణయుని దైత్యుఁ బోరి గొని।వర్ణాశ్రమధర్మసేతువర్గము నలుపం।బూర్ణము జేసితి వేసని। వర్ణింతుము కొలిచి బ్రతుకువారము దేవా॥ప్రజాపతులిట్లనిరి॥మ॥ప్రజలం జేయుటకై సృజించితివి మముం బాటించి దైత్యాజ్ఞచేఁ। బ్రజలం జేయక సంతతాగాలము మహాభారంబుతో నుంటిమీ।కుజను న్వక్షముఁ జీరి చంపితివి సంకోచంబులే కెల్లవో। ప్రజలం జేయుచు నుండువారము జగద్భద్రాయమానోదయా॥గంధర్వులిట్లనిరి॥క॥ఆడుదుము రేయుఁ బగలుం।బాడుదుము నిశాటునొద్ద బాధించు భయం।బూడదు నీ చేజమునం।గూడెను మహాపాతకునకుఁ గుశలము గలదే॥చారణులిట్లనిరి॥క॥భువనజనహృద్భయభల్లూకము। దివిజేంద్రవిరోధి నేఁడు దెగె నీచేత।న్భవరోగనివర్తకమగు।భవదంఘ్రియుగంబుఁ జేరి బ్రతికెదమీశా॥యక్షులిట్లనిరి॥ఉ॥భ్రంశము లేని నీభటులభంగి విముక్తులమయ్యు నెక్కి నిస్సంశయవృత్తి దిక్కులఁ బ్రచారముఁ జేయుచు నుండువీఁడు ని। స్త్రింశముతో డిపీనిఁ గడతేర్చితి పాపసమాననొంచతుర్వింశతితత్త్వశాసన త్రివిష్టపముఖ్యజగన్నివాసకా॥కింపురుషులిట్లనిరి॥క॥ పురుషోత్తమ నేరము కింపురుషుల మల్పులము నిన్ను భూషింపఁగ మా।న్పురుషున్సకలసుజనహృ। త్పరుషుం జంపితివి జగము బ్రదికె నధీశా॥వైతాళికులిట్లనిరి॥క॥త్రిభువనశత్రుఁడు వడియెను।సభలందు సుమఖములందు జగదీశ్వర నీ। శుభగీతములు పఠించుచు।నభయులమై సంచరింతుమార్తశరణ్యా॥కిన్నరులిట్లనిరి॥క॥ధర్మము దలఁపఁడు లఘుతర। కర్మము సేయించు మమ్ముఁ గలుషాత్మకు మా।కుర్మునిఁ జంపితి వున్నత।శర్ములమై నీదుభక్తి సలిపెద మీశా॥విష్ణుసేవకులిట్లనిరి॥ ఉ॥ సంచితవిప్రశాపమునఁ జండనిశాచరుఁడై నపీని శిక్షించుటకీడు గాదు కృపఁ జేసితి వీశ్వర భక్తితోడ సేవించుటకంటె వైరమున వేగమె చేరఁగవచ్చు నిన్ను నీ।యంచితనారసింహతను వద్భుతమాపదఁ బాసిరందఱున్॥వ॥ఇట్లు బ్రహ్మరుద్రేంద్రసిద్ధసాధ్యపురస్సరులైన దేవముఖ్యులందఱు నేకప్రకారంబుల వినుతించి రంతరోషవిజృంభమాణుండయిన నరసింహదేవుని డగ్గఱఁ జేర వెఱచి లక్ష్మీదేవిం బిలిచి యిట్లనిరి॥క॥హరికిం బట్టపుదేవివి।హరిసేవానిపుణమతివి హరిగతివి సదా।హరిరతివి నీవు సనినరు। హరిరోషము డింపవమ్మ హరివరమధ్యా॥వ॥అని నియ్యకొని యమ్మహాకాంత తోడనాకలకంఠి నరకంఠీరవుని యుపకంఠంబునకుం జని॥సీ॥ప్రళయార్కబింబంబుపగిది నున్నది గాని నెమ్మోముపూర్ణేందునిభము గాదు। శిఖిశిఖాసంఘంబు చెలువుఁ జూపెడుఁ గాని చూడ్కి ప్రసాదభాసురము గాదు।పీరరౌద్రమ్మృత వేశ మొప్పెడుఁ గాని భూరికృపారసస్ఫూర్తి గాదు।భయదదంష్ట్రాంకురప్రభలు గప్పెడుఁ గాని దరహసితాంబుజాతంబు గాదు।కరినఖరనారసింహవిగ్రహము గాని। కామినీజనసులభవిగ్రహము గాదు।విన్నదియుఁ గాదు తొల్లి నే విష్ణువలనఁ।గన్నదియుఁ గాదు భీషణాకారమగుచు॥క॥పలికెదనని గినుకముఁ గొను।బలికినఁ గనలి విభుఁడు ప్రతివచనములం।బలుకఁడని నిలుచు శశిముఖి। బలుపిడి హృదయమునఁ జనువు భయమును గమురన్॥వ॥ఇట్లు నరహరిరూపంబు వారిజనివాసిని వీక్షించి శంకించి శోకించుండయిన వెనుక డగ్గఱియెడ ననిచింతించుచున్న వారిజసంభవుం డద్దేవునిరోషంబు నివారింప నితరులకలవి గాదని ప్రహ్లాదుం జీరి యిట్లనియె॥క॥తండ్రీ హరి గురురోషము।ననీ తండ్రిపి మిత్తమునఁ జక్రి దారుణమూర్తి। న్వెండ్రము పడువఁడు మెల్లనఁ।[illegible]డీ శీతలునిఁ జేసి దయ సేయఁగదే॥వ॥అనినఁ గాక యని మహాభాగవతశేఖరుండైన బాలకుండు గరకమలంబులు ముకుళించి సమందగమనంబున సానందవినయవివేకంబుల నరసింహదేవుని సన్నిధికిం జని సాష్టాంగదండప్రణామంబుఁ జేసిన భక్తపరాధీనుండగు నయ్యీశ్వరుండాలోకించి కరుణాయత్తచిత్తుండై॥ఉ॥ప్రాభవ మొప్పఁగన్గొని కృపామతియై కడియంగఁ జీరి సం।శోభితదృష్టిసంఘములఁ జూచుచు బాలునిమౌళియందు లోకాభినుతుండు వెట్టె నసురాంతకుఁ డుద్భటకాలసర్పభీ। తాభయదానశస్తమున నగ్గళమంగళహేతుహస్తమున్॥వ॥ఇట్లు హరికరస్పర్శనంబున భయవిరహితుండును, బ్రహ్మజ్ఞానసహితుండును, బులకితదేహుండును సముత్పన్నసంతోషబాష్పసలిలధారాసమూహుండును, ప్రేమాతిశయగద్గదభాషణుండును, వినయవివేకభూషణుండు నేకాగ్రచిత్తుండును, భక్తిపరాయత్తుండు నై యద్దేవుని చరణకమలంబులు దనహృదయంబున నిలిపికొని కరకమలంబులు

### ప్రహ్లాదుండు నరసింహమూర్తిని స్తుతించుట.

ముకుళించి యిట్లనియె॥ మ॥అమరుల్ సిద్ధులు సంయమీశ్వరులు బ్రహ్మాదుల్ సుతాత్పర్యచిత్తములన్నిన్ను బహుప్రకారముల నిత్యంబు నిచ్చారించి పారము ముట్ట నుతిసేయ నోపరఁట నేరతు స్తనమాజుండ గర్వమదోద్రిక్తుఁడ బాలుఁడ జ్జడమతి న్వర్ణిం

ప్రకారంబును, నీకునై జగుణంబులు విశ్వంబు నీవ గుణాత్మకంబైన విశ్వంబు సృజియించి యందుం బ్రవేశించి హేతుభూతగు
ణయుక్తుండవై రక్షకసంహారకాది నానారూపంబులనుండుదువు సదసత్కారణకార్యాత్మకంబైన విశ్వంబునకుం బరమ
కారణంబు నీవ నీమాయచేత వీఁడు వాఁడనియెడి బుద్ధివికల్పంబు దోఁచుఁగాని నీకంటె నొండెద్దియు లేదు బీజంబునందు వ
స్తుమాత్రభూతసౌక్ష్మ్యంబును, వృక్షంబునందు నీలత్వాదివర్ణంబునుం గలుఁగు తెఱంగున విశ్వంబునకు నీయందు జన్మస్థితి
ప్రకాశనాశంబులుం గలుగు నీచేతనైన విశ్వంబు నీయందు నిలుపుకొని తొల్లి ప్రళయకాలపారావారంబునఁ బన్నగేంద్ర
పర్యంకంబునఁ గ్రియారహితుండవై నిజసుఖానుభవంబు సేయుచు నిద్రితునిభంగి యోగనిమీలితలోచనుండవై యుం
డుచుఁ గొంతకాలంబునకు నిజకాలశక్తిచేతఁ బ్రేరితంబులై ప్రకృతిధర్మంబులైన సత్త్వాదిగుణంబుల నంగీకరించి సమాధి
చాలించి వెలుంగుచున్న నీ నాభియందు వటబీజమువలన నుద్భవించు వటంబు తెఱంగున నొక కమలంబు సంభవించె నట్టి క
మలంబున నాల్గుమోముల బ్రహ్మ జన్మించి దిశలు వీక్షించి కమలంబునకు నొండైన రూపంబు లేకుండుటం జింతించి జలాంత
రాళంబుఁ బ్రవేశించి జలంబులందు నూఱుదివ్యవత్సరంబులు వెదికి తనజన్మంబునకు నుపాదానకారణంబైన నిన్ను దర్శింప
సమర్థుండు గాక మగిడి కమలంబు కడకుం జని విస్మయంబు నొంది హిరణ్యగర్భుండు చిరకాలంబు నిర్భరతపంబుఁ జేసి పృథి
యందు గంధంబుగను చందంబున దనయందు నానాసహస్రవదనశిరోనయననాసాకర్ణవక్త్రభుజకరచరణుండును, బ
హువిధాభరణుండును, మాయాకల్పితుండును, మహాలక్షణలక్షితుండును, నిజప్రకాశదూరీకృతతముండును, బురుషోత్త
ముండునైన నిన్ను దర్శించె నయ్యవసరంబున॥ క॥ ఘోటకవదనుండవై మధుకైటభులం ద్రుంచి నిగమగణముల నెల్లం బా
టించి యజునకిచ్చిన కూటస్థుఁడ వీశ్వరుఁడవు కోవిదవంద్యా॥ వ॥ ఇవ్విధంబున గృతత్రేతాద్వాపరంబులను, మూఁడుయు
గంబులందును, దిర్యఙ్మానవమునిజలచరాకారంబుల నవతరించి లోకంబుల నుద్ధరించుచు, భరియించుచు, హరియించుచు,
యుగానుకూలధర్మంబుల బ్రతిష్ఠించుచు నుండుదువు దేవా యవధరింపుము॥ సీ॥ కామహర్షాదిసంకలితమై చిత్తంబు భ
వదీయచింతనపరవిసారదము। మధురాదిరసముల మరిగి చొక్కుచు జిహ్వ నీవర్ణనమునకుఁ దనియదు। సుందరీముఖములఁ జూడఁ
గోరెడిచూడ్కి దావకాకృతులపైఁ దగులువడదు। వివిధమర్త్యాపలు వినఁ గోరు వీనులు వినవు యుష్మత్కథావిరచనములు।
ఘ్రాణము గుపదడిఁ దెలుసు సుగంధములకుఁ దనువు గోలుపదు వైష్ణవధర్మములకు। నడఁగియుండవు కర్మేంద్రియంబులు పురు
షుఁ గలఁచు సవతులు గృహమేధిఁ గలఁచునట్లు॥ వ॥ ఇవ్విధంబున నింద్రియంబులచేతం జిక్కువడి స్వకీయపరకీయశరీరంబు
లందు మిత్రామిత్రభావంబులు సేయుచు జన్మమరణంబుల నొందుచు సంసారవైతరణీనిమగ్నంబైన లోకంబు నుద్ధరించు
టలోకసంభవస్థితిలయకారణుండవైన నీకుం గర్తవ్యంబు భవదీయసేవకులమయిన మాయందుఁ బ్రియభక్తులైన వారల
నుద్ధరింపుము॥ మ॥ భగవద్దివ్యగుణానువర్ణనసుధాప్రాప్తైకచిత్తుండనై। బెగడన్ సంసరణోగ్రవైతరణికిన్ నానాత్ములై తా
వకీయగుణస్తోత్రపరాఙ్ముఖత్వమున మాయాసౌఖ్యభావంబులన్ సగతింగానని మూఢులన్ సదయుఁడన్ శోకింతు సర్వేశ్వరా॥
వ॥ దేవా మునీంద్రులు నిజవిముక్తికాములై విజనస్థలంబులం దపంబు లాచరింతురు కామునకత్వంబు నొల్లక నుండువారికి నీ
కంటె నొండు శరణంబు లేదు నిన్ను సేవించెనం గొందఱు కాముకులు కరద్వయకండూతిచేతం దనియని చందంబునం దుచ్ఛ
మయి పశుపక్షిక్రిమికీటసామాన్యంబైన మైథునాదిగృహమేధిసుఖంబులం దనియక కడపటను దుఃఖవంతులగుదురు నీప్ర
సాదంబుగల సుగుణుం డనిష్కాముండై యుండు మౌనవ్రతజపతపశ్శ్రుతాధ్యయనంబులును నిజధర్మవ్యాఖ్యానవిజన
స్థలనివాసనియమంబులును మోక్షహేతువులగునైన నివి పదియు నింద్రియజయంబు లేనివారికి భోగార్థంబులై విక్రయిం
చువారికి జీవనోపాయంబులై దాంభికులకు వార్తాకరంబులై యుండు సఫలంబులుగావు భక్తిలేక భవదీయజ్ఞానంబు లే
దు రూపరహితుండవైన నీకు బీజాంకురంబులకైవడిఁ గారణకార్యంబులయిన సదసద్రూపంబులు రెండును ప్రకాశమా
నంబులగు నా రెంటియందును భక్తియోగంబున బుద్ధిమంతులు మథనంబున దారువులందు వహ్నిం గనియెడు తెఱంగున ని
న్నుం బొడగందురు పంచభూతతన్మాత్రంబులు ప్రాణబుద్ధీంద్రియంబులును మనోహంకారచిత్తంబులును నీవ సగుణంబు
ను నిర్గుణంబును నీవ గుణాభిమానులయి జన్మమరణంబుల నొందు విబుధు లాద్యంతంబులు గానక నిరుపాధికుండవైన నిన్నె
ఱుంగరు తత్త్వజ్ఞులైన విద్వాంసులు వేదాధ్యయనాదివ్యాపారంబులు మాని వేదాంతప్రతిపాద్యుండవగు నిన్ను సమాధివి
శేషంబుల నెఱింగి సేవింతు రదిగావున॥ సీ॥ నీగృహాంగణభూమి నిటలంబు మోవంగ మోదించి నిత్యంబు మ్రొక్కఁ డేని। నీ
మంగళస్తవనికరవర్ణంబులు పలుమారు వాలుకఁ బలుకఁ డేని। నీయధీనములుగా నిఖిలకృత్యంబులు ప్రియభావమున సమర్పిం
పఁ డేని। నీపదాంబుజముల నిర్మలహృదయుఁడై చింతించి మక్కువఁ జిక్కఁ డేని। నిన్నుఁ జెవులార వినఁ డేని నీకు సేవ। చేయ

రాఁ జేని బ్రహ్మంబుఁ జెందఁగలఁడె। యోగి నైన నేఁ దపోవ్రతయోగి నైన। వేది నైన మహాతత్త్వవేది నైన॥ వ॥ కావున భవదీయదాస్యయోగంబు కృపఁ జేయుమని ప్రణతుం డైన ప్రహ్లాదుని వర్ణనంబులకు మెచ్చి నిర్గుణుం డైన హరి రోషంబు విడిచి యిట్లనియె॥ శా॥ సంతోషించితి నీ చరిత్రములకున్ సద్భద్రమౌఁ గాక నీ। యంతర్వాంఛితలాభ మెల్లఁ గరుణాయత్తుండ నై యిచ్చెద। న్జింతం జెందకు భక్తకాముఁడ నే సిద్ధంబు మర్త్యోక్త్యుడ౯। జంతుశ్రేణికి నన్నుఁ జూచినఁ బునర్జన్మంబు లేదర్భకా॥ గీ॥ సకలభావములను సాధులు విద్వాంసు। లఖిలభద్రవిభుఁడ నైన నన్నుఁ। గోర్కు లిమ్మటంచుఁ గోరుదు రిచ్చెద। గోరు మెద్ది యైనఁ గుణశీల నీవు॥ వ॥ అని పరమేశ్వరుండు ప్రహ్లాదుని యంతరంగ సకామత్వంబుఁ దెలియుకొఱకు వంచించి యిట్లానతిచ్చిన నతండు నిష్కాముం డైన యేకాంతభక్తుండు గావునఁ గామంబు భక్తియోగంబునకు నంతరాయంబని తలంచి యిట్లనియె- నుత్పత్తి మొదలు కామాద్యనుభవాసక్తిగల నాకు వరంబు లిచ్చెదనని వంచింప నేల సంసారబీజంబులును హృదయబంధకంబులు నైన కామంబులకు వెఱచి ముముక్షుండ నై సేవంబుకొఱకు నేమంబున నిన్నుం జేరితిఁ గామంబులు నింద్రియంబులును, మనశ్శరీరధైర్యంబులును, మనీషా ప్రాణధర్మంబులును, లజ్జాస్మరణలక్ష్మియు, సత్య తేజో విశేషంబులును, నశించు లోకంబులందు భృత్యు లర్థకాములయి రాజుల సేవింతురు రాజులుం బ్రయోజనంబు లర్థించి భృత్యులకు నర్థంబు లొసంగుదురి వ్విధంబునఁ గామనాకుం గామంబు లేదు నీకుం బ్రయోజనంబు లే దైన దేవా వరదుండవయ్యెద వేనిఁ గామంబువృద్ధిఁ బొందనివరంబు గృపఁ జేయుము కామంబులు విడిచినఁ బురుషుండు నీతోడ సమానవిభవుం డగు నరసింహ పరమాత్మ పురుషోత్తమ యని ప్రణవపూర్వకంబుగా నమస్కరించిన, హరి యిట్లనియె॥ సీ॥ నీవంటి విజ్ఞాననిపుణు లేకాంతులు గోర్కులు నా యందుఁ గోరనొల్ల। రట్లైనఁ బ్రహ్లాద యసురేంద్రభర్తవై సాగి మన్వంతరసమయ మెల్ల। నిఖిలభోగంబులు నీవు భోగింపుము కల్యాణబుద్ధి నా కథలు వినుము। సకలభూతములందు సంపూర్ణుఁడగు నన్ను యజ్ఞేశు నీశ్వరు నాత్మ నిలిపి। కర్మచయము లెల్ల ఖండించి పూజనమాచరింపు మీశ్వరార్పణముగ। భోగముల నశించు పుణ్యంబు వ్రతముల। పాపసంచయములు పాపు నిన్ను॥ వ॥ మఱియు నట మీఁదఁ గాలవేగంబున గళేబరంబు విడిచి త్రైలోక్యవిరాజమానంబును, దివిజరాజగేయమానంబును, బరిపూరితదశదిశంబు నైన యశంబుతోడ ముక్తబంధుండ వై నన్ను డగ్గరి యెడవు వినుము॥ గీ॥ నరుఁడు ప్రియముతోడ నాయవతారంబు। నీయుదారగీతనికరములను। మానసించె నేని మఱి సంభవింపఁడు। కర్మబంధచయముఁ గడచిపోవు॥ అనిన బ్రహ్లాదుండిట్లనియె॥ సీ॥ దంష్ట్రివై తొల్లి సోదరుని హిరణ్యాక్షు నీవు సంపుటఁ జేసి నిగ్రహమున। మా తండ్రి రోషనిర్మగ్నుఁ డై సర్వలోకేశ్వరుఁ బరము నిన్నెఱుంగలేక। పరిపంథి వగిది నీ భక్తుండ నగు నాకు నపకారములు సేసె నతఁడు నేఁడు। నీ శాంతదృష్టిచే నిర్మలత్వము నొందెఁ గావున పాపసంఘంబువలనఁ। బాసి శుద్ధాత్ముఁడు గాఁగ భవ్యగాత్ర। వరము వేఁడెద నాకిమ్ము వనజనేత్ర। భక్తసంఘాతముఖపద్మపద్మమిత్ర। భక్తకల్మషవల్లికాపటులవిత్ర॥ అనిన భక్తవత్సలుండిట్లనియె॥ మ॥ నిజభక్తుండవు నాకు నిన్నుఁ గనుటన్ నీ తండ్రి త్రిస్సప్తపూర్వజులం గూడి పవిత్రుఁడై శుభగతిన్ వర్తించు విజ్ఞానదీ। పజితానేకభవాంధకారులగు మద్భక్తులు వొందించు దే। శజనుల్ దుర్జను లైన శుద్ధులు సుమీ సత్యంబు దైత్యోత్తమా॥ సీ॥ ఘనసూక్ష్మభూతసంఘాతంబులోపల నెల్ల వాంఛలు మాని యెవ్వరయిన। నీ చందమున నన్ను నెఱయ సేవించిన మద్భక్తులగుదురు మత్పరులకు। గుఱి సేయ నీవ యోగ్యుఁడ వై యిపిటమీఁద వేదచోదితమయిన పథముతోడఁ। జిత్తంబు నా మీఁదఁ జేర్చి నీ తండ్రికిఁ బ్రేతకార్యములు సంప్రీతిఁ జేయు। మతఁడు రణమున నేఁడు నా యంగమున్న। సమున నిర్మలదేహుఁ డై నవ్యమహిమ। సపగతాఖిలకల్మషుఁ డై తనర్చి। పుణ్యలోకంబునకు నేగుఁ బుణ్యచరిత॥ వ॥ అని యిట్లు నరసింహదేవుం డానతిచ్చిన హిరణ్యకశిపునకుఁ బ్రహ్లాదుండు పరలోకక్రియలు చేసి భూసురోత్తములచేత నభిషిక్తుండయ్యె నయ్యెడఁ బ్రసాదసంపూర్ణముఖుం డైన శ్రీనృసింహదేవునిం జూచి దేవతాప్రముఖసహితుం డై బ్రహ్మదేవుం డిట్లనియె॥ సీ॥ దేవదేవాఖిలదేవేశ భూతభావన వీఁడు నా చేత వరము వడసి। మత్సృష్టిజనులచే మరణంబు నొందక మత్తుఁడై సకలధర్మములు చెఱిచి। నేఁడు భాగ్యంబున నీ చేత హతుఁ డయ్యెఁ గల్యాణమను రెలోకముల కెల్ల। బాలు నీ తని మహాభాగవతశ్రేష్ఠుఁ బ్రతికించితివి మృత్యుభయము వాపి। వరము కృప చేసితివి మేలు వారిజాక్ష। నీ నృసింహావతారంబు నిష్ఠతోడఁ। దగిలి చింతించువారలు దండధరుని। బాధ నొందరు మృత్యువుఁ బాఱఁబడరు॥ వ॥ అనిన నరసింహదేవుండిట్లనియె॥ క॥ మన్నించి దేవశత్రుల। కెన్నఁడు నిటువంటి వరము లీకుము పాపో। త్పన్నులకు వరము లిచ్చుట। పన్నగములకమృత మిడుట పంకజగర్భా॥ వ॥ అని యిట్లానతిచ్చి బ్రహ్మాది దేవమునులచేఁ బూజితుం డై భగవంతుం డైన శ్రీనృసింహదేవుండు తిరోహితుండయ్యెఁ బ్రహ్లాదుండును శూలికిఁ బ్రణతుం డై తమ్మిచూలికి వందనంబులు చేసి ప్రజాపతులకు మ్రొక్కి భగవత్కళలైన దేవతలకు నమస్కరించినం జూచి బ్రహ్మదేవుండు శుక్రాదిమునీంద్రసహితుం డై దైత్య

దానవరాజ్యంబునకుఁ బ్రహ్లాదుం బట్టంబు గట్టి యతనిచేతఁ బూజితుం డై దీవించె నంత నీశానాదినిఖిలదేవతలు వివిధంబులగు నాశీర్వాదంబులచేత నా ప్రహ్లాదుని గృతార్థుఁ గాఁ జేసి తమ్మిచూలిని ముందిడుకొని నిజస్థానంబులకుఁ జనిరి ఇట్లు విష్ణుదేవుని నిజపార్శ్వచరులిరువురు బ్రాహ్మణశాపంబునం జేసి ప్రథమజన్మంబున దితిపుత్రులైన హిరణ్యాక్షహిరణ్యకశిపులను వరాహనారసింహరూపంబుల వధియించె. ద్వితీయభవంబున రావణకుంభకర్ణులయిన శ్రీరామరూపంబున సంహరించెఁ. తృతీయజన్మంబున శిశుపాలదంతవక్త్రులయిన శ్రీకృష్ణరూపంబున ఖండించె నివ్విధంబున మూఁడుజన్మంబుల గాఢవైరానుబంధంబున నిరంతరసంభావితధ్యానులై వారలు హరిం జెంది పాపవిముక్తులై హరిం గలిసిరని చెప్పి నారదుండిట్లనియె॥ ఉ॥ శ్రీరమణీయమైన నరసింహవిహారము నింద్రశత్రుసం। హారముఁ బుణ్యభాగవతుఁ డైన నిశాచరనాథపుత్రసం। చారము నెవ్వఁ డైన ననువిచారత విన్నఁ బఠించిన న్శుభా। కారముతోడ నే భయము గల్లని లోకముఁ జెందు భూవరా॥ మ॥ జలజాతప్రభవాదులున్ మనములోఁ జర్చించి భాషావళిం। బలుకన్లేని జనార్దనాహ్వయపరబ్రహ్మంబు నీయింటిలోఁ। జెలి యై మేనమఱంది యై పవిత్రుఁ డై చిత్తప్రియుం డై మహా। ఫలసంధాయకుఁ డై చరించుట మహాభాగ్యంబు రాజోత్తమా॥ క॥ బ

## త్రిపురాసురసంహారము.

హుమాయు లైన మయుచే। విహితంబగు మానియశము విఖ్యాతజయా। వహముగ నీ భగవంతుఁడు। మహితాత్ముఁడు మున్నను ద్రుంచె మనుజవరేణ్యా॥ అనిన ధర్మనందనుం డిట్లనియె॥ క॥ ఏ కర్మంబున విభుఁడగు। శ్రీకంఠుని యశము మయుఁడు చేసె డివడి యె। న్నే పున నతఁ డెవ్విధంబునఁ। బైకొని తత్కీర్తి చక్రిఁ గా నొనరించెన్॥ అనిన నారదుం డిట్లనియె॥ క॥ చక్రాయుధబలయుతులు సురశత్రుల నోటించి శ్రమమున నసురుల్। సక్రోధంబున నగిరి। విక్రమములు మాని మయుని వెనుకకు నధిపా॥ వ॥ ఇట్లు రక్కసులు తన వెనుకఁ జొచ్చిన మాయానిలయుండును, మద్దముండును నైన మయుండు తన మాయాబలంబున, నయోరజతసువర్ణంబు లై యెవ్వరికి లక్షింపరాని గమనాగమనంబులును, వితర్కింపరాని కర్కశపరిచ్ఛదంబులుం గలిగిన త్రిపురంబులు నిర్మించి యిచ్చిన నక్తంచరులందఱు నందుం బ్రవేశించి కామసంచారులై పూర్వవైరంబుఁ దలంచి నాకనాయకానీకంబులయిన లోకంబుల నస్తోకంబులయిన బలాతిరేకంబుల శోకంబుఁ బొందించిన॥ క॥ లోకాధినాథు లెల్లను। శోకాతురులగుచు నేగి చొచ్చిరి మస్తా। నీకవిదళనాకంతున్। శ్రీకంఠున్ భువనభరణచిత్తోత్కంఠున్॥ వ॥ ఇట్లు సకలలోకేశ్వరుండగు మహేశ్వరుం జేరి లోకపాలకులు ప్రణతులై పూజించి కరకమలంబులు ముకుళించి॥ క॥ త్రిపురాలయులగు దానవు। లపరాజితులగుచు మా పనఁ బ్రాంతంబు। న్నపురాదిపీడఁ జేసెద। రపరాధులను వధింపుము గజాధీశా॥ క॥ దీనులము గాక యుష్మ। ద్ధీనుల మై యుండు మేము దేవా హితదో। ర్లీనుల మై నారము బల। హీనుల మగు మమ్ముఁ గావుమీశానశివా॥ వ॥ అనిన భక్తవత్సలుండగు పరమేశ్వరుండు శరణాగతులయిన గీర్వాణుల వెఱవకుండని మర్వారబలంబున బాణాసనంబుఁ గేలం దికొని యొక్కదివ్యబాణంబు సంధించి త్రిపురంబులపై నేసిన మార్తాండమండలంబున వెలువడు మయూఖజాలంబుల చందంబునఁ దద్బాణంబువలనఁ దేదీప్యమానంబులైన యనేకబాణసహస్రంబులు సంభవించి భూనభోంతరాళంబులు నిండి మండి తెప్పలుగాఁ గుప్పలుగొని త్రిపురంబులపైఁ గప్పిన నప్పుడు తద్బాణపావకహేతిసందోహదందహ్యమానులయి గతాసులయిన త్రిపురనివాసులం దెచ్చి మహాయోగిమైన మయుండు సిద్ధరసకూపంబున వైచిన॥ క॥ సిద్ధామృతరసమహిమను। శుద్ధమహావజ్రతుల్యశోభితతనులై। వృద్ధిం బొందిరి దానవు। లుద్ధతనిర్ఘాతపావకోపములగుచున్॥ క॥ కూపామృతరససంగతి। దీపితులై వెలిచియున్న దేవాహితులన్। రూపించి చింత నొందెడు। గోపధ్వజుఁ జూచి చక్రి*మహనాన్వితుఁడై॥ శా॥ ఉత్సాహంబున నొక్కపాడిమొదవై శ్రీయూథంబుఁ బ్రాణించుచున్। వత్సంబై తన వెంట బ్రహ్మ నడువ న్వైకుంఠుఁ డేతెంచియు। ధృష్టత్వంబునఁ గూపమధ్యరసముం ద్రావెన్ విలోకించుచున్। దత్సౌభాగ్యనిమగ్నులై మఱచిరా దైత్యుల్ నివారింపఁగన్॥ వ॥ ఇట్లు విష్ణుండు మోహనాకారంబున ధేనువై వచ్చి త్రిపురమధ్యకూపామృతరసంబు ద్రావిన నెఱింగి శోకాకులచిత్తులయిన రసకూపపాలకులం జూచి మహాయోగిమైన మయాసురుండు వెఱఁగుపడి దైవగతిం జింతించి శోకింపక యిట్లనియె॥ గీ॥ అసురుఁ డైన దనుజుఁ డైన నరుండైన। నెంత నిపుణుఁడయిన నెవ్వఁ డైన। దైవికార్థచయము దప్పింపఁగా లేఁడు। వలదు దనుజులార వగవ మనకు॥ వ॥ అని పలికె నంత విష్ణుండు నైజంబులైన ధర్మజ్ఞానవిద్యాతపోవిరక్తిసమృద్ధిక్రియాశక్తివిశేషంబుల శంభునికిఁ బ్రాధాన్యంబు సమర్థించి రథసూతకేతువర్మవాహనబాణబాణాసనప్రముఖసంగ్రామసాధనంబులం జేసినఁ గైకొని॥ మ॥ శరియై కార్ముకియై మహాకవచియై సన్నాహియై వాహియై। సరథుండై సనియంతయై సబలుఁడై సత్కేతనచ్ఛా

*మహనాన్వితుఁడై। వంచనాప్రవృత్తితోఁ గూడినవాఁడై—శిష్టము।అపుపాదుగు.

త్రుఁడై। పరమేశ్వరుం డొక బాణము నిగిడిచె దద్బాణానలజ్వాలలం। బురములు గాలెఁ జటచ్ఛటాధ్వనిన ఘోషా మధ్యముల్నిండ దఁగన్॥ వ॥ ఇట్లు హరుండు సురవగాహంబులైన త్రిపురంబుల నఖిలజన్మ మహార్తంబున భస్మంబుఁ జేసి తాల్చిన నమరగరుడగంధర్వసిద్ధసాధ్యయక్షవల్లభులు వీక్షించి జయజయశబ్దంబులు సేయుచుఁ గుసుమవర్షంబులు గురిసిరి - ప్రజలు హర్షించిరి బ్రహ్మేంద్రులు గీర్తించిరి - యప్సరసలు నర్తించిరి - దివ్యకాహళమందుభిరవంబులును, మునిజనోత్సవంబులుఁ బ్రచురంబులయ్యె నిట్లు విశ్వజనీనంబగు త్రిపురాసురసంహారంబున నఖిలలోకులును సంతసిల్లి యుండ నయ్యవసరంబున॥ గీ॥ తృణకణములభంగిఁ ద్రిపురంబుల దహించి। పరముఁ డవ్యయుం డుభగ్రయశుఁడు। శివుఁడు పద్మజాది జేగీయమానుఁడై। నిజనివాసమున

—— నారదుండు ధర్మరాజునకు వర్ణాశ్రమధర్మనిర్ణయంబు నుపదేశించుట. ——

కు నేగ్మెఁ జనియె॥ వ॥ ఇట్లు నిజమాయావిశేషంబున మర్త్యలోకంబున విడంబించుచున్న విష్ణుని పరాక్రమవిధానంబులు మునిజనవంద్యమానంబులై సకలలోకకల్యాణప్రధానంబులై యుండు నని వినిన నారదునకు ధర్మనందనుం డిట్లనియె॥ సీ॥ అనఘాత్మ సకలవర్ణాశ్రమాచారసమ్మతధర్మ మెయ్యది మానవులకు। నే ధర్మమున నరుం డిద్ధవిజ్ఞానము భక్తియుఁ బ్రాపించుఁ బద్మజునకు। సాక్షాత్సుతుండవు సర్వజ్ఞుఁడవు నీకు నెఱుఁగరానిది ధర్మ మింత లేదు। నారాయణపరాయణస్వాంతులన ఘనులు శాంతులు సదయులు సాధువృత్తి। మెఱయుచున్న ఘనులు మీవంటివారెట్టి। పరమధర్మమును శుభక్తిఁ గలఁతు। రట్టి ధర్మరూప మఖిలంబు నెఱిఁగింపు। వినఁగ నిచ్చగలదు విమలచరిత॥ వ॥ అనిన నారదుండు ధర్మరాజుం జూచి దాక్షాయణియందు నిజాంశంబున జన్మించి భువనశోభనంబు కొఱకు బదరికాశ్రమంబునఁ దపోనిరతుండై యున్న నారాయణునివలన *సనాతనధర్మంబు వింటి నది సెప్పెద - సకలవర్ణంబుల జనులకు సత్యంబును, దయయు, నుపవాసాదితపంబును, శౌచంబును, సైరణయు, సదసద్వివేకంబును, మనోనియమంబును, బహిరింద్రియజయంబును, హింస లేమియు, బ్రహ్మచర్యంబును, దానంబును, యథోచితజపంబును, సంతోషంబును, మార్దవంబును, సమదర్శనంబును, మహాజనసేవయు, గ్రామ్యంబులైన కోరికలు మానుటయు, నిష్ఫలక్రియలు విడుచుటయు, మితభాషిత్వంబును, దేహంబు గాని తన్ను వెదకికొనుటయు, నన్నోదకంబులు ప్రాణులకుం బంచియిచ్చుటయుఁ, బ్రాణులందు దేవతాబుద్ధియు, నాత్మబుద్ధిం జేయుటయు, శ్రీనారాయణచరణస్మరణకీర్తనశ్రవణసేవార్చననమస్కారదాస్యాత్మసమర్పణసఖ్యంబులనియెడి త్రింశల్లక్షణంబులు గలుగవలయు, నందు సత్కులాచారుండయి విధిచోదితంబులైన గర్భాధానాదిసంస్కారంబుల విచ్ఛిన్నంబులు గాఁగలవాఁడు ద్విజుండు ద్విజునకు యజనయాజనాధ్యయనాధ్యాపనదానప్రతిగ్రహంబులను షట్కర్మంబులు విహితంబులు రాజునకుఁ బ్రతిగ్రహవ్యతిరిక్తంబులైన యజనాదికర్మంబులైదును, బ్రజాపాలనంబును, బ్రాహ్మణులు గానివారివలన దండశుల్కాదులు గొనుటయు, విహితకర్మంబులు వైశ్యునికిఁ గృషివాణిజ్యగోరక్షణాదికర్మంబులును, బ్రాహ్మణకులానుసరణంబును, విహితంబులు శూద్రునకు ద్విజశుశ్రూషసేయవలయు॥ సీ॥ వినుకర్షణాదికవృత్తికంటెను మేలు యాచింప మెల్లనియట్టి వృత్తి। ప్రాప్తంబుఁ గైకొని బ్రదుకుకంటెను లెస్స యనుదినంబును ధాన్య మడిగికొనుట। యాయావరముకంటె నధికకళ్యాణంబు పరిగ యేఱ్చిన ధాన్యభక్షణంబు। శిలజీవనముకంటె శ్రేయ మాపణముల బడ్డ గింజలు దిని బ్రదుకుఁగనుట। యడరుచో టన్నపతికి నాల్గువృత్తులు। దగుఁ బ్రతిగ్రహంబు దలఁపఁ దగఁడు। నాపదవసరముల నధముఁ డెక్కువజాతి। వృత్తి నున్న దోషవిధము గాదు॥ వ॥ వినుము శిలవృత్తియు, నుంఛవృత్తియు, ఋతమనియు, నయాచితవృత్తి యమృతమనియు, యాచ్ఞావృత్తి మృతమనియుఁ, గర్షకవృత్తి ప్రమృతమనియు, నెన్నుదురట్టి వృత్తుల జీవించుట మేలు శ్వవృత్తి నీచసేవయని పలుకుదురు - సర్వవేదమయుండు బ్రాహ్మణుండు సర్వదేవమయుండు క్షత్రియుండు బ్రాహ్మణక్షత్రియులకు నీచసేవనంబు గర్తవ్యంబు గాదు॥ క॥ దమమును శౌచము దపమును। శమమును మార్దవముఁ గృపయు సత్యజ్ఞాన। క్షమలును హరిభక్తియు హా। గ్రమునిజలక్షణముల గ్రజాతికి నధిపా॥ ఉ॥ శౌర్యము దానశీలముఁ బ్రసాదము నాత్మజయంబుఁ దేజముం। ధైర్యము దేవభక్తియును, ధర్మము నర్థముఁ గామము న్బ్రధా। చార్యముకుంద సేవలును సత్కృతియుం బరితోషణంబు న। దీర్యము రక్షణంబుఁ బృథివీవర శేఖర రాజచిహ్నముల్॥ క॥ ధర్మార్థకామవాంఛయు। నిర్మలగురుదేవవిప్రనివహార్చనము। న్నిర్మదభావము ప్రమదము। శర్మకరత్వములు వైశ్యజనలక్షణముల్॥ ఉ॥ స్తేయము లేనివృత్తియు శుచిత్వము సన్నుతియున్ని జేశుల। న్మాయలు లేక డాయుటయు మంత్రముఁ జెప్పక *పంచయజ్ఞము। ల్సేయుటయుం ద్విజోత్తములసేవయు గోవులరక్షణంబున। న్యాయము లేమియున్మనుజ

---

* సనాతన = శాశ్వతమైన. * పంచయజ్ఞములు। శ్లో॥ పాఠో హోమశ్చాతిథీనాం సపర్యాతర్పణం బలిః। ఏతే పంచమహాయజ్ఞా బ్రహ్మయజ్ఞాదినామకాః॥ తా. వేదపాఠము, వైశ్వదేవాది హోమము, అతిథిపూజ, పితృతర్పణము, భూతబలి, అనునివైదును పంచమహాయజ్ఞములనఁ బడుచున్నవి. పూజాసపర్యాధ్యయనం బ్రహ్మయజ్ఞస్తు తర్పణం। హోమో దైవో బలిర్భౌతో నృయజ్ఞోఽతిథిపూజనమితి స్మృతిః॥ తా. వేదపాఠము - బ్రహ్మయజ్ఞ

నాథయెఱుంగుముశూద్రధర్మముల్ ॥సీ॥నిలయము వాటించి నిర్మలదేహయై శృంగారమేర్పడఁ జేయవలయు। నిత్యప్రి
యాలాపచతురయై ప్రాణేశుచిత్తంబు ప్రేమ రంజింపవలయు। దాక్షిణ్యవంతోపధర్మమేధావులదైవతమునిప్రియుఁదలఁ
పవలయు। నాథుఁడేపద్ధతినడుచు నాపద్ధతినడిచి సద్బంధులనడుపవలయు। మార్దవమునఁబతికిమజ్జనభోజన।శయనపానా
దులజరుపవలయు।విభుఁడుపతితుఁడైన వెలఁదిపాతివ్రత్య।మహిమఁబుణ్యుఁజేసిమనుపవలయు॥ క॥తరుణితనప్రాణవల్ల
భు।హరిభావముగాభజించియతఁడునుదాను।న్సిరికైవడివర్తించును। హరిలోకమునందునంతతానందమునన్॥ క॥ ఉప
వాసంబులువ్రతములుఁ। దపములు వెయ్యేల భర్తదైవతమనిని। మ్కపటతఁగొల్చిన సాధ్వికి।నృపవరదుర్లభములేమనిజల
జగములన్॥ వ॥మఱియుసంకరజాతులైన రజకచర్మకారకనటబురుడకకైవర్తకమ్లేచ్ఛభిల్లురగు నంత్యజాతులేడ్వురకు
జండాలపుల్కసమాతంగజాతులకును నాయాకులాగతంబులైనవృత్తులఁజౌర్యహింసాదులువర్జించి సంచరింపవలయు
మానవులకుఁబ్రతియుగంబుననైసర్గికంబులైనధర్మంబులు రెండులోకంబులందుసుఖకరంబులని వేదవిదులైనపెద్దలుసె
ప్పుదురు కాలుకాలునమన్నెడుక్షేత్రంబులావుచెడునంతఁ జల్లినబీజంబులునిస్తేజంబులై యుండి లెస్సగనంకురింపవుని
రంతరఘృతధారావర్షంబునదహనంబునకుదాహకత్వంబులేక శాంతింజెందునంతఁవ్రేల్చినహవ్యంబులుఫలింపవుతద్వి
ధంబుననవరతకామానుసంధానంబునఁగామోన్ముఖంబైనచిత్తంబుకామంబులందనిసినిష్కామంబై విరక్తినొందుం
గావునసత్త్వస్వభావంబుతోడనెప్పుడుఁదప్పకనిజవంశానుగతవిహితధర్మంబునవర్తించునరుండుమెల్లనస్వాభావికకర్మ
పరత్వంబువిడిచిముక్తినొందు జాతిమాత్రంబునఁబురుషునివర్ణంబునిర్దేశింపలేరు శమదమాదివర్ణలక్షణవ్యవహారంబు
లఁగనవలయునని నారదుండిట్లనియె॥క॥ క్రమమునవర్ణంబులధర్మములెల్లనుజెప్పఁబడియెనాశ్రమములధర్మములె
ఱిఁగించెదనన్నియు।సమదాహితహృదయశూలసదమలశీలా॥ వ॥ వినుముబ్రహ్మచారిమౌంజీకౌపీనయజ్ఞోపవీతకృష్ణా
జినపాలాశదండకమండలుధరుండును, సంస్కారహీనశిరోరుహుండును, దర్భహస్తుండును, శీలప్రశస్తుండును,మౌని
యునై త్రిసంధ్యంబుల బ్రహ్మగాయత్రిజపియించుచు, సాయంప్రాతరవసరంబుల నర్కపావకగురుదేవతోపాసనం
బులుసేయుచుగురుమందిరంబునకుంజనిదాసునిచందంబునభక్తివినయసౌమనస్యంబులుగలిగి వేదంబులుసదువుచునధ్య
యనోపక్రమావసానంబులగురుచరణంబులకునమస్కరించుచు రేపుమాపునువిహితగృహంబులభిక్షించి భైక్షంబుగు
రునకునివేదించియనుజ్ఞఁగొనిమితభోజనంబుగావించుచువిహితకాలంబులనుపవసించుచునంగనయందు నంగనాసక్తు
లందుం బ్రయోజనమాత్రభాషణంబులొనర్చుచుగురుపరాంగనలవలననభ్యంగనకేశప్రసాధనశరీరమర్దనమజ్జనరహ
స్యయోగంబులువర్జించుచుగృహంబునమండకజితేంద్రియత్వంబునసత్యభాషణుండై సంచరింపవలయు॥గీ॥పొలఁతిదా
వవహ్ని పురుషుఁడాజ్యఘటంబు।గరఁగకుండరాదుకదిసెనేని।బ్రహ్మయైనఁగూఁతుఁబట్టకమానఁడు।వటునకింతిపొత్తువ
లమవలదు॥వ॥వినుముస్వరూపసాక్షాత్కారంబున దేహి బహిరింద్రియాదికంబైనయంతయునాభాసమాత్రంబుగాని
శ్చయించియెంతదాఁకజీవుండుస్వతంత్రుండైన యీశ్వరుండుగాకుండునంతదడవు నంగనయిది పురుషుండ నేననియెడి
బుద్ధిమానుటకర్తవ్యంబుగాదు-బ్రహ్మచారి,యతి,గృహస్థులందెవ్వఁడైనఁ జిత్తంబుపరిపక్వంబుగాక నద్వైతానుసం
ధానంబుసేసినమూఢుండగుంగావునరహస్యంబునఁబుత్రికనైనడాయకుండవలయు॥చ॥శిరమునమేనసంస్కృతులుసే
యకచందనభూషణాద్యలం। కరణములెల్లమాని ఋతుకాలములన్నిజభార్యఁబొందుచుం।దరుణులఁజూడఁబోకదృఢ
వ్రతుఁడై మధుమాంసవర్జియై।గురుతరవృత్తితోఁ మెలఁగుకోవిదుఁడొక్కగృహస్థుభూవరా॥వ॥మఱియుద్విజుండుగృహ
స్థుండై గురువులవలననుపనిషదంగసహితంబైనవేదమంత్రంబునుబఠియించినిజాధికారానుసారంబుననర్థవిచారంబుఁ
జేసి తనబలంబుకొలందిగురువులకు నభీష్టంబులొసంగి గృహంబుననొండె,వనంబుననొండె, నైష్ఠికత్వంబునాశ్రయిం
చి ప్రాణులతోడజీవించుచుగురువునందు,నగ్నియందు,నాత్మయందు,సర్వభూతంబులందు,నచ్యుతదర్శనంబుఁజేయుచు,
నింద్రియవ్యసనాదిమగ్నుండుగాకయొటుకగలిగివర్తించుచుపరబ్రహ్మంబునొందు॥ క॥ వినుమువనప్రస్థునకున్మునికథి
తములైననియమములుగలవాచో।ప్పునవనగతుఁడై మెలఁగెడు।ఘనుఁడుమహర్లోకమునకుగమనించునృపా॥ వ॥అటమీఁ
దగ్గృహస్థాశ్రమంబువిడిచివనంబునకుంజనియుదున్నకపండెడునీవారాదికంబులగ్నిపక్వంబుసేసియొండె, నామంబులుచే
సియొండె,నర్కపక్వంబులైనఫలాదులొండె,భక్షించుచువన్యాహారంబులనిత్యకృత్యంబులైనచరుపురోడాశంబులొ
నర్చుచుఁబ్రతిదినంబునంబూర్వసంచితంబులుపరిత్యజించినూతనద్రవ్యంబులుసంగ్రహించుచు నగ్నికొఱకుఁబర్ణశాల
యైనఁ,బర్వతకందరంబైననాశ్రయించుచు-హిమ,వాయు,వహ్ని,వర్షాతపంబులకుసహించుచు-నఖ,శ్మశ్రు, కేశ,తను

గృహంబులు ప్రసాధితంబులు సేయక జటిలుండై వసియించుచు దండాజినకమండలువల్కలపరిచ్ఛదంబులు ధరియించి పండ్రెండైన, నెనిమిదైన, నాలుగైన, రెండైన నొక వత్సరంబైన, దశప్రయాసంబున బుద్ధి నాశంబు గాకుండ మునివృత్తిం జరించుచు దైవవశంబున జరారోగంబుల చేతం జిక్కి నిజధర్మానుష్ఠానసమర్థుండు గాని సమయంబున నిరశనవ్రతుండై యగ్నులనాత్మారోపణంబులు సేసి సన్న్యసించి యాకాశంబునందు శరీరరంధ్రంబులును, గాలియందు నిశ్వాసంబులును, తేజంబులోపల నూష్మంబును, జలంబుల రసంబును, ధరణియందు శల్యమాంసప్రముఖంబులును, వహ్నియందు వ్యక్తంబుతోడ వాక్కు, నింద్రునియందు శిల్పంబుతోడం గరంబులును, విష్ణునియందు గతితోడం బదంబులును, బ్రజాపతియందు రతితోడ నుపస్థంబును, మృత్యువందు విసర్గంబుతోడ పాయువును, దిక్కులందు శబ్దంబుతోడ శ్రోత్రంబును, వాయువందు స్పర్శంబుతోడం ద్వక్కును, సూర్యునియందు రూపంబుతోడం జక్షువులును, సలిలంబులందుఁ బ్రచేతస్సహితమైన జిహ్వయు, క్షితియందు గంధసహితంబైన ఘ్రాణంబును, జంద్రునియందు మనోరథంబులతోడ మనంబును, కవియైన బ్రహ్మయందు బోధంబుతోడ బుద్ధియు, రుద్రునియందహంకారంబుతోడ మమత్వంబును, క్షేత్రజ్ఞునియందు సత్వంబుతోడఁ జిత్తంబును జెందెందించి, యటమీఁదఁ బృథివియందుఁ బృథివిని, జలంబునందు జలంబును, తేజంబునందుఁ దేజంబును, వాయువందు వాయువును, గగనమందు గగనమును, నహంకారతత్త్వమందు నహంకారమును, మహత్తత్త్వమునందు మహత్తత్త్వమును, బ్రకృతియందుఁ బ్రకృతి, నక్షరుండైన పరమాత్మయందును లయంబు నొందించి, చిన్మాత్రావశేషితుండైన క్షేత్రజ్ఞుండగు తన్ను నక్షరత్వంబున నెఱింగి ద్వయరహితుండై దగ్ధకాష్ఠుండైన వహ్నిచందంబునం బరమాత్మయైన నిర్వికారపరబ్రహ్మంబునందు లీనుండు గావలయు॥ క॥ అనఘ వనప్రస్థుండై । చనిత ధర్మంబు లిట్లు సలుపుచు మఱియు। న్మనె నేని సన్న్యసింపం। జను నటమీఁదటను ముక్తిసంగత్వమునన్॥ వ॥ ఇట్లు వానప్రస్థాశ్రమంబు జరిపి సన్న్యసించి, దేహమాత్రావశిష్టుండును, నిరపేక్షుండును, భిక్షుండును, నిరాశ్రయుండు, నాత్మారాముండును, సకలభూతసముండును, శాంతుండును, సమచిత్తుండును, నారాయణపరాయణుండునై కౌపీనంబును నాచ్ఛాదనమాత్రంబైన వస్త్రంబు ధరియించి, దండాదివ్యతిరిక్తంబులు విసర్జించి, యాత్మపరంబులు గాని శాస్త్రంబులు వర్జించి, గ్రహనక్షత్రాదివిద్యల జీవింపక, భేదవాదంబైన తర్కంబులు తర్కింపక, నెందును బక్షీకరింపక, శిష్యులకు గ్రంథంబులు వచించి యుపన్యసింపక, బహువిద్యల జీవింపక, మత్తాదివ్యాపారంబుల నుల్లసిల్లక, పెక్కు దినంబు లొక్కయెడ వసియింపక, యూర నూర నొక్కొక్క రాత్రి నిలుచుచుఁ, గార్యకారణవ్యతిరిక్తంబైన పరమాత్మయందు విశ్వంబు దర్శించుచు, సదసన్మయంబైన విశ్వంబునందుఁ బరబ్రహ్మంబైన యాత్మ నవలోకించుచు, జాగరణస్వప్నసంధిసమయంబుల నాత్మ నిరీక్షణంబు సేయుచు, నాత్మకు బంధమోక్షంబులు మాయామాత్రంబులు గాని వస్తుప్రకారంబున లేవనియును, దేహంబునకు జీవితంబు ధ్రువంబు గాదనియును, మృత్యువు ధ్రువంబని యెఱుంగుచు భూతదేహంబుల సంభవనాశంబులకు మూలంబైన కాలంబుఁ బ్రతీక్షించుచు నివ్విధమ్మున జ్ఞానోత్పత్తిపర్యంతంబు సంచరించి యటమీఁద విజ్ఞానవిశేషంబు సంభవించినఁ బరమహంసుండై దండాదిచిహ్నంబులు ధరియించియుండె- ధరింపక యుండె- బహిరంగవ్యక్తచిహ్నుండు గాక యంతరంగవ్యక్తంబైన యాత్మానుసంధానంబు గలిగి మనీషియై బాహ్యానుసంధానభావంబున మనుష్యులకుఁ దన వలన నున్మత్తబాలమూకులరీతిం జూపుచుండవలయు॥ క॥ మునివల్లభుఁ డజగరుఁడను। ఘనయందు ప్రహ్లాదుఁ డొక శివునూ

## ప్రహ్లాదాజగరసంవాదము.

మందును ము। న్నొనరించిన సంవాదము। వినుమీ యర్థంబునందు వెలయు నరేంద్రా॥ వ॥ తొల్లి భగవత్ప్రియుండైన ప్రహ్లాదుండు కతిపయామాత్యసమేతుండై లోకతత్త్వంబు నెఱింగెడికొఱకు లోకంబుల సంచరించుచు నొక్కనాఁడు కావేరీతీరంబున, సహ్యపర్వతతటంబున, ధూళిధూసరితంబులైన కరచరణాద్యవయవంబులతోడ గూఢంబైన నిర్మలతేజంబుతోఁ గస్త్రాకారవచోలింగవర్ణాశ్రమాదుల నెవ్వరికి నెఱుంగఁబడక నేల నిద్రించుచు నజగరవ్రతధరుండైన మునిం గని తాయం జని విధివత్ప్రకారంబున నర్చించి మునిచరణంబులకు శిరంబు మోపి మ్రొక్కి యతని చరిత్రంబులు దెలియ నిశ్చయించి యిట్లనియె॥ సీ॥ భూమిమదోద్యోగియై భోగివై యుండెడి నరుని కై వడి మునినాథ నీవు। ఘనశరీరముఁ దాల్చి కదలవు చిత్రము ద్యమయుక్తునకుం గాని ధనము లేదు। ధనవంతునకుం గాని తగు భోగములు లేవు భోగికిం గాని సంపూర్ణమైన। తనువు లేదుద్యోగధనభోగములు లేక నేలపై నారక పడి నిద్రవోవు। నీకు నెట్లు గలిగె నిరుపమ దేహంబు। సముఁడవార్యుఁడవు విశారదుఁడవు। బుద్ధినిధివి జనులం బొగడవు దెగడవు। నిద్ర ప్రతిదినంబు నిలుప నేల॥ వ॥ అని యిట్లు ప్రహ్లాదుండడిగిన వికసితముఖుండై మునీంద్రుం డతని మధురాలాపసుధారసప్రవాహంబులు గర్ణంబులం బరిపూర్ణంబులై న నతని నవలోకించి యిట్లనియె॥ సీ॥ అంతరంగిత దృష్టి సం

తెయు నెఱుఁగుము వార్యసమ్మతుఁడవైన సురవర్య! విశ్వజంతువుల ప్రవృత్తినివృత్తిలక్షణములు నీ వెఱుంగనివి లేవు! భగవంతుఁడగు హరి తపాయక నీ మనోవీథి రాజిల్లుచు వెలుఁగుచుండెఁ. గ్రమమున బహిరంధకారంబుఁ బరిమార్చుఁ బరమసాత్త్వికుఁడవు భద్రబుద్ధివైన నీవు నన్ను నడిగెదు గావున విన్న ధర్మమెల్ల విస్తరింతు! నిన్నుఁ జూడఁ గలిగె నీతోడి మాటల నాత్మశుద్ధి గలిగె ననఘచరిత!॥ వ॥ వినుము — ప్రవాహకారిణియైన విషయంబులచేతఁ బూరింపరాని తృష్ణచేతం బడి కర్మంబులఁ బరిభ్రామ్యమాణుండనైన నేను నానావిధయోనులందుఁ బ్రవేశించుచు వెడలుచు *నెట్టకేలకు మనుష్యదేహంబు ధరియించితి; యందు ధర్మంబున స్వర్గద్వారంబును నధర్మంబున శునకసూకరాదితిర్యగ్జంతుయోనిద్వారంబుల నొంది క్రమ్మఱ మనుష్యుండై పుట్టవలయు నని వివేకించి సుఖరక్షణదుఃఖమోక్షణంబులకొఱకు ధర్మంబులు సేయు దంపతుల వ్యవహారంబుఁ గని సర్వక్రియానివృత్తిఁ గలిగిన జీవుండు స్వతంత్రుండై ప్రకాశించు నని నిర్ణయించి భోగంబులు మనోరథజాతమాత్రంబులు గాని శాశ్వతంబులు గావని పరీక్షించి నివృత్తుండనై యుద్యోగంబు లేక నిద్రించుచుఁ బ్రారబ్ధభోగంబుల ననుభవించుచు నుండుదు నిట్టిధంబున నీ దేనకు సుఖరూపంబైన పురుషార్థంబు తనయందుఁ గలుగుట యెఱుంగక పురుషుండు †శైవాలజాలనిరుద్ధంబులైన శుద్ధజలంబుల విడిచి, యెండమావులు జలంబులని పాఱెడు మూఢుని వడువున సత్యంబు గాని ద్వైతంబుఁ జొచ్చి ఘోరసంసారచక్రపరిభ్రాంతుండై దైవతంత్రంబులైన దేహాదులచేత నాత్మకు సుఖంబును దుఃఖనాశంబును గోరుచు నిరీశుండయినవాని ప్రారంభంబులు నిష్ఫలంబులగు. నదియునుం గాక మర్త్యునకు ధనంబు ప్రాప్తంబైన నది దుఃఖకరంబు గాని సుఖకరంబు గాదు. లోభవంతులైన ధనవంతులు నిద్రాహారంబులు లేక రాజచోరయాచకశత్రుమిత్రాదిసర్వస్థలంబుల నుమ శంకించుచు దానభోగంబులు మాని యుండుదురు. ప్రాణార్థవంతులకు భయంబు నిత్యంబు. శోకమోహభయక్రోధరాగశ్రమాదులు, వాంఛామూలంబులు, వాంఛ లేకుండవలయు॥ మ॥ §సరఘల్ గూర్చిన తేనె మానవులకున్ సంప్రాప్తమైనట్లు లోభరతుల్ గూర్చిన విత్తముల్ పరులకుం బ్రాపించుఁ; బ్రాప్తాశినై తిరుగంబోనిక ఘోరాగంబు బ్రతుకుం దీర్ఘాంగమై యుండియుఁ జిరకాలంబును నా నివర్తనములం జింతింతుఁ దివ్యేకాంతినై॥ క॥ ¶అజగరమును జుంటీఁగయు నిజగురువులుఁ గాఁ దలంచి నిశ్చింతుఁడనై విజనస్థలిఁ గర్మంబుల గజిబిజి లేకున్నవాఁడ గౌరవవృత్తిన్॥ సీ॥ ‡అజినవల్కలదుకూలాంబరంబులు గట్టి యొండెఁ గట్టక యొండె నుండుచుందు; నాందోళికారథహయనాగముల నెక్కియైన నెక్కకయైన నరుగుచుందు; గర్పూరచందనకస్తూరికాలేపమైన భూరజమైన నలఁదికొందు; భర్మశయ్యల నైనఁ బర్ణశిలాతృణభస్మంబులందైనఁ బడుచునుందు; మానయుక్తమైన మానహీనంబైనఁ, దీయనైన మిగులఁ దిక్తమైనఁ, గుడుతు సగుణమైన గుణవర్జితంబైన, నల్పమైనఁ జాలనధికమైన॥ క॥ లేదని యెవ్వరి నడుగను గాదని చింతింపఁ బరులు రప్పించినచోఁ గాదని యెద్దియు మానను ఖేదము మోదమును లేకఁ గ్రీడింతు మదిన్॥ క॥ నిందింపఁబడుల నెన్నఁడు వందింపన నేకపీడ వచ్చినమదినా క్రందింపవిభవముల కానందింపఁ బ్రకామవర్తనంబున నధిపా॥ వ॥ ఇట్లు కోరిక లేక యొక్కసమయంబున దిగంబరుండనై పిశాచంబు చందంబున నుండుచుఁ బెక్కుదినంబులుం గోలెఁ బెనుపాము వర్తనంబుఁ గైకొని నిమీలితలోచనత్వంబున నేకాంతభావంబు విష్ణునియందుఁ జేర్చి భేదగ్రాహకచిత్తవృత్తుల నర్థరూపపరిభ్రమంబు గల మనంబున మనంబు నహంకారంబునం దహంకారంబు మాయయం దమ్మాయ నాత్మానుభూతియందు లయంబు నొందించి సత్యంబు దర్శించుచు విరక్తి నొంది స్వానుభవంబున నాత్మస్థితుండనై యుందు. నీవు భగవత్పరుండవు గావున రహస్యంబైన పరమహంసధర్మంబు స్వానుభవగోచరంబైన తెఱంగున నీకు హృద్గోచరంబగునట్లు చెప్పితి ననిన విని॥ క॥ ఘనుఁ డజగరమునివల్లభుఁ డను జేంద్రుఁడు పూజఁ జేసి తగ వీడ్కొని వెన్నునమున సంతోషించుచుఁ జని యెన్నిజగేహమునకు శశికులతిలకా॥ వ॥ అనిన యుధిష్ఠిరుం డిట్లనియె॥ క॥ సదుబోటి జడగృహస్థుఁడు మునివల్లభ యిట్టి పదవి మోదంబున †నే యనువునఁ జెందును వేగను విని పింపుము నేఁడు నాకు విజ్ఞాననిధీ॥ వ॥ అనిన నారదుం డిట్లనియె గృహస్థుండైనవాఁడు వాసుదేవార్పణంబు గా గృహోచితక్రియల ననుసంధించుచు మహామునుల సేవించి వారలవలన నారాయణదివ్యావతారకథాశ్రవణంబుఁ జేయుచు నయ్యై విహితకాలంబుల శాంతజనులం గూడి యుండుచుఁ బుత్రమిత్రకళత్రాదిసంగంబులు గలలవంటివని యెఱుంగుచు లోపల వాసక్తి లేక సక్తుని కైవడి వెలుపలఁ బురుషాకారంబులు నర్పించుచు గులంబులు లేక విత్తంబులిచ్చి జనకసుతసోదరసఖిజ్ఞాతిజనుల చిత్తంబులు సమ్మతాయత్తంబులు గావించుచు ధనధాన్యనిధానదైవలబ్ధంబుల వలన నభిమానంబు మాని యనుభవించుచు గృహక్షేత్రంబులఁ జొచ్చి యుదరపూరణమాత్రం

* ఎట్టకేలకున్ = అతికష్టముచేత. † శైవాలజాలనిరుద్ధంబులైన = పాచిగుంపులచేతఁ గప్పఁబడిన. § సరఘలు = తేనెటీఁగలు. ¶ అజగరము = కొండచిలువ - తేనె - కొండచిలువ. ‡ అజినవల్కల = అజిన = చర్మము, వల్కల = నారచీర. † ఏ యనువునన్ = ఏ యుపాయముచేత.

ణునకైన శ్రాద్ధవిస్తారంబుఁ గర్తవ్యంబు గాదు దేశకాలప్రాప్తకందమూలఫలాదికంబైన హరినైవేద్యంబున విధిచోదిత ప్రకారంబుగా శ్రద్ధతోడఁ బాత్రంబునందుఁ బెట్టిన యన్నంబు కామదంబై యక్షయఫలకారి యగు ధర్మతత్త్వవేదియైన వాఁడు శ్రాద్ధంబులందు మాంసప్రదానంబుఁ జేయక భక్షింపక చరింపవలయుఁ గందమూలాదిదానంబున నయ్యేడి ఫలంబు పశుహింసనంబున సంభవింపదు ప్రాణిహింసఁ జేయక వర్తించుటకంటె మిక్కిలి ధర్మంబు లేదు యజ్ఞవిదులైన ప్రోడలు నిష్కాములై బాహ్యకర్మంబులు విడిచి యాత్మజ్ఞానదీపంబులందుఁ గర్మమయంబు లయిన యజ్ఞంబుల నాచరింతురు॥ క॥ పశువులఁ బొరిగొని సుఖములు। విశదములుగఁ జేయు బుధులవీక్షించి వితము। న్విశసనముఁ జేయు నోయని। కసిమసి బెగడొందు భూతగణము నరేంద్రా॥ వ॥ అదిగావున ధర్మవేదియైనవాఁడు దైవప్రాప్తంబు లయిన కందమూలాదికంబులచేత నిత్యనైమిత్తికక్రియలఁ జేయవలయు నిజధర్మబాధకంబయిన ధర్మంబును, బరధర్మప్రేరితంబయిన ధర్మంబు నాభాసధర్మంబును బాషండధర్మంబును, గపటధర్మంబును, ధర్మజ్ఞుండైనవాఁడు మానవలయు, నైసర్గికధర్మంబు మరి తెరంగుల శాంతి సమర్థంబగు నిర్ధనుండు ధర్మార్థంబు యాత్రఁ జేయుచు నైన ధనంబు గోరవలవదు జీవనోపాయంబున కునిట్టట్టుదిరుగక కార్పణ్యంబు లేక జీవించు మహాసర్పంబు తెఱంగున సంతోషంబున నాత్మారాముండై యెద్దియుం గోరక బ్రతికెడి సుగుణునికిం గలసుఖంబు కామలోభంబులం దశదిశలం*బరిధావనంబుఁ జేయువానికి సిద్ధింపదు పాదరక్షలు గలవానికిఁ గర్కశకంటకాదులవలన భయంబు లేక మెలంగుభంగిఁ గామంబులవలన నివృత్తిగలవానికి నెల్లకాలంబును భద్రంబగు నుపస్థకును జిహ్వకు దైన్యంబు నకును బురుషుండు గృహపాలక శునకంబునకై వడి సంచరించుచు సంతుష్టి లేక చెడు సంతోషిగానివిప్రుని విద్యాతపోవిభవ యశంబులు నిరర్థకంబులగు నింద్రియలోలత్వంబున విజ్ఞానంబు నశించు సకల భూలోకభోగంబులు భోగించియు దిగ్విజయంబుఁ జేసియు బుభుక్షాపిపాసలవలనఁ గామపారంబును హింసవలనఁ గ్రోధపారంబును జేరుట దుర్లభంబు సంకల్పవర్జనంబునఁ గామంబును, గామవర్జనంబునఁ గ్రోధంబును నర్థానర్థదర్శనంబున లోభంబును, దత్త్వానుసంధానంబున భయంబు నాత్మానాత్మవివేకంబుల శోకమోహంబులును, సాత్త్వికసేవనంబున దంభంబును, మౌనంబున యోగాంతరాయంబును, శరీరవాంఛ లేమి హింసయు హితాచరణంబున భూతజంబైన దుఃఖంబును, సమాధిబలంబున దైవికవ్యథయును, ప్రాణాయామాదికంబున నాత్మవ్యథయును, సాత్త్వికాహారంబుల నిద్రయు సత్త్వగుణంబున రజస్తమంబులును, గురుభజనమునఁ దలుంపెల్లను॥ కరిశౌచము క్రియ నిరర్థకంబగు నధిపా॥ ఉ॥ ఈ వనజాతనేత్రుఁ బరమేశు మహాత్ముఁ బ్రధానపూరుషుం। దేవశరణ్యు సజ్జనవిధేయు ననంతుఁ బురాణయోగిసం। సేవితపాదపద్ముఁ డమచిత్తములన్నరుఁ డంచు లోకులి। చ్ఛావిధిఁ జూచుచుండుదురు సన్మతిలేక నరేంద్రచంద్రమా॥ వ॥ వినుము షడింద్రియంబులలోన నెకటియందుఁ దత్పరులై యిచ్ఛాపూరణవిధానంబులఁ జరితార్థుల నైతి మను వారలు ధారణాభ్యాససమాధియోగంబుల సాధింప లేరు కృషిప్రముఖంబులు సంసారసాధనంబులు గాని మోక్షసాధనంబులు గావు కుటుంబసంగంబునఁ జిత్తవిక్షేపంబగుఁ జిత్తవిజయప్రయత్నంబున సన్న్యసించి సంగంబు వర్జించి మితంబైన భిక్షాన్నంబు భక్షించుచు శుద్ధవివిక్తసమప్రదేశంబున నొక్కచో నాసీనుండై సుస్థిరత్వంబునఁ బ్రణవోచ్చారణంబుఁ జేయుచు రేచకపూరకకుంభకంబులఁ బ్రాణాపానంబుల నిరోధించి కామహతంబయిన చిత్తంబు పరిభ్రమణంబు మాని కామవిసర్జనంబుఁ జేసి మఱలు నంతకు నిజనాసాగ్రనిరీక్షణంబుఁ జేయుచు నివ్విధంబున యోగాభ్యాసంబుఁ జేయువాని చిత్తంబు కాష్ఠరహితంబైన వహ్ని తెఱంగున శాంతిఁ జెందుఁ గామాదుల చేత వేధింపంబడక ప్రశాంతసమస్తవృత్తంబైన చిత్తంబు బ్రహ్మసుఖసమర్శనంబున లీనంబై మఱియు నెగయ నేరదు॥ మ॥ ధరణీదేవుఁడు సన్న్యసించి యతియై ధర్మార్థకామంబులన్। బరివర్జించి పునర్విశంబమునఁ దత్ప్రారంభియౌ నేనిలో। భరతింగక్కిన మూఢు మాంచి డనుచున్భక్షించి జీవించుమ। ర్మరుచందంబున హాస్యజీవనుఁ డగు న్నానాప్రకారంబులన్॥ క॥ మలమునఁ గ్రిమియును బడు క్రియ। నిలఁబడు నొడలాత్మ గాదు హేయంబనుచున్। దలఁతురు తద్‌జ్ఞులు పొగడుదు। రలసత నొడలాత్మ యనుచు నజ్ఞులిలేశా॥ గీ॥ వ్రతము మానఁ దగదు వటుకున్ గృహికిని। గ్రియలు మానఁ దగదు గృహగతునికిఁ। దపసి కూరనుండఁ దగదు సన్న్యాసికిఁ। దరుణితోటి పొత్తు దగదు దగదు॥ సీ॥ రథము మే నెల్ల సారథి బుద్ధి యింద్రియగణము గుఱ్ఱములు పగ్గములు మనము। ప్రాణాదిదశవిధపవనంబు లిరుసు ధర్మాధర్మగతులు †రథాంగకములు। బహుళతరంబయిన బంధంబు చిత్తంబు శబ్దాదికములు సంచారభూము। లభిమానసంయుతుండయిన జీవుఁడు రథి ప్రణవంబు ‡కార్ముకంబు। శుద్ధజీవుండు బాణంబు సుభగమయిన।

* పరిధావనంబు। పరుగెత్తుట - లేక - నడుచుట. † రథాంగకములు। చక్రములు. ‡ కార్ముకము। విల్లు.

బ్రహ్మమంచితలత్యంబుపరులురాగ। భయమదద్వేషశోకలోభప్రమోహ। మానమత్సరముఖములుమానవేంద్ర॥
వ॥ఇట్లుమనుష్యశరీరరూపంబయినరథంబుదనవశంబుచేసికొనిమహాభాగవతచరణకమలసేవానిశితంబయిన విజ్ఞానఖడ్గంబుధరియించిశ్రీమన్నారాయణకరుణావలోకనబలంబునరాగాదిశత్రునిర్మూలనంబుగావించిప్రణవబాణాసనంబునశుద్ధజీవశరంబునుసంధించిబ్రహ్మమనియెడిగుఱి యందుఁబడవేసిననహంకారరథికుండురథికత్వంబుమానినిజానందంబుననుండవలయు,నట్టివిశేషంబుసంభవింపనిసమయంబునబహిర్ముఖంబులయినయింద్రియఘోటకంబులుబుద్ధిసారథిసహితంబులై సాభిమానరథికునిప్రసుప్తత్వంబుదెలిసిప్రవృత్తిమార్గంబునొందించి విషయశత్రుమధ్యంబునం గూల్చిన॥
గీ॥విషయశత్రులెల్లవిక్రాంతితోడసా।రథిసమేతుఁడయినరథికుఁబట్టి।యుగ్రతిమిరమృత్యుయుతమగుసంసార। కూపమధ్యమునఁ గూల్తురధిప॥వ॥వినువైదికకర్మంబుప్రవృత్తంబును,నివృత్తంబునన రెండుతెఱంగులయ్యె నందుఁబ్రవృత్తంబునఁబునరావర్తనంబును,నివృత్తంబున మోక్షంబునుసిద్ధించుఁబ్రవృత్తకర్మంబులోన నిష్టాపూర్తంబులన రెండుమార్గంబులుగలవందుహింసాద్రవ్యమయకామ్యరూపంబులయినదర్శపూర్ణమాసపశుయాగవైశ్వదేవబలిహరణప్రముఖంబులైన యాగాదికంబులిష్టంబులు దేవతాలయవనకూపతటాకప్రముఖంబులుపూర్తంబులుప్రవృత్తకర్మంబున దేహంబువిడిచి దేహాంతరారంభంబున దేహిహృదయాగ్రంబున వెలుంగువానితోడనింద్రియంబులంగూడి భూతసూక్ష్మయుక్తుండై ధూమదక్షిణాయనకృష్ణపక్షరాత్రిదర్శంబులవలనసోమలోకంబుఁ జేరిభోగావసానంబునవిలీనదేహుండై వృష్టిద్వారంబునఁగ్రమంబుననోషధిలతాన్నశుక్లరూపంబులఁ బ్రాపించిభూమియందుఁజన్మించునది పునర్భవరూపంబయిన పితృమార్గంబునివృత్తకర్మనిష్ఠుండయినవాఁడుజ్ఞానదీప్తంబులయినయింద్రియంబులందుఁగ్రియాయజ్ఞంబులయజించి యింద్రియంబులదర్శనాదిసంకల్పరూపంబయినమనంబునందు వికారయుక్తంబయినమనంబును, వాక్కునందు విద్యాదిలక్షణమైనవాక్కునువర్ణసముదాయంబునందును,వర్ణసముదాయంబునకారాదిస్వరత్రయాత్మకంబయినయోంకారంబునందునోంకారంబును,బిందువందుబిందువును నాదంబునందునాదంబును ప్రాణంబునందుఁబ్రాణంబును బ్రహ్మమందు నిలుపవలయు, దేవమార్గంబులయినయుత్తరాయణశుక్లపక్షదివాప్రాహ్ణపూర్ణిమారాకలవలనసూర్యబ్రహ్మలోకంబులందుఁజేరిభోగావసానంబునస్థూలోపాధినివిశ్వుండై సూక్ష్మంబునందులయించిసూక్ష్మోపాధియైనతైజసుండై సూక్ష్మంబునుగారణంబునందులయించి కారణోపాధియైన ప్రాజ్ఞుండై కారణంబునుసాక్షిస్వరూపంబునందులయించితుర్యుండై సాక్షిలయంబునందుశుద్ధాత్ముండయియివ్విధంబునముక్తుండగును॥గీ॥అమరనిర్మితంబులై యొప్పుపితృదేవ। సరణులెవ్వఁడెఱుఁగుశాస్త్రదృష్టి। నట్టివాఁడు దేహియై మోహమునఁ బొందఁ।డతిశయించుబుద్ధినవనినాథ॥ వ॥వినుము దేహాదులకుఁ గారణత్వంబున నాదియందునవధికత్వంబుననంత్యమందునుగలుగుచుబహిరంగంబునభోగ్యంబును,నంతరంగంబునభోక్తయు,బరంబునఁబరంబును,జ్ఞానంబునజ్ఞేయంబును,వచనంబునవాచ్యమును,బ్రకాశమునఁబ్రకాశంబునైనవస్తువునకు వేఱొండులేమ ప్రతిబింబాదికంబువస్తుత్వంబునం జేసి వికల్పితంబై తలంపంబడుభంగి నైంద్రియకంబయినసర్వంబునునర్థత్వంబునవికల్పితంబై తోఁచుంగాని పరమార్థంబుగాదు దేహాదికంబులువినాశ్యంబులువానికిహేతువులయినక్షితిప్రముఖంబులు వినాశ్యంబులగుటసిద్ధంబు పరమాత్మకు నవిద్యచేత నెంతతడవు వికల్పంబుదోఁచునంతతడవును భ్రమంబుదోఁచునవిద్యానివృత్తియైనసర్వంబునుమిథ్యయనిశాస్త్రవిధినిషేధంబుల నెఱింగికలలోపల మేలుఁగన్న తెఱంగులగు భావాద్వైతక్రియాద్వైతద్రవ్యాద్వైతంబులుమూఁడుగలవందుఁ బటతంతున్యాయంబునఁ గార్యకారణంబులందువస్తువొక్కటియైయుండుననియెఱింగియేకత్వాలోచనంబుచేసివికల్పంబు లేదని భావించుటభావాద్వైతంబు మనోవాక్కాయకృతంబులయినసర్వకర్మంబులనుఫలభేదంబుఁజేయక పరబ్రహ్మార్పణంబుఁ జేయుటక్రియాద్వైతంబుపుత్రమిత్రకళత్రాదిసర్వప్రాణులకుందనకును,దేహంబునకుంబంచభూతాత్మకత్వంబునభోక్తయొక్కండను,పరమార్థత్వంబుననర్థకామంబులయెడనైక్యదృష్టిఁజేయుటద్రవ్యాద్వైతంబు నేర్పుననాత్మతత్త్వానుభవంబుననద్వైతత్రయంబునువిలోకించివస్తుభేదబుద్ధియు,స్వకీయపరకీయబుద్ధియు,స్వప్నంబులుగాఁదలంచిమునియైనవాఁడుమానవలయు,॥ క॥ వాదములువేయునేటికి। వేదోక్తవిధింజరించువిబుధుఁడు గృహమం।దాదరమున నారాయణ।పాదంబులఁగొలిచిముక్తిపదమునకేఁగు॥శా॥భూపాలోత్తమమీరుభక్తిగరిమస్ఫూర్తిన్సరోజేక్షణ।శ్రీపాదాంబుజయుగ్మమున్నియతులై సేవించికాదే మహో।గ్రాపత్సంఘములోనఁజిక్కకసమస్తాశాంతనిర్జేతలై। యేపారంగమఖంబుఁ జేసితిరి దేవేంద్రప్రభావంబునన్॥వ॥వినుముపోయినమహాకల్పంబునందు గంధర్వులలోనుపబర్హణుండను పేరగంధర్వుండనైన నేనుసౌందర్య

చాతుర్యమాధుర్యగాంభీర్యాదిగుణంబులసుందరులకుఁ బ్రియుండనై క్రీడించుచు నొక్కనాఁడు విశ్వస్రష్టలయిన బ్రహ్మలు దేవసత్త్రమనియెడి యాగంబులోన నారాయణకథలు గానంబు చేయుకొఱకు నప్సరోజనులను గంధర్వులం బిలిచిన॥ గీ॥ క్రతువులోని కేను గంధర్వగణములోఁ। గలసిపోయి విష్ణుగాథలఁ జటఁ। గొన్ని పాడి సతులఁ గూడి మోహితుఁడనై। తలఁగిచనితి నంత ధరణినాథ॥ క॥ వారిజగంధులపొత్తున। వారింగైకొనక తలఁగివచ్చినబుద్ధి। న్వారెఱిఁగి శాపమిచ్చిరి। వారింపఁగ రాని రోషవశమున నధిపా॥ గీ॥ పంకజాక్షుని చటఁబాడక కామినీ। గణముఁ గూడి చనిన కల్మషమున। వర్ధకాంతివగుచు ధరణీతలంబున। శూద్రజాతిసతికి సుతుఁడవగుము॥ వ॥ అనియిట్లు విశ్వస్రష్టలు శపించిన నొక్క బ్రాహ్మణదాసికిఁ బుత్త్రుండనై జన్మించి యందు బ్రహ్మవాదులైన పెద్దలకు శుశ్రూష చేసిన భాగ్యంబున నిమ్మహాకల్పంబునందు బ్రహ్మపుత్త్రుండనై జన్మించితి॥ గీ॥ కాలమున నొక్క గతికి గృహస్థుఁడే। ధర్మమాచరించి తగిలిపోవు। నట్టిధర్మ మెల్ల నతిపిశదంబుగాఁ। బలుకఁబడియె నీకు భవ్యచరిత॥ మ॥ అఖిలాధారుఁడజాదిమృగ్యుఁడు బ్రహ్మంబైన విష్ణుండు నీ। సఖుఁడున్ వర్గ్యుఁడునై నివాసగతుఁడై మాధుర్యసంభాషియై। సఖియై చారకుఁడై నుతింపఁ దగి మేనత్తకుమారుఁడై మంత్రియై। సుఖముండయ్యె భవన్మహామహిమ దాఁ జోద్యంబు ధాత్రీశ్వరా॥ వ॥ అనియిట్లు నారదుండు చెప్పినవృత్తాంతం బంతయు విని ధర్మనందనుండు ప్రేమవిహ్వలుండై వాసుదేవుని బూజించె వాసుదేవధర్మనందనుల చేతఁ బూజితుండై నారదముని యుదేవమార్గంబునం జనియె నని శుకయోగీంద్రుండు పాండవపౌత్త్రునకుం జెప్పెనని సూతుండు శౌనకాదులకుం జెప్పె ॥ ... ... ... ... ...

క॥ రాజీవసదృశలోచన। రాజీవభవాదిదేవరాజవినుతవి। భ్రాజితకీర్తిలతావృత। రాజీవభవాండభాండరఘుకులతిలకా॥

మాలిని. ధరణిదుహితృరంతా ధర్మమార్గావగంతా। నిరుపమనయవంతా నిర్జరారాతిహంతా।
గురుబుధసుఖకర్తా కుంభినీచక్రభర్తా। సురభయపరిహర్తా సూరిచేతోవిహర్తా॥

గద్య. ఇది, శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్యప్రణీతంబైన [illegible]భాగవతంబను మహాపురాణంబునందు, ధర్మనందనునకు నారదుండు హిరణ్యాక్షహిరణ్యకశిపుల పూర్వజన్మవృత్తాంతంబుఁ జెప్పుటయు, హిరణ్యకశిపుదితిసంవాదంబును, సుయజ్ఞచరిత్రంబును, యమసల్లాపంబును, బ్రహ్మవరలాభగర్వితుండైన హిరణ్యకశిపుచరిత్రంబును, బ్రహ్లాదవిద్యాభ్యాసకథయును, బ్రహ్లాదహిరణ్యకశిపుసంవాదంబును, బ్రహ్లాదువచనంబు బ్రతిష్ఠించి హరి నరసింహరూపంబున నావిర్భవించి హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదునకు నభయం బిచ్చి నిఖిలదేవతానివహ ప్రహ్లాదాదిస్తూయమానుండై తిరోహితుండగుటయుఁ, ద్రిపురాసురవృత్తాంతంబును, నీశ్వరుండు త్రిపురంబుల దహించుటయు, వర్ణాశ్రమధర్మవివరణంబును, బ్రహ్లాదాజగరమునిసంవాదంబును, నారదు పూర్వజన్మవృత్తాంతంబును నను కథలుగల సప్తమస్కంధము సమాప్తము.

శ్రీకృష్ణార్పణమస్తు.



## శ్రీమదాంధ్రభాగవతము — అష్టమస్కంధప్రారంభము.

శ్రీమన్నామపయోదశ్యామ *ధరాభృల్లలామ జగదభిరామా। రామాజనకామమహో। ద్దామగుణస్తోమధామ దశరథరామా॥

వ॥ మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండైన సూతుండిట్లనియె నట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని॥ క॥ వినఁబడియె నుస్వాయంభువ। మనువంశము వర్గధర్మమర్యాదలతో। మనుజులదనుజులవేల్పుల। జననంబులు సృష్టియెల్ల జనియించుటయు॥ ఉ॥ ఏమనుకాలమందు హరి యీశ్వరుఁ డేటికి సంభవించె నే। మేమి యొనర్చె నమ్మనువు లెవ్వరు నేక్రియఁ జేయుచున్నవాఁ। డేమి నటించు మీఁదఁగల మెయ్యది సజ్జనులైనవారము। న్నేమని చెప్పుచుందురు మునీశ్వర నాకెఱిఁగింపవే దయన్॥ అనిన శుకుం డిట్లనియె. క॥ ఈకల్పంబున మనువులు। ప్రాకటముగ నార్వురైరి పదునలుగురలోఁ। లోకములజనులపుట్టువు। లాకథితములయ్యె వరుస నఖిలములు నృపా॥ వ॥ ప్రథమమనువైన స్వాయంభువునకు నాకూతిదేవహూతులను, నిరువురుకూఁతులుగలరు వారికిఁ గ్రమంబునఁ గపిలయజ్ఞనామంబుల లోకంబులకు ధర్మజ్ఞానబోధంబు సేయుకొఱకు హరిపుత్త్రత్వంబు నొందె నందుఁ గపిలునిచరిత్రంబులు మున్న చెప్పంబడియె యజ్ఞునిచరిత్రంబు సెప్పెద వినుము॥ మా॥ శతరూపాపతి కాముభోగనిరతిన్ సంత్యక్తభూభారుఁడై।

* పయోదశ్యామ॥ పయోద। మేఘమువలె, శ్యామ। నల్లనైనవాఁడా. ధరాభృల్లలామ॥ ధరాభృత్। రాజులలో, లలామ। శ్రేష్ఠుఁడా, అభిరామ। మనోహరుఁడైనవాఁడా, రామాజనకామ। స్త్రీజనములచే కోరఁబడినవాఁడా, మహోద్దామగుణస్తోమధామ॥ మహత్। మిక్కిలి, ఉద్దామ। ఉత్కృష్టములయిన, గుణస్తోమ। గుణసమూహమునకు, ధామ। స్థానమయినవాఁడా.

సతియుం దానును గానకేఁగి శతవర్షంబుల్ సునందానది । వ్రతియై యేకపదస్థుఁడై నియతుఁడై వాచంయమిస్ఫూర్తితో । గత దోషుండు తపంబు సేసె భువనఖ్యాతంబుగా భూవరా ॥ వ॥ ఇట్లు తపంబు సేయుచు స్వాయంభువమనువు దన మనంబులోన ॥ సీ॥ సృష్టిచే నెవ్వఁడు చేతనపడకుండు సృష్టి యెవ్వని చేత చేతనించు । జగములు నిద్రింప జాగరూకతనుండి యెవ్వఁడు బ్రహ్మంబు దానె యగుచుండు । నాత్మకాధారంబు నఖిలంబు నెవ్వఁడు నెవ్వని నిజధనం బింతవట్టు । పొడఁగానరాకుండుఁ బొడఁగను నెవ్వఁడు నెవ్వని సృష్టికి నేమి లేమి । జననవృద్ధివిలయసంగతిఁ జెందక । యెవ్వఁ డీశుఁడు నెల్ల యెడలఁ దనమహత్వసంజ్ఞ తత్త్వ మెవ్వఁడు దాన । విశ్వరూపుఁ డనఁగ వి_స్తరించు ॥ వ॥ అనిమతియు నిరహంకృతుండును, నిరాశయపరిపూర్ణుండు, ననన్యప్రేరితుండును, నృశిక్షాపరుండును, నిజమార్గసంస్థితుండును, నిఖిలధర్మభావనుండు నైన పరమేశ్వరున కనమస్కరించెద నని యుపనిషదర్థంబులు పలుకుచున్న మనువుం గనుంగొని. క॥ రక్కసులు దినఁగఁ గడఁగిన । వెక్కసముగ యజ్ఞనామవిష్ణుఁడు వారిం । జక్కాడఁ జెంజక్రధారల । మిక్కుటముగ వేల్పు లెల్ల మేలని పొగడన్ ॥ వ॥ ఇది ప్రథమమన్వంతరంబు ఇంక రెండవ మనువు వినుము ॥ సీ॥ స్వారోచిషుండన సప్తార్చిబిడ్డఁడు మనువు వానికి నాద్యమత్సుషేణ । రోచిష్మదాద్యులా రూఢపుత్రులు ధాత్రి నేలిరి రోచనుఁ డింద్రుఁ డయ్యె । నధికులు తుషితాదు లమరులూర్జస్తంభముఖ్యులాఢ్యులు సప్తమునులు నాఁడు । వేదశిరుండను విప్రుని దయితకుఁ దుషితకుఁ బుత్రుఁడై తోయజాక్షుఁ డవతరించె నువిభుఁ డనశీత్యష్టసహస్రమును లనధికుల యినవారు । ఘనులను గ్రహింపఁ గౌమారకబ్రహ్మచారియగుచు నతఁడు సలిపె వ్రతము ॥ తదనంతరంబ ॥ సీ॥ మనువు మూఁడవవాఁడు నను జేంద్రయుత్తముం డనఁ బ్రియవ్రతునకు నాత్మజుండు । పాలించె నిలయెల్ల పవనసృంజయయజ్ఞహోత్రాదు లాతని పుత్రు లధిక । గుణులు వసిష్ఠుని కొడుకులు ప్రమథాదులైరి సప్తఋషులు నమరవిభుఁడు । సత్యజిత్తను వాఁడు సత్యభద్రాద్యులు సురలు ధర్మునికిని సూనృతకును । బుట్టి సత్యనియతిఁ బురుషోత్తముఁడు సత్యసేనుఁ డనఁగ మత్తశీలయుతుల । దనుజయక్షపశుల దండించె సత్యజిన్మిత్రుఁ డనఁగ జగము మేలనంగ ॥ వ॥ చతుర్థమనువు కాలప్రసంగంబు వివరించెద ॥

## గజేంద్రమోక్షణకథాప్రారంభము.

సీ॥ మానవాధీశ్వర మనువు నాలవవాఁడు తామసుం డనఁగ సుత్తముని భ్రాత । పృథ్వీపతుల కేతు *పృథునరఖ్యాతామలతని పుత్రులు పదువు రధికబలులు । సత్యకహరివీరసంజ్ఞులు వేల్పులు త్రిశిఖనామము వాఁడు దేవవిభుఁడు । మునులు జ్యోతిర్వ్యోమముఖ్యులు హరిపుట్టె హరిమేధునకుఁ బ్రీతి హరిణియందు । గ్రహనిబద్ధుఁడయిన గజరాజు విడిపించి । ప్రాణభయము వలనఁ బాపికాచె । హరి దయాసముద్రుఁ డఖిలలోకేశ్వరుఁ డనిన శుకుని జూచి యని యె విభుఁడు ॥ క॥ §నీరాటవనాటులకుం । బోరాటం బెట్లు గలిగెఁ బురుషోత్తముచే । నారాట మెట్లు మానెను । ఘోరాటవిలోని భద్రకుంజరమునకున్ ॥ క॥ మునినాథ యీకథాస్థితి । వినిపింపుము వినఁగ నాకు వేడుక పుట్టెన్ । ఘనియెడఁ గర్ణేంద్రియములఁ । బెనుపండువు సేయుమనము ప్రీతిం బొందన్ ॥ క॥ ఏ కథలయందుఁ బుణ్య । శ్లోకుఁడు హరి సెప్పఁబడును సూరిజనముచే । నా కథలు పుణ్యకథలని । యాకర్ణింపుదురు పెద్ద లతిహర్షమునన్ ॥ వ॥ ఇవ్విధంబునఁ బ్రాయోపవిష్టుండయిన పరీక్షిన్నరేంద్రుండు ¶బాదరాయణి నడిగెనని చెప్పి సభాసదులయిన మునులన వలోకించి సూతుండు పరమహర్షసమేతుండై చెప్పె నట్లు శుకుండు రాజున కిట్లనియె ॥ సీ॥ రాజేంద్ర విను ‖సుధారాశిలో నొకపర్వతము త్రికూటంబనఁ దనరుచుండు । యోజనాయుతమగు నున్నతత్వంబును నంతియ వెడలుపు నతిశయిల్లుఁ । గాంచనాయస్సారకలధౌతమయములై మూఁడు శృంగంబులు మొనసియుండుఁ । దటశృంగబహురత్నధాతుచిత్రితములై దిశలు ఖనభములు దేజరిల్లు । భూరిభూజలతాకుంజపుంజములును । మ్రోసి పఱతెంచు సెలయేటి మొత్తములును । మలఁగి తిరిగెడు దివ్యవిమానములును । జరులఁ గ్రీడించు కిన్నరచయము గలిగి ॥ వ॥ అది మఱియును ⁑మాతులుంగలవంగలుంగ చూత కేతకీభల్లాతకామ్లాతకసరళపనసబదరీవకుళవంజుళవటకుటజకుందకురువకకురంటకకోవిదారఖర్జూరనారికేళసింధువారచందనపిచుమందమందారజంబూజంబీరమాధవీమధూకతాలతక్కోలతమాలహింతాలరసాలసాలప్రియాళుబిల్వా

* పాఠాంతరమందుఁ బృథువసునతని కివ్వఁడను పేరుగల దనివిష్ణుపురాణసమ్మతమైన పాఠము. §నీరాట। జలమందు సంచరించు మొసలి, వనాట। అడవియందు సంచరించెడు ఏనుఁగు, ఘోరాటవి। భయంకరమైన అరణ్యము, భద్రకుంజరము। మదపుటేనుఁగు. ¶బాదరాయణి। వ్యాసపుత్రుఁడైన శుకుని. ‖సుధారాశి। పాలసముద్రము, అయుత। పదివేలు, అయస్సార। శ్రేష్ఠమయిన యినుము, కలధౌత। వెండి, శృంగము। శిఖరము. ⁑మాతులుంగ। మాదీఫలవృక్షములు, లుంగ। పుల్లమాదీఫలవృక్షము, చూత। మామిడిచెట్లు, కేతకీ। మొగలి, భల్లాతక। జీడిచెట్లు, ఆమ్లాతక। అంబాళపుచెట్లు, సరళ। వేగిమ్రాకులు, బదరి। రేఁగుచెట్లు, వకుళ। పొగడమ్రాకులు, వంజుల। నెమ్మిమ్రాఁకులు, వట। మఱ్ఱివృక్షము. కుటజ। కొడిసెచెట్లు కుంద। మొల్లచెట్లు, కురువక। ఎఱ్ఱపువ్వులుగల గోరంటచెట్లు. కురంటక। పచ్చపువ్వులుగల గోరంటలు, కోవిదార। ఎఱ్ఱకాంచనపుచెట్లు, సింధువార। వావిలిచెట్లు, పిచుమంద। వేఁపచెట్లు, జంబూ। నేరేడుచెట్లు, జంబీర। నిమ్మచెట్లు, మాధవీ। వసంతకాలమందు పూచెడు మల్లెచెట్లు, మధూక। ఇప్ప

మలకక్రముకకదంబకరవీరకదళీకపిత్థకాంచనకందరాళశిరీషశింశుపాశోకపలాశనాగపున్నాగచంపకశతపత్రమరువ
కమల్లికామతల్లికాప్రముఖనిరంతరవసంతసమయసౌభాగ్యసంపదంకురితపల్లవితకుసుమితఫలిత లలితవిటప విటపివీరు
న్నివహాలంకృతంబును, మణివాలుకానేకవిమలపులినతరంగిణీసంగతవిచిత్రవిద్రుమలతామహోద్యానశుకపికనికర
నిశితసముచితచంచూపుటనిర్దళితశాఖిశాఖాంతరపరిపక్వఫలరంధ్రప్రవర్షితరసప్రవాహబహుళంబును, గనకమయస
లిలకాసారకాంచనకుముదకల్హారకమలపరిమళమిళితకబళాహారసంతతాంగీకారభారపరిశ్రాంతకాంతాసమాలింగిత
సుమారమత్తమధుకరవిటసముదయసమీపసంచారసముదంచితశకుంత కలహంస కారండవ జలకుక్కుట చక్రవాకక
లకంఠబకబలాహకకోయష్టికముఖరజలవిహంగవిసరవివిధకోలాహలబధిరీభూత భూనభోంతరాళంబును, తుహినకర
కాంతమరకతకమలరాగవజ్రవైడూర్యనీలగోమేధికపుష్యరాగమనోహరకనకకలధౌత మణిమయానేక శిఖరతటదరీ
విహారమాణ విద్యాధరవిబుధసిద్ధచారణ గంధర్వగరుడకిన్నరమిథునసంతతసరససల్లాపసంగీతప్రసంగ మంగళాయత
నంబును, గంధగజగవయగండభేరుండఖడ్గకంఠీరవశరభశార్దూలచమరశల్యభల్లసారంగసాలావృకవరాహమహిషమ
ర్కటమహోరగమార్జాలాదినిఖిలమృగనాథసమూహసమరసన్నాహసంరంభసంచకితశరణాగతశమనకింకరంబు
నునై యొప్పునప్పర్వతసమీపంబునందు ॥ క ॥ *ఝిల్లీభల్లులులాయక । భల్లుకఫణిఖడ్గగవయబలిముఖచమరీ। ఝిల్లీహ
రిశరభకరికిటి। మల్లాద్భుతకాకఘూకమయమగునడవిన్ ॥ శా ॥ అన్యాలోకనభీకరంబులు ✻జితాశానేకపానేకముల్ ।
వన్యేభంబులు గొన్ని మత్తత§ననువ్రజ్యావిహారాగతో। దన్యత్వంబున భూరిభూధరదరీద్వారంబులందుండి సా । జన్య
క్రీడలనీరుగాలివడిఁగాసారావగాహార్థమై ॥ గీ ॥ అంధకారమెల్ల ‡‡నద్రిగుహాంతర।వీథులందుఁబగలు వెఱచి డాఁగి।
¶యెదురు వేచిసంధ్యనెదురుకొనువృద్ధితనున్న। వెడలెననఁగ గుహలు వెడలెఁగరులు॥ క ॥ ;తలఁగవు కొండలకైనను। మలఁగవు సిం
గములకైన మార్కొనఁగడిమిం। గలఁగవు పిడుగులకైనన్। నిలబలసంపన్నవృత్తి నేనుఁగు గున్నల్ ॥ సీ ॥ పులులమొత్తంబులు
పొదరిండ్లలో దూరు ఘోర †భల్లూకముల్ గుహలు సొచ్చు। భూదారములు నేలబొఱియలలోఁ డాఁగు హరిదంతములకేగు హ
రిణచయము। మడువులఁ జొరఁబాఱు మహిషసంఘంబులు గండశైలంబులఁ గపులు ప్రాఁకు। వల్మీకములు సొచ్చు వనభుజం
గంబులు నీలకంఠంబులు నింగికేగ। వెఱచి చమరీమృగంబులు విసరువాల। చామరంబుల విహరణశ్రమము వాయ। భయ
దపరిహేలవిహరించు భద్రకరులు। గాలివారి నమాత్రానజాలిఁ బొంది ॥ క ॥ మదగజదానామోదము । కదలని తమక
ములఁ ద్రావి కడుపులు నిండన్। ✶బొదలుచు మమ్మెదకొదమలు। కదుపులు జుంజుమ్మటంచు గానము సేసెన్ ॥ క ॥ ❁తేఁటి యొ
కటి యొరుప్రియకును। మాటికిమాటికిని నాగమదజలగంధం। బేఁటికి యనితనుఁ బొందెడి। బోఁటికి నందిచ్చు నిండుబోటిత
నమునన్ ॥ క ॥ అంగీకృతరంగన్మా।తంగీమదగంధమగుచుఁ దద్దయు వేడ్కన్। సంగీతవిశేషంబుల। భృంగీగణమొప్పె ⁂మా
నుపెట్టెడి మాడ్కిన్ ॥ క ॥ వల్లభులు వారుమున్నడ। వల్లభయని ముసరిరేని వారణదానం। బొల్లక మధుకరవల్లభు। లుల్లంబు

---

చెట్లు, తాల।తాటిచెట్లు, తక్కోల।తక్కోలవృక్షము, తమాల।కానుగుచెట్లు, భూరిభూజలతాకుంజపుంజములును॥ భూరి।అనేకములైన. భూజా। వృక్షములయొక్క, లతా।తీఁగెలయొక్క, కుంజ।పొదరిండ్లయొక్క, పుంజములును।సమూహములును, పఱతెంచు।వచ్చుచున్న, అనఁగాం ప్రవహించుచున్న, దివ్యవిమానములును।దేవతారథములును, హింతాల।గిఱకతాడిచెట్లు, రసాల।తియ్యమామిడిచెట్లు, సాల।ఏపెచెట్లు, ప్రియాళు।ప్రేంకణపుచెట్లు, ఆమలక।ఉసిరికెచెట్లు, క్రముక।పోఁకచెట్లు, కరవీర।గన్నేరుచెట్లు, కపిత్థ।వెలగచెట్లు, కాంచన।సంపెఁగచెట్లు, కందరాళ।కలజువ్వి, శిరీష।దిరిసెన, శింశుప।ఇరుగుడుచెట్లు, పలాశ।మోదుగుచెట్లు, నాగ।సురపొన్న, పున్నాగ।పొన్నచెట్లు, చంపక।కనకసంపెఁగ, శతపత్ర।తామరతీఁగెలు, మతల్లికా।శ్రేష్ఠము, పల్లవిత।చిగిర్చినట్టి, కుసుమిత।పుష్పించినట్టి, ఫలిత।ఫలించినట్టి, లలిత।కోమలములైన, విటప।కొమ్మలుగల, విటపి।వృక్షములయొక్క, నివహ।గుంపుచేత, తరంగిణి।నది, సంగత।కూడుకొనిన, విద్రుమలతా।పగడపుతీఁగెలు, శుక।చిలుక, పిక।కోకిల, నికర।గుంపు, నిశిత।వాడిమిగల, సముచిత।మిగులనొప్పుచున్న, చంచూపుట।ముక్కులచేత, నిర్దళిత।బ్రద్దలు చేయబడిన, శాఖి।వృక్షములయొక్క, శాఖ।కొమ్మలయొక్క, అంతర।మధ్యప్రదేశములయందున్న, బహుళంబును।అధికమైనదియును, సలిల।జలము, కాసార।కొలను, తుహినకరకాంత।చంద్రకాంతమణులు. భల్ల।ఖడ్గమృగములు, సారంగ।లేడి, సాలావృక।అడవికుక్కలు।లేక నక్కలు, సమర।యుద్ధము, సంరంభ।సంభ్రమము, సంచకిత।భయపెట్టబడిన, శమనకింకర।యమదూతలు. •ఝిల్లీ।అడవిపిల్లులు, భల్లు।ఒకజాతియెలుగుబంట్లు లులాయక।అడవిదున్నలు, భల్లుక।ఎలుఁగుగొడ్డు, గవయ।కురుబోతు, బలిముఖ।కోఁతులు, ఝిల్లీ।చిమ్మటలు- కిటి।పంది, మల్ల।శ్రేష్ఠము. ✻జితాశానేకపానేకముల్।జయింపఁబడినదిగ్గజములుదాయముగల, వన్యేభంబులు।అడవియేనుఁగులు. అనువ్రజ్యావిహార।అనుసరణరూపమయినవిహారము చేత- ఆగత।వచ్చిన- ఉదన్యత్వంబునన్।దప్పిచేత. దరీ।గుహ, కాసారావగాహార్థమై।కొలఁకునందు స్నానము చేయుటకొఱకై,—— ‡‡అద్రి।పర్వతము. ¶ఎదురువేచి।సమయము చూచి, §తలఁగవు।తొలఁగవు, మలఁగవు।వెనుకఁదీయవు, కడిమి।పరాక్రమము. †భల్లూక।ఎలుగుబంటి, భూదారము।పంది, హరిదంతములు।దిక్కులచివరలు, హరిణచయము।లేడిగుంపు- వల్మీకము।పుట్ట- భుజంగము।సర్పము- నీలకంఠము।నెమలి- నింగికేగ।ఆకాశమునకెగురుట- దానామోదమున్- మదధారలవాసనను. ✶పొదలుచున్।బలిసినవై, కొదమ।శిశువు, కదుపు।గుంపు, ❁తేఁటి।తుమ్మెద, బోఁటితనమునన్।జాణతనముచేత. ⁂మానుపెట్టెడుమాడ్కిన్।నిశ్చేష్టులగునట్లు.

నఁ బొందిరెల్లయుల్లాసంబుల్ ॥అప్పుడు॥ మ॥ *కలభంబుల్ చరలాడుఁ బల్వలములాఘ్రాణించి మట్టాడుచున్ |ఫలభూజంబులురాయుచుంజివురుజొంపంబుల్వడిన్మేయుచుం|బులులన్గాఱెనుపోఁతులన్మృగములన్బోనీక శిక్షించుచున్ |గోలఁకుల్లోఁ జొచ్చికలంచుచున్గిరులపై గ్రొబ్బిళ్లుగోరాడుచున్ ॥ క॥ తొండంబుల మదజలవృత|గండంబుల గుంభములను ఘట్టన సేయం| గొండలు దలక్రిందై పడు|బెండుపడున్దిశలు సూచి బెగడున్నగముల్ ॥ క॥ ఎక్కడఁ జూచిన లెక్కకు| నెక్కువ వైయడవినడచు నిభయూథములో| నొక్క కరినాథుఁ డెడ తెగి| చిక్కె నొక §కరేణుకోటి సేవింపంగన్ ॥ వ॥ ఇట్లు వెనుకముందఱ నడచు నుభయపార్శ్వంబులఁ ¶తృషార్దితంబులై యరుగుదెంచు నేనుంగుగములం గూడికొని తెఱంగుఁదప్పి తొలంగుపడి యాశ్వరాయత్తంబునఁ జిత్తంబు సంవిత్తంబుగాకుండుటం జేసి తానును దనకరేణుసముదయంబును నొక్క తెఱువై పోవుచు॥ సీ॥ పల్వలంబుల లేఁతపచ్చికమచ్చికఁ జెలులకందిచ్చు ‖ నచ్చికము లేక |నివురుజొంపములఁ గ్రొవ్వేలయుపూఁగొమ్మలఁ బ్రాణవల్లభలకుఁ బాలువెట్టు|ఘనదానశీతలకర్ణతాళంబుల దయితలచెమటార్చు తనువులరసి|మృదువుగాఁ గొమ్మల మెల్లనె గళములు నివురుచుఁ బ్రేమతో నెఱపు గఱపు|పిఱుదుచక్కట్లడగ్గరి ప్రేమతోడ| డాసిమూర్కొని దివికిఁ దొండంబు సాఁచు| వెదవివేకించుఁ గ్రీడించు విశ్రమించు|మత్తమాతంగమల్లంబు మహిమతోడ॥ సీ॥ తనకుంభములపూర్ణతకు డిగ్గియువతుల కుచములు పయ్యెదకొంగులీవ| తనయానగంభీరతకుఁ జాలకబలలయానంబులందెలనండఁగొనఁగ|దనకరశ్రీఁ గనితలఁగి బాలలవిఱుదొడలు మేఖలదీప్తిఁ దోడుఁ బిలువఁ|దనదంతరుచికోటి తరుణులనగవులు ముఖచంద్రదీప్తుల ముసుకు దిగువఁ|దనదు లావణ్యరూపంబుఁ దలఁచిచూడ|నంజనాభ్రముకపిలాదిహరిదిభేంద్ర|దయితలందఱుఁ దన వెంటఁ దగిలి నడువ| కుంభివిభుఁ డొప్పె నొవ్వలకుప్పఁ బోలి॥ వ॥ మఱియు నానాగహనవిహారణమహిమతో మదగజేంద్రంబు మార్గంబుఁ దప్పి †పిపాసాపరాయత్తచిత్తంబున మత్తకరేణువులమొత్తంబునుం దానునుం జనిచని॥ మ॥ అటఁ గాంచెన్ ౼కరిణీవిభుండు నవఫుల్లాంభోజకల్హారమున్నటదిందిందిరవారమున్నమరమీనగ్రాహదుర్వారము| న్వటహింతాలరసాలసాలసుమనోవల్లీకుటీతీరము| న్జటులోద్ధూతమరాళచక్రబకసంచారంబుఁ గాసారమున్ ॥ వ॥ ఇట్లనన్యపురుషసంచారంబును నిష్కళంకంబైన యప్పంకజాకరంబుఁ బొడగని॥ సీ॥ ౼తోయజగంధంబుదోఁగినచల్లనిమెల్లనిగాడ్పుల మేనులలరఁ|గమలనాళాహారవిమలవాక్కలహంసరవములు సెవులపండువులు సేయ| ఫుల్లదిందీవరాంభోరుహామోదంబు ఘ్రాణరంధ్రంబుల గారవింప|నిర్మలకల్లోలనిర్గతాసారంబు వదనగహ్వరముల వాడుదీర్పఁ|ద్రిజగదఖినవసౌభాగ్యదీప్తమైన|విభవమీక్షణములకును విందుసేయ|నఱిగి పంచేంద్రియవ్యవహారములను| మఱచి మత్తేభయూథంబు మడుగుఁ జొచ్చె॥ క॥ తొండంబులఁ బూరించుచు|గండంబులఁ జల్లుకొనుచు గళగళరవముల్ | మెండుకొన ౼వలుదకడుపులు|నిండన్వేదండకోటి నీరుం ద్రావెన్ ॥అప్పుడు॥ మ॥ ౼ఇభలోకేంద్రుఁ డుహస్తరంధ్రములనీ రెక్కించి పూరించి చం|డభమార్గంబున కెత్తినిక్కి వడి నుడ్డాడించి పైఁ జిమ్మ నా|రభటిన్నీరములోనఁ బెల్లెగసిన గ్రాహపాఠీనముల్ |నభమందాడెడు మీనకర్కటములన్ బట్టెన్సురల్ ప్రాన్పడన్ ॥ మఱియునగ్గజేంద్రంబు నిరర్గళవిహారంబున॥ సీ॥ ౼కరిణీకరోజ్ఝితకంకణచ్ఛటఁ దోఁగి సెలయేటి నీలాద్రి చెలువుఁ దెగడు|హస్తినీహస్తవిన్యస్తపద్మంబుల వేయుగన్నులవాని వెఱపు సూపుఁ| గలభీసముత్కీర్ణకల్హారరజమునఁ గనకాచలేంద్రంబు ఘనతఁ దాల్చుఁ|గుంజరీపరిచితకుముదకాండంబుల ఫణిరాజమండనప్రభ వహించు|మదకరేణులముక్తమౌక్తికశు

*కలభంబుల్ |ముప్పదియేండ్లయేనుఁగులు. చరలాడున్ |సంచరించును, పల్వలంబులు |పడియగుంటలు, మట్టాడుచున్ |చెల్లాచెదరుచేయుచు, భూజంబులు |వృక్షములు- జొంపము |సమూహము- గ్రొబ్బిళ్లుగోరాడుచున్ |ఉన్నతప్రదేశములను కొమ్ములతోఁ జిమ్ముచు. §కరేణుకోటి| ఆఁడుయేనుఁగుల గుంపు. ¶తృషార్దితంబులై |దప్పిచేత తొందరపెట్టఁబడినవై- తెఱంగుదప్పి |దారిదప్పి- తొలంగుపడి |చెదిరిపోయి. ‖అచ్చికము |తక్కువ- దయిత |ప్రియురాలు. †పిపాసాపరాయత్త॥ పిపాసా |దప్పికి- పరాయత్త |మిగుల నధీనమైన. ౼కరిణీవిభుండు |గజేంద్రుఁడు- నవఫుల్లాంభోజకల్హారమున్ ॥ నవఫుల్ల |క్రొత్తగాఁ బూచిన- అంభోజ |పద్మములును- కల్హారమున్ |కలువలును గలదియును- నటదిందిందిరవారమున్ ॥ నటత్ |నృత్యమాడుచున్న- ఇందిందిర |తుమ్మెదలయొక్క- వారమున్ |సమూహము గలదియును- కమఠ |తాబేళ్లు- గ్రాహ |మొసలి- దుర్వారమున్ |నివారింపఁగూడనదియును- వల్లీకుటీ |పొదరిల్లు. కాసారము |కొలను, ౼తోయజ |పద్మము- తోఁగి |మునిఁగి. ౼వలుద |గొప్ప. ౼ఇభలోకేంద్రుండు |గజేంద్రుఁడు- భమార్గము |ఆకాశము. నక్ర |ఏనుఁగును భక్షించెడు జలజంతువు- గ్రాహ |ఏదేని శరీరమునకుఁ జుట్టికొని ప్రాణహింసఁ జేయు మహామత్స్యము- పాఠీనము |మత్స్యము- ప్రాన్పడన్ |నిశ్చేష్టితులగుచుండఁగాను. ౼కరిణీకరోజ్ఝితకంకణచ్ఛటఁ దోఁగి॥ కరిణీ |ఆఁడుయేనుఁగులయొక్క- కర |తొండములనుండి- ఉజ్ఝిత |బయలు వెడలిన- కంకణ |జలబిందువులయొక్క- ఛటన్ |సమూహమందు- తోఁగి |మునిఁగి- హస్తినీహస్తవిన్యస్త॥ హస్తినీ |ఆఁడుయేనుఁగులయొక్క- హస్త |తొండములచేత- విన్యస్త |ఉంచఁబడిన. కలభీ |ఆఁడుయేనుఁగులచేత- సముత్కీర్ణ |విస్తరింపఁజల్లఁబడిన- కల్హారరజమునన్ |కలువపూవులపుప్పొడిచేత- కుంజరీ |ఆఁడుయేనుఁగు- పరిచిత |ఉంచఁబడిన- కుముదకాండంబులన్ |కలువతూఁడులచేత- ఫణిరాజమండన |శివునియొక్క- ప్రభవహించున్ |కాంతివహించును.

క్తుల । మెఱుఁగు మొగులతోడ మేలమాడు । నెదురులేని గరిమ నిభరాజమల్లంబు । వనజగేహకేళి వ్రాలు నపుడు ॥ వ॥ మఱియు నాసరోవరలక్ష్మి మదగజేంద్రవివిధవిహారవ్యాకులితనూతనలక్ష్మీవిభవయై *యనంగవిద్యానిరూఢపల్లవప్రబంధపరికంపితశరీరాలంకారయగు కుసుమకోమలియునుంబోలె వ్యాకీర్ణచికురమత్తమధుకరనికరయు, విగతరసవదనకమలయు, నిజస్థానచలితకుచరథాంగయుగళయు, లంపటితజఘనపులినతలయునై యుండె నంత ॥ సీ॥ భుగభుగాయతభూరి ‡బుద్బుదచ్ఛటలతోఁ గదలుచు దివికి భంగంబు లెగయ । భువనభయంకరపూత్కారరవమున ఘోరనక్రగ్రాహకోటి బెగడ । వాలవిక్షేపమున ఘోరజంఝానిలవశమున ఘుమఘుమావర్తమడరఁ । గల్లోలజాలసంఘట్టనంబులఁ దటీతరులు మూలంబుతోఁ ధరణిఁ గూల । ¶సరసిలోనుండి పొడగని సంభ్రమించి । యుదరి కుప్పించి లంఘించి హుంకరించి । భానుఁ గబళించు స్వర్భాను పగిది । నొక్కమకరేంద్రుఁ డిభరాజు నొడిసిపట్టె ॥ క॥ వడిఁ దప్పించి కరీంద్రుఁడు । నిడుదకరం బెత్తి వైవ నీరాటంబుం । ¶బొడవడఁగినట్లు జలములఁ । బడి కడువడిఁ బట్టెఁ బూర్వపదయుగళంబుల్ ॥ చ॥ పదములఁ బట్టినం దలకుపాటొకయింతయు లేక శూరతన్ । మదగజవల్లభుండు ధృతిమంతుఁడు దంతయుగాంతఘట్టనన్ । జెదరఁగఁ జిమ్మె నమ్మకరి చిప్పలు పాములు దప్పనుప్పరన్ । వదలి §జలగ్రహంబు కరివాలము మూలముఁ జీరె గోరులన్ ॥ క॥ కరిఁ దిగుచు మకరి సరసికిఁ । గరి దరికిని మకరిఁ దిగుచుఁ †గరకరిబెరయన్ । గరిమకరి మకరికిం గరి । భరమున నిట్లు తలకుతలకు బలుదిరిపడన్ ॥ వ॥ ఇట్లు కరిమకరంబులు రెండును నొండొండసముద్దండతండంబులై తలపడి ని₹లోకాలోకనభీకరంబులయి యన్యోన్యవిజయశ్రీవశీకరంబులై సంక్షోభితకమలాకరంబులై హరిహరియును గిరిగిరియును నుండాకపీలు తివియక పెనంగు తెఱంగున నీరాటంబయిన పోరాటం బెట్టుచు వెలికి లోనికిం దిగుచుచుఁ గోలంకు కలంకంబందఁ గడువడి నిట్టట్టు పడి తడఁబడక బుడబుడానుకారంబులై భుగులు భుగుల్లను చప్పుళ్లతో నురువులు గట్టుచు జలంబు లుప్పరంబున కెగయం జప్పరించుచుఁ దప్పక వదనగహ్వరంబుల నప్పళించుచు నిశితనితాంతదురంతదంతకుంతంబుల నింతింతలు తునియలై నెప్పళంబునఁ బునుకచిప్పలు కుదుళ్లు దప్పి రక్తంబులు గ్రమ్ముదేర హుమ్మని యొక్కుమ్మడిం జిమ్ముచు నితరేతరసమాకర్షణంబులం గదలక పదంబులు మొదలిపట్టు వదలక కుమరై యుండుచుఁ బరిభ్రమణవేగంబున జలంబులం దిఱుగుచు మకరకమఠకర్కటగండకమండూకాది సలిలనిలయంబులు ప్రాణంబులు క్షీణంబులుగా నొకటొకటిం దాఁకుర భసంబున నిక్కలువడ ముగ్గుం బ్రొక్కుచు మెండు చెడి బెండుపడి నాచు గుల్లచిప్పతండంబులఁ బరస్పరతాడనంబులకు నడ్డంబుగా నొడ్డుచు నోలమాసఁగొనక గెలుపుతలంపులు బెట్టిదంబులై రెట్టింప నహోరాత్రంబులుం బోలెఁ గ్రమక్రమవిజృంభమాణంబులై బహుకాలకలహవిహారంబులై నిర్గతనిద్రాహారంబులై యవక్రపరాక్రమఘోరంబులై పోరుచున్న సమయంబున ॥ క॥ ‡జవమును జలమును బలమును । వివిధములుగఁ బోరుకరటివీరతకు భువిన్ । దివి మకరమీనకర్కట । నివహములొక్కటన మిత్రనిలయము బొందెన్ ॥ శా॥ ‡ఆటోపంబునఁ జిమ్ము రొమ్ముగలవజ్రాభీలదంతంబులన్ । దాటించున్ మెడఁ జుట్టి పట్టి హరి దోర్దండాభ శుండాహతిన్ । నీటన్ మాటికి మాటికిం దిగువఁగా నీరాటము న్నేటి పోరాటం దోటమిపాటుఁ జూపుట కరిన్యాయంబు వాచాటమై ॥ అప్పుడు ॥ గీ॥ మకరితోడఁ బోరు మాతంగవిభునినొ । క్కరుని డించిపోవఁ గాళ్లురాక । కోరి చూచుచుండెఁ గుంజరీయూథంబు । మగలు తగులుగారె మగువలకును ॥ అంత ॥ గీ॥ ‡జీవనంబు తనకు జీవనంబై యుంట । నలవు బలము నంతకంత కెక్కి । మకర మొప్పెడు స్సేమ త్తేభమల్లంబు । బహుళపక్షసీతభాను పగిది ॥ మ॥ ఉరుకుంభయుగంబుపై హరి క్రియన్ హుమ్మంచుఁ బాదంబులం । దిఱుగుం గంఠము వెన్నుఁదన్ని నెగయున్ హేలాగతిన్ వాలముం । జఱుచున్ స్రుక్కఁగఁ దాఁకు ముంచు మునుఁగున్ శల్యంబులుం దంతముల్ । వ్రీలంగన్ వ్రేయుచుఁ బొంచి పొంచి కదియున్ వేదండయూథోత్తమున్ ॥ మ॥ పొడగానంబడకుండఁ డాఁగు వెలికిం బోవంగఁ దా నడ్డమై । పొడచూపుం జరణంబులం బెనఁగొ

---

*అనంగవిద్యానిరూఢ । కామశాస్త్రమునందు నేర్పరియయిన - పల్లవ । విటకాని యొక్క - ప్రబంధ । నాగరాఖ్యకుక్కుటాదిబంధముల చేత - పరికంపితశరీరాలంకారయగు । చలింపఁజేయఁబడిన శరీరాలంకారము గల - కుసుమకోమలియుంబోలెన్ । స్త్రీవలెనె - వ్యాకీర్ణచికురమత్తమధుకరనికరయు । అంతట వ్యాపించియున్న మదించిన తుమ్మెదగుంపుల నెడు వెండ్రుకలు గలదియును - రథాంగ । చక్రవాకపక్షి - లంపటితజఘనపులినతలయును ॥ లంపటిత । గాసిపెట్టఁబడిన - జఘన । పిఱుదులను - పులిన । ఇసుకదిబ్బల యొక్క - తలయున్ । ప్రదేశము గలదియును. ‡బుద్బుదఘటలతోన్ । బుడగల గుంపులతో - దివికిన్ । ఆకాశమునకు - భంగంబులు । అలలు. ¶సరసి । కొలను - స్వర్భాను । రాహువు. ¶పొడవడఁగినట్లు । చచ్చినట్లు. §జలగ్రహంబు । మొసలి. †కరకరిబెరయన్ । బలాత్కారముగాను. ₹లోకాలోకన । లోక । జనుల యొక్క - ఆలోకన । చూపులకు - పిఱుతివియక । వెనుకఁదీయక - కుంత । బల్లెము - పునుకచిప్పలు । తలపుఱ్ఱెలు - పరిభ్రమణ । సవ్యాపసవ్యములుగాఁ దిరిగెడు - రభసంబున । వేగము చేత - ఓలమాసఁగొనక । వెనుకఁదీయక. ‡జవము । వేగము - చలము । పంతము - ఆటోపము । గర్వము - ఱొమ్ముగలన్ । వక్షము బ్రద్దలగునట్లుగాను - అభీల । భయంకరము. ‡జీవనంబు । జలము - బ్రతుకడము - అలవు । యుక్తి - సీతభానుపగిది । చంద్రునివలె.

నుంబో రాకరా రాక బెగ్గడిలి పంపాలఁ గరాటు లేచుచుఁ జెనుఁ ఘాటించుచు లంఘించు మబల్విడి జీఱుం దలఁగుమ్మలంగు నొడియు నేర్పి ధింమఁ గ్రోధించుచున్॥ వ॥ ఇట్లు విస్మితనక్రచక్రంబై నిర్వక్రవిక్రమంబున నల్పహృదయ అజ్ఞానదీపంబు నతిక్రమించు మహామాయాంధకారంబునుం బోలె ననంతకంతకును త్సాహకలహసన్నాహబహువిధజలావగాహంబయిన గ్రాహంబున మహాసాహసంబున॥ శా॥ పాదద్వంద్వము నేలమోపి పవనున్ బంధించి పంచేంద్రియోన్మాదంబుం బరిమార్చి బుద్ధిలతకున్ మారాకు హత్తించి నిర్భేదబ్రహ్మపదావలంబనగతిం బ్రీడించు యోగీంద్రు మర్యాదన్నక్రము విక్రమించెఁ గరిపాదాక్రాంత నిర్వక్రమై॥ గీ॥ * వనగజంబు లెగుడు వనచారిఁ బొడగని వనగజంబ కాన వజ్రిగజము వెల్లనైన సురేంద్రు వైచి సుధాంధులఁ బట్టు పట్టనీక బయలు వ్రాకె॥ ఉ॥ ‖ఊహ గలంగి జీవనపుటోలమునం బడి పోరుచున్ మహామోహలతానిబద్ధపదమున్ విడిపించుకొనంగలేక సందేహముఁ బొందు దేహిక్రియ దీనదశన్ గజముండు భీషణగ్రాహదురంతదంతపరిఘట్టితపాదఖురాగ్రశల్యమై॥ ఇవ్విధంబున॥ క॥ అలయక ¶సొలయక వేసట నొలయక కరిమకరితోడ నుద్దండతరా త్రులు సంధ్యలు దివసంబులు సలిపె నొక్కొక వేయు సంవత్సరముల్॥ మ॥ పృథుశక్తిన్ గజమా జలగ్రహముతోఁ బెక్కేండ్లు పోరాడి సంశిథిలంబైతన లావు వైరిబలమున్ జింతించి మిథ్యామనోరథమింకేటికిఁ దీని గెల్వసరి పోరం జాలరాదంచు నవ్యథమై యిట్లను పూర్వపుణ్యఫలదివ్యజ్ఞానసంపత్తితోన్॥ శా॥ ఏ రూపంబున దీని గెల్తు నిటమీఁదే వేల్పుఁ జింతింతు నే వ్వారిం జీరుదు నెవ్వరడ్డ మిఁక నివ్వారిప్రచారోత్తముల్ వారింపం గలవార లెవ్వ రఖిలవ్యాపారపారాయణుల్ లేరే మ్రొక్కెద నిక్కనిసుకమాలిన మొఱాలింపం బ్రపుణ్యాత్మకుల్॥ శా॥ నా†నానేకపయూథముల్ వనములోనం బెద్దకాలంబు సన్మానింపన్ దశలక్షకోటికరిణీనాథుండనై యుండి మద్దానాంభఃపరిపుష్టచందనలతాంతచ్ఛాయలం దుండలేకీ నీరాశికి నేల వచ్చితి భయం బెట్లోకొ దేవేశ్వరా॥ ఉ॥ ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపల నుండు ‡లీనమై యెవ్వనియందు డిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వముఁ దానయైనవాఁ డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్॥ క॥ §ఒకపరి జగములు వెలినిడి యొకపరి లోపలికిఁ గొనుచు నుభయముఁ దానై సకలార్థసాక్షియగు న య్యకలంకుని నాత్మమూలు నర్థిఁ దలంతున్॥ క॥ లోకంబులు లోకేశులు లోకస్థులుఁ దెగినఁ దుది నలోకంబగు పెంజీఁకటి కవ్వల నెవ్వఁ డేకాకృతి వెలుఁగు నతని నే సేవింతున్॥ క॥ నర్తకునిభంగిఁ బెక్కగు మూర్తులతో నెవ్వఁ డాడు మునులు దివిజుల్ గీర్తింప నేర రెవ్వని వర్తన మొరు లెఱుఁగ రట్టివాని నుతింతున్॥ గీ॥ ముక్తసంగులైన మునులు ✱దిదృక్షులు సర్వభూతహితులు సాధుచిత్తు లసదృశవ్రతాఢ్యులై కొల్తు రెవ్వని దివ్యపదము వాఁడు దిక్కు నాకు॥ సీ॥ ‡భవము దోషంబు రూపంబు కర్మంబు నాహ్వయము గుణము లెవ్వనికి లేక జగముల గలిగించు సమయించు కొఱకునై నిజమాయ నెవ్వఁడిన్నియును దాల్చు నా పరేశునకు ననంతశక్తికి బ్రహ్మకిద్ధరూపికి రూపహీనునకును జిత్రచారునకు సాక్షికి నాత్మరుచికిని బరమాత్మునకుఁ బరబ్రహ్మమునకు। మాటల నెఱుకల మనముల జేరంగరాని శుచికి సత్త్వగమ్యుఁ డగుచు నిపుణుఁడైనవాని నిష్కర్మతకు మెచ్చు వానికే నొనర్తు వందనములు॥ సీ॥ శాంతున ◆కపవర్గసౌఖ్యసంవేదికి నిర్వాణభర్తకు నిర్విశేషునకు ఘోరునకు మూఢునకు గుణధర్మికి సౌమ్యునకధికవిజ్ఞానమయున కఖిలేంద్రియద్రష్టకధ్యక్షునకు బహుక్షేత్రజ్ఞునకు దయాసింధుమతికి మూలప్రకృతికాత్మమూలునకును జితేంద్రియజ్ఞాపకునకు దుఃఖాంతకృతికి నెఱినసత్యంబు నెడినీడతో వెలుఁగుచు నుండు నేకునకుఁ బరాత్పరునకు। నిఖిలకారణునకు నిష్కారణునకు నమస్కరింతు నన్ను మనుచుకొఱకు॥ క॥ యోగాగ్నిదగ్ధకర్ములు యోగీశ్వరు లే మహాత్మునొండెఱుఁగక స ద్యోగవిభాసితమనముల బాగుగ వీక్షింతు రట్టి పరము భజింతున్॥ సీ॥ సర్వాగమామ్నాయజలనిధికిని బవర్గమయునికి సుత్తమునకు మందిరునకు సకలగుణారణిచ్ఛన్నబోధాగ్నికిం దనయంత రాజిల్లు ఘనునకును గుణలయోద్దీపితగురుమానసునకు సంవర్తితకర్మనిర్వర్తితునకు దిశలేని నాబోటి పశువుల పాపంబు లడఁచువానికి సమస్తాంతరాత్ముఁడై వెలుంగువానికి నచ్ఛిన్నునకు భగవంతునకుఁ దనూజపశుదేహదారసక్తులయినవారి కందఁగరాని వానికాచరింతు వందనములు॥ మఱియును॥ సీ॥ వరధర్మకామార్థవర్జితకాములై విబుధు లెవ్వాని సేవించి యిష్ట గతిఁ బొందుదురు చేరి కాంక్షించువారికి నవ్యయదేహమిచ్చు నె

• వనగజంబుల్ - అడవియందు సంచరించెడు గజేంద్రములు. - ఎగుడు వనచారిన్ - బాధించుచున్న మొసలిని. - పొడగని - చూచి. - వజ్రిగజము - ఐరావతము. వనగజంబ కానన్ - జలమందు ద్భవించిన యేనుఁగు గాఁబట్టి. - వెల్లనై - భయముచేత తెలతెలపోయినదై. - సురేంద్రు వైచి - ఇంద్రుని గ్రిందఁబడఁద్రోసి. - సుధాంధులన్ - దేవతలనొక్క_. - పట్టుఁబట్టనీక - బంధనమునకు లోఁబడక. - బయలు వ్రాకెను - ఆకసమునకుఁ బరుగెత్తెను. ‖ఓలము - మునుఁగు - చాటు. ¶సొలయక - నిస్త్రాణపడక. † అనేకపయూథములు - ఏనుఁగుల గుంపులు. లతాంత - పుష్పము. ‡లీనమై - కనుపడనిదై. డిందున్ - లయమగును. § ఒకపరి - ఒకతేప. ✱దిదృక్షులు - భగవంతునిఁ జూడ నిచ్ఛగలవారు. ‡భవము - జన్మము. ◆అపవర్గసౌఖ్యసంవేదికిన్ - మోక్షసుఖము నెఱిఁగినవానికి. నిర్వాణభర్తకున్ - మోక్షనాయకునికి.

వ్వాఁడు గరుణ ముక్తాత్ము లెవ్వని మనుకొని చింతింతు రాఁ దనార్థి సాగ్నులగుచు, నేకాంతు లెవ్వని నేమియుఁ గోరక భ
ద్రచరిత్రంబుఁ బాడుచుండు రానందాంబునిధి మగ్నులై యొక్కరుఁడె వ్యక్తుఁడై ధ్యాతృ యోగ ... బూర్జునున్న తాల్మి, బ్రహ్మాదయిన
వానిం బరమునిఁ నతీంద్రియు ననుస్థూలసూక్ష్ము నే భజింతు. అనిమఱియు నల్లని ... చె. సీ॥ *పావకుండర్చుల భానుండు దీ
ప్తుల నెట్లు గ్రక్కుచు డిందుచుండు నెల్లవడంతు రాక్రియ నాత్మకరావళిచే బ్రహ్మాదుల వేల్పుల నఖిలజంతు గణముల జగముల ఘన
నామరూపభేదములతో మెఱయించి తగనడంచు నెవ్వఁడు మనము బుద్ధీంద్రియములు దానై గుణసంప్రవాహంబుఁ బర
పు స్త్రీ నపుంసక పురుషమూర్తియును గాక తిర్యగమర నరాది మూర్తియును గాక కర్మగుణభేద సదసత్ప్రకాశి గాక వెను
కఁ నన్నియును దానగు విభుఁ దలంతు॥ క॥ కలఁడందురు దీనుల యెడఁ గలఁడందురు పరమయోగిగణముల పాలం గలఁడందు రన్ని
దిశలను గలఁడు కలం డనెడువాఁడు గలఁడో లేఁడో॥ సీ॥ కలుగఁడే నా పాలి కలిమి సందేహింపఁ గలిమి లేములు లేక కలుగు
వాఁడు నాకడ్డపడ రాఁడె నలిన సాధువులచేఁ బడిన సాధుల కడ్డపడెడువాఁడు। చూడఁడే నా పాటుఁ జూపులఁ జూడక చూచు
వారలఁ గృపఁ జూచువాఁడు లీలతో నా మొఱాలింపఁడే మొఱఁగుల మొఱ లెఱుంగుచుఁ దన్ను మొఱఁగువాఁడు నఖిలరూపులు
దనరూపమైనవాఁడు నాదిమధ్యాంతములు లేక యడరువాఁడు భక్తజనముల దీనులపాలివాఁడు వినఁడె చూడఁడె తలఁపఁ
డె వేగ రాఁడె॥ క॥ విశ్వకరు విశ్వదూరుని విశ్వాత్ముని విశ్వవేద్యు విశ్వు నవిశ్వుం గా శ్వతు నజు బ్రహ్మప్రభు నీశ్వరుఁ బరమ
పురుషు నే భజియింతున్॥ వ॥ అని పలికి తదనంతరంబున నగ్గజేంద్రుండు ఈశ్వర సన్నిధానంబు గల్పించుకొని యిట్లనియె॥ శా॥ లా
వొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్ ఠావుల్ దప్పెను మూర్ఛ వచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమంబయ్యె
డిన్ నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపందగున్ దీనునిన్ రావే యీశ్వర కావవే వరద సంరక్షించు భద్రాత్మకా॥ క॥ వినుదం
ట జీవుల మాటలు జనుదెంచెద రనుచుఁ జాటు జగదీశ్వరుఁడున్ యనుదినము విని వినక సర్వము గనుఁ గొనుచు సందేహమయ్యెఁ గరుణావార్థీ॥
మ॥ ఓ కమలాక్ష యో వరద యో ప్రతిపక్ష విపక్ష దూరకా యో కవి యోగివంద్య సుగుణోత్తమ యో శరణాగ
¶ తామరానోకహ యో మునీశ్వర మనోహర యో విమలప్రభావ రా వే కరుణింప వే తలఁప వే శరణార్థిని నన్నుఁ గావవే॥
వ॥ అని పలికి మఱియు నరక్షితరక్షకుండయిన యీశ్వరుం డాపన్నుండయిన నన్నుం గాచుఁ గాక యని ✱నింగి నిక్కి చూచు
చు నిట్టూర్పులు నిగుడించుచు బయలాలకించుచు నగ్గజేంద్రుండు మొఱచేయుచున్న సమయంబున॥ గీ॥ విశ్వమయత లే
మిని నియునూరక యుండి రంబుజాసనాదు లడ్డుపడక విశ్వమయుఁడు విభుఁడు విష్ణుండు జిష్ణుండు భక్తియుతున కడ్డప
డఁదలంచి॥ మ॥ అలవైకుంఠపురంబులో నగరిలో నామూల సౌధంబు దాపల మందారవనాంతరామృతసరః ప్రాంతేందు
కాంతోపలోత్పల పర్యంక రమావినోదియగు నాపన్నప్రసన్నుండు విహ్వల నాగేంద్రము పాహిపాహి యనఁ గుయ్యా
లించి సంరంభియై॥ మ॥ సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁడే పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నిం
పఁ డాకర్ణికాంతర ధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు వివాదప్రోద్ధత శ్రీకుచో పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనో
త్సాహియై॥ వ॥ ఇట్లు భక్తజనపాలన పరాయణుండును, నిఖిలజంతు హృదయారవింద సదన సంస్థితుండును నగు నారాయ
ణుండు కరికులేంద్ర విజ్ఞాపిత నానావిధ దీనాలాపంబు లాకర్ణించి లక్ష్మీకాంతా వినోదంబులందనివి సాలించి సంభ్రమించి
దిశలు నిరీక్షించి గజేంద్ర రక్షాపరత్వంబు నంగీకరించి నిజపరికరంబు మరలనవధరించి గగనంబున కుద్గమించి వేంచేయున
ప్పుడు॥ మ॥ తన వెంటన్ సిరి లచ్చి వెంట ✱నవరోధవ్రాతము న్దాని వెన్కను బక్షీంద్రుఁడు వాని పొంతను ధనుఃకౌమోదకీ శంఖ
చక్రనికాయంబును నారదుండు ధ్వజినీకాంతుండు దావచ్చిరో య్యన వైకుంఠపురంబునం గలుగువారాబాలగోపా
లమున్॥ వ॥ తదనంతరంబ ముఖారవింద మకరంద బిందు సందోహ పరిష్యందమానానంద దిందిందిరయగు నయ్యిందిరాదేవి
గోవింద కరారవింద సమాకృష్యమాణ సంవ్యాన చేలాంచలయై పోవుచు॥ మ॥ తనవేంచేయు పదంబుఁ బేర్కొనఁడు నా
థ స్త్రీజనాలాపముల్ వినెనో మ్రుచ్చులు మ్రుచ్చిలించిరో ఖలుల్ వేదప్రపంచంబులన్ దనుజానీకము దేవతానగరిపై దండె
త్తెనో భక్తులఁ గనిచక్రాయుధుఁ డేడి చూపుఁడని ధిక్కరించిరో దుర్జనుల్॥ అని వితర్కించుచు॥ శా॥ ✱తాటంకాచల

---

✱అధ్యాత్మయోగగమ్యున్ జ్ఞానయోగగోచరుఁడైనవానికిని ✱పావకుండర్చులన్॥ పావకుండు అగ్ని హోత్రుఁడు, అర్చులన్ జ్వా
లలను. ¶ అమరానోకహ కల్పవృక్షము. ✱నింగి ఆకాశము ✱అభ్రగపతిం బన్నింపఁడు గరుత్మంతుని గమనమున కాయత్తపఱచుమని చెప్పఁ
డు. ఆకర్ణికాంతరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు కర్ణాభరణపర్యంతము వ్రేలాడుచున్న కొప్పును చక్కఁగ సవరించికొనఁడు- అనగా వేలాడు
సిగముడి వేసికొనఁడు. వివాదప్రోద్ధత శ్రీకుచోపరిచేలాంచలమైన వీడఁడు ప్రణయకలహము చేతఁబట్టుకొనఁబడిన లక్ష్మీదేవి స్తనములమీఁ
ది వస్త్రము నైనవదలఁడు- అనఁగా లక్ష్మీదేవి పైఁటనైన విడువఁడు, గజప్రాణావనోత్సాహియై ఏనుగుయొక్క ప్రాణరక్షణమందు సంతోషము
గలవాఁడై ✱అవరోధవ్రాతము అంతఃపుర స్త్రీజనమును, ధ్వజినీకాంతుండు సేనానాయకుండైన విష్వక్సేనుఁడు ✱తాటంక కమ్మలు,

గరిహరిక్కతమునబ్రతుకుచు। గరపీడనమాచరించెఁ గరిణులనుఁ ఋల౯॥ సీ॥ జననాథ దేవలశాపవిముక్తుఁడై పటుతరగ్రాహరూపంబుమాని। ఘనుఁడుహూహూ నామగంధర్వుఁడప్పుడుతనతొంటినిర్మలతనువుఁదాల్చి। హరికినవ్యయునకునతిభక్తితోఁ మ్రొక్కి కనివిలిగి త్రింవిగీతములఁ బాడి। యాదేవుకృపనొందియందందమఱియునువినతశిరస్కుఁడై వేడ్క తోడ। దళితపాపుఁడగుచుఁదనలోకమున కేగె। నపుడుశౌరి కేలనంటనడువ। హస్తిలోకనాథుఁడజ్ఞానరహితుఁడై। విష్ణురూపుఁడగుచు వెలుఁగుచుండె॥ వ॥ అవనీనాథ గజేంద్రుఁడామకరితోనాలంబుగావించెము౯। ద్రవిళాధీశుఁడతండుపుణ్యాసముఁడింద్రద్యుమ్ననాముండువై। ష్ణవముఖ్యుండుగృహీతమాననియతిన్సర్వాత్మునారాయణు। న్నవిశేషంబుగఁబూజఁజేసెనుమహాశైలాగ్రభాగంబున౯॥ మ॥ ఒకనాఁడానృపుఁడచ్యుతున్మనములోనూహించుచున్మౌనియై। యకలంకస్థితినున్నచోఁ గలశజుండవ్వేటికిన్వచ్చి లేవకపూజింపకయున్ననాతనిఁగనివ్యగ్రోధుఁడై మూఢలు। బ్ధారీంద్రోత్తసుయోనిఁబుట్టుమనిశాపంబిచ్చెభూవల్లభా॥ క॥ మునిపతినవమానించిన। ఘనుఁడింద్రద్యుమ్నవిభుఁడుకుంజరయోనిం। జననంబందెనువిప్రులఁగనియవమానింపఁదగమఘనపుణ్యులకు౯॥ క॥ కరినాథుఁడయ్యెనాతఁడు। కరులైరిభటాదులెల్లగజమైయుండి౯। హరిచరణసేవకతమునఁ। గరివరునకునధికముక్తికలిగెనరేంద్రా॥ గీ॥ కర్మతంత్రుఁడగుచుఁ గమలాక్షుఁగొల్చుచు। సుభయనియతవృత్తినుండెనేని। జెడునుగర్మమెల్లశిథిలమైమెల్లనఁ। బ్రబలమయినవిష్ణుభక్తిచెడదు॥ క॥ చెడుకపలుహయములుధనములు। చెడుమరునిజసతులుసుతులుచెడుచెనఁటులకున్। జెడకమనునెఱుసుగుణులకుఁ। జెడనిపదార్థములువిష్ణుసేవానిరతుల్॥

వ॥ అప్పుడుజగజ్జనకుండగునప్పరమేశ్వరుండుదరహసితముఖకమలయగునకమలకిట్లనియె॥ క॥ బాలా నావెనువెంటను। హేలన్వినువీథినుండియేతెంచుచునీ। చేలాంచలంబుఁబట్టుట। కాలోనేమంటినన్నునంభోజముఖీ॥ క॥ మొఱఁగుమదైరవాయిప్పుడు। మఱువనుసకలంబునన్ను నఱచినయెడల। న్మఱతుననియెఱిఁగిమొఱఁగక। మఱపకమొఱయిడిరియేనిఁ మఱచియ్యములు౯॥ వ॥ అనిపలికిననరవిందమందిరయగునయ్యిందిరాదేవిమందస్మితచంద్రికావదనారవిందయగుచుముకుందునకిట్లనియె॥ క॥ దేవాదేవరయడుగులు। భావంబుననిలిపికొలుచుపనినాపని గా। కోవల్లభయేమనియెద। నీవెంటనవచ్చుచుంటినిఖిలాధిపతీ॥ క॥ దీనులకుయ్యాలింపను। దీనులరక్షింపమేలుదీవెనఁబొంద౯। దీనావనసీకొప్పును। దీనపరాధీనదేవదేవమహేశా॥ వ॥ అనిమఱియునుసముచితసంభాషణంబులఁ జనంకించుచున్నపరమవైష్ణవీరత్నంబునుసాదరసరససల్లాపమందహాసపూర్వకంబుగానాలింగనంబుగావించిసపరివారుండై గంధర్వసిద్ధవిబుధగణజేగీయమానుండై గరుడారూఢుండగుచునిజసదనంబునకుంజనియెనని చెప్పిశుకయోగీంద్రుండిట్లనియె। సీ॥ నరనాథనీకునునాచేతవినిరింపఁబడినయీకృష్ణానుభావమైన। గజరాజమోక్షణకథవినువారికియశముఁలెచ్చునుగల్మషాపహంబు। దుస్స్వప్ననాశంబుదుఃఖసంహారంబుప్రొద్దునమేల్కాంచిపూతవృత్తి। నిత్యంబుఁబఠియించునిర్మలాత్మకులైనవిప్రులకునుబహుళవిభవమగు। సంపదలుగల్గుఁబీడలుశాంతిఁబొందు। సుఖముసిద్ధించువర్ధిల్లుశోభనములు। మోక్షమంచెతిఁదయ్యుండుముదమునుచేయుననుచువిష్ణుండుప్రీతుఁడైయానతిచ్చె॥ వ॥ అనిమఱియునప్పరమేశ్వరుండిట్లనియానతిచ్చెనెవ్వరేనియునపరరాత్రంబునమేల్కాంచిసమాహితమనస్కులై శ్వేతద్వీపంబును, నాకుంబ్రియంబైనసుధాసాగరంబును, హేమనగంబును, నిగ్గిరికందరకాననంబులను, వేత్రకీచకవేణులతాగుల్మసురపాదపంబులను, ననుబ్రహ్మయుఘాలలోచనుండును నివసించియుండునికూటశిఖరంబులను, గౌమోదకీకౌస్తుభసుదర్శనపాంచజన్యంబులను, శ్రీదేవినిశేషగరుడవాసుకిప్రహ్లాదనారదాదిఋషులను, మత్స్యకూర్మవరాహాద్యవతారంబులను, మదవతారకృతకార్యంబులను, సూర్యసోమపావకులను, బ్రణవంబును, ధర్మతపస్సత్యంబులను, వేదంబును, వేదాంగంబులను, శాస్త్రంబులను, గోభూసురసాధుపతివ్రతాజనంబులను, జంద్రకాశ్యపజాయాసముదయంబును, గౌరీగంగాసరస్వతీకాళిందీసునందాప్రముఖపుణ్యతరంగిణీనిచయంబును, నమరులను, నమరతరువులను, నైరావతంబును, నమృతంబును, ధ్రువుని బ్రహ్మర్షినివహంబును, బుణ్యశ్లోకులయినమానవులను, సమాహితచిత్తులై తలంచువారలకుఁ బ్రాణావసానకాలంబుననుదీయంబగువిమలగతినిత్తునని హృషీకేశుండుని ర్దేశించిశంఖంబుపూరించివిహగపరివృఢవాహనుండయి వేంచేసెవిబుధానీకంబుసంతోషించెనని చెప్పి శుకుండురాజునకిట్లనియె॥ క॥ గజరాజమోక్షణంబును। నిజముగఁబఠియించునట్టినియతాత్ములకు౯। గజరాజవరదుఁడిచ్చును। గజతురగస్యందనములుకైవల్యంబు౯॥ క॥ తామసుతమ్ముఁడురైవత। నామకుఁడైవెలసెమనువునలువురపుత్రుఁద। న్స్వామికిఁబ్రతివింధ్యార్జున। నామాదులున్నృపులుమనువునందనులున్నృపా॥ సీ॥ మునులుహిరణ్యరోముఁడునూర్ధ్వబాహుండు వేదశీర్షుండునుపేరుమొదలు। న

కలశజుండు। అగస్త్యమహర్షి. శంకించుచున్న। ఊనిపలుకుచున్న. సమాహితమనస్కులై। నిశ్చలచిత్తులై,

హరులు భూతరథాములు శుభ్రుఁ బత్ని వైకుంఠాఖ్య పరమసాధ్వి। యా యిద్దరకుఁ బుత్రుఁడై తనకళలతో వైకుంఠుఁడనఁ బుట్టె వారిజాక్షుఁ। డవనిపై వైకుంఠమనియెడి లోకంబుఁ గల్పించె నెల్లలోకములు మ్రొక్క। రమయు నెదురొక్కలు చేకొనె రాజముఖ్య! తదనుభావగుణంబులు దలఁపఁదరమె। యీ ధరారేణుపటలంబు నెఱుఁగవచ్చుఁ గాని రాదయ్య హరిగుణగణముసంఖ్య॥ తదనంతరంబు॥ సీ॥ చక్షుస్తనూజుండు చాక్షుషుండను వీరుఁ డాఱవ మనువయ్యె నవనినాథ। భూమీశ్వరులు పురుఁ బురుషసుద్యుమ్నాదు లాతని నందను లమరవిభుఁడు। మంత్రద్యుమ్నాఖ్యుఁ డమర్త్యు లాప్యాదులు హవిష్మద్వీరకాది ఘనులు! మునులంబుధిభుఁడు సంభూతికి నాత్మజుండై పుట్టి యజితుండు నాఁగ మెప్పె। నతఁడు కాఁడె కూర్మమై మందరాద్రి నిను పధి జలములోన నుండి మోసె। నతఁడు చువ్వె దివిజులర్థింప నమృతాబ్ధిఁ ద్రచ్చి యిచ్చె నాసుధారసంబు॥ వ॥ అని పలికిన

## ※ క్షీరసాగరమథనకథాప్రారంభము. ※

బరీక్షిన్నరేంద్రుండు మునీంద్రున కిట్లనియె॥ మ॥ వినుము న్నేటికిఁ ద్రచ్చె పాలకడలిన్ విష్ణుండు కూర్మాకృతిన్ స్వనధిం జొచ్చియ దెట్లు మోసె నలుకవ్వంబైన శైలంబు దే। వనికాయంబమృతంబు నెట్లువడసెన్ వారాశి నే మేమి సం। జనితంబయ్యె మునీంద్ర చోద్యముగదా సర్వంబుఁ జెప్పంగదే॥ క॥ అప్పటినుండి బుధోత్తమ। చెప్పెడు భగవత్కథావిశేషంబుల నా। కెప్పుడు దనివి జనింపదు। సెప్పఁగదే చెవులు నిండ శ్రీహరికథలన్॥ వ॥ అని మఱియు నడుగంబడినవాఁడై యతని నభినందించి హరిప్రసంగంబు సెప్ప నుపక్రమించె నని సూతుండు ద్విజులకిట్లనియె నట్లు శుకుండు రాజుం జూచి॥ క॥ * అసురవిసరము లసిలతికల సురల నెగువ ననువులు వెడలం। బస చెడిరి పడిరి గెడసిరి। యసమసమరవిలసనముల నసమ నృపా॥ క॥ సురపతి వరుణామలతో। సురమునులుం గొలువఁగ దలి సురశైలము పై। సురనుతుఁడగు నజుఁ గాంచిరి। సురమత్కృతిఁ జెప్పి రపుడు సొలయు మనతులై॥ క॥ దుర్వాసు శాపవశమున। నిర్వీర్యత జగములెల్ల నిశ్శ్రీకములై। పర్వతరిపుతోఁ గూడ * సుపర్వతతులై యుండె హతసుపర్వావళులై॥ గీ॥ నెలవు వెడలి యున్న నిస్తేజులై నట్టి। వేల్పుగములఁ జూచి వేల్పుపెద్ద। పరమపురుషుఁ దలఁచి ప్రణతుఁడై సంఫుల్ల। పద్మవదనుఁడగుచుఁ బలికెఁ దెలియ॥ క॥ సనులు నీరును గాలము। మానవతిర్యఙ్నరద్రుమ స్వేదజము। ల్మానుగ నెవ్వనికళలము। వానికి మ్రొక్కెదము గాక వగవఁగ నేలా॥ క॥ అమ్మేయుం డురత్నుఁ డుండున। నామ్మేఁడు మాస్వయండు లోకసర్గత్రాణాంతాద్యాదుల నర్చన తం। డాద్యంతవిధానములకు నర్హుఁడు మనకున్॥ క॥ వరమనిఁ బరము జగద్గురుఁ। గరుణాపరతంత్రు మనము గనుఁగొనెదము। త్స్వరములు చెడు ననుచు నలకుఁ। బరఁగఁగఁ బద్మజుఁడు సెప్పి పరమప్రీతిన్॥ వ॥ అంతఁ దానును, దేవతాసమూహంబును, నతిరయంబున నజనిపినయంబునఁ గానంబడని యవ్విభు నుద్దేశించి దైవికంబులగు వచనంబుల నియతేంద్రియులయి యిట్లని స్తుతియించిరి॥ సీ॥ ఎవ్వని మాయ పనింతయు మోహించుఁ దరిమి యెవ్వని మాయ దాఁటరాదు। తనమాయ నెవ్వఁ డింతయుఁ గెల్చె నెవ్వాఁడు నెవ్వనిఁ బొడగాన రెట్టిమునులు। సర్వభూతములకు సమవృత్తి నెవ్వఁడు చరియించు నతఁడె పో జనితమయిన। ధరణి పాదములు చిత్తము సోముఁ డగ్ని ముఖంబును గన్నులు కమలహితులు। చెవులు దిక్కులు రేతంబు సిద్ధజలము। మూఁడుమూర్తుల పుట్టిల్లు మొదలి నెలవు। గర్భమఖిలంబు మూర్ధంబు గగనమగుచు। మలయు నెవ్వని వానిని మస్కరింతు॥ వ॥ మఱియు నెవ్వని బలంబున మహేంద్రుండును, బ్రసాదంబున దేవతలును, గోపంబున రుద్రుండును, బరుషంబున విరించియు, నింద్రియంబుల వలన వేదంబులు మునులును, మేఢ్రంబునఁ బ్రజాపతియు, వక్షంబున లక్ష్మియు, ఛాయవలనఁ బితృదేవతలు స్తనంబులవలన ధర్మంబును, బృష్ఠంబువలన నధర్మంబును, శిరంబువలన నాకంబును, విహారంబువలన నప్సరోజనంబులును, గుహ్యంబువలన బ్రహ్మంబును, ముఖంబువలన విప్రులు భుజంబులవలన రాజులు నూరువులవలన వైశ్యులును, బదంబులవలన శూద్రులు నధరంబున లోభంబును సుపర్వరంధ్రంబువలనఁ బ్రీతియు, నాసాపుటంబువలన ద్యుతియు, స్పర్శంబునఁ గామంబును, భ్రూయుగళంబున నియమంబును, వక్షంబునఁ గాలంబును, సంభవించె నెవ్వని యోగమాయానిర్జితంబులు ద్రవ్యవయఃకర్మగుణవిశేషంబులు చతుర్విధసర్గంబెవ్వని యాత్మతంత్రంబెవ్వని వలన సిద్ధించు లోకంబులును, లోకపాలురుం బ్రతుకుచుండురు పెరుగుచుండురు దివిజులకు నాయువు బలంబునైన జగంబులకు నీశుండై పరమమహాభూతియగు నప్పరమేశ్వరుండు మాకుం బ్రసన్నుండు గాక యని మఱి

* నృపా। రాజా, అసమసమరవిలసనములన్॥ అసమ। సమానరహితములైన, సమర। యుద్ధము యొక్క, విలసనములన్। నేర్పులచేతను. కనిముసఁ। విజృంభించి, అసురవిసరములు। రాక్షససమూహములు, అసిలతికలన్। తీఁగెలవలె సొంపైన కత్తులచేత, సురల నెగువన్। దేవతలను బాధింపఁగాను, అసుబడలి। ఉద్రేకము విడిచినవారై, అసువులు వెడలన్। ప్రాణములు శరీరమును విడిచి బయలు వెడలగాను, పస చెడిరి। నవకము చెడినవారైరి, పడిరి। కూలిరి, కెడసిరి। చచ్చిరి. * సుపర్వావళులై। దేవతాసమూహములు గలవారై.

యును॥ క॥ మొసలజలమిడిన భూజము । మదిన మమను జల్లదనము దొరకొను మాడ్కిన్ । నొప్పిదలను హరికిని మ్రొక్కిన । ముని
మొనమను రెల్ల వేల్పుమూకలు నేమున్॥ క॥ ఆపన్నులగు దివ్యులకు । నోపుణ్యాభవన్ముఖాబ్జ మొయ్యన తెనితోఁ । బ్రాపింపఁ జే
యుసంపన్న । నోపరమదయానివాస యుజ్జ్వలతేజా॥ వ॥ అనియిట్లు దేవగణసమేతుండై యనేకవిధంబులం గీర్తించుచును
న్నపరమేష్ఠియందుఁ గరుణించి దయాగరిష్ఠుండగు విశ్వగర్భుం డావిర్భవించె॥ వ॥ ఒకవేయరుకలుగూడి గట్టికమైయు
త్పత్తిభాభాసితో । నొకరూపై చను దెంచుమాడ్కి హరి దానొప్పారెయా దేలుపు । ల్వికలాలోకనులై విషణ్ణమతులై వి
భ్రాంతులై మ్రొక్కఁగా । నకళంకుం దిరికొంత ప్రస్తుతవిభుం గానంబోలు నేవారికిన్॥ అప్పుడు॥ సీ॥ హారకిరీటకేయూరకుండల
పాదకటక కాంచనరత్న కంకణాది । కౌస్తుభోపేతంబుఁ గౌమోదకీశంఖచక్రశరాసనసంయుతంబు । మరకతశ్యామంబు
సరసిజనేత్రంబుఁ గర్ణాభరణకాంతిగండయుగము । గలితకాంచనవర్ణకౌశేయవస్త్రంబు శ్రీవనమాలికాసేవితంబు । నై
మనోహరంబునై దివ్యసౌభాగ్యమయినయత్ని రూపు హర్షమెసఁగఁ । జూచి బ్రహ్మేంద్రాదిసురలును దానును । బొంగిన
మ్రొక్కులను చుఁ బొగడఁదొడఁగె॥ క॥ జననస్థితిలయమూలుని । మునినుతు నిర్వాణసుఖసముద్రవిసుగుణుం । నసుగుణు నసంఖ్యగుణులప్ర
ఘనులని । ననఘుఁడగు మహానుభావు నభినందింతున్ । క॥ పురుషోత్తమ నీరూపము । పరమశ్రేయంబు భువనపద్మాలకెల్లన్ । స్థి
రవైదికయోగంబున । వరుసను మాయందుఁ గానవచ్చెను మాకున్॥ క॥ మొదలను నీలోఁ దోఁచెను । నడియున్నటఁ దోఁచెన
మముదోఁచెను నాపై । మొదలు నడుము దిన్నష్టికిఁ । గడియఁగ ఘటమునకు మన్నుగలయుగు మాడ్కిన్॥ క॥ నీమాయచేత వి
శ్వము । వేమారు సృజింతు వనుచు విష్ణుఁడవనుచున్ । ధీమంతులు గుణపరిని । నేమంబున సగుణుఁడైన నినుఁ గాంతు రొ
గిన్॥ గీ॥ అన్నమవనియందు నమృతంబు గోవుల । యందు వహ్నిసమిధలందునమరు । యోగవశతఁ బొందు యోజను బుద్ధిచే ।
నగుణుని నిన్నుఁ గాంతురధికగుణులు॥ మత్తకోకిల॥ పట్టులేక బహుప్రకారవిపన్నదిక్తుల మైతిమే । మెట్టకేలకు నిన్నుఁ గంటి
మభీప్సితార్థము వచ్చె । నెట్టలైన దవానలంబున వేగు నేనుఁగు మొత్తము । న్నెట్టలేదిన గంగలోపల నీరుఁ గాంచినచాడ్ప
నన్॥ మత్తకోకిల॥ నీకు నేమని విన్నవింతుము నీవు సర్వమయుండవై । లోకమెల్లను నిండియుండఁగ లోకలోచన నీపదా । లోక
నంబు శుభంబు మాకును లోకపాలకు లేను నీ । నాకవాసులు నీపవహ్నుల నసర్వులరసితరక్రియన్॥ వ॥ అనికమలసంభవప్ర
ముఖులు వినుతి సేసిరని చెప్పి నరేంద్రునకు శుకుం డిట్లనియె॥ శా॥ ఈరీతిం జతురాననాదినుతుఁడై యొప్పారె జీమూతగంభీ
రంబైన రవంబునం బలికె సంప్రీతాత్ముఁడై యీశ్వరుం । డాకోమాంచితకాయులన్నవివి మ ముక్తాపాయులన్ శ్రేయులన్ ।
బ్రారబ్ధోగ్రమహార్ణవోన్మథన వాంఛానల్పులన్ వేల్పులన్॥ క॥ ఓ నలువ యో సురేశ్వర । యో నిటలనటాక్షయో సురోత్త
ములారా । దానవులతోడ నిప్పుడు । మానుగఁ బోరామి కలిగియుండుట యొప్పున్॥ అదియెట్లంటి రేని॥ క॥ ఎప్పుడు దనకసునస
త్త్వము । దొప్పుడునం దాఁకరిపులఁ జూచియుఁ దనమైఁ । గప్పికొని యుండవలయును । నెప్పుగ నహి మూషకమునకొదిగినభం
గిన్॥ క॥ అమృతోత్పాదనయత్నము । విశదముతో జేయుఁటొప్పు వేల్పులు వినుఁడీ । యమృతంబుఁ ద్రావి జంతువు । లమృతగతిం
బ్రతుకుచుండు రాయుర్వృద్ధిన్॥ సీ॥ పాలమున్నీటిలోపల సర్వతృణలతౌషధములు దెప్పించి చాలవైచి । మందరశైలంబు
*మంథానముగఁ జేసి తనర వాసుకిఁ దరిత్రాడుఁ జేసి । నాసహాయంబున నెలమిఁ దఱవుఁడీ మీరు తఱువుఁడు వేగ నతంద్రులగు
చు । ఫలము మీఁద మ్యోడు బహుళమతిక్లేశంబులం బడుదురు దైత్యులు పాపమతులు । అలసటయును లేక యఖిలార్థములుగల్గు । వి
షధిలోన నొక్కవిషము పుట్టుఁ । గడఁగి చెలుప లేవు కామదోషంబులు । వస్తుచయమునందు వలయఁ జేయ॥ అని యుపదేశిం
చి॥ క॥ అంతాదిరహితుఁ డచ్యుతుఁ । డంతర్ధానంబు నొందెఁ దనజఫాలాక్షు । ల్సంతోషంబునఁ దమతమ । కాంతాలయము
లకుఁ జనిరి గౌరవమొప్పన్ ॥ క ॥ కయ్యంబు సేయనొల్లక । §నెయ్యంబు ననతులు వెట్టి నిర్జరనికరం । బియ్యప్పనము
లు వెట్టుచుఁ । దియ్యంబునఁ గొల్చె బలిని దేవద్వేషిన్॥ క॥ పస చెడి తనకును వశమై । ‡సుసరముతోఁ గొల్చుచున్న సురసం
ఘము కసిమసఁగి చంపఁ బూనిన । నసురులవారించె బలియు నతినయయుక్తిన్॥ వ॥ అట్లు వారించి ¶వైరోచని రాక్షససచివస
మయంబునకిట్లనియె॥ క॥ పగవారు శరణుఁ జొచ్చిన । మగతనములు నెఱపఁదగదు మగవారలకున్ । దనుసమయ మెఱుఁగవల
దే మగటిమిఁ బాటింపవలదసుర్యులతోడన్॥ వ॥ అని పలికి కొలువుకూటంబున సురనికరవరివృతుండై నిఖిలలోకరాజ్యల
క్ష్మీసహితుండై యఖిలవిబుధవిజయాహంకారనిజాలంకారుండై సుఖంబునం గొలువున్న విరోచననందనుం గని శచీవి

* మంథానము। కవ్వము- విషధి। సముద్రము. § నెయ్యము। ప్రేమ- నతులు వెట్టి। నమస్కారములు చేసి- ఇయ్యప్పనము। కానుక. తియ్యంబునన్। ప్రీతితో. ‡సుసరముతో। తిన్నదనముతో- కసిమసఁగి। విజృంభించి. ¶ వైరోచని। విరోచనపుత్రుఁడైన బలిచక్రవర్తి. *సచివ। మంత్రి- సాంత్వవచనంబులన్। మిగుల మంచిమాటలచేత.

యుభయసైనికులున్న సిగ్గుతో (*) నహా! పారతటంబునం బడిరి పౌరుషముం జెడి పాండవేయ యొ! వ్వారికి నేరఁబోలు బలవంతపు దైవము నాక్రమింపఁగన్॥ క॥ వననిధిజలములలోపల। మునిఁగెడి గిరిఁ జూచి ముఖములం జింతాబ్ధిన్। మునిఁగెడి వేల్పులఁ గనుఁగొని, వనజాక్షుఁడు వార్ధినడుమ వారలు సూడన్॥ సీ॥ సవరనై లక్ష యోజనముల వెడలు సైకడుఁ గఠోరంబైన క (†)

❀ కూర్మావతారకథాప్రారంభము. ❀

ర్పరమును నదనైన బ్రహ్మాండమైన నాహరించు ఘనతరంబగు ముఖగహ్వరంబు। సకలచరాచరజంతురాసులనెల్ల మ్రింగి లోఁగొను నట్టి మేటికడుపు। విశ్వంబుపై వేఱు విశ్వంబు పైఁబడ్డ నాఁగిన గదలని యట్టి కాళ్ళు। వెలికిలోనికిఁ జనుదెంచు విపుల తుండము। అంబుజంబులఁబోలె నెసఁగు నక్షియుగము। సుందరంబగు విష్ణుండు సురలతోడి। కూర్మి చెలువొంద నొక మహాకూర్మ మయ్యె॥ మ॥ కమఠంబై జలరాశిఁ జొచ్చి లఘుముక్తాశుక్తిచందంబున। న్నమదద్రీంద్రము నెత్తి వాసుకి మహానాగంబుతోఁ ద్రిప్పుతో సురేంద్రాదులు మౌళికంపములతో నానాఁగదే బాపురే। కమలాక్షు శరణంబు భూదిశలు నాకాశంబునన్ మ్రోయఁగన్॥ ఇవ్విధంబున॥ క॥ తరికాండ్రలోన నొకఁడఁట। తరికడవకుఁ గుదురు కాఁగ తా నఁట చేతు। ల్దరిగవ్వంబును దానట। హరి హరి హరి చిత్రలీల హరియే యెఱుఁగున్॥ గీ॥ జలధిఁ గడవ సేయ శైలంబు కవ్వంబు। సేయు భోగిఁ ద్రాడు సేయఁ దరువ। సిరియు సుధయుఁ బడయు శ్రీవల్లభుఁడు దక్క। నొరుఁడు శక్తిమంతుఁ డొకఁడు గలఁడె॥ గీ॥ గొల్లవారి బ్రతుకు గొఱతనవచ్చు నె గొల్లరీతిఁ బాలకుప్ప ద్రచ్చి। గొల్లలైరి సురలు గొల్లయ్యె విష్ణుండు। చేటులేని మందు సిరియుఁ గనిరి॥ వ॥ ఇట్లు సురాసుర యూథంబులు (‡) హరిసనాథంబులై కవచంబులు నెట్టంబులు వెట్టికొని పుట్టంబులు పిరిచుట్టు చుట్టికొని కరంబులు గరంబుల నప్పళించుచు, భుజంబులు భుజంబుల నొఱయుచు, లెండు లెండు పరవఁ ద్రోడం గుఁడు రండని యమందగతిఁ బెరుగుఁ ద్రచ్చు నుండగొల్లలచందంబున మహార్ణవమధ్యంబున మంథాయమాన మందర మహీధర విలగ్నభోగి భోగాద్యంతంబులం గరంబులం జెమల్చుచుఁ బెనుబొబ్బల బ్రహ్మాండకటాహంబు నిర్భరంబై గుబ్బుగుబ్బని యుఱులు కొండకవ్వంబు గుత్తి జిలజిలం దిఱుగు వేగంబున ధబచ్ఛటాయమానంబులై భుగులుభుగుల్లను చప్పుళ్లను ప్పరంబెగసి లెక్కకు మిక్కిలి చుక్కలకొమ్మల చెక్కులనిక్కలువడు మిసిమిగల మీఁదిమీఁగడపాల తేటనిగ్గు తుంపరల పరంపరల వలన నిజకర క్రమాక్రమాకర్షణ పరిభ్రాంత ఫణిఫణాగర్భ సముద్భూత నిర్భర విషకీలికీలాజాలంబు లప్పటప్పటికిని ప్పతిల్లినదప్పి నొందక మందగతిం జెందక నకూపార వేలాతట కుటజకుసుమగుచ్ఛపుచ్ఛస్వచ్ఛమకరంద సుగంధిగంధవహావహనంబున గ్రొంజెమట (*) పిటిలి పెనువరద గములొడళ్ళ నిగుడ నొండొరులం బరిహాసించుచుఁ బేఁటువాడి విలసించుచు మేలు మేలని యగ్గించుచుఁ గాదు కాదని భంగించుచు నిచ్చ మెచ్చని మచ్చరంబుల వలన వననిధి వలమాన వైశాఖ వసుంధరాధర ప్రవర్తన సంజనిత ఘుమఘుమారావంబును, మథనగుణాయమాన మహాహీంద్ర ప్రముఖ ముహుర్ముహురుచ్చలిత భూరి ఘోర ఫూత్కార ఘోషంబును, గులకుధర పరివర్తన సంక్షోభిత సముల్లఘన సమాకులితంబులై వెఱవిచఱచి గుబురుగుబురులై యొరలు కమఠ కర్కటక కాకోదర మకర తిమి తిమింగిల మరాళ చక్రవాక బలాహక భేక సారస సానీకంబుల మొఱలును గూడికొని ముప్పిరిగొని దనుజవిబుధ భటాట్టహాస తర్జన ఘర్జన ధ్వనులనలుపురియై మొత్తినట్లైన దశదిగంత భిత్తులను బేడెత్తి పెల్లగిల్లం ద్రుళ్లుచు గికురుపొడుచుచు నొండొనిని నొకనికంటె వడియు నుండడవు నుంగలుగఁ ద్రచ్చుచుఁ, బంతంబులిచ్చుచు సుధాజననంబుఁ జింతించుచు, నూతనపదార్థంబులకు నెదురు సూచుచు, నెంతదడవు ద్రచ్చి నిహారినవుగుచు. నెడపడని తమకంబుల నంతకంతకు మురువుడింపక ద్రచ్చు సమయంబున॥

క॥ అప్పాలవెల్లిలోపల। నప్పటికప్పటికి మందరాగము దిఱుగం। జప్పుడు నిండెనజాండము। చెప్పెడి దేమి జుని చెవులు వింపఁగొనియెన్॥ అంతనప్పయోరాశిమధ్యంబున॥ క॥ ఎడమఁ గుడి ముసపు దిరుగుచుఁ। గుడినెడమను వెనుకఁ దిరుగు కులగిరి కడలి। న్నడవెడలసురలు సురులు। దొడితొడి ఫణిఫణము మొదలు తుదియును దిగువన్॥ క॥ వడిఁగొని కులగిరి దరువఁగ। జడనిధి ఖగమకర కమఠ ఝషఫణిగణము। ల్సుడివడుఁ దడఁబడుఁ గెలఁకులఁ। బడు భయపడి నెగసి బయలఁబడు నురిలిపడున్॥ క॥ అసురాసురకరపరిభ్రమణధరాధరేంద్రభ్రమణంబున దాఁగము తేంద్ర వీఁపు తీఁటను। శమియింపఁగఁ జాలదయ్యె జగతీనాథా। తదనంతరంబ॥ క॥ ఆలోన జలధిలోపల। నాలోనహి విడిచి సురలు నసురులు బఱవం। గీలాకోలాహలమై। హాలా

---

(*) అహా పారతటంబునన్। సముద్రపు గట్టున - పాండవేయ। పరీక్షిత్తుఁడా. (†) కర్పరము। తాఁబేటివీఁపుచిప్ప॥ (§) అఁకత్రాడు - అనఁగా గవ్వము పొరలకుండఁగుఁజకుఁ గట్టియుండు పాశము. (‡) హరిసనాథంబులై। విష్ణువుతోఁ గూడికొనినవై - (నెట్టంబు। నెట్టంబు) తలపాగ - మంథదండాయమాన। కవ్వమై ఆచరించుచున్న - విలగ్న। తగులుకొనిన - వననిధి వలమానవైశాఖ వసుంధరాధర॥ సముద్రమునందు దిరుగుచున్న మందరపర్వతముయొక్క, భేక। కప్ప - సారస। బెగ్గురుపక్షి - కికురుపొడుచుచు। మోసపుచ్చుచు తమకము। మోహము - మురువు। గర్వము.

## పాలకడలిఁ గ్రచ్చు నెడ హాలాహలము జనించుట.

హాలవిషము పుట్టెనవనీనాథా ॥ వ॥ అదియుం బ్రళయకాలాభీలఫాలలోచనలోచనానలశతంబు చందంబున నమందంబై, విలయదహనసహస్రంబు కైవడి వడిన్నై, కడపటి పట్టపగటింటి వెలుంగులకుం దెఱంగు నమర్గళితంబై, తుదిరేయి వెలింగిన మొగులుగములు నంబడు బలుపిడుగుల వడువున బెడిదంబై, పంచభూతంబులు దేజోరూపంబులైన చాట్పున దుస్సహంబై, భుగభుగాయమానంబులైన పొగలును, చిటచిటాయమానవిస్ఫులింగంబులును, దగద్ధగాయమానంబులైన నెఱమంటలుం గలిగి మహార్ణవమధ్యంబున మందరనగంబు మందరంబునం దిఱుగు నెడ జనియించి, పెటపెటాయమానంబై నింగికిం బొంగి దిశలకుం గేలుసాఁచి, బయళ్లు ప్రబ్బికొని, తఱిగవ్వంపుకొండ నండఁ గొనక నలుగడలకుం బఱచి, దరులకుఁ జికి, సురాసురసముదయంబులం జిక్కొని, గిరివరగుహాగహ్వరంబుల నుడివడక, కులశిఖరిశిఖరంబుల నెఱగలి వడి గహనంబుల దహించి, కుంజమంజరీపుంజంబుల భస్మంబు చేసి, జనపదంబు లేర్చి, నదీనదంబు లెఱియించి, దిక్కుంభికుంభంబులు నిక్కలు వడనిక్క, తరణితారామండలంబుల పైమిట్టించి, మహర్లోకంబు దఱికొని, యుపరిలోకంబునకు మాఱుగొనలిడి, సుడివడి ముసరుకొని బ్రహ్మాండగోళంబు విటిలిపడం దాఁటి, పాతాళాదిలోకంబులకు వెల్లి వారి సర్వాధిక్యంబై శక్యంబుగాక యెక్కడం జూచిన దానయై కురంగంబు క్రియం గ్రేళ్లుఱుకుచు భుజంగంబు విధంబున నొడియుచు సింగంబు భంగి లంఘించుచు, విహంగంబు పగిది నెగయుచు, మాతంగంబు పోలి కెరలు వంబడుచు, నిట్లు హాలాహలదహనంబు జగంబులం గోలాహలంబు సేయుచున్న సమయంబున * మెలకు సెగల మిడుకంజాలక నీఱైన దేవతలును, నేలం గూలిన రక్కసులును, మల్లిన తారకంబులును, గీటడంగిన కిన్నరమిథునంబులును, గమలిన గంధర్వవిమానంబులును, జీకాకుపడిన సిద్ధచయంబులును, జిక్కువడిన గ్రహంబులును, జిందఱవందఱలైన వర్ణాశ్రమంబులు, నిగిరిన నదులు, నింకిన సముద్రంబులును, గాలిన కాననంబులును, బొగిలెడి పురంబులును, ¶ పొనుఁగువడిన పురుషులును, పొక్కిపడిన పుణ్యాంగనాజనంబులును, బగిలిన పర్వతంబులును, భస్మంబులైన ప్రాణిసంఘంబులును, వేఁగిన లోకంబులును, § వివశలైన దిశలును, నడ్డగెడపులైన భూజచయంబులును, నఱవఱలైన భూములును నైయి కాలవిలయకాలంబై తోఁచుచున్న సమయంబున ॥ క॥ ఒడ్డారించి విషంబున । కడ్డము చనుదెంచి కావ నధికులు లేమిన్ । దొడ్డేగురుండు దిరాలన । బిడ్డన నెడ లేక జనులు పృథ్వీనాథా ॥ అప్పుడు ॥. మ॥ చని కైలాసముఁ జొచ్చి శంకరుని వాసద్వారముం జేరి యీశుని దవ్వారికు లడ్డపడ్డఁ దలమంచుం జొచ్చి కుయ్యో మొఱో । విను మాలింపు ముచిత్తగింపుము దయన్వీక్షింపు మంచంబుజాసనముఖ్యు లెల్ల నిరార్తరక్షణకళాసంరంభు నిస్సంభునిన్ ॥ క॥ వారలు దీనత వచ్చుటఁ । గూరిమితో నెఱిఁగి దక్షుకూఁతురు దాను । ◆ న్పేరోలగమున నుండిద । యారతుఁడై చంద్రచూడుఁ డవసరమిచ్చెన్ ॥ వ॥ అప్పుడు భోగిభూషణునకు సాష్టాంగదండప్రణామంబులు గావించి ప్రజాపతిముఖ్యు లిట్లని స్తుతించిరి ॥ సీ॥ భూతాత్మ భూతేశ భూతభావనరూప దేవ మహాదేవ దేవవంద్య । యీలోకములకెల్ల నీశ్వరుండవు నీవ బంధమోక్షములకుఁ బ్రభుఁడ వీవ । యార్తశరణ్యుండ వగుగురుండవు నిన్నుఁ గోరి భజింతురు కుశలమతులు । సకలసృష్టిస్థితిసంహారకర్తవై బ్రహ్మవిష్ణుశివాఖ్యఁ బరఁగుదీవు । పరమగుహ్యమయిన బ్రహ్మంబు సదసత్తమంబు నీ శక్తిమయుఁడ వీవ । శబ్దయోని వీవ జగదంతరాత్మవు । నీవ ప్రాణమరయ నిఖిలమునకు ॥ క ॥ నీయందసంభవించును । నీయందవసించి యుండు నిఖిలజగంబుల్ । నీయందలయముఁ బొందును । నీయుదరము సర్వభూతనిలయము రుద్రా ॥ సీ॥ అగ్నిముఖంబు పరాపరాత్మకమాత్మ కాలంబుగతి రత్నగర్భపదము । శ్వసనంబు నీయూర్పు రసనజలేశుండు దిశలు కర్ణంబులు దివము నాభి । సూర్యుండు గన్నులు శుక్లంబు సలిలంబు జఠరంబు జలములు చదలు శిరము । సర్వౌషధులు రోమచయములు శల్యంబు లద్రులు మానస మమృతకరుఁడు । ఛందములు ధాతువులు ధర్మసమితి హృదయ । మాస్యపంచకముపనిషదాహ్వయంబు । లయిన నీరూపు పరతత్త్వమై శివాఖ్య । మై స్వయంజ్యోతియై యొప్పు నాద్యమగుచు ॥ క॥ కొందఱు కలఁడందురు నినుఁ । గొందఱు లేఁడందు రతఁడు గుణిగాఁడనుచు । న్గొందఱు కలఁడని లేఁడని । కొందల మందుదురు నిన్నుఁ గూర్చి మహేశా ॥ సీ॥ తలఁప బ్రాణేంద్రియ ద్రవ్యగుణస్వభావుఁడవు కాలక్రతువులును నీవ । సత్యంబు ధర్మమక్షరము ఋతంబును నీవ ముఖ్యుండవు నిఖిలమునకు । ఛందోమయుండవు సత్త్వరజస్తమశ్చక్షుండవై యుండు సర్వరూప । కామపురాధ్వర కాలగరాదిభూతద్రోహభయము వోద్యంబు గాదు । లీలలోచనవహ్నిస్ఫులింగశిఖల । నంతకాముఁ గాల్చినయట్టి నీకు । రాజఖండావతంస పురాణపురుష । దీనరక్షకకరుణాత్మ దేవదేవ ॥ గీ॥ మూఁడుమూర్తులకును మూఁడులోకములకు । మూఁడుకా

* మెలకు । జాజ్వల్యమానము గమండుచున్న. మిడుకంజాలక । దుఃఖపడుటకోర్వక. ¶ పొనుఁగువడిన । మండిన-కాలిన. § వివశలైన । మైమఱచిన. అడ్డగెడపు । అడ్డదిడ్డము. అఱవఱలు । తునకలు తునకలు. † చదలు । ఆకాశము. ◆ పేరోలగము । పెద్దసభ.

రారిపుఁడవశ్యు! ముఁగ్రూ విరులతోఁట కేఁగు దెంచి | కోరివచ్చువారి కోర్కెలీ నెడు | వేల్పుబ్రాసుఁ బాల వెల్లిఁ బుట్టె॥ మఱియును గొండగవ్వంబున నంగడలి మథింప నప్సరోజనంబు జనించె నంత॥ క॥ క్రొక్కారు మెఱుఁగు మేనులఁ గ్రిక్కిఱిసి వచన్నకవలుఁ గ్రుస్సిన నడుముల్ పిక్కటిలి యున్న తుఱుములుఁ జక్కని చూపులును దివిజసతులకు నొప్పెన్॥ వ॥ మఱియు నారత్నాకరంబునందు సుధాకరుం డుద్భవించి విరించి యనుమతంబునఁ దన యథాస్థానంబునం బ్రవర్తించుచుండె నంత॥ క॥ తొలుకారు మెఱుఁగు కైవడి | తళతళ యని మేను మెఱయ ధగధగ యనుచున్ | గలుములఁ లీనెడు చూపుల | చెలువంబుల మొదలి టెంకి సిరి పుట్టెన్ నృపా॥ సీ॥ పాలమున్నీటిలోపలి మీఁది మీఁగడ మిసిమి జిడ్డునఁ జేసి మేను వడసి | క్రొక్కారు మెఱుఁగుల కొనల తళుక్కున మేని చేఁగల నిగ్గు మెఱుఁగుఁ జేసి | నాఁడు నాఁటికిఁ బొదనవకంపు తీఁగెలనును పోర నెయ్యంబు నూలుకొలిపి | క్రొక్కారు కెందమ్మి క్రోలునఁ బ్రొద్దునఁ బొలసిన వలపులఁ బ్రోది వెట్టి | పసిఁడి చంపక దామంబు బాగుఁ జెట్టి | వ్రాలు క్రొన్నెల చెలువున వాడి దీర్చి | జాణతనమునఁ జేతుల జాడఁ దీర్చి | నలువ యీ కొమ్మ నొగిఁ జేసి నాఁడు నేఁడు॥ క॥ కెంపారెడు నధరంబును | జంపారెడు నడుము పసిఁడిశంపాలరుచుల్ | సొంపారు మోముఁ గన్నులు | పెంపారుచు నొప్పఁ గప్ప బిఱుఁదును గుచముల్॥ అని జనులు వొగడుచుండ. సీ॥ తరుణికి మంగళస్నానంబు సేయింతు మని పెట్టె నింద్రుఁడనర్ఘమైన | మణిమయపీఠంబు మంగళవతులైన వేలుపు గరితలు విమలతోయ | పూర్ణంబులై యున్న పుణ్యాహకలశంబు లిడిరి పల్లవముల నిచ్చె భూమి | గడిమి గోవులు పంచగవ్యంబులను నిచ్చె మలసి వసంతుండు మధు వొసంగె | మునులు గల్పంబుఁ జెప్పిరి మొగులగములు | పణవ గోముఖ కాహళ పటహ మురజ శంఖ వల్లకీ వేణు నిస్వనము నిచ్చెఁ | బాడి రాడిరి గంధర్వపతులు సతులు॥ క॥ పండిత సూక్తుల తోడుతఁ | దండంబులు సాఁచి తీర్థతోయము లెల్లం | గుండముల ముంచి దిగ్వే | దండంబులు జలక మార్చెఁ దరుణీమణికిన్॥ సీ॥ కట్టంగ పచ్చని పట్టుపుట్టము దోయి ముదితకుఁ దెచ్చి సముద్రుఁ డిచ్చె | మత్తాళినికరంబు మధువాస మూఁగిన వైజయంతిక మాల వరుణుఁ డిచ్చెఁ | గాంచన కేయూర కంకణ కింకిణీ కటకాదులను విశ్వకర్మ యిచ్చె | భారతి యొక మంచి తారహారం బిచ్చెఁ బాణిపద్మము నిచ్చెఁ బద్మభవుఁడు | కుండలిప్రజంబు కుండలముల నిచ్చె | శ్రుతులు భద్రమైన నుతులు సేసె | నెల్ల లోకములకు నేలికసాని వై | బ్రతికెదను చు దిశలు పలికె నధిప॥ మఱియును॥ సీ॥ పలుకుల నమృతంబు చిలుక నెవ్వానితో భాషించు నతఁడె పో బ్రహ్మ యనఁగ | నెలయించి కెంగేల నెవ్వని వరియించె వాఁడె లోకములకు వల్లభుండు | మైదీఁగె నెవ్వని మేనితోఁ గదియించె వాఁడె పో పరమసర్వజ్ఞమూర్తి | నెలఁతుక యెప్పుడు నే యింట వసియించె నాయిల్లు పరమపుణ్యవ్రతపదము | నెలఁత చూపు బారు నెచ్చోటి కచ్చోటు | జిష్ణు ధనద ధర్మ జీవితంబు | కొమ్మ పిన్ననగవు గురుతర దుఃఖని | వారణంబు సృష్టి కారణంబు॥ మఱియు నక్కొమ్మ నెమ్మనంబున ॥ సీ ॥ భావించి యొకమాటు బ్రహ్మాండ మంతయు నాటల బొమ్మరిల్లని తలంచుఁ | బోలించి యొకమాటు భువనంబు లన్నియుఁ దనయింటిలో దొంతులని తలంచుఁ | బ్రాపించి యొకమాటు బ్రహ్మాది సురలను నా యింటిలో బొమ్మలని తలంచుఁ | గొనకొని యొకమాటు కుంభినీచక్రంబు నలవడ బొమ్మపీటని తలంచు | సొలసి యొక్కమాటు సూర్యేందు రోచుల | సచటి దీపకళికలని తలంచు | భామ యొక్కమాటు భారతీ దుర్గల | నాత్మసఖులటంచు నాదరించు॥ తదనంతరంబ॥ గీ ॥ చంచరీకనికర ఝంకార నినదంబు | సనరు నుత్పలముల దండ వెట్టి | మేఘకోటి నడిమి మెఱుఁగు పుత్తడి మాడ్కి | సురల నడుమ నిల్చె సుందరాంగి॥ క॥ ఆకన్నులు నా చన్నులు | నా కురులా పిఱుఁదు నడుము నా ముఖమాన | వ్యాకారముఁ గని వేల్పులు | చీకాకునఁ బడిరి కలఁగి శ్రీహరి దక్కన్॥ వ॥ అట్లు నిలిచి దశదిశలం బరివేష్టించియున్న యక్ష రక్షస్సిద్ధ సాధ్య దితిజ గరుడ గంధర్వ చారణ ప్రముఖ యూథంబులం గనుంగొని పురాణప్రౌఢ కన్యకారత్నంబు దన మనంబున నిట్లని వితర్కించె॥ సీ॥ తమము వైన్యుండ నలవడ దొకచోట నొకచోట సవతితో నోర్వరాదు | తగ నొకచోట సంతత వైభవంబు గా దొకచోట వేడిమి నుండఁ బోల | దొకచోటఁ గరుణ లే దొక్కింత వెదకిన నొకచోట డగ్గరి యుండఁ బెట్టు | నెఱయంగ నొకచోట నిలుకడ చాల దుచర్చింప నొకచోట జడత గలదు | కొన్ని చోట్ల కామగుణ గరిష్ఠంబులు క్రోధసంయుతములు కొన్ని మొదలు | కొన్ని మోహలోభకుంఠితంబులు కొన్ని | ప్రమద మత్సరాను భావకములు. వ॥ అని సకల సత్పురుష జన నవర్తనంబులు మానసంబున పరిహరించి॥ సీ॥ అమరముత్తైమువ నైయుండవచ్చు నవరుసనును సవతు లెవ్వరును లేరు | వెలయంగ నశ్రాంత విభవ మీతని యిల్లు శృంగారచందన శీతలుండు | కలఁగఁ డెన్నఁడు శుద్ధకారుణ్యమయమూర్తి విమలుండు గదిసి సేవింపవచ్చు | నెఱినా మతిబుఁగఁదు నిలుకడ గలవాఁడు సకల కార్యములందు జడత లేదు | సాధురతుఁ డందు షడ్వర్గ రహితుండు | నాథుఁ డయ్యె నేని నడువ నోపు | నితఁడె భర్త యనుచు నిందిరసరోజాతుఁ | బుష్పదామకమునఁ బూజ సేసె॥ క॥ ఇందీవర దామమున ముకుందునిఁ బూజించి దరనకుఁ గూడి వసింపన్ | మందిరముగ దద్వక్షము | నందస లజ్జానుదృష్టి నాలోకించెన్॥ గీ॥ మోహారసముల వలన

బుద్ధియుఁ దాలిమి యొప్పు। సిగ్గువలన బాలశిరము వంచు। నింతి వెఱపువలన నెత్తము వంపదు। గినుకముఖము ప్రాణనాయకుఁ జూచి॥ క॥ హరిసూచిన సిరిచూడదు। సిరిసూచిన హరియుఁ జూడ సిగ్గును బొందన్। హరియును సిరియును దమలో। సరిచూపులఁ జూడమరుఁడు సంపడిఁ జేసెన్॥ చ॥ జగములతండ్రి యైన నరుశౌరి జగంబుల తల్లి నిందిరం। దగనురమందుఁ దాల్చెనఁట దత్కరుణారసదృష్టిచేఁ బ్రజల్। మగుడఁగఁ దొంటిభంగి నజినంగళ సాధ్వి పతిత్వ సంపదన్। న్నెగడిన లోకముల్ నిరనేక శుభంబులం బొందిర త్తఱిన్॥ వ॥ అటమున్న యబ్ధిరాజు తనయందున్న యమూల్యంబైన కౌస్తుభంబు పేరిటి యనర్ఘ మణిరాజంబున య్యంబుజాక్షునకు సమర్పించినఁ దనవక్షఃస్థలంబున ధరియించె నప్పుడయ్యాదిలక్ష్మియు శ్రీవత్స కౌస్తుభ వైజయంతీవనమాలికాది తారహారాలంకృతంబైన పుండరీకాక్షు వక్షఃస్థలంబున వసియించె నయ్యవసరంబున. శా॥ మ్రోసెన్ శంఖమృదంగ వేణురవముల్ మ్రాన్పడి పెంజీఁకటుల్। ల్వాసెన్ నర్తనగానలీలల సురల్ ల్భాసిల్లి రార్యుల్ జగ। ద్వాసున్ విష్ణుని బ్రహ్మదేవముఖరుల్ల్లింగమంత్రంబులం। బ్రాసక్తిన్ వినుతింతి రుల్లసితపుష్పశ్రేణి వర్షించుచున్॥ క॥ ఆ పాల వెల్లి కూఁతురు। తీఁపుల చూపులకుఁ దోఁగి తిలకింపఁ బ్రజల్। ప్పెట్టిరి సంపదలను। బ్రాపించెను మేలు జగము బ్రతికె నరేంద్రా॥ క॥ పాలేటి రాచకన్నియ। నేలారెడు చూపు లేక మిసిమి మసకంచుం। జాలింబుర పురఁ బొక్కుచుఁ। దూలిరి రక్కసులు కీడు దోఁచిన నధిపా॥ క॥ వారిధిఁ దరువఁగ నంతట। వారుణియన నెక్క కన్య వచ్చిన నసురుల్। ల్వారిజలోచను సమ్మతి। వారై కైకొనిరి దాని వారిజనేత్రన్॥ సీ॥ తరుణుండు దీర్ఘదోర్దండుండు కంబుకంధరుఁడు పీతాంబరధారి స్రగ్వి। లాలితభూషణాలంకృతుండరుణాక్షుఁ డున్నతోరస్కుఁడత్యుత్తముండు। నీలకుంచిత కేశనివహుండు జలధర శ్యాముండు మృగరాజసత్త్వశాలి। మణికుండలుఁడు రత్నమంజీరుఁ డచ్యుతునంశాంశ సంభవుం డమలమూర్తి। భూరియాగభాగభోక్త ధన్వంతరి। యనఁగ నమృతకలశహస్తుఁ డగుచు। నిఖిలవైద్యశాస్త్రనిపుణుఁ డాయుర్వేది। * వేల్పువెజ్జు కడలి వెడలి వచ్చె॥ తదనంతరంబ॥ గీ॥ అతని చేతనున్న యమృతకుంభము సూచి। * కెరలు వొడిచి సురలఁ గికురు వెట్టి। పుచ్చికొనిరి యసురపుంగవులెల్లను। మాఱు లేక బలిమి మానవేంద్ర॥ వెండియు॥ గీ॥ చావు లేనిమందు చక్కనమునకబ్బె। ననుచుఁ గడవనసురులడఁచికొనిన। వెఱచి సురలు హరికి మొఱలు వెట్టిరి సుధా। పూ

**శ్రీ విష్ణుమూర్తి మోహినీస్వరూపంబు నొందుట.**

ర్ణ ఘటము పోయెఁ బోయె ననుచు॥ వ॥ ఇట్లు శరణాగతులైన వేల్పుల దైన్యంబు వొడగని భృత్యజనకాముండగు నప్పరమేశ్వరుండు మీరలు దుఃఖింపవలవదేను నా మాయాబలంబునం జేసి మీ యర్థంబు మఱల సాధించెదనని పలికిన సమయంబున నయ్యమృతపూరంబు నేము ముందు ద్రావుము మనితమకించు దైత్యదానవజనంబులలోపల నసంగళంబు సకలి సంభవించిన కతంబునఁ బ్రబలురగు రక్కసులు పిలోకించి సత్రయాగంబునందు నడుచుచందంబునఁ దుల్యప్రయాసహేతువులగు సురలును సుధాభాగంబునఁ గర్తులగుదురు గావునఁ బంచికొందుము టగత్తవ్యంబిది సనాతనంబగు ధర్మంబగుటం జేసి యయ్యమృతకుంభంబు విడువుండని మగ్నులగు నిశాచరులు జాతమత్సరులై తమవారల వారించుచున్న సమయంబున॥ గీ॥ ఒకని చేతనుండ నొకఁడు బలిష్ఠుఁడై। పుచ్చికొనిన వానిఁ బొదువఁ బట్టి। యంతకంటె నధికుఁ డమృతకుంభము నెత్తి। కొంచు పాఱెఁ బరులు గుయ్యిడంగ॥ సీ॥ మెత్తనియడుగులు మెఱుఁగారు జానువులఱటికంబములదోయైన తొడలు। ఘనమగు జఘనంబుఁ గడులేత నడుమును బల్ల వారుణకాంతి పాణియుగముఁ। గడుదొడ్డపాలిండ్లుఁ గంబుకంఠంబును బింబాధరముఁ జంద్రబింబముఖముఁ। దెలికన్నుఁ గవయును నళికుంతలంబులు బాలేందుసన్నిభ ఫాలతలము। నమరకుండల కేయూర హారకంకణాదులే పారమంజీరనాదమొప్ప। నల్లనవ్వులఁ బర్మవళాక్షుఁ డసుర। పశుల నడఁగింపనాఁడు రూపంబుఁ దాల్చి॥ అయ్యవసరంబున జగన్మోహనాకారంబున॥ సీ॥ పాలిండ్లపైనున్న పయ్యెద జాఱించు జాఱించి మెల్లనఁ జక్కనొత్తుఁ। దళుకుతళుక్కను గండఫలకంబు లోలయించు నొలయించి కెంగేల నుజ్జగించుఁ। గడుమెఱుంగులు వారు కడకన్నుల ల్లార్చు నల్లార్చి ఱెప్పలనండఁ గొలుపు। సవరని దరహాసచంద్రికఁ జిలికించుఁ జిలికించి కెమ్మోవిఁ జిక్కువఱచు। దలితధమ్మిల్లి కుసుమగంధమ్ము నెఱపుఁ। గంకణాదిరుణాంకృతుల్ గడలు కొలుపు। నొడలి కాంతులు పట్టు లేకులుకఁ బాఱు। సన్నవలి పెంపు పయ్యెద చౌకళింప॥ వ॥ ఇవ్విధంబున నక్కపటయువతీరత్నంబు జగన్మోహన దేవతయునుం బోలె నెమ్మొగంబు దావి కిమ్ము త్రిళ్లిన తేఁటిమొత్తంబులం గెలిచి దిగురుజొంపంబుల నెడగలుఁ గజడియుచు మురియుచుండ రాక్షసవరులు గనుంగొని॥ సీ॥ ఓఁ గదె లావణ్య మాఁగదే మాధుర్య మాఁగదే సతినవయావనాంగి। యొటనుండి వచ్చితి వేమి చ్చ్ఛయించెదు నీ నామ మెయ్యది నీరజాక్షి। యమరగంధర్వసిద్ధాసుర చారణ మనుజక

* వేల్పువెజ్జు। దేవతావైద్యుఁడు. * కెరలువొడిచి। కోరికలతిశయించి, కికురువెట్టి। లాలనము చేసి. ఖకలి। కలహము. ఖదోయి। జత, జఘన। పిఱుఁదు, పల్లవ। చిగురు, పాణి। హస్తము, పాలిండ్లు। స్తనములు, కంబుకంఠము। శంఖమువంటి కంఠము, బింబాధరము। దొండపండువంటి పెదవి, కవ। జంట, మంజీర। కాలిఅందె

కుంభ, అయోముఖ, ప్రహేతి, హేతి, భూతసంతాప, హయగ్రీవ, కపిల, మేఘదుందుభి, మయ, త్రిపురాధిప, విప్రచిత్తి, విరోచన, వజ్రదంష్ట్ర, తారక, అరిష్ట, రిష్టనేమి, శుంభ, నిశుంభ, శిరోముఖ ప్రముఖులును, పౌలోమ, కాలకేయులును, నివాతకవచ ప్రభృతులును, పక్షి సమండితయోధులు సంఖ్యాకోటియుక్తంబులం, దురగంబుల, మాతంగంబుల, హరిణంబుల, హరి, కిరి, కీట, జలచరంబులను, శరభ, మహిష, గవయ, ఖడ్గ, గండభేరుండ, చమరీ, జంబుక, శార్దూల, గోవృషాదిమృగంబులను, క్రౌంచ, గృధ్ర, కాక, కుక్కుట, బక, శ్యేన, హంసాదివిహంగంబులను, తిమి, తిమింగిలాది, జలచరంబులను, నరులను, నసురసుకరవికృతవిగ్రహరూపంబులగు జంతువుల వారోహించి తమతమ నడియాలంబులగు గొడుగులు, *పడగలు, జోడు, కైదువ, పక్కెర, బొమిడికంబులు మొదలగు పోటుమట్టాయితంబులఁ గైకొని వేలు వేలు §మొనలై విరోచననందనుండగు బలి మున్నట నిలువంబడిరి. దేవేంద్రుండును నైరావతారూఢుండై వైశ్వానర వరుణ వాయు దండధరాద్యనేక నిర్జర వాహినీసందోహంబులును దానును నెనయంబడి పిఱుతివియక మోహరించె నట్లు సంరంభ సన్నాహ సముత్సాహంబుల రెండు దెఱంగులవారును బోరాడు వేడుకల మీఱుచు మాటల సంఘటించుచున్న సమయంబున॥ సీ॥ వజ్రదంష్ట్రాంచిత వ్యాఘ్రచర్మంబులును బర్హాచామరంబులు సితచ్ఛత్రములును। జిత్రవర్ణధ్వజచేలంబులును వాతచలితోత్తరోష్ణీష జాలములును। జప్పళ్లనాసంగు కంకణభూషణంబులుఁ జండాంశురోచుల శస్త్రములును। వివిధ ఖేటకములు పేరవాలికెలును బాణపూర్ణంబులైన తూణములును। నిండి పెచ్చు రేగి నిర్జరాసురవీర। సైన్యయుగ్మకంబు చాల నొప్పె। గ్రాహతతులతోడఁ గలహంబునకు వచ్చు। సాగరముల భంగి జనవరేణ్య॥ క॥ భేరీ భాంకారంబులు। వారణఘీంకారములును వరహయ‡‡హరిహేషల్। భూరథనేమిరవములు। ఘోరములై పెల్లగిల్లెఁ గులశైలంబుల్॥ వ॥ ఇవ్విధంబున నుభయబలంబులు మోహరించి యింద్రునితో బలియుఁ, దారకునితో గుహుండును, హేతితో వరుణుండును, బ్రహేతితోడ మిత్రుండును, గాలనాభునితోడ యముండును, మయునితో విశ్వకర్మయుఁ, ద్వష్టతో శంబరుండును, సవితతోడ విరోచనుండును, నపరాజితుతో నముచియు, వృషపర్వునితో నశ్వినీదేవతలును, బలిశత బాణాది పుత్రశతంబుతో సూర్యుండును, రాహువుతో సోముండును, బులోమునితో ననిలుండును, నిశుంభశుంభులతో భద్రకాళీదేవియు, జంభునితోడ వృషాకపియును, మహిషునితో విభావసుండును, బ్రహ్మపుత్రులతోడ నిల్వలవాతాపులును, గామదేవునితోడ దుర్మర్షుండును, మాతృగణములతోడ నుత్కలుండును, శుక్రునితోడ బృహస్పతియును, నరకునితో శనైశ్చరుండును, నివాతకవచులతో మరుత్తులును, గాలేయులతోడ వసువులు, నమరులును, గ్రోధవశులైన పౌలోములతో రుద్రవిశ్వేదేవగణంబులు, నివ్విధంబునం గలసి పెనంగి ద్వంద్వయుద్ధంబు సేయుచుఁ దఱియుచు రథికులు రథికులను బదాతులు పదాతులను వాహనారూఢులు వాహనారూఢులం దాఁకి సింహనాదంబులు సేయుచు, నట్టహాసంబు లిచ్చుచు, నాహ్వానంబు లొసంగుచు, నన్యోన్యతిరస్కారంబులు సేయుచు, బాహునాదంబుల విజృంభించుచుఁ, బెనుబొబ్బలు బిట్టు రేఁగుచు, హుంకరించుచు, నహంకరించుచు, ధనుర్గుణంబుల టంకరించుచు, శరంబుల నాటించుచుఁ, ‡పరశువుల నడచుచుఁ, జక్రంబులం జెక్కుచు, శక్తులం దునుముచుఁ, గశలం బెట్టుచుఁ, గుఠారంబులం బొడుచుచు, గదల నడుచుచుఁ, గరంబులం బొడుచుచుఁ, గరవాలంబులం ద్రెయ్యుచుఁ, బట్టసంబుల నొంచుచుఁ, బ్రాసంబులం ద్రెంచుచుఁ, బాశంబులం గట్టుచు, బరిఘంబుల మొత్తుచు, ముసలంబుల మోదుచు, ముద్గరంబులం జదియుచు, ముష్టివలయంబుల ఘట్టించుచుఁ, దోమరంబుల నుఱుముచు, శూలంబులఁ జిమ్ముచు, నఖంబులం జీరుచు, దరుశైలంబుల నువ్వుచు, నుల్ముకంబులం జెఱుచుచు, నిట్లు బహువిధంబులం గలహవిహారంబులు సలుపు ననవరతంబున భిన్నంబులైన శిరంబులును, విచ్ఛిన్నంబులయిన కపాలంబులును, వికలంబులయిన కపోలంబులును, జిక్కులువడిన కేశబంధంబులును, భగ్నంబులయిన దంతంబులును, కృత్తంబులయిన భుజంబులును, ఖండితంబులయిన కరంబులును, దళితంబులయిన మధ్యంబులును, వికృతంబులయిన వదనబింబంబులును, వికలంబులయిన నయనంబులును, విశీర్ణంబులయిన కర్ణంబులును, విశీర్ణంబులయిన నాసికలును, విఱిగిపడిన యూరుమధ్యంబులును, వితథంబులయిన పదంబులును, జినిగిన ¶కంకటంబులును, వ్రాలిన కేతనంబులును, గూలిన ఛత్రంబులును, మ్రొగ్గిన గజంబులును, నుగ్గిన రథంబులును, నుఱుమైన

* పడగలు। జండాలు, జోడు। కవచము, కైదువ। ఆయుధము, పక్కెర। పినుఁగునకుఁ దొడిగెడు చొక్కా, బొమిడికము। శిరఃకవచము. § మొన। సైన్యము. ‡‡ హరిహేషల్। గుఱ్ఱముల సకిలింతలు. ‡ పరశువు। గండ్రగొడ్డలి, దునుము। చంపు, కశ। కొఱడా-చిల్లగోల, కుఠారము। గొడ్డలి, గద। ఇనుపగుదియ, కరవాలము। ఖడ్గము-పెద్దకత్తి, పట్టసము। ఆయుధవిశేషము. ప్రాసము। ఈటె-బల్లెము, పరిఘ। ఇనుపకట్లగుదియ. ముద్గరము। కురుచయినపదుడ్డు, ముష్టి। పిడికిలి, తోమరము। నేజా-చబుకు. ఉల్ముకము। కొఱవి, భిన్న। బద్దలైన, విచ్ఛిన్న। నఱకఁబడిన, భగ్న। విఱిగిన, కృత్త। నఱుకఁబడిన, విదళిత। కొట్టఁబడిన. ¶ కంకటంబు। కవచము.

చుసం|బంధాలాపములాడి మాన్పెసురలం బాంధవ్యవంశాగ్రణీ॥ వ॥ ఇట్లు నారదవచననియుక్తులై రాక్షసులతోడి సం గ్రామంబు సాలించి సకలదేవముఖ్యులును త్రివిష్టపంబునకుం జని రిహతశేషులైన దైత్యదానవులు విపన్నులై నబలిం దోడ్కొని పశ్చిమశిఖరిశిఖరంబుఁ జేరిరి విధ్వంసమానకంధరులయి వినష్టదేహులగు యామినీచరుల నెల్లను శుక్రుండు మృతసంజీవని యైన తనవిద్య పెంపునం జేసి బ్రతికించె బలియును భార్గవానుగ్రహంబున విగతశరీరవేదనుండై పరాజితుం డయ్యును లోకకాలవిచక్షణుం డగుటం జేసి దుఃఖింపకయుండె నని చెప్పి రాజున కిట్లనియె॥ సీ॥ కైలాసగిరిమీఁద ఖం డేందుభూషణుం డొకనాఁడు కొలువున్న వేళ సంగనయై విష్ణుఁ డసురుల వంచించి సురలకు నమృతంబు చూఱలిడుట విని దేవియును దాను వృషభేంద్రగమనుఁడై కడు వేడ్క భూతసంఘములు గొలువ మధుసూదనుం డున్న మందిరంబున కేగి పు రుషోత్తమునిచేతఁ బూజ లొంది తానుఁ గూర్చుండి పూజించె వనజవైరిఁ గుశలమే మీకు మాకును గుశల మనుచు మధుర భాషలహరిమీఁద మైత్రి నెఱపి హరుఁడు పద్మాక్షుఁ జూచి యిట్లనియెఁ బ్రీతి॥ సీ॥ దేవ జగన్మయ దేవేశ జగదీశ కాలజగద్వ్యాప కస్వరూప యఖిలభూతములకు నాత్మహేతువు నైన యాదియీశ్వరుఁడ వాద్యంతములకు మధ్యంబు బయలును మతిలోప లయులేక పూర్ణమై యమృతమై భూరిసత్యమానంద చిన్మాత్రమవికారమాద్యమనన్యమశోకంబు నఖిలగుణము సంభవస్థి తిలయములసంగరహితమైన బ్రహ్మంబు నీవ నీయంఘ్రియుగము నుభయసంగవిస్పృష్టులై యున్న మునులు గోరి కైవల్యకా ములై కొల్తు రెప్పుడు॥ సీ॥ భావించి కొందఱు బ్రహ్మంబు నీవని తలపోసి కొందఱు ధర్మమనియుఁ జర్చించి కొందఱు సదసదీశ్వ రుఁడని నెరసఁ గొందఱు శక్తిసహితుఁడనియుఁ జింతించి కొందఱు చిరతరుం డవ్యయుఁ డాత్మతంత్రుఁడు పరుం డధికుఁడని యుఁ దొడరి యూహింతు రుభయదినద్వయ సదసద్విశిష్టసంశ్రయుఁడ వీవు తలఁప నొక్కింత వస్తుభేదంబు గలదె కంక ణాదులు పసిఁడి యొక్కటియుఁ గాదె కడలు పెక్కైన వార్ధి యొక్కటియ కాదె భేదమంచును నిను వికల్పింపవలదు॥ సీ॥ యవ్విలాసము నరిచ్ఛాను లెఱుంగరు నిత్యుఁడవై యున్న నే నెఱుంగ యన్మాయ నంధులై యసురాసురాదులు వనరె పగటయున్న వారలెంత నేరూపమునఁ బొందకే పారుదువు నీవు రూపివై సకలంబు రూపుసేయ రక్షింపఁ జెఱుపఁ గారణ మైన సచరాచరాకృతి మై విలసిల్లు నంబరమున ననిలుఁ డేరీతి విహరించు నట్ల నీవు గలసి వర్తింతు సర్వాత్మకత్వ మొప్ప। జగ ములకు నెల్ల బంధమోక్షంబు నీవ నీవ సర్వంబు వలపో యనీరజాక్ష॥ మ॥ ఘనతన్నీ గుణపోషములు బలుమాఱుం గన్నారఁగ న్నారమే నిను విన్నారము చూడ మెన్నఁడును మున్నీయా హుచందంబు మోహినివై దైత్యులకన్నుఁ బ్రామి యమృతంబిం ద్రాదిదేవాళికిఁ బ్బిన నీరూపము చూపు మా కుతుకము చిత్తంబున సంబుట్టెడిన్॥ క॥ మగవాఁడవై జగంబులఁ దగిలి వివి కులను బెట్టుదు వంటదు నీకుం బా గువతి తనంబున జగములఁ దగులముఁ బొందింతు వెంతదడవు ముకుందా॥ వ॥ అనిపలుకుచున్న శూలపాణిచేత నపేక్షితుండై విష్ణుండు భావగంభీరంబగు నవ్వు నివ్వటిల్ల నవ్వామదేవునకిట్లనియె॥ శా॥ శ్రీకంఠా నినుఁ నీవ యేమఁ జూడ నిమ్మిచిత్తంబు రంజించెడి న్నాకద్వేషులఁ దానురించుటకునై నాఁడేను గైకొన్న కాం తాకారంబు జగన్నిమజ్జనము నీకేఁ జూచెదే చూపెదన్ గైకోనర్హములం త్రకాముకులు సంకల్పప్రభావంబులన్॥ వ॥ అని పలికి కమలలోచనుండంత

## శ్రీహరి తన మోహినీరూపంబుచేత నీశ్వరుని మోహింపఁ జేయుట.

స్త్రీ ఁ తుండయ్యె నయ్యుమాసహితుండయిన భవుండు విష్ణుం డెచటఁ బోయెనో యెందుఁ జొచ్చెనో యని దశదిశలుం గలయ నవలో కించుచుండ నందు పురోభాగంబున॥ సీ॥ ఒకయెలదోఁటలో నొక వీథి నొక నీడఁ గుచకుంభములమీఁదఁ గొంగు దలఁగఁ గబరికాబంధంబు గంపింప నుపటిమై జికురజాలంబులు దిక్కు వడఁగ నసుమాన నైపుణ్యముల్లాడఁ జెక్కులఁ గర్ణకుండల కాంతి గంతులిడఁగ నారోహభరమున నడుగులు వడఁబడ దృష్టిదీప్తిసంఘములు దిశలు గప్ప వామకరమున జారిన వలువ పట్టి కన కనూపురయుగళంబు ఘల్లనంగఁ గంకణంబులు ఝణఝణత్కార మెసఁగ బంతి చేనాడు ప్రాయంపుబింతిఁ గనియె॥ వ॥ కని మున్ను నగవుతో జిగిసగమయిన మగవాఁడమ్ము నవవయోరూపగుణవిలాసంబులు దన్ను నాటింపరగను వెట్టక తప్పక చూ చి మెత్తనైన చిత్తంబున॥ శా॥ ఈ కాంతాజనరత్న మెవ్వరిదొకో యీ యాకారరూపంబును న్నేకల్పంబులయందుఁ గాన మజుఁ డీయింతి నెన్న సృజింపఁగ దా లేఁడుం బెల్లనిజంబు వల్లభతనీలీలావశం జేరఁగా నే కాంతుండు గలండొ క్రీడలకు నాకీయింతి సిద్ధించునే॥ వ॥ అనిమానిమియుం జెఱకువిలుకాని కోలలు మేలు నీటి సెల్లాను నెఱబిఱుసు వెంగు సడం దెరవ మేమిన శ్రోణు లు ముదిగిఁ జిడిపడలిక దలి భుజముల మెడ్డలన దిటిచెదరిన కురులు మొసలిన మృగమదతిలకంపు టసలనసలవిసవిసనగు మొగ ము మెఱుంగులు దశదిశలం బసలు గొలుపఁ జెలువగు మెఱయను మజుపాటఁ గడుం బడి పులకలుగొన హృదయానందకందకం

---

*వనదెదరుఁ దుఃఖించుచున్నారు. కుతుకము సంతోషము. ¶కబరీబంధము కొప్పు. ఆరోహము పిఱుఁదు. తురుము కొప్పు.

బగుకందుకంబు కరారవిందంబునం దెనుల్చి యక్కడ నెగర్చి చెక్కన హత్తించి చుబుకంబు మోపి చూచుకంబులం గది
యించినఖంబుల మీటుచు మెల్ల మెల్లనఁ గెల్లాడుచుఁ గరకమలముల కనకమణివలయములు ఝుణఝుణంబనం గుచకలశ
ములు నొక్కటికొక్కటి నొఱయ నెడనెడ కుడినిందడంబడఁ గ్రమ్మన నెగరఁ జిమ్ముచు నెగరఁ జిమ్మి తనకుఁదానె కొన్ని చిన్ని పన్ని
దంబులు చేసుకొని బహుగునడుము బెడఁగి వడవడవడంక నరుణిసగులు కలయం బడఁ దిఱుగుచుఁ బెనుకువలుగొనఁ జెవులతో
డవులరుచులు గటములనటనములు సలుపం బవిరి తిఱిగి యొడయుచు, నొడిసి కెలంకులకుం జడియుచు, జడిసి జడనుపడక వలు
వ నెలవు వదిలి దిగంబడం గటిస్థలంబునం గాంచీకనకమణికింకిణులు మొఱయఁ జరణకటకమ్ములు ఘల్లుఘల్లనంగ మితిదప్పి
న మోహాతిరేకంబునుప్పొంగ వెనుకొని యుఱికిపట్టుచుఁ బట్టిపుడమిఁబడవైచి పాటువెంట నెమింటికెగసినం గెంటకఁ గరం
బునం గరంబు దిరంబై పలుమాఱునడఁచుచు, నెగయు నెడ దిగంబడుతఱి నీలంపు మెఱుంగునిగ్గు సోగవగ్గంబులు వలలువైచి రా
దిగిచిన పగిది వెనుకొనం గవిలోకనజాలంబులు నిగుడించుచుఁ, గరలాఘవంబున నొక్కటి సదినూఱు వేయి సేసి నేర్పు వాటిం
చుచు, నరుణచరణకమలరుచులనుదయశిఖరిశిఖరతరణికిరణి సేయుచు ముఖచంద్రచంద్రికలు మండలంబులు గావించుచు
నెడనెడ నురోజమగ్ననిగ్గత చేలాంచలంబుఁ జక్కనొత్తుచుఁ, గపోలఫలకాలోలఘర్మజలబిందుబృందంబులు నఖాంతంబుల
నోసరించుచు, నధరబింబారుణసంభ్రాంత సమాగతరాజకీరంబులం జోపుచు, ముఖసరోజపరిమళాసక్తమత్తమధుపం
బుల నివారించుచు, మందగమనాభ్యాస కుతూహలాయత్తమరాళయుగ్మంబులకుం దలంగుచు, విలాసవీక్షణానందితమ
యూరమిథునంబులకు నెడగలుగుచుఁ, బొదరిండ్లయూరంబులకుం బోకమాలంగుచుఁ, గరకిసలయాస్వాదకాముకకలకంఠ
దంపతులకు దూరించుచుఁ, డీఁగెయుయ్యేలలనూఁగుచు, మాధవీమంటపంబు లెక్కుచుఁ, గుసుమరేణుపటలంబుల గుబ్బల్లు
వ్రాకుచు, మకరందస్యందబిందుబృందంబుత్తరించుచుఁ, గృతకశైలంబుల నారోహించుచుఁ, బల్లవపీఠంబులం బరిశ్రమం
బుపుచ్చుచు, లతాసౌధభాగంబులం బొడఁజూపుచు నున్నత కేతకీస్తంభంబుల నెఱుఁగుచుఁ, బుష్పదళఖచితవాతాయనం
బులందొంగిచూచుచుఁ, గమలషండపాలికల నాలంబించుచుఁ, జంపకగేహాళీమధ్యంబుల నిలువంబడుచుఁ, గదళికాపత్త్రవా
తంబుల నొఱయుచు బరాగనిర్మితసాలభంజికానివహంబుల నాదరించుచు, మణికుట్టిమంబుల మురియుచుఁ, జంద్రకాంత వేదిక
ల నెలయించుచు, రత్నపంజరశారికానివహంబులకుం జదువుఁ జెప్పుచుఁ, గోరినక్రియం జూచుచుఁ, జూచినక్రియ మెచ్చుచు
మెచ్చినక్రియ వెఱఁగుపడుచు, వెఱఁగుపడినక్రియ మఱచుచు, మఱవక నేకాంతంబగు నవ్వనాంతంబునననంతవిభ్రమంబు
లజగన్మోహినియై విహరించుచున్న సమయంబున॥ గీ॥ వాలుగంటి వాఁడి వాలారు చూపుల। శూలి ధైర్యమెల్లఁ గోలుపోయి।
తఱిమియెఱుక లేకమఱచె గుణంబుల। నాలి మఱచె నిజగణాలి మఱచె॥ అప్పుడు॥ గీ॥ ఎగరవైచి పట్టనెడ లేమి చేజప్పి। వ్రాలు
బంతిఁ గొనఁగ వచ్చునెడను। బడఁతి వలువ వీడి పడియె మారుతహతిఁ। జంద్రధరుని మనము సంచలింప॥ మ॥ గుదిరాపాంగనిప
ప్రబంధనపరగ్రోమాంచ విభ్రాజితం। గుచభారానమితం గరద్వయపుటీగూఢీకృతాంగిం జలి। త్కచబంధం గనిమన్మథా
తురతనాకంపించి శంభుండు। లజ్జ చలింపం దనకాంత సూడఁగదిసెం జంద్రాస్య కేల్దమ్మికిన్॥ గీ॥ పడము సేరవచ్చు ఫాలా
క్షుఁ బొడఁగని। చీరవీడిపడిన సిగ్గుతోడ। మగువ నగుచుఁ దరుల మాటున డాఁగెను। వేల్పు ఱేఁడు నబల వెంటఁబడియె॥ వ॥ ప్ర
బలోద్యత్కరిణిం గరీంద్రుఁ డురమింపన్వచ్చు లీలన్నిపుం। డబలాపోకుము పోకు వేయనుచు డాయం బాఱి కెంగేలఁ దాఁ। గ
బరీబంధము పట్టి సంభ్రమముతోఁ గౌఁగిళ్లమారార్చెనం। తబహిర్విప్రక్రియ నెట్టకేలఁ గదియం దద్బాహు నిర్ముక్తయై॥
సీ॥ వీడి వెన్నుననాడు వేణీభరంబుతో జఘనభారాగత శ్రాంతితోడ। మాయావధూటియై మఱలి చూచుచుఁ బాఱు విష్ణున
చ్యుతకర్మ వెంటఁదగిలి। యీశానుమఱలజయించె మదుండన గరిణి వెన్కనుకరికరణిఁ దాల్చి। కొండలు నేఱులుఁ గోలఁకులు
వనములు దాఁటి శంభుఁడు సనందనమహాత్మ। నిర్మలా మోఘవీర్యంబు నేలమీఁదఁ। బడినచో నెల్ల వెండియు పైఁడియయ్యె।
ధరణి వీర్యంబు పడఁ దన్నుఁదా నెఱింగి। దేవమాయాజడత్వంబు దెలిసె హరుఁడు॥ క॥ జగదాత్మకుఁడగు శంభుఁడు। మగిడెను
హరి నెఱిఁగి తనను మాహాత్మ్యమున। న్విగతత్రపుఁడై నిలిచెను। మగువతనంబుడిగి హరియు మగవాఁడయ్యెన్॥ గీ॥ కాముఁ
గెలువవచ్చుఁ గాలారి గావచ్చు। మృత్యుజయము గలిగి మెఱయవచ్చు। నాఁడువారిచూపు టంపఱ గెలువంగ। వశము గాదు
త్రిపురవైరికైన॥ వ॥ ఇట్లు పురుషాకారంబు వహించిన హరిహరునకిట్లనియె॥ సీ॥ నిఖిలదేవోత్తమ నీవొక్కరుఁడు దక్క నె
వ్వఁడు నా మాయ నెఱుఁగ నేర్చు। మానినియైన నా మాయ చే మునుఁ గకదృతి మోహితుండవై తెలిసితీవు। కాలరూపంబునఁ
గాలంబుతోఁ దుత నాయంశ మనీ మాయ నధివసించు। నీ మాయ నన్ను జయింపనేరదు నిజమకృతాత్ములకు నెట్లు మనుపలభ్య।
మిపుడు నీ నిష్ఠ పెంపున నిలిచితనుచు। సత్కరించి వివసఖ్యంబు చాల నెఱపి। దత్తుతనయగణంబులుఁ దన్నుఁ గొలువ। భవుఁడు వి

చ్చె సేఁదననిజభవనమునకు॥ శా॥ పారావారముఁ ద్రచ్చుచో గిరిసముద్యద్భారమై కచ్ఛపా। కారుండై నరమేశువర్తనము
నాకర్ణింపఁ గీర్తింపసం। సారాంభోనిధిలో మునుంగకుజనుల్సంశ్రేయముం బొందివి। స్తారోదారసుఖంబుఁ జెందమదురుత
థ్యంబెంతయున్నాధవరా॥ వ॥ ఎలమిన్ దైత్యులనాఁడు రూపమున మోహింపించి పీయూషముం। జలితాపన్నులకున్ సురో
త్తములకుం జక్కన్ విభాగించి నిర్మలరేఖన్ విలసిల్లు శ్రీవిభునిఁ దన్మాయావధూరూపముం। దలఁతున్ మ్రొక్కెదు నాత్మలోన
మరితధ్వాంతోగ్రరూపంబుగన్॥ అని చెప్పి శుకుండిట్లనియె॥ గీ॥ నరవరాధీశ యిప్పుడు నడచుచున్న। వాఁడు సప్తమమనువు
వైవస్వతుండు। శ్రాద్ధదేవుండనం బరగు జనవరేణ్య। పదురు నందనులతనికిఁ బ్రకటబలులు॥ వ॥ వారలిక్ష్వాకుండును, నభగుం
డును, ధృష్టుండును, శర్యాతియు, నరిష్యంతుండును, నాభాగుండును, దిష్టుండును, కరూశకుండును, పృషధ్రుండును, వసుమం
తుండునను వారు పదుగురు రాజులు- పురందరుండను వాఁడింద్రుండు, నాదిత్యమరుదశ్వినీవసురుద్రసంజ్ఞలుగలవారు దే
వతలుఁ-గౌతమకశ్యపాత్రివిశ్వామిత్రజమదగ్నిభరద్వాజవసిష్ఠులను వారు సప్తఋషులై యున్నవారందుఁ గశ్యపునకదితి
గర్భంబున విష్ణుండు వామనరూపుండై జనియించి యింద్రావరజుండయ్యె నిప్పుడేడు మన్వంతరంబులు సెప్పంబడియె-గాఁ
గలమన్వంతరంబులును, శ్రీహరిపరాక్రమంబుం జెప్పెద దత్తావధానుండవై వినుమని శుకుండిట్లనియె॥ సీ॥ జననాథ సంజ్ఞ
యుఛాయయునను వారు గలరర్కసతులు విశ్వకర్మతనయ। లిరువురు వల్లభలిటమున్న చెప్పితిఁ బరగఁ దృతీయయు బడబయనఁ
గ। సంజ్ఞకు యముఁడును శ్రాద్ధదేవుండును యమునయుఁ బుట్టిరి హర్ష మెసఁగ। ఛాయకుఁ దపతియు సావర్ణియును శనైశ్చ
రుఁడును గలిగిరి సంవరణుఁడు। తపతి నాలుగఁ గైకొని లావరించె। నశ్వియుగళంబు బడబకు నవతరించె। వచ్చునష్టమమనువు
సావర్ణి వాఁడు। తపము సేయుచున్నాఁడు ధరణినాథ॥ క॥ ఒకపరిఁ జూచిన వెండియు। నొకపరిఁ జూడంగలేక నుండు సిరుల
కు। న్నొక నొకని చేటు వేళకు। నొకఁడొక్కఁడు మనువుగాచి యుండు నరేంద్రా॥ వ॥ సూర్యసావర్ణి మన్వంతరంబున నత
నితనయులు నిర్మోహవిరజస్కాద్యులు రాజులును, సుతపోవిరజామృతప్రభులను వారు దేవతలును, గాఁగలరు గాలవుండు
ను, దీప్తిమంతుండును, పరశురాముండును, ద్రోణపుత్రుండగు నశ్వత్థామయు, కృపుండును, సజ్జనకుండగు బాదరాయ
ణుండును, ఋశ్యశృంగుండను వారు సప్తఋషులయ్యెదరు వారలిప్పుడు దమతమ యోగబలంబుల నిజాశ్రమమండలంబుల
జరియించుచున్నవారు విరోచననందనుండగు బలి యింద్రుండయ్యెనని చెప్పి శుకుండిట్లనియె॥ సీ॥ బలిమున్న నాకంబు బలిమి
మైఁ జేకొన్నవానునుండై హరి వచ్చి వేడఁ। బాదత్రయంబిచ్చి భగవన్నిబద్ధుఁడై సురమందిరముకంటె సుభగమైన। సుతల
లోకంబున సుస్థితిని న్నాఁడు వెతలేక నిటమీఁద వేదగుహికి। నాసరస్వతికిఁ దానంట సార్వభౌముండు నా ప్రభువై హ
రినాకవిభునిఁ। బదవిహీనునిఁ జేసి బలి దెచ్చి నిలుపును। బలియు నిర్జరేంద్రపదము నొందు। నింద్రపదము హరికి నిచ్చిన కత
మున। దానఫలము చెడమి ధరణినాథ॥ వ॥ అటమీఁదటి కాలంబున వరుణనందనుండగు దక్షసావర్ణి దొమ్మిదవమనువయ్యెడి
నతనికొడుకులు, ధృతకేతుదీప్తకేతుప్రముఖులు రాజులును, బరమరీచిగర్గాదులు నిర్జరులును, నద్భుతుండను వాఁడింద్రుం
డును. ద్యుతిమత్ప్రభృతులగు వారలు ఋషులునయ్యెదరందు॥ గీ॥ దనుజహరణుఁడంబుధార కాయుష్మంతు। నకు జనించి రక్ష
ణంబు సేయ। మూఁడులోకములను మోదంబుతో నేలు। నద్భుతాఖ్యనొప్పు నమరవిభుఁడు॥ వ॥ మఱియు నుపశ్లోకసుతుండ
గు బ్రహ్మసావర్ణి దశమమనువయ్యెడిఁ దత్పుత్రులు భూరిషేణాదులు భూపతులును. హవిష్మత్ప్రముఖాదులు మునులును,
శంభుండను వాఁడింద్రుండును, విబుద్ధాద్యులు నిర్జరులునయ్యెదరందు॥ గీ॥ విశ్వజిత్తునింట విభుఁడు విషూచికిఁ సంభవించు నం
శసహితుఁడగుచుఁ। జెలిమి శంభుతోడఁ జేయు విష్వక్సేనుఁ। డనఁగ జగముఁ గాచు నవనినాథ॥ వ॥ మఱియుం దదాగమిష్య
త్కాలంబున ధర్మసావర్ణి పదనకొండవ మనువయ్యెడి మనుతనూజులు సత్యధర్మాదులుపదుండ్రు ధరణిపతులును, విహంగ
మకామగమన నిర్వాణరుచులను వారు సురలును, వైధృతుండను వాఁడింద్రుండు, నరుణాదులు ఋషులయ్యెదరందు॥
గీ॥ అంబుజాతనేత్రుఁ డాసూర్యసూనుఁడై। ధర్మసేతువనఁగఁ దగఁ జనించి। వైభవాఢ్యుఁడగుచు వైధృతుఁడలరంగఁ। గరు
ణం ద్రిజగము బను గావఁగలఁడు॥ వ॥ మఱియుఁ దద్భవిష్యత్సమయంబున భద్రసావర్ణి పండ్రెండవమనువయ్యెడి-నతనినంద
నులు దేవవదుపదేవదేవశ్రేష్ఠాదులు వసుధాధిపతులును, ఋతుధాముండను వాఁడింద్రుండును, హరితాదులు వేల్పులు
ను, తపోమూర్తితపాగ్నీధ్రకాదులు ఋషులయ్యెదరందు॥ గీ॥ జలజలోచనుండు సత్యతపస్సూనృతలకు సంభవించుఁ దన
యుఁడగుచు। ధరణిఁ గాచునంచితస్వధామాఖ్యుఁడై। మనువుసంతసింపమానవేంద్ర॥ వ॥ మఱియుం దేవ్యత్కాలంబున
నాత్మవంతుండగు దేవసావర్ణి పదమూఁడవమనువయ్యెడి- మనుకుమారకులు చిత్రసేనవిచిత్రాదులు జగతీనాయకులు-సు
కర్మసుత్రామసంజ్ఞలుగలవారు బృందారకులును, దివస్పతియను వాఁడింద్రుండును, నిర్మోహతత్త్వదర్శాద్యులు ఋషు

లయ్యెదరంత॥ గీ॥ అవని దేవ కుమారుండై నగీష్పతికిన్ యోగవిభుఁడు వాఁగ నుద్భవించి వనజనేత్రుఁ డాదివస్పతి కెంతయు సఖ్యమాచరించు జగతినాథ॥ వ॥ మఱియు నట వచ్చు కాలంబున నింద్రసావర్ణి పదునాలుగవ మనువయ్యెడి. మనునందనులు నుగంభీరవస్త్వాదులు రాజులును, బవిత్ర చాక్షుషులను వారు దేవగణంబులును, శుచియను వాఁ డింద్రుండును, అగ్ని, బాహు, శుచి, శుక్ర, మాగధాదులు ఋషులు నయ్యెదరంత॥ గీ॥ తనర సత్రాయణునకు వితానయందు భవము నొందెడి హరి బృహద్భానుఁ డనఁగ విస్తరించుఁ గ్రియాతంతువిసరములను నాకవాసులు ముద మొందన రవరేణ్య॥ క॥ జగదీశ త్రికాలములను భోగమొందు మనుప్రకారములు సెప్పఁబడె న్దగఁ బదునలువురు మనువులు దెగ యుగములు వేయు నడువ దివమజునకి నుర్వా॥ వ॥ అనినఁ బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె॥ గీ॥ ఈపదంబులం దుమీ మనుప్రముఖుల నెవ్వరను వారలేమి కతన నధికవిభవులై రి హరి యేల జనియించె నెఱుఁగఁబలుకు మాకు నిర్ధచరిత॥ వ॥ అనినం బారాశర్యకుమారుం డిట్లనియె॥ సీ॥ మనువులు మునులును మనుసుతు లింద్రులు నమరులు హరియాజ్ఞ నడఁగువారు యజ్ఞాదులందెల్ల హరి పౌరుషాకృతులా మనువులు దత్సహాయశక్తి జగములు నడుపుచు రొగి నాల్గుయుగముల కడపటఁ గాలసంగ్రస్తమైన నిగమచయంబును నిజతపోబలముల మఱలఁ గాంతురు ఋషివరులు దొంటి పగిది ధర్మంబు నాలుగు పాదములను గలిగి వర్తించు మనువులు కమలనేత్రు నాజ్ఞఁ దిరుగుచు రేలుదురవనిపతులు జగతి భాగించి తమతమ సమయములను॥ వ॥ మఱియుం బ్రాప్తులైన వారల నింద్రపదంబులను, బహుప్రకారంబుల దేవపదంబులను, హరి ప్రతిష్ఠించుచుండు. వారలు విహితకర్మంబుల జగత్త్రయంబు నుంబరిపాలింతురు. లోకంబులు సువ్యష్టంబులై యుండు॥ సీ॥ యోగీశరూపుఁడై యోగంబుఁ జూపుచు మహానిరూపమునఁ గర్మంబు దాల్చు సర్గంబు సేయుఁ బ్రజాపతిరూపుఁడై యింద్రుఁడై దైత్యుల నేపడంచు జ్ఞానంబు నెఱిఁగించుఁ జతురసిద్ధాకృతిఁ గాలరూపమునఁ బాకంబు సేయు నానావిధాకారనామ రూపంబులఁ గర్మలోచనులకుఁ గానఁబడఁడు చనినరూపములను జనురూపములనింకఁ జనఁగనున్న రూపచయము నతఁడు వివిధుఁడై యనేకవృత్తి వెలుంగును విష్ణుఁ డవ్యయుండు విమ

✻ వామనచరిత్రకథాప్రారంభము. ✻

లచరిత॥ అనిన భూవరుం డిట్లనియె॥ మ॥ బలి నంభోరుహనేత్రుఁ డేమికొఱకై పాదత్రయిన్ వేఁడెను శ్వలుఁడున్ బూర్ణుఁడు లబ్ధకాముఁడు రమాసంపన్నుఁడై దాంబర స్థలికిన్ దీనునిమాడ్కి నేలచనియెన్ దప్పేమియున్ లేకసి మ్మలు మ్మంబంధన మేల చేసె నువిసంగౌతూహలంబయ్యెడిన్॥ అనిన శుకుం డిట్లనియె॥ సీ॥ పురుహూతుచే నొచ్చిపోయి భార్గవుల చే బలి యెట్టకేలకు బ్రతికి వారి చిత్తంబు రాఁగొల్చి శిష్యుఁడై వర్తింప వారు నాతని భక్తి వలన మెచ్చి విశ్వజిద్యాగంబు విధితోడఁ జేయింప భవ్యకాంచనపట్టబద్ధరథము నర్కవాజులఁ బోలు హరులు కంఠీరవధ్వజము మహాదివ్యధనువుఁ బూర్ణతూణయుగళంబుఁ గవచంబుఁ దోలుత హోమపావకుం డిచ్చె *నమ్లానపద్మమాలఁ గలుషహరుఁడగు తన తాత కరుణ నొసఁగె సోమసంకాశశంఖంబు శుక్రుఁ డిచ్చె నివ్విధంబున॥ క॥ పాణియు రథియుఁ గృపాణియు దూణియు ధన్వియును స్రగ్వి తురగియు దేహత్రాణియు ధిక్కృతవిమత ప్రాణియు మణికనకవలయపాణియు నగుచున్॥ వ॥ పలుదానంబుల విప్రులం దనిపి తద్బ్రాహ్మణాశీర్వాదంబులం బొంది పెద్దలకున్ మ్రొక్కి విశిష్టదేవతల నంతర్భక్తిఁ బూజించి నిర్మలుఁ బ్రహ్లాదునిఁ జీఱి నమ్రశిరుఁడై రాజద్రథారూఢుఁడై వెలిఁగెన్ దానవభర్త శైలశిఖరోద్వేలద్దవాగ్నిప్రభన్॥ క॥ దండితమృత్యుకృతాంతులు ఖండితసురసిద్ధసాధ్యగంధర్వాదుల్ పిండితదిశలు మరాహితదండాధీశ్వరులు సములు దన్నుం గొలువన్॥ క॥ చూపులఁ గదనము ద్రింగుచు నేపున దివిభువి యనావళీ వల సేయన్ రూపించుచు దనుజేంద్రుఁడు ప్రాపించెను దివిజనగరపథమున రేంద్రా॥ వ॥ ఇట్లు బలవంతుండగు బలి సురేంద్రుని సాధింపను ట్టిదండగమనంబు సేసి నిజదపయనంబుల జనిచని॥ మ॥ కనియెన్ బ్రాజ్యజనౌకము న్విగతరోగస్వప్నపీడాన్వఖా వనసంకేతముఁ బుష్పపల్లవఫలోద్దామద్రుమానీకము న్స్వనితోద్ధూతపతాకమున్ విచరద్దివ్యమానికానీకము స్వర్ణగంగాసలిలైకము న్మఘవయుక్తశ్రీకము న్నాకమున్॥ వ॥ కని రకరసుల ఱేఁడు వెక్కసంబై చాల్పుగల వేల్పుల నెలవు దరియం జొచ్చి చెచ్చెర ముందట కుంజనిచని ముందట నెడపడక మొన మొగ్గ యిగురు చిగురుతలిరాకు జొంపంబున న మొగుడ మొగ్గ యఱవిరి నెఱవిరి గుత్తి పిందె పూఁపదోరగాయ పండు గెలంకతండంబుల వ్రేఁగున వ్రేఁగులాగ వ్రేక మూఁగి వీఁగి క్రేఁకలగు మ్రాఁకుల ప్రోఁకలకుఁ జెంతలగు పెందోఁటలును, తోఁటలగాటంబులై నివ్వటిల్లు మవ్వంపుఁ గ్రొవ్విరుల కుఁగవ ఱు వివ్వాఁకి కసిమసలుగలిగి మసరికొసరి ✻పూని పాకొని తేనియలాని విసరుగలిగి మసరుగవిసి క్రొవ్వి తెమ్మి గొని ర్ఘుమ్మర్ఘుమ్మను చుర్ఘుంగ్ఘాటించు తేఁటి దాఁటులును, దాఁట్లువడక నాఁటుకొని కూడి జోడువిడువక క్రొమ్మావుల కమ్మ... మ్మల నిమ్ములము సరిపసి మిగల కిసలయంబులు పాసంగ మెసంగి కిసరువడక కిసరు చెడి బిట్టు రట్టడితనంబుల మించిన

* అమ్లాన = వాడని. ✻ పాకొని = తరుచుగ కమ్ముకొని.

చుంబురుజువిడిసి కికురువోడుచుచువలతేనియురువుచమవులటీకలనంగేకలిచు నెమళ్లును, నెమళ్లపురులనారలునారులగు విండ్లనినదములందలంపులుగఁదోఁకలువడసిపీఁకలుమెఱసిమూఁకలుగొనిదివిఁ కెగరిరపికింగపిసినరాహువుక్రియం దివిఁ దడఁబడుపడగలును,బడగలును,గొడుగులును,దమకుహారంబులగునడియాలంబులుగదోరంబులైనసారంబులబీరంబులు మెఱసిబొబ్బలులగ్రబ్బునంగరులసిరులసింగంబుల భంగంబులశరభంబులరభసంబుల ధూమకేతువులరీతులనై రింజీటి కింగొనకశంకలుడిగిఱంకెలిడుచు అంకెలై లెక్కకుమిక్కిలగుచు రక్కసులచక్కటియొక్కటికయ్యములదయ్యములై ఱంగందిఱుగుపీరభటులకదంబంబులును,కదంబకరవాలశూలాయుధములమెఱుంగులుమెఱుపులతెఱంగులదిశలచెఱంగులం ముఱుంగలింపనేమినినదంబులుఘుమఘుములగునుఱుములుగనడమొగుళ్లపెల్లునంబ్రవర్షితశరధికమనోరథంబులగు రథంబుల గములును,గములుగొనిగమనవేగములవలనహరిహరులనగి,గాలింజాలింబడగేలిగొని,ఘనంబులగుఘనంబులం దెగడి,సె గడుసురంగంబులగుతురంగంబులును,రంగదుత్తుంగవిశదమదకలకరికటతటజనితమదసలిలకణగణవిగణితదశదిశలైనయన భుజసరళమిళితలలితనిఖిలదిగధిపతిశుభకరకరకనకకటకఘటితమణిసముదయ సముదితరేణువర్గదుర్గమంబులయిన ని ర్వక్రమార్గంబులును,మార్గస్థలోకపరిగతాగతశతాయుతానేకగణనాతీతరోహణావలబటపిరాజమానంబులగువిమా నంబులును, విమానవిహారమాణసుందరసుందరీసందోహసంపాదితభూరిభేరీవీణాపణవమృదంగ కాహళశంఖాదివాద నాన్మానగానసాహిత్యనృత్యవిశేషంబులును, విశేషరత్నసంఘటితశృంగారశృంగాటకవాటికాగేహదేహళీప్రదీపం బులును, దీపాయమానమానితసభామంటపశతవితతవిరచితారత్నంబునుంగలిగిరత్నాకరంబునుంబోలె ననిమిషకాని కవాహినీవిశ్రుతంబయిశ్రుతవాక్యంబునుంబోలె నకల్మషసువర్ణప్రభూతంబయిభూతపతికంఠంబునుంబోలెభోగిరా జకాంతంబై కాంతాకుచంబునుంబోలెసువృత్తంబై వృత్తజాతంబునుంబోలెసదాగురులఘుసియమాభిరామంబయిరా మచంద్రునితేజంబునుంబోలె ఖరదూషణాదిదోషాచరానుపలబ్ధంబయి లబ్ధవర్ణచరిత్రంబునుంబోలె విమలాంతరంగ ద్యోతమానంబయిమానధనునినడువడియునుంబోలెనన్మార్గభాతిసుందరంబై సుందరోద్యానంబునుంబోలెరంభాంచితా శోకపున్నాగంబయిపున్నాగంబునుంబోలెసురభిమనోమానవిశేషంబయి శేషాహిమతంబునుంబోలె నున్నతక్షమాని శారదంబై శారదసముదయంబునుంబోలె ధవళజీమూతప్రకాశితంబై సితేతరాజనదానంబునుంబోలె సరసతిలోత్త మంబై యుత్తమపురుషవచనంబునుంబోలెననేకసుధారసప్రవర్షంబై వర్షాదియునుంబోలెనుల్లసదింద్రచాపంబై గోప తినూపురంబునుంబోలెవిచతురాగాద్యాలంకృతంబై కృతార్థంబైనయమరావతీనగరంబుచేరంజని కోటచుట్టునుంబట్టుగ బలంబులజవంబునవిడియించిపాంథమార్గంబులెల్లనఱికట్టుకొనియుండెనంత॥ క॥ మాయిరునగవులకనుగ ను। మూయరుకాలంబుకతనముదియసుఖులులం। డాయరుపుణ్యజనంబులఁ। బాయరుసురరాజుపీటిప్రమదాజనముల్ ॥ అ ప్పుడు॥ క॥ మర్త్యులదానవశంఖావిమ్ఖ్యాతధ్వనులునిండిదిబుధేంద్రవధూ। గర్భములువగిలిలోపలి। యర్భకతతులావురనుచు నాక్రోశించెన్॥ అంత॥ సీ॥ బలివచ్చివిడియుటబలభేదివీక్షించి గట్టిగాఁగోటకుఁగాఁపు వెట్టి। దేవవీరులుదాను దేవతామం త్రినిరప్పించినుతవైరిరాకఁజెప్పి। ప్రళయానలునిభంగిభాసిల్లుచున్నాఁడు ఘోరరాక్షసులనుగూడినాఁడు। మనకోడిచ ని నేఁడుమఱలవీఁడేతెంచెనేతపంబునవీనికింతవచ్చె। నీనురాత్మునకునెవ్వఁడుదోడయ్యె। నింకవీనిఁగెల్వనేవిద్రోవ। యే మిచేయువారమెక్కడికిఁగటిమి। యెమ్ముఱుమోహరింపనెవ్వఁడోపు॥ క॥ మ్రింగెడునాకాశంబును। బొంగెడునమరాద్రి కంజెంబోడవై వీఁడున్। మ్రింగెడుకాలాంతకుక్రియ। భంగించునుసురలఁబట్టి బంకజగర్భున్॥ క॥ ఈరాము రాజ్యమెల్ల ను। బోరాడురణంబుసేయఁబోయితిమేనిన్। రారాదుదనుజుచేతను। జారాదటమీఁద నేమిజాడమహాత్మా॥ అనినసురరా జునకునాచార్యుండిట్లనియె॥ సీ॥ వినుమయ్యదేవేంద్ర వీనికిసంపదబ్రహ్మవాదులుభృగుప్రవరులెల్ల। నిచ్చిరి రాక్షసునెదు రింపవాదింపహరియీశ్వరుఁడుదక్కనన్యజనులు। నీవునునీసముల్నీకంటెనధికులు చాలరు రాజ్యంబు సాలునీకు। విడిచిపో వుటనీతివిబుధనివాసంబువిమతులువెలిఁగఁగఁ వేళసూచి। మఱలిమఱలనాఁడు వచ్చుటమానుతంబు। విప్రబలమునవీనికివ్వ ద్దివచ్చె। వారిఁగైకొనకటమీఁదవాఁడుచెడును। పలఁగుమంచుఁ కరిఘు పేరుపలఁపవలను॥ క॥ పరుగెలువవలయునొండెను। స రిపోరఁగవలయునొండెఁజావలెనొండెన్। సరిగెలుపునృపతియుదొరకమి। సరసంబుగమున్నెతొలఁగివనవలెనొండెన్॥

వ॥ అనికార్యకాలనిదర్శియగుబృహస్పతివచనంబులువిని కామరూపులైదివిజులు త్రివిష్టపంబువిడిచి తమతమపొందుపట్లు కుంజనిరిబలియునుం బ్రతిభటుపిపర్జితయగుదేవధానినధిష్ఠించిజగత్త్రియంబునుండపవశంబుచేసుకొనివిశ్వవిజయుండై పెద్దకాలంబురాజ్యంబుసేయుచుండె శిష్యవత్సలురగుభృగ్వాదులతనిచేతశతాశ్వమేధంబులుసేయించిరి తత్కాలం

బున॥ శా॥ అర్థుల్వేఁడరు దాతలుం జెడరు సర్వారంభముల్పండుఁ బ్రత్యర్థుల్లేరు మహోత్సవంబులను దేవాగారముల్వె
ల్పెఁబూర్ణార్థుల్ విప్రులు వర్షముల్ గురియఁగాలార్హంబులై ధాత్రికి। న్స్వార్థంబయ్యె వసుంధర త్వమసురేంద్రాధీశురా
జ్యంబునన్॥ అంత॥ సీ॥ తనతనూజుల ప్రోలు దనుజులు గొనుటయు వేల్పులెల్లను డాఁగి వెడలుటయును। భావించి సురమాతప
రితాపమును బొంది వగన నాథాకృతి వనరుచుండ। నాయమ్మ పెనిమిటి యగు కశ్యప బ్రహ్మమునిజేయొక నాఁడు సమాధి మాని।
తనకుటుంబిని యున్న ధామంబునకు నేగి నాతిచే విహితార్చనములు వడసి। వంది ప్రాలి కుందివాడిన యిల్లాలి। వదనవారి
జంబు వసువుఁ జూచి। చేరఁ దిగిచి మసఁగు వచుబుకంబు పుడుకుచు। వారిజాక్షి యేల వగచెదనుచు॥ అమ్మహాత్ముఁ డిట్లనియె॥ మ॥ తె
ఱవా విప్రులు పూర్ణులే చెలఁగునే దేవార్చనాచారము। ల్తఱితో వేలుతురే గృహస్థులు సుతుల్ధర్మానుసంధానులే। నెఱి నభ్యా
గతకోటికన్నమిడుదే నీరంబునుం బోయుదే। న ఱలేక స్థలదాసులన్ స్వజనులన్ మన్నింపుదే పైదలీ॥ గీ॥ అన్నమైనఁ దోయమైన
ద్రవ్యంబైన। శాకమైనఁ దనకు జరుగుకొలఁది। యతిథిజనుల కిడ్డ మాఁదక యిడరేని। లేనివారు పుడమి లేనివారు॥ మ॥ ఱియు॥
గీ॥ వెలఁది విష్ణునకును నిఖిల దేవాత్మున। కాననంబు శిఖియు నవనిసురులు। వారు దనియ దనియు వనజాతలోచనుఁ డతఁడు దని
య జగములన్ని దనియు॥ క॥ బిడ్డలు వెఱతురె నీకునుఁ గొడ్డంబులు సేయరెల్ల కోడండ్రు సుమా। రొడ్డారింపక నమతురె। యడ్డ
ము గాకున్న దే నృగేశుఁ డయింటన్॥ అని పలికిన నంబిక కిసలయి ట్లనియె॥ ఉ॥ ప్రేమయొకింత లేక దితిబిడ్డలు బిడ్డలు బిడ్డలున్ మహా
హవ॥ భీమబలాఢ్యులై తనమ బిడ్డల సందడిఁ దోలి సాహస। క్రామికులై రిపులయ్యు నమరావతి నేలుచున్న వారు నీ। కేమని వి
న్నవింతు హృదయేశ్వర మేలుదలంచి చూడవే॥ క॥ అక్కట చెల్లెండ్రయ్యును। నక్కఱ గనా తోడి పోరు దనుజులు విడరు। గ
క్కసులు సురల మొత్తఁగ। నక్కటకట వలదనడు చూచుమనౌనానుచున్॥ సీ॥ ఎండకన్నెఱుఁగని యింద్రుని యిల్లాలు పలుపంచ
లను జాలిఁబడియె నేఁడు। త్రిభువన సామ్రాజ్యవిభవంబు గోల్పోయి దేవేంద్రుఁ డడవులఁ దిరిగె నేఁడు। కలిమి గారాబు
బిడ్డలు జయంతాదులు బెబగార్హ్యుల వెంటఁ జనిరి నేఁడు। సురలకాధారమగు నమరావతీపురంబు నసురుల కాటపట్టయ్యె నేఁడు। బ
లి జగముల నెల్ల బలియుచున్నాఁడు। వాని గెలువరాదు వాసవునకు। యాగభాగ మెల్ల నతఁ డాహరించును। గడఁగి సురల
కొక్క కడియు సీఁడు॥ క॥ ప్రజలకు నెల్లను సముఁడవు। ప్రజలను గడుపారఁ గన్న బ్రహ్మవు నీవుం। బ్రజలందు దుష్టమతు
లను। నిజముగ శిక్షింపవలదె నీవు మహాత్మా॥ మ॥ సకలన్ సభ్యుల నార్తులన్ విరథులన్ శోకంబు వారించి దీని గ్రిధాని న్నిలుపంగ రా
త్రిదశుల న్వాసింప సత్యాగ్యమే। వెరవే నే ఘటించు నట్టి క్రమము న్వేవేగఁ జింతింపవే। కరుణాలోక సుధారుచింపను
ప వేకల్యాణ సంధాయకా॥ వ॥ అని నమునోవల్లభి పలుకుల లాకర్ణించి ముహూర్తమాత్రంబు చింతించి విజ్ఞానదృష్టి నవలం
బించి భావికాలకార్యంబు విచారించి కశ్యపబ్రహ్మ యిట్లనియె॥ మ॥ జనకుం డెవ్వఁడు జాతుఁ డెవ్వఁడు జనస్థానంబు లె
వ్వోటు సం। జననంబెయ్యది మేను లేకొలఁది సంసారంబు లేదూపము। ల్వినుమాయంతయు విష్ణుమాయ దలఁపన్ వేఱే
మియున్ లేదు మోహనిబద్ధంబది మూలమింతటికి జాయా విన్నఁబో నేటికిన్॥ వ॥ అదునైనం గాలోచితకార్యంబు సెప్పె
ద॥ మ॥ భగవంతుం బరముం జనార్దనుఁ గృపాపారీణు సర్వాత్మకున్ జగదీశు న్హరి సేవ సేయుము తఁడు న్సాంగత్యముం బొంది
నీకగు నిష్టార్థము లెల్ల నిచ్చు నిఖిలార్థావాప్తి చేకూరెడిన్ భగవత్సేవలఁ బొందరాదె బహుసౌభాగ్యంబులుం బ్రేయసీ॥ అని
న గృహస్థునకు గృహిణి యిట్లనియె॥ క॥ నారాయణుఁ బరమేశ్వరు। నేరీతిం దలంతు మంత్ర మెయ్యది విహితా। చారంబులే ప్ర
కారము లారాధనకాల మెద్దియానతియీవే॥ వ॥ అనినం గశ్యపప్రజాపతి సతికిఁ బయోభక్షణం బను వ్రతంబుపదేశించి విత
కాలంబును, సన్మంత్రంబును, సద్విధానంబును, దమపవాసదానభోజనప్రకారంబులు నెఱింగించిన నదితియును ఫాల్గునమా
సంబున శుక్లపక్షంబునఁ బ్రథమదివసంబునందొడఁగొని పండ్రెండుదినంబులు హరిసమర్పణంబుగా వ్రతంబు సేసి వ్ర
తాంతంబున నియతయై యున్నయెడ- జతుర్బాహుండును, పీతవాసుండును, శంఖచక్రగదాధరుండునై నేత్రంబులక
గోచరుండైన నారాయణదేవుండు ప్రత్యక్షంబైనం గనుంగొని॥ క॥ కన్నులసంతోషాశ్రులు। చన్నులపైఁ బరవఁ బులకజా
లము లెసఁగ। సన్నతులు సన్నుతులు। న్నున్నతరుచిఁ జేసె నిటలయుక్తాంజలియై॥ క॥ చూపుల శ్రీపతిరూపము। నాపోవకఁ
ద్రావి త్రావి హర్షోద్ధతయై। వాపుచ్చి మందమధురా। లాపంబులఁ బొగడె నదితి లక్ష్మీనాథున్॥ సీ॥ యజ్ఞేశ విశ్వంభ రాచ్యు
త శ్రవణమంగళ నామధేయ లోకస్వరూప। యాపన్నభక్తజనార్తి విఖండన దీనలోకాధార తీర్థపాద। విశ్వోద్భవస్థితివి
లయ కారణభూత సంతతానంద శశ్వద్విలాస। యాయువు దేహంబు ననుపమలక్ష్మియు వసుధయు దివము ద్రివర్గములును।
వైదికజ్ఞానయుక్తియు వైరిజయము। నిన్నుఁ గొలువని నరులకు నెఱయఁగలదె। వినుతమందారగుణహార వేదసార। ప్రణత
వత్సల పద్మాక్ష పరమపురుష॥ గీ॥ అసురవరులు సురల నదలించి బెదరించి। నాక మేలుచున్నవారు నేఁడు। కన్నకడుపు గానఁ

గంటిఁ గూరుకు రాదు। కడుపుపొక్కు మాన్పి కావుమయ్య॥ వ॥ అని నవ్వినవిరహాసితవదనుండగు నాశ్రితకామధేనువై నయప్ప
రమేశ్వరుండిట్లనియె॥ శా॥ నీకోడండ్రును నీకుమారవరులున్ నీనాథుఁడున్నీవును। శ్లోకింపన్సుఖులున్సుఖుల్మిగులసంతోషిం
పరాత్రించరు। లోకింపన్భవదీయగర్భమునఁ దేజోమూర్తి జన్మించెద। న్నాకున్వేడుకపుట్టు నీసుతుఁడనై వర్తించినర్తిం
పఁగా॥ మ॥ బలిమిన్ దైత్యులఁ జంపరాదు వినవో పాయంబులం గానిసం। చలనంబొందకు నేను నీనియతికిన్ సద్భక్తికిన్ మె
చ్చితి। న్బలివిద్వేషుఁడు నానిలింపగణముం బౌలోమియున్ మెచ్చ దై। త్యులరాజ్యంబు హరింతు నింద్రునికి నిత్తున్ దుస్సుఖమిం
కేటికిన్॥ క॥ నీరమణుని సేవింపుము। నారూపము మానసించి నలినీగర్భా। గారంబు వచ్చి చొచ్చెదఁ। గారవమునఁ బెంపు సు
మ్మకరుణ నన్నున్॥ క॥ ఏలింతు దివము సురలను। బాలింతు మహేంద్రయువతిభాగ్యశ్రీలన్। మూలింతు దానవులని। ర్మూలిం
తురిపుప్రియాంగముల భూషణముల్॥ వ॥ అని యిట్లు భక్తజనపరతంత్రుండగు పురాణపురుషుండానతిచ్చి తిరోహితుండ
య్యె। నయ్యదితియుఁ గృతకృత్యయై సంతోషంబునఁ దనమనోవల్లభుండగు కశ్యపునాశ్రయించి సేవించుచుండె నంత నొ
క్కదినంబున॥ గీ॥ ఘనసమాధినుండి కశ్యపుఁ డచ్యుతు। నంశమాత్మనొలయ నదితియందుఁ। దనమువీర్యమధికతరము సేర్చె
సుగాలి। శిఖిని దారువందుఁ జేర్చినట్లు॥ వ॥ ఇట్లు కశ్యపచిరతరతపస్సంభృతవీర్యప్రతిష్ఠితగర్భయై సురలతల్లియుల్లంబున ను
ల్లసిల్లుచుండె నంత॥ క॥ చలచలనై పిసపిసనై। కలలంబై కరుడుగట్టి గళనాళముతోఁ। దలయేర్పడి గర్భంబై। నెలమసలం జీ
గఁజిక్కె నెలఁతకు నధిపా॥ క॥ నెలఁతకుఁ జూలై నెలరెం। న్నెలలై మఱి మూఁడు నాల్గు నెలలై వసుస। న్నెలలంతకంత కెక్కఁ
గ। నెలలు నుడిగ్గరియె నసురనిర్మూలతకున్॥ క॥ మహితతర మేఘమాలా। పిహితాయుతచండభానుబింబప్రభతోఁ। బిహి
తాంగంబులఁ గశ్యపు। గృహిణీగర్భమున శిశువు క్రీడించె నృపా॥ క॥ తనకడుపున నొకవెఱపున। వనరుహగర్భాండభాండవన
ధిచయంబుల్ గొనక నిజగములు నిడుకొని। దనుగతిఁ గడుమడఁగి మునిఁగి తనరెడుబెగడై॥ వ॥ అంతన క్కాంతాతిలకంబు
గ్రమక్రమంబున॥ మ॥ నిలిపెన్నెప్పలబృందిమన్నిశదముల్నేత్రంబులుం జూచుకం। బులనాకాళిను మేఖలం బ్రథిమన
న్గోముస్సుధాపాండిమ। న్బలిమిం జన్నులఁ శ్రోణిపాళిగరిమన్ మధ్యంబునం బ్రంహిమ। న్బలితాత్మన్ లఘిమన్ మహామహిమమే
నన్గర్భమర్భారమై॥ క॥ పెట్టుమురును మటభూతిని। బొట్టిడుమురు మేనఁ బట్టుపుట్టము దోయి। న్నెట్టుమురు వేల్పుటమ్మకుఁ।
గట్టుమరొగిరత్నపడఁతి గర్భంబునకున్॥ ఇవ్విధంబున॥ గీ॥ విశ్వగర్భుఁ డుడనగర్భవివరమందుఁ। బూఁటఫూఁటకుఁ బూర్ణుఁ
డై పాటకరింప। *ప్రేఁకఁ జాలాలితనమున వేల్పుపెద్ద। పొలఁతి కంతటనిల్లాడు ప్రొద్దులయ్యె॥ వ॥ తదనంతరంబున నంజసు రా
ననుండరుదెంచి యదితిగర్భపరిభ్రమవిభ్రముండగు నప్పరమేశ్వరునుద్దేశించి యిట్లని స్తుతించె॥ సీ॥ త్రిభువనమయరూ
పదేవ త్రివిక్రమ పృథులాత్మ శిపివిష్ట పృశ్నిగర్భ। ప్రీతత్రిణాభ త్రిపృష్ఠ జగంబుల కాద్యంతమధ్యంబులరయ నీవ। జంగమ
స్థావరజననాదిహేతువు నీవ కాలంబవై నిఖిలమాత్మ। లోపలధరియింతు లోనిజంతుల నెల్ల స్రోతంబులోఁ గొనిసుంపరిగిత
ను। బ్రహ్మలకు నెల్ల సంభవభవనమీవ। దివమునకుఁ బాసి మద్దశ దిక్కులేక। శోకవారిధిమునిఁగిన సురల కెల్లఁ। దెలియ నా
ధారమగుచున్న తెప్ప నీవ॥ క॥ విచ్చేయుమదితిగర్భము। చెచ్చెర వెలువడుము మహాత్మ చిరకాలంబు। న్నిచ్చలు విడి లేక మరులు।

॥ వామనమూర్త్యావిర్భావఘట్టము. ॥

ముచ్చటపడియున్నవారు ముదమందింపన్॥ వ॥ అని యిట్లు కమలసంభవుండు వినుతి సేయ నయ్యవసరంబున॥ మ॥ రవిమ
ధ్యాహ్నమునం జరింప గ్రహతారాబద్ధచంద్రస్థితిన్। శ్రవణద్వాదశినాఁడు శ్రోణనభిజిత్సంజ్ఞాతలగ్నంబున। న్భువనాధీ
శుఁడు పుట్టె వామనగతిం బుణ్యవ్రతోపేతకున్। దివిజాధీశ్వరుమాతకుం బరమపాతివ్రత్యవిఖ్యాతకున్॥ వ॥ మఱియు నద్దే
వుండు శంఖచక్రగదాకమలకలితచతుర్భుజుండును, పిశంగవర్ణవస్త్రుండును, మకరకుండలమండితగండభాగుండును,
శ్రీవత్సవక్షుండును, నళినచక్షుండును, నిరంతరశ్రీవిరాజితరోలంబకదంబచుంబితవనమాలికాపరిష్కృతుండును, కనక
కంకణకాంచివలయాంగదనూపురాలంకృతుండును, కమనీయకంఠకౌస్తుభాభరణుండును, నిఖిలజనమనోహరుండునై
యవతరించిన సమయంబున॥ శా॥ చింతం బాసిరి యక్షతార్క్ష్యసుమనస్సిద్ధోరగాధీశ్వరుల్। సంతోషించిరి సాధ్యచారణము
నీశబ్రహ్మవిద్యాధరుల్। గాంతిం జెందిరి భానుచంద్రములు రంగద్గీతవాద్యంబులన్। గంతుల్ వైచిరి మింటఁ గింపురుషులున్ గంధ
ర్వులుం గిన్నరుల్॥ క॥ దిక్కులకావిరి వాసె। న్నెక్కువ తక్కువలు లేక నేడుపయోధుల్। నిక్కమయి నిలిచె ధరణియుఁ। జుక్కల
త్రోవయును విప్రసురసేవ్యంబై॥ క॥ ముంపుగొని విరులవానలు। జొంపంబులుగురియ సురలు సుమనోమధువు। ల్గుంపరలెగ
యంబరాగపు। రొంపుల భూభాగమతినిరూపితమయ్యెన్॥ తదనంతరంబ॥ గీ॥ ఈమహానుభావుఁ డెట్లకో యీకాల। ముదర
మందు నిలిచియుండెననుచు। నదితి వెఱఁగువడియె నానందభయశబ్ద। ములను గశ్యపుండు మొగినుతించె॥ వ॥ అంతన వ్విభుం

*ప్రేఁక। బలువు-భారము.

మఖ। వ్రతదాన ప్రవణానువర్తిసుమనోరామా మనోభేదనో।ద్ధతచంద్రాతపకీర్తిసత్యకరుణాధర్మోల్లసన్మూర్తిదా॥
వ॥ ఇట్లు కుశపవిత్రాక్షతసంయుతంబగు దక్షిణహస్తంబు సాఁచియిట్లనియె॥ ఉ॥ స్వస్తి జగత్త్రయీభువనశాసనకర్తకు
హాసమాత్రవి।న్యస్తనిలింపభర్తకు నుదారపదవ్యవహర్తకున్ మునీం।ద్రస్తుతమంగళాధ్వరవితానవిహర్తకు నిర్జరీగళ।న్య
స్తసువర్ణసూత్రపరిహర్తకు దానవలోకభర్తకున్॥ వ॥ అని దీవించి కరచరణాద్యవయవంబులు ధరియించిన వేదరాశియుం
బోలె, ముందట నకుటిలుండును, జటిలుండును, సదండఛత్త్రుండును, గక్షలంబితభిక్షాపాత్రుండును, గరకలితజలకమం
డలుండును, మనోహరవదనచంద్రమండలుండును, మాయావాదనవటుండును నగు వటునిం గని దినకరకిరణపిహితంబు
లైన గ్రహంబుల చందంబునఁ దిరోహితులై భృగువులు గూర్చున్నయెడ లేచి సేమంబడిగి తియ్యని మాటల నాదరించిరి. బలి
యును నమస్కరించి తగిన గద్దియ నునిచి పాదంబులు కడిగి తన ప్రాణవల్లభి పసిండికలశంబున నుదకంబులు వోయ వడు
గుకొమరుని చరణంబులు గడిగి తడి యొత్తి తత్సమయంబున॥ గీ॥ వటుని పాదశౌచవారి శిరంబునఁ। బరమభద్రమనుచు బలివ
హించె। నేజలము గిరీశుఁ డిందుజూటుఁడు దేవ। దేవుఁ డుద్వహించె ధృతి శిరమున॥ మఱియు నయ్యజమానుం డభ్యాగతునకి
ట్లనియె॥ మ॥ వడుగా యెవ్వరివాఁడ వెవ్వఁడవు సంవాసస్థలం బెయ్యది। యెయ్యెడకున్నీ వరుదెంచుట ల్పఫలమయ్యె న్వంశము
న్జన్మముం। గడు ధన్యాత్ముఁడనైతి నీ మఖము యోగ్యంబయ్యె నా కోరికెల్। గడతేరెన్ సుహృతంబులయ్యె శిఖులుం గల్యాణమె
క్కాలముం॥ మ॥ వరచేలంబులో మాడలో ఫలములో వన్యంబులో గోవులో। హరులో రత్నములో రథంబులో విశిష్టాన్నంబు
లో కన్యలో। కరులో కాంచనమో నికేతనములో గ్రామంబులో భూములో। ధరణీఖండమొ కాక యేమడిగెదో ధాత్రీసు
రేంద్రోత్తమా॥ వ॥ అని ధర్మయుక్తంబుగాఁ బలికిన వైరోచని వచనంబులు విని సంతోషించి యీశ్వరుండిట్లనియె॥ సీ॥ ఇది
నాకు నెలవని యేమని పలుకుదు నొకచోటనక నిండియుండ నేర్తు। నెవ్వనివాఁడ నం చేమని పలుకుదు నాయంతవాఁడనై నడు
వ నేర్తు। నీ నడువడి యని యెట్లు వక్కాణింతుఁ బూని ముప్పోకలఁ బోవ నేర్తు। నది నేర్తు నిది నేర్తు ననియేలఁ జెప్పంగ నేరుపులన్ని
యు నేన నేర్తు। నెరులు గారు నాకు నెరులకు నేనౌదు। నొంటివాఁడ జుట్ట మొకఁడు లేఁడు। సిరియుఁ దొల్లి గలదు చెప్పెద నా
యింకి। సుజనులందుఁ దఱుచుఁ జొచ్చియుందు॥ అదియట్లుండ నిమ్ము॥ సీ॥ జననాథ నీమాట సత్యంబు సత్కీర్తిదంబుఁ గులార్హం
బు ధర్మయుతముఁ। గరుణానువర్తులు ఘనసత్త్వమూర్తులు గాని మీ కులమందుఁ గలుగ రొరులు। రణభీరువులు వితరణభీరువులు
లేరు ప్రత్యర్థులర్థులు ప్రార్థించి కొనిన। దానశౌండులగుచుఁ దనుపుదు రధికులై మీ తాతలందఱు మేటిమగలు। మీ కులంబునందు
మెఱయఁ బ్రహ్లాదుండు। మింటి చంద్రుమాడ్కి మేలిరుచులఁ। బ్రథితకీర్తి తోడ భవదీయవంశంబు। నీరరాశి భంగి నెగడుచుం
డు॥ వ॥ తొల్లి మీ మూఁడవ తాత హిరణ్యాక్షుండు విశ్వజయంబు సేసి గదాయుధుండై భూతలంబునఁ బ్రతివీరులం గానక
సంచరింప విష్ణుండు వరాహరూపంబున నతని సమయించెఁ దద్భ్రాతయగు హిరణ్యకశిపుండు విని హరిపరాక్రమంబునకు
నాశ్చర్యంబునొంది తన జయంబును బలంబును బరిహసించి గ్రద్దన నుద్దవిడి నద్దనుజమర్దను మందిరంబునకుం జనియె నప్పు
డు॥ క॥ శూలాయుధహస్తుండై। కాలాకృతి వచ్చు దనుజుఁ గని విష్ణుండున్। గాలజ్ఞత మాయాగుణ। శీలత నిట్లని తలంచెఁ జిత్త
ములోనన్॥ మ॥ ఎదురై పోర జయింపరాదితనిఁ గాఁకెందేనియుం బోవ భీ। ప్రదుఁడై ప్రాణులఁ దోలు మృత్యువు క్రియం బై
వచ్చునంచుం గ్రియా। విదుఁ డజ్ఞాతుఁడు సూక్ష్మరూపమున నావేశించె నిశ్వాసరం। ధ్రదిశన్ దైత్యుహృదంతరాళమునఁ
బ్రత్యక్షక్రియాభీరుఁడై॥ వ॥ అంతన ద్దైత్యవల్లభుండు వైష్ణవాలయంబు సొచ్చి వెదకి హరిం గానక మిన్నుమన్నున న్వేషిం
చి త్రిదివంబున నరసి దిశలం బరికించి భూవివరంబులు వీక్షించి సముద్రంబులు వెదకి పురంబులు శోధించి వనంబులు విమర్శించి
పాతాళంబు పరీక్షించి జగంబున నదృష్టశత్రుండై మార్గణంబు సాలించి తనలో నిట్లనియె॥ క॥ పగవాఁడు మడియ నోపును। దె
గఁ డేనియు నెమకుఁ బడఁడె తెగువ నరులకుం। దెగినయెడఁ బగర మీఁదను। బగఁ గొనఁ దగదనుచు మానెఁ బ్రాభవశక్తిన్॥ అతం
డు మీ ప్రపితామహుండ తని గుణంబుల నేకంబులు గలవదియట్లుండ నిమ్ము॥ క॥ ఆతురభూసురగతిఁ బురు। హూతాదులు దన్ను
వేడ నొగిఁ గొమ్మనుచు। న్మీ తండ్రి యిచ్చె నాయువు। నేతన్మాత్రుఁడవె నీవు నీలోకమునన్॥ క॥ పలితివి మూఁడు జగములు। దోలితి
విం ద్రాదిసురలఁ దొల్లిటి వారిం। బోలితివి దానగుణముల। సోలితివి పిశాచరాక్షసుల రక్షింపన్॥ అదియును గాక॥ క॥ రాజ్యం
బు గలిగెనేనియుఁ। బూజ్యులకును యాచకులకు భూమిసురులకున్। బ్రాజ్యముగ బ్రదుకఁ డేనియుఁ। ద్యాజ్యంబులు వాని జన్మధన
గేహంబుల్॥ క॥ మున్నెన్నఁడు రువదాన్యుల। నెన్నెదు చో నిన్నుఁ ద్రిభువనేశుఁడ వనుచు। న్నిన్నిదినంబుల నుండియు। నెన్నఁ
దునినుఁ బెట్టుమనుచు నీంద్రము సేయన్॥ గీ॥ ఒంటివాఁడ నాకు నొకటి రెండడుగుల। మేర యిమ్ము సొమ్ము మేర నొల్లఁ। గోర్కె
లీల బ్రహ్మకూఁకటి ముట్టెడు। దానకుతుకసాంద్ర దానవేంద్ర॥ అనినఁ బరమయాచకునకుఁ బ్రదాత యిట్లనియె॥ గీ॥ ఉన్నమా

టలెల్ల నొప్పను విప్రుఁడు సత్యగతులవృద్ధసమ్మతంబులఁ దుకఁ దలఁచి కొంచెమడిగితివో చెల్ల దాత పెంపు సొంపుఁ దలఁపవలదె॥ మ॥ వసుధాఖండము వేఁడితో గజములన్ వాంఛించితో వాజులన్ వసనూహించితొ కోరితో యువతులన్ వీక్షించి కాంక్షించితో పసిబాలుండవు నేరవీ వడుగ నీ భాగ్యంబు లీపాటిగా కసురేంద్రుండు పదత్రయంబడుగ నీయల్పంబు నీ నేర్చునే॥ వ॥ అనిన మొగంబున నంజలిబు నగవు మొలకలెత్తఁ గృహమేధికి మేధావి యిట్లనియె॥ మ॥ గొడుగో జన్నిదమో కమండలమొ నాకున్ముంజియో దండమో వడుగే నెక్కడ భూములెక్కడ కరుల్ వామాక్షు లశ్వంబు లెక్కడ నిత్యోచితకర్మ మెక్కడ నుదా కాంక్షామితంబైన మూఁడడుగు లేమేరయద్రోయ కిచ్చుటయె బ్రహ్మాండంబు నాపాలికిన్॥ అదియునుంగాక॥ క॥ వ్యాప్తింబొందక వగవకఁ బ్రాప్తంబగు లేశమైనఁ బదివేలనుచుం దృప్తిం జెందని మనుజుఁడు సప్తద్వీపములనైనఁ జక్కంబడునే॥ శా॥ ఆశాపాశము దాఁ గడున్నిడుపు లేదంతంబు రాజేంద్ర వారాశిప్రావృత మేదినీవలయసామ్రాజ్యంబు చేకూడియుం గాసింబొందిరి గాక వైన్యగయభూకాంతాదులున్నర్థకామాశన్వాయఁగ నేర్చిరే మునునిజాశాంతంబులం జూచిరే॥ సీ॥ సంతుష్టుఁడీమూఁడు జగములఁ బూజ్యుండు సంతోషి కెప్పుడు జరుగు సుఖము సంతుష్టి గాకున్న సంసార హేతువు సంతసంబు నముక్తిసతి యదొరుకుఁ బూఁటఁ బూఁటకు జగంబున యదృచ్ఛాలాభతుష్టిని దేజంబుతోన పెరుగుఁ బరితోషహీనతఁ బ్రభ చెడిపోవును జలధారననలంబు సమయునట్లు నీవు రాజవనుచు నిఖిలంబు నడుగుట తగవుగాము నాకుఁ దగిన కొలఁది యేను వేఁడికొనినయీ పదత్రయమును చాలదనక నిమ్ము చాలుఁ జాలు॥ వ॥ ఇట్లు పలుకుచున్న ఖర్వునకు నుర్వీశ్వరుండుర్వీదానంబు సేయం దలంచి కరకలితసలిలకమండలుండైన వితరణగుణముఖరుం గని నిజవిచారయుక్తదనుజరాజ్యచక్రుండగు శుక్రుండిట్లనియె॥ సీ॥ దనుజేంద్ర యీతఁడు ధరణీసురుఁడు గాఁడు దేవకార్యంబు సాధించుకొఱకు హరి విష్ణుఁడవ్యయుండదితి గర్భంబునఁ గశ్యపసూనుఁడై కలిగె నకట యెఱుఁగవీతనికోర్కె నిచ్చెదనంటివి దైత్యసంతతికుపద్రవము వచ్చు నీలక్ష్మి తేజంబు నెలవు నైశ్వర్యంబు వంచించి యిచ్చును వాసవునకు మొనసి జగములెల్ల మూఁడు పాదంబుల నఖిలకాయుఁడగుచు నాక్రమించు సర్వధనము విష్ణుసంతర్పణము సేసి బడుగుపగిది నెట్లు బ్రతికెదీవు॥ క॥ ఒక్క పదంబున భూమియు నొక్కటఁ ద్రిదివంబుఁ ద్రొక్కి యున్నతమూర్తి దిక్కులు గగనము దానై వెక్కసమై యున్న నెట్లు వెడలెదు చెపుమా॥ సీ॥ ఇచ్చెదనని పల్కి యీకున్న నరకంబు గ్రోవ నీవును సమర్థుఁడవె దేవ యే దానమున నాశమే తెంచు నదియును దానంబు గాదండ్రు తత్త్వవిదులు దానంబు యజ్ఞంబు దపము కర్మంబులు దావిత్తవంతుఁడైగలఁ బవలయుఁ దనయింట గల సర్వధనమెల్ల నైదు భాగములుగా విభజించి కామమునకు నర్థములకు ధర్మయశములకాశ్రిత బృందములకు సమతఁ బెట్టునట్టి పురుషుఁడిందు నందుఁ బూర్ణుఁడై మోదించుఁ దన్నుమాని చేతదగవు గాదు॥ వ॥ అదియునుం గాక నర్థంబునందు బహుభంగి బహ్వృచగీతార్థంబు గలదొక్కటి సావధానుండవై యాకర్ణింపుము॥ సీ॥ అంగీకరించిన నఖిలంబు పోవుచో ననృతంబు గాదు లేదనిన నధిప యాత్మవృక్షము మూలమనృతంబు నిశ్చయమాత్మ మూలము గల్గనాత్మ చెడదు పుష్పఫలంబాత్మభూజంబునకు సత్యమాహాత్మ్యము బ్రతుకమినదియుఁ జెఱుచు ఫలపుష్పములు లేక పస చెడి వృక్షంబు మూలంబుతో వృద్ధిఁ బొందు గాదె చేటుగొరఁత యులఘిమయ్యుఁ జెందకుండ నిచ్చు పురుషుండు చెడకుండు నిద్ధచరిత కాక నంచితసత్యసంగతినటంచు నిజధనంబర్థికిచ్చిన నీకు లేమి॥ గీ॥ సర్వమయినచోట సర్వధనంబులు నడుగ లేదటంచు ననృతమాడు చెనఁటిపంద నేమి చెప్పఁ బ్రాణముతోడి శవము వాఁడు వాని జన్మమేల॥ మఱియు నొక్క విశేషంబు గలదు వివరించెద॥ గీ॥ వారిజాక్షులందు వైవాహికములందుఁ బ్రాణవిత్తమానభంగమందుఁ జకితగోకులాగ్రజన్మరక్షణమందు బొంకవచ్చు నఘము పొందదధిప॥ వ॥ కులము రాజ్యము దేజము న్నిలుపు మీకబ్బుండు విశ్వంభరుండు లంతింబోఁడు త్రివిక్రమస్ఫురణవాఁడై నిండు బ్రహ్మాండముం గలఁడే మాన్పనొకండు నాపలుకులాకర్ణింపు కర్ణంబులన్ వలదీ దానము గీనముం బనుపుమా వర్ణిన్ వదాన్యోత్తమా॥ వ॥ అని యిట్లు హితంబు పలుకుచున్న కులాచార్యునకు క్షణమాత్ర నిమీలితలోచనుండై యశస్వి యిట్లనియె॥ సీ॥ నిజమానతిచ్చితి నీవు మహాత్మక మహి నిగృహస్థధర్మంబు నిదియు యర్థంబుఁ గామంబు యశమును వృత్తియు నెయ్యది ప్రార్థింప నిత్తు నని యు నర్థలోభంబున నర్థిఁ బొమ్మనుటెట్లు పలికి లేదనుకంటెఁ బాపమెద్ది యెట్టి మహాగ్న్యమనియే భరించెదఁ గాని సత్యహీనుని మోవఁ జాలననుచుఁ బలుక దేత్తల్లి భూదేవి బ్రహ్మతోడ సమరమందదుగుఁ దిరుగకఁ జచ్చుకంటెఁ బలికి బొంకక నిజమునఁ బఱుగుకంటె మానధనులకు భద్రంబు మఱియుఁ గలదె॥ క॥ ధాత్రిని హాలికునకును క్షేత్రము బీజములు లెస్సఁ జేకురు భంగిం జిత్రంబు గ రాజునకును పాత్రము సమకూరునట్టి భాగ్యము గలదే॥ శా॥ కారే రాజులు రాజ్యముల్గలుగ వేగర్వోన్నతిం బొందరే వారేరీ సిరి మూఁటఁ గట్టికొని పోవం జాలిరే భూమిపైఁ బేరైనం గలదే శిబిప్రముఖులుం బ్రీతిన్ యశః కాములై యీరే కోర్కులు వారలన్మఱచిరే

యిక్కాలంబు న్యాగ్రహ వా॥ క॥ ఉడుగని క్రతువుల వ్రతములఁ। బొడగనఁ జనఁ బట్టి పాదపూజలఁ గుబుజుఁడై। యడిగెడినఁట నను బోఁటికి। నిడరాదె మహానుభావ యిష్టార్థంబుల్॥ శా॥ ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ। బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై నూత్నమ।ర్యాదం జెందు కరంబు క్రిందగుట మీఁదై నా కరంబుంట మేల్గాదే రాజ్యము గీజ్యము న్సతతమె కాయంబు నాపాయమే॥ మ॥ నిరయంబైన నిబద్ధమైన ధరణీనిర్మూలనంబైన దు।ర్మరణంబైన కులాంతమైన నిజముం రానిమ్ము కానిమ్ము పో। హరుఁడైనన్ హరియైన నీరజభవుండభ్యాగతుండైన నౌ। దిరుగ న్నేరదు నాదు జిహ్వ వినుమా ధీవర్య వెయ్యేటికిన్॥ గీ॥ మొడిచి యనంత పట్టును సలుపక నిచ్చు చో। నేలకట్టు విష్ణుఁ డేటిమాటఁ। గట్టెనేనిఁ దానఁ గరుణించి విడిచి చును। విడువకుండ నిమ్ము విమలచరిత॥ క॥ మేరువు తలక్రిందైనను। బారావారంబు లింకఁ బారిన లోలో। ధారుణి రజమై పోయినఁ। వారధ్వరఖండమైనఁ దప్పక నిత్తున్॥ మత్తకోకిల॥ ఎన్న డుంబరు వేఁడఁ బోఁడఁట యేకలంబఁట కన్నవా। రన్నదమ్ములు నైన లేరఁట యన్నివిద్యలమూలగో। ష్ఠి న్నెఱింగిన ప్రోడ సజ్జనచేతులొగ్గి వసించె నీ। విన్నపాపని ప్రోసి పుచ్చఁగఁ జెత్తమొల్లము సత్తమా॥ వ॥ అని యిట్లు సత్యపదవీప్రమాణతత్పరుండును, వితరణకుతూహలసత్త్వరుండును, విమలయశస్కుండును, వృషభమనస్కుండును, నియతసత్యసంధుండును, నర్థిజనకమలబంధుండును నైన బలిం జూచి శుక్రుండు కోపించి మదీయశాసనం బతిక్రమించుటం జేసి శీఘ్రకాలంబునం బదభ్రష్టుండవు గమ్మని శపించిన బలియును గురుశాపతప్తుండయ్యును సూనృతమార్గంబునకు నభిముఖుండై యుండె నప్పుడు॥ గీ॥ బ్రతుకవచ్చుఁగాక బహుబంధనములైన। వచ్చుఁగాక లేమి వచ్చుఁగాక। జీవధనములైనఁ జెడుఁగాక పడుఁగాక। మాటఁ దిరుగలేరు మానధనులు॥ అనునయ్యవసరంబున॥ గీ॥ దనుజలోకనాథు దయిత వింధ్యావళి। రాజవదన మదమరాళగమన। వటుని కాళ్లు గడుగ వరహేమఘటమున। జలముఁ దెచ్చె భర్తసన్న యెఱిఁగి॥ వ॥ అయ్యవసరంబునఁ గపటవటునకు నర్ధానవేంద్రుం డిట్లనియె॥ క॥ రమ్మా మాణవకోత్తమ। లెమ్మా నీ వాంఛితంబు లేవనకిత్తుం। దెమ్మా యడుగులనటురా। నిమ్మా కడుఁ గంగవలయు నేటికిఁ దడయన్॥ మ॥ బలిదైత్యేంద్రకరద్వయీకృతజలప్రక్షాళనవ్యాప్తికిన్। జలజాతాక్షుఁడు సాఁచె యోగిమనసంప్రార్థిత శ్రీదమున్। గలితానమ్రరమాలలాటపదవీకస్తూరికాశోదమున్। నళినామోదము రత్ననూపురిత నానావేదమున్ బాదమున్॥ క॥ సురలోకసముద్ధరణము। నిరత శ్రీకరణము నిలనిగమాంతాలంకరణము భవసంహరణము। హరిచరణము నీటఁ గడిగె నసురోత్తముఁడున్॥ వ॥ ఇట్లు ధరణీసురపతి చరణప్రక్షాళనంబు సేసి వామపాదంబు గడిగిన తత్పావనజలంబు శిరంబునం జల్లుకొని వార్చి దేశకాలాదిపరిగణనంబు సేసి॥ శా॥ విప్రాయ ప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూపాయ వే। దప్రామాణ్యవిదే త్రిపాదధరణీం దాస్యామి యంచుం బ్రియాభీష్టంబై దనుజేశ్వరుండు వటుకుం జేచాఁచి పూజించె బ్ర। హ్మప్రీతం బని ధారవోసె భువనం బాశ్చర్యమున్బొందఁగన్॥ తత్కాలంబున॥ గీ॥ నీరధారఁ బడఁగనీక నడ్డంబుగాఁ। గలశరంధ్రమూఁదఁగా నుదెలిసి। హరియు కావ్యు నేత్ర మటుక శాగ్రంబునఁ। బొడవ నొక్కనేత్రుఁ డయ్యె నతఁడు॥ అంత॥ ఉ॥ అమరారాతికరోదకుదోర్ఘితపవిత్రాంభఃకణశ్రేణికిన్। మహిళాధీశ్వరుఁ డొడ్డె ఖండితదివౌకస్స్వామి దివ్యస్తముం। గమలాకర్షణము ప్రశస్తము రమాకాంతాకుచోపాస్తము। న్విపులశ్రీకుచ*శాతచూచుకతటీవిన్యస్తముం హస్తమున్॥ క॥ మునిజననియమాధారను। జనితాసురపతిసునేత్రజలకణధారన్। దనుజేంద్రనీరధారను। వనజాక్షుఁడు గొనియె బలివివర్జితధారన్॥ గీ॥ కమలనాభు నెఱిఁగి కాలంబు దేశంబు। నెఱిఁగి శుక్రునాజ్ఞ నెఱిఁగి నాశ। మెఱిఁగి పాత్రమనుచు మనిచ్చె దానంబు బలి। మహిఁ వదాన్యుఁడొకఁడు మఱియుఁ గలఁడె॥ క॥ క్షితిదాన మిచ్చునతఁడును। నతికాంక్షఁ బరిగ్రహించునతఁడును సురితే। చ్యుతులై శతవత్సరములు। శతమఖలోకమునఁ గ్రీడ సలుపుదు రెలమిన్॥ వ॥ అట్లు గావున నేదానంబును భూదానంబునకు సదృశంబు గానేరదు గావున వసుంధరాదానం బిచ్చితి నుభయలోకంబులం గీర్తిసుకృతంబులు వడయుమని పలికి యయ్యవార్థివటుం డిట్లనియె॥ క॥ ఇదియేమి వేఁడితి నీ। మదివగవక ధారఁబోయుమా సజ్జనుఁ బెం। పొదవఁగఁ గోరికె యర్థిం। బిదియిచ్చుటమ జగంబు లిచ్చుటమాకున్॥ వ॥ అని పలికిన పలుకులకు హర్షనిర్భరచేతస్కుండై వైరోచనుండు॥ గీ॥ పుట్టి నేర్చుకొనెనో పుట్టక నేర్చెనో। చిట్టిబుద్ధి చిట్టిపొట్టి వడుగు। పొట్టనున్న వెల్ల భూములు ననినవ్వి। యెలమి ధరణిదాన మిచ్చె నపుడు॥ క॥ బలి చేసిన దానమునకు। నలినాక్షుఁడు నిఖిలభూతనాయకుఁ డగుటం। గలకలనై దశదిక్కులు। భళిభళి యనివొగడె భూతపంచక మనఘా॥ గీ॥ గ్రహములింద్రసిద్ధగంధర్వకిన్నరయక్షపక్షిదేవతాధిపతులు। పొగడి రతని పెంపుఁ బుష్పవర్షంబులు। గురిసె దేవతూర్యకోటి మొరసె॥ ఇట్లు ధారాపరిగ్రహంబు చేసి॥

## శ్రీ వామనమూర్తి విశ్వరూపము నొంది విజృంభించుట. శ్రీ

శా॥ ఇంతింతై వటుఁ డింతయై మఱియుఁ దానింతై నభోవీథిపై। నంతై తోయదమండలాగ్రమున కల్లంతై ప్రభా

*శాతచూచుకతటీవిన్యస్తముఁ। వాడియయిన చనుమొనలయొక్క ప్రదేశములయందుంచఁబడునట్టి.

తలఁపు విశ్వకల్పతరువు మాకు॥ వ॥ అని విన్నవించుచున్న ప్రహ్లాదుం జూచి పరమపురుషుం డిట్లనియె॥ గీ॥ వత్స ప్రహ్లాద మేలు
నీ వారు నీవు। సౌఖ్యమునఁ బొమ్ము సుతల నిలయమునకుఁ। బౌత్రసహితుఁడ వయి మోదభరితుఁడవయి। జేరి రక్షింపుచుండుదు చిత్తమలర
డదటు॥ వ॥ అని యిట్లు నియమించి వంబరమేశ్వరుని కనుమతి యొసంగి ప్రహ్లాదుండును బలియునుఁ దన కనుచరులగు దైత్యదానవులను గూడి నిబ
ద్ధుండై సకలాసురయూథంబులతోడ నొక్క మహాబిలద్వారంబు సొచ్చి ప్రహ్లాదుండు సుతలలోకంబునకుం జని
యెం తయు బ్రహ్మవాదులయిన యాజకుల సభామధ్యంబున నంగుష్ఠమాత్రుఁడైన శుక్రునిం జూచి నారాయణుం డిట్లనియె॥ గీ॥ ఏమికో
ఱంతవడియె నీ తనియాగంబు। విస్తరింపు మీవు విప్రవర్య। విషమమయిన కర్మ విసరంబు బ్రాహ్మణ। జనులు సూచినంతఁ శమతఁ
బొందు॥ అనిన శుక్రుం డిట్లనియె॥ సీ॥ అఖిలకర్మంబులకధినాథుఁడవు నీవు యజ్ఞేశుఁడవు నీవు యజ్ఞపురుష। ప్రత్యక్షమున నీవు
పరితుష్టి నొందినఁ గడ మేల గల్గు నేకర్మములకు। ధనదేశకాలార్హ తంత్రమంత్రంబులఁ గొఱంతలు నిన్నుఁ జేరఁ దీరు నీనామ
ము। నైనఁ గావింతు నీయాజ్ఞ నీయభవ యాజ్ఞ మెలఁగుట జనులకు మేలు గాదె। యింతకంటెను శుభము నాకేటఁ గలుగు। నను చు
హరివంపు శిరమున నావహించి। కావ్యుఁడను రేండ్రు జన్నంబు కడముట్టిఁ దీర్చె। మునులు విప్రులు సాహాయ్యమునఁ జరింప॥
వ॥ ఇవ్విధంబున వామనుండై హరి బలి నడిగి మహిం బరిగ్రహించి తనకు నగ్రజుండగు నమరేంద్రునకుం ద్రిదివంబు నప
యుండై యొసంగెన త్తఱి దక్ష భృగు ప్రజాపతులును భవుండును, కుమారుండును, దేవర్షి పితృగణంబులును, రాజులును,
దానును గూడికొని చతురాననుండు కశ్యపునకు నదితికి సంతోషంబుగా లోకంబులకు, లోకపాలురకు, వామనుండు వల్ల
భుండని నియమించె- ధర్మంబునకు, యశంబునకు, లక్ష్మికి, శుభంబులకు, దేవతలకు, వేదంబులకు, స్వర్గాపవర్గంబులకును పేం
ద్రుండు ప్రధానుండని సంకల్పించి రా సమయంబున॥ క॥ కమలజుఁడు లోకపాలురు। నమరేంద్రునిఁ గూడి దేవయానంబున
న। య్యమరావతికిని వామను। నమరంగా నిపోయి రంతన టమీఁద నృపా॥ గీ॥ బల్లిదంపు తోడు ప్రాపున నింద్రుని। కింద్రపద
ము చేరుట ఇట్లు గలిగెఁ। దనకు వామనుఁడై సత మ్ముఁడుగ లిగినఁ। గోరుకొలన్న కేలఁ గొఱంతనొంచు॥ క॥ పాలడుగఁడు మేలడుగఁ।
డేలఁడు భిక్షించి యన్నకిచ్చెఁ ద్రిజగము। న్వేలుపుల తల్లి కడుపటి। చూలు నొప్పెలంగఁ గల రెసొలయనితమ్ముల్॥ గీ॥ కడుపుబరు
వుగాఁ గఁ గొడుకులఁ గనుకంటెఁ। దల్లి కొకఁడే చాలు బల్లిమండు। త్రిదశగణముఁ గన్న యదితి కానుపుఁ దీర్చె। చిన్ని మేటి వడు
గుఁ గన్న యట్లు॥ వ॥ ఇట్లు దేవేంద్రుండు వామనభుజపాలితంబగు త్రిభువనసామ్రాజ్యవిభవంబు పఁ బలనంగీకరించె నప్పు
డు బ్రహ్మయు శర్వుండును, కుమారుండును, భృగుప్రముఖులైన మునులును, విశ్వదేవతలును, దక్షాది ప్రజాపతులును, సిద్ధ
లును, వైమానికులును, మఱియుం దక్కిన వారలును నద్భుతపరాక్రముండైన విష్ణుప్రభావంబులకు నాశ్చర్యంబు నొందుచుఁ
బ్రశంసించుచు నాడుచుం బాడుచుం దమతమ నివాసంబులకుం జనిరని చెప్పి శుకుం డిట్లనియె॥ గీ॥ మనుజనాథ త్రివిక్రము మ
హిమ కొలఁది। యెఱిఁగి తరింపలేక గింపనెవ్వఁడోపుఁ। గుంభినీ రేణుకణములు గురుతు వెట్టు। వాఁడు నేరఁడు దక్కిన వాని
వశమె॥ క॥ అచ్యుతవర్తనుఁడగు హరి। సచ్చారిక మైన విమలచరితము వినువాఁ। డుచ్చటవిక్రముఁడై తుది। నుచ్చావితలీలఁ బొం
దును త్తమగతులన్॥ గీ॥ తగిలి మానుష పైతృక దైవకర్మ। వేళలందుఁ ద్రివిక్రమువిక్రమంబు। లెక్కడెక్కడఁ గీర్తింతు రెవ్వ
రేనిఁ। బొందుదురు నిత్యసౌఖ్యంబు భూవరేంద్ర॥ వ॥ అని యిట్లు శుకుండు రాజునకు వామనావతారచరితంబు సెప్పెనని

## ॥ మత్స్యావతారకథా ప్రారంభము. ॥

సూతుండు మునులకుం జెప్పిన విని వారల తనికిట్లనిరి॥ సీ॥ వినుము ఆత్మ విన మాకు వేడుకయ్యెను మున్ను హరి మత్స్యమైన వృత్తాం
త మెల్లఁ। గర్మబంధుని భంగి ఘనుఁ డీశ్వరుఁడు లోకనిందితంబైన తపోనిలయమైన। మీనరూపము నేల మేదిని ధరియించె నెక్క
డవర్తించె నేమి చేసె। నాద్యమై వెలయు నయ్యవతారమునకు నెయ్యెది కారణంబుగా ర్యాంశమెట్లు నీవు దగుదు మాకు నిఖి
లంబు నెఱిఁగింపఁ। దెలియఁ జెప్పవలయు దేవదేవు। చరితమఖిలలోకసౌభాగ్యకరణంబు। గాదె వివిస్తరింపు క్రమముతోడ॥
వ॥ అని మునిజనంబులు సూతు నడిగిన నతండు మీరలడిగిన యీ యర్థంబుఁ బరీక్షిన్నరేంద్రుం డడిగిన భగవంతుండగు బాదరా
యణి యిట్లనియె॥ సీ॥ విభుఁడీశ్వరుండు వేదవిప్రగోసురసాధుధర్మార్థములు గావఁ దనువుఁ దాల్చి। గాలి చందంబున ఘనరూ
పములయందునురూపములయందుఁ దగిలియుండు। నెక్కువ తక్కువ నెన్నఁడు నొందక నిర్గుణత్వంబున మెలయుఘనుఁడు।
గురుతయుఁ గొఱంతయు గుణసంగతి వహించుమను జేశ చోద్యమే మత్స్యమగుట। వినుము పోయిన కల్పాంత వేళఁ దొల్లిఁ। ద్ర
విడదేశపు రాజు సత్యవ్రతుండు। నీరుఁ ద్రావుచు హరిఁ గూర్చి నిష్ఠతోడఁ। దపముఁ గావించెనొక యేటి తటమునందు॥ వ॥ అని
మఱియు నొక్కనాఁడమ్మేదినీ కాంతుండు కృతమాలిక యను నేటి యొంత హరిసమర్పణంబుగా జలతర్పణంబు సేయుచున్న
సమయంబున నా రాజు దోయిటనొక్క మీను పుట్టి దవిలి వచ్చిన నులికిపడి మఱలం దరంగిణీజలంబునందు శకులశాభకంబు విడి

చెవిడివడినీటిలోనుండి*జలపోతంబుభూతలేశ్వరునకిట్లనియె॥మ॥త్తకోకిల॥పాటువచ్చినజాతిఘాతులుపావజాతిఝషం
బులీయేటఁగొండొకమీనుపిల్లలనేఁటిపట్టివధింపన।చ్చోటనుండకనీదుదోసిలివచ్చిచొచ్చిననన్నునె। క్కేటఁద్రోవఁగఁబాడి
యేకృపయింతలేకదయానిధీ॥గీ॥వలలుఁదారునింకవచ్చిజాలరి§వేఁట।కాఁడు వేఁడుగలఁచితారువెట్టిమిడిసిపోవనీకమెడఁ
బట్టుకొనియెడ।రప్పడెందుఁజొత్తునసఘచరిత॥క॥భక్షింతురొండెఝషములు।శిక్షింతురుదుష్టులగుచుఁజెడకుండనను।ర
క్షింపుదీనవత్సల।ప్రక్షీణులఁగాఁచుకంటెభాగ్యముగలదే॥వ॥అనినపనికరుణాకరుండగునవ్విభుండు మెల్లనంభోజడింభ
కంబును,గమండలుజలంబునంబెట్టితననెలవునకుంగొనిపోయెనదియునేకరాత్రంబునంగుండికనిండితనకునుండనిమ్ము
చాలకరాజన్యునకిట్లనియె॥క॥ఉండనిదిగొంచెమెంతయు।నెండొకటిందెమ్ముభూవరోత్తముయనుడు।న్గండకముఁదెచ్చివిడి
చెనుమండలపతికలశసలిలమధ్యమునందుఁ॥వ॥అదియునుముహూర్తమాత్రంబునమూఁడుచేతులనిడుపై¶యుదంచ
నంబునిండినఁబట్టులేకవేఱొండుదెమ్మనవుడారాచపట్టికరుణాగుణంబులకునాటపట్టుగావునగండకంబునొక్కచిఱుత
మడుగుననునిచెనదియునాసరోవరజలంబులకునగ్గలంబైతనకుసంచరింపనదికొంచంబనిపలికినఁబుడమిఱేఁడుమంచివాఁ
డగుటంజేసియాయుదకచరంబునుదంచితజలాస్పదంబైనహ్రదంబునందునిడియెనదియుజలాశయంబునకునధికంబైపె
ంపుగనిమ్ములేదనిచెప్పికొనినవప్పణ్యుండొప్పిడినమువడిఁదప్పనివాఁడైనకతరంబుననమ్మహామీనంబును మహార్ణవంబునవి
డిచెనదియునుమకరాకరంబునంబడిపెనుమొసళ్లుముసరికొనికసిమసంగిమ్రింగెడినింతకాలంబునడపికడపటదిగవిడువ
కవెడలందిగువునఁనియెఱింగింపనన్నీటిప్రోడకుంబుడమిఱేఁడుదెలిసియిట్లనియె॥ సీ॥ ఒకదినంబునశతయోజనమాత్ర
మువిస్తరించెమనీవువినముచూడ।మిటువంటిశీర్షుష్షుముల నెన్నఁడు నెఱుఁగమునీనజాతులకిట్టి మేనుగలదె। యేమిటికె
వ్వఁడవేలఁగ్రుప్పించెమకరుణనాపన్నులఁగావవేఁడి। యంభశ్చరంబైనహరివినేనెఱిఁగితినవ్యయనారాయణాభిధాన।
జననసంస్థితిసంహారచతురచిత్త।నీనులగుభక్తులకుమాకుదిక్కునీవ।నీదుమీనావతారంబునిఖిలభూత। భూతిహేతువు
ప్రొక్కెదఁబురుషవర్య॥క॥ఇతరులమిగామిచిత్సం।గతులమిమాపాలనీవుగలిగితిభక్త।స్థితుఁడవగునిన్నునెప్పుడు।నుతి
సేసినవారికేలనాశముగలుగుఁ॥క॥ శ్రీలలనాకుచవీధీ। కేళీపరతంత్రబుద్ధిక్రీడించుసుఖా। లోలుఁడవుదామసాకృతి। నే
లామత్స్యంబవైతివెఱిఁగింపుహరీ॥ వ॥అనిపలుకుసత్యవ్రతుండనుమహారాజునకునయ్యుగంబుకడపటఁ ప్రళయవేళస
ముద్రంబుననేకాంతజనప్రియుండైవిహరింపనిచ్ఛయించుమీనరూపుండైనహరియిట్లనియె॥సీ॥ ఇటమీఁదనీరాత్రికేడ
వదినమునఁబ్రహ్మగర్భునకొక్కపగలునిండు। భూర్భువాదికజగంబులుమూఁడువిలయాబ్ధిలోనమునుంగునాలోనఁబెద్ద।
నావచేరఁగవచ్చునాపంపుపెంపునదానిపైనౌషధతతులుబీజ। రాసులునిడిపయోరాశిలోవిహరింపఁగలవుసప్తర్షులుఁ
గలిసితిఱుగ। మ్రోయఁగానరాకముంచుపెంజీఁకటి। మునుఁగుచుండుమునులమేనివెలుఁగు। దోలుకుచుండుజలధి❀దో
ధూయమానమై।నావతేలుచుండునరవరేణ్య॥ వ॥మఱియునన్నావమున్నీటికరుళ్లకులోనుగాకుండనిరుగెలంకులవెనుక
ముందఱనేనుఱుకుండఁ బెన్నెఱులుగునాగఱులంజడియుచుఁ బొడువవచ్చినబలుగ్రాహంబులనోడియుచు సంచరించెద
నొక్కపెనుపాముచేరువనాయనుమతింబొడచూపెదుదానంజేసి సుడిగాడ్పులకతంబుననావ వడిఁదిరుగకుండనాకొ
మ్ముతుదిఁబదిలంబుగఁజేసినీకునుమునులకునలజడిచెందకుండమున్నీటనిప్పాటందమ్మిచూలిరేయి వేగునంతకుమెలంగెదన
దికారణంబుగాజలచరరూపంబుఁగైకొంటిమఱియునుంబ్రయోజనంబుగలదునామహిమపరబ్రహ్మంబనితెలియుముని
న్నునను గ్రహింతునని సత్యవ్రతుండుసూడహరితిరోహితుండయ్యెనయ్యవసరంబున॥గీ॥మత్స్యరూపియైనమాధవునడు
గులుతలఁచికొనుచురాచతపసియొక్క।దర్భశయ్యఁదూర్పుతలకడగాఁబడి। కాచియుండెనాఁటికాలమునకు ॥ అంతక
ల్పాంతంబుడాసిన॥క॥ఉల్లసితమేఘపఙ్క్తులు।జల్లించినుహూగ్రవృష్టిజడిఁగొనికురియ।న్వెల్లివిరిసిజలరాసులు।సెల్లె
లికట్టలనుదాఁటిసీమలముంచెఁ॥తదనంతరంబ॥గీ॥మున్నుపోయినకల్పాంతముననరేంద్ర। బ్రాహ్మమనఁగనైమిత్తికప్ర
ళయవేళ।నింగిపైనిట్టితొలఁకుమున్నీటిలోనఁ।గూలెభూతాళిజగముఁకొలఁదివెడలి॥అంతనమ్మహారాత్రియందు॥మ॥ నె
ఱినెల్లప్పుడునిల్పిప్రాణచయముస్మీలింపనిర్మించిపీ।పెటియన్నిల్గుచునావులించుచునజుండీసృష్టియున్మానిమే। నొఱఁ
గెఁఁ దెప్పలుమూసికేల్దలగడైయుండంగనిద్రించుచుఁ।గుఱువెట్టందొడఁగెన్గలల్గనుచునిర్ఘోషించుచున్భావరా॥గీ॥అ

* జలపోతంబు-గండకము।చేఁపపిల్ల. §వేఁటకాఁడు।వేఁటకాండ్రు. ¶ఉదంచనము।కుండ-కాఁగు, ప్రాదము।లోఁతుగలమడుగు. మ
హార్ణవము।సముద్రము. మకరాకర।సముద్రము. ఝర్ఝుషము-అంభశ్చరము।మత్స్యము. ❀దోధూయమానమై।మిగులఁగదలింపఁబడుచున్న
దై. ⁂గాడ్పులగు।వెండ్రుకలుగల, గఱులకు।ఱెక్కలచేత, అలజడి।దుఃఖము, మున్నీటఁ।సముద్రమునందు, ఇప్పాటఁ।ఈరీతిని.

లసిసోలసినిమరనందినపరమేష్ఠి ముఖమునందు వెడలె మొదటిశ్రుతుల నపహరించె నొక హయగ్రీవుఁడను దైత్యభటుఁ
డు దొంగఁ దొడరఁ బరులవశమె॥ క॥ చదువులు దనచేఁ బడెనని చదువుచుఁ బెక్కబయలనుండ శంకించి వడిన్ జనువులమమక
డుగూరుకఁ జదువులతస్కరుఁడు సొచ్చె జలనిధి కడుపుల్॥ వ॥ ఇట్లు వేదంబులు దొంగిలి దొంగరక్కసుండు మున్నీట మునిం
గిన వానిజయింపవలసియు బ్రహ్మానుధీఁ గెలయందు పిత్తనంబుల పెన్నీట నాని చెడకుండ ననుపవలసియు నెల్లకార్యంబులకుఁ
గావలియగు నా పురుషోత్తముండప్పెను* రేయిబోరువలయందు॥ క॥ కటుగటులు వలుద మీసలు చిటుదోఁకయుఁ బసిఁడి
యొడలు సిరిగల పొడలు న్నెటిమొగము నెక్కుఁ గొమ్మును మిటుచూపులు గలిగి విభుఁడు మీనంబయ్యెన్॥ వ॥ ఇట్లు లక్షయో
జనాయతంబై విశ్వంభరుండు జలధిసొచ్చి॥ సీ॥ ఒక మాటు జలజంతు ‡శ్రేయాధంబుతోఁ గూడి నొకపటిదరులకు నెకివచ్చు
నొక మాటిమింటికి నుదిరియుల్లంఘించు నొకపారి లోపల నొదిగియుండు నొకసారి వారాశి నొడలు ముంపమి సూపు నొకతే
పబ్రహ్మాండ మొఱయఁ దలఁచు నొక తూరి ఝుషకోటి నొడిసి యాహారించు నొకతూకు జలములసుమిసి వైచు గటులుసా
రించు మీసలు గడలుకొలుపు బొడలు మెఱపించుఁ గన్నులపొలుపు మార్చు నొడలు ఝళిపించు దళతళ నొలయుమీన వేషి
పెన్నీటి @నిగమగవేషియగుచు॥ వ॥ అంతకు మున్న సత్యవ్రతుండు మహార్ణవంబులను మహీవలయంబు ముంచు నవసరంబు
నభక్తపరాధీనుండగు హరిం దలంచుచునుండె నారాయణప్రేరితంబై యొక్కనావ వచ్చినం గనుంగొని॥ మ॥ చనిసత్యవ్ర
తమేదినీపయిశుఁ డోజం బూని మాన్ద్రీఁ గెపి త్తనముల్వెక్కు దు నావపైనిడి హరిధ్యానంబుతోఁ దానిపై మునిసంఘంబులు
దానునెక్కె వెఱతో మున్నీటిపైఁ దేలుచున్ గనియెన్ముందట §భక్తలోకహృదలంకర్మీణము మీనముల్॥ వ॥ కనిజలచరేంద్ర
నికొమ్మున నొక్క పెనుపాము త్రాటన నావఁ గట్టి సంతసించి దండంబు నిడిరి కొనిత పస్వులతోడఁ గూడికొని యారాచపె
ద్దమీనాకారుండగు వేల్పు తేనినిట్లని పొగడెనప్పుడు॥ మ॥ తమలోఁ బుట్టు నవిద్యగప్పికొనఁ గర్దమ్మాలసంసారపు భ్రమునై
కొందఱు దేలుచుం గలఁచుచుం బల్వెంటలం గైనయోగమునం జేపరమేశుఁ గొల్చి ఘనులై కైవల్యసంప్రాప్తులై ప్రస
దంబందెదరట్టి నీవు గరుణం బాలింపుమమ్మీశ్వరా॥ ఉ॥ కన్నులు లేనివాఁడు మఱి కానని వానికిఁ ద్రోవఁ జూపఁగాఁ జన్నతె
అంగు మూఢునకు సన్మతిఁ దాఁ గురుఁడౌట సూర్యుఁడే కన్నులుగాఁగ భూతములఁ గాంచుచునుండు రమేశ మాకును దృష్ట
యుమూర్తివై గురువవై యలసద్గతిఁ జూడఁ జూపవే॥ క॥ ||ఇంగలము తోటిసంగతి బంగారము వన్నెగలుగు భంగిని నీసేవాం
గీకృతులయఘంబులు భంగంబులఁ బొందుముక్తి ప్రాపించు హరీ॥ క॥ హృదయేశ నీప్రసన్నత పదివేలవపాలి లేశభాగము
కతసం త్రిదశేంద్రత్వముగలదఁట తుదినిసు మెప్పింపనేది దొరకదు శ్రీశా॥ క॥ పెఱవాఁడు గురుఁడటంచును గొఱగానిప
దంబు సూపఁడు జనుండు సునీ నెఱత్రోవ నడువ నేర్చిన నఱమఱ లేనట్టిపదమునందు దయాబ్ధీ॥ మ॥ చెలివై చుట్టమవై మనస్థి
తుఁడవై చిన్మూర్తివై యాత్మవై వలనై కోర్కులపంటవై ప్రభుఁడవై వర్తిల్లు సిన్నొల్లకీ పలువెంటం బడిలోకులక్కట వృ
థా బద్ధాశులై పోయెడి న్నిలువన్నేర్వ నెహోమరాశిఁ గనియున్నిర్భాగ్యుఁడం భక్తయా॥ గీ॥ నీరరాశిలోన నిజకర్మబద్ధ
మైయుదితనిద్రఁ బొందియున్నలోక మేమహాత్ము చేత నెప్పటిమేల్కాంచు నట్టినీవు గురుఁడ వధిపమాకు॥ క॥ అలింపుము
విన్నపమిదె వేలుపుగమి తేనినిన్ను వేఁడికొనియెద నాలోని చిక్కు మానిచి నీలోనికిఁ గొంచుపొమ్ము నిఖిలాధీశా॥ వ॥ అ
నియిట్లు సత్యవ్రతుండు వలికిన సంతసించి మత్స్యరూపంబున మహాసముద్రంబున విహరించు హరి పురాణపురుషుండగు
టం జేసి సాంఖ్యయోగక్రియాసహితయగు పురాణసంహిత నుపదేశించె నమ్మహారాజుమునిసమేతుండై భగవన్నిగదితం
బైన సనాతనంబగు బ్రహ్మస్వరూపంబు దెలిసికొని కృతార్థుం డయ్యె నిమ్మహాకల్పంబున వివస్వతుండ నంబరగిన సూర్యునకు
శ్రాద్ధదేవుండన జన్మించి శ్రీహరికృపావశంబున నేడవమనువయ్యె నంతనవ్విధంబునం బెను రేయినిండునంతకు సంచరించి
జలచరాకారుండగు నారాయణుండు ¶దన్నిశాంతసమయంబునందు॥ మ॥ ఉఱుఁ డంభోనిధిరోసి వేదముల నొయ్యన్
దైన్యముం జూచివే గటులాడించి ముఖంబు సాచి బలువీఁకం దోఁకసారించి మే న్మెఱయన్ దౌడలు గీటి మీసల దర
మీనాకృతి విష్ణుఁ †డక్కటిం దాఁకి వధించె ముష్టిదళితగ్రావున్ హయగ్రీవునిన్॥ అంత ప్రళయావసానసమయంబు
న॥ సీ॥ ఎప్పుడు వేఁగునం చెనుఱు సూచుచునుండు మునుల డెందంబులు ముదమునొందఁ దెలివితోఁ బ్రక్క నిద్రించు భారతి
లేచి రోమోరపమ్యొదఁజ [illegible] నొత్తికొనఁగ మలినమై పెను రేయి ప్రక్కన తేజంబుతొంటిచందంబునఁ దొంగలింపఁ బ్రా

*రేయిబోరువలయందు = రాత్రికాలములయందు. ‡శ్రేయాధము = గుంపు. @నిగమగవేషి = వేదముల వెదకుచున్నవాఁడు. §భక్తలోకహృదలంకర్మీణముల్ = భక్తజనహృదయముల నలంకరించు నట్టిస్వభావముగల. ||ఇంగలము = అగ్ని. ¶తన్నిశాంత = ఆరాత్రికడపటియొక్క. †అక్కటిక్ = దుముదైన హయగ్రీవుఁడను రాక్షసుని. ముష్టిదళితగ్రావున్ = పిడికిటిపోటులచేత బద్దలుగాఁ జేయఁబడిన పర్వతములుగల.

ఖలసంచితభాగధేయంబులుగన్నులకొలఁకులఁగానఁబడఁగ। నవయవంబులుగదలించియాపులించి। నిదురఁదెప్పిఱిమేల్కాంచినీల్గిమఱిగి। యొడలువిఱుచుచుఁగనుఁగవనులుముకొనుచు। ధాతగూర్చుండెసృష్టిసంధాతయగుచు॥ అయ్యవసరంబున॥ గీ॥ *హాసవారిఁజంపివానిచేఁబడియున్న। వేదకోటిదిక్కువిచ్చితెచ్చి। నిదురమానియున్ననీరజాసనునకు। నిచ్చెఁగరుణతోడనీశ్వరుండు॥ క॥ జలరుహనాభునికొఱకై। జలతర్పణమాచరించిసత్యవ్రతుఁడా। జలధిఁబ్రతికిమనువయ్యెను। జలజాక్షునిఁగొలువఁగెంతసంపదగలదే॥ గీ॥ జనవిభుండుతపసిసత్యవ్రతుండును। మత్స్యరూపియైనమాధవుండు। సంచరించినట్టి✿విశదామలాఖ్యానంబు। వినినవాఁడుబంధవిరహితుండు॥ క॥ హరిజలచరావతారము। బహువడిఁబ్రతిదినముఁజదువఁబరమపదంబు। న్నరుదందువారికోర్కులు। ధరణీశ్వరసిద్ధిఁబొందుఁదథ్యముసుమ్మీ॥ మ॥ ప్రళయాంభోనిధిలోనమేన్మఱచినిద్రంజెందువాణీశునోములవేదంబులుగొన్నదైత్యునిమ్రుతింబొందించిసత్యవ్రతుం। డలరన్ బ్రహ్మముమాటఁదానిలిపెనిత్యాధారుఁడైమీనమై। జలధిఁగ్రుంకుచుఁదేలుమత్స్యలఁగురాజన్మూర్తికిన్ మ్రొక్కెదన్॥ అనిచెప్పి॥ ... ... ...

క॥ రాజేంద్రదైత్యదానవ। రాజమహాగహనదహన రాజస్తుత్యా। రాజావతంసమానిత। రాజధరార్చనగుణాఢ్య రాఘవరామా॥

మాలిని॥ దివిజరిపువిదారీ దేవలోకోపకారీ। భువనభరనివారీ పుణ్యరక్షానుసారీ।
ప్రవిమలశుభమూర్తీ బంధుపోషప్రవర్తీ। ధవళబహుళకీర్తీ ధర్మనిత్యానువర్తీ॥

గద్య. ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీమహాభాగవతపురాణంబను మహాప్రబంధంబునందు స్వాయంభువ స్వారోచిష ఉత్తమ తామస మనువుల చరిత్రంబును, కరిమకరియుద్ధంబును, గజేంద్రరక్షణంబును, రైవత చాక్షుష మనువుల వర్తనంబును, సముద్రమథనంబును, కూర్మావతారంబును, గరళభక్షణంబు, నమృతాదిసంభవంబును, దేవాసురకలహంబును, హరికపటకామినీరూపంబున నసురుల వంచించి దేవతల కమృతంబు వోయుటయు, రాహువధంబును, హరిహరసల్లాపంబును, హరికపటకామినీరూపవిభ్రమణంబును, వైవస్వత సూర్యసావర్ణి దక్షసావర్ణి బ్రహ్మసావర్ణి భద్రసావర్ణి దేవసావర్ణి యింద్రసావర్ణి మనువుల వృత్తాంతంబును, బలియుద్ధయాత్రయును, స్వర్గవర్ణనంబును, దేవపలాయనంబును, వామనావతారంబును, శుక్రబలిసంవాదంబును, త్రివిక్రమవిస్ఫురణంబును, రాక్షససుతలగమనంబును, సత్యవ్రతోపాఖ్యానంబును, మీనావతారంబును నను కథలు గల యష్టమస్కంధము. శ్రీకృష్ణార్పణమస్తు.



## శ్రీమదాంధ్రభాగవతము — నవమస్కంధప్రారంభము.



శ్రీరాజితమునిపూజిత। వారధిగర్వాతిరేకవారణబాణా। సూరిత్రాణమహోజ్జ్వల। సారయశస్సాంద్ర రామచంద్ర నరేంద్రా॥

వ॥ మహనీయగుణగరిష్ఠులగునమ్మునిశ్రేష్ఠులకునిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండైనసూతుండిట్లనియెనట్లుప్రాయోపవిష్టుండైనపరీక్షిన్నరేంద్రుండుశుకయోగీంద్రుంగనుంగొని॥ సీ॥ మనువులనడవళ్లుమర్యాదలునువింటిమన్వంతరంబులమాధవుండు। దిరిగినజాడలుదెలిసెసత్యవ్రతుఁడనురాజుద్రవిళదేశాధిపుండు। పోయినకల్పాంతమునవిష్ణుసేవించివిజ్ఞానమునఁబొందివెలుఁగుతేని। కతఁడువైవస్వతుండైపుట్టిమనువయ్యెనతనికినిక్ష్వాకుఁడాదిగాఁగ। బదురుకొడుకులుగలరందుఁబరగువారి। వంశమేరీతివర్తించెవారిలోనఁ। జనినవారినిఁజనువారిఁజనెడువారిఁ। జెప్పవేవ్యాసనందనచిత్తగించి॥ క॥ చెవులారనేఁడువినియెద। రవివంశమునందుఁగలుగురాజులకీర్తుల్। ప్రవరింపువరుసతోడను। భువిపుణ్యులచరితవినఁగఁబుణ్యముగాదే॥ వ॥ అనినంబరాశరమునిమనుమఁడిట్లనియె॥ గీ॥ వినుముమనువుకులము వేయినూరేండ్లను। బరగవిస్తరించిపలుకరాదు। నాకుఁదోఁచినంతనరనాథవేగంబ। యెఱుఁగఁబడఁగఁబ్రీతినేర్పఱింతు॥ క॥ ఎక్కువతక్కువపాడవు। లెక్కడమొదలైనపురుషుఁడింతయుఁజెడఁదా। నొక్కఁడుకల్పాంతంబున। నక్కజమైనిల్చెవిశ్వమతఁడైయుండన్॥ సీ॥ భూమీశయమ్మహాపురుషునినాభిమధ్యమునబంగారుకెందమ్మిమొలిచె। నాతమ్మిపూవులోనటమీఁదఁదనయంతనాలుగుమోములనలువపుట్టె। నాబ్రహ్మమనమునఁనటమరీచిజనించెఁగశ్యపుండతనికిఁగలిగెనంత। నాకశ్యపునికిదక్షాత్మజయదితికిఁగొమరుఁడై✿చీఁకటిగొంగవొడమె। జలజబంధునిపెండ్లాముసంజ్ఞయందు। శ్రాద్ధదేవుండుమనువుసంజాతుఁడయ్యె। మనువునకుశ్రద్ధయనియెడిమగువయందుఁ। బదురుకొడుకులుగలిగిరిభద్రయశులు॥ వ॥ వారలిక్ష్వాకుండును, నృగుండును, శర్యాతియు, దిష్టుండును, ధృష్టుండును, కరూశకుండును, నరిష్యంతుండును, పృషధ్రుండును, నభగుండును, కవియుననునెగడిరటమున్నమనువుకొడుకులులేనివాఁడైమిత్రావరుణులనుద్దేశించి॥ సీ॥ మనువుబిడ్డలువుట్టనుఖమాచరించుచోనతనిభార్యయుహో

*హాసవారి। రాక్షసుని. ✿విశదామలాఖ్యానము। నిర్మలమయినకథ. ✿చీఁకటిగొంగ। సూర్యుఁడు. శ్రాద్ధదేవుఁడు। యముఁడు.

తనొత్స్రయించెఁ. కూఁతురుపుట్టనాకొగిఁ జేయుమనిపల్కి వరభక్తితోఁ బయోవ్రతము సలిపె. నా సతి సెప్పినట్లధ్వర్యుఁడును హోతయగుఁగాక వ్రేల్చెదనంచుఁ బలికె. హవియందుకొని కూఁతురగుఁగాకయని వషట్కారంబు సెప్పుచుఁ గడిసి వేల్వ హోత పెడచేత నిలయనునువిదవుట్టె. దానిఁ బొడగని మనువు సంతాపమంది. కొడుకు మేల్గాక యేటికి కూఁతురనుచుఁ జెప్ప వేయని పోయె వసిష్ఠు కడకుఁ జని యిట్లనియె. క॥ అయ్యా కొడుకులకొఱకై యియ్యాగము నీయనుజ్ఞనేఁ జేయంగా నియ్యాఁడు దేలపుట్టెను మియ్యంతటి వారికొండు మేరయుఁ గలదే. వ॥ అదియునుంగాక మీరు బ్రహ్మవాదులరు మంత్రనాములరు పాపంబులంటకుండం జేయుచువారిది యేమి యనవుడు వసిష్ఠుండు హోతృవ్యభిచారంబెఱింగి మనువునకిట్లనియె. గీ॥ అధిపసంకల్పవైషమ్యమును దుటఁ జేసి హోతకల్లదనంబున నువిదగలిగె. నైన నగలిగింతు నీకుఁ బ్రియాత్మజులను నీవు మెచ్చంగఁ జూడు నా నేర్పు బలిమి. వ॥ అని పల్కి భగవంతుండగు వసిష్ఠుండు గీర్తితత్పరుండుగావున మనువుకూఁతురి మగతనంబుకొఱకు నేకచిత్తంబున నాదిపురుషుండగు హరిం బొగడిన నప్పరమేశ్వరుండు మెచ్చి తపసి కోరిన వరంబిచ్చెనది నిమిత్తంబున నిళాకన్యక సుద్యుమ్నుండను కుమారుండై రాజ్యంబు సేయుచు. సీ॥ ప్రొద్దుపోకొక నాఁడు పోయి పేటడవుల వెంట వేఁటాడుచు వేడ్కతోడఁ గొందఱు మంత్రులు గూడి రా *సైంధవంబయిన గుఱ్ఱము నెక్కి యడవికేఁగి బలువిల్లుఁ గ్రొవ్వాడి బాణంబులును దాల్చి పెను మెకంబుల వెంటఁ బఱుచుతోడ నుత్తరదిశకు సామగ్రుఁడై యేతెంచి మేరువు పొంతఁ గుమారవనముఁ జేరె నెందు మహేశుండు శివయు నెప్పుడు రతియుసలుపు చురంబు నా రాజు పోవ నాఁడువయ్యెను దోడనేయనుచరులును బడఁతులై రితదశ్వంబు బడబయయ్యె. వ॥ ఇట్లు మగతనంబు సెడి నగువలై యొండొరుల మొగంబులు సూచికొనుచుండిరనిన విని శుకునకు రాజిట్లనియె. గీ॥ రాజుతోడి వారు రమణులై రంటివి కాంతలయిరి యేమి కారణమున నిట్టి దేశమెఱుఁగ నెన్నఁడా కథలెల్ల వేడ్కఁ దీఱ నాకు విస్తరింపు. అదియునుంగాక. గీ॥ మగువతనము మాని మగవాఁడు గావచ్చుఁ గాక పేరు పెంపు గాసి గాఁగ మగతనంబు మాని మగువ గావచ్చునే మానవంతుఁడయిన మానవునకి. అని పలికిన నప్పనపాత్రునకు వ్యాసపుత్రుండిట్లనియె. సీ॥ పురవైరి యొకనాఁడు పొడసూపు వేడుకఁ దపసులు దిక్కులతనము లెల్లఁ దమతమ వెలుఁగులు నిగిలి గొందురు సారఁ గొందఱు మౌనులుఁ గోరి రాఁగఁ బ్రాణేశుతొడలపై భాసిల్లు నంబిక వారలఁ జూచి మైవలువ లేమి సిగ్గువుట్టి నలేచి చీరఁ గట్టినఁ జూచి దేవియు దేవుండు దీర్ఘలీల నొంటితమలోనఁ గ్రీడించుచున్నవారు మనకుసనుయంబు గాదని మఱలి మునులు నరుఁడు నారాయణుండున్న నారతంబు మెలఁగు చోటికి నడచిరి మేదినీశ. అది కారణంబుగా భగవంతుండగు శివుండు తన ప్రియురాలి వేడుకలకొఱకు నిట్లని వక్కాణించె. క॥ ఈ నెల వెవ్వఁడు సొచ్చిన మానినియగు నని తొంటి మాటకతమున న్మానవుఁడు మగువపోడిమి మానక పేటడవులందు మఱియుందిరిగెన్. వ॥ ఇట్లు చెలికత్తియల మొత్తంబులుం దానును నారాచపూబోఁడి వాడిమి చూపుల నాడుపోడిమి నెఱపుచు దైవయోగంబున సోమసుతుండును భగవంతుండును నగు బుధుని యాశ్రమంబుఁ జేరి మెలఁగుచున్నయెడ. గీ॥ రాజుకొడుకుఁ జూచె రాజీవదళనేత్ర రాజవదనఁ జూచె రాజుపట్టి దొంగకాముఁడంత §దొందడిఁ జిగురాకు వాలు వెఱికి యుఱికి వారి మొత్తె. వ॥ ఇట్లలరువిల్తుని నెఱబిరుదు దిగురుటడిదంబు మొనకు నోహటించి వారలిరువురుం బైఁబడి వేడుకలకుం జొచ్చిన వారలకుం బురూరవుండను కుమారుండు వుట్టె నివ్విధంబున. గీ॥ మనుసుతుండు ఘనుఁడు మగనాలితనమునఁ గొడుకుఁ గాంచి పిమ్మట కుందికుంది చింతఁ బొంది గురువసిష్ఠుని భావింప నతని తలఁపులోనన తఁడు వచ్చె. వ॥ వచ్చి సుద్యుమ్నుండు మగవాఁడయ్యెడుకొఱకు సమ్మునిపుంగవుండు శంకరు నారాధింప నీశ్వరుండు దపసి ప్రయాసంబునకు సంతసిల్లి యిట్లనియె. క॥ తను మున్నాడిన మాటయు నిజము గాఁదన్నోనికిం బ్రీతిగా మనుజేంద్రుండు నెల నెలలం బురుషుఁడై మాసాంతరంబైన కామినియై యాగతి వీడు పాటసురభూమిం దానరక్షించుఁ బొమ్మనినన్వచ్చె వసిష్ఠుఁడా మనుసుతుం డారీతి రాజ్యస్థుఁడై. గీ॥ మగువయగుచు నలమగవాఁడునగుచును ‡భూతధాత్రి యంతనాతఁడేలెఁ బ్రజలు సంతసింప బాహాబలముతోడ గురునికరుణఁ జేసికువలయేశ. వ॥ అతనికి నుత్కలుండును, గయుండును, విమలుండునను కొడుకులు మువ్వురు గలిగి ధర్మపరులై దక్షిణపథంబునకు రాజులై రిసుద్యుమ్నుండు ముసలియై ప్రతిష్ఠానపురంబు విడిచి పురూరవునకు భూమినిచ్చి వనంబునకుం జనియె నివ్విధంబున. సీ॥ కొడుకు సుద్యుమ్నుండు ఘోరాటవుల కేగ వందురి మనువు వైవస్వతుండు తనకు బిడ్డలు గల్గఁ దపమాచరించెను హరిఁ గూర్చి నూఱేండ్లు యమునలోన హరియంత నిక్ష్వాకుఁడాదిగాఁ బదుగురు పుత్రులనిచ్చెను బోసఁగ వారి యందు పృషధ్రాఖ్యుఁడను వాఁడు గురునాజ్ఞ విమలధర్మంబులు వెలయఁ బూని పసుల ¶కదుపులఁ గాచుచుఁ బలు మొగుళ్ళు వచ్చిన దురేయి జోరున వానగురియ మం

* సైంధవంబైన = సింధుదేశమునఁ బుట్టిన. మెకము = మృగము. శివ = పార్వతి. బడబ = ఆఁడుగుఱ్ఱము. † అంబిక = పార్వతి. § దొందడి = దొమ్మి. ‡ భూతధాత్రి = భూమి. ¶ కదుపులు = గుంపులు.

దపిడి యించి చుట్టు నేమఱకనుండె। నడవి మెకములు సోఁకుండ నరసికొనుచు॥ అంత॥ క॥ *ప్రబ్బికొనిన పెంజీకటి। నిబ్బరమున నడికి నడికి నింగికి వడితో। గొబ్బున నెగసి తటాలునఁ। బెబ్బులి మందావుఁ బట్టెఁ బెల్లుఱి యవురన్॥ క॥ ఉల్లములు గలఁగి ✱మొదవులు। వెల్లువ లన్నియును లేచి విచ్చలవిడితోఁ। జెల్లాచెదరై పాఱెను। బెల్లుగ నంభా యటంచుఁ బెబ్బులి గాలిన్॥ అయ్యవసరంబున॥ శా॥ ఆ పెంజీఁకటి మ్రోలఁ గానక డిదంబంకించి శార్దూలమం। చావుల్లావు శిరంబుఁ ద్రుంచి తెగ నాయంచుం బులి న్వెంటాడియు। న్వాపోవం దెగ వ్రేసె భూవరుఁడు ద్రోవ న్ఘోర రక్తంబు చేఁ। బైఁ బైఁ గీయుచుఁ జేరి చూచెఁ దల ద్రెవ్వం బడ్డ యద్ధేనువున్॥ వ॥ చూచి మహాఖిన్నుండై యున్న నృపపుత్రునిం గని కులగురుం డగు వసిష్ఠుండు గోపించి నీవు రాజత్వంబు వాసి యీ యపరాధంబున శూద్రుండవు గమ్మని శపియించెన; తండును గృతాంజలియై తన కులాచార్యుని వలన నమఃఅలంగై కోలు వడసి యతని యనుమతంబున॥ సీ॥ అఖిలాత్ముఁ డగుచున్న హరియందు హరునందు భక్తితోఁ జాలఁ దత్పరత మెఱసి। యూర్ధ్వరేతస్కుఁడై యున్న ప్రాణుల కెల్ల నార్యుఁడై సర్వేంద్రియములు గెల్చి। సంగంబునకుఁ బాసి శాంతుండు నపరిగ్రహుండు నైకోరక నుండుఁ దనకు। వచ్చినయది యజీవనముఁ గావించుచుఁ దనుఁ దాన నిలుపుచు ధన్యబుద్ధి। జడుని తెఱఁగున మందుని చందమునను। జెవిటి భంగి నిమ్మహి నెల్లఁ జెల్లఁ దిరిగి। యడవులకు నేగి కార్చిచ్చు లందుఁ జొచ్చి। విక్రమనియతుఁడై బ్రహ్మంబుఁ జెందె నతఁడు॥ క॥ కవి యను కడపటికొమరుఁడు। భవనము రాజ్యంబు విడిచి బంధులతో నే। గి వనమునఁ బరమపురుషుని। బ్రవిమలమతిఁ దలఁచి తలఁచి పరముం బొందెన్॥ వ॥ మఱియుఁ గరూశకుండను మానవుని వలనం గారూశులు గలిగి ధర్మంబుతోడి ప్రియంబున బ్రహ్మణ్యులై యుత్తరాపథంబునకు రక్షకులైరి- ధృష్టుని వలన ధార్ష్టంబను వంశంబు గలిగి భూతలంబున బ్రహ్మభావంబు నొంది నెగడె- నృగుని మూలంబున సుమతి గలిగె- నతనికి భూతజ్యోతి పుట్టె- నతనికి వసువు జనియించె- వసువునకుం బ్రతీకుండు గలిగెఁ- బ్రతీకునికి నోఘవంతుం డతని కూఁతు రోఘవతి యను కన్యకను సుదర్శనుండు వివాహం బయ్యె- నరిష్యంతుండను మనుపుత్రునికిఁ జిత్రసేనుం డా ప్రభునకు దక్షుం డా పుణ్యునకు మీఢ్వాంసుం డా సుజనునికి శర్వుం డమ్మహాత్మునికి నింద్రసేనుం డా రాజునకు వీతిహోత్రుం డా సుమతికి సత్యశ్రవుం డా ఘనునికి నురుశ్రవుం డా వీరునకు దేవదత్తుం డా పండితునకు నగ్నివేశుండు సుతుండయి జనియించి ✱కానీనుండన నెగడి జాతకర్ణుండను మహర్షియై వెలసె నతని వలన నాగ్నివేశ్యాయనం బను బ్రహ్మకులంబుఁ గలిగె నివ్విధంబున॥ క॥ తెలుపఁబడె నరిష్యంతుని। కుల మెల్లను నీకు దిష్టకులము న్దెలియ। న్దెలిపెద రాజేంద్రోత్తమ। తెలియుము సర్వంబు నీకుఁ దేటపడంగన్॥ వ॥ దిష్టునికొడుకు నాభాగుం డను వాఁడు కర్మవశంబున వైశ్యత్వంబు నొందె- నాభాగునికి హలంధనుండు గలిగె- నతనికి వత్సప్రీతి- వత్సప్రీతికిఁ బ్రాంశువు- నతనికిఁ బ్రమితి- ప్రమితికి ఖమిత్రుఁడు- ఖమిత్రునికిఁ జాక్షుషుండు- నతనికి వింశతి- వింశతికి దంభుండు- దంభునికి ఖనినేత్రుండు- నతనికిఁ గరంధనుండు- గరంధనునకు నవిక్షిత్తు- నా యవిక్షిత్తునకు మరుత్తుండు జనించి చక్రవర్తి యయ్యె నతని చరిత్రంబు వినుము॥ సీ॥ అంగిరస్సుతుఁడు మహాయోగి సంవర్తుఁ డతని యాగమునకు యాజకుండు। తరిగి యుండెడి మరుదాఖ్యగణంబులో వారు విశ్వేదేవుల చటిసభ్యు। లధికలక్షణుల బ్రాహ్మణకోటిఁ దనిపెను సోమపానంబున సురవరుండు। మంత్రియై బంగారుమయముగా వించెను యాగవస్తువు లెల్లన ధికనియతి। నా మరుత్తుఁడు సేసిన యట్టి భంగి। నీరభావంబున మఱంగఁ దెంపు గలిగి। మఖము సేసిన వారిని మఱియు నెఱుఁగ। మెల్ల లోకములందున రేంద్రముఖ్య॥ వ॥ ఆ మరుత్తునకు దముండును, దమునకు రాజవివర్ధనుండును, రాజవివర్ధనునకు సుధృతి, సుధృతికి సౌధృతేయుండును, సౌధృతేయునకుఁ గేవలుండును, గేవలునకు బంధుమంతుం, డతనికి వేగవంతుండును, వేగవంతునికి బన్ధుండు సంభవించె॥ క॥ అచ్చరకన్య యలంబుస। గ్రచ్చర నా బంధుఁ జూచి కామించి తుది। న్విచ్చలవిలుకాని యమ్ములు। ముచ్చిచ్చున వచ్చి పొందె మోహాతురయై॥ వ॥ ఆ దంపతులకుఁ దృణబిందుం డను మహారాజు సంభవించె- నిలవిల యను కూఁతురు జన్మించె నా కొమ్మను విశ్రవసుండు పొందిన నైలబిలుండను కుబేరుండు పుట్టె- నా తృణబిందునకు విశాలుండును శూన్యబంధుండును ధూమ్రకేతుండు నను వారు మువ్వురు కొడుకులు గలిగిరి- యందు విశాలుండు వంశవర్ధనుండై వైశాలి యను నగరంబు నిర్మించె- నా రాజునకు హేమచంద్రుం- డా నరేంద్రునకు ధూమ్రాక్షుం- డా పుడమితేనికి సంయముఁ- డా మనుజపాలునకు సహదేవుం- డా బర్హిష్ఠునకుఁ గృశాశ్వుం- డాతనికి సోమదత్తుండు జనించె నంత॥ గీ॥ అమరవిభుఁడు మెచ్చ నశ్వమేధముఁ జేసి। భూరిపుణ్యగతికిఁ బోయె నెలమి। సోమదత్తుకొడుకు సుమతికి జనమేజ। యుండనంగఁ గొమరుఁడు ప్రుతిల్లె॥ వ॥ వీరలు వైశాలులనం బరగి తృణబిందునికీర్తి వహించి రాజ్యంబు సేసిరి మఱియును॥ సీ॥ శర్యాతియను రాజు జనియించె బ్రహ్మవరుండై నమనువుకు రూఢితోడ। నతఁ డంగిరసు సత్రమందు రెండవ నాఁటి విహితకర్మము లెల్ల వెలయఁ జెప్పె। నతనికూఁతురు సుకన్యక యను వనజాక్షి తండ్రి

*ప్రబ్బికొనిన-దట్టముగ నావరించిన. నడికి నడికి-పొంచి పొంచి. ✱మొదవుల వెల్లువలు-ఆవుల గుంపులు. ✱కానీనుండు-కన్యకకు జనించినవాఁడు.

తోడుతఁదపోవనికినరిగి। చ్యవనాశ్రమముఁజేరిసఖులునుదానును ఫలపుష్పమూలులగోయఁజొతిరిగి। దైవ[illegible]లోన
నొప్పారుజ్యోతులు। రెంటిఁగాంచి వాటిముంటఁబొడిచెఁ। గన్యయుసుకేవలు విభవద్యోతయుగ[illegible]నఁ ?ద
మకీయగుచు॥ జ్యోతులుముంటంబొడిచిన। వాతలనెత్తురులుగురిసె మునిశోభతఁ [illegible]తీపుల
మూత్రబంధమయ్యెన రేంద్రా॥ వ॥ వారలంజూచి రాజర్షియగు శర్యాతి విస్మితుండై మీరలియ్యాశ్రమమునందు[illegible] సేయ
నోపుమరిదికారణంబుగా మీకు విరోధంబు సిద్ధించెనని పలుకు నవసరంబున నిదంత్రికి సుకన్యక యిట్లనియె॥ గీ॥ అయ్య యీ
పుట్ట చేరువ నాడియాడి యిందుఁబో రెండుజ్యోతుల నేను గాంచి। ‡కంటకంబునఁబొడిచితి[illegible] నేపథంబునఁగు
రిసెనో యెఱుఁగుమీవు॥ వ॥ అనిన విని శర్యాతి భీతుండై కూఁతుం దోడ్కొని వల్మీకంబుకడ కరిగి యందు తపంబు సేయు
చున్న చ్యవనునింగని తన నేర్పున నతనివలనఁ బ్రసన్నతవడసి తపసిచిత్తంబు నెఱింగి [illegible] ప్రతికిన
వాఁడై మునీశ్వరుని వీడ్కొని పురంబునకుం జనియె నంత॥ గీ॥ పరమకోపుఁడయిన భార్గవుఁ [illegible] మె
చ్చఁదిటిగి యతనిపర్ణశాల నా సుకన్యక యనుమగువ గొన్నియేండ్లు మనువు మనియె॥ వ॥ అంత [illegible] యాశ్రమం
బునకు వేల్పువెజ్జులయిన యశ్వినులిద్దఱు వచ్చిన వారలం బూజించి తన ముదిమి సూపి చ్యవనుండిట్లనియె మీరలు యాగ
భాగంబు లేని సోమపానంబు నేను గల్పించియిచ్చెద సోమపానసమయంబునఁ బానపాత్రము మీకు నందిచ్చెద నా ముదిమి మా
నుపుఁడని యిట్లనియె॥ క॥ నవకంబగు ప్రాయంబున। జవరాండ్రగరంచు మేనిచక్కదనంబు। న్నివతరము గఁ గృప సేయుఁడు। ది
విజాధిపవైద్యులార దీవింతు మిముఁ॥ అనిన నశ్వినీదేవతలు సంతోషించి సిద్ధనిర్మితంబయిన యీ మడుఁగున మునుఁగుమనిప
లికి॥ సీ॥ ముసలి తాపసిఁబట్టి మొగినెత్తికొనిపోయి ముగురు నా మడుగున మునిఁగి లేచి। వనితాజనుల నెల్ల వలపించు వారలై సుం
దరమూర్తులై సుభగులగుచుఁ। గమలమాలికలతోఁ గనకకుండలములుగాఁ బుష్పసాయకుతోడఁ బోలి తుల్యులై సూర్యతేజ
స్కులై యున్నవారల ముగ్గురఁ బొడగాంచి ముగుద చాల నంద్రఁ బెనిమిటి వీఁడని యెఱుఁగలేక। గరిత గావున నిజనాథుఁగా
నఁగోరి। సుభగవతులార నా నాథుఁ జూపుఁడనుచు నశ్వినీదేవతలకు నయ్యబల మ్రొక్కె॥ వ॥ వారలా పతివ్రతనిజగరిత సం
బునకు మెచ్చి వయోరూపసంపన్నుండైన చ్యవనుం జూపి దంపతులవీడ్కొని విమానారూఢులై వేల్పుల ప్రోలికిం జనిరంత॥
సీ॥ యాగంబు సేయంగ నర్థించి శర్యాతి చ్యవనమునీంద్రు నాశ్రమముకడకుఁ। గూఁతురునల్లునిఁ గొనిపోవ వేడుక వచ్చిపు
త్రికెకుఁ బార్శ్వంబునం దుమ। సూర్యతేజంబున సొంపారు వరుఁ గని వీఁడెవ్వఁడో దీనివిభుఁడు గాఁడు। చెల్ల రేయసిపుత్రి సేసిన
ప్రియములు మ్రొక్కులు నొల్లక మోము వాంచి। మాటుమాటాడ దీవింపమనసు రోసి। చ్యవనుఁ డధికుండు మునిజనసత్త
ముండు। భువనసన్నుతుఁడతఁ డెందుఁబోయె నాతఁ। డెట్లు వంచింపఁబడియె వీఁడెవ్వఁడబల॥ మ॥ తగవే ధర్మమె శీలమే కులజ
వై దర్పించి మోదింపనా। జగదారాధ్యునిఁ బుణ్యశీలుఁ దపసిన్ సాధ్వీ మనస్స్వప్నతు। న్మగనిన్మాని *భుజంగుఁ బొందఁదగునే
మానంబు వాటింపఁగా। జగదేమర్గతిఁ ద్రోచితే కఠినవై తంత్రంబతిం గూఁతురా॥ గీ॥ పద్మనయన మగఁడు ప్రాయంపువాఁ
డయిన। గాపుఁబెట్టికొంతఁ గావనేర్చుఁ। గపటి ముసలితపసి గావంగ నేర్చునే। యువతి ముసలిఁ గూర్పు టొప్పదెందు॥ వ॥ అనిప
లికిన నప్పరమపతివ్రతాలలామంబు చిఱునగవు చెక్కుటద్దంబుల సిడిముడిపడం దండ్రికిట్లనియె॥ క॥ నీయల్లుఁడితఁడు భార్గ
వుఁ। డియ్యాజారుండు గాఁడు హర్షము తోడ। న్నెయ్యంబు నిల్పు మంచును। దొయ్యలి సర్వంబుఁ దండ్రితో వినుపించెన్॥ వ॥
అంత శర్యాతియు నప్రమత్తుండై కూఁతురిం గౌఁగిలించికొని గారవంబున నైదువు గమ్మని దీవించె నంత భార్యాసహితుండై
చ్యవనుండు సనితనమామకు యాగంబు సేయించి యొక్కపాత్రంబున సోమభాగంబుఁ బట్టి నిజతపోబలంబున నశ్వినీదేవత
లకిచ్చినం జూచి॥ క॥ కోపముతోడుత వాసవుఁ। డేపున మునిపై వవజ్రమెత్తిన మఱలన్। దాపసుఁడు వజ్రభుజమున। నాపఁదిని
లిపెన్ జగంబులాశ్చర్యపడన్॥ వ॥ ఇవ్విధంబున నశ్వినీదేవతలిద్దఱు సోమపానంబు లేనివారయ్యుఁ జ్యవనుసామర్థ్యంబునఁ
బ్రాప్తభాగులైచనిరి శర్యాతికి నుత్తానబర్హియు నానర్తుండును భూరిసేనుండునను ముగ్గురుకొడుకులు గలిగిరందు॥ సీ॥ ఆ
నర్తునకు రైవతాహ్వయుండు సయించెనతఁడు కుశస్థలియను పురంబు। నీరధిలోపల నిర్మించెఁ బెంపుతో నానర్తముఖ ‡విష
యంబులేలెఁ। గనియెఁ గకుద్మి ముఖ్యంబయిన నందనశతముఁ గకుద్మి విశాలయశుఁడు। దనకూఁతు రేవతి ధాతముందటఁ బెట్టి
తగువరునడిగెడి తలఁపుతోడఁ। గన్యఁ దోడ్కొని బ్రహ్మలోకమున కేగి। యచట గంధర్వకిన్నరులజుని మ్రోల। నాట్యపాటలు స
లుపఁగ నవసరంబు। గాక నిలుచుండె నతఁడొక్కక్షణము వడవు॥ అంత నవసరంబయిన నజునికి నమస్కరించి కకుద్మి యిట్లనియె
గీ॥ చాలముద్దరాలు జవరాలుఁ గొమరాలు। నీశుభాత్మురాలి కెవ్వఁడొక్కొ। మగఁడు సెప్పుమనిన మది జూచి పకపక। నవ్వి

భూమిపతికి నలువ పలికె॥సీ॥మనుజేశ దివినుండి మహిలోనఁ దలఁచిన వారలెల్లను గాలవశతఁ జనిరి। వారలబిడ్డల [illegible] మల వారల గోత్రంబు వారి నైనను వినము మేమెవ్వరినిఁ దవిలి; మునీ వచ్చిన యీ లోనన నిరువదియేడు మార్గ్లు। నొండొండ నాలుగు యుగములు సనియె నీవటు గానఁ దరణికి నరుగుమిప్పుడు। దేవదేవుండు హరి బలదేవుఁడనఁగ। భూమి భారంబు మాన్పంగఁ బుట్టినాఁడు సకలభూతాత్మకుఁడు నిజాంశంబుతోడ। యువతిమణి నిమ్ము జనమణికున్నతాత్మ॥ వ॥అని యానతిచ్చిన బ్రహ్మకు నమస్కరించి భూలోకంబునకుం జనుదెంచి సోదరస్వజనహీనంబగు తననగరంబున కారాజు వచ్చి బలభద్రుంగాంచి రేవతీకన్యనతనికిచ్చి నారాయణాశ్రమంబగు బదరికావనంబునకు నియమంబునఁ దపంబు సేయుటకుం జనియె॥క॥నభగుఁడను మనుజపతికి। శుభమతి నాభాగుఁడనఁగ సుతుఁడుదయించెన్। ప్రభులై వెలయుచు తలంపున। విభజించిరి భ్రాతలతని విత్తము నధిపా॥వ॥అంత నాభాగుండును బ్రహ్మచారియై తనతోడంబుట్టువులను ధనంబు పాలడిగిన వారలు దండ్రి చెప్పినక్రమంబున నిచ్చెదమని ననా భాగుండు తండ్రియగు నభగుకడకుం జని విభాగంబు సేయుమని పలికిన నతండిట్లనియె నంగిరస్సులు మేధగలవారలయ్యును సత్త్రయాగంబు సేయుచున్నా రవ్వదినంబున నగ్ని కర్మంబులు దోఁపక మూఢులయ్యెదరు వారలకు నీవు వైశ్వదేవసూక్తంబులు రెండింటిం గించిఁ గవియనం బ్రసిద్ధికెక్కెదవు వారలు దానంబు సేసి కృతకృత్యులై స్వర్గంబునకుం బోవుచు సత్త్రావశిష్టంబైన ధనంబు నీకిచ్చెద రని పలికినం దండ్రి పేర్కొని నా నాభాగుండు నియట్లు సేసిన నంగిరస్సులు సత్త్రపరిశేషధనంబుల తనకిచ్చి నాకంబునకుం జనిరంత॥క॥అంగిరసులిచ్చు పసిడికి। సంగతమతిఁ జేరు నృపుని మానిచి యొకఁడు। త్తుంగుఁడు జలదనిభాంగుఁడు। ముంగలనిలుచుండి విత్తముం జేకొనియెన్॥వ॥వానిం జూచి నాభాగుండు దనకు మునులిచ్చుటం జేసి తనధనంబని పలికిన నమ్మహాపురుషుండు మీతండ్రి సెప్పినక్రమంబు కర్తవ్యంబనిన నాభాగుండు నభగు నడిగిన నతండు యజ్ఞపరిశిష్టంబగు ధనంబు దొల్లి మహామునులు రుద్రునకిచ్చిరది కారణంబుగా నాదిదేవుండు సర్వధనంబులకు నర్హుండనిన విని వచ్చి నాభాగుండు మహాదేవునకు నమస్కరించి దేవా యీ ధనంబు నీయధీనంబని మాతండ్రి సెప్పె నేనపరాధంబు సేసితి సహింపుమనవు మభక్తవత్సలుండగు నమ్మహాపురుషుండు నభగు సత్యవచనంబులకు నాభాగుని నిజంబునకు మెచ్చి నీవు దప్పక పలికితివి కావున సత్త్రపరిశేషితంబగు ధనంబు నీకు నిచ్చితినని పలికి యంతర్ధర్శిత్వంబును సనాతనంబగు బ్రహ్మజ్ఞానం బుపదేశించి తిరోహితుండయ్యె నివ్విధంబున॥క॥భువిలో నాభాగుని కథ। ధవళమతిన్ రేపుమాపుఁ దలఁచిన మాత్రన్। గవియగు మంత్రజ్ఞుండగుఁ। బ్రవిమలగతిఁ బొందు నరుఁడు భద్రాత్మకుఁడై ॥వ॥అంత నాభాగునకు నంబరీషుండు జనియించె- నతనియందు జ

## ✱ అంబరీషోపాఖ్యానము. ✱

గద ప్రతిహతంబైన బ్రాహ్మణశాపంబు నిరర్థకంబయ్యె నేమి కారణంబున దురంతంబైన బ్రహ్మదండంబువలన నితండు విడువంబడియె ననిన నప్పుడమి తేనికి శుకుండిట్లనియె॥శా॥సప్తద్వీపవిశాలభూభరము దోస్తంభంబునం బూని సం। ప్రాప్తశ్రీయుతుఁడై మహావిభవసంపచ్చాతురిం గన్గియు। ద్వ్యాప్తిం జెందక వైష్ణవార్చనల మేరంగాలముం బుచ్చుచున్ । సుప్తిం బొందక నెప్పె సద్గుణగరిష్ఠుండంబరీషుండిలన్॥సీ॥చిత్తంబు మధురిపు శ్రీపాదములయందు పలుకులు హరిగుణపఠనమందు। కరములు విష్ణుమందిరమార్జనములందు శ్రవములు హరికథాశ్రవణమందు। చూపులు గోవిందరూపవీక్షణమందు శిరము గేశవనమస్కృతులయందు। పదములీశ్వరగేహపరిసర్పణములందు కామంబు చక్రికైంకర్యమందు। సంగమచ్యుతనిజగుణసంగమందు। ఘ్రాణము సురారిభక్తాంఘ్రికమలమందు। రసన తులసీదళములందు రతులు పుణ్య। సంగతులయందు నా రాజచంద్రమునకు॥మఱియు నమ్మహీపతిభండు॥సీ॥ఘనవైభవంబునఁ గల్మషదూరుఁడై యజ్ఞేశు నీశు నజ్ఞాతుఁ గూర్చి। మొనసి వసిష్ఠాది మునివల్లభులతోడఁ దగిలి సరస్వతీతటమునందు। మేధతో బహువాజిమేధంబు లొనరించి గణుతింపరాని దక్షిణలు వెట్టి। ✿సమలోష్టహేముఁడై సర్వకర్మంబులు హరిపరంబులుగాఁగ నవనిఁ నేలె। విష్ణుభక్తులం దమవిష్ణువనంచుఁ గ। లంక మెడలమనసులం గెప్పెట్టి। విహితరాజ్యవృత్తి విడువని వాఁడునై। యతఁడు రాజతపసియనఁగ నొప్పె॥ వెండియు నమ్మహాభాగవతుండు॥ క॥హరియని సంభావించును। హరియని దర్శించు నంటు నాఘ్రాణించున్। హరియని యరుదిగొనఁ దలఁచును। హరి హరి యనునంబరీషు నలవియె పొగడన్॥ వ॥ఇట్లు పుణ్యచిత్తుండీశ్వరాయత్తుండునై యల్లనల్లన రాజ్యంబు సేయుచున్న సమయంబున॥ గీ॥అతనికి హమ్మా నెహరులందుఁ గరులందు। ధనములందుఁ గేళివనములందు। బుత్త్రులందు బంధుమిత్రులయందును । బుర ములందు నంతిపురమునందు॥ వ॥అంతఁ గొంతకాలంబునకు క్షితి మేదినీకాంతుండు సంసారంబువలని తగులంబు విడిచి నిర్మలుండై యేకాంతంబున భక్తిపరవశుండై యుండ నా రాచతపసికి భక్తలోకవత్సలుండగు పురుషోత్తముండు ప్రతిభటశిక్షణం

* రేపుమాపు। రాత్రిందివములు. ✿సమలోష్టహేముఁడై। మంటిగడ్డను-బంగారును తుల్యముగఁ దలఁచినవాఁడై. క్షితిమేదినీకాంతుండు। రాజు.

బుష్టిమజ్జనరక్షణంబును, నిఖిలజగదవక్రంబగు చక్రంబు విచ్చి చనియెననంత॥ క॥ తనతో డినీడ కైవడి। ననురూపగుణాఢ్యయై
నర్ధాంగలక్ష్మి మహిషితో। జనవిభుఁడు ద్వాదశీవ్రత। మొనరఁగ హరిఁ గూర్చి చేసె నొకయేఁటి దఱిన్॥ వ॥ ఇట్లు వ్రతంబు సేసి యా
వ్రతాంతంబునం గార్తికమాసంబున మూఁడు రాత్రు లుపవసించి కాళిందీజలంబుల స్నాతుండయి మధువనంబున మ
హాభిషేకవిధానంబుల విహితపరికరసంపన్నుండై హరి నభిషేకంబు సేసి మనోహరంబులైన గంధంబులు సమర్పించి య
భినవామోదంబులైన పుష్పంబులం బూజించి॥ తదనంతరంబ॥ శా॥ పాలే త్రెంపక వహింపఁ దగ్గరుచులే ప్రాయంబులన్ రూప
ముల్। హేలన్ ధూర్తలు గాక వెండి గొరిజల్ హేమోరుశృంగంబులన్। గ్రాలం గ్రేపుల నట్టు వాఁకుచును సంగచ్ఛాయలై
యున్నమం। దాలన్నర్బుదషట్క మిచ్చె విభుఁడు ద్యద్వైదికశ్రేణికిన్॥ క॥ పెక్కండ్రు విప్రవరులకు। గ్రక్కన నతిభ
క్తితోడఁ గడుపులు నిండన్। జొక్కపుటన్నం బిడి విభుఁ। డొక్కఁడుఁ బారణము సేయ నుద్యోగింపన్॥ అయ్యవసరంబున॥
క॥ భాసురనిగమ తపోవ్యా। సాసుఁడు సుతపోవిలాసుఁడనుపమ యోగా। భ్యాసుఁడు రవిభాసుఁడు దు। ర్వాసుం డేతెంచెఁ ద
న్నివాసంబునకున్॥ వ॥ వచ్చిన నమ్మునివల్లభునకుఁ బ్రత్యుత్థానంబు సేసి కూర్చుండ గద్దియ యిడి పాదంబులు గడిగి పూజించి
సేమం బరసి తన యింట నన్నంబు గుడువు మని నమస్కరించిన నమ్మహాత్ముండు సంతసించి భోజనంబున కనంగీకరించి నిర్మ
లంబగు కాళిందీజలంబులం బరమధ్యానంబు సేయుచు మునిఁగి లేచి రాక తడవు సేసిన ముహూర్తావశిష్టయగు ద్వాదశి యం
దుఁ బారణ సేయవలయుటఁ జింతించి బ్రాహ్మణాతిక్రమదోషంబునకు శంకించి విద్వజ్జనంబుల రావించి వారల నుద్దేశించి॥
క॥ ముని నీరు సొచ్చి వెడలఁడు। చనియెను ద్వాదశియు నింత చనని దెయీలో। మన పారణ యున్నలయను। వినుఁ డర్హం బైన ధ
ర్మవిధ మెట్టిదియో॥ అని పలికిన నా రాజునకు బ్రాహ్మణజను లిట్లనిరి॥ గీ॥ అతిథి వోయి రామి నధిప యీ ద్వాదశి। పారణంబు
మానఁ బాడి గాదు। గుడువకుండఁ గాదు గుడుచుటయును గాదు। సలిలభక్షణంబు సమ్మతంబు॥ వ॥ అని ధర్మసందేహంబు వా
పిన నా రాజర్షిశ్రేష్ఠుండును మనంబున హరిం దలంచి నీరు పారణంబు సేసి జలంబుల మునింగిన తపసి రాక కెదురు సూచుచు
న్న సమయంబున॥ సీ॥ యమునలోఁ గృతకృత్యుఁడై వచ్చి రాజు చే సేవితుండై రాజచేష్టితంబు। బుద్ధిలో నూహించి బొమము
డి మొగముతో నదరెడి మేనితో నాగ్రహించి। రెట్టించి యాఁకలి కొట్టుమిట్టాడంగ నీసంపదున్మత్తుఁ డీనృశంసు। నీదురహం
కారు నిందలుఁ గంటె రే విష్ణుభక్తుఁడు గాఁడు వీఁడు నన్ను। గుడువరమ్మని మును ముట్టఁ గుడిచినాఁడు। ధర్మభంగంబు సేసి మ
హాధర్ముఁ డయ్యె। నైన నిప్పుడు సూపెద నన్ని దిశల। నేను కోపింప మాన్పువాఁ డెవ్వఁ డనుచు॥ చ॥ పెటపెటఁ బండ్లు గీఁటు
చును భీకరుఁడై కనుఁ గ్రేవ నిప్పుకల్। పొటపొటరాలఁ గండములు పొంగ మునీంద్రుఁడు హుంకరించుచున్। జట మొదలం
టఁ గాఁ బెఱికి చక్కన దానన కృత్య నాయుధో। త్కటవనమాలహస్తయను గా నొనరించి వికవించె రాజుపైన్॥ క॥ కా
లానలసన్నిభయై। శూలాయుధహస్తయగుచు శుష్కాస్రుక్క। న్నేలఁ బదంబుల ద్రొక్కుచు। వాలమహాకృత్య
మనుజవల్లభుఁ జేరెన్॥ గీ॥ ఆప్రకారమెఱిఁగి హరివిశ్వరూపుండు। వెట్టితపసి సేయు [illegible] వేడబంబుఁ। జక్కఁ బెట్టు మనుచుఁ జ
క్రంబుఁ బంచిన। వచ్చె నదియుఁ బ్రళయవహ్నిపగిది॥ వ॥ వచ్చి ముని పంచిన కృత్యను దహించి తన విసనక ముని వెంటం బడిన ము
నియు మేరుగుహ సొచ్చిన నదియు [illegible] వ్యాళంబు వెనుకొను దవానలంబు చందంబునఁ దోన సొచ్చె మఱియును॥ మ॥ భువి దూర
న్భువి మాడు నబ్ధి సొరనబ్ధుల్సొచ్చు నుద్వేగియై। దివి ప్రాఁకన్దివి ప్రాఁకు దిక్కులకుఁ బోఁ దిగ్వీధులం బోవుఁ జి। క్కి వెసన్ గ్రుం
కినఁ గ్రుంగు నిల్వ నిలుచున్ [illegible] గేడింపఁ గేడించు నొ। క్కవడిన్ దాపసు వెంటనంటి హరిచక్రంబన్యదుర్వక్రమై॥ శా॥ ఏలోకం
బున కైన వెంటఁ బడి తో నేతెంచు చక్రానల। జ్వాలల్మాన్పువారు లేమి జని దేవశ్రేష్ఠులోకేశు వాఁ। డాలోకించి విధాత
[illegible]విశ్వజననవ్యాపారపారీణ రే। ఖాలీలేక్షణ కావవే కరుణఁ జక్రంబున్నివారింపవే॥ అనిన బ్రహ్మ యిట్లనియె॥ మ॥ కరమర్థి
ద్విపరార్థసంజ్ఞ గల యీ కాలంబుఁ గాలాత్ముఁడై। [illegible]సౌర దిన్నిండఁ గఁ జేసి లోకముల నాచోటు న్విభుం డెవ్వఁడో। పరిపూర్తి
న్గను త్రేవఁ గెంపులాలు కన్నస్వప్నంబు గాఁ జేయునా। హరిచక్రాకృతివహ్నికన్యుఁ డొకరుం డడ్డంబు గా నేర్చునే॥ గీ॥ ఏను భ
వుఁడు దక్షుఁ డింద్రాదులును బ్రజాపతులు భృగుఁడు భూతపతులు శిరము। లందు దాల్తుమతనియాజ్ఞ జగద్ధితం। బంచు భూరి
కార్యమంతులమనుచు॥ వ॥ కావున సుదర్శననివారణంబునకు నోపనని విరించి పలికిన దుర్వాసుండు గైలాసంబునకుం జని రుదం
చి శర్వు నాలోకించి చక్రానలంబు తెఱంగెఱింగించిన నమ్మహాదేవుం డిట్లనియె॥ సీ॥ వినుమయ్య తండ్రి యో [illegible]

---

* [illegible] | [illegible] | కృత్య [illegible] | [illegible]. వేడబంబు, ఆడంబరము. వ్యాళము [illegible] | [illegible] | [illegible] | విశ్వజననవ్యాపారపారీణ [illegible] విశ్వ ప్రపంచము [illegible] | [illegible] | [illegible]

యందుఁ జతురాస్యజీవకోశములు పెక్కు। వేలసంఖ్యలుగూడి వేళతో నిబ్బంగి నగుచుండుఁ జనుచుండుఁ గవియుఁ గాక। నే వ్యా
నిచే భ్రాంతి నేమందుచున్నార మేను దేవలుఁడును రేంద్రసుతుఁడు। నారదుఁడజుఁడు సనత్కుమారుఁడు ధర్ముఁడాక పిలుఁ
డు మరీచ్యాదులఖిల। నిగ్జులును సిద్ధనివహ మెవ్వనిమాయ। నెఱుఁగలేము మూలమిట్టిదనుచు। నట్టి నిఖిలనాథు నాయుధశ్రే
ష్ఠంబు। దొలఁగఁ జేయ నాకు దుర్లభంబు॥ వ॥ మునీంద్రా నీవు నన్ను మహాత్మునిశరణంబు వేఁడుమతండు మేలు సేయంగలవాఁడ
నిపలికిననీశ్వరునివలన నిరాశుండై దుర్వాసుండు వైకుంఠనగరంబునకుం జని॥ శా॥ ఆవైకుంఠములోని భర్మమణిసౌధా
గ్రంబు పై లక్ష్మీదా। గ్రేవ స్త్రెల్లననర్మభాషణములన్ క్రీడింపఁ బుణ్యున్ హరిన్। దేవాధీశ్వరుఁ గాంచి యో వరద యో దేవేశ
యో భక్తర। క్షావిద్యాపరతంత్రమానుపఁగ దేచక్రానలజ్వాలలన్॥ ఉ॥ నీమహిమార్ణవంబు మదినిక్కముగా నెఱుగం
గలేక నీ। ప్రేమకు వచ్చు దాసునకుఁ బిచ్చతనంబున నెగ్గుఁ జేసితి। న్నా మనువున్ క్షమింపు మట నారకుఁడైన మనంబులో భవ।
న్నామము చింత సేసిన ననంతసుఖస్థితి నొందకుండునే॥ వ॥ అని పలికి పాదకమలంబులకు మ్రొక్కి లేవకయున్న దుర్వాసు
నిం గని హరి యిట్లనియె॥ చ॥ చలమున బుద్ధిమంతులగు సాధులు నా హృదయంబు లీలనొం। గిలిగొని పోవుచుండుదురు కిల్బిషభ
క్తిలతా చయంబుల। న్నిలువఁగఁ బట్టి కొట్టుమగు నేరుపుతో మదకుంభికైవడి। న్నలఘుఁ జిక్కి భక్తజనవత్సలతం జనుచుం
డుఁదాపసా॥ గీ॥ నాకు మేలుగోరు నా భక్తుఁడగు వాఁడు। భక్తజనులకేను పరమగతియు। భక్తుఁ డెందుఁ జనినఁ బఱతెంతు వె
నువెంట। గోవు వెంటఁదగులు క్రేపుభంగి॥ అదియునుం గాక॥ గీ॥ తనువు మనువు విడిచి తనయులఁ జుట్టాల। నాలిపిడిచి సంపదా
లి విడిచి। నన్నె కాని యన్య మెన్నఁడు నెఱుఁగని। వారి విడువ నెట్టి వారినైన॥ క॥ పంచేంద్రియముల తెరువుల। వంచించి మనం
బు నన్ను వరమతులు ప్రతి। ష్ఠించి వహింతురు నన్నును। మంచివరున్ బ్యాసతులు మరిగినభంగిన్॥ క॥ సాధుల హృదయము
నాయది। సాధుల హృదయంబు నేను జగముల నెల్లన్। సాధుల నే నెఱుఁగుదు। సాధువు లెఱుఁగుదురు నాదు చరితము విప్రా॥
గీ॥ ధారుణీసురులకుఁ దపము విద్యయు రెండు। ముక్తి చేయుచుండు ముదముతోడ। దుర్వినీతులైన దుర్జనులకు మీకు। నిడియుఁ
గీడు గాక నేలయుండు॥ క॥ నాతేజము సాధులలో। నాతతమై యుండు వారి నలఁచు జనులకున్। హేతి క్రియ భీతినిచ్చును। జే
తోమోదంబు చెఱుచు సిద్ధము సుమ్మీ॥ క॥ అదె పో బ్రాహ్మణ నీకును। సదయుఁడు నాభాగసుతుఁడు జనవినుతగుణా। స్పదుఁడి
చ్చు నభయ మాతని। మదిసంతసపఱచి వేఁడుమా శరణంబున్॥ మ॥ అని శ్రీవల్లభుఁ డానతిచ్చిన నమస్కారాద్యచక్రకీలాప
లీ। జనితాయాసుఁ డసిర్వికాసుఁడుదితస్వాంతుండు దుర్వాసుఁడ। ల్లన నేతెంచి నభక్తిగాం చెఁగరుణాలావణ్యవేషున్ని
దోషునయోదారమనీషు మంజుమితభాషున్నంబరీషున్వెసన్॥ వ॥ కనిమనఃఖితుండై మహీవల్లభు పాదంబులు వట్టి విడువ
కున్న నానరేంద్రచంద్రుండు చరణస్పర్శనంబునకు సూడుచుఁ గరుణారసభరితహృదయుండై హరిచక్రం[illegible] హృదయం
బున నిట్లని స్తుతియించె॥ సీ॥ నీవ పావకుఁడవు నీవ సూర్యుండవు నీవ చంద్రుండవు నీవ జలము। నీవ నేలయు నింగి నీవ సమీరంబు
నీవ భూతేంద్రియనికరములును। నీవ బ్రహ్మంబును నీవ సత్యంబును నీవ యజ్ఞంబును నీవ ఫలము। నీవ లోకేశులు నీవ సర్వాత్మ
వు నీవ కాలంబును నీవ జగము। నీవ బహుయజ్ఞభోజివి నీవ నిత్య। మూలతేజంబు నీకు నే మ్రొక్కువాఁడ। నీరజాక్షుండు చాల
మన్నించునట్టి శస్త్రముఖ్యమ కావవే చాలు మునిని॥ మ॥ హరి చే నీవు విసృష్టవై చనఁగ మున్నాలించి నీధారలన్ ధరణి న్రావ
లుటనిక్కంపుమును పేదైత్యేంద్రమధ్యంబుల। న్నిరములు పాదములున్ భుజాయుగళముల్ ఛేదింపసంగంబులు। న్నెరలుం
బ్రాణసమీరముల్ గదలు నీయుద్ధంబులం జక్రమా॥ గీ॥ కలఁగి నిద్రవోవఁ గలలోన వచ్చిన। నిన్నుఁ జూచి దీర్ఘనిద్రవోదు। రసుర
వరులు శయ్యలందు నన్నసతులు ప్ర। భాతమందు లేచి పలువరింప॥ ఉ॥ చీకటి వాపుచు న్వెలుఁగు సేయుచు సజ్జనకోటి నెల్ల స।
శ్రీకులఁ జేయు నీరుచులు చెల్వుగ ధర్మసమేతులైనిను। న్నాకునకట్టి దట్టిదని వర్ణనసేయ విధాత నేరఁడ। స్తోకమునీమహామ
హిమదోషనివారిపరాపరాద్యమే॥ గీ॥ కమలలోచనుండు ఖలులశిక్షింపంగ। బాగుసేయ నీవు పాల్పడితి। వైననింకఁ జాలు
నాపన్నుఁడైయున్న। తపసిఁ గావు మీవు ధర్మవృత్తి॥ వ॥ అని వినుతించి కేలుదమ్మిదోయి నొసటం బొసఁగించి యిట్లనియె॥
గీ॥ పనమస్కరింతు నింద్రశాత్రవధూమ। కేతువునకు ధర్మసేతువునకుఁ। విమలరూపమునకు విశ్వదీపమునకుఁ। జక్రమునకు
గుప్తశక్రమునకు॥ అని మఱియు నిట్లనియె॥ గీ॥ విహితధర్మమునను విహరింతు నేనియు। నిష్టమైనద్రవ్య మిత్తు నేని। ధరణిసురుఁ
డు మా కులదైవతంబగు నేని। విప్రునకు శుభంబు వెలయుఁ గాక॥ క॥ అఖిలగుణాశ్రయుఁడగు హరి। సుఖియై నా కొలువు వలనఁ
జొక్కెడి నేని। న్నఖిలాత్మకుఁడగుటకు। సుఖమందుం గాక భూమిసురుఁ డీ వేళన్॥ వ॥ అని యివ్విధంబున నాభాగ
పుడు మిగుల వలన నన్నించి తపసికి దాహంబు నొందింపక రక్షసులగొంగ చక్రంబు తిరిగి చనియె నంత దుర్వాసుండు శాం
తిం బొంది మెల్లని మాటల నారాజుం దీవించి యిట్లనియె॥ మ॥ నరనాథోత్తమ మేలుసేసితిక దానాతప్పమున్నాఁడఁ శ్రీహరి

ద్రుండు వాహనంబగుటం జేసి యింద్రవాహనుండనియుఁ బురంజయుండును మహేశ్వరుని కనుమతంబుగ దైత్యపురం బెక్కి రణంబు సేసిన కారణంబున నతఁడు కకుత్స్థుండన నీమూఁడు నామంబులఁ బ్రసిద్ధి కెక్కె దైత్యుల ధనంబుల నింద్రున కిచ్చె నప్పురంజయుని పుత్త్రుండు సేనస్సతని పుత్త్రుండు పృథుండు, పృథున కు విశ్వగంధుండు, విశ్వగంధునకుఁ జంద్రుండు చంద్రసుతుండు యువనాశ్వుండు యువనాశ్వతనూభవుండు శబస్తుండతండు శాబస్తి నామ నగరంబు నిర్మించె శబస్తతనయుండు బృహదశ్వుండు, బృహదశ్వునకుఁ గువలయాశ్వుండు దానవేంద్రవంద్రుండు॥ క॥ లావు మెఱసి యిరువది యొక వేవురు నందనులుఁ దాను వీరుఁడతఁడు ధుంధు దేవుఁడు దంతుఁడు వనుపడు కావహ దైచంపె మంమనను రాబన్ధుక॥ వ॥ అది కారణంబుగా ధుంధుమారుండన నెగడెనయ్యసుర ముఖానలంబునఁ గువలయాశ్వ కుమారులందఱు భస్మంబులైరందు దృఢాశ్వుండును, కపిలాశ్వుండును, భద్రాశ్వుండును నను వారలు మువ్వురు విక్కిరందు దృఢాశ్వునకు హర్యశ్వుండును, హర్యశ్వునకు నికుంభుండును, నికుంభునకు బర్హిణాశ్వుండును, బర్హిణాశ్వునకుఁ గృశాశ్వుండును, కృశాశ్వునకు సేనజిత్తు, సేనజిత్తునకు యువనాశ్వుండు జనించె నతండు కొడుకులు లేక నూర్వురు భార్యలుం దాను నునిన్వె అపడియుండె నా రాజునకు మునులు కృపఁ జేసి యింద్రునిఁ గూర్చి సంతతికొఱకై యైంద్రయాగంబు సేయించిరందు॥ సీ॥ భూమీశు భార్యకుఁ బుత్త్రలాభమునకై పోయు తలంపున భూమిసురులు। జలముసు మంత్రించి జలకలశము దాఁచిని యవ్వం బుతోఁ గూడి నిద్రవోవ। ధరణీశ్వరుఁడు నీరుదప్పితో నా రాత్రి ధృతి లేక యజ్ఞమందిరముఁ జొచ్చి। యా నీరు ద్రావినసంత మేల్కని వారలెవ్వఁడు ద్రావెనీ రెందుఁ బోయె। ననుచు రాజు ద్రావుటంత యు భావించి। యెఱిఁగి చోద్యమంది యీశ్వరాజ్ఞ। యెవ్వఁ డోపుఁ గడువ నీశ్వరునకు నమస్కారమనుచు నేది కార్యమనుచు॥ వ॥ వారలు దుఃఖించుచుండ నంతఁ గొంతతడవునకు యువనాశ్వుని కడుపు వ్రక్కలించుకొని చక్రవర్తి చిహ్నంబులు గల కుమారుండు జన్మించి తల్లి లేనికతంబునఁ గడుపునకు లేక నేడ్చుచుండ నింద్రుండు వచ్చి శిశువునకు నాఁకలి దీరుకొఱకు వాసినోటం దనవ్రేలిడి నం ద్రావెడి కతంబున వాని పేరు మాంధాతయనిని ర్దేశించి చనియె నివ్విధంబున॥ గీ॥ కడుపు వగల ముద్దు కొడుకు జన్మించిన। ధీరుఁ డయ్యెఁ దండ్రి దేవవిప్ర। కరుణ యట్లకా దె కడిఁది దైవములావు। కలుగువాఁడు బ్రతుకుఁ గాక చెడునె॥ వ॥ ఇట్లు బ్రదికియున్న యువనాశ్వుండు గొంతకాలంబునకుఁ దపంబు సేసి సిద్ధిం బొందెనంత॥ సీ॥ పడమట నొద వెడు బాలచంద్రుని మాడ్కిఁ బూఁటపూఁటకు వృద్ధిఁ బొంది బాలుఁ। డల్లనఁ బరిపూర్ణయౌవనారూఢుఁడై రావణాదిరిపుల రాజవరుల। దండించి తసు ద్రసదస్యుఁ డంచు సురేంద్రుఁ డంకింప శూరుఁడై యఖిలదేవ। మయునతం ద్రియు విష్ణుమాధవు ధర్మాత్ము నజుని యజ్ఞాధీశు నాత్మఁ గూర్చి। చేసి క్రతువులు భూరిదక్షిణల నిచ్చి। ద్రవ్య యజమాన విధి మంత్ర ధర్మ యజ్ఞ। కాల ఋత్విక్ప్రదేశ ముఖ్యంబులెల్ల। విష్ణురూపంబు లనుచు భావించె నతఁడు॥ క॥ బలిమిన డంచు చు నరులం। జలి వెలుఁగు న్వేఁడి వెలుఁగుఁ జనుచోట్లెల్లన్। జలరుహనయను నికరుణను। జెలువుగ మాంధాతయేలె సిరినిండారన్॥ వ॥ అంత రాజు నకుశశిబిందు కూఁతురగు బిందుమతి యందుఁ బురుకుత్సుండు నంబరీషుండును ముచుకుందుండు నను వారు ముగ్గురు కొడుకులు నేబండ్రు కూఁతులుం జనించి పెరుగుచున్న యెడ॥ సీ॥ యమునాజలములోన నధికుఁడు సౌభరి తపము సేయుచు జలస్థలములందుఁ। బిల్లలుఁ దన ప్రాణవల్లభ యును గూడి మెలఁగ నానందించు మీనరాజుఁ। గనుఁగొని సంసారకాంక్షియై మాంధాతనొక కన్య నడుగ నృపోత్తముండు। దరుణి నిత్తును స్వయంవరమునఁ జేకొను మనవుడు ననుఁ జూచి యోవనాంగి। యేల ముసలిఁ గోరు నిట్టట్టు వడఁకెడి। వాఁడఁ జాల నెఱసినాఁడ నొడల। జిగియు బిగియు లేని శిథిలుండఁ గరగింపఁ। జాలఁ దిగిచికొనును పాయ మెట్లు॥ అదియునుం గాక॥ గీ॥ బాలపువ్వు బోఁడి ప్రాయంపువానిని। జెన్నువాని ధనముఁ జేర్చువాని। మఱిగనేని గొంతముఁ గుఁగా కెదిరిఁ ద। న్నెఱిఁగి ముసలి తపసి నేల మఱుగు॥ వ॥ అని విచారించి సౌభరి తన తపోబలంబునం జేసి ముసలితనంబు విడిచి యెలప్రాయంపు కొమరుండయి యలంకరించికొని ముందట నిలువంబడిన మాంధాతయుఁ గన్నియల నగరుఁ గాఁచికొనియున్న వారికి సెలవు సేసిన వారమ్మునీంద్రుని నా రాజపుత్త్రికలున్న యెడకుం గొనిపోయి చూపిన॥ ఈ॥ కోమలులారవీఁడు నలకూబరుఁడో మరుఁడో జయంతుఁడో। యేమఱి వచ్చెవీనిఁ దడవేల వరింతము నేము నేమయం। చాముని నాథుఁ జూచి చలితాత్మకులై సొరిది న్వరించిరా। భామినులందఱుం గుసుమబాణుఁడు ఘీయని ఘంటవ్రేయఁగన్॥ వ॥ ఇట్లు రాజకన్యకలనందఱిం జేకొని సౌభరి నిజతపఃప్రభావంబున ననేకలీలావినోదంబులు గల్పించియందు॥ సీ॥ గృహారామములయందు మెఁ గుసుమవల్లులయందుఁ గోలాహలంబైన కొలఁకులందుఁ। గలకంఠ శుక మధుకర నినాదములచే వర్ణనీయములైన వనములందు। మణివేదికలయందు మహనీయ పర్యంక పీఠ లీలాశైలకములందు। శృంగారవతులను జెలువలు వలువురు తన పంపు సేయు సుస్థలములందు। వస్త్ర మాల్యాను లేపసువర్ణహార। భూరిసంపదస్నానభోజనములఁ బూఁటపూఁటకు నొక్కొక్కకొంతపాలుపుఁ దాల్చి। రాజకన్యలనందఱి రతులఁ దేల్చె॥ క॥ పెక్కండ్రు రాజముఖులకు నొక్క

(డుఁ గాఁడయ్యెఁ దనియకుండె మునీంద్రుం। డొక్కఁడు ఘృతధారలచే। నొక్కఁడు జన్మైతృప్తి లేనియనలుని భంగిన్॥ ఇవ్విధంబు
న॥ క॥ ఆ రామంబున మునివరుఁ। డా రామలతోడ బహువిహారవయుం డై। గారాముల దనకిట్లు। బ్రోరాములు సేసికొన్ని
ప్రొద్దులు పుచ్చెన్॥ వ॥ అంత నొక్కనాఁడు మేదినీవల్లభోత్తముండగు నా మాంధాత మునీశ్వరుం డెందునోయేఁగూఁతు లె
క్కఁడనలజడిపడుచున్నవారలో యని తలంచి వెదక వచ్చి యొక్క మహానగంబున మణిమయసౌధంబులం జక్రవర్తియుంబో
లెఁ గ్రీడించుచున్న తాపసరాజుం గని సంతసించి వెఱఁగుపడి మిన్నంతనలంబొంది మెల్లనఁ గూఁతులం బొడగని సత్కరించి యి
ట్లనియె॥ క॥ నాతోడులార మీపతి। మీతోడి విపసులయొకల మే లేయనుఁడు। నాన్నా తోడిదె నాతోడిదె। తా తా మేలనుచు నని
రితరుణులు వరుసన్॥ వ॥ అంతఁ గొంత కాలంబునకు భార్యాచర్యుం డగు సౌభరి యేకాంతంబునఁ దన్నుఁ దా నె చింతించికొని
మీనమిథునసంగదోషంబున నం గాఁపురంబునకు నగుపడుట యెఱింగి పశ్చాత్తాపంబున నిట్లనియె ॥ మ ॥ ఉపవాసంబులఁ డ
య్యుటో విషయసంయోగంబు వర్జించుటో। జపముం బూని చరించుటో హరిపదధ్యానంబు నన్నిల్పుటో। యపలాపంబున
నేలఁ బొందితి హతంబయ్యెం దపం బెల్లఁ గే। కపటస్త్రీపరిరంభముల్మునులకుం గైవల్యసంసిద్ధులే॥ చ ॥ మునియఁట తత్త్వవేది
యఁట మోక్షము గాని సుఖంబు లెవ్వియుం। జనవఁట కాంత లేఁబదఁట సౌధచయంబఁట వాసదేశముం। దనయులు నైదువే
లఁట నిదానము మీనకుటుంబిసౌఖ్యముం। గనుఁగొనఁట చెల్ల రే నగవుగాక మహాత్ములు సూచి మెత్తురే॥ గీ॥ తపము సేయువాఁ
డుఁ దత్త్వజ్ఞుఁ డగువాఁడు। నెలమి మోక్షమిచ్ఛయించువాఁడు। నేకతంబు విడిచి సేర్పడ నేరఁడు। కాఁపురంబు సేయఁగాఁ
టి తపసి॥ వ॥ అని మగిఖించి తనుఁ దాన చింతించుకొని తన వేడబంబు విచ్ఛేదించుచు నిహపరసాధకుండై కాఁపురంబు విడిచి సతు
లుం దానును వానప్రస్థధర్మంబున నడవికిం జని ఘోరతపంబు సేసి శరీరముఁ గుదియించి యగ్నిసహాయుండై పరబ్రహ్మంబు
సొచ్చె నంత॥ క॥ మునిపతి వనమునకరిగిన। వనితలు తోనరిగి ప్రాణవల్లభులోకం। జనిరి వెనువగిలి విడువక। యనలునితో శిఖలు
నిలువకరిగిన భంగిన్॥ వ॥ అంత మాంధాత పెద్దకొడుకగు నంబరీషుండు వాని పితామహుండగుటం జేసి యువనాశ్వుండు వ
నకుఁ బుత్త్రుండు గావలయునని కోరి పుచ్చికొనియె- నయ్యంబరీషునకు యౌవనాశ్వుం, డతనికి హారీతుండుఁ జనియించె నది
కారణంబున నంబరీష యౌవనాశ్వ హారీతులు మాంధాతృగోత్రంబునకుం బ్రవరులైరి- మాంధాత రెండవ కొడుకు పురుకు
త్సుం డతని నురగలోకంబునకుం గొనిపోయి భుజంగకుమారులు దమ చెల్లెలగు నర్మదయను కన్యకను వివాహంబు చేసిరి- పురు
కుత్సుండు నక్కడ ననేక గంధర్వనాథుల వధించి తన నాగలోకసంచరణంబు దలంచువారికి నురగభయంబు లేకుండ వరంబు
వడసి తిరిగివచ్చెఁ- బురుకుత్సునకుఁ ద్రసదస్యుండు, త్రసదస్యునకు నరణ్యుం, డాయరణ్యునకు హర్యశ్వుండు, హర్యశ్వున
కు నరుణుండు, నరుణునకుఁ ద్రిబంధనుండు, త్రిబంధనునకు సత్యవ్రతుండు, సత్యవ్రతునకుఁ ద్రిశంకుండు జన్మించె నతండు॥
సీ॥ గురుశాపవశమునఁ గూలి చండాలుఁడై యనఘాత్ముఁ గౌశికు నాశ్రయించి। యతని లావున దివిజాలయంబున కేగ నన్నిం
పక మరులు మఱలఁ ద్రోయఁ దలక్రిందుగాఁ బడి దైన్యంబుతో గాఁగ గౌశికుఁ డప్పుడు ఘనత మెఱసి। నిలిపె నాకసమున నేఁ
డు నున్నట్టి త్రిశంకుఁ డాతఁడు హరిశ్చంద్రుఁ గనియె। నా హరిశ్చంద్రుఁ గౌశికుఁ డర్థిఁ జేరి। యాగదక్షిణమిషమున సఖలధ
నముఁ గొల్లఁగొని మీఁదఁ గులహీనుఁ గొలువఁ బెట్టి। బొంకకలజడిఁ బొందె నా భూవరుండు॥ వ॥ ఇట్లు విశ్వామిత్త్రుండు హరి
శ్చంద్రు నెగులుపఱచుటఁ బసివసిష్ఠుండు విశ్వామిత్త్రు నిగృధ్రమ్ముగన్మని శపించె- విశ్వామిత్త్రుండును వసిష్ఠుని బకంబుగమ్మ
ని శపించెఁ- బక్షిరూపులయ్యును నా యిరువురు యుద్ధంబు సేసిరంత, హరిశ్చంద్రుండు పుత్త్రులు లేక నారదునుపదేశంబున
వరుణోపాసన నతిభక్తితోఁ జేయ నా వరుణుండు ప్రత్యక్షంబయిన నతనికి మ్రొక్కి యిట్లనియె॥ గీ॥ వరుణదేవ నాకు వరధీ
రగుణములు గొడుకుపుట్టినేని కొడుకుఁ బట్టి। పశువుఁ జేసి నీవు పరిణమింపఁగ వేల్తుఁ। గొడుకు నీకడయ్యె గొసరు లేక॥ వ॥ అనిప
లికినం గుమారుండు గలిగెడు నని వరుణుండు వరంబిచ్చి చనియె నంత హరిశ్చంద్రునకు వరుణప్రసాదంబున రోహితుండను,
కుమారుండు జన్మించె వరుణుండును, హరిశ్చంద్రుకుమారు నుద్దేశించి॥ సీ॥ పుట్టిటిలోపల వచ్చి పుత్త్రు వేలువుమన్నఁ బుఱుపు
వెళ్లినఁ గాని పొసఁగదనియెఁ। బలురాకమును వచ్చి బాలు వేలువుమన్నఁ బండ్లు లేకున్న నభావ్యుఁ డనియెఁ। బండ్లు రాఁ జూచి
డింభకుని వేలువుమన్నఁ బడిపండ్లు రామి నభావ్యుఁ డనియెఁ। బడిపండ్లు వొడమినఁ గొడుకు వేలువుమన్నఁ బోరులకొమ్మగక
పొసఁగదనియెఁ। దొడరి యిట్లు కొడుకుతోడి మోహంబునఁ। బ్రొద్దు గడుపుచుండె భూవరుండు। పుత్త్రుఁ దల్లఁపుకొలఁదిఁ దన
లోనఁ జింతించి। యింటనుండక డవికేగె వెఱచి॥ వ॥ ఇట్లు వనంబునకుం జని శరశరాసనధరుండై రోహితుండు దిరుగుచుండె వ
రుణగ్రస్తుండై హరిశ్చంద్రుండు మహోదరవ్యాధిచేఁ బీడితుండుగా నుండుట విని పురంబునకుం దిరిగి రాఁగమకింప నిం
ద్రుండు ముసలి తపసియై వచ్చి యిట్లనియె॥ గీ॥ పుణ్యభూములరుగు పుణ్యతీర్థంబులఁ। గ్రుంకు పుణ్యజనులఁ గోరి చూడు। పు

న్యకథలు వినుము భూపాలపుత్రక! మేలుగలుగు నట్టి మేరగలదు॥వ॥అనియిట్లు నారదుండు చనిన నందు దిరిగి చనిరోహితుండొక్క యేఁ
డవ్వనంబునం దిరిగి క్రమ్మఱం జనుదేర నింద్రుండు వచ్చి తొంటియట్ల నివారించె నివ్విధంబున॥సీ॥ ఐదేండ్లు నాఁటి లంచెన మరేం
ద్రుండా బాలు నాటవియేటవాఁ డడవినుండి! యింటికివచ్చుచు నెమ్మితో నజాగర్తుం డాస్యామపుత్రున న్నాన్యచరితుఁ ఘనుని శున
శ్శేఫునిఁ గొని యాగపశువుగ నా హరిశ్చంద్రునకాతఁ డిచ్చెఁ! బురుషమేధము సేసి భూపాలవర్యుండు వరుణుఁ డాదిగ దేవ
తలను దనిపె! యాయాత కౌశికుఁ డధ్వర్యుఁడౌ నరభృగుఁడు బ్రహ్మ జమదగ్ని సామంబు పాడువాఁడు! మునివసిష్ఠుండు మఖ
మున మునయుఁ బొందె! కనకరథమిచ్చె నింద్రుఁ డా నృపతికి॥వ॥శునశ్శేఫుని ప్రభావంబు వెనుక వివరించెద నంత భార్యా
సహితుండయిన హరిశ్చంద్రువలనం బ్రీతుండై విశ్వామిత్రుండతనికి యధ్యాత్మజ్ఞానంబు కృపసేసిన మానంబన్నమయంబు
గావున మనంబునన న్నరూపిన్నైన పృథివి నెఱిఁగి పృథివి నిజలంబు వలన నడంచి జలంబు దేజంబు వలన నింకించి తేజంబు వాయు
వు వలనం జేర్చి వాయువు నాకాశంబునం గలిపి యాకాశంబు దామసాహంకారంబునందు లయంబు సేసి యహంకారత్ర
యంబు మహత్తత్త్వంబునందు డించి పరతత్త్వంబునకు లోకంబును సృజించెద ననుగలం పైన మహత్తత్త్వంబునందుల విష
యాకాశంబు నిర్వర్తించి విషయవినష్టితుండై మహత్తత్త్వంబును బరతత్త్వంబుగా నెఱుంగు నయ్యోఁ బుకవలన సంసార
హేతువైన ప్రకృతిని భస్మంబు సేసి నయ్యోఁ బుకను నిర్వాణసుఖ పారవశ్యంబున సంబరిహరించి సకలబంధవిముక్తుండై హరి
శ్చంద్రుండవాఙ్మానసగోచరంబయిన నిజరూపంబుతో వెలుంగుచుండె నతనికుమారునకు హరితుండు, హరితునకుఁ జంప
నామధేయుండతండు, తన పేర జంపానగరంబు నిర్మించెఁ, జంపునికి సుదేవుండు, సుదేవునికి విజయుండు, విజయునకు రురు

## —— సగరచక్రవర్తి కథా ప్రారంభము. ——

కుండు, రురుకునకు వృకుండు, వృకునకు బాహుకుండు, జనియించె నతండు॥సీ॥ దండించి పగవారు దన భూమిఁ జేకొన్న సంగన
లును దానునడవి కేఁగి! యడవిలో ముసలియై యాతఁడు సచ్చిన నాతని భార్య దానను గమింపఁ! గదియుచో నా స్త్రీకి గర్భంబు
గలుగుట యౌర్వమునీశ్వరుఁ డాత్మ నెఱిఁగి! వారించె నంత నవ వనజాక్షి సవతులు నాలు నిండా గినఁ జూడఁజాల! కద్దిన న్నం
బుగుడుచుచో నందుఁ గలిపి! విషము వెట్టిరి పెట్టిన విధకగుడువ! గరముతోఁ గూడ సగరుండు ఘనుఁడు పుట్టె! వరయశస్స్ఫూర్తి
తోఁ జక్రవర్తియయ్యె॥శా॥ చండస్ఫూర్తి నతండు సంద్రిపగహై సంగ్రామరంగంబులన్ జెండెన్ హైహయ బర్బరాదుల
వధించెన్ దాళజంఘాదులన్! ముండీభూతులు గా శిరంబులు గాముక్తల్పభీభత్సులై! యుండం జేసె నిజారులన్ సగరనా
మోర్వీవిభుండల్పుఁడే॥కం॥ ఖగరాజరుచులు గలయిల! పగరాజులనడఁచి యేలె బాహాశక్తిన్ నగరాజధీరు నూరుల్! సగరుల్
హతపిమతు నిఖిలజనులు నుతింపన్॥సీ॥ శౌర్వుండు సెప్పఁగ నర వేదాత్మకు హరిని శునస్సు పవనంబుఁ గూర్చి! వాజిమేధం
బులు వసుధీశ్వరుఁడు సేసెనందొక్క మఖమున హయము విడువ! నగభేదిగొని పోయి నాగలోకంబునఁ గపిలుని చేరువఁ గట్టి
తొలఁగె! నంతగుఱ్ఱము గానక యారాజువన పుత్రనివహంబు దిశలకు వెదుకఁ బంప! వారు నీయేడు దీవులు వరుస వెదకి! మఖతు
రంగంబు లేకున్న మగుడిరాక! ప్రాభవంబునఁ దోర్దండబలము మెఱసి! క్రొచ్చికో రా డి త్రవ్వి రిలకు నలమెల్ల॥వ॥ ఇట్లు సుమతి కొ
డుకులు నేలఁ ద్రవ్వి పాతాళంబునం దూర్పు మట్టియున్న యుత్తరభాగంబునఁ గపిలముని పొంత నున్న తురంగంబుగని॥చ॥ ఎ
ఱిఁగితి మద్దిరయ్య యీ తడ వేటికి గుఱ్ఱపు దొంగ యాతఁడే! గుఱుతుగఁ బట్టి చంపుఁడని ఘోరమునీంద్రుఁడు వారె నేత్రముల్! దె
ఱవక నున్న వాఁ డితనిఁ డెంపుగఁ జై సిగ వట్టివంచుడం! చఱువది వేవురున్ని జకరాయుధముష్టి లిపించి డాయుచోన్॥చ॥ క
పిలుఁడు నేత్రములు దెఱవఁగాఁ దమ మేనులనుంట వుట్టి తా! రపగతధైర్యులై పడియహంకరణంబున మూఢచిత్తులై! నృపసుతు
లంపేఱుకెన్ ధరణినీఱయిరి తుణ మంద సాధులం! దపసులఁ గాసి పెట్టెడిమదస్ఫురితాత్ములు నిల్వ నేర్తురే॥సీ॥ కొండొకపిలు
నికోపానలంబున నింద్రిరి సగరకుమారులనుచు! నందు రాముని శాంతుఁ డానందమయమూర్తి తోడరి కోపించునే యువ్వ
నేల! గాక జన్మించు నేగగనస్థలంబున నే సాంఖ్యమతమున సిద్ధమతులు! భవసముద్రము నృత్యుపదము నులంఘింతు రాబు
ద్ధిఁ జేయు పరాత్మభూతుఁ డఖిలబోధకుఁ డతనికి నరసి చూడ! సఖులు మిత్రులు నెవ్వరు సగరసుతులు! దామతమ చేయు నేర
మిఁదను పులంపు! ననలకీలలు పుట్టినీ తైరిగాక॥వ॥మఱియు సగరుండను కేశినియందుఁ గన్నపుత్రుండసమంజసుండను వాఁ
డు సమంజసగుణంబులు లేక పూర్వజన్మంబున యోగీశ్వరుండై యుండి సంగదోషంబు వలన యోగభ్రష్టుండై సగరునకు
జన్మించి జాతిస్మరణజ్ఞానంబు గలిగి లోకులకప్రియంబగు వర్తనంబునం దిఱుగుచు నొక్క నాఁడు॥చ॥ వరుస నయోధ్యలో
నఁగలవారల నాడెడు పిన్నవాండ్ర నా! సరయువులోన వైచి జనసంఘముఁ దండ్రియుఁ దిట్టుచుండ వాఁ! డురుమతిఁ గొన్ని
ప్రొద్దులకు యోగబలంబునఁ జేసి బాలురం! దిరిగి పురంబులోపలికిఁ దెచ్చిన నివ్వెఱఁ గందిరందఱున్॥వ॥ అంత సగరుండుద

నసమంజసునినంశుమంతునినశ్వంబు వెదకి తెమ్మనిపంచిననతండుదమతండ్రులచొప్పునంజనివారలుద్రవ్వినమహాఖాతం బుఁజొచ్చి యందుభస్మరాసులపొంతనున్నహయంబుఁగనిహయసమీపంబునందున్నకపిలాఖ్యుండైనవిష్ణునికిదండప్రణా మంబుసేసియిట్లనిస్తుతించె॥ సీ॥మతి దిక్కఁబట్టిసమాధిగౌరవమునవాసిగాఁదనకునవ్వలవెలుంగు।నినునొక్కనాఁడై ననెఱుఁగనేయజాబ్రహ్మయజునిమనంబుననవయవములఁ।బుట్టిజన్మించినభూరిజంతువులందుహీనులమైనమాకెఱుఁగవ శమె।తమలోననీవుండఁగామెఱుంగరునిన్నుగుణములఁజూతురుగుణములైన।గానమొకచోటఁజీకటిఁగందురాత్మ।లం దుఁదెలియరువేలుపులరయఁబొందు।లరయుమఱిదేహధారులత్యంధులగుచుఁగడిఁదినీమాయనెన్నఁడుఁగడువలేక.వ॥అ నినుతిసేయుచుహయంబువిడువుమనిచెప్పకతనతండ్రులునీఱగుటందడవకమ్రొక్కి నిలుచున్నయంశుమంతునికిఁగరుణా విష్ణుండగుచుఁగపిలుండిట్లనియె॥క॥గుఱ్ఱముఁగొనిపోబుద్ధుల।కుఱ్ఱడమీతాతయొద్దనున్నీతండ్రు।ల్వెఱ్ఱులునీఱైరదెయీ మిఱ్ఱునగంగాజలంబు మెలఁగుశుభమగున్॥ వ॥అనిపల్కినసమస్కరించితురగంబుఁగొనివచ్చియాసగరునకిచ్చినసగరుండా పశువువలనజన్నంబుకడమనిండించియంశుమంతునకురాజ్యంబిచ్చిముక్తబంధనుండైయౌర్వుండుసెప్పినమార్గంబున నుత్తమగతికింజనియెనంత॥క॥జనకులుమ్రగ్గినచోటికి।ననిమిషనదిదెత్తుననుచునటవీస్థలికిం।జనితపముసేయఁజాలక।ఘన మునవగలాలయనంశుమంతుఁడుదీఱెన్॥క॥అతనికొడుకుదిలీపుఁడు।భూతలమునగంగఁదెచ్చిపొందించుటకై।ప్రీతిందపం బుసేయుచు।భాతిఁగదేలేకకాలపరవశుఁడయ్యెన్॥క॥అతనిసుతుండుభగీరథుఁ।డతితపమొనరించికనియెనభ్రతాపాంగ న్నుతరంగన్ముఖవనరుహ।రతభృంగన్నివజటాగ్రరంగన్గంగన్॥వ॥కనినమస్కరించినగంగకృపఁజేసివరంబువేడుమనిననా రాచపట్టియిట్లనియె॥క॥మావారిభస్మరాసుల।నీవాఱింగలిపికొనుము నెఱిమావారల్।నీవారిఁగలయనాకము।మావా రికిఁగలుగునిదిప్రమాణముతల్లీ॥ఇంద్రవజ్రము॥చెల్లన్మదిన్నిన్నుభజింతుగంగన్।ఫుల్లాంతరంగన్బహుపుణ్యసంగన్।గ ల్లోలలక్ష్మీజితకాశమల్లిన్।దల్లిన్నదీకల్పలతామతల్లిన్॥అనివినుతులుసల్పుచున్నరాజకుమారునకులోకపావనియిట్లని యె॥మ॥వినువీథింబరతెంచినేలఁబడనావేగంబుమున్నిల్వనో।పినవాఁడెవ్వఁడుమేదినీతలమునేభేదించిపాతాళముం। జనదున్వచ్చితినేనినాజలములన్స్నాతులైమానవు।ల్ననుఁబొందించునఘవ్రజంబెచటనేనాశంబుఁబొందించెదన్॥ వ॥అదిగారణంబుగావిచారించెదననిపలుకుచున్నలోకమాతకురాజన్యవర్యుండగుభగీరథుండిట్లనియె॥మ॥పరతత్త్వజ్ఞులు శాంతచిత్తులుదపఃపారీణులార్యుల్మును।ల్పురుషశ్రేష్ఠులువచ్చితల్లిభవదంభోగాహముల్సేయఁగా।నరసంఘాఘముని న్నుఁబొందునెజగన్నాథుండునానాఘసం।హరుఁడావిష్ణుఁడువారిచిత్తములఁదానైయుంటమందాకినీ॥ మ॥ తనలోని న్నిజగంబులుంగలుగుటందానిన్నిటంజెందుటన్। జననీతంతువులందుఁజీరగలయాచందంబునవ్విశ్వభా। వనుఁడైయొ ప్పశివుండుగాకమఱినీవారిన్నివారింపనే।ర్చినవారెవ్వరునిక్కధరించుకొఱకైశ్రీకంఠునింగొల్చెదన్॥వ॥ అనియెఱింగిం చివీడ్కొనిచనిభగీరథుండుమహేశ్వరునుద్దేశించిగ్రద్దనఁదపంబుసేసిన॥గీ॥ భక్తవత్సలుండుఫాలాక్షుఁడాభగీ। రథు నిమెచ్చినిజశిరంబునందు। శౌరిపాదపూతసలిలమైదివినుండి। ధరకువచ్చుగంగఁదాల్చెనపుడు ॥ వ ॥ ఇట్లుమహేశ

## శ్రీపరమేశ్వరజటాజూటనిర్గతగంగానదీప్రవాహమహిమానువర్ణనము.

దిపురారాతిజటాజూటరంధ్రంబువలనదిగంబడినిరర్గళప్రవాహంబైనిలకుజల్లించి నెఱసినిండిపెల్లువెల్లువంగొని పెచ్చుపెఱిఁగివిచ్చలవిడిఁగ్రేపువెంబడినుఱికఁగ్రేళ్లుఱుకుమరకప్రాయంపుకామధేనువుచందంబునముందటికినిగుడుచు, ముద్దుచందురుతోడినెయ్యంబునఁగ్రయ్యనవెడలిచొప్పుదప్పకసాగిచనుదెంచుసుధార్ణవంబుకైవడిఁబెంపుగలిగి,మహే శ్వరువదనగహ్వరంబువలననోంకారంబుపిఱుందవెలువడుశబ్దబ్రహ్మంబుభంగినదభ్రవిభ్రమంబుననమ్మహీపాలతిల కంబుతెరువువెంటనంటివచ్చువెలియేనుఁగుతొండంబులనుకరించిపఱచువఱదమొగంబులుపిఱుందనందందఁగ్రమ్ముకొని పొడచూపితొలంగుబాలశారదాకుచకుంభంబులకునగ్గలంబైనబుగ్గలును,బుగ్గలసంగడంబునంబారిజాతకుసుమస్తబకం బులచెలువంబులందెగడువెలినురువులును, వెలినురువులచెంగలనర్ధోన్మీలితకర్పూరతరుకిసలయంబులంగేలిఁగొనుసు ళ్లును, సుళ్లకెలంకులధవళజలధరరేఖాకారంబులబాగుమెచ్చనినిడుదయేఱులును, నేఱులంగలసివాయువశంబున నెం డొంటిందాఁకిబిట్టుమిట్టించిమీఁదికెగయుదురితభంగంబులైనభంగంబులును, భంగంబులకొనలభిన్నభిన్నంబులైకుప్పిం చియుప్పరంబెగయుముత్తియంపుసరులసరణి, మల్లికాదామంబులతెఱంగునఁగర్పూరఖండకదంబంబులకరణి, నిందుశ కలంబులతేజంబునఁదారకానికరంబులపోలుపున,మెఱయుచుమౌక్తికన్యాయశీకరంబులైన *శీకరంబులునుంగలిగి మర్త్య

* శీకరంబులు।నీటితుంపురులు. మర్త్యములోక।మనుష్యలోకము.

మలోక శ్రీకరంబై, శ్రీకరంబు తెఱంగున *విష్ణుపదంబు ముట్టి విష్ణుపదంబు భాతి నుల్లసితహంసరుచిరంబై, సితపక్షంబు రీతి నతిశోభితకువలయంబై, కువలయంబు చెన్నున బహుజీవనంబై, జీవనంబు లాగున సుమనోవికాసప్రధానంబై, ప్రధానపర్వతంబు పోలుపున ననేకచక్రబకభీమమహాభంగసుభద్రార్జునచరితాభిరామంబై, రామచిత్తంబు మెలుపున నందనవారిలోఁ జొచ్చిన దోషాచరాభయప్రదానచణంబై, మృత్యుంజయు పోలికె విభూతిసుకుమారంబై, కుమారచరిత్రంబు తేవను క్రౌంచప్రముఖవిజయంబై, విజయురథంబు భాతి హరిదయామందరంబై, మందరవిచారంబు గ్రద్దన మహారామగిరివనప్రవేశకామంబై, కామకేతనంబు పెల్లున నుద్దీపితమకరంబై, మకరకేతను బాణంబు కైవడి నిలీనపరవాహినీకలితశంబరంబై, శంబరారాతి చిగురుగొంతంబు సూటి నధ్వగవేదనాశమనంబయి, శమనదండంబు జాడ నిమ్నోన్నతసమవృత్తంబై, వృత్తశాస్త్రంబు విధంబున వడిఁ గలిగి సదా గురులఘువాక్యచ్ఛటాపరిగణితంబయి, గణితశాస్త్రంబు కోలఁది నిఘనఘనమూలవర్గసంకలితభిన్నమిత్రప్రకీర్ణఘాతభీష్మంబయి, భీష్మపర్వంబు పెంపున ననేకభగవద్గీతంబయి, గీతశాస్త్రంబు నిలుకడను మహాసుషిరతనుఘననానాశబ్దంబయి, శబ్దశాస్త్రంబు మర్యాదనచ్చు వడి హల్లు గలిగి మహాభాష్యరూపావతారవృత్తివృద్ధిగుణసమృద్ధంబై, యర్థశాస్త్రంబు మహిమను బహుప్రయోజనప్రమాణదృష్టాంతరంబయి, దృష్టాంతరంబు తెఱంగున సర్వసామాన్యగుణవిశేషంబై, ఈషావ్యాపారంబు కరణి సుస్థిరోద్ధరణతత్పరంబయి, పరబ్రహ్మంబు గరిమ నతిక్రాంతానేకనిగమంబయి, నిగమంబు నడువడి బ్రహ్మవర్ణపదక్రమసంగ్రహంబయి, గ్రహశాస్త్రంబు పరిపాటి నికర్కటమీనమిథునమకరసుందరంబై, సుందరీముఖంబు పోడిమి నిర్మలచంద్రకాంతంబయి, కాంతాధరంబు రుచి నిశోణితచ్ఛాయావిలాసంబై, విలాసవతీకొప్పుచొప్పునఁ గృష్ణాలకాధికంబయి, యధికమతిశాస్త్రసంవాదంబు సొంపున నపారసరస్వతీవిజయవిభ్రమంబై, విభ్రమవతీచనుదోయి పగిది నిరంతరపయోవ్యాప్తాఖిలలోకజీవనప్రదతురంగభద్రాతిరేఖాసంకలితంబయి, లలితవతీనగవు మించున నపహసితచంద్రభాగధేయంబై, భాగధేయవంతుని వివాహంబు లీల మహామేఖలాకన్యకావిస్తారంబై, తారకెంగేలి యొడికంబున నతిక్రాంతసూర్యతనయంబయి, సూర్యతనయశరవర్షంబు పోలికె భీమరథ్యాటోపవారణంబయి, వారణంబు బిరుసునం బుష్కరోన్నతసంరంభంబై, రంభ నెమ్మొము డాలున సురతనాతిశయదశంబై, దశరథతనయు భామముడి చాడ్పున సింధుగర్వప్రభంజనంబై, ప్రభంజనతనయు గదపెట్టు మాడ్కి నిసమీపగతదుశ్శాసనమర్మదనివారకంబై, వారకన్యకముం జేతి గతి నిముహుర్ముహురుచ్చలితకంకణాలంకృతంబయి, కృతయుగంబు నోజ నపంకంబై, పంకజాసనముఖంబు నెఱపున ప్రభూతముఖ్యవర్ణంబై, వర్ణగుణితంబు తెరకువను బహుదీర్ఘబిందువిసర్గంబై, సర్గబంధకావ్యంబు విన్ననువున గంభీరభావమధురంబై, మధురాపురంబు సొబగున మహానందంబై, నందనవనంబు పొందువున విహారమాణకౌశికంబై, కౌశికహయంబు రీతి నుదరధ్రువంబై, ధ్రువుతలంపు క్రియను పరికీలితవిశ్వంభరంబై, విశ్వంభరుని శంఖంబు రూపున దక్షిణావర్తోత్తరంబై, యుత్తరావివాహంబు చందంబునఁ బ్రముదితనలవరంబై, నరసింహానఖరంబుల భాతి నాశ్రితప్రహ్లాదగురువిభవప్రధానంబై, దానకాండంబు సిరిం గామధేనుకల్పలతాద్యభినవంబయి, నవసూతికాకుచంబు పేర్మి నిరంతరపయోవర్ధనంబై, ధనదనిలయంబు తూనిక సంగతమకరమహాపద్మకచ్ఛపంబై, కచ్ఛపకర్పరంబు బలిమి నిపతితశైలసముద్ధరణంబై, ధరణీధరంబు సాటిను త్తుంగతటముఖ్యంబయి, ముఖ్యవరాహంబు గరిమనున్నతక్షమంబై, క్షమాసురహస్తంబు గఱిగటికెను సత్పవిత్రమనోరామంబై, రామచంద్రు బాణంబు కడిందిన భ్యాగతఖరదూషణముదాపహరముఖరంబయి, ముఖరరామకుఠారంబు రీతి నిభూభృన్మూలభేదనప్రబలంబయి, బలరామహలంబు భాతి నిప్రతికూలసన్నికర్షణప్రవర్ధంబయి, బుద్ధదేవుని మేని యొప్పున నభియాతివధూదారమనోహరంబయి, హరతాండవంబు మేలునుల్లసితానిమిషంబై, యనిమిషావతారంబు కీర్తిని శ్రుతిమంగళప్రదంబయి, ప్రదాతయాగి సూటి నర్థపరంపరావామనంబై, వామనచరణరేఖమబలివంశవ్యపనయంబై, నయశాస్త్రంబు మార్గంబున సామభేదమాయోపాయచతురంబై, చతురాననాండంబు భావంబున నపరిమితభువనజంతుజాలసేవ్యమానంబై, మానినియన లోఁతు సూపక గరితయన నలిచప్పుడు సేయక ముగుదయన బయలుపడక ప్రమదయనఁ గ్రొయ్యంబుఁ బొఱుచుఁ బతివ్రతయన నిట్టట్టు సనక తల్లియన నెవ్విమైన లోఁగొనుచు దైవంబన భక్త

---

*విష్ణుపదము। ఆకాశము-విష్ణుదేవుని పాదము. భాతి। వలె. హంస। అంచ-సూర్యుఁడు. సితపక్షము। శుక్లపక్షము. కువలయము। భూమండలము. జీవనము। జలము-బ్రతుకు. సుమనః। దేవత। పుష్పము. తనవారిలోఁ। స్వజనములో-తనజలములలో. దోషాచర। రాక్షసులు-పాపాత్ములు. చణంబై। నేర్పుగలదై. శంబరంబై। మురదగలదై-శంబరాసురుఁడుగలదియయి. శంబరారాతి। మన్మథుఁడు. గొంతము। బాణము. శీంకణ। జలబిందువు-కడియము, అనిమిష। దేవత। మత్స్యము, మానిని। ప్రణయకోపముగలది, గరిత। గంభీరముగలది. ముగుద। ముగ్ధ-మాధురాలు. ప్రమద। మిక్కిలిమదముగలది,

మనోరథంబు లిచ్చుచు నంతకంతకు నతిగడచి యవాఙ్మానసగోచరంబు ప్రవహించె॥ మ॥ జగతీనాథు రథంబు వెంట బహు
దేశంబుల్వడిం దాటి తత్సగరపుత్త్రోద్భవ కుమార భస్మముల నింపొందఁ జిమ్మంచి పాఁజన్మగు న్నగరావాసము వారు పొందిరి దివ్యశ్రీ
లతో గంగలో సుగతిం గాంచ మహోత్తమ రంతసుజన ద్రోహానలంబారు నే॥ మ॥ హరు మెప్పించి మహోగ్రపోనియతుండై యాకా
శగంగానది నుర్వరకుం దెచ్చి నితాంతకీర్తిలతికా స్తంభంబు గానవ్యసు స్థిరలీలం బితృకృత్యమంతయు నొనర్చెన్ వారితానేక
మస్తరవంశవ్యధుండా భగీరథుండు నిత్యశ్రీకరుండల్పుఁడే॥ క॥ హరిఁదవనమున మునలో నిడి హరిపాదాంభోజజనితమైన నది
న్సుస్థిరులై శ్రుంకి మునీంద్రులు హరిఁ గలసిరి త్రిగుణరహితులై యవ్వేళన్॥ వ॥ అంత నా భగీరథునకు శ్రుతుండును, శ్రుతు
నకు నాభావరుండును, నాభావరునకు సింధుద్వీపుండును, సింధుద్వీపునికి నయుతాయువు, నయుతాయువునకు ఋతుపర్ణుండు
ను జనియించె నతండు॥ గీ॥ నయవిశాలబుద్ధి నలచక్రవర్తితో నెంగిలీనితనము చాలఁ జేసి యక్షహృదయమనెడి నక్షవిద్యాస్తము
గనిచ్చి యశ్వవిద్య నేర్చెనతని వలన॥ వ॥ ఆ ఋతుపర్ణునకు సర్వకాముండును, సర్వకామునకు మదయంతీవల్లభుండైన సు
దాసుండు పుట్టె, నా రాజశేఖరుని మిత్రసహుండును, కల్మాషపాదుండు నని చెప్పుదు రా భూవరుండు వసిష్ఠుని శాపంబున రా
క్షసుండై తన కర్మంబు వనన నపత్యుండయ్యె నని విని పరీక్షిన్నరేంద్రుం డేమి కారణంబున సుదాసునకు గురుశాపంబు ప్రాప్తం
బయ్యె నానతిమ్మని నవిని శుకుండిట్లనియె॥ సీ॥ ఆ సుదాసుండు వేఁటకై వనంబున కేగి కర్పించి యొక్క రక్కసునిఁ జంపి వానితోఁ బుట్టి
న వానిఁ బోవిడిచిన వాఁడును దన తోఁటివాని పృతికి నతిదుఃఖితుండునై యా రాజగృహమున సూదభావంబున సొంపునొం
ది యుండ వసిష్ఠునకు రక్కసుఁ డొక్క నాఁ డన్నంబు సేయంగ సతని ఁ బనుప వాఁడు మానవమాంసంబు వండి తెచ్చి మునికిడ
ఁ జూడ కోపించి ముని నరేంద్రుఁ బెట్టిన మానవమాంసంబుఁ బెట్టితి నను చు నలుకతో రాక్షసుఁడవు గమ్మని శపించె॥ వ॥ ఇట్లు
రాక్షసుండు వండి తెచ్చుటయు సుదాసుండెఱుంగమి దన మనంబున నెఱిఁగి వసిష్ఠుండు పండ్రెండేండ్లు రక్కసుండ
వై యుండుమని శపియించె నయ్యవసరంబున॥ మ॥ గురువున్నాయు శపింతునంచు జలముల్ గోపంబుతో దోయిటన్నర
నాథుండు ధరింపఁ దత్సతి పతి న్వారించి మిన్నుం దిశల్ ధరయున్ జీవమయంబుగా నిఖిలముం దాఁ జూచి చల్లెదవా వసుంధా
త్రీయ పదంబులం గరపుటీ వారిపూరము న్వేగనై॥ వ॥ ఇట్లు మిత్రసహుండు గావునఁ గళత్రానుకూలుండయి
శపియింపనొల్లక సుదాసుండు రాక్షసభావంబు నొంది *కల్మాషవర్ణంబులయిన పాదంబులతో నడవులందిరుగుచు॥
క॥ ఆకటఁ గటకటమాఁడుచు వీకన తండడవి నున్న విప్రమిథునముఁ గాంచి దాకి నటాలున విప్రుని హూంకృతి చేసట్టి మ్రింగఁ గ్రో
ని పోవు తెఱఁగున్॥ వ॥ అంత నా బ్రాహ్మణుని భార్య మోఁదికొనుచుం బెగ్గడిల్లి డగ్గుత్తిక తోఁ బతిభిక్షంబు వచ్చి యేడ్చుచు రాచర
క్కసునకిట్లనియె॥ క॥ మానుష దేహము గలుగుట భూనాయక దుర్లభంబు పుట్టినమీఁదన్ దానము పరోపకారము భూనుత కీ
ర్తియు నువలదె పురుషునకెందున్॥ మ॥ రవివంశాగ్రణివై సమస్తధరణీ రాజ్యానుసంధాయివై భువనస్తుత్యుఁడవై పరార్థ
రతివై పుణ్యానుకూలుండవై వివరం బేమియు లేక నా పెనిమిటిన్ వ్రుందపక్షీలను మాత్సర్యవిహీన సద్ధరణుని న్భ
క్షింపఁగాఁ బాడియే॥ శా॥ తండ్రీ మీకు దినేశవంశజులకున్ దైన్యంబు నా బ్రాహ్మణుం డంత్రా మాటలు లేవె భూమిసురగో
హత్యాభిలాషంబు కై కొండ్రే మీ యటువంటి సాధువులు రక్షోభావమిట్లేల మీ తండ్రీ దాతలఁ బూర్వులం దలఁపవే ధ
ర్మంబు నం బోఁగ దే॥ శా॥ అన్నా చెల్లెలనయ్యెదన్ విడువు నీకన్నంబు పెట్టింతు నా పన్నా నాథున్ ద్విజుం గంగి కుట్టి సకటా
హింసింప నేలయ్య నీ వెన్నం డింతుల తోడఁ బుట్ట వె సిజం బిట్టయి న మున్నుట్ట నా పన్నన్ను న్నిశిరంబుఁ ద్రుంచి మఱి మాత్రాపి
ణేశు భక్షింపవే॥ క॥ అని కరుణపుట్టనాడుచు వనితా మణి పలువరింప వసుధాదేవుం దినియె నతఁడు పులి పశువుం దిను క్రియ
శాపంబు కతన ధీరహితుండై॥ వ॥ అంత నా బ్రాహ్మణి కోపించి కామార్తనైన నా మగని భక్షించితివి గావున నీవు నెలఁ
తలం బొందఁ జేసిన వేళ మరణంబుఁ బొందు మని కల్మాషపాదు శపించి పతిశల్యంబులతో నగ్నిప్రవేశంబు సేసి సుగతికిం జ
నియె నంతఁ బండ్రెండేండ్లు సనిన నా రాజు ముని శాపనిర్ముక్తుండై॥ గీ॥ రతులకొఱకు భార్య రావింప నదియును బెదరి విప్రస
తి శపించు టెఱిఁగి మగని నడ్డపెట్టి మైథునకర్మంబు మాన్పె సతుల గోష్ఠి మానెనతఁడు॥ క॥ అదిగారణముగఁ బుత్త్రా భ్యుద
యము లేదా సుదాస భూపాలునకుం బదపడి మతి న వసిష్ఠుఁడు మదయంతికిఁ గడుపుఁ జేసె మదన క్రీడన్॥ వ॥ ఇట్లు సుదాసు
సభార్యయగు మదయంతి వసిష్ఠువలన గర్భిణియై యేడేండ్లు గర్భంబు ధరించి కీళ్లాడ సంకటపడుచున్న వసిష్ఠుండు వాఁడి యగు
నశ్మమున నా గర్భంబుఁ జీరిన నశ్మకుండను కుమారుండు పుట్టె నతనికి నారీకవచుండు పుట్టె నా సమయంబున॥ క॥ భీరుఁడగు ప
రశురాముఁడు ఘోరకుఠారమున నృపులఁ గూలుచు వేళన్నారీజనములు దాఁచిన నారీకవచుండనంగ నరపతి యయ్యెన్॥ వ॥ ఆ
నారీకవచుండు నిర్మూలుండై నరవివంశంబునకు మూలంబగుటం జేసి మూలకుండయ్యె మూలకునకు విశ్వసహుండును విశ్వ

* కల్మాషవర్ణంబులు చిత్రవర్ణము [illegible]

సహునకు ఖట్వాంగుండు పుట్టె చక్రవర్తియయ్యె నతండు॥ సీ॥ అమరులు వేఁడిన నసురనాథులఁ జంపి త్రిదశులతోఁ దన తెగడు కాల మెంతని యడిగిన నిదె నిండుచున్న దితడవు లేదేమైన నడుగుమనిన వరములు గోరక వరవిమానం బెక్కి తనపురికే తెంచి తత్త్వబుద్ధిఁ బరమేశ్వరుని యందభావంబుఁ గీలించి కులదైవత ద్విజకులముకంటె నంగనా ప్రాణ రాజపుత్రాదు లెల్లఁ గావు ప్రియములు ధర్మంబు గడదినాదు మతి ప్రవర్తింప దెన్నఁడు మది నెఱుంగ నన్య మాయీశ్వరునిఁ దక్క నను చు మఱియు॥ మ॥ ఇలమీఁదన్ బ్రతుకేల వేల్పులవరం బేలా ధనం బేల చంచలగంధర్వపురీవిడంబనము లైశ్వర్యంబు లేలా జగంబులఁ బుట్టించు తలంపునం బ్రకృతితోఁ బొత్తైనుదిం బాసి నిర్మలనై వాఙ్మనసామితంబగు పరబ్రహ్మంబు నేఁ జెందెదన్ ॥ అని నిశ్చయించి॥ మ॥ కల సెన్సంగము లెల్లఁ బాసి నియతిన్ ఖట్వాంగుఁడ శ్రాంతమై కలి గెందున్ మఱిపైన లేన నెడి దై కల్యాణమై సన్నుతిం దలఁపం బల్కఁగ రాని దైపరమమై తత్త్వజ్ఞులూహింప విహ్వలజంతు జాతంబుల వాసుదేవుఁడని సంస్థాపించు నా బ్రహ్మమున్॥

## శ్రీరామచరిత్రము.

వ॥ అట్టి ఖట్వాంగునకు దీర్ఘబాహుండు, దీర్ఘబాహునకు రఘువు, రఘువునకుఁ బృథుశ్రవుండు, బృథుశ్రవునకు నజుండు, నజునకు దశరథుండును, దశరథునకు సుర ప్రార్థితుండై పరబ్రహ్మమయుండయిన హరి నాల్గువిధంబులై శ్రీరామలక్ష్మణభరతశత్రుఘ్న నామంబుల నిజాంశసంభూతుండై జన్మించెఁ దచ్చరితంబు వాల్మీకి ప్రముఖులైన మునులచేత వర్ణితంబైనది యైనం జెప్పెద సావధానమనస్కుండవై యాకర్ణింపుము॥ మ॥ *అమరేంద్రాశకుఁ బూర్ణచంద్రుఁ డుదితుండైనట్టు నారాయణాంశమునం బుట్టె నుదాంధ రావణశిరస్సంఘాతసంఛేదన క్రమణోద్దాముఁడు రాముఁ డాగరితకుం గౌసల్యకున్ సన్నుతామల నైర్మల్యకతుల్యశీలకుం *అంచితజనుస్సంసారసాఫల్యకున్॥ మ॥ సవరక్షార్థము నంద్రి వెంపఁ జని విశ్వామిత్రుఁడుం దోడరాఁ నవలీలం దను నూఁడె రాముఁడపయుండై బాలుఁడై కుంతలచ్ఛవిసంపజ్జితహాటకన్ కపటభాషావిస్ఫురన్నాటకన్ జవభిన్నార్యమఘోటకన్ గరవిరాజత్ఖేటకన్ దాటకన్॥ క॥ §గారామునఁ గౌశికమఖ మా రాముఁడు గాచి దైత్యు నధికసుబాహున్ ఘోరాజిం ద్రుంచి తోలెను మారీచున్ మించుఁ గపటమంజులరోచున్॥ మ॥ ఒకమున్నూఱుగదల్చి తెచ్చిన లలాటోగ్రాక్షు చాపంబు బాలకరీంద్రంబు సలీలమైఁ జెఱకు కోలం ద్రుంచు చందంబునన్ సకలోర్వీశులు సూడఁగా విఱిచె దోశ్శక్తిన్ @విదేహాత్మజాపకగేహంబున సీతకై గుణమణి ప్రస్ఫీతకై లీలతోన్॥ క॥ భూతలనాథుఁడు రాముఁడు ప్రీతుండై పెండ్లియాడెఁ †పృథుగుణమణిసంఘాతన్ భాగ్యోపేతన్ సీతన్ ముఖకాంతివిజితశీతమరీచిద్యోతన్॥ క॥ రాముఁడు నిజబాహుబల ✿స్థేమంబున భంగపఱచె దీర్ఘస్తుతరోద్దామున్ నవనీకృతనృపభామున్ రణరంగభీము భార్గవరామున్॥ క॥ దశరథుఁడు మున్న కైకకు వశుఁడై తా నిచ్చినట్టి వరముకతన వాగ్దశ చెడక యడవి కనిచెను దశముఖముఖకమల ❀తుహినధామున్ రామున్॥ క॥ జనకుఁడు పనిచిన మేలని జనకజయును లక్ష్మణుండు సంసేవింపన్ జనపతి రాముఁడు విడిచెను జనపాలారాధ్య ✿ద్విషదసాధ్యనయోధ్యన్॥ క॥ భరతున్ నిజపదసేవానిరతున్ రాజ్యమున నునిచి నృపమణి యొక్కన్ సురుచిర తపోవిభావిత సురుగోత్రాచలముఁ జిత్రకూటాచలమున్॥ ఉ॥ పుణ్యుఁడు రామచంద్రుఁడటఁ బోయి ముదంబున గాంచె దండకారణ్యము ❀తాపసోత్తమశరణ్యము నుద్ధతబర్హిబర్హలావణ్యము గౌతమీవిమలవారికణపర్యటన ప్రభూతసాద్గుణ్యము నుల్లసత్తరునికుంజవరేణ్యము నగ్రగణ్యమున్॥ సీ॥ ఆవనంబున రాముఁ డనుజసమేతుఁడై సతితోడ నాకపర్ణశాల నుండ రావణు చెల్లెలు రతిఁ గోరి వచ్చిన ❀ముగి లక్ష్మణుఁడు దాని ముక్కు గోయ నదివిని ఖరముఖదానవులు పదునాల్గు వేవు

---

* అమరేంద్రాశకున్ = తూర్పుదిక్కునకు, *అంచితజనుస్సంసారసాఫల్యకున్॥ అంచిత = పూజ్యమైన, జను = పుట్టుకయొక్కయు, సంసార = కుటుంబముయొక్కయు, సాఫల్యకున్ = సఫలత్వముగల. సవ = యజ్ఞము. కుంతలచ్ఛవిసంపజ్జితహాటకన్॥ కుంతల = ఛవి = వెండ్రుకల కాంతియొక్క, సంపత్ = కలిమిచేత జయింపఁబడిన, హాటకన్ = స్వర్ణముగలదియును, కపటభాషావిస్ఫురన్నాటకన్॥ కపటభాషా = మోసపుమాటలచేత, విస్ఫురత్ = ప్రకాశించుచున్న, నాటకన్ = చర్యలుగల, జవభిన్నార్యమఘోటకన్॥ జవ = వేగముచేత, భిన్న = తిరస్కరింపఁబడిన, అర్యమ = సూర్యునియొక్క, ఘోటకన్ = అశ్వములుగలదియును, కరవిరాజత్ఖేటకన్॥ కరవిరాజత్ = హస్తమునందు మెఱయుచున్న, ఖేటకన్ = కేడెముగలదియును, అనఁగా డాలుగలది. §గారామునన్ = ప్రీతితో, కపటమంజులరోచున్ = కపటముచేత మనోహరమయిన ప్రకాశముగలవాఁడు. @విదేహాత్మజాపక = జనకరాజు. †పృథు = అనేకములయిన, విజితశీతమరీచిద్యోతన్ = జయింపఁబడిన చంద్రుఁడుగల. ✿స్థేమంబునన్ = సామర్థ్యముచేత, ఉద్దామున్ = మీరయుచున్న. ❀తుహినధామున్ = చంద్రుఁడైన. ✿ద్విషదసాధ్యన్ = శత్రువులకు సాధ్యముగాని. ❀తాపసోత్తమశరణ్యమున్ = ఋషిశ్రేష్ఠులకు సునికిపట్టయినట్టి, ఉద్ధతబర్హిబర్హలావణ్యమున్॥ ఉద్ధత = అతిశయించిన, బర్హి = నెమళ్లయొక్క, బర్హ = పింఛములచేత, లావణ్యమున్ = ఒప్పుచున్నదియును, గౌతమీ-సాద్గుణ్యమున్॥ గౌతమీ = గోదావరియొక్క, విమలవారికణ = నిర్మలములగు నుదకబిందువులయొక్క, పర్యటన = సంచారములచేత, ప్రభూత = పుట్టిన, సాద్గుణ్యమున్ = సద్గుణసంపత్తిగలది. ఉల్లసత్తరునికుంజవరేణ్యమున్॥ ఉల్లసత్ = తేజరిల్లుచున్న, తరు = వృక్షములచేత, నికుంజ = పొదరిండ్లచేత, వరేణ్యమున్ = శ్రేష్ఠమైనదియును, అగ్రగణ్యమున్॥ అగ్ర = ముందరను, గణ్యమున్ = ఎంచఁదగినదియును.

❀ముగిన్ = ఒక [illegible] సారిగానే

ధనాధాముని విభుఁడు *కలన బాణానలంబున భస్మంబుగావింప జనకనందన మోహించక్క దనము విని దశ గ్రీవుఁడుం గడువిస
ముగ నార్థిఁ బంచినఁ బసిఁడి లేడియై నటించు నీచు మారీచు రాముఁడు నేఁడు వధించె. నంతలోఁ సీతఁ గొనిపోయె నసురవిభుఁడు॥
ఉ॥ ఆయసురేశ్వరుండు వడి నంబరవీథి ‡ఇలాతనూజన న్యాయము సేసి నిష్కరుణుఁడై కొనిపోవఁగ నడ్డమైన ఘోరాయ
త హేతిఁ ద్రుంచె నసహాయత రాము నరేంద్రకార్యదత్తాయువుఁ బత్తు వేగపరిహాసితవాయువు నజ్జటాయువున్॥ వ॥ అంత
నా రామచంద్రుండు లక్ష్మణసహితుండై సీత వెదుక నరుదెంచి నిజకార్యసహితుండైన జటాయువునకుం బరలోకక్రియ
లు గావించి ఋశ్యమూకంబునకుం జని॥ క॥ నిగ్రహము నీకు వలదిఁక నగ్రజు వాలిన్ వధింతు నని నియమముతో నగ్రేసరుఁ
గా నేలెను సుగ్రీవున్ §చరణఘాతచూర్ణగ్రావున్॥ క॥ లీల న్రామవిభుం డొక కోలం దూలంగ నేసె ‖గురునయశాలిన్
శీలిన్ సేవితశూలిన్ మాలిన్ వాలిన్ దశాస్యమానోన్మాలిన్॥ క॥ ఇలమీఁద సీత వెదుకఁగ నలఘుఁడు రాఘవుఁడు పనిచె హ
నుమంతున్ †అతిచ్ఛలవంతున్ మతిమంతున్ బలవంతున్ శౌర్యవంతుఁ బ్రాభవవంతున్॥ క॥ *అలవాయిఁ గొనక మారుతి
లలితామితలాఘవమున లంఘించెను ‖శైవలినీగణసంబంధిన్ జలపూరితధరణిగగనసంధిన్ గంధిన్॥ వ॥ ఇట్లు సముద్రంబు
దాఁటి సీతం గని హనుమంతుం డదిరిగి చనుదెంచుచు నక్షకుమారాదుల వధియించి॥ క॥ సముదగ్రత ననిలసుతుం ¶డమరా
హితదత్తవాలహస్తాగ్నుల భస్మము సేసె నిరాతంకన్ సమదాసురసుభటవిగతశంకన్ లంకన్॥ వ॥ ఇట్లు లంకాదహనం
బు సేసి వచ్చి వాయుజుండు సీతాకథనంబు సెప్పిన విని రామచంద్రుండు వనచరనాథయూథంబులుం దానును జనిచని॥ శా॥
ఆరాజేంద్రుఁడు గాంచె ‖భూరివిధరత్నాగారము న్మీనకుంభీరగ్రాహకఠోరమున్ విపులగంభీరంబు నభ్రభ్రమద్ఘో
రానోన్యవ్యతిభిన్నభంగభవనిర్ఘోషచ్ఛటాంభఃకణప్రారుద్ధాంబరపారము న్లవణపారావారము న్వైరువన్॥ వ॥ కని తనకుఁ
ద్రోవ యిమ్మని వేఁడిన నదియు మార్గంబు సూపక మిన్నందిన నా రాచపట్టి రెట్టించిన కోపంబున॥ క॥ మెల్లని నగవుల నయనము
లల్లార్చి శరంబు విల్లునందిన మాత్ర న్గల్లలు నాఁచులు దిప్పలుఁ బెల్లలు నై జలధి పెద్దబీడై యుండెన్॥ వ॥ ఇట్లు విపన్నుండగు
సముద్రుండు నదులతో మూర్తిమంతుండై చనుదెంచి రామచంద్రుని చరణంబులు శరణంబుగఁ జేసి యిట్లని స్తుతియించె॥
శా॥ ఓ కాకుత్స్థకులేశ యో గుణనిధీ యో దీనమందార నే నీకోపంబున కెంతవాఁడ జడుఁడన్ నీ వేమి ‖భూపుండవే లో
కాధీశుఁడ వాదినాయకుఁడ వీలోకంబు లెల్లప్పుడు న్నీకుక్షిన్ బ్రభవించు నుండు నడఁగు న్నిక్కంబు సర్వాత్మకా॥ క॥ §ధా
తల రజమున దేవవ్రాతము సత్త్వమున భూతరాశి దమమునన్ జాతులుగా నెనరించుదు గాతీతుఁడ వీవు గుణగణాలం
కారా॥ క॥ కట్టుము సేతువు లంకం జుట్టుము నీబాణశిఖల సురవైరితలల్ గొట్టుము నేలం బడఁ జే పట్టుము నీ యబల
నధికభాగ్యప్రబలన్॥ గీ॥ హరికి మామ నగుదు నటమీఁద శ్రీదేవి తండ్రి నార కేల *తాఁగడింపఁ గట్టఁగట్టి దాఁటు కమలాప్త
కులనాథ నీయశోలతలకు నెలవుగాఁగ॥ అని విన్నవించిన రామచంద్రుండు సముద్రునిం బూర్వప్రకారంబున నుండు పొమ్మ
ని వీడుకొల్పె నంత॥ క॥ ఘనశైలంబులు దరువులు ఘనజవమునఁ బెఱికి తెచ్చి కపికులనాథుల్ ఘనజలరాశిం గట్టిరి ‖ఘనవా
హప్రముఖదివిజగణము నుతింపన్॥ వ॥ ఇట్లు సముద్రంబు దాఁటి రామచంద్రుండు రావణు తమ్ముండైన విభీషణుండు శరణం
బు వేఁడిన నభయం బిచ్చి కూడుకొని లంకకుం జని విడిసి ¶వెడ వెట్టించి లగ్గ లుపట్టించిన॥ సీ॥ ప్రాకారములఁ ద్రవ్వి పరిఘల నిం
డించి కోటకొమ్మల నేలఁ గూలఁ ద్రోచి వప్రంబుల గలించి వాకిండ్లఁ బెకలించి తలుపుల విఱిచి యంత్రములఁ ద్రుంచి ఘనవిటం

---

*కలనన్ = యుద్ధమందు. గ్రీవము = కంఠము. ‡ఇలాతనూజన్ = భూపుత్త్రియైన సీతను, హేతి = ఆయుధము. §చరణఘాతచూర్ణగ్రావున్ = పాదతాడనములచేఁ బొడిగాఁ జేయఁబడిన పర్వతములుగల ‖గురునయశాలిన్ = అతివినయసంపదచేత నొప్పుచున్న, శీలిన్ = సత్స్వభావము గల, సేవితశూలిన్ = సేవింపఁబడిన శివుఁడుగల, మాలిన్ = కనకపద్మమాలికగల, దశాస్యమానోన్మాలిన్ = రావణుని గర్వము నడఁగించిన. †అతిచ్ఛలవంతున్ = మహామాయావియైన, ప్రాభవవంతున్ = ప్రభావముగల. *అలవాయిఁ గొనక = అలసట నొందక. మారుతి = ఆంజనేయుఁడు. ‖శైవలినీగణసంబంధిన్ = నదీసమూహమునకు బంధువైన, గంధిన్ = సముద్రమును. ¶అమరాహితదత్తవాలహస్తాగ్నులన్ = అమరాహిత = రాక్షసులచేత, దత్త = అర్పింపఁబడిన, వాలహస్త = తోఁకయందలి, అగ్నులన్ = చిచ్చులచేతను, నిరాతంకన్ = అడ్డులేనిది. ‖భూరివిధరత్నాగారమున్ = అనేకవిధములైన మణులకు స్థానమైన, మీనకుంభీరగ్రాహకఠోరమున్ = మీన = మత్స్యములచేత, కుంభీర = ఏనుఁగును భంతించెడు జలజంతువులచేత, గ్రాహ = తిఁగవలె శరీరముఁ జుట్టుకొని హింసించు మత్స్యములచేత, కఠోరమున్ = కఠినమైనది. అనఁగాఁ జొందనశక్యము గానిది. విపులగంభీరంబున్ = మిగుల లోఁతుగలది, అభ్రభ్రమత్ = ఆకాశమందు తిరుగులాడుచున్న, ఘోర = భయంకరములైన, అన్యోన్య = పరస్పరము, విభిన్న = ఒఱిపిడిగల, భంగ = అలలవలన, భవ = పుట్టిన, నిర్ఘోష = ధ్వనులయొక్క, ఛట = సమూహముగల, అంభఃకణ = జలబిందువులచేత, ప్రారుద్ధ = అడ్డగింపఁబడిన, అంబర = ఆకాశముయొక్క, పారమున్ = కట్టుగలది. అనఁగా బ్రదేశముగలది. పారావారము = సముద్రము. ‖భూపుండవే = రాజపుత్త్రుఁడవా. §ధాతలన్ = బ్రహ్మలను, రజము = రజోగుణము. *తాఁగడింపన్ = ఆలస్యము సేయుట. ‖ఘనవాహప్రముఖదివిజగణము = ఇంద్రుఁడు మొదలగు దేవతాసమూహము. ¶వెడ వెట్టించి = ప్రాఁటు చేసి, లగ్గలు పట్టించిన = కోటమీఁది కెక్కింపఁగా. పరిఘ = అగడ్తలు. కోటకొమ్మలు = కోటబురుజులు. వప్రము = పుట్టకోట. యంత్రములు = కీలుబొమ్మలు మొదలైనవి. విటంకములు = కపోతపాలికలు,

కంబుల ఖండించి గోపురంబుల విచ్చి *వలభుల పాండు చేసి చిమ్మి కరతోరణముల మహిం గూల్చి కేతనంబులం జించి సోపానములం గదల్చి గృహము లెల్ల వ్రచ్చి గృహరాజములం గ్రొచ్చి ధర్మకుంభచయము పాలువైచి కరులు కొలను జొచ్చి కలంచిన కైవడిం గపులు లంకం జొచ్చి కలంచి రప్పుడు॥ వ॥ అంత నయ్యసురేంద్రుండు పంచినం గుంభ నికుంభ ధూమ్రాక్ష విరూపాక్ష సురాంతక నరాంతక దుర్ముఖ ప్రహస్త మహాకాయ ప్రముఖులగు దనుజవీరులు శర శరాసన తోమర గదా ఖడ్గ శూల భిండివాల పరశు పట్టిస ప్రాస ముసలాది సాధనంబులు ధరియించి మాతంగ తురంగ స్యందన సందోహంబుతో బవరంబు సేయ సుగ్రీవ పవనతనయ పనస గజ గవయ గంధమాదన నీలాంగద కుముద జాంబవదాదు లా రక్కసుల నెక్కటికయ్యంబులందుం దరుల గిరుల కరాఘాతంబుల నుక్కడంచి త్రుంచి రంత॥ క॥ ఆయెడ లక్ష్మణుం డుజ్జ్వల। సాయకములం ద్రుంచె శైలసమకాయు సురా। జేయు ననర్గళమాయో। పాయు నన్నయగుణవిధేయు నయ్యతికాయున్॥ గీ॥ రామచంద్రవిభుండు రణమున ఖండించె। మేటికిడిమినీలమేఘవర్ణు। బాహుశక్తిపూర్ణుం బటుసింహనాదసం। పుటితదిగిభకర్ణుం గుంభకర్ణు॥ క॥ *అలవున లక్ష్మణుం డాజి। స్థలి గూల్చె న్మేఘనాదుం జటులాశ్లాఘున్। బలభేదిజయవినోదున్। బలజనితసుపర్వసుభటభావవిషాదున్॥ అంత॥ క॥ తనవారం దఱుగ్రుగ్గిన। ననిమిషపతివైరి పుష్పకారూఢుండై। యనికి నడిచి రామునితో। ఘనరౌద్రముతోడ ※నంపకయ్యము సేసెన్॥ అయ్యవసరంబున॥ క॥ సురపతి పంపున మాతలి। గురుతరమగు దివ్యరథముం గొనివచ్చిన నా। ధరణీవల్లభుం డెక్కెను। ఖరకరుం డుదయాద్రి నెక్కు కైవడిం దోఁపన్॥ ఇట్లు దివ్యరథారూఢుండై రామచంద్రుండు రావణుని కిట్లనియె॥ చ॥ చపలత్వంబున డాగి హేమమృగమున్ సంప్రీతిం బుత్తెంచి తా౯ కపటబ్రాహ్మణమూర్తివై యబలనా కాంతారమధ్యంబున౯ ||నపలాపించుటయో మదీయశితదివ్యామోఘబాణాగ్నిసం। తపనంబే గతి నోర్చువాఁడవు దురంతం బెంతయు న్రావణా॥ క॥ నీచేసిన పాపములకు। నీచాత్మక యముఁడు వలదు నేఁడిట నా నా। రాచములం ద్రుంచివైచెద। ఖేచరభూచరులు గూడి క్రీడన్ జూడన్॥ అని పలికి॥ మ॥ బలువింట ψన్గుణటంకృతంబు నిగుడన్ బ్రహ్మాండభీమంబుగాఁ। బ్రళయోగ్రానలసన్నిభంబగు మహాబాణంబు సంధించి రా। జలలాముండగు రాముఁ డేసె ¶ఖరభాషాశ్రావణున్ దేవతా। బలవిద్రావణు వైరిదారజనగర్భస్రావణున్ రావణున్॥ క॥ దశరథసూనుం డేసిన। విశిఖము హృదయంబు దూఱ వివశుండగుచున్। దశకంధరుండు గూలెను। దశవదనంబులను రక్తధారలు దొరుగన్॥ అంత నా రావణుండు దెగుట విని॥ సీ॥ కొప్పులు బిగివీడి కుసుమమాలికలతో †నంసభాగంబుల నావరింప। సేసముత్యంబులు చెదరంగ గర్ణికలూడంగ నంతహారంబులు గ్రందుకొనంగ। వదనపంకజములు వాడి వాతెఱ లెండఁగ న్నీళ్లవఱదలంగములు దడుప। సన్నపునడుములు జవ్వాఁడ బాలిండ్ల బరువులు నడుములం బ్రబ్బికొనంగ। నెత్తి మోదికొనుచు నెఱిఁబయ్యెదలు జాఱ। నట్టు నిట్టుం దప్పటడుగు లిడుచు। నసురసతులు వచ్చి రటభూతభేతాళ। సదనమునకు ఘోరకదనమునకు॥ వ॥ ఇట్లు వచ్చి తమతమనాథులం గని శోకించి రందు మండోదరి రావణుం జూచి యిట్లనియె॥ ఉ॥ హా దనుజేంద్ర హా సురగణాంతక హా హృదయేశ నిర్జరేం। ద్రాదుల గెల్చి నీవు కుసుమాస్త్రుని కోలల కోర్వలేక ‡సో। న్మాదమునన్ రఘుప్రవరుమానిని నేటికిఁ దెచ్చితప్పుడున్। గాదని చెప్పినన్ వినక గాలవశంబునఁ బొందితక్కటా॥ గీ॥ ఎండఁగాయ వెఱచు ♠నినుఁడు వెన్నెలఁ। గాయ వెఱచు విధుఁడు గాలి వీవ వెఱచు। లంకమీఁద నిట్టి లంకాపురికి మాకు। నధిప విధవభావ మడరె నేఁడు॥ క॥ దురితముఁ దలఁపరు గానరు। జరుగుదు రెటకైన నిమిషసౌఖ్యంబుల కై। పరవనితాసక్తులకును। బరధనరక్తులకు నిహముఁ బరముం గలదే॥ వ॥ అని విలపింప నంత విభీషణుండు రామచంద్రుని పంపు వడసి రావణునకు దహనాదిక్రియలు గావించె నంత రాఘవేంద్రుండు నశోకవనంబున కేగి శింశుపాతరుసమీపంబునందు॥ శా॥ ♣వైతేయప్రమదాపరీత నతిభీతన్ గ్రంధిబంధాలక। వ్రాతన్ నిశ్శ్వసనానిలాశ్రుకణజీవంజీవదారామభూ। జాతన్ శుష్కకపోలకీలితకరాబ్జాతన్ బ్రభూతన్ గృశీ। భూతన్ బ్రాణసమేత సీతం గనియెన్ భూమీశుఁ డాముండటన్॥ వ॥ కని రామచంద్రుండు దాపంబు నొంది భార్యవలన దోషంబు లే

---

*వలభులు। ముంజూరుకలకలు. ధర్మకుంభచయము। బంగరుకుండలగుంపు. అలవు। అనాయాసము. ※అంపకయ్యము। బాణయుద్ధము. ||అపలాపించుట యనఁగా మోసపుచ్చి యెత్తుకొనిపోవడము. ψగుణ। అల్లెత్రాడు, ¶ఖరభాషాశ్రావణున్। కాఠిన్యవచనముల వినువాఁడును, విద్రావణున్। నాశనము జేయుచున్నట్టి, స్రావణున్। స్రవింపఁజేయునట్టి. †అంసభాగములన్। భుజములమీఁద. సేస। పాపట, కర్ణిక। కర్ణాభరణములు. ‡సోన్మాదమునన్। వెఱ్ఱితనము చేత. ♠ఇనుఁడు। సూర్యుఁడు, విధుఁడు। చంద్రుఁడు. ♣వైతేయప్రమదాపరీతన్॥ వైతేయప్రమదా। రక్కసస్త్రీలచేత, పరీతన్। చుట్టఁబడియున్నదియు, గ్రంధిబంధాలకవ్రాతన్॥ గ్రంధి। ముడులుగొన్న, బంధ। పెనుచుకొన్న, అలకవ్రాతన్। ముంగురులుగలదియు, నిశ్వసనానిలాశ్రుకణజీవంజీవదారామభూజాతన్॥ నిశ్వసనానిల। నిట్టూర్పుగాడ్పులతోఁ గూడిన, అశ్రుకణ। కన్నీటిచేత, జీవంజీవత్। మిగుల వృద్ధిఁ బొందింపఁబడిన, ఆరామ। ఉద్యానవనమునందలి, భూజాతన్। వృక్షములు గలదియు, శుష్కకపోలకీలితకరాబ్జాతన్। ఎండిపోయిన చెక్కిళ్లయందుఁ జేర్పఁబడిన హస్తపద్మములు గలదియు, ప్రభూతన్। ప్రసిద్ధురాలైనదియు.

కుంభుటవహ్నివలనం బ్రకటంబుసేసి దేవతలవంపున దేవిం జేకొని॥ ఉ॥ శోషితదానవుండు నృపసోముఁడు రాముఁడు రా
తృసేంద్రతా। శేషవిభూతిఁ గల్పసమజీవికి గమ్మని నిల్పె నర్థిసం।తోషణుఁ బాపశోషణు నదూషణు శశ్వదరోషను క్షమితా।
భాషణు నార్యపోషణుఁ గృపాగుణభూషణు నవ్విభీషణున్॥ వ॥ ఇట్లు విభీషణసంస్థాపనుండై రామచంద్రుండు సీతాలక్ష్మ
ణసమేతుండై సుగ్రీవహనుమదాదులం గూడికొని పుష్పకారూఢుండై వేల్పులు గురియు పువ్వులసోనలం దడియుచుఁ దొల్లి
వచ్చిన జాడలు సీతకు నెఱింగించుచు మఱలి నందిగ్రామంబునకు వచ్చె నయ్యవసరంబున॥ గీ॥ రామచంద్రవిభుని రాక వీనులవి
ని భరతుఁ డుత్సహించి పాదుకలను। మోఁచికొనుచు వచ్చి ముదముతోఁ బురజను।ల్గొల్చుచుండ నన్నకెదురువచ్చె॥ వ॥ వచ్చి
పాదుకలు ముందర నిడికొని యెడనెడ సాష్టాంగదండప్రణామంబులు సేయుచు మెల్లన డాసి రామచంద్రునిపాదంబుల నొ
సలంగ దియించి తచ్చరణరేణువులు మడిచి శిరంబునం జల్లికొని తనివి లేక మఱియు నప్పదకమలంబు *నక్కున మోపికొనుచు
సంతసంబునం గన్నీటం గడిగి సేమంబు లరయుచుండ సీతాలక్ష్మణసహితుండై విభుండును దనకెదురువచ్చిన బ్రాహ్మణ
జనంబులకు నమస్కరించి తక్కిన వారలచేత నమన్నలు వొంది వారల మన్నించె నయ్యవసరంబున॥ చ॥ నృపవర పెక్కునా
ళ్లగొలె నిన్నఁ గనకుండిన యట్టి నేఁడు మా।తపములు పండె నిందఱము ధన్యుల మైతి మటంచుఁ *బుట్టముల్। ల్చపలతఁ ద్రిప్పి పువ్వుల
వసంతము లాడుచుఁ బాడుచున్న త।త్రపులయి యూడుచుం బ్రజలు దద్దయుఁ బండువుఁ జేసి రెల్లెడన్॥ సీ॥ కవగూడి యిటు
దెసఁ గపిరాజు రాక్షసరాజు నొక్కెడఁ జామరములు వీవ। హనుమంతుఁ డతిధవళాతపత్రము వట్టఁ బాదుకల్భరతుండు భక్తి
దేర।శత్రుఘ్నుఁ డమ్ములు చాపంబుఁ గొనిరాఁగ సౌమిత్రి భృత్యుఁడై చనువు సూప।జలపాత్ర చేపట్టి జనకజఁ గూడి రాఁగాం
చనఖడ్గ మంగదుఁడు మోవఁ।బసిఁడిగద్దె పెద్దభల్లూకపతి మోవఁ।గొలువఁ బుష్పకంబు నెలమి నెక్కి।గ్రహములెల్ల వెలయ
గడు నొప్పు సంపూర్ణ।చంద్రు పగిది రామచంద్రుఁ డొప్పె॥ వ॥ ఇట్లు పుష్పకారూఢుండై కపిబలంబులు చేరి కొలువ శ్రీరా
ముండయోధ్యకుం జని యెనంతకమున్న యప్పురంబునందు॥ సీ॥ వీధులు సక్కఁగావించి *శీతోయంబులు సల్లి రంభాస్తంభచ
యము నిలిపి। పట్టుచీరలు చుట్టి బహుతోరణంబులు గలువడంబులు మేలుకట్టు గట్టి।వేదికలలికించి వివిధరత్నంబుల మ్రుగ్గులుప
లుచందములుగఁ బెట్టి।కలయ గోడల రామకథలెల్ల వ్రాయించి ప్రాసాదములు దేవభవనములను। గోపురంబుల బంగారు
కుండ లెత్తి।మొల్లవాకిండ్లఁ గానుకలేర్పరించి।జనులు *శృంగై సేసి తూర్యఘోషములతోడ। నెదురు నడచిరి యూరు రాఘవేం
ద్రుకడకు॥ క॥ సమదగజదానధారల।మసమసలై యున్న పెద్దత్రోవలతోడన్।రమణీయమయ్యె నప్పురి।రమణుఁడు వచ్చి
నగరం గురమణియు బోలెన్॥ గీ॥ రామభూవరేంద్రు రాకఁ దూర్యములతో।రథగజాశ్వసుభటరాజితోడ। నపురేఁ బురము
చంద్రుఁ డరుదేర *ఘూర్ణిల్లు।జంతుభంగమిళితజలధిభంగి॥ వ॥ ఇట్లొప్పుచున్న యప్పురంబు ప్రవేశించి రామచంద్రుండరు
గుచున్న సమయంబున॥ మ॥ ఇతఁడే రామనరేంద్రుఁ డీయబలకా యింద్రారి ఖండించెన। ల్లితఁడే లక్ష్మణుఁ డాతఁడే కపివ
రుండా పొంతవాఁడే మరుత్సుతుఁ డా చెంగట నావిభీషణుఁ డటంచుం జేతులం జూపుచున్। సతులెల్లన్ బరికించి చూచిరి పురీ
సౌధాగ్రభాగంబులన్॥ వ॥ ఇట్లు జనులు చూచుచుండ రామచంద్రుండు రాజమార్గంబునం జనిచని॥ సీ॥ పటికంపు గోడలు పవ
డంపు వాకిండ్లు నీలంపుటరుగులు నెఱయఁ గలిగి।కమనీయవైదూర్యకస్తంభచయముల మకరతోరణముల మహితమగుచుఁ
బడగల మాణిక్యబద్ధచేలంబులఁ జిగురుతోరణములఁ జెలువుమీఱి।పుష్పదామకముల భూరివాసనలను బహుతరధూపదీప
ముల మెఱసి।మారు వేల్పుల భంగి నిమురయుచున్న।సతులుఁ బురుషులు నెప్పుడు సందడింపఁ। గుఱుతులిడరానిధనముల కుప్ప
లున్న।రాజసదనంబునకు వచ్చె రామవిభుఁడు॥ ఇట్లు వచ్చి॥ ఉ॥ తల్లులకెల్ల మ్రొక్కి తమతల్లికి వందన మాచరించి యు।ల్లల్లబు
ధాళికిన్ వినతుఁడై చెలికాండ్రను దమ్ములం బ్రసం।ఫుల్లతఁ గౌఁగిలించుకొని భూవరుఁ డోలి గృపారసంబురం।జిల్లఁగ జాల
మన్ననలు సేసె నమాత్యులఁ బూర్వభృత్యులన్॥ తత్సమయంబున॥ చ॥ కొడుకులఁ బెద్దకోడలును గొబ్బున మ్రొక్కిన నె
త్తిచేతులం।బుడుకుచు మోము నుండలలు భోరన ముద్దులు గొంచు నవ్వులు।న్దొడలకు వారిరాఁ దిగిచి తోఁగఁగఁ జేసిరి నేత్రధా
రలన్। వెడలిన ప్రాణముల్ దగఁ బ్రతిష్ఠములయ్యె నటంచు నబ్బుచున్॥ వ॥ అంత వసిష్ఠుండు శ్రీరామచంద్రుని జటాబంధంబు
విడిపించి, కులవృద్ధులుం దానును, సమంత్రంబుగ దేవేంద్రుని మంగళస్నానంబు సేయించు బృహస్పతిచందంబున సముద్ర

---

*అక్కు।వక్షస్థలము. *పుట్టములు।వస్త్రములు. త్రపులై।లజ్జాహీనులై. *శీతోయము।జలము. రంభాస్తంభచయము। అఁటిచెట్ల
గుంపులను. కలువడంబులు।చిఱుకెక్కులు. మేలుకట్లు।చాందినీలను। వేదిక।తిన్నెలను. ప్రాసాదములు।రాజగృహములు. *శృంగై సేసి।
అలంకరించుకొని, తూర్యఘోషములతోడన్।వాద్యవిశేషములధ్వనులతో. *ఘూర్ణిల్లుజంతుభంగమిళితజలధిభంగిన్।ఘూర్ణిల్లు। శబ్దించు
చున్న. జంతు।మత్స్యాదిజంతువులతోడను, భంగ।అలలతోడను, మిళిత।కూడికొనిన, జలధిభంగిన్।సముద్రమువలె

నదీజలంబులనభిషేకంబు సేయించిన, రఘువరుండును సీతాసమేతుండై, జలంబులాడి, మంచిపుట్టంబులు గట్టికొని, కమ్మనిపువ్వులు ముడిచి, సుగంధంబులలందికొని, తొడవులు దొడిగికొని, తనకు భరతుండు సమర్పించిన రాజసింహాసనంబునం గూర్చుండి, యతని మన్నించి, కౌసల్యకుఁ బ్రియంబు సేయుచు, జగత్పూజ్యంబుగ రాజ్యంబు నేలుచుండె నప్పుడు॥ సీ॥ కలఁగుటెల్లను మానె *గంధులేడింటికి జలనంబు మానె భూచక్రమునకు। జాగరూకత మానె జలజలోచనునకు దీనభావము మానె దిక్పతులకు। మాసియుండుట మానె మార్తాండమండలి కావిరి మానె దిగ్గగనములకు। నుడిగిపోవుట మానె నుర్వీరుహంబులకు గ్రుంగుట మానె ద్రేతాగ్నులకును। గడఁగి వ్రేఁగుట మానె గిరిగిరికిటినాగకమఠములకుఁ బ్రజలకలఁక మానె। రామచంద్రవిభుఁడు రాజేంద్రరత్నంబు। ధరణిభరణరేఖఁ దాల్చునపుడు॥ సీ॥ పొలఁతుల వాలుచూపులయంద చాంచల్యమబలలనడుములయంద లేమి। కాంతాలకములంద ●కౌటిల్యసంచారమతివలనడుపులయంద జడిమ। ముగుదలపరిరంభములయంద పీడనమంగనాకుచములయంద పోరు। పడఁతులరతులంద బంధసంభావంబు సతులఁ బాయుటయంద సంజ్వరంబు। ప్రియులు ప్రియురాండ్రమనములు పెరసితారు। నంటుచౌర్యంబు వల్లభులాత్మసతుల। నాగి క్రొమ్ముళ్లువట్టుటం దాక్రమంబు। రామచంద్రుండు పాలించు రాజ్యమందు॥ క॥ తండ్రిక్రియ రామచంద్రుఁడు। దండ్రులకు ఆపించి ప్రజలఁ దా రక్షింపం। దండ్రులనందఱు మఱచిరి। తండ్రిగదా రామచంద్రధరణిపుఁ డనుచున్॥ వ॥ మఱియు నారామచంద్రుండు రాజర్షిచరితుండును, నిజధర్మనిరతుండును, నేకపత్నీవ్రతుండును, సర్వలోకసమ్మతుండు నగుచు, ధర్మవిరోధంబుగాకుండఁ గోరికలనుభవించుచుఁ, ద్రేతాయుగంబైనం గృతయుగధర్మంబుఁ గాపించుచు, బాలమరణంబు మొదలగు నరిష్టంబులు ప్రజలకుం గలుఁగకుండ రాజ్యంబు సేయుచుండె నయ్యెడ॥ గీ॥ సిగ్గువడుట గల్గి సింగారమును గల్గి। భక్తిగల్గి చాలభయము గలిగి। నయముఁ బ్రియముఁ గల్గి నరనాథుచిత్తంబు। సీత సనువశము సేసికొనియె॥ అని విని పరీక్షిన్నరేంద్రుండిట్లనియె॥ గీ॥ భ్రాతృజనులయందు బంధువులందును। బ్రజలయందు రాజభావమెుండి। యెట్లు మెలఁగె రాముఁ డీశ్వరుండగు నన్నుఁ। గూర్చి క్రతువులెట్లు గోరి చేసె॥ అనిన శుకుండిట్లనియె॥ సీ॥ భగవంతుఁడగు రామభద్రుండు ప్రీతితో దేవోత్తముని సర్వదేవమయునిఁ। దనుఁదానభజించి యధ్వరములు సేసెను §హోతకుఁ బూర్వపునుత్తరంబు। సామగాయకునికి పశ్చిమదిగ్భాగంబు బ్రహ్మకుఁ గ్రమమునఁ బడమరెల్ల। నధ్వర్యునకు శేషమాచార్యునకునిచ్చి సొమ్ములపం విభూషణములకొసంగి। తనము రెండుపుట్టంబులు వనవునైన। మెలఁత మంగళసూత్రంబు మినుకదక్క। నిమ్మునై యుండె నారామ పితరణంబు। పాండవోత్తమ యేమనిపలుకవచ్చు॥ వ॥ అంత నారామచంద్రుని దానశీలత్వంబునకు మెచ్చి విప్రవరులు సమతభూములు అలనిచ్చి యిట్లనిరి॥ గీ॥ ధరణివలము మాకుఁ దపనులకేల? నీ। వఖిలలోకగురుఁడవైన హరివి। మానసంబులందు మాలయు చీఁకటిఁ బాపు। భవదుదారరుచులఁ బార్థివేంద్ర॥ వ॥ అని పలికి ¶బ్రహ్మణ్యదేవుండైన రామచంద్రుని వినయోక్తులం బూజించి మునులు సనిరి; ఇట్లు పెద్దకాలంబు రాజ్యంబు సేసి రాఘవేంద్రుండొకదినంబున॥ సీ॥ వసుధమై బుట్టెడు వార్తలాకర్ణించుకొఱకునై రాముండు గూఢవృత్తి। నసురేయిఁ దిరుగుచో నాగరజనులలో నొకఁడు వనసతి యొప్పకున్న। నెరునింటఁ గాపురంబున్న చంచలురాలిఁ బాయంగ లేకఁ జేపట్టె నేమి। తా వెఱ్ఱియగు రామధరణీశ్వరుండ నే బేలఁ బొమ్మను మాట బిట్టు పలుక। నాలకించి మఱియు నామాటచారుల। వలన జగములోనఁ గలుఁగఁ దెలిసి। సీతనిప్రనోవఁ జెప్పక వాల్మీకిపర్ణశాలఁ బెట్టఁ బనిచె రాత్రి॥ వ॥ అంత సీతయు గర్భిణి గావునఁ గుశలవులను కొడుకులం గనియె వారికి వాల్మీకి జాతకర్మంబులొనరించె. లక్ష్మణునకు నంగదుండును, జంద్రకేతుండును, భరతునకుఁ దక్షుండును బుష్కలుండును, శత్రుఘ్ననకు సుబాహుండును, శ్రుతసేనుండును, సంభవించి రయ్యెడ॥ క॥ బంధురబలుఁడగు భరతుఁడు। గంధర్వచయంబుఁ ద్రుంచి కనకాములన। స్కంధుఁడగు నన్నకిచ్చెను। బంధువులను మాత్యజనులు ప్రజలు సైచ్చన్॥ గీ॥ మధువనంబులోన మధుసుతుండగు లవణుఁ జంపి భుజబలంబు మెఱసి। మధుపురంబు సేసె మధుభాషి శత్రుఘ్నుఁ। డన్నరామచంద్రుఁడౌననంగ॥ వ॥ అంత రామచంద్రుండు గొంతకాలంబునకుఁ దనకొమరులయిన కుశలవులిద్దరును, వాల్మీకివలన వేదాదివిద్యలయందు నేర్పరులై పెక్కుసభలను తానకంబుగా రామకథాశ్లోకంబులు పాడుచు నొక్కనాఁడు రాఘవేంద్రుని యజ్ఞశాలకుం జని॥ మత్తకోకిల॥ వట్టినాకులు పల్లవింపన వారిన్మైమధుధారచా। నుట్టఁ బాడినవారిపాటకు నుర్వరాధిపుఁ డున్ ప్రజల్। బిట్టుపంతసమందిరయ్యెడఁ ద్రేఁగన్నుల బాష్పముల్। ద్రొట్టనొదలలూఁచి వారలతోడి మక్కువ పుట్టఁగాన్॥

*కంధి। సముద్రము. ●కౌటిల్యము। వంకర, ముగుదలపరిరంభములయంద। స్త్రీలయొక్క ఆలింగనములయందే. పెరసి। పొందించి. చౌర్యము। దొంగతనము, వల్లభులు। భర్తలు, ఆత్మసతుల। తమభార్యలను, ఆగి। అడ్డగించి. §హోత। ఋగ్వేదము నెఱిఁగిన ఋత్విజుఁడు, సామగాయకునికి। ఉద్గాతకు, బ్రహ్మకు। ఉపద్రష్టకు, అధ్వర్యునకు। యజుర్వేదము నెఱిఁగిన ఋత్విజుఁడు. ¶బ్రహ్మణ్యదేవుండైన। బ్రహ్మజ్ఞానులచేనారాధింపఁబడినవాఁడైన.

అంత రామచంద్రుండు కుమారులకిట్లనియె॥గీ॥ చిన్నియన్నలార శీతాంశుముఖులార। నళినదళవిశాలనయనులార। మధురభాషులార మహిమీఁద నెవ్వరు। దల్లిదండ్రి మీకు ధన్యులార॥వ॥ అనిన వారలేము వాల్మీకిపౌత్రులము రాఘవేశ్వరు నియాగంబు సూడవచ్చితిమనవుడు మెల్లననగి *యెల్లిప్రొద్దున మీతండ్రి నేఁటింగెదరుండుండని ఋక్షనివాసంబునకు నత్కరించిపనిచె; మును నాఁడు సీతం దోడ్కొని కుశలవులముందటనిడుకొని వాల్మీకి వచ్చి రఘుపుంగవునింగని యనేకప్రకారంబుల స్తుతియించి యిట్లనియె॥గీ॥ సీతముద్దరాలు చిత్తవాక్కర్మంబు। లందుసత్యమూర్తియమలచరిత। పుణ్యసాధ్వి విడువఁబోలదు చేకొను। రవికులాబ్ధిచంద్ర రామచంద్ర॥వ॥ అని వాల్మీకి పలుక రామచంద్రుండు పుత్రార్థియై విచారించఁ గుశలవులను, వాల్మీకికి నొప్పగించి రామచంద్రచరణధ్యానంబు సేయుచు నిరాశయై సీత భూ❀వివరంబు సొచ్చె నయ్యెడ॥మ॥ ముదితా యేటికిఁ గ్రుంకితీవు మనలో మోహంబు చింతింపవే। వదనాంభోజము సూపవే మృదువునీవాక్యంబు విన్పింపవే। తుది నేయెందఁగదం చు నీశ్వరుఁడునై దుఃఖించె భూపాలుఁడా। పదగా నే ప్రియురాలిఁ బాసిన యెడన్ వారింప నెవ్వారికిన్॥వ॥ అని వగచి రామచంద్రుండు బ్రహ్మచర్యంబు ధరియించి పదమూఁడు వేలయేండ్లెడతెగకుండ నగ్నిహోత్రంబులు సెల్లించి తానీశ్వరుండుగావునఁ దన మొదలి నెలవునకుం జనియె నివ్విధంబున॥గీ॥ ఆదిదేవుఁడైన యా రామచంద్రునికబ్ధిగట్టుటెంతయసురకోటిఁ। జంపుటెంత కపులసాహాయ్యమదియెంత। సురలకొఱకుఁ గ్రీడఁ జూపెఁ గాక॥చ॥ వసుఁడుఁగ మ్రొక్కెదన్ లవణవార్ధివిజృంభణతానివర్తికి। న్దశదిగధీశమౌళిమణిదర్పణమండితదివ్యకీర్తికి। న్దశశతభానుమూర్తికి సుధారుచిభాషికి సాధుపోషికి। న్దశరథరాజుపట్టికిని దైత్యపతిం బొరిగొన్న జెట్టికిన్॥ఉ॥ నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు మహా¶శుగంబులు। న్విల్లును దాల్చువాఁడు గడు విప్పగు వక్షమువాఁడు మేలుపైఁ। జల్లెడువాఁడు నిక్కిన భుజంబులవాఁడు యశంబు దిక్కులం। జల్లెడువాఁడునైన రఘుసత్తముఁ డీవుత మాకభీష్టముల్॥గీ॥ రామచంద్రుఁ గూడి రాకలఁ బోకలఁ। గదిసితిరుగువారుఁ గన్నవారు। నంటికొన్నవారు నాకోసలప్రజ। లరిగి రాదియోగులరుగు గతికి॥క॥ మంతనములు సద్గతులకుఁ। బొంతనములు ఘనములైన పుణ్యములకు §దా। నీంతనములు పూర్వాఘని। కృంతనములు రామనామకృతిచింతనముల్॥వ॥ ఆ రామచంద్రునకుఁ గుశుండును, కుశునకు నతిథి, యతిథికి నిషధుండును, నిషధునకు నభుండును, నభునికిఁ బుండరీకుండును, పుండరీకునకు క్షేమధన్వుండును, క్షేమధన్వునకు దేవానీకుండును, దేవానీకునకు నహీనుండును, నహీనునకుఁ బారియాత్రుండును, పారియాత్రునకు బలుండును, బలునకుఁ జలుండును, జలునకు నర్కసంభవుండగు వజ్రనాభుండును, వజ్రనాభునకు శంఖణుండును, శంఖణునకు విధృతియును, విధృతికి హిరణ్యనాభుం, డతండు జైమినిశిష్యుండయి నయాజ్ఞవల్క్యమునివలన నధ్యాత్మయోగంబు నేర్చి హృదయకలుషంబులం బాసి యోగచర్యుండయ్యె, నా హిరణ్యనాభునకుఁ బుష్యుండును, పుష్యునకు ధ్రువసంధియు, ధ్రువసంధికి సుదర్శనుండును, సుదర్శనునకు నగ్నివర్ణుండును, నగ్నివర్ణునకు శీఘ్రుండును, శీఘ్రునకు మరువను రాజశ్రేష్ఠుండు పుట్టె, నా రాజయోగిసిద్ధుండయి, కలాపగ్రామంబుననున్నవాఁడు, కలియుగాంతంబున నష్టంబయ్యెడు సూర్యవంశంబుఁ గ్రమ్మఱం బుట్టింపంగలవాఁడా మరువునకుఁ, బ్రశుశ్రుకుం, డా ప్రశుశ్రునకు సంధియు, నతనికి నమర్షణుం, డా యమర్షణునికి మహస్వంతుం, డా మహస్వంతునకు విశ్వసాహి, విశ్వసాహికి బృహద్బలుండు జనియించె, వాఁడు భారతయుద్ధంబున, మీతండ్రి యగు నభిమన్యుని చేత, హతుండయ్యె వినుము॥గీ॥ పరగ నిక్ష్వాకుఁడును బృహద్బలుఁడు మొద

## ❀ భవిష్యద్రాజేతిహాసవర్ణనము. ❀

లుగ ముదయుగాఁగల రాజులఁ దోడుతోడ। నెఱుఁగఁ జెప్పితినే వారినింక మీఁదఁ। బుట్టఁగలవారిఁ జెప్పెద భూవరేంద్ర॥వ॥ ఆ బృహద్బలునకు బృహద్రణుండును, బృహద్రణునకు నురుక్రియుండు, నాతనికి వత్సప్రీతుండును, వత్సప్రీతునకుఁ బ్రతివ్యోముండును, ప్రతివ్యోమునకు భానుండును, భానునకు సహదేవుండును, సహదేవునకు బృహదశ్వుండును, బృహదశ్వునకు భానుమంతుండును, భానుమంతునకుఁ బ్రతీకాశ్వుండును, ప్రతీకాశ్వునకు సుప్రతీకుండును, సుప్రతీకునకు మేరుదేవుండును, మేరుదేవునకు సునక్షత్రుండును, సునక్షత్రునకు ఋతుకుండును, ఋతుకునకు సుతపుండును, సుతపునకు నమిత్రజిత్తు, నతనికి బృహద్వాజియు, నతనికి బర్హియు, బర్హికి ధనంజయుండును, ధనంజయునకు రణంజయుండు, నతనికి సృంజయుండును, సృంజయునకు శాక్యుండును, శాక్యునకు శుద్ధోదుండును, శుద్ధోదునకు లాంగలుండును, లాంగలునకుఁ బ్రసేనజిత్తు, నతనికి క్షుద్రకుండును, క్షుద్రకునకు ఋణకుండును, ఋణకునకు సురథుండును, సురథునకు సుమిత్రుండును, సుమిత్రుని యనంతరకాలంబున, సూర్యవంశంబు నశింపఁగలదు, వీరలు బృహద్బలుని నుండి క్రమంబునం బుట్టంగలవారలని చెప్పి శుకుండిట్లని

---

* ఎల్లి। రేపు. ❀ వివరము। రంధ్రము. ¶ ఆశుగంబులు। బాణములు. § దానీంతనములు। స్థానభూతములైనవి. పూర్వాఘనికృంతనములు। పూర్వము చేసిన పాపములఁ ఛేదించునట్టివి.

మె॥ సీ॥ ధన్యుఁడా యిక్ష్వాకుతనయుఁడా నిమి యాగమాచరింపఁగఁ గోరి యావసిష్ఠు। నార్త్విజ్యమునకుఁ దా నర్థింపఁగని
యాతఁ డింద్రుని మఖము సేయింపనియ్యె। కొని నాఁడు మతి వత్తుఁ గొదువ లేదని వచ్చి సంసార మెంతయుఁ జంచలంబు। కాల
యాపన మేలఁ గ్రతువు సేసెద ననియన్య ఋత్విక్కులనతఁడుఁ గూర్చి। సేయ నింద్రుని యాగంబు చెల్లఁ జేసి। గురుఁడు చను
దెంచి శిష్యుపై కోపమెత్తి। యోరి నా వచ్చునందాఁక నుండవనుచు। నతని దేహంబు పడుఁ గాత యని శపించె॥ వ॥ ఇట్లు వసిష్ఠుం
డు శపించిన నిమియును వసిష్ఠుని దేహంబు పడుఁగాక యని మఱల శపియింప నవ్వసిష్ఠుండు మిత్రావరుణులవలనఁ గడపటనూ
ర్వశికి జన్మించె. గురుశాపంబున బ్రహ్మజ్ఞానియైన నిమి విగత దేహుండైన నతని దేహంబు మునీశ్వరులు గంధవస్తువులం బొ
దివి దాఁచి దొరఁకొన్న సత్రయాగంబు చెల్లించిరి కడపట దేవగణంబులు మెచ్చి వచ్చిన వారలకు నిమి దేహంబు సూపి బ్ర
తుకం జేయుండనవుడు వారలు నిమి ప్రాణంబు వచ్చుంగాక యని పలికిన నిమి తన దేహంబు సొరనొల్లక యిట్లనియె॥ మ॥ అతి
మోహాకులితంబు సాంద్రనమతాహంకార మూలంబు సం। తత నానా సుఖదుఃఖ పీడితమనిత్యంబిట్టి దేహంబు సం।కృతినా
కేటికి మీన జీవనము భంగిం భీతి బాహుళ్యమం। దితరుల్ పెద్దలు దీనిఁ జేకొనరు సర్వేశున్ మదిం గొల్చెదన్॥ వ॥ అని పలికిన నిమి మా
టలు ద్రొమ్మతింప నేరక శరీరులు గన్నులు దెఱచినప్పుడును మూసినప్పుడును నిమిగా నవచ్చుంగాక యని పల్కి దేవతలు చని
రంత॥ గీ॥ పెద్దలైన మనుజులు పృథివీస్థలికి రాజు। లేమిఁ జూచి నిమి కళేబరంబు। దరువ నొకఁడు పుట్టెఁ దనయుండు వానిని। జన
కుఁడనుచుఁ బలికె జగములెల్ల॥ వ॥ మఱియు నతండు విగత దేహుండు గావున వైదేహుండనియును, మథనజాతుండు గావు
న మిథిలుండనం బరగె, నమ్మిథిలుని చేత, నిర్మితంబయినది గావున, మిథిలానగరంబనాఁ బరగె, నా జనకునకు నుదావసు
డు, నుదావసునకు నందివర్ధనుండును, నందివర్ధనునకు సుకేతుండును, సుకేతువునకు దేవరాతుండును, దేవరాతునకు బృ
హద్రథుండు పుట్టె, నతనికి సుధృతియు, నతనికి ధృష్టకేతుండును, నతనికి హర్యశ్వుండు, నతనికి మరువు, నతనికిఁ బ్రతిం
ధకుండును, నతనికిఁ గృతరయుండు, నతనికి దేవమీఢుండును, నతనికి విధృతుండును, నతనికి మహాధృతియు, నతనికిఁ గీర్తిరా
తుండు, నతనికి మహారోముండును, నతనికి స్వర్ణరోముండును, నతనికి హ్రస్వరోముండును, నతనికి సీరధ్వజుండును బుట్టె॥
గీ॥ అతఁడు మఖము సేయ నవని దున్నింపంగ। లాంగలంబు కొనను లక్షణాంగి। సీత జాతయయ్యె సీరధ్వజుండనఁ। దానఁ జెప్పఁ
బడియె నన్యుఁ డతఁడు॥ వ॥ ఆ సీరధ్వజునకుఁ గుశధ్వజుండును, గుశధ్వజునకు ధర్మధ్వజుండును, ధర్మధ్వజునకు గృతధ్వజ మిత
ధ్వజులను వారిద్దఱు పుట్టిరి, యందుఁ గృతధ్వజునకుఁ గేశిధ్వజుండతండు, దన్నుఁ దా నెఱిఁగెడి విద్యయందు నేర్పరియయ్యె-
మితధ్వజునకు ఖాండిక్యుండను వాఁడు జన్మించి, తండ్రివలన నెఱుక గలవాఁడై, కర్మతత్త్వంబు నేర్చి, కేశధ్వజునివలన భీతుం
డై యేగె, ఖాండిక్యునకు భానుమంతుండును, భానుమంతునకు శతద్యుమ్నుండును, శతద్యుమ్నునికి శుచియు, శుచికి సనద్వా
జుండు, సనద్వాజునకు నూర్ధ్వకేతుండు, నూర్ధ్వకేతునకు నజుండు, నజునకుఁ గురుజిత్తుఁ, గురుజిత్తునకు నరిష్టనేమియు, నరి
ష్టనేమికి శ్రుతాయువు, శ్రుతాయువునకుఁ బార్శ్వుండును, బార్శ్వునకుఁ జిత్రరథుండును, జిత్రరథునకు క్షేమాధియు,
క్షేమాధికి హేమరథుండును, హేమరథునకు సత్యరథుండును, సత్యరథునకు నుపగురుండును, నుపగురునకు నగ్నిదేవు ప్రసా
దంబున నుపగుప్తుండును, నుపగుప్తునకు సావనుండును, సావనునకు సువర్చసుండు, నతఁడె సుభాషణుండనిపించఁబడు, నా
సుభాషణునకు జయుండును, జయునకు విజయుండును, విజయునకు ఋతుండును, ఋతునకు నఘుండు, నఘునకు వీతి
హవ్యుండును, వీతిహవ్యునకు ధృతియు, ధృతికి బహుళాశ్వుండును, బహుళాశ్వునకుఁ గృతియుఁ, గృతికి మహావశియను వాఁ
డు జన్మించె, వీరలు మైథిలురగు రాజులని చెప్పంబడుదురు, యోగీశ్వర ప్రసాదంబున గృహస్థులయి యుండియు, బంధనిర్ము
క్తులై, యాత్మజ్ఞానంబు గలిగి, నిరంతర బ్రహ్మానుసంధానంబు సేయుచునుందురని పలికి, శుకయోగీంద్రుం డిట్లనియె॥

### చంద్రవంశ్యులగు రాజులయితిహాసము.

గీ॥ చంద్రు గారవమునఁ జంద్రవంశమునందుఁ। జంద్రకీర్తులతోడ జనితమైన। యట్టి పుణ్యమతులు నైన రారాజుల। నింక విను
ము మాననేంద్ర చంద్ర॥ సీ॥ ఒక వేయి తలలతో నుండు జగన్నాథు బొడ్డుతమ్మిని బ్రహ్మ పుట్టె మొదల। నతని గుణంబుల నతని
బోలెడువాఁ డత్రియు సంజాతుఁ డయ్యె నత్రి। కడకంటి చూడ్కులఁ గలువల సంగడీఁ డుదయించె విప్రులకోషధులకు। నం
బు గర్భములకును జనిపంపు నాథుఁడై యుండి రాజసూయంబు జేసి। మూఁడులోకములను గెల్చి మోదమునను। జని బృహ
స్పతిసతిఁ దారఁ జారుమూర్తిఁ। దారని లుసొచ్చి గొనిపోయి తన్నుఁ గురుఁడు। వేఁడనం దాఁక నయ్యింతి విడువఁడయ్యె॥ వ॥ అంత
వేల్పులతోఁ రక్కసులకుఁ గయ్యంబయ్యె బృహస్పతితోడి వైరంబున నంజేసి కావ్యుండు రాక్షసులతోఁ జేరికొని చంద్రునిం, దేవ
ట్టసురాచార్యునిం బోఁడోలిన హరుండు భూతగణసమేతుండై యతని గురుపుత్రుండైన బృహస్పతిం జేపట్టె, దేవేంద్రుండు

నసురగణంబులుం దానును బృహస్పతికి నడ్డంబు వచ్చె నయ్యవసరంబున బృహస్పతిభార్యానిమిత్తంబున రణంబు సురాసుర
వినాశకరం బయ్యె నాలోన బృహస్పతితండ్రి యగు నంగిరసుండు సెప్పిన పని బ్రహ్మదేవుండు చంద్రునిం గోపించి గర్భిణియై
న తారను మఱలం జొప్పించినం జూచి బృహస్పతి దాని కిట్లనియె॥ ఉ॥ సిగ్గొకయింత లేక వెలచేడియ భంగి నిధర్మకీర్తులన్। బొగ్గు
లు సేసి జారుశశిఁ బొందితి కటా కడుఁ బేలఁ దెచ్చుకొం। టెగ్గుదలంప గావలదె యిప్పుడు గర్భము డించుకొమ్ము ని।న్నగ్గగ జే
సెదన్ జెనఁటి మానవతుల్ నినుఁ జూచి మెత్తురే॥ వ॥ అని కోపించుచుండ నా చెలువ కుఁబసిండి చాయ మేను గలకుఱ్ఱవుట్టె వా
నిం జూచి మోహంబు చేసి బృహస్పతి దన కొడుక నియును జంద్రుండు దనకన్నవాఁడనియును జగడించి రప్పుడు॥ గీ॥ వారి వా
దుఁ జూచి వారింపఁగా వచ్చి। యేర్పరింప లేక యెల్ల మునులు నసురవరులు నడుగ నా వేడుక లకత్తె। యెఱుఁగుఁగాని యితరు లె
ఱుఁగరసతి॥ ఆ పలుకులు విని సిగ్గుపడి యున్న తారకుఁ జిన్నికొమరుండిట్లనియె॥ క॥ ఇలువరుస చెడఁగ బంధులు। గలవంపఁగ మ
గఁడు ఱోయఁ దల్లి కట్టా వెలి నేల నన్నుఁ గంటివి। కలిగించిన వాఁడు శీతకరుఁడో గురుఁడో॥ వ॥ అని పలుకుచున్న కొడుకు నను మ
ఱు మాటలాడనేఱక యున్న తార నేకాంతంబునం జీరి నంతనంబున బ్రహ్మ యిట్లనియె॥ మ॥ చెలువా నీ యెలసిగ్గువాపి గురుఁ
డో శీతాంశుఁడో యెవ్వఁడీ లలితాకారుఁ గుమారుఁ గన్నయిక నేలా దాఁపనీ పాటు నీ తల నే వుట్టెనె వెచ్చనూర్పు కుమార్కాం
తల్గా మిన్నుల్గా రె మా। టలనిం దేమి యుఁబోము బోయెరులతో డం జెప్పి విన్నింపవే॥ వ॥ అని పలికిన బ్రహ్మకు నెనుఁ బు మాటాడవె
ఱవి యంతనంబున నయ్యంగన చంద్రునికిం గన్నదాన ననవుడా బాలకునకు బుధుండను పేరువెట్టి చంద్రునికిచ్చి బ్రహ్మ సని
యెనంత॥ గీ॥ బుద్ధి గుంటుఁడైన బుధుఁడు పుత్రుండైన। మేనుఁబెంచి రాజు మిన్నుముట్టె। బుద్ధిగలసుతుండు పుట్టినచోఁ దండ్రి।
మిన్నుముట్టి కేల మిన్నకుండు॥ వ॥ ఆ బుధునకుఁ దొల్లి చెప్పిన యిళాకన్యకవలనఁ బురూరవుండు పుట్టె-నా పురూరవునకుఁ గ
ల శౌర్యసౌందర్యగాంభీర్యాదిగుణంబులు నారదునివలన నింద్రసభలోన నూర్వశి విని, మిత్రావరుణశాపంబున మనుష్య
స్త్రీరూపంబు దాల్చి భూలోకంబునకు వచ్చి ముందర నిలువంబడి॥ తరల॥ సరసిజాక్షుమృగేంద్రమధ్యు విశాలవక్షు మహా
భుజున్ సుచిరాననచంద్రమండలశోభితున్ సుకుమారు నా। పురుషవర్యుఁ బురూరవుం గని పువ్వుటంపఱజోము చే। దొఱుఁ
గు క్రొవ్విరితూపుల న్మదిఁ గూలఁబోవఁగ భ్రాంతయై॥ యూర్వశి నిలిచియున్నంత॥ ఉ॥ భావజు కోలయో మెఱుఁగు లావసివె
లుంగు మెఱుంగు మోహినీ। దేవతయో నభోరమయొ దినికరగ్రహణంబు లేనిచో। జీవనమేటికిం చుపురుచేఁ జిగురాకడిం
మ్ము జిమ్ములం। దావతకెన్ పురూరవుఁడు దామరపాకుజలంబుకై పడిన్॥ వ॥ ఇట్లు రాచపట్టి చెలువవింటివాని దాడికి నోడి
యెట్టకేలకు సైరణసేసి నిలుకడం దెచ్చికొని యచ్చెలువ కిట్లనియె॥ ఉ॥ ఎక్కడనుండి రాక మనకెవ్వరికిందగు నీకుఁ దక్కిన్।
మ్రుక్కడి వచ్చెనో యబరు ముల్లులవాఁడఁడిదంబుఁ ద్రిప్పనే। దిక్కనెఱుంగనే యబల దేహము దేహముఁ గేలుఁగేలనీ। చెక్కు
నఁ జెక్కు వోపితగు చెయ్యులనన్ను విపన్నుఁ గావవే॥ అనినం బ్రోడచేడియయిట్లనియె॥ మ॥ ఇవి నా కూర్పుతగల్గు రెండు ద
గనీ వెల్లప్పుడుం గాఁచెదే। సివివస్త్రుండవుగాక నాకడను దానీవుండు దేనిన్నివే। శుగుణాలంకృత నీకు నాముతము నిక్కంబు
య్యె నే నిన్మనో। జవినోదంబుల నిన్నుఁ దేల్తునగునే చంద్రాన్వయగ్రామణీ॥ అని పలికిన వేల్పులవెలయాలి ప్రతిమాటల
కియ్యకొని తనమనంబున॥ క॥ సంచిదఁటరూపుసంతతి। నంచితయా దేవగణికయటమరుచేత। న్సంచలితచిత్తుసనుఁగా। మిం
చినపటయంతకంటె మేలుంగలదే॥ అని నిశ్చయించికొని॥ గీ॥ రాజు రాజముఖిని రతిఁ దేల్చెఁ బంగారు। మేడలందుఁ దరులనీడ
లందుఁ। దోఁటలందు రత్నకూటంబులందును। గొలఁకులందు గిరుల కొలఁకులందు॥ వ॥ అంత నయ్యుద్దఱ సుందరులంబు నెలకొ
ని॥ క॥ ఒకవలని కేగుమగువా। రొకచోటనకాని నిలిచియుండరు దమలో। నొకటియె మానమున నెంచుదు। రొక నిమిషము ప్రా
యకుం బురువిదయు ఱేఁడున్॥ క॥ దయ్యమెఱుంగు న్వారల। నెయ్యంబులు మక్కువలును నిజగరితనము। లివ్వయ్యముగలచో
సందడిఁ। బయ్యేదకొంగడ్డమైనఁ బ్రాణము వెడలున్॥ వ॥ ఇట్లూర్వశియుం బురూరవుండును నెంతోరుపులవలన మక్కువలు చె
క్కులొత్తంబగల్గు రేలు నెల్లెడల విహరింప నొక్కనాఁడు దేవలోకంబున దేవేంద్రుండు గొలువుండుతఱిఁ గొలువున నూ
ర్వశి లేకుండుటం జూచి॥ క॥ ఇన్నిదినంబులు దగమన। మున్న సభామధ్యవేదియూర్వశి లేమి। న్విన్నదనంబున నున్నది। వన్నె
దఱిగియున్న పసిఁడివడుపున ననుచున్॥ వ॥ ఇంద్రుండు గంధర్వులం బనిచిన వారు నడురేయుం జనిచీఁకటి నూర్వశి పెంచుచు
న్న * యేడకంబులం బట్టినవి రెండును మొఱవెట్టుడు వాని మొఱవిని రతిఖిన్నుండై మేను మఱచికూఁకుచున్న పురూరవు
కౌఁగిటనుండియూర్వశి యిట్లనియె॥ మ॥ అదె నా బిడ్డలఁ బట్టి దొంగలు మహాహంకారులై కొంచునున్మదులై పోయెదరడ్డ
పాటునను సామర్థ్యంబున స్త్రీనుఁడై। కదలం డేమగపందకూరుకుగతిం గన్మూసి గుఱ్ఱుపెట్టుచు। న్వదలం జాలఁడు నాదు కౌఁగి
లియుఁ దావంధ్యాస్తుఁడై చెల్లరే॥ క॥ పగతులు దొంగలరేపఁగ। మగఁటిమి వాటింపలేక మగతనమెల్లన్। మగువల కౌఁగిటఁ జూ

* విదళంబులఁ। పొశంసను.

పెడు। సుగవాఁడగుకతమున వెదుకఁదుమగువగుటొప్పఁగ॥ గీ॥ అధముఁడైనవానికాలగుకంటెన। వ్యాధితునింటఁదాసియగుట
మేలు। హీనుఁబొందిదోనిహింసింపఁగా నేల। యువతిజనులకూరపుంటలెన్న॥ క॥ పటికినీ రాచఱికము। బోఁటులుమొఱవె
ట్టఁబసుపుభోగనియతులు। న్వేఁటలనీడ్చెడిదొంగలు। గీటడఁపవు వెడలి శవముక్రియనుండెదిదే॥ క॥ విని యువిన పురణభీరువు।
మనుజాధముని మరపోఁతుమంమనినకటా। నినుఁజక్రవర్తిఁజేసిన। వనజాసనుకంటె వెఱ్ఱివాఁడు సుగలఁడే॥ వ॥ అధికమెక్క-
భంగులనయ్యింతిపరుషోక్తులను కరవాలమ్ములు చెవులఁజొనుప నారాజశేఖరుండంకుశంబుపోట్లనడఁగు మదగజంబుచం
దంబున మఱలిదిగంబరుండై వాలు కేలనంకించి నడురేయిదొంగలనఱికి వైచి మేషంబులవిడిపించుకొని తిరిగివచ్చునెడ॥
గీ॥ చీఱలేనిమగనిఁజెలువదానీక్షించి। కన్నుమొఱఁగిపోవఁగాల్లురాక। వెఱ్ఱివానిభంగి వివశుఁడై పడిలేచి। పొగిలి తెఅలి ప్ర
క్కి పొక్కి పడియె॥ వ॥ మఱియుఁ బురూరవుండు మదనాతురుండై వెదకుచు సరస్వతీనదీతీరంబునఁ జెలికత్తెలతోఁగూడియు
న్నయూర్వశిం గనివికసితముఖకమలుండై యిట్లనియె॥ మ॥ తనుమధ్యా యిదియేల పచ్చితకటా ధర్మంబె శర్మంబె మన్మన
లోనుంకువలాడికొన్నపలుకుల్మర్యాదలుండప్పెనే। నిను నేఁజూసినయంతనుండి తనువున్నేలంబడం జాతెన। ద్దినునుగ్రం
పువ్పుగాలిచినిఁగరుణాదృష్టిన్విలోకింపవే॥ అనిన నూర్వశియిట్లనియె॥ క॥ సుగుణవలకునింత లాఁగెడు। మగవాఁడవె నీవుప
శువుమాడ్కి-న్వగవం। డగవేమానుషపశువును। వృగములుగని లోయుఁగాక మేలని దిను నే॥ అదియునుంగాక॥ మ॥ తలఁపు
ల్చిచ్చులుమాటలుజ్వలసుధాధారల్విభుండైనపు। వ్విలుతున్మెచ్చరుయన్యులందలఁతురేవిశ్వాసముల్లేమప్రా।రులపొత్తు
న్బతినైనఁజంపుమర ధర్మల్నిర్దయుల్వంచలు। ల్వెలయాండ్రెక్కడవారి వేడబములా వేదాంతసూక్తంబులే॥ ఉ॥ ఇంకొ
క యేఁడువోయిన నరేశ్వర యవ్వలిరేయి నీవు నా। లంకెకువచ్చియాత్మజులలక్షణవంతులఁగాంచెదేమియు। శ్శంకకపొ
మ్మునీవనుఁడుగొమ్మనుగర్భిణిగాఁదలంచుచు। శ్శంకయొకింతలేక నృపసత్తముఁడట్లనపోయెవీటికిన్॥ వ॥ ఇట్లు మఱలిచనిత
నపురంబున నొక్క యేఁడుండి పిదప నూర్వశికడకేగి యొక్కరేయి పురూరవుండయ్యింతికడనున్న నావెలందియు గంధర్వ
వరుల వేఁడికొనుము తన్నిచ్చెదరనవుడు నతండు గంధర్వవరులం బ్రార్థించిన వారలతండు పొగడుటకు మెచ్చి *యగ్నిస్థాలి
నిచ్చిన నయ్యగ్నిస్థాలిని నూర్వశిం గాఁదలంచుచు దానితో నడవిం దిరుగుచుండి యొక్కనాఁడగ్నిస్థాలియని యెఱింగి వనం
బునందిగవిడిచి యింటికిఁజనుదెంచి నిత్యంబు రాత్రి దానిని ధ్యానించుచుండె। త్రేతాయుగంబు సొచ్చిన నారాజుచిత్తంబు
నఁ గర్మబోధంబులై వేదంబులు మూఁడుమార్గంబులై తోఁచిన నాభూవరుండు స్థాలికడకుం జనియందు శమీగర్భజాతం
బైనయశ్వత్థంబుఁ జూచి యశ్వత్థంబుచేత నరణులు రెండు గావించి ముందటి యరణియఁదానును వెనుకటి యరణియూర్వ
శియును రెంటి నడుమనున్న కాష్ఠంబు పుత్రుండనియును, మంత్రంబు చెప్పుచుం ద్రచ్చుచుండ జాతవేదుండ నసగ్ని సంభవిం
చెనతఁడు విహితారాధనసంస్కారంబునం జేసి యాహవనీయాదిరూపియై నెగడి పురూరవుని పుత్రుండని కల్పింపంబడియె
నాయగ్ని పురూరవునిఁ బుణ్యలోకంబునకుం బనుపంగారణంబగుటం జేసి॥ క॥ ఆయగ్నిచేఁ బురూరవుఁ। డాయజ్ఞేశ్వరున
నంతు హరి వేదమయున్। శ్రీయుతుఁ గూర్చి యజించెను। నాయుతుఁడూర్వశిఁ గనంగ నరిగెడుకోర్కిన్॥ ఉ॥ ఒక్కటి వహ్ని
వేల్వఁ బురుషోత్తముఁడొక్కఁడు వహ్ని నాజ్ఞయం। బొక్కటి వేదమాత్ర ప్రణవ మొక్కటి వర్ణము తొల్లి త్రేతయం। దొక్క
టి చూచి మూఁడుగను తోరము గానొనరించె బుద్ధిచేఁ। జక్కన నాపురూరవుఁడశక్తులకున్సులభంబు లెల్లగన్॥ వ॥ ఇట్లు వేద
విభాగంబు గల్పించి యాగంబు సేసి పురూరవుండూర్వశియున్న గంధర్వలోకంబునకుం జనియె-నతనికి నూర్వశిగర్భంబున
నాయువు, శ్రుతాయువు, సత్యాయువు, రయుండును, జయుండును, విజయుండన, నార్గురు పుత్రులు గలిగిరందు, శ్రుతాయు
వునకు వసుమంతుండును, సత్యాయువునకు శ్రుతంజయుండును, రయునకు శ్రుతుండును, నేకుండన నిరువురు గలిగిరి. జయు
నకు నమితుండు, విజయునకు భీముండు జనించి, రా భీమునకుఁ గాంచనుండును, గాంచనునకు హోత్రుండును, హోత్రు
నకు గంగాప్రవాహంబు పుక్కిటం బెట్టిన జహ్నుండు, జహ్నునకుఁ బూరుండుఁ, బూరునకు బాలకుండు, బాలకునకు నజ
కుండు, నజకునకు కుశుండు, కుశునకుఁ గుశాంబుండు, ధూర్తయుండు, వసువు, కుశనాభుండన, నలువురు సంభవించిరందుఁ గు
శాంబునికి గాధియనువాఁడు గలిగె-నా గాధి రాజ్యంబు సేయుచుండ॥ సీ॥ సత్యవతిని గాధిజాతను కన్యను విప్రుఁడు ఋచి
కుండు వేఁడికొనిన। గాధి యుసుతకీడుగాఁడని తెల్లనినవకంపు మేనులు నల్లచెవులు। గలుగుతురగములు వేయి కన్యకు నీవుంకువి
చ్చినఁగూఁతురనిత్తునన్న। వసుధామరుండును వరుణునికడకేగి హయముల దెచ్చినఁ గూఁతునాతఁడిచ్చె। నామహాత్మసతియు
నంతటఁ గొడుకులఁ। గోరియమ్మగనిఁ యుక్తో నియతుండు విప్రరాజమంత్రవితతుల వేల్పించి। చెరువు చేసి గ్రుంకఁ జనియె నదికి॥
వ॥ అమ్మ్యోడం దల్లి యడిగిన సత్యవతి బ్రహ్మమంత్రంబుల వేల్పించిన *చరువుఁ దల్లికిచ్చి క్షాత్రమంత్రంబులం దల్లికి వేల్పించి

* అగ్నిస్థాలి। అగ్నిపాత్ర. * చరువు। హోమయోగ్యాన్నము.

నిభంగి నవయవంబులం జెక్కుచు, నంతటం దనివినక విలయకాలకీలికేళి నిమంటలు మియుచు, విఖ్యాతదోస్త్రైదంబిడుగులపో
లు గురియుచును బలుమొగుల్లవడువున నప్రమాణంబులగు బాణంబులం బఱపి సుభటసైన్యంబులకు దైన్యంబు లిచ్చుచు, గడ్డం
బులేనియాకర్ణాంటంబులుగల బాణవర్షఘృతంబులచేఁ గోపానలంబున కాహుతులు సేయుచుఁ దురంగంబుల నిరంగంబులఁ
గావించుచు, రథంబులు వితథంబులుగా నొనర్చుచు, ద్విరదంబులను రదంబులపైఁబడఁ ద్రోయుచు నివ్విధంబున సేనల నంత
వానలముం జిరూపుమాపిన॥ క॥ మత్తిల్లి భూతజాలము। చిత్తంబులఁ జొక్కి వేడ్కఁ జిందులు వాఱన్। నొత్తిల్లి సమిత్తలమున।
నెత్తురు మేదంబు పలలనికరంబయ్యెన్॥ అయ్యవసరంబున॥ క॥ నేలీ బ్రాహ్మణుఁ డొక్కఁడు। నేలంబడఁ గూల్చె సైన్యనిచయ
ము నెల్లన్। బ్యాలార్ప నేల యీతనిఁ। నూలించెదఁ గాక నాదు దోర్బలము వడిన్॥ అని పలికి॥ ఉ॥ ఒకయేనూటకరంబులన్ ధను
వులత్యుల్లాసిన్నై తాల్చి వే। లొకయేనూట గుణధ్వనుల్ చెలఁగ నైదు శతోగ్రాస్త్రముల్ గూర్చి వి। ప్రకుఠారంబును విన్ననై ల్తున
ను మన్నించి పుంఖానుపుం। ఖకఠోరంబుగ నేసియార్చె రయరేఖోద్దాముని రామునిన్॥ క॥ వడిఁ దూపు లెగయఁ గుఠారులు।
వడి కార్ముకపంచశతము వఱఁగ విభుఁడు సొం। పడరెం బరివేషమండలి। నడుమ కరద్యుతుల వెలయు నలినాప్తక్రియన్॥ ఇట్ల
ర్జునుండు బహువిలాసంబులు సూపిన॥ మ॥ ధరణీదేవుఁడు రాముఁ డాఢ్యుఁడు జగద్ధానుష్కరత్నంబునుం। ష్కరచాపంబొ
క టెక్కువెట్టి శరముల్ సంధించి పెల్లేసి భూ। వరుకోదండములొక్క చూడ్కి దునిమెన్ వాఁ డంతటం బోక వే। తరువుల్ బు
వ్వఁగు ధారధారనటికేఁ దద్బాహుసందోహముల్॥ క॥ కరములు దునిసిన నతనికి। శిర మొక్కటి చిక్కె శైలశిఖరము భం
గిఁ। బరశువున నదియుఁ ద్రుంచెను। బరసూదనుఁడైన ఘనుఁడు భార్గవుఁడు వడిన్॥ గీ॥ తండ్రి వడిన నతని తనయులు పదివేలు।
దలఁగిపోయి రతనిఁ దాఁక లేక। పరభయంకరుండు భార్గవుం డంతనా। గోవుఁ గ్రేపుఁ దోడఁ గొనుచుఁ జనియె॥ వ॥ ఇట్లు హోమా
మధేనువును లేఁగ దెచ్చి యిచ్చి తనపరాక్రమంబు దండ్రికిం దోఁబుట్టువులకుం దెలియం జెప్పిన జమదగ్ని రామున కిట్లనియె॥
క॥ కలవేల్పు లెల్లఁ దమతమ। చెలువంబులు దెచ్చి రాజుఁ జేయుదు రకటా। బలువేల్పు రాజు వానిం। జలమున నిట్లేల పోయి చంపి
తి పుత్రా॥ క॥ తాలిమి మనకును ధర్మము। తాలిమి మూలంబు మనకు ధన్యత్వమునం। దాలిమి గలదని యీశుం। డేలించును బ్ర
హ్మపదము నెల్ల న్మనలన్॥ క॥ క్షమగలిగిన సిరి గలుగును। క్షమగలిగిన వాణి గలుగు సౌఖ్యము లెల్లన్। క్షమగలుగ ముక్తి గలు
గును। క్షమగలిగిన మెచ్చు శౌరి సదయుఁడు తండ్రీ॥ క॥ పట్టపు రాజును జంపుట। కట్టలుక న్విప్రుఁ జంపుకంటెను బాపం। బట్టిట్ట
నకు మునీవీ। చెట్టసెడన్ దీర్ఘసేవ సేయుము తనయా॥ క॥ అని తన్నుఁ దండ్రి పంచినఁ। బనిపూని ప్రసాదమనుచు భార్గవుఁ డుర
యంబున నొకయేఁడు ప్రయాణము। చని తీర్థము లెల్ల నాడి చనుదెంచె నృపా॥ ఉ॥ ఆమెడ నొక్కనాఁడు సలిలార్థము రేణుక
గంగలోనికిం। బోయి ప్రవాహమధ్యమునఁ బొల్పుగ నచ్చరలేమ పిండుతోఁ। దోయవిహారముల్ సలుపు దుర్లభుఁ జిత్రరథు
న్సరోజమాలాయుతుఁ జూచుచుం డెఁ బతియాజ్ఞ దలంపక కొంత ప్రేమతోన్॥ వ॥ ఇట్లు గంధర్వవల్లభునిం జూచు కారణంబు
నం దడసి॥ ఉ॥ అక్కట వచ్చి పెద్దతడవయ్యెడి హోమము వేళ దప్పె నే। నిక్కట నేల యుండితి మునీశ్వరుఁ డేమను నోయి
టంచుఁ దాఁ। గ్రక్కునఁ దోయకుంభము శిరస్థలమందిడి తెచ్చి యిచ్చి వే। మ్రొక్కి కరంబు మోడ్చి పతిముందట నల్లన నిల్వఁ
జూచుచున్॥ అప్పుడు॥ క॥ చిత్తమున భార్య దడసిన। వృత్తాంతం బెఱిఁగి తపసి వేగన సుతులన్। మత్తం దీనిం జావఁగ। మొత్తుం డ
న మొత్తరై రిమునుఁగుచు వారల్॥ క॥ కడుకొని పెండ్లముఁ జంపని। కొడుకులఁ బెండ్లాముఁ జరిపగురుఁ డొసఁగినఁ దా। నడుగు
లకు నెఱిఁగి రాముం। డడుగిడకుండం గ్రుంచె నన్నలఁ దల్లిన్॥ శా॥ తల్లిన్ భ్రాతల నెల్లఁ జంపుమనుచోఁ దా జంపరాకున్నఁ
బెం। పెల్లం బోవ శపించుఁ దండ్రి తన పెంపే చేయుచు న్మెచ్చి వా। తల్లి న్భ్రాతల నిచ్చు నిక్కము తపోధన్యాత్ముఁ డంచు వేఁ
దల్లి న్భ్రాతల జంపె భార్గవుఁడు వేఁడాఁ జంపఁ జెయ్యాడునే॥ ఇవ్విధంబున. క॥ అడ్డము సెప్పక కడపటి। బిడ్డఁడు రాముఁడు సు
తులఁ బెండ్లమును చట। న్నొడ్డంటం దెగనడిచిన। జడ్డనఁ దలయూఁచి మెచ్చి జమదగ్ని యనిన్॥ క॥ మెచ్చిన తండ్రిని గనుఁగొని।
చచ్చిరనీ పడినవారి జీవంబులు నీ। విచ్చితి ననుమని మ్రొక్కిన। నిచ్చె న్వారలును లేచి రెప్పటిభంగిన్॥ గీ॥ పడినవారి మఱల బ్ర
తికింప నోపును। జనకుఁ డనుచుఁ జంపెఁ జామదగ్న్యి। యతఁడు సంపెననుచు నన్నలఁ దల్లిని। జనకు నాజ్ఞ మైనఁ జంపవగదు.
సీ॥ పరశురామునికోడి పరుగులు వెట్టిన యర్జునపుత్రకులాత్మయందుఁ। దండ్రి ప్రస్తుటకు సంతప్తులై పొగలుచు నింతటనం
వేట నెదురుచేచి। లివిరియాడుచు నొక్కదివసమున్ దా రాముఁ డడవి కన్నలతోడ నరుగుపిదపఁ। బగఁదీర్పఁ దటియని పరతెంచి
హోమాలయంబున సత్త్వేశు నాత్మ నిలిపి। నిరుపమధ్యానసుఖవృత్తి నిలిచియున్న। పుణ్యు జమదగ్ని నందఱు పొదివి పట్టి। క
దలకుండం గదలఁ దెంచికొని చనిరి। యుద్ధమే తెంచి రేణుక యడలికొనఁగ॥ మ॥ జనకుం జంపిన వైరమున్ దలఁచి రాజన్యా
ప్యజాతుల్ నిద్దురుమాఁ జనకుం జంపిరి హా మహా కర్ములు లన్యాసిం తురష్మంటున। మ్మునిపై వ్రాలె లతాంగి మోదికొనుచున్ మూర్ఛయ్యే

దుమాఱు ద్రుంచియం। బునరాముండరుదెంచి యెన్నికొననాపూర్ణ్వాపవక్రాంతుఁడై॥ వ॥ ఇట్లప్పుడు దల్లి మొఱవిని జమదగ్నికు
మారులు వచ్చియిట్లని విలపించిరి॥ క॥ వాకిలి వెడలవు కొడుకులు। రాకుండఁగ నట్టి నీవు రాజసుతుల చేఁ। జీకాకు నొందిపోవఁగ। నీ
కాల్లెల్లా డెఁదండ్రి నిర్జరపురికిన్॥ అని విలపించుచున్న యన్నలఁ జూచి రాముండిట్లనియె॥ ఉ॥ ఏపున నేలదండ్రి తను వేము
అకుండుఁడు దోడులార నే। జూడుఁడు నేఁడటం చుఁబరశుమ్యలిఘీముఁడు రాముఁ డుగ్రుఁడై। యోడక నర్జునాత్మజులనా
ప్పుపురంబున కేఁగి చొచ్చి కో। డాడక పట్టి చంపె వడి నర్జునజ్ఞాతుల బ్రహ్మఘాతులన్॥ క॥ ఖండించి రిపుల శిరములు। గొండలు
గాఁ బ్రోగులిడి మెఱుఁగు రక్తనదు। ల్నిండి కొని పాసి యుబ్బెను। భండనమున నృపులు రిపులు భయమందిన్ నృపా॥ మఱియు నం
తటఁ బోక॥ గీ॥ అయ్యపగకు రాముఁడలయక రాజుల। నిరువదొక్కమారు నరసి చంపె। జగతిమీఁద రాజశబ్దంబు లేకుండ। నూ
ఱుదీర్ప లేని సుతుఁడు సుతుఁడే॥ వ॥ మఱియు నా రాముండు శమంతపంచకంబున రాజరక్తంబులం దొమ్మిది మడుగులు గా
వించి తండ్రి శిరంబు దెచ్చి శరీరంబుతో సంధించి సర్వదేవమయుండగు దేవుండు తాన కావునఁ దన్నును ద్దేశించి యాగంబు
సేసి హోతకుం దూర్పును, బ్రహ్మకు దక్షిణభాగంబును, నున్నవారలకవాంతరదిశలును, నుపద్రష్టయైన కశ్యపునకు నా
ర్యావర్తంబును, మధ్యభూమియు, సదస్యులకుం దగినయెడలం గలయ నిచ్చి బ్రహ్మనదియైన సరస్వతియం దవభృథస్నానం
బు సేసి కల్మషంబులం బాసి మేఘవిముక్తుండైన సూర్యుండునుం బోలె నొప్పుచుండె నంత॥ క॥ ఆ ప్రొద్దగు పుత్రు వలనను।
బ్రాప్తతనుండగుచుఁ దపము బలిమిని మింటన్। సప్తర్షిమండలంబున। సప్తముఁడై వెలుఁగుచుండె జమదగ్ని నృపా॥ క॥ ఆ జమ
దగ్నితనూజుఁడు। రాజీవాక్షుండు రాముఁ డత్యధికుండై। యోజను వేదజ్ఞులలో। రాజిల్లెడు మీఁద మనువు రానవ్వేళన్॥
గీ॥ శాంతచిత్తుఁడగుచు సంగవిముక్తుఁడై। భవ్యుఁడై మహేంద్రపర్వతమున। నున్నవాఁడు రాముఁడోజతో గంధర్వ। సిద్ధవ
రులు నుతులు సేయుచుండ॥ క॥ భగవంతుఁడు హరి యీక్రియ। భృగుకులమునఁ బుట్టి యెల్ల పృథివీపతులన్। జగతీభారము వా
యఁగఁ। బగఁగొని పలుమాఱుఁ జంపెఁ బవరమున నృపా॥ వ॥ అంత గాధికి నగ్నితేజుండగు విశ్వామిత్రుండు జన్మించి తపోబలం
బున రాజధర్మంబును మాని బ్రహ్మర్షియై యేకశతసంఖ్యాగణితులగు కొడుకులం గనియె నయ్యెడ భృగుకులజాతుండయిన
యజగర్తుని కొడుకు శునశ్శేఫుండు దల్లిదండ్రుల చేత హరిశ్చంద్రుని యాగపశుత్వంబునకు నమ్ముడువడి బ్రహ్మాదిదేవతల వి
నుతిసేయుచు మెప్పించి పితృదేవతల చేత బంధవిముక్తుండయిన వానియందుఁ గృపగలిగి విశ్వామిత్రుండు పుత్రులకిట్లనియె॥
క॥ కన్నులఁ గంటిని మీనిని। మన్ననకొమరుండు నాకు మున్కావ మీతో। నన్న నన్నయనుచు నతని। న్మన్నింపుండని నఁ జూచి మదసం
యుతులై॥ క॥ ఇతఁడన్నఁట వో మాకును। గృతకృత్యులమైతిమనుచు గేలి యొనర్పు। న్సుతులన్ మ్లేచ్ఛులు గండని। ధృతిలేక శ
పించెఁ దపసి తిరుగుడు వడఁగన్॥ వ॥ అయ్యెడ నతని శాపంబునకు వెఱచి మధ్యముండయిన మధుచ్ఛంధుండేబండ్రు దమ్ములుం
దానును, నమస్కరించి తండ్రీ నీ చెప్పిన క్రమంబున శునశ్శేఫుండు మాకన్నయని నమస్కరింపంగల వారము నవుడు సంతసిం
చి మంత్రదర్శియైన శునశ్శేఫుని వారలయందుఁ బెద్దఁ జేసి మధుచ్ఛందునకిట్లనియె॥ గీ॥ పాడి సెడక వీఁడు నేఁడు మీకతమునఁ।
గొడుకు గలిగె నేఁడు కొడుకులార। కొడుకులార మీరు గొడుకులఁగనుఁడింకఁ। బ్రీతితోడ దేవరాతుఁగూడి॥ వ॥ అని పలికె నట్లు
శునశ్శేఫుండు దేవతల చేత విడివడుటం జేసి దేవరాతుండయ్యె మధుచ్ఛందుండు మొదలయిన యేబండ్రును, దేవరాతునకుఁ
దమ్ములైరి పెద్దలయిన యష్టకహారీతజయక్రతుమద్వాదులేబండ్రును, వేఱఁజనిరి క్రమంబున విశ్వామిత్రు కొడుకులు రెండు
విధంబులయి నంద్రవరాంతరంబు గలిగె నని చెప్పి శుకుండిట్లనియె నాపురూరవు కొడుకగు నాయువునకు నహుషుండును, క్ష
త్రవృద్ధుండును, రజియును, రంభుండు నేనస్సనను వారు పుట్టిరందు క్షత్రవృద్ధునకు కుమారుండగు సుహోత్రునకుఁ గా
శ్యుండు కుశుఁడు కృత్స్నమదుఁడను ముగ్గురు గలిగి రా కృత్స్నమదునకు శునకుండును, శునకునకు శౌనకుండును నన్నమహాత్ముండు
బహ్వృచప్రవరుండై జన్మించి తపోనియతుండై చనియెఁ గాశ్యునకుఁ గాశియుఁ, గాశికి సురాష్ట్రుండును, సురాష్ట్రునకు దీ
ర్ఘతముండు జనియించె॥ క॥ ఆదీర్ఘతమునికధిపుఁడు। శ్రీదైత్యాంశమునఁ బుట్టె సేవ్యుండాయు। ర్వేదజ్ఞుఁడు ధన్వంతరి। ఖేదం
బులువాయు నతని కీర్తన సేయన్॥ వ॥ వాసుదేవాంశసంభూతుండగు నా ధన్వంతరి యజ్ఞభాగంబున కర్హుండు తనికిఁ గేతు
మంతుండుఁ గేతుమంతునకు భీమరథుం డతనికి దివోదాసుండనం బఱగు ద్యుమంతుండు దయించె నాద్యుమంతునకుఁ బ్రతర్ద
నుండు జన్మించె నా ప్రతర్దనుండు శత్రుజిత్తనియు, ఋతధ్వజుండనియుం జెప్పంబడె నతనికిఁ గువలయాశ్వుండు సంభవిం
చె॥ గీ॥ వసుమతీశ విను కువలయాశ్వభూభర్త। లలితపుణ్యఘనునలర్కఁగనియె। నాతఁడే లె నేల నఱువదియాఱు వే। లేం
డ్లు వానిభంగి నేలె నెవ్వఁడు॥ వ॥ అయ్యలర్కునకు సన్నతియు, నతనికి సునీతుండు నతనికి ధర్మకేతువు నతనికి సత్యకేతువు నాత
నికి ధృష్టకేతువు నా ధృష్టకేతువునకు సుకుమారుండును, సుకుమారునకు వీతిహోత్రుండును, వీతిహోత్రునకు భర్గుం

డుసుభర్గునకు భార్గభూమియొజ్జనియించె॥ గీ॥ వాఁడుతుదయోఁగాఁగ వసుమతీశులుఁడాది। యైనవారుగాశ్యపనఁగ నెగడె। రవ
నిమీఁదవారలా క్షత్రవృద్ధుని। వంశజాతులగుచు వంశవర్య॥ వ॥ మఱియుక్షత్రవృద్ధునికి రెండవకొడుకగుకుశునికిఁ బ్రతియు
ను, వానికిసంజయుండు, సంజయునికిజయుండు, జయునికిఁగృతుండు, కృతునికిహర్యద్వనుండు, హర్యద్వనునకుసహదేవుండు
నుసహదేవునికిభీముండు, భీమునకుజయత్సేనుండు, జయత్సేనునకుసంకృతియు, సంకృతికిజయుండు, జయునికిక్షత్రధర్ముండు
పుట్టె- వీరలుక్షత్రధర్మునివంశంబునంగలరాజులు రంభునికిరభసుండు రభసునికిగంభీరుండు గంభీరునికిఁగృతుండు కృతునికి
బ్రహ్మకులంబుపుట్టెనయ్యనేనునికిశుద్ధుండు శుద్ధునకుశుచిశుచికిరజస్సుపుట్టెనతనికిఁ ద్రికకుత్తుజనించెనతనికిశాంతవిజ్ఞా
నవంతుండయినకృతకృత్యుండుపుట్టెవిరక్తుండై చనియె॥ సీ॥ రజియనువానికిరాజేంద్ర యేనూఱుకొడుకులుగలిగిరి ఘోర
బలులు। వేల్పులెల్లనువచ్చి వేఁడిననారజి దైత్యులఁ జెక్కాడి ధరణిఁగూల్చి। నాకంబుదేవేంద్రునకునిచ్చె నిచ్చినరజికాళ్ల
కెరఁగిసురప్రభుండు। వెండియునతనికివిబుధగేహమునిచ్చి సంతోషబుద్ధినర్చనమొనర్చె। యంతనారజిమృతుఁడైననతని
పుత్త్రులమరవిభుఁడు దమ్మునడిగికొనిన। నీకయింద్రలోకమేలిరియాగభాగములుపుచ్చికొనిరిగర్వమంది॥ క॥ వేలుపుల
ఱేఁడుగురుచే। వేలిమిఁదప్పించిబలిమి వెలయఁగనిజదంభోళిని రజిసుతులను నిర్మూలముఁగావించిస్వర్గముంగైకొనియెన్॥
వ॥ అదియట్లుండె నహుషునకుయతియు, యయాతియు, సంయాతియు, నాయాతియు, వియతియుఁ, గృతియుననఁ నార్గురు
కొడుకులుదేహికినింద్రియంబులచందంబునసంభవించిరందుఁ బెద్దకొడుకగుయతికిరాజ్యంబిచ్చిననతండు విరక్తుండై॥
క॥ రాజ్యంబుపాపమూలము। రాజ్యముతో నెడలెఱుంగరాదుసుమతియున్। రాజ్యమునఁ బూజ్యునెఱుఁగడు। రాజ్యముగీ
జ్యంబుముక్తిరతులకిదేలా॥ అనిపలికివాఁడు రాజ్యంబునకుంబాసిచనియె॥ క॥ ఆనహుషుఁడుమఖశతమును। మానుగఁగా
వించియింద్రమానినిఁగలియం। బూనిమునీంద్రులుమోఁచిన। యానముపైనుండికూలెనహియై నేలన్॥ ఉ॥ అన్నయుఁదం
డ్రియుంజనయయాతిమహీపతియైచతుర్దిశ।ల్పన్నుగఁగావఁ దమ్ములకుఁ బాలిడిశుక్రునికూతురన్ సుసం। పన్నగుణాభిరా
మవృషపర్వునికూఁతురనోలినాంద్రుఁగా। సన్నయశాలియాధరణిచక్రధురంధరుఁడయ్యెఁ జేర్మితోన్॥ అనినవినిపరీక్షిన్న
రేంద్రుండిట్లనియె॥ గీ॥ పార్థివుఁడుయయాతి బ్రహ్మర్షి భార్గవుఁ। డల్లుఁడగుటమామయగుటయెట్లు। రాజురాచకూఁతురతిసే
యఁదగుఁగాక। విప్రకన్యనొందవిహితమగునె॥ అనినశుకుండిట్లనియె॥ సీ॥ దనుజేంద్రుకూఁతురుతరళాక్షిశర్మిష్ఠపురము
లోనొకనాఁడుప్రొద్దువోక। వేలసంఖ్యలచెలుల్వెంటరాఁ గురుసుతయగు దేవయానితో నాటమఱఁగి। పూఁచినయలతోఁ
టపొంతజొంపముగన్నక్రొమ్మావిచేరువకొలఁకుఁ జేరి। యందుఁదమ్ములతేనెలానిచొక్కుచుమ్రోయునలరుఝంకృతులకు
సవరిపడుచు। వలువలూడ్చికొలఁకువడిఁజొచ్చితమలోనఁ। జెల్లుఱేఁగినీటఁ జల్లులాడ। నందినెక్కిమాలినిందురోచులుపర్వ।
శూలివచ్చెకొండచూలితోడ॥ చ॥ మలహరుఁజూచిసిగ్గువడిమానినులందఱుసంభ్రమంబునన్। వలువలుగట్టుచోఁ దనుజవల్ల
భుకూఁతురుదేవయానిమువ్వలువధరించి వేగమునవచ్చినఁజూచియెఱింగెఱఁగినా। వలువిదియేలఁగట్టికొనివచ్చెనుదాన
వియంచుఁదెప్పుచున్॥ దేవయానియిట్లనియె॥ శా॥ ఆలోకేశుముఖంబులంగలిగె బ్రహ్మణ్యంబు బ్రహ్మంబునా। మేలై వైది
కమార్గముదెలుపుచున్నిన్నందియందున్మహా। శీలుర్భార్గవులందునొప్పెడుసుధీసేవ్యుండు నేవానికిన్। జాలన్నావలువె
ట్లుగట్టితివిరక్షోజాతివై చేటికా॥ క॥ మహిపవతులైనయాసుర। మహిళలవిత్తంబులు పెఱమగువలకగునే। మహిఁబసిఁడి
గొలుసులిడిన। న్విహితములేకుక్కలకుహవిర్భాగంబుల్॥ క॥ మీతండ్రిమాకుశిష్యుఁడు। మాతండ్రిగురుండుగొంతమా
త్రంబయినం। బ్రీతుంగావింపకపరి। భూతులఁజేయుదువెఱుఁగువపోడిమిచెనఁటీ॥ వ॥ అనిభర్జించుచున్న దేవయానిపలుకులు
వినికరాళించి మ్రోగుచున్నభుజంగిపగిదినిట్టూర్పులునిగుడించి పెదవులుగొఱుకుచుశర్మిష్ఠయిట్లనియె॥ శా॥ భిక్షుండైత
మతండ్రిమాజనకునిన్ భిక్షించియుండంగఁ। రక్షింపందుదినింతమైనుఱపుతో రాజప్రమత్తాకృతిన్। రక్షోరాజతనూజ
తోసుగుణతోనాక్షేపముంజేసెదే। కుక్షిస్ఫోటముగాఁగదీనిఁజెలులీకూపంబునంద్రోవరే॥ అనిపలికి॥ గీ॥ బోఁటిపిండుచే
తఁబాదువంగబట్టించి। రాజసమునదైత్యరాజతనయ। తొడరిదేవయానిఁద్రోపించెవలువీక। నూకినూఁతిలోనఁగుది

——⟹ శుక్రాచార్యులతనూజయగు దేవయానయయాతినివరియించుట. ⟸——

లకొనఁగ॥ వ॥ ఇట్లుసేసిశర్మిష్ఠవోయినవెనుక యయాతిభూపాలుండు వేఁటమార్గంబుననడవిందిరుగుచు దైవయోగంబు
ననాదేవయానియున్ననూయిచేరంజనుదెంచెనందు॥ క॥ బంధువులనెల్లఁజీఱుచు। నంధజలాంధమగ్నమధ్యమైవగచుచుదు।
ర్బంధమునఁజిక్కిపీడా। సింధువునమునింగియున్నచేడియఁగనియెన్॥ కనుంగొని॥ శా॥ సప్తాంభోనిధిమేఖలావృతమహా
ర్వంశపాకన్యకా। ప్రాప్తోద్యద్వరదక్షదక్షిణకరప్రాలంబముంజేసిప్రో। క్షిప్తంజేసెయయాతిగట్టికొనఁబై చేలంబును

వేలిమి। హోమము.    చేటికా। దాసి.

స్నిగ్ధస్మితకు వ్యాప్తస్వేదజలాంగి వారిసముదాయాలంకృతకు భార్గవికిన్॥ ఇట్లు నూయి వెడలించిన రాజునకు రాజవదన యిట్ల నియె॥ మ॥ ననుఁ బాణిగ్రహణంబు సంగతిగదా నాభర్తవు నీవదై। వనితాయోగంబిది దప్పదప్పుడుమతా వాక్యంబు సిద్ధంబు సౌ॥ ఖ్యనివాసున్ నిను మాని యొండువరునిం గాంక్షింప నేనోర్తునే। వనజంబానెడి తేఁటి యన్యకుసుమావాసంబపేక్షించునే॥ అదియునుం గాక॥ సీ॥ సుగుణాఢ్య విను నేను శుక్రునికూఁతుర దేవయానినిఁ దొల్లి దేవమంత్రి। తనయుండు గచుఁడు మా తండ్రి చేఁ దొల్లి సంజీవనిఁ దానభ్యసించు వేళ। నతనిఁ గామించిన నతఁడొల్లననవుడు నతఁడు నేర్చిన విద్య యడఁగిపోవ। నతని శపించిన నతఁడు నాభర్త బ్రాహ్మణుఁడు గాకుండెడునని శపించె। నదినిమిత్తంబు నాకు బ్రాహ్మణుఁడు గాఁడు। ప్రాణనాథుఁడవీవని పడఁతి వలుకఁ। దనమహృదయంబు నెలఁత పైఁ దగులువడినఁ। దమకమొకయింతయును లేక దలఁచి చూచి॥ మత్తకోకిల॥ దైవయుక్తము గాక విప్రసుత న్వరించునె నామనం। బే విధంబున నీశ్వరాజ్ఞను నట్టిదంచు వరించెధా। శ్రీవరుండను దేవయానిని ధీరబుద్ధులకున్న మో। భావమొక్కటియుం బ్రమాణము భావ్యభావపరీక్షకున్॥ వ॥ ఇట్లు వివరించి యయాతి చనిన వెనుక దేవయాని శుక్రునికడకుం జని శర్మిష్ఠ సేసిన వృత్తాంతంబంతయుం జెప్పి కన్నీరు మున్నీరుగా వగచిన॥ క॥ క్రూరాత్ములమందిరములఁ। బౌరోహిత్యంబుకంటె పాపంబీ సం। సారమునకంటె శిలల్దిని। యారక కాపోతవృత్తియుండుట యొప్పున్॥ వ॥ అని వృషపర్వుకడ నుండుట నిందించుచు శుక్రుండా కూఁతు రిం దోడ్కొని పురంబు వెడలి చనన య్యసురవల్లభుండెఱింగి శుక్రునిం బ్రార్థింపం దలంచి తెరువునకడ్డంబు వచ్చి పాదంబుల పైఁ బడి ప్రసన్నుం జేసిన నాకోపంబు మాని శుక్రుండు శిష్యునకిట్లనియె॥ తరల॥ చెలులు వేవురుఁ దాను నీసుత చేటికై వడి నాసుతం। గొలుచుచుండను దీటుఁ గోపము గొల్వఁ బెట్టెద వేనిని। వెలఁదిఁ దోడ్కొని వత్తు నావుడు వేగ రమ్మని భార్గవిం। గొలువఁ బెట్టె సురారివర్యుఁడు కూఁతు నెచ్చెలి పిండుతోన్॥ మ॥ చలమింకేలని తన్నుఁ దండ్రి వనూపన్న శర్మిష్ఠ సన్నిస్థతో। జలజాతాస్యలు సద్వయస్యలు సహస్రంబున్న జస్రంబుడ। న్మెలఁగఁ దాసియుఁ దాసియత్త్యె విధా మేయోగ్రకోపానలా। కలితగ్లానికి దేవయానికి మహాగర్వోద్యమస్థానికిన్॥ అంత॥ ఉ॥ ఆతతమైన వేడ్కఁ దనుజాధిపమంత్రి సురారినందనన్। పేతతనూభవం బిలిచి పెండ్లి యొనర్చె మహావిభూతిఁ గం। ప్రీతిమహాగ్రజాతికి నఖీతికి సాధువినీతికిన్ సిత। ఖ్యాతికి భిన్నదుఃఖబహుకార్యభియాతికి నయ్యయాతికిన్॥ వ॥ ఇట్లు యయాతికి దేవయానినిచ్చి శుక్రుండు శర్మిష్ఠాసంగమంబు సేయకుమని నియమించి చనియెఁ బిదప నద్దేవయాని యయ్యయాతివలన యదుదుర్వసులను కుమారులం గనియె నొక్కరేయిఁ జెలంగు మానిన యెడ శర్మిష్ఠ యడరులే దియేకాంతంబున యయాతి కడకుం జని చెలుకువింటి జోదుపువ్వుటంపర కోర్హాటించి తనతలంపు సెప్పిన॥ ఉ॥ ఆజవరాలిఁ జూచి మనమాపఁగలేక తనూభ

## శుక్రాచార్యులు యయాతికి శాపంబొసంగుట.

వార్తుఁడై। యాజనభర్తమున్ను గనియాడిన మాటఁ దలంచి మైనఁజే। తోజసుఖంబులం దని పెఁద్రోవఁగవచ్చునె దైవయోగముల్। రాజట సద్రహస్యమఁట రాజకుమారి నిమాన నేర్చునే॥ వ॥ ఇట్లు యయాతివలన శర్మిష్ఠ గర్భంబయి నంగ్రమంబున ద్రుహ్యుండు, ననువును, పూరువు, ననువారిం గాంచె నంత దేవయాని తద్వృత్తాంతంబంతయు నెఱింగి కోపించి శుక్రుకడకుం జని క్రోధమూర్ఛితయై యున్నపమయంబున యయాతి వెంటం జని యిట్లనియె॥ గీ॥ మామ కేల సెప్పమాను సరోజాక్షి। దనుజతనయఁ బొందితప్పవడితిఁ। గామినైననన్నుఁ గరుణింపు పతిమాట। దండ్రి మాటకంటెఁ దగును నీకు॥ అనిపలికి పాదంబుల కెఱఁగిన నయ్యింతి యొడంబడకుండె నంత నెఱింగి శుక్రుండిట్లనియె॥ క॥ నామాటఁ ద్రోచి మానవ। భామను బొందితివి ధరణిపాలక తగవే। యేమాటయేది రూపము। కామినిలోలులకు నెచటఁ గలవే నిజముల్॥ అనిపలికి నీవు వనితాజనహేయంబయిన ముదిమిం బొందెదవని శపియించిన యయాతి యిట్లనియె॥ క॥ మామా నాపైఁ గోపము। మామా నీపుత్రియందు మానవు నాకుం। గామోపభోగవాంఛలు। ప్రేమం గారమియించి ముదిమిఁ బిదపం దాల్తున్॥ వ॥ అనిపలికి యనుజ్ఞం గొని దేవయానిం దోడ్కొని పురంబునకుం జని పెద్దకొడుక గుయదువుం బిలిచి యయాతి యిట్లనియె॥ శా॥ నీ తల్లిం గని నట్టి శుక్రువలన న్నేఁడీ జరం బొందితి। న్నా తండ్రీ యదునామధేయ తనయా నా వృద్ధతం దాల్పవే। నీ తారుణ్యము నాకునిమ్ము తనివోవిందారఁ గొన్నాళ్లు నేఁ। జేతోజాతసుఖంబులందితిగెదన్ శృంగారినై పుత్రకా॥ అనిన విని తండ్రికి యదుండిట్లనియె॥ శా॥ కాంతాహేయము మర్త్యకారము దురాకందూతి మిశ్రంబు హృ। చ్చింతామూలము పీనసజ్వరము ప్రస్వేదప్రణాకంపన। శ్రాంతిస్ఫోటకయుక్తమీ ముదిమివాఁ ఛందాల్పి నానాసుఖో। పాత్తంబైన వయోనిధానమిది యయ్యా తేరయావచ్చునే॥ వ॥ అని యదుండు నొడంబడమి నయ్యయాతి దుర్వసుద్రుహ్యుల నడిగిన వారును యదునందు పలికిన ట్లపలికిన ననుగోట్టు కుమారుండైన పూరువునకిట్లనియె॥ ఉ॥ పిన్నవుగాని నీవు కడు పెద్దవు బుద్ధులయందు నమ్ము నా। యన్న యదాజ్ఞ గాంచలుగ

దన్న వినీతుఁడవన్న నీవు వీ। యన్నలు సెప్పినట్లు పరిహారము సెప్పకుమన్న నాజరల్। మన్ననదాల్చి నీతరుణిమంబొనగూ
ర్పుము నాకుఁ బుత్ర కా॥ అనిన విని గురుభక్తిగుణాధారుండై నపూరుండిట్లనియె॥ శా॥ అయ్యా నన్నిటు వేఁడనేల భవదీయా
జ్ఞాసముల్లంఘనం। బయ్యుండంబరిహారము న్నొండువ నేననాయి నేనీజర। న్నెయ్యంబొప్పఁగఁ దాల్చి నాతరుణాతన్నీకి
చ్చెదన్ బంపినన్। గయ్యంబాడెడి పుత్రకుండు గ్రిమిసంకాశుండు గాకుండునే॥ అదియుమంగాక॥ క॥ మునివృత్తిజయ్యా
నేటికి జనపాలక సుగతిం గోరు సత్పురుషులకుం। దనుఁగన్న తండ్రి సెప్పిన। పని చేసిన సుగతి గొంగుపసిఁడియ కాదే॥ క॥ వినుఁ
పకఁ జేయుమరధికులు। పని చిన మధ్యములు పొందుపరతురుతంత్రుల్। పని చెప్పి కోరి పనిచిన। ననిశము మహాధముపుత్రుల
ధములు తండ్రీ॥ వ॥ అనిపలికి పూరుండు ముదిమిచేకొని తన లేఁత ప్రాయంబు యయాతికిచ్చె నయ్యయాతియుం దరుణుం
డై॥ శా॥ ఏడుద్వీపములేదువాడలుగ సర్వోలాతలంబెల్ల బెల్। వీఁడైలోనుగ నేలుచుం బ్రజలనర్చెఁషించి రక్షించుచున్।
దోడంభార్గవి రామనోజసుఖసంతోషంబులం జేలుచుం। గ్రీడించెన్నియతేంద్రియుండగుచు నాక్రీడావిశేషంబులన్॥
క॥ మర్మంబులనతిసాధ్వీ। ధర్మంబుల దేవయాని దనప్రాణేశు। న్నర్మములమనోవాక్కుల। కర్మంబులనొండు లేకఁగడు మె
ప్పించెన్॥ శా॥ ఆకాశంబున మేఘబృందము ఘనంబై సన్నమై దీర్ఘమై। యేకంబై బహురూపమైయడఁగునట్లే దేవుగర్భం
బులో। లోకశ్రేణిజనించుచున్మెలఁగుచున్లోపించు నాదేవుసు। శ్రీకాంతున్ హరిఁ గూర్చి యాగములు సేసె న్నాహుషుం
డిమ్ములన్॥ మత్తేభము॥ మ॥ చెలికాండ్రన్గరులన్రథమ్ముల భటశ్రేణిం దురంగంబులన్। గలలోఁ గన్న ధనావళిన్సమమనం
గాఁ జూచుచున్ భార్యతోఁ। బలు వేలేండ్లు మనోజభోగలహరీపర్యాప్తుఁడై తేలియున్। బలుతృష్ణంగడఁగానకెంతయు మ
హాబంధంబులన్ స్రుక్కుచున్॥ వ॥ ఒక్కదినంబున నాత్మజ్ఞానంబునం జేసి కాంతానిమిత్తంబున మోసపోవుట నెఱింగియ
యాతి యతివిషాదంబు నొంది దేవయానికి నిట్లనియె॥ క॥ మనచారిత్రము వంటిది। వినుమితిహాసంబు గలదు వృద్ధజనంబు। ల్మ

✽ యయాతి దేవయానికి బస్తోపాఖ్యానమను వ్యాజంబున స్వవృత్తాంతంబుఁ దెలుపుట. ✽

నులు నుతింతురు నీవును। మనమున నంగీకరింపు మంజులవాణీ॥ అది యెట్టిదనిన॥ సీ॥ అజమొకండు వనంబునం దేగుచును గర్మఫ
లమున నూతిలోపలికిజారి। లోడిగి ఛాగి నాలోకించి కామియై కొమ్మునదరిఁ గొంత గ్రాలద్రోఁచి। వెడలింప నచ్ఛాగివిభునిఁ
గాఁ గోరిన నగుఁగాక యని తానునదియుఁ దిటుఁగ। నెన్నిమేనియుఁదన్ను నెంతఁగామించిన నన్నిటికిని భర్తయై దనర్చి। వా
నినే ప్రొద్దరతులను వశలఁ జేసి। సౌరది క్రీడించి క్రీడించి సొక్కి సొక్కి। కాముఁడనియెడి మున్సహగ్రహము కతనఁ। జిత్తమే
నుఁజివత్తిల్లి చెల్లఁజిక్కె॥ క॥ వెడవిలుతు కేళిఁ జిగురా। కడిదవు వేఁటునకు లోంగియతిమోహితుఁడై। పిడువకసతులం దగిలె
డు। జడునకునెక్కడిపి బుద్ధిచాతుర్యంబుల్॥ వ॥ అంతనచ్ఛాగంబు దనపిదపం దగిలిన ఛాగీనివహంబులోపలం జూడనొప్పెడి
ఛాగియందుఁ దగిలి క్రీడింపంగని ననూఁతిలోపలంబడి వెలువడిన ఛాగితనపతివలని నెయ్యంబు లేకుండుట కువిన్నయై తనమనం
బున॥ క॥ పలికిన పలుకులు వలుకఁడు। కలఁచున్న వకాంతఁ జూచి కడునంచలుఁడై। నిలిచినచోట న్నిలువఁడు। నిలువెల్ల నుగల్లకా
మినిజమతిఁ గలఁడే॥ వ॥ అనిపలికి విడిచిన నయ్యజవల్లభుండు సురతపరతంత్రుండై మిసిమిసియను శబ్దంబు సేయుచు నచ్ఛాగి
వెంటంజని యొడంబరపంజాలకుండె నంతదానికిఁ గర్తయైన బ్రాహ్మణుండు రోషంబున రతిసమర్థంబు గాకుండ నల్లాడుచు
న్న ఛాగవృషణంబు డించి వేసిన నచ్ఛాగంబు గ్రిందఁబడి వేడుకొనిన ప్రయోజనంబు వొడగని యోగవిదుండు గావున బ్రా
హ్మణోత్తముండు గ్రమ్మఱ నయ్యజవృషణంబులు సంధించిన॥ క॥ వృషణములు గలిగిన। సుషముండై ఛాగివిభుఁడు సుంద
రితోడ। న్విషయసుఖంబులఁ బొందుచుఁ। దృషతుదిఁ గనఁడయ్యెఁ బెక్కుదివసములయ్యున్॥ అని యివ్విధంబున యయాతి దే
వయానికి నిజవృత్తాంతంబు కథారూపంబున నెఱింగించి యిట్లనియె॥ మ॥ అబలా నీనిబిడాతిదుర్జయసలజ్జాపాంగభల్లంబు
లం। బ్రబలంబై నమనంబు భగ్నము గనా ప్రావీణ్యముం గోలుపో। యిబలిష్ఠుండగు కాము బారిఁబడి నే నెట్లోర్చెదన్ బందికా
త్తైబడిం బాపపుతృష్ణ యుప్పతకటాదీర్ఘాకృతిన్నొప్పెడిన్॥ క॥ అదలను ప్రాణములదలినఁ। గదలదు సర్వాంగకములు గదలు
చునుండన్। వదలదు బిగువులు వదలినఁ। ముదిలేదీతృష్ణ దీనిఁ ద్రుంపఁగవలయున్॥ క॥ వెయ్యేండ్లనుండి నీతోఁ। గ్రయ్యంబడి
యున్నవాఁడఁ గామసుఖములం। గ్రుయ్యాదొకయించుకైనను। దయ్యదుకొనలిడియొందృష్ణ తవతవతోడన్॥ క॥ ముదిసెను
దంతావళియును। ముదిసెను కేశములు దనువు ముదిసెం దనకున్। ముదియనివి రెండు నిక్కము। బ్రతికెడి తీపియును విషయప
తుస్పృహయున్॥ క॥ కడలేదాశాలతకును। గడఁ జూడఁగఁ గానరాదు కడఁగని రేని। న్గడుముదమున సంసారము। కడఁగందురు
తత్త్వవిదులు గమలదళాక్షీ॥ క॥ ముండనమాటజటాభవ వేదండాశ్వవధూనుకూలధాన్యాదులు పెక్కుండియు నాశాపాశము।
నిండింపఁగ లేవు జగతి నిజమిది పద్మాక్షీ॥ శా॥ మోహభోగసుఖములు। వేమాఱును బురుషుఁడనుభవించుచునున్నం। గామంబు

శాంతిఁబొందదు।ధూమధ్వజుఁడాజ్యవృష్టిఁ ద్రుంగుమవదునే॥ గీ॥ అక్కఁదల్లిచెల్లెలాత్మజలెక్కఁ।బోను పెక్కఁజదువు ప
ద్మనయన।పరమయోగికైనఁబలిమివినింద్రియ।గ్రామమధికపీడఁగలుగఁజేయు॥క॥వెంగలివిత్తయితిరుగక ।నంగజుభీల
లసముక్తినాశించునతం।డంగనలతోడఁబడువని।సంగడములువదలవలయుజలజాతముఖీ॥వ॥ అదియునుంగాక నేఁడు మొ
దలువృష్టాఖండనంబుఁజేసినిర్విషయుండనై యహంకారంబువిడిచిమృగంబులంగలసివనంబునసంచరించెద పరబ్రహ్మం
బునందుఁజిత్తంబుచేర్చెదబ్రహ్మనిష్ఠమనుష్యులకునాశానివారణయగుటంజేసియేనుండఁదత్పరుండనై యాహారనిద్రా
దియోగంబులంబరిహరించెదనాత్మవిదుండనై సంసారనాశంబుఁదలంచినవాఁడెవిద్వాంసుండనితలంచిపలికిపూరునియౌ
వనంబిచ్చిముదిమితానకైకొనివిగతలోభుండై నిజభుజశక్తిపాలితంబగుభూమండలంబువిభాగించి ద్రుహ్యునకుఁ బూ
ర్వభాగంబును,యదువునకుదక్షిణభాగంబును,తుర్వసునకుఁబశ్చిమదిగ్భాగంబును,అనువునకునుత్తరదిగ్భాగంబును, సం
రక్షింపుండనియిచ్చివారలసమక్షంబున॥క॥నాలుగుచెఱఁగులనేలయుఁ।బాలింపుండనుచునగ్రభవులకుఁబంచెక।భూ
లోకమేలుమనుచును। బాలారోఁ దారుఁబూరుఁబట్టముగట్టెక॥వ॥ఇట్లుపూరునికిరాజ్యంబిచ్చి పెక్కువర్షంబులందున
నుభూతంబులైనయింద్రియసుఖంబులువిసర్జించి।క॥మిక్కిలివిజ్ఞానంబునఁ। జక్కఁగవిడివిడిచివైరిషడ్వర్గంబుక। ఱె
క్కలువచ్చినవిహగము। గ్రక్కునఁ నీడంబువిడుచు కరణినుదితుఁడై ॥ క ॥ కారుణికోత్తముఁడగుహరి। గారుణ్య
ముకతననతఁడుఘనుఁడై గెలిచెం। క్రూరములగువిషయంబుల।నూరక గెలువంగశక్తుఁడొక్కఁడుగలఁడే॥వ॥మఱియు
నిర్మూలితసంగుండై సత్త్వరజస్తమోగుణంబుల దిగనాడినిర్మలంబయినవాసుదేవాభిధానబ్రహ్మంబునందుయయా
తిభూపాలుండు స్వసిద్ధమైన భాగవతగతింజెందెనంత॥ సీ॥ ప్రాణేశుఁడాడినపలుకులునగవులుగాఁజూడకంతరంగ
మునవిలిపి। పథికులైపోవుచుఁబానీయశాలలఁ జల్లఁగానుండెడి జనులనెల్ల। సంసారమునఁగర్మసంబంధులైవచ్చు
యాలుబిడ్డలునుగండనుచుఁగూడి। యుండుటగానిసంయోగంబునిత్యంబుగాదీశమాయాప్రకల్పితంబు।దీనివిడుచుట
తగవనితెగువమెఱసి।నిద్రసాలించిమేల్కన్ననెలవుచాలఁ।గలిగిభార్గవిసర్వసంగములవిడిచి। హరిపరాధీనయైముక్తిక
రిగెనధిప॥వ॥అనియిట్లుయయాతిచరితంబుచెప్పిభగవంతుండును,సర్వభూతనివాసుండును,శాంతుండును, వేదమయుం
డునైనవాసుదేవునికినమస్కరించెదననిశుకుండిట్లనియె॥క॥భారతనీవుజనించిన। పూరునివంశంబునందుబుట్టినవారిక।
జారుయశోలంకారుల।ధీరులవినిపింతునధికతేజోధనులక॥వ॥పూరునకుజనమేజయుండు,జనమేజయునకుఁబ్రాచిన్వాం
సుఁ,డతనికిఁబ్రవీరోధనమన్యు,వతనికిఁజారుపదుపుట్టె,నాచారుపదునకుసుద్యువు,సుద్యువునకుబహుగవుండును, బహుగవు
నకుశర్యాతి,శర్యాతికిసంయాతి,సంయాతికిరౌద్రాశ్వుండు,రౌద్రాశ్వునకుఘృతాచియను, నచ్చరలేమయందుఋ
తేపువు,కక్షేపువు,స్థలేపువు,కృతేపువు,జలేపువు,సన్నతేపువు,ధర్మేపువు,సత్యేపువు,వ్రతేపువు,వనేపువులనువారు, జగ
దాత్మభూతుండైనప్రాణులకునింద్రియంబులచందంబునఁబదుగురుకొడుకులుజన్మించిరందుఋతేపునకునంతిసారుం
డు,నంతిసారునకుసుమతియు,ధ్రువుండు,నప్రతిరథుండు,ననుమువ్వురుపుట్టిరందునప్రతిరథునికిగణ్వుం, డాకణ్వునికిమే
ధాతిథి,యతనికిఁబ్రస్కంసుండుమొదలగుబ్రాహ్మణులుజన్మించి,రాసుమతికిరైభ్యుండు,రైభ్యునకు దుష్యంతుండుపు
ట్టె॥క॥పారావారపరీతో।దారధరాభారదక్షదక్షిణహస్త।శ్రీరాజిల్లగనొకనాఁ।డారాజేంద్రుండువేఁటయందభిరతుఁ
డై॥క॥గండకకంఠీరవభే।రుండశశవ్యాళకోలరోహిషరురుశే।దండవ్యాఘ్రమృగాధిక।చండశరభశల్యభల్లచమరాటవుల
లక ॥ క ॥ చప్పుడుసేయుచుమృగముల।నొప్పించునీరములయందురోఁజుచువలలం।ద్రిప్పకొనిపడఁగఁజోఁపుచుఁ।దప్పకనే
యుచునువేఁటతమకంబొప్పక॥క॥ మృగయూథంబులవెంటను।మృగలాంఛనసన్నిభుండుమృగయాతురుఁడై।మృగయు
లుగొందఱుగొలువఁగ। మృగరాజపరాక్రమంబుమెఱయఁగవచ్చెక ॥వ॥ ఇట్లువచ్చివచ్చిదైవయోగంబునఁగణ్వమహా
మునితపోవనంబుచేరంజని॥సీ॥ ఉరుతరశ్రాంతాహియుగళంబులకుఁబించములవిసరెడికేకిముఖ్యములను।గరుణతోమద
యుక్తకలభంబులకుమేఁతలిడుచుమద్దాడుమృగేంద్రములనుఘనమృగాదనములగాఁపుగాలేళ్లతోరతులుసాగించుసా
రంగములను।ననువుగా[illegible]ధేనువులకంఠంబులునువ్వుచునాడుశార్దూలములను।దారకలహించుమూషికదంపతు
లకు।మైత్రినంకించుమార్జాలమల్లములను।మతినిజాతివైరంబులుమానికూడి।కలసిక్రీడించుమృగములఁగాంచెనతఁడు॥
క॥ఇట్లెఱుఁగునమృగజాతుల।పొత్తులుమేమెఱుఁగమనుచుభూవల్లభుఁడుం।జిత్తములోపలనాముని।సత్తముసద్వృత్తము
నకుసంతసపడుచుక ॥క॥ హల్లకబిసరుహసరసీ।కల్లోలోత్ఫుల్లయూథికాగిరిమల్లీ।మల్లీమరువకకురువక।సల్లలితానిల
మువలనసంతుష్టుండై ॥దుష్యంతుండువచ్చునవసరంబున॥క॥ ఇందిందిరాళిసుందరి।యిందిందిరవిధురయున్న[illegible]

భం। బిందింపవంశయనుక్రియ। నిందీవరవీథి మ్రోసె నిందిందిరముల్ ॥ క ॥ మాకందర్పుని ములుకులు। మాకందములగుటఁ జే
సి మాకందంబుల్ । మాకందములను కైవడి। మాకందాగ్రములఁ బికసమాజము న్నిలిచెన్ ॥ అంత ॥ క ॥ ఇందున్న కణ్వమునికిని।
వందన మొనరించి తిరిగి వచ్చెద ననుచుం। బొందుగ ననుచరుల నుదా। నందను నందంద నిలిపి యటఁ జని మ్రోలన్ ॥ శా ॥ ఆకణ్వా
శ్రమముం గనీ రజనివాసాంతప్రదేశంబుల। న్మాకందంబుల నీడ కల్పలతికామధ్యంబులన్ మంజరం। భాకాండాంచిత శా
లలోఁ గుసుమసంపన్న స్థితిం జూచె నా। భూకాంతుండు శకుంతలన్ వనతటద్భూపర్యటత్కుంతలన్ ॥ క ॥ దట్టపుఁ దురుముసు
మీఁదికి మిట్టించి వినచన్నుఁ గవయు మిటిమిటి చూడ్కుల్। న్నట్టాపు నడుము నేదెనియ। లు క్కైదు మోవియును సున ముసూఁటింపం
గన్ ॥ వ ॥ అంత నా రాజకుమారుం డలరుటమ్ములవిలుకాని వెడవింటి ఘణఘణాయమానరయి మ్రోయు ఘంటల కుబ్బరించిత
నమనంబున ॥ శా ॥ వన్యాహారములన్ జితేంద్రియత నావాసించు నా కణ్వుఁడే। కన్యారత్నము నేగతిం గనియె డింగా దీవురం
గా మీరా। జన్యాపత్యము గాఁగ నోపు నభిలాషంబయ్యెఁ గా దేని నీ। యన్యాయత్తము లెందుఁ బౌరవుల కెట్లాశించు నే చిత్త
ముల్ ॥ క ॥ అడిగిన నృపసుతఁ గాననఁ। నొడిఁ వెడినోవ దేమనంబు నెప్పనని విభుం। డుడురాజవదన నవుగక। నడుమున నొకకొంత
ప్రొద్దు తడఁబడఁ జొచ్చెన్ ॥ వ ॥ మఱియు నెట్టకేలకుఁ దనచిత్తసంచలనంబు సత్యంబుగాఁ దలంచి యిట్లనియె ॥ క ॥ భూపాలకక
న్యక వని। నీపైఁ జిత్తంబు నాఁటె నీ వారెరీ। నీ పేరెది నిర్జనవన। భూపర్యటనంబు దగవె పూర్ణేందుముఖీ ॥ వ ॥ అని పలుకుచున్న
రాజకుమారుని వదనచంద్రికారసంబు నేత్రచకోరంబుల వలనం ద్రావుచు నయ్యువిద విభ్రాంతయై యున్న సమయంబున ॥ క ॥
కంశేకాలుని చేతం। గుంఠితుఁడగు బెట్టుమరుఁడు కుసుమాస్త్రంబు। ల్లుంఠించి సుణనిసాదము। లంతమ్మనబాల నేసె తవవలే
మిన్ ॥ ఇట్లు వలరాజువాఁడి క్రొవ్వాడి కోలల వేడిమి దాలిమి పోఁడిమి చెడి యా వాలుఁగంటి యిట్లనియె ॥ మ ॥ అనివార్యప్రభము
న్న మేనక యు విశ్వామిత్రభూభర్తయున్। గనిరా మేనక డించిపోయె నడవిం గణ్వుండు నన్నింతగా । మనిచెన్ సర్వము నా
మునీంద్రుఁ డెఱుఁగున్ మద్భాగధేయంబునన్। నిన్నుఁ గంటిం జిదపంగ్ర కృతార్థనగుదు నేఁడీ వనాంతంబునన్ ॥ క ॥ నీవారము ప్ర
జలేమును। నీవారము ప్రాజఁగొనుము నేఁడిట నీవు। న్నీవారును మా యింటను। నీవారాన్నంబు గొనుఁడు నేఁడు నరేంద్రా ॥
అని పలికిన దుష్యంతుండు మెచ్చి ముచ్చకంటి యిచ్చ యెఱింగి యిట్లనియె ॥ గీ ॥ రాజతనయ వగుము రాజీవదళనేత్ర। మాటని జ
ములోని మాట లేమ। తనకు సదృశుఁడయిన తనయునిఁ గైకొంట। రాజసుతకుఁ దగవు రాజవదన ॥ అని మఱియుఁ దియ్యని నె
య్యంపుఁ బలుకుల వలన నయ్యువిద నియ్యకొలిపి ॥ క ॥ బంధురయశుఁడు జగన్నుత। సంధుఁడు దుష్యంతుఁ డుచితసమయజ్ఞుండై।
గంధగజగమన నప్పుడు। గాంధర్వవిధిన్ వరించె గహనాంతమునన్ ॥ వ ॥ ఇవ్విధంబున నమోఘవీర్యుండగు నా రాచపట్టి తపసి

॥ భరతుని చరిత్రము. ॥

రాచూలికిఁ జూలు నిలిపి మఱునాఁడు తనవీటికిం జనియె నయ్యింతియుం గొంత కాలంబునకుఁ గొడుకుం గనెఁ గణ్వమునీంద్రుం
డా రాచపట్టికి జాతకర్మాదిమంగళాచారంబు లొనర్చె నా డింభకుండును దినదినంబునకు బాలచంద్రుండునుం బోలె నెదు
గుచు ॥ క ॥ కుంఠితుఁడు గాక వాఁడు। త్క్రాంతవన పిన్ననాఁడె కణ్వవనచర। త్కంఠీరవముఖ్యంబుల। కంఠములం బట్టి యడఁచుఁ
గానన వీథిన్ ॥ అంత నా కణ్వమునీంద్రుండు బాలకుం జూచి శకుంతల కిట్లనియె ॥ ఉ ॥ పట్టపు రాజు నీ మగఁడు పాపఁడు నన్నిట నె
క్కుడంతకుం। బట్టపు దేవివై గరిమ బాగుగ నుండక వారివారితో। గట్టువనంబులోన వయఁగాఁ బని లేదిటఁ దల్లి పోఁగదే। పుట్టి
నయింట్లు మానిపతిఁ బొందక నిట్లని శంబు నుందురే ॥ అనిన నియ్యకొని ॥ క ॥ ఆ పిన్నవానిఁ దలఁ। వ్యాపారును దారు వైష్ణవాం
శోద్భవునిం। జూపెదనంచు శకుంతల। భూపాలుని కడకు వచ్చెఁ బుత్రునిఁ గొనుచున్ ॥ వచ్చి దుష్యంతుండున్న సభామంటపం
బునకుం జని నిలిచియున్న యెడ ॥ మ ॥ వలకేలన్ గురుచక్రరేఖయుఁ బదద్వంద్వంబునం బద్మరే। ఖలనొప్పారఁగ నిందు వచ్చిన నర
మూకాంతుండ నాఁ గాంతి నుగ్గలమై యున్న కుమారు మారుసదృశాకారున్ విలోకించి తాఁ। బలుకండయ్యె విభుండెఱింగి సతి
విభ్రాంతాత్మయై యుండఁగన్ ॥ ఆ సమయంబున ॥ మ ॥ అదె నీ వల్లభివాఁడు నీసుతుఁడు భార్యాపుత్రులన్ భ్రాతలన్। వదలం
గావల నాఁటి కణ్వవనికా వైవాహికారంభము। ల్మదినూహింప శకుంతలావచనము న్మాన్యంబుతో భూవరేం। ద్ర దయం జే
కొనుమంచు మ్రోసెనుః యద్వాణీవధూవాక్యముల్ ॥ వ ॥ ఇట్లు శరీరవాణి సర్వభూతంబులకుఁ దేటపడ భరింపుమని పలి
కిన నా కుమారుండు భరతుండయ్యె నంత నా రాజు రాజవదన నంగీకరించి తనూభవుం జేకొని కొంత కాలంబు రాజ్యంబుఁ జే
సి పరలోకంబునకుం జనియెఁ దదనంతరంబ ॥ క ॥ రెండవహరిక్రియ ధరణీ। మండలభారంబు వెసస నుంచిత బాహా। దండమున
నిలిపి తనకును। భండనమున నెదురు లేక భరతుం డొప్పెన్ ॥ వ ॥ మఱియు నాఁడు యమునాతటంబున దీర్ఘతపసునిఁ బు
రోహితుండుగా దెబ్బది యెనిమిదియును, గంగాతీరంబున నేఁబదియైదు, నిట్లు నూటముప్పదినూఁ డశ్వమేధయాగంబులు

సదక్షిణంబులుగా నొనర్చి, దేవేంద్రవిభవంబున నతిశయించి, పదమూఁడువేలు నెనుబదినాలుగుసకచుపు ధేనువులుగలయ ద్వాదశ్వంబ నంబరగునట్టి వెయ్యిద్వంద్వంబులు పాడి మొదవులు క్రేపులతోడ సాలంకారసహితలం జేసి వేవురు బ్రాహ్మణులకిచ్చి మహాప్రసాదంబను పుణ్యతీర్థకూలంబున విప్రముఖ్యులకు రత్నభూషణశోభితంబులై ధవళదంతంబులుగల దంతావళులంబది నాలుగులక్షల నొసంగె దిగ్విజయకాలంబున శకశబరబర్బరకశక కిరాతకహూణ మ్లేచ్ఛదేశంబుల రాజులఁ బీచంబడంచి రసాతలంబున రాక్షసకారాగృహంబులం దున్న వేల్పులగరితలం బెక్కండ్ర విడిపించి తెచ్చి వారల వల్లభులం గూర్చెఁ ద్రిపురదానవుల జయించి నిర్జరుల నిజమందిరంబుల నునిచె నతని రాజ్యంబున గగనధరణీతలంబులు ప్రజలుగోరినక్రోరికలిచ్చుచుండె నివ్విధంబున॥ గీ॥ సత్యచరితమం దచలమం దుబలమందు। భాగ్యమందు లోకపతులకంటె నెక్కుడయిన పేర్మి నిరువదియేడు వే। లేండ్లు ధరణి భరతుఁడేలె నధిప॥ క॥ అర్థపతికంటెఁ గలిమిఁ గృ। తార్థుండై యతులశౌర్యమలపడియు నతం। డర్థములను బ్రాణములను। వ్యర్థములని తలఁచి శాంతుఁడయ్యె నరేంద్రా॥ క॥ భరతుని భార్యలు మువ్వురు। వరుసం బుత్రకులఁ గాంచి వల్లభుతోడన్। సరిగారని తోడ్తోడను। శిరములు నుసుమాడి రాత్మశిశువుల నధిపా॥ వ॥ ఇట్లు విదర్భరాజపుత్రికలు శిశువులం జంపిన భరతుండపుత్రకుండై మరుత్స్తోమంబను యాగంబు పుత్రార్థియై చేసి దేవతల మెప్పించె నయ్యవసరంబున॥ సీ॥ అన్నయిల్లాలిఁ జూలాలి నిమమతాఖ్యఁ జూచి బృహస్పతి సురతమునకుఁ। దొరఁకొని పైఁబడ్డఁ దొల్లి గర్భంబున నున్న బాలుఁడు భయంబొదవి వలదు। తగదని మొఱసేయఁ దమకంబుతో వాని నంధుండవగుమన్న నలిగి వాఁడు। యోనిలోపలి వీర్యమూఁడఁదన్నిన నేలఁబడి బిడ్డఁడై యున్నఁ బాయలేక। నితని పెంపుకొడుకు లిరువురు జన్మించిరనుచు వెలయఁ జేయుచు నినమమతఁ। బెంపఁజాలనీవ పెంపు భరింపుమీ। ద్వాజననుచుఁ జనియె దానివిడిచి॥ వ॥ ఇట్లు చథ్యుని భార్య యగు మమతయు, బృహస్పతియు, శిశువుం గని ద్వాజుండయిన వీని భరింపుమని వదినె మఱఁదులు దమలో నొండొరువులం బలికిన కారణంబున వాఁడు భరద్వాజుండయ్యె గర్భస్థుండయిన వాఁడు బృహస్పతి శాపంబున దీర్ఘతముండయ్యె నంత నా బృహస్పతియు మమతయును దయించిన వాని విడిచిని జేచ్చం జనిన మరుత్తులు వానిం బోషించి పుత్రార్థియైన భరతున కిచ్చిరి భరతుండు వానిం జేకొని వితథంబైన భరతవంశంబునకు నా భరద్వాజుండు వంశకర్తయగుటం జేసి వితథుండనం బరగె-నా వితథునికి మన్యువు, మన్యువునకు బృహ, త్క్షత్ర, జయ, మహావీర్య, నరగర్గులను వారేవురు సంభవించి-రందు నరునికి సంకృతి, సంకృతికి గురుండు రంతిదేవుండన నిరువురు జన్మించిరందు॥

**శ్రీ రంతిదేవుని చరిత్రము. శ్రీ**

సీ॥ రాజవంశోత్తమ రంతిదేవుని కీర్తి యేల చెప్పఁగఁబడు నిమ్మనందు। నా రాజు దనసంచితార్థంబులన్నియు నెడపక దీనులకిచ్చియిచ్చి। సకుటుంబుఁడై ధైర్యసంయుతుండై పేదయై కూడు నీరు లేక ధమవృత్తి। నెండే నినలుబది యెనిమిది దివసము ల్చరియింప నొకదివసంబు రేపు। నెయ్యిపాయసంబు నీరును గలిగిన। బహుకుటుంబభారభయముతోడ। నలసి నీరువట్టు నాఁకలియును మిక్కి। లొదవఁ జూచి కుడువ నుత్సహించి॥ అయ్యెడ॥ సీ॥ అతిథిభూసురుఁడొక్కఁ డాహారమడిగిన గడపక ప్రియముతో గారవించి। హరిసమర్పణమంచు నన్నంబులో సగమిచ్చిన భుజియించి యేగె నాతఁ। డంతలో నొక శూద్రుఁడశనార్థియై వచ్చి పొడసూపలేదని పోక తనకు। నున్న యన్నములోన నొక భాగమిచ్చిన సంతుష్టుఁడై వాఁడు సనిన వెనుక। కుక్కగమియుఁ దానునొక్కఁడే తేర నా। యన్నశేషమిచ్చె సన్నయమున। వాని మ్రొక్కి పంపవరుస తోఁ జండాలుఁ। డొక్కఁడరుగుదెంచి చక్కనిలిచి॥ క॥ హీనుఁడఁ జండాలుండను। మానవకులనాథ దప్పిమానదు సవలం। బో నేర నీకుఁ జిక్కెన్। పానీయము నాకుఁ బోసి బ్రతికింపఁగదే॥ అనిన దీనాలాపంబులకుఁ గరుణించి యిట్లనియె॥ ఉ॥ అన్నము లేదు కొన్ని మధురాంబువు మాత్రము ద్రావుమన్నరు। ప్మన్న శరీరధారులకు నాపదవచ్చిన వారి యాపదల్। గ్రన్ననఁ దాల్చి వారికిని సుఖంబులు సేయుటకంటె నొండుమే। లున్నదె నాకు దిక్కు పురుషోత్తముఁ డొక్కఁడ సుమ్ము పుల్కసా॥ అనిపలికి॥ మ॥ బలవంతంబగు నీరువట్టు నిజప్రాణాంతమై యున్నచో। నలయండే మియు దీనహృజ్జ్వరము నా రాటంబు ఖేదంబు నా। జలదానంబున నేఁడు మానుననుచున్ సర్వేశ్వరాధీనుఁడై। జలములొ్వోసెను రంతిదేవుఁడు దయం జండాలపాత్రంబునన్॥ వ॥ తదనంతరంబ బ్రహ్మాది దేవతలు సంతోషించి రంతిదేవునికి మేలు సేయందలంచి నిజాకారంబుతో ముందర నిలువంబడి యా రాజు ధైర్యపరీక్షార్థంబు దమరు సేసిన వృషలాది రూపంబులగు విష్ణుమాయ నెఱింగించిన నా నరేంద్రుండు దండలికి నమస్కరించి॥ క॥ వారల నేమియు నడుగక। నారాయణభక్తిదనమనంబున వెలుఁగ। స్థిరుండాతఁడు మాయా। పారజ్ఞుండగుచుఁ బరమపదముం బొందెన్॥ క॥ ఆ రాజర్షిని గొలిచిన। వారెల్లఁ దదీయయోగవైభవమున శ్రీ। నారాయణచింతనులై। చేరిరి యోగీశులగుచు సిద్ధపదంబుల్॥ వ॥ ఇట్లు రంతిదేవుండు విష్ణునగర్భిణీయగు భక్తివలనఁ బరమపదంబు నకుం జనియె నంత గర్గునకు శిని జన్మించె-శినికి గార్గ్యుండు గలిగె నాతని వలన బ్రా

హ్మణకులంబయ్యె మహావీర్యునికి నురుక్షయుండు నురుక్షయునకుఁ ద్రయ్యారుణియుఁ గవియుఁ బుష్కరారుణియు ననమువ్వురు సంభవించిరి వారు బ్రాహ్మణులై చనిరి. బృహత్క్షత్రునకు సుహోత్రుండును సుహోత్రునకు హస్తి జనించె. నతండు తన పేర హస్తినాపురంబు నిర్మించె. నా హస్తికి నజమీఢుండును, ద్విమీఢుండును, బురుమీఢుండును, మువ్వురు జనించిరి, యందజమీఢునివంశంబునఁ బ్రియమేధాదులుగొందఱు పుట్టి బ్రాహ్మణులై చనిరి, యయ్యజమీఢునికి బృహదిషువను పుత్త్రుండు, బృహదిషువునకు బృహత్కాయుండు, నతనికి జయద్రథుండు, నాతనికి విశ్వజిత్తు, విశ్వజిత్తునకు సేనజిత్తు, సేనజిత్తునకు రుచిరాశ్వుండు, దృఢహనువు, కాశ్యుండు, వత్సుండు ననం నలుగురు జనియించిరందు రుచిరాశ్వునకుఁ బ్రాజ్ఞుండు నతనికిఁ, బృథుసేనుండు, పృథుసేనునికిఁ బారుండు, వానికి నీపుండు, నీపునికి నూర్వురు కొడుకులు పుట్టిరి మఱియును ॥గీ॥ శుకునికూఁతురైన సుందరి సత్కృతిఁ । బొందు వేడ్క నీపభూవిభుండు । విమలయోగవిత్తు విజ్ఞానదీపితో । దార చిత్తు బ్రహ్మదత్తుఁ గనియె ॥వ॥ బ్రహ్మదత్తుండు జైగిషవ్యోపదేశంబున యోగతంత్రంబు నంజేసి గోదేవియను భార్యవలన విష్వక్సేనుండను కుమారునిం గనియె. విష్వక్సేనునకు నుదక్సేనుండు, నుదక్సేనునకు భల్లాదుండు, వీరలు బార్హదిషవులను రాజులైరి. ద్విమీఢునకు యవీనరుండు, యవీనరునికి కృతిమంతుండు, కృతిమంతునికి సత్యధృతి, సత్యధృతికి దృఢనేమి, దృఢనేమికి సుపార్శ్వకృత్తు, సుపార్శ్వకృత్తునకు సుపార్శ్వుండు, సుపార్శ్వునకు సుమతి, సుమతికి సన్నతిమంతుండు, సన్నతిమంతు కొడుకు కృతియనువాఁడు, హిరణ్యనాభునివలన యోగమార్గంబెఱింగి శోకంబు విడిచి తూర్పుదేశంబున సామసంహిత పఠియించె నతనికి నుగ్రాయుధుండు, నుగ్రాయుధునకు క్షేమ్యుండు, క్షేమ్యునకు సువీరుండు, సువీరునకుఁ బురంజయుండు, పురంజయునకు బహురథుండు జన్మించె, హస్తికొడుకు పురుమీఢునికి సంతతి లేదయ్యె, నయ్యజమీఢునికి నళినియను భార్యయందు నీలుండు, నీలునికి శాంతి, శాంతికి సుశాంతి, సుశాంతికిఁ బురుజుండు, పురుజునికి నర్కుండు, నర్కునికి భర్మ్యాశ్వుండు, భర్మ్యాశ్వునకు ముద్గల యవీనర బృహదిషు కాంపిల్య సృంజయులను వారేవురు పుట్టిరి ॥క॥ మించిన భర్మ్యాశ్వుఁడు సుత । పంచకమును జూచి విషయపంచకమును వ । ర్ణించితి మే మని పల్కినఁ । బాంచాలురు నాగసుతులు పరగిరి ధరణిన్ ॥వ॥ అంత ముద్గలుని నుండి బ్రాహ్మణకులంబైన ముద్గలగోత్రంబనా నెగడె భర్మ్యాశ్వపుత్త్రుండైన యా ముద్గలునికి దివోదాసుండును నహల్యయను కన్యయునుం బుట్టిరి యహల్యయందు గౌతమునికి శతానందుండు పుట్టె, శతానందునికి ధనుర్వేదవిశారదుండయిన సత్యధృతి పుట్టె యతం డొకనాఁడు వనంబున నూర్వశిం గనిన నతనికి రేతఃపాతంబై తద్వీర్యంబు శరస్తంభంబునం బడి మిథునంబైన సమయంబున ॥క॥ చపలరతి శంతనుండను । నృపవరుఁ డడవికిని వేఁట నెపమునఁ జనుచుం । గృపతో శిశుయుగముం గని । కృపియుఁ గృపుండనుచుఁ దెచ్చి గృహమునఁ బెంచెన్ ॥వ॥ ఆ కృపి ద్రోణునకు భార్యయయ్యె దివోదాసునకు మిత్రాయువు, మిత్రాయువునకు చ్యవనుండు, చ్యవనునకు సుదాసుండు, సుదాసునకు సహదేవుండు, సహదేవునకు సోమకుండు, సోమకునకు సుజన్మకృత్తు, సుజన్మకృత్తునకు నూర్వురు కొడుకులుం గలిగిరి, వారిలో జంతువను వాఁడు జ్యేష్ఠుండు కడచూలు పృషతుండు. పృషతునకు ద్రుపదుండు, ద్రుపదునకు ధృష్టద్యుమ్నాదులయిన కొడుకులును ద్రౌపదియను కూఁతురుం గలిగిరి, ధృష్టద్యుమ్ననకు ధృష్టకేతువు పుట్టె, వీరలు పాంచాలరాజులనియెఱుంగుము, మఱియు నయ్యజమీఢునికొడుకు ఋక్షుండు, ఋక్షునకు సంవరణుం, డా సంవరణుండు సూర్యకన్యకయందుఁ గురువుం గనియె నా కురువు పేరం గురుక్షేత్రంబయ్యె. నా కురువునకుఁ బరీక్షిత్తు సుధనుస్సు జహ్నువు నిషధుండునను వారలు నలువురు పుట్టిరందుఁ బరీక్షిత్తు కొడుకులు లేక చనియె సుధనుస్సునకు సుహోత్రుండు, నతనికి చ్యవనుండు, చ్యవనునకు కృతి, కృతికి వసువు, వసువునకు బృహద్రథ కుసుంభ మత్స్య ప్రత్యగ్ర చేదిపాదులు పుట్టిరందు, బృహద్రథునకుఁ గుశాగ్రుండు, కుశాగ్రునికి ఋషభుండు, ఋషభునికి సత్యహితుండు, సత్యహితునికిఁ బుష్పవంతుండు, పుష్పవంతునకు జహ్నువను వాఁడు మఱియును ॥సీ॥ ఆ బృహద్రథునకు నన్య భార్యాగర్భమున రెండగు ఖండములు జనించెఁ దునకలుగని తల్లి వెలఁగంగవైచిన సంధించె నొకటిగా జర యనంగ నొక దైత్యకాంత వాఁడొప్పె జరాసంధుఁడనఁ గిరివ్రజపురమాతఁడేలె నతనికి సహదేవుఁ డతనికి సోమాపి తనయుఁ డాతనికి శ్రుతశ్రవుండు జహ్నుపుత్త్రుండు సురథుండు జనవరేణ్య యతనికొడుకు విదూరథుఁ డతనిపట్టి సార్వభౌముండు వానికి సంభవుండు వినుజయత్సేనుఁడను వాఁడు విమలకీర్తి ॥వ॥ ఆ జయత్సేనునికి రథికుండు, రథికునకు నయుతాయువు, నయుతాయువునకుఁ గ్రోధనుండు, క్రోధనునకు దేవాతిథి, దేవాతిథికి ఋక్షుండు, ఋక్షునికి భీమసేనుండు, వానికిఁ బ్రతీపుండుఁ, బ్రతీపునకు దేవాపి శంతన బాహ్లీకులను మువ్వురు కొడుకులు పుట్టిరందు ॥సీ॥ దేవాపి రాజ్యంబు దీర్పనొల్లక వనంబున కేగి తమ్ముండు పూర్వజన్మమందు మహాభిషుఁడనియెడు వాఁడు శంతనుఁడయ్యె వాఁడె యాధాత్రి నెల్ల నేలుచుఁ గరముల నెవని ముట్టినఁ గాని వాఁడెల్ల నిండు జవ్వనమునందు నధిక శాంతిఁ బ్రాప్తుఁ

డై యున్న దానఁ బండ్రెండేండ్లు వర్షింపకున్న వృష్టి లేనిచో విప్రుల నడిగిన నన్న యుండఁ దమ్ముఁ డగ్నిహోత్ర
దారసంగ్రహంబు దాల్చిన పరివేత్త యండ్రు దాని నీ వయితఁడ వైతి॥ వ॥ అది కారణంబుగా నన్న యుండఁ దమ్ముండు రా
జ్యాగ్రహుం డగుటకు నీవు పరివేత్తవు మీ యన్నకు రాజ్యంబిచ్చిన ననావృష్టిదోషంబు చెడునని బ్రాహ్మణులు వలుకన శంత
నుండు వనంబునకుం జని దేవాపికిఁ బ్రియంబు చెప్పి రాజ్యంబు చేకొమ్మని పలుక నంతకు మున్న వానితండ్రి దేవాపి రా
జ్యంబునకర్హుండు గాకుండ విప్రులం బిలిచిన వా విప్రులు పాషండమత వాక్యంబులు దేవాపికి నుపదేశించిన దేవాపి వేదం
బుల నిందించిన పాషండుండును, దేవదూషకుండును గావున దేవాపికి రాజ్యంబు లేదని బ్రాహ్మణులు చెప్పిన శంతనుండును
మగుడివచ్చి రాజ్యంబుఁ జేకొనియె నంత వర్షంబులు గురిసె నివ్విధంబున॥ క॥ దేవాపి కలాపపురంబు వాసముగా యోగి
యైయున్నాఁడు కలివరకలి నష్టంబగు *జైవాతృకకులము మీఁద సంస్థాపించుఁ॥ వ॥ బాహ్లికుండను వానికి సోమదత్తుండు పు
ట్టె, సోమదత్తునకు భూరియు, భూరిశ్రవస్సు, శలుండను వారు మువ్వురు పుట్టిరి॥ క॥ ఖ్యాతిగ శంతనునకును జ్ఞానుండై గంగ
యందు జనియించెను సన్న్యాతివిమలకీర్తులచే నాతతవాక్యుండు భీష్ముఁ డాత్మజ్ఞుఁడు గాఁ॥ గీ॥ పరశురాముతోడఁ బ్రతి
ఘటించి జయించె నన్న్యుఁ డొకఁడు నెఱుఁగ మతఁడు దక్క వీరయోధపతి వివేకధర్మజ్ఞుండు దివిజనదిసుతుండు దేవసముఁడు
వ॥ ఆ శంతనునకు దాశకన్యక యైన సత్యవతియందుఁ జిత్రాంగద విచిత్రవీర్యులు పుట్టి రందుఁ జిత్రాంగదుండు గంధర్వులచే
హతుండయ్యె మఱియును॥ ఉ॥ సత్యవతీవధూటి మును శంతను పెండ్లము గాని నాఁడు సాంగత్యముగాఁ బరాశరుఁడు గర్భము
చేసిన బాదరాయణుం డత్యధికుండు శ్రీహరికళాంశజుఁడై ప్రభవించె నిత్యముగ సత్యములైన వేదముల సాంగముల న్విభ
జింపఁ దగుఁడై॥ గీ॥ బాదరాయణుండు భగవంతుఁ డనఘుండు పరమగుహ్యమయిన భాగవతము నందనుండనైన నా
కుఁ జెప్పెను శిష్యజనుల మొఱఁగి యేను జదువుకొంటి॥ వ॥ ఆ విచిత్రవీర్యునికిఁ గాశిరాజు కూఁతుల నంబికాంబాలికల భీష్ముం
డు బలాత్కారంబునఁ దెచ్చి వివాహంబు సేసిన విచిత్రవీర్యుండు వారలం దగిలి మనోజరాగమత్తుండై చిరకాలంబు నానా
విధక్రీడల విహరించుచు రాజయక్ష్మపీడితుండై మృతుండయ్యె నంత॥ క॥ అతని సతివలన సుతులను సుతున త్తఱిఁ దగ్గి పను
పసారదింగనియెఁ ధృతరాష్ట్ర పాండు విదురుల నుతచరితుఁడు బాదరాయణుండు నరేంద్రా॥ వ॥ అంత ధృతరాష్ట్రునకు
గాంధారియందు దుర్యోధనాదులగు కొడుకులు నూర్వురును, దుశ్శలయను కన్యకయును జన్మించి రప్పు గశాపభయంబు
నం జేసి భార్యం బొందవెఱచిన పాండునకుఁ గుంతీదేవియందు ధర్మానిలేంద్ర ప్రసాదంబున యుధిష్ఠిర భీమార్జునులను మ
వ్వురును మాద్రిదేవివలన †నాసత్య ప్రసాదంబున నకులసహదేవులను వారిద్దరును గా నేవురు పుట్టిరయ్యేవురకును ద్రుపద
రాజపుత్రి యైన ద్రౌపదియందుఁ గ్రమంబునం బ్రతివింధ్యుండును, శ్రుతసేనుండును, శ్రుతకీర్తియు, శతానీకుండును, శ్రు
తకర్ముండునను నేవురు పుట్టిరి, మఱియు యుధిష్ఠిరునకుఁ బౌరవతియందు దేవకుండును, భీమసేనునికి హిడింబియందు ఘటో
త్కచుండును, గాళియందు సర్వగతుండును, సహదేవునికి విజయయందు సుహోత్రుండును, నకులునకు రేణుమతియం
దు నిరమిత్రుండును, నర్జునునకు నులూచియను కన్యకయందు నిలావంతుండును, మణలూరుపతిపుత్రిక యయిన చిత్రాంగద
యందు బభ్రువాహనుండును, సుభద్రయందు శౌర్యధైర్య తేజోవిభవంబుల నఖిలరాజనికరంబునం బ్రఖ్యాతుండైన య
భిమన్యుండును జన్మించి రందు బభ్రువాహనుం డర్జుననినియోగంబున మాతామహునిగోత్రంబునకు వంశకర్తయయ్యె॥
ఉ॥ అన్యనృపాజ్యనీజనకుఁడై యభిమన్యుఁడు భూవరేంద్రమూర్ధన్యుఁడు ధన్యమార్గణకదంబవిదారితవైరివీరరాజన్యుఁ
డు జన్యభీకరుఁడు సైన్యుఁడు సైన్యసమూహనాథదుర్మాన్యుఁడు మాన్యకీర్తి సుపిహమందన రెంగురువంశకర్తయై॥ ఆయభి
మన్యునకును నుత్తరయందు నీవు జన్మించితి॥ క॥ ద్రోణసుతు తూపు వేడిమిఁ బ్రాణంబులఁ బాసి హరికృపాదర్శనసంత్రాణం
బున బ్రతికితె కా ద్రోణీశ్వర మున్న నీ శిశుత్వము వేళన్॥ వ॥ నీకుమారులు జనమేజయ శ్రుతసేన భీమసేనోగ్రసేనులను న
ల్వురు వీరలు నీవు తక్షకునిచేత నిధనంబు నొందితివని విని సకలసర్పలోకసంహారంబుగ సర్పయాగమిం జనమేజయుండు సే
యఁగలఁడు పూర్వరోషసహితుఁడగుచు మఱియు నతండు సర్వధరణీమండలంబును జయించి కావషేయుండు పురోహితుం
డుగా నశ్వమేధంబు సేయఁగలవాఁడు వానికి శతానీకుండు జనియించి యాజ్ఞవల్క్యునియందు వేదంబులు పఠియించి కృపా
చార్యునివలన నదత్త్వజ్ఞానంబు నేర్చి శౌనకునివలన నాత్మజ్ఞానంబుఁ బడయంగలవాఁ డా శతానీకునికి సహస్రానీకుండు వాని
కి నశ్వమేధజుండు నశ్వమేధజునికి నాసీమకృష్ణుండు నాసీమకృష్ణునకు నిచకుండు నిచకునకుఁ గౌశాంబియందు నుష్ణుండు ను
ష్ణునకుఁ జిత్రరథుండు చిత్రరథునకు శుచిరథుండు శుచిరథునికి వృష్టిమంతుండు వృష్టిమంతునికి సుషేణుండు సుషేణునికి సునీ
థుండు సునీతునికి నృచక్షుస్సు నృచక్షుస్సుకు సుఖానిలుండు, సుఖానిలునికిఁ బరిప్లవుండు, పరిప్లవునకు మేధావి, మేధావికి సు

* జైవాతృకకులము = చంద్రవంశము. † నాసత్య = అశ్వనీదేవతలు.

నయుండు, సునయునికి నృపంజయుండు, నృపంజయునికి దూర్వుండు, దూర్వునికి నిమి, నిమికి బృహద్రథుండు, బృహద్రథునకు సుధాంశుండు, సుధాంశునికి శతానీకుండు, శతానీకునకు దుర్దమనుండు, దుర్దమనునికి విహీనరుండు, విహీనరునికి దండపాణి, దండపాణికి మితుండు, మితునకు క్షేమకుండు, క్షేమకునకు బ్రహ్మక్షత్రుండు, వాఁడు నిర్వంశుండై దేవర్షిపూజ్యుండై కలియుగంబున నంతముం జనంగలవాఁడు॥ క॥ జగతి నిటమీఁదఁ బుట్టెడు। మగధాధీశ్వరుల నిఖిలమనుజేశ్వరుల। న్నిగమార్థవిదుఁడు చెప్పెడ। సుగుణాలంకారధీరసుభగవిచారా॥ వ॥ జరాసంధపుత్రుండైన సహదేవునికి మార్జాలి, మార్జాలికి శ్రుతశ్రవస్సు, శ్రుతశ్రవస్సునకు నయుతాయువు, నయుతాయువునకు నిరమిత్రుండు, నిరమిత్రునకు సునక్షత్రుండు, సునక్షత్రునికి బృహత్సేనుండు, బృహత్సేనునికిఁ గర్మజిత్తు, కర్మజిత్తునకు శ్రుతంజయుండు, శ్రుతంజయునకు విప్రుండు, విప్రునకు శుచి, శుచికి క్షేముండు, క్షేమునికి సువ్రతుండు, సువ్రతునకు ధర్మనేత్రుండు, ధర్మనేత్రునకు శ్రుతుండు, శ్రుతునకు దృఢసేనుండు, దృఢసేనునికి సుమతి, సుమతికి సుబలుండు, సుబలునకు సునీతుండు, సునీతునకు సత్యజిత్తు, సత్యజిత్తునకు విశ్వజిత్తు, విశ్వజిత్తునకుఁ బురంజయుండును, జన్మించెదరని చెప్పి మఱియు నిట్లనియె॥ గీ॥ విను మగధదేశవిభులు జరాసంధ। ప్రముఖధరణిపతులు ప్రబలయశులు। వీరు కలియుగమున వెయ్యేండ్లలోపలఁ। బుట్టి గిట్టఁగలరు భూపరేంద్ర॥ వ॥ యయాతికొడుకైన యనువునకు సభానరుండు, చక్షుస్సు, పరోక్షుండు, ననువారు ముగ్గురు పుట్టిరందు సభానరునికిఁ గాలనాథుండు, కాలనాథునకు సృంజయుండు, సృంజయునకుఁ బురంజయుండు, పురంజయునకు జనమేజయుండు, జనమేజయునకు మహాసాలుండు, మహాసాలునికి మహామనస్సు, మహామనస్సునకు నుశీనరుండు, తితిక్షువు ననిరువురు జన్మించిరందు శీనరునకు శిబియు, వనుండును, క్రిమియు, దర్పుండు, ననఁ నలువురు జన్మించిరందు శిబికి వృషదర్ప, సువీర, మద్ర, కేకయులు నలువురు పుట్టిరి- తితిక్షునకు రుశద్రథుండు, రుశద్రథునకు హేముండు, హేమునకు సుతపస్సు, సుతపస్సునకు బలి పుట్టె నా బలివలన నంగ వంగ కళింగ సింహ పుండ్రాంధ్రులను పేళ్లుగలవా రాఱ్వురు కుమారులు పుట్టిరి వారలు తూర్పుదేశంబునకు రాజులై రితర దేశంబులకుఁ దమతమ నామధేయంబు లిడి యేలిరి- వీరిలో నం సత్యరథుండు, సత్యరథునికి నిరథుండు, నిరథునికి ధర్మరథుండు, ధర్మరథునకుఁ జిత్రరథుండు పుట్టె, వాఁడు రోమపాదుండనా బరఁగె॥ క॥ సంతతి లేనికతంబునఁ। జింతించుచు నుండ దనదు చెలికాఁడు నృపా। లుండగు దశరథుఁ డతనికి। సంతతిగా నిచ్చె నాత్మజను శాంతాఖ్యన్॥ వ॥ అంత రోమపాదుండు తనకూఁతురు శాంతయని పెంచుకొని మెలంగుచుండు నా రాజు రాజ్యంబునం గొంతకాలంబు వర్షంబు లేమికిం జింతించి విభాండకసుతుండైన ఋష్యశృంగుండు వచ్చిన వర్షంబు గురియునని పెద్దలవలన నెఱింగి॥ క॥ ఆ రాజు ఋష్యశృంగుని। ఘోరతపోనియమునిఁ దెచ్చుకొఱకై పనిచెన్। వారవధూనేర్పరులను। భారస్తనభారభీరుతర మధ్యగలన్॥ గీ॥ కాంతలారె మెకముగ నున్నది మొసలుగా। నాతఁడు వారి నెఱుఁగఁ డడవిలోన। గోఁచి బిగియఁగట్టి పోవిన నావడుగుని। మత్తిగా నితనికి మనువలయు॥ అని పలుకుచు నంత॥ క॥ ఆడుచుఁ జౌలషనింపుగఁ। బాడుచు నాలోకనశిని బాశోధుముల స్వాడుచు డగ్గరనోడుచుఁ। జేడియలా తపసికడకుఁ జేరిరి కలఁకన్॥ వ॥ ఇయ్యవసరంబున వారలం జూచి॥ సీ॥ మిళితాళినిలకమ్మ్లల్ల భారంబులు చారుజటావిశేషంబులనియు। భవ్యంచలోజ్జ్వలప్రభ దుకూలంబులు తతచర్మవస్త్రభేదంబులనియు। బహుబకీలిత భాసురదామంబు లధిక రుద్రాక్షమాలాములనియు। మలయజమృగనాభి మహిత లేపంబులు బహువిధభూతిలేపంబులనియు। మధురగానంబు శ్రుతియుక్తమంత్రజాతములనియు వీణెలు కుండంబులనియు సకులమూర్తి లెన్నఁడు నెఱుఁగని మునుడతపసి। వారిదాపులని డాయవచ్చి మొక్కె॥ ఇట్లు వచ్చి మ్రొక్కిన ఋష్యశృంగుం జూచి మమ్ము గుసుదగ్గర॥ సీ॥ సేవయనిస తుల్పితులఁ గ్రుచ్చి కరకుచంబులు మోపి కౌఁగిలించి। చిరతపోనియతి డస్సిన దాయని మోముఁ గదంబు నాభియుఁ గలయఁ బుడికి। క్రొత్తగా మమ్ముఁ జేకొను మని వీనులపొంత నాలుకలు చప్పళ్లు చేసి। మా వనంబుల పండ్లు మంచివి తినుమని పెక్కుభక్ష్యంబులు ప్రీతి నొసఁగి। వర్మవస్త్రము వదలించి భవ్యకాంతి। మించి చెంగులు పరాగంబు మిచ్చి వేసె। మునము సౌకర్యంగనతనిఁ జేకొనఁగ వారి। పంగునకుఁ జేరె నతఁడు వేమఱిగి వారి॥ వ॥ ఇట్లు హరిణీయుతుండాంగ కాంతాకటాక్షపాశబద్ధుండై వారల వెంటం జని రోమపాదుకడకుం బోయిన నతండు తన ప్రియనందనయైన శాంత నిచ్చి పురంబునను సిరికొమెున మ్మునీశ్వరుండు వచ్చిన వర్షదోషంబు చెడి వర్షంబు గురిసె నంత॥ గీ॥ అన్నపాలచంద్రుఁ డనపత్యుఁడై యుంట। నెఱిఁగి మునికులేంద్రుఁ డింద్రుఁ గూర్చి। యిష్టి చేసి సుతుల నిచ్చె నాతనికృపఁ। బడ్డి రథుఁ డపత్యబద్ధసుతుల॥ వ॥ ఆరోమపాదునకుఁ జతురంగుండును, జతురంగునకుఁ బృథులాక్షుండు, పృథులాక్షునికి బృహద్రథుండును, బృహత్కర్మయు, బృహద్భానుండునను వారు మువ్వురు పుట్టిరందు బృహద్రథునకు బృహన్మనస్సు, బృహన్మనస్సునకు జయద్రథుండు వానికి, జయద్రథునకు విజయుండు, విజయునకు సంభూతియను భార్యయందు ధృతియు, నా ధృతికి ధృతవ్రతుండు, ధృతవ్రతునకు సత్యకర్ముండు, సత్య

కర్మునకు నతిరథుండు జన్మించె॥ గీ॥ కుంతి పిన్ననాఁడు కోరి సూర్యునిఁ బొంద। బిడ్డఁ డుదితుఁడైన పెట్టెఁ బెట్టి। గంగనీట విడువ గ
నియె నతిరథుఁ డంతఁ। గర్ణుఁ డనుచుఁ గొడుకు గారవించె॥ వ॥ ఇట్లతిరథునకుఁ గానీనుండై కర్ణుండు కొడుకయ్యెఁ గర్ణునకు వృషసే
నుండు పుట్టె, నయ్యయాతికొడుకైన ద్రుహ్యునకు బభ్రుసేతువు, బభ్రుసేతువునకు నారబ్ధుండు, నారబ్ధునకు గాంధారుం,
డా గాంధారునకు ధర్ముండు, ధర్మునకు ధృతుండు, ధృతునకు దుర్మదుండు, దుర్మదునకుఁ బ్రచేతస్సు, ప్రచేతస్సునకు నూర్గు
రు పుట్టి, మ్లేచ్ఛాధిపతులై యుదీచీదిశ నాశ్రయించిరి - యనువునకు వహ్ని, వహ్నికి భర్గుండు, భర్గునకు భానుమంతుండు, భా
నుమంతునకుఁ ద్రిసానువు, త్రిసానువునకుఁ గరంధముండు, కరంధమునకు మరుత్తుం, డతనికి యయాతి శాపంబున సంతతి లేద
య్యె వినుము॥ చ॥ అనఘ యయాతి పెద్దకొడుకైన యదుక్షితిపాలు వంశము। న్వినినఁ బఠించినన్ నరుఁడు వెండియుఁ బుట్టఁడు

## యదువంశచరిత్రము.

ముక్తిఁ బొందు న। య్యనుపమమూర్తి విష్ణుఁ డపరాకృతిఁ బొంది జనించెఁ గావున। న్వినుము నరేంద్ర నా పలుకు వీనుల విందు వు
గాఁగఁ జెప్పెదన్॥ వ॥ యదువునకు సహస్రజిత్తు, క్రోష్టువు, నలుండు, రిపుండు నను వారు నలువురు సంభవించి రందుఁ బెద్ద
కొడుకైన సహస్రజిత్తునకు శతజిత్తు గలిగె, నా శతజిత్తునకు మహాహయ, వేణుహయ, హైహయులను వారు ముగ్గు-రందు
హైహయునకు ధర్ముండు, ధర్మునకు నేత్రుండు, నేత్రునకుఁ గుంతి, కుంతికి మహిష్మంతుండు, మహిష్మంతునికి భద్రసేనుం
డు, భద్రసేనునకు దుర్మదుండు, దుర్మదునికి ధనికుండు, ధనికునికిఁ గృతవీర్యుండు, కృతాగ్ని, కృతకర్మ, కృతౌజస్సులను నలు
గురు సంభవించి రందుఁ గృతవీర్యునకి నర్జునుండు జనియించె॥ సీ॥ హరికళాసంజాతుఁడైన దత్తాత్రేయు సేవించి సద్యోగసిద్ధిఁ
బొంది। బహుయజ్ఞదానతపంబులు గావించి సకలదిక్కులు గెల్చి జయముతోడ। సతతంబు హరినామసంకీర్తనము సేయ ధన
ములనొందియు చారవృత్తి। మెను బడిమై మువేలేండ్లు భూచక్రంబు నకీర్తిఁ దన పేరు గాఁగ నేలె। ముదిమి లేక తరుణమూ
ర్తిమైయు సుకీర్తి। నమరెఁ గార్తవీర్యుఁ డనఁగ విభుఁడు। నిజము వానిభంగి నేల యేలిన యట్టి। రాజు నెఱుఁగ మెందు రాజను
ల్య॥ వ॥ అర్జునునకుం గల పుత్రసహస్రంబునం బరశురాముని బారికిఁ దప్పిన జయధ్వజుండు, శూరసేనుండు, వృషణుండు,
మధువు, నూర్జితుండను వారేవురు బ్రతికిరి, జయధ్వజునకుఁ దాళజంఘుండు, తాళజంఘునకు నౌర్వముని తేజంబున నూ
ర్వురు కొడుకులు గలిగి రందుఁ బ్రథముండు, వీతిహోత్రుండు, మధువునకు వృష్ణుండు, వృష్ణునకుఁ బుత్రశతంబు పుట్టె-
నందుఁ బ్రథముండు వృష్ణియుఁ గాన నా వంశంబు వారు వృష్ణులు యాదవులనం బరగిరి - యదుపుత్రుండైన క్రోష్టువున
కు వృజినవంతుండు, వృజినవంతునకు శ్వాహితుండు, శ్వాహితునకు భేరుశేకుండు, భేరుశేకునకుఁ జిత్రరథుండు, చి
త్రరథునకు శశిబిందుండు పుట్టె నతండు॥ మ॥ కృశమధ్యల్పది వేవురంగనలతోఁ గ్రీడం బ్రమోదింపన। త్కుశలుండై ప
దివేలు బదులు సుపుత్రుల్భక్తి సేయం జతు। ర్దశరత్నుండును యోగినాఁ బరగి సప్తద్వీపరాజేంద్రుఁడై। శశిబిందుండు రు
చిరుంతుఁ డసు రెన్నఁ దాఁ గాంతిపూర్ణేందుఁడై॥ వ॥ అతనికొడుకుల మొత్తంబులకు ముఖ్యులైన యాఱ్వురిలోఁ బృ
థుశ్రవుండను వానికి ధర్ముండు పుట్టె - ధర్మునకు నుశనస్సు పుట్టి నూఱశ్వమేధంబులు చేసె - నయ్యుశనస్సునకు రుచికుండు
పుట్టె - నా రుచికునకుఁ బురుజిత్తు, రుక్మండు, రుక్మేషువు, పృథువు, జ్యామఘుండు నను వారేవురు పుట్టి రందు జ్యామఘుండు॥
సీ॥ లొత్ర గొప్పైన శైబ్యఁ దోడిడి ప్రేమంబున నపత్యుఁ డయ్యును నన్యభార్యఁ। గైకొనఁ గొకకొంత కాలంబునకుఁ బోయి
పగవారి యింటనుఁ బలిమిఁ బట్టి। యొకకన్యఁ దేరిపై నునిచి దోడ్తేరంగ జననాథు కన్యను శైబ్య సూచి। కోపించి మానవకు
హాకయీపసుచను దెచ్చియ నేనుండఁ దేరిమీఁదఁ। బెట్టి నాఁడవను చుబిలుసులు వలుకంగ। నతఁడు వలికె నంతనయముతో
డ। నాకుఁ గోడలయ్యె నమ్మ యీ లలితాంగి। సవతి గాదు వినుము సత్యమనుచు॥ వ॥ అయ్యవసరంబున శైబ్య కొడుకుం
గాంచు నని మెఱింగి విశ్వేదేవతలును, పితృదేవతలును, సంతసించిరి వారల ప్రసాదంబున॥ క॥ తన సవతి మొఱఁగి పెనిమిటి।
తనుఁ బొందిన శైబ్య మటి విదర్భునిఁ గనియెన్। దనయుఁ గని జ్యామఘుండును। దను దెచ్చిన కన్యఁ దెచ్చి తనయునకిచ్చెన్॥
వ॥ ఆకన్యకయందు విదర్భునకుఁ గుశుండును, క్రథుండును, రోమపాదుండును బుట్టిరి, రోమపాదునకు బభ్రువు, బభ్రువునకు విభువు, విభువునకుఁ
కృతి, కృతికి నుశికుండు, నుశికునకుఁ జేది, చేదికిఁ జైద్యాదులు పుట్టిరి, క్రథునకుఁ గుంతి, కుంతికి ధృష్టి, ధృష్టికి నిర్వృతి, నిర్వృతికి దశార్హుండు దశార్హున
కు వ్యోముండు, వ్యోమునకు జీమూతుండు, జీమూతునకు వికృతి, వికృతికి భీమరథుండు, భీమరథునకు నవరథుండు, నవరథునకు దశరథుండు, దశర
థునకు శకుని, శకునికిఁ గుంతి, కుంతికి దేవరాతుండు, దేవరాతునకు దేవక్షత్రుండు, దేవక్షత్రునకు మధువు, మధువునకుఁ గురువశుండు, కురువశున
కు ననువు, ననువునకుఁ బురుహోత్రుండు, నతనికి నంశువు, నతనికి సాత్వతుండు, సాత్వతునకు భజమానుండును, భజియును, దివ్యుండును, వృష్టియు
దేవావృధుండు, నంధకుండు, మహాభోజుండు, నన నేడ్డురు పుట్టిరందు, భజమానునకుఁ బ్రథమభార్యయందు నిమ్లోచి, కంకణ, వృష్టి యను వారు ముగ్గు

మను, పౌరవియందు సుభద్రుండును, భద్రబాహుండును, దుర్మదుండును, భద్రుండును, భూతాదులును బన్నిద్దఱును, మదిరయందు నందోప నందకృతక శ్రుతపూర్వాదులును, కౌశల్యయందుఁ గేశియు, రోచనయందు హస్తహేమాంగాదులును, ఇళయందు యదుముఖ్యులైన యురువల్కాదులు గలుగు, ధృతదేవియందుఁ ద్రిపృష్ఠుండును, శాంతిదేవాత్మజయందుఁ బ్రశమ ప్రశితాదులును, ఉపదేవియందుఁ గల్పవృష్ట్యాదులు పదుండ్రును, శ్రీదేవియందు వసుహంససుధన్వాదులాఱుగురును, దేవరక్షితయందు గదాదులు తొమ్మండ్రును, సహదేవయందు బురూథ శ్రుత ముఖ్యాదు లెనమండ్రును, దేవకీదేవియందుఁ గీర్తిమంతుండును, సుషేణుండును, భద్రసేనుండును, ఋజువును, సమదనుండును, భద్రుండును, సంకర్షణుండును, వాసుదేవుండుఁ బుట్టిరి మఱియును॥ క॥ దుష్టజననిగ్రహంబును। శిష్టజనానుగ్రహంబు సేయుటకొఱకై । యష్టమగర్భమునఁ గుణో। త్కృష్టుండు దేవకికి విష్ణుదేవుండు పుట్టెన్॥ గీ॥ విష్ణుఁ డుదితుఁడై న వెనుక నా దేవకి। చంద్రమూర్తియగు సుభద్రఁ గనియె। నా గుణాఢ్యు నర్జునునకు నిచ్చెను। దయితయగుటఁ జేసి వరణినాథ॥ క॥ ఎప్పుడు ధర్మము డయ్యును। నెప్పుడు పాపంబు వొడముఁ నీ లోకములో। నప్పుడు సర్వేశుఁడు హరి। యప్పుడు విభుఁ డయ్యుఁ దన్నుఁ దా సృజియించున్॥ క॥ తనమాయ లేకఁ బుట్టఁడు। ఘనుఁ డనీశ్వరుఁ డకాత్మకర్తు హరికిన్। జనములకుఁ గర్మములకును। ననుజేశ్వర కారణంబు నటియును గలదే॥ క॥ తలఁపఁగ నెవ్వని మాయా। విలసనములు జనన వృద్ధి విలయంబులకున్। వలిమికి ననుగ్రహమోక్షం। బులకును జీవులకు మూలములు నా కెపుడున్॥ సీ॥ అట్టి సర్వేశుని కరయంగ జన్మాదిపరతంత్రభావమెప్పాటఁ గలదు। రాజలాంఛనముల రాక్షసవల్లభుల క్షోహిణీశులై యవనిఁ బుట్టి। జనులను బాధింప శాసించుకొఱకు నై సంకర్షణునితోడ జననమంది। యమరులకును మనములకైన నొలెక్కింపంగ రాపం డున గట్టి కర్మము లొనఁ జేసి। కలియుగంబున జన్మింపఁ గలుగు నరుల। దుఃఖజాలంబులన్నిటిఁ దొలఁగనడచి। నేలఁ బ్రేగెల్ల వారిం చిని ఖిలదిశల। విమల కీర్తులు వెదఁ జల్లి వెలసె నధిప॥ క॥ మంగళ హరికీర్తి మహా। గంగామృతమించుకైనఁ గర్ణాంజలులన్। సంగతము సేసి త్రావఁ దొలంగును గర్మంబులా విలంబగుచున్ నృపా॥ క॥ వనజాతు నిమందస్మిత। ఘనకుండలదీప్తి గండకలితాననమున్। వనితలు పురుషులు సూచుచు। ననిమిషభావంబు లేమి కలయు మరధిపా॥ సీ॥ జననము నిగృహమున జన్మించి మందలోఁ బెరిగి శత్రుల నెల్లఁ బీఁచమడఁచి। పెక్కండ్రు భార్యలఁ బెండ్లియై సుతశతంబులఁ గాంచి తనునాదిపురుషుఁ గూర్చి। శరణన్న వారినిఁ గరుణించి పాండవ కౌరవులకు ననంతకలహమైన। నందఱు నసమయించి వర్జును గెలిపించి యుద్ధవునకుఁ దత్త్వమొప్పఁ జెప్పి। మగధ పాండవ సృంజయ మాధవ శాస్త్రా। భోజవృష్ణ్యంధకాది సంపూజ్యుఁ డగుచు। నుర్విభరము నివారించి యుండనొల్లఁ। కానుహోమూర్తి నిజమూర్తియందుఁ బొందె॥ చ॥ నగుమొగము న్సుమధ్యమును నల్లని దేహముల చ్చి కాటపట్టగు నురము న్మహా భుజములం చితకుండలకర్ణముల్మదే। భగళియు నీలవేణియుఁ గృపారసదృష్టియుఁ గల్గు వెన్నుఁడి। మ్ముగఁ బొడసూపు గాత కసుమా సినయప్పుడు విచ్చునప్పుడున్॥ అని చెప్పి॥ .. ... ... ... ... ... ... ...

క॥ జనకసుతాహృచ్చోరా। జనకవచోలబ్ధ విపినశైలవిహారా। జనకామితమందారా। జనకాలిమ సోఖ్యరాళి శయనసంచారా॥

మాలిని॥ జగదుపవనచారీ సర్వలోకోపకారీ। సుగుణఘనవిహారీ సుందరీమానహారీ।

విగతకలుషదోషీ వీరవిద్యావిలాసీ। స్వగురుహృదయపోషీ సర్వదా సత్యభాషీ॥

గద్య॥ ఇది శ్రీపరమేశ్వర కరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రి పుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీమహాభాగవతంబను మహాపురాణంబునందు సూర్యవంశారంభంబును, వైవస్వతమనుజన్మంబును, సోమచంద్ర కథనంబును, సుద్యుమ్నాదిమనుసూనుల చరిత్రంబును, మరుత్తు తృణబిందు శర్యాతి కకుద్మి నగర నాభాగ ప్రముఖుల చరిత్రంబు, నంబరీషునియందుఁ బ్రయోగింపఁబడిన దుర్వాసునికృత్య నిరర్థకయగుటయు, నిక్ష్వాకు వికుక్షి మాంధాతృ పురుకుత్స హరిశ్చంద్ర సగర భగీరథ ప్రముఖుల చరిత్రంబును, భాగీరథీ ప్రవాహవర్ణనంబును, కల్మాషపాద ఖట్వాంగ ప్రముఖుల వృత్తాంతంబును, శ్రీరామచంద్ర కథనంబును, తదీయవంశపరంపరాగణనంబును, నిమికథయును, చంద్రవంశారంభంబును, బుధపురూరవుల కథయును, జమదగ్ని పరశురాముల వృత్తాంతంబును, విశ్వామిత్ర నహుష యయాతి పూరు దుష్యంత భరత రంతిదేవ పాంచాల బృహద్రథ శంతను భీష్మ పాండవ కౌరవ ముఖ్యుల జన్మంబును, ఋశ్యశృంగ వ్రతభంగంబును, ద్రుహ్యానుదుర్వసుల వంశంబును, యదు కార్తవీర్య శశిబిందు జామదగ్న్యాదుల చరిత్రంబును, శ్రీకృష్ణావతార కథాసూచకంబును, ననుకథలుగల నవమస్కంధము సంపూర్ణము

శ్రీ రుక్మిణీసత్యభామాసమేత శ్రీగోపాలకృష్ణార్పణమస్తు.

[illegible]దవ|భూమీశులకెల్ల మొదలిపురియయ్యె నృపా॥ సీ॥ ఆశూరసేనున కాత్మజుండగు వసుదేవుఁ డాపురి నొక్క దినము
[illegible]| దేవకిఁ బెండ్లియై దేవకియును దానుఁ గడు వేడ్కఁ రథ మెక్కి కదలు వేళ|ను గ్రసేనుని సుతుం డుల్లాసి కంసుఁడు చెల్లెలు గు
ఱిదియునుల్లసిల్ల| *హరులపగ్గములఁ జేనందిశిరొప్పఁ దొడంగె మృదంగభేరులు మురజములును | శంఖపటహములును జడి
గొని మ్రోయంగ|ఁ గూఁతుతోడ వేడ్కఁ గొనలుసాఁగ| దేవకుండు సుతకు దేవకీదేవికి|నరణమీఁదలం బియ్యావరించి॥ వ॥ సార్థం
బులైన రథంబుల వేయిన్నెనమన్నూటిని గనకదామ సముత్తుంగంబులైన మాతంగంబుల నన్నూటిని బది వేల తురంగంబుల
సువిలాసవతులైన దాసీజనంబుల నిన్నూటి నిచ్చి యనిచినం గలివరవధూయుగళంబు తెరువునఁ జను సమయంబున॥ క॥ ప
గ్గములు వదలి వేగిర| ¶మగ్గలముగ రథముఁ గడపు నా కంసుఁడు లో| బెగ్గిలి యెగ్గని తలఁకఁగ| దిగ్గన నశరీరవాణి దివి నిట్లని
యెన్. క॥ ◊తుష్టయగు భగిని మెచ్చఁగ|సిష్టుఁడవై రథముఁ గడపె దెలుఁగవు మీఁద|న్నష్టయగు నీ తలోదరి|యష్టమగర్భంబు ని
న్నుహరియించుఁ జుమీ॥ వ॥ అని యిట్లాకాశవాణి పలికిన నులికిపడి భోజకులపాంసనుండైన కంసుండు సంచలదంసుండై కేల య
డిదంబు బెడిదంబుగఁ బెఱికి ఝళిపించి దెప్పరంబున ననుజకొప్పుఁ బట్టి కప్పురపు పాటున నొప్పు అందిగి చియొడిసి పట్టి తోఁబుట్టు
వనితలంపక తెంపుఁ జేసి తెగ వ్రేయఁ గమకించు సమయంబున వసుదేవుండు డగ్గఱి॥ క॥ ఆపాపచిత్తు నుత్తుం|గోపాగ్నిశిఖాను
వృత్తుఁ గొనకొని తనస|ల్లాపామృతధారావి|క్షేపణమునఁ గొంత శాంతుఁ జేయుచుఁ బలికెన్॥ ఉ॥ అన్న నీవు చెల్లెలికి న
క్కటమాడలు చీరె లిచ్చుటో| మన్నన సేయుటో మధురమంజులభాషల నాదరించుటో|మిన్నుల మ్రోఁత లేనిజము మేలని
చంపకు మన్నమానిసా|వన్న సహింపు మన్నఁ దగదన్న వధింపకు మన్న వేఁడెదన్॥ అదియునుంగాక॥ మ॥ చెలియల్ కన్నియ
ముద్దరాలబలనీ సేమంబె చింతించు ని| ర్మలదీనిన్ బ్రియలాడుమాటలకునై మర్యాదఁ బోఁగొట్టిన| త్కులజాతుండవు పుణ్య
మూర్తి వకటా కోపంబు పాపంబు నే|చ్చెలి నో శౌర్యా తెగ వ్రేయఁ బాడియగు నే చింతించు భోజేశ్వరా॥ సీ॥ మేనితోడన పు
ట్టు మృత్యువు జనులకు నెల్లి నేఁడైన నూఱేండ్లకైన| దెల్లంబు మృత్యువు దేహంబు పంచత నొందఁగ గర్మానుగుఁడై శరీరి|మా
రు దేహముఁ జొచ్చి మఱితొంటి దేహంబుఁ బాయును దనపూర్వభాగ మెత్తి| వెఱతొంటి పైఁ జెట్టి వెనుకభాగం బెత్తఁగమనిం
చు ◊తృణజలూకయును బోలె| వెంటవచ్చు కర్మవిసరంబుమును మేలు|కన్న వేళ నరుఁడు గన్నవిన్న| తలఁపఁబడిన కార్యతం
త్రంబు కలలోనఁ|బాడితోఁడఁ గానఁబడినయట్లు॥ క॥ తనతొంటి కర్మరాశి|ననుచరమై బహువికారమైన మనముపడిం| జను
నింద్రియముల తెరువులఁ|దనువులు పెక్కైనఁ జెడవు తన కర్మంబుల్ ॥ గీ॥ జలఘటాసులందుఁ జంద్రసూర్యాదులు|గానఁబ
డుచు గాలిఁ గదలు భంగి|నాత్మకర్మనిర్మితాంగంబులను బ్రాణి|గదలుచుండు రాగకలితుఁడగుచు॥ క॥ కర్మములు మేలు నిచ్చె
డు|కర్మంబులు కీడు నిచ్చు కర్తలు దనకున్|గర్మములు బ్రహ్మకైనను|గర్ముఁడై పరులఁ దడవఁగా నేమిటికిన్॥ క॥ కావునఁ బరు
లకు హింసలు|గావింపఁగవలదు తనకుఁ గల్యాణముగా భావించి పరుల నొంచినఁ|బోవు నైతత్ఫలము పిదపఁ బొందక యున్నే॥
మత్తకోకిల॥ వావిఁ జెల్లెలు గాని కూఁతురు వంటి మత్తను రాలు సం|భావనీయచరిత్ర భీరువు బాలనూత్న వివాహను | శ్రీవి
లాసినిదీనఁ గంపితచిత్త నీకిది మ్రొక్కెదం|గావవే కరుణామయాత్మక కంసమానవవల్లభా॥ వ॥ అని మఱియు సామభేదం
బులగు పలుకులు పలికిన పినియు వాఁడు వేఁడిచూపుల రాలు నిప్పులు కుప్పలుగొన §ననుకంప లేక తెంపుఁ జేసి చంపకగంధిం జం
పఁ జూచుట నెఱింగి మొఱంగెడి తెఱంగు విచారించి తనలో నిట్లనియెం. క॥ ఎంచను గాలము నిజమని|పంచతనంబునను బుద్ధిఁ బా
యక ఘనులై|యొందాఁక బుద్ధి నెగడెడి|నందాఁకఁ జరింపవలయు నాత్మబలమునన్॥ అని నిశ్చయించి॥ సీ॥ ఆపన్నురాలైన
యంగన రక్షించి సుతుల నిచ్చెద నన్న శుభము నేఁడు|మీఁదెవ్వఁడెఱుఁగును మెలఁత ప్రాణముతోడ నిలిచిన మఱువాఁడు నేర
రాదె|సుతులు పుట్టిరియేని సుతులకు మృత్యువు వాలాయమై వెంటవచ్చెనేని| బ్రహ్మచేత నువీఁడు పాపేమియును లేక యుం
డునే సదుపాయ మొకటలేదె|పొంతమ్రాకులఁ గాల్పక పోయి[illegible]| యొగని ||దవ్వులవాని దహించు భంగిఁ| గర్మవశము
నభవమృతికారణంబు దూరగతిఁ బొందు నదియేల తొట్రుపడఁగ॥ క॥ కొడుకుల నిచ్చెద నని సతి|విడిపించుట నీతి వీఁడు విడిచిన
మీఁద|న్గొడుకులు పుట్టిన కార్యము|వడఁబడదే నాఁటికొక్కదైవము లేదే॥ క॥ ఎనిమిదవ చూలు వీనిన్|దునుమాడెడి నంచు మింట
దోరపు పలుకు|ల్వినఁబడియె నేల తప్పను|వనితను విడిపించుటొప్పు ♣వైశంబనుచున్॥ క॥ తిన్ననిపలుకులు వలుకుచుఁ| గ్రన్న

* హరులపగ్గములు|గుఱ్ఱములనీడ్చు పట్టుత్రాళ్లు. ◊శిరొప్పఁ దొడంగెన్|తోలుట కారంభించెను. మురజ|మద్దెల, పటహ|తప్పెట, కనకదామ|బంగారుగొలుసులు. సముత్తుంగ|మిగుల పొడవులైన, మాతంగ|ఏనుఁగు, తురంగ|గుఱ్ఱము, అనిచినన్|పంపఁగా. ¶అగ్గలము|అధికము, బెగ్గిలి|భయపడి. ◊తుష్టయగు భగిని|తుష్టయగు|సంతసిల్లుచున్న, భగిని|తోఁబుట్టిన దేవకీదేవి. ‡అడిదము|కత్తి. ◊తృణజలూక|పచ్చికపురుగు, విసరము|సమూహము. §అనుకంప|దయ, మొఱంగెడి|ఏమఱించెడు. ||దవ్వులవానిన్|మారమ్మునందుండెడివానిని. ♣వైశము|క్రన్నన-శీఘ్రము.

నందగంబూజఁ జేసి కంసు *నృశంసున్ మన్నించి చిత్తమెఱియఁ బ్రసన్నాననుఁడగుచుఁ బలికె శౌరి నయోక్తులనన్॥ క॥ లలనకుఁ బుట్టిన కొమరుని వలనం దెగెదనుచు గగనవాణి పలికెనం; చలిగెద వేని మృగాక్షికిఁ గలకొడుకులఁ జంపనిత్తుఁ గ్రమమున నీకున్॥ వ॥ అని యిట్లు పలికిన విని కంసుండు కంపి*తావతంసుండై సంతసించి గుణగ్రాహిత్వంబు గైకొని కొండలమందు చెలియలి ముందల విడిచి భిన్నని యె వసుదేవుండును బ్రతుకుకుం దలఁగంటిననుచు సుందరీయుండై తన మందిరంబునకుం బోయి డెందంబున నానందంబు నొందియుండెనంతఁ గొంత కాలంబు చనిన సమయంబున॥ క॥ ఎడపక కంసుని యొగ్గులఁ బడి దేవకి నిఖిల దేవభావము దనకే ప్పడ నేఁట నొక్కని రెక్కసు గొడుకుల నేనెనుం డ్రకొక్కరొకఁతుం గనియెన్॥ అందు॥ గీ॥ సుదతి మున్ను గన్న సుతుఁ గీర్తిమంతుని పుట్టుఁ గడవఁ గంసభూవరునకుఁ దెచ్చియిచ్చె జాలద్యుతి గల్గి వసుదేవుఁ డాసపడక సత్యమందు నిలిచి॥ క॥ పలికిన పలుకులు విరుగక సొలయక వంచనము లేక సుతు నగ్గిపునకున్ అలుగక యిచ్చె నదీయుఁ డిలవసుదేవుండు దక్క నితరులు గలరే॥ గీ॥ మానవేంద్ర సత్యమతికి ముప్పరమెయ్యి చెఱుఁగ నేర్చువానికిష్టమెయ్యి దీశభక్తిరతునికి రానిదెయ్యది యొఱుఁగ లేనివానికేది కీడు॥ ఇట్లు సత్యంబుఁ దప్పక క్లొక్క కును నొప్పించిన వసుదేవుపలుకులు విని సలుకకడకు మెచ్చి కంసుం డిట్లనియె॥ గీ॥ కొడుకు నీవు మఱలఁ గొనిపొమ్ము వసుదేవ వెఱపు లేదు నాకు వీనివలన నల్గ వీనికి భవదష్టమపుత్రుండు మృత్యువఁట వధింతు మీఁద్వతని॥ వ॥ అని సశిశు *నానకదుందుభి నూదనుఁ గొని చనియును ఆనందంబు నొందక దుష్టభావుండగు బావ పలుకులు విని యునులకుచుండె నంత॥ సీ॥ ఒక నాఁడు నారదుం †డొయ్యనఁ గంసుని యింటికిఁ జనుదెంచి యేకతమున మందలోపల నున్న నందాదులును వారి భార్యలు పుత్రులు బాంధవులును దేవకి మొదలగు తెఱవలు వసుదేవుఁ డాదిగాఁ గల వర్వయాదవులును సురలు గాని నిజంబు నరులు గారని చెప్పి కంసుండ నీవు రక్కసుఁడవనియు దేవహయుఁడు వక్రి దేవకీ దేవికిఁ బుత్రుఁడై జనించి భూతలంబు చెఱుపఁ బుట్టినట్టి చెనఁటి దైత్యుల నెల్లఁ జంపుననుచుఁ జెప్పి చనియె దివికి॥ క॥ నారదు మాటలు విని పెల్లారాటముఁ బొందియసువ్ర*నిమిషులనియున్ నారాయణకరశిక్షవిదారితుఁడగు కాలనేమి దానని యుమదిన్॥ వ॥ కలగం బాఱినవఱంది జెల్లెలిను గ్రక్రోధుఁడై పట్టి బద్ధులఁ గావించి హరింపలంది వెసఁదోడ్తో వారుగన్నట్టి పుత్రులఁ జంపె నుగ్రసేనుయ మాఁద దోర్బలాంధకాధీశుసుగ్మలుఁ బట్టెనదుగ్రాలి యే లేఁబు నూరన్నూరసేనంబులన్॥ గీ॥ తల్లిఁ దండ్రి నైన దమ్ముల నన్నల సఖులనైన బంధుజనులనైన రాజ్యకాంక్షఁ జేసి రాజులు చంపుదు రవనిఁ దఱుచు జీవితార్థులగుచు॥ వ॥ మఱియు బాణబౌమమాగధమహాశనకేశిధేనుకబకప్రలంబతృణావర్తచాణూరముష్టికారిష్టద్వివిదపూతనాది సహాయసమేతుండై కంసుండు ‡కదనంబున యదుబులడంచిన వదనంబులు వంచికొని సదనంబులు విడిచి యదుపదలై యదువులు పసువులు వదలి నిషధ కురు కో*సల విదేహ విదర్భ కేకయ పాంచాల సాల్వ దేశంబులు సొచ్చి రిమ్చ్చరంబులు పిడిచి కొండఱు కంసునిం గొలిచిరంత॥ క॥ *తొడితొడిఁ గంసుఁడు దేవకి కొడుకుల నార్వురవధింప నుమ శేషాఖ్యం బొడవగు హరిరుచియా సతి కడుపున నేడవ దివ్యమైన గర్భం బయ్యెన్॥ అయ్యవసరంబున విశ్వరూపుండగు హరి తన్ను నమ్మిన యదువులకుఁ గంసునివలన భయంబు గలుగునని యెఱింగి యోగమాయా దేవి కిట్లనియె॥ సీ॥ గోపికాజనములు గోపాలకులును న్నపసుల మందకుఁ బొమ్ము భద్ర నీవు వసుదేవు భార్యలు వరుసఁ గంసుని చేత *నాఁకలఁబడియుండ నందుఁ జొరక తలఁగి రోహిణి యను తరలాక్షి నందగోకులమందు నున్న దిగుణగణాఢ్య దేవకి కడుపున దీపించు శేషాఖ్యమైన నా తేజమివ్వనరఁ బుచ్చి నేర్పు మెఱసి రోహిణీ దేవి కడుపునఁ జొనుపు దేవకికిని సుతుఁడనగుదు నంశభాగయుతుఁడనై యశోదకు నందు పొలఁతి కడుపు నందుఁ బుట్టెదీవు॥ క॥ నానావిధసంపదలకుఁ §దానకమై సర్వకామదాయినివగు నిన్మానవులు భక్తిఁ గొలుతురు కానుకలును బలులు నిచ్చి కల్యాణమయీ॥ వ॥ మఱియు నిన్ను మానవులు దుర్గ భద్రకాళి విజయ వైష్ణవి కుముద చండిక కృష్ణ మాధవి కన్యక మాయ నారాయణి యీశాన శారదాంబికయను పదునాలుగు నామంబులం గొల్చి యుండుదు రాయా స్థానంబులయందని యెఱింగించి సర్వేశ్వరుండగు హరి పొమ్మని యానతిచ్చిన మహాప్రసాదంబని యయ్యోగనిద్ర యుఖ్యాకొని మ్రొక్కి చయ్యనని య్యులకయ్యెడ వాసి వచ్చి॥ గీ॥ దేవకీదేవి కడుపులోఁ దేజరిల్లు దీప్తగర్భంబు మెల్లనఁ దిగిచి యోగనిద్ర రోహిణి కడుపున నిలిపి చనియెఁ గడుపు దిగెనంచుఁ బౌరులు గలఁగఁబడఁగ॥ అంత॥ గీ॥ బలము మిగులఁ గలుగ బలభద్రుఁ డనలోకరమణుఁడగుటఁ జేసి రాముఁడనఁగ సతికిఁ బుట్టె గర్భసంకర్షణమున సంకర్షణుండనంగ ఘనుఁడు సుతుఁడు॥ తదనంతరంబ॥ క॥ ఆనకదుందుభిమనమున శ్రీనాథుండంశభాగ శిష్టతఁ

---

*నృశంసున్ = హంతకుఁడైన, శౌరి = వసుదేవుఁడు. *కంపితావతంసుండై = శిరఃకంపనము చేసినవాఁడయి, కొంచలమందు = దుఃఖించుచున్న. *ఆనకదుందుభి = వసుదేవుఁడు †ఒయ్యనన్ = తిన్నఁగా, ఏకతమునన్ = ఏకాంతమందు *అనిమిషులు = దేవతలు ‡కదనము = యుద్ధము, వదనము = ముఖము, సదనము = గృహము. *తొడితొడి = వెంబడివెంబడిగాను *ఆఁకలన్ = చెరసాలలయందు. § తానకము = స్థానము.

జొరఁగన్; భానురు దినతఁడు వెలిఁగెను; గానఁ గఁబట్టయ్యె భూతగణములకు నృపా. ఉ॥ ఆవసుదేవుఁ డంతఁ దనయందఖిలా త్మకమాత్మభూతము నభావన రేఖయున్న భువనభ్రమునై వెలుఁగొందుచున్న లక్ష్మీవిభు తేజముం బ్రపదఁ జేర్చినఁ దాల్చిన దీన కాంతితోఁ దేవకి యొప్పెఁ బూర్వయగు దిక్సతి చంద్రునిఁ దాల్చునట్లు వడిన్. వ॥ అనిన విని తరువాతి వృత్తాంతం బెట్లయ్యెన ని రాజడిగిన శుకుండిట్లనియె. క॥ గురుతరముగఁ దన కడుపున సరసిజగర్భాండ భాండచయములుగల [illegible] హరి దేవకికిఁ గడుపున భూభరణార్థము వృద్ధిఁ బొందె బాలార్క క్రియన్. అంత॥ సీ॥ *విమతుల మోములు వెలవెలఁ బాఱంగ విమలాస్య మోము వెల్లవెలఁ బాఱె; నలయు పైరుల కీర్తి మాసినట్లన సాఁగ నాభి చూచుకములు నల్లనయ్యె; ముప్పాలయంబుల ధూమరే ఖలు పుట్ట లేమ యారున రోమరేఖ మెఱసె; నరిమానసముల నాహారవాంఛలు దప్ప వనజాక్షి కాహారవాంఛ దప్పె; శత్రు ము సంధిశైలరిపులకు శ్రమము గదుర; †జడత వాటిల్లె శత్రులు జడను పడఁగ; మన్ను రుచియయ్యెఁ బగతురు మన్ను చొరఁగ; వె లఁది యుదరంబులో హరి వృద్ధిఁ బొంద. మఱియును. సీ॥ ‡సలిలమా యెలనాగ జఠరాగ్నికి నిఁగాన [illegible]నై వడి ఘర్మ సలిల మొప్పె; నెగిఁ దేజమా యింతి యుదర డింభకుఁ గోల్పోఁగదసిన క్రియ దేహకాంతి మెఱసెఁ; బవనుఁ డాకొన్న గర్భస్థుని సే వింప నొప్పుతో మిక్కిలి యూర్పులమరెఁ; గుంభిని యాలేమ కుక్షి గుడర్పింపఁ జొచ్చు భంగి నిమ్ముటి చొరవదినరె; గగనమిం దువదన కడుపులో బాలుసేయ నలసరూపు మెఱసి వచ్చినట్లు [illegible]యులువంటి నడుము బహుళాకనయ్యె నుబంచ భూతమయుఁడు లోనఁ బొడలసతికి. తదనంతరంబ॥ సీ॥ అలివ¶కాంచీగుణంబుల్ల నబిగియంగ వైరివధూగుణవ్రజము వదలె; మెల్లనఁ దన్వంగి మెయిదీఁగె మెఱుఁగెక్కుడ స్తాంగనా తనువ్యతుల డంగె; నాతికి ల్లనభూషణములు పల్వలకఁగాఁ బరసతీభూషణ పఙ్క్తులెడలెఁ; గలకంఠికొయ్యన గర్వంబు దొడ్డగాఁ బరిపంథి దారగర్వములు వగిలెఁ; బోలఁతికంతంత సిల్లాడ ప్రొద్దులెను గ నహితవల్లభలై మవలై తనర్చె; ప్రొద్దులన్నియుఁ గ్రుమమునఁ బోవఁ దొడఁగె నువిద కడుపున నసురారి యుంటఁ జేసి॥ ఇ వ్విధంబున. గీ॥ ‖జ్ఞానఖలుని లోని శారదయును బోలె; ఘటములోని దీపకళిక వోలె; భ్రాతయింట నాఁకఁ బడియుండె దేవకీ కాంత విశ్వగర్భగర్భయగుచు. వ॥ అంతనక్కాంతాతిలకంబు నెమ్మొగంబు తెలివియును మేని మెఱుంగును మెలంగడిసొబ గుసుంబూని వెఱఁగుపడి తలఁపు వెలచుచుఁ గంసుండు తనలో నిట్లనియె. క॥ కన్నుల పండువుఁ జూడఁ బరువునై; యున్నది యొలనాగ గర్భముల్లనుగలఁగ; నెన్నఁడు నిట్లుండదు; ¶వెన్నుఁడు చొరఁబోలు గర్భవివరములోనన్. ఉ॥ పనితల్లంచు వాఁడసురెక నెయ్యది గార్యము వాఁడు నాఁటికిన్నామిని చూలు పెంపెసఁగె గర్భిణి జెల్లెలి వాఁడు పేదనే; నేసుని చంపువాఁడు పగ వేలని చంపితినేని శ్రీయును ద్దాసుయశంబు నాయువును ధర్మమును జెడిపోవకుండునే. క॥ వావి నెఱుఁగని క్రూరుని జీవన్మృతుఁ డనుచు నింద సేయుదురతఁడు నొవ్వును నరకమున నపుడు ర్జ్ఞానముతో బ్రతుకుటకు బ్రతుకే తలఁపన్. వ॥ అని నిశ్చయించి క్రౌర్యంబు విడిచి ధైర్యంబు నొంది గాంభీర్యంబు వాటించి శౌర్యంబు ప్రకటించికొనుచు దిగ్గనం జెలియలిం జంపు ||నగ్గలిక యొగ్గని యుగ్గడించి మానినమానియుం బోలెను మార కుండియు. గీ॥ పాపరాని దొడ్డపని పుట్టనీక నెట్టు నింటను ముకిం జక్రి యొపు డు పుట్టుఁ బుట్టినపుడె పట్టి పురిటింటిలోఁ డెగఁ జూతు ననుచు నెమెఱు చూచుచుండె. వ॥ మఱియు వైరానుబంధంబున నన్వా నుసంధానంబుల మఱవియతండు. క॥ ఉరుగుచుఁ గుడుచుచు మంద్రాపుచు నొసుచుఁ నూర్పుండి లేచు చనవరతంబున్ హరిఁ దలఁచి తలఁచి జగమూ హరిమయమై చూచెఁ గంసుఁ డాఱని యలుకన్. వెండియు. సీ॥ ※శ్రవణరంధ్రముల నే శబ్దంబు వినఁ బడున దిహరి రవమని యాలకించు; నక్షిమార్గమున నెయ్యది చూడఁబడున దిహరిమూర్తిగా నొప్పునంచుఁ జూచుఁ; దిరుగునో దేహంబు తృణమైన సోఁకిన హరి కరాఘాతమో యనుచుఁ గలఁగు; గంధంబులేమైన ఘ్రాణంబు సోఁకిన హరిమాలికాగంధమ నుచు నదరుఁ; బలుకు లెవ్వియైనఁ బలుకుచో హరిపేరు పలుకఁబడియె నని బ్రమసి పలుకుఁ; దలఁపులెట్టివైనఁ దలఁచి యాంత లఁపులు హరితలంపులని మూనలుఁగఁ దలఁచు. వ॥ అయ్యవసరంబున నసుపర్షమేత్తలైన దేవతలును నారదాది మునులును గూ డిన డుపనలువయును [illegible]ంటి యునక్కడికి వచ్చి దేవకీదేవి గర్భాభ్యంతరుండగు పురుషోత్తము నిట్లని స్తుతియించిరి. సీ॥ సత్య

---

*విమతుల మోములు। శత్రువుల ముఖములు, విమలాస్య। నిర్మలమయిన ముఖముగల దేవకీదేవి యొక్క, వెల్లవెలఁ బాఱెన్। తెలతెలపాఱెను, నలయు। వ్యాపించియున్న. చూచుకములు। చన్నుమొనలు, ధూమరేఖలు। తోఁకచుక్క మొదలగు నుత్పాతములు, లేమ యారునన్। దేవకీదేవి నూ గారున. †జడత। జడను, మాంద్యము। జలహీనమై మందపడుట, పగతురు। పగవారు. ‡సలిల—వడిన్। సలిలము। జలము, ఆయెలనాగ। ఆ దేవకీదేవి యొక్క, జఠరా[illegible]నిఁగానన్। గర్భమందలి బిడ్డను చూచుటకు, చనినదై వడిన్। పోయినట్లోయనునట్లుగాను, ఘర్మసలిలము। చెమటనీరు, ఉ గిన్। క్రమముగా, ఉదర। గర్భమందలి, డింభకున్। శిశువును, కుంభిని। భూమి. ¶కాంచీ। ఒడ్డాణము, గుణము। దారము, పల్వలకగాన్। బిగువు గాఁగా. ‖జ్ఞానఖలుని లోని। విపరీతజ్ఞానముగలవాని యందలి, శారదయును బోలెన్। విద్యవలెనే. ¶వెన్నుఁడు। విష్ణువు. ||అగ్గలిక। ఉత్సాహము. ※శ్రవణ। చెవి. అక్షి। నేత్రము. కరాఘాతము। చేతిదెబ్బ. ఘ్రాణము। నాసికము.

**——శ్రీ బ్రహ్మ మొదలగు దేవతలు దేవకీగర్భస్థుఁడగు దేవుని స్తుతించుట. శ్రీ——**

ప్రభుని* నిత్యసంప్రాప్తసాధనుఁ గాలత్రయమునందుఁ గలుగువాని। భూతంబులై జనుబుట్టుచుఁబోవువాని నై భూతంబులందు నుండువాని। నై భూతంబులు నడఁగిన పిమ్మటం బరగువాని నిసత్యభాషణంబు। సమదర్శనంబును జరిపెడువానిని నిన్నాశ్రయింతుము నీయధీన। మాయచేత నెఱుక మాలినవారలు। పెక్కుగతుల నిన్నుఁ జేరుకొందు। రెఱుఁగ నేర్చు విబుధులేక చిత్తంబున। నఖిలమూర్తులెల్ల నీవయండ్రు॥ అదియునుంగాక॥ సీ॥ (†)ప్రకృతి యొక్కటి పాదు ఫలములు సుఖదుఃఖములు రెండు గుణములు మూఁడు వేళ్ళు। రసంబులు నాల్గు ధర్మార్థముఖరంబు లెఱిఁగెడి విధములై దింద్రియంబు। లాఱు స్వభావంబు లాఱు శోక మోహాదు లూర్ములు ధాతువు లొక్కయేడు। పైపొరలెనిమిది ప్రంగలు భూతంబులై దు బుద్ధియు మనోహంకృతులును। రంధ్రములు తొమ్మిదియుఁ గోటరములు ప్రాణ। పత్రదశకంబు జీవేశపక్షియుగము। గలుగు సంసారవృక్షంబు గలుగఁజేయఁ। గావ నడఁగింప రాజవొక్కరుఁడ వీవ॥ క॥ నీ దెసఁ దమచిత్తములిడి। యే దెసలం బోక గడుతురెఱుక గలుగువా। రా మూఁడయ మనుక్రియ నీ। పాదంబను నావకతన భవసాగరముల్॥ గీ॥ మందివారికెల్ల మంగళప్రదమగుఁ। గల్లరులకు మేలుగా నియత్తి తనువులెన్నియైనఁ దాల్చి లోకములకు। సేమమెల్లఁ బ్రొద్దు సేయు దీవు॥ క॥ ఎఱిఁగినవారంజనుచును। గొఱమాలిన యెఱుక లెఱిఁగికొండు నీ పే। రెఱిఁగియుఁ దలఁపఁగ నెల్లరు। పఱకుర ధోగతులజాడఁ బద్మదళాక్షా॥ క॥ నీవారై నీదెసఁ దమ। భావంబులు నిలిపి ఘనులు భయవిరహితులై। యే విఘ్నంబులఁ జెందక। నీవరయఁగ మేటిచోట నెగడుదు రీశా॥ క॥ నిను (‡)నాలుగాశ్రమంబుల। జనములు సేవింప నఖిలజనముల సత్త్వం। బును శుద్ధంబును శ్రేయం। బును నగుగాత్రంబు నీవు పొందుదువు హరీ॥ సీ॥ నళినాక్ష సత్త్వగుణంబు నీగాత్రంబుగా దేని విజ్ఞానకలితమగుచు। నజ్ఞానభేదనంబగు నెట్లు గుణములయందును వెలుఁగు నీవను మతింప। బడునువు సత్త్వరూపంబు సేవింపంగ సాక్షాత్కరింతువు సాక్షివగుచు। వాఙ్మనంబులకు నవ్వలనైన మార్గంబు గలుగు నీ గుణజన్మకర్మరహిత। మైన రూపము చేరు నత్యనఘబుద్ధు। లెఱుఁగుచుండురు నిన్నుఁ గొల్వను మహింపుకొనుచు। వినుచుఁ దలఁచుచుఁ బొగడుచు వెలయువాఁడు। భవము నొందఁడు నీ పాదభక్తుఁడగుచు॥ క॥ ధరణీభారము వాసెను। బురుషోత్తమ యీశ నీదు పుట్టువునభవ। చ్చరణాంబుజముల ప్రాపున। ధరణియు నాకసముఁ గాంచె దమునీకరుణన్॥ ఉ॥ పుట్టువులేని నీక భవ పుట్టుటక్రీడయె కాక పుట్టుకే। యెట్టను మర్భభవాదిదశ లెల్లను జీవమునం దవిద్యఁ దాఁ। బుట్టుచునుండుఁగాని నినుఁ బుట్టినదింబలెఁ బొంతనుండియుం। జుట్టఁగలేని తత్క్రియలఁ జొక్కనియొక్కటివాఁడ వీశ్వరా॥ సీ॥ (§)గురు పాఠీనమవై జలగ్రహమవై కోలంబవై శ్రీస్తకేసరివై భిక్షుఁడవై హయాననుఁడవై బ్రహ్మదేవతాభర్తవై। ధరణీనాథుఁడవై దయాగుణగణోదారుండవై లోకముల్। పరిరక్షించిన నీవమొక్కవమి లాభారంబు వారింపవే॥ క॥ (¶)మ్రుచ్చిలి యున్నది లోకము। నిచ్చలుఁ గంసాదిఖలులు నిర్దయులేపన్। మచ్చికఁ గావఁగ వలయును। విచ్చేయుము తల్లికడుపు వెడలి ముకుందా॥ అని మఱియు దేవకీదేవితో నిట్లనిరి॥ మత్తకోకిల॥ తల్లి నీయుదరంబులోనఁ బ్రధానపూరుషుఁడున్నవాఁ। డెల్లి పుట్టెడిఁ

*నిత్యసంప్రాప్తసాధనున్॥ నిత్య। శాశ్వతమైన మోక్షమును, సంప్రాప్త। పొందించుటకు, సాధనున్। సాధకమైనవాఁడును, భూతంబులైదును॥ భూ। జల, అగ్ని। వాయు, ఆకాశములను పంచభూతములును. పుట్టు। జనించుటకు, పెక్కుగతులన్। అనేకమార్గములచేత, పేరుకొందురు। పలుకుచుందురు. (†)ప్రకృతి యొక్కటి పాదు। వ్యష్టిసమష్ట్యాత్మకమగు సకలజగదుత్పత్తినాశనముఁ జేయుచు నేకస్వరూపమైన బ్రహ్మశక్తియే ఆలవాలము. అనఁగా సంసారమనెడి వృక్షోత్పత్తిస్థితినాశములకు బ్రహ్మశక్తియే ఆలవాలమనితా. గుణములు మూఁడు। రాజసతామససాత్త్వికములు. ధర్మార్థముఖరముల్। ధర్మ-అర్థ-కామ-మోక్షములు. ఎఱిఁగెడివిధములైదింద్రియంబు। శ్రోత్ర-త్వక్-చక్షు-జిహ్వా-ఘ్రాణములు విషయములగు శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములను తెలిసికొనెడు మార్గములు, ఆఱు స్వభావంబులు। అస్తి-జాయతే వర్ధతే-పరిణమతే-అపక్షీయతే-నశ్యతి-అనునవి యాఱును సహజములు, ఆశోకమోహాద్యులూర్ములు। అశన-పిపాస-శోక-మోహ-జరా-మరణములాఱును, దుఃఖధర్మములు, ధాతువులొక్కయేడు పైపొరలు। త్వక్-మాంస-రుధిర-మేదః-మజ్జ-అస్థి-స్నాయువులు-యేడును మీఁదిపొరలు, భూతంబులైదును। భూమ్యాదిపంచభూతములును, బుద్ధియు। నిశ్చయాత్మకమయిన బుద్ధియును. మనోహంకృతులును॥ మనః। చంచలాత్మకమయిన మనస్సు, అహంకృతులును। కర్త్రాత్మకమయిన అహంకారమును, ఎనిమిది ప్రంగలు। ఈ యెనిమిది శాఖాద్వయమూలములు, రంధ్రములు తొమ్మిదియుఁ గోటరములు, నవరంధ్రములే తొఱ్ఱలు ప్రాణపత్రదశకంబు। ప్రాణ। అపాన-వ్యాన-ఉదాన-సమాన-నాగ-కూర్మ-కృకర। దేవదత్త-ధనంజయములను పదివాయువులే ఆకులు. జీవేశపక్షియుగము॥ జీవ। కించిజ్జ్ఞత్వాదిలక్షణలక్షితుఁడైన జీవుఁడు. ఈశ। సర్వజ్ఞత్వాదిలక్షణయుక్తుఁడైన యీశ్వరుఁడును. పక్షియుగము। రెండుపులుగులు, కలుగుసంసారవృక్షంబున్। కలిగియున్న ప్రపంచశరీరసంజ్ఞ గల వృక్షమును. కలుగఁజేయన్। పుట్టించుటకు, కావన్। రక్షించుటకు, అడఁగింపన్। నశింపఁజేయుటకు, రాజవొక్కరుఁడవీవ। ప్రభువు నీవొక్కఁడవే సు.—— (‡)నాలుగాశ్రమంబుల। బ్రహ్మచారి-గృహస్థ-వానప్రస్థ-యత్యాశ్రమములచేత. (§)గురుపాఠీనమవై। మహామత్స్యస్వరూపుఁడవై, జలగ్రహమవై। కూర్మావతారుఁడవై, కోలంబవై। వరాహాకారుఁడవై, బ్రహ్మదేవతాభర్తవై। బ్రాహ్మణశ్రేష్ఠుఁడవై, అనఁగాఁ బరశురాముఁడవై, ధరణీనాథుఁడవై। రాజవై, అనఁగా శ్రీరాముఁడవై. (¶)మ్రుచ్చిలియున్నది। మనోదుఃఖమును జెందియున్నది, నిచ్చలున్। నిరంతరమును, ఏపన్। బాధింపఁగా, మచ్చికన్। ప్రీతితో.

గంసు వేఁటయిటు ఎంత లేదు నిజంబు మా। కెల్ల వారికి భద్రమయ్యెడు నింక నీకడు పెంపొందుఁగా। జల్లగావలెయాఁడ వావలి సంతస్తంభముఁ బొందఁగన్॥ వ॥ అని యివ్విధంబున హరిం బొగడి దేవకీదేవి నాదీవించి దేవతలు ఈశాన బ్రహ్మలు ముందటనిడుకొని చనిరం

## శ్రీకృష్ణావతారఘట్టము.

త॥ క॥ పంకజముఖి నీళ్లాడను। సంకటపడ ఖలులమానసంబుల నెల్లన్। సంకటము దోఁచె మెల్లన। సంకటములు లేమిఁ దోఁచె సత్పురుషులకున్॥ సీ॥ స్వచ్ఛంబులై పొంగె జలరాసు లేడును గల ఘోషణముల మేఘంబు లుఱిమె। గ్రహతారకలతోడ గగనంబు రాజిల్లె దిక్కులు మిక్కిలి తెలివిఁ దాల్చెఁ। గమ్మని చల్లని గాలి మెల్లన వీఁచె హోమానలంబు చెన్నొంది వెలిఁగెఁ। గొలఁకులు కమలాళికులములై సిరి మొప్పెఁ బ్రవిమలతోయలై పారె నదులు। వరపుర గ్రామ * ఘోషమైై వసుధ యొప్పె। విహగరస పుష్పఫలముల వెలసె వనము। లలరు సోనలు గురిసి రయ్యమరవరులు। దేవదేవుని దేవకీదేవి గనఁగ ॥ క॥ పాడిరి గంధర్వోత్తము। లాడిరి రంభాదికాంతలానందమునన్। గూడిరి సిద్ధులు భయముల। వీడిరి చారణులు మొరసె వేల్పుల భేరుల్ ॥ క॥ అయ్యవసరంబున॥ క॥ సుతుఁగనె దేవకి నడురే। యతిశుభగతిఁ దారలును గ్రహంబులునుండన్। దితిసుతనిరాకరిష్ణున్। శ్రితవదనాలంకరిష్ణు జిష్ణు న్విష్ణున్॥ క॥ వెన్నుని నతిప్రసన్నునిఁ। గన్నన గని మెఱుఁగుబోఁడి కడు నొప్పారెం। బున్నమనాఁడు కళానిధిఁ। గన్న మహేంద్రాశ చెలువు గలిగిన రేంద్రా॥ అప్పుడు॥ సీ॥ జలధరదేహు నాజానుచతుర్బాహు సరసీరుహాక్షు విశాలవక్షుఁ। జారుగదాశంఖచక్రపద్మవిలాసుఁ గంఠకౌస్తుభమణికాంతిభాసుఁ। గమనీయకటిసూత్రకంకణకేయూరు శ్రీవత్సలాంఛనాంచితవిహారు। నురుకుండలప్రభాయుతకుంతలలలాటు వైదూర్యమణిగణవరకిరీటు। బాలుఁ బూర్ణేందురుచిజాలు భక్తలోకపాలు సుగుణాలవాలుఁ గృపావిశాలుఁ। జూచి తిలకించి పులకించి చోద్యమంది। యుబ్బి చెలరేఁగి వసుదేవుఁ డుత్సహించె॥ క॥ స్నానము సేయఁగ రామిని। నానందరసాబ్ధిమగ్నుఁడై విప్రులకున్। ధేనువులను బదివేలను। మానసమున ధారవోసె మఱియు వసుదేవుండు॥ క॥ ఈపురిటియింటకు ద్యద్దీపంబును బోలి చాల దీపించె నిజం। బీపాపఁడు నలుమొగముల। యాపాపనిఁ గనిన మేటి యగు నని భక్తిన్॥ గీ॥ సాగి మ్రొక్కి లేచి సరగున నొసలిపైఁ। గేలుదమ్మిదోయిఁ గీలుకొలిపి। పాపఁడనక వెఱకపాపని మొదలింటి। పోకలెల్లఁ దలఁచి పొగడఁ దొడఁగె॥ త॥ ఏనిన్ను నఖిలదర్శను। జ్ఞానానందస్వరూపు సంతతు నపరా। ధీను నిమాయాహరుని। సూనునిఁగాఁ గంటి నెట్టి చోద్యము గలదే॥ త॥ అచ్చుగ నీమాయల మునుఁ। జెచ్చెరఁ ద్రిగుణాత్మకముగఁ జేసిన జగముం। జొచ్చిన క్రియఁ జొరకుందువు। చొచ్చుటయును లేము లేదు చొరకుండుటయున్॥ సీ॥ అదియు నెట్లన మహదాదులఁ బోలెడివై వేఱువేఱైయున్న విధము। లగు సూక్ష్మభూతంబు లమర ¶ షోడశవికారములతోఁ గూడి విరాట్టనంగఁ। బరమాత్మ నకు నీకుఁ బరమైన మేను సంపాదించి యందు లోఁబడియుఁ బడక। యుందు సృష్టికి మ్రోల నున్న కారణమున వానికి లోనిభవంబు గలుగ। దట్టి బుద్ధి యెఱుఁగనను వైనలాగున। గలుగు నింద్రియముల కడలమండి। వానిపట్టు లేక వరుస జగంబులఁ। గలసియుండి మైనఁ గలయ వెపుడు॥ క॥ సర్వము నీలోనిది గా। సర్వాత్ముఁడ వాదివస్తుసంపన్నుఁడవై। సర్వమయుఁడవగు నీకును। సర్వేశ్వర లేవు లోను సంధులు వెలియున్॥ గీ॥ ఆత్మవలనఁ గలిగి యమరు దేహాదుల। నాత్మకంటె వేఱులపియటంచుఁ। బలుకువాఁడు మూఢతముఁడు గావున నీశ। విశ్వమెల్ల నీవ వేఱు లేమ॥ అదియునుం గాక॥ సీ॥ గుణము వికారంబుఁ గోరికయును లేని నీవల్ల జగములు నెఱి జనించుఁ। ‡ బ్రబ్బు లేదగు నంచుఁ బలుకుట తప్పు గాదీశుండవై బ్రహ్మమీవ। యైన నినుఁ గొల్చు గుణములు నీయానతులు సేయభటుల శౌర్యంబులు పతికి వచ్చు। పగిది నీగుణముల బాగులు నీవని తోఁచు నీ మాయతోడఁ గూడి। నీవు రక్తధవళనీలవర్ణంబుల। జగము సేయఁగా వసమయఁ జూడఁ। దనరు దస్యు నేఁడు దైత్యులఁ దండింపఁ। బృథివిఁ గావ నవతరించితీశ॥ శా॥ మింటన్మోసిన మ్రోఁత తాళిమినిలో † మేంత్రిళ్పమున్నివు నా। యింటం బుట్టెదవంచుఁ గంసుఁడు దోడిన్ హింసించె నీయన్నలం। గంటం గూరుకుఁ డేఁడు నీయుదయమీ కారాజనుల్ సెప్పఁగా। బంటింపం డెవ్వఁ రేఁగు దెం

## దేవకీదేవి స్వామిని స్తుతించుట.

చు వడి నీపై నేఁడు సన్నద్ధుఁడై॥ వ॥ అనుచుండ దేవకీదేవి మహాపురుషలక్షణుండును, విచక్షణుండును, సుకుమారుండును నైన కుమారునిం గని కంసుని వలన వెఱపున విస్మితయై యిట్లనియె॥ సీ॥ అట్టిట్టిదన రానిదై మొదలై నిండుకొన్నదై వెలుఁగుచు గుణములేనిదై యొక్కచందంబుదై కలదై నిర్విశేషమై క్రియలేక చెప్పరాని। దీరూపమని శ్రుతులెప్పుడు నాడి వేడియా రూపము గుచు నధ్యాత్మదీపమై బ్రహ్మ రెండవ యర్ధంబు తుది జగంబులు నశియింపంగ భూతగణము। సూక్ష్మభూతమందుఁ జొ

* ఘోషము=గొల్లపల్లె. ‡ ప్రబ్బు=సంబంధము. † మేంత్రింపక=వాఁటియుండఁగా, బంటింపఁడు=సందేహింపఁడు. ¶ షోడశవికారములతోన్=పంచభూతములు-జ్ఞానేంద్రియపంచకము-కర్మేంద్రియపంచకము-బుద్ధి. ఈపదియాఱింటితో.

రఁగ నాభూతంబు।ప్రకృతిలోనఁ జొరఁగఁ బ్రకృతి వోయి।వ్యక్తమునందుఁ జొరఁగ నవ్యక్తమడంగను।శేషసంజ్ఞ నీవు చెలువమ
గుదు॥ఉ॥విశ్వము లీలఁ ద్రిప్పుచు నవిద్యకుఁ జుట్టమవై ననీశు నా।శాశ్వతమైన కాలమిది సర్వము *వేడబమందురట్టివి। శ్వేశ్వ
ర మేలుకుప్పనిను నెప్పుడుఁ గోరి భజించువాఁడె పో।శాశ్వతలక్ష్మి మృత్యుజయ సౌఖ్యయుతుండభయుండు మాధవా॥ మత్త
కోకిల॥ఒంటినిల్చి పురాణయోగులు యోగమార్గనిరూఢులై।కంటిమంచురు గాననిక్కము గానరీ భవదాకృతి।గ్గంటిభద్ర
ముఁ గంటి మాంసపుకన్నులం గనఁబోలని।తొంటిరూపుఁ నొలంగఁబెట్టుము త్రోయ జేక్షణ మ్రొక్కెదన్॥గీ॥ విలయకాల
మందు విశ్వంబు నీ పెద్ద।కడుపులోన డాఁచు కడిమి మేటి।నట్టి డవీవు నేఁడు నాగర్భజుఁడ వౌట।పరమపురుష వేడబంబుగా
దె॥తరల॥నలినలోచన నీవు నిక్కము నాకుఁ బుట్టెదవంచు నీ।ఖలుఁడు కంసుఁడు పెద్దకాలము †కారయింటనడంచెను।ర్మలిన
చిత్తుని నాజ్ఞసేయుము మమ్ముఁ గావుము భీతులన్నులుసు లేక ఫలించె నోఁచిన నోము లెల్లను నీవనై॥వ॥అనియిట్లు దేవకీదేవి
విన్నవించిన నీశ్వరుండిట్లనియె-నవ్వా నీవుతొల్లి స్వాయంభువమన్వంతరంబునఁ బృశ్నియను పరమపతివ్రతవు వసుదేవుం
డును సుతపుఁడను ప్రజాపతి మీరిరువురు సృష్టికాలంబున బ్రహ్మ పంపునం బెంపున నింద్రియంబుల జయించి తెంపున వాన
గాలి యెండ మంచులకు సైరించి ‡యేకలంబులై యాకలంబులు దినియేకలంకంబును లేక వేంద్రంబునఁ బండ్రెండు వేలది
వ్యవర్షంబులు తపంబులు నేపంబుల మీరూపంబులు మెఱయ యోజనాజపంబులు సేసి డాసి పేర్చి యర్చింప మీకున్నా
కుంగలరూపుఁ జూపి యేను తిరంబులగు వరంబులు వేడుమని మీరు నా మాయంబొ యని మోహంబున బిడ్డలు లేని దొడ్డయ
డ్డంబున దుర్గమంబగు నపవర్గంబు గోరక నా యీడు కొడుకునడిగిన మెచ్చి యట్ల వరంబిచ్చి మీకేను బృశ్నిగర్భుండను స
ర్భకుండనై తిమఱియును ॥ క ॥ అదితియుఁ గశ్యపుఁడనఁగా । విదితులరగు మీకుఁ గుఱుచవేషంబున నే । నుదయించితి
వామనుఁడనఁ । ద్రిదశేంద్రానుజుఁడనై ద్వితీయభవమునన్ ॥ క ॥ ఇప్పుడు మూఁడవ §బామునఁ । దప్పక మీకెరు
పురకును దనయుఁడనైతిన్ । జెప్పితిఁ బూర్వము మీయయం । దెప్పటికిని లేమ జన్మమిటపై నాకున్॥క॥నందనుఁడనియు నంబర
మా।నందంబగు బ్రహ్మమనియు నను వలఁచుచు నా।పెం దెరువు నెం దెవరు నా।యందుల ప్రేమమున భవమునందరు మీ
రుర్ ॥ అనియిట్లు పలికి యీశ్వరుండా రూపంబు విడిచి॥క॥తెప్పలిడక తలిదండ్రులు । తప్పకఁ దనుఁ జూడ మాయఁ దనరి ల
లితుఁడై । యప్పుడటుగన్నపాపని । యొప్పున వేడుకలు సేసెనొకకొన్ని నృపా ॥ వ ॥ అంతవసుదేవుండు దనకుం జే
యవలసినపనులీశ్వరుండైనహరివలన నెఱింగినవాఁడు గావున॥ క ॥ ఆపురిటియిల్లు వెలువడి । పాపనిఁ దరలించుకొను
చుఁ బరచె దననుచున్। రూపించి నందుభార్యకుఁ । బాపయగుచు యోగమాయ ప్రభవించె నృపా ॥ అయ్యవసరంబున॥
క।బిడ్డనిఁ గరములఁ దొమ్మున।నడ్డంబుగఁ బట్టి పదములల్లన నిడుచున్ । ¶జడ్డనఁ గావలివారల।యొడ్డంగడచి పురిటిసాలయొ
య్యనవెడలెన్॥అంతనట॥క॥నందుని సతికి యశోదకు।పొందుగ హరి యోగమాయ పుట్టిన ※మాయా । స్పందమున నొక్క
యెఱుగమి । క్రిందుకొనియె నూరి వారిఁ గావలివారిన్॥వ॥ అప్పుడు చప్పుడుగాకుండఁ దప్పటడుగులిడుచు నినుపగొలుసు
లమెలసులు వీడినఁ దాలంబులుమహార్గాలుం పైనబిడ్డనికి నడ్డంబుగాక కీలూడి వీడిపడి ⁂యరళంబులు విరళంబులైన స
రళంబులను మొగసాలలం గడచి పాపతోఁడు వాకిండ్లును ఱలమూయుచుఁ బడగ వెడగలుగ విప్పకప్పియేఁచి కాఁచికొని వెంట
నంటి రాఁగఁ గడంగినడుచు నెడ॥క॥ఆశౌరికిఁ దెరువొసఁగెం బ్రకాశోద్ధతతుంగభంగకలితధరాశా।కాశయ యగు యమునము
నుసీ। తేశునకుం బయోధి త్రోవనిచ్చిన భంగిన్॥వ॥ఇట్లు యమునదాఁటి ◊దాఁటిచని నందునిమందం జేరి యందపమందనిద్రం
బొంది యొడలెఱుంగని గొల్లలం దెలుప నెల్లకనిత్య ప్రసాదయగు యశోదశయ్యనొయ్యన చిన్నినల్లనయ్యను నిచి చయ్యన
నయ్యవ్వకూఁతు నెత్తుకొని మఱలనింటికిం బంటింపక వచ్చి యచ్చిఱుతపాపను దేవకిప్రక్కఁ జక్కనిడి॥ క॥ పదములసంకెల
లిడుకొని।మదిఁ ‖వలఁకుచు శూరసుతుఁడు మందుండునోలెన్। బెదరుగలరీతి దేహముఁ।గదలించుచు నొదిగియుండె గరువత
నమునన్॥క॥వనజాక్షునిఁ దెచ్చుటయును।దనసుతఁ గొనిపోవుటయును దానెఱుఁగకమూఁగినని ద్రఁ జొక్కుచుండెను।వన
జాక్షి యశోద రేయి వసుధాధీశా॥సీ॥ అంతబాలికయా పురసియేడ్చు చిఱుచప్పుడాలించి వేగననాఁక యింటి। కావలివారు
మేల్కని చూచి తలుపులతాళముల్మొంటివిధమున నుండఁ।దెలిసి చక్కనవచ్చి దేవకీనీల్లాడె రమ్మురమ్మని భోజరాజుతోడఁ।జె
ప్పిననాతఁడు▓ దిడిముడిపాటుతోఁ దల్పంబుపై లేచి తత్తరమున।వెంట్రుకలు వీడఁబైచీర వ్రేలియాడఁ। గాల్చికీలూడరో

* వేడబము।వేషము-బూటకము. † కారయింటన్।చెరసాలయందు. ‡ ఏకలంబులై।ఏకాకులై నాయీడు।నావంటి § బాము।జన్మ
ము ¶ జడ్డనన్।శీఘ్రముగా, ఒడ్డు।గుంపు. మాయాస్పందమునన్।మాయయొక్క ఆవరించుటచేత. ఎఱుఁగమి।అజ్ఞానము-మైకము క్రం
దుకొనియెన్। క్రమ్ముకొనెను. ⁂ అరళంబులు।తలుపులు. ◊ దాటిచని।వేగముగాఁ బోయి. ‖ తలఁకుచు।భయపడుచు శూరసుతుఁడు।వసుదే
వుఁడు. ▓ దిడిముడిపాటుతో।తొందరపాటుతో.

హాని దర్పమూఁడ। భూరివైరంబుతోఁ గూడఁ బురిటియింటి। జాడఁ జనుదెంచి యీ పాపఁ జంపఁగదియ॥ అంత దేవకీదేవి యడ్డంబు వచ్చి యిట్లనియె॥ ఉ॥ అన్న శమింపుమన్న తగ దల్లుఁడు గాఁడిది మేనగోడలో। మన్నన సేయుమన్న వినుమా నిని జంపుట రాచపాడిగా। వన్నె సుకీర్తివై మనఁగదన్న మహాత్ములు నోవు త్రోవఁ బో। వన్న భవత్సహోదరిఁ గదన్న నినుం *శరణంబు వేఁడెదన్॥ క॥ *కట్టా యాఁడుగురుక్కొడుకులఁ। బట్టి వధించితివి యీ శుభపుఁ బిదికోడల్। నెట్టనఁ జంపఁగవలెనే। కట్టడివి గదన్న యన్న కరుణింపఁగదే॥ క॥ పుత్త్రుఁడు నీ బ్రతుకునకును। శత్త్రుండని వింటిఁ గాన సమయింపఁదగున్। పుత్త్రులకు నోమనైతిని। పుత్త్రీదానంబు సేసి పుణ్యముఁ గనవే॥ వ॥ అని పయ్యెదఁ జక్కఁగ సవరించుకొనుచుఁ బలవరించుచు భ్రాంతిపడి కోఁతుం గ్రుక్కన నక్కునం జక్క హత్తుకొని చెక్కుచెక్కన మోపి చక్కనన్నుత్తరీయాంచలంబున సంచలతం గప్పి చప్పుడుగాఁ గుయ్యోడ నయ్యోడం *గ్రయ్యంబడి వాఁడు పోడిమి చెడఁ దోఁబుట్టువుం దిట్టి చిట్టిపట్టియా పురని వాపోవఁగా వరంబున నడుగులు లాఁడిసి తిగిచి వడిం బెడిసి పడం బుడమిపై ముంబడ వ్రేసిన నబ్బాలయు నేలం బడక నవలీల నెగసి నవ్యదివ్యమాలికాగంధబంధుర మణిహారాంబరాద్యలంకారమనోహారిణియు, గదాశరశంఖచక్రచర్మచాపాసిశూలంబులు లెనిమిదికరంబులం గరంబొప్పనొప్పుచు, సిద్ధచారణకిన్నరగరుడగంధర్వాదివైమానికులు కానుకలిచ్చి పొగడ నెగడుచు, నచ్చరల యాటపాటలకు మెచ్చుచు, మింటనుండి కంటఁబడి కంటుపడఁ గంసున కిట్లనియె॥ ఉ॥ తెంపరివై పొరింబోరిని దేవకిబిడ్డల చిన్నిశిశుల్లన్। జంపితివింక నైన నుపశాంతి వహింపక రాలమీఁదన। న్నెంపితివి స్సిరో యిదియు నీరమె నా సరసన్ జనించి నిన్। జంపెడివీరుఁ డొక్కదెస సత్కృతి నొందెడువాఁడు దుర్మతీ॥ అని పలికి॥ క॥ మహనీయగుణాస్పదయై। మహిలోనా దేవిజనము మన్నింపంగా। బహునామనివాసంబుల। బహునామములం జరించె భద్రాత్మికయై॥ వ॥ అంత నా భోఁటి పలికిన కలికిపలుకులు ములుకులై చెవులఁ జిలికిన నులికిపడి తులుకుఁ గదరిన మనంబున ఘనంబుగ వెఱఁగంది కందికుందెడు దేవకీవసుదేవుల రావించి యథాదరంబున గారవించి చేరి వారితో నిట్లనియె॥ ఉ॥ పాపుఁడ బాలఘాతుకుఁడ బంధువిరక్తుఁడ నష్టచిత్తుఁడన్। గోపనుఁడన్ జరన్మృతుఁడఁ గ్రూరుఁడ బ్రాహ్మణహంతభంగి మీ। పాపలఁ జంపితిన్వ్యలిపల్కుల నమ్మితి సాధులార నా। పాపములుగ్గడింపక కృపాపరులై కనరే శమింపరే॥ ఉ॥ ఒక్కెడఁ బ్రాణులందలు నిజోచితకర్మములోలిఁ ద్రిప్పఁగా। నొక్కొక మేనులం బొడమి యొక్కొక త్రోవలరాఁక పోకలం। జిక్కులఁ బొందుచుందురు చేరరు సంసృతి బోఁడఁ బాయలే। రెక్కడిహంత మీ శిశువులెక్కడి *హన్యులు మారనేటికిన్॥ క॥ పగతురఁ జెఱిచితిననియును। బగతురచేఁ జెడితిననియు బాలుఁడు దలఁచున్। బగ చెలుములు లేవాత్మకుఁ। బగ చెలుముల *కీలు కర్మబంధము సుండీ॥ వ॥ అని పలికి కన్నీరునించి వగచి వెఱచుచు దేవకీవసుదేవుల పాదంబులఁ బట్టుకొని సంకెలలు విప్పించి మిక్కిలి యక్కఱగల వాక్యంబుల నైక్యంబులు నెఱపిన వారును బరితప్తుండైన కంసునిఁ జూచి రోషంబును బాసి రంత నా వసుదేవుండు బావ కిట్లనియె॥ శా॥ బావా నీవచనంబు నిక్కము సుమీ ప్రాణుల్గతజ్ఞానులై। నీ వేనంచును లోభమోహమదభిన్నిశ్చిత్రతానోదశో। కావేశంబుల నెండొరుం బొడుతురే కాకారుఁడై సర్వరూ। పావిష్టుఁడగు నీశ్వరుం డెఱియ లేర న్యోన్యవిభ్రాంతులై॥ వ॥ అని యిట్లు ప్రసన్నులైన దేవకీవసుదేవుల యనుజ్ఞ వడసి కంసుండింటికిం జని యా రేయి గడపి మఱునాఁడు గ్రద్దనఁ బ్రొద్దున నందనకుంభరతంత్రులగు మంత్రులఁ రావించి యోగనిద్ర వలనం దాపిన్న వృత్తాంతంబంతయు మంతనంబున నెఱింగించిన నపుడు వారలతని కిట్లనిరి॥ క॥ ఇట్టయినఁ *దడయ నేటికిఁ। బట్టణముల మందలం బల్లెల నెల్లన్। బుట్టెడి పెరిగెడి శిశువులఁ। బట్టి వధించెదము మమ్ముఁ బంపు మధీశా॥ మ॥ భవదీయోజ్జ్వలబాహుచాపవిలసద్బాణావళీభగ్నులై। దివిజాధీశ్వరులే క్రియం జనిరొ యే దేశంబులం దాఁగిరో। శివునిం జొచ్చిరొ బ్రహ్మఁ జెందిరొ హరిన్ సేవించిరో మానివృ। త్తివనాంతంబుల నిల్చిరో మనసు శోధింపం దగున్ వల్లభా॥ క॥ నెచ్చరి శాత్రవులను చును। విచ్చలవిడిఁ దిరుగ వలదు వివిధాకృతులన్। మ్రుచ్చిలి వత్తురు వారలు। సచ్చినయందాఁక మఱవఁ జనదధిపునకున్॥ క॥ ఒత్తికొనుచు రానీ జన। దెత్తిన రోగముల రిపుల నింద్రియములను। త్పత్తిసమయములఁ జెఱుపక। మెత్తనగా రాదు రాదు మీఁదజయంబుల్॥ వ॥ అమరశ్రేణికి నెల్లఁ జక్రిముఖరుండా చక్రి ధర్మంబునం। దమరున్ గోవులు భూమిదేవతలు దీక్షామ్నాయ కారుణ్యస। త్యములున్ యాగతపోదమంబులును శ్రద్ధా శాంతులున్ విష్ణుదే। హములిన్నింటిని సంహరించిన నతండంతంబునుం బొందెడిన్॥ కావున॥ ఉ॥ చంపుమ మే *నిలింపుల నుఱుంకెలరంకెలఁ దాపసావలిం। బంపుమ మే కృతాంతకుని పాలికిఁ గ్రేపులతోడ గోవులన్। ద్రుంపుమ మేధరామరులఁ దోలుదమే నిగమంబు లన్నిదా। రింపుదమే వసుంధర హరింపుదమే జననాథ పంపుమా॥ వ॥ అని పలుకు మంత్రుల

*కట్టా। అయ్యో, నెట్టనన్। శీఘ్రముగా, కట్టడివి। కఠినుఁడు. *గ్రయ్యంబడి। సమీపించి. *హన్యులు। చంపఁబడినవారు, *ఈలు। కారణము. *తడయుట। ఆలస్యము చేయుట. *నిలింపులు। దేవతలు.

మంత్రంబులనిమంత్రితుండై బ్రాహ్మణనిరోధంబునిషేధంబనితలంపక కాలపాశబద్ధుండై విప్రాది సాధుమానవులఁజంపదానవులఁబంపియంతిపురంబునకుంజనియె ననంతరంబ యారక్కసులు వెక్కసంబులగు మొక్కలంబులసజ్జనులపజ్జలంబడితర్జనగర్జనభర్జనాదిదుర్జనత్వంబులనిర్జించిపాపంబులార్జించిరి॥ గీ॥ వెదకి వెదకి దైత్యవీరులుసాధుల। నడఁప వారిబలములడఁగిపోయె। యశముసిరియుధర్మమాయువుభద్రంబు। నార్యహింససేయనడఁగుఁగాదె॥ వ॥ అంతమందలోనందుండునందనుండుపుట్టుటయెఱింగిమహానందంబున నెఱవాదులగు వేదవిదులంబిలిపించిజలంబులాడిశుచియై శృంగారించుకొనిస్వస్తిపుణ్యాహవాచనంబులుచదివించిజాతకర్మంబులు సేయించిపితృదేవతలనర్చించి క్రేపులతోడంగూడఁగైచేసినపాడిమొదవుల రెండులక్షలసుగనకకలశమణిపసనవిశాలంబులైనతిలశైలంబులేడింటినిభూదేవతలకిచ్చెను. క॥ ఈయాభీరకుమారుఁడు। శ్రీయుతుఁడై వీరవైరిజేతయునై దీ।ర్ఘాయుష్మంతుండగునని। పాయకదీవించిరపుడు బ్రాహ్మణజనముల్.

క॥ దుందుభులుమొరసెగాయక। సందోహము వాడెసూతసముదాయముతో। వందిజనులుగీర్తించిరి। క్రందుగవీతెంచెభద్రకాహళరవముల్॥ క॥ పల్లవతోరణసురుచిర। వల్లీధ్వజరాజిధూపవాసనములతో। సల్లలితములై యొప్పెను। వల్లవవల్లభుబంధుగృహవాకిళ్లెల్లన్॥ క॥ పసపులునూనెలునలఁదిన। బసఁదనరిసువర్ణబర్హిబర్హప్రభతోఁ। బసిమిగలిగి వెలుఁగొందుచుఁ। బసులన్నియుమందలందుఁ బ్రభవించెన్నృపా॥ క॥ క్రేళ్లుఱికిమసలెలేగలు। మల్లడిగొనిరంకెలిడియెమదవృషభంబుల్ పెల్లుగమొదవులపాముగులఁ। జల్లించెం బాల్లుబాలుసంభవవేళన్॥ క॥ ఆరగఁజదివెడిపాగడెడి। వారికివిద్యలనుబ్రతుకువారికిలేమిం। జేరినవారికినెల్లను। గోరకమునునందుఁడిచ్చెగోధనచయముల్॥ ఆసమయంబున॥ క॥ కంచుకములుతలచుట్టలు। కాంచనభూషాంబరములుగడుమెఱయఁగనే। తెంచిరిగోపకులందఱు। నుంచిపదార్థములుగొనుచుమాధవుఁజూడన్॥ క॥ పతెంచిచూచిచెలఁగుచు। నేతులఁ బెరుగులనుబాలనీళ్లనువెన్నన్। బ్రీతివసంతములాడిరి। యాతురులై సరసభాషలాడుచుగొల్లల్॥ తదనంతరంబ॥ గీ॥ ఏమినోముఫలమొయింతప్రొద్దొకవార్త। వింటిమబలలార వీనులలర। మన*యశోదచిన్నిమగవానిఁగనెనట। చూచివత్తమమ్మసువతులార॥ వ॥ అనియొండొరులలేపిగోపికలోపికెలులేనిచిత్తంబులనెత్తినత్తరంబులొత్తుకొననుదారంబులగుశృంగారంబులనింపులువెలువడి॥ క॥ జడగతులునుబలుపిఱుఁదులుఁ। విడికెడునడుములునువలుదవిగిచనుగవలు। న్వొడఁదనయనములుసిరితడః। బడమోములుభ్రమరచికురభరములునమరన్॥ ఉ॥ వేడుకతోడఁ గ్రొమ్ముడులువీడఁగుచోపరిహారరేఖలు। వ్రాడఁగపోలపాలికలహాటకపత్త్రరుచుల్ వినోదనం। బాడపటాంచలంబులసియాడుచుఁ జేరియశోదయింటికిన్। జేడియలేగిచూచిరొగిజిష్ణునివిష్ణునిఁజిన్నికృష్ణునిన్॥ చూచిసంతసించితెచ్చినకానుకలిచ్చి॥ గీ॥ పాపనికినూనెతలయంటిపసపుఁబూసి। *బోరుకాడించిహారిరక్షపొమ్మటంచు। జలములోకకొన్నిచుట్టిరాజిలెడుతొట్ల। నునిచిదీవించిపాడిరయ్యువిదలెల్ల॥ క॥ *జోజోకమలదళేక్షణ। జోజోమృగరాజమధ్య జోజోకృష్ణా। జోజోపల్లవకరపద। జోజోపూర్ణేందువదనజోజోయనుచున్॥ ఇవ్విధంబున॥ క॥ పలుతోయంబులజగముల। బలుతోయములందుముంచిభాసిల్లెడియా। పలుతోయగాఁడువల్లవ। లలనాకరతోయములఁ జెలంగుచుఁదడియున్॥ క॥ లోకములునిదురనోవఁగ। *జోకొట్టుచునిదురవోనిసుభగుఁజురమణుల్। జోకొట్టిపాడనిదురం। గైకొనుక్రియనూరకుండెఁగనుఁదెఱువకయున్॥ సీ॥ ఏపాముఱెక్కఁగకిరయేపాలుమేటికిఁ బసులగాపఱియింటపాముగలిగె। నేకర్మములులేకయొనయుచక్కటికినిజాతకర్మంబులుసంభవించె। నేతల్లిచనుపాలునెఱుఁగనిప్రౌఢ యశోదచన్నులపాలచొరవనెఱిఁగె। నేహానివృద్ధులునెఱుఁగనిబ్రహ్మంబుపాదిగింటిలోవృద్ధిఁబొందఁజొచ్చె। నేతపములనైననెలమిఁ బండనివంట। వల్లవీజనములవాడఁబండె। నేచదువులనైననిట్టిట్టిదనరాని। యర్థమువయవములనందమొందె॥ మ॥ చెయువుల్సేయుతఱిన్విధాతకరణిన్ జెన్నొందుసంతోషస్ఫూ।ర్తియుతుండై నగుచున్ననార్ద్రమనిమాడ్కింబొల్చురోషించియు। న్నరయొదర్కయమప్రభంగినొప్పునుసుఖానందంబునుంబొందితా। న్మయుఁడైబ్రహ్మముభాతిబాలుఁడమరున్బాహుళ్యబాల్యంబునన్॥ ఆయ్యవసరంబున॥ గీ॥ కొడుకుఁగన్నవేడ్కఁ గొనసాగరోహిణిఁ। జీఱంబంచిచిత్రచేలములను। మండనములనిచ్చిమన్నించెనందుఁడా। యంబుజాక్షిప్రీతయైచరించె॥ వ॥ అదిమొదలుమొదవులకదుపులుపొదవులుగలిగియుండెనంత నందుండుగోపకులనేకులగోకులరక్షకుదక్షులైనవారినినియమించిమధురకుంజనికంసునికినేఁటేటంబెట్టెడియరింబెట్టివీడ్కొనివసుదేవునికడకుంజనియథోచితంబుగదర్శించిన॥ క॥ నందునిఁగనుఁగొనిప్రాణము। పొందినబొందియునుబోలెఁబొలుపారుచునా। నందాశ్రులుగడకన్నులఁ। గ్రందుకొనంగేలుసాఁచికౌఁగిటఁజేర్చెన్॥ వ॥ మఱియుఁగౌఁగలించికొనిసుఖాసీనునింగాఁజేసివసుదేవుండుతనకొడుకువలనిమోహంబుదీపింపనందునకి

---

*యశోదచిన్ని। బిడ్డలులేకయున్నయశోదాదేవి. *బోరుకాడించి। స్నానముచేయించి. *జోజో। సుఖముగానిద్రింపుము, జోకొట్టి। ఓదార్చి.

ట్లనియె॥ క॥ సంతతి లేదని మనమున, జింతనము లమునిఁగి ముదిసి చిక్కిన నీకున్, సంతతి గలిగెను భాగ్యము, సంతతిహీనునకు నెక్కడి సౌఖ్యసంతతి గలదే॥ క॥ పొడగంటి నిన్ను బ్రతికితి, గడచితి వాపదల నింకఁ గార్యము లందే, యెడపడు దుగు లేని నెచ్చెలి, పొడఁగాంచుట చచ్చినవాఁడు మరలఁ బుట్టుట గాదే॥ క॥ పలుపాటులఁ బడు జనులకు, నిలనొక చో నుండఁగలదె యేరుల వెంటన్, గలసి చను ప్రాకులన్నియుఁ బలువెంటలఁ బోవుఁ గాక పాయక యున్నే॥ మ॥ బలురోగంబుల మెందకున్న వెతసుల్పాలిచ్చునే ధేనువుల్, ల్కాం [illegible] సుల్పాఁగులు వారిపూరితము లేగోష్ఠప్రదేశంబులం, బులులున్ మప్పలు సంచరింపవుగదా పాల్పారునే ఘోషము, ల్కాల వేప్పనిపూరు జొంపములు లతాకాంతార భాగంబులన్॥ క॥ తనపుత్రమిత్రముఖరులఁ, దనుపక చూడక యు వారు దలిగిన శింపన్న నుచు గృహమేధియాశ్రమ, మునను నుండెడి వానికొక్క మోదము గలదే॥ క॥ నీ కాంత యుద్దనీవును, నీ కాంతయు గారవింపఁ నుదంత్రిగనా, లోకించుచు నీ సుందను, నా కొడుకున్నాఁడు నందనందాన్వితుఁడై॥ అనిన నందుండిట్లనియె॥ శా॥ నీకున్ద్దేవకికిన్ జనించినసుతానీకంబుఁ దోడ్తోడ, మున్నీ కంసుండు వధించె మీసుతఁ దుదిన్ హింసింపఁ జేతప్పి తా, నాకాశంబునకేగె బాలయిది దైవాధీనమాపద్దశ, న్నోకంబందు నెతజ్ఞుఁ డూరడిలునా సూనుండు నీ సూనుఁడే॥ అనిన వసుదేవుండు నందునకిట్లనియె॥ క॥ జనపతికరియిడితివి మము, గనుఁగొంటివి మేము నిన్నుఁ గంటిమి మేలయ్యెను బొమ్మింక నుగోకులమునను

## ఇ కంసుని పంపున పూతన యను రాక్షసి రేపల్లెకుఁ జనుదెంచుట. ఇ

త్పాతములు వోఁచెమునకొనవలయున్॥ వ॥ అని పలికిన వసుదేవుం డునందాదులైన వల్లవులపీడ్కొలిపిన వారలు గొబ్బున వడిగల గిబ్బలం బూనిన శకటంబులు ప్రకటంబులుగ నెక్కి తమతమ పల్లెలత్రోవ లువట్టిచని రానందుండు * ప్రతీతంబులైన యుత్పాతంబులు ముందరఁ బొడఁగని శౌరితనతోఁ బలికిన పలుకులు దప్పదనుచు దలంచుచుండెనంత॥ సీ॥ కంసుపంపున బాలఘాతిని పూతన పల్లెలపుండలఁ బట్టణముల, నిలయెల్ల చో బాలహింసఁ గావించుచుఁ జనుచు నెవ్వని పేరు శ్రవణపీథిఁ, బడినయంతన సర్వభయనివారణమగు నట్టి దైత్యాంతకుండవతరించి యున్న నందుని పల్లెకొక నాఁడు ఖేచరియై వచ్చి యందుమాయాప్రయుక్తిఁ గామరూపిణియై చొచ్చి కానకుండ, నరిగి యిల్లిల్లుఁ దప్పక యరసికొనుచు, నందగృహమున బాలుని నాదమొకటి, బనిప్రమోదించి సుందరీ వేషయగుచు॥ మత్తకోకిల॥ ఇ క్రాలుకన్నులు గుబ్బచన్నులుఁ గంచు బొందని చందురుఁ బోలు మోమును గల్గు లేదను బుద్ధి మానిన కౌను హే, రాళమైన పిఱుందు పల్లవరాగ పాదకరంబులున్, జాలదొడ్డగుకొప్పు నొప్పగ సర్వమోహనమూర్తితోన్॥ మానినీవృత్తము॥ కాంచన కుండల కాంతులు గండయుగంబున గ్రేళ్లుఱకన్ జడపై, నించినమల్లెల మేలిమి తావులు మెచ్చి మదాళులు మిన్ను నరా, నంచితకంకణహారరుచుల్ వెలువారఁగ గబ్బి వలుద్వంచలమించించుగ జారఁగ నించు నిభాననయై గొనుమారుని యింటికినై॥ ఆసమయంబున॥ మ॥ సిరి నమ్మున్ బ్రతుకంగఁ జూచు కొఱకై శృంగారవేషంబుతో, నరుదేనో పునటంచు గోపికలు జిహ్మాక్రాక మోహించి, తత్పరులై చూడల తాంగి వోయి కనియెం బర్యంకస్థ్యంబునం, బసుభస్మానల తేజు మగ్ఘ సవథ ప్రారంభ కుండింభకున్॥ క॥ నికదియ వచ్చు సమయంబున॥ శా॥ ఆలోకేశ్వరుఁ డా చరాచర విభుండా బాలగోపాలుఁ డా, బాలధ్వంసిని గొంటుఁ గంటిడి వెస న్వాలింత చందంబున, న్వాలిఁ డ్లవ్విషమూని వచ్చుట మది న్భావించి లోనవ్వుచున్, గాలుం గేలు నెఱుంగకున్న కరణిం గన్మోడ్చి గుఱ్ఱెట్టుచున్॥ క॥ ఆపాపజాతిసుందరి, యాపాపని పాన్పుఁ జేరనరిగి కరములన్, లేపి చనుం గవ శిశువు, న్మోఁపుచు ముద్దాడి సిరము మూర్కొని పలికెన్॥ క॥ చనుగుడుచుడు ముద్దులాడి, చనువారలు లేరు నీవు చనవలెనంచు, న్ననుఁ గుడిపి మీఁద నీకడఁ, జనుదాననంగ వేడ్కఁ జనుఁజనుగుడుపన్॥ క॥ నాచను బాలా క్రుక్కెడు, నో చిన్నికుమార త్రావుమియ్యనఁ బిదపన్, నీచెలువ మెఱుఁగవచ్చును, నా సెలువము సఫలమగును నళినదళాక్షా॥ వ॥ అని బాలును దేశించి ముద్దాడెడి భంగి మాటలాడెడి చేడియం జూచి॥ మ॥ వనితా ముట్టకు మమ్మ చన్నుగుడువన్ వల్దమ్మ నీచన్ను మా, యనయుం డొల్లఁడు వాసి పొమ్మనియ యశోదా రోహిణుల్ జీఱరై, కొనకీడ్వించు చుమాయఁ బన్ని పెలుచన్ గోశంబులో పాలు మొల్పని గాఁ జిల్లు చుమాట మెత్తదనము న్లో వాడియున్నేర్పడన్॥ వ॥ కదిసికలికిపలుకులఁ బలుకు చనులుకు చెడిరుళులు సపొరకె యెడమర నిదురంగదిరిక ఫణియని యెఱుంగక గుణమతిందిగుచుజడమతి పడంగునక [illegible]టిజరభి తెఱవ పట్టుపడు మునుమెఱుపు గిలిగిమెల్లయుచుఁ గనుంగవం దెఱవక వెఱపు నాఁపు నెఱుంగక కొమరుమిసులు చిఱుతకొమరు నిండిగిచితొడలనడుమ నిడుకొని యొడలు నివురుచు నెడనెడ ముహూతం గడలుకొలుపుచు నాఁకొన్న చిన్నియన్న చన్ను గుడువు మని చన్నిచ్చు సమయంబున॥ సీ॥ మెలఁకన్న తెఱఁగున మెల్లనఁ గమవిచ్చి క్రేగంటఁ జూచుచుఁ గికికినీల్గి, యావలించుచుఁ జేతులాకసంబునఁ జాఁచి యొయ్య నిగిలి యాఁకొన్న యోజ నూఁది, బిగిచన్నుగవఁ గేలఁ బీడించి కబళించి గ్రుక్కగ్రుక్కగుటుగుటుక మనుచు, నొకరెండు గ్రుక్కలను పిద ప్రాణంబులు సైతము మేనిలో సత్త్వమెల్లఁ ద్రావె నదియుమగుం

డెలుదల్ల డిల్లఁ, జిమ్మదిట్టుఁగు చనిలువక శిరము వ్రాల, నితరబాలుర క్రియ వాఁడవీవు గావు । చన్నువిడువుము విడువుము
చాలు ననుచు॥ క॥ నిబ్బరము దప్పి మంటలు, ప్రబ్బిన ధృతిలేక నేత్రపదహస్తంబుల్, గొబ్బున వివృతములగుచును, గుబ్బను చు
న్నట్టిమూఁతగూలె న్నేలన్॥ మ॥ అదరెన్ గొండలతోడ భూమి, గ్రహతారానీకముల్మింటిపై, బెదరెన్ దిక్కులమూఁకల్ మ్రోఁ
తలెసఁ గెన్ క్షితి, న్లాలోకంబులుం, గదలం బాఱెను వజ్రభిన్నగిరిరేఖం బూర్వదేహంబుతోఁ, ద్రిదశధ్వంసిని గూలెఁ గుయ్యి
డుచుఁ దద్ఘోరఘోషంబునన్॥ క॥ అప్పుడు దెప్పరమగునా, చప్పుడు హృదయములఁ జొచ్చి సందడిఁ బెట్టన్, ముప్పిరిఁగొని పడి
రెఱుకలు, దప్పి ధరన్ గొల్లలెల్లఁ దల్లడపడుచున్॥ క॥ ఆజరఖి రండ రక్క-సి, నైజశరీరంబు నేలనలియంబడినన్, యోజనముల్
న్నర మేరధరాజంబులు నుగ్గులయ్యె రాజవరేణ్యా॥ సీ॥ *దారుణలాంగూలదండదంతంబులు నగగహ్వరముఁబోలు నాసిక
యును, గండశైలాకృతి గలకుచయుగమును విరిసి తూలెడి పల్లవెంట్రుకలును, జీఁకటినూఁతులఁ జెనయు నేత్రంబులు పెను
దిబ్బఁబోలెడి పెద్దపిఱుఁదును, చాలుకట్టలఁబోలు చరణోరుహస్తంబులింకిన మడువుతో నెనయు కడుపు। గలిగి పట్టి క్రోశదీర్ఘ
మైకవిసి చూడ భయదమగు దానిఘనకళేబరముఁ జూచి, గోపగోపీజనంబులు గుంపుఁ గూడి, వెగడుచుండిరి మనమున బెదరు
గదిరి॥ ఇవ్విధంబున॥ క॥ ఆతతిఁ గుడువఁగ నడిచెను, నూతన ఫుల్లాబ్జలోచనుఁడు హరి మృత్యు, ద్యోతనఁ గృతమునిసముదయ,
యాతనఁ బూతన నెఱింగి యాతనులీలన్॥ క॥ ¶ విషధరరిపుగమనునికిని, విషగళసఖునికిని విమలవిషశయనునికిన్, విషభవభ
వజనకునికిని, విషకుచచనువిషముఁ గొనుట విషమే తలఁపన్॥ వ॥ అంత నా గోపగోపీజనంబులు దెలిసి రోహిణీయశోదలం గూ
డుకొని బెగ్గడిలక డగ్గఱి॥ శా॥ నేలం గూలిన మేటి పెన్నురముపై నిర్భీతిఁ గ్రీడించు నో బాలారమ్మని మూఁపుఁ జేర్చుకొని సం
స్పర్శించి నూఱార్చుచుం, గోలాంగూలముఁ ద్రిప్పి గోపురజముం, గోమూత్రముం జల్లి తద్బాలాంగంబుల గోమయంబులఁ దిరా
పండ్రెండు నామంబులన్॥ గద్యవచనము॥ మఱియు నంతటం దనియక గోపికలాచమనంబులు సేసి దక్షులై మును దక్షుకుర
ఱ్ఱాకరంబగు బీజన్యాసంబు చేసుకొని చిన్నియన్ననీ యడుగుల జుంఁడును, జానువుల ననిలుండును, దొడల యజ్ఞుండును, గటిత
లంబచ్యుతుండును, గడుపు హయాస్యుండును, హృదయంబు కేశవుండు, నురము నీశుండును, గంఠంబు నినుండును, భుజంబు
లఁ జతుర్భుజుండును, ముఖంబు త్రివిక్రముండును, శిరంబీశ్వరుండును రక్షింతురు- ముందు చక్రియు, వెనుక గదాధరుండైన
హరియుఁ, బార్శ్వంబుల ధనుర్ధరుండైన మధువైరియు, నసిధరుండగు జనార్దనుండును, గోణంబుల శంఖచక్రగదాధరుండై
న యురగశయనుండును, మీఁద నుపేంద్రుండును, గ్రింద తార్క్ష్యుండు, నంతటను హలధరుండగు పురుషుండును గాతురు-
నీయింద్రియంబుల హృషీకేశుండును, బ్రాణంబుల నారాయణుండును, జిత్తంబు శ్వేతద్వీపపతియును, మనంబు యోగీశ్వ
రుండును, బుద్ధి పృశ్నిగర్భుండు, నహంకారంబును భగవంతుండైన పరుండుఁ బాలనంబు సేయుదురు- నీవు క్రీడించు నెడ
గోవిందుండును, శయనించుతఱి మాధవుండును, నడుచువేళ వైకుంఠుండును, గూర్చున్న సమయంబున శ్రీపతియును, గు
డుచు కాలంబున సర్వభక్షకుండయిన యజ్ఞభుజుండు నేమఱకుండుదురు- నిన్నుఁ బేర్కొని నమస్స్వప్నవృద్ధబాలగ్రహం
బులును, గూశ్మాండ ఢాకినీ యాతుధానులును, భూతప్రేతయక్షరాక్షసపిశాచవినాయకులును, గోటరాదులును, జ్యేష్ఠా
దిభూతనాథులును, మాతృకాదిగణంబులును నశియింతురు. నీయందుఁ బ్రాణేంద్రియశరీరవిరోధంబులైన యున్మాదంబులు, న
పస్మారంబులును, మహోత్పాతంబులును బొందకుండుం గావుత యని రక్షచేసి దీవించి రంత॥ క॥ ఆ పెద్దవేడబంబుల పా
పనికిని జన్నుఁ గుడిపి పానుపుపైనం బాపించి కప్పి కూరుకు మోపాడ యని యశోద యొయ్యనఁ బాడెన్॥ వ॥ అంతనం
దుండు మొదలైన గోపకులు మధురనుండి వచ్చి రక్కసి మేనుఁ గని వెఱఁగుపడి మున్ను వసుదేవుం డుత్పాతంబు లెఱింగి చెప్పె
నతండు మహాయోగి యని పొగడి కఠోరంబగు పూతన యొడలుఁ గుఠారంబుల నఱికి నము ‡కుటీరంబులకుం దవ్వగు ప్రదేశం
బున పటీరంబుల దహనంబు సంగ్రహించి దహించిరి॥ గీ॥ పొగిలి పొగిలి కాలుచున్నదేహంబున, నగరుపరిమళముల పొగలు వె
డలె, దేహకల్మషములు శ్రీహరి ముఖమునఁ, ద్రావఁబడుటఁ జేసి భూవరేణ్య॥ క॥ హరి వనమీఁదం బదములు, గరములు నిడి చ
న్నుఁ గుడువ విడిచిన మాత్రన్, హరిజననిపగిది బరగతి, కరిగెను మరితలు మాసి యసురాంగనయున్॥ క॥ వెన్నునికొక నఱి

* దారుణలాంగూలదండదంతంబులు। భయంకరములగు తోఁకలవలె-కఱ్ఱలవలె పొడవులయిన పండ్లును. ‡ కుటీరములు। గృహములు-గుడిసె. పటీరంబులు। చందనవృక్షములచేత ¶ విషధరరిపుగమనునికిని॥ విషధర।సర్పములకు, రిపు।శత్రువైన గరుత్మంతునిపై నెక్కి, గమనునికి।సంచరించువానికిని, విషగళసఖునికిని॥ గరళకంఠుడయిన శివుఁడే స్నేహితుఁడు గాఁగలవానికిని, విమలవిషశయనునికిన్॥ విమలవిష।నిర్మలములగు జలములు యందు, శయనునికిన్।పరుండియుండువానికిని. విషభవభవజనకునికిని॥ విషభవ।జలమునందు బుట్టినపద్మమునందు, భవ।ఉద్భవించిన బ్రహ్మదేవునకు, జనకునికిని।తండ్రియైనవానికిని. విషకుచ।గరళము స్తనమందుఁగలభూతకియను రక్కసియొక్క, చనువిషము।పాలిండ్లయందలి గరళము ను, కొనుట।గ్రహించుట, తలఁపన్।విచారింపఁగా, విషమే।కష్టము.

శపన్నగాధీశుల పగిదిఁ దాల్చు; తరంగసమ్మృష్టపంకాంగరాగంబుల నెసఁగుచున్నల నెత్తువత్తు; రసమయంబులైన జవ్వాదిలే ఖరంబుల సింగంపుకొదమల సిరి వహించు; రాననంబుల కాంతులంతంత కెక్కుం గబాలార్కచంద్రుల పగిదిఁ దోఁచు; రెలమిఁ దల్లుల చన్నుబాలెల్ల ద్రావి పరమయోగోద్భవామృతపానలీల; సోలి యోగుల విధమున సొంపు గంచు; రా కుమారులు జనమనోహరులగుచు. క. చూడని వారల నెప్పుడుఁ జూడక లోకములు మూఁడుఁ జూపులఁ దిరుగన్ జూడఁగ నేర్చిన బాలకు చూడ్డామణిజనుల నెఱిఁగి చూడఁగ నేర్చెన్. క. నగవుల విద్యల పోడిమి నగు బాటుగఁ జేయ నేర్చు తగవరి యంతన్ నగు మొగము తోడ మెల్లన నగు మొగముల సతులఁ జూచి నగ నేర్చె నృపా. క. అవ్వల నెఱుఁగక మువ్వురి కవ్వల వెలుఁగొందు పరముఁడవ్యక్తుండై యా యవ్వలకు సంతసంబుగ నవ్వా యవ్వా యనంగ నల్లన నేర్చెన్. క. అడుగులు వేయఁగ లిగి రెం డడుగుల నే నున్నమిన్న నలమిన బాలుం డడుగిడఁ దొడఁగెను శాత్రవు లడుగులు సడుగులును వదలి యడుగవనిం బడన్. మఱియును. సీ. తనువున నంటిన ధరణీపరాగంబు పూసిన నెఱిభూతిపూఁత గాఁగ; ముందర వెలుఁగొందు ముక్తాలలామంబు తొగలసంగడికాని తునుక గాఁగ; ఫాలభాగంబుపైఁ బరగు కావిబొట్టు కాముని గెల్చిన కన్ను గాఁగఁ; గంఠమాలికలోని ఘననీలరత్నంబు కమనీయమగు మెడకప్పు గాఁగ; హారవల్లులురగహారవల్లులు గాఁగ; బాలలీలఁ బ్రౌఢబాలకుండు శివుని పగిది నొప్పె శివునికిఁ దనకును వేఱు లేమిఁ దెలుప వెలయునట్లు. క. ఆ పాపల విహరణములు తీపులు పుట్టింప మఱియు దేఁకువ లేకా గోపాలసతులు మక్కువ నేపనులును మఱచియుండిరీక్షణపరలై. వ. ఆ సమయంబున బాలకుల తల్లులు గోఱ గోరు కొమ్ములు గల జంతువుల వలన నేమఱక జల దహన కంటకాముల యెడ మోసపోక బాలసంరక్షణంబు సేయుచు నుల్లంబులు మొల్లంబులైన ప్రేమంబుల భిరామంబులుగా విహరించుచుండిరంత. క. తనయీడు గోపబాలుర తనుఁ గొలువఁగ రాముఁ గూడి తనువు గలుగుచున్ దనుగమనంబులఁ గృష్ణుఁడు తనుమధ్యలు మెచ్చ నీలతనురుచి నమరెన్. వ. మఱియు నా కుమారుండు దినదినంబునకు సంచారసరభాషణదక్షుండై. ఉ. చప్పుడు సేయకుండుము నిజంబు కెయొనర్చిన నన్ని పోవఁగా నప్పుడు బారసాఁచి తననవ్వుల విందులు వచ్చిరంచు నవ్వోప్పఁగఁ జీఱు తల్లి దెసకొత్తిలి కృష్ణుఁడు రంతు సేయుచున్నప్పుడు వచ్చి తస్సుడుచు నవ్వోలయన్ వ్రాలగంట మ్రోయఁగన్. క. వల్లవగృహ నవనీతము లెల్లను భక్షించి వచ్చి యెఱుఁగని భంగిన్ దల్లిం గదిసి చిట్టాడుచు నల్లన చనుబువ్వఁ బెట్టుమవ్వా యనుచున్. మఱియు గోపకుమారులం గూడికొని కృష్ణుండు. సీ. గోవల్లభుఁడ నేను గోవులు మీరని వడిఱంకెవైచుచు వంగియాడు; రాజు నే భటులు మీరలు రండు రండని ప్రాభవంబున పెక్కుపనులు వనుచు; నేత స్కరుండ మీరింటివారని నిద్రపుచ్చి సొమ్ములు గొనిపోయెడాఁగు; నే సూత్రధారి మీ రిందఱు బహురూపులని చెలంగుచు నాటలాడఁ బెట్టు; మూలలకు జను డాగిలి మూఁతలాడు; నుయ్యెలల నూఁగుఁ జేబంతులూనరవైచు; జారచోరుల జాడలఁ జాలనిగుడు; శౌరి బాలురతో నాడు సమయమందు. వ. మఱియు నా కుమారశేఖరుండు కపటశైశవంబున దొంగజాడలం గ్రీడింపఁ గోపికలొప్పి

—శ్రీగోపికలు శ్రీకృష్ణుని దుడుకుతనంబులు యశోదాదేవితోఁ జెప్పుట.—

కలు లేక యశోదకడకు వచ్చి యిట్లనిరి. క. బాలురకుఁ బాలు లేవని బాలింతలు మొఱలు వెట్టఁ బకపక నగియా బాలుం డాలము సేయుచు నాలకుఁ గ్రేపుల విడిచె నంభోజాక్షీ. క. పడఁతీ నీ బిడ్డఁడు మా కడవలలో నున్న మంచి కాఁగిన పాలా పడుచులకుఁ బోసి దిక్కున కడవలఁ బో నడఁచె నాజ్ఞ కలదో లేదో. క. మీ పాపఁడు మా గృహములు నా పోవఁగఁ బాలుఁ ద్రావి యిగపడకున్న నోపింపఁ బిన్నపడుచుల వాపోవఁగఁ జిమ్ముకొనుచు వచ్చెం దల్లీ. మత్తకోకిల. పుట్టిపుట్టఁడు నేఁడు దొంగిలఁ బోయి మా యిలుఁ జొచ్చి తా నుట్టి క్రిందొక ఱోలుఁ బీఁటలు నొక్క ప్రోవిడి యెక్కి చేఁ బెట్టఁజాలక కుండ క్రిందొక పెద్దతూఁటొనరించి మీఁ బట్టి మీఁగడపాలుఁ జేఱలఁ బట్టి త్రావెదలోదరీ. క. అడంజని పీరల పెరుగోడక నీసుతుఁడు త్రావి యొకయించుకఁ ద్రావఁ గోడలి మూఁతిం జరిమినఁ గోడలు ద్రచ్చునుచు నత్తమొత్తెలతాంగీ. క. వారిల్లుఁ జొచ్చి కడవ [illegible] తోరంబగు నెయ్యిఁ ద్రావి తుదినా కడవలీ వ్రీరింట నీ సుతుండిడ వారికి పీరికిని దొడ్డ వాదయ్యె సతీ. క. వేలుపుఁ గొని నాకంగొనును వేలుపు మఱియెవ్వఁడను చు వికవిక నగి మా వేలుపుల గోడపైనో హేలావతి నీ తనూజుఁ డెంగిలిఁ జేసెన్. క. వెన్నఁ డిసిఁ గొబోఁడఁగని మా పిన్నది యడ్డంబు వచ్చి పిఱిదికిఁ దివియన్ జన్నొడిసి పట్టి చీ ఱెను జిన్ని కుమారుండె యితఁడు శీతాంశుముఖీ. క. ఇమ్ముగు వతన్నువాకిటఁ గ్రుమ్ములు చోఁ జీఱి నిలిపి కొని పేరడుగన్ నై మ్మొవిఁగ ఱచి వడిఁ జనె నమ్మా యీ [illegible] దుడుకు జెప్పుమా. క. చేబంతి తప్పి పడెనని ప్రాబల్యముతోడ వచ్చి భవనము వెనుకన్ మా బిడ్డ జలకమాడఁగ నీ బిడ్డఁడు వలువఁ దెచ్చె నెలఁతుక తగునే. క. ఇచ్చెలువఁ జూచి మ్రుచ్చిలి యిచ్చుగ మఱికించుకొనుచు నరిగెద నాతో వచ్చెద వా యనియనినాఁ డిచ్చెలుత దుడుకుదవి చిత్రమిట్టిది గలదే. క. కొడుకులు లేరని యొకసతి కడు వగపఁగ దన్ను మగనిఁగాఁ గైకొనిన న్గొడుకులు గలిగెద రని

పైఁబడి నాఁడిది వినుము శిశువు పసులే తల్లీ॥ క॥ తలఁగిన దానం దలమున బదలఁగ కనా చెలికి సాన తలయొత్తఁగనీ। త్రుళ్ళఁగిన చో
కెంపొయ్యెదియని। తలయూఁచె న్నీసుతుండు తగ వెన్నృగాక్షీ॥ క॥ వ్రాలఁగ వచ్చిన నీసతి। చూలాలందలఁగుమనుచుఁ జూలగుట
ను నే। మూలంబు చెప్పుమనెనీ। బాలుఁడు చెప్పుదు రెసతులుప ర్వేంచుము ఖీ॥ క॥ మగువా నీకొమరుఁడు మా। మగవారటుఁబో
వఁ జూచి నంతనమునకు। స్దగఁజేటిపొందనడిగెను। జగములమున్నిట్టిశిశువు చదువంబడెనే॥ గీ॥ నమ్మి నిదురనోవ నాపట్టి * చుం
చుమా। లేఁగతోఁకతోడ నీలఁగట్టి వీథులందుఁదోలె వెలఁది నీకొమరుండు। రాచబిడ్డఁడైన నవ్వమే లె॥ క॥ నాపట్టిపొట్టనిండఁ
గ। జైఁబడి నీపట్టి వెన్న బానెండిడి నాఁ। డూపిరి వెడలదు వానిఁ। జూపెద నేమైన నీవ సుమ్ములతాంగీ॥ క॥ తెఱవ యొకతె ని
ద్రింపఁగ। నెఱిఁగట్టి నవలువ వీడ్చి నేఁడొక తేలుం। గఱపించె నీకుమారుఁడు। వెఱచుచు నదిప ఱవనగుట విహితమె సాక్షీ॥
క॥ నాకొడుకును నాకోడలు। నేకతమునఁ బెనఁగఁ బాముని తఁడువైవం। గోక తెఱంగకఁ బాటిన। గూకలిడెన్నీసుతుండు గు
ణమెగు గాథ్యా॥ గీ॥ తరుణి యొకతె పెరుగుఁదఱుచుచుఁ దుదివఁగి। వెన్నఁదీయ నొదిగి వెనుకఁగదిసి। మగువ నీసుతుండు మ
గపోఁడుములు సేయ। సాగి నాఁడుతగ నెచక్కఁ జేయ॥ సీ॥ కలకంఠి మావాడ గరితల మెల్ల నీపట్టి రాఁగలఁడని పాలు పెరుగు।
లిండ్ల లోపలనిడి యేమెల్లఁదన త్రోవఁ జూచుచో నెప్పుడు చొచ్చినాఁడొ। తలుపులు ముద్రలు తాళంబులును బెట్టియున్న చం
దంబున నున్న వరయ। నొకయింటిలోఁ బాడు నొకయింటిలో నాడు నొకయింటిలో నవ్వు నొకటఁదిట్టు। నొకట వెక్కిరించు
నొకొక్కకచో మృగ। పక్షి ఘోషణములు పరగఁజేయు। నిట్లు చేసి వెనుక నెక్కడఁబోవునో। కానరాఁడు చిత్తకడవలుండు॥
క॥ కడుల చ్చిగలిగ్గ నేనియుఁ। గుడుతురుగట్టుమరుగాక కొడుకుల నుచు। న్బడుగుల వాడల పైఁబడ। విడుతురె రా కాంతలెం
దు వినులేం దుముఖీ॥ క॥ ఓయమ్మ నీకుమారుఁడు। మాయిండ్లను బాలుఁ బెరుగు మననీఁడమ్మా। పోయెద మెక్కడికైనను। మా
యన్నల సురభులాన మంజులవాణీ॥ వ॥ అని మఱియు ననేక విధంబుల బాలకృష్ణుండు సేయు వినోదంబులు దమ్మునుయందుఁ జే
యు మహా ప్రసాదంబులని యెఱుంగక దూఱుచున్న యట్టి గోపికలకు యశోద యిట్లనియె॥ క॥ చన్నువిడిచి చనఁడిట్టటు।
నెన్నఁడు పొరిగిండ్ల త్రోవ లెఱుఁగఁడు నేఁడుం। గన్నులు దెఱువని మాయీ। చిన్నికుమారకుని నవ్వ సేయందగునే॥ గీ॥ అన్య
మెఱుఁగడు తనయంత నాడుచుండు। మంచివాఁడితఁడెగ్గులు మానరమ్మ। రామలార రాత్రిలోకాభిరామలార। తల్లులార గుణ
వతీమతల్లులార॥ వ॥ అని యశోద వారల నొడంబఱచి పంపి కొడుకుం గోపింపంజాలకయుండె నిట్లు॥ ఉ॥ కాంతలు వల్లితోఁ దన
వికారము లెల్ల గణింపభీతుఁడై। శాంతుని సొంపు నస్వరము సాధుని పెంపున గోలమాడ్కి వి। భ్రాంతుని కైవడిన్ జడుని భంగిఁ

## శ్రీకృష్ణుని విశ్వరూప ప్రదర్శనాద్యభివర్ణనము.

గుమారకుఁ డూరకుండెనే। వింతయు లేక దల్లికుచ వేదిక పైఁదల మోపి యాడుచున్॥ వ॥ అంత నొకనాఁడు బలభద్ర ప్రము
ఖులైన గోపకుమారులు వెన్నుండు మన్నుదినెనని చెప్పిన యశోద బాలుని కేలుపట్టి కొనియిట్లనియె॥ క॥ మన్నేటికి భక్షించె
ద। మున్నియనుము లేలనీవు మన్నింపవుగీ। యన్నయు సఖులును జెప్పెద। రన్నా మన్నేల మఱిపదార్థము లేదే॥ వ॥ అని పలికిన
ముగుదతల్లికి నెఱదంటమైన కొడుకిట్లనియె॥ శా॥ అమ్మా మన్నుఁదినంగ నే శిశువునో యాఁకొంటినో వెఱ్ఱినో। నమ్మంజూడ
కుమీరిమాటలు మదిన్నన్నీవు గొట్టంగ వీ। రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు కాదేని న్మదీయాస్యగం। ధమ్మాఘ్రాణముఁ జేసి
నా వచనముల్ దప్పైన దండింపవే॥ వ॥ అని పలికి నెయ్యంబున నయ్యవ్వ నియ్యకొలిపి క్రీడా మనుజబాలకుండైన యీశ్వరుండు
తన నోరుఁ దెఱచి ముఖంబుఁ జూపిన॥ క॥ ఆలలితాంగి గనుంగొనె। బాలుని ముఖమందు జలధి పర్వత వన భూ। గోళ శిఖి తరణి
శశి దిక్పాలాదికరండమైన బ్రహ్మాండంబున్॥ కనుంగొని॥ మ॥ కలయో వైష్ణవమాయయో యితర సంకల్పార్థమో సత్య
మో। తలఁపన్నేరక యున్నదాననొ యశోదాదేవిఁ గానో పర। స్థలమో బాలకుఁడెంతయీతని ముఖస్థంబై యజాండంబు
ప్రజ్వలమై యుండుట కేమి హేతువొ మహాశ్చర్యంబు చింతింపఁగన్॥ గీ॥ బాలమాత్రుఁడు సలీలుని ముఖమందు విశ్వమె
ల్ల నెట్లు వెలసియుండు। బాలు భంగి నితఁడు భాసిల్లుఁ గాని స। ర్వాత్ముఁడాదివిష్ణుఁడగుట నిజము॥ అని నిశ్చయించిన॥ గీ॥ మ
హాత్మ్యవలన నీ విశ్వరూపంబు। గానఁబడిన బుద్ధి కంపమయ్యె। నా మహాత్మ్యు విష్ణు నఖిలలోకాధారు। సార్థు లెల్లఁ బాయనాత్ర
యింతు॥ క॥ నా మగఁడు నేను గోవులు। నీమందలు గోపజనులు నిబ్బాలుసినె। మ్మోమున నున్నాఁడు ధనముగని। యేమాఱితమిగాని
యీశుఁడితఁడు మాకున్॥ వ॥ అని తన్ను పరమేశ్వరుండని తలంచుచున్న యశోదయందు నాకృష్ణుండు వైష్ణవమాయం బొం
దించిన॥ క॥ జడను వడి యొఱుక చెడి యా। పడఁతుక సర్వాత్ముఁడనుచుఁ బలుకక యతనిం। గొడుక నితోడ పై నిడుకొని। కడువే
డుకతోఁడ ముమతఁ గావించె నృపా॥ అనిన విని రాజిట్లనియె॥ గీ॥ జగదధీశ్వరునకుఁ జన్నిచ్చు తల్లి గా। నేమి నోము నోఁచెనీయ
శోద పుత్త్రుఁడనుచు నతనిఁ బోషించు తండ్రిగా। నందుఁడేమి చేసెనందితాత్మ॥ క॥ ప్రబ్బిన భక్తిని హరిపైఁ గబ్బంబులు వా

* ఘుంచు। జడ, అవ్వ। అల్లరి-అపకీర్తి.

ప్రకటితులై వల్లవశ్రీ। కబ్బురపడుచు హరిపోయె మణి। మెచ్చినతలిదండ్రులే వటికెక్కుచ్చు దరుణు తుదిగా। అనినవిని రాజయోగికిశుక యోగీంద్రుండిట్లనియె॥ సీ॥ అవనీశ విను ద్రోణుఁ డను వాఁడు వసువులయందు ముఖ్యుఁడు ధరయనునతని భార్య। వారినిద్దరి బ్రహ్మ వసుధపై జన్మింపు మనుచుఁ బంపిన వారలతనిఁ జూచి।విశ్వేశ్వరుండైన విష్ణుసేవారతి మాకిచ్చి లేనియు మహిఁ జనింతు। మనవుడునట్ల కాకనియె వేల్పుల పెద్ద యా ద్రోణుఁ డీ నందుఁడై జనించె। ధరయశోదయయ్యె దనుజేంద్రవైరియుఁ। గవ లగర్భుమాటఁ గారవించి। తల్లిదండ్రులనుచుఁ దనగె వారిమన్నించె। నధిక భక్తితోడ నలరిరిట్లు॥ వ॥ అంత నొక్కనాఁడు తనయింటికి

శ్రీకృష్ణుఁడు దధిభాండవికలనాదులు చేసుటవలన యశోదయతని వెంటదిరిగి పట్టుకొనుట.

డపావలందఱునయ్యైయిపనులందుఁ బంపువడిపోయిన నందసుందరి సంరంభంబునం దరికంభంబుకడ సుమరుగా నొక్క దధికుంభంబు వెట్టి మిసిమిగలమీఁగడ పెరుగుకూడం బోసి పీఁక నాఁక త్రాఁకకవ్వంబున నలవరించి॥ సీ॥ కరకమలారుణ కాంతిఁ గవ్వపు త్రాడు పవడంపు నునుతీఁగె పగిది మెఱయఁ। గ్రమముతో రజ్జువాకర్షింపఁ బాలిండ్లు వీడ్వడనొండొంటిపీఁకనొత్తఁ। గుచకుంభములమీఁదికొంగు జాఱఁగ్రుంకి నొక్కవడుచుమహారావళుల్ బ్రయలుపడఁగ। బొడమిన చెమటతోఁ బొల్పారు నెమ్మోము సంచుపైఁ బతినపద్మంబుఁ దెగడఁ। గౌనుసులియంగఁ గంకణక్వణనమెసఁగఁ। దుఱుముబిగివీడఁగర్ణికామ్యతులు మెఱయ। బాలునంకించియప్పుడు పాటఁ బాడ। దరువులిగురొత్తఁ బెరుగింతి దఱువఁ జొచ్చె॥ ఆసమయంబున॥ క॥ సుడియుచు వ్రాలుచుఁ గిదుకుచు। నడిగొట్టుచు నమ్మ రమ్మ చన్నిమ్మనుచున్। వెడవెడగంతులువైచుచుఁ। గడవఁ గదిసి బాలకుండు గవ్వముఁ బట్టెన్॥ క॥ కవ్వముఁ బట్టిన ప్రియసుతు। నవ్వనరుహనేత్రి డిగ్గి దియంకతలమునన్। నవ్వుచు నిడుకొని మూఁకటి। మువ్వుచుఁ జన్నిచ్చెనతఁడు దూఁటుచుఁ గుడిచెన్॥ మ॥ కడుపారం జనుబాలుద్రావి నసుతుం గంజాక్షి పీఠంబుపై। నిడిపొంగారెడు పాలు డించుటకునై పోవం జూచితద్బాలుఁడే। కడుఁ గోపంబున వాఁడిగాత దధిమత్కుంభంబు వోఁగొట్టె తెం। పదరం గుంభములోని వెన్నఁ దినె మిథ్యాసంకులద్బాష్పుఁడై॥ వ॥ అంత నాలోలలోచన పాలు డించి వచ్చి వికలంబులయిన దధికుంభశకలంబులఁ బొడగని తుంటకొడుకు వెన్నఁ దింట నెఱింగినసుచు నాకలభగామిని యతని గానక చనిచని॥ గీ॥ వికచకమలనయన వేఱొకయింటిలో। వెలయ రోలుఁ ద్రిరుగవేసియెక్కి। యుట్టిమీఁద వెన్న నులుకుచు నొక కోఁతికి పాలు సేయుచున్న బాలుఁ గనియె॥ మ॥ కని చేత న్నెలగోల వట్టికొనుచున్ గాని మ్మ కానిమ్ము రా। తనయా యెవ్వరియందుఁ జిక్కవడ నేదండంబునుం గాననే। పనివారంబును బొందనే వెఱవునే విభ్రాంతియుం జెందుము। న్ననియున్నీవిటువంటి గైకొనవు నేఁడారీతి సిద్ధించునే॥ వ॥ అనియదలించుచు కొడుకునడు వడిం దలంచి తను మధ్యతనమనంబున॥ సీ॥ బాలుఁడీతండని భావింపనియమనాయే పెద్దలును నేరరీక్రమంబు। వెఱపెఱుంగుటకునై వెఱపింతు నంటినాకలిగి లేకొక్కఁడుగాని లేఁడు। వెఱపుతో నాబుద్ధి పిసిపింతు నందునాతను తానయై బుద్ధి దప్పకుండు। నొండెఱుంగక యుంటే నుండెడి నందునా చొచ్చి చూడని నొకచోటు లేము। తన్ను నెవ్వరైనఁ దలఁపఁ బాయఁ బాఱెడు। నోజ లేమభీతియొక్క ఱెఱుంగఁ। డెలమి నూరకుండఁడెక్కసక్కెములనాఁడు। బట్టి శాస్తిసేయు భంగియెట్లు॥ అనివితర్కించి॥ క॥ లాలనమున బహుదోషము। లోలిం బ్రాపించుఁ దాడనోపాయములన్। జాలగుణంబులు గలుగును। బాలురకును దాడనంబు పథ్యం బరయన్॥ వ॥ అనినిశ్చయించి కేలనున్నకోలఁ ఝళిపించి బాలా నిలుమనిలుమనిభగ్గుభగ్గునఁ దల్చి తల్లిదగ్గఱిన వెగ్గడిలిన చందంబున నగ్గలిక చెడిరోలు డిగ్గనుఱికి॥ క॥ గజ్జలు ఘల్లని మ్రోయఁగ। నజ్జలు ద్రొక్కటలు మానియతిజవమున రోఁపి జ్జనములునగఁ దల్లియుఁ। బజ్జం జను దేరనతఁడు పరువిడెనధిపా॥ అప్పుడు॥ మ॥ స్తనభారంబున డస్సి గ్రుస్సియసదై జవ్వాడు మధ్యంబుతో। జనితస్వేదముతోఁ జలత్కబరితో స్రస్తోత్తరీయంబుతో। వనజాతేక్షణ పాఱి వెంటఁ దిరిగెన్ వారించుచున్ వ్రేఁకఁటిన్। ఘనయోగీంద్ర మనంబులున్ వెనుకొనంగా లేని లీలారతున్॥ ఇట్లు కూడం జని॥ సీ॥ స్తంభాదికంబులు దనకున డ్డంబైన నిట్టట్టుఁ జనిపట్టనీనివాని। నీతప్పు సైరింపుమింకఁ దొంగిలఁ బోవనేనని ముసుముట్ట నేడ్చువానిఁ। గాటుక నెఱయంగఁ గన్నులు నులుముచు వెడలు కన్నీరుతో వెగచువాని। నేడెస వచ్చునో యిదియని పలుమారు సారు గుచుఁ గ్రేకంటఁ జూచువానిఁ। గూడఁ బాఱి పట్టుకొని వెఱపించుచుఁ। జిన్ని వెన్న దొంగ చిక్కె ననుచు। నలిగికొట్టఁ జేతులాడక పూఁబోఁడి। కరుణతోడ బాలుఁ గట్టఁ దలఁచి॥ క॥ వీరెవ్వరు శ్రీకృష్ణులు। గారా యెన్నఁడును వెన్నఁ గానరఁటకదా। చోరత్వం బించుకయును। నేరరఁట ధరిత్రి నిట్టి నియతులు గలరే॥ క॥ పట్టినఁ బట్టువడని నిను। బట్టెద నని చలముఁ గొనినఁ బట్టుట వెట్టే। పట్టుఁ బడవంట్రు పట్టీ। పట్టుకొనన్నాకుఁ గాక పరులకు వశమే॥ క॥ ఎక్కడనైనసు డిరి గెడ। వెక్కరొ యొకగుణము గలిగియుండవు నియమం। బెక్కడి నీకు మఱి దినఁ। జక్కఁగఁ బోయెదవు పెక్కుజాడలఁ బుత్రా॥ సీ॥ తోయంబులిడియున్నతొలఁగక చొచ్చుతలచెన వెళ్లైనఁ దరలనెత్తి। మంటితో నాటలు మానవు కోరాడెదున్నత స్తంభంబులూఁచఁ బోయెదు। దస్యులనల్పంబులఁ దు

స్తునుసీవవీనికన్నిటికినివిభుఁడవీవ। ప్రాకృతగుణవికారములఁబొందకపూర్వసిద్ధుఁడవగునిన్నుఁజింతసేయ। గుణహితుం
డోపునే గుణహీననీయందకలగుణంబులనీవకప్పఁబడుదు। మొదలనెవ్వనియవతారములుశరీరులందసరిదొడ్డులేనివీర్య
ములతనువులఁడరజన్మించి వారలయందుఁజిక్క। వట్టిపరమేశ మ్రొక్కెదమయ్యనీకు॥ క॥ భువనములు సేయఁగావఁగ। నవ
తీర్ణుఁడవైతికాదెయఖిలేశ్వరయో। గివరేణ్యవిశ్వమంగళ। కవిసన్నుతవాసుదేవకల్యాణనిధీ॥ ఉపేంద్రవజ్రము॥ తపస్వి
వాక్యంబులుదప్పవయ్యె। నెన్నెపంబునంగంటిమినిన్నుఁజూడ। స్వపంబులోపెన్నముఁదావకీయ। ప్రపన్నులంజేయుముభక్త
మిత్రా॥ శా॥ నీపద్యావళులాలకించిచెవులన్నాఁడువాక్యంబులన్నీపేరంబనిసేయుహస్తయుగమున్నీమూర్తిపైఁజూ
పులు। నీపాదంబులపొంతమ్రొక్కుశిరముల్నీసేవపైఁజిత్తము। నీపైబుద్ధులుమాకునివ్వుకరుణానీరేజపత్రేక్షణా॥
వ॥ అనియిట్లుకీర్తించినగుహ్యకులంజూచినగుచునులూఖలబద్ధుండైనహరియిట్లనియె॥ క॥ తమతమధర్మముఁదప్పక। సములై
ననునమ్మితిరుగుసభ్యులకునుబంధమునను(ఁ)జూచినవిరియును। గనులాప్తుఁడువొడమవిరియుఘనతమముక్రియన్॥ క॥ శా
రుణ్యమానసుండగు। నారదువచనమునఁజేసిననుఁబొడఁగనుట। స్మీరుప్రబుద్ధులైతిరి। చేరెన్నామీఁదఁదలఁపుసిద్ధముమీ
కున్॥ వ॥ అనియీశ్వరుండుమీరుమీనెలవులకుంబొమ్మనియానతిచ్చినమహాప్రసాదంబనివలగొనిపెక్కుమ్రొక్కులిడిన
లకూబరమణిగ్రీవులుత్తరభాగంబునకరిగిరంతనందాదులైనగోపాలకులునిర్మూలంబులైపడిన*సాలంబులచప్పుడుపిడు
గుచప్పుడనిశంకించివచ్చిచూచి॥ క॥ ఈపాదపములుకూలఁగ। నీపాపఁడులూఖలముననిట్లుబద్ధుండై। యేపగిదిబ్రతికెఁగంటి
రే। వాపోవఁడువెఱవఁడెట్టివాఁడోయితఁడున్॥ గీ॥ పిడుగువడమగాకపెనుగాలివిసరదు। ఖండితంబులగుటగానరాదు। బా
లుఁడితఁడుపట్టిపడఁద్రోయఁజాలఁడు। తరువులేలకూలెధరణిమీఁద॥ వ॥ అనిపెక్కండ్రుపెక్కువిధంబులనుత్పాతంబులు
గావలయుననిశంకించిననక్కడనున్నబాలకులిట్లనిరి॥ క॥ నందునికొమరుఁడువినుఁడీ। సందుననుసుడూరిరోలుసరినడ్డము
గా। ముందరికీడ్చినమద్దులు। గ్రుంగుకొనంగూలెజనులఁగంటిమిరువురన్॥ వ॥ అనియిట్లుపలికినబాలకాలాపంబులువినిమి
థ్యారూపంబులనికొందఱందురు- కొందరునానావిధంబులసందేహించిరంతనందుండువికసితవదనారవిందుండగుచుఁబ
ట్టికట్టువిడిచెనట్టియెడఁదనతెఱంగెవ్వరునెఱుంగకుండవలెననికపటకుమారుండు॥ ఉ॥ పాడుమ్మంచునిభంగిగోపవనితల్
పాణిధ్వనుల్సేయఁగా। నాడున్*జంత్రముకైవడిన్బరవశుండైహస్తముల్ద్రిప్పుచుం। గ్గూడన్నేరనివానిభంగిఁదలయూఁ
చున్నగున్వ్రాల్గుర। గ్గూడుస్వేద్దలపంపుసేయఁజనుడాగున్మట్టిఁజిట్టాడుచున్॥ క॥ చుంచొదవుఁబాలుద్రావుమఁజంచితముగ
ననుఁడుపాలుద్రావిజననితోఁ। జురచొదవదనుచులీలా। చుంచుండైయతఁడుచుంచుఁజూపెనరేంద్రా॥ క॥ సెలగోలపట్టుకొ
నిజల। కలశములోనీడఁజూచికలశయుతుండై। సెలగోలపాపఁడొకఁడిదె। తలచెన్ననుగొట్టననుచుఁదల్లికిఁజెప్పెన్॥ క॥ భి
క్షులువచ్చెదరేడ్చిన। భిక్షాపాత్రమునవేసిపెగడించినిన్। శిక్షించెదరనిచెప్పిన। భిక్షులఁగనితల్లిఁగనియుభీతిల్లెన్నృపా॥

—శ్రీ నందాదులు బృందావనంబునకునరుగుట. శ్రీ—

వ॥ ఇట్లుకృష్ణుండుబహువిధంబులఁగపటబాలలీలలవినోదింపబృహద్వనంబుననందాదులైనగోపవృద్ధులుమహోత్పా
తంబులగుటయువానివలనబాలుండుత్తరించుటయుఁజూచియేకాంతంబుననొక్కనాఁడువిచారింపనుపనందుండనువృ
ద్ధగోపకుండుతనయెఱుకమెఱసియిట్లనియె॥ ఉ॥ ఇక్కడనుండరేమనుజులీమనకృష్ణునకెగ్గుసేయఁగా। రక్కసురాలుచ
న్నొసఁగెరాలపయిన్నుడిగాలిమీఁచెఁబై। గ్రిక్కిరియందరుల్వడియెఁగేశవుసత్కృపఁదప్పెఁజాలునేఁ। డెక్కడికైనఁబ్బో
వలయునింకిటగోపకులారవింటిరే॥ క॥ కసవుగలదిరవుపసులకుఁ। లసదద్రినదీమహీజలతికావళిఁబెం। పెసఁగునుగాపురమున
కును। బొసఁగునుబృందావనంబుపొదఁడవ్వటికిన్॥ వ॥ అనుపలుకులకార్యులైనగోపకులిదియకార్యంబుమందలయఁకొంద
లనుండకయామందలామందగమనంబునముందఱనడువంబంచిపిఱుందంగ్రందుకొనకుండబాలవృద్ధనారులెక్కినతేరులు
సాగించి*తనుత్రాణతూణీరబాణధరులైవిండ్లుపట్టుకొనినడువబండ్లవెనుకంగొమ్ములిమ్ములంబూరించుచునవార్యంబుల
గుతూర్యరవంబులనార్యపురోహితసమేతులైవేడుకలుకొనలునిగుడమొనలేర్పఱచుకొనిపావనంబగుబృందావనంబున
కుంజనిరప్పుడు॥ తరల॥ పసపులాడియురోజకుంకుమపంకశోభితలైలసద్వసనలైకచభారచంపకదామలైసులలామలై। ప
సిఁడిమాడలకాంతులుబ్బులఁబర్వఁదేరులమీఁదఁబెం। పెసఁగఁబాడిరి*శ్వేతలాహరిహేలలింపగునేలలన్॥ వ॥ అప్పుడురోహి
ణీయశోదలేకరథంబునఁబరిపూర్ణమనోరథలైరామకృష్ణులముందఱనిడుకొనివారలవినోదంబులకుఁబ్రమోదంబునొం
దుచుండిరిట్లుగోపకులుబృందావనంబుసొచ్చియందర్ధచంద్రాకారంబుగశకటసందోహంబునిలిపిమందలువిడియించివసి

* సాలంబులచప్పుడు। వృక్షములుపడినశబ్దములు. * జంత్రము। బొమ్మ. * తనుత్రాణ। బొక్క. * శ్వేతలు। గోపస్త్రీలు

యించిరి॥ క॥ చెందిరి బలమాధవు లఖిలనందింబు మఁబరమపావనము దంచితకాళిందీసంజీవనము న్బృందావనమున్మునీంద్ర
బృందావనమున్॥ వ॥ ఇట్లు బృందావనంబు చేరి కొంతకాలంబునకు రామకృష్ణులు సమానవయస్కులై గోపబాలకులం గూ
డుకొని వేడుకలూఁదుకొన దూడలఁ గాచుచు॥ సీ॥ వేణువులూదుచు వివిధరూపములతో గంతులు వైతురు గౌతుకమున। గుఱు
కంబళాదులఁ గోవృషంబులఁ బన్ని పరవృషభములని ప్రతిఘటింతు* రల్లులు ఘట్టించి యంఘ్రులఁ గజ్జెలు మొఱయఁ దన్నుచుఱో
లి ముమ్మరమాఁగఁ। బన్నిదంబులు వై చి ఫలమంజరులు గూర్చి వేటులాడుదురు ప్రావీణ్య మొప్ప। వన్యజంతుచయంబుల వానివా
నిఁ బసరుపసరు మవంచించి పట్టఁబోదు। రంబుజాకరములఁ జల్లులాడఁ జనుదు। రా కుమారులు బాల్యవిహారులగుచు॥ క॥ పోరు
దురు§ కిసురవోడుచుచు। మూఱు మరుభయంబు లేక తోరపుటిరువు। ల్జాఱుదురు ఘనశిలాతటి। మీఱుదు రెన్నంగ రాని మేలఁ

## ✽ వత్సాసురబకాసురులవధ. ✽

కువలన్నృపా॥ వ॥ అంత నొక్కనాఁడు యమునాతీరంబున నా కుమారులు గోపకుమారులం దఱును క్రేపుల మేఁప నొక్క రక్కసుం
డు క్రేపురూపంబున వచ్చి వారలఁ హింసింపఁ దలంచి॥ క॥ క్రేపులయట్టుల నాఁకుచుఁ। గ్రేపులలోనిది యుమంది క్రేపనఁగఁ గ
డున్। జూపట్టి భక్తసంగతి। క్రేపై చనువాని త్రోలఁ గ్రేపై తిరిగెన్॥ వాని నెఱింగి కృష్ణుండు రామునకుం జెప్పిన॥ చ॥ ఇది యొ
కమందిలేఁగ వినుఁ డెంతయు నొప్పెడి నంచు దానెత। త్పదములతోఁ గయుర్ బిగియఁ బట్టి చెలంగి వెలంగ మానుతోఁ। జదియఁ
గ నొక్క పెట్టుఁ గొని చంపెఁ గుమారుఁడు లేఁగ రక్కసుం। గుసులు కొనంగ బాలకులు కోయని యార్వ నఖర్వలీలతోన్॥
వ॥ ఇట్లు రక్కసుండు పట్టువడి విశాలంబగు సాలంబుతో నేలం గూలెనప్పుడు॥ క॥ గొంగడు లెగరఁగ వైచుచుఁ। జంగున దాఁటు
చును జెలఁగి చప్పటలిడుచు। న్పొంగుచుఁ గృష్ణునిఁ బొగడుచు। ముంగిన రక్కసుని జూచి ముల్లిరి కొమరుల్॥ వ॥ ఆ సమయం
బున వేలుపులు విరులవానలు గురియించి రప్పుడు॥ క॥ వత్సములపగిది జగముల। వత్సలత న్మనుపఁ జూచువాఁ డై యుంటన్। వత్స
ముల మేపుచుండియు। వత్సాసురుఁ జంపె భక్తవత్సలుఁ డధిపా॥ వ॥ మఱియు నొక్కనాఁడు రేవకడ గోపకుమారులు క్రేపులం
గొంచు నడపకిం జని యొండంబడి మెండుకొని నదప్పి బెండువడిన తమ తమ లేఁగ కదుపుల నేర్పఱించి నిలువరించుకొని కలంక
బులేని యొక్క కొలంకున నీరుం ద్రావించి తారును జలపానంబు చేసి వచ్చునెడ నందు॥ క॥ అకలంకులు బాలురు గని। రకు
టిలదంభోళిహతసితాద్రిశిఖరరూ। పకమున్ హరిహింసారం। భకమున్ బకమున్ విశాలభయదాంబకమున్॥ వ॥ కని దా
ని మొదలి పావునకు వెఱఁగుపడి చూచుచుండ॥ గీ॥ ఎల్ల పనులు మాని యేకాగ్రచిత్తుఁడై। మౌనివృత్తి నితరమత్తము విడిచి। వన
ములోన నిలిచి వనజాక్షుపైదృష్టిఁ। జేర్చి బకుఁడు తపసి చెలువుఁ దాల్చె॥ ఇవ్విధంబున నొదిగి గుఁబెట్టుకొనియుండిన॥ ఉ॥ చం
చువుఁ దీటి పక్షములు ఝల్లన విచ్చి పదంబు లెత్తి కుప్పించి నభంబుపై కెగసి భీషణఘోషణవక్త్రుఁ డై విజృంభించి గరుత్సమీ
రమున భిన్నములై తరులోలిఁ గూలఁగా। మించి బకాసురుం డొడిసి మ్రింగె సహిష్ణుని జిష్ణు కృష్ణునిన్॥ క॥ సంగడిలోకముల
న్నియు। మ్రింగుచుఁ గ్రక్కుచును బయలు మెలఁగించుచును। ప్పొంగెడు వేడుకకాఁడటు। మ్రింగుడువడె బకుని చేత మీఁదెఱిఁ
గిన్నృపా॥ క॥ దనుజుఁడు మ్రింగినఁ గృష్ణుని। గనలేక బలాదిబాలకప్రముఖులు చేతనులై వెఱఁగందిరి చ। య్యనఁ బ్రాణము లే
నియింద్రియంబుల భంగిన్॥ ఇట్లు మ్రింగుడు వడి లోనికిం జనక॥ శా॥ కంఠోపాంతము దాఁడలు। న్నెఱియుచున్ గాలాగ్ని
చందంబునన్। కుంఠీభూతుఁడు గాక వేంద్ర మను నాగోపాలబాలున్ జయోత్కంఠున్ బ్రహ్మగురున్ మహామహిముఁ జ
క్కన్ మ్రింగ రాదంచు సోల్లుంఠం బాడుచు వాఁడు గ్రక్కె వెడలన్ లోకంబు శోకంబుగన్॥ క॥ కక్కి మహాఘోషముతోఁ।
జక్కఁగఁ దనుఁ బొడువ రాఁగఁ జంచులు రెండున్। ప్రక్కఁగఁ బట్టి తృణము క్రియ। గ్రక్కున హరి చీరెఁ బకునిఁ గలఁ బాలాత్ము
కునిన్॥ వ॥ అప్పుడానందనందనుమీఁద వేలుపులు చాలుపులుగా నందనమల్లికాదికుసుమవర్షంబులు హర్షంబునం గురియిం
చిరి. దేవవాద్యంబులు మొఱయింప రామాదిగోపకుమారులు ప్రాణంబులతోఁ గూడిన యింద్రియంబులుం బోలెఁ గ్రమ్మఱఁ
గృష్ణునిం గని రమ్మని కౌఁగిలించికొని కృష్ణసహితులై లేఁగదాఁటుల నలదాఁటించుకొని మందగమనంబున మందకరిగిన
వారలచేత న వృత్తాంతంబంతయు విని వెఱఁగుపడి గోపగోపికాజనంబులు॥ క॥ ఆపదలమీఁద నాపద। లీపాపనిఁ జెందితోలఁ
గెనీయర్భకుపై। వేపడినఖలులు దహనుని। వైపున శలభములపగిదిఁ బడిరి ధరిత్రిన్॥ వ॥ అని పలికి మఱియు నా రామకృష్ణులు క్రే
పులం గాచు తఱి॥ సీ॥ కపుల మై జలరాశిఁ గట్టుదమా యని కట్టుదు రడ్డంబు కాలువలకు। మునుల మై తపములు మొనయుదమా
యని మౌనులై యుందురు మాట లేక। గంధర్వవరుల మై గానవిద్యలు మీఱఁ బాడుదమా యని పాడఁ జొత్తు। రప్సరోజనుల మై
యాడుదమా యని యాఁడురూపముఁ దాల్చి యాడఁ జనుదు। రమరదైత్యవరుల మై యబ్ధిఁ ద్రచ్చుదమా। యని సరోవరముల

* అల్లులు। భుజములను. ౦ పన్నిదము। పందెము. § కిసుకువోడుచుచున్। వెక్కిరించుచు-లాలించుచు. వత్సము। శిశువు-దూడ. వత్సలతన్। కృపచేత.

యందమ్మహాస్త్ర! దండచయముం ద్రిప్పితరుతురుతమయూథము! కోమరులనుసరింపఁగోమరుమిగుల॥ వ॥ అంతనొక్కనాఁడు

## శ్రీకృష్ణుండుగోపకులతోఁజేరిబంతిచల్దులుగుడువఁగాంతారంబునకుఁబోవుట.

రామకృష్ణులుకాంతారంబునబంతిచల్దులుగుడువనుద్యోగించిప్రొద్దునలేచిగ్రద్దననందనయింటిలేఁగకదుపులంగదలించివిస
రంగంబులగుశృంగంబులుపూరించినవినిమేలుకనిసంరంభంబునగోపడింభకులుచలిదికావడులుమూఁపునవహించి (*)స
జ్జంబులగుఖజ్జంబులుగట్టికొనిపదత్రాణవేత్రదండధరులైలెక్కలకువెక్కసంబైన తమతమక్రేపుకదుపులంజప్పుడించి
రొప్పుకొనుచుఁగాననంబుసొచ్చికాంచనమణిపుంజగుంజాదిభూషణభూషితులయ్యును ఫలకుసుమకోరకపల్లవవల్లరుల
తొడవుగానిడికొనికొమ్ములిమ్ముగఁబూరించుచు, వేణువులూదుచుఁ, దుమ్మెదలంగూడిపాడుచు, మయూరంబులతోడంగూ
డియాడుచుఁ, బికంబులంగలసికూయుచు, శుకంబులంజేరిరొదలుసేయుచుఁ, బులుఁగులనీడలంబాఱుచుఁ, బొదరిండ్లదూ
రుచు, సరాళంబులగువాఁగులుగడచుచు, మరాళంబులచెంతనడుచుచు, బకమ్ములంగనినిలుచుచు, సారసంబులంజొచ్చి
యలంచుచు, నదీజలంబులందోఁగుచుఁ, దీఁగెయుయ్యాలలూఁగుచుఁ, బల్లంబులండాఁగుచు, దూరంబులకేగుచుఁ, గపులసం
గడిఁదరువులెక్కుచు, ఫలంబులమెక్కుచు, రసంబులకుంజొక్కుచు, నింగికినిక్కుచు, నీడలుచూచినవ్వుచుఁ, గయ్యంబుల
కుంగాలుఁద్రవ్వుచుఁ, జెలంగుచు, మెలంగుచు, వ్రాలుచు, సోలుచు, బహుప్రకారంబులశరీరవికారంబులుసేయుచు, మఱి
యును॥ క॥ ఒకనొకనిచల్దికావడి।నొకఁడొకఁడడగించిదాఁచునొకఁడొకఁడదివే।ఱొకఁడొకరిమొఱఁగికొనిచను।నొకఁ
డొకఁడదిదెచ్చియిచ్చునుర్వీనాథా॥ క॥ ఒక్కఁడుమున్నేచనఁదన।నొక్కఁడుబలుబొబ్బవెట్టునులికిపడన్వే।ఱొక్కఁడుమీఁ
ఱితటంబున।నొక్కనికనుదోయిమూయునొక్కఁడునగఁగన్॥ క॥ తీపులగుఖజ్జమున్యాఁడు।కోపింపఁగనెడసిపుచ్చుకొను
చున్వాఁడు।న్నేపఱియమగఁగనొక్కఁడు।క్రేపులలోనట్టునిట్టుఁగిఱురించున్నృపా॥ క॥ వనజాక్షుఁడుమున్నఱిగిన।మునుప
డఁగానతనిమేనుముట్టెదమనుచున్।జనిమునుముట్టనివాని।న్మునుముట్టినవాఁడునవ్వుమొనసినరేంద్రా॥ ఇవ్విధంబున॥
ఉ॥ ఎన్నఁడునైనయోగివిభులెవ్వనిపాదపరాగమింతయున్।గన్నులఁగానరట్టిహరిఁగౌఁగిటఁజేర్చుచుఁజెట్టఁబట్టుచున్।ద
న్నుచుగ్రుద్దుచున్నగుచుఁదద్దయుఁబైఁబడికూడియాడుచు।న్మన్ననసేయువల్లవకుమారులభాగ్యములింతయొప్పునే॥
క॥ విందులకెల్లనుబ్రహ్మసుఖా।నందంబైభక్తగణమునకుదైవతమై।మందులకుబాలుఁడగుహరి।పొందుఁగనిరిగొల్లలిట్టిపు
ణ్యులుగలరే॥ అనిపలికిశుకయోగీంద్రుండుమఱియునిట్లనియె॥ క॥ అమరులమృతపానంబున।నమరినవారయ్యునేనిశౌటు
నిపంచ।త్వమునకునెమల్లుసూతురు।తమునమ్మకయట్టియఘుఁడుదరోద్ధతుఁడై॥ క॥ బకునికిఁదమ్ముఁడుగావున।బకమరణ
ముఁదెలిసికంసుపంపునగోపా।లకబాలురతోఁగూడన్।బకవైరినిఁద్రుంతుననుచుఁబటురోషమునన్॥ క॥ బాలురప్రాణం
బులుగో।పాలురకుంబగ్రజాతుప్రాణముమేమా।బాలురఁజంపిననంతియ।చాలునుగోపాలురెల్లఁజచ్చినవారల్॥ వ॥ అ
నినిశ్చయించియోజనంబునిడుపును, మహాపర్వతంబుపొడవును, గొండచఱులమీఱినకోరలును, మిన్నుదన్నిపన్నినసల్లమొ
గుళ్లపెల్లుగలపెదవులును, బిలంబులకునగ్గలంబయినయిగుళ్లసందులు, నంధకారబంధురంబయినవదనాంతరాళంబును,
దావానలజ్వాలాభీలంబైనదృష్టిజాలంబును, వేఁడిమికినివాసంబులయినయుచ్ఛ్వాసనిశ్వాసంబులును మెఱయనేలనా
లుకలుపఱచుకొనిఘోరంబగునజగరాకారంబున॥ క॥ (*)జాపేరములేకయిప్పుడు।క్రేపులతోగొల్లసుతులఁగృష్ణునిదోర
లన్।గీపెట్టఁగమ్రింగెదననిపాపపురక్కసుఁడునేలఁబడియుండెన్నృపా॥ ఆసమయంబున॥ మ॥ ఒకవన్యాజగరేంద్రమల్ల
దెగిరీంద్రోత్సేధమైదావపావకకీలాపరుషప్రచండతరనిశ్వాసంబుతోఘోరవ।హ్నికరాళాతతజిహ్వతోడమనలన్
హింసింపనీక్షించుచున్।వికటంబైపడిసాగియున్నదిపురోవీథింగమంగొంటిరే॥ అనియొండొరులకుంజూపుచు॥ మ॥ బకు
నింజంపినకృష్ణుఁడుండమనకుం బామంచుఁజింతింపనే। టికిరాపోదము దాఁటికాకయది కౌటిల్యంబుతోమ్రింగుడున్।
బకువెంటన్జనుఁగృష్ణుచేతనసుచున్బద్మాక్షునీక్షించియు।త్సుకులైచేతులువ్రేసికొంచునగుచున్దుర్వారులైపోవఁగన్॥
వారలఁజూచిహరితనమనంబున॥ మ॥ అర్భకులెల్లబాముదివిజాంతకుఁడొటనెఱుంగరక్కటా।నిర్భయులైయెదుర్కొనిరి
వేఁగలనంచువిమూఢులంచునా।విర్భవహాగ్రహత్వమునవెఱదగులన్దమలేఁగపిండుతో।నుర్భరఘోరసత్వఘనతుండ
బిలాంతముఁజొచ్చిరందఱున్॥ అయ్యవసరంబున॥ శా॥ వేల్పుల్చూచిభయంబునొందగ్రసనావేశంబుతోనుజ్జ్వలత్క
ల్పాంతోజ్జ్వలమానజిహ్వదహనాకారంబుతోమ్రింగెనా।స్వల్పాహీంద్రముమాధవార్పితమనోవ్యాపారసంచారుల
న్నల్పాకారులశిక్యభారులఁగుమారాభీరులన్ధీరులన్॥ ఇట్లుపెనుబాముచేతమ్రింగుడుపడుసంగడికాండ్రగమింజూచికృ

(*)సజ్జంబులగుఖజ్జంబులు|మనోహరములైనభక్ష్యాంబులను పిండివంటలనిశేషము. గుంజా గురివెంద. (*)జాపేరము|ఆలస్యము.

డుబలభద్రుండును [illegible] శైలశిఖరంబున ఘాసం
బులు గ్రాసంబులు గొనుచున్న గోవులా లేఁగలం గని ॥ చ॥ ముదమున హుంకరించు [illegible] మూఁపుల మీఁద నెత్తి చాఁచు
చుఁ గా, బదములు నాల్గు రెండయిన భాఁగున నేఁగుడఁ గట్టి బాఁటుచు, న్వదనములన్ని శాల తరవాలముల [illegible] నెత్తి పాతి
యూ, మొదవులు చన్నులం గుడిపె మూఁతుల బ్రుంగెడి భంగి నాఁకుచున్ ॥ వ॥ అంత గోపకులు గోవుల నివారింప [illegible] ది
గ్గన నలుకతోడి సిగ్గులగ్గలంబుగ దుర్గమమార్గంబున వాని వెంటనంటి వచ్చి లేఁగల మేపుచున్న కొడుకులం గని ॥ ఉ॥ [illegible]
గంటి కుంచెఁబుల కాంకురము ల్వొలయంగఁ గుఱ్ఱలన్, జయ్యన డాసి యెత్తికొని సంతసమందుచుఁ గౌఁగలింపఁ దా, [illegible]
నాడ లల్మనములార్గఁ గమూర్కొని ముద్దు సేయుచున్ దయ్యమెఱుంగు గోపకులు తద్దయు నుబ్బిరి నిబ్బరంబుగన్ ॥ వ॥ [illegible]
బాలకాలింగనంబుల నానందబాష్పపూరితనయనులై గోపకులు గోవుల మఱలించుకొని తలంగి చను వారలం జూచి బలభ
ద్రుండిట్లని తనలోఁ దలంచె ॥ సీ॥ చన్నుమానినయట్టి శాబకశ్రేణిపై గోగణంబులకును గోపకులకు, నిబ్బంగి వాత్సల్య మెబ్బం
గి నుదయించె హరితొల్లి మన్నించునట్లు వీరు, మన్నించుచున్నారు మమతఁ జేయుచుఁ బ్రీతి నంబుజాక్షునిఁ గన్నయట్లు నా
కుఁ, బ్రేమ మయ్యెడి డింభబృందంబుఁ గనుఁగొన్న నిది మహాద్భుత మెందు నెఱుఁగరాదు, మనుజ దైవత దానవ మాయ యొ
క్కో, కాక నాభర్తయగు చక్రకమలనయను మాయయో గాక యితరుల మాయ నన్నుఁ గలఁపనోపదు విభుమాయ గాఁగ
నోపు ॥ క॥ అని మున్ను ముగ్ధుఁ డయ్యును దనయందుల దివ్యదృష్టిఁ దప్పక బుద్ధిన్ దన చెలికాండ్రను లేఁగుల, వనజాక్షుండనుచుఁ
జూచె వసుధాధీశా ॥ వ॥ ఇట్లు విజ్ఞానదృష్టిం జూచి యెఱింగి యునమ్మక కృష్ణుం జూచి మహాత్మా తొల్లియెల్ల లేఁగులను ఋషుల
యంశంబనియును, గోపాలకులు వేల్పుల యంశంబనియును దోఁచుచుండు నిపుడు వత్సబాలక సందోహంబు సందేహంబు లే
క నీవయని తోఁచుచున్నది యిది యేమి యని యడిగిన నన్నియును నారూపంబు వచ్చినందు మన్నన జేసి క్రన్నన నెఱింగించెన
తండు నెట్టకే నివ్విధంబున హరి బాలవత్సంబులు దానయై సంచరించిన యేఁడు విరించికి తనమానంబున నొక్క త్రుటిమాత్రం
బైన విరించి చనుదెంచి వత్సపాలకుండైన కృష్ణబాలకుం జూచి వెఱంగుపడి యిట్లని వితర్కించె ॥ శా॥ మందన్ గన్గొన వత్సబాల
కులు నామాయాగుహాసుప్తులై, యెందున్ బోవరు లేవరెవ్వరును లేరే చేయ నాకన్యులాం, డెందున్ లేరు విధాతలుం బరు
లు వీరెవ్వారలెట్లైరకో, యెందే లెంచిరొ కృష్ణుతో మెలఁగువారెం దయ్యెడి న్నేఁటికిన్ ॥ మత్తకోకిల॥ బ్రహ్మ సంపుగఁ గాని
పుట్టదు ప్రాణిసంతతి యెప్పుడున్, బ్రహ్మ నొక్కఁడఁ గాని వేఱొక బ్రహ్మ లేఁడు సృజింపఁగా, బ్రహ్మ నే నుసృజింప నొండొ
బాలవత్సకదంబమే, బ్రహ్మ నం దు జనించె నొక్కఁడ బ్రహ్మమై కనిచూడఁగాన్ ॥ వ॥ అని యిట్లు సకలంబును సుకరంబుగ వెఱ
వెఱింగెడి నెఱవాది ముదుక యొక్కఁకగల ప్రోగు వెఱఁగుపడి గ్రద్దనఁ బెద్దప్రొద్దు తద్దయుం దలపోసి కర్జంబు మంద [illegible]
కకొండల పడుచు నాందోళంబున ॥ క॥ మోహము లేక జగంబుల, మోహంపఁగఁ జేయ నేర్పు మొనసిన విష్ణున్, మోహింపఁ జేయ
నేనని మోహమున విధాత తాన మోహితుఁడయ్యెన్ ॥ గీ॥ పగలు ఖద్యోతరుచి నెపగిది రాత్రి, మంచు చీఁకటి లీనమై
మాయు మాడ్కి, విష్ణుపైనన్య మాయలు విశదమగునె, చెడిని జేయుఁ గరివాంబుఁ జెఱుచుఁగాక, నడియుఁ ॥ క॥ పుట్టించెఁ బుద్ధి
యెఱింగితిఁ బుట్టించితి జగము సగము పోయెను బ్రాయఁ, బిట్టిపి నూతనసృష్టులు పుట్టుట లేదొం యిట్టి *బూమెలు భూమిన్ ॥
వ॥ అని యిట్లు తలవాకిట వాడిమిగల వాణి పోఁడిమి చేవాఁడి కెక్కిన నలుమొగంబుల తక్కరి గొంటు పెనువంటలు వెంటనై
నతనమనంబున వితర్కించి విచారించు నెడ నతండు గనుంగొనుచుండ నబ్బాలకులు మేఘశ్యాములును, హారకుండలకిరీటవన
మాలికాభిరాములును, శ్రీవత్సమంగళాంగద నూపుర కనక కటక కంకణ కటిఘటిత కాంచీగుణోద్దాములు, నాపాదమస్త
క తులసీనవధాములును, విలసదంగుళీయకస్తోమములును, శంఖచక్రగదాకమలహస్తులును, బహుప్రశస్తులును, పీతకౌశే
య వాసులును, చంద్రికాధవళహాసులును, కరుణాకటాక్ష వీక్షణ విలాసులును, రవికోటిభాసులు ననంత సచ్చిదానందరూప
మహితులు నణిమాదిగుణోపేతులును విజాతీయ భేదరహితులును, శ్రీమన్నారాయణప్రతిమానవిగ్రహస్వరూపులునై
తమకుఁ బరతంత్రులగుచున్న నృత్తగీతాది సేవావిశేషంబులఁ బూజింప నెలంగుచు మూర్తిమంతంబులైన బ్రహ్మాది చరాచరం
బులు నణిమమహిమాదిసిద్ధులును, మాయాప్రముఖంబులైన శక్తులును, మహదాదిచతుర్వింశతి తత్త్వంబులును, స్వభావ, క్షో
భ కాలపరిమాణహేతుసంస్కార కామకర్మగుణంబులును, సేవింప వేదాంతవిమలులైన నెఱుంగరాని తెఱంగున [illegible]
చుఁ గానంబడిన వారలం గనుంగొని ॥ ఉ॥ బాలురఁ గంటి నామదికిఁ బాసిన వారి నిమున్ను వారి నేఁ, బోలఁగఁ జూచు నంతటన
భూరి నిరర్గళదుర్గమప్రభా, జాలము తోడఁ జూపులకుఁ జాలమిఁ దెచ్చుచునున్నవారలే, మూల [illegible]
మోనము వచ్చెఁ గదే విధాతకున్ ॥ వ॥ అన్నిసకలేంద్రియంబులకు వెక్కసంబులైన నప్రకిక్కి ॥ ఉ॥ ఏపర మేశుతేజమున నీసచరా

* బూమెలు, మాయలు.

చరమైనలోకము దీపితమయ్యె నట్టి విభు తేజముఁ గన్నులఁ జక్కఁ జూడఁగా నోపక పారవశ్యమును నొందుచు సంస్తిమితా
ఖిలేంద్రియుండై పరమేష్ఠి మైమఱచె నప్పుడు చిత్రపురూపుకైవడిన్. వ. ఇట్లు మాయాతీతుండును, వేదాంతవిజ్ఞానదుర్ల
భుండును, స్వప్రకాశానందమండితుండును నైన నాత్మవైభవంబు చూచి నివ్వెఱపడిన బ్రహ్మం గని యీశ్వరుండు. శా. బాలుండై
చతురాననుం డుతనయీ బ్రహ్మాభిమానంబునన్ లోలుండై మతిఁ దప్పి నా మహిమ యాలోకింప నేతెంచెఁదా నాలోకిం
పఁగ నెంతవాఁడనుచు మాయాజాలముల్ విప్పి తా లీలారూపము లెల్లఁ దాఁచె నట కేళీచాతురీధుర్యుఁడై. వ. అంతలోన నిర్జ
రుండును సజీవుండునైన తెలివొంది నేనిమిదికన్నులుగల వేల్పుగమికాఁడు తేటి తెప్పిరిలి క్రాలుఁగేలుఁ గదలించి చెచ్చెఱఁ గన్నుఁ
దెఱచి చూడ సమర్థుండై ముందరఁగని వెనుకఁ జూచి వివిధలోకించి దిక్కులు వీక్షించి యెల్లయెడలం గల యద్దర్శించి తనపురోభా
గంబున హరిసంచరించుటం జేసి జాతివైరంబు లేని నరపక్షిమృగాదులకు నాటపట్టయి సిరిఁ గలిగి కామక్రోధావిరహితులకు
జీవనంబైన బృందావనంబు పొడగాంచి యందు. సీ. తనకన్యములు లేక తనరారి మూర్తులవిభుఁడయ్యుఁ గ్రేపుల వెదకువా
ని నఖిలజ్ఞుఁడై యొక్కఁడయ్యు నజ్ఞాకృతిఁ జెలికాండ్రఁ జెక్కండ్రఁ జేయువాని బహిరంతరాద్యంతభావశూన్యుఁడయ్యు
నంతంత నడుగు చొప్పరయువాని గురుగభీరుండయ్యుఁ బరువులు వారుచు నట్టిట్టు పాతరలాడువాని జాతిరహితుఁడయ్యుఁ
జతురగోపార్భక భావమెల్లఁ నచ్చుపడిన మేని చెలువువాని హస్తశీతాన్నకబళంబువానిఁ గాంచె నపుడు వాణిమగఁడు.
వ. కని సంభ్రమించి విరించి రాయంచ డిగ్గనుఱికి కనకదండసుకుమారంబైన శరీరంబుతోడ నేలం జాగిలంబడి మణిగణసు
ప్రకాశంబులైన తనకిరీటశిఖరప్రదేశంబులం గుమారుని పాదపద్మంబులు మోవ మ్రొక్కి తోరంబులగు నానందబాష్ప
జలపూరంబుల నతని యడుగులు గడిగి మఱియును. క. అడుగుల పైఁబడు లేచుం బడుఁ గ్రమ్మఱ లేచు నిట్లు భక్తిస్ఫురదా
బోడగనిన పెంపుఁదలఁచుచు మఱిఁ గని మహిమాబ్ధి నజుఁడు మునుకఁడఁ జెన్నొప్పన్. వ. అంతనల్లనల్లన లేచి నిలుచుండి నయనా
రవిందంబులు దెఱచి గోవిందు నీక్షించి చతుర్ముఖుండు ముఖంబులు వంచి కృతాంజలియై గద్గదస్త్రీ కెయిమోడ్చికొనుచు నే
కచిత్తంబునఁ జతుర్ముఖంబుల నిట్లని స్తుతియించె. సీ. శంపాలతికతోడి జలదంబుకైవడి మెఱుఁగుటొల్లియతోడి మేనివా
నిఁ గమనీయమృదులాన్నకబళ వేత్రవిషాణ వేణుచిహ్నంబుల వెలయువాని గుంజావినిర్మితకుండలంబులవాని శిఖిపింఛ
వేష్టితశిరమువాని వనపుష్పమాలికావ్రాతకంఠమువాని నళినకోమలచరణములవానిఁ గరుణ గడలుకొనిన కడకంటివా
నిఁ గోపాలబాలుభంగిఁ బరగువానిఁ నను మొగంబువానిఁ ననుగన్న తండ్రిని నిను భజింతు మ్రొక్కి నీరజాక్ష. మ. ననుమ
న్నించి భవజ్జనంబులకు నానందంబు నిండించి నీ తనురూపం బిదె నా మనంబునకదింత్యం బయ్యె నీయుల్లసద్ ఘనవిశ్వాకృతి నె
వ్వాఁడోపు నెఱుఁగన్ గైవల్యమై యొప్పు నాత్మనివేశ్యంబగు నీమహైభవము చందం బెట్టిదో యీశ్వరా. క. విజ్ఞానపథము లె
ఱుఁగక తద్జ్ఞులు నీవార్తఁ జెప్పఁదను వాఙ్మనముల్ యజ్ఞేశ నీకు నిచ్చిన యజ్ఞులు నినుఁ బట్టి గెలుతురజితుఁడవైనన్. క. శ్రే
యములు గురియు భక్తిని జేయక కేవలము బోధసిద్ధికిఁ దపముల్ జేయుట విఫలము పొల్లం దాయము చేసటు నెతలఁ పనఫి
కంబైనన్. క. నిజముగ నిన్నెఱుఁగుటయును నిజవాంఛలు నిన్నుఁ జేర్చి నీకథ వినుచున్ నిజకర్మలబ్ధభక్తిన్ సుజనులు నీ మొ
దలి కెంకిఁ జొచ్చిరధీశా. సీ. విక్రియాహీనస్వసైవిషయత్వమును లేనిదనుచు నాత్మాకారవృత్తియైన నంతఁ గొకరణ మొక్కటి
యధికసాక్షాత్కారవిజ్ఞానమునఁ బట్టి వేఱొరులకు నెఱుఁగంగరానిదై యేపారియుండుటం జేసి నీనిర్గుణశ్రీ విభాతి. బ
హిరంగవీథులఁ బాఱకదిరములై యమలంబులగు నింద్రియముల చేత నెట్టకేలకైన నెఱుఁగంగనగుఁగాని గుణవిలాసివ
గుచుఁ గొమరుమిగుల నీగుణవ్రజంబు నేరరా దెఱుఁగంగ నొక్కమితము లేక యుంట నీశ. క. తారాతుషారశీకర భూరజ
ములకైన లెక్కబుధులిడుదురు భూభారావతీర్ణ కరుఁడగు నీ రమ్యగుణంబు లెన్న నేరరగణ్యా. శా. ఏ వేళఁ గృపఁ జూచు నె
న్నఁడు హరి న్వీక్షింతునం చార్థుఁడై నీ వెంటన్నడితోఁటికర్మచయమున్నిర్మూలముం జేయుచు నీవాఁడై తనువాఙ్మ
నోగతులని స్సేవించు విన్నాణి నో కైవల్యాధిపలక్ష్మికుద్దవడి దాఁగైకొన్నవాఁ డీశ్వరా. ఉ. మాయలుగల్గువారలను
మాయలఁ బెట్టెడి ప్రోడ నిన్ను నా మాయఁ గలంచి నీమహిమ మానముఁ జూచెద నంచు నేరమిన్ జేయఁగఁ బూనితిన్ గుణసే
యమ్ము కావుము యోగిరాజ వాగ్గేయదవాగ్నిఁ దజ్జనితకీలముఁ గెల్చి వెలుంగ నేర్చునే. సీ. సర్వేశ నీరజోజనితుండ మూ
ఢుండ ప్రభుఁడ నేనని వెఱ్ఱిప్రల్లదమున గర్వించినాఁడను గర్వాంధకారాంధనయనుండ కృపఁ జూడు నను బ్రధాన మహద
హంకృతి నభోమరుదగ్ని జలభూమిపరివేష్టితాండకుంభంబులోన నేడుజానల మేన నేనయ యొక్కండ నే నీదృగ్విధాండం
బు నేరికైన సంఖ్యసేయంగరానిది సంతతంబు నోలిఁ బరమాణువుల భంగి నొడలిరోమ వివరములయందు వర్తించు విపు
లభాతి నేనయు మన్న నీవెక్కడ నెంతకెంత. తరల. కడుపులోపల నున్న పాపఁడు కాలఁదన్నినఁ గిన్కతో నడువఁ బోలు నె

పాదపద్మ సద్భావములు నీయందే సమర్పించి నీప్రేలంద్రొక్కిన పాదరేణువులపై వేష్టించినం జాలదే॥ మ॥ నినుహింసించి నపూతనాదులకు మున్నీ మేటి సంకేతమి ద్విటినీకున్బరదారపుత్రగృహగోస్త్రీప్రాణదేహాదులెల్లను వంచింపక నిచ్చు గోపకులకున్ లక్షింప నేమిచ్చెదో యనిసందేహము దోఁచుచున్నది ప్రపన్నానీకరక్షామణీ॥ క॥ దేహము కారాగేహము। మోహము *నిగళంబు రాగముఖరములు రిపువ్యూహములు భక్తితోని న్నూహింపఁగనెంత దడవు నోకమలాక్షా॥ గీ॥ ఆశ్రయించు జనులకానందసందోహ మీవలంచి వివిధహేలతోడ నప్రపంచకుండవయ్యుఁ బ్రపంచంబు। వెలయఁజేయుదీవు విశ్వమూర్తి॥ క॥ ఎఱిఁగినవార లెఱుంగుదు। రెఱుఁగన్బహుభాషలేల నీశ్వర నీపెం। పెఱుఁగ మనోవాక్కులకున్। గుఱిసేయంగోలఁది గామ గుణరత్ననిధీ॥ క॥ సర్వము నీవ యెఱుంగుదు। సర్వవిలోకనుఁడ వీవ జగదధిపతివిన్। సర్వాపరాధి నను నో। సర్వేశ యనుగ్రహింపు చని యెదనింకన్॥ క॥ జిష్ణునిశాటవిపాటన। వృష్ణికులాంభోజసూర్య విప్రామరగో। వైష్ణవసాగర హిమకర। కృష్ణా పాషండధర్మగృహదావాగ్నీ॥ వ॥ దేవా నీకుఁ గల్పపర్యంతంబు నమస్కరించెదనని యివ్విధంబున సంస్తుతించి ముమ్మారు వలగొని పాదంబులపైఁబడి వీడ్కొని బ్రహ్మ తన నెలవునకుం జనియె నంతనిమ్మన్నించి భగవంతుండైన హరి తొల్లి చెడితిరిగివచ్చిన వత్సబాలకుల గ్రమ్మఱంగైకొని పులినంబుకడఁ జేర్చె నిట్లు॥ క॥ *క్రీడించుతనంబున విధి దమ వంచించిన యేఁడు గోపవరనందనులొక్క క్షణకాలంబుగని క్షించిరి రాజేంద్ర బాలకృష్ణునిమాయన్॥ గీ॥ ఏమహాత్ముమాయ నీవిశ్వమంతయు। మోహితాత్మ యగుచు మునిఁగియుండు నట్టి విష్ణుమాయ నర్భకులొక్కయేఁ। డెఱుఁగకుండి రనుట యేమి దొడ్డ॥ అప్పుడు॥ మ॥ చెలికాఁడా యరుదెంచితే యిచటికిన్ స్నేమంబున గ్రేపులు। న్నెలవుల్ త్రెళ్ళెన రణ్యభూమివలన న్నీవచ్చు నందాఁకఁ జల్దులుమీరించుక యెవ్వరున్ గుడువ రాలోకింపు రమ్మంచు నా। జలజాక్షుండు నగన్బుజించి రచటన్ సంభాషలం డింభకుల్॥ వ॥ ఇట్లు బాలకులతోడఁ జల్దిగుడిచి వారలకు నజగరచర్మంబు చూపుచు వనంబున నుండి తిరిగి॥ వనమయూరవృత్తము॥ ప్రసన్నపింఛమాలికాప్రభావిభాసితాంగుఁడుం। బ్రసిద్ధశృంగవేణునాదపాశబద్ధలోలుఁడుం। బ్రసన్నగోపబాలగీతబాహుకీర్త్యుఁడయ్యె నుల్లసించి యేగెగోపకుల్ చెలంగి చూడ మందకున్॥ ఆసమయంబున॥ క॥ పెనుబాముదమ్ము మ్రింగిన। నునునందసుతుండు పాముమర్దించి మముం। గ్మని చెనరణ్యములోపల। నని ఘోషించిరి కుమారులా ఘోషములోన్॥ అని వినిన రేఁ ద్రుండిట్లనియె॥ క॥ కనిమని దియెత్తి పెంచిన। తనుజన్ములకంటె నందతనయుండా ఘోషనివాసులకు మనోరంజనుఁ డెట్లయ్యె సుబుధేంద్ర చను నెఱిఁగింపన్॥ అని నశుకుండిట్లనియె॥ సీ॥ అఖిలజంతువులకు నాత్మవల్లభుఁడైన భంగి బిడ్డలు నింపులుఁ బసిఁడి మొదలు। వస్తువులెవ్వియు వల్లభంబులు గావు సకలాత్మకుండైన జలజనేత్రుఁ। డఖిలజంతువులకు నాత్మగావున ఘోషవాసులకెల్లను వల్లభత్వ। మునుమిక్కిలొప్పె నమ్మాఁడు లోకములకు హితము సేయఁగఁ జలజేక్షణుండు। మాయతోడ మూర్తిమంతుఁడై యొప్పారు। కలఁడతండు నిఖిలగణములందు। భవతిధాతువెట్లు భావార్థమై సర్వ। ధాతుగణమునందుఁ దనరినట్లు॥ క॥ శ్రీపతిపదమను నావను। బ్రాపించు భవాబ్ధి వత్సపదముగ ధీరుల్। రూపించి దాఁటచేరుదు। రాపత్పదరహితులగుచు నమృతపదంబున్॥ గీ॥ అఘునిఁ జంపి కృష్ణుఁ డాప్తులు దానును। జల్దిఁ గుడిచి జలజసంభవునకుఁ। జిద్విలాసమైన చెలువుఁ జూపినకథఁ। జనువ వినినఁ బూర్ణకామసఫలమగును॥ అని చెప్పి మఱియు వ్యాసనందనుండిట్లనియె॥ క॥ రాగంబుల బలకృష్ణులు। పౌగండవయస్కులగుచుఁ బశుబాలకథా। యోగంబున బృందావన। భాగంబునఁ గాఁచిరంతఁ బశువుల నధిపా॥ వ॥ అయ్యెడఁ గృష్ణుండొక్కనాఁడు *రేపకడలేచి వేణువుపూరించి బలభద్రసహితుండై గోపకుమారులు దన్ను బహువారంబులు వైవారంబులు సేయ మ్రోలనాలకపుల నిడికొని నిరంతర ఫలకిసలయకుసుమంబులును, గుసుమమకరంద నిష్యందపానానందదిందిందిరకదంబంబును, గదంబాది నానాతరులతాగుల్మసంకులంబును, గులవిరోధ రహిత మృగపక్షిభరితంబును, భరితసరస్సరోరుహపరిమళమిళితపవనంబును నైన వనంబుఁ గనియందు వేడుకం గ్రీడింపనిశ్చయించి వెన్నుఁడన్నకిట్లనియె॥ శా॥ శాఖాపుష్పఫలప్రభారనతలై చర్చించిరో దేవమా। శాఖిత్వంబు హరింపుమంచు శుకభాషన్నీ కెఱింగించుచున్। శాఖాహస్తములన్ బ్రసూనఫలముల్ పక్కన్ సమర్పించుచున్। శాఖిశ్రేణులు నీపదాబ్జములకోజన్ మ్రొక్కెడిన్ జూచితే॥ సీ॥ నిఖిలపావనమైన నీకీర్తిఁ బాడుచు నీతుమ్మెదలు వెంట నేఁగుదెంచె। నడవిలో గూఢుండవైన యీశుఁ డవని మునిగణంబు సరిగొల్వఁ గవచ్చె మునిగణంబు। నీలాంబరముతోడ నీవు జీమూతమవని నీలకంఠంబు లాడఁదొడఁగెఁ। బ్రియముతోఁ జూచు గోపికల చందంబున నినుఁ జూచె నదె హరిణీచయంబు। నీవు విందవనుచు నిర్మలసూక్తులు। వలుకుచున్న విచటఁ బరభృతములు। నేఁ

---

*నిగళంబు సంకిలి. రాగముఖములు కామక్రోధాదులు. *క్రీడించుతనంబునన్ దుష్టతనముచేత. విధి బ్రహ్మ. *రేపకడ ప్రాతఃకాలము. బహువారంబులు వైవారంబులు॥ బహువారంబులు అనేకమారులు, వైవారంబులు స్తోత్రములు.

దుపిపినచరులునీవువిచ్చేసిన।ధన్యులైరిగా దెతలంచిచూడ॥సీ॥నీపాదములుసోఁకి నేఁడునీరును దృణపుంజంబుతో భూమివు
న్యయయ్యె।నీనఖంబులు దాఁకి నేఁడునానాలతాతరుసంఘములుగృతార్థంబులయ్యె। నీకృపాదృష్టిచే నేఁడునదీశైలఖగ
మృగంబులువివ్యకాంతిఁ జెందె।నీపెన్నురముఁ బ్రోవ నేఁడుగోపాంగనాజనములపుట్టువుసఫలమయ్యె। ననియరణ్యభూ
మినంకించిపశులను।మిత్రజనులుదాను మేపుచుండి।నలినలోచనుండునదులందుగిరులందు। సంతసంబు మెఱయసంచరిం
చె॥మఱియునయ్యాశ్వర్యుండు॥సీ॥ఒకచోటమత్తాళియూథంబుఝుమ్మని మ్రోయంగఝుమ్మని మ్రోయుచుండు।నొకచో
టఁగలహంసయూథంబుగూడి కేంకృతులు సేయంగఁ గేంకృతులు సేయు। నొకచోటమదకేకియూథంబులాడంగ హస్తా
బ్జములుద్రిప్పియాడుచుఁదోడఁగు। నొకచోటవనగజయూథంబునడువంగనయముతో మెల్లననడువఁజొచ్చుఁ। గ్రౌంచచ
క్రముఖరఖగములలోకొక్కచోటఁ।బలుకవానియట్లపలుకుఁగదిసి। పులులసింహములనుబోడఁగని యొకచోటఁ। బఱచు
మృగములందుఁదఱుచుగూడి।మఱియును॥సీ॥రాపూర్ణచంద్రికరాగౌతమీగంగరమ్మభగీరథరాజతనయ। రాసుధాజల
రాశిరామేఘమాలికరమ్ముచింతామణిరమ్ముసురభి। రామనోహారిణిరాసర్వమంగళరాభారతీదేవిరాధరిత్రి। రా
శ్రీమహాలక్ష్మిరామందమారుతిరమ్ముమందాకినిరాశుభాంగి।యనుచుమఱియుఁగలుగునాఖ్యలుగలగోవు। లడవిలోన
దూరమందుమేయ।ఘనగభీరభాషఁగడుమెప్పఁజీలునా।భీరజనులువొగడఁబెంపునెగడ॥క॥కాంతారవిహారమ్ముల।శ్రాం
తుండై గోపకాంకశయనుండగుచు।న్సంతుష్టిఁబొందఁజేయుని। రంతరకరచరణమర్దనాదులనధిపా ॥ క ॥ పాడుచునా
డుచుముచ్చట। లాడుచునొండొరులఁదాఁకునాప్తులఁగనిబి।ట్టాడుచుఁజేతులువ్రేయుచుఁ।గ్రీడింతురునగుచుబలుఁడుఁ
గృష్ణుఁడునొకచోట॥ఇవ్విధంబున॥సీ॥ వేదాంతవీధులవిహరించువిన్నాణివిహరించుఁగాంతారవీథులందు। ఫణిరాజశ
య్యపైఁబవళించుసుఖభోగిపల్లవశయ్యలఁబవ్వళించు।గురుయోగిమానసగుహలఁగ్రుమ్మరుమేటిగ్రుమ్మరునద్రీంద్రగు
హలలోనఁ।గమలతోడఁబెనంగికడుడయ్యుచతురుఁడాభీలజనులతోడఁబెనఁగిడయ్యు।నఖిలలోకములకునాశ్రయుండగు
ధీరుఁ।డలసితరులనీడనాశ్రయించు। యాగభాగచయములాహరించుమహాత్ముఁ। డడవిలోనిఫలములాహరించు॥ఆసమ
యంబున॥సీ॥ అలసినచోఁగొందఱతిమోదమునవీపులెక్కించుకొనిపోదు రేవు మెఱసి। సొలసినిద్రించినచోనూరుతల్పం
బులిడుదురుకొందఱుహితవుగలిగి।చెమరించియున్నచోఁజిగురుటాకులఁగొందఱొయ్యనవిసరుదురుత్సహించి।దవ్వేఁగి
నిలుచుచోఁడడయకగొందఱుపదములొత్తుదురతిబాంధవమున।గోపవరులుమఱియుఁగొందఱుకొందరు। మాధవునకుఁజె
క్కుమార్గములను।బనులుసేసిరెల్లభవములఁజేసిన।పాపసంచయములుభస్మములుగ॥వ॥అయ్యవసరంబున శ్రీరామనా

——⇒ గార్దభాకారుండైనధేనుకాసురునివధ. ⇐——

మధేయుండైనగోపాలకుండురామునకేశవులంజూచియిట్లనియె॥క॥ దూరంబగుతాలతరు।స్ఫారంబగువనముగలదుపతితా
నుపత।ద్భూరిఫలసహితమదియే।ధీరులు చొర వెఱతురందు ధేనుకుఁడుంటన్॥వ॥ఆధేనుకాసురుండుమహాశూరుండును, ఖ
రాకారుండునునై,సమానసత్వనమేతులైనజ్ఞాతులుందానునుమనుష్యులంబట్టిభక్షించుచుండునయ్యెడఁ, బరిమళోపే
తంబులైననూతనఫలవ్రాతంబులసంఖ్యంబులుగలవు విమడు॥క॥ ఫలగంధమునాసాపుట। ములవెంటన్జొచ్చిచిత్త
ములఁగొనిపోయెన్।ఫలములునకులింపుఁడుమముఁబలిమిరకునుమీకుదైత్యభటులడ్డంబే॥వ॥అనిపలికినచెలికాండ్రపలుకు
లాదరించివిన్నినగివారునుందానును,మత్తాలంబగుతాలవనంబునకుంజనిరంత॥క॥ తత్తరమునబలభద్రుఁడుఁ। దత్తాలానోక
హములఁదనభుజబలసం।పత్తిఁగదల్చుచుగ్రక్కున।మత్తేభముభంగిఁబంట్లుమహిపైరాల్చెన్॥వ॥ అప్పుడుపండ్లురాల్చిన
చప్పుడుచెవులకుదెప్పరంబైననదటిపడిరిపుమర్దనకుతుకంబునగార్దభాకారుండైనధేనుకాసురుండు॥మ॥ పదవిక్షేపము
లన్నవృక్షధరణీభాగంబుగంపింపఁగా।రదముల్దీఁటుచుఁగత్తరించినచెవుల్గాఁజిల్లవాలంబుఖీ।తిదమైతూలఁగఁగావరంబు
నసముద్దీపించిగోపాలకు।ప్రైదరన్రామునిఱొమ్ముఁదన్నె వెనుకైబీరంబుతోరంబుగన్॥క॥ మఱియునుదనుజుఁడురాము
నిఁగఱవఁగగమకించితెఱపిగానకయతని।న్జుఱుచుఱఁజూచుచుశౌర్యము।పఱివోవఁగనంతనింతఁబదములఁదన్నెన్॥వ॥అం
తబలభద్రుండురౌద్రాకారంబునగర్దభాసురుపదంబులునాలుగునొక్కకేలనంటంబట్టిబెట్టుధట్టించిద్రిప్పివిగతజీవుంజేసి.
మ॥ ఒకతాలాగ్రముఁదాఁకవైవనదికంపోద్రేకమైత్రెళ్లి వే।తొకతాలాగ్రముపైఁబడన్నదియునత్యుగ్రాహతిన్నిల్వ
కొండొకతాలాగ్రముపైఁబడన్విరిగియిట్లొండొంటిపైఁదాలవృ। క్షకముల్గూలెఁబ్రచండమారుతముదాఁకన్గూలుచం
దంబునన్॥ ఉ॥తంతువులందుఁజేలమువిధంబుననేపరమేశమూర్తియం। దింతయుఁబుట్టునట్టిజగదీశుఁడనంతుఁడుదైత్య
మాత్రునిట్లంతముసేయుటెంతపనియచ్యుతమేవినుమంతలోనవాఁ। డంతముఁబొందుటెల్లఁగనియాతనిబంధులుగార్ద

ఘనంబులై॥ క॥ బలకృష్ణుల మైఁ గదిసిన। బలియుర ఖరదైత్యభటులఁ బశ్చిమపాదం। బులు వట్టి తాలశిఖరం। బుల నెగరఁగ వైచి వారిఁ బోరిఁ గొనిరధిపా॥ అప్పుడు॥ క॥ అలమున నొలిఁ గూలిన। తాలద్రుమఖండదైత్యహతముఖండముల। నీలితమైఘరజలధర। మాలావృతమైన మింటి మాడ్కి న్వోలిఁ గెన్॥ క॥ ధేనుకవనమున నవ్విరి। మానవులా వేళఁ దాటిఫ్రూసులఫలము। ల్దేనువులు మెసఁగెఁ గసవులు। ధేనుకహరభక్తకామధేనువు గలుగన్॥ వ॥ ఆసమయంబున సురలు విరుల వానలు గురియించిరంతఁ గమలలోచనుండు గోపగీయవర్తమానుండై యన్నయుం దానును గోపగణంబులం బిలిచికొని మందకుం జనియె నవ్వేళ॥ ఉ॥ గోపదరేణుసంకలితకుంతలబద్ధమయూరపింఛు నుద్దీపితమందహాసశుభదృష్టిలసన్ముఖు నవ్యపుష్పమా। లాపరిపూర్ణు గోపజనలాలితవేణురవాభిరాము నా। గోపకుమారునిం గనిరి గోపసతుల్నయనోత్సవంబుగన్॥ గీ॥ కమలనయను వదనకమలమరందంబు। సవిలినయనషట్పదములవలనఁ। ద్రాగి దినవియోగతాపంబు మాసిరి। గోపకాంత లెల్లఁ గోరి యలరి॥ వ॥ ఇట్లు గోపికలాదరంబునం జూడ వ్రీడాహాసవినయంబులం జూచుచుం గ్రీడాగరిష్ఠుండై నప్రౌఢగోష్ఠంబు ప్రవేశించె నంతరోహిణీయశోదలు పుత్త్రులవలని మచ్చిక పిచ్చలింప నిచ్చకువచ్చిన శ్లైష్మ్యోవేళలదీవించిరి- వారును మజ్జనోన్మర్దనాదులంగీకరించి సురభికుసుమగంధంబులు గైకొని రుచిరచేలంబులు గట్టికొని సోపపన్నంబులైన యన్నంబులు గుడిచి తృప్తులై మంజులశయ్యల

### శ్రీకృష్ణుఁడు కాళియమర్దనము గావించుట.

సుప్తులై యుండిరంత॥ సీ॥ ఒకనాఁడు బలభద్రుఁడొక్కఁడు రాకుండ గోపాలకులు దానుఁ గూడి కృష్ణుఁ। డడవికిఁ జని యెండ నా గోవులును గోపకులు నీరువట్టునఁ గుందియుండఁ। గాళిందిలో విషకలితతోయము ద్రావి ప్రాణానిలంబులు వాసి పడిన। యోగీశ్వరేశుండు యోగివంద్యుఁడు గృష్ణుఁడీక్షణామృతధార లెలమిఁ గురిసి। పసుల గోపకులను బ్రతికించె నలంగ। వారు దమకుఁ గృష్ణుపలన నలఁ। బ్రతుకు గలిగెనంచు భావించి సంతుష్ట। మానసములఁ జనిరి మానవేంద్ర॥ క॥ కాళియఫణిపీడితయగు। గాళిందిఁ బవిత్రఁ జేయఁగా నుత్సుకుఁడై। కాళిందీజలవర్ణుఁడు। కాళియు వెడలంగనడిచెఁ గౌరవముఖ్యా॥ వ॥ అనిన నయ్యగాధజలంబువలన మాధవుం డెట్టి నేర్పున సర్పంబు దర్పంబు మాపి వెడలించె నంత పెద్దకాలంబు వ్యాళమ్మేల యుండె నెఱింగింపుము॥ క॥ తొల్లిటిగాఁచిన నంమునికుల్లని చరితామృతంబు గొనకొని చెవులన్। జొల్లంగఁ దనివి గల్గునె। వెల్లులకైన నుదలంప విప్రవరేణ్యా॥ అనిన శుకుం డిట్లనియె॥ సీ॥ మానవేశ్వర యొక్క మడుగు కాళిందిలోఁ గలదది యొప్పుడు కాళియాహి। విషవహ్నిశిఖలచే వేల్చుచుండును మీఁదఁ బరతెంచినంతనఁ బక్షులైనఁ। బడి ప్రుగ్గువెందుఁ దద్భంగశీకరయుక్తపవనతబు సోఁకినఁ బ్రాణులెల్ల। మైన నవ్వడె చచ్చునట్టి యా మడుగులో నుదకంబు పొంగుచునుండుకుచుండుఁ। జూచి వెఱఁగంది కుజనుల స్రుక్కఁ జేయ। నవతరించిన బలుపీరుఁ డాగ్రహించి। భుజగవిషవహ్నిదోషంబు పొలియఁ జేసి। సుజలఁ గావించి యానదిఁ జూతు ననుచు॥ వ॥ కృతనిశ్చయుండై పూర్వజన్మభాగ్యంబున నందనచరణసంస్పర్శనంబునకు యోగ్యంబై తత్సమీపంబున విశాలవిటపశాఖాకదంబంబుతో నున్న కదంబభూజంబు నెక్కి [illegible] కటిచేలంబు బిగించి పింఛమునఁ జక్కంగొప్పు బంధించి దోస్తటసంస్ఫాలనమాచరించి చరణద్వంద్వంబుఁ గీల్కొలిపి [illegible] ధనుండియుటకెన్న గోపాలసింహంబు దిక్తటముల్ క్రోత్రియ ప్రాదంబులో గుభగుభధ్వానంబనూనంబుగన్॥ ఉ॥ [illegible] ప్రతాపపరిపూర్ణభయంకరగోపబాలకంఠీరవపాతవేగవికటీకృతమచ్ఛవిషభీషణోర్మిసం। పూరిత మైమడుంగలఁగి పొంగి ధనుశ్శతమాత్రభాగమై। స్ఫారము పొందెనమ్మడుగు తప్తపయఃకణబుద్బుదోగ్రమై॥ శా॥ పాఠీనాకృతిఁ దోయరాశి నడుమన్ భాసిల్లి మున్నాథుఁడై। కాఠిన్యక్రీయనీమ నేర్పు పనకున్నట్లిష్కజంగేంద్రహృత్పీఠాగ్రంబున రోషవహ్ని లెగియన్ భీమంబుగా నీదెను। ల్లుంఠోత్స్యంగతరంగనైమడుగు దుర్లోక్యంబుగా బాహులన్॥ ఆసమయంబున॥ శా॥ బాలుండొక్కఁడు వీఁడు నా మడుగు విభ్రాంతోచ్చలత్క్రూరకల్లోలంబై కలఁగ న్జరించె నిట్టనేలో నుండుఁ జ్జాతుండుమ। తీక్ష్ణాభీలవిశాలమున్మహావిషాగ్నిజ్వాలలన్భస్మమై। కూలం జేసెద నేఁడు లోపలికి నా కోపంబు దీపింపఁగన్॥ అని తలంచి విజృంభించి॥ ఉ॥ ఘోరవిషానలప్రభలు గొబ్బునఁ గ్రమ్మఁగ సర్పసైన్యవి। స్ఫారుఁడు గాళిఘోరగుఁడు పాటివడిన్నటె చెన్నయోధరా। కారుఁ బయోవిహారు భయకంపవిదూరు మహాగభీరునా। ధీరకుమారు పీరు నవపీతశుభాంబరధారు ధీరుసన్॥ క॥ కఱచి విపిచి తివకమటియును। వెఱవక నిజవదనజనితవిషదహనశిఖల్మెఱయుఁ దన నిడుదయొడలిచే। నెఱిసొరిఁ బెనఁగొనియె భుజగనివహాపతివడిన్॥ వ॥ ఇట్లు భోగిభోగవేష్టితుండై చేష్టలు లేని వాని తెఱంగున నానందముచున్న ప్రాణసఖునిం గనుంగొని తత్ప్రభావంబు లెఱుంగక తత్సమర్పితధనదారమనోరథమానసులు గావున॥ చ॥ అదె మనకృష్ణునిం గఱచె నంతటఁ బోక భుజంగముం బుదఃస్రదమున మేను జుట్టికొని మానక యున్నదియింక నేమి సేఁ। యుదమెటు సొత్తమే పురుషులో పుచరీయసి నగ్గపెట్టెనే। య్యది సముపాయమంచుఁ బడిరా ర్తరవంబు

గంధర్వనిలింపమునినుతులుచ । య్యనఁగురిసిరివిరులవానలాడుచు హరి హైన్ ॥ వ ॥ ఇట్లు మత్తజనదండధరావతారుండైన హరి
పడిఁగలిగినపడగలమీఁదఁ దాండవంబు సలుపఁ బెండువడి యొండొంటిముఖంబుల రక్తమాంసంబులు మియుచుఁ గన్నుల విషం
బు గ్రక్కుచును గ్రక్కుచెడి దిక్కుదిక్కులు చూచుచుం గంఠగతప్రాణుండై ఫణీంద్రుండు తనమనంబున ॥ ఉ ॥ వేలుపులైన లా
వు చెడి వేదనఁ బొందుచు నావిషానలజ్వాలలు సోఁకినంతట నెచత్తురు నేఁడిది యేమి చోద్యమా । ఖీలవిషాగ్నిహేతిభయపీడ
కునోర్చియుఁ గ్రమ్మఁ ఱంగని । బాలుఁడు మత్ఫణాశతము భగ్నముగా వెసఁ ద్రొక్కియాడెడిన్ ॥ క ॥ ఈతఁడు సర్వచరాచర ।
భూతేశుఁడు పరమయోగిపురుషుఁడు సేవా । ప్రీతుఁడు శ్రీహరియగు నని । భీతిన్ స్మరణంబు వేడెబిట్టల సినృపా ॥ వ ॥ ఇట్లు క్రూ

## కాళియుని భార్యలైన నాగకాంతలు శ్రీకృష్ణుని నుతించుట.

రంబులైన హరిచరణప్రహారంబులం బడగలిడిసి నొచ్చి చచ్చిన క్రియం బడియున్న పతిం జూచి నాగకాంతలు దురంతంబైన
చింతాభరంబు నివ్వటిల్లెడు నెవ్వగల నెల్లం బోయి పల్లటిల్లిన యుల్లంబుల ॥ ఉ ॥ కచబంధంబులు వీడ భూషణములాకంపింపఁ
గౌఁదీఁగెలు స్రుగ్గ చయుగ్మంబుల వ్రేఁగున గదలఁ జైకొంగుల్వడిజ్ఞారఁగాఁ । బ్రచురభ్రాంతిఁ గలంగి ముందటను వచ్చి బాలావ
లిం గొంచు స్రు । క్కుచు భక్తిం జని కాంచి రాగుణమణిస్తోమాలచూడామణిన్ ॥ వ ॥ కనిదండప్రణామంబులాచరించి నిటల
తటఘటితకరకమలలై యిట్లనిరి ॥ క ॥ క్రూరాత్ముల దండింపఁగ । ధారుణిపైన వతరించితివ రెడనీకిన్ । క్రూరాత్ముని దండించుట ।
క్రూరత్వము గాదు సాధుగుణము గుణాఢ్యా ॥ క ॥ పగ వారిసుతుల యందును । బగయించుక లేక విమతఁ బరగెడినీకుం । బగగల
దెఖలుల నడఁచుట । జగదవనము కొఱకుఁ గాదె జగదాధారా ॥ క ॥ నిగ్రహమె మము విషాస్యుల । నుగ్రుల శిక్షించు టెల్ల నూ
హింపమహో । నుగ్రహముగాక మాకీ । నిగ్రహము విషాస్యభావనిగ్గతిఁ జేసెన్ ॥ ఉ ॥ ఎట్టితపంబు చేసెనొకొ యెట్టిసుకర్మము
లాచరించెనో । యెట్టినిజంబు వల్కెనొకొ యీ ఫణిపూర్వభవంబునొందుము । న్నెట్టిమహాను భావులకు నెన్నఁడు చేరువ
గానినీవు నేఁ । డిట్టివినోదలీలఁ దలలెక్కినటించెద వీ ఫణీంద్రుపై ॥ వ ॥ బహుకాలంబు తపంబు చేసి వ్రతముల్వాటించి కామిం
చినీ । మహనీయోజ్జ్వలపాదరేణుకణసంస్పర్శాధికారంబు శ్రీ । మహిళారత్నము తొల్లి కాంచెనిదె నేఁ డెమియున్లేక నీ ।
యహి నీపాదయుగాహతిన్ బడసెనేఁ డత్యద్భుతం బీశ్వరా ॥ ఉ ॥ ఒల్లరు నిర్జరేంద్రపద మొల్లరు బ్రహ్మపదంబునొందఁగా ।
నొల్లరు చక్రవర్తిపద మొల్లరు సర్వరసాధిపత్యము । నొల్లరు యోగసిద్ధి మఱి యొండుభవంబుల నొందనీననీ । సల్లలితాం
ఘ్రిరేణువులసంగతి నొందిన ధన్యులెప్పుడున్ ॥ క ॥ ఘనసంసారాహితులగు । జనులా కాంక్షింపఁ గడు నశక్యం బగుశో । భన
ముసమతుం బున నహి । గనియెందామసుఁడు దోషకలితుండయ్యున్ ॥ వ ॥ దేవా సకలపురుషాంతర్యామిరూపత్వంబువలనం
బురుషుండవయ్యు నపరిచ్ఛిన్నత్వంబువలన మహాత్ముండవయ్యు నాకాశాదిభూతసమాశ్రయత్వంబువలన భూతవాసుం
డవయ్యు భూతమయత్వంబువలన భూతశబ్దవాచ్యుండవయ్యుఁ గారణాతీతత్వంబువలనఁ బరమాత్ముండవయ్యు జ్ఞానవిజ్ఞా
నపరిపూర్ణత్వంబు గలిగి నిర్గుణనిర్వికారంబులవలన బ్రహ్మంబవయ్యుఁ బ్రకృతిప్రవర్తకత్వంబువలన ననంతశక్తివై యప్రా
కృతుండవయ్యుఁ గాలచక్రప్రవర్తకత్వంబువలనఁ గాలుఁడవయ్యుం గాలశక్తిసమాశ్రయత్వంబువలనం గాలనాభుండ
వయ్యు సృష్టిజీవనసంహారాదిదర్శిత్వంబువలనం గాలావయవసాక్షివయ్యు నొప్పు నీకు నమస్కరించెదము మఱియును ॥ సీ ॥
విశ్వంబు నీవయ్యు విశ్వంబుఁ జూచుచు విశ్వంబు సేయుచు విశ్వమునకు । హేతువవై పంచభూతమాత్రేంద్రియములకు మనగ
ప్రాణబుద్ధిచిత్తములకెల్ల నాత్మవై మొనసి గుణంబుల నావృతమగుచు నిజాంశభూతమగు నాత్మచయమునకనుభూతి సే
యుచు మూఁడుహంకృతులచే ముసుగువడక । నెఱిననంతుఁడవై దర్శనీయరుచివి । కారసూక్ష్ముఁడవై నిర్వికారమహిమ । ద
నరికూటస్థుఁడ నసమస్తంబు నెఱుఁగు । నీకు మ్రొక్కెద మాలింపు నిర్మలాత్మ ॥ వ ॥ మఱియుఁ గలం డు లేఁడు సర్వంబు నెఱుంగు నిం
చుక యెఱుంగు నించుక బద్ధుండు విముక్తుండొకండ నేకుఁడు నను నివి మొదలుగాఁ గల వాదంబులు మాయ వలన ననురోధింపు
దురుగావున నానావాదానురోధకుండవయ్యు నభిధానాభిధేయశక్తిభేదంబువలన బహుప్రభావప్రతీతుండవయ్యుఁ జక్షు
రాదిరూపంబులవలనఁ బ్రమాణరూపకుండవయ్యు నిరపేక్షజ్ఞానంబు గలిమిం గవివయ్యు వేదమయ నిశ్వాసత్వంబువలన శా
స్త్రయోనివయ్యు సంకర్షణ వాసుదేవ ప్రద్యుమ్నానిరుద్ధరూపంబులవలనఁ జతుర్మూర్తివయ్యు భక్తజనపాలకుండవయ్యు నం
తఃకరణప్రకాశత్వంబు గలిగి నీవ సజ్జనఫలప్రదానంబు కొఱకు గుణాచ్ఛాదకుండవయ్యుఁ జిత్తాదివర్తనంబులగా నందగిన గు
ణంబులకు సాక్షివై యొరులకెఱుంగరామిన గోచరుండవయ్యుఁ దర్కింపరాని పెంపువలన నవ్యాహతవిహారుండవయ్యు సక
లకార్యహేతువయ్యు నంతఃకరణప్రవర్తకత్వంబువలన హృషీకేశుండవయ్యు సుసాధనవశంబుగాని యాత్మారామత్వం
బువలన మునివయ్యు, నధికసూక్ష్మమతుల నెఱుంగుచు నెందుం జెందక నీవు విశ్వంబుగాక యు విశ్వంబు నీవయయ్యును, విశ్వ

భావాభావసందర్శనంబు సేయుచువిద్యావిద్యలకు హేతువైన నీకుం బ్రణామంబులాచరించెద మవధరింపుము॥ క॥ లోకజనస్థితిలయములు, సైకొని చేయుదువు త్రిగుణకలితుఁడవై కాలాకారమునన మోఘ, శ్రీకలితుఁడవగుచు నిచ్ఛఁ జెందక నీశా॥ క॥ ఈ శాంతలుగాని తనువు, లీశా యీ మూఢజాతు లీ సజ్జాతుల్, నీ శాంతతనువులం బ్రకాశింతువు ధర్మహితముగా సుజనులలోన్॥ ఉ॥ నేరము లెన్న నెక్కుడిది నేము దలంచు తలంపు లందులో, నేరుపు లున్న వే సుతుల నేరమిఁ దండ్రులు ద్రోఁచిపుచ్చరే, నేరము సేయువారి ధరణీపతు లోర్చి కమాటు గావరే, నేరమి గల్గు మద్విభుని నేఁడిటు గావఁగ దే కృపానిధీ॥ శా॥ బాలుండీతఁడు నుంచి వాఁడనుచుఁ జెప్పన్ రాము క్రూరుండు దుశ్శీలుండౌ యునైన నేము సుభగశ్రీఁ బాసి వైధవ్యదుఃఖాలంకారముఁ బొందనోడెద మనాథాలాపమాలింపవే, చాలున్ నీపదతాండవంబు పతిభిక్షం బెట్టి రక్షింపవే॥ ఉ॥ ఆకులమయ్యె భోగమిదె యాపలలన్నియు వ్రస్సెఁ బ్రాణము, ల్రాకలఁ బోకలన్ బొలిసె రాయిడిఁ బెట్టకమాని చేసు పై, నీకరుణాకటాక్షములు నిల్పఁగ దే తగ నోసమస్తలో, కైకశరణ్య యోయభయకారణ యోకమలామనోహరా॥ గీ॥ మమ్ముఁ బెండ్లి సేయుమా ప్రాణవల్లభు, ప్రాణమిచ్చి కావు భక్తవరద, నీవు సేయు పెండ్లి నిత్యంబు భద్రంబు, పిన్ననాటి పెండ్లి పెండ్లి కాదు॥ ఇంద్రవజ్రము॥ నీయానయెవ్వారిని నిగ్రహింపం, డాయుగ్రపాపాకృతినందడింక, నీ యాజ్ఞలోనుండెదు నేఁటనుండి, న్యాయ్యాశు ప్రాణంబులు మాకు నీవే॥ వ॥ అని యిట్లు తన పెనిమిటి బ్రతుకు కుఁగోరెడి భుజగసతులయందు శరణాగతవత్సలుండైనపుండరీకాక్షుండు కరుణించి చరణఘట్టనంబు చాలించి తలంగిన నెట్టకేలకుఁ బ్రాణేంద్రియములు అలంబడసి చిదిసి నలఁగిన తలలు సవరించుకొని వగపుగ మరభుజగపతి జలజనయనునికి నంజలి చేసి మెల్లన నిట్లనియె॥ చ॥ మలకలు మా ప్రచారములు మాముఖములు విషవహ్నిఘోరముల్, ఖలులము రోషజాతుల ముగర్వుల మే మొకమంచివారమే, నలినదళాక్ష ప్రాణులకు నైజగుణంబులు మాననేర్చునే, వెలయవె మావికారములు వింతలె మేలోనరించితీశ్వరా॥ సీ॥ వివిధభావాకారవీర్యబీజాశ్రయజనయోనియుతముగా జగము లెల్ల, నీవ చేసితి మున్న నేమా జగంబులో సహజకోపనుల ముసర్పములము, మర్వార మైన నీ తోరంపు మాయ నే మెట్టిఁగిదాఁటెడు పనికెంత వార, మంతకుఁ గారణ మఖిలేశ్వరుండవు సర్వజ్ఞుఁడవు నీవు జలజనయన, మనిచెదే నియుమన్నించి మనుపు నన్ను, నిగ్రహించెద వేని యునిగ్రహింపు, మింక సర్వేశ మాయిమ్ము లెందుఁ గలవు, చిత్తమందున్న క్రమమునఁ జేయఁదగును॥ క॥ నాపుణ్య మేమి చెప్పను, నీపాదరజంబుఁ గంటి నే సనకాదుల్, నీపాదరజముఁ గోరుదు, రేపగ మందున్న నైన నిట మేలు హరీ॥ వ॥ అని విన్నవించినఁ గాళియుపలుకులు విని నవధరించి కార్యమానసుండైన సర్వేశ్వరుండతని కిట్లనియె॥ క॥ గోవర్గముతో మనుజులు, ద్రావుదు రీమడుగు నీరుఁ దగ దిందుండన్, నీవును నీ బాంధవులును, నీ [illegible]తలు సుతులు జనుఁడు నేఁ డంబుధికిన్॥ క॥ నిను నేశాసించిన కథ, మనమునఁ జింతించి రేపుమాపును గీర్తిం, చిన మనుజులు నీ భయమున, వినుమెన్నఁడుఁ బొందరెందు విషవిజయముతోన్॥ చ॥ ఇది మొదలెవ్వరైన నరులీయమునానది నీప్రదంబులో, వదలక తోఁగి నన్నుపవాసముతోడఁ దలంచి కొల్చుచుం, గదలక దేవతాదులకుఁ గా జలతర్పణమాచరించిన, న్సదములవిత్తులై దురితసంఘముఁ బాయుదు రాత్మణంబునన్॥ గీ॥ గరుడభీతి రమణకద్వీపమొల్లక, మడుఁ జొచ్చితీవు మత్పదాబ్జలాంఛనములు నీ తలలనుంటఁ జూచి యా, పక్షిరాజు నిన్నుఁ బట్టఁ డింక॥ వ॥ అని యిట్లు విచిత్రవిహారుండైన గోపాలకృష్ణకుమారుండానతిచ్చిన నీయకొని చయ్యన నయ్యహీంద్రుండు తొయ్యలులుం దానును నెయ్యంబున నయ్యీశ్వరునకు నవ్యదివ్యాంబరాభరణరత్నమాలికానులేపనంబులు సమర్పించి తేఁటిదండంబులకు దండయగు నీలోత్పలంబుల దండ నిచ్చి పుత్రమిత్రకళత్రసమేతుండై బహువారంబు కైవారంబు చేసి వలగొని మ్రొక్కి లేచి వీడ్కొని రత్నాకరద్వీపంబునకుం జని

## ✽ కాళియుని పూర్వకథ. ✽

యెనిట్లు॥ క॥ వారిజలోచనుఁ డెవ్వరు, వారింపఁగ లేని ఫణినివాసత్వంబు, న్వారించిన యమునసుధా, వారింబొలుపారె నెల్లవారికిఁ బ్రియమై॥ వ॥ అనిన విని మునీంద్రా యేమి కారణంబునఁ గాళి[illegible]ండు భుజగనివాసంబయిన రమణకద్వీపంబు విడిచె నతం డొక్కరుండును గరుడున కేమి తలంచె నని నరవరుండడిగిన మునివరుండిట్లనియె॥ సీ॥ సర్పభీరువులైన జను లెల్ల నెల నెల సరసభక్ష్యములు వృక్షముల మొదల, సర్పంబులకుఁ బెట్ట సర్పంబులును మును సర్పాంతకుఁడు దమ్ముఁ జంపకుండఁ, బ్రతిమాసమును దమభాగభక్ష్యంబులా పక్షిరాజునకిచ్చి బ్రతుకుచుండ, విషవీర్యమద్మదావిష్టుండై కాళియుఁ డహికులాంతకుని పాలపహరించి, యాకతనపాలిభాగంబు లెల్లఁ దినిన, విని ఖగేంద్రుఁడు కోపించి వీని తలలు, చీఁటి చెండాడి భోగంబు చించివైచి, ప్రాణములఁ బాపి వచ్చెదఁ బట్టి యనుచు॥ క॥ అతిక్షీణకనకసన్నిభ, పతుయుగోద్భూతఘోరపవమానమహా, విక్షేపకంపితాశేకక్షోణిధరేంద్రుఁ డగుచు గరుడుఁడు వచ్చెన్॥ ఉ॥ వచ్చిన సర్పవైరిఁ గని వ్రాలక లేచి మహోఫణావళుల్ విచ్చి దృగంచలం

శ్రీగాఢత్వము మానిగోఖురరదావిచ్ఛిన్నఘాసంబుతో। బాగై యున్నపథంబునన్ జనిదవాపన్నంబుగాకుండ వే। వేగన్ గోగణ మున్మరల్చి రటవీవీథిన్ జవంబొప్పఁగన్॥ క॥ జలధరగభీరరవమున। నలినదళాక్షుండు దమ్ము నామాంకములన్। బిలిచిన విని ప్రతిఘోషణములు సేయుచుఁ బసులు దిరిగె ముదమున నధిపా॥ వ॥ అంత నవ్వనంబున దైవయోగంబునఁ గార్చిచ్చు పుట్టి బెట్టువిసరెడి కరువలి వలన మిన్నుముట్ట మిట్టివడి గట్టు చెట్టనక దరికొని పట్టి కాలుచుఁ జుట్టుకొని పరవన్నని పల్లటిల్లి సయ్యల్లంబుల వల్లవులెల్లఁ దల్లడిల్లి ప్రబలుండైన హరికి మృత్యుభీతులరీతిం జక్క మ్రొక్కి యిట్లనిరి॥ క॥ అభ్రంకషధూమాయిత। విభ్రాంతమహోస్ఫులింగ విసరోగ్రశిఖా। విభ్రష్టదగ్ధలోకా। దభ్రంబై వచ్చెఁ జూడు దవశిఖి కృష్ణా॥ శా॥ నీ చుట్టాలకు నాపదల్ గలుగు నే నేమెల్ల నీవారము। న్యాసారంబు లెఱుంగ మీశ వడవుమా కాభీలదావాగ్ని నేఁ। డే చందంబున నింక దాఁటుదుము మమ్మీక్షించి రక్షింపవా। నా చంద్రాభవిపన్నులన్నిఖవితానచ్ఛన్నులక్షిన్నులన్॥ అనిన విని యను॥ ఉ॥ బంధుజనంబు చేత నిటు ప్రార్థితుఁడై హరి విశ్వరూపుఁడో। బంధువులార మీనయనపంకజముల్ ముకుళింపుఁ డగ్నిని। స్సంధిన డంతు నే ననినఁ జక్క నవారలు నట్ల చేయఁడు। స్సంధుర దావపావకముఁ బట్టి ముఖంబునఁ ద్రావె లీలతోన్॥ వ॥ ఇట్లు నిజయోగవైభవంబున దావదహనంబు పానంబు చేసి నిమిషమాత్రంబున గోపకులనందఱ భాండీరకవటసమీపంబునకుం దెచ్చి విడిచిన వారు వికసితనయనకనులులై కృష్ణుని యోగమాయాప్రభావంబున నెఱిఁగలి చిచ్చు మ్రగ్గననియెఱింగించుచుఁ దమమానంబులం దమ॥ క॥ కార్చిచ్చార్చుపటుత్వము। నేర్చునె నెరుఁ డొకఁడు శౌరి నేఁడిదె కార్చి। చ్చార్చి మన లరక్షింపఁగ। నేర్చె నితం డజుఁడొ హరియొ నిటలాక్షుండో॥ వ॥ అని వితర్కించి రంతఁ గృష్ణుండు సాయాహ్నసమయంబున రామసహితుండై వంశనాళంబు పూరించుచు గోపజేగీయమానుండై గోష్ఠంబు ప్రవేశించె నప్పుడు॥ క॥ కమలాక్షు నెడ్డనుండని। నిమిషము యుగశతముగాఁగ నెగడిన గోప। ప్రమదలు సంభ్రమమున నా। కమలాక్షునిఁ జూచి ముదము గనిరి మహేశా॥ వ॥ ఆసమయంబున గోపకులిండ్లకడనున్న వృద్ధకాంతాజనంబులకు రామకృష్ణుల చిత్రచరిత్రంబులు చెప్పిన విని వారు వారిని కార్యార్థులై వచ్చిన వియచ్చరవరులని తలఁచి

## ✼ వర్షఋతువర్ణనము. ✼

రంత॥ సీ॥ పూర్వవాయువులు ప్రభూతంబులై వీఁచెఁ బడమట నింద్రచాపంబు దోఁచెఁ। బరివేషయుక్తమై భానుమండలము ప్పె మెఱుపులుత్తరదిశ మెఱవఁ దొడఁగె। దక్షిణగాములై తనరె మేఘంబులు జలచరానీకంబు సంతసించెఁ। జాతకంబుల పిపాసలు కడపలఁ జేరెఁ గాంతారవహ్నుల గర్వమడఁగె। నిజకరాళివలన నీరజబంధుండు। దొల్లి పుచ్చుకొనిన తోయమెల్ల। మఱలనిచ్చుచుండె మహికర్షకానంద। కంద మైన వాన కందువందు॥ క॥ వర్షాకాల*భుజంగుఁడు। హర్షముతో నిడిన నవనఖాంకములనియ। త్కర్షింప భూమిసతిపైఁ। గర్షకహలరేఖలను రెఁగ హనాంతములన్॥ క॥ చెలువుఁడు ప్రావృట్కాలుఁడు। పొలసినఁ బులకించు భూమి పులకములనఁగా। మొలిచి తలలెత్తి నిక్కుచు। సలలితగతిఁ జాలువారె సస్యము లధిపా॥ వ॥ మఱియుఁ జటుల పవనచలితంబులై పన్ని మిన్నుదన్ని లెక్కలకు మిక్కిలియై ఱెక్కలు గల నీలగిరులసిరుల మీఱి కాఱుకొని తెరపిపడక నిబిడంబులై శిశిరకిరణతరణిమండలంబుల చొప్పు దప్పించి విప్పుగలిగి చదలు గప్పుకొనిన నీలమేఘంబులును, మేఘవిముక్తంబులై జలదసమయపిటుండు సరసగతి ధరణిసతియురమ్మున దర్పించి నేర్పున సమర్పించు కర్పూరఖణ్డంబుల వడువునఁ బుడమింబడు కరకములును గరకానుగతంబులై యసితభోగిభోగంబుల బాగున నీలమణిమాలికావిశేషంబుల విధంబున నెడపడకపడు సలిలధారలును, ధారాధర విగళితవిమలసలిలంబులం దోఁగుచు మదజలాభిషిక్తమాతంగంబుల సొబగున నుండు కొండలును, గొండలతుదలనుండి గండశైలంబుల పైఁ బడి వికీర్యమాణంబులగు గిరినిర్ఝరంబుల శీకరంబులును, శీకరపరంపరల చొముకులు ముసుగులుగొనిన పిడఁబిదనగుచుఁ జిముకుచిదుకు మను రొంపులును, రొంపులు ద్రొచ్చి క్రచ్చరనుచ్చలితంబులై పఱచు వఱదలవలన మెదలి కదలి పొఱలెడి మేటులును, నేటుల వెంటగరులు త్రిప్పుచు గములుగొని క్రొన్నీటి కెదుఱు నడచు మీనంబులును, మీననయనల మేనుల మెఱుంగు సొంపు పెంపు సైరింపక కంపించి సురిగి తిరిగి చనియెడి కరణి మేఘమధ్యంబులం బొలసి మలసి నిలువక మాఱి చనుక్రొమ్మెఱుంగులును, మెఱుంగుల తెఱంగునఁ దెరవలు పుష్పములందగిలి నిలువరని జనుల కెఱుంగనలువమొఱయిడిన వడువున మొఱయు నుఱుములు, నుఱుములకు లికిపడక కికురుపొడుచుచుఁ, బింఛంబులు కొంచెంబులు సేయక విప్పి దెప్పరంబుగ నొప్పుచు నర్తనంబులు సేయు మయూరంబులును, మయూరఘోషంబులు భీషణంబులై చెవులకు సోఁకననూనంబులైన మానంబులనాసలు చెడి యొండొరులకుం గ్రిందుపడి క్రందుకొను విరహిజనులును, జనులకు రేపు మాపుని రూపింపరాక శ్రీమాలతీకుసుమవిసరవికసనవిదితావసానంబులగు దుర్దినంబులును దినావసానసమయంబున మినుకుమినుకు

---

* భుజంగుఁడు। విటుఁడు. శ్రీమాలతీకుసుమవిసరవికసనవిదితావసానంబులగు। జాజిపూవులుపూచుటను దెలిపెడుతుదలుగల.

మని మెఱయుచుండిరుగు ఖద్యోతంబులును* ఖద్యోతసందర్శనంబు గోరుచును మగుడ విడువక గురియుజడిం జిఱుచలిగొని వడఁ
కుచు నశనయత్నంబులు వర్జించి బిల్వఖర్జూరజంబూఫలభక్షణంబుల దేహసంరక్షణంబులాచరించు వనచరులును, వనచరానం
దకారిణులైన వారరమణులఁ రుచిర నవర్తనభుజగసమేతలగు కేతకులును, కేతకీకదంబ †యూథికా కుటజకుసుమపరిమళమిళి
తంబులగు విపినమార్గంబులును, మార్గనిరోధంబులగుచుం బెరిగిరసికంబులైపసరుదాలుగలుగుచుఁ, బద్మరాగకిరణపుంజం
బుల భంగి రంజిల్లి తొంగలించుచు, జొంపంబులు గొనిన కసవులును, కసవులు మెసవి మిసమిసం బనువులు మెఱయ వలుదపొదు
గుల బరువున కదలక నిల్చి నెమరమరనిడు ధేనువులును గలిగి, ధేనువ్రజంబుకై వడిఁ బయఃకణమనోహరంబై, హారకరము
భంగిఁ బరిపూర్ణసారంగభాసురంబై, సురగిరి చెలువున హరిశరాసనవిభీషణంబై, విభీషణహృదయంబు పోలి కేఁ బ్రకటితహ
రిశబ్దవైభవంబై, భవపూజనంబుచందంబున నింద్రగోపాదివిభవజనకంబై, జనకయాగంబు భాతి సీతాప్రకరణాలంకృతం
బై కృతయుగంబు సొంపున బహువర్షంబునై వర్షాగమంబు వచ్చె నందు ॥ క॥ వాడక వ్రాలక తెవులులఁ । గూడక తగ నల్లగిరులు
గొనినవకములై । చూడఁగ భద్రములగుచును । వీడె న్సస్యంబులిడుము వీడెం బ్రజకున్ ॥ క॥ జీవనము చాలఁ గలిగియుఁ । గావర
మున మిట్టిపడని ఘనుని క్రియ నదీ । జీవనములు సౌరజలనిధి । ప్రావృట్కాలమున డించుపడియుండె న్నృపా ॥ శా॥ ఆ వర్షాగమమం
దు గోవుల్ వనరణ్యాంతంబుల న్మేపుచు । న్గోవిందుండు ప్రలంబవైరియుతుఁడై గోపాలవర్గంబుతోఁ । బ్రాపీణ్యంబునఁ గంద
మూలఫలము ల్భక్షించుచు న్మంజుల । శ్రీగ్రావాగ్రంబులఁ బ్రీతిఁ జల్దిగుడిచె న్గాసారతీరంబులన్ ॥ ఆ సమయంబున ॥ సీ॥ విశ్వ
మోహనమైన వేణునినాదంబు సరసగంభీరగర్జనము గాఁగ । మహనీయనిర్మలమందహాసద్యుతి లలితసౌదామినీలతిక గాఁ
గ । దలఁచుట్టు బాగుగఁ దనరు పింఛపుదండ శైలభేదను శరాసనము గాఁగ । గరుణాకటాక్షవీక్షణసుధావర్షంబు సలిలధా
రాప్రవర్షంబు గాఁగ । జాడ నేతెంచు గోపాలజనమునీంద్ర । చాతకంబుల మరవస్థఁ జక్కఁ జేసి । కృష్ణమేఘంబు బహుతరకీ
ర్తి నొప్పె । విమలబృందావనాకాశవీథియందు ॥ క॥ గోవుల వృషవత్సంబుల । వావిరిఁ బూజించి పిదప వర్షాకాల । శ్రీవనితను
బూజించెను । శ్రీవల్లభుఁ డయ్యె గోపశేఖరుఁ డధిపా ॥ ఇట్లు కృష్ణుండు విహితవిహారంబుల వర్షాకాలంబుఁ బుచ్చె నంత ॥
క॥ జొంపములు గొని యెవనములు । రొంపులిగిరె నెమలిగములరొదలుడిగెనదు । ల్వెంపులకుఁ బాసె నుఱుములు । శంపలసంప

## శరదృతువర్ణనము.

దలుమానె శారదవేళన్ ॥ వ॥ మఱియు జీవనంబులు విడిచి విమలజ్ఞానవశంబున ముక్తులగు పురుషరత్నంబుల చెన్నునఁ జెన్ను
వదలి మిన్ను విడిచి వాయువశంబులై వెల్లివిఱిసిచను మేఘంబులును, మేఘపటలరహితంబును, గలశభవమునిసహితంబును
నై విజ్ఞానదీపవిలసితంబగు యోగిహృదయంబు చందంబున శుభంబైన నభంబును, నభంబున నీలదుకూలవితానసంయుక్త
ముక్తాఫలంబుల వడువున నెగడును డుగణంబులును, నుడుగణమయూఖంబు క్రొవ్వులు వ్రేత్తుఁగఁ గొని నివ్వటిల్లుచు బ్రహ్మాం
డకరండకర్పూరఖండాయమానంబులగు చంద్రకిరణంబులును, జంద్రకిరణసమ్మర్శనంబున సగర్భంబులై భూమికి మర్భ
రంబులగుచు నిండి పండి హాలికకరనిశితలవిత్రధారాసంరంభంబు దలంచి తల్లడిల్లి వెలవెలకంబాఱుచుఁ దల్లియగు విశ్వంభ
రకు మునుకొని ప్రణతంబులై వడంకుచు నెఱుఁగ మొఱయిడుచున్న పెంపున నంపన్నంబులైన యెన్నుల వ్రేగున వ్రాలి గా
లిం దూలుచు మర్మరధ్వనుల సారస్యంబులగు కలమాదిసస్యంబులును, సస్యమంజరీపుంజంబులు గొంచక చంచువులఁ ద్రుంచి
కబళించి పిల్లపెంటితండంబులం గూడి కడుపుల నిండ మెక్కి విక్కి విరిసి చొక్కుచుఁ ద్రిక్కులు గొని మహోత్తుంగ సమంచి
తమంచప్రదేశంబులెక్కి సంచరించుచు వెన్నుల కావలియున్న యన్నులకెమ్మోవులు బింబఫలంబులని కఱచి తత్కరాస్ఫా
లనంబుల నులికిపడి మొగసి చను శుకనికరకలకలంబులును, కలహంసకోకసారసకోలాహలమండితంబులై నిండి నిర్మలజలం
బులు గల జలాశయంబులును, జలాశయంబుల జలములను దినముని గుడ గృహములఁ బ్రతుకు దినములు సనుట యెఱుంగని
మనుజుల గమనిక కందిరుగు జలచరములును, జలచరహృదయములు బెగడుగ చురడొంకి యింకిన నదులును, నదులందుఁ గర్పూర
మంటపంబుల తెఱంగున, మణికుట్టిమంబుల మాడ్కి ని, సౌధసోపానమార్గంబుల జాడను, విలోకితంబగు నూతనసైకతంబు
లును, సైకతప్రదేశంబుల నుదయవేళ నిత్యకర్మానుష్ఠాననిరతులగు మునులును, మునికన్యకాకరకలశసలిలాభిషిక్తమూలం
బులగు తపోవనబాలసాలంబులును, సాలవిటపివాసంతికాకుంజపుంజంబుల తరుచ నని ముడుకొని, దినకరకిరణములకుం గరు

---

* ఖద్యోతంబులు । మిణుగురుపురుగులును. † యూథిక । అడవిమొల్లలు. సారంగ । లేడి-చాతకపక్షి. హరిశరాసన । ఇంద్రధనుస్సు. హరిశబ్దం
బై । కప్పలచప్పుళ్లు గలదై. భవపూజనంబు చందంబున నింద్రగోపాదివిభవజనకంబై ॥ భవపూజనంబుచందంబునన్ । శివార్చనవలె, ఇంద్రగోపాది
విభవజనకంబై । ఇంద్రరక్షణము మొదలయిన విభవకారణమై-పట్టుపురుగులు మొదలగు పురుగులు పుట్టుటకు కారణమై. శకలములు । వడిగండ్లు.

పలికి రంజోర వెలువడని వనములును, వనములందరులకొమ్మల నాకలంబులు నేకలంబులై మెఱంగి మసరుకొనిన క్రొవ్వి క్రొ
మ్ముల కొనల నూఁది యేటిచరులు త్రవ్వి చిమ్మి క్రుమ్మి కోరాడెడి వనగజంబులును, గజకుంభకనకకుంభరుచిరకుచభారభీరు
మధ్యసమంచితలగు చెంచితలును, చెంచితలక్రూరవమ్ములగు వాలమ్ముల సారమ్ములు చెడి, బెడిదంబునఁ బాదంబులు దొట్రుప
డఁ, బెనుగాథంబులఁ బడు వరాహపుండరీకంబులును, బుండరీకకుముదకురంటకాది కుసుమమకరందంబు గ్రోలి తేలి సోలి
వ్రాలి మహోహుంకృతుల ఝుంకృతులు సేయు తేఁటికదుపులును, కదుపులం గలయక యెదకలిగి మదమున నదముపద నెఱింగిమ
గనమార్గణప్రేరితంబులై పెంటితుటుముల వెంటం జని, యొండొంటిఁ గెంటించుచుఁ దగుల్పనెక్కు గర్వంబులు నెక్కొలుపు
వృగవృషభరాజంబులును, గలిగి రాజరాజగృహంబు పగిది విలసితకుందపద్మసౌభాగ్యంబై, భాగ్యహీనుకర్మంబు రేఖన
శ్రుతనీలకంఠశబ్దంబై, శబ్దశాస్త్రవేదిహృదయంబు భాఁగున విశదప్రకాశాభిరామంబై, రామసంగ్రామంబు కైవడిఁ *బా
ణాసనాలంకృతంబై కృతాంతహృదయంబు కరణి విపంకంబై పంకజాసను గేహంబు సొంపున రాజహంసవిరాజమానంబై
మానధనుని చరిత్రంబు సొబగున నకల్మషజీవనంబై, వననిధిహాలుపు వసమ్మిళితభూభృద్వాహినీసంకులంబై, కులవధూర
త్నంబు చెలువున నదృష్టపయోధరంబై, ధరణికిం దోడవగుచు శరత్కాలంబు వచ్చె నంత. క॥ రాజులశిఖీ రాజనములు। రాజుల
జయగమనములును రాజితలక్ష్మీ।పూజలు దేవోత్సవములు। రాజిల్లెను జగతియందు రాజకులేంద్రా। క॥ చాగగల చెలుకువిం
టను। బాగుగ నీలోత్పలంబు బాణంబుగ సం।యోగంబు చేసి మదనుఁడు వేగంబున విరహిజనుల వేఁటాడె నొగిన్॥ వ॥ ఇట్లు భా
సురంబైన శరద్వాసరంబుల గోవిందుండు గోబృందసమేతుండై బృందావనంబునఁ బసులఁ బొసంగ మేపుచు॥ సీ॥ కర్ణావతం
సితకర్ణికారప్రభ గండభాగద్యుతిఁ గడలుకొలుప। భువనమోహనమైన భ్రూవిలాసంబుతో వామభాగానతవదన మొప్ప।
నవసవ్యకరరమ్య నలాంగుళిచాతురి పడ్జస్వనికి మర్మసరణిఁ జూప। డాకాలిమీఁద నడ్డము సాఁచి నిల్పినపవనఖద్యుతి భూమిఁ బ్ర
బ్బికొనఁగ।మౌళిపింఛముకంఠదామమున మెఱయ।విలసితగ్రామముగ మొకపు వేణువందు।బ్రహ్మగాంధర్వగీతంబు పరగఁ
జేసెఁ।జతురనటమూర్తి గోపాలచక్రవర్తి॥ వ॥ ఇట్లు హరి వేణునాదంబు పూరించిన మారవికారహేతువగు నద్గీతంబాలించి
సిగ్గులు సాలించి మక్కువలు చెప్పఁ లాత్తగోపికలోపికలు లేక తమతమ పొత్తుకత్తెలుండా రనుదత్తరంబునఁ బెనుగురునేసు
రుంచుటములు గొని జిలిబిలిముచ్చటలకుం జొచ్చితమలోన॥ మ॥ శ్రవణోపాంచితకర్ణికారములతో స్వర్ణాభచేలంబుతో। న
వతంసాయితకేకిపింఛములతో నంభోజదామంబుతో। స్వవశుండై మధురాధరామృతముచే వంశంబుఁ బూరించుచు। న్ను
పిదా మాధవుఁ డాలవెంట వనమందొప్పారెడిం జూచితే॥ శా॥ రావే సుందరి యేమె బోఁటి వినవే రాజీవనేత్రుండు బృందా
వీథిం దగ వేణువూదుచు లసన్న్యాసానతాస్యంబుతో। భ్రూవిన్యాసములంగుళీభ్రమణముల్ బొల్పారఁ బడ్జంబుగాఁ। గాపిం
చెన్నటు భంగి బ్రహ్మముగు సద్గాంధర్వసంగీతముల్॥ క॥ తలఁకెను గొబ్బున జిత్తము। నలినాక్షుని మధురవేణునాదము నా
వీనులు సోఁకిన యంతమాత్రన। చెలియా యింక నేటి వెఱపు చింతింపఁగదే॥ క॥ నాతోడ వెఱవవలదే। నాతోడ నెగొను చుంబో
యినలినదళాక్షుఁ నీతోడఁ దఁ బలికించెద। నీతోడి జనంబు మెచ్చ నీతోడు సుమీ॥ వ॥ అని పెక్కుభంగుల నొర్త్రొర్తు నుద్దేశించి
పలుకుచు గోపసుందరులు బృందావనంబునకు గోవిందుని కేమరు చని పరమానందంబున నతనిం దమమనంబులఁ బ్రతిపదంబు
ను నాలింగనంబు చేసిన వారలగుచు రామకృష్ణులను ద్దేశించి॥ మ॥ నవగోష్ఠానుకరంగమందుఁ బరమానందంబుతోఁ జూడ బ
ల్లవనీలోత్పలపింఛపద్మదళమాలావస్త్రసంపన్నులై। కవలై వేణువులూదుచున్ బహునటాకారంబులన్ గేళితాం। డవము
ల్సేసెదరీకుమారకులు వేడ్కన్ గామినుల్గంటిరే॥ క॥ ఓ చెలువలార వినుఁడీ। వాచాశతకంబు లేల వర్ణింపంగా। లోచనముల క
లిమికి ఫలం। మీ చెలువురఁ జూడఁగలుగుట యింతియ సుండీ॥ అని పలికి రమ్మంగొందఱు గోవిందుని నుద్దేశించి॥ మ॥ ఒనరన్ వ్రేతలకిం
చుకేనియును లేకుండంగ గోపాలకృష్ణుని కెమ్మోవిసుధారసంబు గొనుచున్ జోద్యంబుగా మ్రోయుచున్। దనపర్వంబు
లు నేత్రపర్వములుగా దర్పించెఁ బూర్వంబున। న్వసితామ్మోటితపంబు చేసెనొకో యీవంశంబు వంశంబులోన్॥ మ॥ ముది
తామేతటినీపయఃకణములన్మ స్వేణువింత య్యోనా। నదిసత్పుత్రునిఁ గన్నతల్లి పగిదిన్నందంబుతో నేఁడు సన్మదహంసధ్వ
నిపాటగావికచపద్మశ్రేశ్రీరోమాంచమై। యొకసవన్ మంగతరంగహస్తనటనోద్యోగంబు గావింపదే॥ క॥ నలినోదరుభ
స్తునిఁ గని। కులజాల్పునందాశ్రుజలము గురియు తెఱఁగున్ మ్రాఁకులపూదేనియ లొలికెడు। నలినాక్షుని చేతివంశనాళము
మ్రోఁతన్॥ శా॥ నా మోసంబున కెద్ది మేరవినవే నాపూర్వజన్మంబులన్। లేమా నోములు నోఁచుచో నకటకాళిందీతటి

* బాణాసనాలంకృతంబై।వింటిచేత నలంకరింపఁబడినదై, బాణ।నల్లగుళ్ళోవ్వలగోరంటలచేత-లేక-పచ్చపువ్వులగోరంటలచేత, అసన।వేగిస్రు
మ్ములచేతను, అలంకృతంబై। కసేయఁబడినదయి. పయోధర।మేఘము- స్తనము. శిఖీరాజనములు।అరటులు.

న్వేణువై। భూమిన్ బుట్టినవంచుఁ గొంచఁదగదే బోఁటీ! ఇల్లియొకైనన్నీ। బామ్మందివ్వ మమాధవాధరసుధాపానంబు గల్గుంగదే॥ క॥ కాళిందీకూలంబున నాళీ! యానందతనయునధరామృతముల్ గ్రోలెడి వేణువునగునో। మేలాగుననోమవచ్చు నెఱిఁగింపఁగదే॥ క॥ వనితా! కృష్ణుఁడు నల్లని ఘనమని యా వేణురవము గర్జనమనియున్ వనమున నెమలులు పొదలంబడి నవవరతము నెమలితుటుములాడెడిఁ గంటే॥ క॥ *గిరిచరమిథునములోలిన్ బరికింపఁగఁ గృష్ణపాదపద్మాంకితమై సురరాజునగరికంటెను। వరుణీ! బృందావనంబు తద్దయుఁ గొప్పెన్॥ మ॥ అమరేంద్రాంగనలాకసంబున విమానారూఢలై పోవుచున్। గమలాక్షున్మృభమూర్తిఁ గాంచి మురళీగానంబులం దుంపఁగ। ర్ణములన్నిల్పుచు మేఖలల్వదలఁగా నాథాంకమధ్యంబులన్। భ్రమతో త్రాలిరి చూచితే వివశలై పంచాశుగభ్రాంతలై॥ ఉ॥ కానలనుంజుచున్ సరసగానవివేకవిహీనజాతలై। పీనులనేఁడు కృష్ణముఖవేణురవామృతధారసోకిన। న్మేనులు మేతలున్మఱచి మెత్తనిచూడ్కి మృగీమృగావళుల్। ల్మానిని చూడవమ్మ బహుమానము చేసెఁ గృతార్థచిత్తలై॥ ఉ॥ తల్లులచన్నుబాలు మును త్రావుతఱిం దమకర్ణవీథులన్ వల్లభమైన మాధవునివంశరవామృతధారఁ బొచ్చినన్। ద్రుళ్లక పాలు రావక దూఁటక మానక కృష్ణుమీఁద దృ। గ్వల్లులు చేర్చి నిల్చెనటవత్సములంగనలార కంటిరే॥ మ॥ మునులెన్నేములు గీఁదికెత్తుకొని §రోమంథంబు సాలించి విహ్వలతన్ మూలాగ్రంబులఁ గృష్ణునిప్పు మురళీగానామృతశ్రేణికర్ణములన్ గ్రోలుచు మేఁతమాని గళితానందాశ్రులై చిత్రితోపమలై గోవులు చూచుచున్నవదిగో పద్మాక్షి! వీక్షించితే॥ మ॥ జగతీజంబులశాఖలెక్కి మురళీశబ్దామృతస్యందము। ల్మిగులన్వీనులఁ ద్రావి ద్రేఁగుపడి నెమ్మిం గృష్ణురూపంబుచి। త్తగనై యుండఁగ నడ్డపెట్టు క్రియ నేత్రంబుల్దగన్మూసియీ। ఖగముల్వ్రాకెడిఁ జూచితే మునిజనాకారంబులం గామినీ॥ మ॥ శ్రీమమొప్పన్నముకుందు వంశరవమాకర్ణించి సంజాతమో। హములన్మన్మథసాయకక్షతవిశాలావర్తలై హంసవా। క్యములం జీజీతరంగహస్తముల నాకర్షించి పద్మోపహారముల్ గృష్ణపదార్చనంబు సలిపెన్ రామా విలోకించితే॥ గీ॥ వనిత నేఁడు కృష్ణువంశనినాదంబు। వినిపయోధరంబు విరులుగురిసి। తనశరీరమెల్ల ధవళాతపత్రంబుఁ। జేసి మింటనీడఁ జేసెఁ గంటే। క॥ మందిఫలంబులు హరిచే। నిందికరాలంబనముల నెగడుచు నిడక్రీడింపెదరంగన చూడుము। చెందితలంబింపఁ జిత్రచేలాంచితలన్॥ క॥ ఉల్లసితపుచ్ఛరంబుల। నల్లాడెడి నడుముతోడ నలరుపదండశ్రీ। ‡ఝిల్లీ యొకతె హరికిచ్చెను హల్లోహలకలితయగుచు మనంగన కంటే॥ క॥ గిరులెల్ల జలములయ్యెం। దరులెల్లను బల్లవించె ధరణీగగనభూ। చరులెల్లను జొక్కిరి హరి। మురళీరవామృతము సోకి ముద్దియ కంటే॥ మ॥ బలకృష్ణాంఘ్రిసరోజసంగమము చే భాసిల్లుచున్ధన్యమై। ఫలపుష్పంబులఁ గానుకల్గురిసి సంభావించి మిన్నంటుచున్। జలపూరంబుల గోవులం దనిపి చంచద్భూజరోమాంచమై। వెలసెన్జూడఁగ వమ్మయీ గిరిపురోవీథిన్ సరోజాననా॥ వ॥ అని యిట్లు బృందావనవిహారి యైన గోవిందుని సందర్శించి పంచబాణభల్లభగ్నహృదయలై వల్లవకాంతలేకాంతంబులఁ జింతించుచుఁ దత్పరతంత్రలై యుండిరంత॥ క॥ శ్రీమంతికాప్రగంధిత। సీమంతవతీసుచోష్ణజితశీతభయ।

## ❀ హేమంతఋతువర్ణనము. ❀

శ్రీమంతంబై గొబ్బున। హేమంతము దోఁచె మదనుఁ డేఁచె విరహులన్॥ క॥ ఉత్తరపుగాలి విసరెవి। యత్తలమున మిహిరకిరణుఁ డహితుండయ్యెన్। బొత్తుజరిగె మిథునములకు। నెత్తమ్ములు కటిగె హిమము నెలకొనియెన్నృపా॥ క॥ ‡అహములు సన్నములయ్యెను। సహనము హిమవహ్యదీర్ఘనిశలయ్యె నిశ। ల్బహుశీతోపేతంబై। యహహుహూ యనివడఁకె లోకమువ్వీనాథా॥ క॥ అన్నులచన్నులదండవి। పన్నులుగా కెల్లవారు బ్రతికిరి గాకీ। చన్నులమీఁదన చలినా। పన్నులుగా నుండఁదరమె బ్రహ్మాదులకున్॥ గీ॥ పొడుపుకొండమీఁద పొడిచినంది నుకలుగాఁ బలువుఁబెట్టియును డుపశ్చిమాద్రి। నాఁటఁ జొచ్చెఁగాక మనసు లిసచలి చేతఁ జిక్కఁజిక్కనఁగఁ జిక్కకున్నె॥ క॥ చెంగల్వవిరులగంధము। సంగతముగఁ గ్రోలుచున్న మధుపములోలిన్। వ్రేఁగ్నంగజవహ్నులపైను। ప్పొంగి విజృంభించు పొగలపోలికెనధిపా॥ గీ॥ శంభుకంఠమొక్కటి జలరాశి నొక్కటి। నాఁటియు నొక్కటి సునుజమందిరముల। నొదిగెఁగాక మెఱసియున్న మూఁడగ్నులు। చలికి మోడి భక్తి సలుపకున్నె॥ శా॥ ఈ హేమంతము రాకఁ జూచి రమణీహేలాపరీరంభన। త్సాహాయ్యంబునఁ గాని పీనిఁ గెలువన్ శక్యంబు గాదంచుఁ దా। రూహాపోహవిధిం ద్రిమూర్తులు సతీయుక్తాంగులైనారుగా। కోహో! వారల జేమి సంతతవధూయోగంబు రాఁగం మరే॥ క॥ ఈ హేమంతము రాకకు। శ్రీహరి యొక్కింత వడఁకి చింతింపంగా। నోహో వెఱవకు మనుచు। న్నాహరికిని శ్రీకుచంబు లభయం బిచ్చెన్॥ వ॥ ఇట్లు నితాంతంబగు హేమంతంబున మొదలి నెలతొలిదినంబునం దమనందనిమందఁగల గోపకుమారికలు రేపకడ లే

* గిరిచరమిథునములు। వనచరులయొక్క జంటలు. § రోమంథంబు। నెమరువెట్టుటను. ‡ ఝిల్లి। ఎఱుకది, హల్లోలహలకలితయగుచున్। ప్రీతితో గూడుకొనినదయి. ‡ అహములు। పగళ్లు-దివసములు.

గంధర్వుం డుసందడింపనగుచున్న రుత్తరలై యున్న లోకోత్తరుం డిట్లనియె॥ క॥ నా యింటికి దాసుల రై। నా యాజ్ఞ వహించి మీరు నడిచెద రేనిన్। మీ యంబరంబు లిచ్చెద। తోయంబులు వెడలి రండు తొయ్యలులారా॥ అనిన విని హరిమాటలు చలికి వెఱచి వనిత లిలమధ్యంబునన్ నిలువ నోపక॥ క॥ కొందఱు వెడలుద మందురు। కొందఱు వెడలుటయు సిగ్గుఁ గోము గోవిందుఁ డిచ్చుఁ డందరు కొందఱు దకములోఁ గొందలమందుదురు వడఁకుఁ గొని మనుజేంద్రా॥ వ॥ మఱియు నెట్టకేలకుఁ జిత్తంబులు గట్టిపఱచుకొని తనుమధ్యలు తోయమధ్యంబు వెలువడి॥ క॥ చంచత్పల్లవకోమల। కాంచననవరత్నఘటితకంకణరుచిరో। దంచితకరసంఛాదిత। పంచాయుధగేహ లగుచుఁ బడఁతులు వరుసన్॥ వ॥ చని ప్రౌఢలై నసుందరులముందఱ నిడుకొని మందగమనలు మందహాసంబు లొదవ నెదుర నిలిచిన నరవిందనయనుం డిట్లనియె॥ సీ॥ శృంగారవతులార సిగ్గేల మిముఁ గూడి పిన్ననాఁటనుగోలెఁ బెరిగినాఁడ। నెఱుఁగ నే మీలోన నెప్పుడు నున్నాఁడ నేను చూడని మర్మ మెద్ది గలదు। వ్రతనిష్ఠలై యుండి వలువలు గట్టక నీరు చొత్తురె మీరు నీయతిఁ దప్పి। కాత్యాయనీ దేవిఁ గల్ల సేయుట గాక నీరీతి నోము వారెందుఁ గలరు। వ్రతముఫలము మీరు వలసినఁ జక్కఁగ। నింతులెల్లఁ జేతులెత్తి మ్రొక్కి। చీరెపుచ్చుకొనుఁడు చీరెలు సిగ్గువో। నాడ నేల యొగ్గులాడ నేల॥ అనిన విని మానవతులు తమలోన॥ ను॥ వ్రతముల్సేయుచు నొక్కమాటయిన నెవ్వానిన్ విచారించిన। న్వ్రతభంగంబులు మానునట్టి వరదున్ వ్వామాక్షులీక్షించి యి। న్నతచేలాప్లవనంబు నేఁడు వ్రతభంగంబంచు శంకించి ఫా। లతటన్యస్తకరాబ్జలై సరసలీలన్ మ్రొక్కి రట్లందఱున్॥ క॥ బాలలకు హస్తకీలిత। ఫాలలకు నితాంతశీతపవనాగమనా। లోలలకు నంబరములు గృ। పాలుఁడు హరి యిచ్చె భక్తపాలకుఁ డగుటన్॥ గీ॥ చీరె లపహరించి సిగ్గులు విడిపించి। పరిహసించి యైనఁ బరగ మనకు। ఘనుఁడు నోము కొఱఁత గాకుండ మ్రొక్కించె। ననుచు హరిని నుతించి రబలలెల్ల॥ క॥ ఉల్లములు నొవ్వ నాడినఁ। గల్లలు చేసినను నగినఁ గలఁచిన నైనన్। వల్లభులు సేయు కృత్యము। వల్లభలకు నెగ్గుగాదు వల్లభమధిపా॥ వ॥ ఇట్లు హరి వలువ లిచ్చినఁ గట్టుకొని సతులు తనియందు బద్ధానురాగలై యుచ్చరింపక రెప్పలిడక తప్పక చూడ నా ప్రౌఢ యెఱింగి చేరి వారికిట్లనియె॥ సీ॥ లతుణవతులార లజ్జించి చెప్పరుగాని మీ మర్మములు గానఁబడియె। నన్నుఁ గొల్వఁ జింతించినారు నా చేతను సత్యంబు మీ నోము సఫలమగును। గామితార్థంబులకై మిమ్ము చెప్పఁగ వేల నన్నుఁ గొల్వ ముక్తికి నడువవచ్చుఁ। గడమ కూడఁగ నంబికాదేవి నోమంగ నటమీఁద రాత్రులయందు మీకు। నన్నుఁ బొందఁగల్గు నమ్మి పొండని హరి। పల్కె నింతులెల్ల భ్రాంతిఁ జనిరి। తపము పండె ననుచుఁ దత్పదాంభోజము। ల్మానసించికొనుచు మందకడకు॥

## మునిభార్యలన్నముఁ దీసికొనివచ్చి శ్రీకృష్ణున కారగింపు సేయుట.

వ॥ ఇట్లు గోపకన్యకలం బ్రసన్నుండై గోవిందుండు బృందావనంబు దాఁటి మారంబున ధేనువుల మేపుచుండఁ జండకిరణుని యెండం బడి వెండి చెడి తరుల దండ నండఁ గొనుచు నాతపత్రాకారంబులై నీడలు సేయుచున్న వృక్షంబుల నీక్షించి కృష్ణ బల శ్రీరామదేవ ప్రశస్థపిశాలార్జున ప్రముఖులకుం దక్కిన గోపకు లిట్లనిరి॥ మ॥ అపకారంబులు సేయ రెవ్వరికి నేకాంతంబుల నుండు నా। తపశీతానిలవర్షవారకములై త్వగ్గంధనిర్యాసభ। స్మపలాశాగ్రమరందమూలకుసుమచ్ఛాయాఫలశ్రేణిచే। నుపకారంబులు సేయు నర్థులకు నీ యుర్వీజముల్గంటిరే॥ వ॥ అని చిగురాకు పువ్వు కాయ పండ్లు తండంబుల వ్రేఁగున వీఁగిన తరువుల నడిమి తెరువులం బసుల దాఁటుల దాఁటించి యమునకుం జని వెడఁదమడుగుల మెల్లనఁ జల్లని నీరుఁ ద్రావించి తత్సమీపంబున మేపుచు వల్లవులెల్ల మూఁకలుగొని యాఁకలి గొంటిమని విన్నవించినఁ దనకు భక్తురాండ్రగు విప్రభార్యలవలనం బ్రసన్నుండై వారలం జూచి రామసహితుండైన హరి యిట్లనియె॥ సీ॥ వల్లవులార యీ వనమున విప్రులు బ్రహ్మవాదులు దేవభవనమునకు। నరుగుట కాంగిరసాహ్వాయసత్రంబు సలుపుచున్నారు సనుఁడు మీరు। మా నామములు సెప్పి మైత్రితో నడిగిన నన్నంబుఁ బెట్టెదరనుచుఁ బలుక। వారలు చని విప్రవరులకెల్లను మ్రొక్కి పసుల మేపుచు బలభద్రకృష్ణు। లలసి పుత్తెంచి రిట నుమ్మ నన్న మడుగ। ధర్మవిదులార యర్థిప్రదాతలార। పెట్టుఁ డన్నంబు శ్రాంతులఁ బిలిచి తెచ్చి। పెట్టుదురుగాదె మిముఁ బోటి పెద్దలెల్ల॥ క॥ ఘనదీక్షితునకు నైనం। జనుఁ గుడువఁగఁ బశువధంబు సౌత్రామణియుం। జనిన వెనుక దోషము లే। దనఘాత్మకులార పెట్టుఁ డన్నము మాకున్॥ అని గోపకులు పలికిన॥ మ॥ క్రతువున్ మంత్రము తంత్ర ముద్ధనములు న్గాలంబు దేశంబు దే। వతయున్ ధర్మమున న్యముల్దలఁప నెవ్వాఁ డట్టి సర్వేశ్వరు। న్మతి నూహింపక గోపబాలుఁ డనుచున్ మందస్థితిం జూచి దు। ర్మతులై యన్నము లేదు లేదనిరి సన్మానక్రియాశూన్యులై॥ వ॥ అంత గోపకులు నిరాశులై వచ్చి యెఱింగించిన హరి లౌకికానుసారియగుచు మీర య్యార్యుల నడుగక వారి భార్యలకు మా రాకఁ జెప్పుఁ డన్నంబు వెట్టెదరని పంచిన వారుఁ జని బ్రాహ్మణసతుల దర్శించి నమస్కరించి సంపూజితులై యిట్లనిరి॥ క॥ గోవుల మేపుచు నాఁకొని। గోవిందుం డన్న మడిగి కొనితెం డనియెన్। మీ వేశ్మను బుత్తెంచెను। భావిలసితలార రండు తెం డన్నంబుల్॥ వ॥ అనిన విని గోవిందసందర్శన కుతూహలలై ధ

రణీసురసుందరులు సంభ్రమానందంబులు డెందంబుల సందడింప భక్ష్యభోజ్యలేహ్యచోష్యపానీయ భేదంబులం గలిగి సం
స్కారసంపన్నంబులైన యన్నంబులు కుంభంబుల నిడికొని సంరంభంబున సముద్రంబునకుఁ జను నదుల తెఱంగున॥క॥ బి
డ్డలు మగలును భ్రాతలు। నడ్డము చని వలదనం గసటు వలఁదనిమా। యొడ్డుచు జగదీశ్వరునకు। జడ్డన నన్నంబు గొనుచుఁ జని
రా సుదతుల్॥వ॥ చని యమునా సమీపంబున నవపల్లవాతిరేకంబును విగత వనచర శోకంబునైన యశోకంబు క్రింద నిర్మలస్థ
లంబున॥సీ॥ ఒక చెలికాని పైనొక చేయి చాఁచి వేఱొక చేత లీలాబ్జము నూను వానిఁ। గొప్పనకంపని కొన్ని కుంతలములు చెక్కు-
లను నృత్యంబు సేయు వానిఁ। గుఱుచ చుంగులు పుచ్చికొన రారఁ గట్టిన పసిఁడివన్నియ గల పటము వాని। సొవలఁ దిరిగి రానలవ
డఁ జుట్టిన కట్టంపు శిఖిపింఛదండ వాని। రాజితోత్పలకర్ణపూరముల వాని। మహితపల్లవపుష్పదామముల వాని। భువన
మోహననటవేష భూషితు వానిఁ। గనిరి కాంతలు గన్నుల కరువు దీఱ॥క॥ కనిలోచనరంధ్రంబుల। మును మిడి హరి లలితరూపము
ను లోఁగొని నెమ్మనముల బరిరంభించిరి। తనుమధ్యలు హృదయజనిత తాపము వాయన్॥ఇవ్విధంబున॥క॥ వారిత సర్వస్పృ
హలై। వారం బలుకున్నఁ జూడవచ్చుట మదిలో। వారిజనయనుఁడు వొడగని। వారికి నిట్లనియె నగియ వారితదృష్టిన్॥శా॥
కాంతారత్నములార మీ గృహములం గళ్యాణమే యేమి గా। వింపన్ మీకిటు రంతమమ్ముని చట న్వీక్షింప నేతెంచినా। రెంతో
వేడుకతో నెఱుంగుదు మునిస్థైర్యస్థితిన్నన్నుధీ। మంతుల్ మిక్రియఁ జేరికం దురు గదా మత్సేవలన్ సర్వముల్॥వ॥ కావున గృహస్థు
లైన మీ పతులు మిమ్ముం గూడి క్రతువు సమాప్తిం జేసెదరు మీరు యాగవాటంబునకుం జనుండనిన విప్రభార్యలిట్లనిరి॥మ॥ త
గునే మాధవ యిట్టి వాఁడి పలుకుల్ ధర్మంబు లేయీ మెడ। మ్మగలున్ బిడ్డలు సోదరుల్ జనకులున్ మమ్మున్ని వారింపఁగ। న్విగనీ
యంఘ్రులు చేరినారము టఁబోఁ జేకొంపరే వారలా। పగిదే మొల్లముకింకరీజనులఁగా భావించి రక్షింపవే॥ అనిన జగదీశ్వ
రుండు॥సీ॥ నా సమీపమునను న్నారంచు నలుగరు బంధులు భ్రాతలు పతులు సుతులు। మిమ్ము దేవతలైన మెత్తురంగనలార నా
దేహసంగంబు నరులకెల్ల। సౌఖ్యానురాగసంజనకంబు గాదు ముక్తిప్రదాయకము నా కీర్తనమున। దర్శనాకర్ణనధ్యానంబు
లను గర్మబంధ దేహంబులఁ బాసి మీరు। మానసంబులు నాయందు మఱుఁగఁ జేసి। నన్నుఁ జేరెదరిట మీఁదఁ నమ్ముఁ డనుచుఁ। బని
కి వారలు దెచ్చిన భక్షణామూలా స్తవర్గంబుతో హరి యారగించె॥క॥ పరమేశ్వరార్పణంబుగఁ। బరజనులకు భిక్షమిడినఁ బర
మపదమునన్। బరగెదరఁట హరి సాక్షాత్పరమేశ్వరు భిక్ష సేయు ఫలమెట్టిదియో॥వ॥ ఇట్లు సర్వేశ్వరుండయిన హరికి భిక్షు
యిడితమ తమ భార్యల తనివలనం గృతార్థులగుట నెఱింగి భూసురులు తమలో నిట్లనిరి॥ఉ॥ కటకట మోసపోయితిమి కాంతల
పాటియు బుద్ధి లేమ నేఁ। డిటు హరిఁ గానఁబో నెఱుఁగ మేము దురాత్ముల మేము కర్మపో। ష్టులము విష్ణుపారగుల ప్రాజ్ఞత
లెంతపంబు లేల ప। ర్యటనము లేల శీలములు యాగములు స్మృతులేల కాల్పనే॥క॥ జపహోమాధ్యయనంబులు। తపములు
వ్రతములును లేని తరుణులు హరిస। త్కృపఁ బడసి రన్ని గలిగియుఁ। జపలతఁ బొందితిమి భక్తి సలుపమి నకటా॥క॥ సురగురు
గు యోగీంద్రుల। నరుమగ మోహితులఁ జేయు హరిమాయ సుమీ। నరగురుల మూఢవిప్రుల। నురువడి మోహితులఁ జే
య నోపకయున్నే॥మ॥ క్రతువుల్ ధర్మము మంత్రతంత్రధనముల్ కాలంబు దేశంబు దే। వతయున్ వహ్నులు మేదినీసురులు
నె వ్వాఁడట్టి సర్వేశుఁడీ। క్షితి రక్షింప జనించివాఁ డెఱుఁగమా శ్రీభర్త కుం గర్తకుం। గతలోకర్తకు మేము మ్రొక్కెదము ర
క్షోనాథసంహర్తకున్॥వ॥ అని మఱియు ననేకవిధంబులఁ బశ్చాత్తాపంబులం బొంది హరిం దలంచి శమింపుమని మ్రొక్కి
బ్రాహ్మణులు కంసభీతులై కృష్ణసందర్శనంబు సేయం జనరై రంత నక్కడ సఖిలదర్శనుండైన హరి యింద్రయాగంబు సే
యం దలంచి తన కడకు వచ్చిన నందాది గోపవృద్ధులం గని నందున కిట్లనియె॥ సీ॥ యాగంబు సేయంగ నర్థించి వచ్చితిరీ యాగ

### శ్రీ గోపాలకృష్ణుఁడు గోవర్ధనపర్వతము నెత్తుట. శ్రీ

మున ఫలమేమి గలుగు। నెవ్వాఁడు దీనికి నీశ్వరుండధికారి యెవ్వఁడు సాధనమెంత వలయు। శాస్త్రీయమో జనాచారమో
కార్యంబు వైరుల కెఱిఁగింపవలదు గాని। యెఱిఁగెడి మిత్రుల కెఱిఁగింపఁ దగుఁ జేరి యెఱిఁగి చేసినఁ గోర్కెలెల్లఁ గలుగుఁ। బ
గయుఁ జెలిమి లేక పరగిన మిము బోఁటి। వారి కెల్ల సుంతనంబు। తలఁపులెల్ల మాకుఁ దగ నెఱింగింపవే। తాత వాక్సుధా
ప్రదాతవనుచు॥ అని పలికిన ప్రౌఢకుమారునకిఁ దండ్రి యిట్లనియె॥సీ॥ పర్జన్యుఁ డధికుండు భగవంతుఁ డమరేంద్రుఁ డతనికిఁ
బ్రియమూర్తులగుచున్న। మేఘబృందంబులు మేదినీతలముపై నతని పంపున భూతహర్షణముగ। జలములు గురియుఁ దజ్జల
పూరములఁ దోఁగి పండు సస్యంబు లా పంట దమకు। ధర్మార్థకామ ప్రదాయకములు లోకులెల్లను బ్రతుకుదు రింత యెఱిఁ
గి। మేఘవిభుఁడైన యింద్రుండు మెచ్చకొలఁకు। నింద్రమఖములు సేయుదు రెల్లనృపులు. కామలోభభయద్వేషకలితులగు
చుఁ। జేయకుండిన నశుభంబు చెందుఁ బుత్ర॥ అదియునుం గాక॥గీ॥ మఖము సేయ వజ్రి మదిసంతసించును। వజ్రి సంతసింప

వానగురియు। వానగురియఁగ సువ్వసుమతిఁ బెరుగును। గసవు మేసి ధేనుగణము బ్రతుకు॥ క॥ ధేనువులు బ్రతికె నేనియు।
మానమఘునమైన పాఁడిమందలఁ గలుగున్। మానముగ బాఁడి గలిగిన। మానవులును సురలుఁ గనిసి మనుదురు పుత్రా॥ వ॥ అని
యిట్లు నొడివిన నందుని వచనంబులు విని యింద్రునికిఁ గోపంబు దీపింపఁ దనుజదమనుండు తండ్రి కిట్లనియె॥ క॥ కర్మమునఁ బుట్టు
జంతువు। కర్మమునన్ వృద్ధిఁ బొందుఁ గర్మమునఁ జెడున్। గర్మ మెఱుఁగనులకు దేవత। కర్మము సుఖదుఃఖములకుఁ గారణ మధిపా॥
క॥ కర్మములకుఁ దగుఫలములు। కర్మములనిడఁగ రాజు గాని సదాని। ష్కర్మ్ముఁడగు నీశ్వరుండును। గర్మవిహీనునికి రాజు గాఁ
డు మహాత్మా॥ వ॥ కావునఁ గర్మానుయాతంబులైన భూతంబులకుఁ బురుహూతునివలని భీతి యేటికిఁ బురాతన జన్మసంస్కారకర్మం
బులు తప్పులుగొనిక తప్పునఁ గర్మంబులఁ దప్పించి పెంపువడయ నప్పరమేశ్వరుండును నేరఁ డితరులం జెప్ప నేల, సురాసురనరా
నీకంబులతోడి లోకంబు నిజసంస్కారవశంబై యుండఁ డిందియున్నది, సందేహంబు లేదు, దేహి కర్మవశంబున గురుతును దే
హంబులఁ జొచ్చి వెడలు, నెజ్జ వేలుపు నెచ్చెలి పగరు చుట్టంబులు కర్మంబు, జీవుండు కర్మంబుతోడ వర్తించు, నతనికిఁ గర్మంబు
దైవతంబు, కర్మంబునం బ్రతుకుచు, నితర సేవ సేయుట సతి పతి విడిచి జారుం జేరిన చందంబగు విప్రుఁడు వైదికకర్మంబున మె
లఁగు, నృపతి ధరణీపాలనంబున సంచరించు, వైశ్యుండు వాణిజ్య కృషి కుసీద గోరక్షణాదుల వర్తించు, శూద్రుం డగ్రజన్మ
ల సేవించి బ్రతుకు, సత్త్వరజస్తమోగుణంబులు సృష్టిస్థితిలయ కారణంబు, లందు రజంబున జగంబు జన్మించు, రజోగుణప్రేరి
తంబులై మేఘంబులు వర్షించు, వర్షంబునం బ్రజావృద్ధియగు, నింద్రుం డేమి సేయంగలవాఁ డదియునుం గాక॥ శా॥ కోపిం
పంబని లేమ శత్రునికిఁ దాఁ గోపించుఁ గా కేమి సం। క్షేపం బయ్యెడి దేమి పట్టణములున్ గేహంబులున్ దేశముల్। వ్యాపారంబులు
మీకుఁ బో యెడి నెశైలారణ్య భాగంబులన్। గోపవ్రాతంబు ననుండుచున్న నకు సంకోచింపఁగా నేటికిన్॥ సీ॥ పసులకుఁ గొండకు
బ్రాహ్మణోత్తములకు మఖముగావించుట మంచిబుద్ధి। యింద్రయాగంబునకే మేమి దెప్పించితిరవి యెల్లఁ దెప్పింపుఁడ గసిమీ
రు। పాయసంబులు నపూపంబులు నైఁదపు పిండివంటలు బప్పు వలయునట్టి। ఫలశాకములు వండఁ బంపుఁడు హోమంబు సే
యుఁడు ధేనువక్షిణలఁ జిచ్చి। బహురసాన్నంబు పెట్టుఁడు బ్రాహ్మణులకు। నచలులై పూజయొనరింపుఁ డచలమునకు। నధము
చండాలశునక సంప్రాప్తికిఁ దగిన। భక్ష్యములు వెట్టి కసవులు పసులకిండు॥ శా॥ గంధాలంకరణాంబరావళుల చేఁగై చేసి యిష్టా
న్నముల్। బృందశ్రేణియు మీరలుం గుడిచి నానాభా సారతి న్వేడుక। ల్సందిల్లన్ గిరిగోద్విజానలనమస్కారంబుగా వింపుమా। సం
ధిల్లున్నకలేప్సితంబులును మీజన్మంబు ధన్యంబగున్॥ వ॥ అని మజియుఁ గలింపవతి సొంపు దింపు తలంపున నిమ్మఖంబు తనకు సమ్మ
తంబని గోవిందుండు పలికిన నందాదులు మేలు మేలని తద్వచనప్రకారంబున నంబుస్స్వాహావాచనంబులు చదివించి ధరణీసురు
లకు భోజనంబు లిడి పసులకుం గసవు లొసంగి రప్పుడు॥ మ॥ సకలాభీరులు వీఁడె కృష్ణుఁడన నైజంబైన రూపంబుతో। నకలంక స్థి
తి నుండి శైలమిదె నీ రార్చింపఁ బండఁ జూచుఁ దా। నొక శైలాకృతిఁ దాల్చి గోపకులతో నొండొండఁ బూజించి గో। పకదత్తాన్నము
లాహరించె విభుఁ డా ప్రత్యక్షశైలాకృతిన్॥ మ॥ వినుఁడీ శైలము కామరూపి ఖలుల న్వేధించు నాజ్ఞాన్నము। ల్మన మొప్పిం
చిన నాహరించెను నలన్నిన్నిం చెఁ జిత్తంబులో। ననుకంపాతిశయంబుచే సెమన పైనంచున్న గోపాలుఁడై। వనజాక్షుండు
ననుస్మరించె గిరికి* వ్వందారు మందారుఁడై॥ వ॥ ఇట్లు గోపకులు హరిసమేతులై గిరికిం బూజనోపహారంబులు సమర్పించి
గోధనంబులం బురస్కరించుకొని భూసురాశీర్వాద వచనంబులతో గిరికిం బ్రదక్షిణంబు చేసి రాసమయంబున॥ క॥ స[illegible]ను
లపరువు మెచ్చని। న[illegible]ఁగట్టిన రథంబున నందప్రముఖుల్। [illegible]లయార్పులు చెలఁగఁగఁ। దో[illegible]గమి వెంటనంటఁ దోలిరి లేశా॥
క॥ పాటించి గానవిద్యా। పాటవమునఁ దేరు లెక్కి బహుతానములం। బాటల గంధుల కృష్ణునిఁ। బాటలు వాడిరి విరోధిపాట
నుఁడనుచున్॥ క॥ కుండనిశిఖాపీనంబులు। నుండితవర్ణములు వివిధ మహిదాకృతులు। నిండిన కడుపులుఁ గన్నుల। పండువులు
గఁ బాఁడి ప[illegible]పసువులు జరిగెన్॥ క॥ పొగరెక్కి నమూపురములు। దెగగల వాలములు శైల దేహంబులు భూ। గగనములు నిండ
అంకెలు। మిగుల మెఱయు వృషభగణము మెల్లన నడిచెన్॥ వ॥ ఇట్లు పర్వత ప్రదక్షిణంబులు చేసి గోపకులు మాధవసమేతులై
నుండ కుంజనిరంతము హేంద్రుండంతయు నెఱింగి మహాకోపంబునఁ బ్రళయప్రవర్తకంబులగు సంవర్తకాది మేఘంబులం
జీరి యిట్లనియె॥ మ॥ పెరుగున్నేతులుఁ ద్రావి క్రొవ్వి భువి నాభీరుల్మదాఖీలురై। గిరిసంఘాతకఠోరపత్త్రదళన క్రీడాసమా
రంభమ। ర్ఘురవంభోళిధరుం బురందరుననుం బాటించి పూజింపక। గ్గిరికిం బూజలు చేసిపోయిరి దెపో కృష్ణుండు ప్రేరేపఁ
గన్॥ క॥ గురుదేవహీను బాలుని। గిరిభూజప్రముఖవాసుఁ గృష్ణుననీశున్। బరిమాణశీలకులగుణ। విరహితుఁ జేపట్టి యింద్రు
విడిచిరి గొల్లల్॥ గీ॥ విమలఘనతరాత్మవిజ్ఞానవిద్యచే। నిగుడలేక యుడుపనిభములగుచుఁ। గర్మమయములైన క్రతువులఁ భవ

* వందారుమందారుఁడై। తనను భూషించువారలకు కల్పవృక్షప్రాయుఁడై. శిఖాపీనంబులు। పొడుగులు.

మహోత్సవముగఁ దువ్వఁ గోరి నారు వీరు॥ శా॥ ఉద్యత్సంపద నమ్మి నందతనయుం డుద్యోగంబున న్వేల్పులై మద్యాగంబుఁ జక్కఁ బేసి యనిర్బుద్ధి మద్యుల్ఫడిన్నీరుని। విద్యుద్వల్లులఁ గప్పి గర్జనముల న్వేధించి గోవుల్లను। సద్యోన్మృత్యువుఁ బొందఁ రాల్లు రియ్యుఁడీ శౌర్యంబ వార్యంబుగన్॥ క॥ మీ వెంటవత్తు నేనై। రావణనాగంబు నెక్కి రయ మొప్పంగా। దేవగణంబులతోడను। గోవిందుని మందలెల్లఁ గొందలపెట్టన్॥ వ॥ అని యిట్లు పలికి జంభవైరి సంరంభంబున దంభోళి ఝళిపించి, బింకంబున శంకింపక, కింకతోడ నంకిలులు విప్పించిన, మహానిలప్రేరితంబులై చని, నందునిమందమీఁదన మోఘంబులైన మేఘంబులు మహాఘనంబులై పన్ని ప్రచండగతిఁ జండమారీచిమండలంబుఁ గప్పి దిపి నిండి, దిశలావరించి, రోదోంతరాళంబు నిరంతరనిబిడాంధకారబంధురంబుగ నిరోధించి, బలిభంజనతృతీయపాదపల్లవభగ్నంబైన బ్రహ్మాండభాండంబు విల్లులజల్లించి నిండోటుఁగు బహిస్సముద్రసలిలంబులు ఝరంబులవడువున నెడ తెగక, తోరంబులైన నీరధారలం గురియుచు, శిలలవర్షించుచుఁ, బిడుగులు రువ్వుచు, మిఱుపల్లంబులు పుంతలంబులై యేకార్ణవంబు రూపుచూపి సంద్రము ముంచుకడఁచుచు, విలయశిఖిశిఖాసంరంభవిజృంభమాణవిద్యుల్లతావిలోకనంబుల మిఱుమిట్లు గొని సోమ్మసిలం బోవు లేఁగలును, లేఁగలకు మూఁతులడ్డంబులిడి ప్రళయభైరవభేరీభాంకారభీషణంబులగు గర్జనఘోషణంబులఁ జెవులు మూసి పడి చిందరవందరలైన డెందంబులం గందికుందు వ్రాలు ధేనువులును, ధేనువుల వెనుకనిడుకొని మరంటకల్పాంతకాలకీలికరాళ కాళ్లకరవిశాలగిదాఘాతప్రభూతంబులైన నిర్ఘాతపాతంబుల భీతంబులై, హరికి మ్రొక్క రక్షరక్షేతిశబ్దంబులు సేయుచు వడి, విడువనిజడింబడి సైరింపక, శిరంబులు వంచుకొని, గద్గదకంఠరంబుల, నంభారవంబులు సేయు వృషభంబులును, వృషభాదిగోరక్షణంబు సేయుచు దుర్వారఘోరశిలాసారంబుల సారంబులు సెడి శరీరంబులు భారంబులైన మ్రానువడు గోపకులును, గోపకులం బట్టుకదట్టంబైన వానకొట్టునం బెట్టువడి బడుగు నడుములు నులుసువడ వడవడ వడంకుచు గోవిందునిం జీఱు గోపికలును, గోపికాజనకరకృతకలశయుగళంబుల నడుము గునందలలు వెట్టుకొని పరవశులైన శిశువులుం గలిగి మహాఘోషంబుతోడ నష్టంబైన ఘోషంబుఁ జూచి ప్రబుద్ధులైన గోపవృద్ధులు కొందఱు దుర్జనశిక్షకుండును, సజ్జనరక్షకుండు నయిన పుండరీకాక్షునకు మ్రొక్కి యిట్లనిరి॥ ఉ॥ అక్కటవానఁ దోఁగి ప్రజలాకులమయ్యెఁ గదయ్య కృష్ణ నీ। వెక్కడనుంటి వింతదడ వేల సహించితి నీపదాబ్జముల్‌। దిక్కఁగనున్న గోపకులు దీనతనొంద భయాపహారివై। గ్రక్కనఁ గావ కిట్టునికి కారుణికోత్తమ నీకుఁ బాడియే॥ క॥ ఈయుఱుములు నీ మెఱుపులు। నీయశనిఘోషణములు నీజలధారల్‌। నీయాంతతొల్లియెఱుఁగము। కుయ్యాలింపంగదయ్య గుణరత్ననిధీ॥ క॥ వారిభరువయ్యె మందల। వారికి నిదె పసులు లేరు వారింపంగా। వారిదపటల భయంబును। వారిరుహదళాక్ష నేఁడు వారింపఁగదే॥ అనిన విని సర్వజ్ఞుండైన కృష్ణుండంతయు నెఱింగి॥ ఉ॥ తన్నొకయింతగైకొనరు తప్పిరియాగము చేసి రంచుఁ దా। మిన్నుననుండి గోపకుల మీఁదశిలల్‌ గురియించుచున్నవాఁ। డున్నతనిర్జరేంద్రవిభవోద్ధితగర్వనగాధిరూఢుఁడై। కన్నులఁగానఁడింద్రుఁ డిటు గర్వపరుండొకుఁగాన నేర్చునే॥ క॥ దేవతలందఱు నన్నును। సేవింతురు రాజ్యమదముఁ జెందరు చెఱుపం। గావలదు మానభంగము। గావింపఁగవలయు శాంతిఁగలిగెడుకొఱకై॥ వ॥ అని చింతించి శిలావర్షహతులై శరణాగతులైన ఘోషజనుల రక్షించుట తగవని సకలలోకరక్షకుండైన విచక్షణుండు॥ చ॥ కలఁగకుఁడీ వధూజనులు కంపము నొందకుఁడీ వ్రజేశ్వరుల్‌। తలఁగకుఁడీ కుమారకులు తక్కినవారలు రాలవానచే। నలయకుఁడీ పసుల్‌ వ్రజమున క్కడనక్కడ నిల్వనీకుఁడీ। మెలుపున మీకు నీశ్వరుఁడు మేలొసఁగున్‌ గరుణార్ద్రచిత్తుఁడై॥ అని పలికి॥ క॥ కిరివైభరయెత్తిన హరి। కిరిసరసేఖయుకుళ మెత్తుగతిఁ ద్రిభువనశంకరకరుఁడై గోవర్ధనగిరి యెత్తెం జక్కనొక్కకేలన్‌ లీలన్‌॥ క॥ దండిని బ్రహ్మాండంబులు। చెండులక్రియఁ బట్టి యెగరఁజిమ్మెడు హరికిం। గొండ జళిపించి యెత్తుట। కొండొకపనిగాక యొక్క కొండా తలఁపన్‌॥ ఇట్లు గిరి యెత్తి॥ ఉ॥ బాలుండాడుచు నాతపత్రమని సంభావించి పూగుత్తికెన్‌। గేలం దాల్చినలీల లేనగవుతోఁ గృష్ణుండు దానమ్మహా। శైలంబున్‌ వలకేలఁ దాల్చి విపులచ్ఛత్రంబుగాఁ బట్టె నా। భీలాభ్రచ్యుతమశ్శిలాచకితగోపీగోపగోపక్తికిన్‌। ఇట్లు గోత్రంబు ఛత్రంబుగాఁ బట్టి గోపజనులకు గోపాలశేఖరుండిట్లనియె॥ క॥ రా తల్లి రమ్ము తండ్రీ। రేతలు గోపకులు రండు విసుఁడీ గర్త। స్మోకము వనుండుఁ దుగో। వ్రాతముతో మీరు మీకువలసినయెడలన్‌॥ శా॥ బాలుండీతఁ డుకొండ దొడ్డదిమహాభారంబు సైరింపఁగా। జాలండోయని దీనిక్రిందని యువన్మంకింపఁగాఁ బోలదీ। శైలాంభోనిధిజంతుసంయుతధరాచక్రంబు పైఁ బడ్డ నా। కేలల్లాడదు మబంధులార నిలుఁడీ క్రిందన్‌ బ్రమోదంబునన్‌॥ వ॥ ఇట్లు పలుకుచున్న హరిపలుకులు విని నెమ్మనమ్ముల నమ్మి కొండయడుగున తమతమయిమ్ములం బుత్రమిత్రకళత్రాదిసమేతులై గోవులుం దారును గోపజనులు జనార్దనకరుణావిలోకనామృతవర్షంబున నాఁకలి నీరుదప్పుల చొప్పెఱుంగక కృష్ణకథావినోదంబుల నుండిరి యవ్విధంబున॥ మ॥ హరిదో

ర్దండము కామగుబ్బ శిఖరంబా లంబి ముక్తావళుల్ ప్వరగంజా రికతోయబిందువులుగా గోపాంగనా పాంగపా । సరుచు
ద్రత్నచయంబు గాఁగ నచలచ్ఛత్త్రంబు శోభిల్లెఁద ద్గిరిభిద్దుర్మదభంజనైజలధరాభున్న ప్రజారంజనైౖ॥క॥రాజీవాక్షుని
చేనొక రాజీవము భంగి శైలరాజము మెఱసెన్ రాజేంద్ర మీఁద మధుకరరాజిక్రియ మేఘరాజిరాజిల్లెఁ గడున్॥క॥వడి
గొనిబలరిపువనుపున నుడుగక జడిగురిసె నేడ హోరాత్రములు। య్యెడ గోపజనులు బ్రతికిరి జడిఁ జడియక కొండగొడుగు
చాటున నధిపా॥వ॥ ఇట్లు హరి యేడహోరాత్రంబులు గిరిధరించిన గిరిభేది విసికి వేసరి కృష్ణుచరితంబులు విని వెఱఁగుపడి విఫలమనోరథుండై మేఘంబుల మఱలించుకొని చనియె నంత నభోమండలంబు విద్యోతమాన ఖద్యోతమండలంబగుట విని గోవర్ధనధరుండు గోపాలకుల కిట్లనియె॥క॥ఉడిగెను వానయు గాలియు వడి చెడిన మ తెల్లఁ బోలు పవరదలిగి రేఁ గొం దపుగున
నుండక వెడలుఁడు కొడుకులు గోడండ్రు సతులు గోవులు మీరున్॥వ॥ అనిన విని సకలగోపజనులు శకటోపకరణసమేతులై గోవులుం దారును గొండయడుగు విడిచి వచ్చిరవ్విభుండును జెచ్చెరఁ దొల్లింటియట్ల నిజస్థానంబున గిరి నిలిపె నంత వల్లవులెల్లం గృష్ణుం గౌఁగిలించుకొని సముచిత ప్రకారంబుల సంభావించి దీవించిరి గోపికలు సేసలిడి దధ్యన్నాక్షతంబులొసంగుచు నాశీర్వదించిరి నందబలభద్ర రోహిణీయశోదలాలింగనంబు సేసి భద్రవాక్యంబులు పలికిరి సిద్ధసాధ్యగంధర్వవరులు విరులు గురియించిరి సురలు శంఖదుందుభులు మ్రోయించిరి తుంబురు ప్రముఖులయిన గంధర్వులు పాడి రప్పుడు॥క॥వల్లవకాంతలు దనకథ లెల్లను బాడంగ నీరజేక్షుఁ డంతన్ వల్లవబలసంయుతుఁడై యల్లన గోష్ఠంబు చేరె నుర్వీనాథా॥ అయ్యవసరంబునఁ గృష్ణుచరిత్రంబులు తలంచి వెఱఁగుపడి గోపజనులు నందున కిట్లనిరి సీ॥కన్నులు దెరువనికడు చిన్నపాపఁడై దానవిఁ జను బాలుద్రావి చంపె। మూఁడవ నెలనాఁడు ముద్దుల బాలుఁడై కోపించి శకటంబుఁ గూలఁదన్నె। నేఁడాదికుఱ్ఱఁడై యెగసి తృణావర్తు మెడఁబట్టుకొని హతుఁ జేసెఁ దల్లి వెన్నలకునై తనురోలఁ గట్టినఁ గొమరుఁడై మద్దులఁ గూలనీడ్చెఁ బసులఁ గ్రేపులఁ గాచుచు బకునిఁ జీరె వెలగతో వత్సదైత్యుని వ్రేసి గెడపె సబలుఁడై ఖరదైత్యుని సంహరించె నితఁడు కేవల
మనుజుఁడే యెంచి చూడ॥క॥ తెంపరియై రాముని చేఁ జంపించె ప్రలంబు మ్రింగె జటులదవాగ్నిన్ సొంపు చెడ ద్రొక్కెఁ గాళియుఁ ద్రుంపక కాళింది వెడలఁ ద్రోలె నలీలన్॥క॥ఏడేండ్ల బాలుఁ డొక్కఁడ క్రీడం గరితమ్మి యెత్తుక్రియ నందఁడముల్ జూడ గిరి యెత్తు టెక్కఁడ వేడుక నొక చేత నేమి వెఱగో గాదో॥క॥ఓ నంద గోపవల్లభ నీ నందనుఁ డాచరించు నేర్పరితనముల్ మానవులకు శక్యంబులె మానవమాత్రుండె నీకుమారుఁడు తండ్రీ॥వ॥ అనిన విని నందుండు వారలం జూచి మున్ను తనకు గర్గమహాముని చెప్పిన సంకేతంబు తెలిపి శంకలేమఁ గృష్ణుండు లోకరక్షకుండైన పుండరీకాక్షుని నిజాంశమనుచు నంతరంగంబున నంజలించుకొని పలికిన వెఱఁగుపడి గోపకులు కృష్ణుం దవంతుండని పూజించి రంత॥మ॥హరి కేలన్ గిరియెత్తి వర్షజలఖిన్నాభీరగోరాజికిన్ శరణంబైన త్రిలోకరాజ్యమదముం జాలించి నిర్గర్వుఁడై సురభింగూడి బలారి వచ్చి కనియెన్ సొంపేది మత్తప్రజేశ్వరమద్గ్వానని రాకరిష్ణు గరుణావద్విష్ణు శ్రీకృష్ణునిన్॥క॥కని యింద్రుఁ డపుడు పూజించెను దినకరనిభ నిజకిరీటదీధితి చేత నిమ్మనిహ్వానలంకరణంబులు నుతతోద్ధరణములు నందసుతుచరణంబుల్॥వ॥ ఇట్లు నమస్కరించి కరకమలంబులు ముకుళించి హరికి హరిహయుం డిట్లనియె। సీ॥పరమనిధానంబు భాసురతత్త్వంబు శాంతంబు హతరజస్తమము నిత్య। మధిక తపోమయమట్లు గావున మాయనెగడెడి గుణములు నీకు లేవు। గుణహీనుఁడవు గాన గుణములవలనఁ బొడమిలోభాదికములు నీలోనఁ జేర వైనను ధర్మావనిగ్రహము శిష్టరక్షయుఁ దగిలి సేయఁగ దండధారి వగుము జగముభర్తవు గురుఁడవు జనకుఁడవును। జగదధీశులమనుమూఢజనులు వలకి నిచ్చ పుట్టిన రూపంబులీవు దాల్చి హితము సేయుము గాదె లోకేశ్వరేశ॥క॥నావంటి వెఱ్ఱివారిని శ్రీవల్లభ నీవు శాస్తి చేసితి వేనిన్ గావరము మాని పెద్దల త్రోవం జరియింతు రెందుబుద్ధితో మతినీశా॥క॥ ఒక్కొక్క కల్పము గాఁచుచు నెక్కుడు గర్వమున నే మెయి యాశులమనుచున్ జొక్కి నను బోటి వెఱ్ఱులు నిక్కము నీమహిమఁ దెలియ నేరరనంతా॥గీ॥వాసుదేవ కృష్ణ వరదస్వతంత్ర విజ్ఞానమయ మహాత్మ సర్వపుణ్య పురుష నిఖిలబీజభూతాత్మక బ్రహ్మ నీకు వందనంబు నిమస్కరింక॥శా॥నీ సామర్థ్య మెఱుంగ మేఘముల చే నిర్ఘోషముల్ భీషణో గ్రాసారంబున ముంచితి న్మఖము నాకై వల్లవుల్ సేయరం చోసర్వేశ భవన్మహత్త్వమున నా యుద్యోగమిట్లయ్యె నీ దాసున్ నన్నుఁ గృతాపరాధుఁ గరుణాదర్శింప వే మాధవా॥మ॥నిను బ్రహ్మేమ మెఱుంగలేరు జడతానిష్ఠుండ లోకత్రయావనమర్మానకరిష్ఠుఁ డన్విపులమర్యాదప్రభావిష్ఠుఁ డన్విన యత్యాగకనిష్ఠుఁ డన్గుజనగర్వశ్రేష్ఠుఁడ న్దేవ నీ ఘనలీలావిభవంబు పెంపుఁ దెలియంగా నెవ్వఁ డన్నర్వగా॥వ॥అనిన విని నగుచు జలధరగంభీరరవంబున శక్రునకుం జక్రి యిట్లనియె॥మ॥అమరాధీశ్వర లక్ష్మితోఁ దగిలి యిట్లంధుండవై యున్న నీ నమదోద్రేకము ద్రుంచి వైచుటకు నీ జన్నంబు దప్పించితి। నృపిమద శ్రీరతదండధారియగు నన్భావింపఁ డెవ్వాఁడు ని।

మోహనదీపమునఁగ। వింతనునుపు గల్గి వృత్తమై యరుణమై। కాంతితోఁ జకోరగణములు బ్బఁ। బొడుపుకొండచక్కిఁ బొడిచె రాకాచంద్ర। మండలంబు గగనమండలమున॥ వ॥ ఇట్లు పొడమిన నవకుంకుమాంకితరమాముఖమండలమండితంబై యఖండంబైన చంద్రమండలంబు పొడగని పుండరీకనయనుం డయ్యమునాతటంబున జగన్మోహనంబుగ నెక్క గీతంబుఁ బాడిన విని పరాయత్తచిత్తలై తత్తరంబున వ్రేతలు పనులకుం జేతులాడకయు, గోవులకుం గ్రేపుల విడువకయు, విడిచి విడిచి యీడకయు, నీడి యీడియు, నీడిన పాలు కాఁపకయుఁ, గాఁచి కాఁచియుఁ, గాఁగిన పాలు డించకయు, డించి డించియు, డించిన పాలు బాలురకుం బోయకయుఁ, బోసి పోసియుఁ, బతులకుఁ బరిచర్యలు సేయకయుఁ, జేసి చేసియు, నశనంబులు గుడువకయుఁ, గుడిచి కుడిచియుఁ, గుసుమంబులు ముడువకయు, ముడిచి ముడిచియుఁ, దొడవులు దొడఁగకయుఁ, దొడిగి తొడిగియు, గోష్ఠంబుల పట్టులనుండకయుఁ, బాయసంబు నెఱియ వండకయు, నయ్యెయ్యెడల నిలువంబడకయుఁ, గాటుకలు సూఁటి నిడకయుఁ, గురులు చక్క నొత్తకయుఁ, గుచంబుల గంధంబులు కలయ మెత్తకయుఁ, బయ్యెదలు విప్పి కప్పకయు, సఖులకుం జెప్పకయు, సహోదరులు మగలు మామలు నత్తలు బిడ్డలు నడ్డంబు చని నివారింపం దలారింపక సంచలించి, పంచభల్లుని భల్లంబుల మొల్లంపు జల్లుల పెల్లునం దల్లడిల్లి డిల్లపడి, మొగుల్లొగిమి వెలువడి యల్లసిల్లు తటిల్లతల పొంకున, మందగమనలు మందగమనంబుల మందలు వెలువడి గోవిందసందర్శనంబునకుం జని రప్పుడు॥ మ॥ తరుణుల్ గొందఱు మూలగేహములను ద్దండించి రారాక త। ద్విరహాగ్నిం బరితాపమొందుచు మనోవీథి న్విభు న్మాధవుం। బరిరంభంబులు సేసి జారుఁ డనుచు న్భావించి యుర్వి న్జొక్కి పొం। దిరి ముక్తిన్ గుణదేహముల్ విడిచి ప్రీతి న్బంధనిర్ముక్తలై॥ అనిన నరేంద్రుం డిట్లనియె॥ క॥ జారుఁడని కాని కృష్ణుఁడు। భూరిపరబ్రహ్మమని యు బుద్ధిఁ దలంప। న్నెరసుగుణమయ దేహము। లేరీతి న్విడిచి రింతు లెఱిఁగింపు శుకా॥ అనిన శుకుం డిట్లనియె॥ మ॥ మును నేఁ జెప్పితిఁ జక్రికిం బగతుఁడై మాఘుండు చైద్యుండు పెం। పునఁ గైవల్యపదంబు నొందెఁ బ్రియులై పొందంగ రాకున్నదే। యనఘుం డవ్యయుఁ డప్రమేయుఁ డగుణుం డైనట్టి గోవిందమూ। ర్తి నరశ్రేణికి ముక్తిదాయి నిసుమీ తెల్లంబు భూవల్లభా॥ గీ॥ బాంధవమున నైనఁ బగనైన వగ నైనఁ। బ్రీతి నైనఁ బ్రాణభీతి నైన। భక్తి నైన హరికిఁ బరతంత్రులై యుండు। జనులె మోక్షమునకుఁ జను మరధిప॥ వ॥ అటుగావునఁ బరమపురుషుండు, నజుండును, యోగీశ్వరేశ్వరుండైన హరిని సోఁకిన స్థావరంబైన ముక్తంబగు వెఱఁగుపడవలవ దివ్విధంబున॥ క॥ ఘనమధురగీతనినదము। విని వచ్చిన గోపికలను వీక్షించి నయం। బున మేటి సుగుణి నేర్పరి। తన వాగ్వైభవము మెఱయఁ దగ నిట్లనియెన్॥ ఉ॥ మేలా మీకు భయంబు పుట్టదు గదా మీ మందకు స్సింహశా। ర్దూలానేకపముఖ్యముల్ దిరిగెడి న్దూరంబు లేతెంతురే। యేలా వచ్చితిరీ నిశాసమయమం దిచ్చోట వర్తింతురే। చాలుఁ జాలులతాంగులార చనుఁడీ సంప్రీతితో మందకున్॥ చ॥ మీ రేతెంచిన జాడఁ గానక వగ స్మీతల్లులుం దండ్రులు। న్మీ రాముల్మఱఁదుల్తనూజులు గురుల్మీ సోదరుల్బంధువు। ల్మేరల్మీఱిరి లేరు పోయిరనుచు న్మీ ఘోషభూభాగమం। దేరీతిం బరికించి రోతగవు లేయీ సాహసోద్యోగముల్. చ॥ ఇలు వరిసున్నఁ జేసి హృదయేశుల సిగ్గులఁ జంపి యత్తమా। మల నెఱియించి సోదరుల మానము సూఱలు పుచ్చి తల్లిదండ్రుల రుచి మాన్చి బంధుల నరోఁత యొనర్చుచు జారవాంఛల। న్వలనఱి సత్కులాంగనలు వత్తురె లోకులు చూచి మెత్తురే॥ సీ॥ ప్రాణేశుఁ డెఱిఁగిఁ బ్రాణంబునకుఁ దెగు దండించు నెఱిఁగిన ధరణీవిభుఁడు। మామ యెఱింగిన మను వెల్లఁ జెడిపోవుఁ దలవరి యెఱిఁగినఁ దగులు సేయుఁ। దలిదండ్రు లెఱిఁగినఁ దల లెత్తుకుండుదు రేరా లెఱింగిన నెత్తిపొడుచు। నాత్మజు లెఱిఁగిన నాదరింపరు చూచి బంధువు లెఱిఁగిన బహిరమొనర్తు। రితరు లెఱిఁగి రేని నెంతయుఁ జులుకఁగాఁ। జూతు రింత నందు సుఖము లేదు। యశము లేమ నిర్భయానందమును లేదు। జారుఁ జేరఁ జనదు చారుముఖికి॥ క॥ నడువడి కొఱగాకున్నను। బడుగైనఁ గురూపి యైనఁ బామరుఁడైనన్। జడుఁడైన రోగి యైనను। విడుచుట మర్యాద గాదు విభు నంగనకున్॥ చ॥ ఇది యమునానదీజలసమేధితపాదపపల్లవప్రసూ। నదళవిరాజితంబగు వనంబు మనంబుల మేర దప్పెనో। పొదిగిట నేడ్చు బిడ్డలకుఁ బోయుఁడు పాలు విడుండు లేఁగల। న్మోదవులకు న్నిజేశ్వరుల ముద్దియలార భజింపుఁ డొప్పుగన్॥ చ॥ వనితలు నన్నుఁ గోరి యిటు వచ్చితి రింతఁ గొఱంత లేదు మే। లొనరె సమస్తజంతువులు నోలిఁ బ్రియంబులు గావె నాకునై। నను నిలువంగఁ బోలదు సనాతనధర్మము లాఁడువారికిం। బెనిమిటుల న్భజించుటలు పెద్దలు చెప్పుచునుందు రెల్లెడన్॥ క॥ ధ్యానాకర్ణనదర్శన। గానంబుల నా తలంపు గలిగినఁ జాలున్। బూనెదరు కృతార్థత్వము। మానవతుల్ చనుఁడు మఱి మందిరములకున్॥ అని పలికిన విని॥ సీ॥ విరహాగ్నిశిఖలలో వెడలు నిట్టూర్పులమున స్మరంబులఁ గంది మోము లెండఁ। గన్నుల వెడలెడి కజ్జలధారలకు చకుంకుమంబుల గ్రుచ్చి పాఱఁ। జెక్కులఁ జేర్చిన చేతుల వేఁడిమి మోము దమ్ముల మేలి మురుడింపఁ। బొరిపొరి పుంఖానుపుంఖంబులై తాఁకు మదనుకోలల ధైర్యమహిమ వెడల। దుఃఖభరమున మాటలు దొట్రుపడఁగఁ। బ్రియములాడని ప్రియుఁ జూచి బెగ్గడిల్లి। చరణములు నేల వ్రాయుచు సంభ్రమముల।

గాంతలెల్లను వగలనాక్రాంతలగుచు॥ ఇట్లనిరి॥ మ॥ అకటా నమ్మితిమేము క్రూరుఁడ ననిన్నర్థింబె మాయిండ్లలో। సకలవ్యా ప్తులడించి నీపదసరోజాతంబులన్వీక్షఁజే। కక నే లెంచితిమీశుఁడా ధ్యేయుఁడుము మీకాసక్తులం గాఁచుపో। లికఁ గావందగుఁ గావవే విడువమే లేకాంతలన్నాఁగింతలర్॥ మ॥ పతులన్బిడ్డలబంధులన్సతులమన్నాటించు శ్రీధర్మప। ద్ధతినీవంటివి దేహధారిణులకున్ధర్మజ్ఞ చింతింపుమా। పతిపుత్రాదికనామమూర్తివగుచున్భాసిల్లు నీయందుఁ ద। త్పతిపుత్రాధికవాంఛలన్సలిపి సంభావించుటన్యాయమే॥ మత్తకోకిల॥ నీపయిన్రతిసేయుచుండురు నేర్పరుల్సతతప్రియో। ద్దీపకుండవుగాన నెవ్వఁగ దెచ్చు నాథసుతామలన్నాప నేటికి మన్మహాశలు చుట్టినీకడనుండఁగాఁ। బాపనేల మదీయతాపముఁ బాపఁబోలుఁ గృపానిధీ॥ సీ॥ నీపాదకమలంబు నెమ్మిడగ్గరఁగాని తరలి పోవంగఁ బాదములు రావు। నీకరాబ్జంబులు నెఱినంటి తివఁగాని తక్కనపనికి హస్తములు చొరవు। నీవాగమృతధారనిండఁ గ్రోలఁగఁగాని చెవులన్యభాషలఁ జేరివినవు। నీసుందరాకృతినియతిఁ జూడఁగఁగాని చూడవన్యంబులఁ జూడ్కికవలు నిన్నెకాని పలుకనేరవు మాజిహ్వ। లొల్లననుచుఁ బలుకనోడ వీవు। మామనంబులెల్ల మఱలించి దొంగిలి। తేమిసేయువారమింకఁ గృష్ణ॥ చ॥ సిరికిని దారవిహ్వములు సేయు భవచ్చరణారవిందము। ల్సరసిజనేత్ర మాతపము సంపదఁ జేరితి మెట్టకేలకున్మఱలఁగ లేము మా మగల మాటలనొల్లము పద్మగంధము। ల్మఱిగిన తేఁటులన్యకుసుమంబులచెంతలఁ జేరనేర్చునే॥ గీ॥ సవతు లేక నీవిశాలవక్షస్థలిఁ। దులసితోడఁ గూడఁ దోయజాక్షు। మనువు మనుచుఁ లక్ష్మిమానైన నీపాదకమలరజముఁ గోరుఁ గాదె కృష్ణ॥ ఉ॥ అర్తులుమాకులున్వగవ నాఁడికోడక నాథులున్నుగా। యర్థులఁ జేసియిల్వరుసలాఁడినో వఁగ నీ ముఖపద్మ్మల। న్మెత్తనమాటలన్మఱుఁడు మేలొక నియేఁచినవచ్చినారమే। పొత్తులనొల్లమోపురుష భూషణ దాస్యము లిచ్చి కావవే॥ మ॥ మనువల్చి కరెతొల్లి వల్లభులకున్మన్నించి తద్వల్లభు। ల్మగపంతంబు తలంప రేతగులముల్మాపాల నేపుట్టెనే। మగవారాడెడు మాటలేతగవునీమాటల్మనోజాగ్నిచేఁ। బొగలం జాలము కౌఁగిలింపు ముము ముంబుయ్యంబు పుణ్యాత్మకా॥ ఉ॥ కుండలదీప్తగండమున కుంచితకుంతలఫాలమున్సుధా। మండితపల్లవాధరము మంజులహాసవిలోకనంబునై। యుండెడు నీముఖంబుగనియుండఁగవచ్చునె నున్మథేక్షుకో। దండపిముక్తబాణముల దాసులమయ్యెద మాదరింపవే॥ సీ॥ నీయధరామృతనిర్ఝరంబులు నేఁడు చేరి వాతెఱల పైఁ జిలుకకున్న। నీపిశాలాంచితనిర్మలవక్షంబు కుచపట్టములంబులఁ గూర్పకున్న। నీరమ్యతరహస్తనీరజాతంబులు దికురబంధంబులఁ జేర్పకున్న। నీకృపాలోకననివహంబు మెల్లన నెమ్మొగంబుల మీఁద నెఱపకున్న। నీనవీనమాననీయసల్లాపంబు। కర్ణరంధ్రదిశలఁ గప్పకున్న। నెట్లు బ్రతుకువార మెందుఁ జేరెడు వార। మధిపవినఁగఁదగదె యీఁడు కుయులు॥ మ॥ భవదాలోకనహాసగీతజములై భాసిల్లు కామాగ్నులన్। భవదీయాధరపల్లవామృతము చేఁ బాపఁ దగున్బాపవే। నివిమోగానలహేతిసంహతుల చే నీతైభవచ్చింతల। న్భవదంఘ్రిద్వయపీధిఁ బొందెదము నీపాదంబులానప్రియా॥ క॥ తరువులు ఖగగోగణములు। కరమొప్పెడు నిన్నుఁ గన్నఁ గానము విన్నన్। గరగి పులకించు నబలలు। కరగరెనినుఁ గన్న నీమగానము విన్నన్॥ సీ॥ ఈపంచబాణాగ్ని నేమిటనార్తుము నీమంజువాక్యవృష్టి నెగడదేని। నీమన్మథాంభోధినేత్రోవగడఁగుము నీదృష్టినావయై నిలువదేని। నీచిత్తజధ్వాంత మేజాడఁ జెఱుతుము నీహాసచంద్రిక నిగుడదేని। నీదర్పకజ్వరమే భంగినడఁతుము నీనవాధరసుధనింపవేని। నెట్లు నిర్వహింతు మేలాగు మాలాగు। కరుణసేయవేని గదియవేని। మరుఁడు నిర్దయుండు మననిచ్చునే యశో। దాకుమార యువతి ధైర్యచోర॥ క॥ అమరులఁ గాచిన హరి క్రియఁ। గమలేక్షణ నీవు నేఁడు కరుణ నభయహ। స్తము మాయురములశిరములఁ। బ్రమదంబున నిడుము మూర్ఛపాల్పడ సుందర్॥ క॥ కట్టా తలఁపునుకలునై ద్రట్టపు విరహాగ్నిశిఖలు తరుణుల నేఁప। న్నెట్టుం బలుకవు చూడవు। కట్టడవి గదా కుమారక కరుణోదారా॥ వ॥ అనియిట్లు కుసుమశరుని శరపరంపరాపరవశలై యోపికలు లేక పలికిన గోపికల దీనాలాపంబులు వినినవ్వి యోగీశ్వరేశ్వరుండై న కృష్ణుండాత్మారాముండై వారల నోరమించె నప్పుడు॥ మ॥ కరుణాలోకములం బటాంచలకచాకర్షంబులన్మేఖలా। కరబాహుస్తనమర్శనంబులనఖాంకవ్యాప్తులన్నర్మవా। క్పరిరంభంబులమంజులాధరసుధాపానంబులన్గాంతలన్। గరగించెన్రతికేళిఁ గృష్ణుఁడు కృపన్గందర్పుఁ బాలార్చుచున్॥ క॥ మక్కువవికసితవదనలు। చక్కఁగఁ గనుఁగొల్వ హాసచంద్రికతోడ। న్మిక్కిలి మెఱసెను గృష్ణుఁడు। చుక్కలగమి నడిమి పూర్ణ సోముని భంగిన్॥ గీ॥ సతులు కన్నుఁ బాడ సంప్రీతి నాడుచు। నలుత నున్న వైజయంతితోడ। వనజలోచనుండు వనభూషణుండయ్యె। యువతిజనశతంబులోలిఁ గొలువ॥ ఉ॥ దిక్కకనీశుఁడై యెదిరిఁ జిక్కులఁ బెట్టెడి మాయలానికిన్। జిక్కి కృతార్థలై మఱునిదిక్కులఁ జొక్కలఁ తాంగులుండఁగా। మక్కువశాంతి సేయుటకు మన్ననఁ జేసి ప్రసన్నుఁ డౌటకున్। జక్కననావిభుండు గుణశాలి తిరోహితుఁ డయ్యెనయ్యెడన్॥ వ॥ ఇట్లు హరికనుమొఱంగి చనినఁ గరిం గానక తిరుగుకరేణుల పెల్లునమల్లంబులు వల్లడిల్లవల్లవ కాంతలు

తదీయగమనహాసవిలాసవీక్షణవిహారవచనరచనానురాగంబులం జిత్తంబులు గోల్పడి వివిధచేష్టలకుం బాల్పడి తదాత్మకత్వంబున నేన నేన కృష్ణుండ నని కృష్ణగుణావేశంబులం జరియించుచు॥ క॥ భూతములలోన వెలిఁ బ్ర। ఖ్యాతుండగు నట్టివానిఁ గాంతలు కాళిందీతీరవనాంతరముల। భ్రాంతి న్వెదకంగఁ జనిరి పాడుచు నధిపా॥ సీ॥ పున్నాగ కానవే పున్నాగవందితుఁ దిలకంబ కానవే తిలకనిటలు। ఘనసార కానవే ఘనసారశోభితు బంధూక కానవే బంధుమిత్రు। మన్మథ కానవే మన్మథాకారుని వంశంబ కానవే వంశధరునిఁ। జందన కానవే చందనశీతలుఁ గుందంబ కానవే కుందరదను। నింద్రభూజము కానవే యింద్రవిభవుఁ। గువలవృక్షము కానవే కువలయేశుఁ। బ్రియకపాదప కానవే ప్రియవిహారు। ననుచుఁ గృష్ణుని వెదకి రయ్యబ్జముఖులు॥ మఱియును॥ ఉ॥ నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు కృపారసంబు పైఁ। జల్లెడువాఁడు మాలిపరిసర్పితపింఛమువాఁడు నవ్వురాజిల్లెడు మోమువాఁ డొకఁడు చెల్వలమానధనంబుఁ దెచ్చెనో। మల్లియలార మీపొదలమాటున లేఁడు గదమ్మ చెప్పరే॥ ఉ॥ అంగజునైనఁ జూడ హృదయంగముఁడై కరగించువాఁడు శ్రీ। రంగపరంబువాఁడు మధురంబగు వేణురవంబువాఁడు మమ్మంగజుపువ్వుదూఁపులకు నగ్గము చేసె లవంగలుంగనా। రంగములార మీకడకు రాఁడు గదా కృపనుంచి చూడరే॥ సీ॥ మానినీమన్మథు మాధవుఁ గానరే సలిలతోదారవత్సకములార। సలలితోదారవత్సకవైరిఁ గానరే సుందరోన్నతలతార్జునములార। సుందరోన్నతలతార్జునభంజుఁ గానరే ఘనతరలసదశోకంబులార। ఘనతరలసదశోకసుస్ఫూర్తిఁ గానరే నవ్యరుచిరకాంచనంబులార। నవ్యరుచిరకాంచనకిరీటుఁ గానరే। గహనపదవిఁ గురువకంబులార। గహనపదవికురువకనివాసిఁ గానరే। గణికలార చారుగణికలార॥ సీ॥ అదె నందనందనుం డంతర్హితుండయ్యెఁ బాటలీతరులార పట్టరమ్మ। హేలావతులఁ గృష్ణ యేలపాసితి వని నవ్వులేయులతలార యడుగరమ్మ। వనజాక్షుఁడు చటికి వచ్చె డాఁగఁడు గదా చూతమంజరులార చూడరమ్మ। మానినీమదనుతో మా రాక యెఱిఁగింవి మాధవీలతలార మనుపరమ్మ। జాతిసతులఁ బాయనీశియెహరికని। జాతులార దిశలఁ జాటరమ్మ। కదళులార పోయి కదలిందిశిఖిపింఛజూటుఁ జెచ్చి కరుణఁ జూపరమ్మ॥ క॥ హరిచరణములకుఁ బ్రియనై। హరిని నుమన్నింపభ్రమసం జెదు తులసీ। హరినీ దెస రాఁడు గదా। హరిచొప్పెఱిఁగించి శుభమునందింపగదే॥ గీ॥ పొగడ కసువానిఁ గానరె పొగడలార। యీ డెఱుంగని విభుఁ జూపుఁడీ డెలార। మొల్లమగుకీర్తివాఁ డేడి మొల్లలార। శుకసంగదితుని జెప్పుఁడు కింశుకములార॥ క॥ తరుణీకుచకుంకుమయుత। హరికుందకదామగంధమడరెడి చూడ్కిఁ। హరిఁ గని నవగిదిఁ దనరెడి। హరిణీహరిఁ జూడఁ బుణ్యానుమ్యోడిఁ జెప్పుమా॥ క॥ కిటినై కోఁగిటఁ జేర్చెను। వటుఁడై నర్థిల్లి కొలిచె వడిఁ గృష్ణుండై। యిటుపదవిహ్నములిడెక్రిం। దటిబాముననేమి నోఁచితమ్మ ధరిత్రీ॥ వ॥ అని యున్మత్తచిత్తలై తదాత్మకత్వంబునఁ గృష్ణులీలల ననుకరించుచు. సీ॥ పూతనన్నై యొక్కతె పాలఁ ద్రావి చరింపంగ శౌరిన్నై యొకకాంత చన్నుగుడుచు। బాలుఁడై యొకభామ పాలకు నేడ్చుచో బండి నేనను లేమ బాఱఁ దన్ను। సుడిగాలి నని యొక్క సుందరి గొనిపోవ హరి నని వర్తించు నబ్జముఖియు। బకుఁడ నేనని యొక్క పడఁతి సంరంభింపఁ బద్మాక్షుఁడను కొమ్మ పరిభవించు। నెలమి రామకృష్ణులింతు లిద్దరుగాఁగ। గోపవత్సగణము కొందఱగుదు। లసురవైరి నను చు నబలయొక్కతె చీఱుఁ। బసుల ననెడి సతుల భరతముఖ్య॥ గీ॥ లోకమెల్లఁ గుక్షిలోపల నున్నట్టి। మాధవుండ నేను మా తవీవు। చూడుమనుచు నొక్క సుందరి యొకతెకు। ముఖముఁ దెఱచి చూపు ముఖ్యచరిత॥ క॥ వెన్నలు దొంగిలి తినిమొడి। వెన్నుఁడ నని యొకతె నడువ వేఱొక్కతె చే। సన్నలయశోదనంచును। గ్రన్ననఁ గుసుమములదండఁ గట్టును లేశా॥ క॥ కాళియఫణియివి వీరలు। కాళియఫణిసతులు మ్రొక్కఁ గడఁగిరి నేఁ గో। పాలకుమారుఁడ ననుచును। లీలాగతి నాడు నొక్క లేమ నరేంద్రా॥ క॥ తరుణులు గోపకులందఱు। హరిహాయుఁడిదె వాన సురిసె హరి నేనని భా। సుర చేలాంచల మొక్కతె। గిరి నెత్తెద ననుచు నెత్తుఁ గెంగేల నృపా॥ క॥ మీరలు గోపకులే నను। రారి నిదావాగ్ని వచ్చె నటు చూడకుఁడీ। వారించెద నని యొక్కతెఁ జేరి బయల్కబళనంబు సేయు నరేంద్రా॥ వ॥ ఇట్లు తన్మయత్వంబున గోపసుందరులు బృందావనంబునం గల తరుల తావుల హరి నడుగుచు నిరర్గళంబులై నవిపినమార్గంబుల సరోజాతకేతనకులిశాంకుశాదిలక్షణలక్షితంబులై మనోహరంబులయిన హరిచరణంబుల చొప్పుఁ గని తప్పక చెప్పికొనుచుఁ దమలో నిట్లనిరి॥ సీ॥ కొమ్మకుఁ బువ్వులు గోసినాఁ డిక్కడ మోసి పాదాగ్రంబు మోపినాఁడు। సతి నెత్తికొని వేడ్క జరిగినాఁ డిక్కడఁ దృణములోఁ దోఁపమ తెఱవజాడ। ప్రియకు ధమ్మిల్లంబు పెట్టినాఁ డిక్కడఁ గూర్చున్నచొప్పిదె కొమరుమిగులు। నింతికిఁ గెమ్మోవి నిచ్చినాఁ డిక్కడ వెలఁది నిక్కి నగతివిశదమయ్యె సుదతితోడ నీరుఁ జొచ్చినాఁ డిక్కడఁ। జొచ్చి తా వెడలిన చోటులవు రెఁ। దరుణిఁ గాను కేళిఁ దనిపినాఁ డిక్కడ। ననఁగి పెనఁగియున్నయంద మొప్పె॥ మఱియును॥ సీ॥ ఒకయెలనాగ చెయ్యూఁదినాఁ డిక్కడ సరసనున్నవి నాల్గు చరణములును। నొకనీలవేణితో నొదిగినాఁ డిక్కడను గజాడలోని దెమగువజాడ। యొకలేమ మ్రొక్కఁ గనొడివినాఁ డిక్కడ రమణి మ్రొక్కినచొ

ప్పరమ్యమయ్యె। నొకయింతి కేమఱుగా నొలసినాఁడికఁ గడనన్యోన్యముఖములై యంఘ్రులొప్పె । నొకతె వెంటఁదగుల
నుండక నేఁగినాఁడమగుమీఁదఁదరుణీయడుగులమరె। నబలలిరు గెలంకులందు రాఁదిరిగినాఁ। డాఱుపదములున్నవమ్మయి
చట॥ సీ॥ ఈ చరణంబులే యిందుని భానన సనకాదిముని యోగసరణి నెప్పు। నీపాదతలములే యెలనాగ శ్రుతివధూసీమంత
వీథులఁ జెన్నుమిగులు। నీపదాబ్జంబులే యిభకులోత్తమ యానపాలేటి రాచూలిపట్టుకొమ్మ। లీసుందరాంఘ్రులే యిందీవ
రేక్షణముక్తికాంతామనోమోహనంబు। లీయడుగులరజమె యింతి బ్రహ్మ శౌరి। దివిజవరులు మౌళిదిశలఁ దాల్తు। రను
చుఁ గొండఱబలలజ్ఞాతులుఁ డేఁగిన। క్రమముఁ గనియు నతనిఁ గానరైరి॥ సీ॥ పతులదైన్యంబును భామలక్రౌర్యంబుఁ జూపుచు
విభుఁడొక్కసుదతితోడ। విహరింపనదియెల్ల వెలఁదుల వర్జించి నాయొద్దనున్నాఁడు నాథుఁడనుచు। గర్వించి రాజాలఁ గమ
లాక్షు మూఁపున నిడుకొనుమనుఁడు నయ్యీశ్వరుండు। మొఱఁగిపోయినఁ దాపమును బొంది యోకృష్ణ యెక్కడఁ జనితి ప్రా
ణేశ రమణ। నీకు వరవుడ నయ్యోదనిలువుమనుచు। వగవఁ గొండఱు కాంతలావనితఁ జూచి । వరుఁడు మన్నింపగర్వించి వనజనే
త్రి। చిక్కె నేఁడని వెఱఁగును జెందిరపుడు॥ మఱియును॥ సీ॥ ఈపొదరింటలో నిందాఁక కృష్ణుండు నాతోడ మన్మథనటనమా
డె। నియ్యాలమగుచోట నిందాఁక చెలువుండు గాఢంబుగా నన్నుఁ గౌఁగిలించె। నీమహీజము నీడ నిందాఁక సుభగుండు చిట్ట
ట్టుసేఁతల సిగ్గుఁ గొనియె। నీపుష్పలతపొంత నిందాఁక దయితుండు ననుడాసి యధరపానంబు సేసె। నీప్రసూనవేది నిందాఁ
క రమణుండు। కుసుమదామములను గొప్పఁదీర్చె। ననుచుఁ గొండఱతివెలం బోజనయనుని। పూర్వలీలఁ దలఁచి పొగడిరధిప॥
మ॥ అనియిబ్భంగి లతాంగులందఱును బృందారణ్యమందీశ్వరు। న్వనజాక్షున్బరికించి కానక విభున్వర్ణించుచున్బాడుచు। న్మ
నముల్మోహలు చేష్టలున్ క్రియలు నమ్మానాథుపైఁ జేర్చి వే। చనిరయ్యామున సైకతాగ్రమునకున్ సంత్యక్తగేహేచ్ఛలై॥ చని

⇒ గోపికాగీతలప్రారంభము. ⇐

గోపికలు హరి నుద్దేశించి యిట్లనిరి॥ క॥ నీవు జనించినకతమున। నోవల్లభ లక్ష్మి నుందనొప్పెనధికమై। నీవెంటనె ప్రాణములిడి।
నీవారరసెదరు చూపు నీరూపంబుల్॥ క॥ శారదకమలోదరరుచి। చోరకమగు చూపువలన సుందర మమ్ము। న్గోరి వెలయాని
దాసుల। ధీరత నొప్పించుటిది వధించుట గాదే॥ గీ॥ విషజలంబువలన విషధర దానవువలనఁ గాలివలన వహ్నివలన। నున్నవా
నివలన నోగి మమ్ము రక్షించి। కుసుమశరుని బారిఁ గూల్పఁదగునె॥ ఉ॥ నీవు యశోదబిడ్డఁడవె నీరజనేత్ర సమస్తజంతుచే। తోవి
దితాత్మవీశుఁడవు తొల్లి విరించి దలంచి లోకర। క్షావిధమాచరింపుమని సన్నుతి సేయఁగ సత్కులంబున। న్భావలయంబుఁ
గావ నిటు పుట్టితి గాదె మనోహరాకృతీ॥ గీ॥ చరణసేవకులకు సంసారభయమును। బాపి శ్రీకరంబు పట్టుగలిగి। కామదా
యియైన కరసరోజంబు మా। మస్తకములను నిడుమనుపుమీశ॥ ఉ॥ గోవులవెంటఁ ద్రిమ్మరుచుఁ గొల్చినవారల పాపసంఘము।
ద్రోవఁగఁజాలి శ్రీసనరి దుష్టభుజంగఫణాలతాగ్రసం। భావితమైన నీచరణపద్మము చన్నులమీఁద మోపిత। ద్భావజపుష్ప
భల్లభవబాధ హరింపు వరింపు మాధవా॥ క॥ బుధరంజనియును సూక్తయు। మధురయునగు నీదు వాణి మఱిగించెను నీ। యధ
రామృతసంసేవన। విధినంగజతాపమెల్ల విడిపింపగదే॥ క॥ మగువలమెడ నీ క్రౌర్యము। తగునే నిజభక్తభీతిదమనుఁడవకటా।
తగదు భవద్దాసులకును। నగుమొగముం జూపి కావు నళినదళాక్షా॥ మ॥ ఘనలక్ష్మీయుతమై మహాశుభదమై కామాదివిధ్వం
సియై। సనకాదిస్తుతమై నిరంతరతపస్సంతప్తపున్నాగజీ। వనమై యొప్పెడు నీకథామృతము ద్రావంగల్గు నే భూరిదా। నని
రూఢత్వము లేని వారలకు మానారీమనోహారకా॥ క॥ నీనగవులు నీచూడ్కులు। నీనానావిహరణములు నీధ్యానంబు। ల్నీన
ర్మాలాపంబులు। మానసముల నాఁటి నేఁడు మగుడవు కృష్ణా॥ గీ॥ ఘోషభూమి వెడలి గోవుల మేపంగ । నీరజాభమైన నీపద
ములు। కసవు శిలలు దాఁకి కడు నొచ్చునోయని। కలఁగు మామనములు కమలనయన॥ ఉ॥ మాపటివేళ నీవు వనమధ్యము వెల్వ
డివచ్చి గోప్పక। ప్రాపితధూళిధూసరితభాసితకుంతలమై సరోరుహా। న్దీపితమైన నీ మొగము ధీరజనోత్తమ మాకు వే
డ్కతోఁ। జూపి మనంబులన్ మరునిఁ జూపుదుగాదె క్రమక్రమంబునన్॥ గీ॥ భక్తకామదంబు బ్రహ్మసేవితమిలా। మండనం
బు దుఃఖమర్దనంబు। భద్రకరమునైన భవదంఘ్రియుగము మా। యురములందు రమణ యునుపఁదగదె॥ గీ॥ సురతవర్ధనంబు శో
కాపహరణంబు। స్వనితవంశనాళసంగతంబు। నన్యరాగజయమునైన నీ మధురాధ। రామృతమునఁ దాపమార్పుమీశ॥ ఉ॥ నీ
వడవిం బగల్దిరుగ నీకుటిలాలకలాలితాస్యమి। చ్ఛావిధిఁ జూడకున్న నిమిషంబులు మాకు యుగంబులై చనుం। గావున రాత్రు
లైన నినుఁ గన్నుల నెప్పుడుఁ జూడకుండల। క్ష్మీవర రెప్పలడ్డముగఁ జేసెనిదేల విధాత క్రూరుఁడై॥ ఉ॥ అక్కటబంధులున్మగలు
నన్నలు దమ్ములుఁ బుత్రకాములు। న్నెక్కొని రాత్రిఁ బోకుఁడన నీమృదుగీతరవంబు వీనుల। న్వెక్కసమైన వచ్చితిమి వేగమె
మోహమునొంది నాథ నీ। వెక్కడ నోయి తోయజగమీక్రియ నిర్దయుఁడెందుఁ గల్గునే॥ గీ॥ మదనుఁడార్వంగ నీ వాఁడు

నుంతనములు। నవరసాలోకనంబగునను మొగంబు। కమలకిరవైన మహితవక్షస్థలంబు। మానసంబులలోఁ గొని మఱపెఁ గృష్ణ॥ మ॥ అరవిందంబులకంటెఁ గోమలములై యందంబులై యున్ననీ। చరణంబుల్ కఠినంబులై మొనయు మాచన్నుంగవన్మోవఁగా। నెరియం బోలునటంచుఁ బొక్కుదుము నయ్యో కర్కశారణ్యభూ। పరిసంచారము కృష్ణ నీప్రియలకుం బ్రాణవ్యథం జేయదే॥ క॥ కట్టా మన్మథుకోలలు। నెట్టన నోనాఁట వెగడి నీ పాదంబుల్ పట్టికొనఁగ వచ్చిన సఖుమ। నెట్టడపనిడించి పోవనాయమె కృష్ణా॥ క॥ హృదయేశ్వర మా హృదయము। మృదుతరముగఁ జేసి తొల్లి మిక్కిలి కడు నీ। హృదయము కఠినము చేసెను। మదీయ సౌభాగ్య మెట్టి మందము గలదే॥ ఉ॥ క్రమ్మిన శౌచరుల్సురసికాయములన్ విడిఁ దాఁకి పీఁకవా। లమ్ముల తెట్టెముల్ వొలుపనద్దము వచ్చి జయింతువంత్రని। నమ్మిన ముగ్ధల న్విహితనాథల నక్కట నేఁడు రెంతుమూఁ। డమ్ముల యేటు కాఁడెగువనష్టము రాఁదగ దే కృపానిధీ॥ క॥ తియ్యవిలుకాఁడు డీకొని। వ్రయ్యలుగా నాఱనేసె వనితల మనము। ల్నియ్యాన యింకనైనం। గుయ్యాలింపంగదయ్య గోవిందహరీ॥ మ॥ అని యిట్లంగన లంచితస్వరముతో నంకించుచు న్వాపుచు। న్దనురా వేయని చీఱియే డువజగత్త్రాణుండునై త్రైలోక్యమోహనుఁడై మన్మథమన్మథుండయి మనోజ్ఞాకారియై యంతట। న్ఘనపీతాంబరధారియై పొడమెం బల్లవకాంతాసన్నిధానంబునన్॥ క॥ వచ్చిన వల్లభుఁ గనుఁగొని। విచ్చెసెనటంచు సఖులు వికసితముఖలై। యచ్చుగ నిల్చిరి ప్రాణము। వచ్చిన నిలుచుండు నవయవంబుల భంగిన్॥ సీ॥ అబల యొక్కతె భక్తి నంజలిగావించి ప్రాణేశు కెంగేలుఁ బట్టికొనియె। నింతి యొక్కతె జేపి తేశ్వరు బాహువు మూపున నిడికొని ముదము నొందె। వనిత యొక్కతె తన వల్లభు తాంబూలచర్వితమాత్మహస్తమునఁ దాల్చెఁ। బడఁతి యొక్కతె ప్రియుపదములు విరహాగ్నితప్తకుచంబుల దాఁపుకొనియె। భామ యొక్కతె భ్రూకుటిబంధంబుఁ గావించి। ప్రణయభంగకోపభాషణమున। దష్టదశనయగుచు దండించు కైవడి। వాఁడిచూడ్కి గములవరునిఁ జూచె॥ క॥ హరిముఖకమలముఁ జూచుచుఁ। దరుణి యొకతె రెప్పలిడక తనియక యుండెన్। హరిపదకమలముఁ జూచుచు। మఱిగి తనివి లేని సుజనుమాడ్కి నరేంద్రా॥ ఉ॥ ఒక్కలతాంగి మాధవుని యుజ్జ్వలరూపము చూడ్కి లీఁ గెలం। జిక్కఁగఁ బట్టి హృద్గతముఁ జేసి వెలింజనకుండ నేత్రముల్। గ్రక్కున మూసి మేనఁ బులకంబులు గ్రమ్మఁగఁ గౌఁగిలించుచు। న్జొక్కములైనలోచవులఁ జొక్కుచునుండెను యోగికైవడిన్॥ సీ॥ ఎలయించి ప్రాణేశ యెందుఁ బోయితి వని తోరంపుటలుకతో దూఱు నొకతె। జలజాక్ష నను బాసి చనఁగ నీ పాదంబు లెట్లాడె నని వగ నెంచు నొకతె। నాథ నీ వఱిగిన నా ప్రాణమున్నది కూర్మియే యిది యని కుందె నొకతె। యీశ్వర ననుఁ బిన్ననిందాఁక పాపెనే పాపపు విధియని పలుకు నొకతె। తలఁగిపోవునట్టి తప్పేమి చేసితి నాథ పలుకుమన్న నియె నొకతె। యేమి నోముఫలమొ హృదయేశ నీ మోము। మఱల గంటి ననుచు మసలె నొకతె॥ క॥ పలికిన ప్రతిఁ జెప్పెడి। బలికించిన గాని రమణుఁ బలుకఁ డటంచు। న్గలకంఠి యొకతె చెలితోఁ। బలుకుల నవ్వుచు నురియు పలుకులు వలికెన్॥ క॥ పట్టినఁ గాని మనోవిభుఁ। బట్టఁగదా యంచు నొక్క బాలిక సఖిచేఁ। బట్టుకొని చెప్పె ధైర్యము। పట్టెల్లను మరుని దెంకి పట్టుగ నధిపా॥ క॥ చెలువుఁడు చెప్పక పోయిన। సొలపున నొక ముగ్ధ మున్ను మూఁడనను చునౌ। దలవంచి యుండెఁ జాలక। తలమొత్తెను లోన మరుఁడు తలయెత్తె నృపా॥ ఇవ్విధంబున॥ క॥ హరి సురుచిరలలితాకృతిఁ। దరుణులు గని ముక్తవిరహతాపజ్వరలై। పరమోత్సవంబు సలిపిరి। పరమేశ్వరుఁ గని నముక్తబంధులభంగిన్॥ వ॥ అంతఁ బ్రశాంతుండును కాంతాజనపరిక్రాంతుండునైన నాంతరంబున శక్తినికరసంయుక్తుండైన పరమపురుషుండును బోలె వారలం దోడ్కొని మందారకుందకుసుమపరిమళమిళితపవమాననమానితమధుకరనికరఝంకారసుకుమారంబును, శరత్కాలచంద్రకిరణసందోహసంఛిన్నాంధకారంబును, యమునాతరంగసంగతకోమలవాలుకాస్ఫారంబును నై యమలినంబైన పులినంబు ప్రవేశించె. వారును జ్ఞానకాండంబున నీశ్వరుం గని శ్రుతులు ప్రమోదంబునం గామానుబంధంబుల విడిచిన విధంబున హరిం గని విరహవేదనల విడిచి పరిపూర్ణమనోరథలై॥ క॥ పాఠీనవయన లెల్లన। కాఠిన్యపటాంచలములఁ గౌతుకములు హృ। త్పీఠముల సందడింపఁగఁ। బీఠముఁ గల్పించిరంతఁ బ్రియునకు నధిపా॥ గీ॥ పరమయోగిహృదయభద్రపీఠంబులు। నుండు మేటి వ్రజవధూత్తరీయ। పీఠమున వసించి పెంపారె త్రిభువన। దేవలక్ష్మి మేనఁ దేజరిల్ల॥ మ॥ మదనోద్దీపితుఁడైన నాథుని కిసన్మానంబు గావించుచు। న్మదితభ్రూసవిలోకవిభ్రమములన్ మోదించుచుం జేరి తత్పదముల్ హస్తతలంబులన్ బిసుకుచు న్పైముట్టుచున్ డాయుచు। న్మదుల్ యొల్లుచుఁ గూర్మి నిట్లనిరి యీ నవ్యోపదీప్తాస్యలై॥ క॥ కొలిచినఁ గొలుతురు కొందఱు। గొలుతురుఁ దముఁ గొలువకున్నఁ గొందఱు పతులం। గొలిచినను గొలువకున్నను। గొలువరు మఱికొంద ఱెలమి గోపకుమారా॥ వ॥ అని తన్నునుద్దేశించి రహస్యంబు గాఁ బల్కు నసుందరుల పలుకులు విని గోపాలసుందరుం డిట్లనియె॥ సీ॥ కొలిచినఁ గొలుతురు కొందఱు పశువుల భజనము భంగి నిష్ఫలము కొఱకు। నైసఖ్యధర్మములం మసిద్ధిం పవుకొందఱు తంత్రులగుణముఁ దాల్చి। దయఁ గలవారును దగిన సుహృత్తులు గొలువని వారలఁ గొల్తు రెపుడు। ధర్మకామంబు

లుతనరంగఁగొందఱుకొలువనివారినిఁగొలుచువారిఁ। గొలుచుతలఁపులేమిఁగొలువరాత్మారాము।లాప్తకాములజ్ఞులతిక
ఠినులు।వారియందుఁబిడపవానిఁగాఁజింతించి।గోలతాంగులారయిట్టులనుట॥క॥ఏనింతెవ్వఁడనైనను।గానంగనలారవక
ముకారుణికుండ।న్మానసబంధుఁడనిత్య।ధ్యానమునీకొనరవలసితలఁగితిసుండీ॥మ॥నను సేవించుచునున్నవారలకు నే నా
రూపముం జూపఁ జూ।చినఁ జాలించి మదించి వారు మదిన స్సేవింపరో యంచు ని। గ్ధనికుం డాత్మధనంబు చెడ్డ నెపుడున్ ధత్పారవ
శ్యంబు దా।ల్చినభంగి నన్నుఁ బాసి నుప్రియుండు దాఁ జింతించు నారూపము౯॥ తరల॥ తగవు ధర్మముఁ జూడ నొల్లక తల్లి
దండ్రులబంధుల।న్మగలబిడ్డలఁబాసివచ్చిననన్నినమ్మినభక్తలమిమ్మునేఁ। దగుముపాసితిఁ జెప్పనైనఁ పుడుఁ తద్వియోగభరంబున।
న్వగలఁబొందుచు మీరలాడినవాక్యములు వినుచుండితి౯॥ఉ॥పాయని గేహశృంఖలము పాసి నిరంతరసత్పరత్వము౯। జే
యుచునున్న మీకుఁ బ్రతి సేయ యుగంబులనైన నేరన౯। బాయకఁ గొల్చు మానసము ప్రత్యుపకారము గాఁదలంచినా।పా
యుటఁ దప్పుగాఁగొనక భామినులార కృపన్మనింపరే॥ క॥ చక్క గహరి యిటు పలికినఁ।జక్కని వాక్యములనతని సంగమమున

## ⟹ శ్రీ రాసక్రీడాభివర్ణనము. శ్రీ ⟸

లో। నిక్కానపియోగతాపము।లొక్కట నిడి విరిలతాంగులుర్వీనాథా॥ ఉ॥ అసహాయంబున విభుఁడనంతుఁడు కృష్ణుఁడు చి
త్రమూర్తియై।చేసెను మండలభ్రమణశీలపరస్పరబద్ధబాహు కాఁ। తాసువిలాసము౯ బహువిధస్ఫురితాననహస్తపాద
వి।న్యాసము రాసము౯ గృతవియచ్చరనేత్రనుపోపికాసము౯॥వ॥ ఇట్లు బహుగుణులందరుగ నేర్పరియను హరి, జగ్గించి
తనయిరుకెలంకుల నలంకృతలై, కళంకరహితచంద్రవదనలిద్దఱు ముద్దియలం గొని. వీణలం బ్రవీణలై సొంపు మెఱసి యిం
పుగ నాయించుచు, నానందలహరీనిధానంబగు గానంబు సేయ, నవిరళంబై నరిళంబుగాని వేణుకవళంబును, మురళంబుల
లం గేలనందుకొని, మధురంబగు నధరంబునం గదియించి మించి, కామినీజనకబరీకాసౌగంధికగంధబంధురకరాంగుళీకిసల
యంబులు, యతిలయంబులం గూడి. వివరంబుగ మురళీవివరంబుల సారించి పూరించుచు సరిలేని భంగిఁ త్రిభంగి నైకసులక
ద్ధికాకారంబున నమ్మనిలిచి మఱియు గోపసుందరులెందఱుందఱకునందఱు సుందరులకు నడిమెడలందాను నుదనర్కి నడిమె
డలసుందరులును, వేజరిల్లనృత్యవిద్యామహార్ణవవేలావలయవలయితంబై, విస్మితానందంబై న రాసమండలంబు కల్పిం
చి వేల్పులు హర్షంబునం గుసుమవర్షంబులు గురియనంబుఁ బ్రసూనమంజరీసహచరంబులై చంచరీకంబుల మించు ప్రకటిం
చు సువర్ణమణిమయ్యగంబులై నవహేమంత్రనీలంబుల చెఱంగు నెఱపుచుఁ, గరిణీవిహారబంధురంబులైన సింధురంబుల చెలు
వుఁ గైకొలుపుచుఁ, బల్లవితకుసుమితలతానుకూలంబులైన తమాలంబుల సొబగు నిగుడించుచు, మెఱుపుతీఁగెల మొత నెడఁబె
డంగడు నల్లమొగుళ్ల పెల్లు చూపుచుఁ, దరంగిణీసంగతంబులైన రోహణాచలశృంగంబుల బాగులగించుచు, జగన్మోహనుం
డై యుండి, గర్తకమలారుణంబులును, చంద్రకలనిర్మలనఖసంస్ఫురణంబులును, శ్రుతినితంబినీసీమంతపీఠకాలంకరణం
బులును, సనకసనందనాదియోగీంద్రమానసాభరణంబులును నైన, చరణంబులు గదియించి సమస్థితనంజవిపుటంబులం బు
ష్పంబులుల్లసిల్లఁ జల్లి సల్లలితసల ప్రశస్తంబులై సహస్తంబులు నల్లపీడనులకెంతంబులపైనిడిగి సానుసారంబుగ విచిత్ర
పాదసంచారంబులు సలుపుచు, వర్తులాకార రాసబంధంబుల నర్తనంబు నంబ్రవర్తించి, మెండియుఁ బ్రేలుంచానును, శం
ఖపద్మవజ్రకంముకచతుర్ముఖచక్రవాళచతుశ్చక్రసౌభద్రనాగసంద్యావర్తకుండలీకరణకుసుళీబంధప్రముఖంబులైన
విశేషరాసబంధంబులకుంజొక్క, యేకపాదసమపాదవినివర్తిత గతాగత వలితవైశాఖ మండల త్రిభంగి ప్రముఖం
బులైన స్థానకంబుల నిలుచుచుఁ, గనకకింకిణీమంజుల మంజీరసింజనంబులు, జగజ్జనకర్ణరంజనంబులై చెలంగ, ఘుటిత
మర్దితపార్శ్వగప్రముఖంబులైన పాదకర్మభేదంబులు సేయుచు, సమపాదశకటవదనమత్స్యక్రీప్రముఖంబులైన పా
ర్థివచారివిశేషంబులును, వపక్రాంతడోలాపాదసూచీప్రముఖంబులైన వ్యోమచారివిశేషంబులం జూపుచు, సురేంద్రశా
ఖిశాఖానుమనోహరంబులు, నవహసితదిక్కరీంద్రకరంబులును, త్రిలోకక్షేమంకరంబులును, నగుకరంబులందిరంబులగు
రత్నకటకంబుల మెఱుంగులు నింగి చెఱంగులం దలుచుకొన, నర్ధచంద్రకర్తరీముఖకపిత్థకటకాముఖశుకతుండలాంగూలప
ద్మకోశపతాకాప్రముఖంబులైన స్వస్వభావసూచకనానావిధకరభావంబులాచరించుచుఁ, గటినిబద్ధసువర్ణవర్ణచేలాం
చలప్రభానికరంబులు సుకరంబులై దిశాంగనాముఖంబులకు హరిద్రాలేపనముద్రాలంకారంబులొసంగుచు, నాస్కంది
తభ్రమరశకటాసనప్రముఖంబులైన భ్రమణమండలభేదంబులు, నలాతదండవాతలలితవిచిత్రప్రముఖంబులైన దైవ
మండలంబులొనర్చుచుఁ, గమనీయకంబుకంఠాభిరామంబులు, సుద్దామతేజస్తోమంబులునైన నీలమౌక్తికవజ్రవైదూర్య
దామంబులరుచులిందిరాసుందరీకిమందిరంబులై సుందరంబులయిన యురంబులందిరుగుడువడికలయంబడిన, గాంధార

నందముముందరసుందరులుసొచ్చి, పదప్రమాణంబు జానుదఘ్నంబు, కటిద్వయసంబు, మధ్యమాత్రంబు, కుచంబులబంటియై నిబిడకుచముంగుచనయననాభివివరకుంతలంబులు, చక్రవాకజలచరావర్తశైవాలంబులచందంబున, నందంబుగ నీరు పొందినయేటులని, కళిందనందనకరంబులుసాఁచి, పరిరంభంబులకునారంభించుకైవడి, నెఱయలజడిచెంది తోఁకుతరంగంబులకనులుకుచు, సారసంబులకుంగరంబులుసాఁచుచు, సురాళంబులంజోఁపుచుఁ, జెన్నుమిగిలినచన్నులయొత్తువత్తుకును నెపంబులతపంబులనీటఁగావించుమాడ్కి నిసంచరించుచక్రవాకంబులందోలుచు, నితాంతకాంతిసదనంబులగువదనంబులకునోడి వ్రీడంజెందికంపించుచందురుఁడుచలముడిగిజలమ్మునంబడికంపించుకరణి, నిజకరకలితజల ప్రతిఫలితుండైకదలుచంద్రునింగనిమెచ్చిసోలుచు, సలిలావగాహసమయసముచ్ఛలితవారిశీకరపరంపరలవలనఘనకరందపానమత్తమధుకరపక్షవిక్షేపణసంజాతవాతసముద్ధూతకుముదాదిపరాగపటలంబులంజేరుచు, మోముదమ్ములకమ్మనిగంధంబులకుమూఁగిరఝుమ్మరనుతుమ్మెదలకువెఱచుచుఁ, గరంబులనీరెగయంజల్లుచు, నీలనీరదనిపతితపయోబిందుసందోహంబులందడియుపువ్వుఁదీవియలబాగునఁగృష్ణుకరద్వయంబునంబెట్టుతోయంబులందడియుచుఁ, గ్రంతకొనినుడియుచనససబాణునిపులుగడిగినకుసుమబాణంబులపగిదిమేనులుమెఱయసలిలావగాహనపరాయత్తచిత్తలగుచు, మొత్తంబులైసరసభాషణంబులం ద్రుళ్లుచు, బాహులనీరునించుచు, హరిమీఁదఁజల్లుచుఁ, జల్లునెడందడపడఁదాఁటుచు, దాఁటిచనకనిలువరించుచు వినోదింపంగ రేణుకరవికీర్ణసీరధారాభిషిక్తంబగుశుండాలంబులీలనాభీరకామినీకరసముత్క్షిప్తజలాసారంబులందోఁగుచు, వ్రజవధూజనహస్తప్రయుక్తకల్హారకైరవపరాగపటలంబువలనభూతిభూషణుసిరివహించుచు, గోపికాజనపాణికిసలయసమున్ముక్తకమలదళంబులవలనసహస్రనయనునిరూపుఁజూపుచు, గోపాలబాలికాకుచకలశకుంకుమపంకంబువలనఁ బ్రభాతభానునిభంగిభాసిల్లుచు, ఘోషయోషాకటాక్షవిక్షేపణంబులవలనమధుపపరివృతహరిచందనసౌందర్యంబునొందుచు, వల్లవీహాసరుచులవలనఁజంద్రికాప్రభాభాసితనీలశైలంబుక్రియనమరెనంత॥ చ॥ సతులుం దానునునీటిలో వెడలి భూషాగంధచేలాఢ్యులై। కృతుఁడై కుంభికరేణుయూథములతోఁ గ్రీడించుచాడ్పునఁ। స్థలమందుం దరులందుఁ బుష్పమయలీలాశయ్యాలందున్ సుఖో। న్నతుఁడై కృష్ణుఁడు క్రీడలొందెనపెనా నారీలలామంబులన్॥ వ॥ ఇట్లు శరత్కాలంబున వెన్నుఁడింద్రియస్ఖలనంబు సేయక గోపికలతోడ రమించెనని చెప్పిన మునివరునకు భూవరుండిట్లనియె॥ మత్తకోకిల॥ ధర్మకర్తయు ధర్మభర్తయు ధర్మమూర్తియునైనస। త్కర్ముఁడీశుఁడు ధర్మశిక్షయు ధర్మరక్షయు సేయఁగా। నర్మిలిన్ ధరఁ బుట్టి పరాంగనాజనసంగమే। ధర్మమంచుఁ దలంచి చేసెను దాత్తమానస చెప్పుమా॥ అనిన శుకుండిట్లనియె॥ గీ॥ సర్వభక్షుఁడగ్ని సర్వంబు భక్షించి। దోషిగాని పగిది దోషమైనఁ। జేసి దోషపదముఁ జెందరు తేజస్వు। లగుట చంద్రవాసవాదులధిప॥ క॥ ఈశ్వరుఁడుగానివాఁడున। రీశ్వరపరకాంతఁదలఁచియెట్లుబ్రతుకుగొ। రీశ్వరుఁడు దక్కనన్యుఁడు। విశ్వభయదవిషము మ్రింగి వెలయంగలఁడే॥ క॥ సత్యము ప్రభువుల వచనము। నిత్యము తద్వచనవిధిని నిలుతురు పెద్దల్। సత్యాసత్యము గావున। సత్యముసుచుఁజనరువారిచరితమునున్నృపా॥ శా॥ ఘనులై యెవ్వని పాదపంకజపరాగధ్యానసంప్రాప్తయో। గనిరూఢత్వము జేసి నిర్మలు మహాకర్మంబులం బాసి బం। ధనిరోధంబులు లేక విచ్చలవిడిం దర్పింతురాసిత్యశో। భనుఁడెట్లుండిననుండెఁగాక కలవే బంధంబులుర్వీశ్వరా॥ గీ॥ గోపజనములందు గోపికలందును। సకలజంతులందు సంచరించు। నాతఁడాత్మనకుఁ బరాంగనలెవ్వరు। సర్వమం డు లీలసలిపెఁగాక॥ వ॥ అని చెప్పి శుకుండిట్లనియెనంత బ్రాహ్మ్యముహూర్తంబునం గృష్ణుపీడ్కొని గోపికలిచ్ఛలేక య ండ్లకడకేఁగినం గృష్ణమాయామోహితులై గోపకులు వారలం గోపింపనేరరైరి। ఇంద్రవజ్రము॥ గోపాలకృష్ణుం డను గోపకాంతల్। ప్రాపించి క్రీడించిన భంగులెల్లన్। రూపించి వర్ణించినరుండు హృత్సం। తాపంబులన్బాయును ద

## ◆ సర్పరూపియగు సుదర్శనుండను గంధర్వుని శాపవిమోచనము. ◆

త్ప్రిపట్టిన్॥ వ॥ అంతనొక్కనాఁడు నందాదులైన గోపకులంబికావనంబునకు శకటంబులెక్కి జాతరకుం జని సరస్వతీనదీజలంబుల స్నానంబులు సేసి యుమామహేశ్వరుల నర్చించి కానుకలిచ్చి బ్రాహ్మణులకు గోహిరణ్యవస్త్రాన్నదానంబులొసంగి జలప్రాశనంబు సేసి నియమంబున నుండ దైవయోగంబున నాఁకొని యొక్క మహోరగంబు నిద్రవోయిన నందునిం గఱచి మ్రింగఁగ నగ్గలింప నతండు కృష్ణకృష్ణ యని వచనంబులం దన్ను విడిపింపుమని మొఱయిడిన విని॥ క॥ గోపకులందఱు మేల్కాంచి కోపముతోఁ బెద్దగుదెలఁ గొఱవుల మొత్తన్। దాపమునొందియు వదలక। పాపపుఁ బెనుబాము నందుఁ జుట్టెన్ నృపాలా॥ వ॥ అయ్యవసరంబునఁ గృష్ణుండు దర్పించి పాదతాడనంబు సేసి త్రొక్కిన సర్పంబు సర్పరూపంబు విడిచి విద్యాధరేంద్రరూపంబుఁ దాల్చి హరికి మ్రొక్కి నన తనికి హరి యిట్లనియె॥ ఉ॥ మండితమూర్తితోఁ గనకమాలికతోఁ శుభలక్షణుండవై। యుం

జెసునీకు మ్రొక్కెదము హొయ్యారగ దేహమి దేల వచ్చె నెవ్వండవు నామ మెయ్యది భవంబున కెద్ది మిషంబు నాకు నిం । పొండ
మెఱుంగఁ జెప్పుము బుధోత్తమ నీ పని హోద్యమ మెయ్యెడిన్॥ వ॥ అనిన వాఁడిట్లనియె, దేవా నేను సుదర్శనుండను విద్యాధరుండ
విమానారూఢుండనై రూపసంపద్గర్వంబులం జొక్కి దిక్కులం జరించుచు, నొక్కయెడ నాంగిరసులైన ఋషులం గురూ
పులైన వారలం గని నగిన, వారు నీవు రూపదర్పంబున నవ్వితివి గావున, మహాసర్పంబవై యుండుమని శపించిన, విదప
నే వేఁడుకొనిన నిట్లనిరి॥ చ॥ యదుకులమందు భక్తుల భయంబు హరించుటకుం జనార్దనుం । డుదయము నొందియా యదవిక్కొ
క్క దినంబున రాఁగలండు తత్పదమున నీవు దన్నఁబడి పన్నగదేహముతోడఁ బాసి నీ । మొదలిటి మేనుఁ గాంచెదవు మూఢుఁ
డ హాస్యమని రాదయాసిధుల్॥ మ॥ వినఁ జింతించిన విన్నఁ జేసికొనినన్ నిర్మ్మలమై ప్రస్సిపా । పరికాయంబు వినష్టమానఁటభవ
త్పాదంబు నామీఁదఁ బెట్టినఁ దద్బ్రహ్మణశాపసంజనిత కౌటిల్యంబు దూఁల్చె నే । వనజాతేక్షణ నేఁడు నాసెను నగత్వంబె
ల్ల నేఁ బోయెదన్॥ వ॥ అని విన్నవించి హరికిఁ బ్రదక్షిణంబు వచ్చి మ్రొక్కి సుదర్శనుండు దివంబునకుం జనియె సర్పంబువలన
నందుండు విముక్తుండయ్యెఁ దత్ప్రకారంబు విని వెఱఁగుపడి గోపకులు దేవతానుహోత్సవంబు సమాప్తిఁ బొందించి కృష్ణకీ

⟹ శ్రీ కుబేరభటుండగు శంఖచూడుండను గుహ్యకుని సంహరించుట. శ్రీ ⟸

ర్తనంబు సేయుచుఁ బురంబునకుం జనిరంత॥ చ॥ మఱియొక నాఁటి రాత్రి బలమాధవు లుజ్జ్వలవస్త్రమాలికా గంధములును లే
పనాభరణధారులై చని మల్లికాదిపుష్పరసనిమగ్నమైన మధుపంబుల గీతము వించుఁ దవ్వనాంతరమున వెన్నెలఁ బ్ర
జనితంబినులుం దగఁ బాడిరింపుగన్॥ క॥ ఆపాట చెవులసోఁకిన । నేపాటియు దేహలతల నెఱుఁగక దృగ్వా । చాపాటవములు
చెడిపడి । రాపాటలగంధు లెల్ల నటవీవీధిన్॥ వ॥ ఇట్లు సకలభూతసమ్మోహనంబగు గానంబు సేయుచు నిచ్ఛావర్తనంబులం
బ్రమత్తుల చందంబున రామకృష్ణులు క్రీడింపఁ గుబేరభటుండు శంఖచూడుండను వాఁడు రామకృష్ణరక్షితలగు గోపికలం గ
నయోగబలంబునను త్తరపు దిక్కునకుం గొనిపోవ నయ్యొప్పులజ్జనంబులు రామకృష్ణసంభాషణంబులు వలుకుమనుఁ బులికి నగ
పడిన మొదవుల క్రియ మొఱయిడిన విని॥ ఉ॥ క్రుద్ధనసాలవృక్షములై కొని బల్లిదులన్నదమ్ములా । యుద్ధరు కాంతప్పుత్త్ర్యావృ
లయేపున వేచని యోడకుండుడో । ముద్దియలార యంచుఁ దనుమట్టినఁ జూచి కలంగి గుహ్యకుం । డుద్దపిడిం దగం బఱచెను త్త
రమింతులడించి భీతుఁడై॥ వ॥ ఇట్లు గుహ్యకుని చేతఁ పడివడిన గోపికల రక్షించుకొని యుండుమని బలభద్రునిం బలికి॥ శా॥ ఓరీ
గుహ్యక పోకు పోకుమని రోషోద్రేకంబ కారాతి వాఁ । డే రూపంబున నెందుఁ బోవ్వెనటఁ బోయెం దోడఁ దా నేఁగి దు । ర్వారోదం
చితముష్టి వాని తలఁ ద్రెవ్వం బట్టిగ ద్వీరుకోటీర భ్రాజితరత్నముం గొనియె దండి గోపికల్ స్రుక్కన్॥ వ॥ ఇట్లు శంఖచూడునిం
జంపి వాని శిరోరత్నంబుఁ దెచ్చి బలభద్రునకిచ్చి మెప్పించె మఱియు నొక్క దినంబున గృష్ణుండు వనంబునకుం జనిన నతని లీ
లలు వాడుచు నిక్కడ దద్విరహవేదనానలభరంబు సహింపక గోపికలు తమలో నిట్లనిరి॥ శా॥ భ్రూభంగ్యోపముతోడ దాప
రిభుజంబున్ జెక్కుఁ గీలించి కెం । మ్మోవి న్వేణువుఁ గూర్చి సుస్వరముగా మ్రోయించుచున్నంగుళీ । ప్రాపిణ్యంబు విభుండు
సూపఁగ సస్ప్రాణేశలై యుండియు । న్నీవీబంధము లూడఁ జొక్కి సురయోషల్ సంగిన్నిలింపాంగనల్॥ క॥ నవమాధుర్యము గ
ల్గు కృష్ణు మురళీనాదామృతస్యందము । ల్చెవులన్ జొచ్చి హృదంతరాశముల భాసిల్లన్ సుఖస్ఫంబులై । యుపిజా మేఖులకుం
దొఱంగి వృగగోయూథంబు లుత్కంఠతో । విపికింగంతము లెత్తి లోవసలుఁ బో దేహేంద్రియవ్యాప్తులన్॥ శా॥ ఓకంజేక్షణ
కృష్ణుఁ డుజ్జ్వలితహారోద్దాముఁడై గానపి । ద్యాకౌతూహలతన్మనోజ్ఞమురళీధ్వానంబు గావింపఁగా । నాకర్ణించి వినష్టంపమై
మొఱయు నీలాభ్రంబుగాఁ జూచుచున్ । గేకారావము లుజ్జ్వలించు మయూరీయుగ్భోగి కేకీంద్రసంఘాతముల్॥ మ॥ లలనా యేటికిఁ
దెల్లవారెరవి యేలా దోఁచెఁ బూర్వాద్రిపైఁ । గలకాలంబు నహంబు గాకిసిశిగా గల్పింపఁడా బ్రహ్మ హా । వలతేఁడు న్నృప
లేఁడు కీరములు మర్వారంబు లెల్లోగ దే । కల దేమా పటి కాలమందు మనకుంగఁ జాతుసంభోగముల్॥ ఉ॥ ఎప్పుడు ప్రొద్దు
క్రుంకు హరి యెప్పుడు గోవుల మేపి వచ్చు మా । కెప్పుడు తన్ముఖాంబుజసమీక్షణ మబ్బు నతండు వచ్చిన । న్నెప్పుడు గారవిం
చుఁ దుదియెప్పుడు మద్విరహాగ్నిరాశికిన్ । జెప్పఁగ దమ్మబోఁటి వారు సేఁతల నుల్లము తల్లడిల్లెడిన్॥ మ॥ చెలియా కృష్ణుఁడు న
న్నుఁ బాసి వనముం జేరంగనయ్యాతుణం । బుల[illegible]కన్నియు నుండనుండఁగ దగన్ మాసార్ణంబులై సాగిలో । పలఁ దోఁచుం బ్ర
హరంబులై దినములై పక్షస్వరూపంబులై । నెలలై యబ్దములై మహాయుగములై నిండారు కల్పంబులై॥ వ॥ అని మఱియుఁ
గృష్ణవిరహదుఃఖంబున బహువిధంబులఁ బశ్చాత్తాపంబు నొందుచు గోపికలోపికలు లేక నెట్టకేలకు దివంబు గడిపి దినాంత
సమయంబునందు॥ మ॥ అదె ఖానుండపరాద్రిఁ జేరెని దెసాయంకాల మేతెంచె నల్లదె గోపాదపరాగ మొప్పెనఁ గెల్పాం
దారణ్యమార్గంబునం । బదె వీతెంచె వృషేంద్రఘోషము ప్రియుం డేతెంచె రండంచుఁ దా । మెదు రేతెంతురు మా పు కృష్ణుని

కినయ్యింతులప్పరి భ్రాంతలై॥ వ॥ ఇట్లు తనకెదురువచ్చిన మచ్చికన చ్చెలువలనచ్యుతుండిచ్ఛావర్తనంబుల గారవించెనంతను

### ——ః శ్రీకృష్ణుండు వృషభాసురుని సంహరించుట. ః——

క॥ నాఁడు॥ సీ॥ ఎవ్వని మూపురమీక్షించి మేఘంబుల ద్రిశృంగంబని యాశ్రయించు। నెవ్వనిఱంకెకు కర్ణేంద్రియంబులు సోఁకి గర్భపాతనమగు గర్భిణులకు। నెవ్వని పదహతి నెగయు పరాగంబులంధకారారాతి నావరించు। నెవ్వఁడు కొమ్ముల నెదిరించి చిమ్మినఁ బృథ్వీధరంబులు పెల్లగిల్లు। నట్టి వృషభాసురేంద్రుఁడహంకరించి। వాలలత నెత్తి పెనుఱంకె వైచి నేలఁ। గాలఁ ద్రవ్వుచు నిశితశృంగములు సాఁచి। మంద బెగడంగఁ గవిసె నమ్మందఁ గదుచు॥ వ॥ ఇట్లు వృషభాకారంబున నరిష్టుండు హరికి నరిష్టంబు సేయం దలంచి పైకుఱికిన॥ ఉ॥ క్రేపులు వాఱె గోవులకుఁ గ్రేపులు గోవులు గోవృషంబులం। బైపడె వత్సధేను వృషభంబులు గోపకులం గనుంగొనెన్ జొచ్చెనా। గోపకులావృషేంద్రములు గోవులు లేఁగలు విచ్చి పాఱఁగా। గోపచమూవిభుండు గనె గోవృషదైత్యుఁడు వెంటనంటఁగన్॥ వ॥ ఇట్లు భయభ్రాంతులయి కాంతలుం దారును గృష్ణకృష్ణ రక్షింపుమని మొఱగు గోపకుల కడ్డంబు వచ్చి దీనజనరక్షకుండయిన పుండరీకాక్షుండిట్లనియె॥ ఉ॥ బాలురనింతులం బసులఁ బాఱఁగఁ దోలుట బంటుపంతమే। చాలు వృషాసురేంద్ర బలసంపదఁ జూపఁగ నెల్లఁ బాడి గో। పాలుర మందగాము చను పైఁబడి తేఁ ప్రచండ కృష్ణశార్దూలము నేఁడు నీగళము ద్రుంపక చంపక పోవనిచ్చునే॥ గీ॥ అనుచు ధిక్కరించి హస్తతలంబుఁ జప్పరించి నగుచు సఖుని మీఁదఁ। బన్నగేంద్రభయద బాహుదండము సాఁచి। దండిమెఱసి దనుజుదండ నిలిచె॥ అప్పుడు॥ చ॥ ఖురముల నేలఁ ద్రవ్వుచు నకుంచితవాలసమీరణంబులన్। విరవిరఁ బోయి మేఘములు విప్ప విషాణములాడ్డి కొంచుచు। స్థిరతరమూర్తియై వృషభదైత్యుఁడు కన్నులనిప్పులాలఁగా। మరమరవచ్చి తాఁకె రిపుమర్మదమోచనుఁ బద్మలోచనున్॥ ఉ॥ యాదవకుంజరుండు వృషభాసురు కొమ్ములు రెండుఁ బట్టి యష్టాదశపాదమాత్రము గజంబు గజంబును ద్రొబ్బునైవడిన్। భేదిల ద్రొబ్బ నయ్యసుర పిమ్మట నొందిచ నంగ్ఘ్రిమ్రొగ్గి పద్మోదముతో డడీకొనఁ బ్రమత్తవివర్ధను నాజనార్దనున్॥ గీ॥ అంతగోపసింహుఁడసురఁ గొమ్ములు పట్టి। ధరణిఁ ద్రొబ్బి త్రొక్కి దైత్యభటుల। కొమ్ము పీఁకి సురల కొమ్ము వర్ధిలవాని। కొమ్ము వెఱికి మొత్తి కూల్చెనధిప॥ క॥ ఉక్కు చెడి రోఁజి నెత్తురు। గ్రుక్కుచు నవాఁతను ప్రపింపమాత్రశకృత్తు। మిక్కిలి విడుచుచుఁ బసరపు రక్కసుఁడనిసను సెఁ బ్రజమురాగములమరిన్॥ వ॥ ఇట్లు వృషభాసురుఁ జంపిన నిలింపులు గుంపులుగొని విరులు వర్షింప, గోపకులు హర్షింప, గోపసతులు తర్కిఁంప, బలభద్రుండును, వారును, గోవిందుండును, బరమానందంబున, మందకుంజనిరంత॥ చ॥ ఘనుఁడొకనాఁడు నారదముని కంసునితోడ యశోదకూఁతురం। గనుట యుఁ జక్రి దేవకికి గన్నుఁ డౌటయు మున్ను రోహిణీ। తనయుఁడు రాముఁడౌటయును దద్విభుఁడద్దమునందనున్నవా। రని యెఱుఁగంగఁ జెప్పిన మహోష్ణతమంచుఁ జలించుఁ గన్ కతోన్॥ చ॥ కొడుకుల మందలోననిడి గొంటుతనంబున మోసపుచ్చె నీ। బడుగును బట్టి చంపుటది భావ్యమటంచుఁ గృపాణపాణియై। వడివసుదేవు నిండఁ నుసు వచ్చిన కంసునిఁ జూచి నారదుం। డుడుగుము చంపఁ బోలదని యోడకమాన్చి చనో యమింటికిన్॥ వ॥ మఱియు నలుక దీఱక కంసుండు దేవకీవసుదేవుల లోహపాశబద్ధులం జేసి కేశియను వానిం బిలిచి రామకేశవులం జంపుమని పంపి మంత్రి భటగజారోహక చాణూరముష్టిక సాల్వకోసల ప్రముఖుల రావించి యిట్లనియె. శా॥ ఎందున్న న్నెదిరించి పోరుటకు దేవేంద్రాదులుం జాలరీ। బృందారణ్యమునందనిప్పుడు నందాభీరార్భకు ల్రామగో। విందుల్వర్థిలుచున్న వారఁట రణోర్విం గంసు నెప్పింతుమం। చుం దర్పంబులు వల్కుచున్నరఁట యా చోద్యంబులన్వంటి రే॥ క॥ పట్టణజనములు చూతురు। దట్టంబుగ మల్లరంగతల పార్శ్వములన్। బెట్టింపుఁడు ఉత్తమగంబులు। పుట్టింపుఁడు వీటమల్లుపోరను మాటన్॥ శా॥ విన్నాణంబులఁ బోర నేర్తురు మహావీర్యప్రతాపాదిసంపన్నుల్ మీరలు మేటి మంతనములన్ విఖ్యాతులై పెంపుతో। మన్నారాబలకృష్ణులం బెనకువన్ మర్దించి మత్ప్రీతిగా। సన్నుల్గండు పురీజనుల్ పొగడ నో చాణూర యో ముష్టికా॥ శా॥ రారా హస్తిపకేంద్ర గండమదధారాగంధలోభాంధగం। భీరాళి వ్రజమైన మత్కువలయా[illegible]దద్విపేంద్రంబుదు। ర్వారోదంచిత దేహళీపరిసరస్తంభంబు డాయం గనా। భీరుల్ రాన దలంచి డీకొలుపు నీ బీరంబుతో రంబుగన్॥ క॥ పశువిశసనములు సేయుఁడు। పశుపతికిం బ్రియముగాఁగ భావించి చతుర్దశినాఁడు ధనుర్యాగము। విశదంబు[illegible]యవలయు విజయము కొఱకున్॥ వ॥ అనితన వారినందఱ నర్హ్యోపమలకు నియమించి యదుశ్రేష్ఠుండగు నక్రూరుని బిలిచి చెట్టఁ బట్టికొని యిట్లనియె॥ శా॥ అక్రూరత్వముతోడ నీవు మనఁగా నక్రూర నామంబు నిర్వక్రత్వంబునఁ జెల్లె మైత్రి సలుపన్వచ్చున్నినుం జేరినీ। వక్రోధుండవు మందలోన బలకృష్ణాభీరుల స్మద్వినాశక్రీడారతులై చరింతురఁట యారాజం దెచ్చి యొప్పింపవే॥ గీ॥ నానువెలిదినురలు నారాయణుని వేడి। కొనిన నతఁడు వచ్చి గోపకులము। నందుఁ గృష్ణమూర్తి నానకయుందుభి। సుదితుఁడమ్మోననఁగ నశోకటివింటివా॥ కావున నీవు గో

పశులచేతనరుటుగొనిధను ర్యాగంబుఁజూడరండని వారలందోడ్కొనిరమ్ము తెచ్చిన॥ శా॥ కొండల్గూలఁగఁద్రొబ్బుకొమ్ముల
తుదింగోపించికో రాడుచో। నండిన్దండినథగ్గికరించునొక వేదండంబు నాయింటబ్ర।హ్మాండంబైనఁగదల్పనోపుబలకృష్ణాభీ
రుల్గాభోరిలో। ఖండింపన్దడ వెంతధ్యానికదియుంగా దేనియక్రూరకా॥ శా॥ చాణూరుండును ముష్టికుండును సభాసం
ఖ్యాతముల్లల్ జగ। త్ప్రాణుల్మెచ్చ రుసత్వసంపదల బాహాబాహిసంగ్రామపా। రీణుల్వారలు రామకృష్ణుల బలోద్రే
కంబు సైరింతురే। క్షీణప్రాణులఁజేసి చూపుదురు సంసిద్ధంబు యుద్ధంబునన్॥ సీ॥ ఆరామకేశవులంతరించినవసుదేవము
ఖ్యులఁజంపి తెగువ మెఱసి। వృష్ణిభోజదశార్హవీరులఁ దెగటార్చి ముదుకఁడు రాజ్యకాముకుఁడు ఖలుఁడు। నగునుగ్రసేను
మాయయ్యఁ గీటడఁగించి పిపినతండ్రి దేవకు*బిలుకుమార్చి। మఱియు వైరుల నెల్ల మర్దించి నేజరాసంధనరకబాణశంబరాది।
సఖులతోడ భూమిచక్రమేలెదఁ బొమ్ము। తెమ్ము వేగమ వసుదేవసుతుల। ముఖము పేరుఁజెప్పి మంత్రభేదము సేయ। వలయుఁ
బెంపఁజనము నైరిజనుల॥ అనిన నక్రూరుండిట్లనియె॥ ఉ॥ పంపినఁబోని వాఁడనె నృపాలక మానవులైనతమ్మునూ। హింపరు
దైవయోగముల నించుక గానరు తోఁచినట్లుని। ష్కంపగతిన్ జరింతురదిగాక నవచ్చు నెయీశ్వరేచ్ఛ(ద। ప్పింపఁగరా
దు నీపగతు బిడ్డలఁ దెచ్చెదఁ బోయివచ్చెదన్॥ వ॥ అనిపలికి రథంబెక్కియక్రూరుండు చనినసకలజనులను వీడుకొలిపి కం

శ్రీకృష్ణుండు కేశివ్యోమాసురుల సంహరించుట.

సుండంతిపురంబునకుం జనియె-నంతకంసప్రేరితుండై॥ సీ॥ ఖురపుటాహతి ధూళిసుంభినీచక్రంబు ఫణిరాజఫణలకు బరువు
సేయ। భీషణహేషాభీషితులై మింటనమృతాంధులొండొరునండఁగొనఁగ। జటులచంచలసటాచ్ఛటల గాడ్పులమేఘ
ములు విమానములపైమెుసఁగుపడఁగ। వివృతాస్యగహ్వరవిపులదంతంబులు ప్రళయాగ్నికీలలపగిది మెఱయఁ। గాలపాశ
లీలగా వాలమేపార। వాహమగుచు గంధవాహగతుల। విజితశక్రపాశిపీర్యపయోరాశి। కేశివచ్చెమందఘోషమునకు॥ క॥ భీ
షణఘోటకదానవ। హేషానిర్ఘోషభిన్నహృదయనిఖిలగో। యోషాపురుషార్భకమై। ఘోషముహరిచూడదైన్యఘోషం
బయ్యెన్॥ అయ్యవసరంబున॥ ఉ॥ పేదలఘోషగోపకులబిట్టదలించుటవీరధర్మమా। కామ్రజంబులోఁదనునఁగుస్మరుఁడేడ
నితన్నరోయుక్రూ। వ్యాముని జూచిగోపకులకడ్డమువచ్చిననౌటయింకఁబో। రాదని శౌరివీఁతెమృగరాజుక్రియన్నెదిరించె
దైత్యుఁడున్॥ గీ॥ నిష్ఠురోగ్రసింహనినదంబుతోనింగి। మ్రింగుభంగినోరుమిగులఁదెఱచి। కఱచిరాగనతఁడు కాటుఁదప్పం
చినఁ। దన్నె నెగసి తుపగదానవుండు॥ ఉ॥ తన్నినతన్నునంబడకదానవహంతశిసనిరాకరంతయై। కన్నులఁగెంపు పెం
పెనయగ్రక్కునఘోటనిశాటుపాదముల్। వన్నెచెడంగఁబట్టిసడవై చెఘనుశ్శతమాత్రమూరనున్। బన్నగడింభమున్వి
నరిపాఱఁగవైచుఖగేంద్రుకై వడిన్॥ ఉ॥ వైచినమ్రొగ్గిలేచి వెసవాజినిశాటుఁడుహుంకరించిసం। కోచములేక పైఁబ
డినగోపకులేంద్రుఁడు దిగ్గజేంద్రశుం। డాచటుల ప్రభాబలవిడంబకమైనభుజార్గళంబుదో। పాచరునోటిలోననిడెఁ
జండఫణిన్ గుహనించుకై వడిన్॥ శా॥ దంభోళిప్రతిమానకర్కశము హేయావ్యాదాస్యమందో స్తంభమున్। శుంభత్కీలలనఘారి
వానిరదముల్ చూర్ణంబులై రాలఁగా। గంభీరంబుగఁగుక్షిలోఁజొనిపి వీఁకన్ వృద్ధిఁబొందించుచున్। సుంభించెన్పవనంబు
పిక్కటిలఁదత్కుక్షిన్నరేంద్రోత్తమా॥ క॥ వాయువు వెడలక నిలిచినఁ। గాయంబు చెమర్పఁగన్నుగవ వెలికుఱుక। న్నాయ
చెడితన్నుకొనుచును। గూయుచునశ్వాసురుండు గూలెన్నేలన్॥ గీ॥ ఘోటకాసురేంద్రుకుక్షిలోఁగృష్ణుని। బాహువధి
కమైనఁబట్టలేమిఁ। బగిలిదోసపండుపగిదిఁదద్దేహంబు। వసుమతీశరెండువ్రయ్యలయ్యె॥ క॥ నలినాక్షుఁడు లీలాగతి। విలయ
ముఁబొందించెనిట్లువీరావేశిన్। బలలాశిన్ జగదభినవ। బలరాశిన్ విజితశక్రపాశిన్ గేశిన్॥ వ॥ ఆసమయంబున నంబుప్ప
వర్షంబులు గురియించి సురలు వినుతించిరంత హరిభక్తివిశారదుండైన నారదుండువచ్చి గోవిందుని సందర్శించి రహస్యంబు
ననిట్లనియె॥ సీ॥ జగదీశయోగీశ సర్వభూతాధార సకలసంపూర్ణ యీశ్వర మహాత్మ। కాష్ఠగతజ్యోతికైవడి నిఖిలభూతము
లందు నొకఁడవై తనరుదీవు। సద్గూఢుఁడవుగుహాశయుఁడవు సాక్షివి నీయంత వాఁడవై నీవుమాయఁ। గూడి కల్పింతువు గు
ణములవాని చేఁబుట్టించి రక్షించి సాలియఁ జేయు। దీప్రపంచమెల్ల నిట్టినీవిప్పుడు। రాజమూర్తులైన రాక్షసులను। సంహరిం
చి భూమిచక్రంబు రక్షింప। నవతరించినాఁడవయ్య కృష్ణ॥ వ॥ దేవా నీ చేత నింక చాణూర, ముష్టిక, గజ, కంస, శంఖ, యవన, ము
ర, నరక, పౌండ్రక, శిశుపాల, దంతవక్త్ర, సాల్వ ప్రముఖులు కూడి సెదరు-పారిజాతంబపహృతంబయ్యెడిని-నృగుండు శాప
విముక్తుండగు, శమంతకమణిసంగ్రహంబగు, మృతబ్రాహ్మణపుత్రప్రదానంబు సిద్ధించు-నర్జునసారథివై యనేకాక్షౌహి
ణీబలంబుల వధియించెదవు మఱియును॥ శా॥ కృష్ణా నీవు నరించు కార్యములు లెక్కింపన్ సమర్థుండెవ। డ్డిష్ణుండైన విధాత
మూఁడుగుణముల్ దీపించు లోపించురో। చిష్ణుత్వంబున నుండు నీవలన నిస్సీమంబు నీరూపమున్। విష్ణున్ జిష్ణు సహిష్ణు నీశు నవి

తుఁడవి శ్వేశ్వరుఁ డొక్కరుఁడవు॥ వ॥ అని వినుతించి వీడుకొని నారదుం డరిగె నంత నొక్కనాఁడు కృష్ణసహితులై గోపకుమారు లడవికిం జని పసుల మేపుచు నొక్కకొండదండ నిలాయనక్రీడ చేసిరంత॥ క॥ కొందఱు గొఱియలమంచును గొందఱు పాలకులమంచుఁ గుటిలత్వమునన్ గొందఱు దొంగలమనుచును జెందికుమారకులు క్రీడఁ జేసిరి తమలోన్॥ శా॥ ఆలో నొంగలలో మయాసురసుతుం డాద్యుం డువ్యోముండనుం గోపాలుండై చని మేషకల్పవలతో భాసిల్లి క్రీడించుచు న్బాలవ్రాతము నెల్ల మెల్లన చతుఃపంచావశిష్టంబుగా శైలాంతర్గుహలోనికిం గొనిచనెన్ జౌర్యంబవార్యంబుగన్॥ వ॥ ఇట్లు కొండగుహలోనఁ గ్రమక్రమంబున గోపకుమారుల నిడి యొక్కపెనురాతఁ దద్ద్వారంబు గప్పి యెప్పటియట్ల వచ్చిన॥ ఉ॥ వీరుఁడు మాధవుం డఖిలవేది నిశాచరభేది నవ్వుతో నారని శాటదొంగతనమచ్చుపడెన్నె యదొంగవౌదువా భీరుల నెల్ల శైలగుహఁ బెట్టితి వెక్కడ నవ్వారిఁ బెట్టరా రారయటంచుఁ బట్టె నృగరాజు వృకాఖ్యముఁ బట్టుకైవడిన్॥ ఉ॥ పంకజలోచనుం డొడిసిపట్టిన శైలనిభాసురాకృతిన్ బింకముతోడఁ బొంగి విడిపించుకొనంగ బలంబు లేమిలో శంకిలి విట్టుతన్నఁ గొనఁ జక్కన నారణభీమువ్యోమునిం గొంకకఁ గూల్చె నవ్విభుఁడు కోయని మింట సుపర్వు లార్వఁగన్॥ గీ॥ ఘోరదనుజు నేలఁ గూల్చి పర్వతగుహ వాతనున్నరాయి వ్రయ్యఁదన్ని గుహ వరించుచున్న గోపాలకులఁ గొంచు బల్లిదుండు గోపపల్లెకరిగె॥ వ॥ అంత నారాత్రి మధురానగరంబున నక్రూరుండు వసియించి నియతుండై రేపకడ రథంబెక్కి కదలి నందగోకులంబునకుం

కంసుని పంపున నక్రూరుండు బృందావనంబునకుఁ జనుదెంచుట.

బోవుచుం దెరువునఁ దనలోనిట్లనియె॥ ఉ॥ ఎట్టి తపంబు సేయఁబడె నెట్టి పవిత్రము లిచ్చె ధన్యుఁడో యెట్టి ధనంబు లర్థులకు నీఁబడెనో తొలిబామునందు నా యట్టి వివేకహీనునకు నాదిమునీంద్రులు యోగదృష్టులన్ బట్టఁగలేని యీశ్వరుని బ్రహ్మమయున్ హరిఁ జూడఁగల్గెడిన్॥ ఉ॥ సూరులు దొల్లి యే విభుని శోభితపావననఖప్రభావలిన్ జేరి భవాంధకారములఁ జిక్కక దాఁటుదు రట్టి దేవుని న్వైరముతోడ నైనఁ బిలువన్ననుఁ బంపి శుభంబుఁ జేసెనిం పూరణప్రేమతోడఁ గడు బెకంసునిఁ బోలు సఖుండు గల్గునే॥ మ॥ ఇతఁడా కంసునిచేతఁ బంపువడి నన్ హింసింప నేతెంచినాఁ డతిదుష్టుండని చూచునో సకలభూతాంతర్విహారస్థ్యసంగతుఁ డౌటం దలపోసి నన్ను సుజనుం గాఁ జూచునో యెట్టియున్ నలిగావించునో యే క్రియం బలుకునో నా భాగ్య మెట్లున్నదో॥ అని మఱియును॥ మ॥ అలకభ్రాజితమై సుధాంశుసభమై హాసప్రభోద్దామమై జలజాతుంబయి కర్ణకుండలవిరాజద్గండమై యున్నయా జలజాతాక్షుముఖంబు చూడఁగలుగున్ సత్యంబు వో నాకు నా వలదికేఁగుచునున్న యీ వనమృగవ్రాతంబు లీత్రోవలన్॥ ఉ॥ మాపటివేళ నేను జని మాధవుపాదసమీపమందునం దాపలితుండనైన నతఁ డాశుగకాలభుజంగవేగసంతాపితభక్తలోకభయదారుణమైన కరాబ్జ మావలన్ మోపి హసించి నాకభయముల్ కృపతోడుత నీయకుండునే॥ వ॥ అని మఱియు నక్రూరుండనేకవిధంబుల గోవిందసందర్శనంబు గోరుచు నమందగమనసుందరస్యందనారూఢుండై చని చని॥ క॥ ముంచెటఁగనె ఘనచందనకుందకుటజతాలసాలకురువకవటమాకందన్ నందితఖగగోవిందస్వకచారుణారవిందన్ బృందన్॥ వ॥ కని బృందావనంబు దఱియం జొచ్చి యంత సాయంకాలంబున నడవికి నేఁటిగల మేతల వెంబడి దిగంబడి రాక దిక్కున, కుఱ్ఱికోడెపడ్డతండంబులం గానక, సొమయిరువు మిఱ్ఱుపల్లంబులనక, తూఁటిపాటి వెదకి చీఱెడు గోపకులయాహ్వానశబ్దంబు లాకర్ణించుచుఁ, గోమలఘాసఖాదనకుతూహలంబులం జిక్కి మసక్కవలఁ గ్రేపులం దలంచి, తలారింపక తమకంబులం దమతమయంతసంభారవంబులు సేయుచు, మూత్రంబులు స్రవింపఁ బఱువులిడు ధేనువులకు నోసరించుచు, సద్యోజాతంబులగు శ్రీతర్ణకంబుల వహించి, నవసూతికలు వెనుతగులుటవలన దామహస్తులై, చనువల్లవుల మెల్లన విలోకించుచు, మందయిఱుగెలంకులం గళంకరహితులై పులిశివంగి వెంగివాలపు మొత్తంబుల వలన నప్రమత్తులై, కుఠారకుంతశరాసనప్రముఖంబులు ధరియించి, కావలి దిరుగు వారలం గడచి నానావిధసరసతృణకబళఖాదనగరిష్ఠలై, గోష్ఠంబులు ప్రవేశించి, రోమంథలీలాలసలైన ధేనువులును, జన్నులు గుడిచి తల్లుల మ్రోలం బెల్లురేఁగి క్రేళ్లుఱుకు లేఁగలును, నెవలైన మొదవులఁ జై కొని పరస్పరవిరుద్ధంబులై డీకొని కొమ్ములయుద్ధంబు సలుపు వృషభంబులును, నకుంఠితబలంబులం గంతరజ్జువులం దెంచుకొని, పాసలు ఱేకి దాఁటి తల్లులం దూఁటి కుడుచు తఱిపి దూడల దట్టించి పట్టరోపక, క్రద్దనఁ బెద్దలం జీఱు గోపకుమారులును, గోదుకులమగల మాపాలము లంతులవంచించి పంచాయుధభల్లభగ్నహృదయలై, గృహకృత్యంబులు మఱచి, శంకిలక సంకేతస్థలంబులకుఁ గృష్ణాగమనతత్పరలైన గోపకామినులును, గోష్ఠప్రదేశంబుల గోవులకుఁ గ్రేపులు విడిచి యొద్దుచు నాలఁ గట్టుచు నీడ్చుచుం గ్రీడించు గోపకులును, గోఖురసముద్ధూతకరీషపరాగపటలంబులవలన సుల్లారి దుఱములై, ధేనుదోహనవేళావికీర్ణపయోబిందుసందోహపరంపరాసంపాదితపంకంబులును, దోహనసమయగోపకరాకృష్టగోస్తననిర్గతంబులగు

కలశంబులందుఁ బడియెడు క్షీరధారలచప్పుళ్లును, నవోఢోత్సుకకంఠసంస్పర్శనస్నిగ్ధంబులైన, మందిరద్వారదారుస్తంభంబులపొంతనూతనజనవిలోకనకుపితంబులై కరాళించుసారమేయంబులునుం గలిగి బలకృష్ణబాహుదండప్రాకారరక్షావిశేషభూషణంబైన ఘోషంబుఁ బ్రవేశించి యందు॥ క॥ జలజాంకుశాదిరేఖలు। గలహరిపాదములచొప్పుఁ గని మోదముతోఁ। బులకించి రథముడిగి యు। త్కలికన్ సంతోషబాష్పకలితాక్షుండై॥ మ॥ కనె నక్రూరుఁడు పద్మనేత్రులను రంగద్గాత్రులన్ ధేనుదోహనవాటీగతులనన్నలంకృతులనుద్యద్భాసులన్ బీతనీలనవీనోజ్జ్వలవాసులన్ గుసుమమాలాధారులన్ ధీరులన్। వనితాకాములఁ గృష్ణరాముల జగద్వంద్యక్రమోద్దాములన్॥ క॥ కని వారలపాదములకు। వినయంబున మ్రొక్కి భక్తివివశుండగుచున్। దనువునఁ బులకాంకురములు। మొనయఁగ నానందబాష్పములు జడిగురియన్॥ తదనంతరంబ॥ క॥ అక్రూరులైనజనులన। వక్రగతిం గాఁచు భక్తవత్సలుఁ డంత। న్నక్రూరుఁ గౌఁగిలించెను। జక్రాంకితహస్తతలము సాఁచి నరేంద్రా॥ వ॥ మఱియు నక్రూరుండు బలభద్రునికిం బ్రణతుండై నఁ గౌఁగిలించి చేపట్టుకొని కృష్ణసహితుండై గృహంబునకుం గొనిపోయి మేలడిగి గద్దియ నిడి పాదప్రక్షాళనంబు చేసి మధుపర్కంబు సమర్పించి గోవు నిచ్చి యాదరంబున రసవదన్నంబు వెట్టించి తాంబూలగంధమాల్యంబు లొసంగె నయ్యవసరంబున నందుండుపవిష్టుండై న యక్రూరున కిట్లనియె॥ క॥ చెలియలు మొఱయిడ నల్లుర। ఖలుఁడై పొరిగొనిన యట్టి కంసుఁడు బ్రతుకంగల దేమ సకీజశార్దూల। కిల మైమీ సేమ మింక నేమని యడుగన్॥ వ॥ అని పలికి యంత నక్రూరుం డొక్క పర్యంకంబున సుఖోపవిష్టుండై యుండ హరి యిట్లనియె॥ మ॥ శుభమే నీకుఁ బ్రమోదమే సఖులకుం జుట్టాలకున్ సేమమే। యభయంబే ప్రజకెల్ల గోత్రజులకత్యానందమే మామ ము। క్తభయుండే వసుదేవ దేవకులు దత్కారాగృహంబందు మా। త్పరిభవవ్యాజనిబద్ధులై బ్రతికిరే ప్రాణానిలోపేతులై॥ మ॥ నెఱి నేఁడిక్కడ నీవు రాఁగ వగతో నీతోడ నేమైన నా। కెఱుఁగం జెప్పవు మాటంచుఁ జెప్పఁగ దయామేఘుండు మా రావార్తయే। తెఱఁగుల్లేవని డస్సిరో వగచిరో దీనత్వముం జెందిరో। వెఱతో నా తలిదండ్రు లెట్లుపడిరో విన్పింపు మక్రూరకా॥ వ॥ మఱియు నీ వేమి కారణంబున వచ్చితని హరి పలికిన నతండు కంసునికి నారదుండు వచ్చి చెప్పిన వైరానుబంధప్రకారంబును, గంసుండు దేవకీవసుదేవుల వధియింపం గమకించి మానిన తెఱంగును, ధనుర్యాగంబు పేరు చెప్పి పుత్తెంచిన ప్రకారంబు లెఱింగించిన రామకృష్ణులు నగి తమ్ముఁ బరివేష్టించిన నందాదిగోపకులం జూచి కృష్ణుం డిట్లనియె॥ శా॥ భూనాథుండు మఖంబు జూడఁ బిలువం బుత్తెంచినాఁ డష్టభుఁ। గానంబోవలెఁ బాలు నెయ్యి పెరుగుల్ గట్నంబులున్నానుక। ల్మీ నేర్పొప్పఁగఁ గూడఁబెట్టుఁడు తగన్ మీమీ నివాసంబులన్। యానంబుల్ గొని రండు పొండు మధురాయాత్రాభిముఖ్యంబుగన్॥ వ॥ అని నియమించె నంత నక్రూరుండు మధురకు హరిం గొనిపోయెడి ననియెఱింగి వ్రేతలు గలంగి॥ మ॥ హరి నవ్వుల్ హరిమాటలున్ హరిమనోజ్ఞాలాపముల్ లీలలున్। హరి వేడ్కల్ హరిమన్ననల్ హరికరాబ్జాలంబనాహ్వానముల్। హరిణీలోచనలందఱున్ మఱియుపాయం బెట్లుకో యంచులో। నెరియన్ ముచ్చటలాడి రంతగములై యేకాంతగేహంబులన్॥ మఱియుం దమలో నిట్లనిరి॥ ఉ॥ మేటి గృహస్థు బ్రహ్మ యని మిక్కిలి నమ్మితి నమ్మ చూడ నే। పాటియు లేదు మాకుఁ బరిపాలకుఁడైన సరోజనేత్రుని। చ్చోట వసింపనీక నొక చోటికిఁ బో విధియించి పిన్నది। ట్టాటలు చేసె నీ సుఖములక్కట భారమకైనఁ జెప్పరే॥ అని విధిం దూఱుచు మదనతాపాయత్తచిత్తలై॥ ఉ॥ రమ్మని చీఱినంత నెపురంబున కేగెడుఁ గాని నన్ను నీ। కొమ్మలు నమ్మినారు మఱు కోలలకగ్గము చేసిపోవఁగా। ముమ్మరమైన తాపమున మ్రొగ్గుదుమో యనఁ డంబుజాక్షుఁ డా। యమ్మలు గోపవృద్ధులు ప్రయాణము వల్దనరైరి చెల్లరే॥ శా॥ అక్రూరుండని పేరుఁ బెట్టుకొని నేఁ డస్మన్మనోవల్లభుం। జక్రిన్మా కడఁ బాపికొంచు నరుగన్ గజ్జర్పించి నేతెంచినాఁ। డక్రూరుండఁట క్రూరుఁ డీతఁడు నిజం బక్రూరుఁడా నేఁ డని। ర్వక్రత్వంబునఁ గృష్ణుఁ బెట్టి తనత్రోవం బో విచారింపఁడే॥ ఉ॥ ఫుల్లసరోజలోచనలు పూర్ణసుధాంశుముఖుల్ పురాంగనల్। మెల్లనె మొల్లి పట్టణము మేడలనుండి సువర్ణలాజముల్। జల్లఁగ వారిఁ జూచి హరి సంగతి సేయఁ దలంచుఁ గాక వ్రే। పల్లె వసించు ముద్దియలపైఁ బడ నేల తలంచు నక్కటా॥ క॥ పురసతుల విలోకనములు। సరసాలాపములు నర్మసంభోగములున్। మఱిగి హరి మనల నొల్లఁడు। నెరవరులో యమ్మ మాతనప్రియులుగదే॥ క॥ పుట్టిన్నఁడు హరి నెఱుఁగని। పట్టణసుందరులకితనిఁ బతిఁ జేసి కడు। న్దట్టపు విరహాగ్నులకును। గట్టిడి దైవంబు ఘోషకాంతల వెదికెన్॥ మ॥ హరి నేలా కొనిపోయెదంచు మన మాయక్రూరుఁ బ్రార్థింతమా। హరిఁ బోనీకుఁడు నిల్పఁ జేయను చు నేఁ డర్చింతమా వేల్పులన్। హరిపాదంబుల కడ్డముల్ పడుదమా హా దైవమా యంచు నా। తరుణుల్ గోవ్రాలు చీరెలుమ్మఱచి కందర్పజ్వరభ్రాంతలై॥ మ॥ ఉవిదల్ సిగ్గులుమాని కన్గవల నీ రొండొండ వర్షించుచు। న్వివశత్వంబులతోఁ గపోలతటసంవిన్యస్తహస్తాబ్జలై। పవనోద్ధూతలతాభలై మమ్ముఁ గృపం బాలింపు గోవిందమా। ధవ దామోదర యంచు నేడ్చిరి సుజాతంబైన గీతంబులన్॥ వ॥ అంత మఱునాఁడు సూర్యోదయకాలంబున నందనతోడఁ బయనంబునకు గమకించిన పుచు

గోపికలను నూఱడి వత్తునని మాటికి ముఖంబుల నివర్తించి కృష్ణుండు శకటంబులందు గానుకలును, గోరసంబులనిడికొని సంతోషులైన గోపకులు వెనుతగుల నక్రూరచోదితంబైన రథంబెక్కి మధురాభిముఖుండై చనుసమయంబున॥ చ॥ అదె వచ్చుచున్నవాఁడు ప్రియుఁడల్లదె తేరదె వైజయంతి యల్లదె రథఘోటకాంఘ్రి రజమూ దెసమార్గము చూడఁడంచు లో నుదవెడి నిష్టుర్వక్ష హరిరథోన్ముఖలై గములై వ్రజాంగనల్లదలక నిల్చి చూచిరటు కన్నులకద్భుతమైన దూరముల్॥ వ॥ ఇట్లు బలభద్రకృష్ణాక్రూరులు చనిచని॥ క॥ అవలోకించెను గృష్ణుఁడు। ప్రవిమలకల్లోలపవనభాసితజన్యా। న్నవసన్నపాపసైన్యా। న్గవిజనమాన్యన్గళిందకన్యన్ ధన్యన్॥ వ॥ కని తత్కాళిందియందుఁ బరిస్ఫుర్ణమణిగణసముజ్జ్వలంబులగు జలంబులు ద్రావి తరుసమూహసమీపంబున రామసహితుండై కృష్ణుండు రథంబు ప్రవేశించె. నంతనక్రూరుండు వారలకు మ్రొక్కి వీడ్కొని కా

అక్రూరుండు యమునాజలంబున శ్రీరామకృష్ణుల దర్శించి నుతించుట.

ళిందీహ్రదంబు సొచ్చి విధిపూర్వకంబుగా వేదమంత్రంబుల జపియించుచు॥ ఉ॥ స్నానము చేసి చేసి నదిచల్లని నీటను రామకృష్ణులన్। మానుగ జూచి వారు రథమధ్యము పైవసియించియున్న వా। రీనదినీటిలోపలికి నెప్పుడు వచ్చిరటంచు లేచి మే। ధానిధి చూచె వారి నిరథస్థుల భక్తమనోరథస్థులన్॥ కని వెఱఁగుపడి॥ శా॥ కంటిన్మున్ను రథంబుపై జలములోఁ గంటిన్ మదిన్ గృష్ణరన్। గంటిన్ దొంటి రథంబు మీఁద నిదె యీ కల్యాణచారిత్రులే। వెంటన్ద్రోచిరి రెండుదిక్కులను నోవి భ్రాంతియో నీటిలో। నుంటాశ్చర్యము చూతునంచు మఱియున్మాహించి మగ్నాంగుఁడై। ఉ॥ సోషితబాంధవుండు యదుపుంగవుఁ డాజలమందుఁ గాంచె సేద్భావసహస్రమస్తకవిభాసితభూసునహీశు భూమిభృ। ద్వేషు నగ్నపాభిలాషు ప్రతివీరచమూవిజిగీషు నిత్యసంతోషు నరోషు నిర్దళితరోషు ననేకవిశేషు శేషునిన్॥ వ॥ మఱియు నీలాంబరసంయుతుండును, సిద్ధోరగాదిసన్నుతుండును నై యొప్పునప్పాపఱేని యందప్పకిఁ గనుంగొని॥ సీ॥ ఆభోగిభోగపర్యంకమధ్యంబున వలనొప్పు పచ్చని వలువవాని। మేఘంబుపై నున్న మెఱుఁగు చందంబున యురమున శ్రీదేవి యొప్పువాని। మిసిమి తేఁటులు విప్పు ముఖచతుష్కము గలతనయుఁడా డెడిబొడ్డుతమ్మివానిఁ। గదలనిబహుపద్మగర్భవిశేషంబుల రవముచూపెడి నాపు గములవాని। జలజగర్భరుద్రసనకసనందన। సద్విజాచరప్రశస్యమాన। చతురుఁడైన వాని సౌందర్యఖనియైన। వానినొక్క పురుషవర్యుఁ గాంచె॥ వ॥ మఱియుం జారులక్షణలక్షితనఖపాదగుల్ఫజానుజంఘోరుకటినాభిమధ్యోదరుండును, సోదరుండును, శ్రీవత్సకౌస్తుభవనమాలికావిరాజితవిశాలవక్షుండును, బుండరీకాక్షుండును, శంఖచక్రగదాపద్మహస్తుండును, సత్త్వగుణప్రశస్తుండును, బ్రహ్మసూత్రకటిసూత్రహారకేయూరకటకకంకణమకరకుండలకిరీటాదివిభూషణుండును, భక్తజనపోషణుండును, సుందరకపోలఫాలనాసాధరవదనకర్ణుండును, నీలనీరదవర్ణుండును, గంబుకంధరుండును, గరుణాగుణబంధురుండును, బ్రహ్లాదనారదసునందనందప్రముఖసంభావితుండును, శ్రీపుష్టితుష్టికీర్తికాంతీలోర్జావిద్యాశక్తిమాయాశక్త్యాదిసేవితుండును నై, యొప్పు నప్పరమేశ్వరునకు మ్రొక్కి భక్తిసంభ్రమంబుల గ్గలంబులుగ గద్గదకంఠుండై దిగ్గనంగరంబులు ముకుళించి యిట్లని వినుతించె। దండకము॥ శ్రీమానినీమానచోరా శుభాకారవీరా జగద్ధేతుహేతుప్రకారా సనుస్తంబునస్తంగతంబై మహాలోలకల్లోలమాలాకులాఖిలపాథోనిధింబాలకేళీగతిం దేలి నారాయణాఖ్యం బటు ఖ్యాతిశోభిల్లు నీ నాభికంజంబులో లోకపుంజంబులం బన్న విన్నాణియై మున్న యాబొమ్మ యుద్భూతుఁడయ్యెం గదా పావకాకాశవాతావనీవార్యహంకారమహామహామానసామల్హృషీకామలుల్లోకముల్లోకబీజంబులన్నిత్యసందోహమై నీ మహాదేహమందుల్లసించున్ వసించున్నశించుజ్జడత్వంబు లేకాత్మవై యొప్పు నీ యొప్పిదంబెల్ల నోచెల్ల చెల్లన్విచారింపవారెంతవారెంతవారైన మాయామలున్మాయతోఁ గూడి క్రీడించు లోకానుసంధాతయీ ధాతనిర్ణేతయే నీకళారాశికిన్ గొంచెమౌ భోజగర్భాదులధ్యాత్మలందున్న శేషాధిభూతంబులందున్న నేకాధిదైవంబులందున్న దా సాక్షివై యుందువంచున్ దదంతర్గతజ్యోతి వీవండవంచున్ త్రయీపద్ధతిన్ గొందఱింద్రాదిదేవాభిధానంబులన్నిక్కు దొక్కండవంచున్మదిం గొందఱారూఢకర్మంబులం ద్రుంచి సంసారముం ద్రెంచి సన్న్యస్తులై మించి విజ్ఞానచతుండవంచున్ మతింబంచరాత్రానుసారంబున న్నన్మయత్వంబుతోఁ గొందఱీవాత్మయంచున్ మతిం గొందఱా వాసుదేవాదిభేదంబులన్నల్వురై చెల్వు వాటింతువంచున్ మఱిన్నీవు నారాయణాఖ్యుండవంచున్ని వాఖ్యుండవంచున్ మతిం బెక్కుమార్గంబులన్నిన్ను నగ్గింతురెగ్గేమి యేటుల్ప్రవాహాళి రాశిన్ నెరాసులై సూడు గ్రీడన్విశేషంబులెల్లన్నశేషంబులై యుండ నీయందనూనంబు లీనంబులౌ నేకరాకేందుబింబంబు తుంభాంతరాళంబులం బింబితంబైన వేల్పున్న దేయొన్న నేలాఘటాంతర్గతాకాశముల్ ద్వస్తటాంతంబులం జెక్కమారేఖలోకాదిత్వింక వేరొక్కలం బోకసేకాకివై యుండుదీశా కృశానుండు నెమ్మోము సోముండు భానుండు కన్నుల్ దిశల్ కర్ణముల్ ... పాదంబులయ్యోని

ధుల్గుళ శల్యంబుల ద్రుల్లతాసాలము ల్రోమము ల్గాలి ప్రాణంబు బాహుల్సురేంద్రుల్ప్లవంబుల్ భవంబుల్ నభోవీథికా
భిప్రదేశంబు రేలుంబగల్లున్ని మేషంబులంభోజగర్భుండు శేఫంబు వర్షంబు వీర్యంబు నాకంబు మూర్ధంబు నేకమైయు
న్ననీ మేనిదండంబ యోజాతగర్భాండముల్మండిలో దుంబరానోకహానేక శాఖాఫలాపూరితానంతజంతు ప్రకాండంబు
లీలం బ్రసిద్ధోదరాశిస్థజంతుప్రకారంబుగా నిండియుండన్మహారూపనీరూపము ల్వేగ్గలంబుగ్గడింపన్మహాంభోధిలోమీను
మేనన్విరోధిన్నిరోధించి సాధించి యున్వేధకున్వేదరాశిం బ్రసాదింపవే ద్రుంపవే కైటభశ్రీమధుంజక్రివై మొత్తవే యె
త్తవే మందరాగంబు రాగంబుతోఁ గూర్మలీలా పరిస్పందివై పందివై మేదినిన్మీఁదికిం ద్రోఁచి దోషాచరుం గొమ్ములన్నెమ్ము
లంజిమ్ముచున్సుఱివ్వవే త్రవ్వవే ఘోరవైరిన్నృసింహుండవై వండివై దండివై రోచనింజూచి యూడింపవే పెంపవే మేను
బ్రహ్మాండమున్నిండ పొట్టుండవై రాజకోటిన్విదారింపవే రాజవై రాజబింబాస్యకై దుర్మదారిన్విదారింపవే నొంపవే
న్నాఁకులన్నాసు దేవాదిరూపంబులన్సిద్ధబంధుండవై యేపు దీపింప బౌద్ధుండవై వైరివారాంతరంగంబులన్నంత రంగంబుల
క్రూరాగరంగింపవే పెంపు దీపింపవే కల్కిమూర్తిం బ్రవర్తించి మించున్నినున్నెన్నన్నే నెవ్వఁడన్నన్ను మాయావిపన్నున్విష
ణ్ణుం బ్రపన్నుం బ్రసన్నుండవై ఖిన్నతంబాపి మన్నింపవే పన్నగాధీశతల్పా కృపాకల్పవందారుకల్పా నమస్తే నమస్తే నమ
స్తే నమః ॥ మ॥ కలలం బోలెడి పుత్రమిత్రవనితాగారాదిసంయోగము ల్జలవాంఛారతియెండమావులకు నాసల్సేయుచుం
దంబున ద్రెళ్ళుతున్న మృగ్యములంచు మూఢుఁడ వృథాతత్త్వజ్ఞుఁడ న్నాకు నీ। విలసత్పద్మపదంబు చూపి కరుణన్వీక్షింపు లక్ష్మీపతీ॥
వ॥ మఱియు నుపినుతింపన క్రూరునికి యమునాజలంబులోన నదన మొదలి మేను చూపి చాలించినటునికైవడిఁ దిరోహితుండై
నన క్రూరుండు నీరు వెడలి వెఱఁగుపడుచు వచ్చి రథారోహణంబు సేసిన హరియిట్లనియె॥ క॥ జలములు చేరువ మున్నవి। తలపో
యఁగ నీవు పోయితెడవయ్యె నదీ। జలమున నభమున ధరణిం। గలుగని చోద్యములు నీకుఁ గానంబడెనే॥ అనిన నతండిట్లనియె. క॥ నీ
లోన లేని చోద్యము। లేలోకములందుఁ జెప్పరీశ్వర నీట। న్నేలన్నింగిని దిక్కుల। నీలో చోద్యంబులెల్ల నెగడవ మహాత్మా॥ వ॥ అ
నపలికి సాయంకాలంబున నక్రూరుండు మధురానగరంబు చేరరథంబు గడపెనంత నటమున్న చనిన నందాదులు పురోపవ
నంబున విడసియుండ వారలం గూడికొని కృష్ణుండ క్రూరునింజూచి నీవు రథంబు గొనుచు నగరంబునకుం జనుము మేము వెనుక వ

## శ్రీకృష్ణమూర్తి మధురానగర ప్రవేశము చేయుట.

చ్చెదమనిన నతండిట్లనియె॥ క॥ నాయింటికి విచ్చేయుము। నీయంఘ్రిసరోజరేణునికరము సోకి। న్నాయిల్లు పవిత్రంబగు। శ్రీ
యుత నీభటునిఁ బెద్దసేయం దగదే॥ అనిమఱియుం బ్రార్థించిన హరియిట్లనియె॥ క॥ యదుకులవిద్వేషణుఁడై। సదమున వర్తిం
చు కంసు మర్దించి భవ। త్సదనంబు చూడ వచ్చెదఁ। బొదయి యాస్యందనము గొనుచుఁ బురమునకనఘా॥ వ॥ అని పలికిన నక్రూరుం
డు పురంబునకుం జని రామకృష్ణులు వచ్చిరని కంసున కెఱింగించి తన గృహంబునకుం జనియె-నంతనపరాహ్ణంబున బలభద్ర
గోపాలసహితుండై కృష్ణుండు॥ మ॥ పరిఘుల్ కోటలు కొమ్మలుం బడగలు న్ప్రాసాదముల్ వీథులుర్। హరులుర్ దేరులు వీరు
లున్గజములుర్ హర్మ్యంబులు న్వాద్యము। ల్తరుణుల్ ధాన్యములుర్ ధనంబులు మహోద్యానంబులుర్ దీర్ఘికా। ల్గరమాశ్చర్యరు
చిం దనర్చు మధురన్ గాంచెన్ విభుం డంతటన్॥ కనియప్పురంబు ప్రవేశించి వచ్చు సమయంబున॥ ఉ॥ నందతపఃఫలంబు సు
గుణంబుల పుంజము గోపకామినీ। బృందము నోముపంట సిరి విందము దయాంబుధి యోగిబృందముల్। డెందములందుఁ గో
రెడు కడింది నిధానము చేరవచ్చె నో। సుందరులార రండు చని చూతము కన్నులకోర్కిదీఱఁగన్॥ వ॥ అని మఱియు గోవింద
సందర్శనకుతూహలంబులం బౌరసుందరులు పరస్పరాహూయమానలై భుంజానలై భోజనభాజనంబులు దలంగఁ ద్రో
చియు, శయానలై లేచియు, నభ్యంజ్యమానలై జలంబులాడకయు, గురుజనశిక్ష్యమాణలై యోడకయు, గృహకార్యప్రవ
ర్తమానలై పరిభ్రమింపకయు, రమణరమమాణలై రమింపకయు, శిశుజనబిభ్రాణలై డించియు, నలంకుర్వాణలై యన్యో
న్యవస్త్రాభరణమాల్యానులేపనంబులు విడ్వడ ధరించియు, నరిగి॥ క॥ వీటగలచేడెలెల్లను। హాటకమణిఘటితతుంగహర్మ్యా
గ్రములం। గ్గూటువలు గొనుచుఁ జూచిరి। పాటించి విశాలవక్షుఁ బద్మదళాక్షున్॥ సీ॥ వీఁడఁటే రక్కసి విగతజీవగఁ జన్నుబాలు
ద్రావిన మేటి బాలకుండు। వీఁడఁటే నందుని వెలఁదికి జగమెల్ల ముఖమందుఁ జూపిన ముద్దులాఁడు। వీఁడఁటే మందలో వెన్నలు
దొంగిలి దర్పించి మెక్కిన దావరీఁడు। వీఁడఁటే యలయించి వ్రేతలమానంబు చూఱలాడిన లోకసుందరుండు। వీఁడు లేకున్న పు
రమటవీస్థలంబు। వీనిఁ బొందని జన్మంబు విగతఫలము। వీనిఁ బలుకని వచనంబు విహగరుతము। వీనిఁ జూడని చూడ్కులు వృథలు వృ
థలు॥ మ॥ వలియా గోపికలీ కుమారతిలకున్ జింతింతు మెచ్చాడుచుం। గలయం బల్కుచు నంటుచున్నగుచు నాకర్షించు [illegible]
[illegible] శ్రీపదుఁ దెచ్చి యిత్తులును సత్మానంబులం బొందఁగాఁ। దొలిజన్మంబుల నేమినోఁచిరొకదే దుర్గప్రదేశంబు

లన్ ॥ క ॥ అనిమఱియుఁ బౌరకాంతలు। మునుకొని హరిరూపు నేత్రముల వెంటనులోఁ। గొని తాల్చి రిహృదయములను। జనిత ప్రమదమున విరులు చల్లుచు నధిపా॥ మఱియును ॥ క ॥ నానావిధగంధములు ప్ర।సూన ఫలాదులును హరితశుభలాజములున్। గానుక లిచ్చుచు విప్రులు। మానుగఁ బూజించి రాకుమారోత్తములన్ ॥ ... ... ... ... ... ...

—— శ్రీకృష్ణుఁడు రజకునిఁ జంపి వాయకసుదాములొసంగు పూజల నంగీకరించి మేలొసంగుట. ——

వ ॥ ఆ సమయంబున నగరద్వారంబుననుండి వచ్చు రాగకారుండగు నొక్క రజకుం గాంచి హరి యిట్లనియె. ఉ ॥ విందులమైన రేశ్వరుని వీటికి వచ్చితి మేము మాకు మా। మందలలోనఁ గట్టికొన మంచి పటంబులు లేవు నీ మడి। న్సుందర ధౌత చేలములు శోభిలుచున్నవి తెమ్ము నిమ్ము మే। లందెద డీవు రాజు దెస నల్లుర మో రజకాన్వయాగ్రణీ॥ అనిన వాఁ డిట్లనియె ॥ శా ॥ ఎట్టెట్రా మను జేంద్ర చేలములు మీకీఁ బాడియే మీరలుం। గట్టంబోలుదు రే పయోఘృతదధి గ్రాసంబుల న్మత్తులై। యిట్లా డంజనె గాక గొల్లరకు మీకిట్లాడ నోరాడెడిన్। గట్టా ప్రాణముఁ గోలుపోయెదరు మీ కంసోద్ధతి న్బాలకా ॥ క ॥ మా రాజు సొమ్ముఁ గైకొన। నే రాజులు వెఱతు రింత యెల్లిదమే నీ। కీ రాజరాజగృహమున। నీ రాజస మేల గొల్లయేఁగుము తలఁగన్ ॥ అనిన విని రోషించి ॥ క ॥ ఘోరకరాగ్రతలంబున। ధీరుఁడు కృష్ణుండు శిరము దెగిపడఁ గొట్టెన్। బౌరులు గుండెలు వగులఁగ। వీరోత్రేక న్మదావి వేకిం జాకిన్॥ వ ॥ ఇట్లు భగ్నుండైన రజకుం జూచి వాని వారలు పటంబులు డించి వెఱచి పఱచిన రామకృష్ణులు వలసిన వస్త్రంబులు ధరియించికొన్ని గోపకులకొసంగి చనుచుండ ॥ క ॥ అంతట నొక వాయకుఁడా। క్రాంతన్వసుదేవసుతులఁ గని బహువర్ణా। త్యంతమ్ము పటాభరణము। లెంతయు సంతసముతోడ నిచ్చె న్మైచ్చెన్ ॥ శా ॥ కారుణ్యంబున వానిఁ గైకొని యలంకారంబుగా వించిశ్రృం। గారోదంచితదిగ్గజేంద్రకలభాకారంబులం బొల్చిరా। నూరుల్మాధవుఁ డంత వాయకునకు న్సుప్రసన్నుఁ డై ప్రీతుఁడై। సారూప్యంబును లక్ష్మియు న్మొసఁగె నైశ్వర్యాది సంధాయియై॥ వ ॥ అంత నా రామకృష్ణులు సుదాముం డను మాలాకారు గృహంబునకుం జనిన నతం డుగని లేచి గ్రక్కున మ్రొక్కి చక్కన నర్ఘ్యపాద్యాదికంబుల నాచరించి సానుచరులైన వారలకుఁ దాంబూలకుసుమగంధంబులొసంగి యిట్లనియె ॥ ఉ ॥ పావనమయ్యె నా కులము పండె దపంబు గృహంబు లక్ష్మికి। న్నైవితమయ్యె నిష్టములు సేకు రె పిశ్వనిదానమూర్తులై। భూవలయంబు గావ నిటు పుట్టిన మీర లురాక చేసినే। నే విధ మాచరింతుఁ బనులెయ్యవి బంటనె యుంగఁ జెప్పరే॥ అని పలికి ॥ క ॥ దామోదర రాములకు। ద్దామ యశోహసితతుహినధాములకు వధూ। కాములకుఁ దెచ్చి యిచ్చెను। దాముఁడు ఘన సురభి కుసుమదామములధిపా॥ క ॥ వారును మాలికుఁ డిచ్చిన। భూరి కుసుమదామములను భూషితులై నీ। కోరిన వరమిచ్చెద మని। కారుణ్యము సేయ నతఁడు గని యిట్లనియెన్ ॥ క ॥ నీ పాదకమల సేవయు। నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాం। తాపారభూతదయయును। దాపసమందార నాకుఁ దయ సేయఁగదే॥ వ ॥ అని వేఁడికొనిన నిచ్చి మఱియు మాధవుండమ్మాలికునకు బలాయుస్కాంతికీర్తి సంపదలొసంగి వానిగృహంబు వెడలి రాజవీథిం జనిచని ॥ క ॥ అనలి నాతుఁడు గాంచెను। నానా లేపముల భాజనము చేఁ గొనుచు। న్బోనిచను దెంచుదాని। న్మానసనగుచిని చయవినమితాబ్జం గుబ్జన్ ॥ కని యిట్లనియె. క ॥ ఎవ్వరిదానవు లేపము। లెవ్వరికిం గోరికొనుచు నేగెదు నీ పే। రెవ్వ తెమాకిమ్మి న్నియు। నివ్వటిలెదు చక్కనగుచు నీరజనేత్రీ ॥ అనిన నయ్యబల యిట్లనియె ॥ ఉ ॥ చక్కని వాఁడ వౌదు సరసంబుల నొంపకు మెల్లవారికి। న్జక్కదనంబు లెక్కడివి చారుశరీర త్రివక్రయం ద్రునే। నిక్కము కంసుదాసి నివి నిర్మల లేపనవిద్యదానన। న్మిక్కిలి రాజు మెచ్చుఁ దగ మీరు వి లేపనముల్ధరింపరే॥ క ॥ అని పలికి యా కుమారుల। తనువులు నగవులును వీక్షితములును మాటల్ నచిత్తముఁ గరఁగించిన। నను లేపములిచ్చె వారికబల ప్రియముతోన్ ॥ సీ ॥ ఇవ్విధంబునఁ గుబ్జ యిచ్చిన లేపంబులన్నయుఁ దాను దేహమున నలఁది। కొని ప్రసన్నత నొంది కుబ్జ మువ్వంకల యొడలు చక్కఁగ నెత్తియను పదంబులు ద్రొక్కి హస్తాంగుళిద్వయమ్ము బలన డుము। క్రిందుపడి పవ్వగ నిడి కృష్ణుఁడు మీఁదికి నెత్తిన వక్రతలెల్ల మాని। చక్కనైన చిత్తజన్మబాణము క్రియఁ। గొమరుమిగులఁ బిఱుదుఁ గుచయుగంబు। సొంపుఁ జేయఁ దరుణిసుందరమూర్తియై। కమలనయనుఁ జూచి కాంతతోడ ॥ క ॥ వేంచేయుము నా యింటికిఁ। బంచశరాకార యనుచుఁ బైకొంగు గా। క్షించి హరిఁ దిగిచె గాంచి। పంచాశుగబాణజాలభగ్నహృదయయై ॥ క ॥ కామిని తిగిచినఁ గృష్ణుఁడు। రాముని వీక్షించి నగుచు రాజాననవ। త్తా కామిత ముఁదీర్చి పిదప। న్నీ మందిరమునకు వత్తు నేఁడలుగకుమీ॥ వ ॥ అని వీడుకొలిపి కృష్ణుండు *విపణిమార్గంబున జనిచని, తాంబూలమాలికాగంధంబులును, బహువిధంబులయిన కానుకలును, బౌరులిచ్చినఁ బరిగ్రహించుచు, ధనుశ్శాలకరిగి యందు ॥ క ॥ సురరాజు వింటికైవడి। గురుతరమై భూరివీరగుప్తంబై దు।స్తరమైన విల్లుఁ బొడగని। నరులు వలదనం గవిట్టునకు నవికసితుండై ॥ శా ॥ బంధుశ్రేణుల నవ్వ మహాస్త్రము నఁ జాపంబెత్తి మౌర్వీలతా। సంధానంబొనరించి కొంచెవు తెగన్సాగించి యు ధీరతా। సిం

సీ॥ పాషాణవల్మీకపంకాదిరహితంబు వృషలకాంచనసన్నిభమృణ్మయంబు। గమనీయకస్తూరికాజలసిక్తంబు బద్ధచందనదారుపరివృతంబు। సహకారకుసుమదామధ్వజతోరణమండితోన్నతమంచమధ్యమంబు। బ్రాహ్మణక్షత్రాదిపౌరకోలాహలంబు శ్రాంత*తూర్యత్రయాంచితంబు। నిర్మలంబు సమము నిష్కంటకంబునై। పుణ్యపురుషుమనముం బోలి కంస। సైన్యతుంగము గుచసంతుష్టలోకాంత।రంగమైన మల్లరంగ మొప్పె॥ క॥ అమల్లరంగపరిసర। భూమిస్థితమంచమందు భోజేంద్రుఁడు మా।న్యామాత్యసంయుతుండై। భూమీశులు గొలువ నుండెఁ బొంకుచు నధిపా॥ మ॥ సకలాంభోనిధిమేఖలావహనముం జాలించి యేతెంచునా। గుసలాంగంబుల భంగి నొప్పుచుఁ దగం గా సేసి చాణూరము। ష్టికకూటుల్ సలకోసలుల్ గురువులన్ సేవించుచుం గారంగధా। త్రికి నేతెంచిరి తూర్యఘోషములు సాంద్రేకంబ నేకంబుగ౯॥ క॥ నలిదామమలైన గోపా।లుం డంపులు చని కానుకలు సమర్పించిన నృపు౯। సందర్శించి తగు సుమతిఁ। జెందితమహోత్సవమున వసించిరి పరుస౯॥ వ॥ అంతవా రామకృష్ణులు,

## శ్రీకృష్ణుండు కువలయాపీడంబను గజంబును వధించుట.

నలంకృతులై, మల్లదుందుభినినదంబు విని, సందర్శనకుతూహలంబున॥ క॥ ఓడక రంగద్వారము। జాడం జని వారు గనిరి సమద। కువలయాపీడంబు౯ భిన్నపరా। క్రీడంబు౯ బ్రహ్వకంటకిపచూడంబు౯॥ వ॥ కని తత్కరిపాలక శ్రేష్ఠుండై న యంబష్ఠుని కి, మేఘనాదగంభీరభాషణంబుల, రిపుభీషణుండగు హరి యిట్లనియె॥ శా॥ ఓ సింజరపాలమా దెసకు నీయుష్యము దేభేంద్రముం। ప్రేరేపంబని లేదు ద్రిష్టానుఅలం ప్రేరేపిసన్నిస్సుగం। భీరోగ్రాశనితుల్యముష్టిహతులం భేదించి నేఁ డంతకుం। జేరంబుత్తు మహోగ్రద్విపముతో సిద్ధంబు యుద్ధంబున౯॥ అనిపలికి। మ॥ మించిన నొప్పగు జక్కనిది మేలనఁ బచ్చనిచీరె కాశబం। నింద్రిలలాటకుంతలతలిస్ఫాలించుచు సంగరక్రియా। చుంచుతఁ జేర్చి బాలకుఁడు చూచు జనంబులు నన్ను బాపురే। యంచును నింపడగ్గరి యెహస్తగిత్తాగము గంధనాగముగ౯॥ క॥ ¶అంజక బాలకుఁ డనియును। గొంజక దయమాలి రాజకుం।జరయంత౯। గుంజరమును డీకొలిపెను। కుంజరపాలకుఁడు గోపకుంజరుమీఁద౯॥ వ॥ మఱియు (†)వయ్యానేకపంబ నేకపపాలకప్రేరితంబయి మహావాతసంఘాతసముద్ధూతంబగు ప్రళయకాలకీలికేళిని బిట్టు మిట్టిపడి, మృత్యుదేవత మొత్తునం గాలు బోలి కశమనుగమనిక నెదిరి నుదసరిలపరిమళలుబ్ధపరిభ్రమదభ్రభ్రమరగాయక ఝుంకృతులహుంకృతిసంపాదింప పలకుంభికీభరసుహాకుంభకుంభనంబుగ ఘీంకరించి విరోపభీషణ శేషభోగిభోగభయంకరంబగు కరంబున శౌరిం జుట్టి వీరి కింగొనక పట్టి, నొట్టిట్టు గెంటి, విధుంతువవదనగహ్వరంబువలన వెడలివడియును మసరణికరణి, దర్పించి, నుప్పొంచి, పాదమధ్యంబున నసాధ్యుండై, దూఁటదాఁటి మాటుపడిన, క్రోధబంధురంబై సింధురంబు, మహోన్నతమధ్యమంథాయమానమందరమహీధరంబు కైవడి, జిఱజిఱం దిరిగి కానక, భయానకంబై, గాలివెఱపునం గనిపెంగి షెంగటం, బ్రళయసింపెసం డప్రశస్తంబగు హస్తంబునం దివవం దించి మట్టిపట్టిపడ ప్రేయంగ నాకించి సంజనింపఁ దెంపున హరి కరిపిఱుందు సుఱికి, నహోరాత్రము వాలవల్లి కాకృష్ణోద్ధతిస్ఫుండ ప్రసుపన్న తెరంగున నెగరిమోఁడాలంబు వాలంబు లింగె వాడిసిపట్టి ఝళిపించి విషంచపింశతిబాణాసనప్రమాణమూర్గంబుగ, బిఱబిఱం ద్రిప్పెనైన, నవ్వారణంబు మన్నివారణంబై, రణంబునకో హటింప, సవ్యాపసవ్యపరిభ్రమణంబుల నవక్రంబైకి పిసిన, సపసవ్యసవ్యక్రమంబులం దిప్పించి, ఆవొప్పకి కుప్పించి దిమ్మొఖ్యా విన్నకరకంశుండై మేచకాచలతుంగశృంగగుంభంబగు కుంభికుంభంబులు చఱచి విప్రకీర్ణై చెక్కలెగయ ముదురంతకల్పాంతజీమూతప్రభూతనిర్ఘాతనిష్ఠురంబగు ముష్టిసారించి యాఁచి పాడిచినం దద్వికీర్ణపూర్ణరక్తసిక్తమౌక్తికంబులు వసుంధరకు సంధ్యారాగరక్తతారకాచ్ఛన్నంబగు మిన్నుచెన్నలవరింప నలువరింపక ప్రుగ్గి మ్రోకరిలి మొగ్గి దిగ్గన నగ్గజంబు లేచి చూచి త్రొక్కి చినడచిసంహారసమయసముద్రసంఘాతసంభూతసముత్తుంగభంగసంఘట్టితంబగు, కులాచలంబు క్రియఁ గ్రమ్మఱ, నమ్మహాభుజునిభుజాదండంబుల వలన ఘట్టితంబై, కట్టలుక మట్టి నెట్టి డీకొని, ముమ్మరంబుగం గొమ్ములం జిమ్మిన నమ్మేటి చేసూఁటి మెఱసి హస్తాహస్తిసంగరంబు నగరంబొప్పిదప్పింబడ నొప్పిం దిననకుంతిత కాలకంఠకి ఘోరభల్లభగ్నంబగు పురంబు ఫగిదిం జటులఝుంఝానిలవికలంబగు కీలంబుకైవడి నమ్మదకలభంబు బలంబు దక్కి చిక్కి స్రుక్కి పడిలోభికరంబునుం బోలె దానసలిలధారావిరహితంబై, విరహితలంపునుం బోలె నిరంతరదిత్తజాతనిగ్రహంబై, గ్రహణకాలంబునుం బోలెఁ బరాధీనఖరకరంబై, ఖరకరోదయంబునుం బోలె భిన్నపుష్కరంబై, పుష్కరవైరిపిలపనంబునుం బోలె నభాసితపద్మకంబై, యున్నసమయంబున॥ ఉ॥ కాలంద్రొక్కి సలీలుఁడై నగవుతోఁ గంభీరవేదండ్రాకృతి। న్గేలన్ఘీషణదంతము ల్వెఱికి సంక్షీణాంబుగా మొత్తి గో।పా

---

*తూర్యత్రయ=నృత్య-గాన-వాద్యములు ¶అంజక=అలస్యము చేయక. గొంజక=సంకోచింపక. (†)అయ్యనేకపంబు=ఆగజము అనేకపపాలక=మావటివానిచే విధుంతుద=రాహువు. శుండాలము=దంతావళ=ఏనుగు ఓహటింప=వెనుకఁదీయక మదకలంబు=మదపుటేనుఁగు.

రార్చి, జగన్నాథుండైనహరి, కంసాదులకుంబరలోకసంస్కారంబులు సేయంబనిచి, దేవకీవసుదేవులవిడిపించిబలభద్రసహితుండై, వారలకుంబ్రణామంబులు సేసిన॥మ॥ కనిలో కేశులుగానివీరుకొడుకుల్గారంచుఁజిత్తంబులన్ ।జనయిత్రీజనకుల్విచారపరులై శంకింపఁగృష్ణుండుదా। జనసమ్మోహినియైనమాయఁదదభిజ్ఞానంబు వారించియు। ల్లనియె న్సాగ్రజుఁ

॥ శ్రీకృష్ణుండు దేవకీవసుదేవులచెరవాపియుగ్రసేనునికిపట్టంబుగట్టుట. ॥

డైమహావినతుఁడై యానందసందాయియై॥ సీ॥ మమ్ముఁగంటిరిగానిమాబాల్యపౌగండకైశోరవయసులఁగదిసిమీర। లెత్తుచుదించుచు నెలమిమన్నించుచు నుండుసౌభాగ్యంబులొందరైతి। రాకాంక్షగలిగియు నదిదైవయోగంబుతల్లిదండ్రులయొద్దతనయులుండి। యేయవసరమున నెబ్బంగిలాలితులగుచువర్ధిల్లుమరట్టినుహిమ। మాకునిన్నాళ్లు లేదయ్యె నాటియువినుఁడు।నిఖిలపురుషార్థహేతువై నెగడుచున్న। మేనికెవ్వారలాఢ్యులుమీరకారె।యాఋణముదీర్పనోపండ్రునైనఁజనము॥క॥ చెల్లుబడిగలిగియెవ్వఁడు। తల్లికిఁదండ్రికిని దేహధనములువృత్తుల్ । చెల్లింపఁడట్టికష్టుఁడు।ప్రల్లదుఁ... మీఁదనాత్మపలలాశియగున్॥క॥జననీజనకులవృద్ధులఁ।దనయులగురువిప్రసాధుదారాములనే। జనుఁడుపోషింపఁడయ్యెబ్రోకావనరునుజీవన్మృతుండువాఁడుధరిత్రిన్॥ అదియునుంగాక॥ శా॥ కారాశాలలమానిమిత్తముమిముంగంసుండుగాఱింపఁగా।వారింపంగసమర్థతల్లగలిగియువారింపఁగాలేకని।ష్కారుణ్యాత్ములమైనక్రూరులనహో కౌటిల్యసంచారులన్ ।సారాతిక్షములారమమ్ముఁగౌరతల్ సైరించిరక్షింపరే॥ వ॥ అనియిట్లు మాయామనుష్యుండైనహరిపలికినపలుకులకు, మోహితులై వారలనంకపీఠంబులనిడుకొని, కౌఁగిలించుకొని, కన్నీటందడుపుచుఁ, బ్రేమపాశబద్ధులై దేవకీవసుదేవులూరకుండిరంత, మాతామహుండైనయుగ్రసేనునింజూచి॥చ॥ అనఘయయాతిశాపమునయాదవవీరులకున్న రేశ్వరా। సనమున నుండరామనృపసత్తమరాజవుగమ్ముభూమికిన్ ।నినుఁగొలువంగనిర్జరులునీకరిఁబెట్టుమరన్యరాజులం। బనిగొనుటెంత రమ్ముజనపాలనశీలివిగమ్ము వేడ్కతోన్॥అనిపలికి॥క॥మన్నించిరాజుఁజేసెను। వెన్నుఁడుసత్యావధానువిశ్రుతదానున్।సన్నుతమానున్ గదన।భిన్నాహితసేనునుగ్రసేనున్ దీనున్॥ వ॥ తదనంతరంబ, తొల్లి కంసభీతులై విదేశంబులంగృశియించుచున్న, యదు, వృష్ణి, భోజ, మధు, దశార్హ, కుకురాంధక, ప్రముఖులగు, సకలజ్ఞాతిసంబంధులను రావించి, విత్తంబులరవిత్తంబులిచ్చి, వారివారినివాసంబులనుండనియమించె, నివ్విధంబున॥క॥ మధుసూదనసత్కరుణా। మధురాలోకనవిముక్తమానసభయులై ।మధురవచనములఁదారును। మధురానగరంబునరులుమనిరినరేంద్రా॥ వ॥ అంత నొక్క నాఁడు, సంకర్షణసహితుండై, నందునింజేరి గోవిందుండిట్లనియె ॥ శా॥ తండ్రింజూడముతల్లిఁజూడముయశోదాదేవియున్నీవుమా। తండ్రిందల్లియునంచునుండుదుముసద్ధర్మంబు లందొల్లియే। తండ్రుల్బిడ్డలనిట్లుపెంచిరిభవత్సౌజన్యభావంబులన్। దండ్రీయింతటివారమైతిమిగదాతత్త్వప్రయోలీలలన్॥ఉ॥ఇక్కడనున్నబాంధవులకెల్లనుసౌఖ్యముచేసివత్తుమే, మక్కడికిన్మదీయులకునందజకిన్వినుపింపుమయ్యనే। యెక్కడనున్నమాకుమదినెన్నఁడుఁబాయవుమీవ్రజంబులో। మక్కువతోడమీరుకృపచూపొనరించుక్రియావిశేషముల్ ॥వ॥అనిపలికి, వస్త్రభూషణాదులొసంగి, సాదరంబునంగౌఁగిలించికొని, గోవిందుండనిచిన, నందుండుప్రణయవిహ్వలుండై, బాష్పజలపూరితలోచనుండగుచు, వల్లవులుందానును, వ్రేపల్లెకుం జ

॥ రామకృష్ణులుపనీతులై కాశీపట్టణమునకుఁజనివిద్యాభ్యాసముచేయుట. ॥

నియెనంత॥క॥గర్గాదిభూసురోత్తమ।వర్గముచేనుపనయనమువసుదేవుఁడుస।న్మార్గంబునఁజేయించెను।నిర్గర్వచరిత్రులకునునిజపుత్త్రులకున్॥క॥శ్రీద్విజరాజవంశవర్యులు।ద్విజరాజముఖాంబుజోపదిష్టవ్రతులై ।ద్విజరాజత్వమునొందిరి।ద్విజరాజాదికజనంబుదీవింపంగన్॥ వ॥ఉపనయనానంతరంబున, వసుదేవుండు బ్రాహ్మణులకుసదక్షిణంబులుగానేక గోహిరణ్యాదానంబులొసంగి తొల్లి రామకృష్ణులజన్మసమయంబులందునిజమనోదత్తలైనగోవులనుచ్చరించియిచ్చి కామితార్థంబులనర్థులకుంబెట్టెనిట్లు, బ్రహ్మచారులై॥శా॥ఉర్విన్మానవులెవ్వరైనగురువాక్యోపయుక్తులై కానిత। త్పూర్వార్వారంభముసేయఁబోలరనుచున్ బోధించుచందంబునన్।సర్వజ్ఞత్వముతోజగద్గురువులై సంపూర్ణులైయుండియున్। గుర్వంగీకరణంబుసేయఁజనిరాగోవిందుఁడున్ రాముఁడున్॥వ॥ చనిమహావైభవరాశియైనకాశింజేరి, తత్పురంబున, నవంతీపురనివాసియు, సకలవిద్యావిలాసియునైన, సాందీపుండనుబుధవర్యునిం గని, యథోచితంబుగదర్శించి, శుద్ధభావవర్తనంబులభక్తిచేయుచునుండ వారలవలనసంతుష్టుండై॥శా॥ వేదశ్రేణియునంగకంబులుధనుర్వేదంబుదంత్రంబులు। న్యాదివ్యాహృతధర్మశాస్త్రములునుద్యన్న్యాయముందర్కవి।ద్యాదక్షత్వమురాజనీతియునుశబ్దప్రక్రియ జెప్పినా।భూదేవాగ్రణి

శ్రీద్విజరాజ।చంద్రుఁడు, ద్విజరాజ।బ్రాహ్మణశ్రేష్ఠులు, ఉపదిష్ట।ఉపదేశింపఁబడిన, ద్విజరాజత్వమున్।ద్విజరాజాదికజనంబు.

రామకృష్ణులకు సంభూతప్రమోదంబున౯॥ క॥ అఱువదినాలుగు విద్యలు। నఱువదినాలుగు దినంబులం దనవారల్। ఱెన్నెఱవాములై నకతమున। నెఱినొక్కొక నాఁటిపనికి నేర్చిరి లేశా॥ క॥ గురువులకు నెల్లగురులై। గురులఘుభావములు లేక కొమరారు జగద్గురులు త్రిలోకహితార్థము। గురుశిష్యన్యాయలీలఁ గొలిచిరి వేడ్క౯॥ వ॥ ఇట్లు కృతకృత్యులైన శిష్యులం జూచి, వారల మాహాత్మ్యంబునకు వెఱఁగుపడి, సభార్యుండైన సాందీపుం డిట్లనియె॥ శా॥ అంభోరాశిఁ బ్రభాసతీర్థమున మున్నస్మత్తనూసంభవుం। డంభోగాహము సేయుచున్ మునిఁగి లేఁడయ్యెం గృపాంభోనిధుల్। శుంభద్వీర్యులు మీరు మీగురునికిం జోద్యంబుగా శిష్యత౯। గాంభీర్యంబునఁ బుత్రదక్షిణ యిడన్ గర్తవ్యమూహింపరే॥ క॥ శిష్యులు బలాఢ్యులైనవి। శేషస్థితి నొందిగురువు జీవించును సి। ద్దూష్యగుణబలగరిష్ఠులు। శిష్యులరై గురునికోర్కె సేయందగదే॥ వ॥ అనిన విని రామకృష్ణులు, గుర్వర్థంబుగా దుర్వారరథారూఢులై, రయంబునం జని, రౌద్రంబున సముద్రంబుఁ జేరి యిట్లనిరి॥ క॥ సాగరసు బుద్ధితోడను। మా గురుపుత్రుని దెమ్ము మా తాడిననీ। వాగడసువుమవుము స్సహ। వేగరణాభీలనిశితవిశిఖాగ్నులక౯॥ అనిన వారలకు జలరాశి యిట్లనియె॥ ఉ॥ వంచన యేమి లేమయ యదువల్లభులార ప్రభాసతీర్థమం। దంచితమూర్తి విప్రసుతుఁ డాప్యుఁడు తోయములాడుచుండను। త్సంచలితోర్మి యొక్కటి ప్రచండగతిం గొనిపోయెఁ బోవఁగాఁ। బంచజనుండు మ్రింగెన తిభాసురశీలుని విప్రబాలుని౯॥ అని వానివసియించుచో టెఱింగించిన॥ శా॥ శంఖారావముతోడఁ బంచజనుఁ డాశంకించి చిత్తంబులో। నక్షీణున్ డుగవార్థిం జొచ్చె సహసజ్వాలాభ హేమోజ్జ్వల। స్వాంఖాస్త్రంబునఁ ద్రుంచి వానిజఠరంబున్ వ్రచ్చి గోవిందుఁడు। ప్రేంఖచ్చిత్తుఁడు బాలుఁ గానక గురుప్రేమోదితోద్యోగుఁడై॥ క॥ దానవుని దేహజంబగు। మానితశంఖంబు గొనుచు మసలక బలుఁడు। న్దోసే తేరఁగ రథినై। దానవరిపుఁ డరిగె దండధరుపురికిన్ నృపా॥ వ॥ చని సంయమినీ నామనగరంబు చేరి, తద్ద్వారంబునఁ బ్రళయకాలమేఘగంభీరనినదభీషణంబగు శంఖంబు పూరించిన విని, వెఱఁగుపడి॥ శా॥ అస్మద్బాహుబలంబుఁ గైకొనక శంఖారావమున్మానసా। పస్మారంబుగ నెవ్వఁడో కొనగరప్రాంతంబునం జేసెను। ద్విస్మేరాహవరోషపావకుని చే విధ్వస్తుఁడై వాఁడు దా। భస్మంబై చెడునంచు నంతకుఁడు కోపప్రజ్వలన్మూర్తియై॥ వ॥ వచ్చి రామకృష్ణులం గని, వారు లీలామనుష్యులైన విష్ణుమూర్తులని యెఱింగి, భక్తితోడ శుశ్రూష చేసి, సర్వభూతమయుండగు కృష్ణునకు నమస్కరించి, యేమి సేయుదు నానతిమ్మనిన నమ్మహాత్ముం డిట్లనియె॥ క॥ చెప్పెద మా గురునందనుఁ। దప్పఁగ లుగఁ జూచి నీవు దండనమునకు। న్దెప్పించి నాఁడ వా తని। నొప్పింపుము మాకు వలయు నుత్తమచరితా॥ క॥ అనిన విని పేఁడె వీనిం। గొనిపొండ సభక్తితోడ గురునందనుని। చ్చిన కృష్ణుండు పీక్షాలి పెను। ఘనదుర్గనదమును మహిపుగ సానుక్రమున౯॥ వ॥ ఇట్లు యమునడిగి తెచ్చి రామకృష్ణులు సాందీపునికిం బుత్రుని సమర్పించి యింక నేమి సేయవలయు నానతిండనిన నతం డిట్లనియె॥ క॥ గురునకుఁ గోరిన దక్షిణఁ। గరుణన్ మన్నెవ్వఁ డిచ్చె ఘనులార భవ। ద్గురునకుఁ గోరిన దక్షిణఁ। విరమిగ నిచ్చితిరి మీరు దీపితయశులై॥ క॥ కాలునివీటికిఁ జనియు మృత। బాలకుఁ దెచ్చిరుల వశమె భవదీయకృప౯। మేలు దొరఁకొనియె మాకువి। శాలముగుం గాత మీయశము లోకముల౯॥ వ॥ మహాత్ములార యేను గృతార్థుండనైతి ననిదీవించిన సాందీపుని వీడ్కొని, కృతకృత్యులై, రామకృష్ణులు, రథారోహణంబు చేసి, మధురకుం జనుదెంచి పాంచజన్యంబు పూరించినఁ గని, నష్టధనంబులు గనిన వారిభంగిం, బ్రజలు ప్రమోదించిరంత నొకనాఁ డేకాంతంబున॥

## శ్రీకృష్ణుండు గోపకాంతల చెంతకు నుద్ధవునిఁ బంపుట.

శా॥ నా పైఁజిత్తము లెప్పుడున్ నిలుపుచున్ నా రాకఁ గాంక్షించుచు। న్నా పేరాత్మల నావహించుచు వగన్ నానా ప్రకారంబుల౯। గోపాలాంగన లెంత జాలిఁ బడిరో కోపించిరో మాటిరో। ప్రేపల్లె న్నిజధర్మగేహములలో విభ్రాంతచైతన్యలై॥ అని చింతించి॥ క॥ సిద్ధవిచారు గభీరు౯। వృద్ధవచోవర్తనీయు వృష్ణిప్రవరు౯। బుద్ధినిధి నమరగురుసము। నుద్ధవునిం జూచి కృష్ణుఁ డొయ్యనఁ బలికె౯॥ శా॥ రమ్మా యుద్ధవ గోపకామినులు నా రాకల్ నిరీక్షించుచు। న్సమ్మోహంబున నన్నియున్ మఱచి యే చందంబునన్ గుందిరో। తమ్మున్ నమ్మిన వారి డిగ్గవిడువన్ ధర్మంబు గాదండ్రు వే। పొమ్మా ప్రాణము లేక్రియన్ నిలిపిరో ప్రోద్యద్వియోగాగ్నుల౯॥ క॥ లౌకికమొల్లక నన్నా। లోకించు ప్రపన్నులకును లోఁబడి కరుణా। లోకనములఁ బోషింతును। నా కాశ్రితరక్షణములు నైసర్గికముల్॥ క॥ సందేహము మానుండర। విందాననలార మిమ్ము విడువను వత్తు౯। బృందావనమునకనిహరి। సందేశము పంపెనను మసంకేతమున౯॥ వ॥ అని మందహాససుందరవదనారవిందుండై, కరంబు కరంబున నవలంబించి పరసవచనంబు లాడుచు వీడుకొల్పిన నుద్ధవుండును రథారూఢుండై సూర్యాస్తమయసమయంబునకు నందవ్రజంబు చేరి వనంబులనుండి వచ్చు గోవుల చరణరేణువుల బ్రచ్ఛన్నరథుండై చొచ్చి నందమందిరంబు ప్రవేశించిన॥ శా॥ ఆవున్నాత్మనిఁ గౌఁగిలించుకొని నందాభీరుఁ డానందియై। మా పాలింటికిఁ గృష్ణుఁ డీతఁ డనుచు న్మన్నించి పూజించి వాం। ఛాపూర్ణంబుగ

మంజులాన్నమిడిమాగ్గాయాస చుంబాపిస|ల్లాపోత్సాహముతోడనిట్లనియెసంలక్షించి మోదంబునన్॥క॥ నామిత్రుఁడు
వసుదేవుఁడు। సేమంబుగనున్నవాఁడె చెలువుగఁబుత్రుల్। సేమంబున సేవింపఁగ।హామాత్యుండైనకింసుఁడడఁగినపిదపన్॥
శా॥ అన్నాభద్రమెగల్గి సంద్రులనాయుష్మాన్ హర్షించి చింతించునే। తన్నుం బాసిన గోపగోపికలమిత్రవ్రాతముం గోగణంబు
న్నిత్యంబు వలంచునే వననదీభూముల్ ప్రసంగించునే। వెన్నుండెన్నఁడువచ్చు నయ్యెయుటమాత్రేపల్లెకున్ వృద్ధవా॥క॥అం
కిలిగలుగఁగమాకకలంకేంమనిపగిదిఁ గాంటిలలితంబుగ ద|త్పంకజనయనుని నెమ్మొగ|ముం కనిపిలోకింపఁగలదె యీజన్మము
నన్॥క॥అనిహరిమున్నొనరించినపనులెల్లను జెప్పిచెప్పి బాష్పాకులలో|చనుఁడై డగ్గుత్తికతో|వినయంబుననుండె గోపపతి
యుండంతన్॥క॥ పెనిమిటిబిడ్డనిగుణములు। వినుపింప యశోదప్రేమవిహ్వలమతియై। చనుమొనలఁబాలుగురియఁగఁ। గను
గొనలనుజలములొలుకఁగా బెగ్గిలియెన్॥ వ॥ఇట్లుగోవిందసందర్శనాభావవిహ్వలులైనయశోదానందులకునుద్ధవుండిట్ల
నియె॥క॥జననీజనకులమిమ్ముం। గనుఁగొనశీఘ్రంబె వచ్చుఁగనిభద్రంబు। ల్వనజాక్షుండొనరించును। మనమున వగవకుఁడు
ధైర్యమండనులారా॥మ॥బలుఁడుం గృష్ణుఁడుమర్త్యులే వసుమతీభారంబు వారింపఁగా। రలరూపంబులఁబుట్టినాఁడు హరిని
ర్వాణప్రభుండిప్పుడు|జ్జ్వలుఁడై ప్రాణవియోగకాలమునఁ దత్సర్వేశుఁ జింతించువాఁ|డలఘుశ్రేయముఁ బొందు బ్రహ్మ
మయుఁడై యగ్రాహ్యుఁడై నిత్యుఁడై॥సీ॥ అట్టినారాయణుండఖిలాత్మభూతుండు కారణమానవాకారుఁడైనఁ। జిత్తంబుల
తనిపైఁజేర్చి సేవించితిరతికృతార్థులరైతిరనవరతము। శోభిల్లునింధన జ్యోతిచందంబున నఖిలభూతములందు నతఁడతనికిఁ।జ
ననీజనకదారసఖిపుత్రబాంధవశత్రుప్రియాప్రియజనులులేరు। జన్మకర్మములును జన్మంబులును లేవు। శిష్టరక్షణంబు సే
యుకొఱకు।గుణవిరహితుఁడయ్యుగుణియగు సర్గరక్షణవినాశకేళిసలుపుచుండు॥వ॥అనిమఱియు పెక్కువిధంబుల హరి
ప్రభావంబులుపన్యసించుచు నారేయిగడపిదధిమథనశబ్దంబులాకర్ణించుచు లేచి మఱునాఁడు కృతానుష్ఠానుండై యుద్ధ
వుండొక్కరహస్యప్రదేశంబుననున్న సమయంబున॥ శా॥ రాజీవాక్షుఁడు సుందరాస్యుఁడు మహాబాహుండు పీ
తాంబరుం। డాజానుస్థితబాహుఁడంబురుహమాలాలంకృతుండుల్లస।ద్రాజత్కుండలుఁడొక్క వీరుఁడిచటన్ రాజిల్లుచు



## భ్రమరగీతలు.

న్నాఁడుమా। రాజీవాక్షునిభంగినంచుఁగనిరా రాజాన్వయుం గోపికల్॥ వ॥ కనిలజ్జాసహితహాసావలోకనంబులును
ఖంబులకుం జెలువెసంగనిట్లనిరి॥ చ॥ ఎఱుఁగుదుమేమునిన్నువనజేక్షణమిత్రుఁడవేపుకూరిమి|న్నెఱయుచుఁదల్లిదండ్రు
లను మేలెఱుఁగింపఁ బ్రియుండు పంపఁగా। వఱలెడుభక్తివచ్చితివివారలనైనమనంబులోపలన్। మఱవఁడు శౌరి మేలువు
ఱిమాన్యులు రాజునకెవ్వరిచ్చటన్॥క॥ మునివరులైనను బంధుల।ఘనసఖ్యము విడువలేరుగాకవిడువరే। యనిమిత్తసఖ్య
మాఁకటి।పనిదీరిననళులువిరులఁ బాయనెలేదో॥ చ॥ అనియిటుగోపికల్వలుకనందొకగోపికకృష్ణపాదపం|కజమునఁజొ
క్కి చేరువనుదైవవశంబునఁగాంచెనుజ్జ్వల।త్సునిశితసద్వివేకముఁ బ్రసూనరసానుదాతిరేకముం। ఘనస్వననాద
సంచలితకాముకలోకమఁజంచరీకమున్॥వ॥కనిహరిదన్నుం బ్రార్థింపఁబుత్తెంచినదూతయనికల్పించుకొనియుద్ధవునికిన
న్యాపదేశంబైయెటుకపడనయ్యళికిందొయ్యలియిట్లనియె॥మ॥ భ్రమరామర్జనమిత్రముట్టకుముమాపాదాబ్జముల్నాగర|
ప్రమదాళీకుచకుంకుమాంకితలసత్ప్రాణేశదామప్రసూ। నమరందారుణితాననుండవగుటన్నాసుంఘమున్నించుగా।క
నుము న్నేఁపుచుఁబౌరకాంతలశుభాగారంబులన్నిత్యమున్॥మ॥ ఒకపువ్వందలిదేనెఁద్రావిమధుపాయుత్సాహివై నీవు
వే।రొకటింబొందెదు భంగి మన్మథరపియ్యూషంబులందేల్చి మా|యకలంకోజ్జ్వలయౌవనంబు గొనియన్యాసక్తుఁడయ్యె
న్విభుం।డకటాయాతని క్షెట్లు వక్కసిరి మిథ్యాకీర్తి యయ్యెట్టువిరా॥ శా॥భృంగా కృష్ణుఁడు మంచివాఁడనుచు సంప్రీతిం బ్ర
శంసించెదీ। సంగీతంబున నేముసొక్కముమెతచ్చారిత్రములింతలే। యంగీకారము గావుమాకుఁబురకాంతాగ్రప్రదే
శంబులన్।సంగీతంబొనరింపువారికుమురోజన్నీకునిష్టార్థముల్॥ మ॥ సహదాళీశ్వర చూడుముజ్జ్వలితహాసభ్రూవిజృం
భంబులన్।రమణీయుండగు శౌరి చేఁగరగరే రామల్ త్రిలోకంబులన్। బ్రమదారత్నము లక్ష్మిగూర్తనిపదాబ్జాతంబు సే
వించునిక్కము నేమెవ్వరమాకృపాజలధికిం గారుణ్యముం జేయఁగన్॥ శా॥రోలంబేశ్వర నీకు మాత్యముమహోద్రూఘంబు
నీనేరుపు।ల్వాలున్మచ్చరణాబ్జములవిడువుమస్మన్నాథపుత్రాములన్। లీలం బాసిపరంబుడించితనకున్ లీనత్వముల్ బొం
ముమా। మ్మేలా పాసెవిభుండు ధార్మికులుమున్నీచందముత్మెత్తురే॥ శా॥వాలింజంపెను వేఁటకానిపగిదిన్వంచించి దైత్యాను
జన్। లోలంబట్టి విరూపిఁజేసెను బలిన్ లోభంబుతోఁగట్టెయీ। త్రైలోక్యంబు మొఱంగిపుచ్చుకొనియెన్ ధర్మజ్ఞుఁ డేమా
ధవుం।డేలా షట్పదయెగ్గుమావలననీ కెగ్గింపఁగా నేటికిన్॥ ఉ॥ పన్నగమింటపైకెగసిపాలువిహంగములైనవీనులన్।వ

న్నొకమాటువిన్నగృహదారసుతాదులఁబాసివిత్తసం। పన్నతఁడించిసంసరణపద్ధతిఁబాపెడువాఁడునిత్యకాం।తున్నెటి
నున్నమాబ్రతుకుసైఁచునెయేలమధువ్రతోత్తమా॥ మ॥ కమనీయంబగువేఁటకానిపలుకాకర్ణించినిక్కంబుగాఁ। దమ
చిత్తంబులఁజేర్చిచేరిహరిణుల్దద్బాణనిర్భిన్నలై। యమితోగ్రవ్యథనొందుభంగిహరిమాయాలాపముల్నమ్మిదుఃఖము
లంజెందితిమంగజాస్త్రజనితోగ్రక్రౌర్యనిందిందిరా॥ ఉ॥ బంధులబిడ్డలన్మగలభ్రాతలఁదల్లులఁదండ్రులన్మనో।జాంధతఁ
జేసిడించితనునమ్మినమమ్మువియోగదుర్దశా। సింధువులోనఁద్రోఁచియిటుచేరకపోవుటపాడిగాదుపు।ష్పంధయమీయ
ధీశునకుఁబాదములంబడిమొత్తిచెప్పవే॥ సీ॥ కాంచనరత్నసంఘటితసౌధంబులేమాకుటీరంబులుమాధవునకు।వివిధనరేం
ద్రసేవితరాజధానియేమాపల్లెయదువంశమండనునకు।సురభిపాదపలతాశోభితారామమేమాయరణ్యముసింహమధ్య
మునకుఁ। గణనీయబహుగుణగజతురగంబులే మాధేనువులుకంసమర్దనునకు । రూపవిభ్రమనైపుణరూఢలైన।మగువలమె
మేముమన్మథమన్మథునకు। నేలచింతించుమముఁగృష్ణుఁడేలదలఁచుఁ।బృథివినధిపులునూతనప్రియులుగారె॥ వ॥ అనిమఱి
యునిట్లనేకవిధంబులఁగృష్ణసందర్శనలాలసలైపలుకుచున్నగోపికలవచనంబులువినియుద్ధవుండుమధురాలాపంబులనా
శ్వాసించుచునిట్లనియె॥ మ॥జపదానవ్రతహోమసంయమతపస్స్వాధ్యాయముఖ్యంబుల।న్నిపుణుల్గోరియుసేవింతుర్మన
ములన్నిల్పంగలేరట్టిస।ద్విపులాకారునిపైసమాహితములైపెంపిట్లుపైమీకజ।స్రపటుధ్యానములిట్లునిల్చెనిభవచ్చా
రిత్రముల్చిత్రముల్ ॥క॥ననుమీకడపంగృష్ణుఁడు।పనిపంపెడువేళఁబిలిచిపలికినపలుకు।ల్వినుఁడన్నియువివరించెద।వనజే
క్షణలారమీరువగవకుఁడింకన్॥ అనిహరివచనంబులుగానిట్లనియె॥ సీ॥ఎల్లకార్యములకునేనుప్రధానకారణముగావుననీ
సువనములార। కలుగముమద్వియోగము చరాచరరూపములలోమహాభూతములు వసించు। కరణినుండుదునసర్వగతుఁడ
నైనేమనస్ప్రాణబుద్ధిగుణేంద్రియాశ్రయుండ। నాత్మయందాత్మచేనాత్మఁబుట్టింతురక్షింతుద్రుంతుహృషీకభూత।
గుణగణాకారనాత్మలోఁగొమరుమిగుల।నిఖిలమాయానుభవమునన్నిత్యశుద్ధ।మాత్మవిజ్ఞానమయమువేఱయ్యుగుణము।
ప్రకృతికార్యమనోవృత్తిఁబట్టిపొందు॥ చ॥కలఁగనిలేచియున్నగలఁగన్నసమస్తవిధంబుకల్లగాఁ।దలఁచినభంగిమానసప
దార్థముచేనిఖిలేంద్రియార్థముల్ ।బలమునఁగట్టితజ్జ్ఞుఁడుప్రపంచములేదనుఁదన్మనంబుఁదా। దలయకఁగట్టుమన్ప్రభు
లకవ్వలనొండొకభేదమున్నదే॥గీ॥సాంఖ్యయోగనిగమసత్యతపోదమ।ములుమనోనిరోధములుగడపల। గాఁగనుండుజల
ధికడపలగాఁగల।నదులభంగినళిననయనలార॥మ॥చెలువల్దవ్వులనున్నవల్లభులపైఁజిత్తంబులంగూర్తురు।త్కలికంజేరు
వవారికంతెనదియుండగాఁదెప్పుడున్నన్నుమీ। రలుదింతించుచునుండఁగోరియిటుమారస్థత్వముంబొందితిన్। దలకంబో
లమనన్నుఁబొందెదరునిత్యధ్యానపారీణలై॥ వ॥ అనిమీకుంజెప్పుమనికృష్ణుండుచెప్పెననవుడునుద్ధవునికింగోపికలుసంత
సించియిట్లనిరి॥ఉ॥ఇమ్ములనున్నవాఁడెహరియిక్కడికెన్నఁడువచ్చువచ్చిమా।యుమ్మలికంబువాపునెప్రియుండిటువచ్చె
దనన్నసైతురే।యమ్మధురాపురీరమణులక్షువస్తురుగాకచెల్లరే।మమ్మువిధాతనిర్దయుఁడుమన్మథవేదనపాలుచేసెనే॥
చ॥మఱచునెకోమదిందలఁచిమాధవుఁడాయమునాతటంబున। న్నటుచుగదివ్యసౌరభలతాగృహసీమలనేమురాగమా।
మఱుపులనుండిసీడలకుమమ్మెలయించికలంచిదేహము। ల్మఱచినచెర్చినూఁక్కొలిపిమన్మథలీలలఁజేల్పుచందముల్॥ శా॥ నీ
తోనన్మగృహంబులంబలుకునేనేమెల్లవంశోల్లస।త్కీలభ్రాంతలమైకలిందతనయాతీరంబునంజేరిన। న్వైతోజాతసుఖంబు
లందనిపిమాచిత్తస్థితుల్చాడలీ।లాతంత్రజ్ఞతదాఁగిమెల్లనమదాలాపంబులాలించుటల్॥క॥ముచ్చటవేళలఁజెప్పునె।య
చ్చుగమునునేమునోము నప్పుడుజలముల్ । సొచ్చిన మాచేలంబులు । ముచ్చిలియిచ్చినవిధంబు మూలంబెల్లన్॥
శా॥ ఏకాంతంబుననీమపైనెరిగితానేమేనిభాషించుచో। మాకాంతుండువచించునేరవినుతామధ్యప్రదేశంబున।న్రా
కాచంద్రమయూఖముల్మెలయఁగారాసంబుమాతోడనం।గీకారంబొనరించిబంధనియతింగ్రీడించుపన్నాణముల్॥సీ॥త
నుఁబాసియొక్కంతతడవైననిటమీఁదనేలపైమేనులునిలువవనుము । నేలపైమేనులునిలువకయుటమున్నధైర్యంబులా
క్కటఁదలఁగుననుము।ధైర్యంబులొక్కటఁదలఁగినపిమ్మటఁజిత్తంబులిక్కడఁజిక్కవనుము। చిత్తంబులిక్కడఁజిక్కకప
చ్చినప్రాణంబులుండకపాయుననుము। ప్రాణములుపోవమాతివచ్చిప్రాణవిభుఁడు। ప్రాణరక్షకుఁడగుచున్నఁబ్రాణులె
ల్లఁ। జేరిమాఅంగమఁటియేమిసేయువాఁడు। వేగవిన్నపమొనరింపవేమహాత్మ॥క॥తగులరెమగలనుమగువలు।దగులదెతను
మున్నగములదగవువిడిచియున్। దగిలినమగువలవిడుచుట।దగుఁదగదనితగవుఁబలుకఁదగుమహరికిన్॥సీ॥ విభుఁడుమా
ప్రేపల్లెవీథులనేతేరఁజూతుమేమొకనాఁడుచూడఁగలరఁ। బ్రభుఁడుమాతోనర్మభాషలుభాషింపవిందుమేమొకనాఁ
డువీనులలరఁ।దమవాలుపులకింపదయితుండుడాసినఁగలుగునేయొకనాఁడుకౌఁగిలింపఁ। బ్రాణేశమమ్మేలపాసితివనిమా

ఱేఁడొరుకునే యొకవాఁడుతో ద్రుపదఁగ।వచ్చునే హరి మేమున్న వనముఁ జూడఁ।దలఁచునే భర్తమాతోడి తగులు తెరఁగు। దెచ్చునే విధిమున్నాథుఁ దిట్టుపడక।మెఱుఁగ బలుకుమ మాహాత్మ్య మీకెఱుఁగవచ్చు॥ వ॥ అని దుఃఖార్ణవమగ్నంబైన గోపకులంబు నుద్ధరింపుము రమానాథ యని గోపికలు వగచి తదనంతరంబ మఱియు నుద్ధవనిగదితంబులైన కృష్ణసందేశంబుల వలన విరహవేదనలు విడిచి యయ్యుద్ధవుని బూజించి రిట్లు కృష్ణలీలావర్ణనలు సేయుచు వ్రేపల్లె నుద్ధవుండు గొన్ని నెలలుండి నందాదుల వీడ్కొని మఱలి రథారూఢుండై చనిచని॥ క॥ సారమతిఁ బ్రణుతి సేయుచు। నారయ నుద్ధవుఁడు గాంచె నఘసంహారి। న్నారి న్మధురానగరవి।హారిం గారిపుజనపదాపహారి న్శౌరిన్॥ వ॥ కని యథోచితంబుగా భాషించుచుఁ దన చేత నందాదులు పుత్తెంచిన కానుకలు బలకృష్ణులకు నుగ్రసేనునికి వేలు వేలు నిచ్చెనని చెప్పి శుకుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె॥ మ॥ తనుమున్నంగ

## కృష్ణుండు ఉద్ధవునితోఁ జేరుకొని కుబ్జాగృహంబునకు నఱుగుట.

జకేళిఁ గోరిన లతాతన్వి న్గారతిక్రీడల।న్దనుపం గోరి జనార్దనుండటకు గేరత్నస్వర్ణమాల్యానులే।పనభూషాంబరధూపదీపపరిదీప్తంబై మనోజప్రదీపనమై యున్న తదీయగేహమునకున్ బంచేషుపంచేషుఁడై॥ ఇట్లు ఱిగిత గేహంబున॥ గీ॥ కామశరము వోలెఁ గమలాళికళ వోలె। మెలఁగియాడ నేర్చు మెఱుఁగు వోలె।నిఖిలభువనమోహినీ దేవతయుఁ బోలెఁ। జెలువు మెఱసియున్న చెలువఁ గనియె॥ మ॥ హరి యేతెంచిన లేచి సంభ్రమముతో నాళీసమూహంబుచే। సిరి యొప్పన్ విహితోపచారములు తాఁ జేయించి సౌవర్ణసం।వరతల్పస్థితుఁ జేసి యుద్ధవుని నుద్యత్ప్రీతిఁ బూజించి భా। సురపీఠంబున నుండుమంచు మది నౌత్సుక్యంబు శోభిల్లఁగన్॥ క॥ ఆళీనివహనివేదిత।మాలామృగనాభిపంకమణిమయభూషా।చేలాలంకృతయగుచును। హేలావతి గోరె వనరుహేక్షణుఁ గవయన్॥ క॥ లీలావతి సుకృతోల్లస।దేలాకర్పూరమిళితహితమధురసుహా।హాలారసపానను మ।శ్రీలాలితయగుచు నబల చేరెఁ గృష్ణున్॥ వ॥ సరసాలోకనవృష్టి పైఁ గురియుచున్న న్యగ్వచోవైఖరిన్। గరగన్ జేసి సువర్ణకంకణసముగ్రంబైన సైరంధ్రి కేల్దరపద్మంబునఁ బట్టి తల్పమునకాకర్షించి గంభీరత।న్సరిరంభాములనానవృద్ధి మసగు సంభావించుచు న్వేడుకన్॥ ఉ॥ జాతియుఁ గాలముం గళయు సత్త్వము దేశము భావచేష్టలు। న్ధాతువుఁ బ్రాయముం గుణముఁ జద్దశయున్ హృదయంబుఁ జూడ్కియున్।బ్రీతివిశేషముం దెలిసి పెక్కువిధంబులఁ బొయ్యెలిన్మనో।జాతసుఖంబులం దనిపె శౌరి వధూహృదయాపహారియై॥ క॥ కరపద్మంబుల మాధవుఁ।గర మొప్పం గౌఁగిలించి కామానలము। న్దరభోరువు వర్జించెను।గరము దనితోడి శీతకరముఖులలరన్॥ మ॥ సనకాహ్లాదులపోసి కాననవిభున్ సర్వప్రభున్ మల్లభున్। మును దానిచ్చిన యంగరాగసుకృతామోదంబునన్ గూడియున్।ఘననిర్వాణవిభూతి యిమ్మనక నా కంజాక్షునే వాయఁజా। లననుం గొన్నిదినంబులం గభవకేళిం దేల్పవే నాపుమన్॥ గీ॥ వనిత గోరుకొనిన వరమిచ్చి శౌరియా।యుద్ధవుండు దానును విడయిల్లు। దెడలి రపుడు తియ్యవిలుకాఁడు సురభితో।దీగె యిల్లు వెడలు తెఱఁగు మెఱయ॥ క॥ ఏ వేదంబులఁ గానని దేవోత్తముఁ గాంచి ముక్తి తెరువడుగక రా।జీవేక్షణరతి యడిగెను।భావింపఁ దదీయకర్మఫలమెట్టిదియో॥ క॥ కారుణ్యంబునఁ గృష్ణుఁడు। దాసుణ్యము మెఱసి మదనతంత్రంబుల లీ।లారణ్యపీఠిఁ దేల్చెను। సైరంధ్రిన్ విభవవిజితశక్రపురంధ్రిన్॥ వ॥ తదనంతరంబ కృష్ణుం డుద్ధవరామసహితుండై హస్తిపురంబునకు నక్రూరుని బనుపం దలంచి తద్గృహంబునకుం జనిన నతండు వారలం గని లేచి రామకృష్ణులకు నమస్కరించి యుద్ధవుం గౌఁగిలించుకొని వారి నందఱ యథావిధిం బూజించి హరిపాదంబులు దన తొడలమీఁద నిడుకొని యిట్లనియె॥ క॥ అనుచరులుఁ దానుఁ గంసుఁడు।సని యెన్ని చేతజముని సదనంబునకున్। ఘనులార మీ బలంబున।నౌనరఁగ యాదవుల వంశ ముద్ధృతమయ్యెన్॥ వ॥ మహాత్ములారా మీరు విశ్వాదిపురుషులరు, విశ్వకారణులరు, విశ్వమయులరుగుట, మీకుఁ గార్యకారణంబులు లేవవధరింపుము-పరమేశ్వరా నీవు రజోగుణంబున నఖిలంబును సృజియించి కారణరూపంబునఁ దదనుప్రవిష్టుండవై కృతదృష్టకార్యరూపప్రపంచాకారంబున దీపింపుదువు, కార్యరూపచరాచరదేహంబులకుం గారణంబులైన భూప్రముఖంబులను గతంబులై నఁ గార్యరూపదేహంబులు నై ప్రకాశించు చందంబున నొక్కండవు కారణహేతుండవు నాత్మతంత్రుండవు నై యుండియు విశ్వాకారంబునఁ బెక్కగుదువు సృష్టిస్థితిలయంబులఁ జేయుచుండియు విజ్ఞానమూర్తి వగుటం బరిభ్రాంతుండైన జీవుని భంగి గుణకర్మబద్ధుండవు కావు కావున సిద్ధంబు తన్నిమిత్తంబున బంధహేతువు సిద్ధింపదు॥ సీ॥ పరగ జీవునికైన బంధమోక్షములంటవంటునే పరతత్త్వమైన నిన్ను।నంటు నేయాశ దేహాద్యుపాధులు ననిర్వచనీయములు గాన వగుసనీకు। జన్మంబు జన్మసంశ్రయభేదమును లేమ కావున బంధమోక్షములు లేవు।గణుతింపని న్నులూఖలబద్ధుఁడనుటయు నహిముక్తుఁడనుటయు నస్మదీయ।బాలబుద్ధి గాదె పాషండముఖరమా।ర్గముల చేత నీ జద్ధితార్థ।మైన వేదమార్గ మడఁగిపోవచ్చిన।నవతరించి నిలుపుదంబుజాక్ష॥ క॥ ఆ నీవు ధరణిభారము।మానిచి రక్కసుల నెల్ల మర్దించుట

కై । యానకదుందుభి యింటను । మానక జన్మించితివి సమంచితకీర్తీ ॥ మ ॥ త్రిజగత్పావనపాదతోయములచే దీపించి వేదాపుర । ద్విజముఖ్యాకృతివైన నీవు కరుణన్ వచ్చేయుటం జేసి మా । నిజగేహంబులు ధన్యతం బొదవ నేఁడో నిన్నార్యులర్చింపఁగా । నజితత్వంబులు వారికిత్తువనుకంపాయత్తచిత్తుండవై ॥ శా ॥ ఏపుణ్యాతిశయప్రభావమున నో యీ జన్మమందిక్కడన్ । నీ పాదంబులు గంటి నిన్నెఱిఁగితిన్ నిర్వర్గగృహాళుండవై । నాపైనర్మిలిఁ జేసి మాన్పఁగదవే నానాథనాగారకాం । తాపుత్త్రాదులతోడి బంధనము భక్తత్రాత చింతామణీ ॥ వ ॥ అని పలికిన నుచున నక్రూరునికి మాటలవలన సంసారసంబంధంబ

**కృష్ణుం డక్రూరుని హస్తినాపురంబునకుఁ బంపుట.**

గు మోహంబు గీలుకొలుపుచు హరి యిట్లనియె ॥ క ॥ బంధుండవు సద్భ్యోహిత । సంధుండవు వావిఁ జూడ జనకుఁడవు కృపా । సింధుండ వెల్లగుణముల । నంధుండవు గావు ప్రోవ నర్హుల మెంచన్ ॥ చ ॥ కొలుతురు మర్త్యులిష్టములు గోరి శిలామయదేవసంఘమున్ । జలమయతీర్థసంఘమును సంతతమున్నటు వారు గొల్వఁగా । వలవనరాము గాక భగవత్పదభక్తులరైన మీ క్రియన్ । సొలయక దేవతీర్థములు చూచిన యంతనె కోర్కు లిచ్చునే ॥ వ ॥ మహాత్మా పరమభాగవతుండవైన నీవు మాకభీష్టంబు లొనరింప నర్హుండవు వినుము పాండురాజు పరలోకగతుండైనఁ గుంతీసహితులైన పాండవులు ధృతరాష్ట్రుశాసనంబున నేతెంచి కరిపురంబున నున్నవారట నిజపుత్త్రమోహితుండగు నయ్యంధనృపతి వారియందు సమత్వంబునం జరింపఁడట కావున ॥ క ॥ వారలు బంధులు గావున । వారలకును మేలొనర్చి వారలరంగా । వారింపవలయు దుఃస్థితి । వారిజరిపువంశ పొమ్ము వారిం జూడన్ ॥ వ ॥ అని పలికి సంకర్షణోద్ధవసహితుండై హరి నిజగృహంబునకుఁ జనుటయు నక్రూరుండు కౌరవరాజధానియగు కరిపురికరిగి యందు ధృతరాష్ట్ర భీష్మ విదుర బాహ్లిక భారద్వాజ గౌతమ సుయోధన కర్ణాశ్వత్థామాదులన్ గుంతీసహితులైన పాండవుల నందఱి నబంధువులను గని యథోచితసత్కారంబుల నొందితత్తద్వర్తనంబు లెఱింగికొనుచుఁ గొన్నిదినంబు లుండ నొక్కనాఁడు విదురుండును నేకతంబున నక్రూరునికిఁ గుంతి యిట్లనియె ॥ శా ॥ అన్నా తల్లులు సంత్రులున్ భగినులున్నల్లుండ్రు మద్భ్రాతలు । న్నిన్నుం బొమ్మను వేళ నేమనిరి మా నెవ్వల్వు చారింతురే । యున్నారా సుఖయుక్తులై నృగవృకవ్యూహంబులో నున్నరే । ఖిన్నే విక్కడ నున్నదానఁగు మనఃకౌరవ్యమధ్యంబునన్ ॥ మ ॥ కలపించెన్ ఫణికోటిచే లలితకలంగట్టించి గంగానదిన్ । న్నెఱిఁ ద్రోపించె విషాన్నితాన్న మొసఁగె న్నిద్రారతిన్ జెందిరే । మఱియుం దర్పబోడిపించె నాయుధములన్ మత్పుత్త్రులం దేమియున్ । గొఱగాఁడీ ధృతరాష్ట్రసూనుఁడు మహాక్రూరుండు క్రౌర్యంబునన్ ॥ మ ॥ బలుఁడుం గృష్ణుఁడు నెన్నఁడైన దమలో భాషించి మేనత్తబి । డ్డలమన్మేలుఁ దలంతురే వగపులన్ డయ్యంగఁ బాలయ్యెనే । జలజాతాక్షుఁడు భక్తవత్సలుఁడు రాచక్రంబు భాగించి యి । మ్ములనిప్పించునె నా కుమారకులకున్ ముఖ్యప్రకారంబునన్ ॥ వ ॥ అని పలికి కృష్ణునిఁ జిత్తంబున నిల్పి నమస్కరించి సంకీర్తనంబు చేసి సర్వాత్మ సర్వపాలక పుండరీకాక్ష శరణాగతనైన నన్ను రక్షింపు రక్షింపుమని వగచుచున్న కుంతికి నక్రూరుండు విదురసమేతుండై ప్రియవచనంబుల దుఃఖోపశమనంబు చేసి వీడ్కొని బంధుమిత్రమధ్యంబున సుఖోపవిష్టుండైన ధృతరాష్ట్రునకిట్లనియె ॥ ఉ ॥ నీ యనుజుండు పాండుధరణీ

**అక్రూరుండు ధృతరాష్ట్రునితో హితోపదేశరూపముగా సంభాషించుట.**

విభుఁడీల్గిన నీవు భూమిధ । గ్ర్యాయతబుద్ధి నేలుచుఁ బ్రజావళిఁ గాచుచుఁ గౌరవంబుతోఁ । బాయక లోకులందు సమభావతఁ జేసితివేని కీర్తియున్ । శ్రేయముఁ గల్గు వేఱొకటిఁ జేసిన దుర్గతి గల్గు భూవరా ॥ సీ ॥ అవనీశ పాండవులందు నీ నందనులందు సమానుండవగుట బుద్ధి । యెవ్వనితో యోగ మిం దెవ్వనికి నిత్య మంగనాగారపుత్త్రాదికములు వలన నయ్యెడి దేమి వసుమతి నొకజంతువుదయింప నొకజంతువుక్కడంగు । నొకఁడు పుణ్యముఁ జెందు నొకఁడు పాపము నొందు మీనజీవనభూతమిళితజలము । తత్తనూజు లెట్లు ద్రావుదురట్లు మూఢాత్ము విత్తమెల్ల నపహరింతు రహితులైన కొడుకులటమీఁద మనిమైనఁ జచ్చియైనఁ దండ్రి జాడఁ జనరు ॥ క ॥ కావున మూఢాత్ముఁడవై । నీ వార్జించిన ధనంబు నీపుత్రులు దుఃఖావహులు పంచుకొనఁగా । భూవర నిందితుఁడవగుదు భూనాకములన్ ॥ శా ॥ నిందం బొందకుమయ్య యీ తనువు దానిద్రాకళాదృష్టమా । సందోహంబు విధంబు నిల్వదు సుమీ జాత్యంధతం బొందియున్ । మందప్రజ్ఞత లేల చేసెదవు సమ్యగ్జ్ఞానచక్షుండవై । సందేహింపక యిమ్ము పాండవులకున్ సర్వంసహాభాగమున్ ॥ అనిన ధృతరాష్ట్రుం డిట్లనియె ॥ సీ ॥ నీ మాట మంచిది నిశ్చయమగునైన నస్థిరంబైన నా యంతరంగ । మందు నిల్వదు సుధామాచలస్ఫటికశిలాతతచ్యుతతటిల్లతిక భంగి । నమృతంబు నొందియు నానందిరుఁడు గాని నరుమాడ్కి నేను నానంద మొంద । నీశ్వరాజ్ఞావిధ మెవ్వఁడు దప్పింప నోపు విజ్ఞానిరై యుండిరైన । విశ్వమెల్లఁ జేసి విభజించి గుణముల । నెవ్వఁడనుపరించె నెవ్వఁడవని । భారమెల్లఁ బాయఁ బ్రభవించె దేవకికెవ్వఁ డాత్మతం

త్రుండీశ్వరుండు॥ వ॥ అట్టి కృష్ణునకు నమస్కరించెద, నానందనందనుని, దివ్యచిత్తంబునం గల తెఱంగున సం, బ్రతుకం గలవార మని వీడ్కొలిపిన, నక్రూరుండ తని తలంపు తెఱంగి యిట్లనియె, నీ తలంపుఁ గనుంగొంటి, నీ కిష్టంబగునట్లు వర్తింపుమని పలికి, మఱలి మధురకుం జనుదెంచి, తదీయవృత్తాంతంబు రామకృష్ణుల కెఱింగించె, నంతఁ గంసభార్యలగు, నస్తియుం, బ్రాప్తియు విధవలై దుఃఖించుచుం, దమ తండ్రి యైన జరాసంధునికడకుం జని॥ శా॥ వాండ్రున్ వీండ్రును రాజు లేయనుచు గర్వప్రౌఢితో

## జరాసంధుఁడు మధురమీఁద దండెత్తి వచ్చి కృష్ణునితో యుద్ధము సేయుట.

యాదవుల్ । వేండ్రంబైన బలంబుతో మధురకున్ వచ్చి నిష్కారణం । బాండ్రున్ స్త్రీఘ్నులు బంధుఘ్నులు నవ్వ గవఁ గంసాదిక్షమానాథులన్ । బండ్రీ చంపిరి కృష్ణుచేత నిటువై ధవ్యంబు వచ్చె స్వామీ॥ వ॥ అని నవిని ప్రళయకాలానలంబు తెఱంగున నుండిపడి, శోకరోషంబులు బంధురంబులుగా, జరాసంధుం డిట్లనియె॥ శా॥ యేమీ కంసునిఁ గృష్ణుఁ డేరణములో హింసించెనో చెల్లనా । సామర్థ్యంబుఁ దలంపఁ డించుక యుమచ్చండప్రతాపానలో । ద్దామార్చుల్ వడి నేఁడు గాల్చి యదుసంతానాటవీవాటికన్ । ధూమింగ్రుంగిన నింగి వ్రాకిన మహాంభోరాశిలోఁ జొచ్చినన్॥ క॥ యాదవపరహితయగుభో । మేదిని నాచేత నేఁడు మీఁదు మిగిలి సం । పాదితబలులై హరిరు । ద్రద్రుహిణేంద్రాదు లెవ్వ రడ్డంబైనన్॥ అని పలికి, సమరసన్నాహసంకులచిత్తంబునఁ, గోపంబు దీపింప, సంగరభేరి వ్రేయించి కదలి॥ క॥ దళముం డై యిరువదియు మూఁ । డక్షౌహిణులై నబలములను గతములుగా । నక్షుణు జరాసంధుఁడు । ప్రక్షోభముతోడ మధుర పైఁ జనియె నృపా॥ క॥ గంధేభతురగరథభట । బంధురచరణోద్ధితోగ్రపాంసుపటలయో । గాంధీభూతము లై దివి । మంధరగతి నడచె నపుడు మార్తాండహరుల్॥ వ॥ ఇట్లు చని, నిరంతరకిసలయపత్త్రకోరక కుసుమఫలభారవినమితవృక్షవిలసితమహోద్యానంబును, ద్యానవనభాగవలమానజలోన్నయనదారుయంత్రలతానిబద్ధకలశవిముక్తసలిలధారాశీకరపరంపరాసంపాదితవర్షాకాలంబును, గాలకింకరసదృశవీరభటరథతురగసామజసంకులంబును, కులాచారధర్మప్రవీణపౌరజనభాసురంబును, సురాభేద్యమాన మహోన్నతాట్టాలకయంత్రభయంకర ప్రాకారచక్రంబును, జక్రసారసహంసాదికలకలరవకలితసరోవరంబును, సరోవరసంఫుల్లహల్లకకమలపరిమళమిళిత పవనవిరాజితంబును, జితానేకమండలేశ్వరభూషణ మణిగణరజోనివారితమదగజేంద్రదానజలప్రభూతపంకంబును, పంకరహితయాదవేంద్రదత్తసువర్ణాచలకల్పతరుకామధేనుసమృద్ధితవిద్వజ్జననికేతనంబును, కేతనసన్నిబద్ధచామరమయూరచాపశింజినీనినదపరిపూరితాభ్రంబు, నభ్రంలిహమహాప్రాసాదసౌధగవాక్షరంధ్రనిర్గతఘనసారధూపధూమపటలవిలోకనసంజనితజలధరవిభ్రాంతశిఖండితాండవరుచిరంబును, నిరంతరానేకదేవాలయజోఘుష్యమాణ తూర్యనినదపరిభావితపారావారకల్లోలఘోషంబును, ఘోషకామినీప్రాణవల్లభబాహుదండపరిరక్షితంబును నై, పరులకు నలక్షితంబైన, మధురానగరంబు చేరి, వేలాలంఘనంబు చేసి, వెల్లివిరిసిన మహార్ణవంబు తెఱంగున, బట్టణంబునకు ముట్టణంబు చేసి, చుట్టును విడిసిన, జరాసంధుని బలౌఘంబు గని, వేలావిముండను హరితనమనంబున॥ మ॥ అయుతంబుల్ నాలుగు నాలుగు రెండును నిరుమూఁ డక్షౌహిణుల్ సేసి సం । ఛాదించెన్ బుర మెల్ల మాగధుఁ డెడన్ వాసంబు దానంబు సం । భేదంబుల్ పని లేమ దండవిధి శోభిల్లం బ్రయోగించి యీ । భూదేవీవరభార మెల్ల నుడుపం బోలున్ జయోద్భాసినై॥ క॥ పనివడి తిరింపు మెల్లను । మానుగఁ జతురంతధరణిమండలభరముల్ । మానుపుకొఱకుం గాదే । పూనెద నివి మొదలు దగిలి భూభరము డపన్॥ గీ॥ మగధనాథుం బోర మడియింపం బోలదు । మడియకున్న వీఁడు మఱలి మఱలి । బలముఁ గూర్చుకొనుచుఁ బఱతెంచుఁ బఱతేర । దుంపవచ్చు నేలదో సఁగుదొఱఁగ॥ వ॥ అని యిట్లు చింతించుచున్న సమయంబున నభోభాగంబుననుండి, మహాప్రభాసమేతంబులును, సపరిచ్ఛదసూతంబులు, ననేకబాణబాణాసనచక్రాదివివిధాయుధోపేతంబులు నైన, రథంబులు రెండును మనోరథంబులు పల్లవింప, దైవయోగంబునం జేరవచ్చినం జూచి, హరి సంకర్షణునకిట్లనియె॥ శా॥ కంసారాసురథంబులా యుధములున్నాథ ప్రకాశంబులై । మింటన్ వచ్చెను వీనిఁ గైకొని సురమ్లేచ్ఛన్నృపశ్రేణులన్ । బంటింపం బని లేమ చంపుము ధరాభారంబు వారింపుమీ । వెంటన్నీ యవతారముల్ సఫలతా వే వేగ లెమ్మాజికిన్॥ అని పలికి॥ క॥ ఖరులై దృఢకవచధను । శ్శరులై యధిగతరథానుచరులై సుదప । త్కరులై ఘనహారులై బల । హరులమ్యోడ నాజికేఁగి రతిభీకరులై॥ ఇట్లు సమరసన్నాహంబునం, బురంబు వెడలి॥ ఉ॥ అన్యులు తల్లడిల్ల దనుజాంతకుఁ డొత్తె గభీరఘోషకా । ధిన్యమహాప్రభావవికటీకృతపద్మభవాండజంతువై । ధన్యము ధన్యముల్ దివిజతాపసమాన్యముఁ బ్రీతభక్తరా । జన్యము భీతమచ్చరితశాత్రవసైన్యముఁ బాంచజన్యముల్॥ క॥ సింధురభంజనపూరిత । బంధురతరశంఖనినదభారమున జరా । సంధునికిం గలసైన్యము । లంధములై సంచలించె నాహవభూమిన్॥ అయ్యవసరంబున మాగధుండు మాధవున కిట్లనియె॥ సీ॥ అదలించి విరోష్ఠంగ నాలమందలు గావు గంధగజేం

యుధుఁడు లోకోత్కృష్టబాహాబల। శ్రీధారేయుఁడు కృష్ణుఁ డిట్టిఘనులకున్ జిత్రంబు నేఁ డిట్లు సం। రోధించెన్ బలముం దెర
ల్చెమ్మగ ధేంద్రుం డంచు నీక్షించుచున్। సౌధాగ్రంబులఁ బౌరకాంతలు మహాసంతప్తలై రెంతయున్॥వ॥ ఇట్లు తన క్రొమ్మొన
లు విరిగి పాఱినం గనుంగొని సమరసంరంభంబున హరి విశ్వంభరాభరణ వేదండతుండాభంబులగు బాహుదండంబులఁ బెం
చి విజృంభించి బ్రహ్మాండకుహరకుంభ పరిస్ఫోటనంబగు పాంచజన్యనినదంబు, నిబిడనిర్ఘాతశబ్దంబుగ, నుదంచితపింఛదా
మంబు సంక్రందనచాపంబుగఁ, బ్రశస్తహస్తలాఘవంబున శరాకర్షణసంధానమోక్షణంబు లేర్పడక, నిర్వక్రచక్రాకా
రంబు తోడ మార్తాండమండల ప్రభాప్రచండంబగు శార్ఙ్గకోదండంబు క్రొమ్మెఱుంగులుగ, దిగ్గజేంద్రకర్ణభీషణంబులగు
గుణఘోషంబులు ఘుమఘుమారావమన్నహంబులైన గర్జనంబులుగ, రథతురంగమరింఖాసముద్ధూతపరాగపటల పరంప
రాసంపాదితపుంజీభూతంబగు పెంజీకటియిరులుగ, నసమసమరసన్నాహచాతురీవిశేషంబులకుం జొక్కి నిక్కి కరంబు లె
త్తిన నర్తనంబులం బ్రవర్తించు నారదాదులు లీలాతాండవమండితమహోత్కంఠంబులగు నీలకంఠంబులుగ, సుందరస్యంద
ననేమినిర్ఘోషభీతులై కుంభికుంభంబుల పై వ్రాలు వీరులు మత్తమయూరకేకారవచకితులై యువతికుచకుంభంబుల మీఁద
వ్రాలెడు కాముకులుగ, నానానరేంద్రరక్తపిపాసాపరవశంబులై వాచరించుచున్న భూతవ్రాతంబులు వర్షవర్షణనిస్వనం
బు లొసంగు చాతకంబులుగ, నభంగసంగరప్రేరకుండగు హలాయుధుండు వృష్టికారణంబగు మందసమీరణంబుగ, ననల్పక
ల్పాంతకాలనీలబలాహకంబు భాతి నరాతిచతురంగ దేహక్షేత్రంబులం బుంఖానుపుంఖంబులుగ, నసంఖ్యాతబహువిధది
వ్యబాణవర్షంబు గురియు నెడ, శస్త్రాస్త్రపరంపరాసంఘట్టనజనితంబులగు మిడుగుఱులు వర్షాకాలపిహితవిద్యోతమానఖ
ద్యోతంబులుగ, విశిఖవికీర్ణకోటీరఘటితపద్మరాగశకలంబు లింద్రగోపంబులుగ, మహితమార్గణవిదళితమత్తమాతంగకుం
భమౌక్తికంబులు వడగండ్లుగఁ, జటులార్ధచంద్రశరచ్ఛిన్నచరణంబులై కృష్ణకృష్ణ నిలు నిలుమని పలుకుచుం గూలెడి మేను
లుక్కృషీవలకరపరశుధారావిదళితమూలవిశాలసాలంబులుగ, భాసురభల్లభగ్నంబులైన వదనగహ్వరంబులవలనం దొరలె
డు దంతపుంజంబులు మాలతీకుసుమమంజరులుగ, నవ్యనారాచభిన్నదేహంబులై దిగ్గనఁ గ్రొంగ్రొవ్వలన వెడలు రక్తస్యం
దనసందోహంబులతో సంచరింపక ప్రాణంబులు విడుచు శుండాలంబులు శిలయేఱులతోడి కొండలుగఁ, గఠోరకాండఖండితం
బులైన భుజాదండంబులతోడం గలసి పడిన వజ్రమయకంఠికాభరణంబులు భోగిభోగసమేతకేతకీకుసుమంబులుగఁ, బ్రళ
యార్ణవకల్లోలశబ్దసన్నిభంబులైన భేరీరవంబులు భీకరభేకీరవంబులుగ, దారుణేషువిలూనవాహవారణమనుజమస్తి
ష్కంబు రొంపియునై సొంపు మెఱయ నాభీలకీలాలప్రవాహంబులు ప్రవహించె నందు భుజంబులు భుజంగంబులుగఁ, గపా
లంబులు కమఠంబులుగ, శిరోజంబులు శైవాలంబులుగఁ, గరంబులు మీనంబులుగ, హయంబులు నక్రంబులుగ, గజంబులు దీ
వులుగ, ధవళచ్ఛత్రంబులు నురువులుగఁ, జామరంబులు కలహంసంబులుగ, భూషణరత్నరేణురాసులు పులినంబులుగ, నొ
ప్పెనప్పుడు॥లయవిభాతి॥హసితహరినీలనిభవసనము విశాలకటిసనను నయనాద్రిపరిహసితమగు మేఘూ। ల్లసనము వ
హింపఁగ రకిసలయము హేమమణివిసరవలయమ్యుతులు దెసలఁ దుదలం చర్న్। బసలఁ గురియంగ సరభసమున బలుండు దర
హసితసుముఖాబ్జమున నెసఁగ ఘనకాలా। యసమయమహోగ్రతరముసలము వడిన్ విసరి కసిమసఁగి శత్రువుల నసువు
లను బాపెన్॥లయవిభాతి॥ప్రలయసమయాంతకుని చెలువునఁ గటాక్షముల నలఘుచటులాగ్నికణములు చెదరఁ గోలా।
హలముగ సువర్ణమణివలయనిచయోజ్జ్వలితహలము వడిఁ జాఁచి శిరములు నురములున్ని। ర్దళితములుగ న్నకలములుగ నొన
రింపఁగని బెలుకురి జరాసుతుని బలము రణవీథి। జ్వలితదనుజావలికి బలికి భయభీతసురఘలికిఁ ద్రిజగచ్ఛలికి హలికిఁ దలడించెన్॥
శా॥ రోషోద్రేకకళాభయంకరమహారూపంబుతో నెక్కుచే। సీసాదండము సాఁచి లాంగలము భూమీశోత్తమగ్రీవలన్।
భూపాలాలఁ దగిల్చి రాఁదిగిచి సంపూర్ణోద్ధతిన్ రోఁకటన్। వేషంబుల్ చెడ మొత్తె రాముఁ డురణోర్విన్ నెత్తురుల్ గ్రొత్తి
లన్॥క॥హలిహలహృతకరికుంభ। స్థలముక్తాఫలములొలిఁ దనరెఁ గృషికలాం। గలమార్గకీర్ణబీజా। వలికైవడి నచ్యుతాహవ
క్షేత్రమునన్॥ క ॥ తఱిమి హలిహలము విసరుచు। నెఱిఁ గడిసిన బెగడి విమతనికరము లెడలై। వెఱఁగుపడు నొదుగు నడఁగు
ను। మఱుపడుఁ జెడు మడియుఁ బొరలు మఱలున్ దెఱలున్॥క॥ *హరితిగ్మగోశతంబుల। హరిదంతరమెల్లఁ గప్పు నాకృతిఁ గడి

క్రొ మొనలు। సేనలు. *హరితిగ్మగోశతంబులన్॥ హరి। సూర్యుఁడు, తిగ్మ। తీక్ష్ణములైన, గోశతంబులన్। కిరణసమూహముచేత, హరిదంతర
మెల్లన్। దిఙ్మధ్యప్రదేశములనన్నింటిని, కప్పునాకృతిన్। కప్పినట్లు, కడిమిన్। పరాక్రమముచేత. హరితిగ్మగోశతంబులన్॥ హరి। శ్రీకృష్ణుఁడు, తి
గ్మ। పదునుగలిగిన, గో। బాణములయొక్క, శతంబులన్। నూఱులచేత, అతిభీకరుఁడై। మిగుల వెఱపుగలుగఁ జేయుచున్నవాఁడయి, హరిదంత
రమెల్లన్। దిశామధ్యప్రదేశములనన్నింటిని, కప్పెన్। ఆచ్ఛాదించెను.

మిన్ | హరితిగ్మగోశతంబుల | హరివంతర మెల్లఁ గప్పె నతిభీకరుఁడై. ॥ సీ॥ పదునుఁ రేగురు దీర్ఘబాణముల్ గాడినఁ గుదులు గ్రుచ్చినభంగిఁ గూలువారుఁ | సలలు ద్రెవ్వినమున్న దారుపీఠించిన వారల నొప్పించి వ్రాలువారుఁ | బదములు దెగిపడ్డ బాహులఁ బోరి నిర్మూలితబాహులై మ్రొగ్గువారు | *క్షతముల రుధిరంబు జల్లింప నిర్ఘరయుత శైలముల భంగి నుండువారు | భ్రాతృపుత్రమిత్రబంధువుల్ వ్రీగిన | నడ్డ మరుగు దెంచి యడఁగువారు | వాహనములు దెగిన వడి నన్యవాహనాధిష్ఠులగుచు నెదిరి ద్రెళ్లువారు॥ మఱియును॥ శా॥ ఈ కాయంబులఁ బాసినంతటనె మా కెగ్గేమి జేకృత్యముల్ | నీకుం జెల్లమ కృష్ణ నిర్జరుల మై నిన్నోర్తు మీమీఁదటన్ | వైకుంఠంబున నుంచు బల్కు క్రియ దుర్వారాస్త్రభిన్నాంగులై | యాకంపింపకఁ గొందఱాడు మరుగర్వాలాపముల్ గృష్ణునిన్॥ ఇవ్విధంబున॥ క॥ జగతీశ యేమి చెప్పుదు | నగణితలయవార్ధి భయదమై మూఁగిన య | మ్మగధేశు బలము నెల్లను | దెగఁ జూచిరి హరియు హలియుఁ దీవ్రక్రీడన్॥ క॥ భువనజనుఃస్థితివిలయము | లవలీలం జేయు హరికి నరినాశన మెం | తవిషయమైన మనుజుఁడై | భవమొందుటఁ జేసి పొగడఁబడియెన్ గృతులన్॥ ఆ సమయంబున॥ శా॥ శ్రీ అంహస్కర్ములు డల్లడిల్ల భయదాహంకారుఁడై సీరి దోః | సంహారం బొప్ప హలాహతిన్ రథనమారథ్యంబులం గూల్చి తత్ | సంహారస్పృహఁ జొచ్చి పట్టెను జరాసంధున్ మదాంధున్ మహా | సింహంబున్ బ్రతిసింహముఖ్యము బలశ్రీఁ బట్టు నేర్పేర్పడన్॥ ఇట్లు పట్టుకొని. ఉ॥ †కుంఠితులై పరుల్ వెగడ ఘోరబలుండు బలుండు వాని సో | ల్లుంఠములాడుచుం దిగిచి లోకభయంకరమైన ముష్టిచేఁ | గంఠగతాసుఁ జేసి తమకంబున మొత్తఁగ భూభరక్షయో | త్కంఠుఁడు చక్రి మీఁదెఱిఁగి కార్యము గల్గని మాన్పి యిట్లనున్॥ శా॥ దుఃఖింపంబని లేదు పొమ్ము బలసందోహంబులన్ దైన్యముం | జేతఃఖేదంబెడలం గరమ్ము రిపులం దండింపు కాదేని భూ | స్వఃఖేలజ్జన మెల్ల మెచ్చ నృపసీశౌర్యోన్నతుల్ వ్యాపి మే | దఃఖండంబులు భూతముల్ దినఁ దనుత్యాగంబు సేయం దగున్॥ వ॥ అనిన గుచు విడిపించిన, విడివడి, చిడిముడికి నగ్గలంబైన సిగ్గున మ్రొగ్గి, నెమ్మొగంబు నూపక, కోపకపటభావంబులు మనంబునం బెనంగొనఁ, దపంబు చేసి దైవన, వీరలం జయించెదనని, పలాయితులైన రాజులం గూడికొనుచు, జరాసంధుండు విరిగి చనియె, సురలు కుసుమవర్షంబులు గురియ, హలియు హరియును, మధురానగరజనవందిమాగధ జేగీయమానులై, వీణావేణుమృదంగశంఖముఖ్యనినదంబులాఁకర్ణించుచు, మృగమదజలసిక్త విపులవీథికాశతంబును, వివిధవిచిత్రకేతనాలంకృతంబును, సువర్ణమణివజ్రజయస్తంభనిబద్ధతోరణసంయుతంబును, వేదనాదనినాదితంబును, సంతుష్టజనసంకులగోపురంబును నైన, పురంబు ప్రవేశించె నంత॥ ఉ॥ వెల్లువలైన వైరినృపవీరుల నెల్ల జయించి వీటికిన్ | బల్లిదులైన కృష్ణబలభద్రులు వచ్చుచు నున్నవారు రం | డుల్లములారఁ జూతమని యున్నతసౌధము లెక్కి వారిపైఁ | జల్లిరి పువ్వులాజములఁ బౌరపురంధ్రులు చల్లిరెల్లెడన్॥ వ॥ ఇట్లు పురంబు ప్రవేశించి యుద్ధప్రకారం బెల్లను నుగ్రసేనున కెఱింగించి కృష్ణుండిచ్ఛావిహారంబుల నుండె, మఱియు నేకవత్సరంబున, నమ్మాగధుండు, మహీమండలంబునం గల మట్టమహీపతుల నెల్లం గూడుకొని, సప్తదశవారంబులు, సప్తదశాక్షౌహిణీబలసమేతుండై, మధురానగరంబు పై విడిసి, మాధవభుజాప్రాకారరక్షితులగు యాదవులతోడ నాలంబు చేసి, నిర్మూలితబలుండై పోయి, క్రమ్మర నష్టాదశయుద్ధంబునకు వచ్చునెడం, గలహవిద్యావిశారదుండగు నారదుండు కాలయవనుకడకుం జని, యిట్లనియె॥ మ॥ యవనా నీవు సమస్తభూపతుల బాహాఖర్వగర్వోన్నతిం | బవనుం డభ్రములన్ హరించు పగిదిన్ భంజించియున్ నేల

## శ్రీ కాలయవనుండు శ్రీకృష్ణునిమీఁద దండెత్తి మధురాపురమును ముట్టడి వేయుట. శ్రీ

యాదవుల నెల్లవు వారలన్ మఱచితో దర్పంబు లేకుండితో | యవివేకస్థితి నొందితో వెఱచితో దైన్యంబునుం జెందితో॥ క॥ యాదవులలోన నొక్కఁడు | మేదినిపై సత్వరేఖ మెఱసి జరాసం | ధాదులఁ దూలం దోలెను | దాదృశుఁడిల లేఁడు వినవె తత్కర్మంబుల్॥ అనిన విని కాలయవనుండిట్లనియె॥ శా॥ ఏమీ నారద నీవు చెప్పిన నరుం డేరూపువాఁ డెంతవాఁ | డేమేరన్ విహరించు నెవ్వఁడు సఖుం డెందుండు నేపాటిదో | స్సామర్థ్యంబునఁ గయ్యముల్ సలుపు నస్మద్బాహుశౌర్యంబు సం | గ్రామక్షోణి భరించి నిల్వఁ గలఁడే గర్వాఢ్యుఁడే చెప్పుమా॥ అనిన విని దేవముని యిట్లనియె॥ సీ॥ నీలజీమూతసన్నిభశరీరము వాఁడు తామరసాభనేత్రములవాఁడు | పూర్ణేందుబింబంబుఁ బోలెడి మోమువాఁ డున్నతదీర్ఘబాహువులవాఁడు | శ్రీవత్సలాంఛనాంచితమగు నురమువాఁడు కౌస్తుభమణిపతకంబువాఁడు | శ్రీకరపీతకౌశేయచేలమువాఁడు మకరకుండలదీప్తిమలయువాఁడు | రాజయింతంతవాఁడనరానివాఁడు | మెఱసి దిక్కుల నెల్లను మెఱయువాఁడు | తెలిసియే వేళలందైనఁ దిరుగువాఁడు | పట్టనేర్చినఁ గాని లోఁబడనివాఁడు॥ ఉ॥ యాదవుఁ డెంతవాఁడు ప్రళయాంతకుఁడైన నెదిర్చి నేనియున్ | గాదనఁ బోరమత్కలహకర్కశబాహుధనుర్విముక్తనా | నాదృఢహేమపుంఖకఠినజ్వలదస్త్రపరంపరాసము | త్పాదితతవహ్ని

---

*[illegible] ... బాహులు. దోరంపహంబు | బాహువేగము. †కుంఠితులై | మొక్కి పోయినవారై.

ములభస్మము చేసెఁ దాపసోత్తముఁడు॥ వ॥ అనిపలికి కాలయవనుండు మూఁడుకోట్లమ్లేచ్ఛవీరులం గూడుకొని శీఘ్రగమనంబున నం*దాడి వెడలి మధురాపురంబు మీఁద విడిసిన నంజూచి బలభద్రసహితుండై కృష్ణుం డిట్లని వితర్కించె॥ సీ॥ యవనుండు

**విశ్వకర్మ కృష్ణనియోగంబున సముద్రములో ద్వారకానగరము నిర్మించుట.**

పురమెల్ల నావరించె నునేఁటి యెల్లి టి యెల్లుండి యీనడుమను। మాగధుండును వచ్చు నని మీఁద విడియును యవన మాగధులు మహాప్రబలులు। పురి రెండు వంకలఁ బోగు మరఁట్టి చోనోపిన భంగి నొక్కొక్కచోట। ననము యుద్ధము సేయుచుటయు నొక్కఁడు సొచ్చి బంధుజనంబుఁ బట్టి చంపు। నొండెఁ గొనిపోయి చెఱఁబెట్టు నుగ్రకర్ముఁ। డైన మాగధుఁడు వినఁగా నయరివరులకు। విడియఁ బోరాడఁగా రానివిషమభూమి। నొక్క దుర్గంబుఁ జేసి యందునుపవలయు॥ వ॥ అనివితర్కించి, సముద్రునడిగిన సముద్రమధ్యంబునఁ బండ్రెండు యోజనంబుల నిడుపు, నంతియ వెడల్పుం గల, దుర్గమప్రదేశంబు సంపాదించి, తన్మధ్యంబునం గృష్ణుండు, సర్వాశ్చర్యకరంబుగ, నొక్క నగరంబు నిర్మింపుమని విశ్వకర్మం బంచిన॥ గీ॥ వరుణుపురముకంటె వాసవుపురికంటె। ధనము వీటికంటె దండధరుని। నగరికంటె బ్రహ్మనగరంబుకంటెఁ బ్ర। స్ఫుటముగాఁగ నొక్కపురముఁ జేసె॥ అంము॥ క॥ ఆకసముతోడిచూలనఁ। బ్రాకారము పొడవుగలదు పాతాళమహా। లోకము క్రిందటెను లోఁతెం। తో కలదా పరిఘ యొఱుఁగ దొరకదొకరికిన్॥ క॥ కోటయు మిన్నును దపులోఁ। బాటికి జగడింప నడ్డపడి నిల్చిన వా। చాటు లరు విఁదారకములు। కూటువ లైకోటతుదలఁ గొమరారు పురిన్॥ శా॥ సాధుద్వారక వాటకుడ్యవలభి స్తంభార్గళా గేహళీ। వీథీ వేదిక వాస్తు చత్వర సభా వేశ్మ ప్రమాణ ప్రపా। సౌధాట్టాలక సాల హర్మ్య విశిఖా సోపాన సంస్థానముల్। శ్రీధుర్యస్థితి నొప్పుఁ గాంచనమణిస్నిగ్ధంబులై యప్పురిన్॥ క॥ కూడి గ్రహంబులు దిరుగఁగ। మేడలతుద నెలవులందు మెలఁగెడి బాలల్। క్రీడింపఁగ పురుషులతో। ప్రీడం దద్వేళలందు వినుమా వీటన్॥ ఉ॥ ఆయతవజ్రనీలమణిహాటకనిర్మితహర్మ్యసౌధ వా। తాయనరంధ్రనిర్యదసితాభ్రమహాగరుధూపధూమము। లోయ నపస్తులోయను మఁడుం గమహీరుహరమ్యశాఖలన్। జేయుచునుండుఁ దాండవవిశేషముల స్ఫురిఁ గేకిసంఘముల్॥ గీ॥ సరసనవచుచుండి సౌధాగ్రహేమకుం। భములలోన నినుఁడు ప్రతిఫలింప। నేర్పఱింప లేక నినులు పెక్కండ్రంచుఁ। బ్రజలు చూచి చోద్యపడుదు రందు॥ ఉ॥ శ్రీరమణీయగంధములఁ జెన్నువహించుఁ బురీవనంబులం। గోరకజాలక స్తబక కుట్మలపుష్పమరందపూర వి। స్ఫారలతాప్రకాండ విటపచ్ఛదపల్లవవల్లరీశిఫా। సారపరాగమూలఫలసంభృత వృక్షలతావిశేషముల్॥ క॥ శ్రీకరములు జనహృదయవ। శీకరములు మందపవనశీర్ణ నవాంభ। శ్శీకరములు హంసవిహంగాకరములు నగరిఁ గువలయాబ్జాకరముల్॥ క॥ నవకుసుమామోదభరా। జవనము రతిఖిన్నదేహజస్వేదాంభో। లవనము సమధిగతవనము। పవనము విహరించుఁ బౌరభవనములందున్॥ క॥ బ్రహ్మత్వము లఘువగు నని। బ్రహ్మాయువిమలకు వచ్చి పట్టఁడు గాకా। బ్రహ్మాదికళలఁ దత్పురి। బ్రహ్మజనుల్ బ్రహ్మఁ జిక్కువఱుప రెచర్చన్॥ క॥ నగరీభూసురకృత లస। దగణితమఖధూమపిహితమై కాకమహా। గగనము నీలంబగునే। మిగులఁగ బెడఁగగునె గ్రహసమృద్ధంబయ్యున్॥ క॥ తిరుగరు పలుకరు గ్రుంతలు। సురుగరు ధనమిత్త్రరితరసుదతీమణులన్। మఱుగరు రణమునఁ బిఱిఁదికి। సఱుగరు రాజన్యతనయు లానగరమునన్॥ క॥ రత్నాకరమై జలనిధి। రత్నములీ నేరదట్టి రత్నాకరమే। రత్నములఁ గొనుచు రిస్తురు। రత్నాకరజయులు వైశ్యరత్నములు పురిన్॥ క॥ తుంగంబులు కరహతగిరి। శృంగంబులు దానజలవశీకృతభృంగీ। భృంగంబులు శైలాభస। మాంగంబులు నగరి మత్తమాతంగంబుల్॥ క॥ ప్రియములు జితపవనమనో। రయములు కృతజయము లధికరమణీయగుణా। న్వయములు సవినయములు నిర్భయములు హతరిపుచయములు పట్టణహయముల్॥ క॥ పులులపగిదిఁ గంఠీరవ। ముల క్రియ శలభములమాడ్కి ముదితమదేభంబుల తెఱఁగున నానావిధ। కలహములు హెచ్చుటులు భటులు గల రా వీటన్॥ క॥ ఆవీటనుండువారికి। భావింపఁగ లేవు క్షుత్పిపాసాదులు తద్ద్రోణీదక్ష పావశమున। దేవప్రతిమానులగుచు దీపింతురిలన్॥ సీ॥ అసక్తి కృష్ణముఖావలోకనమందు హరిపాదసేవనమందు చింత। వెఱపు నారాయణవిముఖకార్యములందు పారవశ్యము విష్ణుభక్తియందు। బాష్పనిర్గతి చక్రపద్యసంస్తుతులందు పతనపాతము శార్ఙ్గిభక్తులందు। లేమి గోవిందాన్యలీలాచరణమందు భ్రమము గోవిందపూజనములందు। బంధము న్యుతపరముష్టపథములందు। జ్వరము మాధవవిరహితక్షణములందు। మత్సరము లీశుకైంకర్యమతములందు। నరవరోత్తమ వినుము తన్నాగరులకు॥ వ॥ మఱియు నప్పురవరంబున, హరికిం, బారిజాతమహీజంబును, సుధర్మ యనియెడి దేవసభయును, దేవేంద్రుం డిచ్చెఁ, గర్ణైకదేశంబుల నలుపుగలిగి మనోజవంబులును; శుక్లవర్ణంబులునైన తురంగంబుల వరుణుండొసంగె మత్స్య కూర్మ పద్మ మహాపద్మ శంఖ ముకుంద కుంద కచ్ఛప నీలంబులను నెనిమిది నిధులఁ గుబేరుండు సమర్పించె. నిజాధికారసిద్ధికొఱకుఁ దక్కన లోకపాలకులును. దొరి తమతమ...

తిభక్తితో సమర్పించిరివ్విధంబున॥క॥దర్పించి చేసిపురము స।మర్పించెను విశ్వకర్మ మంగళగుణనం।తర్పితగహ్వారికి నిగురు।దర్పితదుఃఖప్రవాహతరికిన్ హరికిన్॥వ॥ఇట్లు విశ్వకర్మనిర్మితంబైన, ద్వారకానగరంబునకు నిజయోగప్రభావంబున, మ

శ్రీకృష్ణుండు నిరాయుధుండై కాలయవనుఁడు వెంటనంటపరుగెత్తుట.

ధురాపురజనుల నందఱం జేర్చి బలభద్రునకెఱింగించి, తదనుమతంబున నందనవనంబు నిర్గమించు, పూర్వదిగ్గజంబు పెంపు నతిరుగిరిగహ్వరంబు వెలువడు కంఠీరవంబు తెఱంగున హరిహయదిగంతరాళంబున నుదయించు నంధకారపరిపంథికైవడి, మధురానగరంబు వెలువడి నిరాయుధుండై యెదురువచ్చుచున్న హరింగని॥ మ॥కరిసంఘంబులు లేవు రావుతురగౌఘంబుల్ రథవ్రాతము। ల్పరిసర్పింపవు రారు శూరులు ధనుర్బాణాసిముఖ్యాయుధో।త్కరముం బట్టఁడు శక్రచాపయుతమేఘస్ఫూర్తితో మాలికా।ధరుఁడొక్కండె నిర్గమించె నగరద్వారంబునం గంటిరే॥శా॥ఎన్నేనయ్యె దినంబు లీనగరిపై నే నుండి పోరాటకున్। మున్నెవ్వండును రాఁడు వీఁడొకఁడు నిర్ముక్తాయుధుండేగు దెం।చెన్నొన్నొర్వఁగనో ప్రియోక్తులకునో శ్రీగోరియో చూడుఁడం।చున్నాత్మీయజనంబుతో డయవనేశుం డిట్లు తర్కింపఁగన్॥క॥ విభులగు బ్రహ్మప్రముఖుల।కభిముఖుఁడై నడువకుండు నట్టి గుణాఢ్యుం।డిభరాజగమనమొప్పఁగ।నభిముఖుఁడై నడిచెఁ గాలయవనునకధిపా॥ఆ సమయంబున నయ్యాదవేంద్రుని నేర్పడం జూచి॥మ॥వనజాతాక్షుఁడు సింహమధ్యుఁడు రమావక్షుండు శ్రీవత్సలాం।ఛనుఁడంభోధరదేహుఁడిందుముఖుఁడం చద్దీర్ఘబాహుండు స।ద్వనమాలాంగదహారకంకణసముద్యత్కుండలుం డీతఁడా।మునిసూచించిన వీరుఁడౌననుచు నమ్మ్లేచ్ఛుండు గాఢోద్ధతిన్॥సీ॥చటులవాలాభీలసైంహికేయునిభంగి లాలితేతరజటాలతికమాలఁ।బ్రళయావసరబృహద్భానుహేలి ద్యుతిఁ బరుషారుణశ్మశ్రుపటలి ప్రేలఁ। గాదంబినీఛన్నకాంచనగిరిభాతిఁ గవచసంవృతదీర్ఘకాయమమర।వల్మీకసుప్తదుర్వారాహికైవడి కోశంబులో వాలు కొమెరుమిగుల।వార్చి పేర్చి మించియశ్వంబు గదలించి కమలసంభవాదిఘనులకైనఁ।బట్టరాని ప్రోడఁ బట్టెద ననిజగ।దవనుఁ బట్టఁగదిసె యవనుఁడధిప॥క॥ఇటుఁదన్నుఁ బట్టవచ్చినఁ।బటుతరజవరేఖ మెఱసిపట్టువడక ది।క్తటములదుర హరి వాఱెన్।నటులగతి న్వాఁడు దోడఁజను దేరంగన్॥అప్పుడు కాలయవనుం డిట్లనియె॥మ॥యదువంశోత్తమ పోకుపోకు రణమీనర్హంబు కంసాదుల।న్గదనక్షోణిజయించితీవనిసమిద్ధామంబున న్వచ్చితే।న్విదితఖ్యాతులు వీటి వోవనరికెన్నైన్నిచ్చి యిబ్భంగినే।గుదురే రాజులు రాజమాత్రుఁడవె వై గుణ్యంబు వచ్చె న్జుమీ॥ మ॥బలిమి న్మాధవ నేఁడు నిన్ను భువనప్రఖ్యాతిగాఁబట్టుదు।న్జలములన్సొచ్చిన భూమిక్రిందం జనినన్ శైలంబుపై నెక్కినన్।బలిదండన్విలసించిన న్వికృతరూపంబుం బ్రవేశించినన్। జలధిందాఁటిన నగ్రజన్మహలికాశ్వాటాకృతుల్దాల్చినన్॥ అదియునుంగాక॥మ॥శరముల్ దూరవు మర్మనుర్గుణలతాశబ్దంబు లేతేరవా। హరిరింఖోద్ధతిధూళి గప్పదకటా హాస్యుండవై పాఱను।ర్వరపై నేక్రియఁ బోరితో కదిసి మున్వాతాశితోఁ గేశితోఁ। గరితో మల్లురతో జరాతనయుతోఁ గంసావనీనాథుతోన్॥వ॥అని పలుకుచుఁ గాలయవనుండు వెంటనరుగుదేర సరకుసేయక మందహాసంబు ముఖారవిందంబునకు సౌందర్యంబు నొసంగ వేగిరపడకు రమ్మురమ్మనుచు హరియాను॥ సీ॥అదె యిదె లోఁబడెనని పట్టవచ్చినఁ గుప్పించి లంఘించుఁ గొంత తడవు।పట్టరాదీతని పరువగ్గలంబని భావింపఁ దనసమీపమున నిలుచు।నడరి పార్శ్వంబున కడ్డంబు వచ్చినఁ గేడించి యిట్టట్టుఁ గికురు వెట్టు।వల్మీకతరుసరోవరముల డ్డంబైన సవ్యాపసవ్యసంచరతఁ జూపుఁ।బల్లములడాఁగు దిబ్బలబయలు పడును। నీడలకుఁ బోవు నిరవుల నిగుడి తాఱు।నన్నుఁ బట్టిన నీవు మానవుఁడవనుచు।యవనుఁ డెదుగంగ బహుజగదవనుఁ డధిప॥మఱియును॥ సీ॥సకలభూతవ్రాతసంవాసుఁడయ్యును వనములున గములు వరుస దాఁటు।లోకోన్నతుండును లోకచక్షుఁడు నయ్యు మాఁటిమాఁటికి నిక్కి మగుడి చూచుఁ। బత్తువిపత్తు సంబంధశూన్యుండయ్యుఁ దనువిపక్షుఁడు వెంటఁదగుల నిగుడు।విజయాపజయభావవిరహితుండయ్యుఁ దానపజయంబును జెందినట్లు చేయు।నభయభయవిహీనుఁడయ్యు భీతుని మాడ్కిఁ గానఁబడును సర్వకాలరూపుఁ।డయ్యుఁ గాలచకితుఁడైనకైవడి వన।మాలి పఱచు వెఱపుమాలి యధిప॥ఇవ్విధంబున॥ క॥దారి[illegible]త్రవభవనున।పారమహావేగవిజితపవనున్యవనున్। దూరముఁగొనిచని కృష్ణుఁడు। ఘోరంబగు నొక్కశైలగుహవడిఁ జొచ్చెన్॥ క॥అదె లోఁబడెని దెలోఁబడె।నదె యిదె పట్టెదనటంచు నాశావశుఁడై। యదుసింహుని పదపద్ధతి।వదలక గిరిగహ్వరంబు వాఁడున్జొచ్చెన్॥వ॥ఇట్లు చొచ్చి మూఢహృదయంబునుంబోలె దమఃపూర్ణంబైన గుహాంతరాళంబున దీర్ఘతల్పనిద్రితుండై గుఱకయిడుచున్న యొక్క మహాపురుషునింగని శ్రీహరి గాఁదలంచి॥ ఉ॥ఆలము సేయలేక పురుషాధమ మర్మభకంటకద్రుమా।ఖిలమహాశిలాసహితభీకరకుంజరఖడ్గసింహశా।ర్దూలతరక్షుసంకలితదుర్గపథంబునఁ బాఱుదెంచి యీ। శైలగుహన్సనిద్రక్రియ సాఁగి నటించినఁ బోవనిత్తునే॥క॥ఎక్కడ నెవ్వారలకును। జిక్కననుచు నారదుండు సెప్పెను నాకుం।

జిక్కి తిరిగి కదలఁబోయెను। నిక్కము గా నిద్రఁ బుత్తు నిన్నీ కొండన్॥ గీ॥ అనుచు యవనుఁ డట్టహాసంబు గావించి। చటుల కఠిన కులిశ సదృశమైన పాద మెత్తి తన్నెఁ బాతితద్రేహంబు। నగగుహం బ్రతిస్వనంబు నిగుడ॥ ఉ॥ తన్నిన లేచి నిద్దిక నుదమ్ములు మెల్లన విచ్చి లోపలన్ సన్నపుకిన్క వర్ధిలఁ దిశల్ గని దృష్టి సమిద్ధ విగ్రహో। త్పన్న మహాగ్ని కీలముల భస్మము చేసెన తండు సాయకచ్ఛిన్న విరోధికంతవను శ్రీభవను న్యవను న్లఘుక్రియన్॥ వ॥ ఇట్లేకక్షణమాత్రంబున యవనుండును నీఱయ్యె ననిన విని రాజిట్లనియె॥ గీ॥ ఎవ్వఁ డాతఁ డితని కెవ్వండు దండ్రి ఘోర। రాత్రి గుహకు నేటి కతఁడు వచ్చి। నిద్రవోయె యవను నిటు గాల్ప నెట్లో

## ముచికుందుని పూర్వకథాభివర్ణనము.

పెఁ దెలియఁ బలుకు నాకు ధీవరేణ్య॥ వ॥ అనినం బరీక్షిన్నరేంద్రునకు నతికుతూహలంబుతో శుకయోగివర్యుం డిట్లనియె-నిక్ష్వాకుకులసంభవుండు మాంధాతకొడుకు ముచికుందుం డను రాజు, రాక్షసభీతులైన వేల్పులం బెద్దకాలంబు సంరక్షించిన నెచ్చి వారమరలోక రక్షకుండైన యా రాజకుమారునికడకుం జేరి ముచికుందున కిట్లనిరి. మ॥ జగతిన్ నిర్గతకంటకంబయిన రాజ్యంబున్ విసర్జించి తూరగణాగ్రేసర పెద్దకాలము మముం గ్రక్షించితీ లోన నీ। మగువల్ మంత్రులు బంధులున్ సుతులు సంబంధుల్బు విన్నేరు కాలగతిం జెందిరి కాల మెవ్వరికి నుల్లంఘ్యంబు గాదారయన్॥ క॥ కాలము ప్రబలురకును బలి। గాలాత్ముం డీశ్వరుండు గణ్యుఁడు జనులన్। గాలవశులఁ గాఁ జేయును। గాలముఁ గడువంగ లేరు ఘను లెవ్వారున్॥ క॥ వరమిచ్చెద మర్థింపుము। ధరణీశ్వర మోక్షపదవి దక్కనుమ్మే। మెవ్వరమును విభులము గామీశ్వరుఁడు హరి దక్క మోక్ష సంగతిఁ జేయన్॥ వ॥ అనిపలికిన దేవతలకు నమస్కరించి ముచికుందుండు నిద్రఁ గోరి దేవదత్త నిద్రావశుండై పర్వతగుహాంతరాళంబున శయనించి యుండె యవనుండును నీఱైన పిమ్మట హరి ముచికుందుని ముందట నిల్చిన॥ సీ॥ వనరుహాలోచను వైజయంతీదామశోభితు రాకేందుసుందరాస్యు। మకరకుండల కాంతి మహిత గండస్థలుఁ గౌస్తుభగ్రైవేయ ఘనశరీరు। శ్రీవత్సలాంఛనాంచితవక్షు మృగరాజమధ్యుఁ జతుర్బాహు మందహాసుఁ। గాంచనసన్నిభ కౌశేయవాసు గాంభీర్యసౌందర్యశోభితుఁ బ్రసన్ను। నమ్మహాత్ముఁ జూచి యాశ్చర్యమును బొంది। తన్మనోజ్ఞదీప్తిఁ దనకుఁ జూడ। నలవి గాక చకితుఁడై యెట్టకేలకుఁ। బలికెఁ బ్రీతి నవనిపాలకుండు॥ మ॥ శివుఁడో యింద్రుఁడవో *విభావసుఁడవో చండప్రభారాశివో। శశిచూడామణివో పితామహుఁడవో చక్రాంకహస్తుండవో। దిశలున్ భూమియు మిన్ను నిండెనిదె నీ తేజంబుఁ జూడంగ మ। ర్త్యశ మెవ్వండవి యేల వచ్చితి చటన్వర్తించ దేకాకివై॥ క॥ ఈ యడవి విషమకంటకభూయిష్టము ఘోరసత్త్వపుంజాలభ్యం। బో యయ్య యెట్లు వచ్చితి। నీయడుగులు కమలపత్త్రనిభములు సూడన్॥ వ॥ మహాత్మా యేను నీకు శుశ్రూషణంబు సేయంగోరెద నీ జన్మగోత్రంబు లెఱింగింప నర్హుండవైన నెఱింగింపు నే నిక్ష్వాకువంశసంభవుండను, మాంధాతృనందనుండను, ముచికుందుండను వాఁడ దేవహితార్థంబు చిరకాలజాగరశ్రాంతుండనై నిద్ర నొంది యింద్రియ సంచారంబులు మఱచి॥ శా॥ ఏ నిద్రించుచు నుండ నొక్క మనుజుం డేతెంచి మద్ధర్మ్యుఁడై। తా నీ హెచ్చెడె నాత్మకిల్బిషమహాదర్పోగ్రుఁడై యంతటన్। శ్రీనాథాకృతివైన నిన్నుఁ గని వీక్షింపన్న శక్తుండనై। దీనత్వంబును జెందితిన్ ననుఁ గృపాదృష్టిన్ విలోకింపవే॥ అనిన విని మేఘగంభీరభాషల హరి యిట్లనియె॥ సీ॥ భూరజంబులనైన భూనాథ యెన్నంగఁ జను గాని నా గుణజన్మకర్మ। నామంబు లెల్ల నెన్నంగ నెవ్వరుఁ జాలరు దియేల నాకును నలవి గాదు। నేలకు ద్రేవైన నిఖిలరాక్షసుల మర్దించి ధర్మంబు నిలువఁ బెట్ట। బ్రహ్మ చే మున్ను నేఁ బ్రార్థింపఁ బడి వసుదేవునింటను వాసుదేవుఁడనఁగ। నగరుణ నవతరించి కంసాఖ్యతో నున్న। కాలనేమిఁ జంపి ఖలుల మఱియుఁ। ద్రుంచుచున్న వాఁడఁ దొడరి నీ చూడ్కి నీ। హైననవాఁడు కాలయవనుఁ డనఘ॥ వ॥ వినుము తొల్లియు నీవు నన్ను సేవించిన కతంబున నిన్ననుగ్రహింప నీ శైలగుహకు నేతెంచితి నభీష్టంబులైన వరంబు లడుగు మిచ్చెద మద్భక్తులగు జనులు గ్రమ్మర శోకంబునకర్హులు గారనిన హరికి ముచికుందుండు నమస్కరించి నారాయణదేవుండగుట నెఱింగి యిరువది యెనిమిదవ మహాయుగంబునందు నారాయణుం డవతరించునని మున్ను గ

## ముచికుందుఁడు శ్రీకృష్ణుని స్తోత్రము సేయుట.

ర్గుండు చెప్పుటఁ దలంచి॥ క॥ నీ మాయఁ జిక్కి పురుష। శ్రీమూర్తి గజనము నిన్ను సేవింపరు వి। త్తామయ గృహగతమై సుఖ। తామసమై కామవంచితంబై యాశా॥ ఉ॥ పూని యనేక జన్మములఁ బొందితుదిం డనపుణ్యకర్మసం। తానము పేర్మిఁ గర్మవసుధాస్థలిఁ బుట్టి ప్రపూర్ణదేహుఁడై। మానవుఁడై గృహేచ్ఛఁ బడు మందుఁడ జంబు తృణాభిలాషియై। కానక పోయినట్లు తఁబడుకై వడి నీపదభక్తిహీనుఁడై॥ క॥ తరుణీపుత్త్ర ధనాముల। మఱిగి మహారాజ్యవిభవ మదమత్తుఁడనై। నరతనము లబ్ధుఁడనగు నా। కరయఁగ బహుకాల మీశ యాఱిడివోయెన్॥ క॥ ఘటకుడ్యసన్నిభంబగు। చటులకళేబరముఁ జొచ్చి జనపతి నంచున్ స్ఫుటుచ

---

*విభావసుఁడవో. అగ్నిదేవుఁడవో. చండప్రభారాశివో। సూర్యుఁడవో, శశిచూడామణివో। రుద్రుఁడవో, చక్రాంకహస్తుండవో। విష్ణుదేవుఁడవో.

తురంగంబులతో నిటనటు దిరుగుచును నిన్ను నెఱుఁగ వనీశా. ॥గీ॥ వివిధకామలోభవిషయలాలసు మత్తు నప్రమత్తవృత్తి నంతకుండ వైన నీవు వేళ నరసి త్రుంతువు సర్ప మొదిగి మూషకంబు నొడియునట్లు. ॥క॥ నరపరసంజ్ఞిత మై రథకరిసేవిత మైన యొడలు కాలగతిన్ గ్రవ్యాదభక్షిత మై చను. దరవిట్క్రిమిభస్మసంగతంబగు నీశా. ॥గీ॥ సకలదిశలు గెలిచి సములు వర్ణింపఁగ జారుపీఠ మెక్కి సార్వభౌముఁ డైన సతుల గృహములందుఁ గ్రీడాసక్తి వృత్తి నుండు నిన్ను వెదక లేఁడు. ॥గీ॥ మోక్షసంబుఁ గట్టి విహితభోగంబులు మాని యింద్రియముల మదము లడఁచి తపము చేసి యింద్రతయుఁ గోరుఁ గాని నీ యవ్యాహత పదముఁ గోరఁ డజ్ఞుఁ డీశ. ॥సీ॥ సంసారి యై యున్న జనమునకీశ్వర నీకృప యెప్పుడు నెఱయఁ గల్గు నప్పుడ బంధంబు లన్నియుఁ దెగిపోవు బంధమోక్షుం డైనఁ బ్రాప్తమగును సత్సంగమంబు సత్సంగమంబున నీమీఁద భక్తి సిద్ధించు నీ భక్తివలన సన్ముక్తి యగు నాకు సత్సంగమునకంటె మును రాజ్యబంధనిర్మూలనంబు గలిగినది దేవ నీయనుగ్రహము గాదె. కృష్ణ నీసేవ గాని తక్కిన వివలము ముక్తిసందాయి వగు నిన్ను ముట్టఁ గొలిచి యాత్మబంధంబు గోరునే యార్యుఁ డెందు. ॥వ॥ కావున రజస్సత్త్వతమోగుణంబుల చేతను బంధంబు లగు నైశ్వర్యశత్రుమరణధర్మాదివిశేషంబుల విడిచి, యీశ్వరుండును, విజ్ఞానఘనుండును, నిరంజనుండును, నిర్గుణుండును, నద్వయుండును నైన, పరమపురుషుని నిన్నాశ్రయించెద. చిరకాలంబు కర్మఫలంబుల చేత నార్తుండనై క్రమ్మరం దద్వాసనల సంతుష్టుండనై తృష్ణం బాయిక శత్రువు లైన యింద్రియంబు లాఱింటిని గెలువ లేని నాకు శాంతి యొక్కఁడిది విపన్నుండనైన నన్ను నిర్భయుం జేసి రక్షింపు మనిన ముచికుందునికి హరి యిట్లనియె. ॥ఉ॥ మంచిది నీమది భక్తి నృపమండన నీవు పదార్థ మెట్లు వర్తించిన నైనఁ గోరిక లదిక్కునఁ జిక్కవు మేలు నిర్మలోదంచితవృత్తి నన్గొలుచు ధన్యుల బద్ధులు నట్లు నీకు నిశ్చంచలభక్తి గల్గెడిని సర్వము నేలుము మాన నేటికిన్. ॥వ॥ నరేంద్రా నీవు తొల్లి క్షత్రధర్మంబున నిలిచి మృగయావినోదంబుల జంతువుల వధియించినాఁడవు తపంబునఁ దత్కర్మవిముక్తుండ వై తరువాతి జన్మంబున సర్వభూతసఖిత్వంబు గలిగి బ్రాహ్మణశ్రేష్ఠుండ వై నన్నుం జేరెదవని వీడ్కొలిపిన హరికిం బ్రదక్షిణంబు వచ్చి నమస్కరించి గుహ వెడలి సూక్ష్మప్రమాణదేహంబులతో నున్న మనుష్యపశువృక్షలతాదులం గని కలియుగంబు ప్రాప్తంబగు నని తలంచి యుత్తరాభిముఖుండై తపోనిష్ఠుండగుచు సంశయంబులు విడిచి సంగంబులు పరిహరించి విష్ణునియందుఁ జిత్తంబు చేర్చి గంధమాదనంబు ప్రవేశించి మఱియు నరనారాయణనివాసంబైన బదరికాశ్రమంబు చేరి శాంతుండై హరి నారాధించుచుండె నిట్లు ముచికుందుని వీడ్కొని. ॥శా॥ అచ్ఛిద్రప్రకటప్రతాపరవి చే నాశాంతరాళంబులన్ బ్రచ్ఛాదించుచుఁ గ్రమ్మరన్ మధురకున్ బద్మాక్షుఁడే తెంచి వీఁ డాచ్ఛాదించి మహానిరోధముగఁ జక్రాకార మై యున్న యా మ్లేచ్ఛవ్రాతము నెల్లఁ ద్రుంచె రణభూమి న్వేల్పు సొంపారఁగన్ ॥

జరాసంధుండు ప్రవర్షణగిరిని దహించుట.

వ॥ ఇట్లు మ్లేచ్ఛబలంబు బొరిగొని-మఱియు నమ్మధురానగరంబునం గల ధనంబు ద్వారకానగరంబునకుం బంచిన-మనుష్యులు గొనిపోవు నెడ. ॥సీ॥ ఘోటకసంఘాతఖురసముత్థిత ధూళిజీమూతసందోహము గను మహనీయమదకలమాతంగకటదానధారలు కీలాలధారలు గను నిరుపమస్యందననేమినిర్ఘోషంబు దారుణగర్జితధ్వానము గను నిశితశస్త్రాస్త్రమానితదీర్ఘరోచులు లలితసౌదామినీలతికలు గను శత్రురాజప్రతాపాగ్ని శాంతము గను వృష్టికాలము వచ్చు నవ్విధము దోఁప నేగుదెంచె జరాసంధుఁ డిరువదియును మూఁడు నక్షౌహిణులు దన్ను మొనసి కొలువ. ॥చ॥ ఇటు చనుదెంచి యున్న మగధేశ్వరవాహినిఁ జూచి యుద్ధసంఘటనము మాని మానవుల కై వడి భీరుల భంగి నోడి ముందటి ధన మెల్లడించి మృదుతామరసాభపదద్వయులు క్రియాపటువులు రామకేశవులు పాఱిరి ఘోరవనాంతరంబులన్ ॥ వ॥ ఇట్లు పఱచుచున్న కృష్ణబలభద్రులం జూచి వారల ప్రభావంబు లెఱుంగక పరిహసించి. ॥ఉ॥ ఓ యదువీరులార రభసోద్ధతిఁ బాఱకుఁ డిట్లు పాఱినన్ బోవ మెదువాఁడఁగాను మిము భూమి నడంగిన మిన్నుఁ బ్రాఁకిన నద్దో యధిఁజొచ్చిన నంబగిలి త్రుంచెద నంచు సమస్తసేనతోఁ బాయక వచ్చె వెంటఁబడి బాహుబలాఢ్యుఁడు మాగధేశుఁడున్ ॥వ॥ మఱియుం బలాయమాను లై బహుయోజనంబులు దూరంబు చని విశ్రాంతు లై తమకు డాఁగ నెలవగు నని యింద్రుండు మిక్కిలి వర్షింపఁ బ్రవర్షణాఖ్యంబై పదునకొండు యోజనంబుల పొడవును, నంతియె వెడలుపునుం గల గిరి యెక్కి రంత. ॥శా॥ ఆ శైలేంద్రముఁ జుట్టి రా విడిసి రోషావిష్టుఁడై మాగధోర్వీశుండా వసుదేవనందనులం దావీక్షింపఁగా లేక వ న్నాశేచ్ఛ న్నిలసానుశృంగములఁ బూర్ణక్రోధుఁడై కాష్ఠముల్ రాసుల్గా నిడిచిచ్చు వెట్టఁ బనిచెన్ రౌద్రంబుతో భృత్యులన్ ॥వ॥ ఇట్లు జరాసంధపరిజనప్రదీపితంబైన మహానలంబు దరికొనియె నంత. ॥క॥ పొగ లెగసెం బొగలతుదలను మిగులుచు మిడుగురులు నిగిడె మిడుగురుగమిము న్నగ బ్రహ్మాండము నిండను భగభగలని మంటలాద వెభయదములగుచున్ ॥ వ ॥ మఱియు నమ్మహానలంబు బిల, సాను, శృంగ, వృక్ష, లతా, కుంజపుంజంబుల దరికొని-శిఖలు కిసల

యంబులుగ, విస్ఫులింగంబులు విరులుగ, సముద్ధూతధూమపటలంబులు బంధురస్కంధశాఖావిసరంబులుగ, ననోహకంబు లై వడి నల్లుంకమం బై ప్రబ్బికఠోరసమీరణసమున్నతమహాజ్వాలాజాలతిరోహితవియచ్చరవిమానంబును, వివిధవిధూమవిస్ఫులింగవిలోకనప్రభూతనూతనతారకాభ్రాంతివిభ్రాంతగగనచరంబును, సంతప్తమానస సరోవరసలిలకీలంబును, విశాలజ్వాలాజాలజాజ్వల్యమానతక్కోలచందనాగ్రురుకర్పూరధూమవాసనావాసితగగనకుహరంబును, గరాళకీలాజాలదందహ్యమానకీచకనికుంజపుంజసంజనిత చిటచిటారావపరిపూరితదిగంతరాళంబును, భయంకర బహుశతరశాఖాభిద్యమానపాషాణఘోషణపరిమూర్ఛితప్రాణిలోకంబును, సంతప్యమానశాఖశాఖాంతరనిబిడనీడనిహితశాబకవియోగదుఃఖడోలాయమానవిహంగకులంబును, మహాహేతిసందీప్యమానకటిసూత్రసంఘటితమయూరపింఛకుచకలశయుగళభారాలసశబరకామినీసమాశ్రితనిర్ఝరంబును, దగ్ధానేకమృగమిథునంబును నై యేర్పడె. క॥ ఇల నేకాదశయోజనములపాడవగు శైలశిఖరమున నుండి వ్రడి।న్బలకృష్ణులు రిపుబలముల। వెలికుఱికిరి కానఁబడక విలసితలీలన్॥ వ॥ ఇట్లు శత్రువుల వంచించి యాదవేంద్రులు సముద్రపరిఘం బైన ద్వారకానగరంబునకుం జనిరి-జరాసంధుండు వారలు దగ్ధు లైరని తలంచుచు బలంబులుం దానును మగధదేశంబునకు మఱలి చనియె నంత॥

## రుక్మిణీకల్యాణకథా ప్రారంభము.

క॥ ఆవనజగర్భువంపున। రైవతుఁడను రాజు దెచ్చి రామునకిచ్చెన్। రేవతి యనియెడు కన్యను। భూవర మును వింటి కాదె బుద్ధిం దెలియన్॥ తదనంతరంబ॥ మ॥ ఖగనాథుండమరేంద్రుఁ గెల్చి సుధ మున్ గైకొన్న చందంబునం। జగతీనాథులఁ జైద్యపక్షచరులన్ సాళ్వాదులం గెల్చి భద్రకుఁ డై చక్రి వరించె భీష్మకసుతన్ రాజీవగంధిన్ రమా।భగవత్యంశభవన్ మహాగుణమణివ్రాలామణిన్ రుక్మిణిన్॥ వ॥ అనిన రాజిట్లనియె-మున్ను రాక్షసవివాహంబున స్వయంవరంబునకు వచ్చి నహరి రుక్మిణిం గొనిపోయె నని పలికితివి_ కృష్ణుం డొక్కరుం డెవ్విధంబున సాళ్వాదులం జయించి తనపురంబునకుం జనియె నదియునుం గాక॥ శా॥ కల్యాణాత్మక మైన విష్ణుకథలాకర్ణించు మ్మర్త్యుఁడౌ। కల్యుం డెవ్వఁడు తృప్తుఁడౌ నవి వినంగాఁ గ్రొత్తలౌం చుండు సా।కల్యం బేర్పడ భూసురోత్తమ యెఱుంగంజెల్వేరుక్మిణీ।కల్యాణంబు విన న్గనాకు మదిలోఁ గౌతూహలం బయ్యెడిన్॥ క॥ భూషములు చెవులకు బుధ।తోషణములనేకజన్మదురితౌఘ విని।శ్శోషణములు మంగళతర।ఘోషణములు గరుడగమను గుణభాషణముల్॥ అని రాజడిగిన శుకుం డిట్లనియె॥ చ॥ వినుము విదర్భదేశమున వీరుఁడు కుండినభర్త భీష్మకుం। డన నొక దొడ్డ రాజుగలఁ డాతని కేవురు పుత్రులగ్రజుం। డనఘుఁడు రుక్మి నాఁ బరగు నందఱకుం గడగొట్టు చెల్లెలై। మనుజవరేణ్య పుట్టె నొక మానిని రుక్మిణి నాఁ బ్రసిద్ధయై॥ క॥ బాలేందురేఖ దోఁచిన। లాలితయగు నపరదిక్కులాగున ధరణీ।పాలుని గేహము మెఱసెను। బాలిక జన్మించి యెదుగ భాసురమగుచున్॥ మఱియు దినదినప్రవర్ధమానయై॥ సీ॥ పేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు నబలలతోడ వియ్యంబులందు।గుజ్జనగూళ్లను గొమరొప్ప వండించి చెలులకుఁ బెట్టించుఁ జెలువ మెఱయ।రమణీయమందిరారామదేశంబుల పువ్వుదీఁగెలకును బ్రోదిసేయు। సదమలమణిమయసౌధభాగంబుల లీలతో భర్మడోలికల నూఁగు।బాలికలతోడఁ జెలరేఁగి బంతులాడు। శారికా కీరపక్షికిఁ జదువు చెప్పు।బర్హిసంఘములకు మురిపములు గరపు।మదమరాళంబులకుఁ జూపు మందగతులు॥ అంత॥ సీ॥ దేవకీసుతుకీర్తి తీఁగెలు వీడంగ వెలఁదికి మైదీఁగె వీడఁ దొడఁగెఁ। గమలనాభుని చిత్తకమలంబు వికసింపఁ గాంతి నింతికి ముఖకమలమొప్పె। మధువిరోధికి లోన మదనాగ్ని వొడచూపఁ బొలఁతికిఁ జనుదోయి పొడవుసూపె। శౌరికి ధైర్యంబు సన్న మై డాయంగ జలజాక్షి మధ్యంబు సన్నమయ్యె।హరికిఁ బ్రేమబంధమధికంబు కాఁ గేశ।బంధమధికమగుచు బాలకమరెఁ। బద్మనయను వలనఁ బ్రమదంబు నిండార। నెలఁత యౌవనమున నిండి యుండె॥ వ॥ ఇట్లు రుక్మి, రుక్మరథ, రుక్మబాహు, రుక్మకేశ, రుక్మనేత్రులను నేవురకుం జెలియ లైన రుక్మిణీదేవి, దనయెల ప్రాయంబున॥ క॥ తన తండ్రి గేహమునకుం। జనుదెంచుచున్న యతిథిజనుల వలనఁ గృష్ణుని రూపబలగుణాదులు।విని కృష్ణుఁడు దనకుఁ దగిన విభుఁడని తలఁచెన్॥ క॥ ఆలలన రూపు బుద్ధియు।శీలములక్షణముగుణము చింతించి తగ।న్బాలారత్నము దనకి।ల్లాలుగఁ జేకొందు ననుచు హరియుం దలఁచెన్॥ అంత॥ ఉ॥ బంధువు లెల్లఁ గృష్ణునకు బాలిక నిచ్చెద మంచు శేముషీ।సింధువులై విచారములు సేయఁగ వారల నడ్డపెట్టి దు।స్సంధుఁడు రుక్మి కృష్ణు నెడఁ జాలవిరోధముఁ జేసి *మత్తపు।ష్పంధయవేణిని త్తుశిశుపాలునకుం జదలంచె నంధుఁడై॥ ఉ॥ అన్నతలంపు తా నెఱిఁగి యన్నవనీరజగంధిలోన నా।పన్నత నొందియాప్తుఁడగు బ్రాహ్మణు నొక్కనిఁ జీరి గర్వసం।ఛన్నుఁడు రుక్మి నేఁడు నను జైద్యున కిచ్చెద నంచు నున్నవాఁ।డెన్నివిధంబులం జనిబుధేశ్వర చక్రికి విన్నవింపవే॥ క॥ అయ్యా కొదుకు విచారము।లయ్యా యువారింపఁ జా

* మత్తపుష్పంధయవేణిన్ - మదించిన తుమ్మెదల రెక్కలవలె నల్లనైన జడగల రుక్మిణీదేవిని.

లఁడటుగాకుండ నెయ్యె మెఱిఁగించి చీఁకుమయ్యా నిజసేవకానుసారికిన్॥ వ॥ అని కొన్ని రహస్యవచనంబులు సెప్పినవిని బ్రాహ్మణుండు ద్వారకానగరంబునకుం జని * ప్రతిహారులవలనఁ దనరాక నెఱింగించి యన్నగధరుండున్న నగరుఁ బ్రవేశించి, యందుఁ గనకాసనాసీనుండయి యున్న పురుషోత్తముం గాంచి పెండ్లికొడుకవు గమ్మని దీవించిన ముసిముసినగవులు నగుచు బ్రహ్మణ్యదేవుండైన హరి తనగద్దియ డిగ్గనడిగ్గి బ్రాహ్మణుం గూర్చుండ నియోగించి తనకు దేవతలు సేయుచందంబున నంబూజలు సేసి సరసపదార్థసంపన్నంబైన యన్నంబుఁ బెట్టించి, రెట్టించిన ప్రియంబున, నయంబున, భూసురుండైన భూసురుం జేరి లోకరక్షణప్రశస్తంబైన హస్తంబున నతని యడుగులుపుడుకుచు మెల్లన నతని కిట్లనియె॥ సీ॥ జగతీసురేశ్వర! సంతోషచిత్తుండవై యున్న నీధర్మ మతిసులభము। వృద్ధసమ్మతమిది విత్తమెయ్యది యైనఁ బ్రాపింప హర్షించు బ్రాహ్మణుండు। దనధర్మమున నుండుఁ దరలఁడా ధర్మంబు గోరికెలతనికిఁ గురియుచుండు। సంతోషి గాఁడేని శక్రుఁడైనన శించు నిర్ధనుఁడైన నింద్రుఁబోలు। సంతసించె నేని సర్వభూతసుహృత్తములకుఁ బ్రాప్తలాభముదితమానసులకు శాంతులకును సుజనులకును గర్వహీనులకును వినతులే నొనర్తు॥ ఉ॥ ఎవ్వని దేశమందునికి యెవ్వని చేఁ గుశలంబు గల్గు మీ। కెవ్వని రాజ్యమందుఁ బ్రజలెల్ల సుఖింతురు వాఁడు సుప్రియుం। డివ్వనరాశి దుర్గమున కెట్లరుదెంచితి వయ్య నీవు లే। నవ్వులు గావు నీతలఁపు నంగల మేలొనరింతు ధీమణీ॥ వ॥ అని యిట్లు లీలాగృహీతశరీరుండైన యప్పరమేశ్వరుం డడిగిన, ధరణీసురవరుం డతనికిట్లనియె, దేవా విదర్భదేశాధీశ్వరుండగు భీష్మకుండను రాజుగలం డా రాజకూఁతురు, రుక్మిణీయను కన్యకామణి గలదయ్యిందువదన నీకుం గైంకర్యంబు సేయం గోరి వివాహమంగళప్రశస్తంబైన యొక్క సందేశంబు విన్నవింపుమని పుత్తెంచె నవధరింపుము॥ సీ॥ ఏ నీ గుణములు కర్ణేంద్రియంబులు సోఁక దేహతాపంబులు దీఱిపోవు। నే నీ శుభాకార మీక్షింపఁ గన్నులకఖిలార్థలాభంబు గలుగుచుండు। నే నీచరణసేవ లేప్రొద్దు చేసిన భువనోన్నతత్వంబుఁ బొందగలుగు। నే నీల సన్నామ మే ప్రొద్దు భక్తితో నొడివిన బంధసంతతులు వాయు। నట్టి నీయందు నా చిత్తమనవరతము। నచ్చియున్నది నీయాన నాన లేదు। కరుణఁ జూడుము కంసారి ఖలవిదారి। శ్రీయుతాకార మానినీచిత్తచోర॥ శా॥ ధన్యశ్లోక మనోభిరాముఁ గులవిద్యారూపతారుణ్యసౌజన్యశ్రీ బలదానశౌర్యకరుణాసంశోభితున్ నిన్ను నే। కన్యల్గోరరు కోరదే మును రమాకాంతాలలామంబు రా। జన్యానేకపసింహావలన నేఁ జన్మించె నే మోహముల్. ఉ॥ శ్రీయుతమూర్తి యో పురుషసింహమ సింహము పాలిసొమ్ము † గో। మాయువు గోరు చందమున మత్తుఁడు చైద్యుఁడు నీపదాంబుజ। ధ్యాయిని నైన నన్ను వడిఁ దాఁ గొనిపోయెద నంచు నున్నవాఁ। డాయధమాధముం డెటుఁ గడన్మృత మైన భవత్ప్రతాపముల్॥ మ॥ వ్రతము ల్దేవగురు ద్విజన్మబుధసేవల్ దానధర్మాదులు। న్నతజన్మంబుల నీశ్వరుల్ హరి జగత్కళ్యాణుఁ గాంక్షించి చే। సితి నేనిన్ వసుదేవనందనుఁడు నాచిత్తేశుఁడౌఁగాక ని। ర్జితులై పోదురు గాక సంగరములోఁ జైద్యముఖ్యాధముల్॥ ఉ॥ ¶ అంకిలి సెప్పలేఁడు చతురంగబలంబులతోడ నెల్లి యో। పంకజనాభ నీవు శిశుపాల జరాసుతులన్ జయించి నా। వంకకు వచ్చి రాక్షసవివాహమునన్ భవదీయ శౌర్యమే। యుంకువ చేసి కృష్ణపురుషోత్తమ చేకొని పొమ్ము వచ్చెదన్॥ సీ॥ లోపలి సౌధంబులోన వర్తింపఁగ దేవచ్చు నే నిన్నుఁ దెత్తు నేని। గావలివారలఁ గలబంధువులఁ జంపి కాని తేరాదని కమలనయన। భావించి తెలిసి యుపాయంబు సెప్పెద నాలింపు కులదేవయాత్రఁ జేసి। నగరంబు వెలువడి నగజాతకు మ్రొక్కఁ బెండ్లికి మునుపడఁ బెండ్లికూఁతుఁ। నెలమి మా వారు పంపుదు రేను నట్లుఁ। బురము వెలువడి యే తెంచి భూతనాథు। సతికి మ్రొక్కంగ నీవు నా సమయమునను। వచ్చి గొని పొమ్ము వన్నెన వార్యచరిత. మ॥ ఘనులాత్మీయతమోనివృత్తికొఱకై గౌరీశుమర్యాద నె। వ్వని పాదాంబుజతోయమందు మునుఁగన్ వాంఛింతు రే నట్టినీ। యనుకంపన్ విలసింప నేని వ్రతచర్యల్నూఱుజన్మంబుల। న్నినుఁ జింతించుచుఁ బ్రాణముల్ విడిచెదన్ నిక్కంబు ప్రాణేశ్వరా॥ సీ॥ ప్రాణేశ నీ మంజుభాషలు వినలేని కర్ణరంధ్రంబుల కలిమి యేల। పురుషరత్నమ నీవు భోగింపఁగా లేని తనులతవలని సౌందర్యమేల। భువనమోహన నిన్నుఁ బొడగానఁగాలేని చక్షురింద్రియముల సత్త్వమేల। దయిత నీ యధరామృతంబానఁగా లేని జిహ్వకు ఫలరససిద్ధి యేల। నీరజాతనయన నీ వనమాలికా। గంధమబ్బలేని ఘ్రాణమేల। ధన్యచరిత నీకు దాస్యంబు సేయని। జన్మమేల యెన్ని జన్మములకు॥ వ॥ అని యిట్లు రుక్మిణీదేవి పుత్తెంచిన సందేశంబులు రూపసౌందర్యాది విశేషంబులును బ్రాహ్మణుండు హరికి విన్నవించి కర్తవ్యం బెద్ది సేయనవధరింపు మని సవరణగా నిట్లనియె॥ సీ॥ పల్లవవైభవాస్పదములు పదములు కనకరంభాతిరస్కారు లూరు। లరుణప్రభామనోహరములు గరములు కంబుసౌందర్యమంగళము గళము। మహిత భావాభావమధ్యంబు మధ్యంబు చతురుత్సవదాయి చన్నుదోయి। పరిహసితార్ధేందుపటలంబు నిటలంబు జితమత్తమధుకరశ్రేణి వేణి। భావజాశుగముల ప్రాపులు

---

అనుసారికిన్। అనుసరించినవారికైనన్. * ప్రతిహారులవలనన్। ద్వారపాలకులవలన. † గోమాయువు। నక్క. ¶ అంకిలి। అడ్డగింపు. వ్రేల్మిడిన్। మిగుల

చూపులు గుసుమశరుని వింటికోపులు| చిత్తతోషణములు చెలువ భాషణములు| జలజనయన ముఖము చంద్రసఖము॥ ఉ॥ ఆ యెలనాగ నీకుఁ దగు నంగనకుం దగు దీవు మాయపా|ధ్యాయుల యాన పెండ్లియగుఁ దప్పదు జాడ్యము లేల నీవు నీ| తోయము వారుఁ గూడుకొని తోయరుహాననఁ దెత్తుగాని వి| చ్ఛేయుము శత్రులన్ను గుము సేయుము సేయుము శోభనంబులన్॥

శ్రీకృష్ణుండు కుండిననగరంబునకు రథారూఢుండై చనుట.

వ॥ అని యిట్లు పలికిన బ్రాహ్మణుని వలన విదర్భరాజతనయ వృత్తాంతంబును సందేశంబును రూపసౌందర్యాది విశేషంబులును విని యవధరించి నిజకరంబున నతని కరంబుఁ బట్టి నగుచు నయ్యాదవేంద్రుండిట్లనియె॥ చ॥ కన్నియమీఁద నా తలఁపు గాఢము కూరుకు రాదు రేయి నా| కెన్నఁడు నా వివాహము సహింపక రుక్మి దలంచు కీడు నే| మున్నె యెఱుంగుదుం బరుల మూఁక నడంచి విభు మారిఁ దెత్తు విస్ఫురన్నత ప్రాంశుఁ ద్రచ్చిన వహ్నిశిఖన్ వడి దెచ్చు కైవడిన్॥ క॥ వచ్చెద విదర్భభూమికిఁ జొచ్చెద భీష్మకుని పురము చూచెద దొరలీలన్| దెచ్చెద బాలన్ ద్రేల్మిడి| వ్రచ్చెద నడ్డంబు రిపులు వచ్చినఁ బోరన్॥ వ॥ అని పలికి రుక్మిణీదేవి పెండ్లి నక్షత్రంబు దెలిసి దనపంపున రథసారథియైన దారకుండు శైబ్యసుగ్రీవ మేఘపుష్ప వలాహకంబులను తురంగంబులం గట్టి రథమాయత్తంబు చేసి తెచ్చిన నమోఘమనోరథుండైన హరి తానును బ్రాహ్మణుండును రథారోహణంబు చేసి యేకరాత్రంబున నానర్తక దేశంబులు గడచి విదర్భదేశంబునకుం జనియె- నంత కుండినపురీశ్వరుండైన భీష్మకుండు కొడుకునకు వశుండై కూఁతు శిశుపాలునకిత్తునని తలంచి శోభనోద్యోగంబు సేయించె నప్పుడు॥ సీ॥ రచ్చలు గ్రంతలు రాజమార్గంబులు విపణిదేశంబులు విశదములుగఁ| జేసిరి చందనసిక్త తోయంబులు గలయంగఁ జల్లిరి కలువడములు| రమణీయ వివిధ తోరణములు గట్టిరి సకల గృహంబులు సక్కఁ జేసి| కర్పూర కుంకుమాగరుధూపములు వెట్టిరతివలు పురుషులు నన్నియెడల| వివిధ వస్త్రములను వివిధ మాల్యాంబరాభరణ లేపనముల నమరియుండి| రఖిల వాద్యములు మహాప్రీతి మ్రోయించి రుత్సవమున నగర మొప్పియుండె॥ వ॥ అంత నా భీష్మకుండు విహిత ప్రకారంబులం బితృదేవతల నర్చించి బ్రాహ్మణులకు భోజనంబులు వెట్టించి మంగళాశీర్వచనంబులు సదివించి రుక్మిణీదేవిని నభిషిక్తం జేసి వస్త్రయుగళ భూషితం గావించి రత్నభూషణంబు లిడి ఋగ్యజుస్సామమంత్రంబుల మంగళాచారంబు లొనరించి భూసురులు రక్షాకరణంబు లాచరించిరి పురోహితుండు గ్రహశాంతికొఱకు నిగమనిగదిత న్యాయంబున హోమంబు గావించె మఱియు నా రాజు దంపతుల మేలుకొఱకు దిలధేను కలధౌత కనక చేలాది దానంబులు ధరణీదేవతలకొసంగె నయ్యవసరంబున॥ మ॥ భటసంఘంబులతోం దావిళులతో భద్రేభయూధంబుతో| బటు వేగాన్విత ఘోటక వ్రజముతో బంధుప్రియశ్రేణితోఁ| గటుసంరంభముతో విదర్భతనయం గైకొందునంచుం బ్రవేశోత్కటవృత్తిజ్ఞను డెంచెఁ జైద్యుఁడు గడున్ గర్వించి యవ్వీటికిన్॥ ఉ॥ బంధులఁ గూడి కృష్ణబలభద్రులు వచ్చినఁ బాఱఁ దోలి నిర్బంధర వృత్తిఁ జైద్యునికి మానినిఁ గూర్చెద మంచు నుల్లస| త్సింధుర వీర వాజి రథ సేనలతోఁ జనుదెంచి రా జరా|సంధుఁడు దంతవక్త్ర విదురథ పౌండ్రక సాల్వ విదూరథపౌండ్రకాదులున్॥ వ॥ మఱియు నానాదేశంబుల రాజులు సేనలు దెచ్చి రంత శిశుపాలు నెదుర్కొని పూజించి భీష్మకుండొక్క నివేశంబున నతని విడియించె నంతఁ దద్వృత్తాంతంబు విని॥ చ॥ హరి యొకరుండె గినాఁడు మగధాదులు నైద్యహితానుసారులై| నరపతులెందఱేనిఁ జని నారు కుమారికఁ దెచ్చుచో టసంగరమునఁ దోడు గావలయుఁ గంసవిరోధికి నంచు వేగఁ దా| నరిగె హలాయుధుండు గమలాక్షుని జాడన నేక సేనతోన్॥ క॥ ఆలోపల నేకతమున| నాలోలవిశాలనయన నయ గురు రుక్మిణి| యాలోకాలోచనుఁడు హరి| యాలోకము చేసికదియఁడని శంకితయై॥ శా॥ లగ్నం బెల్లి వివాహముం గదిసె నేలా రాఁడు గోవిందుఁడు| ద్విగ్నంబయ్యెడి మానసంబు విను నే వృత్తాంతము న్బ్రాహ్మణుం| డగ్నిద్యోతనుఁ డేటికిం దడసెనో యత్నంబు సిద్ధించునో| భగ్నంబై చనునో విరించికృత మెబ్భంగిన్ బ్రవర్తించునో| ఉ॥ ఘనుఁ డా భూసురుఁ డేఁగెనో నడుమ మార్గశ్రాంతుఁడై చిక్కెనో| విని కృష్ణుండిది తప్పుగాఁ దలఁచెనో విచ్చేసెనో యీశ్వరుం| డనుకూలింపఁ దలంచునో తలఁపఁడో యార్యామహాదేవియున్నను రక్షింప నెఱుంగునో యెఱుఁగదో నా భాగ్యమెట్లున్నదో॥ అని వితర్కించుచు॥ ఉ॥ పోఁడను బ్రాహ్మణుండు యదుపుంగవువీటికి వాసుదేవుఁడున్| రాఁడను నింకఁ బోయి హరి రమ్మని చీరెడి యిష్టబంధుఁడున్| లేఁడను రుక్మికిం దగవు లేదటు చైద్యునకిత్తునంచు నున్| నాఁడను గౌరికీశ్వరికి నా వలనన్ గృపలేదు నేఁడనున్॥ ఉ॥ చెప్పదు తల్లికిం దలఁపు చిక్కదిశల్దరహాస చంద్రికల్| దప్పదు వక్త్రతామరస గంధ సమాగత భృంగ సంఘముల్| ద్రొప్పదు నిద్రఁ గైకొనదు రోజు పరస్పర సక్త హారముల్| విప్పదు కృష్ణమార్గగత వీక్షణపఙ్క్తుల ద్రిప్ప దెప్పుడున్॥ చ॥ తుడువదు కన్నులన్ వొడలు తోయకణంబులఁ గొప్పు జక్కఁగాఁ| ముడువదు మై నెచ్చెలిం గదిసి ముచ్చటకున్ జనదన్న మేమియున్| గుడువదు నీరముం గొనదు కూరిమి కీరముఁ జేరి పద్యము| న్నొడువదు వల్లకీ గుణవినోదము సేయదు డాయదన్యులన్॥ సీ॥ మృగనాభియలదదు మృగరాజమధ్యమ జలముల

నాడము జలజగంధి! ముకురంబుఁ జూడము ముకురసన్నిభముఖి! పువ్వులు ముడువము పువ్వుబోఁడి! వనకేళిఁ గోరము వనజాతలో
చన! హంసంబుఁ బెంపము హంసగమన! లతలఁ బోషింపము లతికాలలితదేహ! తొడవులు తొడువము తొడవుతొడవ! తిలక మిడ
దుము మఱఁది లకినీతిలకంబ! గృహముఁ జేరము కమలహస్త! గారవించి తమ్ముఁ గరుణఁ గైకొనవన! మాలి రాఁదు తగవు
నాలి యనుచు॥ మఱియును॥ మ॥ మలఁగున్ మెల్లని గాలికిన్ బటునటన్మత్తద్విరేఫాలికిన్ దలఁగున్ గోయిల మ్రోఁతకై యలుగు నుద్య
త్కీరసంభాషల! కలఁగున్ వెన్నెల వేఁడిమిన్ మెలఁగు మాకందాంకురచ్ఛాయకున్! దొలఁగున్ గొమ్మ మనోభవానలశిఖాదోధూ
యమానాంగియై॥ వ॥ ఇట్లు హరి రాక కెదురుచూచుచు సకలప్రయోజనంబులయందు విరక్తయై మనోజానలంబునం బొ
గలెడి మగువకు శుభంబుఁ జెప్పుచందంబున వామోరు లోచన భుజంబు లదరె నంతఁ గృష్ణునియోగంబున బ్రాహ్మణుండు చ
నుదెంచిన నతనిముఖలక్షణంబు పరీక్షించి యా కలకంఠి మహోత్కంఠతోడ నకుంఠితయై మొగంబునం జిఱునగవు నిగుడ
నెమఱఁ జని నిలువంబడిన బ్రాహ్మణుం డిట్లనియె॥ ఉ॥ మెచ్చె భవద్గుణోన్నతికి మేయధనావళు లిచ్చె నాకుఁ దా వచ్చె సుద
ర్శనాయుధుఁ డవార్యుఁ డసురాసురు లెల్ల నడ్డమై వచ్చిన నైన రాక్షసవివాహమునం గొనిపోవు నిన్ను నీ సచ్చరితంబు భాగ్య
మును సత్యము నేఁడు ఫలించెఁ గన్యకా॥ అనిన నవ్వైదర్భి యిట్లనియె॥ మ॥ జలజాతేక్షణుఁ డోడిఁ దెచ్చితివి నా సందేశముం జెప్పిన
న్నిలువం బెట్టితి నీకృపం బ్రతికితిన్ నీ యట్టి పుణ్యాత్మకుల్ గలరే నీనికి నీకుఁ బ్రత్యుపకృతిన్ గావింపఁగా నేరనం। జలిఁ గావించెద
భూసురాన్వయమణీ సద్బంధుచింతామణీ॥ వ॥ అని నమస్కరించె నంత రామకృష్ణులు దనకూఁతు వివాహంబునకు వచ్చుట వి
ని తూర్యఘోషంబులతో నెదుర్కొని విధ్యుక్తప్రకారంబునం బూజించి మధుపర్కంబు లిచ్చి వివిధాంబరాభరణంబులు మొ
దలైన కానుక లొసంగి భీష్మకుండు బంధుజనసేనాసమేతులైన వారలకుం బూర్ణంబును సకలసంపత్పరిపూర్ణంబులైన నివేశ
బులు గల్పించి విడియించె నిట్లు కూడిన రాజుల కెల్లను వయోవీర్యబలవిత్తంబు లెట్టట్ల కోరిన పదార్థంబు లెల్ల నిప్పించి పూజించె
నంత విదర్భపురంబు ప్రజలు హరి రాక విని వచ్చి చూచి నేత్రాంజలులం దదీయవదనకమలమధుపానంబు సేయుచు॥ క॥ తగు
నీ చక్రి విదర్భరాజసుతకున్ దథ్యంబు వైదర్భియున్ దగు నీ చక్రికి నింత మంచిదగు నే దాంపత్య మీ యిద్దరిం దగులం గట్టిన బ్రహ్మ
నేర్పరి గదా దర్పాహతారాతియై మగఁడౌఁ గావుతఁ జక్రి యీ రమణికిన్ మా పుణ్యమూలంబునన్॥ అని పలికి రా సమయం
బున॥ సీ॥ సన్నద్ధులై బహుశస్త్రసమేతులై బలసి చుట్టును వీరభటులు గొలువ। ముందఱ నుపహారములు కానుకలు గొంచు వ
ర్గంబులై వారవనితలేఁగ। బుష్పగంధాంబరభూషణకలితలై పాడుచు భూసురభార్యలరుగఁ। బణవమృదంగశంఖపటహకాహ
ళవేణుభేరీధ్వనులు మిన్నుపిక్కటిలఁగ। దగిలి సతులు గొల్వఁ దల్లులు బాంధవసతులు దోడరాఁగ సవినయముగ। నగరు వెడలి
నడిచె నగజాతకును మ్రొక్క। బాల దికురపిహితఫాలయగుచు॥ వ॥ మఱియు సూతమాగధవందిగాయకపాఠకజను లెంతెంత
నభినందించుచుండను దెరమందగమనంబున ముకుందచరణారవిందంబులు డెందంబునం దలంచుచు నిందుధరసుందరీమంది
రంబు చేరి సలిలధౌతచరణకరారవిందయై వార్చి శుచియై గౌరీసమీపంబునకుం జనియె నంత ముత్తైదువలగు భూసురోత్తముల
భార్యలు భవసహితయైన భవానికి మజ్జనంబు గావించి గంధాక్షతంబు లిడి వస్త్రమాల్యాదిభూషణంబుల నలంకరించి ధూప
దీపంబు లొసంగి నానావిధోపహారంబులు సమర్పించి కానుక లిచ్చి దీపమాలికల నివాళించి రుక్మిణీదేవిని మ్రొక్కించి రప్పు
డు॥ ఉ॥ నమ్మితి నా మనంబున సనాతనులైన యుమామహేశులన్। మిమ్ముఁ బురాణదంపతుల మేలు భజింతుఁ గదమ్మ మేటి పె
ద్దమ్మ దయాంబురాశివి గదమ్మ హరిం బతి సేయుమమ్మ నిన్। నమ్మిన వారి కెన్నటికి నాశము లేదు గదమ్మ యీశ్వరీ॥ వ॥ అని గౌ
రీదేవికి మ్రొక్కి పతులతోడం గూడిన బ్రాహ్మణభార్యలకు లవణాపూపంబులును దాంబూలకంఠసూత్రంబులును, ఫలంబు
లు నిక్షుదండంబులు నిచ్చి రుక్మిణీదేవి వారలం బూజించిన॥ గీ॥ వారలుత్సహించి వలనొప్ప దీవించి। సేసలిడిరి యువతిశిరము
నందు। సేసలెల్లఁ దాల్చి శివవల్లభకు మ్రొక్కి। మౌననియతి మాని మగువ వెడలె॥ వ॥ ఇట్లు మేఘమధ్యంబు వెలువడి విలసించు
క్రొక్కాఱు మెఱుంగు తెఱంగున, మృగధరమండలంబు నిర్గమించి చరించు మృగంబు చందంబునఁ, గమలభవనర్తకుం డెత్తిన
§జవనిక మఱుఁగు దెరలి పొడసూపిన మోహినీదేవత కైవడి, దేవదానవసంఘాతకరతలసవ్యాపసవ్యసమాకృష్యమాణపన్న
గేంద్రపాశపరివేలయితపర్యాయపరిభ్రాంతమందరాచలమంథానమథ్యమానఘూర్ణితఘుమఘుమాయితమహార్ణవమ
ధ్యంబుననుండి చనుదెంచు నిందిరాసుందరీవైభవంబున, బహువిధప్రభాభాసమానయై, యిందుధరసుందరీమందిరంబు వె
డలి, మానసకాసారహేమకమలకాననవిహారమాణమత్తమరాళంబు భంగి, మందగమనంబునఁ గనకకలశయుగళసంకా
శకర్కశపయోధరభారపరికంప్యమానమధ్యయై, రత్నముద్రికాలంకృతంబైన కెంగేల నొక్కసఖీలలామంబు కైదండఁ
గొని, రత్ననివహసమంచితకాంచనకర్ణపత్రమయూఖంబులు గండభాగంబుల నర్తనంబులు సలుప, నరవిందవదిమళికు

• కలువడములు। చిన్న కొక్కెములు. ! ఘూర్ణము। శ్రీఘుము § జవనిక। తెర.

రూహాళావతీర్ణమత్తమధుకరంబులవడిఁ గ్రీనరాళంబులై నటింతలజాలంబులు ముఖమండలంబునఁ గ్రందుకొనఁ, గుందరమందహాసరోచులు దిశలందు బాలచంద్రికాసౌందర్యంబు నావహింప, నధరబింబఫలారుణమరీచిమాలికలు రదనకుందకుట్మలంబులకు ననురాగంబు సంపాదింప, మనోజాత కేతనసన్నిభంబై నవయ్యెదకొంగు దూఁగ, సువర్ణ మేఖలాఘటిత మణికిరణపటలంబులకాలశక్రచాపజనకంబులై మెఱయఁ, జెఱుకువిలుతుండు వెలికి వాడియిడి ఝళిపించిన దగద్ధగాయమానంబులగు బాణంబులపగిది, సురుచిరవిలోకననికరంబులు రాజవీరుల హృదయంబులు భేదింప, శింజానమంజుమంజీరనినదంబు చెవులపండువులు సేయఁ, ఖాద్గసంచారంబున హరిరాక కెదురుచూచుచు, వీరమోహినియై చనుదెంచుచున్న సమయంబున॥ మ॥ అలినీలాలకఁ బూర్ణచంద్రముఖ నేణాక్షిం బ్రవాళాధరిం। గలకంఠిన్ నవపల్లవాంఘ్రియుగళిం గంధేభకుంభస్తనిం। బులినశ్రోణి నభేంద్రయాన నరుణాంభోజాతహస్తన్మహో। త్పలగంధిన్ మృగరాజమధ్యఁ గని విభ్రాంతాత్ములై రందఱున్॥ వ॥ మఱియు నయ్యింతి దరహాసలజ్జావలోకనంబులం జిత్తంబులేమఱి, ధైర్యంబులు దిగనాడి గాంభీర్యంబులు విడిచి గౌరవంబులు చఱచి చేష్టలు మాని మెఱుకలుడిగి యాయుధంబులు దిగవైచి గజతురగరథారోహణంబులు సేయనేరక రాజులెల్ల నేలకు వ్రాలిరా యమేణీలోచన తనవామకరనఖరంబుల నలకంబులు దలంగద్రోయుచు నుత్తరీయంబు చక్కనొత్తుచుఁ గడకంటిచూపుల నగ్రంబున నారాజలోకంబు నాలోకించుచు॥ శా॥ కనియెన్ రుక్మిణి చంద్రమండలముఖుం గంఠీరవేంద్రావలగ్నున్ నవాంభోజపత్రాక్షుఁ జారుతరవక్షున్ మేఘసంకాశదేహున్ నాగారాతిగజేంద్రహస్తనిభబాహుం జక్రిఁ బీతాంబ

## శ్రీకృష్ణుండు శత్రురాజులు చూచుచుండ రుక్మిణీదేవిని గొనిపోవుట.

రున్ సుహాసున్ దురంగంబు గంతువిజయోత్కంఠున్ జగన్మోహనున్॥ వ॥ కని తదీయరూపవయోలావణ్యవైభవగాంభీర్యచాతుర్య తేజోవిశేషంబులకు సంతసించి మనోభవశరాక్రాంతయై రథారోహణంబుఁ గోరుచున్న వరారోహం జూచి పరిపంథిరాజలోకంబులు సూచుచుండ మందగమనంబున గంధసింధురంబు లీలం జనుదెంచి, †ఫేరవంబుల నడిమిభాగంబు గొనిచను కంఠీరవంబు కైవడి, నిఖిలభూపాలగణంబుల గణింపక తృణీకరించి రాజకన్యకం దెచ్చి, హరి తనరథంబు మీఁద నిడికొని భూనభోంతరాళంబులు నిండ శంఖంబు పూరించుచు, బలభద్రుండు తోడనడువ యాదవవాహినీపరివృతుండై, ద్వారకానగరమార్గంబు పట్టి చనియె నంత జరాసంధవశులైన రాజులందఱు హరిపరాక్రమంబు విని సహింపనోపక॥ మ॥ ఘనసింహంబుల కీర్తి నీచమృగముల్ గైకొన్నచందంబునన్। మన కీర్తుల్ గొని బాలఁ దోడ్కొనుచు నున్మాదంబుతో గోపకుల్। చనుచున్నార దె శౌర్యమెన్నటికి మీ శస్త్రాస్త్రముల్ గాల్పనే। తనుమధ్యన్ విడిపింపమే నినగరేఖాత్రిజమల్ గ్రింతలన్॥ వ॥ అని యొండొరులఁ దెల్పుకొని రోషంబులు హృదయంబుల నిల్పుకొని సంరంభించి తనుత్రాణంబుల వహించి ధనురాదిసాధనంబులు ధరియించి పంతంబులాడి తమతమ చతురంగంబులం గూడి జరాసంధాదులు యదువీరుల వెంటనంటం దాఁకి నిలు నిలుండని ధిక్కరించి పనికియుక్కిమిగిలి మహీధరంబుల మీఁద సలిలధారలు గురియు ధారాధరంబుల చందంబున బాణవర్షంబులు గురిసిన యాదవసేనలం గలదండనాథులు కోదండంబు లెక్కిడి గుణంబులు మ్రోయించి నిలువంబడి రప్పుడు॥ క॥ అరిబలభటసాయకములన్। హరిబలములు గప్పఁబడిన నడరెడు భీతిన్। హరిమధ్య సిగ్గుతోడను। హరివదనముఁ జూచెఁ జకితహరిణేక్షణయై॥ ఇట్లు చూచిన। క॥ వచ్చెదర దెయమవీరులు। వ్రచ్చెదరరిసేన నెల్ల వైరులు పెలుచన్। నొచ్చెదరును విచ్చెదరును। జచ్చెదరును నేఁడు చూడుఁ జలజాతాక్షీ॥ వ॥ అని రుక్మిణీదేవిని హరి యూరడించె నంత బలభద్రప్రముఖులైన యదువీరులు ప్రళయవేళ మిన్నునం బన్ని బలుపిడుగుల డరించు పెనుమొగుళ్ళ వడువున జరాసంధాదిపరిపంథిరాజచక్రంబు మీఁద నవక్రపరాక్రమంబున శిఖిశిఖాసంకాశనిశితశిలీముఖనారాచభల్లప్రముఖంబులైన బహువిధబాణపరంపరలు గురియ నదియును, విదళితమత్తమాతంగంబును, విచ్ఛిన్నతురంగంబును, విభిన్నరథవరూథంబును, వినిహతపదాతియూథంబును, విఖండిత వాహవారణరథారోహణమస్తకంబును, విశకలిత వక్షోమధ్య కర్ణకంఠకపోలహస్తంబును, విస్ఫోటితకపాలంబును, వికీర్ణకేశజాలంబును, విపాటిత చరణజానుజంఘంబును, విదళితదంతసంఘంబును, విఘటిత వీరమంజీర కేయూరంబులును, విభ్రష్టకుండలకిరీటహారంబును, విశ్రుతవీరాలాపంబును, విదార్యమాణ గదాకుంతతోమరపరశుపట్టసప్రాస కరవాలశూలచక్రచాపంబును, వినిపాతిత కేతనచామరఛత్త్రంబును, విలూనతనుత్రాణంబును, వికీర్యమాణ ఘోటకసంఘరింఘాసముద్ఘాతధరణీపరాగంబును, వినష్టరథవేగంబును, వినివారిత సూతమాగధవందివాదంబును, వికుంఠితహాయహేషా, పటహభాంకార, కరటిఘటాఘీంకార, రథనేమిపటాత్కార, తురగవాజి ఘంటాగణఘణాత్కార, వీరహుం

† అరాళము। వంకర. ఫేరవము। నక్క. కంఠీరవము। సింహము. తనుత్రాణము। కవచము.

కార, ఘూషణఝణఝణాత్కార, నిస్సాణధణధణాత్కార, మణినూపురక్రేంకార, కింకిణీ కిణకిణాత్కారశింజినీటంకార, భటపరస్పరధిక్కారనాదంబును, వినిర్భిద్యమానరాజసమూహంబును, విద్యమానరక్తప్రవాహంబును, విశ్రూయమాణభూతబేతాళకలకలంబును, విజృంభమాణఘేరవకాకకంకాదిసంకులంబును, ప్రచలితకబంధంబును, ప్రభూతపలలగంధంబును, ప్రదీపితమేదోమాంసరుధిరఖాదంబును, ప్రవర్తితఢాకినీప్రమోదంబును నై యుండె నప్పుడు॥ చ॥ మగుడి చలించి పాఱుచును మాగధముఖ్యులు గూడి యొక్కచో। వగచుచు నాలిఁ గోల్పడినవానిక్రియం గడు వెచ్చనూర్పుచున్। మొగమునఁ దప్పిదేరవమముండఁ జిఁబొక్కుచునున్న చైద్యుతోఁ। బగతుర చేతులోఁ బడక ప్రాణముతోడుతనున్నవాఁడవే॥ గీ॥ బ్రతుకవచ్చు నొడలఁ బ్రాణంబులుండినఁ। బ్రతుకుఁ గలిగెనేని భార్య గలదు। బ్రతికితీవు భార్య పట్టు దైవమె యుంగు। వగవవలదు చైద్య వలదు వలదు॥ వ॥ వినుము దేహధారి స్వతంత్రుండు గాఁడు - జంత్రగాని చేతి జంత్రపు బొమ్మకైవడి, నీశ్వరతంత్రపరాధీనుండై సుఖదుఃఖంబులందు వర్తనంబులు సలుపుఁ, దొల్లి నేను మధురాపురంబు మీఁదఁ బడి యేడుమాఱులు పరాక్రమంబున విడిసి సప్తదశవారంబులు చక్రిచేత నిర్మూలితబలచక్రుండ నై కామపాలుచేతం బట్టువడ నీకృష్ణుండు గరుణతో విడిపించిన వచ్చి క్రమ్మఱ నిరువదిమూఁడక్షౌహిణులం గూర్చికొని పదునెనిమిదవ మాఱు దాడి చేసి శత్రువులం నోర్చి జయంబుఁ జేకొంటిని - జయాపజయంబులందు హర్షశోకంబులం జెంద నేనెన్నఁడు నేఁటి దినంబున నీకృష్ణుని కెదిరి పోరను రాజలోకంబు లెల్లను గ్రాటుకుం గూడికొని మొదిఁజేపోరిన నోడుదుము, మింతియ కాక దైవయుక్తంబయిన కాలంబునం జేసి లోకంబులు పరిభ్రమించుచుండునది యునుం గాక॥ శా॥ తమకుం గాలము మంచిదైన మనలం ద్రైలోక్యవిఖ్యాతవిక్రములం గెల్చిరి యాదవుల్ హరిభుజాగర్వంబున న్నేఁడు కా। లము మేమై చనుదెంచె నీమనమునన్ లక్షించి విద్వేషుల। స్సమరోద్యోగి జయింత మింత పనికై శోకింప నీ కేటికిన్॥ వ॥ అని యిట్లు జరాసంధుండు నతని యొద్ది రాజులును, శిశుపాలుని పరితాపంబు నివారించి తమ తమ భూములకుం జనిరి శిశుపాలుండు ననుచరసేనాసమేతుండై తననగరంబునకుం జనియె నంతరుక్మియను వాఁడు కృష్ణుండు రాక్షసవివాహంబున దన చెలియలిం గొనిపోవుటకు సహింపక నేకాక్షౌహిణీబలంబుతోడ సమరసన్నాహంబునం గృష్ణుని వెనుదగిలి పోవుచుఁ దన సారథితో నిట్లనియె॥ ఉ॥ బల్లిదు నన్ను భీష్మజనపాలకుమారునిఁ జిన్నచేసి నా। చెల్లెలి రుక్మిణిం గొనుచుఁ జిక్కక సిక్కువుబంటువో లెనీ। గొల్లఁడు వోయెడిన్ రథముఁ గూడఁగఁ దోలుము తేజితోల్లసుత్సుల్లిపరంపరస్మదముఁ జూపెదఁ జూపెద నాప్రతాపమున్॥ వ॥ అని యిట్లు రుక్మి హరికొలంది యెఱుంగక సారథిం బలించి రథంబు గడం ద్రోలించి గోపాలక వెన్నముచ్చ నిలునిలు మమాత్రంబు నిలునిలుమని తిరస్కరించి బలువింటనారి సంధించి మూఁడు వాఁడి తూఁపుల హరి నొప్పించి యిట్లనియె॥ సీ॥ మా సరివాఁడవా మా పాపఁ గొనిపోవ నే పాటిగలవాఁడ వేది వంశ। మెందు జన్మించితివి యెక్కడఁ బెరిగితి వెయ్యది నడువడి యెవ్వఁ డెఱుఁగు। మానహీనుఁడ వీవు మర్యాదలెఱుఁగవు మాయఁగైకొని కానిమలయగావు। నిజరూపమున శత్రు నివహంబు పైఁబోవు వసుధీశుఁడవు గావు వావి లేదు। కొమ్ము నిమ్ము నీవు గుణరహితుండవు। విడువు విడువవేని విలయకాల। శిఖిశిఖాసమాన శితశిలీముఖముల। గర్వమెల్లఁ గొందుఁ గలహమందు॥ వ॥ అని పలికిన నగధరుండు నగి యొక్కబాణంబున వానికోదండంబు ఖండించి, యాఱు శరంబుల శరీరంబు మూఁటనేసి, యెనిమిది విశిఖంబుల రథ్యంబులం గూల్చి, రెండమ్ముల సారథిం జంపి, మూఁడు వాఁడి తూఁపుల కేతనంబు ద్రుంచి, మఱియు నొక్క విల్లందినం ద్రుంచి, వెండియు నొక్క ధనువు పట్టిన విదళించి, క్రమంబునఁ బరిఘపట్టిసశూలచర్మాసిశక్తితోమరంబులు ధరియించిన నంతను కలుచేసి, క్రమ్మఱ నాయుధంబు లెన్ని యెత్తిన, నన్నియు శకలంబులు గావించె, నంతటం దనివిఁ జనక వాఁడు రథంబు డిగ్గి ఖడ్గహస్తుండై, దవానలంబు పైఁబడు మిడుత వడంబునం, గదిసిన ఖడ్గకవచంబులు, చూర్ణంబులు చేసిన, సహింపక, మెఱుంగులు చెదర నడిదంబు వెలికిఁ ఝళిపించి, వాని శిరంబు తెగ వ్రేయ గమకించి నడుచుచున్న నడ్డంబు వచ్చి రుక్మిణీదేవి హరిచరణారవిందంబులు వట్టుకొని, యిట్లనియె॥ మత్తకోకిల॥ నిన్ను నీశ్వరు దేవదేవుని నిర్ణయింపఁగ లేక యో। సన్నుతామరకీర్తిశోభితసర్వలోకశరణ్య మా। యన్న యీతఁడు నేఁడు చేసె మహాపరాధము నీయెడ। న్నన్నుమన్ననఁ జేసి కావుము నాథనాథ దయానిధీ॥ మత్తకోకిల॥ కల్ల లేదని విన్నవించుట గాదు వల్లభ యీతనిన్। బ్రల్లదుండెగఁ జూచితేని యభాగ్యవంతుల మైతిమా। కల్లుఁడయ్యెను మంచుమఁడీశ్వరుఁడంచు మోదితులైనమా। తల్లిదండ్రులు పుత్రశోకము దాల్చి చిక్కమరీశ్వరా॥ మ॥ అని దగ్గుత్తికతో మహాభయముతో నాకంపితాంగంబుతో। వినతక్రాంతముఖంబుతో శ్రుతిచలద్వేణీకలాపంబుతోఁ। గనుదోయిం జడిఁ గొన్న బాష్పములతోఁ గన్యాలలామంబు మ్రొ। క్కినఁ రుక్మిం దెగ వ్రేయఁ బోక మగిడెన్ గృష్ణుండు రోచిష్ణుఁడై॥ వ॥ ఇట్లు చంపక బావా రమ్మని చిఱునగవు నగుచు, వానిం బట్టి బంధించి గడ్డంబును, మీసంబునుం, దలయును, నొకకత్తి

వ్రాతియమ్మున రేఫులు వారఁగొఱిగి, విరూపిం జేసె; నంతట యదువీరులు పరసైన్యంబుల నాఁడఁదోలి తత్సమీపంబునకు వచ్చి రప్పుడు, హతప్రాణుం డై కట్టువడియున్న రుక్మిం జూచి కరుణ చేసి బలభద్రుండు బంధంబు విడిచి హరి కిట్లనియె. క. తలమనక భీష్మనందను, తలయును మూతియును గొఱుగఁ దగవే బంధుం, దలయును మూఁతియు గొఱుగుట, తలఁ దఱుగుట కంటెఁ దుచ్ఛతరము మహాత్మా! క. కొందఱు రిపులని యలుగవు, గొందఱు హితులనుచు మేలు గూర్పవు నిజమీ, వందఱి యందును సముఁడవు, పొందఁగ నేలయ్య పిశునబుద్ధి ననంతా! అని వితర్కించి పలికి రుక్మిణీదేవి నుపలక్షించి యిట్లనియె. శా. తోడంబుట్టిన

శ్రీ సహోదరుని భంగమునకు ఖిన్నయగు రుక్మిణీదేవిని బలభద్రుఁ డూరార్చుట. శ్రీ

వానిభంగమునకుం దుఃఖింపకుమా కృష్ణు నాగ్రహంబు జూడకుమమ్మ పూర్వభవకర్మాధీనమై ప్రాణులు స్త్రీపున్నోలుసు జెందు లేదా కాఁడు శిక్షింపఁగ రక్షింపనీ తోడంబుట్టువు గశ్మలేశపరిభూతుండయ్యె నేఁడియ్యెడన్. క. చంపెడి దోషముఁ గలిగినఁ, జంపఁ జనదు బంధుజనులఁ జనువిషవంగా, జంపిన దోషము సిద్ధము, చంపను మఱి యేల మున్నె చచ్చినవానిన్. గీ. బ్రహ్మ చేత భూమిపతులకీ ధర్మంబు, గల్పితంబు రాజ్యకాంక్షఁ జేసి, తోడిచూలు నైన దోడఁబుట్టినవాఁడు, చంపు చుండుఁ గ్రూరచరితుఁ డగుచు. క. భూమికి ధనధాన్యములకు, భామలకును మానములకు బ్రాభవములకుం, గామించి మీఁదు గానరు, శ్రీమదమున మానఘనులు చెనఁకుదు రొరులన్. వ. వినుము దైవమాయం జేసి దేహాభిమానులై నమానవులకుం బగవాఁడు, బంధుండును, దాసీనుండును నను మోహంబు నసిద్ధం బై యుండు, జలాదులయందుఁ జంద్రసూర్యాదులును, ఘటాదులం దుగగనంబును పెక్కండై గానంబడు భంగి, దేహధారులకం దఱికి, నాత్మ యొక్కండయ్యును, పెక్కండై తోఁచు, నాద్యంతంబులుగల యీ దేహంబు, ద్రవ్యప్రాణగుణాత్మకంబై, యాత్మయందు నవిద్యచేతఁ గల్పితంబై, దేహికి సంసారంబు నందించు, సూర్యుండు తటస్థుండై యుండం బ్రకాశమానంబులైన దృష్టిరూపంబులం బోలె నాత్మ తటస్థుండై యుండ దేహేంద్రియంబులు ప్రకాశమానంబులగు, నాత్మకు పేఱొకండిటితోడ సంయోగవియోగంబులు లేవు వృద్ధిక్షయంబులు చంద్రకళలకుం గాని చంద్రునికి లేనికైవడి, జన్మనాశంబులు దేహంబునకుం గాని యాత్మకుం గలుగనేరవు—నిద్రవోయినవాఁ డాత్మను విషయఫలానుభవంబులు సేయించు తెఱంగున నెఱుక లేనివాఁడు నిజము గాని యర్థంబు నందు ననుభవము నొందుచుండుఁ గావున. క. అజ్ఞానజమగు శోకము, విజ్ఞానవిలోకనమున విడువుము నీకుం, బ్రజ్ఞావతికిం దగునే, యజ్ఞానుల భంగి వగవ నంభోజముఖీ! వ. ఇట్లు బలభద్రుని చేతఁ దెలుపంబడి రుక్మిణీదేవి దుఃఖంబు మాని యుండె—నట రుక్మి యనువాఁడు ప్రాణావశిష్టుండై విడువంబడి తన విరూపభావంబునకు నెఱియుచు, హరిం గెల్చి కాని కుండినపురంబు చొరనని ప్రతిజ్ఞఁ జేసి తత్సమీపంబున నుండె, నివ్విధంబున. క. రాజీవలోచనుఁడు హరి, రాజసమూహములఁ గెల్చి రాజసమొప్పన్, రాజితయగు తన పురికిని, రాజాననఁ దెచ్చె బంధురాజినుతింపన్.

శ్రీ శ్రీకృష్ణుండు రుక్మిణీదేవిని బెండ్లియాడుట. శ్రీ

వ. అంతన య్యాదవేంద్రుని నగరంబు సమారబ్ధవివాహకృత్యంబును, బ్రవర్తమానగీతవాద్యనృత్యంబును, బ్రతిగృహాలంకృతవిలసితాశేష నరనారీవర్గంబును, బరిణయమహోత్సవసమాహూయమాన మహీపాలగజఘటాగండమండలదానసలిలధారాసిక్తమార్గంబును, బ్రతిద్వారరంగవల్లికాచారసంఘటిత క్రముకకదళీకాకర్పూరకుంకుమాగరుధూపదీపపరిపూర్ణకుంభంబును, విభూషితసకలగృహవేదికాకవాటదేహళీస్తంభంబును, విచిత్రకుసుమాంబరరత్నతోరణవిరాజితంబును, సముద్ధూతకేతనవిభ్రాజితంబును నై యుండె, నయ్యవసరంబున. మ. ధ్రువకీర్తిన్ హరి పెండ్లియాడె నిజచేతోహారిణిన్ మాననై, భవగాంభీర్యవిహారిణిన్ నిఖిలసంపత్కారిణిన్ సాధుబాంధవసత్కారిణిఁ బుణ్యచారిణి మహాదారిద్ర్యసంహారిణిన్, సువిభూషాంబరధారిణిన్ గుణవతీచూడామణిన్ రుక్మిణిన్. క. సతులుం దారును బౌరులు హితమతిఁ గానుకలు దెచ్చి యిచ్చిరి కరుణో, న్నత వర్ధిష్ణుల కనుమానిత రోచిష్ణులకు రుక్మిణీకృష్ణులకున్. క. హరి పెండ్లికిఁ గైకేయక, కురుసృంజయయదువిదర్భకుంతినరేంద్రుల్, పరమానందముఁ బొందిరి, ధరణీశులలోన గాఢతాత్పర్యములన్. క. హరి యిట్టి తెఱఁగున రుక్మిణి, నరుమఁగొని వచ్చి పెండ్లియాడుట విని, దుష్కరకృత్యమనుచు వెఱఁగందిరి రాజులు రాజసుతులు దిక్కుల నెల్లన్. గీ. అనఘ యాదిలక్ష్మి యైన రుక్మిణితోడఁ, గ్రీడసలుపుచున్న కృష్ణుఁ జూచి, పట్టణంబులోని ప్రజలుల్లసిల్లిరి, ప్రీతులగుచు ముక్తభీతులగుచు. అని చెప్పి. ... ... ... ... ... ... ... ...

శ్రీ

క. కువలయరక్షాతత్పర, కువలయదళనీలవర్ణకోమలదేహా, కువలయనాథశిరోమణి, కువలయజనవినుతవిపులగుణసంఘాతా! మాలిని. సరసిజనిభహస్తా సర్వలోకప్రశస్తా, నిరుపమశుభమూర్తీ నిర్మలారూఢకీర్తీ, పరహృదయవిచారీ భక్తలోకోపకారీ, గురుబుధజనపోషీ ఘోరదైతేయశోషీ!

రోదోద్యోగంబును, మీనోదరప్రవేశంబునుం జెప్పిన విని, యా రతి మాయావతి యను పేర, శంబరుని యింటం బాత్రత్వంబు నడపుచు, మహానసస్థం బైన తన పెనిమిటి శరీరధారణంబు సేయుట కెదురుచూచుచున్న యది గావున, నయ్యర్భకుండు కందర్పుండని తెలిసి, మెల్లనం బుత్రార్థి యైన తెఱంగున, శంబరుని యనుమతి వడసి, సూపకారుల యొద్దనున్న పాపనిం దెచ్చి పోషించుచుండె; నా కుమారుండును, శీఘ్రకాలంబున నారూఢయౌవనుండై. క॥ సుందరమగు తన రూపము। సుందరులకు నాలు దేఱి చూడినం జాలరు। సౌందర్యమేమి చెప్పను। బొందెదమని డాయ బుద్ధిం బుట్టించు నృపా. సీ॥ చక్రనివారల చక్రవనంబున కుపమింప నెవ్వండు యోగ్యుండయ్యె। మిక్కిలి తపమున మెఱయు నంబికకునై శంకరు నెవ్వండు సగము సేసె। బ్రహ్మత్వమును బొందిపరగు ధాతను వాణికై యెవ్వండు వాడిచెఱిచె। వేయు డాగులతోఁడి విబుధలోకేశుని మూర్తికి నెవ్వండు మూలమయ్యె। మునుల తాలిమి కెవ్వండు ముల్లు సూపు। మగల మగువల నెవ్వండు మరులుగొలుపు। గుసుమధనువున నెవ్వండు గొను విజయము। చిగురువాలున నెవ్వండు దిక్కు వఱచు॥ వ॥ అని తన్ను లోకులు వినుతించు ప్రభావంబులు గలిగి, పద్మపత్రలోచనుండును, ప్రలంబబాహుండును, జగన్మోహనాకారుండును నైన పంచబాణునిం గని, లజ్జాహాససగర్వితంబులైన చూపులం జూచుచు, మాయావతి సురతభ్రాంతిం జేసినం జూచి, ప్రద్యుమ్నుం డిట్లనియె॥ మత్తకోకిల॥ నాఁటి నా భవుఁ డీతఁ డంచను నానయించుక లేక యో। మాత నీవిది యేమి నేఁ డిటు మాతృభావము మాని సం। ప్రీతిఁ గాముకి భంగిఁ జేసెదు పెక్కు విభ్రమముల్ మహా। ఖ్యాతవృత్తికి నీకు ధర్మము గాదు మోహము సేయఁగన్॥ వ॥ అనిన రతి యిట్లనియె, నీవు నారాయణనందనుండవైన కందర్పుండవు, పూర్వకాలంబున నేను నీ భార్యనైన రతిని, నీవు శిశువవై యుండ సిద్ధయుండై దొంగిలి తల్లిం దొఱంగం జేసి, శంబరుండు గొనివచ్చి నిన్ను నీరధిలో వైచిన, నొక్క మీనంబు మ్రింగె, నీ మీనోదరంబు వెడలితీవు. మీఁదటి కార్యమాకర్ణింపుము॥ క॥ మాయావి వీఁడు మర్మవి। మాయఁడు సంగరములందు మర్త్యులఁ గెలుచున్। మాయక రణమున వీనిన్। మాయింపుము మోహనాదిమాయల చేతన్॥ మత్తకోకిల॥ పాపకర్ముఁడు వీఁడు నిన్నుం బుట్టి తెచ్చిన లేచి నా। పాపఁ డెక్కడఁ బోయెనో సుతుఁ బాపి తే విధి యంచుఁ దాఁ। గ్రేపుఁ బాసిన గోవు భంగి నిఖిన్నయై పడి గాఢసం। తాపయైనను సోఁది కాఁదిన తల్లి కుయ్యిడుచుండు నే॥ వ॥ అని పలికి మాయావతి, మహానుభావుండైన ప్రద్యుమ్నునికి సర్వశత్రుమాయావినాశిని యగు, మహామాయావిద్య నుపదేశించె, నివ్విధంబున॥ మ॥ గురుమాయారణవేదియై కవచియై కోదండియై బాణియై। హరిజుం డోరసి శౌటవైచితివి నా డంభోనిధిన్ నన్ను మో। రరణాంభోనిధి వైతు నిన్ను నిదె వేరమ్మంచు జీ రమ్మనో। హరదివ్యాంబరు నుల్లసద్భుజసేనాడంబరున్ శంబరున్॥ చ॥ అవలి చి యిట్లు కృష్ణసుతుఁ డాడిన నిష్ఠురభాషణంబులన్। బదహతమైన డింగవయు పన్నగరాజముం బోలి శంబరుం। డదరుచు లేచి వచ్చి గదనచ్యుతనందను వ్రేసె నుజ్జ్వల। ద్విదురకఠోరఘోషసహభీషణనాదము సేసి యార్చుచున్॥ క॥ దనుజేంద్రుఁడు వ్రేసిన గదఁ। దన గదచేఁ బాయ నడఁచి దనుజులు బెదరన్। దనుజాంతకునికుమారుఁడు। దనుజేశుని మీఁద నార్చి తన గద వైచెన్॥ వ॥ అంత నారక్కసుండు వెక్కసంబగు రోసంబునం దనకుం దొల్లి మయుం డెఱింగించిన దైతేయమాయ నాశ్రయించి మింటికి నెగసి పంచబాణుని పై బాణవర్షంబు గురిసిన సమ్మహారథుండు నొచ్చియు సంచలింపక మత్సరంబున సర్వమాయావినాశిని యయిన సాత్త్వికమాయం బ్రయోగించి దనుజుని బాణవృష్టి నివారించె- మఱియు వాఁడు భుజగగుహ్యకపిశాచమాయలు వన్ని నొప్పించిన నన్నియుం దప్పించి॥ క॥ దండధరమూర్తిఁ గైకొని। యొండాడక చక్రిసూనుఁ డుగ్రతరాసిన్। ఖండించె శంబరుని తలఁ। గుండలకోటీరమణులు గుంభిని రాలన్॥ క॥ చిగురాకడిదపుధారను। జగములఁ బరవశము సేయు చలపాదికి దో। డ్డగు నుక్కడిదంబునఁ దన। పగతుం దెగ వ్రేయు టెంత పని చింతింపన్॥ క॥ తెగడుచు నుండక శంబరు। దెగడుచుఁ బూవింటి జోదు ధీరగుణంబుల్। పొగడుచుఁ గురిసిరి ముదమున। నెగడుచుఁ గుసుమములు ముసరు ని

## రతీదేవి ప్రద్యుమ్నసహితయయి గగనమార్గంబున ద్వారకకుఁ బోవుట.

ర్జరులధిపా॥ వ॥ ఇట్లు శంబరుని వధియించి, విలసిల్లుచున్న యించువిలుకానిం గొంచు, నాకాశచారిణియై, యా రతీదేవి గగనపథంబు వట్టి ద్వారకానగరోపరిభాగంబునం జనుదెంచిన॥ గీ॥ మెఱుఁగుతీఁగెతోడి మేఘంబు కైవడి। యుపిద తోడ మింటనుండి కదలి। యరుగుదెంచె మదనుఁ డంగనాజనములు। మెలఁగుచున్న లోని మేడకడకు॥ మ॥ జలదశ్యాముఁ బ్రలంబబాహుయుగళుం జంద్రాననున్ నీలసం। కులవక్రాలకు భీతవాసు ఘనవక్షున్ సింహమధ్యున్ మహో। త్పలపత్రేక్షణు మందహాసలలితుం బంచాయుధున్ నీరజా। క్షులు దా రేమఱిపాటఁ జూచి హరి యంచున్ డాఁగి రయ్యై యెడన్॥ క॥ కొందఱు హరియగు నందురు। కొందఱు చిహ్నములు గొన్ని కొన్ని హరికిని వే। ఱందురు మెల్లనె తెలియుదు। మందురు మఱుఁ జూచి కొందఱబలలు గుములై॥ క॥ హరియని వెనుచని పిదపన్। హరిఁ బోలెడు వాఁడు గాని హరి గాఁ డనుచున్। హరిమధ్యలల్లనల్లన। హరినందనుఁ డాయవ

చ్చి రాశ్చర్యములన్॥ ఉ॥ అన్నలు సేరవచ్చి మురనందనుఁ జూడఁగ దాను వచ్చె సం।పన్నగుణాభిరాము హరిపట్టపుదేవి విద
ర్భపుత్త్రి గే।గన్నుల నా కుమారకుని గైవడి నేర్పడఁ జూచి బోటితోఁ।జన్నులు చేఁపనిట్లనియె సంభ్రమదైన్యములుల్లసిల్లఁ
గన్॥ శా॥ ఏ కంజేక్షణుఁ డీకుమారతిలకుం డీయిందుబింబాననుం।డీకంఠీరవమధ్యుఁ డిచ్చటికి నేఁ డెందుండి యేతెంచెనో।
యీ కల్యాణునిఁ గన్న భాగ్యవతి మున్నే నోములన్నోఁచెనో।యే కాంతామణియందు వీనిఁ గనెనో యే కాంతుఁ డీ కాంతు
నిన్॥ శా॥ ఆలీ నా తొలుచూలిబిడ్డనికి బోఁ గ్రాడించి నే సూతికా। శాలామధ్యవిశాలతల్పగతనై చన్నిచ్చి నిద్రింపనా। బాలు
న్నా చను బాలకుం జెఱిచి యే పాపాత్ము లేత్రోవము। న్నేలీలం గొనిపోయిరో శిశువుఁ దా నే తల్లి రక్షించెనో॥ క॥ కొడుకఁడు
నా పొదిఁగిటిలోఁ। జెడిపోయిన నాఁటనుండి చెలియా తెలియం।బడ దే వార్తయు నతఁడే।వడువున నెచ్చోట నిలిచి వర్తించెనొ
కో॥ క॥ ఇందాఁక వాఁడు బ్రతికిన।సందేహము లేదు దేహచాతుర్యవయః।సౌందర్యంబుల లోకులు। వందింపఁగ నితని యంత
వాఁడగు సుమ్మీ॥ మ॥ అతివాసిద్ధము నాఁటిబాలకునకీ యాకారమీ వర్ణమీ। గతిహాసంబు విలోకనస్వరము లీగాంభీర్యమీ
కాంతియుఁ। డతఁడే కాఁదగు నున్నవారలకు నాయాత్మేశు సారూప్యసం। గతిసిద్ధింపదు వీనియందు మిగులం గౌతూహలంబ
య్యెడిన్॥ క॥ పొడ లేడి ముదమునఁ జిత్తము। గదలెడి నా యెడమమూఁపు గన్నుల వెంటన్। బొదలెడి నానందాశ్రులు। మెదలెడి
ఁ బాలిండ్లఁ బాలు మేలయ్యెడినో॥ అని డోలాయమానమానసయై వితర్కించుచు॥ క॥ తనయుఁడని యెడువఁ దలఁచును। దన
యుఁడు గాకున్న మిగులఁ దలఁగొని సవతుల్। తను నగియెదరని తలఁచున। దనుసంశయమెలమిఁ గొనియెఁ దనుమధ్య యదిన్॥
వ॥ ఇట్లు రుక్మిణీదేవి విచారించుచుండ లోపలి నగరికావలివారివలన విని కృష్ణుండు దేవకీవసుదేవులం దోడ్కొని చనుదెంచి సర్వ
జ్ఞుండయ్యు, నేమియు వివరింపక, యూరకుండె, నంత నారదుండు చనుదెంచి శంబరుండు కుమారునిం గొనిపోవుట మొదలైన
వార్త లెఱింగించిన॥ క॥ చచ్చిన బాలుఁడు గ్రమ్మర। వచ్చిన క్రియ వచ్చెఁ బెక్కువర్షములకునీ। సచ్చరితు నేఁడు గంటిమి। చె
చ్చెర మున్నెట్టి తపము సేయంబడెనో॥ వ॥ అని యంతఃపురకాంతలును, దేవకీవసుదేవ రామకృష్ణులును, యథోచితక్రమం
బున నా దంపతులకు దివ్యాంబరాభరణాలంకృతుల సత్కరించి సంతోషించిరి- రుక్మిణీదేవియు నందనుం గౌఁగిలించుకొనె॥
శా॥ అన్నా నా చనుఁ బాపి నిన్ను దనుజుం డంభోనిధిం వైచెనే। యెన్నే వర్షములయ్యెఁ బాసి సుత నీ వేరీతి జీవించితే। సన్నా
హంబున శత్రుఁ గెల్చితివి యాశ్చర్యంబు సంధిల్లెడి। న్నిన్నుం గాంచితి నింతకాలమునకు న్నే ధన్యతన్ జెందితిన్॥ వ॥ అని కొ
డుకును జూచి సంతోషించి కోడలి గుణంబులు కై వారంబు చేసి వినోదించుచుండె-నంత ద్వారకానగరంబు ప్రజలు విని హ
ర్షించిరంత॥ క॥ సిరి పెనిమిటి పుత్త్రుఁడగు। మరుఁ గని హరిఁ జూచినట్లు మాతలు దమలో। గరుగు మరఁటపరకాంతలు। మఱుఁగ

— శ్రీకృష్ణుండు లోకాపవాదనివృత్తికొఱకు శమంతకమణిని దెచ్చుట. —

ని మోహాంధకారమగ్నులుగారే॥ అని చెప్పిన శుకుండిట్లనియె॥ క॥ సత్రాజిత్తు నిశాచర।శత్రునకుం గీడుఁ జేసి సద్వినయము
తోఁ। బుత్త్రిన్ శమంతకమణియును। మైత్రిం గొని తెచ్చి యిచ్చె మనుజాధీశా॥ అనిన విని రాజిట్లనియె॥ గీ॥ శౌరికేమి తప్పు చేసె స
త్రాజిత్తు। కూఁతు మణియు నేల కోరి యిచ్చె।నతని కెట్లుఁ గలిగె నా శమంతకమణి।విప్రముఖ్య నాకు విస్తరింపు॥ వ॥ అనిన విని
శుకయోగివర్యుండిట్లనియె-సత్రాజిత్తను వాఁడు సూర్యునకు భక్తుండై చెలిమి సేయ నతనివలన సంతసించి సూర్యుండు శ
మంతకమణి నిచ్చె నా మణి కంఠంబున ధరియించి సత్రాజిత్తుండు భాస్కరునిభంగి భాసమానుండై ద్వారకానగరంబునకు
వచ్చిన మార్గంబున నతనిం జూచి జనులు మణిప్రభాపటలతిరోహితదృష్టులై సూర్యుండని శంకించి వచ్చి హరికిట్లనిరి॥ క॥ నారా
యణ దామోదర। నీరజదళనేత్ర చక్రి నిఖిలేశ గదా।ధారణ గోవింద నమ।స్కారము యదుపుత్త్ర నిత్యకల్యాణహరీ॥ మ॥ ది
విజాధీశ్వరులిచ్చగింతురు గదా దేవేశ నిన్ జూడ యా।దవవంశంబున గూఢమూర్తి వి జగత్స్వామీ యుండవై యుండఁగా। భవదీ
యాకృతిఁ జూడ నేఁడ దెరు విప్రచ్ఛన్నదిగ్భాసుఁడై। రవి యో నీరజగర్భుఁడో యొకఁడు చేరన్వచ్చె మార్గంబునన్॥ వ॥ అని
యిట్లు పలికిన మూఢజనులం జూచి గోవిందుండు నగి మణిసమేతుండైన సత్రాజిత్తుండు గాని సూర్యుండు గాఁడని పలికిన నం
త సత్రాజిత్తుండు శ్రీయుతంబై మంగళాచారసంచారితంబైన తనగృహంబునకుం జని మహీసురులచేత నిజదేవతామంది
రంబున నమ్మణిశ్రేష్ఠంబు ప్రవేశంబు సేయించె నది ప్రతిదినంబును నెనిమిది బారువుల సువర్ణంబు లొసంగుచుండు॥ క॥ పరా
జే లెడు వసుమతి। నా రత్నము పూజ్యమానమగు నక్కడరో। గారిష్టసర్పమాయిక। మారీదుర్భిక్షభయము మాను నరేం
ద్రా॥ క॥ అమ్మణి యాదవవిభునకు। నిమ్మని హరి యడుగ నాతఁ డీకథ నెచ్చున్। బొమ్మని పలికెను జక్రికి। నిమ్మణియాకున్న
మీఁద నేమానుచునన్॥ అంత॥ చ॥ అడరెడు వేడ్కఁ గంఠమున నమ్మణిఁ దాల్చి ప్రసేనుఁ డొక్కనాఁ। డడవికి ఘోరవన్యమృగ
యారతి నేఁగిన వానిఁ జంపి సైఁ।బడి మణిఁ గొంచు నొక్క హరి పాఱఁగ దాని వధించి దాసి రే।ర్పడఁగను జాంబవంతుఁడు ప్ర

భానుదీప్తిదిగంతము నాశమంతమున్॥ క॥ కని జాంబవంతుఁ డామణిఁ, గొని పోయి సమీపశైలగుహఁ జొచ్చి ముదం, బునఁ దన కూరిమిసుతకును, ఘనకేళీకందుకంబుగాఁ జేసె నృపా॥ వ॥ అంత సత్రాజిత్తుండు తన సహోదరుండైన ప్రసేనునిం గానక దుఃఖించుచు॥ మ॥ మణి కంఠంబునఁ దాల్చి నేఁ డడవిలో మా వాఁడు వర్తింపఁగా, మణికై పట్టి వధించినాఁడు హరి కిన్మర్యాద తేదంచు నా, పణముం జేయఁగ వానిదూషణముఁ గంసధ్వంసి యాలించి యీ, వ్రణము న్నాయెడ లేమి నిందగలిగెన్ వారించు టేరీతియో॥ అని వితర్కించి॥ మ॥ తనవారెల్లఁ బ్రసేనుజాడఁ దెలుపం దర్కించుచున్ వచ్చి తా, న్వనవీథిం గనె నేలఁ గూలిన సహాశ్వంబుం బ్రసేనుం బ్రసే, నుని హింసించిన సింహముం న్నృగపతి న్నొప్పించి ఖండించి యేఁ, గినభల్లూకము చొచ్చియున్నగుహయుం గృష్ణుండు రోచిష్ణుఁడై॥ వ॥ కని తన వెంటనంటి వచ్చిన ప్రజ నెల్ల గుహాముఖంబున విడిచి సాహసంబున మహానుభావుండైన హరి నిరంతర నీరంధ్ర నిబిడాంధకార బంధురంబై భయంకరంబై విశాలంబైన గుహాంతరాళంబు సొచ్చి చని యొక్కెడ నొక్క బాలికకు మదన్మనీయ కేళీకందుకంబుగా వ్రేలంగట్టిన యమ్మణిశ్రేష్ఠంబుఁ గని హరింపనిచ్ఛయించి॥ క॥ మెల్లన పదములిడుచు యదు, వల్లభుఁ డా బాలకడకు వచ్చినఁ గుండెల్, ఝల్లనఁగఁ జూచి యంపను, మొల్లంబుగ దాని దాది మొఱవెట్టె నృపా॥ వ॥ అంత నాధ్వని విని బలవంతుండైన జాంబవంతుండు వచ్చి తన స్వామి యగు కృష్ణు నెఱుంగక ప్రాకృతపురుషుండని తలంచి కృష్ణునితో రణంబు చేసె నంత॥ క॥ పలలమునకుఁ బోరెడు డేగలక్రియ శస్త్రములఁ దరులఁ గరముల విజయేచ్ఛల నిరువదియెనిమిదిదిన, ములు వోరిరి నగచరేంద్రముఖ్యుఁడు హరియున్॥ క॥ అడిదములు దరులు విఱిగిన, బెడిదములగు ముగతనములఁ బిఱుతివక వడి, న్బిడుగుల వడువునఁ బడియెడి, పిడికిటఁ బోడుచుటలు గలనఁ బెంసిరి రువ్వురున్॥ శా॥ స్పష్టాహంకృతు, లుల్లసిల్ల హరియున్భల్లూకలోకేశుఁడు, న్ముష్టాముష్టి నహర్నిశంబు జయసంమోహంబులం బోరుచోఁ, బుష్టిం బాసి ముకుంద ముష్టిహతులన్వ్యాప్తశ్రమోపేతుఁడై, పిష్టాంసోరుశరీరుఁడై యతఁడు దాభీతాత్ముఁడై యిట్లనెన్॥ వ॥ దేవా నిన్ను పురాణపురుషు నధీశ్వరుండైన విష్ణుం బ్రభవిష్ణుంగా నెఱుంగుదు. సర్వభూతంబులకుం బ్రాణప్రతాపధైర్యబలంబులు నీవ. విశ్వంబునకు సర్గస్థితిలయంబుల నెవ్వారాచరింతురు వారికి సర్గస్థితిలయంబులఁ జేయు నీశ్వరుండవు నీవ. యాత్మకుం బరమాత్మవు నీవ. యని మఱియును॥ సీ॥ బాణాగ్ని నెవ్వఁడు పఱపి పయోరాశి సంకించి బంధించి యేపుమాఁపెఁ, బరగ నెవ్వఁడు ప్రతాపప్రభారాశి చే దానవగర్వాంధతమసమడఁచెఁ, గంజాతములు త్రెంచు కరిభంగి నెవ్వఁడు దశకంఠు కంఠబృందములు ద్రుంచెఁ, హాచంద్రసూర్యమై యమరు లంకారాజ్యమున కెవ్వఁడు విభీషణుని నిలిపె, నన్ను నేలిన లోకాధినాథుఁ డెవ్వఁ, డంచితోదారకరుణారసాబ్ధి యెవ్వఁ, డాతఁడవు నీవ కావె మహాత్మ నేఁడు, మా ఱుపడి యెగ్గుఁ జేసితి మఱువవలయు॥ వ॥ అని యిట్లు పరమభక్తుండైన జాంబవంతుండు వినుతించిన నతని శరీరనిగ్రహనివారణంబుగా భక్తవత్సలుండైన హరి తనకరంబున నతని శరీరంబు నిమిరి మేఘగంభీరభాషణంబుల హరి యిట్లనియె॥ క॥ ఈ మణి మా చేఁ బడెననఁ, గా మనుజులొనరించు నిందవాప్పెడుకొఱకై, నీ మందిరమగు బిలమున, కే మరుదెంచితిమి భల్లుకేశ్వర వింటే॥ వ॥ అనిన విని సంతసించి జాంబవంతుండు మణియును దన కూఁతు జాంబవతియను కన్యకామణియునుం దెచ్చి హరికిం గానుకగా సమర్పించె నటమున్న హరి వెంట వచ్చిన వారలు బిలంబువాకిటం బండ్రెండుదినంబులు హరిరాక కెదురుచూచి వేసవి వగచి తమపురంబునకుం జనిరంత, దేవకీవసుదేవులు రుక్మిణియును, మిత్రబంధుజ్ఞాతిజనులును గుహ సొచ్చి కృష్ణుండు రాఁడు చిక్కెనని శోకించి॥ క॥ దుర్గమను గుబిలమున హరి, నిర్గతుఁడై చేరవలయు నేఁడని పౌరుల్, స్వర్గములై సేవించిరి, దుర్గన్నృతకుశలమార్గ తోషితభర్గన్॥ క॥ డోలాయితమానసులై, జాలింబడి జనులు గొలువఁ జండిక పలికె, న్బాలామణితో మణితో, హేలాగతి వచ్చు నంబుజేక్షణుఁడనుచున్॥ క॥ యత్నము సఫలంబైన, సపత్నసమూహములు బెగడఁ బత్నీయుండా, రత్నముతోఁ గన్యాజన, రత్నముతోఁ బురికి వచ్చె రయమున నంతన్॥ క॥ మృతుఁడైన వాఁడు పునరా, గతుఁడైన క్రియం దలంచి కన్యామణిసం, యుతుఁడై వచ్చిన హరిఁ గని, వితతోత్సవకౌతుకముల వెలసిరి పౌరుల్॥ వ॥ ఇట్లు హరి తనపరాక్రమంబున జాంబవతీదేవిం బరిగ్రహించి రాజసభకు సత్రాజిత్తుం బిలిపించి యా వృత్తాంతమంతయు నెఱింగించి సత్రాజిత్తునకు మణి నిచ్చిన నతండు సిగ్గువడి మణిం బుచ్చికొని పశ్చాత్తాపంబు నొందుచు, బలవద్విరోధంబునకు వెఱచుచు, నింటికిం జని॥ క॥ పాపాత్ముల పాపములం, బాపంగా నోపునట్టి పద్మాక్షుని పైఁ, బాపము గలదని నొడివిన, పాపాత్ముని పాపమునకుఁ బారము గలదే॥ మ॥ మితభాషిత్వము మాని యేల హరిపై మిథ్యాభియోగంబు చేసితిఁ బాపాత్ముఁడ నర్థలోభుఁడను మశ్చిత్తుండ మత్తుండ దు, ర్మతి నీదేహముఁ గాల్ప నేదురిత మేమార్గంబునం బాయు నే, గతిఁ గంసారి ప్రసన్నుఁడై మనుచు నన్గారుణ్యభావంబునన్॥ గీ॥ మణియుఁ గూఁతు నిచ్చి మాధవు పదములఁ, బట్టుకొంటినేని బ్రతుకు గలదు, సంతసించు నతఁడు సదుపాయమగు నిది, సత్యమితరవృత్తిఁ జక్కఁబడదు॥ వ॥ అని యిబ్భంగి బహుప్రకారముల నే

కాంతస్థుఁడై యింటిలోఁ, దనబుద్ధిం బరికించి నీతిఁ గనిన సత్రాజిత్తునం బ్రాప్తశో, భనుఁడై యిచ్చె విపక్షయోధతతిరిక్తభామాను సోహారికిన్ దనుజాధీశవిదారికిన్ హరికిఁ గాంతారత్నముం రత్నమున్॥ ఉ॥ తామరసాక్షుఁ డచ్యుతుఁ డుదారయశోనిధి పెండ్లియాడె నా, నామనుజేంద్రనందితగుణస్థితిలక్షణసత్యభామ, సుద్దామపతివ్రతాత్వనయధర్మవిచక్షణ గావయాయశల్గ, కామను సత్యభామను ముఖమ్యలినిర్జితసోమ నయ్యెడన్॥ క॥ మణి యిచ్చినాఁడు వాసరమణి నీకును మాకుఁ గలవు మణులు కుమారీమణి చాలు నంచుఁ గృష్ణుఁడు మణి సత్రాజిత్తునకును మరలఁగ నిచ్చెన్॥ వ॥ అంత నక్కడ, గుంతీస

శతధన్వుఁడు సత్రాజిత్తును జంపి మణిని నపహరించుట.

హితులైన పాండవులు, లాక్షాగారంబున దగ్ధులైరని విని, నిఖిలార్థదర్శనుండయ్యును, గృష్ణుండు బలభద్రసహితుండై, కరినగరంబునకుం జని కృపవిదురగాంధారీభీష్మద్రోణులం గని దుఃఖోపశమనంబులు సేయుచున్నయెడ॥ సీ॥ జగతీశ వినవయ్య శతధన్వుఁ బొడగని యక్రూరకృతవర్మలాప్తవృత్తి మనకిత్తు ననుచు సమ్మతిఁ జేసి తనకూఁతుఁ బద్మాక్షునకు నిచ్చి పాడి దప్పెఁ ఖలుఁడు సత్రాజిత్తు గడఁగి యే క్రియనైన మణి పుచ్చుకొను ము నీ మతము మెఱసి యని తన్నుఁ బ్రేరేప నా శతధన్వుఁడు పశువుఁ గిటికించు వాఁడు పట్టిచంపు క్రియ రణిని మఱవోవఁగఁ దగిన సత్రాజిత్తుఁ బట్టిచంపి వాని భామ లెల్ల మొఱలు వెట్ట లోభమునఁ జేసి మణిఁ గొంచుఁ జనియె నొక్కనాఁడు జనవరేణ్య॥ వ॥ ఇట్లు హతుండైన తండ్రిం గని శోకించి సత్యభామ యతనిం దైలద్రోణియందుఁ బెట్టించి హస్తిపురంబునకుం జని సర్వజ్ఞుండైన హరికి సత్రాజిత్తు మరణంబు విన్నవించిన హరియును బలభద్రుండు నీశ్వరులయ్యును మనుష్యభావంబుల విలపించి రంత బలభద్రసత్యభామాసహితుండై హరి ద్వారకానగరంబునకు మఱలి వచ్చి శతధన్వుం జంపెదనని తలంచిన నెఱింగి శతధన్వుండు ప్రాణభయంబునఁ గృతవర్మ యింటికిం జని తనకు సహాయుండవు గమ్మని పలికినం గృతవర్మ యిట్లనియె॥ ఉ॥ అక్కట రామకృష్ణులు మహాత్ములు వారల కెగ్గు సేయఁగా నిక్కడ నెవ్వఁ డోపు విను మేర్పడఁ గంసుఁడు బంధుయుక్తుఁడై యిక్కఁడె మున్ను మాగధుఁడు సేనలతోఁ బదినేడు తోయముల్ ద్రిక్కులఁ బాఱఁడే మన కదృష్టము వారల లావు వింతయే॥ వ॥ అని యుత్తరంబు చెప్పిన విని శతధన్వుం డక్రూరుని యింటికిం జని హరితోడి పగకుం దోడు రమ్మని వీఁడిన నక్రూరుండు హరిబలపరాక్రమధైర్యస్థైర్యంబు లుగ్గడించి మఱియు నిట్లనియె॥ సీ॥ ఎవ్వఁడు విశ్వంబు నెల్ల సలీలుఁడై పుట్టించు రక్షించుఁ బొలియఁ జేయు, నెవ్వని చేష్టలు నెఱుఁగరు బ్రహ్మాదు లెవ్వని మాయ మోహించు భువన, మే డేండ్ల పాపఁడై యే విభుఁ డొక చేత గోరక్షణమునకై కొండ నెత్తె, నెవ్వఁడు కూటస్థుఁ డీశ్వరుఁ డచ్యుతుఁ డనంతుఁడు గర్మసాక్షి యట్టి ఘనునకు శౌరికి ననవరతము మ్రొక్కెదము గాక విద్వేషమునకు నేము వెఱతు మొల్ల మునీ ప్రాంమ వేగఁ బొమ్ము చాలుఁ బదివేలు వచ్చె నీ సఖ్యమునను॥ వ॥ అని యిట్లు అక్రూరుం డుత్తరంబు వలికిన నమ్మహామణి నక్రూరుని [illegible]నునిచి వెఱచి శతధన్వుండు తురగారూఢుండై శతయోజనదూరంబు చనియె నంత గరుడకేతనాలంకృతంబైన తేరెక్కి రామకృష్ణులు వెనుచని యంత నతండును మిథిలానగరంబుఁ జేరి సమీపంబునందు॥ చ॥ తురగము డిగ్గి తల్లడముతో శతధన్వుఁడు పాదచారియై యుఱుకఁ బోకు పోకుమని పద్మదళాక్షుఁడు గూడఁ బాఱి భీకరగతి వాని మస్తకము ఖండితమై పడఁ ద్రెంచె జక్రముం బరిహృతదైత్యచక్రముఁ బ్రభాచయమోదితదేవశక్రమున్॥ వ॥ ఇట్లు హరి శతధన్వుని వధియించి వాని వస్త్రంబులం దమ్మణి వెదకి లేకుండుటఁ దెలిసి బలభద్రుని కడకు వచ్చి శతధన్వుండూరక హతుండయ్యె మణి లేదనిన బలభద్రుండిట్లనియె॥ సీ॥ ఆ మణి శతధన్వుఁ డపహరించుట కిక్క మెవ్వరిచేతఁ బనిచ్చినాఁడొ వేగ మెనీ వేగ వెదకుము పురిలోన వైదేహు దర్శింప వాంఛ గలదు, పోయి వచ్చెద నీవు పొమ్మని వీడ్కొల్పి మెల్లన రాముండు మిథిలఁ జొచ్చి, పోయిన జనకుండు వొడగని హర్షించి యెంతయుఁ బ్రియముతో నెదురువచ్చి యర్ఘ్యపాద్యాదికృత్యంబు లాచరించి యిచ్చవచ్చిన వస్తువు లెల్ల నిచ్చి యుండు మని భక్తిఁ జేసిన నుండె ముసలి గుపలయేశ్వర మిథిలలోఁ గొన్నియేండ్లు॥ వ॥ అంత దుర్యోధనుండు మిథిలానగరంబునకుం జనుదెంచి జనకరాజుచేత సమ్మానితుండై॥ క॥ చలమున గాంధారేయుఁడు లలితగదాయుద్ధకౌశలము నేర్చెఁ దగన్ హలిచే * శ్రితజననిర్జర ఫలిచేఁ దైత్యలోక్యవీరభటగణబలిచేన్॥ వ॥ అటఁ గృష్ణుండును ద్వారకానగరంబునకుం జని శతధన్వుని మరణంబును, మణి లేకుండుటయును, సత్యభామకుం జెప్పి సత్యభామాప్రియకరుండు గావున సత్రాజిత్తునకుం బరలోకక్రియలు సేయించె నక్రూరకృతవర్మలు శతధన్వుమరణంబు విని వెఱచి ద్వారకానగరంబు వెడలి బహుయోజనదూరభూమికిం జని రక్రూరుండు లేమిం జేసి వానలు లేక మహోత్పాతంబులును, శరీరమానసతాపంబులును, ద్వారకానగరవాసులకు సంభవించిన నందు వృద్ధజనులు బెగడి హరికిట్లనిరి॥ సీ॥ కమలాక్ష వినవయ్య కాశీశుఁడేలెడి కుంభిని వానలు గురియకున్నఁ, గోరి శ్వఫల్కునిఁ గొనిపోయి యతనికి గాందిని యనియెడు కన్య నిచ్చి, కాశీవిభుండు సత్కారంబుఁ జేసిన వానలు గురిసె నా వసుధమీఁద నాతని

పుత్రసఖుఁడై నయక్రూరుండు నంతటివాఁడె మహాతపస్వి। మఱలి వచ్చెనేని మానును త్పాతంబు। లెల్ల వానగురియు నీస్థలము
న। దేవయతనిఁ దోడి తెప్పింపు మన్నింపు। మానవలయు పీడ మానవులకు॥ వ॥ అని పలుకు పెద్దల పలుకు లాకర్ణించి దూతజనుల
నంపి కృష్ణుం డక్రూరుని రావించి పూజించి ప్రియకథలు కొన్ని చెప్పి సకలలోకజ్ఞుండు గావున మృదుమధురభాషణంబుల
నిట్లనియె॥ సీ॥ తా నేఁగుతటి శతధన్వుండు మణిఁ దెచ్చి నీయింటఁ బెట్టుట నిజముఁ దెలిసి। నాఁడు సత్రాజిత్తునకుఁ బుత్రకులు లే
మిన తనికిఁ గార్యంబు లాచరించి। విత్తంబు ఋణమును విభజించుకొని యెవరతని పుత్రిక లెల్ల నతఁడు పరుల। చేతనుర్మరణం
బుఁ జెందినాఁడ తనికై సత్కర్మములు మీఁద జరుపవలయు। మణిఁ గ్రహింపు మీవ మాయన్న నను నమ్మఁ। డెలమి బంధుజనుల కె
ల్లఁ జూపు। మయ్య నీగృహమున హాటక వేదికా। సహితమఖములు వరుసంతతమును॥ వ॥ అని యిట్లు సామవచనంబులు హరి ప
లికిన నక్రూరుండు వస్త్రచ్ఛన్నంబైన మణిఁ దెచ్చి హరికిచ్చిన॥ ఉ॥ సంతసమంది బంధుజనసంతతికిన్ హరి దెచ్చి చూపె। న
క్రాంతవిభాసమానఘృణిజాలపలాయితభూనభోంతర। ధ్వాంతము హేమభారచయవర్షణవిస్మితదేవమానవ। స్వాంత
ముఁ గీర్తిపూరితదిశావలయాంతము నా శమంతకమున్॥ క॥ చక్రాయుధుఁడీ క్రియఁ దన। యక్రూరత్వంబు జనులకం దఱకును
నిర్వక్రముగఁ దెలిపి క్రమ్మఱ నక్రూరునకిచ్చె మణి కృపాకలితుండై॥ క॥ ఘనుఁడు భగవంతుఁ డీశ్వరుఁ। డనఘుఁడు మణిఁ దె
చ్చియిచ్చినట్టి కథనము। ల్విననఁ బఠించినఁ దలఁచిన। జనులకు దుర్యశము బాపసంఘము దలఁగున్॥ వ॥ అంత నొక్కనాఁడు

## శ్రీకృష్ణుండింద్రప్రస్థపురంబునకరుగుట.

పాండవులం జూడ నిచ్ఛయించి సాత్యకిప్రముఖయాదవులు గొలువఁ బురుషోత్తముం డింద్రప్రస్థపురంబునకుం జనిన నం ప్రా
ణంబులం గనిన యింద్రియంబుల భంగి నఖిలేశ్వరుండైన హరిం గని కౌఁగిలించి కొని కృష్ణుని దివ్యదేహసంగమంబున నిర్ధూత
కల్మషులై యనురాగహాసవిభాసితంబైన ముకుందముఖారవిందంబు దర్శించి యానందంబు నొందిరి గోవిందుండును యుధి
ష్ఠిరభీమసేనుల చరణంబులకు నభివందనంబు చేసి యర్జును నాలింగనంబున సత్కరించి నకులసహదేవులు మ్రొక్కినఁ గ్రు
చ్చియెత్తి యుత్తమపీఠంబున నాసీనుండై యుండనప్పుడు॥ క॥ చంచన్నకుచభారా। కుంచితయై క్రొత్త పెండ్లికూఁతురగు
టనిం। చించుక సిగ్గు జనింపఁగఁ। బాంచాలతనూజ మ్రొక్కెఁ బద్మాక్షునకున్॥ వ॥ అంత సాత్యకి పాండవుల చేతం బూజితుం
డై యొక్కపీఠంబున నాసీనుఁ డయ్యెఁ దక్కిన యనుచరులును వారిచేఁ బూజితులై కొలిచియుండిరి హరియుం గుంతీదేవిక
డకుం జని నమస్కరించి యిట్లనియె॥ క॥ అత్తా కొడుకులుఁ గోడలుఁ। జిత్తానందమ్ముగఁ బనులు సేయఁగ నాత్మా। యత్తానుగవై
యాజ్ఞా। సత్తాములు గలిగి మను దెస మెల్ల సమునన్॥ చ॥ అనవుడుఁ బ్రేమవిహ్వలత నందుచు గద్గదభాషణంబులన్। గనుఁగవ
నశ్రుతోయములు గ్రమ్మఁగఁ గుంతి సుయోధనుండు చేసిన యపకారముం దడవి చెందిన దుఃఖము లెల్లఁ జెప్పి యా। దనుజవి
రోధికిట్లనియెఁ దద్దయుఁ బెద్దఱికంబు సేయుచున్॥ సీ॥ అన్న నీ చుట్టాల నరయు మమ్ముఁ బవలు నీవు పుత్తెంచిన నెమ్మితోడ। మా
యన్న యే క్షేమంబు నడుగఁ జూచి పోయెను నిల్చియున్నారి మునీ బలమున। నా పిన్నవాండ్రకు నాకు దిక్కెవ్వరు నేఁడాదిగా నిం
కనీవె కాక। నఖిలజంతువులకీ వాత్మవు గావునఁ బరులు నావార ని భ్రాంతి సేయ। వయ్య నా భాగ్య మెట్టిదో యనవరతముఁ। జి
త్తమున నుండి కరుణ మా దిక్కెల్లఁ। బాచుచుందువు గాదె యో పరమపుణ్య। యదుకుమారవరేణ్య బుధాగ్రగణ్య॥ అనిన
యుధిష్ఠిరుం డిట్లనియె॥ ఉ॥ పట్టఁగ లేరు నిన్నుఁ దమభావములందు సనందనాదులే। పట్టున నైన నట్టిగుణభద్రచరిత్రుఁడ వీవ
నేఁడు మా। చుట్టమవంచు వచ్చెదవు చూచెద వల్పుల మైన మమ్ము నే। మెట్టి తపంబు చేసితిమొ యీశ్వర పూర్వశరీరవేళలన్॥ వ॥ అ
ని ధర్మజుండు దన్నుం బ్రార్థించిన నింద్రప్రస్థపురంబు వారలకు నయనానందంబు సేయుచు హరి గొన్ని నెలలు వసియించి
యుండె నందొక్కనాఁడు॥ మ॥ తురగశ్రేష్ఠము నెక్కి కంకటధనుస్తూణీశరోపేతుఁడై। హరితోడన్ వనభూమికేఁగి విజ
యుండాసక్తుఁడై చంపె శంబరశార్దూలతరక్షుశల్యచమరీభల్లూకగంధర్వకా। సరకంఠీరవఖడ్గకోలహరిణీసారంగము
ఖ్యంబులన్॥ క॥ అచ్చోటఁ బవిత్రములై। చచ్చిన మృగరాజి నెల్ల జననాథునకుం। దెచ్చిరి పర్వము వచ్చినఁ। జెచ్చెర ననురుఁ గొ
ల్చియున్న సేవకులధిపా॥ వ॥ అంత నర్జునుం డమనీరు దప్పిఁ గొని డస్సి యమునకుం జని యొ-నమ్మహారథులైన నరనారాయణు

## సూర్యతనూజయగు కాళిందిని గృష్ణుండు వరించుట.

లందు వార్చి జలంబులు త్రావి యొక్క పులినప్రదేశంబున నుండుచు॥ చ॥ ఉపగతులైన యట్టి పురుషోత్తమపార్థులు గాంచి
రాపగా। విపులవిలోలనీలతరవీచికలందు శిరోజభారగు। చ్ఛపరిహాసితాళిమాలికను దంచితబాలశశిప్రభాలికం। దపనుని బా
లికన్ మదనదర్పణతుల్యకపోలపాలికన్॥ వ॥ అని యచ్యుతుండు పంచిన విజయుం డచ్చనియా కన్యకిట్లనియె॥ మ॥ సుదతీ యెవ్వ
రిదాన వేమికొఱకై చొప్పటం బ్రవర్తించెదె। య్యది నీ నామము కోర్కె యెట్టిది వివాహోత్కాంతుతోఁ గూడి నీ। నదికి న్వచ్చిన జా

లం బర్వతసన్నిభంబులన్ ॥ వ॥ ఇట్లు వృషభంబుల నన్నింటిని గట్టియాడ్చినం జూచి సంతసించి హరికి నగ్నజిత్తు నాగ్నజిత్తిని చ్చి నవిధివత్ప్రకారంబునం బెండ్లి యయ్యె నా రాజసుందరులానందంబునుం బొంది రా సమయంబున బ్రాహ్మణాశీర్వాదం బులును, గీతపటహశంఖకాహళభేరీమృదంగనినదంబులు చెలంగె నంత నా కోసలేంద్రుండు దంపతుల రథారోహణంబు సేయించి పది వేల ధేనువులును, విచిత్రాంబరాభరణభూషితలైన యువతులు మూఁడు వేలును, దొమ్మిది వేల గజంబులును, గజంబులకు శతగుణరథంబులును, రథంబులకు శతగుణంబులైన హయంబులును, హయంబులకు శతగుణాధికంబైన నరసమూహంబును నిచ్చి పుత్తెంచిన వచ్చునప్పుడు. ఉ॥ భూతి యలర్పఁ గోసలుని పుత్రిక కై చనుదెంచి తొల్లి యాఁబోతుల చేత నోటువడి పోయిన భూపతులెల్ల మాధవుం। డా తరుణి న్వరించుట చరావలిచే విని త్రోవ సైన్యసం। ఘాతముతోడఁ దాఁకి రరిగర్వవిమోచనుఁ బద్మలోచనున్ ॥ ఉ॥ దండిని రాజులెల్ల హరిఁ దాఁకిన నడ్డము వచ్చి వీఁకతో। భండనభూమియందు మదనబాంధవులెల్లను సన్నుతింపఁగా। గాండివచాపముక్తవిశిఖంబుల వైరుల నెల్లఁ జంపె నా। ఖండలనందనుండు *శశకంబుల సింహము చంపు కైవడిన్ ॥ వ॥ ఇట్లు హరి నాగ్నజిత్తిం బెండ్లియాడి యరణంబు పుచ్చుకొని ద్వారకానగరంబునకు వచ్చి సత్యభామతోఁ గ్రీడించుచుండె మఱియును ॥ మ॥ జనవంద్యన్ శ్రుతకీర్తినందనఁ దరుణీసంతర్జనక్షోణిపా। ద్యనుజన్ మేనమఱందలిన్ స్వములలోలాపాంగఁ గైకేయి నిత్యనవోన్నిద్రప్రపూర్ణ సద్గుణసముద్రన్ భద్ర నతభ్రున్ వా। వనజాతాక్షుఁడు పెండ్లియాడె నహితవ్రాతంబు భీతిల్లఁగన్ ॥ మఱియును ॥ చ॥ అమరులఁ బాఱఁదోలి భుజగాంతకుఁడైన ఖగేశ్వరుండు ము। న్నమృతముఁ దెచ్చు కైవడి మదాంధుల రాజుల నుక్కడంచి యా। కమలదళాయతేక్షణుఁడు గైకొని తెచ్చెను మద్రకన్యకన్। సమదవ్యగేక్షణన్ నయవిచక్షణ లక్షణఁ బుణ్యలక్షణన్ ॥ వ॥ ఇట్లు హరికి రుక్మిణియు, జాంబవతియు, సత్యభామయుఁ, గాళిందియు, మిత్రవిందయు, నాగ్నజిత్తియు, భద్రయు, మద్రరాజనందనయైన లక్షణయు, ననంగ నెనమండ్రు భార్యలైరి. మఱియు నరకాసు

## శ్రీకృష్ణుఁడు - సత్యభామతోఁ గూడి - మురాసుర - నరకాసురుల వధించుట.

రుని వధియించి తన్నిరుద్ధకన్యల సహస్రసంఖ్యల రోహిణి మొదలైన వారిం బరిగ్రహించె నని విని ॥ క॥ ధరకుం బ్రియసదనుఁడగు। నరకుని హరి యేల చంపె నరకాసురుఁడా। వరకుంతలలగు చానల। కరకుంభస్తనుల నేల కారలఁ బెట్టెన్ ॥ వ॥ అనిన నరేంద్రునకు మునీంద్రుం డిట్లనియె నరకాసురునిచేత నదితికర్ణకుండలంబులును, వరుణచ్ఛత్రంబును, మణిపర్వతమనియెడు నమరాద్రిస్థానమునుం గోలుపడుటయు, నింద్రుండు వచ్చి హరికి విన్నవించిన హరి నరకాసురవధార్థంబు గరుడవాహనారూఢుండై చను సమయంబున హరికి సత్యభామ యిట్లనియె ॥ శా॥ దేవా నీవు నిశాటసంఘములను ద్దీపించి చెండాడ నీ। ప్రావీణ్యంబులు చూడఁ గోరుదు మగడా ప్రాణేశ మన్నించిన। న్నీ వెంటం గొనిపొమ్ము నేఁడు గరుణన్నే జూచియే తెంచినీ। దేవీసంహతికెల్లఁ జెప్పను భవద్దీప్తప్రతాపోన్నతుల్ ॥ అనినఁ బ్రాణవల్లభకు వల్లభుం డిట్లనియె ॥ సీ॥ సమదపుష్పంధయఝంకారములు గావు భీషణకుంభికృద్బృంహితములు। వాయునిర్గతపద్మవనరేణువులు గావు తురగరింఖాముఖోద్ధూతరజము। లాకీర్ణజలతరంగాసారములు గావు శత్రుధనుర్ముక్తసాయకములు। కలహంససారసకాసారములు గావు జేంద్రసైన్యకదంబకములు। కమలకల్హారకుసుమసంఘములు గావు। చటులరిపుశూలఖడ్గాదిసాధనములు। కన్య నీ వేడ రణరంగగమన మేడ। వత్తు వేగమ నిలువుము వలదు వలదు ॥ వ॥ అనినఁ బ్రియునకుఁ బ్రియంబు జనియింప డగ్గఱి ॥ ఉ॥ దానవులైన నేమి మఱి దైత్యసమూహములైన నేమి నీ। మానితబాహుదుర్గముల మాటున నుండఁగ నేమి శంక నీ। తో నరుదెంతు నంచుఁ గరతోయజముల్ ముకుళించి మ్రొక్కెన। మ్మానిని దన్ను భర్త బహుమానపురస్సరదృష్టిఁ జూడఁగన్ ॥ వ ॥ ఇట్లు తనకు మ్రొక్కిన సత్యభామను గరకిసలంబులం బ్రుచ్చి యెత్తి తోడ్కొని గరుడారూఢుండై హరి గగనమార్గంబునం జని గిరిశస్త్రసలిలదహనపవనదుర్గంబై మురాసురపాశపరివృతంబైన ప్రాగ్జ్యోతిషపురంబు డగ్గఱి ॥ మ ॥ గదచేఁ బర్వతదుర్గముల్ శకలముల్ గావించి సత్తేజిత। ప్రదరశ్రేణుల శస్త్రదుర్గచయముల్ భంజించి చక్రాహతిన్। జెదరన్ వాయుజలాగ్నిదుర్గముల నిశ్శేషంబులం జేసి భీ। ప్రదుఁడై వాలునఁ ద్రుంచె గృష్ణుఁడు మురప్రచ్ఛన్నపాశంబులన్ ॥ మఱియును ॥ శా ॥ ప్రాకారంబుగదాప్రహారములను త్పాటించి యంత్రంబుల। న్నాకారాతుల మానసంబులను భిన్నత్వంబు నొందించి య। స్తోకాకారుఁడు శౌరి యొత్తె విలయోద్ధూతాభ్రనిర్ఘోషరే। ఖాకాఠిన్యము బాంచజన్యము విముక్తప్రాణిచైతన్యమున్ ॥ వ॥ అంత లయకాలకాలాభ్రగర్జనంబు పగిది నెప్పనమ్మహాధ్వని విని పంచశిరుండైన మురాసురుండు నిదుర సాలించి యావులించి నీల్గి లేచి జలంబులు వెడలి వచ్చి హరిం గని ప్రళయకాలకీలియై పడి మండుచు దుర్నిరీక్ష్యుండై కరాళించుచుండ నపంచముఖంబులం బంచభూతమయుండై లోకంబులు మ్రింగ నప్పళించు చందంబునం గదిసి యాభీలకీలచ్ఛటాజాలంబగు శూలంబున గరుడుని

* శశకంబులు కుందేళ్లు.

వై దిశానభోంతరంబులు నిండ నార్చుచు॥ క॥ మురమురఁ బరువిడి బిరుసున। హరిహరి నిలు నిలువు మనుచు నసురయుఁ గదిసెన్।
స్మరమురదివిజుల హృదయము। మెరమెరయి దెయడఁగు ననుచు మెఱసెన్ హరియున్॥ అప్పుడు॥ క॥ గరుడుని పైఁబడవచ్చి
న। మురశూలము నడుమ నొడిసి ముత్తునియలుగాఁ। గరములఁ బిరిచి ముకుందుఁడు। మురముఖముల నిశితవిశిఖములు వడిఁ జొని
పెన్॥ మ॥ గద త్రెస్స్మరదానవుండు హరిపైఁ గంసారియుం దద్గదన్। గదచేఁ ద్రుంచి సహస్రభాగములుగాఁ గల్పించె నా
లోన వాఁ। డెదమై హస్తము లెత్తికొంచు వడి రా నీక్షించి లీలాసవ్య।గ్రదశస్వానిశిరంబులై మనువడి ఖండించెఁ జక్రాయు
ధన్॥ వ॥ ఇట్లు శిరంబులు చక్రిచక్రధారాచ్ఛిన్నంబులై నవజ్రివజ్రధారావళితశిఖరంబై కూలెడి శిఖరిచందంబున మురా
సురుండు జలంబులందుఁ గూలిన వాని సూనులు జనకవధజనితశోకాతురులై జనార్దను మర్దింతు మని *రణకుర్దనంబునఁ దా
మ్రుండు, నంతరిక్షుండు, శ్రవణుండు, విభావసుండు, వసుండు, నభస్వంతుండు, నరుణుండు, నన నేడ్వురు యోధులు సక్రోధు
లై కాలాంతకచోదితంబైన ప్రళయపవనసప్తకంబు భంగి నరకాసురప్రేరితులై రయంబునఁ బీఠుండను సేనాదండనాథుం
బురస్కరించికొని పఱతెంచి హరిం డాసి శరశక్తిగదాఖడ్గకరవాలశూలాది సాధనంబులు ప్రయోగించిన॥ ఉ॥ ఆదనుజేం
ద్రయోధవివిధాయుధసంఘము నెల్ల సుగ్రతన్। మేదినిఁ గూల నేయుచు సమిద్ధనిరర్గళమార్గణాళిఁ ద్రు। వ్వాదకులాంతకుం
డను రహస్తభుజాసనకంఠజానుజం।ఘాముల ద్రుంచి పై చెదిలలంతలఖండములై యిలం బడన్॥ వ॥ ఇట్లు హరిశరజాల
చక్రనిహతులై తనవారలు మడియుటకు వెఱంగుపడి రోషించి గరుడగమను నిరూపించి తన్ను భూషించుకొని నరకాసు
యకనరపండువరకుండలప్రముఖాభరణభూషితుండై దానసలిలధారాసిక్తగండంబులును, మహోగ్రదండశుండాదం
డవేదండంబులు దండతండంబులై నడువ వెడలి భండనంబున కుంజని॥ మ॥ బలవంతుండు ధరాసుతుండు గనె శుంభద్రాజబిం
బోపరిస్థలశంపాన్విత మేఘమో యనఁ ఖగేంద్రస్కంధపీఠంబుపై। లలనారత్నముఁ గూడి సంగరకథాలాపంబులం జేయును।
జ్జ్వలనీలాంగుఁ ‡గనన్నిషంగుఁ గుహనాచంగున్ రణాభంగురున్॥ వ॥ కని కలహంబున నరకాసురుండు గమకింపం దమ
కింపక విలోకించి సంభ్రమంబున॥ శా॥ § వేణిం జొల్లెము వెట్టి సంఘటితనీవీబంధయై భూషణ। శ్రేణిం దాల్చి ముఖేందుమండ

## సత్యభామ నరకాసురునితో యుద్ధంబు చేయుట.

లనారీచీజాలముల్ పర్వఁగా। బాణింబయ్యెదఁ జక్కఁగా మలఁచి మిసుంభద్విరసంరంభయై। యేణీలోచన లేచి నిల్చెఁ దనప్రా
ణేశాగ్రభాగంబునన్॥ క॥ †జన్యంబున దనుజుల తో।ర్జన్యములు మపంగఁ గోరి చనుదెంచిన సౌ। జన్యవతిఁ జూచి యదుసౌ।జ
న్యశ్రేష్ఠుండు సరససల్లాపములన్॥ క॥ ¶ లేమా దనుజులఁ గెలువఁగ। లేమా నీ వేలఁ గడఁగి లేచితి విటు రా। లేమా నుమాన వేసి
యు। లేమా విల్లందికొను ములీలం గేలన్॥ అని పలికి॥ క॥ హరి కాంక్షీ కి హరి యొసఁగెను। సురనికరోల్లాసనమును శూరకఠోరా।
సురసైన్యత్రాసనమును। బరగర్వనిరాసనమును బాణాసనమున్॥ శా॥ ఆ విల్లందఁ బలంబు మెందఁ తదగణ్యానంత తేజో విశే।
షావిఖ్యాత మహాప్రతాపమున వీరాలోకనశ్లోకయై। తా వేగన్ సగుణంబు చేసె ధనువుం దన్వంగి దైత్యాంగనా। గ్రీవాసం
ఘము నిర్గుణంబుగ రణక్రీడాసమూహాత్కంఠతోన్॥ క॥ నారి మొరయించె రిపుసే। నారింఖణహేతువైన నాదము నిగుడన్।
నారీమణి బలసంప। న్నారీభాదికము మూర్ఛనందన రేంద్రా॥ సీ॥ సౌవర్ణకంకణఝణఝణత్కారంబు శింజినీరవముతోఁ జె
లిమి సేయఁ। దాటంకమణిగణధగధగద్దీప్తులు గండమండలరుచుల్ గప్పికొనఁగ। ధవళతరాపాంగధళధళరోచులు బాణజాల
ప్రభాపటలి నడఁప। శరపాతఘుమఘుమశబ్దంబు పరిపంథిసైనికకలకలస్వనములు డప। వీరశృంగారభయరౌద్రవిస్మయ
ములు। గలసి భామిని యయ్యె నా కాక యనఁగ। నిముసుఁ బోడుగు టదివుచు టేయుటెల్ల। నెఱుఁగరాకుండ నని జేసె నిందు
వదన॥ మ॥ పరుఁ జూచున్ వరుఁ జూచు నొంపనలరింపన్ రోషరాగోదయా। విరతభ్రూకుటిమందహాసములతో వీరంబు శృం
గారముం। బెరుగన్నుల్ గెంపు సొంపు బరగన్ జంద్రాస్త్రసందోహముల్। సరసాలోకసమూహము న్నెరపుచున్ జంద్రాస్య
హేలాగతిన్॥ మ॥ అలినీలాలక చూడ నొప్పెసఁగెఁ ‡బ్రత్యాలీఢమానంబుతో। నలికస్వేదవికీర్ణకాలకలతో నాకర్ణకాంతస్ఫా
లల్లలితజ్యానఖపుంఖదీధితులతో లక్ష్యావలోకంబుతో। వలయాకారధనుర్విముక్తవిశిఖవ్రాతాహతారాతియై॥ సీ॥ బొ
మ్మపెండ్లిండ్లకుఁ బోనొల్లనను బాల రణరంగమున కెట్లు రాఁదలంచె। మగవారిఁ గనినఁ దా మఱుఁగుఁ జేరెడు నింతి పగవారి గె
ల్వ నే పగిదిఁ జూచె। బసిఁడియుయ్యాల లెక్కఁ భయమందు భీరువు ఖగపతిస్కంధ మే కడిఁది నెక్కె। సఖుల కోలాహలస్వనము

---

*రణకుర్దనంబునన్ । యుద్ధవిలాసము చేత. ‡ కనన్నిషంగున్ । ప్రకాశమానములగు అంబులపొదులు గల. కుహనాచంగున్ । మహామాయావి యయిన. § వేణిం జొల్లెము వెట్టి । జడను ముడిగా నమర్చి. † జన్యంబునన్ । యుద్ధమునందు. ¶ లేమా నుమాన వేయను బోట - వేమా నుమాన వేయని యొక పాఠముఁ గలదు. రింఖణ । చలనమునకు. ‡ ప్రత్యాలీఢము । ఎడమ కాలు ముందరికిఁ జాఁచి నిలుచుట.

రంబున కుంజనిరంతరసురభికుసుమమకరందమాధురీవిశేషంబులకుం జొక్కి చొక్కక నాకలోకంబుననుండి వెంటనంటుగు
డెంచుచు తుమ్మెదలకు నెమ్మి వలంచుచున్న పారిజాతము నాశ్రితపారిజాతుండైన హరి మహాప్రేమాభిరామయగు సత్యభా
మతోఁ గ్రీడించు మహోద్యానంబున సంస్థాపించి నరకాసురునియింటం దెచ్చిన రాజకన్యకలెందఱందఱకు నన్ని నివాసం
బులు గల్పించి గృహోపకరణంబులు సమర్పించి॥ చ॥ అమితవిహారుఁ డీశ్వరుఁ డనంతుఁడు దా నొక నాఁడు మంచి లగ్నమునఁ
బదాఱువేలభవనంబులలోనఁ బదాఱువేలరూపములఁ బదాఱువేల నృపబాలలఁ బ్రీతిఁ బదాఱువేల చం।దముల విభూతి నొం
దుచు యథావిధితో వరియించె భూవరా॥ ఉ॥ దానములందు సమ్మదవిధానములందు నవలోకభాషణా।హ్వానములందు నొక్క
క్రియ నాలితాంగులకన్ని మూర్తులై। తా ననిశంబుఁ గానఁబడి తక్కువ యొక్కువ లేక యుత్తమ।జ్ఞానగృహస్థధర్మమునఁ జ
క్రమించెఁ బ్రపూర్ణకాముఁడై॥ క॥ తరుణులు పెక్కండ్రైనను। బురుషుఁడు మన లేఁడు సవతిపోరాటమునన్।హరి యాప
దాఱువేవురు।తరుణులతో సమత నిలిపెఁ దక్షత్వమునన్॥ శా॥ ఎన్నేభంగుల యోగమార్గముల బ్రహ్మేంద్రాదు లీక్షించు
చున్ నెన్నే దేవునిఁ జూడఁగానక తుదిన్ మోహింతు రామేటికే। విన్నాణంబున నోసతుల్ గృహిణులై విఖ్యాతిఁ సేవించిరి। చ్ఛి
న్నాల్లోకమహాసభాషణరతిన్ శ్లాఘానురాగంబులన్॥ సీ॥ ఇంటికి వచ్చిన నెదు రేఁగుదెంచుచు నాసీతవస్తువులందుకొనుచు।
సౌవర్ణమణిమయాసనములు వెట్టుచుఁ బదములు గడుగుచు భక్తితోడ। సంవాసితస్నానజలములందిచ్చుచు గంధవస్త్ర
భూషణములొసఁగి। యిష్టపదార్థంబు లిడుచుఁ దాంబూలాదులొసఁగుచు విసరుచు నోజ మెఱసి। శిరము దువ్వుచు శయ్య
పైఁ జెలువు మిగుల। నడుగులొత్తుచు దాసీసహస్రయుక్త। లయ్యుఁ గొలిచిరి దాసలై హరిని దారు। దారకాధిపవనలు దా
నుదగిలి॥ శా॥ నన్నే పాయఁడు రాత్రులన్ దివసములన్ నన్నే కృపం జెందెడి।న్నన్నే దొడ్డఁగఁ జూచు వల్లభలలో నాథుండు నా
యింటనే। యున్నాఁ డంచుఁ బదాఱువేలువనలో నూహించి సేవించిరా।యన్న శ్లాఘపతివ్రతాత్వపరిచర్యాభక్తియో
గంబులన్॥ క॥ ఆరామలతో నెప్పుడుఁ। బోరాములు చాల నెఱపి పురుషోత్తముఁడు।న్నారాముఁ దిరిగెను సా।ధారామలతా
సరోవిహారములన్ నృపా॥ క॥ ఏ దేవుఁడు జగములను। త్పాదించును మనుచుఁ జెఱుచుఁ బ్రాభవమునన్। ర్యాదారతుఁ డా

~ శ్రీకృష్ణుండు కేళీగృహమునందు రుక్మిణీదేవితో విరసోక్తులాడుట. ~

మున నై। యా దేవుం డట్లు మెఱసె యాదవులందున్॥ వ॥ అంత నొక్కనాఁడు రుక్మిణీదేవిలోఁగిట మహేంద్రనీల
మరకతాదిమణిస్తంభవలభివిటంకపటల దేహళికవాటవిరాజమానంబును, శాతకుంభకుడ్యగవాక్షవేదికాసోపానం
బును, విలంబమానముక్తాఫలదామవిచిత్రకౌశేయవితానంబును, వివిధమణిదీపికావిసరవిభ్రాజమానంబును, మధుక
రకులకలిత మల్లికాకుసుమమాలికాభిరామంబును, జాలకరంధ్రనిర్గత కర్పూరాగరుధూపధూమంబును, వాతాయ
నవిప్రకీర్ణశిశిరకరకిరణస్తోమంబును, పారిజాతప్రసవామోదపరిమిళితపవనసంచరంబునయిన లోపలిమందిరంబున,
శరచ్చంద్రచంద్రికాధవళపర్యంకమధ్యంబున, జగదీశ్వరుండయిన హరి సుఖాసీనుండయియుండ సఖీజనంబులుం దా
నును దగ్గరి కొలిచియుండె॥ సీ॥ కుచకుంభములమీఁది కుంకుమతో రాయు హారంబు లరుణంబు లగుచు మెఱయఁ।
గరపల్లవము సోఁచి కదలింప నంగుళీయకకంకణప్రభ లావరింపఁ। గదలిన బహురత్నకలితనూపురముల గంభీరనినదంబు
గడలుకొనఁగఁ। గాంచనమణికర్ణికామయూఖంబులు గండపాలికలపై గంతులిడఁగఁ।గురులు నర్తింపఁ బయ్యెదకొంగు దూఁ
గఁ।బోఁటి చేనున్న చామరం బుచ్చుకొనుచు।జీవితేశ్వరు రుక్మిణి చేరనరిగి। వేడ్క లెసరొత్త మెల్లన వీవఁ దొడఁగె॥ అప్పుడు॥
ఉ॥ పతి యేరూపము దాల్చినన్ దదనురూపం బైన రూపంబుతో।సతి తానుండెడు నా సురూపవతి నా చంద్రాస్య నా లక్ష్మి నా।
సుతనున్ రుక్మిణి నాయనన్యమతి నా శుద్ధాంతరంగం గళా। చతురత్వంబున శౌరి యిట్లనియెఁ జంచన్మందహాసంబుతోన్॥
మ॥ బలశౌర్యంబుల భోగమూర్తికులరూపత్యాగసంపద్గుణం।బుల దిక్పాలురకంటెఁ జైద్యముఖరుల్ పార్థివుల్ నుల్లారికిన్।
నెలఁతా తల్లియుఁ దండ్రియున్ సహజుఁడున్ నిన్నిచ్చి నం బోక యీ। బలవద్వైరుల వార్ధిలీనుల మమ్ముం బాటింప నీ కేటికిన్॥
సీ॥ లోకులనడవడి లోనివారము గాము పరులకు మాజాడ బయలుపడదు।బలముదోపేతులు పగఁ గొంద్రు మాతోడ రాజపీఠ
ములకు రాము తఱుచు। శరణంబు మాకు నీజలరాశి సతతంబు నిష్కించనుల మేము నిధులు లేవు।కలవారు చుట్టాలుగారు నిష్కిం
చనజనబంధులము ముక్తసంగ్రహులము। గూఢవర్తనులము గుణహీనులము భిక్షు।లైన వారిఁగాని నాశ్రయింప। మిం
మముఖులు దగులరిటువంటి మము బోఁటి। వారి నేలఁ దగుల వారిజాక్షి॥ క॥ సిరియును వంశము రూపును। సరియైన వివాహస
ఖ్యసంబంధంబు ల్జరుగును సరిగాకున్నను।జరుగవు లోలాక్షి యెట్టి సంసారులకున్॥ క॥ తగదని యెఱుఁగవు మమ్మున్। దగిలి
తివి మృగాక్షి దీనఁ దప్పగు నీకుం।దగినమనుజేంద్రు నొక్కనిఁ।దగులుము గుణహీనజనులఁ దగు నేతగులన్॥ సీ॥ సాల్వజరాసం

థమైద్యాదిరాజులు చెలఁగి నిన్వీక్షింప మలయుచుండు। రది గాక రుక్మి నీయన్న యుగర్వించి వీర్యమదాంధుఁడై వెలయుచున్నా। వారిగర్వంబులు వారింపఁ దలఁచి గోరి చెలువ నిన్నొడిచి తెచ్చితిమి గాని। కాంతా తనూజార్థకాముకులము గాము కాము మోహోర్ములఁ గ్రుంగము కొనము। విను ముదాసీనులము క్రియావిరహితులము పూర్ణులము మేము నిత్యాత్మబుద్ధితోడ। వెలుఁగుచుందుము గృహదీపవిధము మెఱసి। నవలతా తన్వి మాతోడ నవయవలదు॥ వ॥ అని యిట్లు భగవంతుండైన హరి దన్నుఁ బాయక సేవించు ప్రియురాలిం బట్టపుదేవి నని యెడి రుక్మిణీదర్పంబు నేర్పున సంహరించియుఁ గుండిన నమ్మానవతియు ప్రియంబులున గౌరవంబులున పూర్వకంబులు నైన మనోవల్లభు మాటలు వినిమరంతంబైన చింతాభరంబున సంతాపంబు నొందుచు॥ సీ॥ కాటుక నెఱయంగఁ గన్నీరు వరదయై కుచకుంభయుగళకుంకుమము దుడిచియ। వడి వడి వెడలెడి వేఁడి నిట్టూర్పుల లాలి-తాధరకిసలయము గందఁ। జెలువంబు నెఱిచిప్పి దిన్నవోవుచు నున్న వదనారవిందంబు వాడుఁబోవ। మారుతాహతిఁ దూలు మహితకల్పకవల్లి వడువున మేన్వడవడ వడంకఁ। జిత్తము మరియుంగఁ జెక్కిటఁ జెయ్యిఁ జేర్చి। కౌతుకం బేదివదనతలాగ్రమున నేల। వ్రాసి పెంచుచు మోహరవాంచి వగలఁ। బొందె మువ్వంబు గందిన పువ్వుఁబోఁడి॥ చ॥ అలికులవేణి తన్ను విభుఁ డాడిన యప్రియభాషలిమ్మెయిఁ। సోలవక కర్ణరంధ్రముల సూచులు చొన్పిన రీతి నాత్మ బెబ్బుకరొదవి న్నలేడి క్రియఁ బొల్పఱి చేష్టలు దక్కి నేలపై। వలనరి వ్రాలెఁ గీలెడలి వ్రాలిన పుత్తడిబొమ్మకైవడిన్॥ ఇట్లు వ్రాలిన॥ మ॥ ప్రణుతామ్నాయుఁడు కృష్ణుఁ డంతఁ గదిసెన్ బాష్పావరుద్ధారుణోత్క్షణి విస్రస్తవినూత్నభూషణి మహాక్షేత్రాంబరన్ ఆగావశోషణి నాలింగితధారుణిన్ జకులాచారైకసధర్మచారిణి విశ్లేషిణి భీతతోషిణిఁ బురంధ్రీగ్రామణిన్ రుక్మిణిన్॥ సీ॥ కనిసంభ్రమంబునఁ దనువునం దనువుగా ననువునఁ జందనంబు బ్లసలఁడి। కన్నీరు పన్నీటఁ గడిగి కర్పూరంపుపలుకులు చెవులలోఁ బొఅనాడి। కర మొప్పము త్యాలసరులు చికిరిఁ డలింపి యురమునఁ బొంచ మాగానాలు కొలిపి। తిలకంబు నునుఫాలఫలకంబుపైఁ దీర్చి వదలిన భూషణావలులు దొడిగి। కమలదళచారుతాలవృంతముల విసరి। పొలుపు సమ్యోదకుచములఁ బొందుపఱచి। చిత్తమిగురొత్త నెయ్యాన సేదఁదేర్చి। బిగియఁ గౌఁగిటఁ జేర్చి నెమ్మొగము నిమిరి॥ గీ॥ నెఱులు గలవారు నీలంపుటురులసిరుల। వరులు గొనఁ జాలి నరులను మరులు గొలుపు। నిరులఁ గెలిచిన తమ్మొనగఱులు దెగమి। కురులను విదీర్చి విరులిడి కొప్పు వెట్టె॥ క॥ మురసంహారుఁ డిందిందిర। గరుపనిలచలప్పవిమానకలికాంచితసుం। దరశయ్యఁ జేర్చె భీష్మకవరపుత్రిన్ సుతచరిత్రి వారిజనేత్రిన్॥ వ॥ ఇట్లు పానుపునం జేర్చి మృదు



రుక్మిణీదేవి శ్రీకృష్ణలాలితయై యతని నుతించుట.

మధురభాషణంబుల ననునయించిన॥ క॥ పురుషోత్తము ముఖకోమల। సరసిజము య్యొందు వదన సవ్రీడాహా। సము దిస్నిగ్ధాపాంగ। స్ఫురదవలోకనములాలయఁ జూచితగ నిట్టె॥ క॥ మురహర దివసాగమదరదరవిందదళాక్షుతలఁపన దియెట్టిదను। న్నిరవధిక విమలతేజో। వరమూర్తివి నీవభక్తవత్సల యెందున్॥ గీ॥ సంతతజ్ఞానసుఖబలైశ్వర్యశక్తులాదిగాఁ గలసుగుణంబులమరు నీకు। నేను గుణము నె సర్వలోకేశ్వరేశ। లీలమై సచ్చిదానందశాలి వనఘ॥ సీ॥ రూఢిమైఁ బ్రకృతిపూరుషకాలములకు నీశ్వరుఁడవై భవదీయచారుదివ్య। లలితకళాకౌశలమున నభిరతుఁడై కడఁగు నీరూప మెక్కడ మహాత్మ। సత్త్వాదిగుణసముచ్చయయుక్తమూఢాత్మనైన నే నెక్కడ ననఘచరిత। కోరి నీమంగళగుణభూతిదానంబు సేయంగఁ బదు నని చెందు భీతి। నంబునిధిమధ్యభాగమందమృతఫేనపటలపాండురనిభమూర్తి పన్నగేంద్రభోగశయ్యను బవ్వళించుచును మనరు। నట్టియున్నతలీలదివ్యంబు వలఁప॥ వ॥ శబ్దస్పర్శరూపరసగంధంబులనియెడు గుణంబుల చేతం బరిగ్రహింపఁబడిన మంగళసుందరవిగ్రహుండవై యజ్ఞానాంధకారనివారకంబైన రూపంబుఁ గైకొని భవదీయులైన సేవకులచేత ననుభావ్యంబవై తిభవత్పాదారవిందమకరందరసాస్వాదలోలాత్ములైన యోగీంద్రులకైన ననుభవన్మార్గంబు స్ఫుటంబుగాపట్లగుటం జేసి యీయానును జపశువులకు మఱి భావ్యంబగుట యేమి చెప్ప నిట్టి యీశ్వరుండవైన నీకు నిచ్ఛాస్వతంత్రంబు దియును, నాకధికంబు గావునని న్ను నేననుసరింతు దేవా నీవకించనుండవై తేని బలిభోక్తలైన బ్రహ్మేంద్రాదులెవ్వనికొఱకు బలిసమర్పణంబు చేసిరి నీవు సమస్తపురుషార్థమయుండవనియును, ఫలస్వరూపివనియును, నీయందలి ప్రేమాతిశయంబులం జేసి విజ్ఞానదీపాంకురంబు ననిరస్తసమస్తదోషాంధకారులై యిహసౌఖ్యంబులు విడిచి భవదీయదాససంగముంబె కోరుచుందురట్లు సేయనేరక నిజాధికారాంధకారమగ్నులై భవత్తత్త్వంబు దెలిసి బలిప్రక్షేపణంబులు సేయంజాలక మూఢులై సంసారచక్రంబునం బరిభ్రమింతురదియునుం గాక॥ గీ॥ వరమునీంద్రయోగివరసురకోటిచే। వర్ణితప్రభావవైభవంబు। గలిగి యఖిలచేతనులకు విజ్ఞానప్రముండవగుదు భవదురితదూర॥ వ॥ దేవా భవదీయకుటిలభ్రూవిక్షేపోదీరితకాలవేగంబుచేత విధ్వస్తమంగళులగుకమలభవభవపాకశాసనాదులందిరస్కరించినట్టి నీదీయవిత్తంబున॥ చ॥ నినువరియించి నం బెలుచ నీరజలోచన శార్ఙ్గపా

యశ్రాంతసనవినదంబులన్సకలశత్రునరాపతులన్జయించివిభో! రుచిఁ జంబుకకోటిఁ దోలుమృగరాజునిజాంశముభూరిశక్తిఁగై। కొనినవిధంబునన్మనకుఁ గొంటితమోహరతఁ దెచ్చితీశ్వరా॥ ఉ॥ అట్టినృపాలకీటములనాజినెదుర్పఁగలేనివానియట్లొట్టినభీతి మైనిటుపయోధిశరణ్యుఁడవై వసించితయ్య। నెట్టనమాయగాకనివినిక్కములేభవదీయభక్తులై। నట్టినరేంద్రమౌళిమణు లంచితరాజఋద్ధిమున్ముదంబునన్॥ గీ॥ వితతరాజ్యగరిమవిడిచికాననములు। నాత్మలందుమీపదాబ్జయుగము। వలఁతిగాఁగని లిపివాతాంబుపర్ణాశనోగ్రనియతులగుచునుందురభవ॥ మ॥ విమలజ్ఞాననిరూఢులైనజనముల్ప్రోషింపమీపాదకం। జమ రందస్ఫుటదివ్యసౌరభము నాస్వాదించినిర్వాణరూ। పముసత్పూరుషవాగుదీరితముశోభాశ్రీనివాసంబునౌ। మిముసేవిం పకమానవాధమునిమర్త్యధాంధు సేవింతునే॥ వ॥ మఱియును దేవాభూలోకంబునందును, నిత్యనివాసంబులందును, సకల ప్రదేశంబులందును జగదీశ్వరుండవైననిన్నుసభినుతంబులైనకామరూపంబులుగైకొనివరియింతుభవదీయచరణారవిం దమకరందాస్వాదనచాతుర్యభృంగిమైనకామినియతిహేయంబైనత్వక్శ్మశ్రురోమనఖకేశంబులచేతఁగప్పంబడియం తర్గతంబైన మాంసాస్థిరక్తక్రిమివిట్కఫపిత్తవాతంబుల భీభత్సంబైన నరాధముని మూఢాత్మనై కామించునేయ దియునుంగాక॥ సీ॥ నీరదాగమమేఘనిర్యత్పయఃపానచాతకంబేగునే చాటిపడెకుఁ। బరిపక్వ*మాకందఫలరసంబులు గ్రోలుకీరముల్చనునె కుత్తూరములకు। ఘనరవాకర్ణనోత్కలికమయూరముల్గోరునే కరినరఝిల్లీరవంబుఁ। గరికుంభపిశిత సక్తాగ్రిమహితసింహములునుసేకునకమ్మాంసాభిలాషఁ। బ్రవిమలాకారభవదీయపాదపద్మ। యుగసమాశ్రయనైపు ణోద్యోగచిత్తమన్యుఁ జేరునెతనకుపాస్యంబుగాఁగ। భక్తమందారమర్త్యభయవిదూర॥ క॥ వాసవవందితభవకమలా ననదివ్యప్రభావభావినియెవ్వడు। నీసమధికచారిత్రకథాసుధవిరగానమవితథంబై చెల్లున్॥ క॥ ధరణీనాథులుతమత మ వరవనితామందిరములవసియించుచుగో।ఖరమార్జాలములగతిఁ। స్థిరబద్ధులగుదురునిన్నుఁదెలియనికతనన్॥ గీ॥ జలజ నాభసకలజగదంతరాత్మవై। నట్టిదేవనీపదారవింద।యుగళిసానురాగయుక్తమైనామదిఁ। గలుగునట్లుగాఁగఁదలఁపుమన ఘ॥ గీ॥ పృథురజోగుణప్రవృద్ధమైనట్టినీ। సృష్టిచేతనన్ను జేసుకొనఁగఁ। జూచుటెల్లఁబద్మలోచననామీఁది। ఘనదయా ద్రిసృష్టిగాఁదలంతు॥ వ॥ అదియునుంగాకమధుసూదననీవాక్యంబులుమిథ్యగావు,తొల్లి వచనంబు కూఁతురికభిమతంబు గాదె యౌవనారూఢమదంబున *స్వైరిణియగుకామినిపురుషాంతరాసక్తయగుటనిచారించిపరిజ్ఞానియైనవాఁడువి డుచునవివేకియయినపురుషుండింద్రియలోలుండై రతెంవగిలిదానివిడువనేరకపరిగ్రహించియుభయలోకచ్యుతుండగు నట్లుగావున నీయెఱుంగనియర్థంబుగలదేయని విన్నవించిన రుక్మిణీదేవివచనంబులకుఁగృష్ణుండు సంతసిల్లియిట్లనియె॥

❀ కృష్ణుండు రుక్మిణీదేవి నూరడించుట. ❀

చ॥ అలికులవేణి నప్పలుకునాడినమాటలకింత నీమదిం। గలఁగఁగ నేల వేటలను గయ్యములన్బతులందు మెవ్వఁగా। బలికిన మాటలెగ్గులని పట్టుమురే భవదీయచిత్తముం। దెలియఁగఁ గోరి నే బకిలిపిన్మదిలోనిటు గుంద నేటికిన్॥ అదియునుంగాక॥ ఉ॥ కిన్కలుమున్ద్రమున్కలును గెంపుకనుంగవతియ్యమోవియున్। జంకెలు తేరిచూపు లెకసక్కెములు న్నెలవంకబొమ్మలుం। గొంకకవీడనాడుటలుఁ గూరిమియుంగలకాంతకూటల్। అంకిని లేక జన్మఫలమబ్బుటగాదెకురంగలోచనా॥ అనిమఱియు నిట్లనియె॥ ఉ॥ నీవుపతివ్రతామణివినిర్మలధర్మవివేకశీలవు। ద్భావపునీమనోగతులఁబాయక నెప్పుడునస్మదీయసం। సేవయ కానియన్యమభజింపవుపుట్టిననాఁటనుండినీ। భావమెఱింగియుండియునుబల్కితి నతప్పసహింపుమానినీ॥ వ॥ అని వెండియు, నిట్లనియె నీవాక్యంబులుశ్రవణసుఖంబులుగావించె నీవు వివిధంబులైనకామంబులుగోరితివేనినవియన్నియును నాయంద యుంటంజేసి మే కాంతసేవాచతురవైననీకునవియన్నియు నిత్యంబులై యుండు నీపాతివ్రత్యంబును, నాయందలిస్నే హంబును సవిశదంబులయ్యె నావాక్యంబులచే భవదీయచిత్తంబుచంచలంబుగాక నాయందుల బుద్ధిదృఢంబగుఁ గావునన ఫలసంపద్విలసితంబైనద్వారకాదినగరదివ్యమందిరంబులందు నీమభాగ్యంబునం జేసి సంసారిణై వడినీయందుబద్ధానురా గుండనై వర్తింతుఁ దక్కిన ప్రాణేంద్రియపరవశత్వంబునవికృతశరీరధారిణిమైన సతినన్నుం జెందుట మక్కరంబదియు నుంగాక మోక్షప్రముండనైననన్నుం గామాతురలై యల్పమతులై వ్రతతపోమహిమలచేత దాంపత్యయోగంబుకై సే వింతురదియంతయునామాయావిజృంభితంబున మందభాగ్యలై నిరయంబునొందుదురట్లుగావున నీసమానంబైనకాంత యేకాంతలంగలదె నీవివాహకాలంబున ననేకరాజన్యవర్యులఁగైకొనక భవదీయమధురాలాపశ్రవణాత్మకుండనైననా సన్నిధికన్యశరీరంబరోగ్యంబునీకు శేషంబై యున్నదాననని యేకాంతంబునం బ్రాహ్మణుంబుత్తెంచినయట్టిమనుజను దెం

*మాకంద।మామిడిచెట్టు. కుత్తూరము।ఉమ్మెత్తచెట్టు. ఝిల్లీరవంబు।చిమ్మటరొద. *స్వైరిణి।వ్యభిచారి. పిశిత।మాంసము. ❀ఆర్ద్ర।తడిని.

నాకన్నులవెనరైనవారు నీకుఁ గలుగ నేర్తురె సకియ! చెలియఁ జెప్పఁ గుసుమనిభాయన్నతోడఁ దన్నుఁ గన్నుఁగవల! నలరుననుసి గ్గుతోనగవామతింప॥ ఇవ్విధంబునఁ జిత్రరేఖంగనుంగొని యిట్లనియె॥ చ॥ చెలికలలోన నొక్క సరసీరుహనేత్రుఁడు షోడశ వత్సకుండలకటకాంగుళీయకరణన్మణినూపురభూషణుండు నిర్మలకనకాంబరుండు సుకుమారతనుండు వినీలదేహుఁడున్ జ్జ్వలరుచినూతనప్రసవసాయకుఁ డున్నతవక్షుఁ డెంతయున్॥ చ॥ నను విగియారఁ గౌఁగిటను నంబలరారఁగఁ జేర్చి మోవ మునివనుకఁ గనంచి తాధరసుధారసమిచ్చి మనోజకేళికిన్ ననుపడఁ జేసి యంజువ్వము భావలఁ దేలిచి యంతలోన నేఁ జనియె నను నిఖవార్ధిఁ బెలుచన్నను ద్రోచి సరోరుహాననా॥ వ॥ అనుచు నమ్మత్తకాశిని చిత్తంబు, చిత్తజాయత్తంబై తత్తరంబున విరహానలంబు త్తలపెట్టఁగ నీరుమున్నీరుగా వగచుచు విన్ననై ఎవిద వారధింపంబు వాఁ దియూరకున్నఁ జిత్రరేఖ తనమ

చిత్రరేఖ రాజవరులం బటంబు వ్రాసి చూపి యనిరుద్ధునిఁ దేఁబోవుట.

నంబున నయ్యింతి సంలాపంబు చింతించి యిట్లనియె॥ చ॥ సరసిజనేత్రి! నీ వెఱుకువిచారము నాకు శక్యమే చెప్పఁ! నరసురయక్ష కింపురుషనాగనభశ్చరసిద్ధసాధ్యకిన్నరవరముఖ్యులం బటమునన్ లిఖియించి తెచ్చి జూపెద నీకు నోహరుఁ గని వీఁడె పొమ్మనిన నప్పుడె వాని నీకుఁ దెచ్చెదన్॥ వ॥ అని యొడంబఱచి మిలమిలని సంపతోపంబు రణించు ఘళిఘళయని మెఱుంగులు మెఱుంగి లిగొను పటంబు నారటంబు సేసి వర్ణంబు మెదిచి, పంచవన్నియలు వేఱు వేఱఁ గనకరజతపాత్రంబుల నించి, కేలం దూలికఁ గరించి యొక్క విజనస్థలంబున కుంజనిమిల్లోకంబులం బేరుకలిగిన నవయౌవనరూపసంపన్నులైన పురుషముఖ్యుల నన్వయ గోత్రనామధేయంబులతోడ వ్రాసి యాయితంబై యప్పటంబు కరముం దఱికిం దెచ్చి యుంచి యప్పటంబునం దగులని వారులేరు సావధానంబున వాకన్గొంపుమని యిట్లనియె॥ సీ॥ కమనీయసంగీతకలితకోవిదులు కింపురుషగంధర్వకిన్నరులు వీరె, సతతయానసులు నిచ్చావిహారులు సిద్ధసాధ్యాంణపియచ్చసులు వీరె ప్రవిమలపేఖ్యసంపద్దైవభావులు సుధాశనమరుద్వసురాసురులు వీరె నిరుపమారుచిరకళాన్వితకామరూపులై పొగడొందునట్టి పన్నగులు వీరె చూడుమిది నేర్పు దీపింపఁ జూపుట యును జిత్తమున నిజమనోరథసిద్ధిపడయఁ జాలఁ బండిన నుధ్యసత్సాగలాధి! పలుగఁ జూపుమ వచ్చెనప్పద్మనయన॥ ఉ॥ మాళవకొంకణద్రవిడమత్స్యపులిందకళింగభోజనేపాళవిదేహపాండ్యకురుబర్బరసింధుయుగంధరాంధ్ర బంగ గౌళకరూశవెంకటత్రికర్తసుథేష్ణమరాటలాటపాంచాలవిషాదఘూర్జరసౌశ్వమహీశులు వీరె కోమలీ॥ ఉ॥ సింధురవైరివిక్రముఁడు శీతమయూఖునిగారి కాపయస్సింధుపటిష్ఠనిర్మలవిశేషయశోవిభవుండు శౌర్యవార్యాంధరిపుక్షితీశనికరాంధతమఃపటలార్కుఁ డీతఁడా సంధునిఁ జూడుమా కఘునిసన్నుపహాశక్వముసుంధర్శోదరీ॥ మ॥ సకలోర్వీతలనాదసన్నుతుఁడు శశ్వత్ఖ్యాతిబాహాబలాధికుఁడు గ్రాహవకోవిదుండు పతిర్జగద్విఖ్యాతగారిత్రకుండకలంకోజ్జ్వలదివ్యభూషుఁడు వికస్వాదీశ్వరుండై నభీష్మకభూపాలసమాఖ్యుఁ జూడు మితనిన్ మత్తద్విపేపాలకా॥ ఉ॥ సంగరరంగనిర్దళితచండవిరోధివరూధినీశమాతంగతురంగసత్కటరథప్రకరైకభుజావిజృంభణా భంగపరాక్రమప్రకటభవ్యయశోమహనీయమూర్తి కాళింగుఁడు వీఁడె చూడుమశరళీకృతవాసిరసిరంగలోచనా॥ మ॥ సుగుణాంభోనిధి పాలలోచనను మేలున్నాత్మ మెప్పించిన త్రిగరిష్ఠంబగు శూలముం బడసెఁ దీవ్రప్రతాపోన్నతిన్ జగతిన్ మిక్కిలి మేటివీఁడు శరణాగత్రాహుండు భూపాత్రుఁ డీ భగదత్తుఁ గనుంగొనంబె పంకజముఖీ ప్రాగ్జ్యోతిషాధీశ్వరున్॥ మ॥ వికచాంభోరుహపత్రనేత్రుఁ డగుగోవిందుండదాఁబూను వందకచక్రాబ్జగదాదిచిహ్నములు చేసి న్యాసుదేవాఖ్యను త్సుకతైఁ జెప్పఁ బసుఁచ్చరించుచుఁ దిగ్జృష్ణుండని నీ మేటి పౌండ్రకుఁ గాశీశసఖుం గనుంగొనుము వేడ్కన్ జంద్రబింబాననా॥ మ॥ ద్విజరాజన్మిత్రనయసూనృతవ్రతమునస్వధృతిస్ఫూర్జాగర్వమున్ విజయాటోపము చాపనైపుణియు దీప్తిస్ఫూర్తి సత్కీర్తియున్ రజనీనాథకులప్రదీపకులఁ బాఱంజూడుపద్మాక్షి ధర్మజభీమార్జునమాద్రినందనుల సంగ్రామైకపారీణులన్॥ మ॥ బలిమిన్సర్వనృపాలురన్నదిమి కప్పంబుల్దగంగొంచు నుజ్జ్వలతేజోవిభవాతిరేకమున భాస్వత్కీర్తి శోభిల్లఁగా బొలుపొందం దను రాజరాజనమహాభూరిప్రతాపంబులుం గలసర్వోధనుఁ జూడు సోదరయుతుం గంజాతపత్రేక్షణా॥ వ॥ అని యిబ్బంగి సకలదేశాధీశులగు రాజవరుల నెల్లం జూపుచు యదువంశసంభవులైన శూరసేన, వసుదేవ, యుద్ధవాదులం జూపి మఱియును॥ ఉ॥ శారదనీరదాబ్జఘ[illegible]సార సుధాకరకాశ్చంద్రికా సారపటీరవర్ణుఁ డయి సత్తము సుత్తమనాయకుం బ్రమత్తారినృపాలకాననహుతాశన[illegible]ర్తిఁ బ్రలంబదైత్యసంహారు సిగ్గామపాలుని హలాయుధుఁ జూడుము దైత్యనందనా॥ సీ॥ కమనీయశుభగాత్రుఁ గంజాతదళనేత్రు వసుధాకళత్రుఁ బావనచరిత్రు సత్యసంకల్పు నిశాచరోగ్రవికల్పు నతపన్నగాకల్పు నాగ[illegible]గౌస్తుభమణిభూషు గంభీరమృదుభాషు శ్రితజనపోషు నందితవిశేషు నీలనీరదకాయు నిర్జితదైతేయు ధృతపీతకౌశేయు నతవిధేయు నఘము

హాగదవైన్యు వేదాంతవేద్యు । దివ్యమునిసన్నుతాహీనదీర్ఘబాహు । జిష్ణువరసద్గుణాలంకరిష్ణుఁ గృష్ణుఁ । జూడు దైతేయకులబాలసుభగలీల॥ చ॥ స్ఫురదరిశింజినీరవవిభూషితపుష్పధనుర్విముక్తభా । స్వరనవచూతకోరకనిశాతశిలీముఖపాతభీతపం । కరుహాభ వాదిచేతనని కాయము నీ జనితాంశురుక్మిణీ । వరసుతు రాజకీరపరివారుని మారునిఁ జూడు కోమలీ॥ ఇవ్విధంబునఁ జూపిన॥ మ॥ వనితారత్నము కృష్ణనందనుని భావప్రౌఢిఁ దాఁ జూచి గ్రద్దనఁ దన్నర్థి వరించి చన్న సుగుణోత్తంసంబు కానాత్మలో । ననుమానించియనంతరంబ యనిరుద్ధాఖ్యున్ సరోజాక్షునా । తనచేతోభవమూర్తిఁ జూచి మది సంతాపించుచున్నిట్లనున్॥ ఉ॥ ఇంతి మదీయమానధనమెల్ల హరించిన ముచ్చు నిమ్మెయిం । బంతమెలర్ప వ్రాసిపటభాగనిరూపితుఁ జేసినట్టి నీ । యంతటి పుణ్యమూర్తిఁ గొనియాడఁగ నేర్తునె నీచరిత్రము । ల్వింత లెనాకు నీ సుహితవీరుకులంబు బలంబుఁ జెప్పవా॥ చ॥ అనవుడు చిత్రరేఖ జలజాక్షికి నిట్లను నీకుమారకుం । డనఘుఁడు యాదవాన్వయసుధాంబుధిపూర్ణసుధాకరుండు నాఁ । దనరిన కృష్ణపౌత్రకుఁడు దారచరిత్రుఁడు భూరిసింహసం । హననుఁ డరాతిసైన్యతిమిరార్కుఁడు పేర నిరుద్ధుఁ డంగనా॥ వ॥ అని చెప్పి యేను త్వరితగతిం జని యక్కుమారరత్నంబుఁ దోడ్కొని వచ్చునంతకు సంతాపింపకుండుమని యక్షణంబ వియద్గమనంబునఁ జనిచని ముందట॥ క॥ సరసిజముఖి కనుఁగొనె శుభ । భరితసలోకనవిధూతభవవేదనము । న్వరసాధనమును సుకృతస్ఫురణాపాదనముఁ గృష్ణపుటభేదనముం॥ వ॥ కని డాయం జని తదీయసుషమావిశేషంబులకుం బరితోషంబు నొందుచుం గామినీచరణరణితమణినూపురఝుణఝుణధ్వనితమణిగోపురంబును, నతివిభవవిజితగోపురంబును, నగుద్వారకానగరంబు నిశాసమయంబునం బ్రచ్ఛన్నవేషంబునం జొచ్చి కనకకుంభకలితసౌధాగ్రంబున మణిదీపనిచయంబు ప్రకాశింపఁ జంద్రకాంతశిలాభవనంబున సుధాధామరుచిరరుచినిచయంబు నపహసించు హంసతూలికాతల్పంబున నిజాంగనారతిశ్రమంబున నిద్రాసక్తుండై యున్న యనిరుద్ధుం జేరి, తనయోగవిద్యామహత్త్వంబున నతని నెత్తికొని మనోవేగంబున శో

### చిత్రరేఖ యనిరుద్ధునిఁ దెచ్చి యుషాకన్యకకు నొప్పగించుట.

ణపురంబునకుం జని, బాణాసురనందనయగు నుషాసుందరీతల్పంబునం దిడి యిట్లనియె॥ క॥ వనజాక్షి చూడు నీవిభు । ననిమిషనగధీరు శూరు నభినవమారు । న్వనధిగభీరు నుదారుని । ననిరుద్ధకుమారు విదళితాహితవీరున్॥ క॥ అనిన నుషా సతి దన మనమున ననురాగిల్లి మేనఁ బులకాంకురము । ల్మొనయఁగ నానందాశ్రులు । గనుఁగవ జడిగురియ ముఖవికాస మెలర్పన్॥ వ॥ ఇట్లు మనంబున నుత్సహించి చిత్రరేఖం గనుంగొని యయ్యింతి యిట్లనియె॥ సీ॥ అతివ నీసాంగత్యమను భానురుచి వాఁ గలుగుటఁ గామాంధకారము వాసెఁ । దరలాక్షి నీసఖిత్వంబను నావ చేఁ గడచితి వియోగాబ్ధిఁ గడవఁ గంటి । నబల నీయనుబంధమను సుధావృష్టి చే నంగజసంతాప మార్పఁ గంటి । వనిత నీ చెలితనంబను రసాంజనము చే నామనోహరనిధానంబుఁ గంటిఁ । గలఁడొకోఁ జినరూపు గ్రక్కున లిఖియించువారు నౌ నన్నఁ దోడ్తెచ్చువారు గలరె । నీటిలోఁ జాడఁ బుట్టింప నేర్పు నీక । కాక గల్గునె మూఁడులోకములయందు॥ వ॥ అని వినుతించి చిత్రరేఖను నిజమందిరంబునకుం బోవం బనిచినం జనియె; ననంతరంబ వింతజనులకెవ్వరికిం బ్రవేశింపరాని యంతఃపురసౌధాంతరంబున ననిరుద్ధుండు మేల్కని యయ్యింతిం గనుంగొని యప్పుడు॥ క॥ సురుచిరమృదుతల్పంబునఁ । బరిరంభణసరసవచనభావకళా చా । తురి మెఱయ నాకుమారుఁడు । తరుణీమణిఁ బొందె మదనతంత్రజ్ఞుండై॥ వ॥ ఇవ్విధంబున నతిమనోహరవిభవాభిరామంబులగు దివ్యాంబరాభరణమాల్యానులేపనంబులఁ గర్పూరతాంబూలంబుల వివిధాన్నపానంబులను రుచిరమణిదీపికానీరాజనంబులను గంధబంధురాగరుధూపంబుల, నాటలపాటల, వీణావినోదంబులం బరితుష్టిం బొంది కన్యాకుమారకులానందసాగరాంతర్నిమజ్యమానమానసులై యుదయాస్తమయనిరూపణంబు సేయనేరక ప్రాణంబు లొక్కటియై యొకతలంపులం గదిసి యిష్టోపభోగంబుల సుఖయించుచుండి రంత॥ క॥ ఆలోనన నతిచిరమగు । కాలము సుఖలీలఁ జరుగఁగా వరుస నుషా । బాలాలలామ కొయ్యనఁ । జూలేర్పడి గర్భ మొదవె సుదతిరభంగిన్॥ క॥ కాచినకావలివారలు । సూచి భయాకులత నొంది సుర్కుచుఁ దమలో । నో చెల్ల యిట్లు దానవ । రాచూలి కేఁ జూలు నిలిచె రా యెబ్బంగిన్॥ క॥ అని గుజగుజఁ బోవుచు నిప్పని దప్పక దనుజలోకపాలునితోడ । న్వినుపింపవలయునని వేచని బాణుం జేరి మ్రొక్కి సద్వినయమునన్॥ క॥ మంతనమున దేవరక । న్యాంతఃపురమేము గాచి యరయుచునుండ । న్స్వాంతజనములకుఁ జొరఁగదు । రంతము విను పోతుటికిఁ గైకొన సురారీ॥ గీ॥ ఇట్టిచోఁ గావలున్న మే మెవ్వరమును । నేమి కమ మాయయో కాని యెఱుఁగ మధిప । నీకుమారిక గర్భంబు నివ్వటిల్లి । యున్నదన్నను విరోషయుక్తుఁ డగుచు॥ వ॥ అట్టియెడ దానవేంద్రుండు రోషావేశభీషణాకారుండై కటము లదరఁ బొమలు ముడివడంగ నంగవలన ననలకణంబు లుప్పతిల్ల నటలు వెతికినం జటులగతి నెగయు పింగంబు నిభంబున నలంఘించుచు, భీకరకరవాలంబు కేలం దాల్చి సముద్దండగతిం గన్యాసౌధాంతరంగంబునకుం జని॥ సీ॥ కనియె

## బాణాసురుం డనిరుద్ధుని నాగపాశబద్ధునిం జేయుట.

శుభ్రోపేతుఁ గందర్పసంజాతు మానితదేహు నాజానుబాహు । మకరకుండలకర్ణు మహితప్రభాపూర్ణు నీరజయశోల్లాసుఁ గౌశేయవాసుఁ । గస్తూరికాలిప్తఘనకాంతికము దాప్తహారశోభితవక్షు నంబుజాక్షు । యదువంశతిలకు మత్తాలినీలాలకు నవపుష్పచాపుఁ బూర్ణప్రతాపు । నభినవాకారు నస్త్రవిద్యావిహారు । మహితగుణవృద్ధు మన్మథమంత్రసిద్ధుఁ । గలితపరిశుద్ధు నఖిలలోకప్రసిద్ధు । చతురు ననిరుద్ధు నంగనాజననిరుద్ధు ॥ చ॥ కనికని లగ్గలింపసురకంటకుఁ డుద్ధతి సబ్బటావళిం । గనుఁగొని యీనరాధమునిఁ గట్టుఁడు పట్టుఁడు కొట్టుఁడన్న వా । రనుపమహేతిదీధితు లహర్పతితేజము మాయఁ జేయఁ డా । సిన నృపశేఖరుండు మదిఁ జేవ యలావును నేర్పు దర్పమున్ ॥ చ॥ కలిగి మహోగ్రవృత్తిఁ బరిఘంబు కరంబున లీలఁ దాల్చి దోర్బలఘనవిక్రమప్రళయభైరవుభంగి విజృంభణక్రియా । కలన నెదిర్చి దానవనికాయము తోఁదలపాటుఁ బోటునుం । జలము బలంబు ధైర్యమును శౌర్యము వ్రేటునుఁ బాటుఁ జూపుచున్ ॥ చ॥ పదములు బాహులుం దలలు ప్రక్కలు సెక్కులు జానుయుగ్మముల్ । రదములు గర్ణముల్ మెడలు రంబులు మూఁపులు వీఁపు లూరువుల్ । ఛిదురుపలై ధరం దొఱఁగఁ జిందరవందర సేయ సైన్యముల్ । గదిసి పరాఙ్ముఖక్రమముఁ గైకొని పాఱిరి కాందిశీకులై ॥ వ॥ ఇవ్విధంబున సైన్యంబు దైన్యంబు నొందియు వెఱచియు ... అవి యవిచ్చియుఁ జచ్చియుఁ గలంగియు నలంగియు విరిగియు నురిగియుఁ జెదరియు బెదరియుఁ జేవదఱిగి విముఖములై చనినం గు హెచ్చిన బాణుండు శౌర్యధురీణుండును గోపోద్దీపితమానసుండును నై కదిసి యేచి వ్రేసియుఁ బొడిచియు నడిచియు ననంగియుఁ బెనంగియు ॥ క॥ క్రుద్ధుండై యహిపాశనిబద్ధుం గావించె నసురపాలుఁడు రణసన్నద్ధు స్మరపితృసన్నిరుద్ధు స్మహితప్రబుద్ధు రూపసమృద్ధున్ ॥ వ॥ ఇట్లు కట్టి త్రోచిన నుషాసతి శోకవ్యాకులితచిత్తయై యుండె నంత నక్కడ ॥ క॥ ద్వారకలోన నిరుద్ధకుమారుని పోకకును యదుసమాజము వగలం । గూరుచు నొకవార్తయు విన । నేరక చింతింప నాల్గు నెలలుఁ జనియె నృపా ॥ అయ్యెడ ॥

## నారదమునివలన ననిరుద్ధవృత్తాంతమును విని కృష్ణుఁడు బాణాసురునిమీఁదికి దండెత్తుట.

క॥ శారదనిర్మలనీరద । పారదరుచిదేహుఁ డతులభాగ్యోదయుఁ డా । నారదముని యేతెంచెను । పారదయామతిమురారిభజనప్రీతిన్ ॥ వ॥ ఇట్లు చనుదెంచిన నద్దివ్యమునికి నిర్మలమణివినిర్మితసుధర్మాభ్యంతరంబున యదువృష్ణిభోజాంధకవీరులు గొలువం గొలువున్న కమలలోచనుండు ప్రత్యుత్థానంబు చేసి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి సముచితకనకాసనాసీనుం జేసిన నత్తాపసోత్తముండు పురుషోత్తము నుదాత్తతేజోనిధిం బొగడి యనిరుద్ధువృత్తాంతం బంతయుఁ దేటపడ నెఱింగించి యప్పుండరీకాక్షునిచేత నామంత్రణంబు వడసి యంతర్ధానంబు నొందె నదనంతరంబ కృష్ణుండు శుభముహూర్తంబున దండయాత్రాభిముఖుండై ప్రయాణభేరి వ్రేయించి బలంబుల వెడలింపఁ బడవాళ్లం బనిచి తానును గట్టాయితం బయ్యె నంత ॥ సీ॥ హారకిరీటకేయూరకంకణకటకాంగుళీయకనూపురాదివివిధ । భూషణప్రతతిచేఁ బొలుపారుకరముల ఘనగదాశంఖచక్రములు దనర । సురభిచందనలిప్తసురుచిరోరఃస్థలిఁ బ్రవిమలకౌస్తుభప్రభలు నిగుడఁ । జెలువారఁ బీతకౌశేయచేలము కాశవలనుగా రింగులువారఁ గట్టి । సైన్యసుగ్రీవమేఘపుష్పకవలాహకములు పూన్చిన తేరాయితముగఁ జేసి । దారుకుఁడు దేర నెక్కె మోదంబుతోడ । భానుఁ డుదయాచలం బెక్కుపగిది మెఱయ ॥ వ॥ ఇట్లు రథారోహణంబు చేసి భూసురాశీర్వచనపూతుండును, మహితదూర్వాంకురాలంకృతుండును, లలితపుణ్యాంగనాకరకిసలయక్షిప్తశోభాక్షతవిన్యాసభాసురమస్తకుండును, మాగధమంజులగానానుమోదితుండును, వందిజన సంకీర్తనానందితుండును, పాఠకపఠనరవవికాసితహృదయుండును నై వెడలు నవసరంబున ॥ సీ॥ బలభద్రసాత్యకిప్రద్యుమ్నయదుముఖవృష్ణిభోజాంధకవీరవరులు । మర్యాదపరిపంథిగర్వభేదనకళాచతురబాహాబలోత్సాహలీల । వారణస్యందనవాజిసందోహంబు సవరణ సేయించి సంభ్రమమున । సముచితప్రస్థానచటులభేరీభూరిఘోషమంభోనిధిఘోషము దెప । ద్వాదశాక్షౌహిణీబలోత్కరము లోలి । నడిచెఁ గృష్ణునిరథము వెన్నంటి చెలఁగి । పృథులగతి ముక్తభగీరథురథము వెనుక । ననుగమించు వియన్నది ననుకరించి ॥ వ॥ ఇవ్విధంబునం గదలి కతిపయప్రయాణంబుల శోణపురంబు చేరం జని వేలాలంఘనంబు చేసి యదువీరు లంత ॥ మ॥ పరిదారామసరోవరోపవనయజ్ఞస్థానముల్ మాపి వే । పరిఘల్ పూడిచి యంత్రముల్ దునిమి వప్రవ్రాతముల్ ద్రొబ్బి గో । పురముల్ గూలఁగఁ ద్రోచి సౌధభవనంబుల్ ద్రుంచి ప్రాకారముల్ । దరణిం గూల్చి కవాటముల్ విఱిచి రుద్దండక్రియాలోలురై ॥ వ॥ ఇట్లనేకప్రకారంబుల గాసి చేసి, పురంబు నిరోధించి పేర్చి యార్చినం జూచి యాగ్రహసముగ్రోగ్రమూర్తియై సమరసన్నాహసంరంభవిజృంభమాణుండై సంగరభేరి వ్రేయించిన ॥ సీ॥ ఆచక్రవాళాచలాచక్రమంతయు భ్రమసి కుంభరసారెపగిదిఁ దిరిగె । ఘనఘోణిఖురకోటిఘట్టనస్వనమూలకరణి నంభోనిధుల్ గలఁగి పొరలెఁ । గాలరుద్రాభీలకరశూలహతి రాలుపిడుగుల గతి నుడుగణము రా

లెఁ జటులానిలోద్ధూత శాల్మలీతూలంబు చాడ్పున మేఘముల్ చదలఁ దూలె। గిరులు వడఁకాడె దివి మెల్ల గిల్లె సురలు। సుండెలవి సెరసాతలక్షోభ మొదవె। దిక్కులదరె విమానము ల్దెరలి చెదరెఁ। గలఁగి గ్రహరాజచంద్రులగతులు దప్పె॥ వ॥ అట్టిసమరసన్నాహంబునకుఁ గట్టాయితంబైన మణిఖచితభర్మవర్మనిర్మితనిర్మలాంశుజాలంబులును, శిరస్త్రాణకిరీటకోటిఘటితవినూత్నరత్నప్రభాపటలంబులును, గనకకుండలగ్రైవేయహారకంకణతులాకోటివివిధభూషణవ్రాతరుచినిచయంబులును, ప్రచండబాహుదండసహస్రంబును, వెలుంగ శరశరాసనశక్తిప్రాసతోమరగదాకుంతముసలముద్గరభిండివాలకరవాలపట్టసశూలక్షురికాపరిఘాదినిశాతహేతివ్రాతాతిదీధితులును, వియచ్చరకోటి నేత్రంబులు మిఱుమిట్లు గొలుపఁగ నస్తాచలశృంగసముత్తుంగంబగు రథంబెక్కి యరాతివాహినీసందోహంబునకుం దుల్యంబైన నిజసేనాసమూహంబు లిరుగడల నడువ బాణుండక్షీణప్రతాపంబు దీపింపన నికి వెడలె నయ్యవసరంబున॥ చ॥ వరమొసఁగుదారభక్తజనవత్సలుఁడైన హరుండు

——శ్రీ బాణాసురునికి సహాయభూతుండగు శివునకుఁ గృష్ణునకు యుద్ధము గుట. శ్రీ——

బాణునిం। గరముసురక్తి నాత్మజులకంటె దయామతిఁ జూచుఁ గానఁదా। మురమొనరించు వేడ్కఁ బ్రమథుల్గుహుఁడున్నిజభూతకోటియు। న్సరవి భజింపనుజ్జ్వలనిశాతభయంకరశూలహస్తుఁడై ॥ సీ॥ ఖురపుటాహతిరేఁగు ధరణీపరాగంబు పంకేరుహాప్తబింబంబుఁ బొదువ। విపులవాలాటోపవిక్షేపజాతవాతాహతి వారివాహములు విరియఁ। గుఱుచ తిన్నని వాఁడికొమ్ములఁ జిమ్మిన బ్రహ్మాండభాండకర్పరము వగుల। నలవోకఖణిఖణిల్లని ఱంకె వ్రేసిన రోదసీకుహరంబు భేదిలంగ। గళ చలద్ఘర్ఘమంటికాఘణఘణప్రఘోషము నదిక్తటంబు లాకులత నొంద। లీలనడతెంచు కలధౌతశైలమనఁగ। నుక్కు మిగిలిన వృషభేంద్రు నెక్కి వెడలె॥ వ॥ ఇట్లు వెడలి సమరసన్నాహసముల్లాసంబు మొగంబులకు వికాసంబు సంపాదింపం బ్రతిపక్షబలంబులతోడం దలపడిన ద్వంద్వయుద్ధంబయ్యె నప్పుడప్పురాతనయోధులయాయోధనంబుఁ జూచు వేడ్కం జనుదెంచిన సరసిజసంభవశక్రసురయక్షసిద్ధసాధ్యచారణగంధర్వకిన్నరకింపురుషగరుడోరగాదులు నిజవిమానారూఢులై వియత్తలంబున నిల్చి రట్టియెడఁ గృష్ణుండును హరుండును, మారుండును గుమారుండును, గూపకర్ణకుంభాండులును గామపాలుండును, బాణపుత్రుండగు బలుండును సాంబుండును, సాత్యకియును బాణుండును, రథికులు రథికులు, నాశ్వికులు నాశ్వికులును, గజారోహకులు గజారోహకులును, బదాతులు పదాతులునుం దలపడి యితరేతరహేతిసంఘట్టనంబుల మిడుంగుఱులు చెదరం బరస్పరాహ్వానబిరుదాంకితసింహనాదహుంకారశింజినీటంకార వారణఘీంకార వాజిహేషారవంబులను, బటహకాహళభేరీమృదంగశంఖతూర్యఘోషంబులను, బ్రహ్మాండకోటరంబు పరిస్ఫోటితంబయ్యె నయ్యవసరంబున॥ చ॥ జలరుహనాభుఁడార్చి నిజశార్ఙ్గశరాసనముక్తసాయకావలినిగుడించి నొంచెఁ బురవైరిపురోగముల న్రణక్రియాకలితులగు హ్యాకప్రమథకర్బురభూతపిశాచఢాకినీ। బలవదరాతియోధులను బన్నెరపోయి కలంగి పాఱఁగన్॥ వ॥ ఇట్లేసి యార్చినఁ గుంభినీధరుభుజావిజృంభణసంరంభంబునకు సహింపక నిటలాంబకుండనలకణంబులుమియు నిశితాంబకంబులం బీతాంబరుని నేసిన వాని నన్నింటి నడుమన త్రుంచి బాణంబులేసి త్రుంచినం గనుంగొని మఱియును॥ మ॥ అనలాక్షుండు త్రిలోకపూజ్యమగు బ్రహ్మాస్త్రంబు ఱింబోసి యా। వనజాతేక్షణు మీఁదఁ గ్రోధమహిమవ్యాకీర్ణుఁడై యేసె నే। సినఁ దద్దివ్యశరంబుచేత నెమరల్పెన్గృష్ణుఁ డత్యుద్ధతిన్। జనితాశ్చర్యరసాబ్ధిమగ్నులగుచున్ శక్రాములగ్గింపఁగన్॥ శా॥ వాయువ్యాస్త్రము పెంచు పైనలిగిదుర్వారోద్ధతి న్నేయడై। తేయధ్వంసియుఁ బార్వతాశుగముచేఁ ద్రెంచెం గ్రతుధ్వంసి యా। గ్నేయాస్త్రంబడరించె నుగ్రగతిలక్ష్మీనాథు పైదాని వే। మాయం జేసెను నైంద్రబాణమునఁ బద్మాక్షుండు లీలాగతిన్॥ మఱియును. ఉ॥ పాయని కిన్కతో హరుఁడు పాశుపతాస్త్రము నారిఁ బోసినన్। దోయరుహాయతాక్షుఁడును దోడన లోకభయంకరోగ్రనారాయణబాణరాజము రయంబున నేసి మరల్చె దానిఁ జక్రాయుధుఁడిత్తెఱంగునఁ బురారిశరావలి రూపుమాపినన్॥ క॥ ఊహకలంగియు విగతోత్సాహుండగు హరుని మీఁద జలజాక్షుఁడు స। మ్మోహనశిలీముఖంబు। వ్యాహతజయశాలియగుచు నడరించె నృపా॥ అట్లేసిన॥ క॥ జృంభణశరపాతముచే। శంభుఁడు నిజతనువు పరవశంబై సోలన్। జృంభితుఁడై ఘననిద్రా। రంభత వృషభేంద్రుమూపురము పై వ్రాలెన్॥ వ॥ ఇట్లు వ్రాలినం జక్రపాణి పరబలంబుల నిశితబాణపరంపరలం దునిమియు, నొక్క యెడం గృపాణంబుల రగణికలు చేసియు, నొక్క చో గదాహతులం దుత్తుమురుగా మొత్తియు, నివ్విధంబునఁ బీనుంగు పెంటలుగావించె నంత॥ చ॥ తఱిమి మురాంతకాత్మజుఁడుదారబలంబున బాహులేయు పైఁ। గఱికరిదాఁకఁ దీవ్రశరకాండపరంపర లేసి నొంపఁగా। నెఱికలుగాడి పెల్లొరుగ నెత్తుటఁ జొత్తిలి వైరులార్వఁగాఁ। బఱచె మయూరవాహనము పైకొని తోలుచువాఁడు భీతుఁడై॥ ఉ॥ వంభిరణావనీస్థలవిపాటితశాత్రవవీరుఁడై నయా। సాంబుఁడు హేమపుంఖసితసాయకజాలము లేర్చి బాణుకో।

పంబున నేసినం జెదరి బాణతనూభవుఁ డోడిపాఱె శౌర్యంబును వీరము దఱుగ వునాఁడివో వబలంబు లార్వఁ (గ.) ॥మ॥ వరబాహాబలశాలియై హలి రణావష్టంభ సంరంభ విస్ఫురదుగ్రాశని తుల్యమైన ముసలంబుం బూన్చి క్రేసెన్స్ వడింబోరి కుంభాండకకూపకర్ణుల శిరంబుల్ వ్రక్కలై మేదంబు నెత్తురు కర్ణంబుల వాతనుండొల్కుగ సంధుల్వీడి వేచావఁ (గ.) ॥వ॥ అట్టియెడ సైన్యంబు దైన్యంబు నొందియనాథలై చెడి విఱిగి పాఱినం గని బాణుండు సాత్యకిం గెడించి ప్రళయాగ్నియుం బోలి విజృంభించి తె ఱువీఁచి బలంబుల మజిలం బురికొల్పి తానును ముంగలియై నడువ నప్పు డుభయసైన్యంబులన్యోన్య జయకాంక్షలం దలపడి దక్షిణోత్తర సముద్రంబుల వీఁకం దాఁకినం బోరు ఘోరంబయ్యె నట్టియెడం గడలనడఁచియుఁ, గుఠారంబులం బొడిచియు, నురియలం గ్రుమ్మియు, శూలంబులం జిమ్మియు, శక్తులముంచియుఁ, జక్రంబులం ద్రుంచియు, ముసలంబుల మొత్తియుఁ, ముద్గరంబుల నొత్తియుఁ, గుంతంబులం గ్రుచ్చియుఁ, బంతంబుల నిచ్చియు, బరిఘంబుల నొంచియు, బట్టిసంబులం ద్రుంచియు, శరంబుల నేసియు, గరవాలంబుల వ్రేసియు, సత్రాసులై పాసియు, వి త్రాసులై డాసియుఁ, బెనంగినం దునిసిన శిరంబులును, దునుకలైన కరంబులును, దెగిన కాళ్లును, ద్రెస్సిన వ్రేళ్లును, నుమురులైన మొముకలును, బ్రోవులైన ప్రేవులును, నులిసిన మేనులును, నలిగిన జానువులును, నొగిలిన వర్మంబులును, బగిలిన చర్మంబులును, వికలంబులైన సకలావయవంబులును, వికీర్ణంబులైన కర్ణంబులును, విచ్ఛిన్నంబులైన నయనంబులును, వెడలు రుధిరంబులును, బడలు వడు బలంబులును, గొండలవడువునం బడు మాంసఖండంబులును, వాచఱచుకొను ప్రాణులును, వ్రాలిన తేరులును, గూలిన కరులును, నొఱలిన గుఱ్ఱంబులును, బలల ఖాదన సతూహలజనిత మదాంధీభూత పిశాచ ఢాకినీ భూత భేతాళ సమాలోల కోలాహల భయంకరారావ బధిరీకృత సకల దిశావకాశంబును నై సంగరాంగణంబు భీషణంబయ్యె నయ్యవసరంబున ॥చ॥ శరకుముదంబులుల్లసిత చామర ఫేనములాతపత్రభాసుర నవపుండరీకములు శోణిత తోయములస్థి సైకతోత్కర ముభుజా భుజంగమని కాయము కేశకలాప శైవలస్ఫురణర ణాంగణంబను రెఁ బూరిత శోణనదంబు పోలికన్ ॥వ॥ అట్టియెడ బాణుండు కట్టలుకం గృష్ణుని పైఁ దన రథంబు బరపించి యఖర్వ బాహాసహస్ర దుర్వార గర్వాటోప ప్రదీప్తుండై కదిసి ॥మ॥ ఒక యేనూఱు కరంబులన్ ధనువు లత్యుగ్రాకృతిం దాల్చి తత్ కకుక యొక్కొక్క టసాయక ద్వయము వీఁకం బూన్చు నాలోననం దకహస్తుండు దను గ్రచాపచయ విధ్వంసంబుఁ గావించి కొంజకఁ దత్సారథిం గూల నేసి రథముం జక్కాడె శౌరో ర్వ్యద్ధతిన్ ॥గీ॥ ప్రళయజీమూత సంఘాత భయదభూరి భైరవారావముగ నొత్తెఁ బాంచజన్య మఖిలజనులు భయభ్రాంతులై చలింపఁ గడఁగి నిర్భిన్న రాక్షసీ గర్భముగను ॥వ॥ అట్టియవక్రవిక్రమ పరాక్రమంబున వెగడుపడి బాణుండు వ్రేలుమొగంబు వడి సేయునది లేక విన్ననై యున్నయెడ ॥సీ॥ అత్తఱిఁ గోటరియను బాణజనయిత్రి సుతుఁ గాఁచు మతము సన్మతిఁ దలంచి వీడిశిరోజముల్ వ్రేలంగ నిర్ముక్త పరిధానయై మురాసురవిభేది మొదల నిల్చినఁ జూడ మదిఁ జాల రోసి పరాఙ్ముఖుండై యున్న యనువు లేచి తల్లడించుచు బాణుఁ డుల్లంబు గలఁగం గఁ దల చీరవీడ యావవులు నవ్వ నవ్యకాంచన మణిభూషణములు రాలఁ బాదహతి నేలగంపింపఁ బాఱి యాత్మపురము వడిఁ జొచ్చె నప్పు

## ——శ్రీ వైష్ణవజ్వరముచేఁ బరాజితంబై – శైవజ్వరము శ్రీకృష్ణుని స్తుతించుట. శ్రీ——

డు భూతగణము లాకులతతో డనెక్కటియఱుగుటయును. ॥క॥ శిరములు మూఁడును ఘనభీకర పదములు మూఁడుగ ల్గిక నలిమహేశ జ్వరము ఘోరాకృతితో నరుదెంచుచునుండఁ గృష్ణుఁ డల్లన నగుచున్ ॥చ॥ పఱువడి వైష్ణవజ్వరముఁ బంచిన నయ్యుభయజ్వరంబులు న్వైరవుసులావు చేవయును పీరము బీరము గల్గి ఘోరసంగరమొనరింప నందుఁ గరకంఠకృత జ్వరముగ్ర వైష్ణవజ్వరము నకోడి పాఱెన నివారణ వైష్ణవి వెంటనంటఁ (గ.) ॥గీ॥ పాఱియేదిక్కుఁ గానక ప్రాణభీతి జేరియేడ్చుచు నా హృషీకేశు పాదకంజముల కెఱఁగి నను గావు కావుమనుచు నిటలతటలసితాంజలి ఘటితయగుచు ॥ ఇట్లు వినుతించె ॥ ॥సీ॥ అవ్యయు ననఘు ననంతశక్తిసంబరులైనట్టి బ్రహ్మ రుద్రామరేంద్ర వరుల కీశ్వరుఁడైన వాని సర్వాత్మకు జ్ఞానస్వరూపు సమానరహితు వరమనిజ గదుద్భవస్థితి సంహార హేతుభూతుని హృషీకేశు నభవు బ్రహ్మ చిహ్నంబులై పరగు సుజ్ఞాన శక్త్యాదుల నొప్పు బ్రహ్మంబు నీశు నజు *షడూర్మిరహితు నిజయోగమాయా విమోహితాఖిలాత్ముఖ్యచరితు మహిత తేజు నాదిమధ్యాంతహీనుని చిన్మయాత్ముని భజింతుఁ గృష్ణు ॥వ॥ అదియునుం గాక లోకంబున దైవంబులనేక ప్రకారంబులై యుండునది యెట్టిదనినఁ; గలా కాష్ఠా ముహూర్తంబులు గల కాలంబును, సుకృత దుష్కృతానుభవరూపంబులు గల జీవకర్మంబులును, స్వభావంబును, సత్త్వరజస్తమోగుణాత్మకంబైన ప్రకృతియును, సుఖదుఃఖాశ్రయంబైన శరీరంబును, జగజ్జంతునిర్వాహకంబైన ప్రాణంబును సకలపదార్థ పరిజ్ఞాన కారణంబైన యంతఃకరణంబును మహదహంకార శబ్దస్పర్శరూప రసగంధ తన్మాత్ర తత్కార్యభూత గగన పవ నానల సలిల ధరాది పంచభూతంబులు నాదిగాఁ గల ప్రకృతి వికారంబులును

*షడూర్ములు = అశన-పిపాస-శోక-మోహ-జరా-మరణములు.

న్నింటికి సంభూతంబును, బీజాంకురన్యాయంబునం గార్యకారణరూపప్రభావంబును నై, జగత్కారణశంకితంబై యుండు-
నదియంతయు భవదీయ మాయావిడంబనంబు గానియున్నయది కాదు- తదీయమాయానివర్తకుండవై నీవు నానావి
ధదివ్యావతారాదిలీలలం జేసి దేవగణంబులను, సత్పురుషులను, లోకనిర్మాణచణులైన బ్రహ్మాదులను బరిరక్షించుచు లో
కహింసాప్రవర్తకులైన సమస్తమార్గగతులం గ్రూరాత్ముల హింసించుచు, విశ్వవిశ్వంభరాభారనివారణంబు సేయుటకుం
గదా భవదీయదివ్యావతారప్రయోజనంబు గావున నిన్ను శరణంబు వేఁడెద॥ సీ॥ చండమై మహితవీక్షణమసహంబై యుము
దాగ్రమై వెలుఁగొందు తావకీన। భూరిభాస్వత్తేజమునఁ దాపమొందితిఁ గడుఁ గృశించితి నన్నుఁ గరుణఁ జూడు। మితర దేవో
పాస్తిరతి మాని మీపాదకమలముల్ సేవించు విమలబుద్ధి। యెందాఁక మదిఁ దోఁపదందాఁక నీజగత్ప్రాణులు నిఖిలతాపము
నఁబడుట। యవిరళానన్యగతికుల నరసి ప్రోచు బిరుదుగల నీకు ననుఁ గాచు టరుదె దేవ। ప్రవిమలాకారసంసారభయవిదూ
ర। భక్తజనపోషపరితోషపరమపురుష॥ చ॥ అనినఁ బ్రసన్నుఁడై హరి యనంతుఁడు శైత్యవిభేది చానికిట్లని యెమ్మదీయసాధ
నమున నన్యనివారణమాటకీమది। గనినను నాస్తిఁ జొచ్చితివి గావున మజ్జ్వరతీవ్రదాహవే। దననినుఁ బొందదింకఁ బరితాప
ముచుక్కుమనీమనంబునన్॥ వ॥ అని మఱియు నప్పుండరీకాక్షుం డిట్లను- నెవ్వరేనియు నీయుభయజ్వరవివాదంబును, నీవు
మత్ప్రపత్తిం జొచ్చుటయుఁ జిత్తంబులఁ దలంతు రట్టి పుణ్యాత్ములు శీతోష్ణజ్వరాదితాపంబులం బొరయరని యానతిచ్చిన న
మ్మహేశ్వరజ్వరంబు పరమానందభరితహృదయంబున నారథాంగపాణికి సాష్టాంగదండప్రణామం బాచరించి నిజేచ్ఛం

## శ్రీకృష్ణునిచేఁ బరాహతుండగు బాణాసురుఁ గాపాడుటకు శివుండు కృష్ణుని స్తుతించుట.

జనియె నంత బాణాసురుండు నక్కడ॥ సీ॥ కమనీయకింకిణీఘంటికాదిసహస్రఘణఘణధ్వనిచేత గగనముగల। నన్యజనాలో
కనాభీలతరళోగ్రకాంచనధ్వజపతాకలు వెలుంగఁ। బృథునేమిఘట్టనఁ బృథివిఁ గంపింపంగ వలనొప్పఁ బటుజవాశ్వము
లఁ బూన్చినట్టి యున్నతరథంబు తృగ్రగతి నెక్కి కరసహస్రముల భీకరతరాసి। శరశరాసనముఖదివ్యసాధనములు। దనరఁ
జలమును బలమును తక్కటము గాఁగ। హర్షమిసరోత్తియ్యంపుటాయితముగ। బురము వెలువడె బలిపుత్రుఁ డురుజవమున॥
క॥ చని రణభూమిని మధ్యందినమార్తాండప్రచండదీప్తాకృతితోఁ। జనరుచుఁ బరిపంథిబలేం। ధనదవశిఖియైన కృష్ణుఁ దాఁ
కెం బెలుచన్॥ ఉ॥ తాఁకి భుజాపిజృంభణము దర్పము నేర్పును నేర్పడంగ నొ। క్కూఁకున వేయుచేతుల మహోగ్రశరావళి
పింజపింజతోఁ। దాఁకఁగ నేసి నమ్మురవిదారుఁడు తోఁడనదచ్చరావళి। న్నాఁకగొనాకఁ ద్రుంచె నిశితార్ధశశాంకశిలీముఖం
బులన్॥ అంత॥ చ॥ నుతనవపుండరీకనయనుండన మొప్పు మురారి రోషఘూ। ర్ణితముహితారుణాబ్జసమనేత్రుఁడు దానయుపం
చెదైత్యుపై। దితిసుతకాననప్రకరదీపితశుక్రము రక్షితాంచితా। శ్రితజనచక్రమున్నతతసేవితశక్రము దివ్యచక్రమున్॥
వ॥ అదియును బ్రచండమార్తాండమండలప్రభావిడంబితంబును భీషణశతసహస్రకోటిదంభోళినిబిడనిశితనిష్ఠురధారా
సహస్రప్రభూతజ్వలనజ్వాలికాపాస్తసమస్తకుటిలపరిపంథిదుర్వారబాహుగర్వాంధకారంబును, సకలదిక్పాలదేవ
తాగణజేగీయమానంబును, సమంచితదానవజనలోకభయంకరదర్శనంబునగు సుదర్శనంబసురాంతకప్రేరితంబై చని
యారానుకారుండగు కదళీకాకాండంబుల నేర్చు చందంబునం బేర్చి పవదపేదండసుండాదండసుండితంబును, గనకమణివ
లయకేయూరకంకణాంకితంబును నగు తదీయ బాహాసహస్రంబుఁ గంచి చతుష్టయావశిష్టంబు గాఁ దునుమునవసరంబున॥ గీ॥
కాలకంఠుఁడు బాణుపైఁ గరుణగలఁడు। గాన నఖిలాండపతిఁ గృష్ణుఁ గదియవచ్చి। పురుషసూక్తంబు చదివి సంపుటకరాబ్జుఁ।
డగుచుఁ బద్మాయతాక్షు నిట్లని నుతించె॥ వ॥ దేవా నీవు బ్రహ్మస్వరూపంబగు జ్యోతిర్మయుండవు, నిఖిల వేదవేదాంతనిరూ
ఢుండవు, నిర్మలుండవు, సమానాధికరహితుండవు, సర్వవ్యాపకుండవైన నిన్ను నిర్మలాంతఃకరణులైన వారలాకాశంబుప
గిదియవలోకింతురదియునుంగాక పంచోపనిషన్మయంబైన భవదీయదివ్యమంగళమహావిగ్రహపరిగ్రహంబు సేయునెడ
నాభియందాకాశంబును, ముఖంబునం గృశానుండును, శిరంబున స్వర్గంబును, శ్రోత్రంబుల దిశలును, నేత్రంబుల సూర్యుం
డును, మనంబున సోమకాములును, పాదంబుల వసుంధరయు, నాత్మయందహంకారంబును, జఠరంబున జలధులును, రేతంబు
న నంబువులును, భుజంబుల నింద్రుండును, రోమంబుల మేఘమహీరుహౌషధివ్రాతంబును, శిరోజంబుల బ్రహ్మలును, జ్ఞానం
బున సృష్టియు, నవాంతర ప్రజాపతులును, హృదయంబున ధర్మంబును గలిగి మహాపురుషుండవై లోకకల్పనంబుకొఱకు నీ
యమంచితతేజంబు గుప్తంబు చేసి జగదుద్భవంబుకొఱకుఁ గైకొన్న భవదీయదివ్యావతారవైభవం బెఱింగి నుతింప నెంత
వారము- నీవు సకలచేతనాచేతననిచయంబులకాద్యుండవు, నద్వితీయుండవు, పురాణపురుషుండవు, సకలసృష్టిహేతుభూ
తుండవు, దినకరుండు కాదంబినీకదంబావృతుండగుచు భిన్నరూపుండై బహువిధచ్ఛాయలం దోఁచువిధంబున నీయఘటిత

ఘటనానిత్యాహ్లాదకంబైన సంకల్పంబునం ద్రిగుణాతీతుండ వయ్యును సత్త్వాదిగుణవ్యవధానంబుల ననేకరూపుండ వైగుణావం
తులైన సత్పురుషులకుం దమోనివారకంబైన దీపంబు రూపంబునం బ్రకాశించుచుందువు భవదీయమాయావిమోహితులై
నజీవులు పుత్రదారగృహక్షేత్రసంసారాదిరూపంబైన పాపపారావారమహావర్తగర్తంబుల మునుంగుచుం దేలుచుందురు
దేవా భవదీయదివ్యరూపానుభవంబు సేయంజాలక నింద్రియపరతంత్రుండై భవత్పాదసరసీరుహంబుల నేర్పునం జేరనె
ఱుంగని మూఢాత్ముం డాత్మవంచకుండనంబడు విపరీతబుద్ధిం జేసి ప్రియుండవైన నిన్ను నొల్లక నింద్రియార్థానుభవంబు సే
యుట యమృతంబు మాని హాలాహలంబు సేవించుటగాదె జగదుదయపాలనలయలీలాహేతుండవై శాంతుండవై సుహృజ్జ
నభాగధేయుండవై సమానాధికవస్తుశూన్యుండవైన నిన్ను నేనునుం బ్రహ్మయుం బరిణతాంతఃకరణులైన మునిగణంబులు
నుభజించుచుందుము మఱియు॥ గీ॥ అవ్యయుండవనంతుండ వచ్యుతుండ। వాదిమధ్యాంతశూన్యుండ వఖిలధృతివి। నిఖిలమం
దెల్ల వర్తింతు నీవు సగిలి। నిఖిలమెల్లను నీయంద నెగడుఁ గృష్ణ॥ సీ॥ అని సన్నుతించిన హరియాత్మ మోదించి మొగమునఁ జిఱున
వ్వు మొలకలెత్త। లలితవాలేందుకళామాళికిట్లను శంకర నీమాట సత్యమరయ। నేవి నీకిష్టమై యెద్దిఁ గోరెదో దానిన వేఁడుము నీ
కిత్తుఁ బీడవధ్యుఁడ వనియిట్టి దని బ్రహ్లాదుమందు మద్భక్తుఁడతనికి వరమునీయన్వయమున। జననమందిన వారలఁ జంపననుచుఁ
గడఁగి మన్నించితి నినదిగారణమున। విశ్వవిశ్వంభరాభారవిపులభూరివరభుజాగర్వ మడఁపంగవలయుఁ గాన॥ క॥ కరములు
నాలుగు దిక్కఁగఁ బరిమార్చితి వీఁడు నీమభక్తులకగ్రేసరుఁడై సొగడొందిజరామరణాదిభయంబుడక్కి మనుసటమీఁద॥
వ॥ అని యానతిచ్చిన నంబికావరుండు సంతుష్టాంతరంగుండయ్యె నప్పుడు బలినందనుండు రణరంగవేదిం గృష్ణదేవతాసన్నిధిం బ్ర
జ్వలితచక్రకృశానుశిఖాజాలంబులం దనిజబాహాసహస్రశాఖాసమిత్పరిచయంబులును, గృత్తశోణితోద్వేలకీలాలమహితా
జ్యధారాశతంబులును, బరభయంకరవీరహుంకారమంత్రంబులతోడ వేల్చి పరిశుద్ధిం బొందిన జ్ఞానదీపాంకురంబున భుజా
గర్వదర్పాంధకారంబు నివారించి యనవరతపూజితస్థాణుండగు బాణుండు భుజవనవిచ్ఛేదజనితవిరూపితస్థాణుండయ్యె
ను, దదీయవరదానకలితానందహృదయారవిందుండగుచు గోవిందచరణారవిందంబులకుం బ్రణామంబులాచరించి యనం

## అనిరుద్ధుండు సాకన్యాసమేతుండై ద్వారకాపురముఁ బ్రవేశించుట.

తరంబ॥ క॥ పురమునకేగి యుషాసుం। దరికిని ననిరుద్ధునకు ముదంబున భూషాం। బరదాసీదాసజనా। వరవస్తువితాన మొసఁగి
వారనిభత్క్రీ॥ క॥ కనకరథంబున నిడికొని। ఘనవైభవ మొప్పఁ గన్యకాయుక్తముగా। ననిరుద్ధుని గోవిందుం। డనుమోదింపం
గఁ దెచ్చియర్పించె నృపా॥ ఉ॥ అంతము రాంతకుండు త్రిపురాంతకువీడ్కొని బాణునిచ్చి యత్యంతవిభూతి మైనిజబలావలితోఁ
జనుదేర నాయుషా। కాంతుఁడు మున్నుగాఁ బటహకాహళతూర్యనినాదపూరితా। శాంతరుఁడై వెసం జనియె నాత్మపురీ
ముఖుఁడై ముదంబునన్॥ మ॥ కనియెన్ గోపకుమారశేఖరుఁ డురంగత్ఫుల్లరాజీవకో। కనదోత్తుంగతరంగసంగతలసత్కాసార
కమ్మారిశోభనవిత్యోన్నతసౌఖ్యభారకముదంచద్వైభవోదారక। జ్జనసంతాపనివారకమ్ముఁ జనభాస్వత్తారకద్వారకన్॥
వ॥ కని డాయంజని పురలక్ష్మీ కృష్ణసందర్శనకుతూహలయై చేసన్నలం జీఱుచందంబున నందంబు నొందు సుధాతతరళవివి
త్రకేతుపతాకాభిశోభితంబును, మహనీయమరకతతోరణమండితంబును, నవమణివినిర్మితగోపురసౌధప్రాసాదవీథికా
విలసితంబును, మౌక్తికవితానవిరచితమంగళరంగవల్లీవిరాజితంబును, శోభనాకలితవిన్యస్తప్రశస్తకదళీకాస్తంభసు
రభికుసుమమాలికాతోరణాలంకృతంబును, కుసుమసలిలసిక్తవిపణిమార్గంబును, శంఖదుందుభిభేరీమృదంగపటహకాహ
ళాదిమంగళారావకలితంబును, వందిమాగధసంగీతప్రసంగంబును, గలిగి యతిమనోహరవిభవాభిరామంబైన యప్పు
రంబున దివ్యపురోహితసుహృద్బాంధవముఖ్యులెదురుకొన భూసురాశీర్వాదంబులును, బుణ్యాంగనాకరకలితలలితాక్ష
తలను, గైకొనుచుం గామినీమణులు కర్పూరనీరాజనంబుల నివాళింప నిజమందిరంబు ప్రవేశించి యప్పుండరీకాక్షుండు ప
రమానందంబున సుఖంబునుండెనంత॥ క॥ శ్రీకృష్ణుని విజయంబగు। నీకథఁ బఠియించువారలెప్పుడు జయముం। గైకొని యి

## నృగమహారాజు చరిత్రము.

హపరసౌఖ్యములాకల్పోన్నతి వహింతురవనీనాథా॥ క॥ అని చెప్పిన శుకయోగికి। జననాయకుఁడనియెఁ గృష్ణచరితము విన
నా। మనమెప్పుడుఁ దనియదింకను। వినవలతుం గరుణఁ జెప్పవే మునినాథా॥ అని నంబరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండి
ట్లనియె. సీ॥ ధరణీశ యొకనాఁడు హరితనూజులు రతీశ్వరసాంబగదచారుచారుభాను। లాదిగా యదుకుమారావలి యుద్యా
నవనమునకతివైభవమున నేఁగి। పలనొప్పని చ్చానువర్తులై సుఖలీలఁ జరియించి ఘనపిపాసలను బొంది। నెటఁ దప్పిసలిలము
న్వేషించుచును వేగవచ్చుచో నొకచోట వారిరహిత। కూపమునునందు లోనొక కొండవోలె। విపులమగు మేని యూసరవె

ల్లిఁ గాంచి చిత్తమున విస్మయంబంది తత్తరమున దాని వెడలించు వేడుకఁ దగులుటయును॥ చ॥ పరువిడిపోయి తెచ్చి ఘనపాశ చయంబుల నంటఁగట్టి యుగ్రగురుభుజులం దలుంగ దిసికోయని యార్చుచు దాని నెమ్మెయిం దరలఁగఁ దీయలేక జగదట్టముగా మదిమట్టగిల్ల నొండొరుఁగడవంగ వేచని పయోరుహనాభునకంతఁ జెప్పినన్॥ చ॥ వినిసరసీరుహాక్షుఁడతివిస్మితుఁడై జన శూన్యకూపము ల్లనఁగదియంగ వేఁగి *కృకలాసము నెక్కటితృణంబ పోలెగొబ్బున వెడలించె వామకరపద్మమున నన్నదియుం తలోనఁగాం। చనరుచి మేనుగల్గి పురుషత్వముతోఁ బొడసూపి నిల్చినన్॥ వ॥ ఇట్లు నిల్చిన నంబుజాక్షుండతని వృత్తాంతం బంతయు నెఱింగియు నక్కడిజనంబులుఁ గుమారవర్గంబును దెలియుకొఱకు నతనిచేత నతద్వృత్తాంతం బంతయు నెఱిం గించువాఁడై యిట్లనియె॥ చ॥ కనకరురత్నభూషణనికాయుఁడవై మహనీయమూర్తివై। యనుపమకీర్తిశోభితుఁడవై పిల సిల్లుచు ధాత్రిమీఁద నెం। పొనరిననీకు నేమిగతి నూసరవెల్లితనంబు చొప్పడెన్। వినని దిచోద్యమయ్యె సువివేకచరిత్ర యెఱుంగఁ జెప్పుమా॥ క॥ అని యడిగిన మురరిపుపదవనజంబులఁ దనకిరీటవరమణులొయ్యన్। వినయమున మ్రొక్కి యిట్ల ను। ఘనమోదముతోడ నిటలఘటితాంజలియై॥ గీ॥ విశ్వసంవేద్య మహితయా విశ్వమందుఁ బ్రకటముగనీ వెఱుంగని దొ కటి గలదె యయిన నాచేత వినవిన్నపయ్యె నేని నవధరింపుము వినుపింతు నంబుజాక్ష॥ ఉ॥ పనితృగ్వాకుతనూజుఁడన్నృగుఁడ నా నేపారుభూపాలుఁడన్। దీనవ్రాతమునర్థిఁ బ్రోముచు ధరిత్రీనాయకుల్గొల్వ సమ్మానింపన్ జతురంతభూభరణసామ ర్థ్యుండనై సంతతశ్రీనిండారినవాఁడ నుల్లసితకీర్తిస్ఫూర్తిశోభిల్లఁగన్॥ చ॥ పలుకులఁ దన్నుఁ దాఁ బొగడఁ బాతకమంచు రటుండఁ దారకాపలిసికతావ్రజంబు హిమవారికణంబులు లెక్కవెట్టఁగా నలవడుఁ గాని యేను వసుధామరకోటికి దాన మిచ్చు గోవులగణుతింపధాతయును నోపఁడు మాధవ యేమి చెప్పుదున్॥ అదియునుం గాక॥ చ॥ పొలుచు సువర్ణశృంగఖుర ముల్ దనరన్ దొలుచూలులై సువత్సలు గలపాడియావులను దాత్తతపోవ్రతవేదపాఠముల్। గలిగి కుటుంబులై విహితకర్మ ములం జరియించు పేదవి। ప్రులకు సదక్షిణంబుగ విభూతిఁ దలిర్పఁగ నిత్తు నచ్యుతా॥ వ॥ మఱియు న్యాయసముపార్జితవిత్త మ్ములగోభూహిరణ్యరత్ననివాసరథహస్తివాజికన్యాసరస్వతీవ ప్రతిలకాంచనరజతశయ్యాది బహువిధదానంబుల నూనంబులుగా నసేకంబులు సేసితిఁ బంచమహాయజ్ఞంబులొనరించితి వాపీకూపతటాకవననిర్మాణంబులు సేయించితి నిని ష్టివిధంబునం జేయుచో నొక్కనాఁడు॥ క॥ అనఘాత్మ కశ్యపాఖ్యుం డనువిప్రునకే నకల్మషాత్ముఁడనై యిచ్చినగోవు దప్పి నామందనెగలసినఁ దెలియ లేకఁ దగనా గోవున్॥ క॥ ఒండొక భూమీసురకుల। మండనునకు దానమీయ మసలక యావి ప్రుండా గోవుం గొనిచను చుండన్ మనుధారఁగొన్న యుర్వీసురుఁడున్॥ క॥ మఱిరోష మొదవ దోవతి వడలిన బిగియించి కొనుచు వడిఁ జనియెడి నా మొదవునడిపథిఁ దొంగిలి పదలక కొనిపోయె దిట్టి వారును గలరే॥ చ॥ అనవుడు నాతఁ డిట్లనియె నా తనితో నిపుడే నుపీనినీ। జనపతిచేత ధారఁగొని సాధుగతిం జననీ దియింటమె। ట్లనిన నతండు నేను ధరాధిపుచే వసుధా రఁగొన్నయా వనిపినిపింపనిద్దరసువయ్యె నపారవివాద మచ్చటన్॥ వ॥ ఇట్లు విప్రులిద్దఱుం దమలోనంతకంతకు మచ్చరం బునం బెచ్చు పెరిగి కలహించి నాయున్నయెడకుం జనుదెంచి మున్ను నాచేత గోదానంబుఁ గొన్న బ్రాహ్మణుం డిట్లనియె॥ సీ॥ మనుజేంద్ర ప్రజలధర్మప్రవర్తనముల నడుపుచుండఁగ నాజ్ఞ నడుపు నీవు। మానమున నేధర్మమునియాచరించితి మును నా కు నిచ్చినమొదవు దప్పి పచ్చి నీమందలోఁ జొచ్చిన నిప్పు డీభూసురునకు ధారఁబోసి యిచ్చి। తగవు మాలితి వీవ దాతవు నపహ ర్తవై తని న్నేమనన వనినాథ। యనిన మాటలు చెవులు సోఁకినఁ గలంగి భూసురోత్తము యజ్ఞానపూర్వకమున నిట్టి పాత కమొదవె నే నెఱిఁగి సేయఁ గొనుము నీకిత్తు నొకలక్ష గోవుల నెగ వరల॥ క॥ అనిమఱియును నవ్విప్రుని సునయోక్తులనను నయించుచును నిట్లంటి నన్నుఁ గావు నరకకూపంబునఁ బడఁగనీకుని జాలఁ బురుషపుంగవ యనినన్॥ గీ॥ ఎంత వేఁడిన మచ్చరం బంత పెరిగి మొదలు నాకిచ్చినట్టి యా మొదవె కాని యొనయఁగ రాజ్యమంతయు నిచ్చితేని నొల్లననివిప్రుఁ డచ్చటనుండక తీ గె॥ వ॥ అట్లతం డఱిగిన నారెండవబ్రాహ్మణునిం బ్రార్థించిన నతండును జలంబు డింపక పదివేలేఱికోరుపాఁడి మొదవుల నిచ్చి ననై నను దీనినకాని యొల్లననినిలువక చనియె నంతఁ గాలపరిపక్వంబైన నన్ను దండధరకింకరులు గొనిపోయి వైవస్వతుముం దఱం బెట్టిన నతండు నన్నునుద్దేశించి యిట్లనియె॥ మ॥ మనుజేంద్రోత్తమ వంశపావన జగన్మాన్యక్రియాచారనీ ఘనదాన క్రతుధర్మముల్ద్రిభువనఖ్యాతంబులై చెల్లెడిన్। మును దుష్కర్మఫలంబు నొందిపిదపన్ బుణ్యానుబంధంబులై చను సౌఖ్యం బులఁ బొందు మబ్జజునియాజ్ఞం ద్రోవఁగా వచ్చునే॥ వ॥ అని వేగంబునం ద్రోపించిన నేనపుడు పుడమిం బడి యీనికృష్టంబైన యూసరవెల్లిరూపంబు గైకొంటి నింతగాలంబు తద్దోషనిమిత్తంబున నిద్దురవస్థం బొందవలసెఁ బ్రాణులకుఁ బుణ్యపా పంబులను భావ్యంబులుగాని యూరక పోనేరవు నేఁడు సమస్తదురితనిస్తారకంబైన భవదీయపాదారవిందసందర్శనంబు

*కృకలాసము। ఊసరవెల్లి తొండ.

నం జేసి యీ ఘోరమగు దశలం బాసి నిర్మలాత్ముండనై తిననిపునఃపునః ప్రణామంబు లాచరించి మఱియు నిట్లనియె॥ గీ॥ కృష్ణ వాసుదేవ కేశవ పరమాత్మ। యప్రమేయ వరద హరి ముకుంద। నిన్నుఁ జూడఁగంటి నీకృపఁ గనుఁగొంటి। నఖిల సౌఖ్యపదవు లందఁగంటి॥ వ॥ అని యనేక భంగులం గొనియాడి గోవిందుని పదంబులు దన కిరీటంబులు సోఁకం బ్రణమిల్లి దేవా భవదీయపాదారవిందంబులు నా హృదయారవిందంబునం బాయకుండునట్లుగాఁ బ్రసాదింప వేయని తదనుజ్ఞాతుండై యచ్చటి జనంబులు సూచి యద్భుతానందంబునుం బొందఁ నతుల తేజోవిరాజితంబైన దివ్యవిమానమందాసీనుండై దివంబునకరిగె నంత నమ్మాధవుండు నచ్చట నున్న పార్థివోత్తములకు ధర్మబోధంబు గా నిట్లనియె ॥ సీ ॥ నరనాథకుల కానన ముదహించుటకును నవనీసురులవిత్తమగ్నికీల। జననాయకుల నైశ్వర్యాబ్ధి నింకింప బ్రాహ్మణక్షేత్రంబు బాడబంబు। పార్థివోత్తముల సంపద్వృక్షములఁ గూల్ప భూసురధనము దంభోళిధార। జగతీవరులకీర్తిచంద్రికమాయింప సూర్యోదయము ధరాసురుల ధనము। విప్రతతిసొమ్ము కంటెను విషము మేలు। గరళమునకును బ్రతికృతి గలదు గాని। దానిమాన్పంగ భువి నౌషధములు లేవు। గాన బ్రహ్మస్వములు గొంట గాదు పతికి॥ క॥ ఎఱుఁగమినైనను భూసుర। వరుల ధనం బపహరింపవలవదు పతికి। న్మఱి పునన। నలము ముట్టిర। దరికొని వెసఁ గాల్పకున్నె తను బెరియంగన్ ॥ వ ॥ మఱియును దనధనంబు పరులచేతఁ గోల్పడిన విప్రుండు దుఃఖంబున రోదనంబు సేయ రాలిన యశ్రుకణంబు లవని రేణువు లెన్ని దడియు నన్ని వేలేండ్లు దను పేరోపరుండైన పతి దారుణ వేదనలు గల కుంభీపాక నరకంబు నొందు-మఱియును గ్రిందటఁ బదితరంబుల వారును, ముందటఁ బదితరంబుల వారును, మహానరక వేదనలం బొందుదురు-స్వదత్తంబైనఁ బరదత్తంబైన నర్థంబు లోభంబునం జేసి మ్లేచ్ఛుండై భుజించు నప్పాపాత్ముండు నఱువదివేల సంవత్సరంబులు మలకూపంబునం గ్రిమిరూపంబున వర్తించు నట్లగుట నెఱింగి విప్రుండెంత తప్పు చేసిన నెన్ని గొట్టిన, నెన్ని దిట్టిన నతనికెదురు పలుకక వినయంబున వందనం బాచరించు పుణ్యాత్ములు నాదు పాలింటి వారదియునుం గాక నేనును బ్రతిదివసంబును భూసురుల నతివినయంబునఁ బూజింతు-నిట్లు సేయక విపరీతవర్తనులైన తామసుల నేను వెదకి దండింతు నదిగావున మీరలు బ్రాహ్మణజనంబుల వలనం బరమభక్తి గలిగి మెలంగుండని యానతిచ్చి యాదవప్రకరంబులు సేవింప నఖిలలోకశరణ్యుండైన యప్పుండరీకాక్షుండు నిజనివాసంబునకుం జనియె నని చెప్పి శుకుం డిట్లనియె॥ క॥ ఈ కథఁ జదివినవారలు। గైకొని వినువారు విగతకలుషాత్ములై। లౌకిక సౌఖ్యము నొందుదు। రాకైవల్యంబు గరతలామలకమగున్॥

### బలరాముండు సుహృద్బంధుజనదర్శనార్థమై వ్రేపల్లెకుం బోవుట.

సీ॥ నరనాథ వినుమొక నాఁడు తాలాంకుండు చుట్టాలబంధులఁ జూచు వేడ్క। సుందర కాంచన స్యందనారూఢుండై భాసిల్లుచున్న వ్రేపల్లెకరిగి। చిరకాలసంగతస్నేహులై గోపగోపాంగనానికర మాలింగనములు। సముచితసత్కృతుల్సలుపఁ గైకొని మనోత్సుకలీల నందయశోదలకును। వందనం బాచరించిన వారు మోదమంది బిగియారఁ గౌఁగిళ్లనొందఁ జేర్చి। సముదదీవించి యంకపీఠమునఁ జేర్చి। శిరము మూర్కొని చుబుకంబుఁ గరము పుడికి॥ వ॥ మఱియు నానందబాష్పధారాసిక్తకపోలయుగళంబులతోడం గుశలప్రశ్నంబుల నిట్లనిరి-రన్నా నీవును నీ చిన్నితమ్ముండును వెన్నుండును లెస్సయున్నవారె-మమ్ము నెప్పుడు నరసిరక్షింపవలయు మాకు నేమి గడయు మీరకాక యొరులు గలరే యని సముచిత సంభాషణంబులం బ్రొద్దుపుచ్చుచుండి రంత॥ క॥ గోపాలవరులు ప్రమదంబా పోవని మది నివర్తితాఖిలగేహ। వ్యాపారులగుచు హలధరు। శ్రీపాదంబులకు నతులు సేసిరి వరుసన్॥ క॥ సీరియు వారికిఁ గరుణో। దారుండై నడిపె సముచితక్రియలంతం। గోరి తనయీడు గోపకుమారుల చేచఱచి బలుఁడు మందస్మితుఁడై॥ క॥ నిజసుందరదేహద్యుతి। రజతాచలకుచుల సడరాముఁడు వారల్ భజియింప నేఁగి యొకచో। విజనస్థలమున వసంతవిలసిల్లు నెడన్॥ కవిరాజవిరాజితము॥ చరణములం ఝళఝళ స్ఫుటనూపురజాలము ఘల్లను ఘుంజెలఁగ। న్గరములఁ గంకణముల్మొఱయన్నలిఁ గొనసియాడఁగు చాగ్రముల। న్సగుబటింపఁ గురుల్గుని యస్వలసన్మణికుండల కాంతులు విస్ఫురితకపోలముల న్సైరయ వ్రజసుందరులం దఱుఁ ముందఁ గతిన్॥ కవిరాజవిరాజితము॥ చనిబలభద్రుని శౌర్యసముద్రుని సంచితపుణ్యు నగణ్యుని జం। ఘనఘనసార పటీర తుషార సుధారుచికాయు నిధేయసుధా। శనరిపుఖండను సన్మణిమండను సారవివేకు నశోకు మహాత్ముని గని గోపికలోపిక లేక యమప్రభు నిట్లని రుత్కలికన్॥ చ॥ హలధర నీసహోదరుఁడు దంచిత కంజవిలోచనుండు పల్లెలితపురాంగనాజనవిలాసవిహార సమగ్ర సౌఖ్యముల్ గలిగి సుఖించు నేమము మొకానొక వేళ నయేని బుద్ధిలోఁ దలఁచునె మమ్మాతన ప్రియులఁ దా గొని యేమిఁ బల్కుచుండునో॥ క॥ జననీజనకుల ననుజులఁ। దనుజుల బంధువుల మిత్రతతి విడిచెపుడు। మ్మనమున నొండు దలఁపక। తనుసమ్మన వారి విడువఁదగు నే హరికిన్॥ సీ॥ సలలిత యమునాసైకతస్థలమున నుండి మమ్మేమని యూరడించె। విమలబృందావనవీథి మా చుబుకముల్ పుడుకుచు నేమని బుజ్జగించెఁ। బుష్పవాటికలలోఁ బొల్పుమా

ధూళినింగిఁ బ్రాంగభూతంబులు సేవింప *నగ్నవేషమై నిజవిలోచనసంజాత సముద్ధూతనిఖిలభయంకర జ్వాలికాజాలంబులఁ బ్వాజాలంబులోలిం బ్రేల్చుచును ద్వేలగగనగమనంబున నగధరనగరంబునకఱుగు దేరఁ బౌరజనంబులు భయాకులమానసులై డావదహనునిం గనిపఱచువనమృగంబులచాడ్పునం బఱచి సుధర్మాభ్యంతరంబున జూదంబాడుచున్న దామోదరుం గనిరక్షరక్షేతి యార్తరవంబులం గృష్ణ కృష్ణ పెనుమంటలం బురంబు గాల్పం బ్రళయాగ్నిచను దెంచెనని వారిం జూచి మీరోడకుఁడుండని భయంబు నివారించి సర్వరక్షకుండైన పుండరీకాక్షుండు జగదంతరాత్ముండు గావునఁ దద్వృత్తాంతంబు తెలియఁ దన చిత్తంబున నెఱింగి కాశీరాజపుత్ర ప్రేరితమైన యమ్మహాకృత్తిని నిగ్రహింపం దలంచి నిజపార్శ్వవర్తియై యున్న యద్దివ్యసాధనంబుగనుంగొని యప్పుడు॥ సీ॥ భీమమై బహుతీవ్రధామమై హతరిపుస్తోమమై సుమహితోద్దామమగుచుఁ। జండమై పిహితమార్తాండమై పాలితాజాండమై విజయప్రకాండమగుచు। దివ్యమై నిఖిలగంతవ్యమై సుజనసంభావ్యమై సద్భక్తసేవ్యమగుచు। నిత్యమై నిగమసంస్తుత్యమై వినమితాదిత్యమై నిర్జితదైత్యమగుచు। విలయసమయసముద్ధూతవిపుల భాస్వ।త్ఫాలలోచనరోచనానలసహస్ర। ఘటితపటుసటాజ్వాలికాచటులసత్త్వ। భయదచక్రంబు కృత్తిపైఁ బంపె శౌరి॥ వ॥ అదియును బ్రళయవేళాసంభూతజీమూతసంఘాత ప్రభూతఘుమఘుమాటోపనినదాధరీకృతాతిదుస్సహ హాకహాకహానిబిడనిస్వననిర్ఘోషపరిపూరిత బ్రహ్మాండకుహరంబున భ్రాంలిహకీలాసముత్కటపటుచిట చిటస్ఫుటస్ఫుటస్ఫులింగచ్ఛటాభీలంబును, సకలదేవతాగణజయజయశబ్దకలితంబును, ననంతతేజోవిరాజితంబును, నగుచుఁ గదిసి నంబంటింపకఁ గంటగించుచు గెంటి వెంటనంటి నెడనంటి రౌద్రంబు విడిచి మగుడి కాశీపురంబు సొచ్చి పౌరలోకంబు భయాకులతం బొంది వాపోవ రోషభీషణాకారంబుతో నప్పుడు ఋత్విక్సకాయయుతంబుగా సుదక్షుని దహించె నత్తఱిఁ జక్రంబు నుదన్నగరసౌధప్రాకారగోపురాట్టాలకాది వివిధవస్తువాహననికరంబులతో భస్మంబుగావించి మఱలి యమ్మురులు వెఱఁగంద కమలలోచనుపార్శ్వవర్తియై నిజప్రభావపుంజంబు వెలుఁగొందఁ గొల్చియుండె నని చెప్పి మఱియు నిట్లనియె॥ క॥ మురరిపువిజయాంకితమగు। చరితము సద్భక్తిఁ దగిలి చదివిన విన్నన। దురితములఁ బాసి జనులిహ। పరసౌఖ్యములఁ దనిచేతఁ బడయుదురధిపా॥ అనినశుకయోగికి రాజిట్లనియె॥



శ్రీ బలరాముండు ద్వివిదుఁడను వానరుని సంహరించుట. శ్రీ

క॥ బలభద్రుఁ డప్రమేయుం। డలఘుఁ డనంతుండు నవనియందద్భుతకర్మం। బులు వినియుఁ దనియదింకను। దెలియఁగ నాకానతిమ్ము దివ్యమునీంద్రా॥ అనిన రాజునకు శుకుండిట్లనియె॥ క॥ జననాయక వినుము గ్రీ। వునిసచివుఁడు మైందునకు సహోదరుఁ డనఁగా। వినుతికెక్కిన ద్వివిదుం। డను ప్లవగుఁడు నరకసఖ్యుఁ డతిదర్పితుఁడై॥ సీ॥ చెలికానిపగఁ దీర్పఁ దలఁచి కృష్ణుం డేలుపురములు జనపదంబులు దహించి। సరిదుపవనసరోవరములు గోరాడి మందలఁ గొందల మందఁ జేసి। ప్రాసాదములు ద్రొబ్బి పరిఘులు మాయించి చతురంగబలముల సమయఁ జేసి। పురుషుల సతులను భూధరగుహలలోఁ జొట్టి వాకిలి గట్టి బిట్టు నొంచి। ఫలితతరువులఁ ద్రుంచి సాధులనలంచి। కోటలగలించి పడుచుల నీటముంచి। ధరణి నిబ్బంగి జెచ్చు బాధలసలం చి పఱవఁ జేయుచు నొకనాఁడు ప్లవగవరుఁడు॥ క॥ చతురమృదుగీతరవము। న్నతిపీతెం చినఁ జెలంగి నగచరుఁడా రైవతగిరికందరమున కా। యతగతిఁ జనియందు నెత్తమాడెడువానిన్॥ చ॥ లలితవినీలవస్త్రుని విలాసవతీయుతుఁ జంద్రచంద్రికాకలితము హాన్నతాంగు మణికాంచనదివ్యవిభూషణోన్నతున్। విలసితవారుణీసమదవిహ్వలలోచనుఁ గాంచె సీరనిర్దలితరిపుక్షితీశ నిజధాముని రాముని గామపాలునిన్॥ సీ॥ కనుఁగొని తత్పురోగమభూమిరుహశాఖ లెక్కి యూఁచుచుఁ జాలవెక్కిరించుఁ। గికురింతలిడుఁ బండ్లు గీటుచు నవ్వుచుఁ గొమ్మకొమ్మకు నుఱుకుచు నదల్చుఁ। దోఁకయూరక మేను సోఁకఁగ నులివెట్టు వెడ వెడ నాలుకఁ ద్రెళ్ళఁ బెట్టు। బరుల నఖంబుల గిరగిరఁ గ్రోఁకుచుఁ బోరి పారి ఫలములు గఱచి వైచు। గోళ్ళు తెగఁగొఱికి యుమియుచు గుదము సూపు। బలసి మర్కటజాతి యిన్నగిదిఁ జేయఁ। గోపమున హలధరుఁ డొకగుండు వైవ। దానిఁ దప్పించుకొని ప్రల్లదమున నతని॥ క॥ నగి శ్రీయాసవకలశముఁ గొని। జగతీరుహశాఖ లెక్కి చాపలమునన। జ్జగతిపయి వైచె దద్ఘటమగలఁ గనఁ దిచూచి కోపమగ్గలమొదవన్॥ మఱియును॥ క॥ సీరి నిందన మనమున నొక। చీరికిఁ గైకొనక కదిసి చీరలు చింపన్। వారక దానవుఁ జూచి ఘనకుపితుండై॥ వ॥ ఇట్లు కోపోద్దీపితమానసుండై కనుంగొని హలాయుధుండప్పుడు భువిజనములఁ గారించుట మాన్పం దలఁచి ఘనకుపితుండై॥ చ॥ ముసలముఁ దీవ్రశౌర్యహలముం ధరియించి సమస్తచేతన। గ్రసనమువాఁడు సొంగులయు కాలునిభంగిన దల్చి నిల్చినాఁ। డసదృశవిక్రమక్రమవిహార మెలర్పసమీపభూజము। న్వెసఁ బెకలించి మస్తకము ద్రెస్సె జలంబు బలంబు చొప్పడన్॥ ఇట్లు ప్రేయబలుం డప్పుడు॥ చ॥ ఉరువడి దండతాడితమహోరగుభంగిఁ గడంగి వీరసా। గరమున నేఁచి హాళికకటకం బుల మెచ్చ సునందనామభీ। కరముసలంబునన్ ద్వివిదుకంఠము వ్రేసిన బొల్పె వాఁడు జే। గురుగలకొండచందమునఁ గో

యనియార్చిసురల్ నుతింపఁగన్ ॥ మత్తకోకిల ॥ అంతవాఁడొకయింతమూర్చిలియంతలోఁ దెలివొందిము । ద్దాంత భూరిభుజావిజృంభణుఁడై మహీజముపూనినై । త్యాంతకాగ్రజు వ్రేసె వ్రేసిననాగ్రహంబున దానినిం । టింపై ధరరాలఁ జేసె నసహీనవిక్రమశాలియై ॥ క ॥ మఱియును బలము హుమగ కతరు । చయుఁ డొకతరు వెత్తి వ్రేయఁ దాలాంకుఁడనా । దరమునఁ దునిమిన వెండియుఁ । బొరఁగిం చెఁగుజంబులను ఁడుదోత్తోమునుమన్ ॥ క ॥ ఆచందంబున వనచరుఁ । డేవిమహీరుహచయంబు లెల్లనుహలిపై । నై చితరుమూన్యమగుటయుఁ । బావిశిలావృష్టి గురిసె సురలగ్గింపన్ ॥ క ॥ బలుఁడవుడు రోలుమములై । యిలరాలఁగఁ జేసియార్చె నేపుమగక యా । వలిముఖుఁడు దాలసన్నిభ । ములుగల వాహుయుగదండములను గ్రుంపై ॥ క ॥ పడిఁ బిడుగువోలుపిడికిటఁ । బొడిచినవడి నెడకబలుఁడు ముసలముహలము । న్విడివిప్లవంగుని మెడగడు । నొడవెడవిగియించె గ్రుడ్లు వెలికుఉకంగన్ ॥ క ॥ వదనములచెవులరుధిరము । మెదడును దొరుగంగ వాఁడు మేదినిమీఁదం । జదికిలఁబడియొకయింతయు మెదలక మిడుకంగ లేక మృతిఁ బొందె నృపా ॥ గీ ॥ వానిపాటున కప్పుడు వనసమేత । ముగుచునాశైలరాజమ్ములఁగె నాడె । సురగణంబులురాముపై పురభికుసుమ । వృష్టి గురియించి రతులసంతుష్టి మెఱసి ॥ వ ॥ ఇవ్విధంబున భువనకంటకుండైన దుష్టశాఖామృగేంద్రుని వసుంధరకు బలి చేసి సకలజనంబులు పరమానందకందలితహృదయారవిందులై తన్ను నందింప నయ్యాదునందనుండు నిజనగరంబునకుఁ జనుదెంచెనని శుకుండు వెండియు నమ్మనుజపతి కిట్లనియె ॥ సీ ॥ కోరిసుయోధనుకూఁతురు సర్వలక్షణములు

## శ్రీ బలరాముండు దనహలంబున హస్తినాపురమును గంగలోఁ ద్రోయఁబూనుట. శ్రీ

గల్గిలక్షణయనంగ । మహినొప్పుకన్యకామణివివాహంబునఁ జక్రహస్తునితనూజాతుఁడైన । సాంబుఁడు బలసాహసమున నెత్తుకపోవఁ గౌరవులీక్షించి కడఁగి క్రొవ్వి । పడుచువాఁడొకఁడ దెబాలికఁగొనిపోవుచున్నాఁడు గైకొనకుక్కి మిగిలి । యిట్టి దుష్కమగయి ముట్టిపట్టి తెచ్చి । జనులు వెఱఁగందఁ జెఱఁబెట్టియునుతుమేని । యాదవులుమనల నేమి సేయంగఁగలరొ । యనుచుఁ గురువృద్ధజనములయనుమతమున ॥ వ ॥ ఇట్లు గడంగి యుద్ధసన్నద్ధులై బలశౌర్యోపేతులగు కర్ణశల్యభూరిశ్రవయజ్ఞకేతుసుయోధనాదులు సమున్నతరథారూఢులై కూడనడిగిన వారలం గనుంగొని జాంబవతీనందనుండు సుస్మితవదనారవిందుఁడగుచు సింగంబుభంగి గర్జించుచు మణిదీప్తంబైన చాపంబుఁ బూని నిల్చిన వారు నా సాంబుని నడ్డగించి నిలునిలుమని పలికి ॥ గీ ॥ చండకోదండముక్తనిశాతవిశిఖ । జాలమందంద పఱపియాభీలముగను । నందనందననందనస్యందనంబు । ముంచిరచలేంద్రమును ముంచుమంచుపగిది ॥ మఱియును ॥ శా ॥ శౌర్యాటోపవిజృంభణంబుల సరోజాతాక్షునూనున్ సురా । హార్యస్థైర్యుని మీఁద నేయన తఁడుద్యద్భూరిబాహాబలా । వార్యుండై శితసాయకాలి నసమాయం జేసిన న్దేవతా । తూర్యంబుల్దివి మ్రోసె నంతన తఁడస్తోకప్రతాపోన్నతిన్ ॥ వ ॥ ఇట్లు గడంగి బాణజాలంబులు పఱగించి యయ్యాఱుగురను నన్నిరూపులై రథసద్ధ్వసూతధ్వజపతాకాతపత్రంబులు చూర్ణంబులుగావించి విరథులం జేసి వారల మెయి మఱుపులఁ బుప్పొళ్లుగావించి యొక్కొక్కని పెక్కుబాణంబుల నుచ్చిపోనేసిన వారలు శోణితదిగ్ధాంగులై కుసుమితకింశుకంబులం బోలియుండిరంత ॥ ఉ ॥ వారలనేకులయ్యు బలవంతులునయ్యును వోహాగ్రసంగరో । దారపరాక్రమప్రకటదక్షులయ్యుఁ గుమారకుం జగ । ద్వీరుని నొక్కనిం జెనకి వ్రేలుసువంపఁగ లేక సిగ్గునం । గూరిన చింత నెండొరులు గూడుచు విచ్చుచు వెచ్చనూర్చుచున్ ॥ మగుడి సమరసన్నద్ధులై సంరంభించి ॥ ఉ ॥ అందఱు నెక్కుపెట్టి దనుజాంతకనందనుఁ జుట్టుముట్టియం । పందనిశాతసాయకచయంబుల ముంచి రథంబు నుగ్రలీ । లం మసుమాడి చాపమురయంబునఁ ద్రుంచి హయాళిఁ జంపి సూ । తునిఁ దెగటార్చి యంతవిరథుండగుటన్ వెసఁ బొచ్చిపట్టిట్టిరన్ ॥ గీ ॥ బాలకుఁడు చేయునది లేక పట్టువడియెఁ । గౌరవులు తమ మానమునఁ గౌతుకంబు । లోలయు సాంబునిఁ గన్యకాయుక్తముగను । బురమునకుఁ దెచ్చిరతులవిభూతి మెఱసి ॥ అంత ద్వారకానగరంబున ॥ ఉ ॥ జాంబవతేయు వార్తయదుజాతులు వారదమౌని చేసను । స్తంబును విన్నవారగుచు సంగరకౌతుకమొప్ప తెల్లఁ జి । త్తంబులఁ గౌరవాన్వయవిడంబము నొక్కటనుక్క డంచు గో । పంబులనుగ్రసేన జనపాలుననుజ్ఞ సమస్తసైన్యముల్ ॥ గీ ॥ కూడి నడువంగఁ గని వారితో డబలుఁడు । ధార్తరాష్ట్రులకును నెంతయు డాసి । నట్టిబంధులు వారి పైఁ బెట్టియలుక । యొత్తిచను ముంటయిది నీతియే తలంప ॥ వ ॥ అని వారల వారించి తత్క్షణంబ బంధుప్రియుండైన బలరాముండు నలార్కసంకాశంబగు కాంచనరథంబెక్కి యసురస్తలైన భూసురులును యుద్ధవాములగు కులవృద్ధులును సేవింపంగ రిపురంబునకుం జని తత్పురోపకంఠవనంబున సురభికుసుమఫలభరితతరుచ్ఛాయావిరచితచంద్రకాంతశిలాతలంబునం దుపసియించి మహితగ్రహమధ్యగతుండైన పూర్ణచంద్రు ననుకరించియుండె నంతఁ గార్యబోధనంబు సేయుటకై కౌరవ్యుల యొద్దకుం బ్రబుద్ధుండైన యుద్ధవుని బనిచినం జనియతం డాంబికేయునకు ధనురాచార్యాపగాతనూభవసుయోధనులకుం బ్రణమిల్లి వారిచేత నభినందితుండై యిట్లనియె ॥ సీ ॥ భూరియశోధనుల

నేనిమిదివమార్గధరణీపాలురు నవ్వా॥వ॥ ఇట్లు తనపడిన బన్నములం దలంపక సింహంబునకుఁ దంతావళంబుల నరికట్టి కారించు చందంబున మమ్ముం జెఱఁబెట్టి బాధించుచున్న యప్పాపాత్ముని మర్దించి కారాగృహవాసబద్ధుల మగు మా నిగ్బంధంబులం బాపి సుతదారమిత్రవర్గంబులం గూర్చి యనన్యశరణ్యుల మైన మమ్ము రక్షింపు మని విన్నవించి రని బ్రాహ్మణుం డవిన్న

## నారదుండు శ్రీకృష్ణుని వద్దికేతెంచి ధర్మరాజు చేయు రాజసూయమును నెరవేర్పుమని చెప్పుట.

నంబు సేయు నవసరంబున॥సీ॥ శారదచంద్రికాసారంగరుచితోడఁ జడనూడి కెంపుచేఁ జెఱచినట్లు। శరదంబుదావృత సౌదామినీలతాశోభఁ గాంచనకటిసూత్రములతోఁ బలితపుఁ గ్రొన్ననలలకెలంకమ్ము గతి వృత్తముగ జిరువిమించుఁ జూపఁ। కల్పశాఖాగ్రసంగతపుష్పగుచ్ఛంబు లీలఁ గేలను నమ్మహాలినాదకర। భూరిపుణ్యానదీతోయపూరణమునఁ। దనుకమండలువొకహస్తమునఁ దనర। వెల్లజన్నిదమున్నతశోభిల్లవచ్చె। నారదుండు వివేకవిశారదుండు॥క॥ చనుదెంచె నట్లు ముని నిజ। తనుకాంతుల నఖిలదిగ్వితానము వెలుఁగ। న్వనజాక్షుఁ బోలనయ్యా మునిజనములు గృష్ణుండు లేచి సంప్రీతి మెయిన్॥క॥ వినయమున న్మ్రొక్కి కనకాసనమునఁ గూర్చుండఁబెట్టి నిజవిధాన్చనములఁ దనిపి మురాంతకుఁ। డని యెంతయు వినయంబునఁ దోఁపనప్పునిఁ బోడఁగాంచి యిట్లనియె॥ ఎప్పుడు నయ్యుండి నిబ్బడి మునినాథా। నఖిలలోకైకసంచారులగుటఁ జేసి। యీ లోకంబునం గల యర్థంబు నిఖిలమున్ మునిన యిదులేని మిమ్ము కడుఁ గావలయు॥ గీ॥ పాండునందను లిప్పుడే సగిది నెచట। నున్నవారలో యెఱిఁగింపుఁడన్న నుగ్రశరసరోజాతములు మోడ్చి కడకతోడఁ। బలికెఁ గమలాక్షుఁ జూచి సద్భక్తి మెఱసి॥వ॥ దేవా నీవు విశ్వనిర్మాణకర్తవై మాయివై సకలకార్యోత్పాదనాదిశక్తియుక్తుండవై పావనుండవై పావకుండు దారువులందు నంతర్హితప్రకాశుండై యున్న చందంబున వర్తించుచున్న నీ మహత్త్వంబు మాయాశతంబులఁ బెక్కుమాఱ్లు పొడగంటి - నదియు నాకప్పుతంబుగా నవియొనుం గాక నీ సంకల్పంబున జగంబుల్ స్వప్నంబై భావస్ఫురితంబులగునట్టి నీకిష్టంబైన వస్తువు సాధుతరంబు గాఁ దెలియ నెవ్వండు సమర్థుండు దేవ పరమార్థంబు ప్రమాణమూలంబునఁ దోఁచునదియును లోకవిచక్షణుండవైన నీ స్వరూపంబు నాత్మీయమును భక్తిమార్గంబు నెఱుంగక సంసారపరవశులైన జీవులు మాయాంధకారంబున వర్తింపఁ జేయు సమర్థంబగు నీ దివ్యశ్రీలావతారంబులం గలుగు కీర్తియను ప్రదీపంబు ప్రజ్వలింపం జేసి కృపసేయునట్టి నీకు నమస్కరించెద నదిగావున నీ ప్రపంచంబున నీ వెఱుంగని యర్థంబు గలదే యని కృష్ణునకు నారదుం డిట్లనియె॥సీ॥ అయిన నను వినుపించెద నవధరింపుము దేవ పాండుసుతనూజుండు సార్వభౌమేచ్ఛ। కామాను మోహితాత్మ కాంక్షింపఁ గలఁడు సద్రాజసూయమహాధ్వరంబు సేయ। భువనంబులలోన విడంబనార్థంబుగాఁ బరికింపఁ దాన కాంక్ష్యబాంధవుఁడవు। భక్తవత్సలుఁడవు పరమపూరుషుఁడవు యజ్ఞరక్షకుఁడవు యజ్ఞభోక్త। వగు భవత్సేవనము చేసి గతవదయి। నైన నీ మేనబావ ధర్మాత్మజుండు। వాని యజ్ఞంబు రక్షింపనంబుజాక్ష। వలయు విచ్చేయుము చక్కఁ బలుకుమంటి॥క॥ నీ పేరు వినిన నొడివిన। బాపంబులు మాసిపోవుఁ బద్మాక్ష జగ। ద్దీపక నీ దర్శనమున। నే పార వె భక్తజనులకిహపరసుఖముల్॥మ॥ భవదీయోజ్జ్వలకీర్తి దిగ్వితతులన్ వ్యాపిల్లి యుష్మత్పదో। ద్భవనైర్మల్యజలంబులు గలికిఁ బాతాళంబునం బాఱు భోగవతినా నయ్యెడం ద్రిభువనంబులఁ గరూపమై। దివిమందాకినినాఁ జగత్త్రయమును నందీపించుఁగా దేవా॥క॥ అసురభయనాశ నస్తక। రాసుండఁ బిలిఁగల్గు మేటి రాజులు మా ని। స్తోత్రంబును భవదీయ మహా। మహిమముఁ జూచి సత్కృతార్థతం బొందన్॥క॥ కలరని చెప్పిన నవ్వుచు। పలుకుల నస్మిడము నొంది పంకజనాభుం। డెలనవ్వు మొగమునకుఁ జెలు

## శ్రీకృష్ణుండుద్ధవుని యాలోచనఁ బొంది ధర్మరాజు పాలికిఁ బోవుట.

వొలయఁగఁ జాటించి యుద్ధవునకిట్లనియెన్॥క॥ ఉద్ధవ మహిత వివేక స। మిద్ధవచోవిభవ కార్యమేగతి నసుచుర్। వృద్ధవరానుమతంబుగ। బోద్ధవ్యము గాఁగఁ జెప్పవు మునినిధానా॥గీ॥ అనఘ చారిత్ర నీవు నా యక్షియుగము। వంటివాఁడవు మనకున వశ్యమగుచుఁ। జేయఁదగినట్టి కార్యంబుఁ జెప్పు నీవు। నేమి పంచిన గావింతు నిద్ధచరిత॥వ॥ అని సర్వజ్ఞుండైన హరి యజ్ఞుండువోలెఁ దన్ను నడిగిన పురుషోత్తముని భాషణంబుల కమనంబున సంతసిల్లి యతని పాదాంబుజంబులు దనమనంబున నిడికొని వృద్ధానుమతంబుగా నే నెఱింగిన తెఱంగున విన్నవించెద నవధరింపుము - దేవా దేవముని చెప్పినట్లు భవదీయభక్తుండైన యుధిష్ఠిరు యాగపాలనంబు సేయంగైకొనుట కార్యంబ దియునుంగాక నిఖిలదిగ్విజయమూలంబగు రాజసూయకృత్యంబునం దజరాసంధమర్దనంబును నతని చేత బద్ధులైన రాజులం గారాగృహవిముక్తులం గావించుటయుం జేకూరు - నదియునుం గాక నాగాయుతసత్త్వుండును, శతాక్షౌహిణీబలాన్వితుండును నగు మాగధుని వధియింప మన ప్రభంజననందనుం డుగాని యొండొరులు నమర్థులు గారట్లగుట నతండు భూసురులేమి గోరిన నయ్యర్థంబు వృథాకరింపక నిచ్చుం గావునఁ గపటవిప్రవేషంబునం జని యాజరాసంధుని నాహవభిక్ష వేఁడిన భవత్సన్నిధానంబున నప్పవమానతనయుం డతని వధియించునట్టి కార్యంబు చే

ళ్ళిలయశోదానందులకుఁ బ్రియసూనుఁ డయ్యె। బ్రహ్మాదిసురులకు భావింపఁగా రాని బ్రహ్మంబు గోపాలబాలుఁ డయ్యె। వేదశాస్త్రంబులు వెదకి కానఁగలేని గట్టి వ్రేతలరోలఁ గట్టువడియె। దివిజులకమృతంబు దివిరియిచ్చిన భక్తసులభుండు నవనీతచోరుఁ డయ్యె। నెనయఁగ మాలాసటికిఁ జిత్తమిూని వేల్పు గొల్లయిల్లాండ్రయుల్లముల్ పల్లవింపఁ। జేసె నని కామినులు సౌధశిఖరములను గూడి తమలోన ముచ్చటలాడి రధిప॥ మఱియును॥ సీ॥ గోపాలబాలురఁ గూడియాడెడినాఁడు వ్రేపల్లెలోపల నేపు రేఁగి। చల్లలమ్మఁగఁ బోవుసతులకొంగులువట్టి మెఱుఁగుచెక్కిళ్ల పైమీఁటి మీఁటి। కలికి మైముద్దాడఁ గౌఁగిటఁ జేర్చిన పూఁబోఁడిపచ్చములు పుడికిపుడికి। పాయని యనురక్తి డాయఁ జీటి నయింతియధరసుధారసం బానియాని। యురుసమాధిపరాష్ట్రాంగయోగయుక్తులైన యోగీశ్వరులు గాననట్టి జెట్టి। వల్లవీజనవకల్పవల్లి యయ్యె। ననుచుఁ బొగడిరి కృష్ణుని యబ్జముఖులు॥ మ॥ అని యిబ్భంగి సరోజలోచనలు సౌధాగ్రంబులందుండి య। వ్వనజాతాక్షుని దివ్యమూర్తిఁ దమభావంబందు గీలించి సంజనితానందరసాబ్ధిమగ్నలగుచున్ సంప్రీతిఁ దద్భవ్యకీ। ర్తనలై చల్లిరి నవ్యలాజములు మందారప్రసూనావలుల్॥ వ॥ తదనంతరంబున శోభనపదార్థంబులు గొనివచ్చి భద్రాసురధరావరవణిక్పుంగవులు దామోదరునకుఁ గానుకలు దెచ్చి సమర్పించిరి- పుణ్యాంగనాజనంబులు పసిండిపళ్లెరంబులఁ గర్పూరనీరాజనంబులు నివాళింప నంతఃపురంబు సొత్తెంచె నంతఁ గుంతిభోజనందనయుం గృష్ణునింగని పర్యంకంబు డిగ్గి కౌఁగిలింప నాయమ వల్లభుండు మేనత్తకు దండప్రణామంబాచరించెఁ బాంచాలియు ముకుందునకు నభివందనంబొనరించె నంతఁ గుంతి పంపున గోవిందు భామినులగు రుక్మిణీ మొదలగు వారికి గంధాక్షతకుసుమతాంబూలంబులిడి లలితదుకూలమణిభూషణంబులం బూజించె యుధిష్ఠిరుండును గమలనయనునిపవధూజనులననుగతబంధుమిత్రపుత్రసచివపురోహితపరిచారికానీకరంబుల నుచితంబులగుస్థలంబుల విడియించి పనియమించి దినదినప్రవర్ధమానాభినవవివిధోపచారంబులు గావించె నంత॥ క॥ హరియు యుధిష్ఠిరుసముచిత। పరిచర్యలకాత్మ నలరి పా

## శ్రీ ధర్మరాజు శ్రీకృష్ణుని యాలోచన చొప్పన దిగ్విజయార్థముగా భీమాదులఁ బంపుట. శ్రీ

ర్థుఁడు దానున్। సరసవిహారక్రియలను। సురుచిరగతిఁ గొన్ని నెలలు సుఖముండె నృపా॥ అంత॥ సీ॥ ధరణీశ యొకనాఁడు ధర్మతనూజుండు ప్రవిమలనిజసభాభవనమందు। హితులు మంత్రులు పురోహితులును సుతులును మిత్రులు బంధువుల్ క్షత్రవరులు। పరిచారకులు సూతపాఠకకవిబుధవరులును మునులును వరుసఁ గొలువఁ। జిరలీల నవరత్నసింహాసనస్థుఁడై కొలువుండి పినతండ్రి నలిననాభు। భువనరక్షణదక్షు నద్భుతచరిత్రు। యదుకులేశ్వరు మురదైత్యదర్పభేదు। నాస్తునయవేదిఁ జతురుపాయప్రవీణుఁ। జూచి యిట్లని పలికె నస్తోకచరిత॥ గీ॥ అనఘచారిత్ర రాజసూయాధ్వరంబు నెమ్మిఁ గావించు వేడుక నెమ్మనమున। నెనయుచున్నది యది నిర్వహింపనీవ। కాక నా కాత్మబంధువుల్ గలరె యొరులు॥ ఉ॥ ఎవ్వరు నీపదాంబుజము లెప్పుడుఁ గొల్తురు భక్తినిష్ఠులై। యెవ్వరు నిన్నుఁ బ్రేమ నుతియింతురు భూరివివేకశాలులై। యవ్విమలాత్ములందు ముకుంద యంచితశోభననిత్యసౌఖ్యముల్। నివ్వటిలంగఁ గృష్ణ నిను నేర్చి భజించిన తత్త్వవేదులే॥ వ॥ అనినఁ గృష్ణుండు ధర్మనందనున కిట్లనియె॥ చ॥ నయగుణశాలి పాండునృపనందన నీ తలఁపొప్పు నీక్రియ। క్రియముని దేవతాపితృసుకృత్యము నైనిఖిలోగ్రశాత్రవక్షయమును బాంధవప్రియము సంచితపుణ్యము నిత్యకీర్తియున్। జయమును గల్గు దీనఁ దగు సత్తను వేగ నుపక్రమింపుమా॥ క॥ మనుచరిత నీసహోదరు। లనుపమదివ్యాస్త్రవేదులాహవభూమిన్। జెనకిన వైరినృపాలురఁ। మనుమఁగఁ జాలుదురు శౌర్యమర్దనభంగిన్॥ క॥ గెలువుము విమతనృపాలుర। వెలయుము బుధవినుతమైన విశ్రుతకీర్తిన్। నిలుపుము నిఖిలధరామం। డలి నిభవచ్ఛాసనము దృఢంబుగఁ జెల్లన్॥ క॥ నీపంపు కార్యమొరులం। జూపక నేఁ జేయని న్నుఁ జుట్టన ప్రేలన్। జూపఁగ వచ్చునె సకలధ। రాపతులకు నీకుఁ జేయరానిది గలదే॥ కావున॥ క॥ విపులమతిఁ బట్టిసుఖరా। జమునకుఁ జెప్పింపవలయు సంభారంబుల్। సమకూర్పుము నీయనుజుల। సమదగతిం బంపు నిఖిలశత్రుల గెల్వన్॥ క॥ అను మాటలు విని కుంతీ। తనయుఁడు మోదమును బొంది తామరసాక్షున్। వినుతించి శౌర్యకలితుల। ననుజులఁ దెసఁ జూచి పలికె హర్షముతోడన్॥ క॥ సృంజయభూపాలకులును। గుంజరరథవాజిసుభటకోటులు నినుఁ గొ। ల్వం జనుమని సహదేవుని। నంజక పొమ్మనియె దక్షిణాశ జయింపన్॥ క॥ ప్రకటచతుర్విధసేనా। ప్రకరంబులు గొలువఁ బంచెఁ బడమటిదిశకు। న్నకులుని విదళితరిపుభూ। పకులున్నార్యంబు మెఱసి పార్థివముఖ్యా॥ క॥ మర్దనభంజను శౌర్యో। పార్జితవిజయప్రకాండు నాహవనిపుణున్। న్నర్జును నమహితయశోనిధి। నర్జునను త్తరపు దిశకు ననిపె నరేంద్రా॥ గీ॥ మహితశౌర్యనిధులు మత్స్యకేకయభద్ర। భూతలేంద్రబలసమేతముగను। దర్పమొప్పఁ బంపెఁ దూర్పుదిక్కునకును। ద్దామనిహతవైరిధాముభీము॥ చ॥ పనిచినవారలేఁగి ఘనబాహుపరాక్రమవిక్రమంబులన్। ననుపమశౌర్యులై నచతురంతమహీశులనోర్చి కప్పముల్। గనక వినూత్నరత్నతురగప్రముఖాఖిలవ

దై। యదిదప్పించి విరోధిమస్తకము వ్రేయవ్వాఁడుపోఁడట్టుచుఁ॥ చ॥ జెడపక భీమసేనుఁడును మాగధరాజుఁగడంగి బెబ్బులు లిట్టడివడులీలనొండొరులవీఁపులుమూఁపులును*బ్రకోష్ఠములన్నడుతలలూరుజానుజఘనప్రకరంబులుబిట్టువ్రయ్యఁగా బిడుగులఁబోలు పెన్నదలబెట్టుగ వ్రేయుచుఁబాయుచున్ వెసన్॥ లయవిభాతి॥ బెదగడరఁ బెన్గదలుసొడిసొడిగఁ దాఁకఁ బెనుపిడుగులవనిందొరుగనుడుగణము రాలన్। మిడుగురులు చెదరనభమడలహరిదంతములు వెడలజడధుల్లలఁగఁ బుడమి చలియింపన్। వెడచరువమొత్తియునుదడఁబడఁగనొత్తియును నెడమఁగుడులొంచితిరుగుడువడఁగ వ్రేయన్। వడవడవడఁకుచునుసుడివడక డాసి చలముడుగక పుడొండొరులువడి చెడక పోరన్॥ వ॥ ఇవ్విధంబున బోరుచుండ నొండొరుల గదాదండంబులును ముక్కలై నంబెండువడక సముదదిగ్వేదండశుండాదండమండితప్రచండంబులగు బాహుదండంబులప్పళించి ముష్టియుద్ధంబునకుడగ్గరి॥ లయగ్రాహి॥ కాలవెసఁదాఁచియును గీలెడలఁద్రోచియును దాలములదూఁబెడ కేలవడి వ్రేయన్। ఫాలములు గత్తుములు దాలువులు వక్షములు లీల నెముకల్మెదడు నేలమురై వే। రాలవిపులక్షతవిలోలమగు నెత్తురులు జాలుగొని యొల్కఁ బెనుగాలువలుగొనఁ బే। తాలమదభూతములు ఖేలనలఁ జేతులను దాళములు దట్టుచును లీలవడి నాడన్॥ ఉ॥ వ్రక్కలు చెక్కలు న్మెడలు పాణితలంబుల చేఁబగుల్చుచున్ ముక్కులు నక్కులు జ్జెవులు ముష్టిహతిన్నలియంగ గ్రుద్దుచున్। డొక్కలు బిక్కలున్నణఁగఁ దోరపుదాహతినొంచుచున్నెఱుల్। దక్కఁగ ద్రుక్కకొండొరులు దార్కొని పేర్కొని పోరిరుగ్రతన్॥ ఉ॥ హుమ్మని మ్రోఁగుచుం బెలుచ హుంకృతులిచ్చుచుఁ బాసి డాసి కో। కొమ్మనుచున్నొడల్లగిలి గుల్లలతిత్తులుగాఁ బదంబులన్। గ్రుమ్ముచు ముష్టిఘట్టనల ద్రుక్కుచు నార్పులుదండడింపఁగా। సొమ్మలవోవుచున్ దెలియుచున్ మదిఁ జేవయులావుఁజూపుచున్॥ వ॥ ఇవ్విధంబున వజ్రవజ్రసన్నిభంబులగు నితరేతరముష్టిఘట్టనంభిన్నాంగులై రక్తసిక్తశరీరంబులతోడఁ బుష్పితాశోకంబులవీఁకను జేసరుగొండలవడంబునం జూపట్టి పోరుచుండఁ గృష్ణుండు జరాసంధుని జన్మమరణప్రకారంబులాత్మ నెఱుంగుటం జేసి వాయుతనూభవునకు లయిక లేక లావును జేవయుఁ గల్గునట్లుగాఁ దద్గాత్రంబునమందినదివ్యతేజంబు నిల్పి విరోధివిరసహాసాయంబు గా హింవిసమీరణనందనుండు మాచుచుండ నొక్క శాఖాగ్రంబు రెండుగాఁ జీర్చి వానినట్లు దీరిచంపుమని సంజ్ఞగాఁ జూపి చెప్పిన నతండు నా కీలు దెలిసి యవక్రవిక్రమపరాక్రమండై మాగధుంబడఁద్రోచి వివాదిపదంబు పదంబునఁ ద్రొక్కి బాహుయుగళంబున రెండవపదంబు గదలకుండఁ బట్టి మస్తకపర్యంతంబుఁ జెళచెళయను చప్పుళ్ళుప్పతిల్ల మస్తదంతావళంబు దాళవృక్షంబు చీరుచందంబునఁ బాదజానుజంఘోరుకటిమధ్యోదరాంసకర్ణనయనంబులు వేఱువేఱభాగంబులుగా వ్రయ్యలువాపి యార్చినఁ బౌరజనంబులు గనుంగొని భయాకులులై హాహాకారంబులు సేసిరంత॥ క॥ అనిలజుని దేవపతినిఁ। దనుఁజును బద్మాక్షుఁడును దారతనాలింఁ। గనములు సేసి పరాక్రమ। మునక

### శ్రీ కారాగృహవిముక్తులగు రాజులు శ్రీకృష్ణుని స్తుతించుట. శ్రీ

న్యుని నుండి మోదమునఁ బొంగడిరొగిన్॥ క॥ వనజాక్షుఁడంతఁ గరుణా। వననిధియును భక్తలోకవత్సలుఁడును గా। వున మాగధుసుతుసహదే। వుని బట్టముగట్టెఁ దన్మహోన్నతపదవిన్॥ క॥ మగధాధినాథునకు మున్న గపడి చెఱసాలలను మహాదుఃఖములన్ పొగులుచుఁ దనపాదాంబుజయుగళము చింతించుచున్న యుర్వీశ్వరులన్॥ వ॥ అయ్యవసరంబునఁ గృష్ణుండు దనదివ్యచిత్తంబున మగధరాజనిరుద్ధులచెఱలు విడిపించిన వారలు పెద్దకాలంబు కారాగృహంబులఁ బెక్కుబాధలం బడి కృశీభూతశరీరులగుటం జేసి రక్తమాంసశూన్యంబులై త్వగస్థిమాత్రావశిష్టంబులును, ధూళిధూసరంబులైన దేహంబులును, గేశపాశంబులు మాసి జటాబంధంబులైన శిరోజంబులును, మలినవస్త్రంబులును గలిగి చను దెంచి రప్పుడు॥ సీ॥ నవపద్మలోచను భవబన్ధమోచను భరితశుభాకారు మరితదూరుఁ। గంకణకేయూరుఁ గాంచనమంజీరు వివిధశోభితభూషు విగతదోషుఁ। బన్నగాంతకవాహు భక్తమహోత్సాహు నతచంద్రజూటు నున్నతకిరీటు। హరినీలనిభకాయు వరపీతకౌశేయుఁ గటిసూత్రధాము జగద్విహారు। హారవనమాలికామహితోరువక్షు। శంఖచక్రగదాపద్మశార్ఙ్గహస్తు। లలితశ్రీవత్సశోభితలక్షణాంగు సుభగచారిత్రు దేవకీసుతునిఁ గాంచి॥ చ॥ భరితముదాత్ములై విగళబంధనులై నిజమస్తములు కరా। సురరిపుపాదపద్మములు సోఁకగఁ జాగిలి మ్రొక్కి నమ్రులై। కరములు మోడ్చి యోపరమకారుణికోత్తమ సజ్జనార్తిసంహరణ వివేకశీలమహితాశ్రితపోషణ పాపశోషణా॥ గీ॥ వరదపద్మనాభ హరికృష్ణ గోవింద। దాసదుఃఖనాశ వాసుదేవ। యవ్యయాప్రమేయ యనిశంబుగా వింశు। మింక కేశ నీకు వందనములు॥ ఉ॥ ధీరవిచారమమ్ము భవదీయపదాశ్రయులన్ జరాసుతో। దారనిబంధనోగ్రపరితాపము మీ కరుణావలోకనా। సారము చేత నార్చితి విసజ్జనరక్షయు మత్పశిక్షయు। న్నారయ మీకు గార్యములు

జెడపక। వెనుకదీయక. *ప్రకోష్ఠము। మోచేతిక్రిందినుంచి మణికట్టుదాఁకనుండెడు ప్రదేశము.

యాదవవంశపయోధిచంద్రమా॥ సీ॥ అవధరింపుము మాగధాధీశ్వరుండు మాకుం బరమబంధుండు గాని పగరగాండు ప్రకటితరాజ్యవైభవమదాంధీభూతచేతస్కులము మమ్ముం జెప్ప నేల గమనీయజలతరంగములకై వడి దీపశిఖ వోలి చూడ నస్థిరములైన గురుసంపదలు నమ్మి పరసాధనక్రియాగమ మేదినద్బాధకంబులైన బలసి యన్యోన్యవైరానుబంధములను బ్రజలం గారించుచును దుష్టభావచిత్తులగుచు నాసన్నమృత్యుభయంబు నెఱుంగక మత్తులై తిరుగుదురు మర్త్యనుజులంత॥ చ॥ కడపటి సేఁతనైహికసుఖంబులఁ గోల్పడి తీర్థకోర్కిఁ దేవెం బడిఁ బడి యెండమావులఁ బిపాసులు నైసలిలాసఁ దాయుచు నైజమనుజుల్ భవాబ్ధి కరిఁ జేరఁగలేక నశింతురట్టియీ యిడుములఁ బొందఁ జాలము రమేశ త్రిలోకశరణ్య మాధవా॥ ఉ॥ వేదవధూశిరోనుహితవీథులఁ జాలన లంకరించు మీ పాదసరోజయుగ్మము శుభస్థితి మా హృదయంబులందు మనీత్యోదితభక్తి నెందగిలియుండును పాయ మెఱుంగఁ బల్కరా మోదరభక్తమర్త్యవన హేయాదధిరాజ! రణసృష్టికారణా॥ క॥ అని తను శరణము వేఁడిన జననాథుల వలనుఁ జూచి సదమలభక్తావనచరితుఁడు పంకజలోచనుఁ డిట్లను వారితో దయాసహితుండై॥ చ॥ జనపతులార మీ పలుకు సత్యము రాజ్యమదాంధచిత్తులై ఘనముగ విప్రులం బ్రజలఁ గారియఁ బెట్టుటఁ జేసి కాదె వేగ నహుషరావణాసురు లగ్గలము నొందిరి గాన ధర్మపాలనమునఁ గాక నిల్చునె సుతులం బలంబు ధరాయుతున్నతుల్॥ వ॥ అదిగావున మీ మనంబుల దేహంబనిత్యంబ కా దెలిసి॥ ఉ॥ మీరును ధర్మమందగపు మేరయుఁ దప్పక భూజనాళిఁ బెంచి పారుచు సౌఖ్యసంపదలనందఁగఁ బ్రోచుచు భూరియజ్ఞము లక్షారవవృత్తి మత్పరముగా నొనరించుచు మానకాంఘ్రిపం కేరుహముల్ భజించుచు నకిల్బిషులై చరియింపుఁడిమ్ముల॥ వ॥ అట్లైన మీరలు బ్రహ్మసాయుజ్యప్రాప్తులయ్యెదరు మదీయపాదారవిందంబులం దుఁ దగిలింపవలయు భక్తియుఁ గలుగునని యానతిచ్చి యారాజవరుల మంగళస్నానంబులు సేయించి వివిధమణిభూషణమృదులాంబరమాల్యానులేపనంబు లొసంగి భోజనతాంబూలంబులం బరితృప్తులం జేసి యున్నతరథాశ్వసామజాదిరూఢులం గావించి నిజరాజ్యంబులకుఁ బూజ్యులం జేసి యనిచిన॥ క॥ నరవరు లీచందంబున మురసంహరుచేత బంధమోక్షణులై సుస్థిరహర్షంబులతో నిజపురములకుం జనిరి శుభవిభూతిం బర్వ॥ క॥ హరికుంగళగుణకీర్తన నిరతము గావించుచును వినిర్మలనాసులై గురుబంధుపుత్రజాయాపరిజనములరంగఁ గృష్ణుంబక్ష్మదళాక్షు॥ వ॥ అట్లు బహుప్రకారంబులం బొగడుచుం దమతమదేశంబులకుం జనిన॥ క॥ నలినదళలోచనుఁ డుదము దెలిపిన సద్ధర్మపథనిరతపరులై యిలఁ బరిపాలించుచు సుఖమునుండిరి మహిత నిజవిభుత్వములలర॥ వ॥ ఇట్లు కృష్ణుండు జరాసంధవధంబును రాజలోకంబునకు బంధమోక్షణంబును గావించి వాయునందన వాసవనందనులుం దానును జరాసంధతనయుండగు సహదేవుండు సేయు వివిధంబులగు పూజలు గైకొని యతని నుండ నియమించి యచ్చోటుఁ గదలి కతిపయప్రయాణంబుల నింద్రప్రస్థపురంబునకుం జనుదెంచి తద్ద్వారప్రదేశంబున విజయశంఖంబులు పూరించిన ప్రతిపక్షభయదంబును బాంధవప్రమోదంబునునగు నమ్మహాఘోషంబు విని పౌరజనంబులు జరాతనయుమరణంబు నిశ్చయించి సంతసిల్లిరి- వారిజాక్షుండును భీమసేనపార్థులతోఁ బురంబు ప్రవేశించి ధర్మనందనునకు వందనం బాచరించి తా మరిగి యున్న తెఱంగును, నచ్చట జరాసంధుని వధియించిన ప్రకారంబును సవిస్తరంబుగా నెఱింగించిన నతండు విస్మయవికచలోచనంబుల నానందబాష్పంబులు గురియ నమ్మాధవు మాహాత్మ్యంబునకుం దన యెడలి భక్తిస్నేహదయాదిగుణంబులకుం బరితోషంబునొందుచుఁ గృష్ణునిం జూచి యిట్లనియె॥ సీ॥ సకలలోకులు సర్వలోకములకు గురుండవై తేజరిల్లెడు భవదీయమూర్తి యంశాంశసంభవులగు లోకపాలురు నీయాజ్ఞఁ దలమోచి నిఖిలభువనపరిపాలనిపుణులై భాసిల్లుచున్నారలట్టి నీకొక నృపునాజ్ఞ సేయుటరయ నీమాయ గాదె నీకు మే మేకమై యద్వితీయమై యవ్యయంబు నైన నీ తేజమునకొక హాని గలదె విస్మయాకార నీపాద సేవకులకు నాత్మపరభేదబుద్ధియుం

→ శ్రీ ధర్మరాజు చేసెడు రాజసూయయాగంబున శ్రీకృష్ణుండు శిశుపాలుని వధించుట. ←

లైనం గలదె పుండరీకాక్ష గోవిందభువనరక్ష॥ వ॥ అని గోవిందునిం బొగడి యద్దేవుననుమతంబునం గుంతీసుతాగ్రజుండు పరతత్త్వవిజ్ఞానులైన ధరణీసురులను ఋత్విక్కులుగా వరియించి॥ సీ॥ సాత్యవతేయ కశ్యప భరద్వాజోపహూతి విశ్వామిత్ర వీతిహోత్ర మైత్రేయ పైల సుమంతు మధుచ్ఛంద గౌతమ సుమతి భార్గవ వసిష్ఠ వామదేవాకృతవ్రణ కణ్వ జైమిని ధౌమ్య పరాశర పర్వత కవషు లసిత వైశంపాయ నాసురి కశ్యప క్రతు వీరసేన గర్గ త్రికవ్యు ముఖ్యులైన బుధులఁ బ్రముఖులను కృపుండు గాంగేయు కుంభజాంబికేయ విదుర కురుకుమారబంధుకుల వృద్ధ ధార్తరాష్ట్ర సురనరేంద్ర వైశ్య శూద్ర వరుల॥ క॥ రప్పింప వారు హర్షము లుప్పతిల నేగుదెంచి యుచితక్రియలం దప్పక కనుఁగొను మండఁగ నప్పాండవు విధ్యుక్తనియతులై భూమిసురుల్॥ గీ॥ కడఁగి సవనభూమిఁ గనకలాంగలములనర్థి దున్నఁ బాండవాగ్రజునకు నచటఁ దీక్ష జేసి యంచిత స్వర్ణమయో

పకరణములనలోపముగను॥ ఇట్లు నియమంబున సముచితక్రియాకలాపంబులు నడుపుచుండి రప్పుడు॥ క॥ సకలావనీశులిచ్చి
నయకలంకసువర్ణరత్నహయధనవస్త్ర। ప్రకరంబులు మొదలగు కానుకలందుకొన సుయోధనుని నియమించెన్॥ సీ॥ అ
ర్థిజాతము గోరినట్టి వస్తువు లెల్లఁ దగఁ బంచియిడఁగ గాధాతనూజు। సరసాన్నపానాదిసకలపదార్థముల్ పాకము ల్సేయిం
పఁ బవనతనయుఁ। బంకజోదరు నొద్దఁ బాయక పరిచర్యఁ దవిలి కావింప వాసవతనూజు। సవననిమిత్తమై సంచితద్రవ్యము
ల్పెంపుతో వేగఁ దెప్పింప నకులు। దేవగురువృద్ధధాత్రీసురావలులను। నరసి పూజింప సహదేవు నఖిలజనులఁ। బోలుచు కృ
ష్టాన్నగతులఁ దృప్తులను జేయ। ద్రౌపదిఁ దగ నియోగించె ధర్మసుతుఁడు॥ అయ్యవసరంబున॥ చ॥ హరిశిఖిదండపాణినికషా
త్మజపాశిసమీరగుహ్యకే। శ్వరశశిమౌళిపంకరుహసంభవచారణసిద్ధసాధ్యకి। న్నరగరుడోరగామరగణంబులు వచ్చి మ
ఖంబుఁ జూచియ। చ్చెరువడి తొల్లి యెవ్వరును జేయు మఖంబులు నింత యొప్పునే॥ క॥ అదిగాక నిందిరాపతి భువనములు సేవిం
చునట్టి భాగ్యము గలుగన్। పదిఁబడయరాని బహుసంపద లెవ్వియుఁ గలవె యనుచుఁ బ్రస్తుతి సేయన్॥ అప్పుడు॥ వ॥ అపర
సమానుఁడై తనరు యాజకవర్గములోలి రాజసూయ మఖవిధానమంత్రముల నగ్నిముఖంబుగఁ జేసి ధర్మజుం। గ్రమమున
వేలుపింపఁ గ్రతురాజసమాప్తిదినంబున నృపోత్తముఁ డుగడంగి యాజకసదస్యగురుద్విజకోటిఁ బెంపునన్॥ వ॥ పూజిం
చునప్పుడు అగ్రపూజార్హు లెవ్వరని యడిగిన సదస్యులుం దమకుఁ దోఁచిన విధంబులం బలుక వారిభాషణంబులు వారించి వి
వేకశీలుండును, బహువచనకోవిదుండునునగు సహదేవుండు; భగవంతుండును, యదుకులసంభవుండునునైన శ్రీకృష్ణునిం
జూపి యిమ్మహాత్ముని సంతుష్టుం జేసిన భువనంబులన్నియుం బరితుష్టిం బొందునని చెప్పి ధర్మజుం జూచి యిట్లనియె॥ ఉ॥ కాల
ము దేశముం గ్రతువుఁ గర్మముఁ గర్తయు భోక్తయున్ జగ। జ్జాలము దైవముం గురువు సాంఖ్యము మంత్రము యజ్ఞమాహు
తుల్। ల్వేళులు విప్రులుం జననవృద్ధిలయంబులు హేతుభూతముల్। స్త్రీలలఁ దాన యైతగ వెలింగెడి నెక్కటి తేజమీతఁడున్॥ చ॥ ఇ
తఁడె యుతుండు నిస్సలోకయించుక మోడ్చిన నీ చరాచర। స్థితభువనంబులన్నియు నశించు నితండపవిచ్చి చూచిన। న్స్వోతతము
లై జనించుఁ బ్రభవస్థానుఁ డాదిస్థుఁడై నయట్టియీ। కృష్ణ ఫలమున్ గాకరుఁ డొకండెటుల్ గ్రహించు శిష్టపూజకున్॥ ఉ॥ ఈ
పురుషోత్తముం జగదధీశు ననంతు నిసర్వశక్తుఁ జి। క్రూపకు నగ్రపూజఁ బరితోషము సేయ సమస్తలోకముల్। ల్వేపరితుష్టి
బొందుఁ బృథివీవర కావున నీవు కృష్ణునిన్। శ్రీపతిఁ బూజ సేయు మెడ సేయక మాటలు వేయు నేటికిన్॥ క॥ అనిసహదేవుఁడు ప
లికిన। విని యచ్చటి జనులు మునులు భూపులు బుధులు వహ్నులు। న్మనుకొని యానమున మోదము। నను కొగని దిలెస్స యనిరి ధర్మజుం డం
తన్॥ క॥ మునిజనమానసమందిర। వనజాతము లైనయట్టి వారిజపదముల్। చనువున పద్మప్రభలు శొన మొగిఁ గొలిచి తజ్జలంబు
లు భక్తిన్॥ క॥ తానును దమ్ముఁడు సుజులు। మానుగ ప్రపదాత్మజయును మస్తకములఁ బెం। పూని సనియతిఁ ధరించిరి। హా
సంబుం బొందిరది యొప్పెనో మెయిన్॥ క॥ చంచత్కాంచనరుచిరో। కంచితవస్త్రములనూతనార్ఘ్యప్రభల। న్మిండిన గన్న
ములంబూ। డించె ధర్మజుండు కృష్ణు జిష్ణు సహిష్ణున్॥ వ॥ ఇట్లు పూజించి యానందబాష్పజలబిందుసందోహకందళితనయ
నారవిందంబు లంగోపింపనిసుందరాకారంబు వర్ణింపఁ జాలకుండె- నట్లు పూజితుండై తేజరిల్లు పుండరీకాక్షుని రీక్షించి విహ
స్తంబులు నిజమస్తకంబుల ధరించి నుతిసేయుచు నఖిలజనంబులు జయజయశబ్దంబు లిచ్చిరి- దేవతలు వివిధతూర్యఘోషం
బులతో డంబుష్పవర్షంబులు గురియించి రయ్యవసరంబున॥ క॥ దమఘోషసుతుఁడు సద్విభ। వముఁ జూచి సహింపక లుకి వ
ర్రిలఁగాఁ బీఠము డిగ్గి నిలిచి నిజహ। స్తము లెత్తి సనోభయంబు దక్కనవాఁడై॥ వ॥ అప్పుడప్పుండరీకాక్షుండు విను చుండ స
భాసదులం జూచి యిట్లనియె॥ క॥ చాలుఁబురే యహహా యీ। కాలము గడుపంగ రాదె వాఁ గాహంబగునే। తేలాతప్పెను నేఁడీ బా
లకు వచనముల చేతఁ బ్రాజ్ఞుల బుద్ధుల్॥ వ॥ ఇట్లు తప్పిన తెలంగెట్లని నంబాత్రా సాత్రవివేకంబు సేయనేర్చిన విజ్ఞాననిపుణు
లు, మున్నత సత్త్వగుణగరిష్ఠులు, బహువిధతపోవ్రతనియమనిష్ఠులు, ననల్పతేజులు, మహదైశ్వర్యశక్తిధరులుం, బరతత్త్వవే
దులు, సఖిలలోకపూజ్యులు, విగతపాపులుం బరమయోగీంద్రులు నుండ వీరిం గైకొనక వివేకరహితులై గోపాలబాలునిం
బూజ సేయుటకు నెట్లు సమ్మతించిరి- పురోడాశంబు సృగాలంబునకర్హంబగు నేయది యుసుంగాక॥ సీ॥ గురుదేవశూన్యుఁ
డుఁ గులగోత్రరహితుండుఁ దలిదండ్రు లెవ్వరో తడవఁ గాన। నప్పులఁ బొరలెడునాదిమధ్యావసానంబులం దరయ మానంబు
లేమి। బహురూపి యై పెక్కు భంగుల వర్తించు వావివర్తనములు వరుస లేవు। పరికింప విగతసంబంధుండు దలపోయ మానిమి
త్తంబున మానిసయ్యెఁ। బరగ మున్ను యయాతిశాపమునఁ జేసి। వాసి కెక్కఁడు యాదవవంశ మెల్ల। బ్రహ్మతేజంబు నెల్లఁ
గోల్పడిన యతఁడు। బ్రహ్మఋషి సేవ్యుఁ డగునె గోపాలకుండు॥ క॥ జారుఁడు జన్మావధియును। చోరుఁడు ముప్పోకలాడు సు
మహితపూజా। చారక్రియలకు నర్హుఁడె। వారక నితఁడను చునశుభవాక్యస్ఫూర్తిన్॥ చ॥ అనితను గూఱనాడినము రాంత

సఖీజనంబులం బురికొల్పి చల్లించుచు భావగర్భితంబులగు వారి చతురసరసోక్తులకు మందహాసచంద్రికలు ముఖకమలలీలావి
లోకనలక్ష్మిం బ్రోదిసేయం జెలువలరం జనిరివ్విధంబున నిజసామ్రాజ్యవిభవంబు పూజ్యంబుగాన జాతశత్రుండు గంగా
ప్రవాహంబునకరిగి యందు నిజవధూయుక్తుండై శాస్త్రోక్తప్రకారంబున వేదఘోషంబు లెసంగ నవభృథస్నానంబాచ
రించె నా సమయంబున॥ క॥ అనిమిషదుందుభిశుంభత్స్వనములు మీటెం జెలంగె బుష్పవర్షము గురిసెన్। ముని దేవపితృమహీవర।
వినుతుల రవ మెసఁగె నపుడు విమలచరిత్రా॥ క॥ నరులెట్టి పాపులైనను। గరమర్థిని నెద్ది చేసి గతకల్మషులై। చరియింతురట్టి
యవభృథ। సరసిం గంగాపించి రెలమి నఖిలజనంబుల్॥ గీ॥ అంత ధర్మతనయుం డభినవవస్త్రములను। మాలసురభిసుమమాలి
కాను। లేపనములు రత్నదీపితభూషణాళులు దాల్చి వైభవమున నొప్పె॥ అంత నవభృథస్నానానంతరంబున నవ్వలిచను
దెంచి॥ ఉ॥ పాండుతనూభవాగ్రజుఁడు పాండుయశోనిధి దానమానమా। ర్తాండనిభుండు యాజకసదస్యమహీసురయో
గిబంధురాణ్మండలిఁ బూజఁ జేసి బుధమాన్యచరిత్రుఁడు వారికిచ్చె నొం।డొండ దుకూలరత్నకనకోజ్జ్వలభూషణముఖ్యవస్తు
పుల్॥ వ॥ ఇట్లు నారాయణపరాయణులై దేవసమానప్రకాశప్రభావంబుల సకలనరనారీలోకంబులనర్ఘ్యరత్నమయ
భూషణమాల్యానులేపనంబులు ధరియించి పరమానందభరితాత్ములై యొప్పియుండిరంత॥ చ॥ మునిశితభక్తితన్ముఖముఁ జూ
డఁగ వచ్చిన యట్టి దేవతా। ముని ధరణీసురప్రకరభూవరవైశ్యజశూద్రకోటియు। జనపతిచంద్రు చేసిన సత్కృతులం బరి
తోషవిత్తులై। వినయముతోడ ధర్మజుని వీడ్కొని పోవుచు బెక్కుభంగులన్॥ చ॥ హరిచరణాంబుజాతయుగళార్చకులై పె
ను సొంపు పాండుభూ। వరసుతు రాజసూయమఖవైభవమున్నుతియించుచున్నమా। దరమున నాత్మభూములకు దారత నేఁ
గిరి ధర్మసూనుఁడున్। సరసిజనేత్రు నిన్ననుపఁజాలక నుండుమటంచు వేఁడినన్॥ వ॥ ఇట్లు పాండవాగ్రజు ప్రార్థనం గైకొని
దామోదరుండు సర్వయాదవులనుం గుశస్థలికిం బోవంబనిచి కతిపయపరిజనంబులుం దానును నతనికిం బ్రియంబుగాఁ దన్న
గరంబునఁ బ్రమోదంబున నుండెనని చెప్పి మఱియు నిట్లనియె॥ చ॥ జనవర పాండుభూపతనుజాతుఁడు మస్తరతన్మనోర
థాబ్ధిని సరసిరుహాక్షుఁడను తెప్పకతంబున దాఁటి భూరిశో। భనయుతుఁడై మనోరుజలఁ బాసి ముదాత్ముకుఁడై వెలింగెన।
న్వనరుహనాభ దాసజనవర్యులకుం గల వేయసాధ్యముల్॥ అట్టియెడ॥ గీ॥ రాజసూయకాధ్వరప్రభావమునకు। నఖిలజను
లు మోదమందిరపుడు కలుషమానసుండు కులపాంసనుండు సుయో। ధనుఁడొకండు దక్క ధరణినాథ॥ వ॥ అనిన విని శుకయో
గీంద్రునకుఁ బరీక్షిన్నరేంద్రుండిట్లనియె॥ గీ॥ అఖిలజనులకెల్ల నానందజనకమై। యెనయు మఖము గురుకులేశ్వరునకుఁ। గర
మసహ్యమైన కారణమెట్లది। యెఱుఁగఁ బలుకుమదీనసిద్ధచరిత॥ చ॥ అనిన మునీంద్రుఁడిట్లను ధరాధిపుతోఁ గురురాజు పాండు
నం। దనుల దెసన్ననేక దురితంబులు నిచ్చలు సేయుచుండునై। నను నొకనాఁడు పంకరుహనాభదయాపరిలబ్ధసర్వశో। భన
జితదేవనైన్యనరపాలకరాజ్యరమామహత్త్వమై॥ చ॥ వెలయ ననూనసంపదల విశ్రుతకీర్తుల మిన్నుముట్టఁ బెం। పలరిన
పాండుభూపసుతునగ్రజుఁ డంతిపురంబులోనను। జ్జ్వలమణిభూషణాంశురుచిజాలము పర్వఁ బయోజనాభును। తక్క లిక
భజించుచున్న ఘనసుస్థితి భూరిమనోహరాకృతిన్॥ వ॥ ఉండం గనుంగొని యదియునుం గాక లలితాష్టమీశశాంకబింబంబు
లవిడంబించుచు నింద్రనీలరుచినిచయంబు నపహసించు కుటిలకుంతలంబులు నటనంబు సలుపం దనరు నిటలఫలకంబులును,
బుష్పచాపచాపప్రచారంబులయేపు చూపు భ్రూయుగోపాంతమ్ములై సౌదామనీదామరుచిస్తోమంబులై కర్ణాంతసీమంబు
లై యంజనంబులతోడ రంజిల్లు నేత్రకంజంబులును, నవమల్లికాముకుళవిభాసితదంతమరీచికానిచయోద్దీపితమందహాస
చంద్రికాధవళితంబులును, ముకురోపమితంబులును, గర్ణకుండలమణిమరీచిజాలంబులు బెరసి బహుప్రకారంబులం బర్వం
బొలుచు కపోలపాళికలును, విలసితగ్రైవేయకముక్తాఫలహారనిచయంబులకిమ్ము చూపక మిసమిసని పసగల మెఱుంగులుగి
రిగొని మీఁటినం బగులననం బొగడం దగి మొగంబుల ముంబుటంబు లెగయను త్తుంగపీనకుచభారంబులఁ ద్రేఁగులాఁగలేక దూ
గాడుచుం గరతలపరిమేయంబులగు మధ్యభాగంబులును, ఘనజఘనమండలావతీర్ణ కాంచనకాంచీకలాపకింకిణీకలనిన
దోల్లసితంబులుం గల కటిప్రదేశంబులును, పల్లవితహల్లకపల్లవకాంతుల మొల్లంబులఁ గొల్లలుగొని యభిరామంబులై
శోభిల్లు పదపాణితలంబులును, నలసగతులం బదంబులం దనరు మణినూపురంబులు గోపురంబులఁ బ్రతిస్వనంబులొలయ
మొఱయ నలరు చరణారవిందంబులును రత్నవలయకంకణాంగుళీయకాదివివిధభూషణమణిద్యుతినిచయంబులున్నమరీచిక
రనిచయంబుల ధిక్కరింప వెలుంగు కరకంజంబులును మృగమదఘనసారహరిచందనాగరుకుంకుమపంకంబుల భాసురంబు
లగు వాసనలు నాసారంధ్రంబులకు వెక్కసంబులై సోలయ సౌభాగ్యంబులుం గలిగి చైతన్యంబు నొందిన మాణిక్యపుబొ
మ్మలవిధంబుల గగనమండలంబు నిర్గమించి వసుధాతలంబున సంచరించు చంద్రరేఖల చెలువున శృంగారరసంబు మూర్తీ

భవించి జగంబుల మోహపఱచు మోహినీదేవతల చందంబున విలసించు మానవవధూసహస్రంబుల సంగతి సౌదామినీలత యునుం బోలి యొప్పుచుండె ద్రుపదరాజనందనవిభవంబును రాజసూయమహాధ్వరోత్సవంబునుం జూచి చిత్తంబు త్తలపెట్ట సుయోధనుండు సంతాపానలంబున గ్రాగుచుండె నంత నొక్కనాఁడు ధర్మనందనుండు నిర్మలంబగు సభాభవనంబునకుం జని॥ సీ॥ సుతసహోదరపురోహితబాంధవామాత్యపరిచారభటకోటి బలసి కొలువఁ। గలితమాగధమంజుగానంబు పాఠకపఠనరవంబులు ప్రమద మెసఁగఁ। గంకణఝణఝణత్కారంబు శోభిల్ల సరసిజాననలు చామరము లిడఁగ। మయవినిర్మితసభామధ్యంబునను భాసమానసింహాసనాసీనుఁ డగుచు। నమరగణములు గొలువఁ బెంపారు ననిమి। షేంద్రుకైవడి మెఱసి యుపేంద్రుఁ డలర। వరుసఁ గొలువున్నయత్తఱి మరభిమాన। క్రోధమాత్సర్యధనుఁడు సుయోధనుండు॥ ఉ॥ కాంచనరత్నభూషణనికాయము దాల్చి సముజ్జ్వలప్రభో। దంచితమూర్తి నొప్పి ఫణిహారులు ముందటఁ గ్రందుమాయ వా। రింపస హోదరుల్ నృపవరేణ్యులు పార్శ్వములన్ భజింపనే। తెంచెను రాజసంబున యుధిష్ఠిరుపాలికి వైభవోన్నతిన్॥ వ॥ అట్లు చనుదెంచి మయమాయామోహితుండై నసభాస్థలంబునందు॥ క॥ సలిలములు లేనితావున। వలువలు వెస నెగయఁ దిగిచి వారకతోయం। బులుగలచోటను చేలం। బులు వడియఁగఁ బడియె నిజవిభుత్వము దఱుఁగన్॥ క॥ ఆవిధమంతయుఁ గనుఁగొని। పావని నవ్వుటయు నచటి పార్థివులును గాం। తావలియును యమతనయుఁడు। వావిరి చేసన్నఁ దమ్ము వారింపంగన్॥ వ॥ ఇట్లు దామోదరానుమోదితులై మహారావంబుగాఁ బరిహాసంబులు చేసిన సుయోధనుండు చిత్తంబు చిన్నఁబోయి లజ్జావనతవదనుండై కుపితమానసుండగుచు నయ్యెడ నిలువక వెలువడి నిజగజపురంబున కరిగె నయ్యవసరంబున నధిపశాలులైన సభాసదుల గునచ్చటిజనంబుల కోలాహలంబు సంకులంబైన నజాతశత్రుండు చిత్తంబున విన్ననై యుండె నప్పుండరీకాక్షుండు భూభారనివారణకారణుండగుటం జేసి మదోయ్యోధనుని నపయశంబునకుం గావనేఁ డయ్యె నయ్యెడ॥ క॥ హరి ధర్మసుతుని వీడ్కొని। తరుణీహితబంధుజనకదంబము గొలువ। న్సరితోవమునఁ గుశస్థల। పురమునకుం జనియె మోదమున నరనాథా॥ చ॥ జనవరబంధమోక్షణము చైద్యవధంబును పాండురాజనం। దనుమఖరక్షణంబును నుదారతఁ జేసినయట్టి దేవకీ। తనయుచరిత్రభాషణకథాపఠనాత్ములు గాంతు రిష్టశో। భనబహుపుత్రకీర్తులును భవ్యవివేకము విష్ణులోకమున్॥ క॥ అని శుకయోగీంద్రుఁ డమ్మ।

## శ్రీ సాల్వుండు శివప్రసాదంబున సౌభకవిమానంబు వడసి ద్వారకాపురిమీఁదకు దండెత్తుట. శ్రీ

నుజేంద్రునిఁ జూచి పలికె మఱియును శ్రీకృ। ష్ణునియద్భుతకర్మంబులు। వినిపింతుఁ జిత్తగింపు విమలచరిత్రా॥ సీ॥ వసుధేశ వినవయ్య వైదర్భిపరిణయవేళ మద్దశిశుపాలభూమి। వరునకుఁ దోడ్పడ నరుదెంచి సైనికావలితోడఁ దొడరి దోర్బలము మాలి। హరిచేత నిర్జితులైన రాజులలోనఁ జైద్యుని చెలికాఁడు సాల్వధరణి। పతి జరాసంధాదిపార్థివప్రకరంబు వినుచుండ మత్సరానలపిపులశిఖల। ధాత్రి నిటమీఁద వీతయాదవముగాఁగఁ। గడఁగి సేయుదు ననియు రాగ్రహముతోడఁ। బంతములు వలికి యటఁ జని భరితనిష్ఠఁ। దపము గావింపఁ బూని సుస్థలమునందు॥ క॥ ధృతి వదలక యుగ్రస్థితిఁ। బ్రతిదినమును బిడికెడవనిరజము శనముగా। నతినియమముతో నాపశు। పతి శంకరు ఫాలనయను భర్గును మేశున్॥ క॥ చెదరని నిజభక్తి నిద। త్పదపద్మము లాత్మ నిలిపి పాయక నొకయేఁ। డుదితక్రియ భజియించిన। మదనారియు వాని భక్తిమహిమకు వశుఁడై॥ క॥ భోరున బ్రత్యక్షుండై। గోరినవర మేమి యైనఁ గొసరక నిత్తున్। వారక వేఁడుము టన్నను। నారాజతపోధనుండు హరునకుఁ బ్రీతిన్॥ గీ॥ వందనం బాచరించి యానందవికచ। వదనుఁడై కేలుదోయి ఫాలమునఁ జేర్చి। శ్రితదయాకార నన్ను రక్షించెదేని। నెఱుఁగ వినిపింతు విను ముమదీప్సితంబు॥ గీ॥ గరుడగంధర్వయక్షరాక్షససురేంద్ర। వరులచే సాధ్యపడక నావలయు నెడల। నభ్రపథమునకతిగెడు నట్టిమహిత। వాహనము నాకు దయ చేయు వరద యీశ॥ వ॥ అని యభ్యర్థించిన నంబ్రసన్నుండై హరుండు వానికోర్కికనురూపంబైన విమానంబు నిర్మింప మయుని నప్పగించిన నతండును నట్ల చేసి కామగమనంబును నతివిస్తృతంబుగా లోహంబున నిర్మించి సౌభకంబను నామం బిడి సాల్వున కిచ్చిన వాఁడును బరమానందంబునుం బొంది తద్విమానారూఢుండై యాదవపుల వలని పూర్వవైరంబుఁ దలంచి దర్పాంధచేతస్కుండై ద్వారకానగరంబు పైఁ జని నిజసేనాసమేతంబుగాఁ దత్పురంబు వేఢించి॥ సీ॥ సరిమపవనసరోవరములు మాయించి బావులు గలఁచి కూపములు చెరిచి। కోటలు వెసవీటతాటముల్ గావించి పరిఘలు పూడ్చి వప్రములు ద్రొబ్బి। యట్టళ్లు ధరఁ గూల్చి యంత్రముల్దును మాడి కాంచనధ్వజపతాకములు నఱికి। భాసురగోపురప్రాసాదహర్మ్యంబు శాలాంగణములు భస్మములు చేసి। విమలకాంచనరత్నాదివివిధవస్తు। కోటి వెల్లను నందందఁ గొల్లఁబుచ్చి। ప్రజలఁ జెఱఁబెట్టి దొరలను భంగపెట్టి। తఱిమి యిబ్బంగిఁ బెక్కుబాధల నలంచి॥ చ॥ మదమున నంతఁ బోవక విమానయుతంబుగ నభ్రవీథికిన్। గొదగొని నేపు మై మొగసి కొంకక శక్తిశిలామహీరుహ। ప్రదరము లోలి మై గురిసి బంధురభూమిప

రాగశరత్కరల్ । వదలకభల్లుచున్నలయవాయువుచేదిశలావరించుచున్॥ అట్టియెడ॥ క॥ చటులపురత్రయదనుజో।త్కట
ము_స్తరబాధ్యమానధారుణిగతిన।ప్పుటభేదనమంతయతిస్ఫుటపీడం జెందివగలసుడివడుచుండెన్॥ చ॥ కనిభగవంతుఁడుదారర
థిశిఖామణియున్నగురౌక్మిణేయుఁడు। జ్జనములనోడకుండుఁడనిసంగరకౌతుకమొప్పదివ్యసాధనములఁబూనిసైనికకదంబ
ముఁగొల్వనమానమీనకే।తనరుదిగ్రాలనున్నతరథస్థితుఁడై వెడలెన్ రణోర్వికిన్॥ అయ్యవసరంబున॥ చ॥ సమధికబా
హుశౌర్యజితచండవిరోధులుపాఁటనున్నత। తుమగదభానువిందశుకసాత్యకిసారణచారుదేష్ణసాం।బముకురకేతనాత్మజ
శ్వఫల్కతనూభవతత్సహోదర।ప్రముఖయమాత్తముల్విమతభంజనులై కృతవర్మమున్నగన్॥ క॥ వారణవాజిస్యం
దన।వీరభటుల్వేగఁజనిరివిశ్వమువడఁకన్। ఘోరాకృతివివిధాయుధ।భూరివ్యక్తులర్కబింబమున్గబళింపన్॥ వ॥ చనియా
గోవిందనందనస్యందనంబునుంబలసందోహంబునుం దలకడదియమసైన్యంబులు సాల్వబలంబులతోడం దార్కొనిపెర
యునప్పుడు దేవదానవసంకులసమరవిధంబునం దుములంబయ్యెనివ్విధంబున॥ మ॥ వితతజ్యాచయటంకృతుల్మదగజలావి
ర్భూతశుండాలఘీం। కృతులుస్స్ఫుటహుంకృతుల్మహితభేరీభాంకృతుల్భీషణో। ద్ధతనిస్సాణధణంకృతుల్ప్రకటయోధ
వ్రాతసాహంకృతుల్ ।పుతలంబుల్ దివినిండ మ్రోసెరిపుసంక్షోభంబుగా భూవరా॥ మ॥ హరిరింఖారథనేమిసస్ఫుటపద
వ్యాఘట్టనోద్ధూతస। _స్తరధూళీపటలప్రభూతనిబిడధ్వాంతప్రవిధ్వంసకృ। త్ఖరశాతాసిగదాదిహేతిరుచులాకాశం
బునిండెన్ వియ।చ్చరదృష్టుల్మిఱుమిట్లుగొల్పసమరోత్సాహంబుసంధిల్లఁగన్॥ చ॥ తలకొనిసైనికుల్గడచితార్కొనిపేర్కొని
డాసిపాసియం।కిలిగొనకిమ్ములన్ముల్లఁబుగిల్పినొగిల్పితశేతరుత్తలు। ల్నలియఁగనొత్తిమొత్తినయనంబులనంబులురాలఁగీ
లనొ।వలువులలాటముల్పనగదాహతినొంచికలందిపొంచఁగన్॥ అయ్యవసరంబునం బ్రద్యుమ్నుండు గనుంగొని॥ మ॥ అన
యంబున్గలుషించి సౌభపతిమాయాకోట్లు వంచచ్ఛరా। సనినిర్ముక్తనిశాతదివ్యమహితాస్త్రశ్రేణిచేఁదత్క్షణంబునఁదీ
లాగతినభ్రగుల్మనములన్మాపింపమాయించెన।వ్వనజాతాప్తుఁడుభూరిసంతమసమున్వారించుచందంబునన్॥ మఱి
యును॥ చ॥ అతిరథికోత్తముండనుదంచితకాంచనపుంఖపంచవిం।శతివిశిఖంబులన్నతనిసైనికపాలునినొంచియుగ్రుఁడై
శతశతకోటికోటినిభసాయకముల్వరగించిసాల్వభూ।పతికకుదంబునొంచిలయభైరవుకైవడిఁబేర్చివెండియున్॥ చ॥ పది
పదియమ్ములన్మనుజపాలవరేణ్యులనొంచిరోషము।న్నదురగమూఁడుమూఁడుశితకాండములన్రథదంతివాజుల।న్వదియఁగ
నేసియొక్కొకనిశాతశరంబులసైనికావలి।న్మసములడంచియిట్లతఁడమానుషలీలఁబరాక్రమించినన్॥ క॥ దుర్మానవహరు
నచ్యుత।కర్మమునకునుభయసైనికప్రకరంబుల్నిర్మలమతినుతియించిరి।భర్మాచలధైర్యువిగతభయుఁబ్రద్యుమ్నున్॥ అ
య్యవసరంబున॥ ఉ॥ సాంబునిసాల్వభూవిభుఁడుసాయకజాలములేసినొంచిన।జ్జాంబవతీతనూభవుఁడుచాపముసజ్యము
చేసిడాసిసాల్వుంబదియేనుతూపులనవోన్నతవక్షముగాడనేసితీ।వ్రాంబకవింశతిన్నతనిసౌభకమున్బలనాడనేసినన్॥
చ॥ గదుఁడునుసోగ్రవృత్తినిజకార్ముకనిర్గతవిస్ఫురద్విధుం।తుదవదనాభబాణవితతుల్వరగించివిరోధిమస్తముల్గ
మలుగఁద్రుంచియెత్తుచునకుంఠితవిక్రమకేళిలోలుఁడై। చదలసురల్నుతింపరథిసత్తముఁడొప్పె నరేంద్రచంద్రమా॥
ఉ॥ సాత్యకిచండరోషమునసాల్వమహీవరుభూరిసౌభసాం। గత్యచతుర్విధోగ్రబలగాఢతమఃపటలంబుభాసురా।ది
త్యమయూఖపుంజమువిధీవ్రశరంబులమాపిసైనిక।స్తుత్యపరాక్రముప్రకటదోర్బలుఁడై విలసిల్లెభూవరా।ఉత్సాహ॥ భా
నువిందుఁడుద్ధతిన్విపక్షపక్షసైన్యను।గ్మానకానననానలోపమానచండకాండసం।తానమూననేసిచూర్ణితంబుచేసెఁజాప
వి।ద్యానిరూఢిదేవతావితానమిచ్చమెచ్చఁగాన్॥ ఉత్సాహ॥ చారుదేష్ణుఁడాగ్రహించిశత్రుభీషణోగ్రదో।స్సారదర్ప
మేర్పడన్నిశాతబాణకోటిచే।దారుణప్రతాపసాల్వదండనాథమండలి।న్మారిరేఁగినట్లుబిల్కుమార్చిపేర్చియార్చినన్॥
క॥ శుకుఁడాయోధనవిజయో।త్సుకమతిబాహాబలంబుసొప్పడవిశిఖ।ప్రకరంబులఁదనుశౌర్యా।ధికుఁడనవిద్వేషబలతతిం
బరిమార్చెన్॥ ఉ॥ సారణుఁడేపుమైఁగదిసిశాత్రవవీరులుసందడింపవో।స్సారమెలర్పఁగుంతశరశక్తిగదాక్షురికాదిహే
తుల। న్వారకవాజిదంతిరథవర్గములందునుమాడికాల్వురం। న్వీరముతోడఁబంపెజముపీటికిఁగాపురముగ్రమూర్తియై॥
క॥ అక్రూరుఁడుదనుజులునవక్రపరాక్రమమునుమెఱసివైరులబాహా।విక్రమమునవధియించిరి।చక్రప్రాసాదివివిధసా
ధనములచేన్॥ మ॥ కృతవర్మక్షితినాయకుండువిశిఖశ్రేణింబ్రమత్తార్యధి।శ్రితవర్మంబులఁజించిమేనులశతచ్ఛిద్రంబుల
న్జేయన।ద్భుతకర్మంబనిసైనికుల్పొగడశత్రుల్డాఁబుచోసంగర।క్షితిధర్మంబుఁదలంచికాచెరథికశ్రేష్ఠుండుభూమీశ్వరా॥
వ॥ అత్తఱిసాల్వుండుగోపోద్దీపితమానసుండై యుండమాయావిడంబకంబైనసౌభకంబప్పుడు॥ సీ॥ ఒకమాటునభమునఁ
బ్రకటంబుగాఁదోఁచునొకమాటుధరణిపైనెనరనిలుచు।నొకమాటుశైలమస్తకమునవర్తించుమొకమాటుజలధిచరియించును

పధివములు నొక్కతోయంబున నొక్కటియై యుండు నొక్కెడఁ గనుఁగొనఁ బెక్కులగును। నొక్కమాటు సాల్వసంయుక్తమై పొడసూపు నొక్కతో యదృశ్యమై యునుడిగి తోఁచు। నొక్కతేపఁ గొఱవియై యురుగకఁ ద్రిప్పిన। గతిమహామాయాప్రవృత్తిగా నవచ్చు। మఱియుఁ బెక్కుగతుల నరివరుల్ లలఁగంగఁ। దిరిగె సౌభకంబు ధీవరేణ్య॥ వ॥ ఇవ్విధంబున సౌభకంబు వర్తించుటం జేసి యదుసైన్యంబుల చేతం దైన్యంబు నొందిన నిజసైన్యంబులకు నలంబు రికొల్పి సాల్వుం డప్పుడు॥ క॥ స్ఫురదనలాభ శరంబులు। పొరిపొరిఁ బుంఖానుపుంఖములుగా నేయ। న్దెరలి యదువీరులు మురిసియు। విరిసియుఁ బెఱుతి వకపోరె వెసయదుబలముల్॥ క॥ అయ్యెడ మానము వదలక। దయ్యుకముగ పాటితో దృఢంబుగఁ బోర। న్దయ్యు మెఱుంగును మొక్కటి। కయ్యంబపు డయ్యెఁ బేసుగల యోధులకున్॥ క॥ మును ప్రద్యుమ్నకుమారుని। ఘననిశితాస్త్రముల చేతఁ గడు నొచ్చిన సా। ల్వునిమంత్రి ద్యుమనాముఁడు। సునిశిత గద చేన మర్చె సుమహితశక్తిన్॥ చ॥ వెరవును లావు చేవయును వీరము బీరముగల్గి డాసి యా। సరసిజనాభనందనుని శాలభుజాంతరమున్ వగిల్చిన। న్వీరవరుఁ బోవమేను నిసువెంద్రుకఁ బెట్టఁగఁ జేఁటిసాధనమో। త్కరములు దేరిపైనఁ దలఁగన్నులు మూయుచు మూర్ఛ నొందినన్॥ గీ॥ సమరధర్మ వేది సమధిక నయవాది। దారకుని సుతుండు ధైర్యయుతుఁడు। రథమువోలిగొను చరణభూమి వెడలి వే। చని మూర్ఛదేరి శంబరారి॥ ఉ॥ సారథిఁ జూచి యిట్లనియె శౌర్యవిదూరులు మూదినవ్వఁగాఁ। దేసుదఱిక్షితిన్ వెడలఁ దెచ్చితి దెచ్చితి మర్త్యశంబుపై। కేరుహనాభుఁ డున్ హలియుఁ గేలిగొనన్ యదువంశసంభవుల్। వీరముఁ దప్పియిప్పగిదిఁ జెల్లు రిపోవుదు రే రణంబునన్॥ అనిన నతం డతనికిట్లనియె॥ క॥ రథిరిపుచే నొచ్చిన సా। రథి యతని సారథియును నొవ్వ రథియును గావ। న్పృథుసమరధర్మ మిది కన। వ్యథచిత్తుఁ డవగుచుఁ గడఁగు వైరుల గెలువన్॥ అనినవిని॥ ఉ॥ నందిత భూరిబాహుబలశౌర్యుఁడు సారథి మాట కాత్మ మో। దించి యుదాత్తకాండరుచి దీపితచాపముఁ దాల్చి మార్వి సా। రించి గుణధ్వని స్మహదరిప్రకరంబుల భీతిముంచి తో। లించెరథంబు మేదిని చలింపఁగ నా ద్యుమనిమీఁద నేర్పునన్॥ అట్లు డగ్గరి॥ చ॥ అరితనువత్త బాణముల నాగ్రహవృత్తిఁ బగిల్చె నాల్గిటన్। తురగములన్ వధించి యొకతూపున సారథిఁ ద్రుంచి రెంటని। స్ఫురతరకేతు చాపములు చూర్ణము జేసి యొకమ్మునన్ ద్యుయం। కరముగఁ ద్రుంచెనద్ద్యుమని కంఠము కుంఠితవిక్రమోద్ధతిన్॥ మ॥ కని సాంబప్రముఖాది యోధవరులుత్కంఠాత్ములై మానకే। తనుసగ్గించి సువర్ణపుంఖనిశితాస్త్రశ్రేణి సంధించి సా। ల్వుని సైన్యావళి మస్తముల్ వెరపుతావుల్నేర్పడన్ నొక్కయొ। త్తున వేత్రుంచిరి తాటిపండ్లు ధరఁ దొర్లోరాల్చు చందంబునన్॥ అట్టియెడ॥ స్రగ్ధర॥ కూలు స్థూలాంబులేనుంగులు ధర దొరఁగు స్తంభములైనుగ్గునూచై। వ్రాలున్ జేరుల్ హతింగై వడిఁ బడు సుభటవ్రాతముల్ శోణితంబు। ల్గ్రోలు ల్మాంసంబు నంజుల్గొఱుకు నెముకలన్గుంపులై సోలుమన్నే। తాళక్రవ్యాదభూతోత్కరములుడతలై తాళము ల్బట్టియాడున్॥ మఱియు నొక్కొక్కయెడ॥ సీ॥ ఖండితశుండాల గండశైలమ్మున క్రముఖ్యా రిటుండంబులు భుజగసమితి పటలంబులుగ చ్ఛపంబులు దంతముల్ కూర్మముల్ కుంభనిర్ముక్త మౌక్తికములు రత్నములు వాలములు జలూకములైమడలు భేకంబులు మెదడు రొంపి। ఛత్రములు పవడంపు దీవలు నరములు నాచుమజ్జంబు ఫేనంబులట్టి। సైకతము లురక్తచయము తోయంబులు। పొరలు నెడల నొరలు మొఱలు ఘనత। రంగరవము గాగ మాతంగజా యోధన। స్థలము జలధిఁ బోల్పఁ దగెన రేంద్ర॥ వ॥ ఇవ్విధంబున యదుసాల్వబలంబులు చలంబునం బరస్పరజయకాంక్షులం దలపడి పోరు పూర్వపశ్చిమసముద్రంబుల సరణిఁ బిరువదియేడు దినంబులతి ఘోరంబుగాఁ బోరు నెడ నింద్రప్రస్థపురంబుననుండి ద్వారకానగరంబునకు నగధరుండు చనుదేర ముందఱంగాన వచ్చు దుర్నిమిత్తంబులు గైకొని కృష్ణుండు దారకునిం జూచి యిట్లనియె॥ శా॥ కంటే దారక దుర్నిమిత్తముల నేకంబు ల్మహాభీలము। ల్మింట న్మేదినిఁ దోఁచుచున్న యవి నెమ్మిన్ఖాండవప్రస్థమే। నుంటన్ జైద్యహితక్షితీశ్వరులు మాయోపాయులై పుత్తురి। న్నెంటింపన్ జను దేరఁ బోలు మగుడుపోనీ తేరు వేగంబునన్॥ వ॥ అని యతిత్వరితగతిం జనుదెంచి తత్పురంబు డగ్గఱి మహాబల పరాక్రమంబుల ప్రతిపక్షబలంబులతో డందలపడి పోరు యదుబలంబులును, నభోవీథిని భేద్యమాయాపడంబకంబునం బ్రతివీరులెంత కాలంబున కేయుపాయంబున సాధింపరాని సౌభకవిమానంబునందున్న సాల్వునిం గనిదివ్యమానంబు డాయుండన తేరుదోలసారథిని నియమించి కదియం జనుమురాంతకుని వీక్షించి యదుబలప్రకరంబులు పరమానందంబునుం బొందిరి-హృతప్రాయంబై యున్న సైన్యంబుగనుంగొని సౌభకపతి విక్రమ క్రియాకలాపుండగుచు న్మరువడించి॥ చ॥ మిఱుగుఱులెల్లెడం జెదర మింటను మంటలు వట్టఘుంటికా। ఘణఘణభూరినిస్వనని కాయము సన్నహారిదంతరాళములై నకమహోగ్రశక్తిఁ గొని వారకదారకునిమీఁద వైవదా। రుణగతిం గినింగిం దిండిని జరోచులతోఁ బడుచుకక్కైవడిన్॥ క॥ వడిఁ జనుదేరఁ గఁ గని యప్పుడ గధరుండతులలీలతో లెద్దాని। న్బొడిపొడియై ధరఁ దొరుఁగఁగ। నడుమున వెసఁ ద్రుంచె నొక్కనారాచమునన్॥ చ॥ గురుభుజుఁడంతఁ జూవకయకుంఠితశూరత శత్రుసైన్యము। ల్దెరలఁగను గ్రతన్గొఱవిఁ ద్రిప్పిన

కై వడిమింటఁ దిర్దిరఁ దిరుగుచు మఱి నిరీక్ష్యమగు దీపిత సౌభకు సాల్వుఁ జండబా। స్కరకిరణాభ షోడశ నిశాతశరంబుల గాఢ
నేసినన్॥ చ॥ కసవడి వల్గి వాఁడు నిజకార్ముకమున్ జలదస్వనంబుగా। వడి మొఱయించుచు న్వెడఁద వాతిశరంబులఁ బద్మ
లోచను। న్నెడమభుజంబు గాఢవడి నేసెఁ దెంపఱి చేతి శార్ఙ్గము। న్విడి చెర థంబు పై గగనవీథి సురల్భయమంది చూడఁగన్॥
క॥ ఓ హో యసిభూతావలు। లాహాకారములు సేయ నంతటఁ దేర। న్నాహరిఁ గనుఁగొని యతఁడు। త్సాహంబునఁ బలికె
బాహుశౌర్యస్ఫూర్తిన్॥ చ॥ నలినదళాక్ష సత్సఖుఁడు నాఁదగు చైద్యుఁడు గోరి నట్టి కో। మలినవినీతి వై తగవుమాలి వరించి
తివంతఁ బోక దో। ర్బలమున ధర్మనందను సభాస్థలి నేమఱియున్నవాని న। చ్ఛలమునఁ జంపినట్టి కలుషంబులు నేఁడు రణాంగ
ణంబునన్॥ క॥ తల చెడి పాఱక బాహా। బల మొప్పఁగ నా దృష్టిపథమున ధృతితో। నిలిచిన నిష్ఠురవిశిఖా। ప్పలముం దిమదీయ
సఖుని సూడిటు దీర్తున్॥ చ॥ అనిన మురాంతకుండు దరహాసము మోమునఁ దొంగలింప సా। ల్వునిఁ గని యోరి లావులగు పున్న
లపోటరి వోలెఁ బ్రేలెదే। మనినను పాటు సన్నిహితమాట యెఱుంగవు మూఢ దిత్తపా। మ్మని గదఁ గేలఁ ద్రిప్పి యభియాతు నిశ
త్రుఁ నిగ్రవేసె సద్ధగన్॥ అట్లు వేసిన॥ క॥ పెనుమూర్ఛ నొంది వెసము। కున వాతను నెత్తురొల్కఁ గొంతవడికి నొ। య్యనఁ దెలి
సి నిలువరింపక। చని వాఁడు నదృశ్యమయ్యె సౌభము దాసున్॥ అయ్యవసరంబున॥ గీ॥ గగనమందుండి యొకఁ డార్తుఁడగుచు
వచ్చి। నందనందను పాదారవిందములకు। వందనము చేసి యానకదుందుభి నిమ। హోగ్రుఁడై పట్టి తెచ్చె సాల్వుండు గడఁ
గి॥ గీ॥ దేవ మీ కెఱిఁగింపఁ గాఁ దివిరి యిటకు। దేవకీదేవి నన్నుఁ బుత్తెంచె ననఁగ। విని సరోరుహనాభుండు ఘనవిషాద। మగ్నుఁ
డయ్యెను గురుమీఁది మమతఁ జేసి॥ క॥ నరగంధర్వసురాసుర। వరులకు నిర్జింపరాని వాఁడు బలుండే। మఱి కనహీనబలుని చేఁ బ
రికింపఁగ నెట్లు పట్టుఁబడె నొకో యనుచున్॥ మఱియును॥ క॥ భావంబు గలఁగ నహహా। దైవకృతం బెవ్వరికిని దప్పింపఁగరా।
దే విధి నైన నను ననిశో। కావిల మతిఁ బలుకుచున్న నత్తఱి వాఁడున్॥ వ॥ అప్పుడు దనమాయాబలంబున గ్రమ్మఱం దోఁచి కృతక
వసుదేవునిం గల్పించి యతని బంధించి కొని తెచ్చి పుండరీకాక్షు నిరీక్షించి భవజ్జనకుండు వీఁడె యిప్పుడు నీవు గనుంగొన వీని
తలఁ ద్రుంతు నింక నెవ్వనికిం గాచనియెదు కావంగల శక్తి గలదేని యతనిం గావుమని దురాలాపంబు లాడుచు మృత్యుజి
హ్వాకరాళంబైన కరవాలంబు కేలం బూని ఝళిపించుచు నమ్మాయావసుదేవుని శిరంబు దునిమి తన్మస్తకంబు గొని వియద్వ
ర్తియై చరియించు సౌభక విమానంబు సొచ్చె నంత గోవిందుండు గొంతతడవు మనంబున ఘనంబగు శోకంబునం గుందుచుండి
యాత్మసైనికులు దెలుపం దెలివొంది యది మాయోద్దీపితంబైన సాల్వుని యుపాయంబని యెఱింగి యుండె నంతం దనకు వ
సుదేవుండు పట్టుఁబడెనని చెప్పిన దూతయు నమ్మాయాకళేబరంబును క్షణంబ విచిత్రంబుగా మాయంబై పోయెఁ దదనంత
రంబ॥ క॥ ముసలపుమ గొంచ అచటికిఁ। జనుదెంచి విమోహితుఁడైన జలజాతాక్షు। న్గనుఁగొని సమధికభక్తి। న్వినయంబునఁ బ
లికి రంత విష్ణున్ జిష్ణున్॥ సీ॥ కమలాక్ష సర్వలోకములందు సర్వమానవులు సంసార నానావిధైక। దుఃఖాబ్ధిమగ్నులై తుదిఁ
జేర నేరక వికలత్వమునఁ బొందు వేళ నిన్నుఁ దలఁచి దుఃఖంబులు దరియింతు రట్టి సద్గుణనిధి వై దేవకోటి కెల్లఁ బట్టుకొమ్మై పర
బ్రహ్మాఖ్యఁ బొగడొంది పరమయోగీశ్వర ప్రకరగాఢ। పరచిదానందదివ్యరూపమున వెలుఁగు। దనఘ నీ వేడ నీ చజన్మాత్మజని
త ఘనభయస్నేహమోహశోకంబు లేడ। ననుచు సంస్తుతి చేసి వారఱిగి రంత॥ చ॥ హరి తనమీఁద ఘోరనిశితాశుగజాలము
లేయు సాల్వభూ। వరు వధియింపఁ గోరి బహువారిదనిర్గతభూరివృష్టి వి। స్ఫురణ ననూనతీవ్రశరపుంజములన్ గగనంబుఁ గప్పి
క్రొ। చ్చరరిపుమాళిరత్నము నుజాపము వర్మముఁ ద్రుంచి వెండియున్॥ మ॥ వితతక్రోధము తోడఁ గృష్ణుఁడు జగద్విఖ్యాతశౌ
ర్యక్రియో। ద్ధతశక్తి న్వడిఁ ద్రిప్పి మింట మెఱుఁగుల్ దట్టంబుగాఁ బర్వను। గ్రతచంచద్గద వై చి త్రుంచె వెసఁ జూర్ణంబై ధరన్
రాలనా। యతభూరిత్రిపురాభము న్మహితమాయాశోభము న్సౌభమున్॥ వ॥ ఇట్లు కృష్ణుండు మ్మాయావిమానంబగు మయ
నిర్మితమాయావిమానంబు నిజగదాహతి నింతింతతునియలై సముద్రమధ్యంబునం దొరుంగఁ జేసిన సాల్వుండు కోఱలు వెఱి
కిన భుజగంబు భంగి గండడంగి విన్ననై విగతమాయాబలుండయ్యును బొలివోవని బీరంబున వసుధాతలంబున కుడిగ్గి యాగ్ర
హంబున॥ క॥ కరమునఁ బవినిభమగు ఖ। ర గద ధరియించి కదియఁ గాఁ జనుదేర। న్మురహరుఁడు గ్ధతి సాల్వుని। కరము గదాయు
క్తముగను ఖండించెన్నృపా॥ క॥ అంతం బోవనికి నుకన। నంతుఁడు విలయార్కమండలాయతరుచిదు। ర్దాంతంబగు చక్రంబు
ని। తాంతంబుగఁ బూన్చి సాల్వధరణిపుమీఁదన్॥ క॥ గురుశక్తివై చి వెస భా। సురకుండలమకుటరత్నశోభితమగు త। చ్ఛిరము

## శ్రీకృష్ణుండు దంతవక్త్రుని సంహరించుట.

వడిఁ ద్రుంచె నింద్రుఁడు। వరకులిశముచేత వృత్రు వధియించు క్రియన్॥ వ॥ ఇట్లు మాయావి యైన సాల్వుండును సౌభకంబు
ను గృష్ణుచేతం బొలియుటఁ గనుంగొని నిజసఖులగు సాల్వపౌండ్రకశిశుపాలభూపాలకులకుఁ బరలోకమైత్రి వాటించి దం

తవక్త్రుండతిభీషణాకారంబుతో నప్పుడు॥ చ॥ పెటపెటఁ బండ్లు గీఁటుచును బెట్టుగ గ్రమ్మొయుచుఁ గన్నుఁ గ్రేవలన్ జిటచిటవి
స్ఫులింగములు చిందఁగ హుంకృతి పాదఘట్టనన్ నటనటనై ధరిత్రి వడకాడ వడిన్ గదఁ గేలఁ ద్రిప్పుచున్ మిటమిటనుండు వేస
వినిమించు దివాకరుఁ బోలి యుగ్రతన్॥ చ॥ వడిఁ జనుదేరఁ జూచి యదువల్లభుఁ డుల్లము పల్లవింపఁ దప్పడు గదఁ గేలఁ బూని రథ
మున్రయ మొప్పఁగ డిగ్గి యుగ్రతన్ నడఁగి విరోధికిన్నెదురుగాఁ జన వాఁడతినీచవర్తనుండై యడరుచు నట్టహాసముఖుఁడై వ
లచేఁ గదఁ ద్రిప్పుచున్ హరిన్॥ వ॥ కనుంగొని పరిహాసోక్తులు గా నిట్లనియె నీవు మదీయభాగ్యంబు కతంబునం జేసి నేఁడు నా
దృష్టిపథంబునకు గోచరుండవైతివి మిత్రద్రోహివై ననిన్ను మాతులేయుండవని యున్నింపక దేహంబునందు వర్తించు ను
గ్రవ్యాధిని యౌషధాదిక్రియల నివర్తింపం జేయు చికిత్సకుని చందంబున బంధురూపశత్రుండవు గావున దంభోళిసంరం
భగంభీరంబైన మదీయ గదాదండహతిం బరేతనివాసంబునకనిచి మున్ను నీచేత నిహతులైన నామసఖుల ఋణంబుఁ దీర్తు
ననిమర్ఘాషలాడుచు డగ్గరి॥ చ॥ పెనుగదఁ బూన్చి కృష్ణు తలఁ బెట్టుగ మొత్తిన నంకుశాహతిన్న నలెడి గంధసింధురము కైవడి
దానవభంజనుండు పెంపున నిజభాసమాన గదఁ బూని బలంబునఁ ద్రిప్పి దంతవక్త్రుని యురమున్ బగిల్చిన గుడుల్కొనుచున్ రు
ధిరంబు గ్రక్కుచున్॥ వ॥ తత్క్షణంబ పర్వతాకారంబగు దేహంబుతో *నొఱలుచు నేలం గూలి కేశపాశంబులు చిక్కులువ
డం దన్నుకొనుచుఁ బ్రాణంబులు విడిచె నప్పుడు నిఖిలభూతంబులు నాశ్చర్యంబు నొందుచుండ దద్గాత్రంబున నుండి యొక్క యతి
సూక్ష్మతేజంబు వెలువడి గోవిందుని దేహంబు ప్రవేశించె నయ్యవసరంబున నగ్రజు మరణంబు గనుంగొని కుపితుండై కనుం
గవలం నిప్పులుప్పతిల్ల విదూరథుండు కాలానలజ్వాలాభీలకరాళంబై వ్రాలు కరవాలంబును బలుకయుం గేలం దాల్చి దామో
దరుం జెనకుం గవయుటయుం గనుంగొని॥ చ॥ జలరుహలోచనుండు నిజసాధనమై తనరారు చక్రము న్వలనుగఁ బూన్చి వైవన
దివారకవాసి శిరంబుఁ ద్రుంచెన్ బ్బలియుఁడు సౌభసాల్వశిశుపాలసహోదరదంతవక్త్రసోదరా। దుల వధించి తత్కృతుల
ము వారిన నేసుల ద్రుంచె నీగతిన్॥ అయ్యవసరంబున॥ క॥ నరముని యోగి సురాసుర। గరుడోరగసిద్ధసాధ్యగంధర్వనభశ్చర
కిన్నరకింపురుషులు హరి నిమహిమనుతించిరమ్మితానందములన్॥ వ॥ మఱియు నప్సరోజనంబులు నృత్యంబులు సలుప వేల్పులు
సుమవర్షంబులు గురియ దేవతూర్యంబుల వార్యంబులై మ్రోయ యదువృష్ణిప్రవరులు సేవింప బహుమానానందంబునుం
బొంది నిజవిజయాంకితంబులైన గీతంబులు వందిజనంబులు సంకీర్తనంబు సేయ నలినోదరవిభవాభిరామంబును నూత
నాలంకారయుక్తంబైన ద్వారకానగరంబు శుభముహూర్తంబునం బ్రవేశింపం జనునెడ॥ క॥ పురసతులు విరులు లాజ
లు। గురు సౌధాగ్రముల నుండి కురియఁగ వికచాంబురుహాక్షుండంతఃపుర। వరమందిరం జొచ్చె వైభవంబలరారన్॥ వ॥ అట్లు
యోగీశ్వరేశ్వరుండును, షడ్గుణైశ్వర్యసంపన్నుండును, నఖిలజగదీశ్వరుండును నైన పురుషోత్తముండు సుఖంబున నుండె
నంత॥

## బలరాముండు తీర్థయాత్రకుం జనుట.

క॥ కౌరవపాండవవృషభుల। కారంభ మెఱింగి తీర్థయాత్ర నెపముగా। సీరాంకుఁ డుభయకులులకు। నారయ సముఁడగుటం
జేసి యరిగె నరేంద్రా॥ వ॥ అట్లు చని మొదలం బ్రభాసతీర్థంబున నవగాహనంబు చేసి, యందు దేవర్షిపితృతర్పణంబులు సం
ప్రీతిం గావించి విమలతేజోధనులగు భూసురప్రవరులు తనతో నరుగుదేరం గదలి చని క్రమంబున సరస్వతియు, బిందుసరో
వరంబును, వజ్రతీర్థంబును, విశాలానదియు, సరయువు, యమునయు, జాహ్నవియును గనుంగొనుచు, నచటనచట నవగా
హనంబులును, దేవర్షిపితృతర్పణంబులును, బ్రాహ్మణసంతర్పణంబులును, భూసురయుక్తుండై నడుపుచుం జని సకలలోక
స్తుత్యంబును, నిఖిలమునిశరణ్యంబును నగు నైమిశారణ్యంబు సొచ్చి యందు దీర్ఘసత్రంబు నడుపుచున్న మునిజనంబులం గనుం
గొనిన, వారలు ప్రత్యుత్థానంబు చేసి రామునకు వినతులై యాసనార్ఘ్యాదిపూజావిధానంబులు గావించిన నతండును బ్ర
ముదితమానసుండగుచు సపరివారంబుగాఁ గూర్చున్నయెడ॥ క॥ ఆ నెఱిఁ దనుఁ గని ప్రత్యు। త్థాననమస్కారవిధులు దగనడపక
పెం। పూని సపీఠము పైనా। సీనుండగు సూతు శేముషీవిఖ్యాతున్॥ వ॥ అట్లున్న యతని సమీపంబున నున్న విప్రవరులం జూచి
రాముండు రోషించి, వీఁడు నన్నుం గని లేవకుండుటకు హేతు వెయ్యది యొకో, యీ ప్రతిలోమజాతుండు మునిగణసభాస్థ
లంబునం దానెక్క ముఖ్యుండు వోలె నురభిమానంబున శక్తిమను మునివలనం గొన్ని కథలు గాథలు గాఁగ విద్వద్గణ్యు
నివిధంబున విఱ్ఱవీగెడు నిట్టి నీచాత్ముం డభ్యసించు విద్యలెల్లను మనంబున విచారించి చూచిన మదకారణంబులు గాని సత్వగు
ణగరిష్ఠంబులు గావు - ధర్మసంరక్షణంబు సేయ నవతరించిన మాకు నిట్టి దుష్టమర్దనం బవశ్యకర్తవ్యంబని తలంచి హస్తంబున
ధరించిన కుశాగ్రంబున నా సూతుని వధించిన నక్కడి మునీంద్రులెల్ల హాహాకారంబులతో దండాలాంకునిం జూచి యిట్లనిరి॥
క॥ అనఘా యితనికి బ్రహ్మా। సనమిచ్చుట సేసి నీవు చను దేనితఁడా। సనముడిగఁ డయ్యె నింతయు। మునునీమది నెఱుఁగనర్థ

• ఒఱలుచున్ ।శోకించుచు.

రామేశ్వరుం దర్శించి, తామ్రపర్ణికిం జని మలయాచలం బెక్కి యగస్త్యునిం గని నమస్కరించి, దక్షిణసముద్రంబు దర్శించి కన్యాఖ్య యగు దుర్గాదేవిని నుపాసించి, పంచాప్సరసంబను తీర్థంబున నుపస్పర్శంబాచరించి, గోకర్ణంబున నిందుమౌళిని దర్శించి ద్వీపవతి యైన కామదేవి నిరీక్షించి, దాఁటి పయోష్ణి నిదర్శించి, నిర్వింధ్యం గడచి, దండకావనంబున కఱిగి, మాహిష్మతీపురంబు నవసియించి, మనుతీర్థంబునం దాడి, క్రమ్మఱం బ్రభాసతీర్థంబునకు వచ్చి యచ్చటి బ్రాహ్మణజనంబుల వలనం బాండవధార్తరాష్ట్రభండనంబునం దుసకలరాజలోకంబులుం బరలోకగతులగుటయు వాయునందనసుయోధనులు గదాయుద్ధసన్నద్ధులగుటయు నెఱింగి వారల వారించు తలంపున నచ్చటికిం జని॥ గీ॥ ధర్మనందనుఁ డనకుం వదనము సేయ। కృష్ణులను మాద్రిసుతుల నీక్షించి యేమి। వలుకక కరగ్రగదాదండపాణులగుచుఁ। గ్రోధమునఁ బొంగు భీమదుర్యోధనులను॥ చూచి వారల డాయంజని యిట్లనియె॥ సీ॥ వీరపుంగవులార వినుఁడు మీలోపల భూరిభుజాసత్త్వమున నొకండు। ప్రకటితాభ్యాససంపద్విశేషంబున నొకండునధికుండై యుండుటం జేసి। సమబలులుం టు గానఁ జర్చింపఁగా నిం దు జయ మొకనికి లేమ సమరమందుఁ। గాన నూఱక పోరఁగా నేల మీకు నివారింపన న్యోన్యవైరములను। నడరి తొల్లింటి మర్త్యభాషలాత్మలందుఁ। దలఁచి తద్భాషణము లుపథ్యములు గాక। మొక్కలంబునఁ బోర నాముష్టి కాను। రారి వీక్షించి పిరిశుభాశుభములు॥ వ॥ ఎల్లు గావలయు నట్లయ్యెడుం గాక యని యచ్చోట నిలువక నుగ్రసేనాదిబంధుప్రకరంబులు పరితోషంబున నెదుర్కొన ద్వారకాపురంబు సొచ్చి యందుండి మగుడి నైమిశారణ్యంబునకుం జని యమ్మునిపుంగవులను మఖింపనచ్చోట నొక్క మఖంబు గావించి బహుదక్షిణలొసంగి యందిత జ్ఞాన పరిపూర్ణులగు నట్లుగా వరంబిచ్చి రేవతియునుం దానును బంధుజ్ఞాతియుతంబుగా నవభృథస్నానంబాచరించి యనంతరంబ. చ॥ విలసితమాల్యచందననవీనవిభూషణరత్నవస్త్రము। ల్వొలుపుగఁ దాల్చి యంచితవిభూతిఁ దలిర్చెను బూర్ణచంద్రికా। కలితసుధాంశులేఖ మెసకం బెసఁగన్ నిజబంధులోచనో। త్పలచయముల్ల సిల్లఁ బరిపాండురచారుయశోవిలాసుఁడై॥ వ॥ ఇవ్విధంబున ననంతుండు, నప్రమేయుండు, మాయామానుషవిగ్రహుండు, ననంతబలశాలియు నైన బలదేవుం డతివిభవంబున నిజపురంబు ప్రవేశించి సుఖంబున నుండె నని చెప్పి వెండియు నిట్లనియె॥ క॥ హలధరుఁ డమర్త్యచరితుం। డలఘుభుజాబలుఁ

## శ్రీ కుచేలోపాఖ్యానము. శ్రీ

డొనర్చు నమ్మితకర్మం। బులు పెక్కు నాల్గు మొగములు। గల మేటియు లెక్కవెట్టఁగలఁ డె నరేంద్రా॥ చ॥ అవినమునీంద్రుఁ గౌనిధరాధిపుఁ డిట్లను బ్రహ్మపత్రలో। చనునియనంతవీర్యగుణసంపద వేమఱు విన్న నైనను। న్దనియదు చిత్తమచ్యుతకథావిభవంబొకమాటు వీనుల। న్వినిన మనోజపుష్పశరవిద్ధుఁడు నైన విరాళినొందఁడే॥ అదియునుం గాక॥ చ॥ హరిభజియించు హస్తములు హస్తములచ్యుతుఁ గోరి మ్రొక్కుతచ్ఛిరము శిరంబు చక్రధరుఁ జేరిన చిత్తము చిత్తమిందిరా। వరుఁ గను దృష్టి దృష్టి మురవైరిను తించిన వాణి వాణి యా। సురుకథలాను కర్ణములు గర్ణములై విలసిల్లుఁ బో భువిక్॥ క॥ హరిపాదతీర్థసేవా। పరుఁడై విలసిల్లునట్టి భాగవతుని విస్ఫురితాంగములంగములా। పరమేశ్వరు నెఱుఁగ నాకుఁ బలుకు మునీంద్రా॥ సీ॥ అనుడు వేదవ్యాసతనయుఁ డాయభిమన్యుతనయునిఁ జూచి యిట్లనియెఁ బ్రీతి। జనవర గోవిందసఖుఁడు కుచేలుండు నానొప్పు విప్రుండు మానధనుఁడు। విజ్ఞానరాగాదివిరహితస్వాంతుండు శాంతుండు ధర్మవత్సలుఁడు ఘనుఁడు। విజితేంద్రియుఁడు బ్రహ్మవేత్త దారిద్ర్యంబు బాధింప నొరులఁ గార్పణ్యవృత్తి। నడుగఁ బోవక తనకు దానబ్బినట్టి। కాసు పదివేలనిష్కముల్గాఁ దలంచి। యాత్మ మోదించి పుత్రదారాభిరతుఁ। డొకవిధంబున నడుపుచునుండు నంత॥ సీ॥ లలితపతివ్రతాతిలకంబు వంశాభిజాత్యదక్షత్వ మున్ సహచరిత్ర। పీడ చేఁ గడు నొచ్చి పెనవులుడుగు చు శిశువులాఁకటి చిచ్చు చేఁ గృశించి। మలమలమాఁడుచు మానసంబెరియంగఁ బట్టెడు రెము మాకుఁ బెట్టుమనుచుఁ। బత్రభాజనధృతపాణులై తనుఁ జేరి వేఁడ వీనులుచురఁ జూడినట్లు। యైన నొకనాఁడు వగచి నిజాధినాథుఁ। జేరి యిట్లని పలికె నోజీవితేశ। తట్టుముట్టాడు నిట్టి పేదఱిక మిట్టు। నొంపదీనికుపాయ మూహింపవైతి॥ అని మఱియు నిట్లనియె॥ గీ॥ బాలసఖుఁడైన యప్పద్మపత్రనేత్రుఁ। గానఁగా నేగి దరిద్రాంధకారమగ్ను। లైన మమునుద్ధరింపుము హరికృపాక। టాక్షరవిదీప్తి వడసి మహాత్మ నీవు॥ మఱియును॥ చ॥ వరమఁడు సాధుభక్తజనవత్సలుఁ డార్తశరణ్యుఁ డిందిరా। వరుఁడు దయాపయోధి భగవంతుఁడు కృష్ణుఁడు దాఁ కుశస్థలీ। పురమున యాదవప్రకరముల్ భజియింపఁగనున్న వాఁడు యిట్లరిగిన నిన్నుఁ జూచి విభుఁ డప్పుడ యిచ్చు సమానసంపదల్॥ మ॥ కలలోనందనుము న్నెఱుంగనివహాలికస్వాత్ముఁ డైనట్టిమా। ర్బలుఁ డాపత్సమయంబునన్నిజపదాబ్జాతంబులుల్లంబులోఁ। దలఁపన్నంతన మెచ్చి యార్తిహరుఁడై తానైన నిచ్చున్ సునిశ్చలభక్తిన్ భజియించు వారికిడఁ డే సంపద్విశేషోన్నతుల్॥ క॥ అనిపలికిన నమ్మానిని। సునమోక్తులకలరి భూమిసురుఁ డా కృష్ణుని। గన నేఁగుటయిహపరసాధనమగునని మదిఁ దలంచి తన సతితోడన్॥ గీ॥ నీవు సెప్పిన యట్ల రాజీవనేత్రుఁ। జూ

దపద్మంబులాశ్రయింపంగఁ జనుట। పరమశోభనమా చక్రపాణికిపుడు। గాను కేమైనఁ గొంపోవఁగలదె యనకు॥ గీ॥ అనినన య్యింతియూఁగాక యనుచు విభుని। శిథిలవస్త్రంబు కొంగునఁ బృథుకతండు। లములనొక కొన్ని ముడిచి నెయ్యముననుపఁ। బనియె గోవిందదర్శనోత్సాహియగుచు॥ అప్పుడు చను మందగమనంబున॥ సీ॥ ద్వారకానగరంబు నేరీతిఁ జొత్తును భాసురాంతర్గపురవాసినైన యప్పుండరీకాక్షు నఖిలేశు నెట్టు దర్శింపఁగల నొకద్వారపాలు రెక్కడి విప్రుఁడ విందేల వచ్చెద వనియడ్డపెట్టిరేని పుష్పవాటి। కేమైనఁ బరిధానమిచ్చి చొచ్చెదనన్న నూహింపనర్థశూన్యుండ నేను। నైన నా భాగ్యమతని దయాదృష్టి। గాక తలఁపోయఁ గానొండు గలదె యాతఁ। డేల నన్నును పేక్షించు నేటిమాట। లనుచు నా ద్వారకాపురము పుడు సొచ్చి॥ వ॥ అప్పుడు ప్రవేశించి రాజమార్గంబునం జనిచని కక్ష్యాంతరంబులు గడచి చని ముందట॥ సీ॥ విశదమై యొప్పు షోడశసహస్రాంగనా కలితవిశాలసంగతిఁ దనర్చి। మహనీయతపనీయమణిమయగోపుర ప్రాసాదసౌధహర్మ్యములు సూచి। మనము బ్రహ్మానందమును బొందఁగడు నుబ్బి సంతోషబాష్పము లొల్కఁ గొనంగ। బ్రకటమై పిలసిల్లు నొకవధూమణిమందిరమున నింతులు చామరములు వీవఁ దనరు హంసతూలికాతల్పమందుఁ। దాను బ్రియయును బహువినోదములఁ దనరి। మహితలీలా[illegible]ను। నసఁగి బొప్పు పుండరీకాయతాక్షు॥ సీ॥ ఇందీవరశ్యాము వందితసుత్రాముఁ గరుణాలవాలు భాసురకపోలు। గౌస్తుభాలంకారుఁ గామితమందారు సురుచిరలావణ్యు సురశరణ్యు। హర్యక్షనిభమధ్యు నఖిలలోకారాధ్యు ఘనచక్రహస్తు జగత్ప్రశస్తు ఖగకులాధిపయాను గౌశేయపరిధానుఁ బన్నగశయను నబ్జాతనయను। మకరకుండలసద్వ్యాఘుమంజుభాషు। నిరుపమాకారు దుగ్ధసాగరవిహారు। భూరిగుణసాంద్రు యదుకులాంభోధిచంద్రు। విష్ణు రోచిష్ణు జిష్ణు సహిష్ణుఁ గృష్ణు॥ మ॥ కని డాయంజనునంతఁ గృష్ణుఁడు పరత్కంజాక్షుఁ డప్పేదవి। ప్రునిఁ ద్రాంతదరిద్రపీడితుఁ గృశీభూతాంగు జీర్ణాంబరు। న్ననత్ప్రాణాతురదిష్టుహాస్యనిలయున్ ఖండోత్తరీయున్ గుచేలుని నల్లంత నెచూచి సంభ్రమవిలోలుండై దిగెఁ దాల్పము౯॥ క॥ కరమర్థి నెదురుగాఁ జని। పరిరంభణమాచరించి బంధుస్నేహస్ఫురణ౯ దోడ్తెచ్చి సమాదరమునఁ గూర్చుండఁ బెట్టెఁ దనతల్పమున౯॥ గీ॥ అప్పుడూర్చుండఁ బెట్టి నెయ్యమునఁ గనక। కలశసలిలంబుచేఁ గాళ్లు గడిగి భక్తిఁ। దజ్జలంబులు దనమస్తకమునఁ దాల్చి। లలితమృగమదఘనసారమిళితమైన॥ గీ॥ మలయజము మేన జొబ్బిల్ల నలఁదియంత। శ్రమము వాయంగఁ దాళవృంతముల విసరి। బంధురామోదకలితధూపంబు లొసఁగి। మించు మణిదీపముల నివాళించి మఱియు॥ వ॥ సురభికుసుమమాలికలు సిగ ముడిచి మఱి మిక్కర్పూరమిళితతాంబూలంబు లిడి ధేనువు నొసంగి సాదరంబుగా స్వాగతం బడిగిన నప్పుడ విప్రుమేనంబుల కాంతురంబు లంకురింప నానందబాష్పజలబిందుసందోహుండయ్యె-నట్టియెడం బద్మలోచనుండు మన్నించు నంగనామణియగు రుక్మిణీకరకంకణంబులు మెఱయం జామరలు వీవం దజ్జాతవాతంబున ఘర్మసలిలంబు నివారించుచుండం జూచి శుద్ధాంతకాంతాజనంబులు మనంబున నద్భుతంబందియిట్లనిరి॥ ఉ॥ ఏమితపంబు జేసెనొకొ యీ ధరణీదివిజోత్తముండుత్తో। ల్సామున యోగిపిన్ఫురదపాస్యకుఁడై తనరారు నీజగ। త్స్వామి రమాధినాథు నిజతల్పమునన్ వసియించియున్నవాఁ। డీమహనీయమూర్తి కెనయే మునిపుంగవులెంతవారలు౯॥ అదియునుంగాక॥ చ॥ తనవ్రుదుతల్పమందు వనితామణినైనరమాలలామసొం। పును నెడఁగాఁ దలంపక యమ్రవరుం డెమ తేఁగి మోదము। న్దనుకఁగఁ గౌఁగిలించి యుచితక్రియలన్ బరితుష్టుఁ జేయుచు। న్వినయమునన్ భజించె ధరణీసురుఁ డెంతటి భాగ్యవంతుఁడో॥ అయ్యవసరంబున॥ క॥ మురసంహరుఁడు సుచేలుని। కరము గరంబునఁ దెమల్చి కడకన్నానమా। గురుగృహమున వర్తించిన। చరితములని కొన్ని నుడివి చతురతమఱియు౯॥ సీ॥ బ్రాహ్మణోత్తమ వేదపాఠనలబ్ధదక్షతగలచారువంశంబువలనఁ। బరిణయంబైనట్టి భార్యసుశీలవర్తనములఁ దగభవత్సదృశయగునె। తలఁపగృహక్షేత్రధనదారపుత్రాదులం దమనీ చిత్తంబు చెందకుంట। తోఁచుచున్నది యేను మదిలోకసంగ్రహార్థంబు కర్మాచరణంబు సేయు। గతి మనంబునఁ గామమోహితులుగాక। నర్థమై విహితకర్మంబు లాచరించి। ప్రకృతిసంబంధమును బాసి భవ్యనిష్ఠఁ। దవిలియుందురు కొందఱుత్తములు భువిని॥ అని మఱియు నిట్లనియె॥ క॥ ఎఱుఁగుదె గురుమందిరమున। వెలువ్రుప్పఁగ మనకునతఁడు వెలయఁగఁ దెలుప। న్నెఱుఁగఁగవలసినయర్థము। లెఱిఁగి పరిజ్ఞానమహిమ లెఱుఁగుట లెల్ల౯॥ అని మఱియు గురుప్రశంస సేయందలంచి యిట్లనియె॥ గీ॥ తివిరి యజ్ఞానతిమిరప్రదీపమగుచు। నవ్యయంబైన బ్రహ్మంబు ననుభవించు। భరితసత్త్వుండు సత్కర్మనిరతుఁ డతుల। భూసురశ్రేష్ఠుఁ డనఘుండు బుధనుతుండు॥ వ॥ అమ్మహాత్మునివలన సకలవర్ణాశ్రమంబుల వారికి నేను విజ్ఞానప్రదుండనగు గురుండనై యుండియు గురుభజనంబు పరమధర్మంబని యాచరించితినది గావున॥ క॥ భూసురుల కెల్ల ముఖ్యుఁడ। నై సకలకులాశ్రమంబులందుల నెపుడు౯। ధీసుజ్ఞానప్రదుఁడన। దేశికుఁడన నొప్పుచుందు ధృతి నెల్లెడల౯॥ గీ॥ అట్టివర్ణాశ్రమంబులయందు నర్థ। కుశలులగు వారి నిఖిలైకగురుఁడనైన। నాదువా

క్యంబుచేఁ భవార్ణవము వెలుచ। దాఁటుదురు మత్పదాంబుజధ్యానపరులు॥ వ॥ అదియునుంగాక సకలభూతాత్మకుండనైన యేను తపోవ్రతయజ్ఞదానశమదమాదులచేత సంతసింపను గురుజనంబులఁ బరమభక్తిసేవించువారలం బరిణమింతు ననిచెప్పి మఱియు మన మిరువురము గురుమందిరంబున నున్నయెడ గురుపత్నీనియుక్తులమై యింధనార్థం బడవికిం జనినయెడ॥ సీ॥ ఘుమఘుమారావసంకుల ఘోరజీమూతపటలసంఛన్నాభ్రభాగ మగుచుఁ। జటులఝంఝానిలోత్కటసముద్ధూతనానావిధజంతుసంతాన మగుచుఁ। జండదిగ్వేదండతుండనిభాఖండవారిధారాపూర్ణవసుధ యగుచు। విద్యోతమానోగ్రఖద్యోతకిరణజిద్విద్యుద్ద్యుతిచ్ఛటావిభవ మగుచు। నదరిజడి గురియఁ జనుదిన మస్తమింప। భూరినీరంధ్రనిబిడాంధకారమేది। సూచికాభేద్యమై వస్తుగోచరంబు। గాని యట్లుండె ఘనమున వానఁ దడిసి॥ గీ॥ బయలు గొందియుఁ జెనుమిట్టుపల్లములును। రహితసహితస్థలంబు లేర్పడ రాక। నున్నయత్తఱి మన మొకరొకరి చేతు। లూఁతగాఁ గొని నడుచుచు నుండ నంత॥ క॥ విసవిసనప్పుడు నుడుగక। విసరెడి వలిచేత వడఁకు విడువక మనము। న్వసచెడి మార్గముఁ గానక। మసలితి మంతటను నంశుమంతుఁడు వొడమన్॥ క॥ తెలతెలవారెడి వేళ। న్గలకలమని పలికెఁ బక్షిగణ మెల్లెడల। న్మిలమిలని ప్రాఙ్ముఖమున। ధళధళయను మెఱుఁగు దిగ్వితానము నిండెన్॥ క॥ అప్పుడు సాందీపుఁడు మన। చొప్పరయుచు వచ్చి వానసోఁకున మనవలి। న్దెప్పిఱిఁగుటఁ గని ఖేదం। బుప్పతిలం బలికెన కటా యోవటులారా॥ చ॥ కటకట యిట్లు మాకొఱకుఁ గాఁ జనుదెంచి మహాటవిన్ సముత్కటపరిపీడ నొందితిరి గావున శిష్యులు మా ఋణంబు నీ। గుటకిది కారణంబు సమకూరెడిఁ బోయిట మీఁద మీకు వి। స్ఫుటధనబంధుదారబహుపుత్రవిభూతిజయాయురున్నతుల్॥ క॥ అని గారవించి యాయన। మనలన్ దోడ్కొనుచు నాత్మమందిరమునకుఁ జనుదెంచుట లెల్లను నీ। మనమునఁ దలఁ తే యటంచు మఱియున్బలికెన్॥ వ॥ అనఘా మన మధ్యయనంబు సేయుచు నన్యోన్యస్నేహవాత్సల్యంబులం జేయు కృత్యంబులు మఱువవు గదా యని యివియెల్లం దలంచి యాడు మాధవుమధురాలాపంబులు విని యతనిం గనుంగొని కుచేలుం డిట్లనియె॥ క॥ వనజోదర గురుమందిర। మున మనము వసించునాఁడు ముదమునఁ గావిం। పని పను లెవ్వియుఁ గలవే। సిను మవి యట్లుండ నిమ్ము విమలచరిత్రా॥ క॥ గురుమతిఁ దలఁపఁగ ద్విజగ। ద్గురుఁడవ నందగిన నీకు గురుఁ డనఁ దా నెం। డొరుఁ డెవ్వఁ డింతయును నీ। కరయంగ విడంబనంబు లగుఁ గాదె హరీ॥ వ॥ అని సాభిప్రాయంబుగాఁ బలికిన పలుకులు విని సమస్తభావాభిజ్ఞుం డైన పుండరీకాక్షుండు మందస్మితసుందరవదనారవిందుం డగుచు నతనిం జూచి నీ విచ్చటికి వచ్చునప్పుడు నాయందు లభక్తిం జేసి నాకు నుపాయనంబుగా నేమి పదార్థంబు దెచ్చితి వప్పదార్థంబు లేశమాత్రంబైనఁ బదివేలుగా నంగీకరింతు నట్లుంగాక నీచవర్తనుండై మద్భక్తిం దగులని దుష్టాత్ముండు హేమాచలతుల్యంబైన పదార్థంబు నొసంగిన నదియు నాకు సమ్మతంబు గామి కావున॥ క॥ దళమైనఁ బుష్పమైనను। ఫలమైనను సలిలమైనఁ బాయని భక్తిన్। గొలిచిన జనులర్పించిన। నెలమి న్రుచిరాన్నముగ నెయ్యేను భుజింతున్॥ క॥ అని పద్మోదరుఁ డాడిన। వినయోక్తుల కాత్మ నలరి విప్రుఁడు దాఁ దె। చ్చిన యడుకులు సగ నర్పిం। పను నేరక మోము వాంచి పలుకక యున్నన్॥ వ॥ అవ్విప్రుండు చనుదెంచిన కార్యంబు కృష్ణుండు దన దివ్యచిత్తంబున నెఱింగి యితండు పూర్వభవంబున నైశ్వర్యకాముండై నన్ను సేవింపండైన నిక్కుచేలుండు నిజకాంతాముఖోల్లాసంబునకై నాయొద్దకుం జనుదెంచినవాఁ డితనికి నింద్రాదులకుం బడయరాని బహువిధంబులైన సంపద్విశేషంబు లీక్షణంబ యొడఁగూర్పవలయు నని తలంచి యతండు జీర్ణవస్త్రంబు కొనముడిచి తెచ్చిన యయ్యడుకులముడియఁ గని యిదియేడ దని యొయ్యన నమ్ముడియఁ దన కరకమలంబుల విడిచి యయ్యడుకులు గొన్ని పుచ్చికొని యివి యనేకలోకంబుల నన్నుఁ బరితృప్తిం బొందింపఁ జాలు నని యప్పుడు॥ క॥ మురహరుఁడు పిడికెడడుకులు। కర మొప్పఁగ నారగించి కౌతుకమతియై। మఱియును బిడికెడు గొనఁ దత్కర మప్పుడు వట్టెఁ గమల కరకమలములన్॥ క॥ సొంపారఁ గ నితనికి బహు। సంపద లందింప నివియ చాలును నిఁక భ। క్షింపఁగ వలవదు త్రిజగ। త్సంపత్కర దేవదేవ సర్వాత్మ హరీ॥ వ॥ అని యిట్లు వారించిన నక్కుచేలుండు నారాత్రి గోవిందుమందిరంబునఁ దనకు హృదయానందకరంబులగు వివిధపదార్థంబుల ననుభవించి మృదులశయ్యాతలంబున నిద్రించి తన మనంబునందు నన్ను సమధికస్వర్గభోగానుభవుంగాఁ దలంచుచు మఱునాఁ డరుణోదయంబున మేల్కని కాలోచితకృత్యంబు లుదీర్చి యుండి రారమణుండు దన్నుఁ గొంతదవ్వనిపి యామంత్రితుం జేయఁ జనుచు నందనందనసందర్శనానందలోలాత్ముండై తన మనంబున నిట్లనియె॥ క॥ నా పుణ్య మరయ నెట్టిదొ। యాపుణ్యనిధిం బ్రశాంతు నచ్యుతు నఖిల। వ్యాపకు బ్రహ్మణ్యుని। జిత్ప్రాపకుఁ బురుషోత్తమునిఁ బరుం గనుఁగొంటిన్॥ సీ॥ పరికింపఁ గృపణస్వభావుండ నైనట్టి నే నేడ నఖిలావనీశుఁ డైన। యిందిరాదేవికి నెనయంగ నిత్యనివాసుఁడై యొప్పు నవ్వాసుదేవుఁ। డేడ నన్నర్థిమైఁ దోడఁబుట్టిన ఘాని కైవడిఁ గౌఁగిటఁ గదియఁజేర్చి। దైవంబుగా నన్ను భావించి నిజతల్పమున నునిచి సత్క్రియలు వాని నడిపి। చారునిజవధూకరసరోజాతకలిత। చామరానిల

విగతవిశ్రమునిఁ జేసి। శ్రీకుచాలిప్తచందనాంచితకరాబ్జతలములను నడుగులొత్తె వత్సలత మెఱసి॥ కావున॥ ఉ॥ శ్రీనిధియిట్లు నన్నుఁ బచరించె ఘనంబుగ విత్త మేమియు। న్నీని తెఱంగుగానఁబడ దెన్నఁడు దరిద్రుఁడు సంపదర్థుఁడై। కానక తన్నుఁ జేరఁడని కాక శ్రీకార్తిహరుండు సత్కృపాంభోనిధి సర్వవస్తుపరిపూర్ణునిఁగా నను జేయకుండునే॥ వ॥ అని తనమనంబున వితర్కించుచు నిజపురంబునకుం జని చనిముందట॥ సీ॥ భానుచంద్రప్రభాభాసమానస్వర్ణచంద్రకాంతోపలసౌధములును। గలకంఠశుకనీలకంఠసముత్కంఠమానితకూజితోద్యానములును। ఫుల్లసితాంభోజహల్లకకల్హారకైరవోల్లసితకాసారములును। మణిమయకనకకంకణముఖాభరణవిభ్రాజితదాసదాసీజనంబు। గలిగి చెలువొందు సదనంబుఁ గాంచి విస్మయమునుబొందుచు నెట్టిపుణ్యాత్ముఁడుండు నిలయమొక్కొ యపూర్వమై నెగడె మహిత। వైభవోన్నతలక్ష్మీనివాసమగుచు॥ అని తలపోయుచున్న యవసరంబున॥ గీ॥ దివిజవనితలఁ బోలెడు తెఱవలపుడు। డాయ నేతెంచి యిందు విచ్చేయుఁడనుచు। విమలసంగీతనృత్యవాద్యములు చెలఁగ। గరిమ దోడ్కొనిచని రంతిపురమునకును॥ వ॥ ఇట్లు చను దేరనతని భార్యయైన సతీలలామంబు దనమనంబున నానందరసమగ్నయగుచు నిట్లనియె॥ సీ॥ తనవిభు రాకముందటఁ గనిమనమున హర్షించి వైభవంబలర మనుజ। కామినీరూపంబుగైకొన్న యిందిరావనితచందంబునఁ దనరుచున్న। కలకంఠి తనవాలుకన్నులఁ గ్రేవలనానందబాష్పంబు లంకురింప। నతని పాదంబుల కాత్మలో మ్రొక్కి భావంబున నాలింగనంబుఁ జేసె। నాథ రా దేవుఁడతులదివ్యాంబరాభరణవిభూషితయై రతిరాజసాయకములఁ గతి నొప్పుపరిచారికలు భజింప। లలితసౌభాగ్యయగు నిజలలనఁ జూచి॥ క॥ ఆనారీరత్నంబును। దానును ననురాగరసముడల్కొత్తఁగని। త్యానందమునొందుచుఁ బెంపూనిన హరిలబ్ధవైభవోన్నతి మెఱయన్॥ సీ॥ కమనీయపద్మరాగస్తంభకంబులుఁ గొమరారు పటికంపుకుడ్యములును। మరకతవరరత్నమయకవాటంబులుఁ గీలితహరినీలజాలకములు। దీపితచంద్రకాంతోపలవేదులు నంచితవివిధపదార్థములును। దసుహంసతూలికాతల్పంబులును హేమలాలితశయనస్థలములుఁ దనరు। సమధికోత్తుంగభద్రపీఠములు సిరులు। మానితోన్నతచతురంతయానములును। వలయు సద్వస్తుపరిపూర్ణవాటికలును గలిగి చెలువొందు మందిరంబెలమి సొచ్చి॥ వ॥ సుఖంబుననుండు నట్టియెడం దనకు మనోవికారంబులు వొడమకుండవర్తించుచు నిర్మలంబగు తనమనంబున నిట్లను చింతగాలంబత్యంతమరంతంబగు దారిద్ర్యదుఃఖార్ణవంబున మునింగియున్న నాకుం గడపటం గలిగిన విధంబున నిప్పుడు॥ గీ॥ ఎన్నఁగ్రొత్తలైనయిట్టి సంపదలు నా। కబ్బుటెల్ల హరిదయావలోక। నమునఁ జేసి కాదె నలినాక్షుసన్నిధి। కర్థినగుచు నేను నరుగుటయును॥ క॥ నను నావృత్తాంతంబును। దనమనమునఁ గనియు నేమి దడవక ననుఁ బొమ్మని యీసంపదలెల్లను। నొనరఁగ నొడఁగూర్చి నన్ను నొడయనిఁ జేసెన్॥ వ॥ అట్టి పురుషోత్తముండు భక్తనిష్ఠులైన సజ్జనులు లేశమాత్రంబగు పదార్థంబైన భక్తిపూర్వకంబుగా సమర్పించిన నది కోటిగుణితంబుగాఁ గైకొని మన్నించుటకు నిదిదృష్టాంతంబుగా దేమలినదేహుండును జీర్ణాంబరుండును నని చిత్తంబున హేయంబుగా పాటింపక నా చేనున్న యటుకులాదరంబున నారగించి నన్నుం గృతార్థునిం జేయుట యతని నిర్హేతుకదయయ కాదె యట్టి కారుణ్యసాగరుండైన గోవిందుని చరణారవిందంబులయందుల భక్తిప్రాభవంబులగుంగాక యని యప్పుండరీకాక్షునియందుఁ బూర్వభక్తితాత్పర్యంబునం దగిలి పత్నీసమేతుండై నిఖిలభోగంబులయందు నాసక్తింబొరయక రాగాదివిరహితుండును నిర్వికారుండును నై యఖిలక్రియలయందు ననంతుని యనంతధ్యానసుధారసంబునం జొక్కుచు విగతబంధనుండై యపవర్గప్రాప్తి నొందె మఱియును॥ గీ॥ దేవదేవుఁ డఖిలభావజ్ఞుఁ డాశ్రిత। వరదుఁడైన హరికి ధరణిసురులు। దైవతములు గాన ధారుణీదివిజుల। కంటె దైవమొకఁడు గలఁడె భువిని॥ క॥ మురహరుఁడిట్లు కుచేలునిఁ। జరితార్థునిఁ జేసినట్టి చరితము వినున। త్పురుషులకిహపరసుఖములు। హరిభక్తియు యశముగలుగు నవనీనాథా॥ అని మఱియుఁ బరాశరపౌత్రుఁ డర్జునపౌత్రుం డిట్లనియె॥ గీ॥ దుష్టశిక్షణంబు దురితసంహరణంబు। శిష్టరక్షణంబు సేయఁదలఁచి। భువిని మనుజుఁడగుచుఁ బుట్టిన శ్రీకృష్ణు। విమలచరిత మెల్ల విస్తరింపు॥ అనిన శుకుండిట్లనియె॥

## శ్రీకృష్ణుఁడు సకుటుంబముగా గ్రహణస్నానమునకుఁ బోవుట.

సీ॥ ధరణీశ బలుఁడును సరసిజోదరుఁడు నవోన్నతసుఖలీలనుండునంతఁ। జటులోగ్రకల్పాంతసమయమందును బోలె దృగసహ్యమై సముద్దీప్తమగుచు। రాజిల్లు సూర్యోపరాగంబు చనుదెంచు టెఱిఁగి భూసురులెల్ల వరుసఁ గదలి। మనుజమదగ్నిరాముఁడు పూని ముయ్యేడుమారులు ఘనబలోదారుఁడగుచు। నిజభుజాదండమండితనిబిడనిశిత। చటులదంభోళిరుచిరభాస్వత్కుఠార। మహితనారాచనిర్భిన్నమనుజపాల। దేహనిర్ముక్తరుధిరప్రవాహములను॥ గీ॥ ఏనుమడువులఁ గావించె నెచట నేని। నట్టిపావనసుక్షేత్రమగు శమంత। పంచకంబునకపుడు సంభ్రమముతోడఁ। జనిరి బలకృష్ణులును సంతసంబెలర్ప॥ వ॥ ఇట్లు నిమగ్నులైన రామకృష్ణులు లోకధర్మానుపాలనవర్తనులై ద్వారకానగరరక్షణంబునకుఁ బ్రద్యుమ్నగదసాం

బను చంద్రశుక సారణానిరుద్ధకృతవర్మాదియోధవరులనియమించియ క్రూరవసుదేవోగ్రసేనాదిసకలయాదవులుంగొం
తానమేతులై స్రక్చందనాభరణవస్త్రములుధరియించి శోభనాకారంబులతోడంబుష్పక విమానంబులనంబోలుచునర
దంబులను మేఘంబులననుకరించుగజంబులనుమనోవేగంబులైనతురంగంబులనెక్కి వియచ్చరులంబురణించుపురుషులు
నమ్ము సేవింపంజనియప్పుణ్యతీర్థంబులనవగాహనంబు చేసియుపవసించియనంతరంబ ॥ క॥ భూసురవరులకునమపమ।వా
సోలంకారధేనువసురత్నధరి। త్రీసుమహితవస్తువులు।ల్లాసంబునదానమిచ్చిలాలితులగుచుఁ॥ క॥ పునరవగాహనములు
పెం।పొనరంగావించిబంధుబుధయుతులై భో।జనకృత్యంబులుదీర్చి స।దనురాగములుల్లసిల్లనచ్చోటఁదగఁ॥ క॥ఘనశా
ఖాకీర్ణములై।యనరత్నములుగానరాకయెసకంబెసఁగ।న్ననిచినసొన్నలనీడల।ననిచినవేడుకల్లనందనందనముఖ్యుల్॥క॥తన
రినపల్లవరుచిరా।సనములనాసీనులనుచుఁదత్సుఖగోష్ఠి।న్ననుపొందఁగనటవసియిం।చినచోఁదత్పుణ్యతీర్థసేవారతులై॥
వ॥ మున్ను చనుదెంచియున్నయశీనరమత్స్యకురుకోసలవిదర్భ సృంజయకాంభోజకేకయమద్రకుంతిఆరట్టకేరళాది
భూపతులును సుహృత్తుయుండకేనరాజవరులునుహితులునునందగోపాలాదిగోపాలునునుగోపికాజనంబులునుధర్మరాజా
నుగతులైవచ్చినభీష్మద్రోణధృతరాష్ట్రగాంధారీకుంతీపాండవతద్దారనివహసంజయవిదురకృపకుంతిభోజవిరాటభీష్మక
నగ్నజిత్ద్రుపదశైబ్యధృష్టకేతుకాశీరాజరాజరాజదమఘోషవిశాలాక్షమైథిలయుధామన్యుసుశర్మలునుసపుత్రకుం
డైనబాహ్లీకుండును మొదలుగాననేకులునుగ్రసేనప్రముఖులం బూజలంధృప్తులంజేసినవారునుంబ్రముదితాత్ములైర
య్యెడ॥ క॥ ఆరాజులుగాంచిరినిజ।నారీయుతులగుచునంగనాపరివారుఁ।ధీరుఁ దానవకులసం।హారుఁ గోపీమనోవిహా
రునుదారుఁ॥ వ॥కనియవ్వృష్ణిబలదేవులు సేయుసముచితపూజావిధానంబులంబరితృప్తులై యమ్ముకుందుసాన్నిధ్యంబు
గలిగితవీయసంపద్విభవాభిరామంబులనభిరాములై విలసిల్లుచున్నయుగ్రసేనాదియదువృష్ణిపుంగవులంజూచివారల
తోడనారాజవరులుమాధవుండువినవనిట్లనిరి॥ మ॥మనశాస్త్రంబులువాక్కులన్మనములన్మాంగల్యముంబొందఁజా।వ
నమైయొప్పుచునేరమాప్రభునిభాస్వత్పాదపంకేజసే।వనతోయంబులనేమహాత్మునిపదాబ్జాతంబులెంచేసినో।కినచో
మెల్లనుముక్తిహేతువగునీకృష్ణుండెసోచూడఁగఁ॥ చ॥ సనకసనందనాదిమునిసత్తములంచితయోగదృష్టిచేఁ।బనివడి
యాత్మలన్వెదకిపట్టనగోచరమైనమూర్తియి।ట్లనవరతంబుమాంసనయనాంచలగోచరుఁడయ్యెనట్టిదే।మననగుపేరిష
ణ్యమునకాదట నెట్టితపంబుచేసిరో॥ మ॥నిరయస్వర్గములాత్మఁగైకొనకదానిర్వాణసమ్మూర్తియా।హరిఁజూడఁ హరితో
డంబల్కహరిమేనంటఁ హరింబాడఁగా।హరితోనేగసహాసనాస్తరణశయ్యావాసులై యుండుటల్।హరిబంధుత్వసఖి
త్వములు బుబుభాగ్యంబెట్లుసిద్ధించెనో॥ గీ॥అనుచుయాదవవృష్ణిభోజాంధకులును।హరిదయాలబ్ధనిఖిలార్థులగుచునున్న।
మానికిఁదమచిత్తములఁబలుమారుపొగడి।యుపరమించిరియంతనప్పాండుమహిషి॥అప్పుడు॥క॥తనసుతులకుగాంధారీ।త
నయులుగావించునపకృతంబులునాత్మఁ।గనమునఁనెరియఁగనచ్చటఁ।గనుఁగొనెవసుదేవుఁ విగతకల్మషభావుఁ॥అట్లుగ
నుంగొనియతనితోనిట్లనియె॥క॥ఓయన్న పాండుతనయులు।నీయల్లుండ్రడవులందునెఱిమృగములలోఁ।బాయనియిడుమ
లఁబడఁగరు।ణాయత్తులరగుచుమీరలరయఁగవలదే॥ వ॥ అనిబహుప్రకారంబులసంతాపించుచుమఱియునిట్లనియె॥క॥అతి
బలవంతపువిధిదాఁ।బ్రతికూలంబైనఁగలరెబంధువులనుచుఁ।ధృతిగలఁగిబాష్పజలపూ।రితలోచనయగుసహోదరిని
జూచియనెఁ॥సీ॥తల్లినీకేలసంతాపింపమనమునఁదలఁపకవిధినేలపాలసెవింత।యఖిలనియామకుండగునీశ్వరుఁడుమా
యజవనికాంతరుఁడైనయవనిసూత్ర।ధారునికైవడిఁదగిలినటింపంగమనుజులుకీలుబొమ్మలుపలంప।గావునవిధిచేతఁగ
డపివర్తింపంగదేవతలకునైనఁదీరదట్లు।క్రోధచిత్తుఁడుగంసుండుబాధఁబఱప।నిలయములుదప్పినేమడవులఁజరింప।ఘన
కృపానిధియైహరిగలఁగఁబట్టి।కోరిమాయిండ్లుగ్రమ్మఱఁజేరఁగలిగె॥అనియూరడిలంబలుకునవసరంబున.క॥నందయశో
దలుగోపక।బృందంబులుగోపికలునుఁబిరిఁగొనిపరమా।నందంబులఁజనుదెంచిరి।మందరధరుఁజూచువేడ్కమనమునఁబొడ
మఁ॥అట్లుచనుదెంచిన॥ క॥ అతిచిరకాలసమాగతు।నతనినిరీక్షించివృష్ణియాదవభోజ।ప్రతతులునెదురేఁగిసము।న్నతి
తోనాలింగనములునడపిరివరుసఁ॥క॥వసుదేవుఁడు వారికిసఁ।తసమునఁగావించెసముచితక్రియలంతఁ।ముసలియుహరి
యుఁ మ్రొక్కిరి।వెసనందయశోదలకునువినయంబెసఁగఁ॥ వ॥ అట్లునమస్కృతులు సేసియాలింగనంబులుగావించిన
యనారపిండంబులనానందబాష్పంబులుదొరుగనఱలేనిస్నేహంబులఁజిత్తంబులుననుత్తమిల్లనేమియుంబలుకకుండిరంతన
య్యశోదాదేవిరామకృష్ణులనిజాంకపీఠంబుననునిచియక్కునంగదియందిగిచిచెక్కులుముద్దులుగొనిశిరంబులుమూర్కొ
నిచుబుకంబులుపుడుకుచుఁబునఃపునరాలింగనంబులుగావించిపరమానందంబునంబొందుచునున్నంతఁబదంపడి॥ చ॥స్త్రీ

బునం దోడనం జనుదెంచె॥ చ॥ రణితవినూత్నరత్నరుచిరస్ఫుటనూపురహారకర్ణభూ। షణకటకాంగుళీయకలసత్పరిధానకి।
రీటతల్పవా। రణరథవాజిహేతినికరంబులనుం బరిచారికాతతిన్। బ్రణుతగుణోత్తరుండు నవపద్మదళాక్షుఁడకిచ్చె నెమ్మి
తోన్॥ వ॥ ఇట్లు మహనీయతేజోనిధియైన మాధవుండు యయాపరిలబ్ధనిఖిలవస్తువిస్తారుండయ్యును నిజాధికారశుద్ధికొఱకు నా అ
లంగన్యారత్నంబును, వినూత్నరత్నవ్రాతంబును, సమర్పించెనని భూసురపిసరంబులు వినుతింపఁ బ్రసిద్ధమైన బృహత్సే
నుండు నన్నును. సమస్తవస్తువులను గృష్ణునకు సమర్పించి క్రమంబున సకలయాదవులనుం బూజించి మఱలి నిజపురంబునకుం
జనియె నని చెప్పెనం గుంతియుఁ గాంధారియుఁ గృష్ణయు నఖిలనృపాలకాంతాజనంబులును గోపికలుం దమతమ మనంబుల స
ర్వభూతాంతర్యామియు, లీలామానుషవిగ్రహుండును నైన పుండరీకాక్షు చరణారవిందస్మరణానందపరవశలై కృష్ణుం

శ్రీ నారదాదిమహర్షులు శ్రీకృష్ణదర్శనంబు చేసికొని వసుదేవుని చేఁ గ్రతువు చేయించుట. శ్రీ

బ్రశంసించిరంత॥ చ॥ బలవదరాతిమర్దనుల బాండురనీలనిభప్రభాంగులన్। గలితనిజాననాంబుజవికాసజితాంచితపూర్ణ
చంద్రమం। డలులఁ బరేశులన్నరవిడంబనులన్ గరుణాపయోధులన్। స్వలసదలంకరిష్ణులనహీనసహిష్ణుల రామకృష్ణులన్॥
వ॥ సందర్శించు తలంపులనంత నుదయహృదయారవిందంబులఁ బ్రేమంబు సందడిగొన నప్పుడు॥ ఉ॥ ధీరమతిన్ ద్వితత్రిత
కదేవలసాత్యవతేయకణ్వులున్। నారదగౌతమచ్యవననాకుజగార్గ్యవసిష్ఠగాలవాం। గీరసకశ్యపాసితసుకీర్తిమృకండు
జకుంభసంభవాం। గీరులు యాజ్ఞవల్క్యభృగుశృంగిముఖాఖిలతాపసోత్తముల్॥ వ॥ చనుదెంచిన గృష్ణుండు వారలకుం బ్ర
త్యుత్థానంబులాచరించి వివిధార్చనలు గావించి యిట్లనియె॥ సీ॥ సన్మునీశ్వరులార జన్మభాక్కులమైన మాకు నిచ్చోట సన్మ
నిదేవ। నికరదృష్టాత్ములు నిరుపమయోగీంద్రులై నమీ దర్శనంబబ్బెఁ గాదె। ధృతిమందభాగ్యులింద్రియపరతంత్రులునైన
మూఢాత్ములకనఘులార। భవదీయదర్శనస్పర్శనచింతనపాదార్చనలు దుర్లభంబులయ్యె। నేఁడు మాకిటసులభమైనెగ
డెఁ గాదె। జగతిపైఁ దీర్థభూతులు సాధుమతులు। మిమ్ము దర్శించుటయ చాలు నెమ్మితోడ। వేఱతీర్థంబులవనిపై వెదకనేల॥
వ॥ అదియునుంగాక నుదకమయంబులైన తీర్థంబులును, మృచ్ఛిలామయంబులైన దేవగణంబులును, దీర్ఘదేవతారూపంబు
లుగాకుండుటలేదైన నవి చిరకాలసేవనార్చనలం గాని పావనంబులు సేయవు; సత్పురుషులు దర్శనమాత్రంబున సంపావనం
బు సేయుదురని వెండియు॥ సీ॥ ఆదిత్యచంద్రాగ్ని మేదినీతారాంబుమారుతాకాశవాఙ్మనములోలిఁ। బరికింపఁ దత్తదుపా
సనంబులఁ బూనితపములచేసమర్థములుగావు। సకలార్థగోచరజ్ఞానంబుగల మహాత్మకులు ముహూర్తమాత్రమున సేవ।
సేసి పావనములు సేయుదురదియునట్లుండె ధాతుత్రయయుక్తమైన। కాయమందాత్మబుద్ధియుఁ గామినీసు। మారులందు
స్వకీయాభిమానములను। వివిరిజలమునఁ దీర్థబుద్ధియును జేయు। నట్టిమూఢుండు పసుమార్గుఁడనఁగఁ బరఁగు॥ వ॥ అనియివ్వి
ధంబునం గృష్ణుండాడిన సాభిప్రాయంబులగు వాక్యంబులు విని యమ్మునీంద్రులు విభ్రాంతహృదయులై యూరకుండి ము
హూర్తమాత్రంబునకిమ్మహాత్మునను గ్రహంబువడసి మందస్మితముఖులై యప్పుండరీకాక్షునకిట్లనిరి-దేవా నేమునుం డ
క్షవిముక్తులయిన బ్రహ్మరుద్రాదులును భవదీయమాయావిమోహితులమయియుందుము-నిగూఢంబయిన నీయిచ్ఛ
చేతనమ్మునను గ్రహించితివి-భవదీయచరిత్రంబుననిమ్మేదినియొక్కటియయ్యును బహురూపంబులఁ గానంబడువిధం
బున నీవు మొదలఁ గారణరూపంబున నేకంబయ్యును నేకరూపంబులు గైకొని జగదుత్పత్తిస్థితిలయంబులకు హేతుభూతం
బనవద్భుతకర్మంబులం దగిలి లీలావతారంబులు గైకొని దుష్టజననిగ్రహంబును, శిష్టజనరక్షణంబునుం గావించుచుందువు అది
యునుంగాక వర్ణాశ్రమధర్మంబులంగీకరించి పురుషరూపంబున వేదమార్గంబు విదితంబు సేసిన బ్రహ్మరూపివి- తపస్స్వ
ధ్యాయనియమంబులచేత హృదయంబు పరిశుద్ధంబుగావున బ్రహ్మస్వరూపంబులైన వేదంబులందు వ్యక్తావ్యక్తస్వరూపం
బులేర్పడఁగానుందువు-కావున బ్రాహ్మణకులంబునెల్ల బ్రహ్మకులాగ్రణివై రక్షించిన మహానుభావుండవు-మాయాతీ
తుండవైన నిన్నును, నీభూపాలవర్గంబును, నేము దర్శింపఁగంటిమి-మాజన్మవిద్యాతపోమహిమలు సాఫల్యంబులయ్యె-నీ
కునమస్కరించెదమని బహువిధంబులఁ గృష్ణునభినందించి యమ్మురాంతకుచేత నామంత్రణంబులు వడసి తమతమ నివాసం
బులకుం బోవం దలంచు నవసరంబున॥ సీ॥ అమ్మునీశ్వరులకు నానకదుందుభి యతిభక్తి వందనంబాచరించి। తాపసోత్తములా
రధర్మతత్వజ్ఞులు మన్నించి వినుఁడు నా విన్నపంబు। సత్కర్మవితతిచే సంచితకర్మచయంబు వాపెడు నుపాయంబు నాకు। ఘ
నదయామతిఁ జెప్పుఁడని నమ్మునివరుల్ భావరుల్ వసుదేవుఁ జూచి। మెలమిఁ బలికిరి నిఖిలయజ్ఞేశుఁడైన। కమలలోచనుఁ
గూర్చి యాగములు సేయఁ। గర్మమునఁ బాయునెట్టి దుష్కర్మమైన। నదియ ధర్మంబుగాఁగ నీమదిఁ దలంపు॥ అదియునుంగాక.
క॥ దేవర్షిపితృజఋణములు। భూవరముఖవేదపాఠపుత్రులచేత। న్వవిరినీఁగని పురుషుఁడు। పోవునధోలోకమునకుఁ బు

బ్బలరిపునందనుండుగని భావజసాయకబాధ్యమానవి। హ్వలహృదయాబ్జుఁడై నిలిపె నత్తరుణీమణియందుఁ జిత్తముల్॥
ఉ॥ ఆతరుణీశిరోమణియు నర్జును నర్జునచారుకీర్తివి। ఖ్యాతుని నింద్రనందను నకల్మషమానసుఁ గామినీమనో। జాతునిఁ జూ
చి పుష్పశరసాయకజర్జరితాంతరంగయై। భీతిలియుండె సిగ్గుమురిపెంబును మోహము దేరి చూపులన్॥ వ॥ అట్లా నృపసత్త
ముమత్తకాశినులాం డొరులచిత్తంబులు చిత్తజాయత్తంబులై కోర్కులు దత్తరింపం దాల్ములు వీడి సిగ్గు నంజెట్టు ముట్టాడుచు
న్నయంత నొక్కనాఁడు దేవతామహోత్సవనిమిత్తంబున నత్తలోదరి పురంబు వెలువలికి నరుగుదెంచిన నర్జునుండు కృ
ష్ణవసుదేవదేవకీదేవుల యనుమతంబు వడసి తానును సుందోడన చని యప్పుడు॥ సీ॥ సాంద్రశరచ్చంద్రచంద్రికాస్ఫూర్తిఁ జే
రాజిల్లుపూర్ణిమారజనివోలెఁ। బూర్ణేందుబింబావతీర్ణమై యిలమీఁద భాసిల్లు హరిణడింభంబువోలె। సులలితమేఘమండ
లమును నెడవాసి వసుధఁ గ్రుమ్మరు తటిద్వల్లివోలె। మాణిక్యరచితసన్మహితచైతన్యంబు వొందినపుత్తడిబొమ్మవోలెఁ। లలి
తవిభ్రమరుచికళాలక్షణములఁ। బొసఁగ రూపైన శృంగారరసమువోలె। నర్థిఁ జరియించుచున్న పద్మాయతాక్షిఁ। బ్రకట
సద్గుణభద్ర సుభద్రఁ జూచి॥ వ॥ అప్పు డాయంజనియ రథంబు పైనిడికొని పోవుచుండంగ నుంగొని యదుబలంబులు పాదం
బున నంటం దాఁకిన నప్పు డయ్యాఖండలనందనుండు ప్రచండగాండీవకోదండనిర్ముక్తకాండంబులఁ దూలించి యఖండబా
హాదండవిజయప్రకాండుండై ఖాండవప్రస్థపురంబునకఁ జెగె-నట బలభద్రుండ వ్వార్త విని విలయసహాయసమీరసఖుండై
వడిం బటురోషభీషణాకారుండై క్రోధించినం గని కృష్ణుం డాదిగాఁ గల బంధుజనంబు లతని చరణంబులకుం బ్రణమిల్లి స్ప
చుమధురభాషణంబుల ననునయించి యొడంబడునట్లుగా నాడిన నతండును సంతుష్టుండై మనంబునఁ గలంక దేరి యప్పుడు॥
క॥ కరులం దేరుల నుత్తమ। హరుల న్మణిహేమభూషణాంబరభృత్యో। త్కరదాసికాజనంబుల। నరణముఁ దగ నిచ్చి పంపె నసను
జకుఁ బ్రీతిన్॥ వ॥ ఇట్లు కృష్ణునకభిమతంబుగా నర్జునసుభద్రలకరణం బిచ్చి పంపె నని చెప్పి శుకయోగీంద్రుండు మఱియు ని

### శ్రీకృష్ణుఁడు ఋషిసమేతుండై మిథిలానగరమునకుఁ బోవుట.

ట్లని యె॥ సీ॥ నరనాథ విను భువనప్రసిద్ధంబుగ దీపించు నట్టి విదేహదేశ। మందు భూకాంత సువాననదర్పణంబనఁ దనర్చిన మిథి
లను పురమునఁ గలఁడు శ్రీహరిపాదకంజాతభక్తుండు గళితరాగాదివికారుఁ డమల। చరితుఁ డక్రోధుండు శాంతుండు నిగ
మార్థకోవిదుండగు శ్రుతదేవుఁ డనెడి। భూసురోత్తముఁ డొకఁ డనిచ్ఛాసమాగ। తంబు తుషమైన హేమశైలంబుగాఁగఁ
దలఁచి పరితోషమందుచుఁ దగ గృహస్థ। ధర్మమున నుండె సముచితకర్ముఁ డగుచు॥ ఉ॥ ఆపురి నేలువాఁడు బహులాశ్వుఁ డనా
నుతికెక్కినట్టి ధా। త్రీపతి యాధరామరుసరీతిని నిష్కలుషాంతరంగుఁడై। యేపనులం దధర్మగతి నేమఱకర్థిఁ జరించు
చుండె లక్ష్మీపతి వారిపైఁ గరుణఁ జేసి ప్రసన్నముఖాంబుజాతుఁడై॥ వ॥ అట్లు కృష్ణుండు వారలం జూచువేడ్క నిజస్యంద
నారూఢుండై నారదవామదేవాత్రికృష్ణద్వైపాయనాసితరోమశారుణదివిజగురుకణ్వమైత్రేయచ్యవనులును నేనును
మొదలైన మునులను గమింపం జనుచుఁ దత్తద్దేశనివాసులగు నానర్తక, ధన్వ, కురుజాంగల, కంకణ, మత్స్య, పాంచాల, కుం
తల, మధు, కేకయ, కోసలాది భూవరులు వివిధవస్తుప్రచయంబులు గానుకలిచ్చి సేవింప గ్రహమధ్యగతుండై దీపించు సూ
ర్యునిం బోలి యప్పుండరీకాక్షుండు మందస్మితసుందరవదనారవిందుండగుచు వారలం గరుణార్ద్రదృష్టిఁ జూచి యోగక్షే
మంబులరసి సాదరంబగు భాషణంబుల నాదరించుచుం గతిపయప్రయాణంబులం జనిచని విదేహనగరంబు డాయుటయు నా
బహులాశ్వుండ మ్మాధవు రాక విని మనంబున హర్షించుచు వివిధపదార్థంబులు గానుకలుగాఁ గొని తానును శ్రుతదేవుండ
ను భూదేవుండును నెదురుగాఁ జనుదెంచి యప్పుడు॥ ఉ॥ ఆమునికోటికి న్వినయమారఁగ వందన మాచరించి యా। తామరసా
క్షలోచనుఁ డుదారచరిత్రుఁడు పాపగోత్రసు। త్రాముఁడు భక్తలోకశుభదాయకుఁడై నరమేశు సద్గుణ। స్తోమునిపాదప
ద్మములు సోఁకగ మ్రొక్కిన విప్రులై తగన్॥ చ॥ కరములు మోడ్చి యో పరమకారుణికోత్తమ నీవు నీ మునీ। శ్వరులును మద్గృ
హంబునకు వచ్చి మమున్ గృప చేసి యిచ్చట। న్గరమనురక్తిఁ బూజనలు గైకొనుఁ డంచు నుతించి వేఁడ నా। హరి మనమందు వారి
వినయంబులకెంతఁ బ్రమోదమందుచున్॥ చ॥ తిరముగ వారి యిష్టములు దీర్పఁ దలంచి మురాసురారి యొం। డొరుల నెఱుం
గకుండ మునియూథముఁ దానును నేఁగి వారి మం। దిరముల కేక కాలమున నధీరత నాధరణీవరుండు వా। రిరుహదళాయతాక్షు
మునిబృందములం గనకాసనంబులన్॥ సీ॥ కూర్చుండ నియమించి కోమరారు కాంచనకలధౌతకలశోదకముల చేరఁ। బాదము
ల్గడిగి తత్పావనజలములు దానును సతియు బాంధవజనంబుఁ। గరమర్థి నిజమస్తకంబుల ధరియించి వివిధార్చనములు సద్విధి
నొనర్చి। మణిభూషణాంబరమాల్యానులేపనరాజితధూపనీరాజనములు। భక్తిఁ గావించి పరిష్కృతబహువిధాన్న। పాయ
సాపూపపరిపక్వఫలములొలి। నారగింపంగఁ జేసి కర్పూరమిళిత। లలితతాంబూలములు నెయ్యమలర నొసఁగి॥ వ॥ ఇట్లు సమ

ర్పించినయనంతరమ్మునమ్మిథిలేశ్వరుండైనజనకుండుపరమానందంబునొందె॥ చ॥హరిపదపద్మయుగ్మమునిజాంకతలం బునఁజేర్చి యొత్తుచుం।బురుషవరేణ్య యీనిఖిలభూతగణావలియాత్మలందును। స్థిరమతిఁగర్మసాక్షివి సుధీవరనీపదభక్త కోటితో।నరయరమాశివాంభవచతురాస్యులుఁబోలరటండ్రు రెప్పుడున్॥ వ॥అట్టిలోకవిదితంబైనభవద్వాక్యంబునిక్కంబు గాభవదీయపాదారవిందంబులందనోకానొకవేళలేశమాత్రధ్యానంబుగలనాగృహంబునకకించనుండని చిత్తంబునం దలంపకభక్తవాత్సల్యుండవగుటం జేసివిజయము చేసితిరి-భవత్పాదపంకేరుహధ్యానసేవారతిం దగిలినమహాత్ము లుద్వ ధ్యానంబులువదలంజాలుమ రేనిరంతరంబును శాంతచిత్తులై నిష్కించనులై యోగీంద్రులై నీవలనం గోరికెగలవారలకు నినైననిత్తువుగదాయని వెండియునిట్లనియె॥ గీ॥కృష్ణపరమాత్మ యదుకులక్షీరవార్ధి।పూర్ణచంద్రమ దేవకీపుత్ర సుజన। వినుతనారాయణాచ్యుత వేదవేద్య।భక్తజనపోషపరితోషపరమపురుష॥ ఉ॥శ్రీపురుషోత్తమాఖ్యయదుసింహకిశోరకభ క్తలోకర।తాపరతంత్ర నీవుమునిసంఘముగొన్నిదినంబులుండవే।నీపదపద్మరేణువులునెమ్మిమదీయగృహంబుసోఁకినన్। దాపసవంద్య యేనిపుడ ధన్యుఁడనయ్యెదఁగాదె మాధవా॥ వ॥అనియభ్యర్థించినం బ్రసన్నుండై యప్పుండరీకాక్షుండు నిమికులప్రదీపకుండైనజనకచక్రవర్తిం గరుణించి యమ్మిథిలానగరంబునం బౌరజనంబులకు నున్నతశోభనంబులుగావించుచుం గొన్నిదినంబులుండె నంత॥ మ॥ శ్రుతదేవుండును మోదియై మునిజనస్తోమంబుతో నిందిరా।పతిఁదోకొంచు నిజాలయంబునకు నెప్పన్నేఁగియచ్చోటస।మ్మతిదర్భాస్తరణంబులన్నునిచి సమ్యగ్జ్ఞానపారీణుఁడై।సతియుందానుపదాబ్జముల్గడిగిచంచద్భక్తిఁదత్తోయముల్॥ చ॥శిరములఁదాల్చినవ్యతులసీదళదామసుమప్రసూనవి।స్ఫురదరవిందమాలికలఁబూజయొనర్చిగృహాంధకూపసం।చరణుఁడనైననాకడకుఁజక్రిదనంతనేవచ్చునట్టిసు। స్థిరమతిమున్నునేతపముఁజేసితినంచునుసంతసించుచున్॥ గీ॥మఱియుఁదత్పాదతీర్థంబుమందిరమునఁ।గలయఁజిలికించి సంప్రీతిఁగడలుకొనఁగ।బత్రఫలపుష్పతోయముల్భక్తినొసఁగి।హరిమురాంతకమూర్తినిజాత్మనిలిపి॥ గీ॥మానితంబగువిశ్వనిధానమూర్తి।యైనకృష్ణుండుతనయింటనారగించె।దనమనోరథసిద్ధియుఁదనకునబ్బె।ననుచుఁబైపుట్టముల్లార్చి యాడుచుండె॥ చ॥ తరుణియుఁదానుఁబుత్రులుపదంపడికృష్ణుభజించుచుండఁదచ్చరణములంకపీఠమునఁజాఁచిన మెల్లననొత్తుచున్ రమా।వరుఁగని పల్కె భక్తజనవత్సలమామకభాగ్యమెట్టిదో।హరచతురాస్యులున్నెఱుఁగనట్టినినుంగనుఁగొంటి నెమ్మితోన్॥ క॥మునియోగిమానసస్ఫుట।వనజంబులనెల్లఁ బ్రొద్దువసియించుభవ।త్ఘనదివ్యమూర్తి నాలో।చనగోచరమయ్యెఁగాదె సర్వాత్మహరీ॥ వ॥ దేవా నీసచ్చరిత్రంబులుకర్ణరసాయనంబులుగానాకర్ణించుచునీకుంబూజలొనర్చుచు నీచరణారవిందంబులకువందనంబులుసేయుచునీదివ్యనామసంకీర్తనంబుసేయుచుందమశరీరంబులుభవదధీనంబులుగామెలంగునిర్మలబోధాత్ములగువారిచిత్తంబులనుదర్పణంబులంగానంబడుచుందువు-కర్మవిక్షిప్తచిత్తులైనవారిహృదయంబులనుండియుదూరగుండవగుదువనిమఱియునిట్లనియె॥ సీ॥నీకుమ్రొక్కెదఁగృష్ణనిగమాంతసంవేద్యలోకరక్షణభక్తలోకవరద।నీపాదసేవనానిరతునినన్నునేపనిఁబంపెదానతిమ్మనినఁగృష్ణుఁ।డెలనవ్వుమోమునఁజెలువొందనావిప్రకరమాత్మకరమునఁగదియఁజేర్చి।పాటించియతనితోఁబలికెఁదపశ్శక్తివరలినయమ్మునివర్యులెపుడుఁ।దమపదాంబుజరేణువితానములను।దగులలోకంబులనుబవిత్రంబుసేయు।వారునునుఁగూడియెప్పుడువలయునెడల।కరుగుదెంతురునీభాగ్యగరిమనిటకు॥ వ॥ చనుదెంచిరిపుణ్యస్థలంబులును విప్రులును,దేవతలును,సంస్పర్శనదర్శనార్చనంబులంబ్రాణులనుసమస్తకిల్బిషంబులంబాయంజేయుదు రదియునుంగాక బ్రాహ్మణుండుజననమాత్రంబునజీవకోటియందుఘనుండైయుండు జపతపోధ్యానాధ్యయనాధ్యాత్మలంజతురుండయి మత్కళాశ్రయుండయ్యేనేనియతండుత్తముండై వెలుంగునతనింజెప్పనేలయనిమఱియునిట్లనియె॥ క॥ వావుదివిప్రులపైఁగల।ప్రేమము వాతనువునందుఁబెట్టనికతన।న్భూమీసురులర్హులునీ।వీమునులంబూజసేయుమిద్ధచరిత్రా॥ క॥ ఇదియే వాక్ప్రమునను।బదివేలవిధంబులాలయిభజియించిననా।నుదికింపగునటుగావున।వదలనిభక్తిన్భజింపువసుధామరులన్॥ క॥అనిసర్వలోకగురుఁడగు।వనజోదరుఁడానతిచ్చువాక్యంబులజా।డనెభూమీసురుఁడమ్ముని।జనులకుసద్భక్తిఁబూజసలిపెన్వరుసన్॥ చ॥ఎనయఁగఁగృష్ణుఁడంతమిథిలేశ్వరభూసురులన్కృపావలో।కనమొలయన్ననూనసుభగస్థితిఁబొందఁగఁజేసివారివీ।క్షానిరతమెక్కుదివ్యమునికోటియుఁదానునువచ్చెఁగ్రమ్మఱ।న్జ్ఞనవరమోక్షదంబగుకుశస్థలికింబ్రముదాంతరంగుఁడై॥

### శ్రీశ్రుతిగీతలనుపరమతత్త్వార్థప్రతిపాదకమైనపురాతనేతిహాసము.

వ॥అనిచెప్పినబాదరాయణికినభిమన్యునందనుండిట్లనియె-మునీంద్రా ఘటపటాదివస్తుజాతంబుభంగినిర్దేశింపనర్హంబుగాకసత్త్వాదిగుణశూన్యంబైనబ్రహ్మంబునందు సత్త్వాదిగుణగోచరంబులైనవేదంబులేక్రమంబునంబ్రవర్తించునటి

చంపంబు నాకెఱింగింపుమనిన భూవరునకు మునివరుం డిట్లనియె. సకలచేతనాచేతనాంతర్యామియైన సర్వేశ్వరుండు సర్వశబ్దవాచ్యుండు గావున సకలజంతునివహంబులకు బుద్ధీంద్రియమనఃప్రాణశరీరంబుల నుసృజియించి చేతనవర్గంబునకు జ్ఞానప్రదుండు గాన సకలనిగమసమూహంబులును, తత్స్వరూపగుణవైభవప్రతిపాదకంబులు గావున ముఖ్యంబై ప్రవర్తించు శ్రుతిస్తోత్రంబు పనిషత్తుల్యంబు నేకపూర్వఋషిపరంపరాయాతంబును నైన దీనిని శ్రద్ధాయుక్తుండై యెవ్వండనుసంధించు నతనికి మోక్షంబు సులభంబు దీనికి నారాయణాఖ్యానం బను నొక్క యుపాఖ్యానంబు గలదు వినిపింతు వినుము. భగవత్ప్రియుండైన నారదుం డొక్క నాఁడు నారాయణాశ్రమంబునకుం జని ఋషిగణసమేతుండైన నారాయణఋషిం గనుంగొని నీవు నన్నడిగినట్ల నారదుం డమ్మహాత్ముని నడిగిన నతండు మున్ను నీయర్థంబు శ్వేతద్వీపవాసులైన సనకసనందనాదిదివ్యయోగీంద్రులు ప్రశ్న సలిపిన వారలకు సనందనుండు వాక్రుచ్చిన ప్రకారంబు నీ కెఱింగించెద నని వక్కాణింప దొడంగె- శయానుండైన రాజశ్రేష్ఠునిం దత్పరాక్రమసత్తాదిచిహ్నంబుల నుతియించు వందిజనంబుల చందంబున జగదవసానసమయంబున ననేకశక్తియుతుండై యోగనిద్రావశుండైన సర్వేశ్వరుని వేదంబులు స్తోత్రంబు సేయువిధంబు నారాయణుండు నారదునకుం జెప్పిన తెఱంగున వినుమనియిట్లనియె॥ సీ॥ జయజయహరి దేవ సకలజంతువులకు జ్ఞానప్రదుఁడవు గాన వారి। వలనదోషంబులు గలిగిన సుగుణసంతానంబు గాఁ బరిజ్ఞానశక్తి। ముఖ్యషడ్గుణపరిపూర్ణతఁ జేసి మాయాత్మవిశిష్టుఁడవగుచుఁ గార్య। కారణాత్మకుఁడవై కడఁగి చరించుచున్న నీయందుఁ బయోరుహాక్ష। వివిధామ్నాయములు ప్రవర్తించుఁ గానఁ। బ్రకటత్రిగుణాత్మకంబైన ప్రకృతితోడ। యోగమింతయు మాన్పవే యోగిమాన। సాంబుజాతమధువ్రతయని నుతించి॥ అదియునుంగాక॥ సీ॥ పరమవిజ్ఞానసంపన్నులైనట్టి యోగీంద్రులు మహితనిస్తంద్రలీలఁ। బరిదృశ్యమానమై భాసిల్లు నిమ్మహీపర్వతముఖర ప్రపంచమెల్లఁ। బ్రకటబ్రహ్మస్వరూపము గాఁగఁ దెలియుదు రెలమి నీవు జగద్విలయవేళ। నవశిష్టుఁడవు గాన ననఘ నీయందు నీవిపులవిశ్వోదయవిలయములగు। ఘటశరావాదులగు మృద్వికారములు మృదాత్మకంబైనయట్లు పద్మాయతాక్ష। తవిలి కారణరూపంబుఁ దాల్చి లీలఁ। గడఁగి నీయందు బుద్ధివాక్కర్మములను॥ క॥ అలవడఁ జేయుచునుందురు। బలుకోనియిలఁ బెట్టఁబడిన పదవిన్యాసం। బులు పతనకారణములుగ। నిలవుల సేవించుచును కృతార్థులరగుచుఁ॥ క॥ లీలం బ్రాకృతపూరుష। కాలాదికనిఖిలమగు జగంబుల కెల్లన్। మాలిన్యనివారకమగు। నీలలితకథాసుధాబ్ధి నింద్రుంకతిగఁ॥ చ॥ భరితనిదాఘతప్తుఁడగు పాంథుఁడు శీతలవారిఁ గ్రుంకిన। ఘోరమగు తాపముం దొరఁగుకైవడి సంసరణోగ్రతాపము। న్వైరవునఁ బాయుచుండుదురు నిన్ను భజించు మహాత్ములర్రా। మరణమనోగుణంబులఁ గ్రసింబునఁ బాయుట సెప్ప నేటికిఁ॥ అదియునుంగాక॥ సీ॥ అనయంబు దేహినిత్యానిత్యసద్వలక్షణమునఁ బంచకోశవ్యవస్థలను వృద్ధిఁ బొరయుచునంబులోపలనున్న ప్రాణాదిబుద్ధివిజ్ఞానమయము। లను చతుష్కోశంబులవ్వల వెలుఁగొందు వానందమయుఁడవు గాన దేవ। సుఖచిరస్వప్రకాశుండవు నీపరిగ్రహము గల్గుటఁ జేసి కాదె ప్రకృతి। మహదహంకారపంచతన్మాత్ర గగన। పవన తేజోంబుభూభూతపంచకాది। కలితతత్త్వంబు బ్రహ్మాండకార్యకరణ। మందు నెపుడు సమర్థంబులగుటఁ జేసి॥ క॥ కోరి శరీరులు భవదనుసారంబున నిహపరైకసౌఖ్యంబులఁ బెం। పారఁగ నందుచునుందురు। ధీరజనోత్తములనంగ దివిజారిహరా॥ గీ॥ నిన్ను ననుసరింప నేరని కుజనులు। పవనపూర్ణచర్మభస్త్రిసమితి। వోలెఁ జేయుచుందురుచ్ఛ్వాసనంబులు। బలసి యాత్మభేదభజనులగుచు॥ సీ॥ దేవ కొందఱు సూక్ష్మదృక్కులైనట్టి మహాత్ములు వరస్థిరులైన వహ్ని। గామదిఁ దలఁతురు గైకొని మఱికొందఱారుణులను పేరనమరు ఋషులు। లీలసుషుమ్నానాడీమార్గగతుఁడవై హృత్ప్రదేశమునఁ జరించుచున్న। రుచిరదేహాకాశరూపిగా భావింతు రట్టి హృత్పద్మంబునందు వెడలి। వితతమూర్ధన్యనాసికాగతులనోలి। బ్రహ్మరంధ్రంబుఁ బ్రాపించి పరమపురుష సుమహితానందమయపరంజ్యోతి నైన। యీశునిన్ఁ బొందు మఱి పుట్టరిల మహీశ॥ వ॥ మఱియు వివిధకాష్ఠాంతర్గతుండైన వాయుసఖుండు దగ్ధదోషంబునం బొరయక నిత్యశుద్ధుండై తరతమభావంబున వర్తించు చందంబున స్వసంకల్పకృతంబులైన విచిత్రశరీరంబులందు నంతర్యామివై ప్రవేశించి తత్తద్విచిత్రదేహాగనియతంబైన హేయంబునం బొరయక సకలాత్మకంబై నేకరసంబై బ్రహ్మంబైన నిన్ను నైహికాముష్మికఫలసంగముంబు లేక విగతరజోగుణంబులం దగిలి కొందఱు భజియించుచుండుదురదియునుంగాక దేవా భవదీయసంకల్పాధీనంబులైన శరీరంబులం బ్రవేశించియున్న జీవసమూహంబు నీకు శేషభూతంబని తెలిసి కొందఱు భవనివారకంబైన శ్రీమత్త్వచ్చరణారవిందంబులు సేవించి కృతార్థులగుదురు మఱియును॥ సీ॥ అనఘ మస్సగమమైన యాత్మతత్త్వంబుఁ బ్రవర్తించుకొఱకు దివ్యంబులైన। యుచితరామకృష్ణాద్యవతారముల్ జేయుంచియున్న నీభవ్యచరిత। మనుసుధాంభోనిధినవగాహనము సేసి విశ్రాంతచిత్తులై వెలయుచుండ్రి। మోక్షంబు బుద్ధిని పేక్షిం

పనొల్లరు మఱియుఁ గొందఱు భవచ్చరణపంకజములు వగిలి పుణ్యతములైన హంసలవడువునొంది భాగవతజనములఁ గ్న
రువారు ప్రకటయోగిజనాప్తమైనట్టి ముక్తిఁ గోరరాత్మలందు॥ ఉ॥ కొందఱు నీశరీరములకుం దితభక్తిభవద్వశంబులై
దఁగనీపదాబ్జములు సేవించి భజించుచుఁ దత్సుఖాత్ములై యుందురు కొందఱీతనువులోలి ధరించి భవత్పదాబ్జములొప్పంగఁ గ్గ
ల్పలేక నిలఁబుట్టుచుఁ జచ్చుచునుందురవ్యయా॥ చ॥ యమనియమాన యోగమహిమాత్మకులైన మునీంద్రులు న్విరోధమ
నఁదలంచు చైద్యవసుధావరముఖ్యనృపుల్ఫణీంద్రభో। గములనఁ నొప్పుబాహువులుగల్గినమిమ్ము భజించు గోపికల్। గ్రప
మునఁ నేము నున్నరియకా మెభవత్కృపకంబుజోదరా॥ మ॥ అరవిందాక్షభవత్స్వరూపములఁ బ్రత్యక్షంబునం గానఁ నెవ్వ
రికింబోలదు శాస్త్రగోచరుఁడవై వర్తింతు పీసృష్టిముం। ధరస ద్రూపుఁడవైన నీవలన నీధాత్రాద్యమర్త్యుల్జనిం। దిరిసి నన్నంత
కము న్నెఱుంగఁగలమే చింతింప నేమచ్యుతా॥ వ॥ అట్టి నిన్నుం బరమాణుకారణవాదులైన కణ్వగౌతమాదులును బ్రకృతి
కారణవాదులైన సాంఖ్యులును దేహాత్మవాదులైన బౌద్ధులును వివిధంబులైన కుతర్కంబులచేతం బరస్పరావ్యాహతం
బులైన నానాగంబులు నమతను కుతర్కవాదంబుల సమర్థించుచు నిన్నుం దెలియలేరు మహాభాగ్యవంతులైన యోగీంద్రులకు
ప్రత్యక్షంబైన నివియన్నియు నసత్యంబులని కానవచ్చు- వెండియుఁ గొందఱు సచరాచరవస్తుజాతంబులకు నంతర్యా
మివైన సర్వంబు నీవయగుటం దెలియలేక యనిత్యంబనియును విపరీతబుద్ధిం దెలియుదురు గాని భవదీయదివ్యతత్వంబు నిక్కం
బుగఁ దెలియనేరరు కొందఱు జగద్భరితుండవు గాన జగద్రూపకుండవైన నిన్నుం గటకముకుటకర్ణికాదివివిధభూషణభేదం
బులం గనకంబు నిజస్వరూపంబు విడువక వర్తించు చందంబున జగద్వికారానుగతుండవయ్యును నిఖిలహేతు ప్రత్యనీకక
ల్యాణగుణాత్మకుండవై యుండుదువని యాత్మవిదులైన వారు దెలియుదురదియునుంగాక॥ మ॥ వనజాతాక్ష భవత్పదాబ్జ
యుగసేవాసక్తులైనట్టి యజ్జనముల్మృత్యుశిరంబుఁ దన్నిఘనసంసారాంబుధిన్ దాటి పావనులై లోకములం బునీతము
లుగా వర్తించుచున్నిత్యశోభనమై యొప్పెడి ముక్తిఁ బొందుదురు శుంభద్వైభవోపేతులై॥ మ॥ మిము సద్భక్తిభజింపనొ
ల్లకిలమర్త్యే ధన్యులవ వర్తించు నీచమతివ్రాతము నేర్పునం బసులఁ బాశశ్రేణిబంధించుచం। దమున స్నైకగుణాఖ్యరూపముల
చేత న్వారిబంధించి మగ్నను సంసారపయోధిఁ ద్రోతువు కరత్కంజాతపత్రేక్షణా॥ వ॥ దేవా కర్మమూలంబులైన పాణిపా
దంబులు లేనివాఁడవయ్యును స్వతంత్రుండవు బ్రహ్మాదులు భవత్పరతంత్రులై యుండుదురు- స్థిరచరరూపంబులుగల చేతన
కోటికి నీవు సర్వవిధినియంతవు కావున నీక్కృపావలోకనంబుగలవారికి మోక్షంబు కరస్థితంబై యుండు భవత్కృపావలోక
నంబు లేనికష్టాత్ములనష్టాత్ములై దుర్గతిం గూలుదురట్టి జీవులు దేవతిర్యఙ్మనుష్యస్థావరాదిశరీరంబులు సొచ్చి యణురూపులై
యుందురంతయు నీవుందువు తదంతరాత్మవగుచు మఱియును॥ క॥ సుడిదలపోయఁగ జలబుద్బుదములు ధరఁబుట్టి పోవుపోలికెఁ గ
లయి। త్రిదశాదిదేహములలో। వనలక వర్తించు నాత్మవర్గములోలిన్॥ గీ॥ ప్రళయవేళ నీవు భరియింతువంతకుఁ। గారణం
బవగుటఁ గమలనాభ। భక్తపారిజాత భవభూరితిమిరది। నేశ మత్తదైత్యనాశ కృష్ణ॥ చ॥ అనఘ జితేంద్రియస్ఫురణులయ్యు
ను జంచలమైన మానసంబను తురగంబు బోధమహితాత్మవివేకపునూలి త్రాటనల్లనఁ గదియంగఁ బట్టనుదలంచుచు ముక్తి
కుపాయలాభమే। యనువున లేమికిన్వగలనొందెదు నాత్మలు పోతలంపఁగన్॥ చ॥ గురుపదపంకజాతములు గొల్వని వార
లు వోమహోబ్ధిని। స్తరణకుఁ గర్ణధారరహితంబగు నావను గ్రహించుచే। హరిగతి భూరిదుస్తరభవాంబుధిలోన మునుంగు
చుందురం। బురుహదళాక్ష నిత్యపరిపూర్ణుఁడవై తనరారు నిన్నొగిన్॥ గీ॥ పుత్రదారగృహక్షేత్రభూరివిషయ। ఘనసుఖా
సక్తుఁడగుచు నేమనుజుఁడేని। నర్థిభజియించువాఁడు భవాబ్ధిలోనఁ। జెందియన్నాళ్లకును దరిఁ జేరలేడు॥ సీ॥ జగతిపైఁ గల తీ
ర్థసాధనంబుల నెల్లఁ బుణ్యానువర్తనస్ఫురితులగుచుఁ। బాటించి నీయందు బద్ధమత్సరములు లేక భక్తామరానోకహంబు। నగు
భవత్పాదాబ్జయుగళంబు సేవించి భవపాశముల నెల్లఁ బారఁదోలి। సమమతులై యదృచ్ఛాలాభతుష్టమేరు సమముగాఁ
గైకొని సాధులగుచుఁ। బాదతీర్థంబుగల మహాభాగవతజ। నోత్తమోత్తములైనట్టి యోగివరుల। వారకెప్పుడు సేవించు
వాఁడు పొందుఁ। బ్రవిమలానందమయ మోక్షపదము మఱియు॥ వ॥ సత్తైన ప్రకృతివలన నుత్పన్నంబైన యీ జగత్తు సత్తుగా
వలయునని యొట్లనినం గనకోత్పన్నంబులైన భూషణంబులు గనకమయంబులై కానంబడు చందంబున నని సాంఖ్యుండు వలి
కినవిని, యద్వైతవాది యిట్లను- నెయ్యది యుత్పన్నంబు గాదది యుసత్తుం గాదను వ్యతిరేకవ్యాప్తినియమంబు నిత్యసత్యం
బైన బ్రహ్మంబునందుఁ దర్కహతంబగుం గావునం బ్రపంచంబు మిథ్యయని నిరూపించిన నాప్రపంచంబు బ్రహ్మవిశేషణం
బై కార్యకారణావస్థలం గలిగియున్న నంతమాత్రంబున మిథ్య గానేరదా ప్రపంచంబునకుం గార్యకారణావస్థలు నిత్యంబు
లుగావున నవస్థాద్వయయుక్తంబైన ప్రపంచంబు సత్యంబని వెండియు నద్వైతి యిట్లను- బహుగ్రంథప్రతిపాదితంబైన జ

ంగమ్మి భావ్యత్వంబు లేమియెట్లనిననదియునుం గర్మవశులై వజకులనవిద్యాప్రతిపాదకంబై కుతర్కసమేతంబై వభావతియం భపరంపరావ్యవహారంబునం జేసి భ్రమయించు - గారణావస్థలయందు బ్రహ్మవిశేషణంబైనసూక్ష్మరూపంబునం బ్రపంచంబునకైయుండు - వసత్యంబు బాధాయోగ్యంబు గావున నీకు విశేషణంబై యుండుము నీవు దేహగతుండైన దేహియందు నంతర్యామివయ్యుం గర్మఫలంబులం బొరయక కర్మఫలభోక్తయైన జీవునకు సాక్షిభూతంబవై యుండుదువట్టి నిన్ను నజ్ఞులైనమానవులు నిజకంఠలగ్నంబైన కంఠికామణి నిత్యసన్నిహితంబై వెలుంగుచుండినం గానక వర్తించు తెఱంగున హృదయపద్మమధ్యంబున ననంతతేజోవిరాజమానుండవై ప్రకాశించు నిన్నుం దెలియలేరు సకలబ్రహ్మాండనాయకుండవైన నీయందు శ్రుతులు ముఖ్యవృత్తిం బ్రవర్తించునని శ్రుత్యధిదేవతలు నారాయణుని నభినందించిన తెఱంగున సనందనుండు మహర్షులకెఱింగించిన ప్రకారంబు నారాయణఋషి నారదునకుం జెప్పిన నమ్మహాత్ముండు మజ్జనకుండైన వేదవ్యాసమునీంద్రునకు నుపన్యసించె నయ్యర్థంబు నతండు నాకుం జెప్పిన విధంబున నీకుం జెప్పితి నీ యుపాఖ్యానంబు సకలవేదశాస్త్రపురాణేతిహాససారంబు పవిత్రత్వంబు దీనిం బఠించువారును వినువారును విగతకల్మషులై యిహపరసౌఖ్యంబుల నొంది వర్తింతురని చె

## శ్రీ పరీక్షిత్తునకు శుకయోగి విష్ణుసేవా ప్రాశస్త్యంబు చెప్పుట

ప్పిన శుకయోగీంద్రునకు రాజయోగీంద్రుండిట్లనియె॥ మ॥ మునినాథోత్తమ దేవదానవులలో ముక్కంటి సేవించు వారనయంబున్ బహుశక్తిసంపదల సౌఖ్యానందులై యుండ న వ్వనజాతాక్షు రమామనోవిభుని శశ్వద్భక్తి సేవించు న న్మునివర్యుల్ల డుం బేదలౌటకుం గతంబున్నా కెఱింగింపవే॥ సీ॥ నావుడుం శుకయోగివరనాథుండనుం గొనియాను మెఱింగింపుండద్విధముం దెలియ ఘనశక్తిసహితుండు కాలకంధరుండు దావినుతగుణక్రియాన్వితుండు గాన రాగాదియుక్తమై రాగిల్లు సంపదలా తనిం గొలుచువారందుచుందు రచ్యుతుండు పరమునననంతుగుణాతీతుండు పురుషోత్తముని నాదిపురుషుననఘు నర్థి భజియించువారు రాగాదిరహితు లగుచ దీపింతురెంతయు ననఘచరిత ధర్మనందనుండశ్వమేధంబు చేసి పిదప సాత్వికకథనము ప్రీతితోడ॥ ఉ॥ నారదసంయమీంద్రువలన న్వినుచుండియనంతరంబ పంకేరుహనాభుఁ జూచి యడిగెన్ దగనిప్పుడు నీవు నన్ను నిం డారి నభక్తితో నడిగినట్ల యతండును మందహాసనం స్ఫారకపోలుఁడై పలికెఁ బాండుతనూభవుతోడఁ జెచ్చెరన్॥ సీ॥ వసుమతీనాథ యెవ్వని మీఁద నాకనుగ్రహబుద్ధి నొడము నాఘునునివిత్తమంతయుఁ గ్రమమున నపహరించిన వాఁడు ధనహీనుఁడగుచు సంతాపమందు విడుతురు బంధులవ్విధమున నొందిలియై చేయునది లేక యఖిలకార్యభాగంబులుడిగి మద్భక్తులతో మైత్రి నెరపుచు విజ్ఞానవిరతుఁడగుచుఁ బిదప వాఁడవ్యయానందపదము నాత్మఁ బరగి శ్రీవిష్ణులోకసంప్రాప్తినొందుఁ గాన మత్సేవ మిగుల దుష్కరమటంచు వదలి భజియింతు రితర దేవతల నెపుడు॥ క॥ సేవింపవారు జమపుం గా

## శ్రీ శివద్రోహంబు సేయం బూనిన వృకాసురుండు విష్ణుమాయ చేఁ జెడియుట.

వించిన శోభనములు గని నిజములు గా భావించి వారు మఱితురు భావములఁ గృతఘ్నవృత్తిం బవితమపనిగన్॥ క॥ మెలఁగుచునుండురు దీనికిం గలదొక యితిహాసమిపుడు గైకొని నీకుం దెలియఁగ జెప్పెదదానన నలవడు నీవడుగు ప్రశ్నకగునుత్తరముల్॥ క॥ శకుఁడను దైత్యుని తనయుఁడు వృకుఁడను వాఁడొకఁడు దుర్వివేకుఁడు సుజన ప్రకరముల నలఁచ దెరువున వొకనాఁడొదిగుండి దివ్యయోగింగనుచున్॥ క॥ కరములు మోడిచి మౌనీశ్వర వారవలలితధీవిశారద నన్ను న్గరుణించి దయానతీ శుభకరులగు హరిహరహిరణ్యగర్భులలోనన్॥ గీ॥ కడఁగి కొలువ శీఘ్రకాలంబులోదన యిష్టమైన వరములిచ్చునట్టి దైవమెవ్వఁడనిన దానవుఁగనుఁగొని మునివరుండు వలికె ముదముతోడ॥ వ॥ వినుము ముగ్గురు గుణంబులలో నొక్కటి యొచ్చటంగలుగునప్పటన క్షణంబ కోపప్రసాదఫలంబులు చూపువాఁ డమ్మువ్వురయందు ఫాలలోచనుండివ్విధంబుఁ దెలిసినవారై బాణాసురదశకంధరులు సమగ్రభక్తియుక్తులై సేవించి యసమాన సామ్రాజ్యవైభవంబుల నొంది ప్రసిద్ధులైరట్లుగావున నీవునమ్మహాత్ముని సేవింపుము తనివలన నభిమతఫలంబులు వేగంబ ప్రాప్తంబయ్యెడినని చెప్పిన నతండక్షణంబ॥ సీ॥ దీపించు కేదారతీర్థంబునకు నేఁగి యతిసాహసాత్మకుండై నయసుర లోకము ల్వొఱగంద నా కాలకంధరు వరదునినంభి కావరునిం గూర్చి తన మేనికండలుద్దండుడై ఖండించి యగ్ని కాహుతులుగా నలర వేల్చి దర్పకారాతి ప్రత్యక్షంబు గాకున్న జడియక సప్తవాసరములందుఁ బూనిత స్తీర్థమునఁ గృతస్నానుఁడగుచు వెడలు మృత్యువుకోర నా వెలయునట్టి గండ్రగొడ్డంటఁ దన మస్తకంబు దునుము కొనఁగఁ బూనిన నయ్యగ్నికుండమునను॥ క॥ అరుదుగ వెలువడి రుద్రుండు కరుణం దలిర్పంగ వానికరమాత్మకరాంబురుహమునఁ బట్టి తెగువకుఁ జోరవలవదు మెచ్చు వచ్చె సుమహితచరితా॥ క॥ నీమది కోరిన కోరికె తేమైనను వేఁడుమిపుడయిచ్చెదననినన్ దామనమున సంతసపడి యామనుజాశనుఁడు హరుపదాంబుజములకున్॥ గీ॥ వంద

నంబాచరించి వొయ్యింమమకుట। ఫాలలోచనవరదము పాణితలము। నేను నెవ్వనితలమీఁదనిడిన వాని। మస్తకమునూఱు వ్రయ్యలై వడియనీ వె॥ క॥ అని వేఁడిన నమ్మాటకు। విని మదనారాతి నవ్వి విబుధాహితుకో। రిన వరముఁ దయ నిచ్చినఁ। దనుజుఁడు దద్వరపరీక్షఁ దాఁ జేయుటకుఁ॥ అక్షణంబ వరదానగర్వంబున మదవృత్తుండై కడంగి॥ క॥ ఆహరు హస్తకమునఁ గడు సాహసమునఁ జేయి వెట్టఁ జడియక గడియ। నూహించి బూహాతన మెచ్చులు దన। కాహా పైవచ్చినను చనభవుఁడు భీతిఁ॥ క॥ దనుజుఁడు దన వెను వెంటం। జను దేమఁ ల్లోకములును సంత్రాసముఁగై। కొని పాఱ సురలు మనముల। దనికి రిదానికిని బ్రతివిధానము లేమిఁ॥ అట్లు చని చని॥ సీ॥ నిరుపమానందమై నిఖిలలోకములకు నవలదై యెయవ్యృతపదాఖ్యఁ దనరి। దినకర చంద్ర దీపితులకుఁ జొరరాక సలలితసహజ తేజమున వెలుఁగు। సద్ధికంబగు శుద్ధసత్వగరిష్ఠమై కిరమొప్ప యోగీంద్రగవ్యమగుచు। హరిపదధ్యానపారాయణులైన తద్దాసులకు లరునివాసమగుచుఁ। బ్రవిమలానంత తేజోవిరాజమాన। దివ్యమణిహేమకలిత సందీప్తభవ్య। సౌధమంటప తోరణ స్తంభవిపుల। గోపురాకీర్ణ సురము వైకుంఠపురము॥ వ॥ కనుంగొని యమ్మహాస్థానంబు డాయం జనుటయు నప్పుండరీకాక్షుం డఖండవైభవంబునం గుండలీశ్వరభోగతల్పంబునం బరమానందకందలితహృదయారవిందుండై యిందిరానయనచకోరకంబుల నిజమందహాససాంద్ర చంద్రికావితతిం దేల్పుచు నార్తభక్తజనరక్షణంబు పనిగా మెలంగుచు వివిధవినోదంబులం దగిలియుండి యుఫాలలోచనుం డద్దనుజపాలునకుం దలంపక నిచ్చిన వరంబు తన తలమీఁద వచ్చినం గలంగి చను దెంచుట తన దివ్యచిత్తంబున నెఱింగి యక్కాలకంధరుని యవస్థ నివారింపం దలంచి యయ్యిందిరాదేవి తోడి వినోదంబు చాలించి యప్పుడు॥ సీ॥ తాపింఛరుచితోడఁ బ్రస్తరించెడు మేను పసిఁడిముంజియుఁ దగు పట్టుగోఁడుగు। ధవళాంశురుచి జన్నిదంబును చిన్నిదండంబు సేతఁ గమండలంబు। పసపుగోఁచియుఁ జిన్నిపట్టెవర్ధనమును రాజతంబైన మృగాజినంబుఁ। మాలాదుశిగయును వ్రేలు మారటగోఁచి వ్రేలిమి బొట్టును వ్రేళ్లదర్భ। వనరసందీప్త హవ్యవాహనసమాన। కాంతిఁ జెలువొందియవ్యుత క్రమ మెలర్పఁ। జతురగతి నస్థువటుక వేషంబు దాల్చి। వచ్చి యానీచదానవవరునిఁ జేరి॥ వ॥ కైతవంబున నతనికి నమస్కరించి మృదుమధురభాషణంబుల ననునయించుచు నయ్యసురాధమున కిట్లనియె- నివ్విధంబున మార్గపరిశ్రాంతుండవై యింత దూరం బేల చనుదెంచితివి సకలసౌఖ్యకారణంబైన యీ శరీరంబు నిరర్థకంబు చేసి వృథాయాసంబున దుఃఖపడు పందగునే యిప్పుడు గొంతదడవు విశ్రమింపు మీ ప్రయాసంబునకుఁ గతం బెయ్యది కపటహృదయుండవు గాక నీ యధ్యవసాయం బెఱింగింపు మని మృదుమధురంబుగాఁ బలికిన నమ్మహాత్ముని సుధారసతుల్యంబులైన వాక్యంబులు విని సంతసిల్లి యప్పిశితాశనుండు దనపూనిన కార్యం బతని కెఱింగించిన॥ చ॥ హరిదరహాసమొప్పఁ బిశితాశనుఁ గన్గొని పల్కె దానవేశ్వర మును దక్షు శాపమునఁ జాలఁ బిశాచపతౌట సూనృత। స్ఫురణము మాని సంతతము బొంకుచునుండుఁ బురారి మాటలీ। వరయక వెంట నేఁగఁదగదాతని చేఁతలు మాకు వింత లే॥ గీ॥ నిజము వలికె నేని నెఱిదనతలమీఁద। నీకరంబు మోఁపనీకఁ దలఁగి। వచ్చు నోటు నితని వలనఁ బ్రత్యయమును। దగుల నేమి గలదు దనుజవర్య॥ గీ॥ అసుచితోడ నతని నంటఁ గఁ బని గాదు। కాలుఁ జేయిఁ గడిగి కరము వార్చి। యతని వెండ వేడ్క నలుగుమ వేనీవు। నవ తలంటఁ దగులు నసురనాథ॥ మ॥ అతిదుశ్శంకలు మాని సొమ్మ నినదైత్యారాతి మాయా విమో। హితుఁడై విస్మృతినొంది తామసమునన్నేపారి వాఁడాత్మపా। ణితలంబుఁ దన నెత్తి మోపికొని తా నేలన్వెసం గూలె వి। శ్రుతదంభోళిహతిన్ వడింబడు మహాక్షోణీధరంబో యనన్॥ వ॥ అట్లు తన తలనూఱు వ్రయ్యలై నేలం గూలిన యసురం గని యప్పుడు॥ క॥ సురలసురాంతకు మీఁద। న్సురమందార ప్రసూనవర్షము లోలి। న్గురిసిరి తుములంబై దివి। మొరసెన్సురదుందుభిప్రముఖతూర్యంబుల్॥ క॥ పాడిరి గంధర్వోత్తము। లాడిరి దివి నప్సరసలు నన్యోన్యముగ। న్గూడిరి గ్రహములు భయములు। వీడిరి ముని కోటులంత విమలచరిత్రా॥ క॥ మురహరుఁ డెలనవ్వొలయఁగఁ। బురహరుఁ దగఁ జూచి పలికె భూతేశ్వర యీ। నరభోజనుండు నీకిత్తఱి నెగ్గొనరింపఁ దలఁచి తా నేపాలి సెఁ॥ వ॥ అదియట్టిది కాదె యిజ్జగంబున నధికుండై నవానికి నపకారంబు గావించిన మానవులకు శుభంబు గలుగునే యది యునుంగాక జగద్గురుండవగు నీకవజ్ఞఁ దలంచు కష్టాత్ముండు వొలియుటం జెప్ప నేల నట్టి దుష్టచిత్తులకిట్టి వరంబు లిచ్చుట కర్జంబు గాదని యప్పురాంతకు వీడ్కొలిపిన నతండు మురాంతకుని ననేకవిధంబుల నభినందించి నిజమందిరంబునకుం జనియె నని చెప్పి యిట్లనియె॥ క॥ మానవనాయక యీయాఖ్యానము చదివినను వినిన ఘనపుణ్యులు ని। త్యానంద సౌఖ్యములు వెం। పొందుదు రటమీఁద ముక్తిఁ బొందుదు రెల

### భృగుమహర్షి త్రిమూర్తుల ప్రాశస్త్యంబు శోధించుటకుఁ బోవుట.

మిఁ॥ అని చెప్పి శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకిట్లనియె॥ క॥ జననాయక యింకఁ బురాతన వృత్తం బొకటి నీకు దెల వెఱింగింతు। న్వినుము తపోమహిములఁ జెం। దినమునిజనులును సరస్వతీనదిపొంత౯॥ క॥ వితతక్రియ లొప్పఁగను। తక్రతువు

నొనరింపనచటఁ గైకొని లక్ష్మీపతి భవపితామహులలో నతులితముగ నెవ్వఁ డధికుఁ డనితమలోనన్॥ వ॥ ఇట్లు తలపోసి తన్మాహాత్మ్యం బంతయుం దెలిసి రమ్మని భృగుమహామునిన మువ్వురు వేల్పులకడకుం బంపిన నత్తాపసోత్తముండు చని చని ముందటఁ॥ క॥ జలరుహసంజాతు సభా। స్థలమున కొగి నేఁగి యతని సత్త్వగుణంబు। దెలియుటకై నుతివందన। ములు సేయక యున్న నజుండుమునసమసయనుచున్॥ క॥ మనమునఁ గలఁగుచు భృగు తన। తనుజాతుఁ డగుట బుద్ధిఁ దలఁచినవాఁడై। ఘనరోషస్ఫురితాగ్ని। న్ననయము శాంతోదకముల నల్లన నార్చెన్॥ చ॥ మహితతపోధనుండు మునిమండనుఁ డయ్యెడఁ బాసి వెండియున్ శశిపతిభూషుఁ గాన రజతాద్రికి నేఁగి యునగ్గిరీంద్రుపైఁ। మహినమయూఖశేఖరుఁ డుమర్గయుఁ దానును విశ్రమింపుచున్। ప్రహిణతనూభవుండు చనుదెంచుట కాత్మఁ బ్రమోదమందుచున్॥ క॥ కనుఁగొని భ్రాతృస్నేహం। బునఁ గౌఁగిటఁ జేర్ప ననుచు ముక్కంటి రయం। బున నెదు రేఁగిన మునిరు। ద్రుని యందుల సత్త్వగుణముఁ దెలియుటకొఱకై॥ అతనిఁ గైకొనక యసూరసుండిన॥ ఉ॥ ఆనిబిరాంబకుండు కమలాసననందనుఁ జూచి భూరికా। లానలరోష వేగభయదాకృతిఁ దాల్చి పటుస్ఫులింగసం। తానము లొల్కు శూలమునఁ దాపసముఖ్యు నురంబు వ్రేయఁ గాఁ। బూనినఁ బార్వతీరమణి భోరున నడ్డము సొచ్చి చెచ్చెరన్॥ క॥ తన విభు పాదములకు వం। దనముం గావించి సముచితప్రియములన। య్యనలాక్షుని కోపము మా। న్పిన నమ్మునినాథుఁ డచట నిలువక చనియెన్॥ సీ॥ పొలుపొందు వైకుంఠపురమున కర్థితోఁ జని యందు సముధికైశ్వర్యమొప్పఁ। గమలాంకపర్యంకగతుఁడై సుఖించు నక్కౌస్తుభభూషు వక్షస్థలంబుఁ। దనపాదమునఁ బట్టు వన్నెఁ దన్నినఁ బాన్పుడిగి వచ్చి మునిఁ జూచి నగధరుండు। పదములఁ కెఱఁగి యో పరమతపోధన యాగతిని వచ్చుటెఱుఁగ లేక। యున్న నా తప్పు మన్నించి నన్నుఁ గరుణఁ। జూచి యీ దివ్యమణిమయస్ఫూర్తిఁ దనరు। రుచిరసింహాసనమునఁ గూర్చుండు దివ్య। తాపసోత్తమ యభయప్రదాననిపుణ॥ క॥ అలఘుపవిత్రభవత్పద। జలములు ననుఁ నస్మదీయజఠరస్థజగం। బులు లోకపాలురను బొలుపలరఁగ బుణ్యులను జేయు ననఘచరిత్రా॥ వ॥ మునీంద్రా భవదీయపాదాబ్జహతి మద్భుజాంతరంబునకు భూషణంబయ్యె భవదాగమనంబు మాబోటివారికి శుభావహంబు గాదె యేను ధన్యుండనైతి నని మృదుమధురాలాపంబుల ననునయించిన నమ్మునివరుండు లక్ష్మీనాథు సంభాషణంబులకుఁ జిత్తంబున నంబరమానందంబు నొంది యమ్ముకుందు ననంతకల్యాణగుణనిధి నభినందించి యానందబాష్పధారాసిక్తకపోలుండగుచు దద్భక్తిపారవశ్యంబున నొండుపలుక నేరక యతని చేత నామంత్రణంబు వడసి మరలి సరస్వతీతీరంబున నున్న మునుల సన్నిధికిం జనుదెంచి వారలం గనుంగొని॥ సీ॥ మునినాయకులతోడఁ దన పోయి వచ్చిన తెఱఁగును దనమదిస్పష్టమైన। మూఁడు మూర్తుల విధంబును నెఱిఁగించిన విని వారు మనముల విస్మయంబు। నంది చిత్తంబుల సందేహములు వాసి చిన్మయాకారు లక్ష్మీసతీశుఁ। డనుపముఁ డనవద్యుఁ డఖిలకల్యాణగుణాకరుఁ డాదిమధ్యాంతరహితుఁ। డైత నర్చిన పుండరీకాక్షుఁ డొకఁడు। గాకఁ బ్రణుతింపదైవ మొక్కఁడును వేఱొకలఁడె యని బుద్ధివిజ్ఞానకలితులగుచు। హరిపదాబ్జాతయు

## శ్రీకృష్ణుండు మృతులయిన విప్రసుతులఁ దెచ్చుట.

గళంబు నర్థిఁ గొలిచి॥ వ॥ అట్లు సేవించి యవ్వ్యయానందంబైన వైకుంఠధామంబు నొందిరని చెప్పి వెండియు నిట్లనియె॥ సీ॥ నరనాథ యొకనాఁడు నలినాయతాక్షుండు పొలుచు కుశస్థలిపురమునందు సుఖముండ నొక్క భూసురవర్యు భార్యకుఁ బుత్రుండు జన్మించి పుట్టినపుడ। మృతుఁడైన ఘనశోకవితతిచేఁ గ్రాఁగుచు నా డింభకునిఁ గొంచు నవనిసురుఁడు। చనుదెంచి పెలుచ రాజద్వారమునఁ బెట్టి కన్నుల బాష్పాంబుకణములొలుక। బాపురే పతి తనుదుఃఖపఱుపఁ దగునె। యనుచు దూఱుచుఁ దనుఁ దిట్టికొనుచు వగల। డెందమందంద నెఱియ నాక్రందనంబు। సేయుచును వచ్చి యావిప్రశేఖరుండు॥ సీ॥ అధికశోకంబున నలమటఁ బొందుచు నచ్చటి జనులతో ననియెఁ బెలుచ। బ్రాహ్మణద్వేషవంతుఁడై తగ శాస్త్రపద్ధతి నడువక పాపవర్తి। యగు క్షత్రబంధువుఁడగు వాని దురితంబు చేత మత్పుత్రుండు జాతమైన। యప్పుడ మృతుఁడయ్యె నకట హింసకు రోయక నప్పుడన్యాయకారి। యగుచు విషయానుగతచిత్తుఁడై నయట్టి। రాజు దేశంబు ప్రజలు నిరాశులగుచు। దుఃఖములఁ జాలవనటఁ బొందుదురటంచు। నేడ్చుచును నచట నిల్వక నేఁగెనపుడు॥ వ॥ ఇవ్విధంబున మఱియుం దనసుతులు మృతులైన వారలం గొనివచ్చి యప్పటియట్ల పలవరించుచు నవ్విప్రుండు రాజు మొగసాలం బెట్టి రోదనంబు సేయుచు నెప్పటియట్లు కొన్ని గాథలు చదివి పోవుచుండె నవ్విధంబున నెనమండ్రు సుతులు మృతులైన పిదప దొమ్మిదవకుమారుండైన శిశువు నెత్తి తెచ్చి యప్పటివిధంబునఁ బలవరించుచున్న బ్రాహ్మణునిం గని యర్జునుండిట్లనియె॥ క॥ ఈపగిది నీవు వగల। న్వాపోవఁగఁ జూచి యకట వారింపఁగఁ దా। నోపిన విలుకాఁ డొక్కరుఁ। డీపురి లేఁడయ్యె నయ్యయో యిది పాపమగున్॥ సీ॥ పుత్రులఁ గోల్పోయి భూరిశోకంబున వనటఁ బొందుచు విప్రవరులు చాల। నేరాజు రాజ్యమందేని వసించుచు రారాజు దలపోయ నవనిమీఁద। నట్టినిగా నాత్మ నెన్నం దగు

నీపుత్రు నే బ్రతికించెదనిపుడు ప్రాణ। యటు సేయనైతి నేనన లంబు సొచ్చెదనని భూసురుఁడు వెరఁగందఁ బలుక। నతఁడు వినియీ చెడుగు మాటలాడఁదగునె। భూరివిక్రమశాలి రాముండు మేటి। బలుఁడు హరియును ధైర్యసంపన్నులనఁగ। దనరుప్రద్యుమ్నుఁడతనినందనుఁడు మఱియు। గీ॥ వినుతబలులైన యాదవవీరవరులు। గలుగ వారలచేఁగాని కార్యమీవు। చక్కఁ బెట్టెడ యెట్లు నీచ నెడి త్రోవఁ। బొమ్ము నా వుడు నయ్యింద్రపుత్త్రుఁడపుడు॥ క॥ మనమున నమరహంకారము। ఘనముగఁ బొడమ నటయు నవుడు గవ్వడి విప్రుం। గనుఁగొని యచ్చటి జనములు। వినఁగా నిట్లనియె రోషవిహ్వలమతియై॥ మ॥ బలుఁడం గాను మురాంతకుండఁ గాఁ బ్రద్యుమ్నుఁడం గాను నే। నలఁ పాండుతనయుండఁ గాన నివిరుద్ధ వ్రాతముల్ భీషణో। జ్జ్వలగాండీవధనుర్విముక్తనిశితాస్త్ర శ్రేణిచేఁ బీన్గుపెంటలుగావించు పరాక్రమ ప్రకటచండస్ఫూర్తి నే పార్థుఁడన్॥ అదియునుం గాక॥ చ॥ బలిమిమురాంతకుండొడరి బాహువిజృంభణ మొప్ప నెక్కటిన్। దలపడి పోరునట్టి రణధైర్యుని నన్ను నెఱుంగవక్కటా। బెలుకురమృత్యుదేవతను బింకమడంచి భవత్తనూజులన్। లలవుఁ జలంబుఁ జూపి కొని యాడఁగ నిప్పుడె తెచ్చియిచ్చెదన్॥ వ॥ అనిన నమ్మాటకు నియ్యకొని ప్రతిజ్ఞ సుభూసురుండు మనంబున నూరడిల్లి యతని నభినందించుచు నిజమందిరంబున కుం జనికొన్ని దినంబులుండు నంత నతని భార్య ప్రసూతివేళ నాసమయంబైనం జనుదెంచి విప్రుచ్చుం గనితద్విధం బెఱింగించిన నయ్యింద్రతనయుం డప్పుడు॥ చ॥ లలితపవిత్రసంచితజలంబుల నాచమనంబుఁ జేసి సుస్థలమున నిల్చి రుద్రునకు సమ్మతి మ్రొక్కి మహాస్త్రవేదిని ర్మలశుభమంత్రదేవతల మానసమందుఁ దలంచి గాండివం। బలవడ నెక్కుపెట్టి బిగియం గడియించి నిషంగయుగ్మముల్॥ ఇవ్విధంబునఁ గట్టాయితంబై యప్పుడు॥ సీ॥ భూసురు వెంటనిమ్ముల నేఁగి సూతికాభవనంబు చుట్టును బాణవితతి। నరికట్టి దిక్కులు నాకాశపథము ధరాతలంబెల్ల నీరంధ్రముగను। శరపంజరముఁ గట్టి శౌర్యంబు దీపింపఁ గడు నప్రమత్తుఁడై కాచియున్న। యెడ నమ్మహీసురు నింటికిఁ బుత్త్రుండు జనియించెనప్పుడచ్చటి జనంబు। పోయెఁ బోయెఁ గదే యని బొబ్బలిడఁగ। బొందితోడన యాకాశమునకు మాయఁ। జెందినప్పుడు దుఃఖంబు నొంది భూమి। సురుఁడు విలపించుచును మురహరునికడకు॥ అప్పుడు చని॥ క॥ ముందట నిల్చి ముకుంద స। నందనమునివినుత నందనందన పరమా। నందశరదిందుచందన। కుందయశస్సాంద్ర కృష్ణ గోవింద హరీ॥ వ॥ అవధరింపుము దేవా యర్జునుండ నెడి పౌరుషవిహీనుండాడిన వృథాజల్పంబులు నమ్మి పుత్త్రుం గోలుపడి బేలనైన నన్ను నేమందు నిఖిలవిశ్వోత్పత్తిస్థితిలయంబులకుం బ్రధానహేతుభూతుండవైన నీవు సమర్థుండవయ్యు వారిం బంజాలక చూచుచుండ నొక్క మనుష్యమాత్రుండు దీర్పం జాలెడువాఁడు గలండే యని వెండియు॥ క॥ ఎక్కడి పాండుతనూభవుఁ। డెక్కడి పిలుకాఁడు పీని కెక్కడి పవ్వం। బెక్కడి గాండీవము దన। కెక్కడి దివ్యాస్త్రసమితి యేమన వచ్చున్॥ క॥ అని తను నోడక నిందిం। చిన యయ్యర్జునుఁడు చాలఁ జిడిముడిపడుచున్। దనవిద్యను హిమపెంపునఁ। జని యెన్వెస దండపాణి సదనంబునకున్॥ క॥ చని యం దుధారుణీసుర। తనయులు లేకుంటఁ దెలిసి తడయక నింద్రాగ్ని నిరృతి వరుణ సమీరణ। ధనదేశానాలయములు దగఁ బరికించెన్॥ వెండియు॥ చ॥ నరసురయక్షకింపురుష నాగనిశాచర సిద్ధసాధ్య ఖేచరవిహగేంద్ర గుహ్యకపిశాచనివాసములందు రోసి భూ। సురసుతులేఁగినట్టి గతి చొప్పడకుండుటఁ జూచి క్రమ్మఱన్। ధరణికి నేను దెంచి బెడిదంబుగ నగ్ని సొరంగఁ బూనినన్॥ వ॥ ఇవ్విధంబంతయు నెఱింగి యమ్మురాంతకుండు విప్రనందనుల నీకుం జూపెద నగ్ని యనలంబు సొరకుండ నతని నివారించి యప్పుడు॥ ఉ॥ సుందరదివ్యరత్నరుచిశోభితమై తనరారు కాంచనస్యందనమంబుజాక్షుఁడు దయాళువలమెక్కి విధంబు దోఁప శౌరిం దరిదాను నెక్కి తనురశ్ములు దిక్కుతతిన్ వెలుంగఁగాఁ। బిందుఁడు దారలీలఁ జనె విప్రతనూజగవేషణార్థియై॥ చ॥ చని పురగోష్ఠ మగ్గవన జానపదాచల పక్కణప్రభూ। తనదనదీసరోవరయుతక్షితినంతయు దాఁటి సప్తవా। రినిధులు దీవులుం గులగిరిప్రకరంబులను త్తరించి మే। రునగము నాక్రమించుచు మరుద్గతితో రథమేఁగె నత్తఱిన్॥ చ॥ ఘనతరభూరిసంతమసమండలముం దరియంగఁ జొచ్చి సా। హసమునఁ బోవఁ బోవఁగ భయంకరమై మది గోచరింపమిన్। వసుమతి మ్రొక్కరిల్లి రథవాజులు మార్గము దప్పి నిల్చినన్। బిసరుహపత్త్రలోచనుఁడ భేద్యతమఃపటలంబు వాపఁగన్॥ సీ॥ బాలభానుప్రభాభాసమానద్యుతిఁ గర మొప్పు నిజరథాంగంబుఁ బనుప। నమ్మహాస్త్రంబేఁగి దిమ్ముచీఁకటి నెల్ల నఱిమి చెండాడిన నరికినైచి। యగ్రభాగంబున నతులితగతి నేఁగ నామార్గమున నిజస్యందనంబు। గడువడిఁ దోలి యాకడఁ దితమోభూమి గడవ ముందఱ కడఁగాన రాక। మిస్తుటంబుగ దృష్టి మిఱుమిట్లు గొలుప। వదల వెలుఁగొందు దివ్యతేజంబు చూచి। మొనసి గాండీవి గన్నులు మూసికొనుచు। నాత్మ భయమంది కొంత దవ్వఱిగి యఱిగె॥ గీ॥ కడిఁది మర్వారమారుతోత్కటవిధూత। చటుల సర్వాంకపోర్మిభీషణగభీర। వారిపూరంబు సొచ్చి తన్నీరమధ్య। భాగమునఁ గోటిసూర్యుల ప్రభలు వెలుఁగ॥ వ॥ అది మఱియునుం జారుదివ్యమణిసహస్రస్తంభాభిరామంబును నాలంబితకమనీయనూత్నరత్నమాలికాలంకృతంబును భాను

శశిమయూఖాగమ్యంబును ననంతతేజోవిరాజితంబును బునరావృత్తిరహితమార్గంబును నిత్యైశ్వర్యదాయకంబును న
వ్యయంబును నత్యున్నతంబును ననూనవిభవంబును బరమయోగీంద్రగమ్యంబును బరమభాగవతనివాసంబును నైయొ
ప్పునద్దివ్యధామంబునందు॥ సీ॥ సాంద్రశరచ్చంద్రచంద్రికాకర్పూరనీహారహారాభదేహమమర। నిందిందిరేందీవరేంద్ర
నీలద్యుతిఁ గరమొప్పు మేచకకంఠసమితి। నరుణాంశుబింబభాసురపద్మరాగవిన్యస్తసహస్రోరుమస్తకములు। విపృతాననో
ద్గతవిషధూమరేఖలలీలఁ జూపట్టిన నాలుకలును। గలితసాయంతనజ్వలజ్వలనకుండములవిడంబించు వేడిచూపులును గలిగి।
భూరికలధౌతగిరినిభాకారమమరఁ। బరగుభోగీంద్రభోగతల్పంబునందు॥ సుఖాసీనుండై యున్నవానిఁ డాయంజనసప్పుడు॥
సీ॥ సజలనీలాంబుదశ్యామాయమానాంగు నాశ్రితావనముదితాంతరంగు। సనకాదియోగిహృద్వనజమరాళేంద్రుముఖ
పద్మరుచిజితపూర్ణచంద్రుఁ। గమనీయనిఖిలజగద్ధితచారిత్రుఁ బ్రత్యూషసంఫుల్లపద్మనేత్రు। నిందిరాహృదయారవిందా
రుణోల్లాసు శ్రీకరపీతకౌశేయవాసు। హారకుండలకటకకేయూరమకుట। కంకణాంగదమణిముద్రికావినూత్న। రత్ననూ
పురకాంచీవిరాజమాను। భవమహార్ణవశోషసద్భక్తపోషు॥ వ॥ మఱియు సనందనాదిమునిజనసంతతసేవితు, నానందకంద
ళితహృదయారవిందు, నరవిందవాసినీవసుంధరాసుందరీసమేతు, నారదయోగీంద్రసంకీర్తనానందితు, నవ్యయు, ననఘు,
ననంతు, నప్రమేయు, నజితు, నవికారు, నాదిమధ్యాంతరహితు, భవలయాతీతుఁ, గరుణాసుధాసముద్రు, నచ్యుతు, మహాను
భావుఁ, బరమపురుషుఁ, బురుషోత్తము, నిఖిలజగదుత్పత్తిస్థితిలయకారణుఁ, జిదచిదీశ్వరు, నష్టభుజుఁ, గౌస్తుభశ్రీవత్సవక్షు,
శంఖచక్రగదాపద్మశార్ఙ్గాదిదివ్యసాధను, సర్వశక్తిసేవితుఁ, బరమేష్ఠిజనకుండగు నారాయణుం గనుంగొని దండప్రణా
మంబులు సేసి కరకమలంబులు మొగిచి భక్తిపూర్వకంబుగా నభినందించిన నయ్యాదిదేవుండు వారలం గరుణావలోకనం
బులు నిగుడ నవలోకించి దరహాసపూరంబు తోరంబుగా సాదరంబుగ నిట్లనియె॥ క॥ ధరణికి వ్రేఁగగు దైత్యులఁ। బోరిపోరి వధి
యించి ధర్మము నిల్పుటకై। ధర జనియించితిరిరువురు। నరనారాయణులనంగ నాయంశమునన్॥ క॥ ఆరూఢనియతితోఁ
బెం। పారి నమిమునిమ్మునీంద్రులం డటుఁ జూడం। గోరిన మీ వచ్చుటకై। ధారుణిసురసుతుల నిటకుఁ దగఁ దేవలసెన్॥ క॥ అని
యాడింభకులను దో। కొని పాండని యిచ్చి వీడుకొలిపిన వార। ల్వినుతులఁ బెక్కువిధమ్ముల। వినిపించుచు నచటు వాసి విప్రుని
సుతులన్॥ వ॥ తోడ్కొని సంప్రాప్తమనోరథులై యబ్బాలకులం దత్తద్వయోరూపంబులతోడఁ దెచ్చి యాబ్రాహ్మణునకు
సమర్పించిన నతండు సంతుష్టాంతరంగుండయ్యె నయ్యవసరంబున॥ చ॥ అనిమిషనాథనందనుఁడు హర్షితతేజుఁడు గృష్ణుతోఁ
డఁడా। జనియచటం గనుంగొనియు సర్వశరణ్యునిఁ బుండరీకనేత్రు నిజధామవైభవసమున్నతతన్మహనీయకీర్తికిన్ మన
మున మోదమంది పలుమారును సన్నుతిఁ జేసె భూవరా॥ గీ॥ వారిజాక్షుని భక్తమందారు ననఘుఁ। గృష్ణు నఖిలేశుఁ గేశవు జి
ష్ణుఁ బరము। వినుతి సేయుచుఁ దత్పాదవనజములకు। వందనములాచరించి యానందమొందె॥ అంత॥ మ॥ హరి సర్వేశుఁడనం
తుఁడాద్యుఁడభవుండామ్నాయసంవేదిభూ। సురముఖ్యప్రజలన్నమస్తధనవస్తుశ్రేణి నొప్పారఁగాఁ। బరిరక్షించుచు ధ
ర్మమున్నిలుపుచున్బాపాత్ములన్ ద్రుంచుచున్। స్వరమోత్సాహమెలర్పభూరిశుభవిభ్రాజిష్ణుఁడై ద్వారకన్॥ క॥ జనవినుత
ముగాఁ బెక్కుస। వనములు దనుఁదానగూర్చి వైదికయుక్తి। న్నొనరించుచు ననురాగము మనమునఁ దళుకొత్తదైత్యమర్దను

### లీలామానుషవిగ్రహుండగు శ్రీకృష్ణునివంశానుక్రమము.

ఁ డెలమిన్॥ వ॥ అట్లు కృష్ణుండు ద్వారకానగరంబునఁ బూజ్యంబగు రాజ్యంబు సేయుచుఁ బురందరవిభవంబున నిరవొందిక న
కమణిమయవిమానమంటపగోపురప్రాసాదసౌధచంద్రశాలాంగణాదివివిధభవనంబులందును; గంగదుత్తుంగతరంగడో
లావిలోలకలహంసచక్రవాకకారండవసారసక్రౌంచముఖజలవిహగవిలసదుచ్ఛలితగరుదనిలదరదమలకమలకుముదక
ల్హారసందోహనిష్యందమకరందరసపానమదవదిందిందిరకులకలగాయకఝుంకారనినదంబులును, నిరంతరవసంతసమ
యసముచితపల్లవితకోరకితబాలరసాలజాలలాలితకిసలయవిసరఖాదనజాతకుతూహలాయమానకషాయకంఠకలకంఠ
కలరవమృదంగఘోషణంబులును, నిశితనిజచంచూపుటనిర్దళితసకలజననయనానందసుందరనందితమాకందపరిపక్వఫల
రంధ్రవిగళితమధురరసాస్వాదనముదితరాజకీరశారికానికరమృదుమధురవచనరచనావంశకృత్యంబులు, నమరపురంధ్రీ
జనపీనపయోధరమండలవిలిప్తలలితకుంకుమపంకసంకులసౌగంధ్యానుబంధబంధురగంధానుమోదితుండును, జందనాచ
లసానుదేశసంజాతమంజులమాధవీలతానికుంజపుంజమంజులకింజల్కరంజితనివాసవిసరవిహరమాణశబరికాకబరికా
పరిపూర్ణసురభికుసుమమాలికాపరిమళవహుండును, గళిందకన్యకాకల్లోలసందోహపరిస్పందకందళితమందగమనుండు
ననగు మందానిలవిదూషకుని చేఁ బోషితాభ్యాసితలాలితలగు వేలాలతావితానసటులనటనంబుల విరాజితంబులగు కా

సారతీరభాసురోద్యానంబులందును, జారుఘనసారపటీరబాలరసాలసాలనీపతాపింఛజంబూజంబీరనింబకదంబప్రముఖముఖ్యశాఖిశాఖాకీర్ణశీతలచ్ఛాయావిరచితవిమలచంద్రకాంతోపలవేదికాస్థలములందు, నుదంచితపింఛవిభాసితబాలనీలకంఠకేకారవాకులీకృతకృతకమహీధరంబులందును, లలితమణివాలుకానేకపులినతలంబులందును, కప్పురంపుదిప్పలను, కురువేరుచప్పరంబులను, విరచితదారుయంత్రనిబద్ధకలశనిర్యత్పయోధారాశీకరపరంపరాసంపాదితనిరంతరహిమాంతసమయప్రదేశంబులనిందిరారమణుండు షోడశసహస్రవధూయుక్తుండై యందఱకన్నిరూపులై లలితసౌదామినీలతాసమేతనీలనీరదంబుల విడంబించుచుఁ గరేణుకాకలితదిగ్గజంబునోజ రాజిల్లుచు సలిలకేళీవిహారంబులు మొదలైన లీలావినోదంబులు సలుపుచు నంతఃపురంబునఁ గొలువున్న యవసరంబున- వివిధవేణువీణాదివాద్యవినోదంబులను, మంజుగానంబులను, గవిగాయకసూతవందిమాగధజనసంకీర్తనంబులను, నటనటీజననాట్యంబులను, విదూషకపరిహాసోక్తులను, సరససల్లాపమృదుమధురభాషణంబులఁ బ్రొద్దుపుచ్చుచు నానందరసాబ్ధి నోలలాడుచుండె నంత॥ మ॥ అరవిందాక్షుపదాంబుజాతయుగళధ్యానానురాగక్రియా। సరసాలాపవిలోకనానుగతచంచత్సౌఖ్యకేళీరతిం। దరుణుల్ మానుపదాఱువేలును హితోత్సాహంబునం జొక్కి త।త్పరలై యొండుఁదలంపకుండిరి సవిభ్రాంతాత్మలై భూవరా॥ అదియునుంగాక॥ మ॥ హరినామాంకితమైనగీత మొకమాటాలించి మూఢాత్ములు।న్విరతిం బొందఁగఁ జాలియుండరటయా విశ్వాత్మునీక్షించుచు।న్బరిరంభించుచు నంటుచున్నగుచు సంభాషించుచున్నుండు సుం।దరులానందనిమగ్నలౌట కిలచోద్యంబేమి భూవల్లభా॥ అని చెప్పి మఱియు నిట్లనియె॥ ఉ॥ వారకఁ గృష్ణుఁడిప్పగిది వైదికవృత్తి గృహస్థధర్మమే। పారఁగఁ బూనిధర్మమును నర్థముఁ గామమునం దుఁజూపుచు। న్గోరికమీరి సజ్జనులకుం గతిదానయనంగ నొప్పె సం। సారిగతిన్ మెలంగె నృపసత్తమ లోకవిడంబనార్థమై॥ సీ॥ హరి యిట్లు గృహమేధియగుచు శతోత్తరషోడశసాహస్రసుందరులను। మును నీకు నెఱుఁగఁ జెప్పినరీతి నందఱకన్నిరూపములు దానర్థిఁ దాల్చి। కైకొని యొక్కొక్క కామినీమణియందు రమణ నమోఘవీర్యమునఁ జేసి। పదురేసి కొడుకులఁ బడసె రుక్మిణ్యాదిపట్టమహిషులకుద్భవులునైన। నందనులలో నధరణి నెన్నంగ బాహు। బలపరాక్రమవిజయసంపద్విశేష। మానితాత్ములు పదునెనమండ్రు వారి। నెఱుఁగ వినిపింతు వినుము రాజేంద్రచంద్ర॥ వ॥ అని యిట్లను వారలు- ప్రద్యుమ్న, అనిరుద్ధ, దీప్తిమద్భాను, సాంబ, మిత్ర, బృహద్భాను, మిత్రవింద, వృక, అరుణ, పుష్కర, దేవబాహు, శ్రుతదేవ, సునందన, చిత్రభాను, వరూథ, కవి, న్యగ్రోధులను నామంబులఁ బ్రసిద్ధులైరి వెండియుఁ ద్రివక్రయందు సంభవించినయుపశ్లోకుండను వాఁడు దనజనకుండైన కృష్ణపాదారవిందసేవారతుండగుచు నారదయోగీంద్రునకు శిష్యుండై యఖండితదివ్యజ్ఞానబోధాత్ముండగుచు నతండు స్త్రీశూద్రదాసీజనసంస్కారంబై స్మరణమాత్రంబున ముక్తిసంభవించునట్టి సాత్వతతంత్రంబను వైష్ణవస్మృతిఁ గల్పించె నిట్లు మధుసూదననందనులు బహుప్రజలును, నధికాయురున్నతులును, ననల్పవీర్యవంతులును, బ్రహ్మణ్యులునై విఖ్యాతిం బొందిరి- వారిని లెక్కపెట్టఁబడి వేలవత్సరంబులకైనం దీరదు- మున్ను నీకెఱింగించినట్లు తత్కుమారులకు విద్యావిశేషంబులు నియమించు గురుజనంబులు మూఁడుకోట్లు నెనుబదెనిమిది వేలనూర్వురనంగలిగియుండు రక్కుమారుల లెక్కింప నెవ్వరికిని వశంబుగాదదియునుం గాక॥ క॥ నరవర దేవాసురసం। గరమున మును నిహతులైన క్రవ్యాదసముత్క। రము నరేశ్వరులై ద్వా। పరమున జనియించి ప్రజల బాధలఁ బరుపన్॥ క॥ హరి దద్వధార్థమై ని। ర్జరులను యదుకులమునందు జనియింపింపం। ధరమాటొక్కకులంబై। వరగిరి వారిని గణింప బ్రహ్మకు వశమే॥ వ॥ అట్టి యన్వయంబునందు మాధవునకు రుక్మిణీదేవియందుఁ బితృసముండును సముగ్రభుజావిజృంభణుండును నై ప్రద్యుమ్నుండు జనించె- నతనికి రుక్మికూఁతురు శుభాంగివలన ననిరుద్ధుండుదయించె- నతనికి మౌసలావశిష్టుండైన వజ్రుండు సంభవించె- నతనికిఁ బ్రతిబాహుండుపుట్టె- వానికి సుబాహుండు జన్మించె- నతనికి నుగ్రసేనుండు ప్రభవించె- నాతనికి శతసేనుండుగలిగె. నిట్లు యదువృష్ణిభోజాంధకవంశంబులు పరమపవిత్రంబులై పుండరీకాక్షుని కటాక్షవీక్షణశయ్యాసనానుగతసరసాలాపస్నానాశనక్రీడావినోదంబులననిశంబుం జెందుచు సర్వదేవతార్థంబు సమస్తంబైన క్రతువులొనరించుచుఁ బరమానందకందళితచిత్తులైరని చెప్పి వెండియు॥ మ॥ పరమోత్సాహముతోడ మాధవుఁడు శుంభల్లీలఁ బూరించున। మ్మురళీగానము వీనులం జిలికి నన్మోదించి గోపాలసుం। దరులేతెంతురరణ్యభూములకుఁ దద్దాస్యంబుగావించియ। క్కరుణావార్ధి భజింపకుండరె బుధుల్ గారవ్యవంశాగ్రణీ॥ మ॥ మతినెవ్వానియమంగళఘ్నమగు నామంబర్థిఁ జింతిందిన। న్నుతిగావించిన విన్న మానవులు ధన్యుల్ భూరిసంసారదుః। ఖకృతులద్దో శ్రికురుకాలచక్రమహితాసిం బట్టి యాకృష్ణుఁడే। క్షితిభారంబుడుపంగఁ జేయుటిదియే చిత్రంబు భూవల్లభా॥ వ॥ ఇవ్విధంబున గోపికాజనమనోజాతుండైన కృష్ణుండు లీలామానుషవిగ్రహుండై నిజరాజధానియైన ద్వారకాపు

రంబున నమానుషవిభవంబులగు సౌఖ్యంబులం బొదలుచుండెనని చెప్పి మఱియు నిట్లనియె॥ మ॥ మనుజేంద్రోత్తమ యే నీకుం ద్రిజగన్మాన్యంబునై యొప్పఁ జెప్పిన యీ కృష్ణకథాసుధారసము సంప్రీతాత్ములై భక్తిం గ్రోలిన పుణ్యాత్ములు గాంతు రిందు సుఖముల్ నిర్ధూతసర్వాఘులై యనయంబున్ దుదిఁ గాంతు రచ్యుతపదం బైనట్టి కైవల్యమున్॥ క॥ అని యిట్లు బాదరాయణి మనమున రాఁగిల్ల నాభిమన్యునకుం జెప్పిన విధమున సూతుఁడు ముని జనుల కెఱిఁగింప వారు సమ్మతితోడన్॥ క॥ సూతుని బహువిధముల సంప్రీతునిఁ గావించి మహిమఁ బెంపారు చువి ఖ్యాతికి నెక్కి నకృష్ణకథాతత్పరులై రిబుద్ధిఁ దరగనిభక్తిన్॥

చ॥ సరసిజపత్రనేత్ర రఘుసత్తమ దుష్టనుదాసురేంద్ర సంహరణ దయాపయోధి జనకాత్మభవానన పద్మమిత్ర భాస్కరకులవార్ధిచంద్రమ మిహికావసుధాధర సూతిసన్నుత స్ఫురితచరిత్ర భక్తజనపోషణ భూషణ పాపశోషణా॥ క॥ మారీచభూరిమాయాసీరంధ్ర మహాంధకారనీరేజహిత। స్మరరమణవినుతపాదాంభోరుహ మహితావతారపుణ్యవిచారా॥ మాలిని॥ శరధిమదవిరామా సర్వలోకాభిరామా। సురరిపువిషభీమా సుందరీలోకకామా। ధరణివరలలామా తాపసస్తోత్రసీమా। సురుచిరగుణధామా సూర్యవంశాబ్ధిసోమా॥ ...............

గద్య. ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్యప్రణీతంబైన శ్రీమహాభాగవతంబను మహాపురాణంబునందుఁ, బ్రద్యుమ్నజన్మంబును, శంబరోద్యోగంబును, సత్రాజిత్తునకు సూర్యుండు శమంతకమణి నిచ్చుటయుఁ, దన్నిమిత్తంబునం బ్రసేనుని సింహంబు వధియించుటయు, దానిఁ జాంబవంతుండు చంపి మణిమాణిక్యంబు గొనిపోవుటయు, గోవిందుండు ప్రసేనునిం దునిమి మణిఁ గొనిపోయెనని సత్రాజిత్తుండు నిందనారోపించుటయుఁ, గృష్ణుండు దన్నిమిత్తంబున జాంబవంతునిం దొడరి మణియుక్తంబుగా జాంబవతిం గొనివచ్చి వివాహంబగుటయు, సత్రాజిత్తునకు మణి నిచ్చుటయు, సత్యభామాపరిణయంబును, పాండవులు లాక్షాగృహంబున దగ్ధులైరనిన విని వాసుదేవుండు బలభద్రసహితుండై హస్తినాపురంబున కరుగుటయు, నక్రూరకృతవర్మానుమతంబున శతధన్వుండు సత్రాజిత్తుం జంపి మణిఁ గొనిపోవుటయుఁ, దదర్థంబు సత్యభామ కరినగరంబునకేఁగి కృష్ణునకు విన్నవించిన నతండు మఱలి చనుదెంచి శతధన్వుం ద్రుంచుటయు, బలభద్రుండు మిథిలానగరంబునకుం జనుటయు, నందు దుర్యోధనుండు రామునివలన గదావిద్య నభ్యసించుటయుఁ, గృష్ణుండు సత్రాజిత్తునకుం బరలోకక్రియలు నడుపుటయు, శతధన్వుని మణి దాఁచినవాఁడై యక్రూరుండు భయంబున ద్వారకానగరంబు విడిచిపోయిన నతని లేమి ననావృష్టి యైనఁ గృష్ణుం డక్రూరుని మఱలి రప్పించుటయు, దామోదరుండింద్రప్రస్థపురంబున కరుగుటయు, నందర్జునసమేతుండై మృగయావినోదార్థం బరణ్యంబునకుం జని కాళిందిం గొనివచ్చుటయుఁ, గాండవదహనంబు, నగ్నిపురుషుం డర్జునునకు నక్షయతూణీర గాండీవ కవచ రథ రథ్యంబులు నిచ్చుటయు, మయుండు ధర్మరాజునకు సభ గావించియిచ్చుటయు, నగధరుండు మఱలి నిజనగరంబున కరుగుదెంచి కాళిందిని వివాహంబగుటయు, మిత్రవిందా-నాగ్నజితీ-భద్రా-మద్రరాజకన్యలం గ్రమంబునఁ గరగ్రహణంబగుటయు, నరకాసురయుద్ధంబును, దద్గృహంబున నున్న రాజకన్యలం బదాఱువేలం దెచ్చుటయు, స్వర్గగమనంబు, నదితికిం గుండలంబు లిచ్చుటయుఁ, బారిజాతాపహరణంబును, బదాఱువేల రాజకన్యలం బరిణయంబగుటయు, రుక్మిణీదేవివిప్రలంభంబును, రుక్మిణీస్తోత్రంబును, గృష్ణకుమారోత్పత్తియుఁ, దద్గురుజనసంఖ్యయుఁ, బ్రద్యుమ్ని వివాహంబు, ననిరుద్ధజన్మంబును, దద్వివాహార్థంబు గుండినగరంబునకుం జనుటయు, రుక్మిబలభద్రుల జూదంబును, రుక్మివధయు, నుషాకన్య యనిరుద్ధుని స్వప్నంబునఁ గని మోహించుటయుఁ, దన్నిమిత్తంబునఁ జిత్రరేఖ సకలదేశరాజులఁ బటంబున లిఖించి చూపి యనిరుద్ధునిఁ దెచ్చుటయు, బాణాసురయుద్ధంబును, నృగోపాఖ్యానంబును, బలభద్రుని ఘోషయాత్రయుఁ, గాళిందీభేదనంబును, గృష్ణుండు పౌండ్రకవాసుదేవ కాశీరాజుల వధియించుటయుఁ, గాశీరాజపుత్రుండైన సుదక్షిణుం డభిచారహోమంబు వేల్చి కృత్తిం బడసి కృష్ణుపాలికిం బుత్తెంచిన సుదర్శనంబు చేతఁ గృత్తి-సుదక్షిణసహితంబుగాఁ గాశీపురంబు భస్మంబు సేయుటయు, బలరాముండు రైవతకంబునందు ద్వివిదుం డను వనచరుని వధియించుటయు, సాంబుండు దుర్యోధనుకూఁతురగు లక్షణ నెత్తికొనివచ్చినఁ గౌరవులతనిం గొనిపోయి చెఱంబెట్టుటయుఁ, దద్వృత్తాంతం బంతయు నారదువలన విని బలుండు నాగనగరంబునకుం జనుటయుఁ, గౌరవులాడిన యగౌరవవచనంబులకు బలరాముండు గోపించి హస్తిపురంబు గంగం బడఁద్రోయ నుపక్రమించుటయుఁ, గౌరవులు భయంబున సంగనాయుక్తంబుగా సాంబునిం దెచ్చియిచ్చుటయు, బలభద్రుండు ద్వారకానగరంబునకు వచ్చుటయు, నారదుండు హరి పదాఱువేల కన్యకల నొకముహూర్తంబున నందఱ కన్నిరూపులై వివాహంబయ్యెనని విని తత్ప్రభావంబు దెలియం గోరి యరుగుదెంచుటయుఁ, దన్మాహాత్మ్యంబు సూచి మఱలి చనుటయు, జరాసంధుని చేత బద్ధులైన రాజులు కృష్ణుపాలికి దూతం బుత్తెంచుటయు, నారదాగమనంబును, పాండవుల ప్రశంసయు, నుద్ధవకార్యబోధంబు, నింద్రప్రస్థాగమనంబును, ధర్మరాజు సేయు రాజసూయారంభంబును, దిగ్విజయంబును, జరాసంధవధయును, రాజబంధమోక్షణంబును, రాజసూయంబు నెఱవేర్చుటయును, శిశుపాలవధయు, నవభృథంబును, రాజసూయవైభవదర్శనాసహ్యమానసుండై సుయోధనుండు మయనిర్మితసభామధ్యంబునఁ ఘనపుట్టంబులు దడియం ద్రెళ్లుటయుఁ, దన్నిమిత్తపరిభవంబు నొంది రారాజు నిజపురికిం జనుటయుఁ, గృష్ణుండు ధర్మరాజప్రార్థితుండై యాదవులఁ నిలిపి కొన్నినెలలు కాండవప్రస్థంబున వసించుటయు, సాల్వుండు దపంబు చేసి హరుని మెప్పించి సౌభకాఖ్యంబగు విమానంబు వడసి నిజసైన్యసమేతుండై ద్వారకానగరంబు నిరోధించుటయు, యాదవసాల్వయుద్ధంబును, గృష్ణుండు మఱలి చనుదెంచి సాల్వుం బరిమార్చుటయును, దంతవక్త్రివధయును, విదూరథమరణంబును, గృష్ణుండు యాదవబలసమేతుండై క్రమ్మఱ పురంబునకుం జనుటయుఁ, గౌరవపాండవులకు యుద్ధంబగు నని బలదేవుండు తీర్థయాత్ర చనుటయు, నందు జాహ్నవీప్రముఖనదులం గృతస్నానుండై నైమిశారణ్యంబునకుం జనుటయు, నచ్చటి మునులు పూజింపం బూజితుండై తత్సమీపంబున నున్న తాపసనంబున నుండి సూతుండు దన్నుఁ గని లేవకుండిన నలిగి రాముండు కుశాగ్రంబున నతని వధించుటయు, బ్రహ్మహత్యాదోషంబు గలిగెనని మునులు వలికిన సూతుం బునర్జీవితుం జేయుటయు, నమ్మునులకుం బ్రియంబుగాఁ గామపాలుండు ఇల్వలసుతుండగు బల్వలుం బరిమార్చుటయు, వారిచేత నమ్మితుండై హలధరుండు దత్సమీపతీర్థంబుల స్నాతుండై గంగాసాగరసంగమంబునకుం జనుటయు, మహేంద్రనగప్రవేశంబును, బరశురామదర్శనంబును, సప్తగోదావరిం గ్రుంకుటయును, మఱియు మధ్యదేశమందుగల తీర్థంబులాడి శ్రీశైల వేంకటాచలంబులు దర్శించుటయు, వృషభాద్రి హరిక్షేత్ర సేతుబంధ రామేశ్వరములం గని తామ్రపర్ణీతీర్థంబులాడుటయును, గోదానంబు లొనరించి మలయగిరియంద

గస్త్యునింగనుటయు, సముద్రకన్యాదుర్గాదేవులనుపాసించుటయు, నందు బ్రాహ్మణజనంబువలన నంబాండవధార్తరాష్ట్రఖండనంబునసకలరాజలోకంబునుమృతినొందిరనివినుటయు, వాయునందనసుయోధనులుగదాయుద్ధసన్నద్ధులగుటవినివారినివారించుటకై రౌహిణేయుండందులకరుగుటయు, నచటవారిచేఁబూజితుండై వారినివారింపలేక తాగుడిద్వారకకరుగుటయుఁ, గొన్నివాసరంబులకుమఱల నైమిశారణ్యంబునకుంబోయి యచటయజ్ఞంబుఁజేసి రేవతియుందానునవబృథంబాడినిజపురంబునకేతెంచుటయుఁ, గుచేలోపాఖ్యానంబును, సూర్యోపరాగంబునఁగృష్ణుండు రామునితోఁజేరిపురరక్షణంబునకుఁబ్రద్యుమ్నాదికుమారులనిలిపిషోడశసహస్రాంగనాపరివృతుండై యక్రూరవసుదేవోగ్రసేనాదియాదవవీరులుదోడరాశమంతపంచకతీర్థంబునకరిగికృతస్నానుండై వసించియుండుటయుఁ బాండవకౌరవాదిసకలరాజలోకంబునుద తీర్థంబునకువచ్చుటయుఁ, గుంతీదేవిదుఃఖంబును, నందయశోదానహితులైనగోపగోపికాజనంబులుజనుదెంచుటయుఁ, గుశలప్రశ్నాదిసంభాషణంబులును, మద్రకన్యాద్రౌపదీసంభాషణంబును, దదనంతరంబ సకలరాజలోకంబును శమంతపంచకతీర్థంబులస్నాతులై రామకృష్ణాదియాదవవీరులనామంత్రణంబుచేసినిజనగరంబులకుంబోవుటయుఁ, గృష్ణునిదర్శించుటకుమునీంద్రులేతెంచుటయు, వారియనుమతినివసుదేవుండుయాగముసేయవేఁడుటయు, నందయశోదాదిగోపికానివహంబులనిజపురంబునకనిచియుగ్రసేనాదియాదవవీరులుందానునుమాధవుండునునిజపురప్రవేశంబగుటయుఁ, దౌర్జికకంసునిచేతహతులైయమపురంబుననున్న దేవకీదేవిసుతుల రామకృష్ణులుయోగమాయాబలంబునఁదెచ్చియామెకిచ్చుటయు, నర్జునుండుసుభద్రనువివాహంబగుటయుఁ, గృష్ణుండుమిథిలానగరంబునకరుగుటయు, శ్రుతదేవజనకులచరిత్రంబును, వారలతో బ్రాహ్మణప్రశంససేయుటయుఁ, గృష్ణుండుమఱలితనపురంబునకరుగుటయు, శ్రుతిగీతలును, హరిహరబ్రహ్మలతారతమ్యచరిత్రంబును, గుశస్థలినుండుబ్రాహ్మణునిచరిత్రంబు, నతనితనయులుపరలోకంబునకుంబోయినఁగృష్ణార్జునులుతమయోగబలంబునవారిందెచ్చియవ్విప్రునకిచ్చుటయుఁ, గృష్ణుండర్జునుందోడ్కొనిద్వారకకరుగుటయు, నంతమాధవుండయ్యాప్రదేశంబులసకలభార్యాపరివృతుండై విహరించుటయు, యాదవవృష్ణిభోజాంధకవంశచరిత్రంబునసుకథలంగలదశమస్కంధంబునందుత్తరభాగంబునమాప్తము. శ్రీగోపాలకృష్ణార్పణమస్తు.



# శ్రీమదాంధ్రభాగవతము — ఏకాదశస్కంధము.

శ్రీసీతాపతిలంకే । శాసురసంహరచతురశాశ్వతసుతపా । శ్రీసత్యధిభూభవవ్వ । త్రాసురరిపుదేవజాలరామనృపాలా॥

వ॥ మహనీయగుణగరిష్ఠులగునమ్మునిశ్రేష్ఠులకునిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండైనసూతుండిట్లనియె. నట్లుప్రాయోపవిష్టుండైనపరీక్షిన్నరేంద్రునకుశుకయోగీంద్రుండిట్లనియె నాయాజన్మకర్మవ్యాధివిమోచనంబునకుఁగారణంబగుదివ్యౌషధంబుగావున శ్రీమన్నారాయణకథామృతంబుగ్రోలుమనియిట్లనియె॥ మ॥ బలవత్సైన్యముతోడఁగృష్ణుఁడు మహాబాహాబలోపేతుఁడై । కలనన్రాక్షసవీరవర్యులవడిన్ఖండించిభూభారము । జ్వలమైయుండఁగనక్కేళికతనన్గారవ్యుఁదోడ్తోనత । స్థలమున్బాండవసైన్యమున్నడిచెభూభాగంబునింపింపఁగన్॥ అంత॥ క॥ మునివరులుసంతసిల్లఁగ । ననయమునందామలకునుహర్షంబయ్యె । న్ఘననిజభక్తులుయాదవ । ఘనవీరసమూహమపుడుగడునొప్పెసఁగెన్॥ మ॥ విదితుండై సకలామరుల్గొలువనుర్వీభారమున్మాన్పిదు । ర్మదసంయుక్తవసుంధరాధిపతులన్మర్దించికంసాదుల । న్వదిముట్టన్వధియించికృష్ణుఁడతిసంతుష్టాత్ముఁడై యున్నచో । యదుసైన్యంబులుభూమిమ్రోవఁగనసహ్యంబయ్యెనత్యున్నతిన్॥ సీ॥ ఈరీతిఁగృష్ణుండునేపారఁబూతనాశకటతృణావర్తసాల్వవత్స । చాణూరముష్టికధేనుప్రలంబకదైత్యాఘశిశుపాలదంతవక్త్ర । కంసపౌండ్రాదికఖండనంబొనరించియటమీఁదఁగురుబలంబడఁచిమఱియు । ధర్మజునభిషిక్తుఁదనరఁగాఁజేసిననతఁడుభూపాలనంబమరఁజేసెభక్తులగుయాదవేంద్రులఁబరఁగఁజూచి । యన్యపరిభవమెఱుఁగరీయదువులనుచు । వీరిఁబరిమార్పనేఁడకర్కశలోకంబు । దైవమిఁక లేదుత్రిభువనాంతరమునందు॥ వ॥ అనివితర్కించిజగదీశ్వరుండత్యున్నతవేణుకాననంబువాయువశంబునమెఱసికొనియనలంబుద్భవంబైదహించుచందంబునయదుబలంబులకన్యోన్యవైరానుబంధంబులుగల్పించిహతంబొనర్పెదననివిప్రశాపంబుమూలకారణంబుగాఁదలంచియదుబలంబులనడంచెననిపలికినమునివరునకు రాజేంద్రుండిట్లనియె॥ క॥ హరిపాదకమలసేవా । పరులగుయాదవులకెట్లు బ్రాహ్మణశాప । స్ఫురణంబుసంభవించెనొ । యరయఁగసంయమివరేణ్యయానతియీవే॥ క॥ అనినజనపాలునకునిట్లనుసంయమికులవరేణ్యుఁడతిమోదముతో । వినుమనిచెప్పఁ

## శ్రీవిశ్వామిత్రవసిష్ఠనారదాదిమహర్షులుశ్రీకృష్ణదర్శనంబునకువచ్చుట.

గఁదొడఁగెను । ఘనతరగంభీరవాక్ప్రకాశస్ఫురణన్॥ వ॥ నిరుపమసుందరంబైనశరీరంబుధరియించిసమస్తకర్మతత్పరుండై పరమేశ్వరుండుయదువులనడఁగింపందలంచుసమయంబునజటావల్కలకమండలుధారులును, రుద్రాక్షభూతిభూషణముద్రాముద్రితులును, గృష్ణాజినాంబరధరులునునగు విశ్వామిత్ర, అసిత, కణ్వ, దుర్వాస, భృగు, అంగీరస, కశ్యప, వామదేవ, వాలఖిల్య, అత్రి, వసిష్ఠ, నారదాదిమునివరులుస్వేచ్ఛావిహారంబునద్వారకానగరంబునకరుగుదెంచియుండు॥ సీ॥ ఘను

నిశ్రీకృష్ణునిఁగౌస్తుభాభరణునిఁగర్ణకుండలయుగ్మఘనకపోలుఁబుండరీకాక్షునంభోధరశ్యామునిఁగలితనానారత్నఘ
నకిరీటు।నాజానుబాహునిరర్గళాయుధహస్తుశ్రీవత్సుఁబీతకౌశేయవాసు। రుక్మిణీనయనసరోజదివాకరుబ్రహ్మాదిసుర
సేవ్యపాదపద్ము।మత్తనిగ్రహశిష్టసంతోషకరణుఁ।గోటిమన్మథలావణ్యకోమలాంగు।నార్తజనరక్షణైకవిఖ్యాతచరితుఁ।
గనిరికరుణాసముద్రునిఘనులుమునులు॥ క॥వచ్చినమునిసంఘములకు।విచ్చలవిడినర్ఘ్యపాద్యవిధులాచరింప।మెచ్చగుక
నకాసనముల।నచ్చగఁగూర్చుండివనరుహాక్షునితోడన్॥క॥జనములునిను సేవింపని। దినములువ్యర్థంబులగుచుఁదిరుగుచుఘ
నుండున్।దనువులునిలుకడగావఁట।వనములలోనున్నైనవనరుహనాభా॥ క॥తరణంబులుభవజలధికి।హరణంబులుమరి
తలతలకాగములకా।భరణంబులార్తజనులకు।శరణంబులునీపదాబ్జసేవానిరతుల్॥ మత్తకోకిల॥ఒక్కవేళనుసూక్ష్మ
రూపమునొందుదీవణుమాత్రమై।యొక్కవేళనుస్థూలరూపమునొందుదంతయునీవయై।పెక్కురూపులుదాల్తునీదగుపెం
పుమాకునుతింపఁగా।నక్కజంబగుచున్నదేమనునంబుజాక్షరమాపతీ॥ క॥శ్రీనాయకనీనామము।నానాభవరోగకర్మనా
శమునకువి। న్నాణెంబగునౌషధమిది।కానరుదుష్టాత్ములకటకంజదళాక్షా॥వ॥అనియనేకవిధంబులంబ్రస్తుతించినమునివ
రులంగరుణాకటాక్షవీక్షణంబులనిరీక్షించిపుండరీకాక్షుండిట్లనియె-మదీయ ధ్యాననామస్మరణంబులుభవరోగహరణం
బులును,బ్రహ్మరుద్రాదిశరణంబులును, మంగళకారణంబులునగునని మాటియునారూపంబులైన మేదినీసురులపరితా
పంబపహరించుపురుషులనైశ్వర్యసమేతులుగాఁజేయుమనని యోగీశ్వరేశ్వరుండానతిచ్చియనంతరంబ మీరలిచ్చటికి
వచ్చినప్రయోజనంబేమియనినవారలుభవదీయపాదారవిందసందర్శనార్థంబుకంటె మిక్కిలివిశేషంబొండెద్దియనిన
వాసుదేవవదనాబ్జామృతంబునిజనేత్రచకోరంబులఁగ్రోలి యథేచ్ఛావిహారులై ద్వారకానగరంబున కనతిదూరంబున
నుండుపిండాకరంబను నొక్కపుణ్యతీర్థంబునకఱిగిరంత॥క॥దర్పించియాదవులుదమ। నేర్పునఁగొమరారుసాంబునెలఁతు
కరూపం।బేర్పడశృంగారించుకఁ।గర్పూరసుగంధిసోలిఁగావించిరొగిన్॥ఉ॥మూఁకలుగూడియాదవులుముందటఁబెట్టు
కయార్చినవ్వుచు।నోర్చికలఁబోవుచున్ననిసమూహము నెయ్యనసాగి మ్రొక్కుచు।న్నాబ్రికటమైనయీసుదతిభారపుగర్భ
మునందుఁబుత్రుఁడో।యేకతమందుబాలకియొయేర్పడఁజెప్పుఁడటన్ననుగ్రులై॥ క॥ యమడింభకులనుఁగనుఁగొని।మద
యుతులైవచ్చిరనుచుమదిలోరోషం।బొదవికనుఁగొనలనిప్పులు।సెదరఁగహాస్యంబుచనునె చేయఁగననుచున్॥క॥వాలా
యముయదుకులని।ర్మూలకరంబైనయట్టిముసలంబొకటీ। బాలికకుదయించునుబొం।డాలస్యములేదటంచునపల్కిట
యున్॥వ॥మదోద్రేకులైనయాదవబాలకులుమునిశాపభీతులైవడవడవడంకుచుసాంబకుక్షినిబద్ధచేలగ్రంథివిమోచనం
బుసేయుసమయంబునముసలంబొకటిభూతలపతితంబైనవిస్మయంబునొందిదానింగొనిచని దేవకీనందనుసన్నిధానంబు
నంబెట్టియెఱింగించిననతండాత్మకల్పితమాయారూపంబగుటనెఱింగియు నెఱుంగనితెఱంగున వారలంజూచియిట్లనియె॥
క॥మదిచెడికన్నుంగానక।కుదయితులైమీరుగల్లమాటలమునుల।న్గదిసికులక్షయకారియ।విదితంబగుశాపమొందువెట్టు
లుగలరే॥క॥ధరణీసురశాపమునకు।హరిహరబ్రహ్మములైననడ్డముగలరే।నరులనఁగనెంతవారలు।గరమరుదుగఁబూర్వ
జన్మకర్మముఁద్రోవన్॥ వ॥ అదిగావునయతినిందాపరత్వంబునయదువంశనాశంబగుసందియంబులేదని పరమేశ్వరుం
డువారలంజూచిసముద్రతీరంబున నొక్కమహాపర్వతంబున్నదందునుండత్యుగ్రభయవిశాలభీషణంబగు పాషాణంబున
మీభుజాబలంబుచేతనీముసలంబువివిదినిచూర్ణంబుమహార్ణవకబంధంబులంగలిపిరండుపొండనిజగద్విష్ణుండైనకృష్ణుం
డానతిచ్చిన-వారునట్లచేసి తత్కలితంబైనలోహఖండంబునుసరకుగొనకసాగరంబునంబడవైచిన నొక్కఝషకంబు
గ్రసించిన దానినొక్కలుబ్ధకుండుజాలమార్గంబునఁబట్టికొనితదుదరగతంబైనలోహఖండంబుదెచ్చిబాణాగ్రంబునము
ల్కగానొనర్చెననియుఁదత్కథావృత్తాంతంబుసెప్పినబాదరాయణింగనుంగొనిరాజేంద్రుండిట్లనియె॥క॥చిత్తంబెక్రియ

శ్రీ వసుదేవునకునారదుండుపురాతనంబగువిదేహర్షభసంవాదంబుదెలుపుట. శ్రీ

నిలుచుం।జిత్తజగురుపాదపద్మసేవసదాయ।త్యుత్తమమనివసుదేవుఁడు।జిత్తముఁదగనిల్పియెట్లుచెందెమునీంద్రా॥అని
యడిగినరాజునకుశుకుండిట్లనియె॥ క॥వినుమున్నృపాలకసెప్పెద।ఘనమైవిలసిల్లుపూర్వకథగలదదియు।న్వినుద్వారకకే
తెంచియు। నొనరఁగనారదుఁడుకృష్ణునొయ్యనఁగాంచెన్॥వ॥దేవమునికృష్ణసందర్శనార్థంబరుగుదెంచితద్గృహాభ్యంత
రంబునకరిగినవసుదేవుండమ్మునీంద్రునినర్ఘ్యపాద్యాదివిధులంబూజించికనకాసనాసీనుంగావించియుచితకథావినో
దంబులంబ్రొద్దుపుచ్చుచునిట్లనియె నేనరుండునారాయణచరణసరసీరుహభజనపారాయణత్వంబునిరంతరంబునొందఁ
డట్టివానికిమృత్యువుసన్నిహితంబైయుండునీదర్శనంబునంగృతార్థుండనైతి నచ్యుతానంతగోవిందాది నామస్మరణైకా

గ్రచిత్తులై నమీవంటిపుణ్యపురుషులసమాగమంబునలోకులుసుఖాశ్రయులై యుండుదురు దేవతాభజనంబు సేయువారినిగీర్వాణులునను గ్రహింతురట్లుసజ్జనులును, దీనవత్సలురునగువారలు పూజనాదిక్రియలచేనా దేవతలనుభక్తిసేయుదురుకావునశ్రీమన్మహాభాగవతకథాసమూహంబులంగలధర్మంబులడిగెద నేయేధర్మంబులుశ్రవణసుఖంబులుగావినినదండధరకింకరతాడనంబులంబడకముకుందచరణారవిందవందనాభిలాషులై పరమపదప్రాప్తులగుదురాధర్మంబు లానతిమ్ము:తొల్లిగోవిందునింబుత్రునిఁగాఁగోరిముక్తిమార్గంబెఱుంగలేక దేవతామాయంజేసిదిక్కుచిత్తవ్యసనాంధకారంబగుసంసారంబునందగులువడియున్నవాఁడ-హరికథామృతంబు వెల్లిగొల్పుమట్లయినసుఖంబుగలుగుననినవసుదేవకృతప్రశ్నుండైననారదుండువాసుదేవకథాప్రసంగసల్లాపహర్షసమేతుండై సంతసంబందనిట్లనియె॥ క॥ ననునీవు సేయుప్రశ్నము। జనసన్నుతవేదశాస్త్రసారాంశంబై। ఘనమగుహరిగుణకథనము। వినుమనివినుపింపఁదొడఁగె వేడ్కదలిర్పన్॥ క॥అతిపాపకర్ములైనను।సతతమునారాయణాఖ్యశబ్దముమదిలో।వితతంబుగఁబఠియించిన।చతురులఁగోనియాడఁగమలసంభవువశమే॥వ॥అట్లుగావునఁబరమేశ్వరభక్తిజనకంబై కైవల్యపదప్రాప్తికరంబై యొప్పుచున్న విదేహార్షభసంవాదంబు నాఁబరగునొక్కపురాతనపుణ్యకథావిశేషంబెఱింగించెదసావధానమనస్కుండవై యాకర్ణింపుమనియిట్లనియె॥ గీ॥ వినుముస్వాయంభువుండనుమనువునకును।రమణనుదయించెనటప్రియవ్రతుఁడనంగ।దనయుఁడాతనికాగ్నీధ్రుఁడనఁగసుతుఁడు।జాతుఁడయ్యెనుభువనవిఖ్యాతుఁడగుచు॥వ॥ఆయాగ్నీధ్రువునకునాభియనుప్రాజ్ఞుండగు తనూభవుండుదయించిబలిచక్రవర్తితోమైత్రింజేసిధరణీభారంబుపూనియాజ్ఞాపరిపాలనంబునసహితరాజన్యరాజ్యంబులస్వవశంబుగావించికొనియుండెనంత-నానాభికిసత్పుత్రుండైనఋషభుండుపుట్టెనతండుహరిదాసుండై సుతశతకంబువడసె నందగ్రజుండైనభరతుండనుమహానుభావుండునారాయణపరాయణుండై యిహపరలోకసుఖంబులంబరిహరించి జన్మత్రితయంబున ఘోరతపంబాచరించిగీర్వాణసుఖపారవశ్యంబుపరిహరించిసకలబంధవిముక్తుండై వాసుదేవపదంబునొందెనాతనిపేరభారతవర్షంబనుభూఖండనామవ్యవహారంబునెగడిజగంబులంబ్రసిద్ధంబయ్యె మఱియునందొమ్మండ్రుకుమారులుబలపరాక్రమప్రభావరూపసంపన్నులై నవఖండంబులకు నధిష్ఠాతలై రిమ్మలవారలలో నెనుబదియొక్కండ్రుగుమారులునిత్యకర్మానుష్ఠానపరతంత్రులై విప్రత్వంబంగీకరించిరియందుఁగొందఱు శేషించినవారలుకవి, హరి,అంతరిక్షు,ప్రబుద్ధ,పిప్పలాయన,హవిర్హోత్ర,ద్రమీళ, చమస,కరభాజనులనంబరగుతొమ్మండ్రుగురూర్ధ్వరేతస్కులై బ్రహ్మవిద్యావిశారదులగుచుజగత్త్రయంబునుం బరమాత్మస్వరూపంబుగాఁదెలియుచుముక్తులై యవ్యాహతగమనులగుచునురసిద్ధసాధ్యయక్షగంధర్వ కిన్నరకింపురుష నాగలోకంబులందు స్వేచ్ఛావిహారంబు సేయుచునిరంతరానందంబువడసి యుండనొక్కనాఁడు॥క॥జగదేక నాథుగుణములు।మిగులఁగసంస్మరణతోడమీరినభక్తిన్।బగలును రాత్రియుసంధ్యల విజితేంద్రియులైనతపసులుధాత్రిన్॥క॥ఊహింపఁబుణ్యుఁడైనవి। దేహునియజ్ఞాంతమందు నేతెంచినచో।గేహ డలియెదుర్కొని।మోహావివర్జితులఁబుణ్యమునిసంఘములన్॥గీ॥అర్ఘ్యపాద్యాదివిధులనునర్థితోడఁ।బూజఁగావించి లఁబొలుపుమిగుల।నువితపీఠంబులందులనునిచెనెలమి।నవమునిశ్రేష్ఠులనుభూమినాయకుండు॥క॥ వారలకెట్లనుమీరలు।గారవమునవిష్ణుమూర్తిఁగైకొనినమహా।భూరితపోధనవర్యులు।సారవిహీనంబులైనసంసారములన్॥క॥ పరికింగడవసేర్తురు।క్రూరులుబహుదుఃఖరోగకుత్సితబుద్ధు।ల్నీరసులునరులుగావున।నారయసుజ్ఞానబుద్ధినానతియీరే॥ వ॥మఱియును

## ఋషభకుమారుండగుకవియను మొదటివాఁడువిదేహునకు సేయుపరమార్థోపదేశము.

కలజంతుసంతానంబుకంటెమానుషాకారంబునొందుటదుర్లభంబంతకంటెనారాయణచరణయుగళస్మరణపారాయణులగుటమేలుకావుననత్యంతావశ్యకంబగుక్షేమంబడుగవలసెఁబరమేశ్వరుండుప్రపత్తినిష్ఠులకుసారూప్యంబెట్లొసంగునత్తెఱంగానతిండనినవినివిదేహభూపాలునకుహరికథామృతపానాతిపరవశులైనమునిసమాజంబునందుగవియనుమహానుభావుండిట్లనిచెప్పందొడంగెనరిషడ్వర్గంబునందునీషణత్రయంబునందుందగులువడి మాత్సర్యయుక్తచిత్తుండగునట్టివానికెవ్విధంబుననచ్యుత పాదారవిందభజనంబుసంభవించువిశ్వంబును నాత్మయువేఱుగాభావించువానికిఁబరతత్త్వంబెట్లులేదుమయవిద్యాంధకారమగ్నులకుహరిచింతనంబెట్లుసిద్ధించునట్టినరుండుతొంటికళేబరంబువిడిచిపరతత్త్వంబెబ్భంగింజేరు, ముకుళీకృతనేత్రుండైననరుండుమార్గభ్రమణంబునఁదొట్రుపాటువడిచనుచందంబునవిజ్ఞానవిమలహృదయభక్తిభావనావశంబులేకున్నఁబరమపదంబువీరికెవ్విధంబునంగలుగుననియడిగితివిగావునఁజెప్పెదసావధానుండవై యాకర్ణింపుము॥ క॥కరణత్రయంబుచేతను।నరుఁడేకర్మంబుసేయునమ్మెవేళన్।హరికర్పణమనిపలుకుట।పరువడిస్వ

జ్ఞానమండ్రు పరమమునీంద్రుల్ ॥వ॥ జ్ఞానాజ్ఞానంబులందు సంకలితుండై యస్మృతివిపర్యయంబు నొందునట్లు గావున గురుదే
వతాత్మకుండై బుద్ధిమంతుండైన మర్త్యుండు శ్రీవల్లభు నుత్తమోత్తమునిఁగాఁ జిత్తంబునఁ జేర్చి సేవింపవలయు స్వప్నమ
నోరథేచ్ఛాద్యవస్థలయందు సర్వసంకల్పనాశంబగుటం జేసి వానిఁ గుదియంబట్టి నిరంతర హరిధ్యానపరుండైన వానికిఁ
గైవల్యంబు సులభంబునం గరతలామలకంబై యుండు ॥ సీ ॥ సంతతంబును గృష్ణసంకీర్తనంబులు వీనులకింపుగా వినఁగవల
యు। హరినామకథనంబు హర్షంబుతోడుతఁ బాటలనాటలఁ బనుపవలయు। నారాయణుని దివ్యనామాక్షరంబులు హృద్వీ
థి సతతంబు నెన్నవలయు। కంజాక్షులీలలు గాంతారములనైన భక్తియుక్తంబుగాఁ బాడవలయు। వెఱ్ఱిమాడ్కి నిలీలతో వి
శ్వమయుని నొడువుచును లోకబాహ్యత నొందవలయు। నింతయును విష్ణుమయమని యెఱుఁగవలయు। భేదమొనరింపవలవ

ఋషభకుమారులగు హరియు నంతరిక్షుండును సేసెడు భాగవతస్వరూపోపదేశము.

దు మేదినీశ ॥వ॥ అనిన విదేహభూపాలుండు భాగవతధర్మం బెద్దియే ప్రకారంబునం బ్రవర్తించు నట్టి భాగవత చిహ్నంబులె
వ్వి యింతయు నెఱింగింప మీర యర్హులరని నందు హరియను మహాత్ముం డిట్లనియె ॥గీ॥ సర్వభూతమయుండైన సరసిజా
క్షుఁ డతఁడె తన యాత్మయందుండు నని వాఁడు। శంఖచక్రధరుఁ డంచుఁ జనెడు వాఁడు। భక్తిభావాభిరతుఁడు వో భాగవ
తుఁడు ॥క॥ వర్ణాశ్రమధర్మంబుల। నిర్ణయకర్మములఁ జెడక నిఖిలజగత్సం। పూర్ణుఁడు హరియనునాతఁడె। వర్ణింపఁగ భాగవతుఁ
డు వసుధాధీశా ॥వ॥ ఇట్లు సర్వసంగపరిత్యక్తుండై నిఖిలాంతరాత్మకుండైన పరమేశ్వరుండరుణగభస్తి కిరణసహస్రంబు
ల లోకత్రయంబుం బావనంబు సేయు చందంబున నందనందన చరణారవిందరజఃపుంజంబుల చేతం బవిత్రంబు సేయు చ
సురాసురజేగీయమానంబైన జనార్దన పాదారవిందంబునకు వందనాభిలాషులై భక్తియులవమాత్రంబునుం జలింపనీక
సుధాకరోదయంబున దివాకరజనిత తాపంబు నివారణంబైన భంగి నారాయణాంఘ్రి నఖమణిచంద్రికా నిరస్తహృదయ
తాపుండై యాత్మీయభక్తిరచనానుబంధబంధురుండును నై వాసుదేవచరణసరోరుహధ్యానానందపరవశుండగు నతం
డు భాగవతప్రధానుండని యెఱింగించిన విని విదేహుండిట్లనియె ॥క॥ గజరాజవరదు గుణములు। త్రిజగత్పావనములగుటఁ దే
టపడంగా। సుజనమనోరంజకముగ। విజితేంద్రియ వినఁగ నాకు వేడుక పుట్టెన్ ॥ అనిన విని యంతరిక్షుండను ఋషిశ్రేష్ఠుం
డిట్లనియె ॥క॥ పరమబ్రహ్మమనంగా। నరతత్త్వమనంగఁ బరమపదమనఁగను నీ। శ్వరుఁడనఁ గృష్ణుండన జగ। ద్భరితుఁడు నా
రాయణుండు దా వెలుఁగొందున్ ॥వ॥ అవ్యక్త నిర్గుణ పరబ్రహ్మంబునందుఁ దనకు విపర్యయంబుగా జననంబైన యజ్ఞానంబె విష్ణు
మాయయనం బడు పరమేశ్వరుం డట్టి మాయచేత జగంబు నిర్మించి నిశ్చింతుండై యుండు నింద్రియార్థభ్రమణంబు సేసెడు
తులకు సుప్త్యాద్యవస్థలు వరుసనఁ గలుగుటగాకఁ బరమేశ్వరునిం బొందరామి యను నాలుగవ యవస్థయుఁ గలుగు స్వ
నందు గ్రాహ్య గ్రాహక గ్రాహయితృత్వంబులను త్రివిధ భేదంబులుఁ గలిగియుండు నీచందంబున నవిద్యాంధకార
ంబై మూఁడు విధంబులం బర్యవసించు మనోరథంబు స్వప్నావస్థం గడంగి సక్రియ త్రివిధంబగు మాయయు నాత్మ
ందు లీనంబగుఁ బరమేశ్వరుండా మొదలం బృథివ్యాది మహాభూతమయంబైన సృష్టినిఁ గలుగఁ జేసి యందుఁ బంచభూ
తాత్మకంబైన యాత్మ నేకాదశేంద్రియంబుల చేత భేదంబు పుట్టించు గుణంబుల చేత గుణంబు లంగీకరించు నాత్మయందుఁ
బ్రద్యోతిత గుణంబులవలన గుణానుభవంబుఁ జేయుచున్నవాఁడై సృష్టిని యాత్మీయంబుగా భావించును- దేహి కర్మమూలం
బున నైమిత్తికకర్మంబుల నాచరించుచుఁ దత్ఫలం బంగీకరించి దుఃఖైకవశుండై వర్తించుఁ బెక్కు దుఃఖంబులం బడియీ దే
హి కర్మఫలప్రాప్తుండగుచు భూతసంప్లవపర్యంతంబు పరవశుండై జన్మమరణంబులం బొరలుచు నంత్యకాలం బాసన్నంబైన
ద్రవ్యగుణస్వరూపంబగు జగంబు ననాదినిధనంబగు కాలంబును బ్రకృతిం బొందించు నట మీఁద శతవర్షంబులు వర్షంబు లేమి
చేత నత్యుగ్రలోకలోచను తేజంబున సకలలోకంబులు దహింపఁబడు నంత నధోలోకంబు నుండి సంకర్షణముఖజనితాన
లంబూర్ధ్వశిఖాజాలంబుల వాయుసహాయంబై దిక్కులయం దెల్లఁ బ్రవర్తించు నట మీఁద సంవర్తకవలాహకగణంబులు శ
తవత్సరంబులు సలిలధారాపాతంబుగా వర్షంబులు గురియు నంత విరాడ్రూపంబు లీనంబగు నందు నీశ్వరుండు నింధనాగ్ని
రూపంబున నవ్యక్తంబుగాఁ బ్రవేశించుఁ దదనంతరంబ ధరణీమండలంబు వాయుహృతగంధంబై కబందరూపంబుఁ దాల్చు
నా జలంబు హృతరసంబై తేజోరూపంబు నొందు నా తేజంబు తమోనిరస్తంబై వాయువందడంగు నా గంధవహుండు స్పర్శ
విరహితుండై యాకాశంబునందు సంక్రమించు నా విష్ణుపదంబును విగతశబ్దగుణంబు గలదియై యాత్మయందడంగు నింద్రి
యంబులును, మనంబును, బుద్ధియు, వికారంబులతోడ సహంకారంబుఁ బ్రవేశించు నా యహంకారంబు గుణయుక్తంబై పర
మాత్మనుం జేరు- నిట్లు త్రివర్ణాత్మకమై సర్గస్థితిలయకారిణియగు మాయ యిట్టిదియని తత్స్వరూపమాహాత్మ్యంబులు వివరిం

దుమురంతయుందగ।న్భానుతసత్యవాక్యగుణభూమణియొక్క భవేదికి తోడుతన్యాన్నుకఁ జెప్పవున్నను బ్రబుద్ధుండునిట్లను

శ్రీ ఋషభకుమారులలోఁ బ్రబుద్ధపిప్పలాహ్వయులు సెప్పెడుపరమార్థోపదేశము. శ్రీ

గౌరవంబునన్॥ వ॥ సూర్యోదయాస్తమయంబులం బ్రతిదినంబు నాయువుక్షయంబునొందఁ దేహి దేహకళత్రమిత్రపుత్ర మమత్వపాశబద్ధుండై విడివడునుపాయంబుగానక సంసారాంధకారమగ్నుండై గతాగతకాలంబుల నెఱుంగక దివాంధంబులగుజంతుజాలంబులభంగి జన్మజరారోగవిపత్తిమరణంబులందియు శరీరంబ మేలనుచుఁ బ్రమోద మోహమదిరాపానమత్తులై విషయాసక్తతం జిక్కి తమ్ముఁ దా రెఱుంగకనుండి విరక్తిమార్గంబు దెలియక వర్తించు మూఢులగుజనంబుల పొంతలం బోవక కేవలవిష్ణుభక్తిభావంబుగలసద్గురులం బ్రతిదినంబును భజియించి సాత్వికంబు భూతదయయును, హరికథామృతపానంబును, బ్రహ్మచర్యవ్రతంబును, విషయంబులమనంబు చేరకుండుటయు, సాధుసంగంబును, సజ్జనమైత్రియు వినయసంపత్తియు, శుచిత్వంబు తపంబును, క్షమయు, మౌనవ్రతంబును, వేదశాస్త్రాధ్యయనతదర్థానుష్ఠానంబు, నహింసయు, సుఖదుఃఖాదిద్వంద్వసహిష్ణుతయు, నీశ్వరుని సర్వగతునిగా భావించుటయు, ముముక్షుత్వంబును, జనసంగవర్జనంబును, వల్కలాదిధారణంబును, యదృచ్ఛాలాభసంతుష్టియు, వేదాంతశాస్త్రార్థజిజ్ఞాసత్వంబును, దేవతాంతరనిందావర్జనంబును, గరణత్రయశిక్షణంబును, సత్యవాక్యతయు, శమదమాదిగుణవిశిష్టత్వంబును, గృహారామక్షేత్రకళత్రపుత్రవిత్తాదులహరికర్పణంబు సేయుటయు, నితరదర్శనవర్జనంబుఁ జేయుటయును, సుధర్మంబులని చెప్పి యిట్లనియె॥ క॥ హరిదాసులమిత్రత్వము। మురరిపుకథ లెన్నికొనుచు మోదముతోడ। న్నాస్తా ... [illegible] ... నై। పురుషుఁడు హరిమాయ గెల్చు భూపవరేణ్యా॥ వ॥ అని రాజేంద్రుండు వారలకిట్లనియె- భాగవతులారా సకలలోకనాయకుండగు నారాయణుండనంబరగినపరమాత్మునిప్రభావంబు వినవలతు నానతిండనిన పిప్పలాహ్వయుండిట్లనియె॥ సీ॥ నరవరపిను జగన్నాథునిచారిత్ర మెఱింగింతు నీమది కింపుమిగుల। లసదుద్భవస్థితిలయకారణంబైన దేహేంద్రియాదులఁ దిరముగాఁగ। జొనుపు నెప్పుడు పరంజ్యోతిస్వరూపంబు జ్వాలలనలునందుఁ జననిపగిది। నింద్రియంబులు నాత్మ నెనయవు శబ్దంబు పొరయక సుషిరంబుఁ బొందుసత్య। మనఁగ సత్వరజస్తమోమయగుణంబు। మహదహంకారరూపమై మహిమ వెలయుఁ। జేతనత్వంబు గలదీని జీవమందు। రిదియ సదసత్స్వరూపమై యెన్నఁబడును॥ వ॥ దీనికిం బెక్కైనది పరమాత్మగా నెఱింగి కమలసంభవాదులనుతియించు రిట్టిపరమాత్మ స్థావరజంగమంబులనధిష్ఠించి వృద్ధిక్షయంబులం బొందక నిమిత్తమాత్రంబునం దరులతాగుల్మంబుల జీవంబు లేక తదంతరస్థుండై వర్తించునంత సర్వేంద్రియావృతంబై యాకారంబు నష్టంబైన మనంబును బాసి క్రి[illegible] హితుండై తిరుగుచుండు నిర్మలజ్ఞానదృష్టిగలవానికి భాను ప్రభాజాలంబుతోఁ జిన క్రియను సుజ్ఞానవంతుండు హరిభక్తి[illegible] ణకర్మార్థంబు చిత్తదోషంబులు భంజించి భగవత్సదనంబు చేరుననిన విని రాజిట్లనియె॥ క॥ పురుషుం డేయేకర్మము[illegible] డిఁగా॥

శ్రీ ఋషభకుమారులలో హవిర్హోత్ర ద్రమీళులు దెలుపు పరమార్థోపదేశము

పరుఁడై మునుదా। మరితములఁ దొరఁగి మురరిపు। చరణయుగం బెట్లు చేరు సన్మునివర్యా॥ వ॥ అనిన విని యందు హవిర్హోత్రుండిట్లనియెఁ గర్మాకర్మవికర్మప్రతిపాదకంబులగు శ్రుతివాదంబులలౌకికవర్ణితంబులట్టియామ్నాయంబులు సర్వేశ్వరస్వరూపంబులుగా నవిద్వాంసులు నెఱుంగలేరవి కర్మాచారంబులనంబడు మోక్షంబుకొఱకు నారాయణభజనంబు పరమపావనంబు వేదోక్తంబుల నాచరింపక ఫలంబులకు వాంఛ సేయు వారలనేకజన్మాయుతంబులం బడయుదురు మోక్షంబునపేక్షించువాఁడు విధిచోదితమార్గంబున హరిం బూజింపవలయు నట్టిపూజాప్రకారం బెట్లనినఁ బవిత్రగాత్రుండై [illegible] నుసన్నిధిం బూతచిత్తుండై విధ్యుక్తప్రకారంబునఁ జక్రధరుని ధ్యానించి గంధపుష్పధూపదీపనైవేద్యంబులు సమర్పించి సాష్టాంగదండప్రణామంబులాచరించి భక్తిభావనావిశేషుండగునతండు హరిం జేరుననిచెప్పిన విని విదేహుండిట్లనియె- నీశ్వరుం డేయేకర్మంబుల నాచరించె నంతయు నెఱింగింపుమనిన ద్రమీళుండిట్లనియె॥ క॥ తారల నెన్నఁగవచ్చును। భూరేణుల లెక్క పెట్టఁబోలును ధాత్రి। న్నారాయణగుణకథనము। లారయ వర్ణింప లేరు హరబ్రహ్మాదుల్॥ వ॥ ఇట్లుగావున నాత్మసృష్టంబైన మనంబునఁ బంచభూతనికరంబను పురంబొనరించి యందు నిజాంశంబునం బ్రవేశించి సగుణనిష్ఠుండై నారాయణాభిధానంబుగల ఋషీశ్వరుండగు పరమేశ్వరుండు వెలుఁగొందె- నతని దశేంద్రియంబులచేఁ బాలితంబులైన దేహంబుల [illegible]రియించి జగద్రక్షకత్వసంహారకత్వాదిగుణంబులు గలుగుటం జేసి గుణనిష్ఠుండై రజస్సత్వతమోగుణంబుల బ్రహ్మవిష్ణురుద్రమూర్తులనంబరగి త్రిగుణాత్మకుండనంబడు నారాయణాఖ్యుని చరిత్రం బెఱింగించెద నాకర్ణింపుము॥ క॥ ధర్మ[illegible]

పుత్రిక। నిర్మలమతిం
॥ గీ॥ అట్టి నారాయణాహ్వయు లై నమాని।బదరీ శ్రమమునందు నపారనిష్ఠ।దపము గావింపబల భదివిల కిమదిని।
న కేంసు దివిజకామినులఁబనిచె॥ వ॥ వారు నారాయణాశ్రమంబునకు నతని తపోవిఘ్నంబు సేయవచ్చునప్పుడవ్వనంబు
బరసాలబిల్వకదళీఖర్జూరజంబూజంబీరచందనపున్నాగమందారాదివివిధవృక్షనిబిడంబును, బుష్పఫలభరితశాఖావ
ప్రతరులతాబృందంబును, మాధవీపుంజమంజరీపుంజమకరందపానమత్తమధుకరనికరఝుంకారరవముఖరితహరిదంత
ంబును, గనకకమలకల్హారవిలసత్సరోవిహరమాణచక్రవాకబకక్రౌంచమరాళదంపతీమండలమండితంబును, మృణాళ
భోజనాసక్తసారసచయచంచూపుటవిఘాటితకమలముకుళకేసరవిసరవితతప్రశస్తసరోవరంబును నై వెలయు నవ్వనం
నఁ నింద్యవదనలందంద నుందగమనంబులం జెందు ఘర్మజలబిందుబృందంబులు నఖాంతంబుల నోసరించుచు డాయం జను
చ॥ మదనుని బాణజాలమున మగ్నతఁ బొందక ధైర్యవంతుఁడై। ముదితల వాడిచూపులకు మోహము నొందక నిశ్చలా
డై। హృదయమునందు నచ్యుతుఁ బరమేశు ననంతు జగన్నివాసునిఁ। న్వదలక భక్తి నిల్పి కొని వారికి నిట్లనె మారి పెంపునన్॥
జంభారి పంపున నుమీ। రంభోరుహవదనలార యరుదెంచితిరా। శుంభద్విహార వాంఛారంభంబున దిరుగుఁడని నలజ్జిం
వెసన్॥ సీ॥ దేవమానిని సేదివ్యనారిత్రంబు నెఱిఁగి సన్నుతి సేయ నెవ్వఁడోపు। బుత్రమిత్రకళత్రభోగంబులను హాని త
ముగా విడిచు సద్ధర్ములకును। విఘ్నము ల్చేయు నెవ్విశ్వేశుఁ గొల్చిన యతనికి నెంత రాయంబు వలను। గానుంబు గ్రోధంబుఁ
గినతపములు పల్వలోదకములఁ భంగిఁ గావె। నిన్ను వర్ణింపనలవియే నిర్మలాత్మ। రమణులో గోసుమాయపగాధమసుచు।
స్తుతించిన యతఁడు ప్రసన్నుఁడగుచుఁ దనసామర్థ్యమెఱిఁగింపఁ దలఁచి యప్పుడు॥ వ॥ అమ్మునీశ్వరుండు పరమాశ్చర్య
నంబుగా నిజతనూరుహంబుల వలన ద్రికోటికన్యకాసివహంబుల నుద్భవింపం జేసిన, గంధర్వ విబుధకామినీ సమూహ
ంబులు పరమాద్భుతభయంబులు మనంబులం బొడమ సన్నుతించి యచ్చెలాసిని సమూహంబులో నూర్వశియను దానిం
నిచని పాకశాసను సభాసదనంబునం బెట్టిన వృత్తాంతంబంతయు విన్నవించిన నాశ్చర్యయుక్తహృదయుండై శునాసీ
ండూరకుండె-నట్టి నారాయణమునీశ్వరు చరిత్రంబు విను వారలు పరమకల్యాణగుణవంతులగుదురని చెప్పిన॥ గీ॥ ఋషభ
నకు నాత్మయోగమికీర్తిఁ జెప్పె। నచ్యుతుఁడు భూమి భారమునడఁపనంత। సొంపెనవతారములు దాల్చె సొంపు నెనఁడు। రా
చరులను జంపనీరసముతోడ॥ వ॥ అట్టి పరమేశ్వరుని లీలాగృహీతంబులగు మత్స్యకూర్మవరాహనారసింహవామనరా
రఘురామరామబుద్ధకల్క్యాద్యవతారంబులనేకంబులు గలవు శేషభాషాపతులకైన నుతియింపనలవి గామమఱియును॥
లఘుసీసము॥ నవపికచసరసిరుహనయనయుగ నిజచరణగగనచరనదినిఖిలనిగమపినుత। జలధిజనికుచకలశలలితహృగ
దిరపరిమళితనిజహృదయధరణిభరణ। ద్రుహిణముఖసురనికరవిహితనుతికలితగుణ। టిఘుటిలరుచిరతరకనకవసన।
వరగమసరజగిరిపతివినుతసతతవ్రతజపనియమసరణిచరిత। తిమికమఠకిటినృహరినమితబలినిహితపదపరశుధ
కరవిదళన। సురమఘనకలికలుషముదపహృతనిపుణకరివరదముని సుజనుగరుడపనుత॥ వ॥ ఇవ్విధంబునం బ్ర
స్తినన శ్రీమన్నారాయణమూర్తి లీలావిలాసంబులనంతంబులు గలవు-మనోవాక్కాయకర్మంబుల హరిపూజనంబు సే
కవిపరీతగతులందు నుచ్చుండుఁ జడులకెవ్విధంబున గతిగలుగునని నన్నప్పుడప్పుడమి ఱేఁడు స్వరమ ఘురుమ్ములఁ జూచి యట్టిజ

ఋషభకుమారులగు చమసకరభాజనులు సేయు పరమార్థోపదేశము.

లుముక్తి నొందను పాయం బెట్టులంతయు నెఱింగింపుమనిన చమసుండిట్లనియె॥ సీ॥ హరిముఖ బాహూరువరపదాబ్జము
మువరుసచ ... వర్ణవర్గ సమితి। జనియించె నందులో నతులును శూద్రులు హరిఁదలంతురు కలిహోయనమాల। వేదశాస్త్రపు
ణవిఖ్యాతులై కర్మకర్తలై విప్రులు గర్వ మెసఁగి। హరిభక్తిపరులను హాస్యంబు సేయుచు నిరయంబు నొందుట నిజముగా
ప్యములపక్వాన్నములను దామెసఁగఁ గోరి। జీవహింసకుఁ జను వానిఁ జెందు నఘము। హరిను తింపక స్త్రీలోలుఁడైన వాఁ
నరకవాసుండునగుచుండు ననవరతము॥ వ॥ అట్లుగావున గృహ, క్షేత్ర, పుత్ర, కళత్ర, ధన, ధాన్యాదులందు మోహితుం
ముక్తిమార్గంబుల ప్రత్యక్షంబని నిందించువాఁడును, హరిభక్తివిరహితుండును, దుర్గతిం బాలుదురని మునివరుండానతి
నవి దేహుండిట్లనియె॥ గీ॥ ఏయుగంబునందు నేరీతి వర్తించు। నెట్టిరూపువాఁడు నెవ్విధమున। మునుసుతింపఁబడెను మ్మని
వగణము చేఁ బిష్ణుఁడవ్యయుండు విశ్వవిభుఁడు॥ వ॥ అసిన విని యందుఁ గరభాజనుండిట్లనియె-ననేకావతారంబులును, నా
రూపంబులును, బహువిధవర్ణంబులును గలిగి రాక్షసుల సంహరించి దుష్టజననిగ్రహంబును, శిష్టజనపరిపాలనంబుం
యుచుం, గృతయుగంబున శుక్లవర్ణుండై, చతుర్బాహుండై, జటావల్కలకృష్ణాజినోత్తరీయజపమాలికాదండకమండ

వాదించుతలంపున నచ్చటికిం జని॥) గీ॥ ధర్మనందనుఁ డనకు వందనము సేయు। కృష్ణులను మాద్రిసుతులనీక్షించి యేమి। బలుక కుగ్రగదా దండ పాణులగుచుఁ। గ్రోధమునఁ బొంగుభీమ దుర్యోధనులను॥) చూచి వారల డాయంజని యిట్లనియె॥) సీ॥ వీర పుంగవులార వినుఁడు మీలోపల భూరిభుజాసత్త్వమున నొకండు। ప్రకటితాభ్యాససంపద్విశేషంబున నొక్కఁ డు నధికుఁడై యుంట జేసి। సమబలులగుట గాఁ జర్చింపగా నిందు జయమొక్కనికి లేదు సమరమునందుఁ। గాన నూఱక పోరగా నేల మీకు నివా రింపనోప్యన్యవైరములను। నడరి తొల్లింటి మర్యాద శల్యాత్మలందుఁ। దలచితద్భాషణములు పథ్యములు గాక। యొక్కలంబు నఁ బోరి నా ముష్టికాసు। రారి వీక్షించి వీరి శుభాశుభములు॥) వ॥ ఎట్లు గావలయునట్ల య్యెడుం గాక యని యచ్చట నిలువక ను గ్రసేనాదిబంధుప్రకరంబులు పరితోషంబున నెదుర్కొన ద్వారకాపురంబు సొచ్చి యందుండి మగుడి నైమిశారణ్యంబు నకుం జని యమ్మునిపుంగవులను మఱింపనచ్చట నొక్కమఖంబు గావించి బహుదక్షిణ లొసంగి యుచితజ్ఞానపరిపూర్ణులగునట్లు గావరం బిచ్చి రేవతియును దానును బంధుజ్ఞాతియుతంబుగా నవభృథస్నానంబాచరించి యనంతరంబ॥) చ॥ విలసితమా ల్యచందననవీనవిభూషణరత్నవస్త్రముల్। పొలుపుగఁ దాల్చి యంచితవిభూతి దలిర్చి సుపూర్ణచంద్రికా। కలితసుధాంశు రేఖ యొసకం బెసగ న్నిజబంధులోచనోత్పలచయముల్లసిల్లఁ బరిపాండురచారుయశోవిలాసుఁడై॥) వ॥ ఇవ్విధంబున ననం తుండును అప్రమేయుండును మాయామానుషవిగ్రహుండును అనంతబలశాలియు నైన బలదేవుండతి విభవంబున నిజపు రంబు ప్రవేశించి సుఖంబున నుండెనని చెప్పి వెండియు నిట్లనియె॥) క॥ హలధరుఁడమర్త్యచరితుం। డలఘుభుజాబలుఁడౌ నచ్చ

## శ్రీకుచేలోపాఖ్యానము.

సమ్మతకర్మంబులు పెక్కు నాళ్లు నొగములు। గల మేటియ లెక్క పెట్టఁగల డెవ రేంద్రా॥) చ॥ అనిన మునీంద్రుఁ గన్గొని ధరాధి పుఁడిట్లను బద్మపత్రలోచనుని యనంతవీర్యగుణసంపద వేమరు విన్ననైనను। దనియదు చిత్తము చ్యుతకథావిభవంబొక మాటు వీనులన్। వినిన మనోజపుష్పశరవిద్ధుఁడునై నవిగాలి నొందడే॥) అదియునుం గాక॥) చ॥ హరిభజియించు హస్తములు హస్తములచ్యుతుఁ గోరి మ్రొక్కు తచ్ఛిరము శిరంబు చక్రధరుఁ జేరిన చిత్తము చిత్తమిందిరా। వరుఁ గనుదృష్టులు దృష్టులు మురవైరిసు తించిన వాణి వాణియ। తదుకథలానుకర్ణములు కర్ణములై విలసిల్లుఁ బో భువిన్॥) క॥ హరిపాదతీర్థసేవా। పరుఁడై విలసిల్లునట్టి ట్టి భాగవతుని విస్ఫురితాంగములంగములా। పరమేశ్వరు నెఱుఁగ నాకుఁ బలుకుము నీంద్రా॥) సీ॥ అనుడు వేదవ్యాసతనయుఁ డా యభిమన్యుతనయున కిట్లనియె నో భూపతి। జనవర గోవిందసఖుఁడు కుచేలుండను నా నొప్పు విప్రుండు మానధనుఁడు। వి జ్ఞానరాగాదివిరహితస్వాంతుండు శాంతుండు ధర్మవత్సలుఁడు ఘనుఁడు। విజితేంద్రియుఁడు బ్రహ్మవేత్త దారిద్ర్యంబు బా ధింప నెరుల గార్పణ్యవృత్తి నడుగఁ బోవక దనకుఁ దానబ్బినట్టి। కాసు పదివేలనిష్కముల్ గా దలంచి। యాత్మ మోదించి పు త్రదారాభిరతుఁ। డొకవిధంబున నడుపుచునుండునంత॥) సీ॥ లలితపతివ్రతాతిలకంబు వంశాభిజాత్యతద్భార్య దుస్సహద రిద్రపీడ చేగడు నొచ్చి పెదవులు దడుపుచు శిశువులాకటి విచ్చుచేఁ గృశించి। మలకుల మాడుచు మానసంబెరియంగఁ బట్టె డోరెము మాకుఁ బెట్టుమనుచు। బత్రభాజనధృతపాణులై తనుఁ జేరి వేడ వీనులు చురఁ జూడినట్లు। ధ్యానమొక నాఁడు వగచిని జాధినాథుఁ జేరి యిట్లనిపలికె నో జీవితేశ। తట్టుముట్టాడు నిట్టి పేదరికమిట్లు। నొంప దీనికుపాయమూహింప వైతి॥) అనిమఱి యు నిట్లనియె॥) గీ॥ బాలసఖుఁడైన యప్పద్మపత్రనేత్రు। గాన నేగి దరిద్రాంధకారమునకు। లైపమును దరింపుము హరి కృపాకటాక్షుగ పిదీప్తి వడసె మహాత్మ నీవు॥) మఱియును॥) చ॥ వరమునఁ సాధుభక్తజనవత్సలుఁ డార్తశరణ్యుఁ డిందిరా। వరుఁ డుదయాపయోనిధి భగవంతుఁడు కృష్ణుఁడు దా కుశస్థలీ। పురమున యాదవప్రకరముల్ భజియింపఁగనున్న వాఁడు యి। ట్లరిగిన నని న్నుఁ జూచి విభుఁ డప్పుడ యిచ్చు ననూనసంపదల్॥) మ॥ కలలోనం దనునెన్నఁ డుంగనిన పాటి స్వాత్ముఁడై నట్టిమ। ర్త్యులుఁ దా పత్సముయంబునన్ నిజపదాబ్జాతంబు లుల్లంబులోఁ। దలపన్నంతన మెచ్చి యార్తిహరుఁడై తానై ననిచ్చు న్సుసి। శ్చలభక్తిన్ భజియించువారికిడ డే సంపద్విశేషోన్నతుల్॥) క॥ అనిపలికిన నమ్మానిని। మునయోక్తులకలరి భూమిసురుఁ డాకృష్ణున్। గన నే గుట యిహపరసాధనమునునని మదిఁ దలంచి తన సతితోడన్॥) గీ॥ నీవు సెప్పిన యట్ల రాజీవనేత్రు। పాదపద్మంబు లాశ్రయిం పంగ జపుట। పరమశోభనమా చక్రపాణికిపుడు। గాను కేమైన గొంపోవఁగల దె మనకు॥) గీ॥ అనిన నయ్యింతి యాగాత్మ నను చు విభుని। శిథిలవస్త్రంబు కొంగునఁ బృథుకతండు। లముల నొకకొన్ని ముడిచి నెయ్యమున ననుపఁ। జనియె గోవిందదర్శనో త్సాహియగుచు॥) అల్లుచనచుం దనమనంబున॥) సీ॥ ద్వారకానగరంబు నేరీతిఁ జొత్తును భాసురాంతఃపురవాసినైన। య

తపోవ్రతయజ్ఞదానశమదమాదులచేతసంతసింపంగురుజనంబులంబరమభక్తిసేవించువారలంబరిణమింతుననిచెప్పి మరి యును మనము గురుమందిరంబుననున్నయెడ గురుపత్నినియుక్తులమై యింధనార్థంబడవికిం జనిన యవసరంబున॥)సీ॥ఘుమఘుమారావసంకులఘోరజీమూతపటలసంఛన్నాభ్రభాగమగుచుఁ। జటులఝంఝానిలోత్కటసముద్ధూతనానావిధజంతుసంతానమగుచుఁ। జండదిగ్వేదండతుండనిభాఖండవారిధారాపూర్ణవసుధయగుచు। విద్యోతమానోగ్రఖద్యోతకిరణజిహ్మీకృతద్యుతిచ్ఛటావిభవమగుచు। నడరిజడిగురియ నినుఁడనస్తమింప। గాఁడినీరంధ్రనిబిడాంధకారమేది। సూదికాభేద్యమై వస్తుగోచరంబు। గానియట్లుండె మనమున వ్వానఁదడసి॥)గీ॥బయలుగొందియు పెనుమిట్టపల్లములును। గహితనహితస్థలంబులేర్పడుపగాక। మున్నయుత్తరిమనములొండొరులచేతు। లూతగాఁగొని నడచుచునుండ నంత॥)క॥బిసబిసనప్పుడు నుడుగక। పిసరేడివలిచేతవణఁకెడు వకమనముల్। బసచెడిమార్గము గానక। మసలితిమంతటనంశుమంతుఁడు పొడమన్॥)క॥తెలతెలవారెడి వేళను। గలకలమని పలికెఁ బక్షిగణమెల్లెడలన్। మిలమిలని ప్రొద్దు పొడవు। ధళధళయను మెరుగు దిగ్వితానము నిండెన్॥)క॥అప్పుడు సాందీపునిమన। గొప్పరయుచు వచ్చి వానసోఁకున నవలిన్। దెప్పిల్లుటగని ఖేదం। బుప్పతిలం బలికె నకటయో వటులారా॥)చ॥కటకట యిట్లు మాకొరకు గాఁ జమదెంచి మహాటవిన్ సము। త్కటపరిపీడనొందితిరి గావున శిష్యులు మా ఋణంబ నీ। గుటకిది కారణంబు సమకూరెడి బోయిబమీరుమీరువి। స్ఫుటధనబంధుదారబహుపుత్రవిభూతిజయాయురున్నతుల్॥)క॥అని గారవించి యామౌని। మనలన్ దోడ్కొని చను నాత్మమందిరమునకున్। జనుదెంచుటలెల్ల నుకీ। మనమునఁ దలఁతే యటంచు మరియును బలికెన్॥)వ॥అనఘ మనమధ్యయనంబు సేయుచున్యోన్యస్నేహవాత్సల్యంబులం జేయు కృత్యంబులు మరువవు గదా యని యవియెల్ల నుం దలంచి యా మాధవు మాటలు విని యతనిం గనుంగొని కుచేలుం డిట్లనియె॥)క॥వనజోదర గురుమందిర। మున మనము వసించునాఁడు ముదమునఁ గావిం। పని పను లెవ్వియు గలవే। వినుమవి యిట్లుండనిమ్ము విమలచరిత్రా॥)క॥గురుమతి నలవగఁ ద్రిజగ। ద్గురుఁడవనందగిన నీకు గురుఁడనఁదా నెం। దొరుఁ డెవ్వఁ డింత యును నీకు రయంగవిడంబనంబులగుగాదె హరీ॥)వ॥ అని సాభిప్రాయంబుగాఁ బలికిన పలుకులు విని సమస్తభావాభిజ్ఞుండైన పుండరీకాక్షుండు మందస్మితవదనారవిందుండగుచు నతనిం జూచి నీ విచ్చటకి వచ్చునప్పుడు నాయందుల భక్తిం జేసి నాకును పాయంబుగా నేమి పదార్థంబు దెచ్చితి వప్పదార్థంబు లేశమాత్రంబైన పదివేలుగా నంగీకరింతు నట్లుంగాక నీచవర్తనుండై మద్భక్తిం దవులని దుష్టాత్ముండు హేమాచలతుల్యంబైన పదార్థంబు నొసంగిన నదియును నా మనంబున కసమ్మతంబు గావున॥)క॥దళమైన పుష్పమైనను। ఫలమైనను సలిలమైనఁ బాయనిభక్తిన్। గొలిచినజను లర్పించిన। నెలమిన్ రుచిరాన్నముగ నేనే భుజింతున్॥)క॥అని పద్మోదరుఁ డాడిన। వినయోక్తుల కాత్మ నలరి విప్రుఁడు దా(డా)। చ్చిన యటుకులు దగనర్పిం। పను నేరక మోము వాంచి పలుకక యున్నన్॥)వ॥అవ్విప్రుండు చనుదెంచిన కార్యంబు గృష్ణుండు దనదివ్యచిత్తంబున నెఱింగి యితండు పూర్వభవంబున నైశ్వర్యకాముండై నన్ను సేవింపఁడై నను నిక్కుచేలుండు నిజకాంతాముఖోల్లాసంబు కొఱకు నా యొద్దకుం జనుదెంచిన వాఁడితనికి నింద్రాదులకుం బడయరాని బహుప్రకారంబులైన సంపద్విశేషంబు లీక్షణంబ యొసఁగవలయు నని తలంచి యతండు జీర్ణవస్త్రంబు కొన ముడిచి తెచ్చిన యయ్యటుకుల ముడియఁ గని యిదియేడకీ యొయ్యైనన మ్ముడియఁ దనకరకమలంబులఁ బిడిచి యయ్యటుకులు గొన్ని పుచ్చికొని యివి యనేకలోకంబుల నన్నుం బరితృప్తిం బొందింపఁ జాలు నని యప్పుడు॥)క॥మురహరుఁ డొకపిడికెడటుకులు। గరమొప్పగ నారగించి కౌతుకమతియై। మరియును పిడికెడుఁ గొనఁ దత్కర మప్పుడు వట్టెఁ గమలకరకమలములన్॥)క॥ఒప్పారగ నితనికి బహు। సంపద లందింప నివియ చాలును నిక భ। క్షింపఁగ వలవదు త్రిజగ। త్సంపత్కర దేవదేవ సర్వాత్మహరీ॥)వ॥అని యిట్లు వారించిన నక్కుచేలుండు నాఁటి రాత్రి గోవిందుని మందిరంబున నందనసహృదయానందకరంబులగు వివిధపదార్థంబు లనుభవించి మృదులశయ్యాతలంబున నిద్రించి తనమనంబున నందస్నసమధికస్వర్గభోగానుభవుం గా దలంచుచు మరునాఁ డరుణోదయంబున మేల్కని కాలోచితకృత్యంబులు దీర్చి యిందిరారమణుండు దన్నుఁ గొంతదవ్వనిపియాముంత్రితుం జేయఁ జనుచుం బుండరీకాక్షసంకర్షణానందలోలాత్ముండై తనమనంబున నిట్లనియె॥)క॥నా పుణ్యమరయ నెట్టిదొ। యాపుణ్యనిధిం బ్రశాంతు నచ్యుతు నఖిల। వ్యాపకు బ్రహ్మణ్యుని జీ। కాపకుఁ బురుషోత్తముని బరుంగను గొంటిన్॥)సీ॥పరికింపఁ గృపణస్వభావుండనైనట్టి నేనెడ శిలావనీశుఁడైన। యిందిరాదేవికి నెనయంగనత్యైకవాసుఁడై యొప్పు నవ్వాసుదేవుఁ। డేడ నన్నర్థిమై దోడఁబుట్టినవానికైవడిఁ గౌగిటఁ గదియఁ జేర్చి। దైవంబుగాన

న్ను భావించి నిజతల్పమున నుంచి సత్క్రియయొప్పారించి డపి। చామ నిజవధూకరసరోజాతకలిత। చామరానిలవిగతవిశ్రమునిఁ జేసి। శ్రీకుచాలిప్తచందనాంచితకరాబ్జతలములను నడుగులొత్తె వత్సలత మెఱసి॥) కావున॥) ఉ॥ శ్రీనిధి యిట్లు నన్నుఁ బచరించి ఘనంబుగ విత్తమేమియుఁ। నీని తెంటకగాఁ బడకనెన్న దరిద్రుఁడు సంపదస్థుఁడై। కానక వన్ను జేరఁడని కాక శ్రితార్తహరుండు సత్కృపాంభోనిధి పర్వవస్తుపరిపూర్ణునిగా నను జేయకుండునే॥) వ॥ అని తనమనంబున వితర్కించుచు నిజపురంబు సొంపుని నిమాండ్యము॥ సీ॥ భానుచంద్రప్రభాభాసమానస్వర్ణచంద్రకాంతోపలసౌధములును। కలకంఠశుకనీలకంఠసముపఁ లతమోనితభూజితోద్యానములును। ఫుల్లసితాంభోజహల్లకకల్హారకైరవోల్లసితకాసారములును। మణిమయకనకకంకణముఖాభరణవిభ్రాజితదాసదాసీజనంబు। గలిగి చెలువొందు సదనంబు గాంచి విస్మయమునుబొందుచు నెట్టిపుణ్యాత్ముఁ డుండు నిలయమొక్కో యపూర్వమై నెగడె మహో। వైభవోన్నతలక్ష్మీనివాసమగుచు॥) అని తలపోయుచున్న యవసరంబున॥) గీ॥ దివిజవనితలబోలెడు తెరవలపుడు। డాయ నేతెంచి యిందుఁ విచ్చేయుఁడనుచు। విపులసంగీతనృత్యవాద్యములు చెలఁగ। గిరుదోట్టూని చనిరంతిపురమునకపుడు॥) వ॥ ఇట్లు చను దేరనతని భార్యయైన సతీలలామంబు సదనంబున నానందరసమగ్నయగుచు నిట్లనియె॥) సీ॥ ఘనవిభూరాకముందటగని మనమున హర్షించి వైభవంబలర మనుజ। కామినీరూపంబు గైకొన్న యిందిరావనిత చందంబునఁ దనగుచున్న। కలకంఠి తనవాలుకన్నుల క్రేవల నానందబాష్పంబు లంకురింప। నతనిపాదంబుల కాత్మలోఁ మ్రొక్కి భావంబున నాలింగనంబు జేసె। నాథరాదేవుఁడకుం బదివ్యాంబరోఘ। రత్నవిభూషితయై రతిరాజుసాయ। కములగతినొప్పు పరిచారికలు భజింప। లలితసౌభాగ్యయగు నిజలలనఁ జూచి॥) క॥ ఆనారీరత్నంబును। తానును ననురాగరసమున పలుకొత్తగని। ల్యాణంబు నొందుచు నె। ప్పానిన హరిలబ్ధవైభవోన్నతి మెఱయన్॥) సీ॥ కమనీయపద్మరాగస్తంభకంబులఁ గొమరారు పటికంపుకుడ్యములును। మరకతవరరత్నమయకవాటంబులఁ గీలితహరినీలజాలకములు। దీపితచంద్రకాంతోపలవేదులవందితవివిధపద్మాసనములు। మనుహంసతూలికాతల్పంబులను హేమలాలితశయనస్థలములఁ దనరు। సమధికోత్తుంగభద్రపీఠములపరు।లమాసితోన్నతచతురంతయానములును। వలయుసద్వస్తుపరిపూర్ణవాటికలును। గలిగి చెలువొందు మందిరంబెలమి సొచ్చి॥) వ॥ సుఖంబుననుండునట్టి మొదటన మనోవికారంబులు వొడముసుండ వర్తించుచు నిర్మలంబగు తనమనంబున నిట్లనుచింతగాంచు అత్యంతదురంతంబగు దారిద్ర్యదుఃఖార్ణవంబున మునింగియున్న నాకుం గడపటం గలిగిన విధంబున నిప్పుడు॥, గీ॥ ఎన్నఁ గ్రొత్తలైన యిట్టిసంపదలు నా। కబ్బుటెల్ల హరిదయావలోక। నమున జేసి కాదె నలినాక్షుసన్నిధి। కర్గినగుచు నేను నరుగుటయును॥) క॥ నను నావృత్తాంతంబును। తనమనమునఁ గనియు నేమి కడవక ననుఁ బొమ్మని యీసంపదలెల్లను। నొసరఁగ నొడఁగూర్చి నన్ను నొడయని జేసెన్॥) వ॥ అట్టిపురుషోత్తముండు భక్తనిష్ఠులైన సజ్జనులు లేశమాత్రంబగు పదార్థంబైన భక్తిపూర్వకంబుగా సమర్పించిన నది కోటిగుణితంబుగాఁ గైకొని మన్నించుటకు నిది దృష్టాంతంబుగా దేవమలినదేహుండును జీర్ణాంబరుండును నగు నిత్తుం దన హేయంబుగా పాటింపక నాచేనున్న యటుకులాదరంబున నారగించి తన్ను కృతార్థునిం జేయుట యతనిని హేతుకదయ యకాదె యట్టి కారుణ్యసాగరుండైన గోవిందుని చరణారవిందంబులయందుల భక్తిప్రాభవంబు గలుగుంగాక యని యప్పుండరీకాక్షునియందుఁ బూర్వభక్తితాత్పర్యంబునం దగిలి పత్నీసమేతుండై నిఖిలభోగంబులయందు నాసక్తిం బొరయక రాగాదివిరహితుండును నిర్వికారుండును నై యఖిలక్రియలయందు ననంతుని యనంతధ్యానసుధారసంబునం జొక్కుచు విగతబంధనుండై యపవర్గప్రాప్తి నొందె మఱియును॥) గీ॥ దేవదేవుఁ డఖిలభావజ్ఞుఁ డాశ్రిత। వరదుఁడైన హరికి నరణిసుతులు। దైవతములు గాన ధాయుణీవిభుజులు। కంటె దైవమొకఁడు గలడె భువిని॥) క॥ మురహరుఁ డిట్లు కుచేలుని। జరితార్థునిఁ జేసినట్టి చరితము వినుచ। న్నరులకిహపరసుఖములు। హరిభక్తియు



శ్రీకృష్ణుఁడు సకుటుంబముగా గ్రహణస్నానమునకు బోవుట.

యశముఁ గలుగును నవనీనాథ॥) అని మఱియుం బరాశరపౌత్రునకర్జునపౌత్రుం డిట్లనియె॥) గీ॥ దుష్టశిక్షణంబు మఱియు సంహరణాను। శిష్టరక్షణంబు పేయఁదలఁచి। భువిని మనుజుఁడగుచుఁ బుట్టిన శ్రీకృష్ణు। విమలచరితమెల్ల విస్తరింపు॥) అనిన శుకుం డిట్లనియె॥ సీ॥ ధరణీశ బలుఁడును సరసిజోదరుఁడును వైభవోన్నతసుఖలీలమండునంతఁ। జటులోగ్రకల్పాంతసమయమందును బోలె సృగసహ్యమైన ముద్దీప్తమగుచు। గాజిల్లు సూర్యోపరాగంబు చను దెంచు టెఱిగి మానుషులెల్ల వసగవలి। మునుజమదగ్నిరాముఁడు గ్గురాని ముయ్యేడుమారులు దనబలోదారుఁడగుచు। నిజభుజాదండమండితనిబిడనిశిత। చటులపంభోళిసదిరభాస్వత్కుఠా

**లక్షణ యనుకృష్ణునియష్టమభార్య - ద్రౌపదీదేవికిఁ దనవివాహవృత్తాంతము దెలుపుట.**

ద్రౌపదియును గూడి తమలోన ముచ్చటలాడుచుండి॥) వ॥ అట్టియెడఁ గృష్ణకథావేశంబులు పరితోషంబున నుగ్గడింపుచు బ్ర
సంగవశంబున నా రుక్మిణీదేవి మొదలగు శ్రీకృష్ణుభార్యలం గనుంగొని పాంచాలి యిట్లనియె మిమ్ము నుం బుండరీకాక్షుండు వి
వాహంబునఁ జేకొన్న తెఱంగు వినఁ బింపుడనిన వారును దమపరిణయంబుల తెఱంగు మున్ను నేనీకుం జెప్పిన విధంబున వినుపిం
చిరందు సవిస్తరంబుగాఁ దెలియం బలుకని మద్రరాజకన్యకావృత్తాంతం బా మానిని పాంచాలికిం జెప్పిన విధంబు నను నా నిశు
ఘండు ధరిత్రీన్నరేంద్రునకిట్లనియె॥) సీ॥ పాంచాలితో మద్రపతిసుత యిట్లను సంగీతవిద్యావిశారదుండు। నారదుచేఁ బీఠా
స్వనకలితమైనట్టి గోవిందుకథామృతంబు। వవిలియే గ్రోలి చిత్తము దన్మయత్వంబు నొంది మోదింపుచునుండునంత। దుహి
తృవత్సలుఁ డుమద్ధనుండు దానిది విని సముపాయ మొక్కటి మదిఁ దలంచి। చవల నెబ్బంగి నైన గోచరము గాక। వారి మధ్య
ములోన భివ్యాప్తిఁ దోచు। మత్స్యయంత్రంబు గల్పించి మనుజులెంత। వారికైనను దివ్వ మోవంగ రాని॥ గీ॥ ధనువు పరిచండ
నిష్ఠురాస్త్రంబునచట। సంచితంబైన గంధపుష్పాక్షతలను। బూజగావించి ముని దయేచ్ఛు గుణుఁ డేసి। నిద్ధబలమున నీచాపమె
క్కు బెట్టి )క। ఈసాయకంబు నారిం। బోసి వెస న్మత్స్యయంత్రముం ధరగూల। న్వేసిన శౌర్యధురీణుఁడ। నా సుత వరియించు
ననిజనంబులు వినఁగ॥)క। చాటించిన నవ్వార్తకు। బాటించిన సంభ్రమముల బాణాసనమా। క్రీటంకారవహారవ। పాటిత
శాత్రవులు బాహుబలసాహసుల్ ॥)క॥ సుందరతనులు దమస్సవ। సందర్శనకుతుకులమితసైన్యులు భూభృ। న్నందనులే
తెంచిరి జన। నందితయశులని మద్రనగరంబునకున్॥) క॥ చనుదెంచిన వారికి నా। జనకుఁడు వివిధార్చనములు సమ్మతి గా
వి। దిననా బాహుబలాఢ్యులు। ధనువుం జేరంగనరిగి ధైర్యస్ఫూర్తిన్॥ ఇట్లు డగ్గిరి యద్ధనువుం గనుంగొని॥) ఉ॥ కొందఱు
పూనలేకఁ జనఁ గొంద ఱుపూనిక దల్పలేక బోఁ। గొంద ఱొకింత నెత్తనొక కొందఱు నోపికలేకఁ దక్కఁగాఁ। గొంద ఱొకిం
త నారి కిక్కుచుఁ గూరి నృపాలకులిట్లు సిగ్గుచుఁ। జెందితలంగి పోవుచును చీయుల కేగుట నీకుఁ జెప్పనే॥) అట్టియెడ )క। భీముఁడు
రాధేయుఁడును। ద్రాముగతి నెక్కు ద్రోచితగని మీనం। బేమరకిదిరుగుచుంటయు। దామేమియు నెఱుఁగలేకఁ దలఁగిరి పిద
ప॥) క॥ అమరేంద్రతనయుఁ డప్పుడు। శక్యము నేయను పాయమె టిగితగ నేసెయు మీనము ద్రుంపలేక సిగ్గున। విముఖుండై
చనియెనఁ తపికలుంటగుచున్॥) వ॥ ఇట్లు సకలరాజకుమారులుం దమతమ ప్రయత్నంబులు విఫలంబులైన మా భారవిందంబు
లు ముకుళించి దైన్యంబు నవిన్నులై చూచుచున్న సమయంబున॥) చ॥ సరసిజపత్రలోచనుఁడు చాపము సజ్యము చేసి యుల్లస
త్ప్రదరము రిబోసి కార్ముకవిశారదుఁడై యెలరేఖ న్వాలెఖా। చరముగు మీనము న్దునిమె సత్వరతన్ సుగసిద్ధసాధ్యఖే। చరజ
యశబ్దమొప్పఁ జెలుచన్ గురిసెన్ దివిఁ బుష్పవర్షముల్॥) వ॥ అయ్యవసరంబున నేనుం బరితుష్టాంతరంగనై పరమానందవికచ
వదనారవిందంబున నిందిందిరసన్నిభంబులగు చికురబృందంబులు విలసదలికఫలకంబునందు లోలుకఘర్మజలకణంబు
లతిరంగునట్లు శుద్ధాలకంపుటపలు మసలుకొని సంగరకిసలయంబున నోసరింపుచ మిసమిసను మెఱుంగు గమి లుగిరి గొనఁ
గౌనువడవడవడఁకనప్పు శపరుండనమనంబున॥) చ॥ లలితపదాబ్జనూపురకలధ్వనితోదరహాసచంద్రికా। కలితకపోలపాలిక
లఁగప్పు సువర్ణవినూత్నరత్నకుం। డలరుచలొప్పఁ గంకణఝణంకృతులింపెసలారరంగభూ। తలమున కేగుదెంచి మఖితా
మరసంబవు డెత్తిచూచుచున్॥) వ॥ నరపతులం గనుంగొని యసంబున వారి దృణీకరించి। తక్కరజలచాతదివ్యమణికాంచన
మాలికనమ్మురారికం। ధరమున లీలమై నిడిపదంపడి నవ్యసుధూకదామమా। హరికబరింపగిప్పి నయంబునఁ గన్నుల లజ్జదే
రగన్॥) అప్పుడు॥) చ॥ కొలదికిమీరగానవరు గోముఖడిండిమకాహళశంఖ కాహళమలీనృగ వణవానకదుందుభిప
క్కకాంస్యము। క్షరము రజార జాదివివిధధ్వనులేపున భూనభోంతరం। బులఁ జెలగెన్నటీనటనముల్ దనరారె మనోహరా
కృతిన్॥) అంత॥) వ॥ అమరగణంబు దోలియరగారిసుధాకలశంబుగొన్నచం। దమున సమస్తశత్రువసుధావరకోటిఁ దృ
ణీకరించియా। కమలవిలోచనుండు ననుఁ గౌగిట నొప్పగఁ జేర్చి సింహాసం। క్రమణ మెలర్పఁ గొంచుఁ జనెఁ గాంచనచారురథం
బు మీఁదికిన్॥) అట్లు రథారోహణంబు చేసిన॥) చ॥ తురగచతుష్కముల్ వినుతమార్గముగూరతఁ బూన్చి దారకుఁ। డరదము
తొప్పశత్రునికరాంధతమఃపటలప్రచండభా। స్కరరుచి నొప్పనట్టి నిజకార్ముకయుక్తగుణప్రఘోషసం। భరితదిగంత
రుండగుచుఁ బన్నగశాత్రుఁ డాజిఁ బ్రోవుచుండగన్॥) వ॥ అట్టియెడ సకలరాజలోకంబును కృష్ణునివిభవంబు చూచి సోపకనసంఖ్యాం
బులగుమూకలు గట్టి యమ్మహాత్ముని మాహాత్మ్యంబు దెలియలేక దర్పాంధులై కిణంగి॥) ఉ॥ భావభవప్రసూనశరబాధితమా

నసుతై సమస్తథా। శ్రీవరనందనుల్ బలువుఁ దెంపును బెంపును సొంపు నేర్పడన్। దేవకిరీటరత్నరుచిదీపితపాదసరోజుఁడైన
రాజీవదళాక్షుఁ డాకిరివిశృంఖలవృత్తినతి ప్రియయుక్తులై॥అంత)॥చ॥సరసిజలోచనుండు నిజశార్ఙశరాసనముక్తహేమపుం।
ఖరుచిరశాతసాయకనికాయములన్ రిపుకోటి నేసె సిం।ధురరిపువిక్రమ ప్రకటదోర్బలుఁడై విలసిల్లి యొత్తె నుస్తరచారి
నాన్య సైన్యమును సజ్జనమాన్యము పాంచజన్యమున్॥)ఉ॥అత్తరిభూరిబాహుబలులైన విరోధినరేశ్వరుల్ మృగ।వ్రాతము
లూకరం బెట్టి మృగరాజికిశోరము పై నెదిర్చిన।ట్లాతురులై చతుర్విధసమగ్రబలంబులతోడఁ గూడిని। ఘాతకళంకుఁడై ననవ
నీరజనేత్రునిఁ జుట్టుముట్టినన్॥)చ॥అలిగి మురాంతకుండు గులిశాభశరంబుల నూత్నరత్నకుం।డలములతో శిరంబులు ర
ణన్మణినూపురరాజితోఁ బదం।బులు గటకాంగుళీయకవిభూషణచాపశరాలితోడఁ జే।తులు నిలఁ గూలఁగా విజయవోహలి
నై మనువారు డెందియున్॥)క॥హతశేషులు జో క్షాకుల। గతిమాలని శాతపవనకాండములసము।ద్ధతి నేసె తోలి విజయో।
న్నతుఁడై నిజనగరికేగె నరధరుఁ డంతన్॥)వ॥ అట్లు మహితమంగళాలంకృతంబును నతిమనోహరవిభవాభిరామంబునగు
ద్వారకానగరంబునకరుగుదెంచిన మజ్జనకుండు ప్రియంబునఁ దోడనఁ జనుదెంచి॥)చ॥రణితవినూత్నరత్నరుచిరస్ఫుటనూ
పురహారకర్ణభూ।షణకటకాంగుళీయకలసత్పరిధానకిరీటతల్పవా। రణరథవాజిహేతినికరంబుల నంబరిచారికాతతిన్
బ్రణుతగుణోత్తరుండు నవపద్మదళాక్షునకిచ్చె నెమ్మితోన్॥)వ॥ ఇట్లు మహనీయతేజోనిధియై నమాధవు దయాపరిలబ్ధని
ఖిలవస్తువిస్తారుండయ్యు ననిజాధికారశుద్ధికొరకు మఱలం గన్యారత్నంబును వినూత్నరత్నవ్రాతంబును సమర్పించె నని
భూసురగణంబులు వినుతింపమాతండ్రియై నబృహత్సేనుండు నన్ను నుసమస్తవస్తువులను గృష్ణునకు సమర్పించి క్రమంబున
సకలయాదవులనుం బూజించి మఱలి నిజపురంబునకుం జనియె నని చెప్పినఁ గుంతియు గాంధారియుఁ గృష్ణయు నఖిలనృపాల
కాంతాజనంబులును గోపికలుం దమతమ మనంబుల సర్వభూతాంతర్యామియు లీలామానుషవిగ్రహుండును నైన పుండరీ

——శ్రీ నారదాదిఋషులు శ్రీకృష్ణదర్శనము చేసుకొని వసుదేవుని చేక్రతువు చేయుట, ——

కాక్షుచరణారవిందస్మరణానందపరవశలై కృష్ణుం బ్రశంసించిరంత॥)చ॥బలవదరాతిమర్దనులఁ బాంసురనీలనిభప్రభాం
గులన్। గలితనిజాననాంబుజవికాసజితాంచితపూర్ణచంద్రముం। డలులఁ బరేశులన్ నరవిడంబనులన్ గరుణాపయోధు
లన్।విలసదలంకరిష్ణుల నహీనసహిష్ణుల రామకృష్ణులన్॥) వ॥ సందర్శించుతలంపుల నందఱుదమహృదయారవిందంబు
లన్ బ్రేమంబు సందడిగొననప్పుడు॥)ఉ॥ధీరమతిన్ ద్వితత్రితకదేవలసాత్యవతేయకణ్వులున్। నారదగౌతమచ్యవననా
కుజగార్గ్యవసిష్ఠగాలవాంగీరసకశ్యపాసితసుకీర్తిమృకండుజకుంభసంభవాం।గీరులయాజ్ఞవల్క్యమృగశృంగముఖా
ఖిలతాపసోత్తముల్॥)వ॥ చనుదెంచినఁ గృష్ణుండు వారలకుఁ బ్రత్యుత్థానంబులాచరించి వివిధార్చనలు గావించి యిట్లనియె॥
సీ॥సన్మునీశ్వరులార జన్మభాక్కులమై నమాకునిచ్చోటసన్మతిని దేవ। నికరదృష్టాత్ములు నిరుపమయోగీంద్రులైన మీదర్శనం
బబ్బెగాదె। ధృతిమందభాగ్యులింద్రియపరతంత్రులునై నమూఢాత్ములకనఘులార।భవదీయదర్శనస్పర్శనచింతనపా
దార్చనలు దుర్లభంబులయ్యు। నేఁడు మాకిట సులభమై నెగడెగాదె।జగతిపై తీర్థభూతులు సాధుమతులు।మిమ్ము దర్శించుట
యు చాలు నెమ్మితోడ। వేఱె తీర్థంబులవనిపై వెదకనేల॥)వ॥అదియునుం గాక నుదకమయంబులైన తీర్థంబులును మృచ్ఛిలా
మయంబులైన దేవగణంబులును తీర్థదేవతారూపంబులు గాకుండుట లేమ యినననవిచిరకాల సేవనార్చనలం గాని పావనంబు
లు సేయవు సత్పురుషులు దర్శనమాత్రంబునం బావనంబు సేయుదురని వెండియు॥)సీ॥ఆదిత్యచంద్రాగ్నిమేదినీతారాంబు
మారుతాకాశవాఙ్మనములో విఁ।బరికింపదత్తము పాసనంబులఁ బూనితపములు చేసమర్థములు గావు।సకలార్థగోచరజ్ఞానం
బుగల మహాత్మకులు ముహూర్తమాత్రమున సేవ। సేసి పావనములు సేయుదురదియునట్లుండె ధాతుత్రయాయుక్తమైన।
కాయమందాత్మబుద్ధియుఁ గామినీసు।మారులందు స్వకీయాభిమానములను।దివిరి జలమునఁ దీర్థబుద్ధియును జేయు।నట్టిమూ
ఢుండు పశువు మారుఁడనగబరగు॥) వ॥ అనియివ్విధంబునం గృష్ణుండాడిన సాభిప్రాయంబులగు వాక్యంబులు వినియమ్మునీం
ద్రులు విభ్రాంతహృదయులై యూరకుండి ముహూర్తమాత్రంబునకమ్మహాత్మునను గ్రహంబువడసేమందస్మితముఖులై
యప్పుండరీకాక్షునకిట్లనిరి దేవా నేము సుందత్వవిముత్తములైన బ్రహ్మరుద్రాదులను భవదీయ మాయావిమోహితుల
మై యుండుము నిగూఢంబై ననీయిచ్ఛ చేత మమ్మునను గ్రహించితివి భవదీయచరిత్రంబున నిమ్మేదినియొక్కటియయ్యును బ
హురూపంబులఁ గానంబడు విధంబున నీవును మొదలన్ గారణరూపంబున నేకంబయ్యును ననేకరూపంబులు గైకొని జగదుత్ప

త్రై విరించిశాపసాగరంబుహరిదయాకటాక్షంబను నావచేతఁదరియించినిజస్వరూపంబులుధరించి కృష్ణునకుఁదల్లిదండ్రు
లకువందనంబాచరించిగగనపథంబుననిజస్థానంబునకరిగిరంత దేవకీదేవితనమనంబున॥ (క॥ చచ్చినబాలురఁ గ్రమ్మఱ దె
చ్చుటగడువిచిత్రమనుచు దేవకిమదిలో। నచ్చెరువడియవియంతయు। నచ్యుతుహరిమాయగాక యనితలఁచెన్నృపా॥) క॥ పర
మాత్ముఁడఖిలజగదీ। శ్వరుఁడగుకృష్ణుండుసేయుసత్కృత్యంబుల్। పరికింప నెన్నఁ దెక్కులు। ధరణీవరయనినరాజు దాము

## శ్రీ సుభద్రా పరిణయము.

నికనియె॥) సీ॥ మునినాథపార్థుండువనజనాభునిసహోదరిసుభద్రను నేవిధమునఁ బెండ్లి। యయ్యెనావిధమంత నెయ్యానఁ
గ్రమముతోఁ దెలియంగ నెఱింగింపుధీవిశాల। యనవుడునవ్యాసతనయుఁడాతనిఁజూచివినవయ్య నృపదేవవిభునిసుతుఁడు।
మునుఁదీర్థయాత్రాసముత్సుకుండగుచునురమణఁ బ్రభాసతీర్థమునసుండి। యాతలోఁదగితోడి నెయ్యంబుగలిమిఁ। జూడగో
రుచు రాముండుసుందరాంగిఁ। గౌరవేంద్రునకీసమకట్టెననుచుఁ। దనకునెఱిఁగింపనాపురందరసుతుండు॥) వ॥ అట్లు సుభ
ద్రాదర్శనోత్సాహంబుదనమనంబునసందడిగొనం త్రిదండి వేషంబుధరియించి ద్వారకాపురంబునకుంజనుదెంచియప్పౌ
రజనంబులుభక్తిస్నేహంబులననిశంబుఁబూజింపదనమనోరథసిద్ధియగునంతకుంగనిపెట్టుకొనివాసకాలంబు చనునంత
నసప్పట్టణంబుననుండుసమయంబున॥) క॥ రాముఁడుదత్తపటాకృతిఁ। దామదిఁదెలియంగలేకదగనొకనాఁడా। భూమివర
తాపసుఁబో। రామింగనియాత్మమందిరమునకుఁదెచ్చెన్॥) గీ॥ తెచ్చిభిక్షసేయదేవేంద్రతనయుండు। గుడుచుచుండియచట
గోరిమెలఁగు। నసమబాణుమోహనాస్త్రంబు కైవడి। వీరమోహినినవిహారలీల॥) అట్లు సుభద్రవిహరింపుచున్నసమయం
బున॥) చ॥ జలరుహపత్రనేత్రుననుసంభవచారువధూలలామస। ల్లలితవిహారవిభ్రమవిలాసములాత్మకువింతసేయున
బ్బలరిపునందనుండుగనిభావజసాయకబాధ్యమానవి। హ్వలహృదయాబ్జుఁడై నిలిపెన త్తరుణీమణియందుఁజిత్తము॥
ఉ॥ ఆతరుణీశిరోమణియునర్జునునర్జునచారుకీర్తివి। ఖ్యాతునినింద్రనందనునకల్మషమానసుఁ గామినీమనో। జాతునిఁజూ
చిపుష్పశరసాయకజర్జరితాంతరంగయై। భీతిలియుండెసిగ్గుముగిపెంబునుమోహముదేరిచూపులన్॥) వ॥ అట్లా నృపసత్త
మమత్తకాశినులాండొరులచిత్తంబులుచిత్తజాయత్తంబులై కోర్కులుక త్తరింపఁ దాల్ములువీడిసిగ్గునం జిట్టుముట్టాడుచున్న
యంతనొక్కనాఁడుదేవతామహోత్సవనిమిత్తంబునన త్తలోదరిపురంబువెలువలికినరుగుదెంచిన నర్జునుండునుకృష్ణవ
సుదేవదేవకీదేవులయనుమతంబువడసితానునుందోడనచనియప్పుడు॥) సీ॥ సాంద్రశరచ్చంద్రచంద్రికాస్ఫూర్తిచేరాజి
ల్లుపూర్ణిమారజనివోలెఁ। బూర్ణేందుబింబావతీర్ణమై యిలమీఁదభాసిల్లుహరిణిడింభంబువోలె। సులలితమేఘమండలము
ననెడబాసివసుధఁగ్రుమ్మరుతటిద్వల్లివోలె। మాణిక్యరచితసన్నిహితచైతన్యంబునొందినపుత్తడిబొమ్మవోలె। లలితవి
భ్రమరువికళాలక్షణములఁ। బొసగరూపైనశృంగారరసమువోలె। నర్థిజరియించుచున్నపద్మాయతాక్షిఁ। బ్రకటసద్గు
ణభద్రసుభద్రఁజూచి॥) వ॥ అప్పుడాయంజనియరదంబుపై నిడికొనిపోవుచుండఁగనుంగొని యదుబలంబులుమదంబున
వెంటందాకిననప్పుడయ్యాఖండలనందనుండు ప్రచండగాండీవకోదండవిర్ముక్తకాండంబులంగూలించి యఖండబాహాదం
డవిజయప్రకాండుండై కాండవప్రస్థపురంబునకరిగెనటబలభద్రుండవ్వార్తవినివిలయసమయసమీరసఖునికైవడింబటు
రోషభీషణాకారుండై క్రోధించినంగనికృష్ణుండుమొదలైనబంధుజనంబులతనిచరణంబులకుం బ్రణమిల్లిమృదుమధురభా
షణంబులననునయించియొడంబడునట్లుగానాడిననతండునుసంతుష్టుండై మనంబునఁగలంకదేరియప్పుడు॥) క॥ కరులందే
రులనుత్తమహయంబులన్మణిహేమభూషణాంబరభృత్యో। త్కరదాసికాజనంబుల। నరణముఁదగనిచ్చిపంపెననుజకుఁ బ్రీ
తిగన్॥) వ॥ ఇట్లు కృష్ణునకభిమతంబుగానర్జునసుభద్రలకరణంబిచ్చిపంపెనని చెప్పి శుకయోగీంద్రుండుమరియునిట్లనియె॥

## శ్రీకృష్ణుఁడు ఋషిసమేతుండై మిథిలానగరమునకుఁబోవుట.

సీ॥ నరనాథవినుభువనప్రసిద్ధంబుగదీపించునట్టివిదేహదేశ। మందుభూకాంతకు నాననదర్పణంబనఁదనర్చినమిథిలనాఁపుర
మునఁ। గలఁడు శ్రీహరిపాదకంజాతభక్తుండుగళితరాగాదివికారుఁడమల। చరితుఁడక్రోధుండుశాంతుండునిగమార్థకోవి
దుండగుశ్రుతదేవుఁడనెడి। భూసురోత్తముఁడనయగృహ్యాసమాగతంబులుసమైన హేమశైలంబుగాఁ। దలచిపరితోష
మందుచుఁదగగృహస్థధర్మమునసుండెసముచితకర్ముఁడగుచు॥) ఉ॥ ఆపురినేలువాఁడు బహులాశ్వుఁడనా నుతికెక్కినట్టి
ధాత్రీపతియాథరామరునిరీతినినిష్కలుషాంతరంగుఁడై। మేపనులందుధర్మగతినెమరకర్థిఁజరించుచుండెల। క్ష్మీపతి వారి

పైఁ గరుణఁ జేసి ప్రసన్నముఖాంబుజాతుఁడై ॥) వ॥ అట్లు కృష్ణుండు వారలం జూచు వేడ్క విజయస్యందనారూఢుండై నా[illegible] మదేవాత్రికృష్ణద్వైపాయనాసితరోమశారుణదివిజగురుకణ్వమైత్రేయచ్యవనులు నేనును మొదలయిన మును[illegible] మింపఁ జనుచుఁ దత్తద్దేశనివాసులగు నానర్తక-ధన్వ-కురు-జాంగల-కొంకణ-మత్స్య-పాంచాల-కుంతల-మధు-కేకయ-కోసలాదిభూవరులు వివిధవస్తుప్రచయంబులు గానుకలిచ్చి సేవింప గ్రహమధ్యగతుండై దీపించు సూర్యునింబోలి యప్పుండరీకాక్షుండు మందస్మితవదనారవిందుండగుచు వారలం గరుణార్ద్రదృష్టిం జూచి యోగక్షేమంబుల రసి సాదరంబగు భాషణంబుల నాదరింపుచుం గతిపయప్రయాణంబులం విదేహనగరంబు డాయుటయు నా బహులాశ్వుం డమ్మాధవు రాక విని మనంబున హర్షింపుచు వివిధపదార్థంబులు గానుకలుగాఁ గొని తానును శ్రుతదేవుండను మహీసురుండును నెదురు గాజను దెంచి యప్పుడు ॥) ఉ॥ ఆముని కోటికిన్ వినయమారఁగ వందనమాచరించి యా। తామరసాక్షలోచనుఁడు దారచరిత్రుఁడు పాపగోత్రసుత్రాముఁడు భక్తలోకశుభదాయకుఁడైన రమేశు సన్మణిస్తోముని పాదపద్మములు సోఁకగ మ్రొక్కి వినమ్రులై తగన్ ॥ చ॥ కరములు మోడ్చి యోపరమకారుణికోత్తమ నీవు నీమునీశ్వరులు నుమద్గృహంబునకు వచ్చి మముం గృప చేసి యిచ్చటన్ గరమనురక్తిఁ బూజనలు గైకొనుడంచు నుతించి వేడనా। హరి మనమందు వారి ప్రియంబుల కెంతఁ బ్రమోదమందుచున్ ॥ చ॥ శిరము గవారి యిష్టములు దీర్పదలంచి మురాసురారి యొం। డొరుల నెఱుంగకుండ మునియూథముఁ దానును నేగి వారి మం। దిరముల కేక కాలమున ధీరత నా ధరణీవరుండు వా। రిగుహదళాయతాక్షు మునిబృందములం గనకాసనంబులన్ ॥) సీ॥ కూర్చుండ నియమించి కొని రాజు కాంచనకలశౌతకలశోదకముల చేతఁ। బాదముల్ గడిగి తత్పావనజలము దానును సతియు బాంధవజనంబు। గరమర్థి నిజమస్తకంబుల ధరియించి వివిధార్చనములు సద్విధి నొనర్చి। మణిభూషణాంబరమాల్యానులేపనరాజితధూపదీపరాజనములు। భక్తి గావించి పరిమృష్టబహువిధాన్న। పాయసాపూపపరిపక్వఫలములొలి। నారగింపఁగఁ జేసి కర్పూరమిళిత। లలితతాంబూలములు నెయ్యమలర నొసఁగి ॥) వ॥ ఇట్లు సమర్పించిన యనంతరంబ య మ్మిథిలేశ్వరుండైన జనకుండు పరమానందంబు నొంది ॥) చ॥ హరిపదపద్మయుగ్మము నిజాంకతలంబునఁ జేర్చి యొత్తుచుం। బురుషవరేణ్య యీనిఖిలభూతగణావలి యాత్మలందును। స్థిరమతిఁ గర్మసాక్షివి సుధీవర నీపదభక్తకోటితో। నరయ రమాహినాధచతురాస్యులు బోలరటందు రెప్పుడున్ ॥) వ॥ అట్టి లోకవిదితంబైన భవద్వాక్యంబు నిక్కంబుగా భవదీయపాదారవిందంబులందు నొకానొక వేళ లేశమాత్రధ్యానంబు గల నాగృహంబునకు కించనుఁడని చిత్తంబున దలంపక భక్తవాత్సల్యుండవగుటం జేసి విజయము చేసితిరి భవత్పాదపంకేరుహధ్యానసేవారతిం దగిలిన మహాత్ములు ద్వద్ధ్యానంబులు వదలం జాలుదురే నిరంతరంబును శాంతచిత్తులై నిష్కించనులై యోగీంద్రులై నీవలనం గోరి కెగలవారలకు నిన్నె నొసఁగిత్తువు గదా యని వెండియు నిట్లనియె ॥) గీ॥ కృష్ణ పరమాత్మ యదుకులక్షీరవార్ధిశర్వరీచంద్ర మ దేవకీపుత్ర సుజన। వినుత నారాయణాచ్యుత వేదవేద్య। భక్తజనపోషపరితోషపరమపురుష ॥) ఉ॥ శ్రీపురుషోత్తమాఖ్య యదుసింహ కిశోరకభక్తలోకర। క్షాపరతంత్ర నీవు మునిసంఘము గొన్ని దినంబులుండవే। నీపదపద్మరేణువులు నెమ్మి మదీయగృహంబు సోకినన్। దాపసవంద్య యే నిపుడు ధన్యుఁడనయ్యెదఁ గాదె మాధవా ॥) వ॥ అని యభ్యర్థించిన సంప్రసన్నుండై యప్పుండరీకాక్షుండు నిమికులప్రదీపకుండైన జనకచక్రవర్తిం గరుణించి యమ్మిథిలానగరంబునం బౌరజనంబులకు సమున్నతశోభనంబులు గావించుచుం గొన్ని దినంబులుండె నంత ॥) సు॥ శ్రుతదేవుండును మోదితుఁడై మునిజనస్తోమంబుతో నిందిరాపతిఁ దోకొంచు నిజాలయంబునకు నొప్పన్ నేగి యచ్చోట సమ్మతి దర్భాస్తరణంబుల న్నుచితసమ్యక్స్థానపారీణుండై। సతియుం దాను పదాబ్జముల్ గడిగి చంచద్భక్తిఁ దత్తోయముల్ ॥) చ॥ శిరములఁ దాల్చి నవ్యతులసీదళదామకుశప్రసూనవిస్ఫురదరవిందమాలికలఁ బూజ యొనర్చి గృహాంధకూపసం। చరణుఁడనైన నాకడకుఁ జక్రి దనంత నెవచ్చునట్టి సుస్థిరమతి మున్ను నే తపము జేసితినంచును సంతసింపుచున్ ॥) గీ॥ మఱియుఁ దత్పాదతీర్థంబు మందిరమునఁ గలయంజలికించి సంప్రీతిఁ గడలుకొనఁగఁ। బత్త్రఫలపుష్పతోయముల్ భక్తి నొసఁగి। హరి మురాంతకమూర్తి నిజాత్మ నిలిపి ॥) గీ॥ మానితంబగు విశ్వనిధానమూర్తి। మైన కృష్ణుండు తన యింట నారగించె। దనమనోరథసిద్ధియుఁ దనకు నబ్బె। ననుచుఁ బైపుట్టముల్లార్చి యాడుచుండె ॥) చ॥ తరుణియు దానుఁ బుత్రులు పదంపడి కృష్ణు భజింపుచుండఁ ద। చ్చరణములంక పీఠమునఁ జాచిన మెల్లన నొత్తుచున్ రమావరుఁ గనిపల్లె భక్తజనవత్సల మామకభాగ్యమెట్టిదో। హర చతురాస్యులున్నెఱుఁగనట్టి నినుం గనుగొంటి నెమ్మితోన్ ॥) క॥ మునియోగిమానసస్ఫుట। వనజంబుల నెల్లప్రొద్దు వసియించు భవ। ఘ్నదివ్యమూర్తి నాలో। చనగోచరమ

త్యాగాదెసర్వాత్మహరీ॥) వ॥ దేవా నీసచ్చరిత్రంబులు కర్ణరసాయనంబులుగా నాకర్ణింపుచు నీకుఁ బూజలొనర్పుచు నీచర ణారవిందంబులకు వందనంబు సేయుచు నీదివ్యనామసంకీర్తనంబు సేయుచుండు మశరీరంబులు భవదధీనంబులుగా మెలంగు నిర్మలబోధాత్ము లగువారిచిత్తంబులను దర్పణంబులంగా నంబఁచుందువు కర్మవిక్షిప్తచిత్తులైన వారిహృదయంబులనుండి యు కూరగుండవగుదువని మరియు నిట్లనియె ॥) సీ॥ నీకు మ్రొక్కెదఁ గృష్ణ నిగమాంతసంవేద్య లోకరక్షణ భక్తలోకవర ద। నీపాదసేవ నానిరతంబు నన్ను నేపనిఁ బంపెదా నమ్మనిరఁ గృష్ణ। జెలనవ్వు మోమునఁ జెలువొందు నా విప్రకరమాత్మకర మునఁ గదియఁ జేర్చి। పాటించి యతనితోఁ బలికెఁ దపశ్శక్తి వరలిన యమ్మునివర్యు లెపుడు। తన పాదాంబుజ రేణువితానములు ను। తగుల లోకంబులను బవిత్రంబు సేయు। వారు నను గూడి యెప్పుడు వలయు నెడల। కరుగుదెంతురు నీభాగ్యగరిమ నిటకు॥ వ॥ చను దెంచి రిపుణ్యస్థలంబులును విప్రులును దేవతలును సంస్పర్శదర్శనార్చనంబులం బాపములను సమస్తకిల్బిషంబులం బాయం జేయు మరదియునుం గాక బ్రాహ్మణుండు జననమాత్రంబున జీవకోటియందు ఘనుండై యుండు జపతపోధ్యానా ధ్యయనాధ్యాత్మలం జతురుండై సత్కర్మాశ్రయుండయ్యె నేని యతండుత్తముండయి వెలుంగు నతనిం జెప్ప నేలనని మరి యు నిట్లనియె॥) క॥ నా మది విప్రుల పైఁగల। ప్రేమము నా తనువునందుఁ బెట్టని కతనన్। భూమీసురులన్ నీ। వీమునులం బూ జ సేయుమిద్ధచరిత్రా ॥) క॥ ఇదియే నా కిష్టము నను। బది వేలవిధంబులోలయి భజియించిన నా। మదికింపగునటుగావున। వ లనిభక్తిన్ భజింపు వసుధామరులన్॥) క॥ అని సర్వలోకగురుఁడగు। వనజోదరుఁ డానతిచ్చు వాక్యంబుల జా। డనె భూమీసు రుఁడమ్మునిజనులకు భక్తిఁ బూజసలిపె నవగుసన్॥) చ॥ ఎనయఁగఁ గృష్ణుఁ డంతమిథిలేశ్వర భూసురులన్ గృపావలోకన ములయన్న మానసుభగస్థితిఁ బొందఁగఁ జేసి వారిపీ। డ్వానిరద మెకిఁ దివ్యమునికోటియుఁ దానును వచ్చెఁ గ్రమ్మఱన్। జనవర

## శ్రుతిగీతలను పరమతత్త్వప్రతిపాదకమైన పురాతనేతిహాసకథ

మోక్షకాంక్షకు శ్రద్ధలికిం బ్రశాంతరంగుఁడై॥) వ॥ అని చెప్పిన బాదరాయణికి నభిమన్యునందనుండిట్లనియె మునీంద్రా ఘట పటాదివస్తుజాతంబు భంగిని నిర్దేశింపనర్హంబుగాక సత్త్వాదిగుణశూన్యంబైన బ్రహ్మంబునందు సత్త్వాదిగుణగోచరంబులైన వే దంబులెట్లు ప్రవర్తించునట్టి చందంబు నాకెఱిఁగింపు మనిన భూవరునకు మునివరుండిట్లనియె సకలచేతనాచేతనాంత ర్యామియైన సర్వేశ్వరుండు సర్వశబ్దవాచ్యుండుగావున సకలజంతునివహంబులకు బుద్ధీంద్రియమనఃప్రాణశరీరంబులను సృ జియించి చేతనవర్గంబునకు జ్ఞానప్రముండుగాన సకలనిగమసమూహంబులును తత్స్వరూపగుణైశ్వర్యప్రతిపాదకంబులుగా వున ముఖ్యంబై ప్రవర్తించు శ్రుతిస్తోత్రంబుపనిషత్తుల్యంబు అనేకపూర్వఋషిపరంపరాయాతంబును నైన దీనిని శ్రద్ధా యుక్తుండై యెవ్వండను సంధించు నతనికి మోక్షంబు సులభంబు దీనికి నారాయణాఖ్యానంబను నొక్క యుపాఖ్యానంబు గలదు వినుపింతు నాకర్ణింపుము భగవత్ప్రియుండైన నారదమునీంద్రుండొక్క నాఁడు నారాయణాశ్రమంబునకుం జని ఋషిగణసమేతుండైన నారాయణఋషిం గనుంగొని నీవు సన్నడిగినట్ల నారదుండమ్మహాత్ము నిట్లడిగిన నతండు మున్ను నీయర్థంబు శ్వేతద్వీపవాసు లయి సనకసనందనాదిదివ్యయోగీంద్రులు ప్రశ్న చేసిన వారలకు సనందనుండు చెప్పిన ప్రకారంబు నీ కెఱింగించెదనని చె ప్పం దొడంగె శయానుండైన రాజశ్రేష్ఠునిం దత్పరాక్రమపత్రాదిచిహ్నంబులు నుతియించు వందిజనంబుల చందంబున జ గదవసానసమయంబున ననేకశక్తియుతుండై యోగనిద్రావశుండైన సర్వేశ్వరుని వేదంబులు స్తోత్రంబు సేయువిధంబు నా రాయణుండు నారదునకుం జెప్పిన తెఱంగున వినుమని యిట్లనియె॥) సీ॥ జయ జయ హరి దేవ సకలజంతువులకు జ్ఞానప్రముండ వుగాన వారి। వలన దోషంబులు గలిగిన సుగుణసంతానంబుగాఁ బరిజ్ఞానశక్తి। ముఖ్యషడ్గుణపరిపూర్ణతఁ జేసి మాయాత్మ వశి ష్టుఁడవగుచుఁ గార్య। కారణాత్మకుఁడవై గణుతికెక్కుచున్న నీయందు బరయోగుహేతు। లవిరియామ్నాయములు ప్రవ ర్తించుగానఁ। బ్రకట త్రిగుణాత్మకంబైన ప్రకృతితోడ। యోగమింతయు మాన్ప వేయోగివైన। సాంబుజాత మధుప్రగయ నిను నెంచి॥) అదియునుం గాక॥) సీ॥ పరమవిజ్ఞానసంపన్నులైనట్టి యోగీంద్రులును హితనిస్తంద్రలీలఁ। బరిదృశ్యమానమై భాసిల్లు నిస్సీమపర్వతముఖర ప్రపంచమెల్లఁ। బ్రకట బ్రహ్మస్వరూపముగాఁ దెలియుదు రేమి నీవును జగద్విలయవేళ। నవశిష్టుఁడవుగాన ననఘ నీయందు నీవిపులవిశ్వోదయవిలయములగు। ఘటశరావాదులగు మృద్వికారములు మృ। దాత్మకం బైనయట్లు పద్మాయతాక్ష। తవిలి కారణరూపంబు దాల్చి లీలఁ। గణఁగి నీయందు బుద్ధివాక్కర్మములను॥) క॥ అలవడఁ జేయుదు రందురు। బలుకొని యిలఁ బెట్టబడిన పదవిన్యాసం। బుల పతనకారణములుగ। నలవుగ సేవింపుచు నుగ్రుతార్థులరగుచున్॥) క॥

లీలం బ్రాకృతపూరుష। కాలాదికనిఖిలమగుజగంబుల కెల్లన్। మాలిన్యనివారకమగు। నీలలితకథాసుధాబ్ధినిం గ్రుంకిత
గన్॥) చ॥ భరితనిదాఘతప్తుఁ డగుపాంథుఁడు శీతలవారి గ్రుంకి మ। ప్పరమగు తాపముం దొఱఁగునట్లు వడిన్ సంసరణోగ్రతాప
ము। స్వైరవున బాయుచుండు దురునిన్ను భజించు మహాత్ముకుల్ జరా। మరణమనోగుణంబులఁ గ్రమంబునఁ బాయుట సెప్ప
నేటికిన్॥) అదియునుంగాక॥) సీ॥ అనయంబు దేహినిత్యానిత్యసద్విలక్షణమునఁ బంచకోశవ్యవస్థ। లనువృద్ధిఁ బొరయుచు
నంచులోపలనున్న ప్రాణాదిబుద్ధివిజ్ఞానమయము। లను చతుష్కోశంబులవ్వల వెలుగొందు నానందమయుఁడవు గాన దేవ। సు
రుచిరస్వప్రకాశుండవు నీ పరిగ్రహము గల్గుటఁ జేసి కాదె ప్రకృతి। మహదహంకారపంచతన్మాత్ర గగన। పవన తేజోంబుభూ
భూతపంచకాది। కలితతత్త్వంబు బ్రహ్మాండకార్యకరణ। మందు నెపుడు సమర్థంబులగుట జేసి॥) క॥ కోరి శరీరులు భవదను। సా
రంబున నిహపరైకసౌఖ్యంబులఁ బెం। పారగనందుచునుందురు। శ్రీగజనోత్తములనంగ దివిజారిహరా॥) గీ॥ నిన్ను ననుసరిం
ప నేరని కుజనులు। పవనపూర్ణచర్మభస్త్రి సమితి। న్వ్రాలె జేయుచుండురుచ్ఛ్వసనంబులు। బలసియాత్మభేదభజనులగుచు॥
సీ॥ దేవ కొందఱు మహాత్ములు దృష్ట్యర్కులై నట్టి మహాత్మకులు దరస్థులైన వపిన్న। గామదిఁ దలఁతురు గొని మఱికొందఱారుణుల
ను సేరనమరు బుఋషులు। లీలసుషుమ్నా నాడీమార్గగతుఁడవై హృత్ప్రదేశమునఁ జరింపుచున్న। రుచిర దేహాకాశరూపిగా
భావింతురట్టి హృత్పద్మంబునందు వెడలి। వితతమూర్ధన్యనాసికాగతులనోలి। బ్రహ్మరంధ్రంబు బ్రాపించి పరమపురుష। సుమ
హితానందమయపరంజ్యోతియైన। యీశునినుఁ బొంది మఱి పుట్టరిలను హీశ॥) వ॥ మఱియు వివిధకాష్ఠాంతర్గతుండైన వా
యుసఖుండు దదతదోషంబునం బొరయక నిత్యశుద్ధుండై తరతమభావంబున వర్తించు చందంబున స్వసంకల్పకృతంబులైన
విచిత్రశరీరంబులయందు మనంతర్యామివై ప్రవేశించి తత్తద్విచిత్రయోనిగతంబైన హేయంబును బొరయక సకలాత్మకం
బై యేకరసంబై బ్రహ్మంబైన నిన్ను నైహికాముష్మికఫలసంగమంబు లేక విగతరజోగుణంబులం దగిలి కొందఱు భజియింపు
చుండుదురు గదియునుం గాక దేవా భవదీయసంకల్పాధీనంబులైన శరీరంబులను బ్రవేశించియున్న జీవసమూహంబు నీకు శే
షభూతంబని తెలిసి కొందఱు భవనివారకంబైన శ్రీమత్త్వచ్చరణారవిందంబులు సేవించి కృతార్థులగుదురు మఱియును॥) సీ॥
అనఘ దుర్గమమైన యాత్మతత్త్వంబు బ్రవర్తించు కొఱకు దివ్యంబులైన। యంచితరామకృష్ణాద్యవతారముల్ భజియించియు
న్న నీ భవ్యచరిత। మనుసుధాంభోనిధిరవగాహనము సేసి విశ్రాంతచిత్తులై వెలయుచుండి। మోక్షంబు బుద్ధిన పేక్షింప నొల్ల
గుమరియుఁ గొందఱు భవచ్చరణపంక। జములు దగిలి ధన్యతములై సహంసల। వకనమొందిరి భాగవతజనముల। మునరు వాగు
ప్రకటయోగిజనాప్తమై। నట్టి యుక్తి గోరరాత్మల దా॥) ఉ॥ కొందఱు నీ శరీరములకుం దరితభక్తి భవద్వశంబులై। జెందగ నీప
దాబ్జములు సేరి భజింపుచుఁ దత్సుఖాత్ములై। యుందురు కొందఱీతనువులోలి ధరించి భవత్పదాబ్జముల్। పొందఁగఁ గొల్వ లేక
నిలఁ బుట్టుచుఁ జచ్చుచునుందురవ్యయా॥) చ॥ యనఘ నియమాదియోగమహాత్మకులైన మునీంద్రులున్ విరోధమునఁ ద
లంచు దైత్యవసుధావరముఖ్యనృపుల్ ఫణీంద్రభో। గములనెప్పు బాహువులు గల్గిన మిమ్ము భజించు గోపికల్। గ్రమము
న నేమనుల్ సరియ కామె భవత్కృపకంబు జొందరా॥) మ॥ అరవిందాక్ష భవత్స్వరూపములు బ్రత్యక్షంబునం గాననెవ్వ
రికిం బోలదు శాస్త్రగోచరుఁడవై వర్తింతు నీ సృష్టియుల్। ధరస్రష్టపుఁడవైన నీవలన నీ ధాత్రాద్యమర్త్యుల్ జనిం। చిరి ని
న్నంతకమున్నె యుంగఁగలమే చింతింప నేనచ్యుతా॥) వ॥ అట్టి నిన్ను బరమాణుకారణవాదులైన కణ్వగౌతమాదులును బ్ర
కృతికారణవాదులైన సాంఖ్యులును దేహాత్మవాదులైన బౌద్ధులును వివిధంబులైన కుతర్కంబుల చేతం బరస్పరావ్యాహ
తంబులైన మతంబులు దమతమ కుతర్కవాదంబుల సమర్థింపుచు నిన్నుం దెలియలేరు మహాభాగ్యవంతులైన యోగీంద్రు
లకు నీవు ప్రత్యక్షంబైన నివియన్నియు నసత్యంబులని కానవచ్చు వేఁడియుఁ గొందఱీ సచరాచరవస్తుజాతంబులకు నంతర్యా
మివై సర్వంబు నీవయగుటం దెలియలేక ననిత్యంబనియును విపరీతబుద్ధిం దెలియుదురు గాని భవదీయ దివ్యతత్త్వంబు నిక్కం
బుగఁ దెలియ నేరరు కొందఱు జగత్కారణుండవు గాన జగద్రూపసుండవైన నిన్నుం గటకమకుటకర్ణికాదివివిధ భూషణభేదం
బులం గనకంబు నిజస్వరూపంబు విడువక వర్తించు చందంబున జగద్వికారానుగతుండవయ్యును నిఖిలహేయప్రత్యనీక కల్యా
ణగుణాత్మకుండవై యుండుదువని యాత్మవిదులైనవారు దెలియుదురదియునుంగాక॥) మ॥ వనజాతాక్ష భవత్పదాబ్జయు
గసేవాసక్తులైనట్టియ। జ్జనముల్ మృత్యుశిరంబుదన్ని ఘనసంసారాంబుధిన్ దాటి పావనులై లోకములం బునీతములు గావ
ర్తింపుచున్నిత్యశోభనమై యొప్పెడి ముక్తిఁ బొందుదురు శుంభద్వైభవోపేతలై॥) మ॥ మిము సద్భక్తి భజింప నొల్లక ఇలదు

నిగోలుచు వారంచుచుండు। రచ్యుతుఁ బరము ననంతుఁ గుణాతీతుఁ బురుషోత్తముని నాదిపురుషు ననఘు। నర్థిభజియించువార
రాగాదిరహితు। లగుచు దీపింతు రెంతయు ననఘచరిత। ధర్మనందనుఁ డశ్వమేధంబు చేసి। పిదప సాత్త్వికకథనముల్ ప్రీతితో
డ॥) ఉ॥ నారదసంయమీంద్రు వలన న్వినుచుండి యనంతరంబ పం। కేరుహనాభుఁ జూచి యడిగెన్ దగ నివ్విధ మీవు నన్నునిం। డా
రిభక్తిమై నడిగినట్లియ తండును మందహాసపం। స్ఫారకపోలుఁడై పలికెఁ బాండుతనూభవుతోడఁ జెచ్చెరన్॥) సీ॥ వసుమ
తీనాథ యెవ్వని మీఁద నాకనుగ్రహబుద్ధి పుట్టు నా ఘనుని విత్త। మంతయుఁ గ్రమమున నపహరించిన వాఁడు ధనహీనుఁడగుచు
వంతాపమంది। విడుతురు బంధులవ్విధమున నొందిలిర్మై చేయునది లేక యఖిలకార్య। భాగంబులుడిగి మద్భక్తులతోమైత్రి
నెరపుచు విజ్ఞాననిరతుఁ డగుచుఁ। బిదప వాఁ డవ్యయానందపదము నాత్మఁ। బరగి శ్రీవిష్ణులోకసంప్రాప్తి నొందు। గాన మత్సేవ
కులకుఁ బురుషకారమటంచు। వదలి భజియింతురితర దేవతల నెపుడు॥) క॥ సేవింప వారు దమకుం। గావించిన శోభనములు గని నిజ

——శివద్రోహంబు సేయబూనిన వృకాసురుం డు విష్ణుమాయ చే మడుసుట, శిఖ——

ములుగా। భావించి వారు మరతురు। భావముల గృతఘ్నవృత్తిఁ బనితమపనిగన్॥) క॥ మెలగుచునుందురు దీనికిఁ। గలదొక యి
తిహాస మిపుడు నైకొని నీకున్। దెలియఁగఁ జెప్పెద దానవ। నలవదు నీ వడుగు ప్రశ్నకగు నుత్తరమున్॥) క॥ శకునుఁ డను దైత్య
తనయుఁడు। వృకుఁ డను వాఁ డొకఁడు దుర్వివేకుఁడు సుజన। ప్రకరముల నలపఁ దెరువున। నొకనాఁ డొదిగుండి దివ్యయోగిం
గనుచున్॥) క॥ కరములు మోడ్చి దివ్యానీ। శ్వర నారదలలిత ధీవిశారదనన్నున్। గరుణించి యానతీశుభ। కరులగు హరిహర
హిరణ్యగర్భులలోనన్॥ గీ॥ కణఁగికొలువ శీఘ్రకాలంబులోఁ దన। యిష్టమైన వరము లిచ్చునట్టి। దైవ మెవ్వఁ డనిన దానవుఁ
గనుగొని। మునివరుండు వలికె ముదముతోడ॥) వ॥ వినుము ద్రుగుణసుగుణంబులలోనొక్కటి యెచ్చటం గలుగు నచ్చట నతఁ
డంబ కోపప్రసాదఫలంబులు చూపు వాఁడమ్మహేశ్వరయందు మనుఫాలలోచనుండివ్విధంబు దెలిసినవారై బాణాసురదశకంధ
రులు సమగ్రభక్తియుక్తులై సేవించి యసమానసామ్రాజ్యవైభవంబుల నొంది ప్రసిద్ధులైరట్లు గావున నీవును నమ్మహా
త్ముని సేవింపుము తనివలన నభిమతఫలంబులు వేగంబ ప్రాప్తంబయ్యెడినని చెప్పిన నతండతిక్షణంబ॥) సీ॥ దీపించు కేదారతీర్థంబు
నకు నేగి యతిసాహసాత్మకుండై నయసుర। లోకము ల్వెఱగందనా కాలకంధరు వరదుని నంబికావరుని గూర్చి। తన మేనికండ
లుద్దండుఁడై ఖండించి యగ్నికాహుతులుగా నలర వేల్చి। దర్పకారాతి ప్రత్యక్షుంబు గాకున్న జడియక సప్తవాసరములందు।
బూనితత్తీర్థమునఁ గృతస్నానుఁ డగుచు। వెడలు నెత్తుటఁ బుక్కిటఁ గోరనావెలయునట్టి। గండగొడ్డంటఁ దనమస్తకంబు దునుము। కొ
నఁగఁ బూనిన నయ్యగ్నికుండమునను॥) క॥ అసమగ వెలువడి గుమ్మఁడుఁ। గరుణ దలిర్పంగ వాని కరమాత్మకరాంబురుహమునఁ
బట్టి తెగువకుఁ। జోరవలవదు మెచ్చితి వచ్చెద సుమహితచరితా॥) క॥ నీకు దిఁబొడమిన కోరికె। లేమైనను వేఁడు మిపుడె యిచ్చెద
నినన్। దాపనమున సంతసపడి। యామనుజాశనుఁడు హరుపదాంబుజములకున్॥) గీ॥ వందనంబాచరించి యోయిందుమకు
ట। ఫాలలోచన వరద నుతప్రశిత। నేను నెవ్వని తలమీఁద నిడిన వాని। మస్తకము నూఱువ్రయ్యలై మడియనీవె॥) క॥ అని వే
డిన నవ్వాటకు। విని సదనారాధిని నవ్విబుధాహితునకు। దినవరము దడయక యిచ్చిన। దనుజుండు దద్వరపరీక్షఁ దా జేయుటకున్॥
అతఁ డంబ వరదానగర్వంబునను న్మత్తుండై కడంగి॥) క॥ ఆహరుమస్తకమునఁ గడు। సాహసమునఁ జేయి వెట్టఁ జడియకఁ గదిసి
యున్నోన్నతుఁడు తన మెచ్చులు దన। కాపై వచ్చెనను చు నభవుఁడు భీతిన్॥) క॥ దనుజుఁడు దన వెను వెంటన్। జను దేమి యల్లో
కములను సంత్రాసమునైకొని పార సురలు మనములఁ। దనికిరి దానికిని బ్రతివిధాన మిది లేమిన్॥ అట్లు చనిచని॥) సీ॥ నిరుప
మానందమై నిఖిలలోకములకు నవలమై యమృతపదాఖ్యఁ దనరి। దినకరచంద్రదీధితులకుఁ జొరరాక సలలిత సహజతేజ
మున వెలుగు। సనాధికంబగు శుద్ధసత్త్వగరిష్ఠమై కర మొప్పు యోగీంద్రగమ్య మగుచు। హరిపదధ్యానపారాయణులైన సత
ద్దాసులకు లరు నివాసమగుచుఁ। బ్రవిమలానంత తేజోవిరాజమాన। దివ్యమణిహేమకలితసందీప్తభవ్య। సౌధమంటపతోర
ణస్తంభవిపుల। గోపురాకీర్ణసురము వైకుంఠపురము॥) వ॥ కనుంగొని యమ్మహాస్థానంబు డాయం జనుటయు నప్పుండరీకా
క్షుండఖండవైభవంబునం గుండలీశ్వరభోగతల్పంబునం బరమానంద కందళితహృదయారవిందుండై యిందిరాసయనచ
కోరంబుల నిజమందహాససాంద్రచంద్రికావితతిం దేల్పుచు నార్తభక్తజనరక్షణంబు పనిగా మెలంగుచు వివిధవినోదంబులం
దగిలి యుండి యాఫాలలోచనుండగ్గనుజపాలునకుం దలంపక నిచ్చిన వరంబు తనతలమీఁద వచ్చినం గలంగి చను దెంచుట దనది
వ్యచిత్తంబున నెఱింగి యక్కాలకంధరుని యవస్థ నివారింపం దలంచి యయ్యిందిరాదేవితోడి వినోదంబు చాలించి యప్పుడు॥

న భార్యకు ప్రసూతి వేదనాసమయంబైనం జనుదెంచి సవ్యసాచికిం దద్వృత్తాంతం బెఱింగించిన నయ్యింద్రతనయుం డప్పుడు॥) చ॥
లలితశుచిష్మదంచితజలంబుల నాచమనంబుఁ జేసి సుస్థలమున నిల్చి రుద్రునకు సమ్మతి మ్రొక్కి మహాస్త్రవేది నిర్మలశుభమంత్ర
దేవతలమానసమందుఁ దలంచి గాండివం బలవడ నెక్కుఁ ద్రోచి బిగియం గడియించి నిషంగయుగ్మముల్॥) ఇవ్విధంబునఁ గట్టా
యిత్తంబై యుప్పుడు॥) సీ॥ భూసురు వెంటనిమ్ముల నేగి సూతికాభవనంబు చుట్టును బాణవితతి । సరికట్టి దిక్కులు నాకాశపథము ధ
రాతలంబెల్ల నీరంధ్రముగను । శరపంజరముగట్టి శౌర్యంబు దీపింపఁగఁ బెనుప్రసూతిగృహ కావలియున్న । యెడ నప్పు డాసుగుణ యింతి
కిఁ బుత్రకుండు జనియించె నప్పుడ చచ్చెటి జనంబు । పోయెం బోయె గెడయుని బొబ్బ డగ । బొందెతోడ నయ్యాకాశమునకు నాయ
జెందినప్పుడు దుఃఖంబు నొంది భూమి । సురుఁడు విలపించుచును మురహరునికడను॥ అప్పుడు చని॥) క॥ ముంగటనిల్చి ముకుందన
నందన మునివినుత నందనందన పరమా । నందశరదిందుచందన । కందయశస్సాంద్ర కృష్ణ గోవిందహరీ॥) వ॥ అవధరింపుము దే
వా యుపనుండ నెడి సారుషవిహీనుం డాడిన వృథాజల్పంబులు నమ్మి పుత్త్రుం గోలుపడితిఁ బేల నైన నన్ను నేమందు మనిఖిలవిశ్వోత్ప
త్తిస్థితిలయంబులకుం బ్రధానహేతుభూతుండవైన నీవు సమర్థుండ వయ్యు వారిం బంజాలక జూచుచుండ నొక్క మనుష్య
మాత్రుండు వీర్యంబు జాలెడువాఁడు గలండే యని వెండియు॥) క॥ ఎక్కడి పాండుతనూభవుఁ । డెక్కడి విలుకాఁడు వీని కెక్కడి
సత్త్వం । బెక్కడి గాండీవము దన । కెక్కడి దివ్యాస్త్రసమితి యేమనవచ్చున్॥) క॥ ఆనీచు నోడక నిందిం । వినయయ్యర్జునుఁడు
చాలఁ జిడిముడిపడుచున్ । దనవిద్యను హీను పెంపువ । జనియె న్వెస దండపాణిసదనంబునకున్॥) క॥ చనియందు ధారుణీసు
రతనయులు లేమి నంటఁ దెలసి తడయక నింద్రాగ్ని నిర్‌ఋతి వరుణ సమీరణ । ధనదేశానాలయములు దగ బరికించెన్॥) వెండి
యు॥) చ॥ నరసురయక్షకింపురుష నాగనిశాచర సిద్ధసాధ్య ఖేచర విహగేంద్ర గుహ్యక పిశాచ నివాసములందు రోసి భూ । సు
రసుతులేగినట్టి గతి చొప్పడ సంతటఁ జూచి క్రమ్మఱన్ । ధగఁ జిక్కి నేఁ డెంచి బెడిదంబుగ నగ్నిఁ జొరంగఁ బూనినన్॥) వ॥ ఇవ్విధం
బంతయు నెఱింగి యచ్యుతుండు అంతకుం దవిప్రనందనుల నీకుం జూపెదనని యనలంబు సారకుండ నతనిని వారించి యప్పుడు॥,ఉ॥
సుందరదివ్యరత్నరుచి శోభితమై తనరారు కాంచనస్యందనమం బుజాక్షుఁ డుదయాచలమెక్కు విధంబు పోఁడఁబొం । దందరి
దాను నెక్కి తను రశ్ములు దిగ్వితతిన్ వెలుంగఁగా । విందుఁడు దారవిలంజ నెవిప్రతనూజగవేషణార్థియై ॥) చ॥ చనిపురగోష్ఠ
పుర్వన జానపదాచలపక్కణ ప్రభూ । తనదనదీపయోవరయుతక్షితినంతయు దాటి సప్తవా । రినిధులు దీవులుం గులగిరి ప్రకరం
బులను త్తరించి మేరునగము నాక్రమించు మహోద్ధతి తోరథ మేగెనత్తరిన్॥) చ॥ మసలక భూరిసంతమసమండలముం దరి
యంగఁ జొచ్చి సాహసమునం బోవం బోవగ భయంకరమై మదిగోచరింపమిన్ । వసుమతి మ్రోకరిల్లి రథవాజులు మార్గము ద
ప్పినిల్చినన్ । బిసరుహపత్త్రలోచనుఁడు భేద్యతమఃపటలంబు వాపగన్॥) సీ॥ బాలభాను ప్రభాభాసమానద్యుతిఁ గర మొప్పు
నిజరథాంగంబు బనుప నమ్మహాస్త్రంబు వేగ దిమ్ముఁ జీకటి నెల్లనటిము ఱిసిం దండదనరిక్కైది । యగ్రభాగంబున నతులితగతి నేగ నా
మార్గమున నిజస్యందనంబు । గడువడిఁ దోలియా కడిఁదితమోభూమి గడవ ముందట నకడఁ గాన రాక । మిక్కుటకద్దృష్టులను మిఱు
మిట్లుగొలిపి చదలవెలుగొందు దివ్యతేజంబు చూచి । మొనసి గాండీవి కన్నులు మూసికొనుచు । నాత్మభయమందికొంత దవ్వ
రిగి యరిగి॥) గీ॥ కడుదుర్వారమారుతోత్కటఘూర్మి । చటులసర్వాంకషోర్మిభీషణ గభీర । వారిపూరంబు పొడ్చితన్నీరమధ్య ।
భాగమునఁ గోటిసూర్యుల ప్రభలు వెలుఁగ॥) వ॥ అది మురియు సుంజారు దివ్యమణిసహస్రస్తంభాభిరామంబును ఆలంబితకమ
నీయ నూత్నరత్న మాలికాలంకృతంబును భానుశశిమయూఖాగమ్యంబును ననంత తేజోవిరాజితంబును పునరావృత్తిరహి
తమార్గంబును నిత్యైశ్వర్యదాయకంబును అవ్యయంబును అత్యున్నతంబును అనూనవిభవంబును పరమయోగీంద్రగమ్యం
బును పరమభాగవతనివాసంబునై యొప్పు నద్దివ్యధామంబునందు॥) సీ॥ సాంద్రశరచ్చంద్ర చంద్రికా కర్పూరనీహారహార రా
భ దేహము మెఱ । నిందిందిరేందీవరేంద్రనీలద్యుతిఁ గర మొప్పు మేచక కంఠసమితి । సరుణాంశు బింబ భాసుర పద్మరాగ విన్యస్తస
హస్రోరు మస్తకములు । విపులాననోద్గతవిషధూమ రేఖాలలీలఁ జూపట్టి నాలుకలును । కనితసాయంతనజ్వలజ్వలనకుం
డములవిడంబించు వేడిచూపులును గలిగి । భూరికలశార్ణవగిరినిభాకారమమరఁ । బరగు భోగీంద్రభోగతల్పంబునందు॥) సుఖా
సీనుండై యున్నవాని డాయంజనప్పుడు॥ సీ॥ సజలనీలాంబుదశ్యామాయమానాంగు నాశ్రితావనముదితాంతరంగు । స
నకాదియోగి హృద్వనజ మరాళేంద్రు ముఖపద్మరుచిజితపూర్ణచంద్రుఁ । గమనీయనిఖిలజగద్ధితచారిత్రుఁ బ్రత్యూషసం
ఫుల్లపద్మనేత్రు । నిందిరాహృదయారవిందారుణోల్లాసు శ్రీకరపీతకౌశేయవాసు । హారకుండలకటక కేయూరమకుట । కం

కటకాంగదమణిముద్రికావిభూష్ణు । రత్ననూపురకాంచీవిరాజమాను । భవమహార్ణవపోతము సద్భక్తపోషు ॥ వ॥ మరియు సనం
దనాదిమునిజనసంతతసేవితు నానందకందళితహృదయారవిందు నరవిందవాసినీవసుంధరాసుందరీసమేతు నారదయోగీం
ద్రసంకీర్తనానందితు నవ్యయు ననఘు ననంతు నప్రమేయు నజితు నపరాజితు నాదిమధ్యాంతరహితు భవలయాతీతుఁ గరుణా
సుధాసముద్రు నచ్యుతు మహానుభావుఁ బరముఁ బురుషోత్తము నఖిలజగదుత్పత్తిస్థితిలయకారణు జిదచిదీశ్వరు నష్ట
భుజుఁ గౌస్తుభశ్రీవత్సవక్షు శంఖచక్రగదాపద్మశార్ఙ్గాదిదివ్యసాధను సర్వశక్తిసేవితుఁ బరమేష్ఠిజనకుండగు నారా
యణుం గనుంగొని దండప్రణామంబులు సేసి కరకమలంబులు మొగిచి భక్తిపూర్వకంబుగా నభినందించిన నయ్యాదిదేవుం
డును వారలం గరుణావలోకనంబుల నిగుడ నవలోకించి పరిహాసపూర్వకంబుతోరంబుగా సాదరంబుగ నిట్లనియె ॥ క॥ ధరణికి
బ్రేగగు దైత్యులఁ । బోరి సొరిగి వధియించి ధర్మము నిల్పుటకై । వరజనియించితి రిరువురు । నరనారాయణుల నంగ నా యంశ
మునన్ ॥ క॥ ఆరాధనీయమతితోఁ జెం । పారిన మిమ్మునిసత్తములం గనఁ జూడం గోరి నమీ వచ్చుటకై । ధారుణిసురసుతుల ని
టకుఁ దగఁ దేవల సేన్ ॥ క॥ అనియా డింభకులను దోడ్కొని పాండవనియిచ్చి వీడుకొలిపి న వారల్ । వినుతులఁ బెక్కువిధమ్ముల వి
నపించుచు నచటు వాసి విప్రునిసుతులన్ ॥ వ॥ తోడ్కొని సంప్రాప్తమనోరథులై యబ్బాలకుల నంద త్తద్వయోరూపంబుల
తోడఁ దెచ్చి యా బ్రాహ్మణునకు సమర్పించి నన తండును సంతుష్టాంతరంగుండయ్యె నయ్యవసరంబున ॥ చ॥ అనిమిషనాథ
నందనుఁడు హృష్టి తేజుఁడు కృష్ణుతోడఁ దా । జనియచటం గనుంగొనియు సర్వశరణ్యునిఁ బుండరీకనే । త్రుని నిజధామవైభవ
సమున్నతతన్మహనీయుకీర్తి । మనమున మోదమంది పలుమారు నుసన్నుతిఁ జేసె భూవరా ॥ గీ॥ వారిజాక్షుని భక్తమందా
రు నఘు । కృష్ణు నఖిలేశుఁ గేశవు జిష్ణుఁ బరము । వినుతి సేయుచుఁ దత్పాదవనజములకు । వందనములాచరించి యానందమొం
దె ॥ (అంత) ॥ మ॥ హరి సర్వేశుఁడసంకుఁ డాద్యుఁ డభవుం డామ్నాయసంవేదిభూ । సురముఖ్యప్రజలన్ సమస్తధనవస్తుశ్రే
ణినొప్పారగాఁ । బరిరక్షింపుచు ధర్మమున్ నిలుపుచున్ బాపాత్ములన్ ద్రుంపుచున్ । బరమోత్సాహ మెలర్ప భూరిశుభవి
భ్రాజిష్ణుఁడై ద్వారకన్ ॥ క॥ జనపతి నుతముగాఁ బెక్కు । వనితలు దను దా వకూర్చి వైదికయుక్తి । మొనరింపుచు నను రాగము

## లీలామానుషవిగ్రహుండగు శ్రీకృష్ణుని వంశానుక్రమమును దెలుపుట.

మనమునఁ గలుకొత్తదైత్యమర్దనుఁ డెలమిన్ ॥ వ॥ అట్లు కృష్ణుండు ద్వారకానగరంబునఁ బూజ్యంబగు రాజ్యంబు సేయుచుఁ
బురందరవిభవంబున నిగర్వించి సకలమణిమయ మహామంటపగోపుర ప్రాసాద సౌధ చంద్రశాలాంగణాది వివిధభవనం
బులందును రంగదుత్తుంగతరంగడోలావిలోలకలహంసచక్రవాక కారండవ సారస క్రౌంచముఖ జలవిహగవిలసదుచ్ఛలి
తగరుదనిలదరదమలకమలకుముదకల్హారసందోహనిష్యందమకరందరసపానమదవదిందిందిరములకలగాయక ఝుంకార
నినదంబులును నిరంతరవసంతసమయసముదితపల్లవితకోరకితబాలరసాలజాలలాలితకిసలయవిసరఖాదనజాతమదోహ
లాయమానకలాయకంఠకలకంఠకలరవమృదంగఘోషంబులును నిశితనిజచంచూపుటనిర్దళితసకలజననయనానందసుం
దరనందితమాకందపరిపక్వఫలరంధ్రవిగళితమధురరసాస్వాదనముదితరాజకీరశారికానికరమృదుమధురవచనరచనా
వంశకృత్యంబులును మరపురంధ్రీజనపీనపయోధరమండలవిలిప్తలలితమృగమదపంకసంకుల సౌగంధ్యానుబంధబంధుర
గంధాయమానితమందమందచందనాచలసానుదేశసంజాతమంజుళమాధవీలతానికుంజపుంజమంజుళకింజల్కరంజిత నివా
సవిసరవిహరమాణశబరికాకబరికాపరిస్ఫూర్జసురభికుసుమమాలికాపరిమళవహుండును కళిందకన్యాకల్లోలసందోహ
పరిస్పందకందళితమందగమనుండును నగుమందానిలవిధూయమానచేబోషితాభ్యాసితలాలితలగు నేలాలతావితాన నటుల
నటనంబుల విరాజితంబులగు కాసారతీరభాసురోద్యానంబులందును చారుఘనసారపటీరబాలరసాలసాలనీపతాపింఛజం
బూజంబీరనింబకదంబప్రముఖముఖ్యశాఖిశాఖాకీర్ణశీతలచ్ఛాయావిరచితవిమలచంద్రకాంతోపలవేదికాస్థలములందును
ఉదంచిత పింఛవిభాసిత బాలనీలకంఠకేకారవాంచితకృతకహిమధరంబులందును లలిత మణివాలుకానేకపులినత
లంబులందును కప్పురంపుదిప్పలనుబగు వేరుచప్పరంబులను విరచితదారుయంత్రనిబద్ధకలశనిర్యత్పయోధారాశీకరపరం
పరాసంపాదితనిరంతరహేమంతసమయప్రదేశంబులను ఇందిరారమణుండు షోడశసహస్రవధూయుక్తుండై యందలి
కన్నిరూపులై లలితసౌదామినీవిలాసమేతనీలనీరదంబుల విడంబించుచుఁ గరేణుకాకలితదిగ్గజంబు నోజ రాజిల్లుచు సలిల
కేళీవిహారంబులు మొదలైన లీలావినోదంబులు సలుపుచు నంతఃపురంబునఁ గొలువున్నయవసరంబున వివిధవేణువీణాది

ర్తి॥) చ॥ సరసిజపత్రనేత్ర రఘుసత్తమ మత్తమదాసురేంద్రసం।హరణ దయాపయోధి జనకాత్మభవానన మిత్రభా।సుర
కులవార్ధిచంద్ర మిహికావసుధాకర జేశసన్నుత। స్ఫురితచరిత్ర భక్తజనపోషణ భూషణ పాపశోషణా॥) క॥ మారీచభూరి
మాయా। నీరంధ్ర మహాంధకార రవి రేజహిత। శ్రీమారిగుణవినుత పాదా। భూసుహామహితావతారపుణ్యవిచారా॥) మాలి
ని॥ శరధిమదవిరామా సర్వలోకాభిరామా। సురరిపువిషభీమా సుందరీలోకకామా। ధరణివరలలామా తాపసస్తోత్రసీమా।
సురుచిరగుణధామా సూర్యవంశాబ్ధిసోమా॥ ........ .. .. .. .. ........ .. .. ..... ..... ....... .. ....... ..... ..

గద్య॥——ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీమహాభాగవతంబను మహాపురాణంబునందు ప్రద్యుమ్ను జన్మంబును శంబరోద్యోగంబును సత్రాజిత్తునకు సూర్యుండు శమంతకమణి నిచ్చుటయు తన్నిమిత్తంబున ప్రసేనుని సింహంబు వధియించుటయు దాని జాంబవంతుండు చంపి మణిక్యంబుగొనిపోవుటయు గోవిందుండు ప్రసేనునిం దునిమి మణిఁగొనిపోయెనని సత్రాజిత్తుండు నిందవారోపించుటయు కృష్ణుండు తన్నిమిత్తంబున జాంబవంతునితోడఁ బోరి మణియుక్తంబుగా జాంబవతిం గొనివచ్చి వివాహంబగుటయు సత్రాజిత్తునకు మణి నిచ్చుటయు సత్యభామా పరిణయంబును పాండవులు లాక్షాగృహంబున దగ్ధులైరని విని వాసుదేవుండు బలభద్రసహితుండై హస్తినాపురంబునకరుగుటయు అక్రూర కృతవర్మానుమతంబున శతధన్వుండు సత్రాజిత్తుం జంపి మణిఁగొనిపోవుటయు తదర్థంబు సత్యభామ కరినగరంబునకేగి కృష్ణునకు విన్నవించిన నతండు మరలి చనుదెంచి శతధన్వునిం ద్రుంచుటయు బలభద్రుండు మిథిలానగరంబునకుం జనుటయు నందు సుయోధనుండు రాముని వలన గదావిద్య నభ్యసించుటయు కృష్ణుండు సత్రాజిత్తునకుం బరలోకక్రియలు నడుపుటయు శతధన్వుని మణి దానపతియైన యక్రూరుండు భయంబున ద్వారకానగరంబు విడిచిపోయినం దనిలేమిని నావృష్టియైన నక్రూరుం గృష్ణుండు మరలి రప్పించుటయు దామోదరుండింద్రప్రస్థపురంబునకరుగుటయు నచ్చట సమేతుండై మృగయావినోదార్థంబరణ్యంబున కరుగి కాళిందిం గొనివచ్చుటయు ఖాండవ దహనంబును అగ్నిపురుషుండర్జునునకు నక్షయతూణీర గాండీవ కవచ వర రథ రత్నంబులనిచ్చుటయు మయుండు ధర్మరాజునకు సభ గావించి యిచ్చుటయు యదువరుండు మరలి నిజనగరంబునకరుగుదెంచి కాళిందిని వివాహంబగుటయు మిత్రవిందా నాగ్నజితీ భద్రా మద్రరాజకన్యలం గ్రమంబున వరియించుటయు నరకాసుర యుద్ధంబును తద్గృహంబుననున్న రాజకన్యలం బదాఱువేలం దెచ్చుటయు స్వర్గగమనంబును అదితికిం గుండలంబు లిచ్చుటయు పారిజాతాహరణంబును పదాఱువేల రాజకన్యలం బరిణయంబగుటయు రుక్మిణీదేవీ విప్రలంభంబును రుక్మిణీ స్తోత్రంబును కృష్ణకుమారోత్పత్తియు తద్భుజవర సంఖ్యయు ప్రద్యుమ్ను వివాహంబును అనిరుద్ధజన్మంబును తద్వివాహార్థంబు భోజకటపురంబునకుం జనుటయు రుక్మి బలభద్రుల జూదంబును రుక్మివధయును బాణాసుర యుద్ధంబును నృగోపాఖ్యానంబును బలభద్రుని ఘోషయాత్రయు కాళిందీ భేదనంబును కృష్ణుండు పౌండ్రక వాసుదేవ కాశిరాజుల వధియించుటయు కాశిరాజపుత్రుండైన సుదక్షిణుండు దక్షిణాగ్ని హోమంబు వేల్చి కృత్యం బడసి కృష్ణు పాలికిం బుత్తెంచిన సుదర్శనంబు చేత కృత్యయు సుదక్షిణు సహితంబుగా కాశీపురంబు భస్మంబు సేయుటయు బలభద్రుండు రైవతనగరంబునందు ద్వివిదుండను వానరుని వధియించుటయు సాంబుండు దుర్యోధనుకూతురు లక్షణ నెత్తికొనివచ్చిన కౌరవులతనిం గొనిపోయి చెఱంబెట్టుటయు తద్వృత్తాంతంబు నారదువలన విని బలభద్రుండు నాగనగరంబునకుం జనుటయు కౌరవులాడిన యగౌరవ వచనంబులకు బలభద్రుండు కోపించి హస్తిపురంబు గంగం బడఁద్రోయం గమకించుటయు కౌరవులు భయంబున సంగనాయుక్తంబుగా సాంబునిం దెచ్చి సమర్పించుటయు బలభద్రుండు ద్వారకానగరంబునకు వచ్చుటయు నారదుండు హరి పదాఱువేల కన్యకలనొక్క ముహూర్తంబున నన్నియెడల వివాహంబయ్యెనని విని తత్ప్రభావంబు దెలియంగోరి యరుగుదెంచుటయు కృష్ణుని మాహాత్మ్యంబు సూచి మరలి చనుటయు జరాసంధునిచేత బద్ధులైన రాజులు కృష్ణుని పాలికిం దూతం బుత్తెంచుటయు నారదాగమనంబును పాండవుల ప్రశంసయు నుద్ధవకార్యబోధంబును ఇంద్రప్రస్థాగమనంబును ధర్మరాజు సేయు రాజసూయారంభంబును దిగ్విజయంబును జరాసంధవధయును రాజబంధమోక్షణంబును రాజసూయంబు నెఱవేర్చుటయు శిశుపాలవధయును అవభృథస్నానంబును రాజసూయవైభవ కర్మ నాసహ్యమాన మానసుండై సుయోధనుండు మయనిర్మిత సభామధ్యంబున నంగటి పుట్టంబులు తడియం ద్రెళ్ళుటయు తన్నిమిత్తపరిభవంబునొందిన రాజు నిజపురి కరుగుటయు కృష్ణుండు ధర్మరాజ ప్రార్థితుండై యాదవుల ననిపి కొన్ని నెలలు కాండప్రస్థంబున వసియించుటయు సాల్వుండు ద

పరమాత్ముని త్రైభావంబు వినవలతు నా నతండనిన పిప్పలాహ్వయుం డిట్లనియె ॥ సీ॥ నరవరవినుజగన్నాథుని చారిత్ర మెఱుఁగఁ దుర్నిమిత్తంబు మీకుల । లసమద్భవస్థితిలయకారణంబైన దేహేంద్రియాదులఁ దిరముగాఁగ । నొనర్పు నెవ్వఁడు పరంజ్యోతిస్స్వరూపంబు జ్వాలలనలునకుం జనని పగిది । నింద్రియంబులు నాత్మ నైనయవు శబ్దంబు బోరయక సుషిరంబుఁ బొందునట్టి । మునఁ గసత్త్వరజస్తమోమయగుణంబు । మహదహంకారరూపమై మహిమ వెలయుఁ । జేతనత్వంబు గలదీని జీవ మండ్రు దియ సదసత్స్వరూపమై యొప్పు బహుని ॥ ) వ॥ దీనికిం బైకైన దిపరమాత్మగా నెఱింగి కమలసంభవాదులును తియ్యంతటఁ గట్టి పరమాత్మ స్థావరజంగమంబుల నధిష్ఠించి వృద్ధిక్షయంబులం బొందక నిమిత్తమాత్రంబునం దరులతాదులందు జీవంబు లేక తదంతరస్థుండై వర్తించు నంత సర్వేంద్రియావృతంబై యాకారంబు నష్టంబైన మనంబును సాక్షీకృతవిరహితుండై తిరుగుచుండు నిర్మలజ్ఞానదృష్టి గలవానికి భానుప్రభాజాలంబు తోఁచిన క్రియ ననుజ్ఞానవంతుండు హరిభక్తిచేత గుణకర్మార్థంబులైన చిత్తదోషంబులు భంజించి భగవత్సదనంబు చేరవనిన విని రాజిట్లనియె ॥ ) క॥ పురుషుండే యేకర్మము । పరువడి గావించి పుణ్యపరుఁడై మునుఁ దా । దురితములఁ దొరఁగి ముర్రిరిపుఁ । చరణయుగంబెట్లు చేరు సన్మునివర్యా ॥ ) వ॥ అనిన విని యందు మహావిర్హో

## ఋషభకుమారులలో నావిర్హోత్రద్రమీళులు దెలిపిన పరమార్థోపదేశము.

త్రుండిట్లనియె కర్మాకర్మ వికర్మ ప్రతిపాదకంబులగు శ్రుతివాదంబుల లౌకికవర్ణితంబులట్టి యామ్నాయంబులు సర్వేశ్వరస్వరూపంబులు గాన విద్వాంసులు న్నెఱుంగ లేరు అవికర్మాచారంబుల నంబకు మోక్షంబు కొఱకు నారాయణభజనంబు పరమపావనంబు వేదోక్తంబుల నాచరింపక ఫలంబులకు వాంఛ సేయువారలనేక జన్మాయుతంబులం బడయుదురు మోక్షంబున పేక్షించువాఁడు విధిచోదితమార్గంబున హరిం బూజింపవలయునట్టి పూజాప్రకారం బెట్లనినఁ బవిత్రగాత్రుండై జనార్దను సన్నిధింబూత చిత్తుండై విధ్యుక్తప్రకారంబునఁ జక్రధరుని ధ్యానించి గంధపుష్పధూపదీప నైవేద్యంబులు సమర్పించి సాష్టాంగదండప్రణామంబు లాచరించి భక్తిభావనావిశేషుండగు నతండు హరిం జేరునని చెప్పిన విని విదేహుం డిట్లనియె నీశ్వరుండే యేకర్మంబుల నాచరించె నంత నెఱింగింపుమనిన ద్రమీళుండిట్లనియె ॥ ) క॥ తారలనెన్నఁగవచ్చును । భూరేణుల లెక్కఁ బెట్టంబోలును ధాత్రిన్ । నారాయణగుణకథనము । లారయ వర్ణింపలేరు హరబ్రహ్మముల్ ॥ ) వ॥ ఇట్లు గావున నాత్మసృష్టంబైన మనంబునఁ బంచభూతనికరంబును పురంబొనరించి యందు నిజాంశంబునం బ్రవేశించి సగుణనిష్ఠుండై నారాయణాభిధానంబునుం గల ఋషీశ్వరుండగు పరమేశ్వరుండు వెలుగొందె నతనిద శేంద్రియంబులచేతఁ బాలితంబులైన దేహంబులు ధరియించి జగద్రక్షకత్వసంహారకత్వాదిగుణంబులు గలుగుటం జేసి గుణనిష్ఠుండై రజస్సత్త్వతమోగుణంబుల బ్రహ్మవిష్ణురుద్రమూర్తులనం బరగి త్రిగుణాత్మకుండవంబకు నారాయణాఖ్యుని చరిత్రం బెఱుంగించెద నాకర్ణింపుము ॥ ) క॥ ధర్ముండు దక్షపుత్త్రిక । నిర్మలమతి బెండ్లియాడి నెఱి పుత్త్రునిన । తర్ధ్మని నారాయణ ఋషి । నర్మిలిగనె నమలు బదరికాశ్రమమందున్ ॥ ) గీ॥ అట్టి నారాయణాహ్వయుండైన మహాత్ముఁ । బదరికాశ్రమమందున పారనిష్ఠ । దపము గావింప బలభేది దలఁకి మదిని । మీనకేతను దివిజకామినులఁ బనిచె ॥ ) వ॥ వారు నారాయణాశ్రమంబునకు నతని తపోవిఘ్నంబు సేయ వచ్చునప్పుడవ్వనంబు పాలరసాల బిల్వకదళీ ఖర్జూర జంబూ జంబీర చందన పున్నాగ మందారాది వివిధవృక్షనిబిడంబును పుష్పఫలభరితశాఖావనమ్రతరులతాబృందంబును మాధవీకుంజమంజరీపుంజ మకరందపానమత్తమధుకరనికరఝంకారరవముఖరిత హరిదంతరంబును కనక కమల కల్హార విలసత్సరోవిహారిమాణ చక్రవాక బక క్రౌంచ మరాళ దంపతీమండలమండితంబును మృణాళభోజనాసక్త సారసచయ చంచూపుట విపాటిత కమలముకుళ కేసర విసరవితత ప్రశస్తసరోవరంబును నై వెలయు నవ్వనంబున నిందువదనలందం దమందగమనంబులం జెందు ఘర్మజలబిందుబృందంబులు నఖాంతంబుల నోసరింపుచు డాయం జనునప్పుడు ॥ ) చ॥ మదనుని బాణజాలమున మగ్నత బొందక ధైర్యవంతుఁడై । ముదితల వాడిచూపులకు మోహము నొందక నిశ్చలాత్ముఁడై । హృదయమునందు నచ్యుతుర మేశు నచంతుఁ జగన్నివాసునిన్ । వదలక భక్తి నిల్పుకొని వారికి నిట్లనె నూని పెంపునన్ ॥ ) క॥ జంభారి పంపునను మీ । రంభోరుహవదనలార యరుదెంచితిరా । శుంభద్విహారలవాంఛా । రంభంబునఁ దిరుగుడనిన లజ్జించి వెసన్ ॥ ) సీ॥ దేవ మానీశ నీదివ్యచారిత్రంబు నెఱిఁగి సన్నుతి సేయ నెవ్వఁడోపుఁ । బుత్త్రమిత్త్రకళత్రభోగాదుల సుమహితపము గావించు సద్ధర్ములకును । విఘ్నముల్ చెందు నే విశ్వేశుఁ గొల్చిన యతనికి నంతరాయంబు వలన । కామంబు క్రోధంబు గలిగిన తపములు పల్వలోదకమున భంగిఁ గావె । నిన్ను వర్ణింపనలవియే నిర్మలాత్మ । రమణులో గామమాయపరాధమనుచు ।

ణుతించినయతఁడు ప్రసన్నుఁడగుచు। దనదుసామర్థ్య మెఱుఁగఁ బడ దలఁచియపుడు॥ వ॥ అమ్మునీశ్వరుండు పరమాశ్చర్యవిధానంబుగా నిజతనూరుహంబుల వలన నంద్రికోటికన్యకానివహంబుల నుద్భవింపఁ జేసిన గంధర్వవిబుధకామినీసముదయంబులు పరమాద్భుతభయంబులు మనంబులం బొడమ నసన్నుతించి యవ్విలాసినీసమూహంబులో నూర్వశి యను దానిం గొనిచని పాకశాసను సభాభవనంబునం జెట్టి తద్వృత్తాంతం బంతయు విన్నవించిన నాశ్చర్యయుక్తహృదయుండై శునాసీరుం డూరకుండె నిట్టి నారాయణమునీశ్వరు చరిత్రంబు వినువారలు పరమకల్యాణగుణవంతులగుదురని చెప్పిన॥ గీ॥ ఋషభభూనకునాత్మయోగమీరీతిఁ జెప్పె। నచ్యుతుఁడు భూమిభారము నడఁపనంత। సొరిదినవతారములు దాల్చె సొంపు నెవఁడు। రాత్రిచరులను జంపనీరసము తోడ॥ వ॥ అట్టి పరమేశ్వరుని లీలాగృహీతంబులగు మత్స్యకూర్మవరాహనారసింహవామనరామరఘురామరాముఁ బుద్ధకల్క్యవతారంబుల నేకంబులు గలవు శేషభాషాపతులకైన వర్ణింపనలవిగాదు మఱియును॥ సర్వలఘుసీసము॥ నవవికచపరసిరుహనయన నయజనక నిజచరణగగనచరనది నిఖిలనిగమవినుత। జలధిజనికుచకలశలలితమృగమదరుచిరపరిమిళితనిజహృదయ ధరణిభరణ। బ్రహ్మణముఖసురనికరవిహితనుతికలితగుణ కటిఘటితరుచిరతరకనకవసన। భుజగరిపువరగమన రజతగిరిపతివినుత సతతవ్రతజపనియమసరణిచరిత॥ ఓమికమణి కిటి నృహరి నమితబలి నిహితపద పరశుధర దశవదనరిపువిరళ। మురమథన కలితలుషముదపహృతనిపుణ కరివరద మునిమనుజసురగరుడవినుత॥ వ॥ ఇవ్విధంబునం బ్రవర్తిల్లిన శ్రీమన్నారాయణమూర్తి లీలావిలాసంబులవంతంబులు గలవు మనోవాక్కాయకర్మంబుల హరిపూజనంబు సేయక విపరీతగతులం దిరుగుచుండు జనులకెవ్విధంబున గతిగలుగు ననిన నప్పుడప్పడమితేఁడప్పరమపురుషులం జూచి యట్టిజనులు ముక్తి

ఋషభకుమారులగు చమసకరభాజనులు సేసెడు పరమార్గోపదేశము,

నొందుపాయం బెట్టిదంతయు నెఱుంగింపుమనిన చమసుండిట్లనియె॥ సీ॥ హరిముఖబాహూరుపదాబ్జములందు వరుస చతుర్వర్ణవర్గసమితి। జనియించె నందులో సతులును శూద్రులు హరిఁదలంతురు కలిహాయనములు। వేదశాస్త్రపురాణవిఖ్యాతులై కర్మకర్తలై విప్రులు గర్వమెసఁగి। హరిభక్తిపరుల నుపహాస్యంబు సేయుచు నిరయంబు నొందుట నిజముగాదె। వృద్ధులపక్వాన్నములను దా మెసఁగఁ గోరి। జీవహింసకుఁ జనువానిఁ జెందు నఘము। హరినుతింపక స్త్రీలోలుఁడైనవాఁడు। నరకవాసుండునగుచుండు ననవరతము॥ వ॥ అట్లుగావున గృహక్షేత్రపుత్రకళత్రధనధాన్యాదులందు మోహితుండై ముక్తిమార్గంబుల ప్రత్యక్షంబుల నిందించువాఁడును హరిభక్తివిరహితుండును మర్త్యతిం గూలుదురని మునివరుండానతిచ్చిన విదేహుండిట్లనియె॥ గీ॥ ఏయుగంబునందు నేరీతి వర్తించు। నెట్టిరూపువాఁడు నెవ్విధమున। మనుజులఁ బూజింపఁబడెను ముని దేవగణముచే। విష్ణుఁడవ్యయుండు విశ్వవిభుఁడు॥ వ॥ అనిన విని యంతకరభాజనుండిట్లనియె నానావతారంబులను నానారూపంబులను బహువిధవర్ణంబులను గలిగి రాక్షసుల సంహరించి దుష్టజననిగ్రహంబును శిష్టజనపరిపాలనంబునుం జేయుచుండు కృతయుగంబున శుక్లవర్ణుండై చతుర్బాహుండై జటావల్కలకృష్ణాజినోత్తరీయ జపమాలికాకమండలుధరుండై హరి నిర్మలతపోధ్యానానుష్ఠానగరిష్ఠులైన పురుషశ్రేష్ఠుల చేత హంసుండు సుపర్ణుండు వైకుంఠుండు ధర్ముండమలుండు యోగీశ్వరుండు ఈశ్వరుండు పురుషుండు అవ్యక్తుండు పరమాత్ముండను దివ్యనామంబులం బ్రసిద్ధివహించి నుతియింపంబడు త్రేతాయుగంబున రక్తవర్ణుండై బాహుచతుష్కమేఖలాత్రయవిశిష్టుండై హిరణ్యకేశుండును వేదత్రయస్వరూపుండును స్రుక్స్రువాద్యుపలక్షణశోభితుండై విష్ణు యజ్ఞ పృశ్నిగర్భ సర్వదేవ ఉరుక్రమ వృషాకపి జయంత ఉరుగాయాఖ్యల బ్రహ్మవాదుల చేత నుతియింపంబడు ద్వాపరంబున శ్యామలదేహుండును పీతాంబరధరుండును బాహుద్వయోపశోభితుండును దివ్యాయుధధరుండును శ్రీవత్సకౌస్తుభవనమాలికావిరాజమానుండును మహారాజోపలక్షణుండును నై జనార్దన వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధ ఋషి పురుష మహాత్మ విశ్వ నారాయణ విశ్వరూప సర్వభూతాత్మకాది నామంబుల వెలసి మూర్ధాభిషిక్తుల చేత సన్నుతింపంబడుఁ గలియుగంబున కృష్ణవర్ణుండును కృష్ణనామకుండును నై భక్తసంగతుఁ డారంబు పుండరీకాక్షుండు వివిధయజ్ఞంబుల చే సంకీర్తనముల చేతం బ్రస్తుతింపంబడు హరి రామ నారాయణ నృసింహ కంసారి నళినోదరాది బహునామముల చే బ్రహ్మవాదులు మునీంద్రులును నుతియింపుదురు మఱియును॥ గీ॥ ద్రవిడదేశంబునందు లందాఁ బ్రపన్న। సహ్యజాకృతమాలాదిసకలనదుల। నెవ్వఁడేనియు భక్తితో నేగియచట। బొదలి తర్పణ మొగిఁ జేయఁ బుణ్యమొదవు॥ వ॥ ఇవ్విధంబునం బ్రశంసింపందగిన కావేర్యాది మహానదీపావనజలస్నానపానదానంబు

యంబులును నూవికారంబులను నిగ్రహించియీ కణత్రయంబును వర్జించి మోదఖేదంబుల సముండవుగా వర్తింపుచు నీజగంబంతయు నాత్మాధిష్ఠితంబుగా నెఱింగి మాయామలనాత్మతత్త్వాధీనంబులుగాఁ దెలిసి యుచుఁ జ్ఞానవిజ్ఞానయుక్తుండవై యాత్మానుభవసంతుష్టుండవై విశ్వంబు నన్నుఁగా భావించి వర్తింపవలయు నని వాసుదేవుం డానతిచ్చిన నుద్ధవుండు భక్తిభయవినయంబులం గరంబులు మొగిడ్చి మహాత్మా సన్న్యాసలక్షణంబు మహాఘోరంబు పామరులకు నాచరింపలేరు నీమాయచేత భ్రాంతులై చేయునది దెలియని సాంసారికులు భవాబ్ధిం గడచి యెట్లు ముక్తి వడయుదురు భృత్యుండనైన నన్ను నీవు ననుగ్రహించి యానతిమ్ము బ్రహ్మాదిదేవతాసముదయంబులు బాహ్యావసువుల భ్రాంతులై పర్యటనంబు సేయుచుందురు నీభక్తులైన పరమభాగవతులు నన్మాయానిరసనంబు సేయుదురు గృహిణీగృహస్థులకైన యతులకైనను నిత్యంబును నీనామస్మరణంబు మోక్షసామ్రాజ్యప్రదంబు గావున బరమేశ్వర నీ చరణంబు శరణంబు వేఁడెదఁ గృపారసంబు నాపై నిగుడింపు మని ప్రియసేవకుండైన యుద్ధవుండు వలికిన నతనికి గంసమర్దనుం డిట్లనియె నెట్లు పురుషుని కాత్మకు నాత్మ గురుండవని యెఱుంగుము సుపథంబులకు జనకసన్మార్గవర్తివై పరమంబైన మన్నివాసంబునకుం జనుము సర్వమూలశక్తిసంపన్నుండనైన నన్ను సాంఖ్యయోగపరులు నిరంతరభావంబులందు పురుషభావంబుగా భావించి తలంపుచుండుదురు మఱియు నేకద్విత్రిచతుష్పాదబహుపాదాపాదంబులు నైనయట్టి జీవజాలంబులలోన మనుష్యులు మేలు వారిలలోన నిరంతరధ్యానగరిష్ఠులైన యోగీంద్రులుత్తములు వారలలోన దేహపరుల చేతఁ గ్రాహ్యుండఁ గాని నన్ను సత్త్వగుణగ్రాహ్యునిగా నెఱింగి నిజచేతఃపంకజంబునందు జీవాత్మపరమాత్మల నేకంబుగాఁ జేసి శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గకౌమోదకీకౌస్తుభాభరణయుక్తుంగా దలంపుచునుందురు వారలు పరమయోగీంద్రులనియును పరమజ్ఞానులనియును జెప్పి మఱియు నవధూతయదుసంవాదంబను పురాతనేతి

వధూత యదు సంవాదము,

హాసంబు గలదు చెప్పెద నాకర్ణింపుము॥ (ఉ॥ పంకజనాభుఁ డుద్ధవుని పై గలకూర్మిని జెప్పె నొప్పనా। తంకము లేక నన్ని దిశలం జరింపుచు నిత్యతృప్తుఁడై। శంకరవేషధారి యొక సంయమి యా యదురాజుఁ జేరనే। వంకను నుండి వచ్చితివి వానితొ నిట్లనె నర్థి నేర్పడన్॥) క॥ అవధూతవర్యునంతటఁ। బ్రవిమలవిజ్ఞాననిపుణభవ్యులు గురువుల్। తవిలిన నిరువదినలువురు। నవనీత విజ్ఞానినైతినని పల్కుటయున్॥) వ॥ అంత యదుప్రవరుం డిట్లనియె దేహలోభమోహంబుల వర్జించి జనార్దనుని నే విధంబునఁ జేరవచ్చు నెఱింగింపు మనిన నతం డిట్లనియె॥) సీ॥ పరధనపరదారపరదూషణాదులఁ బరవస్తుచింత దాఁ బరిహరించి। ముదిమిచే రోగములు దయింపకట మున్న దనువు చంచలత నొందకుండ। బుద్ధి సంచలత బొంపొందక నటమున్న శ్లేష్మంబు గళమునఁ జేరకుండ। శక్తియుక్తులు మది జేవడీయక మున్న భక్తిభావనచేత ప్రార్థుఁడగుచు। దైత్యభంజను దివ్యపాదారవింద। భజననిజభక్తిభావనఁ బ్రాజ్ఞుఁడగుచు। నవ్యయానందమును బొందు ననుదినంబు। నరుఁడు కర్మవిముక్తుఁడౌ నసఘచరిత॥ (ఉ॥ దారలయందుఁ బుత్రధనధాన్యములందు ననేకభంగులం। గూరిమి చేయు మర్త్యుఁడతి ఘోరవియోగజదుఃఖమగ్నుఁడై। నేరుపు వక్కఁ జిక్కువడి నీవి వేకహీనుఁడై చనున్। భారముతోఁ గపోతపతిభంగి నిజంబుగఁ బోవు నష్టమై॥) వ॥ ఇందు కొక్క యితిహాసంబు గలదు మహారణ్యంబున నొక్క కపోతంబు దారసమేతంబుగా నొక్కనికేతనంబు నిర్మించి యన్యోన్యమోహాతిరేకంబునఁ గొంత గాలంబునకు సంతానసమృద్ధిఁ గలదియై యపరిమితంబులైన పిల్లలు దిరుఁగాడుచుండఁ గొన్నిమాసంబులు భోగానుభవంబునం బొరలుచుండం గాలవశంబున నొక్కలుబ్ధకుం డురులొడ్డిన నందు దారాపత్యంబులు తగులుపడిన ధైర్యంబు వదలి మోహాతిరేకంబునం గపోతంబు కళత్రపుత్రస్నేహంబునం దానునందు జొచ్చి యనధికచింతాభరంబునం గృశీభూతం బయ్యెం గావున నతిదీర్ఘంబైన మోహంబు ఘోరగాఁ దట్లు గాన నిరంతరహరిధ్యానపరుండై భూమిపవనగగనజలకృపీటభవసోమసూర్యకపోతతిలిప్సజలధిశలభధుహాశ్రీనాగజద్విరేఫహరిణపాఠీనపింగళాకురరడింభకకుమారికాశరకృత్సర్పలూతాసుపేశకృత్తులసముదయంబునుండి వానిగుణంబు లెఱింగికొని యోగీంద్రులు మెలంగుదురనిన॥) క॥ ఇవి దెలియవలయు నాకును। బ్రవిమలమతి వానిఁ దెలియఁబలుకు సుమనంగన్। గ్రమమున వినుమని కృష్ణుఁడు। సవినయుఁడగు నుద్ధవునికిఁ జయ్యనఁ జెప్పెన్॥) వ॥ ఇవ్విధంబున భూమివలన స్థైర్యము గంధవహునివలన బంధురంబగు పరోపకారంబును విష్ణుపదంబువలన కాలసృష్టగుణసాంగత్యంబు నుదకంబువలన నిత్యశుచిత్వంబు నగ్నివలన నిర్మలత్వంబును నిశాకరప్రభాకరులవలన నధికాల్పసమత్వజీవగ్రహణమోక్షణంబును కపోతంబువలనఁ గళత్రపుత్రస్నేహంబున [illegible]గరంబు

వలన స్వేచ్ఛానమాగతాహారంబును వననిధివలన నుత్సాహశోషణంబులును శలభంబువలన శక్త్యనుకూలకర్త్మాచరణం
బును భృంగంబువలన సారమాత్రగ్రహణవిశేషంబును స్తంబేరమంబువలనం గాంతావైముఖ్యంబును సరఘవలన నిరంతర
సారసంగ్రహగుణంబును హరిణంబువలనం జింతాపరత్వంబును జలచరంబువలన జిహ్వాచాపల్యంబును పింగళవలన యథా
లాభసంతుష్టియు కురరంబువలన మోహపరిత్యాగంబును కుమారికవలన సంగత్యాగంబును శరకారునివలన నందనేకనిష్ఠ
యు దందశూకంబువలనం బరగృహవాసంబును నూర్ణనాభివలన సంసారపరిత్యాగంబును కణుందురువలన లక్ష్యగతజ్ఞానం
బును అనంగలవీని గుణంబులెఱింగి కామక్రోధలోభమోహమదమాత్సర్యంబులను నరిషడ్వర్గంబులు జయించి జరామరణ
విరహితంబుగా వాయువు వశంబు చేసి గాత్ర పవిత్రత్వంబునకై రుచుషట్కర్మరతుండై పుర నగర గ్రామంబులు పరిత్య
జించి పర్వతారణ్యంబుల సంచరింపుచు శరీరధారణార్థంబు నియమితస్వల్పభోజనుండై ఖేదమోదంబులు సరియకా భావిం
చి లోభమోహంబులు వర్జించి నిర్జితేంద్రియుండై యొండెఱుంగక నాత్మనిష్ఠ చేఁబవిత్రాంతఃకరణుండై సద్యోగి నాయం
డుఁ గలయుండుఁ గావున ॥ క॥ మోహితుఁడై వసుకాంతా। వాహినిలోఁ జిక్కి క్రూరవశుండై యెవ్వం। డూహాపోహ లెఱుంగ
క। దేహమున లగంగఁ జేయు దీనత నొందున్ ॥ వ॥ ఇందుకు పురాతన వృత్తాంతంబు గలదు సావధానచిత్తుండవై వినుము మిథి
లానగరంబునఁ బింగళయను గణికారత్నంబు గలదు దానివలనం గొంత పరిజ్ఞానంబు గంటి నదెట్లనిన నమ్మానిని వసుకాంక్షం
జేసి యాత్మసఖుని మొరంగి ధనంబిచ్చు వానినిం జేకొనిని జనికేతనాభ్యంతరంబునకుం గొనిచని రాత్రి నిద్ర లేకుండుచుం బు
ట భేదనవిపణిమార్గంబులఁ బర్యటనంబు సలుపుచు నిద్రాలస్యభావంబున జడసు వడి యర్థాపేక్షుం దగిలి తిరిగి యలసి యాత్మ
సుఖంబు సేయునాతండే భర్తయని చింతించి నారాయణు నిట్లు చింతింప నతనికైవల్యంబు చేరవచ్చునని విచారించి నిజశయ
నాదిస్థానంబులు వర్జించి వేగిరవాసుదేవచరణారవిందవందనాభిలాషయై దేహంబు విస్మృతప్రకారంబని చింతించి పరమత
త్త్వంబునందు జిత్తంబు గీలుకొలిపి ముక్తురాలయ్యె ననియెఱింగించి ॥ క॥ దేహము నిత్యము గాదని। మోహము దెగఁ గోసి సిద్ధ
మునివర్తనుఁడై। గేహము వెలువడి జనను। త్సాహమునం జెందు ముక్తిసంపదననఘా ॥ వ॥ మఱియు నొక్క పురాతనపుణ్యక
థ వినుము కనకావతీపురంబున నొక్క ధరామరునికన్యకారత్నంబు గలదవ్వనూతిలకంబు రత్నసమేతంబులగు కంకణంబు
లు ధరియించి బంధుజనంబులకు నాతిథ్యంబు గావించు కొఱకు శాలితండులంబులను రహస్యంబుగా ముసలంబు చేకొని దంచు
నప్పుడు కంకణంబులతిరావంబుగా మ్రోయుచుండ నప్పరమపతివ్రత యయ్యెడ నసహ్యయై యన్నియు వలిచి యొక్కటి
నిలిపెన ట్లేకచిత్తంబునం దత్తరపడక భగవదాయత్తంబైన చిత్తంబునం బ్రసన్నవిస్తులై ముక్తులగుదు రట్లు గాన నవిద్యావి
ద్యలు నా మాయగాఁ జాటించి కేవలపశుమార్గులు గాక షడ్గుణైశ్వర్యసంపన్నులైన యోగీంద్రుల పగిది సుఖంబు గోరక
యుండువారలు ముక్తులగుదురు సర్వంబును విష్ణుమాయగా దెలియుమని యుద్ధవునికిం జెప్పిన నతండు దేవా నీరూపం బేలా
గునం గానవచ్చు ననిన నతం డిట్లనియె భక్తిభావనాపరాయణుండై కృపాపరతంత్రుండై మితభాషణుండై లౌకికకర్మం
బులను మదర్పణంబుగాఁ జేసిన యతండు భాగవతుండు మత్కథలు మజ్జన్మకర్మంబులును వినుచు మత్సేవకులైన భాగవతులం
జూచి తద్గృహంబునకుం గొనిపోయి మజ్జనపూజనభోజనశయనవినయధ్యానంబుల బరితుష్టులం జేసిన యతండె భాగవతుం
డనం బరగుని ట్లెంత కాలంబు జీవించు నంతకాలమున దదుపునతండు మద్రూపంబునవై కుంఠనిలయంబు నొందు నదియునుం గాక
గంధపుష్పధూపదీపనైవేద్యంబుల లక్ష్మీసమేతుండనై శంఖచక్రగదాశార్ఙ్గాదియుక్తుండనైన నన్ను శుకసనకాది యో
గీంద్రులు నంబరీషవిభీషణరుక్మాంగదులు మొదలుగాఁగల భాగవతులు శాస్త్రచారచోదితులుగాక భక్తిభావనావిశేషంబు
న నన్నేమరక నిత్యంబును జింతనాయత్తులైన న్నెఱింగిరి మధురానగరంబునకు హలాయుధసమేతుండనై యేను రాగు గోపగోపి
కలు ఓపికలు లేక భక్తియోగంబునఁ జింతించి ముక్తులైరి యివి భక్తియోగప్రకారంబని యుద్ధవునికిం జెప్పిన ॥ క॥ ధ్యానం బే క్రి
యనిలుచును। ధ్యానం బేరీతిఁ దగును దాత్తచరిత్రా। ధ్యానప్రకారమంతయు। నూనంబుగఁ జెప్పుమయ్య యుర్వీరమణా॥
వ॥ అనియడిగిన యాదవేంద్రుం డిట్లనిపలుకం దొణంగె దామమధ్యభాగంబున ననలంబు సూక్ష్మరూపంబున వర్తించు చందం
బున నందంబై సకలశరీరులయందు నచ్ఛేద్యుండును నదాహ్యుండును నశోష్యుండును నై నజీవుండు వసియించి యుండు నని
సనుద్ధవుం డిట్లనియె సనకసనందనాదియోగీంద్రులకు యోగమార్గం బే రీతి నానతిచ్చితివది యేవిధంబానతీఁ యని యభ్యర్థిం
చిన నతం డిట్లనియె వారలు చతుర్ముఖు నడిగిన నతండు నేనును దెలియ నేరననిన వారలు విస్మయంబందుచుండ నే నా సమయం

ఋనహంసస్వరూపుండనై వారల కెఱుంగించిన తెఱంగు వినుము పంచేంద్రియంబులకు దృష్టంబైన పదార్థంబు నిత్యంబు నిత్యదృ
ష్టి బ్రహ్మంబని తెలియవలయు దేహికర్మార్జిత దేహుండై సంసారమహితలనిరసించి నిశ్చలజ్ఞానయుక్తుండై మత్పదప్రా
ప్తుండగు స్వప్నలబ్ధపదార్థంబు నిజము గాని క్రియ కర్మానుభవపర్యంతంబుగ లేబరంబు వర్తించు నని సాంఖ్యయోగంబున సన
కాదులకు నెఱుంగించినవిని బ్రహ్మ మొదలైన దేవతలెఱింగిరి వారలవలన భూలోకంబునందుఁ బ్రసిద్ధంబయ్యెనది గావున
నీవును నెఱింగికొని పుణ్యాశ్రమంబుల సుజనులు అస్మదీయ భక్తియుక్తులను హరిపరాయణులను నిరసింపక నట్టి భాగవతుల
చరణరజఃపుంజంబు తన శరీరంబు సోఁక జేయునతండును ముద్రాధారణయు హరిదివ్యనామంబును ధరియించు వారలకు న
న్నోదకంబులు నిడునతండును వాసుదేవభక్తులం గనిహర్షించువాఁడె భాగవతుండని చెప్పి మఱియు సర్వసంగ పరిత్యాగంబు
చేసియొండెఱుంగక నన్నే తలంచు మానవునకు భుక్తిముక్తిప్రదాయకుండనై యుండుదు ననియానతిచ్చిన నుద్ధవుండు జ్ఞాన
మార్గంబెఱిఁగియానతీయవలయు ననిన హరి యిట్లనియె నేకాంతమానసుండై హస్తాబ్జంబులు హృదయంబున సంధించి నాసా
గ్రంబ నవీక్షణంబు నిల్పి ప్రాణాయామంబున నన్ను హృదయగతుంగా దలంచి యష్టాదశ ధారణాయోగసిద్ధు లెఱింగి అం
దున శమాదులు ప్రధానమ్ముగా దెలిసి యింద్రియంబుల బంధించి మనంబాత్మయందుఁ జేర్చి యాత్మ నాత్మతో గీలించిన బ్ర
హ్మపదంబు బొందును భాగవతశ్రేష్ఠులితరధర్మంబులు మానినన్నుం గాంతురు తొల్లి పాండునందనుఁడగు నర్జునుండు యుద్ధ
రంగంబున విషాదంబునొంది యిట్లయడిగిన నతనికి నే జెప్పిన తెఱంగు నెఱింగించెద భూతంబులకు నాధారభూతంబును సూ
క్ష్మంబులయందు జీవుండును దుర్జయంబులయందు మనంబును దేవతలయందుఁ బద్మగర్భుండును వసువులయందు హవ్యవా
హుండును ఆదిత్యులయందు విష్ణువు రుద్రులందు నీలలోహితుండును బ్రహ్మలయందు భృగువును ఋషులలోన నారదుండు
ను ధేనువులయందు కామధేనువు సిద్ధులలోన కపిలుండును దైత్యులలోఁ బ్రహ్లాదుండును గ్రహంబులలోఁ గళానిధియును
గజంబులలో నైరావతంబును హయంబులలోను నుచ్చైశ్శ్రవంబును నాగంబులలోన వాసుకియును మృగంబులలోన కేసరి
యును ఆశ్రమంబులందు గృహస్థాశ్రమంబును వర్ణంబులలో నోంకారంబును నదులయందు గంగయును సాగరంబులలో దుగ్ధసా
గరంబును ఆయుధంబులలోఁ గార్ముకంబును గిరులయందు మేరువును వృక్షంబులలోన శ్వత్థంబును ఓషధులలోన యవలును
యజ్ఞంబులయందు బ్రహ్మయజ్ఞంబును వ్రతంబులందహింసయు యోగంబులందు నాత్మయోగంబును స్త్రీలలోన శతరూ
పయు భాషణంబులలోను సత్యభాషణంబును ఋతువులందు వసంతాగమంబును మాసంబులలో మార్గశీర్షంబును నక్షత్రం
బులలోన నభిజిత్తును యుగంబులయందు కృతయుగంబును భగవదాకారంబులందు వాసుదేవుండును యక్షులలోఁ గుబే
రుండును వానరులయందాంజనేయుండును రత్నంబులయందుఁ బద్మరాగంబును దానంబులలోన నన్నదానంబును నరులయం
దు వైష్ణవుండై భాగవతప్రవర్తనం బ్రవర్తించువాఁడును ఇవియన్నియు మద్విభూతులుగా నెఱుంగుమని కృష్ణుండుద్ధవునకుపన్య
సించిన వెండియు నతండిట్లనియె॥ (క॥ వర్ణాశ్రమధర్మంబులు। నిర్ణయముగ నానతిమ్ము నీరజనాభా। కర్ణరసాయనముగ నవి। వర్ణింపు
ము వినెద నేఁ బవనరుహనేత్రా॥) వ॥ అనిన గృష్ణుండు నాలుగు వర్ణంబులయుత్పత్తియు నాలుగాశ్రమంబులకట్టి వర్ణంబులనియును
నాలుగు వేదంబులం జెప్పిన ధర్మంబులును ప్రవృత్తినివృత్తి హేతువులగు పురాణేతిహాసధర్మశాస్త్రంబులును వైరాగ్యాది జ్ఞానంబు
లు మనివి మొదలుగాఁగలవన్నియు నెఱుంగించి (సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ) అను నుపనిషత్తుల్యంబగు గీతా
వచనప్రకారంబున నెవ్వఁడేనియు నాయందులగ్నుండగుచు వర్తించువాఁడు నేననిపలుకంబడు పెక్కువిధంబుల వాదంబులేల నెఁడు
ముందగులు వడక నామీఁద దలంపు గలిగి వర్తింపుమనిన నుద్ధవుండిట్లనియె॥ (క॥ తెలియగ నుగ్గెగ్గి చెప్పితి। దెలియఁగఁగల వెల్ల
నాకుఁ దెలుపుము కృష్ణా। వల నెఱిఁగి తెలియవలయును। నలినాసనజనక భక్తనతపదయుగళా॥) వ॥ అని యుద్ధవుండడిగిన పుం
డరీకాక్షుండు నీ ప్రశ్నంబులు దుర్లభంబులు వినుము నియమశమదమాదులు తపంబులనంబడు సుఖదుఃఖంబులు స్వర్గనరకం
బులనంబడునని యొప్పి యనినహాన వ్రత బ్రహ్మచర్యతపోజపతపంబులును అతిథిసత్కారంబులును పరహితంబును ఇవియె
డలయినవి నియమంబులు ఇంద్రియనిగ్రహంబును శత్రుమిత్రసమత్వంబును శమంబనంబరగు మూఢజనులకు జ్ఞానోపదే
శార్థంబుగఁ గామ్యత్యాగంబును సమదర్శనంబును వైష్ణవసమూహంబులందు భక్తియు ప్రాణాయామంబును దత్తత్త్వం బెఱిం
గి విత్యేత్య పుణ్యాదభ్యంబులు ఇంతియమాదిగుణసహితత్వంబు మద్భక్తిసాహిత్యంబును ననుదినయోగ సుఖము నన్నెఱుంగక
డ యోగుణంబు నంబరగు బహుదుఃఖంబనంబడు బంధుగురుజనంబులయెడల భేదబుద్ధినొంది శరీరంబు నిజగృహంబుగా భా

వించినవాఁడెవ్వరి దృఢంబుగ నింద్రియనిరసనుండును కృపణగుణవిరక్తుండై యీశ్వరుండు నాయందు దలంపు నిలిపి కర్మయో
గంబులందును భక్తియోగంబులందును వాత్సల్యముం దగిలి జనకాదులు గైవల్యంబు జెందిరి భక్తియోగంబునం జేసి శబరీప్ర
హ్లాదముఖ్యులం దాములు పరమపదప్రాప్తులై రది గావున నిది యెఱింగి నిరంతర భక్తియోగం బధికంబుగా మనంబున నిలుపు
ము మృణ్మయంబైన ఘటంబున జలంబులు జాలుగొను తెఱంగున దినదినంబునకు నాయువు క్షయంబై నమృత్యువు సన్నిహితం
బై వచ్చు గావున నిది యెఱింగి నిరంతరంబును నన్నే మఱక తలంచునతండు నాకుం బ్రియుండు॥ )క॥ గర్భమునం బరిజ్ఞానము। ని
ర్భరమై యుండ జీవునికి మది నతండా। నిర్భాగ్యుండై నిజమునం। దర్భావంబునను బోధమంతయు ననఘా॥ )వ॥ అట్లు గావున
బాల్యకైశోరకౌమారవయోవిశేషంబుల వెనుక నైనం బెన్నయి యెఱింగినేని కృతకృత్యుండగు సంపద్గర్వాంధుండై నన్నంథ
కారరూపంబున నంబుడు వానిదరి దృఢనిగా జేసన జ్ఞానియై యస్మత్పాదారవిందవందనాభిలాషుండై ముక్తుండగు నట్లు గావున
దేహాభిమానంబులు వర్జించి యైహికాముష్మిక సుఖంబులం గోరక మనంబున గుదియించి యే ప్రొద్దు న న్నుదలంచువాడు వై
కుంఠపదప్రాప్తుండగు నేనును తని విడువంజాలక వెంట వరుగుదు నారదాది మునులు భక్తిభావంబునం జేసి నాస్వరూపంబైమ
విరియని యుద్ధవునకుం జెప్పిన నుద్ధవుం డిట్లనియె")క॥ అయ్యా దేవ జనార్దన। నెయ్యంబున సృష్టికర్త నేర్పరివై తా। నెయ్యె
ననునడపు నెవ్వడుం। సయ్యన నెఱిఁగింపు నాకు సర్వజ్ఞనిధీ॥ )వ॥ అనుటయు హరి యుద్ధవునకుం జెప్పె నిట్లు మత్ప్రేరితంబులైన
మహదాదిగుణంబులు గూడి యండంబై యుద్భవించె నంత నా నాభివిసరంబున బ్రహ్మ యుదయించె నంత సాగరారణ్యనదీనద
సంఘంబులు మొదలుగాగల జగన్నిర్మాణంబు వతని వలనం గల్పించితి నంత శతానందునకు శతాబ్దంబులు పరిపూర్ణంబైన ధా
త్రి గంధంబం దడంగు నాగంధంబు దకంబునం గలయు నుదకంబు రసంబు నీ రసంబగు నారసంబు తేజోరూపంబై యా తేజంబు
రూపంబు వసంక్రమించు నారూపంబు వాయువందుం గలయు వాయువు స్పర్శగుణసంగ్రాహ్యంబైన నా స్పర్శగుణంబాకాశం
బున లయంబగు నా యాకాశంబు శబ్దతన్మాత్రలచే గ్రసియింపంబడిన నింద్రియంబులు మనోవైకారికగుణంబులం గూడి యీ
శ్వరునిం బొంది యీశ్వరరూపంబు దాల్చుపను రజస్సత్త్వతమోగుణసమేతుండనై త్రిమూర్తులు వహించి జగదుత్పత్తిస్థితి
లయకారణుండనై వర్తించుము గావున నీరహస్యంబు నీకు నుపదేశించితి పరమపావనుండవుం బరమభక్తియుక్తుండవుం గమ్మ
ని చెప్పె నంత॥ గీ॥ రూపు లేని నీకు రూపిగా యోగులు। రూపు నిల్పి నిన్ను రుదిగ భక్తిం। గొల్చి యుండ వారి కోర్కెలనిచ్చెద। వేమి
లాగు మాకు నెఱుంగం బలుకు॥ )వ॥ అని యుద్ధవుం డడిగిన నారాయణుం డిట్లనియె నేను సర్వవర్ణంబులకు సమంబైన పూజాప్ర
కారంబెఱింగించెద నాచారంబునం జేసి యొక్క స్వరూపంబును పాషాణమృణ్మయదారువులం గల్పించి యందు నారూపంబు
నిల్పి కొందఱు పూజింతురు కాంస్యత్రపురజతకాంచన ప్రతిమావిశేషంబు లుత్తమంబు లిట్లు నారూపంబులందు మద్భావ
ముంచి కొల్చినవారలకు నేఁ బ్రసన్నుండనగుదు నీలోకంబున మనుష్యులకు ధ్యానంబు నిలువ నేరదు గావున నం బ్రతిమావిశేషం
బు లనేకంబులు గలవు వానియందు సౌందర్యసారంబులైన మనోహరంబులైన రూపంబుల నేనుందు గావున దుగ్ధార్ణవ
శాయిగా భావించి కౌశాంబరాభరణమాల్యానులేపనంబులను దివ్యాన్నపానంబులను షోడశోపచారపూజాప్రకారంబు
లను రాజోపచారంబులను బాహ్యపూజావిధానంబుల నాచరించి మనస్సంకల్పితంబులైన పదార్థంబులు సమర్పించి నిత్యం
బును నాభ్యంతరపూజావిధానంబు లంబరితుష్టునిం జేసి దివ్యాంబరాభరణమాల్యానుశోభితుండును శంఖచక్రకిరీటాద్య
లంకారభూషితుండును దివ్యమంగళవిగ్రహుండును నంగా దలంచి ధ్యానపరవశుండైన యతండు నాయందుం గలయు నుద్ధ
వా నీవును నీప్రకారంబు గరిష్ఠనిష్ఠాతిశయంబున యోగనిష్ఠుండవై బదరికాశ్రమంబు చేరి మత్కథితంబైన సాంఖ్యయోగం
బంతరంగంబునం నిలుపుకొని కలియుగావసానపర్యంతంబు వర్తింపు మని యప్పరమేశ్వరుం డానతిచ్చిన నుద్ధవుండు నానంద
భరితాంతరంగుండై తత్పాదారవిందంబులు హృదయంబునం జేర్చుకొని పావనంబైన బదరికాశ్రమంబునకు నరిగె నని శో
కుండు పరీక్షిన్నరేంద్రునకుం జెప్పుటయును॥ )క॥ చెప్పిన విని రాజేంద్రుండు। చొప్పడ శ్రీకృష్ణుకథలు చోద్యముగాఁగన్। జెప్పి

### ❀ యాదవులనోన్యకలహంబున మడియ-శ్రీకృష్ణబలరాములు వైకుంఠంబునకరుగుట. ❀

నఁదనియదు చిత్తం। బొప్పగ మునిచంద్ర నాకు నుత్తమలీలన్॥ )గీ॥ అంతట ను గృష్ణుఁ డేమయ్యె నరసిచూడ। యదువు లెట్టులు
వర్తించి రెప్పుడంగ। ద్వారకాపట్టణం బెవ్విధము ననుండె। మునిజనశ్రేష్ఠ యానతీ ముదముతోడ॥ )వ॥ అనిన రాజునకు శుకుండి
ట్లనియె వాసుదేవుండ న్యాయప్రవర్తకులగు దుష్టుల సంహరించి న్యాయప్రవర్తకులగు శిష్టులం బరిపాలనంబు చేసి బలరా

సమేతంబుగా ద్వారకానగరంబు వెడలి నంగరియాదవులు దమలోఁ దామ మదిరాపానమత్తులై మత్సరంబుననుత్సా
హకలహంబున సంగమకించి కరితురగరథపదాతిబలంబులతో ననర్గళంబుగా యుద్ధసన్నద్ధులై యుద్ధంబునకుఁ జొచ్చి ముని
శాపకారణంబునను త్తుంగంబులైన తురంగసమూహంబులం బడలువడం బొడుచుచు వ్రేయుచు నుండ దాకన వియును వజ్రా
యుధసమానంబులై యొండొరులం దాకి ఖండవంబునం బడి ఖండంబులై యొరలు కబంధంబులును వికలంబులైన యంగంబు
లును విభ్రష్టంబులైన రథంబులును వికటంబులైన శకటంబులును వ్రాలెడి యశ్వంబులును మ్రొగ్గెడి గజంబులు నైన యా
యోధనంబున నండఁ బొలియుట నగిన గిరిధరుండును రాముండును జనిచని యంత నీలాంబరుండు వేరొక త్రోవం బోయి
యోగమార్గంబున ననంతుని గలసె నప్పరమేశ్వరుండును మరియొక మార్గంబున జని యొక్క నికుంజపుంజంబు చాటున వి
శ్రమించుటం జేసి చరణంబు వేరొక చరణంబుమీఁద సంఘటించి చంచలంబుగా వినోదంబు సలుపు సమయంబున నొక్క లుబ్ధ
కుండు మృగవధార్థంబుగా వచ్చి దిక్కులు నిరీక్షింపుచుండ వృక్షంబుచాటున నప్పరమపురుషుని చరణంబు హరిణకర్ణంబుగా బో
లునని దానిం గని శరంబు శరాసనంబున సంధానంబు చేసి యేసిన నతం డాహారవంబునం గదలుచున్న యప్పరమేశ్వరుని స
న్నిధానంబునకు వచ్చి భయంబున జగన్నాథుం గాంచి దెలిసి మహాపరాధుండను పాపచిత్తుండను కుటిలప్రచారుండ నని యనేక
విధదీనాలాపంబులం బలుకుచు బాష్పజలధారాసిక్తవదనుండై సరోజనేత్రుండు వానిం గరుణించి యిల్లని యొనీ వేలఁ జాలింబ
డెదము పూర్వజన్మాంతరకర్మంబు లెంత వారికైన ననుభావ్యంబులు గాని యూరకఁబోవ నేరవు నీవు నిమిత్తమాత్రుండ వింతియె
కాని యని వానికిం దెలిపిన వాఁడు మహాపరాధులైన వారూరకి పోవరు దేవబ్రాహ్మణగురుద్రోహులకు సిలువ నెల్లగు ననిపవి
త్రాంతఃకరణుండై ప్రాయోపవేశంబునం బ్రాణంబులు వర్జించి వైకుంఠపదప్రాప్తుండయ్యె నప్పుడు॥)క॥ దారకుఁడు గని
యెనంతఁ జారుసిరూధావధాను సర్వజ్ఞు హరి౯। మేనసహభీరుదనుజుల దాగుణి నేకాంతపతుని దద్దయు వేడ్క౯॥ వ॥ క
నియత్యంతభయభక్తితాత్పర్యంబుల ముకుళితకరకమలుండై యుల్లసిల్లె॥ గీ॥ నిన్నుఁ జూడనికన్నులు నిష్ఫలములు। నిన్ను
నొడువని జిహ్వ దానీరసంబు। నిన్నుఁ గానని దినములు నింద్యములగుఁ। గన్నులను జూచి నమ్ము నుగారవింపు॥)వ॥ అనుచు నా
దారకుం డునిర్వేదనపరుండై యున్న నివిన్నవించె యాదవసముద్రంబడంగె బంధుగురుమిత్రజనంబులక్కడక్కడం బోయి
రి ద్వారకకుం బోయి సుహృజ్జనంబులం గూడి యేగుండు మనని పలుకు సనవసరంబున దివ్యాయుధంబులును దివ్యరథరథ్యంబులును
నంతర్ధానంబు నొందె నారాయణుండును వానితో నక్రూరవిదురులకు నీవృత్తాంతం బంతయుఁ జెప్పుమనుటయు సవ్యసాచిం గని
స్త్రీబాలగురువృద్ధజనంబుల గరిపురంబునకుం గొనిచనుమనుము సొమ్మని సమరిలి వాఁడునుం జని కృష్ణుని వాక్యంబులు సవిస్తరంబు
గాఁ జెప్పి యట్లు చేయ నత్క్షణంబ ద్వారకానగరంబు పరిపూర్ణజలంబై మునింగె నంత నెవ్వరికిం గనరాకనుండె నప్పరమేశ్వ
రుండును శతకోటిసూర్యదివ్యతేజోవిభాసితుండై వెడలి నారదాది మునిగణంబులును బ్రహ్మరుద్రాది దేవతలును జయజయ
శబ్దంబులతోడం గదలి రా నిజపదంబునకరిగె నారాయణవిగ్రహంబు జలధిప్రాంతంబున జగన్నాథస్వరూపంబై యుండెనని శు
కుండు పరీక్షిన్నరేంద్రునకుఁ జెప్పెనని చెప్పి॥)క॥ ఈకథ విన్నను వ్రాసినఁ। బ్రాకటముగ లక్ష్మి యశము భాగ్యముఁ గలుగు౯। జే
కొని యాయువు ఘనుఁడై। లోకములోనుండు నరుఁడు లోకులు పొగడ౯॥)క॥ రాజీవసదృశనయనవి। రాజితశుభదాభిధేయ
రాజవినుతవిభ్రాజితకీర్తిలతావృత। రాజీవభవాదిజనక రఘుకులతిలకా॥)మాలిని॥ ధరణిదుహితృరంతా ధర్మమార్గావగం
తా। నిరుపమనయవంతా నిర్జరారాతిహంతా। గురుబుధసుఖకర్తా కోసలక్ష్మాభర్తా। సురభయపరిహర్తా సూరిచేతోవిహ
ర్తా॥ గద్య॥ ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రియశిష్య
వెలిగందల నారాయణాఖ్య ప్రణీతంబైన శ్రీమహాభాగవతంబను మహాపురాణంబునందు కృష్ణుండు భూభారంబు వాపి
యాదవులకన్యోన్యవైరానుబంధంబు గల్పించి వారలహతంబు గావించుటయు విదేహర్షభసంవాదంబును నారాయణము
నిచరిత్రంబును నాల్గుయుగంబుల హరి నాల్గువర్ణంబులై వర్తించుటయు బ్రహ్మాదిదేవతలు ద్వారకానగరంబునకుం జని కృష్ణుం
బ్రార్థించి నిజపదంబునకు రమ్మనుటయు నవధూతయదుసంవాదంబును ఉద్ధవునకుఁ గృష్ణుండు నానావిధంబులైన యుపా
ఖ్యానంబు లెఱింగించుటయు నారాయణప్రకారం బంతయు దారకుం డెఱింగి వచ్చి ద్వారకావాసులకుం జెప్పుటయుఁ గృష్ణుం
డు దనదివ్యతేజంబుతో పరమాత్మం గూడుటయు నను కథలం గల యేకాదశస్కంధము॥ ........ శ్రీకృష్ణార్పణమస్తు. ......

---

## శ్రీమదాంధ్రభాగవతము- ద్వాదశస్కంధము.

శ్రీమదుదశనవతిశయనా! కామితమునిరాజయోగికల్పద్రుమభూ! కామఘనజనకవరనృప! జామాతృవశేశ రామచంద్రమహీశా॥ వ॥ మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండైన సూతుం డిట్లనియె నట్లు పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండు వాసుదేవనిర్యాణపర్యంతంబు తజ్జన్మకర్మంబులు సెప్పిన విని సంతసంబందియున్న రపాలపుంగవుండు మహాత్మా నారాయణకథాప్రపంచంబును తద్గుణంబులును నాచారవిధియును జీవాత్మభేదంబును హరిపూజావిధానంబును జ్ఞానయోగప్రకారంబును మొదలైనవి యెఱింగించి విజ్ఞానవంతుం గాఁ జేసి మన్నించితివింక భావికార్యంబులన్నియు నెఱింగింపు మనిన శుకయోగీంద్రుం డిట్లనియె॥ క॥ నరవర యీ ప్రశ్నమునకు। సరి చెప్పఁగ రాదు నామసామర్థ్యము చే। బరికించి నీకు జెప్పెదఁ। గర మొప్పఁగ భావి కాలగతులన్ వరుసన్॥ వ॥ అందు రాజుల ప్రకారం బెఱింగించెద బృహద్రథునకుం బురంజయుండు పుట్టును వానికి శునకుండ నెడివాఁడు మంత్రియై యతండు పురంజయునిం జంపి తాను రాజ్యంబేలుచుండ నంతఁ గొంతకాలంబునకు తనికిం గుమారుఁ డుదయించిన వానికిం బ్రద్యోతన నామం బిడి యతనికిం బట్టంబుగట్టు నా భూభుజునకు విశ్వరూపుం డుదయించఁగలఁడు నాతనికి నందివర్ధనుండు జనియించు నీయేవురు నూటముప్పదియెనిమిది సంవత్సరంబులు వసుంధరాపరిపాలనంబునం బెంపువడయుదురు తదనంతరంబ శిశునాభుండను పార్థివుం డుదయించు నా మూర్ధాభిషిక్తునకు కాకవర్ణుం డను జనియించు నా రాజన్యునకు క్షేమవర్ముఁ డుదయించఁగలఁడు నా పృథ్వీపతికి క్షేత్రజ్ఞుఁ డతనికి విధిసారుండను విధిసారునకు జాతశత్రుండును ఆ భూపాలునకు దర్భకుండును దర్భకునికి నజయుండును అతనికి శైశునాగుండును అతనికి నందియును నంగలపము సుకునకపాలకులుద్భవించి షష్ట్యుత్తరత్రిశతహాయనంబులు కలికాలమున ధరాతలంబేలెదరు అంత నందికి మహానంది యతనికి శూద్రస్త్రీగర్భంబున నతిబలశాలియయిన మహాపద్మపతి యనేనందుం డుదయించు నతనితోఁ క్షత్రియవంశంబు నిగిపోఁగలదు నాసమయంబున నరపతు లశూద్రప్రాయులై ధర్మవిరహితులై తిరుగుచుండ మహాపద్మనకు సుమాల్యుండు మొదలయిన యెనమండ్రు గురుకుమారులుదయించెదరు వారు నూఱు సంవత్సరంబులు క్షోణీతలంబేలెదరంత నా నవనందుల నొక భూసురోత్తముండు నిర్మూలనంబు సేయు నప్పుడు వారలేమి మౌర్యులు గొంతకాలంబు నీజగతీతలంబు నేలుదు రత్తరి నా భూదేవుండు చంద్రగుప్తుండను వానిని నందరాజ్యంబునం దభిషిక్తునిగాఁ జేయఁగలఁ డంత నా చంద్రగుప్తునకు వారిసారుండను వానికి నశోకవర్ధనుండును అతనికి సుయశస్సును వానికి సమ్మితుండును అమ్మహానీయునకు శాలిశూకుండు అతనికి సోమశర్ముండును వానికి శతధన్వుండును నా శతధన్వునకు బృహద్రథుండు నుదయించెదరు మౌర్యులతోఁ జేరిన యీ పదుగురును సప్తత్రింశదుత్తరశతాబ్దంబులు నిష్కంటకంబుగా భూపరిపాలనంబు సేసెదరు అంత నా బృహద్రథపుత్రుఁ డగు నగ్నిమిత్రుండను వానికిని జ్యేష్ఠుండును జ్యేష్ఠునకు వసుమిత్రుండును అతనికి భద్రకుండును భద్రకునకుఁ బుళిందుండును నాతనికి ఘోషుండును వానికి వజ్రమిత్రుండును అతనికి భాగవతుండును వానికి దేవభూతియు అతనికి శుంగుండును జనించెదరు వీరు పదుగురును ద్వాదశోత్తరశతహాయనంబులు క్ష్మాపతులయ్యెదరు అంత మీఁద శుంగకులసంజాతుండైన దేవభూతికి నమాత్యుండగు వాసుదేవుండను వాఁడు వధియించి రాజ్యంబేలు వానికి భూమిత్రుండును అమహానుభావునకు నారాయణుండును గలిగెదరు కణ్వవంశజులైన వీరలు మున్నూటనలుబదేను సంవత్సరంబులు మేదినీతలంబేలుదురు మరియును॥ చ॥ చతురత నీక్షితి నేలియు। నతిమోహము విడువలేక మానవనాథుల్। సతతము దమకీ కాలం। బతిచంచలమగుట నెఱుఁగ రయ్య మహాత్మా॥ క॥ నరపతుల మహిమ యంతయు। నరగాధిపుఁడైన నెఱుఁగ నోపఁడు ధాత్రిం। జిరకాలమేలియుండే। పరువడి నణఁగుదురు వారు భ్రాంతులరగుచున్॥ క॥ గజతురగాదిశ్రీలను। నిజమని నిన్నంగ రాఁపు నిత్యము నుహరిన్। గజిగిజ లేకఁ దలంచిన। సుజనులకు ననతనియందుఁ జొరఁగా వచ్చున్॥ వ॥ మరియును కణ్వవంశజుఁడగు సువర్ముండను రాజుదయించు వానిహింసించి తద్భృత్యుండ శూద్రజాతీయుండైన వృషలుండ ధర్మమార్గవర్తియై వసుమతీచక్రంబు వక్రుండై యేలు నంత వానియనుజుండు కృష్ణనాథుఁడను వాఁడు రాజై నిలుచు నా మహామూర్తికి శాతకర్ణుండును వానికి పౌర్ణమాసుండును అతనికి లంబోదరుండును వానికి చిబిలికుండును అతనికి మేఘస్వాతియును వానికి దండమానుండును వానికి హాలేయుండగు నరిష్టకర్మయు అతనికి బురుషసేనుండును వానికి సునందనుండును ఆ రాజశేఖరునకు వృకుండును వృకునకు జటాపుం

డును జటాపునకు శివస్వామియును వానికి నరిందముండును ఆభూమీశునకు గోమతియును వానికి పురీమంతుండును అతనికి దేవశీర్షుండును వానికి శివస్కంధుండును అతనికి యజ్ఞశీర్షుండును ఆభవ్యునకు విజయుండును విజయునికి చంద్రబీజుండును అతనికి సులోమధియును ఇట్లు పెక్కండ్రుదయించిన న్నూటయేబదియాఱు సంవత్సరంబులు ధాత్రిం బాలించెదరంతట నాభీరులేడుపురు గర్దభులు పదుగురు కంకవంశజులు పదాఱుగురు మేదినీభరంబు దాల్చియుండెదరు అటమీఁద యవనులెనమండ్రు గురుబర్బరులు పదునలుగురు దేశాధీశులై తమేలెదరు మఱియుం గిరుండులు పదుమువ్వురును పదునలుగురు మౌలులును వెయిన్ని తొమ్మన్నూటతొమ్మిది హాయనంబులు గర్వాంధులై యేలెదరు అటమీఁద నానామౌలివంశజులగు పదునొకండు మంది త్రిశతయుతంబైన వత్సరంబులు మత్సరంబున నేలెదరు ఆసమయంబునం గైలికిలులను యవనులు భూపతులగుదురు అంత భూతనందుండును అవభంగియుండును శిశువందుండును తద్భ్రాతయగు యశోనందుండును ప్రవీరకుండును వీరలు వీరులై షడుత్తరశత హాయనంబులేలెదరు అంత నారాజులకు పదుమువ్వురు కుమారులుదయించి యందు నాల్గురు బాహ్లీక దేశాధిపతులయ్యెదరు కడమ యేడ్గురును కోసలాధిపతులయ్యెదరు అంత వైదూర్యపతులు నిషధాధిపతులై యుండెదరు పురంజయుండు మగధదేశాధిపతియై పుట్టు అంత నతండు పుళిందయదుమద్ర దేశవాసులగు హీనజాతిజనులు బ్రహ్మజ్ఞానహీనులై హరిభక్తివిరహితులై యుండ వారికి ధర్మోపదేశంబు చేసి నారాయణభక్తి నిత్యంబునుండునట్లుగా జేసి బలపరాక్రమవంతుండై క్షత్రియవంశంబుల డంచి పద్మావతీనగర పరిపాలకుండై గంగానది మొదలు ప్రయాగవరకుగల భూమి నేలగలడు సౌరాష్ట్ర అవంతీ ఆభీర అర్బుద మాళవ దేశాధిపతులు వ్రాత్య బ్రాహ్మణులై శూద్రప్రాయులై యుండగలరు వారు సింధుతీరంబులను చంద్రభాగాప్రాంత్యంబులను కాశ్మీరమండలంబును నేలెదరు మఱియు నత్తరి శూద్రులును మ్లేచ్ఛులును బ్రహ్మతేజోహీనులయిన బ్రాహ్మణులును భూభాగంబులం బరిపాలింతురు మఱిన్ని వీరలు రాజరూపులైన మ్లేచ్ఛులై ధర్మసత్యదయాహీనులై క్రోధమాత్సర్యంబుల స్త్రీబాలగోద్విజాతుల వధియించి రోయక పరధనపరస్త్రీపరులై రజస్తమోగుణరతులై యల్పజీవులై యల్పబలులై హరిచరణారవిందమకరందరసాస్వాదులుగాక దమలోనన్యోన్యవైరానుబంధులై సంగ్రామరంగంబుల హతులయ్యెదరు ఆసమయంబునం బ్రజలు తచ్ఛీలవేషభాషాదులననుసరించియుండెదరు కావున॥

క॥ దినదినము ను ధర్మంబులు। ననయము ధరనడగిపోవు నాశ్చర్యముగా। వినువర్ణచతుష్కములో। నెనయగ ధనవంతుండె ఘనుండగు ధరిత్రిన్॥

క॥ బలవంతుండైనవాడే। కులహీనుండైన దొడ్డగుణవంతుండగు౦। గలిమియు బలిమియు గలిగిన। నిలలోపల రాజతండె యేమనవచ్చున్॥

వ॥ అట్లుగాన జనంబులు లోభులై జారత్వచోరత్వాదుల చేత ద్రవ్యహీనులై వన్యశాకమూలఫలంబుల భుజింపుచు వనగిరిమందిరంబులం గృశీభూతులై దుర్భిక్షశీతవాతాతపక్షుధాతాపంబుల చేత భయపడి ధైర్యహీనులై యల్పాయుష్యులు నల్పతరశరీరులు నై రాజులు చోరులై సంచరింపుచు నధర్మప్రవర్తనులై వర్ణాశ్రమధర్మంబులు వదలి శూద్రప్రాయులై యుండెదరు అంత నోషధులల్పఫలదంబులు మేఘంబులు శూన్యంబులు సస్యంబులు నిస్సారంబులునగు నిట్లు ధర్మమార్గంబు లేక యున్న యెడ ముకుందుండు దుష్టనిగ్రహశిష్టపరిపాలనంబు కొఱకు శంబలగ్రామంబున విష్ణుయశుండను విప్రునకుం బుత్రత్వంబు నొంది దేవతాబృందంబులు నిరీక్షింప దేవదత్తఘోటకారూఢుండై దుష్టమ్లేచ్ఛజనంబుల దనమండలాగ్రంబున ఖండీభూతులం జేయ నప్పుడు ధాత్రీమండలంబు విగతక్రూరజనమండలంబై తేజరిల్లు నంత నరులు స్నానధ్యానవందన పూజాదివిధానాసక్తులై నారాయణపరాయణులై వర్తిల్లెదరు ఇట్లు లోకరక్షావతారంబున నిఖిలజనులు ధన్యులయ్యెదరు అంతటకృతయుగధర్మంబై నడచుచుండు చంద్ర భాస్కర శుక్ర గురువులేకరాశిగతులైనం గృతయుగంబై తోచు రాజాగత వర్తమానకాలంబులు భవజ్జన్మంబు మొదలు పంచదశాధికోత్తరశతసహస్రహాయనంబులై నందాభిషేకపర్యంతంబునుండునంతట నారాయణుండఖిలమత్త రాజధ్వంసంబుగావించి ధర్మంబు నిలిపి వైకుంఠనిలయుండగునని చెప్పెన॥

క॥ మునినాథ యేవిధంబున। ఘనతరముగ జంద్రసూర్యగ్రహముల జాడల్। వినఁగాలవర్తనక్రమ। మొనరఁగ నెఱిఁగింపవయ్య ముదముదలిర్పన్॥

వ॥ అనిన నట్లు కాకయని చెప్పందొణంగె వినుము సప్తర్షిమండలాంతర్గతంబులయిన పూర్వఋక్షద్వయసమమధ్యంబునందు నిశాసమయంబున మధ్యమాసంబులో నెక్కడ నక్షత్రంబు గానుపించిన నా కాలంబు శతసంవత్సరపరిమితంబయ్యె నేని నా సమయంబునం గలిప్రవేశంబగు గావన విష్ణుపాదజనార్దనుండు నిజపదంబునం బోదలేని వేళ ధాత్రీమండలంబు కలిసమాక్రాంతంబయ్యె కృష్ణుండెంత గాలంబు భూమియందు బ్రవర్తించు నంతకాలంబు కలిసమాక్రాంతంబు గాదు మఘానక్షత్రంబునను

ప్తర్షులు నేఁడు నక్షత్రంబునఁ జరియింతు రా నక్షత్రంబున హరి పరమపద ప్రాప్తుండయ్యె నద్దినంబుననందే కలి ప్రవేశించి నందావసానపర్యంతంబు ప్రవృద్ధంబై యుండు నంత నా ఋషిసంఘంబు పూర్వాషాఢకుం జనం బ్రవృద్ధంబు నొందు నట్లు దివ్యాబ్దసహస్రంబులు చనిన యనంతరంబ నాలుగవ పాదంబునఁ గృతయుగధర్మంబు ప్రాప్తంబగు॥

చ॥ నరవర తొంటి భూపతుల నామగుణంబులు వృత్తిచిహ్నముల్। సిరియును రూపసంపదలు చేకొని రాజ్యములాత్మవిత్తముల్। వరుసన నంగ కానియట వారల కీర్తులు నిర్మలంబులై। యురువడి భూమిలో నిలిచియున్నవి నేఁడును రాజశేఖరా॥

వ॥ శంతనవ్రతుజుండగు దేవాపియు నిక్ష్వాకువంశజుండగు మరుత్తువున్న యోగయుక్తులై కలాపగ్రామనిలయులై కలియుగాంతంబునందు వాసుదేవప్రేరితులై ప్రజలను వర్ణాశ్రమాచారంబులు వప్పకుండ నడపుచు నారాయణస్మరణంబు నిత్యంబును జేసి కైవల్యపద ప్రాప్తులగుదురు-ఇవ్విధంబున నాలుగు యుగంబుల రాజులును నే నెఱింగించిన పూర్వరాజన్యులును వీరందఱును సనుస్తవస్తుసందోహంబులయందును మమతం బొంది యాశాసహవంతులై యుండి పిదప నీ భూతలంబు వదలి నిధనంబు నొందుదురు కావునఁ గాలంబు జాడ యెవ్వరికిం గానరాదు కీర్తిసుకృతదుష్కృతంబులు వెంటనంటంగలయవి యిదియునుంగాక ముత్పూర్వులు హరిధ్యానపరవశులై దయాసత్యశౌచశమదమాదిక ప్రశస్తగుణంబులం బ్రసిద్ధులై నడిచిరట్టు గావున॥

క॥ ధర్మము సత్యము కీర్తియు। నిర్మలదయ విష్ణుభక్తి నిరుపమ ఘనస। త్కర్మము హింసావ్రతమున్। నర్మిలిగలవారె పుణ్యులవనీనాథా॥

గీ॥ ఈ జగంబేలు తొల్లిటి రాజవరులు। కాలవశమున నాయువుల్ గోలుపోయి। నామమాత్రావశిష్టులై నారు కాన। సంపదలవమమమతను బెంపుతోడ॥

వ॥ గర్వాంధులై నరపతులం జూచి భూదేవి హాస్యంబు సేయు శత్రుక్షయంబు చేసి యెవ్వరికి నీక దామె యేలుచుండెదమని యెడి మోహంబునం బితృపుత్త్ర భ్రాతలకు భ్రాంతిం గల్పించి యన్యోన్య వైరానుబంధంబులం గలహంబు చేసి రణరంగంబులఁ దృణప్రాయంబులుగా దేహంబుల వర్జించి నిర్గతలోక ప్రాప్తులైన-పృథు యయాతి-గాధి-నహుష-భరత-అర్జున-మాంధాతృ-సగర-రామ-ఖట్వాంగ-ధుంధుమార-రఘు-తృణబిందు-పురూరవ-శంతను-గయ-భగీరథ-కువలయాశ్వ-కకుత్స్థ-నిషధాములగు రాజులును-హిరణ్యకశిపు-వృత్ర-రావణ-నముచి-శంబర-భౌమ-హిరణ్యాక్ష-తారకాదులైన దైత్యులును ధరణి నమత్వంబునం జేసి కడ కాలవశంబున నాశంబు నొందిరి ఇది యంతయు మిథ్యగాన సర్వంబును బరిత్యజించి జనార్దన వైకుంఠ వాసుదేవ నృసింహాది హరి నామామృతపానంబు నిరంతరంబు చేసి జరారోగవికృతులం బాసి హరిపదంబు నొందుమని చెప్పి॥

గీ॥ ఉత్తమశ్లోకుఁడన నెవ్వఁడున్నవాఁడు। సన్నుతుండగు నెవ్వఁడు సకలదిశల। నట్టి పరమేశ్వరుని జిత్తమం

## యుగధర్మంబులం బ్రాకృతాది ప్రళయచతుష్టయంబును దెలుపుట.

దునిలిపి। తద్గుణంబులు వర్ణింపు ధరణినాథ॥

వ॥ అనిన శుకయోగీంద్రునకు రాజేంద్రుండిట్లనియె కలియుగంబతి పాపసమ్మిళితంబు గాన దురితంబు లేలాగున నరులొంటకనుండెదరు కాలం బేక్రమంబున నడచు కాలస్వరూపకుండైన హరి ప్రభావం బే లాగునం గానంబడు నీ జగజ్జాలం బెవ్విధంబున నిలుచు నని యడిగిన రాజునకు శుకయోగీంద్రుండిట్లనియె కృతత్రేతాద్వాపరకలియుగంబులను యుగచతుష్టయంబు నుక్రమముగాఁ బ్రవర్తించు నందు సత్యదానధర్మదయాశౌచ తపోనియమవ్రతశాంతిదాంతివర్ణాశ్రమాచారంబులు మొదలయినవి మొదటి యుగంబున నాలుగు పాదంబులం బరిపూర్ణంబై ప్రవర్తిల్లు శాంతిదాంతికర్మాచరణాదిరూపంబగు ధర్మంబు మూఁడు పాదంబుల రెండవ యుగంబునం బ్రవర్తిల్లు నిప్పార్చనాహింసావ్రతజపానుష్ఠానాదిలక్షణంబులు గలిగి ధర్మంబు రెండు పాదంబుల మూఁడవ యుగంబునఁ దేజరిల్లు మఱియు జనులు కలియుగంబున ధర్మరహితులును అన్యాయకాములును క్రోధమాత్సర్యలోభమోహాదిదుర్గుణవిశిష్టులును వర్ణాశ్రమాచారరహితులును మరావాదులును మరన్నభక్షకులును శూద్రసేవారతులును నిర్దయులు మస్తిష్కారణవైరులును దయాసత్యశౌచాదివిహీనులును అనృతవాదులును మాయోపాయులును ధనవిహీనులును దోషైకదృష్టులును నై పాపచరితులగు రాజుల సేవించి జననీజనకసుతసోదరబంధుదారాసుహృజ్జనులం బరిత్యజించి సురతాపేక్షులై కులంబులం జెఱుపుచుండెదరు మఱియు యుక్తాశుడాంబరంబులం బ్రజాక్షయంబగు దుష్ప్రతిగ్రహవిహారులై యజ్ఞాదికర్మంబులు పరార్థపరులై చేయుచు హీనులై నశించెదరట్లు గాన నీ కలియుగంబున నొక్క ముహూర్తమాత్రంబైన నారాయణస్మరణపరాయణులై మనంబున శ్రీనృసింహ వాసుదేవ సంకర్షణాది నామంబుల నచంచలభక్తిం దలంచెడు వారలకుఁ గ్రతుశతఫలంబు గలుగు నట్లు గావున రాజశేఖరా నీ మదిన నవరతంబు హరిం దలంపుము కలియనేక దురితాలయంబు గాన నొక్క నిమిషమాత్రంబు ధ్యానంబు చేసినం

రము పావనత్వంబు నొందిక్ష్మాతలస్థుండవగుమవని పలికి మరియును ॥) క॥ మూడవ యుగమునఁ జేయుచు వేడుక హరికీర్తనంబు వెలయఁగ లెస్సన్ । వాడుచుఁ గృష్ణాయనుచుం గ్రీడింతురు కలినిఁ బలు వికృతమతులగుచున్ ॥) వ॥ అంతఁ గల్పప్రళయ ప్రకారం బెట్లనిన నతం డిట్లనియె చతుర్యుగసహస్రంబులు చనినది బ్రహ్మకు నొక్క పగలగును దత్క్రమంబున రాత్రియు వర్తిల్లు నంత బ్రహ్మకు నొక్క దినంబగుట వలన నది నైమిత్తిక ప్రళయంబనం బడు నందు విధాత సమస్తలోకంబులం దన యాత్మయందు నిలిపి శయనించు బ్రహ్మ నిర్వినష్టంబైన నది ప్రాకృత ప్రళయంబని చెప్పంబడు నా ప్రళయ ప్రకారంబు వినుము ఇట్లు పగలు నైమిత్తిక ప్రళయంబును రాత్రి ప్రాకృత ప్రళయంబును నను బరఁగినయది యజునకు నది దిన ప్రమాణంబట్టి దిన ప్రమాణంబున ముప్పది యగు నవి దినంబులైన నెలలు నవి నొక్క సంవత్సరంబు పరిపూర్ణంబగు నవి ద్విపరార్థంబులు శతపరిమితంబులైన ॥) సీ॥ అంత లోకేశునకు నవసానకాలంబు వచ్చిన నూఱేండ్లు వసుధలోన । వర్షంబులుడిగిన వడి దప్పి మానవుల్ దప్పివాకటఁ జిక్కి నొప్పి నొంది । యన్యోన్య భక్షులై యా కాలవశమున నాశ నొందెదరంత నలిన సఖుండు । సాముద్ర భౌతిక దైహిక జాతరసములఁ జూఱి గిరి నాళి చేతఁ గాల్పు నంతఁ గాలాగ్ని సంకర్షణాస్యమునగుచు మిన్నుఁ గలయఁగ నదియాక్రమించునట్టి రౌద్రమున శతవర్షములు పడఁ బడఁ గూడి పీఁకితో డుత వాయువు వీచునపుడు ॥) వ॥ ఇట్లు వర్షశతంబు వర్షశూన్యంబగునంత శతవర్షంబులు ద్వాదశ భాస్కర ప్రచండ కిరణ తాండవ బగుఁ బివప శతవర్షంబులు ప్రళయాగ్ని దందహ్యమానంబును విష్వక్సప్త మారుత ఝంఝూనిల వేగ తాడితంబును నంబర మీ శతహాయనంబులు నవ ధారాధరంబులు మహా ఘోషంబుతోడం గరికరోపమానంబులైన నీరధారల నఖిల జగంబును శంబరమయంబు చేయన బ్రహ్మండంబెల్ల జలమయంబగుటం జేసి భూమి హృత గంధగుణంబై కబంధంబున లీనంబగు నన్నీరంబును జీర్ణరసగుణంబై తేజంబున నణంగు నా తేజంబు వాయువు హృతరూపంబై కలయు నా పవనుండు గతస్పర్శగుణుండై నభంబున సంక్రమించు నా యాకాశంబు విగత శబ్దంబై భూతాది ప్రకృతి యందు నణంగు నా ప్రకృతియు నాశంబై వాఙ్మనస గోచరంబు గాక సత్వ రజస్తమో గుణ రహితంబై మహదాది విసన్నివేశంబు లేక స్వప్నావస్థా రహితంబై యప్రతర్క్యంబగు నాత్మయందు లయంబగు నదియె సర్వాధారభూతంబైన పదంబని చెప్పఁబడు కాల పర్యయంబై పురుషావ్యక్తులు విలీనంబగునది ప్రాకృత ప్రళయంబనంబడునని చెప్పి మరియు నొక్క విశేషంబు వినుము బుద్ధీంద్రియార్థరూపంబుల చే జ్ఞానంబు తదాశ్రయంబై వెలుంగు దృశ్యత్వావ్యతిరేకంబుల చేనది యాద్యంతము గలదై యుండు తేజంబు చక్షుస్సు రూపంబునకు వేఱుగాని యట్లు పదార్థంబు మూర్తికి నన్యంబుగాదు జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు బుద్ధిధర్మంబులగు ప్రత్యగాత్మయందు నానా ప్రకారంబులం దోచు నీ దృశ్య ప్రపంచంబంతయు మిథ్యయని తెలియుము ఒక్క తేజంబు బహురంధ్రంబులం గానంబడు తెఱంగున నొక్క యాత్మ పెక్కు దేహంబులం దోచబడు మహాకాశంబు పెక్కు రూపంబులు గలదైన నేకంబైన తెఱంగున బరమాత్మ వివిధ చేతనాచేతన శరీరములయందుఁ బెక్కు విధంబులం గనుపడిన నేకంబుగా భావింపవలయు నేత్రంబులకు నిర్మలాంబువులయందు భాస్కర మండలంబు గనుపించు తెఱంగున బంధహేతువైన యహంకారంబాత్మజ్ఞానంబునం దిరస్కృతంబైనన ప్పుడె పరమాత్మ నిర్మలంబై తోచు నా పరమాత్మను నిరంతరంబును దలంచుచు యోగులు తదేకాయత్తచిత్తులై యుందురు కాలంబును వేగంబున నీ సర్వప్రపంచంబునకు నవస్థాంతరంబులం గల్పించుచుండు పరమేశ్వరమూర్తి యైన కాలంబు నభంబునం గలుగు తారకంబులు గానరాని కరణిం గానబడక కల్యావస్థల జలించు నిత్య నైమిత్తిక ప్రాకృతి కాత్యంతికంబులను ప్రళయంబులు చతుర్విధంబులై పరగుచుండుఁ గల నారాయణు లీలావతారంబులఁ గమలభవ భవాదులైనం బచింపలేరు నే నెఱింగినంతయుం జెప్పితి సంసార సాగరంబు దాఁట హరికథ యనెడి నావ మొదలహాయంబు గాని వేఱొకటి లేదని చెప్పి ॥) ఉ॥ ఏను మృతుండ నౌదునని యెంత భయంబును నీ మనంబులో వలదు । మానుము సంభవంబు గల మానవకోట్లకుఁ జావు నిత్యము । గాన హరిం దలంపుమిక గల్గదు జన్మము నీకు ధాత్రిపై । మానవనాథ సాంద్ర దృఢ మాధవ లోక నివాస సౌఖ్యముల్ ॥

శ్రీ పరీక్షిత్తు తక్షకునిచే దష్టుఁడై ముక్తి నొందన తత్పుత్రుఁడు సర్పయాగము చేయుట శ్రీ

వ॥ జరామరణ హేతుకంబైన శరీరంబు వలన జీవుండు ఘటంబులోఁ గనుబడెడు నాకాశంబు ఘటనాశంబైన మహాకాశంబునం జేరు చందంబున నీశ్వరుం గలయు తైలనాశన పర్యంతంబు వర్తి తేజంబుతోడ వెలుంగు కరణి దేహకృతంబగు భవంబు రజస్సత్త్వతమోగుణంబుల చేతఁ బ్రవర్తించు నాత్మ నభంబు మాడ్కి ధ్రువంబై యనంతంబై వ్యక్తావ్యక్తంబులకుఁ బరంబయ్యుండు నిట్లాత్మస్వరూపుని గా హరిని నిరంతరంబు భావించుచుండుట విశేషంబు నిన్నుఁ దక్షకుండు గఱచునను భయంబు నొందవలదు

